# భరతమునిప్రణీతం నాట్యశాస్త్రమ్

## ఆంధ్రభాషావ్యాఖ్య బాలానందినితో



వ్యాఖ్యారచయిత

ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు

2014

# భరతమునిప్రణీతం నాట్యశాస్త్రమ్

## ఆంధ్రభాషావ్యాఖ్య బాలానందినితో




వ్యాఖ్యారచయిత

**ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు**

# భరతమునిప్రణీతం నాట్యశాస్త్రమ్

## ఆంధ్రభాషావ్యాఖ్య బాలానందినితో

వ్యాఖ్యారచయిత

**డా. పుల్లెల శ్రీరామచంద్రుడు**




ప్రథమ ముద్రణము : 2014

వెల : **రూ. 650/- (US$ 15)**

ప్రకాశకులు : **పి. యస్. శాస్త్రి**
'నందనం', 8-2-603/1/ప్లాట్ నెం. 8ఎ,
రోడ్డు నెం. 10, బంజారాహిల్స్,
హైదరాబాదు - 500 034.
ఫోను : 040-23551299
సెల్ : 09949270707

డి. టి. పి. : **సమంత గ్రాఫిక్స్**
ఎస్. ఆర్. టి. 8 జవహర్‌నగర్
హైదరాబాద్ - 500 020.
సెల్ : 9440631462

ముద్రణ : **సంహిత గ్రాఫిక్స్**
అమీర్‌పేట, హైదరాబాద్ - 500 016.
ఫోన్ : 040-23731620

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

ఓమ్ శ్రీనటరాజాయ నమః

# కృతిసమర్పణమ్

[1]ఆఙ్గికం భువనం యస్య, వాచికం సర్వవాఙ్మయమ్,
ఆహార్యం చన్ద్రతారాది, తం వన్దే సాత్త్వికం శివమ్.

[2]విశ్వం స్థావరజఙ్గమాత్మకమిదం యస్యాఙ్గికం, వాఙ్మయం
సర్వం వాచికమ్, ఇన్దుసూర్యభగణాన్యాహార్యమార్యా జగుః.
వీక్షామాత్రకృతాఖిలత్రిభువనో యః కేవలం సాత్త్వికో
రుద్రః స్త్రీకృతసవ్యభాగసుభగో భూయాత్ స వః శ్రేయసే.

యదుపజ్ఞం సదా నాట్యం లోకాన్ నర్తయతే ముదా,
నటరాజస్య తస్యేయం పదయోః కృతిరర్ప్యతే.

---

1 చరాచర రూపమైన ఈ ప్రపంచం అంతా శివుని **ఆంగికాభినయం**. వాఙ్మయమంతా **వాచికాభినయం**. చంద్రనక్షత్రాదులు **ఆహార్యాభినయం**. సాత్త్వికుడైన, (**సాత్త్వికాభినయ** స్వరూపుడైన) అట్టి నటరాజైన శివునకు నా నమస్కారము.

– నందికేశ్వరవిరచిత **అభినయదర్పణం**; మంగళాచరణశ్లోకం.

2 "స్థావరజంగమాత్మకమైన ఈ ప్రపంచకం అంతా ఈ నటరాజు **ఆంగికం**, వాఙ్మయం అంతా **వాచికం**, సూర్యచంద్రనక్షత్రగణాలు **ఆహార్యం**" అని ఋషులు ఎవ్వనిని స్తుతిస్తూంటారో, దేహంలోని వామపార్శ్వంగా ఉన్న మహాదేవితో ప్రకాశిస్తూ, చూపులచేతనే ముల్లోకాలను సృజించి తాను మాత్రం **సాత్త్వికుడు**గా ఉన్న ఆ నటరాజు మీకు సకలశ్రేయస్సులను అనుగ్రహించుగాక."

– విప్రదాసవిరచిత **'సంగీతచంద్ర'**. మంగళశ్లోకం.

శ్రీః

# నటరాజస్వరూపవర్ణనం

నటరాజు జ్వాలామాలావినిర్మితమైన ప్రభామండలం మధ్య దేదీప్యమానుడై తాండవనృత్యభంగిమలో ఉన్నాడు. వృత్తాకారం సర్వనాదాత్మకమైన ఓంకారానికి, జటాజూటంలో ఉన్న గంగ సర్వసంపత్సమృద్ధికి, కాలాధిపతియైన చంద్రుడు అనుగ్రహానికీ చిహ్నాలు. సూర్య – చంద్ర – అగ్న్యాత్మకా లైన మూడునేత్రాలు మూడు కాలాలకు చిహ్నాలు. లలాటనేత్రం జ్ఞానానికి చిహ్నం. అర్ధనారీశ్వరుడుగా నటరాజు కుడిచెవికి మకరకుండలము, ఎడమచెవికి తాటంకము ధరించి ఉన్నాడు. సర్పము కుండలినీశక్తికి, నాగయజ్ఞోపవీతము సర్వకర్మాధికారానికీ చిహ్నాలు. నాలుగు చేతులలోని పై కుడిచేతిలో ఉన్న డమరుకము సృష్టికీ, అభయముద్రలో ఉన్న క్రింది కుడిచేయి స్థితికీ, అగ్నిజ్వాల ధరించిన పై ఎడమ చేయి సంహారానికీ, దోలాహస్తముద్రలో ఉన్న క్రింది ఎడమచేయి అనుగ్రహానికీ చిహ్నాలు. స్థితపదస్థానకంలో ఉన్న కుడి పాదం క్రింద నలిగిపోతూన్న మరుగుజ్జు అజ్ఞాన – రోగ – జరా – మరణాదులకు ప్రతీకం. కుంచితముద్రలో ఉన్న ఎడమ పాదం మోక్షానుగ్రహానికి చిహ్నం. గజచర్మాంబరం, పిక్కలకు కట్టిన గజ్జెలు అడ్డు లేని వీరత్వానికి చిహ్నాలు.

ఈ విధంగా శివతాండవం పరమేశ్వరుని సృష్టి – స్థితి – సంహార – తిరోభావ – అనుగ్రహా లనే పంచక్రియాశక్తికి చిహ్నం.

శ్రీః

# నాట్యశాస్త్రము

## విషయసూచిక

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

శ్రీశఙ్కరభగవత్పాదాః విజయన్తే

# ప్రస్తావన

**భరతుని నాట్యశాస్త్రం :** మన కిపుడు లభించే అలంకారశాస్త్రగ్రంథాలలో అతిప్రాచీన మైనది భరతుని నాట్యశాస్త్రం. అంకారశాస్త్రంలో అతిప్రధానమైన రససిద్ధాంతమే కాకుండా, ఈ శాస్త్రానికి సంబంధించిన ఎన్నో విషయాలు **నాట్యశాస్త్రం**లో ప్రతిపాదింపబడ్డాయి.

**నాట్యశాస్త్రం** తొలిసారిగా 1920 ప్రాంతంలో పూర్తిగా నిర్ణయసాగరప్రెస్సు ద్వారా ప్రకటించబడింది. తరువాత 1929 ప్రాంతంలో చౌఖంభాప్రెస్ వారు ప్రకటించారు. (ఈ గ్రంథంలో నిర్దేశాలు ఈ పుస్తకంనుండి, స్పష్టంగా చెప్పినచోట ఇతర పుస్తకాలనుండీ చేయబడ్డాయి.) నాట్యశాస్త్రం అభినవగుప్తుడు రచించిన **అభినవభారతి** అనే వ్యాఖ్యానంతో గాయక్‌వాడ్ ఓరియంటల్ సీరీస్ ద్వారా 1926 లో ప్రారంభించి నాలుగు భాగాలుగా ప్రకటించబడింది. (i) సంపుటం – 1–7 అధ్యాయాలు 1926; (ii) సం. 8–18 అ. 1936, (iii) సం. 19–27 అ. 1954; (iv) సం. 28–37 అ. 1964. **నాట్యశాస్త్రానికి** సంబంధించిన కొన్ని అధ్యాయాల ఆంగ్లానువాదాలు కూడా ఏసియాటిక్ సొసైటీ, కలకత్తా మొదలైన సంస్థలు ప్రకటించాయి. అయితే అక్కడక్కడ లభ్యం అవుతూన్న వ్రాతప్రతులలోను ప్రకటించిన పుస్తకాలలోనూ కూడ అధ్యాయసంఖ్యాశ్లోకాదులలో వ్యత్యాసం ఎక్కువగా కనబడుతున్నది. నిర్ణయసాగర ప్రతిలో 37 అధ్యాయాలుండగా చౌఖంభా ప్రతిలో 36 అధ్యాయా లున్నాయి. చివరి అధ్యాయం 36వ అధ్యాయంలో కలిపివేయబడింది. **నాట్యశాస్త్రం**లో మొత్తం 36 అధ్యాయా లున్నట్లుగా అభినవగుప్తుడు అక్కడక్కడ చెప్పిఉన్నాడు. **నాట్యశాస్త్ర** ప్రమాణం 6000 శ్లోకా లని కూడా అతడు చెప్పాడు. (32 అక్షరాలు ఒక శ్లోకంగా పరిగణించి గ్రంథ పరిమాణాన్ని శ్లోకసంఖ్యలో నిర్దేశించడం అలవాటు). అధ్యాయాలలోని శ్లోకాల సంఖ్య కూడ వేరు వేరుగా ఉన్నది. ఈ విధంగా **నాట్యశాస్త్రా**నికి సంబంధించిన వ్రాతప్రతులను ముద్రితగ్రంథాలనూ పరిశీలించగా దీనిలో అడుగడుగునా ఎన్నో మార్పులూ, చేర్పులూ, పాఠభేదాలూ, శ్లోకక్రమాదిభేదాలు కనబడుతున్నాయి. అలాంటి కొన్ని అంశాలు. క్రింద చూపబడు తున్నాయి.

1. భరతముని నాట్యంలో ఎనిమిది రసాలుంటా యని అంగీకరించి నట్లూ, అప్సరసల సాహాయ్యంతో అతడు ఇంద్రసభలో నాట్యప్రదర్శన చేసినట్లూ కాళిదాసు **"విక్రమోర్వశీయం"** లో అంటాడు. –

**"మునినా భరతేన యః ప్రయోగో భవతీష్వష్టరసాశ్రయః ప్రయుక్తః,**

**లలితాభినయం తమద్య భర్తా మరుతాం ద్రష్టుమనాః సలోకపాలః".** (2.18).

ఈ శ్లోకంలో చెప్పిన ప్రధానాంశాలు మనకు ప్రస్తుతం లభిస్తూన్న **నాట్యశాస్త్రం**లో కనబడుతున్నాయి. భరతుడు **నాట్యశాస్త్రం** రచించి శిష్యులకు బోధించి నట్లు, అప్సరసల సాహాయ్యంతో నాట్యాన్ని ప్రయోగించినట్లు చౌఖంభాప్రతి ప్రథమాధ్యాయంలో 47-50 శ్లోకాలలో చెప్పబడింది. నాట్యప్రయోగం శక్రుడు, లోకపాలులూ మొదలైనవారి సమక్షంలో జరిగినట్లు 55వ శ్లోకంలో చెప్పబడింది. చౌఖంభా ప్రతి ఆరవ అధ్యాయంలో

**"శృఙ్గారహాస్యకరుణరౌద్రవీరభయానకాః,**
**బీభత్సాద్భుతసంజ్ఞౌ చేత్యష్టౌ నాట్యే రసాః స్మృతాః"** (6.15)

అని ఎనిమిది రసాలు చెప్పబడ్డాయి.

ఈ అధ్యాయం -

**"ఏవమేతే రసా జ్ఞేయా హ్యష్టౌ లక్షణలక్షితాః"** (6.83)

అనే శ్లోకార్ధంతో ముగుస్తుంది. ఏడవ శతాబ్దం నాటికి కూడ ఎనిమిది రసాలే అంగీకరించబడ్డాయి అని

**"ఇహ త్వష్టరసాయత్తా రసవత్తా స్మృతా గిరామ్"** (కావ్యాదర్శ. 2.292)

అను కావ్యాదర్శంలోని వాక్యంవల్ల తెలుస్తూన్నది. కొందరు ఎనిమిది రసాలు మాత్రమే అంగీకరించా రనీ, అయితే తనకు తొమ్మిదవదైన శాంతరసానికీ, దాని స్థాయిభావ మైన శమానికి సంబంధించిన చర్చ ఉన్న ప్రాచీనమైన వ్రాతప్రతి కనబడిందనీ అభినవగుప్త డన్నాడు, **"యే పునః నవ రసాః ఇతి పఠన్తి తన్మతే శాన్తస్వరూపమ్ అభిధీయతే"** (గాయక్వాడప్రతి. మొ.సంపుటం పే. 333). **"తస్మాదస్తి శాన్తో రసః తథా చ చిరన్తనపుస్తకేషు "స్థాయిభావాన్ రసత్వముపనేష్యామః"** ఇత్యనన్తరం **"శాన్తో నామ శమస్థాయిభావాత్మకః "** ఇత్యాది శాన్తలక్షణం లక్ష్యతే" (పే. 340). దీనిని పట్టి (కొందరి అభిప్రాయం ప్రకారం కాళిదాసుకాలం క్రీ.శ. 350 - 450 ప్రాంతం అని అంగీకరించినా) కాళిదాసు కాలం నాటికి శాంతం రసంగా అంగీకరించబడలేదనీ, అయితే అభినవగుప్తునికి చాల పూర్వం, అనగా క్రీ.శ. 1000 కి కొన్ని శతాబ్దాలు పూర్వం, శాంతం తొమ్మిదవ రసంగా అంగీకరించబడిన దనీ, అభినవగుప్తుడు **నాట్యశాస్త్రా**నికి రెండు పాఠాలు చూచి ఉన్నా డనీ తెలుస్తూన్నది.

**కావ్యాలంకారసార సంగ్రహంలో** ఉద్భటుడు తొమ్మిది రసాలు పేర్కొన్నాడు -

**"శృఙ్గారహాస్యకరుణరౌద్రవీరభయానకాః,**
**బీభత్సాద్భుతశాన్తాశ్చ నవ నాట్యే రసాః స్మృతాః"** (4.5)

శాంతరసాన్ని క్రొత్తగా వాసుకి చేర్చా డని శారదాతనయుడు **భావప్రకాశనంలో** (పే. 46.48) అన్నాడు. ఈ మాటల ప్రామాణ్యాప్రామాణ్యాల మాట ఎలా ఉన్నా ఇంతవరకు మనం చూచిన దానిని పట్టి నాట్యశాస్త్రానికి సంబంధించిన కొన్ని వ్రాతప్రతులలో క్రీ.శ. 400 తరవాత క్రీ.శ. 750కి పూర్వం శాంతరసం రసంగా అంగీకరించబడినట్లు స్పష్టం అవుతున్నది.

2. అయిదవ అధ్యాయం చివర ఉన్న 40 శ్లోకాలు (నిర్ణయసాగరప్రతిలో 181–220, చౌఖంభాప్రతిలో 176–25) చాలా లిఖితప్రతులలో లేవు. వీటికి అభినవగుప్తాచార్యులు కూడా వ్యాఖ్యానం వ్రాయలేదు. బహుశా అవి నందికేశ్వరుని నుండి గ్రహించబడి ఉంటాయి.

3. చౌఖంభాప్రతిలోని 207 శ్లోకాల తొమ్మిదవ అధ్యాయము 55 శ్లోకాల పదవ అధ్యాయమూ కలిసి నిర్ణయసాగరప్రతిలో 267 శ్లోకాల తొమ్మిదవ అధ్యాయంగా ఉంది. అభినవగుప్తుడు కూడ వీటిని ఒకే అధ్యాయంగా కలిపివేశారు.

4. ఛందస్సును గూర్చిన పదిహేనవ అధ్యాయం ప్రారంభంలో అభినవగుప్తుడు అక్కడ రెండు పాఠా లున్నట్లుగా చెప్పాడు.– **"తత్రేహాధ్యాయే భరతమునికృతమితి త్రికైః మకారాదిభిః కైశ్చిత్ కించిల్లక్షణం స్వీకృతమితి ద్వివిధః పాఠో దృశ్యతే, మధ్యే చ చిరన్తనేషు పుస్తకేషు ఉభయమపి పఠ్యతే."** (అ.భా. రెండవ సంపుటం. పే. 252–253). నిర్ణయసాగర ప్రతిలో రెండవపాఠం ఉన్నది.

5. నిర్ణయసాగరప్రతిలోని 16వ అధ్యాయంలోను, చౌఖంభా ప్రతిలోని 17వ అధ్యాయంలోను ఐదు అనుష్టుప్ శ్లోకాలలో 36 నాట్యలక్షణాలు చెప్పబడ్డాయి. గాయక్వాడ్ ప్రతిలోని 16వ అధ్యాయంలో ఇవి నాలుగు ఉపజాతివృత్తాలలో చెప్పబడ్డాయి. అంతే కాకుండా, రెండు పట్టికలలోనూ ఉన్న పేర్లు సమంగా లేవు; రెండింటిలోను సమంగా ఉన్నవి పదిహేడు పేర్లు మాత్రమే. ఇక్కడ అభినవగుప్తుడు – "భరతుడు తానే చెప్పిన లక్షణాల పేర్లకంటె వేరుగా కొన్ని పేర్లు చెపుతున్నాడు. అందుచేతనే లిఖితప్రతులలో నున్న లక్షణాల పేర్లలోను, వాటి క్రమంలోను భేదం కనబడుతూన్నది. అయితే నేను మా గురువుగారైన భట్టతౌతుని సంప్రదాయం అనుసరిస్తున్నాను" అని అన్నాడు – **"తథా చ మతాన్తరేణ భరతమునిరేవ అన్యథాప్యుద్దేశలక్షణేన నామాన్తరైరపి చ వ్యవహారం కరోతి. తత ఏవ పుస్తకేషు భేదో దృశ్యతే. తం చ దర్శయిష్యామః. పఠితోద్దేశక్రమస్తు అస్మదుపాధ్యాయపరమ్పరాగతః"** (అ.భా.రెండవ సంపుటం, పే. 298). దీనిని పట్టి అభినవగుప్తాచార్యుల కాలంనాటికి లక్షణాలను గూర్చి చెప్పిన అధ్యాయానికి రెండు విధాలైన పాఠా లున్నట్లు తెలుస్తూన్నది. ధనికుడు **దశరూపకం**లోను (4.78), రాఘవభట్టు **అర్థద్యోతనిక**లోను ఉపజాతివృత్తంలో చెప్పిన లక్షణాలను ఉదాహరించగా **సాహిత్య**

**దర్పణకారుడు,** మరి కొందరూ అనుష్టుప్ శ్లోకాలలో ఇచ్చిన లక్షణాలను ఉదాహరించారు.

6. నిర్ణయసాగర ప్రతిలోని 24వ అధ్యాయం చౌఖంభా ప్రతిలోని 34, 35 అధ్యాయాలలో పంచబడి ఉంది. నిర్ణయసాగరప్రతిలోని 36, 37 అధ్యాయాలు చౌఖంభాప్రతిలోను, **అభినవభారతి**లోనూ కూడ 36వ అధ్యాయంగా కూర్చబడ్డాయి.

7. నిర్ణయసాగరప్రతిలోని 31వ అధ్యాయంలో 334 శ్లోకా లున్నాయి. చౌఖంభాప్రతిలోని అదే అధ్యాయంలో 545 శ్లోకా లున్నాయి. **"ఆకారవృత్తమన్యత్స్యాత్ చతుష్కం త్రికమేవ వా"** (నిర్ణయసాగరప్రతిలో 293వ శ్లోకం. చౌఖంభాప్రతి. 397వ శ్లోకం) అనే శ్లోకం తరవాత ఒక లిఖితపుస్తకంలో 92 శ్లోకాలు చేర్చబడ్డాయి అని క్రొత్త నిర్ణయసాగరప్రతిలో 520వ పేజీలో ఒక సూచన (Note) ఉంది. అభినవగుప్తాచార్యుల వ్యాఖ్యానం ప్రకారం వీటిలోని సగం శ్లోకాలు మాత్రమే విడిచివేయబడ్డాయి అని **అభినవభారతీ**సహిత**నాట్యశాస్త్రా**నికి సంపాదకు డైన రామకృష్ణకవి రెండవ సంపుటం ప్రస్తావనలో పద్నాల్గవ పేజీలో వ్రాశారు. తాను నలభై **నాట్యశాస్త్ర**లిఖితపుస్తకాలను సంపాదించి పరిశీలించినట్లూ వాటిలోని ఏ రెండూ పూర్తి సామ్యంతో లేవు అనీ కూడ కవి మొదటి సంపుట ప్రస్తావన ఏడవ పేజీలో అన్నారు. **నాట్యశాస్త్రానికి** ఔత్తరభారత పాఠమూ, దాక్షిణాత్యపాఠమూ అని రెండు పాఠా లున్నాయనీ, దాక్షిణాత్యపాఠం ప్రాచీన మైన దనీ ఆయన తమ అభిప్రాయం వెలిబుచ్చారు.

ప్రస్తావనలలో కవి వ్రాసినదానిని పట్టి **అభినవభారతి**ని యథాతథంగా సంపాదించడానికి తగిన లిఖితపుస్తకా లేవీ లేవని స్పష్టం అవుతుంది. ముప్పైఆరు అధ్యాయాలన్నింటికీ పూర్తిగా **అభినవభారతి** ఉన్న లిఖితపుస్తకం ఏదీ లభించలేదు. కొన్ని చోట్ల అభినవభారతికే రెండు పాఠా లున్నట్లు, ఇది **నాట్యశాస్త్రానికి** భిన్నంగా ఉన్నట్లూ కనబడుతుంది. ఏడు – ఎనిమిది అధ్యాయాలకు **అభినవభారతీ**వ్యాఖ్య కవికి లభించలేదు. ఏడవ అధ్యాయం ప్రారంభంలో కొన్ని వాక్యపుంజాలు మాత్రమే లభించాయి. అసంపూర్ణంగా ఉన్న కొన్ని లిఖితపుస్తకాలలో దూరదూరంగా చెదిరి పడి ఉన్న భాగాలను తీసికొని వ్యాఖ్యానాన్ని పూరించవలసి ఉండడంచేత ఈ వ్యాఖ్యానం చాల వరకు అతుకుల బొంతయే అయి సంతృప్తికరంగా ఉండదు. కొన్ని చోట్ల **అభినవభారతి** లభించక పోవడంచేత తన వ్యాఖ్యానం చేర్చినట్లుగా కవి వ్రాశాడు. తాను ఎక్కడ పూరించాడో స్పష్టంగా ఆయన అక్కడ వ్రాసినా కూడ ఇది **అభినవభారతి**యే అని కొందరు భ్రాంతి పడడానికి అవకాశం ఏర్పడింది. గ్రంథం మధ్యలో కాక గ్రంథాంతంలో అనుబంధంగా తన వ్యాఖ్యలు ఇస్తే ఇలాంటి భ్రాంతికి అవకాశం ఉండేది కాదని కొందరు పండితుల అభిప్రాయం.

ఈ విధంగా **నాట్యశాస్త్రమూ**, దాని వ్యాఖ్యయైన **అభినవభారతీ** కూడ మనకీనాడు

లభిస్తున్న రూపంలో అసంపూర్ణంగాను, అసంతృప్తికరంగానూ ఉండడంచేత మూల **నాట్యశాస్త్రం** ఏది, దాని రచయిత ఎవ్వరు అనే రెండు ప్రశ్నలు, సరియైన సమాధానం చెప్పడానికి శక్యం కాని ప్రశ్నలు, ఉదయిస్తున్నాయి.

ప్రస్తుతం మనకు లభిస్తున్న **నాట్యశాస్త్ర** స్వరూపం ఈ విధంగా ఉంది. –

1. ఈ గ్రంథం అంతా శ్లోకరూపంలో ఉంది. ఆరు ఏడు అధ్యాయాలలో అక్కడక్కడ కొన్ని గద్యభాగా లున్నాయి.

2. "ఆ(అ)నువంశ్యాలు", అనే పేరుతో కనీసం పదిహేను శ్లోకాలు (అనుష్టుప్పులు). 16 ఆర్యలు ఉన్నాయి.

3. **"సూత్రానుబద్ధే ఆర్యే భవతః"** (సూత్రానికి సంబంధించిన రెండు ఆర్యలున్నాయి.) అని ప్రారంభించి చాలా శ్లోకాలు చెప్పబడ్డాయి.

4. **"భవన్తి చాత్ర శ్లోకాః", "అత్రార్యే భవతః" "అత్ర శ్లోకాః"** అని ప్రారంభించి వేరు వేరు స్థానాలలో దాదాపు 100 శ్లోకాలు ఉదాహరించబడ్డాయి.

5. **నాట్యశాస్త్రంలో** ఐదు వేలకు పైగా శ్లోకా లున్నాయి. వీటిలో చాలా వరకు శ్లోకంఛందస్సులో ఉన్నాయి. కొన్ని శ్లోకాలు మాత్రమే ఆర్యా – ఉపజాతివృత్తాలలో ఉన్నాయి.

పైన చెప్పిన అంశాలలో ప్రతీ అంశాన్నీ జాగర్తగా పరిశీలించవలసి ఉంది.

1. గద్యభాగాలు నిరుక్తంలోని వాక్యాల వలె సూత్ర–భాష్యపద్ధతిలో ఉన్నాయి. ఇందుకు ఆరవ అధ్యాయంలోని **"విభావానుభావవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః, కో వా దృష్టాన్త ఇతి చేత్ – ఉచ్యతే – యథా నానావ్యఞ్జనౌషధి ... రసత్వమాప్నువన్తి. ఋషయ ఊచుః, రస ఇతి కః పదార్థః? అత్రోచ్యతే ఆస్వాద్యత్వాత్"** అను రససూత్ర వాక్యసందర్భాన్ని ఉదాహరణంగా చూపవచ్చును. ఇక్కడ నున్న మొదటి వాక్యం సూత్రం వలె తరవాతి వాక్యాలు భాష్యంవలె ఉన్నాయి. ఇంకా **"వ్యభిచారిణ ఇదానీం వక్ష్యామః. అత్రాహ, వ్యభిచారిణ ఇతి కస్మాదుచ్యన్తే? వి అభి ఇత్యేతౌ ఉపసర్గౌ. చర గతౌ ధాతుః"** (పే. 34) ఇత్యాదివాక్యాలను ఉదాహరణలుగా చూపవచ్చును. ఈ వాక్యాలను **"అపత్యం కస్మాత్? అపతితం భవతి, నానేన పతతీతి వా"** (నిరు. 3.1) అను **నిరుక్తంలోని** వాక్యాలతోను, **"కో ధర్మః? కథం లక్షణః? కాన్యస్య సాధనాని? కాని సాధనాభాసాని? కింపరశ్చేతి"** (శాబరభాష్యం. పే. 9) అను **శాబరభాష్యవాక్యాలతోను** పోల్చి చూడవచ్చును. అభినవగుప్తుడు **నాట్యశాస్త్రాన్ని 'భరతసూత్రం'** అనే పేరుతో నిర్దేశించడం గమనార్హం. ఈ గ్రంథం సూత్రాలు. భాష్యం, సంగ్రహం, కారికలు, నిరుక్తమూ వీటి రూపంలో

ఉన్నట్లు మన కిపుడు లభ్యం అవుతున్న గ్రంథంలోనే సూచన లున్నాయి.

**"విస్తరేణోపదిష్టానామర్థానాం సూత్రభాష్యయోః,**
**నిబన్ధో యః సమాసేన సంగ్రహం తం విదుర్బుధాః,**
**రసా భావా హ్యభినయా ధర్మివృత్తిప్రవృత్తయః,**
**సిద్ధిః స్వరాస్తథాతోద్యం గానం రఙ్గం చ సంగ్రహః.**
**అల్పాభిధానేనార్థో యః సమాసేనోచ్యతే బుధైః,**
**సూత్రతః సా తు విజ్ఞేయా కారికార్థప్రయోగినీ".** **(6.9–11)**

**"ఏవమేషోఽల్పసూత్రార్థో వ్యాదిష్టో నాట్యసంగ్రహః,**
**అతః పరం ప్రవక్ష్యామి సూత్రగ్రన్థవికల్పనమ్"** (6.31)

సూత్రం అనగా లక్షణం. సూత్రాన్ని పరీక్షించి దాని అర్థాన్ని విశదీకరించేది భాష్యం." (**సూత్రం లక్షణమ్. భాష్యం తద్వ్యక్తీకరణరూపా పరీక్షా.** (మొదటి సంపుటం పే.256) అని అభినవగుప్తుడు సూత్ర – భాష్య శబ్దాల అర్థం వివరించాడు. సూత్రాన్నే కారిక అనవచ్చుననీ, సూత్రం తరవాత వచ్చినది, సూత్రంతో సంబంధించి దాని అర్థాన్ని విశదీకరించేదీ అయిన శ్లోకం కూడ కారికయే అనీ ఈయన వ్యాఖ్యానించారు. – **"సూత్రతః సూత్రణేన, తేన సూత్రమపి కారికా. తత్ సూత్రమ్ అపేక్ష్య యా అను పశ్చాత్ పఠితా శ్లోకరూపా సాపి కారికా"** (మొ.సం.పే 266). ఆరవ అధ్యాయంలోని 39వ శ్లోకంలో ఉన్న **"సూత్రం సూత్రకం, లక్షణం, వక్ష్యామి. తేనైవ చ కారికా సంగృహీతా. గ్రన్థః భాష్యం తత్కృతం చ వికల్పనమ్. ఆక్షేపప్రతిసమాధానాత్మకమ్ ఇతి పరీక్షా నిరుక్త శబ్దవాచ్యా ప్రతిజ్ఞాతా. సూత్రవివరణస్వభావా తు కారికా సూత్రమపి ప్రకాశయన్తీ బహుతరాక్షేపసమాధానవ్యాకులశిష్యజనస్థితిపక్షం నిరూపణేన ఉపకరోతీతి భాష్యస్య పశ్చాదస్యాః పాఠః"** (మొ.సం.పే.273) అని అన్నారు. **"విభావానుభావ ... నిష్పత్తిః"** అను వాక్యానికి అవతారికగా అభినవగుప్తుడు **"ఏవం క్రమహేతుమభిధాయ లక్షణ సూత్రమాహ విభావేతి"** అనీ, **"కో దృష్టాన్తః? అత్రాహ యథా హి..."** ఇత్యాది వాక్యాన్ని వివరిస్తూ **"అత్ర ప్రశ్నే భాష్యేణ ప్రతివచనమాహ యథేత్యాదినా ఆప్నువన్తీత్యన్తేన"** (మొ.సం.పే. 289) అనీ అన్నారు. ఆరవ అధ్యాయంలో **"తత్ర శృఙ్గారో నామ రతిస్థాయిభావప్రభవః ఉజ్జ్వలవేషాత్మకః"** అనే వాక్యానికి అవతారికగా **"అత్ర రతిస్థాయీతి సూత్రభాగం భాష్యేణ స్పష్టయతి స చేత్యాదినా"** అనే అభినవభారతీవాక్యం – పై వాక్యం సూత్ర – భాష్యాత్మకమైన దని సూచిస్తూన్నది.

భవభూతి **ఉత్తరరామచరిత్ర** నాల్గవ అంకంలో భరతుడు "తౌర్యత్రిక సూత్రధారుడు" అని అంటాడు. సూత్రం అనేది గద్యరూపంలోనే ఉండాలనే నియమం లేదు. **ఐతరేయబ్రాహ్మణ – శతపథబ్రాహ్మణాదులైన** ప్రాచీన గ్రంథాలలో కూడ శ్లోకాలున్నాయి.

ఆపస్తంబ – బోధాయన – వాసిష్ఠాది ధర్మసూత్రాలలోను గృహ్యసూత్రాలలోనూ కూడా శ్లోకాలున్నాయి. మధ్యయుగానికి సంబంధించిన **కావ్యప్రకాశాది** గ్రంథాలలోని కారికలను సూత్రా లని కూడా నిర్దేశించడం ఉన్నది. అందుచేత నాట్యశాస్త్రంలోని మూలభూతమైన ప్రధానభాగంలో పద్యగద్యాలు రెండూ కలిసి ఉండేవని చెప్పవచ్చును.

2. ఇంక – అక్కడక్కడ ఆర్యలను అనుష్టుప్ శ్లోకాలను ఉదాహరించే సందర్భంలో ప్రయోగించిన "ఆనువంశ్య" అనే పదానికి గల అర్థాన్ని పరిశీలించవలసి ఉన్నది. ఈ పేరుతో ఉదాహరించబడిన శ్లోకాలు ముఖ్యంగా ఆరు – ఏడు అధ్యాయాలలో మాత్రమే అధిక సంఖ్యలో ఉన్నా యనే ప్రధాన విషయాన్ని మనం గుర్తు ఉంచుకోవాలి. ఇతర అధ్యాయాలలో ఇవి చాల తక్కువగా కనబడుతున్నాయి. 'ఆనువంశ్యశ్లోకం' అనే పదం తరచుగా **మహాభారతం**లో ప్రయోగించబడింది. కొన్నిచోట్ల 'అనువంశం' అనే పదం కూడా ప్రయోగించబడింది –

**"యత్రానువంశం భగవాన్ జామదగ్న్యస్తథా జగౌ**
**విశ్వామిత్రస్య తాం దృష్ట్వా విభూతిమతిమానుషీమ్"** (వనపర్వం. 87.16)

వనపర్వంలో (88.5) 'ఆనువంశ్యా' అనే పదం 'గాథా'కు విశేషంగా ప్రయోగించ బడింది. వనపర్వంలోనే **"అత్రానువంశం పఠతః శృణు మే కురు నన్దన"** అనే శ్లోకంలోని 'ఆనువంశ' శబ్దానికి నీలకంఠుడు "పరమ్పరాగతమాఖ్యానశ్లోకమ్" (గురుశిష్యపరంపరయా వస్తూన్న ఒక విషయప్రతిపాదకమైన శ్లోకం) అని అర్థం వ్రాశాడు. **మత్స్యపురాణంలో** కూడా (271.15) ఒక ఆనువంశ్య శ్లోకం ఉంది. **నాట్యశాస్త్రం** ఆరవ అధ్యాయంలో 35–36 శ్లోకాలకు ముందున్న **"ఆనువంశ్యశ్లోకౌ భవతః"** అనే దానిని వివరిస్తూ అభినవగుప్తుడు – **"అత్రేతి భాష్యే అనువంశభవౌ శిష్యాచార్యపరమ్పరాసు వర్తమానౌ శ్లోకాఖ్యౌ వృత్తవిశేషౌ సూత్రార్థసంక్షేపప్రకటీకరణేన కారికాశబ్దవాచ్యౌ భవన్తౌ పఠతి యథేత్యాది"** (మొ.సం.పే.290). ఇక్కడ 'అత్ర' అనే దానికి 'భాష్యే' అని అర్థం చెప్పడం చేత **"విభావా ... నిష్పత్తిః"** అనేదానిని సూత్ర మనీ, అక్కడ గద్యరూపాలైన వాక్యాలను భాష్యం అనీ అభినవగుప్తుడు గ్రహిస్తూన్నట్లు స్పష్టం అవుతున్నది.

దీని నంతనీ పట్టి – ఆనువంశ్యశ్లోకా లనేవి చాలా కాలం క్రితమే రచితములై సంప్రదాయానుసారం తండ్రినుండి కుమారునకు లేదా గురువునుండి శిష్యులకు అందింపబడుతూ వస్తూన్న నాట్యానికి సంబంధించిన శ్లోకాలనీ, వాటినే నాట్యశాస్త్రంలో చేర్చడం జరిగిన దనీ, అంతేనే కాని అవి ప్రస్తుత నాట్యశాస్త్రకర్త రచించినవి కావనీ స్పష్టం అవుతున్నది.

3. కొన్ని ఘట్టాలలో ప్రయోగించిన **"సూత్రానువిద్ధే"** లేదా **"సూత్రానుబద్ధే ఆర్యే**

**భవతః"** అనేదానికి ఈ శ్లోకాలు అంతకు ముందే చెప్పిన సూత్రానికి చాల దగ్గరగా సంబంధించినవి అని లేదా అవి సూత్రంయొక్క అర్థాన్ని సులభమైన భాషలో స్పష్టీకరిస్తాయి అని అర్థం. అవి గ్రంథకారుడు రచించిన శ్లోకాలే అని చెప్పవచ్చును. **"అపి చ సుఖ..."** (మొ.సం.పే.311–12) అనే దాని దగ్గర – **"ఏవం సూత్రార్థే పరీక్ష్య స్థాపితే తదర్థస్య సుఖగ్రహణార్థం సూత్రార్థవివరణరూపత్వాత్ సూత్రసమీపేఽపి ఉచితపాఠాత్ కారికామధునా పఠతి అపి చేతి. న కేవలం సూత్రం, పరీక్షాపి యావదియం కారికేతి, ఏవం సర్వత్ర మన్తవ్యమ్. తామేవ కారికాం పఠతి – సుఖేతి"** అని **అభినవభారతిలో** చెప్పబడింది. ఇక్కడ చెప్పినది సూత్రానుబద్ధాలుగా ఉదాహరించబడిన ఆర్యలకు కూడ వర్తిస్తుంది.

**"అత్రార్యాః"** (మొ.సం.పే.327–28) అనేచోట అభినవగుప్త డిలా అన్నాడు. "కొందరు ప్రాచీనాచార్యులు రసాలకీ, వాటికి సంబంధించిన కొన్ని విషయాలకీ సంబంధించిన కొన్ని అంశాలను కూర్చిన కొన్ని ఆర్యలను సేకరించి ఉంచారు; భరతుడు వాటినుంచి కొన్ని ఆర్యలను గ్రహించి ఆ యా రసాలను గూర్చి చెప్పేటప్పుడు తగు ప్రదేశాలలో ఆ ఆర్యాశ్లోకాలను చేర్చాడు. – **"తా ఏతా హ్యార్యాః ఏకప్రఘట్టకతయా పూర్వాచార్యైః లక్షణత్వేన పఠితాః. మునినా తు సుఖసంగ్రహాయ యథాస్థానం నివేశితాః"** (మొ.సం.పే.328). దీనిని పట్టి అభినవగుప్తుని అభిప్రాయం ప్రకారం **నాట్యశాస్త్రంలో** ఉన్న ఆర్యలు భరతవిరచితాలు కావని తెలుస్తూన్నది. **భావప్రకాశనంలో** వాసుకి రచించిన ఒక శ్లోకం ఉదాహరించబడింది. **నాట్యశాస్త్రంలోని** ఆరవ అధ్యాయంలో **"భవన్తి చాత్ర శ్లోకాః"** లేదా **"అత్ర శ్లోకాః"** అని ప్రారంభించి ఉదాహరించిన ఐదు శ్లోకాలలో ఈ శ్లోకం ఉంది.

> **"నానాద్రవ్యౌషధైః పాకైర్వ్యఞ్జనం భావ్యతే యథా,**
> **ఏవం భావా భావయన్తి రసానభినయైః సహ,**
> **ఇతి వాసుకినాప్యుక్తో భావేభ్యో రససంభవః."** (భా.ప్ర.పే. 36, 37)

ఇంక మిగిలిన నాట్యశాస్త్రగ్రంథానికి సంబంధించిన వ్రాతప్రతులలోని శ్లోకాల సంఖ్యలో భేదం వందలలో ఉన్నది. అందుచేత అసలు మూల**నాట్యశాస్త్రంలో** ఏముందో చెప్పడం చాల కష్టం. అయితే దాని స్వరూపం ఈ క్రింది విధంగా ఉండి ఉండవచ్చునని కొందరు పండితుల అభిప్రాయం. ప్రస్తుతం మనకు లభిస్తూన్న ఆరు – ఏడు అధ్యాయాలూ, వివిధాభినయాలను ప్రతిపాదించే ఎనిమిదినుండి పద్నాలుగు వరకు ఉన్న ఆరు అధ్యాయాలూ, పదిహేడవ అధ్యాయం నుంచి ముప్పైయైదవ అధ్యాయం వరకూ ఉన్న పందొమ్మిది అధ్యాయాలూ – ఇవన్నీ ఒక కాలానికి చెందినవి. ఆరు – ఏడు

అధ్యాయాలలోని గద్యభాగాలు, ప్రాచీనాచార్యులనుండి గ్రహింపడినట్లుగా అభినవగుప్తుడు చెప్పే ఆర్యాశ్లోకాలు బహుశా క్రీ.పూ.200 సంవత్సరం ప్రాంతానికి చెంది ఉంటాయి. వాటిని పైన చెప్పిన అధ్యాయాలను రచించినపుడు వాటిలో చేర్చడం జరిగి ఉంటుంది. ఈ కాలాన్ని చెప్పడానికి కారణాలు ఇవి – **గౌతమధర్మసూత్రంలో** (11.19) నాలుగు ఉపవేదాలు చెప్పబడ్డాయి. **ఆయుర్వేదం, ధనుర్వేదం, గాంధర్వవేదం, అర్థశాస్త్రం** (కొందరి ప్రకారం **స్థాపత్యం**) అనేవి నాలుగు వేదాలకు ఉపవేదాలుగా అతిప్రాచీనకాలంనుంచీ చెప్పబడుతున్నాయి. అర్జునుడు విశ్వావసుపుత్రుడైన చిత్రరథుని వద్ద **గాంధర్వవేదం** నేర్చినట్లు వనపర్వంలో (91.14–15) చెప్పబడింది. సామమంత్రాలు, గానము, నృత్యము, వాద్యవాదనము **గాంధర్వవేదానికి** సంబంధించిన విషయాలు. **గాంధర్వవేదాన్ని** మొట్టమొదట ప్రచారంలోనికి తీసికొనివచ్చినవాడు నారదుడని **శాంతిపర్వంలో** (210.21) చెప్పబడింది. **గాంధర్వవేదానికి నాట్యవేదానికి** కొంత భేదం ఉంది. **గాంధర్వవేదం** పరిమితమైన పరిధి గల ఉపవేదం. **నాట్యవేదం** అన్ని వర్గాలవారి కోసమూ ఉద్దిష్టమైన పంచమవేదం. అందుచేత దీని పరిధి అతివిస్తృతమైనది. గానము, నృత్యము అనేవి దీనిలోని ఒక భాగం మాత్రమే. గాంధర్వాన్ని **గాంధర్వవేదం** నుండి భరతుడు గ్రహించినట్లు **నాట్యశాస్త్రం**లోనే చెప్పబడింది. –

> **“గాన్ధర్వమేతత్కథితం మయా హి పూర్వం యదుక్తం త్విహ నారదేన,**
> **కుర్యాద్య ఏవం మనుజః ప్రయోగం సంమానమగ్ర్యం కుశలేషు గచ్ఛేత్”**
> (నా.శా. 32.484)

శృంగారం పుష్పాలచేత, గాంధర్వంచేత, కావ్యపఠనంచేతా ఉత్తేజితం అవుతుంది అని **నాట్యశాస్త్రం** చెపుతున్నది.

> **“ఋతుమాల్యాలఙ్కారైః ప్రియజనగాన్ధర్వసేవాభిః,**
> **ఉపవనగమనవిహారైః శృఙ్గారరసః సముద్భవతి”** (నా.శా. 6.47)

ఈ విధంగా **నాట్యశాస్త్రానికి** గాంధర్వంతో సన్నిహితసంబంధం ఉన్నట్లు స్పష్టం అవుతున్నది. అయితే ఈ రెండూ స్వతంత్రమైన రెండు విద్య లని భరతుని అభిప్రాయం అని కొందరు అంటారు. అందుకు ప్రమాణంగా నాట్యశాస్త్రంలో అక్కడక్కడ ఉన్న **“గాన్ధర్వం చైవ నాట్యం చ యః సమ్యగనుపశ్యతి”** ఇత్యాదివాక్యాలను చూపుతూ ఉంటారు. సామాన్యవిశేషన్యాయంచేత (వృక్షాలు చూతవృక్షాలు అని వేరు వేరుగా చెప్పినట్లు) వీటిని వేరు వేరుగా చెప్పడం జరిగింది కాని ఈ రెండింటిని అత్యంత భిన్నము లైన రెండు విద్యలుగా గ్రహించవలసిన పని లేదు. **నాట్యశాస్త్రం** ప్రారంభంలోనే బ్రహ్మదేవుడు **నాట్యవేదాన్ని** సృష్టించా డనీ, దీనికి వేదాలతోనూ ఉపవేదాలతోనూ సంబంధం ఉన్నదనీ,

ఇది అత్యంత లలిత మైన వేద మనీ భరతుడు చెప్పి ఉన్నాడు -

> **"వేదోపవేదైః సంబద్ధో నాట్యవేదో మహాత్మనా,**
> **ఏవం భగవతా సృష్టో బ్రహ్మణా లలితాత్మకః"** (నా.శా. 1.18)

అని కాణే మొదలైన పండితుల అభిప్రాయం. అయితే - **నాట్యవేదం గాంధర్వవేదం**నుండి విషయాలు సేకరించినది అని అంగీకరించి నప్పుడు ఈ రెండూ వేరు వేరు విద్యలు అని చెప్పడంలో తప్పులేదు. పైన ఉదాహరించిన శ్లోకంలో చెప్పినట్లు నాట్యవేదానికి వేదోపవేదాలతో సంబంధం ఉన్నా వాటికంటె ఇది భిన్నం అని అంగీకరిస్తున్నాం కదా?

కళింగదేశరాజైన "ఖారవేలుడు" **గాంధర్వవేదబుధుడు** అని, ఖారవేలుడు వ్రాయించిన హాథిగుఫాశిలాశాసనంలో చెప్పబడింది. ఈ శాసనం క్రీ.పూ. రెండవ శతాబ్దానికి చెందినదిగా అంగీకరించబడింది. అందుచేత గాంధర్వవేదాన్ని ఒక వేదంగా (ఉపవేదంగా) క్రీస్తుకు కొన్ని శతాబ్దాలకు పూర్వమే అంగీకరించి ఉంటారు. ఈ వేదంలోని కొన్ని అంశాలను అలవాట్లను గ్రహించిన **నాట్యశాస్త్రం** క్రీ.పూ. 200 సంవత్సరాల ప్రాంతానికి చెందినదని చెప్పవచ్చు.

**నాట్యశాస్త్ర** ప్రవర్తకుడు భరతుడు అని కాళిదాసు - భవభూతి - దామోదరగుప్తులు చెప్పి ఉన్నారు. అందుచేత ప్రస్తుతం లభిస్తూన్న **నాట్యశాస్త్రంలోని** మొదటి అధ్యాయం, బహుశా తరువాతి నాలుగు అధ్యాయాలూ కూడ క్రీ.శ. ఐదవ శతాబ్దికంటె కొన్ని శతాబ్దాలకు పూర్వమే చేర్చబడి ఉండాలి. ఇప్పుడు లభించే అధ్యాయాలలో చాలవరకు క్రీ.శ.మూడవ లేదా నాల్గవ శతాబ్దానికే ఉండి ఉంటాయని అనేక ప్రమాణాల ద్వారా నిర్ధారించడానికి అవకాశం ఉంది.

క్రీ.శ.1000-1030 ప్రాంతంలో **నాట్యశాస్త్రానికి** వ్యాఖ్యానం రచించిన అభినవగుప్తుడు నాట్యశాస్త్రాని కున్న అనేక ప్రాచీనవ్యాఖ్యానాలను గూర్చి ప్రస్తావించాడు. తొమ్మిదవ అధ్యాయంలో ఉన్న -

> **"ఉత్తానో వర్తులస్త్ర్యస్రః స్థితోఽధోముఖ ఏవ చ,**
> **పఞ్చ ప్రచారా హస్తస్య నాట్యనృత్తసమాశ్రయాః"** (9.182)

అనే శ్లోకాన్ని భట్టోద్భటుడు -

> **"ఉత్తానోఽధస్తలస్త్ర్యశ్రోఽగ్రగోఽధోముఖ ఏవ చ,**
> **పఞ్చ ప్రకారా హస్తస్య..."**

అని మరొక విధంగా పఠించినట్లు ఆయన వ్రాశారు. అట్లే పద్దెనిమిదవ అధ్యాయంలోని **"వృత్తాని సమవకారే కవిభిస్తాని ప్రయోజ్యాని"** (18.76) అనే శ్లోకాన్ని ఉద్భటుడు - **"వృత్తాని సమవకారే కవిభిర్నైవ ప్రయోజ్యాని"** అని పఠించాడట. పందొమ్మిదవ

అధ్యాయంలోని 42వ శ్లోకంలో ఉద్భటుడు 'విమర్శ' కు బదులు 'అవమర్శ' అని పఠించాడని చెపుతూ అభినవగుప్తుడు దాని అర్థం వివరించాడు. అదే అధ్యాయంలోని 69వ శ్లోకంలో సంధ్యంగాల విషయంలో ఉద్భటుడు అంగీకరించిన క్రమాన్ని అభినవగుప్తుడు విమర్శిస్తాడు. ఉద్భటుడు ఎనిమిదవ శతాబ్దం ఉత్తరార్ధంలో ఉన్నాడు. దీనిని పట్టి ప్రస్తుతం లభిస్తూన్న గ్రంథంలో తొమ్మిదవ అధ్యాయం, పద్దెనిమిదవ అధ్యాయం కూడ ఎనిమిదవ శతాబ్ధానికి చాల పూర్వమే ఉన్నట్లు చెప్పాలి. లోల్లటుడు ఉద్భటుని మతాన్ని ఖండించినట్లుగా అభినవగుప్తుడు ఆరవ అధ్యాయంలోని పదవ శ్లోకంలో చెప్పాడు. లోల్లటుడు అంగీకరించిన అనేక పాఠభేదాలను కూడా అక్కడక్కడ చూపించాడు. అట్లే **నాట్యశాస్త్రం**లోని 3, 18, 19, 29, అధ్యాయాలలోని కొన్ని శ్లోకాలపై శంకుకుడు చేసిన వ్యాఖ్యను అభినవగుప్తుడు ఉదాహరించాడు. దీనిని పట్టి కనీసం ఎనిమిదవ శతాబ్దం నాటికి **నాట్యశాస్త్రం**లోని ప్రధానమైన అధ్యాయా లన్నీ ప్రచారంలో ఉన్నా యని తెలుస్తూన్నది. **కావ్యాదర్శం**లో (2, 281, 283, 286) దండి రతి – క్రోధ – ఉత్సాహాలు, శృంగార – రౌద్ర – వీరరసాలకు స్థాయిభావా లని చెప్పాడు. అదే విధంగా ఇతరులు చెప్పిన సంధ్యంగ – వృత్త్యంగలక్షణాలు కూడా మా మతంలో అలంకారాల క్రిందికే వస్తాయి అని అంటాడు.

**"యచ్చ సంధ్యఙ్గవృత్త్యఙ్గలక్షణాద్యాగమాన్తరే,**
**వ్యావర్ణితమిదం చేష్టమలంకారతయైవ నః"** (కావ్యాదర్శ 2.367)

ఇక్కడ దండి చెప్పిన ఆగమాంతరం **నాట్యశాస్త్రం** అని వ్యాఖ్యాత లందరూ వ్యాఖ్యానించారు. నాట్యశాస్త్రంలో సంధ్యంగాలు 21వ అధ్యాయంలోని 58–69 శ్లోకాలలోను, వృత్తులు వృత్త్యంగాలు 22వ అధ్యాయంలోని 25–64 శ్లోకాలలోను, లక్షణాలు 17వ అధ్యాయంలోని 1–42 శ్లోకాలలోను చెప్పబడ్డాయి. దండి చెప్పిన దానిని పట్టి **నాట్యశాస్త్రం** లోని ప్రధానమైన అధ్యాయాలు ఉద్భటునికంటె ఒకటి రెండు శతాబ్దాలకు పూర్వమే ఉన్నట్లు చెప్పవచ్చును.

**కుమారసంభవం** ఏడవ సర్గలోని ఈ క్రింది శ్లోకాల భావాన్ని పరిశీలిస్తే మన **నాట్యశాస్త్రకాలం** ఇంకా వెనుకకు నెట్టవచ్చును.

**"తౌ సన్ధిషు వ్యఞ్జితవృత్తిభేదం రసాన్తరేషు ప్రతిబద్ధరాగమ్,**
**అపశ్యతామప్సరసాం ముహూర్తం ప్రయోగమాద్యం లలితాఙ్గహారమ్."**(7–91)

**"ప్రమథముఖవికారైర్హాసయామాస గూఢమ్"** (7.95)

ఈ శ్లోకాలలో నాట్యశాస్త్రంలోని 6, 21, 22 అధ్యాయాలలో చెప్పిన విషయాల

నిర్దేశం ఉంది. నాట్యశాస్త్రంలోని 21వ అధ్యాయం 37వ శ్లోకంలో అయిదు సంధులు, 22వ అధ్యాయంలోని 24-57, 65 శ్లోకాలలో వృత్తులు చెప్పబడ్డాయి. 22వ అధ్యాయం 17వ శ్లోకంలో **సులలితైరఙ్గహారైః** అనే పదా లున్నాయి. **శృఙ్గారో విష్ణుదైవత్యః హాస్యః ప్రమథదైవతః** (నా.శా. 6.44) అనే శ్లోకంలో హాస్యరసానికి ప్రమథులు దేవత అని చెప్పబడింది. అందుచేత ప్రమథుల చేష్టలు హాస్యజనకా లవడం యుక్తమే. చాలామంది పండితులు అంగీకరించి నట్లు ఐదవశతాబ్దం పూర్వార్ధం కాళిదాసుని కాలం అని గ్రహించినా ప్రస్తుతం మనకు లభిస్తూన్న **నాట్యశాస్త్రం** క్రీ.శ. 350-450కి కనీసం ఒకటి రెండు శతాబ్దాలకు పూర్వమే ఉన్న దని చెప్పవచ్చును. కాళిదాసు కాలం క్రీ.పూ. ప్రథమశతాబ్ది అని అంగీకరించిన పక్షంలో **నాట్యశాస్త్ర**కాలం ఇంకా వెనుకకు వెళ్ళవచ్చును.

క్రీ.శ. 100 ప్రాంతంలో ఉన్న అశ్వఘోషుడు రచించిన **శారిపుత్రప్రకరణం** అనే ప్రకరణంలోని కొన్ని భాగాలు మాత్రమే లభించాయి. **నాట్యశాస్త్రంలో** చెప్పిన ప్రకరణనియమాలకు ఈ ప్రకరణంలో అనుసరించిన పద్ధతికీ చాల సామ్యం ఉంది. అశ్వఘోషుడు ఆ కాలంలో చూడడానికి అవకాశం ఉన్న శాస్త్రగ్రంథం నాట్యశాస్త్రమే అయి ఉండాలి. దీనిని పట్టి **నాట్యశాస్త్రం** కాలం క్రీ.శ. 100కి కనీసం ఒకటి రెండు శతాబ్దులకు పూర్వం అయి ఉండాలి.

వేదకాలంలో సంగీతానికీ వాద్యసంగీతానికి అత్యధిక మైన ప్రచారం ఉండేది. **"పారాశర్యశిలాలిభ్యాం భిక్షునటసూత్రయోః"** (పా.సూ.4.3.110) **"కర్మన్దకృశాశ్వాదినిః"** (పా.సూ.4.3.111) అను పాణినిసూత్రాలను పట్టి పాణినికి పూర్వం అనగా క్రీ.పూ. ఏడవ శతాబ్దానికి పూర్వం, శిలాలి, కృశాశ్వుడు రచించిన నాట్యసూత్రా లున్నట్లు తెలుస్తూన్నది. అయితే అవి పూర్తిగా విస్మృతము లైపోయాయి. వాటి పేర్లు కూడా నాట్యానికి సంబంధించిన ఏ గ్రంథాలలోను కనబడడంలేదు. ఈ ఇద్దరు సూత్రకారుల పేర్లూ కూడ కాలక్రమంలో భరతశబ్దం వలె నటు డనే అర్థంలో ప్రచారంలోనికి వచ్చాయి. అమరకోశంలో

> **"శైలాలినస్తు శైలూషా జాయాజీవాః కృశాశ్వినః**
> **భరతా ఇత్యపి నటాశ్చారణాస్తు కుశీలవాః"**

అని ఈ పేర్లు కనబడుతున్నాయి. శైలాలిన్, కృశాశ్వన్ అనే పదాలు నట వాచకాలుగా ప్రయోగించబడడానికి పాణినిసూత్రాలే మూలం. "భరతాః" అనే పదం **"భరతస్య అపత్యాని పుమాంసః"** అనే అర్థంలో భరతశబ్దానికి **"అనృష్యానన్తర్యే బిదాదిభ్యోఽ** ఞ్ (పా.సూ.4.1104) అనే సూత్రంచేత **అఞ్** ప్రత్యయం చేర్చి **"యఞఞోశ్చ"** (పా.సూ.2.4.64) అనే సూత్రంచేత దానికి లోపం చేయగా నిష్పన్నం అయిన దని

క్షీరస్వామి (అమరకోశవ్యాఖ్యాత) అన్నాడు. "భరతుడు **నాట్యశాస్త్రం** రచించాడు; దాని అధ్యయనం చేసిన భరతశిష్యులు భరతపుత్రు లనడం యుక్తమే. అందుచేత వాళ్ళు **"భరతాః"** అనబడుతున్నారు" అని కూడా క్షీరస్వామి విశదీకరించాడు. "భరత" శబ్దానికి అసలు అర్థం నటుడు. అందుచేత దీనికి నటశాస్త్రం అని కూడ అర్థం ప్రచారంలోనికి వచ్చి ఉంటుంది. కాలాంతరంలో నటశాస్త్రం రచించిన వానినే భరతుడనే పేరుతో పిలవడం జరిగింది" అని కొందరి అభిప్రాయం అంత యుక్తంగా లేదు. 'భరత' అనేది అతిప్రాచీనమైన పేరు. **ఋగ్వేదం**లోను, **శతపథబ్రాహ్మణం**లోను, **ఐతరేయ బ్రాహ్మణం**లోను అనేక స్థలాలలో ప్రయోగించబడింది. ఈ శబ్దం **యాజ్ఞవల్క్యస్మృతి**లో (3.62) నటు డనే అర్థంలో ప్రయోగించబడింది. అందుచేత పాణిని తరవాత కాళిదాసుకు పూర్వం భరతు డనే ఒక రచయిత నాట్యానికి సంబంధించిన ఒక గ్రంథం (అది ఈ **నాట్యశాస్త్రం** కాకపోవచ్చు) రచించి ఉంటాడు, అదే కాలక్రమేణ ఎన్నో చేర్పులతో మార్పులతో ప్రస్తుతనాట్యశాస్త్రంగా తయా రైనది అని కొందరి ఊహ.

ధర్మశాస్త్రాలు, ప్రాచీనస్మృతులు బయలుదేరే కాలంనాటికి సాంప్రదాయికుల దృష్టిలో నట - నర్తక - గాయకాదులను అపవిత్రులనగా నీతిబాహ్యులనుగా పరిగణించడం ప్రారంభం అయింది. విద్యార్థి నృత్యం చూడకూడదు, సభకు గాని సమితికి గాని వెళ్ళకూడదు అని **ఆపస్తంబధర్మసూత్రం** (1.1.3.11-12) నిషేధించింది. విద్యార్థి నృత్య - గాన - వాద్యసంగీతాదులకు దూరంగా ఉండాలి అని **మనుస్మృతి** (2.178) విధించింది. నృత్య - గీత - వాద్యసంగీతతాలాదులు అభ్యసించే బ్రాహ్మణులు శ్రాద్ధభోజనానికి అనర్హు లని **గౌతమధర్మసూత్రం** (15.18) చెప్పింది. **మనుస్మృతి** ప్రకారం (8.102) బ్రాహ్మణుడు వడ్రంగిపని చేసినా, నటుడుగా ఉన్నా అతడు శూద్రునితో సమానుడు. అలాంటివాడు సాక్ష్యం ఇవ్వడానికి అనర్హుడు (8.65). నటుణ్ణి మతానికి సంబంధించిన కర్మలకు ఆహ్వానించకూడదు (3.155). శూద్రుడు నటించవచ్చు ననీ, స్త్రీవేషం ధరించవచ్చుననీ మూకాభినయప్రదర్శనం చేయవచ్చనీ శాంతిపర్వంలో (295 - 4 - 5) చెప్పబడింది. నటుడు ఏడు రకాలైన అంత్యజుల జాతిలో చేర్చబడ్డాడు (చూ. హిస్టరీ ఆఫ్ ధర్మశాస్త్ర II సంపుటం. పే. 70,84).

ఈ వెలివేతను ఎదుర్కొనడానికి **నాట్యశాస్త్రం**లో ప్రబలమైన ప్రయత్నం చేయబడింది. నాట్యంలో ధార్మిక - ఆధ్యాత్మిక విషయాలను ప్రవేశపెట్టడం ద్వారా దీనికి అత్యున్నత మైన, పూజనీయ మైన స్థానాన్ని కల్పించడంకోసం ప్రయత్నం జరిగింది. **నాట్యశాస్త్రం**లోని మొదటి ఐదు అధ్యాయాలు ఈ ప్రయోజనాన్నే ఉద్దేశించి చేర్చబడి ఉంటాయి. మహాపండితుడు, గొప్ప శైవసిద్ధాంతాచార్యుడూ అయిన అభినవగుప్తుడు అత్యుత్తమమైన

ఈ నాట్యవిద్య విషయంలో యుక్తియుక్తమూ, పూర్తిగా ఆచరణయోగ్యమూ అయిన తాత్త్వికదృక్పథాన్ని ప్రదర్శించాడు. **"ఏతేన, కామజో దశకో గణః ఇతి వర్జనీయత్వేన నాట్యస్యానుపాదేయతా ఇతి యత్ కేచిదాశశజ్కిరే తదయుక్తీకృతమ్. యాజ్ఞవల్క్యస్మృతిపురాణాదౌ చ అస్య ప్రశంసాభూయస్త్వశ్రవణాత్. న చాగమాదృతే ధర్మః అనుమానగమ్యః ఇతి న్యాయాత్. ఏతత్తు వృథైవాస్థానభీరూన్ ప్రతి శఙ్కాశమనార్థమ్ అభిధీయతే నామ. తథా హి నటానాం తావదేతత్స్వధర్మామ్నాయరూపత్వాత్ అనుష్ఠేయమేవ. న చాస్మాకం తచ్చేష్టితం విచార్యమ్. సోమక్రయోపదేశినో హి వాక్యస్య న తద్విక్రయిబ్రాహ్మణాన్తరగతకృత్యాకృత్యవిచారణోద్యోగః యుక్తః. న చాప్యస్య ఉపదిశ్యతే గాయేత్ నృత్యేదితి"** (నా.శా.మొ.సం.పే.3,4). పై వాక్యంలోని 'ఏతేన' అనుపదం **నాట్యశాస్త్రం** మూడవ అధ్యాయంలోని 74-75 శ్లోకాలను నిర్దేశిస్తుంది. ఎవరు **నాట్యవేదం** వింటారో, అధ్యయనం చేస్తారో వాళ్లకు, వేదాధ్యయనం చేసినవాళ్లకు లేదా యజ్ఞాలు చేసినవాళ్ళకు ఎలాంటి ఫలం లభిస్తుందో అలాంటి ఫలమే లభిస్తుంది అని ఆ శ్లోకాలలో చెప్పబడింది. **మనుస్మృతి** - సాధారణంగా మానవు లందరూ ఆనందం కోసం చేసే పనులను పేర్కొని రాజు వాటియందు ఆసక్తుడు కాకూడదు అని బోధించింది.

> **"మృగయాక్షో దివాస్వప్నః పరివాదః స్త్రియో మదః,**
> **తౌర్యత్రికం వృథాట్యా చ కామజో దశకో గణః"** (మ.స్మృ. 7.47)

పై విషయాలన్నీ దృష్టిలో ఉంచుకొని పరిశీలించగా క్రీ.శ. మూడు నాలుగు శతాబ్దాలకు పూర్వం ఎవరో నాట్యశాస్త్రం పునర్నిర్మాణం చేసి దానిలో సూత్ర - భాష్యపద్ధతిలో గద్యభాగాలను, ప్రాచీన ఆర్యలను, శ్లోకాలను తాను రచించిన కొన్ని కారికలను చేర్చి ఉంటా డని అనుకొనడానికి అవకాశం ఉంది. తరవాత కాలాంతరాలలో ఈ శాస్త్రంలో నైపుణ్యం గల మరి కొందరు కొన్ని శ్లోకాలు చేర్చి ఉంటారు.

ఏమైనా కూడ కోహల - నందికేశ్వరాదులు రూపకాలపైన రచించిన గ్రంథాలు, ఉద్భటాదుల వ్యాఖ్యానాలు లభించేవరకూ నాట్యశాస్త్రగ్రంథస్వరూపానికీ, దీని రచయితకూ, దీని రచనా, కాలమూ మొదలైన అంశాలకూ సంబంధించిన ప్రశ్నలకు సరియైన సమాధానాలు దొరకడం కష్టమే.

నాట్యశాస్త్రరచయిత ఎవరు అనే ప్రశ్నకు సమాధానం చెప్పాలంటే చాలా చిక్కులు ఎదురవుతాయి. మొదటి అధ్యాయం ప్రారంభంలో ఉన్న ఐదు శ్లోకాలు భరతుని శిష్యుడు రచించిన వనీ, అట్లే ఈ గ్రంథంలోని ప్రశ్నలు సమాధానాలు కూడా భరతుని శిష్యుడే చేర్చా డనీ, మిగిలిన గ్రంథం మాత్రం భరతుని రచనయే అనీ చెప్పిన పండితులు అభినవగుప్తునికి పూర్వమే ఉండేవారు. అయితే అభినవగుప్తుడు ఈ అభిప్రాయాన్ని చాల

గట్టిగా ఖండించాడు. ఎందువల్ల ననగా – ఈ గ్రంథంలో మరి కొందరి హస్తక్షేపం ఉన్న దని చెప్పడానికి తగిన ప్రమాణం ఏదీ లేదు. ఒక విషయాన్ని గూర్చి చర్చించే టప్పుడు రచయిత తనను ప్రథమపురుషలో నిర్దేశించడం అనేది అన్ని శాస్త్రాలలోనూ ఉన్న సంప్రదాయం. **"ఏకస్య గ్రన్థస్య అనేక వక్తృవచనసందర్భమయత్వే ప్రమాణాభావాత్. స్వపరవ్యవహారేణ పూర్వపక్షోత్తరపక్షాదీనాం శ్రుతిస్మృతివ్యాకరణతర్కాదిశాస్త్రేషు ఏకవి రచితేష్వపి దర్శనాత్"** (అ.భా.మొ.సం.పే.9). **నాట్యవేద**ప్రవర్తకు లైన సదాశివ – బ్రహ్మ – భరతులలో బ్రహ్మచెప్పిన సిద్ధాంతాలే ప్రామాణిక మైనవి అని స్థాపించడం కోసమే **నాట్యశాస్త్రం** రచించబడింది అని చెప్పిన కొందరు 'నాస్తికాగ్రేసరులైన ఉపాధ్యాయుల' అభిప్రాయాన్ని కూడ అభినవగుప్తుడు ఖండించాడు – **"ఏతేన సదాశివబ్రహ్మభరత మతత్రయవివేచనేన బ్రహ్మమతసారతాప్రతిపాదనాయ మతత్రయీసారాసారవివేచనం తద్గ్రన్థఖణ్డప్రక్షేపేణ విహితమిదం శాస్త్రం, న తు మునివిరచితమితి యదాహుః నాస్తికధుర్యోపాధ్యాయాః తత్ ప్రత్యుక్తమ్. సర్వానపహ్నవనీయాబాధితశబ్దలోకప్రసిద్ధి విరోధాచ్చ"** (అ.భా.మొ.సం.పే.8).

ఈ గ్రంథం నందిభరతులు రచించిన దనీ, సంగీతానికి సంబంధించిన దనీ నిర్ణయసాగరప్రతి చివర ఉన్నది. కొన్ని వ్రాతప్రతులను పట్టి నందికేశ్వరునికి **నాట్యశాస్త్రంతో** ఏదో సంబంధం ఉన్నట్లు కనబడుతున్నది. కోహలునికి **నాట్యశాస్త్రంతో** ఎలాంటి సంబంధం ఉన్నదో స్పష్టంగా తెలియదు. **నాట్యవేదాన్నీ** దాని ప్రయోగాన్నీ భరతుడు నూరుగురు కుమారులకు లేదా శిష్యులకు (చౌఖంభాప్రతి ప్రకారం 105 లేదా 106 గురికి) ఉపదేశించి నట్లు చెప్పబడింది. వాళ్లలో శాండిల్యుడు, వాత్స్యుడు, కోహలుడు, దంతిలుడు అనేవాళ్ల పేర్లు ముందున్నాయి. **నాట్యశాస్త్రంలో** చెప్పని విషయాలను మరొక గ్రంథంలో కోహలుడు కాలాంతరంలో చెప్పగలడు అని జోస్యం చెప్పినట్లు చివరి అధ్యాయంలో (36.65) చెప్పబడింది. కోహల – వాత్స్య – శాండిల్య – ధూర్తిలులు నాట్యశాస్త్రాన్ని ప్రయోగించారని కూడ చెప్పబడింది (36–71). నాట్యశాస్త్రాన్ని తిరిగి వ్రాసినవాళ్లమీద కోహలుని ఏదో ఒక గ్రంథం యొక్క ప్రభావం ప్రసరించి ఉంటుంది. అభినవగుప్తుడు కోహలుని అనేక స్థలాలలో పేర్కొన్నాడు. కొన్ని చోట్ల ఆతనిని భరతునికి సమకాలికు డన్నట్లు కూడ వ్రాశాడు. దామోదరగుప్తుడు (క్రీ.శ. ఎనిమిదవ శతాబ్దం ఉత్తరార్ధం) **కుట్టనీమతంలో** భరతునితో పాటు కోహలుణ్ణి కూడ నాట్యాచార్యుణ్ణిగా పేర్కొన్నాడు. **"విటఖటకే కా నృత్యతి కోహలభరతోదితక్రియయా"** (కు.మ.81). **రాజశేఖరుని బాలరామాయణంలో** కోహలు డనే నాట్యాచార్యు డున్నాడు. అతడు **"పరమేష్ఠినో మానసభువః ప్రథమపుత్రస్య నాట్యయోనేః భరతాచార్యస్య కృతిః అభినవం సీతాస్వయంవర ఇతి నాటకం ప్రయోక్తవ్యమ్"**

(3.12) అని రావణునితో అంటాడు. భరతుడు, శాండిల్యుడు, కోహలుడు, దత్తిలుడు, మతంగుడు నాట్యశాస్త్రానికి సంబంధించిన గ్రంథాలు రచించా రని శింగభూపాలుడు **రసార్ణవసుధాకరంలో** (1.50–2) అన్నాడు. **కుట్టినీమతంలో కామశాస్త్ర**రచయిత లైన వాత్స్యాయన – దంతిలులతో పాటు భరత – విశాఖిల – దత్తిలాచార్యులు పేర్కొనబడ్డారు. ఎపిగ్రాఫియా కర్ణాటకాలో ఉన్న క్రీ.శ.517 నాటి శాసనంలో కొంగణీవర్మ కుమారుడైన మాధవుడు **దత్తకసూత్రవృత్తి** రచించి నట్లు చెప్పబడింది. దంతిలుడు భరతపుత్రులలో ఒకడు. దత్తిలుడు ధ్రువల విషయంలోను, తాలాల విషయంలోను ప్రామాణికు డనీ **గంధర్వవేదసారం** అనే అతని గ్రంథం లభ్యం అవుతూన్న దన్నీ కొంద రంటున్నారు.

**అభినవభారతి** మొదటి సంపుటం ప్రస్తావనలో రామకృష్ణకవి **యామిలాష్టక తంత్రం**నుండి ఒక శ్లోకం ఉదాహరించాడు. దాని ప్రకారం ఉపవేదమైన గాంధర్వవేదంలో 36000 శ్లోకా లున్నాయి. భరతులు నాట్యవేదంనుంచి రెండు సంగ్రహగ్రంథాలు రచించా రనీ, ఒకదానిలో 12000 శ్లోకాలు, రెండవదానిలో 6000 శ్లోకాలూ ఉన్నా యనీ **భావప్రకాశనంలో** (10.34–35) చెప్పబడింది. వృద్ధభరతుడు 12000 శ్లోకాలతో ఒక గ్రంథం నిర్మించాడనీ, భరతుడు 6000 శ్లోకాలతో నాట్యశాస్త్రం రచించా డనీ రామకృష్ణకవి అన్నాడు. భరతుడు నాట్యవేదంలో రసాలను ప్రతాపాదించా డనీ భరతవృద్ధుడు గద్యభాగాలను కూర్చా డనీ శారదాతనయుని **భావప్రకాశనంలో** చెప్పబడింది.

**"ఏవం హి నాట్యవేదోఽస్మిన్ భరతేనోచ్యతే రసః,**
**తథా భరతవృద్ధేన కథితం గద్యమీదృశమ్"**

**"యథా నానాప్రకారైః వ్యఞ్జనౌషధైః పాకవిశేషైశ్చ"** ఇత్యాదివాక్యాలు ఉదాహరణంగా చూపబడ్డాయి. **నాట్యసర్వస్వదీపికా** అనే ఒక వ్రాతప్రతి ఉన్నది. ఆదిభరతుని గ్రంథానికి వాఖ్యాన మని చెప్పబడే దీనిలో సమవాయం, శిక్ష, భావం, ఉల్లాసం, వైశేషికం అనే ఐదు స్కంధా లున్నాయి. 32 అధ్యాయాలు, 221 ప్రకరణాలు కల ఈ గ్రంథంలో 6000 శ్లోకా లున్నాయి. కొందరు సంస్కృతరూపకవ్యాఖ్యాతలు ఆదిభరతునినుంచీ భరతుని నుంచీ కూడ శ్లోకాలు ఉదాహరిస్తూంటారు. ఉదాహరణకి – **శాకుంతల** వ్యాఖ్యాన మైన **అర్థద్యోతనికలో** రాఘవభట్టు కనీసం పదిహేడు సార్లు ఆదిభరతుని నుంచి శ్లోకాలు ఉదాహరించాడు. వీటిలో చాలా వరకు శ్లోకాలు మనకు లభిస్తూన్న **నాట్యశాస్త్రంలో** కనబడుతున్నాయి. కొన్నింటితో సామ్యం ఉన్న శ్లోకాలు **నాట్యశాస్త్రంలో** ఉన్నాయి. అదే విధంగా ఇతడు కనీసం పదకొండు సార్లు భరతునినుంచి శ్లోకాలు ఉదాహరించాడు. భరతునినుంచి శ్లోకాలను ఉదాహరించే టప్పుడు ఇతడు సాధారణంగా అధ్యాయం కూడ నిర్దేశించాడు. ఆదిభరతునినుంచి మాత్రం అధ్యాయం పేర్కొనకుండానే ఉదాహరించాడు.

దీనిని పట్టి రాఘవభట్టు దగ్గర, ఆనాడు భరతుని గ్రంథం ఒకటి ఆదిభరతుని గ్రంథం ఒకటీ ఉన్నట్లు తెలుస్తూన్నది. అయితే చాలా వరకు వాక్యాలు రెండింటిలోను సమానంగానే ఉండి ఉంటాయి. ఒక చోట ఇతడు – **"సూత్ర – మూలభరత – టీకాకారాభినవగుప్తాచార్యసంమతా... ద్వాదశపదా ఉదాహృతా"** అని అంటాడు. దీనిని పట్టి ఇతడు సూత్రమూ మూలభరతమూ వేరు వేరని భావిస్తూన్నట్లు తెలుస్తూన్నది. సాధారణంగా అర్వాచీనరచయితలు మాత్రమే భరత – ఆదిభరతులను వేరువేరుగా చూపారు. ఉదాహరణకి బహురూపమిశ్రుడు **దశరూపక** వ్యాఖ్యానంలో ఒక "షట్సహస్రీకారుణ్ణి" (అనగా భరతుని నాట్యశాస్త్రం) పేర్కొన్నాడు. – **"సూత్రణం సకలాజ్ఞానాం జ్ఞేయమజ్ఞముఖం బుధైః"** ఇతి **"షట్సహస్రీకారః"**. మరొక చోట "ద్వాదశసహస్రీకారుణ్ణి" పేర్కొన్నాడు.

> **"సమాప్యమాన ఏకస్మిన్నితరాజ్ఞస్య సూచనమ్,**
> **సమాసతో హి నాట్యజ్ఞైరజ్ఞావతార ఇష్యతే.**

ఇతి ద్వాదశసహస్రీకారః".

దీనినంతనీ పట్టి నాట్యశాస్త్రానికి సంబంధించిన రెండు వ్రాతప్రతులు ఉండి ఉండవచ్చు ననీ, వాటిలోని శ్లోకసంఖ్య వేరువేరుగా ఉండడంచేత ఒకదానికి భరతునిగ్రంథ మనీ, మరొకదానికి వృద్ధభరతుని గ్రంథ మనీ ప్రచారం వచ్చి ఉంటుం దనీ ఊహించ వచ్చును.

**యాజ్ఞవల్క్యస్మృతి**లో భరతశబ్దం నటు డనే అర్థంలో ప్రయోగించబడింది. –

> **"యథా హి భరతో వర్ణైర్వర్ణయత్యాత్మనస్తనుమ్**
> **నానారూపాణి కుర్వాణస్తథాత్మా కర్మజాస్తనూః"** (3.162)

ఈ శబ్దం **నాట్యశాస్త్రం**లోనే నటవాచకంగా ప్రయోగింపబడింది.

> **"పృష్ఠే కృత్వాస్య కుతపం నాట్యం యుజ్ఞే యతోముఖం భరతః,**
> **సా పూర్వా మన్తవ్యా ప్రయోగకాలే తు నాట్యజ్ఞైః"** (14.25)

అభినయసంప్రదాయంలో మంచి ప్రావీణ్యం సంపాదించిన ఎవరోఒక విద్వాంసునికి భరతుల (నటుల) విషయంలో ఎక్కువ ఆదరాభిమానాలు ఉండి ఉంటాయి. అతడు నేటి **నాట్యశాస్త్రం**లోని విషయా లన్నింటిని ఒక చోట క్రోడీకరించి ఈ గ్రంథం భరతుడనే ఒక కాల్పనికవ్యక్తి రచించి నట్లుగా ప్రచారంలోనికి తీసికొనివచ్చి ఉంటాడు. సంస్కృతవాఙ్మయంలో ఇలాంటి పనులు సర్వసాధారణంగా జరుగుతూ ఉంటాయి. ఉదాహరణకి అతివిశాల మైన పురాణవాఙ్మయం అంతా వ్యాసునికి అంటకట్టబడింది. పద్దెనిమిది మహాపురాణాలు, పద్దెనిమిది ఉపపురాణాలు వ్యాసు డనే ఒక వ్యక్తి రచించాడనేది

ఎవ్వరూ కూడ నమ్మడానికి శక్యం కాని విషయం. అనువంశ్యశ్లోకా లని చెప్పబడే కొన్ని ఆర్యలను, శ్లోకాలను చూడగా – అతిప్రాచీనకాలంనుంచీ అనేక మైన నాట్యసంబద్ధాలైన శ్లోకాదులు గాలిలో తిరుగుతూండే వనీ, వాటిని సేకరించి నియమబద్ధరీతిలో రచించిన **నాట్యశాస్త్రం**లో తగిన చోట్ల కూర్చడం జరిగిం దనీ ఊహించడానికి అవకాశం ఉంది. **నాట్యశాస్త్రం**లో ఒక చోట శబ్దలక్షణాల విషయంలో ప్రాచీనాచార్యుల అభిప్రాయాలను సేకరించి సంక్షిప్తంగా వాటిని ఇక్కడ చేర్చడం జరిగిం దని చెప్పబడింది.

**"పూర్వాచార్యైరుక్తం శబ్దానాం లక్షణం తు విస్తరశః,**
**పునరేవ సంహృతార్థం లక్షణతః సంప్రవక్ష్యామి"** (15.12)

**భావప్రకాశనం**లోని 10వ అధికరణంలో (పే 285–287) **నాట్యవేదా**విర్భావాన్ని గూర్చిన ఒక కథ ఉన్నది. బ్రహ్మకు **నాట్యవేదం** ఉపదేశించివలసినదిగా శివుడు నందికేశ్వరుణ్ణి ఆజ్ఞాపించాడు. భరతుడు ఐదుగురు శిష్యులతో కలిసి బ్రహ్మదగ్గరికి వెళ్లగా బ్రహ్మ "**ఈ నాట్యవేదాన్ని** భరించండి" **"తానబ్రవీన్నాట్యవేదం భరతేతి పితా మహః"** అన్నాడు. అందువల్ల మొట్టమొదట నటించిన ఆ నటులకు 'భరతులు' అను పేరు వచ్చింది. జగత్పాలనవల్ల మనుచక్రవర్తికి కలిగిన అలసటను తొలగించడంకోసం వాళ్లు తొలిసారిగా ఆతని ఎదుట ఒక రూపకం ప్రదర్శించారు. భరతులు నాట్యవేదంనుండి కొన్ని అంశాలు గ్రహించి రెండు గ్రంథాలు రచించారు. ఒకదానిలో 12000 శ్లోకాలు, మరొక దానిలో 6000 శ్లోకాలూ ఉన్నాయి. అందుచేత రెండవ దానికి భరతుల పేరు పెట్టబడింది.

**"నాట్యవేదాచ్చ భరతః సారముద్ధృత్య సర్వతః,**
**ఏకం ద్వాదశసాహస్రైః శ్లోకైరేకం తదర్ధతః.**
**షడ్భిః శ్లోకసహస్రైర్యో నాట్యవేదస్య సంగ్రహః,**
**భరతైర్నామతస్తేషాం ప్రఖ్యాతా భరతాహ్వయాః"**

ఈ కథను పట్టి శారదాతనయుడు ప్రస్తుతం లభిస్తూన్న నాట్యశాస్త్రాన్ని పౌరాణికు డైన భరతు డనేవాని రచనగా అంగీకరించ లేదనీ ఇది నాట్యాన్ని అభ్యసించిన భరతుల రచన అని అతడు అంగీకరిస్తున్నా డనీ తెలుస్తూన్నది. స్వాతి – నారదులు గాంధర్వ – వాద్యవిద్యల ప్రవర్తకు లని చెప్పబడింది. (నా.శా. 33.3; 32.484). గుహుడనేవాడు ఛందస్సును ప్రవర్తింపచేసి నట్లు కూడ చెప్పబడింది. (16.112) ధ్రువలను గూర్చి చెప్పిన సందర్భంలో నారదుని పేరు కూడా పేర్కొనబడింది (32.1). తండు అంగహారాల ప్రయోగాన్ని, వివిధకరణాలను, రేచకాలను భరతునికి ఉపదేశించి నట్లు చెప్పబడింది. (4.17–19). ఇక్కడ ప్రయోగించిన తండు – మునిశబ్దాలు నంది – భరతుల

ఉపనామాలని అభినవగుప్తుడు వ్యాఖ్యానించాడు. **"తణ్డుమునిశబ్దౌ నన్దిభరతయోరు పనామనీ"** (అ.భా.మొ.సం.పే 90). **నాట్యశాస్త్రంలో** రెండు మూడు స్థలాలలో **కామతంత్ర** (24.182; 25.65) **కామసూత్రాలు** (24.142) పేర్కొనబడ్డాయి. రాజు, సేనాపతి, మంత్రులు, ప్రధాన న్యాయాధికారి మొదలైనవాళ్ల కుండవలసిన లక్షణాలను బృహస్పతి చెప్పిన రీతిగా గ్రహించాలి అని చెప్పబడింది. **"బృహస్పతిమతాదేతాన్ గుణాంశ్చాపృథి లక్షయేత్"** (34.79). అర్థశాస్త్రకర్తగా ప్రసిద్ధుడైన మానవుడైన కౌటిల్యుని పేరు చెపితే **నాట్యశాస్త్రానికి** బ్రహ్మభరతాదులతో సంబంధం ఉన్నట్లుగా చెప్పినదానికి విరోధం కనబడుతుం దనే ఉద్దేశ్యంతో అర్థశాస్త్రకర్తగా ఇక్కడ బృహస్పతి పేరు నిర్దేశించబడి ఉంటుంది. దేశాల పేర్లను గూర్చి చెప్పిన సందర్భంలో ఒక పురాణం పేర్కొనబడింది.

**"అన్యేఽపి దేశాః ప్రాచ్యాం యే పురాణే సంప్రకీర్తితాః,**
**తేషు ప్రయుజ్యతే త్వేషా ప్రవృత్తిశ్చౌఢ్రమాగధీ"** (14-46)

**'అన్యే', 'అన్యేస్తు'** ఇత్యాదిపదాలతో ఉపక్రమించి ఇంకా ఇతర రచయితల మతాలు కూడ **నాట్యశాస్త్రంలో** అక్కడక్కడ చెప్పబడ్డాయి.

**సంక్షిప్తంగా నాట్యశాస్త్రంలోని విషయాలు అధ్యాయక్రమంలో ఇవి :**

1. ఆత్రేయుడు మొదలైన మునులు భరతమునిని - **నాట్యశాస్త్రం** ఎలా ఆవిర్భవించింది? ఎవరికోసం ఆవిర్భవించింది? దీని అంగాలు ఏవి? నిశ్చితము లైన సిద్ధాంతాలను తెలుసుకొనడానికి ఉపకరించే ఉపాయాలు ఏవి? దీనిని నాట్యరంగం మీద ఎట్లు ప్రయోగించాలి? అని ఐదు ప్రశ్నలు అడుగుతారు. అయితే అతడు ఈ ప్రశ్నలకు సమాధానాలు ఒక వరుసలో ఇవ్వలేదు, వీటి సమాధానాలు గ్రంథం అంతటా వ్యాపించి ఉన్నాయి అని అభినవగుప్తు డన్నాడు - **"వయం తు బ్రూమః - నాత్ర క్రమః కశ్చిత్. అపి తు యథావసరం మహావాక్యాత్మనా షట్సాహస్రీరూపేణ ప్రధానతయా ప్రశ్నపఞ్చకనిరూపణపరేణ శాస్త్రేణ తత్త్వం నిర్ణీయతే; న తు క్రమః కశ్చిత్"** (అ.భా.1, పే.8). శూద్రులు వేదాలు చదవకూడదు గాన అన్ని వర్ణాలవారికీ ఉపకరించే ఐదవ వేదాన్ని సృష్టించవలసిందిగా బ్రహ్మదేవుడు భరతుణ్ణి ఆదేశించాడు.

**"న వేదవ్యవహారోఽయం సంశ్రావ్యః శూద్రజాతిషు,**
**తస్మాత్సృజాపరం వేదం పఞ్చమం సార్వవర్ణికమ్"** (నా.శా.1.12)

భరతుడు **ఋగ్వేదం**నుంచి పాఠ్యాన్నీ, **సామవేదం** నుంచి గానాన్నీ, **యజుర్వేదం** నుంచి అభినయాన్నీ, **అథర్వవేదం** నుంచి రసాలనూ గ్రహించి నాట్యవేదం నిర్మించి నూర్గురు పుత్రులకు (శిష్యులకు) బోధించాడు.

2. మూడు, ఆరు పద్యాలలో నాట్యమండప నిర్మాణం. 7వ శ్లోకంలో ప్రేక్షాగృహనిర్మాణం చెప్పబడ్డాయి. **నాట్యశాస్త్రం** ప్రకారం (2.8-11) వికృష్టం (పొడవుగా ఉన్నది), చతురస్రం, త్ర్యస్రం (త్రికోణాకృతిలో ఉన్నది) అని నాట్యమండపం మూడు విధాలుగా ఉంటుంది. ఈ మూడు రకాల మండపాలలో ప్రతీ ఒక్కటీ జ్యేష్ఠం, మధ్యమం, అవరం అని మూడేసి రకాలు ఉండవచ్చును. వీటి కొలతలు హస్తాలలో కాని దండాలలో కాని ఉంటాయి. నాలుగు హస్తాలు ఒక దండం. 108 హస్తాలు లేదా దండా లున్నది జ్యేష్ఠం; 64 హస్తాలు లేదా దండా లున్నది మధ్యమం, 32 హస్తాలు లేదా దండా లున్నది అవరం. అరవైనాలుగు హస్తాల పొడవు ముప్పైరెండు హస్తాల వెడల్పు ఉన్న నాట్యమండపం ప్రేక్షకులకు అనుకూలంగా ఉంటుంది. అలా కాకపోతే మాటలు స్పష్టంగా వినబడవు. **భావప్రకాశన** రచయిత యైన శారదాతనయుడు తాను **నాట్యవేదం** నాట్యశాలాపతి యైన ఒక బ్రాహ్మణునిదగ్గర అభ్యసించి నట్లు చెప్పుకొన్నాడు (1. పే. 2). నాట్యమండపంలో స్తంభాలు నిలపాలి. దీనిలో రెండు భాగా లుండాలి. అది ఒక పర్వతగుహ వలె ఉండాలి. గోడలమీద బొమ్మలు చిత్రించాలి. ప్రేక్షకుల ఆసనాలు ఇటుకలతో గాని కఱ్ఱతో గాని నిర్మించాలి.

3. రూపకప్రయోగానికి ఆ యా దేవతల రక్షణను కోరుతూ మహాదేవుడు, బ్రహ్మ, విష్ణువు, బృహస్పతి, గుహుడు మొదలైన దేవతల పూజలు చెప్పబడ్డాయి.

4. దేవతల సమక్షంలో **అమృతమథనం** అనే రూపకం ప్రయోగించబడింది. భరతుడు దేవతలకోసం **లక్ష్మీస్వయంవరం** అనే రూపకం ప్రయోగించా డనీ, లక్ష్మీపాత్ర ధరించిన ఊర్వశి, పూరూరవుని మీద మనస్సు లగ్నం అయి ఉండడంచేత అభినయం సరిగా చేయకపోవడంతో భరతు డామెను శపించా డనీ **పద్మపురాణం**లో చెప్పబడింది. (5. 12. 81) మహాదేవుని సమక్షంలో **త్రిపురదాహం** అనే రూపకం ప్రదర్శింపబడింది. తండు భరతునికి వివిధము లైన అంగహారాలు,కరణాలు, రేచకాలు బోధించాడు. (చిదంబరంలోని నటరాజమందిరం తూర్పు గోపురం మీద నాట్యశాస్త్రంలోని ఈ నాల్గవ అధ్యాయం 34 – 55 శ్లోకాలలో వర్ణించిన 108 కరణాలు రాళ్లమీద చెక్కబడి ఉన్నాయి. ప్రతీ కరణం క్రిందా దానికి సంబంధించిన శ్లోకాలు కూడా చెక్కబడి ఉన్నాయి. ఇవి 13వ శతాబ్దికి చెందినవి. వీటి ప్రతికృతులు గాయక్వాడ ప్రతిలో ఇవ్వబడ్డాయి.) రూపకాల ప్రదర్శనలో నృత్యం అర్థప్రకటనానికి, విషయస్పష్టీకరణకి అంతగా ఉపయోగించకపోయినా దీనివల్ల నాట్యరంగంమీద పాడిన పాటలకు ఒక విధమైన శోభ చేకూరుతుంది అని ఈ ఘట్టంలో చెప్పబడింది.

**"అత్రోచ్యతే న ఖల్వర్థం నృత్తం కంచిదపేక్షతే,**

**కిం తు శోభాం జనయతీత్యతో నృత్తమిదం స్మృతమ్.**
**ప్రాయేణ సర్వలోకస్య నృత్తమిష్టం స్వభావతః,**
**మఙ్గల్యమితి కృత్వా చ నృత్తమేతత్ప్రకీర్తితమ్.**
**వివాహప్రసవావాహప్రమోదాభ్యుదయాదిషు**
**వినోదకారణం చైవ నృత్తమేతత్ ప్రకీర్తితమ్...,**
**గీతప్రయోగమాశ్రిత్య నృత్యమేతత్ ప్రనృత్యతామ్"** (4.260–263, 265)

5. పూర్వరంగం, నాంది, ధ్రువ, ప్రస్తావన వీటికి సంబంధించిన వివరణ.

6. రసాలకు ఆ పేరు ఎలా వచ్చింది? భావా లనగా ఏవి? ఈ విధంగా మునులు అడిగిన ఆరు ప్రశ్నలు, సంగ్రహకారికాదులు, సంగ్రహరూపంగా శాస్త్రసారం అని చెప్పిన – రసాలు, భావాలు, అభినయాలు, ధర్మి, వృత్తి, ప్రవృత్తి, సిద్ధి, స్వరాలు, ఆతోద్యాలు, గానం, రంగం అనే పన్నెండు అంశాలు. కారికా – నిరుక్తశబ్దాల అర్థం. ఎనిమిది లేదా తొమ్మిది రసాలు. (**అభినవభారతి**లో చెప్పినదాని ప్రకారం నాట్యశాస్త్రానికి రెండు పాఠా లున్నాయి. ఒకదానిలో శాంతరసంతో సహా తొమ్మిది రసాలు చెప్పబడ్డాయి. మరొక దానిలో శాంతరసం చెప్పబడలేదు.) ఎనిమిది స్థాయిభావాలు ముప్పైమూడు వ్యభిచారిభావాలు, ఎనిమిది సాత్త్వికభావాలు, ఆంగిక – వాచిక – ఆహార్య – సాత్త్వికాభినయా లనే నాలుగు అభినయాలు, లోకధర్మి, నాట్యధర్మి అను రెండు ధర్ములు, భారతీ – సాత్వతీ – కైశికీ – ఆరభటీవృత్తు లనే నాలుగు వృత్తులు, ఆవంతీ – దాక్షిణాత్యా – పాంచాలీ – ఓఢ్రమాగధీ – మధ్యమా – ప్రవృత్తు లనే ఐదు ప్రవృత్తులు, దైవీ మానుషీ అను రెండు సిద్ధులు, షడ్జఋషభాదిసప్తస్వరాలు, తత – ఆనద్ధ – ఘన – సుషిరా లనే నాలుగు విధాలైన సంగీతోపయుక్తవాద్యాలు, ఐదు విధాలైన గానాలు, నాలుగు రకాలైన నాట్యమండపాలు, విభావానుభావవ్యభిచారిభావాలవల్ల రసనిష్పత్తి క్రమం, రసాలకు పరస్పరసంబంధం, భావాలతో రసాల సంబంధం, రసాల వర్ణాలు (రంగులు), అధిష్ఠానదేవతలు, రసాలయొక్క వాటి స్థాయిభావాలయొక్క విస్తృతప్రతిపాదన.

7. భావ – విభావ – స్థాయిభావాల విస్తృతవర్ణన. నిర్వేదం మొదలైన ముప్పైమూడు వ్యభిచారిభావాలు, స్తంభం మొదలైన ఎనిమిది సాత్త్విక భావాలు.

8. చతుర్విధాభినయాల విస్తృతవర్ణన.

9. నాట్యంలో హస్తాలు, వక్షఃస్థలం, పార్శ్వాలు, నడుము, కాళ్లు, పాదాలు మొదలైన అవయవాల అనేకవిధాలైన చలనాలు, పతాక, త్రిపతాక మొదలైన 24 అసంయుతహస్తభేదాలు, అంజలి, స్వస్తికం మొదలైన 13 సంయుతహస్తభేదాలు, 27

నృత్తహస్తాలు, పైన చెప్పిన 64 హస్తాల లక్షణప్రయోగాలు; రసభావాద్యనుగుణంగా ఇతరవిధాలైన హస్తాలు కూడ ప్రయోగించవచ్చు. (**"ఏవమేష ప్రయోక్తవ్యః స్త్రీపుంసాభినయే కరః"** (9.27) అనేదాన్ని వ్యాఖ్యానిస్తూ అభినవగుప్తుడు – **"స్త్రీపుంసయోః ఉభయోరపి అభినేత్రోః అభినేయయోర్వా"** అని అన్నాడు. దీనిని పట్టి అభినవగుప్తుని కాలంనాటికి స్త్రీలు కూడ నాట్యప్రయోగంలో పాల్గొనేవా రని తెలుస్తూన్నది).

10. వక్షస్థలం, పార్శ్వాలు, నడుము, ఇతరశరీరావయవాలు – వీటి ఐదు విధాలైన చలనాలు, వాటి లక్షణప్రయోగాలు.

11. చారి – ఖండ – కరణ – మండలాలు, భూమిచారుల లక్షణాలు, 16 ఆకాశచారీలక్షణాలు, వాటి ప్రయోగసమయాలు, నాట్యంలో ధనుర్విద్యాప్రదర్శనవిధానం, నాట్యప్రయోగంలో ఎవరూ ఎక్కువ శీఘ్రత్వాన్ని చూపకూడదు, శ్రమపడకూడదు.

> **"ఏక పాదప్రచారో యః సా చారీత్యభిసంజ్ఞితా**
> **ద్విపాదక్రమణం యత్తు కరణం నామ తద్భవేత్ ...**
> **యదేతత్ప్రస్తుతం నాట్యం తచ్చారీష్వేవ సంజ్ఞితమ్.** (11.3,6)"

12. మండలాల సంఖ్య వాటి లక్షణాలు.

13. ధ్రువాంగాలు ప్రారంభం అయిన తరవాత వేణునాదాది వాద్యసంగీతం ప్రవర్తిస్తూండగా పాత్రలు ఆ యా రసాలకు, స్థానాలకు అనుగుణంగా ఏ విధంగా నడుస్తూ ప్రవేశించాలి; పాత్రలు, దేవతలు గాని, రాజులు గాని అయినప్పుడు వాళ్లు రంగస్థలంమీద ఎంత సేపు నడవాలి, మధ్యమపాత్రలు గాని, స్త్రీలు గాని, నీచపాత్రలు గాని అయినప్పుడు ఎంత సేపు నడవాలి, రౌద్ర – బీభత్స – వీరాది రసాలను ప్రకటించేటప్పుడు ఏ విధంగా నడవాలి, ఏ విధంగా శరీరావయవచలనాలు ఉండాలి; గాయాలు చలి మొదలైన వాటిని సూచించడానికి అవయవాల కదలిక ఎలా ఉండాలి, అదే విధంగా సంన్యాసులు, మత్తులు, ఉన్మత్తులు మొదలైన వాళ్ల చలనాదులు ఎలా ఉండాలి.

14. నాట్యమండపం మీద – సంగీతవాద్యాలకు, గృహ – ఉద్యాన – అరణ్య – స్థల జలాదులకు స్థానాల కేటాయింపు. ఒక ముహూర్తకాలంలో (48 నిమిషాలు) గాని, ఒక జాములో కాని, గరిష్టం ఒక రోజులో గాని జరిగే విషయాన్నే ఒక అంకంలో ప్రదర్శించాలి. తరవాత ఒక మాసంలో కాని సంవత్సరంలో కాని జరిగే పనులు దాటవేసి క్రొత్త అంకం ప్రారంభించాలి, దేశ – వేష – భాషలకు, అలవాట్లకు అనుగుణమైన నాలుగు విధాలైన ఆవంతీ – దాక్షిణాత్యా – పాంచాలీ – ఓఢ్రమాగధీ ప్రవృత్తులు, ఒక్కొక్క ప్రవృత్తికి సంబంధించిన దేశాలు వృత్తులు; సుకుమారమూ ఆవిద్ధమూ అనే

రెండు విధాలైన నాట్యప్రయోగాలు, డిమసమవకార - వ్యాయోగ - ఈహామృగాలు ఆవిద్ధాలు, మిగిలిన రూపకభేదాలు సుకుమారాలు. లోకధర్మి - నాట్యధర్ముల లక్షణోదాహరణాలు

16. **"స్వభావభావోపగతం శుద్ధం త్వవికృతం తథా,**
**లోకవార్తాక్రియోపేతమఙ్గలీలావివర్జితమ్.**
**స్వభావాభినయోపేతం నానాస్త్రీపురుషాశ్రయమ్**
**యదీదృశం భవేన్నాట్యం లోకధర్మీ తు సా స్మృతా"...**
**"యోఽయం స్వభావో లోకస్య సుఖదుఃఖక్రియాత్మకః,**
**సోఽఙ్గాభినయసంయుక్తో నాట్యధర్మీ తు సా స్మృతా.** (14.70.71,78)

**సంగీతరత్నాకరంలో** కల్లినాథుడు **"వాక్యాభినయే కేవలవాక్యోచ్చారణం లోకధర్మీ, రాగయుక్తవాక్యోచ్చారణం నాట్యధర్మీ"** (సం.ర.పే. 629) అని వీటిని విశదీకరించాడు.

15. అచ్చులమీద హల్లులమీద ఆధారపడిన వాచికాభినయం. నాట్యానికి వాక్యం (మాటలాడడం) శరీరం. ఆంగికాభినయం, వేషం, రంగస్థలానికి సంబంధించిన ఏర్పాట్లు ఇవన్నీ ఏమి మాటలాడుతారో వాటి భావాన్ని స్పష్టీకరిస్తాయి. అచ్చులు, హల్లులు, నామవాచకాలు, క్రియాపదాలు, ఉపసర్గలు, క్రియావిశేషణాలు, సమాసాలు మొదలైనవాటి వివరణ. రూపకంలో సంభాషణాదికం సంస్కృతంలో కాని, ప్రాకృతంలో కాని రెండింటిలోనూ కాని ఉండాలి; ఒకటినుండి ఇరవైయారు అక్షరాలవరకు ఉన్న వృత్తాలు, వాటి అవాంతరభేదాలు, అవి అసంఖ్యాక మైనవి. భ-మ-జ మొదలైన ఎనిమిది గణాలు గురు - లఘు - యతుల అర్థాలు.

16. రూపకాలలో ఉపయోగించదగిన వృత్తాలు, వాటి లక్షణాలు ఉదాహరణలు. సమ - విషమవృత్తాలు, ఆర్యలు.

17. రంగంమీద ప్రయోగించే కావ్యంలో ఉండవలసిన లక్షణాలు. వాటి స్వరూపం. నాటకంలో ఉపయోగించే ఉపమ, రూపకం, దీపకం, యమకం అనే నాలుగు అలంకారాలు, వాటి అవాంతర భేదాలు; ఉదాహరణలు, పది కావ్యదోషాలు, పది కావ్యగుణాలు, వాటి లక్షణాలు, (భరతుడు **"కావ్యబన్ధాస్తు కర్తవ్యాః షట్త్రింశల్లక్షణాన్వితాః"** అని చెప్పిన లక్షణాలు క్రమక్రమంగా విస్మృతప్రాయా లైపోయా యనీ, ఆశీస్సు, దృష్టాంతం మొదలైన కొన్ని లక్షణాలు అలంకారాలలో అంతర్గతం చేయబడ్డా యనీ అభినవగుప్తుడే అన్నాడు - **"తత్ర గుణాలంకారాదిః వృత్తయశ్చ ఇతి కావ్యేషు ప్రసిద్ధో మార్గః. లక్షణాని తు న ప్రసిద్ధాని"** II పే. 294.)

18. రూపకాలలో ప్రాకృతభాషను ఉచ్చరించే విధానం మూడు విధాలుగా ఉంటుంది. (1) సంస్కృతం వలెనే ఉచ్చరించడం (2) విభ్రష్టంగా అనగా సంస్కృతంలోని అచ్చులను హల్లులను మార్చి, ఉచ్చరించడం, (3) దేశరీతిలో ఉచ్చరించడం. ఏ పాత్రలు సంస్కృతంలో మాట్లాడాలి, ఏవి ప్రాకృతంలోను ఇతరములైన ప్రాంతీయభాషలలోను మాటలాడాలి. శౌరసేని ప్రధానప్రాకృతభాష. మాగధి, ఆవంతిజ, ప్రాచ్య, ఆర్ధమాగధి, బాహ్లీక, దాక్షిణాత్య అనే ఇతర ప్రాకృతాలు కూడ ఉన్నాయి. వీటిని నటుల ఇష్టాన్ని పట్టి ఉపయోగించాలి. వీటిని ఎవరు ఉపయోగించాలి? శబరులు, ఆభీరులు, చండాలులు, స(శ)కారులు, ద్రవిడులు, ఓఢ్రులు, ఆటవికులు మాటలాడే భాషలకు విభాష లని పేరు.

19. ఉత్తమ – మధ్యమ – నీచ పాత్రలను ఎలా సంబోధించాలి? ఉదాహరణకి బ్రాహ్మణుణ్ణి 'ఆర్య', అనీ, రాజును 'మహారాజ' అని సంబోధించాలి. మొదటి మూడు వర్ణాలవాళ్ల పేర్ల చివర వరసగా 'శర్మ' 'వర్మ' 'దత్త' అని ఉండాలి. వేశ్యల పేర్ల చివర 'దత్తా' 'మిత్రా' 'సేనా' అని ఉండాలి. పాఠ్యగుణాలు, ఏడు సంగీత స్వరాలు, హృదయం, కంఠం, శిరస్సు అనే మూడు ఉచ్చారణస్థానాలు, ఉదాత్తం, అనుదాత్తం స్వరితం, కంపితం అనే నాలుగు స్వరాలు. రెండు విధాలైన కాకుస్వరాలు, ఉచ్చం, దీప్తం, మంద్రం, నీచం, ద్రుతం, విలంబితం అనే అలంకారాలు.

20. పది విధాలైన రూపకాలను గూర్చిన వివరణ –

**"నాటకం సప్రకరణమఙ్కో వ్యాయోగ ఏవ చ,**
**భాణః సమవకారశ్చ వీథీ ప్రహసనం డిమః,**
**ఈహామృగం చ విజ్ఞేయం దశమం నాట్యలక్షణమ్"** (నా.శా. 20, 2,3)

దశరూపకాలలో మొదటిదైన నాటకంలో ఉండే విషయాలు దాని ప్రధానలక్షణాలు. రంగంమీద ఏ విషయాలు చూపవచ్చును ఏవి చూపకూడదు?

**"క్రోధప్రసాదశోకాః శాపోత్సర్గోఽథ విద్రవోద్వాహౌ,**
**అద్భుతసంశ్రయదర్శనమఙ్కప్రత్యక్షజాని స్యుః.**
**"యుద్ధం రాజ్యభ్రంశో మరణం నగరరోధనం చైవ,**
**అప్రత్యక్షకృతాని ప్రవేశకైః సంవిధేయాని,**
**అఙ్కప్రవేశకే వా ప్రకరణమాశ్రిత్య నాటకం వాపి.**
**న వధః కర్తవ్యః స్యాద్యోఽభ్యుదయీ నాయక స్తస్య** (నా.శా. 20.20.22)

రంగస్థలం మీద మరణాన్ని ప్రత్యక్షంగా చూపడం విషయంలో అనేకమతాలను ఉదాహరించి అభినవగుప్తుడు "ఎట్టి పరిస్థితిలోనూ రంగస్థలంమీద మరణం చూప కూడదు" (**తస్మాద్రఙ్గే మరణమ్ అప్రయోజ్యమేవ**) అని అంటాడు. (Vol. II 426.)

ప్రవేశక - విష్కంభకాల విధానం, ప్రకరణాదుల ప్రధానలక్షణాలు. వాటి అంగాల లక్షణాలు.

21. రూపకకథావస్తువు. ఆధికారికం, ప్రాసంగికం అని కథావస్తువు రెండు విధాలు. ఐదు సంధులు, ప్రారంభం యత్నం మొదలైన ఐదు అవస్థలు. బీజ - బిందు - పతాకా - ప్రకరీ - కార్యా లనే ఐదు అర్థప్రకృతులు, వాటి లక్షణాలు. సంధ్యంతరాలు. ఐదు సంధుల 64 అంగాలు (ముఖసంధికి 12, ప్రతిముఖానికి 14, గర్భానికి 12, విమర్శకు 13, నిర్వహణానికి 14) వాటి లక్షణాలు, విష్కంభకం, చూళిక, ప్రవేశకం, అంకావతారం, అంకముఖం అనే ఐదు అర్థోపక్షేపకాలు (ఇవి అంకానికీ అంకానికీ మధ్య జరిగినవీ, రంగస్థలంమీద ప్రదర్శించడానికి శక్యం కానివీ అయిన కథాంశాలను సూచించడానికి ఉపయోగిస్తాయి.) నాటకంలో ప్రయోగించబడనిది లేదా నాటకానికి ఉపయోగించనిదీ అయిన జ్ఞానం కాని, విద్య గాని, కళ గాని, శిల్పం గాని, కర్మ గాని లేదు -

**"న తద్ జ్ఞానం న తచ్ఛిల్పం న సా విద్యా న సా కలా,**
**న తత్కర్మ న యోగోఽసౌ నాటకే యన్న దృశ్యతే"** (నా.శా. 21.122)

దీనిని అభినవగుప్తుడు ఈ విధంగా వ్యాఖ్యానించాడు. **జ్ఞానమితి ఉపాదేయం ఆత్మజ్ఞానాది... విద్యా దణ్డనీత్యాది... యోగః యోజనం తేషామేవ జ్ఞానాదీనాం కలాన్తానాం స్వభేదైః, అన్యోన్య స్వభేదైః... కర్మేతి యుద్ధనియుద్ధాదిః వ్యాపారః.**)

22. భారతీ, సాత్వతీ, కైశికీ, ఆరభటీ అనే నాలుగు వృత్తులు : మధుకైటభు లనే అసురులతో విష్ణువు యుద్ధం చేస్తూన్న సమయంలో అవి ఆవిర్భవించాయి. ఈ నాలుగు వృత్తులూ వరుసగా ఋగ్ - యజుస్ - సామ - అథర్వవేదాలనుండి జనించాయి. వాటి అవాంతర భేదాలు వాటి లక్షణాలు. ఈ నాలుగు వృత్తులలో దేనిని ఏ రసంలో ఉపయోగించాలి.

23. రూపకప్రయోగం అంతా ఆహార్యాభినయంమీద ఆధారపడి ఉంటుంది. ఇది నేపథ్యం మీద అనగా - వేషాలు అలంకారాలు ప్రయోగసాధనాలు లేదా ఉపకరణాలు వీటిమీద ఆధారపడి ఉంటుంది.

**"ఆహార్యాభినయో నామ జ్ఞేయో నేపథ్యజో విధిః,**
**తత్ర కార్యః ప్రయత్నస్తు నాట్యస్య శుభమిచ్ఛతా".** (నా.శా. 23.2)

**"సమస్తాభినయప్రయోగచిత్రస్య భిత్తిస్థానీయమ్ ఆహార్యమ్".** (అ.భా.)

పుస్తాలు, అలంకారాలు, అంగరచన, సంజీవం లేదా సజ్జీవం అని నేపథ్యం నాలుగు విధాలు. కొండలు, బండ్లు మొదలైన వాటిని చూపడానికి బట్టలతో గాని తోలుతో గాని తయారుచేసినవి పుస్తాలు. పుష్పమాలలు, తలనుంచి పాదాలవరకు వివిధావయవాలమీద ధరించే అలంకారాలు, వివిధ దేశాలకు నగరాదులకు అనుగుణంగా

ఉండేటట్లు స్త్రీ – పురుషులు ధరించే వస్త్రాలు, తిలకం, కాటుక, దంతాలకీ పెదవులకీ రంగు – ఇవి అలంకారం. రాజులు, ధనవంతులు, కిరాతులు, ఆంధ్రులు, శకులు, యవనులు, శూద్రులు మొదలైన వాళ్ల శరీరచ్ఛాయకు తగునట్లు శరీరానికి పూసికొనే రంగూ, గడ్డాలు, మీసాలూ – ఇవి అంగరచన. చతుష్ప్రాజ్ఞంతువులను, ద్విపాదులను, పక్షులను సర్పాలను చూపడానికి ఉపకరించే సాధనాలు సంజీవాలు, నాట్యోపకరణాలు, కృత్రిమములైన ఆయుధాలు.

24. సామాన్యాభినయం, సత్త్వాన్ని (మానసికభావాన్ని) పైకి ప్రకటించే పద్ధతులు, యువతుల భావము, హావము, హేల అనే మూడువిధా లైన అలంకారాలు. లీల, విలాసం మొదలైన పది స్వభావజాలంకారాలు. శోభ, కాంతి, దీప్తి, మాధుర్యం ధైర్యం, ప్రాగల్భ్యం, ఔదార్యం అనే ఏడు అయత్నజములైన అలంకారాలు. వీటి లక్షణాలు. పురుషులలో శోభ మొదలైన సత్త్వావిర్భావాలు 'రసభావానుసారం శారీరకాభినయం. రూపకంలోని వాక్యకథనానికి సంబంధించిన ఆలాప – ప్రలాప విలాపాదులైన పన్నెండు విధాలైన అభినయం. ఇవన్నీ వాక్యాభినయాలు. ఇష్టవస్తువులను గాని అనిష్టవస్తువులను గాని వినేటప్పుడు, స్పృశించేటప్పుడు, చూచేటప్పుడు, రుచిచూచే టప్పుడు చేయవలసిన అభినయం. అనేకవిధాల స్త్రీల వర్ణన. అభిలాష, చింతనం, అనుస్మృతి, సుఖకీర్తనం, ఉద్యోగం, విలాపం, ఉన్మాదం, వ్యాధి, జడత, మరణం అనే పది కామావస్థలు; వాటి వర్ణన, వాటి అభినయం. దూతిని పంపడం. వాసకసజ్జ, స్వాధీనపతిక, అభిసారిక, మొదలైన ఎనిమిది విధాలైన నాయికలు. ప్రేక్షకులలో తండ్రులు – కుమారులు, కోడళ్లు – అత్తలు మొదలైన వాళ్లు కలిసి ఉంటారు గాన అలాంటప్పుడు ఇవన్నీ రంగం మీద ఎలా ప్రదర్శించాలి.

**"న కార్యం శయనం రఙ్గే నాట్యధర్మం విజానతా,...**
**చుమ్బనాలిఙ్గనం చైవ తథా గుహ్యం చ యద్భవేత్.**
**దన్తనఖక్షతం భేద్యం నీవీస్రంసనమేవ చ,**
**స్తనాధరవిమర్దం చ రఙ్గమధ్యే న కారయేత్.**
**భోజనం సలిలక్రీడాం తథా లజ్జాకరం తు యత్,**
**పితృపుత్రస్నుషాశ్వశ్రూదృశ్యం యస్మాత్తు నాటకమ్.**
**తస్మాదేతాని సర్వాణి వర్జనీయాని యత్నతః.** (నా.శా. 24.285 – 289)

ప్రియురాళ్లు ప్రేమతో ఉన్నప్పుడు, అసూయతో ఉన్నపుడూ నాయకులను ఎలా సంబోధించాలి.

25. కళలలో నిపుణుడై స్త్రీలను వేశ్యలను ఆవర్జించడంలో నేర్పు కలవాడు వైశికుడు.

అలాంటివానికి సహజంగా ఉండేవి, నేర్చుకొనేవి అయిన ముప్పైమూడు గుణాలు. వాని మిత్రుడు, దూతి. ఒక పురుషుని విషయంలో ప్రేమ కలిగిన లేదా వానిని ద్వేషించే స్త్రీయొక్క చిహ్నాలు, స్త్రీల యౌవనానికి సంబంధించిన నాలుగు అవస్థలు, ప్రేమించే పురుషులలో నాలుగు భేదాలు, స్త్రీలను వశం చేసికొనడానికి సామం, ప్రదానం, భేదం, దండం, ఉపేక్ష అనే అయిదు ఉపాయాలు.

26. చిత్రాభినయం అనగా ఇంతవరకు విశదీకరింపబడని ఆంగికాభినయం (అందుచేత సామాన్యాభినయానికి అనుబంధంగా చెప్పిన అభినయం). ఆకాశాన్ని, రాత్రిని, సాయంకాలాన్ని, చీకటిని వేడిని ఎలా ప్రదర్శించాలి (సూచించాలి). సంతోషాన్ని, కోపాన్ని, బాధను దుఃఖాన్ని ఎలా ప్రదర్శించాలి. ఆకాశవచన – ఆత్మగత – అపవారితక – జనాంతికాల అర్థం. వృద్ధులు బాలులూ వాళ్ల వాళ్ల సంభాషణ ఎలా చెయ్యాలి (ఉచ్చరించాలి). ఒకడు చావబోతున్నాడు అనేదానిని ఎలా చూపించాలి. ఇతరాభినయా లన్నీ లోకంనుండి నేర్చుకోవాలి.

**"నోక్తా యే చ మయా తత్ర లోకగ్రాహ్యాస్తు తే బుధైః,**
**లోకో వేదాస్తథాధ్యాత్మం ప్రమాణం త్రివిధం స్మృతమ్.**
**తస్మాన్నాట్యప్రయోగే తు ప్రమాణం లోక ఉచ్యతే,**
**కృతానుకరణం లోకే నాట్యమిత్యభిధీయతే.**
**లోకస్య చరితం యత్తు నానావస్థాన్తరాత్మకమ్,**
**తదఙ్గాభినయోపేతం నాట్యమిత్యభిసంజ్ఞితమ్".** (నా.శా. 26.111–115)

27. సిద్ధి (చక్కగా జరిగిన నాట్యప్రయోగం). "మానుషీసిద్ధి" "దైవసిద్ధి" అని సిద్ధి రెండు విధాలు. వస్త్రాదులను బహూకరించడంచేత, చిరునవ్వులచేత, విదూషకుడు విచిత్రంగా ప్రవర్తిస్తున్నపుడు బిగ్గరగా నవ్వడంచేత, ఆశ్చర్యకరాలైన దృశ్యాలు, లేదా ప్రేమదృశ్యాలు వచ్చినపుడు 'సాధు సాధు' అని గాని, 'అహో' అని కాని అనడంచేత, కరుణప్రధాన దృశ్యాలలో "కష్టం!" అనడంచేత ప్రేక్షకులు నాట్యప్రయోగంయొక్క సిద్ధిని (సాఫల్యాన్ని) సూచించాలి. ప్రయోగం జరుగుతున్నప్పుడు కలకలధ్వన్యాదులు గాని ఇతర ప్రతిబంధకాలు గాని లేకపోవడం, అపశకునాలేవీ లేకపోవడం, ప్రేక్షాగృహం ప్రేక్షకులతో నిండి ఉండడం ఇవన్నీ 'దైవికసిద్ధి'. అగ్నిప్రమాదం, సుడిగాలి, ఏనుగు, సర్పాలు మొదలైనవి, నటులను ద్వేషించే ప్రేక్షకులు చప్పట్లు కొట్టడం. పేడ, బురద, విసరడం, నటులు తమ సంభాషణం మరిచిపోవడం, కిరీటం గాని అలంకారాలు గాని పడిపోవడం – ఇవన్నీ అపశకునాలు. నాట్యప్రయోగం సాధుత్వాసాధుత్వాలను నిర్ణయించేవాళ్లకి ఉండవలసిన యోగ్యతలు.

28. తతములు (తీగ లుండే వీణాదులు), అవనద్ధాలు' (చర్మం బిగించిన మద్దెళ్లు మొదలైనవి), ఘనాలు (తాళాలు), సుషిరాలు (రంధ్రా లున్న పిల్లన గ్రోవి మొదలైనవి) అని నాలుగు విధాలైన వాద్యాలు. షడ్జ – ఋషభాది సప్తస్వరాలు. వాటిలో వాది, సంవాది, అనువాది, వివాది అను నాలుగేసి భేదాలు, వాటి లక్షణాలు, గ్రామాలు మూర్ఛనలు, ఇరవై రెండు శ్రుతులు, జాతులు.

29. ఏ రసానికి ఏ స్వరాలను ఏ జాతులను ఉపయోగించాలి. ఆరోహి, అవరోహి, స్థాయి, సంచారి అను నాలుగు వర్ణాలు; వాటిపై ఆధారపడి ఉన్న ముప్పైమూడు అలంకారాలు వాటి లక్షణాలు; గీతులు.

30. మురళులు.

31. తాల – లయలు.

32. ధ్రువాల వర్ణన. ఒక పాత్ర రంగస్థలంమీద ప్రవేశించేటప్పుడు, రంగస్థలాన్ని విడిచి వెళ్లేటప్పుడు, ఒక అంకం ముగిసినప్పుడు, రూపకప్రయోగం జరుగుతున్నప్పుడు మధ్య మధ్య, ఒక పాత్ర క్రింద పడిపోయినప్పుడు తాను చెప్పవలసిన మాటలు మరచి నప్పుడు లేదా మూర్ఛపోయినప్పుడు ధ్రువాగానం చేయబడుతుంది.

**"ప్రావేశికీ తు ప్రథమా ద్వితీయాక్షేపికీ స్మృతా,**
**ప్రాసాదికీ తృతీయా చ చతుర్థీ చాన్తరా ధ్రువా.**
**నైష్క్రామికీ చ విజ్ఞేయా పఞ్చకీ చ ధ్రువా బుధైః".** (నా.శా. 32.23,24)

ఈ ధ్రువలలో కొన్ని సంస్కృతంలో ఉన్నా, సాధారణంగా ఇవి శౌరసేనిలో ఉండాలి. గానం చేసేవారికి, వీణావేణ్వాదులను మ్రోగించేవాళ్లకి ఉండవలసిన యోగ్యతలు. పాడడం స్త్రీలకు సహజంగా లభిస్తుంది. పురుషులకు వాద్యాలు మ్రోగించడం సహజంగా అలవడుతుంది.

**"ప్రాయేణ తు స్వభావాత్ స్త్రీణాం గానం నృణాం చ వాద్యవిధిః,**
**స్త్రీణాం స్వభావమధురః కణ్ఠో నృణాం బలత్వం చ"** (నా.శా. 32.465)

సంగీతోపాధ్యాయునికి, నేర్చుకొనే శిష్యునికి ఉండవలసిన ఆరు యోగ్యతలు.

33. మృదంగం, పణవం, దర్దురం మొదలైన అవనద్ధవాద్యాల విస్తృతవర్ణన. గాంధర్వాన్ని, వాద్యాలను స్వాతి – నారదులు తొలిసారిగా ప్రవర్తింపచేశారు. అన్ని రకాల వాద్యాలను మ్రోగించవలసిన సమయాలు. వాద్యాల అధిష్ఠానదేవతలు.

34. పురుషులలోను, స్త్రీలలోను ఉత్తమ – మధ్యమ – అధమ అనే మూడు ప్రకృతులు, వారి లక్షణాలు. **"ఏవం చ శీలతో నృణాం ప్రకృతిస్త్రివిధా స్త్రియాః"** (నా.శా. 34.8). రూపకనాయకులలో ధీరోద్ధతుడు, ధీరలలితుడు, ధీరోదాత్తుడు, ధీరశాంతుడు

అను నాలుగు భేదాలు, ఈ భేదాలలోనికి ఎవరు చేరుతారు. రూపకాలలో వచ్చే మహాదేవి, దేవి, నర్తకి, పరిచారిక మొదలైన వేరు వేరు విధాలైన స్త్రీలు, వాళ్ల వర్ణన. కంచుకీయులు వర్షవరులు మొదలైనవాళ్లు, అంతఃపురపరిచారికలు, నృపుడు – సేనాపతి, పురోహితుడు, మంత్రి, సచివుడు, ప్రాడ్వివాకుడు, కుమారుడు మొదలైనవారి ప్రధానలక్షణాలు.

35. నాటక ప్రయోగం చేయవలసిన నటసముదాయంలో (నాటకసంఘాలలో) ప్రతీ ఒక్కరికీ వారి వారి కర్తవ్యాలను నిర్దేశించడం, ఒక్కొక్కరికీ ఉండవలసిన యోగ్యతలు.. రావణుడు మొదలైన పాత్రల చేతులు తలలు మొదలైనవాటిని, సింహాలు ఏనుగులు మొదలైన వాటిని చూపడానికి ఉపయోగించే మట్టితోను, తోలుతోను, కఱ్ఱతోను చేసిన వివిధ సాధనాలు (నాట్యధర్ములు), స్త్రీ పాత్రలు ధరించే పురుషులను గూర్చి, పురుషపాత్రలు ధరించే స్త్రీలను గూర్చి, సుకుమారరూపకాల (నాటక – ప్రకరణ – భాణ – వీథీ – అంకాల) ప్రయోగం; ఆవిద్ధరూపకాల (డిమం మొదలైనవాటి) ప్రయోగం. సూత్రధార – పారిపార్శ్వికుల కుండవలసిన యోగ్యతలు, విట – శకార – విదూషక – చేట – నాయికా – గణికా – నటాదుల లక్షణాలు. మాల్యకార – వేషకర – రజక – కారుకాదిశిల్పుల లక్షణాలు.

**"ఉజ్జ్వలవస్త్రాభరణః క్రుధ్యత్యనిమిత్తతః ప్రసీదతి చ,**
**అధమో మాగధభాషీ భవతి శకారో బహువికారః".** **(నా.శా. 35,56)**

36. "పూర్వరంగంలో ఏ దేవతను పూజించాలి? స్వర్గలోకంనుండి నాట్యం భూలోకానికి ఏ విధంగా వచ్చింది? భరతుని వారసులకు నటు లనే పేరు ఎందుకు వచ్చింది" అని ఆత్రేయుడు మొదలైనవారు భరతుణ్ణి ప్రశ్నించారు. భరతడు ఈ విధంగా సమాధానం చెప్పాడు. నా కుమారులు నాట్యవేదంలో తమ కున్న ప్రావీణ్యాన్ని చూచుకొని దృప్తులై మునీశ్వరులను అనుకరించడం ప్రారంభించారు; కొన్ని అనుచితములైన రూపకాలు నిర్మించారు. మునీశ్వరులు కోపించి భరతులు వాళ్ల సంతానం (లేదా అనుయాయులు) శూద్రులవుతా రని శపించారు. వాళ్లు తమకు తెలిసిన నాట్యశాస్త్రాన్ని ఇతరులకు, మంచి శిష్యులకు బోధించి ఆ విధంగా ప్రాయశ్చిత్తం చేసికొనవలసినదిగా నేను వాళ్లకి సలహా ఇచ్చాను. తరవాత ఇంద్రపదాన్ని అధిరోహించిన నహుషుడు **నాట్యశాస్త్రాన్ని** భూలోకంలో ప్రచారం చేయవలసిందిగా నన్ను ఆజ్ఞాపించాడు. కోహలుడు **నాట్యవేదానికి** కావలసిన కొన్ని అంశాలను కూరుస్తా డని కూడ అత డన్నాడు. తరవాత భరతుని కుమారులు తమ కుమారులకు ఈ శాస్త్రాన్ని బోధించారు, కోహలుడు, వాత్స్యుడు, శాండిల్యుడు, ధూర్తిలుడు దానిని ఈ లోకంలో ప్రచారం చేశారు. **నాట్యశాస్త్రం** చాల మంగళకరమైనది; పవిత్రమైనది. పుష్పగంధాదులతో పూజచేయటంచేతకంటె నాట్యాన్ని ప్రయోగిస్తే దేవతలు

చాల సంతోషిస్తారు.

ఇది నాట్యసర్వస్వం వంటి **నాట్యశాస్త్రం**లో ఉన్న విషయాల సంక్షిప్తస్వరూపం. ఒక రూపకప్రయోగాన్ని చూచినప్పుడు కలిగే ఆనందానికి మూలకారణం దీనిలో అతివిస్తృతంగా విశ్లేషించి వివేచింపబడింది. ప్రేక్షాగృహనిర్మాణం, వివిధఛందస్సుల స్వరూపం, అభినయాలు, మాటలాడేటప్పుడు అవలంబించవలసిన వాక్యోచ్చారణ విధానాలు, వివిధరూపకాల స్వరూపం, కథావస్తువిశ్లేషణం, కథావస్తువులలో ఉండే పద్ధతులు చర్చించబడ్డాయి. గీతాలాపనవిధానాలు, ఉపయోగించవలసిన వాద్యాలు, సంగీతస్వరాలు మొదలైనవి ప్రతిపాదింపబడ్డాయి. అన్నింటికి మించి రూపకంయొక్క అత్యున్నతప్రయోజనాలను ఆదర్శాలను విశదీకరిస్తూ అసభ్యచేష్టాభాషాదుల ఉపయోగం నిషేధింపబడింది. నటులు అత్యున్నతమైన ఆధ్యాత్మికోన్నతిని లక్ష్యంగా పెట్టుకొని తమ కళను శ్రద్ధతో అభ్యసించి దానిలో నిర్దుష్ట మైన ప్రావీణ్యాన్ని సంపాదించా లనీ, ఆ విధంగా సమాజసేవ చేయడం ద్వారా పుణ్యం సంపాదించ కలుగుతా రనీ ఉపదేశింప బడింది. **నాట్యశాస్త్రం**లోని చివరి అధ్యాయంలో సూచించినట్లు నటుల నీతిబాహ్యప్రవృత్తి చేత నటులూ నాటకాలూ కూడ అపకీర్తికి పాలైనట్లు స్పష్టం అవుతుంది. ఆ అపకీర్తి తొలగించడం కోసం ఈ శాస్త్రంలో నటులూ రూపకాలూ కూడ అత్యున్నతమైన ఆదర్శాలను పాటించి సమాజాభ్యున్నతికీ సమాజసేవకు అంకితం కావాలని ఉపదేశం ఇవ్వబడింది. నాటకాలను గూర్చి రచించిన గ్రంథాలలో ఈ నాట్యశాస్త్రానికి, ప్రపంచ వాఙ్మయం లోనే సాటి లేదని నిఃసంశయంగా చెప్పవచ్చును. ఇది ఒక అసాధారణమైన అద్భుతమైన గ్రంథం. సమగ్రవిషయప్రతిపాదనలోను, సాహిత్యసౌందర్యంలోను, కళాత్మకవైచిత్ర్యంలోను, **నాట్యశాస్త్రం**తో సరితూగ గలిగిన గ్రంథం ప్రపంచంలోని ఏ భాషలోనూ కనబడదు.

**భరతనాట్యశాస్త్రాన్ని** గూర్చి ఏ.యల్. బాషం (A.L. Basham, Professor of Asian Civilzation in the Australian National Univerity, Canberra), **"ది వండర్ దట్ వజ్ ఇంసియా"** *(The Wonder that Was India)* అను గ్రంథంలో ఇలా అన్నాడు. "The Bharata *Natya Sastra* is our earliest Indian authority on these three arts (Drama, Music and Dance) and it shows by this time India had a fully developed system of music out of which later Indian 'classical' music developed" P. 384.

"Like music, Indian dancing has changed little with the centuries, and the best modern Indian dancers, such as Uday Shankar and Ram Gopal, still dance according to the rules of the

*Bharata Natya Sastra*. Dancing (Nrtya) was closely connected with acting (Natya) ... Indian dancing is not a thing of legs and arms alone,but of the whole body. Every movement of the little finger or the eye - brow is significant and must be fully controlled. The poses and grestures are classified in detail, even as early as the *Bharatanatya Sastra*. Which mentions thirteen postures of the head, thrity six of the eyes, nine of the neck, thirty seven of the hand and ten of the body. Later texts classfiy many more poses and gestures, everyone of which depicts a specific emotion or object. with so many possible combinations the dancer can tell a whole story easily comprehensible to the observer who knows the convention.

The most striking feature of the Indian dance is undoubtedly, the hand gesture (Mudra). By a beautiful and complicated code, the hand alone is capable of portraying not only a wide range of emotions, but gods, animals men, natural scenery, actions and so on." P. 387

"భారతీయుల నాట్యం (డ్రామా), సంగీతం, నృత్యం అనే ఈ మూడు కళలకు సంబంధించిన, మన కీ నాడు లభిస్తూన్న అతిప్రాచీనమైన ప్రామాణికగ్రంథం భరతుని నాట్యశాస్త్రం. ఈ గ్రంథం బయలుదేరే నాటికే భారతీయ సంగీత సంప్రదాయం సర్వతోముఖ వికాసం చెందిన దని ఈ గ్రంథం వల్ల తెలుస్తూన్నది. ఈ నాడు భారతదేశంలో ప్రచారంలో ఉన్న శాస్త్రీయసంగీతానికి ఈ గ్రంథమే మూలాధారం". (P. 384)

"ఇన్ని శతాబ్దాలు గడిచినా కూడ, భారతీయసంగీతంలో వలెనే భారతీయనృత్యంలో కూడ మార్పు లేవీ రాలేదు. ఉదయశంకర్, రామ్‌గోపాల్ మొదలైన, విశ్వవిఖ్యాతి గాంచిన ఆధునికభారతీయనృత్యవిద్వాంసుల నృత్యప్రయోగాలు కూడ పూర్తిగా భరతనాట్యశాస్త్రంలో చెప్పిన నియమాలను అనుసరించి జరుగుతున్నాయి. నృత్యానికీ, (dance) నాట్యానికీ (acting) చాల దగ్గర సంబంధం ఉంది ...

భారతీయనృత్యం అనగా కేవలం చేతులూ, కాళ్లూ ఆడిస్తూ చేసేది కాదు. ఈ నృత్యంలో మొత్తం శరీరానికి పని ఉంటుంది. చిటికనవేలులో గాని, కనుబొమ్మలో గాని కనబడే ప్రతీ కదలికకూ కూడ ఒక అర్థం, ప్రయోజనం ఉంటుంది. **నాట్యశాస్త్రం** కాలంనాటికే ఎన్నో స్థానకాల (poses, postures) చేష్టల (gestrues) విధానాలు, విభాగాలు ప్రచారంలో ఉండేవి. శిరస్సుకు సంబంధించిన స్థానకాలు (postures) పదమూడు,, మెడకు సంబంధించినవి తొమ్మిది, ముప్పైఆరు విధాల నేత్రాభినయాలు,

ముప్పైఏడు హస్తాభినయాలు, పది శరీరాభినయాలు **నాట్యశాస్త్రం**లో చెప్పబడ్డాయి. తరువాత వచ్చిన గ్రంథాలలో కూడ వేరు వేరు భావాలను, వస్తువులను సూచించడానికి ఉపయోగించే అనేకవిధాల చేష్టలు చెప్పబడ్డాయి. ఇన్ని విధాలైనస్థానకాలను, అభినయ విశేషాలను కలపడం ద్వారా నటుడు, నృత్యసంప్రదాయజ్ఞులకు అర్థం అయే టట్లు మొత్తం ఒక కథ అంతా చెప్పగలడు (అభినయం ద్వారా సూచించగలడు).

భారతీయనృత్యంలో కొట్టవచ్చి నట్లు కనబడే ఒక అసాధారణమైన అంశం హస్త ముద్ర. చాల మనోహరమైన, దురవగాహమైన ఈ సాంకేతిక పద్ధతిలో (code) కేవలం అనేకవిధాలైన భావాలనే కాదు దేవతలను, జంతవులను, మానవులను, ప్రాకృతిక దృశ్యాలను, కొన్ని పనులు మొదలైనవాటినీ కూడ సూచించవచ్చును." (P. 387)

**ప్రతిభారతీయుడూ గర్వించ దగిన ఈనాటికీ కూడ ఎందరో కళానిష్ణాతులు భక్తిశ్రద్ధలతో పరిరక్షించుకొంటూ వస్తూన్న ఇంతటి ప్రాచీనభారతీయసాంస్కృతిక సంపదకు నిధానమైనది ఈ భరతనాట్య శాస్త్రం.**

**నాట్యశాస్త్రం** అత్యున్నతాలైన ఆదర్శాలను నటుల ముందు ఉంచినా కూడ కొన్ని శతాబ్దాల అనంతరమే నటులు చాల నీచస్థితికి దిగజారిపోయి నట్లు ఎనిమిదవ శతాబ్దం ఉత్తరార్ధానికి చెందిన దామోదరుని **కుట్టనీమతం** ద్వారా తెలుస్తూన్నది. ఈ గ్రంథంలోని 881–928 శ్లోకాలలో ఒక అసాధారణమైన విషయం చెప్పబడింది. ఒక దేవాలయంలో ఒక రాజు సమక్షాన హర్షవర్ధనుని **రత్నావళి**లోని మొదటి అంకాన్ని ప్రదర్శించారు. స్త్రీ – పురుషపాత్రలు రెండూ వేశ్యలే నిర్వహించారు. మంజరి అనే వేశ్య రత్నావళి పాత్ర నిర్వహించింది. మరొక వేశ్య ఉదయనుని వేషం ధరించింది. **రత్నావళి**లోని ఒక శ్లోకం (1.24) కూడ **కుట్టనీమతం**లో ఉదాహరించబడింది. ఏ మాత్రం సంకోచం లేకుండా వేశ్యలు ధన సంపాదనమే తమ పరమలక్ష్యంగా పెట్టుకొని ప్రవర్తించారు. ఆ రోజులలోని చాలమంది జనులలో, ముఖ్యంగా సంగీతనృత్యాదులకు సంబంధించి నవాళ్లలో ఎంతటి నైతికపతనం ఉండేదో మృదుమధురభాషలో రచించిన ఈ కావ్యంలో స్పష్టంగా వర్ణింపబడింది. ఎనిమిదవ శతాబ్దంలోని ఉత్తరార్ధంలో **నాట్యశాస్త్ర**గ్రంథస్వరూపం ఎలా ఉండేదో **కుట్టనీమతం** అతిస్పష్టంగా విశదీకరిస్తుంది. **కుట్టనీమత** రచయిత అయిన దామోదరగుప్తుణ్ణి కాశ్మీరరాజైన జయాపీడుదు తన మంత్రిపరిషత్తులో ప్రధానుణ్ణిగా చేసినట్లు **రాజతరంగిణి** చెపుతున్నది –

**"స దామోదరగుప్తాఖ్యం కుట్టనీమతకారిణమ్,**
**కవిం కవిం బలిరివ ధుర్యం ధీసచివం వ్యధాత్".** (రాజతరంగిణి 4.496)

జయాపీడుడు క్రీ.శ. 779 నుండి 813 వరకు పాలించాడు. **ఈ కాలపు పరిస్థితులను వర్ణించాలంటే వంద కుట్టనీమతాలు కూడ సరిపోవేమో!**

**నాట్యశాస్త్రం కాలం - నాట్యశాస్త్రం** ఆవిర్భవించిన కాలాన్ని గూర్చి వెనుక కొంతవరకు సూచింపబడింది. నాట్యశాస్త్రం కాలాన్ని గూర్చి మాటలాడడానికి ముందు కొన్ని విషయాలు గుర్తుంచుకోవాలి. ఆ యా కాలాలలో **నాట్యశాస్త్రం**లో వివిధవిషయాలు చేర్చబడ్డాయి. అందుచేత దీని వ్రాతప్రతులలో ఎన్నో పాఠభేదాదు లున్నాయి. అందుచేత **నాట్యశాస్త్రం** కాలాన్ని నిర్ణయించడం అనగా **నాట్యశాస్త్రం**లో ప్రధానమైన భాగం యొక్క కాలాన్ని నిర్ణయించడంగా తెలుసుకోవాలి. ఇక్కడా అక్కడా జరిగిన అనేక పద్యభాగాల చేర్పులను పరిశీలించడం ఈ సందర్భంలో కుదరదు.

**నాట్యశాస్త్రం** కాలాన్ని గూర్చి విమర్శకులలో అభిప్రాయ భేదాలున్నాయి. క్రీ.పూ. రెండవ శతాబ్దంలో నాట్యశాస్త్రం రచింపబడిన దని మ.మ. హరప్రసాదశాస్త్రి అభిప్రాయ పడ్డారు. **నాట్యశాస్త్రం**లో ఉపయోగించిన కొన్ని పదాలను ఆధారంగా చేసికొని ప్రొఫెసర్ లెవి **నాట్యశాస్త్రం** ఇండోసిథియన్ క్షత్రపుల కాలంలో రచింపబడి ఉంటుందని అన్నాడు. క్రీ.శ. మూడవ శతాబ్దికి పూర్వమే రససిద్ధాంతం నాట్యప్రయోగం మొదలైన విషయాలను చెప్పే భరతరచిత మైన **నాట్యశాస్త్రం** ఉందని పి.వి.కాణే అభిప్రాయం. ఏ విధంగానూ కూడ ఇది మూడవ శతాబ్దానికి ముందు లేదని కీథ్ అన్నాడు. అయితే మనోమోహన్ ఘోష్ అనేక ఉపపత్తులను చూపుతూ **నాట్యశాస్త్రం** క్రీ.పూ. 100 మొదలు క్రీ.శ. 200 మధ్య రచింపబడి ఉంటుందని ప్రతిపాదించారు. (ఈయనే, కొంతకాలంతరవాత, నా.శా. క్రీ.పూ. 500ల నాటిదని నిర్ణయించారు). ఇది పి.వి.కాణే కూడా అంగీకరించారు. ఈ సందర్భంలో ఆయన, **నాట్యశాస్త్రం** క్రీ.శ. రెండవ శతాబ్దం తరవాతనే రచింపబడి ఉంటుంది అనే డా.డి.సి. సర్కార్ అభిప్రాయాన్ని ఖండించారు. ఏమైనా నాట్యశాస్త్రం పూర్వకాలావధిని (ఫలానా శతాబ్దానికి పూర్వం ఇది లేదు అని) నిర్ణయించడం శక్యం కాదు.

అయితే దీని ఉత్తరకాలావధిని (ఈ కాలం నాటికి ఇది ఉంది అని) నిర్ణయించడానికి తగిన ఉపపత్తులను ఈ విధంగా చూపవచ్చును :-

(అ) వెనుక ఉదాహరించిన కాలిదాసుని **విక్రమోర్వశీయ**శ్లోకాన్ని పట్టి కనీసం క్రీ.శ. 450 సంవత్సరానికి పూర్వం భరతుడు **నాట్యశాస్త్ర** రచయితగా ప్రసిద్ధ దయ్యా దనీ, ఎనిమిది రసాలు ప్రతిపాదించా దనీ, దేవలతల ముందు రూపకప్రయోగం చేశా దనీ తెలుస్తూన్నది. దీనివల్ల మొదటి అధ్యాయంలో చెప్పిన ప్రాచీనకథ, రసాధ్యాయం (ఆరవ అధ్యాయం) ఆనాటికి ఉన్నాయని చెప్పాలి. **రఘువంశం**లో (19.21) 'ఖండితనాయిక' ప్రసక్తి ఉంది. ఇది నాట్యశాస్త్రంలో (31.109-110) చెప్పిన అష్టవిధనాయికలను సూచిస్తున్నది. ఇట్లే రఘువంశంలోని **"అఙ్గసత్త్వవచనాశ్రయం మిథః స్త్రీషు నృత్యముపధాయ దర్శనమ్"** (రఘు.19.36) అనే శ్లోకం నాట్యశాస్త్రంలోని

**"సామాన్యాభినయో నామ జ్ఞేయో వాగఙ్గసత్త్వజః"** (21.1) అను శ్లోకానికి అనుకరణం అనే విషయం స్పష్టం అవుతూన్నది.

(ఆ) **నాట్యశాస్త్రం** బ్రహ్మచేత చెప్పబడినది అని **కుట్టనీమతం** (75వ శ్లోకం) అంటుంది. ఇది **నాట్యశాస్త్రం**లోని ప్రథమాధ్యాయానికి నిర్దేశం. **"భరతసుతైరుపదిష్టం క్షితిపతినహుషావరోధనారీణామ్"** (946 శ్లో) అనే శ్లోకంలో నాట్యశాస్త్రంలోని (36.48–61) నహుష – భరతపుత్రాదుల కథ నిర్దేశింపబడుతున్నది. ఇంకా అనేక స్థలాలలో **కుట్టనీమతం**లో ప్రస్తుతం మనకు లభిస్తున్న **నాట్యశాస్త్రం**లోని వేరు వేరు అధ్యాయాలలోని విషయాల సూచన స్పష్టంగా కనబడుతూన్నది. ఉదాహరణకి 791–91 పద్యాలలోని ఖండితా – కలహాంతరితా నాయికలను గూర్చి **నాట్యశాస్త్రం** 22.216 – 217 మొదలైన శ్లోకాలలో ప్రతిపాదించింది. పాత్రలు రంగస్థలంమీద ప్రవేశించే టప్పుడు చేయవలసిన ప్రావేశికధ్రువాగానం, వాళ్లు నిష్క్రమించే టప్పుడు చేయలసిన నైష్క్రామిక ధ్రువాగానం **నాట్యశాస్త్రంలో** (32.335–336) చెప్పబడ్డాయి. వాటిని గూర్చిన నిర్దేశం **కుట్టనీమతం** లోని 881, 928 శ్లోకాలలో ఉంది. సూత్రధారుడు ప్రవేశించేటప్పుడు **రత్నావళి** ప్రథమాంకం చివర పాత్ర లందరూ నిష్క్రమించే టప్పుడు ఈ ధ్రువాగానాలు చేయబడినట్లు చెప్పబడింది. కు.మ. 805 శ్లోకంలో సాత్త్వికభావాల ముచ్చట ఉంది. ఇవి **నాట్యశాస్త్రం** లోని ఏడవ అధ్యాయంలో చెప్పబడ్డాయి. **"సదృశేఽ ప్యనుభావగణే కరుణరసం విప్రలమ్భతో భిన్నమ్"** (కు.మ. 809) అనే వాక్యం **నాట్యశాస్త్రంలో** ఆరవ అధ్యాయంలో ప్రతిపాదించిన విషయాన్నే పేర్కొంది. దీనిని పట్టి **నాట్యశాస్త్రంలోని** ప్రధానమైన అధ్యాయా లన్నీ (మొదటి అధ్యాయం మొదలు ముప్పై ఆరవ అధ్యాయం వరకు) ఎనిమిదవ శతాబ్దంనాటికి ఉన్నా యని స్పష్టం అవుతున్నది.

(ఇ) ఆనందవర్ధనుడు **ధ్వన్యాలోకంలో** – **"యది వా వృత్తీనాం భరతప్రసిద్ధానాం కైశిక్యాదీనామ్"** అనీ, **"యథా వేణీసంహారే విలాసాఖ్యస్య ప్రతిముఖసంధ్యఙ్గస్య ప్రకృత రసనిబన్ధనానను గుణమపి భారతమతానుసరణమాత్రేచ్ఛయా ఘటనమ్"** అనీ, **"అత ఏవ చ భరతే ప్రబన్ధప్రఖ్యాతవస్తువిషయత్వం ప్రఖ్యాతోదాత్తనాయకత్వం చ నాటక స్యావశ్యకర్తవ్యతయా ఉపన్యస్తమ్"** అనీ, **"ఏతచ్చ రసాదితాత్పర్యేణ కావ్యనిబన్ధనం భరతాదావపి సుప్రసిద్ధమేవ"** అనీ అనేక స్థలాలలో భరతుని మతం ఉదాహరించాడు. ఇక్కడ చెప్పిన విషయాలన్నీ **నాట్యశాస్త్రంలో** 20, 21, 16 అధ్యాయాలలో ప్రతిపాదింపబడినవి. ఆనందవర్ధనుడు తొమ్మిదవ శతాబ్దం ఉత్తరార్ధంలో ఉన్నాడు. **వేణీసంహారం** ఆనందవర్ధనునికి పూర్వమే రచింపబడింది. దీని రచయిత భట్ట నారాయణుడు నాట్యం విషయంలో భరతుడే అత్యుత్తమప్రమాణం అని అంగీకరించాడు.

తదనుసారంగానే నాటకం రచించాడు. అందుచేత ఆనందవర్ధనునికి కొన్ని శతాబ్దాలు పూర్వమే నాట్యశాస్త్రంలో రససిద్ధాంతం, నాయకులు, వృత్తులు, ప్రతిముఖసంధ్యంగమైన విలాసంవంటివాటి వివరణలు ఉన్నాయి.

(ఈ) **నాట్యశాస్త్రం** ఆరవ అధ్యాయంలో ఉన్న రససూత్రం **కావ్యప్రకాశ**లో ఉదాహరించబడింది. దానికి భట్టలోల్లట – శంకుక – భట్టనాయక – అభినవగుప్తులు చేసిన వ్యాఖ్యాభేదాల చర్చ కూడ **కావ్యప్రకాశ**లో ఉంది. అభినవగుప్తుని వివిధగ్రంథరచనా కాలం క్రీ.శ. 980–1030. భట్టనాయకుడు క్రీ.శ. 900–925 ప్రాంతంలో ఉండేవాడు. **భువనాభ్యుదయం** అనే కావ్యం రచించిన శంకుకుడే ఈ శంకుకుడై ఉంటాడు. ఇతని పేరు **రాజతరంగిణి**లో ఉట్టంకించబడింది.

**"కవిబుధమనఃసిన్ధుశశాఙ్కః శఙ్కుకాభిధః,**
**యముద్దిశ్యాకరోత్కావ్యం భువనాభ్యుదయాభిధమ్"** (రా.త. 4.705)

దీనిని పట్టి అతడు క్రీ.శ. 840 ప్రాంతానికి చెందినవా డని చెప్పవచ్చును. సోమేశ్వరుడు తాను రచించిన **కావ్యప్రకాశవ్యాఖ్యానంలో** శంకుకుని కొన్ని శ్లోకాలను రససూత్రం దగ్గర ఉదాహరించి వాటి విషయంలో భట్టతౌతుడు చేసిన విమర్శలను కూడ చూపి ఉన్నాడు. లోల్లటుడు ఏ కాలానికి చెందినవాడో స్పష్టంగా తెలియక పోయినా శంకుక – భట్టనాయక – అభినవగుప్తుల మతాలను వాళ్ల కాలక్రమాన్ని బట్టి నిర్దేశించడంచేత ఇతడు వీళ్లందరికంటె ప్రాచీను డని చెప్పవచ్చును. ఇతడు **'రసవివరణం'** రచించాడు. దాని నుంచి –

**"యమకానులోమతదితరచక్రాదిభిదా హి రసవిరోధిన్యః,**
**అభిధానమాత్రమేతద్గడ్డరికాదిప్రవాహో వా"**

అనే శ్లోకాన్ని ఉదాహరించాడు. ఈ శ్లోకం రుద్రటుని **కావ్యాలంకారం**లో (3.59) కూడ రచయిత పేరు చెప్పకుండా ఉదాహరించబడింది. అందుచేత లోల్లటుడు శంకుకునికి ముందు క్రీ.శ. 750–800 ప్రాంతంలో ఉండి ఉండాలి. దీని నంతనీ పట్టి ఎనిమిదవ శతాబ్దంనాటికి **నాట్యశాస్త్రం**లోని ఆరవ అధ్యాయాన్ని ఎందరో వ్యాఖ్యాతలు అనేకవిధాలుగా వ్యాఖ్యానించా రని తెలుస్తూన్నది.

(ఉ) క్రీ.శ. 700–740 ప్రాంతానికి చెందిన భవభూతి – భరతుడు **తౌర్యత్రిక సూత్రం** రచించా డనీ, అతడు వాల్మీకికి సమకాలికు డనీ **ఉత్తరరామచరితం** చతుర్థాంకంలో అన్నాడు.

(ఊ) చంద్రాపీడుడు భరతవిరచిత మైన **నృత్తశాస్త్రాన్ని** అభ్యసించా డని **కాదంబరి**లో బాణు డన్నాడు. భరతుని పద్ధతిని అనుసరించిన గానాన్ని గూర్చి **హర్షచరితం**లో ముచ్చటించాడు –

**"వంశానుగమవివాది స్ఫుటకరణం భరతమార్గభజనగురు,**
**శ్రీకణ్ఠవినిర్యాతం గీతమిదం హర్షరాజ్యమివ"** (హ.చ.3.4)

**నాట్యశాస్త్రం**లో వాది, సంవాది, అనువాది, వివాది అను నాలుగు విధాలైన స్వరాలు చెప్పబడ్డాయి. (28.20). పై శ్లోకంలోని వివాదిశబ్దం ఈ చతుర్థభేదాన్ని చెపుతున్నది.

**"వివాదినస్తు తే యేషాం వింశతిస్వరమన్తరమ్,**
**తద్యథా వృషభగాన్ధారౌ ధైవతనిషాదౌ"** (నా.శా.28.21)

**నాట్యశాస్త్రం**లోని తొమ్మిదవ అధ్యాయంలో (198–207శ్లో) కరణాలు చెప్పబడ్డాయి. హర్షవర్ధనుడు మరొక చోట **"వైణవావర్తమణ్డలీరేచకరాసరభసారబ్ధనర్తనార భటీనటాః"** (హర్ష.చ.2.4) అని అన్నాడు. **నాట్యశాస్త్రం**లో రేచకము (4.240.246) ఆరభటి కూడ (20.65) వర్ణించబడ్డాయి.

(ఋ) సామలను శాస్త్రానుసారం నిర్దుష్టంగా గానం చేసేవాడు బ్రహ్మసాక్షాత్కారం పొందుతాడు అని చెప్పిన తరవాత **యాజ్ఞవల్క్యస్మృతి**లో వేదమంత్రాలకు బదులు అపరాంతకం, ఉల్లోప్యకం, మద్రకం, ప్రకరి, ఔవేణకం, సరోబిందు, ఉత్తరం అనే ఏడు విధాలైన గీతాలు గానం చేసేవాడు కూడ అదే ఫలం పొందుతాడు అని చెప్పబడింది. ఋగ్గాథలు మొదలైన వాటిని గానం చేయడంచేత కూడ మనస్సు పరమాత్మపైన స్థిరంగా ఏకాగ్రంగా నిలవడంచేత మోక్షం పొందవచ్చు ననీ, వీణావాదన తత్త్వం తెలిసినవాడూ, శ్రుతి – జాతులయందు నేర్పు గలవాడు, తాలం తెలిసినవాడూ కూడ మోక్షం పొందవచ్చు ననీ చెప్పబడింది.

**"అపరాన్తకముల్లోప్యం మద్రకం ప్రకరీం తథా,**
**ఔవేణకం సరోబిన్దుముత్తరం గీతకాని చ.**
**ఋగ్గాథా పాణికా దక్షవిహితా బ్రహ్మగీతికా,**
**గేయమేతత్తదభ్యాసకరణాన్మోక్షసంజ్ఞితమ్.**
**వీణావాదనతత్త్వజ్ఞః శ్రుతిజాతివిశారదః,**
**తాలజ్ఞశ్చాప్రయాసేన మోక్షమార్గం నియచ్ఛతి."** (యా.స్మృ. 3.113–115)

ఇవన్నీ **నాట్యశాస్త్రం**లో చెప్పబడినవే –

**"బ్రహోక్తం సప్తరూపం హి సమవేతాద్వినిస్సృతమ్,**
**దైవతారాధనం పుణ్యమనన్తం గీతవాదితమ్...."**
**ఋగ్గాథాపాణికానాం చ ప్రమాణానాం తథైవ చ,**

**అనేనైవ విధానేన యుగ్మౌజస్త్వం విభావయేత్"** (నా.శా.31.419,421)

**"ఋగ్గాథా పాణికా చైవ సప్తరూపం ప్రకీర్ణకమ్"** (నా.శా.31.523)

**"యా ఋచః పాణిగా గాథా సప్తరూపాఙ్గమేవ చ"** (నా.శా. 32.2)

ఈ శ్లోకాలు వ్యాఖ్యానిస్తూ మితాక్షరలోను, అపరార్కవ్యాఖ్యానంలోను భరతుడు ప్రమాణంగా చూపబడ్డాడు. విశ్వరూపుడు నారదుణ్ణి, ఇతరులనూ, **దీపకలిక** విశాఖిలుణ్ణి ఇతరులను ప్రమాణంగా చూపించారు. ఈ ఏడు పేర్లు **నాట్యశాస్త్రం**లో (31.287) కొంచెం భేదంతో కనబడుతున్నాయి. వీటిని వివరిస్తూ **నాట్యశాస్త్రం**లో సుమారు 130 శ్లోకా లున్నాయి. ఇవి బ్రహ్మచేత ప్రచారం చేయబడిన వనీ, దేవతలకు ఆనందకరమైన వనీ కూడ చెప్పబడింది. వైదికాలు కాని ఈ ఏడు విధాల గీతాల స్వరూపాన్ని **అభినవభారతి** కూడ అతివిస్తృతంగా వివరించింది. **నాట్యశాస్త్రం** ప్రకారం ఈ ఏడింటి పేర్లు – మంద్రకం, అపరాంతకం, ప్రకరి, రోవిందకం, (సరోబిందుక బదులు) ఓవేణకం, ఉల్లోప్యకం, ఉత్తరం. యాజ్ఞవల్క్యుడు వీటిని నాట్యశాస్త్రంనుండే గ్రహించాడు గాన నాట్యశాస్త్రాన్ని ఏ విధంగానూ కూడ క్రీ.శ.మొదటి శతాబ్దానికి లేదా రెండవ శతాబ్దానికి తరవాత రచింపబడినట్లు చెప్పడానికి వీలు లేదు.

(ఋ) రతి (ప్రేమ) అనే నాటకానికి ఆలింగనం పూర్వరంగం అని **గాథా సప్తశతిలోని** ఒక గాథలో వర్ణింపబడింది –

**"మానదుమ పరుస పవణస్స మామి సవ్వంగణివ్వుదిఅరస్స,**
**అబఊహణస్స భద్దం రినాడఅ పుబ్బరంగస్స"** (సప్తశతి. 4.44)

**"మానద్రుమపరుషపవనస్య సర్వాఙ్గనిర్వృతికరస్య**
**అవగూహనస్య భద్రం రతినాటకపూర్వరంగస్య"** (సంస్కృతచ్ఛాయ).

ఇది **నాట్యశాస్త్రం**లోని ఐదవ అధ్యాయంలో ప్రతిపాదించబడిన పూర్వరంగాన్ని దృష్టిలో ఉంచుకొని చెప్పిన వర్ణనం. **గాథాసప్తశతి** సంకలనం క్రీ.శ. 200 కు 400 కు మధ్య చేయబడిం దని పండితుల అభిప్రాయం.

(ఏ) పట్టడకల్ లోని ఒక స్తంభంమీద అచలుడు లేదా అచలదుడు అనే కవి రచించిన కొన్ని శ్లోకాలు చెక్కబడి ఉన్నాయి. అక్కడ ఉపయోగించిన లిపి 8–9 శతాబ్దాలలో ప్రచారంలో ఉన్నది. దక్షిణదేశంలో కూడ ఆనాడు **భరతనాట్యశాస్త్రం** అభ్యసించినవాళ్ళు ఇతరపద్ధతులను అభ్యసించేవారిని ఓడించకలిగేవా రని ఈ క్రింది శ్లోకంలో చెప్పబడింది.

**"నట సేవ్యభరతమతయుతపటుతరవచనాశనిప్రపాతేన,**
**కుటిలోన్నతనటశైలః స్ఫుటితానతమస్తకః పతతి".**

(ఐ) భట్టి (క్రీ.శ.590–650), దండి, భామహుడు, ఉద్భటుడు మొదలైన ప్రాచీనాలంకారికు లందరూ సుమారు ముప్పై అలంకారాలను నిరూపించారు. భరతుడు అతి సాధారణా లైన ఉపమ, దీపకం, రూపకం, యమకం అనే నాలుగు అలంకారాలు మాత్రమే ప్రతిపాదించాడు. ఛందస్సును గూర్చి ప్రాకృతభాషలను గూర్చి అతి విస్తృతంగా చర్చించిన భరతుడు ఆ నాటికి చాలా అలంకారాలు ప్రచారంలో ఉండి ఉన్నట్లయితే తప్పకుండా వాటి నన్నింటినీ ప్రతిపాదించి ఉండేవాడు. అందుచేత ఇతడు ఈ ఆలంకారికులకంటె కనీసం కొన్ని శతాబ్దాలు పూర్వం ఉండి ఉంటాడు.

నాట్యశాస్త్రానికున్న **'సూత్రమ్' 'భరతసూత్రమ్'** అను పేర్లు దీని అతిప్రాచీనత్వాన్ని సూచిస్తూన్నాయి అని ప్రతిపాదిస్తూ, శ్రీ ఎం. కృష్ణమాచారియార్ ఆంగ్లభాషలో రచించిన తమ **'సంస్కృతవాఙ్మయచరిత్ర'**లో ఇలా అన్నారు – "**నాట్యశాస్త్రం** అతిప్రాచీన మైనది. దీనిలో భరతముని ఐంద్రవ్యాకరణమూ, యాస్కుని నిరుక్తము నిర్దేశించాడు గాని పాణినిని పేర్కొనలేదు. ఈ గ్రంథంలోని భాషలోను, విషయప్రతిపాదనలోను అతిపురాతనతారీతులు (Archaic Tenor) స్పష్టంగా కనబడుతున్నాయి. అందుచేతనే నాట్యశాస్త్రరచయిత పేరు దివ్యపురుషుల కిచ్చే గౌరవభావంతో **'భరతముని'** అని ప్రసిద్ధిలోనికి వచ్చింది. (కొందరు ప్రాచీనాలంకారికులు కేవలం 'ముని' అని ఈయనను నిర్దేశించారు).

ఈ గ్రంథాన్ని, దీని వ్యాఖ్యాతలు, ఇతరశాస్త్రకారులూ కూడ **'సూత్రమ్'** అని నిర్దేశించారు. చిన్న మాటలలో అతివిస్తృతమైన అర్థాన్ని బోధించే ప్రామాణిక మైన శాస్త్రగ్రంథాన్ని మాత్రమే **'సూత్రమ్'** అనడం భారతీయప్రాచీనశాస్త్రసంప్రదాయం. ఉదాహరణకి – **'కలానామాని సూత్రకృదుక్తాని యథా'** (భరతసూత్రకారుడు చెప్పిన కలానామా లెట్లనగా) అంటాడు నాన్యదేవుడు. నాట్యశాస్త్రవ్యాఖ్యప్రారంభంలో అభినవ గుప్తాచార్యులు –

**"షట్త్రింశంకం భరతసూత్రమిదం వివృణ్వన్,**
**వన్దే శివం శ్రుతితదర్థవివేకిధామ".**

("ముప్పై ఆరధ్యాయాల భరతసూత్రాన్ని వ్యాఖ్యానించడానికి ప్రారంభించిన నేను వేద – వేదార్థవిద్గమ్యుడైన పరమశివునికి నమస్కరిస్తున్నాను") అంటారు.

పురాణాలలో లభించే కొన్ని ఐతిహాసికకాలక్రమాలను పట్టి చూడగా భరతుడు అతిప్రాచీను డను విషయం స్పష్టం అవుతుంది. అయితే సాంప్రదాయికవిషయాలను విశ్వసించకపోవడం ఈనాటి విమర్శకులకు ఒక అలవాటుగా ఏర్పడింది. ఏమైనా – పూర్వం సూత్రరూపంలో రచించిన వివిధశాస్త్రగ్రంథాలకు వ్యాఖ్యానాలుగా శ్లోకరూపంలో, ఆవిర్భవించిన, సూత్రకాలానంతరకాలిక ప్రాచీన గ్రంథాలలో అతిపురాతనమైనది **భరత**

**నాట్యశాస్త్రమే; రామాయణ – భారతాల** తరువాత మనకు లభిస్తూన్న అతిపురాతన మైన శ్లోకబద్ధ విశాలగ్రంథం ఇదే అని నిస్సంశయంగా చెప్పవచ్చును.

(History of Classical Sanskrit Literature, P. 811)

ఇంతవరకు మనం చూచినదానిని పట్టి **నాట్యశాస్త్రం** కాలం క్రీ.శ. 300 కు తరువాత అయి ఉండడానికి వీలులే దని స్పష్టం అవుతున్నది. అంటే ఈ నాడు మనకు లభిస్తూన్న నాట్యశాస్త్రం ఇదే ఆకారంలో ఆ కాలంనుంచీ మనకు వస్తూన్నదని అర్థం కాదు. రససిద్ధాంతాన్ని గూర్చి రూపకనియమాలను గూర్చీ చెప్పేది, భరతుని రచనగా ప్రసిద్ధమూ అయిన **నాట్యశాస్త్రం** క్రీ.శ. 300 లకు పూర్వమే ఉండే దని మాత్రమే దీని అర్థం. అలంకారశాస్త్ర సిద్ధాంతాలను దానికి సంబంధించిన విషయాలనూ ప్రతిపాదించే గ్రంథం ఏదీ క్రీ.శ. 300 ప్రాంతంలో ఉన్నట్లు ప్రస్తుతం కనబడడం లేదు గాన మనకు తెలిసి నంతవరకు **నాట్యశాస్త్రమే** అలంకార శాస్త్రానికి సంబంధించిన అతి ప్రాచీనగ్రంథం అని అంగీకరించవలసి ఉంటుంది.

**దశరూపక**వ్యాఖ్యానంలో ధనికుడు – "ఏతచ్చ –

**"ఇదం త్రిపురదాహే తు లక్షణం బ్రహ్మణోదితమ్,**
**తతస్త్రిపురదాహశ్చ డిమసంజ్ఞః ప్రకీర్తితః"** (ద.రూ. 56.60)

**"ఇతి భరతమునినా స్వయమేవ త్రిపురదాహేతివృత్తస్య తుల్యత్వం దర్శితమ్"** అని **నాట్యశాస్త్రం**నుండి ఒక శ్లోకం ఉదాహరించాడు. ఇప్పుడు లభించే **నాట్యశాస్త్రంలో** (4.10) ఈ శ్లోకం ఉత్తరార్ధం మాత్రమే లభ్యం అవుతూన్నది. **సరస్వతీకంఠాభరణ** వ్యాఖ్యాత మురజబంధానికి ఉపయోగించవలసిన వర్ణాలను గూర్చి –

**"పాఠాక్షరాణి మురజే లహకారౌ తథదధాశ్చమౌ రేఫః**
**నణకఖగవజాశ్చేత్థం షోడశ భరతాదికథితాని"** (పే. 268. 109కా.)

అని అంటూ భరతుని అభిప్రాయాన్ని ఉదాహరించాడు. కాని **నాట్యశాస్త్రంలో** ఈ విషయాన్ని గూర్చి ఏమీ కనబడడంలేదు.

**నాట్యశాస్త్రానికి వ్యాఖ్యానాలు :** భట్టోద్భటుడు : **నాట్యశాస్త్ర**వ్యాఖ్యానాలలో అతి ప్రసిద్ధ మైనది అభినవగుప్తుని **అభినవభారతి**. దీనికి **నాట్యవేదవివృతి** అనే పేరు కూడ ఉంది. ఇది అనేకస్థలాలలో ఖండితంగాను, అస్పష్టంగాను ఉన్నది. అయినా **నాట్యశాస్త్ర** వ్యాఖ్యాతలను గూర్చి అభినయవిద్యకు సంబంధించిన గ్రంథాలు రచించిన అనేకప్రాచీన రచయితలను గూర్చీ ఎంతో విలువ గల విషయాలు ఈ వ్యాఖ్యానం ద్వారా మనకు తెలుస్తున్నాయి. లోల్లటుడు, ఉద్భటుడు, శంకుకుడు, కీర్తిధరుడు, అభినవగుప్తుడు నాట్యశాస్త్రానికి వ్యాఖ్యలు రచించారని **సంగీతరత్నాకరంలో** శార్ఙ్గ దేవు డన్నాడు –

**వ్యాఖ్యాతారో భారతీయే లోల్లటోద్భటశఙ్కుకాః,**
**భట్టాభినవగుప్తశ్చ శ్రీమత్కీర్తిధరో౭_పరః"** (1.19)

**అభినవభారతి**లోని అనేక స్థలాలలో ఉద్భటుడు అంగీకరించిన కొన్ని పాఠభేదాలను గూర్చి కొన్ని అర్థ విశేషాలను గూర్చి చర్చ ఉంది. అందుచేత ఉద్భటుడు మొత్తం నాట్యశాస్త్రానికి వ్యాఖ్య రచించినట్లు చెప్పవచ్చును. ఉద్భటుడు క్రీ.శ. 800 ప్రాంతానికి చెందినవాడు.

**లోల్లటుడు :-** వృత్తి, ఆత్మసంవిత్తి మొదలైన విషయాలను గూర్చిన ఉద్భటుని అభిప్రాయాలను శకలీగర్భుడు అంగీకరించాడు. శకలీగర్భుని మతాన్ని లోల్లటుడు నిరాకరించాడు. దీనిని పట్టి లోల్లటుడు క్రీ.శ 800 నుండి 840 కి చెందినవా డని చెప్పవచ్చును. అతడు అనేక స్థలాలలో ఉద్భటుని మతాన్ని కూడ ఖండించాడు. రససూత్రానికి అతడు చేసిన వ్యాఖ్యానం అభినవగుప్తుడు ఉట్టంకించాడు. లోల్లటుని కొన్ని అభిప్రాయాలు ఇవి – (1) రసాలు అనేకం. అయినా ప్రసిద్ధమైన సాంప్రదాయికగ్రంథాల ననుసరించి ఎనిమిది లేదా తొమ్మిది రసాలను మాత్రమే రంగస్థలం మీద ప్రదర్శించాలి) – **"తేన ఆనన్త్యే౭_పి పార్షదప్రసిద్ధ్యా ఏతావతాం ప్రయోజ్యత్వమితి యద్ భట్టలోల్లటేన నిరూపితం తదవలేపనాపరామృష్ట్యా ఇత్యలమ్"** (అ.భా. మొదటి సం.పే. 299) (2) **నాట్యశాస్త్రం** లోని ఈ క్రింది శ్లోకం భట్టలోల్లటుని ప్రకారం లేదు.

**"యః కశ్చిత్కార్యవశాద్గచ్ఛతి పురుషః ప్రకృష్టమధ్వానమ్,**
**తత్రాప్యఙ్కచ్ఛేదః కర్తవ్యః పూర్వవత్తద్‌జ్ఞైః"** (20.30)
**"అత ఏవ ఏతత్ భట్టలోల్లటాద్యైః అపఠితమేవ"** (అ.భా. II పే. 243)

(3) 'గోపాల'ధ్రువతాలాల విషయంలో లోల్లటుని అభిప్రాయాలను అభినవగుప్తుడు ఉదాహరించాడు (అ.భా.II.134) (4) **నాట్యశాస్త్రం** లోని పదమూడవ అధ్యాయంలోని మొదటిశ్లోకంలో అభినవగుప్తుడు లోల్లటుని మతం నిర్దేశించాడు. (5) **"అఙ్క ఇతి గూఢశబ్దో భావైశ్చ రసైశ్చ రోహయత్యర్థాన్"** (నా.శా. 18.14) అనే శ్లోకంలో **"గూఢ శబ్దః"** అనేది లోల్లటుని పాఠమని చెపుతూ అభినవగుప్తుడు **"రూఢశబ్దః"** అని తనకు సంమతమైన పాఠం ఇచ్చాడు. (6) నాటిక షట్పద అని లోల్లటుని అభిప్రాయ మనీ, అష్టపద అని శంకుకుని అభిప్రాయ మనీ, అభినవగుప్త డంటాడు. **"షట్పదేయం నాటికేతి సంగ్రహానుసారిణో భట్టలోల్లటాద్యాః, శ్రీశంకుకస్తు అయుక్తమేతదిత్యభిధాయ అష్టధేతి వ్యాచష్టే"** (అ.భా.III. పే.436). (7) **నాట్యశాస్త్రం** 21వ అధ్యాయం 29వ శ్లోకం దగ్గర లోల్లటుడు – "పతాకానాయకుని జీవితానికి సంబంధించిన భాగాలకు ఆతని చర్యలకు **"అనుసంధి"** అని పేరు అని అన్నాడు. **"తథా లోల్లటాద్యాస్తు మన్యన్తే పరార్థే సాధయితవ్యే**

**పతాకానాయకస్య ఇతివృత్తభాగాః అనుసంధయః"** (అ.భా.III. పే.17) దీనిని పట్టి లోల్లటుడు మొత్తం **నాట్యశాస్త్రానికి** కాకపోయినా 6,13, 18, 21 వంటి చాలవరకు అధ్యాయాలకు వ్యాఖ్య రచించా డని చెప్పవచ్చును.

**కావ్యానుశాసనం**లో హేమచంద్రుడు లోల్లటుని రెండు శ్లోకాలు ఉదాహరించాడు-

**"యస్తు సరిదద్రిసాగరనగతురగపురాదివర్ణనే యత్నః,**
**కవిశక్తిఖ్యాతిఫలో వితతధియాం నో మతః ప్రబన్ధేషు.**
**యమకానులోమతదితరచక్రాదిభిదా హి రసవిరోధిన్యః,**
**అభిమానమాత్రమేతద్ గడ్డరికాదిప్రవాహో వా"** **(కావ్యాను.V పే. 215)**

వీటిలోని మొదటి శ్లోకం అపరాజితి రచించినదిగా **కావ్యమీమాంస**లో చెప్పబడింది. రెండవ శ్లోకం లోల్లటరచితంగా **కావ్యప్రకాశవ్యాఖ్య**లో సోమేశ్వరుడు ఉదాహరించాడు. రుద్రటుని **కావ్యాలంకార**వ్యాఖ్యలో (III. 59) ఈ శ్లోకాన్ని నమిసాధువు రచయిత పేరు చెప్పకుండా ఉదాహరించాడు. క్రీ.శ. 1159-60లో **కావ్యప్రకాశసంకేతం** రచించిన మణిచంద్రుడు - రససిద్ధాంతానికి సంబంధించిన మతాలను లోల్లటుని **రసవివరణం** నుండీ, ఇతరులనుండీ తెలుసుకోవాలని అంటూ లోల్లట - శంకుక - నాయకులను ముగ్గురునీ కూడ ఈ విధంగా ఆక్షేపించాడు -

**"న వేత్తి యస్య గామ్భీర్యం గిరితుఙ్గోఽపి లోల్లటః,**
**తత్తస్య రసపాథోధేః కథం జానాతు శఙ్కుకః.**
**భోగరత్యాదిభావానాం భోగం స్వస్యోచితం బ్రువన్,**
**సర్వథా రససర్వస్వమర్మాస్ప్రాక్షీన్న నాయకః."**

లోల్లటుడు రసాన్ని గూర్చిన తన మతాన్ని పూర్వమీమాంసను ఆధారంగా ప్రవర్తింపచేసి నట్లు అభినవగుప్తుని ఈ క్రింది వాక్యాన్ని పట్టి తెలుస్తూన్నది -

**"ప్రత్యేకప్రసంగత్వలాభాత్, క్రమస్య అపదార్థత్వాత్ నార్థప్రమాణకత్వాత్ ముఖ్యశ్రౌతపదార్థబాధకత్వమయుక్తం, శ్రుత్యా వాక్యప్రమాణస్య బాధనాత్ ఇతి తు భట్టలోల్లటోక్తం ప్రకృతే సిధ్యతి, విరోధాభావాత్"** (అ.భా.2. పే. 196.)

**శంకుకుడు :** శంకుకుడు రసం విషయంలో లోల్లటుని మతాన్ని ఖండించాడు. ఇతని వ్యాఖ్యానం లోల్లటుని వ్యాఖ్యానం వలెనే మన కిపుడు లభ్యం కాకపోయినా ఇతడు మొత్తం **నాట్యశాస్త్రానికి** వ్యాఖ్యానం రచించినట్లు కనబడుతున్నది. (1) మూడవ అధ్యాయం 21-22 శ్లోకాల వ్యాఖ్యానంలో అభినవగుప్తుడు రంగపీఠం విషయంలో శంకుకుని మతాన్ని - **"అతః చతుర్దశహస్తం రఙ్గపీఠపృష్ఠే ఏవ మణ్డలమిత్యుక్తం భవతి. శఙ్కుకాదిభిః**

**షోడశహస్తావకాశాభావః ఆసనస్తమ్భాదివశాత్; తస్మాత్ అకృత ఏవ రఙ్గపీఠే ఇత్యాది వృథైవ ఉపన్యస్తమ్"** అని ఉట్టంకించబడింది (2) **"ప్రఖ్యాతవస్తు విషయం ప్రఖ్యాతోదాత్తనాయకమ్"** (1810) అనే శ్లోకానికి శంకుకుడు చేసిన వ్యాఖ్యను నిర్దేశించి అభినవగుప్తుడు దానిని నిరాకరిస్తాడు. (3) **నృపతీనాం యచ్చరితం నానా రసభావచేష్టితం బహుధా"** (1812) అనే శ్లోకంలో 'నృపతీనామ్' అనే పదానికి శంకుకుడు చెప్పిన భావాన్ని అభినవగుప్తుడు నిరాకరించాడు. – **"శ్రీశఙ్కుకస్తు వ్యాచష్టే – విజిగీషుః అరిః మధ్యమోదాసీనౌ మిత్రం మిత్రమిత్రమితి ఏషాం చరితమితి బహువచనేన లభ్యతే ..."** (అ.భా. 18.12). (4) నాటికను గూర్చి శంకుకుని అభిప్రాయం వెనుక చూపబడింది. (5) 21వ అధ్యాయం 40వ శ్లోకంలో ప్రతిముఖసంధిని గూర్చి శంకుకుడు చెప్పిన అభిప్రాయాన్ని అభినవగుప్తుడు – **"ఉద్ఘాటితత్వాత్ బీజస్య స్తోకమాత్రం తు శఙ్కుకాదిభిరుదాహృతం యత్ తదేకదేశలక్షణమితి ద్రష్టవ్యమ్"** (అ.భా. 3 పే.25) అని విమర్శించాడు. (6) 21వ అధ్యాయం 42వ శ్లోకంలో శంకుకుడు విమర్శసంధిని గూర్చి చెప్పిన అభిప్రాయాన్ని అభినవగుప్తుడు ఉదాహరించాడు. (7) గర్భసంధ్యంగాలలో ఒకటైన విద్రవం విషయంలో శంకుకు డంగీకరించిన పాఠాన్ని దాని వివరణాన్ని అభినవగుప్తుడు ఉదాహరించాడు – **"అన్యే తు శఙ్కాభయత్రాసైః కృతః యః స విద్రవ ఇత్యాది, తత్ర చ విశేష్యపదమన్వేష్యమ్ – సముదాయ ఏవ విశేష్యమితి శ్రీశఙ్కుకః, ఉదాహరతి చ కృత్యారావణే షష్ఠేఽఙ్కే గర్భసన్ధౌ"** (అ.భా. 3పే. 52). (8) ఇరవైనాలుగో అధ్యాయంలో సామాన్యాభినయం విషయంలో శంకుకుడు వెలిబుచ్చిన అభిప్రాయాలు విస్తృతంగా ప్రతిపాదించబడ్డాయి. (అ.భా. 3 సంపుటం). (9) ఇరవై నాల్గవ అధ్యాయంలోని మూడవ శ్లోకంలో – **"అవ్యక్తరూపమ్ ఇత్యాదికం ప్రబన్ధం శ్రీశఙ్కుకాదయః ఇత్థం నయన్తి"** (అ.భా. III 150) అని శ్రీశంకుకుని అభిప్రాయం ఉదాహరించబడింది. (10) వందల కొలది అభినయభేదాలు ఏర్పడవచ్చును అని అంటూ అభినవగుప్తుడు ఆ సందర్భంలో శంకుకుకుని ప్రకారం నలభైవేల భేదా లుండవచ్చు నని అన్నాడు – **"నను యథా శ్రీశఙ్కుకేన ఉక్తం చత్వారింశత్సహస్రాణి ఇత్యాది"** (అ.భా. పే. 180). (11) ఐదవ అధ్యాయంలోని 20–21 శ్లోకాల వ్యాఖ్యానంలో అభినవగుప్తుడు 29వ అధ్యాయం నుంచి చాలా శ్లోకాలు ఉదాహరిస్తూ "ఈ శ్లోకాలలో కొన్నింటిలో శ్రీశంకుకుడు అంగీకరించిన పాఠాలు భిన్నంగా ఉన్నా యని ఆ భేదాలను చూపించాడు. (12) **అభినవభారతి** మొదటి అధ్యాయంలోను, రససూత్రవ్యాఖ్యానంలో, 293, 298, 318 పేజీలలో శంకుకుని మతం ఉదాహరించబడింది. దీని నంతనీ పట్టి శంకుకుడు మొత్తం **నాట్యశాస్త్రానికి** వ్యాఖ్యానం రచించి నట్లు స్పష్టం అవుతున్నది.

అభినవగుప్తుడు తన వ్యాఖ్యానంలో అనేక స్థలాలలో భట్టనాయకుని మతం ప్రస్తావించాడు. అయితే భట్టనాయకుడు నాట్యశాస్త్రానికి వ్యాఖ్యానం రచించాడా లేక ఏదైనా స్వతంత్రగ్రంథం రచించాడా అనే విషయం నిర్ధారణ చేయవలసి ఉంది. అదే విధంగా **నాట్యశాస్త్రం** నాల్గవ అధ్యాయం చివరి శ్లోకం వ్యాఖ్యానంలో కీర్తిధరుని పేరు చెప్పబడింది కాని ఇతడు **నాట్యశాస్త్రానికి** వ్యాఖ్యానం వ్రాసి నట్లు చెప్పడానికి తగిన ఆధారాలు లేవు.

అదే విధంగా అభినవగుప్తుడు అనేక స్థలాలలో 'టీకాకారుడు' టీకాకృత్. అని నిర్దేశించిన ఒక రచయిత ఎవరో ఉన్నాడు. ఆరవ అధ్యాయంలో రెండు పర్యాయాలు ఇతని మతం ఉదాహరించబడింది. ఇంకా 21,23,29,30,31 అధ్యాయలలోను, ఇతరత్రా కూడా దాదాపు పది పన్నెందు స్థలాలలో ఇతని మతాన్ని ఉదాహరించి నిరాకరించడం జరిగింది. ఈ విధంగా ఈ రచయిత పేరు అన్ని అధ్యాయాలలోనూ కాకపోయినా చాల అధ్యాయాలలో చెప్పబడింది. ఆలాపం, ప్రలాపం, ఉపదేశం, అతిదేశం మొదలైన అంతర్లాపాలను గూర్చి వ్రాస్తూ అభినవగుప్తుడు కొందరు ఉపదేశం, అతిదేశం, ఉపమానం మొదలైన వాటిలోనికి మీమాంసక – తార్కిక పరిభాషలను ప్రవేశపెట్టి సుకుమారమతులను భ్రాంతులను చేసి తప్పుదారి పట్టిస్తున్నారు అని అన్నాడు. **"అత్ర ఉపదేశాతిదేశయోః ఉపమానస్య చ సాహిత్యవిషయే తార్కికమీమాంసకవిషయే విశేషప్రతిపాదనం యత్ టీకాకారైః కృతం తత్సుకుమారమనోమోహనం వృథా భ్రమణికామాత్రం ప్రకృతానుపయో గాదిహోపేక్ష్యమేవ"** (అ.భా. పే. 176). అప్పయ్యదీక్షితులు, తద్వ్యాఖ్యాతలు, పండితరాజ జగన్నాథాదులు అలంకారశాస్త్రంలో ప్రవేశపెట్టిన తర్కశాస్త్రాద్యాడంబరాలు చూస్తే అభినవ గుప్తుడు ఎంత వాపోయి ఉండేవాడో!

**అభినవభారతి**లోను ఇతర గ్రంథాలలోను ఇంకా ఎంతోమంది కొన్ని నాట్యశాస్త్రీయ విషయాలను చర్చించిన రచయితల పేర్లు కనబడుతున్నాయి. భట్టయంత్రుడు, ప్రియాతిథి, భట్టవృద్ధి, భట్టసుమనస్, భట్టగోపాలుడు, రుద్రకుడు, భట్టశంకరుడు, ఘంటకుడు మొదలైన ఈ రచయితలు నాట్యశాస్త్రాని కంతకీ వ్యాఖ్యలు వ్రాశారా కొన్ని భాగాలకు మాత్రమే వ్రాశారా, లేదా స్వతంత్రగ్రంథాలు రచించి ఆయావిషయాలు చర్చించారా అనే విషయం చెప్పడం కష్టం.

**అభినవభారతి**లో రాహులకు డనే రచయితను అనేక పర్యాయాలు పేర్కొనడం కనబడుతుంది. **"యథాహ రాహులకః –**

**పరోక్షేఽపి హి వక్తవ్యో నార్యా ప్రత్యక్షవత్ప్రియః,**
**సఖీ చ నాట్యధర్మోఽయం భరతేనోదితం ద్వయమ్"** (అ.భా. 1పే.172)

వైశాఖరేచితం ప్రతిపాదిస్తూ రాహులకుడు రచించిన ఒక శ్లోకం ఉదాహరించబడింది. భరతుడు చెప్పిన యువతుల ఇరవై అలంకారాలు కాకుండా ఇతడు – మౌగ్ధ్యం, మదం, భావవికృతం, పరితపనం అనే మరికొన్ని అలంకారాలు కూడా అంగీకరించినట్లు చెప్పబడింది. **"తేన మౌగ్ధ్యమదభావవికృతపరితపనాదీనామపి శాక్యాచార్యరాహులాదిభిః అభిధానం విరుద్ధమ్ ఇత్యలం బహునా".** (అ.భా. 3. పే. 164)

అభినవగుప్తుడు ఒక మారు పుష్పాన్ని గూర్చి చెప్పే సందర్భంలో మాతృగుప్తుణ్ణి పేర్కొన్నాడు. **నాట్యశాస్త్రం**లో (29.93) చెప్పినట్లు వీణను ప్రయోగించే ఒక పద్ధతికి పుష్పం అని పేరు. ఇదొక పారిభాషికపదం. **"యథోక్తం మాతృగుప్తేన" 'పుష్పం చ జనయత్యేకో భూయోఽనుస్పర్శనాన్వితః'** ఇతి (అ.భా. 3. పే. 164). మాతృగుప్తుడు నాట్య – సంగీతాలను గూర్చిన గ్రంథాలు రచించి ఉంటాడు. నాటకంలోని కథావస్తువు ప్రాచీన కథతో సంబంధించినదైనా దానిలో కవికల్పితాలైన కథాంశాలు కూడ ఉండవచ్చునని మాతృగుప్తుని అభిప్రాయం అన్నట్లు శారదాతనయుడు **భావప్రకాశనంలో** చెప్పాడు –

> **"పూర్వవృత్తాశ్రయమపి కిం చిదుత్పాద్యవస్తు చ,**
> **విధేయం నాటకమితి మాతృగుప్తేన భాషితమ్"** (భా.ప్ర. పే. 234)

**శాకుంతల** వ్యాఖ్యానమైన **అర్థద్యోతనికలో** రాఘవభట్టు దాదాపు ఇరవై స్థలాలలో మాతృగుప్తుని మతం ఉదాహరించాడు – సూత్రధారుని గుణాలు, ఆర్యావర్తం, రూపకాలలో శౌరసేని అన్నివర్గాల స్త్రీపాత్రలు మాటలాడే భాష అనే విషయం, నాటకలక్షణాలు (51/2 శ్లోకాలు), బీజం (3 శ్లోకాలు), రూపకాలలో ఎవరు సంస్కృతంలో మాటలాడాలి అనే విషయం (ఒక శ్లోకం), 36 నాట్యలక్షణాలలో మొదటిదైన భూషణం యొక్క లక్షణం, పరిచారిక లైన యవనస్త్రీల లక్షణాలు (11/2 శ్లోకాలు) సేనాపతిలక్షణం, హసిత – స్మిత – పతాకాస్థానక – కంచుక – పరిచారికా – కార్యాల లక్షణాలు మామూలుగా ప్రాకృతంలో మాటలాడేవాళ్లు ఎప్పుడు సంస్కృతంలో మాట్లాడతారు అనే విషయం – వీటి అన్నింటి పైన మాతృగుప్తుని మతం ఉదాహరించబడింది. **నాటకలక్షణ రత్నకోశంలో** సాగరనంది మాతృగుప్తుని ఎన్నో శ్లోకాలు ఉదాహరించాడు. మాతృగుప్తుడు సౌకుమార్యంతో నిండిన కవిత్వం చెప్పగల కవి అని **వక్రోక్తిజీవితం**లో చెప్పబడింది. **ఔచిత్యవిచారచర్చ**లో మాతృగుప్తుని శ్లోకం ఒకటి ఉదాహరించబడింది. **రాజతరంగిణి**లో (3.125–33) మాతృగుప్తుణ్ణి గూర్చిన విపులవర్ణనం ఉన్నది. ఈ మహాకవి హర్షవిక్రమాదిత్యుని ఆస్థానంలో ఆస్థానకవిగా ఉండేవాడు. భర్తృమేంఠునికి సమకాలికుడు. ఆతని పోషకుడు, హర్షుని తరువాత ఐదు సంవత్సరాల పాటు కాశ్మీరును పాలించాడు. చివరికి కాశీ వెళ్ళి సంన్యాసం స్వీకరించాడు. మాతృగుప్తుడు హర్షుని ఆస్థానంలో ఉన్నప్పుడు రూపకాలకు సంబంధించిన

ఏదో గ్రంథం శ్లోకాలలో రచించి ఉంటాడని చెప్పవచ్చును గాని ఇతడు **నాట్యశాస్త్రానికి** వ్యాఖ్యానం వ్రాసినట్లు కనబడదు. **రాజతరంగిణిలో** (III. 181. 252) ఈతని పద్యాలు రెండు ఉదాహరించబడ్డాయి. క్రీ.శ. 1613లో రచించిన **నాట్యప్రదీపంలో** సుందరమిశ్రుడు **నాట్యశాస్త్రంనుంచి** నాందీలక్షణం (5,25,106) ఉదాహరించి – **"అస్య వ్యాఖ్యానే మాతృగుప్తాచార్యైః షోడశాఙ్ఘ్రిపదాపీయమ్ ఉదాహృతా"** అని అన్నాడు. చాల అర్వాచీనుడైన ఇతని వాక్యాన్ని అక్షరశః అంగీకరించ వలసిన పనిలేదు. మాతృగుప్తుడు తన రూపకగ్రంథంలో భరతుని నాందీలక్షణం గ్రహించి వివరించాడు అని మాత్రమే దీని అర్థం అయి ఉంటుంది. **రాజతరంగిణిలో** చెప్పిన మాతృగుప్తుడు వేరు రూపకశాస్త్రం రచించిన మాతృగుప్తుడు వేరు అని కొందరి అభిప్రాయం కాని, మాతృగుప్తుడే కాళిదాసు అనే కొందరి మతం కాని ప్రామాణికాలు కావు.

అభినవగుప్తుని నాట్యశాస్త్రాచార్యుడైన భట్టతౌతుడు కూడ **నాట్యశాస్త్రానికి** వ్యాఖ్యానం వ్రాసి ఉంటాడా అనే విషయం వివాదాస్పదం. **ప్రత్యభిజ్ఞాశాస్త్రంలో** అభినవ గుప్తుని ప్రాచార్యుడైన ఉత్పలదేవుని అభిప్రాయాలను అభినవగుప్తుడు చాల తరచుగా 29,31,32 అధ్యాయాలలో ఉదాహరించాడు. అతడు ఈ అధ్యాయాలకు వ్యాఖ్య రచించాడా లేక సంగీతశాస్త్రానికి సంబంధించిన స్వతంత్రగ్రంథం ఏదైనా రచించాడా అని నిశ్చితంగా చెప్పడం కష్టం. అభినవగుప్తుడు ఒక చోట ఉత్పలదేవుని మతం అంగీకరించడు – **"ఉత్పలదేవపాదాస్తు అస్మత్పరమగురవః వ్యాచక్షతే ... వయం తు మన్మహే"** (అ.భా.)

**ధ్వన్యాలోక**వ్యాఖ్యాన మైన **లోచనంలో** అభినవగుప్తుడు –

**"బహూనాం సమవేతానాం రూపం యస్య భవేద్బహు,**

**స మన్తవ్యో రసః స్థాయీ శేషాః సంచారిణో మతాః"**

అను **నాట్యశాస్త్రంలోని** శ్లోకం ఉదాహరించి, దీనిని చాలమంది చాల విధాలుగా వ్యాఖ్యానించారు అని చెపుతూ భాగురి మతాన్ని ఉటంకిస్తాడు. –

**"తథా చ భాగురిరపి కిం రసానామపి స్థాయిసంచారితా అస్తి ఇత్యాక్షిప్య అభ్యుపగమేనైవ ఉత్తరమవోచత్ బాఢమ్ అస్తీతి"** (లోచనం.పే. 217). భాగురి **నాట్యశాస్త్రవ్యాఖ్యాత** అని చెప్పడానికి మరొక మూలం ఏదీ లభించడంలేదు.

మనకీ నాటివరకు లభించని రూపకప్రయోగ గ్రంథాలను నిర్మించిన కొందరు ప్రాచీన రచయితలను గూర్చి చెప్పవలసి ఉన్నది. సదాశివుడు, శివుడు, బ్రహ్మదేవుడు, భరతుడు, కశ్యపముని, మతంగుడు, యాష్టికుడు, కోహలుడు, విశాఖిలుడు, దంతిలుడు, కంబలుడు, అశ్వతరుడు, నారదుడు, తుంబురుడు, ఆంజనేయుడు, మాతృగుప్తుడు, రావణుడు నందికేశ్వరుడు, రుద్రటుడు, నాన్యభూపాలుడు, భోజుడు, సోమేశ్వరపరమర్ది,

జగదేకమహీపతి ఈ విధంగా ఎందరో గ్రంథనిర్మాతల పేర్లు సంగీతరత్నాకరంలో (1.15–18) కనబడుతున్నాయి. వీరిలో కొందరు దివ్యపురుషులు, కొందరు దేవయోనులు (అర్ధదేవతలు), కొందరు మానవులు, కోహలుణ్ణి గూర్చి వెనుక కొంతవరకు తెలుసుకొని ఉన్నాం. అతడు **నాట్యశాస్త్రానికి** సంబంధించిన అన్ని విషయాలమీద, ప్రధానంగా సంగీత – నృత్య – అభినయాలమీద గ్రంథం లేక గ్రంథాలు రచించి నట్లు కనబడుతుంది. కోహలుడు రచించిన **సంగీతమేరువు** ఇప్పుడు లభ్యంకాదు; తాలాలకు సంబంధించిన ఒక అధ్యాయం మాత్రమే లభ్యం అవుతున్నది అని తెలుస్తూన్నది. సట్టకం మొదలైన ఉపరూపకాలను గూర్చి మొట్టమొదట చెప్పినవాడు కోహలుడు. అభినవగుప్తుడు అనేకస్థలాలలో కోహలుని మతం ప్రతిపాదించడమే కాకుండా ఆతని శ్లోకాలు కూడ అనేకం ఉదాహరించాడు. **నాట్యశాస్త్రంలో** కోహలుడు నృత్తాచార్యుడుగా పేర్కొనబడ్డాడు. – **"శూన్యభాస్వరవిద్యుదాద్యభినయవిషయే నృత్తాచార్యప్రవాహసిద్ధః కోహలలిఖితోఽపి హస్తః సంగతో భవతీతి"** (అ.భా.II.పే. 26). ఉపయోగించిన భాషలను పట్టి రూపకాలు అనేకవిధా లని కోహలుని అభిప్రాయ మనీ, సైంధవభాషలో రచించిన సైంధవకాన్ని రూపకంగా అంగీకరించడంచేత భరతునకు కూడ ఈ అభిప్రాయం అంగీకార్యమే అనీ **అభినవభారతిలో** చెప్పబడింది. – **"తేన దశరూపకస్య యద్భాషాకృతం వైచిత్ర్యం కోహలాదిభిరుక్తం తదిహ మునినా సైన్ధవాఙ్గనిరూపణే స్వీకృతమేవ"** (అ.భా.III.పే.72).

**సైన్ధవీమాశ్రితాం భాషాం జ్ఞేయం సైన్ధవకం బుధైః**
**రూపవాద్యాదిసంయుక్తం సైన్ధవం స్యాద్యథోద్ధతమ్.** (నా.శా.31.513).

కోహలుని మతం అంగీకరించిన ప్రాచీనరచయితలు సామాన్యాభినయం ఆరు విధా లని అంగీకరించారు అని చెపుతూ అభినవగుప్తుడు ఒక శ్లోకం కూడ ఉదాహరించాడు –

**"కోహలమతానుసారిభిః వృద్ధైః సామాన్యాభినయస్తు షోఢా భణ్యతే. తథాహి కోహలః – "శిష్టం కామం మిశ్రం వక్రం సంభూతమేకయుక్తత్వమ్**
**సామాన్యాభినయే యత్ షోఢా విదురేతదేవ బుధాః ఇతి"** (అ.భా. పే.146)

కోహలశాస్త్రప్రసిద్ధాలైన చిత్రాభినయాలు కూడ అభ్యసించాలి అని చెపుతూ అభినవగుప్తుడు సుమారు ముప్పై విషయప్రతిపాదకశ్లోకాలు ఉదాహరించాడు. (అ.భా.పే.289). కోహలుని మతం **భావప్రకాశనంలో** కూడ అనేక పర్యాయాలు ఉదాహరించబడింది. (చూ.పే.204.210, 236, 245, 251) **ప్రాకృతసర్వస్వ** కర్త యైన మార్కండేయుడు తాను ఆ గ్రంథాన్ని శాకల్య – భరత – కోహల – వరరుచి – భామహ – వసంతరాజుల గ్రంథాలను పరిశీలించి రచించినట్లుగా గ్రంథప్రారంభంలో

ఉన్న మూడవ శ్లోకంలో చెప్పాడు. దీనివల్ల భరతుని వలెనే కోహలుడు కూడ ప్రాకృత భాషలో ప్రాకృతాలను గూర్చి చెప్పినట్లు తెలుస్తూన్నది.

**రసార్ణవసుధాకరం**లో సింగభూపాలుడు భరతుని కుమారులైన శాండిల్య – కోహల – దత్తిల– మతంగులు నాట్యశాస్త్రగ్రంథాలు రచించా రని అన్నాడు.

అధేవిధంగా **రసరత్నప్రదీపికాకారుడు** తాను అధ్యయనం చేసిన గ్రంథాలను తత్రచయితలనూ గూర్చి చెప్పుతూ కశ్యప – కోహల – మతంగ – దత్తిల – విశాఖిల – నారద – తుమ్బురు – రావణులను పేర్కొన్నాడు. పాటలీపుత్రంలోని గణికలు కోరగా దత్తకుడు కామశాస్త్రంలోని వైశికప్రకరణం రచించి నట్లు **కామసూత్రం**లో చెప్పబడింది. **కుట్టనీమతం** 77, 122 శ్లోకాలలో దత్తకాచార్యుని పేరున్నది. **అభినవభారతి**లో ధ్రువను గూర్చిన ప్రకరణంలో దత్తిలాచార్యుని శ్లోకం ఉదాహరించబడింది. ఆతోద్యాలకు తాళాలకు సంబంధించిన ఘట్టంలో దత్తిలాచార్యుని పేరు చాల సార్లు చెప్పబడింది. **గంధర్వవేదసారం** అనే పేరు గల ఈ గ్రంథం లభ్యమౌతున్న దట.

మాతంగుడు వంశి మొదలైన సుషిరవాద్యాలలో నిపుణు డని దామోదరగుప్త డన్నాడు.

**"సుషిరస్వరప్రయోగే ప్రతిపాదనపణితో మతఙ్గమునిః"** (కుట్టనీమతం. 877)

అందుచేత ఇతడు అభినవగుప్తుని కంటె చాల ప్రాచీనుడు. **నాట్యశాస్త్రం** 30వ అధ్యాయంలో **అభినవభారతి**లో ఈ విధంగా చెప్పబడింది. మతంగుడు మొదలైన మునులు వెదురుకఱ్ఱతో చేసిన పిల్లనగ్రోవితో పూర్వం మహేశ్వరుణ్ణి సంతోషపెట్టారు. దీనికి వంశం అనే పేరు ప్రసిద్ధిలోనికి వచ్చింది. ఖదిరదారువుతో నిర్మించినా కూడ రంధ్రం ఉన్న ఏ గొట్టమైనా సుషిరాతోద్యం అని చెప్పవచ్చు : **"పూర్వం భగవన్మహేశ్వరా రాధనం మతఙ్గమునిప్రభృతిభిః వేణునా కృతమ్. తతో వంశ ఇతి ప్రసిద్ధః. వస్తుతస్తు ఛిద్రాత్మకసుషిరాభివ్యక్తస్వరవిశేషరూపతయైవాస్య ఉపయోగ ఇతి ఖాదిరాదినిర్మితం వ్యసనం భవత్యేవ. తథా చోక్తమ్ –**

**"వంశే సృష్టం యదా పూర్వం వంశసక్తా తు వైణవీ,**
**వంశాస్తు ఖదిరారోప్యాః శంశవాయత్క..." -- ఇతి".**

పిల్లనగ్రోవి లోహంతో కూడ తయారుచేయవచ్చు నని తరవాత చెపుతూ మతంగుని ఒక శ్లోకం కూడ ఉదాహరించబడింది. **"తథా హి మతఙ్గమునినా" – "చత్వారో ధాతవో వంశః" ఇత్యాదినా ధాతువినియోగోఽపి ప్రదర్శిత ఏవ"**. ముప్పైయవ అధ్యాయం 11వ శ్లోకంలో **అభినవభారతి**లో మతంగుని రెండు శ్లోకాలు ఉదాహరించబడ్డాయి. **సంగీతచూడామణి**లో జగదేకమల్లుడు (క్రీ.శ. 1138 – 1150) మతంగ – భోజులు

తనకు పూర్వం ఉన్న గొప్ప రచయితలు అని అన్నాడు. **సంగీత రత్నాకరం**లో చాలమంది రచయితల పేర్లు చెప్పబడ్డాయి. తద్వ్యాఖ్యాత యైన కల్లినాథుడు షడ్జాదిస్వరాల సార్థకత్వాన్ని మతంగుడు వివరించా డని చెప్పి (సం.ర.1.3.24) **"సరిగాదీనాం మతజ్ఞాభిమతః ఉద్ధారక్రమః ఉచ్యతే"** (సం.ర.3.25) అంటాడు. మతంగ – నందికేశ్వరులు పన్నెండు మూర్ఛనలు అంగీకరించా రనీ (సం.ర. 1.4.9) **"సామవేదే గీతప్రధానే ఆవృత్తిషు అర్థాః నాద్రియన్తే"** అని మతంగు డన్నా డనీ (సం.ర.I.8.13) కూడ కల్లినాథు డన్నాడు. భాషలను విభాషలను దృష్టిలో ఉంచుకొని మతంగుడు ఏడు గీతిక లంగీకరించాడు, భరతుడైతే మాగధి మొదలైన నాలుగు గీతికలనే అంగీకరించాడు అని కూడ కల్లినాథు దన్నాడు (సం.ర.II.1.7) **నాట్యశాస్త్రం**లో భరతు డన్నమాట లివి –

> **"అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి గీతీనామపి లక్షణమ్,**
> **ప్రథమా మాగధీ జ్ఞేయా ద్వితీయా చార్ధమాగధీ**
> **సంభావితా తృతీయా చ చతుర్థీ పృథులా స్మృతా"** (నా.శా.29.76–72)

ఈ నాలుగూ **సంగీతరత్నాకరం**లో కూడ చెప్పబడ్డాయి (సం.ర.I.8.14–16) ఇక్కడ – **"అస్యా మగధోద్భవత్వాత్ మాగధీతి నిరుక్తిః మతజ్ఞోక్తా"** అని కల్లినాథు డన్నాడు. మతంగుడు **బృహద్దేశి** అనే ఒక గ్రంథం రచించా డనీ దానిలోని 2500 శ్లోకాలు ఇప్పుడు లభిస్తున్నా యనీ కొందరు అంటున్నారు. ఈ **బృహద్దేశిని** నాన్యదేవుడు భరతభాష్యంలో అనేక పర్యాయాలు పేర్కొన్నాడు. మనకిపుడు నందికేశ్వరరచిత మైన **భరతార్ణవం**లో కొంత భాగం మాత్రమే లభిస్తున్నది. నాలుగు వేల శ్లోకాలకు 800 శ్లోకాలు మాత్రమే, పదిహేను అధ్యాయాలలో లభిస్తున్నాయి.

వామనుని **కావ్యాలంకారసూత్రవృత్తి**లో విశాఖిలుడు కళలను గూర్చి గ్రంథం రచించినట్లు చెప్పబడింది (I.3.7). **కుట్టనీమతం**లో కూడ విశాఖిలుని పేరు కనబడుతున్నది. –

> **"భరతవిశాఖిలదన్తిలవృక్షాయుర్వేదచిత్రసూత్రేషు,**
> **పత్రచ్ఛేదవిధానే భ్రమకర్మణి పుస్తసూత్రశస్త్రేషు"** (123 శ్లో.)

లాస్యగానాన్ని విశాఖిలుడు ప్రచారం చేసినట్లుగా **అభినవభారతి**లో చెప్పబడింది. (అ.భా.I.పే.199). **అభినవభారతి**లో విశాఖిలుని అభిప్రాయాన్ని ఉదాహరిస్తూ – **"తథా చ విశాఖిలాచార్యాః స్వరపదతాలసమవాయే గాంధర్వమితి"** (నా.శా.20.10) అని చెప్పబడింది. ఒకచోట అభినవగుప్తుడు భరతునికి విశాఖిలుని గ్రంథంయొక్క పరిచయం ఉన్నట్లు సూచించాడు – **"ఏవకారేణ చతుష్ప్రహరణసత్రిప్రహరణమ్ అఙ్గులీనాం విభాగః ద్వే తృతీయా సమరేఖా చిత్రరేఖా ఇత్యాదికం విశాఖిలాచార్యాన్తరప్రోక్తం సర్వథైవ**

**ధ్రువగానజ్ఞానవైకల్యోపయోగాత్ మయా నోక్తమ్ ఇతి సూచయతి"** (నా.శా. 29.81–83) **"అత ఏవ శారీరవద్వంశ్యానామారోహణమివారోహణం వా ఇతి విశాఖిలా చార్యః"** (నా.శా. 30.3) అని మరొకచోట కూడ అభినవగుప్తుడు విశాఖిలుణ్ణి పేర్కొన్నాడు.

**నాట్యశాస్త్రం**మీద హర్షుడు లేదా శ్రీహర్షు డనే పండితుడు రచించిన **'వార్తికం'** ఉన్నట్లు కనబడుతుంది. "వార్తిక కృత్" అనీ "హర్షః" అనీ ఆతనిని చాల తరచుగా నాట్యశాస్త్రంలో పేర్కొనడం జరిగింది. (1) నాట్యమండపంలోని వివిధప్రదేశాలలో నిలుపవలసిన స్తంభాలను గూర్చి వార్తికకారుని అభిప్రాయం **నాట్యశాస్త్రం**లోని ఒకటిన్నర ఆర్యలలో చెప్పబడింది. (II.97.98) తరవాత కూడ బహుశా వార్తికకారునివే ఇంకా నాలుగు ఆర్య లున్నాయి.

(2) మొదటి అధ్యాయం 84వ శ్లోకంలో **అభినవభారతి**లో వార్తికకారుని అభిప్రాయం చెప్పబడింది. నాల్గవ అధ్యాయం 267 – 68 శ్లోకాల దగ్గర

**"వాచ్యానుగతేఽభినయే ప్రతిపాద్యేఽర్థే చ గాత్రవిక్షేపైః,**
**ఉభయోరపి హి సమానః కో భేదో నృత్తనాట్యగతః"**

అని అంటూ చివరికి ప్రయోజనాన్ని పట్టి చూస్తే నృత్తనాట్యాలకి అంతగా భేదం లేదని వార్తికకారు డన్నట్లు చెప్పబడింది.

(నాట్యం అనగా రూపకవస్తుప్రయోగం, రూపకకథాప్రదర్శనం. దీనిలో కథా నిర్వహణం, గానం, నృత్యం – ఈ మూడు కలిసి ఉంటాయి. వివిధరూపకాలలో (నాటక ప్రకరణాదులలో) కథానిర్వహణానికే ప్రాధాన్యం ఉంటుంది. ఇతర రూపకాలలోను ఉపరూపకాలలోను గీత – నృత్యాలు ప్రధానంగా ఉంటాయి. నాట్య – నృత్య – నృత్తాల మధ్య కొంత భేదం ఉన్నట్లు చెప్పడం ఉంది. నాట్యంలో చాలమంది పాత్రలు పాల్గొంటారు. నృత్య – నృత్తాలు ఏకహార్యాలు, ఒక్క పాత్రచేతనే చేయబడతాయి.

**"అవస్థానుకృతిర్నాట్యం .... దశధైవ రసాశ్రయమ్,**
**అన్యద్ భావాశ్రయం నృత్యం నృత్తం తాలలయాశ్రయమ్"**

అని **దశరూపకం**లో చెప్పబడింఇ (I.7–త9)

**"పదార్థాభినయో నృత్యం డోమ్బీ శ్రీగదితాదిషు,**
**అఙ్గవిక్షేపమాత్రం యల్లయతాలసమన్వితమ్**
**తన్నృత్తమ్...."** (పే.298) అనీ,

**"నటకర్మైవ నాట్యం స్యాదితి నాట్యవిదాం మతమ్,**
**కరణైరఙ్గహారైశ్చ నిర్వృత్తం నృత్తముచ్యతే"** (పే.45)

అనీ భావప్రకాశనంలో చెప్పబడింది. అనుకరణం అనేది ఈ మూడింటికీ సాధారణమైనది. **"తౌర్యత్రికం నృత్యగీతవాద్యం, నాట్యమిదం త్రయమ్"** అని **అమరకోశంలో** కూడ చెప్పబడింది.)

(4) **"ఏవమవాన్తరవాక్యైరుపదేశో రాగదర్శనీయేషు,**
**సింహాదివర్ణకైర్వా క్వచిదప్యర్థాన్తరన్యాసాత్"** (అ.భా. I. పే. 174)

ఇత్యాది వాక్యాలలో కూడ వార్తికకారుని ఇదే అభిప్రాయం విశదీకరించబడింది.

(5) అయిదవ అధ్యాయంలోని ఏడవ శ్లోకంలో వార్తికకారుడు చెప్పిన 'పూర్వరఙ్గ' శబ్దార్థం, ఒక ఆర్య ఉదాహరింపబడ్డాయి – **"శ్రీహర్షస్తు రఙ్గశబ్దేన తౌర్యత్రికం బ్రువన్ నాట్యాఙ్గప్రయోగస్య తస్యైవ పూర్వరఙ్గతాం మన్యమానః పూర్వశ్చాసౌ రఙ్గశ్చ ఇతి సమాసమ్ అమంస్త. యదాహ –**

**"దృష్టా యేవస్థార్థే (వస్త్వర్థే?) నాట్యే రఙ్గాయపాదభాగాః స్యుః**
**పూర్వం త ఏవ యస్మిన్ శుద్ధాః స్యుః పూర్వరఙ్గోఽ సౌ"** (అ.భా. I. పే. 211)

(6) అయిదవ అధ్యాయంలోని 8–15 శ్లోకాలలో పూర్వరంగాన్ని గూర్చిన ప్రసంగంలో వార్తికకారుని వాక్యాలు కొన్ని (గద్యరూపంలో) ఉదాహరించబడ్డాయి.

(7) ఐదవ అధ్యాయం 180 వ శ్లోకంలో **"యదాహ శ్రీహర్షః – అత ఏవ హాసో నామ కవిః కస్మింశ్చిన్నాటకే – దివం యాతశ్చిత్తజ్వరేణ కవిరిత ఏవాభివర్తతే; అశక్య మస్య పురతోఽ వస్థాతుమ్"** అని శ్రీహర్షుడు పూర్వరంగంలోని ప్రస్తావనను గూర్చి చెపుతూ అన్నాడని చెప్పబడింది. (అ.భా. I. పే. 251)

మనం పైన చూచిన దానిని పట్టి **హర్షవార్తికం** అన్ని అధ్యాయాలకు సంబంధించి ఉంటుందనీ, చాల వరకు ఆర్యలలో రచింపబడి మధ్య మధ్య రూపకవాఙ్మయంనుంచి గ్రహించిన గద్యరూపోదాహరణాదులు కూర్చబడి ఉంటుందనీ ఊహించవచ్చును. **అభినవభారతి** రెండవ సంపుటం ప్రస్తావనలో రామకృష్ణకవి అంగహారాలకు సంబంధించిన వార్తికం లోని కొన్ని భాగాలు లభిస్తున్నా యని అన్నాడు. తోటకంలో విదూషకు డుండడు, నాటకంలో ఉంటాడు; ఇదే ఈ రెండింటికీ భేద మని హర్షుడు చెప్పి నట్లు **భావప్రకాశనంలో** చెప్పబడింది.

సుబంధువు అనే రూపకశాస్త్రకర్త ఉండేవా డనీ, అతడు నాటకాలను పూర్ణం, ప్రశాంతం, భాస్వరం, లలితం, సమగ్రం అని అయిదు విధాలుగా విభజించా డనీ **భావప్రకాశనం** (పే.,238) లో చెప్పబడింది. శారీరాభినయం ఆరు విధా లని **నాట్యశాస్త్రంలో** (24.4) చెప్పబడింది. వాటిలో ఒకటి "నాట్యాయితం". ఇది 48వ శ్లోకంలో వివరించబడింది. దీని వ్యాఖ్యానంలో అభినవగుప్తుడు మహాకవి యైన సుబంధువు

రచించిన **'వాసవదత్తానాట్యధార'** నాట్యాయితానికి ఉదాహరణం అని అన్నాడు – **"తత్రాస్య బహుతరవ్యాపినః బహుగర్భస్వప్నాయితతుల్యస్య నాట్యాయితస్యోదాహరణం మహాకవిసుబన్ధునిబద్ధో వాసవదత్తానాట్యధారాఖ్యః సమస్త ఏవ ప్రయోగః. తత్ర హి బిన్దుసారః ప్రయోజ్యవస్తుకే ఉదయనచరితే"**. ఈ మహాకవి సుబంధువు భావప్రకాశనం పేర్కొన్న రూపకశాస్త్రవప్రణీత యైన సుబంధువు ఒక్కరేనా వేరు వేరా అనేది తెలియదు.

నాన్యదేవుడు లేదా నాన్యపతి అనే మిథిలదేశరాజు రచించిన **భరతభాష్యం** లేదా **సరస్వతీహృదయాలంకారం** అనే గ్రంథం లిఖితగ్రంథరూపంలో ఉన్నది. దీనికి **భరతవార్తికం** అనే పేరు కూడ పుష్పికలో ఉన్నది. ఇది ఒక బృహద్గ్రంథంగా రచించడానికి ఉద్దేశింపబడినా పై పుస్తకంలో నాల్గు విధాల అభినయాలలో ఒకటైన వాచికాభినయం మాత్రమే ప్రతిపాదింపబడింది. ఇది ప్రధానంగా **నాట్యశాస్త్రం**లో 28 నుండి 33 వరకు ఉన్న అధ్యాయాలపై వ్యాఖ్య. ఈ రాజుకు రాజనారాయణు డని కూడ పేరు ఉన్నట్లు ఇతడు కీర్తిరాజుకు తమ్ముడు అన్నట్లు ఒక చోట చెప్పబడింది. ఇతడు **గ్రంథమహార్ణవం** అనే మరొక గ్రంథం కూడ రచించినట్లు చెప్పుకొన్నాడు. పదిహేడు అధ్యాయాలలో వాచికాభినయాన్ని వివరిస్తాను అని అంటూ ఇతడు ప్రతిపాద్యవిషయాల సూచిక ఇచ్చి ఉన్నాడు. ఇది భరతుని ప్రతీ శ్లోకానికీ వ్యాఖ్యరూపంలో లేదు. భరతుడు వందల కొలది స్థలాలలో ఉదాహరింపబడ్డాడు. ఒక మారు బృహత్కశ్యపుణ్ణి, ఒక మారు వృద్ధకశ్యపుణ్ణీ పేర్కొన్నాడు. బృహద్దేశిని, మతంగుణ్ణి, యాష్టికుని, విశాఖిలుని అనేక పర్యాయాలు ఉదాహరించాడు. ఇతడు ఇంకా నారదీయశిక్షావివరణకృత్, దేవరాజు, మేర్వాచార్యుడు, నందిమతం, స్వరసంహితాచార్యుడు, **యాజ్ఞవల్క్యస్మృతి**, తుంబురుడు, **కాలికాపురాణం, భాగవతపురాణం** ఇత్యాదులను కూడ ఉదాహరించాడు. అభినవగుప్తుణ్ణి చాల దగ్గరగా అనుసరించినా ఆతని పేరు మాత్రం ఒకటి రెండు సార్లు మాత్రమే నిర్దేశించారు. పాణిని – నారద – ఆపిశలులను కూడ పేర్కొన్నాడు. కొన్ని చోట్ల భరతునినుంచి తాను విభేదిస్తున్నట్లు చెప్పాడు. – **"గాన్ధారగ్రామశ్చ భరతేన అలౌకికశ్చాత్ర ఉపదర్శితః. అస్మాభిశ్చ ఆగమానుసారేణ దర్శితః"; "భరతాచార్యస్యాస్య శాస్త్రే ... ప్రయోగాగతా అస్మాభిశ్చ కశ్యపమతఙ్గతుమ్బురవిశాఖిలాద్యాచార్యనిఖిలమునివచనాత్"**. ఈ గ్రంథం రచించిన నాన్యదేవుడు క్రీ.శ.1100 ప్రాంతంలో ఉండి ఉంటాడు.

సాగరనంది రచించిన **నాటకలక్షణరత్నకోశం**. చివర –

**"శ్రీహర్షవిక్రమనరాధిపమాతృగుప్తగర్గాశ్మకుట్టనఖకుట్టకబాదరాణామ్,**

**ఏషాం మతేన భరతస్య మతం విగాహ్య ఘుష్టం మయా సమనుగచ్ఛత రత్నకోశమ్'**

అనే శ్లోకం ఉంది. దీనిని పట్టి ఈ ఏడుగురు రచయితలు భరతుని నాట్యశాస్త్రానికి

వ్యాఖ్యానాలు వ్రాసి ఉంటారు లేదా తమ గ్రంథాలలో **నాట్యశాస్త్రం**లోని విషయాలను చర్చించి ఉంటారని చెప్పవలసి ఉంటుంది.

భరతుని **నాట్యశాస్త్రానికి భరతసూత్రం** అనే పేరు కూడ ప్రసిద్ధంగా ఉంది. అభినవగుప్తాదులు ఈ పేరుతో **నాట్యశాస్త్రాన్ని** నిర్దేశించారు. వ్యాకరణ – న్యాయ – వేదాంతాదిశాస్త్రాలలో ఉన్న సంప్రదాయాన్ని అనుసరించి ఈ **భరతసూత్రం**మీద వార్తికాలు భాష్యాలు అనే పేర్లతో కూడ వ్యాఖ్యలు బయలుదేరి ఉంటాయి.

**ఈ బాలానందినీవ్యాఖ్యను గూర్చి :–** కొన్ని అలంకారశాస్త్రగ్రంథాలకు నేను తెలుగులో వ్యాఖ్యానాలు రచించే కాలంలో కొందరు మిత్రులు "అలంకారశాస్త్రానికి మూలగ్రంథంగా పండితు లందరూ అంగీకరించిన అతిప్రాచీన మైన భరతమునిప్రణీత **నాట్యశాస్త్రానికి** కూడ మీరు తెలుగులో వ్యాఖ్యానం రచిస్తే బాగుంటుంది" అనేవారు. నాకు కూడ ఆ అభిలాష ఉండేది కాని కార్యరూపం దాల్చలేదు. దాదాపు ఇరవైయైదు – ముప్పై సంవత్సరాల క్రితం జరిగిన ఆ విషయం విస్మృతప్రాయం అయిపోయింది.

అయితే – ఆంధ్రదేశంలో రంగస్థలనాటకప్రయోగప్రచారాలకి నిరంతరమూ ప్రయత్నిస్తూ, **'నాటక కళ'** అను మాసపత్రిక కూడ స్థాపించి నడుపుతూన్న **'కళామిత్ర'** శ్రీ ఆర్.రవిశర్మ గారు ఈ మధ్య ఏడెనిమిది మాసాల క్రితం మా యింటికి వచ్చి – "నాట్యశాస్త్రానికి సులభమైన తెలుగు అనువాదం ఏదీ లభించడంలేదు. అలాంటి అనువాదం రచించవలసినదిగా మిమ్మల్ని కోరడానికి వచ్చాను" అన్నారు. "వయోభారం చేతా, ఆరోగ్యం కూడ తదనుయాయిగా ఉండడంచేతా ఆ కార్యం నేను నిర్వహించజాలను" అని నేను చెప్పబోయే లోగానే ఆయన ఇంకా ఇలా అన్నారు – "ఆంధ్రదేశంలోని రెండు మూడు ప్రధాననగరాలలో శ్రీత్యాగరాజస్వామి ఉన్నతశిలా విగ్రహాలు స్థాపించాలని, సంకల్పించి, నేను నా మిత్రులు కొందరూ కలిసి, ఈ సంకల్పం సఫలం అయేటట్లు శ్రీశృంగేరి పీఠాధిపతుల ఆశీస్సులు పొందడానికై శృంగేరి వెళ్లి జగద్గురు శ్రీభారతీతీర్థ స్వాములవారిదర్శనం చేసికొన్నప్పుడు వారితో నాట్యశాస్త్ర వ్యాఖ్యానాన్ని గూర్చి కూడ ప్రస్తావించగా వారు, మీ పేరు చెప్పి 'ఆయన హైదరాబాదులోనే ఉన్నారు కదా. ఆయనని అడగండి; వ్యాఖ్యానం రచిస్తారు. నా మాటగా కూడ చెప్పండి' అన్నారు. అందుచేతనే మీతో నాకంతగా పరిచయం లేకపోయినా వచ్చాను".

ప్రారంభంలో సందేహించినా –

**"ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి"** (ఉత్తరరామచరితం)

"ఋషుల మాటల వెనుకనే అర్థం పరుగిడుతుంది" అను భవభూతిసూక్తి మనస్సులో

స్ఫురించి ఉపవేదాలలో ఒకటిగా ప్రసిద్ధమైన ఈ **నాట్యవేదానికి** తెలుగులో యథాశక్తిగా వ్యాఖ్య రచించి తెలుగువారికి అందించడం అనే ఈ సత్కార్యాన్ని జగద్గురువుల ఆదేశమే పూర్తిచేయిస్తుంది అను విశ్వాసంతో ఈ కార్యక్రమం ప్రారంభించి ఏప్రిల్ 30 తారీకున పూర్తి చేయకలిగాను.

**నాట్యశాస్త్రం** సకలభారతదేశంలో అధికప్రచారం గల గ్రంథం అవడంచేత, దాదాపు 2500 సంవత్సరాల కాలంలో వేలకొలది లేఖకుల చేతులలో అనేక పాఠ – అక్షరాది దోషాలకు, వ్యాఖ్యాతృ – పాఠకుల చేతులలో ప్రక్షిప్తపాఠాలకూ నిలయంగా ఏర్పడింది. దీనికి తోడు ఎన్నో గ్రంథపాతాలతో దురవగాహ మైపోయినది. ప్రస్తుతం మనకు లభిస్తూన్న ఒకే ఒక ప్రాచీనవ్యాఖ్యానం **అభినవభారతి**. అది కూడ అనేకమైన గ్రంథపాతాలతో, అక్షర – పదదోషాలతో చాలచోట్ల అస్పష్టార్థంగానే ఉంది. అందుచేతనే దీని ప్రథమ సంపాదకుడైన రామకృష్ణకవి – "అభినవగుప్తుడే స్వర్గంనుంచి దిగి వచ్చి ఈ లిఖితప్రతులను చూచినా, మూలపాఠాన్ని అంతసులభంగా నిర్ణయింపజాలడు" అన్నారు.

"అభినవగుప్తుని వ్యాఖ్యానరీతియే విచిత్రంగా ఉంటుంది. ఇతర వ్యాఖ్యానాల వలె చెప్పవలసిన అర్థం ప్రత్యక్షంగా (Directly) చెప్పకుండా శైవదర్శన – ఆగమ – తంత్రాదులలో తన కున్న అసాధారణమైన పాండిత్యాన్ని ప్రదర్శిస్తూ అసలు విషయం నుంచి దూరంగా వెళ్లిపోతూంటాడు. ఘోష్ అన్నట్లు – కొన్ని చోట్ల ఆయన ఏమి చెప్పదలచాడో ఆయనకే తెలియదేమో అన్నట్లు కనబడుతుంది. ఉదాహరణకి – **'ద్విభూమి'** అను పదానికి అర్థం విషయంలో నాలుగు అభిప్రాయాలు చెప్పి తన అభిప్రాయం ఏమో సప్రమాణంగా చెప్పలేదు. అదే విధంగా **'కుతప'** శబ్దానికి ఒక చోట "గాయకుల, సంగీతవాద్యవాదకుల సముదాయం (group)" అనీ, మరొక చోట "నాలుగు విధాలైన వాద్య సాధనాలు" అనీ అర్థం చెప్పాడు .... ఇలాంటి లోపాలు కొన్ని ఉన్నా నాట్యశాస్త్రరత్న భాండాగారం తెరవడానికి **అభినవభారతి** ఒక్కటే మన కున్న తాళం చెవి (key)."

(Dr. R.S. Nagar, Introduction to N.S. Part-I)

**అయితే – ఇలాంటివి చాల తక్కువే ఉన్నాయని ప్రొ. ఘోషే అన్నారు. నిజానికి – కొన్ని పదాలు వేరు వేరు అర్థాలలో ప్రయోగించడం నాట్యశాస్త్రంలోనే ఉంది. (పు.శ్రీ.రా.)**

**నాట్యశాస్త్రం**లోని భాష పాణినివ్యాకరణానికి లొంగిన భాష కాదు. బహుశా ఈ గ్రంథం రచించేనాటికి పాణినివ్యాకరణం పూర్తిగా పండితజనామోదం పొంది ఉండక పోవచ్చు. పూర్వం పాణినీయులకీ, కాతంత్రవైయాకరుణులకీ తరచు తీవ్రమైన కాకో లూకీయం జరుగుతూండే దని **పద్మప్రాభృతక** భాణం వంటి కొన్ని ప్రాచీనగ్రంథాల ద్వారా తెలుస్తూన్నది. **నాట్యశాస్త్ర**కారునికి పాణినీయంతో పరిచయమే లేకపోవచ్చు కూడ. అందుచేతనే విశేష్య – విశేషణాలను భిన్నలింగ – వచనాదులలో ప్రయోగించడం, క్రియాపదాలలో కాలనియమాలను సరిగా పాటించకపోవడం, సమస్తపదాలలో పౌర్వా

పర్యవ్యత్యాసం, సంధినియమాలు మరొక విధంగా ఉండడం మొదలైన అనేకమైన ఆపాణినీయరీతులు దీనిలో కనబడతాయి.

**నాట్యశాస్త్రం**లోని పద్నాల్గవ అధ్యాయంలో సంస్కృతవ్యాకరణానికి సంబంధించిన కొన్ని విషయాల చర్చ ఉంది. అదంతా ఏవో **ప్రాతిశాఖ్యలను**, ప్రాచీనవ్యాకరణాలను అనుసరించి చేసి నట్లు కనబడుతుంది. సంస్కృతధాతువులు ఐదువంద లనీ, అవి ఇరవైఎనిమిది గణాలుగా (ఇది ఘోష్‌గారి అభిప్రాయం. 'ఐదు గణాలుగా' అని మా అభిప్రాయం. పు.శ్రీ.రా). విభక్తములై ఉన్నాయనీ ఈ ఘట్టంలో చెప్పబడింది. అయితే ఇది ఏ వ్యాకరణం ప్రకారం చెప్పబడిందో తెలియదు. పాణినివ్యాకరణం ప్రకారమైతే మొత్తం ధాతువులు దాదాపు రెండు వేలు; అవి పది గణాలుగా విభక్తములయి ఉన్నాయి. ఈ విషయా లన్నీ దృష్టిలో ఉంచుకొని వ్యాఖ్యాతలు నాట్యశాస్త్రశ్లోకాదులకు అర్థం చెప్పవలసి ఉంటుంది.

డా. మానవల్లి రామకృష్ణకవి గారి తరువాత అంత సుదీర్ఘమైన పరిశ్రమచేసి నాట్యశాస్త్రానికి సంబంధించిన ఎన్నో పాఠాలను పరిశీలించి సవరించి, ఆంగ్లభాషలో అనువాదం కూడ సంతరించినవారు ప్రొ. మనోమోహన్‌ఘోష్. ఏడెనిమిది సంవత్సరాలు శాంతినికేతనంలో 'విశ్వకవి' రవీంద్రనాథటాగూరు గారి సంనిధిలో ఉన్న ఈయన ఆయన ప్రేరణచేత 1924లో నాట్యశాస్త్రాధ్యయనం ధ్రువాధ్యాయంలో ఉన్న ప్రాకృతశ్లోకాలలోని ప్రాకృతాల స్వరూపస్వభావాల పరిశీలనతో ప్రారంభించి, తాను పరిశోధించిన **నాట్యశాస్త్రం** మూలం రెండు సంపుటాలలోను, ఎన్నో విమర్శాత్మకవిషయాలతో కూర్చిన ఆంగ్లభాషాను వాదం రెండు సంపుటాలలోను, విస్తృతమైన ఇంట్రడక్షన్స్‌తో 1962 నాటికి పూర్తిగా ప్రకటిం చారు. ఈలోగా అనేకమైన పరిశోధనాత్మకమైన పత్రాలు, **అభినయదర్పణాదు**లకు ఆంగ్లానువాదాలు కూడ ప్రకటించారు.

"భాసుని రూపకాలలోను, నాట్యశాస్త్రంలోను ఉన్న ప్రాకృతభాష ఒక స్వతంత్రభాష కాదు; ఆ కాలంలో సంస్కృతమే జనసామాన్యభాషగా ఉండడంచేత ఆ యా ప్రాంతాలలో నివసించే ఉచ్చారణభేదాదులను పట్టి మార్పులు చెందిన సంస్కృతభాషనే 'ప్రాకృతం' అనేవారు. అందుచేత భాసుని రూపకాలలోని ప్రాకృతాన్ని పట్టి అవి క్రీ.పూ. 350 ప్రాంతానికి చెందినవి" అను డా. పుసాల్కర్ గారి అభిప్రాయంతో ఏకీభవిస్తూ – "భాసునికి తెలిసిన ఈ **నాట్యశాస్త్రం** క్రీ.పూ. 500 లకు చెందిన దని నిస్సంశయంగా చెప్పవచ్చును" అని ప్రొ.ఘోష్ ప్రతిపాదించారు –

"We are in complete agreement with him (Dr. Pusalkr) when he concludes :

"From the flowing tone of Bhasa's Sanskrit and the conversational style of his dialogues which are short, easy, graceful

and colloquial we are inclined to think that Sanskrit was a spoken language in Bhasa's time and so we place him after Panini, before the later's grammer got a strong foothold, and probably before Katyatyana (350 B.C.)"

- quoted from Dr. Pusalkar's work on Bhasa by
Prof. M. Ghosh

"But the Prakrt of the plays of Bhasa, as they have reached us, needs some comments ... The Prakrt of the dramas was always in the state of flux. In the beginning, the Prakrt of the dramas was not considered a seperate langauge, but a mode of speaking, and such a condifion prevailed probably in the time of Panini, and even continued for some time after him. Most probably the original orthography of Bhasa's Prakrt was not different from that of Sanskrit and the available Prakrt passages of Bhasa speak of the date of the MSS, tradition they followed, rather that of the dramatist, hence there is no bar to place him between 400 and 350 B.C, just before Kautilya (350 B.C.) who made a quotation from a play of his. Under these circumstances the most probable date for the NS. becomes about 500 B.C. because he was known to Bhasa".

(Introduction to Volume I of Translation PP IXIV, IXV)

పాణిని క్రీ.పూ. నాల్గవ శతాబ్దికి చెందినవా డని పాశ్చాత్యపండితులు అంటారు. ఆయన క్రీ.పూ. ఏడవ శతాబ్దానికి చెందినవా డని భారతీయవిమర్శకుల నిర్ణయం. పాణినికాలమూ, **నాట్యశాస్త్ర** కాలమూ కొంచెం ఇటు అటూ జరిగితే పాణిని పేర్కొన్న రెండు నటసూత్రాలలో ఒకటి మన **నాట్యశాస్త్రమే** కావచ్చునేమో! ప్రాచీనశాస్త్రరచయితల అసలు పేర్లు ఏవో తెలియక పోవడానికి ఎన్నో ఉదాహరణ లున్నాయి. ఉదాహరణకి – 'పాణిని' అనేదే పణినపుత్రు డను అర్థంలో ఉపయోగించిన పదం. ఈయన అసలు పేరు మరొక టేదో అయి ఉండవచ్చు. అందుచేతనే **నాట్యశాస్త్రం**లో అపాణినీయ ప్రయోగా లుండడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. **నాట్యశాస్త్రం** ఎంత ప్రాచీనమైనదో చెప్పడానికి ఇక్కడ ఈ విషయం అంతా చెప్పడం జరిగింది.

**'బాలానందినీ'** రచనకు ఈ క్రింది **నాట్యశాస్త్రం** పుస్తకాల సాహాయ్యం తీసికొన బడింది.

1. **అభినవభారతి**తో పరిమళపబ్లికేషన్స్, డిల్లీవారు నాలుగు సంపుటాలలో ప్రచురించినది. ఇది పూర్తిగా గాయక్వాడ్ ఎడిషన్ అనుసరించి డా. రవిశంకర్ నాగర్ సంపాదించినది. ద్వితీయసంస్కరణం – 1988.
2. ప్రొ. మనోమోహన్‌ఘోష్ సంపాదించినది. ఆంగ్లానువాదంతో నాలుగు సంపుటా

లలో చౌఖంభా సాన్‌స్క్రిట్ సీరీస్, వారణాసివారు ప్రచురించినది.

3. డా. బాబూలాల్ శుక్ల శాస్త్రి గారి హిందీ అనువాదాదులతో, నాలుగు సంపుటాలలో చౌఖంభా పబ్లికేషన్స్, వారణాసివారు ప్రచురించినది. పునర్ముద్రణం 2009. (ఇది ఘోష్‌గారి ఎడిషన్‌ను అనుసరించినది).

4. డా. సుధా రస్తోగీ రచించిన హిందీఅనువాదం. 1–10 అధ్యాయాలు మాత్రం. కృష్ణదాస్ అకాడమీ, వారణసి, 1989. (గాయక్వాడ్ ఎడిషన్ ను అనుసరించినది).

మా వ్యాఖ్యానంలో అధ్యాయాలసంఖ్య, వాటి పేర్లు మొదలైన విషయాలలో **అభినవభారతీ** సహిత **నాట్యశాస్త్రం** అనుసరించబడింది. అభినవగుప్తాచార్యుడు ఈ శాస్త్రంలో 36 అధ్యాయా లున్నా యని చాల చోట్ల చెప్పి ఉన్నా చివరిదైన 36 వ అధ్యాయం రెండుగా విభజించి 37 వ అధ్యాయానికి కూడ వ్యాఖ్య వ్రాసి సమాప్తి చేసి నట్లు ముద్రితపుస్తకం ద్వారా తెలుస్తున్నది. బహుశా ఈ మార్పు ఏ లేఖకులో చేసి ఉంటారు. మా వ్యాఖ్య ప.ప. ముద్రిత పుస్తకాన్నే అనుసరించింది. అదే విధంగా మొదటి ఇరవై అధ్యాయాల వ్యాఖ్య. ముప్పై యైదవ అధ్యాయం వ్యాఖ్య, మధ్యమధ్య ఇతర ప్రతుల సాహాయ్యం తీసికొన్నా ప్రధానంగా అ.భా.సహిత పుస్తకాన్నే అనుసరించి నడిచింది. మిగిలిన అధ్యాయాల వ్యాఖ్యకు ఘోష్ గారి పుస్తకము. అత్యల్పమైన భేదంతో దానినే అనుసరించిన డా. శుక్లగారి హిందీ అనువాదసహితపుస్తకము బాగా సహకరించాయి. నాట్యశాస్త్రస్వరూపం తెలిసికొనడానికి ఈ గ్రంథం కొంతవరకైనా జిజ్ఞాసువులైన తెలుగువారికి ఉపకరించగలదని ఆశిస్తున్నాను.

**డా. (శ్రీమతి) పెండ్యాల సీతాభవాని** ఈ పుస్తకం ప్రాగ్రూపాలు (ప్రూఫులు) దిద్దడంలో చాల సహకరించింది. పుస్తకాకారాదినిర్ణయం, ముద్రణపర్యవేక్షణ, ఛాయా చిత్రగ్రహణము మొదలైన బాధ్యత లన్నీ తమపైవేసికొని, గణిత – భౌతికశాస్త్ర విద్వద్వతంసులు **శ్రీ ఉప్పులూరి కామేశ్వరరావు** గారు తమ అమూల్యమైన కాలాన్ని ఈ పనులకై వెచ్చించారు.

ప్రసిద్ధ నాట్యాచార్యులు **శ్రీ దండిభొట్ల వైకుంఠ నారాయణమూర్తి** గారి వద్ద నాట్యవిద్య నేర్చిన **చి॥ కుమారి ఝాన్సీ, చి॥ కుమారి ఫణికుమారీ, చి ॥ లక్ష్మీనారాయణ** తమ గురువుల సమక్షంలో ప్రదర్శించిన **'కరణ' 'హస్తముద్ర'**ల చిత్రాలు ఈ పుస్తకానికి అపూర్వమైన శోభను చేకూర్చి పాఠకుల హృదయాలలో **నాట్యశాస్త్రం** విషయంలో కుతూహలాన్ని ఇనుమడింపచేసేవిగా ఉన్నాయి. అర్థాపేక్ష లేకుండా కేవలం కళారాధన దృష్టితో ఆచార్య – శిష్యులు చేసిన ఈ శోభాసంవర్ధనం చాల ఆనందదాయకమైనది. అనేక ధార్మిక – సాంస్కృతిక సంస్థలతో సంనిహిత సంబంధం కలిగి తత్సంవర్ధకులుగా కూడ ఉన్న వదాయన్యశేఖరులు **శ్రీ ముసునూరి చంద్రశేఖరరావుగారు** ఈ నాట్యచార్యు లతో మా పరిచయానికి కారణ భూతులు.

నాట్యశాస్త్రంలోనే కాక నాట్యనృత్యనృత్తాదుల ప్రయోగంలో కూడ నిష్ణాతులుగా విఖ్యాతి గాంచిన **శ్రీ మునుకుంట్ల సదాశివ** గారితో మాకు పరిచయం కలగడం నటరాజ చోదనాకృతం. మా అభ్యర్థనను మన్నించి వీరు తమ అమూల్యమైన సమయం వెచ్చించి చేసిన పర్యవేక్షణ ఈ చిరంజీవులు చేసిన కరణముద్రావిన్యాసాలకు ప్రామాణికత్వాన్ని సమకూర్చింది.

**శ్రీ 'సమంత గ్రాఫిక్స్'** సోదరులు **శ్రీకృష్ణ, పవన్‌కుమారులు**, యథాపూర్వంగా డి.టి.పి. కార్యం, అతిశీఘ్రంగా, శ్రద్ధాపూర్వకంగా నిర్వహించారు. **'రెయిన్‌బో ప్రింట్ ప్యాక్'** అధిపతి **శ్రీ నరేంద్ర** గారు ఈ పుస్తకాన్ని సహృదయు లందరూ మెచ్చుకొనే రీతిలో లాభదృష్టి లేకుండా, అతిమనోహర మైన ఆకారంతో తీర్చిదిద్ది, తయారుచేశారు. వీరందరికీ – **"విప్రస్తుష్టః శ్లోకమేకం దదాతి"** (విప్రుడు సంతోషిస్తే మాత్రం ఏమిస్తాడు! ఒక శ్లోకం ఇస్తాడు) అన్నట్లు, అభినందన పూర్వకశుభాకాంక్షలు తెలుపుతున్నాను.

మహామాహేశ్వరులు, శ్రీమదభినవగుప్తాచార్యుల రెండు శ్లోకాలతో ఈ ప్రస్తావన ముగిస్తున్నాను.

**ఊర్ధ్వోర్ధ్వమారుహ్య యదర్థతత్త్వం ధీః పశ్యతి శ్రాన్తిమవేదయన్తీ,**
**ఫలం తదాద్యైః పరికల్పితానాం వివేకసోపానపరమ్పరాణామ్.**

**అభినవభారతి**, షష్ఠాధ్యాయం. రససూత్రవ్యాఖ్య సందర్భంలో.

(ఒక విద్వాంసుని) బుద్ధి, అలసట అనేది ఎరుగకుండా, పై పైకి ఎక్కి ఒక విషయానికి సంబంధించిన తత్త్వాన్ని చూడకలుగుతూన్న దంటే, పూర్వులు ఏర్పరచిన వివేచనాలు (series of anlytical discussions) అనే సోపానపరంపరల (మెట్ల పంక్తుల) వల్ల లభించిన ఫలమే అది.

**"సజ్జనాన్ కవిరసౌ న యాచతే; హ్లాదనాయ శశభృత్ కిమర్థితః,**
**నాపి నిన్దతి ఖలాన్, ముహుర్ముహుః ధిక్కృతోఽపి న హి శీతలోఽనలః."**

ఈ కవి సజ్జనులను ప్రార్థించడు; ఎవరైనా సంతోషపెట్ట మని చంద్రుణ్ణి ప్రార్థిస్తున్నారా! దుష్టులను నిందించడు; ఎంత నిందిస్తే మాత్రం నిప్పు చల్లబడుతుందా!

హైదరాబాదు **పుల్లెల శ్రీరామచంద్రుడు**

6-7-2014

శ్రీః

# నాట్య - నృత్య - నృత్తాల వైశిష్ట్యము

**దేవానామిదమామనన్తి మునయః కాన్తం క్రతుం చాక్షుషం**
**రుద్రేణేదముమాకృతవ్యతికరే స్వాఙ్గే విభక్తం ద్విధా,**
**త్రైగుణ్యోద్భవమత్ర లోకోచరితం నానారసం దృశ్యతే**
**నాట్యం భిన్నరుచేర్జనస్య బహుధాప్యేకం సమారాధకమ్.**

నాట్యం అనేది కళ్లతో చూచి ఆనందించే మనోహరమైన దేవయజ్ఞం, దేవతారాధన, అని మునులు అంటారు. రుద్రుడు, ఈ నాట్యాన్ని, తాండవం, (ఉద్ధతనృత్యం) లాస్యం (లలితనృత్యం) అని రెండు విధాలుగా విభజించి, (వామభాగంలో) ఉమతో కలిసిఉన్న తన శరీంలో ధరించాడు. సత్త్వ – రజస్ – తమోగుణాల ప్రభావంచేత జరిగే, వివిధరసాలకు నిలయమైన సకలలోకాల చరిత్ర, జీవనవిధానం, దీనిలో చూడవచ్చు. ఈ విధంగా, నాట్యం, అది అవడానికి ఒక్కటే అయినా, వేరు వేరు అభిరుచులు గల మనుష్యులకు అనేకవిధాల వినోదం కలిగిస్తుంది.

– మాళవికాగ్నిమిత్రము

**క్షితౌ రత్నచ్ఛాయాఫలనముదకే వీచిలలితం**
**శిఖిన్యర్చిఃప్రేఙ్ఖా, సహజగతివైచిత్ర్యమనిలే,**
**తడిత్క్రీడా వ్యోమ్నీత్యకృతసుభగః పఞ్చసు పరః,**
**ప్రవిష్టో భూతేషు ప్రభవతి హి నృత్తస్య మహిమా.**

– జాయసేనాపతివిరచితనృత్తరత్నావళి

భూమిలో రత్నకాంతుల తళతళలు, నీటిలో తరంగాల లలితచలనము; అగ్నిలో జ్వాలల ఊగులాటలు. వాయువులో సహజమైన వింత వింత నడకలు, ఆకాశంలో మెరుపుదీగల ఆటలు – ఈ విధంగా సహజసుందరమైన నృత్తకళామహిమ పంచ భూతాలలో ప్రవేశించింది.

**[1]జాయసేనాపతి రచించిన నృత్తరత్నావళి 1-4**

**– [1]ఈయన కాకతీయచక్రవర్తి గణపతిదేవుని బావమరిది, గజసేనాపతి**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# నాట్యశాస్త్రము

నత్వా శ్రీతాతపాదాదీన్ సర్వశాస్త్రార్థసద్గురూన్,
భరతస్య మునేర్నాట్యశాస్త్రమాద్ర్యాంవివృణ్మహే.

## ప్రథమాధ్యాయము

## నాట్యోత్పత్తి

యస్తన్మయాన్ హృదయసంవదనక్రమేణ
ద్రాక్చిత్రశక్తిగణభూమివిభాగభాగీ,
హర్షోల్లసత్పరవికారజుషః కరోతి
వన్దేతమాం తమహమిన్దుకలావతంసమ్. **1**

షడ్వింశ (షట్త్రింశ) కాత్మక జగద్గగనావభాస
సందిన్మరీచిచయచుమ్బితబిమ్బశోభమ్,
షట్త్రింశకం భరతసూత్రమిదం వివృణ్వన్
వన్దే శివం శ్రుతితదర్థవివేకి ధామ. **2**

విశ్వబీజప్రరోహార్థం మూలాధారతయా స్థితమ్,
ధర్తుం శక్తిమయం వన్దే ధరణీరూపమిశ్వరమ్. **3**

మూ. ప్రణమ్య శిరసా దేవౌ పితామహమహేశ్వరౌ,
నాట్యశాస్త్రం ప్రవక్ష్యామి బ్రహ్మణా యదుదాహృతమ్. **1**

*శ్రీమదభినవగుప్తాచార్యాః*

**తాత్పర్యం :** బ్రహ్మదేవునకు మహేశ్వరునకు శిరస్సు వంచి నమస్కరించి బ్రహ్మదేవుడు బోధించిన నాట్యశాస్త్రాన్ని నా మాటలలో చెపుతాను.

మూ. సమాప్తజప్యం వ్రతినం స్వసుతైః పరివారితమ్,
అనధ్యాయే కదాచిత్తం భరతం నాట్యకోవిదమ్. **2**

మునయః పర్యుపాస్యైవమాత్రేయప్రముఖాః పురా,
పప్రచ్ఛుస్తే మహాత్మానో నియతేన్ద్రియబుద్ధయః. **3**

**తా.** పూర్వం ఒక అనధ్యాయదివసాన (శిష్యులకు క్రొత్త పాఠాలు చెప్పకూడని రోజున) నాట్యశాస్త్రప్రవీణుడు, నియమవంతుడు అయిన భరతముని జపం పూర్తి చేసికొని

ఆసీనుడై ఉన్నాడు. ఆయన పుత్రులు ఆయన చుట్టూ కూర్చొని ఉన్నారు. అప్పుడు, ఇంద్రియాలను బుద్ధిని అదుపులో ఉంచుకొన్న మహాత్ములైన ఆత్రేయాది మునులు ఆ భరతమునిని ఈ విధంగా ప్రశ్నించారు –

**మూ. యోయం భగవతా సమ్యక్ గ్రథితో వేదసంమితః,**
**నాట్యవేదః కథం బ్రహ్మన్నుత్పన్నః కస్య వా కృతే. 4**

**తా.** ఓ! బ్రాహ్మణోత్తమా! పూజ్యుడ వైన నీవు చక్కగా కూర్చిన ఈ నాట్యవేదం వేదంతో సమాన మైనది. ఇది ఎలా ఆవిర్భవించినది? ఎవనికోసం ఆవిర్భవించింది?

**మూ. కత్యఙ్గః కింప్రమాణశ్చ ప్రయోగశ్చాస్య కీదృశః,**
**సర్వమేతద్యథాతత్త్వం భగవన్! వక్తుమర్హసి. 5**

**తా.** పూజ్యుడా! ఈ నాట్యవేదానికి ఎన్ని అంగా లున్నాయి? దీని ప్రమాణం ఎంత? దీనిని ఏ విధంగా ప్రయోగించాలి? ఈ విషయా లన్నీ ఉన్నవి ఉన్నట్లు నీవు మాకు చెప్పా లని కోరుతున్నాం.

*నాట్యోత్పత్తికథనమ్ – నాట్యావిర్భావాన్ని గూర్చిన వివరణ*

**మూ. తేషాం తద్వచనం శ్రుత్వా మునీనాం భరతో మునిః,**
**ప్రత్యువాచ తతో వాక్యం నాట్యవేదకథాం ప్రతి. 6**

**తా.** భరతముని, ఆ మునుల మాటలు విని నాట్యవేదోత్పత్తిని గూర్చిన కథ ఈ విధంగా చెప్పడం ప్రారంభించాడు.

**మూ. భవద్భిః శుచిభిర్భూత్వా తథావహితమానసైః,**
**శ్రూయతాం నాట్యవేదస్య సంభవో బ్రహ్మనిర్మితః. 7**

**తా.** బ్రహ్మదేవుడు **నాట్యవేదం** ఏ విధంగా సృజించాడో చెపుతాను; మీరందరూ పవిత్రులై, సావధాన మైన మనస్సులతో వినండి.

**మూ. పూర్వం కృతయుగే విప్రాః వృత్తే స్వాయమ్భువేఽన్తరే,**
**త్రేతాయుగేఽథ సంప్రాప్తే మనోర్వైవస్వతస్య చ. 8**

**గ్రామధర్మప్రవృత్తే తు కామలోభవశం గతే,**
**ఈర్ష్యాక్రోధాభిసంమూఢే లోకే సుఖితదుఃఖితే. 9**

**దేవదానవగన్ధర్వయక్షరక్షోమహోరగైః,**
**జమ్బూద్వీపే సమాక్రాన్తే లోకపాలప్రతిష్ఠితే. 10**

**మహేన్ద్రప్రముఖైర్దేవైరుక్తః కిల పితామహః,**
**"క్రీడనీయకమిచ్ఛామో దృశ్యం శ్రవ్యం చ యద్ భవేత్. 11**

**తా.** ఓ! బ్రాహ్మణులారా! పూర్వం స్వాయంభువమన్వంతరంలో, కృతయుగం గడచి త్రేతాయుగం ప్రారంభ మైనప్పుడు అట్లే వైవస్వతమన్వంతరంలో కృతయుగం గడచి త్రేతాయుగం ప్రారంభ మైనప్పుడు భూలోకంలోని ప్రజ లందరూ కామ – లోభాలకు వశులై, ఈర్ష్య, క్రోధము మొదలైనవాటితో ఏమి చేయ్యాలో తెలియని స్థితిలో సుఖ – దుఃఖాలు అనభవిస్తూ, గ్రామ్యధర్మాలను, (ధర్మవిముఖు లైన పామరజనుల జీవనవిధానాలను) అనుసరిస్తూండేవారు. అప్పుడు లోకపాలులు స్థాపించిన జంబూ ద్వీపాన్ని దేవతలు, దానవులు, గంధర్వులు, యక్షులు, రాక్షసులు మహోరగులు (మహానాగులు) ఆక్రమించుకొన్నారు. ఇది చూచి మహేంద్రుడు మొదలైన దేవతలు బ్రహ్మదేవుని వద్దకు వెళ్లి – "పూజ్యుడా! కళ్లతో చూచి, చెవులతో విని అందరూ ఆనందించడానికి ఉపయోగించే ఏదైన ఒక సాధనాన్ని కోరుతున్నాము".

**మూ. "న వేదవ్యవహారోఽయం సంశ్రావ్యః శూద్రజాతిషు,**
**తస్మాత్సృజాపరం వేదం పఞ్చమం సార్వవర్ణికమ్." 12**

**తా.** "శూద్రజాతులవాళ్లు, శూద్రసమానప్రవృత్తికలవాళ్లూ కూడ రాజసస్వభావం కలవాళ్లవడంచేత వాళ్లకు వేదవ్యవహారం, (వేదోక్తధర్మాదికం) వినిపించి ప్రయోజనం లేదు. అందుచేత అన్ని వర్ణాలవాళ్లకు ఉపయోగించే మరొక వేదాన్ని, ఐదవ వేదాన్ని నువ్వు నిర్మించి మమ్ములను అనుగ్రహించాలి".

**వివరణ :** ఎనిమిదవ (8) శ్లోకానికి ఉన్నదున్నట్లు అర్థం చెప్పుకొంటే భావం కుదరదు. అందుచేత **నాట్యశాస్త్రానికి** ప్రామాణికమైన **అభినవభారతి** అను వ్యాఖ్యానం వ్రాసిన అభినవగుప్తులు వ్రాసిన విధంగా అనువాదం చేయబడింది.

భారతీయ జ్యోతిఃశాస్త్ర ప్రకారం కృత – త్రేతా – ద్వాపర – కలియుగా లని నాలుగు యుగాలు. వీటికాలం (ఒక్కొక్కదానిలో) కొన్ని లక్షల సంవత్సరాలు. నాలుగు యుగాల కాలానికి ఒక **మన్వంతరం** అని పేరు. అలాంటి పద్నాలుగు మన్వంతరాలు ఒక **కల్పం,** ఒక కల్పం బ్రహ్మదేవునికి ఒక దినం. ఒక కల్పంలో మొదటిది స్వాయంభువ మన్వంతరం. ప్రస్తుతం జరుగుతూన్న వైవస్వతమన్వంతరం పద్నాలుగు మన్వంతరాలలో ఏడవది. పైన చూచి నట్లు ప్రతీ మన్వంతరంలోను నాలుగు యుగా లుంటాయి కదా! మొదటి మన్వంతర మైన స్వాయంభువమన్వంతరంలో త్రేతాయుగంలో బ్రహ్మదేవుడు నాట్యశాస్త్రం ఆవిర్భవింపచేశాడు. అదే విధంగా అన్ని మన్వంతరాలకు సంబంధించిన త్రేతాయుగాలలోను నాట్యశాస్త్రావిర్భావం జరుగుతూంటుంది. కృతయుగంలో ప్రజలు సహజంగానే స్వధర్మాలు పాటిస్తూ సుఖంగా ఉంటారు. అది గడచిన వెంటనే వాళ్ల మానసికప్రవృత్తులు మారి దుఃఖాలు కూడ అనుభవిస్తూంటారు. అట్టి వారి ఆనందం కోసం నాట్యశాస్త్రావిర్భావం. ఇది అభినవగుప్తాచార్యుల అష్టమశ్లోక వ్యాఖ్యానసారం.

**మూ. ఏవమస్త్వితి తానుక్త్వా దేవరాజం విసృజ్య చ,**
**సస్మార చతురో వేదాన్ యోగమాస్థాయ తత్త్వవిత్. 13**

**తా.** లోక – వేదాదిశాస్త్రాల తత్త్వం బాగా తెలిసిన బ్రహ్మదేవుడు "సరే! అలాగే ఆవిర్భవింప చేస్తాను" అని వాళ్లతో పలికి, దేవేంద్రుణ్ణి పంపివేసి, ధ్యానముద్రలో కూర్చొని నాలుగు వేదాలను స్మరించాడు.

**మూ. ("నేమే వేదాః యతః శ్రావ్యాః స్త్రీశూద్రాద్యాసు జాతిషు,**
**వేదమన్యత్తతః స్రక్ష్యే సర్వశ్రావ్యం తు యద్భవేత్.")**

(ఇది 12వ శ్లోకం పూర్వార్ధంలోని భావాన్నే అనువదిస్తూ చెప్పిన ప్రక్షిప్తశ్లోకం. మూలంలో లేకపోయినా తరువాతి ఎవరో చేర్చినదానిని ప్రక్షిప్తం అంటారు. ఇలాంటి ప్రక్షిపశ్లోకాలు ముమ్ముందు అడుగడుగునా తగులుతాయి. వాటిని చాల వరకు కుండలిలో (బ్రాకెట్సులో) చూపడం జరిగింది.

**మూ. ధర్మ్యమర్థ్యం యశస్యం చ సోపదేశ్యం ససంగ్రహమ్,**
**భవిష్యతశ్చ లోకస్య సర్వకర్మానుదర్శకమ్. 14**

**సర్వశాస్త్రార్థసంపన్నం సర్వశిల్పప్రవర్తకమ్,**
**నాట్యాఖ్యం పఞ్చమం వేదం సేతిహాసం కరోమ్యహమ్. 15**

**తా.** "నేను **'నాట్యవేదం'** అనే పంచమవేదాన్ని నిర్మిస్తూ దాని ఇతిహాసం కూడ చెపుతాను. ఆ యా చారిత్రవిషయాలు కూడ ఈ నాట్యశాస్త్రం ద్వారా, నాట్యం ద్వారా తెలుస్తాయి. ఈ **నాట్యవేదం** ధర్మసంమతంగా, అందరూ ఆదరపూర్వకంగా కోరదగినది గాను, జనులకు యశస్సు సంపాదించేదిగాను ఉంటుంది. దీనిలో జనులకు ఉపదేశించ వలసిన విషయా లుంటాయి, అన్ని విషయాలు సంగ్రహింపబడతాయి. ఇది రాబోయే తరాల వాళ్లకు అన్ని విధాల కర్మలను (కర్తవ్యాలను) చూపేదిగా ఉంటుంది. దీనిలో సమస్తశాస్త్రాలలోని విషయాలు, చెప్పబడతాయి. అన్ని విధాలైన శిల్పాలకు దీనిలో అవకాశం ఉంటుంది.

**మూ. ఏవం సంకల్ప్య భగవాన్ సర్వవేదాననుస్మరన్,**
**నాట్యవేదం తతశ్చక్రే చతుర్వేదాఙ్గసంభవమ్. 16**

**తా.** భగవంతు డైన బ్రహ్మదేవుడు ఈ విధంగా సంకల్పించి, సమస్తవేదాలను స్మరిస్తూ, నాలుగువేదాలనుండి గ్రహించబడిన అంగాలతో ఏర్పరచిన నాట్యవేదాన్ని నిర్మించాడు.

**మూ. జాగ్రాహ పాఠ్యమృగ్వేదాత్ సామభ్యో గీతమేవ చ,**
**యజుర్వేదాదభినయాన్ రసానాథర్వణాదపి. 17**

**తా.** ఋగ్వేదంనుండి పాఠ్యాన్నీ, సామలనుండి (సామవేదంనుండి) గీతాన్నీ, యజుర్వేదం నుండి అభినయాలను, అథర్వవేదంనుండి రసాలను గ్రహించాడు.

**వి.** స్పష్టమైన ఉచ్చారణ చేస్తూ చెప్పదలచిన విషయాన్ని స్పష్టంగా ఇతరులకు అర్థ మయే టట్లు, తగిన కంఠస్వరం, దానిలోని మార్పులు, అలంకారాదులు చేర్చి కూర్చిన వాగ్విధానానికి పాఠ్యం అని పేరు.

**మూ. వేదోపవేదైః సంబద్ధో నాట్యవేదో మహాత్మనా,**
**ఏవం భగవతా సృష్టో బ్రహ్మణా సర్వవేదినా. 18**

**తా.** సర్వజ్ఞుడు, మహాత్ముడు, పూజ్యుడు అయిన బ్రహ్మదేవుడు ఈ విధంగా వేదాలతోను, ఉపవేదాలతోను సంబంధం ఉన్న నాట్యవేదాన్ని సృష్టించాడు.

**మూ. ఉత్పాద్య నాట్యవేదం తు బ్రహ్మోవాచ సురేశ్వరమ్,**
**ఇతిహాసో మయా సృష్టః స సురేషు నియుజ్యతామ్. 19**

**తా.** బ్రహ్మదేవుడు ఈ విధంగా నాట్యవేదం సృష్టించి ఇంద్రునితో – "ఇతిహాసం, అనగా దేవదానవమానవాదుల వివిధచరిత్రలను చూపే దశరూపకం (పది రూపకాలు) నేను సృజించాను. దీన్ని గ్రహించవలసినదిగా దేవతలను ఆజ్ఞాపించుము" అన్నాడు.

**మూ. కుశలా యే విదగ్ధాశ్చ ప్రగల్భాశ్చ జితశ్రమాః,**
**తేష్వయం నాట్యసంజ్ఞో హి వేదః సంక్రామ్యతాం త్వయా. 20**

**తా.** "నీవు ఈ నాట్యవేదాన్ని కుశలులు, విదగ్ధులు, ప్రగల్భులు, జితశ్రములు అయినవాళ్లకు బోధించాలి."

**వి.** గురువునుండి విషయం గ్రహించడానికీ, గ్రహించినదానిని మరవకుండడానికీ సమర్థులు **కుశలులు**. ఎక్కడ ఏది చేర్చాలి, ఏది తొలగించాలి అను ఊహ – అపోహలలో సమర్థులు **విదగ్ధులు**. సభాకంపం లేనివాళ్లు **ప్రగల్భులు**. యోగ్యులై తగు ఆకారాదు లుండి, తొందరగా అలసిపోని వాళ్లు జితశ్రములు – అలసటను జయించినవారు.

**మూ. తచ్ఛ్రుత్వా వచనం శక్రో బ్రహ్మణా యదుదాహృతమ్,**
**ప్రాఞ్జలిః ప్రణతో భూత్వా ప్రత్యువాచ పితామహమ్. 21**

**తా.** ఇంద్రుడు బ్రహ్మదేవుని మాటలు విని, అంజలి ఘటించి వినయపూర్వకంగా ఇలా అన్నాడు.

**మూ. "గ్రహణే ధారణే జ్ఞానే ప్రయోగే చాస్య సత్తమ,**
**అశక్తా భగవన్! దేవా అయోగ్యా నాట్యకర్మణి." 22**

**తా.** "మహానుభావా! పూజ్యుడా! దేవతలు ఈ నాట్యవేదాన్ని గ్రహించడానికి గాని, ధరించడానికి గాని, ప్రయోగించడానికి (అభినయించడానికి) గాని అసమర్థులు. వీళ్లు ఈ పని చేయడానికి అనర్హులు.

**మూ. య ఇమే వేదగుహ్యజ్ఞా ఋషయః సంశితవ్రతాః,**
**ఏతేఽస్య గ్రహణే శక్తాః ప్రయోగే ధారణే తథా." 23**

**తా.** వేదాలలోని రహస్యా లన్నీ తెలిసిన, ఉత్తమనియమాలను పాలించే ఈ ఋషులు ఈ నాట్యశాస్త్రాన్ని గ్రహించడానికీ, ధరించడానికీ గ్రహించినదానిని మనస్సులో ధారణ చేయడానికీ ప్రయోగించడానికీ సమర్థులు."

## *భరతముని నూర్గురు పుత్రుల పేర్లు*

**మూ. శ్రుత్వా తు శక్రవచనం మామాహామ్బుజసంభవః,**
**త్వం పుత్రశతసంయుక్తః ప్రయోక్తాస్య భవానఘ. 24**

**తా.** ఇంద్రుని మాటలు విని బ్రహ్మదేవుడు నాతో – "ఓ దోషరహితుడవైన భరతా! నువ్వు నీ నూరుగురు పుత్రులతో కలిసి ఈ నాట్యశాస్త్రాన్ని ప్రయోగించు" అన్నాడు.

**మూ. ఆజ్ఞాపితో విదిత్వాహం నాట్యవేదం పితామహాత్,**
**పుత్రానధ్యాపయామాస ప్రయోగం చాపి తత్త్వతః. 25**

**తా.** బ్రహ్మదేవు డీ విధంగా ఆజ్ఞాపించగా నేను ఆయననుండి నాట్యవేదం తెలిసికొని దానినీ దానిని ప్రయోగించే విధానాన్నీ నా పుత్రులకు, ఏవిధమైన దోషములూ లేనివిధంగా బోధించాను.

**మూ. శాణ్డిల్యం చైవ వాత్స్యం చ కోహలం దత్తిలం తథా,**
**జటిలామ్బష్టకౌ చైవ తణ్డుమగ్నిశిఖం తథా. 26**

**సైన్ధవం సపులోమానం శాడ్వలిం విపులం తథా,**
**కపిఞ్జలిం బాదరిం చ యమధూమ్రాయణౌ తథా. 27**

**జమ్బుధ్వజం కాకజఙ్ఘం స్వర్ణకం తాపసం తథా,**
**కైదారిం శాలికర్ణం చ దీర్ఘగాత్రం చ శాలికమ్. 28**

**కౌత్సం తాణ్డాయనిం చైవ పిఙ్గలం చిత్రకం తథా,**
**బన్ధులం మల్లకం చైవ ముష్టికం సైన్ధవాయనమ్. 29**

**తైతిలం భార్గవం చైవ శుచిం బహులమేవ చ,**
**అబుధం బుధసేనం చ పాణ్డుకర్ణం సుకేరలమ్. 30**

ఋజుకం మణ్డకం చైవ శమ్బరం వఞ్జులం తథా,
మాగధం సదలం చైవ కర్తారం చోగ్రమేవ చ. **31**

తుషారం పార్షదం చైవ గౌతమం బాదరాయణమ్,
విశాలం శబలం చైవ సునాభం మేషమేవ చ. **32**

కాలియం భ్రమరం చైవ తథా పీఠముఖం మునిమ్,
నఖకుట్టాశ్మ కుట్టౌ చ షట్పదం సోత్తమం తథా. **33**

పాదుకోపానహౌ చైవ శ్రుతిం చాషస్వరం తథా,
అగ్నికుణ్డాజ్యకుణ్డౌ చ వితణ్డం తాణ్డ్యమేవ చ. **34**

కర్తరాక్షం హిరణ్యాక్షం కుశలం దుస్సహం తథా,
లాజం భయానకం చైవ బీభత్సం సవిచక్షణమ్. **35**

పుణ్డ్రాక్షం పుణ్డ్రనాసం చాప్యసితం సితమేవ చ,
విద్యుజ్జిహ్వం మహాజిహ్వం శాలఙ్కాయనమేవ చ. **36**

శ్యామాయనం మాఠరం చ లోహితాఙ్గం తథైవ చ,
సంవర్తకం పంచశిఖం త్రిశిఖం శిఖమేవ చ. **37**

శఙ్ఖవర్ణముఖం షణ్డం శఙ్కుకర్ణమథాపి చ,
శక్రనేమిం గభస్తిం చాప్యంశుమాలిం శఠం తథా. **38**

విద్యుతం శాతజఙ్ఘం చ రౌద్రం వీరమథాపి చ,
పితామహాజ్ఞయాస్మాభిః లోకస్య చ గుణేప్సయా. **39**

ప్రయోజితం పుత్రశతం యథాభూమివిభాగశః,
యో యస్మిన్ కర్మణి యథా యోగ్యస్తస్మిన్ స యోజితః. **40**

**తా.** (భరతముని నాట్యవేదాన్ని ఉపదేశించిన ఆయన కుమారుల పేర్లు – )

(1) శాండిల్యుడు (2) వాత్స్యుడు (3) కోహలుడు (4) దత్తిలుడు (5) జటిలుడు (6) అంబష్టకుడు (7) తండు (8) అగ్నిశిఖుడు (9) సైంధవుడు (10) పులోముడు (11) శాద్వలి (12) విపులుడు (13) కపింజలి (14) బాదరి (15) యముడు (16) ధూమ్రాయణుడు (17) జంబుధ్వజుడు 918) కాకజంఘుడు (19) స్వర్ణకుడు (20) తాపసుడు (21) కైదారి (22) శాలికర్ణుడు (23) దీర్ఘగాత్రుడు (24) శాలికర్ణుడు (25) కౌత్సుడు (26) తాండాయని (27) పింగలుడు (28) చిత్రకుడు (29) బంధులుడు (30) భల్లకుడు (31) ముష్టికుడు (32) సైంధవాయనుడు (33) తైతిలుడు (34) భార్గవుడు (35) శుచి (36) బహులుడు (37) అబుధుడు (38) బుధసేనుడు (39) పాండుకర్ణుడు

(40) సుకేరలుడు (41) ఋజుకుడు (42) మండకుడు (43) శంబరుడు (44) వంజులుడు (45) మాగధుడు (46) సరలుడు (47) కర్త (48) ఉగ్రుడు (49) తుషారుడు (50) పార్షదుడు (51) గౌతముడు (52) బాదరాయణుడు (53) విశాలుడు(54) శబలుడు (55) సునాభుడు (56) మేషుడు (57) కాలియుడు (58) భ్రమరుడు (59) పీఠముఖ ముని (60) నఖకుట్టుడు (61) అశ్మకుట్టుడు (62) షట్పదుడు (63) ఉత్తముడు (64) పాదుకుడు (65) ఉపానహుడు (66) శ్రుతి (67) చాషస్వరుడు (68) అగ్నికుండుడు (69) ఆజ్యకుండుడు (70) వితండ్యుడు (71) తాండ్యుడు (72) కర్తరాక్షుడు (73) హిరణ్యాక్షుడు (74) కుశలుడు (75) దుస్సహుడు (76) లాజుడు (77) భయానకుడు (78) బీభత్సుడు (79) విచక్షణుడు (80) పుండ్రాక్షుడు (81) పుండ్రానసుడు (82) అసితుడు (83) సితుడు (84) విద్యుజ్జిహ్వుడు (85) మహాజిహ్వుడు (86) శాలం కాయనుడు (87) శ్యామాయనుడు (88) మాఠరుడు (89) లోహితాంగుడు (90) సంవర్తకుడు (91) పంచశిఖుడు (92) త్రిశిఖుడు (93) శిఖుడు (94) శంఖవర్ణ ముఖుడు (95) షండుడు (96) శంకుకర్ణుడు (97) శక్రనేమి (98) గభస్తి (99) అంశుమాలి (100) శఠుడు (101) విద్యుతుడు (102) శతజంఘుడు (103) రౌద్రుడు (104) వీరుడు – అను నూర్గురు పుత్రులను, బ్రహ్మదేవుని ఆజ్ఞను అనుసరించి నేను వాని వాని అర్హతలను బట్టి, అనగా ఎవడు ఏ భూమికను చక్కగా నిర్వహించగలడో వానికి ఆ భూమికను ఇచ్చి, నాట్యశాస్త్రప్రయోగంలో నియమించాను. ఎవడు ఏ కర్మయందు నిపుణుడో అతనిని ఆ కర్మయందు నియమించాను.

**వి.** ఇక్కడ భరతపుత్రుల సంఖ్య నూరు కాక నూటనాలుగు వచ్చినది. స్థూలంగా నూరుగురు అన్నాడు అని సమాధానం చెప్పుకోవాలి. లేదా 'మునిమ్', 'తాపసమ్', 'షణ్డమ్' 'శుచిమ్' అను పదాలను ప్రక్కనున్నవాటి విశేషణాలుగా గ్రహించి సంఖ్య సరిపెట్టుకోవాలి.

ఏమైనా వీరందరూ భరతముని పుత్రులు కాకపోవచ్చును. కాలాంతరానికి సంబంధించిన కోహలుడు, దత్తిలుడు, తండు వంటి కొందరు రచించిన, నాట్యశాస్త్రంలోని కొన్ని విషయాలకు సంబంధించిన కొన్ని గ్రంథాల పేర్లు, కొన్ని వాక్యాలు ప్రాచీన గ్రంథాలలో కనబడుతున్నాయి. అందుచేత అలాంటివాళ్ల పేర్లు కూడ ఎవరో ఇక్కడ భరతపుత్రుల పేర్లలో చేర్చి ఉంటారు అని కొందరి అలంకారశాస్త్రేతిహాసనిర్మాతల అభిప్రాయం.

**మూ. భారతీం సాత్త్వతీం చైవ వృత్తిమారభటీం తథా,**
**సమాశ్రితః ప్రయోగస్తు ప్రయుక్తో వై మయా ద్విజాః. 41**

**తా.** మునులారా! నేను నాట్యంలో భారతి, సాత్త్వతి, ఆరభటి అను వృత్తులను

ఆశ్రయించి ప్రయోగం చేశాను. (వీటి స్వరూపం మున్ముందు తెలియగలదు).

**మూ. పరిగృహ్య ప్రణమ్యాథ బ్రహ్మా విజ్ఞాపితో మయా,**
**అథాహ మాం సురగురుః కైశికీమపి యోజయ. 42**

**యచ్చ తస్యాః క్షమం ద్రవ్యం తద్బ్రూహి ద్విజసత్తమ.**

**తా.** నేను మూడు వృత్తులను నాట్యంలో గ్రహించి నేను చేసిన పని బ్రహ్మదేవునకు నివేదించాను. అప్పు డాయన "భరతా! కైశికీవృత్తిని కూడ చేర్చి దానికి తగిన సుందర మైన వస్తువు ఏది ఉంటుందో అది కూడ చెప్పు" అని ఆదేశించాడు.

**మూ. ఏవం తేనాస్మ్యభిహితః; ప్రత్యుక్తశ్చ మయా ప్రభుః. 43**

**"దీయతాం భగవన్! ద్రవ్యం కైశిక్యాః సంప్రయోజకమ్."**

**తా.** బ్రహ్మదేవుడు ఇట్లు ఆజ్ఞాపించగా నేను ఆయనతో "పూజ్యుడా! కైశికీవృత్తిని ప్రయోగించడానికి ఉపకరించే ద్రవ్యాన్ని (material) నీవే నాకు ఇవ్వాలి.

**మూ. నృత్తాఙ్గహారసంపన్నా రసభావక్రియాత్మికా. 44**

**దృష్టా మయా భగవతో నీలకణ్ఠస్య నృత్యతః,**
**కైశికీ శ్లక్ష్ణనైపథ్యా శృఙ్గారరససంభవా. 45**

**తా.** కైశికీవత్తి నృత్తంతోను, అంగహారాల తోను కూడి ఉంటుంది. రసభావనను కలిగించడమే దీని స్వరూపం. శృంగారరసాన్ని ఆవిష్కరించే టప్పుడు వేషధారణాదికం చాల సుకుమారంగా ఉంటుంది. అలాంటి కైశికీవృత్తి వినియోగాన్ని నేను భగవంతుడైన నీలకంఠుడు నృత్యం చేస్తూన్నప్పుడు చూచి ఉన్నాను" అని నేను విజ్ఞాపన చేశాను.

**మూ. అశక్యా పురుషైః సా తు ప్రయోక్తుం స్త్రీజనాదృతే,**
**తతోఽసృజన్మహాతేజా మనసాప్సరసో విభుః. 46**

**నాట్యాలంకారచతురాః ప్రాదాన్మహ్యం ప్రయోగతః,**

**తా.** స్త్రీలు తప్ప పురుషులు కైశికీవృత్తిని ప్రయోగింపజాలరు. అందుచేత మహాతేజః శాలి యైన బ్రహ్మదేవుడు మనస్సుచేత అప్సరఃస్త్రీలను సృజించి నాట్యాలంకారమునందు చాతుర్యం గల వాళ్లను, నాట్యప్రయోగం కోసమై నా కిచ్చాడు.

## *అప్సరసల పేర్లు*

**మూ. మఞ్జుకేశీం సుకేశీం చ మిశ్రకేశీం సులోచనామ్. 47**

**సౌదామినీం, దేవదత్తాం దేవసేనాం మనోరమామ్,**
**సుదతీం సున్దరీం చైవ విదగ్ధాం విపులాం తథా. 48**

**సుమాలాం సంతతిం చైవ సునన్దాం సుముఖీం తథా,**
**మాగధీమర్జునీం చైవ సరలాం కేరలాం ధృతిమ్.** **49**
**మన్దాం సపుష్కలాం చైవ కలమాం చైవ మే దదౌ,**

**తా.** మంజుకేశి, సుకేశి, మిశ్రకేశి, సులోచన, సౌదామిని, దేవదత్త, దేవసేన, మనోరమ, సుదతి, సుందరి, విదగ్ధయైన విపుల, సుమాల, సుమతి, సునంద, సుముఖి, మాగధి, అర్జుని, సరల, కేరల, ధృతి, నంద, పుష్కల, కలమ అను అప్సరసలను నాకు అప్పగించాడు.

**మూ. స్వాతిర్భాణ్డనియుక్తస్తు సహ శిష్యైః స్వయంభువా.** **50**
**నారదాద్యాశ్చ గన్ధర్వా గానయోగే నియోజితాః.**

**తా.** బ్రహ్మదేవుడు, స్వాతినీ, ఆతని శిష్యులను భాండానికి (మృదంగాది వాద్య సముదాయానికి) సంబంధించిన విషయా లన్నీ చూచుకొనడానికీ, నారదుడు మొదలైన గంధర్వులను గానానికి సంబంధించిన వీణావేణ్వాదుల విషయాలు పర్యవేక్షించడానికీ నియమించాడు.

**వి.** ఇక్కడ చెప్పినదానిని బట్టి సంగీతశాస్త్రప్రవీణు డైన నారదుడు దేవర్షి యైన నారదుడు కాదు; గంధర్వుడైన మరొక నారదు డని తెలుస్తూన్నది.

### *బ్రహ్మదేవుని ఆజ్ఞచేత ప్రథమనాట్యప్రయోగప్రారంభం*

**మూ. ఏవం నాట్యమిదం సమ్యగ్బుద్ధ్వా సర్వైః సుతైః సహ.** **51**
**స్వాతినారదసంయుక్తో వేదవేదాఙ్గకారణమ్,**
**ఉపస్థితోఽహం బ్రహ్మాణం ప్రయోగార్థం కృతాఞ్జలిః.** **52**

**తా.** నేను, నా పుత్రులూ కూడ ఈ విధంగా వేద – వేదాంగాలనుండి జనించిన నాట్యాన్ని గూర్చి బాగా తెలిసికొన్నాం. పిమ్మట నేను స్వాతితోను, నారదునితోను కలిసి బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్లి, అంజలి ఘటించి, దీని ప్రయోగాన్ని గూర్చి ఆయనను అభ్యర్థించాను.

**మూ. "నాట్యస్య గ్రహణం ప్రాప్తం బ్రూహి కిం కరవాణ్యహమ్"**
**ఏతత్తు వచనం శ్రుత్వా ప్రత్యువాచ పితామహః.** **53**

**తా.** "దేవా! ఇపుడు నాట్యాన్ని ప్రయోగించవలసి ఉన్నది. నే నేమి చేయవలెనో ఆదేశించుము" అని కోరాను. నా మాట విని బ్రహ్మదేవు డిట్లన్నాడు.

**మూ. "మహానయం ప్రయోగస్య సమయః ప్రత్యుపస్థితః,**
**అయం ధ్వజమహః శ్రీమాన్ మహేన్ద్రస్య ప్రవర్తతే. 54**
**అత్రేదానీమయం వేదో నాట్యసంజ్ఞః ప్రయుజ్యతామ్."**

**తా.** "నాట్యప్రయోగానికి (ప్రదర్శనానికి) తగిన మంచి అవకాశం ఇప్పుడు వచ్చినది – మహేంద్రధ్వజమహోత్సవం జరుగుతూన్నది. ఈ ఉత్సవంలో ఈ నాట్యవేదప్రదర్శన చెయ్యండి."

**మూ. తతస్తస్మిన్ ధ్వజమహే నిహతాసురదానవే. 55**
**ప్రహృష్టామరసంకీర్ణే మహేన్ద్రవిజయోత్సవే,**
**పూర్వం కృతా మయా నాన్దీ హ్యాశీర్వచనసంయుతా. 56**

**తా.** ధ్వజోత్సవం ప్రారంభ మైనది. అసురులు దానవులు నశించగా దేవత లందరూ ఆనందిస్తూన్న ఆ మహేంద్రవిజయోత్సవంలో నేను ముందుగా ఆశీర్వచనంతో కూడిన నాంది చేశాను.

**మూ. అష్టాఙ్గపదసంయుక్తా విచిత్రా వేదనిర్మితా,**
**తదన్తేఽనుకృతిర్బద్ధా యథా దైత్యాః సురైర్జితాః. 57**

**తా.** ప్రారంభంలో నేను చేసిన నాంది నాట్యవేదంలో చెప్పిన ప్రకారం అంగములైన ఎనిమిది పదములతో విచిత్రంగా ఉన్నది. ఆ నాంది చేసిన తరువాత సురులు దైత్యులను జయించినట్లు అనుకృతి (అభినయం) చేయబడింది.

**మూ. సంఫేటవిద్రవకృతా ఛేద్యభేద్యాహవాత్మికా,**
**తతో బ్రహ్మాదయో దేవాః ప్రయోగపరితోషితాః. 58**

**తా.** ఆ అనుకృతి (అభినయం) సంఫేటంతోనూ, విద్రవంతోను చేయబడినదై ఛేద్య భేద్యాహవాల స్వరూపంతో ఉన్నది. అప్పుడు ఆ ప్రయోగానికి సంతోషించిన బ్రహ్మాది దేవతలు –

**వి.** రోషంతో పలికిన వాక్యాలతో కూర్చినది **సంఫేటం.** శంకా – భయ – త్రాసాలతో కూర్చినది **విద్రవం.** శస్త్రయుద్ధం ఛేద్యం. మల్లయుద్ధం **భేద్యం.** ఆహవం = యుద్ధం.

*సంతసించిన బ్రహ్మాదిదేవతలు ఉపకరణాలను ఇచ్చుట*

**మూ. ప్రదదుర్మత్సుతేభ్యస్తు సర్వోపకరణాని వై,**
**ప్రీతస్తు భగవాన్ శక్రో దత్తవాన్ స్వం ధ్వజం శుభమ్. 59**

**తా.** (దేవతలు) నా పుత్రులకు అన్ని (నాట్య) సాధనాలను బహూకరించారు. సంతోషించిన ఇంద్రుడు ముందుగా తన (ఇంద్ర) ధ్వజం బహూకరించాడు.

**మూ. బ్రహ్మా కుటిలకం చైవ భృఙ్గారం వరుణః శుభమ్,**
**సూర్యశ్ఛత్రం శివః సిద్ధిం వాయుర్వ్యజనమేవ చ. 60**

**తా.** బ్రహ్మదేవుడు (విదూషకుడు చేతిలో ధరించే) వంకరగా ఉండే దండం ఇచ్చాడు. వరుణుడు మంగళప్రదమైన పాత్ర ఇచ్చాడు. సూర్యుడు ఛత్రం (ఇక్కడ దీనికి వితానం, అనగా దేరా పైకప్పువంటి ఆచ్ఛాదనపటం అని అర్థం). శివుడు సిద్ధిని (తలపెట్టిన కార్యం నిర్విఘ్నంగా సిద్ధించడాన్నీ), వాయువు వింజామరను బహూకరించారు.

**మూ. విష్ణుః సింహాసనం చైవ కుబేరో మకుటం తథా,**
**శ్రావ్యత్వం ప్రేక్షణీయస్య దదౌ దేవీ సరస్వతీ. 61**

**తా.** విష్ణువు సింహాసనము, కుబేరుడు కిరీటము, సరస్వతీదేవి దృశ్యమైన రూపకాలలోని గీతాదులు శ్రావ్యంగా ఉండడాన్ని ఇచ్చారు.

**మూ. శేషా యే దేవగన్ధర్వా యక్షరాక్షసపన్నగాః,**
**తస్మిన్ సదస్యభిప్రేతాన్నానాజాతిగుణాశ్రయాన్. 62**

**అంశాంశైర్భాషితం భావాన్ రసాన్ రూపం బలం తథా,**
**దత్తవన్తః ప్రహృష్టాస్తే మత్సుతేభ్యో దివౌకసః. 63**

**తా.** ఆ సదస్సులో ఉన్న మిగిలిన దేవతలు, గంధర్వులు. యక్షులు, రాక్షసులు, పన్నగులు వాళ్లకు ఇష్టమైన అనేకవిధాలైన జాతులకు, గుణాలకు సంబంధించిన ఆయా అంశలకు (భూమికలకు) అనుగుణమైన సంభాషణలను, భావాలను, రసాలను, రూపమును, బలమును ఇచ్చారు. ఈ విధంగా సంతసించిన ఆ దేవతలు (దేవాదులు) నా పుత్రులకు అనేక వస్త్రాదులను ఇచ్చారు.

### *విరూపాక్షుడు మొదలైన దైత్యులు నాట్యప్రయోగంలో విఘ్నం కలిగించుట*

**మూ. ఏవం ప్రయోగే ప్రారబ్ధే దైత్యదానవనాశనే,**
**అభవన్ క్షుభితాః సర్వే దైత్యా యే తత్ర సంగతాః. 64**

**తా.** దైత్యదానవుల నాశనాన్ని చూపే నాట్యప్రయోగం ఈ విధంగా ప్రారంభం కాగానే అక్కడ చేరిన దైత్యు లందరు క్షోభ చెందారు. ఆ ప్రదర్శనం తమ జాతివాళ్లను కించపరచేదిగా ఉన్న దని వాళ్లు ఆగ్రహించారు.

**మూ. విరూపాక్షపురోగాంశ్చ విఘ్నాన్ ప్రోత్సాహ్య తేఽబ్రువన్,**
**న క్షమిష్యామహే నాట్యం హేతదాగమ్యతామితి. 65**

**తా.** వాళ్లు విరూపాక్షుడు మొదలైన విఘ్నాలను ప్రోత్సహించి, – "మేం ఈ నాట్యం సహించజాలం. వెళ్లిపోదాం. వచ్చి వేయండి" (అంటూ బైటకు వెళ్లిపోయారు).

**మూ. తతస్తైరసురైః సార్ధం విఘ్నా మాయాముపాశ్రితాః,**
**వాచశ్చేష్టాం స్మృతిం చైవ స్తమ్భయన్తి స్మ నృత్యతామ్. 66**

**తా.** విఘ్నాలు (విఘ్నకారకులైన భూతాలు) అసురులతో కలిసి, మాయాబలంతో ఆ నాట్యప్రయోగంలో నృత్యం చేస్తున్నవాళ్ల వాక్కులను, చేష్టలను, స్మృతినీ స్తంభింప చేశారు.

**మూ. తథా విధ్వంసనం దృష్ట్వా సూత్రధారస్య దేవరాట్,**
**కస్మాత్ప్రయోగవైషమ్యమిత్యుక్త్వా ధ్యానమావిశత్. 67**

**తా.** సూత్రధారుణ్ణి ఆ విధంగా బాధించడం చూచిన దేవేంద్రుడు నాట్యప్రయోగంలో ఈ విధంగా వైషమ్యం ఎందుకు కలిగిందా అని ధ్యానించాడు. ఆలోచించాడు.

### *జర్జరం ఆవిర్భవించుట*

**మూ. అథాపశ్యత్సదో విఘ్నైః సమన్తాత్పరివారితమ్,**
**సహేతరైః సూత్రధారం నష్టసంజ్ఞం జడీకృతమ్. 68**

**తా.** ఈ విధంగా ధ్యానం ద్వారా ఇంద్రుడు, పరివారసమేతు డైన సూత్రధారుణ్ణి విఘ్నాలు చుట్టుముట్టి సంజ్ఞ లేకుండా, జడుడుగా చేసినట్లు తెలుసుకొన్నాడు.

**మూ. ఉత్థాయ త్వరితం శక్రః గృహీత్వా ధ్వజముత్తమమ్,**
**సర్వరత్నోజ్జ్వలం తం తు కిఞ్చిదుద్వృత్తలోచనః. 69**
**రఙ్గపీఠగతాన్విఘ్నానసురాంశ్చైవ దేవరాట్,**
**జర్జరీకృతదేహాంస్తానకరోజ్జర్జరేణ సః. 70**

**తా.** దేవేంద్రుడు వెంటనే లేచి, కోపంతో నేత్రాలు కొంచెం త్రిప్పుచు, సమస్త రత్నాలతో ప్రకాశిస్తూన్న ఉత్తమమైన ఆ (ఇంద్ర) ధ్వజాన్ని ఎత్తి (చేత ధరించి) ఆ జర్జరంతో రంగపీఠం మీద ఉన్న విఘ్నాల దేహాలను, అసురుల దేహాలను జర్జరమై పోయేటట్లు చేశాడు.

**వి.** జర్జరం (దుర్బలం) అయేటట్లు చేయడంచేత ఆ దండానికి **'జర్జరం'** అని పేరు.

**మూ. నిహతేషు చ సర్వేషు విఘ్నేషు సహ దానవైః,**
**సంప్రహృష్య తతో వాక్యమాహుః సర్వే దివౌకసః. 71**

**తా.** విఘ్నాలూ, దానవులూ నశించిపోవడంతో దేవత లందరూ సంతోషించి ఇంద్రునితో ఇలా అన్నారు –

**మూ. అహో ప్రహరణం దివ్యమిదమాసాదితం త్వయా,**
**జర్జరీకృతసర్వాఙ్గా యేనైతే దానవాః కృతాః. 72**

**తా.** ఆహా! నీ కెంత దివ్యమైన దండం లభించినది! ఇది సకలదానవుల అవయవాలన్నీ చితగకొట్టినది.

**మూ. యస్మాదనేన తే విఘ్నాః సాసురా జర్జరీకృతాః,**
**తస్మాజ్జర్జర ఏవేతి నామతోஉయం భవిష్యతి. 73**

**తా.** ఈ దండం విఘ్నాలను అసురులనూ కూడ జర్జరులను చేసింది. అందుచేత దీనికి 'జర్జరము' అను పేరు ప్రసిద్ధికి వస్తుంది.

**మూ. శేషా యే చైవ హింసార్థముపయాస్యన్తి హింసకాః,**
**దృష్ట్వైవ జర్జరం తేஉపి గమిష్యన్త్యేవమేవ తు. 74**

**తా.** ఇంకా మిగిలిన హింసకులు ఎవరైనా విఘ్నాలు కల్పించడానికి వచ్చినా, వాళ్లు కూడ ఈ జర్జరాన్ని చూడగానే జర్జరదేహులై పారిపోతారు.

**మూ. ఏవమేవాస్త్వితి తతః శక్రః ప్రోవాచ తాన్ సురాన్,**
**రక్షాభూతశ్చ సర్వేషాం భవిష్యత్యేష జర్జరః. 75**

**తా.** "మీరన్నట్లే జరుగుతుంది; ఈ జర్జరం నాట్యప్రయోక్త లందరికీ రక్షగా ఉంటుంది" అని దేవేంద్రుడు దేవతలకు మాట ఇచ్చాడు.

**మూ. ప్రయోగే ప్రస్తుతే హ్యేవం స్ఫీతే శక్రమహే పునః,**
**త్రాసం సంజనయన్తి స్మ విఘ్నాః శేషాస్తు నృత్యతామ్. 76**

**తా.** ఇంద్రోత్సవం మళ్లీ మహోత్సాహంతో ప్రారంభం కాగానే మిగిలిన విఘ్నాలు నర్తకులను భయపెట్టడం ప్రారంభించారు(యి).

**మూ. దృష్ట్వా తేషాం వ్యవసితం దైత్యానాం విప్రకారజమ్,**
**ఉపస్థితోஉహం బ్రహ్మాణం సుతైః సర్వైః సమన్వితః. 77**

**తా.** ఆ దైత్యులు పగ తీర్చుకొనడంకోసం చేస్తూన్న ఆ ప్రయత్నాన్ని చూచి, నేను నా పుత్రులతో కలిసి బ్రహ్మదేవుని దగ్గరకు వెళ్లాను.

**మూ. "నిశ్చితా భగవన్! విఘ్నా నాట్యస్యాస్య వినాశనే,**
**అస్య రక్షావిధిం సమ్యగాజ్ఞాపయ సురేశ్వర!" 78**

**తా.** "దేవాధిపతి వైన ఓ! పూజ్యుడా! విఘ్నాలు ఈ నాట్యప్రయోగం జరగకుండా చెయ్యాలన్న నిశ్చయంతో ఉన్నారు (యి); ఈ ప్రయోగాన్ని బాగా, రక్షించే విధానం ఏమో నువ్వు ఆజ్ఞాపించు."

### *విశ్వకర్మ నాట్యశాల నిర్మించుట*

**మూ. తతశ్చ విశ్వకర్మాణం బ్రహ్మోవాచ ప్రయత్నతః,**
**"కురు లక్షణసంపన్నం నాట్యవేశ్మ మహామతే." 79**

**తా.** అప్పుడు బ్రహ్మదేవుడు విశ్వకర్మను పిలిచి – "ఓ! మహామతీ! అన్ని మంచి లక్షణాలతో కూడిన ఒక నాట్యగృహం నీవు ప్రయత్నపూర్వకంగా నిర్మించాలి" అని ఆదేశించాడు.

**మూ. తతోఽచిరేణ కాలేన విశ్వకర్మా మహచ్ఛుభమ్,**
**సర్వలక్షణసంపన్నం కృత్వా నాట్యగృహం తు సః. 80**
**ప్రోక్తవాన్ ద్రుహిణం గత్వా సభాయాం తు కృతాఞ్జలిః,**
**సజ్జం నాట్యగృహం దేవ తదవేక్షితుమర్హసి. 81**

**తా.** బ్రహ్మదేవుని ఆదేశమును విని విశ్వకర్మ సర్వలక్షణసంపన్నమూ, శుభకరమూ అయిన ఒక నాట్యగృహం అచిరకాలంలో నిర్మించి సభలో ఉన్న బ్రహ్మదేవునివద్దకు వెళ్లి నమస్కరించి "ప్రభూ! నాట్యగృహం నిర్మించాను. నీవు వచ్చి దర్శించుము" అని విన్నవించాడు.

**మూ. తతః సహమహేన్ద్రేణ సురైః సర్వైశ్చ సేతరైః,**
**ఆగతస్త్వరితో ద్రష్టుం దృహిణో నాట్యమణ్డపమ్. 82**

**తా.** బ్రహ్మదేవుడు వెంటనే మహేంద్రునితోను, సకల దేవతలతోను విద్యాధర గంధర్వాదులతోను కలిసి ఆ నాట్యమండపం చూడడానికి వచ్చాడు.

### *బ్రహ్మదేవుడు నాట్యమండపరక్షణకై దేవతలను నియోగించుట*

**మూ. దృష్ట్వా నాట్యగృహం బ్రహ్మా ప్రాహ సర్వాన్సురాంస్తతః,**
**అంశభాగైర్భవద్భిస్తు రక్ష్యోఽయం నాట్యమణ్డపః. 83**

**తా.** బ్రహ్మదేవుడు నాట్యగృహం చూచిన తరువాత దేవతలను ఇలా ఆజ్ఞాపించాడు – "మీరందరూ ఎవరికి ఏ అంశం నిర్దేశిస్తున్నానో ఆ అంశల ప్రకారం ఈ నాట్య మండపాన్ని రక్షిస్తుండాలి."

**మూ. రక్షణే మణ్డపస్యాథ వినియుక్తస్తు చన్ద్రమాః,**
**లోకపాలాస్తథా దిక్షు విదిక్ష్వపి చ మారుతాః. 84**

**తా.** పూర్తి మండపాన్ని రక్షించడానికి (సౌమ్యస్వభావం గల) చంద్రుణ్ణీ, నాలుగు దిక్కుల రక్షణకు నలుగురు లోకపాలులను, విదిక్కులను రక్షించడానికి వాయువులను నియోగించాడు.

**మూ. నేపథ్యభూమౌ మిత్రస్తు నిక్షిప్తో వరుణోఽమ్బరే,**
**వేదికారక్షణే వహ్నిః భాణ్డే సర్వదివౌకసః. 85**

**తా.** వేషధారణగృహం రక్షణకు మిత్రుణ్ణీ (సూర్యునీ), ఆకాశ (ఊర్ధ్వభాగ) రక్షణకు వరుణుణ్ణీ, వేదికను (రంగస్థలాన్ని) రక్షించడానికి అగ్నినీ, వాద్యసముదాయరక్షణకు మేఘాలను (మేఘాధిష్ఠానదేవతలను) నియమించాడు.

**మూ. వర్ణాశ్చత్వార ఏవాథ స్తమ్భేషు వినియోజితాః,**
**ఆదిత్యాశ్చైవ రుద్రాశ్చ స్థితాః స్తంభాన్తరేష్వథ. 86**

**తా.** స్తంభాల రక్షణకు నలుగురు వర్ణాధిష్ఠానదేవతలను, నాలుగు స్తంభాల మధ్య భాగాలలో ఆదిత్యులను, రుద్రులను నియమించాడు.

**మూ. ధారణీష్వథ భూతాని శాలాస్వప్సరసస్తథా,**
**సర్వవేశ్మసు యక్షిణ్యో మహీపృష్ఠే మహోదధిః. 87**

**తా.** ధారణులయందు భూతాలను, శాలలయందు అప్సరసలను, సమస్తగృహాలలో యక్షిణులను, నేల వెనుక (అడుగున) మహాసముద్రాన్ని రక్షణకై నియమించాడు.

**మూ. ద్వారశాలానియుక్తౌ తు కృతాన్తః కాల ఏవ చ,**
**స్థాపితౌ ద్వారపత్రేషు నాగముఖ్యౌ మహాబలౌ. 88**

**తా.** ద్వార-శాలల రక్షణకై యముణ్ణీ, కాలదేవతను, తలుపుల రక్షణకై మహాబలశాలు లైన అనంతుడు గులికుడు అను ప్రధాననాగులను నియమించాడు.

**మూ. దేహల్యాం యమదణ్డస్తు శూలం తస్యోపరిస్థితమ్,**
**ద్వారపాలౌ స్థితౌ చోభౌ నియతిర్మృత్యురేవ చ. 89**

**తా.** గుమ్మంమీద యమదండమూ, దాని పైభాగంలో శూలమూ వాటి రక్షణకై ఉన్నాయి. నియతి (దైవం) మృత్యువు అను ఇద్దరు దేవతలు ద్వారపాలకులుగా ఉన్నారు.

**మూ. పార్శ్వే చ రఙ్గపీఠస్య మహేన్ద్రః స్థితవాన్ స్వయమ్,**
**స్థాపితా మత్తవారణ్యాం విద్యుద్దైత్యనిషూదనీ. 90**

**తా.** రంగపీఠం ప్రక్కన స్వయంగా మహేంద్రుడే రక్షకుడుగా ఉన్నాడు. మత్తవారణి రక్షణకై దైత్యవినాశక మైన వజ్రరూపమైన మెరుపు నిలపబడింది.

**మూ. స్తమ్భేషు మత్తవారణ్యాః స్థాపితాః పరిపాలనే,**
**భూతయక్షపిశాచాశ్చ గుహ్యకాశ్చ మహాబలాః. 91**

**తా.** మత్తవారణి స్తంభాలమీద వాటి రక్షణకై భూత – యక్ష – పిశాచాలను, మహాబలవంతు లైన గుహ్యకులను (యక్షులలో ఒక తెగ) నియమించాడు.

**మూ. జర్జరే తు వినిక్షిప్తం వజ్రం దైత్యనిబర్హణమ్,**
**తత్పర్వసు వినిక్షిప్తాః సురేన్ద్రా హ్యమితౌజసః. 92**

**తా.** గొప్ప తేజస్సు గల సురేంద్రులను దైత్యసంహారకమైన జర్జరంలోను, దాని పర్వల (కణుపుల) లోను రక్షణకై ఉంచాడు.

**మూ. శిరఃపర్వస్థితో బ్రహ్మా ద్వితీయే శఙ్కరస్తథా,**
**తృతీయే చ స్థితో విష్ణుశ్చతుర్థే స్కన్ద ఏవ చ. 93**

**తా.** జర్జరం చివరి పర్వమీద బ్రహ్మ, రెండవదానిమీద శంకరుడు, మూడవదాని మీద విష్ణువు, నాల్గవదాని మీద కుమారస్వామి ఉన్నారు.

**మూ. పఞ్చమే చ మహానాగాః శేషవాసుకితక్షకాః,**
**ఏవం విఘ్నవినాశాయ స్థాపితా జర్జరే సురాః. 94**

**తా.** శేష – వాసుకి – తక్షకు లను మహానాగులు ఐదవ పర్వంమీద ఉన్నారు. ఈ విధంగా విఘ్నవినాశంకొరకై ఆ యా దేవతలు జర్జరంమీద (జర్జరంలో) నిలుపబడ్డారు.

**మూ. రఙ్గపీఠస్య మధ్యే తు స్వయం బ్రహ్మా ప్రతిష్ఠితః,**
**ఇష్ట్యర్థం రఙ్గమధ్యే తు క్రియతే పుష్పమోక్షణమ్. 95**

**తా.** బ్రహ్మదేవుడే స్వయంగా రంగపీఠం మధ్య నిలిచి ఉంటాడు. రంగమధ్యలో (బ్రహ్మదేవుని) పూజించడానికై పుష్పాలు చల్లుతారు.

**మూ. పాతాలవాసినో యే చ యక్షగుహ్యకపన్నగాః,**
**అధస్తాద్రఙ్గపీఠస్య రక్షణే తే నియోజితాః. 96**

**తా.** రంగపీఠం క్రిందిభాగాన్ని రక్షించడానికై పాతాళవాసులైన యక్షులు, గుహ్యకులు, పన్నగులు నియమింపబడ్డారు.

**మూ. నాయకం రక్షతీన్ద్రస్తు నాయికాం చ సరస్వతీ,**
**విదూషకమథౌఙ్కారః శేషాస్తు ప్రకృతీర్హరః. 97**

**తా.** నాయకుణ్ణి ఇంద్రుడు, నాయికను సరస్వతి, విదూషకుణ్ణి ఓంకారము, మిగిలిన ప్రకృతులను (actors) అందరినీ హరుడు రక్షిస్తుంటారు.

**మూ. యాన్యేతాని నియుక్తాని దైవతానీహ రక్షణే,**
**ఏతాన్యేవాధిదైవాని భవిష్యన్తీత్యువాచ సః. 98**

**తా.** ఆ యా స్థానాదుల రక్షణకై ఏ దేవతలు నియమింపబడ్డారో వాళ్లే వాటికి అధిష్ఠానదేవత లవుతా రని బ్రహ్మదేవుడు చెప్పాడు.

**మూ. ఏతస్మిన్నన్తరే దేవైః సర్వైరుక్తః పితామహః,**
**సామ్నా తావదిమే విఘ్నాః స్థాప్యన్తాం వచసా త్వయా. 99**
**పూర్వం సామ ప్రయోక్తవ్యం ద్వితీయం దానమేవ చ,**
**తయోరుపరి భేదస్తు తతో దణ్డః ప్రయుజ్యతే. 100**

తా. ఇంతలో దేవతలందరూ బ్రహ్మదేవునితో ఇలా అన్నారు – "పూజ్యుడా! ముందుగా నువ్వు ఈ విఘ్నకర్తలతో మాట్లాడి వాళ్లను విఘ్నాలు కలిగించకుండా ఆపుచెయ్యి. ఎందువల్ల ననగా – ముందు సామోపాయం ప్రయోగించాలి. రెండవది దానోపాయం. ఈ రెండూ విఫలమైతే భేదోపాయం. అదీ విఫలమైతే దండం ప్రయోగించాలి."

### *బ్రహ్మదేవుడు దైత్యుల విషయంలో సామం ప్రయోగించుట*

**మూ. దేవానాం వచనం శ్రుత్వా బ్రహ్మా విఘ్నానువాచ హ,**
**కస్మాద్భవన్తో నాట్యస్య వినాశాయ సముత్థితాః. 101**

**తా.** దేవతల మాటలు విని బ్రహ్మదేవుడు – "మీరందరూ నాట్యాన్ని చెడగొట్టడానికి ఎందుకు పూనుకొన్నారు?" అని విఘ్నకారకు లైన ఆ దైత్యులను ప్రశ్నించాడు.

**మూ. బ్రహ్మణో వచనం శ్రుత్వా విరూపాక్షోఽబ్రవీద్వచః,**
**దైత్యైర్విఘ్నగణైః సార్ధం సామపూర్వమిదం తతః. 102**

**తా.** విఘ్నగణా లైన దైత్యులు ప్రక్కనే ఉన్న విరూపాక్షుడు బ్రహ్మదేవునితో సామపూర్వకంగా (సవినయంగా) ఇలా అన్నాడు.

**మూ. "యోఽయం భగవతా సృష్టో నాట్యవేదః సురేచ్ఛయా,**
**ప్రత్యాదేశోఽయమస్మాకం సురార్థం భవతా కృతః. 103**

**తా.** "సురులు కోరగా నువ్వు ఈ నాట్యశాస్త్రం సృజించావు. ఇది మాకు తిరస్కారం. అవమానకరం! నువ్వు దీనిని సురులకోసం నిర్మించావు.

**మూ. తన్నైతదేవం కర్తవ్యం త్వయా లోకపితామహ,**
**యథా దేవాస్తథా దైత్యాః త్వత్తః సర్వే వినిర్గతాః." 104**

**తా.** "సకలలోకపితామహు డైన నువ్వు ఇలా చేసి ఉండకూడదు. నీనుండి దేవతలు ఏ విధంగా ఆవిర్భవించారో దైత్యు లందరూ కూడ అలాగే ఆవిర్భవించారు."

**మూ. విఘ్నానాం వచనం శ్రుత్వా బ్రహ్మా వచనమబ్రవీత్,**
**అలం వో మన్యునా దైత్యాః విషాదం త్యజతానఘాః. 105**

**తా.** విఘ్నాల మాటలు విని బ్రహ్మదేవు డిలా అన్నాడు – "దైత్యులారా! మీకు ఏమాత్రమూ కోపం తగదు. ఓ! దోషరహితులారా! మీరు విషాదం చెందకండి."

**మూ. భవతాం దేవతానాం చ శుభాశుభవికల్పకః,**
**కర్మభావాన్వయాపేక్షీ నాట్యవేదో మయా కృతః. 106**

**తా.** నేను రచించిన ఈ నాట్యవేదం మీకూ దేవతలకూ కూడ శుభాశుభాలను వికల్పించేది. కర్మలమీద, మనోభావాలమీదా, వంశ – దేశాదులభేదాల మీదా ఆధార పడినది.

**వి.** దేవతలు గొప్పవాళ్ళనీ దానవాదులు చెడ్డవాళ్లనీ చిత్రించడం నాట్యంయొక్క ఉద్దేశ్యం కాదు. దానస్నానాదులు ధర్మం; హింస, చౌర్యం మొదలైనది అధర్మం. ధర్మం ఆచరించినవాడు, అతడు సురుడైనా అసురుడైనా సుఖం పొందుతాడు. అధర్మం చేసినవాడు కష్టాల పాలవుతాడు అని బోధించడమే నాట్యం ఉద్దేశించిన పని. "ప్రతీ ఒక్కడు తాను చేసిన కర్మను, తన భావాన్నీ, తాను పుట్టిన జాతిదేశాదులను పట్టి ప్రవర్తిస్తాడు, ఫలం అనుభవిస్తాడు" అని మాత్రమే నాట్యం బోధిస్తుంది.

### *నాట్యస్వరూపం ఏమో తెలుపుట*

**మూ. నైకాన్తతోఽత్ర భవతాం దేవానాం చానుభావనమ్,**
**త్రైలోక్యస్యాస్య సర్వస్య నాట్యం భావానుకీర్తనమ్. 107**

**తా.** ఈ నాట్యంలో కేవలం మీకు సంబంధించిన విషయాలు తెలపడం కాని, సురులకు సంబంధించిన విషయాలు తెలపడం కాని ఉద్దిష్టం కాదు. నాట్యం మూడు లోకాలలో నివసించే స్వరూపస్వభావాలను చిత్రీకరిస్తుంది. ప్రత్యక్షంగా జరుగుతున్నట్లు చూపి ప్రేక్షకుల హృదయాలలో ఆ అనుభవాలను రేకెత్తిస్తుంది.

**మూ. క్వచిద్ధర్మః క్వచిత్క్రీడా, క్వచిదర్థః, క్వచిచ్ఛమః,**
**క్వచిద్ధాస్యం, క్వచిద్యుద్ధం, క్వచిత్కామః, క్వచిద్వధః. 108**

**తా.** నాట్యంలోని కొన్ని ఘట్టాలలో ధర్మం ప్రదర్శింపబడుతుంది; ఒక చోట ఆటలు, ఒకచోట అర్థం (ధనదాన్యాదిసంపద), ఒక చోట హాస్యం, మరొక చోట యుద్ధం, వేరొక చోట కామం, ఒకచోట వధ చిత్రింపబడతాయి.

**మూ. ధర్మో ధర్మప్రవృత్తానాం కామః కామోపసేవినామ్,**
**నిగ్రహో దుర్వినీతానాం వినీతానాం దమక్రియా. 109**

**తా.** ధర్మప్రవృత్తిగలవాళ్ల ధర్మాచరణ, కామాలు అనుభవించేవాళ్ల కామోపభోగమూ, దుర్మార్గుల నిగ్రహమూ, వినీతుల (ఇంద్రియనిగ్రహవంతుల) శమపూర్వక మైన ప్రవర్తన – ఇవన్నీ నాట్యంలో ప్రయోగింపబడతాయి (ప్రదర్శింపబడతాయి).

**మూ. క్లీబానాం ధార్ష్ట్యజననముత్సాహః శూరమానినామ్,**
**అబుధానాం విబోధశ్చ వైదుష్యం విదుషామపి. 110**

**తా.** నపుంసకులలో ధార్ష్ట్యాన్ని (హాస్యాన్ని) పుట్టించడమూ, శూరులైన ఆత్మాభిమాన వంతుల ఉత్సాహము, తెలివితక్కువవాళ్లు తెలిసికొనేటట్లు చేయడము, విద్వాంసుల వైదుష్యమూ – ఇవన్నీ నాట్యంలో ప్రయోగింపబడతాయి.

**మూ. ఈశ్వరాణాం విలాసశ్చ స్థైర్యం దుఃఖార్దితస్య చ,**
**అర్థోపజీవినామర్థో ధృతిరుద్విగ్నచేతసామ్. 111**

**తా.** ప్రభువుల విలాసలు, దుఃఖపీడితుల మానసికస్థైర్యము, అర్థసంపాదనకోసం జీవించేవాళ్ల అర్థమూ, (అర్థసంపాదనావిధానము) దిగులు చెందిన మనస్సులు కలవాళ్ల ధృతి (ధైర్యము) ప్రయోగింపబడతాయి.

**మూ. నానాభావోపసంపన్నం నానావస్థాన్తరాత్మకమ్,**
**లోకవృత్తానుకరణం నాట్యమేతన్మయా కృతమ్. 112**

**తా.** నేను రచించిన ఈ నాట్యంలో లోకప్రవృత్తి, ఎన్నో విధా లైన మానవాదుల ప్రవర్తన అనుకరించబడుతుంది; ప్రదర్శింపబడుతుంది. దీనిలో అనేకవిధాలైన భావాలు, అనేకవిధాలైన అవస్థలు పుష్కలంగా ప్రదర్శింపబడతాయి.

**మూ. ఉత్తమాధమమధ్యానాం నరాణాం కర్మసంశ్రయమ్,**
**హితోపదేశజననం ధృతిక్రీడాసుఖాదికృత్. 113**

**తా.** సమాజంలో కొందరు ఉత్తము లుంటారు. కొందరు మధ్యము లుంటారు; కొందరు అధములు ఉంటారు. అలాంటివాళ్లు చేసే పనులను, వాళ్ల ప్రవర్తనాదులను ఆశ్రయించుకొని ఉంటుంది నాట్యం. హితం ఉపదేశిస్తుంది. ధైర్యం కలగజేస్తుంది. కొందరికి క్రీడగా, వినోదం కలిగించే ఆటగా, ఉంటుంది. సుఖం మొదలైన వాటిని కలిగిస్తుంది.

**మూ. (ఏతద్రసేషు భావేషు సర్వకర్మక్రియాస్వథ,**
**సర్వోపదేశజననం నాట్యం లోకే భవిష్యతి).**

**తా.** (లోకంలో ఈ నాట్యం రసాల విషయంలోను, భావాల విషయంలోను, అన్ని విధాలైన కర్మల (పనుల) ఆచరణ విషయంలోను అందరికీ ఉపదేశం చేస్తుంది).

**మూ. దుఃఖార్తానాం శ్రమార్తానాం శోకార్తానాం తపస్వినామ్,**
**విశ్రాన్తిజననం కాలే నాట్యమేతద్భవిష్యతి. 114**

**తా.** వ్యాధ్యాదులవల్ల కలిగిన దుఃఖంతో బాధపడుతున్నవారికీ, దూరగమనం మొదలైన శ్రమతో బాధపడుతున్నవారికీ, ఇష్టజనమరణాదులవల్ల కలిగిన శోకంతో బాధపడుతున్నవారికీ, ఉపవాస - కృచ్ఛ్రచాంద్రాయణాదివ్రతాలతో అలసిపోయిన మునులకు తగు సమయాలలో నాట్యం విశ్రాంతిని కలిగిస్తుంది.

**మూ. ధర్మ్యం యశస్యమాయుష్యం హితం బుద్ధివివర్ధనమ్,**
**లోకోపదేశజననం నాట్యమేతద్భవిష్యతి. 115**

**తా.** నాట్యం ధార్మిక ప్రవృత్తిని కలిగిస్తుంది. యశస్సును ఇస్తుంది. ఆయుర్దాయం పెంచుతుంది. హితోపదేశం చేస్తుంది. బుద్ధిని పెంచుతుంది. లోకం పోకడను తెలుపుతుంది.

**మూ. న తద్ జ్ఞానం న తచ్ఛిల్పం న సా విద్యా న సా కలా,**
**నాసౌ యోగో న తత్కర్మ నాట్యేఽస్మిన్ యన్న దృశ్యతే. 116**

**తా.** నాట్యంలో ప్రదర్శింపబడని జ్ఞానం లేదు; శిల్పం లేదు; విద్య లేదు; కళ లేదు; యోగం లేదు. కర్మ లేదు.

**వి.** జ్ఞానం = ఆత్మజ్ఞానాదికం. శిల్పం = మాలా - చిత్ర - పుత్తలికా (బొమ్మ)ది రచన. విద్య = దండనీతి మొ; కళ = సంగీత - వాద్యాదికం. యోగం = వీటిలో కొన్నింటిని మేళవించడం. కర్మ = యుద్ధ - మల్లయుద్ధాదికం.

**మూ. తన్నాత్ర మన్యుః కర్తవ్యో భవద్భిరమరాన్ ప్రతి,**
**సప్తద్వీపానుకరణం నాట్యమేతద్భవిష్యతి. 117**
**(యేనానుకరణం నాట్యమేతత్తద్యన్మయా కృతమ్).**

**తా.** అందుచేత మీకు దేవతలమీద కోపం కలగకూడదు. ఏడు ద్వీపాలలోని విషయాల అనుకరణం ఈ నాట్యంలో ఉంటుంది. (ఎందువల్ల ననగా నేను రచించిన ఈ నాట్యం అనుకరణప్రధాన మైనది).

**మూ. దేవానామసురాణాం చ రాజ్ఞామథ కుటుమ్బినామ్,**
**బ్రహ్మర్షీణాం చ విజ్ఞేయం నాట్యవృత్తాన్తదర్శకమ్. 118**

**తా.** దేవతలు, అసురులు, రాజులు, కుటుంబాలు, బ్రహ్మర్షులు – వీళ్ల అందరి వృత్తాంతాలను చరిత్రలను ఈ నాట్యం ప్రదర్శిస్తుంది.

**మూ. యోఽయం స్వభావో లోకస్య సుఖదుఃఖసమన్వితః,**
**సోఽఙ్గాద్యభినోయోపేతః నాట్యమిత్యభిధీయతే. 119**

**తా.** నాట్యం అంటే ఏమనగా – సుఖదుఃఖాదులతో నిండిన లోకుల స్వభావాన్నే (జీవనవిధానాదులనే) అంగాభినయాదులతో ప్రదర్శిస్తే అది **'నాట్యం'** అంటారు.

**మూ. (వేదవిద్యేతిహాసానామాఖ్యానపరికల్పనమ్,**
**వినోదకరణం లోకే నాట్యమేతద్భవిష్యతి.**
**శ్రుతిస్మృతిసదాచారపరిశేషార్థకల్పనమ్,**
**వినోదజననం లోకే నాట్యమేతద్భవిష్యతి.)**

**తా.** (ఈ నాట్యంలో వేదములు, ఇతరవిద్యలు, ఇతిహాసములు – వీటినుండి ఆఖ్యానాల కల్పన చేయబడుతుంది. ఈ విధంగా ఇది వినోదసాధనంగా లోకంలో ఉంటుంది.

శ్రుతులలోను, స్మృతులలోను ఉన్న విషయాలను, సదాచారంతో సంబంధించిన విషయాలను, ఇంకా మిగిలిన ఇతరవిషయాలను కూర్చడంచేత నాట్యం వినోదకరం అవుతుంది).

### *రంగదేవతాపూజ చెయ్యా లని బ్రహ్మదేవుడు చెప్పుట*

**మూ. ఏతస్మిన్నన్తరే దేవాన్ సర్వానాహ పితామహః,**
**క్రియతామద్య విధివద్యజనం నాట్యమణ్డపే. 120**

**తా.** ఈ మధ్యలో పితామహుడు దేవతలతో – "ఇప్పుడు నాట్యమండపంలో యథాశాస్త్రంగా పూజలు నిర్వహించాలి" అన్నాడు.

**మూ. బలిప్రదానైర్హోమైశ్చ మన్త్రౌషధిసమన్వితైః,**
**భోజ్యైర్భక్ష్యైశ్చ పానైశ్చ బలిః సముపకల్ప్యతామ్. 121**

**తా.** మంత్రాలతోను ఓషధులతోను కూడిన బలిప్రదానములచేత, హోమాలచేత, భోజ్యములచేత, భక్ష్యములచేత, పానీయములచేత పూజలు ఏర్పరచాలి.

**వి.** బలి = అనేకవిధా లైన రంగులు పూసిన తండులాదులు. హోమం = తిలాదులు అగ్నిలో ఉంచడం. భోజ్యం = నమిలి తినే గట్టి పదార్థం. భక్ష్యం = పాయసం, పొంగలి మొ. పానం = పాలు, చెరకురసం, ద్రాక్షారసం మొ. **"బల్యన్తే ఆప్యాయ్యన్తే దేవతాః**

**అనేన ఇతి బలిః"** అని వ్యుత్పత్తి. "దేనిచేత దేవతలకు సంతృప్తి కలిగింపబడుతుందో అది బలి" అని బలిశబ్దానికి సాధారణమైన (general) అర్థం.

**మూ. మర్త్యలోకగతాః సర్వే శుభాం పూజామవాప్స్యథ.**
**(మర్త్యలోకేష్వయం వేదః శుభాం పూజామవాప్స్యతి)**
**అపూజయిత్వా రఙ్గం తు నైవ ప్రేక్షాం ప్రవర్తయేత్. 122**

**తా.** మీరందరూ మర్త్యలోకానికి వెళ్లి శుభమైన పూజను పొందగలరు. ("ఈ నాట్య వేదం మర్త్యలోకాలలో అనగా భూలోకనివాసులలో, శుభమైన పూజను (ఆదరమును) పొందగలదు") రంగపూజచేయకుండా నాట్యప్రదర్శనం చేయకూడదు.

**మూ. అపూజయిత్వా రఙ్గం తు యః ప్రేక్షాం కల్పయిష్యతి,**
**నిష్ఫలం తస్య తద్ జ్ఞానం తిర్యగ్యోనిం చ యాస్యతి. 123**

**తా.** రంగపూజ చేయకుండా నాట్యప్రదర్శనం చేయించేవాని నాట్యజ్ఞానం అంతా నిష్ఫలం అయిపోతుంది; వాడు పశుపక్ష్యాదిజన్మ ఎత్తుతాడు.

**మూ. యజ్ఞేన సంమితం హ్యేతద్రఙ్గదైవతపూజనమ్,**
**తస్మాత్సర్వప్రయత్నేన కర్తవ్యం నాట్యయోక్తృభిః. 124**

**తా.** రంగదేవతాపూజ యజ్ఞంతో సమాన మైనది. అందుచేత నాట్యప్రయోగం చేసే వాళ్లు అన్ని విధాలా ప్రయత్నించి ఈ రంగపూజ జరిపించాలి.

**మూ. నర్తకోఽర్థపతిర్వాపి యః పూజాం న కరిష్యతి,**
**న కారయత్యప్యన్యైర్వా ప్రాప్నోత్యపచయం తు సః. 125**

**తా.** నర్తకుడు గాని, అర్థపతిగాని, అనగా డబ్బు పెట్టుబడి పెట్టి నాట్యం జరిపించే ధనికుడు గాని, తాను స్వయంగా ఈ పూజలు చేయకపోయినా, ఇతరులచేత చేయించక పోయినా అతడు నష్టపోతాడు.

**మూ. యథావిధి యథాదృష్టం యస్తు పూజాం కరిష్యతి,**
**స లప్స్యతే శుభానర్థాన్ స్వర్గలోకం స యాస్యతి. 126**

**తా.** యథాశాస్త్రంగా ఇతరులు చేస్తూన్నప్పుడు తాను చూచిన విధంగా పూజలు జరిపించేవాడు శుభమైన ప్రయోజనాలను (లాభాలను) పొందుతాడు. స్వర్గలోకానికి వెడతాడు కూడ.

**మూ. ఏవముక్త్వా తు భగవాన్ ద్రుహిణః సహ దైవతైః,**
**రఙ్గపూజాం కురుష్వేతి మామేవం సమచోదయత్. 127**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే శాస్త్రోత్పత్తిర్నామ ప్రథమోఽధ్యాయః.**

**తా.** ముందుగా దేవతలతో ఇలా చెప్పి దేవతాసహితుడైన బ్రహ్మదేవుడు "రంగపూజ చెయ్యి" అని నన్ను ఆదేశించాడు.

**వి.** దేనిచేత ప్రేక్షకుల మనస్సులు రంజింపచేయబడతాయో అది రంగం. అనగా నాట్యం. నాట్యప్రయోగానికి ఆధారమైన మండపం కూడ రంగం అని చెప్పబడుతుంది.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను భరతనాట్యశాస్త్రాంధ్ర వ్యాఖ్యానంలో నాట్యోత్పత్తి అను ప్రథమాధ్యాయం సమాప్తం.**

**"త్రిణేత్రపాదాబ్జసదాస్తవో (సమాశ్రయో)ల్లస**
**త్ప్రసారభాక్స్ఫుటమిహ నాట్యశాసనే,**
**ప్రవర్తితేయం హృదయే మహాధియాం**
**ప్రకాశతామభినవగుప్తభారతీ."**

***– శ్రీమదభినవగుప్తాచార్యాః.***

**శ్రీః శ్రీః శ్రీః**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ ద్వితీయోఽధ్యాయః

# మణ్డపవిధానము

## *మూడు రకాల నాట్యప్రదర్శనగృహాలు*

**సంసారనాట్యజననధాతృబీజలతాజుషీమ్**
**జలమూర్తిం శివాం పత్యుః సరసాం పర్యముపాస్మహే.**

–శ్రీమదభినగుప్తాచార్యాః

**మూ. భరతస్య వచః శ్రుత్వా పప్రచ్ఛుర్మునయస్తతః,**
**"భగవన్ శ్రోతుమిచ్ఛామో యజనం రఙ్గసంశ్రయమ్." 1**

**తా.** భరతముని చెప్పిన దంతా విని మునులు – "పూజ్యుడా! రంగానికి సంబంధించిన పూజను గూర్చి ఇంకా తెలుసుకోవా లని కోరుచున్నాము.

**మూ. అథవా యాః క్రియాస్తత్ర, లక్షణం యచ్చ పూజనమ్,**
**భవిష్యద్భిర్నరైః కార్యం కథం తన్నాట్యవేశ్మని. 2**

**తా.** ఆ పూజలో చేయవలసిన పను లేవో, ఆ పూజకు లక్షణం (స్వరూపం) ఏదో రాబోయే తరాలవాళ్లు రంగగృహంలో ఆ పూజ ఎలా చెయ్యాలో తెలుసుకోవా లని కోరుచున్నాం.

**మూ. ఇహాదిర్నాట్యయోగస్య నాట్యమణ్డప ఏవ హి,**
**"తస్మాత్తస్యైవ తావత్త్వం లక్షణం వక్తుమర్హసి." 3**

**తా.** "నాట్యయోగానికి నాట్యమండపమే మొదటిది (ప్రధానమైనది) కదా! అందుచేత దానికి (నాట్యమండపానికి) సంబంధించిన లక్షణాన్ని నీవు మాకు చెప్పా లని కోరుతున్నాం."

**మూ. తేషాం తు వచనం శ్రుత్వా మునీనాం భరతోఽబ్రవీత్,**
**లక్షణం పూజనం చైవ శ్రూయతాం నాట్యవేశ్మనః. 4**

తా. భరతుడు మునుల మాటలు విని – "నాట్యగృహం లక్షణాలను పూజా విధానాన్ని చెపుతున్నాను; వినండి" అన్నాడు.

**మూ. దివ్యానాం మానసీ సృష్టిః గృహేషూపవనేషు చ,**
**(యథాభావాభినిర్వర్త్యాః సర్వే భావాస్తు మానుషాః)**
**నరాణాం యత్నతః కార్యా లక్షణాభిహితాః క్రియాః. 5**

**తా.** దేవతాపురుషులు గృహాలను, ఉద్యానవనాలను మనస్సుచేతనే సృష్టిస్తారు. మానవులు పూర్వంనుంచీ ఉన్నవాటిని చూచి వాటి ప్రకారం గృహ – ఉపవనాదులను నిర్మించుకోవాలి. అందుచేత మానవులు శాస్త్రంలో ఏ విధంగా చెప్పబడి ఉంటుందో ఆ విధంగానే చెయ్యాలి.

**మూ. శ్రూయతాం తద్యథా యత్ర కర్తవ్యో నాట్యమణ్డపః,**
**తస్య వాస్తు చ పూజా చ యథా యోజ్యా ప్రయత్నతః. 6**

**తా.** అందుచేత నాట్యమండపం ఎక్కడ ఎలా నిర్మించాలో, దాని (వాస్తు), నిర్మాణ విధి, పూజాదికము ప్రయత్నపూర్వకంగా ఎలా చేయాలో వినండి.

**మూ. ఇహ ప్రేక్షాగృహం దృష్ట్వా ధీమతా విశ్వకర్మణా,**
**త్రివిధః సంనివేశశ్చ శాస్త్రతః పరికల్పితః. 7**

**తా.** బుద్ధిమంతు డైన విశ్వకర్మ ప్రేక్షకాగృహం (నాట్యగృహం) ఎలా ఉండాలో ఆలోచించి, శాస్త్రానుసారంగా మూడు విధా లైన సంనివేశం (ఆకారం) నిర్ణయించాడు.

**మూ. వికృష్టశ్చతురస్రశ్చ త్ర్యస్రశ్చైవ తు మణ్డపః,**
**తేషాం త్రీణి ప్రమాణాని జ్యేష్ఠం మధ్యం తథాఽవరమ్. 8**

**తా.** విశ్వకర్మ చేసిన కల్పన (plan) ప్రకారం, వికృష్టం (పొడవైనది), చతురస్రము, త్ర్యస్రము (త్రిభుజాకారము) అని నాట్యమండపం మూడు విధాలు. ఈ మూడూ కూడ జ్యేష్ఠము (పెద్దది), మధ్యము, అవరము (చిన్నది) అని మూడు ప్రమాణాలలో (కొలతలలో) ఉంటాయి.

**మూ. ప్రమాణమేషాం నిర్దిష్టం హస్తదణ్డసమాశ్రయమ్,**
**శతం చాష్టౌ చతుఃషష్టిః హస్తా ద్వాత్రింశదేవ చ. 9**

**తా.** నాట్యగృహాల ప్రమాణం హస్తాలు, దండాలు అను కొలతలను పట్టి నిర్ణయింప బడింది. నూట ఎనిమిది (108) హస్తాల ప్రమాణం అరవైనాలుగు (64) హస్తాల ప్రమాణం, ముప్పైరెండు (32) హస్తాల ప్రమాణం అని మూడు ప్రమాణాలు.

**మూ. అష్టాధికం శతం జ్యేష్ఠం, చతుఃషష్టిస్తు మధ్యమమ్,**
**కనీయస్తు తథా వేశ్మ హస్తా ద్వాత్రింశదిష్యతే. 10**

**తా.** నూటఎనిమిది హస్తాల ప్రమాణం గల గృహం జ్యేష్ఠం. అరవైనాలుగు హస్తాల ప్రమాణం గలది మధ్యమం. ముప్పైరెండు హస్తాల ప్రమాణం గలది అవరం (చిన్నది).

**మూ. దేవానాం తు భవేజ్జ్యేష్ఠం, నృపాణాం మధ్యమం భవేత్,**
**శేషాణాం ప్రకృతీనాం తు కనీయం సంవిధీయతే. 11**

**తా.** జ్యేష్ఠప్రేక్షాగృహం దేవతలకు, మధ్యమప్రేక్షాగృహం రాజులకు, చిన్నది సామాన్యజనులకు చెప్పబడింది.

**మూ. (ప్రేక్షాగృహాణాం సర్వేషాం ప్రశస్తం మధ్యమం స్మృతమ్,**
**తత్ర పాఠ్యం చ గేయం చ సుఖశ్రావ్యతరం భవేత్).**

**తా.** (ప్రేక్షాగృహా లన్నింటిలోకీ మధ్యమప్రేక్షాగృహం ప్రశస్త మైనది. ఎందుచేత ననగా దానిలో పాఠ్యమూ (సంభాషణాధికం) గేయమూ కూడ స్పష్టంగా శ్రావ్యమై ఉంటుంది (వినబడుతుంది).

**మూ. (ప్రేక్షాగృహాణాం సర్వేషాం త్రిప్రకారో విధిః స్మృతః,**
**వికృష్టశ్చతురస్రశ్చ త్ర్యస్రశ్చైవ ప్రయోక్తృభిః).**

**తా.** (నాట్యప్రయోగం చేసేవాళ్లు సమస్తప్రేక్షా గృహాలను వికృష్టము, చతురస్రము, త్ర్యస్రము అని మూడు విధాలుగా ఉంటా యని విభజించి చెప్పారు).

**మూ. (కనీయస్తు స్మృతం త్ర్యస్రం చతురస్రం తు మధ్యమమ్,**
**జ్యేష్ఠం వికృష్టం విజ్ఞేయం నాట్యవేదప్రయోక్తృభిః).**

**తా.** (నాట్యవేద ప్రయోగం చేసేవాళ్ళు త్ర్యస్రగృహం అవరం అనీ, చతురస్రగృహం మధ్యమం అనీ వికృష్టగృహం జ్యేష్ఠం అనీ తెలుసుకోవాలి).

**వి.** పైన 10వ శ్లోకంలో చెప్పినదానిని బట్టి వికృష్ట – చతురస్ర – త్ర్యస్ర గృహాలలోనే ఒక్కొక్కదానికి ప్రమాణాలను బట్టి జ్యేష్ఠ – మధ్యమ – కనీయ (అవర) అను మూడేసి భేదాలుండవచ్చు నని తెలుస్తూన్నది. పై మూడు శ్లోకాలలో అందుకు విరుద్ధంగా చెప్పబడుతూన్నది. అందుచేత ఇవి ప్రక్షిప్తములై ఉంటాయను అభిప్రాయంతో వీటిని బ్రాకెట్స్‌లో ముద్రించారు.

## *ప్రమాణనిర్ణయము*

**మూ. ప్రమాణం యచ్చ నిర్దిష్టం లక్షణం విశ్వకర్మణా,**
**ప్రేక్షాగృహాణాం సర్వేషాం తచ్చైవ హి నిబోధత. 12**

**తా.** అన్ని విధాలైన ప్రేక్షాగృహాలకు విశ్వకర్మ చెప్పిన ప్రమాణాలను, లక్షణాలను తెలిసికొనండి.

**మూ. అణూ రజశ్చ బాలశ్చ లిక్షా యూకా యవస్తథా,**
**అఙ్గులం చ తథా హస్తో దణ్డశ్చైవ ప్రకీర్తితః. 13**

**తా.** అణువు, రజస్సు, బాలము, లిక్ష, యూక, యవము, అంగులము, హస్తము, దండము అను ప్రమాణాలు చెప్పబడ్డాయి.

**వి.** పరమాణువు అన్నింటికంటె చిన్నది. అది కంటికి కనబడదు. రెండు పరమాణువులు కలిస్తే ద్వ్యణుకం. మూడు ద్వ్యణుకాలు కలిస్తే త్ర్యణుకం. అనగా ఆరు పరమాణువులు దగ్గరగా చేరడంవల్ల ఏర్పడినది త్ర్యణుకం; అది కంటికి కనబడుతుంది. ఇది వైశేషికులు అంగీకరించిన త్ర్యణుకమే కాని పరమాణువు కాదు అని అభినవగుప్త వ్యాఖ్య.

**మూ. అణవోఽష్టౌ రజః ప్రోక్తం, తాన్యష్టౌ బాల ఉచ్యతే,**
**బాలస్త్వష్టౌ భవేల్లిక్షా, యూకా లిక్షాష్టకం భవేత్. 14**

**తా.** ఎనిమిది అణువులు చేర్చగా ఏర్పడిన పొడవు ఒక రజస్సు. ఎనిమిది రజస్సులు ఒక **బాలము.** ఎనిమిది బాలాలు ఒక **లిక్ష.** ఎనిమిది లిక్షలు ఒక **యూక.**

**మూ. యూకాస్త్వష్టౌ యవో జ్ఞేయో యవాస్త్వష్టౌ తథాఙ్గులమ్,**
**అఙ్గులాని తథా హస్తశ్చతుర్వింశతిరుచ్యతే. 15**
**చతుర్హస్తో భవేద్దణ్డో నిర్దిష్టస్తు ప్రమాణతః,**
**అనేనైవ ప్రమాణేన వక్ష్యామ్యేషాం వినిర్ణయమ్. 16**

**తా.** ఎనిమిది యూకలు ఒక **యవ**. ఎనిమిది యవలు ఒక **అంగుళం**. ఇరవైనాలుగు అంగుళాలు ఒక **హస్తం**. నాలుగు హస్తాలు ఒక **దండం**. ఈ ప్రమాణాల ప్రకారమే వేరు వేరు నాట్యగృహాల ప్రమాణాలు ఏ విధంగా ఉండాలో చెపుతాను.

**మూ. చతుష్షష్టికరాన్ కుర్యాద్దీర్ఘత్వేన తు మణ్డపమ్,**
**ద్వాత్రింశతం చ విస్తారాన్మర్త్యానాం యో భవేదిహ. 17**

**తా.** మానవులకోసం నిర్మించే మండపం అరవైనాలుగు హస్తాల పొడవు, ముప్పైరెండు హస్తాల వెడల్పు ఉండే టట్లు నిర్మించాలి.

**మూ. అత ఊర్ధ్వం న కర్తవ్యః కర్తృభిర్నాట్యమండపః,**
**యస్మాదవ్యక్తభావం హి తత్ర నాట్యం వ్రజేదితి. 18**

**తా.** నాట్యమండపం ఈ ప్రమాణాలను మించి ఉండకూడదు. ఈ ప్రమాణాలను మించి ఉంటే నాట్యప్రదర్శనం స్పష్టంగా ఉండదు.

**మూ. మణ్డపే విప్రకృష్టే తు పాఠ్యముచ్చారితస్వరమ్,**
**అనిస్సారణధర్మత్వాద్విస్వరత్వం భృశం వ్రజేత్. 19**

**తా.** విప్రకృష్ట జ్యేష్ఠ మండపంలో పాఠ్యాన్ని ఉచ్చరించినపుడు ఉండే స్వరం, మండపం బైటకు వెళ్లక వికృత స్వరంగా మారుతుంది. ప్రతిధ్వన్యాదులు వస్తాయి.

**మూ. యశ్చాప్యాస్యగతో భావో నానాదృష్టిసమన్వితః,**
**స వేశ్మనః ప్రకృష్టత్వాద్ వ్రజేదవ్యక్తతాం పరామ్. 20**

**తా.** నాట్యమండపం ఎక్కువ పొడవుగా ఉంటే, అనేకవిధాలైన చూపులతో ముఖం ద్వారా ప్రకటించే భావం స్పష్టంగా సామాజికులకు తెలియదు.

**మూ. ప్రేక్షాగృహాణాం సర్వేషాం తస్మాన్మధ్యమమిష్యతే,**
**యావత్పాఠ్యం చ గేయం చ తత్ర శ్రవ్యతరం భవేత్. 21**

**తా.** అందుచేత అన్ని రకాల ప్రేక్షాగృహాలలోకీ మధ్యమప్రేక్షాగృహం మంచిది. దానిలో పాఠ్యమూ గేయమూ కూడ స్పష్టంగా వినబడతాయి.

**మూ. (ప్రేక్షాగృహాణాం సర్వేషాం త్రిప్రకారో విధిః స్మృతః,**
**వికృష్టశ్చతురస్రశ్చ త్ర్యస్రశ్చైవ ప్రయోక్తృభిః.)**

**(తా.** వికృష్టము, చతురస్రము, త్ర్యస్రము అని ప్రేక్షాగృహాల నిర్మాణం మూడు విధాల ఉంటుం దని నాట్యప్రయోగం చేసేవాళ్లు చెపుతారు).

**మూ. (కనీయస్తు స్మృతం త్ర్యస్రం, చతురస్రం చ మధ్యమమ్,**
**జ్యేష్ఠం వికృష్టం విజ్ఞేయం నాట్యవేశ్మప్రయోక్తృభిః.)**

**తా.** (త్ర్యస్రమండపం కనీయం (అవరం) అనీ, చతురస్రమండపం మధ్యమమనీ, వికృష్టమండపం జ్యేష్ఠమనీ నాట్యప్రయోక్తలు తెలుసుకోవాలి).

**మూ. దేవానాం మానసీ సృష్టిర్గృహేషూపవనేషు చ,**
**యత్నభావాభినిష్పన్నాః సర్వే భావా హి మానుషాః. 22**

**తా.** దేవతలు చేసే గృహ – ఉపవనాదుల సృష్టి మానస మైనది. (వాళ్లు ఎంత విశాల మైన గృహోపవనాదు లైనా అనాయాసంగా మనస్సులో ఎలా తలచుకుంటే అలా నిర్మించగలరు). మానవులు నిర్మించే అన్ని వస్తువులు (భావాః) ప్రయత్నపూర్వకంగా ఇతర వస్తుసామగ్రి సమకూర్చుకొని ఏర్పరచుకొనవలసినవి.

**మూ. తస్మాద్దేవకృతైర్భావైర్న విస్పర్ధేత మానుషః,**
**మానుషస్య తు గేహస్య సంప్రవక్ష్యామి లక్షణమ్. 23**

**తా.** అందుచేత మానవుడు, దేవతలు నిర్మించిన వస్తువులతో పోటీ పడకూడదు. మానవులు నిర్మించగల నాట్యగృహం లక్షణాన్ని చెపుతాను, వినండి.

### *భూమివిభాగము*

**మూ. భూమేర్విభాగం పూర్వం తు పరీక్షేత ప్రయోజకః,**
**తతో వాస్తుప్రమాణేన ప్రారభేత శుభేచ్ఛయా. 24**

**తా.** నాట్యప్రయోగం ఏర్పాటుచేయువాడు, తనకు శుభం కలగా లని కోరుతూ

ముందుగా భూస్వరూపం పరీక్షించాలి. తరవాత శాస్త్రానుసారంగా, ప్రమాణానుసారంగా వాస్తువును (నాట్యగృహనిర్మాణాన్ని) ప్రారంభించాలి.

**మూ. సమా స్థిరా తు కఠినా కృష్ణా గౌరీ చ యా భవేత్,**
**భూమిస్తత్రైవ కర్తవ్యః కర్తృభిర్నాట్యమణ్డపః. 25**

**తా.** నాట్యమండపనిర్మాతలు, సమంగాను, స్థిరంగాను గట్టిగాను, నల్లగా గాని తెల్లగా గాని ఉన్న నేలమీదనే నాట్యమండపం నిర్మించాలి.

**మూ. ప్రథమం శోధనం కృత్వా లాఙ్గలేన సముత్కృషేత్,**
**అస్థికీలకపాలాని తృణగుల్మాంశ్చ శోధయేత్. 26**

**తా.** ఎన్నుకొన్న ఆ స్థలం ముందుగా పరిశుద్ధం చేసి నాగలితో దున్నాలి. ఆ స్థలంలో ఎముకలు, ఇనుప మేకులు, పుఱ్ఱెలు మొదలైనవి ఏవైనా ఉంటే వాటి నన్నింటినీ జాగర్తగా తొలగించి గడ్డి, పొదలు మొదలైనవాటినికూడ తీసివేసి పరిశుద్ధం చెయ్యాలి.

### *సూత్రం పట్టి నేలను కొలవడానికి తగిన నక్షత్రాలు*

**మూ. శోధయిత్వా వసుమతీం ప్రమాణం నిర్దిశేత్తతః,**
**(త్రీణ్యుత్తరాణి సౌమ్యం చ విశాఖాపి చ రేవతీ,**
**హస్తతిష్యానురాధాశ్చ ప్రశస్తా నాట్యకర్మణి)**
**పుష్యనక్షత్రయోగేన శుక్లం సూత్రం ప్రసారయేత్. 27**

**తా.** 'ఉత్తర' శబ్దంతో కూడిన ఉత్తరాషాఢా – ఉత్తరఫల్గుణీ – ఉత్తరాభాద్రనక్షత్రాలు మూడూ, మృగశిర, విశాఖ, రేవతి, హస్త, పుష్యమి, అనూరాధ – ఈ నక్షత్రాలు నాట్యానికి సంబంధించిన పనులకు ప్రశస్త మైనవి. పుష్యనక్షత్రంలో ఉన్న తిథియందు తెల్లని సూత్రం భూమి కొలవడానికి పట్టాలి (ముగ్గు పొయ్యాలి).

**మూ. కార్పాసం బాల్బజం వాపి మౌఞ్జం వాల్కలమేవ చ,**
**సూత్రం బుధైస్తు కర్తవ్యం యస్య చ్ఛేదో న విద్యతే. 28**

**తా.** బుద్ధిమంతులు, నూలుతో గాని, బల్బం అను తృణంతో గాని, ముంజగడ్డితో గాని, చెట్టు నారతో (జనుముమొదలైనది) గాని తయారైన సూత్రాన్ని, నేలను కొలవడానికి ఉపయోగించాలి. దానిలో ఎక్కడా అతుకులు ఉండకూడదు. అతుకు లుంటే మధ్యలో అది తెగిపోయే ప్రమాదం ఉంటుంది.

**మూ. అర్ధచ్ఛిన్నే భవేత్సూత్రే స్వామినో మరణం ధ్రువమ్,**
**త్రిభాగాచ్ఛిన్నయా రజ్జ్వా రాష్ట్రకోపో విధీయతే. 29**

**తా.** సూత్రం మధ్యభాగంలో తెగిపోతే స్వామి (నాట్యమండపాధిపతి లేదా రాజు) తప్పక మరణిస్తాడు. మూడవ భాగంలో తెగితే రాష్ట్రప్రకోపం (ప్రజోపద్రవం) జరుగుతుం దని చెప్పబడుతూన్నది.

**మూ. ఛిన్నాయాం తు చతుర్భాగే ప్రయోక్తుర్నాశ ఉచ్యతే,**
**హస్తాత్ ప్రభ్రష్టయా వాపి కశ్చిత్త్వపచయో భవేత్. 30**

**తా.** సూత్రం నాల్గవ భాగం దగ్గర తెగిపోతే నాట్యప్రయోక్త నశిస్తాడు. సూత్రం లాగుతూన్నప్పుడు చేతిలోనుంచి జారిపోతే ఏదో ఒక అపచయం (హాని) కలుగుతుంది.

**మూ. తస్మాన్నిత్యం ప్రయత్నేన రజ్జుగ్రహణమిష్యతే,**
**కార్యం చైవ ప్రయత్నేన మానం నాట్యగృహస్య తు. 31**

**తా.** అందుచేత రజ్జువు (భూమిని కొలిచే సూత్రాన్ని) చాల జాగ్రత్తగా పట్టుకోవాలి. నాట్యగృహం కొలతలు కూడ చాల ప్రయత్నపూర్వకంగా చెయ్యాలి.

**మూ. ముహూర్తేనానుకూలేన తిథ్యా సుకరణేన చ,**
**బ్రాహ్మణాంస్తర్పయిత్వా తు పుణ్యాహం వాచయేత్తతః. 32**

**తా.** అనుకూలమైన తిథీ, కరణమూ, ముహూర్తమూ చూచుకొని, బ్రాహ్మణులను తృప్తిపరచి తరవాత పుణ్యాహవాచనం చేయించాలి.

**మూ. శాన్తితోయం తతో దత్త్వా తతః సూత్రం ప్రసారయేత్,**
**చతుఃషష్టికరాన్ కృత్వా ద్విధా కుర్యాత్పునశ్చ తత్. 33**
**పృష్ఠతో యో భవేద్భాగో ద్విధాభూతస్య తస్య తు,**
**సమమర్ధవిభాగేన రఙ్గశీర్షం ప్రకల్పయేత్. 34**

**తా.** తరువాత శాంత్యుదకం చల్లి సూత్రం లాగాలి. అరవైనాలుగు హస్తాలు కొలిచి దానిని సరిగా రెండు భాగాలుగా (32 + 32 హస్తాలుగా) విభజించాలి. ఆ విధంగా రెండు భాగాలుగా విభజించగా ఏర్పడిన వెనుకటి భాగాన్ని మళ్లీ సగానికి (16 హస్తా లుండే టట్లు) విభజించి రంగశీర్షం ఏర్పరచాలి.

**మూ. పశ్చిమే చ విభాగేஉథ నేపథ్యగృహమాదిశేత్,**
**విభజ్య భాగాన్ విధివద్యథావదనుపూర్వశః. 35**

**తా.** రంగశీర్షానికి వెనుక ఉన్న అర్ధభాగంలో, అనగా 16 హస్తాల నాల్గవ భాగంలో నేపథ్యగృహానికి, నటులు వేషధారణచేసే గృహానికి, ఏర్పాటు చెయ్యాలి. ఈ విధంగా, యథాశాస్త్రంగా, ఒకదాని వెనుక ఒకటి భాగాలను విభజించి –

## *మండపానికి ఏర్పాట్లు*

**మూ. శుభే నక్షత్రయోగే చ మణ్డపస్య నివేశనమ్,**
**శఙ్ఖదున్దుభినిర్ఘోషైః మృదఙ్గపణవాదిభిః. 36**
**సర్వాతోద్యైః ప్రణుదితైః స్థాపనం కార్యమేవ తు.**

**తా.** శుభ మైన నక్షత్ర – యోగములయందు, శంఖాలు దుందుభులు మ్రోగు చుండగా, మృదంగములు, పణవములు మొదలైన సమస్త ఆతోద్యములు (చేతులతో చరిచి వాయించవలసిన వాద్యములు) వాయించబడుచుండగా, మండపానికి శంకుస్థాపన (ఆధారశిలాదిస్థాపన) చెయ్యాలి.

**మూ. ఉత్సార్యాణి త్వనిష్టాని పాషణ్డాఃశ్రమణాస్తథా. 37**
**కాషాయవసనాశ్చైవ వికలాశ్చైవ యే నరాః,**

**తా.** అమంగలకర మైన వస్తువులను ఆ ప్రదేశంనుండి తొలగించాలి. పాషండులు, శ్రమణులు, కాషాయవస్త్రాలు ధరించినవాళ్లు, అంగవైకల్యం ఉన్నవాళ్లు ఆ ప్రాంతానికి రాకుండా చూచుకోవాలి.

**మూ. నిశాయాం చ బలిః కార్యో నానాభోజనసంయుతః. 38**
**గన్ధపుష్పఫలోపేతో దిశో దశ సమాశ్రితః,**

**తా.** రాత్రి అనేకవిధాలైన తినే పదార్థాలు, గంధాలు, పుష్పాలు, ఫలాలు కలిపి పది దిక్కులందూ కూడ బలి (పూజ) ఇవ్వాలి (చెయ్యాలి).

**మూ. పూర్వేణ శుక్లాన్నయుతో నీలాన్నో దక్షిణేన తు. 39**
**పశ్చిమేన బలిః పీతో రక్తశ్చైవోత్తరేణ తు,**

**తా.** తూర్పుదిక్కున తెల్లని అన్నాలతో కూడిన బలి, దక్షిణదిక్కున నీలవర్ణమైన అన్నాలతో కూడిన బలి, పశ్చిమాన పసుపుపచ్చని అన్నాలతో కూడిన బలి, ఉత్తరాన ఎఱ్ఱని అన్నాలతో కూడిన బలి ఇవ్వాలి.

**మూ. యాదృశం దిశి యస్యాం తు దైవతం పరికల్పితమ్. 40**
**తాదృశస్తత్ర దాతవ్యో బలిర్మన్త్రపురస్కృతః,**

**తా.** ఏ దిక్కునందు ఏ దేవత కల్పింపబడుతుందో ఆ దిక్కునందు ఆ దేవతకు తగిన బలి మంత్రోచ్చారణపూర్వకంగా ఇవ్వాలి.

**మూ. స్థాపనే బ్రాహ్మణేభ్యశ్చ దాతవ్యం ఘృతపాయసమ్. 41**
**మధుపర్కస్తథా రాజ్ఞే కర్తృభ్యశ్చ గుడౌదనమ్,**

**తా.** ఆధారశిలను స్థాపించే సమయంలో బ్రాహ్మణులకు నెయ్యి కలిపిన పాయసమూ, రాజుకు మధుపర్కము, కార్యకర్తలకు బెల్లం అన్నమూ ఇవ్వాలి.

**వి.** పెరుగు, తేనె, నెయ్యి కలిపి చేసిన ఖాద్యపదార్థం **మధుపర్కం.** ఇది ఇవ్వడం ఆదరసూచకం.

**మూ. నక్షత్రేణ తు కర్తవ్యం మూలేన స్థాపనం బుధైః. 42**
**ముహూర్తేనానుకూలేన తిథ్యా సుకరణేన చ,**
**ఏవం తు స్థాపనం కృత్వా భిత్తికర్మ ప్రయోజయేత్. 43**

**తా.** పండితులు మంచి తిథి, కరణము ముహూర్తమూ చూచుకొని, మూలనక్షత్రం కూడ ఉన్న సమయంలో శిలాస్థాపనం చెయ్యాలి. తరవాత గోడల కట్టుబడి చేయించాలి.

## *స్తంభాలు నిలపడము*

**మూ. భిత్తికర్మణి నిర్వృత్తే స్తమ్భానాం స్థాపనం తతః,**
**తిథినక్షత్రయోగేన శుభేన కరణేన చ. 44**

**తా.** గోడల పని పూర్తి అయిన తరువాత శుభ మైన తిథి – నక్షత్ర – యోగ – కరణాలు చూచుకొని శుభముహూర్తాన స్తంభాలు నిలబెట్టాలి.

**మూ. స్తమ్భానాం స్థాపనం కార్యం రోహిణ్యా శ్రవేణన వా,**
**ఆచార్యేణ సుయుక్తేన త్రిరాత్రోపోషితేన చ. 45**
**స్తమ్భానాం స్థాపనం కార్యం ప్రాప్తే సూర్యోదయే శుభే,**

**తా.** విధివిధానాలు పూర్తిగా బాగా తెలిసిన ఆచార్యుడు (పురోహితుడు) మూడు రోజులు ఉపవాసాలు చేసి, రోహిణీనక్షత్రంలో గాని, శ్రవణనక్షత్రంలో గాని స్తంభస్థాపన చెయ్యాలి. స్తంభస్థాపనం శుభ మైన సూర్యోదయసమయంలో జరపాలి.

**మూ. ప్రథమే బ్రాహ్మణస్తమ్భే సర్పిః సర్షపసంస్కృతః. 46**
**సర్వశుక్లో విధిః కార్యో దద్యాత్పాయసమేవ చ,**

**తా.** మొదటిది బ్రాహ్మణస్తంభం. దానికి సంబంధించిన పూజాదివిధి నేతిచేత ఆవాలచేత సంస్కరించిన తెల్లని వస్తువులతో (పుష్ప – ఫల – మాల్యాదులతో) జరపాలి. తెల్లని వస్తువులు మాత్రమే ఉపయోగించాలి. ద్విజులకు పాయసం ఇవ్వాలి.

**మూ. తతశ్చ క్షత్రియస్తమ్భే వస్త్రమాల్యానులేపనమ్. 47**
**సర్వం రక్తం ప్రదాతవ్యం ద్విజేభ్యశ్చ గుడౌదనమ్,**

**తా.** తరువాత (రెండవదైన) క్షత్రియస్తంభానికి సమర్పించే వస్త్ర – మాల్య – అనులేపనాదులన్నీ ఎఱ్ఱనివై ఉండాలి. ద్విజులకు బెల్లం అన్నం ఇవ్వాలి.

**మూ. వైశ్యస్తమ్భే విధిః కార్యో దిగ్భాగే పశ్చిమోత్తరే. 48**
**సర్వం పీతం ప్రదాతవ్యం ద్విజేభ్యశ్చ ఘృతౌదనమ్,**

**తా.** మూడవది వైశ్యస్తంభం. దానికి పసుపుపచ్చని వస్తువులతో, పశ్చిమోత్తర (వాయవ్య) దిక్కునందు పూజాదివిధి జరపాలి. ద్విజులకు నేతి అన్నం ఇవ్వాలి.

**మూ. శూద్రస్తమ్భే విధిః కార్యః సమ్యక్ పూర్వోత్తరాశ్రయే. 49**
**నీలప్రాయం ప్రయత్నేన కృసరం చ ద్విజాశనమ్,**

**తా.** నాల్గవది శూద్రస్తంభం. దానికి సంబంధించిన పూజాదికం నీలిరంగు వస్తువులతో పూర్వోత్తర (ఈశాన్య) దిక్కునందు చేసి ద్విజులకు పులగం ఇవ్వాలి.

**మూ. పూర్వోక్తబ్రాహ్మణస్తమ్భే శుక్లమాల్యానులేపనే. 50**
**నిక్షిపేత్ కనకం మూలే కర్ణాభరణసంశ్రయమ్,**

తా. తెల్లని మాల్యము, అనులేపము సమర్పించిన, పైన చెప్పిన బ్రాహ్మణస్తంభం మొదట్లో చెవుల అలంకారానికి చెందిన సువర్ణం ఉంచాలి.

**మూ. తామ్రం చాధః ప్రదాతవ్యం స్తమ్భే క్షత్రియసంజ్ఞకే. 51**
**వైశ్యస్తమ్భస్య మూలే తు రజతం సంప్రదాపయేత్**

**తా.** క్షత్రియస్తంభం క్రింద రాగీ, వైశ్యస్తంభం క్రింద వెండీ ఉంచాలి.

**మూ. శూద్రస్తమ్భస్య మూలే తు దద్యాదాయసమేవ చ. 52**
**సర్వేష్వేవ తు నిక్షేప్యం స్తమ్భమూలేషు కాఞ్చనమ్,**

**తా.** శూద్రస్తంభం మొదట్లో ఇనుము వేయించాలి. అన్ని స్తంభాల అడుగునా కూడ బంగారం వేయించాలి.

**మూ. స్వస్తిపుణ్యాహఘోషేణ జయశబ్దేన చైవ హి. 53**
**స్తమ్భానాం స్థాపనం కార్యం పుష్పమాలాపురస్కృతమ్,**

**తా.** మంగళవాచనాల, పుణ్యాహవాచనాల ఘోషల మధ్య 'జయ' 'జయ' శబ్దాలు పలుకుతూ ప్రారంభంనుండీ కూడ పుష్పాలను, పుష్పమాలలను వినియోగిస్తూ స్తంభాల స్థాపనం చెయ్యాలి.

**మూ. రత్నదానైః సగోదానైర్వస్త్రదానైరనల్పకైః. 54**
**బ్రాహ్మణాంస్తర్పయిత్వా తు స్తమ్భానుత్థాపయే త్తతః.**

**తా.** పుష్కలంగా రత్నదానాలు, గోదానాలు, వస్త్రదానాలు చేసి బ్రాహ్మణులను సంతోషపెట్టి పిదప స్తంభాలు నిలబెట్టించాలి.

**మూ. అచలం చాప్యకమ్ప్యం చ తథైవావలితం పునః. 55**

**స్తమ్భస్యోత్థాపనే సమగ్దోషా హ్యేతే ప్రకీర్తితాః.**

**తా.** స్తంభం నిలబెట్టేటప్పుడు అది తన చోటునుండి మరొక చోటికి జరిగి పోకుండాను, కదలకుండాను (ఊగిపోకుండాను) తిరిగిపోకుండాను ఉండే టట్లు చూచుకోవాలి. ఎందువల్ల ననగా స్తంభాలు ఎత్తే టప్పుడు ఇవి దోషాలుగా చెప్పబడ్డాయి.

**మూ. అవృష్టిరుక్తా చలనే, వలనే మృత్యుతో భయమ్. 56**

**కమ్పనే పరచక్రాత్తు భయం భవతి దారుణమ్,**

**దోషైరేతైర్విహీనం తు స్తమ్భముత్థాపయేచ్ఛివమ్. 57**

**తా.** స్తంభం జరిగితే అనావృష్టి కలుగుతుంది. తిరిగిపోతే మృత్యుభయం. ఊగిపోతే శత్రురాజ్యంనుండి దారుణమైన భయం కలుగుతుంది. ఈ దోషా లేవీ లేకుండా మంగళ కరమైన రీతిలో స్తంభం నిలబెట్టాలి.

**వి.** అనావృష్టి, శతృభయమూ రాజ్యానికీ, మృత్యుభయం రాజుకూ లేదా గృహం నిర్మించే స్వామికీ కలుగుతాయి అని భావం.

**మూ. పవిత్రే బ్రాహ్మణస్తమ్భే దాతవ్యా దక్షిణా చ గౌః,**

**శేషాణాం భోజనం కార్యం స్థాపనే కర్తృసంశ్రయమ్. 58**

**మన్త్రపూతం చ తద్దేయం నాట్యాచార్యేణ ధీమతా,**

**తా.** పవిత్రమైన బ్రాహ్మణస్తంభం నిలబెట్టినప్పుడు (బ్రాహ్మణునకు) దక్షిణ, గోవూ కూడ ఇవ్వాలి. ఇతరు లందరికీ, నాట్యగృహనిర్మాణం చేయించే స్వామి (యజమాని) భోజనాలు పెట్టాలి. భోజనాలలో వినియోగించే పదార్థా లన్నింటినీ ధీమంతుడైన నాట్యాచార్యుడు మంత్రపఠనంచేత ముందుగా పవిత్రం చెయ్యాలి.

**మూ. పురోహితం నృపం చైవ భోజయేన్మధుపాయసైః. 59**

**కర్తౄనపి తథా సర్వాన్ కృసరాం లవణోత్తరామ్,**

**తా.** పురోహితునికీ రాజుకీ తేనెతోను, పాయసంతోను భోజనం పెట్టాలి. మిగిలిన కార్యకర్త లందరికీ కూడ ఉప్పు వేసిన పులగంతో (ఉపమా లేదా కిచడీవంటి పదార్థం) భోజనం పెట్టాలి.

**మూ. సర్వమేవం విధిం కృత్వా సర్వాతోద్యైః ప్రవాదితైః. 60**

**అభిమన్త్ర్య యథాన్యాయం స్తమ్భానుత్థాపయేచ్ఛుచిః,**

**తా.** ఈ విధంగా చేయవలసిన పను లన్నీ సమస్త మైన ఆతోద్యముల వాద్యాల

మంగళధ్వనులతో పూర్తిచేసి, యథాశాస్త్రంగా స్తంభాలను, అభిమంత్రించి తాను కూడ పవిత్రంగా ఉంటూ స్తంభాలను నిలబెట్టాలి.

**మూ. యథాచలో గిరిర్మేరుః హిమవాంశ్చ మహాబలః. 61**
**జయావహో నరేన్ద్రస్య తథా త్వమచలో భవ,**

**తా.** "కదలకుండా నిలచిన మేరుపర్వతం వలె, మహాబలం గల అచలంగా ఉన్న హిమవత్పర్వతం వలె, స్తంభమా! నీవు రాజునకు జయం కలిగిస్తూ కదలకుండా నిలబడు" అని నిలబెట్టిన స్తంభాలను ప్రార్థించాలి. ఈ మంత్రానికి ముందు 'ఓమ్' చేర్చి, చివర 'నమః' చేర్చి పఠించా లని శాస్త్రజ్ఞులు చెపుతున్నారు.

**మూ. స్తమ్భద్వారం చ భిత్తిం చ నేపథ్యగృహమేవ చ. 62**
**ఏవముత్థాపయేత్తద్‌జ్ఞో విధిదృష్టేన కర్మణా,**

**తా.** స్తంభాలను, ద్వారాలను, గోడలను, నేపథ్యగృహాన్ని కూడ, వీటికి సంబంధించిన విధివిధానాలన్నీ తెలిసినవాడు యథాశాస్త్రంగా నిర్మింపచెయ్యాలి.

## *మత్తవారణి నిర్మాణము*

**మూ. రఙ్గపీఠస్య పార్శ్వే తు కర్తవ్యా మత్తవారణీ. 63**
**చతుఃస్తమ్భసమాయుక్తా రఙ్గపీఠప్రమాణతః,**
**అధ్యర్ధహస్తోత్సేధేన కర్తవ్యా మత్తవారణీ. 64**
**ఉత్సేధేన తయోస్తుల్యం కర్తవ్యం రఙ్గమణ్డపమ్,**

**తా.** నిర్మించబోయే రంగపీఠానికి రెండు ప్రక్కలా రెండు మత్తవారణులు నిర్మించాలి. రంగపీఠం ప్రమాణంకంటె అధికంగా ఒకటిన్నర హస్తాల ఎత్తుతో నాలుగు స్తంభాలతో ఉన్న ఈ మత్తవారణులను నిర్మించాలి. మత్తవారణుల ఎత్తుతో సమంగా రంగమండపం ఏర్పరచాలి.

**వి.** పై శ్లోకాలలో 'పార్శ్వే' అనీ, 'మత్తవారణీ' అని ఏకవచనంలో ప్రయోగించడం చేత "రంగపీఠానికి ఏదో ఒక పార్శ్వంలో ఒక మత్తవారణిని నిర్మించాలి" అను అర్థం లభిస్తుంది. కాని 'ఉత్సేధేన తయోస్తుల్యం' (ఆ రెండింటి ఎత్తుతో సమంగా) అని ద్వివచనం ప్రయోగించడంచేత "ఒక్కొక్క పార్శ్వమునందు ఒక్కొక్క మత్తవారణి అని గ్రహించి రెండు ప్రక్కలా రెండు మత్తవారణులు నిర్మించాలి" అని అభినవగుప్తాచార్యులు వ్యాఖ్యానించారు.

**మూ. తస్యాం మాల్యం చ ధూపం చ గన్ధం వస్త్రం తథైవ చ. 65**
**నానావర్ణాని దేయాని తథా భూతప్రియో బలిః,**

**తా.** ఆ మత్తవారణులమీద పుష్పమాలలు, ధూపము గంధము, వస్త్రము అనేక విధాలైన రంగులూ ఉంచాలి. లేదా అనేకవిధాలైన రంగులు గల మాల్యవస్త్రాదు లుంచాలి అని అర్థం. ఆ యా భూతాలకి ప్రియ మైన బలి కూడ ఇవ్వాలి.

**మూ. ఆయసం తత్ర దాతవ్యం స్తమ్భానాం కుశలైరథః. 66**
**భోజనే కృసరాశ్చైవ దాతవ్యం బ్రాహ్మణాశనమ్,**

**తా.** నాట్యగృహనిర్మాణచతురులు స్తంభాల క్రింద ఇనుపవస్తువు ఉంచాలి. భోజనంలో కృసరం (ఖిచిడీవంటిది) పెట్టాలి. బ్రాహ్మణులకు భోజనం పెట్టాలి.

**మూ. ఏవం విధపురస్కారైః కర్తవ్యా మత్తవారణీ. 67**
**రఙ్గపీఠం తతః కార్యం విధిదృష్టేన కర్మణా,**

**తా.** ఈ విధంగా శాస్త్రోక్తవిధానాలను అనుసరిస్తూ మత్తవారణి నిర్మించాలి. పిమ్మట శాస్త్రోక్త మైన పద్ధతిలో రంగపీఠం నిర్మించాలి.

**మూ. రఙ్గశీర్షం తు కర్తవ్యం షడ్దారుకసమన్వితమ్. 68**
**కార్యం ద్వారయుగం చాత్ర నేపథ్యగృహకస్య తు,**

**తా.** తరువాత ఆరు దారువులతో (కఱ్ఱలతో, వాసాలు లేదా చిన్న దూలాలతో) కూడిన రంగశీర్షం నిర్మించాలి. ఆ రంగశీర్షం మీద నేపథ్యగృహానికి రక్షిణోత్తరదిశలలో రెండు ద్వారాలు నిర్మించాలి.

**మూ. పూరణే మృత్తికా చాత్ర కృష్ణా దేయా ప్రయత్నతః. 69**
**లాఙ్గలేన సముత్కృష్య నిర్లోష్టతృణశర్కరమ్,**

**తా.** రంగపీఠం నేలను నాగలితో దున్ని బెడ్డలూ, గులకరాళ్లూ లేకుండా చేసి, దాని ఎత్తు పెంచడానికి ప్రయత్నపూర్వకంగా నల్ల మట్టి (రేగడిమట్టి) నింపాలి.

**మూ. లాఙ్గలే శుద్ధవర్ణౌ తు ధుర్యౌ యోజ్యౌ ప్రయత్నతః. 70**
**కర్తారః పురుషాశ్చాత్ర యేఽఙ్గదోషవివర్జితాః.**

**తా.** నాగలికి బాగా పుష్టిగా తెల్లగా ఉన్న రెండు ఎడ్లను కట్టాలి. దున్నేవాళ్లు ఏ విధమైన అవయవదోషాలూ లేనివాళ్లై ఉండాలి.

**మూ. అహీనాఙ్గైశ్చ వోఢవ్యా మృత్తికా పిటకైర్నవైః. 71**
**ఏవంవిధైః ప్రకర్తవ్యం రఙ్గశీర్షం ప్రయత్నతః.**

**తా.** రంగశీర్షంలో పోసే మట్టిని, ఏ విధమైన అవయవదోషాలు లేనివాళ్లు క్రొత్త తట్టలతో మోసికొని రావాలి. ఇలాంటి నియమాలను ప్రయత్నపూర్వకంగా పాటిస్తూ రంగశీర్షం నిర్మించాలి.

**మూ. కూర్మపృష్ఠం న కర్తవ్యం మత్స్యపృష్ఠం తథైవ చ. 72**
**శుద్ధాదర్శతలాకారం రఙ్గశీర్షం ప్రశస్యతే.**

**తా.** కూర్మపృష్ఠం (తాబేలు వీపు) వలె మధ్య ఉబికి ఉండే విధంగా గాని, అంతకంటె కొంచెం తక్కువగా మత్స్యపృష్ఠం వలె ఉబికి ఉండే విధంగా గాని కాక పూర్తిగా అద్దం పైభాగం వలె సమతలమైన రంగశీర్షం నిర్మించాలి.

**మూ. రత్నాని చాత్ర దేయాని, పూర్వే వజ్రం విచక్షణైః. 73**
**వైదూర్యం దక్షిణే పార్శ్వే స్ఫటికం పశ్చిమే తథా,**
**ప్రవాలముత్తరే చైవ మధ్యే తు కనకం భవేత్. 74**

**తా.** రంగశీర్షనిర్మాణంలో నిష్ణాతులైన శిల్పులు, రంగశీర్షం క్రింద రత్నాలు ఉంచాలి. తూర్పున వజ్రమూ, దక్షిణాన వైదూర్యమూ, పశ్చిమాన స్ఫటికమూ, ఉత్తరదిక్కున పగడము, మధ్యభాగంలో బంగారమూ ఉంచాలి.

*రంగశీర్షంమీద చేయించవలసిన దారుకర్మ (కఱ్ఱపని)*

**మూ. ఏవం రఙ్గశిరః కృత్వా దారుకర్మ ప్రయోజయేత్,**
**ఊహప్రత్యూహసంయుక్తం నానాశిల్పప్రయోజితమ్. 75**
**నానాసంజవనోపేతం బహువ్యాలోపశోభితమ్,**
**ససాలభఞ్జికాభిశ్చ సమన్తాత్సమలంకృతమ్. 76**
**నిర్వ్యూహకుహరోపేతం నానాగ్రథితవేదికమ్,**
**నానావిన్యాససంయుక్తం చిత్రజాలగవాక్షకమ్. 77**
**సుపీఠధారిణీయుక్తం కపోతాలీసమాకులమ్,**
**నానాకుట్టిమవిన్యస్తైః స్తమ్భైశ్చాప్యుపశోభితమ్. 78**

**తా.** రంగశీర్షనిర్మాణం పూర్తి అయిన తరువాత దారుకర్మ (కఱ్ఱపని) ప్రారంభించాలి. ఈ దారుకర్మలో ఊహము, ప్రత్యూహము అనేకవిధాలైన శిల్పాలు, అనేకవిధాలైన సంజవనాలు, అనేకమైన సింహాదులు, సాలభంజికలు (కఱ్ఱమీద మానవాద్యాకృతులలో చెక్కిన బొమ్మలు), నిర్వ్యూహములు, కుహరములు, అనేకవిధాల కూర్చిన వేదికలు, అనేకవిధాలైన విన్యాసాలు (ఆకారాల ఏర్పాట్లు), చిత్రవిచిత్రమైన రంధ్రాలు ఉన్న కిటికీలు, అందమైన పీఠా లున్న ధారిణీలు, కపోతాల పంక్తులు కుట్టిమం(చపటా) మీద నిలబెట్టిన స్తంభాలు, ఇవన్నీ ఉండాలి.

**వి.** (1) స్తంభంపైనుండి బైటకు వచ్చిన కఱ్ఱ **(వాసం)** ఊహం. (2) దానిమీద త్రాసు వలె ఉన్న కఱ్ఱ (వాసం) ప్రత్యూహం. (3) ఆసనరూపంలో ఉన్న దారుఫలకం

సంజవనం. (4) సింహాదుల, సర్పాదుల ఆకారాలలో చెక్కడాలు వ్యాలాలు. (5) నృత్య భంగిమాదులలో ఉన్న మూర్తులు సాలభంజికలు (6) తులాకారంలో ఉన్న ప్రత్యూహం అంచులలో చిన్న ఫలకాల (బిళ్లల) పంక్తి నిర్వ్యూహం (7) అందంగా ఉండడం కోసం చెక్కిన చిత్రవిశేషాలు లేదా పర్వతాలు, నగరాలు, పొదరిళ్లు, గుహలు మొదలైనవాటి ఆకారాలలో నగిషీలు **కుహరం**. సుపీఠధారణు లనగా స్తంభాలు పైభాగాలమీద పీఠాలపై ఉన్న తులాకారమైన భాగాలు. దానిపై పావురాల గూళ్లు కపోతపాలి. కుట్టిమంమీద (నేలమీద) నిలబెట్టినవి స్తంభాలు (ఈ అర్థా లన్నీ **అభినవభారతి**నుండి గ్రహింపబడినవి).

### *భిత్తికర్మ (గోడల నిర్మాణం)*

**మూ. ఏవం కాష్ఠవిధిం కృత్వా భిత్తికర్మ ప్రయోజయేత్,**
**స్తమ్భం వా నాగదన్తం వా వాతాయనమథాపి వా. 79**
**కోణం వా సప్రతిద్వారం ద్వారవిద్ధం న కారయేత్.**

**తా.** కఱ్ఱ పని ఈ విధంగా పూర్తి చేసికొని పిదప భిత్తికర్మ (గోడల కట్టుబడి) ప్రారంభించాలి. ద్వారానికి ఎదురుగా, స్తంభం కాని, వస్త్రాలు, చిత్రాలు మొదలైనవి వ్రేలాడదీసే నాగదంతం (ఏనుగు దంతంతో తయారు చేసే చిలుకకొయ్య నాగదంతం. ఇక్కడ చిలుకకొయ్య అను సాధారణార్థం చెప్పుకోవాలి) గాని, కిటికీ గాని, మూల గాని, మరొక ద్వారం గాని నిర్మించగూడదు.

**మూ. కార్యః శైలగుహాకారో ద్విభూమిర్నాట్యమణ్డపః. 80**
**మన్దవాతాయనోపేతో నిర్వాతో ధీరశబ్దవాన్.**

**తా.** రెండు అంతస్తుల, లేదా కొంత భూమి (నేల) పల్లంగాను కొంత భూమి ఎత్తుగాను ఉన్న, నాట్యమండపాన్ని పర్వతగుహాకారంలో నిర్మించాలి. చిన్న కిటికీలు అమర్చి ఎక్కువ గాలి లోనికి ప్రసరించకుండాను, శబ్దం గంభీరంగా వినబడేటట్లుగా ఏర్పరచాలి.

**మూ. తస్మాన్నివాతః కర్తవ్యః కర్తృభిః నాట్యమణ్డపః. 81**
**గమ్భీరస్వరతా యేన కుతపస్య భవిష్యతి.**

**తా.** గృహనిర్మాత లా నాట్యగృహం లోనికి గాలి ఎక్కువ చొరగకుండా ఎందుకు నిర్మించా లనగా – అలా నిర్మించడంచేత కుతపధ్వని గంభీరంగా ఉంటుంది.

**వి.** శాద్యాల, గాయకుల, వాదకుల సముదాయానికి **'కుతపం'** అని పేరు.

**మూ. భిత్తికర్మ విధిం కృత్వా భిత్తిలేపం ప్రదాపయేత్. 82**
**సుధాకర్మ బహిస్తస్య విధాతవ్యం ప్రయత్నతః.**

**తా.** గోడల కట్టుబడి చేసిన తరువాత గోడలకు ఇసుక, మట్టి మొదలైనవి కలిపిన పదార్థంతో పూత పూయించాలి. నాట్యగృహం బైట సున్నం పూయడం విషయంలో బాగా శ్రద్ధ వహించాలి.

**మూ. భిత్తిష్వథ విలిప్తాసు పరిమృష్టాసు సర్వతః. 83**
**సమాసు జాతశోభాసు చిత్రకర్మ ప్రయోజయేత్.**

**తా.** గోడలకు పూతలు పూసి, అంతా బాగా తుడిచి, సమంగా (ఎత్తుపల్లాలు లేకుండా) చేసి, అవి అందంగా తయారైన పిమ్మట వాటిమీద చిత్రకర్మ (చిత్తరువులు చిత్రించడం) చేయించాలి.

**మూ. చిత్రకర్మణి చాలేఖ్యాః పురుషాః స్త్రీజనాస్తథా. 84**
**లతాబన్ధాశ్చ కర్తవ్యాః చరితం చాత్మభోగజమ్.**

**తా.** చిత్రకర్మలో – పురుషుల చిత్రాలు, స్త్రీల చిత్రాలు వేయించాలి. పాకుతూన్న తీగల బొమ్మలు కూడ వేయించి తన అభిరుచికి అనుగుణముగా ఏవైన కథాంశాలు చిత్రీకరించాలి.

**మూ. ఏవం వికృష్టం కర్తవ్యం నాట్యవేశ్మ ప్రయోక్తృభిః. 85**

### *చతురస్రనాట్యమండపలక్షణమ్*

**పునరేవ హి వక్ష్యామి చతురస్రస్య లక్షణమ్,**

**తా.** నాట్యప్రయోగం చేసేవాళ్లు వికృష్టనాట్యగృహం బైన చెప్పిన విధంగా నిర్మించాలి. ఇపుడు చతురస్రనాట్యగృహలక్షణం చెపుతాను.

**మూ. సమన్తతశ్చ కర్తవ్యా హస్తా ద్వాత్రింశదేవ తు. 86**
**శుభభూమివిభాగస్థో నాట్యజ్ఞైర్నాట్యమణ్డపః.**

**తా.** నాట్యవేత్తలు – అన్ని వైపులా ముప్పైరెండు హస్తాల పొడవు గల చతురస్ర నాట్యమండపం శుభకరమైన భూమిమీద (స్థలంలో) నిర్మించాలి.

**మూ. యో విధిః పూర్వముక్తస్తు లక్షణం మఙ్గలాని చ. 87**
**వికృష్టే తాన్యశేషాణి చతురశ్రేఽపి కారయేత్,**

**తా.** వికృష్టనాట్యమండపం విషయంలో ఏ విధివిధానాలు, లక్షణము, మంగళాలు వెనుక చెప్పబడ్డాయో వాటిని అన్నిటినీ చతురస్రమండపం విషయంలో కూడ పాటించాలి.

**మూ. చతురశ్రం సమం కృత్వా సూత్రేణ ప్రవిభజ్య చ. 88**
**బాహ్యతః సర్వతః కార్యా భిత్తిః శ్లిష్టేష్టకా దృఢా,**

**తా.** నాలుగు వైపులా సమంగా ఉండేటట్లు, సూత్రం పట్టి కొలిచి, బాగా అతుగు కొన్న ఇటికలతో, నాలుగు వైపులా బైట దృఢమైన గోడ నిర్మించాలి.

**మూ. తత్రాభ్యన్తరతః కార్యా రఙ్గపీఠోపరి స్థితాః. 89**
**దశ ప్రయోక్తృభిః స్తమ్భాః శక్తా మణ్డపధారణే,**

**తా.** మండపనిర్మాతలు, మండపం లోపల, రంగమండపంమీద, మండపాన్ని నిలబెట్టగల పది స్తంభాలు ఏర్పరచాలి.

**మూ. స్తమ్భానాం బాహ్యతశ్చాపి సోపానాకృతిపీఠకమ్,**
**ఇష్టకాదారుభిః కార్యం ప్రేక్షకాణాం నివేశనమ్. 90**

**తా.** స్తంభాల వెలుపల ప్రేక్షకులు కూర్చొనడానికై ఇటికలతోను కఱ్ఱలతోను మెట్ల ఆకారంలో ఆసనపంక్తి ఏర్పరచాలి.

**మూ. హస్తప్రమాణైరుత్సేధైః భూమిభాగసముత్థితైః. 91**
**రఙ్గపీఠావలోక్యం తు కుర్యాదాసనజం విధిమ్,**

**తా.** మండపంలో ఉన్నవాళ్లందరికీ రంగపీఠం కనబడడానికి నేలమీదనుంచి ఒక్కొక్క హస్తం ఎత్తులతో ఆసనాలు ఏర్పాటు చెయ్యాలి. (ఇవి నేటి గేలరీల వంటివి).

**మూ. షడన్యానన్తరే చైవ పునః స్తమ్భాన్యథాదిశమ్. 92**
**విధినా స్థాపయేత్తద్జ్ఞో దృఢాన్మణ్డపధారణే,**
**అష్టౌ స్తమ్భాన్పునశ్చైవ తేషాముపరి కల్పయేత్. 93**

**తా.** మండపనిర్మాణనిపుణుడు కొంత దూరంలో, ఆ యా దిక్కులలో, మండపాన్ని నిలబెట్ట గల దృఢమైన, మరి ఆరు స్తంభాలు యథాశాస్త్రంగా నిలబెట్టాలి. ఆరు స్తంభాలే కాక మరి ఎనిమిది స్తంభాలు కూడ నిలబెట్టాలి.

**వి.** 90, 92, 93 శ్లోకాలలో చెప్పిన స్తంభాల విషయంలో అభినవగుప్తుడు ఈ విధంగా విశదీకరించాడు. రంగపీఠం నాలుగు మూలలా నాలుగు స్తంభాలు. ఆగ్నేయ స్తంభంనుంచి నాలుగు హస్తాల దూరంలో దక్షిణదిక్కున ఒకటి. అలాగే నైర్ఋతిదిక్కున ఉన్న స్తంభంనుంచి నాలుగు హస్తాల దూరంలో ఒకటి. అలాగే ఉత్తరాన రెండు స్తంభాలు. తూర్పున ఈశాన్య – ఆగ్నేయాలలో ఉన్న రెండు స్తంభాలనుంచి నాలుగు హస్తాల దూరంలో రెండు స్తంభాలు. ఈ విధంగా మొత్తం పది స్తంభాలు రంగపీఠం మీద.

రంగపీఠం దక్షిణాన నిలిపిన రెండు స్తంభాలనుండి నాలుగు హస్తాల దూరంలో రెండు స్తంభాలు. ఈ రెండు స్తంభాల మధ్య దూరం ఎనిమిది హస్తా లుంటుంది.

ఆగ్నేయస్తంభం ఎదురుగా తూర్పున ఉన్న స్తంభానికి నాలుగు హస్తాల దూరంలో దక్షిణ స్తంభం ఉన్న మూడు స్తంభాలకీ, గోడకీ మధ్యలో మూడు స్తంభాలు, అదే విధంగా ఉత్తరాన మూడు స్తంభాలు. ఈ విధంగా ఆరు స్తంభాలు.

**'అష్టౌ స్తమ్భాన్ పునశ్చైవ'** అనుదాని ప్రకారం అభినవగుప్తుడు చెప్పిన ఎనిమిది స్తంభాల స్థానాలు సరిగా అర్థం అవడంలేదు.

**మూ. స్థాప్యం చైవ తతః పీఠమష్టహస్తప్రమాణతః,**
**విద్ధాస్యమష్టహస్తం చ పీఠం తేషు తతో న్యసేత్. 94**

**తా.** స్తంభాలు నిలిపిన తరువాత ఎనిమిది హస్తాల ప్రమాణం గల పీఠం తయారు చేయించి, పద్మాదుల రూపంలో నగిషీ లున్న ఆ పీఠాన్ని ఆ స్తంభాలమీద అమర్చాలి.

**మూ. తత్ర స్తమ్భాః ప్రదాతవ్యాస్తద్జ్ఞైర్మణ్డపధారణే,**
**ధారణీధారణా స్తే చ శాలస్త్రీభిరలఙ్కృతాః. 95**

**తా.** మండపనిర్మాణజ్ఞులు (ప్రేక్షామండపంలో ఉన్న) క్రింది నేల (అధోభూమి), రంగపీఠం, రంగము అను మూడు భాగాలలో మొదటిదైన అధోభూమియందు మండపాన్ని నిలపడానికై, స్తంభాలు ఏర్పరచాలి. ధారణిని నిలబెట్టే ఆ స్తంభాలు సాలభంజికలచేత అలంకరింపబడి ఉండాలి.

**వి.** ధారణీ = పైకప్పు.

**మూ. నేపథ్యగృహకం చైవ తతః కార్యం ప్రయత్నతః,**
**ద్వారం చైకం భవేత్తత్ర రఙ్గపీఠప్రవేశనమ్. 96**

**తా.** పిమ్మట నేపథ్యగృహం ప్రయత్నపూర్వకంగా నిర్మించాలి. దానికి, రంగపీఠం మీదికి ప్రవేశించడానికై ఉపయోగించే ఒక్క ద్వారం ఉండాలి.

**మూ. జనప్రవేశనం చాన్యదాభిముఖ్యేన కారయేత్,**
**రఙ్గస్యాముఖం కార్యం ద్వితీయం ద్వారమేవ తు. 97**

**తా.** జనులు ప్రవేశించడానికి రంగపీఠానికి అభిముఖంగా ద్వారం ఏర్పరచాలి. మరొక ద్వారం రంగానికి అభిముఖంగా నిర్మించాలి.

**వి.** ఇక్కడ అభినవగుప్తుడు నేపథ్యగహానికి రెండు ద్వారాలు, ప్రేక్షకులకోసం మండపానికి రెండు ద్వారాలు ఉండాలని అన్నాడు.

**మూ. అష్టహస్తం తు కర్తవ్యం రఙ్గపీఠం ప్రమాణతః,**
**చతురస్రం సమతలం వేదికాసమలంకృతమ్. 98**

**తా.** ఎనిమిది హస్తాల ప్రమాణంతో రంగపీఠం నిర్మించాలి. అది చతురస్రంగా, సమతలం (ఎత్తుపల్లాలు లేకుండా) ఉండాలి. దానిమీద వేదిక అందంగా ఉండాలి.

**మూ. పూర్వప్రమాణనిర్దిష్టా కర్తవ్యా మత్తవారణీ,**
**చతుఃస్తమ్భసమాయుక్తా వేదికాయాస్తు పార్శ్వతః. 99**

**తా.** వేదికకు ఇరు ప్రక్కలా నాలుగుస్తంభా లున్న మత్తవారణులు వెనుక చెప్పిన ప్రమాణాల ప్రకారం నిర్మించాలి.

**మూ. సమున్నతం సమం చైవ రఙ్గశీర్షం తు కారయేత్,**
**వికృష్టే తూన్నతం కార్యం, చతురస్రే సమం తథా. 100**

**తా.** వేదికకంటె ఎత్తుగా గాని, దానితో సమంగా గాని రంగశీర్షం నిర్మించాలి. వికృష్టప్రేక్షాగృహంలో ఉన్నతంగాను, చతురస్రంలో సమంగాను ఉండాలి.

**మూ. ఏవమేతేన విధినా చతురశ్రం గృహం భవేత్,**

## త్ర్యశ్రనాట్యగృహము

**అతఃపరం ప్రవక్ష్యామి త్ర్యశ్రగేహస్య లక్షణమ్. 101**

**తా.** చతురశ్రగృహానికి పాటించవలసిన విధి ఇది. ఇంక త్ర్యశ్రనాట్యగృహలక్షణం చెపుతాను.

**మూ. త్ర్యస్రం త్రికోణం కర్తవ్యం నాట్యవేశ్మ ప్రయోక్తృభిః,**
**మధ్యే త్రికోణమేవాస్య రఙ్గపీఠం తు కారయేత్. 102**

**తా.** నాట్యప్రయోక్తలు త్ర్యస్రనాట్యగృహాన్ని త్రికోణాకారంలో నిర్మించాలి. దాని మధ్యభాగంలో త్రికోణాకారంలోనే రంగపీఠం కూడ నిర్మించాలి.

**మూ. ద్వారం తేనైవ కోణేన కర్తవ్యం తస్య వేశ్మనః,**
**ద్వితీయం చైవ కర్తవ్యం రఙ్గపీఠస్య పృష్ఠతః. 103**

**తా.** వికృష్ట – చతురస్రగృహాలకు చెప్పినట్లుగానే దీనికి కూడ ఆ కోణంలోనే, అనగా తూర్పున గాని అభిముఖంగా గాని ద్వారం నిర్మించాలి. రంగపీఠం వెనుక రెండవ ద్వారం నిర్మించాలి.

**మూ. విధిర్యశ్చతురస్రస్య భిత్తిస్తమ్భసమాశ్రయః,**
**స తు సర్వః ప్రయోక్తవ్యః త్ర్యస్రస్యాపి ప్రయోక్తృభిః. 104**

**తా.** భిత్తి – స్తంభాల విషయంలో చతురస్రగృహానికి చెప్పిన పద్ధతినే, నాట్య ప్రయోక్తలు, త్ర్యస్రగృహానికి అవలంబించాలి.

**మూ. ఏవమేతేన విధినా కార్యా నాట్యగృహా బుధైః,**
**పునరేషాం ప్రవక్ష్యామి పూజామేవం యథావిధి. 105**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే మణ్డపవిధానో నామ ద్వితీయోఽధ్యాయః.**

**తా.** బుధులు ఈ విధివిధానాలను పాటిస్తూ నాట్యగృహాలు నిర్మించాలి. ఇంక ఈనాట్యగృహాలలో చేయవలసిన పూజావిధిని చెపుతాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన 'బాలానందిని' అను భరతనాట్యశాస్త్రాంధ్ర వ్యాఖ్యానంలో 'మండపవిధానము' అను ద్వితీయాధ్యాయం సమాప్తం.**

**శ్రీః శ్రీః శ్రీః**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథతృతీయోఽధ్యాయః

# రంగదైవతపూజనము

*యదాప్యాయపరా లోకాః స్వే స్వే కర్మణి సంగతాః,*
*ప్రాప్నువన్తి ఫలం వన్దే తత్తేజోవపురైశ్వరమ్.*

*– శ్రీమదభినవగుప్తాచార్యాః*

**మూ. సర్వలక్షణసంపన్నే కృతే నాట్యగృహే శుభే,**
**గావో వసేయుః సప్తాహం సహ జప్యపరైర్ద్విజైః. 1**

**తా.** సర్వలక్షణసంపన్నమై, శుభప్రద మైన నాట్యగృహం నిర్మాణం పూర్తి అయిన పిమ్మట, గోవులూ, మంత్రజపం చేస్తూ బ్రాహ్మణులూ, ఆ నాట్యమండపంలో ఏడు రోజుల పాటు నివసించాలి.

**మూ. తతోఽధివాసయేద్వేశ్మ రఙ్గపీఠం తథైవ చ,**
**మన్త్రపూతేన తోయేన ప్రోక్షితాఙ్గో నిశాగమే. 2**

**యథాస్థానాన్తరగతో దీక్షితః ప్రయతః శుచిః,**
**త్రిరాత్రోపోషితో భూత్వా నాట్యాచార్యోఽహతామ్బరః. 3**

**తా.** అటుపిమ్మట రాత్రి ప్రారంభంలో (సాయంసంధ్యాసమయంలో) దీక్షార్హమైన స్థానంలో ఉంటూ దీక్షవహించి, నియమవంతుడై, మూడు రోజులు ఉపవాసం చేసిన నాట్యాచార్యుడు మంత్రపూత మైన ఉదకం తనమీద చల్లుకొని, పవిత్రుడై, నూతన వస్త్రములు ధరించి నాట్యగృహంలోను, రంగపీఠంమీద ఆ యా దేవతల ఆవాహన చెయ్యాలి.

**మూ. నమస్కృత్య మహాదేవం సర్వలోకోద్భవం భవమ్,**
**జగత్పితామహం చైవ విష్ణుమిన్ద్రం గుహం తథా. 4**

**సరస్వతీం చ లక్ష్మీం చ సిద్ధిం మేధాం ధృతిం స్మృతిమ్,**
**సోమం సూర్యం చ మరుతో లోకపాలాంస్తథాశ్వినౌ. 5**

**మిత్రమగ్నిం సురాన్వర్ణాన్ రుద్రాన్ కాలం కలిం తథా,**
**మృత్యుం చ నియతిం చైవ కాలదణ్డం తథైవ చ. 6**

**విష్ణుప్రహరణం చైవ నాగరాజం చ వాసుకిమ్,**

**వజ్రం విద్యుత్సముద్రాంశ్చ గన్ధర్వాప్సరసో మునీన్. 7**

**భూతాన్ పిశాచాన్ యక్షాంశ్చ గుహ్యకాంశ్చ మహేశ్వరాన్,**

**అసురాన్నాట్యవిఘ్నాంశ్చ తథాన్యాన్ దైత్యరాక్షసాన్. 8**

**తథా నాట్యకుమారీశ్చ మహాగ్రామణ్యమేవ చ,**

**యక్షాంశ్చ గుహ్యకాంశ్చైవ భూతసంఘాంస్తథైవ చ. 9**

**ఏతాంశ్చాన్యాంశ్చ దేవర్షీన్ ప్రణమ్య రచితాఞ్జలిః,**

**యథాస్థానాన్తరగతాన్ సమావాహ్య తతో వదేత్. 10**

**తా.** నాట్యాచార్యుడు సర్వలోకాల సృష్టికీ కారణభూతు డైన మహాదేవు డైన ఈశ్వరునకు, జగత్తు కంతకీ పితామహుడైన బ్రహ్మదేవునికీ, విష్ణువునకూ, ఇంద్రునకూ, కుమారస్వామికీ, సరస్వతికి, లక్ష్మికి, సిద్ధికీ, మేధకు, ధృతికి, స్మృతికి, సోమునకు, సూర్యునకు, మరుత్తులకు, లోకపాలులకు, అశ్వినీదేవతలకు, మిత్రునకు, అగ్నికి, సురులకు, వర్ణాలకు (చతుర్వర్ణాధిష్ఠానదేవతలకు), రుద్రులకు, కాలానికి, కలికి, మృత్యువు నకు, నియతి (దైవమునకు), కాలదండానికి, విష్ణ్వాయుధ మైన సుదర్శనచక్రమునకు, నాగరాజైన వాసుకికి, వజ్రాయుధానికి, మెరుపులకు, సముద్రానికి, గంధర్వులకు, అప్సరసలకు, మునులకు, భూతాలకు, పిశాచాలకు, యక్షులకు, గుహ్యకులకు, మహేశ్వరులకు, అసురులకు, నాట్యవిఘ్నాలకు (నాట్యవిఘ్నకరదుష్టశక్తులకు), ఇతరులైన దైత్యులకు, రాక్షసులకు, నాట్యకుమారీలకు, మహాగ్రామణికి (గణపతికి), యక్షులకు, గుహ్యకులకు (వీళ్లిద్దరూ పైన చెప్పబడ్డారు), భూతాల సముదాయాలకు, వీరందరికీ, ఇతరు లైన దేవతలకు, ఋషులకు నమస్కరించి, అంజలి ఘటించి, వారి నందరిని వారి వారి తగిన స్థానములకు ఆవాహన చేసి, ఇలా చెప్పాలి (ప్రార్థించాలి).

**మూ. భవద్భిర్నో నిశాయాం తు కర్తవ్యః సంపరిగ్రహః,**

**సాహాయ్యం చైవ దాతవ్యమస్మిన్నాట్యే సహానుగైః. 11**

**తా.** ఓ! పూజ్యులారా! మీరు రాత్రియందు మాకు రక్షణ ఇవ్వాలి. పరివారసమేతు లైన మీరందరూ ఈ నాట్యప్రయోగంలో మాకు సాహాయ్యం ఇవ్వాలి.

**మూ. సంపూజ్య సర్వానేకత్ర కుతపం సంప్రయుజ్య చ,**

**జర్జరాయ ప్రయుఞ్జీత పూజాం నాట్యప్రసిద్ధయే. 12**

**తా.** సమస్తదేవతలను పూజించి, వాద్యసముదాయధ్వని చేయిస్తూ నాట్యప్రదర్శనం నిర్విఘ్నంగా కొనసాగడానికై ఒక చోట జర్జరానికి పూజ చెయ్యాలి.

**మూ. త్వం మహేన్ద్రప్రహరణం సర్వదానవసూదనమ్,**
**నిర్మితః సర్వదేవైశ్చ సర్వవిఘ్ననిబర్హణ. 13**
**నృపస్య విజయం శంస, రిపూణాం చ పరాజయమ్,**
**గోబ్రాహ్మణశివం చైవ నాట్యస్య చ వివర్ధనమ్. 14**

**తా.** సర్వవిఘ్నాలను నశింపచేసేదానా! నీవు సర్వదానవులను సంహరించిన మహేంద్రాయుధ మైనదానవు. నిన్ను దేవత లందరూ కలిసి నిర్మించారు. మా రాజుకు విజయాన్నీ, శత్రువులకు పరాజయాన్ని, ఇమ్ము. గోబ్రాహ్మణులకు క్షేమమును చేయుము. నాట్యం అభివృద్ధి చెందే టట్లు చూడుము.

**మూ. ఏవం కృత్వా యథాన్యాయముపాస్యం నాట్యమణ్డపే,**
**నిశాయాం తు ప్రభాతాయాం పూజనం ప్రక్రమేదిహ. 15**

**తా.** ఈ విధంగా నియమానుసారం పూజ చేసి, ఆ నాట్యమండపంలోనే ఆ రాత్రి ఉండి, తెల్లవారగానే పూజలు ప్రారంభించాలి.

### *రంగపూజ*

**మూ. ఆర్ద్రాయాం వా మాఘాయాం వా యామ్యే పూర్వేషు వా త్రిషు,**
**ఆశ్లేషామూలయోర్వాపి కర్తవ్యం రఙ్గపూజనమ్. 16**

**తా.** ఆర్ద్రా – మఘా – భరణి – పూర్వాషాఢా – పూర్వఫల్గునీ – పూర్వాభాద్రా – ఆశ్లేషా – మూల నక్షత్రాలలో ఏదో ఒక నక్షత్రాన రంగపూజ చెయ్యాలి.

**మూ. ఆచార్యేణ తు యుక్తేన శుచినా దీక్షితేన చ,**
**రఙ్గస్యోద్ద్యోతనం కార్యం దేవతానాం చ పూజనమ్. 17**

**తా.** శుచి యైన ఆచార్యుడు దీక్ష అవలంబించి, ఏకాగ్రచిత్తంతో (దీపాదులచే) రంగాన్ని ప్రకాశింపచేసి దేవతాపూజ చెయ్యాలి.

**మూ. దినాన్తే దారుణే ఘోరే ముహూర్తే యమదైవతే,**
**ఆచమ్య తు యథాన్యాయం దేవతా వై నివేశయేత్. 18**

**తా.** సాయంసంధ్యాసమయంలో దారుణము ఘోరమూ, భూతగణం అధిష్ఠాన దేవతలుగా గల ముహూర్తంలో, ఆచమనం చేసి, యథాశాస్త్రంగా దేవతాస్థాపనం చెయ్యాలి.

**మూ. రక్తాః ప్రతిసరాః సూత్రం రక్తగన్ధాశ్చ పూజితాః,**
**రక్తాః సుమనసశ్చైవ యచ్చ రక్తం ఫలం భవేత్. 19**

**యవైః సిద్ధార్థకైర్లాజైరక్షతైః శాలితణ్డులైః,**
**నాగపుష్పస్య చూర్ణేన వితుషాభిః ప్రియఙ్గుభిః. 20**
**ఏతైర్ద్రవ్యైర్యుతం కుర్యార్దేవతానాం నివేశనమ్.**

**తా.** ఒగ్గులొగ్గులుగా చేసినఎఱ్ఱని నూలు దారాలు, మంచి ఎఱ్ఱని గంధాలు, ఎఱ్ఱని పువ్వులు, ఎఱ్ఱని పండ్లు సిద్ధం చేసికోవాలి. దేవతలను – యవలు, తెల్ల ఆవాలు, పేలాలు, అక్షతలు (లేదా ముక్కలు కాని పేలాలు), వరిబియ్యం, వాగపుష్పచూర్ణం, పైపొట్టు తీసివేసిన ప్రియంగుగింజలు – ఈ ద్రవ్యాలతో కూడిన ఆసనాలు ఏర్పరచి దేవతలను స్థాపించాలి.

**మూ. ఆలిఖేన్మణ్డలం పూర్వం యథాస్థానం యథావిధి. 21**
**సమన్తతశ్చ కర్తవ్యం హస్తాః షోడశమణ్డలమ్,**
**ద్వారాణి చాత్ర కుర్వీత విధానేన చతుర్దిశమ్. 22**

**తా.** దేవతాస్థాపనకు ముందు తగిన స్థానంలో, యథాశాస్త్రంగా మండలం (పిండి మొదలైనవాటితో) వ్రాయాలి (నిర్మించాలి). నాలుగు ప్రక్కలా పదహారు హస్తాల పొడవు వెడల్పు ఉండేటట్లు మండలం నిర్మించాలి. నాలుగు దిక్కులకు, యథాశాస్త్రంగా, ఆ మండలానికి నాలుగు ద్వారాలు ఏర్పరచాలి.

**మూ. మధ్యే చైవాత్రకర్తవ్యే ద్వే రేఖే తిర్యగూర్ధ్వగే,**
**తయోః కక్ష్యావిభాగేన దైవతాని నివేశయేత్. 23**

**తా.** మండలం మధ్య అడ్డంగాను నిలువుగాను రెండు రేఖలు గీయాలి. ఆ రేఖల చేత ఏర్పడిన వేరు వేరు గళ్లలో దేవతలను స్థాపించాలి.

**మూ. పద్మోపవిష్టం బ్రహ్మాణం తస్య మధ్యే నివేశయేత్,**
**ఆదౌ నివేశ్యో భగవాన్ సార్ధం భూతగణైః శివః. 24**

**తా.** మండలం మధ్యలో పద్మంలో కూర్చున్న బ్రహ్మదేవుని స్థాపించాలి. అందరి కంటె ముందు భూతగణసమేతు డైన భగవంతు డైన శివుణ్ణి స్థాపించాలి.

**మూ. నారాయణో మహేన్ద్రశ్చ స్కన్దః సూర్యోఽశ్వినౌ శశీ,**
**సరస్వతీ చ లక్ష్మీశ్చ శ్రద్ధా మేధా చ పూర్వతః. 25**

**తా.** తూర్పున, నారాయణుడు, మహేంద్రుడు, స్కందుడు, సూర్యుడు, అశ్వినీ దేవతలు, చంద్రుడు, సరస్వతి, లక్ష్మి, శ్రద్ధ, మేధ – ఈ దేవతలను స్థాపించాలి.

**మూ. పూర్వదక్షిణతో వహ్నిర్నివేశ్యః స్వాహయా సహ,**
**విశ్వేదేవాః సగన్ధర్వా రుద్రాః సర్పగణాస్తథా. 26**

**తా.** పూర్వదక్షిణ (ఆగ్నేయ) దిక్కున స్వాహాసమేతు డైన అగ్నిదేవుణ్ణి, విశ్వేదేవతలను, గంధర్వులను, రుద్రులను – సర్పగణాలను స్థాపించాలి.

**మూ. దక్షిణేన నివేశ్యస్తు యమో మిత్రశ్చ సానుగః,**
**పితౄన్ పిశాచానురగాన్ గుహ్యకాంశ్చ నివేశయేత్. 27**

**తా.** దక్షిణదిక్కునందు యముణ్ణి, పరివారసమేతుడైన మిత్రుణ్ణి, పితృదేవతలను, పిశాచాలను, ఉరగులను, గుహ్యకులను ఆవాహన చేసి స్థాపించాలి.

**మూ. నైరృత్యాం రాక్షసాంశ్చైవ భూతాని చ నివేశయేత్,**
**పశ్చిమాయాం సముద్రాం శ్చ వరుణం యాదసాంపతిమ్. 28**

**తా.** నైరృతిదిక్కునందు రాక్షసులను, భూతాలను స్థాపించాలి. పశ్చిమదిక్కున సముద్రాలను, జలజంతువుల ప్రభు వైన వరుణుణ్ణి స్థాపించాలి.

**మూ. వాయవ్యాయాం దిశి తథా సప్త వాయూన్నివేశయేత్,**
**తత్రైవ వినివేశ్యస్తు గరుడః పక్షిభిః సహ. 29**

**తా.** వాయవ్యదిక్కునందు ఏడు వాయుగణాలను, ఇతరపక్షిసహితు డైన గరుత్మంతుణ్ణి స్థాపించాలి.

**మూ. ఉత్తరస్యాం దిశి తథా ధనదం సంనివేశయేత్,**
**నాట్యస్య మాతౄశ్చ తథా యక్షానథ సగుహ్యకాన్. 30**

**తా.** ఉత్తరదిక్కునందు కుబేరుణ్ణి, నాట్యమాతలను, యక్షులను, గుహ్యకులను స్థాపించాలి.

**మూ. తథైవోత్తరపూర్వాయాం నన్ద్యాద్యాంశ్చ గణేశ్వరాన్,**
**బ్రహ్మర్షిభూతసంఘాంశ్చ యథాభాగం నివేశయేత్. 31**

**తా.** ఉత్తరపూర్వ (ఈశాన్య) దిక్కునందు నందీశ్వరుడు మొదలైన ప్రమథగణ నాయకులను, బ్రహ్మర్షులను, భూతసంఘాలను, వారి వారి స్థానాలలో స్థాపించాలి.

**మూ. స్తమ్భే సనత్కుమారం తు దక్షిణే దక్షమేవ చ,**
**గ్రామణ్యముత్తరే స్తమ్భే పూజార్థం సంనివేశయేత్. 32**

**తా.** (మండలం నాలుగు దిక్కులందు ఉన్న స్తంభాలలో) తూర్పుస్తంభంమీద సనత్కుమారుణ్ణీ, దక్షిణస్తంభంమీద ప్రజాపతిని, ఉత్తరస్తంభంమీద గ్రామణీ అను దేవతను, లేదా గ్రామదేవతను, పూజకొరకై స్థాపించాలి.

**మూ. అనేనైవ విధానేన యథాస్థానం యథావిధి,**
**సుప్రసాదాని సర్వాణి దైవతాని నివేశయేత్. 33**

**తా.** బాగుగా అనుగ్రహించు ఈ దేవతల నందరినీ, ఇదే పద్ధతిలో స్థానానుసారం యథాశాస్త్రంగా ఆవాహన చేసి స్థాపించాలి.

**మూ. స్థానే స్థానే యథాన్యాయం వినివేశ్య తు దేవతాః,**
**తాసాం ప్రకుర్వీత తతః పూజనం తు యథార్హతః. 34**

**తా.** ఆ యా దేవతలను వారి వారి స్థానాలలో స్థాపించి తగు విధంగా ఆ దేవతల పూజలు చెయ్యాలి.

**మూ. దేవతాభ్యస్తు కర్తవ్యం సితమాల్యానులేపనమ్,**
**గన్ధర్వవహ్నిసూర్యేభ్యో రక్తమాల్యానులేపనమ్. 35**

**తా.** దేవతలకు తెల్లని మాలలు, గంధాదులు సమర్పించాలి. గంధర్వులకు, అగ్నికి, సూర్యునకు ఎఱ్ఱని పుష్పమాలలు, ఎఱ్ఱని చందనాదులు సమర్పించాలి.

**మూ. గన్ధం మాల్యం చ ధూపం చ యథావదనుపూర్వశః,**
**దత్త్వా తతః ప్రకుర్వీత బలిం పూజాం యథావిధి. 36**

**తా.** ముందుగ గంధము, తరువాత మాల్యము, పిమ్మట ధూపము వరుసగా సమర్పించి తరవాత బలి సమర్పించి పూజ చెయ్యాలి.

**మూ. బ్రహ్మాణం మధుపర్కేణ పాయసేన సరస్వతీమ్,**
**శివవిష్ణుమహేన్ద్రాద్యాః సంపూజ్యా మోదకైరథ. 37**

**తా.** బ్రహ్మదేవుణ్ణి మధుపర్కంతోను, సరస్వతిని పాయసంతోను, శివ - విష్ణు - మహేంద్రాదులను మోదకములతోను (వీటిని నైవేద్యంగా సమర్పించి) పూజించాలి.

**వి.** మోదకం అనగా సంతోషింపచేసేది అని అర్థం. దేనిని ఇవ్వగానే ఇతరుని ముఖం వికసిస్తుందో అది. ఏ మధురభక్ష్య మైనా మోదకమే.

**మూ. ఘృతౌదనేన హుతభుక్ సోమార్కౌ తు గుడౌదనైః,**
**విశ్వేదేవాః సగన్ధర్వా మునయో మధుపాయసైః. 38**

**తా.** నేతి అన్నంతో అగ్నిదేవునీ, సోమ - సూర్యులను బెల్లం అన్నాలతోను, తేనెతోను పాయసాలతోను విశ్వేదేవ - గంధర్వ - మునులను పూజించాలి.

**మూ. యమమిత్రౌ చ సంపూజ్యావపూపైర్మోదకైస్తథా,**
**పితౄన్ పిశాచానురగాన్ సర్పిఃక్షీరేణ తర్పయేత్. 39**

**తా.** యమ - మిత్రులను అప్పాలతోను మోదకాలతోను పూజించాలి. పితృ దేవతలను, పిశాచాలను, ఉరగులను నేతితోను క్షీరంతోను సంతృప్తులను చెయ్యాలి.

**మూ. పక్వాన్నేన తు మాంసేన సురాసీధుఫలాసవైః,**
**అర్చయేద్భూతసంఘాంశ్చ చణకైః పలలాప్లుతైః. 40**

**తా.** ఉడికిన అన్నాలు, మాంసము, సుర, మిష్టాన్నము, ఫలాల రసము, మాంసంతో కూడిన శనగలు నైవేద్యం పెట్టి భూతసంఘాలను అర్చించాలి.

**మూ. అనేనైవ విధానేన సంపూజ్యా మత్తవారణీ,**
**పక్వామేన తు మాంసేన సంపూజ్యా రక్షసాం గణాః. 41**

**తా.** మత్తవారణి పూజ కూడ ఇదే విధానంతో జరపాలి. రాక్షసగణాలను ఉడికించిన మాంసము, పచ్చిమాంసము కూడ నైవేద్యం పెట్టి పూజించాలి.

**మూ. సురామాంసప్రదానేన దానవాన్ ప్రతిపూజయేత్,**
**శేషాన్ దేవగణాంస్తద్జ్ఞః సాపూపోత్కారికౌదనైః. 42**

**తా.** సురా – మాంసాలు నైవేద్యం పెట్టి దానవులను పూజించాలి. పూజావిధానం తెలిసినవాడు ఇతర దేవతలను అపూపములు (అప్పాలు, గార్లు మొదలైనవి) ఉత్కారికలు, అన్నము నైవేద్యం పెట్టి పూజించాలి.

**మూ. మత్స్యైశ్చ పిష్టభక్ష్యైశ్చ సాగరాన్సరితస్తథా,**
**సంపూజ్య వరుణం చాపి దాతవ్యం ఘృతపాయసమ్. 43**

**తా.** సముద్రాలను, నదులను, వరుణుణ్ణి మత్స్యాలతోను, పిండితో చేసిన భక్ష్యాల తోను (పిండివంటలతోను) పూజించి నేతితో కూడిన పాయసం కూడ ఇవ్వాలి.

**మూ. నానామూలఫలైశ్చైవ మునీన్ సంప్రతిపూజయేత్,**
**వాయూంశ్చ పక్షిణశ్చైవ విచిత్రైర్భక్ష్యభోజనైః. 44**

**తా.** అనేకవిధాలైన దుంపలతోను, ఫలాలతోను మునులను పూజించాలి. వాయువు లనూ, పక్షులను విచిత్రములైన భక్ష్యాలు, భోజనాలు ఇచ్చి పూజించాలి.

**మూ. మాతౄర్నాట్యస్య సర్వాస్తాః ధనదం చ సహానుగైః,**
**అపూపైర్లాజికామిశ్రైర్భక్ష్యభోజ్యైశ్చ పూజయేత్. 45**

**తా.** నాట్యమాతలను అందరినీ, పరివారసహితుడైన కుబేరుణ్ణీ లాజికలు (చిన్న లాజలతో) కలిపిన అపూపాలు, భక్ష్యాలు, భోజ్యాలు సమర్పించి పూజించాలి.

**మూ. ఏవమేషాం బలిః కార్యో నానాభోజనసంశ్రయః,**
**పునర్మన్త్రవిధానేన బలికర్మ చ వక్ష్యతే. 46**

**తా.** ఈ విధంగా అనేకవిధాలైన భోజనాలతో కూడిన బలి ఈ దేవతలకు ఇవ్వాలి. ఇప్పుడు మంత్రవిధానంతో చేయవలసిన బలిని గూర్చి చెపుతాను.

**మూ. దేవదేవ! మహాభాగ! సర్వలోకపితామహ!**
**మన్త్రపూతమిమం సర్వం ప్రతిగృహ్ణీష్వ మే బలిమ్. 47**

**తా.** దేవదేవా! మహానుభావా! సర్వలోకాలకు పితామహుడ వైన బ్రహ్మదేవుడా! మంత్రముచేత పవిత్రం చేయబడిన ఈ బలిని అంతనీ స్వీకరించుము.

**మూ. దేవదేవ! మహాదేవ! గణేశ! త్రిపురాన్తక!**
**ప్రగృహ్యతాం బలిర్దేవ! మన్త్రపూతో మయోద్యతః. 48**
**(మహాదేవ! మహాయోగిన్! దేవదేవ! సురోత్తమ!**
**సంప్రగృహ్య బలిం దేవ! రక్ష విఘ్నాత్సదోత్థితాత్.)**

**తా.** దేవదేవా! మహాదేవా! ప్రమథగణాధీశా! త్రిపురసంహారా! దేవా! నేను సమర్పించిన ఈ మంత్రపూత మైన బలిని గ్రహించుము.

(**తా.** మహాదేవా! మహాయోగీ! దేవదేవా! సురులలో ఉత్తముడా! దేవా! నేను సమర్పించిన బలిని స్వీకరించి మాకు ఎదు రయ్యే విఘ్నాలనుండి మమ్ములను సర్వదా రక్షించుము).

**మూ. నారాయణామితగతే! పద్మనాభ! సురోత్తమ!**
**ప్రగృహ్యతాం బలిర్దేవ! మన్త్రపూతో మయార్పితః. 49**

**తా.** తెలియశక్యం కాని గమనం కలవాడా! పద్మనాభా! సురులలో ఉత్తముడా! నారాయణా! నేను అర్పించిన మంత్రపూత మైన బలిని స్వీకరింపుము.

**మూ. పురన్దరామరపతే! వజ్రపాణే! శతక్రతో!**
**ప్రగృహ్యతాం బలిర్దేవ! విధిమన్త్రపురస్కృతః. 50**

**తా.** అమరుల ప్రభూ! వజ్రము హస్తమునందు కలవాడా! నూరు యజ్ఞాలు చేసినవాడా! దేవా! మహేంద్రా! శాస్త్రం ప్రకారం మంత్రపురస్కృతమైన బలిని స్వీకరించుము.

**మూ. దేవసేనాపతే! స్కన్ద! భగవన్! శఙ్కరప్రియ!**
**బలిః ప్రీతేన మనసా షణ్ముఖ! ప్రతిగృహ్యతామ్. 51**

**తా.** దేవతల సేనాపతీ! పూజ్యుడా! శంకరునకు ప్రియమైనవాడా! ఆరు ముఖములు కల ఓ! స్కందా! నేను సమర్పించిన బలిని సంతోషించిన మనస్సుతో స్వీకరింపుము.

**మూ. దేవదేవి! మహాభాగే! సరస్వతి! హరిప్రియే!**
**ప్రగృహ్యతాం బలిర్మాతః మయా భక్త్యా సమర్పితః. 52**

**తా.** దేవతలకు పూజ్యురాలా! మహానుభావురాలా! హరిప్రియా! తల్లీ! సరస్వతీ!

నేను భక్తితో సమర్పించిన బలిని స్వీకరింపుము.

**మూ. నానానిమిత్తసంభూతాః పౌలస్త్యాః సర్వ ఏవ తు,**
**రాక్షసేన్ద్రా మహాసత్త్వాః ప్రతిగృహ్ణీత మే బలిమ్. 53**

**తా.** వివిధకారణాలచేత జన్మించిన, పులస్త్యవంశీయులైన, మహాబలశాలులైన సమస్తరాక్షసేంద్రులారా! నేను సమర్పించిన బలి స్వీకరించండి.

**మూ. లక్ష్మీః సిద్ధిర్మతిర్మేధా సర్వలోకనమస్కృతాః,**
**మన్త్రపూతమిమం దేవ్యః ప్రతిగృహ్ణన్తు మే బలిమ్. 54**

**తా.** సర్వలోకములచేత నమస్కరింపబడిన లక్ష్మి, సిద్ధి, మతి, మేధ అను దేవులు (దేవీలు) నేను సమర్పించిన, మంత్రపూతమైన ఈ బలిని స్వీకరించెదరు గాక.

**మూ. సర్వభూతానుభావజ్ఞ! లోకజీవన! మారుత!**
**ప్రగృహ్యతాం బలిర్దేవ! మన్త్రపూతో మయోద్యతః. 55**

**తా.** సకలభూతాల సామర్థ్యం తెలిసినవాడా! లోకానికి జీవనమైనవాడా! దేవా! మారుతా! నేను సమర్పించిన మంత్రపూత మైన బలిని స్వీకరించుము.

**మూ. దేవవక్త్ర! సురశ్రేష్ఠ! ధూమకేతో! హుతాశన!**
**భక్త్యా సముద్యతో దేవ! బలిః సంప్రతిగృహ్యతామ్. 56**

**తా.** దేవతల ముఖమా! సురశ్రేష్ఠుడా! ధూమం కేతువుగా కలవాడా! అగ్నిదేవా! నేను భక్తితో సమర్పించుచున్న బలిని స్వీకరింపుము.

**మూ. సర్వగ్రహాణాం ప్రవర! తేజోరాశే! దివాకర!**
**భక్త్యా మయోద్యతో దేవ బలిః సంప్రతిగృహ్యతామ్. 57**

**తా.** సమస్తగ్రహాలలో శ్రేష్ఠుడా! తేజస్సుల రాశీ! దేవా! సూర్యా! నేను భక్తిపూర్వకంగా సమర్పించు బలిని స్వీకరింపుము.

**మూ. సర్వగ్రహపతే! సోమ! ద్విజరాజ! జగత్ప్రియ!**
**ప్రగృహ్యతామేష బలిర్మన్త్రపూతో మయోద్యతః. 58**

**తా.** సకలగ్రహాల అధిపతీ! బ్రాహ్మణుల రాజా! జగత్తుకు ఇష్టుడా! చంద్రా! నేను సమర్పించుచున్న మంత్రపూత మైన ఈ బలిని స్వీకరింపుము.

**మూ. మహాగణేశ్వరాః సర్వే నన్దీశ్వరపురోగమాః,**
**ప్రగృహ్యతాం బలిర్భక్త్యా మయా సంప్రతిచోదితః. 59**

**తా.** నందీశ్వరుడు నాయకుడుగా గల (నందీశ్వరుడు మొదలైన) సకలమహా గణేశ్వరులారా! నే నిపుడు భక్తితో సమర్పించుచున్న బలిని స్వీకరించండి.

**మూ. నమః పితృభ్యః సర్వేభ్యః ప్రతిగృహ్ణన్త్విమం బలిమ్,**
**(భూతేభ్య శ్చ నమో నిత్యం యేషామేష బలిః ప్రియః)**
**కామపాల! నమో నిత్యం యస్యాయం తే విధిః కృతః. 60**

**తా.** సమస్తపితృదేవతలకు నమస్కారము, మీరు నేను సమర్పించిన బలిని స్వీకరించండి. (నేను సమర్పించిన ఈ బలి ఏ భూతములకు ప్రియమో ఆ భూతము లన్నింటికీ నిత్యమూ నమస్కారము). కామపాలా! (ఎవరో దేవతాపురుషుడు; లేదా సర్వదేవాత్మకుడైన పరమాత్మ) నీకొరకే ఈ విధి అంతా నిర్వహించాం. నీకు నిత్యము నమస్కారము.

**మూ. నారదస్తుమ్బురుశ్చైవ విశ్వావసుపురోగమాః,**
**పరిగృహ్ణన్తు మే సర్వే గన్ధర్వా బలిముద్యతమ్. 61**

**తా.** నారదుడు, తుంబురుడు, విశ్వావసువు మొదలైన ఇతరగంధర్వులు, అందరూ కూడ నేను సమర్పించు బలిని స్వీకరింతురుగాక.

**మూ. యమో మిత్రశ్చ భగవాన్ ఈశ్వరౌ లోకపూజితౌ,**
**ఇమం మే ప్రతిగృహ్ణీతాం బలిం మన్త్రపురస్కృతమ్. 62**

**తా.** యముడు, భగవంతుడైన మిత్రుడు, లోకపూజితులైన ఈ ఇద్దరు ప్రభువులూ కూడ, నేను సమర్పించు, మంత్రపూర్వమైన బలిని స్వీకరించెదరుగాక.

**మూ. రసాతలగతేభ్యశ్చ పన్నగేభ్యో నమో నమః,**
**దిశన్తు సిద్ధిం నాట్యస్య పూజితాః పాపనాశనాః. 63**

**తా.** రసాతలంలో నివసించు పన్నగులకు నమస్కారము! నమస్కారము! నాచేత పూజింపబడిన ఈ పన్నగులు పాపాలను నశింపచేసి నాట్యానికి సిద్ధిని (నిర్విఘ్న ప్రయోగమును) ఇచ్చెదరు గాక!

**మూ. సర్వామ్భసాం పతిర్దేవో వరుణో హంసవాహనః,**
**పూజితః ప్రీతిమానస్తు ససముద్రనదీనదః. 64**

**తా.** సకలజలాలకు అధిపతీ, హంసవాహనుడు, సముద్ర – నదీ – నదాలతో కూడిన వరుణదేవుడు ఇపుడు నాచే పూజింపబడినాడు. ఆతడు నాయందు ప్రీతిమంతు డగుగాక.

**వి.** తూర్పు వైపు ప్రవహించేది నది. పశ్చిమం వైపు ప్రవహించేది నదం.

**మూ. వైనతేయ! మహాసత్త్వ! సర్వపక్షిపతే! విభో!**
**ప్రగృహ్యతాం బలిర్దేవ! మన్త్రపూతో మయోద్యతః. 65**

**తా.** గొప్పబలం కలవాడా! సర్వపక్షుల అధిపతీ! ప్రభూ! దేవా! వినతాకుమారుడ వైన గరుత్మంతుడా! నేను సమర్పించుచున్న మంత్రపూతమైన ఈ బలి స్వీకరింపుము.

**మూ. ధనాధ్యక్షో యక్షపతిః లోకపాలో ధనేశ్వరః,**
**సగుహ్యకః సయక్షశ్చ ప్రతిగృహ్ణాతు మే బలిమ్. 66**

**తా.** ధనాలకు అధ్యక్షుడు, యక్షుల ప్రభువు, లోకపాలుడు అయిన కుబేరుడు, గుహ్యకులు, యక్షులు, నేనిచ్చుచున్న బలిని స్వీకరించెదరు గాక.

**మూ. నమోఽస్తు నాట్యమాతృభ్యో బ్రాహ్మ్యాద్యాభ్యో నమో నమః,**
**సుముఖీభిః ప్రసన్నాభిః బలిరద్య ప్రగృహ్యతామ్. 67**

**తా.** బ్రాహ్మి మొదలైన నాట్యమాతలకు అనేక నమస్కారములు! ప్రసన్నలై ఆనంద భరితముఖములతో ఉండి మీరు ఇపుడీ బలిని స్వీకరింతురు గాక!

**మూ. రుద్రప్రహరణం సర్వం ప్రతిగృహ్ణాతు మే బలిమ్,**
**విష్ణుప్రహరణం చైవ విష్ణుభక్త్యా మయోదితమ్. 68**

**తా.** రుద్రుని ఆయుధా లన్నీ నే నిచ్చుచున్న ఈ బలిని స్వీకరించుగాక. విష్ణువు ఆయుధా లన్నీ విష్ణుభక్తితో నేను సమర్పించుచున్న బలిని స్వీకరించు గాక.

**మూ. తథా కృతాన్తః కాలశ్చ సర్వప్రాణివధేశ్వరౌ,**
**మృత్యుశ్చ నియతిశ్చైవ ప్రతిగృహ్ణాతు మే బలిమ్. 69**

**తా.** సకలప్రాణుల సంహారమునందు సమర్థులైన యముడు, కాలము, మృత్యు దేవత, దైవము నే నిచ్చుచున్న బలిని గ్రహింతురుగాక.

**మూ. యాశ్చాస్యాం మత్తవారణ్యాం సంశ్రితా వాస్తు దేవతాః,**
**మన్త్రపూతమిమం సమ్యక్ ప్రతిగృహ్ణన్తు మే బలిమ్. 70**

**తా.** మత్తవారణిని అధిష్ఠించి ఉన్న వాస్తుదేవతలు, నేను సమర్పించు, మంత్రంచేత పవిత్రమైన ఈ బలిని స్వీకరింతురుగాక.

**మూ. అన్యేఽపి యే దేవగణాః దిశో దశ సమాశ్రితాః,**
**దివ్యాన్తరిక్షభౌమాశ్చ తేభ్యశ్చాయం బలిః కృతః. 71**

**తా.** పది దిక్కులందు ఉన్న దేవత లందరికీ, ద్యులోక – అంతరిక్ష – భూలోకాలకు సంబంధించిన దేవత లందరికీ ఈ బలి సమర్పించుచున్నాను.

**వి.** 47 వ శ్లోకం మొదలు 71 వ శ్లోకంవరకు ఉన్న ఈ శ్లోకాలే ఆ యా దేవతల స్తుతిరూపాలైన మంత్రాలు.

**మూ. కుమ్భం సలిలసంపూర్ణం పుష్పమాలాపురస్కృతమ్,**
**స్థాపయేద్రఙ్గమధ్యే తు సువర్ణం చాత్ర దాపయేత్. 72**

**తా.** ఉదకంతో నిండిన ఒక కుంభాన్ని, పుష్పమాలలతో అలంకరించి రంగ మధ్యంలో దానిని ఉంచాలి. ఆ కుంభంలో బంగారం ఉంచాలి.

**మూ. (ఆతోద్యాని చ సర్వాణి కృత్వా వస్త్రోత్తరాణి తు,**
**గన్ధైర్మాల్యైశ్చ ధూపైశ్చ భక్ష్యైర్భోజ్యైశ్చ పూజయేత్.)**

తా. (వాద్యాలన్నింటిని ఒక చోట ఉంచి వాటిపై వస్త్రాలు ఆచ్ఛాదించి, గంధాల తోను పుష్పమాలలతోను, ధూపాలతోను, భక్ష్యాలతోను, భోజ్యములతోను (ఇవన్నీ సమర్పించి) వాటిని పూజించాలి).

**మూ. పూజయిత్వా తు సర్వాణి దైవతాని యథాక్రమమ్,**
**జర్జరస్త్వభిసంపూజ్యః స్యాత్తతో విఘ్నజర్జరః. 73**

**తా.** ఈ విధంగా క్రమానుసారంగా దేవత లందరికీ పూజలు చేసిన తరువాత, విఘ్నాలను తొలగించే జర్జరానికి పూజ చెయ్యాలి.

**మూ. శ్వేతం శిరసి వస్త్రం స్యాత్ నీలం రౌద్రే చ పర్వణి,**
**విష్ణుపర్వణి వై పీతం, రక్తం స్కన్దస్య పర్వణి. 74**
**మృదపర్వణి చిత్రం తు దేయం వస్త్రం హితార్థినా,**
**సదృశం చ ప్రదాతవ్యం ధూపమాల్యానులేపనమ్. 75**

**తా.** జర్జరం చివర తెల్లని వస్త్రము, రుద్రపర్వానికి నీలవస్త్రము, విష్ణుపర్వానికి పసుపుపచ్చని వస్త్రము, స్కందుని పర్వానికి ఎఱ్ఱని వస్త్రము, మృదుని పర్వానికి చిత్రవర్ణం గల వస్త్రము సమర్పించాలి (కట్టాలి). ఆ వస్త్రాలకి తగిన విధంగా ధూప – మాల్య – అనులేపనాలు సమర్పించాలి.

**వి.** మృడశబ్దానికి ఇక్కడ నాగులు అని అర్థం చెప్పాలి. చూ.ప్ర. అధ్యాయం. 94.శ్లో.

**మూ. ఆతోద్యాని చ సర్వాణి వాసోభిరవగుణ్ఠయేత్,**
**గన్ధైర్మాల్యైశ్చ ధూపైశ్చ భక్ష్యైః భోజ్యైశ్చ పూజయేత్. 76**

**తా.** ఈ శ్లోకం రెంవ పాదంలో చిన్న మార్పుతో 72 వ శ్లోకం తరవాత ప్రక్షిప్త శ్లోకంగా వచ్చనది. నిజానికి ఈ శ్లోకానికి అదే తగిన స్థానం.

**మూ. సర్వమేవంవిధం కృత్వా గన్ధమాల్యానులేపనైః,**
**విఘ్నజర్జరణార్థం తు జర్జరం త్వభిమన్త్రయేత్. 77**

**తా.** గంధ – మాలా – అనులేపనాలతో పూజ అంతా ఈ విధంగా చేసి, విఘ్నాలను తొలగించడానికై జర్జరాన్ని (ఈ విధంగా) అభిమంత్రించాలి. (మంత్రం పఠిస్తూ స్పృశించాలి).

**మూ. అత్ర విఘ్నవినాశార్థం పితామహముఖైః సురైః,**
**నిర్మితస్త్వం మహావీర్యో వజ్రసారో మహాతనుః. 78**

**తా.** ఓ! జర్జరమా! బ్రహ్మ మొదలైన దేవతలు వజ్రం వంటి శక్తి, గొప్ప వీర్యము, గొప్ప శరీరము గల నిన్ను ఇక్కడ సంభవించే విఘ్నాలను నశింపచేయడంకొరకు నిర్మించారు.

**మూ. శిరస్తే రక్షతు బ్రహ్మా సర్వైర్దేవగణైః సహ,**
**ద్వితీయం తు హరః పర్వ, తృతీయం తు జనార్దనః. 79**
**చతుర్థం చ కుమారస్తే పఞ్చమం పన్నగోత్తమః,**
**నిత్యం సర్వేఽపి పాన్తు త్వాం సురార్థే చ శివో భవ. 80**

**తా.** నీ శిరస్సును సకలదేవతాసమేతుడై బ్రహ్మ రక్షించుగాక. రెండవ పర్వను రుద్రుడు, మూడవ పర్వను విష్ణువు, నాల్గవ పర్వను కుమారస్వామి, ఐదవ పర్వను సర్పశ్రేష్ఠుడు, రక్షించుగాక. వీరందరూ నిన్ను రక్షించుగాక. దేవతల కార్యంలో నీవు మంగళకరుడవుగా ఉండాలి.

**మూ. నక్షత్రేఽభిజితి త్వం హి ప్రసూతోఽహితసూదన,**
**జయం చాభ్యుదయం చైవ పార్థివస్య సముద్వహ. 81**

**తా.** శత్రువినాశకమైన ఓ! జర్జరమా! నువ్వు అభిజిత్‌నక్షత్రంలో పుట్టావు. నువ్వు (మా) రాజుకు జయము అభ్యుదయమూ కలిగే టట్లు చెయ్యి.

**మూ. జర్జరం పూజయిత్వైవం బలిం సర్వం నివేద్య చ,**
**అగ్నౌ హోమం తతః కుర్యాత్ మన్త్రాహుతిపురఃసరమ్. 82**

**తా.** ఈ విధంగా జర్జరాన్ని పూజించి, సమస్తమైన బలిని దానికి నివేదించి, తరువాత సమంత్రకంగా, ఆహుతులు చేస్తూ హోమం చెయ్యాలి.

**మూ. హుతాశ ఏవ దీప్తాభిరుల్కాభిః పరిమార్జనమ్,**
**నృపతేర్నర్తకీనాం చ కుర్యాద్దీప్త్యభివర్ధనమ్. 83**

**తా.** అగ్నిలోనే కణకణలాడుతూన్న ఉల్కలతో (కొరవిలతో) రాజుకు, నర్తకు(కీ)లకు, వాళ్ల కాంతిని వృద్ధిపొందించే పరిమార్జనము (శరీరం తుడవడం) చెయ్యాలి.

**వి.** వాళ్లను హోమగుండందగ్గరకు తీసికొని వెళ్లి ఆ కొరవులు దగ్గరగా ఉండే టట్లు చేయడం ద్వారా గాని, లేదా శుభసమయాలలో ఎవరికైనా హారతి ఇచ్చేటపుడు దీపం వాళ్ల ముఖం దగ్గరికి తీసికొనివెళ్లి హస్తచాలనాదుల ద్వారా వాళ్ల ముఖాలకు తేజస్సును కలిగిస్తూన్నట్లు భావనచేయడంవల్ల గాని ఈ పని జరపుతూండవచ్చు.

**మూ. అభిద్యోత్య సహాతోద్యైర్నృపతిం నర్తకీస్తథా,**
**మన్త్రపూతేన తోయేన పునరభ్యుక్ష్య తాన్ వదేత్. 84**

**తా.** వాద్యాలను, రాజును, నర్తకిలను ఈ విధంగా అగ్నిచేత ప్రకాశింపచేసి, మంత్రంచేత పవిత్రమైన ఉదకం వాళ్లమీద చల్లి వాళ్లతో ఇలా చెప్పాలి.

**మూ. "మహాకులే ప్రసూతాః స్థ గుణౌఘైశ్చాప్యలంకృతాః,**
**యద్వో జన్మగుణోపేతం తద్వో భవతు నిత్యశః." 85**

**తా.** "మీరందరూ ఉత్తమకులంలో పుట్టారు. మంచి గుణసంపదచే అలంక రింపబడి ఉన్నారు. మీ పుట్టుకకు సద్గుణాలకూ ఏది అనుగుణమో అది మీకు నిత్యము కలుగుగాక."

**మూ. ఏవముక్త్వా తతో వాక్యం నృపతేర్భూతయే బుధః,**
**నాట్యయోగప్రసిద్ధ్యర్థమాశిషః సంప్రయోజయేత్. 86**

**తా.** పండితుడు (పురోహితుడు) ఇలా పలికి, రాజుకు ఐశ్వర్యం కలగా లనీ, నాట్యప్రయోగం నిర్విఘ్నంగా, చక్కగా జరగా లనీ ఆశీర్వదించాలి.

**మూ. "సరస్వతీ ధృతిర్మేధా హ్రీః శ్రీర్లక్ష్మీః స్మృతిర్మతిః,**
**పాన్తు వో మాతరః సౌమ్యాః సిద్ధిదాశ్చ భవన్తు వః." 87**

**తా.** "తల్లులైన సరస్వతి, ధృతి, మేధ, హ్రీదేవి, శోభ, లక్ష్మి, స్మృతి, మతి మిమ్ములను రక్షించెదరుగాక! మీ విషయంలో సౌమ్యలై (ప్రసన్నలై) మీరు తలబెట్టిన కార్యం సిద్ధించే టట్లు చేయుదురు గాక."

**మూ. హోమం కృత్వా యథాన్యాయం హవిర్మన్త్రపురస్కృతమ్,**
**భిన్ద్యాత్ కుమ్భం తతశ్చైవ నాట్యాచార్యః ప్రయత్నతః. 88**

**తా.** పిమ్మట నాట్యాచార్యుడు శాస్త్రానుసారం హవిస్సులతో మంత్రపూర్వకంగా హోమం చేసి తరవాత కుంభం బ్రద్దలుకొట్టాలి.

**మూ. అభిన్నే తు భవేత్కుమ్భే స్వామినః శత్రుతో భయమ్,**
**భిన్నే చైవ తు విజ్ఞేయః స్వామినః శత్రుసంక్షయః. 89**

**తా.** కుంభం బ్రద్దలవకపోతే రాజుకు శత్రుభయం ఉంటుంది. బ్రద్దలైతే రాజు

శత్రువులు నశిస్తారు.

**మూ. భిన్నే కుమ్భే తతశ్చైవ నాట్యాచార్యః ప్రయత్నతః,**
**ప్రగృహ్య దీపికాం దీప్తాం సర్వం రఙ్గం ప్రదీపయేత్. 90**

**తా.** కుంభం బ్రద్దలుకొట్టిన తరువాత నాట్యాచార్యుడు బాగా వెలుగుతూన్న దీపం (కాగడా) తీసికొని, ప్రయత్నపూర్వకంగా, రంగంలో అంతటా ప్రకాశం వ్యాపించే టట్లు అన్ని మూలలా దానిని చూపాలి.

**మూ. క్ష్వేడితైః స్ఫోటితైశ్చైవ వల్గితైశ్చ ప్రధావితైః,**
**రఙ్గమధ్యే తు తాం దీప్తాం సశబ్దాం సంప్రయోజయేత్. 91**

**తా.** అందరూ కలిసి బిగ్గరగా అరుస్తూ, బొబ్బలు పెడుతూ, గంతులు వేస్తూ, పరుగు లెత్తుతూ, ఇలాంటి కోలాహలధ్వనులతో మండుతూన్న ఆ కాగడాను రంగమధ్య నిలపెట్టాలి.

**మూ. శఙ్ఖదున్దుభినిర్ఘోషైర్మృదఙ్గపణవైస్తథా,**
**సర్వాతోద్యైః ప్రణదితైః రఙ్గే యుద్ధాని కారయేత్. 92**

**తా.** శంఖాలు, దుందుభులు మ్రోగుతూండగా, మృదంగాలు, పణవాలు, సమస్త వాద్యాలు వాయిస్తూండగా, రంగస్థలంలో యుద్ధాలు (Mock - fights) చేయించాలి.

**మూ. సమ్యగిష్టస్తు రఙ్గో వై స్వామినః శుభమావహేత్,**
**పురస్యాబాలవృద్ధస్య తథా జనపదస్య చ. 93**

**తా.** బాగా యథాశాస్త్రంగా చేసిన రంగపూజ రాజుకీ, పురానికీ, ఆబాలవృద్ధప్రజలకు దేశానికీ కూడ శుభం కలిగిస్తుంది.

**మూ. దురిష్టస్తు తథా రఙ్గో దైవతైర్దురధిష్ఠితః,**
**నాట్యవిధ్వంసనం కుర్యాత్ నృపస్య చ తథాఽశుభమ్. 94**

**తా.** పూజలు సరిగా జరగని రంగాన్ని దేవతలు అధిష్ఠించకపోవడంతో, అది నాట్యాన్ని ధ్వంసం చేస్తుంది; రాజుకు అశుభాన్ని కలిగిస్తుంది.

**మూ. య ఏవం విధిముత్సృజ్య యథేష్టం సంప్రయోజయేత్,**
**ప్రాప్నోత్యపచయం శీఘ్రం తిర్యగ్యోనిం చ గచ్ఛతి. 95**

**తా.** ఎవడైతే ఈ విధమైన విధిని (శాస్త్రవిధానాన్ని) విడచి ఇష్టం వచ్చినట్లు చేస్తాడో వాడు వెంటనే సర్వవిధాలా క్షీణత్వం పొందుతాడు; మరణానంతరం తిర్యగ్జంతువుగా పుడతాడు.

**మూ. యజ్ఞేన సంమితం హ్యేతద్రఙ్గదైవతపూజనమ్,**

**అపూజయిత్వా రఙ్గం తు నైవ ప్రేక్షాం ప్రయోజయేత్. 96**

**తా.** ఈ రంగదేవతాపూజ యజ్ఞంతో సమాన మైనది. రంగపూజ చేయకుండా నాట్యప్రదర్శనం చేయకూడదు.

**మూ. పూజితాః పూజయన్త్యేతే మానితా మానయన్తి చ,**
**తస్మాత్సర్వప్రయత్నేన కర్తవ్యం రఙ్గపూజనమ్. 97**

**తా.** రంగమండపాధిష్ఠానదేవతలను పూజిస్తే వాళ్లు పూజిస్తారు; వాళ్లను గౌరవిస్తే వాళ్లూ గౌరవిస్తారు. అందుచేత అన్ని విధాల ప్రయత్నించి రంగపూజ చెయ్యాలి.

**మూ. న తథా ప్రదహత్యగ్నిః ప్రభఞ్జనసమీరితః,**
**యథా హ్యపప్రయోగస్తు ప్రయుక్తో దహతి క్షణాత్. 98**

**తా.** చెడ్డ పద్ధతిలో చేసిన నాట్యప్రయోగం ఏ విధంగా క్షణకాలంలో కాల్చివేస్తుందో ఆ విధంగా పెనుగాలికి సర్వత్రా వ్యాపించిన అగ్ని కూడ కాల్చజాలదు.

**మూ. శాస్త్రజ్ఞేన వినీతేన శుచినా దీక్షితేన చ,**
**నాట్యాచార్యేణ శాన్తేన కర్తవ్యం రఙ్గపూజనమ్. 99**

**తా.** శాస్త్రజ్ఞానం కలవాడు, వినయవంతుడు, పరిశుద్ధుడు, దీక్ష అవలంబించిన వాడు, శాంత స్వభావుడు అయిన నాట్యాచార్యుడు రంగపూజ చెయ్యాలి.

**మూ. స్థానభ్రష్టం తు యో దద్యాద్ బలిముద్విగ్నమానసః,**
**మన్త్రహీనో యథా హోతా ప్రాయశ్చిత్తీ భవేత్తు సః. 100**

**తా.** ఎవడు (ఏ నాటాచార్యుడు) కంగారుపడుతూన్న మనస్సుతో బలిని, చెప్పబడిన స్థానంలో కాక మరొకస్థానంలో ఇస్తాడో అతడు మంత్రం తప్పు చెప్పిన హోత వలె ప్రాయశ్చిత్తం చేసికొనివలసినవా డవుతాడు.

**మూ. ఇత్యయం యో విధిర్దృష్టో రఙ్గదైవతపూజనే,**
**నవే నాట్యగృహే కార్యః ప్రేక్షాయాం చ ప్రయోక్తృభిః. 101**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే రఙ్గదైవతపూజనం నామ తృతీయోఽధ్యాయః.**

**తా.** రంగాధిష్ఠానదేవతల పూజ విషయంలో ఇంతవరకూ చెప్పినవిధి అంతా క్రొత్తగా నిర్మించిన నాట్యగృహం విషయంలోనూ, ఏదైన నాట్యప్రదర్శనం క్రొత్తగా ప్రారంభిస్తూన్నప్పుడూ పాటించాలి.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన 'బాలానందిని' అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో 'రంగదైవతపూజనము' అను తృతీయాధ్యాయం సమాప్తం.**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# చతుర్థోఽధ్యాయః

## తాండవలక్షణము

"స్వవిలాసైరిదం విశ్వం యో దర్శయతి సన్తతమ్,
సమీరమూర్తిం తం వన్దే గిరిరాజసుతాప్రియమ్."

– శ్రీమదభినవగుప్తాచార్యాః

**మూ. ఏవం తు పూజనం కృత్వా మయా ప్రోక్తః పితామహః,**
**ఆజ్ఞాపయ విభో! క్షిప్రం కః ప్రయోగః ప్రయుజ్యతామ్. 1**

**తా.** (ఇవి భరతముని మునులతో అన్న మాటలు) నే నీ విధంగా రంగపూజ చేసి – "ప్రభూ! ఇప్పుడు ఈ నాట్యశాలలో ఏ నాట్యం ప్రయోగం చెయ్యాలో ఆజ్ఞాపించుము" అని బ్రహ్మను అడిగాను.

**మూ. తతోఽస్మ్యుక్తో భగవతా యోజయామృతమన్థనమ్,**
**ఏతదుత్సాహజననం సురప్రీతికరం తథా. 2**

**తా.** బ్రహ్మదేవుడు నా మాటలు విని – "అమృతమంథన మను నాట్యం ప్రయోగింప చేయుము; ఇది సురులకు ఉత్సాహజనకంగాను, ప్రీతికరంగాను ఉంటుంది.

**మూ. "యోఽయం సమవకారస్తు ధర్మకామార్థసాధకః,**
**మయా ప్రాగ్గ్రథితో విద్వన్ సప్రయోగః ప్రయుజ్యతామ్." 3**

**తా.** "ఓ! పండితోత్తమా! ధర్మ – అర్థ – కామాలకు ఉపకరించే ఈ సమవకారం పూర్వం నేనే రచించాను. ఆ ప్రయోగాన్ని ప్రయోగించుము," అని అన్నాడు.

**వి.** 'సమవకారం' దశరూపకాలలో ఒకటి. దీని లక్షణం మున్ముందు ఈ శాస్త్రంలో స్పష్టం అవుతుంది.

**మూ. తస్మిన్సమవకారే తు ప్రయుక్తే దేవదానవాః,**
**హృష్టాః సమభవన్సర్వే కర్మభావానుదర్శనాత్. 4**

**తా.** ఆ సమవకారం ప్రదర్శించగా అది చూచి – దానిలో శారీరక అభినయాదులు, భావావిష్కరణము చక్కగా చేయడంచేత సమస్తదేవతలూ, దానవులూ కూడ సంతోషించారు.

### *అమృతమంథనమును త్రిపురదాహమును శివుని ఎదుట ప్రదర్శించుట*

**మూ. కస్యచిత్త్వథ కాలస్య మామాహామ్బుజసంభవః,**
**నాట్యం సందర్శయామోఽద్య త్రినేత్రాయ మహాత్మనే. 5**

**తా.** "ఈ నాట్యం మహాత్ము డైన త్రినేత్రుని ఎదుట ప్రదర్శిద్దాం" అని కొంతకాలం తరువాత బ్రహ్మదేవుడు నాతో అన్నాడు.

**మూ. తతః సార్ధం సురైర్గత్వా వృషభాఙ్కనివేశనమ్,**
**సమభ్యర్చ్య శివం పశ్చాదువాచేదం పితామహః. 6**

**తా.** పిమ్మట బ్రహ్మదేవుడు దేవతలతో కలిసి శివుని నివాసస్థానానికి వెళ్లి ఆ శివుణ్ణి పూజించి ఆయనతో ఇట్లన్నాడు –

**మూ. "మయా సమవకారస్తు యోఽయం సృష్టః సురోత్తమ,**
**శ్రవణే దర్శనే చాస్య ప్రసాదం కర్తుమర్హసి." 7**

**తా.** "ఓ! సురోత్తమా! నేను రచించిన ఈ సమవకారం విని, చూచి మమ్ములను అనుగ్రహించుము."

**మూ. పశ్యామ ఇతి దేవేశో ద్రుహిణం వాక్యమబ్రవీత్,**
**తతో మామాహ భగవాన్ సజ్జో భవ మహామతే. 8**

**తా.** 'అలాగే; చూస్తాం' అని దేవేశు డైన శివుడు బ్రహ్మదేవునితో అన్నాడు. అప్పుడు భగవంతుడైన బ్రహ్మదేవుడు – "మహాబుద్ధిశాలీ! నువ్వు ప్రదర్శనానికి సిద్ధం అవాలి" అని నన్ను ఆదేశించాడు.

**మూ. తతో హిమవతః పృష్ఠే నానానగసమాకులే,**
**బహుభూతగణాకీర్ణే రమ్యకన్దరనిర్ఝరే. 9**
**పూర్వరఙ్గః కృతః పూర్వం తత్రాయం ద్విజసత్తమాః,**
**తథా త్రిపురదాహశ్చ డిమసంజ్ఞః ప్రయోజితః. 10**

**తా.** బ్రాహ్మణోత్తములారా! అటుపిమ్మట, అనేకవిధాలైన వృక్షాలతో నిండినది, అనేకభూతగణాలతో వ్యాకులమూ, రమ్యమైన గుహలూ, సెలయేళ్లూ కలదీ అయిన హిమవత్పర్వతం పైభాగమునందు తొలిసారిగా ఈ పూర్వరంగం చేయబడినది. తరువాత **'త్రిపురదాహం'** అను డిమం కూడ ప్రయోగించబడింది.

**వి.** 'డిమం' రూపకాలలో ఒక భేదం.

**మూ. తతో భూతగణా హృష్టాః కర్మభావానుకీర్తనాత్,**
**మహాదేవశ్చ సుప్రీతః పితామహమథాబ్రవీత్. 11**

**తా.** అది చూచిన భూతగణా లన్నీ ఆ ప్రదర్శనంలో చేష్టలను భావాలను చక్కగా అనుకరించడం చేత సంతోషించాయి. మహాదేవుడు కూడ చాల సంతోషించి పితామహు నితో ఇలా అన్నాడు.

**మూ. "అహో నాట్యమిదం సమ్యక్ త్వయా సృష్టం మహామతే,**
**యశస్యం చ శుభార్థం చ పుణ్యం బుద్ధివివర్ధనమ్." 12**

**తా.** మహానుభావా! యశస్కరమూ, శుభము చేకూర్చేదీ, పుణ్యప్రదమూ, బుద్ధిని వృద్ధిపొందించేదీ అయిన ఈ నాట్యాన్ని ఆహా! ఎంత చక్కగా సృష్టించావు!

**మూ. మయాపీదం స్మృతం నృత్యం సంధ్యాకాలేషు నృత్యతా,**
**నానాకరణసంయుక్తైరఙ్గహారైర్విభూషితమ్. 13**

**తా.** (నీవు ఈ నాట్యం సృష్టించి నట్లే) నేను కూడ, సంధ్యాకాలాలలో నృత్యం చేసేటప్పుడు అనేకవిధాలైన కరణాలతో కూడిన అంగహారాలచేత అలంకరింపబడిన ఈ నృత్యం స్మరించాను (సృజించాను).

**మూ. పూర్వరఙ్గవిధావస్మింస్త్వయా సమ్యక్ ప్రయోజ్యతామ్,**
**వర్ధమానకయోగేషు గీతేష్వాసారితేషు చ. 14**
**మహాగీతేషు చైవార్థాన్ సమ్యగేవాభినేష్యసి.**

**తా.** నేను సృజించిన ఈ నృత్యాన్ని నీవు ఈ పూర్వరంగవిధియందు, వర్ధమాన కములందు, గీతములందు, మహాగీతములందు బాగా ప్రయోగించుము. అలా నృత్యాన్ని కూడ చేర్చడంచేత విషయాలను చక్కగా అభినయించగలవు. ఆవిష్కరించగలవు.

**వి.** వర్ధమానక – గీత – ఆసారితక – మహాగీతములను గూర్చి ఈ గ్రంథంలోనే మున్ముందు ప్రతిపాదింపబడుతుంది.

**మూ. యశ్చాయం పూర్వరఙ్గస్తు త్వయా శుద్ధః ప్రయోజితః. 15**
**ఏభిర్విమిశ్రితశ్చాయం చిత్రో నామ భవిష్యతి.**

**తా.** నీవు ఇప్పుడు ఏ **శుద్ధపూర్వరంగాన్ని** ప్రయోగింపచేశావో అదే నృత్యంతో మిశ్రితమై **'చిత్రపూర్వరంగం'** అవుతుంది.

**వి.** నృత్యమిశ్రితం కానిది **శుద్ధపూర్వరంగం**. నృత్యమిశ్రితమైనది **'చిత్రపూర్వరంగం'.**

**మూ. శ్రుత్వా మహేశ్వరవచః ప్రత్యుక్తస్తు స్వయంభువా. 16**
**ప్రయోగమఙ్గహారాణామాచక్ష్వ సురసత్తమ.**

**తా.** మహేశ్వరుని మాటలు విని బ్రహ్మదేవుడు – "సురశ్రేష్ఠా! అంగహారాల ప్రయోగం ఎలా ఉంటుందో చెప్పు" అన్నాడు.

**మూ. తతస్తణ్డుం సమాహూయ ప్రోక్తవాన్ భువనేశ్వరః. 17**
**ప్రయోగమఙ్గహారాణామాచక్ష్వ భరతాయ వై.**

**తా.** ఆ మాటలు విని భువనేశ్వరుడు తండువును పిలిపించి "అంగహారాల ప్రయోగం భరతునికి బోధించు" అని ఆతనిని ఆదేశించాడు.

**మూ. తతో వై తణ్డునా ప్రోక్తాస్త్వఙ్గహారా మహాత్మనా. 18**
**తాన్వః కరణసంయుక్తాన్ వ్యాఖ్యాస్యామి సరేచకాన్.**

**తా.** మహాదేవుని ఆజ్ఞ ప్రకారం మహాత్ముడైన తండువు అంగహారాలను నాకు బోధించాడు. కరణాలతోను, రేచకాలతోను సహా ఆ అంగహారాలను మీకు చెపుతాను.

### *ముప్పైరెండు (32) అంగహారాల పేర్లు*

**మూ. స్థిరహస్తోఽఙ్గహారస్తు తథా పర్యస్తకః స్మృతః. 19**
**సూచీవిద్ధస్తథా చైవ హ్యపవిద్ధస్తథైవ చ,**
**ఆక్షిప్తకోఽథ విజ్ఞేయః తథా చోద్ఘట్టితః స్మృతః. 20**
**విష్కమ్భశ్చైవ సంప్రోక్తస్తథా చైవాపరాజితః,**
**విష్కమ్భాపసృతశ్చైవ మత్తాక్రీడస్తథైవ చ. 21**
**స్వస్తికో రేచితశ్చైవ పార్శ్వస్వస్తిక ఏవ చ,**
**వృశ్చికాపసృతః ప్రోక్తో భ్రమరశ్చ తథాఽపరః. 22**
**మత్తస్ఖలితకశ్చైవ మదాద్విలసితస్తథా,**
**గతిమణ్డలకో జ్ఞేయః పరిచ్ఛిన్నస్తథైవ చ. 23**
**పరివృత్తచితోఽథ స్యాత్తథా వైశాఖరేచితః,**
**పరావృత్తోఽథ విజ్ఞేయః తథా చైవాప్యలాతకః. 24**
**పార్శ్వచ్ఛేదోఽథ సంప్రోక్తో విద్యుద్భ్రాన్తస్తథైవ చ,**
**ఊరూద్వృత్తస్తథా చైవ స్యాదాలీఢస్తథైవ చ. 25**
**రేచితశ్చాపి విజ్ఞేయస్తథైవాచ్ఛురితః స్మృతః,**
**ఆక్షిప్తరేచితశ్చైవ సంభ్రాన్తశ్చ తథాపరః. 26**
**అపసర్పస్తు విజ్ఞేయస్తథా చార్ధనికుట్టకః,**
**ద్వాత్రింశదేతే సంప్రోక్తా అఙ్గహారాస్తు నామతః. 27**
**ఏతేషాం తు ప్రవక్ష్యామి ప్రయోగం కరణాశ్రయమ్.**

తా. ముప్పై రెండు (32) అంగహారాల పేర్లు –

(1) స్థిరహస్తం (2) పర్యస్తకం (3) సూచీవిద్ధం (4) అపవిద్ధం (5) ఆక్షిప్తకం (6) ఉద్ఘట్టితం (7) విష్కంభం (8) అపరాజితం (9) విష్కంభాపసృతం (10) మత్తాక్రీడం

(11) స్వస్తికరేచితం (12) పార్శ్వస్వస్తికం (13) వృశ్చికాపసృతం (14) భ్రమరం (15) మత్తస్ఖలితకం (16) మదవిలసితం (17) గతిమండలం (18) పరిచ్ఛిన్నం (19) పరివృత్తరేచితం (20) వైశాఖరేచితం (21) పరావృత్తం (22) అలాతకం (23) పార్శ్వచ్ఛేదం (24) విద్యుద్భ్రాంతం (25) ఊరూద్వృత్తం (26) ఆలీఢం (27) రేచితం (28) ఆచ్ఛురితం (29) ఆక్షిప్తరేచితం (30) సంభ్రాంతం (31) అపసర్పం (32) అర్ధనికుట్టకం.

ఈ విధంగా ముప్పైరెండు అంగహారాల పేర్లు చెప్పాను. ఇప్పుడు కరణాలను ఆశ్రయించి వీటి ప్రయోగం ఎలా చెయ్యాలో చెపుతాను.

### *అంగహారముల ఉపకరణాలు*

**మూ. హస్తపాదప్రచారశ్చ యథా యోజ్యః ప్రయోక్తృభిః. 28**
**అఙ్గహారేషు వక్ష్యామి కరణేషు చ వై ద్విజాః.**

**తా.** బ్రాహ్మణులారా! అంగహారాల, కరణాల ప్రయోగం చేసేవాళ్లు ఏ విధంగా తమ హస్తాలు, పాదాలు కదల్చాలో కూడ చెపుతాను.

**మూ. సర్వేషామఙ్గహారాణాం నిష్పత్తిః కరణైర్యతః. 29**
**తాన్యతః సంప్రవక్ష్యామి నామతః కర్మతస్తథా.**
**హస్తపాదసమాయోగో నృత్యస్య (నృత్తస్య) కరణం భవేత్. 30**

**తా.** అంగహారా లన్నీ కరణాల సాహాయ్యంతోనే సంపాదింపబడతాయి, చూప బడతాయి. అందుచేత కరణాల పేర్లు వాటి ప్రయోగవిధానము చెపుతాను. నృత్యంలో (నృత్తంలో) చేసే హస్త – పాద సంచాలనమే (హస్తాలు, పాదాలు కదల్చడానికే) కరణ మని పేరు.

**మూ. ద్వే నృత్తకరణే చైవ భవతో నృత్తమాతృకా,**
**ద్వాభ్యాం త్రిభిశ్చతుర్భిర్వాప్యఙ్గహారస్తు మాతృభిః. 31**

**తా.** రెండు నృత్తకరణాలకు నృత్తమాతృక అని పేరు. అంగహారం, రెండు లేదా మూడు లేదా నాలుగు నృత్తమాతృకల కలయికచేత చేయబడుతుంది. ఏర్పడుతుంది.

**మూ. త్రిభిః కలాపకం చైవ చతుర్భిర్మణ్డకం భవేత్,**
**పఞ్చైవ కరణాని స్యుః సంఘాతక ఇతి స్మృతః. 32**

**తా.** మూడు నృత్తకరణాలకు కలాపకం అనీ, నాలిగింటికి మండకం అనీ, అయిదింటికి సంఘాతకం అనీ పేర్లు.

మూ. షడ్భిర్వా సప్తభిర్వాపి అష్టభిర్నవభిస్తథా,
కరణైరిహ సంయుక్తా అఙ్గహారాః ప్రకీర్తితాః. **33**
ఏతేషామేవ వక్ష్యామి హస్తపాదవికల్పనమ్.

**తా.** పైన చెప్పిన సంఖ్యలోనే కాక – ఆరు లేదా ఏడు లేదా ఎనిమిది లేదా తొమ్మిది కరణాల, సంయోగం ఉన్న అంగహారాలు కూడ ఉంటాయి. వాటికి సంబంధించిన హస్త – పాదాది సంచాలనమును గూర్చి చెపుతాను.

### *నూటఎనిమిది (108) కరణాల పేర్లు*

మూ. తలపుష్పపుటం పూర్వం వర్తితం వలితోరు చ. **34**
అపవిద్ధం సమనఖం లీనం స్వస్తికరేచితమ్,
మణ్డలస్వస్తికం చైవ నికుట్టకమథాపి చ. **35**
తథైవార్ధనికుట్టం చ కటిచ్ఛిన్నం తథైవ చ,
అర్ధరేచితకం చైవ వక్షఃస్వస్తికమేవ చ. **36**
ఉన్మత్తం స్వస్తికం చైవ పృష్ఠస్వస్తికమేవ చ,
దిక్స్వస్తికమలాతం చ తథైవ చ కటీసమమ్. **37**
ఆక్షిప్తరేచితం చైవ విక్షిప్తాక్షిప్తకం తథా,
అర్ధస్వస్తికముద్దిష్టమఞ్చితం త తథాపరమ్. **38**
భుజఙ్గత్రాసితం ప్రోక్తమూర్ధ్వజాను తథైవ చ,
నికుఞ్చితం చ మత్తల్లి త్వర్ధమత్తల్లి చైవ హి. **39**
స్యాద్రేచితనికుట్టం చ తథా పాదాపవిద్ధనమ్,
వలితం ఘూర్ణితం చైవ లలితం చ తథాపరమ్. **40**
దణ్డపక్షం తథా చైవ భుజఙ్గత్రస్తరేచితమ్,
నూపురం చైవ సంప్రోక్తం తథా వైశాఖరేచితమ్. **41**
భ్రమరం చతురం చైవ భుజఙ్గాఞ్చితమేవ చ,
దణ్డరేచితకం చైవ తథా వృశ్చికకుట్టితమ్. **42**
కటిభ్రాన్తం తథా చైవ లతావృశ్చికమేవ చ,
ఛిన్నం చ కరణం ప్రోక్తం తథా వృశ్చికరేచితమ్. **43**
వృశ్చికం వ్యసితం చైవ తథా పార్శ్వనికుట్టకమ్,
లలాటతిలకం క్రాన్తం కుఞ్చితం చక్రమణ్డలమ్. **44**

ఉరోమణ్డలమాక్షిప్తం తథా తలవిలాసితమ్,
అర్గలం చాథ విక్షిప్తమావృత్తం దోలపాదకమ్. **45**

వివృతం వినివృత్తం చ పార్శ్వక్రాన్తం నిశుమ్భితమ్,
విద్యుద్భ్రాన్తమతిక్రాన్తం వివర్తితకమేవ చ. **46**

గజక్రీడితకం చైవ తలసంస్ఫోటితం తథా,
గరుడప్లుతకం చైవ గణ్డసూచి తథాపరమ్. **47**

పరివృత్తం సముద్దిష్టం పార్శ్వజాను తథైవ చ,
గృధ్రావలీనకం చైవ సన్నతం సూచ్యథాపి చ. **48**

అర్ధసూచీతి కరణం సూచీవిద్ధం తథైవ చ,
అపక్రాన్తం చ సంప్రోక్తం మయూరలలితం తథా. **49**

సర్పితం దణ్డపాదం చ హరిణప్లుతమేవ చ,
ప్రేఙ్ఖోలితం నితమ్బం చ స్ఖలితం కరిహస్తకమ్. **50**

ప్రసర్పాతక ముద్దిష్టం సింహవిక్రీడితం తథా,
సింహాకర్షితముద్వృత్తం తథోపసృతమేవ చ. **51**

తలసంఘట్టితం చైవ జనితం చావహిత్థకమ్,
నివేశమేలకాక్రీడమూరూద్వృత్తం తథైవ చ. **52**

మదస్ఖలితకం చైవ విష్ణుక్రాన్తమథాపి చ,
సంభ్రాన్తమథ విష్కమ్భముద్ఘట్టితమథాపి చ. **53**

వృషభక్రీడితం చైవ లోలితం చ తథాపరమ్,
నాగాపసర్పితం చైవ శకటాస్యం తథైవ చ. **54**

గఙ్గావతరణం చైవేత్యుక్తమష్టాధికం శతమ్,
అష్టోత్తరశతం హ్యేతత్కరణానాం మయోదితమ్. **55**

**తా.** నూట ఎనిమిది (108) కరణాల పేర్లు –

(1) తలపుష్పపుటం (2) వర్తితం (3) వలితోరు (4) అపవిద్ధం (5) సమనఖం (6) లీనం (7) స్వస్తికరేచితం (8) మండలస్వస్తికం (9) నికుట్టకం (10) అర్ధనికుట్టకం (11) కటిచ్ఛిన్నం (12) అర్ధరేచితం (13) వక్షఃస్వస్తికం (14) ఉన్మత్తం (15) స్వస్తికం (16) పృష్ఠస్వస్తికం (17) దిక్స్వస్తికం (18) అలాతం (19) కటీసమం (20) ఆక్షిప్తరేచితం (21) విక్షిప్తాక్షిప్తకం (22) అర్ధస్వస్తికం (23) అంచితం (24) భుజంగత్రాసితం (25) ఊర్ధ్వజాను (26) నికుంచితం (27) మత్తల్లి (28) అర్ధమత్తల్లి (29) రేచకనికుట్టం

(30) పాదాపవిద్ధకం (31) వలితం (32) ఘూర్ణితం (33) లలితం (34) దండపక్షం (35) భుజంగత్రస్తరేచితం (36) నూపురం (37) వైశాఖరేచితం (38) భ్రమరం (39) చతురం (40) భుజంగాంచితం (41) దండరేచితకం (42) వృశ్చికకుట్టితం (43) కటభ్రాంతం (44) లతావృశ్చికం (45) ఛిన్నం (46) వృశ్చికరేచితం (47) వృశ్చికం (48) వ్యసితం (49) పార్శ్వనికుట్టకం (50) లలాటతిలకం (51) క్రాంతకం (52) కుంచితం (53) చక్రమండలం (54) ఉరోమండలం (55) ఆక్షిప్తం (56) తలవిలాసితం (57) అర్గలం (58) విక్షిప్తం (59) ఆవృత్తం (60) దోలపాదకం (61) వివృత్తం (62) వినివృత్తం (63) పార్శ్వక్రాంతం (64) నిశుంభితం (65) విద్యుద్భ్రాంతం (66) అతిక్రాంతం (67) వివర్తితకం (68) గజక్రీడితకం (69) తలసంస్ఫోటితం (70) గరుడప్లుతకం (71) గండసూచి (72) పరివృత్తం (73) పార్శ్వజాను (74) గృధ్రావలీనకం (75) సంనతం (76) సూచి (77) అర్ధసూచి (78) సూచీవిద్ధం (79) అపక్రాంతం (80) మయూరలలితం (81) సర్పితం (82) దండపాదం (83) హరిణప్లుతం (84) ప్రేంఖోలితం (85) నితంబం (86) స్ఖలితం (87) కరిహస్తం (88) ప్రసర్పితం (89) సింహవిక్రీడితం (90) సింహకర్షితం (92) ఉపసృతం (93) తలసంఘట్టితం (94) జనితం (95) అవహిత్థకం (96) నివేశం (97) ఏలకాక్రీడం (98) ఉద్వృత్తం (99) మదస్ఖలితకం (100) విష్ణుక్రాంతం (101) సంభ్రాంతం (102) విష్కంభం (103) ఉద్ఘట్టితం (104) వృషభక్రీడితం (105) లోలితం (106) నాగాపసర్పితం (107) శకటాస్యం (108) గంగావతరణం.

ఈ విధంగా నూట ఎనిమిది (108) కరణాలు నేను చెప్పి ఉన్నాను.

**మూ. నృత్తే యుద్ధే నియుద్ధే చ తథా గతిపరిక్రమే,**
**గతిప్రచారే వక్ష్యామి యుద్ధచారీవికల్పనమ్. 56**
**యత్ర తత్రాపి సంయోజ్యమాచార్యైర్నాట్యశక్తితః.**

**తా.** ఈ కరణాలను నృత్తంలోను, యుద్ధ - బాహుయుద్ధ ప్రదర్శనలలోను, (గత్యధ్యాయంలో చెప్పబోవు) గతులకు సంబంధించిన నడకలలోను (పరిక్రమే) ఉపయోగించాలి. గతిప్రచారంలో కూడ యుద్ధచారీల ఏర్పాటును (వినియోగాన్ని) గూర్చి చెప్పగలను. ఆచార్యులు, పైన చెప్పిన స్థలాలలోనే కాక మరెక్కడనైనా కూడ నాట్యోప యోగాన్ని పట్టి వీటిని కూర్చుకొనవచ్చును.

### *కరణాల సాధారణముద్ర*

**మూ. ప్రాయేణ కరణే కార్యో వామో వక్షఃస్థితః కరః. 57**
**చరణస్యానుగశ్చాపి దక్షిణస్తు భవేత్కరః.**

**తా.** సాధారణగా (చాలావరకు) కరణాలలో, ఎడమ చెయ్యి వక్షస్థలంమీద ఉంచాలి. కుడి చెయ్యి కుడి పాదాన్ని అనుసరించి ఉంటుంది.

**మూ. హస్తపాదప్రచారం తు కటిపార్శ్వోరుసంయుతమ్. 58**
**ఉరఃపృష్ఠోదరోపేతం వక్ష్యమాణం నిబోధత.**

**తా.** నడుము, పార్శ్వాలు, తొడలు, వక్షఃస్థలము, వెనుకభాగం (వీపు), పొట్ట – వీటితో సంబంధించిన హస్త – పాదాలకు చేష్టలను (కదలికలను) చెపుతున్నాను, వినండి.

**మూ. యాని స్థానానిని యాశ్చార్యో నృత్తహస్తాస్థథైవ చ. 59**
**సా మాతృకేతి విజ్ఞేయా తద్యోగాత్కరణం భవేత్.**

**తా.** స్థానము, చారి, నృత్తహస్తాలు – వీటినే **మాతృక** అంటారు. వీటి కలయిక చేతనే కరణాలు ఏర్పడతాయి.

**మూ. కటీ కర్ణసమా యత్ర కోర్పరాంసశిరస్తథా. 60**
**సమున్నతమురశ్చైవ సౌష్ఠవం నామ తద్భవేత్.**

**తా.** కటిప్రదేశం కర్ణాలతో సమంగా ఉండి, మోచెయ్యి, భుజము, శిరస్సు, వక్షఃస్థలము ఉన్నతంగా ఉన్నట్లయితే అది సౌష్ఠవం అవుతుంది. (భావం తెలియలేదు)

### *ఇపుడు 108 కరణాల లక్షణాలు, పేర్లు చెప్పిన క్రమంలో చెప్పబడుచున్నాయి*

**మూ. వామే పుష్పపుటః పార్శ్వే పాదోఽగ్రతలసఞ్చరః. 61**
**తథా చ సంనతం పార్శ్వం తలపుష్పపుటం భవేత్.**

**తా.** (1) **తలపుష్పపుటం :–** హస్తాలు పుష్పపుటముద్రలో ఎడమపార్శ్వంలోను, పాదాలు అగ్రతలసంచరంలోను ఉండగా పార్శ్వభాగం సన్నతం అయి ఉంటే అది **తలపుష్పపుటకరణం.**

**వి.** చేతులు రెండూ సర్పం పడగ ఆకారంలో కనబడే టట్లు వాటి వ్రేళ్లు కలిసి ముడిచి, ఆ చేతులు కొంచెం దూరంగా ఉండేటట్లు చేసిన ముద్ర **పుష్పపుటముద్ర.**

పాదం మణవ పైకి ఎత్తి బొటనవేలు నిటాగ్గాను, మిగిలిన వేళ్లు వంచీ, ఉంచి నట్లయితే అది **అగ్రతలసంచరపాదం.**

నడుము కొంచెం వంగి ఉండగా ఒక పార్శ్వం కూడ కొంచెం వంగి ఉండాలి. ఒక వైపు బుజం కొంచెం లాగినట్లు ఉండాలి. ఈ స్థితికి (position; pose; posture) **సన్నతపార్శ్వం** అని పేరు.

**మూ. కుఞ్చితౌ మణిబన్ధే తు వ్యావృత్తపరివర్తితౌ. 62**
**హస్తౌ నిపతితౌ చోర్వోర్వర్తితం కరణం తు తత్.**

**తా.** (2) **వర్తితం :–** రెండు చేతులు మణికట్టుల దగ్గర వంచి ఒకటి వ్యావృత్తం గాను (తిరగవేసినట్లుగాను) రెండవది పరివర్తితంగాను (బోర్లావేసి ఉండేటట్లు) వాటిని తొడలమీద ఉంచినట్లైతే అది **వర్తితకరణం.**

**మూ. శుకతుణ్డౌ యదా హస్తౌ వ్యావృత్తపరివర్తితౌ. 63**
**ఊరూ చ వలితౌ యస్మిన్ వలితోరుకముచ్యతే.**

**తా.** (3) **వలితోరు :–** శుకతుండముద్రలో ఉన్న చేతులలో ఒకదానిని తిరగా, ఒకదానిని బోర్లా ఉంచి ఊరువులను వలితం చేస్తే అది **వలితోరుకరణం.**

**వి.** అనామికను ధనురాకారంలో వంచి, బొటనవ్రేలు తర్జనీ కూడ ముడిచి మిగిలిన వేళ్లు చాపి ఉంచిన ముద్ర శుకతుండముద్ర (చిలుకముక్కు ఆకారంలో ఉన్న ముద్ర). మోకాళ్ల దగ్గర వంచి తొడలు కొంచెం అడ్డంగా విస్తరింపచేయడం **వలితం.**

**మూ. ఆవర్త్య శుకతుణ్డాఖ్యమూరుపృష్ఠే నిపాతయేత్. 64**
**వామహస్తశ్చ వక్షఃస్థోఽ పృపవిద్ధం తు తద్భవేత్.**

**తా.** (4) **అపవిద్ధం :–** శుకతుండముద్ర ఉన్న కుడిచెయ్యి వెల్లగిలా తొడమీద ఉంచి, ఎడమ చెయ్యి వక్షంమీద ఉంచితే అది అపవిద్ధకరణం.

**మూ. శ్లిష్టౌ సమనఖౌ పాదౌ కరౌ చాపి ప్రలమ్బితౌ. 65**
**దేహః స్వాభావికో యత్ర భవేత్సమనఖం తు తత్.**

**తా.** (5) **సమనఖం :–** వేళ్ల గోళ్లు అన్నీ స్పష్టంగా కనబడే టట్లు (అనగా ఏ వేలూ కూడ ముణవకుండగా) ఉన్న రెండు పాదాలను దగ్గరగా చేర్చి, రెండు చేతులూ క్రిందికి జారవిడచి, మాములుగా శరీరం నిలచి ఉన్న స్థితి **సమనఖకరణం.**

**మూ. పతాకాఞ్జలి వక్షస్థం ప్రసారితశిరోధరమ్. 66**
**నికుఞ్చితాంసకూటం చ తల్లీనం కరణం స్మృతమ్.**

**తా.** (6) **లీనం :–** పతాకాంజలి వక్షఃస్థలంమీద ఉంచాలి. మెడ చాపాలి. భుజపీఠం (భుజాలు రెండూ) కొంచెం ముందుకు వంచాలి. ఇది **లీనకరణం.**

**వి.** కలిసి ఉన్న నాలుగు వేళ్లూ ముందుకు చాపి, బొటనవేలు కొంచెం వంచిన చెయ్యి **పతాక.** ఆ పతాకాముద్రలో ఉన్న రెండుచేతులూ దగ్గరగా చేరిస్తే అది **అంజలి.** ఆ అంజలిని వక్షస్థలంమీద ఉంచాలి.

**మూ. స్వస్తికౌ రేచితావిద్ధౌ విశ్లిష్టౌ కటిసంశ్రితౌ. 67**
**యత్ర తత్కరణం జ్ఞేయం బుధైః స్వస్తికరేచితమ్.**

**తా.** (7) **స్వస్తికరేచితం :–** రేచిత – ఆవిద్ధ అవస్థలలో (Pose) ఉన్న చేతులు స్వస్తికముద్రలో కూర్చి, పిమ్మట వాటిని వేరు చేసి నడుముమీద ఉంచుకొన్నట్లయితే అది **స్వస్తికరేచితకరణం.**

**వి.** శీఘ్రంగా త్రిప్పబడు రెండు హంసపక్షముద్రలకు **రేచిత** మని పేరు. మూడు వేళ్లు చాపి, కనిష్ఠిక (చిటికెన వేలు) పైకి ఎత్తి, బొటనవేలు వంచి ఉంచగా ఏర్పడిన ముద్ర **హంసపక్షకముద్ర.**

రెండుప్రక్కలా (అటూ, ఇటూ ఉన్న) భుజాలు, భుజాలపై భాగాలు, చేతులు, అరచేతులు స్పృశించి రెండు చేతులూ వంకరగా వీపుమీదికి త్రిప్పడం **ఆవిద్ధవక్రత.**

రెండు అరాలహస్తాలు ముఖాలు పైకి ఉండే టట్లు చేసి వాటి ముంజేతులు కలిపి ఉంచడం **స్వస్తికముద్ర.**

**మూ. స్వస్తికౌ తు కరౌ కృత్వా ప్రాఙ్ముఖోర్ధ్వతలౌ సమౌ. 68**
**తథా చ మణ్డలం స్థానం మణ్డలస్వస్తికం తు తత్.**

**తా.** (8) **మండలస్వస్తికం :–** చేతులు స్వస్తికముద్రలో ఉంచి, వాటి అరచేతులు పై వైపు సమంగా ఉంచి, దేహాన్ని మండలస్థానం (Pose) లో ఉంచితే అది **మండల స్వస్తికం.**

**మూ. నికుట్టితౌ యదా హస్తౌ స్వబాహుశిరసోఽన్తరే. 69**
**పాదౌ నికుట్టితౌ చైవ జ్ఞేయం తత్తు నికుట్టకమ్.**

**తా.** (9) **నికుట్టకం :–** తన (రెండవ) బాహువుకు శిరస్సుకు మధ్య హస్తం నికుట్టితం చేసి, పాదం కూడ నికుట్టితం చేస్తే అది **నికుట్టకకరణం.**

**వి.** నికుట్టనం అనగా పైకీ క్రిందికీ తిప్పడం. కుడిచేతితో నికుట్టనం చేసేటప్పుడు కుడికాలు, ఎడమచేతితోనికుట్టనంచేసేటప్పుడు ఎడమకాలు కదుపుతూండడం పాద నికుట్టనం.

**మూ. అఞ్చితౌ బాహూ శిరసి హస్తస్త్వభిముఖాఙ్గులిః. 70**
**నికుఞ్చితార్ధయోగేన భవేదర్ధనికుట్టకమ్.**

**తా.** (10) **అర్ధనికుట్టకం :–** రెండు బాహువులు వంగి ఉండాలి. హస్తం శిరస్సుమీద వ్రేళ్లు అభిముఖంగా ఉండే టట్లు ఉంచాలి. ఒక పాదం పైకి క్రిందికీ కదల్చాలి. ఇది **అర్ధనికుట్టకరణం.**

**మూ. పర్యాయశః కటిః ఛిన్నా బాహ్వోః శిరసి పల్లవౌ. 71**
**పునః పునశ్చ కరణం కటిచ్ఛిన్నం తు తద్భవేత్.**

**తా.** (11) **కటిచ్ఛిన్నం :–** కటిప్రదేశం అనేకపర్యాయాలు ఛిన్నముద్రలో ఉండాలి. రెండు హస్తాలు పల్లవముద్రతో అనేక పర్యాయాలు శిరస్సుమీద ఉంచాలి. ఇది **కటిచ్ఛిన్న కరణం.**

**వి.** పతాకముద్రలో ఉన్న రెండు హస్తాలను మణికట్టుల దగ్గర కలిపితే అది **పల్లవముద్ర.**

**మూ. అపవిద్ధకరః సూచ్యా పాదశ్చైవ నికుట్టితః. 72**
**సన్నతం యత్ర పార్శ్వం చ తద్భవేదర్ధరేచితమ్.**

**తా.** (12) **అర్ధరేచితం :–** హస్తాలను సూచీముఖముద్రచే బంధించాలి. పాదాలు మాటి మాటికి పైకి క్రిందికీ కదల్చాలి. పార్శ్వభాగాలు కొంచెం వంగాలి. హస్తాలు దగ్గరగా చేర్చాలి. ఇది **అర్ధరేచితకరణం.**

**వి.** సర్పం పడగ ఆకారంలో ఉన్న రెండు హస్తాల మధ్య వేళ్లతో బొటనవేళ్లు స్పృశిస్తూ రెండు హస్తాల ముఖాలు (అగ్రాలు) అడ్డంగా చాపితే అది **సూచీముఖముద్ర.**

**మూ. స్వస్తికౌ చరణౌ యత్ర కరౌ వక్షసి రేచితౌ, 73**
**నికుఞ్చితం తథా వక్షో వక్షఃస్వస్తికమేవ తత్.**

**తా.** (13) **వక్షఃస్వస్తికం :–** పాదాలు స్వస్తికముద్రలో ఉండాలి. రెండు హస్తాలు రేచితస్థితిలో వక్షఃస్థలంమీద ఉండాలి. వక్షస్థలం కొంచెం వంగాలి. ఇది **వక్షఃస్వస్తిక** కరణం.

**మూ. అఞ్చితేన తు పాదేన రేచితౌ తు కరౌ యదా. 74**
**ఉన్మత్తం కరణం తత్తు విజ్ఞేయం నృత్తకోవిదైః.**

**తా.** (14) **ఉన్మత్తకరణం :–** పాదాలు అంచితములై ఉండాలి. చేతులు రేచితములై ఉండాలి. అది **ఉన్మత్తకరణం** అని నృత్తకోవిదులు తెలుసుకోవాలి.

**వి.** నేలపై మణవలమీద నిలబడి అరికాలు పైకి ఎత్తి, అన్ని వేళ్లూ క్రిందికి మునవాలి. ఇలా ఉన్న పాదం **అంచితపాదం.**

**మూ. హస్తాభ్యామథ పాదాభ్యాం భవతః స్వస్తికౌ యదా. 75**
**తత్స్వస్తికమతి ప్రోక్తం కరణం కరణార్థిభిః.**

**తా.** (15) **స్వస్తికం :–** హస్తాలూ, పాదాలూ కూడ స్వస్తికముద్రలో ఉంటే అది **స్వస్తికకరణం** అని కరణాలు చేయగోరువారు అంటారు.

**మూ. విక్షిప్తాక్షిప్తబాహుభ్యాం స్వస్తికౌ చరణౌ యదా, 76**
**అపక్రాన్తార్ధసూచిభ్యాం తత్ పృష్ఠస్వస్తికం భవేత్.**

**తా.** (16) **పృష్ఠస్వస్తికం :–** పైకి ఎత్తుతూ క్రిందికి దించుతూ కదిలిస్తూన్న బాహువులు స్వస్తికముద్రలో ఉండాలి. పాదాలు అపక్రాంత – అర్ధసూచీ చారీలతో స్వస్తికంగా ఏర్పడుతూండాలి. ఇది **పృష్ఠస్వస్తికకరణం**.

**వి.** రెండు ఊరువులు వలనముద్రలో ఉండాలి (ఊరువులను దూరంగా ఉండే టట్లు మధ్య దూరం పెరిగే టట్లు చెయ్యాలి). ఒక పాదం వంచి పైకెత్తి పార్శ్వభాగం వైపు ఉంచాలి. ఇది **అపక్రాంతచారి**.

వంచిన పాదం పైకెత్తి మోకాలిపైకి ప్రసరింపచేసి దానిని ఎదుట నేల మీద పడవేయాలి. ఇది **అర్ధసూచి**.

**మూ. పార్శ్వయోరగ్రతశ్చైవ యత్ర శ్లిష్టః కరో(కృతో)భవేత్. 77**
**స్వస్తికో హస్తపాదాభ్యాం తద్దిక్స్వస్తికముచ్యతే.**

**తా. దిక్స్వస్తికం :–** రెండుపార్శ్వాలకు, ముందుకూ, వెనుకకూ వంగుతూ ఏక కాలంలో హస్తాల చేత పాదాలచేత స్వస్తిముద్ర చూపితే అది **దిక్స్వస్తికరణం**.

**మూ. అలాతం చరణం కృత్వా వ్యంసయేద్దక్షిణం కరమ్. 78**
**ఊర్ధ్వజానుక్రమం కుర్యాత్ అలాతకమితి స్మృతమ్.**

**తా.** (18) **అలాతకం :–** అలాతచారి చేస్తూ, కుడి చెయ్యి క్రిందికి జార్చాలి; వ్రేలాడే టట్లు ఉంచాలి. ఊర్ధ్వజానుచారీని చెయ్యాలి. అది **అలాతకరణం.**

**వి.** పాదం ముందుగా వెనుకకు లాగి, ఒక తిప్పు తిప్పి, మళ్లీ దానిని దాని చోట్లో మణవ స్థిరంగా, నేలను నొక్కిపెట్టి ఉండే టట్లు ఉంచాలి. ఇది **అలాతచారి.**

పాదం మణచి మోకాలు వక్షఃస్థలం ఎత్తు లేపాలి; రెండవ కాలు నేలమీద స్థిరంగా ఉండాలి. రెండవ మోకాలు కూడ అలాగే చెయ్యాలి. ఇది **ఊర్ధ్వజానుచారి.**

**మూ. స్వస్తికాపసృతః పాదః కరౌ నాభికటిస్థితౌ. 79**
**పార్శ్వముద్వాహితం చైవ కరణం తత్కటీసమమ్.**

**తా.** (19) **కటీసమం :–** స్వస్తికకరణం ఏర్పరచిన తరువాత పాదాలసు విడిగా ఉంచి, ఒక చెయ్యి నాభిదగ్గర, రెండవది కటిప్రదేశంమీద ఉంచి, పార్శ్వాన్ని ఉద్వాహిత ముద్రలో ఉంచుతే అది **కటీసమకరణం.**

**వి. ఉద్వాహితం** అనగా పైకి ఉబికి నట్లు, లేచి నట్లు చేయడం.

**మూ. హస్తో యది భవేద్వామః సవ్యశ్చాక్షిప్తరేచితః. 80**
**రేచితశ్చాపవిద్ధశ్చ తత్స్యాదాక్షిప్తరేచితమ్.**

**తా.** (20) **ఆక్షిప్తరేచితం :–** ఎడమ చెయ్యి హృదయంమీద, కుడి చెయ్యి రేచితమై, పిమ్మట రెండు చేతులూ అపవిద్ధముద్రలో రేచతము లైతే అది **ఆక్షిప్తరేచితకరణం.**

**మూ. విక్షిప్తం హస్తపాదం చ తస్యైవాక్షేపణం పునః. 81**
**యత్ర తత్కరణం జ్ఞేయం విక్షిప్తాక్షిప్తకం ద్విజాః.**

**తా.** (21) **విక్షిప్తాక్షిప్తం :–** కాళ్లూ చేతులూ ముందుగా పైకీ, తరవాత క్రిందికి వేగంగా విసిరివేసి నట్లు కదిపితే అది **విక్షిప్తాక్షిప్తకకరణం.**

**మూ. స్వస్తికౌ చరణౌ కృత్వా కరిహస్తం చ దక్షిణమ్. 82**
**వక్షఃస్థలే తథా వామమర్ధస్వస్తికమాదిశేత్.**

**తా.** (22) **అర్ధస్వస్తికం :–** రెండు కాళ్లు స్వస్తికంగా ఏర్పరచి, కుడి చేతిలో కరిహస్తముద్ర వేసి, ఎడమచెయ్యి వక్షఃస్థలంమీద ఉంచినట్లయితే అది **అర్ధస్వస్తికకరణం.**

**వి.** లతాముద్రలో ఉన్న, అనగా అడ్డంగా పార్శ్వం వైపు చాపిన, హస్తం పైకి ఎత్తి, ఇటూ అటూ ఊపుతూ త్రిపతాకముద్రలో ఉన్న రెండవ హస్తాన్ని చేతిమీద ఉంచడం **కరిహస్తం.**

**మూ. వ్యావృత్తపరివృత్తస్తు స ఏవ తు కరో యదా. 83**
**అఞ్చితో నాసికాగ్రే తు తదఞ్చితముదాహృతమ్.**

**తా.** (23) **అంచితం :–** అర్ధస్వస్తికకరణంలో ఉన్న కరిహస్తాన్ని ఇటు అటూ తిప్పి, ముక్కు చివర ఉంచితే అది **అంచితకరణం.**

**మూ. కుఞ్చితం పాదముత్క్షిప్య త్ర్యశ్రమూరుం వివర్తయేత్. 84**
**కటిజానువివర్తాచ్చ భుజఙ్గత్రాసితం భవేత్.**

**తా.** (24) **భుజంగత్రాసితం :–** కుంచిత మైన (వంచబడిన) పాదం పైకి ఎగుర వేసి ఊరువులకు అడ్డంగా తిప్పాలి. కటిప్రదేశము, ఊరువులూ కూడ ఇదే విధంగా తిప్పుతూ ఉండాలి. అది **భుజంగత్రాసితకరణం.**

**మూ. కుఞ్చితం జానుముత్క్షిప్య జాను స్తనసమం న్యసేత్. 85**
**ప్రయోగవశగౌ హస్తావూర్ధ్వజాను ప్రకీర్తితమ్.**

**తా.** (25) **ఊర్ధ్వజానువు :–** కుంచిత మైన మోకాలు మోకాలుచిప్ప వక్షఃస్థలం ఎత్తుకు వచ్చేటంతగా పైకి ఎత్తాలి. చేతులు రెండూ నృత్యానికి అనుకూలమైన స్థితిలో (Pose)లో ఉంచాలి ఇది **ఊర్ధ్వజానుకరణం.**

**వి.** కాలి మణవ బాగా పైకి కనబడే టట్లు ఎత్తాలి. వేళ్లు ముణవాలి. మధ్యకు కాలు వంగాలి. అది **కుంచితం.**

**మూ. వృశ్చికం క(చ)రణం కృత్వా కరం పార్శ్వం నికుఞ్చయేత్.** **86**
**నాసాగ్రే దక్షిణం చైవ జ్ఞేయం తత్తు నికుఞ్చితమ్.**

**తా.** (26) **నికుంచితం :–** వృశ్చికకరణంలో ఉంచిన విధంగా కాళ్లు ఉంచి ఒక చెయ్యి ప్రక్కకి వంచాలి. కుడి చెయ్యి నాసికాగ్రంమీద ఉంచాలి. అది **నికుంచితకరణం.**

**వి.** వృశ్చికకరణంలో కాళ్లు వెనుకకు ముణవబడతాయి.

**మూ. వామదక్షిణపాదాభ్యాం ఘూర్ణమానోపసర్పణైః.** **87**
**ఉద్వేష్టితాపవిద్ధైశ్చ హస్తైర్మత్తల్ల్యుదాహృతమ్.**

**తా.** (27) **మత్తల్లి :–** రెండు కాళ్లూ గుండ్రంగా తిప్పుతూ చేతులు ఉద్వేష్టిత – అపవిద్ధ అవస్థలలో ఉంచుతే అది **మత్తల్లి కరణం.**

**మూ. స్ఖలితాపసృతౌ పాదౌ వామహస్తశ్చ రేచితః.** **88**
**సవ్యహస్తః కటిస్థః స్యాదర్ధమత్తల్లి తత్ స్మృతమ్.**

**తా.** (28) **అర్ధమత్తల్లి :–** స్ఖలితముద్రలో పాదాలు దూరదూరంగా ఉంచి ఎడమచెయ్యి రేచితమై కుడి చెయ్యి కటిప్రదేశంమీద ఉంచినట్లయితే అది **అర్ధమత్తల్లికరణం.**

**మూ. రేచితో దక్షిణో హస్తః పాదః సవ్యో నికుట్టితః.** **89**
**దోలా చైవ భవేద్వామస్తద్రేచితనికుట్టితమ్.**

**తా.** (29) **రేచితనికుట్టితం :–** కుడి చెయ్యి రేచితమై, కుడి పాదం నికుట్టితమై, ఎడమ చెయ్యి దోలాముద్రలో ఉంటే అది **రేచితనికుట్టితకరణం.**

**వి.** బుజాలనుండి చేతులు శిథిలంగా వ్రేలాడుతున్నట్లు చేసి, అవి పతాకముద్రలో ఉండే టట్లు చేయడం **దోలాముద్ర.**

**మూ. కార్యౌ నాభితటే హస్తౌ ప్రాఙ్ముఖౌ కటకాముఖౌ.** **90**
**సూచీవిద్ధావపక్రాన్తౌ పాదౌ పాదాపవిద్ధకే.**

**తా.** (30) **పాదాపవిద్ధకం :–** పాదాపవిద్ధకరణంలో కటకాముఖావస్థలో ఉన్న హస్తాల పృష్ఠభాగాలు (వెనుకభాగాలు) నాభివైపు ఉంటాయి. పాదాలు సూచీవిద్ధ – అపక్రాంతచారులలో ఉంటాయి.

**వి.** సూచీవిద్ధ అపక్రాన్తచారుల లక్షణం ముమ్ముందు (9,10 అధ్యాయాలలో) తెలుస్తుంది.

**మూ. అపవిద్ధో భవేద్ధస్తః సూచీపాదస్తథైవ చ. 91**
**తథా త్రికం వివృత్తం చ వలితం నామ తద్ భవేత్.**

**తా.** (31) **వలితం :-** హస్తాలు అపవిద్ధాలై ఉంటాయి. కాళ్లు సూచీచారిలో ఉంటాయి. త్రికం తిప్పబడుతుంది. అది **వలితకరణం.**

**వి.** త్రికం = వెన్నెముక అడుగుభాగం. ఇక్కడ కటిప్రదేశం అని అర్థం.

**మూ. వర్తితాఘూర్ణితః సవ్యో హస్తో వామశ్చ దోలితః. 92**
**స్వస్తికాపసృతః పాదః కరణం ఘూర్ణితం తు తత్.**

**తా.** (32) **ఘూర్ణితం :-** కుడి చెయ్యి వలితముద్రలోను, ఎడమచెయ్యి దోలా ముద్రలోను ఉండగా, స్వస్తికకరణంలో ఉన్న కాళ్లు అపసృతము లైతే (విడిపోయే టట్లు చేయబడిన ట్లయితే) అది **ఘూర్ణితకరణం.**

**మూ. కరిహస్తో భవేద్వామో దక్షిణశ్చ వివర్తితః. 93**
**బహుశః కుట్టితః పాదః జ్ఞేయం తల్లలితం బుధైః.**

**తా.** (33) **లలితం :-** ఎడమ చెయ్యి కరిహస్తముద్రలో నుండగా కుడి చెయ్యి వివర్తితమై ఉండాలి. పాదం మాటిమాటికీ కుట్టితం కావాలి. అది **లలితకరణం.**

**మూ. ఊర్ధ్వజానుం విధాయాథ తస్యోపరి లతాం న్యసేత్. 94**
**దణ్డపక్షం తు తత్ప్రోక్తం కరణం నృత్తవేదిభిః.**

**తా.** (34) **దండపక్షం :-** ఊర్ధ్వజానుచారీప్రయోగం చేస్తూ 'లతా' హస్తాలను మోకాళ్ల చిప్పలమీద ఉంచి చేసే నృత్తం **దండపక్షకరణం** అని నృత్తజ్ఞులు చెపుతున్నారు.

**మూ. భుజఙ్గత్రాసితం కృత్వా యత్రోభావపి రేచితౌ. 95**
**వామపార్శ్వస్థితౌ హస్తౌ భుజఙ్గత్రస్తరేచితమ్.**

**తా.** (35) **భుజంగత్రస్తరేచితం :-** పాదాలు భుజంగత్రస్తచారిలో ఉండాలి. రేచితంలో ఉన్న రెండు చేతులూ ఎడమ వైపు తిప్పాలి. అది **భుజంగత్రస్తరేచితం.**

**మూ. త్రికం సువలితం కృత్వా లతారేచితకౌ కరౌ. 96**
**నూపురశ్చ తథా పాదః కరణే నూపురే న్యసేత్.**

**తా. నూపురం :-** త్రికం వలితం చేసి, చేతులలో ఒకటి లతాముద్రలోను, రెండవది రేచితముద్రలోను ఉంచాలి. ఒక పాదంలో నూపురపాదచారి ప్రయోగించాలి. అది **నూపురకరణం.**

**వి.** పాదం అడగు భాగం (అరికాలు) అగ్రభాగం వెనుకకు వంచి, దానిని శీఘ్రంగా నేలమీద పడవేస్తూండాలి (అనుస్తూండాలి). అది **నూపురపాదచారి.**

**మూ. రేచితౌ హస్తపాదౌ చ కటీ గ్రీవా చ రేచితా. 97**
**వైశాఖస్థానకేనైతద్ భవేద్వైశాఖరేచితమ్.**

**తా.** (37) **వైశాఖరేచితం :–** హస్తాలు, పాదాలు, కటిప్రదేశము, కంఠం – ఇవన్నీ రేచితముద్రలో ఉండగా, మొత్తం శరీరం వైశాఖముద్రలో ఉంటే అది **వైశాఖరేచితం.**

**మూ. ఆక్షిప్తః స్వస్తికః పాదః కరౌ చోద్వేష్టితౌ తథా. 98**
**త్రికస్య వలనాచ్చైవ జ్ఞేయం భ్రమరకం హి తత్.**

**తా.** (38) **భ్రమరకం :–** ఆక్షిప్తచారిలో స్వస్తికపదం ఉండాలి. హస్తాలు ఉద్వేష్టి గతిలో ఉండాలి. భ్రమరీచారిలో త్రికం తిప్పుతూ ఉండాలి. అది **భ్రమరకకరణం.**

**వి.** కుంచితపాదాన్ని పైకి ఎత్తి, విసరివేస్తూ అంచితంలో ఉంచాలి. కాళ్లు స్వస్తికంలో ఉండాలి. అది **ఆక్షిప్తచారి.**

**మూ. అఞ్చితః స్యాత్కరో వామః సవ్యశ్చతుర ఏవ తు. 99**
**దక్షిణః కుట్టితః పాదః చతురం తత్ ప్రకీర్తితమ్.**

**తా.** (39) **చతురం :–** ఎడమ హస్తం అంచితముద్రలో (అలపల్లవముద్ర అంచితముద్ర ఒకటే అని **అభినవభారతి**). ఉండాలి. కుడి హస్తం చతురముద్రలో ఉండాలి. కుడి కాలుతో కుట్టితం చెయ్యాలి. ఇది **చతురకరణం.**

**వి.** చేతి వేళ్లు ఒకదానితో ఒకటి కలవకుండా అరచేతి వైపు వంచి, అరచేయి పైకి నిలపెట్టి ఉంచితే అది **అలపల్లవముద్ర** లేదా **అంచితముద్ర.**

చేతి వేళ్లు విడివిడిగా చాపి ఉండాలి. చిటికెన వ్రేలు నిలబెట్టాలి. వాటి మధ్య బొటనవేలు చేర్చాలి – ఇది **చతురముద్ర.**

**మూ. భుజఙ్గత్రాసితః పాదో దక్షిణో రేచితః కరః. 100**
**లతాఖ్యశ్చ కరో వామో భుజఙ్గాఞ్చితకం భవేత్.**

**తా.** (40) **భుజంగాంచితకం :–** కాళ్లు భజంగత్రాసితచారిలోను, కుడి హస్తం రేచితంలోను ఉంటే అది **భుజంగాంచితకకరణం.**

**మూ. విక్షిప్తం హస్తపాదం తు సమన్తాద్యత్ర దణ్డవత్. 101**
**రేచ్యతే తద్ధి కరణం జ్ఞేయం దణ్డకరేచితమ్.**

**తా.** చేతులూ, కాళ్లూ దండం వలె నాలుగు వైపులకు చాపి, ఆ హస్తపాదాలతో రేచిత ముద్ర వేసిన ట్లయితే అది **దండకరేచితకరణం.**

**మూ. వృశ్చికం చరణం కృత్వా ద్వావప్యథ నికుట్టితౌ. 102**
**విధాతవ్యౌ కరౌ తత్తు జ్ఞేయం వృశ్చికకుట్టితమ్.**

**తా.** (42) **వృశ్చికకుట్టితం :-** వృశ్చికకరణం చేసి (కాళ్లు రెండూ వీపు పైకి ముణిచి) చేతులు రెండింటినీ నికుట్టితములు చేస్తే అది **వృశ్చికకుట్టితకరణం.**

**మూ. సూచీం కృత్వాపవిద్ధం చ దక్షిణం చరణం న్యసేత్. 103**
**రేచితా చ కటిర్యత్ర కటిభ్రాన్తం తదుచ్యతే.**

**తా.** (43) **కటిభ్రాంతకరణం :-** సూచీచారిలో కుడికాలు అపవిద్ధముద్రలో ఉంచి, కటిప్రదేశం రేచితం చేస్తే అది **కటిభ్రాంతకరణం.**

**మూ. అఞ్చితః పృష్ఠతః పాదః కుఞ్చితోర్ధ్వతలాఙ్గులిః. 104**
**లతాఖ్యశ్చ కరో వామః తల్లతావృశ్చికం భవేత్.**

**తా.** (44) **లతావృశ్చికం :-** ఒక పాదం అంచితముద్రలో ఉండాలి. ఎడమ చేతి వేళ్లు ముణిచి అరచెయ్యి పైవైపు తిరిగి లతాముద్రలో ఉండాలి. అది **లతావృశ్చికకరణం.**

**మూ. అలపద్మః కటీదేశే ఛిన్నా పర్యాయశః కటీ. 105**
**వైశాఖస్థానకేనేహ తచ్ఛిన్నం కరణం భవేత్.**

**తా.** (45) **ఛిన్నం :-** కటిప్రదేశంమీద అలపద్మహస్తం ఉండాలి. కటిప్రదేశం మాటి మాటికీ ఛిన్నం అవాలి. శరీరం వైశాఖముద్రలో ఉండాలి. అది **ఛిన్నకరణం.**

**వి.** కాలి మణవలు మాటి మాటికి ఎత్తుతూ, నేలమీద ఆనుస్తూ ఉంటె కటిచ్ఛిన్న అవుతుంది. అలపద్మం, అలపల్లవం అనేవి పర్యాయపదాలు.

**మూ. వృశ్చికం చరణం కృత్వా స్వస్తికౌ చ కరావుభౌ. 106**
**రేచితౌ విప్రకీర్ణౌ చ కరౌ వృశ్చికరేచితమ్.**

**తా.** (46) **వృశ్చికరేచితం :-** వృశ్చికచరణం చేసి స్వస్తికముద్రలో ఉన్న రెండు చేతులూ రేచితములు చేసి విప్రకీర్ణముద్ర ఏర్పరిస్తే అది **వృశ్చికరేచితం.**

**మూ. బాహుశీర్షాఞ్చితౌ హస్తౌ పాదః పృష్ఠాఞ్చితస్తథా. 107**
**దూరసంనతపృష్ఠం చ వృశ్చికం తత్ప్రకీర్తితమ్.**

**తా.** (47) **వృశ్చికం :-** రెండుచేతులు వంచి, బాహువుల శిరస్సులవైపు, అనగా బాహువుల శిఖరాలవైపు వంచాలి. పాదం పూర్తిగా వీపువైపు వంచాలి. ఇది వృశ్చికకరణం.

**మూ. ఆలీఢం స్థానకం యత్ర కరౌ వక్షసి రేచితౌ. 108**
**ఊర్ధ్వాధోవిప్రకీర్ణౌ చ వ్యంసితం కరణం స్మృతమ్.**

**తా.** (48) **వ్యంసితం :-** ఆలీఢం అనే స్థానకంలో నిలిచి, రెండు చేతులూ వక్షః స్థలంమీద రేచితం చేసి పిమ్మట విప్రకీర్ణముద్రలో పైకి కిందికీ ఊపినట్లయితే అది **వ్యంసితకరణం.**

**వి.** ఆలీఢం అనగా – యుద్ధంలో ధనుర్ధరులు కుడికాలు ముందుకు పెట్టి నిలబడు ఒక స్థానకం. స్థానకం అనగా నిలబడే స్థితి (Pose) ఇది. 10వ అధ్యాయంలో చెప్పబడుతుంది. చేతి వేళ్లు మారుస్తూ ఒకదానితో ఒకటిపెనవేయడం **విప్రకీర్ణముద్ర**.

**మూ. హస్తౌ తు స్వస్తికౌ పార్శ్వే తథా పాదో నికుట్టితః. 109**
**యత్ర తత్ కరణం జ్ఞేయం బుధైః పార్శ్వనికుట్టితమ్.**

**తా.** (49) **పార్శ్వనికుట్టితం :–** స్వస్తికముద్రలో ఉన్న రెండు చేతులూ (శరీరం) ఒక పార్శ్వంలో ఉంచి పాదంతో నికుట్టితం చేస్తే అది **పార్శ్వనికుట్టితం.**

**మూ. వృశ్చికం చరణం కృత్వా పాదస్యాఙ్గుష్ఠకేన తు. 110**
**లలాటే తిలకం కుర్యాల్లలాటతిలకం తు తత్.**

**తా.** (50) **లలాట తిలకం :–** వృశ్చికకరణంలో ఉంటూ, కాలి బొటనవేలితో లలాటంమీద తిలకం పెట్టినట్లయితే అది **లలాటతిలకం.**

**మూ. పృష్ఠతః కుఞ్చితం కృత్వా వ్యతిక్రాన్తక్రమం తతః. 111**
**ఆక్షిప్తౌ చ కరౌ కార్యౌ క్రాన్తకే కరణే ద్విజాః.**

**తా.** (51) **క్రాంతకం :–** కాలు కుంచితం చేసి వెనుకకు వంచాలి; వ్యతిక్రాంతచారి చెయ్యాలి. రెండు చేతులూ క్రిందికి జార్చి ఉండాలి. ఇది **క్రాంతకకరణం.**

**మూ. ఆద్యః పాదో నతః కార్యః సవ్యహస్తశ్చ కుఞ్చితః. 112**
**ఉత్తానో వామపార్శ్వస్థః తత్కుఞ్చితముదాహృతమ్.**

**తా.** (52) **కుంచితం :–** కుడి కాలు క్రిందికి వంచి, కుడి చెయ్యి వంచి ఎడమ పార్శ్వం వైపు ఉంచాలి. దాని అరచెయ్యి పైకి ఉండాలి. ఇది **కుంచితకరణం.**

**మూ. ప్రలమ్బితాభ్యాం బాహుభ్యాం యద్ గాత్రేణానతేన చ. 113**
**అభ్యన్తరాపవిద్ధః స్యాత్ తద్ జ్ఞేయం చక్రమణ్డలమ్.**

**తా.** (53) **చక్రమండలం :–** రెండు చేతులూ రెండు వైపులా వ్రేలాడుతూండగా శరీరం వంగి ఉండాలి. ప్రారంభంలో అపవిద్ధచారి స్థితిలో ఉండాలి. అది **వక్రమండల కరణం.**

**వి.** అభినవగుప్తుని ప్రకారం అభ్యన్తరాపవిద్ధచారి అనగా ఇక్కడ అడ్డితచారి అని గ్రహించాలి. దీని లక్షణం 10 వ అధ్యాయం 33 వ శ్లోకంలో చెప్పబడింది – నేలమీద ఒక కాల నిలువుగా ఆన్చి రెండవ కాలి పాదంతో మొదటిదాని వెనుకభాగం గాని ముందు భాగం గాని స్పృశిస్తే అది **అడ్డితచారి.**

**మూ. స్వస్తికాపసృతౌ పాదౌ అపవిద్ధక్రమౌ యదా. 114**
**ఉరోమణ్డలకౌ హస్తౌ ఉరోమణ్డలికం తు తత్.**

**తా.** (54) **ఉరోమండలికం :–** స్వస్తికముద్రలో ఉన్న రెండు కాళ్ల స్థితిని మార్చి, వాటితో అపవిద్ధచారి ప్రయోగం చేసి చేతులతో ఉరోమండలముద్ర వేసిన ట్లయితే అది **ఉరోమండలకరణం.**

**వి.** రెండు చేతులూ ఒకదానితో ఒకటి మెలివేసి వక్షః స్థలంమీద ఉంచుతే అది **ఉరోమండలముద్ర.**

**మూ. ఆక్షిప్తం హస్తపాదం చ క్రియతే యత్ర వేగతః. 115**
**ఆక్షిప్తం నామ కరణం విజ్ఞేయం తద్ద్విజోత్తమాః.**

**తా.** (55) **ఆక్షిప్తం :–** హస్తాలను పాదాలను వేగంగా ఆక్షిప్తం చేస్తే అది ఆక్షిప్తకరణం అని పండితులు చెపుతారు.

**మూ. ఊర్ధ్వాఙ్గులితలః పాదః పార్శ్వేనోర్ధ్వం ప్రసారితః. 116**
**ప్రకుర్యాదఞ్చితతలౌ హస్తౌ తలవిలాసితే.**

**తా.** (56) **తలవిలసితం :–** పాదం వేళ్లూ అరికాలు ఊర్ధ్వముఖంగా (వాటి అగ్రం పైకి ఉండేటట్లు) పార్శ్వభాగంలో బాగా ఎత్తుగా ఎత్తాలి. పతాకముద్రలో ఉన్న రెండు చేతుల అరచేతులూ దగ్గరగా కలిపితే **తలవిలసితకరణం.**

**మూ. పృష్ఠతః ప్రసృతౌ పాదౌ ద్వౌ తాలావర్ధమేవ చ. 117**
**తస్యైవ చానుగో హస్తః పురతస్త్వర్గలం తు తత్.**

**తా.** (57) **అర్గలం :–** రెండు పాదాలు వెనుక వైపునకు రెండున్నర తాలాల దూరం చాపి, హస్తాలు కూడ పాదాలకు అనుగుణంగా ముందుకు ఉంచినట్లయితే అది **అర్గలకరణం.**

**మూ. విక్షిప్తం హస్తపాదం చ పృష్ఠతః పార్శ్వతోఽపి వా. 118**
**ఏకమార్గగతం యత్ర తద్విక్షిప్తముదాహృతమ్.**

**తా.** (58) **విక్షిప్తం :–** చెయ్యి, కాలూ వెనుకకు గాని, పక్కకు గాని విసురుట **విక్షిప్తకరణం.**

**మూ. ప్రసార్య కుఞ్చితం పాదం పునరావర్తయేద్రుతమ్. 119**
**ప్రయోగవశగౌ హస్తౌ తదావర్తముదాహృతమ్.**

**తా.** (59) **ఆవర్తం :–** కుంచిత మైన పాదాన్ని చాపి దానిని తొందరగా వెనుకకు లాగేసికొన్న ట్లయితే, ఆ సమయంలో హస్తాలు నృత్తానుకూల మైన కదలికలతో ఉన్నట్లయితే అది **ఆవర్తకరణం.**

**మూ. కుఞ్చితం పాదముత్క్షిప్య పార్శ్వాత్ పార్శ్వం తు దోలయేత్. 120**
**ప్రయోగవశగౌ హస్తౌ దోలాపాదం తదుచ్యతే.**

**తా.** (60) **దోలాపాదం :–** కుఞ్చిత మైన పాదం ఎత్తి ఒక పార్శ్వంనుంచి మరొక పార్శ్వానికి ఊచుచుండగా, హస్తాలు నృత్తానికి అనుకూలంగా కదల్చాలి. అది **దోలాపాద కరణం.**

**మూ. ఆక్షిప్య హస్తపాదం చ త్రికం చైవ వివర్తయేత్. 121**
**రేచితౌ చ తథా హస్తౌ వివృత్తే కరణే ద్విజాః.**

**తా.** (61) **వివృత్తం :–** చేతులూ కాళ్లూ బైట వైపునకు ప్రసరింపచేస్తూ త్రికం వివర్తితం చెయ్యాలి. అనగా ముందు కుడికాలుతోను, తరవాత ఎడమకాలుతోను భ్రామరీచారి చెయ్యాలి. హస్తాలు రేచితములై ఉండాలి. అది **వివృత్తకరణం.**

**మూ. సూచీవిద్ధం విధాయాథ త్రికం తు వినివర్తయేత్. 122**
**కరౌ చ రేచితౌ కార్యౌ వినివృత్తే ద్విజోత్తమాః.**

**తా.** (62) **వినివృత్తం :–** ద్విజోత్తములారా! సూచీవిద్ధచారి ప్రయోగించి, త్రికపరి వర్తనం చేస్తూ హస్తాలు రేచితములై ఉంటే అది **వినివృత్తకరణం.**

**మూ. పార్శ్వక్రాన్తక్రమం కృత్వా పురస్తాదథ పాతయేత్. 123**
**ప్రయోగవశగౌ హస్తౌ పార్శ్వక్రాన్తం తదుచ్యతే.**

**తా.** (63) **పార్శ్వక్రాంతం :–** పార్శ్వక్రాంతచారి ప్రయోగించి పాదం ముందు వైపు నిలపాలి. చేతులు నృత్తానుకూలంగా ఉండాలి. ఇది **పార్శ్వక్రాంతకరణం.**

**వి.** ఒక కాలు కుంచితముద్రలో పైకి ఎత్తి దాని మోకాలి చిప్ప వక్షఃస్థలంవరకూ తీసికొని వెళ్లాలి. రెండవకాలు ఉద్ఘట్టితముద్రలో ఉండాలి. అది పార్శ్వక్రాంతచారి.

**మూ. పృష్ఠతః కుఞ్చితః పాదః వక్షశ్చైవ సమున్నతమ్. 124**
**తిలకే చ కరః స్థాప్యస్తన్నిశుమ్భితముచ్యతే.**

**తా.** (64) **నిశుంభితం :–** ఒక కాలు వెనుకకు మణవాలి. వక్షఃస్థలం ఎత్తుగా బిగబెట్టి హస్తాన్ని తిలకస్థానంలో ఉంచాలి. అది **నిశుంభితకరణం.**

**మూ. పృష్ఠతో వలితం పాదం శిరోఘృష్టం ప్రసారయేత్. 125**
**సర్వతోమణ్డలావిద్ధం విద్యుద్భ్రాన్తం తదుచ్యతే.**

**తా.** (65) **విద్యుద్భ్రాంతం :–** కాలు వెనుకకు తిప్పి, శిరస్సుదాకా తీసికొనివెళ్లాలి. అక్కడ కాలు పూర్తిగా గోలాకారంలో ఉండాలి. ఇది **విద్యుదుద్భ్రాంతకరణం.**

**మూ. అతిక్రాన్తక్రమం కృత్వా పురస్తాత్సంప్రసారయేత్. 126**
**ప్రయోగవశగౌ హస్తౌ అతిక్రాన్తే ప్రకీర్తితౌ.**

**తా.** (66) **అతిక్రాంతం :–** అతిక్రాంతచారి చేసి కాలు ముందు వైపుకు ప్రసరింప చెయ్యాలి. చేతులు నృత్తానికి అనురూపంగా ఉంటాయి. ఇది **అతిక్రాంతకరణం.**

**మూ. ఆక్షిప్తం హస్తపాదం చ త్రికం చైవ వివర్తితమ్. 127**
**ద్వితీయో రేచితో హస్తః వివర్తితకమేవ తత్.**

**తా.** (67) **వివర్తితం :–** ఒక హస్తమును ఒక పాదమును బైటకు ఆక్షిప్తములు చేసి త్రికం వివర్తితం చెయ్యాలి. రెండవ హస్తం రేచితంలో ఉండాలి. ఇది **వివర్తితం.**

**మూ. కర్ణేఽఞ్చితః కరో వామో లతాహస్తశ్చ దక్షిణః. 128**
**దోలపాదస్తథా చైవ గజక్రీడితకం భవేత్.**

**తా.** (68) **గజక్రీడితకం :–** అంచితముద్రలో ఉన్న ఎడమ చెయ్యి చెవిమీద ఉంచాలి. కుడి చెయ్యి లతాముద్రలో ఉండాలి. కాళ్లు దోలాపాదచారిలో ఉండాలి. ఇది **గజక్రీడితకరణం.**

**మూ. ద్రుతముత్క్షిప్య చరణం పురస్తాదథ పాతయేత్. 129**
**తలసంస్ఫోటితౌ హస్తౌ తలసంస్ఫోటితే మతౌ.**

**తా.** (69) **తలసంస్ఫోటితం :–** ఒక కాలు చాల వేగంగా పైకి ఎత్తి ముందువైపు నేలమీద ఉంచి రెండు చేతులతో చప్పట్లు కొడితే అది **తలసంస్ఫోటితకరణం.**

**మూ. పృష్ఠప్రసారితః పాదః లతారేచితకౌ కరౌ. 130**
**సమున్నతం శిరశ్చైవ గరుడప్లుతకః భవేత్.**

**తా.** (70) **గరుడప్లుతకమ్ :–** ఒక పాదం (కాలు) వెనుకవైపునకు ప్రసరింప చేయాలి (చాపాలి). ఒక హస్తం లతాముద్రలో ఉండగా రెండవది రేచితమై ఉండాలి. తల పైకి ఎత్తి ఉండాలి. ఇది **గరుడప్లుతకకరణం.**

**మూ. సూచీపాదో నతం పార్శ్వమేకో వక్షఃస్థితః కరః. 131**
**ద్వితీయశ్చాఞ్చితో గణ్డే గణ్డసూచీ తదుచ్యతే.**

**తా.** (71) **గండసూచి :–** పాదాలు సూచీస్థితిలో ఉండాలి. పార్శ్వభాగం వంగి ఉండాలి. ఒక హస్తం వక్షఃస్థలంమీద ఉండాలి. రెండవది అంచితముద్రలో గండస్థలం (చెక్కిలి) మీద ఉంచాలి. అది **గండసూచీకరణం.**

**మూ. ఊర్ధ్వాపవేష్టితౌ హస్తౌ సూచీపాదో వివర్తితః. 132**
**పరివృత్తత్రికం చైవ పరివృత్తం తదుచ్యతే.**

**తా.** (72) **పరివృత్తకరణం :–** ఆపవేష్టితముద్రలో ఉన్న రెండు చేతులూ పైకి ఎత్తి ఉంచి ఒక సూచీపాదాన్ని రెండవ పాదంమీద వర్తితం చేస్తూ, త్రికాన్ని (భ్రమరీచారిలో) పరివర్తితం చేస్తే అది **పరివృత్తకరణం.**

**మూ. ఏకః సమస్థితః పాదః ఊరుపృష్ఠే స్థితోఽపరః. 133**
**ముష్టిహస్తశ్చ వక్షఃస్థః పార్శ్వజాను తదుచ్యతే.**

**తా.** (73) **పార్శ్వజాను :–** ఒక పాదం సమావస్థలో ఉండాలి. రెండవ పాదం (కాలు) తొడ వెనుకవైపు త్రిప్పి ఉంచాలి. ముష్టిహస్తం వక్షఃస్థలంమీద ఉంచాలి. అది **పార్శ్వజానుకరణం.**

**మూ. పృష్ఠప్రసారితః పాదః కిఞ్చిదఞ్చితజానుకః. 134**
**యత్ర ప్రసారితౌ బాహూ తత్స్యాత్ గృధ్రావలీనకమ్.**

**తా.** (74) **గృధ్రావలీనకం :–** ఒక పాదం వెనుకకు తిప్పాలి. మోకాలు కొంచెం వంగాలి. రెండు చేతులూ చాపి ఉంచాలి. అది **గృధ్రావలీనకకరణం.**

**మూ. ఉత్ప్లుత్య చరణౌ కార్యావగ్రతః స్వస్థికస్థితౌ. 135**
**సన్నతౌ చ తథా హస్తౌ సన్నతం తదుదాహృతమ్.**

**తా.** (75) **సన్నతం :–** ముందుకు గంతు వేసి పాదాలు రెండూ స్వస్తికముద్రలో ఉంచాలి. హస్తాలు సంనతములై (దోలాముద్రలో) ఉండాలి. ఇది **సన్నతకరణం.**

**మూ. కుఞ్చితం పాదముత్క్షిప్య కుర్యాదగ్రస్థితం భువి. 136**
**ప్రయోగవశగౌ హస్తౌ సా సూచీ పరికీర్తితా.**

**తా.** (76) కుంచితమైన పాదాన్ని ఎత్తి నేలమీద వేసి అగ్రభాగంమీద నిలపాలి. పాదాలు రెండూ నృత్తానికి అనుగుణంగా ఉండాలి. అది **కుంచితకరణం.**

**మూ. అలపద్మః శిరోహస్తః సూచీపాదశ్చ దక్షిణః. 137**
**యత్ర తత్కరణం జ్ఞేయమర్ధసూచీతి నామతః.**

**తా.** (77) **అర్ధసూచి :–** అలపద్మహస్తం శిరస్సుమీద ఉంచాలి. కుడి పాదం సూచీచారిలో ఉండాలి. అది **అర్ధసూచీకరణం.**

**మూ. పాదసూచ్యా యదా పాదో ద్వితీయస్తు ప్రవిధ్యతే. 138**
**కటివక్షఃస్థితౌ హస్తౌ సూచీవిద్ధం తదుచ్యతే.**

**తా.** (78) **సూచీవిద్ధం :–** సూచీచారిలో ఉన్న ఒక పాదం రెండవ పాదానికి తగిల్చి, ఒక హస్తం కటి ప్రదేశం మీదా, రెండవ హస్తం వక్షఃస్థలంమీదా ఉంచినట్లయితే అది **సూచీవిద్ధకరణం.**

**మూ. కృత్వోరు వలితం పాదమపక్రాన్తక్రమం న్యసేత్. 139**
**ప్రయోగవశగౌ హస్తౌ అపక్రాన్తం తదుచ్యతే.**

**తా.** (79) **అపక్రాంతం :–** ఊరువును వలితం చేసి, పాదాన్ని అపక్రాంతచారిలో ఉంచి, హస్తాలు నృత్తానుగుణంగా ఉంచిన ట్లయితే అది **అపక్రాంతకరణం.**

**మూ. వృశ్చికం చరణం కృత్వా రేచితౌ చ తథా కరౌ. 140**
**తథా త్రికం వివృత్తం చ మయూరలలితం భవేత్.**

**తా.** (8) **మయూరలలితం :–** పాదాలు వృశ్చికముద్రలో ఉండగా, హస్తాలు రేచితములుగా ఉండి, త్రికం వివృత్త మైతే అది **మయూరలలితకరణం.**

**మూ. అఞ్చితాపసృతౌ పాదౌ శిరశ్చ పరివాహితమ్. 141**
**రేచితౌ చ తథా హస్తౌ తత్సర్పితముదాహృతమ్.**

**తా.** (81) **సర్పితం :–** అంచితముద్రలో పాదాలను ఒకదానినుండి ఒకదానిని దూరంగా ఉంచి శిరస్సును పరివాహితముద్రలో ఉంచితే, (మాటిమాటికీ ఇటూ అటూ త్రిప్పితే), రెండు చేతులూ రేచితము లైతే అది **సర్పితకరణం.**

**మూ. నూపురం చరణం కృత్వా దణ్డపాదం ప్రసారయేత్. 142**
**క్షిప్రావిద్ధకరం చైవ దణ్డపాదం తదుచ్యతే.**

**తా.** (82) **దండపాదం :–** ఒక పాదం నూపురచారిలో ఉంచి, దానినే దండపాద చారిలో చాపాలి. రెండు చేతులూ శీఘ్రంగా ఆవిద్ధం చెయ్యాలి. అది **దండపాదకరణం.**

**వి.** పాదం వెనుకభాగం కొంచెం వంచి అగ్రభాగంతో దానిని తొందరగా నేలమీద పడవెయ్యాలి. అది **నూపురపాదికాకరణం.**

తొందరగా ఆవిద్ధం చేస్తే అది **దండపాదచారం.**

భుజాన్ని (చేతులు) బోర్లా త్రిప్పడం **అపవిద్ధం.**

**మూ. అతిక్రాన్తక్రమం కృత్వా సముత్ప్లుత్య నిపాతయేత్. 143**
**జఙ్ఘాఞ్చితోపరి క్షిప్తా తద్విద్యాద్ధరిణప్లుతమ్.**

**తా.** (83) **హరిణప్లుతం :–** అతిక్రాంతక్రమం చేసిన తరవాత గంతు వేసి పాదం నేలమీద నిలిపి, అంచితమైన కాలు పైకి విసిరినట్లయితే అది **హరిణప్లుతకరణం.**

**మూ. డోలాపాదక్రమం కృత్వా సముత్ప్లుత్య నిపాతయేత్. 144**
**పరావృత్తత్రికం చైవ తత్ ప్రేఙ్ఖోలితముచ్యతే.**

**తా.** (84) **ప్రేంఖోలితం :–** డోలాపాదంచారి చేసి తరువాత, గంతు వేసి పాదం మోపి, త్రికం పరివృత్తం చేస్తే అది **ప్రేంఖోలితకరణం.**

**మూ. భుజావూర్ధ్వవినిష్క్రాన్తౌ హస్తౌ చాభి (ధ్యా) ముఖాఙ్గులీ. 145**
**బద్ధాచారీ తథా చైవ నితమ్బే కరణే భవేత్.**

**తా.** (85) **నితంబం :–** రెండు చేతులూ పైకి నిలబడి ఉంటాయి. చేతుల వ్రేళ్లు పైవైపు చాపబడి ఉంటాయి. బద్ధాచారిని ప్రయోగించాలి. అది **నితంబకరణం.**

**వి.** రెండు కాళ్లు స్వస్తికముద్రలో పెనవేసి ఊరువుల వలనం చెయ్యాలి. అది **బద్ధాచారి.**

**మూ. దోలాపాదక్రమం కృత్వా హస్తౌ తదనుగావుభౌ. 146**
**రేచితౌ ఘూర్ణితౌ వాపి స్ఖలితం కరణం భవేత్.**

**తా.** (86) **స్ఖలితం :–** దోలాపదచారి చేస్తూ హంసపక్షరేచితములై తిప్పబడుతూన్న హస్తాలను పాదాల గతికి అనుగుణంగా ఉంచుతే అది **స్ఖలితకరణం.**

**మూ. ఏకో వక్షఃస్థితో హస్తః ప్రోద్వేష్టితతలోఽపరః. 147**
**అఞ్చితశ్చరణశ్చైవ ప్రయోజ్యః కరిహస్తకే.**

**తా.** (87) **కరిహస్తకం :–** ఒక హస్తం వక్షస్థలంమీద ఉంచాలి. రెండవచేతి అరచెయ్యి ప్రోద్వేష్టితం చెయ్యాలి. పాదాలు అంచితములై ఉండాలి. ఇది **కరిహస్తకం.**

**మూ. ఏకస్తు రేచితో హస్తః లతాఖ్యస్తు తథాపరః. 148**
**ప్రసర్పితతలౌ పాదౌ ప్రసర్పితకమేవ తత్.**

**తా.** (88) **ప్రసర్పితకం :–** ఒక హస్తం రేచితమై ఉండాలి. రెండవది లతాముద్రలో ఉండాలి. పాదాలు తలసంచరములై ఉండాలి. అది **ప్రసర్పితకకరణం.**

**వి.** ప్రసర్పితతలౌ అనగా నేలమీద ఈడ్వబడుచున్న అరికాళ్లు గలవి అని అర్థం.

**మూ. అలాతం చ పురః కృత్వా ద్వితీయం చ ద్రుతక్రమమ్. 149**
**హస్తౌ పాదానుగౌ చాపి సింహవిక్రీడితం స్మృతమ్.**

**తా.** (89) **సింహవిక్రీడితం :–** అలాతచారిని ప్రదర్శించిన తరువాత అతిశీఘ్ర సంచరణంతో, పాదాలతో పాటు చేతులు కూడ పాదాల గతికి అనురూపంగా కదుపుతూంటే అది **సింహవిక్రీడితకకరణం.**

**వి.** ఏ వైపున ఉన్న పాదాన్ని ద్రుతగతితో ముందుకు కదుల్చుతారో ఆ వైపున ఉన్న హస్తం కూడ ఆ పాదం కదల్చుచున్న వైపే కదల్చాలి. రెండు కాళ్లు రెండు చేతులూ కూడ ఇలాగే చెయ్యాలి. అది **అలాతచారి.**

**మూ. పృష్ఠప్రసర్పితః పాదస్తథా హస్తౌ నికుఞ్చితౌ. 150**
**పునస్తథైవ కర్తవ్యౌ సింహాకర్షితకే ద్విజాః.**

**తా.** (90) **సింహాకర్షితకం :-** ఒక కాలు వెనుకకు బాగా తిప్పి, రెండు చేతులూ కుంచితం చెయ్యాలి. అదే విధంగా రెండవ కాలు చేతులూ చెయ్యాలి. అది **సింహాకర్షిత కరణం.**

**మూ. ఆక్షిప్తహస్తమాక్షిప్తదేహమాక్షిప్తపాదకమ్. 151**
**ఉద్వృత్తగాత్రమిత్యేతదుద్వృత్తం కరణం స్మృతమ్.**

**తా.** (91) **ఉద్వృత్తం :-** కాళ్లూ, చేతులూ, పూర్తి శరీరమూ బాగా కుదిపివేస్తూ శరీరాన్ని ఉద్వృత్త చారీస్థితిలో ఉంచినట్లయితే అది **ఉద్వృత్తకరణం.**

**మూ. ఆక్షిప్తశ్చరణశ్చైకో హస్తౌ తస్యైవ చానుగౌ. 152**
**ఆనతం చ తథా గాత్రం తథోపసృతకం భవేత్.**

**తా.** (92) **ఉపసృతకం :-** పాదాలు ఆక్షిప్తచారిలో ఉండగా హస్తాలు వాటిని అనుసరించి ఉండాలి. శరీరం వంగి ఉండాలి. అది **ఉపసృతకకరణం.**

**మూ. దోలాపాదక్రమం కృత్వా తలసంఘట్టితౌ కరౌ. 153**
**రేచయేచ్చ కరం వామం తలసంఘట్టితే సదా.**

**తా.** (93) **తలసంఘట్టితం :-** దోలాపాదచారీ ప్రదర్శనం చేసి తరువాత రెండు అరిచేతులతో తాలం వేసి (వాయించి) పిమ్మట ఎడమచెయ్యి రేచితం చెయ్యాలి. ఇది **తలసంఘట్టితకరణం.**

**మూ. ఏకో వక్షఃస్థితో హస్తో ద్వితీయశ్చ ప్రలమ్బితః,**
**తలాగ్రసంస్థితః పాదో జనితే కరణే భవేత్. 154**

**తా.** (94) **జనితం :-** ఒక హస్తం వక్షఃస్థలంమీద ఉంచాలి. రెండవ చెయ్యి ఊగుతూ ఉండాలి. కాళ్లు అగ్రతలసంచరముద్రలో ఉండాలి. ఇది **జనితకరణం.**

**మూ. జనితం కరణం కృత్వా హస్తౌ చాభిముఖాఙ్గులీ. 155**
**శనైర్నిపతితౌ చైవ జ్ఞేయం తదవహిత్థకమ్.**

**తా.** (95) **అవహిత్థకం :-** జనితకరణం వేసిన తరువాత వేళ్లు పరసర్పరమూ అభిముఖంగా ఉన్న రెండు చేతులూ మెల్ల మెల్లగా క్రిందికి దింపితే అది **అవహిత్థకరణం.**

**మూ. కరౌ వక్షఃస్థితౌ కార్యౌ ఉరో నిర్భుగ్నమేవ చ. 156**
**మణ్డలస్థానకం చైవ నివేశం కరణం విదుః.**

**తా.** (96) **నివేశం :-** నిర్భుగ్నమైన (పైకి పొంగి బిగిసినట్లున్న) వక్షఃస్థలంమీద చేతులు ఉంచి, మండలస్థానకంలో నిలబడితే అది **నివేశకరణం.**

**మూ. తలంసచరపాదాభ్యాముత్ప్లుత్య పతనం భవేత్.** **157**
**సన్నతం వలితం గాత్రమేలకాక్రీడితం తు తత్.**

**తా.** (97) **ఏలకాక్రీడితమ్ :–** తలసంచరముద్రలో ఉన్న రెండూ పాదాలతో గంతులేసి నేలమీద నిలచి వంగిన శరీరం త్రిప్పితే అది **ఏలకాక్రీడితకరణం.**

**మూ. కరమావృత్తకరణమూరుపృష్ఠే౽ఞ్చితం న్యసేత్.** **158**
**జఙ్ఘాఞ్చితా తథోద్వృత్తా హ్యూరూద్వృత్తం తు తద్భవేత్.**

**తా.** (98) **ఊరూద్వృత్తం :–** చేతులు వెనుకకు తిప్పి, ఊరువుల పైభాగంమీద అంచితరూపంలో ఉంచి, కాలు అంచితముద్రలో ఉద్వృత్తగతిలో ఉంచితే అది **ఊరూద్వృత్తకరణం.**

**మూ. కరౌ ప్రలమ్బినౌ కార్యౌ శిరశ్చ పరివాహితమ్.** **159**
**పాదౌ చ వలితావిద్ధౌ మదస్ఖలితకే ద్విజాః.**

**తా.** (99) **మదస్ఖలితకం :–** రెండు చేతులూ క్రిందికి వేలాడుతూండాలి. శిరస్సు పరివాహితముద్రలో ఉండాలి. (శిరస్సును క్రమంగా రెండు పార్శ్వాలకు త్రిప్పుతూండాలి). కాళ్లు వలితములు చేసి ఆవిద్ధచారిలో ఉంచాలి. అది **మదస్ఖలితకకరణం.**

**మూ. పురఃప్రసారితః పాదః కుఞ్చితో గగనోన్ముఖః.** **160**
**కరౌ చ రేచితౌ యత్ర విష్ణుక్రాన్తం తదుచ్యతే.**

**తా.** (100) **విష్ణుక్రాంతం :–** ఒక కాలు ముందుకు చాపాలి. రెండవ కాలు వంచి ఆకాశంవైపు (పైకి) తీసికొనివెళ్లాలి. రెండు చేతులూ రేచితముద్రలో ఉండాలి. అది **విష్ణుక్రాంతకరణం.**

**మూ. కరమావర్తితం కృత్వా హ్యూరుమూలే నికుఞ్చయేత్.** **161**
**ఊరుశ్చైవ తథావిద్ధః సంభ్రాన్తం కరణం తు తత్.**

**తా.** (101) **సంభ్రాతం :–** ఒక చెయ్యి వ్యావర్తితగతిలో ఉంచి, తొడమీద దానిని కుంచితం చెయ్యాలి. ఊరువులు ఆవిద్ధచారిలో ఉండాలి. అది **సంభ్రాంతకరణం.**

**మూ. అపవిద్ధః కరః, సూచ్యా పాదశ్చైవ నికుట్టితః.** **162**
**వక్షస్థశ్చ కరో వామో విష్కమ్భే కరణే భవేత్.**

**తా.** (102) **విష్కంభం :– విష్కంభ కరణం**లో కుడి చెయ్యి అపవిద్ధముద్రలో ఉంటుంది. సూచీచారిలో ఉన్న కాళ్లు నికుట్టితములై (వంగి) ఉంటాయి. ఎడమ చెయ్యి వక్షఃస్థలంమీద ఉంటుంది.

**మూ. పాదావుద్ఘట్టితౌ కార్యౌ తలసంఘట్టితౌ కరౌ. 163**
**నతం చ పార్శ్వం కర్తవ్యం బుధైరుద్ఘట్టితే సదా.**

**తా.** (103) **ఉద్ఘట్టితం :–** రెండు పాదాలూ ఉద్ఘట్టితముద్రలో ఉండాలి. అనగా పాదాగ్రాలు పైకి లేపి మణవలమీద నిలబడాలి. హస్తాలు తాలసంఘట్టితముద్రలో ఒక ప్రక్కకు వంచి ఉంచాలి. ఇది **ఉద్ఘట్టితకరణం**. బుధులు ఎల్లప్పుడు ఈ కరణాన్ని ఇలా ప్రదర్శించాలి.

**మూ. ప్రయుజ్యాలాతకం పూర్వం హస్తౌ చాపి హి రేచయేత్. 164**
**కుఞ్చితావఞ్చితౌ చైవ వృషభక్రీడితే సదా.**

**తా.** (104) **వృషభక్రీడితం :–** వృషభక్రీడితకరణప్రదర్శనలో ముందుగా అలాతచారి ప్రయోగించాలి. చేతులు రేచితం చేసి వాటిని కుంచిత – అంచితముద్రలలో ఉంచాలి.

**మూ. రేచితావఞ్చితౌ హస్తౌ లోలితం వర్తితం శిరః. 165**
**ఉభయోః పార్శ్వయోర్యత్ర తల్లోలితముదాహృతమ్.**

**తా.** (105) **లోలితం :–** రెండు చేతులూ అంచితములై రేచితముద్రలో ఉండాలి. శిరస్సును లోలితముద్రలో రెండు ప్రక్కలకూ తిప్పుతూండాలి. ఇది **లోలితకరణం.**

**మూ. స్వస్తికాపసృతౌ పాదౌ శిరశ్చ పరివాహితమ్. 166**
**రేచితౌ చ తథా హస్తౌ స్యాతాం నాగాపసర్పితే.**

**తా.** (106) **నాగాపసర్పితం :–** రెండు కాళ్లూ స్వస్తికస్థితిలో వెనుకకు జరపాలి. తరువాత వాటిని పరివాహితముద్రలో ఉంచాలి. చేతులు రేచితములై ఉండాలి. అది **నాగాపసర్పితకరణం.**

**మూ. నిషణ్ణాఙ్గస్తు చరణం ప్రసార్య తలసఞ్చరమ్. 167**
**ఉద్వాహితమురః కృత్వా శకటాస్యం ప్రయోజయేత్.**

**తా.** (107) **శకటాస్యం :–** శరీరం స్థిరంగా నిలిపి, పాదాలు తలముద్రావస్థలో ఎడంగా ఉండే టట్లు చేసి, వక్షఃస్థలం పైకి పొడుచుకొని వచ్చినట్లు చేస్తూ **శకటాస్య కరణం** ప్రదర్శించాలి.

**మూ. ఊర్ధ్వాఙ్గులితలౌ పాదౌ త్రిపతాకావధోముఖౌ. 168**
**హస్తౌ శిరః సంనతం చ గఙ్గావతరణం త్వితి.**

**తా.** (108) **గంగావతరణం :–** రెండు పాదాల వేళ్లూ, అడుగు భాగాలూ పైకి ఎత్తినట్లు ఉండాలి. త్రిపతాకాముద్రలో ఉన్న రెండు చేతులు అధోముఖంగా (నేలవైపు) ఉండాలి. శిరస్సు వంగి ఉండాలి. అది **గంగావతరణకరణం.**

**మూ. యాని స్థానాని యాశ్చార్యో వ్యాయామే కథితాని తు. 169**
**పాదప్రచారస్త్వేషాం తు కరణానామయం భవేత్.**

**తా.** ఏ స్థానాలు (నిలబడే విధానం), ఏ చారీలు (పాదచాలనవిధి) వ్యాయామంలో, నృత్త మనే వ్యాయామంలో, చెప్పబడ్డాయో, కరణాలలో చెప్పిన ఈ పాదప్రచారం (పాదాలు ఎత్తడం, దించడం) వాటికి ఉపకరిస్తుంది. (శ్లోకవాక్యనిర్మాణం అస్పష్టార్థంగా ఉంది ఈ శ్లోకం మొదలు నాలుగు శ్లోకాలకు అభినవగుప్తుని వ్యాఖ్య లేదు).

**మూ. యే చాపి నృత్తహస్తాస్తు గదితా నృత్తకర్మణి. 170**
**తేషాం సమాసతో యోగః కరణేషు విభావ్యతే.**

**తా.** నృత్తం ప్రయోగంలో చెప్పబడిన నృత్తహస్తాలకు కరణాలతో సంబంధం ఉంటుంది.

**మూ. ప్రాయేణ కరణే కార్యో వామో వక్షఃస్థితః కరః. 171**
**చరణస్యానుగశ్చాపి దక్షిణస్తు భవేత్కరః.**

**తా.** సాధారణంగా కరణాలలో ఎడమచెయ్యి వక్షఃస్థలంమీద ఉంచాలి. కుడి చెయ్యి పాదగతులను అనుసరించి ఉంటుంది.

**మూ. చార్యశ్చైవ తు యాః ప్రోక్తా నృత్తహస్తాస్తథైవ చ. 172**
**సా మాతృకేతి విజ్ఞేయా తద్భేదాత్కరణాని తు.**

**తా.** ఇక్కడ చెప్పిన చారీలకు, నృత్తహస్తాలకు, మాతృక అని పేరు. వాటి భేదాలను పట్టి వేరు వేరు కరణాల స్వరూపం తెలుసుకోవాలి.

**మూ. అష్టోత్తరశతం హ్యేతత్కరణానాం మయోదితమ్. 173**
**అతః పరం ప్రవక్ష్యామి హ్యఙ్గహారవికల్పనమ్.**

**తా.** నేను నూటఎనిమిది కరణాలను చెప్పాను. ఇపుడు అంగహారాల స్వరూపం (లక్షణం) చెపుతాను.

### *32 అంగహారాలు*

**మూ. ప్రసార్యోత్క్షిప్య చ కరౌ సమపాదం ప్రయోజయేత్. 174**
**వ్యసితాపసృతం సవ్యం హస్తమూర్ధ్వం ప్రసారయేత్,**
**ప్రత్యాలీఢం తతః కుర్యాత్ తథైవ చ నికుట్టకమ్. 175**
**ఊరూద్వృత్తం తతః కుర్యాదాక్షిప్తం స్వస్తికం తతః,**
**నితమ్బం కరిహస్తం చ కటిచ్ఛిన్నం చ యోగతః. 176**
**స్థిరహస్తో భవేదేష త్వఙ్గహారో హరప్రియః.**

**తా.** (1) **స్థిరహస్తం :-** రెండు చేతులూ చాపి పైకెత్తి సమపాదం (పాదాలు రెండూ సమంగా ఉండేటట్లు నిలబడు విధానాన్ని) స్థితిని, ప్రయోగించాలి. కుడి చెయ్యి వ్యంసిత స్థితిలో పైకి చాపాలి. పిమ్మట ప్రత్యాలీఢ మనే స్థానాన్ని అవలంబించి నిలబడి నికుట్టకం, ఊరూద్వృత్తం, ఆక్షిప్తం, స్వస్తికం, నితంబం, కరిహస్తం, కటిఛిన్నం అను కరణాల ప్రదర్శనం ఏకాగ్రతతో వరుసగా చెయ్యాలి. శివునకు ప్రీతికర మైన **స్థిరహస్త** మను అంగహారం ఈ విధంగా ఏర్పడుతుంది. ఈ అంగహారం యోగం కంటె కూడ హరునకు ప్రియమైనది అని కొందరు వ్యాఖ్యానించారు (అభి).

**మూ. తలపుష్పాపవిద్ధే ద్వే వర్తితం సనికుట్టకమ్. 177**

**ఊరూద్వృత్తం తథా క్షిప్తమురోమణ్డలమేవ చ,**
**నితమ్బం కరిహస్తం చ కటిచ్ఛిన్నం తథైవ చ. 178**
**ఏష పర్యస్తకో నామ హ్యఙ్గహారో హరోద్భవః.**

**తా.** (2) **పర్యస్తకం :-** తలపుష్పం, అపవిద్ధం, వర్తితం, నికుట్టకం, ఊరూద్వృత్తం, ఆక్షిప్తం, ఉరోమండలం, నితంబం, కరిహస్తం, కటిచ్ఛిన్నం – ఈ కరణాలను ఇదే క్రమంలో ప్రయోగిస్తే శివునినుండి ఆవిర్భవించిన **పర్యస్తకం** అను అంగహారం ఏర్పడుతుంది.

**మూ. అలపల్లవసూచీ చ కృత్వా నిక్షిప్తమేవ చ. 179**

**ఆవర్తితం తతః కుర్యాత్ తథైవ చ నికుట్టకమ్,**
**ఊరూద్వృత్తం తథా క్షిప్తమురోమణ్డలమేవ చ. 180**
**కరిహస్తం కటిచ్ఛిన్నం సూచీవిద్ధో భవేదయమ్.**

**తా.** (3) **సూచీవిద్ధం :-** ముందుగా అలపల్లవ – సూచీముఖముద్రలు చూపి, తరువాత, వరుసగా, విక్షిప్తం, ఆవర్తితం, నికుట్టకం, ఊరూద్వృత్తం, ఆక్షిప్తం, ఉరోమణ్డలం, కరిహస్తం, కటిచ్ఛిన్నం అను కరణాల ప్రయోగం చేస్తే అది **సూచీవిద్ధాంగహారం.**

**మూ. అపవిద్ధం తు కరణం సూచీవిద్ధం తథైవ చ. 181**

**ఉద్వేష్టితేన హస్తేన త్రికం తు పరివర్తయేత్,**
**ఉరోమణ్డలకౌ హస్తౌ కటిచ్ఛిన్నం తథైవ చ. 182**
**అపవిద్ధోఽఙ్గహారశ్చ విజ్ఞేయోఽయం ప్రయోక్తృభిః.**

**తా.** (4) **అపవిద్ధం :-** ముందుగా అపవిద్ధ – సూచీవిద్ధకరణాల ప్రయోగం చేసి, ఉద్వేష్టితమైన హస్తం చూపుతూ త్రికాన్ని తిప్పాలి. తరవాత ఉరోమండలకకరణానికి

అనుగుణంగా హస్తా లుంచుతూ కటిచ్ఛిన్నకరణం చూపాలి. ఇదే **అపవిద్ధం** అనే అంగహారం అని ప్రయోక్తలు తెలుసుకోవాలి.

**మూ. కరణం నూపురం కృత్వా విక్షిప్తాలాతకే పునః. 183**

**పునరాక్షిప్తకం కుర్యాత్ ఉరోమణ్డలకం తథా,**

**నితమ్బం కరిహస్తం చ కటిచ్ఛిన్నం తథైవ చ. 184**

**ఆక్షిప్తకః స విజ్ఞేయో హ్యఙ్గహారః ప్రయోక్తృభిః.**

**తా.** (5) **ఆక్షిప్తకం :–** ముందుగా నూపురకరణం ప్రయోగించాలి. పిమ్మట విక్షిప్తం, అలాతకం, ఆక్షిప్తం, ఉరోమండలం, నితంబం, కరిహస్తం, కటిచ్ఛిన్నం అను కరణాలు అదే వరసలో ప్రయోగించాలి. ఈ అంగహారానికి **ఆక్షిప్తకం** అని పేరు.

**మూ. ఉద్వేష్టితాపవిద్ధస్తు కరః పాదో నికుట్టితః. 185**

**పునస్తేనైవ యోగేన వామపార్శ్వే భవేదథ,**

**ఉరోమణ్డలకౌ హస్తౌ నితమ్బం కరిహస్తకమ్. 186**

**కర్తవ్యం సకటిచ్ఛిన్నం నృత్తే తూద్ఘట్టితే సదా.**

**తా.** (6) **ఉద్ఘట్టితం :–** కుడి చెయ్యి ఉద్వేష్టితమై అపవిద్ధముద్రలో ఉండగా కుడి కాలు నికుట్టితంలో ఉండాలి. అదే విధంగా ఎడమ చెయ్యి ఉద్వేష్టితమై అపవిద్ధముద్రలో ఉండగా ఎడమ కాలు నికుట్టితమై ఉండాలి. హస్తాలు ఉరోమండలకరణంలో నుండగా వరుసగా నితంబం, కరిహస్తం, కటిచ్ఛిన్నం అను కరణాల ప్రదర్శనం చెయ్యాలి. ఇది **ఉద్ఘట్టిత** అంగహారం.

**మూ. పర్యాయోద్వేష్టితౌ హస్తౌ పాదౌ చైవ నికుట్టితౌ. 187**

**కుఞ్చితావఞ్చితౌ చైవ హ్యూరూద్వృత్తం తథైవ చ,**

**చతురశ్రం కరం కృత్వా పాదేన చ నికుట్టకమ్. 188**

**భుజఙ్గత్రాసితం చైవ కరం చోద్వేష్టితం పునః,**

**పరిచ్ఛిన్నం చ కర్తవ్యం త్రికం భ్రమరకేణ తు. 189**

**కరిహస్తం కటిచ్ఛిన్నం విష్కమ్భే పరికీర్తితమ్.**

**తా.** (7) **విష్కంభం :–** హస్తాలు ఉద్వేష్టితం చేసి కాళ్లు నికుట్టితం చేసి ఉంచాలి. అదే క్రమంలో హస్తాలు కుంచితం చేసి కాళ్లు అంచితం చెయ్యాలి (తిప్పాలి). తరువాత ఊరూద్వృత్తకరణ ప్రయోగం చేసి చేతులతో చతురసం చేసి పాదాలతో నికుట్టకకరణం ప్రయోగించాలి. తరువాత భుజంగత్రాసితకరణప్రయోగం చేసి చేతులు ఉద్వేష్టితముద్రలో ఉంచాలి. తరువాత భ్రమరకరణం ప్రయోగిస్తూ త్రికాన్ని వలితం చెయ్యాలి. తరువాత కరిహస్తం కటిచ్ఛిన్నకరణం ప్రదర్శించాలి. ఇది **విష్కంభ – అంగహారం.**

**మూ. దణ్డపాదం కరం చైవ విక్షిప్యాక్షిప్య చైవ హి.** **190**

**వ్యసితం వామహస్తం చ సహపాదేన సర్పయేత్**

**నికుట్టకద్వయం కార్యమాక్షిప్తం మణ్డలోరసి.** **191**

**కరిహస్తం కటిచ్ఛిన్నం కర్తవ్యమపరాజితే.**

**తా.** (8) **అపరాజితం :–** ముందుగా దండపాదకరణం ప్రయోగించి, పిదప హస్తాలను విక్షిప్తం చేసి (ముందుకు చాపి) మరల వాటిని ఆక్షిప్తం చేసి (శరీరం వైపు లాగికొని) తరువాత వ్యంసితకరణం ప్రయోగించి ఎడమ చేతిని పాదాలకు అనురూపంగా ఉండేటట్లు కదలుస్తూ ఉంచాలి. తరువాత రెండు నికుట్టకాలూ (నికుట్టకం అర్ధకుట్టకం) చూపాలి. వాటి తరువాత ఆక్షిప్తం, ఉరోమండలం, కరిహస్తం, కటిచ్ఛిన్నం ప్రదర్శించాలి. ఇది **అపరాజితాంగహారం.**

**మూ. కుట్టితం కరణం కృత్వా భుజఙ్గత్రాసితం తథా.** **192**

**రేచితేన తు హస్తేన పతాకం హస్తమాదిశేత్,**

**ఆక్షిప్తకం ప్రయుఞ్జీత హ్యురోమణ్డలకం తథా.** **193**

**లతాఖ్యం సకటిచ్ఛిన్నం విష్కమ్భాపసృతే భవేత్.**

**తా.** (9) **విష్కంభాపసృతం :–** ముందుగా కుట్టితభుజంగత్రాసితకరణాల ప్రయోగం చేస్తూ రేచితహస్తాలను పతాకముద్రలో ఉంచాలి. తరువాత వరుసగా ఆక్షిప్తక – ఉరో మండలకరణాలను, కటిచ్ఛిన్నకరణంతో పాటు లతాహస్తమూ ప్రయోగించాలి. ఇది **విష్కంభాపసృతఅంగహారం.**

**మూ. త్రికం సులలితం కృత్వా నూపురం కరణం తథా.** **194**

**భుజఙ్గత్రాసితం సవ్యం తథా వైశాఖరేచితమ్,**

**ఆక్షిప్తకం తతః కృత్వా పరిచ్ఛిన్నం తథైవ చ.** **195**

**బాహ్యాభ్రమరకం కుర్యాదురోమణ్డలమేవ చ,**

**నితమ్బం కరిహస్తం చ కటిచ్ఛిన్నం తథైవ చ.** **196**

**మత్తాక్రీడో భవేదేష హ్యఙ్గహారో హరప్రియః.**

**తా.** (10) **మత్తాక్రీడం :–** అందంగా త్రికాన్ని వలితం చేస్తూ నూపురకరణం ప్రదర్శించాలి. తరువాత భుజంగత్రాసిత – వైశాఖరేచితకరణాలు ప్రయోగించాలి. వీటి తరువాత వరుసగా ఆక్షిప్తం, ఛిన్నం, బాహ్యాభ్రమరకం, ఉరోమండలం, నితంబం, కరిహస్తం, కటిచ్ఛిన్నం ప్రయోగించాలి. ఇది శివునకు ప్రియ మైన **'మత్తాక్రీడం'** అను అంగహారం.

**మూ. రేచితం హస్తపాదం చ కృత్వా వృశ్చికమేవ చ. 197**

**పునస్తేనైవ యోగేన వృశ్చికం సంప్రయోజయేత్,**

**నికుట్టకం తథా చైవ సవ్యాసవ్యకృతం క్రమాత్. 198**

**లతాఖ్యః సకటిచ్ఛేదో భవేత్ స్వస్తికరేచితే.**

**తా.** (11) **స్వస్తికరేచితం :-** చేతులూ కాళ్లూ రేచితముద్రలో ఉంచి వృశ్చికకరణ ప్రయోగం చెయ్యాలి. అదే హస్త – పాదాలతో వృశ్చికకరణం మళ్లీ ప్రయోగించాలి. తరువాత కుడి – ఎడమ అంగాలతో నికుట్టక కరణం ప్రదర్శించాలి. ఇది **స్వస్తికరేచిత** అంగహారం.

**మూ. పార్శ్వే తు స్వస్తికం బద్ధ్వా కార్యం త్వర్ధనికుట్టకమ్. 199**

**ద్వితీయస్య చ పార్శ్వస్య విధిః స్యాదయమేవ హి,**

**తతశ్చ కరమావర్త్య హ్యూరుపృష్ఠే నిపాతయేత్. 200**

**ఊరూద్వృత్తం తతః కుర్యాదాక్షిప్తం పునరేవ హి,**

**నితమ్బం కరిహస్తం చ కటిచ్ఛిన్నం తథైవ చ. 201**

**పార్శ్వస్వస్తిక ఇత్యేష హ్యఙ్గహారః ప్రకీర్తితః.**

**తా.** (12) **పార్శ్వస్వస్తికం :-** పాదాలను స్వస్తికముద్రలో పార్శ్వంలో ఉంచి అర్ధనికుట్టకం ప్రదర్శించాలి. రెండవ పార్శ్వంలో అదే విధంగా చెయ్యాలి. తరువాత చెయ్యి తిరగవేసి తొడపైన వెయ్యాలి. తరువాత క్రమంగా ఊరూద్వృత్తం, ఆక్షిప్తం, నితంబం, కరిహస్తం, కటిచ్ఛిన్నం అను కరణాల ప్రయోగం చెయ్యాలి. ఇది **పార్శ్వస్వస్తికఅంగహారం.**

**మూ. వృశ్చికం కరణం కృత్వా లతాఖ్యం హస్తమేవ చ. 202**

**తమేవ చ కరం భూమౌ నాసాగ్రే సన్నికుఞ్చయేత్,**

**తమేవోద్వేష్టితుం కృత్వా నితమ్బం పరివర్తయేత్. 203**

**కరిహస్తం కటిచ్ఛిన్నం వృశ్చికాపసృతే భవేత్.**

**తా.** (13) **వృశ్చికాపసృతం :-** వృశ్చికకరణం ప్రయోగించి, లతాముద్రలో ఉన్న హస్తం ముక్కు చివర వంచి, పిమ్మట ఆ హస్తాన్నే ఉద్వేష్టితముద్రలో ఉంచుతూ నితంబ కరణం ప్రయోగించి, పిమ్మట వరుసగా కరిహస్త – కటిచ్ఛిన్నకరణాలు ప్రయోగించి నట్లయితే అది వృశ్చికాపసృతాంగహారం.

**మూ. కృత్వా నూపురపాదం తు తథాక్షిప్తకమేవ చ. 204**

**పరిచ్ఛిన్నం చ కర్తవ్యం సూచీపాదం తథైవ చ,**

**నితమ్బం కరిహస్తం చాప్యురోమణ్డలకం తథా. 205**

**కటిచ్ఛిన్నం తతశ్చైవ భ్రమరః స తు సంజ్ఞితః.**

**తా.** (14) **భ్రమరం :-** నూపురపాదచారి చేసిన పిమ్మట ఆక్షిప్తకం, ఛిన్నం, సూచీపాదం, నితంబం, కరిహస్తం, ఉరోమండలం, కటిచ్ఛిన్నం అను కరణాలను ఇదే క్రమంలో ప్రయోగించిన ట్లయితే ఇది **భ్రమరాంగహారం.**

**మూ. మత్తల్లికరణం కృత్వా కరమావర్త్య దక్షిణమ్. 206**
**కపోలస్య ప్రదేశే తు కార్యం సమ్యఙ్నికుఞ్చితమ్,**
**అపవిద్ధం ద్రుతం చైవ తలసంస్ఫోటిసంయుతమ్. 207**
**కరిహస్తం కటిచ్ఛిన్నం మత్తస్ఖలితకే భవేత్.**

**తా.** (15) **మత్తస్ఖలితకం :-** మత్తల్లికరణం ప్రయోగించి, కుడి హస్తం గుండ్రంగా తిప్పి, బుగ్గమీద చక్కగా నికుంచితం చేసి, పిమ్మట అపవిద్ధకరణం; తరవాత వెంటనే తలసంస్ఫోటితమును, చివర కరిహస్త – కటిచ్ఛిన్న కరణములు ప్రయోగించగా **మత్తస్ఖలిత అంగహారం** అవుతుంది.

**మూ. దోలైః కరైః పరిచితైః స్వస్తికాపసృతైః పదైః. 208**
**అఞ్చితైర్వలితైర్హస్తైస్తలసంఘట్టితైస్తథా,**
**నికుట్టితం చ కర్తవ్యమూరూద్వృత్తం తథైవ చ. 209**
**కరిహస్తం కటిచ్ఛిన్నం మదాద్విలసితే భవేత్.**

**తా.** (16) **మదవిలసితం :-** గతితో ఉన్న రెండు చేతులూ దోలాముద్రలో ఉండాలి. పాదాలు స్వస్తికచేష్టలో కదలుస్తూ ఉండాలి. హస్తాలను అంచితములుగాను, వలితములు గాను తలసంఘట్టితములుగాను చెయ్యాలి, తరువాత వరుసగా నికుట్టితము, ఊరూద్వృత్తము, కరిహస్తము కటిచ్ఛిన్నము అను కరణాల ప్రయోగం చెయ్యాలి. అది **మదవిలసితాంగహారం.**

**మూ. మణ్డలం స్థానకం కృత్వా తథా హస్తౌ చ రేచితౌ. 210**
**ఉద్ఘట్టితేన పాదేన మత్తల్లికరణం భవేత్,**
**ఆక్షిప్తం కరణం చైవ హ్యురోమణ్డలమేవ చ. 211**
**కటిచ్ఛిన్నం తథా చైవ భవేత్తు గతిమణ్డలే.**

**తా.** (17) **గతిమండలం :-** మండలస్థానకం ప్రయోగించి, చేతులతో రేచితం ముద్ర వేసి పాదాలు ఉద్ఘట్టిత క్రియలో ఉంచి, తరువాత వరుసగా మత్తల్లి, ఆక్షిప్త, ఉరోమండల, కటిచ్ఛిన్నకరణాల ప్రయోగం చేసిన ట్లయితే అది **గతిమండలఅంగహారం.**

**మూ. సమపాదం ప్రయుజ్యాథ పరిచ్ఛిన్నం త్వనన్తరమ్. 212**
**ఆవిద్ధేన తు పాదేన బాహ్యభ్రమకరం తథా,**
**వామసూచ్యా త్వతిక్రాన్తం భుజఙ్గత్రాసితం తథా. 213**
**కటిహస్తం కటిచ్ఛిన్నం పరిచ్ఛిన్నే విధీయతే.**

**తా.** (18) **పరిచ్ఛిన్నం :-** ప్రారంభంలో సమపాదం ప్రయోగించి, తరవాత పరిచ్ఛిన్నకరణము, ఆవిద్ధపాదంతో బాహ్యభ్రమరకము, తరువాత ఎడమకాలితో సూచీచారి ద్వారా అర్ధసూచీకరణము, తరువాత వరుసగా అతిక్రాంత భుజంగత్రాసిత కరిహస్త కటిచ్ఛిన్నకరణాల ప్రయోగమూ చెయ్యాలి. అది **పరిచ్ఛిన్నాంగహారం.**

**మూ. శిరసస్తూపరి స్థాప్యౌ స్వస్తికౌ విచ్యుతౌ కరౌ. 214**
**తతః సవ్యం కరం చాపి గాత్రమానమ్య రేచయేత్,**
**పునరుత్థాపయేత్తత్ర గాత్రమున్నమ్య రేచితమ్. 215**
**లతాఖ్యౌ చ కరౌ కృత్వా వృశ్చికం సంప్రయోజయేత్,**
**రేచితం కరిహస్తం చ భుజఙ్గత్రాసితం తథా. 216**
**ఆక్షిప్తకం ప్రయుఞ్జీత స్వస్తికం పాదమేవ చ,**
**పరాఙ్ముఖవిధిర్భూయ ఏవమేవ భవేదిహ. 217**
**కరిహస్తం కటిచ్ఛిన్నం పరివృత్తకరేచితే.**

**తా.** (19) **పరివృత్తకరేచితం :-** రెండు చేతులు స్వస్తికముద్రలో శిరస్సుమీద ఒదులుగా ఉంచాలి. తరువాత వరీరం వంచి కుడి చేతితో రేచితం చెయ్యాలి. తిరిగి రేచితహస్తం పైకి లేవదీసి, శరీరం కూడ నిలువుగా నిలపాలి. పిమ్మట చేతులు లతాముద్రలో ఉంచి వరుసగా వృశ్చిక - రేచిత - కరిహస్త - భుజంగత్రాసిత - ఆక్షిప్తక కరణాలు ప్రయోగించి పాదాలు స్వస్తికముద్రలో ఉంచుతూ, వెనుకకు తిరిగి పైన చెప్పిన కరణాలన్నీ మళ్లీ చెయ్యాలి. అన్నింటికీ చివర కరిహస్తకరణమూ, కటిచ్ఛిన్న కరణమూ ప్రయోగించాలి. అప్పు డది **పరివృత్తరేచితకరణం.**

**మూ. రేచితౌ సహ గాత్రేణ హ్యపవిద్ధౌ కరౌ యదా. 218**
**పునస్తేనైవ దేశేన గాత్రమున్నమ్య రేచయేత్,**
**కుర్యాన్నూపురపాదం చ భుజఙ్గత్రాసితం తథా. 219**
**రేచితం మణ్డలం చైవ బాహుశీర్షే నికుఞ్చయేత్,**
**ఊరూద్వృత్తం తథాక్షిప్తమురోమణ్డలమేవ చ. 220**
**కరిహస్తం కటిచ్ఛిన్నం కుర్యాద్వైశాఖరేచితే.**

**తా.** (20) **వైశాఖరేచితం :-** శరీరంతో పాటు చేతులు రెండూ రేచితం చేసి అపవిద్ధముద్రలో ఉంచాలి. తరువాత శరీరాన్ని రెండవ వైపు ఎత్తుగా ఉండే టట్లు చేసి పై ప్రక్రియ అంతా మళ్లీ చెయ్యాలి. తరువాత వరుసగా నూపుర – భుజంగవిలసిత – రేచిత – మండలకరణాలు ప్రదర్శించి, మెడలు కొంచెం వంచి (కుదించి) తరువాత ఊరూద్వృత్తము, ఆక్షిప్తకము, ఉరోమండలము, కరిహస్తము, కటిచ్ఛిన్నము ప్రయోగిస్తే అది **వైశాఖరేచితాంగహారం.**

**మూ. ఆద్యం తు జనితం కృత్వా పాదమేకం ప్రసారయేత్. 221**
**తథైవాలాతకం కుర్యాత్ త్రికం తు పరివర్తయేత్,**
**అఞ్చితం వామహస్తం చ గణ్డదేశే నికుఞ్చయేత్. 222**
**కటిచ్ఛిన్నం తథా చైవ పరివృత్తం ప్రయోజయేత్.**

**తా.** (21) **పరావృత్తం :-** ముందుగా జనితకరణప్రయోగం చేసి ఒకపాదం ముందుకు చాపాలి. పిమ్మట అలాతకరణం చేసి త్రికాన్ని (భ్రమరీచారీప్రయోగం చేసి) త్రిప్పాలి. ఎడమ చెయ్యి అంచిత ముద్రలో కపోలంమీద (చెక్కిలిమీద) నికుట్టితం చెయ్యాలి. చివర కటిచ్ఛిన్నకరణప్రయోగం చెయ్యాలి. ఇది **పరావృత్తఅంగహారం.**

**మూ. స్వస్తికం కరణం కృత్వా వ్యసితౌచ కరౌ పునః. 223**
**అలాతకం ప్రయుఞ్జీత హ్యూర్ధ్వజాను నికుఞ్చితమ్,**
**అర్ధసూచీ చ విక్షిప్తముద్వృత్తాక్షిప్తకే తథా. 224**
**కరిహస్తం కటిచ్ఛిన్నమఙ్గహారే హ్యలాతకే.**

**తా.** (22) **అలాతకం :-** ముందుగా స్వస్తికరణం చేసి రెండు చేతులు వ్యంసితములుగా ఉంచి పిమ్మట వరుసగా – అలాతక – ఊర్ధ్వజాను – నికుంచిత – అర్ధసూచీ – విక్షిప్త – ఉద్వృత్త – ఆక్షిప్త – కరిహస్త – కటిచ్ఛిన్నకరణాల ప్రయోగం చెయ్యాలి. అది **అలాతకఅంగహారం.**

**మూ. నికుట్ట్య వక్షసి కరావూర్ధ్వజాను ప్రయోజయేత్. 225**
**ఆక్షిప్తస్వస్తికం కృత్వా త్రికం తు పరివర్తయేత్,**
**ఉరోమణ్డలకౌ హస్తౌ నితమ్బం కరిహస్తకమ్. 226**
**కటిచ్ఛిన్నం తథా చైవ పార్శ్వచ్ఛేదే విధీయతే**

**తా.** (23) **పార్శ్వచ్ఛేదం :-** హస్తాలను కుట్టితముద్రలో వక్షఃస్థలంమీద ఉంచాలి. పిమ్మట ఊర్ధ్వజాను – ఆక్షిప్త – స్వస్తిక కరణాల ప్రయోగం చేసి త్రికాన్ని (భ్రామరీ

చారీలో) పరివర్తితం చేసి, హస్తాలను ఉరోమండలకరణంలో ఉంచుతూ నితంబ – కరిహస్త – కటిచ్ఛిన్న కరణాల ప్రయోగం చెయ్యాలి. అది **పార్శ్వచ్ఛేదఅంగహారం.**

**మూ. సూచీవామపదం దద్యాద్విద్యుద్భ్రాన్తం చ దక్షిణమ్. 227**

**దక్షిణేన పునః సూచీ విద్యుద్భ్రాన్తం చ వామతః,**

**పరిచ్ఛిన్నం తథాచైవ హ్యతిక్రాన్తం చ వామకమ్. 228**

**లతాఖ్యం సకటిచ్ఛిన్నం విద్యుద్భ్రాన్తశ్చ స స్మృతః.**

**తా.** (24) **విద్యుద్భ్రాంతం :–** ఎడమ పాదం సూచీకరణంలో ఉంచి కుడిపాదం విద్యుద్భ్రాంతకరణంలో ఉంచాలి. తరువాత కుడిపాదం సూచీకరణంలో ఉంచి ఎడమ పాదంలో విద్యుద్భ్రాంతకరణం ప్రయోగించాలి. తరువాత ఛిన్నకరణం ప్రయోగించి త్రికపరివర్తనం చెయ్యాలి. పిమ్మట లతాహస్తముద్రలో కటిచ్ఛిన్నకరణం ప్రయోగించాలి. అది **విద్యుద్భ్రాంతఅంగహారం.**

**మూ. కృత్వా నూపురపాదం తు సవ్యవామౌ ప్రలమ్బితౌ. 229**

**కరౌ పార్శ్వే తతస్తాభ్యాం విక్షిప్తం సంప్రయోజయేత్,**

**తాభ్యాం సూచీ తథా చైవ త్రికం తు పరివర్తయేత్. 230**

**లతాఖ్యం సకటిచ్ఛిన్నం కుర్యాదుద్వృత్తకే సదా.**

**తా.** (25) **ఉద్వృత్తకం :–** పాదాలు నూపురపాదచారిలో ఉంచుతూ చేతులు రెండూ పార్శ్వాలలో వ్రేలాడుతూన్నట్లు ఉంచాలి. తరవాత ఆ చేతులతోనే విక్షిప్తకరణ ప్రయోగం చేసి, వాటితోనే సూచీకరణ ప్రయోగం కూడ చేసి, భ్రామరీచారితో త్రికపరివర్తనం చెయ్యాలి. చివర లతా కటిచ్ఛిన్న కరణాలు ప్రయోగించాలి. అది **ఉద్వృత్తక అంగహారం.**

**మూ. ఆలీఢవ్యంసితౌ హస్తౌ బాహుశీర్షే నికుట్టయేత్. 231**

**నూపురశ్చరణో వామః తథాలాతశ్చ దక్షిణః,**

**తేనైవాక్షిప్తకం కుర్యాదురోమణ్డలకౌ కరౌ. 232**

**కరిహస్తం కటిచ్ఛిన్నమాలీఢే సంప్రయోజయేత్.**

**తా.** (26) **ఆలీఢం :–** ఆలీఢస్థానకంతో పాటు వ్యంసితకరణం ప్రయోగిస్తూ రెండు చేతులా బుజాలమీద నికుట్టితములు చేసి, ఎడమ పాదంతో నూపురకరణమూ, కుడి పాదంతో అలాతకరణమూ ప్రయోగించాలి. ఆ పాదంతోనే ఆక్షిప్తకరణం కూడ

ప్రదర్శించాలి. పిదప చేతులు రెండింటితో ఉరోమండలకరణం ప్రయోగిస్తూ కరిహస్త – కటిచ్ఛిన్నకరణాలు ప్రయోగించాలి. అది **ఆలీఢాంగహారం.**

**మూ. హస్తం తు రేచితం కృత్వా పార్శ్వమానమ్య రేచయేత్. 233**

**పునస్తేనైవ యోగేన గాత్రమానమ్య రేచయేత్,**
**రేచితం కరణం కార్యమురోమణ్డలమేవ చ. 234**

**కటిచ్ఛిన్నం తు కర్తవ్యమఙ్గహారే తు రేచితే.**

**తా.** (27) **రేచితం :–** ఒక హస్తం రేచితం చేసి పిదప ఒక పార్శ్వం వంచి రేచితంగా ఉంచాలి. పిమ్మట మొత్తం శరీరం వంచి రేచితంగా ఉంచాలి. రేచితకరణం ప్రయోగించి క్రమంగా ఉరోమండల – కటిచ్ఛిన్న కరణాలు ప్రయోగించాలి. అది **రేచితాంగహారం.**

**మూ. నూపురం చరణం కృత్వా త్రికం తు పరివర్తయేత్. 235**

**వ్యంసితేన తు హస్తేన త్రికమేవ వివర్తయేత్,**
**వామం చాలాతకం కృత్వా సూచీమత్రైవ యోజయేత్. 236**

**కరిహస్తం కటిచ్ఛిన్నం కుర్యాదాచ్ఛురితే సదా.**

**తా.** (28) **ఆచ్ఛురితం :–** నూపుర (పాద)చారి చేసి త్రికం పరివర్తితం చెయ్యాలి. తరువాత హస్తంచేత వ్యంసితకరణం చేసి త్రికాన్ని త్రిప్పాలి. ఎడమ పాదంతో అలాతక కరణం ప్రదర్శించి సూచి, కరిహస్తం, కటిచ్ఛిన్నం అను కరణాల ప్రయోగం చెయ్యాలి. అది **ఆచ్ఛురితాంగహారం.**

**మూ. రేచితౌ స్వస్తికౌ పాదౌ రేచితౌ స్వస్తికౌ కరౌ. 237**

**కృత్వా విశ్లేషమేవం తు తేనైవ విధినా పునః,**
**పునరుత్క్షేపణం చైవ రేచితైరేవ కారయేత్. 238**

**ఉద్వృత్తాక్షిప్తకే చైవ హ్యురోమణ్డలమేవ చ,**
**నితమ్బం కరిహస్తం చ కటిచ్ఛిన్నం తథైవ చ. 239**

**ఆక్షిప్తరేచితో హ్యేష కరణానాం విధిః స్మృతః.**

**తా.** (29) **ఆక్షిప్తరేచితం :–** స్వస్తికంలో ఉన్న రెండు పాదాలూ, స్వస్తికంలో ఉన్న రెండు హస్తాలూ, రేచితంలో ఉంచి, రేచితప్రక్రియచేతనే వాటిని విడదీసి, మళ్లీ రేచితక్రియ చేత వాటిని పైవైపు కదల్చి, పిదప వరుసగా ఉద్వృత్తం, ఆక్షిప్తం, ఉరోమండలం, నితంబం, కరిహస్తం, కటిచ్ఛిన్నం అను కరణాల ప్రయోగం చేసిన ట్లయితే అది **ఆక్షిప్తరేచితాంగ హారం.**

**మూ. విక్షిప్తం కరణం కృత్వా హస్తపాదం సుఖానుగమ్. 240**
**వామసూచీసహకృతం విక్షిపేద్వామకం కరమ్,**
**వక్షఃస్థానే భవేత్సవ్యః వలితం త్రికమేవ చ. 241**
**నూపూరాక్షిప్తకే చైవ హర్ధస్వస్తికమేవ చ,**
**నితమ్బం కరిహస్తం చ హ్యురోమణ్డలకం తథా. 242**
**కటిచ్ఛిన్నం చ కర్తవ్యం సంభ్రాన్తే నృత్తయోక్తృభిః.**

**తా.** (30) **సంభ్రాంతం :–** విక్షిప్తకరణం ప్రయోగించి, చేతులూ, పాదాలూ ముఖాభిముఖంగా ఉండే టట్లు ఉంచుతూ, ఎడమ చెయ్యి సూచీముద్రలోను, కుడి చెయ్యి వక్షఃస్థలంమీదా ఉంచుతూ త్రికాన్ని వలితం చెయ్యాలి. తరువాత వరుసగా నూపుర – ఆక్షిప్త – అర్ధస్వస్తిక – నితంబ – కరిహస్త – ఉరోమండల కటిచ్ఛిన్న కరణాల ప్రయోగం చెయ్యాలి. అది **సంభ్రాంతాంగహారం.**

**మూ. అపక్రాన్తక్రమం కృత్వా వ్యసితం హస్తమేవ చ. 243**
**కుర్యాదుద్వేష్టితం చైవ హ్యర్ధసూచీం తథైవ చ,**
**విక్షిప్తం సకటిచ్ఛిన్నముద్వృత్తాక్షిప్తకే తథా. 244**
**కరిహస్తం కటిచ్ఛిన్నం కర్తవ్యమపసర్పితే.**

**తా.** (31) **అపసర్పితం :–** అపక్రాంతకరణం ప్రయోగించి, హస్తాలతో వ్యసిత కరణం చేసి, పిమ్మట హస్తాలు ఉద్వేష్టితకరణంలో ఉంచి, నిలబడి, వరుసగా అర్ధసూచి, విక్షిప్తం, కటిచ్ఛిన్నం, ఉద్వృత్తం, ఆక్షిప్తకం, కరిహస్తం, కటిచ్ఛిన్నం అను కరణాలు ప్రయోగిస్తే అది **అపసర్పితాంగహారం.**

**మూ. కృత్వా నూపురపాదం చ ద్రుతమాక్షిప్య చ క్రమమ్. 245**
**పాదస్య చానుగే హస్తౌ త్రికం చ పరివర్తయేత్,**
**నికుట్య కరపాదం చాప్యురోమణ్డలకం పునః. 246**
**కరిహస్తం కటిచ్ఛిన్నం కార్యమర్ధనికుట్టకే,**
**ద్వాత్రింశదేతే సంప్రోక్తా హ్యఙ్గహారా ద్విజోత్తమాః. 247**

**తా.** (32) **అర్ధనికుట్టకం :–** అతిశీఘ్రంగా నూపురపాదచారీప్రయోగం చేసి చేతులూ పాదాలూ క్రమంగా ఆక్షిప్తములు చెయ్యాలి. పాదాల గతిని అనుసరించి హస్తాల గతి ఉండే టట్లు చూచుకొంటూ త్రికాన్ని పరివర్తితం చెయ్యాలి. హస్తాలను పాదాలను నికుట్టితములు చేస్తూ వరుసగా ఉరోమండల – కరిహస్త – కటిచ్ఛిన్నకరణాలను

ప్రయోగించాలి. అది **అర్ధనికుట్టకాంగహారం.** ద్విజోత్తములారా! ఇంతవరకు నేను ముప్పై రెండు (32) అంగహారాలు మీకు చెప్పాను.

### *రేచకాలలో నాలుగు భేదాలు*

**మూ. చతురో రేచకాంశ్చాపి గదతో మే నిబోధత,**
**పాదరేచక ఏకః స్యాద్ ద్వితీయః కటిరేచకః. 248**
**కరరేచకస్తృతీయస్తు చతుర్థః కణ్ఠరేచకః.**

**తా.** ఇప్పుడు నాలుగు విధాలైన రేచకాలు చెపుతున్నాను; వినండి. మొదటిది పాదరేచకం; రెండవది కటిరేచకం; మూడవది హస్తరేచకం; నాల్గవది కంఠరేచకం.

### *రేచకాలు*

**(మూ. రేచితా(చకా)ఖ్యః పృథగ్భావః వలనే చాభిధీయతే,**
**ఉద్వాహనాత్ పృథగ్భావాత్ చలనాచ్చాపి రేచకః,**
**పార్శ్వాత్ పార్శ్వే తు గమనం స్ఖలితైశ్చలితైః పదైః,**
**వివిధైశ్చైవ పాదస్య పాదరేచక ఉచ్యతే**
**త్రికస్యోద్వర్తనం చైవ కటీవలనమేవ చ,**
**తథాపసర్పణం చైవ కటిరేచక ఉచ్యతే.**
**ఉద్వర్తనం పరిక్షేపో విక్షేపః పరివర్తనమ్,**
**విసర్పణం చ హస్తస్య హస్తరేచక ఉచ్యతే.**
**ఉద్వాహనం సంనమనం తథా పార్శ్వస్య సంనతిః,**
**భ్రమణం చాపి విజ్ఞేయో గ్రీవాయోః రేచకో బుధైః.)**

(**తా.** ఒక అవయవం కదలికలో ఉన్న వేరు వేరు పద్ధతి రేచకం. ఆ రేచకం చెప్ప బడుచున్నది. పైకి ఎత్తడంవల్ల, విడదీయడంవల్ల లేదా విడిపోవడంవల్ల, కదలడంవల్ల రేచకం ఏర్పడుతుంది.

(1) పాదాల అనేకవిధాలైన తొట్రుబాటులచేత, అడుగులు తడబడడంచేత, ఒక ప్రక్కనుండి మరొక ప్రక్కకు నడవడం **పాదరేచకం.**

(2) త్రికాన్ని పైకి లేపడం, కటిప్రదేశాన్ని త్రిప్పడం, కటిప్రదేశం మరొక వైపు కదల్చటం ఇది **కటిరేచకం.**

(3) హస్తం పైకి ఎత్తడం, దగ్గరగా విసరడం, దూరంగా విసరడం, తిప్పడం – వీటికి **హస్తరేచకం** అని పేరు.

(4) మెడ పైకి ఎత్తడం, వంచడం, ప్రక్కకి వంచడం, తిప్పడం – ఇవి **కంఠరేచకము**)

### *శివుడు రేచక - అంగహారాలతో నృత్యం చేయుట*

**మూ. రేచకైరఙ్గహారైశ్చ నృత్యన్తం వీక్ష్య శంకరమ్. 249**

**సుకుమారప్రయోగేణ నృత్యన్తీం చైవ పార్వతీమ్,**
**మృదఙ్గభేరీపటహైర్భాణ్డడిణ్డిమగోముఖైః. 250**

**పణవైర్దర్దురైశ్చైవ సర్వాతోద్యైః ప్రవాదితైః,**
**దక్షయజ్ఞే వినిహతే సన్ధ్యాకాలే మహేశ్వరః. 251**

**నానాఙ్గహారైః ప్రానృత్యల్లయతాలవశానుగైః,**
**పిణ్డీబన్ధాంస్తతో దృష్ట్వా నన్దిభద్రముఖా గణాః. 252**

**చక్రుస్తే నామ పిణ్డీనాం బన్ధమాసాం చ లక్షణమ్. 252½**

ఈ శ్లోకాలకి నాట్యశాస్త్రంలో ఉన్న ఈ క్రమంలో అర్థం సరిగా కుదరడంలేదు. పైన ఇచ్చిన ఎనిమిది శ్లోకార్ధాలలో మొదటి రెండు శ్లోకార్ధాలను. "మృదఙ్గ ... వంశానుగైః" అను 3-6 శ్లోకార్ధాల తరువాత పఠిస్తే అర్థం చెప్పుకొనడానికి కొంతవరకు కుదురుతుంది. అప్పుడు అర్థం - దక్షయజ్ఞధ్వంసానంతరం, మహేశ్వరుడు సంధ్యాకాలంలో మృదంగ - భేరీ - పటహ - భాండ - డిండిమ - గోముఖ - పణవ - దర్దురము లను సకలవాద్యాలు మ్రోగింపబడుచుండగా, లయకు తాలానికి అనుకూలంగా అనేకవిధాలైన అంగహారాలు ప్రయోగిస్తూ నృత్యం చేశాడు. (ఇది అప్పుడు మహేశ్వరుడు చేసిన నృత్యం విషయం. కాలాంతరంలో శివపార్వతులు చేసిన నృత్యం వర్ణన **"రేచకైరఙ్గహారైశ్చ"** ఇత్యాది శ్లోకాలలో చెప్పబడింది అని మనం అనుకోవాలి).

రేచకాలతోను, అంగహారాలతోను, అనగా రేచకాంగహారాలు ప్రయోగిస్తూ, నృత్యం చేస్తూన్న, శంకరుణ్ణి, సుకుమారప్రయోగంతో నృత్యం చేస్తూన్న పార్వతినీ చూచి, తరువాత పిండీబంధాలను కూడ చూచి, నంది, భద్రుడు మొదలైన గణాలు (ప్రమథులు) పిండీలకు పేర్లు పెట్టారు. వాటి బంధాన్నీ, అనగా పిండీలను ఏ విధంగా కట్టాలో ఆ విధానాన్నీ, వాటి లక్షణాలనూ కూడ చెప్పారు.

### *పిండీబంధాల పేర్లు*

**మూ. ఈశ్వరస్యేశ్వరీ పిణ్డీ నన్దినశ్చాపి పట్టసీ. 253**

**చణ్డికాయా భవేత్పిణ్డీ తథా వై సింహవాహినీ,**
**తార్క్ష్యపిణ్డీ భవేద్విష్ణోః పద్మపిణ్డీ స్వయంభువః. 254**

**శక్రస్యైరావతీ పిణ్డీ ఝషపిణ్డీ తు మాన్మథీ,**
**శిఖిపిణ్డీ కుమారస్య రూపపిణ్డీ భవేచ్ఛ్రియః. 255**

**ధారాపిణ్డీ చ జాహ్నవ్యాః పాశపిణ్డీ యమస్య చ,**
**వారుణీ చ నదీపిణ్డీ యాక్షీ స్యాద్ధనదస్య తు.** **256**

**హలపిణ్డీ బలస్యాపి సర్పపిణ్డీ తు భోగినామ్,**
**గాణేశ్వరీ మహాపిణ్డీ దక్షయజ్ఞవిమర్దినీ.** **257**

**త్రిశూలాకృతిసంస్థానా రౌద్రీ స్యాదన్ధకద్విషః,**
**ఏవమన్యాస్వపి తథా దేవతాసు యథాక్రమమ్.** **258**

**ధ్వజభూతాః ప్రయోక్తవ్యాః పిణ్డీబన్ధాః సుచిహ్నితాః.**

**తా.** ఈశ్వరుని పిండి పేరు **ఈశ్వరీపిండి.** నందీశ్వరునిది **పట్టసీపిండి.** చండికది **సింహవాహినీపిండి.** విష్ణుమూర్తిది **తార్క్ష్యపిండి.** స్వయంభవునిది పద్మపిండి. ఇంద్రునిది ఐరావతీపిండి. మన్మథునిది ఝషపిండి. కుమారస్వామిది శిఖిపిండి. శ్రీయొక్క పిండి రూపపిండి. జాహ్నవిది ధారాపిండి. యమునిది పాశపిండి. వరుణునిది నదీపిండి. కుబేరునిది యాక్షీపిండి. బలరామునిది హలపిండి. భోగుల (సర్పాల) పిండి **సర్పపిండి.** గణేశ్వరుని పిండి **'దక్షయజ్ఞవినాశిని'** అను పేరు గల **మహాపిండి.** అంధకాసురసంహారి యైన శంకరుని పిండి త్రిశూలాకారమైన **రౌద్రీపిండి.** ఇదే విధంగా ఐతరదేవతల పిండులు కూడ వారి వారి పేర్లు చేర్చి ఉంటాయి.

**వి.** 'పిండీ' శబ్దానికి ముద్ద, సముదాయము, గణము అని అర్థం. ఒక్కొక అంగహారంలో కొన్ని కరణాల, చారుల, ముద్రల కలయిక ఉంటుంది గాన దీనికి **'పిండీబంధం'** అను పేరు పెట్టి ఉంటారు. అభినవగుప్తాచార్యులు పిండీబుధ మనగా ఒక విధ మైన ఆకృతి (pose) అను అభిప్రాయంతో **"పిణ్డీబన్ధో నామ ఆకృతివిశేషః"** అన్నారు. కొన్ని కరణాలు, అంగహారాలు కొందరు దేవతలకు ప్రియం అవడంచేత వీటికి ఆ దేవతల పేర్లు ప్రసిద్ధిలోనికి వచ్చాయి. ఇలాంటి పిండీబంధాలలో ఆ యా దేవతలకు సంబంధించిన ఆయుధాలు వాహనాలు, భావాలు మొదలైనవాటి అనుకరణం చేయబడుతుంది. ఉదాహరణకు – భవాని ప్రీతికొరకు తలపుష్పపుటము, శివుని ప్రీతికై నిస్తంభితకరణము ప్రదర్శింపబడతాయి. నికుట్టకకరణం ప్రయోగించి త్రిశూలాకారం ప్రదర్శింపబడుతుంది.

## *తాండవనృత్యోత్పత్తి*

**మూ. రేచకా అఙ్గహారాశ్చ పిణ్డీబన్ధాస్తథైవ చ.** **259**

**సృష్ట్వా భగవతా దత్తా స్తణ్డవే మునయే తదా,**
**తణ్డునాపి తతః సమ్యగ్గానభాణ్డసమన్వితః.** **260**

**నృత్తప్రయోగః సృష్టో యః స తాణ్డవః ఇతి స్మృతః.**

**తా.** భగవంతుడైన శివుడు రేచకాలను, అంగహారాలను, పిండీబంధాలను సృజించి తండు మహామునికి ఉపదేశించాడు. దానిని ఆధారంగా తీసికొని తండుముని తగిన గాన పద్ధతితో, వివిధవాద్యసమూహంతో ఒక విశిష్టమైన నృత్తప్రయోగం సృష్టించాడు. దానికే **తాండవం** అని పేరు.

**మూ. ఋషయ ఊచుః-**

**"యదా ప్రాప్త్యర్థమర్థానాం తద్‌జ్ఞైరభినయః కృతః. 261**
**కస్మాన్నృత్తం కృతం హ్యేతత్ కం స్వభావమపేక్షతే.**

**తా.** ఋషులు భరతమునిని ఈ విధంగా ప్రశ్నించారు – "కొన్ని అర్థాల (భావాదుల) ఆవిష్కరణలకోసం, అభినయనిష్ణాతులు అభినయం నిర్మించారు కదా. ఈ నృత్తం ఎలా వచ్చింది? దీని స్వభావం ఏమిటి?

**మూ. న గీతకార్థసంబద్ధం న చాప్యర్థస్య భావనమ్. 262**
**కస్మాన్నృత్తం కృతం హ్యేతత్ గీతేష్వాసారితేషు చ."**

**తా.** నృత్తానికి గీతాలతో సంబంధం ఏమీ లేదు. గీతాలలోని అర్థాన్ని ఆవిష్కరించ డానికి కూడ ఉపకరించదు. అలాంటి ఈ నృత్తం గీతాలతోను, ఆసారితాలతోను ఎందుకు కలిపారు?"

**మూ. భరతః – అత్రోచ్యతే న ఖల్వర్థం కంచిన్నృత్తమపేక్షతే. 263**
**కింతు శోభాం ప్రజనయేదితి నృత్తం ప్రవర్తితమ్.**

**తా.** భరతముని ఇలా సమాధానం చెప్పాడు – "ఈ విషయంలో చెపుతున్నాను; వినండి. నృత్తం ఏ అర్థవిశేషాన్నీ అపేక్షించదు. ఏదో ఒక ప్రయోజనంకోసం ఏర్పడలేదు. శోభను వృద్ధిపొందిస్తుంది అను అభిప్రాయంతోనే నృత్తాన్ని ఆవిష్కరించారు.

**మూ. ప్రాయేణ సర్వలోకస్య నృత్తమిష్టం స్వభావతః. 264**
**మఙ్గల్యమితి కృత్వా చ నృత్తమేతత్ప్రకీర్తితమ్.**

**తా.** సాధారణంగా లోకంలో అందరికీ కూడ సహజంగానే నృత్తం ఇష్టమైనది. ఇది మంగళప్రద మైనది కూడ. అందుచేతనే పూర్వులు ఈ నృత్తాన్ని చెప్పారు. ఆవిష్క రించారు.

**మూ. వివాహ ప్రసవావాహప్రమోదాభ్యుదయాదిషు. 265**
**వినోదకారణం చేతి నృత్తమేతత్ప్రవర్తితమ్.**

**తా.** వివాహము, పుత్రాదిజన్మ, వివాహంలో ఎదురుకోళ్లు, మనోరంజనము, ధనాది

ప్రాప్తిరూప మైన అభివృద్ధి మొదలైన సమయాలలో ఇది వినోదహేతువు గాన ఈ నృత్తాన్ని ప్రవర్తింపజేశారు.

**మూ. అతశ్చైవ ప్రతిక్షేపాద్ భూతసంఘైః ప్రవర్తితాః. 266**

**తే గీతకాదౌ యుజ్యన్తే సమ్యజ్ నృత్తవిభాగకాః.**

**తా.** అందువల్లనే, అనగా నృత్తం చాలా లోకప్రియం అవడంవల్లనే, భూత సంఘాలు, వేటిని గీతకాదులలో విభాగకములుగా ప్రయోగిస్తారో వాటినే నృత్తంలోనికి ప్రవేశపెట్టి (ప్రతిక్షేపాత్) నృత్తంలో కూడ విభాగకాలను చక్కగా ప్రవర్తింపచేసినవి.

**వి.** ఇక్కడ అభినవగుప్తాచార్యులు – "ప్రతిక్షేపం' అనగా ఏమో నాట్యశాస్త్రంలో ఎక్కడా వివరించలేదు. కొందరు దీనికి ఇలా అర్థం చెప్పారు" అంటూ కొంత చర్చ చేశారు. అదంతా అనావశ్యక మేమో అనిపిస్తుంది. "ఒకదానిలో ఉన్నదానిని మరొక దానిలోకి చేర్చడం ప్రతిక్షేపం" అని ఈ పదానికి అర్థం చెప్పి, శ్లోకార్థం పైవిధంగా గ్రహిస్తే సరిపోతుం దని మా అభిప్రాయం. విజ్ఞులు ఆలోచించాలి.

**మూ. దేవేన చాపి సంప్రోక్తస్తణ్డుస్తాణ్డవపూర్వకమ్. 267**

**గీతప్రయోగమాశ్రిత్య నృత్తమేతత్ ప్రవర్త్యతామ్.**

**తా.** భగవంతుడైన శంకరుడు కూడ తండువుకు తాండవవిధి బోధించి "ఈ నృత్యం గీతప్రయోగాన్ని అనుసరించి ప్రయోగించాలి" అని ఆదేశించాడు.

**మూ. ప్రాయేణ తాణ్డవవిధిర్దేవస్తుత్యాశ్రయో భవేత్. 268**

**సుకుమారప్రయోగశ్చ శృఙ్గారరససంభవః."**

**తా.** సాధారణంగా తాండవనృత్యం దేవతల స్తుతికోసం చేయబడుతుంది. శృంగార రసానికి సంబంధించిన భావాదులను ఆవిష్కరించేటప్పుడు తాండవప్రయోగం సుకుమా రంగా ఉంటుంది."

## *వర్ధమానకలక్షణం*

**మూ. తస్య తణ్డుప్రయుక్తస్య తాణ్డవస్య విధిక్రియామ్. 269**

**వర్ధమానకమాసాద్య సంప్రవక్ష్యామి లక్షణమ్.**

**తా.** తండుముని ప్రయోగించిన తాండవానికి సంబంధించిన ప్రయోగవిధినీ, దాని లక్షణమునూ ఇపుడు నేను వర్ధమానకాన్ని అనుసరించి చెపుతాను.

**మూ. కలానాం వృద్ధిమాసాద్య ద్వ్యక్షరాణాం చ వర్ధనాత్. 270**

**లయస్య వర్ధనాచ్చాపి వర్ధమానకముచ్యతే.**

**తా. వర్ధమానకము** కలలను పెంచుతూ అక్షరాలను పెంచుతుంది. లయను కూడ పెంచుతుంది. అందుచేతనే దీని కా పేరు.

**వి.** ఎనిమిది పలాల కాలం ఒక కల. లయను బట్టి, వాటి సంఖ్యను బట్టి కలల సంఖ్య పెరుగుతుంది. 17 కలల ఆసారితకం కనిష్ఠం. రెట్టింపు లయలు గల అదే లయాంతరం. 33 కలల ఆసారితకం మధ్యమం. 65 కలల ఆసారితకం జ్యేష్ఠం.

**మూ. కృత్వా కుతపవిన్యాసం యథావద్ ద్విజసత్తమాః. 271**

**ఆసారితప్రయోగస్తు తతః కార్యః ప్రయోక్తృభిః.**

**తా.** ఓ! ద్విజశ్రేష్ఠులారా! వాద్యాలను వాటి వాటి స్థానాలలో ఉంచి, నాట్య ప్రయోక్తలు, ఆసారితప్రయోగం చెయ్యాలి.

**మూ. తత్ర తూపోహనం కృత్వా తన్త్రీగానసమన్వితమ్. 272**

**కార్యః ప్రవేశో నర్తక్యా భాణ్డవాద్యసమన్వితః.**

**తా.** నర్తకి, తంత్రీవాద్యగానంతో ఉపోహనం చేసి, పుష్కరవాద్యాలు మ్రోగుతుండగా రంగస్థలంమీద ప్రవేవించాలి.

**వి.** పిల్లనగ్రోవి, తీగలున్న వాద్యము (ఆతోద్యము) మ్రోగుగుతండగా స్వర యుక్తంగా పాట పాడడం **గానం.**

కనిష్ఠాసారితంలోని ఐదు కలల కాలంలో శుష్కాక్షరప్రయోగం, (అనగా అర్థం లేని "తననా" ఇత్యాద్యక్షరాలు ఉచ్చరించడం) చేయడం **ఉపోహనం.**

**మూ. విశుద్ధకరణాయాం తు జాత్యాం వాద్యం ప్రయోజయేత్. 273**

**గత్యా వాద్యానుసారిణ్యా తస్యాశ్చారీం ప్రయోజయేత్.**

**తా.** ఆ సమయంలో ఏకాక్షరప్రయోగం ఉన్న (విశుద్ధకరణాయామ్) జాతిలో వాద్యం వాయించాలి. వాద్యానికి అనుకూలమైన గతితో దాని చారిని ప్రయోగించాలి.

**మూ. వైశాఖస్థానకేనేహ సర్వరేచకచారిణీ. 274**

**పుష్పాఞ్జలిధరా భూత్వా ప్రవిశేద్రఙ్గమణ్డపమ్.**

**తా.** వైశాఖస్థానకంలో ఉండి అన్ని రేచకాలూ (నాలుగు విధాలైన రేచకాలు) ప్రయోగిస్తూ దోసిట్లో పుష్పాలు నింపుకొని నర్తకి రంగమండపంలో ప్రవేశించాలి.

**మూ. పుష్పాఞ్జలిం విసృజ్యాథ రఙ్గపీఠం పరీత్య చ. 275**

**ప్రణమ్య దేవతాభ్యశ్చ తతోఽభినయమాచరేత్.**

**తా.** అంజలిలోని పుష్పాలు నేలకై జారవిడిచి, రంగపీఠం నాలుగు మూలలా తిరిగి, దేవతలకు నమస్కరించి అభినయం ప్రారంభించాలి.

**మూ. యత్రాభినేయం గీతం స్యాత్ తత్ర వాద్యం న యోజయేత్. 276**
**అఙ్గహారప్రయోగే తు భాణ్డవాద్యం విధీయతే.**

**తా.** గీతంతో పాటు అభినయం ప్రదర్శిస్తూన్నప్పుడు వాద్యం చేర్చకూడదు. అంగహారం ప్రయోగించేటప్పుడు మాత్రం భాండవాద్యం వాయించాలి.

**మూ. సమం రక్తం విభక్తం చ స్ఫుటం శుద్ధప్రహారజమ్,**
**నృత్తాఙ్గగ్రాహి వాద్యజ్ఞైర్వాద్యం యోజ్యం తు తాణ్డవే. 277**

**తా.** వాద్యనిపుణులు, తాండవంలో సమమైనదీ (ఎగుడుదిగుడుగా లేనిదీ) మనోహరమూ, (నృత్తాన్ని అనుసరించి) విడి విడిగా స్ఫుటంగా నున్నదీ, తప్పులు లేని వాదనల (వాయింపుల) నుండి జనించినదీ, నృత్తంలో ఉన్న వివిధాంగాలను గ్రహించేదీ అయిన వాద్యమును ఉపయోగించాలి.

**మూ. ప్రయుజ్య గీతవాద్యే తు నిష్క్రమేన్నర్తకీ తతః. 278**
**అనేనైవ విధానేన ప్రవిశన్త్యపరాః పృథక్.**

**తా.** ఈ విధంగా గీతవాద్యాలు ప్రయోగించి నర్తకి నాట్యరంగంనుండి వెళ్లిపోవాలి. తరువాత ఇతర నర్తకీలు కూడ, వేరు వేరుగా నాట్యరంగంమీదికి రావాలి.

**మూ. అన్యాశ్చానుక్రమేణాథ పిణ్డీం బధ్నన్తి యాః స్త్రియః. 279**
**తావత్పర్యస్తకః కార్యో యావత్పిణ్డీ న బధ్యతే,**
**పిణ్డీం బద్ధ్వా తతః సర్వా నిష్క్రామేయుస్త్రియస్తు తాః. 280**

**తా.** నర్తకీలు క్రమంగా పిండీబంధం రచన పూర్తి చేయనంతవరకు పర్యస్తకం జరుపుతూండాలి. పిండీబంధం పూర్తి అయిన తరువాత నర్తకిలు అందరూ నిష్క్రమించాలి.

**వి. పర్యస్తకం** అనగా వాహినీరూప మైన అంగవిక్షేపం లేదా అభినయం లేని ఆంగికవిధి అని అభినవగుప్తాచార్యులు.

**మూ. పిణ్డీబన్ధేషు వాద్యం తు కర్తవ్యమిహ వాదకైః,**
**పర్యస్తకప్రమాణేన చిత్రౌఘకరణాన్వితమ్. 281**

**తా.** పిండీబంధాలు జరుగుతూన్న సమయంలో వాదకులు (వాద్యాలు మోగించే వాళ్లు) పర్యస్తకం సమయంలో చేసిన ప్రమాణంలోనే చిత్రమైన ఓఘములతో, కరణాలతో కూడిన వాద్యం చెయ్యాలి.

**మూ. తత్రోపవహనం భూయః కార్యం పూర్వవదేవ హి,**
**తతశ్చాసారితం భూయో గాయనం తు ప్రయోజయేత్. 282**

**తా.** తరువాత ముందుగా చేసినట్లుగానే మళ్లీ ఉపోహనం ప్రయోగించాలి. అదే విధంగా ఆసారితగానప్రయోగం కూడ చెయ్యాలి.

**మూ. పూర్వేణైవ విధానేన ప్రవిశేచ్చాపి నర్తకీ,**
**గీతకార్యం త్వభినయేద్ ద్వితీయాసారితస్య తు. 283**

**తా.** వెనుక చెప్పిన పద్ధతిలోనే నర్తకి రంగస్థలంమీదికి వచ్చి రెండవ ఆసారిత గానం అర్థం అభినయించాలి.

**మూ. తదేవ తు పునర్వస్తు నృత్తేనాపి ప్రదర్శయేత్,**
**ఆసారితే సమాప్తే తు నిష్క్రామేన్నర్తకీ తతః. 284**

**తా.** ఆ వస్తువునే, విషయాన్నే, మళ్లీ నృత్తం ద్వారా కూడ ప్రదర్శించాలి. ఆసారితం సమాప్తం కాగానే నర్తకి నిష్క్రమించాలి.

**మూ. పూర్వవత్ప్రవిశన్త్యన్యాః ప్రయోగః స్యాత్స ఏవ హి,**
**ఏవం పదే పదే కార్యో విధిరాసారితస్య తు. 285**

**తా.** ఇతర నర్తకిలు కూడ పూర్వం వలెనే ప్రవేశించి అదే విధంగా ప్రయోగం చెయ్యాలి. ఈ విధంగా ఒక్కొక్క పదంలో ఆసారితం జరిపించాలి.

**మూ. భాణ్డవాద్యకృతే చైవ తథా గానకృతేఽపి చ,**
**ఏకా తు ప్రథమం యోజ్యా ద్వే ద్వితీయం తథైవ చ. 286**
**తిస్రో వస్తు తృతీయం తు చతస్రస్తు చతుర్థకమ్.**

**తా.** వాద్యాల వాదానంలోను, గీతాల గానంలోను, మొదటి పాదం ఒక పర్యాయం, రెండవ పాదం రెండుసార్లు, మూడవ పాదం మూడుసార్లు, నాలుగవ పాదం నాలుగు సార్లు గానం చెయ్యాలి.

**మూ. పిణ్డీనాం విధయశ్చైవ చత్వారః సంప్రకీర్తితాః. 287**
**పిణ్డీ శృఙ్ఖలికా చైవ లతాబన్ధోఽథ భేద్యకః.**

**తా.** పిండులలో – పిండి, శృంఖలిక, లతాబంధము, భేద్యకము అను నాలుగు పద్ధతులు చెప్పబడ్డాయి.

**మూ. పిణ్డీబన్ధస్తు పిణ్డత్వాత్ గుల్మః శృఙ్ఖలికా భవేత్. 288**
**జాలోపనద్ధా చ లతా సనృత్తో భేద్యకః స్మృతః.**

**తా.** కొందరు నర్తకిలు గుంపుగా ఒక చోట చేరడంచేత ఆ పిండీబంధం **'పిండీ'** అని చెప్పబడుచున్నది. గుత్తివలె ఏర్పరచడంచేత అది **శృంఖలిక.** వలవలె ఏర్పడడంచేత అది **'లత'**. నృత్తంతో కలిసి ఉన్నది **భేద్యకం.**

**వి.** "నర్తకీ"లు లేదా నర్తకులు ఒక సమూహంగా ఏర్పడి చేసే నృత్యం **'గుల్మపిండీ బంధం'.** ఒకరి చేయి మరొకరు పట్టుకొని గొలుసువలె ఏర్పడి చేసే నృత్యం **శృంఖలిక.** ఒకరి బాహువులో మరొకరి బాహువు చొనిపి చేసే నృత్యం **లతాపిండీబంధం.** దూర దూరంగా నిలబడి చేసేదే **"భేదకపిండీబంధం"** అని **భావప్రకాశనంలో** చెప్పబడింది.

**అపరే నృత్తభేదాస్తు గుల్మశృఙ్ఖలికాలతాః,**
**భేద్యకశ్చేతి చత్వారః కథ్యన్తే చ మనీషిభిః,.**

**గుల్మః సంభూయ యన్నృత్తం శృఙ్ఖలాన్యోన్యబన్ధనీ,**
**ఏకైకస్య బహిః సంఘాన్నృత్తం యత్స చ భేద్యకః.**

**పరస్పరాఙ్గవేష్టేన యన్నృత్తం సా లతా మతా,**
**పిణ్డీబన్ధశ్చ గుల్మశ్చ పర్యాయావితి కేచన.** (భావప్రకాశనం 8.15-20)

పైన (288-89 శ్లోకాలలో) భరతుడు చెప్పినది, భావప్రకాశలో చెప్పినదీ వేరుగా ఉన్నాయి.

పదహారుగురు లేదా పద్దెనమండుగురు నాయికలు పిండీబంధం మొదలైన విన్యాసాలతో నృత్యం చేస్తే అది **'రాసకం'** అని **భావప్రకాశనంలో** చెప్పబడింది.

**షోడశ వా దశాష్టౌ వా యస్మిన్నృత్యన్తి నాయికాః,**
**పిణ్డీబన్ధాదివిన్యాసైః రాసకం తదుదాహృతమ్.** (భావప్రకాశనం 9.21)

**మూ. పిణ్డీబన్ధః కనిష్ఠే తు శృఙ్ఖలా తు లయాన్తరే. 289**
**మధ్యమే చ లతాబన్ధో జ్యేష్ఠే చైవాథ భేద్యకః.**

**తా.** కనిష్ఠాసారితకంలో పిండీబంధము, లయాంతరంలో, అనగా రెట్టింపు లయ లున్న కనిష్ఠాసారితకంలో శృంఖల, మధ్యమాసారితకంలో లతాబంధం, జ్యేష్ఠాసారితకంలో భేద్యకము ప్రయోగింపబడుతుంది.

**మూ. పిణ్డీనాం వివిధా యోనిః యన్త్రం భద్రాసనం తథా. 290**
**శిక్షాయోగస్తథా చైవ ప్రయోక్తవ్యః ప్రయోక్తృభిః.**
**ఏవం ప్రయోగః కర్తవ్యో వర్ధమానే తపోధనాః. 291**

**తా.** పిండీలకు అనేకవిధమైన కారణా లుంటాయి. ఒకటి యంత్రం, రెండు భద్రాసనం, మూడు శిక్షాయోగం. ఈ మూడు విధాలైన కారణాలను అనుసరించి

ప్రయోక్తలు పిండీప్రయోగం చెయ్యాలి. తపోధనులారా! వర్ధమానంలో ప్రయోగం ఈ విధంగా చెయ్యాలి.

**వి.** (1) వేరు వేరు అంగాల అనుసంధానమూ, తగు విధంగా నృత్తాంగాలను ప్రదర్శించడం, భూమి, తన దేహము, ఆకాశము మొదలైనవాటిమీద దృష్టి – ఇది **యంత్రం.** (2) భూమ్యాదులయందు భద్ర మైన స్థానం, అనగా ఏ కరణముద్రాదుల అభినయ సమయంలో ఎట్టి స్థానకం (పోజులో) ఉండాలో దాని సరియైన జ్ఞానం **భద్రాసనం.** (3) అభ్యాసపాటవం **శిక్షాయోగం.** వివిధపిండీబంధాలు వీటిమీద ఆధారపడి ఉంటాయి. అందుచే తదనుసారంగా వాటిలో వైవిధ్యం ఏర్పడుతుంది.

### *గీతాల ఛందకాల ప్రయోగం*

**మూ. గీతానాం ఛందకానాం చ భూయో వక్ష్యామ్యహం విధిమ్,**
**యాని వస్తునిబద్ధాని యాని చాఙ్గకృతాని తు. 292**
**గీతాని తేషాం వక్ష్యామి ప్రయోగం నృత్తవాద్యయోః,**
**తత్రావతరణం కార్యం నర్తక్యాః సార్వభాణ్డికమ్. 293**
**క్షేపప్రతిక్షేపకృతం భాణ్డోపోహనసంస్కృతమ్.**

**తా.** నేను, మళ్లీ గీతాల విధిని, ఛందకాల విధిని గూర్చి చెపుతాను. వస్తువుతో (కథతో) సంబంధించి, అంగాలతో కూడ కూర్చబడిన గీతాలకు సంబంధించిన నృత్యవాద్యాల ప్రయోగం కూడ ఎలా చెయ్యాలో చెపుతాను. గీత – నృత్తాల ప్రయోగ సమయంలో అన్ని విధాలైన వాద్యాలు మ్రోగుతుండగా, వాద్యాల ఉపోహనం కూడ జరుగుచుండగా, క్షేప – ప్రతిక్షేపములు చేస్తూ నర్తకి ప్రవేశించాలి.

**మూ. ప్రథమం త్వభినేయం స్యాద్ గీతకే సర్వవస్తుకమ్. 294**
**తదేవ తు పునర్వస్తు నృత్తేనాపి ప్రదర్శయేత్.**

**తా.** గీతంలో ఉన్న సమస్తవిషయాన్నీ (అర్థం అంతా) అభినయించాలి, అనగా ముద్రాదుల ద్వారా ఆవిష్కరించాలి. తరువాత ఆ వస్తువునే నృత్తం ద్వారా ప్రదర్శించాలి.

**మూ. యో విధిః పూర్వముక్తస్తు నృత్తాభినయవాదితే. 295**
**ఆసారితవిధౌ స స్యాద్గీతానాం వస్తుకేష్వపి,**
**ఏవం వస్తు నిబన్ధానాం గీతకానాం విధిః స్మృతః. 296**

**తా.** ఆసారితానికి సంబంధించిన వస్తువుల విషయంలో కూడ నృత్త – అభినయ – వాద్యాల ప్రయోగంలో అనుసరించవలసిన ఏ పద్ధతి వెనుక చెప్పబడిందో దానినే

అనుసరించాలి. ఈ విధంగా వస్తువుతో సంబంధించిన గీతకాలప్రయోగవిధానం చెప్పబడింది.

**మూ. శృణుతాఙ్గనిబద్ధానాం గీతానామపి లక్షణమ్,**
**య ఏవ వస్తుకవిధిర్నృత్తాభినయవాదితే. 297**
**తమేవాఙ్గనిబద్ధేషు ఛన్దకేష్వపి యోజయేత్.**

**తా.** అంగాలలో నిబద్ధములైన గీతాల లక్షణం కూడ వినండి. ఏ విధి (పద్ధతి) వస్తువుతో కూడ నృత్త – అభినయ – వాదనాలలో ప్రయోగింపబడుతుందో అదే విధి అంగనిబద్ధఛందకాలలో కూడ చేయబడుతుంది.

**మూ. వాద్యం గుర్వక్షరకృతం తథాల్పాక్షరమేవ చ. 298**
**ముఖే సోపోహనే కుర్యాద్వర్ణానాం విప్రకర్షతః.**

**తా.** ముఖమును, ఉపోహనమును ప్రయోగించే టప్పుడు గురువులైన అక్షరాల, లఘ్వక్షరాల భేదాన్ని చూపుతూ, వర్ణాల వ్యవధానం స్పష్టంగా తెలిసే టట్లు వాద్యాలను వాయించాలి.

**మూ. యదా గీతివశాదఙ్గం భూయో భూయో నివర్తతే. 299**
**తత్రాద్యమభినేయం స్యాత్ శేషం నృత్తేన యోజయేత్.**

**తా.** గీతప్రయోగసమయంలో అంగాన్ని మాటిమాటికి ఆవృత్తి చేయవలసివచ్చి నప్పుడు, మొదటిదానిని అభినయించి, మిగిలినవాటిని నృత్తం ద్వారా ప్రదర్శించాలి.

**మూ. యదా గీతివశాదఙ్గం భూయోభూయో నివర్తతే. 300**
**త్రిపాణిలయసంయుక్తం తత్ర వాద్యం ప్రయోజయేత్,**
**యథా లయస్తథా వాద్యం కర్తవ్యమిహ వాదకైః. 301**
**ఏవమేవ విధిః కార్యో గీతేష్వాసారితేష్వపి.**

**తా.** గీతప్రయోగసమయంలో దాని అంగాలను మళ్లీ మళ్లీ ఆవృత్తిచేయవలసి వచ్చి నప్పుడు మూడు పాణులతో (తాళాలతో), మూడు లయలతో వాద్యం ప్రయోగించాలి. వాదకులు వాద్యాన్ని లయానుసారంగా ప్రయోగించాలి. ఈ విధంగానే ఆసారితగీతాల ప్రయోగంలో విధానం అవలంబించాలి.

**వి.** పాణి అనగా తాళం. సమపాణి, ఉపరిపాణి, అర్ధపాణి అని పాణి మూడు విధాలు. ఛందంలోని అక్షరాల, పదాల సమత్వం లయ. ఇది ద్రుత, మధ్యమ, విలంబితము లను భేదంచేత మూడు విధాలు.

తాలం తరువాత విశ్రామానికి కూడ **'లయ'** అని పేరు.

**మూ. (తత్త్వం చానుగతం చాపి ఓఘం చ కరణాన్వితమ్,**
**స్థిరే తత్త్వం ప్రయోక్తవ్యం మధ్యే చానుగతం భవేత్.**
**భూయశ్చౌఘః ప్రయోక్తవ్యస్త్వేష వాద్యగతో విధిః,**
**ఛన్దోగీతకమాసాద్య త్వఙ్గాని పరివర్తయేత్.**
**ఏష కార్యో విధిర్నిత్యం నృత్తాభినయవాదితే,**
**యాని వస్తునిబద్ధాని తేషామన్తే గ్రహో భవేత్**
**అఙ్గానాం తు పరావృత్తావాదావేవ గ్రహో మతః.)**

**(తా.** తత్త్వము, అనుగతం, ఓఘము అనేవి కరణాలతో సంబంధించి ఉంటాయి. స్థిరలయతో తత్త్వమును, మధ్యలయతో అనుగతమును ద్రుతలయతో ఓఘమును ప్రయోగించాలి. ఇది వాద్యమునకు సంబంధించిన విధానం. గీతాంగాలు ఛందకావస్థలో ఉన్నప్పుడు వాటిని అనేకపర్యాయాలు ఆవృత్తి చెయ్యాలి. నృత్త – అభినయ – వాద్యాలు మూడింటిలోను కూడ ఈ విధానం నిత్యమూ అనుసరించాలి. ఏ గీతాల వస్తురచనతో ఏవి సంబంధించి ఉంటాయో వాటి చివర గ్రహాలు (విశిష్టవాద్యాల వాదనం) ప్రయోగించాలి. పెద్ద గీతాల అంగాల ఆవృత్తి జరుగునప్పుడు గ్రహాల ప్రయోగం చివర చెయ్యాలి. సమ – అతీత. అనాగత గ్రహాలు మూడూ కాలానికి సంబంధించిన వని **సంగీతరత్నాకరం**లో చెప్పబడినది.)

**మూ. దేవస్తుత్యాశ్రయం హ్యేతత్సుకుమారం నిబోధత. 302**
**స్త్రీపుంసయోస్తు సంలాపో యస్తు కామసముద్భవః,**
**తద్ జ్ఞేయం సుకుమారం హి శృఙ్గారరససంభవమ్. 303**

**తా.** ఇంతవరకు చెప్పినది దేవతాస్తుతికి సంబంధించినది. ఇప్పుడు సుకుమార తాండవాన్ని గూర్చి తెలుసుకొనండి (చూ. శ్లో. 268). కామంవల్ల స్త్రీ పురుషుల మధ్య జరిగే సంలాపం సుకుమార మైనది. అది శృంగారరసంవల్ల కలిగినది. లేదా శృంగార రసానికి కారణము.

**మూ. యస్యాం యస్యామవస్థాయాం నృత్తం యోజ్యం ప్రయోక్తృభిః,**
**తత్సర్వం సంప్రవక్ష్యామి తచ్చ మే శృణుత ద్విజాః. 304**

**తా.** ద్విజులారా! ఏ యే అవస్థలలో నృత్తం ప్రయోగించాలి ఆ విషయం అంతా చెపుతాను; వినండి.

**మూ. అఙ్గవస్తునివృత్తౌ తు తథా వర్ణనివృత్తిషు,**
**తథా చాభ్యుదయస్థానే నృత్తం తద్జ్ఞైః ప్రయోజయేత్. 305**

**తా.** గీతవిషయవస్తువుయొక్క, నాటకవిషయవస్తువుయొక్క అంగము గాని వర్ణం గాని సమాప్తమైనప్పుడు, లేదా ఏదైన పాత్రకు అభ్యుదయం కలిగినప్పుడు నృత్తజ్ఞులు నృత్తం ప్రయోగించాలి.

**వి.** గీతాంగం అనగా గీతంలోని పదరచన. దాని రచనాక్రమం ముగిసినప్పుడు, లేదా నాటకంలోని వేరు వేరు అంగాలలో ఏదైనా పూర్తి అయినప్పుడు నృత్తం చెయ్యాలి.

**వర్ణం** అనగా గీతక్రియావిస్తారం. దానికే స్థాయి అని కూడ పేరు.

**మూ. యత్తు సందృశ్యతే కించిద్దమ్పత్యోర్మదనాశ్రయమ్,**
**నృత్తం తత్ర ప్రయోక్తవ్యం ప్రహర్షార్థగుణోద్భవమ్. 306**

**తా.** దంపతుల ప్రేమవిలాసాలకు సంబంధించిన విషయాలు ప్రదర్శించేటప్పుడు ఆనందమూలకమైన నృత్తం ప్రదర్శించాలి.

**మూ. యత్ర సంనిహితే కాన్తే ఋతుకాలాదిదర్శనమ్,**
**గీతకార్థాభిసంబద్ధం నృత్తం తత్రాపి చేష్యతే. 307**

**తా.** ప్రియుడు సంనిహితుడై ఉన్నప్పుడు, అనుకూలమైన ఋతువు, కాలము మొదలైనదానిని ప్రదర్శించే టప్పుడు గీతం అర్థంతో సంబంధించిన నృత్తం చెయ్యాలి.

**మూ. ఖణ్డితా విప్రలబ్ధా వా కలహాన్తరితాపి వా,**
**యస్మిన్నఙ్గే తు యువతిర్న నృత్తం తత్ర యోజయేత్. 308**

**తా.** ఏ కథాంగంలో ఖండితనాయిక గాని, విప్రలబ్ధ కాని, కలహాంతరిత కాని అభినయింపబడుతుందో అక్కడ నృత్తం ప్రయోగించకూడదు.

**మూ. సఖీప్రవృత్తే సంలాపే తథాసంనిహితే ప్రియే,**
**న హి నృత్తం ప్రయోక్తవ్యం యస్యా వా ప్రోషితః పతిః. 309**

**తా.** ప్రియుని పరోక్షంలో నాయిక సఖురాలితో సంభాషణ చేసే సందర్భంలో కాని, ప్రోషితపతి (పతి ప్రవాసంలో ఉన్న) నాయికను గాని అభినయిస్తూన్నప్పుడు నృత్తం ప్రయోగించకూడదు.

**మూ. (దూత్యాశ్రయం యదా తు స్యాదృతుకాలాదిదర్శనమ్,**
**ఔత్సుక్యచిన్తాసంబద్ధం న నృత్తం తత్ర యోజయేత్).**

**తా.** (దూతి మొదలైనవాళ్ల ద్వారా ఋతుకాలాదుల వర్ణనం ఔత్సుక్యాన్ని, చింతను సూచించే విధంగా సాగుతూన్నట్లు, ప్రదర్శించే టప్పుడు కూడ నృత్తం ప్రయోగించ కూడదు).

**మూ. యస్మిన్నఙ్గే ప్రసాదం తు గృహ్ణీయాన్నాయికా క్రమాత్,**
**తతః ప్రభృతి నృత్తం తు శేషేష్వఙ్గేషు యోజయేత్. 310**

**తా.** ఏ వస్త్వంగంలో (కథాంశంలో) నాయిక క్రమంగా సంతోషం పొందుతుందో ఆ వస్త్వంగంనుండి ప్రారంభించి మిగిలిన అంగాలలో, నృత్తాన్ని ప్రయోగించాలి.

**మూ. దేవస్తుత్యాశ్రయకృతం యదఙ్గం తు భవేదథ,**
**మాహేశ్వరైరఙ్గహారైరుద్ధతైస్తత్ప్రయోజయేత్. 311**

**తా.** ఏదైన ఒక అంగం దేవతారాధనతో సంబంధించిన దయితే దానియందు ఉద్ధతములైన అంగహారాలతో మహేశ్వరునికి సంబంధించిన (అనగా తాండవానికి సంబంధించిన) నృత్తం ప్రదర్శించాలి.

**వి.** విద్యుద్భ్రాంతము, గరుడప్లుతమూ మొదలైనవి ఉద్ధిత మైన అంగహారాలు.

**మూ. యత్తు శృఙ్గారసంబద్ధం గానం స్త్రీపురుషాశ్రయమ్,**
**దేవీకృతైరఙ్గహారైర్లలితైస్తత్ ప్రయోజయేత్. 312**

**తా.** స్త్రీ పురుషులతో సంబంధించిన శృంగారరససంబద్ధ మైన గానం చేసే సమయంలో దేవి రచించిన లలితము లైన అంగహారాలతో నృత్తం ప్రయోగించాలి.

**వి.** తలపుష్పపుటము, లీనము, నితంబము మొదలైనవి లలితాంగహారాలు.

**మూ. చతుష్పదా నర్కుటకే ఖఞ్జకే పరిగీతకే,**
**విధానం సంప్రవక్ష్యామి భాణ్డవాద్యవిధిం ప్రతి. 313**

**తా.** చతుష్పాదం, నర్కుటకం, ఖంజకం, పరిగీతం అను గీతాల గానం చేసే సమయంలో అనుసరించవలసిన భాండ – వాద్య విధానాన్ని చెపుతాను.

**వి.** ఈ రాగాలను గూర్చి నా.శా. 31, 32 అధ్యాయాలలో చెప్పబడుతుంది.

**మూ. ఖఞ్జనర్కుటసంయుక్తా భవేద్యా తు చతుష్పదా,**
**పాదాన్తే సంనిపాతే తు తస్యా భాణ్డగ్రహో భవేత్. 314**

**తా.** ఖంజక – నర్కుటాలతో కూడిన చతుష్పదధ్రువయొక్క పాదాంతమునందు సంనిపాత మను కలగానం చేయబడుచున్నప్పుడు వాద్యవాదనం ప్రారంభించాలి.

**మూ. యా ధ్రువా ఛన్దసా యుక్తా సమపాదా సమాక్షరా,**
**తస్యాః పాదావసానే తు ప్రదేశిన్యా గ్రహో భవేత్. 315**

**తా.** ఛందస్సుతో సమానమైన అక్షరాలు సమాన మైన పాదాలు గల ధ్రువ యొక్క పాదాంతమునందు తర్జనితో గ్రహం చెయ్యాలి.

**మూ. కృత్వైకం పరివర్తం తు గానస్యాభినయస్య చ,**
**పునః పాదనివృత్తిం తు భాణ్డవాద్యేన యోజయేత్. 316**

**తా.** పైన చెప్పి నట్లు చేసిన తరువాత గానమూ, అభినయమూ ప్రయోగిస్తూ మళ్లీ ధ్రువను ఆవృత్తి చెయ్యాలి. చివరి పాదం పూర్తిఅయిన తరువాత భాండవాదనం చేయించాలి.

**మూ. అఙ్గవస్తునివృత్తౌ తు వర్ణాన్తరనివృత్తిషు,**
**తథోపస్థాపనే చైవ భాణ్డవాద్యం ప్రయోజయేత్. 317**

**తా.** గీతాంగములు, వస్తువు సమాప్త మైన తరువాత, వర్ణాలు మధ్య మధ్య సమాప్త మైనప్పుడు, గీతాన్ని కాని వస్తువును కాని ఉపస్థాపించే (presentation) సమయంలోను భాండవాద్యం ప్రయోగించాలి.

**మూ. యేఽపి చాన్తరమార్గాః స్యుః తన్త్రీవాక్కరణైః కృతాః,**
**తేషు సూచీ ప్రయోక్తవ్యా భాణ్డేన సహ తాణ్డవే. 318**

**తా.** తంత్రులతోను, వాక్కుతోను, కరణాలతోను చేసే ఆంతరమార్గాల మధ్య తాండవాన్ని ప్రయోగించాలి, దానిలో భాండవాద్యాలతో సూచీచారి ప్రదర్శించాలి.

**వి.** స్వరాల మధ్య ఉండే అల్పస్వరాలలో విచిత్రతను కలిగించే సంగతికి అంతర మార్గము అని పేరు.

**మూ. మహేశ్వరస్య చరితం య ఇదం సంప్రయోజయేత్,**
**సర్వపాపవిశుద్ధాత్మా శివలోకం స గచ్ఛతి. 319**

**తా.** మహేశ్వరుడు ప్రయోగించిన ఈ తాండవాన్ని ప్రయోగింపచేసినవాడు, సర్వపాపములు తొలగి శివలోకం పొందుతాడు.

**మూ. ఏవమేష విధిర్దృష్టస్తాణ్డవస్య ప్రయోగతః,**
**భూయః కిం కథ్యతామన్యన్నాట్యవేదవిధిం ప్రతి. 320**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే తాణ్డవలక్షణం నామ చతుర్థోఽధ్యాయః.**

**తా.** ఈ విధంగా తాండవప్రయోగాన్ని గూర్చిన విధి చెప్పబడింది. నాట్యవేదానికి సంబంధించిన మరేది చెప్పాలో తెలపండి.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్ర వ్యాఖ్యానము నందు తాండవలక్షణము అను నందు చతుర్థాధ్యాయం సమాప్తం.**

**"రవిశశిహుతభుక్కల్పితనయనత్రయకిరణదలితతిమిరతతిః,**
**అభినవుగప్తస్తాణ్డవవిధిమేనం వ్యవృణుత స్పష్టమ్."**

– శ్రీమదభినవగుప్తాచార్యాః

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ పఞ్చమోఽధ్యాయః

# పూర్వరఙ్గప్రయోగము

**"సంసారనాట్యనిర్మాణే యోఽవకాశవిధానతః,**
**పూర్వరఙ్గాయతే వ్యోమమూర్తిం తాం శాఙ్కరీం నుమః."**

**– శ్రీమదభినగుప్తాచార్యాః**

**మూ. భరతస్య వచః శ్రుత్వా నాట్యసన్తానకారణమ్,**
**పునరేవాబ్రువన్ వాక్యమృషయో హృష్టమానసాః. 1**

**తా.** నాట్యం నిరంతరమూ ప్రవర్తించడానికి కారణం తెలిపిన భరతుని వచనము విని సంతసించిన మనస్సులు గలవారై మునులు మళ్లీ ఇలా అన్నారు.

**మూ. యథా నాట్యస్య జన్మేదం జర్జరస్య చ సంభవః,**
**విఘ్నానాం శమనం చైవ దేవతానాం చ పూజనమ్. 2**

**తదస్మాభిః శ్రుతం సర్వం గృహీత్వా చావధారితమ్,**
**నిఖిలేన యథాతత్త్వమిచ్ఛామో వేదితుం పునః. 3**

**పూర్వరఙ్గం మహాతేజః! సర్వలక్షణసంయుతమ్,**
**యథా బుధ్యామహే బ్రహ్మంస్తథా వ్యాఖ్యాతుమర్హసి. 4**

**తా.** మహాతేజఃశాలి వైన బ్రాహ్మణోత్తమా! ఈ నాట్యం ఎలా పుట్టిందో, జర్జరం ఎలా పుట్టిందో ఆ విషయాలను, విఘ్నవినాశనాన్నీ, దేవతాపూజను, నువ్వు చెప్పగా విని మేం చక్కగా గ్రహించి స్థిరంగా మనస్సులలో నిశ్చితరూపంలో నిలుపుకొన్నాం. సర్వ లక్షణాలతో కూడిన పూర్వరంగాన్ని, దాని యథార్థస్వరూపాన్నీ తెలుసుకొన గోరుచున్నాం. దానిని మేం ఎలా తెలుసుకొనగలుగుతామో అలా చెప్పుము.

**మూ. తేషాం తు వచనం శ్రుత్వా మునీనాం భరతో మునిః,**
**ప్రత్యువాచ పునర్వాక్యం పూర్వరఙ్గవిధిం ప్రతి. 5**

**తా.** ఆ మునుల మాటలు విని, భరతముని పూర్వరంగవిధిని గూర్చి వారికి చెపుతూ ఇలా అన్నాడు.

**మూ. పూర్వరఙ్గం మహాభాగా గదతో మే నిబోధత,**
**పాదభాగాన్ కలాశ్చైవ పరివర్తాంస్తథైవ చ. 6**

**తా.** మహాభాగులారా! పూర్వరంగాన్ని గూర్చి, దానికి సంబంధించిన పాదభాగము లను కలలను పరివర్తములను గూర్చి చెపుతున్నాను; వినండి.

**వి.** కలలను గూర్చి 31 వ అధ్యాయంలో చెప్పబడుతుంది. పాదభాగంతో కూడిన తాలం ఆవృత్తి చేయడం **పాదపరివర్తనం.**

**మూ. యస్మాద్రఙ్గప్రయోగోఽయం పూర్వమేవ ప్రయుజ్యతే,**
**తస్మాదయం పూర్వరఙ్గో విజ్ఞేయో ద్విజసత్తమాః. 7**

**తా.** బ్రాహ్మణశ్రేష్ఠులారా! అన్నింటికంటె ముందుగా ఈ రంగప్రయోగం చేయబడుతుంది గాన దీనికి పూర్వరంగం అను పేరు వచ్చింది.

### *పూర్వరంగానికి అంగాలు*

**మూ. అస్యాఙ్గాని తు కార్యాణి యథావదనుపూర్వశః,**
**తన్త్రీభాణ్డసమాయోగైః పాఠ్యయోగకృతైస్తథా. 8**
**ప్రత్యాహారోఽవతరణం తథా హ్యారమ్భ ఏవ చ,**
**ఆశ్రావణా వక్త్రపాణిస్తథా చ పరిఘట్టనా. 9**
**సంఘోటనా తతః కార్యా మార్గాసారితమేవ చ,**
**జ్యేష్ఠమధ్యకనిష్ఠాని తథైవాసారితాని చ. 10**
**ఏతాని తు బహిర్గీతాన్యన్తర్యవనికాగతైః,**
**ప్రయోక్తృభిః ప్రయోజ్యాని తన్త్రీభాణ్డకృతాని చ. 11**

**తా.** పూర్వరంగానికి అంగాలైన వీణాదితంత్రీవాద్యాలు, మృదంగాదిభాండ వాద్యాలు, పాఠ్యాంశాలు అనగా (సంభాషణలు) క్రమం తప్పకుండా యథావిధిగా చెయ్యాలి.

ప్రత్యాహారం, అవతరణం, ఆరంభం, ఆశ్రావణ, వక్త్రపాణి, పరిఘట్టన, సంఘోటన, మార్గాసారితం, జ్యేష్ఠ – మధ్య – కనిష్ఠ ఆసారితాలు అను ఈ అంగాలను ప్రయోగించాలి. ఈ బహిర్గీతాలను ప్రేక్షకులకు కనబడకుండా తెరవెనుక నున్న ప్రయోక్తలు (నటీనటాదులు) తంత్రీభాండవాద్యాలతో కూడ ప్రయోగించాలి.

**వి.** గాయకులు కనబడకుండా ఉండి గానం చేసే గీతాలు **బహిర్గీతాలు.** లేదా నాట్యవస్తువులో అంతర్గతం కాని గీతాలు **బహిర్గీతాలు.**

### *పూర్వరంగ ప్రయోగవిధానం*

**మూ. తతః సర్వైస్తు కుతపైః సంయుక్తానీహ కారయేత్,**
**విఘట్ట్య వై యవనికాం నృత్తపాఠ్యకృతాని తు. 12**

**గీతానాం మద్రకాదీనాం యోజ్యమేకం తు గీతకమ్,**
**వర్ధమానమథాపీహ తాణ్డవం యత్ర యుజ్యతే. 13**

**తతశ్చోత్థాపనం కార్యం పరివర్తనమేవ చ,**
**నాన్దీ శుష్కావకృష్టా చ రఙ్గద్వారం తథైవ చ. 14**

**చారీ చైవ తతః కార్యా మహాచారీ తథైవ చ,**
**త్రికం ప్రరోచనా చాపి పూర్వరఙ్గే భవన్తి హి. 15**

**తా.** పిమ్మట తెర పై కెత్తి అన్ని వాద్యాలు మోగిస్తూ నృత్త – పాఠ్యాదులు చేయించాలి. (సంభాషణ మొదలైనవి పాఠ్యాలు). మద్రకం మొద లైన గీతవిశేషాలలో ఒక గీతం ప్రయోగించాలి. తాండవం ప్రయోగించినప్పుడు వర్ధమానం అను గీతవిశేషం కూడ ప్రయోగించబడుతుంది. తరువాత వరుసగా ఉత్థాపనం, పరివర్తనం, నాంది, శుష్కావకృష్ట, రంగద్వారం, చారి, మహాచారి, త్రికం, ప్రరోచన వీటి ప్రయోగం చెయ్యాలి. (వీటి అర్థాలు ముస్ముందు స్పష్టం అవుతాయి).

**మూ. ఏతాన్యఙ్గాని కార్యాణి పూర్వరఙ్గవిధౌ ద్విజాః,**
**ఏతేషాం లక్షణమహం వ్యాఖ్యాస్యామ్యనుపూర్వశః. 16**

**తా.** ద్విజులారా! పూర్వరంగంలో ఈ అంగా లన్నీ ప్రయోగించాలి. వరసగా వీటి లక్షణాలను చెపుతాను.

**మూ. కుతపస్య తు విన్యాసః ప్రత్యాహార ఇతి స్మృతః,**
**తథావతరణం ప్రోక్తం గాయికానాం నివేశనమ్. 17**

**తా.** వాద్యాలను వాటిని ఉంచవలసిన స్థానాలలో ఉంచడం **ప్రత్యాహారం.** గాయకులను, గాయికలను వాళ్ల వాళ్ల స్థానాలలో కూర్చుండబెట్టడం **అవతరణం.**

**మూ. పరిగీతక్రియారమ్భ ఆరమ్భ ఇతి కీర్తితః,**
**ఆతోద్యరఞ్జనార్థం తు భవేదాశ్రావణావిధిః. 18**

**తా.** గానం చేయడానికి కంఠం అనుకూలంగా చేసికొనడానికై ఆలాపం చేయడం ప్రారంభించడం **ఆరంభం.** వాద్యాలు వాయించడంకొరకై వాటి శబ్దాదులు పరీక్షించి సిద్ధంచేసికొనడం **ఆశ్రావణావిధి.**

**వి.** అతిప్రాచీన కాలంనుంచీ కూడ వాద్యాలకూ, గాయకులు మొదలైన వాళ్లకూ రంగపీఠంమీద నిశ్చితమైన స్థానాలు ఉండేవి. నేపథ్యగృహం ద్వారం దగ్గర మృదంగం వాయించే మార్దంగికుడు కూర్చోవాలి. వాని ఎడమప్రక్క పణవవాదకుడు, రంగపీఠం

ఎడమప్రక్కన ఉత్తరాభి ముఖంగా గాయకులు, అక్కడనే కొంచెం ముందు దక్షిణాభి ముఖంగా గాయికలు కూర్చోవాలి. గాయకులకు ఎడమవైపు వేణువాదకుడు కూర్చోవాలి.

**మూ. వాద్యవృత్తివిభాగార్థం వక్త్రపాణిర్విధీయతే,**
**తన్త్ర్యోజఃకరణార్థం తు భవేచ్చ పరిఘట్టనా. 19**

**తా.** వాద్యవాదనంలోని వేరు వేరు వృత్తుల (శైలుల) విభాగం చేయడం **వక్త్రపాణి.** తంత్రీవాద్యాలను మోగించే ముందు, వాటిని పరీక్షిస్తూ, వాటి తీగలు సారిస్తూ చప్పుడు చేయడం **పరిఘట్టన.**

**వి.** వివిధవాద్యాలనుండి వచ్చే ధ్వనుల మధ్య సామంజస్యం, పరస్పరం అనుకూలంగా ఉండడంకోసం ప్రారంభంలోనే చేసే ఏర్పాటు **వక్త్రపాణి.**

**మూ. తథా పాణివిభాగార్థం భవేత్సంఘోటనావిధిః,**
**తన్త్రీభాణ్డసమాయోగాన్మార్గాసారితమిష్యతే. 20**

**తా.** అవనద్ధాది వాద్యాలమీద ధ్వనిని పరీక్షించడానికై చేతులతో వాయించడం **సంఘోటన.** తంత్రీవాద్యాలు, భాండవాద్యాలు కలిసి స్వరప్రయోగం చేయడం **మార్గాసారితం.** (ఇది కూడ పరీక్షించడానికే అని కొందరి అభిప్రాయం)

**మూ. కలాపాతవిభాగార్థం భవేదాసారితక్రియా,**
**కీర్తనాద్దేవతానాం చ జ్ఞేయో గీతవిధిస్తథా. 21**

**తా.** కలల విభాగం (మాత్రల గణన) కోసం **ఆసారితక్రియ** చేయబడుతుంది. దేవతలను స్తుతిస్తూ చేసిన గానం **గీతవిధి.**

**మూ. (అతఃపరం ప్రవక్ష్యామి హ్యుత్థాపనవిధిక్రియామ్)**
**యస్మాదుత్థాపయన్త్యత్ర ప్రయోగం నాన్దిపాఠకాః,**
**పూర్వమేవం తు రఙ్గేఽస్మిన్ తస్మాదుత్థాపనం స్మృతమ్. 22**

**తా.** (ఇపుడు ఉత్థాపనవిధిక్రియను గూర్చి చెపుతాను).

ఈ సందర్భంలో నాన్దిపాఠకులు, నాట్యరంగంమీద మొట్టమొదట నాట్యప్రయోగాన్ని లేవదీస్తారు. (ప్రారంభిస్తారు) గాన దీనికి **ఉత్థాపనం** అని పేరు.

**మూ. యస్మాచ్చ లోకపాలానాం పరివృత్య చతుర్దిశమ్,**
**వన్దనాని ప్రకుర్వన్తి తస్మాచ్చ పరివర్తనమ్. 23**

**తా.** నాలుగు దిక్కుల వైపూ తిరుగుతూ లోకపాలకుల వందనం చేస్తారు గాన దీనికి **పరివర్తనం** అని పేరు.

**మూ. ఆశీర్వచనసంయుక్తా నిత్యం యస్మాత్ప్రవర్తతే,**
**దేవద్విజనృపాదీనాం తస్మాన్నాన్దీతి సంజ్ఞితా. 24**

**తా.** ఆశీర్వచనపూర్వకంగా దేవతలు, ద్విజులు, రాజు మొదలైనవారి స్తుతి తప్పక చేయబడుతుంది గాన దీనికి **'నాందీ'** అని పేరు.

**వి.** "నిత్యమ్" అనడంచేత ఈ నాంది తప్పక చెయ్యాలి. 'నృపాదీనామ్' అని 'ఆది' పదంచేత నాట్యప్రయోగాధికారిని కూడ స్తుతించాలి" అని అభినవగుప్తాచార్యులు.

**మూ. అత్ర శుష్కాక్షరైరేవ హ్యవకృష్టా ధ్రువా యతః,**
**తస్మాచ్ఛుష్కావకృష్టేయం జర్జరశ్లోకదర్శికా. 25**

**తా.** దీనిలో శుష్కాక్షరాలతో (అర్థరహిత మైన అక్షరాలు ఉచ్చరిస్తూ) అవకృష్టధ్రువ గానం చేయబడుతుంది. అందుచేత ఇది 'జర్జరశ్లోకాలను' చూపే (వినిపించే) **శుష్కావకృష్ట.**

**మూ. యస్మాదభినయస్త్వత్ర ప్రథమం హ్యవతార్యతే,**
**రఙ్గద్వారమతో జ్ఞేయం వాగఙ్గాభినయాత్మకమ్. 26**

**తా.** పూర్వరంగంలో అభినయం (రూపకం) తొలిసారిగా అవతరింపచేయబడు తుంది; ప్రవేశపెట్టబడుతుంది. అందుచేత వాగభినయ – అంగాభినయరూప మైన ఇది రంగద్వారంగా చెప్పబడుతుంది.

**మూ. శృఙ్గారస్య ప్రచరణాచ్చారీ సంపరికీర్తితా,**
**రౌద్రప్రచరణాచ్చాపి మహాచారీతి కీర్తితా. 27**

**తా.** దీనిలో గతి ద్వారా శృంగారరసానికి సంబంధించిన భావాలు ప్రదర్శింప బడతాయి; అందుచేత **'చారి'** అని చెప్పబడుచున్నది. రౌద్రానికి సంబంధించిన భావాలు ప్రదర్శింపబడతాయి. అందుచేత **'మహాచారి'** అని చెప్పబడుచున్నది.

**మూ. విదూషకః సూత్రధారస్తథా వై పారిపార్శ్వికః,**
**యత్ర కుర్వన్తి సంజల్పం తచ్చాపి త్రిగతం మతమ్. 28**

**తా.** విదూషకుడు, సూత్రధారుడు, పారిపార్శ్వికుడు – ఈ ముగ్గురూ కలిసి చేసే సంభాషణ **త్రిగతం.**

**మూ. ఉపక్షేపేణ కావ్యస్య హేతుయుక్తిసమాశ్రయా,**
**సిద్ధేనామన్త్రణా యా తు విజ్ఞేయా సా ప్రరోచనా. 29**

**తా.** ప్రయోగించబోయే కావ్యంలోని (రూపకంలోని) విశేషాలను ప్రస్తావిస్తూ సూత్రధారుడు గాని, నాట్యవిశేషం తెలిసిన మరొకడు గాని సామాజికులను ఆహ్వానించడం, రూపకదర్శనోత్సుకులనుగా చేయడం, **ప్రరోచన.**

**మూ. అతఃపరం ప్రవక్ష్యామి హ్యాశ్రావణవిధిక్రియామ్,**
**బహిర్గీతవిధౌ సమ్యగుత్పత్తిం కారణం తథా. 30**

**తా.** ఇటుపిమ్మట నేను, బహిర్గీతవిధిలో ప్రయోగించవలసిన ఆశ్రావణవిధినీ, దాని ఉత్పత్తినీ, అందుకు కారణాన్నీ గూర్చి చెపుతాను.

**మూ. చిత్రదక్షిణవృత్తౌ తు సప్తరూపే ప్రవర్తితే,**
**సోపోహనే సనిర్గీతే దేవస్తుత్యభినన్దితే. 31**

**నారదాద్యైస్తు గన్ధర్వైః సభాయాం దేవదానవాః,**
**నిర్గీతం శ్రావితాః సమ్యగ్లయతాలసమన్వితమ్. 32**

**తా.** నారదాదిగంధర్వులు చిత్రమార్గ – దక్షిణమార్గాలలో, ఉపోహనంతోను, నిర్గీతంతోను కూడిన, దేవతాస్తుతిచేత ప్రశస్త మైన, సప్తరూపగానం ప్రవర్తింపచేసి సభలో (దేవ – దానవసభలో) నిర్గీతాన్ని చక్కని లయ – తాళాలతో కూర్చి వినిపించారు.

**వి.** 1. చిత్రమార్గము, దక్షిణమార్గము, వార్తికమార్గము అని మార్గాలు మూడు. 2. "మద్రకం" మొదలైన ఏడు గానాల పద్ధతి **సప్తరూపం.** విస్తారం, వ్యంజన, ఆవిద్ధం, కరణం, సంజ్ఞ, ధాతు, వాద్యం అనే ఏడు విధాల తాలాలు కూడ **సప్తరూపం** అని చెప్పవచ్చును.

3. స్థాయిస్వరాన్ని ఆశ్రయించి ఉన్న గీతాన్ని ప్రారంభించడం **ఉపోహనం.**

4. అర్థబోధకా లైన శబ్దాల ప్రయోగం లేకుండా కేవలం తాలాదులతో కూడిన ధ్వనుల ప్రయోగం **నిర్గీతం.** నిర్గీతమే బహిర్గీతం అనికొందరి అభిప్రాయం. వాద్యసంగీతం నిర్గీతం అనీ, వీణాదివాదనం నిర్గీతం అనీ కూడ అర్థాలు ప్రసిద్ధిలో ఉన్నాయి.

**మూ. తచ్ఛ్రుత్వా తు సుఖం గానం దేవస్తుత్యభినన్దితమ్,**
**అభవన్ క్షుభితాః సర్వే మాత్సర్యాద్దైత్యరాక్షసాః. 33**

**తా.** సుఖకర మైన, దేవతాస్తుతిపర మైన ఆ గానం విని దైత్యులు, రాక్షసులూ కూడ మాత్సర్యంతో చాల అలజడి చెందారు.

**మూ. సంప్రధార్య తు తేఽన్యోన్యమిత్యవోచన్నవస్థితాః,**
**నిర్గీతం తు సవాదిత్రమిదం గృహ్ణీమహే వయమ్. 34**

**సప్తరూపేణ సంతుష్టా దేవాః కర్మానుకీర్తనాత్,**
**వయం గృహ్ణీమ నిర్గీతం తుష్యామోఽత్రైవ సర్వదా. 35**

**తా.** వాళ్లందరూ ఒక చోట చేరి, ఒకరితో ఒకరు ఇలా చర్చించి – "వాద్యాలతో సహా ఈ నిర్గీతాన్ని మనం తీసివేసుకుందాం. తమను స్తుతించడంవల్ల దేవతలు ఈ

సప్తరూపంచేత సంతోషిస్తున్నారు. మనం ఈ నిర్గీతం తీసికొని ఎల్లప్పుడూ దీనితో సంతోషిద్దాం."

**మూ. తే తత్ర తుష్టా దైత్యాస్తు సాధయన్తి పున పునః,**
**రుష్టాశ్చాపి తతో దేవాః ప్రత్యభాషన్త నారదమ్. 36**

**తా.** ఆ దైత్యులు ఈ విధంగా నిశ్చయించుకొని ఆ సప్తరూపాన్నే మాటి మాటికి సాధన చేస్తూ సంతోషిస్తూండగా చూచి, దేవతలు కోపించి నారదునితో ఇలా అన్నారు.

**మూ. ఏతే తుష్యన్తి నిర్గీతే దానవాః సహరాక్షసైః,**
**ప్రణశ్యతు ప్రయోగోఽయం కథం వా మన్యతే భవాన్. 37**

**తా.** "ఈ దానవులూ, రాక్షసులూ కూడ నిర్గీతంతో సంతోషిస్తున్నారు. ఈ ప్రయోగాన్నే నశింపచేయడం మంచిది. నువ్వేమంటావు?"

**మూ. దేవానాం వచనం శ్రుత్వా నారదో వాక్యమబ్రవీత్,**
**ధాతువాద్యాశ్రయకృతం నిర్గీతం మా ప్రణశ్యతు. 38**

**కిం తూపోహనసంయుక్తం ధాతువాద్యవిభూషితమ్,**
**భవిష్యతీదం నిర్గీతం సప్తరూపవిధానతః. 39**

**నిర్గీతేనావబద్ధాశ్చ దైత్యదానవరాక్షసాః,**
**న క్షోభం న విఘాతం చ కరిష్యన్తీహ తోషితాః. 40**

**తా.** దేవతల మాటలు విని నారదు డిలా అన్నాడు – "ధాతువాద్యాలమీద ఆధారపడి ఏర్పరచిన ఈ నిర్గీతం నశించకూడదు. అయితే ఉపోహతోను, ధాతువాద్యాల తోను కూడి ఉన్న ఈ నిర్గీతం సప్తరూపవిధానానుసారం ఏర్పాటు చేయబడుతుంది. అప్పుడు ఈ నిర్గీతంచేత కట్టబడి (ఆకర్షింపబడి) దైత్యదానవరాక్షసులు సంతోషింప చేయబడినవారై రూపకప్రయోగానికి సంక్షోభం గాని విఘాతం కాని చేయరు.

**వి. ధాతువు** లనగా – ఆ యా వీణాతంత్రులను మోగించడంచేత, వేణువు రంధ్రాలపై ఆ యా అంగుళుల (వేళ్ల) విన్యాసంచేత కలిగే ధ్వనివిశేషాలు. ఈ ధ్వనివిశేషాలు వాద్యాల ద్వారా ఆవిర్భవిస్తాయి గాన వాటికి **ధాతువులు** అని పేరు అని అభినవ గుప్తాచార్యుల అభిప్రాయం అన్నట్లు త్రుటితములైన ఆయన వాక్యాల ద్వారా తెలుస్తున్నది.

**మూ. ఏవం నిర్గీతమేతత్తు దైత్యానాం స్పర్ధయా ద్విజాః,**
**దేవానాం బహుమానేన బహిర్గీతమితి స్మృతమ్. 41**

**తా.** ఓ! ద్విజులారా! దైత్యుల స్పర్ధమూలాన నిర్మింపబడిన ఈ నిర్గీతమే, దేవతలకు సంతోషహేతు వవడంచేత బహిర్గీత మను పేరు పొందినది.

**మూ. ధాతుభిశ్చిత్రవీణాయాం గురులఘ్వక్షరాన్వితమ్,**
**వర్ణాలఙ్కారసంయుక్తం ప్రయోక్తవ్యం బుధైరథ. 42**

**తా.** గురువు లైన అక్షరాలతోను, లఘుఅక్షరాలతోను, వర్ణములతోను అలంకారాల తోను కూడిన ఈ నిర్గీతాన్ని పండితులు, ధాతువులతో, చిత్రవీణమీద ప్రయోగించాలి.

**మూ. నిర్గీతం గీయతే యస్మాదపదం వర్ణయోజనాత్,**
**అనసూయయా చ దేవానాం బహిర్గీతమితి స్మృతమ్. 43**

**తా.** పదా లేవీ ప్రయోగించకుండా కేవలం వర్ణాలు మాత్రమే ప్రయోగించడంచేత, దేవతలకు సంతోషకరం అవడంచేత దీనికి నిర్గీతం అను పేరు వచ్చింది.

**వి.** నిర్గీతంలో నిరర్థక మైన ధ్వనులే చిత్రవీణాదులమీద ప్రయోగింపబడతాయి.

**మూ. నిర్గీతం యన్మయా ప్రోక్తం సప్తరూపసమన్వితమ్,**
**ఉత్థాపనాదికం యచ్చ తస్య కారణముచ్యతే. 44**

**తా.** సప్తరూపాలతో కూడిన నిర్గీతాన్ని గూర్చి, ఉత్థాపనాదికాన్ని గూర్చీ మీకు చెప్పాను కదా. దీని కంతకీ కారణం ఏమో చెపుతాను.

**మూ. ఆశ్రావణాయాం యుక్తాయాం దైత్యాస్తుష్యన్తి నిత్యశః,**
**వక్త్రపాణౌ కృతే చైవ నిత్యం తుష్యన్తి దానవాః. 45**

**పరిఘట్టనయా తుష్టా యుక్తాయాం రక్షసాం గణాః,**
**సంఘోటనక్రియాయాం చ తుష్యన్త్యపి చ గుహ్యకాః. 46**

**మార్గాసారితమాసాద్య తుష్టా యక్షా భవన్తి హి,**
**గీతకేషు ప్రయుక్తేషు దేవాస్తుష్యన్తి నిత్యశః. 47**

**వర్ధమానే ప్రయుక్తే తు రుద్రస్తుష్యతి సానుగః,**
**తథా చోత్థాపనే యుక్తే బ్రహ్మా తుష్టో భవేదిహ. 48**

**తుష్యన్తి లోకపాలాశ్చ ప్రయుక్తే పరివర్తనే,**
**నాన్దీప్రయోగేఽథ కృతే ప్రీతో భవతి చన్ద్రమాః. 49**

**యుక్తాయామవకృష్టాయాం ప్రీతా నాగా భవన్తి హి,**
**తథా శుష్కావకృష్టాయాం ప్రీతః పితృగణో భవేత్. 50**

**రఙ్గద్వారే ప్రయుక్తే తు విష్ణుః ప్రీతో భవేదిహ,**
**జర్జరస్య ప్రయోగే తు తుష్టా విఘ్నవినాయకాః. 51**

**తథా చార్యాం ప్రయుక్తాయాముమా తుష్టా భవేదిహ,**
**మహాచార్యాం ప్రయుక్తాయాం తుష్టో భూతగణో భవేత్. 52**

**తా.** ఆశ్రావణను ప్రయోగించడంచేత దైత్యులు సంతోషిస్తారు. వక్త్రపాణి ప్రయోగిస్తే దానవులు సంతోషిస్తారు. పరిఘట్టనాప్రయోగంచేత రాక్షసగణము, సంఘోటనక్రియ చేత గుహ్యకులు, మార్గాసారితప్రయోగం చేస్తే యక్షులు, గీతాలు ప్రయోగిస్తే దేవతలు, వర్ధమానకం ప్రయోగిస్తే రుద్రుడూ, ఆయన అనుచరులూ, ఉత్థాపనప్రయోగంచేత బ్రహ్మ, పరివర్తనప్రయోగంచేత లోకపాలకులు, నాందీప్రయోగంచేత చంద్రుడు, అవకృష్టా ప్రయోగంచేత నాగులు, శుష్కావకృష్టాప్రయోగంచేత పితృదేవతాగణము, రంగద్వారం ప్రయోగించడంచేత విష్ణువు, జర్జరప్రయోగంచేత విఘ్నకారకులైన వినాయకులు, చారీప్రయోగంచేత ఉమాదేవి, మహాచారీప్రయోగంచేత భూతగణము సంతోషిస్తారు.

**మూ. ఆశ్రావణాది చాద్యన్తమేతద్దైవతపూజనమ్,**
**పూర్వరఙ్గే మయాఖ్యాతం తథా చాఙ్గవికల్పనమ్. 53**

**తా.** ఆశ్రావణం మొదలు చారీల వరకు ఉన్న దేవతాపూజావిధానమూ, పూర్వ రంగంలో చేయవలసిన అంగాల విభాగమూ మీకు చెప్పాను.

**మూ. దేవస్తుష్యతి యో యేన యస్య యన్మనసః ప్రియమ్,**
**తత్తథా పూర్వరఙ్గే తు మయా ప్రోక్తం ద్విజోత్తమాః. 54**

**తా.** ద్విజోత్తములారా! దేనిచేత ఏ దేవుడు సంతోషిస్తాడో, ఎవనికి ఏది ప్రియమో, పూర్వరంగంలో చేయవలసిన అదంతా నేను చెప్పాను.

**మూ. సర్వదైవతపూజార్హం సర్వదైవతపూజనమ్,**
**ధన్యం యశస్యమాయుష్యం పూర్వరఙ్గప్రవర్తనమ్. 55**
**దైత్యదానవతుష్ట్యర్థం సర్వేషాం చ దివౌకసామ్,**
**నిర్గీతాని సగీతాని పూర్వరఙ్గకృతాని తు. 56**

**తా.** పూర్వరంగం ప్రవర్తింపచేయడం సకలదేవతల పూజ చేయడానికి అనుకూలంగా ఉండి, సకల దేవతల పూజలు జరిపిస్తుంది. ఇది చాల లాభకరం; యశః ప్రదం; ఆయుర్దాయవర్ధకం.

దైత్యులు దానవులు సంతోషించిడానికీ, దేవత లందరూ సంతోషించడానికీ; నిర్గీతాలూ, గీతాలూ పూర్వరంగంలో చేర్చబడ్డాయి.

**మూ. (యా విద్యా యాని శిల్పాని యా గతిర్యచ్చ చేష్టితమ్,**
**లోకాలోకస్య జగతస్తదస్మిన్నాటకాశ్రయే).**

**తా.** (జగత్తులో ఏ విద్య లున్నాయో, ఏ శిల్పా లున్నాయో, ఏ మానవాదుల ప్రవృత్తి ఉన్నదో, ఏ విధమైన పను లున్నాయో, అవన్నీ లోకం (జనులు) ఒక్క చోట చూడడానికి అనువుగా ఈ నాటకం అనే ఆశ్రయంలో ఉంటుంది).

**మూ. నిర్గీతానాం సగీతానాం వర్ధమానస్య చైవ హి,**
**ధ్రువావిధానే వక్ష్యామి లక్షణం కర్మ చైవ హి. 57**

**తా.** నిర్గీతాల, గీతాల లక్షణమును, ప్రయోగమును, వర్ధమానలక్షణప్రయోగ ములను, ధ్రువావిధానంలో ధ్రువ ఏ విధంగా ప్రయోగించాలి అని చెప్పే ఘట్టంలో చెపుతాను.

### *ఉత్థాపనీధ్రువ - దానిలక్షణాదులు*

**మూ. ప్రయుజ్య గీతకవిధిం వర్ధమానమథాపి చ,**
**గీతకాన్తే తతశ్చాపి కార్యా హ్యుత్థాపనీధ్రువా. 58**

**తా.** గీతకవిధిని, వర్ధమానాన్ని చేసి, గీతకం ముగిసిన తరువాత 'ఉత్థాపనీధ్రువ' చెయ్యాలి.

**మూ. ఆదౌ ద్వే చ చతుర్థం చాప్యష్టమైకాదశే తథా,**
**గుర్వక్షరాణి జానీయాత్పాదౌ హ్యేకాదశాక్షరే. 59**

**తా.** పదకొండు అక్షరా లున్న పాదంలో మొదటి రెండక్షరాలు. నాల్గవది, ఎనిమిదవది, పదకొండవది గురువులై ఉండాలి.

**మూ. చతుష్పదా భవేత్సా తు చతురస్రా తథైవ చ,**
**చతుర్భిః సంనిపాతైశ్చ త్రిలయా త్రియతిస్తథా. 60**

**తా.** దీనిలో ఇలాంటివి నాలుగు పాదా లుంటాయి. చతురస్రతాలం ఉంటుంది. నాలుగు సంనిపాతాలు, (ద్రుతము, మధ్యమము, విలంబితము అను) మూడు లయలు, (సమ, స్రోతోవహ, గోపుచ్ఛ అను) మూడు యతులు ఉంటాయి.

**మూ. పరివర్తాశ్చ చత్వారః పాణయస్త్రయ ఏవ చ,**
**జాత్యాం చైవ చ విశ్లోకా తాం చ తాలేన యోజయేత్. 61**

**తా.** దీనిలో నాలుగు పరివర్తాలు మూడు పాణులు జాతివృత్తంలో విశ్లోక చందస్సు చతురస్రతాలంలో ప్రయోగింపబడతాయి.

**మూ. శమ్యా తు ద్వికలా కార్యా తాలో ద్వికల ఏవ చ,**
**పునశ్చైకకలా శమ్యా సంనిపాతః కలాత్రయమ్. 62**

**తా.** చతురస్రతాలంలో రెండు కలల ప్రమాణం గల శమ్య, రెండు కలల తాలం, మళ్లీ ఒక కల గల శమ్య - ఈ విధంగా మూడు కలల సంనిపాతం అవుతుంది.

**మూ. ఏవమష్టకలః కార్యః సంనిపాతో విచక్షణైః,**
**చత్వారః సంనిపాతాశ్చ పరివర్తః స ఉచ్యతే. 63**

**తా.** ప్రయోగనిపుణులు ఇదే పద్ధతిలో ఎనిమిది కలల సంనిపాతం చెయ్యాలి. నాలుగు సంనిపాతాలకు **పరివర్తం** అని పేరు.

**మూ. పూర్వం స్థితలయః కార్యః పరివర్తో విచక్షణైః,**
**తృతీయే సంనిపాతే తు తస్య భాణ్డగ్రహో భవేత్. 64**

**తా.** పూర్వరంగంలో ప్రయోగించే మొదటిపరివర్తకం విలంబితలయలో చెయ్యాలి. మూడవ సంనిపాతంలోని పరివర్తకంలో భాండవాద్యాలు ఉపయోగించాలి.

**మూ. ఏకస్మిన్ పరివర్తే తు గతే ప్రాప్తే ద్వితీయకే,**
**కార్యం మధ్యలయే తద్జ్ఞైః సూత్రధారప్రవేశనమ్. 65**

**తా.** ఒక పరివర్తకం సమాప్తమై రెండవది ప్రారంభం అయినప్పుడు, ప్రయోగజ్ఞులు, మధ్యలయ జరుగుతూండగా సూత్రధారుణ్ణి ప్రవేశపెట్టాలి.

*రంగప్రవేశవిధానం*

**మూ. పుష్పాఞ్జలిం సమాదాయ రక్షామంగలసంస్కృతాః,**
**శుద్ధవస్త్రాః సుమనసః తథా చాద్భుతదృష్టయః. 66**
**పాదం తు వైష్ణవం కృత్వా సౌష్ఠవాఙ్గపురస్కృతమ్,**
**దీక్షితాః శుచయశ్చైవ ప్రవిశేయుః సమం త్రయః. 67**

**తా.** సూత్రధారుడు వాని సహచరులైన ఇద్దరు పారిపార్శ్వికులు – ముగ్గురూ కూడ, ఉపవాసాది దీక్షచే పవిత్రులై రక్షాసూత్రములు ధరించడంచే సంస్కృతులై, తెల్లని వస్త్రాలు ధరించి, దోసిళ్లలో పుష్పాలు ఉంచుకొని, మంచి (ఉత్సాహభరితమైన) మనస్సులతో నాట్యానికి అనుగుణ మైన అంగసౌష్ఠవంతో వైష్ణవస్థానకంలో నిలచి 'అద్భుతం' అనే దృష్టితో రంగస్థలంమీద ప్రవేశించాలి.('అద్భుతదృష్టి' 'వైష్ణవస్థానం' మొదలైన పదాలు పారిభాషికములు. వీటి స్వరూపం రాబోయే అధ్యాయాలలో స్పష్టం అవుతుంది).

**మూ. భృఙ్గార జర్జరధరౌ భవేతాం పారిపార్శ్వికౌ,**
**మధ్యే తు సూత్రభృత్తాభ్యాం వృతః పఞ్చపదీం చరేత్. 68**

**తా.** పారిపార్శ్వికు లిద్దరిలో ఒకని చేతిలో భృంగారం (పాత్రవిశేషం) ఉండాలి. రెండవ వాని చేతిలో జర్జరం ఉండాలి. సూత్రధారుడు వాళ్లిద్దరి మధ్య ఉంటూ ఐదు అడుగులు వేసి నడవాలి.

**మూ. పదాని పఞ్చ గచ్ఛేయుర్బ్రహ్మణో యజనేచ్ఛయా,**
**పఞ్చానామపి విక్షేపం వ్యాఖ్యాస్యామ్యనుపూర్వశః. 69**

**తా.** బ్రహ్మదేవుని పూజించా లను ఇచ్ఛతో ఐదు అడుగులు వేస్తూ ముందుకు నడవాలి. ఐదు అడుగులూ ఏ విధంగా వెయ్యాలో, ఒకదాని తరువాత ఒకటి విశదీక రిస్తాను.

**మూ. త్రితాలాన్తరవిష్కమ్భముత్క్షిపేచ్చరణం శనైః,**
**పార్శ్వోత్థానోత్థితం చైవ తన్మధ్యే పాతయేత్పునః. 70**

**తా.** మూడు తాలాల వైశాల్యం ఉండే టట్లు పాదం మెల్లగా ఎత్తాలి. ఒక పార్శ్వం వైపు లేపడం ద్వారా లేచిన పాదాన్ని అదే కొలతలో, నేలమీద ఉంచాలి.

**వి.** తాలం అనగా ఇక్కడ అరచేయిచాచినప్పుడు మధ్యవేలు చివరినుండి మణికట్టు వరకూ ఉన్న దూరం; పొడవు. దాదాపు జానెలో మూడు వంతులు.

**మూ. ఏవం వామపదీం దత్త్వా సూత్రధారః సహేతరః,**
**సూచీం వామపదే దద్యాద్విక్షేపం దక్షిణేన చ. 71**

**తా.** సూత్రధారుడు, మిగిలిన ఇద్దరూ కూడ ఈ విధంగా ఐదు అడుగులతో నడిచి, ఎడమ పాదంతో సూచీచారి, కుడి పాదంతో విక్షేపచారి ప్రయోగించాలి.

**మూ. పుష్పాఞ్జల్యపవర్గశ్చ కార్యో బ్రాహ్మేఽథ మణ్డలే,**
**రఙ్గపీఠస్య మధ్యే తు స్వయం బ్రహ్మా ప్రతిష్ఠితః. 72**

**తా.** రంగపీఠం మధ్య సాక్షాత్తు బ్రహ్మదేవుడు ప్రతిష్ఠింపబడి ఉంటాడు. అందుచేత బ్రహ్మస్థాన మైన మండలంమీద అంజలిలోని పుష్పాలు విడవాలి (సమర్పించాలి).

**మూ. తతః సలలితైర్హస్తైరభివన్ద్య పితామహమ్. 73**
**అభివాదాని కార్యాణి త్రీణి హస్తేన భూతలే.**
**కాలప్రకర్షహేతోశ్చ పాదానాం ప్రవిభాగతః**

**తా.** తరువాత లలితముద్ర లున్న హస్తాలతో బ్రహ్మదేవునికి అభివాదనం చెయ్యాలి. నేల చేతులతో స్పృశిస్తూ మూడు అభివాదనలు చెయ్యాలి. కాలవిభాగంకొరకు పాద న్యాసాలు చేస్తూ అభివాదనాలు చెయ్యాలి.

**మూ. సూత్రధారప్రవేశాద్యో వన్దనాభినయాన్తకః. 74**
**ద్వితీయః పరివర్తస్తు కార్యో మధ్యలయాశ్రితః.**

**తా.** సూత్రధారప్రవేశం మొదలు వందనాభినయం చివరి వరకూ ఉన్న ద్వితీయ పరివర్తకం మధ్యలయతో చెయ్యాలి.

## తృతీయపరివర్తకవిధానం

**మూ. తతఃపరం తృతీయే తు మణ్డలస్య ప్రదక్షిణమ్. 75**

**భవేదాచమనం చైవ జర్జరగ్రహణం తథా,**
**ఉత్థాయ మన్డలాత్తూర్ణం దక్షిణం పాదముద్ధరేత్. 76**

**వేధం తేనైవ కుర్వీత విక్షేపం వామకేన చ,**
**పునశ్చ దక్షిణం పాదం పార్శ్వసంస్థం సముద్ధరేత్. 77**

**తతశ్చ వామవేధస్తు విక్షేపో దక్షిణస్య చ,**
**ఇత్యనేన విధానేన సమ్యక్కృత్వా ప్రదక్షిణమ్. 78**

**భృఙ్గారభృతమాహూయ శౌచం చాపి సమాచరేత్,**
**యథాన్యాయం చ కర్తవ్యా తేన హ్యాచమనక్రియా. 79**

**ఆత్మప్రోక్షణమేవాద్భిః కర్తవ్యం తు యథాక్రమమ్.**

**తా.** మూడవ పరివర్తకంలో సూత్రధారుడు బ్రహ్మమండలానికి ప్రదక్షిణం చెయ్యాలి. తరవాత ఆచమనం చేసి జర్జరం తీసికోవాలి. మండలనుంచి తొందరగా లేచి కుడిపాదం ఎత్తి దానితో వేధ అనగా సూచీచారి, చెయ్యాలి. ఎడమపాదంతో విక్షేపం చెయ్యాలి. పార్శ్వం దాకా ఎత్తి ఎడమపాదంతో వేధ చెయ్యాలి. కుడి పాదంతో విక్షేపం చెయ్యాలి. ఈ విధానాన్ని అనుసరించి బాగా ప్రదక్షిణం చేసి, పాత్ర పట్టుకొన్న వానిని పిలిచి, శౌచం చేసికొనడానికి, తనను పవిత్రుణ్ణి చేసికొనడానికి, శాస్త్రానుసారం ఆచమనం చెయ్యాలి. క్రమానుసారం ఉదకం తనపై చల్లుకోవాలి.

**మూ. ప్రయత్నకృతశౌచేన సూత్రధారేణ యత్నతః. 80**

**సంనిపాతసమం గ్రాహ్యో జర్జరో విఘ్నజర్జరః,**
**ప్రదక్షిణాద్యో విజ్ఞేయో జర్జరగ్రహణాంతకః. 81**

**తృతీయః పరివర్తస్తు విజ్ఞేయో వై ద్రుతే లయే.**

తా. సూత్రధారుడు శ్రద్ధాపూర్వకంగా శౌచం చేసికొని, సంనిపాతంతో సమంగానే, (సంనిపాతం ప్రారంభించేటప్పుడే) విఘ్నవినాశక మైన జర్జరం చేతిలో పట్టుకోవాలి. సూత్రధారుడు ప్రదక్షిణం చేయడం మొదలు జర్జరం చేతిలో పట్టుకొనే వరకు ఉన్న ప్రయోగం తృతీయపరివర్తకం. ఇది ద్రుతలయంలో జరగాలి.

**మూ. గృహీత్వా జర్జరం త్వష్టౌ కలా జప్యం ప్రయోజయేత్. 82**

**వామవేధం తతః కుర్యాత్ విక్షేపం దక్షిణస్య చ,**
**తతః పఞ్చపదీం చైవ గచ్ఛేత్తు కుతపోన్ముఖః. 83**

**వామవేధస్తు తత్రాపి విక్షేపో దక్షిణస్య తు,**
**జర్జరగ్రహణాద్యోఽయం కుతపాభిముఖాన్తరః. 84**
**చతుర్థః పరివర్తస్తు కార్యో ద్రుతలయే పునః.**

**తా.** జర్జరం గ్రహించి ఎనిమిది కలల సమయం మంత్రజపం చెయ్యాలి. తరువాత ఎడమ పాదం ముందుకు ఉంచుతూ సూచీచారి చెయ్యాలి. కుడి పాదంతో విక్షేపం చెయ్యాలి. పిదప కుతపం వైపు (వాద్యసముదాయం ఉంచిన వైపు) ఐదు అడుగులు వేసి నడవాలి. అప్పుడు కూడ ఎడమ పాదంతో సూచీచారి, కుడి పాదంతో విక్షేపమూ చెయ్యాలి. జర్జరం గ్రహించడం మొదలు కుతపం వైపు వెళ్లడంవరకు జరిగిన ఈ నాల్గవ పరివర్తకాన్ని ద్రుతలయంలో జరపాలి.

**మూ. కరపాదనిపాతాస్తు భవన్త్యత్ర తు షోడశ. 85**
**త్ర్యశ్రే ద్వాదశ పాతాస్తు భవన్తి కరపాదయోః.**

**తా.** దీనిలో (**చతురశ్రమండపంలో**) పదహారు హస్తపాదనిపాతాలు (కదలికలు) ఉంటాయి. **త్ర్యస్రమండపం**లో నైతే పన్నెండు హస్తపాదపాతాలు ఉంటాయి.

**మూ. వన్దనాన్యత్ర కార్యాణి త్రీణి హస్తేన భూతలే. 86**
**ఆత్మప్రోక్షణమద్భిశ్చ త్ర్యశ్రే నైవ విధీయతే,**
**ఏవముత్థాపనం కార్యం తతస్తు పరివర్తనమ్. 87**

**తా. (చతురస్రమండపంలో)** భూమిని హస్తంతో స్పృశిస్తూ మూడు వందనాలు చెయ్యాలి. త్ర్యశ్రమండపంలో ఉదకంతో సూత్రధారుడు తనపై ప్రోక్షించుకొనడం విధింప బడదు. ఈ విధంగా ఉత్థాపనధ్రువ ముగించుకోవాలి. తరువాత పరివర్తనం ప్రయోగించాలి.

**మూ. చతురశ్రం లయే మధ్యే సంనిపాతైరథాష్టభిః,**
**యస్యా లఘూని సర్వాణి కేవలం నైధనం గురు. 88**
**భవేదతిజగత్యాం తు సా ధ్రువా పరివర్తనీ.**

**తా.** ('పరివర్తనీ' ధ్రువను) చతురస్రతాలంతో, మధ్యమలయలో ఎనిమిది సంని పాతాలతో ప్రయోగించాలి. అన్ని అక్షరాలు లఘువులై కేవలం ఎనిమిదవది గురువుగా ఉన్న అతిజగతీఛందస్సులో జరిగే ధ్రువ **పరివర్తని.**

**మూ. వార్తికేన తు మార్గేణ వాద్యేనానుగతేన చ. 89**
**లలితైః పదవిన్యాసైర్వన్ద్యా దేవా యథాదిశమ్.**

**తా.** (పరివర్తనీధ్రువగానం చేసే టప్పుడు) సూత్రధారుడు వార్తికమార్గంలో, వాద్య – తాలధ్వనులకు అనుకూలంగా లలిత మైన పదన్యాసం చేస్తూ ఆ యా దిక్కుల వైపు తిరిగి అందరు దిక్పాలకులకు వందనం చెయ్యాలి.

**వి.** 'నాలుగు మాత్రల కాలం ఉన్న ఒక కల' అనేది వార్తికమార్గం.

**మూ. ద్వికలం పాదపతనం పాదచార్యాం గతం భవేత్. 90**
**వామపాదేన వేధస్తు కర్తవ్యో నృత్తయోక్తృభిః,**
**ద్వితాలాన్తరవిష్కమ్భో విక్షేపో దక్షిణస్య తు. 91**

**తా.** పైన చెప్పిన పాదచారిలో ఒక్కొక్క పాదపతనం (అడుగు వేయడం) రెండు కలల సమయంలో జరగాలి. నృత్త ప్రయోక్తలు వామపాదంతో సూచీచారి చేసి కుడి పాదంతో రెండు తాలాల దూరం విష్కంభం (మధ్య నున్న ప్రదేశం) గల విక్షేపం చెయ్యాలి.

**మూ. తతః పఞ్చపదీం గచ్ఛేదతిక్రాన్తైః పదైరథ,**
**తతోఽభివాదనం కుర్యాత్ దేవతానాం యథాదిశమ్. 92**

**తా.** తరువాత అతిక్రాంతచారిలో ఐదు అడుగులు వేసుకుంటూ ముందుకు వెళ్లాలి. పిదప వారి వారి దిక్కుల ప్రకారం దిక్పాలకుల అభివాదనం చెయ్యాలి.

**మూ. వన్దేత ప్రథమం పూర్వాం దిశం శక్రాధిదైవతామ్,**
**ద్వితీయాం దక్షిణామాశాం వన్దేత యమదైవతామ్. 93**
**వన్దేత పశ్చిమామాశాం తతో వరుణదైవతామ్,**
**చతుర్థీముత్తరామాశాం వన్దేత ధనదాశ్రయామ్. 94**

**తా.** ముందుగా ఇంద్రుడు అధిష్ఠానదేవతగా గల తూర్పుదిక్కుకు, తరవాత యముడు అధిదేవతగా గల దక్షిణదిక్కుకూ, తరువాత వరుణుడు అధిష్ఠానదేవతగా గల పశ్చిమదిక్కుకూ, పిదప కుబేరుడు అధిష్ఠానదేవతగా గల ఉత్తరదిక్కుకూ వందనం చెయ్యాలి.

**మూ. దిశాం తు వన్దనం కృత్వా వామవేధం ప్రయోజయేత్,**
**దక్షిణేన తు కర్తవ్యం విక్షేపపరివర్తనమ్. 95**

**తా.** దిక్కుల వందనం చేసిన పిమ్మట ఎడమపాదంతో సూచి, కుడిపాదంతో విక్షేపపరివర్తనము చెయ్యాలి.

**మూ. ప్రాఙ్ముఖస్తు తతః కుర్యాత్ పురుషస్త్రీనపుంసకైః,**
**త్రిపద్యా సూత్రభృద్రుద్రబ్రహ్మోపేన్ద్రాభివన్దనమ్. 96**

**తా.** తరువాత సూత్రధారుడు తూర్పుదిక్కు వైపు తిరిగి, పురుష – స్త్రీ

నపుంసకపాదాలతో రుద్ర - బ్రహ్మ - విష్ణువుల వందనం చెయ్యాలి.

**మూ. దక్షిణం తు పదం పుంసో వామం స్త్రీణాం ప్రకీర్తితమ్,**
**పునర్దక్షిణమేవ స్యాన్నాత్యుత్క్షిప్తం నపుంసకమ్. 97**

**తా.** కుడిపాదం పురుషపాదం. ఎడమపాదం స్త్రీ పాదం. కొంచెం పైకి ఎత్తిన కుడిపాదం నపుంసకపాదం.

**మూ. వన్దేత పౌరుషేణేశం స్త్రీపదేన జనార్దనమ్,**
**నపుంసకపదేనాపి తథైవామ్బుజసంభవమ్. 98**

**తా.** పురుషపాదంలో ఈశ్వరునకూ, స్త్రీపాదంతో విష్ణువుకు, నపుంసకపాదంతో బ్రహ్మదేవునికీ వందనం చెయ్యాలి.

**మూ. పరివర్తనమేవం స్యాత్తస్యాన్తే ప్రవిశేత్తతః,**
**చతుర్థకారః పుష్పాణి ప్రగృహ్య విధిపూర్వకమ్. 99**

**తా.** ఈ విధంగా పరివర్తనం పూర్తి అయిన తరువాత నాలుగవ పని మనిషి యథావిధిగా పుష్పాలు తీసికొని రంగంమీదికి ప్రవేశించాలి.

**వి.** సూత్రధారుడు, వాని పారిపార్శ్వికులు చేసే పనులు కాక వేరే పనులు చేసేవాడు గాన వీనికి చతుర్థకారుడు అని పేరు.

**మూ. యథావత్తేన కర్తవ్యం పూజనం జర్జరస్య తు,**
**కుతపస్య చ సర్వస్య సూత్రధారస్య చైవ హి. 100**

**తా.** అతడు జర్జరానికి, కుతపానికి (వాద్యసముదాయానికి) సూత్రధారునికి యథాశాస్త్రంగా పూజ చెయ్యాలి.

**మూ. తస్య భాణ్డసమః కార్యస్తద్జ్ఞైర్గతిపరిక్రమః,**
**న తత్ర గానం కర్తవ్యం తత్ర స్తోభక్రియా భవేత్. 101**

**తా.** వాని పాదవిన్యాసాదికం వాద్యాలకు అనుగుణంగా ఉండాలి. గానం చేయ కూడదు. అర్థరహితమైన అక్షరాల ఉచ్చారణ చేస్తూండాలి.

**మూ. చతుర్థకారః పూజాం తు స కృత్వాన్తర్హితో భవేత్,**
**తతో గేయావకృష్టా తు చతురశ్రా స్థితా ధ్రువా. 102**

**తా.** పూజలు చేసి, ఆ చతుర్థకారుడు నిష్క్రమించాలి. తరువాత విలంబితలయతో, చతురస్రతాలంతో అవకృష్టధ్రువ గానం చెయ్యాలి.

**మూ. గురుప్రాయా తు సా కార్యా తథా చైవావపాణికా,**
**స్థాయివర్ణాశ్రయోపేతా కలాష్టకవినిర్మితా. 103**

**తా.** అవకృష్టధ్రువలో అన్ని వర్ణాలు గురువులు ఉండాలి. అవపాణికతాలంతో ఉండాలి. స్థాయివర్ణములను, అనగా సమంగా ఉండే స్వరాలను, ఆశ్రయించి ఉండాలి. ఎనిమిది కలలతో ప్రయోగింపబడాలి.

**(మూ. చతుర్థం పఞ్చమం చైవ సప్తమం చాష్టమం తథా,**
**లఘూని పాదే పఙ్క్త్యాం తు సావకృష్టా ధ్రువా స్మృతా.)**

**తా.** (అవకృష్ట ధ్రువలోని పంక్తిఛందః పాదంలో నాలుగు, ఐదు, ఏడు, ఎనిమిది వర్ణాలు లఘువులై ఉండాలి).

*నాందీపాఠవిధానం*

**మూ. సూత్రధారః పఠేత్తత్ర మధ్యమం స్వరమాశ్రితః,**
**నాన్దీం పదైర్ద్వాదశభిరష్టాభిర్వాప్యలంకృతామ్. 104**

**తా.** సూత్రధారుడు పన్నెండు లేదా ఎనిమిది పదా లున్న నాందిని మధ్యమస్వరంలో గానం చెయ్యాలి.

**మూ. నమోఽస్తు సర్వదేవేభ్యో ద్విజాతిభ్యః శుభం తథా,**
**జితం సోమేన వై రాజ్ఞా శివం గోబ్రాహ్మణాయ చ. 105**

**తా.** సకలదేవతలకు నమస్కారము. బ్రాహ్మణులకు శుభం కలుగుగాక. రాజైన సోముడు సర్వోత్కర్షతో ఉండుగాక. గోవులకు బ్రాహ్మణులకు శుభం అవుగాక.

**మూ. బ్రహ్మోత్తరం తథైవాస్తు హతా బ్రహ్మద్విషస్తథా,**
**ప్రశాస్త్విమాం మహారాజః పృథివీం చ ససాగరామ్. 106**

**తా.** బ్రాహ్మణజాతి ఉన్నతస్థితిలో ఉండుగాక. బ్రాహ్మణద్వేషులు నశింతురు గాక. మహారాజు, సాగరసహిత మైన ఈ భూమిని పాలించుగాక.

**మూ. రాష్ట్రం ప్రవర్ధతాం చైవ రఙ్గస్యాశా సమృధ్యతు,**
**ప్రేక్షాకర్తుర్మహాన్ధర్మో భవతు బ్రహ్మభాషితః. 107**

**తా.** రాష్ట్రం బాగా వృద్ధిలో ఉండుగాక. నాట్యరంగం ఆశ సిద్ధించుగాక. నాట్య ప్రదర్శకునకు, బ్రహ్మ చెప్పిన గొప్ప ధర్మం కలుగుగాక.

**వి.** ప్రేక్షాకర్త అనగా నటీ – నటాదులసముదాయం అని లేదా నాట్యప్రదర్శనం ఏర్పాటు చేసినవాడు అని అర్థం చెప్పవచ్చును.

**మూ. కావ్యకర్తుర్యశశ్చాస్తు ధర్మశ్చాపి ప్రవర్ధతామ్,**
**ఇజ్యయా చానయా నిత్యం ప్రీయన్తాం దేవతా ఇతి. 108**

**తా.** కావ్యం (ప్రయోగింపబోయే రూపకం) రచించినవానికి కీర్తి కలుగుగాక; వాని ధర్మం వృద్ధి పొందుగాక. ఈ నాట్యరూప మైన యాగంచేత, నిత్యమూ దేవతలు సంతోషించెదరు గాక (అని సూత్రధారుడు గానం చేయాలి) (ఈ నాలుగు శ్లోకాల నాందిలో మొత్తం 12 వాక్యా లున్నాయి).

**మూ. నాన్దీపదాన్తరేష్వేషు హ్యేవమార్యేతి నిత్యశః,**
**వదేతాం సమ్యగుక్తాభిర్వాగ్భిస్తౌ పారిపార్శ్వికౌ. 109**

**తా.** సూత్రధారుడు నాందీగానం చేస్తూన్నప్పుడు, పారిపార్శ్వికులు స్పష్టంగా మాటలు ఉచ్చరిస్తూ – 'ఆర్య ఏవమ్' (ఆర్యా! ఇలాగే జరుగుగాక!) అని ప్రతీ పాదం చివరా, అంటూండాలి. ఉదాహరణకి – **'నమోఽస్తు సర్వదేవేభ్యః'** అని సూత్రధారుడు అనగానే పారిపార్శ్వికులు **'ఆర్య ఏవమ్'** = **'తథాస్తు'** అని అనాలి. అలాగే అన్ని సంపూర్ణ వాక్యాల చివర అనాలి.

**మూ. ఏవం నాన్దీ ప్రయోక్తవ్యా యథావల్లక్షణాన్వితా,**
**తతః శుష్కావకృష్టా స్యాజ్జర్జరశ్లోకదర్శితా. 110**

**తా.** ఈ విధంగా, చెప్పబడిన అన్ని లక్షణాలతో యథాశాస్త్రంగా నాంది ప్రయోగించాలి. పిమ్మట జర్జరశ్లోకంలో చూపబడిన శుష్కావకృష్ట (అర్థరహిత పదాలతో కూర్చిన అవకృష్ట) ప్రయోగించాలి.

**మూ. నవ గుర్వక్షరాణ్యాదౌ షడ్ లఘూని గురుత్రయమ్,**
**శుష్కావకృష్టా తు భవేత్ కలా హ్యష్టౌ ప్రమాణతః. 111**
**యథా – "దిగ్లే దిగ్లే దిగ్లే దిగ్లే జమ్బుక పలితకతేతేజాః"**

**తా.** మొదట గురువు లైన తొమ్మిది అక్షరాలు. తరువాత ఆరు లఘ్వక్షరాలు; చివర మూడు గుర్వక్షరాలు – ఇది శుష్కావకృష్ట. ఇది ఎనిమిది కలల కాలంలో ప్రయోగించాలి. ఉదాహరణం ఎట్లనగా – "దిగ్లే దిగ్లే దిగ్లే దిగ్లే జమ్బుక పలితకతే తేజాః" అను నిరర్థకశబ్దాల కూర్పు.

**మూ. కృత్వా శుష్కావకృష్టాం తు యథావద్ద్విజసత్తమాః. 112**
**తతః శ్లోకం పఠేదేకం గమ్భీరస్వరసంయుతమ్,**
**దేవస్తోత్రం పురస్కృత్య యస్య పూజా ప్రవర్తతే. 113**
**రాజ్ఞో వా యత్ర భక్తిః స్యాదథవా బ్రాహ్మణస్తవమ్.**

**తా.** ద్విజోత్తములారా! సూత్రధారుడు శుష్కావకృష్ట పూర్తిచేసి ఏ దేవత పూజింప బడుతూన్నదో ఆ దేవతకు సంబంధించిన స్తోత్రరూపంలో గాని, తనకు ఇష్టమైన రాజు స్తోత్రం రూపంలో గాని, బ్రాహ్మణస్తుతిరూపంలో గాని ఉన్న ఒక శ్లోకం గంభీరమైన స్వరంతో చదవాలి.

**మూ. గదిత్వా జర్జరశ్లోకం రఙ్గద్వారే చ యత్ స్మృతమ్. 114**

**పఠేదన్యం పునః శ్లోకం జర్జరస్య వినామనమ్.**

**తా.** రంగద్వారం దగ్గర ఏది చదవా లని చెప్పబడినదో ఆ జర్జరశ్లోకం పఠించాలి. తరవాత జర్జరాన్ని వంచేటప్పుడు (లేదా నమస్కరిస్తూ) చదివే మరొక శ్లోకం కూడ చదవాలి.

**మూ. జర్జరం నమయిత్వా తు తతశ్చారీం ప్రయోజయేత్. 115**

**పారిపార్శ్వికయోశ్చ స్యాత్ పశ్చిమేనాపసర్పణమ్.**

**తా.** జర్జరాన్ని వంచి (నమస్కరించి) పిమ్మట చారి చెయ్యాలి. పారిపార్శ్వికులు పశ్చిమదిశవైపు నిష్క్రమించాలి.

**మూ. అడ్డితా చాత్ర కర్తవ్యా ధ్రువా మధ్యలయాన్వితా. 116**

**చతుర్భిః ప్రణిపాతైశ్చ చతురశ్రా ప్రమాణతః.**

**తా.** మధ్యలయతో, చతురస్రతాళంతో నాలుగు సన్నిపాతాలతో అడ్డితధ్రువ చెయ్యాలి.

**మూ. ఆద్యమన్త్యం చతుర్థం చ పఞ్చమం చ తథా గురు. 117**

**యస్యాం హ్రస్వాని శేషాణి సా జ్ఞేయా త్వడ్డితా బుధైః.**

**తా.** పన్నెండు వర్ణాలలో మొదటిది, చివరిది, నాల్గవది, ఐదవది గురువులుగా ఉన్నదీ, మిగిలిన వన్నీ లఘువులుగా ఉన్నదీ అయిన ధ్రువ అడ్డితధ్రువ అని పండితు లంటారు.

**మూ. అస్యాః ప్రయోగం వక్ష్యామి యథా పూర్వం మహేశ్వరః. 118**

**సహోమయా క్రీడితవాన్ నానాభావవిచేష్టితైః.**

**తా.** మహేశ్వరుడు ఉమాదేవితో కూడ అనేకవిధాలైన భావాలను వ్యంజించే చేష్టలతో ఏ విధంగా (ఈ ధ్రువను ప్రయోగిస్తూ) క్రీడించాడో ఆ ప్రయోగాన్ని మీకు చెపుతాను.

**మూ. కృత్వావహిత్థం స్థానం తు వామం చాధోముఖం భుజమ్. 119**

చతురశ్రమురః కార్యమఞ్చితశ్చాపి మస్తకః,
నాభిప్రదేశే విన్యస్య జర్జరం చ తులాధృతమ్. **120**

వామపల్లవహస్తేన పాదైస్తాలాన్తరోత్థితైః,
గచ్ఛేత్పఞ్చపదీం చైవ సవిలాసాఙ్గచేష్టితైః. **121**

వామవేధస్తు కర్తవ్యో విక్షేపో దక్షిణస్య చ,
శృఙ్గారససంయుక్తాం పఠేదార్యాం విచక్షణః. **122**

చారీశ్లోకం గదిత్వా తు కృత్వా చ పరివర్తనమ్,
తైరేవ చ పదైః కార్యం పశ్చిమేనాపసర్పణమ్. **123**

పారిపార్శ్వికహస్తే తు న్యస్య జర్జరముత్తమమ్,
మహాచారీం తతశ్చైవ ప్రయుఞ్జీత యథావిధి. **124**

**తా.** సూత్రధారుడు ముందుగా అవహిత్థస్థానకంలో నిలచి, ఎడమచెయ్యి క్రింది వైపు ఉంచి, వక్షఃస్థలాన్ని చతురస్రంగాను, శిరస్సును అంచితంగాను ఉంచుతూ, జర్జరాన్ని సరిగా నాభిప్రదేశంలో నిలుపుతూ ఐదు అడుగులు వెయ్యాలి. తరవాత ఎడమ చెయ్యి పల్లవచేష్టలో ఉంచాలి. నడిచే టప్పుడు ప్రతీ అడుగూ ఒక తాలం వ్యవధానం ఉండే టట్లు వేస్తూ, ఎడమ చెయ్యి పల్లవచేష్టతో ఉంచాలి. తరువాత, నడిచే టప్పుడు ప్రతీ అడుగూ ఒక తాలం వ్యవధానంలో ఉండే టట్లు వేస్తూ తన అవయవాలు విలాసమయ మైన చేష్టలలో ఉంచాలి. తరువాత ఎడమ పాదంతో సూచిని, కుడి పాదంతో విక్షేపమూ ప్రయోగించాలి. తరవాత శృంగారరసభరిత మైన ఆర్యను పఠించాలి. తరవాత గుండ్రంగా తిరిగి ఆ పదాలతోనే (అడుగులతోనే) వెనుకకు వెళ్లాలి. ఉత్తమమైన జర్జరాన్ని పారిపార్శ్వికుని చేతిలో ఉంచి, పిమ్మట యథాశాస్త్రంగా మహాచారి ప్రయోగించాలి.

**మూ.** చతురశ్రా ధ్రువా తత్ర తథా ద్రుతలయాన్వితా,
చతుర్భిః సంనిపాతైశ్చ కలా హ్యష్టౌ ప్రమాణతః. **125**

ఆద్యం చతుర్థమన్త్యం చ సప్తమం దశమం గురు,
లఘు శేషం ధ్రువాయోగే త్రైష్టుభే చరణే తథా. **126**

**తా.** మహాచారిలో ధ్రువ చతురస్రతాళంతో, ద్రుతలయతో, నాలుగు సంనిపాతాలతో ఉంటుంది. దీని ప్రమాణం ఎనిమిది కలలు. ధ్రువలో ఉపయోగించే త్రైష్టుభవృత్తశ్లోకంలోని చరణంలో మొదటిది, నాల్గవది, చివరిది, ఏడవది, పదవది గుర్వక్షరమై ఉంటుంది. మిగిలినవి లఘ్వక్షరాలు.

**మూ.** యథా :- పాదతలాహతిపాతితశైలం,

**క్షోభితభూతసమగ్రముదగ్రమ్,**
**తాణ్డవనృత్తమిదం ప్రలయాన్తే**
**పాతు జగత్సుఖదాయి హరస్య. 127**

**తా.** పాదాల దెబ్బలచే పర్వతాలను పడగొట్టేదీ, సముద్రంలోని సమస్త ప్రాణులను క్షోభింపచేసేదీ, జగత్తుకు సుఖం ఇచ్చేదీ అయిన, ప్రలయకాలాంతంలో హరుడు చేసే తాండవనృత్తం రక్షించుగాక.

**మూ. భాణ్డోన్ముఖేన కర్తవ్యం పాదవిక్షేపణం తతః,**
**సూచీం కృత్యా పునః కుర్యాద్విక్షేపపరివర్తనమ్. 128**

**తా.** పిమ్మట, సూత్రధారుడు భాండవాద్యాల వైపు పాదన్యాసాలు చేస్తూ అటు వెళ్లాలి. తరువాత సూచీచారి చేసి విక్షేపమూ, తరువాత గుండ్రంగా తిరగడమూ చెయ్యాలి.

**మూ. అతిక్రాన్తైః సలలితైః పాదైర్ద్రుతలయాన్వితైః,**
**త్రితాలాన్తరముత్క్షిప్తైర్గచ్ఛేత్పఞ్చపదీం తతః. 129**

**తత్రాపి వామవేధస్తు నిక్షేపో దక్షిణస్య చ,**
**తైరేవ చ పదైః కార్యం ప్రాఙ్ముఖేనాపసర్పణమ్. 130**

**పునః పదాని త్రీణ్యేన గచ్ఛేత్ప్రాఙ్ముఖ ఏవ తు,**
**తతశ్చ వామవేధః స్యాద్విక్షేపో దక్షిణస్య తు. 131**

**తా.** పిమ్మట అతిక్రాంతచారిలో, ద్రుతలయతో లలితమైన పాదాలు ఎత్తి మూడు తాలాల దూరంలో నేలమీద వేస్తూ ఐదు అడుగులు వేసి నడవాలి. అక్కడ ఎడమపాదంతో సూచి, కుడి పాదంతో విక్షేపమూ చెయ్యాలి. అదే విధంగా అడుగులు వేసుకొంటూ తూర్పువైపు నడవాలి. అప్పుడు కూడ ప్రాఙ్ముఖుడై మూడు అడుగులతో తూర్పువైపు వెళ్లాలి. అప్పుడు వామపాదవేధ (ఎడమ పాదంతో సూచి) దక్షిణపాద విక్షేపమూ (కుడి పాదంతో విక్షేపమూ) చెయ్యాలి.

**మూ. తతో రౌద్రరసం శ్లోకం పాదసంహరణం పఠేత్,**
**తస్యాన్తే తు త్రిపద్యాథ వ్యాహరేత్ పారిపార్శ్వికౌ. 132**

**తా.** తరువాత దీర్ఘసమాసాల ప్రయోగంచేత పాదాలు కలిసిపోయిన, రౌద్రరస ప్రధాన మైన శ్లోకం పఠించాలి. పిమ్మట మూడు అడుగులు వేసి పారిపార్శ్వికుల దగ్గరకు వెళ్లి వాళ్లతో సంభాషణ చెయ్యాలి.

**మూ. తయోరాగమనే కార్యం గానం నర్కుటకం బుధైః,**
**తథా చ భారతీభేదే త్రిగతం సంప్రయోజయేత్. 133**

**తా.** పారిపార్శ్వికులు వస్తూన్నప్పుడు బుధులు, నర్కుటకగానం చెయించాలి. అదే విధంగా భారతీవృత్తిలో త్రిగతమును (ముగ్గురి మధ్య సంభాషణమును) జరిపించాలి.

**వి.** నర్కుటగానస్వరూపం 32 వ అధ్యాయంలో చెప్పబడనున్నది.

**మూ. విదూషకస్త్వేకపదాం సూత్రధారస్మితావహామ్,**
**అసంబద్ధకథాప్రాయాం కుర్యాత్ కథనికాం తతః. 134**

**తా.** అప్పుడు విదూషకుడు, పదాలు కలపకుండా ఒక్కొక పదం ఉచ్చరిస్తూ, అసంబద్ధమైన విషయంతో కూడిన కథనికను (చిన్న కథనమును), సూత్రధారుని ముఖంలో చిరునవ్వు వెలిసే విధంగా చెప్పాలి.

**(మూ. వితణ్డాం గణ్డసంయుక్తాం తాలికాం చ ప్రయోజయేత్,**
**కస్తిష్ఠతి జితం కేనేత్యాది కావ్యప్రరూపిణీమ్. 1**
**పారిపార్శ్వికసంజల్పో విదూషకవిరూపితః,**
**స్థాపితః సూత్రధారేణ త్రిగతం సంప్రయుజ్యతే. 2)**

(**తా.** పారిపార్శ్వికుడు సరిగానే మాటలాడుతున్నా కూడ ఆ మాటలకు విదూషకుడు విపరీతార్థాలు చెపుతూండగా సూత్రధారుడు ఆ మాటలను స్థాపిస్తూండాలి. ఈ విధంగా ఆ ముగ్గురి మధ్యా జరిగే సంభాషణ 'త్రిగతం'. ఈ సంభాషణ వివాదాస్పదంగాను, పొడుపుడు కథలతోను నిండి "నిలబడ్డది ఎవరు?" 'జయించినవాడు ఎవరు' ఇత్యాది రూపంలో ప్రయోగింపబోయే కావ్యం (రూపకం) లోని విషయం సూచించేదిగా ఉంటుంది. మధ్య మధ్య చప్పట్లు చరుస్తూంటారు. 1,2)

**మూ. ప్రరోచనా చ కర్తవ్యా సిద్ధేనోపనిమన్త్రణమ్,**
**రఙ్గసిద్ధౌ పునః కార్యం కావ్యవస్తునిరూపణమ్. 135**

**తా. ప్రరోచన :-** తరువాత సూత్రధారుడు ప్రరోచన చెయ్యాలి. సిద్ధమైనదానితో ఆహ్వానించడమే ప్రరోచన అనగా. నాట్యప్రయోగం సఫలం అవడంకొరకై మరల ప్రయోగించబోయే కావ్యంలో ఉన్న కథావస్తువును నిరూపించాలి. సూచించాలి.

**వి.** ఒక వస్తువునందు ఇతరులకు అభిలాష కలిగే టట్లు మాటలాడడం ప్రరోచన. (అడ్వర్టైజ్‌మెంటు వంటిది). సఫలం కాననున్న విషయాన్ని ఒకదానిని చూపి దీనిని మీరు ఆస్వాదించండి అని ప్రేక్షకాదులను ఆహ్వానించడం ప్రరోచన. దానిలో భాగంగా రూపకంలో చూపబోయే కథావస్తువును సూచించాలి.

**మూ. సర్వమేవ విధిం కృత్వా సూచీవేధకృతైరథ,**
**పాదైరనావిద్ధగతైః నిష్క్రమేయుః సమం త్రయః. 136**

**తా.** ఈ విధంగా, చేయవలసిన ప్రక్రియ అంతా పూర్తిచేసికొని ఆ ముగ్గురూ కూడ, ఒకేసారి పాదాలతో సూచీవేధ చేస్తూ ఆవిద్ధగతి తప్ప మరి ఏ చారితో నైనా రంగంనుండి నిష్క్రమించాలి.

**మూ. ఏవమేష ప్రయోక్తవ్యః పూర్వరఙ్గో యథావిధి,**
**చతురశ్రో ద్విజశ్రేష్ఠాః త్ర్యశ్రం చాపి నిబోధత. 137**

**తా.** ద్విజశ్రేష్ఠులారా! చతురశ్రపూర్వరంగం ఈ విధంగా యథాశాస్త్రంగా ప్రయోగించాలి. త్ర్యశ్రపూర్వరంగం ఎలా చెయ్యాలో చెపుతాను; వినండి.

**మూ. అయమేవ ప్రయోగః స్యాత్ అఙ్గాన్యేతాని చైవ హి,**
**తాలప్రమాణం సంక్షిప్తం కేవలం తు విశేషకృత్. 138**

**తా.** త్ర్యశ్రపూర్వరంగప్రయోగం కూడ ఈ విధంగానే చెయ్యాలి. దాని అంగాలు కూడ ఇవే. తాలప్రమాణం మాత్రం దీనిలో సంక్షిప్తంగా ఉంటుంది. ఇదే దీనిలోని విశేషం.

**మూ. శమ్యా తు ద్వికలా కార్యా తాలోహ్యేకకల స్తథా,**
**పునశ్చైకకలా శమ్యా సంనిపాతః కలాద్వయమ్. 139**

**తా.** దీనిలో రెండు కలల శమ్య, ఒక కల ప్రమాణం గల తాలము, మళ్లీ ఒకే కల సమయం గల శమ్య రెండు కలల సంనిపాతమూ చెయ్యాలి.

**వి.** కుడిచేతితో తాళం వాయించడం శమ్య. పదినిమేషాలకాలం కల.

**మూ. అనేన హి ప్రమాణేన కలాతాలలయాన్వితః,**
**కర్తవ్యః పూర్వరఙ్గస్తు త్ర్యశ్రోఽప్యుత్థాపనాదికః. 140**

**తా.** కలా – తాల – లయలలో వెనుక చెప్పిన ప్రమాణాలే అనుసరిస్తూ ఉత్థాపనం మొదలైన త్ర్యశ్రపూర్వరంగం కూడ చెయ్యాలి.

**మూ. ఆద్యం చతుర్థం దశమమష్టమం నైధనం గురు,**
**యస్యాస్తు జాగతే పాదే సా త్ర్యశ్రోత్థాపినీ ధ్రువా. 141**

**తా.** త్ర్యశ్రోత్థాపినీధ్రువకు సంబంధించిన జగతీఛందోబద్ధశ్లోకంలోని పాదంలోని మొదటిది, నాల్గవది, పదవది, ఎనిమిదవది, చివరిది గుర్వక్షరం అయి ఉంటుంది.

**మూ. వాద్యం గతిప్రచారశ్చ ధ్రువా తాలస్తథైవ చ,**
**సంక్షిప్తాన్యేవ కార్యాణి త్ర్యశ్రే నృత్తప్రవేదిభిః. 142**

**తా.** నృత్తవిదులు త్ర్యశ్రపూర్వరంగంలో వాద్యమూ, గతిప్రచారము, ధ్రువ, తాలమూ కూడ సంక్షిప్తంగానే చెయ్యాలి.

**మూ. వాద్యగీతప్రమాణేన కుర్యాదఙ్గవిచేష్టితమ్,**
**విస్తీర్ణమథ సంక్షిప్తం ద్విప్రమాణవినిర్మితమ్. 143**

**తా.** వాద్యసంగీతానికీ, కంఠసంగీతానికీ అనుకూలంగా ఉండే టట్లు ఆంగిక వ్యాపారం కూడ విస్తీర్ణం, సంక్షిప్తం అను రెండు ప్రమాణాలలో చెయ్యాలి.

**మూ. హస్తపాదప్రచారస్తు ద్వికలః పరికీర్తితః,**
**చతురశ్రే పరిక్రాన్తే పాతాః స్యుః షోడశైవ తు. 144**
**త్ర్యశ్రే ద్వాదశపాతాస్తు భవన్తి కరపాదయోః,**
**ఏతత్ప్రమాణం విజ్ఞేయముభయోః పూర్వరఙ్గయోః. 145**

**తా.** త్ర్యశ్రపూర్వరంగంలో హస్తపాదాల సంచాలనం (కదల్చడం) రెండు కలల వరకు జరుగుతుంది. చతురశ్రపూర్వరంగంలోని పరిక్రాంతంలో హస్తపాదాల సంచాలనం పదహారు పర్యాయాలు జరుగుతుంది. త్ర్యశ్రపూర్వరంగంలో నైతే పన్నెండు పర్యాయాలు మాత్రమే జరుగుతుంది. రెండు పూర్వరంగాల ప్రమాణం ఈ విధంగా ఉంటుం దని తెలుసుకోవాలి.

**మూ. కేవలం పరివర్తే తు గమనే త్రిపదీ భవేత్,**
**దిగ్వన్దనే పఞ్చపదీ చతురశ్రే విధీయతే. 146**

**తా.** దిగ్వందనంకోసం చేసే పరివర్తనంలో (తిరగడంలో) త్ర్యశ్రపూర్వరంగంలో మూడు అడుగులు మాత్రమే వేసి నడవడం జరుగుతుంది. చతురశ్రపూర్వరంగదిగ్వందన సమయంలో నైతే పంచపది (ఐదు అడుగులు) వేసి నడవడం విధింపబడుతుంది.

**మూ. ఆచార్యబుద్ధ్యా కర్తవ్యస్త్ర్యశ్రస్తాలప్రమాణతః,**
**తస్మాన్న లక్షణం ప్రోక్తం పునరుక్తం భవేత్తతః. 147**

**తా.** నాట్యాచార్యుని బుద్ధికౌశలాన్ని అనుసరించి త్ర్యశ్రం తాళప్రమాణానుసారంగా చెయ్యాలి. అందుకే మళ్లీ మళ్లీ చెప్పినట్లవుతుం దనే అభిప్రాయంతో లక్షణం చెప్పలేదు. కొన్ని చిన్న చిన్న విశేషాలు తప్ప ఈ రెండు విధాలైన పూర్వరంగాలలోను భేదం లేదు అని భావం.

**మూ. ఏవమేష ప్రయోక్తవ్యః పూర్వరఙ్గో ద్విజోత్తమాః,**
**త్ర్యశ్రశ్చ చతురశ్రశ్చ శుద్ధో భారత్యుపాశ్రయః. 148**

**తా.** ద్విజోత్తములారా! భారతీవృత్తిని ఆశ్రయించిన శుద్ధమైన త్ర్యశ్రపూర్వరంగము, చతురశ్రపూర్వంగమూ కూడ ఈ విధంగా ప్రయోగింపదగినది.

**మూ. ఏష తావదయం శుద్ధః పూర్వరఙ్గో మయోదితః,**
**చిత్రత్వమస్య వక్ష్యామి యథాకార్యం ప్రయోక్తృభిః. 149**

**తా.** నే నీ విధంగా శుద్ధపూర్వరంగాన్ని గూర్చి చెప్పాను. ప్రయోక్తలు దీని చిత్ర స్వరూపం ఎలా ప్రయోగించాలో చెపుతాను.

**మూ. వృత్తే హ్యుత్థాపనే విప్రాః కృతే చ పరివర్తనే,**
**చతుర్థకారదత్తాభిః సుమనోభిరలంకృతే. 150**
**ఉదాత్తగానైర్గన్ధర్వైః పరిగీతే ప్రమాణతః,**
**దేవదున్దుభయశ్చైవ నినదేయుర్భృశం తతః. 151**

**తా.** బ్రాహ్మణులారా! ఉత్థాపనధ్రువ తరువాత పరివర్తనం చేయబడగా, చతుర్థకారుడు చల్లిన పుష్పాలచేత రంగస్థలం అలంకరింపబడిన పిమ్మట, ఉదాత్తమైన గానాలు చేయ గల గంధర్వులు తగు విధంగా గీతాలు గానం చేసిన పిమ్మట, దేవదుందుభులు బిగ్గరగా మ్రోగాలి.

**మూ. సిద్ధాః కుసుమమాలాభిః వికిరేయః సమన్తతః,**
**అఙ్గహారైశ్చ దేవ్యస్తా ఉపనృత్యేయురగ్రతః. 152**

**తా.** సిద్ధులు నలు మూలలా పుష్పమాలలు చల్లాలి. దేవతాస్త్రీలు అంగహారాలతో ఎదుట నృత్యం చెయ్యాలి.

**వి.** నటీనటులే ఆ యా దేవీ – గంధర్వసిద్ధాదివేషాలతో చిత్రరంగంలో పాల్గొంటారు.

**మూ. తాణ్డవాదివిధిః ప్రోక్తో నృత్తే పిణ్డీసమన్వితః,**
**రేచకైరఙ్గహారైశ్చ న్యాసాపన్యాససంయుతః. 153**
**నాన్దీపదానాం మధ్యే తు ఏకైకస్మిన్ పృథక్ పృథక్,**
**ప్రయోక్తవ్యో బుధైః సమ్యక్ చిత్రభావసమీప్సుభిః. 154**

**తా.** చిత్రపూర్వరంగవిధానం అనుసరించదలచినవారు, నాందీపదాల మధ్య ఒక్కొక్క పదం తరువాత వేరు వేరుగా, పిండులు, రేచకాలు, అంగహారాలు, న్యాస – అపన్యాసములు – వీటితో కూడిన ఏ తాండవవిధి చెప్పబడినదో దానిని ప్రయోగించాలి.

**వి.** గీతము లేదా వాద్యము లేదా నృత్తము – వీటిలోని ఒక ఘట్టం సమాప్త మైన స్థానం **న్యాసం.** గీతము లేదా వాద్యము, లేదా వృత్తము వీటి మధ్యభాగం ఏ స్వరం దగ్గర సమాప్త మౌతుందో అది **అపన్యాసం.**

**మూ. ఏవం కృత్వా యథాన్యాయం శుద్ధం చిత్రం ప్రయత్నతః,**
**తతఃపరం ప్రముఞ్జీత నాటకం లక్షణాన్వితమ్. 155**

**తా.** ఈ విధంగా ప్రయత్నపూర్వకంగా శుద్ధపూర్వరంగము, చిత్రపూర్వరంగమూ శాస్త్రానుసారం పూర్తి చేసి, పిమ్మట నాటకానికి చెప్పిన లక్షణాలతో కూడిన నాటకం ప్రయోగించాలి.

**మూ. తతస్త్వన్తర్హితాః సర్వా భవేయుర్దివ్యయోషితః,**
**నిష్క్రాన్తాసు చ సర్వాసు నర్తకీషు తతఃపరమ్. 156**
**పూర్వరఙ్గే ప్రయోక్తవ్యమఙ్గజాతమతఃపరమ్,**
**ఏవం శుద్ధో భవేచ్చిత్రః పూర్వరఙ్గో విధానతః. 157**

**తా.** పిమ్మట దేవతాస్త్రీల వేషాలలో ఉన్న నటులు (నటీలు) అందరూ అంతర్ధానం చెందాలి. ఆ నర్తకీలు అందరూ నిష్క్రమించిన పిమ్మట పూర్వరంగంలో దాని తరువాత చేయ వలసిన అన్ని అంగాలు పూర్తి చెయ్యాలి. ఈ విధంగా చేయడంచేత శుద్ధపూర్వ రంగమే చిత్రపూర్వంగం అవుతుంది.

**మూ. కార్యో నాతిప్రసంగోఽత్ర నృత్తగీతవిధిం ప్రతి,**
**గీతే వాద్యే చ నృత్తే చ ప్రవృత్తేఽతిప్రసంగతః. 158**
**ఖేదో భవేత్ప్రయోక్తౄణాం ప్రేక్షకాణాం తథైవ చ,**
**ఖిన్నానాం రసభాగేషు స్పష్టతా నోపజాయతే. 159**
**తతః శేషప్రయోగస్తు న రాగజనకో భవేత్.**

**తా.** పూర్వరంగంలో చేయవలసిన నృత్త – గీతాదులు అతిగా చేయకూడదు. గీత – వాద్య – నృత్తాలు అతిగా చేస్తే, మోతాదు మించితే, ప్రయోక్తలు అలిసిపోతారు. ప్రేక్షకులు విసుగు చెందుతారు. ఈ విధంగా నటీనటాదులు మొదట్లోనే అలిసిపోయి, ప్రేక్షకులు మనస్సులు విరిగిపోయి ఉంటే రస – భావాదిప్రదర్శనంలో స్పష్టత్వం కొరవడుతుంది. దానితో మిగిలిన అసలు నాట్యప్రయోగం రక్తి కట్టదు.

**(మూ. లక్షణేన వినా బాహ్యాలక్షణాద్విస్తృతం భవేత్,**
**లోకశాస్త్రానుసారేణ తస్మాన్నాట్యం ప్రవర్తతే.)**

(**తా.** శాస్త్రం అనుసరించకుండా స్వంతంగా కల్పనలు చేసి పూర్వరంగం నడిపిస్తే అది చాలా విస్తృతం అయిపోతుంది. అందుచేత నాట్యప్రయోగం లోకానుసారంగాను, (లోకుల అభిరుచులకు అనుగుణంగాను), శాస్త్రానుసారంగాను జరగాలి).

**మూ. త్ర్యశ్రం వా చతురశ్రం వా శుద్ధం చిత్రమథాపి వా. 160**
**ప్రయుజ్య రఙ్గాన్నిష్క్రామేత్సూత్రధారః సహానుగః.**

**తా.** సూత్రధారుడు, త్ర్యశ్రమును గాని, చతురశ్రమును గాని, శుద్ధరూపంలోనో, చిత్రరూపంలోనో ఈ విధంగా ప్రయోగించి పారిపార్శ్వికులతో కలిసి నిష్క్రమించాలి.

**(మూ. దేవపార్థివరఙ్గానామాశీర్వచనసంయుతామ్,**
**కవేర్నామగుణోపేతాం వస్తూపక్షేపరూపికామ్. 1**
**లఘువర్ణపదోపేతాం వృత్తైశ్చిత్రైరలంకృతామ్,**
**అన్తర్యవనికాసంస్థః కుర్యాదాశ్రావణాం తతః. 2**
**ఆశ్రావణావసానే చ నాన్దీం కృత్వా స సూత్రధృత్,**
**పునః ప్రవిశ్య రఙ్గం తు కుర్యాత్ప్రస్తావనాం తతః. 3)**

(**తా.** పిమ్మట, సూత్రధారుడు – దేవ – నృప – రంగముల ఆశీర్వచనంతో కూడినది, (వాటి విజయాన్నీ అభివృద్ధినీ కోరేది), కవి పేరు ఆతని వైశిష్ట్యము తెలిపేది, కథావస్తువును సూచించేది, తేలిక యైన వర్ణములలో, చిత్రము లైన వృత్తాలతో అలంకృతమూ అయిన ఆశ్రావణము (విషయప్రతిపాదకమైనగీతాదులను వినిపించడం ఆశ్రావణము) తెర వెనకనుండి చెయ్యాలి. ఆశ్రావణ తరువాత నాందిని చేసి, మళ్లీ రంగంమీద ప్రవేశించి ప్రస్తావన జరపాలి.) (1–3).

**మూ. ప్రయుజ్య విధినైవం తు పూర్వరఙ్గం ప్రయోగతః. 161**
**స్థాపకః ప్రవిశేత్తత్ర సూత్రధారగుణాకృతిః.**

("త్ర్యశ్రం ... సహానుగః అను శ్లోకం తరువాత ఈ శ్లోకం వస్తుంది. మధ్య నున్న మూడు శ్లోకాలు ప్రక్షిప్తాలు. అందుచేత ఈశ్లోకం అర్థం ఆ శ్లోకంలో చెప్పినదానితో ముడిపెట్టి చెప్పుకోవాలి).

**తా.** ఈ విధంగా యథాశాస్త్రంగా, ప్రయోగం చేయవలసిన పద్ధతిలో పూర్వరంగం ప్రయోగించి (సూత్రధారుడు పారిపార్శ్వికులతో కలిసి నిష్క్రమించిన తరువాత) సూత్రధారుని వంటి గుణాలు ఆకారమూ గల స్థాపకుడు రంగంమీద ప్రవేశించాలి.

**మూ. స్థానం తు వైష్ణవం కృత్వా సౌష్ఠవాఙ్గపురస్కృతమ్. 162**
**ప్రవిశ్య రఙ్గం తైరేవ సూత్రధారపదైర్వ్రజేత్.**

**తా.** అవయవసౌష్ఠవం గల ఆ స్థాపకుడు వైష్ణవస్థానకంలో ఉంటూ, రంగప్రవేశం చేసి, సూత్రధారుడు (పూర్వరంగప్రారంభంలో) ఏ విధమైన పాదన్యాసాదులు చేశాడో వాటితోనే నడవాలి.

**మూ. స్థాపకస్య ప్రవేశే తు కర్తవ్యార్థానుగా ధ్రువా. 163**
**త్ర్యశ్రా వా చతురశ్రా వా తదఙ్గైర్మధ్యలయాన్వితా.**

**తా.** స్థాపకుడు ప్రవేశించిన తరువాత లేదా స్థాపకుని ప్రవేశసమయంలో, ధ్రువా నిపుణులు, అర్థానుసారంగా త్ర్యశ్రధ్రువ గాని చరురశ్రధ్రువ గాని మధ్యలయతో ప్రయోగించాలి.

**మూ. కుర్యాదనన్తరం చారీం దేవబ్రాహ్మణశంసినీమ్. 164**

**సువాక్యమధురైః శ్లోకైర్నానాభావసమన్వితైః.**

**తా.** తరువాత స్థాపకుడు, అందమైన వాక్యాలతో మధురమైన, అనేకవిధాలైన భావాలను ఆవిష్కరించే శ్లోకాలు పఠిస్తూ దేవతల – బ్రాహ్మణుల ప్రశంస చేసే చారీని ప్రయోగించాలి.

**మూ. ప్రసాద్య రఙ్గం విధివత్కవేర్నామ చ కీర్తయత్. 165**

**ప్రస్తావనాం తతః కుర్యాత్కావ్యప్రఖ్యాపనాశ్రయామ్.**

**తా.** ఈ విధంగా, యథావిధిగా, రంగాన్ని (నాట్యమండపాన్ని) రంజింపచేసి నాటకం రచించిన కవి పేరు చెప్పాలి. పిమ్మట కావ్యవైశిష్ట్యాన్ని ప్రకటించే ప్రస్తావన జరపాలి.

**మూ. ఉద్ఘాత్యకాది కర్తవ్యం కావ్యోపక్షేపణాశ్రయమ్. 166**

**దివ్యే దివ్యాశ్రయో భూత్వా మానుషే మానుషాశ్రయః,**

**దివ్యమానుషసంయోగే దివ్యో వా మానుషోఽపి వా. 167**

**ముఖబీజానుసదృశం నానామార్గసమాశ్రయమ్,**

**నానావిధైరుపక్షేపైః కావ్యోపక్షేపణం భవేత్. 168**

**తా.** కావ్యంలోని కథావస్తువును విశదీకరించు ఉద్ఘాత్యకమును (ఇది ప్రస్తావనలోని ఒక భేదం), ముఖానికి బీజానికి తగునట్లుగా అనేకవిధము లైన మార్గాలను ఆశ్రయించి, చెయ్యాలి. ప్రయోగించబోయే రూపకం దేవతలకు సంబంధించిన ట్లయితే దేవతావేష భూషాదులు ధరించి, మనుష్యులకు సంబంధించిన దయితే మానుషవేషభూషాదులు ధరించి, దేవమానుషకథలకు సంబంధించిన దైతే ఏదో ఒక వేషభూషాదికం ధరించి ఉద్ఘాట్యకాదిప్రయోగం చెయ్యాలి. అనేకవిధాలైన ఉపక్షేపాలచేత (విషయప్రతిపాదనా పద్ధతులచేత) కావ్యార్థోపక్షేపణం (కావ్యార్థ ప్రతిపాదనం) చెయ్యాలి.

**వి.** 'ముఖం' 'బీజం' మొదలైనవి ముమ్ముందు విశదీకరింపబడతాయి.

**మూ. ప్రస్తావ్యైవం తు నిష్క్రామేత్కావ్యప్రస్తావకస్తతః,**

**ఏవమేష ప్రయోక్తవ్యః పూర్వరఙ్గో యథావిధి. 169**

**తా.** కావ్యాన్ని గూర్చి ప్రస్తావన చేసే ఆ స్థాపకుడు కావ్యార్థాన్ని ఈ విధంగా ప్రతిపాదించి రంగం నుంచి నిష్క్రమించాలి. పూర్వరంగం, ఈ విధంగా, యథాశాస్త్రం ప్రయోగించాలి.

**మూ. య ఇమం పూర్వరఙ్గం తు విధినైవ ప్రయోజయేత్,**
**నాశుభం ప్రాప్నుయాత్కించిత్ స్వర్గలోకం చ గచ్ఛతి. 170**

**తా.** పూర్వరంగాన్ని యథాశాస్త్రంగా ప్రయోగించినవానికి అశుభం ఏదీ కలగదు. అతడు స్వర్గంలోకం పొందుతాడు కూడ.

**మూ. యశ్చాపి విధిముత్సృజ్య యథేష్టం సంప్రయోజయేత్,**
**ప్రాప్నోత్యపచయం ఘోరం తిర్యగ్యోనిం చ గచ్ఛతి. 171**

**తా.** శాస్త్రవిధానాన్ని అనుసరించకుండా తన ఇష్టం వచ్చి నట్లు పూర్వరంగం ప్రయోగం చేసిన వాడు ఘోర మైన నష్టం పొందుతాడు. పశుపక్ష్యాదిజన్మ ఎత్తుతాడు.

**మూ. న తథాగ్నిః ప్రదహతి ప్రభఞ్జనసమీరితః,**
**యథా హ్యపప్రయోగస్తు ప్రయుక్తో దహతి క్షణాత్. 172**

**తా.** శాస్త్రాన్ని ఉల్లంఘించి చేసిన పూర్వరంగప్రయోగం క్షణంలోనే ఏ విధంగా ప్రయోక్తలను దహించివేస్తుందో ఆ విధంగా గాలికి విజృంభించిన అగ్ని కూడ దహించదు.

**మూ. ఇత్యేవావన్తిపాఞ్చాలదాక్షిణాత్యౌఢ్రమాగధైః,**
**కర్తవ్యః పూర్వరఙ్గస్తు ద్విప్రమాణవినిర్మితః. 173**

**తా.** అవంతికి చెందినవాళ్లు పాంచాలదేశానికి చెందినవాళ్లు దాక్షిణాత్యులు (ఆంధ్ర – మహారాష్ట్ర – గుజరాత – కర్ణాటక – కేరల – ద్రవిడప్రాంతీయుల) ఓఢ్ర (కలింగ) దేశీయులు. మగధదేశీయులూ కూడ త్ర్యశ్ర – చతురశ్రము లను రెండు ప్రమాణములలో నిర్మింపబడిన పూర్వరంగం ఈ విధంగానే ప్రయోగించాలి.

**మూ. ఏష వో కథితో విప్రాః పూర్వరఙ్గాశ్రితో విధిః,**
**భూయః కిం కథ్యతాం సమ్యఙ్ నాట్యవేదవిధిం ప్రతి. 174**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే పూర్వరఙ్గప్రయోగో నామ పఞ్చమోధ్యాయః.**

**తా.** విప్రులారా! ఇంత వరకు మీకు పూర్వరంగానికి సంబంధించిన విధానాన్ని చెప్పాను. ఇంక నాట్యవేదవిధికి సంబంధించిన ఏ విషయం చెప్పాలో అడగండి.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన 'బాలానందిని' అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానము నందు పూర్వరంగప్రయోగం అను పంచమాధ్యాయం సమాప్తం.**

కొన్ని ప్రతులలో ఈ అధ్యాయానికి చివర ఇంకా 39 శ్లోకా లున్నాయి. వీటికి అభినవభారతీవ్యాఖ్య లేదు.

**మూ. పునశ్చిత్రే తథా మిశ్రే శుద్ధే చైవ బ్రవీమ్యహమ్,**
**యథా యోజ్యాః ధ్రువాః పఞ్చ తథా వక్ష్యామి తత్త్వతః. 1**

**తా.** చిత్ర – మిశ్ర – శుద్ధపూర్వరంగాలలో ఐదు ధ్రువలు ఎలా ప్రయోగించాలో కూడ వాటి యథార్థస్వరూపం నిరూపిస్తూ చెపుతాను.

**మూ. ఆదావుత్థాపనీ కార్యా పరివర్తస్తథా భవేత్,**
**అవకృష్టాడ్డితా చైవ విక్షిప్తా చైవ పఞ్చమీ. 2**

**తా.** అన్నింటికంటె ముందు ఉత్థాపనీధ్రువ, తరువాత పరివర్తనీధ్రువ, అవకృష్టా ధ్రువ, అడ్డితాధ్రువ, (చివర) ఐదవదైన విక్షిప్తాధ్రువ ప్రయోగించాలి.

**మూ. ఏవం పఞ్చ ధ్రువా జ్ఞేయో ఉపోహనసమన్వితాః,**
**కర్తవ్యాస్తు ప్రయత్నేన పూర్వరఙ్గే ప్రయోక్తృభిః. 3**

**తా.** ప్రయోక్తలు పూర్వరంగంలో ఉపోహనంతో కూడిన ఐదు ధ్రువలను ప్రయత్న పూర్వకంగా చెయ్యాలి.

**వి.** వస్తువును గాని, గీతమును గాని ప్రయోగించే టప్పుడు తాళాన్ని నియమించ డానికై చేసే ఆలాపనకు **ఉపోహనం** అని పేరు.

**మూ. అతః పరం ప్రవక్ష్యామి హ్యుపోహనవిధిక్రియామ్,**
**ఉత్థాపనస్యాష్టకలం పరివర్తస్య షట్కలమ్. 4**
**అవకృష్టం పునః కార్యం కలాభిః పఞ్చభిర్యుతమ్,**
**ధ్రువాయామడ్డితాయాం చ చతుష్కలమథాపి చ. 5**
**క్షిప్తాయాం చైవ విజ్ఞేయం కలాత్రయసమన్వితమ్,**
**ఏవం హ్యుపోహనానాం తు ప్రమాణం సముదాహృతమ్. 6**

**తా.** ఇపుడు ఉపోహనవిధిని గూర్చి చెపుతాను. ఉత్థాపనీధ్రువలో ఎనిమిది కలలు. పరివర్తనీధ్రువలో ఆరు, అవకృష్టాధ్రువలో ఐదు, అడ్డితాధ్రువలో నాలుగు, విక్షిప్తాధ్రువలో మూడు కలలు ప్రమాణం గల ఉపోహనం చెయ్యాలి. ఈ విధంగా ఉపోహనల ప్రమాణం చెప్పబడింది.

**మూ. గురులాఘవసంయుక్తం కలాతాలసమన్వితమ్,**
**పూర్వరఙ్గే సదా జ్ఞేయం చిత్రమార్గే హ్యుపోహనమ్. 7**

**తా.** చిత్రమార్గంలోని ఉపోహనంలో గురులఘువుల యోగము, కలా – తాలాల యోగము ఉంటుంది.

**మూ. చిత్రే చైత్రాః కలా జ్ఞేయా మిశ్రే వార్తికమాశ్రితాః,**
**శుద్ధే దక్షిణామార్గేణ ప్రయోక్తవ్యాః ప్రయోక్తృభిః. 8**

**తా.** ప్రయోక్తలు చిత్రపూర్వరంగంలో చిత్రమార్గానుసారంగాను, మిశ్రపూర్వ రంగంలో వార్తికమార్గానుసారంగాను, శుద్ధపూర్వరంగంలో దక్షిణమార్గానుసారంగాను కలల ప్రయోగం చెయ్యాలి.

**మూ. చతస్రో గీతయః కార్యా మాగధీ హ్యర్ధమాగధీ,**
**సంభావితా తథా చైవ పృథులా చ ప్రకీర్తితా. 9**

**తా.** మాగధి, అర్ధమాగధి, సంభావిత, పృథుల అను నాలుగు విధాల గీతల ప్రయోగం చెయ్యాలి.

**మూ. మాగధీ త్వథ కర్తవ్యా పృథవా త్వర్ధమాగధీ,**
**పూర్వరఙ్గే భవేచ్చిత్రే చిత్రమార్గసమాశ్రితా. 10**

**తా.** చిత్రపూర్వరంగంలో చిత్రమార్గాన్ని ఆశ్రయించిన మాగధీగీతి గాని, అర్ధమాగధీ గీతి కాని ప్రయోగించాలి

**మూ. యథా మిశ్రస్తు యోక్తవ్యః పూర్వరఙ్గే భవేదిహ,**
**మిశ్రే సంభావితా కార్యా తదా వార్తికమాశ్రితా. 11**
**శుద్ధే చ పృథులా కార్యా దక్షిణం మార్గమాశ్రితా.**

**తా.** వార్తికమార్గానుసారం జరిగే చిత్రపూర్వరంగంలో సంభావితాగీతి, దక్షిణ మార్గానుసారం జరిగే శుద్ధపూర్వరంగంలో పృథులాగీతి ప్రయోగించాలి.

**మూ. అతః పరం ప్రవక్ష్యామి గురులాఘవతః క్రియామ్. 12**
**ఉపోహనక్రియాయాం తు యథాయోజ్యం ప్రయోక్తృభిః.**

**తా.** ఇపుడు, ప్రయోక్తలు ఏ విధంగా ప్రయోగిస్తారో ఆ విధంగా ఉపోహన క్రియలో గురులఘువుల క్రియను గూర్చి చెపుతాను.

**మూ. దిగ్లే దిగ్లే పునః (రః) కార్యమన్తే ఝణ్టుం సదా బుధైః. 13**
**మధ్యే లఘ్వక్షరాణి స్యుః షోడశైవ తు నిత్యశః,**
**ఏవం హ్యుపోహనం కృత్వా తథా వస్తు సమాచరేత్. 14**

**తా.** ముందుగా “దిగ్లే దిగ్లే” చెయ్యాలి. చివర “ఝణ్టుమ్” ‘ఝణ్టుమ్’ చెయ్యాలి. వీటి మధ్య పదహారు లఘువు లుండాలి. ఈ విధంగా ఉపోహనం చేసి వస్తువును కూర్చాలి.

**మూ. ఉత్థాపన్యాం ప్రయోగేఽస్మిన్ కలాకాలసమన్వితమ్,**
**అక్షరాణాం కలాయాస్తు గురులాఘవమేవ చ. 15**

**పూర్వం తు కథితం యస్మాత్తస్మాన్నాభిహితం భవేత్.**

**తా.** వెనుక ఉత్థాపనీధ్రువను గూర్చి చెప్పే సందర్భంలో, కలను, కాలమును పట్టి ఏర్పడు అక్షరాల, కలల గురుత్వలఘుత్వములను గూర్చి చెప్పబడినది. అందుచేత ఆ విషయం మళ్లీ చెప్పడంలేదు.

**మూ. యథా -**

**దేవం విభుం త్రిభువనాధిపతిం కైలాసపర్వతగుహాభిరతమ్,**
**శైలేన్ద్రరాజతనయాదయితం మూర్ధ్నానతోఽస్మి పురనాశకరమ్. 16**

**తా.** ఎట్లనగా – త్రిభువనాల అధిపతి, కైలాసపర్వతగుహలయందు ఆసక్తి గలవాడు, పార్వతీప్రియుడు, త్రిపురాంతకుడు అయిన ప్రభువైన పరమేశ్వరునికి శిరస్సు వంచి నమస్కరిస్తున్నాను. ఇది **ఉత్థాపనీధ్రువకు** ఉదాహరణం.

**మూ. ఏవముత్థాపనీ కార్యా పూర్వరఙ్గప్రయోక్తృభిః,**
**అతోఽన్యత్పరివర్తాయా లక్షణం సంవిధీయతే. 17**

తా. పూర్వరంగప్రయోక్తలు ఉత్థాపనీధ్రువను ఈ విధంగా ప్రయోగించాలి. ఇప్పుడు పరివర్తినీధ్రువాలక్షణం చెప్పబడుతున్నది.

**మూ. అస్యాస్తూపోహనం కార్యం షట్కలం పరిసంఖ్యయా,**
**ఆదౌ దిగ్లే ద్విరుక్తస్తు అన్తే ఝణ్టుం సదాభవేత్. 18**
**మధ్యే లఘ్వక్షరాణ్యేవ ద్వాదశైవ ప్రయోజయేత్.**

**తా.** పరివర్తినీ ధ్రువలో ఆరు కలల ఉపోహనం చెయ్యాలి. ప్రారంభంలో "దిగ్లే దిగ్లే" చివర 'ఝణ్టుమ్' 'ఝుణ్టుమ్' వీటి మధ్య పన్నెండు లఘ్వక్షరాలు ప్రయోగించాలి.

**మూ. వస్తునోఽత్ర ప్రవక్ష్యామి గురులఘ్వక్షరక్రమమ్. 19**
**ద్వే చాదౌ తు చతుర్థం చ అష్టమం దశమం తథా,**
**చతుర్దశం పఞ్చదశం పాదే గుర్వక్షరాణి తు. 20**

**తా.** దీనిలో వస్తువుకు సంబంధించిన గురులఘ్వక్షరాల క్రమాన్ని చెపుతాను. పాదంలోని మొదటి రెండక్షరాలు; నాలుగు, ఎనిమిది, పది, పద్నాలుగు పదిహేను అక్షరాలు గుర్వక్షరాలు. మిగిలినవి లఘువులు.

**మూ. సా ధ్రువా పరివర్తాఖ్యా త్రిలయా త్రియతిస్తథా,**
**పరివర్తాస్తు చత్వారః పాణయస్త్రయ ఏవ చ. 21**

**తా.** పరివర్తధ్రువలో మూడు లయలు, మూడు యతులు, నాలుగు పరివర్తాలు, మూడు పాణులు ఉంటాయి.

**మూ. చతుర్భిః సంనిపాతైస్తు ద్వాత్రింశత్కలికాన్వితా,**
**పూర్వరఙ్గే ప్రయోక్తవ్యః పరివర్తః ప్రయోక్తృభిః. 22**

**తా.** నాలుగు సంనిపాతాలతో పరివర్తధ్రువను ముప్పైరెండు కలలలో, ప్రయోక్తలు పూర్వ రంగంలో ప్రయోగించాలి.

**మూ. యథా –**
**చన్ద్రార్ధభూషణజటం వరం వృషభకేతుం,**
**కైలాసపర్వతనివాసినం సురవరిష్ఠమ్.**
**శైలాధిరాజతనయాప్రియం ప్రమథనాథం**
**మూర్ధ్నా నతోఽస్మి త్రిపురాన్తకం పరయోగినమ్. 23**

**తా.** ఎట్లనగా – అర్ధచంద్రుణ్ణి భూషణంగా జటలపై ధరించినవాడు, శ్రేష్ఠుడు, వృషభం కేతనముగా కలవాడు, కైలాసపర్వతనివాసి, సురశ్రేష్ఠుడు, పార్వతీప్రియుడు, ప్రమథగణాల ప్రభువు. త్రిపురసంహారకుడు, మహాయోగి అయిన పరమేశ్వరునికి శిరస్సు వంచి నమస్కరిస్తున్నాను. ఇది **'పరివర్తినీధ్రువకు'** ఉదాహరణశ్లోకం.

**మూ. అవకృష్టామిదానీం తు కథ్యమానాం నిబోధత,**
**అస్యాస్తూపోహనం కార్యం కలాభిః పఞ్చభిర్యుతమ్. 24**
**దిగ్లే దిగ్లే పునశ్చాన్తే ఝణ్టుమస్య ప్రయోజయేత్,**
**అష్టావేవ తు కార్యాణి మధ్యే లఘ్వక్షరాణి తు. 25**
**తృతీయం చైవ షష్ఠం తు నవమైకాదశే తథా,**
**పాదే పఞ్చదశం చైవ షోడశం చ భవేద్గురు. 26**

**తా.** ఇప్పుడు అవకృష్టధ్రువను గూర్చి చెపుతున్నాను; వినండి. దీని ఉపోహనం ఐదు కలలలో చెయ్యాలి. ప్రారంభంలో 'దిగ్లే దిగ్లే' చివర "ఝణ్టుం ఝణ్డుమ్' ప్రయోగించాలి. మధ్య ఎనిమిది లఘ్వక్షరాలు మాత్రమే ఉండాలి. ఒక్కొక్క పాదంలో మూడు, ఆరు, తొమ్మిది, పదకొండు, పదిహేను, పదహారు అక్షరాలు గురువులై ఉండాలి.

**మూ. అష్టషష్టిగణైః పాదైరవకృష్టావిధిర్బుధాః,**
**చతుర్భిః సంనిపాతైశ్చ పాణిభిస్త్రిభిరేవ చ. 27**

**తా.** బుధులారా! మొత్తం అరవైఎనిమిది గణాలు (మాత్రలు), ఉన్న నాలుగు పాదాలతో అవకృష్టాధ్రువ ప్రయోగింపబడుతుంది. దీనిలో నాలుగు సంనిపాతాలు, మూడు పాణులు ఉంటాయి.

**మూ. యథా –**
**వరదం సగణం త్రిపురాన్తకం వృషభకేతుమ్,**
**గజచర్మపటం విషమేక్షణం భువననాథమ్.**

**భుజగాభరణం జగతాం హితం భువనయోనిం,**
**ప్రణతోఽస్మి భవన్తముమాపతిం త్వసితకణ్ఠమ్. 28**

**తా.** వరా లిచ్చువాడవు, గణాలతో కూడినవాడవు, త్రిపురాంతకుడవు, వృషభం కేతువుగా కలవాడవు, గజచర్మ వస్త్రంగా ధరించినవాడవు, మూడు నేత్రములు కలవాడవు, లోకాలకు ప్రభువువు, సర్పాభరణుడవు. జగత్తులకు హితుడవు, లోకాలకు కారణ భూతుడవు, ఉమాపతివి, నీలకంఠుడవు అయిన నీకు ప్రణామము చేయుచున్నాను.

**మూ. తృతీయం చైవ షష్ఠం చ గురు పాదౌ త్రయోదశమ్,**
**చతుర్గణసమాయుక్తా సా కార్యా త్వడ్డితా ధ్రువా. 29**

**తా. అడ్డితాధ్రువ**లోని ఒక్కొక్కపాదంలో మూడు, ఆరు, పదమూడు అక్షరాలు గురువులై ఉండాలి. నాలుగు గణాలు, అనగా పదహారు మాత్రలు ఉండాలి.

**మూ. తత్రాప్యుపోహనం కార్యం చతుష్కలసమన్వితమ్,**
**అడ్డితాయాః ప్రయోగజ్ఞైః అన్తే ఝుణ్టు విభూషితమ్. 30**

**తా.** అడ్డితాధ్రువలో, చివర "ఝుంటు ఝుంటు" ఉండగా నాలుగు కలలలో ఉపోహనం చెయ్యాలి.

**మూ. దిగ్లే దిగ్లే తతశ్చైవ కార్యమన్తే సదా బుధైః,**
**చత్వార్యేవ హి కార్యాణి మధ్యే లఘ్వక్షరాణి తు. 31**

**తా.** ఈ ధ్రువలో ప్రతీ పాదంలోను ప్రారంభంలో "దిగ్లే దిగ్లే", చివర 'ఝుంటు ఝుంటు' ఉండాలి. మధ్య నాలుగు లఘువులు మాత్రమే ఉండాలి.

**మూ. యథా –**
**ప్రవరం వరదం ప్రణమత సతతం,**
**గజచర్మపటం మునిజనసహితమ్.**
**ఉమయా సహితం భుజగవలయినం**
**ప్రణతోఽస్మి శివం త్రిభువననమితమ్. 32**

**తా.** సర్వశ్రేష్ఠుడు, వరా లిచ్చేవాడు, గజచర్మ వస్త్రంగా ధరించినవాడు, మునిజనాలతో కూడినవాడు, పార్వతీసమేతుడు, సర్పాలు వలయములుగా ధరించినవాడు అయిన శివునికి ఎల్లప్పుడు నమస్కరించండి. మూడు లోకాలచే నమస్కరింపబడే శివునకు ప్రణామం చేయుచున్నాను.

**మూ. ప్రయోజ్యా త్వడ్డితా హ్యేవం పూర్వరఙ్గే యథార్థతః,**
**అతః పరం ప్రవక్ష్యామి విక్షిప్తాయాస్తు లక్షణమ్. 33**

**తా.** పూర్వరంగంలో అడ్డితాధ్రువ ఈ విధంగా యథాశాస్త్రంగా ప్రయోగించాలి. ఇటు పైన **విక్షిప్తాధ్రువ** లక్షణం చెపుతాను.

**మూ. తృతీయం చైవ షష్ఠం చ నవమం దశమం తథా,**
**గుర్వక్షరాణి పాదే తు యస్యా విక్షిప్తికా తు సా. 34**

**తా.** పాదంలోని మూడు, ఆరు, తొమ్మిది, పది అక్షరాలు గురువులుగా ఉన్నది విక్షిప్తధ్రువ.

**మూ. దిగ్లే త్రిభిర్గణైర్యుక్తాః పాతాస్తస్య భవన్తి హి,**
**త్రికలం చాపి నిర్దిష్టముపోహనమతః పరమ్. 35**
**దిగ్లే దిగ్లే పునః కార్యమన్తే ఝుణ్టుం ప్రయోక్తృభిః,**
**లఘ్వక్షరైర్విహీనం తు విక్షిప్తోపోహనం భవేత్. 36**

**తా. విక్షిప్తధ్రువలో** 'దిగ్లే' ప్రయోగించడం ద్వారా మూడు గణాలతో కూడిన పాదం ఏర్పడుతుంది. మూడు కలలు అవుతాయి. ఉపోహనప్రారంభంలో 'దిగ్లే దిగ్లే', అంతంలో 'ఝుంటు' ప్రయోగింపబడుతుంది. ఈ ఉపోహనంలో లఘ్వక్షరాల ప్రయోగం ఉండదు.

**మూ. యథా –**
**త్రిపురాన్తకరం బహులీలముమయా సహితం బహురూపమ్,**
**భుజగాభరణం త్రిపురాన్తకం ప్రణమామి సదా పరమీశమ్. 37**

**తా.** త్రిపురవినాశకుడు, అనేకమైన లీలలు చేయువాడు. ఉమాసమేతుడు, అనేక రూపాలు గలవాడు. సర్పములు ఆభరణంగా గలవాడు, అయిన పరమేశ్వరునకు ఎల్లప్పుడు నమస్కరించుచున్నాను.

**మూ. ఏవం సర్వా ధ్రువాః కార్యాః యుగ్మౌజకృతగీతకాః,**
**ఆచార్యబుద్ధ్యా కర్తవ్యాః పూర్వరఙ్గే యథావిధి. 38**

**తా.** చతురశ్ర – త్ర్యశ్రతాలాలతో కూడిన ఈ ధ్రువలు, నాట్యాచార్యుని బుద్ధిని అనుసరించి, యథాశాస్త్రంగా పూర్వరంగంలో ప్రయోగింపదగినవి.

**మూ. ఏవం వః కథితం సమ్యక్ పూర్వరఙ్గం త్రిధా మయా,**
**కిమన్యత్ సంప్రవక్ష్యామి భూయోఽభీష్టం ద్విజోత్తమాః. 39**
**ఇతి భరతీయే నాట్యశాస్త్రే పూర్వరఙ్గవిధానం నామ పఞ్చమోఽధ్యాయః.**

**తా.** ద్విజోత్తములారా! ఈ విధంగా మీకు మూడు విధాలైన పూర్వరంగం స్పష్టంగా వివరించి చెప్పాను. మీకు కావలసిన మరేమి విషయం చెప్పాలో అడగండి.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో పూర్వరంగవిధానము అను పంచమాధ్యాయం సమాప్తం.**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ షష్ఠోఽధ్యాయః

# రసాధ్యాయము

**మూ. పూర్వరఙ్గవిధిం శ్రుత్వా పునరాహుర్మహత్తమాః,**
**భరతం మునయః సర్వే ప్రశ్నాన్ పఞ్చాభిధత్స్వ నః. 1**

**తా.** మహాత్ములైన ఆ ముని లందరు పూర్వరంగవిధానం విని భరతమునితో మళ్లీ ఇలా అన్నారు – "మహాత్మా! మా ఐదు ప్రశ్నలకు ఉత్తరములు చెప్పుము.

**మూ. యే రసా ఇతి పఠ్యన్తే నాట్యే నాట్యవిచక్షణైః,**
**రసత్వం కేన వై తేషామేతదాఖ్యాతుమర్హసి. 2**

**తా.** (1) నాట్యమునందు మంచి నేర్పుగలవారు. "నాట్యంలో (రూపకాలలో) రసాలు" అని అంటూంటారు కదా? వాటికి రసత్వం ఎలా వచ్చిందో, అనగా వాటిని రసాలు అని ఎందుకు అంటారో, మాకు చెప్పుము.

**మూ. భావాశ్చైవ కథం ప్రోక్తాః కిం వా తే భావయన్త్యపి,**
**సంగ్రహం కారికాం చైవ నిరుక్తం చైవ తత్త్వతః. 3**

**తా.** (2) కొన్నింటిని భావా లని ఎందు కంటారు? అవి దేనిని భావింపచేస్తాయి. (3) రసభావాల సంగ్రహమును, (4) కారికను, (5) నిరుక్తమును మాకు విశదీకరింపుము.

**మూ. తేషాం తు వచనం శ్రుత్వా మునీనాం భరతో మునిః,**
**తానువాచ పునర్వాక్యం రసభావవికల్పనమ్. 4**

**తా.** భరతముని ఆ మునుల మాటలు విని రసభావాల స్వరూపాన్ని లక్షణాదులను బోధిస్తూ వాళ్లతో ఇలా అన్నాడు.

**మూ. అహం తు కథయిష్యామి నిఖిలేన తపోధనాః,**
**సంగ్రహం కారికాం చైవ నిరుక్తం చ యథాక్రమమ్. 5**

**తా.** తపోధనులారా! రస – భావాదులకు సంబంధించిన సంగ్రహమూ, కారిక, నిరుక్తమూ కూడ క్రమానుసారంగా మీకు చెపుతాను.

**మూ. న శక్యమస్య నాట్యస్య గన్తుమన్తం కథంచన,**
**కస్మాద్ బహుత్వాద్ జ్ఞానానాం శిల్పానాం వాప్యనన్తతః. 6**

**తా.** ఈ నాట్యాన్ని గూర్చి పూర్తిగా తెలిసికొనడానికి ఏ విధంగా నూ కూడ శక్యం కాదు. ఎందువల్ల ననగా – జ్ఞానములు, అనగా వ్యాకరణాదివివిధశాస్త్రాలలో ఉన్న తెలిసికొనదగిన విషయాలు ఎన్నో ఉన్నాయి. చిత్రలేఖనము, పుత్తలికా (బొమ్మలు మొ.) నిర్మాణము మొదలైన శిల్పాలు అనంత మైనవి.

**మూ. ఏకస్యాపి న వై శక్యస్త్వన్తో జ్ఞానార్ణవస్య హి,**
**గన్తుం కిం పునరన్యేషాం జ్ఞానానామర్థతత్త్వతః. 7**

**తా.** ఒక్క జ్ఞాన (విద్యా) సముద్రం కొనలు చూడడమే శక్యం కాని పని; ఇతర జ్ఞానాల (సకలవిద్యల) తత్త్వాన్ని తెలుసుకొంటూ వాటి అంతాలను చూడగలవాడు ఎవ్వడూ ఉండ డని వేరుగా చెప్పాలా!

**మూ. కిన్త్వల్పసూత్రగ్రన్థార్థమనుమానప్రసాదకమ్,**
**నాట్యస్యాస్య ప్రవక్ష్యామి రసభావాదిసంగ్రహమ్. 8**

**తా.** అయినా కూడ అల్పమైన (చిన్నవైన) సూత్రరూపములలో ఉన్న గ్రంథానికి సంబంధించిన విషయాలు తెలిపేదీ, అనగా చిన్న సూత్రాల రూపంలో ఉన్న గ్రంథంలోని విషయా లన్నీ ప్రతిపాదించేదీ, అనుమానప్రమాణం ద్వారా విషయాలను బోధించేదీ, అనగా విషయజ్ఞానానికి ఉపయోగించే అనుమానాలను (inferences) సూచించేదీ అయిన, ఈ నాట్యానికి (రూపకనిర్మాణ ప్రయోగాదులకు) సంబంధించిన రస – భావాదుల సంగ్రహమును మీకు చెపుతాను.

**మూ. విస్తరేణోపదిష్టానామర్థానాం సూత్రభాష్యయోః,**
**నిబన్ధో యః సమాసేన సంగ్రహం తం విదుర్బుధాః. 9**

**తా.** సూత్రాలలోను వాటి భాష్యంలోను (విస్తృతవ్యాఖ్యానంలోను) సవిస్తరంగా చెప్పబడిన విషయాలను సమాసంచేత, అనగా సంక్షిప్తరూపంలో, నిబంధించడం (ఒకచోట కూర్చడం) **సంగ్రహం** అని పండితు లంటారు. ఇది **సంగ్రహానికి** లక్షణం.

**మూ. రసా భావా హ్యభినయాః ధర్మీ వృత్తిప్రవృత్తయః,**
**సిద్ధిః స్వరాస్తథాతోద్యం గానం రఙ్గశ్చ సంగ్రహః. 10**

**తా.** రసాలు, భావాలు, అభినయాలు, ధర్మి, వృత్తులు, ప్రవృత్తులు, సిద్ధి, స్వరాలు, ఆతోద్యం, గానం, రంగం – ఇవే నాట్యసంగ్రహం. నాట్యశాస్త్రంలో ఉన్న విషయా లేవో సంగ్రహంగా చెప్పా లంటే ఇవే అని అర్థం.

**మూ. అల్పాభిధానేనార్థో యః సమాసేనోచ్యతే బుధైః,**
**సూత్రతః సాఽను పఠితా కారికార్థప్రదర్శినీ. 11**

**తా.** చాల తక్కువ సంఖ్యలో ఉన్న శబ్దాలతో విస్తృత మైన అర్థాన్ని సమాసంచేత, అనగా సంక్షిప్త రూపంలో, క్రోడీకరించి సూత్రం బోధించగా ఆ సూత్రాన్ని అనుసరించి దానిలో ఇమడ్చిన అర్థాన్ని బోధించేది **కారిక.**

**వి.** ఈ శ్లోకానికి వ్యాఖ్య వ్రాస్తూ అభినవగుప్తుడు. "అర్థానికీ అనగా చెప్పబడే విషయానికీ, లక్షణరూప మైన సూత్రానికీ, ఆ సూత్రం అర్థాన్ని వివరించే శ్లోకానికీ కూడ కారిక అని పేరు" అన్నాడు. కాని ఆ అర్థం ఈ శ్లోకంలో రావడంలేదు.

**మూ. నానానామాశ్రయోత్పన్నం నిఘణ్టునిగమాన్వితమ్,**
**ధాత్వర్థహేతుసంయుక్తం నానాసిద్ధాన్తసాధితమ్. 12**
**స్థాపితోఽర్థో భవేద్యత్ర సమాసేనార్థసూచకః,**
**ధాత్వర్థవచనేనేహ నిరుక్తం తత్ప్రచక్షతే. 13**

**తా.** ఒక పదం ఏ ధాతువునుండి నిష్పన్న మైనదో దాని అర్థాన్ని చెపుతూ, సంక్షిప్తరూపంలో ఉన్న అర్థాన్ని సూచించే అర్థాన్ని ఏది స్థాపిస్తుందో అది **నిరుక్తం.** ఈ నిరుక్తం అనేకవిధా లైన నామల (సుబంతపదాల) ఆశ్రయంవల్ల ఏర్పడుతుంది. నిఘంటువులకు, వ్యాకరణాదిశాస్త్రాలకు అనుగుణంగా ఉంటుంది. ధాతువుయొక్క అర్థాన్ని హేతువుగా చూపి చెప్పబడుతుంది. అనేకవిధా లైన సిద్ధాంతాల సాహాయ్యంతో నిర్ణయింపబడుతుంది.

**వి.** ఈ ఘట్టంలోని శ్లోకాలను పట్టి, సంగ్రహం అనగా ఒక శాస్త్రంలోని విషయాలను సూచించే విషయసూచికవంటి దనీ, సూత్రాలలో సంక్షిప్తంగా చెప్పిన విషయాన్ని వివరించేది శ్లోకరూపంలో ఉంటే కారిక అనీ, ఒక పదానికి ఆ అర్థం ఎలా వచ్చిందో దాని మూలధాతువును, నిఘంట్వాదులలో ఉన్న ఆ పదం అర్థాన్నీ, ఇతరశాస్త్ర సిద్ధాంతాలను పరిశీలించి నిర్ణయించేది **నిరుక్తం** అనీ చెప్పినట్లు అర్థం అవుతున్నది. ఇది ఒక పద్ధతి.

అయితే వ్యాకరణశాస్త్రాదులలో సూత్రం, వార్తికం, భాష్యం, సంగ్రహం అను మరొక వ్యాఖ్యానవిధానం ఉంది. చాల తక్కువ పదాలలో అతివిస్తృత మైన విషయాన్ని సూచించేది **సూత్రం.**

**"అల్పాక్షరమసందిగ్ధం సారవద్విశ్వతోముఖమ్,**
**అస్తోభమనవద్యం చ సూత్రం సూత్రవిదో విదుః."**

సూత్రకారుడు చెప్పినవాటిలో ఏవైనా లోపా లుంటే సవరిస్తూ. చెప్పనివాటిని చేరుస్తూ, చెప్పినవాటికి అవసరం అయితే వివరణం ఇస్తూ వ్రాసినదానికి **వార్తికం** అని పేరు. ఇది శ్లోకరూపంలో ఉండవచ్చు, చిన్న వాక్యాల రూపంలో ఉండవచ్చు.

**"ఉక్తానుక్తదురుక్తానాం చిన్తా యత్ర ప్రవర్తతే,**

**తం గ్రన్థం వార్తికం ప్రాహుర్వార్తికజ్ఞా మనీషిణః."**

సూత్రాలవంటి చిన్న చిన్న వాక్యాలలో సూత్రార్థాన్ని వివరిస్తూ, తనలోని పదాల అర్థాలు కూడా వివరించేది **భాష్యం.**

**సూత్రార్థో వర్ణ్యతే యత్ర పదైః సూత్రానుకారిభిః,**
**స్వపదాని చ వర్ణ్యన్తే భాష్యం భాష్యవిదో విదుః.**

ఈ లక్షణాలు పాణినిసూత్ర – కాత్యాయనకృత వార్తిక – పతంజలికృత మహాభాష్యాలకు చక్కగా వర్తిస్తాయి. బ్రహ్మసూత్ర – శాంకరభాష్య – సురేశ్వరాచార్యకృత వార్తికాలకు కూడ వర్తిస్తాయిగాని వార్తికాలు భాష్యాలపై వ్రాయబడినవి.

వ్యాకరణశాస్త్రంలో సంగ్రహం అనేది కూడ ఒకటుండేది. సూత్ర – భాష్యాలలో విస్తృతంగా చెప్పిన విషయాలను సంక్షిప్తంగా చెప్పేది **సంగ్రహం.**

**"విస్తరేణోపదిష్టానామర్థానాం సూత్రభాష్యయోః,**
**నిబన్ధో యః సమాసేన సంగ్రహం తం విదుర్బుధాః."**

అని దీని లక్షణ. వ్యాడి అనే పండితుడు రచించిన **'సంగ్రహం'** అనేది ఉండేది; అది లభ్యం కాదు.

వైదికవాఙ్మయానికి సంబంధించిన 'నిఘంటు' 'నిరుక్తాలు' ప్రసిద్ధములే. ఇక్కడ చెప్పిన 'నిరుక్తం' నిరుక్తంవంటిదే కాని అది కాదు.

**'రసాః భావాః'** ఇత్యాదిశ్లోకంలో చెప్పిన సంగ్రహస్వరూపం, కోహలుడు చెప్పిన పదకొండు అంగాల సంగ్రహానికి సరిపడినా, నాట్యశాస్త్రంలోని అంగాలు – మూడు విధాల అభినయం, గీతము, ఆతోద్యము అని ఐదే గాన దీనికి సంబంధించినది కాదు అని అభినవగుప్తుని అభిప్రాయం.

**మూ. సంగ్రహో యో మయా ప్రోక్తః సమాసేన ద్విజోత్తమాః,**
**విస్తరం తస్య వక్ష్యామి సనిరుక్తం సకారికమ్. 14**

**తా.** ద్విజోత్తములారా! నేను మీకు సంక్షిప్తరూపంలో చెప్పిన సంగ్రహానికి సంబంధించిన విస్తరాన్ని, నిరుక్తమును, కారికలను ఇప్పుడు చెపుతాను.

**మూ. శృఙ్గారహాస్యకరుణా రౌద్రవీరభయానకాః,**
**బీభత్సాద్భుతసంజ్ఞౌ చేత్యష్టౌ నాట్యే రసాః. స్మృతాః. 15**

**తా.** నాట్యంలో శృంగారము, హాస్యము, కరుణ, రౌద్రము, వీరము, భయానకము, భీభత్సము, అద్భుతము అని ఎనిమిది రసాలు చెప్పబడ్డాయి.

**మూ. ఏతే హ్యష్టౌ రసాః ప్రోక్తా ద్రుహిణేన మహాత్మనా,**
**పునశ్చ భావాన్ వక్ష్యామి స్థాయిసఞ్చారిసత్త్వజాన్. 16**

**తా.** మహాత్ముడైన బ్రహ్మదేవుడు ఈ ఎనిమిది రసాలు చెప్పాడు. ఇంకా మీకు స్థాయిభావాలను, సంచారిభావాలను, సాత్త్వికభావాలను చెపుతాను.

## స్థాయిభావాలు

**మూ. రతిర్హాసశ్చ శోకశ్చ క్రోధోత్సాహౌ భయం తథా,**
**జుగుప్సా విస్మయశ్చేతి స్థాయిభావాః ప్రకీర్తితాః. 17**

**తా.** (పైన చెప్పిన ఎనిమిది రసాలకు) రతి, హాసం, శోకం, క్రోధం, ఉత్సాహం, భయం, జుగుప్స (ఏవగింపు) విస్మయం (ఆశ్చర్యం) అనేవి వరుసగా ఎనిమిది స్థాయి భావాలు.

**మూ. నిర్వేదగ్లానిశఙ్కాఖ్యాస్తథాసూయా మదః శ్రమః,**
**ఆలస్యం చైవ దైన్యం చ చిన్తా మోహః స్మృతిర్ధృతిః. 18**
**వ్రీడా చపలతా హర్ష ఆవేగో జడతా తథా,**
**గర్వో విషాద ఔత్సుక్యం నిద్రాపస్మార ఏవ చ. 19**
**సుప్తం విబోధోఽమర్షశ్చాప్యవహిత్థమథోగ్రతా,**
**మతిర్వ్యాధిస్తథోన్మాదస్తథా మరణమేవ చ. 20**
**త్రాసశ్చైవ వితర్కశ్చ విజ్ఞేయా వ్యభిచారిణః,**
**త్రయస్త్రింశదమీ భావాః సమాఖ్యాతాస్తు నామతః. 21**

**తా.** నిర్వేదం, గ్లాని, శంక, అసూయ, మదం, శ్రమ, ఆలస్యం (సోమరితనం), దైన్యం, చింత, మోహం, స్మృతి, ధృతి (ధైర్యం), వ్రీడ (సిగ్గు), చపలత్వం, హర్షం, ఆవేగం (మనస్సులో కంగారు), జడత్వం (కదలిక లేకపోవడం), గర్వం, విషాదం, ఔత్సుక్యం, నిద్ర, అపస్మారం (మూర్ఛ), సుప్తం (నిద్ర), విబోధం (మేల్కొనడం) అమర్షం, అవహిత్థం (మనస్సులోని భావాలు దాచుకొనడం), ఉన్మాదం, మరణం, త్రాసం (భయం) వితర్కం (ఊహ) ఇవి వ్యభిచారిభావాలు. ఈ ముప్పైమూడు (33) భావాల పేర్లు చెప్పాను.

**వి.** వ్యభిచారిభావాలు అన్నా సంచారిభావాలన్నా ఒకటే. ఇవి పర్యాయపదాలు.

**మూ. స్తంభః స్వేదోఽథ రోమాఞ్చః స్వరభఙ్గోఽథ వేపథుః,**
**వైవర్ణ్యమశ్రు ప్రలయ ఇత్యష్టౌ సాత్త్వికాః స్మృతాః. 22**

**తా.** స్తంభం (కొయ్యబారిపోవడం), స్వేదం (చెమటపట్టడం), రోమాంచం, స్వర భంగం (కంఠస్వరం మారిపోవడం), వేపథు (కంపం), వైవర్ణ్యం (ముఖం రంగు

మారిపోవడం), ప్రలయం (సొమ్మిసిలడం) ఇవి ఎనిమిది **సాత్త్వికభావాలు** (మనోవికారం వల్ల పుట్టే భావాలు).

**మూ. ఆఙ్గికో వాచికశ్చైవ హ్యాహార్యః సాత్త్వికస్తథా,**
**చత్వారోఽభినయా హ్యేతే విజ్ఞేయా నాట్యసంశ్రయాః. 23**

**తా.** ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్త్వికము అని నాట్యానికి సంబంధించిన అభినయాలు నాలుగు విధాలు.

**మూ. లోకధర్మీ నాట్యధర్మీ ధర్మీతి ద్వివిధః స్మృతః,**
**భారతీ సాత్త్వతీచైవ కైశిక్యారభటీ తథా. 24**
**చతస్రో వృత్తయో హ్యేతా యాసు నాట్యం ప్రతిష్ఠితమ్.**

**తా.** లోకధర్మి, నాట్యధర్మి అని ధర్మి రెండు విధాలు. భారతి, సాత్త్వతి, కైశికి, ఆరభటి అని వృత్తులు నాలుగు విధాలు. నాట్యం ఈ నాలుగు వృత్తులమీదనే ఆధారపడి ఉన్నది.

**మూ. ఆవన్తీ దాక్షిణాత్యా చ తథా చైవౌఢ్రమాగధీ. 25**
**పాఞ్చాలమధ్యమా చేతి విజ్ఞేయాస్తు ప్రవృత్తయః.**

**తా.** ఆవన్తి, దాక్షిణాత్య (ఆంధ్ర – కర్నాట – ద్రవిడ – కేరల – మహారాష్ట్ర – గుజరాతదేశాలు దాక్షిణాత్యదేశాలు), ఓడ్రీమాగధి (అర్ధమాగధి), పాంచాలి, మధ్యమ అనేవి ప్రవృత్తులు.

**మూ. దైవికీ మానుషీ చైవ సిద్ధిః స్యాత్ ద్వివిధైవ తు. 26**

**తా.** దైవికి, మానుషి అని సిద్ధి రెండు విధాలైనది.

**మూ. శారీరాశ్చైవ వైణాశ్చ సప్త షడ్జాదయః స్వరాః,**
**(నిషాదర్షభగాన్ధారమధ్యపఞ్చమధైవతాః)**

**తా.** శారీరములు, వైణములు అను రెండు భేదములతో షడ్జం మొదలైన స్వరాలు ఏడు. (వాటి పేర్లు నిషాదము, ఋషభము, గాంధారము, మధ్యమము, పంచమము, ధైవతము, షడ్జము).

**మూ. తతం చైవావనద్ధం చ ఘనం సుషిరమేవ చ. 27**
**చతుర్విధం చ విజ్ఞేయమాతోద్యం లక్షణాన్వితమ్.**

**తా.** తతము, అవనద్ధము, ఘనము, సుషిరము అని ఆతోద్యం వేరు వేరు లక్షణాలతో నాలుగు విధాలు.

**మూ. తతం తన్త్రీగతం జ్ఞేయమవనద్ధం తు పౌష్కరమ్. 28**
**ఘనస్తు తాలో విజ్ఞేయః సుషిరో వంశ ఏవ చ.**

**తా.** తీగ లున్న వీణాదివాద్యం **తతం.** రెండు ప్రక్కలా లేదా ఒక ప్రక్క చర్మచేత బిగించిన మృదంగాది వాద్యం **అవనద్ధం.** ఇత్తడి తాళాలు మొదలైనవి **ఘనం.** వెదురు వంటివాటితో చేసిన పిల్లనగ్రోవి మొదలైన రంధ్రా లున్న వాద్యం **సుషిరం.**

**మూ. ప్రవేశాక్షేపనిష్క్రామప్రాసాదికమథాన్తరమ్. 29**
**గానం పఞ్చవిధం జ్ఞేయం ధ్రువాయోగసమన్వితమ్.**

**తా.** ధ్రువతో సంబంధించిన గానం ప్రవేశకం, ఆక్షేపం నిష్క్రామం, ప్రాసాదికం, ఆన్తరం అని ఐదు విధాలు.

**వి.** రంగప్రవేశం చేస్తూన్న పాత్రల ప్రకృతిని, మనోభావాదులను సూచించే గానం **ప్రవేశికం.** ప్రకృతమైన రసంకంటె భిన్నమైన రసాన్ని దూరంగా ఉంచే గానం **ఆక్షేపం.** పాత్రలు రంగంనుండి నిష్క్రమిస్తూన్నప్పుడు చేసే గానం **నిష్క్రామం.** ప్రవేశించిన పాత్ర యొక్క చిత్తవృత్తిని సామాజికులకు తెలిపే గానం **ప్రాసాదికం.** ప్రవేశ – నిష్క్రమణాల మధ్య చేసే గానం ఆంతరం.

**మూ. చతురశ్రో వికృష్టశ్చ రజ్గస్త్ర్యశ్రశ్చ కీర్తితః. 30**

చతురశ్రం, వికృష్ఠం, త్ర్యశ్రం అని రంగం మూడు విధాలు.

**మూ. ఏవమేషోఽల్పసూత్రార్థో నిర్దిష్టో నాట్యసంగ్రహః,**
**అతఃపరం ప్రవక్ష్యామి సూత్రగ్రన్థవికల్పనమ్. 31**

**తా.** ఈ విధంగా సూత్రాల అల్పార్థమైన నాట్యసంగ్రహం చెప్పాను. ఇటుపైన సూత్రాల వ్యాఖ్యారూప మైన పరీక్షను చెప్పెదను.

**మూ. తత్ర రసానేవ తావదభివ్యాఖ్యాస్యామః. న హి రసాదృతే కశ్చిదర్థః ప్రవర్తతే.**

**తా.** ముందుగా రసాలను గూర్చియే విస్తృత మైన వ్యాఖ్య (వివరణం) చేస్తాం. ఎందవల్ల ననగా రసం లేకుండా నాట్యాంగమైన ఏ విషయమూ ప్రవర్తించదు. నడవదు.

## *రసలక్షణసూత్రం*

**మూ. తత్ర విభావానుభావవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః.**

**తా.** విభావాల, అనుభావాల, వ్యభిచారిభావాల సంయోగంవల్ల రసం నిష్పన్నం అవుతుంది.

**వి.** ఇది రససిద్ధాంతానికి ఆయువుపట్టు వంటి సూత్రం. దీనిలోని **'సంయోగాత్'** **'నిష్పత్తిః'** అను పదాలకు అనేకవిధాల అర్థాలు చెపుతూ అనేకవాదనలు బయలుదేరాయి.

అభినవగుప్తుడు, ఆయనకంటె ముందున్న నాట్యశాస్త్రవ్యాఖ్యాతలు ఈ సూత్రాన్ని, ఎలా వ్యాఖ్యానించాలో, వారి వ్యాఖ్యాభేదాలను పట్టి రసస్వరూపనిరూపణం ఎలా వేరు వేరుగా జరిగిందో **'రససిద్ధాంతం'** అను శీర్షికతో అస్మద్విరచిత **అలంకారశాస్త్రచరిత్ర**లో ప్రతి పాదింపబడింది. ఆ భాగం (386 – 407 పేజీలు) యథాతథంగా ఈ షష్ఠాధ్యాయం చివర ఇవ్వబడింది. అందుచేత ఇక్కడ ఈ సూత్రానికి విస్తృతవ్యాఖ్యానం ఏమీ చేయలేదు.

**మూ. కో దృష్టాన్తః? అత్రాహ – యథా హి నానావ్యఞ్జనౌషధిద్రవ్యసంయోగాద్రసనిష్పత్తిః తథా నానాభావోపగమాద్రసనిష్పత్తిః. యథా హి గుడాదిభిర్ద్రవ్యైః వ్యఞ్జనైః ఓషధిభిశ్చ షాడబాదయో రసాః నిర్వర్త్యన్తే తథా నానాభావోపగతా అపి స్థాయినః భావాః రసత్వ మాప్నువన్తీతి.**

**తా.** విభావాదులు కలవడంవల్ల రసనిష్పత్తి జరుగుతుంది అని చెప్పడానికి దృష్టాంతం ఏమిటి? దీనికి సమాధానం చెపుతున్నారు – అనేక విధాలైన వ్యంజనాలతోను, ఓషధులతోను ఒకద్రవ్యం కలవడంవల్ల (క్రొత్త) రసం (రుచి) ఎలా నిష్పన్నం అవుతుందో అట్లే అనేకవిధా లైన భావాలు వచ్చి స్థాయితో చేరడంవల్ల రసనిష్పత్తి జరుగుతుంది. సూత్రప్రాయంగా ఉన్న ఈ వాక్యాన్నే వ్యాఖ్యానిస్తున్నాడు –

**యథాహీతి :–** బెల్లం మొదలైన ద్రవ్యాలు వ్యంజనములతోను, నంజులతోను, ఓషధులతోను (ఎలకులు లవంగాలు కుంకుమపువ్వు మొదలైన ఓషధులతోను) కలవడం వల్ల (కలిపి) షాడవం మొదలైన రసాలు తయారు చేయబడతాయో అదే విధంగా అనేక విధాలైన విభావాదిభావాలతో కూడిన స్థాయిభావాలు రసత్వాన్ని పొందుతాయి; రసం అవుతాయి.

**వి.** మధుర (తియ్యని) తిక్త (చేదైన) ఆమ్ల (పుల్లని) లవణ (ఉప్పని) కటు (కారం) కషాయ (వగరు) రుచులు గల పదార్థాలను కలపగా ఈ ఆరు రుచులకంటె భిన్నమైన రుచి ఏర్పడుతుంది. అదే **షాడబం** అనగా అని **అభినవభారతి.** ప్రధానమైన ఒక గుడం వంటి పదార్థంతో వేరు వేరు రుచులు గల కొన్ని వస్తువులు కొంచెం కొంచెం కలపగా క్రొత్తగా రుచి పుట్టి నట్లు ప్రధానమైన స్థాయిభావంతో ఇతరభావాలు కలుపగా క్రొత్తగా రసం నిష్పన్నమౌతుంది అని అర్థం.

**మూ. అత్రాహ – రస ఇతి కః పదార్థః? ఉచ్యతే; ఆస్వాద్యత్వాత్.**

తా. 'రసః' అంటున్నావు కదా? ఆ పదానికి అర్థం ఏమిటి? అని అడుగుతున్నాడు. దీనికి సమాధానం చెప్పబడుతూన్నది – ఆస్వాదింపబడుతుంది కాబట్టి ఇది రసం అని చెప్పబడుతున్నది. **"రస్యతే ఇతి రసః"** అని నిరుక్తి చూపినట్లయింది.

**మూ. కథమాస్వాద్యతే రసః? యథాహి నానావ్యఞ్జనసంస్కృతమన్నం భుఞ్జానాః రసానా స్వాదయన్తి సుమనసః పురుషాః, హర్షాదీంశ్చాధిగచ్ఛన్తి తథా నానాభావాభినయవ్యఞ్జి తాన్ వాగఙ్గసత్త్వోపేతాన్ స్థాయిభావాన్ ఆస్వాదయన్తి సుమనసః ప్రేక్షకాః; హర్షాదీంశ్చా ధిగచ్ఛన్తి. తస్మాన్నాట్యరసా ఇత్యభివ్యాఖ్యాతాః.**

**తా.** (ప్రశ్న) రసం ఎలా ఆస్వాదింప బడుతుంది? (సమాధానం) మంచి మనస్సులతో ఉన్న, అనగా శోకక్రోధాదులు ఏవీ మనస్సులలో లేని, పురుషులు అనేకవిధా లైన వ్యంజనాలతో సంస్కరింపబడిన అన్నం తింటూ రసాలను ఎలా ఆస్వాదిస్తారో, (ఆ రసాలలో ఉన్న భేదాలను, తమ ఇష్టత్వానిష్టత్వాదులను బట్టి) హర్షాదులు పొందుతారో (తమ కిష్టం కాని రసం తగిలితే కొంచెం క్లేశం కూడ పొందవచ్చును గాన హర్షాదీన్ అని 'ఆది' శబ్దం ప్రయోగించాడు) అదే విధంగా సహృదయు లైన ప్రేక్షకులు అనేక విధాలైన భావాల అభినయంచేత వ్యంజింపచేయబడిన వాచిక – ఆంగిక – సాత్త్వికాభినయములతో కూడిన స్థాయిభావాలను ఆస్వాదిస్తారు, హర్షాదులు కూడ పొందుతారు. అందుచేత వీటిని నాట్యరసాలు – నాట్యం ద్వారా నిష్పన్నములైన రసాలు – అని అంటారు.

**మూ. అత్రానువంశ్యౌ శ్లోకౌ భవతః.**

**యథా బహుద్రవ్యయుతైర్వ్యఞ్జనైర్బహుభిర్యుతమ్,**
**ఆస్వాదయన్తి భుఞ్జానా భక్తం భక్తవిదో జనాః. 32**
**భావాభినయసంబద్ధాన్ స్థాయిభావాంస్తథా బుధాః,**
**ఆస్వాదయన్తి మనసా తస్మాన్నాట్యరసాః స్మృతాః. 33**

**తా.** ఈ విషయంలో రెండు **అనువంశ్యశ్లోకాలు** ప్రసిద్ధిలో ఉన్నాయి – అనేక ద్రవ్యాలతో చేర్చిన, అనేక వ్యంజనాలతో కలిసిన అన్నమును తింటూ భోజనప్రియులు దానిని ఏ విధంగా ఆస్వాదిస్తారో అదే విధంగా, బుధులు, భావాల అభినయాలతో కూడిన స్థాయిభావాలను మనస్సుతో ఆస్వాదిస్తారు. అందువల్లనే, అనగా దీనికి భావాభినయం ప్రధానకారణం అవడంవల్ల, వీటిని నాట్యరసా లంటారు.

**వి. 'వంశో ద్విధా – విద్యయా జన్మనా చ'** అను అభియుక్తోక్తి ననుసరించి గురు శిష్యపరంపర **విద్యావంశం**. ఆ విద్యావంశానికి సంబంధించినవి గాన గురుశిష్య పరంపరయా వస్తూన్నవి గాన, ఇలాంటి అజ్ఞాతకర్తృకా లైన ప్రాచీన శ్లోకాలకు **అనువ్యంశ్య శ్లోకాలు** అని పేరు.

**మూ. అత్రాహ – కిం రసేభ్యో భావానామభినిర్వృత్తిః, ఉతాహో భావేభ్యో రసానామితి? కేషాంచిన్మతం పరస్పరసంబన్ధాదేషామభినిర్వృత్తిరితి. తన్న; కస్మాత్? దృశ్యతే హి భావేభ్యో రసానామభినిర్వృత్తిః న తు రసేభ్యో భావానామభినిర్వృత్తిరితి.**

**తా.** ఇక్కడ ఇలా ప్రశ్నిస్తున్నాడు – రసాలనుండి భావాలు ఏర్పడతాయా; లేక భావాల నుండి రసాలు ఏర్పడతాయా? రసభావాలకు పరస్పరం సంబంధంచేత, కలవడంచేత, ఇవి ఏర్పడతాయి, (అనగా రసాలతో సంబంధించి భావాలు, భావాలతో సంబంధించి రసాలు పుడతాయి) అని కొంద రంటారు. అది యుక్తం కాదు. ఎందువల్ల? భావాలనుండి రసాల ఉత్పత్తి కనబడుతూన్నది కాని రసాలనుండి భావాల ఉత్పత్తి కనబడడంలేదు కదా?

**మూ. భవన్తి చాత్ర శ్లోకాః –**
**నానాభినయసంబన్ధాన్భావయన్తి రసానిమాన్,**
**యస్మాత్తస్మాదమీ భావా విజ్ఞేయా నాట్యయోక్తృభిః. 34**

**తా.** ఈ విషయంలో కొన్ని అనువంశ్యశ్లోకా లున్నాయి –

అనేకవిధా లైన అభినయాలతో సంబంధం గల రసాలను భావింపజేస్తాయి కాబట్టి వీటిని 'భావాలు' అని నాట్యప్రయోక్తలు తెలుసుకోవాలి.

**వి.** అనగా **"భావయన్తి రసానితి భావాః"** – ఏవి రసాలను భావింపచేస్తాయో అవి భావాలు అను వ్యుత్పత్తిచేత భావాలే రసాల ఉత్పత్తికి హేతువులు అని అర్థం.

**మూ. నానాద్రవ్యైర్బహువిధైర్వ్యఞ్జనం భావ్యతే యథా,**
**ఏవం భావా భావయన్తి రసానభినయైః సహ. 35**

**తా.** ఎన్నో రకా లైన అనేకద్రవ్యాలచేత ఏ విధంగా వ్యంజనం భావింపబడుతుందో అట్లే భావాలు, అభినయాలతో కలిసి రసాలను భావింపచేస్తాయి.

**వి. భవనం** అనగా ఉండడం; పుట్టడం. **భావనం** అనగా ఉండే టట్లు, పుట్టే టట్లు, చెయ్యడం. భావయన్తి = రసాన్ని ఉండే టట్లు, పుట్టే టట్లు చేస్తాయి. అందుచేత వాటి కా పేరు అని అర్థం. అస లంటూ ముందుగా భావా లుండాలి. ఆ వివిధభావాలను (విభావానుభావవ్యభిచారిభావాలను) ఒక్క సందర్భంలో చతుర్విధాభినయాల ద్వారా ఆవిష్కరిస్తే అప్పుడు రసోదయం అవుతుంది.

'భావన' శబ్దానికి సంస్కరించడం అను అర్థం కూడ ఉంది. ఒక వస్తువులో అంతకు పూర్వం లేని ఒక మంచి గుణాన్ని పుట్టించడం సంస్కారం. పాయసంలో ఏలకుల పొడి, కుంకుమపువ్వు మొదలైనవి వేయడంవంటిది. ఒక విధమైన వ్యభిచారి భావాదులవల్ల పూర్వమే జనించి ఉన్న రసానికి ఒక విధమైన సంస్కారం చేసిన ట్లవుతుంది గాన ఆ అర్థంలో కూడ అన్వయించవచ్చును గాని మొదటి అర్థమే యుక్తతర మైనది.

**వ్యంజనం** అనగా ఏదైన ఒక ప్రధానమైన ఆహారపదార్థం తింటూన్నప్పుడు దానిలో కొంత రుచి పుట్టించడానికి మధ్య మధ్య నలుచుకొనే పచ్చడి, కూర మొదలైనది; నంజు;

అని అర్థం. ప్రకృత శ్లోకంలో – "బహువిధద్రవ్యాల కలయికచే వ్యంజనం పుడుతుంది" అన్నప్పుడు 'వ్యంజనం' అనగా క్రొత్త రుచి అని అర్థం గ్రహించాలి.

**మూ. న రసో భావహీనోఽస్తి న భావో రసవర్జితః,**
**పరస్పరకృతా సిద్ధిస్తయోరభినయే భవేత్. 36**

**తా.** భావం లేని రసం ఉండదు; రసం లేని భావం ఉండదు. అభినయంలో, (ఇక్కడ అభినయం అనగా నాట్యం అని అర్థం), నాట్యంలో, రస – భావాలు రెండింటి యొక్క సిద్ధి పరస్పరసంబంధంచేత జరుగుతుంది.

**మూ. వ్యఞ్జనౌషధిసంయోగో యథాన్నం స్వాదుతాం నయేత్,**
**ఏవం భావా రసాశ్చైవ భావయన్తి పరస్పరమ్. 37**

**తా.** వ్యంజనాలు, ఓషధులు కలపడంవల్ల అన్నంలో రుచి పుట్టి నట్లు భావాలు రసాలూ కూడ పరస్పరమూ భావింపచేస్తుంటాయి.

**వి.** 'భావయన్తి' అనుదానికి ఇక్కడ, 'భావన' శబ్దానికి, పైశ్లోకవ్యాఖ్యానంలో చెప్పిన రెండవ అర్థం కూడ వర్తిస్తుంది.

**మూ. యథా బీజాద్భవేద్వృక్షో వృక్షాత్పుష్పం ఫలం యథా,**
**తథా మూలం రసాః సర్వే తేభ్యో భావా వ్యవస్థితాః. 38**

**తా.** బీజంనుండి వృక్షం ఎలా పుడుతుందో, వృక్షంనుండి పుష్పమూ ఫలమూ ఎలా పుడతాయో అదే విధంగా రసాలే అన్నింటికీ మూలం. అందుచేత రసాలవల్లనే భావాలు ఏర్పడతాయి.

**వి.** భావాలవల్ల రసాలు పుడతాయి అని అన్నట్లయితే **"న హి రసాదృతే కశ్చిదప్యర్థః ప్రవర్తతే; తేన పూర్వం త ఏవోద్దేశ్యాః"** (రసం లేకపోతే ఇతరమైన వేవీ లేవు; అందుచేత ముందుగా రసాలనే చెప్పాలి అని వెనుక చెప్పినదానికి ఇది విరుద్ధం కదా అని ఆశం కించుకొని – మొదట విత్తునుండి పుట్టిన చెట్టునుండే చివరికి పుష్పం ద్వారా ఫలరూపమైన మరొక విత్తనం పుట్టినట్లు, రసం అను విత్తనంనుండి క్రమంగా పుట్టిన భావాలే మళ్లీ రసానికి విత్తనాల వలె పనిచేస్తాయి అని ఈ శ్లోకంలో చెప్పబడింది. అనగా నిగూఢంగా నైనా రసాస్వాదార్హత లేని వానికి ఏ భావాలూ పుట్టవు; రసం అసలే పుట్టదు అని భావం.

**మూ. తదేషాం రసానాముత్పత్తివర్ణదైవతనిదర్శనాన్యభివ్యాఖ్యాస్యామః, తేషాముత్పత్తి హేతవశ్చత్వారో రసాః; తద్యథా శృఙ్గారో, రౌద్రో, వీరో, బీభత్స ఇతి. అత్ర –**

**తా.** ఇక ఈ రసాల ఉత్పత్తి, వర్ణాలు, దేవతలు, ఉదాహరణలు – వీటి వ్యాఖ్య (విస్తృత ప్రతిపాదనం) చేస్తాం. (నాలుగు రసాల ఉత్పత్తికి నాలుగు రసాలు కారణం.

అదెట్లనగా – శృంగారం, రౌద్రం, వీరం, బీభత్సం – (ఇవి కారణరసాలు). వీటిలో –

**మూ. శృఙ్గారాద్ధి భవేద్ధాస్యో రౌద్రాచ్చ కరుణో రసః,**
**వీరాచ్చైవాద్భుతోత్పత్తిః బీభత్సాచ్చ భయానకః. 39**

**తా.** శృంగారరసంనుండి హాస్యరసం పుదుతుంది. రౌద్రంనుండి కరుణ, వీరంనుండి అద్భుతం, బీభత్సంనుండి భయానకమూ పుడతాయి.

**మూ. శృఙ్గారానుకృతిర్యా తు స హాస్యస్తు ప్రకీర్తితః,**
**రౌద్రస్యైవ చ యత్కర్మ స జ్ఞేయః కరుణో రసః. 40**
**వీరస్యాపి చ యత్కర్మ సోఽద్భుతః పరికీర్తితః,**
**బీభత్సదర్శనం యచ్చ జ్ఞేయః స తు భయానకః. 41**

**తా.** శృంగారాన్ని అనుకరిస్తే అది హాస్యం అవుతుంది. రౌద్రరసం కర్మ (దాని పని) కరుణరసం. వీరరసం కర్మ అద్భుతరసం. బీభత్సాన్ని చూపడం భయానకం.

**మూ. శ్యామో భవతి శృఙ్గారః సితో హాస్యః ప్రకీర్తితః,**
**కపోతః కరుణశ్చైవ రక్తో రౌద్రః ప్రకీర్తితః. 42**
**గౌరో వీరస్తు విజ్ఞేయః కృష్ణశ్చైవ భయానకః,**
**నీలవర్ణవస్తు బీభత్సః పీతశ్చైవాద్భుతః స్మృతః. 43**

**తా.** శృంగారం చామనచాయతో ఉంటుంది. హాస్యం తెల్లగాను, కరుణ పావురం రంగుతోను, రౌద్రం ఎఱ్ఱగాను, వీరం పసుపు కలిసిన తెలుపువర్ణంతోను (బంగారం రంగు) భయానకం నల్లగాను, బీభత్సం నీలంగాను, అద్భుతం పచ్చగాను ఉంటాయి.

**వి.** ఆ యా రసాలను ధ్యానించడానికై ఈ రంగుల చెప్పబడ్డాయి. (అ.భా.)

**మూ. శృఙ్గారో విష్ణుదేవత్యో హాస్యః ప్రమథదైవతః,**
**రౌద్రో రుద్రాధిదైవత్యః కరుణో యమదైవతః. 44**
**బీభత్సస్య మహాకాలః కాలదేవో భయానకః,**
**వీరో మహేన్ద్రదేవః స్యాదద్భుతో బ్రహ్మదైవతః. 45**

**తా.** శృంగారానికి అధిష్ఠానదేవత విష్ణువు. హాస్యానికి ప్రమథగణాలు. రౌద్రానికి రుద్రుడు. కరుణకు యముడు. బీభత్సానికి మహాకాలుడు. భయానకానికి కాలదేవత. వీరానికి మహేంద్రుడు. అద్భుతానికి బ్రహ్మదేవుడు.

**వి.** ఆ యా రసాల సిద్ధికై పూజలు నిర్వర్తించి నపుడు పూజించవలసిన దేవతలు వీరు. (అ.భా.)

**మూ. ఏవమేతేషాం రసానాముత్పత్తివర్ణదైవతాన్యభివ్యాఖ్యాతాని. ఇదానీమనుభావవిభావ వ్యభిచారిసంయుక్తానాం లక్షణనిదర్శనాన్యభివ్యాఖ్యాస్యామః. స్థాయిభావాంశ్చ రసత్వముప నేష్యామః.**

**తా.** ఈ విధంగా ఈ రసాల ఉత్పత్తి – వర్ణ – అధిష్ఠానదేవతలను చెప్పాం. ఇపుడు అనుభావ – విభావ – వ్యభిచారిభావాలతో కూడిన రసాల లక్షణాలను, ఉదాహరణలను వ్యాఖ్యానించెదము. స్థాయిభావాలు ఎలా రసా లవుతాయో ప్రతిపాదిస్తాం.

## *అథ శృఙ్గారరసప్రకరణమ్*

**మూ. తత్ర శృఙ్గారో నామ రతిస్థాయిభావప్రభవః. ఉజ్జ్వలవేషాత్మకః. యత్కించిల్లోకే శుచి, మేధ్యమ్, ఉజ్జ్వలం, దర్శనీయం వా తత్ శృఙ్గారేణోపమీయతే. యస్తావదుజ్జ్వలవేషః స శృఙ్గారవానిత్యుచ్యతే. యథా చ గోత్రకులాచారోత్పన్నాని, ఆప్తోపదేశసిద్ధాని పుంసాం నామాని భవన్తి తథైవేషాం రసానాం భావానాం చ నాట్యాశ్రితానాం చార్థానామ్ ఆచారోత్పన్నాని ఆప్తోపదేశసిద్ధాని నామాని. ఏవమేష ఆచారసిద్ధో హృద్యోజ్జ్వలవేషాత్మ కత్వాత్ శృఙ్గారో రసః. స చ స్త్రీపురుషహేతుక ఉత్తమయువప్రకృతిః.**

**తా.** వాటిలో శృంగారం అనేది రతి అను స్థాయిభావంనుండి పుట్టినది. ఉజ్జ్వలమైన అనగా ప్రకాశించే, మెరిసిపోయే ఆకర్షక మైన వేషస్వరూప మైనది. లోకంలో శుభ్రము, పవిత్రము, ప్రకాశించేది, చూడ ముచ్చట గొల్పేది అయిన ఏ వస్తువైనా దానిని శృంగారంతో (శృంగారపురుషునితో) పోలుస్తారు. ఉజ్జ్వల మైన వేషం ధరించినవానిని శృంగారవంతు డంటారు. పురుషులకు గోత్రము, కులము, ఆచారము (ఇంటిలోని సంప్రదాయము) వీటిని పట్టి ఏర్పడినవి, ఆప్తుల ఉపదేశంచేత నిర్ణయింపబడినవీ అయిన పేర్లు ఏ విధంగా ఉంటాయో అదే విధంగా, ఈ రసాలకు, భావాలకు, నాట్యానికి సంబంధించిన ఇతర విషయాలకు కూడ ఆచారం (సంప్రదాయం) ప్రకారం వస్తూన్నవీ, ఆప్తుల ఉపదేశంచేత నిర్ణయింపబడినవి అయిన పేర్లు ఉంటాయి. ఈ విధంగా, ఈ రసం ఉజ్జ్వలవేషస్వరూప మైనది గాన 'శృంగారము' అను పేరు ఆచారసిద్ధ మైనది. దీనికి స్త్రీపురుషులు హేతువు. ఉత్తమప్రకృతి గల యువతీయువకులు దీనికి కారణం.

**వి.** రసాదులకు ప్రసిద్ధిలో ఉన్న పేర్లన్నీ అతిప్రాచీనకాలంనుంచీ వస్తూన్నవే కాని క్రొత్తగా నాట్యశాస్త్రకారుడు పెట్టినవి కావు అని పై మాటలవల్ల తెలుస్తూన్నది. కొన్ని పేర్లకు శ్రమపడితే వ్యుత్పత్త్యర్థం కనబడవచ్చు గాని అన్నింటికి లభించకపోవచ్చు. శృంగార శబ్దానికి వ్యుత్పత్తి చెప్పడంకోసం ప్రయత్నిస్తూ కొందరు శాస్త్రకారులు – శృంగం అనగా ప్రాధాన్యం; రసాలలో ప్రాధాన్యం పొందినది శృంగారం అని అర్థం చెప్పారు కాని

నాట్యశాస్త్రంలోని ఈ ఘట్టం చూస్తే ఈ పేర్లన్నీ అతిప్రాచీనకాలంనుంచీ వస్తున్నట్లు కనబడుతుంది.

ఈ ఘట్టంలోనే అభినవగుప్తుడు **"రసాదీనాం తచ్ఛాస్త్రవేదివృద్ధవ్యవహారతః నిరూఢాని ప్రాక్తనబ్రహ్మాద్యాప్తప్రణీతాని నామాని"** రసాదుల ఈ పేర్లు ప్రాచీనులైన శాస్త్రకారుల ప్రసిద్ధిని పట్టి రూఢ మైపోయినవి (అనగా వీటికి వ్యుత్పత్తి వెదకడం అనవసరం). ప్రాచీను లైన బ్రహ్మాదు లైన ఆప్తులు ఏర్పరచినవే ఈ పేర్లు" అన్నాడు. 'శృంగ' శబ్దానికి ఏదో మత్వర్థప్రత్యయం చేర్చి అర్థం చెప్పిన ఒక వ్యాఖ్యకారుణ్ణి ఆక్షేపిస్తూ వ్యాకరణ శాస్త్రంలోని **'శృఙ్గవృన్దాభ్యామారకన్'** అను వార్తికాన్ని **'శృఙ్గారభృఙారే'** అను ఉణాది సూత్రాన్ని మరిచి ఇత డిలా వ్రాశాడు అని ఆక్షేపించాడు. (**అభినవభారతి**).

**మూ. తస్య ద్వే అధిష్ఠానే సమ్భోగో విప్రలమ్భశ్చ. తత్ర సంభోగస్తావత్ – ఋతుమాల్యాను లేపనాలంకారేష్టజనవిషయవరభవనోపభోగోపవనగమనానుభవనశ్రవణదర్శనక్రీడా లీలాదిభిః విభావైరుత్పద్యతే.**

**తా.** శృంగారరసానికి సంభోగము, విప్రలంభమూ అని రెండు అవస్థలు. వాటిలో సంభోగశృంగారం, ఋతువులు, పుష్పమాలలు, సుగంధద్రవ్యానులేపనములు (మైపూతలు) అలంకారములు, ఇష్టజనుడు (ప్రియుడు లేదా ప్రియురాలు) భోగ్యవస్తువులు, శ్రేష్ఠమైన భవనము, వాటి భోగము, ఉద్యానగమనము, అక్కడ అనుభవించడము, ప్రియుణ్ణి లేదా ప్రియురాలిని గూర్చి శ్రవణము, దర్శనము, క్రీడ, విలాసలు మొదలైన విభావాలచేత పుడుతుంది.

**మూ. తస్య నయనచాతుర్య – భ్రూక్షేప – కటాక్ష – సంచార. లలితమధురాఙ్గహార – వాక్యాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః. వ్యభిచారిణశ్చ ఆలస్య – ఔగ్ర్య – జుగుప్సాః వర్జ్యాః.**

**తా.** నేత్రాల నేర్పు, కనుబొమ్మల విరుపు, క్రీకంటి చూపులు, నడక, లలితములు మధురములు అయిన అంగహారములు, మాటలు మొదలైన అనుభావాలతో సంభోగ శృంగారాభినయం చెయ్యాలి. దీనిలో ఆలస్యము, ఉగ్రత్వము, జుగుప్స అను వ్యభిచారి భావాల ప్రయోగం ఉండకూడదు.

**మూ. విప్రలమ్భకృతస్తు నిర్వేద – గ్లాని – శఙ్కా – అసూయా – శ్రమ – చిన్తా – ఔత్సుక్య – నిద్రా – స్వప్న – విబోధ – వ్యాధి – ఉన్మాద – అపస్మార – జాడ్య (మోహ) మరణాదిభిః అనుభావైః అభినేతవ్యః.**

**తా.** విప్రలంభశృంగారాన్ని నిర్వేదము, గ్లాని, శంక, అసూయ, శ్రమము, చింత, ఔత్సుక్యము. నిద్ర, స్వప్నము, మేల్కొనడం, వ్యాధి, ఉన్మాదము, అపస్మారము, జడత్వము, మోహము, మరణము మొదలైన అనుభావాలతో అభినయించాలి.

**మూ. అత్రాహ – యద్యయం రతిప్రభవః శృఙ్గారః కథమస్య కరుణాశ్రయిణః భావాః భవన్తి? అత్రోచ్యతే. పూర్వమేవాభిహితం సంభోగవిప్రలమ్భకృతః శృఙ్గారః ఇతి. వైశిక శాస్త్రకారైశ్చ దశావస్థోఽభిహితః. తాశ్చ సామాన్యాభినయే వక్ష్యామః.**

**తా.** ఇక్కడ ప్రశ్నిస్తున్నాడు – శృంగారం రతినుండిపుట్టినది కదా; కరుణకు సంబంధించిన భావాలు దీని కెలా ఉంటాయి? సమాధానం చెపుతున్నాం – శృంగారం సంభోగచేత విప్రలంభంచేత (వియోగంచేత) చేయబడుతుంది (కలుగుతుంది) అని పూర్వమే చెప్పాం కదా! అందుచేతనే కామశాస్త్రకారులు దీనిలో (శృంగారంలో) పది అవస్థలు ఉంటాయి అని చెప్పారు. వాటిని గూర్చి **సామాన్యాభినయప్రకరణంలో** చెపుతాం.

**మూ. కరుణస్తు శాప – క్లేశ – వినిపతితేష్టజన – విభవనాశ – వధ – బన్ధసముత్థః నిరపేక్షభావః. ఔత్సుక్యచిన్తాసముత్థః సాపేక్షభావో విప్రలమ్భః. ఏవమన్యః కరుణః అన్యశ్చ విప్రలమ్భ ఇతి. ఏవమేష సర్వభావసంయుక్తః శృఙ్గారో భవతి.**

**తా.** శాపము, క్లేశములు, పడిపోయిన (కష్టాలలో పడిన) ఇష్టజనులు, వైభవ నాశము, వధ, బంధము – వీటివల్ల కలిగిన నిరపేక్షభావం (పూర్తిగా ఆశ వదులు కొనడం) కరుణ. విప్రలభంలో నైతే ఔత్సుక్యంవల్ల చింతవల్ల సాపేక్షభావం (ఎప్పటికైనా ఈ కష్టంనుండి గట్టెక్కుతాం అనే ఆశ) ఉంటుంది. అందుచేత కరుణ వేరు విప్రలంభం వేరు. ఈ విధంగా శృంగారరసంలో అన్ని భావాలకు (వ్యభిచారిభావాలకు) అవకాశం ఉంటుంది.

**మూ. అపి చ –**

**సుఖప్రాయేషు సంపన్నః ఋతుమాల్యాదిసేవకః,**
**పురుషః ప్రమదాయుక్తః శృఙ్గార ఇతి సంజ్ఞితః. 46**

**తా.** మరొక విషయమేమనగా – సుఖప్రధానము లైనవాటియందు సంపన్నుడు, ఋతువులను, మాల్యాదులను సేవించేవాడు, తగిన ప్రమదతో కూడినవాడు అయిన పురుషుడే శృంగార మని చెప్పబడుచున్నాడు. అనగా పురుషుని ఇలాంటి స్థితి శృంగారము అని భావం.

**మూ. అపి చాత్ర సూత్రార్థానువిద్ధే ఆర్యే భవతః –**

**ఋతుమాల్యాలఙ్కారైః ప్రియజనగాన్ధర్వకావ్యసేవాభిః,**
**ఉపవనగమనవిహారైః శృఙ్గారరసః సముద్భవతి. 47**

**నయనవదనప్రసాదైః స్మితమధురవచోధృతిప్రమోదైశ్చ**
**మధురైశ్చాఙ్గవిహారైస్తస్యాభినయః ప్రయోక్తవ్యః. 48**

**ఇతి శృఙ్గారరసప్రకరణమ్**

**తా.** ఈ సందర్భంలో – సూత్రార్థంతో సంబంధించిన (సూత్రార్థాన్ని విశదీకరించే) రెండు ఆర్యలు కూడ ఉన్నాయి –

వసంతాదిఋతువులచేత, మాల్యములచేత, అలంకారాలచేత, ప్రియజనులను, సంగీతమును కావ్యములను సేవించడంచేత, అనగా వీటితో దగ్గర సంబంధంచేత, ఉద్యానవనమునకు వెళ్లడంచేత, అక్కడ విహరించడంచేత శృంగారరసం పుడుతుంది.

నేత్రాలు (చూపులు) ముఖము ప్రసన్నంగా ఉండడము, చిరునవ్వు, మధుర మైన మాటలు, మనః స్థైర్యము, మధురమైన అవయవాల కదలికలు – వీటితో శృంగారరసాభి నయం చెయ్యాలి.

## శృఙ్గారరసప్రకరణం సమాప్తం

## *అథ హాస్యరసప్రకరణమ్*

**మూ. అథ హాస్యో నామ హాసస్థాయిభావాత్మకః. స చ వికృతపరవేషాలంకార – ధార్ష్ట్య – లౌల్య – కుహకాసత్ప్రలాప – వ్యఙ్గదర్శన – దోషోదాహరణాదిభిః విభావైః ఉత్పద్యతే. తస్య ఓష్ఠ – నాసా – కపోలస్పన్దన – దృష్టివ్యాకోశ – ఆకుఞ్చన – స్వేద – ఆస్యరాగ – పార్శ్వగ్రహణాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః. వ్యభిచారిణశ్చాస్య అవహిత్థా – ఆలస్య – తన్ద్రా – నిద్రా – స్వప్న – ప్రబోధ – అసూయాదయః.**

**తా.** హాసం స్థాయిభావంగా గలది **హాస్యరసం.** ఇతరుల వికృతవేషము, అలంకారము, ధార్ష్ట్యము (పొగరు), చపలత్వము, కుహకము, చెడ్డ పేలాపన, అంగవికారము మొదలైన వాటిని చూడడం, ఏవైన దోషాలను (నత్తి మొదలైనవి) గూర్చి చెప్పడం మొదలైన విభావాలచేత హాస్యరసం పుడుతుంది. పెదవులు, ముక్కు, చెక్కిళ్లు మొదలైనవాటి స్పందనము (కదలడం), కళ్లు పెద్దవి చేయడం, చిన్నవి చేయడం, చెమట, ముఖం ఎఱ్ఱబడడం. పక్కలు చేతులతో పట్టుకొనడం మొదలైన అనుభవాలచేత అభినయించి హాస్యరసాన్ని ప్రయోగించాలి. అవహిత్థ, అలసత్వము, తంద్ర (బద్ధకం), నిద్ర, స్వప్నం, మేల్కొనడం, అసూయ మొద లైనవి హాస్యానికి వ్యభిచారిభావాలు.

**వి.** కుహకం అనగా చక్కిలిగింతలుపెట్టడం అని అభినవభారతి. వంచన, మోసం అను అర్థాలు చెపితే బాగుంటుంది.

**మూ. ద్వివిధశ్చాయమాత్మస్థః పరస్థశ్చ. యదా స్వయం హసతి తదా ఆత్మస్థః. యదా తు పరం హాసయతి తదా పరస్థః.**

**తా.** ఆత్మస్థము, పరస్థమూ అని హాస్యం రెండు విధాలు. తాను నవ్వినపుడు ఇది **ఆత్మస్థం.** పరులను నవ్వంచి నప్పుడు ఇది **పరస్థం.**

**మూ. అత్రానువంశ్యే ఆర్యే భవతః -**
**విపరీతాలఙ్కారైర్వికృతాచారాభిధానవేషైశ్చ,**
**వికృతైరర్థవిశేషైర్హసతీతి రసః స్మృతో హాస్యః. 49**

**తా.** ఈ విషయంలో రెండు అనువంశ్య ఆర్య లున్నాయి -

విపరీతమైన అలంకారాలచేత, వికృతమైన ఆచారం (ఆచరణ) చేత, పేర్లచేత, వేషాలచేత, వికృతమైన ఆ యా విషయాలచేత, మానవుడు నవ్వుతాడు. అందుచేత అది హాస్య మను రసంగా చెప్పబడింది. ఇది **ఆత్మస్థహాస్యం.**

**మూ. వికృతాచారైః వాక్యైః అఙ్గవికారైశ్చ వికృతవేషైశ్చ,**
**హాసయతి జనం యస్మాత్ తస్మాత్ జ్ఞేయో రసో హాస్యః. 50**

**తా.** వికృతమైన ప్రవర్తనలచేత, వికృతమైన మాటలచేత, అవయవవికారాలచేత వికృత మైన వేషాలు ధరించడంచేత ఇతరులను నవ్వింపచేస్తాడు. ఇది **పరస్థహాస్యం.**

**మూ. స్త్రీనీచప్రకృతావేష భూయిష్ఠం దృశ్యతే రసః,**
**షడ్భేదాశ్చాస్య విజ్ఞేయాః తాంశ్చ వక్ష్యామ్యహం పునః. 51**

**తా.** ఈ రసం తరచు స్త్రీలలోను, నీచప్రకృతి గల మనుషులలోను కనబడు తూన్నది. దీనిలో ఆరు భేదా లున్నాయి. వాటిని కూడ నేను చెపుతాను.

**మూ. స్మితమథ హసితం విహసితముపహసితం చాపహసితమతిహసితమ్,**
**ద్వౌ ద్వౌ భేదౌ స్యాతాముత్తమమధ్యాధమప్రకృతౌ. 52**

**తా.** స్మితము, హసితము, విహసితము, ఉపహసితము, అపహసితము, అతిహసితము అను ఆరు విధాల హసితభేదాలలో రెండేసి వరుసగా ఉత్తమ - మధ్యమ - అధమప్రకృతులైన వాళ్లలో ఉంటాయి.

**మూ. తత్ర -**
**స్మితహసితే జ్యేష్ఠానాం మధ్యానాం విహసితోపహసితే చ,**
**అధమానామపహసితం హ్యతిహసితం చాపి విజ్ఞేయమ్. 53**

**తా.** ఉత్తమప్రకృతి గలవాళ్లకు స్మిత - హసితాలు, మధ్యమప్రకృతి గలవాళ్లకు విహసితోపహసితాలు. అధములకు అపహసిత - అతిహసితాలు ఉంటాయి.

**మూ. అత్ర శ్లోకాః -**
**ఈషద్వికసితైర్గణ్డైః కటాక్షైః సౌష్ఠవాన్వితైః,**
**అలక్షితద్విజం ధీరముత్తమానాం స్మితం భవేత్. 54**

**ఉత్ఫుల్లాననేత్రం తు గణ్డైర్వికసితైరథ,**
**కించిల్లక్షితదన్తం చ హసితం తద్విధీయతే. 55**

**తా.** కొంచెం వికసించిన చెక్కిళ్లతో, చక్కగా అందంగా ఉన్న క్రీగంటి చూపులతో, దంతాలు కనబడకుండగా ధీరంగా గంభీరంగా ఉన్న చిరునవ్వు స్మితం. అది ఉత్తమ ప్రకృతులలో ఉంటుంది.

చెక్కిళ్లు కొంచెం వికసించగా, ధీరంగా ముఖము నేత్రాలూ కూడ బాగా ఉత్ఫుల్లము లువుతాయి (వికసిస్తాయి). దంతాలు కొంచెం పైకి కనబడతాయి. ఇది హసితం. ఇది కూడ ఉత్తప్రకృతులలోనే ఉంటుంది.

**మూ. అథ మధ్యమానామ్ –**

**ఆకుఞ్చితాక్షిగణ్డం యత్సస్వనం మధురం తథా,**
**కాలాగతం సాస్యరాగం తద్వై విహసితం భవేత్. 56**
**ఉత్ఫుల్లనాసికం యత్తు జిహ్మదృష్టినిరీక్షితమ్,**
**నికుఞ్చితాఙ్గకశిరస్తచ్చోపహసితం భవేత్. 57**

**తా.** కళ్లూ గండస్థలాలూ కొంచెం వంగుతాయి. మధురమైన ధ్వని ఉంటుంది. ముఖం ఎఱ్ఱబడుతుంది. తగిన సమయంలో (కారణం ఉంటేనే) వస్తుంది. అది **విహసితం.**

ఏ నవ్వులో ముక్కు వికసిస్తుందో, కంటి చూపు వక్రంగా ఉంటుందో, ఒడలూ శిరస్సూ కూడ వంచబడతాయో అది **ఉపహసితం.**

ఈ రెండు విధాల హాస్యాలూ మధ్యమప్రకృతులవి.

**మూ. అథాధమానామ్ :–**

**అస్థానహసితం యత్తు సాస్రునేత్రం తథైవ చ,**
**ఉత్కమ్పితాంసకశిరః తచ్చాపహసితం భవేత్. 58**
**సంబద్ధం సాస్రునేత్రం చ వికృష్టస్వరముద్ధతమ్,**
**కరోపగూఢపార్శ్వం చ తచ్చాతిహసితం భవేత్. 59**

**తా.** కన్నీళ్లతో నిండిన కళ్లతో, బుజాలూ శిరస్సూ ఉగిపోతూ అస్థానంలో, నవ్వకూడని చోట నవ్వే నవ్వు **అపహసితం.**

చాలా హడావిడి చేస్తూ, కళ్లనుండి నీళ్లు కారుతూండగా, కర్ణకఠోరమైన ధ్వనితో రెండు చేతులతో రెండు పార్శ్వాలూ పట్టుకొంటూ బిగ్గరగా నవ్వే నవ్వు **అతిహసితం.** ఈ రెండు విధాలైన హసితములూ కూడ అధమప్రకృతిగలవారిలో కనబడుతాయి.

**మూ. హాస్యస్థానాని యాని స్యుః కార్యోత్పన్నాని నాటకే,**
**ఉత్తమాధమమధ్యానామేవం తాని ప్రయోజయేత్. 60**

**తా.** నాటకంలో ఉత్తమాధమ మధ్యములకు సంబంధించిన హాస్యానికి అవసరం ఏర్పడినప్పుడు వాటిని ఈ విధంగా ప్రయోగించాలి.

**మూ. ఇత్యేష స్వసముత్థస్తథా పరసముత్థశ్చ విజ్ఞేయః,**
**ద్వివిధస్త్రిప్రకృతిగతస్త్ర్యవస్థగతో రసో హాస్యః. 61**

**ఇతి హాస్యప్రకరణమ్.**

**తా.** ఈ విధంగా స్వసముత్థము, పరసముత్థము అని రెండు విధా లైనదీ, ఉత్తమ మధ్యమ – అధమప్రకృతిగత మవడంచేత త్రిప్రకృతి అయిన మూడు అవస్థలు గల రసం హాస్యం.

**వి.** ఇతరులకు సంక్రమించని, స్మిత – హసిత – విహసితాలు **ఆత్మసముత్థములు.** పరులలో సంక్రమించే ఉపహసిత – అపహసిత – అతిహసితాలు **పరసముత్థాలు (అభినవభారతి).**

**హాస్యప్రకరణం సమాప్తం.**

***అథ కరుణప్రకరణమ్***

**మూ. అథ కరుణో నామ శోకస్థాయిభావప్రభవః. స చ శాప – క్లేశవినిపతితేష్టజన– విప్రయోగ – విభవనాశ – వధ – బన్ధ – విద్రవ – ఉపఘాత – వ్యసనసంయోగాదిభిః విభావైః సముపజాయతే. తస్య అశ్రుపాత – పరిదేవన – ముఖశోషణ – వైవర్ణ్య – స్రస్తగాత్రతా – నిఃశ్వాస – స్మృతిలోపాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః. వ్యభిచారిణశ్చాస్య నిర్వేదగ్లాని – చిన్తా – ఔత్సుక్య – ఆవేగ – భ్రమ – మోహ – శ్రమ – భయ – విషాద – దైన్య – వ్యాధి – జడతా – ఉన్మాద – అపస్మార – త్రాస – ఆలస్య – స్మరణ – స్తమ్భ – వేపథు – వైవర్ణ్య – అశ్రు – స్వరభేదాదయః.**

**తా.** కరుణరసం శోకం అను స్థాయిభావంనుండి పుడుతుంది. అది శాపంచేత కష్టాలలో చిక్కుకొన్న లేదా ఏదో కష్టంలో చిక్కుకొన్న ఇష్టజనులు, వియోగం, వైభవనాశం, వధ, బంధము, లోకోపద్రవము తలచినదానికి ఎదురుదెబ్బలు తగలడం, లేదా ఆకస్మికంగా శరీరానికి దెబ్బలు తగలడం, వ్యవసనంతో సంబంధము (వ్యసనం కలగడం) మొదలైన విభావాలచేత కలుగుతుంది. కన్నీళ్లు, విలపించడం, ముఖం ఎండిపోవడం, ముఖం రంగు మారిపోవడం, అవయవాలు జారిపోవడం, నిట్టూర్పు, మరుపు, మొదలైన అనుభావాలచేత దీని అభినయం చెయ్యాలి. దీనికి – నిర్వేదము, గ్లాని, చింత, ఔత్సుక్యం,

ఆవేగం, భ్రమ, మోహం, శ్రమ, భయం, విషాదం, దైన్యం, వ్యాధి, జడత్వం, ఉన్మాదం, మూర్ఛ, త్రాసం (దిగులు), అలసత్వం, మరణం, స్తంభం (కొయ్యబారడం), వణుకు, రంగు మారిపోవడం, కన్నీళ్లు, కంఠస్వరంలో వికారం, మొదలైనవి వ్యభిచారులు.

**మూ. అత్యార్యే భవతః –**

**ఇష్టవధదర్శనాద్వా విప్రియవచనస్య సంశ్రవాద్వాపి,**
**ఏభిర్భావవిశేషైః కరుణరసో నామ సంభవతి. 62**

**సస్వనరుదితైర్మోహాగమైశ్చ పరిదేవితైర్విలపితైశ్చ,**
**అభినేయః కరుణరసో దేహాయాసాభిఘాతైశ్చ. 63**

**ఇతి కరుణరసప్రకరణం.**

**తా.** ఇష్టులైనవారి వధను చూడడంవల్ల గాని, అప్రియ మైన వార్త వినడంవల్ల గాని, ఈ విధమైన ఇతరమైన భావవిశేషాలవల్ల గాని, (లేదా ఇలాంటి భావవిశేషాలతో,) కరుణ అనే రసం పుడుతుంది. బిగ్గరగా ఏడ్పులచేత మోహం చెందుతూండ డంచేత, పరిదేవితములచేత (దైవాన్నీ, ఇతరులనూ నిందించడంచేత), విలాపాలచేత తన దేహాన్ని ఆయాసపెట్టే రొమ్ము బాదుకొనడం వంటి పనులు చేయడం చేతా కరుణ రసాన్ని అభినయించాలి.

**కరుణరసప్రకరణం సమాప్తం.**

## *అథ రౌద్రరసప్రకరణమ్*

**మూ. అథ రౌద్రో నామ క్రోధస్థాయిభావాత్మకః. రక్షోదానవోద్ధతమనుష్యప్రకృతిః సంగ్రామ హేతుకః. స చ క్రోధ – ఆఘర్షణ – అధిక్షేప – అనృతవచన – ఉపఘాత – వాక్పారుష్య – అభిద్రోహ – మాత్సర్యాదిభిః విభావైః ఉత్పద్యతే. తస్య చ తాడన – పాటన – పీడన – ఛేదన – భేదన – ప్రహరణాహరణ – శస్త్రసంపాత – సంప్రహార – రుధిరాకర్షాద్యాని కర్మాణి. పునశ్చ రక్తనయన – భృకుటీకరణ – దన్తోష్ఠపీడన – గణ్డస్ఫురణ – హస్తా గ్రనిష్పేషాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.**

**తా.** రౌద్రరసానికి స్థాయిభావం క్రోధం. దీనికి ప్రకృతి (ఆశ్రయం) రాక్షసులు, దానవులు, ఉద్ధతమనుష్యులు (తీవ్రస్వభావం గల భీమసేనాదులు). యుద్ధం దీనికి హేతువు. క్రోధంతో లాగడం, నిందించడం, అసత్యవచనం, దెబ్బతగలడం, పరుష వాక్కులు, ద్రోహము, మాత్సర్యం మొదలైన విభావాలవల్ల పుడుతుంది. కొట్టడం, చీల్చడం, పీడించడం, ఛేదించడం, బద్దలుకొట్టడం, ఆయుధాలు ప్రయోగించడం, ఆయుధాలతో కొట్టడం, రక్తం లాగడం మొదలైన పనులు దీనివల్ల జరుగుతాయి. ఎఱ్ఱని నేత్రాలు, కను

బొమ్మలు విరవడం, దంతాలు పెదవులు బిగించడం, చెక్కిళ్లు కదలడం, అరిచేతులు పిండడం మొదలైన అనుభావాలచేత రౌద్రరసాభినయం చెయ్యాలి.

**మూ. భావాశ్చాస్య అసమ్మోహ - ఉత్సాహ - ఆవేగ - అమర్ష - చపలతా - ఔగ్ర్య - గర్వ - స్వేద - వేపథు - రోమాఞ్చ - గద్గదాదయః.**

**తా.** సంమోహం లేకపోవడం, ఉత్సాహము, ఆవేగము, అమర్షము, చపలత, ఉగ్రత్వము, గర్వము, చెమట, వణకు, రోమాంచము, గద్గదస్వరము మొదలైనవి దీనికి సంబంధించిన భావాలు (వ్యభిచారిసాత్త్వికభావాలు).

**మూ. అత్రాహ - యదభిహితం రక్షోదానవాదీనాం రౌద్రో రసః - కిమన్యేషాం నాస్తి? ఉచ్యతే. అస్త్యన్యేషామపి రౌద్రో రసః. కింత్వధికారోఽత్ర గృహ్యతే. తే హి స్వభావత ఏవ రౌద్రాః. తస్మాత్? బహుబాహవః, బహుముఖాః, ప్రోద్ధూతవికీర్ణపిఙ్గలశిరోజాః, రక్తోద్వృత్తవిలోచనాః, భీమాసితరూపిణశ్చైవ. యచ్చ కించిత్సమారభన్తే స్వభావచేష్టితం వాగఙ్గాదికం తత్సర్వం రౌద్రమేతేషామ్. శృఙ్గారశ్చ తైః ప్రాయశః ప్రసభం సేవ్యతే. తేషాం చానుకారిణో యే పురుషాః తేషామపి సంగ్రామసంప్రహారకృతః రౌద్రో రసః అనుమన్తవ్యః.**

**తా.** (ప్రశ్న) ఇక్కడ అంటున్నాడు - రౌద్రరసం రాక్షసదానవాదులకు సంబంధించినది అని అంటున్నావు కదా? ఇది ఇతరులలో ఉండదా? (సమాధానం) చెపుతున్నాం; విను. రౌద్రరసం ఇతరులకు కూడా ఉంటుంది. కాని ఈ విషయంలో రాక్షసాదులలో ఉన్న అధికారం (రౌద్రరసానువృత్తి) గ్రహింపబడుతుంది. ఎందువల్ల ననగా వాళ్లు సహజంగా స్వభావంచేతనే రౌద్రులు. ఎందువల్ల? వాళ్లకు చాలా చేతులు, చాలా ముఖాలు, ఉంటాయి. ఎఱ్ఱగా ఉన్న జుట్టు విరమోసికొని ఉంటారు. ఎఱ్ఱని కళ్లు గుడ్లు తిప్పుతూ ఉంటారు. నల్లగా భయంకర మైన రూపాలతో ఉంటారు. వాళ్లు మామూలుగా చేసే పనులు, మాటలు తీరూ కూడ రౌద్రంగానే ఉంటాయి. వాళ్ల శృంగారసేవ కూడ చాల మోటగా ఉంటుంది. వాళ్లను అనుకరించే పురుషులలో కూడ యుద్ధమూ, ఆయుధప్రయోగమూ మొదలైనవాటిచే ఏర్పడు రౌద్రం ఉంటుం దని అంగీకరించాలి; వాళ్లు ఆ విధంగా ప్రవర్తించాలి.

**మూ. అత్రానువంశ్యే ఆర్యే భవతః -**

**యుద్ధప్రహారఘాతనవికృతచ్ఛేదన విదారణైశ్చైవ,**
**సంగ్రామసంభ్రమాద్యైరేభిః సంజాయతే రౌద్రః. 64**

**నానాప్రహరణమోక్షైః శిరఃకబన్ధభుజకర్తనైశ్చైవ,**
**ఏభిశ్చార్థవిశేషైః అస్యాభినయః ప్రయోక్తవ్యః. 65**

**తా.** ఈ సందర్భంలో రెండు అనువంశ్యఆర్యలు ఉన్నాయి.

యుద్ధము, చంపివేయడము, అవయవాలు నరికివేయడము. వికారంగా శరీరం ఛేదించడము, చీల్చివేయడము, యుద్ధంకోసం ఆయుధాలు పట్టడం మొదలైన హడావిడి వీటి అన్నింటిచేతా రౌద్రం పుడుతుంది.

అనేకవిధాలైన ఆయుధాల ప్రయోగంచేత, శిరస్సులను, మొండెములను, భుజాలను ఖండించడంచేత, ఇంకా ఇలాంటి పనులచేత రౌద్రరసాభినయం ప్రయోగించాలి.

**మూ. ఇతి రౌద్రరసో దృష్టో రౌద్రవాగఙ్గచేష్టితః,**
**శస్త్రప్రహారభూయిష్ఠః ఉగ్రకర్మక్రియాత్మకః. 66**

**ఇతి రౌద్రప్రకరణమ్.**

**తా.** ఈ విధంగా రౌద్రరసం రౌద్రమైన మాటలూ, శారీరచేష్టలు, అధికమైన ఆయుధప్రయోగమూ ఉగ్రమైన పనులు చేయడం అనే స్వరూపంతో కనబడుతుంది.

**రౌద్రరసప్రకరణం సమాప్తం.**

***అథ వీరరసప్రకరణమ్***

**మూ. అథ వీరో నామ ఉత్తమప్రకృతిః ఉత్సాహాత్మకః. స చ అసంమోహ – అధ్యవసాయ – నయ – వినయ – బల – పరాక్రమ – శక్తి – ప్రతాప – ప్రభావాదిభిః విభావైరుత్పద్యతే. తస్య – స్థైర్య – ధైర్య – శౌర్య – త్యాగ – వైశారద్యాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః. భావాశ్చాస్య ధృతి – మతి – గర్వ – ఆవేగ – ఔగ్ర్య – అమర్ష – స్మృతి – రోమాఞ్చాదయః.**

**తా.** వీరరసం ఉత్తమప్రకృతి గలది, ఉత్సాహస్వరూప మైనది. సంమోహం (ఏమి చెయ్యాలో తెలియని స్థితి) లేకపోవడం, నిశ్చితమైన ఆలోచన, నీతి, వినయం, బలం, పరాక్రమం, శక్తి, ప్రతాపం, ప్రభావం ఈ విభావాలవల్ల పుడుతుంది. స్థైర్యం, ధైర్యం, శౌర్యం, త్యాగం, నేర్పుమొదలైన అనుభవాలతో దీని అభినయం ప్రయోగించాలి. ధృతి, మతి, గర్వం, ఆవేశం, ఉగ్రత్వం, అమర్షం (కోపం) స్మృతి, రోమాంచం మొదలైనవి దీని భావాలు (వ్యభిచారి – సాత్త్వికభావాలు).

**వి. అసంమోహాధ్యవసాయం** అనగా యథార్థస్థితిని జాగర్తగా తెలిసికొని నిర్ణయం తీసికొనడం. సంధి మొదలైన షడ్గుణాలను సరిగా ప్రయోగించడం నయం. ఇంద్రియ జయం **వినయం.** చతురంగసైన్యం **బలం.** శత్రుమండలాక్రమణం **పరాక్రమం.** యుద్ధాది సామర్థ్యం **శక్తి.** శత్రువులను బాధించగలడు అను ప్రసిద్ధి **ప్రతాపం.** అభిజనులు, ధనం, మంత్రులు మొదలైనవాటి సంపత్తి (సమృద్ధి) **ప్రభావం** (అ.భా.).

**మూ. అత్రార్యే రసవిచారముఖే :-**

**ఉత్సాహాధ్యవసాయాదవిషాదిత్వాదవిస్మయామోహాత్,**
**వివిధాదర్థవిశేషాద్వీరరసో నామ సంభవతి. 67**

**స్థితిధైర్యవీర్యగర్వైరుత్సాహపరాక్రమప్రభావైశ్చ,**
**వాక్యైశ్చాక్షేపకృతైర్వీరరసః సమ్యగభినేయః. 68**

**ఇతి వీరరసప్రకరణమ్**

**తా.** ఈ సందర్భంలో, రసవిచారప్రారంభంలో రెండు సాంప్రదాయికములైన ఆర్యలు – ఉత్సాహము, అధ్యవసాయము, అవిషాదము, అవిస్మయం (చిన్నవిషయానికి కూడ ఆశ్చర్యపడడం విస్మయం. అది లేకపోవడం అవిస్మయం), మోహం లేకపోవడం, ఇలాంటి అనేకవిషయాలవల్ల వీరరసం పుడుతుంది.

స్థితి, ధైర్యము, వీర్యము, గర్వము, ఉత్సాహము, పరాక్రమము, ప్రభావము – వీటితోను, ఆక్షేపించే మాటలతోను వీరరసాన్ని బాగా అభినయించాలి.

**వీరరసప్రకరణం సమాప్తం.**

***అథ భయానకరసప్రకరణమ్***

**మూ. అథ భయానకో నామ భయస్థాయిభావాత్మకః. స చ వికృతరవ – సత్త్వదర్శన – శివోలూకత్రాసోద్వేగ – శూన్యాగారారణ్యగమన – స్వజనవధబన్ధదర్శన – శ్రుతికథాది భిర్విభావైరుత్పద్యతే. తస్య ప్రవేపిత కరచరణ – నయనచాపల – పులక – ముఖ – వైవర్ణ్య – స్వరభేదాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః. భావాశ్చాస్య స్తమ్భ – స్వేద – గద్గద – రోమాఞ్చ – వేపథు – స్వరభేద – వైవర్ణ్య – శంకా – మోహ – దైన్య – ఆవేగ – చాపల – జడతా – త్రాస – అపస్మార – మరణాదయః.**

**తా.** భయానకరసానికి భయం స్థాయిభావం. వికృతమైన ధ్వని (వినబడడం) పిశాచాదులను చూడడం, నక్కల, గుడ్లగూబల భయంవల్ల ఉద్వేగం, అనగా అవి భయపడి అరుస్తూండగా విని లేదా చూచి ఉద్వేగం చెందుట, శూన్యగృహంలోనికి, శూన్యారణ్యం లోనికి వెళ్లడం, తనవాళ్ల వధను గాని, బంధనాన్ని చూడడం, లేదా వినడం లేదా దాని గూర్చి సంభాషణ – మొదలైనవాటినుండి భయానకరసం పుడుతుంది. చేతులు కాళ్లు వణకిపోవడం, కళ్లు తిరిగిపోవడం, పులకలు, ముఖం రంగు మారిపోవడం, కంఠస్వరం మారిపోవడం మొదలైన అనుభావాలతో దీని అభినయం ప్రయోగించాలి.

స్తంభము, స్వేదము, దగ్గుత్తిక, రోమాంచము, వణుకు – స్వరం మారిపోవడం,

దైన్యం, ఆవేగం (కంగారు), చపలత్వం, జడత, త్రాసము, అపస్మారం, మరణం మొదలైనవి దీని భావాలు (వ్యభిచారి – సాత్త్వికభావాలు).

**మూ. అత్రార్యాః–**

**వికృతరవసత్త్వదర్శనసంగ్రామారణ్యశూన్యగృహగమనాత్,**
**గురునృపయోరపరాధాత్కృతకశ్చ భయానకో జ్ఞేయః. 69**

**తా.** ఈ విషయంలో మూడు ఆర్య లున్నాయి – వికృతమైనధ్వని (అట్టహాసాదికం) వినబడడం, పిశాచాదులు కనబడడం, యుద్ధరంగంలోకి, శూన్యగృహంలోకి, అరణ్యంలోకి ప్రవేశించడం – వీటివలన భయానకరసం పుడుతుంది. గురువుల (పెద్దవాళ్ల) విషయంలో కాని, రాజు విషయంలో కాని తనవలన ఏదైన అపరాధం జరిగి నప్పుడు చాల భయపడి నట్లు అభినయిస్తే అది కృత్రిమమైన భయానకం.

**మూ. గాత్రముఖదృష్టిభేదైరూరుస్తమ్భాభివీక్షణోద్వేగైః,**
**సన్నముఖశోషహృదయస్పన్దనరోమోద్గమైశ్చ భయమ్. 70**

**తా.** అవయవాలలోను, ముఖంలోను, నేత్రాలలోను మార్పుల చేత, కాళ్లు బిగిసి పోవడంచేత, నాలుగు దిక్కుల వైపూ చూస్తుండడంచేత, ఉద్వేగంచేత (మనస్సులో కంగారుచేత) చిక్కిపోయిన ముఖం ఎండిన ట్లయిపోవడంచేత, గుండె కొట్టుకొనడంచేత, రోమాంచంచేత భయానకాన్ని అభినయించాలి.

**మూ. ఏతత్స్వభావజం స్యాత్ సత్త్వసముత్థం తథైవ కర్తవ్యమ్,**
**పునరేభిరేవ కార్యైః కృతకం మృదుచేష్టితైః కార్యమ్. 71**

**తా.** స్వాభావిక మైన భయం ఈ విధంగా ఉండాలి. పిశాచాదులవల్ల భయం కూడ ఇలాగే అభినయించాలి. కృత్రిమభయం విషయంలో కూడ ఇవే భావాలను ప్రయోగించి అభినయించాలి; అయితే ఆ భావాలు మృదువు లైన చేష్టల ద్వారా చూపాలి.

**మూ. కరచరణవేపథుస్తమ్భగాత్రహృదయకమ్పేన,**
**శుష్కోష్ఠతాలుకణ్ఠైః భయానకో నిత్యమభినేయః. 72**

**ఇతి భయానకరసప్రకరణమ్.**

**తా.** చేతులు కాళ్లు వణికిపోవడం, దేహం కొయ్యబారిపోవడం, గుండె కొట్టుకొనడం, పెదవులు, చెలివిలు, కంఠము ఎండిపోవడం – వీటితో భయానకరసాన్ని అభినయించాలి.

**భయానకప్రకరణం సమాప్తం.**

## *అథ బీభత్సరసప్రకరణమ్*

**మూ. అథ బీభత్సో నామ జుగుప్సాస్థాయిభావాత్మకః, స చ అహృద్య - అప్రియ - అరోష్య - అనిష్టశ్రవణదర్శనకీర్తనాదిభిః విభావైరుత్పద్యతే. తస్య సర్వాఙ్గ సంహార - ముఖవికూణన - ఉల్లేఖన - నిష్ఠీవన - ఉద్వేజనాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః. భావాశ్చాస్య అపస్మారోద్వేగమోహవ్యాధిమరణాదయః.**

**తా.** ఇపుడు జుగుప్స (ఏవగింపు) స్థాయిభావంగా గల బీభత్సం చెప్పబడుచున్నది - ఇంపైనవి కానివి, అప్రియములు, తిన తగనివి, అనిష్టములు అయినవాటిని చూడడం, వాటిని గూర్చి వినడం, వాటిని గూర్చి చెప్పుకొనడం మొదలైన విభావాలచేత బీభత్సరసం పుడుతుంది. అన్ని అవయవాలు ముణుచుకొనడం, ముఖం వంకరగా తిప్పడం, కాండ్రించడం, ఉమ్మివేయడం, ఉద్వేజనం (అసహించుకోవడం) మొదలైన అనుభావాలచేత దానిని అభినయించాలి. అపస్మారం, ఉద్వేగం, ఆవేగం, మోహం, వ్యాధి, మరణం మొదలైనవి దీని భావాలు.

**మూ. అత్రానువంశ్యే ఆర్యే భవతః -**

**అనభిమతదర్శనేన చ గన్ధరసస్పర్శశబ్దదోషైశ్చ,**
**ఉద్వేజనైశ్చ బహుభిః బీభత్సరసః సముద్భవతి. 73**

**ముఖనేత్రనికూణనయా నాసాప్రచ్ఛాదనావనమితాస్యైః,**
**అవ్యక్తపాదపతనైః బీభత్సః సమ్యగభినేయః. 74**

**ఇతి బీభత్సరసప్రకరణమ్.**

**తా.** ఈ రసం విషయంలో రెండు అనువంశ్యార్య లున్నాయి .

ఇష్టం కాని వస్తువును చూడడంచేత, గంధ - రస - స్పర్శ - శబ్దాలలోని దోషాలచేత అసహ్యం కలిగించే ఇంకా అనేకమైన వస్తువులచేత బీభత్సరసం పుడుతుంది.

ముఖమూ నేత్రాలూ వంకరగా తిప్పడంచేత, ముక్కు కప్పుకొనడంచేత, ముఖం క్రిందికి వంచుకొనడంచేత నడకలో తొట్రుబాటుచేత బీభత్సరసం బాగా అభినయించాలి.

**బీభత్సరసప్రకరణం సమాప్తం.**

## *అథ అద్భుతరసప్రకరణమ్*

**మూ. అథ అద్భుతో నామ విస్మయస్థాయిభావాత్మకః. స చ దివ్యజనదర్శన - ఈప్సిత మనోరథాప్తి - ఉపవనదేవకులాదిగమన - సభా - విమాన - మాయా - ఇన్ద్రజాల సంభావనాదిభిః విభావైః ఉత్పద్యతే. తస్య నయనవిస్తార - అనిమిషప్రేక్షణ - రోమాఞ్చ**

**అశ్రు – స్వేద – హర్ష – సాధువాద – దానప్రబన్ధ – హాహాకార – బాహువదనచేలాఙ్గులి భ్రమణాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః. భావాశ్చాస్య స్తమ్భ – అశ్రు – స్వేద – గద్గద – రోమాఞ్చ – ఆవేగ – సంభ్రమ – జడతా – ప్రలయాదయః.**

**తా.** ఇప్పుడు విస్మయం స్థాయిభావంగా గల అద్భుతరసాన్ని గూర్చి చెప్పబడుచున్నది – దివ్యజనుల దర్శనం, అనుకొన్న కోరిక తీరడం, ఉద్యాన – దేవాలయాదులకు వెళ్లడం, సభ – విమానము (అందమైన భవనము) మాయ – ఇంద్రజాలము – ఆదరంతో చేసిన సత్కారము మొదలైన విభావాలచేత అద్భుతరసం ఉత్పన్నం అవుతుంది. కళ్లు పెద్దవిగా చేయడం, రెప్పపాటు లేకుండా చూడడం. రోమాంచం, కన్నీళ్లూ, స్వేదము, సంతోషము, 'బాగు బాగు' అనడం, ధనం ఇవ్వడం, నిరంతరంగా ఆహా ఆహా అని బిగ్గరగా అనడం, చేతులు, ముఖము, చేతిలోని వస్త్రము వేళ్లు తిప్పడం మొదలైన అనుభవాలతో అద్భుతరసాభినయం ప్రయోగించాలి. స్తంభము, కన్నీరు, గద్గదస్వరము, రోమాంచము, ఆవేగమూ, సంభ్రమము, జడత్వము ప్రలయము (సంజ్ఞ లేకపోవడం) మొదలైనవి దీని భావాలు.

**మూ. అత్రానువంశ్యే అర్యే భవతః –**

**యత్త్వతిశయార్థయుక్తం వాక్యం శిల్పం చ కర్మరూపం వా,**
**తత్సర్వమద్భుతరసే విభావరూపం హి విజ్ఞేయమ్. 75**

**స్పర్శగ్రహోల్లుకసనైః హాహాకారైశ్చ సాధువాదైశ్చ,**
**వేపథుగద్గదవచనైః స్వేదాద్యైరభినయస్తస్య. 76**

**ఇత్యద్భుతరసప్రకరణం**

**తా.** ఈ విషయంలో అనువంశ్యార్యలు రెండున్నాయి –

ఏదో ఒక వైశిష్ట్యంతో కూడిన అర్థం గల వాక్కు, అందమైన శిల్పము, ప్రశంసనీయమైన కర్మ – ఇవన్నీ అద్భుతరసంలో విభావా లని గ్రహించాలి.

స్పర్శ, గ్రహణము, ఉల్లుకసనము, హాహాకారము, 'బాగుబాగు' అనడము, వణుకు, గద్గరస్వరము. స్వేదము మొదలైనవాటితో అద్భుతరసాన్ని అభినయించాలి.

**వి. స్పర్శ :–** కళ్లు సగం మూసి, కనుబొమ్మలు పైకి ఎత్తి బుజాలు చెక్కిళ్ల వైపు ఎగరవేయడం (shrugging) స్పర్శ. పారవశ్యంలో ప్రక్కనున్నవాళ్లనో, ఏదైనవస్తువునో పట్టుకొనడం **గ్రహం.** కూర్చున్నచోటనే త్రుళ్లిపడడం **ఉల్లుకసనం.**

**అద్భుతరస ప్రకరణం సమాప్తం.**

## *రసాలలో మూడేసి విధాలు, అద్భుతంలో రెండు విధాలు*

**మూ. శృఙ్గారం త్రివిధం విద్యాద్వాఙ్నైపథ్యక్రియాత్మకమ్,**
**అఙ్గనైపథ్యవాక్యైశ్చ హాస్యరౌద్రౌ త్రిధా స్మృతౌ. 77**

**తా.** వాక్కు, నైపథ్యం (వేషము), క్రియ (చేష్టలు) అని శృంగారం మూడు విధాలు. అట్లే హాస్యరౌద్రాలు, శరీరచేష్టలు, వేషము – మాటలు – వీటిచేత మూడు విధాలు.

**మూ. ధర్మోపఘాతజశ్చైవ తథార్థాపచయోద్భవః,**
**తథా శోకకృతశ్చైవ కరుణస్త్రివిధః స్మృతః. 78**

**తా.** ధర్మానికి విఘాతం ఏర్పడడంవల్ల కలిగినది, ధనం తరిగిపోవడంవల్ల, లేదా అనుకొన్న ప్రయోజనానికి లోపం కలగడంవల్ల కలిగినది, శోకంవల్ల, కలిగినది అని కరుణరసం మూడు విధాలు.

**మూ. దానవీరం ధర్మవీరం యుద్ధవీరం తథైవ చ,**
**రసం వీరమపి ప్రాహ బ్రహ్మా త్రివిధమేవ హి. 79**

**తా.** దానవీరం, ధర్మవీరం, యుద్ధవీరం అని వీరరసం మూడు విధాలు అని బ్రహ్మదేవుడు చెప్పాడు.

**మూ. వ్యాజాచ్చైవాపరాధాచ్చ విత్రాసితకమేవ చ,**
**పునర్భయానకం చైవ విద్యాత్ త్రివిధమేవ హి. 80**

**తా.** కృత్రిమము, అపరాధంవల్ల కలిగినది, భయహేతువు కనబడడంవల్ల కలిగినది అని భయానకం కూడ మూడు విధములు.

**మూ. బీభత్సః క్షోభజః శుద్ధ ఉద్వేగీ స్యాత్ ద్వితీయకః,**
**విష్ఠాకృమిభిరుద్వేగః క్షోభజో రుధిరాదిజః. 81**

**తా.** చిత్తక్షోభవలన కలిగిన **బీభత్సం శుద్ధం;** ఉద్వేగిబీభత్సం రెండవది. విష్ఠ (మలాదికము) కృములుమొదలైన అశుద్ధమైన విభావాలవల్ల కలిగినది **ఉద్వేగజ బీభత్సము.** రక్తమాంసాదులు చూడగా కలిగిన చిత్తక్షోభచే కలిగినది **క్షోభజబీభత్సము.**

**వి.** ఈ విధంగా శ్లోకంలో ఉన్నదానిని పట్టి బీభత్సం; శుద్ధము, ఉద్వేగి అని రెండు విధాలే అన్నట్లు తెలుస్తున్నది. అభినవగుప్తుడు మాత్రం తన గురువుల అభిప్రాయం ఉటంకిస్తూ విష్ఠాదుల ద్వారా కలిగినది రుధిరాదిదర్శనంవల్ల కలిగినదీ కూడ అశుద్ధమే అని అంటూ, యోగశాస్త్రంలో చెప్పి నట్లు శరీరాదుల విషయంలోనే జగుప్స కలగడం

చేత ఏర్పడిన బీభత్సం మోక్షహేతువు గాన అది శుద్ధం అనిసూచించాడు. ఈవిధంగా బీభత్సంలోకూడ మూడుభేదాలు అంగీకరించినట్లయింది.

**మూ. దివ్యశ్చానన్దజశ్చైవ ద్విధా ఖ్యాతోఽద్భుతో రసః,**
**దివ్యదర్శనజో దివ్యః హర్షాదానన్దజః స్మృతః. 82**

**తా.** దివ్యము, ఆనందజము అని అద్భుతరసం రెండు విధాలు. దివ్యములైన వస్తువులను, పురుషులను చూడడంవల్ల కలిగినది **దివ్యాద్భుతం**. సంతోషంవల్ల కలిగినది **ఆనందజాద్భుతం.**

### *అథ శాన్తవిచారః (ఇది కొన్ని ప్రతులలో లేదు)*

**మూ. అథ శాన్తో నామ శమస్థాయిభావాత్మకః మోక్షప్రవర్తకః. స తు తత్త్వజ్ఞాన – వైరాగ్య – ఆశయశుద్ధ్యాదిభిః విభావైః సముత్పద్యతే. తస్య యమ – నియమ – అధ్యాత్మ ధ్యాన – ధారణ – ఉపాసన – సర్వభూతదయా – లిఙ్గగ్రహణాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః. వ్యభిచారిణశ్చాస్య నిర్వేద – స్మృతి – ధృతి – సర్వాశ్రమ – శౌచ – స్తమ్భ – రోమాఞ్చాదయః.**

**తా.** శమం స్థాయిభావంగా గల శాంతరసం మోక్షమార్గంలో ప్రవర్తింపచేస్తుంది. అది తత్వజ్ఞానము, వైరాగ్యము, అంతఃకరణశుద్ధి మొదలైన విభావాలచేత పుడుతుంది. యమ – నియమ – ఆత్మతత్త్వధ్యాన – ధారణ – ఉపాసనములు, సర్వభూతములయందు దయ, లింగగ్రహణము అనగా వైరాగ్యచిహ్నాలైన కాషాయవస్త్రాదుల గ్రహణము మొదలైన అనుభావాలచేత శాంతరసాభినయం ప్రయోగించాలి. నిర్వేదము, స్మృతి, ధృతి, సర్వాశ్రమ, శుచిత్వము, స్తంభము (అన్ని ఆశ్రమాలలోను శుచిత్వము), రోమాంచము మొదలైనవి దీని వ్యభిచారిభావాలు.

**వి. యమాలు – "తత్రాహింసాసత్యాస్తేయబ్రహ్మచర్యాపరిగ్రహాః యమాః"** (పాతంజలయోగసూత్రం. 2.30) అహింస, సత్యము, పరుల సొత్తు హరించకపోవడం, బ్రహ్మచర్యం, ధనాదులు కూడబెట్టుకొనకపోవడం – ఇవి **యమాలు. "శౌచసంతోషతపః స్వాధ్యాయేశ్వరప్రణిధానాని నియమాః"** (యో.సూ. 2.32) పవిత్రత్వము, సంతృప్తి, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరపూజ, (పరమేశ్వరునియందే ఎల్లవేళలా మనస్సు నిలుపుట) ఇవి **నియమాలు.** ఏదైన ఒకవసువునందు మనస్సు నిలపడం **ధారణ.** ఏవస్తువుపై మనస్సు నిలపబడినదో దానినే నిరంతరము చింతించుట **ధ్యానం. "దేశబన్ధః చిత్తస్య ధారణా" "తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్"** (యో.సూ. 3.1,2.)

**మూ. అత్రార్యాః శ్లోకాశ్చ భవన్తి –**
**మోక్షాధ్యాత్మసముత్థః తత్త్వజ్ఞానార్థహేతుసంయుక్తః,**
**నైఃశ్రేయసోపదిష్టః శాన్తరసో నామ సంభవతి. 1**

**తా.** మోక్షమును గూర్చి, అధ్యాత్మవిషయాలను గూర్చి చింతనచేత పుట్టేదీ, తత్త్వ జ్ఞానానికి ఉపయోగించే హేతువులతో కూడినది, మోక్షమార్గం చూపే మహాత్ములచేత ఉపదేశింపబడినదీ అయిన శాంతరసం అనేది సంభవించును; (ఇది అసంభవం కాదు).

**మూ. బుద్ధీన్ద్రియకర్మేన్ద్రియసంరోధాధ్యాత్మసంస్థితోపేతః,**
**సర్వప్రాణిసుఖహితః శాన్తరసో నామ విజ్ఞేయః. 2**

**తా.** బుద్ధీంద్రియ – కర్మేంద్రియాలను అదుపులో పెట్టుకొని ఆత్మయందే స్థిరంగా నిలచినవారిచేత పొందబడేది, సకలప్రాణులకు సుఖకరము, హితమూ అయినది శాంత రసముగా తెలియదగినది.

**మూ. న యత్ర దుఃఖం న సుఖం న ద్వేషో నాపి మత్సరః,**
**సమః సర్వేషు భూతేషు స శాన్తః ప్రథితో రసః.**

**తా.** దేనిలో దుఃఖం కాని, సుఖం కాని, ద్వేషం కాని, అసూయ కాని ఉండదో, అన్ని ప్రాణుల విషయంలోను సమత్వబుద్ధి ఉంటుందో అట్టి శాంత మను రసం ప్రసిద్ధ మైనది.

**మూ. భావా వికారాః రత్యాద్యాః శాన్తస్తు ప్రకృతిర్మతః,**
**వికారః ప్రకృతేర్జాతః పునస్తత్రైవ లీయతే. 3**

**తా.** రతి మొదలైన భావాలు వికారాలు, వికృతులు; శాంతంనుండి పుట్టిన కార్యాలు. శాంత మైతే వాటి కన్నింటికీ ప్రకృతి, కారణం, ప్రకృతినుండి జనించిన వికారం మళ్లీ దానిలోనే లీనమైపోతుంది.

**మూ. స్వం స్వం నిమిత్తమాసాద్య శాన్తాద్భావః ప్రవర్తతే,**
**పునర్నిమిత్తాపాయే చ శాన్త ఏవోపలీయతే. 4**
**ఏవం నవరసా దృష్టాః నాట్యజ్ఞైర్లక్షణాన్వితాః.**

**తా.** ఆ యా నిమిత్తకారణంవల్ల శాంతరసంనుండి రత్యాదిభావాలు పుడతాయి. నిమిత్తం తొలగిపోగానే తిరిగి అవి శాంతంలోనే అణగిపోతాయి.

ఇంతవరకు కొన్ని పుస్తకాలలో మాత్రమే ఉన్న ఈ భాగాన్ని ప్రామాణికంగా గ్రహించి అభినవగుప్తుడు – శాంతం రసం మాత్రమే కాదు; అన్నింటికంటె ప్రధానమైన రసం;

అన్ని రసాలు దీనినుండే పుట్టాయి" అని గట్టిగా వాదించి స్థాపించాడు. ఈ విషయా లన్నీ ఈ అధ్యాయం చివర ఉన్న అనుబంధంలో చర్చించబడ్డాయి.

**మూ. ఏవమేతే రసా జ్ఞేయాస్త్వష్టౌ లక్షణలక్షితాః,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి భావానామపి లక్షణమ్. 83**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే రసాధ్యాయః షష్ఠః.**

**తా.** ఈ విధంగా వేరు వేరు లక్షణాలు గల ఈ ఎనిమిది రసాలు తెలియదగినవి. ఇటుపైన భావాల లక్షణం కూడ చెపుతాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన 'బాలానందిని' అను నాట్యశాస్త్రాంధ్ర వ్యాఖ్యానమునందు రసాధ్యాయ మను ఆరవ అధ్యాయం సమాప్తం.**

"ఇ (ర)త్యాదిశక్త్యష్టకమధ్యవృత్తిర్యస్య స్వహృన్మన్డలసంప్రయోజ్యా (జ్యః),
స్థాయీ శివశ్చేతసి తేన వృత్తిః కృతా రసాధ్యాయ ఇహ క్రమేణ."

– శ్రీమదభినగుప్తాచార్యాః.

**శ్రీః శ్రీః శ్రీః.**

### బాలానన్దినీవాఖ్య

# షష్ఠాధ్యాయానికి అనుబంధం

## (రససిద్ధాంతాదులను గూర్చిన చర్చ)

**రససిద్ధాంతం :** ఇపుడు లభిస్తూన్న, రససిద్ధాంతాన్ని ప్రతిపాదించే గ్రంథాలలో అతి ప్రాచీనమైనది భరతుని **నాట్యశాస్త్రం.** అయితే **నాట్యశాస్త్రానికి** పూర్వం రసాన్ని గూర్చి తెలియదని అర్థం కాదు. **నాట్యశాస్త్రం** ఈ ఆకారంలో సిద్ధం అవడానికి పూర్వం అనేకమైన అనువంశ్య శ్లోకాలు, ఆర్యలు ప్రచారంలో ఉండేవి. వాటిని **నాట్యశాస్త్రంలో** అక్కడక్కడ చేర్చడం జరిగింది. రూపక ప్రయోగాన్ని దృష్టిలో ఉంచుకొని **నాట్యశాస్త్రం** నిర్మించబడింది. కావ్య–నాట్యశబ్దాలు రెండూ పర్యాయపదాలుగా కూడ ఉపయోగింప బడేవి. రససిద్ధాంతం **అభినవభారతిలో** అతివిస్తృతంగాను, **లోచనంలో** సంక్షిప్తంగాను ప్రతిపాదింపబడింది. మహాకవీ విమర్శాగ్రేసరుడూ అయిన అభినవగుప్తుడు **ధ్వన్యాలోకానికి నాట్యశాస్త్రానికి** కూడా వ్యాఖ్యానాలు రచించాడు. **నాట్యశాస్త్రం** షష్ఠాధ్యాయంలోని **'నాట్యరసాః స్మృతాః'** అనే వాక్యాన్ని వివరిస్తూ – **"నాట్యాత్ సముదాయరూపాత్ రసాః, యది వా నాట్యమేవ రసాః, రససముదాయో హి నాట్యమ్. న నాట్య ఏవ చ రసాః, కావ్యేఽపి నాట్యాయమాన ఏవ రసః, కావ్యార్థవిషయే హి ప్రత్యక్షకల్ప సంవేద నోదయే రసోదయః ఇత్యుపాధ్యాయాః. తదాహుః కావ్యకౌతుకే**

"ప్రయోగత్వమనాపన్నే కావ్యే నాస్వాదసంభవః" ఇతి.
**'వర్ణోనోత్కలికాభోగప్రౌఢోక్త్యా సమ్యగర్పితాః,**
**ఉద్యానకాన్తాచన్ద్రాద్యా భావాః ప్రత్యక్షవత్ స్ఫుటాః'**

ఇతి (అ.భా.మొ.సం 291–92).

అభినవగుప్తుడు ఇంకా ఇలా అన్నాడు – **"కావ్యం తావన్ముఖ్యతః దశరూపాత్మకమేవ ... తత్ర యే స్వభావతః నిర్మలముకురహృదయాః త ఏవ సంసారోచితక్రోధ మోహాభిలాష పరవశమనసః న భవన్తి తేషాం తథావిధదశరూపకాకర్ణనసమయే సాధారణ రసనాత్మచర్వణగ్రాహ్యః రససంచయః నాట్యలక్షణః స్ఫుట ఏవ. యే త్వతథాభూతాః తేషాం ప్రత్యక్షోచితతథావిధచర్వణాలాభాయ నటాదిప్రక్రియా స్వగతక్రోధశోకాదిసంకట హృదయగ్రన్థిభఞ్జనాయ గీతాదిప్రక్రియా చ మునినా విరచితా. 'సర్వానుగ్రాహకం హి శాస్త్రమ్' ఇతి న్యాయాత్. తేన నాట్య ఏవ రసాః న లోకే ఇత్యర్థః. కావ్యం చ నాట్య మేవ"** (మొ.సం.పే. 292).

రస శబ్దానికి ముఖ్యార్థం రుచి, లేదా ఆస్వాదం. కావ్యనాటకాదులలోని సౌందర్యం

యొక్క భావావేశపూర్ణమైన అనుభూతి (ఆస్వాదం) అని దీని లాక్షణికార్థం. కవి చేసే రచన (కావ్యం) **"హ్లాదైకమయి"** (కేవలానందస్వరూపం) అని అంటాడు మమ్మటుడు. పఠితమీద ప్రసరించే అత్యధికమైన కావ్య ప్రభావానికి ఎంత ప్రాధాన్యం ఉన్నదో ఈ ఒక్కపదం స్పష్టం చేస్తూన్నది.

జ్ఞానప్రధానము, అనుభూతిప్రధానమూ అని వాఙ్మయం రెండు విధాలని డి.క్వేన్సీ చేసిన ద్వివిధవిభాగం సంస్కృత రచయితలు ఏనాడో అంగీకరించి ఉన్నారు. మొదటి తరగతికి చెందిన వాఙ్మయం ఆ యా విషయాల జ్ఞానం కలిగిస్తే రెండవ తరగతికి చెందినది హృదయాన్ని స్పందింపచేస్తుంది. ఈ రెండు విధాల వాఙ్మయాన్ని ఒకచోట కలపడానికి అవకాశం లేకపోలేదు. అయితే వీటిని పూర్తిగా వేరు వేరుగానే ఉంచవచ్చును. సాహిత్య విమర్శ అనేది, అది సంస్కృతంలో ఉన్నా ఇతర భాషలలో ఉన్నా కూడ, పైన చెప్పిన ద్వితీయభేదానికి చెందిన గ్రంథాలకు సంబంధించి ఉంటుంది. కావ్యం, రూపకం, కథాఖ్యాయికాదులు – ఇవన్నీ దీనికి చెందినవి. వీటిలో ఇది తప్పొ, ఒప్పొ, ఇలా ఉంటుందా ఉండదా అనే ప్రశ్నలకు తావు లేదు. ప్రతిభాత్మకమైన సహజమానసిక భావనకూ (సంవిత్తుకూ) తర్కబలసంపాదిత మైన జ్ఞానానికీ చాల భేదం ఉంటుంది. కావ్యంలో ధ్వనింపబడే అర్థం విషయంలో ఇది తప్పొ ఒప్పొ అనే ప్రశ్నకు అవకాశం లేదని ఆనందవర్ధనుడు స్పష్టంగా చెప్పాడు – **"కావ్యవిషయే చ వ్యఙ్గ్యప్రతీతీనాం సత్యాసత్య్వ నిరూపణస్య అప్రయోజకత్వమేవ ఇతి తత్ర ప్రమాణాన్తరవ్యాపారపరీక్షా ఉపహాసాయైవ సంపద్యతే"** (ధ్వన్యా. పే. 253). రసాలకు కావ్యాలతో ఉన్న సంబంధాన్ని గూర్చి క్రమబద్ధ మైన రీతిలో చర్చ, నిర్ణయమూ **ధ్వన్యాలోకం** వచ్చేవరకు జరగలేదు. అయితే ప్రాచీనాలంకారికులకు రసాని కున్న ప్రాధాన్యం తెలియ దని అర్థం కాదు.

**"కామం సర్వోప్యలంకారో రసమర్థే నిషిఞ్చతి,**
**తథాప్యగ్రామ్యతైవైనం భారం వహతి భూయసా"** (కావ్యాదర్శం. I. 62)

అని **కావ్యాదర్శం** అంటూన్నది. రసవదలంకారం ఎనిమిది రసాలలో ఏదో ఒక రసం మీద ఆధారపడి ఉంటుం దని దండి సోదాహరణంగా ప్రతిపాదించాడు. స్థాయిభావాలకీ రసాలకీ ఉన్న భేదం కూడ దండికి స్పష్టంగా తెలుసును (చూ. కావ్యాదర్శ II. 280 – 292).

**"మధురం రసవద్వాచి వస్తున్యపి రసస్థితిః,**
**యేన మాద్యన్తి ధీమన్తః మధునేవ మధువ్రతాః"** (కావ్యాద. I. 51)

**"కన్యే కామయమానం మాం న త్వం కామయసే కథమ్,**
**ఇతి గ్రామ్యోఽయమర్థాత్మా వైరస్యాయ ప్రకల్పతే"**

**"కామం కన్దర్పచణ్డాలో మయి వామాక్షి నిర్దయః**
**త్వయి నిర్మత్సరో దిష్ట్యేత్యగ్రామ్యోఽర్థో రసావహః"** (I.63,64)

ఇత్యాది శ్లోకాలు కావ్యంలో దండి రసానికి ఎంత ప్రాధాన్యం ఇచ్చాడో సూచిస్తున్నాయి.

**"రసవద్దర్శితస్పష్టశృఙ్గారాదిరసం యథా"** (భామహకా. III.6)

అను శ్లోకం భామహునకు రసాల విషయంలో ఉన్న పరిచయాన్ని సూచిస్తూన్నది. మహాకావ్యంలో రసా లుండాలి అని కూడ అతడు అన్నాడు –

**"యుక్తం లోకస్వభావేన రసైశ్చ వివిధైః పృథక్"** (కావ్యాలం. I.31)

అయితే కావ్యంలో ఉండవలసిన ప్రధానాంశం రసం అని మాత్రం అతడు ప్రతిపాదించ లేదు.

**"దీప్తరసత్వం కాన్తిః"** (కా.అ.సూ. II.2.4) అని అంటూ వామనుడు రసాలను కాంతిగుణంలో చేర్చాడు. దండి (I.31) భామహుడూ (I.24) కూడ రూపకాలను గూర్చి తమ గ్రంథాలలో చర్చించకుండా, వాటిని తెలుసుకోవా లనుకొన్నవాళ్లు నాట్య శాస్త్రాదులు చూడవచ్చును అన్నారు. ప్రాచీనాలంకారికులు రూపకాలనూ కావ్యాలనూ అంతగా పరస్పర సంబంధం లేని విభిన్న ప్రక్రియలనుగా చూచి నట్లు కనబడుతుంది. అందుచేత ఆలంకారికులు ప్రారంభదశలో రసాలను గూర్చి తమ గ్రంథాలలో విస్తృతంగా చర్చించలేదు. రసాలను గురించి తొలిసారిగా చర్చించిన అలంకారశాస్త్ర గ్రంథం రుద్రటుని **కావ్యాలంకారం.** రుద్రటునికి రాదాపు నూరు సంవత్సరాలకు పూర్వం రచించబడిన **శిశుపాలవధం** లో రసాలకీ నాటకాదులకీ ఉన్న సంబంధం స్పష్టంగా వర్ణించబడింది–

**"స్వాదయన్ రసమనేకసంస్కృతప్రాకృతైరకృతపాత్ర సంకరైః,**
**భావశుద్ధివిహితైర్ముదం జనో నాటకైరివ బభార భోజనైః"** (శిశు. 14.50)

భరతుని **నాట్యశాస్త్రం**లో కూడ రసస్వరూపచర్చ ఒక్కటే ప్రధాన విషయం కాదు. రూపక ప్రయోగంలో రసాని కున్న సంబంధాన్ని పట్టి రసానికి కావలసిన అన్ని విషయాలను చర్చించడం దీని ప్రధానోద్దేశ్యం. ఆంగిక – వాచిక – ఆహార్య – సాత్త్వికాభినయాల సాహాయ్యంతో ప్రేక్షకులకు రసానుభూతి కలిగించడం రూపకం చేయవలసిన ప్రధానమైన కార్యం. ఈ చతుర్విధాభినయాలు వరుసగా 8–13, 15–22, 23, 24 అధ్యాయాలలో **నాట్యశాస్త్రంలో** ప్రతిపాదించబడ్డాయి. **"న హి రసాదృతే కశ్చిదర్థః ప్రవర్తతే"** అని అంటుంది **నాట్యశాస్త్రం** (మొ.సం.పే.274). దీని అర్థం వివరిస్తూ – రూపక ప్రదర్శనంలో మొదటి నుండి చివరి దాకా ఒక రసం సూత్రం వలె అనుస్యూతంగా నడుస్తూంటుంది" అని అభినవగుప్తు డన్నాడు. **"ఏక ఏవ తావత్పరమార్థతః రసః సూత్రస్థానీయత్వేన రూపకే**

**ప్రతిభాతి"** (అ.భా.మొ.సం.పే.273). **నాట్యశాస్త్రంలోని** చాలా వరకు గ్రంథం నాటకరచయితకూ, నటునికీ సంబంధించిన విషయాలకోసం వినియోగించబడింది. ప్రేక్షకులలో రసావిర్భావప్రక్రియా సానుభూతీ అనే విషయాలు 6,7 అధ్యాయాలలో మాత్రమే చర్చించబడ్డాయి. **కావ్యమీమాంసలో** చెప్పినదానిని పట్టి భరతుడు రూపకాలను గూర్చి మాత్రమే చర్చించగా రసచర్చ నందికేశ్వరుడు చేశాడు. అయితే మనకిపుడు లభించే **నాట్యశాస్త్రంలో** ఈ రెండు విషయాల ప్రతిపాదనా కూడా ఉన్నది. నందికేశ్వరుని గ్రంథం మనకు లభించడం లేదు.

రససిద్ధాంతం శారీరక – మానసిక ప్రవృత్తుల కలయిక మీద ఆధారపడి ఉందని అంటూ కాణే మానవులలో నిగూఢంగా ఉండే కొన్ని మానసిక ప్రవృత్తులను గూర్చిన, కొందరు శారీరక – మానసిక శాస్త్ర నిపుణుల అభిప్రాయాన్ని ఈ విధంగా ఉదాహరించారు (H.S.P;P - 357–358). "మానసిక శాస్త్రజ్ఞులకు అనేక విషయాలలో ఐకమత్యం లేదు. MacDowall అనే పండితుడు 'ది ఎనెర్జీస్ ఆఫ్ మెన్' అనే గ్రంథంలో (1932) (ఏడవ చాప్టర్ పే. 97,98) మానవులలో ఉండే పద్దెనిమిది సహజమైన ప్రవృత్తులను వర్ణించి చెప్పాడు. 'సేన్ సైకాలజీ' (1944) అనే గ్రంథంలో R.J.S. MacDowall ఈ పద్దెనిమిదింటినీ పద్నాలుగుకు తగ్గించి వాటికి సంబంధించిన భావావేశాలతో సహా ప్రతిపాదించాడు.

| | సహజ ప్రవృత్తి (Instinct) | సంబద్ధ భావావేశం (Attendant emotion) |
|---|---|---|
| 1. | ఆపదనుండి తప్పించుకొనడం (Escape from danger) | భయం (Fear) |
| 2. | ఎదిరించడం (Combat) | కోపం (Anger) |
| 3. | జుగుప్స (Repugnance) | అసహ్యించు కొనడం (Disgust) |
| 4. | బాలసంరక్షణ (Parental Protection of the young) | వాత్సల్యం (Parental feeling) |
| 5. | విషయజిజ్ఞాస (Curiosity) | సాహసప్రదర్శనం (Adventure) |
| 6. | తనమాట నిలబెట్టుకొనడం (Self assertion) | ప్రభుత (Superiority) |
| 7. | ఆత్మనింద (Self abasement) | లొంగి ఉండడం (Subjection) |
| 8. | ఏడ్పు (Cry of distress) | అసహాయ స్థితి (Helplessness) |

| | | |
|---|---|---|
| 9. | కామం (Sex) | లైంగిక ప్రవృత్తి (Sexual Desire) |
| 10. | గుంపు (Herd) | ఏకాంతస్థితి (Loneliness) |
| 11. | ఆహారాన్వేషణం (Food-Seeking) | ఆకలి (Appetite) |
| 12. | కూడబెట్టడం (Hoarding) | స్వత్వబుద్ధి (Feeling of owership) |
| 13. | నిర్మాణం (Construction) | సర్జనశక్తి (Feeling of Creativeness) |
| 14. | నవ్వు (laughter) | సంతోషం (Amusement) |

ఈ మానసిక శాస్త్రవేత్తలు మొదటి స్తంభంలో (Column) ఉన్నవాటిని instincts (సహజప్రవృత్తులు) అనీ, రెండవ స్తంభంలో ఉన్నవాటిని attendent emotions అనీ అన్నారు. కాని నిజానికి మొదటి స్తంభంలో ఉన్నవాటిని attendant - instincts అనడం యుక్తం అని తోస్తుంది. ఎందువల్ల ననగా emotions అనేవి instincts కు కారణం. ఉదాహరణకి భయం అనే ఎమోషన్ కలగగానే కళ్లు మూసికొనడం, నెత్తికి చెయ్యి అడ్డుపెట్టుకొనడం వంటి, ఇన్‌స్టింక్ట్, ప్రభుత అనుభావం వల్ల సెల్ఫ్ అసెర్షన్ వంటి ఇన్‌స్టింక్ట్ కలుగుతాయి. నిజానికి మన అలంకారికులు ఏనాడో ప్రతిపాదించిన స్థాయి – సాత్త్విక – వ్యభిచారిభావాదులు వాటి విశ్లేషణా చూస్తే ఇతరులు చేసిన వాటిలో శబ్దాడంబరమే తప్ప పరిపూర్ణత్వం కనబడదు.

రత్యాదులను మాత్రమే స్థాయిభావాలుగా ఎందుకు అంగీకరించాలి అనేదానికి అభినవగుప్తుడు చక్కని ఉపపత్తి చూపించాడు. పుట్టినది మొదలు ప్రతీ మానవునిలోను ప్రతీప్రాణిలోను సుఖం అనుభవించాలనే కోరిక ఉంటుంది. (రతి); తనలో ఒక వైశిష్ట్యాన్ని ఆరోపించుకొని ఇతరులను పరిహసిస్తాడు (హాసం); తన కిష్టమైన వ్యక్తులు లేదా వస్తువులు దూరం అయినప్పుడు శోకిస్తాడు (శోకం). అలా దూరం చేయడానికి కారణం అయిన వారిమీద కోపం చూపుతాడు (క్రోధం); వాళ్లనేమీ చేయలేక తన్ను తాను రక్షించు కొనజాలనప్పుడు భయపడతాడు (భయం); ఇది సంపాదించాలి, అది సంపాదించాలి అని అనుకొంటూ ఉంటాడు (ఉత్సాహం); చెడ్డ వస్తువులను అసహ్యించుకొంటాడు (జుగుప్స); ఎవరైనా గొప్పపనులు చేస్తే అది చూచి ఆశ్చర్యపడతాడు (విస్మయం); కొన్నింటిమీద అనాసక్తి చూపుతాడు (నిర్వేదం). **"స్థాయిత్వం చ ఏతావతామేవ. జాత ఏవ హి జన్తుః ఇయతీభిః సంవిద్భిః పరీతో భవతి." తథాహి – "దుఃఖసంశ్లేషవిద్వేషీ సుఖాస్వాదన సాదరః" ఇతి న్యాయేన సర్వో రిరంసయా వ్యాప్తః, స్వాత్మని ఉత్కర్ష మానితయా పరముపహసన్, అభీష్టవియోగసంతప్తః తద్ధేతుషు కోపపరవశః, అశక్తౌ తతో భీరుః, కించిదర్జిజిషురపి, అనుచితవస్తువిషయవైముఖ్యాత్మకతయాక్రాన్తః,**

**కిం చిదనభీష్టతయా అభిమన్యమానః, తత్తత్స్వపరకర్తవ్యదర్శనసముదితవిస్మయః, కించిచ్చ జిహాసురేవ జాయతే** (అ.భా. VI. అధ్యాయం).

ఇంచుమించు ఇలాంటి తొమ్మిది భావాల ఆవిష్కరణం ఉన్నదే నిజమైన కావ్యం అని కొందరు ఆధునిక పాశ్చాత్య విమర్శకులు అంగీకరించడం గమనార్హం – "Every truth which a human being enunciates, every throught, even every outward impression which can enter into his consciousness, may become poetry when shown through an impassioned medium, when invested with the colouring of joy or grief or pity or affection or admiration or reverence, or awe or even hatred or terror: and unless so coloured, nothing, be it as interesting as it may, is poetry (quoted from Mill in the preface of mirror of composition' P. VIII; the contribution of panditaraja to sanskrit poetics part. I.P.141).

ఒక రూపకాన్ని చూచినపుడు ప్రేక్షకుల మనస్సులలో కలిగే భావాలను భరతుడు, తదనుసారులైన అర్వాచీనులు ఎలా విశ్లేషించారో ఇప్పుడు పరిశీలిద్దాం. రూపక ప్రయోగం నేత్రాలు, చెవులూ అనే రెండు ఇంద్రియాలకు మాత్రమే ప్రవర్తకంగా ఉంటుంది. **"క్రీడనీయకమిచ్ఛామో దృశ్యం శ్రవ్యం చ యద్భవేత్"** (నా.శా.I.11). ఇవి శారీరకాలంబనం (Physiological basis). నృత్యము, అభినయము, అలంకారాలు, చిత్రణము – ఇవి నేత్రం ద్వారా ఆనందాన్ని కలిగించే కళలు. సంభాషణ, పద్యాదిపఠనం, సంగీతం – ఇవి చెవుల ద్వారా ఆనందం కలిగించే కళలు. విషాదకరసంఘటనలు కూడ రూపకంలో ప్రదర్శించినపుడు ఆనందమే కలిగిస్తాయనే విషయం భరతాదులకు తెలుసు. మామూలు జీవితంలో జాలి, భయం ఆనందాన్ని కలిగించవు. వాటినే రంగస్థలం మీద ప్రదర్శించినప్పుడు వాటి ప్రభావం వేరుగా ఉంటుంది. అలాంటి సన్నివేశాలలో సహృదయులు అనుభవించే ఆ ఆనందాన్ని వీరు విశ్లేషించి పరీక్షించి వర్ణించారు. రూపకాదులను చూడడం వల్ల కలిగే ఆనందమూ రసమూ వాస్తవంలో ఒక్కటే; అనగా ఈ ఆస్వాదంలో భేదాలు లేవు. అభినవగుప్తుడు రసాన్ని వైయాకరణుల స్ఫోటతో పోలుస్తాడు – **తేన రస ఏవ నాట్యం యస్య వ్యుత్పత్తిః. ఫలమిత్యుచ్యతే. తథా చ రసాదృతే ఇత్యత్ర (నా.శా.6.34) ఏకవచనోపపత్తిః. తతశ్చ ముఖ్యభూతాన్మహారసాత్ స్ఫోటదృశీవాసత్యాని వా, అన్వితాభిధానదృశీవ ఉపాయాత్మకాని సత్యాని వా, అభిహితాన్వయదృశీవ తత్సముదాయరూపాణి వా రసాన్తరాణి భాగాభినివేశదృష్టాని రూప్యన్తే"** (నా.శా.I. 16). భాషలో ఒక పరిపూర్ణార్థాన్ని బోధించేవి వాక్యాలు. వాటిని పదాలుగాను, పదాలను వర్ణాలుగాను విభజించి పదాల అర్థం అనీ (కొన్నిచోట్ల) వర్ణాల అర్థం అనీ అంటున్నాం. నిజానికి ఇవన్నీ ఒకే ఒక వాక్యార్థానికి సంబంధించినవి. అదే విధంగా ఆనందానుభవం

ఒక్కటే అయినా దానిని విశ్లేషించి ఎనిమిది వేరువేరు స్థాయి భావాలకు సంబంధించిన దవడం చేత శృంగారాదిభేదాలతో ఎనిమిది విధాలని అంటున్నాం. వాస్తవంలో ఆనందానుభూతి, రసాస్వాదం అనేది ఒక్కటే.

రసం సామాజికాశ్రయం. ఇది స్థాయి భావభేదాన్ని పట్టి ఎనిమిది విధాలు అని **భావప్రకాశనం** చెపుతున్నది –

**"యతోఽ ష్టధా మనోవృత్తిః సభ్యానాం నాట్యకర్మణి,**
**అష్టావేవానుభూయన్తే తాసూక్తాస్తై రసాః పృథక్.**
**సామాజికైస్తు రస్యన్తే యస్మాత్తస్మాద్రసాః స్మృతాః"** II. P.46)

**"వర్ధితాః స్థాయినో భావాః నాయకాదిసమాశ్రయాః,**
**అనుకారతయా నాట్యే క్రియమాణా నటాదిషు,**
**రసతాం ప్రతిపద్యన్తే సామాజికమనఃస్సుతే,**
**సంస్కారైః ప్రాక్తనైస్తైశ్చ రస్యన్తే యత్నతో రసాః"** (భా.ప్ర. II. P.46)

**దశరూపకం**లో కూడ ఈ విధంగానే ప్రతిపాదింపబడింది. (IV. 38–39). రసాస్వాదం కలగాలంటే కవి – శ్రోతల మధ్య సమన్వయం ఉండాలని **లోచనంలో** (పే. 23) చెప్పబడింది. **"వక్తృప్రతిపత్తృప్రతిసహకారిత్వం హి అస్మాభిః ద్యోతనస్య ప్రాణత్వేనోక్తమ్."**

రంగస్థలం మీద ప్రయోగించబడే రూపకాన్ని చూస్తున్నప్పుడు ప్రేక్షకులకు ఒక విధమైన ఆనందానుభూతి కలుగుతుంది. ఈ అనుభూతిలో దుఃఖానికి ఏ మాత్రమూ అవకాశం లేదు. సామాజికుల మనస్సులో అణగి ఉన్న రతి – హాస శోకాది భావాలను వివిధాభినయాల ద్వారా ఉత్తేజితము లయే టట్లు చేయడంచేత ఈ అనుభూతి వివిధ రూపాలలో ఉన్నట్లు కనబడుతుంది. (కాని, ఆ అనుభూతి వాస్తవంలో ఒక్కటే అని వీరి అభిప్రాయం) – **"అస్మన్మతే తు సంవేదనమేవ ఆనన్దఘనమ్ ఆస్వాద్యతే తత్ర కా దుఃఖాశంకా? కేవలం తస్యైవ చిత్రతాకరణే రతిశోకాదివాసనావ్యాపారః తదుద్బోధనే చాభినయాదివ్యాపారః"** (అ.భా.మొ.సం. I. పే. 293) అని అభినవగుప్తు డన్నాడు.

భరతుడు **నాట్యశాస్త్రంలోని** ఆరవ అధ్యాయంలో రసాన్ని ప్రతిపాదించాడు. జాగర్తగా పరిశీలిస్తే భరతుడు ప్రతిపాదించిన రసానికి చివరకు అభినవగుప్తుని దగ్గరకు వచ్చేసరికి తేలిన రసస్వరూపానికి చాల భేదం ఉంది. **"విభావానుభావవ్యభిచారిసంయోగాద్రస నిష్పత్తిః"** అనేది భరతుడు చెప్పిన రససూత్రం. దీనిని ఆధారంగా చేసికొని వివిధ వ్యాఖ్యానాలు బయలుదేరాయి. ఈ సూత్రంలో స్థాయి శబ్దం ప్రయోగించలేదు. ఇలా

ప్రయోగించకపోవడంలో చాల విశేషం ఉందని కొందరు వ్యాఖ్యాతలు నిరూపించడానికి ప్రయత్నించారు. అయితే రెండు మూడు వాక్యాల తరవాత భరతుడు – **"యథా హి... తథా నానాభావోపగతా అపి స్థాయినో భావా రసత్వమాప్ను వన్తి"** అని స్థాయిభావాలను స్పష్టంగా పేర్కొన్నాడు. **'సంయోగ' 'నిష్పత్తి'** శబ్దాల అర్థం అస్పష్టంగా ఉండడం చేత ఈ సూత్రాన్ని వేరు వేరు విధాల వ్యాఖ్యానించడానికి అవకాశం ఏర్పడింది. దీనికి లోల్లటుడు, శంకుకుడు, భట్టనాయకుడు, అభినవగుప్తుడు ఇచ్చిన నాలుగు విధాలైన వివరణలున్నాయి. జగన్నాథుడు ఈ నాలుగు కాక ఇంకా నాలుగు వివరణలను చూపాడు.

లోల్లట – శంకుక – భట్టనాయకుల గ్రంథా లేవీ మనకిప్పుడు లభించడం లేదు. వాళ్ల మతాలను గూర్చి అభినవగుప్త – మమ్మటాదులు చెప్పిన దానిని పట్టి మాత్రమే తెలుసుకొనవలసి ఉంది. వీటికి వరసగా **ఉత్పత్తివాదం, అనుమితివాదం, భుక్తివాదం, అభివ్యక్తివాదం** అని పేర్లు. ఈ వాదాలను తెలిసికొనే ముందు ఈ సూత్రంలో ఉపయోగించిన కొన్ని పారిభాషికపదాల అర్థాలు తెలుసుకొనవలసి ఉంది. నాట్యశాలకు వెళ్లేవారిలోను, కావ్యం పఠించేవారిలోను కొన్ని స్థిరమైన భావాలు నిగూఢంగా ఉంటాయి. ఇవి మౌలికములైన భావాలు. ఇవి సాధారణంగా అంతర్లీనంగానే ఉన్నా తగిన సంభాషణలు, పాటలు సంగీతం మొదలైనవి వినగానే, అభినయం చూడగానే పైకి ఉద్బుద్ధము లౌతాయి. శ్రవ్యకావ్యాలలో విశిష్టశబ్దాలు చదవడంచేత ఉద్బుద్ధమౌతాయి. అప్పుడు అవి వాళ్ల మనస్సులలో ఆనందరూప స్థితిని పొందుతాయి. స్థిరమైన ఈ భావాలకే స్థాయిభావా లని పేరు. వీటి కీ పేరు ఎందుకు వచ్చిందో భరతుడు ఏడవ అధ్యాయంలో ఈ విధంగా వివరించాడు. ఒక రాజుకు వాని పరిచారకులకు శరీరాదు లన్నీ సమంగానే ఉన్నా ఒకనిని రాజు అంటారు. ఇతరులు అతనికి సేవ చేస్తారు. అదే విధంగా ఒకటి స్థాయిభావం అయితే దానితో కలిసి ఉన్న ఇతర భావాలు విభావ – అనుభావ – వ్యభిచారిభావా లవుతాయి. వీటితో కూడిన స్థాయిభావం రసత్వాన్ని పొందుతుంది. ఆనందంగా, ఆస్వాదంగా మారుతుంది. **"యథా నరేన్ద్రో బహుజన పరివారోఽపి సన్ స ఏవ నామ లభతే నాన్యః సుమహానపి పురుషః తథా విభావానుభావ వ్యభిచారిపరివృతః స్థాయీ భావో రసనామ లభతే. భవతి చాత్ర శ్లోకః – "**

**"యథా నరాణాం నృపతిః శిష్యాణాం చ యథా గురుః,**
**ఏవం హి సర్వభావానాం భావః స్థాయీ మహానిహ"** (నా.శా. VII. 8)

**దశరూపకం**లో స్థాయిభావాల స్వరూపం మరొక దృక్కోణంతో పరిశీలించి చెప్పబడింది. "స్థాయిభావం సముద్రం వలె నిశ్చల మైనది. అప్పుడప్పుడు ఇతర భావాలు వచ్చి దానిని క్షుబ్ధం చేయడానికి ప్రయత్నించినా అది కదలకుండా అలాగే ఉంటుంది.

ఇతరభావాలు స్థాయిభావాన్ని విచ్ఛిన్నం చేయజాలవు. అవి దానికి అంగంగా ఉండిపోతాయి. ఈ విధంగా విభావాదులచేత ఉత్తేజితములై రసస్థితిని పొందగల స్థాయిభావాలు రతి, హాసం, శోకం, క్రోధం, ఉత్సాహం, భయం, జుగుప్స విస్మయం అని ఎనిమిది. కొందరు శమాన్ని కూడ చేర్చి తొమ్మిది స్థాయిభావాలను అంగీకరించారు."

వీటి అన్నింటిసంయోగం వల్ల కలిగే ఆనందానికి రసం అని పేరు. దీనికి ఈ పేరు రావడానికి కారణం ఏమో భరతుడు వివరించాడు. మనుష్యులు బెల్లం, పాలు సుగంధద్రవ్యాలు, మిరియాలు మొదలైన వస్తువుల లన్నీ కలిపి తయారుచేసిన ఒక ఆహారపదార్థం తిన్నప్పుడు ఏ విధంగా ఆనందం అనుభవిస్తారో అదే విధంగా ప్రేక్షకులు అనేక భావాలచేత, అభినయాదులచేత పైకి ఉద్బుద్ధం అయే టట్లు చేయబడిన స్థాయి భావాలను ఆస్వాదిస్తారు. అందుచేత ఆ ఆస్వాదనానికి నాట్యరసం అని పేరు. లోకంలో రసశబ్దానికి పాదరసం, మాధుర్యం మొదలైనవి (మధురామ్లలవణకటుకషాయతిక్తాలు), సారం, అత్యంతాసక్తి, ఫలాదులనుండి పిండి తీసిన ద్రవపదార్థం, కషాయం, మొదలైన అనేక అర్థా లున్నాయి. అయితే కావ్యనాటకాదులలో దీనికి ఆస్వాదం అని అర్థం. **"రసనాద్రసత్వమేషాం మధురాదీనామివోక్తమాచార్యైః"** (14) అని రుద్రటు డన్నాడు. **"విభావానుభావసాత్త్వికవ్యభిచారిభావైః ఉపచీయమానః పరిపూర్ణః స్థాయీ భావో రస; చరమసమయపర్యన్తస్థాయిత్వాదస్య స్థాయిత్వవ్యపదేశః"** (రసతరం. IV) అని **రసతరంగిణి.**

లోపల కలిగిన భావంవల్ల పుట్టిన వికారం అనుభావం. ఇది లోపల పుట్టిన భావానికి సంసూచకం **"అనుభావో వికారస్తు భావసంసూచనాత్మకః"** (దశ రూ. IV. 3) అని **దశరూపకం. "స్థాయి భావాననుభావయన్తః సామాజికాన్ సభ్రూవిక్షేపకటాక్షాదయః రసపోషకారిణః అనుభావాః"** అని ధనికుడు వివరించాడు ఈ అనుభావాలలో ఎనిమిదింటికి సాత్త్విక భావాలని పేరు.

> **పృథగ్భావా భవన్త్యేతేఽనుభావత్వేఽపి సాత్త్వికాః,**
> **సత్త్వాదేవ సముత్పత్తేస్తచ్చ తద్భావభావనమ్.**
> **స్తమ్భప్రలయరోమాఞ్చాః స్వేదో వైవర్ణ్యవేపథూ,**
> **అశ్రు వైస్వర్యమిత్యష్టౌ స్తమ్భోఽస్మిన్నిష్క్రియాఙ్గతా.**
> **ప్రలయో నష్టసంజ్ఞత్వం శేషాః సువ్యక్తలక్షణాః."** (దశ రూ. IV. 4-6)

వీటిని సాత్త్వికభావా లనడానికి కారణం విషయంలో అభిప్రాయభేదం ఉంది. **దశరూపకా**నుసారం సత్త్వం అనగా సానుభూతితో కూడిన Sympathetic హృదయం. దానిచేత ఏర్పడినవి (సత్త్వేన నిర్వృత్తాః) గాన సాత్త్వికభావాలు. **సాహిత్యదర్పణంలో** కూడ ఇదే వ్యుత్పత్తి చెప్పబడింది. (III. 134) అయితే **రసతరంగిణిలో "సత్త్వం జీవశరీరమ్,**

**తస్య ధర్మాః సాత్త్వికాః. ఇత్థం చ శరీరభావాః స్తమ్భాదయః స్వాత్త్వికాః భావాః ఇత్యభిధీయన్తే"** అని చెప్పబడింది. ఈ విధంగా సాత్త్విక భావాలు లోపల కలిగిన భావంవల్ల పుట్టి ఆ భావాన్ని ఇతరులు తెలుసుకొనే టట్లు చేస్తాయి గాన అనుభావాలు. ఇదే విధంగా లోపల నున్న రతి – క్రోధాదులవలన కలిగే భ్రూలతాకుంచన – కటాక్ష వీక్షణాదులు కూడ అనుభావాలే.

**ఆలంబనవిభావం** అనీ **ఉద్దీపనవిభావం** అనీ విభావం రెండు విధాలు. శృంగార రసం విషయంలో పరిశీలిస్తే నాయకునిలో ఉన్న రతికి ఆలంబనవిభావం నాయిక (ఆ రతికి ఆశ్రయం నాయకుడు). నాయికలో ఉన్న రతికి ఆలంబనవిభావం నాయకుడు (ఆశ్రయం నాయిక). ఆశ్రయం వేరు, ఆలంబనం వేరు. రతి ఉద్బుద్ధం అవడానికి ఉపకరించే ఏకాంతస్థాన – ఉద్యాన – చంద్రోదయాదులు ఉద్దీపన విభావాలు. నిర్వేదం, గ్లాని, శంక మొదలైన భావాలు మాటిమాటికీ మారిపోతూంటాయి. ఇవి కూడ స్థాయి భావాలను పరిపుష్టం చేస్తూంటాయి. వీటికి **వ్యభిచారిభావాలు** లేదా **సంచారిభావాలు** అని పేరు. ఇవి ముప్పైమూడు. వీటిలో కొన్ని అనేకరసాలకు సాధారణాలుగా ఉండవచ్చును. అనగా ఒక రసానికి వ్యభిచారిభావాలుగా ఉన్నవి ఇతరరసాలకి కూడ వ్యభిచారులుగా ఉండవచ్చును. ఒక్కొక్కప్పుడు రత్యాదిస్థాయిభావాలు కూడ పూర్తిగా పరిపుష్టం కానప్పుడు ఇతరరసాలకు వ్యభిచారిభావాలు కావచ్చును. తగిన విభావాను భావవ్యభిచారి భావాలచేత పరిపుష్టము లైన రతి – హాసాదులు శృంగార – హాస్యాది రూపాన్ని పొందుతాయి. రసాలను విభావాదుల ఉపస్థాపనం ద్వారా ఆస్వాద్యము లయేటట్లు చెయ్యాలి కాని ఇక్కడ ఈ రసం ఉంది, అక్కడ అది ఉంది అని చెప్పకూడదు. విభావాద్యుపస్థాపనం లేకుండా పేర్లు చెప్పినా రసావిష్కృతి కలగదు. వీటి కన్నింటికి ప్రేక్షకునిలోను పఠితలోను భావుకత్వం, సహృదయత్వం ఉండాలి. అది లేనివానికి రసాస్వాదం కలగదు. వేషధారణమాత్రసంన్యాసులు కాకుండా నిజమైన వైరాగ్యం గల సంన్యాసులకు శృంగారకరుణాద్యాస్వాదం కలుగదు. పిరికిపందకు వీరరసం పడదు.

**"సవాసనానాం నాట్యాదౌ రసస్యానుభవో భవేత్,**
**నిర్వాసనాస్తు రఙ్గాన్తః కాష్ఠకుడ్యాశ్మసంనిభాః."**

**"విభావానుభావవ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః"** అనే రససూత్రం చెప్పి భరతుడే దానికి వివరణ తన మాటలలో ఇచ్చి ఉన్నాడు – **"తత్ర విభావానుభావవ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః" కో దృష్టాన్తః? అత్రాహ – యథా హి నానావ్యఞ్జనౌషధి సంయోగాత్ రసనిష్పత్తిః. తథా నానాభావోపగమాద్రసనిష్పత్తిః. యథా హి గుడాదిభిః ద్రవైః వ్యఞ్జనైః ఓషధిభిశ్చ షాడవాదయః రసాః నిర్వర్త్యన్తే తథా నానాభావోపగతా అపి స్థాయినో భావాః**

**రసత్వమ్ ఆప్నువన్తీతి. రసః ఇతి – కః పదార్థః? ఉచ్యతే ఆస్వాద్యత్వాత్. కథమాస్వాద్యతే రసః? యథా హి నానావ్యఞ్జన సంస్కృతమన్నం భుఞ్జానాః రసానా స్వాదయన్తి హర్షాదీంశ్చాధిగచ్ఛన్తీతి సుమనసః పురుషా ఇత్యభివ్యాఖ్యాతాః తథా నానాభావా భినయవ్యఞ్జితాన్ వాగఙ్గసత్త్వోపేతాన్ స్థాయిభావానాస్వాదయన్తి హర్షాదీంశ్చాధిగచ్ఛన్తీతి ప్రేక్షకాః సుమనస ఇత్యభివ్యాఖ్యాతాః. తస్మాన్నాట్యరసాః. అత్రానువంశ్యౌ శ్లోకౌ భవతః –**

> **యథా బహుద్రవ్యయుతైః వ్యఞ్జనైర్బహుభిర్యుతమ్,**
> **ఆస్వాదయన్తి భుఞ్జానా భక్తం భక్తవిదో జనాః.**
> **భావాభినయసంబద్ధాన్ స్థాయిభావాంస్తథా బుధాః,**
> **ఆస్వాదయన్తి మనసా తస్మాన్నాట్యరసాః స్మృతాః.**

(నాట్యశా. హిం. అ.భా.పే. 442. 501)

భరతుడు చెప్పినదానిని పట్టి రసంలో అలౌకికత్వం ఏదీ లేదు. ఇది లోకంలో ప్రత్యక్షంగా కనబడే ఆ యా వస్తువులవల్ల, స్త్రీ పురుషాదులవల్ల పుట్టుట లేదు గాన దీనిని అలౌకికం అని అంటే అనవచ్చు నేమో! రసాన్ని భరతుడు పాకరసదృష్టాంతం సహాయంతో విశదీకరించాడు. వరిఅన్నం మొదలైనవాటిని వేరు వేరు రుచులు గల వివిధవ్యంజనాలతో (ఊరగాయలు మొదలైనవాటితో – పోపు సామాగ్రితో) కలిపినపుడు దాని కొక క్రొత్త రుచి వస్తుంది. (షాడబం అంటే అర్థం స్పష్టంగా తెలియదు. అలా తయారుచేసిన అన్నాదికం షాడబం కావచ్చు. దీని రుచికి ఆ పేరు ఉండవచ్చు). అదే విధంగా విభావానుభావవ్యభిచారిభావాలు స్థాయిభావంతో కలవడంచేత రసం నిష్పన్నం అవుతుంది. అనగా విభావాదులతో కలిసిన స్థాయిభావం రసంగా మారుతుంది. తినేవాళ్లకి పాకరసం ఆనందం ఇచ్చినట్లు ఈ రసం సహృదయులకు ఆనందం ఇస్తుంది. ఇక్కడ ఇచ్చిన ఈ దృష్టాంతాన్ని పట్టి చూస్తే భరతుని అభిప్రాయం ప్రకారం నాట్యరసం పాకరసం వలె పుట్టింపబడుతుంది గాన రసం వేరు, దానివల్ల కలిగే ఆనందం వేరు అన్నట్లు కనబడుతుంది. వ్యాఖ్యానాల జోలికి పోకుండా భరతుని మాటలను వాక్యనిర్మాణంలో పరిచయం ఉన్నవాళ్లు పరిశీలిస్తే ఇంతమాత్రం అర్థమే వస్తుంది. భరతుడు రసాలను నాట్యానికి సంబంధించి నంతవరకే ప్రతిపాదించాడు.

కాలాంతరంలో భరతుని రససూత్రానికి వేరు వేరు అర్థాలు చెప్పబడ్డాయి. లోల్లటుని వ్యాఖ్య భరతునికి చాల దగ్గరగా ఉంటుంది. భట్టలోల్లటాదుల ప్రకారం రసం ప్రధానంగా రామాదులలోనే ఉంటుంది. నాట్యంలో (రూపకాలలో) నటుడు రామాదుల వేషభూషాదులు ధరించి ఆ విధంగానే మాట్లాడుతూ రామాదుల్ని అనుకరించడంచేత నటుడిలో కూడ రసం ఉన్నట్లు కనబడుతుంది. రతి మొదలైనవాటికే విభావాదులతో సంబంధం ఏర్పడి

నప్పుడు అవి రసాలుగా మారుతాయి. శృంగారాన్ని గూర్చి చెప్పవలసి నప్పుడు – ఆలంబనం, ఉద్దీపనం అనే ద్వివిధ విభావాలవల్ల రతి పుడుతుంది. వాస్తంలో రతి పుట్టేది ఆలంబన విభావం చేతనే. పుట్టిన రతికి కొంత పుష్టి కలిగిస్తాయి కాబట్టి ఉద్దీపనవిభావాలను కూడ రతికి కారణం అని చెప్పడం జరుగుతున్నది. ఒక్కొక్కపుడు ఆలంబన విభావం ఉన్నా సుందరమైన పరిసరాలు వివిక్తస్థానం మొదలైన ఉద్దీపన విభావాలు లేకపోతే, రతి పుట్టకపోవచ్చు కూడ. ఈ విభావాలకీ రతికీ ఉన్న సంబంధం జన్యజనకభావసంబంధం. రతి జన్యం, పుట్టేది, విభావాలు జనకాలు, పుట్టించేవి. కటాక్షవీక్షణం మొదలైన అనుభవాలు రతివల్ల పుట్టిన కార్యాలు. వాటిని పట్టి రతి ఉన్నట్లు తెలుస్తుంది. ఈ అనుభావాలకీ రతికీ గమ్యగమకభావ సంబంధం. తెలుపబడేది రతి, తెలిపేవి అనుభావాలు. లజ్జ మొదలైన విభావాలు రతిని బాగా పరిపుష్టం చేసి శరీరం అంతటా వ్యాపించే టట్లు చేస్తాయి. కాబట్టి వీటికీ రతికీ మధ్య నున్న సంబంధం పోష్యపోషకభావసంబంధం. రతి పోషించదగినది, విభావాలు పోషించేవి. ఈ విధంగా రతితో విభావానుభావవ్యభిచారుల సంయోగంచేత, కలయికచేత, రామాదులైన అనుకార్యవ్యక్తులలో శృంగారరసం పుడుతుంది. బాగా అభినయాదులు చేయడంచేత నటుడిలో కూడ ఉన్నట్లు కనబడుతుంది.

ఈ విధంగా భట్టలోల్లటాదుల మతం ప్రకారం – (స్థాయినామ్ = నిగూఢంగా ఉన్న స్థాయిభావములకు), విభావ – లలనాదిరూపాలైన ఆలంబన విభావాలతోను ఉద్యానాదులైన ఉద్దీపనవిభావాలతోను ఉత్పాద్యోత్పాదక భావరూపసంబంధంవల్లా, అనుభావ – కటాక్షాలు, హస్తచాలనాలు మొదలైన కార్యాలైన అనుభావాలతో గమ్యగమక భావరూపసంబంధంవల్లా, వ్యభిచారి – నిర్వేదం మొదలైన వ్యభిచారిభావాలతో పోష్యపోషకభావ సంబంధంవల్లా, రసనిష్పత్తిః – వరసగా రసం యొక్క ఉత్పత్తి, అభివ్యక్తి, పుష్టి కలుగుతుంది అని రససూత్రానికి అర్థం. సూత్రంలో లేకపోయినా నాట్యశాస్త్రంలో తరవాత ప్రతిపాదించే రీతిని పట్టి "స్థాయినామ్" అనే పదాన్ని అధ్యాహారం తెచ్చుకొని అర్థం చెప్పుకోవాలి. (లోల్లటాదులకు సమకాలికులైన భవభూత్యాదులు రసం రామాదినిష్ఠం అని అంగీకరించడం గమనార్హం.)

ఈ విధంగా రసం అనుకరింపబడే రామాదులలలో నిష్పన్నం అయితే ఆ రసనిష్పత్తి లేని సామాజికులకు రసాస్వాదం ఎలా కలుగుతుంది? అందుచేత శ్రీశంకుకాదులు దీనిని మరొక విధంగా వ్యాఖ్యానించారు –

శ్రీ శంకుకాదుల అభిప్రాయం ప్రకారం ఆ యా హేతువుల చేత సామాజికుడు నటుడిలో ఉన్నట్లు ఊహించే (అనుమేయమైన) స్థాయిభావమే రసం. నటుడు గురువు

వద్ద సరియైన శిక్షణ పొంది చాలాకాలం స్వయంగా కూడ అభ్యాసం చేసి, రాముని వేషం ధరించి మాటలలోను, చేష్టలలోను ఆ రాముణ్ణే అనుకరిస్తున్నాడు. విభావానుభావ వ్యభిచారు లనే నామాంతరాలు గల కార్య – కారణ – సహకారులను ప్రదర్శిస్తున్నాడు. అవి కృత్రిమాలే అయినా కృత్రిమా లని అనిపించకుండా సహజాలే అన్నట్లు కనబరుస్తున్నాడు. **"సేయం మమాఙ్గేషు" దైవాదహమద్య"** ఇత్యాదిశ్లోకాలు పఠిస్తూ అత డా విధంగా అభినయించే టప్పుడు సామాజికులు మనస్సులలో ఆ శ్లోకాల భావాన్ని మననం చేస్తూ ఆ నటుణ్ణి చూస్తూంటే, వాళ్లకి ఇతడు రాముడు అనే జ్ఞానం కలుగుతుంది. ఈ జ్ఞానం లోకంలో ప్రసిద్ధంగా ఉన్న ఏ జ్ఞానాల కోవకీ చెందదు. "ఇతడు రాముడే" అనే జ్ఞానం వలె ఇది సమ్యగ్జ్ఞానం (యథార్థజ్ఞానం) కాదు. ముత్యపు చిప్పను చూడగానే "ఇది వెండి" అనే జ్ఞానం కలిగి మరు క్షణంలోనే "ఇది వెండి కాదు" అని బాధజ్ఞానం కలుగుతుంది. ఈ బాధజ్ఞానాన్ని పట్టి మొదట కలిగిన జ్ఞానం మిథ్యాజ్ఞానం (భ్రమ) అని తెలుస్తుంది. ఇక్కడ "ఇతడు రాముడు కాడు," అను బాధజ్ఞానం కలగకపోవడం చేత ఇది (రామోఽయమ్ అనే జ్ఞానం) భ్రమ కాదు. ఇది స్థాణువా (బండఊయా) లేక మనిషా అన్నపుడు ఈ జ్ఞానంలో రెండు కోటులు (పక్షాలు) ఉండడంచేత దీనిని సంశయం అంటాం. ఆ విధంగా ఇక్కడ "ఇతడు రాము డవునా కాదా" అను రెండు పక్షాలు లేకపోవడంచేత సంశయజ్ఞానం కాదు. "ఇతడు రాముడు వలె ఉన్నాడు" అనే జ్ఞానం కాదు కాబట్టి ఇది సాదృశ్యజ్ఞానము కాదు. ఈ విధంగా నటుణ్ణి చూస్తున్నపుడు కలిగే "ఇతడు రాముడు" అనే జ్ఞానం లోక ప్రసిద్ధాలైన అన్నివిధాల జ్ఞానాలకంటె విలక్షణ మైనది. చిత్రించిన గుఱ్ఱాన్ని చూచినపుడు కలిగే 'ఇది గుఱ్ఱం' అనే జ్ఞానం వంటిది. ఎందుచేత ననగా అది కూడ సమ్యగ్జ్ఞానము కాదు, సంశయమూ కాదు, సాదృశ్యజ్ఞానము కాదు. ఇది "గుఱ్ఱం కాదు" అనే బాధజ్ఞానం కలగక పోవడంచేత భ్రాంతీ కాదు. ధూమాన్ని చూచి పర్వతంమీద అగ్నిని ఊహించి నట్లు నటుని అభినయం అంతా చూచి సామాజికులు అతడు రాము డనుకొని అతనిలో స్థాయిభావం ఉందను కొంటున్నారు. ఆ స్థాయిభావానికీ నటుడు ప్రదర్శించే విభావాదులకూ సంబంధం గమ్యగమకభావసంబంధం. స్థాయిభావం గమ్యం, తెలియదగినది, విభావాదులు గమకాలు. తెలిపేవి; ఊహింపచేసేవి. ఈ స్థాయి భావంలో సహజంగా ఒక రమణీయత్వం ఉంది. అందుచేత ఇది లోకంలో అనుమీయమానములైన ఇతరవస్తువుల వంటిది కాదు. అందువలన దీనిని అనుమానప్రమాణంవలన గ్రహించినా ఇది ఆస్వాదయోగ్యంగా ఉంటుంది. ఈ విధంగా నటునిలో వాస్తవంగా లేని రతిని ఉన్నట్లుగా భావించి సామాజికులు ఆస్వాదిస్తారు. అదే రసం ''స్థాయికి విభావానుభావవ్యభిచారులతో సంయోగంవల్ల అనగా అనుమాప్యానుమాపకసంబంధం వల్ల (స్థాయి అనుమాప్యం, ఊహింపచేయదగినది,

విభావాదులు అనుమాపకాలు, అనుమితిని కలిగించేవి) రసనిష్పత్తి. రసానుమితి" అని సూత్రార్థం.

చమత్కారం ప్రత్యక్షంవల్లనే కలగాలి కాని అనుమిత్యాదులవల్ల కలగదు అనే విషయం లోకప్రసిద్ధం. అందుచేత ఈ రసానుమితివాదం అయుక్తం అనే ఉద్దేశ్యంతో భట్టనాయకుడు ఈ సూత్రాన్ని మరొక విధంగా వ్యాఖ్యానించాడు –

కావ్యనాట్యాదులలో ప్రయోగించే శబ్దానికి అభిధ అనే వ్యాపారం (function) ఒక్కటే కాకుండా 'భావకత్వం', 'భోజకత్వం' అని మరి రెండు వ్యాపారాలు కూడ ఉంటాయి. రసానుభూతి విషయంలో ఈ రెండు వ్యాపారాలకీ చాల ప్రాధాన్యం ఉంది. నాట్యం సందర్భంలో నటుడు, రామాదినాయకులు, సామాజికుడు, అనే ముగ్గురు ఉంటారు. నటుడు నాయకుడూ కూడ తటస్థులే. అనగా రసానుభూతికి సంబంధించి నంతవరకు ఉదాసీనులే. అందుచేత రసం తటస్థులైన నట – రామాదులకు సంబంధించినదిగా గాని, తనకు, అనగా సామాజికునికి సంబంధించినదిగా గాని ప్రతీతి (జ్ఞాన) గోచరం కాదు. వారిలో పుట్టదు. వారిలో ఉన్నట్లు వ్యంజింపచేయబడదు. శబ్దంలో ఉన్న రెండవ వ్యాపారం అయిన భావకత్వం, సామాజికుణ్ణి, అభిధ ద్వారా తెలిసిన కావ్యార్థాన్ని మాటి మాటికీ భావనచేసే టట్లు చేస్తుంది. ఆ భావన ఉన్నంతవరకూ సామాజికుడు ఎదుటనున్న విభావాదుల్ని ఆ యా వ్యక్తులనుగా గాని, ఆ యా వ్యక్తులకు, దేశకాలాలకు సంబంధించిన వాటినిగా గాని చూడడు. సామాన్యరూపంలో (సర్వసాధారణరూపంలో) చూస్తాడు. అనగా రత్యాదులను సీతారామాదులకు సంబంధించినవాటినిగా కాక కేవలం రత్యాదిరూపంలో చూస్తాడు. అటుపైన భోజకత్వవ్యాపారం పనిచేయడం ప్రారంభిస్తుంది. అప్పుడు సాధారణీకృతాలైన విభావాదులతో సహకృతమైన ఈ భోజకత్వవ్యాపారంచేత సామాజికునికి ఈ రత్యాదుల ఆస్వాదం కలుగుతుంది. ఈ రత్యాద్యాస్వాదమే రసనిష్పత్తి. స్థాయికి విభావాదులతో భోజ్యభోజకభావసంబంధంచేత (స్థాయి భోజ్యం, అనుభవించ తగినది; విభావాదులు భోజకాలు, అనుభవింపచేసేవి) రసనిష్పత్తి అనగా రసభుక్తి (భోగం) అని ఈ సూత్రానికి అర్థం.

**సాధారణీకరణం** (universalisation) రససిద్ధాంతానికి సంబంధించిన అతి ప్రధానమైన అంశం. దీనిని ప్రప్రథమంగా ప్రతిపాదించిన గౌరవం భట్టనాయకునికి చెందుతుంది. వ్యంజనావ్యాపారం ఒక్కటే అంగీకరిస్తే చాలు, భావకత్వభోజకత్వ వ్యాపారాలు అంగీకరించవలసిన పనిలేదు అనే ఉద్దేశ్యంతో భట్టనాయకుని మతాన్ని ఖండించిన అభినవగుప్తాదులు కూడ ఈ సాధారణీకరణాన్ని అంగీకరించారు.

"సత్త్వోద్రేకప్రకాశానన్దమయసంవిద్విశ్రాన్తిసతత్త్వేన భోగేన భుజ్యతే' అనే వాక్యంలో మమ్మటుడు భట్టనాయకాభిమతరసస్వరూపాన్ని ప్రతిపాదించాడు. ప్రపంచకం అంతా

సత్త్వరజస్తమోగుణాత్మకం అని సాంఖ్యుల సిద్ధాంతం. ఇది దార్శనికుల కందరికీ అంగీకారయోగ్య మైన సిద్ధాంతం. మానవుడు కూడ సత్త్వరజస్తమోగుణాత్మకుడే. సత్త్వగుణం జ్ఞానాన్నీ, ప్రకాశాన్నీ కలిగిస్తుంది. రజోగుణం కార్యశీలత్వాన్ని కలిగిస్తుంది. తమోగుణం నిద్రా – ఆలస్యాదులకు (ఆలస్యం అనగా మందగొండితనం) కారణం. ఈ మూడు గుణాలు విషమంగా అనగా హెచ్చుతగ్గులలో ఉంటూంటాయి. ఒక గుణం హెచ్చుగా ఉన్నప్పుడు మిగిలిన రెండూ అణగి ఉంటాయి. సత్త్వగుణం రజస్తమోగుణాలను అణచి ఉద్రిక్తంగా ఉన్నపుడు జ్ఞానం, ప్రకాశం, ఆనందం అధికంగా ఉంటాయి. వాస్తవానికి జ్ఞాన – ప్రకాశ – ఆనందాలు మూడు ఒకటే అని తాత్త్వికులు చెపుతారు. భావకత్వవ్యాపారంచేత భావ్యమానమై, సాధరణీకృతమైన స్థాయిభావం, సత్త్వోద్రేకంచేత (సత్త్వగుణం రజస్తమోగుణాలను అణచి ఉద్రేకం చెందడంచేత) కలిగిన ప్రకాశ = ప్రకాశ అనే, ఆనన్దమయసంవిత్ = ఆనందరూపమైన జ్ఞానము నందు, విశ్రాన్తి = విశ్రమించడం, అనగా ఇతర జ్ఞానా లేవీ లేకుండా ఉండడం, అనే సతత్త్వేన = సమానమైన స్వరూపం గల, భోగంచేత అనగా సాక్షాత్కారంచేత, అనుభవించబడును అని అర్థం. భోగం అనగా – సత్త్వోద్రేకంచేత కలిగిన ప్రకాశ అనే ఆనందస్థితిలో ఇతర విషయజ్ఞానా లేవీ లేకుండా ఉండడం అని భావం. ఆ భోగమే రసాస్వాదం లేదా రసం ఇది భట్టనాయకుని మతంలోని సారం.

భట్టనాయకు డంగీకరించిన భావకత్వభోజకత్వవ్యాపారాలతో పని లేకుండా వ్యంజనావ్యాపారంచేతనే రసాస్వాదాన్ని నిరూపిస్తూ అభినవగుప్తుడు తన మతాన్ని ఈ విధంగా ప్రతిపాదించాడు – లోకంలో దైనందినజీవితంలో యువతి, ఉద్యానం మొదలైన (రతి) కారణాలనూ, కటాక్షవిక్షేపాదికార్యాలనూ, నిర్వేదం మొదలైన సహకారులనూ బాగా పరిశీలించి వాటి సహాయంచేత రత్యాదిభావాలను అనుమానించగలిగిన (అనగా ఊహించగలిగిన) వ్యక్తి హృదయంలో రత్యాదిస్థాయిభావాలు వాసనారూపంలో, అనగా సంస్కారరూపంలో, ఉండిపోతాయి. అలాంటివాడే సహృదయుడైన సామాజికుడు. వానికే రసాస్వాదయోగ్యత ఉంటుంది. కేవలం వ్యాకరణ – న్యాయ – మీమాంసా – వేదాంతాది శాస్త్రాదుల పఠనపాఠనాదులతోను, ఈనాటి విజ్ఞానశాస్త్రం, కంప్యూటర్లు మొదలైన వాటితోను కాలం గడిపే శుష్కహృదయులకూ, వేదాభ్యాసజడులకూ ఈ వాసన ఉండదు. రసాస్వాదం అసంభావ్యం. అందుచేతనే –

**"వాసనాచేన్న హేతుః స్యాత్ స స్యాన్మీమాంసకాదిషు"**

**"సవాసనానాం నాట్యాదౌ రసస్యానుభవో భవేత్**
**నిర్వాసనాస్తు రఙ్గాన్తః కాష్ఠకుడ్యాశ్మసంనిభాః."**

అని అంటారు. “రసాస్వాదనకి వాసన హేతువు కాకపోతే అలాంటి వాసన లేని మీమాంసకులకు కూడ (వీళ్లలో వేదాంతులు కూడ చేరుతారు) రసాస్వాదం కలగాలి. (కలగడం లేదు కదా)”. “వాసన ఉన్నవాళ్లకే నాట్యాదులలో రసానుభవం కలుగుతుంది. వాసన లేనివాళ్లు నాట్యశాలలో కూర్చుండి చూస్తున్నా, అక్కడ ఉన్న స్తంభాలూ గోడలూ రాళ్లు ఎంతో వీళ్లు కూడ అంతే” అని ఈ వాక్యాల అర్థం.

అలాంటి సహృదయులైన సామాజికులు ధ్వనికావ్యాదులలోను –

**“కాయికో వాచికశ్చైవ ఆహార్యః సాత్త్వికస్తథా,**
**చత్వారోఽభినయాః ప్రోక్తా నాట్యశాస్త్రవిశారదైః.”**

అని చెప్పిన చతర్విధాభినయాలు ఉన్న నాట్యంలోను (రూపకంలోను) కవి – నటాదులు చూపిన వనితాదికారణకార్యసహకారుల్ని చూస్తారు. అయితే అవి లోకానికి (ప్రత్యక్ష జీవితానికి) సంబంధించినవి కావు. విభావనం, అనుభావనం, వ్యభిచారణం అనే అలౌకికాలైన వ్యాపారాలు (పనులు) చేస్తూంటాయి. అతి సూక్ష్మంగా వాసనారూపంలో ఉన్న రత్యాదుల్ని ఆస్వాదయోగ్యాలు అయే టట్లు చేయడం విభావనం. వాటిని అనుభవ యోగ్యం అయే టట్లు చేయడం వ్యభిచారణం. అందుచేత వీటికి కారణ – కార్య – సహకారు లనే పేర్లకు బదులు విభావ – అనుభావ – వ్యభిచారు లనే పేర్లు పెట్టి వ్యవహరిస్తారు. నిజానికి ఈ విభావాదులు ఒకానొక కాలంలో ఒకానొక దేశంలో జరిగిన లేదా జరిగినట్లు చిత్రించిన కథలోని వ్యక్తులకు సంబంధించినవి. అయితే సామాజికుడు సహృదయు డవడంచేత, భావనాబలంచేత, వ్యక్తి విశేష – దేశ – కాలాదుల్ని పూర్తిగా విస్మరించి ఆ వ్యక్తుల్ని నాయికా – నాయకాదిరూపంలోనే చూస్తాడు కాని ఏనాటివాళ్లో అయిన శకుంతలాదుష్యంతాదుల రూపాలలో చూడడు. తన సంకుచిత వ్యక్తిత్వాన్ని కూడ మరచిపోతాడు. ఈ విభావాదులు “నాకు సంబంధించినవి” అని కాని, “వీళ్ల కెవరికీ సంబంధించనివి” అని కాని అతనికి ఆ సమయంలో జ్ఞానం ఉండదు. వీటి నన్నింటినీ సాధారణరూపంలో చూస్తాడు (ఇదే సాధరణీకరణం అనగా). ఆ విభావాదులచేత వ్యంగ్యాలైన రత్యాదుల్ని సాధారణరూపంలోనే చూస్తాడు. ఆ సమయంలో విభావాదుల జ్ఞానం తప్ప ఇతరవిషయాల జ్ఞానం ఏదీ వానికి ఉండదు. అతని హృదయంలో అణగి ఉన్న రత్యాదులు ఉద్బుద్ధాలవుతాయి. ఆ రత్యాదుల్నే ఆస్వాదిస్తారు. ఈ విధంగా రత్యాదుల ఆస్వాదమే రసం. లేదా ఆస్వాదించబడే రత్యాదులే రసం.

అయితే ఇక్కడ ఒక ప్రశ్న ఉదయిస్తుంది. పటికబెల్లం వేరు, దాని ఆస్వాదనం వేరు. అదే విధంగా రసాస్వాదనం అన్నప్పుడు రసం వేరు, దాని ఆస్వాదనం వేరు అని చెప్పాలి కదా? ఆస్వాదమే రసం ఎలా అవుతుంది? దానికి బౌద్ధమతం ప్రకారం ఒక

సమాధానం చెపుతారు. బౌద్ధమతానికి సంబంధించిన ప్రధానమైన నాలుగు శాఖలలో యోగాచారశాఖ ఒకటి. యోగచారుల సిద్ధాంతం ప్రకారం జ్ఞానంకంటె భిన్నంగా బాహ్యమైన వస్తు వనేది లేదు. అయినా ఘటం వేరు, దాని జ్ఞానం వేరు అన్నట్లు ఘటజ్ఞానం అని వ్యవహరిస్తున్నాం. అదే విధంగా రసం వేరు దాని ఆస్వాదం వేరు కాకపోయినా 'రసాన్ని ఆస్వాదించడం' అని వ్యవహరించడం సౌకర్యం కోసం చెప్పే మాట మాత్రమే. ఔపచారికప్రయోగం అన్నమాట. ("ఈ కావ్యంలో ఈ రసం ఉంది" అని చెప్పేమాటలు పూర్తిగా ఔపచారికా లని వేరే చెప్పనక్కరలేదు). మరొక ఉదాహరణం చెప్పాలంటే – "నన్ను నేను తెలుసుకొనుచున్నాను" అని లోకంలో వ్యవహారం ఉంది. ఇక్కడ తెలుసుకొనే వాడు తెలుసుకొనబడేదీ కూడ తానే (ఆత్మయే). అదే విధంగా ఆస్వాదించబడేదీ ఆస్వాదనమూ కూడ రసమే. రసంలోని ప్రధానమైన అంశం ఏది? ఆస్వాదమే. రసం ఎంత సేపు ఉంటుంది? విభావాదుల జీవితమే దీనికి అవధి. అనగా విభావాదులు ఎంతసేపు ఉంటే ఇది అంతసేపు ఉంటుంది. విభావాదుల జ్ఞానం ఆగిపోతే రసాస్వాదం ఆగిపోతుంది. అంతేకాదు – ఆ తన్మయత్వస్థితి సడలి "ఈమె శకుంతల, ఇతడు దుష్యంతుడు" ఇత్యాదివిధంగా గాని "ఎదుట ఉన్నది ఫలానా నటుడు లేదా నటి' అని కాని అనుకొనగానే విభావాదుల సాధారణీకరణానికి ఆఘాతం కలిగినప్పుడు కూడ విభావాదుల జీవితం ఆగిపోయినట్లే.

ఈ రసాస్వాదం పానకరసాస్వాదం వంటిది. బెల్లం, ఏలకులు, మిరియాలు, పచ్చకర్పూరం మొదలైన వస్తువు లన్నీ వేసి తయారుచేసిన పానకం ఆస్వాదిస్తూన్నపుడు దాని రుచి ఆ వస్తువుల రుచుల సంమేళన రూపంలో ఉంటుంది. ఆ వస్తువుల్ని వేరు వేరుగా తిన్నపుడు ఉండే రుచి వేరు, అవన్నీ కలపగా వచ్చే రుచి వేరు. అదే విధంగా రసాస్వాదనంలో, విభావానుభావాదులు స్థాయితో కలవడంచేత ఆ సంమిశ్రితానుభూతి విశిష్టంగా ఉంటుంది. ఆ సమయంలో రసం మన ఎదటనే స్ఫురిస్తూన్నట్లు, హృదయంలో ప్రవేశించినట్లు, శరీరం అంతా వ్యాపించి నట్లు అనిపిస్తుంది. శరీరం పరవశమైపోతుంది. బ్రహ్మానందాన్ని అనుభవిస్తున్నామా అనిపించే టట్లు చేస్తుంది. బ్రహ్మానందంలో ఆత్మ ఒక్కటే భాసిస్తుంది. దీనిలో విభావాదులు కూడ భాసిస్తాయి. కాబట్టి ఇది బ్రహ్మానందం కాదు. తత్సదృశం మాత్రమే. దైనందిన జీవితంలో కనబడే దృశ్యాల అనుభూతి వేరు; ఈ కావ్యనాట్యాద్యనుభూతి వేరు. దానిలో చమత్కారం ఉండవచ్చు లేకపోవచ్చు కాని దీనిలో మాత్రం వర్ణించడానికి శక్యం కాని చమత్కారం, ఆనందానుభూతి కలుగుతుంది. అందుచేతనే ఇది అలౌకికం. ఈవిధంగా సామాజికు డాస్వాదించే, తనలోనే అణగి ఉండి విభావాదులచేత ఉద్బుద్ధాలైన రత్యాదులే రసం. "విభావానుభావవ్యభిచారి సంయోగాత్ = స్థాయిభావాలకు విభావాదులతో వ్యంగ్యవ్యంజకభావ సంబంధంవల్ల

లేదా విభావ – అనుభావ – వ్యభిచారిభావాలు పరస్పరం కలవడం వల్ల, రసనిష్పత్తిః = రసాభివ్యక్తి కలుగుతుంది" అని ఈ పక్షంలో రస సూత్రానికి అర్థం. ఇది అభినవగుప్తుని మతం. అభినవగుప్తుడు తన మతాన్ని పూర్వమతవిమర్శపూర్వకంగా **అభినవభారతిలోను, లోచనంలోను** ప్రతిపాదించాడు. (**కావ్యప్రకాశకు** అస్మద్విరచిత బాలానందినీ వ్యాఖ్యానంలో వివరించిన ఈ మత చతుష్టయాన్ని యథాతథంగా ఇక్కడ చూపించడం జరిగింది.)

జగన్నాథుడు **రసగంగాధరంలో**, అభినవగుప్తాదుల మతాలను చూపిన తరవాత రెండు క్రొత్త మతాలను కూడ చూపించాడు. వాటిలో **'నవ్యాస్తు'** అని ప్రారంభించి చెప్పిన మతం ప్రకారం రసానుభవం భ్రాంతిజ్ఞానజన్యం. ఇది వేదాంత సిద్ధాంతాన్ని అనుసరించి ప్రతిపాదించిన మతం. ముత్యపుచిప్పను చూచినపుడు వెండి అనే భ్రాంతి కలుగుతుంది. ఆ సయంలో అక్కడ కనబడే వెండి అనిర్వచనీయం. అది నిజంగా ఉన్నది అనడానికి వీలు లేదు. నిజంగా ఉంటే క్షణాంతరంలో "ఇది వెండి కాదు" అనే జ్ఞానం కలగకూడదు. అలా గని అసలే లేదనడానికి వీలు లేదు. ఎదురుగా కనబడుతూన్నది కదా? ఈ విధంగా ఇది ఉన్న దని కాని లేదని కాని నిర్వచించడానికి శక్యం కాదు గాన **అనిర్వచనీయం**. భ్రాంతిస్థలా లన్నింటిలో ఇదే పద్ధతి. ఇదే విధంగా పరిపుష్టరత్యాదిరూపమైన ఈ శృంగారాదిరసం కూడ అనిర్వచనీయమే. కవి లేదా నటుడు ప్రదర్శించిన అసత్యములైన విభావాదులచేత సహృదయుడు వ్యంజనావ్యాపారం ద్వారా దుష్యంతాదులకు శకుంతలాదుల విషయంలో రతి ఉన్న దని గ్రహిస్తాడు. సహృదయునిలో భావన అనే దోషం ఉంది. దానిచేత తనలో దుష్యంతత్వాదికాన్ని ఆరోపించుకొంటాడు. అప్పుడు అతనిలో రతి పుడుతుంది. అది అనిర్వచనీయమే. దానితో అతడు అలౌకికమైన ఆనందాన్ని అనుభవిస్తాడు. ఇలాంటి ఆనందాన్ని కలిగించే శక్తి కావ్యాద్యుపస్థాపితమైన విభావాదులకు మాత్రమే ఉంది. ఈ విధంగా ఎదుట నున్న వాళ్లను దుష్యంతాదు లనుకొనడం అనే భ్రాంతితో ప్రారంభమైన జ్ఞానం తనలో లేని రత్యాదులను ఆరోపించు కొనడం అనే భ్రాంతికి దారితీసి తద్ద్వారా ఆనందం కలిగిస్తుంది. ఇది ఈ మతం యొక్క సంక్షిప్తరూపం. దీని తరవాత **'పరే తు'** అనే మాటలతో ప్రారంభించి మరొక మతం ప్రతిపాదించబడింది. ఇది కూడ భ్రాంతిత్వాన్ని ప్రతిపాదించే మతం. వెనుక చెప్పిన శుక్తిరజతదృష్టాంతంలో అద్వైతవేదాంతులు అనిర్వచనీయమైన రజతం భాసిస్తూన్నది అని అంటే మరికొందరు దార్శనికులు గృహ – ఆపణాదులలో తాను ఇది వరకు చూచి ఉన్న రజతాన్నే ద్రష్ట ఇక్కడ ముత్యపుచిప్ప మీద చూస్తున్నాడు అంటారు. మొదటిదానికి **అనిర్వచనీయఖ్యాతి** అనీ రెండవదానికి **అన్యథాఖ్యాతి** అనీ పేర్లు. ఈ రెండవ మతం అన్యథాఖ్యాత్యనుసారం ప్రతిపాదించి నట్లు కనబడుతుంది. ఏదైనా రసానుభూతి

భ్రాంతిజన్య మనే ఈ మతం కూడ చెపుతున్నది. బహుశా జగన్నాథునకు మొదటి మతం అంగీకార్యం అయి ఉండవచ్చు.

అయితే ఆరోపితమైనది రత్యాదిక మైతే అది సహజంగా సుఖరూపం గాన ఆనందజనకం అయితే కావచ్చును. శోకాద్యారోపం ఆనందహేతు వెలా అవుతుంది. అన్ని రసాలూ ఆనందస్వరూపాలు కదా అని ప్రశ్న. దీనికి సమాధానంగా జగన్నాథుడు – శోకాదులు కూడ ఆనందజనకాలే అని లోకంలో సహృదయుల అనుభవం అయితే కావ్యాదులకు దుఃఖాన్ని కూడ సుఖంగా మార్చ గల శక్తి ఉందని ఒప్పుకోండి; అలా కాక కరుణాదులవల్ల దుఃఖం కలుగుతుంది అని అనుభవ మైతే తదనుసారంగా కరుణాదులు శృంగారాదుల వలె ఆనందరూపాలు కావు అని అంగీకరించండి అంటాడు. దీనిని పట్టి అన్ని రసాలు సుఖరూపాలే అనే అభినవగుప్తాదుల వాదం జగన్నాథునికి అంగీకార్యం కాదని తెలుస్తూన్నది.

**రససంఖ్య :** కాళిదాసుని **విక్రమోర్వశీయం** (II. 18) **కావ్యాదర్శం** (II. 392) ఒక **నాట్యశాస్త్ర**పాఠం (IV. 15.16) మొదలైనవాటిని పట్టి మొదట ఎనిమిది రసాలే అంగీకరించబడి నట్లు తెలుస్తూన్నది. ఉద్భటునిలోను (IV. 5) **విష్ణుధర్మోత్తర పురాణం**లోను తొమ్మిది రసాల నిర్దేశం ఉంది. దీనిని పట్టి ఏడవ శతాబ్దం నాటికి శాంతరసం కూడ చేర్చబడినట్లు తెలుస్తూన్నది. మొట్టమొదట శాంతరసాన్ని ప్రతిపాదించినవాడు వాసుకి అని **భావప్రకాశనం**లో చెప్పబడింది. శాంతరసానికి కావ్యాలలో స్థానం ఉండవచ్చు నేమో కాని రూపకాలలో దీనికి అవకాశం ఉండదు అని కొందరన్నారు **"శమమపి కేచిత్ప్రాహుః పుష్టిర్నాట్యేషు నైతస్య"** (**దశరూపకం**. IV. 35).

> **"నాటకాదినిబన్ధే తు తపశ్చరణవస్తుని,**
> **అభినేతుమశక్యత్వాత్తద్వాక్యార్థపదార్థయోః,**
> **సామాజికానాం మనసి రసః శాన్తో న జాయతే."** (భా. ప్ర. పే. 47)

ఈ విధంగా శాంతరసానికి రూపకాలలో అనుప్రవేశం లేదనడానికి అనేకకారణాలు చెప్పబడ్డాయి. **మహాభారతంలో** శాంతరసం ప్రధానరసం అని ఆనందవర్ధనుడు నాల్గవ ఉద్ద్యోతంలో ప్రతిపాదించాడు. అయితే **నాట్యశాస్త్రం**లోని కొన్ని పాఠాలలో శాంతరసం కూడ ప్రతిపాదించబడిన దనీ నిజానికి మోక్షహేతువవడంచేత అదే ప్రధానరస మనీ అభినవగుప్తుడు **అభినవభారతిలో** (మొదటి సం. పే. 340) గట్టిగా ప్రతిపాదించాడు. అభినవగుప్త – ధనంజయుల ప్రకారం శాంతరసానికి స్థాయిభావం శమం. వైరాగ్యము, సంసారభీరుత్వము, విభావాలు, మోక్షశాస్త్రచింత అనుభావం. నిర్వేద – మతి – ధృతి –

స్మృతులు వ్యభిచారిభావాలు. నిర్వేదం దీని స్థాయిభావ మని మమ్మటుడు, జుగుప్స లేదా ఉత్సాహం స్థాయిభావం అని కొందరూ అన్నారు. రుద్రటుడు ప్రేయస్ అను పదవ రసం పేర్కొన్నాడు. కొందరు ఆర్ద్రత స్థాయిభావంగా గల స్నేహరసాన్ని, కొందరు లౌల్య – భక్తిరసాలను చెప్పినట్లు అభినవగుప్తుడు (మొ.సం. 341–42 పే) అన్నాడు. అయితే స్నేహం రత్యుత్సాహాలలోను, లౌల్యం హాసంలోను లేదా రతిలోను, భక్తి రతిలోను అంతర్గతం అవుతాయి అని అభినవగుప్తుని అభిప్రాయం. దేవాది విషయకరతి భావమే కాని రసం కాదని మమ్మటు డన్నాడు – **"రతిర్దేవాదివిషయా వ్యభిచారీ తథాఞ్జితః, భావః ప్రోక్తః"** (కా.ప్ర. IV.35) "నటుడు కేవలం రసం పోసిన పాత్ర వంటివాడు. వానికి దాని ఆస్వాదనం ఉండదు. కొందరు శ్రద్ధ స్థాయిభావంగా గల భక్తిని, లౌల్యాన్ని, స్నేహాన్ని రసాలుగా అంగీకరిస్తారు, అది యుక్తం కాదు" అని **సంగీతరత్నాకరం**లో (370–71 శ్లోకాలు VII పే. 815) ప్రతిపాదింపబడింది. **నాగానందనాటకం**లో శాంత శృంగారాలు వ్యాపించి ఉన్నాయనీ, శాంతరసానికి తృష్ణాక్షయసుఖం స్థాయిభావం అనీ చెపుతూ ఆనందవర్ధనుడు **మహాభారతం** నుండి తృష్ణాక్షయసుఖప్రాధాన్యాన్ని చెప్పే శ్లోకం ఉదాహరించి, దీనియందు అందరికీ ఆసక్తి లేనంత మాత్రాన ఇది స్థాయిభావం కాదని గాని, శాంతరసం నాటకాదులలో ఉండ దని గాని చెప్పడానికి వీలు లేదని అన్నాడు – **"శాన్తశ్చతృష్ణాక్షయ సుఖస్య యః పరిపోషః తల్లక్షణః రసః ప్రతీయతే. తథాచోక్తమ్"** –

> **"యచ్చ కామసుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్,**
> **తృష్ణాక్షయసుఖస్యైతే నార్హతః షోడశీం కలామ్."** (శాం. ప. 175–35)

**"యది నామ సర్వజనానుభవగోచరతా తస్య నాస్తి నైతావతాసావలోకసామాన్యమహాను భావచిత్తవృత్తివిశేషవత్ ప్రతిక్షేప్తుం శక్యః" (ధ్వన్యా. పే. 219–220).** అభినవగుప్తుడు **లోచనం**లో రూపకాలలో ఒకప్పుడు ధర్మం, ఒకప్పుడు క్రీడలు, ఒకప్పుడు ఐశ్వర్యం, ఒకప్పుడు శమం కూడ చూపవచ్చును అను **నాట్యశాస్త్ర**వాక్యాన్ని ఉదాహరించి శమం కూడ రూపకాలలో నిబద్ధం కావచ్చును అని అంటాడు.

> **"త్రైలోక్యస్యాస్య సర్వస్య నాట్యం భావానుకీర్తనమ్,**
> **క్వచిద్ధర్మః క్వచిత్క్రీడా క్వచిదర్థః క్వచిచ్ఛమః."** (నా.శా. VII.104)

అందరికీ ఇష్టం కాకపోయినంత మాత్రంచేత దానిని కూర్చకూడ దనే మాట లేదు అని అంటూ వీతరాగులకు శృంగారం అంటే ఇష్టం లేకపోయినంత మాత్రంచేత శృంగారం రసం కాదంటామా అని ప్రశ్నిస్తాడు. శాంతం అనేది శమం ద్వారా సాధించబడుతుంది. నటునిలో శమం ఉండదు; అందుచేత రూపకాలలో శాంతానికి అవకాశం లేదు అనే

కొందరి అభిప్రాయాన్ని చెప్పి **సంగీతరత్నాకరం**లో – రసాస్వాదం సామాజికునకే కాని నటునికి కాదు కదా; అందుచేత రూపకాలలో కూడ శాంతం ఉండడానికి అభ్యంతరం ఏమీ ఉండకూడదు అని సమాధానం చెప్పబడింది–

> **"శాన్తస్య శమసాధ్యత్వాన్నటే చ తదసంభవాత్,**
> **అష్టావేవ రసా నాట్యేష్వితి కేచిదచూచుదన్.**
> **తదచారు యతః కంచి న్న రసం స్వదతే నటః,**
> **సామాజికాస్తు లిహతే రసాన్, పాత్రం నటో మతః".**

(సం. రత్నా. ×. 1370–71)

**నాట్యశాస్త్రం**లో భరతుడు ప్రతిపాదించిన రససిద్ధాంతాన్ని గూర్చిన విమర్శ, ఆ గ్రంథం ఆవిర్భవించినది మొదలు నేటివరకు అనేకనాట్యశాస్త్రవ్యాఖ్యానగ్రంథాలలోను ఎన్నో స్వతంత్రఅలంకారశాస్త్రగ్రంథాలలోను, ఆధునికసాహిత్యవిమర్శకుల గ్రంథాదుల లోను నిరంతరంగా జరుగుతూనే ఉంది. ఇక్కడ కొందరు ప్రాచీనవ్యాఖ్యాతల, ఆలం కారికుల అభిప్రాయాలు మాత్రమే సంక్షిప్తంగా చూపబడ్డాయి.

**శ్రీః శ్రీః శ్రీః**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ సప్తమోఽధ్యాయః

# భావవ్యఞ్జకాధ్యాయము

స్థాయీ ప్రబుద్ధహృదయే వ్యభిచారిభూతః,
కామాకులాసు జనతాసు మహానుభావః,
అన్తర్విభావవిషయో రసమాత్రమూర్తిః
శ్రీమాన్ ప్రసన్నహృదయోఽస్తు మమ త్రిణేత్రః.
– శ్రీమదభినవగుప్తాచార్యాః

**మూ. భావానిదానీం వ్యాఖ్యాస్యామః. అత్రాహ – భావా ఇతి కస్మాత్? కిం భవన్తీతి భావాః, కిం వా భావయన్తీతి భావాః? ఉచ్యతే – వాగఙ్గసత్త్వోపేతాన్ కావ్యార్థాన్ భావయన్తీతి భావాః ఇతి. భూ ఇతి కరణే ధాతుః; తథా చ భావితం, వాసితం, కృతమ్ ఇత్యనర్థాన్తరమ్. లోకేఽపి చ ప్రసిద్ధమ్ – అహో హ్యనేన గన్ధేన రసేన వా సర్వమేవ భావితమితి. తచ్చ వ్యాప్త్యర్థమ్.**

**తా.** ఇపుడు భావాలను వ్యాఖ్యానిస్తాం. ఇక్కడ ప్రశ్నిస్తున్నాడు – భావాలు అని ఎందు కంటున్నారు? ఉంటాయి కాబట్టి భావాలా, (ఇతరమైనవాటిని వేటినో) ఉండేటట్లు చేస్తాయి కాబట్టి భావాలా? (సమాధానం) చెపుతున్నాం, విను. వాచిక – ఆంగిక – సాత్త్వికాభినయాలచే అందింపబడిన కావ్యార్థాలను, నాటకంలో ఉన్న విషయాలను భావింపచేస్తాయి కాబట్టి భావాలు.

ఇక్కడ ప్రేరణార్థక 'ణిచ్' ప్రత్యయంచేర్చిన 'భూ' ధాతువునకు, 'కరణం' అనగా 'ఉండేటట్లు, అలా జరిగేటట్లు చేయడం' అని అర్థం. అందుచేత 'భావితమ్' ('ఉండే టట్లు చేయబడినది') అన్నా, 'వాసితమ్' ('వ్యాపింపచేయబడినది) అన్నా ఒకటే అర్థం. లోకంలో కూడ – "ఆహా! ఈ గంధంచేత, లేదా ఈ రసంచేత అంతా భావితమైనది," అనడం ప్రసిద్ధంగా ఉంది. 'భావితమ్' అనేది ఇక్కడ వ్యాప్తి అను అర్థం గలది. 'భావితమ్' అనగా వ్యాపింపచేయబడినది అని అర్థం.

**మూ. శ్లోకాశ్చాత్ర –**

**విభావేనాహృతో యోఽర్థో హ్యనుభావైస్తు గమ్యతే,**
**వాగఙ్గసత్త్వాభినయైః స భావ ఇతి సంజ్ఞితః. 1**

**తా.** ఈ విషయంలో ప్రాచీన శ్లోకాలు కూడ ఉన్నాయి –

విభావాలచేత ఏ అర్థం (విషయం) ఆహృత మైనదో, ఉపస్థాపిత మైనదో (presented) అది అనుభావాల చేత వాచిక – ఆంగిక – సాత్త్విక అభినాయల ద్వారా స్పష్టంగా తెలుపబడుతుంది. అదే **భావం** అని చెప్పబడుతుంది.

**మూ. వాగఙ్గముఖరాగేణ సత్త్వేనాభినయేన చ,**
**కవేరన్తర్గతం భావం భావయన్ భావ ఉచ్యతే. 2**

**తా.** మాటలచేత, శరీరంచేత (అవయవాల చేష్టలచేత) ముఖకవళికలచేత (ముఖం రంగుచేత) సాత్త్వికాభినయంచేత కవి మనస్సులో ఉన్న భావాన్ని (అభిప్రాయాన్ని) భావింప చేసేది పైకి తెలిపేది, భావం అని చెప్పబడుతుంది.

**వి. 'భవతీతి భావః'** అను వ్యుత్పత్తి చేత ఉన్నది, అని **'భావ'** శబ్దానికి అర్థం. ఈ శబ్దానికే **"భావయతీతి భావః"** అను వ్యుత్పత్తిచేత తెలుసుకొనేటట్లు చేసేది అని అర్థం. ఈ విధంగా కవి మనస్సులో ఉన్నదీ భావమే; ఆ భావాన్ని వ్యక్తీకరించేదీ భావమే.

**మూ. నానాభినయసంబద్ధాన్ భావయన్తి రసానిమాన్,**
**యస్మాత్తస్మాదమీ భావా విజ్ఞేయా నాట్యయోక్తృభిః. 3**

**తా.** అనేకవిధా లైన అభినయాలతో సంబంధించిన రసాలను భావింపచేస్తాయి గాన ఇవి 'భావములు' అని నాట్యప్రయోక్తలు తెలుసుకోవాలి.

**మూ. అథ విభావః కస్మాత్? ఉచ్యతే – విభావో విజ్ఞానార్థః. విభావః కారణం నిమిత్తం, హేతుః ఇతి పర్యాయాః. విభావ్యన్తేఽనేన వాగఙ్గసత్త్వాభినయా ఇత్యతో విభావః. యథా విభావితమ్, విజ్ఞాతమ్ ఇత్యనర్థాన్తరమ్.**

**తా.** సరే! విభావం అని ఎందు కంటారు? (సమాధానం) చెపుతున్నాం; విను. 'విభావః' అనగా విజ్ఞానం, తెలిసికొనుటకు సాధనం అని అర్థం. 'విభావము' 'కారణము' 'నిమిత్తము' 'హేతువు' ఈ పదా లన్నీ సమానార్థకాలు. వాచిక – ఆంగిక – సాత్త్వికాభి నయాలు దేనిచేత తెలుపబడతాయో అది విభావం. 'విభావితమ్' 'విజ్ఞాతమ్' అనుపదాలకు అర్థం ఒకటే.

**వి.** ఇక్కడ ఒక విషయం గుర్తుంచుకొనివలసి ఉంది. ఆలంబనవిభావం, ఉద్దీపన విభావం అని విభావం రెండు విధాలు. శృంగారంలో – దుష్యంతాదులు ఆలంబన విభావాలు. ఋతుమాల్యాదులు. ఉద్దీపనవిబావాలు. ఈ విభావాలచేత చతుర్విధాభి నయాలు తెలియబడుటలేదు. వాగాద్యభినయాలచేత స్థాయి – వ్యభిచారిభావాలు తెలియబడుతున్నాయి. అందుచేత ఇక్కడ 'వాగఙ్గసత్త్వాభినయాః' అనగా ఈ అభినయాలు

ఏ స్థాయివ్యభిచారిభావాల అభివ్యక్తి కోసం చేయబడుతున్నాయో ఆస్థాయ్యాదులు అని అర్థం. **"వాగాదయోऽభినయాః యేషాం స్థాయివ్యభిచారిణాం తే వాగాద్యభినయసహితాః విభావ్యన్తే విశిష్టతయా జ్ఞాయన్తే యైస్తే విభావాః".** (అభి.భా.)

**మూ. అత్ర శ్లోకః**

**బహవోऽర్థా విభావ్యన్తే వాగఙ్గాభినయాశ్రయాః,**
**అనేన యస్మాత్తేనాయం విభావ ఇతి సంజ్ఞితః. 4**

**తా.** వాచిక – ఆంగిక – సాత్త్విక అభినయాలకు సంబంధించిన అనేక మైన అర్థాలు దీనిచేత తెలియజేయబడతాయి గాన దీనికి విభావం అని పేరు.

**మూ. అథానుభావ ఇతి కస్మాత్? ఉచ్యతే – అనుభావ్యతే వాగఙ్గసత్త్వకృతోऽభినయః ఇతి.**

**అత్ర శ్లోకః –**

**వాగఙ్గాభినయేనేహ యతస్త్వర్థోऽనుభావ్యతే,**
**శాఖాఙ్గోపాఙ్గసంయుక్తస్త్వనుభావస్తతః స్మృతః. 5**

**తా.** సరే! అనుభావం అని ఎందు కంటారు? (సమాధానం) చెపుతున్నాం; విను. వాచిక – ఆంగిక సాత్త్వికాభినయాలచేత సూచింపబడిన విషయం దీనిచేత అనుభవింప బడుతుంది గాన ఇది అనుభావం. ఈ విషయంలో శ్లోకం ఉన్నది – వాచిక ఆంగికసాత్త్వికా భినయాలచేత, శాఖలతోను, అంగాలతోను, ఉపాంగాలతోను కూడిన కావ్యార్థం అనుభవింపచేయబడుతుంది గాన ఇది **అనుభావం** అని చెప్పబడింది.

**మూ. ఏవం తే విభావానుభావసంయుక్తాః భావాః ఇతి వ్యాఖ్యాతాః. అతో హ్యేషాం భావానాం సిద్ధిర్భవతి. తస్మాదేషాం భావానాం విభావానుభావసంయుక్తానాం లక్షణని దర్శనాని అభివ్యాఖ్యాస్యామః. తత్ర విభావనుభావౌ లోకప్రసిద్ధౌ. లోకస్వభావానుగతత్వాచ్చ తయోర్లక్షణం నోచ్యతే, అతిప్రసంగనివృత్త్యర్థమ్. భవతి చాత్ర శ్లోకః –**

**లోకస్వభావసంసిద్ధా లోకయాత్రానుగామినః,**
**అనుభావా విభావాశ్చ జ్ఞేయాస్త్వభినయే బుధైః. 6**

**తా.** ఈ విధంగా విభావానుభావాలతో సంయుక్తా లైన భావాలను గూర్చి విశ దీకరించడం జరిగింది. ఈ విధంగా ఈ భావాలు సిద్ధిస్తాయి. ఇక విభావానుభావాలతో కూడిన భావాల లక్షణోదాహరణాలను విశదీకరిస్తాం. విభావ – అనుభావాలు లోక ప్రసిద్ధ మైనవి. ఈ రెండూ లోకస్వభావాన్ని అనుసరించి ఉంటాయి గాన వీటి లక్షణం చెప్పడంలేదు. తెలిసిన వాటిని గురించి మళ్ళీ చెప్పడం అతిప్రసంగం అవుతుంది.

ఈ సందర్భంలో ఒక ప్రాచీనశ్లోకం ఉంది –

"అనుభావాలు, విభావాలూ కూడ లోకస్వభావంచేత సిద్ధించినవి; ప్రసిద్ధమైనవి. లోకవ్యవహారాన్ని అనుసరించి ఉంటాయి. పండితులు వీటిని గూర్చి అభినయంలో తెలుసుకోవాలి."

**vi. కావ్యప్రకాశ**లో విభావానుభావాదుల స్వరూపం స్పష్టంగా వివరించాడు.

**"కారణాన్యథ కార్యాణి సహకారీణి యాని చ,**
**రత్యాదేః స్థాయినో లోకే తాని చేన్నాట్యకావ్యయోః,**
**విభావా అనుభావాశ్చ కథ్యన్తే వ్యభిచారిణః."** **(కా.ప్ర.4.27,28)**

"లోకంలో – రతి మొదలైన స్థాయిభావాలకు వేటిని కారణా లనీ, కార్యా లనీ సహకారు లనీ అంటారో, వాటినే, నాట్యంలోను శ్రవ్యకావ్యంలోను వరుసగా విభావాలు, అనుభావాలు, వ్యభిచారిభావాలు అంటారు."

ఉదాహరణకి – లోకవ్యవహారంలో, ఒక నాయకుని (పురుషుని) మనస్సులో, నాయికను (ఒకయువతిని) చూడగానే రతి (ప్రేమ) అనే భావం పుట్టింది. లేదా నాయకుణ్ణి చూడగానే, నాయిక మనస్సులో రతి పుట్టింది. ఇక్కడ 'రతి పుట్టింది' అంటే పూర్వం ఎన్నడూ లేని రతి అనేది క్రొత్తగా పుట్టింది అని అర్థం కాదు. ప్రతీ మనిషి మనస్సులోనూ రతి, ఉత్సాహం, క్రోధం మొదలైన భావాలు ఎల్లప్పుడూ ఉంటాయి; అయితే అవి నిగూఢంగా ఉంటాయి. కొన్ని పరిస్థితులలో అవి బైటకు వస్తాయి. అదే పుట్టడం అనగా. నాయకుని మనస్సులో పుట్టిన రతికి నాయిక, నాయిక మనస్సులో పుట్టిన రతికి నాయకుడు కారణం. వివిక్తప్రదేశం, చంద్రోదయం మొదలైనవాటివల్ల ఆ రతి పుష్టి చెందుతుంది. అందుకు కారణం వివిక్తప్రదేశాదులు. ఈ విధంగా రతి పుట్టడానికీ, అది పుష్టి చెందడానికీ ఇవి కారణాలు. లోకంలో కారణాలు అన్నవాటికే దృశ్యకావ్యాల లోను, శ్రవ్యకావ్యాలలోను విభావా లని పేరు. ఆలంబనవిభావం, ఉద్దీపనవిభావం అని విభావం రెండు విధాలు. కావ్యాదులలో వర్ణించిన నాయకుని మనస్సులో పుట్టిన రతికి కారణం నాయిక; ఆమె ఆ రతికి ఆలంబనవిభావం. ఆ రతికి ఆశ్రయం మాత్రం నాయకుడే. అట్లే నాయిక మనస్సులో పుట్టినదానికి నాయకుడు ఆలంబనవిభావం. ఆశ్రయం నాయికయే. రతి పుష్టి చెందడానికి కారణాలైన వివిక్తదేశాదులు ఉద్దీపనవిభావం. ఉద్దీపనం అనగా పుట్టినదానికి రగుల్కొల్పడం. హృదయంలో అణగి ఉన్న రత్యాదిస్థాయిభావాలను మేల్కొల్పి ఆస్వాదించడానికి యోగ్యం అయినవాటినిగా చేసేవి కాబట్టి కారణాలకి విభావా లని పేరు. **"విభావయన్తి = రత్యాదీన్ ఆస్వాదయోగ్యతాం నయన్తీతి విభావాః"** అని విగ్రహం.

మనస్సులో రతి జనించి కొంచెం పుష్టం కాగానే, లోకంలో, క్రీకంటి చూపులు, ఆ యా అవయవాల కదలిక, ఒక రక మైన సంభాషణ మొదలైనవి ప్రారంభం అవుతాయి. అవి మనస్సులో పుట్టిన రతివల్ల జరిగాయి గాన దాని కార్యాలు. వాటినే కావ్యాదుల్లో 'అనుభావాలు' అంటారు. రత్యాదులు అనుభవంలోనికి వచ్చే టట్లు చేస్తాయి కాబట్టి వీటి కా పేరు. ఈ చేష్ట లన్నీ చూడగానే ఆ వ్యక్తి మనస్సులోని రతిని గూర్చి తెలుస్తుంది కదా. **"అనుభావయన్తి ఇతి అనుభావాః"** అని విగ్రహవాక్యం.

మనస్సులో పుట్టి, ఆ యా చేష్టలకు కూడా కారణ మైన రతి కొంత సేపు పూర్తిగా శరీరంలో వ్యాపించడానికి లేదా ఆ యా కార్యాలను పుట్టించడానికి, సహకరించే నిర్వేదం మొదలైన భావాలను లోకంలో సహకారు లంటాం. వీటికే కావ్యంలో 'వ్యభిచారులు' లేదా 'సంచారులు' అని పేరు. మనస్సులో పుట్టిన రతి అంతటా వ్యాపించే టట్లు, అనగా శరీరంమీద అంతటా దాని ప్రభావం కనబడే టట్లు చేయడానికి, దానివల్ల మరి కొన్ని కార్యాలు పుట్టడానికీ ఇవి ఉపకరిస్తాయి. రత్యాదులను మాటి మాటికి వ్యంజింపచేస్తాయి. ఈ విధంగా **(రత్యాదీన్ స్థాయిభావాన్) విశేషేణ అభితః (కాయే) చారయన్తి ఇతి వ్యభిచారిణః." "విశేషేణ అభితః చారయన్తి = ముహుర్ముహుః అభివ్యఞ్జయన్తి ఇతి వ్యభిచారిణః." "విశేషేణ అభితః (ఆభిముఖ్యేన), కార్యజననే ఆనుకూల్యేన చరన్తీతి వ్యభిచారిణః"** అని కూడ అర్థం చెప్పవచ్చును. **'సంచారిణః'** అన్నప్పుడు **"సమ్యక్ చారయన్తి" 'సమ్యక్ చరన్తి'** అని విగ్రహాలు. అర్థం సమానమే.

అన్ని రసాల విషయంలోను ఇదే పద్ధతి. శృంగారంలో 'రతి' అయితే రౌద్రంలో **'క్రోధం'** స్థాయి భావం. దానిని పట్టి విభావాదులు మారుతాయి.

సాత్త్వికభావాలు అనగా మనస్సులో కలిగిన భావాలను బట్టి శరీరంమీద కనబడే మార్పులు, వికారాలు మొదలైనవి. సత్త్వం అనగా మనస్సు. సత్త్వంలోని వికారాలను బట్టి శరీరంమీద కనబడే వికారాలు సాత్త్వికభావాలు – చెమట, కొయ్యబారిపోవడం, కళ్లు ఎఱ్ఱబడడం, కన్నీళ్లు, వణుకు మొదలైనవి.

**మూ. తత్రాష్టౌ భావాః స్థాయినః. త్రయస్త్రింశద్వ్యభిచారిణః, అష్టౌ సాత్త్వికా ఇతి భేదః . ఏవమేతే కావ్యరసాభివ్యక్తిహేతవః ఏకోనపఞ్చాశద్భావాః ప్రత్యవగన్తవ్యాః. ఏభ్యశ్చ సామాన్యగుణయోగేన రసా నిష్పద్యన్తే.**

**తా.** వాటిలో ఎనిమిది స్థాయిభావాలు. ముప్పైమూడు వ్యభిచారి భావాలు. ఎనిమిది సాత్త్వికభావాలు. ఇది భావాల విభజన. కావ్యంలోని రసం అభివ్యక్తం అవడానికి హేతువు లైన ఈ నలభైతొమ్మిది భావాలను బాగా గుర్తించాలి. వీటినుండి, వీటి సామాన్య (సాధారణం) గుణాల కలయికచేత రసాలు నిష్పన్నం అవుతాయి.

**మూ. అత్ర శ్లోకః –**

**యోఽర్థో హృదయసంవాదీ తస్య భావో రసోద్భవః,**
**శరీరం వ్యాప్యతే తేన శుష్కం కాష్ఠమివాగ్నినా. 7**

**తా.** ఈ సందర్భంలో ఒక శ్లోకం –

హృదయసంవాది యైన, సామాజికుల లేదా పఠితల హృదయాలకు అనుగుణంగా ఉన్న, అర్థంలో ఉన్న భావం (స్థాయిభావం) రసానికి ఉత్పత్తిస్థానం. రసం దాని నుండి పుడుతుంది. ఆ రసం, ఎండిపోయిన కఱ్ఱను అగ్ని అంతటా వ్యాపించి నట్లు శరీరం అంతనీ వ్యాపిస్తుంది. రసానుభూతిసమయంలో సహృదయుని శరీరం అంతా రసంచేత ప్రభావితం అవుతుం దని భావం.

**మూ. అత్రాహ – యది కావ్యార్థసంశ్రితైః విభావానుభావవ్యఞ్జితైః ఏకోనపఞ్చాశద్భావైః సామాన్యగుణయోగేనాభినిష్పద్యన్తే రసాః తత్కథం స్థాయిన ఏవ భావా రసత్వమాప్నువన్తి? ఉచ్యతే – యథాహి సమానలక్షణాః తుల్యపాణిపాదోదరశరీరాః, సమానాఙ్గప్రత్యఙ్గా అపి పురుషాః కులశీలవిద్యాకర్మశిల్పవిచక్షణత్వాద్రాజత్వమాప్నువన్తి. తత్రైవ చాన్యేఽల్పబుద్ధయః తేషామేవానుచరా భవన్తి తథా విభావానుభావవ్యభిచారిణః స్థాయిభావాను పాశ్రితా భవన్తి. బహ్వాశ్రయత్వాత్ స్వామిభూతాః స్థాయినో భావాః. తద్వత్ స్థానీయపురుష గుణభూతాః అన్యే భావాస్తాన్ గుణతయా శ్రయన్తే. స్థాయిభావా రసత్వమాప్నువన్తి. పరిజనభూతాః వ్యభిచారిణో భావాః.**

**అత్రాహ – కో దృష్టాన్త ఇతి. యథా నరేన్ద్రో బహుజనపరివారోఽపి స ఏవ నామ లభతే నాన్యః సుమహానపి పురుషః, తథా విభావానుభావవ్యభిచారిపరివృతః స్థాయీ భావః రసనామ లభతే.**

**తా.** ఇక్కడ ప్రశ్నిస్తున్నాడు – కావ్యార్థంలో ఉన్న, విభావానుభావములచే వ్యంజితము లైన నలభై తొమ్మిది భావాలు, సామాన్యమైన గుణాల కలయికచేత రసాలను నిష్పన్నం చేసే పక్షంలో, స్థాయిభావాలు మాత్రమే రసత్వాన్ని ఎలా పొందుతాయి. (సమాధానం) చెపుతున్నాం – (మానవు లందరిలో) సమాన మైన లక్షణాలు కల చేతులు, కాళ్లు, ఉదరాలు, శరీరాలు, అవయవాలు, వాటి అవయవాలూ కూడ అందరిలోను సమంగానే ఉన్న పురుషులు, ఏ విధంగా కులము, శీలము, విద్య, కర్మ, శిల్పము – వీటిలో మంచి నేర్పుగలవా రవడంచేత రాజు లౌతారో, అక్కడనే, అల్పబుద్ధి గల ఇతరులు ఆ రాజులకు అనుచరు లౌతారో అదే విధంగా విభావానుభావవ్యభిచారులు స్థాయి భావాలను ఆశ్రయించుకొని ఉంటాయి. చాలా భావాలకు ఆశ్రయం అవడంచేత స్థాయి భావాలు స్వాములు (ప్రభువులు) అవుతాయి. రాజు ఉన్న ప్రదేశంలోనే ఉన్నా వాని క్రింద అప్రధాన మైన వాళ్లుగా ఉన్న పురుషుల వలె ఇతరభావాలు, స్థాయిభావాలను, వాటికంటె

అప్రధానంగా ఉంటూ, ఆశ్రయిస్తాయి. స్థాయిభావాలు రసత్వాన్ని పొందుతాయి. వ్యభిచారిభావాలు స్థాయిభావాలకు పరిజనం వంటివి.

ఇక్కడ ప్రశ్నిస్తున్నాడు – ఇందుకు దృష్టాంతం ఏమిటి? (సమాధానం) రాజు చుట్టూ ఎంతో మంది పరివారంగా ఉన్నా ఆ రాజుకే పేరు వస్తుంది కాని, ఎంత గొప్ప వాడైనా మరొకనికి ఏ విధంగా రాదో అదే విధంగా విభావానుభావవ్యభిచారులతో పరివృతమైన స్థాయిభావం మాత్రమే రసం అను పేరును పొందుతుంది.

**మూ. భవతి చాత్ర శ్లోకః –**

**యథా నరాణాం నృపతిః శిష్యాణాం చ యథా గురుః,**
**ఏవం హి సర్వభావానాం భావః స్థాయీ మహానిహ.** **8**

**తా.** ఈ విషయంలో ఒక శ్లోకం కూడ ఉంది –

నరులలో రాజు ఎట్లో, శిష్యులలో (కు) గురు వెట్లో అట్లే భావా లన్నింటిలోను స్థాయిభావం గొప్పది.

**మూ. లక్షణం ఖలు పూర్వమభిహితమేషాం రససంజ్ఞకానామ్. ఇదానీం భావసామాన్య లక్షణమభిధాస్యామః. తత్ర స్థాయీభావాన్ వక్ష్యామః.**

**తా.** రసాల లక్షణాలు పూర్వం చెప్పబడ్డాయి. ఇప్పుడు భావాల సామాన్యలక్షణాలు చెపుతాం. ముందుగా స్థాయిభావాలను గూర్చి చెపుతాం.

**మూ. రతిర్నామ ప్రమోదాత్మికా ఋతుమాల్యానులేపన – ఆభరణ – భోజన – వరభవనానుభవ – అప్రాతికూల్యాదిభిః విభావైః సముత్పద్యతే. తామభినయేత్ స్మితవదన – మధురకథన – భ్రూక్షేప – కటాక్షాదిభిః అనుభావైః.**

**తా.** రతి అను స్థాయిభావం ఆనందాత్మక మైనది. అది ఋతువు, మాలలు, మైపూతలు, ఆభరణములు, మంచి భోజనము, ఉత్తమమైన భవనము మొదలైనవాటి అనుభవము, ఎటునుండీ ప్రతికూలత్వం లేకపోవడం మొదలైన విభావాలచేత ఉత్పన్నం అవుతుంది. చిరునవ్వుతో ఉన్న ముఖం, మధురమైన మాటలు, కనుబొమ్మల విరుపులు, క్రీకంటి చూపులు మొదలైన అనుభావాలతో దీనిని అభినయించాలి.

**మూ. అత్ర శ్లోకః–**

**ఇష్టార్థవిషయప్రాప్త్యా రతిరిత్యుపజాయతే,**
**సౌమ్యత్వాదభినేయా సా వాఙ్మాధుర్యాఙ్గచేష్టితైః.** **9**

**తా.** ఈ సందర్భంలో ఒక ప్రసిద్ధశ్లోకం –

ఇష్టమైన వస్తువులు, విషయాలు లభించడంచేత రతి అనేది పుడుతుంది. ఇది

సౌమ్యమైన భావం గాన మధురమైన వాక్కులతోను, అవయవాల చేష్టలతోను అభినయించాలి.

**మూ. హాసో నామ వినోదాత్మకో భావః. స చ పరచేష్టానుకరణ - కుహక - అసంబద్ధ ప్రలాప - పౌరోభాగ్య - మౌర్ఖ్యాదిభిః విభావైః ఉత్పద్యతే. తమభినయేత్ పూర్వోక్తైః హసితాదిభిః అనుభావైః. భవతి చాత్ర శ్లోకః -**

**పరచేష్టానుకరణాద్ధాసః సముపజాయతే,**
**స్మితహాసాతిహసితైః అభినేయః స పణ్డితైః. 10**

**తా.** హాసం అనేది వినోదాత్మక మైన భావం ఇతరుల చేష్టలను అనుకరించడం, మాయమాటలు చెప్పడం, అసంబద్ధంగా పేలడం, ఇతరుల దోషాలు ఎత్తి చూపడం, మూర్ఖత్వప్రదర్శనం మొదలైన అనుభవాలచేత పుడుతుంది. వెనుక చెప్పిన హసితం మొదలైన అనుభావాలతో దీనిని అభినయించాలి. ఈ విషయంలో ఒక శ్లోకం కూడ ఉంది -

ఇతరుల చేష్టలను అనుకరించడంవల్ల హాసం పుడుతుంది. పండితులు దీనిని, స్మితము, హాసము, హసితము మొదలైనవాటితో అభినయించాలి.

**మూ. శోకో నామ ఇష్టజనవియోగ - విభవనాశ - వధ - బన్ధ - దుఃఖానుభవనా దిభిః విభావైః సముత్పద్యతే. తస్య అశ్రుపాత - పరిదేవిత - విలపిత - వైవర్ణ్య - స్వరభేద - స్రస్తగాత్రతా - భూమిపతన - సస్వరరుదిత - ఆక్రన్దిత - దీర్ఘనిఃశ్వసిత - జడతా - ఉన్మాద - మోహ - మరణాదిభిః అనుభావైరభినయః ప్రయోక్తవ్యః.**

**తా.** శోకం అనే భావం, ఇష్టజనుల వియోగం, సంపద నశించడం, వధ, బంధనము, దుఃఖాన్ని అనుభవించడం మొదలైన విభావాలచేత పుడుతుంది. కన్నీళ్లు కార్చడం, పరిదేవితం (ఇతరులను దూషించడం) విలపించడం, శరీరం రంగు మారిపోవడం, స్వరం మారిపోవడం, శరీరం జారిపోవడం, నేలమీద పడడం, బిగ్గరగా ఏడవడం, అరవడం, దీర్ఘంగా నిట్టూర్చడం, జడత్వం, ఉన్మాదం, మోహం, మరణం మొదలైన అనుభావాలతో దాని అభినయం ప్రయోగించాలి.

**మూ. రుదితమత్ర త్రివిధమ్ - ఆనన్దజమ్, ఆర్తిజమ్, ఈర్ష్యాసముద్భవం చేతి. భవన్తి చాత్రార్యాః -**

**(ఆనన్దేర్ష్యార్తికృతం త్రివిధం రుదితం సదా బుధైర్జ్ఞేయమ్,**
**తస్య త్వభినయయోగాన్విభావగతితః ప్రవక్ష్యామి)**

**తా.** ఈ విషయంలో ఆర్య లున్నాయి -

(ఆనందంవల్ల కలిగినది, ఈర్ష్యవల్ల కలిగినది, పీడవలన కలిగినది అని రోదనం మూడు విధా లుంటుం దని పండితులు తెలుసుకోవాలి. ఆ మూడు విధాల రోదనాన్ని ఏ విధంగా అభినయించాలో చెపుతాను).

**మూ. హర్షోత్ఫుల్లకపోలం సానుస్మరణాదపాఙ్గనిసృతాస్రమ్,**
**రోమాఞ్చగాత్రమనిభృతమానన్దసముద్భవం భవతి. 11**

**తా.** ఆనందంవల్ల కలిగిన రోదనంలో హర్షంచేత గండస్థలాలు వికసిస్తాయి. జరిగిపోయిన కొన్ని ఘటనలు స్మరించడంచేత నేత్రాంతాలనుండి నీళ్లు రాలుతాయి. శరీరంమీద రోమాంచం కలుగుతుంది. ఈ విధంగా అది ఆవిష్కరింపబడుతుంది.

**మూ. పర్యాప్తవిముక్తాస్రం సస్వనమస్వస్థగాత్రగతిచేష్టమ్,**
**భూమినిపాతనివర్తితవిలపితమిత్యార్తిజం భవతి. 12**

**తా.** శోకంవల్ల కలిగిన రోదనంలో కన్నీళ్లు ఎక్కువగా కారతాయి. ఏడుపు ధ్వనితో జరుగుతుంది. శరీరం అస్వస్థమై నడక చేష్టలు కూడా వికృతంగా ఉంటాయి. నేలమీద పడిపోయి విలాపం కూడ చేస్తాడు.

**మూ. ప్రస్ఫురితౌష్ఠకపోలం సశిరఃకమ్పం తథా సనిఃశ్వాసమ్,**
**భృకుటీకటాక్షకుటిలం స్త్రీణామీర్ష్యాకృతం భవతి. 13**

**తా.** పెదవులు, చెక్కిళ్లు కదిలిపో తూంటాయి. తల కంపిస్తుంది. నిట్టూర్పులు వెడలుతాయి. కనుబొమ్మల విరుపులు, క్రీగంటి చూపులూ వక్రంగా ఉంటాయి. ఈ విధమైన ఈర్ష్యవల్ల కలిగే రోదనం స్త్రీలలో ఉంటుంది.

**మూ. స్త్రీనీచప్రకృతిష్వేవ శోకో వ్యసనసంభవః,**
**ధైర్యేణోత్తమమధ్యానాం నీచానాం రుదితేన చ. 14**

**తా.** వ్యసనంవల్ల (కష్టాలవల్ల) కలిగే ఈ శోకం స్త్రీలలోను నీచప్రకృతి గల మనుష్యుల లోను కనబడుతుంది. ఉత్తములు, మధ్యములూ కూడ ధైర్యంతో దీనిని వ్యక్తీకరిస్తారు, నీచులు ఏడ్పుతో వ్యక్తీకరిస్తారు.

**మూ. క్రోధో నామ – ఆఘర్షణ – ఆక్రుష్ట – కలహ – వివాద – ప్రతికూలాదిభిః విభావైః సముత్పద్యతే. అస్య వికృష్టనాసాపుట – ఉద్వృత్తనయన – సందష్టోష్ఠపుట – గణ్డస్ఫురణాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.**

**తా.** క్రోధం అనే స్థాయిభావం – లాగులాట పీకులాట, తిట్లు, కలహం, మాటా మాట పట్టింపు, ప్రతికూలంగా ప్రవర్తించడం మొదలైన విభావాలచేత ఉత్పన్నం అవుతుంది. ముక్కు పుటాలు పెద్దవి చెయ్యడం. కళ్లు తిప్పడం, పెదవులు బిగించడం, చెక్కిళ్లు కదలడం, మొదలైన అనుభావాలచేత దీనిని అభినయించాలి.

**మూ. రిపుజో గురుజశ్చైవ ప్రణయిప్రభవస్తథా,**
**భృత్యజః కృతకశ్చేతి క్రోధః పఞ్చవిధః స్మృతః. 15**

**తా.** శత్రువువల్ల కలిగినది, పెద్దవారినుండి కలిగినది, ప్రియులనుండి కలిగినది, భృత్యులవల్ల కలిగినది, కృత్రిమము అని క్రోధం ఐదు విధాలు.

**మూ. అత్రార్యా భవన్తి –**
**భ్రుకుటీకుటిలోత్కటముఖః సందష్టోష్ఠః స్పృశన్ కరేణ కరమ్,**
**క్రుద్ధః స్వభుజప్రేక్షీ శత్రౌ నిర్యన్త్రణం రుష్యేత్. 16**

**తా.** ఈ విషయంలో ఆర్య లున్నవి –

కనుబొమ్మల విరుపుచే కుటిలమైన భయంకరమైన ముఖంతో, పెదవులు బిగించి, తన భుజాలు చూచుకొంటూ (చొక్కా చేతులు పైకి తీస్తూ) శత్రువు విషయంలో ఏ మాత్రము అదుపు లేకుండా కోపం చూపాలి.

**మూ. కించిదవాఙ్ముఖదృష్టిః సాస్రస్వేదాపమార్జనపరశ్చ,**
**అవ్యక్తోల్బణచేష్టో గురౌ వినయయన్త్రితో రుష్యేత్. 17**

**తా.** పెద్దవాళ్ల విషయంలో కోపించినవాడు కొంచెం చూపులు క్రిందికి దింపి, కన్నీళ్లు చెమట తుడుచుకొంటూ, తీవ్రమైన చేష్టలు అస్పష్టంగానే చేస్తూ, గౌరవభావంతో తనను తాను అదుపులో ఉంచుకొని కోపం ప్రదర్శించాలి.

**మూ. అల్పతరప్రవిచారో వికిరన్నశ్రూణ్యపాఙ్గవిక్షేపైః,**
**సభ్రుకుటీస్ఫురితోష్ఠః ప్రణయోపగతాం ప్రియాం రుష్యేత్.**

**తా.** ప్రియురాలి విషయంలో ప్రణయకోపం చేసినప్పుడు కొంచెం ఇటూ అటూ తిరుగుతూ నేత్రాంతాలతో చూస్తూ, కన్నీళ్లు రాలుస్తూ, కనుబొమ్మలు విరిచి పెదవులు వణికిస్తూ కోపం ప్రదర్శించాలి.

**మూ. అథ పరిజనే తు రోషస్తర్జననిర్భర్త్సనాక్షివిస్తారైః,**
**విప్రేక్షణైశ్చ వివిధైరభినేయః క్రూరతారహితః. 19**

**తా.** భృత్యుల విషయంలో కోపించినప్పుడు, జళిపిస్తూ "ఏం చేస్తానో చూడు" అని భయపెడుతూ కళ్లు పెద్దవి చేసి అనేకవిధాల చూస్తూ కోపాన్ని అభినయించాలి. ఈ చేష్టలలో క్రూరత్వం మాత్రం కనబడకూడదు.

**మూ. కారణమపేక్షమాణః ప్రాయేణాయాసలిఙ్గసంయుక్తః,**
**వీరరసాన్తరచారీ కార్యః కృతకో భవతి కోపః. 20**

**తా.** వీరరసంలో చారిగా ఉండే కృత్రిమ మైన కోపం, కారణాపేక్షమై ఉండాలి, సాధారణంగా ఆయాసానికి లింగాలు ఉండాలి.

**వి.** రౌద్రరసంలో స్థాయిభావంగా ఉన్న కోపమే ఒకప్పుడు వీరరసంలో సంచారి భావంగా కనబడవచ్చు. అప్పుడు అది కృత్రిమం; తెచ్చి పెట్టుకొన్నది. ఇది కలగడానికి ఏదో ఒక చిన్న కారణం ఉండి ఉండాలి. దీనిలో ఏదో శ్రమపడుతూన్న చిహ్నాలు కూడా ఉంటాయి.

**మూ. ఉత్సాహో నామ - ఉత్తమప్రకృతిః. స చ అవిషాద - శక్తి -ధైర్య - శౌర్యాదిభిః విభావైః ఉత్పద్యతే. తస్య ధైర్యాత్యాగ - వైశారద్యాదిభిరనుభావైః అభినయః ప్రయోక్తవ్యః అత్ర శ్లోకః -**

> **అసమ్మోహాదిభిర్వ్యక్తో వ్యవసాయనయాత్మకః,**
> **ఉత్సాహస్త్వభినేయః స్యాదప్రమాదోత్థితాదిభిః. 21**

**తా. ఉత్సాహం** అనేది ఉత్తమప్రకృతి గల నాయకులకు సంబంధించినది. ఇది విషాదం చెందకపోవడం, శక్తి, ధైర్యము, శౌర్యము మొదలైన విభావాలచేత పుడుతుంది. దీనిని - ధైర్యాన్ని విడవకుండా ఉండడం, పని సాధించడంలో నేర్పు మొదలైన అనుభావాలతో అభినయించాలి. ఈ విషయంలో ఒక ప్రసిద్ధశ్లోకం - అసంమోహాదులచేత త్యంజింపబడినది, నిరంతరమైన ఉద్యమము నీతీ ప్రధానంగా ఉండేది, అయిన ఉత్సాహాన్ని అప్రమాదము, ఉత్థానము మొదలైనవాటిచేత అభినయించాలి.

**వి.** సంమోహం అనగా ఏమి చెయ్యాలో తెలియకపోవడం. సంమోహం లేకపోవడం అసంమోహం. వ్యవసాయం అనగా నిరంతరప్రయత్నం. అప్రమాదం అనగా ఏమరుపాటు లేకపోవడం. ఉత్థితి అనగా ఉత్థానం; అనగా ఎల్లప్పుడూ ఉద్యమశీలుడుగా ఉండడం.

**మూ. భయం నామ స్త్రీనీచప్రకృతికమ్. గురురాజాపరాధ - శ్వాపదశూన్యాగారాటవీపర్వత గహనగజాహిదర్శన, నిర్భర్త్సన - కాన్తార - దుర్దిన - నిశాన్ధకార - ఉలూకనక్తంచ రారావశ్రవణాదిభిర్విభావైః సముత్పద్యతే. తస్య ప్రకమ్పిత - కరచరణహృదయకమ్పన స్తమ్భ - ముఖశోష - జిహ్వాపరిలేహన - స్వేద - వేపథు - త్రాస - పరిత్రాణాన్వేషణ - ధావన - ఉత్క్రుష్టాదిభిరనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.**

**తా.** భయం అనేది స్త్రీలలోను నీచప్రకృతి కలవారిలోను ఉంటుంది. ఇది - గురువుల విషయంలోను, రాజు విషయంలోను చేసిన అపరాధము, శూన్యగృహము, అడవి, పర్వతాలపైన ఉన్న ప్రవేశింప శక్యం కాని ప్రదేశాలు, ఏనుగు సర్పము కనబడడము, ఇతరు లెవరో భయపెట్టడము, దుర్గమ మైన ప్రదేశము, సూర్యుడు కనబడని అతివృష్టి గల దినము, రాత్రి, అంధకారము, గుడ్లగూబల, రాత్రి సంచరించే ఇతర ప్రాణుల

అరుపులు వినడం మొదలైన విభావాలచేత పుడుతుంది. కాళ్లూ చేతులూ వణికిపోవడం, గుండె అదరడం, శరీరం కొయ్యబారిపోవడం, ముఖం ఎండిపోవడం, నాలుకతో పెదవులు నాకడం, చెమట, వణుకు, ఏమౌతుందో అన్న కంగారు, రక్షణకోసం వెదకడం, పరుగెత్తడం, కేకలు బొబ్బలూ మొదలైన అనుభావాలతో భయాన్ని అభినయించాలి.

**మూ. అత్ర శ్లోకాః -**

**గురురాజాపరాధేన రౌద్రాణాం చాపి దర్శనాత్,**
**శ్రవణాదపి ఘోరాణాం భయం మోహేన జాయతే. 22**

**తా.** ఈ సందర్భంలో శ్లోకాలు ఉన్నాయి -

గురువుల (పెద్దవాళ్ల) విషయంలోను, రాజు విషయంలోను అపరాధం చేయడం చేత, భయంకర మైన పదార్థాలను చూడడంచేత, ఘోరమైన వార్తలు వినడంచేత, మోహం వల్ల భయం కలుగుతుంది.

**మూ. గాత్రకమ్పనవిత్రాసైర్వక్త్రశోషణసంభ్రమైః,**
**విస్ఫారితేక్షణైః కార్యమభినేయక్రియా గుణైః. 23**

**తా.** అవయవాలు వణకడంచేత, ఏమౌతుందో అన్న కంగారుచేత, ముఖం ఎండిపోవడంచేత, హడావుడిచేత, కళ్లు పెద్దవిచేయడంచేత, ఇతరగుణాలచేత (ఇతర చేష్టలచేత) భయాన్ని అభినయించాలి.

**మూ. సత్త్వవిత్రాసనోద్భూతం భయముత్పద్యతే నృణామ్,**
**ప్రస్తాఙ్గాక్షినిమేషైస్తదభినేయం తు నర్తకైః. 24**

**తా.** పిశాచాదులు గాని, క్రూరమృగాదులు గాని జళిపించగా మానవులకు భయం కలుగుతుంది. దీనిని, నర్తకులు అవయవాలను జార్చడంచేత, కళ్లు మూసికొనడంచేత అభినయించాలి.

**మూ. అత్రార్యా భవతి -**

**కరచరణహృదయకమ్పైః ముఖశోషణవదనలేహనస్తమ్భైః**
**సంభ్రాన్తవదనవేపథుసన్త్రాసకృతైరభినయోఽస్య. 25**

**తా.** ఈ విషయంలో ఒక ఆర్య ప్రసిద్ధలో ఉన్నది -

చేతులూ, కాళ్లూ, గుండె వణకడము, ముఖం ఎండిపోవడము, ముఖం (పెదవులు) నాలుకతో నాకడము, కొయ్యబారిపోవడము. ఉలిక్కిపడడము, ముఖం కంపించడము, ఏమౌతుందో అన్న కంగారు. వీటిచేత భయం అభినయించాలి.

**మూ. జుగుప్సా నామ - స్త్రీనీచప్రకృతికా. సా చ అహృద్యదర్శనశ్రవణాదిభిః విభావైః**

**సముత్పద్యతే. తస్యాః సర్వాఙ్గసంకోచ - నిష్ఠీవన - ముఖనికూణన - హృల్లేఖాదిభిః అభినయః ప్రయోక్తవ్యః.**

**తా.** జుగుప్స స్త్రీలలోను, నీచప్రకృతులలోను కనబడుతుంది. ఏవగింపు కలిగించే వస్తువులను చూడడంచేత, వాటిని గూర్చి వినడంచేత జుగుప్స పుడుతుంది. అవయవాలన్నీ ముణుచుకొనడం, ఉమ్మి వేయడం, ముఖం ముణుచుకొనడం, హృదయంపై గట్టిగా రాయడం మొదలైన అనుభావాలచేత దీని అభినయం చెయ్యాలి.

**మూ. భవతి చాత్ర శ్లోకః -**

**నాసాప్రచ్ఛాదనేనేహ గాత్రసంకోచనేన చ,**
**ఉద్వేజనైః సహృల్లేఖైః జుగుప్సా మభినిర్దిశేత్. 26**

**తా.** ఈ విషయంలో శ్లోకం కూడ ఉంది -

ముక్కు మూసికొనడం, శరీరం ముణుచుకొనడం, ఏవగించుకొనడం, గుండెమీద రాసుకొనడం, వీటిచేత జుగుప్సను అభినయించాలి.

**మూ. విస్మయో నామ - మాయా - ఇన్ద్రజాల - మానుషకర్మాతిశయ - చిత్ర - పుస్త - శిల్ప - విద్యాతిశయాదిభిః విభావైః సముత్పద్యతే. తస్య నయనవిస్తార - అనిమేషప్రేక్షిత - భ్రూక్షేప - రోమహర్షణ - శిరఃకమ్ప - సాధువాదాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.**

**తా.** విస్మయం అను స్థాయిభావం - మాయ, ఇంద్రజాలము, మనిషి చేసిన ఏదో ఒక పనిలో అతిశయం, చిత్తరువు, బొమ్మలు, ఇతర శిల్పాలు. విద్యలో అతిశయము మొదలైన విభావాలచేత పుడుతుంది. కళ్లు పెద్దవి చేయడం, రెప్పపాటు లేని చూపు, కనుబొమ్మలు ఎగురువేయడం, రోమాంచం, తల ఊపడం, 'బాగు బాగు' అనడం మొదలైన అనుభావాలచేత దీని అభినయం ప్రయోగించాలి.

**మూ. భవతి చాత్ర శ్లోకః -**

**కర్మాతిశయనిర్వృత్తో విస్మయో హర్షసంభవః,**
**సిద్ధిస్థానే త్వసౌ సాధ్యః ప్రహర్షపులకాదిభిః. 27**

**తా.** ఈ విషయంలో శ్లోకం కూడ ఉన్నది -

అద్భుత మైన పనులను చూడడంవల్ల హర్షం కలగడం విస్మయం. దీనిని అత్యధికమైన హర్షమూ, పులకలు మొదలైనవాటిచే అభినయించాలి.

**మూ. ఏవమేతే స్థాయినో రససంజ్ఞాః ప్రత్యవగన్తవ్యాః.**

**తా.** ఇవి రసం అను పేరు బొందబోయే స్థాయిభావము లని తెలిసికోవాలి.

**మూ. వ్యభిచారిణ ఇదానీం వ్యాఖ్యాస్యామః. అత్రాహ - వ్యభిచారిణ ఇతి కస్మాత్? ఉచ్యతే- వి అభి ఇత్యేతౌ ఉపసర్గౌ. చర ఇతి గత్యర్థో ధాతుః. వివిధమ్ ఆభిముఖ్యేనరసేషు చరన్తీతి వ్యభిచారిణః. వాగఙ్గసత్త్వోపేతాః ప్రయోగే రసాన్నయన్తీతి వ్యభిచారిణః.**

**తా.** ఇప్పుడు వ్యభిచారులను వ్యాఖ్యానిస్తాం. ఇక్కడ ప్రశ్నిస్తున్నాడు - వీటిని వ్యభిచారులు అని ఎందు కంటారు? (సమాధానం) చెపుతున్నాం; విను. 'వి' 'అభి' అనే ఈ రెండూ ఉపసర్గలు. 'చర' అనేది గతి అను అర్థం గల ధాతువు. అనేకవిధాలుగా రసాలలో అభిముఖత్వంతో (రసాలకు) అనుగుణంగా ప్రవర్తిస్తాయి కాబట్టి వ్యభిచారులు. వాచిక - ఆంగిక - సాత్త్వికఅభినయాలతో కలిసి రసాలను ప్రయోగంలో నడిపిస్తాయి కాబట్టి వ్యభిచారులు.

**మూ. అత్రాహ - కథం నయన్తీతి? ఉచ్యతే - లోకసిద్ధాన్త ఏషః - యథా సూర్యః ఇదం దినం నక్షత్రం వా నయతీతి. న చ తేన బాహుభ్యాం స్కన్ధేన వా నీయతే. కింతు లోక ప్రసిద్ధమేతత్ - యథేదం సూర్యో నక్షత్రం దినం వా నయతీతి. ఏమమేతే వ్యభిచారిణః ఇత్యవగన్తవ్యమ్.**

**తానిహ సంగ్రహాభిహితాన్ త్రయస్త్రింశద్వ్యభిచారిణో భావాన్ వర్ణయిష్యామః.**

ఇక్కడ ప్రశ్నిస్తున్నాడు - ఎలా నడిపిస్తాయి? సమాధానం చెపుతున్నాం. విను. ఇది లోకప్రసిద్ధమైన విషయం - ఎలా ననగా - "సూర్యుడు ఈ దినాన్ని లేదా నక్షత్రాన్ని నడుపుతున్నాడు" (అని అంటుంటారు). అయితే సూర్యుడు చేతులతో పట్టుకొని, లేదా బుజంమీద ఎక్కించుకొని వీటిని తీసికొనివెళ్లడంలేదు కదా? అయినా - 'సూర్యుడు నక్షత్రాన్ని లేదా దినాన్ని తీసికొనివెడుతున్నాడు, నడిపిస్తున్నాడు" అని ప్రసిద్ధంగా ఉంది. వ్యభిచారులు కూడ ఇలాగే(రసాన్ని నడిపిస్తాయి) అని అర్థం చేసుకోవాలి. సంగ్రహంగా వెనుక చెప్పిన ఆ ముప్పై మూడు వ్యభిచారిభావాలను వర్ణిస్తాం, విస్తృతంగా నిరూపిస్తాం.

**మూ. తత్ర నిర్వేదో నామ దారిద్ర్య - వ్యాధి - అవమాన - అధిక్షేప - క్రోధ - తాడన - ఇష్టజనవియోగ - తత్త్వజ్ఞానాదిభిః విభావైః స్త్రీనీచకుసత్త్వానామ్. రుదిత - నిఃశ్వసిత - ఉచ్ఛ్వసిత - సంప్రధారణాదిభిః అనుభావైః తమభినయేత్. అత్ర శ్లోకః -**

**దారిద్ర్యేష్టవియోగాద్యైః నిర్వేదో నామ జాయతే,**
**సంప్రధారణనిఃశ్వాసైస్తస్య త్వభినయో భవేత్. 28**

**తా. (1) నిర్వేదం :** వాటిలో నిర్వేదం అనేది - దారిద్ర్యము, వ్యాధి, అవమానము,

నిందించడం, తిట్టడం, క్రోధం, కొట్టడం, ఇష్టజనుల విరహం, తత్త్వజ్ఞానం మొదలైన విభావాలచేత స్త్రీలకు, నీచులకు, దుర్బల మైన మనస్సు కలవాళ్లకు కలుగుతుంది. ఏడ్పు, నిట్టూర్పు, శ్వాస ఎగపీల్చడం, ఒక నిర్ణయానికి రావడం మొదలైన అనుభావాలతో దానిని అభినయించాలి. ఈ సందర్భంలో ఒక శ్లోకం – "దారిద్ర్యం ఇష్టుల వియోగం మొదలైన వాటిచేత నిర్వేదం కలుగుతుంది. నిర్ణయంచేతా, నిట్టూర్పులచేత దానిని అభినయించాలి."

**వి.** నిర్వేదం ఒక విధ మైన వైరాగ్యం. మనస్సు విరిగిపోవడం. సంప్రధారణం అనగా చింత అని కూడ అర్థం (ఇక్కడ) చెప్పుకొనవచ్చును.

**మూ. అత్రానువంశ్యే ఆర్యే భవతః –**

**ఇష్టజనవిప్రయోగాత్ దారిద్ర్యాద్వ్యాధితస్తథా దుఃఖాత్,**
**ఋద్ధిం పరస్య దృష్ట్వా నిర్వేదో నాను సంభవతి. 29**

**బాష్పపరిప్లుతనయనః పునశ్చ నిఃశ్వాసదీనముఖనేత్రః,**
**యోగీవ ధ్యానపరో భవతి హి నిర్వేదవాన్ పురుషః. 30**

**తా.** ఈ సందర్భంలో రెండు అనువంశ్యాలైన ఆర్య లున్నాయి –

ఇష్టజనవియోగంవల్ల, దారిద్ర్యంవల్ల, వ్యాధివల్ల, దుఃఖంవల్ల లేదా ఇతరుల అభివృద్ధిని చూడడంవల్ల నిర్వేదం పుడుతుంది.

నిర్వేదం ఉన్న పురుషుని నేత్రాలు కన్నీటితో వ్యాకులమై ఉంటాయి. నిట్టూరుస్తూ దీనమైన ముఖంతో నేత్రాలతో ఉంటాడు. యోగి వలె ఏదో ధ్యానిస్తూ ఉంటాడు.

**మూ. గ్లానిర్నామ - వాన్త - విరిక్త - వ్యాధి - తపో - నియమ - ఉపవాస - మనస్తాపాతిశయ – మదన – మద్యసేవన – అతివ్యాయామ – అధ్వగమన – క్షుత్పిపాసా – నిద్రాచ్ఛేదాదిభిః విభావైః సముత్పద్యతే. తస్యాః క్షామవాక్యనయనకపోలోదర - మన్దపదోత్క్షేపణ - వేపన - అనుత్సాహ - తనుగాత్ర - వైవర్ణ్య - స్వరభేదాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.**

**తా. (2) గ్లాని :** వాంతులు, విరేచనాలు, వ్యాధి, తపస్సుకు సంబంధించిన నియమాలు, ఉపవాసాలు, మనస్తాపం అధికంగా ఉండడం, మన్మథబాధ, మద్యసేవనం, అతిగా ఏదో పనిచేయడం, నడక, ఆకలి, దాహం, నిద్రకు భంగం కలగడం మొదలైన విభావాల చేత గ్లాని అనేది (అలిసి పోవడం, దౌర్బల్యం) పుడుతుంది. మందస్వరంతో మాటలాడడం, చిక్కిపోయిన నేత్రాలు చెక్కిళ్లు పొట్ట, అడుగులు మెల్లగా ఎత్తి వేయడం, వణకడం, ఉత్సాహం లేకపోవడం, అవయవాలు సన్న వైపోవడం, రంగు మారడం,

స్వరంలో మార్పు మొదలైన అనుభావాలతో దీని అభినయం ప్రయోగించాలి.

**మూ. అత్రార్యే భవతః –**

**వాన్తవిరిక్తవ్యాధిషు తపసా జరసా చ జాయతే గ్లానిః,**
**కార్శ్యేన సాభినేయా మన్దభ్రమణేన కమ్పేన. 31**

**గదితైః క్షామక్షామైః నేత్రవికారైశ్చ దీనసఞ్చారైః,**
**శ్లథభావేనాఙ్గానాం ముహుర్ముహుర్నిర్దిశేద్ గ్లానిమ్. 32**

**తా.** ఈ విషయంలో రెండు ప్రసిద్ధమైన ఆర్య లున్నాయి –

వాంతులు, విరేచనాలు వెళ్లినప్పుడు, వ్యాధియందు, తపస్సుచేత, ముసలితనంచేత, గ్లాని కలుగుతుంది. చిక్కిపోవడంచేత, మెల్లగా నడవడంచేత, వణుకుచేత దీనిని అభినయించాలి.

నీరసంగా ఉన్న మాటలతోను, దీనదృష్టులతో నున్న నేత్రాల వికారాలచేత, అవయవా లన్నీ శిథిలంగా ఉండడంచేతా గ్లానిని అభినయించాలి.

**మూ. శఙ్కా నామ సన్దేహాత్మికా, స్త్రీనీచప్రభవా. చౌర్యాభిగ్రహణ – నృపాపరాధ – పాపకర్మకరణాదిభిర్విభావైః సముత్పద్యతే. తస్యాః ముహుర్ముహురవలోకన – అవకుణ్ఠన. ముఖశోషణ – జిహ్వాపరిలేహన – ముఖవైవర్ణ్య – స్వరభేద – వేపథు, శుష్కోష్ఠ – కణ్ఠాయాససాధర్మ్యాదిభిః అనుభావైః అభినయః ప్రమోక్తవ్యః.**

**తా. (3) శంక :** సందేహమే శంకకు ఆత్మ; దాని ప్రధానలక్షణం. ఇది స్త్రీలలోను, నీచప్రకృతి గల మానవులలోను అధికంగా ఉంటుంది. చౌర్యం చేసి పట్టుబడడము, రాజు విషయంలో అపరాధము, పాపకర్మ చేయడమూ మొదలైన విభావాదులవల్ల పుడుతుంది. మాటి మాటికీ అటూ ఇటూ చూడడం, ముఖం ఎండిపోవడం, నాలుకతో నాకడం, రంగు మారిపోవడం, కంఠస్వరం భేదించడం, వణుకు, పెదవులు కంఠము ఎండిపోవడం, ఆయాసం వంటి ఇతరలక్షణాలు – ఈ అనుభావాలచేత దాని అభినయం చెయ్యాలి.

**మూ. చౌర్యాదిజనితా శఙ్కా ప్రాయః కార్యా భయానకే,**
**ప్రియవ్యలీకజనితా తథా శృఙ్గారిణీ మతా. 33**

**తా.** సాధారణంగా చౌర్యాదులవల్ల కలిగే శంక భయానకంలో చూపాలి. శృంగార రసంలో ప్రియుడుచేసిన అపరాధంవల్ల కలిగిన శంక ప్రదర్శించాలి.

**మూ. అత్రాకారసంవరణమపి కేచిదిచ్ఛన్తి. తచ్చ కుశలైరుపాదిభిః ఇఙ్గితైశ్చ ఉపలక్ష్యమ్.**

**తా.** కొందరు ఆకారం కప్పిపుచ్చడం (తన మనస్సులోని భావం ఇతరులకు తెలియకుండే టట్లు ప్రవర్తించడం) శంక అని అంటారు. ఆ శంకను నేర్పుతో కూడిన ఉపాయాలతోను, ముఖవికారాదులచేతను ప్రదర్శించాలి.

**మూ. అత్రార్యే భవతః –**
**ద్వివిధా శఙ్కా కార్యా హ్యాత్మసముత్థా చ పరసముత్థా చ,**
**యా తత్రాత్మసముత్థా సా జ్ఞేయా దృష్టిచేష్టాభిః. 34**

**తా.** ఈ విషయంలో రెండు ఆర్య లున్నాయి.

శంక ఆత్మసముత్థ (తనలోనే పుట్టినది) పరసముత్థా (ఇతరులు తనవిషయంలో ప్రవర్తించే విధానాన్ని పట్టి కలిగినది) అని రెండు విధాలుగా ఉంటుంది. ఆత్మసముత్థ మైన శంకను వాని చూపులను, చేష్టలను బట్టి తెలుసుకోవాలి.

**మూ. కించిత్ప్రవేపితాఙ్గస్త్వధోముఖో వీక్షతే చ పార్శ్వాని,**
**గురుసజ్జనమానజిహ్వః శ్యామాస్యః శఙ్కితః పురుషః. 35**

**తా.** శంకావిష్టు డైన పురుషుడు వణుకుతూన్న శరీరంతో ముఖం క్రిందికి వంచుకొని ప్రక్కలకు చూస్తుంటాడు. వాని నాలుక బండబారిపోయి మాటలలో తడబడతాడు. వాని ముఖం నల్లబడిపోతుంది.

**మూ. అసూయా నామ – నానాపరాధద్వేషపరైశ్వర్య – సౌభాగ్య – మేధా – విద్యాలీలాదిభిః విభావైః సముత్పద్యతే. తస్యాశ్చ పరిషది దోషప్రఖ్యాపన – గుణోపఘాత – ఈర్ష్యాచక్షుః ప్రదాన – అధోముఖ – భ్రుకుటీక్రియా – అవజ్ఞాన – కుత్సనాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.**

**తా. (4) అసూయ :** అనేకవిధాలైన అపరాధాల వల్లా, ద్వేషం వల్ల, ఇతరుల ఐశ్వర్యము, సౌందర్యము, మేధాశక్తి, విద్య, లీలాదులు చూడడము అను విభావాదులవల్ల అసూయ అను భావం పుడుతుంది. సభలలో (ఎవనిపై అసూయ ఉంటుందో వాని) దోషాలను చూపడం, గుణాలను మరుగుపరచడం, ఈర్ష్యతో కూడిన దృష్టులు ప్రసరింపచేయడం; ముఖం క్రిందికి దింపడం, కను బొమ్మలు విరవడం, చులకన చేయడం, నిందించడం మొదలైన అనుభావాలచేత దీని అభినయం చెయ్యాలి.

**మూ. అత్రార్యే భవతః –**
**పరసౌభాగ్యేశ్వరతామేధాలీలాసముచ్ఛ్రయాన్ దృష్ట్వా,**
**ఉత్పద్యతే హ్యసూయా కృతాపరాధో భవేద్యశ్చ. 36**

**తా.** ఇతరుల సౌభాగ్యాన్ని, ఐశ్వర్యాన్ని (అధికారాదులను) మేధను, లీలలను,

ఉన్నతిని చూచి అసూయ పుడుతుంది. అపరాధం చేసినవానిమీద కూడ అసూయ కలుగుతుంది.

**మూ. భ్రుకుటికుటిలోత్కటముఖైః సేర్ష్యాక్రోధపరివృత్తనేత్రైశ్చ,**
**గుణనాశనవిద్వేషైః తత్రాభినయః ప్రయోక్తవ్యః. 37**

**తా.** కనుబొమ్మల విరుపులచేత, వికృతంగా భయంకరంగా ఉన్న ముఖాలచేత, ఈర్ష్యతోను క్రోధముతోను నేత్రాలు తిప్పడంచేత, గుణాలను నశింపచేయడంచేతను, అనగా గుణాలను వక్రీకరించి నిందించడంచేతను, విద్వేషంచేతను అసూయను అభినయించాలి.

**మూ. మదో నామ మద్యోపయోగాదుత్పద్యతే; స చ త్రివిధః పఞ్చవిధభావశ్చ. అత్రార్యా భవన్తి –**

**తా. (5) మదం :** మదం అనేది మద్యం ఉపయోగించడంవల్ల కలుగుతుంది. మదంలో (మత్తులో) మూడు విధా లుంటాయి; ఐదు విధాలైన భావాలు (అనుభావాలు) ఉంటాయి. ఈ విషయంలో కొన్ని ఆర్య లున్నాయి.

**మూ. జ్ఞేయస్తు మదస్త్రివిధస్తరుణో మధ్యస్తథావకృష్టశ్చ,**
**కరణం పఞ్చవిధం స్యాత్తస్యాభినయః ప్రయోక్తవ్యః. 38**

**తా.** తరుణము, మధ్యమము, అవకృష్టము అని మదం మూడు విధాలు. దానిని అభినయించే (కరణం) సాధనం ఐదు విధాలుగా ఉంటుంది.

**మూ. కశ్చిన్మత్తో గాయతి రోదితి కశ్చిత్తథా హసతి కశ్చిత్,**
**పరుషవచనాభిధాయీ కశ్చిత్, కశ్చిత్తథా స్వపితి. 39**

**తా.** మత్తెక్కినప్పుడు ఒకడు పాటలు పాడుతాడు; ఒకడు ఏడుస్తాడు; ఒకడు నవ్వుతాడు. ఒకడు బూతులు మాట్లాడతాడు. ఒకడు నిద్రపోతాడు.

**మూ. ఉత్తమసత్త్వః హసతి చ గాయతి చ మధ్యమప్రకృతిః,**
**పరుషవచనాభిధాయీ రోదిత్యపి చాధమప్రకృతిః. 40**

**తా.** ఉత్తమప్రకృతి కలవాడు నిద్రపోతాడు. మధ్యమప్రకృతి కలవాడు పాడు తూంటాడు; నవ్వుతాడు కూడ. అధమప్రకృతిగలవాడు పరుష మైన మాటలు మాట్లాడతాడు. ఏడుస్తాడు కూడ.

**మూ. స్మితవచనమధురరాగో హృష్టతనుః కించిదాకులితవాక్యః,**
**సుకుమారావిద్ధగతిః తరుణమదస్తూత్తమప్రకృతిః. 41**

**తా.** తరుణమదంలో ఉన్న ఉత్తమప్రకృతి గలవాడు, చిరునవ్వుతో ముఖం ఎఱ్ఱబడి చూడ ముచ్చటగా ఉంటాడు. వాని శరీరం ఉత్సాహభరితమై ఉంటుంది. మాటలు కొంచెం తడబడతాయి. వాని నడక కొంచెం తొట్రుబాటుతో సుకుమారంగానే ఉన్నట్లు కనబడుతుంది.

**మూ. స్ఖలితాఘూర్ణితనయనః అస్తవ్యాకులితబాహువిక్షేపః,**
**కుటిలవ్యావిద్ధగతిః మధ్యమదో మధ్యమప్రకృతిః. 42**

**తా.** మధ్యమమదంలో ఉన్న మధ్యమప్రకృతి గలవాని కళ్లు తొట్రుపాటు చెంది కదిలిపోతూ తిరిగిపోతూ ఉంటాయి. చేతుల కదలికలు అస్తవ్యస్తంగా వ్యాకులంగా ఉంటాయి. నడక వక్రంగా ఎక్కడి కక్కడ అడ్డుపడుతూ ఉంటుంది.

**మూ. నష్టస్మృతిర్హతగతిశ్ఛర్దితహిక్కాకఫైః సుబీభత్సః,**
**గురుసజ్జమానజిహ్వో నిష్ఠీవతి చాధమప్రకృతిః. 43**

**తా.** అధమదంలో ఉన్న అధమప్రకృతిగలవానికి, ఒంటి స్పృహ ఉండదు. నడవజాలడు. వాంతులతోను, ఎక్కిళ్లతోను, కఫంతోను చాల బీభత్సంగా ఉంటాడు. నాలుక బాగా అడ్డుపడుతూ నోటినుండి మాటలు సరిగారావు. మాటిమాటికీ ఉమ్మేస్తుంటాడు.

**మూ. రఙ్గే పిబతః కార్యా మదవృద్ధిర్నాట్యయోగమాసాద్య,**
**కార్యో మదక్షయో వై యః ఖలు పీత్వా ప్రవిష్టః స్యాత్. 44**

**తా.** నాట్యరంగంమీదనే ఉంటూ మద్యం త్రాగుతున్నవాని మత్తు ఎలా పెరుగుతుందో దానిని నాట్యంలోని అవసరాన్ని పట్టి చూపించాలి. తాగి రంగంమీద ప్రవేశించినవాని మత్తు క్రమంగా తగ్గుతూన్నట్లు చూపాలి.

**మూ. సన్త్రాసాచ్ఛోకాద్వా భయాత్ప్రహర్షాచ్చ కారణోపగతాత్,**
**ఉత్క్రమ్యాపి హి కార్యో మదప్రణాశః క్రమాత్తదజ్ఞైః. 45**

**తా.** మదం తగ్గడానికి తగి నంత సమయం పూర్తి కాకపోయినా, ఏదో ఒక కారణంచేత కలిగిన త్రాసంవల్ల గాని, శోకంవల్ల గాని, భయంవల్ల గాని, అత్యానందం వల్ల గాని మదం క్రమంగా తగ్గిపోయి నట్లు నాట్యనిపుణులు చూపాలి.

**మూ. ఏభిర్భావవిశేషైః మదో ద్రుతం సంప్రణాశముపయాతి,**
**అభ్యుదయసుఖైర్వాక్యైర్యథైవ శోకః క్షయం యాతి. 46**

**తా.** ఏదైన అభ్యుదయం కలగడంచేత గాని, సుఖకర మైన మాటలు వినడంచేత గాని శోకం క్షీణించి నట్లు, త్రాసం, శోకం మొదలైన (పైన చెప్పిన) భావాలచేత మత్తు తొందరగా తొలగిపోతుంది.

**మూ. శ్రమో నామ అధ్వ - వ్యాయామసేవనాదిభిర్విభావైః సముత్పద్యతే. తస్య గాత్రపరిమర్దన - సంవాహన - నిఃశ్వసిత - విజృమ్భిత - మన్దపదోత్క్షేపణ - నయనవదనవికూణన - సీత్కారాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.**

**తా. 6. శ్రమ :** దూరప్రయాణము, ఎక్కువ పని చేయడము, మొదలైన వి భావాలచేత శ్రమ అనేది పుడుతుంది. ఒళ్లు రాసుకొనడం, ఒత్తుకొనడం, నిట్టూర్పులు, ఒళ్లు విరుచుకొనడం, అడుగులు మెల్ల మెల్లగా వేయడం, నేత్రాలూ ముఖమూ వంకరగా పెట్టడం, 'ఇస్సు ఇస్సు' అనడం, మొదలైన అనుభావాలచేత శ్రమను అభినయించాలి.

**మూ. అత్రార్యా -**

**నృత్తాధ్వవ్యాయామాన్నరస్య సంజాయతే శ్రమో నామ,**
**నిఃశ్వాసఖేదగమనైస్తస్యాభినయః ప్రయోక్తవ్యః. 47**

**తా.** నృత్తం చేయడంవల్ల, దూరప్రయాణం, వ్యాయామం - వీటివల్ల నరునికి శ్రమ అనేది కలుగుతుంది. నిట్టూర్పు ఖేదం (అలసిపోవడం) మొదలైనవాటిచేత దీని అభినయం చెయ్యాలి.

**మూ. ఆలస్యం నామ - ఖేద - వ్యాధి - గర్భ - స్వభావ - శ్రమ - సౌహిత్యాదిభిః విభావైః స్త్రీ - నీచజనానామ్. తదభినయేత్ సర్వకర్మానభిలాష - శయన - ఆసన - నిద్రా - తన్ద్రాసేవనాదిభిః అనుభావైః.**

**తా. 7. ఆలస్యం :-** పనిచేసి అలసిపోవడం, వ్యాధి, గర్భము, స్వభావము, శ్రమ, అతి భోజనము మొదలైన విభావాలచేత స్త్రీలలోను, నీచపురుషులలోను ఆలస్యం అనేది పుడుతుంది. ఏ పనిచేయడానికీ ఇష్టం లేకపోవడం, శయనించడం, ఒకచోట కూర్చొనడం, నిద్ర, తంద్ర (కునికిపాట్లు) మొదలైనవాటిచేత దీనిని అభినయించాలి.

**మూ. అత్రార్యా -**

**ఆలస్యం త్వభినేయం ఖేదోపగతం స్వభావజం చాపి,**
**ఆహారవర్జితానామారమ్భాణామనారమ్భాత్. 48**

**తా.** ఖేదంవల్ల (ఎక్కువ పనిచేసి అలసిపోవడంవల్ల) కలిగినదిగాని, స్వభావ సిద్ధంగా ఉన్నది గాని అయిన, ఆలస్యాన్ని ఆహారం తప్ప మిగిలిన ఏ పనులూ చేయకపోవడం ద్వారా అభినయించాలి.

**మూ. దైన్యం నామ - దౌర్గత్యమనస్తాపాదిభిః విభావైః సముత్పద్యతే. తస్య అధృతి - శిరోరోగ - గాత్రగౌరవ - అన్యమనస్కతా - మృజాపరివర్జనాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.**

**తా. 8. దైన్యం :** దుర్గతి (దారిద్ర్యం మొదలైనవి) మనస్తాపము మొదలైన విభావాల చేత దైన్యం పుడుతుంది. ధైర్యం లేకపోవడం, తలనొప్పి, ఒళ్లు బరువెక్కడం, పరధ్యానంగా ఉండడం, శరీరానికి స్నానాది సంస్కారం చేసికొనకపోవడం మొదలైన అనుభావాలచేత దీనిని అభినయించాలి.

**మూ. అత్రార్యా :-**

**చిన్తౌత్సుక్య సముత్థా దుఃఖాద్యా భవతి దీనాతా పుంసామ్,**
**సర్వమృజాపరిహారైః వివిధోఽభినయో భవేత్తస్య. 49**

**తా.** చింత, ఔత్సుక్యము, దుఃఖము మొదలైనవాటివల్ల పురుషులకు దైన్యం కలుగుతుంది. దానిని అన్ని విధాల శరీరంసంస్కారములను పరిహరించడంచేత అభినయం చెయ్యాలి.

**మూ. చిన్తా నామ - ఐశ్వర్యభ్రంశ - ఇష్టద్రవ్యాపహార - దారిద్ర్యాదిభిః విభావైః ఉత్పద్యతే. తామభినయేత్ నిఃశ్వసిత - ఉచ్ఛ్వసిత - సంతాప - ధ్యాన - అధోముఖ - చిన్తన - తనుకార్శ్యాదిభిః అనుభావైః.**

**తా. 9. చిన్త :** ఐశ్వర్యం తొలగిపోవడం, ఇష్టమైన ద్రవ్యం అపహరించబడడం, దారిద్ర్యం మొదలైన విభావాలచేత చింత పుడుతుంది. నిట్టూర్పు, ఉచ్ఛ్వసితం (గాలి పైకి ఎగబీల్చడం) సంతాపము, ధ్యానము, ముఖం క్రిందికి వంచి కూర్చొనడం, ఏదో ఆలోచిస్తూండడం, కృశించడం మొదలైన అనుభావాలచేత చింతను అభినయించాలి.

**మూ. అత్రార్యే భవతః -**

**ఐశ్వర్యభ్రంశేష్టద్రవ్యక్షయజా బహుప్రకారా తు,**
**హృదయవితర్కోపగతా నృణాం చిన్తా సముద్భవతి. 50**

**సోచ్ఛ్వాసైర్నిఃశ్వసితైః సన్తాపైశ్చైవ హృదయశూన్యతయా,**
**అభినేతవ్యా చిన్తా మృజావిహీనైరధృత్యా చ. 51**

**తా.** ఈ విషయంలో రెండు ఆర్య లున్నాయి.

ఐశ్వర్యం తొలగిపోవడం, ఇష్టమైన ద్రవ్యం క్షీణించడం - వీటివల్ల కలిగేది, అనేక రీతులలో ఉండేదీ, హృదయంలో ఏవేవో ఆలోచనలతో ఉండేది, అయిన చింత మానవులకు కలుగుతుంది.

ఉచ్ఛ్వాసాలచేత (శ్వాస పైకి విడవడంచేత), నిఃశ్వాసాలచేత, శరీరంలో తాపంచేత, శూన్యహృదయత్వంచేత (ఏ పని చేయడానికీ తోచని పరిస్థితిచేత) స్నానాదిసంస్కారాలు లేకపోవడంచేత, ధైర్యం (స్థిరత్వం) కోల్పోవడంచేత, చింతను అభినయించాలి.

**మూ. మోహో నామ - దైవోపఘాత - వ్యసనాభిఘాత - వ్యాధి - భయ - ఆవేగ - పూర్వవైరానుస్మరణాదిభిః విభావైః సముత్పద్యతే. తస్య నిశ్చైతన్య - భ్రమణ - పతన - ఘూర్ణనాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.**

**తా. 10. మోహం :** దైవంవల్ల కలిగిన పెద్ద దెబ్బ (అపద), కష్టాలవల్ల కలిగిన దెబ్బలు, వ్యాధి, భయం, ఆవేగం (మనస్సులో కంగారు), పూర్వకాలంనాటి వైరం గుర్తుకు రావడం మొదలైన విభావాలచేత **మోహం** (మనస్సు పూర్తిగా పని చేయకపోవడం) పుడుతుంది. చైతన్యం కోల్పోవడం, తిరగడం, పడిపోవడం, (కళ్లు) తిరగడం, చూడకపోవడం మొదలైన అనుభావాలచేత మోహాన్ని అభినయించాలి.

**మూ. అత్ర శ్లోకస్తావదార్యా చ :-**
**అస్థానే తస్కరాన్ దృష్ట్వా త్రాసనైర్వివిధైరపి,**
**తత్ప్రతీకారశూన్యస్య మోహః సముపజాయతే. 52**

**తా.** ఈ సందర్భంలో ఒక శ్లోకము, ఒక ఆర్య ప్రసిద్ధమైనవి -

హటాత్తుగా దొంగలు కనబడినప్పుడు, అనేకమైన భయకారణాలచేత వాటి ప్రతిక్రియ చేసి కొనజాలని పరిస్థితిలో మోహం కలుగుతుంది.

**మూ. వ్యసనాభిఘాతభయపూర్వవైరస్మరణరోగజో మోహః,**
**సర్వేన్ద్రియసంమోహాత్తస్యాభినయః ప్రయోక్తవ్యః. 53**

**తా.** వ్యసనాలు వచ్చి పడడంవల్లా, భయంవల్లా, పూర్వవైరాన్ని స్మరించడంవల్ల రోగాలవల్లా మోహం కలుగుతుంది. ఏ ఇంద్రియము పని చేయకుండా ఉన్నట్లు చూపడం ద్వారా మోహాన్ని అభినయించాలి.

**మూ. స్మృతిర్నామ - సుఖదుఃఖకృతానాం భావానామనుస్మరణమ్. సా చ స్వాస్థ్య - జఘన్యరాత్రిభాగనిద్రాచ్ఛేద - సమానదర్శనోదాహరణ - చిన్తా - అభ్యాసాదిభిః విభావైః సముత్పద్యతే. తామభినయేత్ శిరః కమ్పన - అవలోకన - భ్రూసమున్నమనానాదిభిః అనుభావైః.**

**తా. 11. స్మృతి :** పూర్వం తాను అనుభవించిన సుఖ - దుఃఖాలచేత ఏర్పడిన భావాలను స్మరించడం **స్మృతి.** స్వాస్థ్యం (ఏ పనీ లేక ఒకచోట కుదురుగా కూర్చొని ఉండడం), తెల్లవారుజామున నిద్రాభంగం కలగడం, సమానమైన (పోలిక ఉన్న) వస్తువును చూడడం లేదా ఎవరైనా దానిని గూర్చి చెప్పడం, చింత, అభ్యాసం మొదలైన విభావాలచేత పుడుతుంది. తల పంకించడం, చూడడం, కనుబొమ్మలు పైకి ఎత్తడం మొదలైన అనుభావాలచేత దానిని అభినయించాలి.

**మూ. అత్రార్యే భవతః –**

**సుఖదుఃఖమతిక్రాన్తం తథా మతివిభావితం యథావృత్తమ్,**
**చిరవిస్మృతం స్మరతి యః స్మృతిమానితి వేదితవ్యోఽసౌ. 54**

**తా.** పూర్వం ఏనాడో అనుభవించిన సుఖాన్నీ దుఃఖాన్నీ చాలకాలం క్రితం మరచిపోయిన కొన్ని విషయాలను జరిగినవి జరిగినట్లుగా మనస్సులో ఊహించుకొంటూ స్మరించేవానిని **స్మృతి** కలవాడు అంటారు.

**మూ. స్వాస్థ్యాభ్యాససముత్థా శ్రుతిదర్శనసంభవా స్మృతిర్నిపుణైః,**
**శిరఉద్వాహనకమ్పైర్భ్రూక్షేపైశ్చాభినేతవ్యా. 55**

**తా.** స్వాస్థ్యంవల్లా, అభ్యాసంవల్లా కలిగినదీ, వినడంచేత చూడడంచేత కలిగినదీ అయిన స్మృతిని నాట్యనిపుణులు శిరస్సును పైకి ఎత్తడం, శిరస్సును కంపింపచేయడం, కనుబొమ్మలు కదల్చడం – వీటిచేత అభినయించాలి.

**మూ. ధృతిర్నామ – శౌర్య – విజ్ఞాన – ప్రీతి – విభవ – శౌచ – ఆచార – గురుభక్తి – అధికమనోరథార్థలాభ – క్రీడాదిభిః విభావైః సముత్పద్యతే. తామభినయేత్ – ప్రాప్తానాం విషయాణామ్ ఉపభోగాత్, అప్రాప్త – అతీత – ఉపహత – వినష్టానామ్ అననుశోచనా దిభిః అనుభావైః.**

**తా. 12. ధృతి :** శౌర్యము, విజ్ఞానము, శాస్త్రజ్ఞానము, వైభవము, శౌచము, ఆచారము, గురుభక్తి, కోరిన అధికమైన ధనం లభించడం, క్రీడలు మొదలైన విభవాలచేత ధృతి అను వ్యభిచారిభావాలవల్ల పుడుతుంది. లభించిన విషయాలను (భోగాలను) అనుభవించడం, లభించని లేదా గడచిపోయిన, ఉపహతములు (విఘ్నాలచే అడ్డగింపబడినది). నశించినవి అయిన వాటిని గూర్చి విచారించకపోవడం – ఈ మొదలైన అనుభావాలచేత దానిని అభినయించాలి.

**మూ. అత్రార్యే భవతః –**

**విజ్ఞాన – శౌచ – విభవ – శ్రుతి – శక్తి సముద్భవా ధృతిః సద్భిః**
**భయశోకవిషాదాద్యై రహితా తు సదా ప్రయోక్తవ్యా. 56**

**తా.** విజ్ఞానము, శౌచము, వైభవము, శాస్త్రజ్ఞానము, శక్తి – వీటివల్ల కలిగిన ధృతిని, భయము, శోకము, విషాదము మొదలైనవి ఏవీ లేనిదానినిగా నిపుణులు ప్రయోగించాలి.

**మూ. ప్రాప్తానాముపభోగః శబ్దరసస్పర్శరూపగన్ధానామ్,**
**అప్రాప్తైశ్చ న శోకో యస్యాం హి భవేద్ధృతిః సా తు. 57**

**తా.** ఏ మానసికస్థితిలో – లభించిన శబ్ద – స్పర్శ – రూప – రస – గంధాలను అనుభవిస్తాడో, లభించని వాటిని గూర్చి విచారించడో అది ధృతి.

**మూ. వ్రీడా నామ - అకార్యకరణాత్మికా, సా చ గురువ్యతిక్రమణ - అవజ్ఞాన - ప్రతిజ్ఞాతానిర్వహణ - పశ్చాత్తాపాభిః విభావైః సముత్పద్యతే. తాం నిగూఢవదన - అధోముఖ - విచిన్తన - ఉర్వీలిఖన - వస్త్రాఙ్గులీయకస్పర్శన - నఖనికృన్తనాదిభిః అనుభావైః అభినయేత్.**

**తా. 13. వ్రీడ :–** వ్రీడ అనేది చేయకూడని పని చేయడం అను స్వరూపం గలది; పెద్దల వ్యతిక్రమం (పెద్దల మాట ప్రకారం చేయకపోవడం), అవమానం, మాట ఇచ్చి తప్పడం, పశ్చాత్తాపం మొదలైన విభావాలచేత పుడుతుంది. ముఖం దాచుకోవడం, తల క్రిందికి వంచడం, ఆలోచన, నేలమీద గీయడం, వస్త్రాలు ఉంగరమూ తడుము కొనడం, గోళ్లు ఛేదించడం (గోళ్లు కొరకడం) మొదలైన అనుభావాలచేత ప్రయోగించాలి.

**మూ. అత్రార్యే భవతః –**

**కించిదకార్యం కుర్వన్నేవం యో దృశ్యతే శుచిభిరన్యైః,**
**పశ్చాత్తాపేన యుతో వ్రీడిత ఇతి వేదితవ్యోఽసౌ. 58**

**తా.** చేయకూడని పనిచేస్తూండగా మంచివా ళ్లెవరో చూడడంచేత పశ్చాత్తాపంతో బాధపడుతూన్న వాడు వ్రీడితుడు (వ్రీడ కలవాడు) అని తెలుసుకొనాలి.

**మూ. లజ్జానిగూఢవదనో భూమిం విలిఖిన్నఖాంశ్చ వినికృన్తన్,**
**వస్త్రాఙ్గులీయకానాం సంస్పర్శం వ్రీడితః కుర్యాత్. 59**

**తా.** వ్రీడ కలిగినవాడు లజ్జతో ముఖం దాచుకొంటూ, నేలమీద గీస్తూ, గోళ్లు తుంపుకొంటూ, వస్త్రాన్ని, ఉంగరాలను స్పృశిస్తూంటాడు. (ఇది అనుభవా లని అర్థం).

**మూ. చపలతా నామ – రాగ – ద్వేష– మాత్సర్య – ఈర్ష్యా – ప్రతికూలాదిభిః విభావైః సముత్పద్యతే. తస్యాశ్చ వాక్పారుష్య - నిర్భర్త్సన - వధ - బన్ధ - సంప్రహార - తాడనాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.**

**తా. 14. చపలత :** రాగము, ద్వేషము, మాత్సర్యము, కోపము, ఈర్ష్య (ఓర్వలేని తనం) ప్రతికూలంగా ప్రవర్తించడం మొదలైన విభావాలచేత చపలత పుడుతుంది. పరుషవాక్కులు. భయపెట్టడము, చంపడము, బంధనము, కొట్టడము, పీడించడము మొదలైన అనుభావాలచేత చపలతను అభినయించాలి.

**మూ. అత్రార్యా భవతి :–**

**అవిమృశ్య తు యః కార్యం పురుషో వధతాడనం సమారభేత్,**
**అవినిశ్చితకారిత్వాత్ స తు ఖలు చపలో బుధైర్జ్ఞేయః. 60**

**తా.** చేయదగిన పనినిగూర్చి బాగా విమర్శించకుండా వధించడానికి, పీడించడానికి ప్రారంభించేవాడు, సరియైన నిశ్చయం లేకుండా ఏమి చేస్తాడో తెలియనిరీతిలో పనులు చేసేవా డవడంచేత చపలుడు అని పండితులు తెలుసుకోవాలి.

**మూ. హర్షో నామ – మనోరథలాభ – ఇష్టజనసమాగమన – మనఃపరితోష – దేవగురు రాజభర్తృప్రసాద – భోజనాచ్ఛాదనలాభ – ఉపభోగాదిభిః విభావైః సముత్పద్యతే. తమభినయేత్ – నయనవదనప్రసాద – ప్రియభాషణ – ఆలిఙ్గన – కణ్టకిత – పులకిత – అస్ర – స్వేదాదిభిః అనుభావైః.**

**తా. 15. హర్షం :** హర్షం అనేది – కోరిక తీరడము, ఇష్టజనులు కలవడము, మనస్సుకు ఆనందము, దేవతల గురువుల రాజుల ప్రభువుల అనుగ్రహము, భోజన – వస్త్రాదుల లాభం, వాటిని అనుభవించడం మొదలైన విభావాలచేత పుడుతుంది. నేత్రములు ముఖము ప్రసన్నములుగా ఉండడం, ప్రియంగా మాటలాడడం, ఆలింగనం, రోమాంచము, కన్నీళ్లు, చెమట మొదలైన అనుభావాలచేత హర్షాన్ని అభినయించాలి.

**మూ. అత్రార్యే భవతః –**

**అప్రాప్యే ప్రాప్యే వా లబ్ధేఽర్థే ప్రియసమాగమే వాపి,**
**హృదయమనోరథలాభే హర్షః సంజాయతే పుంసామ్. 61**

**తా.** పొందడానికి శక్యం కాని లేదా శక్యమైన విషయం లభించి నప్పుడు గాని, ప్రియులను సమాగమం జరిగి నప్పుడు గాని, హృదయానికి ఇష్టమైన కోరిక తీరి నప్పుడు గాని మానవులకు హర్షం కలుగుతుంది.

**మూ. నయనవదనప్రసాదప్రియభాషాలిఙ్గనైశ్చ రోమాఞ్చైః,**
**లలితైశ్చాఙ్గవిహారైః స్వేదాద్యైరభినయస్తస్య. 62**

**తా.** నేత్రాలు ముఖమూ ప్రసన్నంగా ఉండడము, ప్రియమైన సంభాషణ, ఆలింగనము, రోమాంచము, సుకుమార మైన అవయవాల కదలికలు, చెమట మొదలైనవి – వీటిచేత హర్షాన్ని అభినయించాలి.

**మూ. ఆవేగో నామ – ఉత్పాత – వాత – వర్ష – అగ్ని – కుఞ్జరోద్భ్రమణ – ప్రియాప్రియ శ్రవణ – వ్యసనాభిఘాతాదిభిః విభావైః సముత్పద్యతే. తత్ర ఉత్పాతకృతో నామ విద్యుదుల్కానిర్ఘాత ప్రతపన చన్ద్రసూర్యోపరాగకేతుదర్శనకృతః. తమభినయేత్ సర్వాఙ్గస్రస్తతా – వైమనస్య – ముఖవైవర్ణ్య – విషాద – విస్మయాదిభిః.**

**తా. 16 ఆవేగం :** ఆవేగం అనేది – ఉత్పాతములు (దేశోపద్రవాన్ని సూచించే దుఃశకునాలు) తుపాను, అధికవృష్టి, అగ్ని, ఏనుగు తరుముకొని రావడం, ప్రియమైన వార్త వినడం, అప్రియ మైన వార్త వినడం, హటాత్తుగా ఆపదలో చిక్కుకొనడం మొదలైన

విభావాలచేత పుడుతుంది. మెరుపులు, ఉల్కలు (అగ్నిపిండాలు) ఆకాశంనుంచి పడడం, ఉరుములతో పిడుగులు పడడం, చంద్రసూర్యగ్రహణాలు, ధూమకేతువు (తోకచుక్క) కనబడడం మొదలైనవాటివల్ల కలిగిన ఆవేగం ఉత్పాతకృత మైనది. అన్ని అవయవాలు శిథిలములై వ్రేలాడిపోవడం, మనస్సు వికలంగా ఉండడం, ముఖం నల్లబడడం, విషాదం, ఆశ్చర్యం మొదలైనవాటితో ఈ ఆవేగాన్ని అభినయించాలి.

**మూ. వాతకృతం పునః అవగుణ్ఠన - అక్షిపరిమార్జన - వస్త్రసంగూహన - త్వరిత గమనాదిభిః. వర్షకృతం పునః సర్వాఙ్గసంపిణ్డన - ప్రధావన - ఛన్నాశ్రయమార్గణా దిభిః. అగ్నికృతం తు ధూమాకులనేత్ర - అఙ్గసంకోచన - విధూనన - అతిక్రాన్త - అపక్రాన్తాదిభిః. కుఞ్జరోద్భ్రమణకృతం నామ త్వరితాపసర్పణ - చఞ్చలగమన - భయ - స్తమ్భ - వేపథు - పశ్చాదవలోకన - విస్మయాదిభిః.**

**తా.** తీవ్రవాయువుచేత కలిగిన ఆవేగాన్ని - కప్పుకొనడం, కళ్లు తుడుచుకొనడం, వస్త్రంలో శరీరం దాచుకొనడం, తొందరతొందరగా నడవడం మొదలైనవాటితో అభినయించాలి. అగ్నివల్ల కలిగిన ఆవేగాన్ని పొగచేత వ్యాకులమైన నేత్రాలు, అవయవాలు ముణుచుకొనడం, అవయవాలు దులుపుతూండడం, ఎగిరి గంతులేసి దాటడం, పక్కకి తొలగడం మొదలైన అనుభావాలచేత అభినయించాలి. ఏనుగు గొలుసు తెంచుకొని ఊరిమీద పడినప్పుడు కలిగిన ఆవేగాన్ని - తొందరగా దూరంగా పారిపోవడం, చంచలంగా నడవడం, భయం, స్తంభం (కాళ్లు ముందుకు పడకపోవడం) వణకు, వెనుకకు తిరిగి చూస్తూండడం, ఆశ్చర్యం మొదలైన అనుభావాలతో అభినయించాలి.

**మూ. ప్రియశ్రవణకృతం నామ అభ్యుత్థానాలిఙ్గనవస్త్రాభరణప్రదానాశ్రుపులకితాదిభిః. అప్రియశ్రవణకృతం నామ భూమిపతన - విషమవర్తన - పరిధావన, విలాపన - ఆక్రన్దనాదిభిః. వ్యసనాభిఘాతజం తు సహసాపసర్పణ - శస్త్రచర్మవర్మధారణ - గజతురగ రథారోహణ - సంప్రధారణాదిభిః.**

**తా.** ప్రియవార్తను వినడంవల్ల కలిగిన ఆవేగాన్ని ఆ వార్త తీసికొనివచ్చినవానికి సాదరంగా ఎదురుగా వెళ్లడం, ఆలింగనం, వస్త్రాభరణాదులు బహూకరించడం, కన్నీళ్లు, పులకలు మొదలైనవాటిచేత అభినయించాలి. అప్రియవార్త వినడంవల్ల కలిగిన ఆవేగాన్ని - నేలమీద పడిపోవడం, ఇటూ అటూ దొర్లడం, పరుగెత్తడం, విలపించడం, బిగ్గరగా ఏడ్వడం మొదలైన అనుభావాలచేత అభినయించాలి. హటాత్తుగా ఆపద వచ్చినప్పుడు కలిగే ఆవేగాన్ని ఉన్న చోటునుంచి వెంటనే దూరంగా వెళ్లడం, శస్త్రాలు, డాలు, కవచం ధరించడం, గజ - అశ్వ - రథాలు ఎక్కడం, ఏమి చెయ్యాలో నిశ్చితంగా నిర్ణయించడం మొదలైన అనుభావాలచేత అభినయించాలి.

**మూ. ఏవమష్టవికల్పోఽ యమావేగః సంభ్రమాత్మకః,**
**స్థైర్యేణోత్తమమధ్యానాం నీచానాం చాపసర్పణైః. 63**

**తా.** సంభ్రమస్వరూప మైన (సంభ్రమం అనగా కంగారు) ఆవేగం ఈ విధంగా ఎనిమిది విధాలైనది. ఉత్తములు, మధ్యములూ ఆవేగం కలిగినా కూడ స్థైర్యంతో (ధైర్యంతో) నిలదొక్కుకొంటారు. నీచులు పారిపోతారు.

**మూ. అత్రార్యే భవతః –**
**అప్రియనివేదనాద్వా సహసా హ్యవధారితారివచనస్య,**
**శస్త్రాక్షేపాత్ త్రాసాదావేగో నామ సంభవతి. 64**

**తా.** ఈ విషయంలో రెండు ఆర్య లున్నాయి –

అప్రియమును తెలుపుటవల్ల విన్న వెంటనే శత్రువు మాటల విషయంలో ఒక నిశ్చయం చేసికొన్నవానికి, శత్రువు చేయబోయే శస్త్రప్రయోగంవల్ల కలిగిన భయంవల్ల ఆవేగం అనేది కలుగుతుంది.

**మూ. అప్రియనివేదనాద్యో విషాదభావాశ్రయోఽ నుభావోఽ స్య,**
**సహసారిదర్శనాచ్చేత్ ప్రహరణమరిఘట్టనైః కార్యః. 65**

**తా.** అప్రియమైన వార్త తెలుపడంవల్ల వానికి (అప్రియవార్త విన్నవానికి) కలిగిన విషాదానికి సంబంధించిన ఏ అనుభావం ఉంటుందో, దానిని, హటాత్తుగా శత్రువు ఎదు రైతే ఆయుధాల రాపిడితో చెయ్యాలి.

**వి.** వార్తమాత్రమే విన్నప్పుడు విన్నవానికి శత్రువు అభిప్రాయం తెలిసి, ఆతనితో యుద్ధం చేయవలసిఉంటుం దని ఊహించుకొన్నప్పుడు యుద్ధభయంవల్ల ఆవేగం కలుగుతుంది. ఆ ఆవేగాన్ని ఆకారంలో మార్పు మొదలైనవాటితో అభినయించవచ్చు. కాని ఆతనికి శత్రువే ఎదు రైతే వాని ఆవేగానికి అనుభావంగా శస్త్రగ్రహణాన్నే చూపాలి అని రెండు ఆర్యల భావం.

**మూ. జడతా నామ – సర్వకార్యాప్రతిపత్తిః. ఇష్టానిష్టశ్రవణదర్శనవ్యాధ్యాదిభిః. విభావైః సముత్పద్యతే. తామభినయేత్. అకథన – అవిభాషణ – తూష్ణీంభావ – అప్రతిభా – అనిమేషనిరీక్షణ – పరవశత్వాదిభిః అనుభావైః.**

**తా. 17. జడత :** ఏ పని చేయడానికీ తోచకపోవడం **జడత.** ఇష్టవిషయశ్రవణము, అనిష్టవిషయశ్రవణము, ఇష్టానిష్టదర్శనము, వ్యాధి మొద లైన విభావాలచేత జడత పుడుతుంది. సమాధానం చెప్పకపోవడం, మాటలాడకపోవడం, మౌనంగా ఉండడం, ఏమీ అర్థం చేసికొనకపోవడం, రెప్పపాటు లేని చూపు, పరవశత్వంలో ఉండడమూ – ఈ అనుభావాలచేత జడతను అభినయించాలి.

**మూ. అత్రార్యా భవతి –**

**ఇష్టం వానిష్టం వా సుఖదుఃఖే వా న వేత్తి యో మోహాత్,**
**తూష్ణీకః పరవశగో భవతి స జడసంజ్ఞితః పురుషః. 66**

**తా.** ఏ పురుషుడు, మోహంవల్ల ఇష్టమును గాని, అనిష్టమును గాని, సుఖం గాని దుఃఖం గాని తెలుసుకొనజాలడో. ఏమీ మాటలాడక పరవశత్వంతో ఉంటాడో అతడు జడు డను పేరు గలవాడు.

**మూ. గర్వో నామ – ఐశ్వర్య – కుల – రూప – యౌవన – విద్యా – బల – ధనలాభాదిభిః విభావైః సముత్పద్యతే. తస్య అసూయా – అవజ్ఞా – ధర్షణ – అనుత్తరదాన – అసంభాషణ – అఙ్గావలోకన – విభ్రమ – అవహసన – వాక్పారుష్య – గురువ్యతిక్రమణ – అధిక్షేప – వచనవిచ్ఛేదాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.**

**తా. 18. గర్వం :** గర్వం అనేది – ఐశ్వర్యం, కులం, రూపం, యౌవనం, విద్య, బలం, ధనలాభం మొద లైన విభావాలచేత పుడుతుంది. అసూయ, అందరి విషయంలో అనాదరభావం, ఇతరులను ఎదిరించడం, ఎవరైనా ప్రశ్నించినా సమాధానం చెప్పక పోవడం, మాటలాడకపోవడం, తన దేహం చూచుకొంటూండడం, విలాసచేష్టలు, ఇతరులను పరిహసించడం, పరుషవాక్కు, గురువులను లెక్కచేయకపోవడం, అక్షేపించడం, మాటలాడుతుండగా మధ్యలో ఆపివేయడం మొదలైన అనుభావాలచేత గర్వం అభినయించాలి.

**మూ. అత్రార్యా భవతి :–**

**విద్యావాప్తేరూపాదైశ్వర్యాదథ ధనాగమాద్వాపి,**
**గర్వః ఖలు నీచానాం దృష్ట్యఙ్గవిచారణైః కార్యః. 67**

**తా.** విద్య సంపాదించడంవల్ల, సౌందర్యంవల్ల, ఐశ్వర్యంవల్ల, ధనప్రాప్తివల్ల నీచులకు కలిగే గర్వాన్ని వాని చూపులు, అవయవాల లేదా దేహంయొక్క చేష్టలూ ప్రదర్శిస్తూ అభినయించాలి.

**మూ. విషాదో నామ కార్యానిస్తరణ – దైవవ్యాపత్తిసముత్థః. తమభినయేత్ సహాయాన్వేషణ ఉపాయచిన్తన – ఉత్సాహవిఘాత – వైమనస్య – నిఃశ్వసితాదిభిః అనుభావైః ఉత్తమమ ధ్యమానామ్. అధమానాం తు విపరిధావన – ఆలోకన – ముఖశోషణ – సృక్వపరిలేహన అనిద్రా – నిఃశ్వసిత – ధ్యానాదిభిః అనుభావైః.**

**తా. 19. విషాదం :** తలపెట్టిన కార్యం సాధించలేకపోవడం వల్ల, దైవం ప్రతికూలంగా ఉండడం వల్లా కలిగేది విషాదం అను భావం. సహాయాన్ని అన్వేషించడం,

ఉపాయం ఆలోచించడం, ఉత్సాహం దెబ్బతినడం, మనస్సు కలత చెందడం, నిట్టూర్పు మొదలైన అనుభావాలచేత, ఉత్తమ – మధ్యములలో ఉన్న విషాదాన్ని అభినయించాలి. అధముల విషాదా న్నైతే – ఇటూ అటూ పరుగెత్తడం, చూస్తూండడం, ముఖం ఎండిపోవడం. చెలివిలు నాకడం, నిద్ర లేకపోవడం, నిట్టూర్చడం, ఆలోచనలో పడడం మొదలైన అనుభావాలచేత అభినయించాలి.

**మూ. అత్రార్యాశ్లోకౌ –**

**కార్యానిస్తరణాద్వా చౌర్యాభిగ్రహణరాజదోషాద్వా,**
**దైవాదర్థవిపత్తేః భవతి విషాదః సదా పుంసామ్. 68**

**తా.** ఈ విషయంలో ఒక ఆర్య, ఒక శ్లోకమూ ప్రసిద్ధంగా ఉన్నాయి. తలబెట్టిన పని పూర్తికాకపోవడంవల్ల గాని, దొంగతనం చేసి పట్టుబడిపోవడంవల్ల గాని, రాజు విషయంలో అపరాధం చేయడంవల్ల గాని, దైవంవల్ల పని చెడిపోవడంవల్ల గాని నరులకు విషాదం కలుగుతుంది.

**మూ. వైచిత్ర్యోపాయచిన్తాభ్యాం కార్య ఉత్తమమధ్యయోః,**
**నిద్రానిఃశ్వసితధ్యానైః అధమానాం తు యోజయేత్. 69**

**తా.** ఉత్తమ – మధ్యములలోని విషాదాన్ని, మనస్సు వికలం అవడంచేత, ఉపాయాన్ని గూర్చి ఆలోచించడంచేత అభినయించాలి. అధముల విషాదాన్ని నిద్ర, నిట్టూర్పు, ఆలోచన – వీటితో అభినయించాలి.

**మూ. ఔత్సుక్యం నామ – ఇష్టజనవియోగ – అనుస్మరణ – ఉద్యానదర్శనాదిభిః విభావైః సముత్పద్యతే. అస్య దీర్ఘనిఃశ్వసిత – అధోముఖవిచిన్తిత – నిద్రా – తన్ద్రా – శయనాభిలాషాదిభిః అభినయః ప్రయోక్తవ్యః.**

**తా. 20. ఔత్సుక్యం :** ఔత్సుక్యం అనే భావం ఇష్టజనుల వియోగం, వాళ్లను స్మరించడం, ఉద్యానదర్శనం మొదలైన విభావాలవల్ల కలుగుతుంది. దీర్ఘమైన నిట్టూర్పులు, తల క్రిందికి వంచి ఆలోచన, నిద్ర, అలసత్వము, అభిలాష మొదలైన అనుభావాలచేత ఔత్సుక్యం అభినయించాలి.

**మూ. అత్రార్యా భవతి :–**

**ఇష్టజనస్య వియోగాదౌత్సుక్యం జాయతే హ్యనుస్మృత్యా,**
**చిన్తానిద్రాతన్ద్రాగాత్రగురుత్వైరభినయోఽస్య. 70**

**తా.** ఇష్టజనుల వియోగంవల్ల, వాళ్లను స్మరించడంచేత ఔత్సుక్యం (వాళ్లని చూడాలి చూడాలి అని తీవ్రమైన అభిలాష) కలుగుతుంది. దీనిని – చింత, నిద్ర, అలసత్వము, శరీరం బరువెక్కడం మొదలైనవాటిచేత అభినయించాలి.

**మూ. నిద్రా నామ దౌర్బల్య - శ్రమ - క్లమ - మద - ఆలస్య - చిన్తా - అత్యాహార - స్వభావాదిభిః విభావైః సముత్పద్యతే. తామభినయేత్ - వదనగౌరవ - శరీరావలోకన - నేత్రఘూర్ణన - గాత్రవిజృమ్భణ - మాన్ద్య - ఉచ్ఛ్వసిత - సన్నగాత్రతా - అక్షినిమీలనాదిభిః అనుభావైః.**

**తా. 21. నిద్ర :** నిద్ర అనే భావం - దౌర్బల్యము, శ్రమ, వాడిపోవడం, మత్తు, అలసత్వం, చింత, అతిభోజనము, స్వభావము మొదలైన విభావాలచేత పుడుతుంది. 'ముఖం' బరు వెక్కడం, శరీరం చూసుకొంటూండడం, కళ్లు తిప్పడం, శరీరం విరుచు కోవడం, మందత్వం, పైకి శ్వాస పీల్చడం, అవయవాలు నీరసంగా ఉండడం. కళ్లు మూతలుపడడం మొదలైన అనుభావాలచేత నిద్రను అభినయించాలి.

**మూ. అత్రార్యే భవతః -**
**ఆలస్యాద్దౌర్బల్యాత్ క్లమాచ్ఛ్రమాచ్చిన్తనాత్ స్వభావాచ్చ,**
**రాత్రౌ జాగరణాదపి నిద్రా పురుషస్య సంభవతి. 71**

**తా.** ఈ విషయంలో రెండు ఆర్య లున్నాయి -

అలసత్వం (బద్ధకం) వల్ల, దౌర్బల్యంవల్ల, వాడిపోవడంవల్ల, శ్రమవల్ల, చింతవల్ల, స్వభావం వల్లా, రాత్రి మేల్కొని ఉండడంవల్లా పురుషునికి నిద్ర వస్తూంటుంది.

**మూ. తాం ముఖగౌరవగాత్రప్రతిలోలన నయనమీలనజడత్వైః,**
**జృమ్భణగాత్రవిమర్దైరనుభావైరభినయేత్ ప్రాజ్ఞః. 72**

**తా.** ముఖంలో బరువు, అవయవాలు ఇటూ అటూ శిథిలంగా ఊపడం, కళ్లు మూసికొంటూండడం, జడత్వము, ఆవులింతలు, శరీరం మర్దించుకొంటూండడం మొదలైన అనుభావాలచేత నిద్రను అభినయించాలి.

**మూ. అపస్మారో నామ - దేవ - యక్ష - నాగ - బ్రహ్మరాక్షస - భూత - ప్రేత - పిశాచగ్రహణానుస్మరణ - ఉచ్ఛిష్ట - శూన్యాగారసేవన - అశుచికాలాన్తరాపరిపతన - వ్యాధ్యాదిభిః విభావైః సముత్పద్యతే. తస్య స్ఫురిత - నిఃశ్వసిత - ఉత్కమ్పిత - ధావన - పతన - స్వేద - స్తమ్భన - వదనఫేన - జిహ్వోపరిలేహనాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.**

**తా. 22. అపస్మారం :** అపస్మారం (మూర్ఛరోగం) అనేది - దేవతలు, రాక్షసులు నాగులు బ్రహ్మరాక్షసులు ఆవహించడంచేతగాని, వాళ్లను స్మరిస్తూండడంచేత గాని, వాళ్ల ఉచ్ఛిష్టాన్ని (వాటికి సమర్పించిన దానిలో మిగిలినదానిని) సేవించడం (తినడం) వల్లగాని, శూన్యగృహంలో ఉండడంచేతగాని, అశుచిగా చాలాకాలం (శుద్ధిచేసికొనకుండా) ఉండడంవల్ల గాని, వ్యాధి మొదలైనవాటిచేత గాని, పై విభావాలచేత పుడుతుంది. దీనిని

– కదిలిపోవడం, నిట్టూర్పులు, వణుకుతో పైకి ఎగిరిపడడము, పరుగు లెత్తడం, పడిపోవడం, చెమట, కొయ్యబారిపోవడం, నోటినుండి నురుగ బైటకు రావడం, నాలుకతో అన్ని వైపులా నాకు తూండడమూ మొదలైన అనుభావాలచేత అభినయించాలి.

**మూ. అత్రార్యే భవతః –**

**భూతపిశాచగ్రహణానుస్మరణోచ్ఛిష్టశూన్యగృహగమనాత్,**
**కాలాన్తరాతిపాతాదశుచేశ్చ భవత్యపస్మారః. 73**

**తా.** ఈ విషయంలో రెండు ఆర్య లున్నాయి –

భూత – పిశాచాదులు పట్టుకొనడం, వాటిని స్మరించడం, ఉచ్ఛిష్టం తినడం (లేదా మూత్రవిసర్జనాదులు చేసిన పిమ్మట పాదప్రక్షాలనాదులు చేసికొనకుండా అశుచిగానే ఉండడం), జనులు నివసించని శూన్యగృహంలోనికి ఒంటరిగా వెళ్లడం, అశుచియై యుండి పరిశుద్ధి చేసికొనడంలో జాప్యం చెయ్యడం – వీటివల్ల అపస్మారం కలుగుతుంది.

**మూ. సహసా భూమౌ పతనం ప్రవేపనం వదనఫేనమోక్షశ్చ,**
**నిఃసంజ్ఞస్యోత్థానం రూపాణ్యేతాన్యపస్మారే. 74**

**తా.** ఉన్నట్లుండి నేలమీద పడిపోవడం, అతిగా వణుకు, నోటినుండి నురుగు వెలువర్చడం, ఏమి చేస్తున్నాడో తెలియని స్థితిలో లేచి నిలబడడం – ఇవన్నీ అపస్మారం లక్షణాలు.

**మూ. సుప్తం నామ – నిద్రాభిభవ – విషయోపగమన – మోహన – క్షితితలశయన – ప్రసారణానుకర్షణాదిభిః విభావైః సముత్పద్యతే. నిద్రాసముత్థం తదుచ్ఛ్వసిత – సన్నగాత్ర – అక్షినిమీలన – సర్వేన్ద్రియసంమోహన – ఉత్స్వప్నాయితాదిభిః అనుభావైరభినయేత్.**

**తా. 23. సుప్తం :** 'సుప్తం' అను భావం – నిద్ర ఆవహించడం, భోగాలు సేవించడం, విషయాలచేత మోహింపబడడం, నేలమీదనే వాలిపోవడం, అవయవాలు చాచడం, దొర్లడం మొదలైన విభావాలచేత పుడుతుంది. నిద్రవల్ల వచ్చిన ఈ సుప్తం అనుభావాన్ని పైకి శ్వాస పీల్చడం, కృశించిన శరీరం, కళ్లు మూసికొనడం, ఇంద్రియా లేవీ పనిచేయక పోవడం, పలవరింతలు మొదలైన అనుభావాలచేత అభినయించాలి.

**మూ. అత్రార్యే భవతః :–**

**నిద్రాభిభవేన్ద్రియోపరమణమోహనైర్భవేత్ సుప్తమ్,**
**అక్షినిమీలనోచ్ఛ్వసనైః స్వప్నాయితజల్పితైః కార్యః. 75**

**తా.** ఈ విషయంలో రెండు ఆర్య లున్నాయి –

నిద్ర ఆక్రమించడం, ఇంద్రియా లేవీ పనిచేయకపోవడం, మోహం (బాహ్యప్రపంచ వ్యవహారం ఏదీ తెలియకపోవడం), వీటిచేత సుప్తం కలుగుతుంది. కళ్లు మూసికొని దీర్ఘంగా ఊపిరి పైకి విడవడంచేత, పలవరింతలచేత దీనిని అభినయించాలి.

**మూ. సోచ్ఛ్వాసైర్నిఃశ్వాసైః మన్దాక్షినిమీలనేన నిశ్చేష్టః,**
**సర్వేన్ద్రియసంమోహాత్ సుప్తం స్వప్నైశ్చ యుఞ్జీత. 76**

**తా.** ఉచ్ఛ్వాసనిఃశ్వాసలతో మనిషి, మందంగా కళ్లు మూసికొని నిశ్చేష్టుడై ఉంటాడు. అన్ని ఇంద్రియాలూ మోహంలో (పని చేయని స్థితిలో) ఉంటాయి. స్వప్నం చూస్తూ ఉంటాడు. ఈ విధంగా సుప్తాన్ని చూపాలి.

**మూ. విబోధో నామ – ఆహారపరిణామ – నిద్రాచ్ఛేద – స్వప్నాన్త – తీవ్ర శబ్దశ్రవణ – స్పర్శాదిభిః విభావైః సముత్పద్యతే. తమభినయేత్ – జృమ్భణాక్షిపరిమర్దన – శయనమోక్షణాదిభిరనుభావైః.**

**తా. 24. విబోధం :** విబోధం అనేది – ఆహారం జీర్ణం అవడం, నిద్ర భగ్నం కావడం, స్వప్నం ముగియడం, తీవ్ర మైన శబ్దం వినడం, స్పర్శ మొదలైన విభావాలవల్ల కలుగుతుంది. దీనిని – ఆవులింతలు, కళ్లు నులుముకొనడం, పక్కపైనుంచి లేవడం మొదలైన అనుభావాలచేత అభినయించాలి.

**మూ. అత్రార్యా భవతి :–**
**ఆహారవిపరిణామాచ్ఛబ్దస్పర్శాదిభిశ్చ సంభూతః,**
**ప్రతిబోధస్త్వభినేయో జృమ్భణవదనాక్షిపరిమర్దైః. 77**

**తా.** ఆహారం జీర్ణం అవడం, శబ్దం వినబడడం, స్పర్శ తగలడం మొదలైనవాటి నుండి కలిగిన ప్రతిబోధం (మేల్కొనడం), ఆవులింతలచేత, ముఖమూ కళ్లూ మర్దించు కొనడంచేత అభినయించాలి.

**మూ. అమర్షో నామ – విద్యైశ్వర్యబలాధికైః అధిక్షిప్తస్య అవమానితస్య వా సముత్పద్యతే. తమభినయేత్ – శిరఃకమ్పన – ప్రస్వేదన – అధోముఖచిన్తన – ధ్యాన – అధ్యవసాయ – ఉపాయ – సహాయాన్వేషణాదిభిః అనుభావైః.**

**తా. 25. అమర్షం :** విద్యచేత, ఐశ్వర్యంచేత, బలంచేత అధికులైనవాళ్లు ఒకనిని అధిక్షేపించినా, అవమానించినా వానికి అమర్షం అనేది పుడుతుంది. శిరస్సు కంపింప చేయడం, తల వంచుకొని ఏమేమో ఆలోచించుకొనడం. ఆ అవమానాదులను గూర్చియే తలపోయడం, ఒక నిర్ణయానికి రావడం, ప్రతీకారానికి ఉపాయాన్ని, సాహాయ్యం చేసేవానినీ అన్వేషించడం మొదలైన అనుభావాలచేత అమర్షాన్ని అభినయించాలి.

**మూ. అత్ర శ్లోకౌ –**

**ఆక్షిప్తానాం సభామధ్యే విద్యాశౌర్యబలాధికైః,**
**నృణాముత్సాహసంయోగాదమర్షో నామ జాయతే. 78**

**తా.** ఈ సందర్భంలో రెండు శ్లోకాలున్నాయి.

విద్యా – శౌర్య – బలాలచేత తమకంటె అధికులైన వాళ్లు సభామధ్యలో కించ పరచగా, ఉత్సాహశీలులైన మానవులకు అమర్షం కలుగుతుంది.

**మూ. ఉత్సాహాధ్యవసాయాభ్యామధోముఖవిచిన్తనైః,**
**శిరఃప్రకమ్పస్వేదాద్యైః స్తం ప్రయుఞ్జీత పణ్డితః. 79**

**తా.** ఉత్సాహంచేత, నిర్భయంచేత, తలవాల్చి కూర్చొని ఆలోచించడంచేత, తల కంపింపచేయడంచేత, చెమట మొదలైనవాటిచేత, పండితుడు, అమర్షాన్ని అభినయించాలి.

**మూ. అవహిత్థం నామ – ఆకారప్రచ్ఛాదనాత్మకమ్. తచ్చ లజ్జా – భయ – అపజయ – గౌరవ – జైహ్మ్యాదివిభావైః సముత్పద్యతే. తస్య అన్యథాకథన – అవలోకిత – కథాభఙ్గ – కృతకధైర్యాదిభిః అనుభావైః అభినయః ప్రయోక్తవ్యః.**

**తా. 26. అవహిత్థం :** ఆకారాన్ని (మనస్సులోని భావాన్ని) కప్పిపుచ్చుకొనడం అవహిత్థ. లజ్జ, భయం, ఓటమి, గౌరవం, వక్రత్వం (వక్రబుద్ధి) మొదలైన విభావాలచేత అవహిత్థ కలుగుతుంది. మాట మార్చి చెప్పడం, అదొక విధంగా చూడడం, మాట తుంచివేయడం, తెచ్చి పెట్టుకొన్న ధైర్యం మొదలైన అనుభావాలచేత అవహిత్థను అభినయించాలి.

**మూ. అత్ర శ్లోకో భవతి –**

**ధార్ష్ట్యజైహ్మ్యాదిసంభూతమవహిత్థం భయాత్మకమ్,**
**తచ్చాగణనయా కార్యం నాతీవోత్తరభాషణమ్. 80**

**తా.** ఇక్కడ ఒక శ్లోకం ప్రసిద్ధిలో ఉన్నది –

తన రహస్యం ఇతరులకు ఎక్కడ తెలిసిపోతుందో అన్న భయంతో కూడిన అవహిత్థం, ధార్ష్ట్యం (డబాయింపు), వక్రత్వం మొదలైనవాటివల్ల పుడుతుంది. ప్రస్తుతమైన విషయాన్ని లెక్కచేయకుండా, ఇతరుల ప్రశ్నలకు సమాధానాలు కూడ దాటవేస్తూ అవహిత్థను ప్రదర్శించాలి.

**మూ. ఉగ్రతా నామ – చౌర్యాభిగ్రహణ – నృపాపరాధ – అసత్ప్రలాపాదిభిః విభావైః సముత్పద్యతే. తాం చ వధ – బన్ధన – తాడన – నిర్భర్త్సనాదిభిః అనుభావైః అభినయేత్.**

**తా. 27. ఉగ్రత :** ఉగ్రత అనేది – చౌర్యం చేసి పట్టుబడిపోవడం, రాజు విషయంలో

అపరాధం, దుర్భాషలాడడం మొదలైన విభావాలచేత పుడుతుంది. వధ, బంధనం, కొట్టడం, భయపెట్టడం మొదలైన అనుభావాలచేత ఉగ్రతను అభినయించాలి.

**మూ. అత్రార్యా భవతి –**

**చౌర్యాభిగ్రహణవశాత్ నృపారాధాదథోగ్రతా భవతి,**
**వధబన్ధనతాడనాదిభిరనుభావైరభినయస్తస్యాః. 81**

**తా.** ఈ సందర్భంలో ఒక ఆర్య ప్రసిద్ధిలో ఉంది –

చౌర్యం చేస్తూ పట్టుబడడంవల్ల, రాజువిషయంలో అపరాధం చేయడంవల్ల ఉగ్రత్వం పుడుతుంది. అది వధ, బంధనము, తాడనము మొదలైన అనుభావాలచేత అభినయింపబడుతుంది.

**మూ. మతిర్నామ – నానాశాస్త్రవిచిన్తన – ఊహ – అపోహాదిభిః విభావైః సముత్పద్యతే. తామభినయేత్ శిష్యోపదేశార్థవికల్పన – సంశయచ్ఛేదాదిభిః అనుభావైః.**

**భవతి చాత్ర శ్లోకః –**

**నానాశాస్త్రార్థబోధేన మతిః సంజాయతే నృణామ్,**
**శిష్యోపదేశార్థకృతస్తస్యాస్త్వభినయో భవేత్. 82**

**తా. 28. మతి :** అనేకశాస్త్రాలను పరిశీలించడం, చెప్పని విషయాలను ఊహించి చేర్చడం (ఊహ), చెప్పిన వైనా అనుపయుక్తా లైన విషయాలను తొలగించడం (అపోహ) మొదలైన విభావాలచేత పుడుతుంది. శిష్యోపదేశంకోసం అనేక మైన వికల్పాలు చేయడం, సంశయాలను ఛేదించడం మొదలైన అనుభావాలచేత మతిని అభినయించాలి.

ఈ విషయంలో ప్రసిద్ధ మైన శ్లోకం కూడ ఉన్నది –

అనేకవిధాలైన శాస్త్రవిషయాలను తెలిసికొనడంచేత మానవులకు **మతి** (అనేక విషయాలను గూర్చి నిశ్చితమైన అభిప్రాయం) కలుగుతుంది. శిష్యోపదేశం చేయడం అనే అనుభావంచేత దానిని అభినయించాలి.

**వి.** వికల్పనం అనగా ఇక్కడ ఇలా అర్థం చెప్పడం యుక్తమా, అలా చెప్పడం యుక్తమా అని రెండు పక్షాలను చూపడం. లేదా విస్పష్టంగా ప్రతిపాదించడం.

**మూ. వ్యాధిర్నామ వాతపిత్తకఫసంనిపాతప్రభవః. తస్యాః (స్స) జ్వరాదయో విశేషాః. జ్వరస్తు ద్వివిధః సశీతః సదాహశ్చ. తత్ర సశీతో నామ – ప్రవేపిత – సర్వాఙ్గోత్కమ్పన – నికుఞ్చన – అగ్న్యభిలాష – రోమాఞ్చ – హనువలన – నాసావికూణన – ముఖశోషణ – పరిదేవితాదిభిః అనుభావైః అభినేయః. సదాహో నామ – విక్షిప్తాఙ్గకరచరణ – భూమ్యభిలాషా – అనులేపన – శీతాభిలాష – పరిదేవన – ముఖశోష – ఉత్క్రుష్టాదిభిః**

**అనుభావైః యేచాన్యే వ్యాధయః తేఽపి ఖలు ముఖవికూణన – గాత్రస్తమ్భ – స్రస్తాక్షి – నిఃస్వన – స్తనిత – ఉత్క్రష్ట – వేపనాదిభిః అనుభావైః అభినేయాః.**

**తా. 29. వ్యాధి :** వాత – పిత్త – కఫాల కలయికవల్ల, వాటిలోని కొన్ని లోపాలవల్ల వ్యాధి కలుగుతుంది. జ్వరం మొదలైనవి వ్యాధిలోని కొన్ని విశేషాలు (భేదాలు). శీతంతో కూడినది, వేడితో కూడినది అని జ్వరం రెండు విధాలు. వణుకు, అన్ని అవయవాలు లేదా మొత్తం దేహం ఎగిరి పడుతూండడం. ముణిచిపెట్టుకొనడం, అగ్నిదగ్గర కూర్చోవాలనే కోరిక. రోమాంచము, దవడలు కదలడం, ముక్కు వంకరగా తిప్పుతూండడం, ముఖం ఎండడం, తిట్టుకుంటూ (complaining) కూర్చోవడం మొదలైన అనుభావాలచేత సశీత (చలితోకూడిన) జ్వరాన్ని అభినయించాలి. శరీరమూ, కాళ్లూ చేతులూ దులుపుతూండడము (దూరంగా కదుపుతూండడమూ) నేలమీద అభిలాష, మైపూతలు, చల్లదనంమీద అభిలాష, తిట్టుకొంటూ, విసుక్కొంటూ ఏ మేమో అంటూండడము, ముఖం ఎండిపోవడం, నిందించడం లేదా అరవడం మొదలైన విభావాలచేత సదాహజ్వరాన్ని అభినయించాలి. ఈ జ్వరాలు కాక మిగిలిన వ్యాధులను కూడ ముఖ వికారాలు, శరీరం కొయ్యబారడం, కళ్లు నీరసంగా వాలిపోతూండడం, నిట్టూర్పు, మూలుగు, తిట్లు, వణకు మొదలైన అనుభావాలచేత అభినయించాలి.

**మూ. అత్ర శ్లోకో భవతి :–**

**సమాసతస్తు వ్యాధీనాం కర్తవ్యోఽభినయో బుధైః,**
**స్రస్తాఙ్గగాత్రవిక్షేపైస్తథా ముఖవికూణనైః. 83**

**తా.** ఈ సందర్భంలో ఒక శ్లోకం వినబడుతున్నది –

నాట్యవిదులు వ్యాధు లన్నింటినీ – శరీరాన్నీ అవాయవాలనీ శిథిలంగా జారవిడుస్తూ, ముఖం వికృతంగా, అదోలా పెడుతూ అభినయించాలి.

**మూ. ఉన్మాదో నామ – ఇష్టజనవియోగ – విభవనాశ – అభిఘాత – వాతపిత్తశ్లేష్మ ప్రకోపాదిభిః విభావైరుత్పద్యతే. తమ్ అనిమిత్తహసిత – రుదిత – ఉత్క్రుష్ట – అసంబద్ధ ప్రలాప – శయిత – ఉపవిష్ట – ప్రధావిత – నృత్త – గీత – పఠిత – భస్మపాంస్వవధూలన – తృణనిర్మాల్యకుచేలచీరఘటకపాలశరావాభరణధారణోపభోగైః అనేకైశ్చ అనవస్థితైః చేష్టానుకరణాదిభిః అనుభావైః అభినయేత్.**

**తా. 30. ఉన్మాదం :** ఉన్మాదం అనేది – ఇష్టజనుల వియోగం, వైభవం నశించడం, హటాత్తుగా పెద్ద దెబ్బతగలగడం, వాతపిత్తశ్లేష్మాల ప్రకోపం (అవి పెరగకూడని స్థితికి పెరగడం) మొదలైన విభావాలచేత పుడుతుంది. కారణం లేని నవ్వులు ఏడ్పులు, తిట్లు,

అసంబద్ధమైన పేలాపన, నేలమీద శయనించడం, కూర్చొనడం, లేవడం, పరుగులెత్తడం, నృత్తం చేయడం, ఏవేవో పాటలు పాడడం, కాలిన బూడిద పరాగము ఒంటినిండా పూసికొనడం, గడ్డి, నిర్మాల్యము (దేవునినుంచి తీసివేసిన పువ్వులు దండలు మొదలైనవి) మాసిన బట్టలు, చింకిరి గుడ్డలు, కుండపెంకులు, మట్టిమూకుళ్లు అలంకారాలుగా ధరించడం వాటిని వివిధరీతులలో ఉపయోగించడం, ఒక పద్ధతిలో లేని చేష్టలు చేయడం మొదలైన అనుభావాలచేత ఉన్మాదాన్ని అభినయించాలి.

**మూ. అత్రార్యే భవతః–**

**ఇష్టజనవిభవనాశాదభిఘాతాద్వాతపిత్తకఫకోపాత్,**
**వివిధాచ్చిత్తవికారాదున్మాదో నామ సంభవతి. 84**

**అనిమిత్తరుదితహసితోపవిష్టప్రధావితోత్క్రుష్టైః**
**అన్యైశ్చ వికారకృతైరున్మాదం సంప్రయుఞ్జీత. 85**

**తా.** ఈ విషయంలో రెండు ఆర్యలు ప్రసిద్ధంగా ఉన్నాయి –

ఇష్టజనుల మరణంవల్ల, వైభవం నశించడంవల్ల, ఆకస్మికమైన దెబ్బ తగలడంవల్లా వాతపిత్తకఫాల ప్రకోపంవల్లా, అనేకవిధా లైన చిత్తవికారాలవల్లా ఉన్మాదం అనేది కలుగుతుంది.

కారణం ఏమీ లేకుండా ఏడ్వడం నవ్వడం, కూర్చొనడం పాటలు పాడడం, పరుగులెత్తడం తిట్లు తిట్టడం – వీటిచేత, ఇతరమైన వికృతచేష్టలతో ఉన్మాదాన్ని అభినయించాలి.

**మూ. మరణం నామ వ్యాధిజమ్, అభిఘాతజం చ. తత్ర యత్ అన్త్ర – యకృత్ – శూల – దోషవైషమ్య – గణ్డ – పిటక – జ్వర – విషూచికాదిభిః ఉత్పద్యతే తద్వ్యాధి ప్రభవమ్.**

**అభిఘాతజం తు శస్త్ర – అహిదంశ – విషపాన – శ్వాపద – గజ – తురగ – రథ – పశు – యానపాతవినాశప్రభవమ్. ఏతయోరభినయవిశేషాన్ వక్ష్యామః –**

**తా.** 31. మరణం అనేది వ్యాధివల్ల కలిగేది, అభిఘాతంవల్ల (అకస్మికంగా దెబ్బ తగలడం వల్ల) కలిగేది (అని రెండు విధాలు). వాటిలో ప్రేగులు, యకృత్తు (లివరు) చెడిపోవడం, కడుపులో శూల, వాతపిత్తకఫాలు ఎగుడుదిగుడుగా ఉండడం. గండమాల రోగం, కురుపులు బొబ్బలు, జ్వరం, విషూచిక (మశూచికం) మొదలైనవాటివల్ల కలిగిన మరణం వ్యాధిజం. ఆయుధం, పాముకాటు విషం తాగడం, క్రూరమృగాలు, ఏనుగు గుఱ్ఱం రథం, ఇతరపశువులు, వాహనాలు – వీటి మీదినుండి క్రిందికి పడడంవల్ల, ఎక్కిన గజాదులు నశించడంవల్లా కలిగినది అభిఘాతజం. ఈ రెండింటిని ఎలా

అభినయించాలో, దానిలోని విశేషాలు చెపుతాం.

**మూ. తత్ర వ్యాధిజం - విషణ్ణగాత్ర - వ్యాయతాఙ్గవిచేష్టిత - నిమీలితనయన - హిక్కాశ్వాసోపేత - అనవేక్షితపరిజన - అవ్యక్తాక్షరకథనాదిభిః అనుభావైః అభినయేత్. అత్ర శ్లోకో భవతి -**

**వ్యాధీనామేకభావోహి మరణాభినయః స్మృతః,**
**విషణ్ణగాత్రైర్నిశ్చేష్టైరిన్ద్రియైశ్చ వివర్జితః. 86**

**తా.** వ్యాధులన్నీ కలిసి మీద పడినట్లుంటుంది మరణసమయంలో. అవయవాలు దుర్బలములై చేష్ట లుడిగి ఉంటాయి. ఇంద్రియాలు పనిచేయనే చేయవు. మరణాభినయం ఈ విధంగా చెయ్యాలి.

**మూ. అభిఘాతజే తు నానాప్రకారాః అభినయవిశేషాః - శస్త్రక్షత - అహిదష్ట - విషపీత - గజాదిపతిత - శ్వాపదహతాః యథా. తత్ర శస్త్రక్షతే తావత్సహసా భూమిపతనవేపన స్ఫురణాదిభిః అభినయః ప్రయోక్తవ్యః.**

**తా.** అభిఘాతంవల్ల కలిగిన మరణంలో నైతే అనేక విధాలైన అభినయవిశేషా లుంటాయి. శస్త్రంచేత కొట్టడం, సర్పం కరవడం, విషం తాగడం, గజాదులమీదినుండి పడిపోవడం, క్రూరమృగాలు చంపడం అనే వాటివల్ల కలిగిన మరణాన్ని అభినయించడం ఎట్లనగా - వాటిలో ఆయుధం ప్రహారంచేత కలిగిన మరణాన్ని, వెంటనే నేలమీద పడిపోవడం, వణకడం, కొట్టుకోవడం మొదలైనవాటిచేత అభినయించాలి.

**మూ. అహిదష్టవిషపీతయోః విషవేగో యథా - కార్శ్య - వేపథు - విదాహ - హిక్కా - ఫేన - స్కన్ధభఙ్గ - జడతా - మరణానీత్యష్టౌ విషవేగాః. అత్ర శ్లోకౌ భవతః.**

**కార్శ్యం తు ప్రథమే వేగే ద్వితీయే వేపథుర్భవేత్,**
**దాహం తృతీయే హిక్కాం చ చతుర్థే సంప్రయోజయేత్. 87**

**ఫేనం చ పఞ్చమే కుర్యాత్ షష్ఠే స్కన్ధస్య భఞ్జనమ్**
**జడతాం సప్తమే కుర్యాదష్టమే మరణం భవేత్. 88**

**తా.** పాముకాటులోను, విషం త్రాగినప్పుడు విషవేగం ఎట్లనగా - కృశించి పోవడం, వణుకు, అతిగా దాహము, ఎక్కిళ్లు, నురుగులు కక్కడం, బుజాలు వ్రేలాడి పోవడం, జడత్వము, మరణము అని విషవేగాలు ఎనిమిది. ఈ విషయంలో రెండు శ్లోకా లున్నాయి.

మొదటి విషవేగంలో కృశత్వము, రెండవదానిలో వణుకు, మూడవదానిలో అతిదాహం, నాల్గవ దానిలో ఎక్కిళ్లు, ఐదవదానిలో నురుగు, ఆరవదానిలో బుజాలు వాలిపోవడం, ఏడవదానిలో నిశ్చేష్టత్వం, చివరికి ఎనిమిదవ వేగంలో మరణము అభినయించాలి.

**మూ. అత్రార్యా భవతి –**

**శ్వాపదగజతురగరథోద్భవం తు పశుయానపతనజం వాపి,**
**శస్త్రక్షతవత్కుర్యాదనవేక్షితగాత్రసంచారమ్. 89**

**తా.** అభిఘాతజమరణం విషయంలోనే ఒక ఆర్య ఉంది –

క్రూరమృగాలవల్ల, గజ – తురగ – రథాలనుండి పడడంవల్ల, పశువుల పై నుండి, ఇతరవాహనాల నుండి పడడంవల్లా కలిగిన మరణాన్ని, అవయవాల కదిలక విషయంలో నియమం ఏదీ లేకుండా, శస్త్రక్షతంవల్ల కలిగిన మరణాన్ని అభినయించినట్లే అభినయించాలి.

**మూ. ఇత్యేవం మరణం జ్ఞేయం నానావస్థాన్తరాత్మకమ్,**
**ప్రయోక్తవ్యం బుధైః సమ్యక్ యథాభావాఙ్గచేష్టితైః. 90**

**తా.** ఈ విధంగా మరణం అనేది అనేకవిధాలైన వేరు వేరు అవస్థల రూపంలో ఉంటుంది. విజ్ఞులు దీనిని భావానికి అనుగుణమైన అవయవచేష్టలతో చక్కగా అభినయించాలి.

**మూ. త్రాసో నామ – విద్యుదుల్కాశనిపాతనిర్ఘాతామ్బుధరమహాసత్త్వపశురవాదిభిః విభావైరుత్పద్యతే. తమభినయేత్ – సంక్షిప్తాఙ్గ – ఉత్కమ్పన – వేపథు – స్తమ్భ – రోమాఞ్చ – గద్గద – ప్రలాపాదిభిరనుభావైః.**

**తా. 32. త్రాసం :** త్రాసం అనేది – మెరుపులు, ఉల్కాపాతం, పిడుగులు, ఉరుములు, మేఘాడంబరం, మహాబలం గల మృగాల ధ్వనులు మొదలైన విభావాలవల్ల పుడుతుంది. అవయవాలు ముణుచుకొనడం, బాగా వణికిపోవడం, కొయ్య బారిపోవడం, రోమాంచం, గద్గదస్వరం, పేలాపన మొదలైన అనుభావాలచేత త్రాసాన్ని అభినయించాలి.

**మూ. అత్ర శ్లోకో భవతి –**

**మహాభైరవనాదాద్యైస్త్రాసః సముపజాయతే,**
**త్రస్తాఙ్గాక్షినిమేషైశ్చ తస్య త్వభినయో భవేత్. 91**

**తా.** ఈ విషయంలో ఒక శ్లోకం ప్రసిద్ధంగా ఉంది –

చాలా భయంకర మైన ధ్వనులు మొదలైనవాటివల్ల త్రాసం పుడుతుంది. అవయవాలు జార్చి వేయడం, కళ్లు మూసికోవడం మొదలైనవాటిచేత దానిని అభినయించాలి.

**మూ. వితర్కో నామ – సందేహ – విమర్శ – విప్రతిపత్త్యాదిభిః విభావైః ఉత్పద్యతే. తమభినయేత్ వివిధవిచారిత – ప్రశ్న – సంప్రధారణ – మన్త్రసంగూహనాదిభిరను**

**భావైః. అత్ర శ్లోకో భవతి –**

**విచారణాదిసంభూతః సందేహాతిశయాత్మకః,**
**వితర్కః సోఽభినేయస్తు శిరోభ్రూక్షేపకమ్పనైః. 92**

**తా. 33. వితర్కం :** వితర్కం అనేది సందేహం, విమర్శ, విప్రతిపత్తి మొదలైన విభావాలచేత పుడుతుంది. దీనిని అనేకవిధాలైన ఆలోచనలు, ప్రశ్నలు, నిర్ణయాలు, ఆలోచనలను దాచుకొనడం మొదలైన అనుభావాలచేత అభినయించాలి. ఈ సందర్భంలో ఒక శ్లోకం ప్రసిద్ధిలో ఉంది.

విచారణ చేయడం మొదలైనవాటివల్ల పుట్టినది, అధికమైన సందేహం అనే స్వరూపం గలది అయిన వితర్కాన్ని శిరస్సు కంపింపచేయడం (తల ఊపడం) కనుబొమ్మలు ముడివేయడం మొదలైనవాటిచేత అభినయించాలి.

**వి.** సందేహం అనగా "ఇది మంచిదా చెడ్డదా?" ఈ విధమైన ఆలోచన. ఒక విషయంలోని మంచిచెడ్డలను గూర్చి ఆలోచించడం విమర్శ. ఒక విషయంలో విరోధం ప్రకటించడం **విప్రతిపత్తి.**

**మూ. ఏవమేతే త్రయస్త్రింశద్వ్యభిచారిణో భావాః దేశ – కాల – అవస్థానురూప్యేణ ఆత్మగత – పరగత – మధ్యస్థాః ఉత్తమ – మధ్యమ – అధమైః స్త్రీపుంసైః స్వప్రయోగ వశాదుపపాద్యాః ఇతి.**

**తా.** ఈ విధమైన ముప్పైమూడు వ్యభిచారిభావాలను, ఉత్తమ – మధ్యమ – అధములైన స్త్రీ పురుషులు (నాట్యంలో) దేశానికీ, కాలానికీ, అవస్థకీ అనుగుణంగా, తమకు సంబంధించినట్లు గాని, పరులకు సంబంధించినట్లు గాని మధ్యస్థులలో ఉన్నట్లు గాని వాటి ప్రయోగానికి కలిగే అవసరాన్ని బట్టి ప్రయోగించాలి.

**మూ. త్రయస్త్రింశదిమే భావా విజ్ఞేయా వ్యభిచారిణః,**
**సాత్త్వికాంస్తు పునర్భావాన్ ప్రవక్ష్యామ్యనుపూర్వశః. 93**

**తా.** ఈ ముప్పైమూడు వ్యభిచారిభావాల స్వరూపం బాగా తెలిసికోవాలి. ఇపుడు, క్రమానుసారం సాత్త్వికభావాలు చెపుతాను.

**మూ. అత్రాహ – కిమన్యే భావాః సత్త్వేన వినా అభినీయన్తే, యస్మాదుచ్యన్తే ఏతే సాత్త్వికా ఇతి? అత్రోచ్యతే – ఇహ హి సత్త్వం నామ మనఃప్రభవమ్. తచ్చ సమాహితమనస్త్వా దుచ్యతే. మనసః సమాధౌ సత్త్వనిష్పత్తిర్భవతి. తస్య చ యోఽసౌ స్వభావః రోమాఞ్చాశ్రు వైవర్ణ్యాదిలక్షణః యథాభావోపగతః. స చ న శక్యోఽన్యమనసా కర్తుమితి. లోకస్వభావాను కరణత్వాచ్చ నాట్యస్య సత్త్వమ్ ఈప్సితమ్.**

**తా.** ఇక్కడ ప్రశ్నిస్తున్నాడు – వీటినే సాత్త్వికభావాలు అంటున్నావు; ఇతర భావాలను సత్త్వం (మానసప్రయత్నం) లేకుండా అభినయిస్తారా? సమాధానం చెపుతున్నాం; విను. ఈ సందర్భంలో సత్త్వం అనేది మనస్సునుండి పుట్టేది. మనస్సు ఏకాగ్రంగా ఉంటేనే సత్త్వం అనేది ఉంటుంది (పుడుతుంది). మనస్సు సమాహిత మైనప్పుడు, ఏకాగ్రమైనప్పుడు, సత్త్వనిష్పత్తి జరుగుతుంది. సత్త్వస్వభావ మైన, ఆ యా భావాలను పట్టి ప్రయోగించదగిన, రోమాంచము, కన్నీరు, ముఖం రంగు మారిపోవడం మొదలైనదానిని, ఏదో మరొక ఆలోచనలలో ఉన్నవాడు ప్రదర్శించజాలడు. నాట్యం అనేది లోకస్వభావాన్నే అనుకరిస్తుంది గాన అందుకు (లోకస్వభావానుకరణానికి) సత్త్వం చాల అవసరం.

**మూ. కో దృష్టాన్తః? ఇహ హి నాట్యధర్మిప్రవృత్తాః సుఖదుఃఖకృతాః భావాః తథా సత్త్వ విశుద్ధాః కార్యాః యథా సరూపాః భవన్తి. తత్ర దుఃఖం నామ రోదనాత్మకం తత్కథమ దుఃఖితేన, సుఖం చ హర్షాత్మకమ్ అసుఖితేన వా అభినేయమ్? ఏతదేవాస్య సత్త్వం యత్ దుఃఖితేన సుఖితేన వా అశ్రురోమాఞ్చౌ దర్శయితవ్యౌ ఇతి కృత్వా సాత్త్వికా భావా ఇత్యభివ్యాఖ్యాతాః.**

**తా.** ఈ విషయంలో దృష్టాంతం ఏమున్నది? (సమాధానం) నాటకాదులలో నాట్యధర్మిగా ప్రవర్తించే, సుఖదుఃఖాలతో కలిగే భావాలు, లోకధర్మితో సమంగా ఉండే టట్లు సత్త్వంచేత విశుద్ధములుగా, పూర్తిగా సత్త్వకృతములుగా, చెయ్యాలి. (ప్రశ్న) వీటిలో దుఃఖం అనేది ఏడ్పు అనే లక్షణం గలది. అలాంటప్పుడు దుఃఖం లేనివాడు ఆ రోదనాత్మక దుఃఖాన్నీ, సుఖం లేనివాడు హర్షాత్మకమైన సుఖాన్నీ ఎలా అభినయించగలడు? (సమాధానం) నటుని సత్త్వం ఇదే – ఏమనగా అతడు దుఃఖితు డైనా సుఖితు డైనా కూడ దుఃఖచిహ్న మైన కన్నీళ్లు, దుఃఖానుభావమైన రోమాంచము చూపగలగాలి. అందుచేతనే వీటికి సాత్త్వికభావాలు అని పేరు.

**మూ. త ఇమే –**

**స్తమ్భః స్వేదోఽథ రోమాఞ్చః స్వరభేదోఽథ వేపథుః,**
**వైవర్ణ్యమశ్రు ప్రలయ ఇత్యష్టౌ సాత్త్వికా మతాః. 94**

**తా.** అవి ఇవి –

స్తంభము, స్వేదము, రోమాంచము, స్వరభేదము, వణుకు, రంగు మారిపోవడం, ప్రలయము, ఈ ఎనిమిది సాత్త్వికభావా లని చెప్పబడుచున్నాయి.

**మూ. అత్రార్యాః. తత్ర –**

**క్రోధభయహర్షలజ్జాదుఃఖశ్రమరోగతాపఘాతేభ్యః,**

**వ్యాయామక్లమఘర్మైః స్వేదః సంపీడనాచ్చైవ.** **95**

**తా. (1) స్వేదము :–** క్రోధము, భయము, హర్షము, లజ్జ, దుఃఖము, శ్రమ, రోగము, తాపము, దెబ్బ తగలడము, వ్యాయామము, వాడిపోవడము, గ్రీష్మము, గట్టిగా నొక్కడం (జనసమూహాదులలో) – వీటిచేత స్వేదం పుడుతుంది.

**మూ. హర్షభయశోకవిస్మయవిషాదరోషాదిసంభవః స్తమ్భః,**
**శీతభయహర్షరోషస్పర్శజరారోగజః కమ్పః.** **96**

**తా. (2,3) స్తంభము, కంపము :–** హర్షము, భయము, శోకము, ఆశ్చర్యము, విషాదము, రోషము మొదలైనవాటివల్ల **స్తంభం** పుడుతుంది. చలి, భయము, హర్షము, రోగము, కొన్ని వస్తువుల స్పర్శ, వార్ధకము, రోగము – అను విభావాలవల్ల **కంపం** కలుగుతుంది.

**మూ. ఆనన్దామర్షాభ్యాం ధూమాఞ్జనజృమ్భణాద్ భయాచ్ఛోకాత్,**
**అనిమేషప్రేక్షణతః శీతాద్రోగాద్భవేదశ్రు.** **97**

**తా. (4) అశ్రువులు :–** ఆనందం, అమర్షం, పొగ, కాటుక, ఆవులింత, భయం, శోకం, రెప్పపాటు వేయకుండా చూడడం, చలి, రోగం – వీటివల్ల కన్నీరు పుడుతుంది.

**మూ. శీతక్రోధభయశ్రమరోగానుతాపజం చ వైవర్ణ్యమ్,**
**స్పర్శభయశీతహర్షాత్ క్రోధాద్రోగాచ్చ రోమాఞ్చః.** **98**

**తా. (5,6) వైవర్ణ్యం, రోమాంచం :–** చలి, క్రోధము, భయము, శ్రమ, రోగము, అలసిపోవడం, తాపం – వీటివల్ల **వైవర్ణ్యం** (శరీరం రంగు మారిపోవడం) కలుగుతుంది. స్పర్శ, భయం, శీతం, సంతోషం, క్రోధం, రాగం – వీటివల్ల **రోమాంచం** కలుగుతుంది.

**మూ. స్వరభేదో భయహర్షక్రోధజరారౌక్ష్యరోగమదజనితః,**
**శ్రమమూర్ఛామదనిద్రాభిఘాతమోహాదిభిః ప్రలయః.** **99**

**తా. (7,8) స్వరభేదము, ప్రలయము :–** భయం, హర్షం, క్రోధం, వార్ధకం, గట్టిగా అరవడంచేత కంఠం బొంగురుపోవడం, రోగం, మదం – వీటివల్ల కంఠ**స్వరభేదం** కలుగుతుంది. శ్రమ, మూర్ఛ, మదం, నిద్ర, దెబ్బతగలడం, మోహం మొదలైనవాటివల్ల **ప్రలయం** (స్పృహ తప్పడం) కలుగుతుంది.

**మూ. ఏవమేతే బుధైర్జ్ఞేయాః భావా హ్యష్టౌ తు సాత్త్వికాః,**
**కర్మ చైషాం ప్రవక్ష్యామి రసభావానుభావకమ్.** **100**

**తా.** ఈ విధంగా ఉన్న ఎనిమిది సాత్త్వికభావాలను గూర్చి బుధులు తెలిసికోవాలి. ఇప్పుడు, రసాలను, భావాలను అనుభవింపచేసే ఈ సాత్త్వికభావాల పనులను (వీటి

అనుభావాలను గూర్చి చెపుతాను).

**మూ. నిఃసంజ్ఞో నిష్ప్రకమ్పశ్చ స్థితః శూన్యజడాకృతిః,**
**స్కన్నగాత్రతయా చైవ స్తమ్భం త్వభినయేద్ బుధః. 101**

**తా. స్తంభం అనుభావాలు :–** స్పృహతప్పి, చేష్టలుడిగి, చైతన్యశూన్య మైన జడపదార్థం వలె శరీరాన్ని కట్టెవలె నిలిపి నాట్యప్రవీణుడు స్తంభాన్ని అభినయించాలి.

**మూ. వ్యజనగ్రహణాచ్చాపి స్వేదాపనయనేన చ,**
**స్వేదస్యాభినయో యోజ్యస్తథా వాతాభిలాషతః. 102**

**తా. స్వేదానుభావాలు :–** విసనకఱ్ఱ పట్టుకొనడం, చెమట తుడుచుకొంటూండడం, గాలి ఉంటే బాగుండును అనుకొంటూండడం – వీటిచేత స్వేదాభినయం చెయ్యాలి.

**మూ. ముహుః కణ్టకితత్వేన తథోల్లుకసనేన చ,**
**పులకేన చ రోమాఞ్చం గాత్రస్పర్శేన దర్శయేత్. 103**

**తా. రోమంచానుభావాలు :–** మాటిమాటికి రోమాలు నిలబడినట్లు చూపడం, ఉలిక్కిపడడం, (ఉల్లుకసనమ్), శరీరాన్ని తుడుచుకొంటూండడం, గగుర్పాటు – వీటిచేత రోమాంచం, ప్రదర్శించాలి.

**మూ. స్వరభేదోఽభినేతవ్యో భిన్నగద్గదనిఃస్వనైః,**
**వేపనాత్ స్ఫురణాత్ కమ్పాద్వేపథుం సంప్రదర్శయేత్. 104**

**తా. స్వరభేద – వేపథుల అనుభావాలు :–** వేరు వేరు విధాలైన గద్గదధ్వనులతో స్వరభేదం అభినయించాలి. వణకిపోవడం, కదలిపోవడం, అవయవాలు కొట్టుకొనడం – వీటిచేత వేపథును చూపించాలి.

**మూ. ముఖవర్ణపరావృత్త్యా నాడీపీడనయోగతః,**
**వైవర్ణ్యమభినేతవ్యం ప్రయత్నాత్తద్ధి దుష్కరమ్. 105**

**తా. వైవర్ణ్యానికి అనుభావాలు :–** నాడులను బిగపెట్టడం ద్వారా ముఖవర్ణాన్ని మారిపోయేటట్లు, ప్రయత్నపూర్వకంగా వైవర్ణ్యాన్ని అభినయించాలి. ఇది చాల కష్టమైన పని.

**మూ. బాష్పామ్బుప్లుతనేత్రత్వాన్నేత్రసంమార్జనేన చ,**
**ముహురశ్రుకణాపాతైరస్రం త్వభినయేద్ బుధః. 106**

**తా. అశ్రువుల అనుభావాలు :–** కళ్లు కన్నీటితో నిండే టట్లు చేయడం, కళ్లు తుడుచుకొంటూండడం, కన్నీటి చుక్కలు మాటి మాటికీ రాల్చడం – వీటిచేత అశ్రువును

అభినయించాలి.

**మూ. నిశ్చేష్టో నిష్ప్రకమ్పత్వాదవ్యక్తశ్వసితాదపి,**
**మహీనిపాతనాచ్చాపి ప్రలయాభినయో భవేత్. 107**

**తా. ప్రలయానుభావాలు :–** కదలక నిశ్చేష్టుడై, శ్వాస పీల్చుకొన్నట్లు కూడ పైకి తెలియకుండా ఉండాలి. నేలమీద పడిపోవాలి. ఈ విధంగా ప్రళయాన్ని అభినయించాలి.

**మూ. ఏకోనపఞ్చాశదిమే యథావ**
**ద్భావాః త్ర్యవస్థా గదితా మయేహ,**
**భూయశ్చ యే యత్ర రసే నియోజ్యాః**
**తాన్ శ్రోతుమర్హన్తి చ విప్రముఖ్యాః. 108**

**తా.** నేనింతవరకు మూడు అవస్థలు గల నలభైతొమ్మిది (49) భావాలను గూర్చి చెప్పాను. ద్విజోత్తములారా! ఏ రసంలో ఏ భావాలు వినియోగించాలో చెపుతాను, వినండి.

**మూ. (అత్ర శ్లోకాః :–**
**శఙ్కావ్యాధిస్తథా గ్లానిః చిన్తాసూయా భయం తథా,**
**విస్మయశ్చ వితర్కశ్చ స్తమ్భశ్చపలతా తథా. 1**
**రోమాఞ్చహర్షౌ నిద్రా చ తథోన్మాదమదావపి,**
**స్వేదశ్చైవావహిత్థం చ ప్రలయో వేపథుస్తథా. 2**
**విషాదశ్రమనిర్వేదాః గర్వావేగౌ ధృతిః స్మృతిః,**
**మతిర్మోహో విబోధశ్చ సుప్తమౌత్సుక్యవర్జితే. 3**
**క్రోధామర్షౌ చ హాసశ్చ శోకోఽపస్మార ఏవ చ,**
**దైన్యం చ మరణం చైవ రతిరుత్సాహసంయుతా. 4**
**త్రాసవైవర్ణ్యరుదితైః స్వరభేదః శమోఽపి చ,**
**జడతా చ తథా షట్చత్వారింశత్పరికీర్తితాః. 5)**

**తా.** (ఈ సందర్భంలో కొన్ని శ్లోకాలు ఉన్నాయి. (ఇవి కొన్ని ప్రతులలో లేవు)–

శంక, వ్యాధి, గ్లాని, చింత, అసూయ, భయం, విస్మయం, వితర్కం, స్తంభం, చపలత, రోమాంచం, హర్షం, నిద్ర, ఉన్మాదం, మదం, స్వేదం, అవహిత్థ, ప్రలయం, వేపథు, విషాదం, శ్రమం, నిర్వేదం, గర్వం, ఆవేగం, ధృతి, స్మృతి, మతి, మోహం, విబోధం, సుప్తం, ఔత్సుక్యం, వర్జితం (?) క్రోధం, అమర్షం, హాసం, శోకం, అపస్మారం, దైన్యం, మరణం, రతి, ఉత్సాహం, త్రాసం, వైవర్ణ్యం, రుదితం, స్వరభేదం, శమం, జడత – ఈ విధంగా నలభైఆరు (46) భావాలు చెప్పబడినది.

**మూ. ఆలస్యౌగ్ర్యజుగుప్సాఖ్యైరేవం భావైస్తు వర్జితాః,**
**ఉద్భావయన్తి శృఙ్గారం సర్వే భావాః స్వసంజ్ఞయా. 109**

**తా.** ఆలస్యము, ఉగ్రత్వము, జుగుప్సా అను మూడుభావాలు తప్ప మిగిలిన, పైన చెప్పిన భావా లన్నీ, తమ పేర్లకు అనుగుణంగా, శృంగారరసాన్ని ఆవిష్కరిస్తాయి; పోషిస్తాయి.

**మూ. (యథావసరమేతే హి స్థాయిసఞ్చారిసత్త్వజాః,**
**ఉద్దీపయన్తి శృంగారం రసమాసాద్య సంజ్ఞితమ్).**

**తా.** (ఈ స్థాయి – సంచారి – సాత్త్వికభావాలు తమకు అనుకూల మైన రసాన్ని ఆవిష్కరిస్తూ శృంగార రసాన్ని ఉద్దీపింపచేస్తాయి).

**మూ. గ్లానిః శఙ్కా హ్యసూయా చ శ్రమశ్చపలతా తథా,**
**సుప్తం నిద్రావహిత్థం చ హాస్యే భావాః ప్రకీర్తితాః. 110**

**తా.** హాస్యరసంలో – గ్లాని, శంక, అసూయ, శ్రమ, చపలత, సుప్తం, నిద్ర, అవహిత్థ అను భావా లుంటాయి; అనగా విభావాలుగాను, అనుభావాలుగాను హాస్యరస పుష్టికి ఉపకరిస్తాయి.

**మూ. నిర్వేదశ్చైవ చిన్తా చ దైన్యం గ్లాన్యాస్రమేవ చ,**
**జడతా మరణం చైవ వ్యాధిశ్చ కరుణే స్మృతాః. 111**

**తా.** కరుణరసంలో, నిర్వేదం, చింత, దైన్యం, గ్లాని, అశ్రువులు, జడత, మరణం, వ్యాధి అను భావా లుంటాయి.

**మూ. అసంమోహస్తథోత్సాహ ఆవేగో హర్ష ఏవ చ,**
**మతిశ్చైవ తథోగ్రత్వమమర్షో మద ఏవ చ. 113**
**రోమాఞ్చః స్వరభేదశ్చ క్రోధోఽసూయా ధృతిస్తథా,**
**గర్వశ్చైవ వితర్కశ్చ వీరే భావా భవన్తి హి. 114**

**తా.** అసంమోహము, ఉత్సాహము, ఆవేగము, హర్షము, మతి, ఉగ్రత్వము, అమర్షము, మదము, రోమాంచము, స్వరభేదము, క్రోధము, అసూయ, ధృతి, గర్వము, వితర్కకము, అను భావాలు వీరరసంలో ఉంటాయి.

**మూ. వేపథుః స్వరభేదశ్చ రోమాఞ్చో గద్గదస్తథా,**
**త్రాసశ్చ మరణం చైవ వైవర్ణ్యం చ భయానకే. 115**

**తా.** భయానకరసంలో – వేపథు, స్వరభేదము, రోమాంచము, గద్గదము, త్రాసము,

మరణము, వైవర్ణ్యము అను భావాలు ఉంటాయి.

**మూ. అపస్మారస్తథోన్మాదో విషాదో మద ఏవ చ,**
**మృత్యుర్వ్యాధిర్భయం చైవ భావా బీభత్ససంశ్రయాః. 116**

**తా.** అపస్మారము ఉన్మాదము, విషాదము, మదము, మృత్యువు, వ్యాధి, భయం అను భావాలు బీభత్సరసంతో సంబంధించి ఉంటాయి.

**మూ. స్తమ్భః స్వేదశ్చ మోహశ్చ రోమాఞ్చో విస్మయస్తథా,**
**ఆవేగో జడతా హర్షో మూర్ఛా చైవాద్భుతాశ్రయః. 117**

**తా.** స్తంభము, స్వేదము, మోహము, రోమాంచము, విస్మయము, ఆవేగము, జడత్వము, హర్షము, మూర్ఛ అను భావాలు అద్భుతరసాన్ని ఆశ్రయించి ఉంటాయి.

**మూ. యే త్వేతే సాత్త్వికా భావాః నానాభినయసంశ్రితాః,**
**రసేష్వేతేషు సర్వేషు తే జ్ఞేయా నాట్యయోక్తృభిః. 118**

**తా.** అనేకవిధా లైన అభినయాలతో సంబంధం ఉన్నవిగా వెనుక చెప్పిన సాత్త్విక భావాలను, నాట్యప్రయోక్తలు అన్ని రసాలలోను ప్రయోగించాలి.

**మూ. న హ్యేకరసజం కావ్యం కించిదస్తి ప్రయోగతః,**
**భావో వాపి రసో వాపి ప్రవృత్తిర్వృత్తిరేవ వా. 119**

**తా.** ప్రయోగానుసారం – ఒకే రసంతో సంబంధించిన కావ్యం గాని, భావం గాని, రసం గాని, ప్రవృత్తి గాని, వృత్తి గాని ఉండదు.

***(ఈ ఎనిమిది శ్లోకాలు కొన్ని ప్రతులలో లేవు)***

**మూ. బహూనాం సమవేతానాం రూపం యస్య భవేద్బహు,**
**స మన్తవ్యో రసః స్థాయీ శేషాః సంచారిణో మతాః. 1**

**తా.** అనేక మైన స్థాయిభావాలు ఒక చోట కలిపినప్పుడు ఏ స్థాయిభావం అధికంగా వ్యాపించి ఉంటుందో దానిని స్థాయిభావం అని గ్రహించాలి. మిగిలిన స్థాయిభావా లన్నీ దానికి సంచారిభావాలు. 1

**మూ. దీపయన్తి ప్రవర్తన్తే యే పునః స్థాయినం రసమ్,**
**తే తు సంచారిణో జ్ఞేయాస్తే హి స్థాయిత్వమాగతాః. 2**

**తా.** స్థాయి యైన (స్థిరమైన) ప్రధానరసాన్ని ఉద్దీపింపచేస్తూ ఏ ఇతరరసా లుంటాయో వాటిని సంచారి భావాలే అని గ్రహించాలి. ఎందువల్ల ననగా అవి స్థాయిత్వాన్ని పొందినవి.

**వి.** ఒక కావ్యంలో (దృశ్య మైనా శ్రవ్య మైనా) అనేకస్థాయిభావాలు రసస్థితికి చేరడంచేత, అనేకరసా లుండవచ్చును. కాని కావ్యంలోని విస్తృప్రదేశంలో ఉన్నది ప్రధానం గాన అది ప్రధానరసం. మిగిలిన రసా లన్నీ ఆ ప్రధానరసానికి సంచారి భావాలూ; ప్రధానరసపోషకాలే. అందుచేత అవి స్థాయిభావస్థితిలోనే ఉన్నట్లు భావించాలి. 2

**మూ. విభావానుభావయుతో హ్యఙ్గవస్తుసమాశ్రయః,**
**సంచారిభిస్తు సంయుక్తః స్థాయ్యేవ తు రసో భవేత్. 3**

**తా.** విభావానుభావాలతో కూడినది, అంగములతోను, కథావస్తువుతోను సంబంధించినది, సంచారిభావాలతో కూడినది అయిన స్థాయిభావమే రసం అవుతుంది. 3

**మూ. స్థాయీ సత్త్వాతిరేకేణ ప్రయోక్తవ్యః ప్రయోక్తృభిః,**
**సంచార్యాకారమాత్రేణ స్థాయీ యస్మాదవస్థితః. 4**

**తా.** ప్రయోక్తలు స్థాయిరసాన్ని, అనగా రసం కాబోయే స్థాయిభావాన్ని అధిక మైన సత్త్వంతో ప్రయోగించాలి. సంచారిభావాలను మాత్రం కేవలం వాటి ఆకారం చూపి వదిలివేయాలి. ఎందువల్ల ననగా ప్రారంభంనుంచి చివరివరకు ఉండేది స్థాయియే. 4

**మూ. యే త్వేతే సాత్త్వికా భావా నానాభినయయోజితాః,**
**రసేష్వేతేషు సర్వేషు తే జ్ఞేయా నాట్యకోవిదైః. 5**

**తా.** అనేకవిధా లైన అభినయాలతో సంబంధం ఉన్నవిగా వెనుక చెప్పిన సాత్త్విక భావాలను, నాట్యప్రయోక్తలు అన్ని రసాలలోను ప్రయోగించాలి. 5

**మూ. న హ్యేకరసజం కావ్యం నైకభావైకవృత్తికమ్,**
**విమర్దే రాగమాయాతి ప్రయుక్తం హి ప్రయత్నతః.**
**భావా వాపి రసా వాపి ప్రవృత్తిర్వృత్తిరేవ వా. 6**

**తా.** ఒకే రసం కాని, ఒకే భావం కాని ఒకే వృత్తి కాని కావ్యం కాజాలదు. అనేకభావాలు, అనేక రసాలు, అనేక ప్రవృత్తులు, అనేకవృత్తులు ప్రయత్నపూర్వకంగా ప్రయుక్తములై వాటి విమర్దం (పరస్పరము రాసుకొనడం) ఉంటేనే కావ్యం రంజకంగా ఉంటుంది. 6

**మూ. బీభత్సాద్భుతశాన్తానాం త్రైవిధ్యం నాత్ర కథ్యతే,**
**షణ్ణాం రసానాం త్రైవిధ్యం నానాభావరసాన్వితమ్. 7**

**తా.** భీభత్స – అద్భుత – శాంతాలలో మూడేసి భేదా లున్నట్లు చెప్పలేదు. నానారస – భావాలను పట్టి మిగిలిన ఆరు రసాలకే త్రివిధత్వం చెప్పబడింది. 7

**మూ. సత్త్వప్రయోజితో హ్యర్థః ప్రయోగోఽత్ర విరాజతే,**
**విదిత్వా హి విరాజన్తే లోకే చిత్రం హి దుర్లభమ్. 8**

**తా.** సత్త్వప్రధాన మైన రసం ప్రయోగించి నపుడే ఆ ప్రయోగం రక్తి కడుతుంది. రసం అనుభూతి విషయ మైనపుడు లోకంలో నాట్యప్రయోగాలు ప్రకాశిస్తాయి. అనేకరస – భావాదుల మేలనంచేత చిత్రమైన నాట్యప్రయోగం చాల దుర్లభమైనది. 8

**మూ. నానాభావార్థసంపన్నాః స్థాయిసత్త్వాభిచారిణః,**
**పుష్పావకీర్ణాః కర్తవ్యాః కావ్యేషు హి రసా బుధైః. 120**

**తా.** పండితులు కావ్యాలలోని రసాలను స్థాయి – సాత్త్వికభావ – సంచారి భావములతో కలుపుతూ, పుష్పాలు చల్లినట్లు, అనేకవిధా లైన భావాలతోను, అర్థాలతోను వ్యాప్తములయే టట్లు చెయ్యాలి.

**మూ. ఏవం రసాశ్చ భావాశ్చ త్ర్యవస్థా నాటకే స్మృతాః,**
**య ఏవమేతజ్జానాతి స గచ్ఛేత్సిద్ధిముత్తమామ్. 121**

**ఇతి శ్రీ భరతీయే నాట్యశాస్త్రే భావవ్యఞ్జకో నామ సప్తమోఽధ్యాయః.**

**తా.** నాటకంలో, ఈ విధంగా రసాలు, మూడు రకాలైన భావాలు (విభావ – అనుభావ – సాత్త్వికభావాలు) ప్రయోగించాలి. ఈ విషయం తెలిసినవాడు ఉత్తమమైన కార్యసిద్ధిని పొందుతాడు.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో భావవ్యంజక మను ఏడవ అధ్యాయం సమాప్తం.**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ అష్టమోఽధ్యాయః

# ఉపాఙ్గవిధానము

**మూ. ఋషయ ఊచుః-**

**"భావానాం చ రసానాం చ సముత్థానం యథాక్రమమ్,**
**త్వత్ప్రసాదాచ్ఛ్రుతం సర్వమిచ్ఛామో వేదితుం పునః. 1**

**తా.** ఋషులు ఇలా అడిగారు –

"మహామునీ! నీ అనుగ్రహంవల్ల భావాలు, రసాలు ఏ విధంగా నిష్పన్నం అవుతాయో ఆ విషయం అంతా విన్నాం. ఇప్పుడు మళ్లీ కొన్ని విషయాలు వినా లని కోరుతున్నాం.

**మూ. నాట్యే కతివిధః కార్యః తద్‌జ్ఞైరభినయక్రమః,**
**కథం వాభినయో హ్యేష కతిభేదశ్చ కీర్తితః. 2**

**తా.** నాట్యజ్ఞులు నాట్యంలో ఎన్ని విధా లైన అభినయాల క్రమం చెయ్యాలి? ఎలా చెయ్యాలి? దానిలో ఎన్ని భేదా లున్నాయి?

**మూ. సర్వమేతద్యథాతత్త్వం కథయస్వ మహామునే,**
**యో యథాభినయో యస్మిన్ యోక్తవ్యః సిద్ధిమిచ్ఛతా. 3**

**తా.** మహామునీ! తలబెట్టిన నాట్యప్రదర్శన సిద్ధించా లని కోరుకొనేవాడు, ఏ సమయంలో ఏ అభినయం ప్రయోగించాలో ఆ విషయ మంతా సవిస్తరంగా మాకు చెప్పుము.

**మూ. తేషాం తద్వచనం శ్రుత్వా మునీనాం భరతో మునిః,**
**ప్రత్యువాచ పునర్వాక్యం చతురోఽభినయాన్ ప్రతి. 4**

**తా.** ఆ మునుల మాటలు విని, భరతముని నాలుగు విధా లైన అభినయాలను గూర్చి చెపుతూ వాళ్లతో ఇలా అన్నాడు.

**మూ. అహం వః కథయిష్యామి నిఖిలేన తపోధనాః,**
**యస్మాదభినయో హ్యేష విధివత్సముదాహృతః. 5**

**తా.** తపోధనులారా! నేను మీకు అన్ని విషయాలు చెపుతాను. ఎందువల్ల ననగా – ఈ అభినయాన్ని గూర్చి యథాశాస్త్రంగా బ్రహ్మదేవుడు నాకు చెప్పి ఉన్నాడు.

**మూ. యదుక్తం చత్వారోఽభినయా ఇతి తాన్ వర్ణయిష్యామః. అత్రాహ – అభినయ**

**ఇతి కస్మాత్? అత్రోచ్యతే – అభీత్యుపసర్గః 'ణీఞ్' ఇతి ప్రాపణార్థో ధాతుః. అస్య 'అభిని' ఇత్యేవం వ్యవస్థితస్య "ఏరచ్" ఇతి "అచ్" ప్రత్యయాన్తస్య 'అభినయః' ఇత్యేవం రూపం సిద్ధమ్. ఏతచ్చ ధాత్వర్థవచనేన అవధార్యమ్.**

**తా.** అభినయాలు నాలుగు విధాలు అని చెప్పబడింది కదా; ఆ అభినయాలను ఇప్పుడు విశదీకరిస్తాం. ఇక్కడ ప్రశ్నిస్తున్నాడు – 'అభినయః' అని ఎందు కంటారు? సమాధానం చెపుతున్నాం – 'అభి' అనేది ఉపసర్గ (ధాతువునకు ముందు చేర్చే ఒక శబ్దస్వరూపం). 'ణీఞ్' అనేది 'పొందించుట', 'దగ్గరకు చేర్చుట', 'దగ్గరకు తీసికొనివెళ్లుట' అను అర్థం గల ధాతువు. ఈ ధాతువునకు ముందు 'అభి' అను ఉపసర్గ చేర్చగా 'అభిని' అని ఏర్పడింది. దీనికి **'ఏరచ్'** అను పాణినిసూత్రం ప్రకారం 'అచ్' అను ప్రత్యయం చేర్చగా 'అభినయ' అను శబ్దం సిద్ధించింది. ఈ విధంగా ధాతువు అర్థాన్ని చెప్పడం ద్వారా ఈ పదాని కున్న అర్థం నిర్ణయించాలి. ఈ **'అభినయ'** శబ్దానికి **"ఒక వస్తువును మరొక చోటికి తీసికొనివెళ్లుట". "ఒక దానిని మరొకరికి అందించుట"** అని అర్థం.

**మూ. అత్ర శ్లోకౌ –**

**అభిపూర్వస్తు ణీఞ్ ధాతురాభిముఖ్యార్థనిర్ణయే,**
**యస్మాత్ప్రయోగం నయతి తస్మాదభినయః స్మృతః. 6**

**విభావయతి యస్మాచ్చ నానార్థాన్ హి ప్రయోగతః,**
**శాఖాఙ్గోపాఙ్గసంయుక్తస్తస్మాదభినయః స్మృతః. 7**

**తా.** ఈ సందర్భంలో రెండు శ్లోకా లున్నాయి –

'అభి' అనేది పూర్వమునందు గల 'ణీఞ్' ధాతువు 'అభిముఖత్వము' అను అర్థాన్ని చెపుతుంది. నాట్యప్రయోగాన్ని నడిపిస్తుంది గాన, సామాజికులకు అందిస్తుందిగాన అభినయం అని చెప్పబడినది.

నాట్యప్రయోగం ద్వారా తెలపదలచిన అనేకవిధా లైన విషయాలను సామాజికులు తెలిసికొనే టట్లు, అనుభవించే టట్లు, చేస్తుంది గాన, శాఖలతోను, అంగాలతోను, ఉపాంగాలతోను కూడిన ఇది 'అభినయం' అని చెప్పబడుచున్నది.

**మూ. చతుర్విధశ్చైవ భవేన్నాట్యస్యాభినయో ద్విజాః,**
**అనేకభేదబహులం నాట్యమస్మిన్ ప్రతిష్ఠితమ్. 8**

**తా.** ద్విజులారా! నాట్యాభినయం నాలుగు విధాలు. అనేకమైన భేదాలతో అనేకరూపాలతో నిండిన నాట్యం ఈ అభినయంలో ప్రతిష్ఠితమై, ఆధారపడి ఉంది.

**మూ. ఆఙ్గికో వాచికశ్చైవ హ్యాహార్యః సాత్త్వికస్తథా,**
**జ్ఞేయస్త్వభినయో విప్రాః చతుర్ధా పరికీర్తితః. 9**

**తా.** ఆంగికము, వాచికము, ఆహార్యము, సాత్త్వికము అని అభినయం నాలుగు విధాలు.

**మూ. సాత్త్వికః పూర్వముక్తస్తు భావైశ్చ సహితో మయా,**
**అఙ్గాభినయమేవాతో గదతో మే నిబోధత. 10**

**తా.** భావాలతో సహితంగా సాత్త్వికాభినయాన్ని గూర్చి నేను వెనుక చెప్పి ఉన్నాను. అందుచేత నేనిపుడు ఆంగికాభినయాన్ని గూర్చి చెపుతాను; వినండి.

**మూ. త్రివిధస్త్వాఙ్గికో జ్ఞేయః శారీరో ముఖజస్తథా,**
**తథా చేష్టాకృతశ్చైవ శాఖాఙ్గోపాఙ్గసంయుతః. 11**

**తా.** శారీరము. (శరీరంతో చేసేది), ముఖజము (ముఖంతో చేసేది) చేష్టాకృతము (చేష్టలతో చేసేది) అని ఆంగికాభినయం మూడు విధాలు. దీనిలో శాఖలు, అంగాలు, ఉపాంగాలు ఉపయోగింపబడతాయి.

**మూ. శిరోహస్తకటీవక్షఃపార్శ్వపాదసమన్వితః,**
**అఙ్గప్రత్యఙ్గసంయుక్తః షడఙ్గో నాట్యసంగ్రహః. 12**

**తా.** నాట్యాన్ని గూర్చి సంగ్రహంగా చెప్పాలంటే – ఇది శిరస్సు, హస్తాలు, కటిప్రదేశము, వక్షఃస్థలము, పార్శ్వభాగాలు, పాదాలు – వీటితో సంబంధించి ఉంటుంది. ఈ విధంగా అంగప్రత్యంగాలతో, అంగ – ఉపాంగాలతో ఇది షడంగము – ఆరు అంగాలు గలది.

**మూ. తస్య శిరోహస్తోరఃపార్శ్వకటీపాదతః షడఙ్గాని,**
**నేత్రభ్రూనాసాధరకపోలచిబుకాన్యుపాఙ్గాని. 13**

**తా.** నాట్యానికి ఉపయోగించే **షడంగాలు** – శిరస్సు, హస్తాలు, వక్షఃస్థలం, పార్శ్వాలు, కటిప్రదేశము, పాదాలు. నేత్రాలు, కనుబొమ్మలు, ముక్కు, అధరోష్ఠము, చెక్కిళ్లు, గడ్డం (chin) – ఇవి ఆరు **ఉపాంగాలు.**

**మూ. అస్య శాఖా చ నృత్తం చ తథైవాఙ్కుర ఏవ చ,**
**వస్తూన్యభినయస్యేహ విజ్ఞేయాని ప్రయోక్తృభిః. 14**

**తా.** నాట్యప్రయోక్తలు – శాఖ, నృత్తము, అంకురము అను మూడు అభినయ వస్తువులను, అభినయ పద్ధతులను గూర్చి తెలుసుకోవాలి.

**మూ. ఆఙ్గికస్తు భవేచ్ఛాఖా హ్యఙ్కురః సూచనా భవేత్,**
**అఙ్గహారవినిష్పన్నం నృత్తం తు కరణాశ్రయమ్. 15**

**తా.** ఆంగికముద్రలు **శాఖ.** ఆంగికముద్రల తరువాత చేసే ముద్రలు **అంకురములు.** కరణాలమీద ఆధారపడి, అంగహారాలతో కూడిన అభినయం **నృత్తం.**

**మూ. ముఖజేஉభినయే విప్రా నానాభావరసాశ్రయే,**
**శిరసః ప్రథమం కర్మ గదతో మే నిబోధత. 16**

**తా.** విప్రులారా! అనేకవిధాలైన భావాలకు రసాలకు సంబంధించిన ముఖంతో చేసే అభినయంలో ముందుగా శిరస్సుయొక్క చేష్టలను చెపుతున్నాను; వినండి.

**మూ. ఆకమ్పితం కమ్పితం చ ధుతం విధుతమేవ చ,**
**పరివాహితమాధూతమవధూతం తథాఞ్చితమ్. 17**

**నిహఞ్చితం పరావృత్తముత్క్షిప్తం చాప్యధోగతమ్,**
**లోలితం చేతి విజ్ఞేయం త్రయోదశవిధం శిరః. 18**

**తా.** ఆకమ్పితం, కంపితం, ధుతం, విధుతం, పరివాహితం, ఆధూతం, అవధూతం, అంచితం, నిహంచితం, పరావృత్తం, ఉత్క్షిప్తం, అధోగతం, లోలితం అని శిరస్సు పదమూడు (13) విధాలు.

**మూ. శనైరాకమ్పనాదూర్ధ్వమధశ్చాకమ్పితం భవేత్,**
**ద్రుతం తదేవ బహుశః కమ్పితం కమ్పితం శిరః. 19**

**తా. (1,2) ఆకంపిత – కంపిత శిరస్సులు :** పైకీ క్రిందికీ మెల్లగా శిరస్సును కదపడం **ఆకంపితం.** శిరస్సును అదే విధంగా తొందర తొందరగా చాలసార్లు చేస్తే కంపితం.

**మూ. ఋజుస్థితస్య చోర్ధ్వాధః క్షేపాదాకమ్పితం భవేత్,**
**బహుశశ్చలితం యచ్చ తత్కమ్పితమిహోచ్యతే. 20**

**తా.** ఋజువుగా మామూలుగా ఉన్న శిరస్సును పైకి క్రిందికి విసిరితే అది ఆకంపితం. అదే విధంగా చాల పర్యాయాలు చేస్తే అది కంపితం అవుతుంది.

**మూ. సంజ్ఞోపలమ్భప్రశ్నేషు స్వభావాభాషణే తథా,**
**నిర్దేశావాహనే చైవ భవేదాకమ్పితం శిరః. 21**

**తా.** గుర్తు తెచ్చుకొన్నప్పుడు, దోషం ఆరోపించినప్పుడు, ప్రశ్నించినప్పుడు, మామూలుగా మాటలాడేప్పుడు, ఆదేశించినప్పుడు, ఆవాహనం చేసినప్పుడు ఆకంపిత శిరస్సు ఉపయోగించాలి.

**మూ. రోషే వితర్కే విజ్ఞానే ప్రతిజ్ఞానేஉథ తర్జనే,**
**ప్రశ్నాతిశయవాక్యేషు శిరః కమ్పితమిష్యతే. 22**

**తా.** కోపము, ఊహ, విషయం తెలపడం, ప్రతిజ్ఞ చేయడం, భయపెట్టడం. ప్రశ్న, ఏదైన ఒక అతిశయాన్ని చెప్పడం – వీటిలో కంపితశిరస్సు వినియోగించాలి.

**మూ. శిరసో రేచనం సమ్యక్ శనైస్తద్ధుతమిష్యతే,**
**ద్రుతమారేచనాదేతద్విధుతం తు భవేచ్ఛిరః. 23**

**తా. (3,4) ధుత – విధుతశిరస్సులు :** మెల్లగా, చక్కగా శిరస్సు త్రిప్పడం **ధుతం.** శీఘ్రంగా తిప్పడం **విధుతం.**

**మూ. అనీప్సితే విషాదే చ విస్మయే ప్రత్యయే తథా,**
**ప్రార్శ్వావలోకనే శూన్యే ప్రతిషేధే ధుతం శిరః. 24**

**తా.** ఏదైన ఇష్టం కాకపోవడం, దుఃఖం, ఆశ్చర్యం, నమ్మకం, ప్రక్కకు పనిలేకుండా చూడడం, నిషేధించడం వీటియందు ధుతశిరస్సు వినియోగించాలి.

**మూ. శీతగ్రస్తే భయార్తే చ త్రాసితే జ్వరితే తథా,**
**పీతమాత్రే తథా మద్యే విధుతం తు భవేచ్ఛిరః. 25**

**తా.** చలితో బాధపడడం, భయం, భయపెట్టడం, జ్వరం, మద్యపాన ప్రారంభం, ఈ సమయాలలో విధుతశిరస్సు వినియోగించాలి.

**మూ. పర్యాయతః పార్శ్వగతం శిరః స్యాత్పరివాహితమ్,**
**ఆధూతముచ్యతే తిర్యక్ సకృదుద్వాహితం తు యత్. 25**

**తా. (5,6) పరివాహిత – ఆధూతశిరస్సులు :** పర్యాయం ప్రకారం (క్రమంగా) శిరస్సును ఒక పార్శ్వంనుండి మరొక పార్శ్వం వైపు తీసికొని వెళ్లడం **పరివాహితశిరస్సు.** ఒక్క పర్యాయమే శిరస్సును అడ్డంగా ఒక ప్రక్కకు తిప్పడం **ఆధూతం.**

**మూ. సాధనే విస్మయే హర్షే స్మృతౌ చామర్షితే తథా,**
**విచారే విహృతే చైవ లీలాయాం పరివాహితమ్. 27**

**తా.** ఒక పని సాధించడం, ఆశ్చర్యం, హర్షం, స్మరించడం, కోపం, ఆలోచించడం, విహారం (sportiveness) విలాసం – వీటిలో పరివాహితం వినియోగించాలి.

**మూ. గర్వేచ్ఛాదర్శనే చైవ పార్శ్వస్థోర్ధ్వనిరీక్షణే,**
**ఆధూతం తు శిరో జ్ఞేయమాత్మసంభావనాదిషు. 28**

**తా.** గర్వం గాని ఇచ్ఛ గాని చూపడం, పార్శ్వమునందు పై వైపున ఉన్న దానిని చూడడం, తన గొప్పతనం ప్రదర్శించడం – వీటిలో ఆధూతశిరస్సు వినియోగించాలి.

**మూ. యదధఃసకృదాక్షిప్తమవధూతం తు తచ్ఛిరః,**

**సందేశావాహనాలోప(క) సంజ్ఞాదిషు తదిష్యతే. 29**

**తా. (7) అవధూతం :–** శిరస్సును క్రిందికి ఒక సారి పడవేయడం **అవధూతం.** సందేశం ఇవ్వడం, ఆవాహనం చేయడం, కనబడకుండా ఉన్నవారిని బైటకు రమ్మన్నట్లు సంజ్ఞ చేయడం మొదలైనవాటియందు దీనిని వినియోగించాలి.

**మూ. కించిత్పార్శ్వానతగ్రీవం శిరో విజ్ఞేయమఞ్చితమ్,**
**వ్యాధితే మూర్ఛితే మత్తే చిన్తాయాం హనుధారణే. 30**

**తా. (8) అంచితశిరస్సు :–** ప్రక్కకు కొంచెం కంఠం వంచిన శిరస్సు అంచిత శిరస్సు – వ్యాధి, మూర్ఛ, మత్తు, చింత, గడ్డం (చేతితో) పట్టుకొనడం – వీటిలో దీనిని ప్రయోగించాలి.

**మూ. ఉత్క్షిప్తాంసావసక్తం యత్ కుఞ్చితభ్రూలతం మనాక్,**
**నిహఞ్చితం తు విజ్ఞేయం స్త్రీణామేతత్ప్రయోజయేత్. 31**

**తా. (9) నిహంచితశిరస్సు :–** కొంచెం కనుబొమ్మలు విరిచి, బుజం కొంచెం ఎత్తి దానిమీదకు వాల్చిన శిరస్సు **నిహంచితం.** దానిని స్త్రీలు ప్రయోగించాలి.

**మూ. గర్వే మానే విలాసే చ బిబ్బోకే కిలికిఞ్చితే,**
**మోట్టాయితే కుట్టమితే స్తమ్భమానే నిహఞ్చితమ్. 32**

**తా.** గర్వం, మానం (ప్రణయకోపం) బిబ్బోకం, కిలికించితం, మోట్టాయితం, కుట్టమితం, స్తంభంతో కూడిన మానం వీటిలో నిహంచితం ప్రయోగించాలి.

**వి.** దీనిలోని గర్వాదు లన్నీ స్త్రీలు చేసే శృంగారచేష్టలు.

**మూ. పరావృత్తానుకరణాత్ పరావృత్తమిహోచ్యతే,**
**తత్స్యాన్ముఖాపహరణే పృష్ఠతః ప్రేక్షణాదిషు. 33**

**తా. (10) పరావృత్తశిరస్సు :–** వెనుకకు తిరిగినట్లు అనుకరించడంవల్ల ఇది **పరావృత్త శిరస్సు** అని చెప్పబడుచున్నది. ముఖాన్ని వెనుకకు తీసికొనడంలోను, వెనుకకు తిరిగి చూడడం మొదలైనవాటిలోను దీనిని వినియోగించాలి.

**మూ. ఉత్క్షిప్తం చాపి విజ్ఞేయమున్ముఖావస్థితం శిరః,**
**ప్రాంశుదివ్యార్థయోగేషు స్యాదుత్క్షిప్తం ప్రయోగతః. 34**

**తా. (11) ఉత్క్షిప్తశిరస్సు :–** ముఖం పైకి ఎత్తి ఉన్న శిరస్సు **ఉత్క్షిప్తశిరస్సు.** ఎత్తైన లేదా దేవతలకు సంబంధించిన విషయాలను గురించిన అభినయాలలో ఉత్క్షిప్త శిరస్సు ప్రయోగించాలి.

**మూ. అవాఙ్ముఖస్థితం చాపి బుధాః ప్రాహురధోగతమ్,**
**లజ్జాయాం చ ప్రణామే చ దుఃఖే చాధోగతం శిరః. 35**

**తా. (12) అధోగతశిరస్సు :–** ముఖం క్రిందికి ఉంచి ఉన్న శిరస్సు **అధోగతశిరస్సు.** సిగ్గు, ప్రణామం, దుఃఖము – వీటియందు అధోగతశిరస్సు ప్రయోగింపబడుతుంది.

**మూ. సర్వతో భ్రమణాచ్చైవ శిరో లోలితముచ్యతే,**
**మూర్ఛావ్యాధిమదావేగగ్రహనిద్రాదిషు స్మృతమ్. 36**

**తా. (13) లోలితశిరస్సు :–** శిరస్సును అన్ని వైపులకు తిప్పుతూండడం **లోలితశిరస్సు.** మూర్ఛ, వ్యాధి, మదావేశము, గ్రహావేశము, నిద్ర మొదలైనవాటియందు ఇది ప్రయోగింపబడును.

**మూ. ఋజుస్వభావసంస్థానం ప్రాకృతం తు స్వభావజమ్,**
**మఙ్గల్యాధ్యయనధ్యానస్వభావజయకర్మసు. 37**

**తా.** ఋజువుగా, స్వభావసిద్ధంగా ఉన్న శిరస్సు **ప్రాకృతశిరస్సు.** కదలిక లేవీ లేక ఉన్న దున్న ట్లుగా ఉంటుంది. మంగళకర మైన పనులు, అధ్యయనము, ధ్యానము, మనోభావాలను అదుపులో ఉంచుకొనడం – వీటిలో దీనిని ప్రయోగించాలి.

**మూ. ఏభ్యోఽన్యే బహవో భేదా లోకాభినయసంశ్రయాః,**
**తే చ లోకస్వభావేన ప్రయోక్తవ్యాః ప్రయోక్తృభిః. 38**

**తా.** ఈ చెప్పిన శిరశ్చేష్టలే కాక ఇంకా ఎన్నో భేదాలు లోకంలోని పద్ధతులను అభినయించడానికి సంబంధించినవి ఉంటాయి. ప్రయోక్తలు వాటి నన్నింటిని లోక స్వభావాన్ని అనుసరించి ప్రయోగించాలి.

**మూ. త్రయోదశవిధం హ్యేతత్ శిరఃకర్మ మయోదితమ్,**
**అతః పరం ప్రవక్ష్యామి దృష్టీనామపి లక్షణమ్. 39**

**తా.** ఇంతవరకు పదమూడు విధాలైన శిరశ్చేష్టలను గూర్చి చెప్పాను. ఇటుపైన దృష్టుల లక్షణం కూడ చెపుతాను.

**మూ. కాన్తా భయానకా హాస్యా కరుణా చాద్భుతా తథా,**
**రౌద్రీ వీరా చ బీభత్సా విజ్ఞేయా రసదృష్టయః. 40**

**తా.** కాంత దృష్టి, భయానక, హాస్య, కరుణ, అద్భుత, రౌద్రీ, వీర, బీభత్స అని ఈ ఎనిమిది **రసదృష్టులు.**

**మూ. స్నిగ్ధా హృష్టా చ దీనా చ క్రుద్ధా దృప్తా భయాన్వితా,**
**జుగుప్సితా విస్మితా చ స్థాయిభావేషు దృష్టయః. 41**

**తా.** స్నిగ్ధ దృష్టి, హృష్ట, దీన, క్రుద్ధ, దృప్త, భయాన్విత, జుగుప్సిత, విస్మిత అను ఈ ఎనిమిది దృష్టులు స్థాయిభావాలకు సంబంధించినవి.

**మూ. శూన్యా చ మలినా చైవ శ్రాన్తా లజ్జాన్వితా తథా,**
**గ్లానా చ శఙ్కితా చైవ విషణ్ణా ముకులా తథా. 42**
**కుఞ్చితా చాభితప్తా చ జిహ్మా సలలితా తథా,**
**వితర్కితార్ధముకులా విభ్రాన్తా విప్లుతా తథా. 43**
**ఆకేకరా వికోశా చ త్రస్తా చ మదిరా తథా,**
**షట్త్రింశద్దృష్టయో హ్యేతాస్తాసు నాట్యం ప్రతిష్ఠితమ్. 44**

**తా. సంచారిభావాలకు సంబంధించిన ఇరవై (20) దృష్టులు :–** శూన్యదృష్టి, శ్రాంత, లజ్జాన్విత, మ్లాన, శంకిత, విషణ్ణ, ముకుల, కుంచిత, అభితప్త, జిహ్మ, లలిత, వితర్కిత, అర్ధముకుల, విభ్రాంత, విప్లుత, ఆకేకర, వికోశ, త్రస్త, మదిర. (అని ఇరవై **సంచారిభావదృష్టులు**) పైన చెప్పిన రస – స్థాయిభావదృష్టులు పదహారు కలపగా మొత్తం ముప్పైఆరు (36) దృష్టులు. వీటిమీదనే నాట్యం ప్రతిష్ఠితమై ఉంది.

**మూ. అస్య దృష్టివిధానస్య నానాభావరసాశ్రయమ్,**
**లక్షణం సంప్రవక్ష్యామి యథాకర్మప్రయోగతః. 45**

**తా.** వివిధభావాలకు, రసాలకు సంబంధించిన ఈ దృష్టుల లక్షణము, వీటి పనులు, వీటిని ప్రయోగించే విధానమూ మీకు చెపుతాను.

**మూ. హర్షప్రసాదజనితా కాన్తాత్యర్థం సమన్మథా,**
**సభ్రూక్షేపకటాక్షా చ శృఙ్గారే దృష్టిరిష్యతే. 46**

**తా. (1) కాంతదృష్టి :–** హర్షముతోను, ప్రసన్నత్వముతోను పుట్టినది, మిక్కిలి మన్మథునితో కూడినది, కనుబొమ్మల విరపులతో కటాక్షప్రసరములతో కూడినదీ అయిన దృష్టి **కాంతదృష్టి.** ఇది శృంగారరసంలో ప్రయోగించబడుతుంది.

**మూ. ప్రోద్వృత్తనిష్టబ్ధపుటా స్ఫురదుద్వృత్తతారకా,**
**దృష్టిర్భయానకాత్యర్థం భీతా జ్ఞేయా భయానకే. 47**

**తా. (2) భయానకదృష్టి :–** పైకి లేచిన కంటిరెప్పలు కదలకుండా ఉంటాయి. కంటి గుడ్లు కదిలిపోతూ తిరిగిపోతూన్న ట్లుంటాయి. చాల భయంతో నిండి ఉన్న ఆ దృష్టి **భయానకదృష్టి.** ఇది భయానకరసంలో ప్రయోగించాలి.

**మూ. క్రమాదాకుఞ్చితపుటా సవిభ్రాన్తాల్పతారకా,**
**హాస్యా దృష్టిస్తు కర్తవ్యా కుహకాభినయం ప్రతి. 48**

**తా. (3) హాస్యాదృష్టి :–** కంటి రెప్పలు క్రమంగా మూతపడతాయి. కంటి గుడ్లు చిన్నవౌతాయి. అలాంటి తిరిగిపోతూన్న **హాస్యాదృష్టిని** మాయావి చేసే అభినయం సందర్భంలో, అనగా ఏవైన విషయాలు కల్పించి చెపుతూన్నప్పుడు వింటూన్న సందర్భంలో ప్రయోగించాలి.

**మూ. పతితోర్ధ్వపుటా సాౖస్రా మన్యుమన్థరతారకా,**
**నాసాౖగ్రానుగతా దృష్టిః కరుణా కరుణే రసే. 49**

**తా. (4) కరుణాదృష్టి :–** పైరెప్ప క్రిందికి వాలుతుంది. కన్నీళ్లు కారుతూంటాయి. అలసటచేత గుడ్లు కదలకుండా ఉంటాయి. ఈ విధంగా చివరివైపు ప్రసరిస్తూన్నట్లు ఉండే దృష్టి **కరుణాదృష్టి.** ఇది కరుణరసానికి సంబంధించినది.

**మూ. యాత్యాకుఞ్చితపక్ష్మాగ్రా సాశ్చర్యోద్వృత్తతారకా,**
**సౌమ్యా వికసితాన్తా చ సాద్భుతా దృష్టిరద్భుతే. 50**

**తా. (5) అద్భుతాదృష్టి :–** అద్భుతాదృష్టిలో రెప్పల చివరిభాగాలు కొంచెం వంగి ఉంటాయి. ఆశ్చర్యంతో కనుపాపలు పైకి తిప్పబడతాయి. సౌమ్యంగా నేత్రాంతాలు వికసించి ఉంటాయి. ఇది **అద్భుతరసదృష్టి.**

**మూ. రూక్షా క్రూరారుణోద్వృత్తా నిష్టబ్ధపుటతారకా,**
**భ్రుకుటీకుటిలా దృష్టీ రౌద్రీ రౌద్రరసే స్మృతా. 51**

**తా. (6) రౌద్రీ దృష్టి :–** క్రూరంగా, స్నేహరహితమై ఎఱ్ఱగా పైవైపు తిరిగిపోతూ, రెప్పలూ గుడ్లూ కదలకుండా, కనుబొమ్మల విరుపులతో కుటిలంగా ఉన్న దృష్టి **రౌద్రీదృష్టి.** ఇది రౌద్రరసానాకి సంబంధించినది.

**మూ. దీప్తా వికసితా క్షుబ్ధా గమ్భీరా సమతారకా,**
**ఉత్ఫుల్లమధ్యా దృష్టిస్తు వీరా వీరరసాశ్రయా. 52**

**తా. (7) వీరాదృష్టి :–** వీరాదృష్టి ఉత్సాహంతో మెరిసిపోతూంటుంది. వికసించి క్షోభ చెంది సమంగా ఉన్న గుడ్లతో గంభీరంగా ఉంటుంది. మధ్యభాగంలో వికసించి ఉంటుంది. ఇది వీరరసానికి సంబంధించినది.

**మూ. నికుఞ్చితపుటాపాఙ్గాఘూర్ణోపప్లుతతారకా,**
**సంశ్లిష్టస్థిరపక్ష్మా చ బీభత్సా దృష్టిరిష్యతే. 53**

**తా. (8) బీభత్సాదృష్టి :–** నేత్రాల కొనలలోని రెప్పలు వంగి ఉంటాయి. గుడ్లు కంగారుపడుతూ తిరిగి పోతూంటాయి. రెప్పలు పూర్తిగా మూసికొనిపోయి కలిసి పోతాయి. ఈ దృష్టి **బీభత్సదృష్టి.**

**మూ. నాసాగ్రసక్తానిమిషా తథాధోభాగచారిణీ,**
**ఆకేకరపుటా చైవ శాన్తా దృష్టిర్భవేదసౌ. 54**

**తా. (9) శాంతాదృష్టి :–** దృష్టి ముక్కు పైననే రెప్పపాటు లేకుండా నిలిచి ఉంటుంది. క్రింది వైపు మాత్రమే ప్రసరిస్తుంది. రెప్పలు అర్ధనిమీలితాలై ఉంటాయి. ఇది **శాంతాదృష్టి.**

**మూ. రసజా దృష్టయో హ్యేతా విజ్ఞేయా లక్షణాన్వితాః,**
**అతఃపరం లక్షయిష్యే స్థాయిభావసమాశ్రయాః. 55**

**తా.** ఇంతవరకు రసదృష్టులు వాటి లక్షణాలతో చెప్పబడినవి. ఇప్పుడు స్థాయిభావాలకు సంబంధించిన దృష్టులు చెపుతాను.

**మూ. వ్యాకోశమధ్యా మధురా స్థితతారాభిలాషిణీ,**
**సానన్దభ్రూలతా దృష్టిః స్నిగ్ధేయం రతిభావజా. 56**

**తా. (1) స్నిగ్ధాదృష్టి :–** రతిస్థాయిభావంవల్ల ఏర్పడే ఈ దృష్టిలో నేత్రాలు పూర్తిగా తెరవకుండా మూసికొనకుండా ఉంటాయి. స్థిరమైన కనుపాపలతో అభిలాషను సూచిస్తూ మధురంగా ఉంటుంది. కనుబొమ్మలు ఆనందంతో నిండి ఉంటాయి. ఇది **స్నిగ్ధాదృష్టి.**

**మూ. చలా హసితగర్భా చ విశత్తారానిమేషిణీ,**
**కించిదాకుఞ్చితా హృష్టా దృష్టిర్హాసే ప్రకీర్తితా. 57**

**తా. (2) హృష్టాదృష్టి :–** హాసస్థాయిభావానికి చెందిన **హృష్టాదృష్టి** చంచలంగా మధ్య మధ్య నవ్వుతో కలిసి ఉంటుంది. గుడ్లు కప్పబడిపోతాయి. రెప్పపాటు ఉండదు. కొంచెం క్రిందివైపు వంగి ఉంటుంది.

**మూ. అవస్రస్తోత్తరపుటా రుద్ధతారా జలావిలా,**
**మన్దసఞ్చారిణీ దీనా సా శోకే దృష్టిరుచ్యతే. 58**

**తా. (3) దీనాదృష్టి :–** శోకస్థాయిభావానికి సంబంధించిన **'దీనాదృష్టి'**లో పైరెప్పలు క్రిందికి జారిపోతాయి. గుడ్లు కన్నీరు కప్పి అస్పష్టంగా కనబడతాయి. ఈ దృష్టి ప్రసారం మందంగా ఉంటుంది.

**మూ. రూక్షా స్థిరోద్వృత్తపుటా నిష్టబ్ధోద్వృత్తతారకా,**
**కుటిలభ్రుకుటీ దృష్టిః క్రుద్ధా క్రోధే విధీయతే. 59**

**తా. (4) క్రుద్ధాదృష్టి :–** క్రోధస్థాయిభావానికి చెందిన **క్రుద్ధాదృష్టి,** పైకి లేపగా స్థిరంగా ఉండిపోయిన రెప్పలతో, పైకి పొడుచుకొని వచ్చి నట్లున్న బిగిసిపోయిన గుడ్లతో, కుటిలమైన కనుబొమ్మల విరుపుతో తీవ్రంగా ఉంటుంది.

**మూ. సంస్థితే తారకే యస్యాః స్థిరా వికసితా తథా,**
**సత్త్వముద్గిరతీ దృప్తా దృష్టిరుత్సాహసంభవా. 60**

**తా. (5) దృప్తాదృష్టి :–** ఉత్సాహంవల్ల పుట్టిన **దృప్తాదృష్టి** వికసించి, స్థిరంగా నిలచి ఉంటూ బలం వెడలకక్కుతూన్నదా అన్నట్లుంటుంది. గుడ్లు కండలకుండా నిలిచి ఉంటాయి.

**మూ. విస్ఫారితోభయపుటా భయకమ్పితతారకా,**
**నిష్క్రాన్తమధ్యా దృష్టిస్తు భయభావే భయాన్వితా. 61**

**తా. (6) భయాన్వితాదృష్టి :–** రెండు రెప్పలూ బాగా తెరుచుకుంటాయి. భయంతో గుడ్లు తిరిగిపోతూంటాయి. కండ్ల మధ్యభాగం బైటకు వచ్చేస్తున్న ట్లుంటుంది. ఇది **భయాన్వితాదృష్టి.** భయస్థాయిభావంతో సంబంధించినది.

**మూ. సంకోచితపుటా ధ్యామా దృష్టిర్మీలితతారకా,**
**లక్ష్యోద్దేశాత్సముద్విగ్నా జుగుప్సాయాం జుగుప్సితా. 62**

**తా. (7) జుగుప్సితాదృష్టి :–** రెప్పలు మూసుకొనడంవల్ల గుడ్లు కనబడవు. బెదిరిపోతున్నట్లు ఉంటుంది. కనబడుతూన్న ఎదుట నున్న వస్తువునుండి మాటిమాటికి వెనుతిరుగు తూంటుంది. అలాంటిది జుగుప్సాస్థాయిభావానికి సంబంధించిన **జుగుప్సితాదృష్టి.**

**మూ. భృశముద్వృత్తతారాత్ర నష్టోభయపుటాఞ్చితా,**
**సమా వికసితా దృష్టిర్విస్మితా విస్మయే స్మృతా. 63**

**తా. (8) విస్మితాదృష్టి :–** గుడ్లు బాగా వికసిస్తాయి. రెండు రెప్పలూ బాగా తెరచుకొని అవి ఉన్నట్లే కనబడకుండా ఉంటాయి. ఈ విధంగా సమముగా ఉన్న వికసించిన, దృష్టి **విస్మితాదృష్టి.** ఇది విస్మయానికి సంబంధించినది.

**మూ. స్థాయిభావాశ్రయా హ్యేతా విజ్ఞేయా దృష్టయో బుధైః,**
**సంచారిణీనాం దృష్టీనాం సంప్రవక్ష్యామి లక్షణమ్. 64**

**తా.** ఈ ఎనిమిది దృష్టులూ స్థాయిభావాలకి సంబంధించినవి. ఇపుడు సంచారి భావాలకి సంబంధించిన దృష్టుల లక్షణాలు చెపుతాను.

**మూ. సమతారా సమపుటా నిష్కమ్పా శూన్యదర్శనా,**
**బాహ్యార్థాగ్రాహిణీ ధ్యామా శూన్యా దృష్టిః ప్రకీర్తితా. 65**

**తా. (1) శూన్యాదృష్టి :–** గుడ్డు, రెప్పలూ సమంగా ఉంటాయి. కదలిక ఉండదు.

బైట నున్న వస్తు వేదీ కనబడదు. కళ్లుతెరిచే ఉన్నా దేనినీ చూడకపోవడంతో బైట ఏమీ లేనట్టే అవుతుంది. అలాంటి దృష్టి **శూన్యాదృష్టి.**

**మూ. ప్రస్పన్దమానపక్ష్మాగ్రా(యా) నాత్యర్థముకులైః పుటైః,**
**మలినాన్తా చ మలినా దృష్టిర్విభ్రాన్తతారకా. 66**

**తా. (2) మలినాదృష్టి :–** రెప్పల అగ్రభాగాలు కదులుతూంటాయి. రెప్పలు కొంచెం ముణుచుకొని ఉంటాయి. కళ్ల చివరిభాగాలలో కొంచెం మాలిన్యం ఉంటుంది. గ్రుడ్లు తిరుగుతుంటాయి. అది **మలినాదృష్టి.**

**మూ. శ్రమాత్ ప్రమ్లాపితపుటా క్షామాన్తాఞ్చితలోచనా,**
**సన్నా పతితతారా చ శ్రాన్తా దృష్టిః ప్రకీర్తితా. 67**

**తా. (3) శ్రాన్తాదృష్టి :–** అలసటవల్ల రెప్పలు వాడిపోతాయి. చిక్కిన నేత్రాలు చివరి భాగాలలో మూసికొనిపోతూంటాయి. కళ్లు లోపలికి క్రుంగిపోయి గ్రుడ్లు క్రిందికి వాలిపోతాయి. అది **శ్రాంతాదృష్టి.**

**మూ. కించిదంచితపక్ష్మాగ్రా పతితోర్ధ్వపుటా హ్రియా,**
**త్రపాధోగతతారా చ దృష్టిర్లజ్జాన్వితా తు సా. 68**

**తా. (4) లజ్జాన్వితాదృష్టి :–** రెప్పల రోమాలు కొంచెం వంగగా పైరెప్ప క్రిందికి వాలి ఉంటుంది. గుడ్లు సిగ్గుచేత క్రిందివైపు దిగి ఉంటాయి. అది **లజ్జాన్వితాదృష్టి.**

**మూ. మ్లానభ్రూపుటపక్ష్మా యా శిథిలా మన్దచారిణీ,**
**క్లమప్రవిష్టతారా చ గ్లానా దృష్టిస్తు సా స్మృతా. 69**

**తా. (5) గ్లానాదృష్టి :–** కనుబొమ్మలు, రెప్పలూ, వాటి పై రోమాలూ వాడిపోయి, దుర్బలంగా ఉన్నట్లు కనబడగా, గుడ్లు లోపలికి కూరుకొనిపోగా, అతిమందంగా ప్రసరించే దృష్టి **గ్లానాదృష్టి.**

**మూ. కించిచ్చలా స్థిరా కించిదుద్గతా తిర్యగాయతా,**
**గూఢా చకితతారా చ శఙ్కితా దృష్టిరిష్యతే. 70**

**తా. (6) శంకితాదృష్టి :– శంకితాదృష్టి** కొంచెం చలంగాను, కొంచెం పైకి ప్రసరిస్తూ కొంచెం అడ్డంగా పొడవుగా ఉంటుంది. ఒకప్పుడు గుడ్లు గూఢంగాను, భయంతో కదిలిపోతూ ఉంటాయి.

**మూ. విషాదవిస్తీర్ణపుటా పర్యస్తాన్తా నిమేషిణీ,**
**కించిన్నిష్టబ్ధతారా చ కార్యా దృష్టిర్విషాదినీ. 71**

**తా. (7) విషాదినీదృష్టి :–** విషాదంచేత రెప్పలు విప్పారి ఉంటాయి. నేత్రాగ్రాలు వాలిపోతూంటాయి. మాటిమాటికి రెప్పలు వాలిపోతూంటాయి. గుడ్లు కొంచెం బిగిసిపోయి నట్లు నిలిచిపోతాయి. ఇది విషాదినీ దృష్టి.

**మూ. స్ఫురదాశ్లిష్టపక్ష్మార్ధా ముకులోర్ధ్వపుటాఞ్చితా,**
**సుఖోన్మీలితతారా చ ముకులా దృష్టిరిష్యతే. 72**

**తా. (8) ముకులాదృష్టి :–** ముకులాదృష్టిలో రెప్పలు రోమాలు కదులుతూ సగం భాగం కలిసి ఉంటాయి. పై రెప్పలు కొంచెం ముణుచుకొని ఉంటాయి. గుడ్లు సుఖంతో వికసిస్తాయి.

**మూ. ఆనికుఞ్చితపక్ష్మాగ్రా పుటైరాకుఞ్చితైస్తథా,**
**సంనికుఞ్చితతారా చ కుఞ్చితా దృష్టిరిష్యతే. 73**

**తా. (9) కుఞ్చితాదృష్టి :–** రెప్పల రోమాలు కొంచెం వంగి ఉంటాయి. రెప్పలు, గుడ్లు కూడ కొంచెం క్రింది వైపు వంగి ఉంటాయి. అది **కుంచితాదృష్టి.**

**మూ. మన్దాయమానతారా యా పుటైః ప్రచలితైస్తథా,**
**సన్తాపోపప్లుతా దృష్టిః అభితప్తా తు సవ్యథా. 74**

**తా. (10) అభితప్తాదృష్టి :–** రెప్పలు కదిలిపోతూ, మందంగా ఉన్న కంటిగుడ్లతో, సంతాపంచేత పీడితమై, వ్యథతో కూడిన దృష్టి **అభితప్తాదృష్టి.**

**మూ. లమ్బితాకుఞ్చితపుటా శనైస్తిర్యఙ్నిరీక్షణైః,**
**నిగూఢా గూఢతారా చ జిహ్మా దృష్టిరుదాహృతా. 75**

**తా. (11) జిహ్మాదృష్టి :–** మెల్లగా అడ్డంగా చూడడంచేత పొడిగింపబడి, వంగిన రెప్పలూ కనబడని కనుపాపలూ గల నిగూఢమైన దృష్టి **జిహ్మాదృష్టి.**

**మూ. మధురాకుఞ్చితాన్తా చ సభ్రూక్షేపా చ సస్మితా,**
**సమన్మథవికారా చ దృష్టిః సా లలితా స్మృతా. 76**

**తా. (12) లలితాదృష్టి :–** మధురము, చివర క్రిందికి వంగినది, కనుబొమ్మల ప్రసారము, చిరునవ్వు, మన్మథవికారాలు – వీటితో మనోహరము అయిన దృష్టి **లలితాదృష్టి.**

**మూ. వితర్కోద్వర్తితపుటా తథైవోత్ఫుల్లతారకా,**
**అధోముఖవిచారా చ దృష్టిరేషా వితర్కితా. 77**

**తా. (13) వితర్కితాదృష్టి :–** ఆలోచనలతో కంటి రెప్పలు పైకి ఎగిసి ఉంటాయి. కనుపాపలు వికసించి చూపు క్రింది వైపు ప్రసరిస్తుంది. ఈ దృష్టి **వితర్కితాదృష్టి.**

**మూ. అర్ధవ్యాకోశపక్ష్మా చ హ్లాదార్ధముకులైః పుటైః,**
**స్ఫురితార్ధముకులా దృష్టిః కించిల్లులితతారకా. 78**

**తా. (14) అర్ధముకులాదృష్టి :-** ఆనందంతో కంటిరెప్పలు సగం మూతపడి ఉంటాయి. రెప్పలమీద రోమాలు కూడ సంగం వంగి ఉంటాయి. కనుపాపలు కొంచెం నలిగి నట్లు కనబడతాయి. ఇది **అర్ధముకులాదృష్టి.**

**మూ. అనవస్థితతారా చ విభ్రాన్తాకులదర్శనా,**
**విస్తీర్ణోత్ఫుల్లనేత్రా చ విభ్రాన్తా దృష్టిరుచ్యతే. 79**

**తా. (15) విభ్రాన్తాదృష్టి :-** కంటిపాపలు చంచలములై యుండి బాగా పెద్దవి చేసిన కళ్లతో కంగారు పడుతూన్న వ్యాకులమైన చూపులు గల దృష్టి **విభ్రాంతాదృష్టి.**

**మూ. పుటీ ప్రస్ఫురితా యస్య నిష్టబ్ధౌ పతితౌ పునః,**
**విప్లుతోద్వృత్తతారా చ దృష్టిరేషా తు విప్లుతా. 80**

**తా. (16) విప్లుతాదృష్టి :-** కనురెప్పలు బాగా కదిలీ కదలి స్థిరములై మళ్లీ క్రిందికి వాలిపోగా, గుడ్లు పైవైపు తిరిగిపోతూ అలజడి చెందిన ట్లున్న దృష్టి **విప్లుతాదృష్టి.**

**మూ. ఆకుఞ్చితపుటాపాఙ్గా సఙ్గతార్ధనిమేషిణీ,**
**ముహుర్వ్యావృత్తతారా చ దృష్టిరాకేకరా స్మృతా. 81**

**తా. (17) ఆకేకరాదృష్టి :-** నేత్రాంతాల దగ్గర రెప్పలు క్రిందికి వాలగా రెప్పలు సగం సగమే మూతపడుతూండగా, మాటి మాటికి గుడ్లు ఇటూ అటూ తిరుగుతూన్న దృష్టి ఆకేకరాదృష్టి.

**మూ. వికోశితోభయపుటా ప్రోత్ఫుల్లా చానిమేషిణీ,**
**అనవస్థితతారా చ వికోశా దృష్టిరిష్యతే. 82**

**తా. (18) వికోశాదృష్టి :-** రెండు రెప్పలూ బాగా విప్పారి, బాగా వికసించి ఉన్న, రెప్పపాటు లేని, స్థిరంగా నిలకడ లేని గుడ్లు గల దృష్టి వికోశాదృష్టి.

**మూ. త్రాసోర్వృత్తపుటా యా తు తథోత్కమ్పితతారకా,**
**సంత్రాసోత్ఫుల్లమధ్యా చ త్రస్తా దృష్టిరుదాహృతా. 83**

**తా. (19) త్రస్తాదృష్టి :-** భయంచేత రెప్పలు పైకి లేవగా, గుడ్లు వణుకుతూ ఉంటాయి. భయంచేత మధ్యభాగం వికసిస్తుంది (పెద్దదవుతుంది). అలాంటి దృష్టి త్రస్తాదృష్టి.

**మూ. ఆఘూర్ణమానమధ్యా యా క్షామాన్తాఞ్చితలోచనా,**
**దృష్టిర్వికసితాపాఙ్గా మదిరా తరుణే మదే. 84**

**తా. (20) మదిరాదృష్టి :–** తరుణమదంలో (మద్యం తాగిన మత్తు ప్రారంభావస్థలో) మధ్యభాగం తిరిగి పోతూ ఉంటుంది. నేత్రాల కొసలు క్రిందికి వంగి చిక్కిపోయి నట్లు (కళ్లు చిన్నవై పోయి నట్లు) ఉంటుంది. నేత్రాంతాలు వికసిస్తాయి. అలాంటి దృష్టి **మదిరాదృష్టి.**

**మూ. కిఞ్చిదాకుఞ్చితపుటా కిఞ్చిల్లులితతారకా,**
**అనవస్థితసంచారా దృష్టిర్మధ్యమదే భవేత్. 85**

**తా.** మధ్యమదంలో (మద్యంవల్ల కలిగిన మత్తులోని మధ్యభాగంలో) రెప్పలు కొంచెం వంగుతాయి. గుడ్లు కొంచెం నలిగి వాడిపోయినట్లుంటాయి. దాని (ఆదృష్టి) ప్రసారం స్థిరంగా ఉండదు.

**మూ. సనిమేషానిమేషా చ కిఞ్చిద్దర్శితతారకా,**
**అధోభాగచరీ దృష్టిః అధమే తు మదే స్మృతా. 86**

**తా.** మద్యంమత్తు చివరి స్థితిలో కంటి రెప్పలు పడిపోతూ తెరచుకొంటూ ఉంటాయి. గుడ్లు పైకి కొంచెం కనబడతాయి. దృష్టి క్రిందికే ప్రసరిస్తూంటుంది.

**మూ. ఇత్యేవం లక్షితా హ్యేతాః షట్త్రింశద్దృష్టయో మయా,**
**రసజా భావజాశ్చాసాం వినియోగం నిబోధత. 87**

**తా.** రసజములు, భావజములు అయిన ముప్పైయారు దృష్టుల లక్షణాలు చెప్పాను. ఇపుడు వీటి వినియోగం ఎలా చెయ్యాలో తెలుసుకొనండి.

**మూ. రసజాస్తు రసేష్వేవ స్థాయిషు స్థాయిదృష్టయః,**
**శృణుత వ్యభిచారిణ్యః సఞ్చారిషు యథాస్థితాః. 88**

**తా.** రసజదృష్టులు రసాల ప్రయోగంలోను, స్థాయిజదృష్టులు స్థాయుల ప్రయోగంలోను వినియోగించాలి. వ్యభిచారిభావాలకు సంబంధించిన దృష్టులు సంచారి భావాల (వ్యభిచారిభావాల) ప్రయోగం చేసే సందర్భంలో ఎలా వినియోగించాలో వినండి.

**మూ. శూన్యా దృష్టిస్తు చిన్తాయామ్ అభితప్తాపి కీర్తితా,**
**నిర్వేదే చాపి మలినా వైవర్ణ్యే చ విధీయతే. 89**

**శ్రాన్తా శ్రమార్తే స్వేదే చ లజ్జాయాం లలితా తథా,**
**అపస్మారే తథా వ్యాధౌ గ్లాన్యాం గ్లానా విధీయతే. 90**

**శఙ్కాయాం శఙ్కితా జ్ఞేయా విషాదార్థే విషాదినీ,**
**నిద్రా స్వప్నసుఖార్థేషు ముకులా దృష్టిరిష్యతే. 91**

**తా.** చింత అనే వ్యభిచారిభావంలో శూన్యదృష్టి, నిర్వేదంలో అభితప్తాదృష్టి, వైవర్ణ్యంలో మలినాదృష్టి, శ్రమ, స్వేదం ఈ రెండింటియందు శ్రాంతాదృష్టి, లజ్జయందు లలితాదృష్టి చెప్పబడింది. అపస్మార – వ్యాధి – గ్లానులయందు గ్లానాదృష్టి, శంకయందు శంకితాదృష్టి, విషాదంలో విషాదినీదృష్టి, నిద్రా – స్వప్న – సుఖాలలో ముకులాదృష్టి వినియోగించాలి.

**మూ. కుఞ్చితాసూయితానిష్టదుష్ప్రేక్ష్యాక్షివ్యథాసు చ,**
**అభితప్తా చ నిర్వేదే హ్యభిఘాతాభితాపయోః. 92**

**జిహ్మా దృష్టిరసూయాయాం జడతాలస్యయోస్తథా,**
**ధృతౌ హర్షే సలలితా స్మృతా తర్కే వితర్కితా. 93**

**ఆహ్లాదిష్వర్ధముకులా గన్ధస్పర్శసుఖాదిషు,**
**విభ్రాన్తా దృష్టిరావేగే సంభ్రమే విభ్రమే తథా. 94**

**విప్లుతా చపలోన్మాదదుఃఖార్తిమరణాదిషు,**
**ఆకేకరే దురాలోకే విచ్ఛేదప్రేక్షితేషు చ. 95**

**విబోధగర్వామర్షౌగ్ర్యమతిషు స్యాద్వికోశితా,**
**త్రస్తా త్రాసే భవేద్దృష్టిః మదిరా చ మదేష్వితి. 96**

**తా.** అసూయ, అనిష్టము, చూడ శక్యంకానిది, రోగము – వీటియందు కుంచితా దృష్టి, నిర్వేద – అభిఘాత – అభితాపాలయందు అభితప్తాదృష్టి, అసూయా – జడతా – ఆలస్యాలయందు జిహ్మాదృష్టి, ధృతి – హర్షాలలో లలితాదృష్టి, స్మృతి – తర్కాలలో వితర్కితాదృష్టి, ఆహ్లాదం కలిగించే గంధ – స్పర్శసుఖాదులలో అర్ధముకులాదృష్టి, ఆవేగ – సంభ్రమ – విభ్రమాలలో విభ్రాంతాదృష్టి, చపల – ఉన్మాద – దుఃఖ – ఆర్తి – మదాదులలో విప్లుతాదృష్టి, (అధికకాంతిచేత గాని దూరంగా ఉండడంచేత గాని) చూడడానికి శక్యంకానిదానిని చూచేటప్పుడు, ఆగీ ఆగి చూచేటప్పుడు ఆకేకరాదృష్టి, విబోధిత – గర్వ – అమర్ష – ఔగ్ర్య – మతులలో వికోశితాదృష్టి, త్రాసంలో త్రస్తాదృష్టి, మదాలలో మదిరాదృష్టి వినియోగించాలి.

**మూ. షట్‌త్రింశద్దృష్టయో హ్యేతా యథావత్సముదాహృతాః,**
**రసజానాం తు దృష్టీనాం భావజానాం తథైవ చ. 98**

**తా.** రసజములు, భావజములు అయిన ముప్పై ఆరు దృష్టులను, వాటి స్వరూప లక్షణాలదులను చెప్పాను.

**మూ. తారాపుటభ్రువాం కర్మ గదతో మే నిబోధత,**
**భ్రమణం వలనం పాతః చలనం సంప్రవేశనమ్. 99**
**వివర్తనం సముద్వృత్తం నిష్క్రామః ప్రాకృతం తథా.**
**(ఏతాని నవ కర్మాణి తారాకర్మ ద్విజోత్తమాః,**
**శృణుధ్వం లక్షణం తావత్ సామ్ప్రతం ప్రీతితః స్ఫుటమ్.)**

**తా.** ఇప్పుడు కంటిపాపలు (గుడ్లు), రెప్పలు – కనుబొమ్మలు – వాటి పనులను గూర్చి చెపుతున్నాను; వినండి. భ్రమణము, వలనము, పాతము, చలనము, సంప్రవేశనము, వివర్తనము, సముద్వృత్తము, నిష్క్రామము, ప్రాకృతము – ఈ తొమ్మిది కర్మలు తారాకర్మలు. కంటి గుడ్లతో చేసే పనులు. ద్విజోత్తములారా! ఇప్పుడు వీటి లక్షణాలను ప్రీతిపూర్వకంగా, స్పష్టంగా వినండి.

**మూ. పుటాన్తర్మణ్డలావృత్తిస్తారయోర్భ్రమణం స్మృతమ్ 100**
**వలనం గమనం త్ర్యస్రం పాతనం స్రస్తతా తథా,**
**చలనం కమ్పనం జ్ఞేయః ప్రవేశోఽన్తఃప్రవేశనమ్. 101**
**వివర్తనం కటాక్షస్తు సముద్వృత్తం సమున్నతిః,**
**నిష్క్రామో నిర్గమః ప్రోక్తః ప్రాకృతం తు స్వభావజమ్. 102**

**తా.** నేత్రపుటాల (రెప్పల) మధ్య రెండు గుడ్లను గుండ్రంగా తిప్పడం **భ్రమణం.** గుడ్లు కిందికి జార్చడం **పాతనం.** గుడ్లు శీఘ్రంగా కదల్చడం **చలనం.** గుడ్లు నేత్రపుటాలం లోపలికి తీసికొనిపోవడం **అంతఃప్రవేశనం.** క్రీగంటిచూపులు చూడడం **వివర్తనం.** గుడ్లు పైకి లేపడం **సముద్వర్తనం.** గుడ్లు బైటకు వచ్చాయా అన్నట్లు చేయడం **నిష్క్రామణం.** ఏ వికారాలూ లేకుండా సహజంగా ఉంచడం **ప్రాకృతం.**

**మూ. అథైషాం రసభావేషు వినియోగం నిబోధత,**
**భ్రమణం వలనోద్వృత్తే నిష్క్రామో వీరరౌద్రయోః. 103**
**నిష్క్రామణం సంచలనం కర్తవ్యం హి భయానకే,**
**హాస్యబీభత్సయోశ్చాపి ప్రవేశనమిహేష్యతే. 104**
**పాతనం కరుణే కార్యం నిష్క్రామణమథాద్భుతే,**
**ప్రాకృతం శేషభావేషు శృఙ్గారే చ వివర్తితమ్. 105**

**తా.** వేరు వేరు భావాలలో ఈ తారాచేష్టలు ఎలా వినియోగించాలో చెపుతాను; తెలుసుకొనండి. భ్రమణ – వలన – ఉద్వృత్తాలు (సముద్వర్తనాలు) వీర – రౌద్రాలలో వినియోగించాలి. భయానకరసంలో నిష్క్రామణ – సంచలనాలు వినియోగించాలి. వీటిని

హాస్య – బీభత్సాలలో కూడ వినియోగించవచ్చును. కరుణరసంలో పాతనాన్ని, అద్భుతంలో నిష్క్రామణాన్నీ, శృంగారంలో వివర్తితాన్నీ వినియోగించాలి. మిగిలిన భావాలలో ప్రాకృతమే ఉంటుంది.

**మూ. స్వభావసిద్ధమేవైతత్కర్మలోకక్రియాశ్రయమ్,**
**ఏవం రసేషు భావేషు తారాకర్మాణి యోజయేత్. 106**

**తా.** ఈ కర్మ (తారాచేష్టలు అనగా కంటి గుడ్ల చేష్టలు) స్వభావసిద్ధంగా, సమాజంలో ప్రసిద్ధంగా ఉన్నదే. తారాకర్మలను రసాలలోను, భావాలలోను, పైన చెప్పినట్లు వినియోగించాలి.

**మూ. అథాత్రైవ ప్రవక్ష్యామి ప్రకారాన్ దర్శనస్య తు,**
**సమం సాచ్యనువృత్తే చ హ్యాలోకితవిలోకితే 107**
**ప్రలోకితోల్లోకితే చాప్యవలోకితమేవ చ.**

**తా.** ఇప్పుడు దృష్టుల భేదాలను గూర్చి చెపుతాను – సమం, సాచి (సాచీకృతం), అనువృత్తం, ఆలోకితం, విలోకితం, ప్రలోకితం, ఉల్లోకితం, అవలోకితం అని వీటి భేదాలు.

**మూ. సమతారం చ సౌమ్యం చ యద్దృష్టం తత్సమం స్మృతమ్. 108**
**పక్ష్మాన్తర్గతతారం యత్త్ర్యశ్రం సాచీకృతం తు తత్.**
**రూపనిర్వర్ణనాయుక్తమనువృత్తమితి స్మృతమ్. 109**
**సహసా దర్శనం యత్స్యాత్ తదాలోకితముచ్యతే,**
**విలోకితం పృష్ఠతస్తు పార్శ్వాభ్యాం తు ప్రలోకితమ్. 110**
**ఊర్ధ్వముల్లోకితం జ్ఞేయమవలోకితమప్యధః,**
**ఇత్యేష దర్శనవిధిః సర్వభావరసాశ్రయః. 111**

**తా.** కనుపాపలు సమంగా ఉండగా సౌమ్యమైన చూపు **సమం.** గుడ్లు రెప్పలలో దాగి ఉండగా, అడ్డంగా చూడడం, **సాచీకృతం.** ఏ వస్తువు నైనా పరిశీలనాపూర్వకంగా పైనుంచి క్రిందికీ, క్రింది నుంచి పైకీ చూడడం **అనువృత్తం.** హటాత్తుగా చూడడం **ఆలోకితం.** వెనుకకు చూడడం **విలోకితం.** ప్రక్కలకు చూడడం **ప్రలోకితం.** పైకి చూడడం **ఉల్లోకితం.** క్రిందికి చూడడం **అవలోకితం.** ఈ దర్శనవిధానం అన్ని భావాలకూ, రసాలకూ కూడ వర్తిస్తుంది.

**మూ. తారాకృతః; అస్యానుగతం పుటకర్మ నిబోధత,**
**ఉన్మేషశ్చ నిమేషశ్చ ప్రసృతం కుఞ్చితం సమమ్. 112**

**వివర్తితం సస్ఫురితం పిహితం సవితాడితమ్.**

**తా.** పైన చెప్పిన దర్శనవిధి తారాకృత మైనది; అనగా గుడ్ల కదలికచే ఏర్పడేది. ఇప్పుడు దీనితో పాటు జరిగే పుటకర్మ (రెప్పలు చేష్టలు) చెపుతున్నాను; వినండి - ఉన్మేషము, నిమేషము, ప్రసృతము, కుంచితము, సమము, వివర్తితము, స్ఫురితము, పిహితము, వితాడితము అని పుటకర్మ తొమ్మిది విధాలు.

**మూ. విశ్లేషః పుటయోర్యస్తు స ఉన్మేషః ప్రకీర్తితః. 113**
**సమాగమో నిమేషః స్యాదాయామః ప్రసృతం భవేత్,**
**ఆకుఞ్చితం కుఞ్చితం స్యాత్సమం స్వాభావికం స్మృతమ్. 114**
**వివర్తితం సముద్వృత్తం స్ఫురితం స్పన్దితం తథా,**
**స్థగితం పిహితం ప్రోక్తమాహతం తు వితాడితమ్. 115**

**తా.** రెప్పలు రెండూ దూరంగా విడిపోవడం **ఉన్మేషం;** అవి కలవడం **నిమేషం.** రెప్పలు బాగా విస్తరింపచేయడం **ప్రసృతం.** రెప్పలు వంచడం **కుంచితం.** వాటిని మామూలుగా ఉంచడం **సమం.** వాటిని పైకి ఎత్తడం **వివర్తితం.** వాటిని తొందరగా మూస్తూ తెరుస్తూ ఉండడం **స్ఫురితం.** అవి కదలకుండామూసి ఉంచడం **పిహితం.** దెబ్బ తగులుతుం దనే భయం కలిగినప్పుడు హటాత్తుగా గట్టిగా మూయడం **వితాడితం.**

**మూ. అథైషాం రసభావేషు వినియోగం నిబోధత,**
**క్రోధే వివర్తితం కార్యం నిమేషోన్మేషణైః సహ. 116**
**విస్మయార్థే చ హర్షే చ వీరే చ ప్రసృతం స్మృతమ్,**
**అనిష్టదర్శనే గన్ధే రసే స్పర్శే చ కుఞ్చితమ్. 117**
**శృఙ్గారే చ సమం కార్యమీర్ష్యాసు స్ఫురితం తథా,**
**సుప్తమూర్ఛితవాతోష్ణధూమవర్షాఞ్జనార్తిషు. 118**
**నేత్రరోగే చ పిహితమభిఘాతే వితాడితమ్.**

**తా.** ఇప్పుడు, రసాలలోను భావాలలోను పుటకర్మల వినియోగాన్ని తెలుసుకొనండి. క్రోధంలో నిమేష - ఉన్మేషణాలతో పాటు వివర్తితం వినియోగించాలి. విస్మయ - హర్ష - వీరాలలో ప్రసృతం వినియోగించాలి. అనిష్ట మైన దానిని చూచినా, వాసన చూచినా, రుచి చూచినా, స్పృశించినా **కుంచితం** వినియోగించాలి. శృంగారంలో **సమం**, ఈర్ష్యలో **స్ఫురితం,** సుప్తంలోను, మూర్ఛలోను, వాత - ఉష్ణ - ధూమ - వర్ష - అంజనాదులవల్ల నేత్రాలకు పీడ కలిగి నప్పుడు, నేత్రరోగంలోను పిహితం విని యోగించాలి. హటాత్తుగా ఏదైన దెబ్బ తగులుతుం దనుకొన్నప్పుడు **వితాడితం** ఉపయోగించాలి.

**మూ. ఇత్యేషరసభావేషు తారకాపుటయోర్విధిః. 119**

**కార్యానుగతమస్యైవ భ్రువోః కర్మ నిబోధిత,**
**ఉత్క్షేపః పాతనం చైవ భ్రుకుటీ చతురం తథా. 120**

**కుఞ్చితం రేచితం చైవ సహజం చేతి సప్తధా.**

**తా.** రస - భావాలలో వినియోగించవలసిన తారకా - పుటచేష్టల విధానం ఇంతవరకు చెప్పబడినది. దీనినే అనుసరించి కనుబొమ్మల చేష్ట ఎలా ఉండాలో తెలుసుకొనండి.

ఉత్క్షేపము, పాతనము, భ్రుకుటి, చతురము, కుంచితము, రేచితము, సహజము అని భ్రూకర్మ ఏడు విధాలు.

**మూ. భ్రువోరున్నతిరుత్క్షేపః సమమేకైకశోఽపి వా. 121**

**అనేనైవ క్రమేణైవ పాతనం స్యాదధోముఖమ్,**
**భ్రువోర్మూలసముత్క్షెపాత్ భ్రుకుటీ పరికీర్తితా. 122**

**చతురం కించిదుచ్ఛ్వాసాన్మధురాయతతా భ్రువోః,**
**ఏకస్యా హి ద్వయోర్వాపి మృదుభఙ్గస్తు కుఞ్చితమ్. 123**

**ఏకస్యా ఏవ లలితాదుత్క్షేపాద్రేచితం భ్రువః,**
**సహజాతం తు సహజం కర్మ స్వాభావికం స్మృతమ్. 124**

**తా.** రెండు కనుబొమ్మలను కలిపి గాని, ఒక్కొక్కదానిని గాని పైకి ఎత్తడం **ఉత్క్షేపం.** అదే క్రమంలో వాటిని క్రిందికి దించడం **పాతనం.** కనుబొమ్మల మొదళ్లను పైకి ఎత్తడం భ్రుకుటి. కనుబొమ్మలను మృదువుగా కొంచెం పైకి ఎత్తడం **చతురం.** ఒక కనుబొమ్మను మాత్రమే కాని, రెండింటినీ కాని మృదువుగా విరవడం **కుంచితం.** విలాసపూర్వకంగా ఒకే కనుబొమ్మ పైకి ఎగరవేయడం **రేచితం.** ఏ కదలికలూ లేని స్థితి **సహజం.**

**మూ. అథైషాం సంప్రవక్ష్యామి రసభావప్రయోజనమ్,**
**కోపే వితర్కే హేలాయాం లీలాదౌ సహజే తథా. 125**

**దర్శనే శ్రవణే చైవ భ్రువమేకాం సముత్క్షిపేత్,**
**ఉత్క్షేపో విస్మయే హర్షే రోషే చైవ ద్వయోరపి. 126**

**తా.** ఇపుడు - రసభావాలలో వీటి ప్రయోగాన్ని చెపుతాను - కోపంలోను, వితర్కంలోను, హేలయందు, సహజమైన లీలాదికమునందు, దర్శనంలోను, వినే సమయం లోను, ఒక కనుబొమ్మ ఎత్తాలి. విస్మయంలోను, హర్షంలోను, రోషంలోను - రెండింటినీ పైకి ఎత్తాలి.

**మూ. అసూయితే జుగుప్సాయాం హాసే ఘ్రాణే చ పాతనమ్,**
**క్రోధస్థానేషు దీప్తేషు యోజయేత్ భ్రుకుటీం బుధః. 127**

**శృఙ్గారే లలితే సౌమ్యే సుఖస్పర్శే ప్రబోధనే,**
**ఏవంవిధేషు భావేషు చతురం తు ప్రయోజయేత్. 128**

**(స్త్రీపురుషయోశ్చ సంలాపే నానావస్థాన్తరాత్మకే)**

**తా.** అసూయితము, జుగుప్స, హాసం, వాసన చూచుట – వీటిలో పాతనం వినియోగించాలి. క్రోధం చూపవలసినప్పుడు, కాంతి అధికంగా ఉన్నచోట, బుధుడు, భ్రుకుటిని వినియోగించాలి. శృంగారంలోనూ, సౌమ్యమైన విలాసలోను, సుఖస్పర్శ యందు, మేల్కొలిపేటప్పుడు చతురాన్ని వినియోగించాలి (వివిధావస్థలతో సంబంధించిన స్త్రీపురుషసంభాషణ సమయాలలో కూడ చతురాన్ని ఉపయోగించాలి).

**మూ. మోట్టాయితే కుట్టమితే తథా చ కిలికిఞ్చితే,**
**నికుఞ్చితం చ కర్తవ్యం నృత్తే యోజ్యం తు రేచితమ్. 129**

**అనావిద్ధేషు భావేషు కుర్యాత్ స్వాభావికం తథా,**
**ఇత్యేవం తు భ్రువోః ప్రోక్తం నాసాకర్మ నిబోధత. 130**

**తా.** మోట్టాయితంతోను, కుట్టమితంలోను, కిలికించితంలోను నికుంచితం వినియోగించాలి. నృత్తంలో రేచితం చెయ్యాలి. సాధారణపరిస్థితులలో మాత్రం సహజం ప్రయోగించాలి. ఈ విధంగా భ్రూకర్మ (కనుబొమ్మల చేష్ట) చెప్పబడింది. ఇప్పుడు నాసికా కర్మ (ముక్కుతో చేష్టలను) తెలిసికొనండి.

**మూ. నతా మన్దా వికృష్టా చ సోచ్ఛ్వాసాథ వికూణితా,**
**స్వాభావికా చేతి బుధైః షడ్విధా నాసికా స్మృతా. 131**

**తా.** నత, మంద, వికృష్ట, సోచ్ఛ్వాస, వికూణిత, స్వాభావిక అని నాసిక ఆరు విధములు అని బుధులు చెపుతున్నారు.

**మూ. నతా ముహుః శ్లిష్టపుటా మన్దా తు నిభృతా స్మృతా,**
**వికృష్టా ఫుల్లితపుటా సోచ్ఛ్వాసాకృష్టమారుతా. 132**

**వికూణితా సంకుచితా సమా స్వాభావికీ (కా) స్మృతా,**
**నాసికాలక్షణం హ్యేతద్వినియోగం నిబోధత. 133**

**తా.** మాటిమాటికి అణిగిపోయిన పుటలు (రంధ్రాలు) కలది నత. పుటాలు మామూలుగా ఉన్నది **మంద.** పుటలు పెద్దవి చేసినది వికృష్ట. గాలి పీల్చేది **సోచ్ఛ్వాస.**

వంచినది **వికూణిత.** మామూలు పరిస్థితిలో ఉన్నది స్వాభావికి (క). ఇది నాసికాలక్షణం. ఇపుడు దీని వినియోగాన్ని తెలుసుకొనండి.

**మూ. మదోత్కమ్పసమాయుక్తే నారీణామనురోధనే,**
**నిఃశ్వాసే చ నతా కార్యా నాసికా నాట్యయోక్తృభిః. 134**

**తా.** మద్యపానంవల్ల కలిగిన కంపనంలోను, స్త్రీలను బతిమాలుకొనడంలోను, నిట్టూర్పు విడిచేటప్పుడూ నతానాసికను ప్రయోగించాలి.

**మూ. నిర్వేదౌత్సుక్యచిన్తాసు మన్దాం శోకే చ యోజయేత్,**
**తీవ్రగన్ధే వికృష్టాం తాం రౌద్రే వీరే తథైవ చ. 135**

**తా.** నిర్వేదము, ఔత్సుక్యము, చింత, శోకము – వీటిలో మందానాసికను, తీవ్ర గంధంలోను, రౌద్రంలోను, వీరంలోను నికృష్టానాసికను వినియోగించాలి.

**మూ. ఇష్టఘ్రాణే తథోచ్ఛ్వాసే దీర్ఘోచ్ఛ్వాసాం ప్రయోజయేత్,**
**వికూణితా చ కర్తవ్యా జుగుప్సాసూయితాదిషు. 136**
**కార్యా శేషేషు భావేషు తద్‌జ్ఞైః స్వాభావికీ తథా.**

**తా.** సువాసన అనుభవించే టప్పుడు, దీర్ఘశ్వాస తీసికొనే టప్పుడు సోచ్ఛ్వాసా నాసికను ప్రయోగించాలి. జుగుప్స, అసూయ మొదలైన భావాలలో వికూణితానాసికను; ఇతరభావాలలో స్వాభావికనాసికను ప్రయోగించాలి.

**మూ. క్షామం ఫుల్లం చ ఘూర్ణం చ కమ్పితం కుఞ్చితం సమమ్. 137**
**షడ్విధం గణ్డముద్దిష్టమస్య లక్షణముచ్యతే.**

**తా.** క్షామము, ఫుల్లము, ఘూర్ణము, కంపితము, కుంచితము, సమము అని గణ్డస్థలము (కపోలము – చెక్కిలి) ఆరు విధాలు. వీటి లక్షణం చెప్పబడుతూన్నది.

**మూ. క్షామం చావనతం జ్ఞేయం ఫుల్లం వికసితం భవేత్. 138**
**వితతం ఘూర్ణమత్రోక్తం కమ్పితం స్ఫురితం భవేత్,**
**స్యాత్కుఞ్చితం సంకుచితం సమం ప్రాకృతముచ్యతే. 139**

**తా.** నొక్కుకొనిపోయిన చెక్కిలి **క్షామం.** వికసించినది **ఫుల్లం.** వ్యాపించినది ఘూర్ణం. వణుకుతూన్న కపోలం **కంపితం.** మునిగిపోయిన కపోలం **కుంచితం.** స్వాభావిక మైన స్థితిలో ఉన్నది **సమం.**

**మూ. గణ్డయోర్లక్షణం ప్రోక్తం వినియోగం విబోధత,**
**క్షామం దుఃఖేషు కర్తవ్యం ప్రహర్షే ఫుల్లమేవ చ. 140**

**ఘూర్ణముత్సాహగర్వేషు రోషహర్షేషు కమ్పితమ్,**
**కుఞ్చితం చ సరోమాఞ్చం స్పర్శే శీతే భయే జ్వరే.** **141**
**ప్రాకృతం శేషభావేషు గణ్డకర్మ భవేదితి.**

**తా.** గండస్థలాల లక్షణం చెప్పబడింది. ఇప్పుడు వినియోగం తెలుసుకొనండి. దుఃఖంలో క్షామగండస్థలం ప్రయోగించాలి. గొప్ప సంతోషం కలిగినపుడు **ఫుల్లము,** ఉత్సాహంలోను, గర్వంలోను **ఘూర్ణము,** రోమాంచంలో **కంపితము.** శీతస్పర్శలోను, భయంలోను, జ్వరంలోను రోమాంచంతో కూడిన **కుంచితకపోలాన్నీ,** ఇతరభావాలలో **సమకపోలాన్నీ** వినియోగించాలి.

**మూ. వివర్తనం కమ్పనం చ విసర్గో వినిగూహనమ్.** **142**
**సందష్టకం సముద్గం చ షట్కర్మాణ్యధరస్య తు**

**తా.** క్రింది పెదవికి – వివర్తనము, కంపనము, విసర్గము, వినిగూహనము, సందష్టకము, సముద్గకము అను ఆరు కర్మలుంటాయి.

**మూ. వికూణనం వివర్తస్తు వేపనం కమ్పనం స్మృతమ్.** **143**
**వినిష్క్రామో విసర్గస్తు ప్రవేశో వినిగూహనమ్,**
**సందష్టకం ద్విజైర్దష్టం సముద్గః సహజోన్నతిః.** **144**

**తా.** పెదవులను పక్షిముక్కువలె ముణవడం **వివర్తనం.** కదల్చడం **కంపనం.** పెదవులు చాపడం **విసర్గం.** నోటిలోనికి ముణవడం **వినిగూహనం.** దంతాలతో నొక్కడం **సందష్టకం.** మామూలుగా ఉంచడం **సముద్గకం.**

**మూ. ఇత్యోష్ఠలక్షణం ప్రోక్తం వినియోగం నిబోధత,**
**అసూయావేదనావజ్ఞాహాస్యాదిషు వివర్తనమ్.** **145**
**కమ్పనం వేదనాశీతభయరోషజవాదిషు,**
**స్త్రీణాం విలాసే బిబ్బోకే విసర్గో రఞ్జనే తథా.** **146**
**వినిగూహనమాయాసే సందష్టం క్రోధకర్మసు,**
**సముద్గస్త్వనుకమ్పాయాం చుమ్బనే చాభినన్దనే.** **147**
**ఇత్యోష్ఠకర్మాణ్యుక్తాని చిబుకస్య నిబోధత.**

**తా.** ఈ విధంగా ఓష్ఠకర్మ చెప్పబడింది. ఇపుడు దాని వినియోగం చెపుతాను, వినండి – అసూయ, వేదన, అనాదరభావం, హాస్యం మొదలైనవాటిలో **వివర్తనం** వినియోగించాలి. బాధ, చలి, భయం, రోషం, వేగం మొదలైనవాటియందు **కంపనం** ప్రయోగించాలి. స్త్రీల విలాసంలోను, బబ్బోకంలోను, పెదవులకు రంగువేసేటప్పుడు

**విసర్గం** ప్రయోగించాలి. ప్రయాసం (శ్రమ) పడేటప్పుడు **వినిగూహనము;** క్రోధంతో చేసే పనులలో సందష్టం, జాలిచూపడం, చుంబనము, అభినందించడం – వాటిలో **సముద్గం** ప్రయోగించాలి.

ఈ విధంగా ఓష్ఠకర్మలు చెప్పాను. ఇప్పుడు చిబుక (గడ్డం) కర్మలు తెలిసికొనండి–

**మూ. కుట్టనం ఖణ్డనం భిన్నం చుక్కితం లేహితం సమమ్. 148**
**దష్టం చ దన్తక్రియయా చిబుకం త్విహ లక్ష్యతే,**

**తా.** కుట్టనం, ఖండనం, భిన్నం, చుక్కితం, లేహితం, సమం, దంతదష్టం – అని చిబుకక్రియలు ఏడు.

**మూ. కుట్టనం దన్తసంఘర్షః సంఘోటః ఖణ్డనం ముహుః. 149**
**భిన్నం తు గాఢసంశ్లేషః చుక్కితం దూరవిచ్యుతిః,**
**లేహనం జిహ్వయా లేహః కించిచ్ఛ్లేషః సమం భవేత్. 150**
**దన్తైర్దష్టేఽధరే దష్టమిత్యేషాం వినియోజనమ్.**

**తా.** దంతాలు గట్టిగా రాయడం **కుట్టనం.** మాటిమాటికీ దంతాలు కటకట లాడించడం **సంఘోటం.** దంతాలు బిగించడం **భిన్నం.** దూరంగా దంతాలు విస్తరింప చేయడం **చుక్కితం.** నాలుకతో నాకడం **లేహితం.** దంతపంక్తి కొంచెం విడిగా (కలవకుండా) ఉండడం **సమం.** క్రిందిపెదవి నొక్కడం దష్టం. ఇపుడు వీటి వినియోగం (వినండి).

**మూ. భయశీతజ్వరక్రోధగ్రస్తానాం కుట్టనం భవేత్. 151**
**జపాధ్యయనసల్లాపభక్ష్యయోగే చ ఖణ్డనమ్,**
**భిన్నం వ్యాధౌ భయే శీతే వ్యాయామే రుదితే మృతే. 152**
**జృమ్భణే చుక్కితం కార్యం తథా లౌల్యే చ లేహనమ్,**
**సమం స్వభావభావేషు సన్దష్టం క్రోధకర్మసు. 153**
**ఇతి దన్తోష్ఠజిహ్వానాం కరణే చిబుకక్రియా.**

**తా.** భయము, చలి, జ్వరము, క్రోధము వీటి ఆవేశంలో ఉన్నవాళ్లకు **కుట్టనం** చెప్పబడింది. జపము, అధ్యయనము, సంలాపము, భక్ష్యాలు తినడం – వీటిలో **ఖండనం.** వ్యాధి, భయం, చలి, వ్యాయామం, ఏడ్పు, మరణం – వీటిలో **భిన్నం.** ఆవులింతలో చుక్కితం చెయ్యాలి. లౌల్యంలో (తినుబండారాలు మొదలైనవి చూచినపుడు కలిగే కోరికలో) **లేహనం.** మామూలు పరిస్థితులలో **సమం.** క్రోధంతో చేసే పనులలో **సందష్టం.** దంత – ఓష్ఠ – జిహ్వాల పనులతో సంబంధించిన చిబుకక్రియ ఈ విధంగా ఉంటుంది.

**మూ. వినివృత్తం చ విధుతం నిర్భుగ్నం భుగ్నమేవ చ. 154**

**వివృత్తం చ తథోద్వాహి కర్మాణ్యత్రాస్యజాని తు.**

**తా. ముఖచేష్టలు :–** వినివృత్తం, విధుతం, నిర్భుగ్నం, భుగ్నం, వివృత్తం, ఉద్వాహి – ఇవి ఆరు ముఖజకర్మలు (ముఖచేష్టలు).

**మూ. వ్యావృత్తం వినివృత్తం స్యాత్ విధుతం తిర్యగాయతమ్. 155**

**అవాఙ్ముఖత్వం నిర్భుగ్నం వ్యాభుగ్నం కించిదాయతమ్,**

**విశ్లిష్టోష్ఠం చ వివృతమ్ ఉద్వాహ్యుక్షిప్తమేవ చ. 156**

**తా.** ముఖం వెనుకకు తిప్పడం **వినివృత్తం.** అడ్డంగా ఊపడం **విధుతం.** ముఖం క్రిందికి దింపడం **నిర్భుగ్నం.** కొంచెం ముందుకు చాపడం **వ్యాభుగ్నం.** పెదవులు తెరచి ఉంచిన ముఖం **వివృతం.** ముఖం విసిరి నట్లు కదపడం **ఉద్వాహి.**

**మూ. వినివృత్తమసూయాయామీర్ష్యాకోపకృతేషు చ,**

**అవజ్ఞావిహృతాదౌ చ స్త్రీణాం కార్యం ప్రయోక్తృభిః. 157**

**విధుతం వారణే చైవ నైకమిత్యేవమాదిషు,**

**నిర్భుగ్నం చాపి విజ్ఞేయం గమ్భీరాలోకనాదిషు. 158**

**భుగ్నం లజ్జాన్వితే యోజ్యం యతీనాం తు స్వభావతః,**

**నిర్వేదౌత్సుక్యచిన్తాసు తథా వినయమన్త్రణే. 159**

**వికృతం వాపి విజ్ఞేయం హాస్యశోకభయాదిషు,**

**స్త్రీణాముద్వాహిలీలాయాం గర్వే గచ్ఛత్యనాదరే. 160**

**ఏవం నామేతి కార్యం చ కోపవాక్యే విచక్షణైః,**

**తా. ముఖచేష్టల వినియోగం :–** స్త్రీలలో పరస్పరము, అసూయ, ఈర్ష్య, కోపం, అనాదరం, విహారం మొదలైన సందర్భాలలో, నాట్యప్రయోక్తలు **వినివృత్తం** ప్రయోగించాలి. నివారించడంలోను, 'అది అలా కాదు' అని చెప్పేటప్పుడు **విధుతం** ప్రయోగించాలి. గంభీరమైన ఆలోచనాదులలో **నిర్భుగ్నం** ప్రయోగించాలి. లజ్జతో కూడినవాని విషయం లోను, యతులలో సహజంగాను నిర్వేద – ఔత్సుక్య – చింతా – వినయాలలోను, ఆలోచనా సమయంలోను భుగ్నం వినియోగించాలి. హాస్య – శోక – భయాదులలోను, స్త్రీల విలాసయందు, గర్వంలోను, 'వెళ్లు' అన్నప్పుడు, అనాదరంలోను ఉద్వాహిముఖం ప్రయోగిస్తూ "ఇది ఇంతేనట!" అను కోపవాక్యం పలికే టప్పుడు కూడ ఈ ముఖం ప్రయోగించాలి.

**మూ. సమసాచీకృతాద్యుక్తం యచ్చ దృష్టివికల్పనమ్. 161**

**తద్జ్ఞైస్తదనుసారేణ కార్యం తదనుగం ముఖమ్.**

**తా.** సమం, సాచీకృతం మొదలైన, వెనుక చెప్పిన దృష్టిభేదాలకు అనుగుణంగా, నాట్యజ్ఞులు ముఖంకూడ (ముఖచేష్ట కూడ) చెయ్యాలి.

**మూ. అథాతో ముఖరాగస్తు చతుర్ధా సంప్రకీర్తితః. 162**

**స్వాభావికః ప్రసన్నశ్చ రక్తః శ్యామోఽర్థసంశ్రయః.**

**తా.** ముఖరాగం (ముఖం రంగు) కావ్యార్థాన్ని పట్టి స్వాభావికము, ప్రసన్నము, రక్తము, శ్యామము అని నాలుగు విధాలు గలదిగా చెప్పబడినది.

**మూ. స్వాభావికస్తు కర్తవ్యః స్వభావాభినయాశ్రయః. 163**

**మధ్యస్థాదిషు భావేషు ముఖరాగః ప్రకీర్తితః,**

**ప్రసన్నస్త్వద్భుతే కార్యో హాస్యశృఙ్గారయోస్తథా. 164**

**వీరరౌద్రమదాద్యేషు రక్తః స్యాత్ కరుణే తథా,**

**భయానకే సబీభత్సే శ్యామం సంజాయతే ముఖమ్. 165**

**తా.** సహజమైన పరిస్థితులలో, భావావేశం ఏదీ లేని సందర్భాలలో **స్వాభావిక ముఖరాగమే** ఉండాలి. అద్భుత – హాస్య – శృంగారాలలో **ప్రసన్నముఖరాగము,** వీర – రౌద్రాదులయందు, మద్యపానాదులలోను కూడ **రక్తముఖవర్ణము,** కరుణ – భయానక – బీభత్సాలలో శ్యామముఖవర్ణము ప్రయోగించాలి.

**మూ. ఏవం భావరసార్థేషు ముఖరాగం ప్రయోజయేత్,**

**శాఖాఙ్గోపాఙ్గసంయుక్తః కృతోప్యభినయః శుభః. 166**

**ముఖరాగవిహీనస్తు నైవ శోభాన్వితో భవేత్.**

**తా.** భావ – రసాదులలో ఈ విధంగా ముఖరాగం ప్రయోగించాలి. శాఖా – అంగ – ఉపాంగాలతో శుభమైన అభినయం ప్రయోగించినా కూడ ముఖరాగాలు లేకపోతే అది శోభించదు.

**మూ. శారీరాభినయోఽల్పోఽపి ముఖరాగసమన్వితః. 167**

**ద్విగుణాం లభతే శోభాం రాత్రావివ నిశాకరః.**

**తా.** శరీరావయవాదులతో చేసే అభినయం అల్పమే అయినా, అది ముఖరాగంతో కూడి ఉంటే అప్పు డా అభినయం, రాత్రియందు చంద్రుడువలె రెండురెట్లు శోభ కలదౌతుంది.

**మూ. నయనాభినయోఽపి స్యాన్నానాభావరసస్ఫుటః. 168**

**ముఖరాగాన్వితో యస్మాన్నాట్యమత్ర ప్రతిష్ఠితమ్.**

**తా.** నేత్రాలతో చేసే అభినయం కూడ ముఖరాగంతో కలిస్తే అనేకవిధాలైన భావాలను రసాలను స్పష్టంగా వ్యక్తీకరిస్తుంది. అందుచేత నాట్యం ముఖరాగంమీదనే ఆధారపడి ఉంది.

**మూ. యథా నేత్రం ప్రసర్పేత ముఖభ్రూదృష్టిసంయుతమ్. 169**

**తథా భావరసోపేతం ముఖరాగం ప్రయోజయేత్.**

**తా.** ముఖభ్రూ – దృష్టులతో కలిసి నేత్రం ఏ యే విధంగా వ్యాపారం (కదలికలు) చేస్తుందో ఆ యా పద్ధతులలోనే ముఖరాగాన్ని భావ – రసాదులకు అనుగుణంగా ప్రయోగించాలి.

**మూ. ఇత్యేవం ముఖరాగస్తు ప్రోక్తో భావరసాశ్రయః. 170**

**అతఃపరం ప్రవక్ష్యామి గ్రీవాకర్మాణి వై ద్విజాః.**

**తా.** ద్విజులారా! భావరసాలతో సంబంధించిన ముఖరాగాన్ని ఈ విధంగా మీకు చెప్పాను. ఇప్పుడు గ్రీవాకర్మలు (మెడతో చేసే చేష్టలు) చెపుతాను.

**మూ. సమా నతోన్నతా త్ర్యశ్రా రేచితా కుఞ్చితాఞ్చితా. 171**

**వలితా చ నివృత్తా చ గ్రీవా నవవిధార్థతః.**

**తా.** అభినయించదగిన వస్తువును అనుసరించి, గ్రీవ (మెడ) – సమ, నతోన్నత, త్ర్యశ్ర, రేచిత, కుంచిత, అంచిత, వలిత, నివృత్త అని తొమ్మిది విధాలు.

**మూ. సమా స్వాభావికీ ధ్యానస్వభావజపకర్మసు. 172**

**నతా నతాస్యాలఙ్కారబన్ధే కణ్ఠావలమ్బనే,**
**ఉన్నతాభ్యున్నతముఖీ గ్రీవా చోర్ధ్వాదిదర్శనే. 173**

**త్ర్యశ్రా పార్శ్వగతా జ్ఞేయా స్కన్ధభారే చ దుఃఖితే,**
**రేచితా విధుతా భ్రాన్తా భావే మథననృత్తయోః. 174**

**కుఞ్చితా కుఞ్చితే మూర్ధ్ని భారితే గలరక్షణే,**
**అఞ్చితాపసృతోద్బన్ధకేశకర్షోర్ధ్వదర్శనే. 175**

**పార్శ్వోన్ముఖీ స్యాద్వలితా గ్రీవాభఙ్గే చ వీక్షితే,**
**వివృత్తాభిముఖీ భూతా స్వస్థానాభిముఖాదిషు. 176**

**తా.** మామూలుగా స్వాభావికమైన స్థితిలో ఉన్న గ్రీవ **సమ.** ఇది ధ్యానము,

స్వభావము – జపం చేయడం మొదలైనవాటికి సంబంధించినది. ముఖం వంచినప్పుడు **నత.** దీనిని మెడలో హారాద్యలంకారం కట్టుకొనే టప్పుడు, ఇతరులు తన కంఠం పట్టుకొన్నప్పుడు ప్రయోగించాలి. పైనున్న వస్తువులు చూడడం మొదలైన పనులలో ముఖం పైకి ఎత్తినప్పుడు **ఉన్నత.** మూపుమీద బరువు ఉన్నప్పుడు, దుఃఖం లోను ప్రక్కకు వంగినది **త్ర్యశ్ర.** కంఠం వేగంగా కదల్చినా, తిప్పినా అది **రేచిత.** (కవ్వంతో) పెరుగు చిలికేటప్పుడు, నృత్తంలో దీని ప్రయోగం. నెత్తిమీద బరువు ఉన్నపుడూ, మెడను రక్షించు కొనడంకొరకూ గ్రీవను వంచినట్లయితే అది **కుంచిత.** ఉరివేయడం, జుట్టు లాగడం, పైకి చూడడం – ఈ సమయాలలో పైకి ఎత్తిన గ్రీవ **అంచిత.** పక్కకు వంగిన గ్రీవ **వలిత.** మెడత్రిప్పి చూడడంలో దీని ప్రయోగం. ముందు వైపు (ముందుకు) తిరిగినది **వివృత్త.** గ్రీవను దాని స్థానంలో ఉంచడం, దేనికైనా అభిముఖంగా ఉండడం మొదలైన సమయాలలో దీని ప్రయోగం.

**మూ. ఇత్యాదిలోకభావార్థా గ్రీవా భేదైరనేకధా,**
**గ్రీవాకర్మాణి సర్వాణి శిరఃకర్మానుగాని హి. 177**
**శిరసః కర్మణా కర్మ గ్రీవాయాః సంప్రవర్తతే,**
**ఇత్యేతల్లక్షణం ప్రోక్తం శీర్షోపాఙ్గసమాశ్రయమ్. 178**
**అఙ్గకర్మాణి శేషాణి గదతో మే నిబోధత. 179**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే ఉపాఙ్గవిధానం నామ అష్టమోఽధ్యాయః.**

**తా.** ఈ విధంగా లోకప్రసిద్ధిలో ఉన్న పద్ధతిని, భావాలను అనుసరించి గ్రీవ అనేక భేదాలలో ఉంటుంది. గ్రీవాకర్మ లన్నీ శిరఃకర్మలను అనుసరించి ఉంటాయి. శిరః కర్మను బట్టి గ్రీవాకర్మ జరుగుతుంది.

ఈ విధంగా శిరస్సుకు, ఉపాంగాలకు సంబంధించిన కర్మల లక్షణం చెప్పాను. మిగిలిన అంగాల కర్మలను చెపుతున్నాను; వినండి.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్ర వ్యాఖ్యానము నందు ఉపాఙ్గవిధానం అను అష్టమాధ్యాయం సమాప్తం.**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ నవమోఽధ్యాయః

## అఙ్గాభినయము

*"అలంక్రియన్తే గాత్రాణి యత్స్పర్శవివశస్థితేః*
*స్పర్శతన్మాత్రవపుషం సంస్తుమః పరమేశ్వరమ్."*

*- శ్రీమదభినవగుప్తాచార్యాః*

**మూ. ఏవమేతచ్ఛిరోనేత్రభ్రూనాసోష్ఠకపోలజమ్,**
**కర్మ లక్షణసంయుక్తముపాఙ్గానాం మయోదితమ్. 1**

**తా.** ఇంతవరకు నేను - ఉపాంగాలైన శిరో - నేత్ర - భ్రూ - నాసా - ఓష్ఠ - కపోలాల కర్మలు, లక్షణాలు మీకు చెప్పాను.

**మూ. హస్తాదీనాం ప్రవక్ష్యామి కర్మ నాట్యప్రయోజకమ్,**
**యథా యేనాభినేయం చ గదతో మే నిబోధత. 2**

**తా.** నాట్యప్రయోగానికి అవసరమైన హస్తాదుల కర్మను చెపుతాను. (ఏ హస్తాదికం చేత) ఏది అభినయించాలో చెపుతున్నాను; వినండి.

**మూ. హస్తోరఃపార్శ్వజఠరకటీజఙ్ఘోరుపాదతః,**
**లక్షణం సంప్రవక్ష్యామి వినియోగం చ తత్త్వతః. 3**

**తా.** హస్తము, వక్షఃస్థలము, పార్శ్వము, పొట్ట, కటిప్రదేశము, కాళ్లు (పిక్కలు), తొడలు, పాదాలు - వీటి లక్షణమూ, వినియోగమూ కూడ యథార్థంగా (శాస్త్రానుసారంగా) చెపుతాను.

**మూ. పతాకస్త్రిపతాకశ్చ తథా వై కర్తరీముఖః,**
**అర్ధచన్ద్రో హ్యరాలశ్చ శుకతుణ్డస్తథైవ చ. 4**

**ముష్టిశ్చ శిఖరాఖ్యశ్చ కపిత్థః కటకాముఖః,**
**సూచ్యాస్యః పద్మకోశశ్చ సర్పశిరా మృగశీర్షకః. 5**

**కాఙ్గూలకోఽలపద్మశ్చ చతురో భ్రమరస్తథా,**
**హంసాస్యో హంసపక్షశ్చ సందంశో ముకులస్తథా. 6**

**ఊర్ణనాభస్తామ్రచూడశ్చతుర్వింశతిరీరితాః,**
**అసంయుతాః సంయుతాంశ్చ గదతో మే నిబోధత. 7**

**తా. ఇరవైనాలుగు (24) అసంయుతహస్తముద్రలు :–** పతాకము, త్రిపతాకము, కర్తరీముఖము, అర్ధచన్ద్రము, అరాలము, శుకతుండము, ముష్టి, శిఖరము, కపిత్థము, కటకాముఖము, సూచ్యాస్యము, పద్మకోశము, సర్పశిరస్సు, మృగశీర్షకము, కాంగూలకము, అలపద్మము, చతురము, భ్రమరము, హంసాస్యము, హంసపక్షము, సందంశము, ముకులము, ఊర్ణనాభము, తామ్రచూడము, అను ఇరవైనాలుగు అసంయుత హస్తముద్రలు (ఒంటిచేతితో వేసే ముద్రలు) చెప్పబడినవి. వీటి తరువాత సంయుత ముద్రలను గూర్చి చెపుతాను; వినండి.

**మూ. అఞ్జలిశ్చ కపోతశ్చ కర్కటః స్వస్తికస్తథా,**
**ఖటకావర్ధమానశ్చ హ్యుత్సఙ్గో నిషధస్తథా. 8**
**దోలః పుష్పపుటశ్చైవ తథా మకర ఏవ చ,**
**గజదన్తోఽవహిత్థశ్చ వర్ధమానస్తథైవ చ. 9**
**ఏతే తు సంయుతా హస్తా మయా ప్రోక్తాస్త్రయోదశ,**
**నృత్తహస్తానతశ్చోర్ధ్వం గదతో మే నిబోధత. 10**

**తా. పదమూడు (13) సంయుతహస్తాలు :–** అంజలి, కపోతం, కర్కటం, స్వస్తికం, ఖటకావర్ధమానం, ఉత్సంగం, నిషధం, దోలం, పుష్పపుటం, మకరం, గజదంతం, అవహిత్థం, వర్ధమానం. ఈ పదమూడు (13) సంయుతహస్తాలు. (రెండు చేతులు కలిపి వేయవలసిన ముద్రలు) నేను చెప్పాను. ఇప్పుడు నృత్తహస్తాలు చెపుతాను; వినండి.

**మూ. చతురస్రౌ తథోద్వృత్తౌ తథా తలముఖౌ స్మృతౌ,**
**స్వస్తికౌ విప్రకీర్ణౌ చాప్యరాలఖటకాముఖౌ. 11**
**ఆవిద్ధవక్రౌ సూచ్యాస్యౌ రేచితావర్ధరేచితౌ,**
**ఉత్తానవఞ్చితౌ చైవ పల్లవౌ చ తథా కరౌ. 12**
**నితమ్బావపి విజ్ఞేయౌ కేశబన్ధౌ తథైవ చ. 13**
**పక్షవఞ్చితకౌ చైవ పక్షప్రద్యోతకౌ తథా**
**జ్ఞేయౌ గరుడపక్షౌ చ దణ్డపక్షావతః పరమ్. 14**
**ఊర్ధ్వమణ్డలినౌ చైవ పార్శ్వమణ్డలినౌ తథా,**
**ఉరోమణ్డలినౌ చైవ ఉరఃపార్శ్వార్ధమణ్డలౌ. 15**
**ముష్టికస్వస్తికౌ చాపి నలినీపద్మకోశకౌ,**
**అలపల్లవోల్బణౌ చ లలితౌ వలితౌ తథా. 16**

**తా. ముప్పై (30) నృత్తహస్తముద్రలు :** (రెండు చేతు లవడంచేత ఈ పేర్లన్నీ

ద్వివచనంలో ఉన్నాయి). చతురశ్రములు. ఉద్వృత్తములు, తలముఖములు, స్వస్తికములు, విప్రకీర్ణములు, అరాలఖటకాముఖములు, ఆవిద్ధవక్త్రములు, సూచ్యాస్యములు, రేచితములు, అర్ధరేచితములు, ఉత్తానవంచితములు, పల్లవములు, నితంబములు, కేశబంధములు, లతలు, కరిహస్తములు, పక్షవంచితకములు, పక్షప్రద్యోతకములు, గరుడ పక్షములు, దండపక్షములు, ఊర్ధ్వమండలులు, పార్శ్వమండలులు, ఉరోమండలులు, ఉరః పార్శ్వార్ధమండలులు, ముష్టికస్వస్తికములు, నలినీపద్మకోశములు, అలపల్లవములు, ఉల్బణములు, లలితములు, వలితములు.

**మూ. చతుఃషష్టికరా హ్యేతే నామతోఽభిహితా మయా,**
**యథాలక్షణమేతేషాం కర్మాణి చ నిబోధత. 17**

**తా.** ఈ విధంగా నేను (64) అరవైనాలుగు హస్తముద్రల పేర్లు చెప్పాను. లక్షణాను సారంగా వీటి కర్మలను (అభినయింపదగినవాటిని) తెలుసుకొనండి.

**మూ. ప్రసారితాః సమాః సర్వా యస్యాఙ్గుల్యో భవన్తి హి,**
**కుఞ్చితశ్చ తథాఙ్గుష్ఠః స పతాక ఇతీరితః. 18**

**తా. అసంయుతహస్తముద్రల లక్షణాలు :- (1) పతాకముద్ర :-** అంగుష్ఠం ముణిచి, మిగిలిన అన్ని అంగుళులు (వేళ్లు) సమంగా చాపి ఉంచిన హస్తం పతాకహస్తం.

**మూ. ఏష ప్రహారపాతే ప్రతాపనే నోదనే ప్రహర్షే చ,**
**గర్వేప్యహమితి తద్జ్ఞైర్లలాటదేశోత్థితః కార్యః. 19**

***19-25 శ్లోకాలలో పతాకహస్తవినియోగం చెప్పబడుచున్నది***

**తా.** దెబ్బ కొట్టేటప్పుడు (ఆయుధం విసిరేటప్పుడు), ఎండ అధికంగా ఉన్నప్పుడు, దేనినైనా దూరంగా తొలగించడంలోను, (లేదా ఎండ వేడిమి తీవ్రంగా ఉన్నప్పుడు దానిని వారించుకొనడానికీ), అత్యంతానందంలోను, 'నేను' అంటూ గర్వం ప్రదర్శించే టప్పుడూ ఈ పతాకహస్తం లలాటం (నుదురు) వరకు ఎత్తాలి.

**మూ. ఏషోఽగ్నివర్షధారానిరూపణే పుష్పవృష్టిపతనే చ,**
**సంయుతకరణః కార్యః ప్రవిరలచలితాఙ్గులిర్హస్తః. 20**

**తా.** అగ్ని మంటలు రేగుతున్నట్లు, వర్షధారలు పడుతున్నట్లు. పుష్పవర్షం కురుస్తూన్నట్లు చూపడానికై పతాకముద్రలో ఉన్న రెండు చేతులూ కలిపి, వేరు చేసిన వేళ్లు కదపాలి.

**మూ. స్వస్తికవిచ్యుతికరణాత్పల్లవపుష్పోపహారశష్పాణి,**
**విరచితముర్వీసంస్థం యద్ద్రవ్యం తచ్చ నిర్దేశ్యమ్. 21**

**తా.** ఈ పతాకహస్తాన్నే స్వస్తికకరణంనుండి వేరు చేసి – నీళ్లు ఎండిపోతూన్న చిన్న చెరువును, పుష్పోపహారం (అలంకరణార్థం పువ్వులు చల్లడం), లేతపచ్చిక, అందంకోసం నేలమీద అమర్చిన ఏదైన ద్రవ్యమూ నిర్దేశించడానికి ప్రయోగించాలి.

**మూ. స్వస్తికవిచ్యుతికరణాత్పునరేవాధోముఖేన కర్తవ్యమ్,**
**సంవృతవివృతం పాల్యం ఛన్నం నిబిడం చ గోప్యం చ. 22**

**తా.** స్వస్తికకరణంనుండి వేరు చేసిన, పతాకహస్తాల వేళ్లు కిందికి వంచి – కప్పబడినదానిని, పైకి తీయబడినదానిని, రక్షించదగినదానిని, దాచినదానిని, దట్టంగా అల్లుకొనిపోయినదానిని, దాచదగినదానిని సూచించడానికి ప్రయోగించాలి.

**మూ. అస్యైవ చాఙ్గులీభిః స్త్వధోముఖప్రస్థితోత్థితచలాభిః,**
**వాయూర్మివేగవేలాక్షోభశ్చౌఘశ్చ కర్తవ్యః. 23**

**తా.** ఈ పతాకహస్తాల వ్రేళ్లనే క్రిందికి వంచుతూ, పైకి లేపుతూ కదలుస్తూ – వాయువేగాన్ని, తరంగాల వేగాన్ని, సముద్రతీరక్షోభాన్ని, మహాజలప్రవాహాన్నీ సూచించడానికై ప్రయోగించాలి.

**మూ. ఉత్సాహనం బహు తథా మహాజనప్రాంశుపుష్కరప్రహతమ్,**
**పక్షోత్క్షేపాభినయం రేచకకరణేన కుర్వన్తి. 24**

**తా.** పతాకముద్రలోనే ఉన్న హస్తాలతో రేచకం చేసి – అధికంగా ప్రోత్సహించడము, మహాజనులు (జనసమూహము), అత్యున్నతమైన వస్తువు, మృదంగవాదనము, (పక్షులు) రెక్కలు విసరుట – వీటిని అభినయించాలి.

**మూ. పరిఘృష్టతలస్థేన తు ధౌతం మృదితం ప్రమృష్టపిష్టే చ,**
**పునరేవ శైలధారణముద్ఘాటనమేవ చాభినయేత్. 25**

**తా.** ఈపతాకముద్రలోనే ఉన్న రెండు చేతులూ రాయడంచేత – ఏదైన ఒక వస్తువును తోమడం, కడగడం, అణిచివేయడం, నలగగొట్టడం, పిండడం లేదా పిండి చేయడం, పర్వతం పైకి ఎత్తడం, దేనినైనా తెరవడం – వీటిని అభినయించాలి.

**మూ. దశాఖ్యాశ్చ శతాఖ్యాశ్చ సహస్రాఖ్యాస్తథైవ చ,**
**పతాకాభ్యాం తు హస్తాభ్యామభినేయః ప్రయోక్తృభిః. 26**
**ఏవమేష ప్రయోక్తవ్యః స్త్రీపుంసాభినయే కరః,**
**అతః పరం ప్రవక్ష్యామి త్రిపాతకస్య లక్షణమ్. 27**

**తా.** పతాకముద్రలో ఉన్న హస్తాలతోనే ప్రయోక్తలు – పది, నూరు, వెయ్యి మొదలైన సంఖ్యలను ప్రదర్శించాలి. అదే విధంగా స్త్రీ – పురుషులను గూర్చి కూడ ఈ హస్తాలతోనే సూచిస్తూ అభినయించాలి.

ఇటుపైన త్రిపతాకహస్తలక్షణం చెపుతాను.

**(2) త్రిపతాకహస్తం :-**

**మూ. పతాకే తు యదా వక్రానామికాత్వఙ్గులిర్భవేత్,**
**త్రిపతాకః స విజ్ఞేయః కర్మ చాస్య విబోధత. 28**

**తా.** పతాకహస్తంలోనే అనామిక (ఉంగరంవేలు) వక్రంగా ఉంచినప్పుడు అది **త్రిపతాకహస్తం** అవుతుంది. దీని పనిని వినండి.

**మూ. ఆవాహనమవతరణం విసర్జనం వారణం ప్రవేశశ్చ,**
**ఉన్నామనం ప్రణామో నిదర్శనం వివిధవచనం చ. 29**
**మఙ్గల్యద్రవ్యాణాం స్పర్శం, శిరసోఽథ సంనివేశశ్చ,**
**ఉష్ణీషముకుటధారణనాసాస్యశ్రోత్రసంవరణమ్. 30**

**తా. త్రిపతాకహస్తవినియోగం :-** ఆవాహనము, దిగడము, విడవడము, నివారించడము, ప్రవేశము, పైకి ఎత్తడము, ప్రణామము, చూపించడము, అనేకవిధాల వచనము, మంగళప్రదద్రవ్యాలను స్పృశించడం - వీటిలో (వీటి ప్రదర్శనంలో) త్రిపతాక హస్తప్రయోగం చెయ్యాలి. అదే విధంగా - ఉష్ణీష (తలపాగా) కిరీటాలు ధరించడం, ముక్కు, నోరు, చెవులు మూసికొనడం మొదలైన శిరస్సుకు సంబంధించిన పనులలో దీనిని ప్రయోగించాలి.

**మూ. అస్యైవ చాఙ్గులీభ్యామధోముఖప్రస్థితోత్థితచలాభ్యామ్,**
**లఘుఖగపతనస్రోతోభుజగభ్రమరాదికాన్ కుర్యాత్. 31**

**తా.** త్రిపతాకముద్రలో ఉన్న హస్తంతోనే కదులుతూన్న రెండు వేళ్లు క్రిందికి వంచుతూ పైకి ఎత్తుతూ చిన్న పక్షుల ఎగరడాన్నీ, ప్రవాహం, సర్పం తుమ్మెద మొదలైన వాటిని (వాటి కదలికలను) అభినయించాలి.

**మూ. అశ్రుప్రమార్జనం తిలకవిరచనం రోచనాలభనకం చ,**
**త్రిపతాకానామికయోః స్పర్శనమలకస్య కర్తవ్యమ్. 32**

**తా.** త్రిపతాకహస్తంలోని అనామిక(ల)తో, బొట్టు పెట్టుకొనడం, రోచనం (చందనాదికం) ధరించడం, ముంగురులు స్పృశించడం - ఈ పనులు చెయ్యాలి. (అభినయించాలి).

**మూ. స్వస్తికౌ త్రిపతాకౌ తు గురుణాం పాదవన్దనే,**
**పరస్పరాగ్రసంశ్లిష్టౌ కార్యావుద్వాహదర్శనే. 33**

**తా.** త్రిపతాకహస్తాలను స్వస్తికకరణంలో ఉంచి పెద్దవాళ్లకు పాదాభివందనం చెయ్యాలి. వివాహాన్ని చూపేటప్పుడు త్రిపతాకహస్తాల అగ్రభాగాలు పరస్పరమూ కలపాలి.

**మూ. విచ్యుతౌ చలితావస్థౌ కర్తవ్యౌ నృపదర్శనే,**
**తిర్యక్ స్వస్తికసంబద్ధౌ స్యాతాం తౌ గ్రహదర్శనే. 34**

**తా.** రాజును అభినయించేటప్పుడు, త్రిపతాకహస్తాలను వేరు చేసి కదల్చాలి. గ్రహాన్ని అభినయించే టప్పుడు త్రిపతాకహస్తాలను అడ్డంగా స్వస్తికకరణంలో ఉంచాలి.

**మూ. తపస్విదర్శనే కార్యౌ ఊర్ధ్వౌ చాపి పరాఙ్ముఖౌ,**
**పరస్పరాభిముఖౌ చ కర్తవ్యౌ ద్వారదర్శనే. 35**

**తా.** మునిని అభినయించే టప్పుడు త్రిపతాకహస్తాలను తిరగవేసి పైకి ఎత్తాలి. ద్వారం అభినయించడానికి, ఆ హస్తాలను పరస్పరము ఎదు రెదురుగా ఉన్నట్లు చూపాలి.

**మూ. ఉత్తానాధోముఖౌ కార్యావగ్రే వక్త్రస్య సంస్థితౌ,**
**బడబానలసంగ్రామే మకరాణాం చ దర్శనే. 36**

**తా.** బడబాగ్ని (సముద్రంలోని అగ్ని), యుద్ధము, మొసళ్లు – వీటి ప్రదర్శనానికి త్రిపతాకహస్తాలను తిరగవేసి క్రిందివైపు దింపి ముఖం దగ్గర ఉంచాలి.

**మూ. అభినేయాస్త్వనేనైవ వానరప్లవనోర్మయః,**
**పవనశ్చ స్త్రియశ్చైవ నాట్యే నాట్యవిచక్షణైః. 37**

**తా.** నాట్యవిచక్షణులు కోతుల గంతులను, తరంగాలను, గాలిని, స్త్రీలను కూడ ఈ హస్తముద్రతోనే, నాట్యంలో, అభినయించాలి.

**మూ. సంముఖప్రసృతాంగుష్ఠః కార్యో బాలేన్దుదర్శనే,**
**పరాఙ్ముఖస్తు కర్తవ్యః యానే నృణాం ప్రయోక్తృభిః. 38**

**తా.** బాలచంద్రుని ప్రదర్శించడానికి, త్రిపతాకాహస్తం అంగుష్ఠం అభిముఖంగా ఉండే టట్లు చూపాలి. మానవుల ప్రయాణాన్ని అభినయించడానికి ఈ హస్తాన్ని పరాఙ్ముఖంగా ఉండేటట్లు చెయ్యాలి.

**మూ. త్రిపతాకే యదా హస్తే భవేత్పృష్ఠావలోకినీ,**
**తర్జనీ మధ్యమాయాశ్చ తదాసౌ కర్తరీముఖః. 39**

**తా. (3) కర్తరీముఖం :–** త్రిపతాకహస్తంలోని తర్జని మధ్యవేలు పృష్ఠభాగాన్ని (వెనుకభాగాన్ని) చూస్తూన్నట్లయితే, అనగా తర్జనిని పైకి లేపి మధ్యమ పైవైపు కొంచెం వంచి నట్లయితే అది **కర్తరీముఖహస్తం** అవుతుంది.

**మూ. పథిచరణరచనరఞ్జనరఙ్గణకరణాన్యధోముఖేనైవ,**
**ఊర్ధ్వముఖేన తు కుర్యాద్దష్టం శృఙ్గం చ లేఖ్యం చ. 40**
**పతనమరణవ్యతిక్రమపరివృత్తవితర్కితం తథా న్యస్తమ్,**
**భిన్నవలితేన కుర్యాత్ కర్తర్యాస్యాఙ్గులిముఖేన. 41**
**సంయుతకరణో వా స్యాదసంయుతో వా ప్రయుజ్యతే తద్‌జ్ఞైః,**
**రురుచమరమహిషసురగజవృషగోపురశైలశిఖరేషు. 42**

**తా.** కర్తరీముఖహస్తాన్ని అధోముఖం (క్రిందికి ముఖం ఉండే టట్లు) చేసి మార్గమును, పాదాలంకరణమును, పాదాలకు పారాయిణి పూయడం, ముగ్గులు వేయడం వీటిని అభినయించాలి. ఈ హస్తాన్నే ఊర్ధ్వముఖం చేసి కరవడం, శృంగము, (లేఖాదికం) రాయడం అభినయించాలి. కర్తరీముఖహస్తంలోని వేలు ముఖం (అగ్రం) విపరీతమైన దిక్కు వైపు తిప్పి – పడిపోవడము, మరణము, దాటిపోవడము, తిరిగిరావడం, ఆలోచన, (ఒకవస్తువును) ఉంచడం – వీటిని అభినయించాలి. రురు – చమర – మహిష – ఐరావత – వృషభ – గోపుర – పర్వత – శిఖరాదుల ప్రదర్శనం కర్తరీముఖముద్రలో ఉన్న రెండు చేతులను కలిపి గాని, ఒక చేతితో కాని ప్రదర్శించాలి.

**మూ. యస్యాఙ్గుల్యస్తు వినతాః సహాఙ్గుష్ఠేన చాపవత్,**
**సోఽర్ధచన్ద్ర ఇతి ఖ్యాతః కరః కర్మాస్య వక్ష్యతే. 43**

**తా. (4) అర్ధచంద్రహస్తం :–** అంగుష్ఠంతో సహా అన్ని వేళ్లూ ధనస్సు వలె వంగి ఉండే హస్తం **అర్ధచంద్రహస్తం.** దీని వినియోగాలు చెపుతున్నాను.

**మూ. ఏతేన బాలతరవః శశిలేఖా కమ్బుకలశవలయాని,**
**నిర్ఘాటనమాయస్తం మధ్యౌపమ్యం చ పీనం చ. 44**
**రశనా జఘనకటీనామాననతలపత్రకుణ్డలాదీనామ్,**
**కర్తవ్యో నారీణామభినయయోగోఽర్ధచన్ద్రేణ. 45**

**తా.** చిన్న చిన్న చెట్లు (మొక్కలు), చంద్రలేఖ, శంఖము, కలశము, వలయము, బలవంతంగా (మెడ బట్టి) గెంటివేయడం, ప్రయాస, నడుముకు సామ్యం, బలిసి ఉండడం (బలిసినది), స్త్రీల వడ్డాణము, జఘనము, కటిప్రదేశము, చెక్కిళ్లమీద చేసే పత్రరచన (రంగులతో వేసే చిత్రాలు) కుండలాలు మొదలైనవాటి అభినయం చెయ్యాలి.

**మూ. ఆద్యా ధనుర్నతా కార్యా కుఞ్చితోఽఙ్గుష్ఠకస్తథా,**
**శేషా భిన్నోర్ధ్వలలితా హ్యరాలేఽఙ్గులయః కరే. 46**

**తా. (5) అరాలహస్తం :–** చిటికిన వేలు ధనస్సు వలె వంచి, అంగుష్ఠం ముణిచి మిగిలిన మూడు వేళ్లూ విడిగా చాపి ఉంచితే అది **అరాళహస్తం.**

**మూ. ఏతేన సత్త్వశౌణ్డీర్యవీర్యకాన్తిధృతిదివ్యగామ్భీర్యమ్,**
**ఆశీర్వాదాశ్చ తథా భావా హితసంజ్ఞకాః కార్యాః. 47**

**తా.** అరాలహస్తంచేత – సత్త్వము (మనోబలము), శౌర్యము, వీర్యము, కాంతి, ధైర్యము, దివ్యత్వము, గంభీరత్వము, ఆశీర్వాదము, హితమైన భావాలు అభినయించాలి.

**మూ. ఏతేన పునః స్త్రీణాం కేశానాం సంగ్రహస్తథోత్కర్షః,**
**సర్వాఙ్గికం తథైవ చ నిర్వర్ణనమాత్మనః కార్యమ్. 48**

**తా.** స్త్రీలు తమ కేశాలు పట్టుకొని ముడివేసికొనడము, ముడివిప్పి కేశాలు వ్యాపించే టట్లు చేయడం, వాళ్లు తమ సర్వావయవాలు పరిశీలనగా చూచుకొనడము అరాళహస్తంతో అభినయించాలి.

**మూ. కౌతుకవివాహయోగం ప్రదక్షిణేనైవ సంప్రయోగం చ,**
**అఙ్గుల్యగ్రస్వస్తికయోగాన్ పరిమణ్డలేనైవ. 49**

**తా.** అరాలహస్తాలు రెండూ ఒకదానికి ఒకటి నలుదిక్కులా తిప్పుతూ, వాటి వేళ్లు స్వస్తికా కారంలో కలిపి కౌతుకం (వివాహోత్పూర్వం చేసే మంగళకార్యాలు) వివాహం, ప్రదక్షిణం చేయడం వీటిని అభినయించాలి.

**మూ. ప్రాదక్షిణ్యం పరిమణ్డలం చ కుర్యాన్మహాజనం చైవ,**
**యచ్చ మహీతలరచితం ద్రవ్యం తచ్చాభినేయం స్యాత్. 50**

**తా.** ఈ అరాళముద్రలతోనే – ప్రదక్షిణం చేయడం, నాల్గు మూలలనుండీ చుట్టుముట్టడం, జనాలు చాలమంది ఒక చోట గుమిగూడడం, నేలమీద ఏదో ద్రవ్యంతో అలంకరించడం – వీటిని అభినయించాలి.

**మూ. ఆహ్వానే చ నివారణనిర్మాణే చాప్యనేకవచనే చ,**
**స్వేదస్య చాపనయనే గన్ధాఘ్రాణే శుభః శుభే చైషః. 51**

**తా.** ఈ అరాళహస్తం – ఆహ్వానంలోను, నివారించడంలోను, (ఏదైన) నిర్మించడం లోను, అనేకము అని చెప్పడంలోను, చెమటను తొలగించుకొనడంలోను, మంచి గంధాన్ని ఆఘ్రాణించడంలోను శుభ మైనది.

**మూ. త్రిపతాకహస్తజాని తు పూర్వం యాన్యభిహితాని కర్మాణి,**
**తాని త్వరాలయోగాత్ స్త్రీభిః సమ్యక్ ప్రయోక్తవ్యాని. 52**

**తా.** త్రిపతాకహస్తంతో చేయవలసినవిగా వెనుక చెప్పిన పను లన్నీ, స్త్రీలు అరాళ హస్తంతో చక్కగా నిర్వర్తించాలి.

**మూ. అరాలస్య యదా వక్రానామికా త్వఙ్గులిర్భవేత్,**
**శుకతుణ్డస్తు స కరః కర్మ చాస్య నిబోధత. 53**

**తా. (6) శుకతుండం :–** అరాళహస్తముద్రలోని అనామిక వక్రంగా ఉండే టట్లు చేసిన ట్లయితే అది **శుకతుండహస్తం** అవుతుంది. దీని పనులు వినండి.

**మూ. ఏతేన త్వభినేయం నాహం న త్వం న కృత్యమితి చార్థే,**
**ఆవాహనే విసర్గే ధిగితి చ వచనే చ సావజ్ఞమ్. 54**

**తా.** 'నేను కాదు; నువ్వూ కాదు' – అనగా "నీకూ నాకూ సంబంధం లేదు", "ఇలా చేయకూడదు" అనే అర్థాన్ని బోధించడానికీ, ఆవాహనం, విసర్జనం, 'ఛీ!' అని నిందావచనం పలకడం – ఈ అర్థాలను బోధించడానికీ ఈ శుకతుండహస్తం ప్రయోగించాలి.

**మూ. అఙ్గుల్యో యస్య హస్తస్య తలమధ్యేఽగ్రసంస్థితాః,**
**తాసాముపరిచాఙ్గుష్ఠం స ముష్టిరితి సంజ్ఞితః. 55**

**తా. (7) ముష్టి :–** నాలుగు వేళ్లూ అరచేతిలోనికి వాటి అగ్రభాగాలు ఉండే టట్లు మణిచి వాటిమీద అంగుష్ఠం ఉంచినట్లయితే **అది ముష్టిహస్తం** (పిడికిలి).

**మూ. ఏష ప్రహారే వ్యాయామే నిర్గమే పీడనే తథా,**
**సంవాహనేఽసియష్టీనాం దణ్డకున్తగ్రహే తథా. 56**

**తా.** ఇది ఇతరులను కొట్టినప్పుడు, వ్యాయామం చేయడంలోను, పండ్ల రసం మొదలైనవి బైటకు తీయడంలోను, ఆవుల పాలు పిండడంలోను, మట్టి మొదలైనవి పిసగడంలోను, కత్తులు, దండాలు, కుంతాలు పట్టుకొనడంలోను వినియోగింప బడుతుంది.

**మూ. అస్యైవ చ యదా ముష్టేః ఊర్ధ్వోఽఙ్గుష్ఠః ప్రయుజ్యతే,**
**హస్తః స శిఖరో నామ తదా జ్ఞేయః ప్రయోక్తృభిః. 57**

**తా. (8) శిఖరహస్తం :–** ఈ ముష్టిహస్తంలోనే అంగుష్ఠం పైకి నిలబెడితే అది **శిఖరహస్త** మని నాట్యప్రయోక్తలు గ్రహించాలి.

**మూ. రశ్మికుశాఙ్కుశధనుషాం తోమరశక్తిప్రమోక్షణే చైవ,**
**అధరోష్ఠపాదరఞ్జనమలకస్యోత్క్షేపణే చైవ. 58**

**తా.** (గుఱ్ఱం) కళ్లాలు, కుశలు, అంకుశము, ధనస్సులు, పట్టుకొన్నప్పుడు, తోమరములు, శక్తులు, విడిచే టప్పుడు, అధరోష్ఠమునకు, పాదాలకు రంగు పూసికొనేటప్పుడు, ముందుకు పడుతూన్న జుట్టు పైకి తీసికొనేటప్పుడు ఈ హస్తాన్ని ప్రయోగించాలి.

**మూ. అస్యైవ శిఖరాఖ్యస్య హ్యఙ్గుష్ఠకనిపీడితా,**
**యదా ప్రదేశినీ వక్రా స కపిత్థస్తదా స్మృతః. 59**

**తా. (9) కపిత్థహస్తం :-** శిఖరహస్తంలోని ప్రదేశిని (తర్జని) వంకరగా చేసి దానిని అంగుష్ఠంచేత నొక్కితే అది **కపిత్థహస్తం.**

**మూ. అసిచాపచక్రతోమరకున్తగదాశక్తివజ్రవర్గాణి,**
**శస్త్రాణ్యభినేయాని తు కార్యం పథ్యం చ సత్యం చ. 60**

**తా.** ఖడ్గము, ధనస్సు, చక్రము, తోమరము, కుంతము, గద వజ్రము – ఈ జాతికి చెందిన ఆయుధాలను, హితము సత్యము అయిన కార్యమును ఈ కపిత్థహస్తంతో ప్రదర్శించాలి.

**మూ. ఉత్క్షిప్తవక్రా తు యదానామికా సకనీయసీ,**
**అస్యైవ తు కపిత్థస్య తదాసౌ ఖటకాముఖః. 61**

**తా. (10) ఖటకాముఖహస్తం :-** కపిత్థహస్తంలోనే అనామిక, కనిష్ఠిక ఈ రెండు వేళ్లూ పైకి ఎత్తి కొంచెం వంకరగా ఉంచినప్పుడు అది **ఖటకాముఖహస్తం.**

**మూ. హోత్రం హవ్యం ఛత్రం ప్రగ్రహపరికర్షణం వ్యజనకం చ,**
**ఆదర్శధారణం ఖణ్డనం తథా పేషణం చైవ. 62**
**ఆయతదణ్డగ్రహణం ముక్తాప్రాలమ్బసంగ్రహం చైవ,**
**స్రగ్దామపుష్పమాలావస్త్రాన్తాలమ్బనం చైవ. 63**
**మన్థనశరావకర్షణపుష్పాపచయప్రతోదకార్యాణి,**
**అఙ్కుశరజ్జ్వాకర్షణస్త్రీదర్శనమేవ కార్యం చ. 64**

**తా.** హోమసాధనము, హోమద్రవ్యము, ఛత్రము, (గుఱ్ఱం) కళ్లెం లాగడము, వ్యజనము (విసనకఱ్ఱ), అద్దం పట్టుకొనడము, ఖండించడము, నూరడము, పొడవైన దండాన్ని పట్టుకొనడము, ముత్యాల హారం స్వీకరించడము, పుష్పమాలాదుల ధారణము, వస్త్రం కొంగు లాగడము, మథించడము, బాణం లాగడము, పుష్పాలు కోయడము, కొరడా పట్టుకొనడము, అంకుశము, త్రాడు లాగడము, స్త్రీ – ఇవన్నీ ఖటకాముఖహస్తంతో చూపాలి.

**మూ. ఖటకాఖ్యే యదా హస్తే తర్జనీ సంప్రసారితా,**
**హస్తః సూచీముఖో నామ తదా జ్ఞేయః ప్రయోక్తృభిః. 65**

**తా. (11) సూచీముఖం :-** ఖటకాముఖహస్తముద్రలోని తర్జనిని చాపిన ట్లయితే అది **సూచీముఖహస్తం** అని నాట్యప్రయోక్తలు తెలుసుకోవాలి.

**మూ. అస్య వివిధాన్ ప్రయోగాన్ వక్ష్యామి సమాసతః ప్రదేశిన్యాః,**
**ఊర్ధ్వ-నత-లోల-కమ్పిత-విజృమ్భితోద్వాహితచలాయాః. 66**

**తా.** ఈ సూచీముఖహస్తంలోని తర్జనికి సంబంధించిన – పైకి ఎత్తబడుట, వంచబడుట, చంచలంగా ఉండుట, వణుకుట, తిన్నగా చాపబడుట, పైకి వెళ్లుట మొదలైన అనేకఅవస్థలలో చేసే ప్రయోగాలను చెపుతాను.

**మూ. చక్రం తటిత్పతాకామఞ్జర్యః కర్ణచూలికాశ్చైవ,**
**కుటిలగతయశ్చ సర్వే నిర్దేశ్యాః సాధువాదాశ్చ. 67**
**బాలోరగపల్లవధూమదీపవల్లీలతాః శిఖణ్డాశ్చ,**
**పరిపతనవక్రమణ్డలమభినేయాన్యూర్ధ్వలోలితయా. 68**

**తా.** చక్రము, మెరుపు, పతాక (చిన్నజండా), పూల గుత్తి, కర్ణాలంకారము, కుటిలంగా (వక్రంగా) నడిచే అన్ని ప్రాణులూ, సాధువాదాలు (బాగు బాగు అను అరుపులు), పాము పిల్ల, చిగురు, దూమం, దీపం, వల్లి, లత, కాకపక్షం (చిన్నపిల్లల పొట్టి జుట్టు), క్రిందపడడం, వక్రత్వము, మండలము – వీటిని పైకి ఎత్తి కదల్చ బడుతూన్న తర్జనితో అభినయించాలి.

**వి.** ఆనపకాయతీగ మొదలైనవి వల్లులు. ద్రాక్షమొదలైన తీగలు లతలు (అ.భా.).

**మూ. భూయశ్చోర్ధ్వవిరచితా తారాఘోణైకదణ్డయష్టిషు చ,**
**వినతా చ తథా కార్యా దంష్ట్రిషు చ తథాస్యయోగేన. 69**

**తా.** తర్జనిని పైకి ఎత్తి నక్షత్రదర్శనాన్ని, ముక్కు, ఒకటి అను సంఖ్య, దండము, కఱ్ఱ – వీటిని అభినయించాలి. ఈ వేలునే వంచి ముఖం దగ్గర ఉంచి కోరలు గల జంతువులను సూచించాలి.

**మూ. పునరపి మణ్డలగతయా సర్వగ్రహణం తథైవ లోకస్య,**
**ప్రణతోన్నతే చ కార్యే హ్యద్యే దీర్ఘే చ దివసే చ. 70**

**తా.** తర్జనిని గుండ్రంగా తిప్పితే 'ఈ సమస్తలోకమూ' అను అర్థం సూచిత మవుతుంది. క్రిందికి దింపి పైకి ఎత్తి నట్ల యితే మొదటి దివసము, దీర్ఘదివసము అను అర్థాలు సూచింపబడతాయి.

**మూ. వదనాభ్యాశే కుఞ్చితవిజృమ్భితా వాక్యరూపణే కార్యా,**
**శ్రవణాభ్యాశే వక్రా విజృమ్భణే వాక్యరూపణావసరే. 71**

**తా.** తర్జనిని వంచి నోటి దగ్గర కదల్చిన ట్లయితే మాటలాడడాన్ని సూచిస్తుంది. వంకరగా చేసి చెవి దగ్గర దానిని ఊపినట్లయితే అది మాట అర్థం అవడాన్ని సూచిస్తుంది.

**మూ. మేతి వదేతి చ యోజ్యా ప్రసారితోత్కమ్పితోత్తానా,**
**కార్యా ప్రకమ్పితా రోషదర్శనే స్వేదరూపణే చైవ. 72**

**తా.** తర్జనిని తిరగదీసి, చాపి కదల్చిన ట్లయితే 'వద్దు' అనీ, 'చెప్పుము' అనీ సూచిస్తుంది. రోషం ప్రదర్శించడానికీ, చెమటను సూచించడానికీ తర్జనిని ఎక్కువగా కదపాలి.

**మూ. కున్తలకుణ్డలాఙ్గదగణ్డాశ్రయసంశ్రయేఽభినయే,**
**గర్వేఽహమితి లలాటే రిపునిర్దేశే తథైవ చ క్రోధే. 73**
**కోఽసావితి నిర్దేశేఽథ కర్ణకణ్డూయనే చైవ.**

**తా.** కుంతలములు, కుండలములు, బాహుపురులు, గండస్థలంమీద ఉన్న ఇతర వస్తువులు – వీటికి సంబంధించిన అభినయంలోను, 'నేను' అను గర్వంలోను, శత్రువును నిర్దేశించేటప్పుడు, క్రోధంలోను, "వీడెవడు?" అని నిర్దేశించడంలోను, చెవి గోక్కొనడం లోను తర్జనిని లలాటం వైపు తీసికొనివెళ్లాలి.

**మూ. సంయుక్తా సంయోగే కార్యా విశ్లేషితా వియోగే చ. 74**
**కలహే స్వస్తికయుక్తా పరస్పరోత్పీడితా బన్ధే.**

**తా.** సంయోగం ప్రదర్శించడానికి సూచీముఖముద్రలో ఉన్న రెండు హస్తాలూ కలపాలి; వియోగం సూచించడానికి విడదీయాలి. కలహాన్ని సూచించడానికి రెండు హస్తాలూ స్వస్తికంలో ఉంచాలి. బంధనం సూచించడానికి ఒకదానితో ఒకటి పీడించాలి.

**మూ. ద్వాభ్యాం తు వామపార్శ్వే దక్షిణతో దిననిశావసానాని. 75**
**అభిముఖపరాఙ్ముఖీభ్యాం విశ్లిష్టాభ్యాం ప్రయుఞ్జీత.**

**తా.** సూచీముఖముద్రలో ఉన్న రెండు హస్తాలు కలవకుండా వేరుగా ఉంచుతూ పరస్పరము అభిముఖంగా ఉండే టట్లు చేసి ఎడమ పార్శ్వం వైపు తిప్పితే అది పగలు గడిచిపోవడాన్నీ, కుడి పార్శ్వం వైపు తిప్పితే రాత్రి గడిచిపోవడాన్నీ సూచిస్తుంది.

**(మూ. ద్వాభ్యాం ప్రదర్శయేన్నిత్యం సంపూర్ణం చన్ద్రమణ్డలమ్. 76**
**శ్లిష్టా లలాటే శక్రస్య కార్యాహ్యుత్తానసంశ్రయా.**

**తా.** ఎల్లప్పుడు రెండు హస్తాలూ కలిపి చంద్రమండలాన్ని అభినయించాలి. ఇంద్రుణ్ణి అభినయించడానికి రెండుహస్తాలూ కలిపి, తిరగవేసి లలాటంమీద ఉంచాలి.)

**మూ. పరిమణ్డలం భ్రమితయా మణ్డలమాదర్శయేచ్చ చంద్రస్య. 77**
**హరనయనే చ లలాటే శక్రస్య చ తిర్యగుత్తానా.**

**తా.** ఈ హస్తాలు గుండ్రంగా త్రిప్పి చంద్రమండలాన్ని చూపించాలి (అభినయించాలి). శివుని నేత్రం అభినయించే టప్పుడు ఈ హస్తాలు లలాటంమీద ఉంచాలి. ఇంద్రుని నేత్రాలు చూపే టప్పుడు ఉత్తానంగా (తిరగవేసి) అడ్డంగా ఈ హస్తాలు శిరస్సు వైపు ఎత్తాలి.

**(మూ. పునరపి చ భ్రమితాగ్రా రూపశిలావర్తయస్త్రశైలేషు. 78**

**పరివేషణే తథైవ హి కార్యా చాధోముఖీ నిత్యమ్,**

**శ్లిష్టా లలాటపట్టేష్వధోముఖీ శమ్భురూపణే కార్యా. 79**

**శక్రస్యాప్యుత్తానా తద్జ్ఞైస్తిర్యక్ స్థితా కార్యా.**

**తా.** సూచీముఖహస్తాన్నే దాని అగ్రభాగాన్ని తిప్పినట్లయితే అది ఏదైన ఒక వస్తువు స్వరూపాన్నీ, తిరుగలిని, పర్వతాన్నీ సూచిస్తుంది. దీనినే కిందికి తిప్పితే వడ్డనను సూచిస్తుంది. ఈశ్వరుణ్ణి సూచించడానికి ఈ సూచీహస్తద్వయాన్ని దగ్గరగా చేర్చి, దాని అగ్రం క్రింది వైపు ఉండే టట్లు లలాటంమీద ఉంచాలి; దానినే వెల్లగితల ఉండే టట్లు చేసి, అడ్డంగా లలాటంమీద ఉంచితే ఇంద్రుణ్ణి సూచిస్తుంది.

**మూ. యస్యాఙ్గుల్యస్తు విరలాః సహాఙ్గుష్ఠేన కుఞ్చితాః. 80**

**ఊర్ధ్వాహ్యసంగతాగ్రాశ్చ స భవేత్పద్మకోశకః.**

**తా. (12) పద్మకోశం :–** వేళ్లు అన్నీ విడి విడిగా ఉండే టట్లు చేసి, అంగుష్ఠంతో సహా అన్నింటినీ వంచి, అగ్రభాగాలు తగలకుండా పైకి ఎత్తి ఉంచిన హస్తం **పద్మకోశ హస్తం.**

**మూ. బిల్వకపిత్థఫలానాం గ్రహణం కుచదర్శనం చ నారీణామ్, 81**

**గ్రహణే హ్యామిషలాభే భవన్తి తాః కుఞ్చితాగ్రాస్తు,**

**బహుజాతిబీజపూరకమామిషఖణ్డం చ నిర్దేశ్యమ్. 82**

**తా.** మారేడు పండ్లు, వెలగ పండ్లు, స్త్రీకుచాలు – వీటిని చూపడంలో ఈ హస్తం ప్రయోగించాలి. అయితే వీటిని పట్టుకొన్నట్లు, మాంసం లభించి నట్లు చూపే టప్పుడు మాత్రం వేళ్ల అగ్రాలు కిందికి వంచాలి. ఈ హస్తంచేతనే అనేకజాతులు గల బీజపూరకఫలమూ, మాంసఖండమూ కూడ చూపించాలి.

**మూ. దేవార్చనబలిహరణే సముద్గకే సాగ్రపిణ్డదానే చ,**

**కార్యః పుష్పప్రకరశ్చ పద్మకోశేన హస్తేన. 83**

**తా.** దేవతల అర్చనకు సంబంధించిన నైవేద్యం సమర్పించడాన్నీ, పుష్పాల బుట్టనూ,

హస్తాగ్రంతో పిండప్రదానం చేయడాన్నీ, పుష్పసముదాయాన్నీ ఈ పద్మకోశ హస్తంతోనే చూపాలి.

**మూ. మణిబన్ధనవిశ్లిష్టప్రవిదలచలితాఙ్గులికరాభ్యామ్,**
**కార్యో వివర్తితాభ్యాం వికసితకమలోత్పలాభినయః. 84**

**తా.** పద్మకోశముద్రలో ఉన్న రెండు హస్తాలు మణిబంధాల దగ్గర కలిపి, విడిగా ఉన్న వేళ్లు కదుపుతూ వెల్లగితలా ఉంచిన, వాటితో వికసించిన పద్మాలను, కలువలను అభినయించాలి.

**మూ. అఙ్గుల్యః సంగతాః సర్వాః సహాఙ్గుష్ఠేన యస్య చ,**
**తథా నిమ్నతలశ్చైవ స తు సర్పశిరాః కరః. 85**

**తా. (13) సర్పశిరోహస్తం :–** అంగుష్ఠంతో సహా వేళ్లు అన్నీ దగ్గరగా కలిసి ఉండగా, అరచేయి పల్లంగా ఉండే టట్లు చేసిన ట్లయితే అది సర్పశిరోహస్తం. పాము పడగ ఆకారం గల హస్తం.

**మూ. ఏష సలిలప్రదానే భుజగగతౌ తోయసేచనే చైవ,**
**ఆస్ఫోటనే చ యోజ్యః కరికుమ్భాస్ఫాలనాద్యేషు. 86**

**తా.** జలప్రదానంలోను, సర్పాల నడకలోను, నీళ్లతో తడపడంలోను, జబ్బ చరవడంలోను, ఏనుగు కుంభస్థలాన్ని చరవడంలోను ఈ హస్తాన్ని వినియోగించాలి.

**మూ. అధోముఖీనాం సర్వాసామఙ్గులీనాం సమాగమః,**
**కనిష్ఠాఙ్గుష్ఠకావూర్ధ్వౌ స భవేన్మృగశీర్షకః. 87**

**తా. (14) మృగశీర్షహస్తం :–** అన్ని వేళ్లూ దగ్గరగా అధోముఖంగా (క్రిందికి అగ్రాలు ఉండే టట్లు) ఉంచి కనిష్ఠికను, అంగుష్ఠాన్ని మాత్రం పైకి ఎత్తి నట్లయితే అది **మృగశీర్షహస్తం.**

**మూ. ఇహ సామ్ప్రతమద్యేతి చ శక్త్యుల్లాసనేఽక్షపాతే చ,**
**స్వేదాపమార్జనేషు చ కుట్టమితే ప్రచలితస్తు భవేత్. 88**

**తా.** 'ఇప్పుడు ఇది ఇలా ఉంది', 'ఈ రోజున ఇది ఇలా ఉంది' అని చెప్పడము, శక్తిని చూపడము. పాచికలు ఆడడము, చెమట తుడుచుకొనడము, కుట్టమితము – వీటిలో మృగశీర్షకహస్తం వినియోగించాలి.

**మూ. త్రేతాగ్నిసంస్థితా మధ్యా తర్జన్యఙ్గుష్ఠకా యదా,**
**కాఙ్గులేఽనామికా వక్రా తథా చోర్ధ్వా కనీయసీ. 89**

**తా. (15) కాంగులహస్తం :–** మధ్యవేలు, తర్జని, అంగుష్ఠము త్రేతాగ్నుల వలె

ఉంటాయి. వాటి స్థానాలలో విడిగా చాపబడి ఉంటాయి. అనామిక వక్రంగా ఉంటుంది. కనిష్ఠిక పైకి లేచి ఉంటుంది. ఇది **కాంగులహస్తం.**

**వి.** ఆహ నీయము, గార్హపత్యము, దక్షిణాగ్ని అను మూడు అగ్నులను వేరు వేరు గుండాలలో ఒకే అగ్ని గృహంలో సంరక్షిస్తారు. వాటి స్థానాలు మూడూ ఎలా ఉంటాయో ఈ మూడు వేళ్లూ ఆ స్థితిలో కనబడతాయి. 'కంగు' అనగా ప్రియంగువృక్షం. దాని పువ్వులు కోసేటప్పుడు హస్తం ఏ స్థితిలో ఉంటుందో ఆ స్థితి ఈ ముద్రది. 'కంగు' అనగా తేలు అని కొంద రంటారు (అ.భా.).

**మూ. ఏతేన తరుణఫలరూపణాని నానావిధాని లఘూని,**
**కార్యాణి రోషజాని స్త్రీవచనాన్యఙ్గులిక్షేపైః. 90**

**తా.** ముదరని ఫలాలు, చిన్న చిన్న కాయలు. స్త్రీలు కోపంతో మాట్లాడే మాటలూ వేళ్లు విసురుతూ ఈ హస్తంతో చూపాలి.

**మూ. మరకతవైదూర్యాదేః ప్రదర్శనం సుమనసాం చ కర్తవ్యమ్,**
**గ్రాహ్యం బిడాలపదమితి తద్‌జ్ఞైరేవం ప్రయోగేషు. 91**

**తా.** మరకతము వైదూర్యము మొదలైన మణులు, పుష్పాలు చూపేటప్పుడు బిడాలపదంలో ఉండాలి అని ఆ విషయాలు తెలిసినవాళ్లు చెపుతున్నారు.

**వి. 'బిడాలపదమ్'** కు బదులు **'మరాళపదమ్'** అని మరొక పాఠం.

**మూ. ఆవర్తితాః కరతలే యస్యాఙ్గుల్యో భవన్తి హి,**
**పార్శ్వాగతవికీర్ణాశ్చ స భవేదలపల్లవః. 92**

**తా. (16) అల్లపల్లవహస్తం :-** వేళ్లన్నీ అరచేతి వైపు ముణిచి ప్రక్కలకు చాపి ఉంచాలి. అది అలపల్లవహస్తం.

**మూ. ప్రతిషేధకృతే యోజ్యః కస్య త్వం నాస్తి శూన్యవచనేషు,**
**పునరాత్మోపన్యాసః స్త్రీణామేతేన కర్తవ్యః. 93**

**తా.** నిషేధించేటప్పుడు, "నువ్వు ఎవరివాడవు – (నీకూ నాకు సంబంధం ఏమిటి), "ఉట్టుట్టి మాటలతో లాభం లేదు" అని అంటూ స్త్రీలు మళ్లీ తమను గూర్చి ప్రియుని దగ్గర చెప్పుకొనే టప్పుడు అలపల్లవహస్తం ప్రయోగించాలి.

**మూ. తిస్రః ప్రసారితా యత్ర తథా చోర్ధ్వా కనీయసీ,**
**తాసాం మధ్యే స్థితోఽఙ్గుష్ఠః స కరశ్చతురః స్మృతః. 94**

**తా. (17) చతురహస్తం :-** మూడు వేళ్లూ విస్తరింపచెయ్యాలి. చిటికిన వేలు పైకి ఎత్తాలి. అంగుష్ఠం వాటి మధ్యకు రావాలి. ఇది **చతురముద్ర.**

**మూ. నయ-వినయ-నియమ-సునిపుణ-బాల-ఆతుర-సత్త్వ-కైతవార్థేషు,**
**వాక్యే యుక్తే పథ్యే సత్యే ప్రశమే చ వినియోజ్యః. 95**

**తా.** నయము, వినయము, నియమము, మంచినేర్పు, బాలుడు, రోగి, శక్తి, మోసం – అనే అర్థాలలోను, యుక్తమూ పథ్యమూ, సత్యమూ అయిన వాక్కువిషయంలోను, శాంతి విషయంలోను ఈ చతురహస్తం వినియోగించాలి.

**మూ. ఏకేన ద్వాభ్యాం వా కించిన్మణ్డలకృతేన హస్తేన,**
**వివృతవిచారితచరితం వితర్కితం లజ్జితం చైవ. 96**

**తా.** ఈ ముద్రలో ఉన్న కొంచెం గుండ్రంగా చేసిన ఒక హస్తంతో కాని, రెండింటితోనూ కాని – తెరవడం, విచారించడం, చేయడం, ఊహించడం, సిగ్గు – వీటిని అభినయించాలి.

**మూ. నయనౌపమ్యం పద్మదలరూపణం హరిణకర్ణనిర్దేశః,**
**సంయుతకరేణైవ తు చతురేణైతాని కుర్వీత. 97**

**తా.** నేత్రాలను పద్మదలాలతో పోల్చేటప్పుడు, లేడుల చెవులను సూచించే టప్పుడు చతురముద్రలో ఉన్న రెండు హస్తాలతోనూ అభినయించాలి.

**మూ. లీలారతీ రుచిం చ స్మృతిబుద్ధివిభావనాః క్షమాం పుష్టిమ్,**
**సంజ్ఞామాశాం ప్రణయం విచారణం సంగతం శౌచమ్. 98**
**చాతుర్యం మాధుర్యం దాక్షిణ్యం మార్దవం సుఖం శీలమ్,**
**ప్రశ్నం వార్తాయుక్తిం వేషం మృదుశాద్వలం స్తోకమ్. 99**
**విభవావిభవౌ సురతం గుణాగుణౌ యౌవనం గృహం దారాన్,**
**నానావర్ణాంశ్చ తథా చతురేణైవం ప్రయుఞ్జీత. 100**

**తా.** విలాసం, ప్రీతి, రుచి, స్మరణము, బుద్ధి, ఆలోచన, ఓర్పు, పుష్టి, సంజ్ఞ, ఆశ, ప్రేమ, విచారించడం, సంగమము, శౌచం, నేర్పు, మాధుర్యం, అందరినీ సమదృష్టితో చూచే దాక్షిణ్యం, మృదుత్వం, సుఖం, మంచి శీలం, ప్రశ్న, వార్తలతో సంబంధం, వేషం, మెత్తని పచ్చికబీడు, కొంచెము (అల్పత్వము), సామర్థ్యం, సామర్థ్యం లేకపోవడం, సురతం, గుణాలు, దుర్గుణాలు, యౌవనం, గృహం, భార్య, అనేకవర్ణాలు (రంగులు) – వీటిని చతురహస్తంతో ప్రయోగించాలి.

**(మూ. సితమూర్ధ్వేన తు కుర్యాద్రక్తం పీతం చ మణలకృతేన,**
**పరిమృదితేన తు నీలం వర్ణాంశ్చతురేణ హస్తేన. 101**

**తా.** చతురహస్తాన్ని పైకి ఎత్తి తెలుపురంగును, గుండ్రంగా తిప్పి ఎరుపును, పసుపురంగును, నలిపి నీలం రంగును ప్రదర్శించాలి).

**మూ. మధ్యమాఙ్గుష్ఠసందంశో వక్రా చైవ ప్రదర్శినీ,**
**ఊర్ధ్వమన్యే ప్రకీర్ణే చ ద్వ్యఙ్గుల్యౌ భ్రమరే కరే. 102**

**తా. (18) భ్రమరహస్తం :–** మధ్యవేలు, అంగుష్ఠం పక్కభాగమూ (పట్టుకారువలె) దగ్గరికి చేర్చాలి. తర్జనిని వంకరగా ఉంచాలి. అనామిక, కనిష్ఠిక కూడ విడిగా పైకి చాపి ఉంచాలి. ఇది **భ్రమరహస్తం.**

**మూ. పద్మోత్పలకుముదానామన్యేషాం చైవ దీర్ఘవృన్తానామ్,**
**పుష్పాణాం గ్రహణవిధిః కర్తవ్యః కర్ణపూరశ్చ. 103**

**తా.** పద్మము, నల్లకలవ, తెల్లకలవ, పొడవైన తొడిమి గల ఇతరపుష్పాలు, చెవిలో అలంకారంగా ధరించే పుష్పము – వీటిని ఈ భ్రమరహస్తంతో గ్రహించాలి.

**మూ. విచ్యుతశ్చ సశబ్దశ్చ కార్యో నిర్భర్త్సనాదిషు,**
**బాలాలాపే చ శీఘ్రం చ తాలే విశ్వాసనే తథా. 104**

**తా.** భ్రమరహస్తాన్ని ధ్వని చేస్తూ క్రిందికి దింపి – భయపెట్టడం, చిన్నపిల్లల మాటలు, శీఘ్రత్వము, తాలము, విశ్వసింపచేయడం – మొదలైనవాటిని అభినయించాలి.

**మూ. తర్జనీమధ్యమాఙ్గుష్ఠాః త్రేతాగ్నిస్థాః నిరన్తరాః,**
**భవేయుర్హంసవక్త్రస్య శేషే ద్వే సంప్రసారితే. 105**

**తా. (19) హంసవక్త్రం :–** తర్జని, మధ్యమ – అంగుష్ఠాలు త్రేతాగ్నులు ఏ స్థితిలో ఉంటాయో ఆ స్థితిలో ఒకదాని కొకటి దగ్గరగా ఉండాలి (చూ. 88వ శ్లోకం). మిగిలిన రెండు వేళ్లూ చాపబడి ఉండాలి. ఇది **'హంసవక్త్రహస్తం'.**

**మూ. శ్లక్ష్ణాల్పశిథిలలాఘవనిఃసారార్థే మృదుత్వయోగే చ,**
**కార్యోఽభినయవిశేషః కించిత్ ప్రస్పన్దితాగ్రేణ. 106**

**తా.** నున్నగా ఉండడం, అల్పత్వము, శిథిలత్వము, తేలికగా ఉండడం, సారం లేకపోవడం, మృదుత్వం అను అర్థాలలో హంసవక్త్రహస్తం దీని అగ్రభాగాలు కొంచెం కదల్చుచూ ప్రయోగించాలి.

**మూ. సమాః ప్రసారితాస్తిస్రస్తథా చోర్ధ్వా కనీయసీ,**
**అఙ్గుష్ఠః కుఞ్చితశ్చైవ హంసపక్ష ఇతి స్మృతః. 107**

**తా. (20) హంసపక్షహస్తం :–** మూడు వేళ్లు వంకర లేకుండా చాపి, చిటికెన వేలు పైకి ఎత్తి బొటకనవేలు వంచిన ట్లయితే అది హంసపక్షహస్తం.

**మూ. ఏష చ నివాపసలిలే దాతవ్యే గణ్డసంశ్రయే చైవ,**
**కార్యః ప్రతిగ్రహాచమనభోజనార్థేషు విప్రాణామ్. 108**

**తా.** పితృతర్పణోదకాలు ఇచ్చేటప్పుడు, చెక్కిళ్లకు సంబంధించిన పత్రరచనాదికర్మ యందు, బ్రాహ్మణులు దానం పట్టేప్పుడు, ఆచమనం చేసేటప్పుడు, భోజనం చేసేటప్పుడు ఈ హంసపక్షహస్తం వినియోగించాలి.

**మూ. ఆలిఙ్గనే మహాస్తమ్భదర్శనే రోమహర్షణే చైవ,**
**స్పర్శేఽనులేపనార్థే యోజ్యః సంవాహనే చైవ. 109**

**తా.** ఆలింగనంలోను, అధికంగా శరీరం కొయ్యబారడం అభినయించడంలోను, రోమాంచంలోను, సుఖస్పర్శలోను, మైపూత పూసికొనడంలోను, సంవాహనం (ఒళ్లు పట్టడం) లోను ఈ హస్తం వినియోగించాలి.

**మూ. పునరేవ చ నారీణాం స్తనాన్తరస్థేన విభ్రమవిశేషాః,**
**కార్యా యథారసం స్యుర్దుఃఖే హనుధారణే చైవ. 110**

**తా.** హంసపక్షహస్తాన్నే స్త్రీలు తమ వక్షఃస్థలంమీద ఉంచుకొని రసానుగుణంగా అనేక మైన విలాసవివేషాలు చూపవచ్చును. దీనిని దుఃఖసమయంలో హనుధారణంలో (గడ్డంవాల్చి ఆనుకొనడానికి) కూడ వినియోగించాలి.

**మూ. తర్జన్యఙ్గుష్ఠసందంశస్త్వరాలస్య యదా భవేత్,**
**ఆభుగ్నతలమధ్యస్థః స సందంశ ఇతి స్మృతః. 111**

**తా. (21) సందంశం :–** అరాళముద్రలో ఉన్న హస్తంలోని తర్జని, అంగుష్ఠము సందంశంవలె (పట్టుకారు వలె) ఏర్పడి అరచెయ్యి మధ్యభాగం కొంచెం పల్లంగా ఉంటే అది సందంశం.

**మూ. సందంశస్త్రివిధో జ్ఞేయస్త్వగ్రజో ముఖజస్తథా,**
**తథా పార్శ్వగతశ్చైవ రసభావోపబృహితః. 112**

**తా.** రసాలను, భావాలను అనుసరించి సందంశం (అగ్రజము) ముందుకు ఉన్నది, (ముఖజము) ముఖం వైపున ఉన్నది, (పార్శ్వగతము) ప్రక్కకు ఉన్నది అని మూడు విధాలు.

**మూ. పుష్పాపచయగ్రథనే గ్రహణే తృణపర్ణకేశసూత్రాణామ్,**
**శల్యావయవగ్రహణే ప్రకర్షణే చాగ్రసందంశః. 113**

**తా.** పూవుల కోయడంలోను, గుచ్చడంలోను, గడ్డిపరకలు ఆకులు కేశాలు దారాలు

– వీటిని పట్టుకొనడంలోను, (కాలిలో గుచ్చుకొన్న) ముల్లు అవయవాన్ని పట్టుకొనడం లోను, ముల్లు పైకి లాగడంలోను అగ్రసందంశం ఉపయోగించాలి.

**మూ. వృన్తాత్పుష్పోద్ధరణం వర్తిశలాకాదిపూరణం చైవ,**
**ధిగితి చ వచనం రోషే ముఖసందంశస్య కర్మాణి. 114**

**తా.** తొడిమినుండి పువ్వు పైకి లాగడం, దీపపువత్తి, అంజనశలాక (కాటుక పెట్టుకొనే పుల్ల) మొదలైనవాటిని నింపడం (సరిచేయడం), కోపంలో 'ఛీ!' అనడం – ఇవి ముఖసందంశంతో చేసే పనులు.

**మూ. యజ్ఞోపవీతధారణ – వేధన – గుణసూక్ష్మబాణలక్ష్యేషు,**
**యోగే ధ్యానే స్తోకే సంయుతకరణస్తు కర్తవ్యః. 115**

**తా.** యజ్ఞోపవీతధారణము, ముత్యాలు మొదలైనవి గుచ్చడం లేదా వాటికి రంధ్రాలు చేయడం, ధనస్సు నారి, సూక్ష్మమైన బాణలక్ష్యము, యోగము, ధ్యానము, కొంచెము అను అర్థము – వీటియందు రెండు హస్తాలు కలిపి ప్రయోగించాలి.

**మూ. పేలవకుత్సాసూయాసదోషవచనే చ వామహస్తేన,**
**కించిద్వివర్తితాగ్రః ప్రయుజ్యతే పార్శ్వసందంశః. 116**

**తా.** పేలవము (అసారత్వము), నింద, అసూయ, దోషోద్ఘాటనము – వీటిలో ఎడమ చేతితో, కొంచెం అగ్రభాగంలో వంచిన పార్శ్వసందంశం ప్రయోగించాలి.

**మూ. ఆలేఖ్యనేత్రరఞ్జనవితర్కవృన్తప్రవాలరచనం చ,**
**నిష్పీడనం తథాలక్తకస్య కార్యం చ నారీభిః. 117**

**తా.** చిత్రం చిత్రించడం, నేత్రాలకు కాటుక పెట్టుకొనడం, ఊహ, చెక్కిళ్లమీద పువ్వుల తొడిమలు చిగుళ్లు రచించడం, పాదాలకు పారాయిణిగా ధరించడానికి లత్తుక నూరడం – ఈ పనులను స్త్రీలు ఈ హస్తంతో అభినయించాలి.

**మూ. సమాగతాగ్రాః సహితా యస్యాఙ్గుల్యో భవన్తి హి,**
**ఊర్ధ్వా హంసముఖస్యైవ స భవేన్ముకులః కరః. 118**

**తా. (22) ముకులహస్తం :–** హంసవక్త్రహస్తంలోని వేళ్ల అగ్రభాగాలు దగ్గరగా చేర్చబడి వంగి మొగ్గవలె కలిసి ఉంటే అది **ముకులహస్తం** అవుతుంది.

**మూ. దేవార్చనబలిహరణే పద్మోత్పలముకులరూపణే చైవ,**
**విటచుమ్బనే చ కార్యో వికుత్సితే విప్రకీర్ణశ్చ. 119**
**భోజనహిరణ్యగణనాముఖసంకోచప్రదానశీఘ్రేషు,**
**ముకులితకుసుమేషు తథా తద్జ్ఞైరేష ప్రయోక్తవ్యః. 120**

**తా.** దేవతల పూజ, బలి సమర్పించడం, పద్మం మొగ్గలను కలువ మొగ్గలను చూపించడం, విటచుంబనం, వీటియందు ఈ ముకులహస్తం ప్రయోగించాలి. ఇది కుత్సిత మైనది అని సూచించడానికి ముకుళహస్తం వేళ్లు విడదీసి విదిపి నట్లు చెయ్యాలి. భోజనము, బంగారు నాణాలు లెక్కపెట్టడం, ముఖం ముణుచుకొనడం, ఇవ్వడం, శీఘ్రత్వం, ముణుచుకొన్న పుష్పాలు – వీటి సూచనకు కూడ ఈ ముద్రను అభినయజ్ఞులు ఉపయోగించాలి.

**వి.** విటులు తమ హస్తమే ముకులితం చేసి దానిని చుంబిస్తారు; అదే **విటచుంబనం.** లేదా విటులు హస్తం ముకులితం చేసి ఐదు వేళ్ల కొనలతోను ఒకే సమయంలో యువతుల కుచాదులను స్పృశిస్తే అది **'ఆచ్ఛురితకం'** అని కామసూత్రంలో చెప్పినదే ఈ విటచుంబనం. (అ.భా.)

**మూ. పద్మకోశస్య హస్తస్య హ్యఙ్గల్యః కుఞ్చితా యదా,**
**ఊర్ణనాభః స విజ్ఞేయః కేశచౌర్యగ్రహాదిషు.** **121**

**తా. (23) ఊర్ణనాభం :–** పద్మకోశహస్తంలోని వేళ్లు బాగా మణిచితే అది **ఊర్ణనాభహస్తం.** ఇతరులు చూడకుండా రహస్యంగా కేశాలు పట్టుకొనడం మొదలైన వాటియందు దీనిని ఉపయోగించాలి (అ.భా.)

**మూ. శిరఃకణ్డూయనే చైవ కుష్ఠవ్యాధినిరూపణే,**
**సింహవ్యాఘ్రేష్వభినయః ప్రస్తరగ్రహణే తథా.** **122**

**తా.** తల గోకికొనడానికి, కుష్ఠవ్యాధిని సూచించడానికి, సింహ – వ్యాఘ్రాలను సూచించడానికి, రాయి పట్టుకొనడానికి దీనిని వినియోగించాలి.

**మూ. మధ్యమాఙ్గులిసందంశో వక్రా చైవ ప్రదేశినీ,**
**శేషే తలస్థే కర్తవ్యే తామ్రచూడకరేఽఙ్గులీ.** **123**

**తా. (24) తామ్రచూడం :–** మధ్యవేలు, బొటనవేలు సందంశాకారంలో ఉంచాలి. తర్జని వంకరగా ఉంచి మిగిలిన రెండు వేళ్లు అరచేతిలోనికి వంగి ఉండాలి. అది **తామ్రచూడహస్తం.**

**మూ. విచ్యుతశ్చ సశబ్దశ్చ కార్యో నిర్భర్త్సనాదిషు,**
**తాలే విశ్వాసనే చైవ శీఘ్రార్థే సంజ్ఞితేషు చ.** **124**

**తా.** ధ్వని చేస్తూ వేళ్లను శిథిలం చేసి దానిని భయపెట్టడం మొదలైనవాటికి వినియోగించాలి. తాళము, విశ్వాసం కలిగించడం, శీఘ్ర మను అర్థమునందు, సంకేతం సూచించడంలోను తామ్రచూడం ప్రయోగించాలి.

**మూ. తథా కలాసు కాష్ఠాసు నిమేషే తు క్షణే తథా,**
**ఏష ఏవ కరః కార్యో బాలాలాపనిమన్త్రణే. 125**

**తా.** అట్లే కలలు, కాష్ఠలు, నిమేషాలు, క్షణాలు – ఈ కాల విశేషాలను, బాలుల మాటలను, పిలవడాన్ని సూచించడానికి కూడ ఈ హస్తాన్ని వినియోగించాలి.

**మూ. అథవా –**
**అఙ్గుల్యః సంయుతా వక్రా ఉపర్యఙ్గుష్ఠపీడితాః,**
**ప్రసారితా కనిష్ఠా చ తామ్రచూడకరః స్మృతః. 126**

**తా.** (తామ్రచూడానికే మరొక లక్షణం) లేదా – వేళ్లన్నీ దగ్గరగా కలిపి వంకరగా ఉంచగా వాటి మీద బొటనవేలు నొక్కుతూంటుంది. కనిష్ఠాంగులి మాత్రం చాపబడి ఉంటుంది. అది **తామ్రచూడహస్తం.**

**మూ. శతం సహస్రం లక్షం చ కనకం చాపి దర్శయేత్,**
**క్షిప్రముక్తాఙ్గులీభిస్తు స్ఫులిఙ్గాన్విప్రుషస్తథా. 127**

**తా.** ఈ హస్తంతో – నూరు, వెయ్యి, లక్షసంఖ్యలలో ఉన్న బంగారు నాణాలను ప్రదర్శించాలి. ఈ హస్తంలోని వేళ్లు అతిశీఘ్రంగా విప్పివేస్తూ అగ్ని కణాలను, నీటి తుంపరలను చూపించాలి.

**మూ. అసంయుతాః కరా హ్యేతే మయా ప్రోక్తా ద్విజోత్తమాః,**
**అథ సంయుతహస్తాః –**
**అతశ్చ సంయుతాన్ హస్తాన్ గదతో మే నిబోధత. 128**

**తా.** ద్విజోత్తములారా! ఇంతవరకు అసంయుతహస్తాలు చెప్పాను. ఇటుపైన సంయుతహస్తాలు చెపతున్నాను వినండి.

## *సంయుతహస్తముద్రలు*

**మూ. పతాకాభ్యాం తు హస్తాభ్యాం సంశ్లేషాదఞ్జలిః స్మృతః,**
**దేవతానాం గురూణాం చ మిత్రాణాం చాభివాదనే. 129**

**తా. (1) అంజలి :–** పతాకముద్రలో ఉన్న రెండు చేతులు ఒకదానితో ఒకటి కలిపితే **అంజలి** అవుతుంది. దీనిని దేవతలకు, గురువులకు మిత్రులకు అభివాదనం చేసేటప్పుడు వినియోగించాలి.

**మూ. స్థానాన్యస్య పునస్త్రీణి వక్షో వక్త్రం శిరస్తథా,**
**దేవతానాం శిరస్థస్తు గురూణామాస్యసంస్థితః. 130**

**తా.** అంజలిని తన వక్షఃస్థలం దగ్గర, ముఖం దగ్గరా, శిరస్సుపైనా ఘటించాలి. ఈ విధంగా దీనికి మూడు స్థానాలు. దేవతలకు శిరఃస్థాంజలితోను, గురువులకు ముఖస్థాంజలితోను, మిత్రులకు వక్షఃస్థాంజలితోను ప్రణామం చెయ్యాలి. స్త్రీల విషయంలో నియమం లేదు.

**వి.** స్త్రీలు దేవతాదులకు అభివాదనం చేసేటప్పుడు నియమం లేదు (అ.భా.)

**మూ. ఉభాభ్యామపి హస్తాభ్యామన్యోన్యం పార్శ్వసంగ్రహాత్.** **132**
**హస్తః కపోతకో నామ కర్మ చాస్య నిబోధత.**

**తా. (2) కపోతహస్తం :–** పతాకముద్రలో ఉన్న రెండు చేతులు పార్శ్వాల దగ్గర కలిపితే అది **కపోతహస్తం.** దీని వినియోగం వినండి.

**మూ. ఏష వినయాభ్యుపగమే ప్రణామకరణే గురోశ్చ సంభాషే,**
**శీతే భయే చ కార్యో వక్షస్థః కమ్పితః స్త్రీభిః.** **133**

**తా.** వినయంలోను, ఏదైన విషయాన్ని ఆజ్ఞను అంగీకరించడంలోను, ప్రణామం చేయడంలోను, గురువుతో సంభాషణ చేసేటప్పుడూ, శీతబాధలోను, భయంలోను ఈ కపోతముద్ర వక్షఃస్థల ప్రాంతంలో వినియోగించాలి. స్త్రీలు దీనిని కదల్చుతూ వినియోగించాలి.

**మూ. అయమేవాఙ్గులిపరిఘృష్యమాణముక్తస్తు ఖిన్నవాక్యేషు,**
**ఏతావదితి చ కార్యో నేదానీం కృత్యమితి చార్థే.** **133**

**తా.** వేళ్లు ఒకదానితో ఒకటి రాసుకొంటూ విడిపోతూన్న ఈ హస్తంతో ఖేదంతో కూడిన మాటలలలోను, "ఇంతమాత్రమే చేయ శక్యం అవుతుంది". "ఇంతకు మించి ఏమీ చెయ్యడానికి శక్యం కాదు" అని చెప్పేటప్పుడు అభినయం చెయ్యాలి.

**మూ. అఙ్గుల్యో యస్య హస్తస్య హ్యన్యోన్యాన్తరనిఃసృతాః,**
**స కర్కట ఇతి జ్ఞేయః కరః కర్మ చ వక్ష్యతే.** **134**
**ఏష మదనాఙ్గమర్దే సుప్తోత్థితజృమ్భణే బృహద్దేహే,**
**హనుధారణే చ యోజ్యః శఙ్ఖగ్రహణేఽర్థతత్త్వజ్ఞైః.** **135**

**తా. (3) కర్కటహస్తం :–** రెండు చేతుల వేళ్లు ఒకదానితో ఒకటి పెనవేసుకొని బైటకు వచ్చినప్పుడు ఆ హస్తముద్ర **కర్కటకహస్తముద్ర.** దాని పని చెపుతున్నాను, వినండి. కామభోగంలో జరిగే శరీర మర్దనంలోను, నిద్రనుండి లేచి ఒళ్లు విరచుకొనేటప్పుడు, విశాలమైన దేహమునందు, గడ్డం (హనువు) ధరించినపుడు, శంఖం పట్టినప్పుడు దీనిని వినియోగించాలి.

**మూ. మణిబన్ధనవిన్యస్తావరాలౌ స్త్రీప్రయోజితౌ,**
**ఉత్తానౌ వామపార్శ్వస్థౌ స్వస్తికః పరికీర్తితః. 136**

**తా. (4) స్వస్తికముద్ర :–** అరాలముద్రలో ఉన్న రెండు హస్తాలు వెల్లగితల మణికట్ల దగ్గర కలిపి ఉంచితే అది **స్వస్తికముద్ర** అని చెప్పబడింది. దీనిని స్త్రీలు మాత్రమే ప్రయోగిస్తారు.

**మూ. స్వస్తికవిచ్యుతికరణాద్ దిశో ఘనాః ఖం వనం సముద్రాశ్చ,**
**ఋతవో మహీ తథౌఘం విస్తీర్ణం వాభినేయం స్యాత్. 137**

**తా.** స్వస్తికముద్రలో ఉన్న హస్తాలను విడదీయడం ద్వారా – దిక్కులు, మేఘాలు, ఆకాశము, వనము, సముద్రాలు, ఋతువులు, భూమి, సముదాయము, విస్తీర్ణత్వము – వీటిని అభినయించాలి.

**మూ. ఖటకః ఖటకే న్యస్తః కటకావర్ధమానకః,**
**శృఙ్గారార్థేషు యోక్తవ్యః ప్రణామకరణే తథా.**
**కుముదోత్పలవృన్తేషు కర్తవ్యశ్ఛత్రధారణే. 139**

**తా. (5) ఖటకావర్ధమానకహస్తం :–** ఒక ఖటకాముఖహస్తం మీద రెండవ ఖటకాముఖహస్తం ఉంచితే అది **ఖటాకావర్ధమానకం** అవుతుంది. దీనిని శృంగార చేష్టల యందు, ప్రణామం చేయడంలోను, తెల్లకలవల నల్లకలవల కాడలయందు, ఛత్రధారణము నందు అభినయించాలి.

**మూ. అరాలౌ తు విపర్యస్తావుత్తానౌ వర్ధమానకౌ,**
**ఉత్సఙ్గ ఇతి విజ్ఞేయః స్పర్శస్య గ్రహణే కరః. 140**

**తా. (6) ఉత్సంగహస్తం :–** రెండు అరాళహస్తాలను విపరీతదిక్కులలో (ఎదురెదురు దిక్కులలో) వెల్లగితలా వంచినపుడు అది **ఉత్సంగహస్తం.** స్పర్శను గ్రహించినప్పుడు దీనిని ప్రయోగించాలి.

**మూ. సనిష్పేషకృతే చైవ రోషామర్షకృతేఽపి చ,**
**నిష్పీడితః పునశ్చైవ స్త్రీణామీర్ష్యాకృతే భవేత్. 141**

**తా.** గట్టిగా నూరడం, రోషంతోను, అమర్షంతోను పనులు చేయడం, పిండడం, స్త్రీల ఈర్ష్యాకృతచేష్టలు – వీటిని ఈ హస్తంతో అభినయించాలి.

**మూ. ముకులం తు యదా హస్తం కపిత్థః పరివేష్టయేత్,**
**స మన్తవ్యస్తదా హస్తో నిషధో నామ నామతః. 142**

**తా. (7) నిషధహస్తం :–** ముకులస్తాన్ని కపిత్థహస్తంతో చుట్టినట్లయితే అది **నిషధహస్తం** అవుతుంది.

**మూ. సంగ్రహపరిగ్రహౌ ధారణం సమయశ్చ సత్యవచనం చ,**
**సంక్షేపః సంక్షిప్తం నిపీడితేనాభినేతవ్యమ్. 143**

**తా.** సంగ్రహమును (శాస్త్రార్థమును తగు రీతిలో గ్రహించడమును), పరిగ్రహమును (స్వీకారమును), ధారణమును, సమయమును (నియమమును) సత్యవచనమును, సంక్షేపమును (తాత్పర్యమును), సంక్షిప్తమును (బాగుగా ఒకచోట స్థితిని) ఈ హస్తంచేత అభినయించాలి.

**మూ. శిఖరస్తు యదా హస్తో మృగశీర్షేణ పీడితః,**
**నిషధో నామ విజ్ఞేయః స భయార్తే విధీయతే. 144**

**తా.** శిఖరహస్తం మృగశీర్షహస్తంచేత పీడింపబడినప్పుడు (నొక్కబడినప్పుడు) అది నిషధహస్తం అవుతుంది. దీనిని భయార్తుని విషయంలో ప్రయోగించాలి.

**మూ. గృహీత్వా వామహస్తేన కూర్పరాభ్యన్తరే భుజమ్,**
**దక్షిణం చాపి వామస్య కూర్పరాభ్యన్తరే న్యసేత్. 145**
**స చాపి దక్షిణో హస్తః సమ్యఙ్ముష్టికృతో భవేత్,**
**ఇత్యేష నిషధో హస్తః కర్మ చాస్య నిబోధత. 146**

తా. ఎడమ చేతితో కుడి మోచేతిని (కుడిజబ్బను) పట్టుకొని పిడికిలితో ఉన్న కుడిచేతిని ఎడమ జబ్బకింద ఉంచినట్లయితే ఇది **నిషధహస్తం.** దీని పనులు వినండి.

**మూ. ఏతేన ధైర్యమదగర్వసౌష్ఠవౌత్సుక్యవిక్రమాటోపాః,**
**అభిమానావష్టమ్భస్తమ్భస్థైర్యాదయః కార్యాః. 147**

**తా.** ధైర్యము, మదము, గర్వము, సౌష్ఠవము, ఔత్సుక్యము, విక్రమము, ఆటోపము, అభిమానము, బిగింపు, నిలదొక్కుకొనడం, స్థిరత్వము మొదలైనవాటిని ఈ నిషధహస్తంచేత అభినయించాలి.

**మూ. అథవా –**
**జ్ఞేయో వై నిషధో నామ హంసపక్షౌ పరాఙ్ముఖౌ,**
**జాలవాతాయనాదీనాం ప్రయోక్తవ్యోఽభిఘట్టనే. 148**

**తా.** లేదా –

హంసపక్షహస్తాలను ఎడముఖం పెడముఖంలో ఉన్నట్లు చేసినట్లయితే అది **నిషధహస్తం** అవుతుంది. వల, కిటికీ మొదలైనవాటిని దులుతుపున్నట్లు ఘట్టనం చేయడంలో దీనిని ప్రయోగించాలి.

**మూ. అంసౌ ప్రశిథిలౌ ముక్తౌ పతాకౌ తు ప్రలమ్బితౌ,**
**యదా భవేతాం కరణే స దోల ఇతి సంజ్ఞితః. 149**

**తా. (8) దోలహస్తం :–** బుజాలు రెండూ జారవిడిచి, పతాకహస్తాలు రెండింటిని వ్రేలాడే టట్లు చేస్తే అది **దోలహస్తం** అవుతుంది.

**మూ. సంభ్రమవిషాదమూర్ఛితమదాభిఘాతే తథైవ చావేగే,**
**వ్యాధిప్లుతే చ శస్త్రక్షతే చ కార్యోఽభినయయోగః. 150**

**తా.** కంగారు, దుఃఖము, మూర్ఛ, మదం, ఆకస్మికంగా తగిలినదెబ్బ, ఆవేగం, వ్యాధివల్ల బాధ, శస్త్రంచేత గాయం – వీటియందు దోలహస్తం అభినయించాలి.

**మూ. యస్తు సర్పశిరాః ప్రోక్తస్త్స్యాఙ్గులినిరన్తరః,**
**ద్వితీయః పార్శ్వసంశ్లిష్టః స తు పుష్పపుటః స్మృతః. 151**

**తా. (9) పుష్పపుటహస్తం :–** సర్పశిరోహస్తంలోని వేళ్లు అన్నీ దగ్గరగా ఉండాలి. ఈ విధంగా ఉన్న రెండు చేతులూ ఒకదాని పక్క ఒకటి కలిసి ఉంటే అది పుష్పపుటహస్తం.

**మూ. ధాన్యఫలపుష్పసదృశాన్యనేన నానావిధాని యుక్తాని,**
**గ్రాహ్యాణ్యుపనేయాని చ తోయానయనాపనయనే చ. 152**

**తా.** ధాన్యములు, ఫలములు, పుష్పములు మొదలైన అనేకవిధాలైన తగిన వస్తువులు ఈ హస్తంచేత గ్రహించాలి, ఇతరులకు అందించాలి. అదే విధంగా ఉదకం తీసికొనిరావడం, తీసికొనివెళ్లడం కూడ ఈ హస్తంతో అభినయించాలి.

**మూ. పతాకౌ తు యదా హస్తావూర్ధ్వాఙ్గుష్ఠావధోముఖౌ,**
**ఉపర్యుపరి విన్యస్తౌ తదాసౌ మకరః స్మృతః. 153**

**తా. (10) మకరహస్తం :–** పతాకహస్తాలను రెండింటిని ఒకదానిపై ఒకటి బోర్లించి వాటి అంగుష్ఠాలు పైకి ఎత్తినట్లయితే అది **మకరహస్తం** అవుతుంది.

**మూ. సింహవ్యాలద్వీపిప్రదర్శనం నక్రమకరమత్స్యానామ్,**
**యే చాన్యే క్రవ్యాదాః అభినేయాస్తేఽర్థయోగేన. 154**

**తా.** ఈ మకరహస్తంతో – అవసరాన్ని పట్టి, సింహములను, సర్పములను, చిరుతపులులను, నక్రములను, మకరములను, మత్స్యములను, పచ్చిమాంసం తినే అన్యజంతువులను ప్రదర్శించాలి.

**మూ. కూర్పరాంసోచితౌ హస్తౌ యదా స్తాం సర్పశీర్షకౌ,**
**గజదన్తః స తు కరః కర్మ చాస్య నిబోధత. 155**

**తా.** (11) సర్పశీర్షకహస్తాలు రెండింటిలో ఒకటి రెండవదాని మోచేతినీ, రెండవది మొదటిదాని బుజాన్ని స్పృశిస్తూన్నప్పుడు అది **గజదంతహస్తం.** దీనితో చేయవలసిన పని తెలిసికొనండి.

**మూ. ఏష చ వధూవరాణాముద్వాహే చాతిభారయోగే చ,**
**స్తమ్భగ్రహణే చ తథా శైలశిలోత్పాటనే చైవ. 156**

**తా.** వధూవరులను తీసికొనివెళ్లడంలోను, ఎక్కువ భారం మోయడంలోను, స్తంభాలు పట్టుకొనడంలోను, కొండరాళ్లు పెకిలించడంలోను ఈ హస్తం వినియోగించాలి.

**మూ. శుకతుణ్డౌ కరౌ కృత్వా వక్షస్యభిముఖాఞ్చితౌ,**
**శనైరధోముఖావిద్ధౌ సోఽవహిత్థ ఇతి స్మృతః. 157**

**తా. (12) అవహిత్థహస్తం :–** శుకతుండహస్తాలను వక్షఃప్రదేశంమీద ఒకదానితో ఒకటి అభిముఖంగాకలిసి, మెల్లమెల్లగా అధోముఖంగా క్రిందికి వంగితే అది **అవహిత్థహస్తం.**

**మూ. దౌర్బల్యే నిఃశ్వసితే గాత్రాణాం దర్శనే తనుత్వే చ,**
**ఉత్కణ్ఠితే చ తద్జ్ఞైరభినయయోగస్తు కర్తవ్యః. 158**

**తా.** దుర్బలత్వము, నిట్టూర్పు, అవయవప్రదర్శనం, చిక్కిపోవడం, బెంగ, – వీటి యందు నాట్యజ్ఞులు ఈ హస్తంతో అభినయించాలి.

**మూ. జ్ఞేయో వై వర్ధమానస్తు హంసపక్షౌ పరాఙ్ముఖౌ,**
**జాలవాతాయనాదీనాం ప్రయోక్తవ్యో విఘాటనే. 159**

**తా. (13) వర్ధమానహస్తం :–** హంసపక్షహస్తాలను పరస్పరము విపరీతదిక్కులందు (ఎడాపెడా) ఉన్న ట్లయితే అది **వర్ధమానహస్తం.** చిన్న కటకటాలు, కిటికీలు మొదలైన వాటిని తెరవడంలో దీనిని వినియోగించాలి.

**మూ. సంగ్రహపరిగ్రహోద్ధారణం చ సమయం చ సత్యవచనం చ,**
**సంక్షేపః సంక్షిప్తం నిపీడితేనాభినేతవ్యమ్. 160**

**తా.** చేతిమీద చేయి వేసి నొక్కడంచేత – విషయసంగ్రహణమును, స్వీకరించడ మును, ఎత్తిధరించడమును, శపథమును, సత్యవచనమును, సంక్షేపమును, ఒక వస్తువును ఉంచుటను అభినయించాలి. (చూ. శ్లో. 143)

**మూ. ఉక్తా హ్యేతే ద్వివిధాస్త్వసంయుతాః సంయుతాశ్చ సంక్షేపాత్,**
**అభినయకరాస్తు యే త్విహ తేఽన్యత్రాప్యర్థతః సాధ్యాః. 161**

**తా.** రెండు విధా లైన అసంయుత – సంయుతకరాలు ఇంతవరకు సంక్షేపంగా

చెప్పబడ్డాయి. అయితే ఈ అభినయహస్తాలను, ఇక్కడ చెప్పినచోట్లలోనే కాకుండా ఇతర స్థలాలలో కూడ, అర్థానుసారంగా ఉపయోగించుకొనవచ్చును.

**మూ. అన్యైరప్యుక్తమ్ –**
**ఆకృత్యా చేష్టయా చిహ్నైర్జాత్యా విజ్ఞాయ వస్తుతః,**
**స్వయం వితర్క్య కర్తవ్యం హస్తాభినయనం బుధైః. 162**

**తా.** ఇతరనాట్యజ్ఞులు కూడ ఇలా అన్నారు – ఆకారము, చేష్ట, చిహ్నాలు, జాతి – వీటి అన్నిటి స్వరూపం బాగా గుర్తించి పండితులు, ఆలోచించుకొని హస్తాభినయం చెయ్యాలి.

**మూ. నాస్తి కశ్చిదహస్తస్తు నాట్యార్థాభినయం ప్రతి,**
**యస్య యద్దృశ్యతే రూపం బహుశస్తన్మయోదితమ్. 163**

**తా.** నాట్యంలో, అభినయానికి ఉపయోగించే హస్తం లేని అర్థం (వస్తువు, విషయం) ఏదీ ఉండదు, దేనికి ఏ రూపం (హస్తం) అధికంగా కనబడుతూన్నదో దానిని గూర్చి నేను చెప్పాను.

**మూ. అన్యే చాప్యర్థసంయుక్తా లౌకికా యే కరాస్త్విహ,**
**ఛన్దతస్తే ప్రయోక్తవ్యా రసభావవిచేష్టితైః. 164**

**తా.** ఆ యా అర్థాలతో సంబంధించిన లోకప్రసిద్ధా లైన ఇతరహస్తా లేవైనా ఉంటే వాటిని రస – భావ చేష్టలకు అనుగుణంగా ప్రయోక్తల ఇష్టం ప్రకారం ప్రయోగించవచ్చును.

**మూ. దేశం కాలం ప్రయోగం చాప్యర్థయుక్తిమవేక్ష్య చ,**
**హస్తా హ్యేతే ప్రయోక్తవ్యా నృణాం స్త్రీణాం విశేషతః. 165**

**తా.** దేశాన్ని, కాలాన్ని, ప్రయోగాన్ని (ఏవిధమైన రూపకం ప్రయోగింపబడుతున్నదో దాని స్వభావాన్నీ), అర్థంతో సంబంధాన్ని జాగర్తగా పరిశీలించుకొని, పురుషులు, విశేషించి స్త్రీలు, ఈ హస్తాలను ప్రయోగించాలి.

**మూ. సర్వేషామేవ హస్తానాం యాని కర్మాణి సన్తి వై,**
**తాన్యహం సంప్రవక్ష్యామి రసభావకృతాని తు. 166**

**తా.** ఆ యా రూపకాదులలో హస్తా లన్నింటికీ రసాలకు భావాలకు అనుగుణంగా ఏ యే కర్మలుంటాయో అవి నేనిపుడు చెపుతున్నాను.

ఇరవై (20) విధాలైన హస్తకర్మలు.

**మూ.** **ఉత్కర్షణం వికర్షణం తథా వ్యాకర్షణం పునః,**
**పరిగ్రహో నిగ్రహశ్చాహ్వానం తోదనమేవ చ.** **167**

**సంశ్లేషశ్చ వియోగశ్చ రక్షణం మోక్షణం తథా,**
**విక్షేపధూననే చైవ విసర్గస్తర్జనం తథా.** **168**

**ఛేదనం భేదనం చైవ స్ఫోటనం మోటనం తథా,**
**తాడనం చేతి విజ్ఞేయం తద్‌జ్ఞైః కర్మ కరాన్ ప్రతి.** **169**

**తా.** ఉత్కర్షణము (పైకి లాగడం) వికర్షణము (వేగంగా లాగడం), వ్యాకర్షణము (బైటకు లాగడం), పరిగ్రహము (ఏదైన ఒక వస్తువును తీసికొనడం), నిగ్రహము, ఆహ్వానము, తోదనము (పీడించడం), సంశ్లేషము (కలవడం), వియోగము, రక్షణము, మోక్షణము (విడవడము), విక్షేపము (దూరంగా విసిరివేయడం), ధూననము (ఊపడం), విసర్గము (విడవడం) తర్జనము (భయపెట్టడం), ఛేదనము (కోయడం), భేదనము (బ్రద్దలు కొట్టడము), స్ఫోటనము (పగలకొట్టడం) మోటనము (మూయడం) తాడనం (కొట్టడం) ఇవి హస్తాలకు చెందిన కర్మలు.

**మూ.** **ఉత్తానః పార్శ్వగశ్చైవ తథాధోముఖ ఏవ చ,**
**హస్తప్రచారస్త్రివిధో నాట్యశాస్త్రసమాశ్రయః.** **170**

**తా.** నాట్యశాస్త్రానికి సంబంధించిన హస్తప్రచారం (హస్తాలతో చేసే క్రియ), ఉత్తానం (పైకి ఎత్తడం; వెల్లగితలా ఉంచడం) పార్శ్వగం (పార్శ్వాల వైపు జరిగేదీ), అధోముఖం (క్రిందికి వెళ్లేదీ) అని మూడు విధాలు.

**మూ.** **సర్వే హస్తప్రచారాశ్చ ప్రయోగేషు యథావిధి,**
**నేత్రభ్రూముఖరాగాద్యైః కర్తవ్యా వ్యఞ్జితా బుధైః.** **171**

**తా.** నాట్యప్రయోగాలలో హస్తప్రచారాల (హస్తక్రియల)లోని భావాదులు నేత్రాల చేత, కనుబొమ్మలచేత, ముఖరాగాదులచేత బాగా స్పష్టంగా సూచింపబడే టట్లు, పండితులు ప్రయత్నించాలి. అనగా హస్తాభినయాలతో పాటు అనేకరసభావాదుల అభినయం నేత్రాదులతో కూడ జరగాలి.

**మూ.** **కరణం కర్మ స్థానం ప్రచారయుక్తిం క్రియాం చ సమవేక్ష్య,**
**హస్తాభినయః కార్యస్తద్‌జ్ఞైః లోకోపచారేణ.** **172**

**తా.** హస్తాభినయజ్ఞులు ఆవేష్టితం మొదలైన కరణాన్ని – చేయదగిన కర్మను, లలాటం మొదలైన స్థానాన్ని, ఉత్తానాధోముఖత్వాది ప్రచారయుక్తిని, క్రియను జాగర్తగా దృష్టిలో ఉంచుకొంటూ, లోకరీతిని కూడ అనుసరిస్తూ హస్తాభినయం చెయ్యాలి.

**మూ. ఉత్తమానాం కరాః కార్యా లలాటక్షేత్రచారిణః,**
**వక్షఃస్థాశ్చైవ మధ్యానామ్ అధమానామధోగతాః. 173**

**తా.** ఉత్తమవ్యక్తుల హస్తాలు (హస్తాభినయాలు) లలాటప్రాంతంలోను, మధ్యముల హస్తాలు వక్షఃస్థలప్రాంతంలోను, అధముల హస్తాలు అధోభాగంలోను జరగాలి.

**మూ. జ్యేష్ఠే స్వల్పప్రచారాః స్యుర్మధ్యే కుర్వీత మధ్యమైః,**
**అధమేషు ప్రకీర్ణాశ్చ హస్తాః కార్యాః ప్రయోక్తృభిః. 174**

**తా.** ఉత్తమపాత్రలు హస్తాభినయం తక్కువగా చెయ్యాలి, మధ్యమపాత్రలు మధ్యమ పద్ధతిలో (వాళ్లకంటె కొంచెం అధికంగా) చెయ్యాలి. అధమపాత్రలు స్వేచ్ఛగా చేయ వచ్చును.

**మూ. లక్షణవ్యఞ్జితా హస్తాః కార్యాస్తూత్తమమధ్యమైః,**
**లోకక్రియాస్వభావేన నీచైరప్యర్థసంశ్రయాః. 175**

**తా.** ఉత్తమ – మధ్యమపాత్రలు హస్తాల ప్రయోగం వాటికి చెప్పిన లక్షణాలను అనుసరించి చెయ్యాలి. నీచపాత్రలు అర్థానుసారంగా లోకంలో ఉండే అలవాట్లను పద్ధతులను పట్టి అభినయించాలి. వాళ్లు పూర్తిగా శాస్త్రానుసారం చెయ్యాలి అను నియమం లేదు.

**మూ. అథవాన్యాదృశం ప్రాప్య ప్రయోగం కాలమేవ చ,**
**విపరీతాశ్రయా హస్తాః ప్రయోక్తవ్యా బుధైర్న వా. 176**

**తా.** లేదా – నాట్యప్రయోగజ్ఞులు, సమయాన్నీ పరిస్థితులనూ, ప్రయోగస్వరూపాన్నీ పట్టి వేరు వేరు అర్థాలకు సంబంధించిన విరుద్ధమైన హస్తాలు ప్రయోగించవచ్చును. లేదా ప్రయోగించనేకూడదు.

## *హస్తాభినయ నిషేధ స్థానాలు*

**మూ. విషణ్ణే మూర్ఛితే హ్రీతే జుగుప్సాశోకపీడితే,**
**గ్లానే స్వప్నే విహస్తే చ నిశ్చేష్టే తన్ద్రితే జడే. 177**

**వ్యాధిగ్రస్తే జ్వరార్తే చ భయార్తే శీతవిప్లుతే,**
**మత్తే ప్రమత్తే చోన్మత్తే చిన్తాయాం తపసి స్థితే. 178**

**హిమవర్షహతే బద్ధే వారిణాప్లవసంశ్రితే,**
**స్వప్నాయితే చ సంభ్రాన్తే నతసంస్ఫోటనే తథా. 179**

**న హస్తాభినయః కార్యః కార్యః సత్త్వసమాశ్రయః,**
**తథా కాకువిశేషశ్చ నానార్థరసభావకః. 180**

**తా.** విషాదం చెందినవాడు, మూర్ఛితుడు, సిగ్గుపడుతూన్నవాడు, జుగుప్సతోను శోకంతోను బాధపడుతూన్నవాడు, అలసిపోయినవాడు, నిద్రలో వున్నవాడు, చేతులు లేనివాడు లేదా ఏదో తొందరపనిలో ఉండి చేతులకు తీరిక లేనివాడు, అలసుడు, జడుడు, వ్యాధిగ్రస్తుడు, వార్ధక్యంతో బాధపడుతూన్నవాడు, భయపీడితుడు, చలితో బాధ పడుతున్నవాడు, మద్యం మత్తులో ఉన్నవాడు, పొరబాటు చేసినవాడు, పిచ్చివాడు, చింతామగ్నుడు, తపస్సులో ఉన్నవాడు, మంచులోను వర్షంలోను బాగా తడిసినవాడు, బద్ధుడు, నీటి వరదలో చిక్కుకొన్నవాడు, పలవరిస్తున్నవాడు, ఏమీ తెలియని స్థితిలో ఉన్నవాడు, లోతైన వ్రణములు కలవాడు (?) – ఇలాంటివాళ్ల విషయంలో హస్తాభినయం చేయకూడదు. అయితే కేవలం వాళ్ల మానసికిస్థితిని సూచించే అనాయాససాధ్యమైన హస్తాభినయము, సాత్త్వికాభినయమూ చేయవచ్చును. అట్లే అనేకవిధాలైన అర్థాలను భావింపచేయగలిగిన కాకువిశేషం కూడా (మాటలలోని స్వరవిశేషం కూడ) చేయవచ్చును.

**మూ. యత్ర వ్యగ్రావుభౌ హస్తౌ తత్తద్దృష్టివిలోకనైః,**
**వాచికాభినయం కుర్యాద్విరామైరర్థదర్శకైః. 181**

**తా.** రథం నడపడం వంటి ఏ పరిస్థితిలో నైనా సారథి మొదలైన వాళ్ల రెండు చేతులూ పనిలో ఉన్నప్పుడు అలాంటివాని మానసికస్థిత్యాదులను అభినయించడానికి ఆ యా దృష్టులలో చూడడంతో, వాచికాభినయం (మాటలాడటం) చెయ్యాలి. మాటల మధ్యలో, ఆ యా అర్థాలు సూచించే విధంగా విరామం ఇస్తూ ఉండాలి.

**మూ. ఉత్తానః పార్శ్వగశ్చైవ తథాధోముఖ ఏవ చ,**
**ప్రచారస్త్రివిధోఽఙ్గానాం నాట్యనృత్తసమాశ్రయః. 182**

**తా.** నాట్యనృత్తాలకు సంబంధించిన అవయవసంచాలనం (అవయవాల కదలిక) ఉత్తానం (ఊర్ధ్వముఖం) అనీ, పార్శ్వగం (ప్రక్కపక్కకు జరిగేది) అనీ, అధోముఖం అనీ మూడు విధాలు.

**మూ. అన్యేతు –**
**ఉత్తానో వర్తులస్త్ర్యశ్రః స్థితోఽధోముఖ ఏవ చ,**
**పఞ్చ ప్రకారా హస్తస్య నాట్యనృత్తసమాశ్రయాః. ఇతి. 183**

**తా.** మరికొంద రైతే – నాట్య – నృత్తాలకు సంబంధించి హస్తముద్రలు – ఉత్తానము, వర్తులము, త్ర్యశ్రము, స్థిరము, అధోముఖము అని ఐదు విధాలు అంటారు.

**మూ. ఏవం జ్ఞేయాః కరా హ్యేతే నానాభినయసంశ్రయాః,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి కరాన్ నృత్తసమాశ్రయాన్. 184**

**తా.** ఈ విధంగా అనేకవిధా లైన అభినయాలకు సంబంధించిన ఈ హస్తాలు తెలుసుకోవాలి. ఇపుడు నృత్తానికి సంబంధించిన హస్తాలు చెపుతాను.

**మూ. వక్షసోఽష్టాఙ్గులస్థౌ తు ప్రాఙ్ముఖౌ ఖటకాముఖౌ,**
**సమానకూర్పరాంసౌ తు చరతురస్రౌ ప్రకీర్తితౌ. 185**

**తా. (1) చతురస్రం :–** ఖటకాముఖహస్తాలు రెండూ ప్రయోక్త ఎటు తిరిగి ఉంటాడో అటే అభిముఖంగా, వక్షస్థలానికి ఎనిమిది అంగులాల ఎత్తున ఉండి బుజాలు మోచేతులు సమానాంతరాలుగా ఉన్నట్లయితే అది **చతురస్రం.**

**మూ. హంసపక్షకృతౌ హస్తౌ వ్యావృత్తౌ తాలవృన్తవత్,**
**ఉద్వృత్తావితి విజ్ఞేయావథవా తాలవృన్తకౌ. 186**

**తా. (2) ఉద్వృత్తం :–** హంసపక్షముద్రలో ఉన్న చేతులు రెండూ, తాలవృంతాల వలె (తాటాకు విసనకఱ్ఱలవలె) వ్యావృత్తము లైతే (తిరగేసి ఉంటే) అవి **ఉద్వృత్తములు** లేదా **తాలవృంతకములు**.

**మూ. చతురస్రస్థితౌ హస్తౌ హంసపక్షకృతౌ తథా,**
**తిర్యక్స్థితౌ చాభిముఖౌ జ్ఞేయౌ తలముఖావితి. 187**

**తా. (3) తలముఖం :–** చతురస్రముద్రలో హంసపక్షస్థితిలో ఉన్న రెండు చేతులూ అడ్డంగా, ఒకదానికి ఒకటి అభిముఖంగా (ఎదు రెదురుగా) ఉంటే అది **తలముఖం**.

**మూ. తావేవ మణిబన్ధాన్తే స్వస్తికాకృతిసంస్థితౌ,**
**స్వస్తికావితి విఖ్యాతౌ విచ్యుతౌ విప్రకీర్ణకౌ. 188**

**తా. (4.5) స్వస్తిక – విప్రకీర్ణకాలు :–** తలముఖముద్రలో ఉన్న రెండు చేతులూ ముంజేతుల దగ్గర స్వస్తికాకారంలో ఉంటే **స్వస్తికహస్తం;** అలా ఉండి విడిపోతే **విప్రకీర్ణకములు**.

**మూ. అలపల్లవసంస్థానాదూర్ధ్వస్థౌ పద్మకోశకౌ,**
**అరాలఖటకాఖ్యౌ చాప్యరాలఖటకాముఖౌ. 189**

**తా. (6) అరాలఖటకాముఖం :–** అలపల్లవముద్రలో ఉన్న రెండు హస్తాల అరచేతులు పైకి లేచి పద్మకోశముద్రలో ఉన్నట్లయితే అది **అరాలఖటకాముఖహస్తం.**

**మూ. అన్యే తు –**
**తథైవ మణిబన్ధాన్తే హ్యరాలౌ విచ్యుతావుభౌ,**
**జ్ఞేయౌ ప్రయోక్తృభిర్నిత్యమరాలఖటకావితి. ఇతి. 190**

**తా.** ఇతరు లైతే – "మణిబంధాల (ముంజేతుల) చివర విడిపోయిన అరాలహస్తాలే **అరాలఖటకాలు**గా ప్రయోక్తలు తెలుసుకోవాలి" అని అన్నారు.

**మూ. భుజాంసకూర్పరాగ్రైస్తు కుటిలావర్తితౌ కరౌ,**
**పరాఙ్ముఖతలావిద్ధౌ జ్ఞేయావావిద్ధవక్రకౌ. 191**

**తా. (7) ఆవిద్ధవక్రహస్తం :–** అంసములు (బుజాల) కూర్పరాగ్రాలు (మోచేతి అగ్రభాగాలు) భుజాలు (జబ్బలు) వీటితో కుటిలంగా (సవిలాసగా) తిప్పబడిన, పరాఙ్ముఖంగా ఉన్న తలములతో ఆవిద్ధము లైన చేర్చబడిన హస్తాలకు ఆవిద్ధవక్రకములు అని పేరు.

**మూ. హస్తౌ తు సర్పశిరసౌ మధ్యమాఙ్గుష్ఠకౌ యదా,**
**తిర్యక్ ప్రసారితాస్యౌ చ తదా సూచీముఖౌ స్మృతౌ. 192**

**తా. (8) సూచీముఖం :–** సర్పశిరోహస్తాల మధ్యమాంగుళులమీద అంగుష్ఠా లుంచి వాటి ముఖాలు అడ్డంగా చాపిన ట్లయితే అవి **సూచీముఖాలు.**

**మూ. అన్యే –**
**సర్పశిర్షౌ యదా హస్తౌ భవేతాం స్వస్తికాస్థితౌ,**
**మధ్యప్రసారితాఙ్గుష్ఠౌ జ్ఞేయౌ సూచీముఖౌ తదా. 193**

**తా.** సర్పశీర్షహస్తాలు స్వస్తికముద్రలో ఉండి వాటి అంగుష్ఠాలను మధ్యమాంగుళులు స్పృశిస్తే అవి సూచీముఖహస్తాలు అని కొంద రన్నారు.

**మూ. రేచితౌ చాపి విజ్ఞేయౌ హంసపక్షౌ ద్రుతభ్రమౌ,**
**ప్రసారితోత్తానతలౌ రేచితావితి సంజ్ఞితౌ. 194**

**తా. (9) రేచితహస్తాలు :–** హంసపక్షహస్తాలు రెండూ ఊర్ధ్వముఖాలుగా చేసి, అతిశీఘ్రంగా కదిపినట్లయితే అవి రేచితహస్తాలు.

**మూ. చతురస్రో భవేద్వామః సవ్యహస్తశ్చ రేచితః,**
**విజ్ఞేయౌ నృత్తతత్త్వజ్ఞైః అర్ధరేచితసంజ్ఞితౌ. 195**

**తా. (10) అర్ధరేచితహస్తాలు :–** ఎడమ చెయ్యి చతురస్రముద్రలో ఉండగా కుడిచెయ్యి రేచితముద్రలో ఉంచుతే అది **అర్ధరేచితహస్తముద్ర** అవుతుంది.

**మూ. అఞ్చితౌ కూర్పరాంసౌ తు త్రిపతాకౌ కరౌ స్మృతౌ,**
**కించిత్తిర్యగ్గతావేతౌ స్మృతావుత్తానవఞ్చితౌ. 196**

**తా. (11) ఉత్తానవంచితహస్తాలు :–** బుజాలు, మోచేతులు కొంచెం వంచాలి.

త్రిపతాకముద్రలో ఉన్న రెండు హస్తాలు కొంచెం అడ్డంగా వంగి ఉండాలి. ఇవి **ఉత్తాన వంచితహస్తాలు**.

**మూ. మణిబన్ధనముక్తౌ తు పతాకౌ పల్లవౌ స్మృతౌ,**
**బాహుశీర్షాద్వినిష్క్రాన్తౌ నితమ్బావితి కీర్తితౌ. 197**

**తా. (12, 13) పల్లవ - నితంబహస్తాలు :-** పతాకహస్తాలను మణిబంధనం (ముంజేతి) నుంచి వేరుచేస్తే అవి పల్లవహస్తా లవుతాయి. పతాకహస్తాలను రెండింటినీ మూపునుండి నితంబంవరకు బైటకు చాపితే అవి నితంబహస్తాలు.

**మూ. కేశదేశాద్వినిష్క్రాన్తౌ పరిపార్శ్వోత్థితౌ తథా,**
**విజ్ఞేయౌ కేశబన్ధౌ తు కరావాచార్యసంమతౌ. 198**

**తా. (14) కేశబంధహస్తాలు :-** (ముందు ఒక పక్క కొంచెం తిరిగి చేతులు కేశ బంధంవరకు తీసికొని వెళ్లిన తరువాత) కేశబంధనంనుండి దూరమై, పక్కకి లేచిన హస్తాలు **కేశబంధహస్తాలు**గా ఆచార్యులు అంగీకరించారు. ఇలా కేశాలను సరిచేసి కొనడంలో ఒక సొగసు ఉండడంచేత 'ఆచార్యసంమతౌ' అని ప్రత్యేకంగా చెప్పబడింది అని అభినవగుప్తాచార్యుడు.

**మూ. తిర్యక్ప్రసారితౌ చైవ పార్శ్వసంస్థౌ తథైవ చ,**
**లతాఖ్యౌ చ కరౌ జ్ఞేయౌ నృత్తాభినయనం ప్రతి. 199**

**తా. (15) లతాహస్తాలు :-** నృత్తంలోను అభినయంలోను రెండు చేతులూ అడ్డంగా పార్శ్వాలకి చాపితే అవి **లతాహస్తాలు**.

**మూ. సమున్నతో లతాహస్తః పార్శ్వాత్ పార్శ్వం విలోలితః,**
**త్రిపతాకోఽపరః కర్ణం కరిహస్తః ప్రకీర్తితః. 200**

**తా. (16) కరిహస్తం :-** ఒక లతాహస్తం పైకి ఎత్తి ఒక పార్శ్వంనుంచి మరొక పార్శ్వానికి ఊపుతూ త్రిపతాకాముద్రలో ఉన్న రెండవ హస్తాన్ని చెవి దగ్గర ఉంచుతే అది **కరిహస్తం**.

**మూ. కటిశీర్షనివిష్టౌ ద్వౌ త్రిపతాకౌ యదా కరౌ,**
**పక్షవఞ్చితకౌ హస్తౌ తదా జ్ఞేయౌ ప్రయోక్తృభిః. 201**

**తా. (17) పక్షవంచితకహస్తాలు :-** ఒక త్రిపతాకాహస్తం కటిప్రదేశంమీద, రెండవ త్రిపతాకహస్తం శిరస్సుమీద ఉంచుతే అవి **పక్షవంచితకహస్తాలు**.

**మూ. తావేవ తు పరావృత్తౌ పక్షప్రద్యోతకౌ స్మృతౌ,**
**అధోముఖతలావిద్ధౌ జ్ఞేయౌ గరుడపక్షకౌ. 202**

**తా. (18, 19) పక్షప్రద్యోతక - గరుడపక్షాలు :-** పక్షవంచితకహస్తాల చోట్లు మార్చగా అవి **పక్షప్రద్యోతక** హస్తా లవుతాయి. అరచేతులు క్రింది వైపు ఉండే టట్లు చేసి, వాటిని నితంబప్రదేశంనుంచి ఛట్టున పైకి తీసికొనిపోతే అది **గరుడపక్షహస్తాలు** అవుతాయి.

**మూ. హంసపక్షకృతౌ హస్తౌ వ్యావృత్తపరివర్తితౌ,**
**తథా ప్రసారితభుజౌ దణ్డపక్షావితి స్మృతౌ. 203**

**తా. (20) దండపక్షహస్తాలు :-** హంసపక్షముద్రలో ఉన్నహస్తాలలో ఒకదానిని వక్షఃస్థలం వైపు తీసికొని రెండవదానిని ముందుకు చాపుతూ, భుజాలు చాపుతూ, అట్లే మళ్లీ చేస్తూ ఉంటే అవి దండపక్షహస్తాలు.

**మూ. ఊర్ధ్వమణ్డలినౌ హస్తౌ ఊర్ధ్వదేశవివర్తనాత్,**
**తావేవ పార్శ్వవిన్యస్తౌ పార్శ్వమణ్డలినౌ స్మృతౌ. 204**

**తా. (21, 22) ఊర్ధ్వమండలి - పార్శ్వమండలిహస్తాలు :-** చేతులు తలపైకి ఎత్తి గుండ్రంగా తిప్పితే అవి ఊర్ధ్వమండలిహస్తాలు. పార్శ్వాల వైపుకు చేతులు తీసికొని వెళ్లి అక్కడ గుండ్రంగా తిప్పితే అవి **పార్శ్వమండలిహస్తాలు.**

**మూ. ఉద్వేష్టితో భవేదేకః ద్వితీయశ్చాపవేష్టితః,**
**భ్రామితావురసః స్థానే హ్యురోమన్డలినౌ స్మృతౌ. 205**

**తా. (23) ఉరోమండలిహస్తాలు :-** ఒక హస్తం ఉద్వేష్టితం చేసి రెండవది అపవేష్టితం చేసి రెండింటినీ వక్షఃస్థలం దగ్గర తిప్పిన ట్లయితే అవి **ఉరోమండలిహస్తాలు.**

**వి.** అరచేయి బోర్లా వేసి తన వైపు తిప్పడం ఉద్వేష్టనం; అది తిరగవేసి బైటవైపుకు తిప్పడం అపవేష్టనం.

**మూ. అలపల్లవకారాలావురోర్ధభ్రమణక్రమాత్,**
**పార్శ్వావర్తశ్చ విజ్ఞేయావురఃపార్శ్వార్ధమణ్డలౌ. 206**

**తా. (24) ఉరఃపార్శ్వార్ధమండలహస్తాలు :-** అలపల్లవక - అరాలహస్తాలు వరుసగా మాటమాటికీ వక్షఃస్థలం సగంభాగం పైనా, పార్శ్వమునందూ తిరగడంచేత **ఉరఃపార్శ్వార్ధమండలము** లని గ్రహించాలి.

**మూ. హస్తౌ తు మణిబన్ధాన్తే కుఞ్చితావఞ్చితౌ యదా,**
**ఖటకాఖ్యౌ తు తౌ స్యాతాం ముష్టికస్వస్తికౌ తదా. 207**

**తా. (25) ముష్టికస్వస్తికహస్తాలు :-** ఖటకాముఖహస్తాలు రెండింటినీ మణిబంధం దగ్గర వంచి తిప్పగా అవి **ముష్టికస్వస్తికహస్తాలు.**

**మూ. పద్మకోశౌ యదా హస్తౌ వ్యావృత్తపరివర్తితౌ,**
**నలినీపద్మకోశౌ తు తదా జ్ఞేయౌ ప్రయోక్తృభిః. 208**

**తా. (26) నలినీపద్మకోశహస్తాలు :–** పద్మకోశహస్తాలను వ్యావృత్త – పంరివర్తిత కరణాలలో ఉంచిన ట్లయితే అవి **నలనీపద్మకోశహస్తాలు** అవుతాయి అని ప్రయోక్తలు గ్రహించాలి.

**మూ. కరావుద్వేష్టితాగ్రౌ చ ప్రవిధాయాలపల్లవౌ,**
**ఊర్ధ్వప్రసారితావిద్ధౌ కర్తవ్యావుల్బణావితి. 209**

**తా. (27–28) అలపల్లవ ఉల్బణహస్తాలు :–** ఉద్వేష్టితకరణంలో ఉన్న రెండు హస్తాలు కదుపుతుంటే అది **అలపల్లవం.** రెండు చేతులూ పైకి ప్రసరింపచేసి ఆవిద్ధము లయితే అవి **ఉల్బణహస్తాలు.**

**మూ. పల్లవౌ చ శిరోదేశం సంప్రాప్తౌ లలితౌ స్మృతౌ,**
**కూర్పరస్వస్తికగతౌ లతాఖ్యౌ వలితావితి. 210**

**తా. (29, 30) లలిత – వలితములు :–** పల్లవహస్తాలు శిరఃప్రదేశం దగ్గరికి వెళ్లినప్పుడు వాటికి **లలితము** లని పేరు. లతాహస్తాలు రెండూ కూర్పరస్వస్తికములో ఉంటే అవి **వలితము** లవుతాయి.

**మూ. కరణే తు ప్రయోక్తవ్యా నృత్తహస్తా విశేషతః,**
**తథార్థాభినయే చైవ పతాకాద్యాః ప్రయోక్తృభిః. 211**

**తా.** కరణాలను ప్రయోగించే టప్పుడు విశేషించి నృత్తహస్తాలను కూడ ప్రయోగించాలి. ఏదైన విషయాన్ని అభినయిం చేటప్పుడు మాత్రం పతాకాదిహస్తాలు ప్రయోగించాలి.

**మూ. సఙ్కరోఽపి భవేత్తేషాం ప్రయోగేఽర్థవశాత్పునః,**
**ప్రాధాన్యేన పునః సంజ్ఞా నాట్యే నృత్తే కరేష్విహ. 212**

**తా.** ఇవి నాట్యహస్తాలు ఇవి నృత్తహస్తాలు అని ప్రాధాన్యాన్ని పట్టి పేర్లు పెట్టడం జరిగింది కాని, అర్థానుసారంగా, విషయానుసారంగా, వాటి ప్రయోగంలో సాంకర్యం ఉండవచ్చును; నాట్యంలో నృత్తహస్తాల ప్రయోగం నృత్తంలో నాట్యహస్తాల ప్రయోగం జరగవచ్చును.

**మూ. వియుతాః సంయుతాశ్చైవ నృత్తహస్తాః ప్రకీర్తితాః,**
**అతఃపరం ప్రవక్ష్యామి కరాన్ కరణసంశ్రయాన్. 213**

**తా.** ఇంతవరకు వియుతహస్తాలు, సంయుతహస్తాలు అను రెండు రకాల నృత్త హస్తాలను చెప్పాను. ఇప్పుడు కరణాలకు సంబంధించిన హస్తాలు చెపుతాను.

**మూ. సర్వేషామేవ హస్తానాం నాట్యహస్తనిదేశిభిః,**
**విజ్ఞాతవ్యం ప్రయత్నేన కరణం తు చతుర్విధమ్. 214**

**తా.** ఈ హస్తా లన్నీ నాలుగు కరణాలలో వర్గీకరింపబడి ఉన్నాయి అను విషయం నాట్యహస్తనిదేశకులు తెలుసుకోవాలి.

**మూ. అథావేష్టితమేకం స్యాదుద్వేష్టితమథాపరమ్,**
**వ్యావర్తితం తృతీయం తు చతుర్థం పరివర్తితమ్. 215**

**తా.** ఆవేష్టితం, ఉద్వేష్టితం, వ్యావర్తితం, పరివర్తితం అని కరణాలు నాలుగు విధాలు.

**మూ. ఆవేష్ట్యన్తే యదఙ్గుల్యస్తర్జన్యాద్యా యథాక్రమమ్,**
**అభ్యన్తరేణ కరణం తదావేష్టితముచ్యతే. 216**

**తా. (1) ఆవేష్టితకరణం :–** తర్జని మొదలైన వేళ్లన్నీ వరుసగా లోపలికి ముణిచి నట్లయితే అది **ఆవేష్టితకరణం.**

**మూ. ఉద్వేష్ట్యన్తే యదాఙ్గుల్యః తర్జన్యాద్యా బహిర్ముఖమ్,**
**క్రమశః కరణం విప్రాస్తదుద్వేష్టితముచ్యతే. 217**

**తా. (2) ఉద్వేష్టితం :–** తర్జని మొదలైన వేళ్లను వరుసగా బైటకు విప్పినట్లయితే అది **ఉద్వేష్టితకరణం.**

**మూ. ఆవర్త్యన్తే కనిష్ఠాద్యా అఙ్గుల్యోభ్యన్తరేణ తు,**
**యథా క్రమేణ కరణం తద్వ్యావర్తితముచ్యతే. 218**

**తా. (3) వ్యావర్తితం :–** కనిష్ఠిక మొదలైన వేళ్లు వరుసగా లోపలికి ముణవడం **వ్యావర్తితం.**

**మూ. ఉద్వర్త్యన్తే కనిష్ఠాద్యా బాహ్యతః క్రమశో యదా,**
**అఙ్గుల్యః కరణం విప్రాస్తదుక్తం పరివర్తితమ్. 219**

**తా. (4) పరివర్తితం :–** కనిష్ఠకతో ప్రారంభించి అన్ని వేళ్లూ వరుసగా బైటకు తెరవడం **పరివర్తితకరణం.**

**మూ. నృత్తేఽభినయయోగే చ పాణిభిర్వర్తనాశ్రయైః,**
**ముఖభ్రూనేత్రయుక్తాని కరణాని ప్రయోజయేత్. 220**

**తా.** పైన చెప్పిన నాలుగు వర్తనాలను ఆశ్రయించి ఉన్న హస్తాలతో, నృత్తంలోనూ, అభినయంలోను కూడ ముఖ - భ్రూ - నేత్రక్రియలతో పాటు కరణాలను కూడ ప్రయోగించాలి.

**మూ. తిర్యక్ తథోర్ధ్వసంస్థో హ్యధోముఖశ్చాఞ్చితోఽపవిద్ధస్తు,**
**మణ్డలగతిస్తథా స్వస్తికశ్చ పృష్ఠానుసారీ చ. 221**
**ఉద్వేష్టితః ప్రసారిత ఇత్యేతే వై స్మృతాః ప్రకారాస్తు,**
**బాహ్వోరితి కరణగతా విజ్ఞేయా నర్తకైర్నిత్యమ్. 222**

**తా. పది బాహుకరణాల పేర్లు :-** తిర్యక్ (పక్కకకి అడ్డంగా తిప్పబడినది), ఊర్ధ్వసంస్థం (తలకంటె కూడ పైకి ఎత్తినది), అధోముఖం (నేలవైపు దించినది), అంచితం (వక్షఃప్రదేశంనుంచి శిరఃక్షేత్రంవరకు ఎత్తినది), అపవిద్ధం (మండలగతిలో అన్ని వైపులా తిరిగేది) మణ్డలగతి (మండలాకారంగా తిరిగేది), స్వస్తికం, పృష్ఠానుసారి (శరీరం వెనుక వైపునకు వెళ్లినది), ఉద్వేష్టితం (మణిబంధ వర్తనాన్ని అనుసరించి బైటకువచ్చేది) ప్రసారితం (ముందుకు చాపబడినది) అను పది విధాలైన బాహుకరణాలను నృత్తప్రయోక్తలు బాగా తెలుసుకోవాలి.

**మూ. హస్తానాం కరణవిధిర్మయా సమాసేన నిగదితో విప్రాః,**
**అత ఊర్ధ్వం వ్యాఖ్యాస్యే హృదయోదరపార్శ్వకర్మాణి. 223**

**తా.** విప్రులారా! హస్తకరణాలను గూర్చి మీకు సంక్షిప్తంగా చెప్పాను. ఇటుపైన హృదయ - ఉరస్ - పార్శ్వాల కర్మలు వివరిస్తాను.

**మూ. ఆభుగ్నమథ నిర్భుగ్నం తథా చైవ ప్రకమ్పితమ్,**
**ఉద్వాహితం సమం చైవ హ్యురః పఞ్చవిధం స్మృతమ్. 224**

**తా. ఐదు విధాలైన ఉరశ్చేష్టలు :-** ఆభుగ్నం, నిర్భుగ్నం, ప్రకంపితం, ఉద్వాహితం, సమం అని ఉరస్సు (వక్షస్థలం) ఐదు విధాలు.

**మూ. నిమ్నమున్నతపృష్ఠం చ వ్యాభుగ్నాంసం శ్లథం క్వచిత్,**
**ఆభుగ్నం తదురో జ్ఞేయం కర్మ చాస్య నిబోధత. 225**

**తా. (1) ఆభుగ్నవక్షస్థలం :-** వక్షస్థలం కొంచెం పల్లంగా, దాని వెనుకభాగం ఎత్తుగా ఉంటుంది. బుజాలు కొంచెం వంగి శిథిలంగా ఉంటాయి. ఇది **ఆభుగ్నవక్షస్థలం.**

**మూ. సంభ్రమవిషాదమూర్ఛాశోకభయవ్యాధిహృదయశల్యేషు,**
**కార్యం శీతస్పర్శే వర్షే లజ్జాన్వితేఽర్థవశాత్. 226**

**తా.** అభినయించవలసిన అర్థాన్ని అనుసరించి - కంగారు, దుఃఖం, మూర్ఛ,

శోకం, భయం, వ్యాధి, హృదయంలో శల్యం, చలి, వర్షం, సిగ్గు – వీటిలో ఆభుగ్నవక్షః స్థలం ప్రదర్శించాలి.

**మూ. స్తబ్ధం చ నిమ్నపృష్ఠం చ నిర్భుగ్నాంసం సమున్నతమ్,**
**ఉరో నిర్భుగ్నమేతద్ధి కర్మ చాస్య నిబోధత. 227**

**తా. (2) నిర్భుగ్నవక్షఃస్థలం :–** బిగిసి, వెనుకభాగం కొంచెం వెనుకకు వంగి, బుజాలు నిలబడి, ఎత్తుగా ఉన్న వక్షఃస్థలం **నిర్భుగ్నవక్షఃస్థలం**. దీని పనులు వినండి.

**మూ. స్తమ్భే మానగ్రహణే విస్మయదృష్టే చ సత్యవచనే చ,**
**అహమితి చ దర్పవచనే గర్వోత్సేకే చ కర్తవ్యమ్. 228**

**తా.** కదలకుండా నిలబడడంలోను, ఆత్మాభిమానం లేదా పట్టుదల చూపడంలోను, ఆశ్చర్యంతో చూచినప్పుడు, 'సత్యం' అని అంటున్నప్పుడు, 'నేను' అని దర్పంతో పలికే టప్పుడు, తీవ్రమైన గర్వంలోను నిర్భుగ్నవక్షఃస్థలప్రయోగం చెయ్యాలి.

**మూ. దీర్ఘనిఃశ్వసితే చైవ జృమ్భణే మోటనే తథా,**
**బిబ్బోకే చ పునః స్త్రీణాం తద్విజ్ఞేయం ప్రయోక్తృభిః. 229**

**తా.** దీర్ఘంగా నిట్టూర్పు విడవడంలోను, ఆవులింతలోను, స్త్రీల మోటన – బిబ్బోకా లనే విలాసలలోను, ప్రయోక్తలు ఈ నిర్భుగ్నవక్షఃప్రయోగం తెలుసుకోవాలి.

**మూ. ఊర్ధ్వక్షేపైరురో యత్ర నిరన్తరకృతైః కృతమ్,**
**ప్రకమ్పితం చ తద్ జ్ఞేయమురో నాట్యప్రయోక్తృభిః. 230**

**తా. (3) ప్రకమ్పితవక్షస్థలం :–** మాటి మాటికీపైకి లేపబడిన వక్షస్థలం **ప్రకంపితం** అని నాట్యప్రయోక్తలు గ్రహించాలి.

**మూ. హసితరుదితేషు కార్యం శ్రమే భయే శ్వాసకాసయోశ్చైవ,**
**హిక్కే దుఃఖే చ తథా నాట్యజ్ఞైరర్థయోగేన. 231**

**తా.** అభినేయమైన అర్థాన్ని అనుసరించి నాట్యజ్ఞులు ఈ ప్రకంపితవక్షస్థలాన్ని, నవ్వు, ఏడ్పు, అలసట, భయం, ఆయాసం, దగ్గు, ఎక్కిళ్లు, దుఃఖం – వీటిలో ప్రయోగించాలి.

**మూ. ఉద్వాహితం తూర్ధ్వకృతమురో జ్ఞేయం ప్రయోక్తృభిః,**
**దీర్ఘోచ్ఛ్వాసోన్నతాలోకే జృమ్భణాదిషు చేష్యతే. 232**

**తా. (4) ఉద్వాహితవక్షఃస్థలం :–** ప్రయత్నపూర్వకంగా పైకి ఎత్తబడిన వక్షస్థలం **ఉద్వాహితం**. దీర్ఘంగా నిట్టూర్పు విడవడం, ఎత్తుమీద ఉన్న వస్తువును చూడడం, ఆవులించడం మొదలైనవాటిలో దీనిని నాట్యప్రయోక్తలు ప్రయోగించాలి.

**మూ. సర్వైరేవాఙ్గవిన్యాసైశ్చతురస్రకృతైః కృతమ్,**
**ఉరః సమం తు విజ్ఞేయం స్వస్థం సౌష్ఠవసంయుతమ్. 233**

**తా. (5) సమవక్షస్థలం :–** అన్ని అవయవాలు ఉండవలసినచోట ఉండగా, స్వస్థమై, ఏ ఒడుదుడుకులూ లేకుండా ఉన్న వక్షః స్థలం **సమం.**

**మూ. ఏతదుక్తం మయా సమ్యగురసస్తు వికల్పనమ్,**
**అతఃపరం ప్రవక్ష్యామి పార్శ్వయోరిహ లక్షణమ్. 234**

**తా.** వక్షస్థలలక్షణం ఇంతవరకు స్పష్టంగా చెప్పాను. ఇప్పుడు పార్శ్వాల లక్షణం చెపుతాను.

**మూ. నతం సమున్నతం చైవ ప్రసారితవివర్తితే,**
**తథాపసృతమేవం తు పార్శ్వయోః కర్మ పఞ్చధా. 235**

**తా. ఐదు విధాల పార్శ్వచేష్టలు :–** నతము, సమున్నతము, ప్రసారితము, వివర్తితము, అపసృతము అని పార్శ్వాల పనులు అయిదు విధాలు.

**మూ. కటీ భవేత్తు వ్యాభుగ్నా పార్శ్వమాభుగ్నమేవ చ,**
**తథైవాపసృతాంసం చ కించిత్పార్శ్వం నతం స్మృతమ్. 236**

**తా. (1) నతం :–** కటిప్రదేశం కొంచెం వంగుతుంది; పార్శ్వం కొంచెం అడ్డంగా వంగుతుంది. బుజం కొంచెం విశాలం అయినట్లుంటుంది. ఇతి **నతపార్శ్వచేష్ట.**

**మూ. నతస్యైవాపరం పార్శ్వం విపరీతం తు యుక్తితః,**
**కటిపార్శ్వభుజాంసైశ్చాప్యున్నతైరున్నతం భవేత్. 237**

**తా. (2) ఉన్నతపార్శ్వం :–** ఒక పార్శ్వం నతమై ఉన్నప్పుడు రెండవ పార్శ్వం అందుకు విపరీతంగా ఉంటుంది. కటి – పార్శ్వము, జబ్బలు, బుజాలు, ఎత్తుగా ఉంటాయి. అది ఉన్నతపార్శ్వచేష్ట.

**మూ. ఆయామనాదుభయతః పార్శ్వయోః స్యాత్ప్రసారితమ్,**
**పరివర్తాత్ త్రికస్యాపి వివర్తితమిహేష్యతే. 238**

**తా. (3,4) ప్రసారిత – వివర్తితాలు :–** రెండు పార్శ్వాలను విస్తరింపచేయడం **ప్రసారితం.** త్రికాన్ని (వెన్నెముక క్రింది భాగాన్ని) తిప్పడం **వివర్తితం.**

**మూ. వివర్తితాపనయనాద్భవేదపసృతం పునః,**
**పార్శ్వలక్షణమిత్యుక్తం వినియోగం విబోధత. 239**

**తా. (5) అపసృతం :–** వివర్తితాన్ని తొలగించడంవల్ల, అనగా తిప్పిన త్రికాన్ని

సహజస్థితిలో ఉంచడంవల్ల, **అపసృతం** అవుతుంది. ఈ విధంగా పార్శ్వలక్షణం చెప్పాను. ఇపుడు ఆ పార్శ్వాల వినియోగం తెలిసికొనండి.

**మూ. ఉపసర్పే నతం కార్యమున్నతం చాపసర్పణే,**
**ప్రసారితం ప్రహర్షాదౌ పరివృత్తే వివర్తితమ్. 240**
**వినివృత్తే త్వపసృతం పార్శ్వమర్థవశాద్భవేత్,**
**ఏతాని పార్శ్వకర్మాణి జఠరస్య నిబోధత. 241**

**తా.** ఎవరిదగ్గరి కైనా వెళ్లేటప్పుడు **నతం** చెయ్యాలి. వెనుకకు వెళ్లే ప్రయత్నంలో **ఉన్నతం** చెయ్యాలి. ఆనందాదిప్రదర్శనంలో **ప్రసారితం** వినియోగించాలి. తిరిగే టప్పుడు **పరివృత్తం** వినియోగించాలి. పూర్వస్థితినుండి వెనుకటి స్థితిలోకి వెళ్లేటప్పుడూ **అపసృతం** విని యోగించాలి. అభినయించే విషయాన్ని పట్టి పార్శ్వవిశేషాల వినియోగం చెయ్యాలి.

ఇవి పార్శ్వకర్మలు. ఇప్పుడు ఉదరచేష్టలు తెలిసికొనండి –

**మూ. క్షామం ఖల్వం చ పూర్ణం చ సంప్రోక్తముదరం త్రిధా,**
**తను క్షామం నతం ఖల్వం పూర్ణమాధ్మాతముచ్యతే.**

**తా. ఉదరచేష్టలు :–** క్షామం, ఖల్వం, పూర్ణం అని ఉదరం మూడు విధాలు. సన్నని ఉదరం **క్షామం.** వంగిన ఉదరం **ఖల్వం.** లావైన (ఉబికిన) ఉదరం **పూర్ణం.**

**మూ. క్షామం హాస్యేఽథ రుదితే నిఃశ్వాసే జృమ్భణే భవేత్,**
**వ్యాధితే తపసి శ్రాన్తే క్షుధార్తే ఖల్వమిష్యతే. 243**
**పూర్ణముచ్ఛ్వసితే స్థూలే వ్యాధితాత్యశనాదిషు.**
**అన్యే తు –**
**క్షామం ఖల్వం సమం పూర్ణముదరం స్యాచ్చతుర్విధమ్. 244**

**తా.** హాస్యంలోను, రోదనంలోను, నిట్టూర్పు విడుచుటలోను, ఆవులించడంలోను, **క్షామం** ప్రయోగించాలి. వ్యాధి, తపస్సు అలసిపోవడం, ఆకలి – వీటిలో **ఖల్వం** వినియోగించాలి. ఊపిరి గట్టిగా పీల్చినప్పుడు, స్థూలత్వంలోను, రోగవిశేషంలోను, అతిభోజనంలోను **పూర్ణం** వినియోగించాలి.

కొంద రైతే – క్షామం, ఖల్వం, సమం, పూర్ణం అని ఉదరం నాలుగు విధాలు అని అన్నారు.

**మూ. ఇత్యేతదుదరస్యోక్తం కర్మ కట్యా నిబోధత,**
**ఛిన్నా చైవ నివృత్తా చ రేచితా కమ్పితా తథా. 245**
**ఉద్వాహితా చేతి కటీ నాట్యే నృత్తే చ పఞ్చధా.**

**తా.** ఈ విధంగా ఉదరకర్మ చెప్పాను. ఇపుడు కటిస్థలకర్మ తెలిసికొనండి – ఛిన్న, నివృత్త, రేచిత, కంపిత, ఉద్వాహిత అని, నాట్యంలోను, నృత్తంలోను, కటిప్రదేశం ఐదు విధాలు.

**మూ. కటీ మధ్యస్యవలనాచ్ఛిన్నా సంపరికీర్తితా. 246**

**పరాఙ్ముఖస్యాభిముఖీ నివృత్తా స్యాన్నివర్తితా,**
**సర్వతో భ్రమణాచ్చాపి విజ్ఞేయా రేచితా కటీ. 247**

**తిర్యగ్గతాగతా క్షిప్రకటీ జ్ఞేయా ప్రకమ్పితా,**
**నితమ్బపార్శ్వోద్వహనాచ్ఛనైరుద్వాహితా కటీ. 248**

**తా. కటిచేష్టలు :–** నడుము తిప్పడంవల్ల **ఛిన్నకటి** అని చెప్పబడుతుంది. వెనుక వైపు తిరిగి ఉన్నదానిని అభిముఖంగా తిప్పితే అది **నివృత్తకటి**. కటిప్రదేశాన్ని అన్నివైపులకు తిప్పుతే అదే **రేచితకటి**. అడ్డంగా తిప్పి శీఘ్రంగా వస్తూ వెడుతూ ఉంటే **ప్రకంపితకటి**. నితంబపార్శ్వాలను పైకి ఎత్తినప్పుడు ఆ కటి **ఉద్వాహితకటి**.

**మూ. పునశ్చాసాం ప్రవక్ష్యామి వినియోగప్రయోజనమ్,**
**ఛిన్నా వ్యాయామసంభ్రాన్తవ్యావృత్తప్రేక్షణాదిషు. 249**

**నివృత్తా వర్తనే చైవ రేచితా భ్రమణాదిషు,**
**కుబ్జవామననీచానాం గతౌ కార్యా ప్రకమ్పితా. 250**

**స్థూలేషూద్వాహితా యోజ్యా స్త్రీణాం లీలాగతే షు చ.**

**తా.** ఈ కటిస్థలాల వినియోగం ఎప్పుడు చెయ్యాలో చెపుతాను – వ్యాయామము, తొందరపాటు లేదా కంగారు, అన్ని వైపులా తిరిగిచూడడం మొదలైనవాటిలో **ఛిన్నకటి** వినియోగించాలి. మామూలుగా ఉన్నప్పుడు **నివృత్తకటి** ప్రయోగించాలి. తిరగడం మొదలైనవాటిలో రేచితకటి వినియోగించాలి. గూనువాళ్లు, పొట్టివాళ్లునీచులు – వీళ్ల నడకలలో **ప్రకంపితకటి** వినియోగించాలి. స్థూలకాయులలోను, స్త్రీల విలాసగమనాల లోను **ఉద్వాహితకటి** వినియోగించాలి.

**మూ. కమ్పనం వలనం చైవ స్తమ్భనోద్వర్తనే తథా. 250**

**వివర్తనం చ పఞ్చైతాన్యూరుకర్మాణి కారయేత్.**

**తా. ఊరుకర్మలు :–** కంపనము, వలనము, స్తంభనము, ఉద్వర్తనము, వివర్తనము అను ఐదు విధాలైన ఊరు (తొడల) చేష్టలు చేయించాలి.

**మూ. నమనోన్నమనాత్ పార్ష్ణేః ముహుః స్యాదూరుకమ్పనమ్. 251**

**గచ్ఛేదభ్యన్తరం జాను యత్తు తద్వలనం స్మృతమ్,**
**స్తమ్భనం చాత్ర విజ్ఞేయమపవిద్ధక్రియాత్మకమ్. 252**
**వలితావిద్ధకరణాదుద్వర్తనమితీరితమ్,**
**పార్ష్ణిరభ్యన్తరం గచ్ఛేద్యత్ర తత్తు వివర్తనమ్. 253**

**తా.** మాటి మాటికి మణవలు ఎత్తుతూ దింపుతూండడంవల్ల **ఊరుకంపనం.**

మోకాలు తొడ వైపు ముణవడం **వలనం.**

ఏ పనీ (కదలికా) లేకుండడం **స్తంభనం.**

తొడక్రిందికి ముణచిన మోకాలు బైటకు తీయడం **ఉద్వర్తనం.**

సీలమండ బాగా తొడ క్రిందికి చొనపడం **వివర్తనం.**

**మూ. గతిష్వధమపాత్రాణాం భయేచాపి ప్రకమ్పనమ్,**
**వలనం చాపి కర్తవ్యం స్త్రీణాం స్వైరపరిక్రమే. 254**
**సాధ్వసే చ విషాదే చ స్తమ్భనం సంప్రయోజయేత్,**
**వ్యాయామే తాణ్డవే చైవ కార్యముద్వర్తనం బుధైః. 255**
**వివర్తనం చ కర్తవ్యం సమ్భ్రమాదిపరిక్రమే,**
**యథాదర్శనమన్యత్ర లోకాద్ గ్రాహ్యం ప్రయోక్తృభిః. 256**

**తా. ఊరుచేష్టల వినియోగం :–** అధమపాత్రల నడకయందు, భయంలోను **కంపనం** వినియోగించాలి. స్త్రీల స్వేచ్ఛాగమనంలో **వలనం** వినియోగించాలి. భయం లోను, దుః ఖంలోను **స్తంభనం** వినియోగించాలి. వ్యాయామంలోను; తాండవంలోను **ఉద్వర్తనం** ప్రయోగించాలి. తొందరగా నడవడం మొదలైనవాటిలో **వివర్తనం** వినియోగించాలి. లోకంలో ఏ విధంగా కనబడుతుందో అది కూడ అవసరాన్ని పట్టి ప్రయోక్తలు అవలంబించాలి.

**మూ. ఇత్యూర్వోర్లక్షణం ప్రోక్తం జఙ్ఘయోస్తు నిబోధత,**
**ఆవర్తితం నతం క్షిప్తముద్వాహితమథాపి వా. 257**
**పరివృత్తం తథా చైవ జఙ్ఘాకర్మాణి పఞ్చధా.**

**తా.** ఇంతవరకు ఊరువుల లక్షణం చెప్పాను. ఇప్పుడు జంఘల (పిక్కల) లక్షణం వినండి – ఆవర్తితం, నతం, క్షిప్తం, ఉద్వాహితం, పరివృత్తం అని జంఘాకర్మలు ఐదు విధాలు.

**మూ. వామో దక్షిణపార్శ్వేన దక్షిణశ్చాపి వామతః. 258**

**పాదో యత్ర వ్రజేద్విప్రా స్తదావర్తితముచ్యతే,**
**జఙ్ఘాస్వస్తికయోగేన క్రమాదావర్తితం నయేత్.** **259**

**తా. (1) ఆవర్తితం :-** ఎడమ కాలు కుడిపార్శ్వం వైపు కుడి కాలు ఎడమ పార్శ్వం వైపు తీసికొని వెడితే అది ఆవర్తితం. పిక్కలను స్వస్తికాకారంలో ఉంచడం ద్వారా ఆవర్తితం ఏర్పడుతుంది.

**మూ. జానునోః కుఞ్చనాచ్చైవ నతం జ్ఞేయం ప్రయోక్తృభిః,**
**విక్షేపాచ్చాపి జఙ్ఘాయాః క్షిప్తమిత్యభిధీయతే.** **260**
**(నతం స్యాజ్జానునమనాత్ క్షిప్తం విక్షేపణాద్బహిః,)**
**ఉద్వాహితం చ విజ్ఞేయమూర్ధ్వముద్వాహనాదిహ.** **261**
**ప్రతీపనయనం యత్తు పరివృత్తం తదుచ్యతే.**

**(తా. (2) నతం :-** మోకాళ్లను వంచడంచేత **నతం** ఏర్పడుతుంది. (3) **క్షిప్తం:-** కాళ్లు బైటకు విసరడం **క్షిప్తం.** (మోకాళ్ళు వంచడం నతం. మోకాళ్లు బైటకు విసురుతూ నడవడం **క్షిప్తం.**) (4) కాళ్ళు పైకి ఎత్తడం **ఉద్వాహితం.** (5) కాళ్లు ఒకదానికి మరొకటి ప్రతికూలంగా ఉండే టట్లు ఉంచడం **పరివృత్తం.**

**మూ. ఆవర్తితం ప్రయోక్తవ్యం విదూషకపరిక్రమే.** **262**
**నతం చాపి హి కర్తవ్యం స్థానాసనగతాదిషు,**
**క్షిప్తం వ్యాయామయోగేషు తాణ్డవే చ ప్రయుజ్యతే.** **263**
**తథా చోద్వాహితం కార్యమావిద్ధగమనాదిషు,**
**తాణ్డవాదౌ ప్రయోక్తవ్యం పరివృత్తం ప్రయోక్తృభిః.** **264**

**తా. జంఘాచేష్టల వినియోగం :-** విదూషకుని నడకలో ఆవర్తితం ప్రయోగించాలి. లేవడం, కూర్చొనడం, నడవడం మొదలైనవాటియందు **నతం** ప్రయోగించాలి. వ్యాయామంలోను తాండవనృత్యంలోను **క్షిప్తం** ప్రయోగించాలి. ఆవిద్ధగమనాదులలో (సీలమండలు ఎత్తిపడవేస్తూ నవడవం మొదలైనవాటిలో) **ఉద్వాహితం** ఉపయోగించాలి. తాండవాదులలో **పరివృత్తం** వినియోగించాలి.

**మూ. ఇత్యేవం జఙ్ఘయోః కర్మ పాదయోస్తు నిబోధత,**
**ఉద్ఘట్టితః సమశ్చైవ తథాగ్రతలసంచరః.** **265**
**అఞ్చితః కుఞ్చితశ్చైవ పాదః పఞ్చవిధః స్మృతః**

**తా.** ఇంతవరకూ జంఘాచేష్టలను గూర్చి చెప్పాను. ఇపుడు పాదాల చేష్టలను

తెలుసుకొనండి. ఉద్ఘట్టితము, సమము, అగ్రతలసంచరము, అంచితము, కుంచితము అని పాదం ఐదు విధాలు.

**మూ. స్థిత్వా పాదతలాగ్రేణ పార్ష్ణిర్భూమౌ నిపాత్యతే. 266**
**యస్య పాదస్య కరణే భవేదుద్ఘట్టితస్తు సః.**

**తా. (1) ఉద్ఘట్టితపాదం :–** పాదాగ్రాలమీద నిలబడి నేలమీద మణవలు పడవేసిన ట్లయితే అది **ఉద్ఘట్టితపాదం**.

**మూ. అయముద్వేష్టితకరణేష్వనుకరణార్థం ప్రయోగమాసాద్య. 267**
**ద్రుతమధ్యమప్రచారః సకృదసకృద్వా ప్రయోక్తవ్యః.**

**తా.** ఉద్వేష్టితకరణాలలో అనుకరణంకోసం చేసే ప్రయోగం చేసేటప్పుడు ఈ అవఘట్టితపాదచేష్ట ద్రుతగతిలో గాని మధ్యమగతిలో కాని, ఒకే పర్యాయం లేదా అనేక పర్యాయాలు చేయవచ్చును.

**మూ. స్వభావరచితో భూమౌ సమస్థానశ్చ యో భవేత్. 268**
**సమపాదః స విజ్ఞేయః స్వభావాభినయాశ్రయః.**

**తా. (2) సమపాదం :–** నేలమీద స్వాభావిక మైన స్థితిలో ఆన్చి, సమంగానే ఉంచిన పాదం **సమపాదం**. స్వభావాన్ని అభినయించే సందర్భంలో దానిని వినియో గించాలి.

**మూ. స్థిరః స్వభావాభినయే నానాకరణసంశ్రయే. 269**
**చరితశ్చ పునః కార్యో విధిజ్ఞైః పాదరేచితే.**

**తా.** అనేకవిధా లైన కరణాలకు సంబంధించిన స్వభావాభినయంలో **స్థిరపాదం** వినియోగించాలి. పాదరేచకం చేసే సమయంలో **చలితపాదం** ప్రయోగించాలి.

**మూ. సమస్యైవ యదా పార్ష్ణిః పాదస్యాభ్యన్తరే భవేత్. 270**
**బహిః పార్శ్వస్థితోఽఙ్గుష్ఠస్త్ర్యశ్రపాదస్తు స స్మృతః.**

**తా.** సమపాదంలో ఉన్న మణవ పాదం లోపలివైపు వంగి ఉండగా, అంగుష్ఠం బైట పక్కకు ఉన్నట్లయితే అది **త్ర్యశ్రపాదం**.

**మూ. త్యక్త్వా (కృత్వా) సమపదం స్థానమశ్వక్రాన్తే తథైవ చ. 271**
**స్యాద్విక్లవాదిష్వర్థేషు త్ర్యశ్రః పాదో యథావిధి.**

**తా.** గుఱ్ఱం ఎక్కేటప్పుడు, ఉపద్రవం మొదలైనవాటియందు సమపాదాన్ని విడిచి, యథావిధిగా ఈ త్ర్యశ్రపాదం ప్రయోగించాలి.

**మూ. అస్యైవ సమపాదస్య పార్‌ష్ణిరభ్యన్తరే భవేత్. 272**

**త్ర్యశ్రపాదః స విజ్ఞేయః స్థానకాదిషు సంశ్రయః**

**తా.** సమపాదంలో ఉన్నప్పుడు మణవ లోపలివైపు వంగిన ట్లయితే అది త్ర్యశ్రపాదం. దీని వినియోగం స్థానకాదులలో ఉంటుంది.

**మూ. ఉత్‌క్షిప్తా తు భవేత్ పార్‌ష్ణిః ప్రసృతోఽఙ్గుష్ఠకస్తథా. 273**

**అఙ్గుల్యశ్చాఞ్చితాః సర్వాః పాదేఽగ్రతలసంచరే.**

**తా. (3) అగ్రతలసంచరపాదం :–** **అగ్రతలసంచర** పాదంలో మణవ ఎత్తబడి ఉంటుంది. బొటనవ్రేలు పైకి లేచి ఉంటుంది. మిగిలిన వేళ్లు కూడా విస్తరించి ఉంటాయి.

**మూ. తోదననికుట్టనే స్థితనిశుమ్భనే భూమితాడనే భ్రమణే. 274**

**విక్షేపవివిధరేచకపార్‌ష్ణికృతాగమనమేతేన.**

**తా.** ప్రేరేపించడము, నికుట్టనము (ప్రేరణను అంగీకరించడము), స్థితము (వైష్ణవాదిస్థానకము) నిశుమ్భనము (పీడించడము) భూమితాడనము, భ్రమణము (మనోభ్రాంతి), విక్షేపము (ప్రాణులను దూరంగాతోలివేయడము) అనేకవిధా లైన రేచకాలు – వీటిలో అగ్రతలసంచరపాదం వినియోగించాలి.

**మూ. పార్‌ష్ణిర్యస్యాఞ్చితా భూమౌ పాదమగ్రతలం తథా. 275**

**అఙ్గుల్యశ్చాఞ్చితాః సర్వాః స పాదోఽఞ్చిత ఉచ్యతే.**

**తా. (4) అంచితపాదం :–** మణవ, పాదాగ్రతలము నేలమీద ఆనుకొని ఉండాలి. వేళ్లు అన్నీ విడివిడిగా ఉండాలి. అది **అంచితపాదం.**

**మూ. పాదాగ్రస్థితసంచారే వర్తితోద్వర్తితే తథా. 276**

**ఏష పాదాహతే కార్యో నానాభ్రమరకేషు చ.**

**తా.** పాదాగ్రంమీద నిలచి సంచరించడంలోను, వర్తిత – ఉద్వర్తితాలలోను, పాదంతో నేలకొట్టినప్పుడు, అనేకభ్రమరకములలోను దీనిని వినియోగించాలి.

**మూ. ఉత్‌క్షిప్తా యస్య పార్‌ష్ణిః స్యాత్ అఙ్గుల్యః కుఞ్చితాస్తథా. 277**

**తథాకుఞ్చితమధ్యశ్చ స పాదః కుఞ్చితః స్మృతః.**

**తా. (5) కుంచితపాదం :–** మణవ పైకి లేచి ఉంటుంది. వేళ్లు, పాదమధ్యభాగము వంగి ఉంటాయి. ఆ పాదం **కుంచితపాదం.**

**మూ. ఉదాత్తగమనే చైవ వర్తితోద్వర్తితే తథా. 278**

**అతిక్రాన్తక్రమే చైవ పాదమేతం ప్రయోజయేత్.**

**తా.** అందమైన నడకలోను, వర్తిత – ఉద్వర్తితములలోను, దుముకుటలోను, ఈ పాదం ప్రయోగించాలి.

**మూ. ఉత్క్షిప్తా తు భవేత్ పార్ష్ణిః అఙ్గుష్ఠాగ్రేణ సంస్థితః. 279**
**వామశ్చైవ స్వభావస్థః సూచీపాదః ప్రకీర్తితః,**
**నృత్తే నూపురకరణే చ ప్రయోగస్తస్య కీర్తితః. 280**

**తా.** కుడిపాదం మణవ పైకెత్తి ఉంటుంది. బొటన వేలి చివర నిలబడి ఉంటాడు. ఎడమ పాదం మామూలుగా ఉంటుంది. అది సూచీపాద మని చెప్పబడుతుంది. నృత్తంలోను, నూపురం ధరించడంలోను దీని వినియోగం.

**మూ. పాదజఙ్ఘోరుకరణం సమం కార్యం ప్రయోక్తృభిః,**
**పాదస్య కరణే సర్వం జఙ్ఘోరుకృతమిష్యతే. 281**

**తా.** నాట్యప్రయోక్తలు పాద – జంఘా – ఊరువులు మూడింటి చేష్టలూ ఒకే సమయంలో కలిపి చెయ్యాలి. ఎందువల్ల ననగా పాదకరణంలో జంఘోరువుల చేష్ట కూడ జరుగుతూనే ఉంటుంది.

**మూ. యథా పాదః ప్రవర్తేత తథైవోరుః ప్రవర్తతే,**
**తయోః సమానకరణాత్ పాదచారీం ప్రయోజయేత్. 282**

**తా.** పాదం ఎలా ప్రవర్తిస్తే ఊరువు కూడ అలాగే ప్రవర్తిస్తుంది. ఈ రెండింటి సమానత్వాన్ని చూచుకొంటూ పాదచేష్టలు చెయ్యాలి.

**మూ. ఇత్యేతదఙ్గజం ప్రోక్తం లక్షణం చైవ కర్మ హి,**
**అతఃపరం ప్రవక్ష్యామి చారీవ్యాయామలక్షణమ్. 283**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే అఙ్గాభినయో నామ నవమోధ్యాయః.**

**తా.** ఇంతవరకు ఆంగికచేష్టల లక్షణము, వినియోగమూ, కూడ చెప్పాను. ఇటుపైన చారీవ్యాయామం యొక్క లక్షణాలు చెపుతాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్ర వ్యాఖ్యానంలో అంగాభినయం అను తొమ్మిదవ అధ్యాయం సమాప్తం.**

**శ్రీః శ్రీః శ్రీః**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ దశమోఽధ్యాయః

# చారీవిధానాధ్యాయము

**"నిశ్చలస్థితిమద్వ్యోమభూచారీ సద్గతిప్రదః,**
**సర్వదా ధ్వనిమాత్రాత్మా శమ్భుర్విజయవాత్ ప్రభుః."**

**– శ్రీమదభినవగుప్తాచార్యాః**

**మూ. ఏవం పాదస్య జఙ్ఘాయా ఊర్వోః కట్యాస్తథైవ చ,**
**సమానకరణే చేష్టా సా చారీతి ప్రకీర్తితా. 1**

**తా.** ఈ విధంగా పాదము, జంఘ, ఊరువులు, కటిప్రదేశము పరస్పరసహ కారంతో, సమన్వయంతో సమానరీతిలో ప్రవర్తించిన ట్లయితే ఆ చేష్టకు **'చారీ'** అను పేరు.

**మూ. విధానోపగతాశ్చార్యో వ్యాయచ్ఛన్తే పరస్పరమ్,**
**యస్మాదఙ్గసమాయుక్తా స్తస్మాద్వ్యాయామ ఉచ్యతే. 2**

**తా.** ఏదో ఒక ప్రధాన మైన అంగానికి (అవయవానికి) సంబంధించినవై, ఒక విధానాన్ని (పద్ధతిని, నియమాన్ని) అనుసరించి ఏర్పడిన చారులు పరస్పరము (ఒకదానితో ఒకటి) సంబంధించి ఉంటాయి. ఇలా సంబంధించి ఉండడంవల్ల **వ్యాయామం** అని చెప్పబడుచున్నవి.

**వి.** వెనుకటి అధ్యాయం చివరి శ్లోకంలో – **"అతః పరం ప్రవక్ష్యామి చారీవ్యాయామ లక్షణమ్"** అను వాక్యంలో ప్రయోగించిన **'చారీవ్యాయామ'** పదానికి అర్థం ఇది – 'చారీ' అనగా 'దేనితో చరిస్తారో అది' అని గాని, 'చరించుట' అని గాని అర్థం. చరించడానికి సాధనం లేదా చరించడం అని అర్థం. చారి అనేది ఒక వ్యాయామం గాన ఇది 'చారీవ్యాయామం' అని చెప్పబడింది. ఇక్కడ 'వ్యాయామ' శబ్దానికి పరస్పర సంబంధము, ఒకదానితో మరొకదానికి సంబంధము, అని అర్థం.

ఒక్కొక విధమైన నృత్యంలో లేదా నృత్తంలో ఒక్కొక్క అంగం ప్రధానంగా ఉంటుంది. ఉదాహరణకి – అభినయంలో హస్తాలకు ప్రాధాన్యం. గతి (గమనం)లో పాదాలకు ప్రాధాన్యం. హస్తంతో అభినయం జరిగే టప్పుడు ఏ చారి ఉపయోగపడుతుందో, ఆ చారి ప్రధానం. అది ప్రయత్నసాధ్యం. ఆ చారితో మరికొన్ని చారులు వాటంతట అవి

వచ్చి చేరుతాయి. ఇవి అప్రయత్నసిద్ధాలు. ఈ విధంగా కొన్ని చారుల పరస్పర సంబంధానికి వ్యాయామం అని పేరు.

**ఏతదుక్తం భవతి – కించిదఙ్గం ప్రధానం సంభవతి, యథా హస్తౌ వా అభినయే, పాదౌ వా గతే, తదా తదుపయోగినీ చారీ ప్రధానమ్; తచ్చారీసంపత్త్యుచితా చ పూర్వా చారీ ఆశ్రీయతే పరయా చేతి పరస్పరనియమవత్యశ్చార్యో వ్యాయామ ఇతి. (అభి.భా. 10.2)**

వాస్తవంలో కటి – ఊరు – జంఘా – పాదకర్మలే పరస్పరము మిశ్రీభవించే విధంగా ప్రయోగించి నపుడు వాటి ప్రయోగాల సముదాయమే చారి అని అభినవ గుప్తాచార్యులు నవమాధ్యాయంలో చెప్పి ఉన్నారు.

**కట్యూరుజఙ్ఘాపాదకర్మాణ్యేవ పరస్పరవ్యామిశ్రీభూతతావైచిత్ర్యేణ సముదితతయా ప్రయుజ్యమానాని చారీత్యుచ్యన్తే. తత్సముదాయస్య మణ్డలభేదేన గతిర్నిష్పద్యతే ఇతి కట్యాదిపాదాన్తకర్మణైవ చార్యః ఉక్తాః. అత ఏవ తాసాం వినియోగః పృథక్ నోక్తః" (అభి.భా. 9.280).**

**మూ. ఏకపాదప్రచారో యః సా చారీత్యభిసంజ్ఞితా,**
**ద్విపాదక్రమణం యత్తు కరణం నామ తద్ భవేత్. 3**

**తా.** ఒక పాదంతో (శ్రోణి మొదలైన) అంగాలను కదల్చడం **చారి** అని చెప్పబడు తుంది. రెండు పాదాల గమనాన్ని **కరణం** అంటారు. (ఈ కరణానికీ చతుర్థాధ్యాయంలో చెప్పిన కరణాలకీ సంబంధం ఏమీ లేదు).

**మూ. కరణానాం సమయోగః ఖణ్డ ఇత్యభిధీయతే,**
**ఖణ్డైస్త్రిభిశ్చతుర్భిర్వా సంయుక్తైర్మణ్డలం భవేత్. 4**

**తా.** మూడు కరణాలు కలుస్తే అది ఒక ఖండం. మూడు లేదా నాలుగు ఖండాలు కలుస్తే మండలం.

**మూ. చారీభిః ప్రసృతం నృత్తం చారీభిశ్చేష్టితం తథా,**
**చారీభిః శస్త్రమోక్షశ్చ చార్యో యుద్ధే చ కీర్తితాః. 5**

**తా.** నృత్తం చారీలతో నిండి ఉంటుంది. చారుల ద్వారానే వేరు వేరు చేష్టలు జరుగుతాయి. శస్త్రప్రయోగం చారీలతోనే జరుగుతుంది. యుద్ధంలో కూడ చారీల ప్రయోగం ఉంటుంది.

**మూ. యదేతత్ ప్రస్తుతం నాట్యం తచ్చారీష్వేవ సంస్థితమ్,**
**న హి చార్యా వినా కించిన్నాట్యేऽఙ్గం సంప్రవర్తతే. 6**

**తా.** ఏ నాట్యం గూర్చి మనం ఇప్పుడు మాట్లాడుతున్నామో ఆ నాట్యం కూడ చారీలమీదనే ఆధారపడి ఉన్నది. చారీ లేకుండా, నాట్యంలో, కరచరణాద్యంగాలలో ఒక్కటి కూడ ప్రయోగింపబడదు.

**మూ. తస్మాచ్చారీవిధానస్య సంప్రవక్ష్యామి లక్షణమ్,**
**యా యస్మింస్తు యథా యోజ్యా నృత్తే యుద్ధే గతౌ తథా. 7**

**తా.** అందుచేత నృత్తము, యుద్ధము, గతి – వీటియందు చారి ఏ విధంగా ప్రయోగించాలో ఆ చారీ విధానానికి లక్షణం చెపుతాను.

**మూ. సమపాదా స్థితావర్తా శకటాస్యా తథైవ చ,**
**అధ్యర్ధికా చాషగతిః విచ్యవా చ తథాపరా. 8**
**ఏడకాక్రీడితా బద్ధా ఊరూద్వృత్తా తథాడ్డితా,**
**ఉత్స్పన్దితాథ జనితా స్యన్దితా చాపస్యన్దితా. 9**
**సమోత్సారితమత్తల్లీ మత్తల్లీ చాపి షోడశ,**
**ఏతా భౌమ్యః స్మృతాశ్చార్యః శృణుతాకాశికీః పునః. 10**

**తా.** సమపాదా; స్థితావర్తా, శకటాస్యా, అధ్యర్ధికా, చాషగతి, విచ్యవా, ఏడకాక్రీడితా, బద్ధా, ఊరూద్వృత్తా, అడ్డితా, ఉత్‌స్పందితా, జనితా, స్యన్దితా, అపస్యన్దితా, సమా, ఉత్సారిత మత్తల్లీ, మత్తల్లీ, అని పదహారు (16) **'భౌమీచారీలు!'** ఇప్పుడు **ఆకాశికీచారీలను** వినండి.

**మూ. అతిక్రాన్తా హ్యపక్రాన్తా పార్శ్వక్రాన్తా తథైవ చ,**
**ఊర్ధ్వజానుశ్చ సూచీ చ తథా నూపురపాదికా. 11**
**డోలపాదా తథాక్షిప్తా హ్యావిద్ధోద్వృత్తసంజ్ఞితే,**
**విద్యుద్భ్రాన్తా హ్యలాతా చ భుజఙ్గత్రాసితా తథా. 12**
**మృగప్లుతా చ దణ్డా చ భ్రమరీ చేతి షోడశ,**
**ఆకాశిక్యః స్మృతా హ్యేతా లక్షణం చ నిబోధత. 13**

**తా.** అతిక్రాన్తా, అపక్రాన్తా, పార్శ్వక్రాన్తా, ఊర్ధ్వజాను, సూచీ, నూపురపాదికా, డోలపాదా, ఆక్షిప్తా, వ్యావిద్ధా, ఉద్వృత్తా, విద్యుద్భ్రాన్తా అలాతా, భుజఙ్గత్రాసితా, మృగప్లుతా, దణ్డా, భ్రమరీ – అని **ఆకాశికీచారీలు** పదహారు (16). (ముందుగా భౌమీచారీల) లక్షణాలు తెలిసికొనండి.

**మూ. పాదైర్నిరన్తరకృతైస్తథా సమనఖైరపి,**
**సమపాదా తు సా చారీ విజ్ఞేయా స్థానసంశ్రయా. 14**

**తా. (1) సమపాదచారి :-** పాదాలు దగ్గరగా పెట్టి వాటి గోళ్లు (వేళ్లు) కూడ హెచ్చుతగ్గులు లేకుండా సమంగా ఉండే టట్లు చూచుకొన్న) చారి **సమపాదచారి**. ఇది స్థానానికి (ఒకవిధమైన స్థితికి) (standing posture కు) సంబంధించినది.

**మూ. భూమిఘృష్టేన పాదేన కృత్వాభ్యన్తరమణ్డలమ్,**
**పునరుత్సారయేదన్యం స్థితావర్తా తు సా స్మృతా. 15**

**తా. (2) స్థితావర్తచారి :-** ఒక పాదం అగ్రభాగంతో నేలపై ఈడ్చి రెండవకాలి మోకాలువరకు మండలాకారంగా తిప్పి రెండవదానిని ప్రక్కకు లాగాలి. ఇది **స్థితావర్తచారి**.

**మూ. నిషణ్ణాజస్తు చరణం ప్రసార్య తలసంచరమ్,**
**ఉద్వాహితమురః కృత్వా శకటాస్యాం ప్రయోజయేత్. 16**

**తా. (3) శకటాస్యచారి :-** శరీరపూర్వభాగం స్థిరంగా ఉండే టట్లు నిలిపి, ఒక పాదం సమంగా ఉంచి, రెండవ పాదం వ్రేళ్లు ముణిచి మోకాలు వంచి కాలు చాపాలి; వక్షఃస్థలం ఉద్వాహితస్థితిలో ముందుకు బిగియచేసి ఉంచాలి. అది **శకటాస్యచారి**.

**మూ. సవ్యస్య పృష్ఠతో వామశ్చరణస్తు యదా భవేత్,**
**తస్యాపసర్పణం చైవ జ్ఞేయా సాధ్యర్ధికా బుధైః. 17**

**తా. (4) అధ్యర్ధికచారి :-** ఎడమ కాలు కుడి కాలు వెనుక ఉంచి, కుడికాలు ఆ పక్కకే సగం భాగం వరకు జరపాలి – అది **అధ్యర్ధికచారి**.

**మూ. పాదః ప్రసారితః సవ్యః పునశ్చైవాపసమర్పితః,**
**వామః సవ్యాపసర్పీ చ చాషగత్యాం విధీయతే. 18**

**తా. (5) చాషగతిచారి :-** కుడికాలు ముందుకు చాపి మళ్లీ దానిని వెనుకకు తీసికోవాలి. ఎడమకాలు వెనుకకు జరిపి మళ్లీ దానినే ముందుకు వెయ్యాలి – అది **చాషగతిచారి**.

**మూ. విచ్యవాత్ సమపాదాయాః విచ్యవాం సంప్రయోజయేత్,**
**నికుట్టయంస్తలాగ్రేణ పాదస్య ధరణీతలమ్. 19**

**తా. (6) విచ్యవచారి :-** సమపాదచారిలో ఉన్న ఒక పాదం ముందుకు జరిపి, రెండవ పాదం అడుగు భాగంతో నేలమీద గట్టిగా వేగంగా ఒత్తాలి – అది **విచ్యవచారి**.

**మూ. తలసంచరపాదాభ్యాముత్ప్లుత్య పతనం తు యత్,**
**పర్యాయతశ్చ క్రియతే ఏడకాక్రీడితా తు సా. 20**

**తా. (7) ఏడకాక్రీడితచారి :-** రెండు పాదాల తలభాగాలతో (అరికాళ్లతో) నేలమీద కొంచెం ముందుకు జరిగి, ఎగిరిగంతువేసి వెనుకటి స్థితిలోనికి రావాలి. ఈ విధంగా కొన్ని పర్యాయాలు చేస్తే అది **ఏడకాక్రీడితచారి** అవుతుంది.

**మూ. అన్యోన్యజఙ్ఘాసంవేధాత్ కృత్వా తు స్వస్తికం తతః,**
**ఊరుభ్యాం వలనం యస్మాత్ సా బద్ధాచార్యుదాహృతా. 21**

**తా. (8) బద్ధాచారి :–** కుడి కాలు తిప్పి ఎడమకాలి వైపు తీసికొనివెళ్లి రెండు కాళ్లు లగ్నములయే టట్లు చేయడం, లేదా ఎడమ కాలు తిప్పి కుడికాలి వైపు తీసికొని వెళ్లి రెండు కాళ్లు లగ్నములయే టట్లు చేయడం – **బద్ధాచారి.**

**మూ. తలసఞ్చరపాదస్య పార్ష్ణిర్బాహ్యోన్ముఖీ యదా,**
**జఙ్ఘాఞ్చితా తథోద్వృత్తా ఊరూద్వృత్తేతి సా స్మృతా. 22**

**తా. (9) ఊరూద్వృత్తచారి :–** ఒక పాదం అరికాలు బాగా ఆనేటట్లుగా నేలమీద ఉంచి, రెండవ పాదం మణవ ఎత్తి, ఆ కాలు ఆ విధంగానే ఉండగా ముందుకు ఉంచినట్లయితే అది **ఉద్వృత్తచారి.**

**మూ. అగ్రతః పృష్ఠతో వాపి పాదోఽగ్రతలసంచరః,**
**ద్వితీయపాదో నిర్ఘృష్టః యత్ర స్యాదడ్డితా తు సా. 23**

**తా. (10) అడ్డితచారి :–** ఒక పాదం సమంగా నేలమీద ఆన్చి, దాని అగ్రభాగం కాని వెనుకభాగం కాని రెండవపాదంతో స్పృశిస్తే అది **అడ్డితచారి.**

**మూ. శనైః పాదో నివర్తేత బాహ్యేనాభ్యన్తరేణ చ,**
**యద్రేచకానుసారేణ సా చార్యుత్స్పన్దితా స్మృతా. 24**

**తా. (11) ఉత్స్పన్దితచారి :–** రేచకాన్ని అనుసరించి పాదాన్ని లోపలినుంచి బైటకు, అనగా అంగుష్ఠంనుంచి కనిష్ఠికవరకు, లేదా బైటనుంచి లోపలి వరకు, అనగా కనిష్ఠికనుండి అంగుష్ఠంవరకు క్రమంగా కదల్చడం **ఉత్స్పందితచారి.**

**మూ. ముష్టిహస్తశ్చ వక్షఃస్థః కరోఽన్యశ్చ ప్రవర్తితః,**
**తలసంచరపాదశ్చ జనితాచార్యుదాహృతా. 25**

**తా. (12) జనితచారి :–** ఒక హస్తం ముష్టిముద్రలో వక్షఃస్థలంమీద ఉండాలి. రెండవ హస్తం ఏదో పనిలో ఉండాలి. పాదాలు తలసంచరముద్రలో ఉండాలి. అది **జనితచారి.**

**మూ. పఞ్చతాలాన్తరం పాదం ప్రసార్య స్యన్దితాం న్యసేత్,**
**ద్వితీయేన తు పాదేన తథాపస్యన్దితామపి. 26**

**తా. (13, 14) స్యందిత – అపస్యందితచారీలు :–** కుడి పాదం ఎడమ పాదం నుండి ఐదు తాలాల దూరంలో ఉంచితే **స్యందితచారి.** ఎడమ పాదం కుడి పాదానికి ఐదు తాలాల దూరంలో ఉంచుతే అది **అపస్యందితచారి.** (అంగుష్ఠం నుంచి మధ్యమాం గులి వరకు ఉన్న దూరం **తాలం**).

**మూ. తలసఞ్చరపాదాభ్యాం ఘూర్ణమానోపసర్పణైః,**
**సమోత్సారితమత్తల్లీ వ్యాయామే సముదాహృతా. 27**

**తా. (15) సమోత్సారితమత్తల్లి :-** రెండు కాళ్లు స్వస్తికాకారంలో బంధించి ఒక మాటు కుడి తలభాగంతోను, మరొక మారు ఎడమ తలభాగంతోను ముందుకు తిరుగుతూ జరిగితే **సమోత్సారితమత్తల్లీచారి.**

**మూ. ఉభాభ్యామపి పాదాభ్యాం ఘూర్ణమానోపసర్పణైః,**
**ఉద్వేష్టితాపవిద్ధైశ్చ హస్తైర్మత్తల్ల్యుదాహృతా. 28**

**తా. (16) మత్తల్లి :-** పైన చెప్పిన చారి చేస్తూ చేతులు రెండూ పెనవేసికొంటే అది మత్తల్లిచారి.

**మూ. ఏతా భౌమ్యః స్మృతాశ్చార్యో నియుద్ధకరణాశ్రయాః,**
**ఆకాశికీనాం చారీణాం సంప్రవక్ష్యామి లక్షణమ్. 29**

**తా.** బాహుయుద్ధంతోను, కరణాలతోను సంబంధించిన ఈ భౌమచారీలు ఇంతవరకు చెప్పబడ్డాయి. ఇప్పుడు ఆకాశికీచారీల లక్షణం చెపుతాను.

**మూ. కుఞ్చితం పాదముత్క్షిప్య పురతః సంప్రసారయేత్,**
**ఉత్క్షిప్య పాతయేచ్చైవమతిక్రాన్తా తు సా స్మృతా. 30**

**తా. (1) అతిక్రాన్తాచారి :-** కుంచితమైన పాదం ఎత్తి ముందుకు చాపి నేలమీద అగ్రభాగం పడవెయ్యాలి. ఇది **అతిక్రాంతచారి.**

**మూ. ఊరుభ్యాం వలనం కృత్వా కుఞ్చితం పాదముద్ధరేత్,**
**పార్శ్వే వినిక్షిపేచ్చైనమపక్రాన్తా తు సా స్మృతా. 31**

**తా. (2) అపక్రాంతాచారి :-** రెండు తొడలను వలితావస్థలో ఉంచి ఒక పాదాన్ని కుంచితావస్థలో పైకి ఎత్తి పార్శ్వం వైపు తీసికొని వెళ్లినట్లయితే అది **అపక్రాన్తాచారి.**

**మూ. కుఞ్చితం పాదముత్క్షిప్య జాను స్తనసమం న్యసేత్,**
**ఉద్ఘట్టితేన పాదేన పార్శ్వక్రాన్తా విధీయతే. 32**

**తా. (3) పార్శ్వక్రాంతచారి :-** కుంచితమైన పాదం పార్శ్వభాగంనుండి పైకెత్తి మోకాలు స్తనానికి దగ్గరగా ఉండే టట్లు ఉంచి, తరవాత ఉద్ఘట్టితావస్థలో ఆ పాదాన్ని నేలపై ఉంచాలి. ఇది **పార్శ్వక్రాంతచారి.**

**మూ. కుఞ్చితం పాదముత్క్షిప్య జాను స్తనసమం న్యసేత్,**
**ద్వితీయం చ క్రమాత్ స్తబ్ధమ్ ఊర్ధ్వజానుః స కీర్తితః. 33**

**తా. (4) ఊర్ధ్వజానుచారి :–** కుంచితపాదం పైకి ఎత్తి దాని మోకాలు స్తనం దగ్గర ఉండే దాకా ఎత్తి రెండవ కాలు క్రమంగా స్థిరంగా ఉండేటట్లు చెయ్యాలి. అది **ఊర్ధ్వజానుచారి.**

**మూ. కుఞ్చితం పాదముత్క్షిప్య జానూర్ధ్వం సంప్రసారయేత్,**
**పాతయేచ్చాగ్రయోగేన సా సూచీ సంప్రకీర్తితా. 34**

**తా. (5) సూచీచారీ :–** కుంచితపాదం పైకెత్తి మోకాలు ఎత్తున చాపాలి. పిమ్మట అగ్రభాగంతో భూమిమీద ఆ పాదాన్ని పడవేయాలి. అది **సూచీచారి.**

**మూ. పృష్ఠతో హ్యఞ్చితం కృత్వా పాదమగ్రతలేన తు,**
**ద్రుతం నిపాతయేద్భూమౌ చారీ నూపురపాదికా. 35**

**తా. (6) నూపురపాదికా :–** అంచితావస్థలో ఉన్న పాదం వెనుకకు తీసికొనివెళ్లి దాని అగ్రభాగం నేలమీద నిలపాలి. ఇది **నూపురపాదికాచారి.**

**మూ. కుఞ్చితం పాదముత్క్షిప్య పార్శ్వాత్ పార్శ్వం తు దోలయేత్,**
**పాతయేదఞ్చితం చైవ దోలాపాదా తు సా స్మృతా. 36**

**తా. (7) దోలాపాదచారి :–** కుంచితపాదం ఎత్తి ఒక పక్కనుంచి మరొకపక్కకు ఊగించి, అంచిత స్థితిలో దానిని నేలమీద పడవేయాలి. ఇది **దోలాపాదచారి.**

**మూ. కుఞ్జితం పాదముత్క్షిప్య ఆక్షిప్య త్వఞ్చితం న్యసేత్,**
**జఙ్ఘా స్వస్తికసంయుక్తా చాక్షిప్తా నామ సా భవేత్. 37**

**తా. (8) ఆక్షిప్తచారి :–** పాదాన్ని కుంచితావస్థలో పైకి ఎత్తి అంచితావస్థలో నేలమీద ఉంచాలి. కాళ్లు స్వస్తికాకారంలో ఉండాలి. ఇది **ఆక్షిప్తచారి.**

**మూ. స్వస్తికస్యాగ్రతః పాదః కుఞ్చితస్తు ప్రసారితః,**
**నిపతేదఞ్చితావిద్ధమావిద్ధా నామ సా స్మృతా. 38**

**తా. (9) ఆవిద్ధచారి :–** స్వస్తికస్థితిలో ఉన్న పాదం కుంచితావస్థకు తీసికొనివచ్చి, ముందుగా దానిని చాపి పిదప అంచితావస్థలో క్రింద ఉంచాలి. ఇది **ఆవిద్ధచారి.**

**మూ. పాదమావిద్ధమావేష్ట్య సముత్ప్లుత్య నిపాతయేత్,**
**పరివృత్య ద్వితీయం చ సోద్వృత్తా చార్యుదాహృతా. 39**

**తా. (10) ఉద్వృత్తచారి :–** పైన చెప్పిన ఆవిద్ధచారిలో ఉన్న కుంచితపాదం మణవను రెండవపాదం తొడవరకు తీసికొనివెళ్లి, గంతు వేసి, ఆ పాదాన్నే తిప్పి నేలమీద ఉంచాలి. అది **ఉద్వృత్తచారి.**

**మూ. పృష్ఠతో వలితం పాదం శిరోఘృష్టం ప్రసారయేత్,**
**సర్వతో మణ్డలావిద్ధం విద్యుద్భ్రాన్తా తు సా స్మృతా. 40**

**తా. (11) విద్యుద్భ్రాంతచారి :–** పాదం పార్శ్వం వైపు వంచి శిరస్సును స్పృశిస్తూ పైకీ, క్రిందికీ, పృష్ఠభాగంవైపూ మండలాకారంలో తిప్పుతూ చాపాలి. అది **విద్యుద్భ్రాంతచారి.**

**మూ. పృష్ఠప్రసారితః పాదో వలితోఽభ్యన్తరీకృతః,**
**పార్ష్ణిప్రపతితశ్చైవ హ్యలాతా సా ప్రకీర్తితా. 41**

**తా. (12) అలాతాచారి :–** ముందుగా పాదాన్ని పృష్ఠభాగం వైపు చాపి, తరువాత వంచి, రెండవ పాదం తొడ వైపు తీసికొనివెళ్లి, పిదప తన పార్శ్వభాగంలో ఉన్న మణవ సహాయంతో నేలమీద ఉంచాలి. అది **అలాతాచారి.**

**మూ. కుఞ్చితం పాదముత్క్షిప్య త్ర్యశ్రమూరుం వివర్తయేత్,**
**కటీజానువివర్తాచ్చ భుజఙ్గత్రాసితా భవేత్. 42**

**తా. (13) భుజంగత్రాసితాచారి :–** కుంచితావస్థలో ఉన్న పాదం ఎత్తి రెండవపాదం తొడ దగ్గరికి తీసికొని వెళ్లాలి. తరువాత కటిప్రదేశంవరకు మోకాలివరకు తీసికొనివెళ్లి, నితంబానికి ఎదురుగా తొడవరకు తిప్పాలి అది **భుజంగత్రాసితచారి.**

**మూ. అతిక్రాన్తక్రమం కృత్వా చోత్ప్లుత్య వినిపాతయేత్,**
**జఙ్ఘాఞ్చితా పరిక్షిప్తా సా జ్ఞేయా హరిణప్లుతా. 43**

**తా. (14) హరిణప్లుతాచారి :–** అతిక్రాన్తచారిచేసి, ఆ చారిలో కుంచితమైన పాదం పైకి ఎత్తి గంతు వేసి, ఆ పాదం క్రిందికి దింపాలి. తరువాత అంచితపాదంతో ఉన్న రెండవ కాలు వెనుకకు తిప్పినట్లయితే అది **హరిణప్లుతచారి.**

**మూ. నూపురం చరణం కృత్వా పురతః సంప్రసారయేత్,**
**క్షిప్రమావిద్ధకరణం దణ్డపాదా తు సా స్మృతా. 44**

**తా. (15) దండపాదచారి :–** నూపురపాదికాచారిలో ప్రయోగించిన కుంచిత చరణాన్ని రెండవ పాదం మణవవైపు తీసికొనివెళ్లి ముందుకు చాపాలి. వెంటనే ఆవిద్ధచారి వలె చెయ్యాలి. ఇది **దండపాదచారి.**

**మూ. అతిక్రాన్తక్రమం కృత్వా త్రికం తు పరివర్తయేత్,**
**ద్వితీయపాదభ్రమణాత్తలేన భ్రమరీ స్మృతా. 45**

**తా. (16) భ్రమరీచారి :–** అతిక్రాంతచారిలోని కుంచితపాదం పైకి లేవదీసి భుజంగత్రాసితచారీలో ప్రయోగించిన త్ర్యశ్రస్థితిలో ఊరువులవరకు తిప్పి రెండవపాదం అరికాలుమీద మొత్తం శరీరా న్నంతనీ మూడు సార్లు తిప్పాలి. ఇది **భ్రమరీచారి.**

**మూ. ఆకాశిక్యః స్మృతా హ్యేతా లలితాఙ్గక్రియాత్మికాః,**
**ధనుర్వజ్రాసిశస్త్రాణాం ప్రయోక్తవ్యా విమోక్షణే. 46**

**తా.** లలిత మైన అంగక్రియలు గల ఈ ఆకాశికీచారీలు ధనస్సు (బాణాలు) వజ్రము, ఖడ్గము, ఇతరశస్త్రాలు – వీటిని విడిచే టప్పుడు ప్రయోగించాలి.

**మూ. అగ్రగౌ పృష్ఠగౌ వాపి హ్యనుగౌ వాపి యోగతః,**
**పాదయోస్తు ద్విజా హస్తౌ కర్తవ్యౌ నాట్యయోక్తృభిః. 47**

**తా.** నాట్యప్రయోక్తలు – అవసరాన్ని పట్టి పాదాల చేష్టలకు ముందుగా గాని, వాటి తరువాత గాని, వాటితో కాని హస్తక్రియలు ప్రయోగిస్తూండాలి.

**మూ. యతః పాదస్తతో హస్తో యతో హస్తస్తతస్త్రికమ్,**
**పాదస్య నిర్గమం కృత్వా తథోపాఙ్గాని యోజయేత్. 48**

**తా.** పాదచేష్ట ఎటు ఉంటుందో దానిని అనుసరించి హస్తచేష్ట ఉండాలి. హస్తచేష్టను అనుసరించి త్రికచేష్ట ఉండాలి. పాదచేష్టను ప్రారంభించి తరువాత తదనుగుణంగా నేత్రాలు మొదలైన ఉపాంగాల చేష్ట జరగాలి.

**మూ. పాదచార్యా యథా పాదో ధరణీమేవ గచ్ఛతి,**
**ఏవం హస్తశ్చలిత్వా తు కటీదేశం సమాశ్రయేత్. 49**

**తా.** పాదచారి (పాదచేష్టలు) పూర్తి అయినతరువాత పాదం ఏ విధంగా నేలమీదకే వెడుతుందో (నిలిచి ఉంటుందో), అదే విధంగా హస్తం చేష్టలు పూర్తి అయిన తరువాత కటిప్రదేశాన్ని ఆశ్రయించాలి.

**మూ. ఏతాశ్చార్యో మయా ప్రోక్తా లలితాఙ్గక్రియాత్మికాః,**
**స్థానాన్యేషాం ప్రవక్ష్యామి సర్వశస్త్రవిమోక్షణే. 50**

**తా.** లలితమైన అంగక్రియలతో కూడిన చారీలు ఇంతవరకు చెప్పాను. ఇప్పుడు సమస్త ఆయుధప్రయోగసమయాలలో వీటి స్థానాలను చెపుతాను.

**మూ. వైష్ణవం సమపాదం చ వైశాఖం మణ్డలం తథా,**
**ప్రత్యాలీఢమథాలీఢం స్థానాన్యేతాని షణ్ణృణామ్. 51**

**తా.** సర్వశస్త్రప్రయోగసమయాలలో మానవులు నిలబడే స్థానాలు – వైష్ణవము, సమపాదము, వైశాఖము, మండలము, ప్రత్యాలీఢము, ఆలీఢము అని ఆరు విధాలు.

**మూ. ద్వౌ తాలావర్ధతాలశ్చ పాదయోరన్తరం భవేత్,**
**తయోః సముత్థితస్త్వేకః త్ర్యశ్రః పక్షస్థితోఽపరః. 52**

**కించిదంచితజఙ్ఘం చ సౌష్ఠవాఙ్గపురఃస్సృతమ్,**
**వైష్ణవం స్థానమేతద్ధి విష్ణురత్రాధిదైవతమ్. 53**

**తా. (1) వైష్ణవస్థానం :–** రెండు పాదాలకూ మధ్య రెండున్నర తాలాల దూరం ఉండాలి. రెండుపాదాలలో ఒకటి సమ అవస్థలోను, రెండవది త్ర్యశ్రావస్థలోను ఉండాలి. దీని వేళ్లు కొంచెం పక్కకు తిరిగి ఉండాలి. మోకాలు కొంచెం వంగడంచేత కాలు కొంచెం వంకరగా నిలబడుతుంది. ఈ అంగసౌష్ఠవంతో కూడిన స్థానం (నిలబడే పద్ధతి) **వైష్ణవస్థానం**. దీనికి విష్ణువు అధిదేవత.

**మూ. స్థానేనానేన కర్తవ్యః సంలాపస్తు స్వభావజః,**
**నానాకార్యాన్తరోపేతైర్నృభిరుత్తమమధ్యమైః. 54**

**చక్రస్య మోక్షణే చైవ ధారణే ధనుషస్తథా,**
**ధైర్యోదాత్తాఙ్గలీలాసు తథా కోపే ప్రయోజయేత్. 55**

**తా.** అనేకకార్యాలలో మగ్ను లైన ఉత్తమపురుషులు, మధ్యమపురుషులు, పరస్పరమూ సహజంగా సంలాపాదులు జరిపే టప్పుడు ఈ స్థానంలో నిలబడాలి. చక్రాయుధాన్ని విడిచినప్పుడు, ధనస్సు ధరించినప్పుడు, ధైర్యంతో కూడిన ఉదాత్తమైన శరీరలీలలయందు, క్రోధంలోను ఈ స్థానాన్ని వినియోగించాలి.

**(మూ. ఇదమేవ విపర్యస్తం ప్రణయక్రోధ ఇష్యతే,**
**ఉపాలమ్భకృతే చైవ ప్రణయోద్వేగయోస్తథా. 56**

**శఙ్కాసూయోగ్రతాచిన్తామతిస్మృతిషు చైవ హి,**
**దైన్యే చపలతాయాం చ గర్వాభీష్టేషు శక్తిషు. 57**

**శృఙ్గారాద్భుతబీభత్సవీరప్రాధాన్యయోజితమ్.)**

ప్రణయకోపంలోను, నిందలోను, ప్రణయంలోను, ఆత్రంలోను, శంకా – అసూయా – ఉద్వేగ – ఉగ్రతా – చింతా – మతి – స్మృతులలోను, ద్ర్యైనంలోను, చపలతలోను, గర్వంలోను, ఇష్టప్రాప్తియందు, శక్తియందు, శృంగార – అద్భుత – బీభత్స – వీరరసాలకు ప్రాధాన్యం ఉన్నచోటా ఈ వైష్ణవస్థానానికి విపరీతమైన స్థానం వినియోగించాలి.

**వి.** దీని భావం తెలియలేదు. వైష్ణవస్థానానికి విపరీతమైన స్థానం అంటూ దేనిని నిర్ధరించాలి? ఇవి ప్రక్షిప్తశ్లోకాలు. **అభినవభారతి**లో లేవు. బహుశా – ఇలాంటి పరిస్థితులలో ఈ స్థానం ఉపయోగిస్తే విపరీతంగా అనుచితంగా ఉంటుంది అని అభిప్రాయమేమో! ప్రక్షేప్తకే తెలియాలి!

**మూ. సమపాదే సమౌ పాదౌ తాలమాత్రాన్తరస్థితౌ. 58**

**స్వభావసౌష్ఠవోపేతౌ బ్రహ్మా చాత్రాధిదైవతమ్.**

**తా. (2) సమపాదస్థానం :– సమపాదస్థానంలో** స్వభావసిద్ధమైన రీతిలో, పాదాలు రెండూ, సమంగా తాలమాత్రం దూరంలో చక్కగా నిలిచి ఉంటాయి. దీనికి బ్రహ్మదేవుడు అధిదేవత.

**మూ. అనేన కార్యం స్థానేన విప్రమఙ్గలధారణమ్. 59**

**రూపణం పక్షిణాం చైవ వరం కౌతుకమేవ చ,**
**స్వస్థానాం స్యన్దనస్థానాం విమానస్థాయినామపి. 60**

**లిఙ్గస్థానాం వ్రతస్థానాం స్థానమేతత్తు కారయేత్.**

**తా.** విప్రులు చేసే ఆశీర్వాదాదిమంగళముల స్వీకారం ఈ స్థానంలో నిలచి చెయ్యాలి. పక్షుల నిరూపణము, శ్రేష్ఠమైన కౌతుకము (వివాహాదుల ప్రారంభంలో చేసే మంగళకృత్యాదికమూ కూడ) ఈ స్థానంలో నిలచి చెయ్యాలి. స్వస్థులు, రథంమీద ఉన్నవాళ్లు, విమానంలో ఉన్నవాళ్లు, సాంప్రదాయిక చిహ్నాలు ధరించే లింగస్థులు, వ్రతాలలో ఉన్నవాళ్లు – వీరందరి విషయంలో సమపాదస్థానం ప్రదర్శించాలి.

**మూ. తాలాస్త్రయోర్ధతాలశ్చ పాదయోరన్తరం భవేత్. 61**

**తాలాంస్త్రీనర్ధతాలాంశ్చ నిషణ్ణోరు ప్రకల్పయేత్,**
**త్ర్యస్రౌ పక్షస్థితౌ చైవ తత్ర పాదౌ ప్రయోజయేత్. 62**

**వైశాఖస్థానమేతద్ధి స్కన్దశ్చాత్రాధిదైవతమ్.**

**తా. (3) వైశాఖస్థానం :–** పాదాల మధ్య మూడు న్నర తాలాలు ఎడం ఉండాలి. ఊరువులు స్థిరంగా ఉండాలి. పాదాలు త్ర్యస్రములై వాటి వేళ్లు పక్కలకి ఉండాలి. ఇది వైశాఖస్థానం. స్కందుడు దీని అధిదేవత.

**మూ. స్థానేనానేన కర్తవ్యమశ్వానాం వాహనం బుధైః. 63**

**వ్యాయామనిర్గమశ్చైవ స్థూలపక్షినిరూపణమ్,**
**శరాసనసముత్కర్షే వ్యాయామకృతమేవ చ. 64**

**రేచకేషు చ కర్తవ్యమిదమేవ ప్రయోక్తృభిః.**

**తా.** అశ్వాలను నడిపించడం, వ్యాయామం, బయల్వెడడం, స్థూలపక్షుల నిరూపణం, ధనుస్సు నారి లాగడం, అభ్యాసం, రేచకం – వీటిలో ప్రయోక్తలు ఈ వైశాఖస్థానాన్ని ప్రయోగించాలి.

**మూ. ఐన్ద్రే తు మణ్డలే పాదౌ చతుస్తాలాన్తరస్థితా. 65**

**త్ర్యస్రౌ పక్షస్థితౌ చైవ కటిజానూ సమౌ తథా.**

**తా. (4) మండలస్థానం :–** మండస్థానంలో రెండు పాదాల మధ్య నాలుగు తాలాల వ్యవధానం ఉండాలి. అవి త్ర్యశ్రావస్థలో ఉండాలి. వాటి వేళ్లు పక్కలకి తిప్పి ఉంచాలి. నడుము, మోకాళ్లు సమస్థితిలో ఉండాలి. దీని అధిదేవత ఇంద్రుడు.

**మూ. ధనుర్వజ్రాసిశస్త్రాణి మణ్డలేన ప్రయోజయేత్. 66**

**వాహనం కుఞ్జరాణాం తు స్థూలపక్షినిరూపణమ్.**

**తా.** ధనస్సు, వజ్రం, ఖడ్గం, శస్త్రాలు – వీటి ప్రయోగంలోను, ఏనుగులను నడపడంలోను, స్థూలమైన పక్షులను (అభినయం ద్వారా) చూపడంలోను ఈ మండలాన్ని వినియోగించాలి.

**మూ. అస్యైవ దక్షిణం పాదం పఞ్చ తాలాన్ ప్రసార్య తు. 67**

**ఆలీఢస్థానకం కుర్యాత్ రుద్రశ్చాస్యాధిదైవతమ్.**

**తా. (5) ఆలీఢస్థానకం :–** ఈ మండలస్థానంలో ఉన్న కుడి పాదం ఐదు తాలాల దూరం చాపితే అది **ఆలీఢస్థానకం**. దీనికి రుద్రుడు అధిదేవత.

**మూ. అనేన కార్యం స్థానేన వీరరౌద్రకృతం తు యత్.. 68**

**ఉత్తరోత్తరసంజల్పో రోషామర్షకృతస్తు యః,**

**మల్లానాం చైవ సంఫేటః శత్రూణాం చ నిరూపణమ్. 69**

**తథాభిద్రవణం చైవ శస్త్రాణాం చైవ మోక్షణమ్.**

**తా.** వీర – రౌద్రరసాలకు సంబంధించిన అన్ని పనులూ, రోషామర్షాలతో పరస్పర సంభాషణము, మల్లుల సంఘర్షము, శత్రువుల నిరూపణము, శత్రువులమీదికి దుమకడము, శస్త్రప్రయోగము ఈ స్థానకంతో ప్రయోగించాలి.

**మూ. కుఞ్చితం దక్షిణం కృత్వా వామం పాదం ప్రసార్య చ. 70**

**ఆలీఢపరివర్తస్తు ప్రత్యాలీఢమితి స్మృతమ్.**

**తా. (6) ప్రత్యాలీఢం :–** కుడికాలు ముణిచి ఎడమ పాదం చాపి ఆలీఢానికి విపరీతంగా నిలిచిన ట్లయితే అది **ప్రత్యాలీఢస్థానకం.**

**మూ. ఆలీఢసహితం శస్త్రం ప్రత్యాలీఢేన మోక్షయేత్. 71**

**నానాశస్త్రవిమోక్షో హి కార్యోఽనేన ప్రయోక్తృభిః.**

**తా.** ఆలీఢస్థానంలో ఉండి సంధించిన ఆయుధాన్ని ప్రత్యాలీఢంలో ఉండి విడవాలి. ప్రయోక్తలు ఈ ప్రత్యాలీఢస్థానంలో ఉండగా అనేకవిధాలైన శస్త్రాల ప్రయోగం చేయించాలి.

**మూ. న్యాయాశ్చైవ హి విజ్ఞేయాశ్చత్వారః శస్త్రమోక్షణే. 72**

**భారతః సాత్వతశ్చైవ వార్షగణ్యో౽థ కైశికః.**

**తా. శస్త్రమోక్షణంలో నాలుగు న్యాయాలు :-** శస్త్రాలు విడవడంలో – భారతము, సాత్వతము, వార్షగణ్యము, కైశికము అని నాలుగు న్యాయాలు (పద్ధతులు) తెలుసుకోవాలి.

**మూ. భారతే తు కటీఛేద్యం పాదచ్ఛేద్యం తు సాత్వతే. 73**

**వక్షసో వార్షగణ్యే తు శిరశ్ఛేద్యం తు కైశికే.**

**తా.** భారతన్యాయంతో శత్రుకటిప్రదేశచ్ఛేదనము, సాత్వతన్యాయంతో శత్రుపాద చ్ఛేదనము, వార్షగణ్యన్యాయంతో శత్రువక్షశ్ఛేదనము, కైశికన్యాయంతో శత్రుశిరశ్ఛేదనము చేయబడుతుంది.

**మూ. ఏభిః ప్రయోక్తృభిర్న్యాయై ర్నానాచారీసముత్థితైః. 74**

**ప్రవిచారాః ప్రయోక్తవ్యా నానాశస్త్రవిమోక్షణే.**

**తా.** అనేకవిధాలైన చారీలతో ఏర్పడిన ఈ న్యాయాలతో, ప్రయోక్తలు, వివిధము లైన శస్త్రాలను విడవడంలో వివిధచేష్టలు ప్రయోగించాలి.

**మూ. న్యాయాశ్రితైరఙ్గహారైర్న్యాయాచ్చైవ సముత్థితైః. 75**

**యస్మాద్యుద్ధాని నీయన్తే తస్మాన్న్యాయాః ప్రకీర్తితాః.**

**తా.** న్యాయశబ్దానికి వ్యుత్పత్తి చెప్పబడుచున్నది. **"నీయన్తే యుద్ధాని ఏభిః ఇతి న్యాయాః"** వీటిచేత యుద్ధాలు జరపబడతాయి (అభినయింపబడతాయి) గాన న్యాయాలు అని న్యాయశబ్దానికి అర్థం. న్యాయాన్ని అనుసరించి ఏర్పడినవి, న్యాయానుసారమే శత్రువుల అంగాలమీద ప్రయోగింపబడినవీ అయిన శస్త్రాలతో యుద్ధాలు జరుగుతాయి గాన వీటికి న్యాయములు అని పేరు.

**మూ. వామహస్తే వినిక్షిప్య ఖేటకం దక్షిణేన చ. 76**

**శస్త్రమాదాయ హస్తేన ప్రవిచారమథాచరేత్,**

**ప్రసార్య చ కరౌ సమ్యక్ పునరాక్షిప్య చైవ హి. 77**

**ఖేటకం భ్రామయేత్ పశ్చాత్ పార్శ్వాత్ పార్శ్వమథాపి చ,**

**శిరః పరిగమశ్చాపి కార్యః శస్త్రేణ యోక్తృభిః. 78**

**కపోలస్యాన్తరే వాపి శస్త్రస్యోద్ఘట్టనం తథా,**

**పునశ్చ ఖడ్గహస్తేన లలితోద్వేష్టితేన చ. 79**

**ఖేటకేన చ కర్తవ్యః శిరఃపరిగమో బుధైః,**
**ఏవంప్రచారః కర్తవ్యో భారతే శస్త్రమోక్షణే.** **80**

**తా. (1) భారతన్యాయప్రయోగవిధానం :-** ఎడమ చేతిలో డాలు, కుడి చేతిలో ఆయుధమూ పట్టుకోవాలి. చేతులు బాగా చాపి మళ్లీ ముణుచుకోవాలి. ఒక పార్శ్వం నుంచి మరొక పార్శ్వంవైపు డాలు తిప్పాలి. శస్త్రాన్ని శత్రువు శిరస్సుపై నాలుగు వైపులా తిప్పాలి. శస్త్రాన్ని కపోలం దగ్గర ముట్టించాలి. తరవాత శస్త్రం ఉన్న హస్తం లలిత ముద్రలో కాని ఉద్వేష్టితముద్రలో కాని ఉంచి, డాలు శత్రువు శిరస్సు నాలుగు వైపులా తిప్పాలి ఇవి భరతన్యాయంలో చెప్పిన చేష్టలు.

**మూ. సాత్వతే తు ప్రవక్ష్యామి ప్రవిచారం యథావిధి,**
**స ఏవ ప్రవిచారస్తు శస్త్రఖేటకయోః స్మృతః.** **81**
**కేవలం పృష్ఠతః శస్త్రం కర్తవ్యం ఖలు సాత్వతే.**

**తా. (2) సాత్వతన్యాయప్రయోగవిధానం :-** సాత్వతన్యాయంలో యథావిధిగా అనుసరించ వలసిన పద్ధతి చెపుతాను. ఈ న్యాయంలో కూడ శస్త్రఖేటకాల ప్రయోగం భారతన్యాయంలో వలెనే చెయ్యాలి. ఈ న్యాయంలో శస్త్రప్రయోగం శత్రువు వెనుక వైపున చెయ్యాలి – ఇదే ఈ రెండింటికీ భేదం.

**మూ. గతిశ్చ వార్షగణ్యేపి సాత్వతేన క్రమేణ తు.** **82**
**శస్త్రఖేటకయోశ్చాపి భ్రమణం సంవిధీయతే,**
**శిరః పరిగమాదస్మింస్తస్య శస్త్రస్య కేవలమ్.** **83**
**ఉరస్యుద్వేష్టనం కార్యం తథాంసే పరితః పునః.**

**తా. (3) వార్షగణ్యన్యాయప్రయోగవిధానం :-** వార్షగణ్యన్యాయంలో శస్త్రఖేటకాల భ్రమణం కూడ సాత్త్వతన్యాయంలో చెప్పిన రీతిలోనే ఉంటుంది. అయితే – శత్రువు శిరస్సుకు నాలుగు వైపులా శస్త్రం తిప్పడానికి బదులు వాని వక్షస్థలంమీద ఉద్వేష్టనం చేసి వాని బుజాలకు నాలుగు వైపులా తిప్పాలి.

**మూ. భారతే ప్రవిచారే యః కర్తవ్యః స తు కైశికే.** **84**
**విభ్రమయ్య తథా శస్త్రం కేవలం మూర్ధ్ని పాతయేత్.**

**తా. (4) కైశికన్యాయప్రయోగవిధి :-** భారతన్యాయంలో చెప్పిన ప్రవిచారమే (చేష్టాదికమే) కైశికన్యాయంలో కూడ చెయ్యాలి. భేదం ఏమనగా – శస్త్రం తిప్పి శత్రువు శిరస్సుమీద పడవెయ్యాలి.

**మూ. ప్రవిచారాశ్చ కర్తవ్యా హ్యేవమేతేఽజ్గలీలయా. 85**

**ధనుర్వజ్రాసిశస్త్రాణాం ప్రయోక్తవ్యా విమోక్షణే.**

**తా.** ఈ విధంగా అవయవాల వివిధచేష్టల ద్వారా, బాణ - వజ్ర - ఖడ్గ - అస్త్రాలను శత్రువులపై విడవడంలో గతులను ప్రయోగించాలి.

**మూ. న భేద్యం నాపి చ ఛేద్యం న చాపి రుధిరస్రుతిః. 86**

**రజ్గే ప్రహరణే కార్యో న చాపి వ్యక్తఘాతనమ్.**

**తా.** పైన చెప్పిన కటిచ్ఛేదనాదులు కేవలం అభినయంచేతనే చూపించాలి కాని ఇవేవీ యథార్థంగా రంగస్థలంమీద చేయకూడదు అని చెపుతున్నాడు - రంగస్థలం మీద చూపే యుద్ధంలో శత్రువు అవయవా లేవీ భేదించకూడదు, ఛేదించకూడదు, రక్తపాతం జరగకూడదు, శత్రువును చంపకూడదు.

**మూ. సంజ్ఞామాత్రేణ కర్తవ్యం శస్త్రాణాం మోక్షణం బుధైః. 87**

**అథవాభినయోపేతం కుర్యాచ్ఛేద్యం విధానతః.**

**తా.** రంగస్థలంలో శస్త్రప్రయోగం నామమాత్రానికే చెయ్యాలి. లేదా కృత్రిమమైన ఆనవాళ్లవంటి వేవో శరీరం మీద చూపించి ఛేదనాన్ని అభినయించాలి.

**మూ. అజ్గైః సౌష్ఠవసంయుక్తైరజ్గహారైర్విభూషితమ్. 88**

**వ్యాయామం కారయేత్ సమ్యక్ లయతాలసమన్వితమ్.**

**తా.** సౌష్ఠవంతో కూడిన అవయవాలతో, చక్కని అజ్గచేష్టలతో, రంగస్థలంమీద మంచి లయకాలాలతో కూడిన వ్యాయామం (నృత్తనృత్యప్రదర్శనం) చేయించాలి.

**మూ. సౌష్ఠవే హి ప్రయత్నస్తు కార్యో వ్యాయామవేదిభిః. 89**

**సౌష్ఠవం లక్షణం ప్రోక్తం వర్తనాక్రమయోజితమ్.**

**తా.** వ్యాయామవిధి తెలిసినవాళ్లు సౌష్ఠవం విషయంలో మంచి ప్రయత్నం చెయ్యాలి. శ్రద్ధ తీసికోవాలి. అంగా లన్నింటినీ ఒక నిర్ణీతక్రమంలో కూర్చడం సౌష్ఠవ లక్షణం.

**మూ. శోభా సర్వైవ నిత్యం హి సౌష్ఠవం సముపాశ్రితా. 90**

**న హి సౌష్ఠవహీనాజ్గః శోభతే నాట్యనృత్తయోః.**

**తా.** ఎల్లప్పుడూ కూడ శోభ అంతా సౌష్ఠవం మీద ఆధారపడి ఉంటుంది. అంగ సౌష్ఠవం లేని వాడు నాట్యనృత్తాలలో శోభించడు కదా.

**వి.** ఈ ఘట్టంలో నాట్యనృత్తాలకు సంబంధించిన అంగాల సౌష్ఠవాన్ని గూర్చి,

నాట్యనృత్త ప్రయోక్తల శరీరావయవసౌష్ఠవాన్ని గూర్చి కూడ చెప్పబడుతున్నది. 88, 89 శ్లోకాలలో చెప్పిన సౌష్ఠవం నృత్తనాట్యాదుల అంగాల సౌష్ఠవం. వాటి సౌష్ఠవం కూడా నటుల అంగాల సౌష్ఠవం మీద ఆధారపడి ఉంటుం దని 90వ శ్లోకంలోని ఉత్తరార్ధం నుంచి చెప్పబడింది.

**మూ. అచఞ్చలమకుబ్జం చాసన్నగాత్రమథాపి చ. 91**

**నాత్యుచ్ఛం చలపాదం చ సౌష్ఠవాఙ్గం ప్రయోజయేత్.**

**తా.** నాట్యాంగాలు సౌష్ఠవంతో ఉండాలంటే ప్రయోక్తల అంగాలలో సౌష్ఠవం ఉండా లని చెపుతున్నాడు – శరీరం చంచలంగా ఉండకూడదు. శరీరం వంకరటింకరగా ఉండ కూడదు. అవయవాలు దుర్బలంగా ఉండకూడదు. ఎక్కువ పొడ వుండకూదు. పాదాలు కదిలిపోకూడదు. ఇలాంటి సౌష్ఠవాంగాలతో నృత్యనాట్యాదులలోని సౌష్ఠవాంగా లను ప్రయోగించాలి.

**మూ. కటీ కర్ణసమా యత్ర కూర్పరాంసశిరస్తథా. 92**

**సమున్నతమురశ్చైవ సౌష్ఠవం నామ తద్భవేత్.**

**తా.** కటిప్రదేశం కర్ణాలలో (పార్శ్వాలలో) సమంగా ఉండాలి. మోచేతులు, బుజాల శిఖరాలు సమంగా ఉండాలి. వక్షఃస్థలం విశాలంగా ఉన్నతంగా ఉండాలి. అది సౌష్ఠవం అని చెప్పబడతాయి.

**మూ. అత్ర నిత్యం ప్రయత్నో హి విధేయో మధ్యమోత్తమైః. 93**

**నాట్యం నృత్తం చ సర్వం హి సౌష్ఠవే సంప్రతిష్ఠితమ్.**

**తా.** మధ్యమ – ఉత్తమపాత్రలు ఎల్లప్పుడు ఈ అంగసౌష్ఠవంమీద దృష్టి ఉంచాలి. నాట్యమూ, నృత్తమూ సమస్తమూ కూడ సౌష్ఠవంమీదనే ఆధారపడి ఉంది.

**మూ. కటినాభిచరౌ హస్తౌ వక్షశ్చైవ సమున్నతమ్. 94**

**వైష్ణవం స్థానమిత్యఙ్గం చతురశ్రముదాహృతమ్.**

**తా.** చేతులు కటిప్రదేశంమీదా నాభి దగ్గరా ఉండాలి, వక్షఃస్థలం ఉన్నతంగా ఉండాలి. వైష్ణవస్థానం ప్రయోగించాలి. ఇలా ఉన్నప్పుడు అంగం చతురశ్రంగా (అందంగా, సౌష్ఠవంతో) ఉన్నది అని చెప్పబడుతుంది.

**మూ. పరిమార్జనమాదానం సంధానం మోక్షణం తథా. 95**

**ధనుషస్తు ప్రయోక్తవ్యం కరణం తు చతుర్విధమ్.**

**తా.** పరిమార్జనము, ఆదానము, సంధానము, మోక్షణము అని ధనస్సులో

ఉపయోగించవలసిన కరణాలు నాలుగు విధాలు.

**మూ. ప్రమార్జనం పరామర్శః ఆదానం గ్రహణక్రియా. 96**

**సంధానం శరవిన్యాసో విక్షేపో మోక్షణం భవేత్.**

**తా.** ధనస్సును స్పృశించడం **ప్రమార్జనం**. దానిని పట్టుకొనడం **ఆదానం**. బాణం ఎక్కుపెట్టడం **సంధానం**. బాణం విడవడం **మోక్షణం**.

**మూ. తైలాభ్యక్తేన గాత్రేణ యవాగూమృదితేన చ. 97**

**వ్యాయామం కారయేత్ శ్రీమాన్ భిత్తావాకాశికే తథా,**

**యోగ్యాయాం మాతృకా భిత్తిస్తస్మాద్భిత్తిం సమాశ్రయేత్. 98**

**భిత్తౌ ప్రసారితాఙ్గం తు వ్యాయామం కారయే న్నరమ్,**

**బలార్థం చ నిషేవేత నస్యం బస్తివిధిం తథా. 99**

**స్నిగ్ధాన్యన్నాని చ తథా రసకం పానకం తథా.**

**తా.** శరీరం అంతా తిలతైలం పూసికొని, దానిపైన యవల పిండి మర్దించి, గోడదగ్గర (అవసరమైనప్పుడు ఆనుకొనడానికి) గాని, ఆకాశంలో (ఆరుబయట) గాని శరీరవ్యాయామం చెయ్యాలి. యోగ్యలో (యోగ్యా అనగా నింతరాభ్యాసం – exercise) గోడ తల్లి వంటిది. అందుచే ఆ సమయంలో భిత్తిని ఆశ్రయించాలి. బలంకోసం నస్యము (నాసిక ద్వారా నీళ్లు నూని మొదలైనవి త్రాగడం మొదలైనది) బస్తి విధిని (మూత్రకోశాది శుద్ధిని), స్నిగ్ధమైన (ఎండిపోని, ఆరిపోని) అన్నాలు. రసకము ('మాంసరసం' అని అ.భా.) మంచి మధురపానీయాలు, సేవించాలి.

**మూ. ఆహారేఽధిష్ఠితాః ప్రాణాః ప్రాణే యోగ్యాః ప్రతిష్ఠితాః. 100**

**తస్మాద్యోగ్యాప్రసిద్ధ్యర్థమాహారే యత్నవాన్ భవేత్.**

**తా.** ప్రాణాలు ఆహారంమీద ఆధారపడి ఉంటాయి. యోగ్యలు (అభ్యాసాలు) ప్రాణంమీద ఆధారపడి ఉంటాయి. అందువల్ల యోగ్యలు సఫలం కావాలంటే ఆహారం విషయంలో ప్రయత్నవంతుడు కావాలి.

**మూ. అశుద్ధకాయం ప్రక్లాన్తమతీవ క్షుత్పిపాసితమ్. 101**

**అతిపీతం తథా భుక్తం వ్యాయామం నైవ కారయేత్.**

**తా.** అశుద్ధ మైన శరీరం కలవానిచేత, అలసిపోయినవానిచేత, ఆకలితో కాని దప్పికతో కాని చాలా బాధపడుతూన్నవానిచేతా, ఎక్కువ తాగి లేదా తిని ఉన్నవానిచేత వ్యాయామం చేయించకూడదు.

**మూ. అచలైర్మధురైర్గాత్రైశ్చతురస్రేణ వక్షసా. 102**
**వ్యాయామం కారయేద్ధీమాన్ నరమఙ్గక్రియాత్మకమ్,**
**ఏవం వ్యాయామసంయోగే కార్యశ్చారీకృతో విధిః. 103**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి మణ్డలానాం వికల్పనమ్. 104**

**ఇతి భరతీయ నాట్యశాస్త్రే చారీవిధానో నామ దశమోధ్యాయః.**

**తా.** స్థిరంగా, అందంగా ఉన్న అవయవాలతో, విశాలమైన అందమైన వక్షస్థలంతో ఉన్నవానిచేత నాట్యాంగక్రియారూపమైన వ్యాయమం చేయించాలి. ఈ విధంగా బాగా వ్యాయామం, (అనగా నృత్త - నాట్యాంగాదులకు సంబంధించిన మంచి అభ్యాసం) జరిగిన తరువాత చారీలకు సంబంధించిన విధి చెయ్యాలి.

ఇటుపైన మండలాల భేదాలను సవిస్తరంగా చెపుతాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్ర వ్యాఖ్యానము నందు చారీవిధానం అను దశమాధ్యాయం సమాప్తం.**

**శ్రీః శ్రీః శ్రీః**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ ఏకాదశోఽధ్యాయః

# మణ్డలవిధానము

**"గతిమణ్డలవైచిత్ర్యమాసూత్రయతి యా సదా,**
**తథా నేదిష్ఠనిర్మాత్రీం శక్తిం వన్దే మహేశితుః.**
**స్వల్పేఽపి పాఠ్యే న త్యాజ్యః కోఽప్యధ్యాయో మయా యతః,**
**విభోర్విశ్వాత్మనః స్తోత్రం ముఖ్యమన్యత్ ప్రసంగతః"**

**– శ్రీమదభినవగుప్తాచార్యాః**

**మూ. ఏతాశ్చార్యో మయా ప్రోక్తా యథావచ్ఛస్త్రమోక్షణే,**
**చారీసంయోగజానీహ మణ్డలాని నిబోధత. 1**

**తా.** మునులారా! శస్త్రప్రయోగంలో వినియోగించవలసిన చారీలను, మీకింతవరకు చెప్పాను. ఇప్పుడ చారులను కలపడంవల్ల ఏర్పడే మండలాలను గూర్చి చెపుతాను; వినండి.

**మూ. అతిక్రాన్తం విచిత్రం చ తథా లలితసంచరమ్,**
**సూచీవిద్ధం, దణ్డపాదం విహతాలాతకే తథా. 2**

**వామబన్ధం సలలితం కాన్తం చాకాశగాని చ,**
**మణ్డలాని ద్విజశ్రేష్ఠాః! భూమిగాని నిబోధత. 3**

**తా.** ద్విజశ్రేష్ఠులారా! అతిక్రాంతం, విచిత్రం, లలితసంచరం, సూచీవిద్ధం, దండపాదం, విహతం, అలాతకం, వామబన్ధం, లలితం, క్రాంతం అని **ఆకాశగత మండలాలు** పది అని తెలుసుకొనండి. ఇంక భూమిమీదమండలాల పేర్లు వినండి.

**మూ. భ్రమరాస్కన్దితే స్యాతామావర్తం చ తతఃపరమ్,**
**సమాక్రన్దితమప్యాహురేడకాక్రీడితం తథా. 4**

**అడ్డితం శకటాస్యం చ తథాధ్యర్ధకమేవ చ,**
**పిష్టకుట్టం చ విజ్ఞేయం తథా చాషగతం పునః. 5**

**ఏతాన్యపి దశోక్తాని భూమిగానీహ నామతః.**

**తా.** భ్రమరం, ఆస్కందితం, ఆవర్తం, సమాక్రందితం, ఏడకాక్రీడితం, అడ్డితం, శకటాస్యం, అధ్యర్ధకం, పిష్టకుట్టం, చాషగతం – ఇవి పది **భూమిగతమండలాల** పేర్లు.

**మూ. ఆద్యం పాదం చ జనితం కృత్వోద్వాహిత మాచరేత్. 6**

**అలాతం వామకం చైవ పార్శ్వక్రాన్తం చ దక్షిణమ్,**
**సూచీవామం పునశ్చైవ పార్శ్వక్రాన్తం చ దక్షిణమ్. 7**

**సూచీం వామక్రమం దద్యాదపక్రాన్తం చ దక్షిణమ్,**
**సూచీవామం పునశ్చైవ త్రికం చ పరివర్తయేత్. 8**

**తథా దక్షిణముద్వృత్తమలాతం చైవ వామకమ్,**
**పరిచ్ఛిన్నం తు కర్తవ్యం బాహ్యభ్రమరకేణ హి. 9**

**అతిక్రాన్తం పునర్వామం దణ్డపాదం చ దక్షిణమ్,**
**విజ్ఞేయమేతద్వ్యాయామే త్వతిక్రాన్తం తు మణ్డలమ్. 10**

**తా. (1) అతిక్రాంతమండలం :-** కుడి పాదం జనితచారిలో ఉంచి దానినే శకటాస్యచారిలో ఉంచాలి. తరువాత ఎడమ పాదం సూచీక్రాంతచారిలో ఉంచి కుడి పాదం పార్శ్వక్రాంతంలో ఉంచాలి. ఇదే విధంగా వరుసగా – వామం (ఎడమపాదం) సూచి, దక్షిణం (కుడిపాదం) అపక్రాంతం, వామం సూచిలో ఉంచి భ్రమరీచారిలోనికి మార్చాలి. తరువాత దక్షిణపాదం ఉద్వృత్తచారి, వామపాదం అలాతచారి. దానినే బాహ్యభ్రమరకచారిచేత పరిచ్ఛిన్నం చేసి దానితోనే అతిక్రాంతచారి ప్రయోగించాలి. దక్షిణపాదం దండచారిలో. ఈ విధంగా దక్షిణ – వామపాదాల చారులను ఒక క్రమంలో మార్చుకొంటూ చేస్తే అది **అతిక్రాంతమండలం** అనే ఆకాశగమండలం.

**మూ. ఆద్యం తు జనితం కృత్వా తేనైవ చ నికుట్టకమ్,**
**ఆస్పన్దితం తు వామేన పార్శ్వక్రాన్తం చ దక్షిణమ్. 11**

**వామం సూచీపదం దద్యాత్ అపక్రాన్తం చ దక్షిణమ్,**
**భుజఙ్గత్రాసితం వామమతిక్రాన్తం చ దక్షిణమ్. 12**

**ఉద్వృత్తం దక్షిణం చైవాలాతం చైవాత్ర వామకమ్,**
**పార్శ్వక్రాన్తం పునః సవ్యం సూచీనామక్రమం తథా. 13**

**విక్షేపో దక్షిణస్య స్యాదపక్రాన్తం చ వామకమ్,**
**బాహ్యభ్రమరకం చైవ విక్షేపం చైవ యోజయేత్. 14**

**విజ్ఞేయమేతద్వ్యాయామే విచిత్రం నామ మణ్డలమ్.**

**తా. (2) విచిత్రమండలం :-** కుడి పాదంతో జనితం చేసి, దానితోనే కుట్టకం చెయ్యాలి. ఎడమపాదంలో ఆస్పందితం, కుడిపాదంతో పార్శ్వక్రాంతం. వామంతో సూచీపాదం సమకూర్చి కుడిపాదంతో అపక్రాంతం. ఎడమపాదంతో భుజంగత్రాసితం,

కుడిపాదంతో అపక్రాంతం. దక్షిణపాదంతో ఉద్వృత్తం, వామపాదంలో అలాతం. ఆ పాదంతోనే పార్శ్వక్రాంతం. కుడిపాదంతో సూచీపదం. దక్షిణంతో విక్షేపం, వామంతో అపక్రాంతం, బాహ్యభ్రమరకం. విక్షేపమూ కూడ చెయ్యాలి. ఇలా క్రమంగా చారుల ప్రయోగం **విచిత్రమండలం** అవుతుంది.

**మూ. కృత్వోర్ధ్వజానుచరణమాద్యం సూచీం ప్రయోజయేత్. 15**

**అపక్రాన్తః పునర్వామ ఆద్యః పార్శ్వగతో భవేత్,**
**వామసూచీం పునర్దద్యాత్ త్రికం చ పరివర్తయేత్. 16**

**పార్శ్వక్రాన్తః పునశ్చాద్యమతిక్రాన్తం చ వామకమ్,**
**సూచీవామక్రమం కృత్వా హ్యపక్రాన్తం చ వామకమ్. 17**

**పార్శ్వక్రాన్తం పునశ్చాద్యమతిక్రాన్తం చ వామకమ్,**
**పరిచ్ఛిన్నం చ కర్తవ్యం బాహ్యభ్రమణకేన హి. 18**

**ఏష చారీప్రయోగస్తు కార్యో లలితసంచరే.**

**తా. (3) లలితసంచరమండలం :–** కుడి పాదం మోకాలు పైకి ఎత్తి, తరువాత సూచీని ప్రయోగించాలి. వామంచేత అపక్రాంతం, దక్షిణంచేత పార్శ్వగతం. వామపాదంతో సూచి చేసి భ్రమరి చెయ్యాలి. మళ్లీ కుడి పాదంతో పార్శ్వక్రాంత, ఎడమ పాదంతో అతిక్రాంత, సూచి, అపక్రాంత చెయ్యాలి. కుడి పాదంతో పార్శ్వక్రాంత, వామపాదంతో అతిక్రాంత. దానితోనే బాహ్యభ్రమరకంచేత పరిఛిన్నం చెయ్యాలి. **లలితసంచర మండలం**లో చారీప్రయోగం ఈ విధంగా చెయ్యాలి.

**మూ. సూచీ వామపదం దద్యాత్ త్రికం చ పరివర్తయేత్, 19**

**పార్శ్వక్రాన్తః పునశ్చాద్యో వామోఽతిక్రాన్త ఏవ చ,**
**సూచీమాద్యం పునర్దద్యాత్ అతిక్రాన్తం చ వామకమ్. 20**

**పార్శ్వక్రాన్తం పునశ్చాద్యం సూచీవిద్ధే తు మణ్డలే.**

**తా. (4) సూచీవిద్ధమండలం :– సూచీవిద్ధమండలంలో –** వామపాదంతో సూచి, చేసి భ్రమరి కూడ చెయ్యాలి. కుడి పాదంతో పార్శ్వక్రాంతం వామపాదంతో అతిక్రాంతం. కుడిపాదంతో మళ్లీ సూచి వామపాదంతో అతిక్రాంతం. కుడిపాదంతో పార్శ్వక్రాంతం చెయ్యాలి.

**మూ. ఆద్యస్తు జనితో భూత్వా స చ దణ్డక్రమో భవేత్. 21**

**వామసూచీం పునర్దద్యాత్ త్రికం చ పరివర్తయేత్,**

ఉద్వృత్తో దక్షిణశ్చ స్యాదలాతశ్చైవ వామకః. 22

పార్శ్వక్రాన్తః పునశ్చాద్యో భుజఙ్గత్రాసితస్తథా,
అతిక్రాన్తః పునర్వామో దణ్డపాదశ్చ దక్షిణః. 23

వామసూచీ త్రికావర్తో దణ్డపాదే చ మణ్డలే.

**తా. (5) దండపాదమండలం :–** దక్షిణపాదంతో ముందు సూచీచారి చేసి పిదప దండచారిలో ఉండాలి. వామంతో సూచీచారి చేసి భ్రమరీచారి కూడ చెయ్యాలి. దక్షిణంతో ఉద్వృత్తచారి వామ పాదంతో అలాతచారి దక్షిణపాదంతో పార్శ్వక్రాంత, భుజంగత్రాసితం వామపాదంతో అతిక్రాంత దక్షిణపాదంతో దండపాదం. వామంతో సూచి, భ్రమరి చెయ్యాలి.

**మూ.** ఆద్యం తు జనితం కృత్వా తేనైవ చ నికుట్టకమ్. 24

ఆస్యన్దితం చ వామేన హ్యుద్వృత్తం దక్షిణేన చ,
అలాతం వామకం పాదం సూచీం దద్యాత్తు దక్షిణమ్. 25

పార్శ్వక్రాన్తః పునర్వామః ఆక్షిప్తో దక్షిణస్తథా,
సమావర్త్య త్రికం చైవ దణ్డపాదం ప్రసారయేత్. 26

సూచీవామపదం దద్యాత్ త్రికం తు పరివర్తయేత్,
భుజఙ్గత్రాసితశ్చాద్యో వామోఽతిక్రాన్త ఏవ చ. 27

ఏవం చారీప్రయోగస్తు విహృతే మణ్డలే భవేత్.

**తా. (6) విహృతమండలం :–** దక్షిణపాదంతో జనితాచారి చేసి దానితోనే నికుట్టనం చెయ్యాలి. వామపాదంతో ఆస్యందితం దక్షిణపాదంతో ఉద్వృత్తం. వామ పాదంతో పార్శ్వక్రాంతం, దక్షిణపాదంతో ఆక్షిప్తం భ్రమరి చేసి దండపాదప్రసారంతో అతిక్రాంతాచారి. **విహృతమండలం**లో చారీప్రయోగం ఈ క్రమంలో జరగాలి.

**మూ.** సూచీమాద్యక్రమం కృత్వా చాపక్రాన్తం చ వామకమ్. 28

పార్శ్వక్రాన్తస్తతశ్చాద్యో ఽప్యలాతశ్చైవ వామకః,
భ్రాన్త్వా చారీభిరేతాభిః పర్యాయేణాథ మణ్డలమ్. 29

షట్సంఖ్యం సప్తసంఖ్యం చ లలితైః పాదవిక్రమైః,
అధికుర్యాదపక్రాన్తమతిక్రాన్తం చ వామకమ్. 30

అపక్రాన్తః పునశ్చాద్యే వామోఽతిక్రాన్త ఏవ చ,
పాదభ్రమరకశ్చ స్యాదలాతే ఖలు మణ్డలే. 31

**తా. (7) అలాతమండలం :-** కుడి పాదంతో పార్శ్వక్రాంతచారి, వామపాదంతో అలాతచారి, ఈ విధంగా ఏడూ లేదా ఎనిమిది పర్యాయాలు చేస్తూ రంగం నలుమూలలా తిరగాలి. చివరికి వామపాదంతో అపక్రాంతమూ, అతిక్రాంతమూ కూడ చెయ్యాలి. మళ్లీ కుడిపాదంతో అపక్రాంతచారి, ఎడమ పాదంతో అతిక్రాంతచారి చేసి తరవాత భ్రమరకచారి చెయ్యాలి. ఇది **అలాతమండలం.**

**మూ. సూచీమాద్యక్రమం కృత్వా హ్యపక్రాన్తం చ వామకమ్,**
**ఆద్యో దణ్డక్రమశ్చైవ సూచీపాదస్తు వామకః. 32**

**కార్యస్త్రికవివర్తశ్చ పార్శ్వక్రాన్తశ్చ దక్షిణః,**
**ఆక్షిప్తవామకం కుర్యాత్ దణ్డపార్శ్వం చ దక్షిణమ్. 33**

**ఊరూద్వృత్తం తు తేనైవ కర్తవ్యం దక్షిణేన తు,**
**సూచీవామక్రమం కృత్వా త్రికం చ పరివర్తయేత్. 34**

**అలాతశ్చ భవేద్వామః పార్శ్వక్రాన్తశ్చ దక్షిణః,**
**అతిక్రాన్తః పునర్వామో వామబన్ధే తు మణ్డలే. 35**

**తా. (8) వామబంధమండలం :-** వామబంధమండలంలో ఈ క్రమంలో దక్షిణ - వామపాదాల చారీలు చెయ్యాలి. కుడిపాదంతో సూచీక్రమం, ఎడమపాదంతో అపక్రాంతమూ, పిమ్మట దక్షిణపాదంతో దండచారి వామపాదంతో సూచీపాదం, దానితోనే భ్రమరి చేసి పిమ్మట దక్షిణపాదంతో పార్శ్వక్రాంతం చెయ్యాలి. వామపాదం ఆక్షిప్తం చేసి దక్షిణపాదం దండపార్శ్వం చెయ్యాలి. దక్షిణపాదంతోనే ఊరూద్వృత్తం చేసి వామపాదంతో సూచీక్రమం చేసి పిమ్మట భ్రమరి చెయ్యాలి. వామం అలాతంలో ఉండగా దక్షిణపాదం పార్శ్వక్రాంతం కావాలి. వామపాదం అతిక్రాంతచారిలో ఉండాలి.

**మూ. సూచీమాద్యక్రమం కృత్వాహ్యప్రకాన్తం చ వామకమ్,**
**పార్శ్వక్రాన్తః పునశ్చాద్యో భుజఙ్గత్రాసితః స చ. 36**

**అతిక్రాన్తః పునర్వామః ఆక్షిప్తో దక్షిణస్తథా,**
**అతిక్రాన్తః పునర్వామః ఊరూద్వృత్తస్తథైవ చ. 37**

**అలాతశ్చ పునర్వామః పార్శ్వక్రాన్తశ్చ దక్షిణః,**
**సూచీవామం పునర్దద్యాదపక్రాన్తస్తు దక్షిణః. 38**

**అతిక్రాన్తః పునర్వామః కార్యో లలితసంజ్ఞకః,**
**ఏష పాదప్రసారస్తు లలితే మణ్డలే భవేత్. 39**

**తా. (9) లలితమండలం :–** లలితమండలంలో పాదచారీక్రమం ఇలా ఉండాలి – దక్షిణపాదంతో సూచి, వామపాదంతో అపక్రాంతం. దక్షిణపాదంతో పార్శ్వక్రాంతం, భుజంగత్రాసితం కూడ. వామంతో అతిక్రాంతం, దక్షిణపాదంతో ఆక్షిప్తం. వామంతో అతిక్రాంతం, ఊరూద్వృత్తం కూడ. వామంతో అలాతం, దక్షిణపాదంతో పార్శ్వక్రాంతం. వామపాదంతో సూచి, దక్షిణపాదంతో అపక్రాంతం. మళ్లీ వామం అపక్రాంతంలో ఉండాలి.

**మూ. సూచీమాద్యక్రమం కృత్వా హ్యపక్రాన్తం చ వామకమ్,**
**పార్శ్వక్రాన్తం పునశ్చాద్యం వామపార్శ్వక్రమం తథా. 40**

**భ్రాన్త్వా చారీభిరేతాభిః పర్యాయేణ చ మణ్డలమ్,**
**వామసూచీం తతో దద్యాదపక్రాన్తం చ దక్షిణమ్. 41**

**స్వభావగమనే హ్యేతన్మణ్డలం సంవిధీయతే,**
**క్రాన్తమేతత్తు విజ్ఞేయం నామతో నాట్యయోక్తృభిః. 42**

**తా. (10) క్రాన్తమండలం :–** దక్షిణపాదంతో సూచి చేసి, ఎడమపాదంతో అపక్రాంతం చెయ్యాలి. దక్షిణపాదంతో పార్శ్వక్రాంతం, వామపాదంతో పార్శ్వక్రమం చెయ్యాలి. ఈ చారీలతో కొన్ని పర్యాయాలు తిరిగి తరువాత వామపాదంతో సూచిని దక్షిణపాదంతో అపక్రాంతం చెయ్యాలి. స్వాభావికమైన గమనంలో ఈ మండలం ప్రయోగింపబడుతుంది. ఈ మండలం పేరు **క్రాంతమండలం**.

**మూ. ఏతాన్యాకాశగామీని జ్ఞేయాన్యేవం దశైవ తు,**
**అతఃపరం ప్రవక్ష్యామి భౌమానామిహ లక్షణమ్. 43**

**తా.** ఈ పదీ ఆకాశగమండలాలు. ఇటుపైన భౌమమండలాల లక్షణం చెపుతాను.

**మూ. ఆద్యస్తు జనితః కార్యో వామశ్చాస్పన్దితో భవేత్,**
**శకటాస్యః పునశ్చాద్యో వామశ్చాపి ప్రసారితః. 44**

**ఆద్యో భ్రమరకః కార్యస్త్రికం చ పరివర్తయేత్,**
**ఆస్కన్దితః పునర్వామః శకటాస్యశ్చ దక్షిణః. 45**

**వామః పృష్ఠాపసర్పీ చ దద్యాద్ భ్రమరకం తథా,**
**స ఏవాస్పన్దితః కార్యస్త్వేతద్ భ్రమరమణ్డలమ్. 46**

**తా. (1) భ్రమరమండలం :–** దక్షిణపాదంతో జనితాచారి, వామపాదంతో ఆస్పందితచారి. దక్షిణంతో శకటాస్యచారి చేసి వామపాదం ప్రసారితం చెయ్యాలి (చాపాలి). దక్షిణపాదంతో భ్రమరీచారి చెయ్యాలి. వామపాదంతో ఆస్కందితం చేసి దక్షిణపాదంతో శకటాస్యం. ఎడమపాదం పృష్ఠాపసర్పియై ఉండగా భ్రమరకం చెయ్యాలి. దానితోనే

ఆస్పందితచారి చెయ్యాలి. ఇది **భ్రమరమండలం.**

**మూ. ఆద్యో భ్రమరకః కార్యో వామశ్చైవాడ్డితో భవేత్,**
**కార్యస్త్రికవివర్తశ్చ శకటాస్యశ్చ దక్షిణః. 47**

**ఊరూద్వృత్తః స ఏవ స్యాద్వామశ్చైవాపసర్పితః,**
**కార్యస్త్రికవివర్తశ్చ దక్షిణః స్పన్దితో భవేత్. 48**

**శకటాస్యో భవేద్వామస్తదేవాస్ఫోటనం భవేత్,**
**ఏతదాస్కన్దితం నామ వ్యాయామే యుద్ధమణ్డలమ్. 49**

**తా. (2) ఆస్కందితమండలం :–** దక్షిణపాదంతో భ్రమరకం; వామపాదంతో అడ్డితం చెయ్యాలి. తరువాత భ్రమరి చెయ్యాలి. కుడి పాదంతో శకటాస్యచారి. దానితోనే ఊరూద్వృత్తం. వామపాదంతో అపసర్పితం. దానితోనే భ్రమరి. దక్షిణపాదంతో స్పందితం. ఎడమపాదంతో శకటాస్యం. దానితోనే ఆస్ఫోటనం. ఇది ఆస్కందితం అనే యుద్ధరంగంలో ప్రయోగించే మండలం.

**మూ. ఆద్యస్తు జనితం కృత్వా వామశ్చైవ నికుట్టకమ్,**
**శకటాస్యః పునశ్చాద్యః ఊరూద్వృత్తః స ఏవ తు. 50**

**పృష్ఠాపసర్పో వామశ్చ స చ చాషగతిర్భవేత్,**
**ఆస్పన్దితః పునర్దక్షః శకటాస్యశ్చ వామకః. 51**

**ఆద్యో భ్రమరకశ్చైవ త్రికం చ పరివర్తయేత్,**
**పృష్ఠాపసర్పో వామశ్చేత్యావర్తే మణ్డలే భవేత్. 52**

**తా. (3) ఆవర్తమండలం :–** దక్షిణపాదంతో జనిత, వామపాదంతో నికుట్టకం – దక్షిణపాదం శకటాస్యచారిలోను ఊరూద్వృత్తచారిలోను ఉండాలి. వామపాదం పృష్ఠాపసర్పమై ఉండి చాషగతి కూడ చెయ్యాలి. దక్షిణపాదం ఆస్పందితచారిలోను వామ పాదం శకటాస్యంలోను ఉండాలి. దక్షిణపాదంతో భ్రమరీచారి చెయ్యాలి. వామపాదం పృష్ఠాపసర్పం చెయ్యాలి. ఇది **ఆవర్తమండలం**లో అనుసరించవలసిన చారీ క్రమం.

**మూ. సమపాదం బుధః కృత్వా స్థానం హస్తౌ ప్రసారయేత్,**
**నిరన్తరావూర్ధ్వతలౌ ఆవేష్ట్యోద్వేష్ట్య చైవ హి. 53**

**కటీతటే వినిక్షిప్య చాద్యమావర్తయేత్ క్రమాత్,**
**యథాక్రమం పునర్వామమావర్తేన ప్రసారయేత్. 54**

**చారయా చానయా భ్రాన్త్వా పర్యాయేణాథ మణ్డలమ్,**
**సమోత్సారితమేతత్తు కార్యం వ్యాయామమణ్డలమ్. 55**

**తా. (4) సమోత్సారిత (సమాక్రందిత) మండలం :–** బుధుడు సమపాదస్థానం చేసి రెండు చేతులూ అరచేతులు పైవైపు ఉండేటట్లు, దగ్గరగా చాపి ఒకదానితో ఒకటి మెలివేస్తూ విప్పుతూ ఉంచాలి. కుడిచెయ్యి కటిప్రదేశంమీద ఉంచి క్రమంగా దానిని తిప్పాలి. తరువాత వామహస్తం కూడ క్రమానుసారం తిప్పి చాపాలి. ఈ చారితో కొన్ని పర్యాయాలు మండల భ్రమణం చెయ్యాలి. ఇది **సమోత్సారితం** లేదా **సమక్రందితం** అను యుద్ధమండలం.

**మూ. పాదైస్తు భూమిసంయుక్తైః సూచీవిద్ధైస్తథైవ చ,**
**ఏడకాక్రీడితైశ్చైవ తూర్ణైస్త్రికవివర్తితైః. 56**

**సూచీవిద్ధాపవిద్ధైశ్చ క్రమేణావృత్త్య మణ్డలమ్,**
**ఏడకాక్రీడితం విద్యాత్ ఖణ్డమణ్డలసంజ్ఞితమ్. 57**

**తా. (5) ఏడకాక్రీడితమండలం :–** పాదాలు నేలమీద దగ్గరగా ఉంచి నిలిచి, సూచీవిద్ధములు చేసి, తరువాత ఏడకాక్రీడితచారి చేసి, శీఘ్రంగా భ్రమరీచారి చేసి, తరువాత సూచీవిద్ధములు చేసి, అపవిద్ధములు చేస్తూ క్రమంగా ఈ విధంగా చారీ ప్రయోగం చేస్తే ఇది **ఏడకాక్రీడితం** అవుతుంది. దీనికి **ఖండమండలం** అని పేరు.

**మూ. సవ్యమద్ఘట్టితం కృత్వా తేనైవావర్తమాచరేత్,**
**తేనైవాస్కన్దితః కార్యః శాకటాస్యశ్చ వామకః. 58**

**ఆద్యః పృష్ఠాపసర్పీ చ స చ చాషగతిర్భవేత్,**
**అడ్డితశ్చ పునర్వామ ఆద్యశ్చైవాపసర్పితః. 59**

**వామో భ్రమరకః కార్య ఆద్య ఆస్కందితో భవేత్,**
**తేనైవాస్ఫోటనం కుర్యాత్ ఏతదడ్డితమణ్డలమ్. 60**

**తా. (6) అడ్డితమణ్డలమ్ :–** సవ్య (కుడి) పాదంతో ఉద్ఘట్టనం చేసి దానితోనే ఆవర్తనం చెయ్యాలి (తిరగాలి). తరువాత దానితోనే ఆస్కందితం చేయాలి. వామపాదం శకటాస్యచారిలో ఉండాలి. దక్షిణపాదం వెనుకకు కదల్చబడి చాషగతిచారిలో ఉండాలి. వామపాదం అడ్డితాచారిలో ఉండగా దక్షిణపాదం అపసర్పితం కావాలి. వామపాదం భ్రామరీచారి చెయ్యాలి. దక్షిణపాదం ఆస్కందితం కావాలి. దానితోనే ఆస్ఫోటనం (నేలమీద కొట్టి, జబ్బచరచి చప్పుడుచేయడం) చెయ్యాలి. ఇది **అడ్డితమండలం**.

**మూ. ఆద్యం తు జనితం కృత్వా తేనైవ చ నికుట్టకమ్,**
**స ఏవ శకటాస్యశ్చ వామశ్చాస్కన్దితో భవేత్. 61**

**విజ్ఞేయం శకటాస్యం తు వ్యాయామే యుద్ధమణ్డలమ్.**
**పాదైశ్చ శకటాస్యస్థైః పర్యాయేణాథ మణ్డలమ్. 62**

**తా. (7) శకటాస్యమండలం :–** దక్షిణపాదంతో జనితచారి చేసి దానితోనే నికుట్టకం కూడ చేసి, దానితోనే శకటాస్యచారి చేయగా, వామపాదం ఆస్కందితమై ఉన్నప్పుడు అది శకాటస్య మనే యుద్ధమండలం. దీనిలో పాదాలు ఒకదానితరువాత ఒకటి శకటాస్యచారిలో ఉంటాయి.

**మూ. ఆద్యస్తు జనితో భూత్వా స ఏవాస్కన్దితో భవేత్,**
**అపసర్పీ పునర్వామః శకటాస్యశ్చ దక్షిణః. 63**

**భ్రాన్త్వా చారీభిరేతాభిః పర్యాయేణాథ మణ్డలమ్,**
**అధ్యర్ధమేతద్విజ్ఞేయం నియుద్ధే చాపి మణ్డలమ్. 64**

**తా. (8) అధ్వర్ధమండలం :–** దక్షిణపాదం జనితచారిలో ఉండి పిదప ఆస్కందితం కావాలి. వామపాదం అపసర్పిగాను, దక్షిణపాదం శకటాస్యంలోను ఉండాలి. ఈ చారీలు ఒక దాని తరువాత ఒకటి చేస్తూ మండలాకారంగా తిరగాలి. ఇది **అధ్యర్ధమండలం**. ఈ మండలం నియుద్ధంలో (బాహుయుద్ధంలో) ఉపయోగించబడుతుంది.

**మూ. సూచీమాద్యక్రమం కృత్వా హ్యపక్రాన్తం చ వామకమ్,**
**భుజఙ్గత్రాసితం చాద్య ఏవమేవ తు వామకః. 65**

**భుజఙ్గత్రాసితైర్భ్రాన్త్వా పాదైరపి చ మణ్డలమ్,**
**పిష్టకుట్టం చ విజ్ఞేయం చారీభిర్మణ్డలం బుధైః. 66**

**తా. (9) పిష్టకుట్టమండలం :–** దక్షిణపాదం సూచిలోను, వామపాదం అపక్రాంత చారిలోను ఉండాలి. దక్షిణపాదము, వామపాదమూ కూడ భుజంగత్రాసితంలోనే ఉండాలి. భుజంగత్రాసితచారీలతో మండలభ్రమణం చెయ్యాలి. ఈ విధంగా చేసిన చారీలతో **పిష్టకుట్టమండలం** ఏర్పడుతుంది.

**మూ. సర్వైశ్చాషగతైః పాదైః పరిభ్రామ్య తు మణ్డలమ్,**
**ఏతచ్చాషగతం విద్యాన్నియుద్ధే చాపి మణ్డలమ్. 67**

**తా. (10) చాషగతమండలం :–** అన్నీ చాషగతంచారీలే ప్రయోగిస్తూ మండల భ్రమణం చేస్తే అది **చాషగతమండలం**. ఇది కూడ నియుద్ధంలో చేయబడుతుంది.

**మూ. నానాచారీసముత్థాని మణ్డలాని సమాసతః,**
**ఉక్తాన్యతః పరం చైవ సమచారీణి యోజయేత్. 68**

**తా.** ఈ విధంగా అనేకవిధాలైన చారుల (భౌమ – ఆకాశచారుల) కలయికవల్ల ఏర్పడిన మండలాలను గూర్చి సంక్షిప్తంగా చెప్పాను. అటుపైన సమచారులతో ఏర్పడిన మండలాలను కూర్చుకోవాలి.

**మూ. సమచారీప్రయోగో యస్తత్సమం నామ మణ్డలమ్,**
**ఆచార్యబుద్ధ్యా తానీహ కర్తవ్యాని ప్రయోక్తృభిః. 69**

**తా.** సమానమైన చారీల ప్రయోగంచేత ఏర్పడే మండలం సమమండలం. అనగా కొన్ని భూమిచారీలు మాత్రమే, లేదా కొన్ని ఆకాశచారీలు మాత్రమే ప్రయోగిస్తూ చేసిన మండలం **సమమండలం**. ప్రయోక్తలు ఆచార్యుడు ఆలోచించి కలిపిన చారీలతో ఈ సమమండలాలను చెయ్యాలి.

**మూ. ఏతాని ఖణ్డాని సమణ్డలాని యుద్ధే నియుద్ధే చ పరిక్రమే చ,**
**లీలాఙ్గమాధుర్యపురస్కృతాని కార్యాణి వాద్యానుగతాని తద్జ్ఞైః. 70**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే మణ్డలవిధానం నామ ఏకాదశోఽధ్యాయః.**

**తా.** అంగసౌష్ఠవం ఉన్నవాళ్లు, ప్రక్కనే మ్రోగుతూన్న వాద్యాలను అనుసరిస్తూ, వాటికి అనుగుణంగా ఈ ఖండాలను మండలాలను వీటిని బాగా అభ్యసించినపిమ్మట యుద్ధంలోను, బాహుయుద్ధంలోను, నడకలోను, విలాసపూర్వకంగా చెయ్యాలి.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానము నందు మండలవిధానం అను పదకొండవ అధ్యాయం సమాప్తం.**

**శ్రీః శ్రీః శ్రీః**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ ద్వాదశోఽధ్యాయః

# గతిప్రచారము

**శ్రుత్యన్తవిశ్రాన్తవిధిర్యా గతిః పరమాత్మనః,**
**తాం మహానన్దసన్దోహతత్త్వమూర్తిం స్తుమః సదా.**

**– శ్రీమదభినవగుప్తాచార్యాః**

**మూ. ఏవం వ్యాయామసంయోగే కార్యం మణ్డలకల్పనమ్,**
**అతః పరం ప్రవక్ష్యామి గతీస్తు ప్రకృతిస్థితాః. 1**

**తా.** వ్యాయామముల (చారీల) సంయోగం ఏర్పడి నప్పుడు మండలాల కల్పనం ఈ విధంగా చెయ్యాలి. ఇటు పైన ప్రకృతికి సంబంధించిన గతులను గూర్చి చెపుతాను.

**వి.** చారీలు, చారీల కలయికచేత ఏర్పడిన మండలాలు కేవలం కరచరణా వ్యవయవాల చేష్టలమీద ఆధారపడినవి. వాటికి చిత్తవృత్తితో అంతగా పని లేదు. ఈ అధ్యాయంలో చెప్పబోయే గతులు ఆ యా పాత్రల ప్రకృతులను, రసాన్నీ, అవస్థను, దేశ – కాలాదులను అనుసరించి ప్రయోగించవలసినవి గాన వీటికి చిత్తవృత్తితో సంబంధం అధికంగా ఉంటుంది. అందుచేతనే **"ప్రకృతిస్థాః"** అని చెప్పబడింది. (అ.భా.)

**మూ. తత్రోపహనం కృత్వా భాణ్డవాద్యపురస్కృతమ్,**
**యథామార్గరసోపేతం ప్రకృతీనాం ప్రవేశనే. 2**

**ధ్రువాయాం సంప్రవృత్తాయాం పటే చైవాపకర్షితే,**
**కార్యః ప్రవేశః పాత్రాణాం నానార్థరససంభవః. 3**

**తా.** ముందుగా భాండవాద్యములను పురస్కరించుకొని, అనగా తంత్రీవాద్యములూ (భాండం) మృదంగాదివాద్యములు వాటి వాటి స్థానాలలో ఉండే టట్లు చేసికొని, మార్గము, అనగా దేశము, రసము, (స్థాయిచిత్తవృత్తి) – వీటితో కూడిన విధంగా, వీటికి అను గుణంగా ఉపవహనం, అనగా 'అంగానుసారంగా ఆలాపము' అని ప్రసిద్ధమైన ఆలాపం చేసి, ధ్రువాగానం ప్రవర్తించిన తరువాత పాత్రల ప్రవేశం చేయించవలసిన సమయంలో, తెర తొలగించి వివిధ నాట్య వస్తువులకు సంబంధించిన పాత్రప్రవేశం చేయించాలి.

**మూ. స్థానం తు వైష్ణవం కృత్వా హ్యుత్తమే మధ్యమే తథా,**
**సమున్నతం సమం చైవ చతురస్రమురస్తథా. 4**

**బాహుశీర్షే ప్రసన్నే చ నాత్యుత్క్షిప్తే చ కారయేత్,**
**గ్రీవాప్రదేశః కర్తవ్యః మయూరాఞ్చితమస్తకః. 5**

**తా.** రంగప్రవేశ సమయంలో ఉత్తమ – మధ్యమపాత్రలు వైష్ణవస్థానకంలో ఉండాలి. వక్షస్థలాలు ఎత్తుగాను, సమంగాను, చతురస్రంగాను ఉంచుకోవాలి. బాహువులు, శిరస్సులూ ఎక్కువ ఎత్తకుండా, ప్రసన్నంగా (సుఖనిద్రాసమయంలో ప్రసన్నంగా ఉన్నట్లు) ఉండాలి. కంఠప్రదేశం మయూరకంఠం వలె సొగసుగా, తల కొంచెం వంగి ఉండాలి.

**మూ. కర్ణాదష్టాఙ్గులస్థే చ బాహుశీర్షే ప్రయోజయేత్,**
**ఉరసశ్చాపి చిబుకం చతురఙ్గులసంస్థితమ్. 6**

**తా.** బుజాల శిఖరాలు చెవికి ఎనిమిది అంగులాల దూరంలోను, చిబుకం (గడ్డం) వక్షఃస్థలంనుంచి నాలు గంగులాల ఎడంలోను ఉండాలి.

**మూ. హస్తౌ తథైవ కర్తవ్యౌ కటీనాభితటస్థితౌ,**
**దక్షిణో నాభిసంస్థస్తు వామః కటితటస్థితః. 7**

**తా.** చేతులు రెండూ కటిప్రదేశంమీద నాభిదగ్గర ఉంచాలి. కుడిచెయ్యి నాభి దగ్గర ఎడమ చెయ్యి కటితటందగ్గరా ఉండాలి.

**మూ. పాదయోరన్తరం కార్యం ద్వౌ తాలావర్ధమేవ చ,**
**పాదోత్క్షేపస్తు కర్తవ్యః స్వప్రమాణవినిర్మితః. 8**

**తా.** పాదాల మధ్య రెండున్నర తాలాల ఎడం ఉండాలి. తన దేహం ప్రమాణాన్ని అనుసరించి పాదం ఎత్తాలి.

**మూ. చతుస్తాలో ద్వితాలశ్చాప్యేకతాలస్తథైవ చ,**
**చతుస్తాలస్తు దేవానాం పార్థివానాం తథైవ చ. 9**
**ద్వితాలశ్చైవ మధ్యానాం తాలః స్త్రీనీచలిఙ్గినామ్.**

**తా.** పాదం ఎత్తడంలో ప్రమాణం నాలుగు తాలాలు గాని, రెండు తాలాలు గాని, ఒక తాలం గాని ఉండాలి. దేవతాపురుషులకు, రాజులకు నాలుగు తాలాలు, మధ్యములకు రెండు తాలాలు, స్త్రీలకు నీచులకు సంన్యాసి – బ్రహ్మచార్యాదులకు ఒక తాలం ఉండాలి. (తాలం అనగా ఇంచుమించు ఒక జానెడు దూరం).

**మూ. చతుష్కలోఽథ ద్వికలస్తథా హ్యేకకలః స్మృతః. 10**
**చతుష్కలో హ్యుత్తమానాం మధ్యానాం ద్వికలో భవేత్,**
**తథా చైకకలః పాదో నీచానాం సంప్రకీర్తితః. 11**

**తా.** నాలుగు కలల కాలం, రెండు కలలు, ఒక కల చెప్పబడ్డాయి. ఉత్తముల పాదన్యాసానికి నాలుగుకలలు, మధ్యములకు రెండు కలలు, నీచులకు ఒక కల చెప్పబడింది.

**మూ. స్థితం మధ్యం ద్రుతం చైవ సమవేక్ష్య లయత్రయమ్,**
**యథాప్రకృతి నాట్యజ్ఞో గతిమేవం ప్రయోజయేత్. 12**

**తా.** స్థితం (విలంబితం), మధ్యం, ద్రుతం అను మూడు విధాలైన లయల ప్రకారం, పాదన్యాసం జరగాలి. ఏ సమయంలో ఏ లయప్రకారం జరగాలో నాట్యజ్ఞులు తెలిసికొని ఆ విధంగా ప్రయోగించాలి.

**మూ. ధైర్యోపపన్నా గతిరుత్తమానాం మధ్యా గతిర్మధ్యమసంమతానామ్,**
**ద్రుతా గతిశ్చ ప్రచురాధమానాం లయత్రయం సత్త్వవశేన యోజ్యమ్. 13**

**తా.** ఉత్తముల గతి ధైర్యంతో నిండి (హుందాతనంతో) ఉంటుంది. మధ్యముల గతి మధ్యమంగా ఉంటుంది. అధముల గతి ద్రుతంగా ఉంటుంది. అందుచేత వాళ్ల వాళ్ల స్వభావాలను పట్టి మూడు విధాల లయలు అనుసరించాలి.

**మూ. ఏష ఏవ తు విజ్ఞేయః కలాతాలలయే విధిః,**
**పునర్గతిప్రచారస్య ప్రయోగం శృణుతానఘాః. 14**

**తా.** సద్గుణవంతులైన మునులారా! కలా – తాల – లయల ప్రయోగం ఈ విధంగానే ఉంటుంది అని తెలిసికొనండి. ఇపుడు గతిప్రచారప్రయోగాన్ని చెపుతాను; వినండి.

**మూ. స్వభావాత్తూత్తమగతౌ కార్యం జాను కటీసమమ్,**
**యుద్ధచారీప్రయోగేషు జాను స్తనసమం న్యసేత్. 15**

**తా.** ఉత్తముల స్వాభావికమైన గతిలో మోకాలు కటిప్రదేశంతో సమంగాఉండాలి. యుద్ధచారీల ప్రయోగాలలో మోకాలు స్తనంతో సమంగా ఉండాలి.

**మూ. పార్శ్వక్రాన్తైః సలలితైః పాదైర్వాద్యాన్వితైరథ,**
**రఙ్గకోణోన్ముఖం గచ్ఛేత్ సమ్యక్పఞ్చ పదాని చ. 16**

**తా.** వాద్యానికి అనుగుణంగా పార్శ్వక్రాంత – లలితచారీలతో పాదన్యాసం చేస్తూ రంగస్థలంమీద పూర్వోత్తరదిక్కు వైపు సరిగా ఐదు అడుగులు వేస్తూ వెళ్లాలి.

**మూ. వామవేధం తతః కుర్యాత్ విక్షేపం దక్షిణేన తు,**
**పరివృత్య ద్వితీయం తు గచ్ఛేత్ కోణం తతః పరమ్. 17**

**తా.** ఎడమ మణవపై సూచీవేధం చేసి కుడి పాదంతో విక్షేపం చెయ్యాలి. అక్కడ వెనుకకు తిరిగి ఉత్తరపశ్చిమకోణం దగ్గరికి వెళ్లాలి.

**మూ. తత్రాపి వామవేధస్తు విక్షేపో దక్షిణేన చ,**
**తతో భాణ్డోన్ముఖో గచ్ఛేత్ తాన్యేవ తు పదాని చ. 18**

**తా.** అక్కడ కూడ వామవేధం చేసి తరువాత దక్షిణపాదవిక్షేపం చెయ్యాలి. అక్కడినుండి అన్ని (ఐదు) అడుగులే వేస్తూ భాండం వైపు వెళ్లాలి.

**మూ. ఏవం గతాగతైః కృత్వా పదానామిహ వింశతిమ్,**
**వామవేధం తతః కుర్యాత్ విక్షేపం దక్షిణస్య చ. 19**

**తా.** ఈ విధంగా రాకపోకలలో ఇరవై అడుగులు వేసి, వామవేధమూ, దక్షిణ విక్షేపము చెయ్యాలి.

**మూ. రఙ్గే వికృష్టే భరతేన కార్యో గతాగతైః పాదగతిప్రచారః,**
**త్ర్యశ్రస్త్రికోణే చతురస్రరఙ్గే గతిప్రసారశ్చతురస్ర ఏవ. 20**

**తా.** నటుడు వికృష్టరంగమునందు, పాదగతిప్రచారం రాకపోకలచేత ఈ విధంగా చెయ్యాలి. త్రికోణరంగమునందు త్ర్యశ్రగతిప్రచారము, చతురస్రరంగంలో చతురస్రరంగ ప్రచారము చెయ్యాలి.

**మూ. యః సమైః సంహితో గచ్ఛేత్తత్ర కార్యో లయాశ్రయః,**
**చతుష్కలోఽథ ద్వికలస్తథైవైకకలః పునః. 21**

**తా.** ఒక పాత్ర సములతో కలిసి వెళ్లే టప్పుడు లయను అనుసరించాలి. నాలుగు కలలుగాని, రెండు కలలు గాని ఒక కల గాని ఉండాలి.

**మూ. అథ మధ్యమనీచైస్తు గచ్ఛేద్యః పరివారితః,**
**చతుష్కలమథార్ధం చ తథా చైకకలం పునః. 22**

**తా.** మధ్యమనీచులతో కలిసి వెళ్లేవాడు నాలుగు కలలు, లేదా రెండు కలలు, లేదా ఒక కల గల లయను అనుసరించాలి.

**మూ. దైత్యదానవయక్షాణాం నృపపన్నగరక్షసామ్,**
**చతుస్తాలప్రమాణేన కర్తవ్యాథ గతిర్బుధైః. 23**

**తా.** బుధులు, దైత్య – దానవ – యక్ష – నృప – పన్నగ – రాక్షసుల గతి నాలుగు తాలాల ప్రమాణంలో జరిగే టట్లు చూడాలి.

**మూ. దివౌకసాం తు సర్వేషాం మధ్యమా గతిరిష్యతే,**
**తత్రాపి చోద్ధతా యే తు తేషాం దేవైః సమా గతిః. 24**

**తా.** సమస్తస్వర్గవాసులు (దేవదూతాదులు) మధ్యమగతి చెయ్యాలి. వాళ్లలో కూడ ఉద్ధతులైన వాళ్ల (మాతలి మొదలైనవాళ్ల) గతి దేవతల గతితో సమంగా ఉండాలి.

**మూ. ఋషయ ఊచుః –**
**యదా మనుష్యా రాజానః తేషాం దేవగతిః కథమ్,**
**అత్రోచ్యతే కథం వైషా గతీ రాజ్ఞాం భవిష్యతి. 25**

**తా.** ఋషు లిలా ప్రశ్నించారు – "రాజులు మానవులు కదా! వాళ్లకు దేవతల గతి ఎలా చెప్పబడింది?" "ఈ విషయంలో – రాజులకు దేవగతి ఎలా చెప్పబడిందో చెపుతాను.

**మూ. ఇహ ప్రకృతయో దివ్యా దివ్యమానుష్య ఏవ చ,**
**మానుష్య ఇతి విజ్ఞేయా నాట్యనృత్తక్రియాం ప్రతి. 26**

**తా.** నాట్య – నృత్తక్రియలకు సంబంధించి ప్రకృతులు – దివ్యము లని, దివ్య మానుషము లని, మానుషము లని మూడు విధములుగా ఉంటాయి అని తెలుసుకోవాలి.

**మూ. దేవానాం ప్రకృతిర్దివ్యా రాజ్ఞాం వై దివ్యమానుషీ,**
**యా త్వన్యా లోకవిదితా మానుషీ సా ప్రకీర్తితా. 27**

**తా.** దేవతల ప్రకృతి దివ్యప్రకృతి; రాజులది దివ్యమానుషప్రకృతి; లోకప్రసిద్ధమైన ఏ మరొక ప్రకృతి ఉన్నదో అది మానుషప్రకృతి.

**మూ. దేవాంశజాస్తు రాజానో వేదాధ్యాత్మసు కీర్తితాః,**
**ఏవం దేవానుకరణే దోషో హ్యత్ర న విద్యతే. 28**

**తా.** రాజులు దేవతల అంశలతో పుడతా రని వేదాలలోను అధ్యాత్మవిద్యలలోను చెప్పబడింది. అందుచేత దేవతలను అనుకరించడంలో దోషం ఏమీ లేదు.

**మూ. అయం విధిస్తు కర్తవ్యః స్వచ్ఛన్దగమనం ప్రతి,**
**సంభ్రమోత్పాతరోగేషు ప్రమాణం న విధీయతే. 29**

**తా.** మనుష్యులు తాము తమ అధీనంలో ఉన్నప్పుడు చేసే గమనాల విషయంలో ఈ నియమాలు పాటించాలి. తొందర, ఉపద్రవాలు, రోగాలు మొదలైన సమయాలలో ఇలాంటి నియమా లేవీ పాటించవలసిన పని లేదు.

**మూ. సర్వాసాం ప్రకృతీనాం తు అవస్థాన్తరసంశ్రయా,**
**ఉత్తమాధమమధ్యానాం గతిః కార్యా ప్రయోక్తృభిః. 30**

**తా.** ఎవరు ఏ ప్రకృతికి చెందినా కూడ, అందరికీ అవస్థాభేదాలను పట్టి ఉత్తమ – అధమ – మధ్యములకు చెప్పిన గతులను ప్రయోక్తలు ప్రయోగించాలి.

**మూ. చతురర్ధకలం వా స్యాత్ తదర్ధకలమేవ చ,**
**అవస్థాన్తరమాసాద్య కుర్యాద్గతివిచేష్టితమ్. 31**

**తా.** అవస్థాభేదాన్ని పట్టి నాలుగు లేక రెండు లేక ఒకటి కలల గతిని చెయ్యాలి.

**మూ. జ్యేష్ఠే చతుష్కలం హ్యత్ర మధ్యమే ద్వికలం భవేత్,**
**ద్వికలా చోత్తమే యత్ర మధ్యే త్వేకకలా భవేత్. 32**

**తా.** ఉత్తముడు చతుష్కలగతిని, మధ్యముడు ద్వికలగతిని చెయ్యాలి. (అవస్థాభేదం చేత) ఉత్తముడు ద్వికలగతి చేసినప్పుడు మధ్యముడు ఏకకలగతి చెయ్యాలి.

**మూ. కలికం మధ్యమే యత్ర నీచేష్వర్ధకలం భవేత్,**
**ఏవమర్ధార్ధహీనం తు కలానాం సంప్రయోజయేత్. 33**

**తా.** మధ్యముడు ఏకకలగతి చేసేటప్పుడు నీచుడు అర్ధకలగతి చెయ్యాలి. ఈ విధంగా అవస్థానుసారం మూడు విధాల పురుషుల గతులలో కలలు సగం సగం తగ్గించాలి.

**మూ. జ్వరార్తే చ క్షుధార్తే చ తపఃశ్రాన్తే భయాన్వితే,**
**విస్మితే చావహిత్థే చ తథౌత్సుక్యసమన్వితే. 34**
**శృఙ్గారే చైవ శోకే చ స్వచ్ఛన్దగమనే తథా,**
**గతిః స్థితలయా కార్యాధికలాన్తరపాతితా. 35**

**తా.** జ్వరపీడితుడు, ఆకలితో బాధపడుతూన్నవాడు, తపస్సుచేత అలసినవాడు, భయంతో ఉన్నవాడు, ఆశ్చర్యపడుతూన్నవాడు, లేని ధైర్యం నటిస్తూన్నవాడు (అవహిత్థే), ఔత్సుక్యంతో ఉన్నవాడు – వీళ్ల గతి, శృంగారంలోను (విప్రలంభశృంగారంలోను), శోకంలోను, స్వేచ్ఛగా నడిచేటప్పుడు గతీ కూడ విలంబితలయతో, అధికమైన కలలతో గతి చెయ్యాలి.

**మూ. పునశ్చిన్తాన్వితే చైవ గతిః కార్యా చతుష్కలా,**
**అస్వస్థకామితే చైవ భయే విత్రాసితే తథా. 36**
**ఆవేగే చైవ హర్షే చ కార్యే యచ్చ త్వరాన్వితమ్,**
**అనిష్టశ్రవణే చైవ క్షేపే చాద్భుతదర్శనే. 37**
**అపి చాత్యయికే కార్యే దుఃఖితే శత్రుమార్గణే,**
**అపరాధానుసరణే శ్వాపదానుగతౌ తథా. 38**
**ఏతేష్వేషాం గతిం ప్రాజ్ఞః వికలాం సంప్రయోజయేత్.**

**తా.** చింతలో ఉన్నవాడు నాలుగు కలల గతి చెయ్యాలి. అస్వస్థుడైన కాముకుడు, భయపడుతున్నవాడు, భయపెట్టబడినవాడు, కంగారుపడుతున్నవాడు, సంతోషంలో ఉన్నవాడు, తొందరపనిలో ఉన్నవాడు, అనిష్టవార్త విన్నవాడు, ఎవరిచేతనైనా నిందింప

బడినవాడు, అద్భుతమైన విషయం చూసినవాడు, తప్పనిసరిగా చేయవలసిన పనిలో ఉన్నవాడు, శత్రువును వెదుకుతూన్నవాడు, అపరాధం చేసినవానిని తరుముతున్నవాడు, క్రూరమృగం వెనుక పరుగెత్తుతున్నవాడు – వీరందరి విషయంలోను వికలమైన, ఇన్ని కలలు అను నియమం లేని గతిని ప్రయోగించాలి.

**మూ. ఉత్తమానాం గతిర్యా తు న తాం మధ్యేషు యోజయేత్. 39**
**యా గతిర్మధ్యమానాం తు న తాం నీచేషు యోజయేత్.**

**తా.** ఉత్తమపాత్రల గతిని మధ్యమపాత్రలకీ, మధ్యమపాత్రల గతిని అధమపాత్రలకీ వినియోగించకూడదు.

**మూ. గతిః శృఙ్గారిణీ కార్యా స్వస్థకామితసంభవా. 40**
**దూతీదర్శితమార్గస్తు ప్రవిశేద్రఙ్గమణ్డలమ్,**
**సూచయా చాప్యభినయం కుర్యాదర్థసమాశ్రయమ్. 41**

**తా. శృంగారగతి :–** ఇంతవరకు ప్రకృతిభేదాన్ని పట్టి అనుసరించవలసిన గతి భేదాలను చెప్పి, ఇప్పుడు రసభేదాలను బట్టి గతిభేదాలు చెపుతున్నాడు – శృంగార రసానికి సంబంధించిన (నాయకుని) గతి స్వస్థుడైన కాముకునకు ఏది సంభావ్యమో అలాంటిది చెయ్యాలి. అర్థానికి (కథాంశానికి) సంబంధించిన అభినయం 'సూచ'చేత చేస్తూ నాయకుడు దూతి మార్గం చూపుతూండగా రంగమండలంమీద ప్రవేశించాలి.

**మూ. హృద్యైర్గన్ధైస్తథా వస్త్రైరలఙ్కారైశ్చ భూషితః,**
**నానాపుష్పసుగన్ధాభిర్మాలాభిః సమలంకృతః. 42**

**తా.** మనోహరము లైన సుగంధాలచేత, వస్త్రాలచేత, అలంకారాలచేత అలంకరింప బడినవాడై, అనేకవిధాలైన పుష్పాలతో పరమళిస్తూన్న పుష్పమాలలు ధరించి ప్రవేశించాలి.

**మూ. గచ్ఛేత్ సలలితైః పాదైరతిక్రాన్తస్థితైః స్తథా,**
**తథా సౌష్ఠవసంయుక్తైర్లయతాలవశానుగైః. 43**

**తా.** అతిక్రాంతచారిలో ఉన్న, సౌష్ఠవంతో విలంబితాదిలయలను, చతురశ్రాది తాలాలను అనుసరించిన విలాసపూర్వకమైన పాదన్యాసాలతో నడుస్తూ ప్రవేశించాలి.

**మూ. పాదయోరనుగౌ హస్తౌ నిత్యం కార్యౌ ప్రయోక్తృభిః,**
**ఉత్క్షిప్య హస్తం పాదేన పాదయోశ్చ విపర్యయాత్. 44**

**తా.** ప్రయోక్తలు ఎల్లప్పుడూ పాదాలను అనుసరించి హస్తాలు కదల్చుతూండాలి. పాదం నేలమీద ఆన్చినప్పుడు హస్తం ఎత్తాలి, పాదం ఎత్తినప్పుడు హస్తం దింపాలి.

**మూ. ప్రచ్ఛన్నకామితే చైవ గతిం భూయో నిబోధత,**
**విసర్జితజనస్త్రస్తః తథా దూతీసహాయవాన్. 45**

**నిర్వాణదీపో నాత్యర్థం భూషణైశ్చ విభూషితః,**
**వేలాసదృశవస్త్రశ్చ సహ దూత్యా శనైస్తథా. 46**

**వ్రజేత్ ప్రచ్ఛన్నకామస్తు పాదైర్నిశ్శబ్దమన్థరైః,**
**శబ్దశఙ్క్యౌత్సుకశ్చ స్యాదవలోకనతత్పరః. 47**

**వేపమానశరీరశ్చ శఙ్కితః ప్రస్ఖలన్ ముహుః.**

**తా.** రహస్యప్రేమకలాపాలలో ఎలాంటి గతి అనుసరించాలో తెలుసుకొండి. ప్రచ్ఛనకాముకుడైన నాయకుడు కేవలం దూతికను మాత్రం వెంట బెట్టుకొని మిగిలిన పరిజను లందరినీ పంపివేయాలి. జంకుతూ, దీపం ఆరిపివేసి, అలంకారాలు చాల తక్కువగా ధరించి, సమయానికి తగిన వస్త్రాలు ధరించి దూతికతో కూడ, నిఃశబ్దంగా మందంగా అడుగులు వేసుకొంటూ వెళ్లాలి. అలికి డైతే శంకిస్తూ, ఔత్సుక్యంతో ఇటూ అటూ చూస్తూ, వణుకుతూన్న శరీరంతో, శంకిస్తూన్న మనస్సుతో మాటి మాటికీ తొట్రుపడుతూ నడవాలి.

**మూ. రసే రౌద్రే తు వక్ష్యామి దైత్యరక్షోగణాన్ ప్రతి. 48**

**ఏక ఏవ రసస్తేషాం స్థాయీ రౌద్రో ద్విజోత్తమాః,**
**నేపథ్యరౌద్రో విజ్ఞేయః స్త్వఙ్గరౌద్రస్తథైవ చ. 49**

**తథా స్వభావజశ్చైవ త్రిధా రౌద్రః ప్రకల్పితః.**

**తా. రౌద్రగతి :–** రౌద్రరసంలో దైత్యారాక్షసగణాల విషయం చెపుతాను. ద్విజోత్తము లారా! వీళ్లతో స్థిరంగా సంబంధించి ఉండేది రౌద్రం ఒక్కటే.

నేపథ్య (వేష) రౌద్రం, శరీరరౌద్రం, స్వాభావికమైన రౌద్రం అని రౌద్రం మూడు విధాలు.

**మూ. రుధిరక్లిన్నదేహో యో రుధిరార్ద్రముఖస్తథా. 50**

**తథా పిశితహస్తశ్చ రౌద్రో నేపథ్యజస్తు సః.**

**తా.** దేహమూ ముఖమూ కూడ రక్తంతో తడిసి ఉంటుంది. చేతిలో పచ్చిమాంసం ముద్ద ఉంటుంది. అది నేపథ్యానికి (వేషానికి) సంబంధించిన రౌద్రం.

**మూ. బహుబాహుర్బహుముఖో నానాప్రహరణాకులః. 51**

**స్థూలకాయస్తథా ప్రాంశుః అఙ్గరౌద్రః ప్రకీర్తితః.**

**తా.** చాలా చేతులతో, అనేకముఖాలతో అనేకవిధాలైన ఆయుధాలు ధరించి, లావుగా చాల పొడవుగా ఉన్నవాడు అఙ్గరౌద్రం కలవాడు.

**మూ. రక్తాక్షః పిఙ్గకేశశ్చ అసితో వికృతస్వరః. 52**
**రూక్షో నిర్భర్త్సనపరః రౌద్రః సోఽయం స్వభావజః.**

**తా.** ఎఱ్ఱని కళ్లు, తోపురంగు జుట్టు, నల్లని శరీరం, వికృతమైన కంఠస్వరం; క్రూరంగా ఉంటూ జళిపిస్తూంటాడు. ఇది స్వభావజరౌద్రం.

**మూ. చతుస్తాలాన్తరోత్క్షిప్తైః పాదైస్త్వన్తరపాతితైః. 53**
**గతిరేవం విధాతవ్యా తేషాం యే చాపి తద్విధాః.**

**తా.** ఈ విధంగా త్రివిధరౌద్రం కలవాళ్లు నాలుగు తాలాల ఎత్తు పాదాలు విసురుతూ, పెద్ద పెద్ద అంగలతో నడుస్తూన్నట్లుగా చూపించాలి.

**మూ. అహృద్యా తు మహీ యత్ర శ్మశానరణకశ్మలా. 54**
**గతిం తత్ర ప్రయుఞ్జీత బీభత్సాభినయం ప్రతి.**

**తా. బీభత్సగతి :-** ఏవగింపు కలిగించే శ్మశానప్రదేశంలోను, రణభూమియందు బీభత్సాభినయానికి సంబంధించిన గతి ప్రయోగించాలి.

**మూ. క్వచిదాసన్నపతితైః వికృష్టపతితైః క్వచిత్. 55**
**ఏడకాక్రీడితైః పాదైరుపర్యుపరి పాతితైః,**
**తేషామేవానుగైర్హస్తైర్బీభత్సే గతిరిష్యతే. 56**

**తా.** ఒకచోట దగ్గర దగ్గరగా అడుగులు వేస్తూ, కొన్ని చోట్ల దూరంగా వేస్తూ ఏడకాక్రీడితచారిలో అడుగులు ఒకదానిమీద ఒకటి వేస్తూ, పాదన్యాసానికి అనుగుణంగా హస్తాలు కదుపుతూ భీభత్సంలో గతి చెయ్యాలి.

**మూ. అథ వీరే చ కర్తవ్యా పాదవిక్షేపసంయుతా,**
**ద్రుతప్రచారాధిష్ఠానా నానాచారీసమాకులా. 57**
**పార్శ్వక్రాన్తైర్ద్రుతావిద్ధైః సూచీవిద్ధైస్తథైవ చ,**
**కలాకాలగతైః పాదైరావేగే యోజయేద్గతిమ్. 58**

**తా. వీరరసగతి :-** వీరరసంలో గతి ఈ విధంగా చెయ్యాలి – పాదవిక్షేపం చేస్తూ ద్రుతసంచారంతో అనేకవిధా లైన చారీల ప్రయోగం చెయ్యాలి. పార్శ్వక్రాంతము, ద్రుతములు, అవిద్ధములు సూచీవిద్ధములు అయిన, (అనగా పార్శ్వక్రాంతాది చారులలో ఉన్న) పాదాలతో కలాకాలాలను అనుసరిస్తూ ఆవేగసూచక మైన గతిని ప్రయోగించాలి.

**మూ. ఉత్తమానామయం ప్రాయః ప్రోక్తో గతిపరిక్రమః,**
**మధ్యానామధమానాం చ గతిం వక్ష్యామ్యహం పునః. 59**

**తా.** సాధారణంగా ఉత్తములు అనుసరించే ఈ గతిపరిక్రమం మీకు చెప్పాను. ఇప్పుడు (హాస్యంలో) మధ్యముల గతి, అధముల గతి ఎలా ఉంటుందో చెపుతాను.

**మూ. విస్మయే చైవ హర్షే చ విక్షిప్తపదవిక్రమాన్,**
**ఆసాద్య తు రసం హాస్యమేతచ్చాన్యచ్చ యోజయేత్. 60**

**తా. హాస్యగతి :–** విస్మయంలోను, హర్షంలోను విక్షిప్తములైన పాదన్యాసాలు చేస్తూ హాస్యరసానికి సంబంధించిన గతి చెయ్యాలి. దీనిలో ఇతరాంశాలను యథా సంభవంగా చేర్చాలి.

**మూ. పునశ్చ కరుణే కార్యా గతిః స్థిరపదైరథ,**
**బాష్పామ్బురుద్ధనయనః సన్నగాత్రస్తథైవ చ. 61**
**ఉత్క్షిప్తపతితకరస్తథా సస్వనరోదనః,**
**గచ్ఛేత్తథాధ్యధికయా ప్రత్యగ్రాప్రియసంశ్రయే(వే). 62**

**తా. కరుణరసగతి :–** కరుణరసంలో గమనం విలంబితపదాలతో (చాల మెల్లిగా) చెయ్యాలి. నేత్రాలు కన్నీళ్లతో నిండి ఉంటాయి. శరీరం దుర్బలం అయిపోతుంది. చేతులు ఎత్తి క్రిందికి పడవేస్తూంటాడు. పైకి ధ్వని వినబడే టట్లు రోదనం చేస్తాడు. ఈ విధంగా – క్రొత్తగా అప్రియాన్ని విన్నప్పుడు అర్ధతాలం కంటె కొంచెం దూరంగా అడుగులు వేస్తూ నడవాలి.

**మూ. ఏషా స్త్రీణాం ప్రయోక్తవ్యా నీచసత్త్వే తథైవ చ,**
**ఉత్తమానాం తు కర్తవ్యా సధైర్యా బాష్పసంగతా. 63**
**నిఃశ్వాసైరాయతోత్సృష్టైస్తథైవోర్ధ్వనిరీక్షితైః,**
**న తత్ర సౌష్ఠవం కార్యం న ప్రమాణం తథావిధమ్. 64**

**తా.** పైన చెప్పిన గతి స్త్రీలు, నీచమైన సత్త్వం (మానసికస్థైర్యం) కలవాళ్లూ ప్రయోగించాలి. ఉత్తము లైతే ధైర్యపూర్వక మైనది, బాష్పాలతో కూడినదీ అయిన గతి ప్రయోగించాలి. దీర్ఘంగా నిఃశ్వాసాలు విడుస్తూ, (దైవాన్ని నిందిస్తూన్నట్లు) పైకి చూస్తూ వాళ్లు ఈ గతి ప్రయోగించాలి. ఈ గతిలో సౌష్ఠవం చూపకూడదు; నాలుగు కలల కాలం మొదలైన ప్రమాణం కూడ పాటించకూడదు.

**మూ. మధ్యానామపి సత్త్వజ్ఞా గతిర్యోజ్యా విధానతః,**
**ఉరఃపాతహతోత్సాహః శోకవ్యాకులచేతనః. 65**
**నాత్యుత్క్షిప్తైః పదైర్గచ్ఛేత్ ఇష్టబన్ధునిపాతనే.**

**తా.** మధ్యములకు కూడ వారి మానసికస్థిరత్వానికి అనుగుణ మైన గతిని యథాశాస్త్రంగా ప్రయోగించాలి. మధ్యముడు ఇష్టబంధువు మరణించినప్పుడు వక్షఃస్థలం లోనికి క్రుంగిపోగా ఉత్సాహవిహీనుడై, శోకంతో వ్యాకుల మైన మనస్సుతో, పాదాలు ఎక్కువగా పైకి ఎత్తి విసరకుండా నడవాలి.

**మూ. గాఢప్రహారే కార్యా చ శిథిలాఙ్గభుజాశ్రయా. 66**
**విఘూర్ణితశరీరా చ గతిశ్చూర్ణపదైరథ.**

**తా.** గాఢమైన దెబ్బ తగిలి నప్పుడు శరీరం అంతా తిరిగిపోతూండగా, భుజాలు, ఇతరావయవాలు శిథిలము లైపోగా, చిన్న చిన్న అడుగులతో గతి చెయ్యాలి.

**మూ. శీతేన చాభిభూతస్య వర్షేణాభిద్రుతస్య చ. 67**
**గతిః ప్రయోక్తృభిః కార్యా స్త్రీనీచప్రకృతావథ.**

**తా. శీతవర్షాలతో బాధపడుతూన్నవాళ్ల గతి :–** ఎక్కువచలితో బాధపడుతూన్న వానికీ, వర్షంలో పూర్తిగా తడిసిపోయినవానికీ, నాట్యప్రయోక్తలు ఈ విధమైన గతి ప్రయోగించాలి – స్త్రీలు; నీచప్రకృతులూ కూడ ఈ విధంగా ప్రవర్తించాలి.

**మూ. పిణ్డీకృత్య తు గాత్రాణి తేషాం చైవ ప్రకమ్పనమ్. 68**
**కరౌ వక్షసి నిక్షిప్య కుబ్జీభూతస్తథైవ చ,**
**దన్తోష్ఠస్ఫురణం చైవ చిబుకస్య ప్రకమ్పనమ్. 69**
**కార్యం శనైశ్చ కర్తవ్యం శీతాభినయనే గతౌ.**

**తా.** అవయవా లన్నీ వణికిపోతూండగా వాటి నన్నింటినీ ముద్దలాగా ముణిచిపెట్టు కోవాలి. చేతులు రెండూ వక్షస్థలంమీద ఉంచి ముందుకు వంగాలి. దంతాలూ, పెదవులూ కదిలిపోతూండగా గడ్డం కదిలిపోతూండాలి. శీతాభినయంలో చేయవలసిన గతి ఈ విధంగా ఉండాలి.

**మూ. తథా భయానకే చైవ గతిః కార్యా విచక్షణైః. 70**
**స్త్రీణాం కాపురుషాణాం చ యే చాన్యే సత్త్వవర్జితాః,**
**విస్ఫారితే చలే నేత్రే విధుతం చ శిరస్తథా. 71**
**భయసంయుక్తయా దృష్ట్యా పార్శ్వయోశ్చ విలోకనైః,**
**ద్రుతైశ్చూర్ణపదైశ్చైవ బద్ధ్వా హస్తం కపోతకమ్. 72**
**ప్రేరేపితశరీరశ్చ శుష్కోష్ఠః స్ఖలితం వ్రజేత్,**
**ఏషానుకరణే కార్యా తర్జనే త్రాసనే తథా. 73**

**తా. భయానకంలో గతి :–** నాట్యవిచక్షణులు భయానకంలో కూడ స్త్రీలకు, నీచ పురుషులకు, ధైర్యరహితులైన ఇతరులకు కూడ గతిని ఈ విధంగా ప్రయోగించాలి – కళ్లు పెద్దవి చేయబడి కదిలిపోతూంటాయి. తల ఊపుతూంటారు. భయంతో నిండిన చూపులతో ప్రక్కలకు చూస్తూ ఉంటారు. తొందరగా చిన్న చిన్న అడుగులు వేసుకొంటూ, కపోతకహస్తం బంధించి (కపోతకముద్రతో) పరుగెడతారు. శరీరం వణికిపోతూంటుంది. పెదవులు ఎండిపోయి కాళ్లు తొట్రుపడుతూంటాయి. భయపడినప్పుడు గాని, ఇతరులు జడిపించినప్పుడు గాని అనుకరించడంలో ఇలా చెయ్యాలి.

**మూ. సత్త్వం చ వికృతం దృష్ట్వా శ్రుత్వా చ వికృతం స్వరమ్,**
**ఏషా స్త్రీణాం ప్రకర్తవ్యా నృణాం చాక్షిప్తవిక్రమా. 74**
**క్వచిదాసన్నపతితైర్వికృష్టపతితైః క్వచిత్,**
**ఏడకాక్రీడితైః పాదైరుపర్యుపరిపాతితైః. 75**
**ఏషామేవానుగైర్హస్తైర్గతిం భీతేషు యోజయేత్.**

**తా.** వికృతమైన ఆకారం గల మృగాన్ని చూచినప్పుడు గాని, వికృతమైన స్వరం విన్నప్పుడు గాని స్త్రీలకు పురుషులకు కూడ కాళ్లు ముందుకు కదలని ఈ విధమైన గతి ప్రయోగించాలి. పాదాలు (కాళ్లు) ఒకచోట క్రిందికి పడిపోయినట్లే అయిపోతుంది. మరొకచోట దూరంగా చాపినట్లయి పడిపోవడం కూడ జరుగుతుంది. ఏడకాక్రీడితచారిలో పాదంతో పాదం కొట్టుకొంటూ ఉంటాయి. పాదాల కదలికతో అనుగుణంగానే హస్తాల కదలిక కూడ ఉండే టట్లు చూచుకొంటూ భీతుల గతిని అభినయించాలి.

**మూ. వణిజాం సచివానాం చ గతిః కార్యా స్వభావజా. 76**
**కృత్వా నాభితటే హస్తముత్తానఖటకాముఖమ్,**
**ఆద్యం చారాలముత్తానం కుర్యాత్పార్శ్వే స్తనాన్తరే. 77**
**న నిషణ్ణం న చ స్తబ్ధం న చాపి పరివాహితమ్,**
**కృత్వా గాత్రం తథా గచ్ఛేత్తేన చైవ క్రమేణ తు. 78**

**తా.** ఈ శ్లోకార్థం మొదలు 84 వ శ్లోకం వరకు **శాంతగతి** చెప్పబడినది అని అభినవగుప్తాచార్యులు ప్రతిపాదించారు. వర్తకులు కూడ ఆధ్యాత్మికదృష్టిప్రధాను లైన యతి – బ్రాహ్మణ శ్రమణాదులవలె ప్రశాంతచిత్తులై ఉంటారు అని అంటూ – **"ధీర ప్రశాన్తాః వణిజః"** అను వాక్యం ఉదాహరించారు. మహామేధాశాలు లైతే కాని అమాత్యులు కాజాలరనీ, అందుచేత వారి ప్రవృత్తి కూడ అలాగే ఉంటుందని అని ఆయన అభిప్రాయం.

వర్తకుల గతి, అమాత్యుల గతి స్వాభావికంగా ఉండే టట్లు ప్రదర్శించాలి. ఎడమ చెయ్యి 'ఖడకాముఖం'లో ఉత్తానంగా వెల్లగితలా పైకి తెరిచి ఉండే టట్లు నాభిప్రదేశంలో

ఉంచాలి. కుడి చెయ్యి అలాతంలో ఉత్తానంగా చేసి స్తనాల మధ్య (వక్షఃస్తలంమీద) లేదా పార్శ్వభాగంలో ఉంచాలి. శరీరం కుంగిపోయినట్లు కాకుండా, బిగిసిపోయినట్లు కాకుండా, ఏదో బరువును ఈడ్చు కొంటూ పోతూన్నట్లు కాకుండా ఉంచుకొని ఒకే విధమైన పాదవిన్యాసంతో నడవాలి.

**మూ. అతిక్రాన్తపదైర్విప్రా ద్వితాలాన్తరగామిభిః,**
**యతీనాం శ్రమణానాం చ యే చాన్యే తపసి స్థితాః. 79**
**తేషాం కార్యా గతిర్యే తు నైష్ఠికం వ్రతమాశ్రితాః.**

**తా.** బ్రాహ్మణులు అతిక్రాంతచారీపాదాలతో రెండు తాలాల దూరంలో అడుగులు వేస్తూ నడవాలి. యతులు, శ్రమణులు, తపస్సులో ఉన్నవాళ్లు, నైష్ఠికవ్రతం అవలంబించిన వాళ్లు, అనగా జన్మాంతంవరకు బ్రహ్మచర్యాశ్రమంలోనే ఉండే ఆజన్మబ్రహ్మచారులు – వీళ్ల గతి ఈ విధంగా ఉండాలి.

**మూ. అలోలచక్షుశ్చ భవేద్యుగమాత్రనిరీక్షణః. 80**
**ఉపస్థితస్మృతిశ్చైవ గాత్రం సర్వం విధాయ చ,**
**అచఞ్చలమనాశ్చైవ యథావల్లిఙ్గమాశ్రితః. 81**
**వినీతవేషశ్చ భవేత్ కషాయవసనస్తథా,**
**ప్రథమం సమపాదేన స్థిత్వా స్థానేన వై బుధః. 82**
**హస్తం చ చతురం కృత్వా తథా చైకం ప్రసారయేత్,**
**ప్రసన్నం వదనం కృత్వా ప్రయోగస్య వశానుగః. 83**
**అవిషణ్ణేన గాత్రేణ గతిం గచ్ఛేద్ వ్యతిక్రమాత్,**
**ఉత్తమానాం భవేదేషా లిఙ్గినాం యే మహావ్రతాః. 84**

**తా.** యతిశ్రమణాదుల చూపు చంచలంగా, చపలంగా ఉండకూడదు. వాళ్లు ఒక బండి కాడి (రెండు గజాల) దూరం మాత్రమే ముందుకు చూడాలి. ఎల్లప్పుడు స్మృతికలవారై ఉండాలి, తామున్న పరిస్థితులు మరవకూడదు. లింగులు, శరీరం అంతా పొందికగా ఉంచుకోవాలి. మనస్సు చంచలంగా ఉండకూడదు. తాము ఏ నియమాలను పాటిస్తున్నారో దానికి తగిన లింగం – జపమాలా – భస్మ – కౌపీనాదికం, ధరించి ఉండాలి. నిరాడంబరవేషం ధరించాలి. కషాయవస్త్రాలు ధరించాలి. రంగస్థలంమీద ప్రవేశించిన వెంటనే ముందు సమపాదస్థానకంలో నిలబడి, ఒక హస్తం చతురం చేసి రెండవ హస్తం ముందుకు చాపాలి. ముఖం ప్రసన్నంగా ఉండాలి. ప్రయోగానికి అనుకూలంగా, కుదించుకొనిపోని శరీరంతో అవసరమైన మార్పులు చేస్తూ నడవాలి. ఇది మహావ్రతాన్ని పాటిస్తూన్న ఉత్తములైన లింగుల గతి.

**మూ. ఏభిరేవ విపర్యస్తై ర్గుణైరన్యేషు యోజయేత్,**
**తథా వ్రతానుగావస్థా హ్యన్యేషాం లిఙ్గినాం గతిః. 85**
**విభ్రాన్తా వాప్యుదాత్తా వా విభ్రాంతనిభృతాపి వా.**

**తా.** నియమా లేవీ పాటించకుండా వేషమాత్రంచేతనే యతుల వలె, నైష్ఠిక బ్రహ్మచారుల వలె ప్రవర్తించే కుహనాసంన్యాసులు మొదలైనవాళ్ల గతి, ప్రవర్తన దీనికి విరుద్ధంగా ఉన్నట్లు అభినయించాలి. ఆ యా వ్రతాలను పాటించే లింగుల (వ్రతచిహ్న ధారుల) గతి వాళ్లు అనుసరించే వ్రతాలకి అనుగుణంగా విభ్రాంతంగా గాని, ఉదాత్తంగా గాని, విభ్రాంతనిభృతంగా గాని ఉండాలి.

**మూ. శకటాస్యస్థితైః పాదైరతిక్రాన్తైస్తథైవ చ. 86**
**కార్యా పాశుపతానాం చ గతిరుద్ధతగామినీ.**

**తా.** పాశుపతుల (పాశుపతమతావలంబుల) గతి శకటాస్య – అతిక్రాంతచారీలలో ఉన్న పాదవిన్యాసాలతో ఉద్ధతంగా (తీవ్రంగా, అమ్మవారు పూనినట్ల భినయించేవాళ్ల గతి వలె) ఉండాలి.

**మూ. అన్ధకారేఽథ యానే చ గతిః కార్యా ప్రయోక్తృభిః. 87**
**భూమౌ విసర్పితైః పాదైర్హస్తైర్మార్గప్రదర్శిభిః.**

**తా.** చీకటిలో అభియనించవలసిన గతి, వాహనంమీద గతి నాట్యప్రయోక్తలు ఈ విధంగా చెయ్యాలి. నేలమీద కాళ్లు ఈడుస్తూ, చేతులతో ముందూ పక్కలా తడుము కొంటూ చీకట్లో గతి అభినయించాలి.

**మూ. రథస్థస్యాపి కర్తవ్యా గతిశ్చూర్ణపదైరథ. 88**
**సమపాదం తథా స్థానం కృత్వా రథగతిం వ్రజేత్,**
**ధనుర్గృహీత్వా చైకేన తథా చైకేన కూబరమ్. 89**

**తా.** రథంమీద ఉన్నవాడు కూడ చిన్న చిన్న అడుగులతో గతి చెయ్యాలి. తరవాత సమపాదస్థితిలో నిలబడి, ఒక చేతితో ధనస్సు పట్టుకొని రెండవ చేతితో తాను నిలబడిన చోటనే, పక్కన రథంలో ఉన్న ఎత్తైన కఱ్ఱ దిమ్మను పట్టుకొని రథగతిని చెయ్యాలి.

**మూ. సూతశ్చాస్య భవేదేవం ప్రతోదప్రగ్రహాకులః,**
**వాహనాని విచిత్రాణి కర్తవ్యాని విభాగశః. 90**

**తా.** రథసారథి కూడ రథికుని వలెనే, కొరడా, కళ్లాలు పట్టుకొనడం అనే తన పనిలో ఆకులుడై ఉండాలి. విచిత్ర మైన వేరు వేరు వాహనాలు ఏర్పరచాలి.

**మూ. ద్రుతైశ్చూర్ణపదైశ్చైవ గన్తవ్యం రఙ్గమణ్డలే,**
**విమానస్థస్య కర్తవ్యా హ్యేషైవ స్యన్దినీ గతిః. 91**

**తా.** రంగమండలంలో నడిచేటప్పుడు చిన్న చిన్న అడుగులు వేసికొంటూ శీఘ్రంగా నడవాలి. విమానంలో ఉన్నవాడు కూడ ఇదే విధంగా మెల్లగా జారుతూన్నట్లు దాని గతిని చూపాలి.

**మూ. ఆరోఢుముద్వహేద్గాత్రం కించిత్ స్యాదున్ముఖస్థితమ్,**
**తస్యైవ వైపరీత్యేన కుర్యాచ్చాప్యవరోహణమ్. 92**

**తా.** శరీరం పైకి కొంచెం ఎత్తి ముఖం కూడ పైకెత్తి రథాదులు ఎక్కుతూన్నట్లు అభినయించాలి. దీనికి వ్యతిరేకంగా చేస్తూ వాహనుంచి దిగడాన్ని అభినయించాలి.

**మూ. అధోవలోకనైశ్చైవ మణ్డలావర్తనేన చ,**
**ఆకాశగమనే చైవ కర్తవ్యా నాట్యయోక్తృభిః. 93**

**తా.** ఆకాశప్రయాణం చేస్తూన్నట్లు అభినయించే టప్పుడు, నాట్యప్రయోక్తలు క్రిందికి మాటి మాటికీ చూస్తూ మండలాకారంగా తిరుగుతూండాలి.

**మూ. స్థానేన సమపాదేన తథా చూర్ణపదైరపి,**
**వ్యోమ్నశ్చావతరేద్యస్తు తస్యైతాం కారయేద్గతిమ్. 94**

**తా.** ఆకాశంనుండి క్రిందికి దిగేవాడు సమపాదస్థానంలో నిలబడి, తరువాత చిన్న చిన్న అడుగులు వేస్తూ; అభినయించే టట్లు చెయ్యాలి.

**మూ. ఋజ్వాయతోన్నతనతైః కుటిలావర్తితైరథ,**
**భ్రశ్యతశ్చ తథాకాశాదపవిద్ధభుజా గతిః. 95**
**వికీర్ణవసనా చైవ తథా భూగతలోచనా.**

**తా.** ఆకాశంనుంచి క్రిందికి పడిపోతున్నవాని గతి ఋజువుగాను, పొడవుగాను, ఎత్తుగాను క్రిందికి వంగిపోతూ, వంకరగాను, గుండ్రంగా తిరుగుతూ భుజాలు పైకెత్తి జరుగుతుంది. అంత దూరం ఆకాశంనుంచి నేలమీద పడేటప్పటికి శరీరం ఇన్ని భంగిమలలో తిరిగిపోడానికి అవకాశం ఉంది గాన ఇలాంటి భంగిమలు రంగస్థలంమీద చూపుతూ అభినయించాలి అని అర్థం. ఈ గతిలో వస్త్రాలు ఇటూ అటూ ఎగిరి పోతూంటాయి. దృష్టి, నేల వైపు ఉంటుంది.

**మూ. ప్రాసాదద్రుమశైలేషు నదీనిమ్నోన్నతేషు చ. 96**
**ఆరోహణావతరణం కార్యమర్థవశాద్బుధైః.**

**తా.** నాట్యనిపుణులు, అవసరాన్ని అనుసరించి మేడలమీదికి, చెట్లమీదికి, పర్వతాల

మీదికి ఎక్కినట్లు నదులలోనికి, గోతులలోనికి దిగినట్లు, మళ్లీ పైకి ఎక్కినట్లు గతులు చేయవలసి వస్తుంది.

**మూ. ప్రాసాదారోహణం కార్యమతిక్రాన్తైః పదైరథ. 97**
**ఉద్వాహ్య గాత్రం పాదం చ సోపానే నిక్షిపేన్నరః,**
**తత్రావతరణం చైవ గాత్రమానమ్య రేచయేత్. 98**

**తా.** ప్రాసాదారోహణం చేసేటప్పుడు అతిక్రాంతపదం వినియోగించాలి. శరీరం పైకి ఎత్తి పాదం మెట్టుమీద ఉంచాలి. ప్రాసాదంనుంచి దిగే టప్పుడు శరీరం వంచి రేచనం చెయ్యాలి.

**మూ. ప్రాసాదే యన్మయా ప్రోక్తః ప్రతారః(రే) కేవలో భవేత్,**
**కించిన్నతాగ్రకాయా తు ప్రతారే గతిరిష్యతే. 99**

**తా.** ప్రాసాదంనుండి దిగేటప్పుడు ఏది చేయవలె నని నేను చెప్పానో దానిని ఒకటి మాత్రమే ప్రతారంలో (నీటిలో దిగేటప్పుడు) ఉంటుంది. అదే మనగా – ప్రతారంలో శరీరం పైభాగం కొంచెం వంగిన గతి ఉంటుంది.

**మూ. జలప్రమాణాపేక్షా తు జలమధ్యే గతిర్భవేత్,**
**తోయేఽల్పే వసనోత్కర్షః, ప్రాజ్యే పాణివికర్షణైః. 100**

**తా.** జలమధ్యలో గతి జలప్రమాణాన్ని పట్టి ఉంటుంది. జలం తక్కువగా ఉంటే వస్త్రాలను తడవకుండా పైకి లాగికొంటూ గతి జరగాలి. జలం అధికంగా ఉంటే చేతులతో లాగడంద్వారా గతి ఉంటుంది. అనగా చేతులతో నీరు వెనక్కి నెట్టుకొంటూ, ఈదాలి అని అర్థం.

**మూ. ప్రసార్య బాహుమేకైకం ముహుర్వారివికర్షణైః,**
**తిర్యక్ప్రసారితా చైవ హ్రియమాణా చ వారిణా. 101**
**అశేషాఙ్గాకులాధూతవదనా గతిరిష్యతే,**
**నౌస్థస్యాపి ప్రయోక్తవ్యా ద్రుతైశ్చూర్ణపదైర్గతిః. 102**

**తా.** ఈదుతున్నట్లు ఎలా అభినయించాలో చెపుతున్నాడు – ఒక్కొక్క బాహువు చాపి నీరు వెనుకకు లాగుతూ, అడ్డంగా ప్రసరింపచేయబడిన, నీటిలో తేలిపోతూన్నట్లు గతి చెయ్యాలి. ఆ గతిలో అవయవా లన్నీ వ్యాకులంగా ఉంటాయి; ముఖం ఇటూ అటూ తిప్పబడుతూ ఉంటుంది.

నావలో ఎక్కి నీరు దాటుతున్నవాడు కూడ చిన్న చిన్న అడుగులతో ద్రుతగతి చెయ్యాలి. అలా చేస్తూ నావమీద నది దాటు తూన్నట్లు అభినయించాలి.

**మూ. అతిక్రాన్తేన పాదేన ద్వితీయేనాఞ్చితేన చ,**
**ప్రాసాదారోహణే యత్తు తదేవాద్రిషు కారయేత్. 103**

**తా.** ప్రాసాదారోహణంలో ఎలా చేస్తారో అలాగే పర్వతం ఎక్కేటప్పుడు కూడ ఒక పాదం అతిక్రాంతం గాను, రెండవది కుంచితంగాను ఉంచి గతి చేయించాలి (చెయ్యాలి).

**మూ. కేవలమూర్ధ్వనిక్షేపమద్రిష్వఙ్గం భవేదథ,**
**ద్రుమే చారోహణం కార్యమతిక్రాన్తైః స్థిరైః పదైః. 104**

**తా.** పర్వతారోహణసమయంలో దేహం ఊర్ధ్వనిక్షేపంలో (పైకి నిటారుగా) ఉంటుంది. నిలచిన అతిక్రాంతపదాలతో వృక్షారోహణం చెయ్యాలి.

**మూ. సూచీవిద్ధైరప్రకాన్తైః పార్శ్వక్రాన్తైస్తథైవ చ,**
**ఏతదేవావతరణం సరిత్స్వపి నియోజయేత్. 105**

**తా.** చెట్టునుంచి దిగేటప్పుడు సూచీవిద్ధ – అప్రక్రాంత – పార్శ్వక్రాంతపదాల ప్రయోగం చెయ్యాలి. నదులలో దిగే టప్పుడు కూడ ఇదే విధానం అవలంబించాలి.

**మూ. అనేనైవ విధానేన కర్తవ్యం గతిచేష్టితమ్,**
**సంజ్ఞామాత్రేణ కర్తవ్యాన్యేతాని విధిపూర్వకమ్. 106**

**తా.** గతులకు సంబంధించిన చేష్ట ఈ పద్ధతిలోనే చెయ్యాలి. ఈ ప్రాసాద పర్వతా రోహణాదు లన్నీ కేవలం అభినయంమాత్రంచేత చూడవలసినవే. (ప్రాసాదాలు రథాలు మొదలైనవి రంగస్థలంమీద ఉండవు కదా?)

**మూ. కస్మాన్మృత ఇతి ప్రోక్తే కిం కర్తవ్యం ప్రయోక్తృభిః,**
**అఙ్కుశగ్రహణాన్నాగం ఖలీనగ్రహణాద్ధయమ్. 107**
**ప్రగ్రహగ్రహగ్రహణాద్యానమేవమేవాపరేష్వపి.**

**తా.** అతడు ఎలా మరణించాడు అని ఎవరైనా అడిగితే నాట్యప్రయోక్త సమాధానం ఎలా చెప్పాలి? అంకుశాన్ని (అంకుశముద్రను) చూపించి ఏనుగును, కళ్లెం గ్రహించి గుఱ్ఱాన్ని, ప్రగ్రహం (జంతువును అదుపులో పెట్టే పగ్గం) గ్రహించి ఇతరవాహనాన్ని, ఇదే విధంగా ఇతర విషయాలను సూచించాలి. ఈ విధంగా నాట్యంలో ప్రత్యక్షంగా చూపడానికి శక్యం కాని వాటిని అభినయంద్వారానే సూచించాలి అని భావం.

**మూ. అశ్వయానే గతిః కార్యా వైశాఖస్థానకేన తు. 108**
**యథా చూర్ణపదైశ్చిత్రైరుపర్యుపరిపాతితైః.**

**తా.** అశ్వంమీద ప్రయాణం చేయడానికి వైశాఖస్థానకమూ, ఒకదాని తరువాత

ఒకటి తొందరగా వేసిన చిత్రము లైన చూర్ణపదాలు అభినయించాలి.

**మూ. పన్నగానాం గతిః కార్యా పాదైః స్వస్తికసంజ్ఞితైః. 109**

**పార్శ్వక్రాన్తం పదం కుర్యాత్ స్వస్తికం రేచయేదిహ.**

**తా.** స్వస్తికపాదాలను ప్రయోగించి సర్పాల గతిని చూపాలి. దీనిలో పార్శ్వక్రాంత పదం చేసి స్వస్తికరేచనం చెయ్యాలి.

**మూ. విటస్యాపి తు కర్తవ్యా గతిర్లలితవిక్రమా. 110**

**పాదైరాకుఞ్చితైః కించిత్ తాలాభ్యన్తరపాతితైః,**

**స్వసౌష్ఠవసమాయుక్తౌ తథా హస్తౌ పదానుగౌ. 111**

**ఖటకావర్ధమానౌ తు కృత్వా విటగతిం చరేత్.**

**తా.** విటుడు కొంచెం వంచిన పాదాలు ఒక తాలం దూరంలో వేస్తూ లలితమైన పాదన్యాసాలతో నడవాలి. వాటి కుండవలసిన సౌష్ఠవంతో రెండు హస్తాలూ పాదన్యాసాన్ని అనుసరించి ఉండాలి; అవి ఖటకా – వర్ధమానహస్తాలుగా ఉండాలి.

**మూ. కఞ్చుకీయస్య కర్తవ్యా వయోవస్థావిశేషతః. 112**

**అవృద్ధస్య ప్రయోగజ్ఞో గతిమేవం ప్రయోజయేత్,**

**అర్ధతాలోత్థితైః పాదైర్విష్కమ్భైః ఋజుభిస్తథా. 113**

**సముద్వహన్నివాఙ్గాని పఙ్కలగ్న ఇవ వ్రజేత్.**

**తా.** కంచుకి గతి వాని వయస్సుకు, అవస్థకు అనుగుణంగా ఉండే టట్లు చూడాలి. నాట్యప్రయోగజ్ఞుడు వృద్ధుడు కాని కంచుకిగతిని ఈ విధంగా ప్రయోగింపచెయ్యాలి. విష్కంభాలుగా, ఋజువుగా ఉన్న పాదాలు అర్ధతాలం ఎత్తుకు ఎత్తుతూ, అవయవాలు మోస్తున్నాడా అన్నట్లు, బురదలో పాదాలు దిగిపోయినవాడు వలె నడవాలి.

**మూ. అథ వృద్ధస్య కర్తవ్యా గతిః కమ్పితదేహికా. 114**

**విష్కమ్భనకృతప్రాణా మన్దోత్క్షిప్తపదక్రమా.**

**తా.** వృద్ధుడైన కంచుకి దేహం అంతా వణికిపోతూ, విష్కంభనంచేత ఊపిరి బిగపట్టి పాదాలు మందంగా ఎత్తి అడుగులు వేస్తూ నడవాలి.

**మూ. కృశస్యాప్యభినేయా వై గతిర్మన్దపదక్రమా. 115**

**వ్యాధిగ్రస్తే జ్వరార్తే చ తపఃశ్రాన్తే క్షుధాన్వితే,**

**విష్కమ్భనకృతప్రాణః కృశః క్షామోదరస్తథా. 116**

**క్షామస్వరకపోలశ్చ దీననేత్రస్తథైవ చ,**
**శనైరుత్క్షేపణం చైవ కర్తవ్యం హస్తపాదయోః.** **117**
**కమ్పనం చైవ గాత్రాణాం క్లేశనం చ తథైవ చ.**

**తా.** చిక్కిపోయినవాని గతి కూడ మందమైన పాదవిన్యాసములతో అభినయించాలి.

వ్యాధిగ్రస్తుడు, జ్వరపీడితుడు, తపస్సుచేత అలసినవాడు, ఆకలితో ఉన్నవాడు – (వీళ్లల్లో ప్రతీ ఒక్కడూ కూడ) విష్కంభనంచేత ప్రాణాలు బిగపెట్టి కొని, దీనమైన నేత్రాలతో ఉండాలి. చేతులూ కాళ్లూ చాల మెల్లగా ఎత్తుతూండాలి. అవయవాలు వణికిపోతూ, బాధతో ఉన్నట్లు అభినయించాలి.

**మూ. దూరాధ్వానం గతస్యాపి గతిర్మన్దపరాక్రమా.** **118**
**వికూణనం చ గాత్రస్య జానునోశ్చ విమర్దనమ్.**

**తా.** చాల దూరం నడిచి అలసిపోయినవాడు కూడ మందంగా అడుగులు వేస్తూ నడవాలి. శరీరం ముణుచుకొంటూ పిక్కలు మర్దించుకొంటూండాలి.

**మూ. స్థూలస్యాపి చ కర్తవ్యా గతిర్దేహానుకర్షిణీ.** **119**
**సముద్వహనభూయిష్ఠా మన్దోత్క్షిప్తపదక్రమా,**
**విష్కమ్భగామీ చ భవేన్నిఃశ్వాసబహులస్తథా.** **120**
**శ్రమస్వేదాభిభూతశ్చ వ్రజేచ్చూర్ణపదైస్తథా.**

**తా.** స్థూలశరీరంవాళ్లు కూడ దేహం ఈడ్చుకొంటూ నడుస్తూన్నట్లూ, శ్రమపడి మోస్తూన్నట్లు పాదాలు మెల్లిగా ఎత్తి అడుగులు వేస్తూ నడవాలి. స్థూలకాయుడు విష్కంభంతో నడుస్తూ ఒగరుస్తూ చెమటకు తడిసిపోయి చిన్న అడుగులు వేసుకొంటూ నడవాలి.

**మూ. మత్తానాం తు గతిః కార్యా మదే తరుణమధ్యమే.** **121**
**వామదక్షిణపాదాభ్యాం ఘూర్ణమానాపసర్పణైః,**
**అవకృష్టే పదే చైవ హ్యనవస్థితపాదికా.** **122**
**విఘూర్ణితశరీరా చ కరైః ప్రస్ఖలితైస్తథా.**

**తా.** మద్యం త్రాగి తరుణమదంలోను, మధ్యమదంలోను ఉన్నవాళ్ల గతి ఈ విధంగా ఉండాలి. రెండు పాదాలు ఒకదాని వైపు ఒకటి తిప్పి వేస్తూ మళ్లీ పక్కకి తీసుకొంటూ ఉండాలి. బైటకు లాగిన పాదం మీద స్థిరంగా నిలబడలేకుండా ఉండాలి. చేతులు మెలికలు తిరిగిపోతూ శరీరం కూడ తిరిగి పోతూండాలి.

**మూ. ఉన్మత్తస్యాపి కర్తవ్యా గతిస్త్వనియతక్రమా. 123**

**బహుచారీసమాయుక్తా లోకానుకరణాశ్రయా.**

**తా.** ఉన్మత్తుని (పిచ్చివాని) గతి అనియతమైన పాదవిన్యాసాలతో, అనేకవిధా లైన చారీలతో, లోకంలోని పద్ధతిని అనుసరించి ఉండాలి.

**మూ. రూక్షస్ఫుటితకేశశ్చ రజోధ్వస్తతనుస్తథా. 124**

**అనిమిత్తప్రకథనో బహుభాషీ వికారవాన్,**

**గాయత్యకస్మాద్ధసతి సజ్గే చాపి న సజ్జతే. 125**

**తా.** జట్టు ఎండి గరుకుగా ముక్కముక్కలుగా ఉంటుంది. ఒళ్లంతా దుమ్ము కొట్టుకొని ఉంటుంది. నిమిత్తం ఏమీ లేకుండా ఏదేదో చెపుతూంటాడు. వికృతంగా ఏమేమో వాగుతాడు. అకస్మాత్తుగా పాడుతూంటాడు. నవ్వుతూంటాడు. ఎవరైనా దగ్గరికి వచ్చినా వాళ్లతో కలవడు.

**మూ. నృత్యత్యపి చ సంహృష్టో వాదయత్యపి వా పునః,**

**కదాచిద్ధావతి జవాత్ కదాచిదవతిష్ఠతే. 126**

**కదాచిదుపవిష్టస్తు శయానః స్యాత్కదాచన,**

**నానాచీరధరశ్చైవ రథ్యాస్వనియతాలయః. 127**

**ఉన్మత్తో భవతి హ్యేవం తస్యైతాం కారయేద్ గతిమ్.**

**తా.** ఒకప్పుడు హర్షంతో నృత్యం చేస్తాడు, వాద్యం వాయిస్తాడు, ఒకప్పుడు వేగంగా పరుగెత్తుతాడు. ఒకప్పుడు ఒకచోట నిలబడిపోతాడు. ఒకప్పుడు కూర్చుంటాడు. ఒకప్పుడు పడుకొంటాడు. అనేక విధాలైన చింకిరి గుడ్డలు కట్టుకొంటాడు. వీథులలో ఒక చోట ఉండకుండా తిరుగుతాడు. ఉన్మత్తుని గతిని ఈ విధంగా అభినయింపచెయ్యాలి.

**మూ. స్థిత్వా నూపురపాదేన దణ్డపాదం ప్రసారయేత్. 128**

**బద్ధాం చారీం తథా చైవ కృత్వా స్వస్తికమేవ చ,**

**అనేన చారీయోగేన పరిభ్రామ్య తు మణ్డలమ్. 129**

**బాహ్యభ్రమరకం చైవ రజ్గకోణే ప్రసారయేత్,**

**త్రికం సులలితం కృత్వా లతాఖ్యం హస్తమేవ చ. 130**

**విపర్యయగతైర్హస్తైః పద్భ్యాం సహగతిర్భవేత్.**

**తా.** 'నూపురపాదం'తో నిలబడి 'దండపాదం' చాపాలి. 'బద్ధాచారి'నీ 'స్వస్తికాన్నీ' చేసి, ఈ చారీలలో ఉండగానే మండలభ్రమణం చేసి, రంగస్థలకోణంలో బాహ్యభ్రమరకం

ప్రసరింపచెయ్యాలి. లలితత్రికము, లతాహస్తము చేసి చేతులూ కాళ్లూ విపరీతంగా (అటూ ఇటూ పెట్టి) నడవాలి.

**మూ. త్రివిధా తు గతిః కార్యా ఖఞ్జపఙ్గుకవామనైః. 131**

**వికలాఙ్గప్రయోగేణ కుహకాభినయం ప్రతి,**
**ఏకః ఖఞ్జగతౌ నిత్యం స్తబ్ధో వై చరణో భవేత్. 132**

**తథా ద్వితీయః కార్యస్తు పాదోఽగ్రతలసంచరః,**
**స్తబ్ధేనోత్థాపనం కార్యమఙ్గస్య చరణేన తు. 133**

**గమనేన నిషణ్ణః స్యాదన్యేన చరణేన తు,**
**ఇతరేణ నిషీదేచ్చ క్రమేణానేన వై వ్రజేత్. 134**

**ఏషా ఖఞ్జగతిః కార్యా తలశల్యక్షతేషు చ,**
**పాదేనాగ్రతలస్థేన హ్యఞ్చితేన వ్రజేత్తథా. 135**

**తా.** ఖంజుడు, పంగువు వామనుడు రంగస్థలంమీద చేయవలసిన కపటాభినయంలో, వికలము లైన అవయవాలు ప్రదర్శిస్తూ మూడు విధాల గతులు చెయ్యాలి. ఖంజుని (పుట్టుకతో ఒక కాలు దుర్బలంగా ఉన్నవాని) గతిలో ఒక పాదం ఎల్లప్పుడు స్తబ్ధంగా, మొద్దుబారినట్లు కదలకుండా ఉండాలి. రెండవ పాదం అగ్రతలసంచరస్థితిలో ఉంచాలి. స్తబ్ధమైన చరణంతో శరీరం పైకి లేపుతూండాలి. రెండవపాదంతో నడిచే టప్పుడు ఆ వైపు వంగిపోతూండాలి. మరొకపాదంతో అటు వైపు వంగిపోతూండాలి. ఈ విధంగా పాదన్యాసం చేస్తూ నడవాలి. పాదానికి శల్యం (మేకు వంటివి) గుచ్చుకొనినా దెబ్బతగిలినా ఈ ఖంజగతి చెయ్యాలి. అగ్రతలచారిలో ఉన్న అంచితమైన పాదంతో నడవాలి.

**మూ. నిషణ్ణదేహో పఙ్గోస్తు నతజఙ్ఘా తథైవ చ,**
**సర్వసంకుచితాఙ్గా చ వామనే గతిరేష్యతే. 136**

**తా.** పంగువు (కుంటివాని) గతిలో శరీరం ఒకవైపు వంగిపోయి మోకాలు ముణుచు కొని ఉంటుంది. వామనుని (పొట్టివాని) గతిలో అవయవా లన్నీ సంకుచితములైపోయి ఉంటాయి.

**మూ. న తస్య విక్రమః కార్యో విక్షేపశ్చరణస్య చ,**
**సోద్వాహితా చూర్ణపదా సా కార్యా కుహనాత్మికా. 137**

**తా.** వామనుడు పాదం బాగా చాపడంగాని, పైకి విసరడం కాని చేయకూడదు. వాని కపటాభినయగతి ఉద్వాహితమై చిన్న చిన్న అడుగులతో జరగాలి.

**మూ. విదూషకస్యాపి గతిః హాస్యత్రయసమన్వితా,**
**అఙ్గవాక్యకృతం హాస్యం హాస్యం నేపథ్యజం స్మృతమ్. 138**

**తా.** విదూషకుని గతి అంగహాస్యము, వాక్యహాస్యము, నేపథ్య (వేష) హాస్యము అను మూడు విధాల హాస్యంతో కూడినదై ఉండాలి.

**మూ. దన్తురః ఖలతిః కుబ్జః ఖఞ్జశ్చ వికృతాననః,**
**య ఈదృశః ప్రవేశః స్యాదఙ్గహాస్యం తు తద్ భవేత్. 139**

**తా.** ఎత్తుపళ్లు, బట్టతల, గూను, కుంటి, వికృతమైన ముఖం – ఇలాంటివాని ప్రవేశం అంగహాస్యం అవుతుంది.

**మూ. యదా తు బకవద్ గచ్ఛేదుల్లోకితవిలోకితైః,**
**అత్యాయతపదత్వాచ్చ అఙ్గహాస్యో భవేత్ స తు. 140**

**తా.** కొంగ వలె పైకి చూస్తూ చుట్టూ చూస్తూ, పెద్ద అడుగులు వేస్తూ నడిస్తే అది కూడ అంగహాస్యం అవుతుంది.

మూ. కార్య (వాక్య) హాస్యం తు విజ్ఞేయమసంబద్ధప్రభాషణాత్,
అనర్థకైర్వికారైశ్చ తథా చాశ్లీలభాషితైః. 141

తా. అసంబద్ధంగా మాట్లాడడం, అర్థరహిత మైన వికృతచేష్టలు, అశ్లీలభాషణం – వీటిచేత అది వాక్యహాస్యం అవుతుంది.

**మూ. చీరచర్మమషీభస్మగైరికాద్యైస్తు మణ్డితః,**
**యస్త్వాదృశో భవేద్విప్రా హాస్యో నేపథ్యజస్తు సః. 142**

**తా.** చిన్న గుడ్డలు, చర్మలు, మసి, భస్మ, గైరికాదిధాతువులు (రంగులు) వీటితో అలంకరించుకొనడం నేపథ్యజహాస్యం.

**మూ. తస్మాత్తు ప్రకృతిం జ్ఞాత్వా భావః కార్యస్తు తత్త్వతః,**
**గతిప్రచారం విభజేత్ నానావస్థాన్తరాత్మకమ్. 143**

**తా.** అందుచేత ఆ పరిస్థితిలో ఉన్న విదూషకుని ప్రకృతిని గ్రహించి, ఆతని యథార్థస్వరూపం నిర్ణయించాలి. వివిధావస్థలను అనుసరించి విదూషకుని గతిప్రచారం విభజించి నిర్ణయించాలి.

**మూ. స్వభావజాయాం విన్యస్య కుటిలం వామకే కరే,**
**తదా దక్షిణహస్తే చ కుర్యాచ్చతురకం పునః. 144**

**పార్శ్వమేకం శిరశ్చైవ హస్తోఽథ చరణస్తథా,**
**పర్యాయశః సన్నమయేల్లయతాలవశానుగః. 145**

**స్వభావజా తు తస్యైషా గతిరన్యా వికారజా,**
**అలాభలాభాత్ భుక్తస్య స్తబ్ధా తస్య గతిర్భవేత్. 146**

**తా.** విదూషకుని స్వాభావికగతిలో – వాని ఎడమ చేతిలో వంకరకఱ్ఱ ఉండాలి. కుడి చేయి చతురకముద్రలో ఉండాలి. లయ – తాలాలను అనుసరించి ఒక పార్శ్వాన్ని, శిరస్సును, హస్తాన్ని పర్యాయంచేత (ఒకమారు ఒకటి మరొకమారు మరొకటి) వంచు తూండాలి. ఇది విదూషకుని స్వాభావికగతి. వికారంవల్ల గతి మరొక విధంగా ఉంటుంది. పూర్వం ఎన్నడూ లభించనిది లభించడంతో బాగా భుజించిన వాని గతి స్తబ్ధంగా ఉండాలి.

**మూ. కార్యా చైవ హి నీచానాం చేటాదీనాం పరిక్రమాత్,**
**అధమా ఇతి యే ఖ్యాతాః నానాశీలాశ్చ తే పునః. 147**

**పార్శ్వమేకం శిరశ్చైవ కరః సచరణస్తథా,**
**గతౌ నమేత చేటానాం దృష్టిశ్చార్ధవిచారిణీ. 148**

**తా.** నీచు లైన చేటులు, అధములని ప్రసిద్ధు లైన, అనేకవిధాలైన శీలం గలవాళ్లు – ఇలాంటి వాళ్ల గతిలో ఒక పార్శ్వము, శిరస్సు, హస్తము, పాదము వంగి ఉంటాయి. చేటుల దృష్టి సగం మాత్రమే ప్రసరిస్తుంది.

**మూ. శకారస్యాపి కర్తవ్యా గతిశ్చఞ్చలదేహికా,**
**వస్త్రాభరణసంస్పర్శైర్ముహుర్ముహురవేక్షితైః. 149**

**గాత్రైర్వికారవిక్షిప్తైర్లమ్బవస్త్రస్రజా తథా,**
**సగర్వితా చూర్ణపదా శకారస్య గతిర్భవేత్. 150**

**తా.** శకారుని గతి దేహం అంతా కదిలిపోతూ ఉంటుంది. మాటిమాటికి తన వస్త్రాలు ఆభరణాలు స్పృశిస్తూంటాడు. మాటిమాటికి వాటి కేసి చూసుకొంటూంటాడు. అవయవాలను వికృతంగా విసురుతూ నడుస్తాడు. పుష్పమాలలు, వస్త్రాలు వేలాడు తూంటాయి. వాని గతి చూర్ణపదాలతో, గర్వంతో ఉంటుంది.

**వి.** మృచ్ఛకటికంలోని శకారుని పాత్ర ప్రసిద్ధ మైనది. అతడు రాజుగారి బావమరిది. శకారం అధికంగా ఉన్న భాష మాటలాడడంచేత వానికి శకారు డని పేరు అనీ, శకజాతికి చెందినవాడు శకారుడనీ, ఉన్నతస్థానం ఎక్కించిన నీచస్వభావుడు శకారు డనీ అభినవగుప్తాచార్యులు మూడు అభిప్రాయాలు తెలిపారు.

**మూ. జాతా నీచేషు యోక్తవ్యా విలోకనపరా గతిః,**
**అసంస్పర్శశ్చ లోకస్య స్వాఙ్గాని వినిగృహ్య చ. 151**

**తా.** నీచజాతులకు చెందినవాళ్లు లోకులు స్పృశించపోవడంచేత తమ అవయవా

లను ముణుచుకొంటూ ఇటూ అటూ చూస్తూ నడుస్తున్నట్లు వాళ్ల గతిని చూపాలి.

**మూ. మ్లేచ్ఛానాం జాతయో యాస్తు పులిన్దశబరాదయః,**
**తేషాం దేశానుసారేణ కార్యం గతివిచేష్టితమ్. 152**

**తా.** పులిందులు, శబరులు మొదలైన మ్లేచ్ఛజాతులకు చెందినవాళ్ల గతులు, చేష్టలూ వాళ్ల వాళ్ల దేశాలను అనుసరించి ప్రయోగించాలి.

**మూ. పక్షిణాం శ్వాపదానాం చ పశూనాం చ ద్విజోత్తమాః,**
**స్వస్వజాతిసముత్థేన స్వభావేన గతిర్భవేత్. 153**

**తా.** ద్విజోత్తములారా! పక్షులు, క్రూరమృగాలు, పశువులు – వీటి గతి వాటి వాటి జాతుల స్వభావాన్ని అనుసరించి ప్రయోగించాలి.

**మూ. సింహరవానరాణాం చ గతిః కార్యా ప్రయోక్తృభిః,**
**యా కృతా నరసింహేన విష్ణునా ప్రభవిష్ణునా. 154**
**ఆలీఢస్థానకం కృత్వా గాత్రం తస్యైవ చానుగమ్,**
**జానూపరి కరం హ్యేకమపరం వక్షసి స్థితమ్. 155**
**అవలోక్య దిశః కృత్వా చిబుకం బాహుమస్తకే,**
**గన్తవ్యం విక్రమైర్విప్రాః పఞ్చతాలాన్తరోత్థితైః. 156**

**తా.** నరసింహరూపం ధరించిన, సర్వసమర్థుడైన విష్ణువు ఏ గతి చేశాడో అదే గతి, నాట్యప్రయోక్తలు, సింహ – ఋక్ష – వానరుల విషయంలో ప్రయోగించాలి (ఆ గతినే విశదీకరిస్తున్నాడు) – ఆలీఢస్థానకంలో నిలిచి, శరీరం దానికి అనుగుణంగా ఉండే టట్లు ఉంచి, ఒక చెయ్యి మోకాలుమీద రెండవది వక్షఃస్థలం మీదా ఉంచి, అన్ని దిక్కులవైపు చూచి బాహుశిఖరంమీద గడ్డం ఆన్చి ఐదు తాలాల ఎత్తు ఎత్తిన పాద న్యాసాలతో నడవాలి.

**వి.** నరసింహరూపు డైన విష్ణువు గతిని గూర్చి చెప్పడంచేత ఈ గతిని దేవతాంశ సంభూతులైన జాంబవత్ – సుగ్రీవ – అంగద – హనుమదాదుల విషయంలోమాత్రమే అని గ్రహించాలి అని అభినవగుప్తాచార్యులు.

**మూ. నియుద్ధసమయే చైవ రఙ్గావతరణే తథా,**
**సింహాదీనాం ప్రయోక్తవ్యా గతిరేషా ప్రయోక్తృభిః. 157**
**శేషాణామర్థయోగేన గతిం స్థానం చ యోజయేత్.**

**తా.** మల్లయుద్ధసమయంలోను, రంగప్రవేశసమయంలోను, నాట్యప్రయోక్తలు ఈ

సింహాదిగతి ప్రయోగించాలి. మిగిలినవాటి గతినీ, స్థానమునూ అవసరాన్ని పట్టి ప్రయోగించాలి.

**మూ. వాహనార్థప్రయోగేషు రఙ్గావతరణేషు చ,**
**ఏవమేతాః ప్రయోక్తవ్యాః నరాణాం గతయో బుధైః. 158**

**నోక్తా యా యా మయా హ్యత్ర గ్రాహ్యాస్తాస్తాశ్చ లోకతః.**

**తా.** నేను చెప్పిన నరుల గతు లన్నీ పండితులు వాహనారోహణాదిసమయాల లోను, ఇతరకథావస్తుప్రయోగాలలోను, రంగప్రవేశసమయాలలోను ప్రయోగించాలి. నేను ఇక్కడ చెప్పనిది ఏవైన ఉంటే వాటిని లోకంనుండి గ్రహించాలి.

**మూ. అతఃపరం ప్రవక్ష్యామి స్త్రీణాం గతివిచేష్టితమ్. 159**
**స్త్రీణాం స్థానాని కార్యాణి గతిష్వాభరణేషు చ,**
**ఆయతం చావహిత్థం చ అశ్వక్రాన్తమథాపి చ. 160**

**స్థానాన్యేతాని నారీణామథ లక్షణముచ్యతే.**

**తా.** ఇపుడు స్త్రీల గతి – చేష్టాదులను గూర్చి చెపుతాను. స్త్రీలు గతులయందు, ఆభరణాలయందు స్థానాలు చెయ్యాలి. ఆయతము, అవహిత్థము, అశ్వక్రాంతము అని ఇవి స్త్రీల స్థానాలు. వీటి లక్షణం చెపుతాను.

**మూ. వామః స్వభావతో యత్ర పాదో విరచితః సమః. 161**
**తాలమాత్రాన్తరే న్యస్తః త్ర్యస్రః పక్షస్థితోఽపరః,**
**ప్రసన్నమాననమురః సమం యత్ర సమున్నతమ్. 162**

**లతానితమ్బగౌ హస్తౌ స్థానం జ్ఞేయం తదాయతమ్.**

**తా.** వామపాదం స్వాభావికరీతిలో సమంగా ఉండాలి. కుడి పాదం ఒక తాలం దూరంలో త్ర్యస్రంగా పక్షస్థితంగా ఉండాలి. ముఖం ప్రసన్నంగాను, వక్షఃస్థలం సమంగా, ఉన్నతంగా ఉండాలి. హస్తాలు లతాస్థితిలో నితంబంమీద ఉండాలి. అది **ఆయతస్థానం.**

**మూ. దక్షిణస్తు సమః పాదః త్ర్యస్రః పక్షస్థితోఽపరః,**
**వామస్సమున్నతకటిశ్చాయతే స్థానకే భవేత్. 163**

**తా. మరొక లక్షణం :–** దక్షిణపాదం సమంగా ఉండగా రెండవది త్ర్యస్రమై పక్షస్థితమై ఉండాలి. కటిప్రదేశం ఎడమభాగం ఉన్నతంగా ఉండాలి. ఇది **ఆయతస్థానం.**

**మూ. ఆవాహనే విసర్గే చ తథా నిర్వర్ణనేషు చ. 164**

**చిన్తాయాం చావహిత్థే చ స్థానమేతత్ ప్రయోజయేత్,**
**రఙ్గావతరణారమ్భః పుష్పాఞ్జలివిసర్జనమ్. 165**
**మన్మథేర్ష్యోద్భవం కోపం తర్జన్యఙ్గులిమోటనమ్,**
**నిషేధగర్వగామ్భీర్యమౌనం మానావలమ్బనమ్. 166**
**స్థానేఽస్మిన్ సంవిధాతవ్యం దిగన్తరనిరూపణమ్.**

**తా.** ఆవాహనంలోను, విసర్జనంలోను, చూడడంలోను, చింతయందు, అవహిత్థంలోను ఈ స్థానం ప్రయోగించాలి. రంగావతరణప్రారంభము, పుష్పాంజలి చల్లడము, ప్రణయకోపము, తర్జని విరవడము, నిషేధ – గర్వ – గాంభీర్య – మౌనాలు, మానం (కోపం) చూపడము, మరొక దిక్కుకు చూడడము – ఇవన్నీ ఈ స్థానంలో చెయ్యాలి.

**మూ. (సమో యత్ర స్థితో వామః త్ర్యస్రః పక్షస్థితోఽపరః. 167**
**సమున్నతః కటిర్వామస్త్వహిత్థస్తు తద్భవేత్).**

**తా.** వామపాదం సమస్థితిలో ఉండగా దక్షిణపాదం త్ర్యస్రంగా పక్షస్థితమై ఉంటుంది. ఎడమ కటిభాగం ఎత్తుగా ఉంటుంది. అది **అవహిత్థ**స్థానం).

**మూ. పురోవిచలితస్త్ర్యశ్రః తదన్యోఽపసృతః సమః. 168**
**పాదస్తాలాన్తరన్యస్తస్త్రికమీషత్సమున్నతమ్,**
**పాణిర్లతాఖ్యో యత్రైకస్తదన్యస్తు నితమ్బగః. 169**
**అవహిత్థం సమాఖ్యాతం స్థానమాగమభూషణైః.**

**తా.** ఒక పాదం ముందుకు జరపబడి త్ర్యశ్రంగా ఉంటుంది. రెండవ పాదం అపసృతమై సమంగా, ఒక తాలం దూరంలో ఉంటుంది. త్రికం కొంచెం ఎత్తుగా ఉంటుంది. ఒక హస్తం లతాహస్తంగాను రెండవది నితంబంమీద ఉంటుంది. ఇది **అవహిత్థం** అను స్థాన మని శాస్త్రజ్ఞులు చెపుతున్నారు.

**మూ. స్త్రీణామేతమ్ స్మృతం స్థానం సంలాపే తు స్వభావజే. 170**
**నిశ్చయే పరితోషే చ వితర్కే చిన్తనే తథా),**
**విలాసలీలాబిబ్బోకశృఙ్గారాత్మనిరూపణే. 171**
**స్థానమేతత్ ప్రయోక్తవ్యం భర్తుర్మార్గవిలోకనే.**

**తా.** ఇది స్త్రీలకు సంబంధించిన స్థానం. స్వాభావికమైన సంభాషణయందు, నిశ్చయమునందు, సంతోషమునందు, వితర్కమునందు ఆలోచనయందు, విలాస – లీలా – బిబ్బోకముల ద్వారా శృంగారంలో తనను తాను ప్రియునికి చూపడంలోను

(తన భావం ఆవిష్కరించడంలోను), భర్త రాకకొరకు ఎదురుచూడడంలోను దీనిని వినియోగించాలి.

**మూ. పాదః సమస్థితశ్చైకః ఏకశ్చాగ్రతలాఞ్చితః. 172**
**సూచీవిద్ధమవిద్ధం వా తదశ్వక్రాన్తముచ్యతే.**

**తా.** ఒక పాదం సమస్థితిలోను రెండవది అగ్రతలంలోను ఉండాలి. సూచీవిద్ధం కావచ్చు, కాకపోవచ్చు. అది **అశ్వక్రాంతస్థానం.**

**మూ. స్ఖలితం ఘూర్ణితం చైవ గలితామ్బరధారణమ్. 173**
**కుసుమస్తబకాదానం పరిరక్షణమేవ చ,**
**విత్రాసనం సలలితం తరుశాఖావలమ్బనమ్. 174**
**స్థానేఽస్మిన్ సంవిధానీయం స్త్రీణామేతత్ప్రయోక్తృభిః.**

**తా.** స్త్రీలకు సంబంధించిన ఈ స్థానంలో – స్త్రీలు తొట్రుపడడం, తిరగడం, జారిపోతూన్న వస్త్రం పట్టుకొనడం, పుష్పగుచ్ఛం కోయడం, దానిని రక్షించడం, విలాసగా భయపెట్టడం, చెట్టుకొమ్మ పట్టుకొని నిలబడడం – ఇవన్నీ చెయ్యాలి.

**మూ. శాఖావలమ్బనే కార్యం స్తబకగ్రహణే తథా. 175**
**విశ్రామేష్వథ దేవానాం నరాణాం చార్థయోగతః,**
**స్థానకం తావదేవ స్యాద్యావచ్చేష్టాప్రవర్తతే. 176**

**తా.** ఈ స్థానకాన్ని చెట్టుకొమ్మ పట్టుకొనడంలోను, పుష్పగుచ్ఛం కోయడంలోను, దేవతల, అవసరాన్ని పట్టి మానవుల విశ్రాంతియందు వినియోగించాలి. స్థానకం, చేష్టలు ప్రవర్తించినంతసేపు మాత్రమే ఉండాలి.

**మూ. భగ్నం చ స్థానకం నృత్తే చారీచేత్సముపస్థితా,**
**ఏవం స్థానవిధిః కార్యః స్త్రీణాం నృణామథాపి చ. 177**

**తా.** నృత్తంలో చారీని చేయవలసి వస్తే అంతవరకు ఉన్న స్థానకాన్ని భగ్నం చెయ్యాలి (విడిచివేయాలి). స్త్రీలూ, పురుషులూ కూడ స్థానవిధానాన్ని ఈ విధంగా అనుసరించాలి.

**మూ. పునశ్చాసాం ప్రవక్ష్యామి గతిం ప్రకృతిసంస్థితామ్,**
**కృత్వావహిత్థం స్థానం తు వామఞ్చాధోముఖం కరమ్. 178**
**నాభిప్రదేశే విన్యస్య సవ్యం చ ఖటాకాముఖమ్,**
**తతః సలలితం పాదం తాలమాత్రసముత్థితమ్. 179**

**దక్షిణం వామపాదస్య బాహ్యాపార్శ్వే వినిక్షిపేత్,**
**తేనైవ సమకాలం చ లతాఖ్యం వామకం భుజమ్. 180**
**దక్షిణం వినమేత్పార్శ్వం న్యసేన్నాభితటే తతః,**
**నితమ్బే దక్షిణం కృత్వా హస్తం చోద్వేష్ట్య వామకమ్. 181**
**తతో వామపదం దద్యాల్లతాహస్తం చ దక్షిణమ్,**
**లీలయోద్వాహితేఽ_నాథ శిరసానుగతేన చ. 182**
**కించిన్నతేన గాత్రేణ గచ్ఛేత్ పఞ్చపదీం తతః,**
**యో విధిః పురుషాణాం తు రఙ్గపీఠపరిక్రమే. 183**
**స ఏవ ప్రమదానాం వై కర్తవ్యో నాట్యయోక్తృభిః.**

**తా.** స్త్రీల ప్రకృతికి అనుగుణమైన గతిని మళ్లీ చెపుతాను – అవహిత్థస్థానంలో ఉంటూ ఎడమచెయ్యి అధోముఖం చెయ్యాలి. కుడి చెయ్యి ఖటకాముఖంలో నాభిప్రదేశం దగ్గర ఉంచాలి. తరువాత కుడిపాదం లలితంలో ఒక తాలం ఎత్తు లేపి ఎడమ పాదం బైట పార్శ్వంలో ఉంచాలి. అదే సమయంలో ఎడమచెయ్యి లతాస్థితిలో ఉంచాలి. కుడి పార్శ్వం వంచి వామహస్తం నాభిసమీపంలో ఉంచాలి. దక్షిణహస్తం నితంబందగ్గర ఉంచాలి. తరువాత ఎడమ చెయ్యి పైకి మెలిపెట్టాలి. పిమ్మట ఎడమ పాదం ముందుకు పెట్టాలి. దక్షిణహస్తం లతాహస్తంగా ఉండాలి. అటుపైన శరీరాన్ని విలాసపూర్వకంగా పైకి లేపుతూ, శిరస్సు దానికి అనుగుణంగా ఉండే టట్లు చేస్తూ, శరీరం కొంచెం వంచి ఐదు అడుగులు వెయ్యాలి. రంగపీఠంమీద నడవడంలో పురుషులకు ఏ విధి చెప్పబడిందో అదే స్త్రీలకు కూడ నాట్యప్రయోక్తలు వర్తింపచెయ్యాలి.

**మూ. షట్కలం తు న కర్తవ్యం తథాష్టకలమేవ చ. 184**
**పాదస్య పతనం తద్‌జ్ఞైః ఖేదనం తద్ భవేత్ స్త్రియాః.**

**తా.** పాదన్యాసం ఆరు కలలు గాని, ఎనిమిది కలలు గాని స్త్రీలచేత చేయించ కూడదు. అది స్త్రీకి శ్రమకరం అవుతుంది.

**మూ. సయౌవనానాం నారీణామేవం కార్యా గతిర్బుధైః**
**స్థానీయా యాః స్త్రియస్తాసాం సంప్రవక్ష్యామ్యహం గతిమ్. 186**

**తా.** బుధులు, యౌవనంలో ఉన్న స్త్రీలచేత ఈ గతి చేయించాలి. స్థానీయలైన, అనగా మధ్యమవయస్కులైన స్త్రీల గతి ఎలా ఉండాలో చెపుతాను.

**మూ. కృత్వాపవిద్ధం స్థానం తు వామం న్యస్య కటీతటే,**
**ఆద్యం చారాలముత్తానం కుర్యాన్నాభిస్తనాన్తరే. 187**

**కృత్వా గాత్రం తతో గచ్ఛేత్తేనైవేహ క్రమేణ తు,**
**ప్రేష్యాణామపి కర్తవ్యా గతిరుద్భ్రాన్తగామినీ. 188**

**క్వచ్చిదున్నమితైర్గాత్రైరావిద్ధభుజవిక్రమా.**

**తా.** అపవిద్ధస్థానంలో నిలిచి, వామహస్తం కటితటంమీద ఉంచి, కుడిచెయ్యి అరాలరూపంలో ఉత్తానంగా నాభికి స్తనాలకీ మధ్య ఉంచి, తరువాత వెనుక చెప్పిన విధంగా ఆ క్రమంలోనే నడిచి వెళ్లాలి. ప్రేష్యలు (పరిచారికలు) ఉద్భ్రాంతగామిని యైన, అర్ధమదవికారంతో కూడిన గతి చెయ్యాలి. కొన్ని చోట్ల అవయవాలు పైకి ఎత్తి, అలా ఎత్తడంచేత కొంచెం అడ్డుకొనబడిన భుజాలు, నడకా గలదై గతి చెయ్యాలి.

**మూ. స్థానం కృత్వావహిత్థం చ వామం చాధోముఖం భుజమ్. 189**
**నాభిప్రదేశే విన్యస్య సవ్యం చ ఖటకాముఖమ్,**
**అర్ధనారీగతిః కార్యా స్త్రీపుంసాభ్యాం విమిశ్రితా. 190**

**తా.** అవహిత్థస్థానం చేసి, ఎడమ భుజం అధోముఖంగా ఉంచి, దక్షిణహస్తం ఖటకాముఖంగా నాభిప్రదేశంలో ఉంచి, అర్ధనారీగతి (అనగా నపుంసకుని గతి), స్త్రీ పురుషగతులు మిశ్రం చేసి ఉండాలి.

**మూ. ఉదాత్తలలితైర్గాత్రైః పాదైః లీలాసమన్వితైః,**
**యా పూర్వమేవాభిహితా హ్యుత్తమానాం గతిర్మయా. 191**

**స్త్రీణాం కాపురుషాణాం చ తతోఽర్ధార్ధం తు యోజయేత్.**

**తా.** ఉదాత్తములు లలితములు అయిన గాత్రాలతో లీలతో కూడిన పాదాలతో ఉత్తముల గతి ఉండా లని నేను వెనుక చెప్పాను కదా? దానిలో సగంలో సగం (నాల్గవవంతు) సాధారణస్త్రీలకు నీచపురుషులకు ప్రయోగించాలి.

**మూ. మధ్యమోత్తమనీచానాం నృణాం యద్ గతిచేష్టితమ్. 192**
**స్త్రీణాం తదేవ కర్తవ్యం లలితైః పదవిక్రమైః,**
**బాలానామపి కర్తవ్యా స్వచ్ఛన్దపదవిక్రమా. 193**

**తా.** మధ్యమ – ఉత్తమ – నీచనరులకు ఏ గతిచేష్టాదికం చెప్పబడిందో అదే గతి మధ్యమోత్తమ స్త్రీలు కూడ చెయ్యాలి; కాని లలిత మైన పాదవిన్యాసాలతో చెయ్యాలి. బాలుల గతి స్వేచ్ఛానుసారం పాదవిన్యాసాదులతో ఉండవచ్చును.

**మూ. న తస్యాః సౌష్ఠవం కార్యం న ప్రమాణం ప్రయోక్తృభిః,**
**తృతీయా ప్రకృతిః కార్యా నామ్నా చైవ నపుంసకా. 194**
**నరస్వభావముత్సృజ్య స్త్రీగతిం తత్ర యోజయేత్.**

**తా.** పురుషప్రకృతి కాని స్త్రీప్రకృతి కాని లేక మూడవప్రకృతి గల మనిషి తృతీయ ప్రకృతి. తృతీయప్రకృతికి నపుంసకా అని పేరు పెట్టాలి. నాట్యప్రయోక్తలు ఆ నపుంసకకు సౌష్ఠవం కాని, ప్రమాణం (తాల – కలాదికం) కాని విధించకూడదు. నరస్వభావం విడిచిపెట్టి ఆమెకు స్త్రీగతినే ఉపయోగించాలి.

**మూ. విపర్యయః ప్రయోక్తవ్యః పురుషస్త్రీనపుంసకే. 195**

**స్వభావమాత్మనస్త్యక్త్వా తద్భావగమనాదిహ,**
**వ్యాజేన క్రీడయా వాపి తథా భూయశ్చ వఞ్చనాత్. 196**

**తా.** వ్యాజం (వంక) చేత గాని, ఆటకోసం గాని, వంచించడంకోసం గాని పురుష – స్త్రీ – నపుంసకులు తమ స్వభావం విడిచి; ఇంకొకరి లాగ అయి, తమకు విరుద్ధమైన గతిచేష్టాదికం చేయవచ్చును. (కొన్ని నాటకాలలో విదూషకుడు చేటివేషం వేయడం, చేటి విదూషకునివేషం వేయడంవంటి సందర్భాలలో ఇలా చెయ్యాలి అని అర్థం).

**మూ. స్త్రీ పుంసః ప్రకృతిం కుర్యాత్ స్త్రీభావం పురుషోఽపి చ,**
**ధైర్యోదార్యేణ సత్త్వేన బుద్ధ్యా తద్వచ్చ కర్మణా. 197**
**స్త్రీ పుమాంసం త్వభినయేత్ వేషవాక్యవిచేష్టితైః,**
**స్త్రీవేషభాషితైర్యుక్తః ప్రేషితాప్రేషితైస్తథా. 198**
**మృదుసన్నగతిశ్చైవ పుమాన్ స్త్రీభావమాచరేత్.**

**తా.** (పై కారణాలచేత) స్త్రీ పురుషప్రకృతిని చెయ్యాలి; పురుషుడు స్త్రీత్వాన్ని చెయ్యాలి.

ధైర్యంచేత, ఔదార్యంచేత, బలంచేత, బుద్ధిచేత, పనులచేత, వేషంచేత, మాటల చేత, చేష్టలచేత స్త్రీ పురుషుణ్ణి అభినయించాలి (పురుషుడువలె ప్రవర్తించాలి). పురుషుడు స్త్రీ వేషం ధరించి ఆమె వలెనే మాట్లాడుతూ, పరిచారికలను ఆజ్ఞాపిస్తూ, మృదువైన సుకుమారమైన గమనంతో స్త్రీ వలె ప్రవర్తించాలి.

**మూ. జాతిహీనాశ్చ యా నార్యః పులిన్దశబరాఙ్గనాః. 199**

**యాశ్చాపి తాసాం కర్తవ్యా తజ్జాతిసదృశీ గతిః.**

**తా.** నీచజాతి స్త్రీలు, పులిందస్త్రీలు, శబరస్త్రీలు – వీళ్లందరూ తమ తమ జాతులకు తగిన గతులు చెయ్యాలి.

**మూ. వ్రతస్థానాం తపఃస్థానాం లిఙ్గస్థానాం తథైవ చ. 200**

**ఖస్థానాం చైవ నారీణాం సమపాదం ప్రయోజయేత్.**

**తా.** వ్రతంలో ఉన్న స్త్రీలకు, తపస్సు చేసికొంటూన్న స్త్రీలకు, పరివ్రాజికాత్వాది లింగాలు ఉన్న స్త్రీలకు, ఆకాశంమీద ఉన్న స్త్రీలకు సమపాదగతిని ప్రయోగించాలి.

**మూ. ఉద్ధతా యేఽఙ్గహారాః స్యుర్యాశ్చార్యో మణ్డలాని చ. 201**

**తాని నాట్యప్రయోగజ్ఞైర్న కర్తవ్యాని యోషితామ్.**

**తా.** నాట్యప్రయోగజ్ఞులు, స్త్రీలచేత ఉద్ధత మైన అంగహారాలను, చారీలను, మండలాలను చేయించకూడదు.

**మూ. తథాసనవిధిః కార్యో నృణాం స్త్రీణాం విశేషతః. 202**

**నానాభావసమాయుక్త స్తథా చ శయనాశ్రయః.**

**తా.** ఇపుడు – పురుషులు, స్త్రీలు ఏ విధంగా ఏ విధమైన ఆసనాలమీద కూర్చోవాలో, ఏవిధమైన శయనాలమీద శయనించాలో; వివిధభావాలకు అనుగుణమైన ఆ ఆసనవిధానం చెప్పబడుచున్నది. (ఈ ఉపవేశనశయనాదులు కూడ అభినయరూపాలే).

**మూ. విష్కమ్భితాఞ్చితౌ పాదౌ త్రికం కించిత్సమున్నతమ్. 203**

**హస్తౌ కట్యూరువిన్యస్తౌ స్వస్థే స్యాదుపవేశనే,**

**పాదః ప్రసారితః కించిదేకశ్చైవాసనాశ్రయః. 204**

**తా.** పాదాలు విష్కంభితములై అంచితములై ఉండాలి. త్రికం కొంచెం ఎత్తాలి. చేతులు కటిప్రదేశంమీద ఊరువుల మీదా ఉంచాలి. ఇది స్వస్థుడుగా ఉన్న వాడు కూర్చుండే టప్పుడు కూర్చొనే పద్ధతి. కూర్చున్న తరవాత ఒక పాదం కొంచెం చాపబడు తుంది; రెండవది ఆసనం మీద లేదా దగ్గర ఉంటుంది.

**మూ. శిరః పార్శ్వనతం చైవ సచిన్త ఉపవేశనే,**

**చిబుకోపాశ్రితౌ హస్తౌ బాహుశీర్షాశ్రితం శిరః. 205**

**తా.** ఏదో ఆలోచిస్తూ కూర్చున్నప్పుడు శిరస్సు పక్కకి వంగి ఉంటుంది. చేతులు గడ్డం దగ్గర ఉంటాయి. తల భుజశిఖరంమీద ఆని ఉంటుంది.

**మూ. సంప్రణష్టేన్ద్రియమనాః శోకౌత్సుక్యోపవేశనే,**

**ప్రసార్య బాహూ శిథిలౌ తథాచోపాశ్రయాశ్రితః. 206**

**తా.** శోకంతోను, ఔత్సుక్యంతో (ఏమి కానున్నదో అనుచింతతో) కూర్చున్నప్పుడు ఇంద్రియాలు, మనస్సు పని చెయ్యవు. శిథిలంగా ఉన్న బాహువులను చాపి పక్క ఉన్న ఆధారాన్ని దేని నైనా ఆనుకొంటాడు.

**మూ. మోహమూర్ఛామదగ్లానివిషాదేషూపవేశయేత్,**

**సర్వపిణ్డీకృతాఙ్గస్తు సంయుక్తైః పాదజానుభిః. 207**

**తా.** మోహం, మూర్ఛ, మత్తు, అలసట, దుఃఖం – వీటిలో ఉన్నవానిని పాదాలు మోకాళ్లు దగ్గరగా చేర్చి శరీరం అంతా ముణుచుకొని కూర్చుండబెట్టాలి.

**మూ. వ్యాధిప్రీడితనిద్రాసు ధ్యానే చోపవిశేన్నరః,**
**తథా చోత్కటికం స్థానం స్ఫిక్పార్ష్ణీనాం సమాగమః. 208**
**పిత్ర్యే నివాపే జప్యే చ సన్ధ్యాస్వాచమనేఽపి చ,**
**విష్కమ్భితం పునశ్చైవ జాను భూమౌ నిపాతయేత్. 209**

**తా.** వ్యాధి, సిగ్గు, నిద్ర, ధ్యానం – ఈ పరిస్థితులలో నరుడు కూర్చొని ఉండాలి. తుంటెలు, మణవలు దగ్గరగా ఉండే టట్లు చేసి కూర్చున్న స్థితికి **ఉత్కటికస్థానం** అని పేరు (గొంతుక కూర్చుండడం). పితృతర్పణాలు చేసే టప్పుడు, జపం చేసే టప్పుడు, సంధ్యావందనసమయంలోను, ఆచమనంలోను ఉత్కటికస్థానంలో ఉండాలి. తరువాత పైకి ఎత్తిన ఒక మోకాలు నేలమీద పడవేయాలి. (ఒక మోకాలు పైకి ఉంటుంది).

**మూ. ప్రియాప్రసాదనే కార్యం హోమాదికరణేషు చ,**
**మహీగతాభ్యాం జానుభ్యామధోముఖవస్థితమ్. 210**

**తా.** ప్రియురాలిని అనుగ్రహింపచేసికొనేటప్పుడు, హోమాదులు చేసే టప్పుడు, మోకాళ్లు నేలమీద ఆన్చి ముఖం కిందికి వంచి ఉండాలి.

**మూ. దేవాభిగమనే చైవ రుషితానాం ప్రసాదనే,**
**శోకే ఆక్రన్దితే తీవ్రే మృతానాం చైవ దర్శనే. 211**
**త్రాసనే చ కుసత్త్వానాం నీచానాం చైవ యాచనే,**
**హోమయజ్ఞక్రియాయాం చ ప్రేష్యాణాం చైవ కారయేత్. 212**

**తా.** దేవతాసంనిధిలోను, కోపించినవాళ్లను బతిమానుకొనే టప్పుడు, శోకంలోను, నీచుల తీవ్రమైన ఏడ్పులోను, నీచులు మృతులను చూచే టప్పుడు, చిన్న జంతువులు (నక్కలు మొదలైనవి) నీచులను భయపెట్టినప్పుడు, నీచులు యాచించినప్పుడు, హోమాలలోను, యజ్ఞాలలోను, ఈ స్థితిలో ఉండాలి. పరిచారకులు కూడ ఈ స్థితిలో ఉండే టట్లు చెయ్యాలి.

**మూ. మునీనాం నియమేష్వేష భవేదాసనజో విధిః,**
**తథాసనవిధిః కార్యో వివిధో నాటకాశ్రయః. 213**

**తా.** పైన చెప్పిన ఆసనవిధానం మునులు పాటించే నియమాలలో పాటించ బడుతుంది. నాటకానికి సంబంధించి అనేకవిధా లైన ఆసనవిధానం ఉంటుంది.

**మూ. స్త్రీణాం చ పురుషాణాం చ బాహ్యశ్చాభ్యన్తరస్తథా,**
**ఆభ్యన్తరస్తు నృపతేర్బాహ్యో బాహ్యగతస్య చ. 214**

**తా.** నాటకాలలో, స్త్రీలకు పురుషులకూ కూడ బాహ్య మైన ఆసనవిధి, ఆభ్యంతర మైన ఆసనవిధి ఉంటాయి. రాజుకు సంబంధించినది రాజోచితమైనది, ఆభ్యంతరం;

బైటవాళ్లకు సంబంధించినది బాహ్యం.

**మూ. దేవానాం చ నృపాణాం చ దద్యాత్సింహాసనం ద్విజాః,**
**పురోధసామమాత్యానాం భవేద్వేత్రాసనం తథా. 215**

**ముణ్డాసనం చ దాతవ్యం సేనానీయువరాజయోః,**
**కాష్ఠాసనం ద్విజాతీనాం కుమారాణాం కుథాసనమ్. 216**

**ఏవం రాజసభాం ప్రాప్య కార్యస్త్వాసనజో విధిః,**
**స్త్రీణాం చాప్యాసనవిధిం సంప్రవక్ష్యామ్యహం పునః. 217**

**తా.** ద్విజులారా! (నాటకంలో) దేవతలకు రాజులకు సింహాసనం ఇవ్వాలి. పురోహితులకు, అమాత్యులకు వేత్రాసనం (పేప బెత్తం ఆసనం), సేనానాయకునకు యువరాజుకు ముండాసనం, బ్రాహ్మణులకు కాష్ఠాసనం (కఱ్ఱపీట), కుమారులకు (రాజ కుమారులకు) కుథాసనం, ఇవ్వాలి. రాజసభలో ఆసనవిధానం ఇలా ఉంటుంది. ఇప్పుడు స్త్రీలకు ఆసనవిధానాన్ని చెపుతాను.

**వి. ముండాసనం** అనగా **'చాతురీ'** అని అభినవవ్యాఖ్య. అర్థం తెలియలేదు. బహుశా సింహాసనం వంటి దానికే శిఖరం లేకపోతే అది ముండాసనం అయి ఉంటుంది. కుథం అనగా ఉన్నితో తయారు చేసిన రంగు రంగుల చిత్రాసనం.

**మూ. సింహాసనం తు రాజ్ఞీనాం దేవీనాం ముణ్డమాసనమ్,**
**పురోధోమాత్యపత్నీనాం దద్యాద్వేత్రాసనం తథా. 218**

**భోగినీనాం తథా చైవ వస్త్రం చర్మ కుథోఽపి వా,**
**బ్రాహ్మణీతాపసీనాం చ పట్టాసనమథాపి చ. 219**

**వైశ్యానాం చ ప్రదాతన్యమాసనం చ మయూరకమ్,**
**శేషాణాం ప్రమదానాం తు భవేద్ భూమ్యాసనం ద్విజాః. 220**

**తా.** పట్టమహిషులకు సింహాసనం ఇవ్వాలి. ఇతరరాజ భార్యలకు ముండాసనం, పురోహితుల భార్యలకు, అమాత్యుల భార్యలకు వేత్రాసనం, రాజుకు సంబంధించిన భోగినీస్త్రీలకు వస్త్రంకాని, చర్మ (లేడి చర్మం వంటిది), లేదా కుథం, బ్రాహ్మణస్త్రీలకు తాపసస్త్రీలకు (తపస్సు చేసికొనే స్త్రీలకు) పట్టాసనం, (వర్తకుల స్త్రీలకు, శ్రేష్ఠిభార్యలకు) మయూరాసనం ఇతర స్త్రీలకు నేలా ఆసనంగా ఇవ్వాలి.

వి. పట్టాసనం = కఱ్ఱబద్దల ఆసనం

మయూరాసనం = మెత్తని ఆసనం (cushion)

**మూ. ఏవమాభ్యన్తరో జ్ఞేయో బాహ్యశ్చాసనజో విధిః,**
**తథా స్వగృహవార్తాసు ఛన్దేనాసనమిష్యతే. 221**

**తా.** ఆభ్యంతరము(రాజసంనిధిలో అనుసరించవలసినది), బాహ్యము అయిన ఆసనవిధి ఈ విధంగా ఉండాలి. స్వగృహాలలోను, వార్తలలోను ఆసనవిధానం వారి వారి ఇచ్ఛను అనుసరించి ఉండవచ్చును.

**వి.** బాహ్యం అనగా రాజకుటుంబానికి, రాజ్యాధికారానికి చెందని ఇతరులకు సంబంధించినది అని అర్థం అయి ఉంటుంది. **"వార్తా"** అనడంచేత సేనాపతి అమాత్యుని ఇంటికి వెళ్లడం వంటిది అని సూచింపబడుతూన్నది" అని అభినవభారతి.

**మూ. నియమస్థమునీనాం చ భవేదాసనజో విధిః,**
**లిఙ్గినామాసనవిధిః కార్యో వ్రతసమాశ్రయః. 222**

**తా.** నియమంలో (దీక్షలో) ఉన్న మునుల ఆసనవిధానము, లింగుల ఆసనవిధానం వాళ్లు ఆ సమయంలో పాటిస్తూన్న వ్రతాన్ని పట్టి ఉంటుంది.

**మూ. బృసీముణ్డాసనప్రాయం వేత్రాసనమథాపి చ,**
**హోమే యజ్ఞక్రియాయాం చ పిత్ర్యేఽర్థే చ ప్రయోజయేత్. 223**

**తా.** హోమాదులు, యజ్ఞమూ జరిగే టప్పుడు, పితృకార్యాలు జరిగే టప్పుడు బృసి (దర్భాసనం) ముండాసనం వంటి ఆసనం కాని, వేత్రాసనం కాని ఉపయోగించాలి.

**మూ. స్థానీయా యే చ పురుషాః కులవిద్యాసమన్వితాః,**
**తేషామాసనసత్కారః కర్తవ్య ఇహ పార్థివైః. 224**

**తా.** ఉన్నతకులమునకు చెందినవాళ్లు, విద్యావంతులు అయిన స్థానీయపురుషులకు రాజులు ఆసనసత్కారం చెయ్యాలి.

**వి.** స్థానీయులు – ఆస్థానానికి హితులైన వృద్ధులు. ఆసనసత్కారం అనగా "రండి, ఈ ఆసనంమీద కూర్చొండి" అని అంటూ సత్కారం. (అ.భా.)

**మూ. సమే సమాసనం దద్యాత్ మధ్యే మధ్యమమాసనమ్,**
**అతిరిక్తేఽతిరిక్తం చ హీనే భూమ్యాసనం భవేత్. 225**

**తా.** అంత గొప్పవాడు కాకుండా, తక్కువ వాడూ కాకుండా ఉన్నవానికి వానికి తగిన సమమైన ఆసనం ఇవ్వాలి. మధ్యమునికి మధ్యమాసనం ఇవ్వాలి. వైశిష్ట్యం గలవానికి విశిష్టమైన ఆసనం ఇవ్వాలి. హీనునికి నేలను చూపించి కూర్చోమనాలి.

**మూ. ఉపాధ్యాయస్య నృపతేర్గురూణామగ్రతో బుధైః,**
**భూమ్యాసనం తథా కార్యమథవా కాష్ఠమాసనమ్. 226**

**తా.** ఉపాధ్యాయుని ఎదుట, రాజు ఎదుట, పూజ్యులైన పెద్దవారి ఎదుట, బుధులు భూమిరూప మైన ఆసనం (నేల) కాని కాష్ఠాసనం కాని ఏర్పరచుకోవాలి.

**వి.** ఇక్కడ కాష్ఠాసనం అనగా కటిక కఱ్ఱ బల్ల కాదు, చాలామంది కూర్చున్నా ఆగే మెత్తని సోఫావంటిది అని అర్థం. **"కాష్ఠమితి ఏకమేవ దీర్ఘం భారసహం పర్యఙ్కం దర్శయితుం కాష్ఠమిత్యుక్తం, న తు కాష్ఠమయమితి"** (అభి.భా.).

**మూ. నౌనాగరథయానేషు భూమికాష్ఠాసనేషు చ,**
**సహాసనం న దుష్యేత గురూపాధ్యాయపార్థివైః. 227**

**తా.** నావమీద, ఏనుగుమీద, రథంమీద ఎక్కి ప్రయాణం చేసే టప్పుడు, భూమి మీదా, కఱ్ఱతో చేసిన బల్లల వంటి ఆసనాలమీద గురు - ఉపాధ్యాయ - రాజులతో కలిసి కూర్చొనడం దోషం కాదు.

**మూ. ఆకుఞ్చితం సమం చైవ ప్రసారితవివర్తనే,**
**ఉద్వాహితం నతం చైవ శయనే కర్మ కీర్త్యతే. 228**

**తా.** శయనంలో - ఆకుంచితం, సమం, ప్రసారితం, వివర్తనం, ఉద్వాహితం, నతం అను కర్మలు జరుగుతాయి.

**మూ. సర్వైరాకుఞ్చితైరఙ్గైః శయ్యావిద్ధే తు జానునీ,**
**స్థానమాకుఞ్చితం నామ శీతార్తానాం ప్రయోజయేత్. 229**

**తా.** అవయవాలన్నీ దగ్గరగా ముణుచుకొని, మోకాళ్లతో శయ్య ఆవిద్ధం చేస్తూ (పొడుస్తూ) ఉన్న స్థానం **ఆకుంచితస్థానం**. దానిని చలితో బాధపడుతూన్నవారికి ప్రయోగించాలి.

**మూ. ఉత్తానితముఖం చైవ స్రస్తముక్తకరం తథా,**
**సమం నామ ప్రసుప్తస్య స్థానకం సంవిధీయతే. 230**

**తా.** ముఖం వెల్లగితలా ఉంటుంది. చేతులు రెండూ శిథిలంగా (పట్టు లేకుండా) జార్చి ఉంటాయి. ఇది సమం అనే స్థానం. ఇది గాఢనిద్రలో ఉన్నవానికి విధింపబడు తుంది.

**మూ. ఏకం భుజముపాధాయ సంప్రసారితజానుకమ్,**
**స్థానం ప్రసారితం నామ సుఖసుప్తస్య కారయేత్. 231**

**తా.** ఒక భుజం తలగడగా పెట్టుకొని మోకాళ్లు చాపిన ట్లయితే అది **ప్రసారిత స్థానకం**. హాయిగా నిద్రపోతూన్నవానిచేత ఇది ప్రయోగింపచెయ్యాలి.

**మూ. అధోముఖస్థితం చైవ వివర్తితమితి స్మృతమ్,**
**శస్త్రక్షతమృతోత్క్షిప్తమత్తోన్మత్తేషు కారయేత్. 232**

**తా.** ముఖం క్రిందికి వ్రేలాడదీసి ఉండడం **వివర్తితం**. ఆయుధం దెబ్బ తగిలినవాడు, మరణించినవాడు, పైకి ఎత్తబడినవాడు (పైకి ఎత్తబడిన మృతుడు). మత్తులో ఉన్నవాడు, ఉన్మత్తుడు వీరి విషయంలో దీనిని ప్రయోగించాలి.

**మూ. అంసోపరి శిరః కృత్వా కూర్పరక్షోభమేవ చ,**
**ఉద్వాహితం చ విజ్ఞేయం లీలయావేశనే ప్రభోః. 233**

**తా.** బుజం పైన శిరస్సు ఉంచి మోచెయ్యి పై కెత్తడం ఉద్వాహితం. దీనిని ప్రభువు విలాసగా శయనించడంలో వినియోగించాలి.

**మూ. ఈషత్ప్రసారితే జఙ్ఘే యత్ర స్రస్తౌ కరావుభౌ,**
**ఆలస్యశ్రమఖేదేషు నతం స్థానం ప్రచక్షతే. 234**

**తా.** మోకాళ్లు కొంచెం చాపి రెండు చేతులూ శిథిలంగా జారవిడిచి ఉంటే అది **నతస్థానం**. దీనిని అలసత్వంలోను, శ్రమలోను ఖేదంలోనూ (ఒళ్లు నొప్పులు మొ.) వినియోగించాలి.

**మూ. గతిప్రచారస్తు మయోదితోఽయం,**
**నోక్తశ్చ యః సోర్థవశేన సాధ్యః.**
**అతః పరం రఙ్గపరిక్రమస్య**
**వక్ష్యామి కక్ష్యాం ప్రవిభాగయుక్తామ్. 235**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే గతిప్రచారో నామ ద్వాదశోఽధ్యాయః.**

**తా.** గతిప్రచారం ఇంతవరకు నేను చెప్పాను. నేను చెప్పినదానిని అర్థవశంచేత, అవసరాన్ని బట్టి ప్రయోక్త సాధించుకోవాలి. ఇటుపైన రంగపరిక్రమణానికి అవసర మైన కక్ష్యావిభాగం చెపుతాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను భరతనాట్యశాస్త్రాంధ్ర వ్యాఖ్యానంలో గతిప్రచారం అను పన్నెండవ అధ్యాయం సమాప్తం.**

**"యావద్గతిఖేదవిధిప్రకటనమధ్యాయమిహ వివృణుతే,**
**స్మరమథనచరణసరసిజపరాగభూతోఽభినగుప్తః."**

**– శ్రీమదభినవగుప్తాచార్యాః.**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ త్రయోదశోఽధ్యాయః

# కరయుక్తిధర్మీవ్యంజకము

"దేశస్య బాహ్యాన్తరభేదికక్ష్యా
విభాగధర్మీ వివిధాం ప్రవృత్తిమ్,
ఆసూత్రయన్ దోషవిశుద్ధిదక్ష
క్రమోఽర్కదృష్టిర్జయతాద్వృషాఙ్కః."

– శ్రీమదభినవగుప్తాచార్యాః

**మూ. యే తు పూర్వం మయా ప్రోక్తాస్త్రయో వై నాట్యమణ్డపాః,**
**తేషాం విభాగం విజ్ఞాయ తతః కక్ష్యాం ప్రయోజయేత్. 1**

**తా.** వెనుక నేను చెప్పిన మూడు రకాలైన నాట్యమండపాల విభాగం తెలుసుకొని పిదప కక్ష్య (ఏది ఎక్కడ ఉండాలో, ఏ పని ఎక్కడ జరగాలో తెలిసికొనే వేరు వేరు స్థానాలను) ఏర్పరచుకోవాలి.

**మూ. యే నేపథ్యగృహద్వారే మయా పూర్వం ప్రకీర్తితే,**
**తయోర్భాణ్డస్య విన్యాసో మధ్యే కార్యః ప్రయోక్తృభిః. 2**

**తా.** నేపథ్యగృహానికి రెండు ద్వారా లుండా లని నేను చెప్పి ఉన్నాను కదా! నాట్యప్రయోక్తలు భాండాన్ని ఆ రెండు ద్వారాల మధ్యభాగంలో ఉంచాలి.

**వి.** భాండం అనగా తత – ఆవోద్య – త్రిపుష్కరాల సముదాయం. వాద్య సముదాయం.

**మూ. కక్ష్యావిభాగో నిర్దేశ్యో రఙ్గపీఠపరిక్రమాత్,**
**పరిక్రమేణ రఙ్గస్య కక్ష్యా హ్యన్యా విధీయతే. 3**

**తా.** రంగపీఠంమీద పరిక్రమం చేయబడుతుంది గాన కక్ష్యావిభాగం నిర్దేశించవలసి ఉంటుంది. పరిక్రమాన్ని పట్టి కక్ష్య మారిపోతూంటుంది కదా?

రంగపీఠంలో ఉంచిన భాండవాద్యానికి కొంత చోటు పోగా, ఆ స్థానంనుండి ప్రేక్షకుల వరకు ఉన్న రంగస్థలాన్ని ఇక్కడ ప్రవేశం, ఇక్కడనుంచి నిర్గమం, ఇక్కడ చారీ ప్రయోగం చెయ్యాలి, ఈ భాగం భూలోకం, ఇది పర్వతం, ఇది రథం ఉండే స్థానం ఇత్యాదివిధంగా స్థానాలను విభజిస్తే ఆ ప్రాంతంలో జరిగే అభినయాదికం చూడగానే చూచేవారికి ఇది రథారోహణస్థలం; అందుచేత ఇక్కడ ఇతడు రథారోహణం

అభినయిస్తున్నాడు. ఇది స్వర్గం; దేవతాపురుషుడు వస్తున్నాడు; ఇత్యాదివిధంగా కథా వస్తువులను, అర్థం చేసికొనడానికి వీలవుతుంది. ఈ నాటి సినీమాలలో వలె నగర – పర్వత – రథ – అశ్వ – స్వర్గ – పాతాలాదులను రంగంమీద ప్రత్యక్షంగా చూస్తున్నట్లు చూపడం అశక్యం కదా. అందుకే ఈ కక్ష్యావిభాగం అని భావం.

**మూ. కక్ష్యావిభాగే జ్ఞేయాని గృహాణి నగరాణి చ,**
**ఉద్యానారామసరితస్త్వాశ్రమా అటవీ తథా. 4**

**పృథివీ సాగరాశ్చైవ త్రైలోక్యం సచరాచరమ్,**
**వర్షాణి సప్త ద్వీపాశ్చ పర్వతా వివిధాస్తథా. 5**

**అలోకశ్చైవ లోకశ్చ రసాతలమథాపి చ,**
**దైత్యనాగాలయాశ్చైవ గృహాణి భవనాని చ. 6**

**తా.** కక్ష్యావిభాగం చేస్తే – గృహాలు, నగరాలు, ఉద్యానాలు చిన్న తోటలు, ఆశ్రమాలు, అడవి, భూమి, సాగరాలు, చరాచరసహితమైన లోకత్రయం, వర్షాలు (భరతవర్షాదులు), ఏడు ద్వీపాలు, అనేకపర్వతాలు, లోక – అలోకపర్వతాలు, రసాతలం, దైత్యలోకం, నాగలోకం, గృహాలు, భవనాలు – వీటి నన్నింటినీ తెలిసికొనడానికి శక్యం అవుతుంది.

**మూ. నగరే వా వనే వాపి వర్షే వా పర్వతేఽపి వా,**
**యత్ర వార్తా ప్రవర్తేత తత్ర కక్ష్యాం ప్రవర్తయేత్. 7**

**తా.** నగరంలో కాని, వనంలో కాని, వర్షంలో కాని, పర్వతంమీద గాని ప్రయోగించ బోయే రూపకంలోని కథాంశం ఎక్కడ జరుగుతుందో అక్కడ ఆ పేరుతో కక్ష్య ఏర్పరచాలి.

**మూ. బాహ్యం వా మధ్యమం వాపి తథైవాభ్యన్తరం పునః,**
**దూరం వా సంనికృష్టం వా దేశం తు పరికల్పయేత్. 8**

**తా.** (రంగస్థలంమీద) బాహ్యము (బైటది), మధ్యమము, అభ్యంతరము (లోపలిది) దూరము, దగ్గిర అని ప్రదేశాన్ని కల్పించాలి.

**మూ. పూర్వప్రవిష్టా యే రఙ్గం జ్ఞేయాస్తేఽభ్యన్తరా బుధైః,**
**పశ్చాత్ప్రవిష్టా విజ్ఞేయాః కక్ష్యాభాగే తు బాహ్యతః. 9**

**తా.** ముందుగా రంగంమీదికి ప్రవేశించినవాళ్లు అభ్యంతరు లనీ, తరువాత ప్రవేశించినవాళ్లు బాహ్యంనుండి వచ్చినవాళ్లని బుధులు గ్రహించాలి.

**మూ. తేషాం తు దర్శనేచ్ఛుర్యః ప్రవిశేద్రఙ్గమణ్డలమ్,**
**దక్షిణాముఖిముఖః సోఽథ కుర్యాదాత్మనివేదనమ్. 10**

**తా.** వాళ్ల (పూర్వప్రవిష్టుల) దర్శనం కోరుతూ రంగమండలంలో ప్రవేశించినవాడు దక్షిణాభిముఖుడై ఆత్మనివేదనం (తన పరిచయం తాను) చేసికోవాలి.

**మూ. యతోముఖం భవేద్ భాణ్డం ద్వారం నేపథ్యకస్య చ,**
**సా మన్తవ్యా తు దిక్ పూర్వా నాట్యయోగేన నిత్యశః. 11**

**తా.** భాండమూ, నేపథ్యగృహద్వారమూ దేని వైపు తిరిగిన ముఖంతో ఉంటుందో అది తూర్పు దిక్కు అని నాట్యప్రయోగంలో ఎల్లప్పుడూ గుర్తుంచుకోవాలి.

**మూ. నిష్క్రామేద్యశ్చ తస్మాద్వై స తేనైవ తథా వ్రజేత్,**
**యతస్తస్య కృతం తేన పురుషేణ నివేదనమ్. 12**

**తా.** అతడు ఆ ప్రదేశంనుంచి బైటకు వెళ్లవలసి ఉంటే ఏ వైపునుండి వచ్చి తాను తన పరిచయం తెలిపాడో ఆ వైపునుండే నిష్క్రమించాలి.

**మూ. నిష్క్రాన్తోఽర్థవశాచ్చాపి ప్రవిశేద్యది తత్ గృహమ్,**
**యతః ప్రాప్తః స పురుషః తేన మార్గేణ నిష్క్రమేత్. 13**

**తా.** ఏదో పనిమీద బైటకు వెళ్లినవాడు మళ్లీ ఆ గృహంలోనికి ప్రవేశిస్తే, అతడు ఏ మార్గంలో వచ్చాడో ఆ మార్గంనుండే బైటకు వెళ్లాలి.

**మూ. అథవార్థవశాచ్చాపి తేనైవ సహ గచ్ఛతి,**
**తథైవ ప్రవిశేద్గేహమేకాకీ సహితోఽపి వా. 14**

**తా.** లేదా అతడు పనిమీద ఎవనికి తన పరిచయం ఇచ్చాడో ఆతనితో కలిసి వెడితే, తిరిగి తాను ఒంటరిగా వచ్చినా, ఆతనితో కలిసి వచ్చినా, ఆ మార్గంనుండే ప్రవేశించాలి.

**మూ. తయోశ్చాపి ప్రవిశతోః కక్ష్యామన్యాం వినిర్దిశేత్,**
**పరిక్రమేణ రఙ్గస్య త్వన్యా కక్ష్యా విధీయతే. 15**

**తా.** వాళ్లిద్దరూ కలిసి ప్రవేశిస్తూన్నప్పుడు వాళ్లకు మరొక కక్ష్య చూపించాలి. పరిక్రమం చేసి రంగాన్ని దాటి వెడితే మరొక కక్ష్య విధింపబడుతుంది.

**మూ. సమైశ్చ సహితో గచ్ఛేన్నీచైశ్చ పరివాహితః,**
**అథ ప్రేక్ష(ష)ణికాశ్చాపి విజ్ఞేయా హ్యగ్రతో గతా. 16**

**తా.** సామూహికప్రవేశసమయంలో సములతో (సమానమైన హోదా కలవాళ్లతో) కలిసి నడవాలి. నీచులతో వెళ్ళినప్పుడు వాళ్లను తన చుట్టూ ఉంచుకొని నడవాలి. పరిచారికాదులు ముందు నడుస్తూ దారి చూపాలి.

**మూ. సైవ భూమిస్తు బహుభిర్విక్రుష్టా స్యాత్ పరిక్రమైః,**
**మధ్యా వా సంనికృష్టా వా తేషామేవ వికల్పనాత్. 17**

**తా.** అధే భూమి చాలా పరిక్రమాలు చేస్తే దూరం అవుతుంది. పరిక్రమల హెచ్చుతగ్గులవల్ల అదే భూమి మధ్య అవుతుంది, సంనికృష్ట అవుతుంది.

**మూ. నగరే వా వనే వాపి సాగరే పర్వతేఽపి వా,**
**దివ్యానాం గమనం కార్యం ద్వీపే వర్షేషు వా పునః. 18**
**ఆకాశేన విమానేన మాయయాప్యథవా పునః,**
**విచిత్రాభిః క్రియాభిర్వా నానార్థాభిః ప్రయోగతః. 19**

**తా.** నగరమునందైనా, వనమునందైనా, సాగరమునందైనా, పర్వతముపై నైనా, ద్వీపమునందైనా, వర్షాలలో నైనా దివ్యుల గమనం, విమానం మీద గాని, మాయచేత గాని ఆకాశమార్గంలోనే జరగాలి. లేదా నాట్యప్రయోగానుసారం అనేకప్రయోజనాలను ఉద్దేశించి బలాత్కారంగా హరించడం మొదలైన పనులను బట్టి దేవతల ఆకాశగమనం ఉంటుంది.

**మూ. నాటకే ఛన్నవేషాణాం దివ్యానాం భూమిసంచరః,**
**మానుషే కారణాదేషాం యథా భవతి దర్శనమ్. 20**

**తా.** మనుష్యలోకంలో ఏదో కారణంవల్ల, భక్తానుగ్రహాదికారణంవల్ల, దివ్య పురుషుల దర్శనం అయినట్లే నాటకంలో, రహస్యమైన వీళ్ల వేషాలతో భూమిసంచారం జరుగుతుంది.

**మూ. భారతే త్వథ హైమే వా హరివర్ష ఇలావృతే,**
**రమ్యే కింపురుషే వాపి కురుషూత్తరకేషు వా. 21**
**దివ్యానాం ఛన్దగమనం సర్వవర్షేషు కీర్తితమ్.**

**తా.** దివ్యపురుషులకు – భారతవర్షంలోను, హేమకూటంలోను, హరివర్షంలోను, ఇలావృతవర్షంలోను రమ్యమైన కింపురుషవర్షంలోను, ఉత్తరకురుదేశంలోను, అన్ని వర్షాలలోనూ కూడ స్వేచ్ఛాసంచారం చెప్పబడుచున్నది.

**మూ. భారతే మానుషాణాం చ గమనం సంవిధీయతే. 22**

**గచ్ఛేద్యది వికృష్టస్తు దేశకాలవశాన్నరః,**
**అఙ్కచ్ఛేదే తమన్యస్మిన్ నిర్దిశేద్ధి ప్రవేశకే. 23**

**తా.** భారతవర్షంలో మానవులు కూడ స్వేచ్ఛగా దూరదేశాలకు వెళ్లి నట్లు వర్ణనం చేయబడుతూంటుంది. మానవుడు, దేశ – కాలానుసారం ఈ విధంగా అతిదూర ప్రదేశానికి వెళ్లి నట్ల యితే, నాటకంలోని ఒక అంకం ముగించి, వానిని మరొక ప్రవేశకంలో

నిర్దేశించాలి. ఒకడు ఒకచోటనుండి సుదూరదేశం వెళ్లి నట్లు అదే అంకంలో చూపకూడ దని భావం.

**మూ. అహ్నః ప్రమాణం గత్వా తు కార్యలాభం వినిర్దిశేత్,**
**తథాలాభే తు కార్యస్య అఙ్కచ్ఛేదో విధీయతే. 24**

**తా.** ఒక పగటిభాగం లేదా ఒక దివసం పూర్తి అయేసరికి ప్రారంభించిన కార్యం సిద్ధించి నట్లు చూపాలి. అలా కార్యలాభం కలగకపోతే అంకాన్ని పూర్తిచేసివెయ్యాలి.

**మూ. క్షణో ముహూర్తో యామో వా దివసో వాపి నాటకే,**
**ఏకాఙ్కే సంవిధాతవ్యో బీజస్యార్థవశానుగః. 25**

**తా.** నాటకంలో బీజం ప్రయోజనానికి అనుగుణంగా, క్షణమైనా, ముహూర్త మైనా, యామమైనా, దివసమైనా ఒకే అంకంతో సంబంధించి నట్లు కూర్చాలి.

**మూ. అఙ్కచ్ఛేదే తు నిర్వృత్తం మాసం వా వర్షమేవ వా,**
**నోర్ధ్వం వర్షాత్ ప్రకర్తవ్యం కార్యమఙ్కసమాశ్రయమ్. 26**

**తా.** ఒక మాసమైనా, సంవత్సర మైనా, అంకచ్ఛేదంలో జరిగిపోయినట్లు ప్రదర్శించాలి. ఒక అంకానికి సంబంధించిన కార్యం ఒక సంవత్సరంకంటె అధిక మైన కాలం తీసికొన్నట్లు చూపకూడదు.

**మూ. ఏవం తు భారతే వర్షే కక్ష్యా కార్యా ప్రయోగతః,**
**మానుషాణాం గతిర్యా తు దివ్యానాం తు నిబోధత. 27**

**తా.** భారతవర్షంలో, మానుషగతిప్రయోగాన్ని అనుసరించి, నాటకరంగస్థలంమీద కక్ష్యావిభాగం పైన చెప్పినట్లుగా చెయ్యాలి. ఇపుడు దివ్యపురుషులకు సంబంధించిన ప్రయోగాలలో కక్ష్యావిభాగం చెపుతున్నాను; వినండి.

**మూ. హిమవత్పృష్ఠసంస్థే తు కైలాసే పర్వతోత్తమే,**
**యక్షాశ్చ గుహ్యకాశ్చైవ ధనదానుచరాశ్చ యే. 28**

**తా.** యక్షులు, గుహ్యకులు, కుబేరుని అనుచరులైన వీరందరూ హిమవత్పర్వతం పైన ఉన్న కైలాసపర్వతంమీద సంచరిస్తారు.

**మూ. రక్షఃపిశాచభూతాశ్చ సర్వే హైమవతాః స్మృతాః,**
**హేమకూటే చ గన్ధర్వా విజ్ఞేయాః సాప్సరోగణాః. 29**

**తా.** రాక్షసులు, పిశాచాలు, భూతాలు – వీళ్లందరూ హిమవత్పర్వతప్రాంత నివాసులుగా చెప్పబడుతున్నారు. గంధర్వులు, అప్సరఃస్త్రీగణాలు హేమకూటంమీద నివసిస్తారు.

**మూ. సర్వే నాగాశ్చ నిషధే శేషవాసుకితక్షకాః,**
**మహామేరౌ త్రయస్త్రింశద్ జ్ఞేయా దేవగణా బుధైః. 30**

**తా.** శేషవాసుకితక్షకాదినాగు లందరూ నిషధపర్వతప్రాంతంలోను, ముప్ఫైమూడు దేవగణాలు మహామేరుపర్వతంమీదా ఉంటారు.

**మూ. నీలే తు వైదూర్యమయే సిద్ధా బ్రహ్మర్షయస్తథా,**
**దైత్యానాం దానవానాం చ శ్వేతపర్వత ఇష్యతే. 31**

**తా.** వైదూర్యమణులు అధికంగా లభించే నీలపర్వతంమీద సిద్ధులు, బ్రహ్మర్షులు ఉంటారు. శ్వేతపర్వతంమీద దైత్యులు, దానవులు ఉంటారు.

**మూ. పితరశ్చాపి విజ్ఞేయాః శృఙ్గవన్తం సమాశ్రితాః,**
**ఇత్యేతే పర్వతాః శ్రేష్ఠాః దివ్యావాసాః ప్రకీర్తితాః. 32**

**తా.** పితృదేవతలు శృంగవత్పర్వతాన్ని ఆశ్రయించుకొని ఉంటారు. ఈ విధంగా శ్రేష్ఠములైన ఈ పర్వతాలు దేవతాపురుషుల నివాసస్థానాలుగా చెప్పబడ్డాయి.

**మూ. తేషాం కక్ష్యావిభాగశ్చ జమ్బూద్వీపే భవేదయమ్,**
**తేషాం న చేష్టితం కార్యం స్వైః స్వైః కర్మపరాక్రమైః. 33**

**తా.** జంబూద్వీపంలో ప్రదర్శించే నాటకాల రంగస్థలంమీద ఆ యా దేవతాస్థానాల కక్ష్యల విభాగం పైన చెప్పిన విధంగా చెయ్యాలి. అయితే ఆ దేవతాపురుషులు ఏ విధంగా తమ పరాక్రమంచేత ఎలాంటి చేష్టలు చేస్తారో, ఎలాంటి కర్మలు చేస్తారో అవి ఈ రంగంమీద ప్రదర్శించకూడదు. (అది శక్యం కాదు కదా!)

**మూ. పరిచ్ఛేదవిశేషస్తు తేషాం మానుషలోకవత్,**
**సర్వే భావాశ్చ దివ్యానాం కార్యా మానుషసంశ్రయాః. 34**

**తా.** వాళ్ల కర్మ పరాక్రమాదులు మనుష్యలోకానికి అనుగుణంగా, పరిచ్ఛిన్నములై, మానవుల శక్తిని మించనివై, ఉండాలి. దివ్యపురుషుల కార్యా లన్నీ మనుష్యులకు సంబంధించినవై జరిగినట్లు ఉండాలి.

**మూ. తేషాం త్వనిమిషత్వం యత్తన్న కార్యం ప్రయోక్తృభిః,**
**ఇహ భావా రసాశ్చైవ దృష్టావేవ ప్రతిష్ఠితాః. 35**
**దృష్ట్యా హి సూచితో భావః పునరఙ్గైర్విభావ్యతే.**

**తా.** దివ్యపురుషులకు రెప్పపాటు ఉండదుకదా అని, నాట్యప్రయోక్తలు ఆ అనిమిషత్వాన్ని నాట్యంలో ప్రయోగించకూడదు. ఎందువల్ల ననగా నాట్యంలో చేయవలసిన

రస – భావావిష్కరణం అంతా దృష్టిమీదనే ఆధారపడి ఉంటుంది. దృష్టి చేత సూచించిన భావమే అంగాలచేత ప్రకటింపబడుతుంది కదా?

**మూ. ఏవం కక్ష్యావిభాగస్తు మయా ప్రోక్తో ద్విజోత్తమాః. 36**
**పునశ్చైవ ప్రవక్ష్యామి ప్రవృత్తీనాం తు లక్షణమ్.**

**తా.** ద్విజోత్తములారా! నే నీ విధంగా మీకు కక్ష్యావిభాగాన్ని గూర్చి చెప్పాను. ఇప్పుడు ప్రవృత్తుల లక్షణం చెపుతాను.

**వి.** **'ప్రవృత్తి'** ఆ యా దేశాలలో (ప్రాంతాలలో) ప్రచారంలో ఉన్న వేషాలు, భాషలు, ఆచారాలు – వీటి విచిత్రత. **"ప్రవృత్తిః దేశవిశేషగతా వేషభాషాసమాచారవైచిత్ర్య సిద్ధిరుచ్యతే."** (అభి.భా.)

**మూ. చతుర్విధా ప్రవృత్తిశ్చ ప్రోక్తా నాట్యప్రయోగతః,**
**ఆవన్తీ దాక్షిణాత్యా చ పాఞ్చాలీ చౌడ్రమాగధీ. 37**

**తా.** నాటప్రయోగానుసారం, ప్రవృత్తి – ఆవన్తి, దాక్షిణాత్య, పాంచాలి, ఓఢ్రమాగధి అని నాలుగు విధాలుగా చెప్పబడింది.

**మూ. అత్రాహ – ప్రవృత్తిరితి కస్మాత్? పృథివ్యాం నానాదేశవేషభాషాచారవార్తాః ప్రఖ్యాపయతీతి వృత్తిః. ప్రవృత్తిశ్చ నివేదనే. అత్రాహ – యథా (దా) పృథివ్యాం బహవః దేశాః సన్తి, కథమాసాం, చతుర్విధత్వముపపన్నమ్? సమానలక్షణశ్చాసాం ప్రయోగ ఉచ్యతే? సత్యమేతత్; సమానలక్షణ ఆసాం ప్రయోగః. కింతు నానాదేశవేషభాషాచారో లోక ఇతి కృత్వా లోకానుమతేన వృత్తిసంశ్రితస్య నాట్యస్య వృత్తీనాం మయా చతుర్విధత్వ మభిహితం – భారతీ, సాత్వతీ, కైశికీ, ఆరభటీ చేతి. వృత్తిసంశ్రితైశ్చ ప్రయోగైరభిహితా దేశాః, యతః ప్రవృత్తిచతుష్టయమభినిర్వృత్తం ప్రయోగశ్చోత్పాదితః.**

**తా.** ఇక్కడ అడుగుతున్నాడు – **ప్రవృత్తి** అని దీనిని ఎందు కంటున్నావు? చెపుతున్నాం; విను. **'వృత్తి'** అనగా అనేకవిధాలైన దేశాల వేషాలను, భాషలను, ఆచారాలను, వార్తనూ – అనగా కృషివాణిజ్యం, పశుపాలన మొదలైన వాటినీ, తెలిపేది. వాటి నన్నింటినీ విశేషించి స్పష్టంగా చెప్పేది **'ప్రవృత్తి'**. మళ్లీ ప్రశ్నిస్తున్నాడు – భూమిమీద అనేకమైన దేశా లున్నాయి కదా; అలాంటప్పుడు ఈ ప్రవృత్తులు నాలుగే అనడం ఎలా కుదురుతుంది? వీటి ప్రయోగలక్షణాలు కూడ సమంగానే ఉంటా యని కూడ అంటున్నావు! (సమాధానం) నువ్వు అంటూన్నది నిజమే; వీటి ప్రయోగం సమానలక్షణ మైనదే. అయినా కూడ – లోకంలో అనేకమైన దేశాలు, వేషాలు, భాషలూ, ఆచారాలూ కూడా ఉంటాయి గాన, లోకం అంగీకరించినవిధంగా ఒక విధమైన పద్ధతిని ఆశ్రయించి ఉన్న నాట్యంలో

వృత్తులు భారతి, సాత్త్వతి, కైశికి, ఆరభటి అని నాలుగు విధాలుగా ఉంటా యని నేను చెప్పాను. ఆ వృత్తులను ఆశ్రయించిన ప్రయోగాలను బట్టి, ఏ దేశాలలో నాలుగు విధాల ప్రవృత్తులు ప్రచారంలో ఉన్నాయో, ఆ ప్రవృత్తుల ద్వారా నాట్యప్రయోగం కనుగొన బడిందో ఆ దేశాలను గూర్చి చెప్పాను.

**వి. అభినవభారతిలో** దీని భావం ఈ విధంగా స్పష్టీకరించబడింది – లోకాన్ని (భారతదేశాన్ని) దక్షిణాపథం, పూర్వదేశం, పశ్చిమదేశం, ఉత్తరభూమి, అని నాలుగు విధాలుగా విభజించడం జరిగింది. ఇది నిమిత్తం ఏదీ లేకుండా చేసిన విభజనం కాదు. ఎందుచేత ననగా – ఇది చిత్తవృత్తుల సామ్యాన్ని పట్టి చేసిన విభజనం. శృంగార ప్రచుర మైన కైశికీవృత్తి దాక్షిణాత్యులలో అధికంగా ఉంటుంది. పశ్చిమదేశాలలో ఆవంతి చేరుతుంది. అక్కడ కూడ కైశికి ఉంటుంది; అయితే – ధర్మప్రాధాన్యంవల్ల సాత్త్వతీవృత్తి అధికంగా ఉంటుంది. ప్రాచ్యదేశాలలో ఫటాటోపము, వాక్యాడంబరం ఎక్కువ ఉండడం వల్ల భారతీవృత్తి, ఆరభటీ కలిసి ఉంటాయి. ఉత్తరభూమిలో భారత్యారభటీయోగమే ప్రధానంగా ఉన్నా కైశికి కూడ కొంచెం ఉండడంవల్ల అక్కడి వాళ్లు శృంగారమయ మైన ప్రయోగాన్ని సహిస్తారు ... ఈ విధంగా చిత్తవృత్తుల సాదృశ్యాన్ని పట్టి చేసిన నాలుగు విధాలైన లోకవిభాగమే ఇక్కడ కూడ చేయబడింది.

**మూ. తత్ర దాక్షిణాత్యాస్తావత్ బహునృత్తగీతవాద్యాః కైశికీప్రాయాః చతురమధురలలితాఙ్గాభినయాశ్చ. తద్యథా –**

**తా.** దాక్షిణాత్యులలో నృత్త – గీత – వాద్యాల ఉపయోగం అధికంగా ఉంటుంది. వీరిలో కౌశికీవృత్తి ప్రయోగం కూడ అధికం. వీళ్ల ఆంగికాభినయం నేర్పుతో మధురంగాను, లలితంగాను ఉంటుంది. అదెట్లనగా –

**మూ. మహేన్ద్రో మలయః సహ్యో మేకలః పాలమఞ్జరః,**
**ఏతేషు యే శ్రితా దేశాః స జ్ఞేయో దక్షిణాపథః. 38**

**కోసలాస్తోశలాశ్చైవ కలిఙ్గా యవనాః ఖసాః,**
**ద్రవిడాన్ధ్రమహారాష్ట్రా వైష్ణా (వేణ్ణా) వై వానవాసజాః. 39**

**దక్షిణస్య సముద్రస్య తథా విన్ధ్యస్య చాన్తరే,**
**యే దేశాస్తేషు యుఞ్జీత దాక్షిణాత్యాం తు నిత్యశః. 40**

**తా.** మహేంద్రము, మలయము, సహ్యము, మేకలము, పాలమంజరము అను పర్వతాలను ఆశ్రయించుకొని ఉన్న దేశాలకు దక్షిణాపథం అని పేరు. కోసలదేశము, తోశల దేశము, కలింగ – యవన – ఖస – ద్రవిడ – ఆంధ్ర – మహారాష్ట్రదేశములు,

వైష్ణ (వేణ్ణ) దేశము, వానవాసదేశము అను, దక్షిణసముద్రానికీ వింధ్యపర్వతానికీ మధ్య నున్న దేశాలలో దాక్షిణాత్యప్రవృత్తిని ప్రయోగించాలి.

**మూ.** **ఆవన్తికా వైదిశికా సౌరాష్ట్రా మాలవాస్తథా,**
**సైన్ధవాస్త్వథ సౌవీరా ఆవర్తాః సార్బుదేయకాః. 41**

**దాశార్ణాస్త్రైపురాశ్చైవ తథా వై మార్తికావతాః,**
**కుర్వన్త్యావన్తికీమేతే ప్రవృత్తిం నిత్యమేవ తు. 42**

**తా.** అవంతికి, విదిశకు చెందినవాళ్ళు, సౌరాష్ట్ర – మాలవ – సింధు – సౌవీర – ఆవర్త – అర్బుదేయ – దశార్ణ – త్రిపుర – మృత్తికావద్దేశాలకు చెందినవారు 'ఆవంతికీ' ప్రవృత్తిని ప్రయోగిస్తారు.

**మూ.** **సాత్త్వతీం కైశికీం చైవ వృత్తిమేషాం సమాశ్రితా (తః),**
**భవేత్ ప్రయోగో నాట్యేఽత్ర స తు కార్యః ప్రయోక్తృభిః. 43**

**తా.** వీళ్ల ప్రయోగం సాత్త్వతీ – కైశికీవృత్తులను ఆశ్రయించి ఉంటుంది. అందుచేత నాట్యప్రయోక్తలు ఈ దేశాలలో వీటిని ప్రయోగించాలి.

**మూ.** **అఙ్గవఙ్గాః కలిఙ్గాశ్చ వత్సాశ్చైవౌఢ్రమాగధాః,**
**పౌణ్డ్రా నేపాలకాశ్చైవ అన్తర్గిరిబహిర్గిరాః. 44**

**తథా ప్లవఙ్గమా జ్ఞేయా మలదా మల్లవర్తకాః,**
**బ్రహ్మోత్తరప్రభృతయో భార్గవా మార్గవాస్తథా. 45**

**ప్రాగ్జ్యోతిషాః పులిన్దాశ్చ వైదేహాస్తామ్రలిప్తకాః,**
**ప్రాఙ్గాః ప్రావృతయశ్చైవ యుఞ్జన్తీహౌఢ్రమాగధీమ్. 46**

**అన్యేఽపి దేశాః ప్రాచ్యాం యే పురాణే సంప్రకీర్తితాః,**
**తేషు ప్రయుజ్యతే హ్యేషా ప్రవృత్తిశ్చౌఢ్రమాగధీ. 47**

**తా.** అంగ – వంగ – కలింగ – వత్స – ఓఢ్రమగధ – పౌండ్ర – నేపాలదేశీయులు, అక్కడ ఉన్న పర్వతాలకు ఇటు అటూ ఉన్నవాళ్లు, ప్లవంగములు, మలదులు, మల్లవర్తకులు, బ్రహ్మోత్తరులు మొదలైనవాళ్లు, భార్గవులు, మార్గవులు, ప్రాగ్జ్యోతిషానికి చెందినవాళ్లు, పులిందులు, వైదేహులు, తామ్రలిప్తికులు, ప్రాంగులు, ప్రావృతులు ఓఢ్రమాగధీప్రవృత్తిని అనుసరిస్తారు. పురాణాలలో చెప్పిన ఇతరమైన దేశాలలో ఉండేవారు కూడ ఈ ఓఢ్రమాగధీ ప్రవృత్తిని అనుసరిస్తారు.

**వి.** వీటిలో కొన్ని దేశాల పేర్లు, కొన్ని దేశవాసుల పేర్లు, ఒకే పదం దేశవాచకం గాను, దేశవాసిజనవాచకం గాను ప్రయోగిస్తారు. ఉదాహరణకి – 'ఆన్ధ్రాః' అనగా ఆంధ్రదేశ

మనీ, ఆంధ్రదేశనివాసు లనీ కూడ అర్థం. దేశవాచకపదాలు బహువచనంలోనే ప్రయోగించాలని కూడ నియమం. 'ఆంధ్రాః' అనగా ఆంధ్రదేశం అనీ, ఆంధ్రు లనీ కూడ అర్థం.

**మూ. పాఞ్చాలాః సౌరసేనాశ్చ కాశ్మీరా హస్తినాపురాః,**
**బాహ్లీకాః శల్యకాశ్చైవ మద్రకౌశీనరాస్తథా. 48**
**హిమవత్సంశ్రితా యే తు గఙ్గాయాశ్చోత్తరాం దిశమ్,**
**యే శ్రితా వై జనపదాస్తేషు పాఞ్చాలమధ్యమాః. 49**
**పాఞ్చాలమధ్యమాయాం తు సాత్వత్యారభటీ స్మృతా,**
**ప్రయోగస్త్వల్పగీతార్థ ఆవిద్ధగతివిభ్రమః. 50**

**తా.** పాంచాల – సౌరసేన – కాశ్మీరదేశీయులు, హస్తినాపురవాసులు, బాహ్లీకులు, శల్యకులు, మద్రకులు, ఉశీనరులు, గంగకు ఉత్తరదిశలో ఉన్న జనపదాలలో ఉన్నవాళ్లు, పాంచాలమధ్యమప్రాంతీయులు పాంచాలమధ్యమప్రవృత్తి కలవారు, సాత్వతీ – ఆరభటీ వృత్తులను ప్రయోగిస్తారు. సంగీతం స్వల్పంగా ఉంటుంది. ఆవిద్ధగతి అధికంగా ఉంటుంది.

**మూ. ద్విధా గతిర్భవత్యాసాం రఙ్గపీఠపరిక్రమే,**
**ప్రదక్షిణప్రదేశా చ తథా చాప్యప్రదక్షిణా. 51**

**తా.** ఈ ప్రవృత్తుల రంగపీఠపరిక్రమణం ప్రదక్షిణపరిక్రమం గాను, అప్రదక్షిణ పరిక్రమంగాను రెండు విధాల ఉంటుంది.

**వి.** ఉత్తరద్వారంలోనుంచి ప్రవేశించి, పశ్చిమదిక్కులో పరిక్రమణం చేసి, తరువాత దక్షిణదిక్కునందు, పిమ్మట తూర్పుదిక్కునందు పరిక్రమణం చేసి, తరువాత ఉత్తరదిక్కున పరిక్రమణం చేసి, అక్కడినుండి తూర్పుకు, అక్కడినుండి దక్షిణానికి, అక్కడినుండి పశ్చిమానికి వెళ్లి ఉత్తరదిక్కునుండి నిష్క్రమిస్తే అది ప్రదక్షిణ ప్రవృత్తి. ఇదే విధంగా దక్షిణద్వారంనుంచి ప్రవేశించి ఆ యా దిక్కులయందు పరిక్రమణం చేసి దక్షిణద్వారం గుండా నిష్క్రమించడం అప్రదక్షిణం (అభి.భా.)

**మూ. ఆవన్తీ దాక్షిణాత్యా చ ప్రదక్షిణపరిక్రమే,**
**అపసవ్యప్రదేశాస్తు పాఞ్చాలీ చోఢ్రమాగధీ. 52**

**తా.** ఆవంతీ, దాక్షిణాత్యాప్రవృత్తులు ప్రదక్షిణపరిక్రమం గలవి. పాంచాలీ – ఓఢ్రమాగధులు అపసవ్యపరిక్రమం గలవి.

**మూ. ఆవన్త్యాం దాక్షిణాత్యాయాం పార్శ్వద్వారమథోత్తరమ్,**
**పాఞ్చాల్యామోఢ్రమాగధ్యాం యోజ్యం ద్వారం తు దక్షిణమ్. 53**

**తా.** ఆవన్తీ – దాక్షిణాత్యప్రవృత్తులయందు పార్శ్వదారం ఉత్తరాన ఉంటుంది. పాంచాలీ – ఓఢ్రమాగధులలో ఇది దక్షిణంగా ఉండాలి.

**మూ. ఏకీభూతాః పునశ్చైతాః ప్రయోక్తవ్యాః ప్రయోక్తృభిః,**
**పార్షదం దేశ కాలౌ వాప్యర్థయుక్తిమవేక్ష్య చ. 54**

**తా.** ఈ నాలుగు విధాలైన ప్రవృత్తులనూ కూడ, నాట్యప్రయోక్తలు, పార్షదుని (అనగా ఆనాడు ఆనాట్యప్రయోగం నిర్వహించిన స్వామి) అభిప్రాయాన్ని, దేశ – కాలాలను, విషయప్రాధాన్యాన్ని అనుసరించి, కలిపి ప్రయోగించవచ్చును.

**మూ. యేషు దేశేషు యా కార్యా ప్రవృత్తిః పరికీర్తితా,**
**తద్వృత్తికాని రూపాణి తేషు తద్జ్ఞః ప్రయోజయేత్. 55**

**తా.** ఏ దేశాలలో ఏ ప్రవృత్తిని చెయ్యా లని (ప్రయోగించా లని) చెప్పబడిందో, ఆ దేశాలలో ఆ వృత్తులు గల రూపకాలను, ఆ వృత్తులను ప్రయోగించు నేర్పు గలవాడు ప్రయోగించాలి.

**మూ. ఏకీభూతాః పునస్త్వేతా నాటకాదౌ భవన్తి హి,**
**అవేక్ష్య వృత్తిబాహుల్యం తత్తత్కర్మ సమాచరేత్. 56**

**తా.** నాటకాదులలో, అనగా నాట్యప్రయోగాలలో, ఈ వృత్తులు కలుస్తూనే ఉంటాయి. (అనగా మొత్తం ప్రయోగం అంతా ఒకే వృత్తిలో జరపడం కుదరదు). వృత్తుల బాహుల్యాన్ని (చాలా వృతులుండడాన్ని) పరిశీలించుకొంటూ ఆ యా కర్మలు ప్రవర్తింపచెయ్యాలి.

**మూ. (సార్థే బాహుల్యమేకస్య శేషాణామథ బుద్ధిమాన్,**
**యేషామన్యస్య బాహుల్యం ప్రవృత్తిం పూరయేత్తదా. 57**

**తా.** అనేకవృత్తుల (ప్రవృత్తులు) కలిసి నప్పుడు ఆ సముదాయంలో ఒకదానికి సంబంధించిన అంగాలను అధికంగా ప్రయోగిస్తూ, మిగిలినవాటిని తగు విధంగా ప్రయోగిస్తూ, బుద్ధిమంతుడు ప్రధానమైన ప్రవృత్తిని పరిపూర్ణం చెయ్యాలి.)

**మూ. ప్రయోగో ద్వివిధశ్చైవ విజ్ఞేయో నాటకాశ్రయః,**
**సుకుమారస్తథావిద్ధో నాట్యయుక్తిసమాశ్రయః. 58**

**తా.** నాటకానికి సంబంధించిన, (అనగా నాట్యానికి సంబంధించిన) ప్రయోగం సుకుమారము, ఆవిద్ధము అని రెండు విధాలుగా ఉంటుంది. ఇది నాట్యప్రయోగం అవసరాలను పట్టి ఉంటుంది.

**వి.** ఇక్కడ నాటకాశ్రయః అన్నప్పుడు 'నాటక' శబ్దానికి రూపకాలలో మొదటి దైన నాటకం అని కాక 'నాట్యం' అను సామాన్యార్థం గ్రహించాలి అని **అభినవభారతి**. ఇంకా అనేకస్థలాలలో కూడ ఈ పదం 'నాట్యం', 'నాట్యప్రయోగం' అను సామాన్యార్థం లోనే ప్రయోగించబడింది.

**మూ. యత్త్వావిద్ధాఙ్గహారం తు ఛేద్యభేద్యాహవాత్మకమ్,**
**మాయేన్ద్రజాలబహులం పుస్తనేపథ్యసంయుతమ్. 59**

**పురుషైర్బహుభిర్యుక్తమల్పస్త్రీకం తథైవ చ,**
**సాత్త్వత్యారభటీయుక్తం నాట్యమావిద్ధసంజ్ఞితమ్. 60**

**తా.** ఆవిద్ధం అనే నాట్యంలో సాత్త్వతీ – ఆరభటీవృత్తు లుంటాయి. అంగహారాలు ఉత్కటంగానూ తీవ్రంగాను ఉంటాయి. ఛేదించడాలు, బ్రద్దలుకొట్టడాలు, యుద్ధాలు ఎక్కువగా ఉంటాయి. మాయా – ఇంద్రజాలాదుల ప్రయోగం అధికంగా ఉంటుంది. పుస్తములతో వేషధారణ ఉంటుంది. దీనిలో పురుషులు అధికంగాను స్త్రీలు అల్పంగాను ఉంటారు.

**వి. 'మాయ'** అనగా మంత్ర – ఓషధాదుల సహాయంతో రూపం మార్చివేయడం మొదలైనది. **'ఇంద్రజాలం'** అనగా హస్తలాఘవము, సాదృశ్యము మొదలైనవాటిచేత చేయబడే కనికట్టు. **'పుస్తం'** అనగా కర్రతోను, మట్టితోను చేసిన వివిధాకారములైన బొమ్మలు, ముఖాలు, తలలు మొదలైనవి.

**మూ. డిమః సమవకారశ్చ వ్యాయోగేహామృగాస్తథా,**
**ఏతన్యావిద్ధసంజ్ఞాని విజ్ఞేయాని ప్రయోక్తృభిః. 61**

**తా.** డిమం, సమవకారం, వ్యాయోగం, ఈహామృగం – ఇవి ఆవిద్ధనాట్యములు అని నాట్యప్రయోక్తలు తెలుసుకోవాలి.

**మూ. ఏషాం ప్రయోగః కర్తవ్యో దైత్యదానవరాక్షసైః,**
**ఉద్ధతా యే చ పురుషాః శౌర్యవీర్యబలాన్వితాః. 62**

**తా.** దైత్యులు, దానవులు, రాక్షసులు, శౌర్య – వీర్య – బలా లున్న ఉద్ధతులైన (పొగరుబోతులైన పురుషులు) ఆవిద్ధనాట్యాలు ప్రయోగించాలి. వీటిలో పాత్రలుగా ఉండాలి.

**మూ. నాటకం సప్రకరణం భాణో వీథ్యఙ్కనాటికే,**
**సుకుమారప్రయోగాణి మానుషేష్వాశ్రితాస్తు యే. 63**

**తా.** నాటకం, ప్రకరణం, భాణం, వీథి, అంకం, నాటిక ఇవి సుకుమారమైన ప్రయోగం గలవి. ఇవి మనుష్యులకు సంబంధించినవి.

**మూ. అథ బాహ్యప్రయోగేషు ప్రేక్షాగృహవివర్జితే,**
**విదిక్ష్వపి భవేద్రఙ్గః కదాచిద్ భర్తురాజ్ఞయా. 64**

**తా.** నాట్యప్రయోగాధిపతి ఆజ్ఞాపించిన ట్లయితే ప్రేక్షాగృహం లేని ఆరుబైట కూడ నాట్యరంగం విదిక్కులలో (దిక్కుల మూలలలో) అప్పుడప్పుడు ఏర్పాటు చేయవచ్చు.

**మూ. పృష్ఠే కృత్వా కుతపం నాట్యే యుక్తా యతోముఖం భరతాః,**
**సా పూర్వా మన్తవ్యా ప్రయోగకాలే తు నాట్యజ్ఞైః. 65**

**తా.** నటులు, వాద్యసముదాయం తమ వెనుక ఉండేటట్లు, ఎటు వైపు తిరిగి నాట్య ప్రయోగం చేస్తారో అది తూర్పుదిక్కు అని భావించాలి.

**మూ. ద్వారాణి షట్ చైవ భవన్తి చాస్య రఙ్గస్య దిగ్భాగవినిశ్చితాని,**
**నాట్యప్రయోగేణ ఖలు ప్రవేశే ప్రాచ్యాం ప్రతీచ్యాం చ దిశి ప్రవేశః. 66**

**తా.** ఆరుబైట నిర్మించిన ఈ రంగానికి ఆ యా దిక్కులలో నిశ్చయించి ఆరు ద్వారాలు ఏర్పరచాలి. వీటిని నాట్య ప్రయోగసమయంలో ప్రవేశానికి ఉపయోగించాలి. ప్రవేశద్వారం తూర్పుదిక్కునందు, పశ్చిమ దిక్కునందు ఉండాలి.

**మూ. విధానముత్క్రమ్య యథా చ రఙ్గే వినా ప్రమాణాద్విదిశః ప్రయోగే,**
**ద్వారం తు యస్మాత్సమృదఙ్గభాణ్డం ప్రాచీం దిశం తాం మనసాధ్యవస్యేత్. 67**

**తా.** విధానాన్ని (నియమాన్ని) ఉల్లంఘించి రంగస్థలం ఏర్పరచినప్పుడు, ప్రమాణం లేకుండా విదిక్కును ఉపయోగించినప్పుడు, ఎటువైపు మృదంగము, ఇతరవాద్య సముదాయమూ ఉంటుందో ఆ దిక్కు తూర్పు అని మనసా భావించాలి.

**మూ. వయోనురూపః ప్రథమం తు వేషో వేషానురూపశ్చ గతిప్రచారః,**
**గతిప్రచారానుగతం చ పాఠ్యం పాఠ్యానురూపోఽభినయశ్చ కార్యః. 68**

**తా.** ముందుగా – వయస్సుకు అనురూప మైన వేషం ధరించాలి. గతిప్రచారం వేషానికి అనుగుణంగా ఉండాలి. పాఠ్యం (గద్యపద్యాదిరూపంలో ఉండే సంభాషణాదికం) గతిప్రచారానికి అనుగుణంగా ఉండాలి. పాఠ్యానికి అనుగుణంగా అభినయం చెయ్యాలి.

**మూ. ధర్మీ యా ద్వివిధా ప్రోక్తా మయా పూర్వం ద్విజోత్తమాః,**
**లౌకికీ నాట్యధర్మీ చ తయోర్వక్ష్యామి లక్షణమ్. 69**

**తా.** ద్విజోత్తములారా! నేను వెనుక చెప్పిన లోకధర్మి, నాట్యధర్మి అను రెండు విధాలైన ధర్ముల లక్షణం చెపుతాను.

**మూ. స్వభావభావోపగతం శుద్ధం త్వవికృతం తథా,**
**లోకవార్తాక్రియోపేతమఙ్గలీలావివర్జితమ్. 70**

**స్వభావాభినయోపేతం నానాస్త్రీపురుషాశ్రయమ్,**
**యదీదృశం భవేన్నాట్యం లోకధర్మీ తు సా స్మృతా. 71**

**తా.** స్వాభావికమైన భావాలతో, ఏ వికారాలు (మార్పులు) లేక, శుద్ధంగా ఉండేది లోకధర్మి. దీనిలో లోకంలో ప్రసిద్ధమైన విషయాలు, పనులు మాత్రమే ఉంటాయి. అవయవాలు, లీలలు (విలాసలు) ఏవీ ఉండవు. సహజమైన అభినయమే ఉంటుంది. అనేకవిధాలైన స్వభావాలు గల స్త్రీలకు, పురుషులకు సంబంధించి ఉంటుంది.

**మూ. అతివాక్యక్రియోపేతమతిసత్త్వాతిభావకమ్,**
**లీలాఙ్గహారాభినయం నాట్యలక్షణలక్షితమ్. 72**

**స్వరాలఙ్కారసంయుక్తమస్వస్థపురుషాశ్రయమ్,**
**యదీదృశం భవేన్నాట్యం నాట్యధర్మీ తు సా స్మృతా. 73**

**తా.** నాట్యధర్మిలో నైతే మాటలు, పనులు అతిగా ఉంటాయి. సాత్త్వికభావాలు, ఇతరభావాలు వీటి ప్రదర్శన అతిగా ఉంటుంది. విలాసలు, అంగహారాభినయాలు ఉంటాయి. నాట్యానికి ఏ లక్షణాలు శాస్త్రంలో చెప్పబడ్డాయో వాటిని అనుసరించి ఉంటుంది. స్వరాలు, అలంకారాలు ప్రయోగింపబడతాయి. అస్వస్థులైన పురుషులను, అనగా తాము సహజంగా ఎలా ఉంటారో అలా ఉండకుండా తెచ్చిపెట్టుకొన్న మాటలూ చేష్టలూ చేసే పురుషులను, ఆశ్రయించుకొని ఉంటుంది.

**మూ. లోకప్రసిద్ధం ద్రవ్యం తు యదా నాట్యే ప్రయుజ్యతే,**
**మూర్తిమత్ సాభిలాషం చ నాట్యధర్మీ తు సా స్మృతా. 74**

**తా.** లోకప్రసిద్ధమైన ద్రవ్యమే (విషయమే) నాట్యంలో మూర్తి లేనిదానిని మూర్తి ఉన్నదానినిగాను, అభిలాష లేనిదానిని అభిలాష ఉన్నదానిని గాను ప్రయోగించినట్లయితే అది **నాట్యధర్మి.**

**వి. 'మాయాపుష్పకం'** అను నాటకంలో **"తతః ప్రవిశతి బ్రహ్మశాపః"** (ఇంతలో బ్రహ్మశాపం ప్రవేశిస్తుంది) అనేది ఉదాహరణం. (అభి.భా.)

**మూ. ఆసన్నోక్తం తు యద్వాక్యం న శృణ్వన్తి పరస్పరమ్,**
**అనుక్తం శ్రూయతే వాక్యం నాట్యధర్మీ తు సా స్మృతా. 75**

**తా.** దగ్గరగా ఉన్నవాళ్లు చెప్పిన మాటే పరస్పరమూ వినరు. చెప్పని మాట (ఆకాశభాషితాదికం) వినిపిస్తుంది. ఇలా చేయడం నాట్యధర్మి.

**మూ. శైలయానవిమానాని చర్మవర్మాయుధధ్వజాః,**
**మూర్తిమన్తః ప్రయుజ్యన్తే చర్మకర్మాయుధధ్వజాః. 76**

**తా.** పర్వతాలు, విమానాలు, కవచం, ఆయుధాలు, ధ్వజాలు – వీటిని మూర్తి మంతాలుగా, (కొన్నింటిని యథార్థంగాను, కొన్నింటిని వస్త్ర – దారుఖండాదుల రూపాలలోను) చూపుతూంటారు. ఇది **నాట్యధర్మి.**

**మూ. (య ఏకాం భూమికాం కృత్వా కుర్వీతైకాన్తరేఽపరామ్,**
**కౌశల్యాదేకకత్వాద్వా నాట్యధర్మీతి సా స్మృతా. 77**

**తా.** ఒక నటుడు, ఒక భూమిక వహించి, నేర్పువల్లగాని, మరొకడు లేక తానొక్కడే ఉండడంచేత గాని, కొంచెం వ్యవధిలో మరొకభూమిక వహిస్తే (మరొక పాత్రగా వేషం వేస్తే) అది **నాట్యధర్మి**).

**మూ. యాఽగమ్యా ప్రమదా భూత్వా గమ్యా భూమిషు యుజ్యతే,**
**గమ్యా భూమిరగమ్యా చ నాట్యధర్మీ తు సా స్మృతా. 78**

**తా.** ఒక స్త్రీ అగమ్యాభూమిక (కులస్త్రీ భూమిక) ధరించి, మరొకప్పుడు గమ్యా భూమికలో (వేశ్యవంటి భూమికలో) చూపబడినా, గమ్యాభూమిక వహించినది అగమ్యా భూమికలో చూపబడినా అది **నాట్యధర్మి.**

**మూ. లలితైః పదవిన్యాసైస్తథోత్క్షిప్తపదక్రమైః,**
**నృత్యతే గమ్యతే యచ్చ నాట్యధర్మీ తు సా స్మృతా. 79**

**తా.** (నాట్యంలో) లలితమైన అంగవిన్యాసాలతో నృత్యం చేస్తున్నా రంటె, కాళ్లు పైకి ఎత్తి విసురుతూ నడుస్తున్నా రంటే – అది **నాట్యధర్మి.**

**మూ. యోఽయం స్వభావో లోకస్య సుఖదుఃఖక్రియాత్మకః,**
**సోఽఙ్గాభినయసంయుక్తో నాట్యధర్మీ తు సా స్మృతా. 80**

**తా.** సుఖించడం, దుఃఖించడం, ఏ వేవో పనులు చేస్తూండడం – ఈ విధమైన లోక స్వభావం అంగాభినయంతో చూపబడుతూన్న దంటే ఇది **నాట్యధర్మి.**

**మూ. యశ్చేతిహాసవేదార్థో బ్రహ్మణా సముదాహృతః,**
**దివ్యమానుషరత్యర్థం నాట్యధర్మీ తు సా స్మృతా. 81**

**తా.** ఇతిహాసాలలోని విషయాలు, వేదాలలోని విషయాలు దేవతల ప్రీతికొరకు మనుష్యుల ప్రీతికొరకు నాట్యవస్తువుగా బ్రహ్మచేత చెప్పబడిం దంటే అది **నాట్యధర్మి.**

**మూ. యశ్చ కక్ష్యావిభాగోఽయం నానావిధిసమాశ్రితః,**
**రఙ్గపీఠగతః ప్రోక్తః నాట్యధర్మీ తు సా భవేత్. 82**

**తా.** నాట్యరంగంలో కక్ష్యావిభాగం అనేకమైన విధానాలు చెప్పబడినవి కదా! అదంతా **నాట్యధర్మి.**

**మూ. నాట్యధర్మీప్రవృత్తం హి సదా నాట్యం ప్రయోజయేత్,**
**న హ్యఙ్గాభినయాత్ కించిదృతే నాట్యం ప్రవర్తతే. 83**

**తా.** నాట్యధర్మీలతో ప్రవర్తించే నాట్యాన్నే ప్రయోగించాలి. అంగాభినయం లేకుండా నాట్యం ప్రవర్తించదుకదా?

**మూ. సర్వస్య సహజో భావః సర్వో హ్యభినయోఽర్థతః,**
**అఙ్గాలంకారచేష్టాభిర్నాట్యధర్మీ ప్రకీర్తితా. 84**

**తా.** లోకంలో ప్రతీవానికీ సహజంగా ఏదో భావం ఉంటూనే ఉంటుంది. అన్ని విధాల అభినయమూ కూడ అర్థాన్ని అనుసరించే ఉంటుంది. అంగ – అలంకార చేష్టలచేత చేసే ఈ అర్థాభినయమే **నాట్యధర్మి** అని చెప్పబడుతుంది.

**మూ. ఏవం కక్ష్యావిభాగస్తు ధర్మీ యుక్తయ ఏవ చ,**
**విజ్ఞేయా నాట్యతత్త్వజ్ఞైః ప్రయోక్తవ్యాశ్చ తత్త్వతః. 85**

**తా.** ఈ విధంగా కక్ష్యావిభాగమూ, ధర్మి, ప్రవృత్తులు తెలుసుకోవాలి. ఇవన్నీ తెలిసికొన్న నాట్యతత్త్వజ్ఞులు వీటిని అన్నింటినీ యథాశాస్త్రంగా ప్రయోగించాలి.

**మూ. ఉక్తో మయేహాభినయో యథావత్ శాఖాకృతో యశ్చ కృతోఽఙ్గహారైః,**
**పునశ్చ వాక్యాభినయం యథావద్వక్ష్యే స్వరవ్యఞ్జనవర్ణయుక్తమ్. 86**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే కరయుక్తిధర్మీవ్యఞ్జకో నామ త్రయోదశోఽధ్యాయః.**

**అఙ్గాభినయః సమాప్తః.**

**తా.** ఇక్కడ నేను, అంగకృతము, అంగహారకృతమూ అయిన అభినయం యథా శాస్త్రంగా చెప్పాను. ఇపుడు స్వరములు, వ్యంజనములు వాక్యాభినయమూ – వీటిని గూర్చి చెపుతాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో**
**కర – యుక్తి – ధర్మీవ్యంజక మను పదమూడవ అధ్యాయం సమాప్తం.**

**శీతాంశుమణ్డలకశేఖరపాదపద్మ**
**కిఞ్జల్కపూగపరిపూతశిరోరుహేణ,**
**వృత్తిః కృతాభినగుప్తపదాభిధేన**
**కక్ష్యాఙ్కచిత్రతలలక్షణవర్ణనేఽస్మిన్.**

**– శ్రీమదభినవగుప్తాచార్యపాదాః.**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ చతుర్దశోఽధ్యాయః

# ఛన్దోవిధానము

*ద్విధా స్థితం సద్మ (కర్మ) సదావిభక్తం,*
*విశ్వాన్ పదార్థాన్ సముపాదదానమ్.*
*పాణీన్ద్రియం సంవ్యవహారహేతుం*
*యస్యేశ్వరం తం వరదం నమామః.*

*– శ్రీమదభినవగుప్తాచార్యాః*

**మూ. యో వాగభినయః ప్రోక్తో మయా పూర్వం ద్విజోత్తమాః,**
**లక్షణం తస్య వక్ష్యామి స్వరవ్యఞ్జనసంభవమ్. 1**

**తా.** ద్విజోత్తములారా! వెనుక నేను వాగభినయాన్ని గూర్చి చెప్పాను. ఇప్పుడు, అచ్చుల, హల్లుల, కలయికవల్ల ఏర్పడిన దాని లక్షణం చెపుతాను.

**మూ. వాచి యత్నస్తు కర్తవ్యో నాట్యస్యేయం తనుః స్మృతా,**
**అఙ్గనేపథ్యసత్త్వాని వాక్యార్థం వ్యఞ్జయన్తి హి. 2**

**తా.** వాక్కు (speech) విషయంలో బాగా ప్రయత్నం చెయ్యాలి. వాక్కు నాట్యానికి శరీరం అని పెద్ద లంటారు. అంగాలు, వేషమూ, సాత్త్వికభావాదులు వాక్యార్థాన్ని వ్యంజింపచేస్తాయి. (వాక్యం అనేది ఉంటేనే కదా వాక్యార్థమూ దాని అభినయమూ అనేవి ఉంటాయి!)

**మూ. వాఙ్మయానీహ శాస్త్రాణి వాఙ్నిష్ఠాని తథైవ చ,**
**తస్మాద్వాచః పరం నాస్తి వాగ్ హి సర్వస్య కారణమ్. 3**

**తా.** శాస్త్రా లన్నీ వాఙ్మయాలే, వాక్స్వరూపాలే. వాక్కుమీదనే నిలచి ఉన్నాయి. అందుచేత వాక్కుకంటె గొప్పది మరేదీ లేదు. వాక్కే అన్నింటికీ కారణం.

**మూ. ఆగమనామాఖ్యాతనిపాతోపసర్గసమాసతద్ధితైర్యుక్తః,**
**సన్ధివచనవిభక్త్యుపగ్రహనియుక్తో వాచికాభినయః. 4**

**తా.** ఆగమాలు, నామాలు, ఆఖ్యాతలు, నిపాతలు, ఉపసర్గలు, సమాసములు, తద్ధితలు, సంధులు, వచనాలు, విభక్తులు, ఉపగ్రహాలు – వీటిచేత వాచికాభినయం ఏర్పడుతుంది, లేదా నియమితం అవుతుంది.

**మూ. ద్వివిధం హి స్మృతం పాఠ్యం సంస్కృతం ప్రాకృతం తథా,**
**తయోర్విభాగం వక్ష్యామి యథావదనుపూర్వశః. 5**

**తా.** సంస్కృతము, ప్రాకృతమూ అని పాఠ్యం (పఠింపదగిన, అనగా నోటితో ఉచ్చరించే గద్యపద్యగీతాదిరూపమైన భాష) రెండు విధాలు. (నాట్యంలో ఉపయోగించే) ఈ భాషల స్వరూపస్వభావాలను గూర్చి ఆనుపూర్వికంగా (ఒకదాని తరువాత ఒకటి చొప్పున) చెపుతాను.

**మూ. వ్యఞ్జనాని స్వరాశ్చైవ సన్ధయోఽథ విభక్తయః,**
**నామాఖ్యాతోపసర్గాశ్చ నిపాతాస్తద్ధితాస్తథా. 6**

**ఏతైరఙ్గైః సమాసైశ్చ నానాధాతుసమాశ్రయమ్,**
**విజ్ఞేయం సంస్కృతం పాఠ్యం, ప్రయోగం చ నిబోధత. 7**

**తా.** సంస్కృతరూపమైన పాఠ్యం – వ్యంజనములు (హల్లులు), స్వరములు (అచ్చులు), సంధులు, విభక్తులు, నామలు, ఆఖ్యాతాలు, ఉపసర్గలు, నిపాతలు, తద్ధితలు (తద్ధితప్రత్యయాలు) ఈ అంగాలతోను, సమాసాలతోను కూడినదీ, అనేక ధాతువులను ఆశ్రయించినదీ, లేదా అనేకధాతువులతో కూడినదీ అయినది అని తెలుసుకోవాలి. దాని ప్రయోగాన్ని గూర్చి తెలుసుకొనండి.

**మూ. అకారాద్యాః స్వరా జ్ఞేయా ఔకారాన్తాశ్చతుర్దశ,**
**హకారాన్తాని కాదీని వ్యఞ్జనాని విదుర్బుధాః. 8**

**తా.** అకారం మొదలు 'ఔ' వరకు ఉన్న పద్దెనిమిది అక్షరాలు స్వరా లనీ, 'క' మొదలు 'హ' వరకు ఉన్నవి వ్యంజనములు అని పండితులు చెపుతారు.

**మూ. తత్ర స్వరాశ్చతుర్దశ – అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ ఇతి స్వరా జ్ఞేయాః.**

**కాదీని వ్యఞ్జనాని యథా :– క ఖ గ ఘ ఙ; చ ఛ జ ఝ ఞ; ట ఠ డ ఢ ణ; త థ ద ధ న ; ప ఫ బ భ మ ; య ర ల వ శ ష స హ ఇతి వ్యఞ్జనవర్గః.**

**తా.** స్వరాలు పద్నాలుగు అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అనేవి స్వరాలు (అచ్చులు). 'క' మొదలైన వ్యంజనాలు (హల్లులు) ఎట్లనగా – క ఖ గ ఘ ఙ (కవర్గం), చ ఛ జ ఝ ఞ (చవర్గం), ట ఠ డ ఢ ణ (టవర్గం), తథ ద ధ న (తవర్గం) ప ఫ బ భ మ (పవర్గం) య ర ల వ శ ష స హ – ఇది వ్యంజనాల వర్గం.

**మూ. వర్గే వర్గే సమాఖ్యాతా ద్వౌ వర్ణౌ ప్రాగవస్థితౌ,**
**అఘోషా ఇతి యే త్వన్యే సఘోషాః సంప్రకీర్తితాః. 9**

**తా.** ప్రతీవర్గంలోను (కవర్గం మొదలు పవర్గం వరకు ఉన్న ఐదు వర్గాలలోను) మొదటి రెండు వర్ణాలు అఘోషవర్ణా లనీ, మిగిలినవి సఘోషవర్ణా లనీ చెప్పబడు తున్నాయి.

**మూ. అష్టౌ స్థానాని వర్ణానామురః కణ్ఠః శిరస్తథా,**
**జిహ్వామూలశ్చ దన్తాశ్చ నాసికోష్ఠౌ చ తాలు చ. 10**

**తా.** వర్ణాలకు వక్షఃస్థలము, కంఠము, శిరస్సు, జిహ్వామూలం (నాలుకమొదలు) దంతాలు, నాసిక, ఓష్ఠాలు (పెదవులు), తాలు (దౌడల లోపలి భాగాలు) ఈ ఎనిమిదీ స్థానాలు.

**వి.** కొన్ని అక్షరాలను ఉచ్చరించినప్పుడు నాభిస్థానంనుండి పైకి బయలుదేరిన ప్రాణవాయువు ముఖంలోని ఆ యా అవయాలపై రాపిడి (ఆఘాతం) కలిగిస్తుంది. దానిని పట్టి ఆ అక్షరానికి స్థానం (ఉచ్చరించడానికి అధికంగా పనిచేసే శిరస్సులోని ప్రదేశం) ఆ అక్షరానికి స్థానం అని చెప్పబడుతుంది. ఉదాహరణకి – 'క ఖ గ ఘ' లను ఉచ్చరించి నప్పుడు గాలి తాకిడి కంఠంలో ఎక్కువ తగిలినట్లు కనబడుతుంది గాన వాటిని కంఠ్యాక్షరా లంటారు. 'ప ఫ బ భ' లను ఉచ్చరించి నప్పుడు పెదవులమీద గాలి తాకిడి, కదలికా ఎక్కువగా ఉంటాయి గాన వాటిని ఓష్ఠ్యము లంటారు. ఇట్లే ఇతరవర్ణాల విషయంలో కూడ చూచుకోవాలి.

**మూ. అ కు హ విసర్జనీయాః కణ్ఠ్యాః. ఇ చు య శాః తాలవ్యాః. ఋ టు ర షాః మూర్ధన్యాః. ఌ తు ల సాః దన్త్యాః. ఉ పు ఉపధ్మానీయాః ఓష్ఠ్యాః.' ప ఫ' ఇతి పఫాభ్యాం ప్రాక్ అర్ధవిసర్జనీయ సదృశః ఉపధ్మానీయః. ' క, ఖ' ఇతి≍కఖాభ్యాః ప్రాక్ అర్ధవిసర్గ సదృశః జిహ్వామూలీయః. ఏ ఐ కణ్ఠతాలవ్యౌ. ఓ ఔ కణ్ఠోష్ఠ్యౌ. వకారో దన్తోష్ఠ్యః. ఙ ఞ ణ న మాః అనునాసికాః. విసర్జనీయః ఔరస్య ఇత్యేకే. సర్వవర్ణానాం ముఖం స్థానమిత్యపరే.**

**తా.** అ, కు (కవర్గాక్షరాలు) హ, విసర్గ – ఇవి కంఠ్యాలు. (కంఠంతో ఉచ్చరించ బడేవి. వీటిని ఉచ్చరించే టప్పుడు కంఠంలోపల గాలి తాకిడి ఎక్కువగా ఉంటుంది). ఇ, చ వర్గాక్షరాలు, య, శ – ఇవి తాలవ్యాలు. ఋ, టవర్గాక్షరాలు, ర, ష – ఇవి మూర్ధన్యాలు, ఌ, తవర్గాక్షరాలు ల, స – ఇవి దంత్యాలు. ఉ, పవర్గాక్షరాలు, ఉపధ్మానీయము – ఇవి ఓష్ఠ్యాలు. ప ఫ ల కు ముందు ఉన్న విసర్గను కూడ అర్ధవిసర్గను వలె ఉచ్చరిస్తారు. ఈ అర్ధవిసర్గకు (ః) జిహ్వామూలీయం అని పేరు. ఏ ఐ – ఈ రెండూ కంఠతాల్యవాలు. ఓ ఔ – ఈ రెండూ కంఠోష్ఠ్యాలు. 'వ' దంతోష్ఠ్యము. (కంఠము తాలువులూ కూడ ఉచ్చారణస్థానాలుగా ఉంటే అవి కంఠతాలవ్యాలు. అట్లే మిగిలిన చోట్ల). ఙ ఞ ణ న మ – ఇవి అనునాసికలు. ఇవి ఏ వర్గాలకు చెందినవో ఆ స్థానాలతో పాటు వీటికి నాసిక కూడ ఉచ్చారణస్థానం కాబట్టి వీటికి అనునాసికలు పేరు. విసర్గ (ః) ఔరస్యము – దీనికి

స్థానం వక్షఃస్థలము అని కొంద రంటారు. అన్ని వర్ణాలకు ముఖమే స్థానం అని కొంద రంటారు. (ఇది స్థూలంగా చెప్పిన మాట).

**మూ. ద్వౌ ద్వౌ వర్ణౌ తు వర్గాద్యౌ శషసాశ్చ త్రయోఽపరే,**
**అఘోషాః ఘోషవన్తస్తు తతోఽన్యే పరికీర్తితాః. 11**

**తా.** ఐదు వర్గాల మొదటి రెండేసి వర్ణాలు, 'శ ష స' లు అఘోషలు. మిగిలిన వన్నీ సఘోషవర్ణాలు.

**వి.** అఘోషవర్ణాలను ఉచ్చరిస్తూన్నపుడు ఆ వర్ణాలు ఆ యా ఉచ్చారణస్థానాలను అంటి పెట్టుకొన్న ట్లుండడంచేత వాటి ఘోష (చప్పుడు) తక్కువగా ఉన్నట్లూ, మిగిలిన వర్ణాలు తమ స్థానాలను కొంచెం శిథిలంగా పట్టుకొన్న ట్లుండడంచేత అవి కొంచెం గుల్ల చప్పుడుతో ఉన్నట్లు వినబడతాయి. అందుచేత మొదటి తెగకు చెందిన వర్ణాలకు అఘోష లనీ, మిగిలినవాటికి సఘోష లనీ పేర్లు వచ్చి ఉంటాయి.

**మూ. ఏతే ఘోషాఘోషాః కణ్ఠ్యోష్ఠ్యా దన్త్యజిహ్వ్యానునాసిక్యాః,**
**ఊష్మాణస్తాలవ్యా విసర్జనీయాశ్చ బోద్ధవ్యాః. 12**

**తా.** ఘోషాఘోషము లైన (కొన్ని ఘోషములు, కొన్ని అఘోషములూ అయిన) కంఠ్యములు, ఓష్ఠ్యములు, దంత్యములు, జిహ్వామూలీయము, ఆనునాసిక్యము, ఊష్మలు, తాలవ్యములు, విసర్జనీయములు ఈ క్రింద చెప్పబోవు విధంగా తెలియదగినది.

**మూ. గ ఘ ఙ జ ఝ ఞ డ ఢ ణ ద ధ న బ భ మ తథైవ య ర ల**
**వా మతా ఘోషాః.**
**క ఖ చ ఛ ట ఠ త థ ప ఫ ఇతి వర్గేష్వఘోషాః స్యుః. 13**

**తా.** గ ఘ ఙ, జ ఝ ఞ, డ ఢ ణ, ద ధ న, బ భ మ, య ర ల వ – ఇవి ఘోషములు. క ఖ, చ ఛ, ట ఠ, త థ. ప ఫ అనే వర్గప్రథమద్వితీయాక్షరాలు అఘోషములు.

**మూ. క ఖ గ ఘ ఙాః కణ్ఠస్థాః తాలుస్థానాస్తు చ ఛ జ ఝ ఞాః,**
**ట ఠ డ ఢ ణాః మూర్ధన్యాః త థ ద ధ నాశ్చైవ దన్తస్థాః. 14**
**ప ఫ బ భ మాస్త్వోష్ఠ్యాః స్యుః దన్త్యా ఌ ల సా అ హౌ చ కణ్ఠస్థౌ,**
**తాలవ్యా ఇ చు యశాః స్యుర్ఋ టు ర షా మూర్ధస్థితా జ్ఞేయాః. 15**
**ఌ ౡ దన్త్యౌ ఓ ఔ కణ్ఠోష్ఠ్యౌ ఏ ఐకారౌ చ కణ్ఠతాలవ్యౌ,**
**కణ్ఠ్యో విసర్జనీయో జిహ్వామూలసముద్భవః క ఖ యోః. 16**

**తా.** క ఖ గ ఘ ఙ – వీటికి కంఠం స్థానం. చ ఛ జ ఝ ఞ – వీటికి తాలు స్థానం. ట ఠ డ ఢ ణ – వీటికి మూర్ధ (శిరస్సు) స్థానం. త థ ద ధ న – వీటికి

దంతాలు స్థానం. ప ఫ బ భ మ – వీటికి ఓష్ఠాలు స్థానం. ఌ ల స – వీటికి దంతాలు స్థానం. అ హ – వీటికి కంఠం స్థానం. ఇ చవర్గ య శ – వీటికి తాలవులు స్థానం. ఋ, టవర్గ, ర, ష – వీటికి మూర్ధ స్థానం. ఌ ౡ వీటికి దంతాలు స్థానం. ఓ ఔ – వీటికి కంఠోష్ఠాలు స్థానం. ఏ ఐ – వీటికి కంఠ – తాలువులు స్థానం. విసర్గకు కంఠం స్థానం. విసర్గకు క ఖ లు పరంగా ఉన్నప్పుడు దానికి జిహ్వామూలం స్థానం.

**మూ. పఫయోరోష్ఠస్థానం భవేదుకారః స్వరో వివృతః,**
**స్పృష్టాః కాద్యా మాన్తాః శ ష స హ కారాస్తథా వివృతాః. 17**

**తా.** విసర్గకు ప ఫ లు పరంగా ఉన్నప్పుడు ఆ విసర్గకు 'ఉ'కు ఓష్ఠం స్థానం. అచ్చు లకు 'వివృతం'. 'క' మొదలు 'మ' వరు ఉన్న అక్షరాలు 'స్పృష్టాలు', అనగా వీటి ప్రయత్నం 'స్పృష్టం'. శ ష స హ – ఇవి 'వివృతములు'. (వీటి ప్రయత్నం వివృత ప్రయత్నం).

**మూ. అన్తస్థాః సంవృతజాః ఙ ఞ ణ న మా నాసికోద్భవాః జ్ఞేయాః,**
**ఊష్మాణశ్చ శ ష స హా య ర ల వర్ణాస్తథైవ చాన్తస్థాః. 18**

**తా.** అంతస్థాలు 'సంవృతాలు'. ఙ, ఞ, ణ, న, మ – లు అనునాసికలు. శ ష స హ లకు ఊష్మ లనీ, య ర ల వ లకు అంతస్థ లనీ పేర్లు.

**మూ. జిహ్వామూలీయ క ప ఉపధ్మానీయసంజ్ఞయా జ్ఞేయః,**
**క చ ట త పాః స్వరితాః స్యుః ఖ చ థ ఫాః స్యుః సదా క్రమ్యాః. 19**

**తా.** 'క' కు జిహ్వామూలీయం అనీ, ' ప'కు ఉపధ్మానీయం అని పేరు. క చ ట త ప లు స్వరితములు. ఖ చ ఠ థ ఫ లు క్రమ్యాలు.

**మూ. కణ్ఠోరస్యాన్ విద్యాత్ ఘ ఝ ఢ ధ భాన్ పాఠ్యసంప్రయోగే తు,**
**వేద్యో విసర్జనీయో జిహ్వాస్థానే స్థితో వర్ణః. 20**

**తా.** పాఠ్యం ఉచ్చరించేటప్పుడు, ఘ – ఝ – ఢ – ధ – భ లు – కంఠం దగ్గర వక్షస్థలం దగ్గరా పుట్టినట్లు ఉచ్చరించాలి. విసర్గ జిహ్వాస్థానానికి సంబంధించినదిగా ఉండాలి.

**మూ. ఏతే వ్యఞ్జనవర్ణాః సమాసతః సంజ్ఞయా మయా కథితాః,**
**శబ్దవిషయప్రయోగే స్వరాంస్తు భూయః ప్రవక్ష్యామి. 21**

**తా.** వ్యంజనవర్ణాలూ (హల్లులూ), వాటి పేర్లూ చెప్పాను. శబ్దాలలో స్వరాలను (అచ్చులను) ఎలా ప్రయోగించాలో చెపుతాను.

**మూ. యస్మిన్ స్థానే స సమో విజ్ఞేయో యః సవర్ణసంజ్ఞోఽసౌ,**

**య ఇమే స్వరాశ్చతుర్దశ నిర్దిష్టాస్తత్ర వై దశ సమానాః.**
**పూర్వో హ్రస్వస్తేషాం పరశ్చ దీర్ఘో ఽవగన్తవ్యః. 22**

**తా.** ఏ వర్ణం ఏ స్థానంలో సమంగా ఉంటుందో దానికి సవర్ణం అని పేరు. అనగా ఒకే స్థానం నుండి పుట్టే వర్ణాలు పరస్పరం సవర్ణాలు. పైన చెప్పిన పద్నాలుగు స్వరాలలో పది సమానములు. (ఉదాహరణకి 'అ', 'ఆ' రెండూ ఒకే స్థానం నుంచి పుడతాయి గాన దీనికి అదీ, దానికి ఇదీ సవర్ణాలు). వాటిలో (ఆ జంటలలో) మొదటిది హ్రస్వం, రెండవది దీర్ఘం.

**మూ. ఇత్థం వ్యఞ్జనయోగైః స్వరైశ్చ సాఖ్యాతనామపదవిహితైః,**
**కావ్యనిబన్ధాశ్చ స్యుర్ధాతునిపాతోపసర్గైస్తు. 23**

**తా.** ఈ విధంగా స్వర – వ్యంజనాల కలయికచేత ఏర్పడిన ఆఖ్యాతలు, నామలు, పదాలు, ధాతువులు, నిపాతల, ఉపసర్గలు – వీటితో కావ్యనిర్మాణాలు జరుగుతాయి.

**మూ. ఏభిర్వ్యఞ్జనవర్ణైర్నామాఖ్యాతోపసర్గనిపాతైః,**
**తద్ధితసంధివిభక్తిభిరధిష్ఠితః శబ్ద ఇత్యుక్తః. 24**

**తా.** ఈ వ్యంజనవర్ణాలతో కూడిన నామ – ఆఖ్యాత – ఉపసర్గ – నిపాత – తద్ధిత – సంధి – విభక్తులచేత అధిష్ఠితమైనది, ఏర్పడినది శబ్దం అని చెప్పబడుతుంది.

**మూ. పూర్వాచార్యైరుక్తం శబ్దానాం లక్షణం సమాసయోగేన,**
**విస్తరశః పునరేవ ప్రకరణవశాత్ సంప్రవక్ష్యామి. 25**

**తా.** పూర్వాచార్యులు సంక్షిప్తంగా చెప్పిన శబ్దలక్షణం, ప్రసంగవశంచేత నేను మళ్లీ సవిస్తరంగా చెపుతాను.

**మూ. (అర్థప్రధానం నామ స్యాత్ ఆఖ్యాతం తు క్రియాకృతమ్,**
**ద్యోతయన్త్యుపసర్గాస్తు విశేషం భావసంశ్రయమ్. 26**

**తా.** అర్థప్రధాన మైనది **'నామ'**. క్రియను బోధించేది **ఆఖ్యాతం**. **ఉపసర్గలు** క్రియకు సంబంధించిన విశేషాన్ని సూచిస్తాయి).

**మూ. తత్ ప్రాహుః సప్తవిధం షట్కారకసంయుతం ప్రథితసాధ్యమ్,**
**నిర్దేశసంప్రదానాపాదానప్రభృతిసంజ్ఞాభిః. 27**

**తా.** ప్రసిద్ధ మైన సాధ్యం (అర్థం) గల, ఆరు కారకాలతో కూడిన ఆ 'నామ' నిర్దేశ – సంప్రదాన – అపాదాన – మొదలైన పేర్లతో ఏడు విధాలైన దని చెపుతారు.

**మూ. నామాఖ్యాతార్థవిషయం విశేషం ద్యోతయన్తి తే,**
**పృథక్ తత్రోపసర్గేభ్యో నిపాతా నియమేఽచ్యుతే. 28**

**తా.** ఉపసర్గలకంటె వేరుగా నిపాతలు, ఒక నిశ్చిత మైన నియమం ప్రకారం, నామాల అర్థాలకీ క్రియల అర్థాలకీ సంబంధించిన విశేషాన్ని తెలుపుతాయి.

**మూ. సంప్రత్యతీతకాలక్రియాదిసంయోజితం ప్రథితసాధ్యమ్,**
**వచనం నాగతయుక్తం సుసదృశసంయోజనవిభక్తమ్. 29**

**పఞ్చశతధాతుయుక్తం పఞ్చగు(గ)ణం పఞ్చవిధమిదం వాపి,**
**స్వాద్యధికారగు(గ)ణైరర్థవిశేషైర్విభూషితన్యాసమ్. 30**

**ప్రాతిపదికార్థలిఙ్గైర్యుక్తం పఞ్చవిధమిదం జ్ఞేయమ్,**
**ఆఖ్యాతం పాఠ్యకృతం జ్ఞేయం నానార్థశ్రయవిశేషమ్. 31**

**వచనం నామసమేతం పురుషవిభక్తం తదాఖ్యాతమ్.**

**తా.** ఆఖ్యాతం వర్తమానభూతకాలాలకు సంబంధించిన క్రియలతో కూర్చబడినది. దాని అర్థం ప్రసిద్ధంగా ఉంటుంది. నాగతంతో, అనగా భవిష్యత్కాలికార్థంతో కూడ కూడినది. తగు విధమైన కూర్పులచే వేరు వేరుగా విభజింపబడినది. ఐదు వందల ధాతువులతో (ప్రయోగప్రసిద్ధ మైన ధాతువులతో) కూడినది (ఏర్పడినది). ఐదు గుణాలు (?) కలది. ఐదు విధా లైనది. 'సు' మొదలైన ధాతువులతో ప్రారంభమయ్యే గణాలచేత అర్థవిశేషాలచేత అలంకరింపబడిన ప్రయోగాలు కలది. (దీనికి) లింగభేదం లేకపోయినా) ప్రాతిపదికార్థాలకు సంబంధించిన లింగాలనే బోధిస్తుంది. ఇట్టి, పాఠ్యనిబద్ధమైన ఆఖ్యాతాన్ని, దాని అనేకవిధాలైన అర్థాలకు సంబంధించిన విశేషాలను తెలుసుకోవాలి. దీనిలో మూడు వచనాలు మూడు పురుషలు ఉంటాయి. ఇది (వాక్యంలో) నామలతో కలిసి ఉంటుంది.

**మూ. ప్రాతిపదికార్థయుక్తాన్ ధాత్వర్థానుపసృజన్తి యే స్వార్థైః,**
**ఉపసర్గా హ్యుపదిష్టాస్తస్మాత్ సంస్కారశాస్త్రేఽస్మిన్. 32**

**తా.** ప్రాతిపదిక అర్థాలతో అన్వయించే ధాతువుల అర్థాలను తమ అర్థాలచేత ఏవి మారుస్తూంటాయో అవి ("ఉపసృజన్తీతి ఉపసర్గాః" అను వ్యుత్పత్తిచేత) **ఉపసర్గలు** అని చెప్పబడుతున్నాయి. అని ఈ సంస్కారశాస్త్రంలో, (శబ్దసంస్కారశాస్త్రంలో, వ్యాకరణ శాస్త్రంలో) చెప్పబడ్డాయి.

**వి.** ధాతువులకు ముందుచేర్చే "ప్ర, వి, పర, అవ" మొదలైనవి ఉపసర్గలు.

**మూ. ప్రాతిప్రదికార్థయోగాద్ధాతుచ్ఛన్దోనిరుక్తయుక్త్యా చ,**
**యస్మాన్నిపతన్తి పదే తస్మాత్ ప్రోక్తా నిపాతాస్తు. 33**

**తా.** ప్రాతిపదికల అర్థాలతో సంబంధంవల్లా, ధాతు – ఛందస్ – నిరుక్తుల సంబంధంవల్లా ఏవి పదం దగ్గరికి వచ్చి వాల్తాయో అవి నిపాతలు.

వి. "చ, తు, వా", మొదలైనవి నిపాతలు. ఇవి ఏ పదం పక్క వచ్చి చేరుతాయో దాని అర్థంలో కొంచెం మార్పుతెస్తాయి. ఒక్కొకప్పుడు వాటివల్ల ప్రత్యేకంగా ప్రయోజనం ఏమీ లేకపోయినా ఛందస్సు సరిపడడానికై చేర్చబడుతూంటాయి.

**మూ. ప్రత్యయవిభాగజనితాః (తైః) ప్రకర్షసంయోగసత్త్వవచనైశ్చ,**
**యస్మాత్పూరయతేఽర్థాన్ ప్రత్యయ ఉక్తస్తతస్తస్మాత్. 34**

**తా.** ప్రత్యయములను ప్రకృతికంటె వేరుగా విభజించడం ద్వారా పుట్టించబడిన (బోధించబడిన) ప్రకర్షము, సంయోగము, ద్రవ్యము, వచనములు – మొదలైన అర్థాలను పూరింప చేస్తుంది గాన **ప్రత్యయం** అని చెప్పబడినది.

**మూ. లోకే ప్రకృతిప్రత్యయవిభాగసంయోగసత్త్వవచనైశ్చ,**
**తాంస్తాన్ పూరయతేఽర్థాన్ తేషు యతస్తద్ధితస్తస్మాత్. 35**

**తా.** లోకంలో – ప్రకృతిప్రత్యయాల విభాగము, సంయోగము, ద్రవ్యము, వచనములు – వీటిచేత అర్థాలను పూరింపచేస్తుంది గాన **తద్ధితము** అని చెప్పబడుచున్నది.

**మూ. ఏకస్య బహూనాం వా ధాతోర్లిఙ్గస్య వా పదానాం వా,**
**విభజన్త్యర్థం యస్మాత్ విభక్తయస్తేన తాః ప్రోక్తాః. 36**

**తా.** ఒక ధాతువుయొక్క లేదా అనేకధాతువులయొక్క, లింగముయొక్క, లేదా పదాల యొక్క, అర్థాన్ని వేరు వేరుగా చూపుతాయి గాన వీటికి **విభక్తులు** అని పేరు.

**మూ. విశిష్టాస్తు స్వరా యత్ర వ్యఞ్జనం వాపి యోగతః,**
**సంధీయతే పదే యస్మాత్తస్మాత్సన్ధిః ప్రకీర్తితః. 37**

**తా.** విశిష్టమైన స్వరాలు (అచ్చులు) గాని, వ్యంజనం (హల్లు) గాని, మరొకపదంతో తగు విధంగా చేర్చబడుతుంది గాన దీనికి **సంధి** అని పేరు.

**మూ. (వర్ణపదక్రమసిద్ధః పదైకయోగాచ్చ వర్ణయోగాచ్చ,**
**సంధీయతే చ యస్మాత్తస్మాత్సన్ధిః సముద్దిష్టః. 38**

**తా.** రెండు అక్షరాలు ఒకదానితో ఒకటి చేర్చడం సంధి. ఇది వర్ణాల, పదాల క్రమాన్ని పట్టి ఏర్పడుతుంది. ఒకే పదంలో రెండు అక్షరాల కలయిక చేత ఏర్పడుతుంది. రెండు వర్ణాల కలయికవల్ల ఏర్పడుతుంది.

**మూ. లుప్తవిభక్తికనామ్నామేకార్థం సంహరత్స(న్స)మాసోఽపి,**
**తత్పురుషాదికసంజ్ఞైర్నిర్దిష్టః షడ్విధో వి(ప్రాః). 39**

**తా.** విప్రులారా! విభక్తిప్రత్యయాలు లోపించిన నామవాచకాలను ఒకే అర్థం కలవాటినిగా కుదించేది సమాసం. ఇది తత్పురుష మొదలైన పేర్లతో ఆరువిధా లైనదిగా చెప్పబడింది.

**మూ. ఏభిః శబ్దవిధానైర్విస్తారవ్యఞ్జనార్థసంయుక్తైః,**
**పదబన్ధాః కర్తవ్యాః నిబద్ధబన్ధాస్తు చూర్ణా వా. 40**

**తా.** విస్తృతమైన వ్యంజనములతోను, అర్థాలతోను కూడిన ఈ శబ్దవిధానాలచేత పదబంధాలు (పదాల కూర్పులు, అనగా వాక్యాలు) నిర్మించాలి. అవి నిబద్ధబంధములు, అనగా ఛందోబద్ధములు కావచ్చు, చూర్ణములు, అనగా విడిగా ఉన్న పదాలు, కావచ్చు.

**మూ. విభక్త్యన్తం పదం జ్ఞేయం నిబద్ధం చూర్ణమేవ చ,**
**తత్ర చూర్ణపదస్యేహ సంనిబోధత లక్షణమ్. 41**

**తా.** చివర విభక్తి ప్రత్యయా లున్న శబ్దం **పదం**. అది నిబద్ధ మనీ, చూర్ణ మనీ రెండు విధాలు. వాటిలో చూర్ణపదం లక్షణం చెపుతాను తెలుసుకొనండి.

**మూ. అనిబద్ధపదం చందోవిధానానియతాక్షరమ్,**
**అర్థాపేక్ష్యక్షరస్యూతం జ్ఞేయం చూర్ణపదం బుధైః. 42**

**తా.** సమాసాలలో కలిపివేయకుండా వ్యస్తములైన పదా లున్నదీ, ఛందస్సులో చెప్పిన అక్షరసంఖ్యానియమాదికం లేనిదీ, శృంగారవీరాద్యర్థాలను అనుసరించి అల్ప సంఖ్యాకాక్షరాలతో గాని అధికసంఖ్యాకాక్షరాలతో గాని కూర్చినదీ **చూర్ణపదం**.

**మూ. నిబద్ధాక్షరసంయుక్తం యతిచ్ఛేదసమన్వితమ్,**
**నిబద్ధం తు పదం జ్ఞేయం ప్రమాణనియతాత్మకమ్. 43**

**తా.** దగ్గరకు చేర్చిన (సంధి చేసిన) అక్షరాలు కలది, యతిస్థానం దగ్గర ఛేదం (పదచ్ఛేదం) ఉన్నదీ, గురులఘ్వాదిప్రమాణంచేత, అక్షరసంఖ్యాప్రమాణంచేత నియతమూ అయినది **నిబద్ధపదం**.

**మూ. ఏవం నానార్థసంయుక్తైః పాదైర్వర్ణవిభూషితైః,**
**చతుర్భిస్తు భవేద్యుక్తం ఛన్దో వృత్తాభిధానవత్. 44**

**తా.** ఈ విధంగా వివిధములైన అర్థాలను బోధించేవి, వర్ణాలతో అలంకృతములు అయిన నాలుగు పాదా లున్న ఛందస్సుకు **వృత్తం** అని పేరు.

**మూ. షడ్వింశతిః స్మృతాన్యేభిః పాదైశ్ఛన్దాంసి సంఖ్యయా,**
**సమమర్ధసమం చైవ తథా విషమమేవ చ. 45**
**ఛన్దో జ్ఞేయం సమాసేన త్రివిధం వృత్తమిష్యతే.**

**తా.** పాదాలలో ఉన్న అక్షరాల సంఖ్యను పట్టి ఛందస్సులు ఇరవై ఆరు విధాలు. సమం, అర్ధసమం, విషమం అని వృత్తం మూడు విధాలు.

**మూ. నానావృత్తసముత్పన్నా శబ్దస్యైషా తనుః స్మృతా. 46**
**ఛన్దోహీనో న శబ్దోఽస్తి న ఛ్ఛన్దః శబ్దవర్జితమ్,**
**ఏవం తూభమసంయోగో నాట్యస్యోద్యోతకః స్మృతః. 47**

**తా.** నాట్యప్రయోగంలో ఉపయోగించే శబ్దానికి (పాఠ్యానికి) వివిధవృత్తాలతోనే శరీరం ఏర్పడుతుంది. ఛందస్సు లేని శబ్దం ఉండదు, శబ్దం లేని ఛందస్సు ఉండదు. ఛందః – శబ్దాలు రెండూ కలవడం నాట్యప్రయోగానికి శోభను కూరుస్తుంది.

**మూ. ఏకాక్షరం భవేదుక్తమత్యుక్తం ద్వ్యక్షరం భవేత్,**
**మధ్యం త్ర్యక్షరమిత్యాహః ప్రతిష్ఠా చతురక్షరా. 48**
**సుప్రతిష్ఠా భవేత్పఞ్చ షడ్గాయత్రీ భవేదిహ,**
**సప్తాక్షరా భవేదుష్ణిగష్టౌ చానుష్టుబిష్యతే. 49**
**నవాక్షరా తు బృహతీ పఙ్క్తిశ్చైవ దశాక్షరా,**
**ఏకాదశాక్షరా త్రిష్టుబ్జగతీ ద్వాదశాక్షరా. 50**
**త్రయోదశాతిజగతీ శక్వరీ తు చతుర్దశ,**
**దశ పఞ్చాతిశక్వర్యా అష్టిః స్యాత్ షోడశాక్షరా. 51**
**తథా సప్తదశాత్యష్టిః ధృతిరష్టాదశాక్షరా,**
**ఏకోనవింశాతిధృతిః కృతిర్వింశతిరేవ చ. 52**
**ప్రకృతిశ్చైకవింశత్యా ద్వావింశత్యాకృతిస్తథా,**
**వికృతిః స్యాత్త్రయోవింశా చతుర్వింశాపి సఙ్కృతిః. 53**
**పఞ్చవింశత్యతికృతిః షడ్వింశత్యక్షరోత్కృతిః.**

**తా.** పాదాలలోని అక్షరాల సంఖ్యను పట్టి ఏర్పడిన ఛందస్సుల పేర్లు – పాదానికి ఒకే అక్షరం ఉన్నది **ఉక్తఛందస్సు**; రెండు అక్షరా లుంటే **అత్యుక్త**; మూడు అక్షరాలుంటే **మధ్య**; నాలు గక్షరాలుంటే **ప్రతిష్ఠ**; ఐదు అక్షరా లుంటే **సుప్రతిష్ఠ**; ఆరక్షరాలుంటే **గాయత్రి**; ఏడక్షరాలుంటే **ఉష్ణిక్**; ఎనిమిదక్షరాలుంటే **అనుష్టుప్**; తొమ్మి దక్షరాలుంటే **బృహతి**; పది అక్షరా లుంటే **పంక్తి**. పదకొం డక్షరా లుంటే **త్రిష్టుప్**; పన్నెం డక్షరాలుంటే **జగతి**;

పదమూ డక్షరాలుంటే **అతిజగతి**; పద్నాలుగు అక్షరా లుంటే **శక్వరి**; పదిహే నక్షరాలుంటే **అతిశక్వరి**; పదహా రక్షరా లుంటే **అష్టి**; పదిహేడక్షరాలుంటె **అత్యష్టి**; పద్దెనిమి దక్షరాలుంటె **ధృతి**; పందొమ్మిది అక్షరా లుంటే **అతిధృతి**; ఇరవై అక్షరా లుంటే **కృతి**; ఇరవైయొక్క అక్షరా లుంటే **ప్రకృతి**; ఇరవైరెండు అక్షరా లుంటే **ఆకృతి**. ఇరవైమూడు అక్షరా లుంటే **వికృతి**. ఇరవైనాలుగు అక్షరా లుంటే **సంకృతి**; ఇరవైఐదు అక్షరా లుంటే **అతికృతి**; ఇరవై ఆరు అక్షరా లున్న ఛందస్సు **ఉత్కృతిఛందస్సు**.

**మూ. అతోఽధికాక్షరం ఛన్దో మాలావృత్తమితి స్మృతమ్. 54**

**ఛన్దసాం తు తథా హ్యేతే భేదాః ప్రస్తారయోగతః,**
**అసంఖ్యేయప్రమాణాని వృత్తాన్యాహురతో బుధాః. 55**

**గాయత్రీప్రభృతిష్వేషాం ప్రమాణం సంప్రవక్ష్యతే,**
**ప్రయోగజాని సర్వాణి ప్రాయశో న భవన్తి హి. 56**

**తా.** ఇరవైఐదు అక్షరాలు మించిన అక్షరా లున్న వృత్తాలకు మాలావృత్తా లని పేరు. ప్రస్తారప్రక్రియను అనుసరించి ఛందస్సులో ఇన్ని భేదాలు ఏర్పడతాయి. అందుచేతనే వృత్తాల సంఖ్య ఇంత అని చెప్పడానికి శక్యం కాదని పండితు లంటారు. గాయత్రీఛందస్సు మొదలైన ఛందస్సులకు సంబంధించిన వృత్తాల సంఖ్య చెపుతాను. అయితే అన్ని వృత్తాలు ప్రయోగంలో ఉండవు.

**మూ. వృత్తాని తు చతుఃషష్టిః గాయత్ర్యాం కీర్తితాని తు,**
**శతం వింశతిరష్టౌ చ వృత్తాన్యుష్టిగ్ హ్యథోచ్యతే. 57**

**షట్పఞ్చాశచ్ఛతే ద్వే చ వృత్తానామప్యనుష్టుభి,**
**శతాని పఞ్చ వృత్తానాం బృహత్యాం ద్వాదశైవ తు. 58**

**పఙ్క్త్యాం సహస్రం వృత్తానాం చతుర్వింశతిరేవ తు,**
**త్రైష్టుభే ద్వే సహస్రే చ చత్వారింశత్తథాష్ట చ. 59**

**సహస్రాణ్యథ చత్వారి నవతిశ్చ షడుత్తరా,**
**జగత్యాం సమవర్ణానాం వృత్తానామిహ సర్వశః. 60**

**శతమష్టౌ సహస్రాణి ద్వ్యధికా నవతిః పునః,**
**జగత్యామతిపూర్వాయాం వృత్తానాం సర్వశో భవేత్. 61**

**శతాని త్రీణ్యశీతిశ్చ సహస్రాణ్యపి షోడశ,**
**వృత్తాని చైవ చత్వారి శక్వర్యాః పరిసంఖ్యయా. 62**

**ద్వాత్రింశత్తు సహస్రాణి సప్త చైవ శతాని చ,**
**అష్టౌ షష్టిశ్చ వృత్తాని హ్యాశ్రయన్త్యతిశక్వరీమ్. 63**

**పఞ్చషష్టి సహస్రాణి సహస్రార్ధం తు సంఖ్యయా,**
**షట్త్రింశచ్చైవ వృత్తాని తథార్ష్యాం గదితాని తు. 64**

**ఏకత్రింశత్సహస్రాణి వృత్తానాం చ ద్విసప్తతిః,**
**తథా శతసహస్రం చ ఛన్దస్యత్యష్టిసంజ్ఞితే. 65**

**ధృత్యామపి చ పిణ్డేన వృత్తాన్యాకల్పితాని తు,**
**తద్జ్ఞైః శతసహస్రే ద్వే శతమేకం తథైవ చ. 66**

**తా.** గాయత్రీఛందస్సులో అరవైనాలుగు (64) వృత్తాలుంటాయని చెప్పబడింది. ఉష్ణిక్‌లో ఒకవంద ఇరవై ఎనిమిది (128). అనుష్టుపులో ఐదు వందల పన్నెండు (512). పంక్తిలో ఒకవెయ్యి ఇరవైనాలుగు (1024). త్రిష్టుప్‌లో రెండువేల నలభై ఎనిమిది (2048). జగతిలో నాలుగువేల తొంభైఆరు (4096). అతిజగతిలో ఎనిమిదివేల నూటతొంభై రెండు (8192). శక్వరిలో పదహారువేల మూడు వందల ఎనభైనాలుగు (16384). అతిశక్వరిలో ముప్పైరెండు వేల ఏడువందల అరవైఎనిమిది (32768). అష్టి ఛందస్సులో అరవైయైదువేల ఐదువందల ముప్పైఆరు (65536). అత్యష్టిలో ఒకలక్ష ముప్పైయొక్కవేల డెబ్బైరెండు (131072).

**మూ. ద్విషష్టిశ్చ సహస్రాణి చత్వారింశచ్చ యోగతః,**
**చత్వారి చైవ వృత్తాని సమసంఖ్యాశ్రయాణితు. 67**

**తా.** సమవృత్తాల సంఖ్య అరవైరెండువేల నలభైనాలుగు (62044).

**మూ. అతిధృత్యాం సహస్రాణి చతుర్వింశతిరేవ చ,**
**తథా శతసహస్రాణి పఞ్చ వృత్తశతద్వయమ్. 68**
**అష్టాశీతిశ్చ వృత్తాని వృత్తజ్ఞైః కథితాని చ.**

**తా.** అతిధృతిఛందస్సులో వృత్తాల సంఖ్య ఐదు లక్షల ఇరవైనాలుగు వేల రెండు వందల ఎనభై ఎనిమిది (524288).

**మూ. కృతౌ శతసహస్రాణి దశ ప్రోక్తాని సంఖ్యయా. 69**
**చత్వారింశత్తథా చాష్టౌ సహస్రాణి శతాని చ,**
**పఞ్చ షట్సప్తతిశ్చైవ వృత్తానాం పరిమాణతః. 70**

**తా.** కృతిఛందస్సులో వృత్తాల సంఖ్య – పదిలక్షల నలభైఎనిమిదవేల ఐదువందల డెబ్బైఆరు. (1048576).

**మూ. తథా శతసహస్రాణాం ప్రకృతౌ వింశతిర్భవేత్,**
**సప్త వై గదితాస్త్వత్ర నవతిశ్చైవ సంఖ్యయా. 71**

**సహస్రాణి శతం చైకం ద్విపఞ్చాశత్తథైవ చ,**
**వృత్తాని పరిమాణేన వృత్తజ్ఞైర్గదితాని తు. 72**

**తా.** ప్రకృతిచ్ఛందస్సులో వృత్తాల సంఖ్య – ఇరవైలక్షల తొంబైఏడువేల ఒకవంద యాభైరెండు. (2097152).

**మూ. చత్వారింశత్తథైకం చ లక్షాణామథ సంఖ్యయా,**
**తథా చేహ సహస్రాణి నవతిశ్చతురుత్తరా. 73**

**శతత్రయం సమాఖ్యాతం హ్యాకృత్యాం చతురుత్తరమ్.**

**తా.** ఆకృతిచ్ఛందస్సులో వృత్తాల సంఖ్య – నలభైయొక్కలక్షల తొంభైనాలుగువేల మూడు వందల నాలుగు. (4194304).

**మూ. జ్ఞేయా శతసహస్రాణామశీతిస్త్ర్యధికా బుధైః. 74**

**అష్టాశీతిసహస్రాణి వృత్తానాం షట్శతాని చ,**
**అష్టౌ చైవ తు వృత్తాని వికృత్యాం గదితాని తు. 75**

**తా.** వికృతిచ్ఛందస్సులో వృత్తాల సంఖ్య ఎనభైమూడు లక్షల ఎనభైఎనిమిదివేల ఆరువందల ఎనిమిది. (8388608).

**మూ. తథా శతసహస్రాణి సప్తషష్టిశ్చ సప్తతిః,**
**సప్త చైవ సహస్రాణి షోడశ ద్వే శతే తథా. 76**

**కోటిశ్చైవేహ వృత్తాని సంకృతౌ కథితాని వై.**

**తా.** సంకృతిచ్ఛందస్సులో వృత్తాల సంఖ్య – ఒకకోటి అరవైఏడులక్షల డెబ్బైఏడు వేల రెండు వందల పదహారు. (16777216).

**మూ. కోటిత్రయం చాభికృత్యాం పఞ్చత్రింశద్భిరన్వితమ్. 77**

**పఞ్చాశద్భిః సహస్రైశ్చ చతుర్భిరధికైస్తథా,**
**చతుష్టయం శతానాం చ ద్వాత్రింశద్భిః సమన్వితమ్. 78**

**తా.** అభికృతిచ్ఛందస్సులో వృత్తాల సంఖ్య – మూడుకోట్ల ముప్పైయైదులక్షల యాభైనాలుగువేల నాలుగువందల ముప్పైరెండు – (33554432).

**మూ. షట్కోటయస్తథోత్కృత్యాం లక్షాణామేకసప్తతిః,**
**చతుష్షష్టిః శతాన్యష్టౌ సహస్రాణ్యష్ట చైవ హి. 79**

**తా.** ఉత్కృతిఛందస్సులో వృత్తాల సంఖ్య – ఆరు కోట్ల డైబ్బైఒకలక్షల ఎనిమిది వేల ఎనిమిది వందల అరవైనాలుగు (67108864).

**వి.** పైన ఇచ్చినశ్లోకానికి అర్థం సరిగా కుదరకపోవడంచేత **అభినవభారతిలో** పైన చూపిన సంఖ్యను తెలిపే –

**షట్కోట్యస్తు సహస్రాణాం శతాని హ్యేకసప్తతిః.**
**అష్టౌ చైవ సహస్రాణి శతాన్యష్టౌ తథైవ చ.**
**చతుఃషష్టిస్తు వృత్తాని హ్యుత్కృతావసి సంఖ్యయా.**

అను శ్లోకం చూపబడింది.

**మూ. ఉక్తాద్యుత్కృతిపర్యన్తవృత్తసంఖ్యాం విచక్షణః,**
**ఏతేన చ వికల్పేన వృత్తేష్వేతేషు నిర్దిశేత్. 80**

**తా.** బుధుడు ఉక్తం మొదలు ఉత్కృతి దాకా ఉన్న పైన చెప్పిన వృత్తాల భేదాలకు (వికల్పాలను) ఈ వృత్తాలలో నిర్దేశించాలి.

**మూ. సర్వేషాం ఛన్దసామేవం వృత్తాని కథితాని వై,**
**తిస్రః కోట్యో దశ తథా సహస్రాణాం శతాని తు. 81**

**చత్వారింశత్తథా ద్వే చ సహస్రాణి దశైవ తు,**
**సప్తభిః సహితాన్యేవ సప్త చైవ శతాని చ. 82**

**షడ్వింశతిరిహోన్యాని వ్యాఖ్యాతాని సమాసతః.**

**తా.** ఈ విధంగా అన్ని ఛందస్సులకూ సంబంధించిన వృత్తాలు చెప్పబడ్డాయి. మొత్తం వీటి సంఖ్య పదమూడుకోట్ల, నలభై రెండులక్షల, పదిహేడువేల, ఏడువందల ఇరవై ఆరు (134217726).

**మూ. సమాని గణనాయుక్తిమాశ్రిత్య కథితాని వై. 83**

**సర్వేషాం ఛన్దసామేవం త్రికైర్వృత్తం ప్రయోజయేత్,**
**జ్ఞేయాస్త్వష్టౌ త్రికాస్తత్ర సంజ్ఞాభిః స్థానమక్షరమ్. 84**

**తా.** సమవృత్తాల అక్షరాల లెక్కను పట్టి ఉంటాయి. అన్ని చందస్సుల వృత్తాలనూ కూడ త్రికాలను పట్టి ఉపయోగించాలి. అలాంటి త్రికాలు ఎనిమిది ఉన్నాయి. వీటిలో ఒక్కొక్క అక్షరం తీసికొని త్రికాన్ని నిర్ధారించాలి. అనగా మూడు అక్షరాలు ఒక త్రికం అవుతుంది.

**మూ. త్రీణ్యక్షరాణి విజ్ఞేయస్త్రికోఽంశః పరికల్పితః,**
**గురులఘ్వక్షరకృతః సర్వవృత్తేషు నిత్యశః. 85**

**తా.** మూడు అక్షరాల సముదాయం త్రికం. అన్ని వృత్తాలలోను ఈ త్రికం గురు – లఘుఅక్షరాలచేత ఏర్పడుతుంది.

**మూ. గురుపూర్వో భకారః స్యాత్ మకారే తు గురుత్రయమ్,**
**జకారో గురుమధ్యస్థః సకారోఽన్త్యగురుస్తథా. 86**

**తా.** మొదటి అక్షరం గురువైన త్రికం (అక్షరత్రయంలో మొదటిది గురువై, మిగిలిన రెండూ లఘువు లైతే అది) భగణం. అన్నీ గురువు లైతే మగణం. మధ్యాక్షరం గురు వైతే జగణం. చివరి అక్షరం గురు వైతే సగణం.

**మూ. లఘుమధ్యస్థితో రేఫస్తకారోఽన్త్యలఘుః పరః,**
**లఘుపూర్వో యకారస్తు నకారే తు లఘుత్రయమ్. 87**

**తా.** మధ్యలఘు వున్న త్రికం రగణం. చివర లఘు వున్నది తగణం. మొదట లఘు వున్నది యగణం. అన్నీ లఘువు లున్నది నగణం.

**మూ. ఏతే హ్యష్టౌ త్రికాః ప్రాజ్ఞైర్విజ్ఞేయా బ్రహ్మసంభవాః,**
**లాఘవార్థం పునరమీ ఛన్దోజ్ఞానమవేక్ష్య చ. 88**

**తా.** ఈ ఎనిమిది త్రికాలు బ్రహ్మనుండి (వేదంనుండి) జనించినది. ఛందోజ్ఞానం దృష్టిలో పెట్టుకొని, లాఘవంకొరకూ వీటిని జాగర్తగా గుర్తించాలి.

**మూ. ఏభిర్వినిర్గతాశ్చాన్యా జాతయోఽథ సమాదయః,**
**అస్వరాః సస్వరాశ్చైవ ప్రోచ్యన్తే వృత్తలక్షణైః. 89**

**తా.** ఇతరమైన జాతులు ఈ గణాలనుంచే ఏర్పడ్డాయి. ఇప్పుడు స్వరసహితములూ, స్వరరహితములూ అయిన సమాదివృత్తాలు వాటి లక్షణాలతో చెప్పబడుతున్నాయి.

**మూ. గుర్వేకం గితి విజ్ఞేయం తథా లఘు లితి స్మృతమ్,**
**నియతః పదవిచ్ఛేదో యతిరిత్యభిధీయతే. 90**

**తా.** (వృత్తాల లక్షణాలలో) 'గ్' అంటే 'గురువు' అనీ, 'ల్' అంటే లఘువు అనీ అర్థం. ఇన్నో అక్షరం దగ్గర పదం విరగాలి అను నియమం యతి.

**మూ. గురు దీర్ఘం ప్లుతం చైవ సంయోగపరమేవ చ,**
**సానుస్వారవిసర్గశ్చ తథాన్త్యం చ లఘు క్వచిత్. 91**

**తా.** దీర్ఘాక్షరము, ప్లుతాక్షరము, దేని తరవాత సంయుక్తాక్షరం ఉంటుందో ఆ అక్షరము, అనుస్వార – విసర్గలతో కూడిన అక్షరమూ గురువు. కొన్ని చోట్ల – పాదం చివర నున్న లఘువు కూడ గురువు అవుతుంది.

**మూ. గాయత్ర్యాం ద్వౌ త్రికౌ జ్ఞేయౌ ఉష్ణిక్ చైకాధికాక్షరా,**
**అనుష్టుప్ ద్వ్యధికా చైవ బృహత్యాం చ త్రికాస్త్రయః. 92**

**తా.** గాయత్రీఛందస్సులో ఒక పాదానికి ఆరు అక్షరాలు (రెండు త్రికాలు) ఉంటాయి. ఉష్ణిక్ లో ఏడక్షరాలు, అనుష్టుప్ లో ఎనిమిది అక్షరాలు. బృహతిలో మూడు త్రికాలు (తొమ్మిది అక్షరాలూ) ఉంటాయి.

**మూ. ఏకాక్షరాధికా పఙ్క్తిః త్రిష్టుభ్ చ ద్వ్యధికాక్షరా,**
**చతుస్త్రికా తు జగతీ సైకాతిజగతీ పునః. 93**

**తా.** పది అక్షరా లున్నది **పంక్తి**. పదకొండు అక్షరా లున్నది **త్రిష్టుభ్**. నాలుగు గణాలు (పన్నెండు అక్షరాలు) ఉన్నది **జగతి**. పదమూడు అక్షరా లున్నది **అతిజగతి**.

**మూ. శక్వరీ ద్వ్యధికా పఞ్చత్రికా జ్ఞేయాతిశక్వరీ,**
**ఏకాధికాక్షరాష్టిశ్చ ద్వ్యధికాత్యష్టిరుచ్యతే. 94**

**తా.** పద్నాలుగు అక్షరా లున్నది **శక్వరి**. ఐదు గణాలు (పదిహేను అక్షరాలు) ఉన్నది అతిశక్వరి. పదహారు అక్షరా లున్నది **అష్టి**. పద్దెనిమిది అక్షరా లున్నది అత్యష్టి.

**మూ. షట్ త్రికాస్తు ధృతిః ప్రోక్తా సైకా చాతిధృతిస్తథా,**
**కృతిశ్చ ద్వ్యధికా ప్రోక్తా ప్రకృత్యాః సప్త తే త్రికాః. 95**

**తా.** ఆరు గణా లున్నది **ధృతి**. పందొమ్మిది అక్షరా లున్నది **అతిధృతి**. ఇరవై అక్షరా లున్నది **కృతి**. **ప్రకృతి**లో ఏడు గణాలు, అనగా ఇరవైఒక్క అక్షరా లుంటాయి.

**మూ. ఆకృతిస్త్వధికైకేన ద్వ్యధికా వికృతిస్తథా,**
**అష్ట త్రికాః సంకృతౌ స్యాత్ సైకా చాభికృతిః పునః. 96**
**ఉత్కృతిర్ద్వ్యధికా చైవ విజ్ఞేయా గణమాననా.**

**తా.** 22 అక్షరా లున్నది ఆకృతి. 23 అక్షరా లున్నది **వికృతి**. **సంకృతిలో** ఎనిమిది త్రికాలు, అనగా 24 అక్షరాలు ఉంటాయి. 25 అక్షరా లున్నది **అభికృతి**. 26 అక్షరా లున్నది **ఉత్కృతి**.

**మూ. గుర్వేకం గ ఇతి ప్రోక్తం గురుణీ గావితి స్మృతౌ,**
**లఘ్వేకం ల ఇతి జ్ఞేయం లఘునీ లావితి స్మృతౌ. 97**

**తా.** ఒక గురువు 'గ' అనీ, రెండు గురువులను 'గౌ' అనీ, ఒక లగువును 'ల' అనీ రెండు లఘువులను 'లౌ' అనీ (వృత్తలక్షణాలలో) నిర్దేశించడం జరుగుతుంది).

**మూ. సంపద్విరామపాదాశ్చ దైవతస్థానమక్షరమ్,**
**వర్ణః స్వరో విధిర్వృత్తమితి ఛన్దోగతో విధిః. 98**

**తా.** సంపత్, విరామం, పాదం, దైవతం, స్థానం, అక్షరం, వర్ణం, స్వరం, విధి, వృత్తం ఇవి చందస్సుకు సంబంధించిన విధానము.

**మూ. నైవాతిరిక్తం హీనం వా యత్ర సంపద్యతే క్రమః,**
**విధానే ఛన్దసామేష సంపదిత్యభిసంజ్ఞితః. 99**

**తా.** ఛందస్సు విధానంలో అధికత్వం కాని అల్పత్వం కాని లేకుండా అక్షరగణాది క్రమం యథావిధిగా ఉండడాన్ని **సంపత్** అంటారు.

**మూ. యత్రార్థస్య సమాప్తిః స్యాత్ స విరామ ఇతి స్మృతః,**
**పాదశ్చ పద్యతేర్ధాతోః చతుర్భాగ ఇతి స్మృతః. 100**

**తా.** అర్థం ఎక్కడ సమాప్తం అవుతుందో అది విరామం. **'పాద'** శబ్దం **'పద్'** ధాతువునుండి నిష్పన్న మైనది. దీనికి నాలుగవ భాగం అని అర్థం.

**మూ. అగ్న్యాది దైవతం ప్రోక్తం స్థానం ద్వివిధముచ్యతే,**
**శరీరాశ్రయసంభూతం దిగాశ్రయమథాపి చ. 101**

**తా.** అగ్న్యాదిదేవతలు అధిష్ఠానదేవతలు. శరీరమును ఆశ్రయించి ఏర్పడినది, దిక్కులను ఆశ్రయించి ఏర్పడినది అని స్థానం రెండు విధాలు.

**వి. "వీరస్య భుజదణ్డానాం వర్ణనే స్రగ్ధరా భవేత్,**
**నాయికావర్ణనే కార్యం వసన్తతిలకాదికమ్**
**శార్దూలలీలా ప్రాచ్యేషు మన్దాక్రాన్తా చ దక్షిణే."**

అను కాత్యాయనుని సార్ధశ్లోకం ఉదాహరించి, **అభినవభారతిలో** – వీరుల భుజదండాన్ని వర్ణించడానికి స్రగ్ధరావృత్తం, నాయికావర్ణనానికి వసంతతిలకాదివృత్తాలు, ప్రాచ్యులలో శార్దూలవిక్రీడితం, దక్షిణంలో మందాక్రాంత ఉపయోగించాలి అని చెప్పబడింది.

**మూ. (శారీరం మన్త్రసంభూతం ఛన్దోగాయత్రసంజ్ఞితమ్,**
**క్రుష్టే మధ్యందినం ప్రోక్తం త్రైష్టుభం పరికీర్త్యతే. 102**
**తృతీయసవనం చాపి శీర్షణ్యం జాగతం హి యత్.**

**తా.** మంత్రాలనుండి పుట్టిన గాయత్రఛందస్సు శారీరం. క్రుష్టమునందు త్రైష్టుభ ఛందస్సు మధ్యందినం. శీర్షణ్యమైన జాగతం. తృతీయసవనం (వీటిభావం స్పష్టంగా తెలియలేదు. శ్రౌతంతో పరిచయంగలవారు చెప్పాలి).

**మూ. హ్రస్వం దీర్ఘం ప్లుతం చైవ త్రివిధం చాక్షరం స్మృతమ్. 103**
**శ్వేతాదయస్తథా వర్ణా విజ్ఞేయాశ్ఛన్దసామిహ.**

**తా.** హ్రస్వము, దీర్ఘము, ప్లుతము అని అక్షరం మూడు విధాలు. ఛందస్సులకు తెలుపు మొదలైన వర్ణాలు ఉంటా యని తెలుసుకోవాలి.

**వి.** ఛందస్సులకు శ్వేతాదివర్ణాలు ప్రాతిశాఖ్యగ్రంథాలలో చెప్పబడ్డాయి. ఇక్కడ వాటి ఉపయోగం లేకపోవడంచేత వాటిని మేం చెప్పలేదు అని **అభినవభారతి**.

**మూ. తారశ్చైవ హి మన్ద్రశ్చ మధ్యమస్త్రివిధః స్వరః. 104**
**ధ్రువావిధానే చైవాస్య సంప్రవక్ష్యామి లక్షణమ్,**
**విధిర్గణకృతశ్చైవ తథైవార్థకృతో భవేత్. 105**

**తా.** తారము, మంద్రము, మధ్యమము అని స్వరం మూడు విధాలు. ధ్రువా విధానం చెప్పే సందర్భంలో దీని లక్షణం చెపుతాను. ఈ విధంగా, గణాలకూ, అర్థాలకూ సంబంధించి వృత్తవిధానం ఉంటుంది.

**మూ. ఛన్దతో యస్య పాదే స్యాద్ధీనం వాధికమేవ వా,**
**అక్షరం నిచృదితి ప్రోక్తం భూరిక్ చేతి ద్విజోత్తమాః. 106**

**తా.** పాదంలోని ఒక అక్షరం తక్కువ అయితే అది **'నిచృత్'** అనీ, అధిక మైతే **'భూరిక్'** అనీ ఆ ఛందస్సు చెప్పబడుతుంది.

**మూ. అక్షరాభ్యాం యదా ద్వాభ్యామధికం హీనమేవ వా,**
**తచ్ఛన్దో నామతో జ్ఞేయం స్వరాడితి విరాడితి. 107**

**తా.** పాదంలోని రెండు అక్షరాలు ఎక్కు వైతే ఆ ఛందస్సుకు 'స్వరాట్' అనీ తక్కువైతే 'విరాట్' అనీ పేర్లు.

**మూ. సర్వేషామేవ వృత్తానాం తద్జ్ఞైర్జ్ఞేయా గుణాస్త్రయః,**
**దివ్యో దివ్యేతరశ్చైవ దివ్యమానుష ఏవ చ. 108**

**తా.** వృత్తాల నన్నింటినీ దివ్యా లనీ, మానుషా లనీ, దివ్యమానుషా లనీ మూడు విధాలుగా విభజించవచ్చును.

**వి.** దేవతాస్తుత్యాదులలో, దేవతలు వక్త లైనప్పుడు దివ్యవృత్తాలు, మానవాదులు వక్త లైనప్పుడు దివ్యేతరగణానికి చెందిన వృత్తాలు. దివ్యాదివ్యులైన రామాదులు వక్త లైనప్పుడు దివ్యాదివ్యగణానికి చెందినవీ ఉపయోగించాలని **అభినవభారతి**.

**మూ. గాయత్ర్యుష్ణిగ్ అనుష్టుప్చ బృహతీ పఙ్క్తిరేవ చ,**
**త్రిష్టుప్ చ జగతీ చైవ దివ్యోఽయం ప్రథమో గణః. 109**

**తా.** గాయత్రీ – ఉష్ణిక్ – అనుష్టుప్ – బృహతీ – పంక్తి – త్రిష్టుప్ – జగతీ ఛందస్సులు దివ్యగణం.

**మూ. తథాతిజగతీ చైవ శక్వరీ చాతిశక్వరీ,**
**అష్టిరత్యష్టిరపి చ ధృతిశ్చాతిధృతిర్గణః. 110**

**తా.** అతిజగతీ - శక్వరీ - అతిశక్వరీ - అష్టి - అత్యష్టి - ధృతి - అతిధృతి వృత్తాలు అదివ్యవృత్తాలు.

**మూ. కృతిశ్చ ప్రకృతి శ్చైవ హ్యాకృతిర్వికృతిస్తథా,**
**సంకృత్యభికృతీ చైవ ఉత్కృతిర్దివ్యమానుషా. 111**

**తా.** కృతి - ప్రకృతి - ఆకృతి - వికృతి - సంకృతి - అభికృతి - ఉత్కృతి వృత్తాలు దివ్యమానుషగణానికి చెందినవి.

**మూ. ఏతేషాం ఛన్దసాం భూయః ప్రస్తారవిధిసంశ్రయమ్,**
**లక్షణం సంప్రవక్ష్యామి నష్టముద్దిష్టమేవ చ. 112**

**తా.** ఇప్పుడు ఈ ఛందస్సుల ప్రస్తారవిధికి సంబంధించిన, నష్టమూ, ఉద్దిష్టమూ అయిన లక్షణం చెపుతాను.

**వి.** నష్టం అనగా సంఖ్యచేత తెలిసినా, స్వరూపంచేత తెలియనిది. ఉద్దిష్టం అనగా స్వరూపంచేత తెలిసినా సంఖ్యచేత తెలియనిది (అభి.భా.)

ప్రస్తారాన్ని గూర్చిన 113-129 వరకు ఉన్న శ్లోకాలు అభినవభారతీసహితమైన, పరిమల పబ్లికేషన్సువారిప్రతిలో ఉన్నాయి. ఈ ప్రస్తారవిధానం తెలిసికొనడం క్లిష్టంగా కనబడుతూన్నది. అందుచేతనే కాబోలు కొన్ని ప్రతులలో ఈ శ్లోకాలు చేర్చలేదు. ప్రస్తుతమైన నాట్యశాస్త్రంలోని ప్రధానవిషయాలను తెలిసికొనడానికి కోట్ల సంఖ్యలో ఉన్న వృత్తాలను గూర్చి గాని, ఈ ప్రస్తారవిధానాన్ని కాని తెలుసుకొనడం ఏ మాత్రం ఉపయోగించదు. మానసక్లేశం మాత్రం మిగులుతుంది. అందుచేత వీటి అర్థం ఏమో తెలిసికొనడానికీ, ఈ గ్రంథంలో రాయడానికీ ప్రయత్నించకుండా కేవలం మూలంలో ఉన్న శ్లోకాలు ఇస్తున్నాము.

**మూ. ప్రస్తారోఽక్షరనిర్దిష్టో మాత్రోక్తశ్చ తథైవ హి,**
**ద్వికో గ్లావితి వర్ణోక్తౌ మిశ్రౌ చేత్యపి మాత్రికా. 113**
**గురోరధస్తాదాద్యస్య ప్రస్తారే లఘు విన్యసేత్,**
**అగ్రతస్తు సమాదేయా గురవః పృష్ఠతస్తథా. 114**
**ప్రథమం గురుభిర్వర్ణైర్లఘుభిస్త్వవసానజమ్,**
**వృత్తం తు సర్వచ్ఛన్దస్సు ప్రస్తారవిధిరేవ తు. 115**

గుర్వధస్తాల్లఘుం న్యస్య తథా ద్విద్వి యథోదితమ్,
న్యస్యేత్ ప్రస్తారమార్గోఽయమక్షరోక్తస్తు నిత్యశః. 116

మాత్రాసంఖ్యావినిర్దిష్టో గణో మాత్రావికల్పితః,
మిశ్రౌ గ్లావితి విజ్ఞేయౌ పృథక్ లక్ష్యవిభాగతః. 117

మాత్రాగణో గురుశ్చైవ లఘునీ చైవ లక్షితే,
ఆర్యాణాం తు చతుర్మాత్రాప్రస్తారః పరికల్పితః. 118

గీతకప్రభృతీనాం తు పఞ్చమాత్రో గణః స్మృతః,
వైతాలీయం పురస్కృత్య షణ్మాత్రాద్యాస్తథైవ చ. 119

త్ర్యక్షరాస్తు త్రికా జ్ఞేయా లఘుగుర్వక్షరాన్వితాః,
మాత్రాగణవిభాగస్తు గురులఘ్వక్షరాశ్రయః. 120

అన్త్యాద్ద్విగుణితాద్రూపాత్ ద్విద్విరేకం గురోర్భవేత్,
ద్విగుణాం చ లఘోః కృత్వా సంఖ్యాం పిణ్డేన యోజయేత్. 121

ఆద్యం సర్వగురు జ్ఞేయం వృత్తం తు సమసంజ్ఞితమ్,
కోశం తు సర్వలఘ్వన్త్యం మిశ్రరూపాణి సర్వతః. 122

వృత్తానాం తు సమానానాం సంఖ్యాం సంయోజ్య తావతీమ్,
రాశ్యూనామర్ధవిషమాం సమాసాదభినిర్దిశేత్. 123

ఏకాదికాం తథా సంఖ్యాం ఛందసో, వినివేశ్య తు,
యావత్ పూర్ణం తు పూర్వేణ పూరయేదుత్తరం గణమ్. 124

సమానాం విషమాణాం చ సగుణస్య తథా స్ఫుటమ్,
రాశ్యూనామభిజానీయా ద్విషమాణాం సమాసతః. 125

ఏవం కృత్వా తు సర్వేషాం పరేషాం పూర్వపూరణమ్,
(క్రమాన్నైధనమేకైకం ప్రతిలోమం విసర్జయేత్. 126

సర్వేషాం ఛన్దసామేవం లఘ్వక్షరవినిశ్చయమ్)
జానీత సమవృత్తానాం సంఖ్యాం సంక్షేపతస్తథా. 127

వృత్తస్య పరిమాణం తు భిత్వార్ధేన యథాక్రమమ్,
న్యసేల్లఘు తథా సైకమక్షరం గురు చాప్యథ. 128

ఏవం విన్యస్య వృత్తానాం నష్టోద్దిష్టవిభాగతః,
గురులఘ్వక్షరాణీహ సర్వచ్ఛన్దస్సు దర్శయేత్. 129

**ఇతి ఛ్ఛన్దాంసి యానీహ మయోక్తాని ద్విజోత్తమాః,**
**వృత్తాన్యేతేషు నాట్యేఽస్మిన్ ప్రయోజ్యాని నిబోధత. 130**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే వాచికాభినయే ఛన్దోవిధానం నామ చతుర్దశోఽధ్యాయః**

**తా.** ద్విజోత్తములారా! నేనీ విధంగా ఛందస్సులను చెప్పాను. నాట్యంలో ప్రయోగింప దగిన వృత్తాలను గూర్చి ఇపుడు చెపుతాను; తెలుసుకొనండి.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన 'బాలానందిని' అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో, వాచికాభినయానికి సంబంధించిన ఛందోవిధానం అను పద్నాల్గవ అధ్యాయం సమాప్తం.**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ పఞ్చదశోఽధ్యాయః

# ఛన్దోవిచితి

**సమస్తవృత్తాని వినా న యేన పటూద్భవచ్ఛ్రోతరసాయనేన,**
**ఛన్దాంసి యస్మాత్ ప్రభవన్తి వన్దే తం వాఙ్మయం రూపమిహేష్టమూర్తేః.**

**– శ్రీమదభినవగుప్తాచార్యాః**

**మూ. ఛన్దాంస్యేవం హి యానీహ మయోక్తాని ద్విజోత్తమాః,**
**వృత్తాని తేషు నాట్యేఽస్మిన్ ప్రయోజ్యాని నిబోధత. 1**

**తా.** చూ. 14.130 శ్లోకం.

**మూ. ఆద్యే పునరన్త్యే ద్వే ద్వే గురుణీ చేత్,**
**సా స్యాత్తనుమధ్యా గాయత్రసముత్థా. 2**

**తా. 1. తనుమధ్యావృత్తం :–** గాయత్రీఛందోగణానికి సంబంధించిన ఆరక్షరాల **తనుమధ్యావృత్తం** పాదంలోని మొదటి రెండక్షరాలు, చివరి రెండక్షరాలు గురువులుగా ఉంటాయి. అనగా మధ్యలో ఉన్న రెండక్షరాలు (మూడవది నాల్గవది) లఘువులు.

**మూ. యథా – సంత్యక్తవిభూషా భ్రష్టాఞ్జననేత్రా,**
**హస్తార్పితగణ్డా కిం త్వం తనుమధ్యా. 3**

**తా.** ఎట్లనగా (ఉదాహరణం). తను (సన్నని) మధ్యం (నడుము) గల నీవు, అలంకారాలు ధరించక, కంటి కాటుక చెరిగిపోయి, చెక్కిలి చేతిలో ఆన్చి కూర్చున్నావు? కారణ మేమిటి?

**వి.** ఇక్కడ **'సంత్యక్తవిభూషా'** అనేది ఒక పాదం దీనిలోని 'సంత్య' అను మొదటి రెండక్షరాలు, 'భూషా' అను చివరి రెండక్షరాలూ గురువులు. మధ్యలో ఉన్న 'క్త వి' అనేవి లఘువులు. నాలుగు పాదాలూ ఇలాగే ఉన్నాయి గాన ఈ వృత్తం గాయత్రీ ఛందస్సులోని **తనుమధ్యావృత్తం**. ఇటుపై వచ్చే అన్ని లక్షణోదాహరణలలోను లక్ష్య లక్షణసమన్వయం ఇలాగే చూచుకోవాలి.

**మూ. లఘుగణ ఆదౌ భవతి చతుష్కః,**
**గురుయుగమన్తే మకరకశీర్షా. 4**

**తా. (2) మకరకశీర్షావృత్తం :–** ఆరక్షరాల **'మకరకశీర్షా'** వృత్తంలో పాదం మొదటి నాలుగు అక్షరాలు లఘువులు. చివరి రెండక్షరాలు గురువులు.

**మూ. యథా – స్వయముపయాన్తం భజసి న కాన్తమ్,**
**భయకరి కిం త్వం మకరకశీర్ష్ణా. 5**

**తా.** ఎట్లనగా – స్వయంగా వచ్చిన ప్రియుణ్ణి ఆదరించడంలేదు. భయం కలిగించేదనా! నువ్వు మొసలివంటి శిరస్సు కలదానవు కాదా!

**మూ. ఏకమాత్రం షట్కే స్యాద్ ద్వితీయం పాదే,**
**ఖ్యాతరూపా వృత్తే మాలినీ సా నామ్నా. 6**
**షడక్షరకకృతే పాదే లఘు యత్ర ద్వితీయకమ్,**
**శేషాణి తు గురూణి స్యుర్మాలినీ సా మతా యథా. 7**

**తా. (3) మాలినీవృత్తమ్ :–** పాదంలోని ఆరక్షరాలలో రెండవ అక్షరం మాత్రం లఘువు అయి ఉంటుంది. అది మాలినీవృత్తం. ఆరక్షరాలున్న పాదంలో రెండవ అక్షరం లఘువై యుండి మిగిలిన వన్నీ గురువు లైతే అది **మాలినీవృత్తం**. ఎట్లనగా –

**మూ. స్నానగన్ధాధిక్యైః వస్త్రభూషణయోగైః,**
**వ్యక్తమేవాసౌ త్వం మాలినీ ప్రఖ్యాతా. 8**

**తా. ఉదా :–** స్నానగంధాదులు అధికంగా ఉండడంచేత, వస్త్రాలు అలంకారాలు ధరించడంచేతా నువ్వు నిజంగానే **'మాలినీ'** అను ప్రసిద్ధి పొందావు. ఇది యుక్తమే.

**మూ. ద్వితీయం పఞ్చమం చైవ లఘు యత్ర ప్రతిష్ఠితమ్,**
**శేషాణి తు గురూణి స్యుర్మాలతీ నామ సా యథా. 9**

**తా. (4) మాలతీవృత్తమ్ :–** దీనిలో రెండు, ఐదు అక్షరాలు లఘువులు, మిగిలినవి గురువులు. ఎట్లనగా –

**మూ. శోభతే బద్ధయా షట్పదావిద్ధయా,**
**మాలతీమాలయా మానినీ లీలయా. 10**

**తా. ఉదా :–** ఆ మానిని, కేశపాశంలో ధరించిన, తుమ్మెదలు ముసురుతూన్న, **మాలతీ**కుసుమమాలతో, విలాసతో శోభిస్తూన్నది.

**మూ. ద్వితీయం చ చతుర్థం చ పఞ్చమం చ యదా లఘు,**
**యస్యాః సప్తాక్షరే పాదే జ్ఞేయా సా తూద్ధతా; యథా. 11**

**తా. (5) ఉద్ధతావృత్తం :–** ఏడక్షరాల పాదంలో రెండు, నాలుగు, ఐదు అక్షరాలు లఘువులుగా ఉంటే అది **ఉద్ధతావృత్తం**. ఎట్లనగా –

**మూ. (ర్సౌ త్రికౌ యది పాదౌ హ్యన్తిమశ్చ గకారః,**
**ఉష్ణిగుత్థితపాదా ఉద్ధతా ఖలు నామ్నా. 12**

**తా.** పాదంలో రెండు ర సగణా లుంటాయి. ఏడవది గురువు. ఇది ఉష్ణిక్ ఛందోతర్గత మైన **ఉద్ధతావృత్తం**).

**మూ. దన్తకున్తకృతాస్త్రం వ్యాకులాలకశోభమ్,**
**శంసతీవ తవాస్యం నిర్దయం రతయుద్ధమ్. 13**

**తా. ఉదా :–** దంతా లనే కుంతాలను ఆయుధాలుగా ధరించి, వ్యాకులములైన ముంగురులతో శోభిస్తూన్న నీ ముఖం నువ్వు నిర్దయ మైన రతయుద్ధంలో పాల్గొన్నట్లు చెపుతూన్నదా అన్నట్లుంది.

**మూ. ఆదౌ ద్వే నిధనే చైవ గురుణీ యత్ర వై సదా,**
**పాదే సప్తాక్షరే జ్ఞేయా నామ్నా భ్రమరమాలికా. 14**

**తా. (6) భ్రమరమాలికావృత్తం :–** ఏడక్షరాలు పాదంలో మొదటి రెండక్షరాలు, ఏడవ అక్షరం గురువులు, మిగిలినవి లఘువులు అయితే అది **భ్రమరమాలికావృత్తం**.

**మూ. (పాదే యది నివిష్టౌ సమ్యగ్విరచితౌ త్సౌ,**
**అన్త్యే యది గకారః సా తు భ్రమరమాలా. 15**

**తా.** పాదంలో మొదట తగణ – సగుణాలు, చివరి అక్షరం గురువు ఉంటే **భ్రమరమాలికావృత్తం**).

**మూ. యథా :– నానాకుసుమచిత్రే ప్రాప్తే సురభిమాసే,**
**ఏషా భ్రమతి మత్తా కాన్తే భ్రమరమాలా. 16**

**తా.** ఎట్లనగా – కాంతా! అనేకవిధాలైన పుష్పాలతో చిత్రమైన వసంతం రాగానే ఈ తుమ్మెదల పంక్తి మత్తెక్కి తిరుగుతూన్నది.

**మూ. ఆద్యం తృతీయమన్త్యం చ పఞ్చమం సప్తమం తథా,**
**గురూణ్యష్టాక్షరే పాదే సింహలేఖేతి సా యథా. 17**

**తా. (7) సింహలేఖావృత్తం :–** ఒకటి, మూడు, ఎనిమిది, ఐదు, ఏడు అక్షరాలు, దేని ఎనిమిదక్షరాల పాదంలో గురువులుగా ఉంటాయో అది **సింహలేఖావృత్తం**.

**మూ. (జాతు యస్య గౌ న, పాదే సంస్థితః సమస్వరూపే,**
**తామనుష్టుభాశ్రయస్థాం వావదన్తి సింహలేఖామ్). 18**

(శ్లోకార్థం స్పష్టంగా లేదు).

**ఉదా :– యత్త్వయా హ్యనేకభావైశ్చేష్టితం రహః సుగాత్రి!,**
**తన్మనో మమ ప్రవిష్టం వృత్తమత్ర సింహలేఖమ్. 19**

**తా.** సుగాత్రీ! అనేకభావాలతో నీవు రహస్యప్రదేశంలో చేసిన చేష్ట ఈనాడు సింహలేఖ వలె, నా మనస్సులో స్థిరంగా నిలిచి ఉంది.

**మూ. చతుర్థం చ ద్వితీయం చ షష్ఠమష్టమమేవ చ,**
**గురూణ్యష్టాక్షరే పాదే యత్ర తన్మత్తచేష్టితమ్. 20**

**తా. (8) మత్తచేష్టితవృత్తం :–** ఎనిమిదక్షరాల పాదంలోని నాలుగు, రెండు, ఆరు, ఎనిమిది అక్షరాలు గురువులుగా ఉన్నది **మత్తచేష్టితవృత్తం.**

**మూ. (యదా తు జాత్పరౌ రవౌ గకార ఏవ చ స్థితః,**
**అనుష్టబుద్భవం తదా వదన్తి మత్తచేష్టితమ్. 21**

**తా.** జగణం, రగణం, లఘువు, గురువు – వరుసగా ఒక పాదంలో ఉన్నది, అనుష్టుభ్ఛందస్సునుండి పుట్టిన **మత్తచేష్టితవృత్త** మని చెప్పబడినది).

**మూ. యథా – మదావఘూర్ణితేక్షణం విలమ్బితాకులాలకమ్,**
**అసంస్థితైః పదైః ప్రియా కరోతి మత్తచేష్టితమ్. 22**

**తా.** ఉదాహరణం ఎట్లనగా – మత్తుచే తిరిగిపోతూన్న చూపులతో వ్యాకులములైన ముంగురులు వేలాడుతూండగా, ప్రియురాలు, తొట్రుపడుతూన్న అడుగులతో మత్తుల చేష్టలు చేస్తూన్నది.

**మూ. అష్టాక్షరకృతే పాదే సర్వాణ్యేవ భవన్తి హి,**
**గురూణి యస్మిన్ సా నామ్నా విద్యున్మాలేతి కీర్తితా. 23**

**తా. (10) విద్యున్మాలావృత్తం :–** ఎనిమిదక్షరాల పాదంలో అన్నీ గురువులే అయితే అది **విద్యున్మాల.**

**మూ. (మౌ గౌ చాన్త్యౌ యస్యాః పాదౌ పాదస్యాన్తే విచ్ఛేదశ్చ,**
**సా చానుష్టుప్ఛన్దస్యుక్తా నిత్యం సద్భిర్విద్యున్మాలా. 24**

**తా.** పాదంలో రెండు మగణాలు, చివరి రెండు గురువులు, పాదాంతంలో విచ్ఛేదమూ ఉన్నది **విద్యున్మాలావృత్తం.** ఇది అనుష్టుప్ఛందోంతర్గతం).

**మూ. సామ్భోభారైరానర్దద్భిః శ్యామామ్భోదైర్వ్యాప్తే వ్యోమ్ని,**
**ఆదిత్యాంశుస్పర్ధిన్యేషా దిక్షు భ్రాన్తా విద్యున్మాలా. 25**

**తా.** (ఉదాహరణం ఎట్లనగా) నీటి భారంతో నిండి, నల్లని మేఘాలు గంభీరంగా ధ్వనులు చేస్తూ ఆకాశాన్ని వ్యాపించి ఉండగా **విద్యున్మాల** (మెరుపుల పంక్తి) సూర్యకాంతితో పోటీపడుతూ దిక్కులలో తిరుగుతూన్నది.

**మూ. (పఞ్చమం సప్తమం చాన్త్యం గురు పాదేఽష్టకే తథా,**
**ఛన్దోజ్ఞైర్ జ్ఞేయమేతత్తు వృత్తం చిత్తవిలాసితమ్. 26**

**తా. (11) చిత్తవిలాసితవృత్తం :–** ఎనిమిదక్షరాల పాదంలో ఐదు, ఏడు, ఎనిమిది అక్షరాలు గురువులు ఉంటే **చిత్తవిలాసితవృత్తం**. ఉదాహరణం ఎట్లనగా –

**మూ. స్మితవశవిప్రకాశైర్దశనపదైరమీభిః,**
**వరతను! పూర్ణచన్ద్రం తవ ముఖమావృణోతి.) 27**

(**తా.** ఓ! సుందరగాత్రీ! నీ ముఖం చిరునవ్వుతో ప్రకాశిస్తూన్న ఈ దంతాలతో పూర్ణచంద్రుణ్ణి కప్పివేస్తూన్నది.)

**మూ. నవాక్షరకృతే పాదౌ త్రీణి స్యుర్నైధనాని చ,**
**గురూణి యస్యాః సా నామ్నా జ్ఞేయా మధుకరీ యథా. 28**

**తా. (12) మధుకరీవృత్తం :–** తొమ్మిది అక్షరాలలో మొదటి ఆరు అక్షరాలు లఘువులు, చివరి మూడు అక్షరాలు గురువులు – ఇది **మధుకరీవృత్తం**.

ఇదే అర్థం చెప్పే మరొక శ్లోకం –

**మూ. (షడిహ యది లఘూని స్యుర్నిధనగతభకారశ్చేత్,**
**బుధజనబృహతీసంస్థా భవతి మధుకరీ నామ్నా). 29**

ఎట్లనగా –

**మూ. కుసుమితమభిపశ్యన్తీ వివిధతరుగణైశ్ఛన్నమ్,**
**వనమతిశయగన్ధాఢ్యం భ్రమతి మధుకరీ హృష్టా. 30**

**తా. మధుకరి** (ఆడతుమ్మెద) అనేకమైన వృక్షసముదాయాలతో నిండిన, పుష్పించిన, మంచి సువాసనలు వ్యాపింపచేస్తూన్న వనం చూస్తూ సంతోషిస్తూ తిరుగు తూన్నది.

**మూ. దశాక్షరకృతే పాదే త్రీణ్యాదౌ త్రీణి నైధనే,**
**యస్యా గురూణి సా జ్ఞేయా పఙ్క్తిరుత్పలమాలికా. 31**

**తా. (13) ఉత్పలమాలికావృత్తం :–** పదక్షరాల పాదంలో మొదట మూడు అక్షరాలు, చివరి మూడు అక్షరాలు గురువు లైతే మధ్య నున్న నాలుగు లఘువు లైతే అది **ఉత్పలమాలికావృత్తం**.

ఇదే లక్షణం మరొక శ్లోకంలో –

**మూ. త్రీణ్యాదౌ యది హి గురూణి స్యుశ్చత్వారో యది లఘవో మధ్యే,**
**పఞ్చావన్తగతమకారః స్యాద్విజ్ఞేయా కువలయమాలాఖ్యా. 22**

యథా – ఎట్లనగా

**మూ. అస్మింస్తే శిరసి తదా కాన్తే వైదూర్యస్ఫటికసువర్ణాఢ్యే,**
**శోభాం స్వాం న వహతి తాం బద్ధా సుశ్లిష్టా కువలయమాలేయమ్. 33**

**తా.** కాన్తా! వైదూర్యాలతో, స్ఫటికాలతో, బంగారంతో నిండిన నీ శిరస్సుమీద బిగించి కట్టిన ఈ **కువలయమాల** (తెల్లకలవల దండ) తగినంతగా శోభించడంలేదు.

**మూ. ద్వితీయం చ చతుర్థం చ షష్ఠమష్టమమేవ చ,**
**హ్రస్వం దశాక్షరే పాదే యత్ర సా శిఖిసారిణీ. 34**

**(ర్జౌ త్రికౌ హి పాదగౌ తు యస్యా ర్గౌచ సంశ్రితౌ తథా సమాప్తౌ,**
**పఙ్క్తియోగసుప్రతిష్ఠితాఙ్గీ సా మయూరసారిణీతి నామ్నా). 35**

**తా. (14) శిఖిసారిణీ లేదా మయూరసారిణీవృత్తం :–** పది అక్షరాల పంక్తిఛంద స్సైన దేని పాదంలో రెండు, నాలుగు, ఆరు, ఎనిమిది అక్షరాలు హ్రస్వాలో (లఘువులో) అది **మయూరసారిణీవృత్తం**, లేదా **శిఖిసారిణీవృత్తం**.

**మూ. యథా – నైవ తేఽస్తి సంగమో మనుష్యైర్నాపి కామభోగచిహ్నముహ్యతే,**
**గర్భిణీవ దృశ్యసే హ్యనార్యే! కిం మయూరసారిణీ త్వమేవమ్. 36**

**తా.** ఎట్లనగా – అనార్యురాలా! నీకు మనుష్యులతో సంగమం లేదు. కామభోగం చేసిన చిహ్నం కూడ ఏదీ కనబడడంలేదు. గర్భిణి వలె ఎందుకు కనబడుతున్నావు – నెమలివలె నడుస్తున్నావు!

**మూ. ఆద్యం చతుర్థమన్త్యం చ సప్తమం దశమం తథా,**
**గురూణి త్రైష్టుభే పాదే యత్ర స్యుర్దోధకం తు తత్. 37**

**తా. (15) దోధకవృత్తం :–** పదకొండు అక్షరాల ఈ త్రిష్టుప్ఛందోగత మైన దోధకవృత్తపాదంలోని ఒకటి, నాలుగు, పదకొండు, ఏడు, పది అక్షరాలు గురువులు.

**మూ. భౌతు భగావితి యస్య గణాః స్యుః స్యాచ్చ యతిస్త్రిచతుర్భిరథాస్మిన్,**
**త్రైష్టుభమేవ హి తత్ ఖలు నామ్నా దోధకవృత్తమితి ప్రవదన్తి. 38**

**తా.** మూడు భగణాలు రెండు గురువులు, తృతీయాక్షరంమీద, తరవాత చతుర్థాక్షరం మీద యతి ఉన్న త్రిష్టుప్చందస్సుకు చెందిన వృత్తం **దోధకవృత్తం**).

**మూ. యథా :– ప్రస్థలితాప్రపదప్రవిచాయం మత్తవిఘూర్ణితగాత్రవిలాసమ్,**
**పశ్య విలాసిని! కుఞ్జరమేతం, దోధకవృత్తమయం ప్రకరోతి. 39**

**తా.** ఓ విలాసినీ! పైన కప్పిన ఆచ్ఛాదనం పాదాలచివరి వరకు వ్రేలాడుతూ

ఊగుతుండగా, మదంతో తిరిగిపోతూన్న శరీరంవిలాసంతో ఈ ఏనుగు దోధకవృత్తాన్ని (దోధకంతో గానం చేసే వృత్తము పద్ధతిని) చేస్తూన్నది.

**మూ. ఆదౌ ద్వౌ పఞ్చమం చైవాష్టమం నైధనం తథా,**
**గురూణ్యేకాదశే పాదే యత్ర తన్మోటకం యథా. 40**

**తా. (16) మోటకవృత్తం :–** పదకొండు అక్షరాల పాదంలో మొదటి రెండక్షరాలు, ఐదు, ఎనిమిది, పదకొండు అక్షరాలు గురువులు అయి ఉంటే అది **మోటకవృత్తం**. ఎట్లనగా –

**మూ. ఏషోఽమ్బుదనిఃస్వవతుల్యరవః క్షీబః స్ఖలమానవిలాసగతిః,**
**శ్రుత్వా ఘనగర్జితమద్రితటే వృక్షాన్ ప్రతిమోటయతి ద్విరదః. 41**

**తా.** మదించి, మేఘం వలె గంభీరంగా ధ్వని చేస్తూ, తొట్రుపడుతూ సవిలాస గమనం గల ఈ ఏనుగు, పర్వతం చరియమీద మేఘాల ఉరుములు విని, చెట్లను పొడుస్తూన్నది.

**మూ. నవమం సప్తమం షష్ఠం తృతీయం చ భవేల్లఘు,**
**ఏకాదశక్షరే పాదే ఇన్ద్రవజ్రేతి సా యథా. 42**

**తా. (17) ఇంద్రవజ్రావృత్తం :–** పదకొండు అక్షరాల పాదంలో తొమ్మిది, ఏడు, ఆరు, మూడు అక్షరాలు లఘువులై ఉంటే అది ఇంద్రవజ్రావృత్తం. ఎట్లనగా –

**మూ. త్వం దుర్నిరీక్ష్యా దురతిప్రసాదా దుఃఖైకసాధ్యా కఠినస్వభావా,**
**సర్వాస్వవస్థాసు చ కామతన్త్రే యోగ్యాసి కిం వా బహునేన్ద్రవజ్రా. 43**

**తా.** నువ్వు చూడ శక్యం కానిదానవు. అనుగ్రహింపచేసి కొనడానికి శక్యం కానిదానవు. అతికష్టంమీద సాధించతగినదానవు. కఠినస్వభావం కలదానవు. అధికంగా చెప్పి ఏమి ప్రయోజనము; నువ్వు ఇంద్రుని వజ్రమే. అయినా అన్ని అవస్థలలోను కామతంత్రానికి యోగ్యురాలవు.

**మూ. ఏభిరేవ తు సంయుక్తా లఘుభిస్త్రైష్టుభీ యదా,**
**ఉపేన్ద్రవజ్రా విజ్ఞేయా లఘ్వ్యాదావిహ కేవలమ్. 44**

**తా. (18) ఉపేంద్రవజ్రావృత్తం :–** త్రిష్టుప్ఛందస్సుకు చెందినదే మరొక వృత్తం పైన చెప్పినట్లు ఆ యా లఘ్వక్షరా లున్నదైతే, ఒక్క మొదటి అక్షరం కూడ గురువుకు బదులు లఘు వైతే, దాని పేరు **ఉపేంద్రవ్రజావృత్తం**. ఎట్లనగా –

**మూ. ప్రియే! శ్రియా వర్ణవిశేషణేన స్మితేన కాన్త్యా సుకుమారభావైః,**
**అమీ గుణా రూపగుణానురూపా భవన్తి తే కిం? త్వముపేన్ద్రవజ్రా. 45**

**తా.** ప్రియురాలా! శోభతోను, వర్ణవిశేషంతోను, చిరునవ్వుతోను, కాంతితోను, సుకుమారభావాలతోను కలిసి ఈ గుణాలు రూపానికి గుణాలకీ అనురూపంగా నీలో ఉన్నాయి. నువ్వు ఉపేంద్రవజ్రవా? (ఉపేంద్రుని ఆయుధమా?)

**మూ. ఆద్యం తృతీయమన్త్యం చ సప్తమం నవమం తథా,**
**గురూణ్యేకాదశే పాదే యత్ర సా తు రథోద్ధతా. 46**

**తా. (19) రథోద్ధతావృత్తం :–** పదకొండు అక్షరాల పాదంలో ఒకటి, మూడు, పదకొండు, ఏడు, తొమ్మిది అక్షరాలు గురువులుగా ఉంటే అది **రథోద్ధతావృత్తం**. ఎట్లనగా–

**మూ. కిం త్వయా సుభట! దూరవర్జితం నాత్మకో న సుహృదాం ప్రియం కృతమ్,**
**యత్పలాయనపరాయణస్య తే యాతి ధూలిరధునా రథోద్ధతా. 47**

**తా.** ఓ! సుభటుడా! నీవు పారిపోతూంటే రథవేగానికి పైకి ఎగిరిన ధూళి ఇంకా నీ వెనుక వస్తూనే ఉంది! నువ్వు దూరంగా విడిచిపెట్టినది ఏముంది? నువ్వు చేసిన పారిపోవడం అనే ఈ పని నీకు ప్రియం కాదు. నీ మిత్రులకూ ప్రియం కాదు.

**మూ. (కిం త్వయా కుమతిసంగయా సదా నాజ్ఞయేవ సుహృదాం ప్రియం కృతమ్,**
**యద్గృహాద్వచనరోషకమ్పితా యాతి తూర్ణమబలా రథోద్ధతా. 48**

**తా.** కుమతు లిచ్చిన ఆజ్ఞ వలె నువ్వు నీ మిత్రులు మెచ్చుకొనే పని చేయలేదు. ఎందువల్ల ననగా నీ వన్న మాటలవల్ల కలిగిన రోషంతో కదిలిపోయిన ఆ అబల, రథం వలె శీఘ్రంగా ప్రవర్తించి ఉద్ధతయై ఇంట్లోనుంచి వెంటనే వెళ్లిపోతూన్నది!)

**మూ. ఆద్యం తృతీయమన్త్యం సప్తమం దశమం గురు,**
**యస్యాస్తు త్రైష్టుభే పాదే విజ్ఞేయా స్వాగతా హి సా. 49**

**తా. (20) స్వాగతావృత్తం :–** త్రిష్టుప్ఛందస్సుకు చెందిన **స్వాగతావృత్తం** పాదంలోని ఒకటి, మూడు, పదకొండు, ఏడు, పది వర్ణాలు గురువులై ఉంటాయి.

**మూ. యథా :– అద్య మే సఫలమాయాతనేత్రే! జీవితం మదనసంశ్రయభావమ్,**
**ఆగతాసి భవనం మమ యస్మాత్ స్వాగతం తవ వరోరు! నిషీద. 50**

**తా.** ఎట్లనగా – విశాలనేత్రములు గలదానా! మదనునితో కూడిన మనస్సుతో నా జీవనం ఈ నాడు సఫలమైనది. ఎందువల్ల ననగా నీ వీనాడు నా భవనానికి వచ్చావు. సుందరమైన ఊరువులు గలదానా! నీకు స్వాగతం; కూర్చో.

**మూ. (షష్ఠం చ నవమం చైవ లఘునీ త్రైష్టుభే యది,**
**గురూణ్యన్యాని పాదౌ తు సా జ్ఞేయా శాలినీ యథా. 51**

**తా. (21) శాలినీవృత్తం :–** త్రిష్టుప్ఛందస్సుకు చెందిన ఒక పాదంలోని ఆరు, తొమ్మిది అక్షరాలు లఘువులై మిగిలిన వన్నీ గురువు లైతే అది **శాలినీవృత్తం**. ఎట్లనగా–

**మూ. దుఃశీలం వా నిర్గుణం వా పరం వా లోకే ధైర్యాదప్రియం న బ్రవీషి,**
**తస్మాచ్ఛీలం సాధుహేతోః సువృత్తం మాధుర్యాత్స్యాత్సర్వథా శాలినీత్వమ్. 52**

**తా.** నీవు ఈ లోకంలో ఎవడైనా చెడ్డశీలం కలవాడైనా, నిర్గుణు డైనా, మరొక డైనా – వానిని గూర్చి అప్రియంగా మాటలాడవు. సాధుత్వానికి శీలము, మంచి నడవడికా ఇవే కారణాలు. అన్నివిధాలా మధురస్వభావంతో ఉంటున్న నీవు శాలినివి, ప్రకాశిస్తున్నావు.

**మూ. తృతీయం చైవ షష్ఠం చ నవమం ద్వాదశం తథా,**
**గురూణి జాగతే పాదే యత్ర తత్తోటకం భవేత్. 53**

**తా. (22) తోటకవృత్తం :–** పన్నెండక్షరాల జగతీఛందస్సులోని పాదంలో మూడు, ఆరు, తొమ్మిది, పన్నెండు అక్షరాలు గురువు లైతే అది **తోటకవృత్తం**.

**మూ. యది సోఽత్ర భవేత్తు సముద్రసమస్త్రిషు చాపి తథా నియమేన యతిః,**
**సతతం జగతీనిహితం హి తతం గదితం ఖలు తోటకవృత్తమిదమ్). 54**

**తా.** నాలుగు సగణాలు మూడవ అక్షరంమీద యతీ ఉంటే అది తోటకవృత్తం).

**మూ. యథా – కిమిదం కపటాశ్రయదుర్విషహం బహుశాఠ్యమథోల్బణరూక్షకథమ్,**
**స్వజనప్రియసజ్జనభేదకరం నను తోటకవృత్తమిదం కురుషే. 55**

**తా.** ఏమిటిది! కపటత్వంచేత సహింప శక్యంకాని అత్యధికమైన శఠత్వంతో, తీవ్రమైన మాటలతో, స్వజనులలోను, సజ్జనులలోను భేదం కలిగించే, ఇలాంటి, ఛేదించే వాడు చేసే పని చేస్తున్నావు!

**మూ. (ఆద్యం తృతీయమన్త్యం చ పఞ్చమం షష్ఠ మేవ చ,**
**తథోపాన్త్యం జగత్యాం చ గురు చేత్కుముదప్రభా. 56**

**తా. (23) కుముదప్రభావృత్తం :–** జగతీఛందస్సులోనే – ఒకటి, మూడు, పన్నెండు, ఐదు, ఆరు, పదకొండు అక్షరాలు గురువు లైతే అది **కుముదప్రభావృత్తం**.

**మూ. యౌ త్రికౌ తథాన్యౌ యది పాదౌ షడ్భిరేవ వర్ణైర్యది చ యతిః స్యాత్,**
**నిత్యసంనివిష్టా జగతి విధానే నామతః ప్రసిద్ధా కుముదనిభా సా. 57**

**తా.** రెండు యగణాలు, నగణం, యగణం ఆరవ అక్షరంమీద యతీ ఉంటే **కుమదనిభావృత్తం**.

**మూ. యథా – మన్మథేన విద్ధా సలలితభావా నృత్తగీతయోగా ప్రవికసితాక్షీ,**
**నిన్వ్యమద్య కిం? త్వం విగలితశోభా చన్ద్రపాదయుక్తా కుమదవతీ చ(వ). 58**

**తా.** ఎట్లనగా – ఓ! రమణీ! నువ్వు మన్మథునిచేత పీడింపబడి, లలితమైన భావములతో నృత్తగీతాదులయందు ఆసక్తురాలవై వికసించిన నేత్రాలతో ఉండేదా నవు కదా? ఇప్పుడు నింద్యమైనది ఏమి జరిగినది? చంద్రపాదాల స్పర్శ గల కుముదవతి (కలువల లత) వలె శోభారహితురాలవై ఉన్నావు. (చంద్రకరస్పర్శ ఉన్న కుముదవతి శోభారహితం కాకూడదు. అయినా అది శోభారహితమై నట్లుంది నీ స్థితి అని భావం అయి ఉంటుంది).

**మూ. మతాన్తరే – యది ఖలు పాదే న్యౌ త్రికౌ యథా ర్యౌ**
**యతిరపి వర్ణైః షడ్భిరేవ చేత్ స్యాత్,**
**జగతి విధానే నిత్యసంనివిష్టా**
**కుముదనిభా సా నామతః ప్రసిద్ధా. 59**

**తా. మతాంతరం ప్రకారం కుముదనిభావృత్తం :–** పాదంలో న – య – ర – య గణాలు, ఆరవ అక్షరంమీద యతి ఉంటే కూడ **కుమదనిభావృత్తం**.

**మూ. కుముదనిభా త్వం కామబాణవిద్ధా కిమసి నతభ్రూః శీతవాతదగ్ధా,**
**మృదునలినీవాపాణ్డువక్త్రశోభా కథమపి జాతా హ్యగ్రతః సఖీనామ్. 60**

**తా.** నువ్వు సఖురాళ్ల ఎదుట ఉన్నా వన్నమాటే కాని, శీతవాతానికి దెబ్బతిన్న తెల్లకలవవలె ఉన్నావు. కనుబొమ్మలు వంగిపోయాయి. మృదువైన తామరతీగవలె తెల్లబడిన ముఖశోభతో ఉన్నావు. కామబాణాల దెబ్బ ఏమైనా తగిలిందా నీకు?

**మూ. ద్వాదశాక్షరకే పాదే సప్తమం దశమం లఘు,**
**ఆదౌ పఞ్చాక్షరచ్ఛేదశ్చన్ద్రలేఖా (తు) సా యథా. 61**

**తా. (25) చంద్రలేఖావృత్తం :–** పన్నెండక్షరాల పాదంలో, ఏడు, పది అక్షరాలు లఘువులు. మొదటినుండి ఐదవదైన అక్షరం దగ్గర యతి. ఇది **చంద్రలేఖావృత్తం**. ఎట్లనగా –

**మూ. వక్త్రం సౌమ్యం తే పద్మపత్రాయతాక్షం కామస్యావాసం సునాసోచ్చప్రహాసమ్,**
**కామస్యాపీదం కామమాహర్తుకామం కాన్తే! కాన్త్యా త్వం చన్ద్రలేఖేవ భాసి. 62**

**తా.** కాంతా! సౌమ్యమైన నీ ముఖం పద్మపత్రాల వలె విశాలమైన నేత్రాలతో, అందమైన ముక్కుతో ప్రహాసంతో మన్మథునికి నివాసమై ఉంది. కామునికి కామం కలిగించా లను కామంతో ఉంది. కాంతితో నీవు చంద్రలేఖ వలె ఉన్నావు.

**మూ. తృతీయమన్త్యం నవమం పఞ్చమం చ యదా గురు,**
**ద్వాదశాక్షరకే పాదే యత్ర సా ప్రమితాక్షరా. 63**

**తా. (26) ప్రమితాక్షరావృత్తం :-** పన్నెండక్షరాల పాదంలో మూడు, పన్నెండు, తొమ్మిది, ఐదు అక్షరాలు గురువు లైతే **ప్రమితాక్షరావృత్తం.**

**మూ. యథా – స్మితభాషిణీ హ్యచపలా పరుషా నిభృతాపవాదవిముఖీ సతతమ్,**
**అపి కస్య చిద్యువతిరస్తి సుఖా ప్రమితాక్షరా స హి పుమాన్ జయతి. 64**

**తా.** ఎట్లనగా – చిరునవ్వుతో మాట్లాడేదీ, చపలత్వం లేనిదీ, పరుషత్వం లేనిదీ, రహస్యంగా దూషించడంలో విముఖురాలు, మితంగా మాట్లాడేదీ అయిన యువతి (భార్య) ఉన్న పురుషుడు అందరికంటె గొప్పవాడుగా ఉంటాడు.

**మూ. ద్వితీయమన్త్యం దశమం చతుర్థం పఞ్చమాష్టమే,**
**గురూణి ద్వాదశే పాదే వంశస్థా జగతీ తు సా. 65**

**తా. (27) వంశస్థవృత్తం :-** జగతీఛందస్సుకు చెందిన పన్నెండు అక్షరాల పాదంలో రెండు, పన్నెండు, నాలుగు, ఐదు, ఎనిమిది అక్షరాలు గురువులుగా ఉంటే అది **వంశస్థవృత్తం.**

**మూ. (యది త్రికౌ జ్తౌ భవతస్తు పాదతః తథైవ చ జ్రావవసానసంస్థితౌ,**
**తదా హి వృత్తం జగతీప్రతిష్ఠితం వదన్తి వంశస్థమితీహ నామతః. 66**

**తా.** జ – త – జ – రగణాలు ఒక్కొక్క పాదంలో ఉన్న జగతీఛందోంతర్గత వృత్తం **వంశస్థం).**

**మూ. న మే ప్రియా త్వం బహుమానవర్జితాఽప్రియం ప్రియం తే పరుషాభిభాషిణీ,**
**తథాహి పశ్యామ్యహమద్య విగ్రహం ధ్రువం హి వంశస్థగతిం కరిష్యతి. 67**

**తా.** గౌరవభావం లేనిదానవై నీ ప్రియుణ్ణి గూర్చి అప్రియంగా పరుషంగా మాటలాడే నువ్వు నాకు ప్రియురాలవు కాదు. ఇప్పుడు నీ విగ్రహాన్ని చూస్తే ఇది నీ వంశంలో ఉన్న పద్ధతినే చేస్తున్నది అని తలచుచున్నాను.

**మూ. చతుర్థమన్త్యం దశమం సప్తమం చ యదా గురు,**
**భవేద్ధి జాగతే పాదే తదా స్యాద్ధరిణప్లుతా. 68**

**తా. (28) హరిణప్లుతావృత్తం :-** జగతీఛందస్సుకు సంబంధించి హరిణప్లుతా వృత్తపాదంలోని నాలుగు, పన్నెండు, పది, ఏడు అక్షరాలు గురువులుగా ఉంటాయి.

**మూ. పరుషవాక్యకశాభిహతా త్వయా భయవిలోకనపార్శ్వనిరీక్షణా,**
**వరతనుః ప్రతతప్లుతసర్పణైరనుకరోతి గతైర్హరిణప్లుతమ్. 69**

**తా.** నీ పరుషవాక్కు లనే కొరడాచేత కొట్టబడిన ఆ సుందరి భయంతో చంచల

మైన చూపులతో పక్కలకు చూస్తూ, దీర్ఘమైన ప్లుతములు (అంగలు) గల నడకలతో లేడి ప్లుతాన్ని (గెంతడాన్ని) అనుకరిస్తున్నది.

**మూ. సప్తమం నవమం చాన్త్యముపాన్త్యం చ యదా గురు,**
**ద్వాదశాక్షరకే పాదే కామదత్తేతి సా యథా. 70**

**తా. (29) కామదత్తావృత్తం :-** పన్నెం డక్షరాల పాదంలోని ఏడు, తొమ్మిది, పన్నెండు, పదకొండు అక్షరాలు గురువు లైతే అది **కామదత్తావృత్తం**. ఎట్లనగా –

**మూ. కరజపదవిభూషితా యథా త్వం సుదతి! దశనవిక్షతాధరా చ,**
**గతిరపిచరణవిలగ్నమన్దా త్వమసి మృగనిభాక్షి! కామదత్తా. 71**

**తా.** లేడి కళ్లవంటి కళ్లుకలదానా! నువ్వు నఖక్షతాల గుర్తులతో అలంకృతవై, దంతక్షతాలతో కూడిన అధరోష్ఠంతో పాదాలు ఒకదానితో ఒకటి కొట్టుకొంటూ మంద గమనం చేస్తున్నావు! నువ్వు కామదత్తవే. (మన్మథునికి ఇవ్వబడినదానవు).

**మూ. ఆద్యం చతుర్థం దశమం సప్తమం చ యదా లఘు,**
**పాదే తు జాగతే యస్యా అప్రమేయా తు సా యథా. 72**

**తా. (30) అప్రమేయావృత్తం :-** జగతీఛందస్సుకు చెందిన ఒక పాదంలో ఒకటి, నాలుగు, పది, ఏడు అక్షరాలు లఘువు లయితే అది **అప్రమేయావృత్తం**. ఎట్లనగా –

**మూ. న తే కాచిదన్యా సమా దృశ్యతే స్త్రీ నృలోకే విశిష్టా గుణైరద్వితీయైః,**
**త్రిలోక్యాం గుణాన్యా సమాహృత్య సర్వాన్ జగత్యప్రమేయాసి సృష్టా విధాత్రా. 73**

**తా.** ఎట్లనగా – ఈ మానవలోకంలో గుణాలచేత నీకంటె విశిష్టురాలు కాని, నీతో సమురాలు కాని ఏ స్త్రీ కూడ నాకు కనబడడంలేదు. మూడు లోకాలలో ఉన్న అన్ని గుణాలను ప్రోగుచేసి బ్రహ్మదేవుడు నిన్ను సృజించాడు. జగత్తులో నిన్ను ఎవరితోనూ పోల్చడానికి శక్యం కాదు.

**మూ. ద్వితీయం పఞ్చమం చైవ ద్వాదశైకాదశే తథా,**
**పాదే యత్ర లఘూని స్యుః పద్మినీ నామ సా యథా. 74**

**తా. (31) పద్మినీవృత్తం :-** పాదంలోని రెండు, ఐదు, పన్నెండు, పదకొండు అక్షరాలు లఘువు లైతే అది **పద్మినీవృత్తం**. ఎట్లనగా –

**(మూ. రాస్త్రికాః సాగరాఖ్యా నివిష్టా యదా స్యాత్ త్రికే చ త్రికే యుక్తరూపా,**
**యతిః సంనివిష్టా జగత్యాస్తతః సా బుధైర్నామతశ్చాపి సంకీర్త్యతే పద్మినీ. 75**

**తా.** జగతీఛందస్సులోని పాదంలో నాలుగు రగణాలు ఉండి ప్రతీగణం చివరా యతి ఉంటే అది **పద్మినీవృత్తం**.)

**మూ. దేహతోయాశయా వక్త్రపద్మోజ్జ్వలా నేత్రభృఙ్గాకులా దన్తహంసస్మితా,**
**కేశపాశచ్ఛదా చక్రవాకస్తనీ పద్మినీవ ప్రియే భాసి మే సర్వదా. 76**

**(ఫుల్లపద్మాననా త్వం ద్విరేఫేక్షణా కేశపత్రచ్ఛదా చక్రవాకస్తనీ,**
**పీతతోయావలీబద్ధకాఞ్చీగుణా పద్మినీవ ప్రియే భాసి నీరే స్థితా). 77**

**తా. ఉదా :–** ప్రియురాలా! దేహమే సరస్సుగా గల దానవూ, ముఖ మనే పద్మంతో ప్రకాశించుదానవూ, నేత్రము లనే తుమ్మెదలతో వ్యాకులురాలవూ. దంతములు చిరునవ్వా హంసములుగా కలదానవూ, కేశపాశ మనే ఆకులు గల దానవూ, స్తనము లనే చక్రవాక పక్షులు కలదానవు అయిన నీవు ఎల్లప్పుడు నాకు పద్మలత వలె కనబడతావు.

(ప్రియురాలా! వికసించిన పద్మం వంటి ముఖము, తుమ్మెదలవంటి నేత్రాలు ఆకులవంటి కేశాలు, చక్రవాకముల వంటి స్తనములు, పచ్చగా నున్న జలధారవంటి వడ్డాణము గల, ఒడ్డుమీద నీటిలో ఉన్న నీవు పద్మినివలె భాసిస్తున్నావు).

**మూ. ఆదౌ షడ్ దశమం చైవ పాదే యత్ర లఘూన్యథ,**
**శేషాణి తు గురూణి స్యుః జాగతే పుటసంజ్ఞితా. 78**

**తా. (32) పుటవృత్తం :–** పాదంలోని మొదటి ఆరు అక్షరాలు, పదవ అక్షరమూ లఘువులై ఉండి, మిగిలినవి గురువు లైతే జగతీఛందోన్తర్గత మైన ఆ వృత్తం **పుటవృత్తం**.

**మూ. యదిచరణనివిష్టౌ నౌ తథా మ్యౌ యతివిధిరపి యుక్త్యాష్టాభిరిష్టః,**
**భవతి చ జగతీస్థః సర్వదాసౌ య ఇహ హి పుటవృత్తం నామతస్తు. 79**

**తా.** జగతీఛందఃపాదంలో రెండు నగణాలు, మ – యగణాలు ఉండి, ఎనిమిదవ అక్షరంమీద యతి ఉన్నట్లయితే అది పుటవృత్తం.

**మూ. ఉపవనసలిలానాం బాలపద్మైర్భ్రమరపరభృతానాం కణ్ఠనాదైః,**
**మదనమదవిలాసైః కామినీనాం కథయతి పుటవృత్తం పుష్పమాసః. 80**

**తా.** ఉద్యానంలోని జలాలలో ఉన్న లేతపద్మాలచేత, తుమ్మెదల కోకిలల ధ్వనుల చేత, కామినుల మన్మథమదంతో కూడిన విలాసలచేత, వసంతమాసం పుటవృత్తాన్ని (జంటల ప్రవర్తనను) చెపుతూన్నది.

**మూ. ద్వితీయాన్త్యే చతుర్థం చ నవమైకాదశే గురు,**
**విచ్ఛేదోఽతిజగత్యాం తు చతుర్భిః సా ప్రభావతీ. 81**

**తా. (33) ప్రభావతీవృత్తం :–** పదమూడక్షరాల అతిజగతీఛందస్సుకు సంబంధించిన ఒక పాదంలో రెండు, పదమూడు, నాలుగు, తొమ్మిది, పదకొండు అక్షరాలు గురువులుగా ఉండగా, నాలుగేసి అక్షరాలమీద యతి ఉంటే అది **ప్రభావతీవృత్తం**.

**మూ. కథం న్విదం కమలవిశాలలోచనే! గృహం ఘనైః పిహితకరే దివాకరే,**
**అచిన్తయన్త్యభినవవర్షవిద్యుతస్త్వమాగతా సుతను! యథా ప్రభావతీ. 82**

**తా.** కమలవిశాలనేత్రీ! సుందరీ! సూర్యుని కిరణాలను మేఘాలు కప్పివేసి ఉండగా, కొత్తగా ప్రారంభ మైన వర్షాన్ని మెరుపులను లెక్కచేయకుండా, **ప్రభావతి** (కాంతి కలదానవు) వలె ఇంటికి ఎలా వచ్చావు?

**మూ. త్రీణ్యాదావష్టమం చైవ దశమం నైధనద్వయమ్,**
**గురూణ్యతిజగత్యాం తు త్రిభిశ్ఛేదైః ప్రహర్షిణీ. 83**

**తా. (34) ప్రహర్షిణీవృత్తం :–** మొదట మూడు అక్షరాలు, ఎనిమిది, పది, పన్నెండు, పదమూడు అక్షరాలు అతిజగతీఛందస్సుకు చెందిన ఒక పాదంలో ఉంటే, మూడు యతు లున్నప్పుడు అది **ప్రహర్షిణీవృత్తం**.

**మూ. భావస్థైర్మధురకథైః సుభాషితైస్త్వం**
**సాటోపస్ఖలితవిలమ్బితైర్గతైశ్చ,**
**శోభాఢ్యైర్హరసి మనాంసి కాముకానాం**
**సువ్యక్తం హ్యతిజగతీ ప్రహర్షిణీ చ. 84**

**తా.** భావాలను ఆవిష్కరించే మధుర మైన కథలు చెప్పే మంచి మాటలచేత, ఆటోపంతో తొట్రుపడుతూన్న, మందమైన అందమైన నడకలచేతా, నువ్వు కాముకుల మనస్సులను ఆకర్షిస్తున్నావు. నిజంగా నువ్వు **అతిజగతివి** (భూలోకాన్ని అతిక్రమించిన దానవు), ప్రహర్షిణివి (సంతోషం కలిగించేదానవు).

**మూ. (35) మత్తమయూరవృత్తం :**
**షష్ఠం చ సప్తమం చైవ దశమైకాదశే లఘు,**
**త్రయోదశాక్షరే పాదే జ్ఞేయం మత్తమయూరకమ్. 85**

**తా.** పదమూడక్షరాల పాదంలోని ఆరు, ఏడు, పది, పదకొండు అక్షరాలు లఘువులు. అది **మత్తమయూరకవృత్తం**.

**మూ. విద్యున్నద్ధాః సేన్ద్రధనూరఞ్జితదేహాః,**
**వాతోద్ధూతాః శ్వేతవలాకాకృతశోభాః,**
**ఏతే మేఘా గర్జితనాదోజ్జ్వలచిహ్నాః**
**ప్రావృట్కాలం మత్తమయూరాః కథయన్తి. 86**

**తా.** మెరుపులతో కూడినవి, ఇంద్రధనస్సుచేత రంజింపచేయబడిన (రంగుపూసిన) దేహములు కలవి, గాలికి కదల్చబడినవి, తెల్లని కొంగలచేత శోభింపచేయబడుచున్నవి,

ఉరుము లనే స్పష్టమైన చిహ్నములు గలవి, మదించిన మయూరములు గలవి అయిన ఈ మేఘాలు వర్షాకాలం వచ్చిన దని చెపుతున్నాయి.

**మూ. ఆదౌ ద్వే చ చతుర్థం చాష్టమమేకాదశే గురు,**
**అన్త్యోపాన్త్యే చ శక్వర్యా వసన్తతిలకా యథా. 87**

**తా. (36) వసంతతిలకావృత్తం :–** పద్నాలుగు అక్షరాల శక్వరీఛందః పాదంలోని ఒకటి, రెండు, నాలుగు, ఎనిమిది, పదకొండు, పదమూడు, పద్నాలుగు అక్షరాలు గురువు లైతే వసంతతిలకావృత్తం. ఎట్లనగా –

**మూ. చిత్రైర్వసన్తకుసుమైః కృతకేశహస్తా**
**స్రగ్దామమాల్యరచనాసువిభూషితాఙ్గీ,**
**నానావతంసకవిభూషితకర్ణపాశా**
**సాక్షాద్వసన్తతిలకేవ విభాతి నారీ. 88**

**తా.** ఎట్లనగా – ఈ యువతి విచిత్రమైన వసంతకాలికపుషాలతో కేశపాశం అమర్చుకొంది. పుష్పమాలలతో అవయవా లన్నీ అలంకరించుకొంది. అనేకవిధాలైన కర్ణావతంసాలుగ ధరించే పుష్పాలతో చెవులు అంలకరించుకొంది. ఈ విధంగా ఈమె సాక్షాత్తు వసంతతిలకవలె ప్రకాశిస్తూన్నది.

**మూ. పఞ్చాదౌ శక్వరీపాదే గురూణి త్రీణి నైధనే,**
**పఞ్చాక్షరాదౌ చ యతిః అసంబాధా తు సా యథా. 89**

**తా. (37) అసంబాధావృత్తం :–** పద్నాలుగు అక్షరాల శక్వరీఛందఃపాదంలో మొదటి ఐదు అక్షరాలు గురువులు, చివరి మూడూ కూడ గురువులు, ఐదేసి అక్షరాల దగ్గర యతి ఉన్నట్లయితే అది **అసంబాధావృత్తం.**

**తా.** ఎట్లనగా –

**మూ. మానీ లోకజ్ఞః సుతబలకులశీలాఢ్యో**
**యస్మిన్ సంమానం న సదృశమనుపశ్యేద్ధి,**
**గచ్ఛేత్తం త్యక్త్వా ద్రుతగతిరన్యం దేశం**
**కీర్ణా నానార్థైరవనిరియమసంబాధా. 90**

**తా.** ఎట్లనగా – ఆత్మాభిమానం కలవాడు, లోకజ్ఞానం ఉన్నవాడు, పుత్ర – బల – కుల – శీలసంపద కలవాడు అయిన పురుషుడు ఏ దేశంలో తనకు తగిన సంమానం పొందాడో ఆ దేశాన్ని వెంటనే విడచి అతిశీఘ్రంగా మరొక దేశానికి వెళ్లిపోవాలి. అనేక మైన లాభకరవిషయాలతో నిండిన ఈ భూమి ఇరుకైన దేమీ కాదు!

**మూ. చత్వార్యాదౌ గురూణి స్యుర్దశమైకాదశే తథా,**
**అన్త్యోపాన్త్యే చ శక్వర్యాః పాదే తు శరభా యథా. 91**

**తా. (38) శరభావృత్తం :-** శక్వరీఛందోర్గత మైన పద్నాలు గక్షరాల **శరభావృత్తం** పాదంలో మొదటి నాలుగు అక్షరాలు గురువులుగా ఉంటాయి. ఎట్లనగా -

**మూ. ఏషా కాన్తా వ్రజతి లలితా వేపమానా**
**గుల్మైశ్ఛన్నం వనమభినవైః సంప్రవిద్ధమ్,**
**హా! హా! కష్టం కిమిదమితి నో వేద్మి మూఢో**
**వ్యక్తం కాన్తే శరభలలితాత్వం కరోషి. 92**

**తా.** సుందరియైన ఈ కాంత వణుకుచూ కొత్త పొదలతో నొండిన, దట్టమైన వనంలోనికి వెడుతూన్నది. మూఢుడ నైన నా కేమీ అర్థం అవడంలేదు; అయ్యో! కాన్తా! నిజంగా శరభమృగవిలాస చేస్తున్నావు.

**మూ. ఆదౌ షట్ దశమం చైవ లఘు చైవ త్రయోదశమ్,**
**యత్రాతిశక్వరీపాదౌ జ్ఞేయా నాన్దీముఖీ తు సా. 93**

**తా. (39) నాందీముఖీవృత్తం :-** శక్వరీఛందస్సుకు చెందిన పదిహేను అక్షరాల పాదంలో - మొదటి ఆరు అక్షరాలు, పది, పదమూడు అక్షరాలు లఘువులు. అది **నాందీముఖీవృత్తం.**

**మూ. న ఖలు తవ కదాచిత్క్రోధతామ్రాయతాక్షం**
**భ్రుకుటివలితభఙ్గం దృష్టపూర్వం మయాస్యమ్,**
**కిమిహ బహుభిరుక్తైర్యా మమేచ్ఛా హృదిస్థా**
**త్వమసి మధురవాక్యా దేవి! నాన్దీముఖీవ. 94**

**తా.** దేవీ! క్రోధంచేత విశాలనేత్రాలు ఎఱ్ఱబడి, కనుబొమ్మలు విరిచిన నీ ముఖం నే నెన్నడూ పూర్వం చూడలేదు. చాలా మాటలు చెప్పడం ఎందుకు? నా మనస్సులో ఏ కోరిక ఉందో దానికి అనుగుణంగా నీవు నాందీముఖి వలె (ఆనందకర మైన ముఖం కలదానవై) మధుర మైన మాటలు చెపుతావు.

**మూ. ఆద్యం చతుర్థం షష్ఠం చ నైధనం చ యదా గురు,**
**షోడశాక్షరకే పాదే యత్రేభలసితం తు తత్. 95**

**తా. (40) ఇభలసితవృత్తం :-** పదహారు అక్షరాల పాదంలో ఒకటి, నాలుగు, ఆరు, పదహారు అక్షరాలు గురువులుగా ఉంటే అది **ఇభలసితవృత్తం.**

**మూ. భ్రౌ యది నాశ్చ నిత్యమిహ విరచితచరణః,**
**గశ్చ తథా చ వై భవతి నిధనముపగతః,**
**స్యాదపి చాష్టికమేవ యది సతతమనుగతం**
**తత్ ఖలు వృత్తమగ్రవృషభగజవిలసితమ్. 96**

**తా.** పదహా రక్షరాల అష్టిఛందఃపాదంలో భగణరగణాలు, మూడు నగణాలు, చివర అక్షరం గురువు ఉంటే అది **అగ్రవృషభగజవిలసితవృత్తం.**

**మూ. తోయధరైః సుధీరఘనపటుపటహరవః,**
**సర్జకదమ్బనీపకుటజకుసుమసురభిమ్,**
**కన్దలసేన్ద్రగోపకరచితమవనితలం**
**వీక్ష్య కరోత్యసౌ వృషభగజవిలసితమ్. 97**

**తా.** చాల గంభీర మైన పటహధ్వని వంటి ధ్వని చేస్తూన్న మేఘం, సర్జ – కదంబ – నీప – కుటజ పుష్పాలతో పరిమళిస్తూన్న, ఇంద్రగోప కీటములు, వేణుకందల ములు (అంకురాలు) అంతటా వ్యాపించి ఉన్న ఈ భూతలాన్ని చూచి వృషభగజ విలసితాన్ని చేస్తూన్నది (వృషభాలు గజాలు ప్రవర్తించి నట్లు ప్రవర్తిస్తూన్నది).

**మూ. ఆద్యాత్పరాణి వై పఞ్చ ద్వాదశం సత్రయోదశమ్,**
**అన్త్యోపాన్త్యే చ దీర్ఘాణి లలితప్రవరం హి తత్. 98**

**తా. (41) లలితప్రవరవృత్తం :–** మొదటిదాని తరువాతి ఐదు అక్షరాలు, పన్నెండు, పదమూడు, పదిహేను, పదహారు అక్షరాలు గురువు లైతే అది **లలితప్రవరవృత్తం.**

**మూ. యదా య్మౌ పాదస్థౌ భవత ఇహ చేత్ న్సౌ తథార్గౌ**
**తథా షడ్భిశ్చాన్త్యైర్యతిరపి చ వర్ణైర్యథా స్యాత్,**
**తదప్యష్టౌ నిత్యం సమనుగతమేవోక్తమన్యైః**
**ప్రయోగజ్ఞైర్వృత్తం ప్రవరలలితం నామతస్తు. 99**

**తా.** అష్టిఛందస్సుకు సంబంధించిన పాదంలో య, మ, న, స, రగణాలు ఒక గురువు ఉండాలి; ఆరు అక్షరాల దగ్గర యతి. ఇది ప్రవరలలితవృత్తం.

**మూ. యథా – నఖాలీఢం గాత్రం దశనఖచితం చోష్ఠగణ్డం**
**శిరః పుష్పోన్మిశ్రం ప్రవిలులితకేశాలకాన్తమ్,**
**గతిః ఖిన్నా చేయం వదనమపి సంభ్రాన్తనేత్రం**
**అహో శ్లాఘ్యం వృత్తం ప్రవరలలితం కామచేష్టమ్. 100**

**తా.** శరీరం అంతా గోళ్ల నాట్లున్నాయి. పెదవులు గండస్థలమూ కూడ దంతాల ఆనవాళ్లతో నిండి ఉన్నాయి. నలిగిపోయిన జుట్టుతో ముంగురులతో శిరస్సు పువ్వులతో

చిక్కుపడి ఉంది. నడక చాల అలసటతో ఉంది. ముఖంలో నేత్రాలు తిరిగిపోతున్నాయి. ఆహా! అతి శ్రేష్ఠ మైన లలితమైన, శ్లాఘ్యమైన మన్మథవ్యాపారం జరిగి ఉంటుంది.

**మూ. ఆద్యాత్పరాణి పఞ్చాథ ద్వాదశం సత్రయోదశమ్,**
**అన్త్యం సప్తదశౌ పాదౌ శిఖరిణ్యాం గురూణి చ. 101**

**తా. (42) శిఖరిణీవృత్తం :–** పదిహేడక్షరాల పాదంలో మొదటి అక్షరం తరవాతి అయిదక్షరాలు, పన్నెండు, పదమూడు, పదిహేడు అక్షరాలు గురువులుగా ఉంటాయి. అది శిఖరిణీవృత్తం.

**మూ. చతుర్భిస్తస్యైవ ప్రవరలలితస్య త్రికగణై**
**ర్యదా లోగశ్చాన్తే భవతి చరణేఽత్యష్టిగదితే,**
**యదా షడ్భిశ్ఛేదో భవతి యది మార్గేణ విహిత**
**స్తదా వృత్తేష్వేషా ఖలు శిఖరిణీ నామ గదితా. 102**

**తా.** ప్రవరలలితంలో చెప్పిన గణాలు నాలుగు, చివర లఘు – గురువులు ఉంటే అత్యష్టిఛందస్సులోని **శిఖరిణీవృత్తం** అవుతుంది. ఆరవ అక్షరం దగ్గర యతి.

**మూ. మహానద్యాభోగే పులినమివ తే భాతి జఘనం**
**తథాస్యం నేత్రాఢ్యం భ్రమరసహితం పఙ్కజమివ,**
**గతిర్మన్దా చేయం సుతను తవ చేష్టా సులలితా**
**స్తనాభ్యాం తాభ్యాం త్వం శిఖరిణి సుపీనాసి వనితే. 103**

**తా.** నీ జఘనం, మహానదీవిశాలప్రదేశంలోని ఇసుక తిన్నె వలె ప్రకాశిస్తూన్నది. నేత్రాలతో నీ ముఖం తుమ్మెదలు వాలిన పద్మంవలె ఉంది. సుందరీ! నీ నడక మందంగా ఉంది. నీ చేష్ట మనోహరంగా ఉంది. వనితా! ఈ స్తనములచేత శిఖదవంతురాలవై (శిఖరాలవలె ఉన్న ఈ స్తనములతో) చాల బలిసి ఉన్నావు.

**మూ. యత్ర పఞ్చలఘూన్యాదౌ త్రయోదశ చతుర్దశే,**
**షోడశైకాదశే చైవ తత్ స్యాద్ వృషభచేష్టితమ్. 104**

**తా. (43) వృషభచేష్టివృత్తం :–** పదిహేడక్షరాల పాదంలో మొదటి ఐదు అక్షరాలు. పదమూడు, పద్నాలుగు, పదహారు, పదకొండు అక్షరాలు లఘువు లైతే అది **వృషభచేష్టిత వృత్తమ్.**

**మూ. యది హి చరణే న్సౌ స్లౌ గః క్రమాద్వినివేశితాః**
**యది ఖలు యతిః షడ్భిర్వర్ణై స్తథా దశభిః పునః,**
**యదిహ విహితం స్యాదత్యష్టిప్రయోగసుఖాశ్రయం**
**వృషభలలితం వృత్తం జ్ఞేయం తథా హరిణీతి వా. 105**

**తా.** అత్యష్టిఛందస్సుకు చెందిన పాదంలో నగణసగణాలు, సగణ – లఘు – గురువులు క్రమంగా కూర్చాలి. ఆరవ అక్షరంమీద, తరువాత పదవ అక్షరం మీద యతి ఉండాలి. ఇది **వృషభలలితవృత్తం** లేదా **హరిణీవృత్తం.**

**మూ. యథా – జలధరరవం శ్రుత్వా శ్రుత్వా మదోచ్ఛ్రయదర్పితో**
**విలిఖితమహీశృఙ్గాక్షేపైర్వృషః ప్రతినర్ద్య చ,**
**స్వయువతివృతో గోష్ఠాద్గోష్ఠం ప్రయాతి చ నిర్భయో**
**వృషభలలితం చిత్రం వృత్తం కరోతి చ శాద్వలే. 106**

**తా.** బాగా మత్తెక్కడంచేత గర్వించిన వృషభం (ఆబోతు) మేఘాల ఉరుములు వినీ విని, భూమిని పొడిచిన కొమ్ములు పైకి విసురుతూ, ఉరుములను అనుసరించి తాను కూడ నర్దిస్తూ తన యువతులు వెంట రాగా ఏ భయమూ లేకుండా గోష్ఠంనుంచి గోష్ఠానికి వెడుతూన్నది; పచ్చిక బీడులో చిత్రమైన వృషభవిహారం చేస్తూన్నది.

**మూ. చత్వార్యాదౌ చ దశమం గురు యత్ర త్రయోదశమ్,**
**చతుర్దశం తథాన్యే ద్వే చైకాదశమథాపి చ. 107**

**యదా సప్తదశే పాదే శేషాణి చ లఘూన్యథ,**
**భవన్తి యస్మిన్ సా జ్ఞేయా శ్రీధరీనామతో యథా. 108**

**తా. (44) శ్రీధరీవృత్తం :–** పదిహేడు అక్షరాల పాదంలోని మొదటి నాలుగు అక్షరాలు, పది, పదమూడు, పద్నాలుగు, పదకొండు అక్షరాలు గురువులుగాను, మిగిలినవి లఘువులుగాను ఉన్నట్లయితే అది **శ్రీధరీవృత్తం.**

**మూ. మో భ్నౌ చ స్యుశ్చరణరచితాస్తౌ గురూ చ ప్రవిష్టౌ**
**శ్ఛేదః శ్లిష్టో యది చ దశభిః స్యాత్తథాన్యైశ్చతుర్భిః,**
**అత్యష్టౌ చ ప్రతినియమితా వర్ణతః స్పష్టరూపా**
**సా విజ్ఞేయా ద్విజమునిగణైః శ్రీధరీ నామతస్తు. 109**

ఎట్లనగా –

**తా.** అత్యష్టిఛందోతర్గ మైన **శ్రీధరీవృత్తంలోని** పాదంలో మ, భ, న, త, తగణాలు, రెండు గురువులూ ఉంటాయి. పదవ అక్షరం దగ్గర, తరవాత నాల్గవ అక్షరం దగ్గర యతి.

**మూ. స్నానైశ్చూర్ణైః సుఖసురభిభిర్గన్ధవాసైశ్చ ధూపైః**
**పుష్పైశ్చాన్యైః శిరసి రచితైర్వస్త్రయోగైశ్చ తైస్తైః,**
**నానారత్నైః కనకఖచితైరఙ్గసమ్భోగసంస్థైః,**
**వ్యక్తం కాన్తే కమలనిలయా శ్రీధరీవాతిభాసి. 110**

**తా.** స్నానాలు, స్నానచూర్ణాలు, సుఖకరములూ, సుగంధములూ అయిన మైపూతలు, ధూపాలు, శిరస్సుమీద ధరించిన పుష్పాలు, ఆ యా అవయవాలమీద అమర్చిన, బంగారంలో పొదిగిన అనేకవిధాలైన రత్నాలు – వీటి అన్నింటితో, ఓ! కాన్తా! నువ్వు పద్మాలయ యైన శోభాధిష్ఠానదేవత లక్ష్మి వలె ఎంతగానో మెరిసిపోతున్నావు.

**మూ. ఆద్యం చతుర్థం షష్ఠం చ దశమం నైధనం గురు,**
**తద్వంశపత్రపతితం దశభిః సప్తభిర్యతిః.** **111**

**తా. (45) వంశపత్రపతితవృత్తం :–** పాదంలోని ఒకటి, నాలుగు, ఆరు, పది, పదిహేడవ అక్షరాలు గురువులుగా ఉండాలి. ఏడు, పది అక్షరాలమీద యతి. ఇది **వంశపత్రపతితవృత్తం.**

**మూ. యథా – ఏవ గజోఽద్రిమస్తకతటే కలభపరివృతః**
**క్రీడతి వృక్షగుల్మగహనే కుసుమభరనతే,**
**మేఘరవం నిశమ్య ముదితః పవనజవసమః**
**సున్దరి! వంశపత్రపతితం పునరపి కురుతే.** **112**

**తా.** ఎట్లనగా – సుందరీ! ఈ ఏనుగు, చిన్న ఏనుగులను తన వెంటబెట్టుకొని వృక్షాలతోను, పొదలతోను నిండి ప్రవేశింప శక్యం కాని, పుష్పభారంచేత వంగిన ఈ పర్వతశిఖరప్రదేశంమీద విహరిస్తూన్నది. మేఘాల ధ్వనులు వినగానే సంతోషిస్తూ, వాయువేగంతో సమంగా మళ్లీ **వంశప్రతిపతితాన్ని** (వెదురు ఆకులు లాగి పడవేయడాన్ని) చేస్తూన్నది.

**మూ. ద్వితీయమన్త్యం షష్ఠం చాప్యష్టమం ద్వాదశం తథా,**
**చతుర్దశం పఞ్చదశం పాదే సప్తదశాక్షరే.** **113**
**భవన్తి యత్ర దీర్ఘాణి శేషాణి తు లఘూన్యథ,**
**విలమ్బితగతిః సా తు విజ్ఞేయా నామతో యథా.** **114**

**తా. (46) విలంబితగతివృత్తం :–** పదిహే డక్షరాల పాదంలోని రెండు, పదిహేడు, ఆరు, ఎనిమిది, పన్నెండు, పద్నాలుగు, పదిహేను అక్షరాలు గురువులు, మిగిలినవి లఘువులు. అది **విలంబితగతివృత్తం.** ఎట్లనగా –

**మూ. (యదా ద్విరుదితౌ హి పాదమభిసంశ్రితౌ జ్సౌ త్రికౌ**
**తథైవ చ పునస్తయోర్నిధనమాశ్రితో యో లగౌ,**
**తదాష్టిరతిపూర్వికా యతిరపి స్వభావాద్యథా**
**విలమ్బితగతిస్తదా నిగదితా ద్విజైర్నామతః.** **115**

**తా.** ఆత్యష్టి ఛందస్సుకు చెందిన ఒక పాదంలో జ, స, జ, స, య, గణాలు, చివర లఘు – గురువులూ ఉండాలి. యతి సహజంగానే ఏర్పడుతుంది అది **విలంబిత గతివృత్తం**.

**మూ. యథా – విఘూర్ణితవిలోచనా పృథువికీర్ణహారా పునః**
**ప్రలమ్బరశనా చలత్స్ఖలితపాదమన్దక్రమా,**
**న మే ప్రియమిదం జనస్య బహుమానరాగేణ య**
**న్మదేన వివశా విలమ్బితగతిః కృతా త్వం ప్రియే. 116**

**తా.** ఎట్లనగా – ప్రియురాలా! కళ్లు తిరిగిపోతూ, పెద్దవైన హారాలు పైకి ఎగిరిపడుతూ, వడ్డాణం వేళ్లాడుతూ, నీవు పాదాలు తొట్రుపడగా మందగమనవై జనుల బహుమానమునందు ఆసక్తిచేత మదవివశురాలవై **విలంబితగతి** (ఆలస్యంగా వచ్చిన దానవు) అయ్యావు అంటే ఇది నా కిష్టం కాదు.

**మూ. పఞ్చాదౌ పఞ్చదశకం ద్వాదశైకాదశే గురు,**
**చతుర్దశం తథాన్త్యే ద్వే చిత్రరేఖా ధృతౌ స్మృతా. 117**

**తా. (47) చిత్రలేఖావృత్తం :–** పద్దెనిమిది అక్షరాల ధృతిచ్ఛందఃపాదంలో మొదటి ఐదు అక్షరాలు, పదిహేను, పన్నెండు, పదకొండు, పద్నాలుగు అక్షరాలు, చివరి రెండక్షరాలు గురువులైతే అది **చిత్రలేఖావృత్తం**.

**మూ. యథా – నానారత్నాఢ్యైర్బహుభిరధికం భూషణైరఙ్గసంస్థై**
**ర్నానాగన్ధాఢ్యైర్మదనజనకైరఙ్గరాగైర్విచిత్రైః**
**కేశైః స్నానాఢ్యైః కుసుమభరితైర్వస్త్రరాగైశ్చ తైస్తైః**
**కాన్తే! సంక్షేపాత్ కిమిహ బహునా చిత్రలేఖేవ భాసి. 118**

**తా.** ఎట్లనగా – కాంతా! ఆ యా అవయవాలమీద ఉన్న అనేకవిధాలైన రత్నాలు పొదిగిన భూషణాలతోను, అనేకవిధాలైన సువాసనలు విరజిమ్మే, విచిత్రములైన, మన్మథజనకాలైన మైపూతలతోను, స్నానాలంకృతాలైన, పుష్పాలంకృతాలైన కేశాలతోను, ఆ యా రంగు రంగు వస్త్రాలతోను, నువ్వు – అతిగా ఏం చెప్పాలి! ఒక్క మాటలో చెప్పాలంటే చిత్రలేఖ వలె (చిత్రంలో గీసిన బొమ్మవలె) ప్రకాశిస్తూన్నావు.

**మూ. అన్త్యం సప్తదశం చైవ షోడశం సచతుర్దశమ్,**
**త్రయోదశం, ద్వాదశం చ షష్ఠమష్టమమేవ చ. 119**

**త్రీణ్యాదౌ చ గురూణి స్యుర్యస్మిన్నేకోనవింశకే**
**పాదే లఘూని శేషాణి శార్దూలక్రీడితం తు తత్. 120**

**తా. (48) శార్దూలవిక్రీడితవృత్తం :-** ఇరవైయొక్క అక్షరాల పాదంలో - ఇరవైయొకటి, పదిహేడు, పదహారు, పద్నాలుగు, పదమూడు, పన్నెండు, ఆరు, ఎనిమిది అక్షరాలు, మొదటి మూడక్షరాలు గురువులుగా ఉండి మిగిలిన వన్నీ లఘువు లైతే అది **శార్దూలవిక్రీడితవృత్తం.**

**మూ. (మౌసజౌ తౌ గురు చ ప్రయోగనియతా యస్మిన్నివిష్టాః త్రికాః**
**ఆద్యా చాన్త్యయతిశ్చతుస్త్రికయుతా జ్ఞేయా పరా సప్తభిః,**
**నిత్యం యత్పదమాశ్రితా హ్యతిధృతిర్నిత్యం కవీనాం ప్రియం**
**తద్ జ్ఞేయం ఖలు వృత్తజాతినిపుణైః శార్దూలవిక్రీడితమ్). 121**

**తా.** (అతిధృతిచ్ఛందస్సుకు చెందిన శార్దూలవిక్రీడితంలోని పాదంలో మ - స - జ - స - త - త - గణాలు ఒకగురువు ఉంటాయి. నాలుగవ అక్షరం మీద ఏడవ అక్షరం మీద యతి).

**మూ. యథా - నానాశస్త్రశతఘ్నితోమరహతాః ప్రభ్రష్టసర్వాయుధాః**
**నిర్భిన్నోదరపాదబాహువదనా నిర్ణాశితాః శత్రవః,**
**ధైర్యోత్సాహపరాక్రమప్రభృతిభిః స్తైస్తైర్విచిత్రైర్గుణై**
**ర్వృత్తం తే రిపుఘాతి భాతి సమరే శార్దూలవిక్రీడితమ్. 122**

**తా.** నీ శత్రువులు అనేకవిధా లైన ఆయుధాలచేత, శతఘ్నులచేత, తోమరాలచేత కొట్టబడినవారై, వాళ్ల ఆయుధా లన్నీ జారిపోగా ఉదరములు, పాదాలు, బాహువులు, ముఖాలు ఛేదించి నశింపచేయబడ్డారు. ఈ విధంగా, సమరంలో, ధైర్య - ఉత్సాహ - పరాక్రమాదులైన ఆ యా విచిత్రగుణాలతో కూడిన నీ శార్దూలవిక్రీడితవృత్తం (శార్దూల విహారం వంటి ఆచరణ) ప్రకాశిస్తూన్నది.

**మూ. (తావత్త్వం విజితేన్ద్రియః శుభమతే సర్వాత్మనా ప్రత్యహం**
**దానే శీలవిధౌ చ యోజయ మనః స్వర్గాపవర్గావహమ్,**
**యావద్ వ్యాధిజరాప్రచణ్డనఖరో వ్యాయత్తటాభిర్భృశం**
**మృత్యుస్తే న కరోతి జీవితమృగైః శార్దూలవిక్రీడితమ్.) 123**

**తా.** శుభ్రమైన బుద్ధికలవాడా! వ్యాధులు, ముసలితనము అను తీవ్రములైన గోళ్లు గల మృత్యువు, దీర్ఘమైన విజృంభించుచున్న జూలుతో (భయంకరమై), నీ ప్రాణా లనే మృగాలతో **శార్దూలవిక్రీడితం** చేయక ముందే నువ్వు ఇంద్రియాలను జయించి ప్రతీ రోజూ, అన్నివిధాల, నీ మనస్సును దానం చేయడంలోను, మంచి శీలమునందు ఆసక్తమై నట్లు చేసుకో. అదే నీకు స్వర్గమూ మోక్షమూ కూడ ఇస్తుంది.

**మూ. చత్వార్యాదౌ చ షష్ఠం చ సప్తమం సచతుర్దశమ్,**
**తథా పఞ్చదశం చైవ షోడశం నైధనం తథా. 124**

**ఏతాని చ గురూణి స్యుః శేషాణి తు లఘూన్యథ**
**పాదే యత్ర కృతౌ జ్ఞేయా నామ్నా సువదనా తు సా. 125**

**తా. (49) సువదనావృత్తం :–** కృతిచ్ఛందస్సుకు చెందిన ఇరవై అక్షరాల పాదంలో మొదటి నాలుగు అక్షరాలు, ఆరు, ఏడు, పద్నాలుగు, పదిహేను, పదహారు, ఇరవై అక్షరాలు గురువులుగాను మిగిలినవి లఘువులుగాను ఉంటాయి. అది **సువదనావృత్తం.**

**మూ. భ్రౌ మ్నౌ య్భౌ ల్గౌ చ సమ్యగ్యది చ విరచితాః పాదే క్రమవశాత్,**
**విచ్ఛేదః సప్తభిః స్యాత్ పునరపి చ యతిః సప్తాక్షరకృతా,**
**యద్యేషా సంశ్రితా స్యాత్కృతిమపి చ పునః శ్లిష్టాక్షరపదా**
**విద్వద్భిర్వృత్తజాతౌ తత ఇహ గదితా నామ్నా సువదనా. 126**

**తా.** కృతిచ్ఛందోంతర్గత మైన సువదనావృత్తంలోని పాదంలో భ – ర – మ – న – య – భగణాలు ఒక లఘువు ఒక గురువు వరుసగా ఉంటాయి. ఏడవ అక్షరంమీదా, మళ్లీ ఏడవ అక్షరంమీదా యతి.

**మూ. నేత్రే లీలాలసాన్తే కమలదలనిభే భ్రూచాపవినతౌ**
**రక్తోష్ఠం పీనమధ్యం సమసహితఘనాః స్నిగ్ధాశ్చ దశనాః,**
**కర్ణావంసప్రలమ్బౌ చిబుకమపి నతం ఘోణా సురుచిరా**
**వ్యక్తం త్వం మర్త్యలోకే సుతను విహితాస్యేకా సువదనా. 127**

**తా.** కమలదలాల వలె ఉన్న నేత్రాలు విలాసచేత చివరిభాగాలలో కొంచెం మూసికొని ఉన్నాయి. ధనస్సుల వంటి కనుబొమ్మలు వంగి ఉన్నాయి. ఎఱ్ఱని అధరోష్ఠం మధ్యభాగం బలిసి ఉంది. దంతాలు నున్నగా మెరుస్తూ సమంగా దగ్గరగా ఉన్నాయి. చెవులు బుజాల దాకా వేలాడుతూ పొడవుగా ఉన్నాయి. గడ్డం సొట్టపడి ఉంది. ముక్కు చాల అందంగా ఉంది. ఓ! సుందరీ! నిజంగా, మనుష్యలోకంలో నిన్నొక్కదానినే దేవుడు **సువదనను**గా సృష్టించాడు.

**మూ. చత్వార్యాదౌ తథా షష్ఠం సప్తమం చ చతుర్దశమ్,**
**అష్టాదశ సప్తదశ తథా పఞ్చదశ పునః. 128**

**అన్త్యోపాన్త్యే గురూణ్యత్ర లఘూన్యన్యాని సర్వదా,**
**ఏకవింశతికే పాదే స్రగ్ధరా నామ సా యథా. 129**

**తా. (50) స్రగ్ధరావృత్తం :–** ఇరవైయొక్క అక్షరాల **స్రగ్ధరావృత్త** పాదంలో మొదటి

నాలుగు అక్షరాలు, ఆరు, ఏడు, పద్నాలుగు, పద్దెనిమిది, పదిహేడు, పదిహేను, ఇరవై, ఇరవైయొకటి – అక్షరాలు గురువులు. మిగిలినవి లఘువులు.

**మూ. మ్రౌ భ్నౌ యౌ యశ్చ సమ్యగ్యది హి విరచితాః స్యుస్త్రికాః పాదయోగే,**
**వర్ణైః పూర్వోపదిష్టైర్యతిరపి చ పునః సప్తభిః సప్తభిః స్యాత్,**
**వృత్తం సమ్యగ్యది స్యాత్ ప్రకృతిమనుగతం తత్త్వవిద్భిః ప్రదిష్టం**
**విజ్ఞేయం వృత్తజాతౌ కవిజనదయితా స్రగ్ధరా నామతస్తు. 130**

**తా.** స్రగ్ధరావృత్తపాదంలో మ – ర – భ – న – య – య – య – గణాలు వరసగా ఉంటాయి. ఏడేసి అక్షరాలమీద యతి.

**మూ. యథా – చూతాశోకారవిన్దైః కురవకతిలకైః కర్ణికారైః శిరీషైః**
**పున్నాగైః పారిజాతైర్వకులకువలయైః కింశుకైః సాతిముక్తైః,**
**ఏతైర్నానాప్రకారైర్బహులసురభిభిర్విప్రకీర్ణైశ్చ తైస్తై**
**ర్వాసన్తైః పుష్పవృన్దైర్నరవర! వసుధా స్రగ్ధరేవాద్య భాతి. 131**

**తా.** నరశ్రేష్ఠుడా! వసంతర్తువురాగానే, అంతటా చల్లబడిన ట్లున్న పరిమళిస్తూన్న చూత – అశోక – అరవింద – కురవ – తిలక – కర్ణికార – శిరీష – పున్నాగ – పారిజాత – వకుల – కువలయ – కింశుక – అతిముక్తా పుష్పాలతో భూమి స్రగ్ధర వలె (పుష్పమాలలు ధరించినది వలె) కనబడుచున్నది.

**మూ. చతుర్థమాద్యం షష్ఠం చ దశమం ద్వాదశం తథా,**
**షోడశాష్టాదశే చైవ నైధనం చ గురూణ్యథ. 132**
**ద్వావింశత్యక్షరే పాదే శేషాణి చ లఘూన్యథ,**
**భవన్తి యత్ర తద్ జ్ఞేయం భ(మ)ద్రకం నామతో యథా. 133**

**తా. (51) భద్రకవృత్తం :–** ఇరవై రెండక్షరాల పాదంలోని ఒకటి, నాలుగు, ఆరు, పది, పన్నెండు, పదహారు, పద్దెనిమిది, ఇరవైరెండు అక్షరాలు గురువులు. మిగిలినవి లఘువులు. ఇది **భద్రకవృత్తం.**

**మూ. భ్రౌ చరణే యదా వినియతౌ త్రికౌ క్రమవశాదథాకృతివిధౌ,**
**న్రౌ చ తతః పరం చ రుచిరావనన్తరకృతౌ నగావపి పునః,**
**తచ్చ దశాష్టవర్ణరచితా చతుర్ష్వపి తథా యతిశ్చ సతతం**
**మ(భ)ద్రకవృత్తమేవ ఖలు నాట్యయోగకుశలైర్బుధైర్నిగదితమ్. 134**

**తా.** పాదంలో భ – ర – న – ర – న గణాలు, గురువు ఉండాలి. పదవ, ఎనిమిదవ, నాల్గవ వర్ణాల మీద యతి. ఇది **మ(భ)ద్రకవృత్తం.**

**మూ. ఉత్ప్లుతమేకహస్తచరణం ద్వితీయకరరేచితసలలితం**
**వంశమృదఙ్గవాద్యమధురం విచిత్రకరణానుగతం బహువిధమ్,**
**మద్రకమేతదద్య సుభగే! విదగ్ధగతిచేష్టితైః సులలితైః**
**నృత్యసి విభ్రమాకులపదం వివిక్తరసభావితం శశిముఖి. 135**

**తా.** ఓ! శశిముఖీ! ఒక హస్తము, ఒక పాదమూ ఎగురవేసి, రెండవ హస్తం రేచితంలో ఎత్తి, వేణుమృదంగవాద్యాలతో మధురంగా, విచిత్రమైన కరణాలతో కలుపుతూ అనేకవిధాల, విలాసతో ఆకులమైనపద విన్యాసములతో, నేర్పుతో కూడిన గతులతోను చేష్టలతోను, రసం స్పష్టంగా అనుభవగోచర మయే రీతిలో ఈ మద్రకాన్ని చక్కగా నృత్యం ద్వారా ప్రదర్శిస్తున్నావు.

**మూ. అన్త్యమేకోనవింశం చ సప్తమం సత్రయోదశమ్,**
**ఏకాదశం సప్తదశం పఞ్చమం చ గురూణ్యథ. 136**

**శేషాణి చ లఘూని స్యుర్వికృత్యాశ్చరణే బుధైః,**
**వృత్తం తదశ్వలలితం విజ్ఞేయం నామతో యథా. 137**

**తా. (52) అశ్వలలితవృత్తం :-** పాదంలోని చివరి అక్షరం, పందొమ్మిది, ఏడు, పదమూడు, పదకొండు, పదిహేడు, ఐదు అక్షరాలు గురువులు. మిగిలినవి లఘువులు. ఇది వికృతిఛందోంతర్గత మైన **అశ్వలలితవృత్తం.**

**మూ. యది చ నకార ఆదిరచితః పదే విరచితోఽన్త ఏవ చ లగౌ**
**యది చ జభౌ త్రిధా చ నిహితౌ క్రమేణ ఖలు మధ్యావపి తథా,**
**యది చ సమాశ్రితం హి వికృతిం యతిశ్చ దశభిస్తథైకసహితైః**
**తత ఇహ కీర్తితం మునిగణైర్విశుద్ధచరితైస్తదశ్వలలితమ్. 138**

**తా.** వికృతిచందస్సుకు చెందిన 23 అక్షరాల పాదంలో న – జ – భ – జభ – జ – భగణాలు చివర లఘుగురువులూ, పదకొండవ అక్షరంమీద యతీ ఉంటే అది **అశ్వలలిత వృత్తం.**

**మూ. వివిధతురఙ్గనాగరథయోధసమాకులమలం బలం సముదితం**
**శరశతశక్తికున్తపరిఘాసియష్టివితతం బహుప్రహరణమ్,**
**రిపుశతయుక్తశస్త్రరవభీతశఙ్కితభటం భయాకులదిశం**
**కృతమభివీక్ష్య సంయుగముఖే సమర్పితగుణం త్వయాశ్వలలితమ్. 139**

**తా.** అనేక మైన అశ్వాలు, గజాలు, రథాలు, యోధులు – వీళ్లతో వ్యాకులమై (నిండినదై) వచ్చి, వందలకొలది శరములతోను శక్తి – కుంత – పరిఘ – ఖడ్గ –

యష్టులతోను వ్యాప్తమై అనేకమైన ఆయుధాలు గల సైన్యములోని శత్రువులు ప్రయోగించిన శస్త్రముల ధ్వనులకు భటులు భయపడి, దిక్కులవైపు పరుగెత్తిపోతూండగా చూచి నీవు యుద్ధరంగము నందు అశ్వలలితానికి గొప్ప గుణం (తీవ్రత్వం) కల్పించావు.

**మూ. షడాదావష్టమం చైవ హ్యేకాదశచతుర్దశే,**
**వింశం సప్తదశం చైవ త్రయోవింశం తథైవ చ. 140**

**ఏతాని చ లఘూని స్యుః శేషాణ్యథ గురూణి చ**
**చతుర్వింశతికే పాదే మేఘమాలేతి సా యథా. 141**

**తా. (53) మేఘమాలావృత్తం :-** ఇరవైనాలు గక్షరాల పాదంలో మొదటి ఆరు అక్షరాలు, ఎనిమిది, పదకొండు, పద్నాలుగు, ఇరవై, పదిహేడు, ఇరవైమూడు అక్షరాలు లఘువులు కాగా మిగిలినవి గురువులుగా ఉంటే అది **మేఘమాలావృత్తం**.

**మూ. (యది ఖలు చరణస్థితౌ నౌ త్రికౌ షట్ తు రా వ్యవస్థితాస్తత్పరం స్యుః క్రమాత్**
**భవతి యది యతిస్తథా సప్తభిః సప్తభిశ్చాక్షరైః సద్భిరుక్తాక్షరా,**
**సతతముపనివిష్టదేహా తథా సంకృతౌ సూరిభిః సంమతా దృశ్యతే**
**త ఇహ పరిభాషితా శాస్త్రవిద్భిస్త్వియం మేఘమాలాథవాన్ధకః. 142**

**తా.** పాదంలో ప్రారంభంలో రెండు నగణాలు, తరవాత ఆరు రగణాలు, ఏడు, పద్నాలుగు, ఇరవైఒకటి అక్షరాలపై యతి ఉన్నది **మేఘమాలా** లేదా **అంధకవృత్తం**.)

**మూ. పవనబలసమావృతా తీవ్రగమ్భీరనాదా బలాకావలీమేఖలా**
**క్షితిధరసదృశోచ్చరూపా మహానీలధూమాఞ్జనాభాఽమ్బుగర్భోద్భవా,**
**సురపతిధనురుజ్జ్వలా బద్ధకక్ష్యా తడిద్ద్యోతసంనాహపట్టోజ్జ్వలా**
**గగనతలవిసారిణీ ప్రావృషేణ్యా దృఢం మేఘమాలాధికం శోభతే. 143**

**తా.** ఆకాశంమీద ప్రసరిస్తూన్న ఈ వర్షాకాలపు మేఘమాల అధికంగా శోభిస్తూన్నది. దీనిని బలమైన వాయువు తీసికొని వస్తూన్నది. తీవ్రంగా గంభీరంగా ధ్వని చేస్తూన్నది. కొంగల పంక్తులు దీనికి వడ్డాణంలా ఉన్నాయి. కొండ వలె ఎత్తుగా ఉంది. నీళ్లతో నిండిన ఇది ఇంద్రనీలమణి వలె, పొగ వలె, కాటుక వలె నల్లగా ఉంది. దీనిమీద ఉన్న ఇంద్రధనస్సు నడుమునకు కట్టిన బంగారుతాడు వలె ఉంది. మెరుపుల కాంతులు యుద్ధాదులకు సిద్ధం చేసే ఏనుగు మొదలైనవాటికి పైన కప్పే వస్త్రపట్టం వలె ఉంది.

**మూ. ఆద్యం చైవ చతుర్థం చ పఞ్చమం షష్ఠమేవ చ,**
**నవమం దశమం చైవ నైదనం చ భవేద్గురు. 144**

**లఘూన్యన్యాని శేషాణి పాదే స్యుః పఞ్చవింశకే,**
**వృత్తజ్ఞైః సా తు విజ్ఞేయా క్రౌఞ్చపాదీతి నామతః. 145**

**తా. (54) క్రౌంచపాదీవృత్తం :-** ఇరవైఐదు అక్షరాల పాదంలోని ఒకటి, నాలుగు, ఐదు, ఆరు, తొమ్మిది, పది, ఇరవైయైదు అక్షరాలు గురువులుగాను, మిగిలినవి లఘువులు గాను ఉండాలి. దీనికి **క్రౌంచపాదీవృత్తం** అని పేరు.

**మూ. (భ్మౌ యది పాదే స్భావపి చేష్టావభికృతిరపి చ హి యది ఖలు విహితా**
**నాశ్చ సముద్రాః స్యుర్వినివిష్టాః యది చ ఖలు గురు భవతి నిధనగతమ్,**
**పఞ్చభిరాదౌ ఛేదముపేతా పునరపి యతిరిహ యది ఖలు దశభిః**
**క్రౌఞ్చపదేయం వృత్తవిధానే సురగణపితృగణమునిగణవిహితా). 146**

**తా.** ఇరవైఐదు అక్షరాల పాదంలో భ - మ - స - భ - న - న- న - న గణాలు, ఇరవై యైదవ అక్షరం గురువు ఉంటే అది **క్రౌంచపదావృత్తం**. ఐదవ అక్షరం మీదా, తరువాత దానినుండి పదవ అక్షరంమీదా యతి.

**మూ. యః కిల దాక్షం విద్రుతసోమం క్రతువరమచమసమపగతకలశం**
**పాతితయూపం క్షిప్తచషాలం విచయనమసమిధమపశుకచరుకమ్,**
**కార్ముకముక్తేనాశు చకార వ్యపగతసురగణపితృగణమిషుణా**
**నిత్యమసౌ తే దైత్యగణారిః ప్రదహతు మఖమివ రిపుగణమఖిలమ్. 147**

**తా.** దైత్యగణాల శత్రువైన ఏ రుద్రుడు ధనస్సునుండి విడువబడిన బాణంచేత వెంటనే దక్షయజ్ఞంలో - చంద్రుడు పారిపోయే టట్లు చేశాడో చమసలు కలశలు బద్దలుకొట్టాడో, యూపస్తంభాలు పడగొట్టాడో, చషాలం (ఒక పాత్ర) దూరంగా విసిరేశాడో, చయనము, సమిధలు, పశువులు, హోమచరువు - ఇవన్నీ లేకుండా చేశాడో ఆ రుద్రుడు నీ శత్రుగణా న్నంతనీ యజ్ఞమును వలె కాల్చివేయుగాక.

**మూ. (యా కపిలాక్షీ పిఙ్గలకేశీ కలిరుచిరనుదినమనునయకఠినా**
**దీర్ఘతరాభిః స్థూలసిరాభిః పరివృతవపురతిశయకుటిలగతిః,**
**ఆయతజఙ్ఘా నిమ్నకపోలా లఘుతరకుచయుగపరిగతహృదయా**
**సా పరిహార్యా క్రౌఞ్చపదా స్త్రీ ధ్రువమిహ నిరవధిసుఖమభిలషతా. 148**

**తా.** పిల్లికళ్లు, రాగిజుట్టూ, రోజూ కలహించడంలో ఆసక్తీ కలదీ, ఎంత బతిమాలినా విననిదీ, ఒళ్లంతా పొడవుగా లావుగా ఉన్న నరాలు పైకి కనబడేదీ. చాల వంకర నడక గలదీ, పొడవైన కాళ్లూ (పిక్కలూ) సొట్ట దవడలూ కలది, గుండెలను అంటిబెట్టుకొన్న ఎండిపోయిన స్తనాలు గలదీ, అయిన, క్రౌంచపక్షిపాదాల వంటి పాదాలుగల స్త్రీని, సుఖంగా బతకాలనుకొనేవాడు ఎన్నడూ చేరదీయకూడదు).

**మూ. అష్టావాదౌ గురూణి స్యుస్తథా చైకోనవింశకమ్,**
**ఏకవింశం చ విజ్ఞేయం చతుర్వింశం సనైధనమ్,**
**ఏతాని గురుసంజ్ఞాని శేషాణి చ లఘూన్యథ**
**షడ్వింశత్యక్షరే పాదే తద్ భుజఙ్గవిజృమ్భితమ్. 150**

**తా. (55) భుజంగవిజృంభితవృత్తం :–** ఇరవై అక్షరాలు గల పాదంలోని మొదటి ఎనిమిది అక్షరాలు, పందొమ్మిది, ఇరవైయొకటి, ఇరవైనాలుగు, ఇరవైఆరు అక్షరాలు గురువులు, మిగిలినవి లఘువులు ఉంటే అది **భుజంగవిజృంభితవృత్తం.**

**మూ. యస్యాం మౌ తో నాః స్రౌ నిత్యం ప్రతిచరణమథ గదితాస్త్రికా హ్యనుపూర్వశః**
**షడ్వింశత్యామేకోనాయాం చ యది హి ఖలు యతిరభిధా చతుర్భిరథాష్టాభిః,**
**పశ్చాదన్త్యే ల్గౌ సంయోజ్యౌ యది భవతి మనుజదయితాం సమాశ్రితముత్కృతిం**
**నామ్నా వృత్తం లోకే ఖ్యాతం కవివదనవికసనపదం భుజఙ్గవిజృమ్భితమ్. 151**

**తా.** ఉత్కృతిఛందస్సుకు సంబంధించిన **భుజంగవిజృంభితవృత్తంలో**, ఇరవైఆరు అక్షరాల పాదంలో వరుసగా రెండు మగణాలు. తగణం, మూడు నగణాలు, సగణం, రగణం, చివర లఘువు, గురువు ఉంటాయి. నాల్గవ అక్షరంమీద, ఎనిమిదవ అక్షరంమీదా యతి!?)

**మూ. రూపోపేతాం దేవైః సృష్టాం సమదగజవిలసితగతిం నిరీక్ష్య తిలోత్తమాం**
**ప్రాదక్షిణ్యాత్ ప్రాప్తాం ద్రష్టుం బహువదనమచలనయనం శిరః కృతవాన్హరః,**
**దీర్ఘం నిఃశ్వస్యాన్తర్గూఢం స్తనవదనజఘనరుచిరాం నిరీక్ష్య తథా పునః**
**కణ్ఠే న్యస్తం దేవేన్ద్రేణ ప్రవరమణికనకవలయం భుజఙ్గవిజృమ్భితమ్. 152**

**తా.** ఎట్లనగా – రూపవంతురాలు, దేవతలు సృజించినదీ, మదించిన ఏనుగు వంటి విలాసతో కూడిన నడకగలది, మర్యాదగా చూచి వెడదాం అని వచ్చిన తిలోత్తమను చూడడానికే శివుడు తన శిరస్సుపై చాల ముఖాలు, రెప్పపాటు లేని కళ్లూ చేసికొన్నాడు. దేవేంద్రుడు రహస్యంగా దీర్ఘనిఃశ్వాసం విడిచి స్తన – వదన – జఘనాలతో అందంగా ఉన్న ఆమెను మళ్లీ చూచి సర్పంవంటి విజృంభణము గల రత్నాలుపొదిగిన బంగారు వలయం (హస్తం) కంఠం మీద ఉంచుకొన్నాడు.

**మూ. దణ్డకం నామ విజ్ఞేయముత్కృతేరధికాక్షరమ్,**
**మేఘమాలాదికం తత్ స్యాన్నౌ చాదౌ కాగుహా (?) త్రికాః. 153**

**తా. (56) దణ్డకం :–** ఉత్కృతికంటె అధికమైనది, అనగా 26 కంటె అధికమైన అక్షరాలు కలది **దండకం.** (ఉత్తరార్థం అర్థం స్పష్టంగా లేదు).

**మూ. ముదితజనపదాకులా స్ఫీతసస్యాకరా భూతధాత్రీ భవన్తం సమభ్యర్చతి**
**ద్విరదకరవిలుప్తహిన్తాలతాలీవనాస్త్వాం నమస్యన్తి విన్ధ్యాదయః పర్వతాః,**
**స్ఫుటితకలశశుక్తినిర్గీర్ణముక్తాఫలైరూర్మిహస్తైర్నమస్యన్తి వః సాగరాః**
**ముదితజలచరాకులాః సంప్రకీర్ణామలాః కీర్తయన్తీవ కీర్తిం మహానిమ్నగాః. 154**

**తా.** ఆనందిస్తూన్న గ్రామాలతో నిండినదీ, సస్యసమృద్ధమూ అయిన భూమి నిన్ను పూజిస్తూన్నది. ఏనుగుల తొండాలచేత విరవబడిన హింతాల – తాలీవృక్షవనాలు గల వింధ్యాదిపర్వతాలు నీకు నమస్కరిస్తున్నాయి. సముద్రాలు బ్రద్దలైన ముత్యపుచిప్పల నుండి పైకి చిమ్మబడిన ముత్యాలను తరంగహస్తాలతో నీకు సమర్పిస్తూ నమస్క రిస్తున్నాయి. సంతోషిస్తూన్న జలచరాలతో వ్యాకులములైన మహానదులు తెల్లని నురగులు చిమ్ముతూ నీ కీర్తిని కీర్తిస్తున్నాయా అన్న ట్లున్నాయి.

**మూ. ఏతాని సమవృత్తాని మయోక్తాని ద్విజోత్తమాః,**
**విషమార్ధసమానాం తు పునర్వక్ష్యామి లక్షణమ్. 155**

**తా.** ద్విజోత్తములారా! ఇంతవరకూ మీకు నేను సమవృత్తాలు (నాలుగు పాదాల లోను సమంగా ఉండే వృత్తాలు) చెప్పాను. ఇప్పుడు విషమ (వేరు వేరు విధాలుగా ఉండే పాదాలు గల) వృత్తాలను, అర్ధసమ (సగం భాగం మాత్రమే సమంగా ఉండే) వృత్తాలను చెపుతాను.

**మూ. యత్ర పాదాస్తు విషమా నానావృత్తసముద్భవాః,**
**గ్రథితాః పాదయోగేన తద్ వృత్తం విషమం స్మృతమ్. 156**

**తా.** వివిధవృత్తాలనుండి పుట్టి వేరు వేరు విధాలైన పాదాలు దేనిలో, పాద సంబంధాన్ని పట్టి కూరుస్తారో అది విషమవృత్తం.

**మూ. ద్వౌ సమౌ ద్వౌ చ విషమౌ వృత్తేఽర్ధవిషమే తథా,**
**సర్వపాదైశ్చ విషమైర్వృత్తం విషమముచ్యతే. 157**

**తా.** ఒక శ్లోకంలోని రెండు పాదాలు ఒక విధంగాను, రెండు పాదాలు మరొక విధంగాను ఉంటే అది అర్ధవిషమవృత్తం. నాలుగు పాదాలూ నాలుగు విధాలుగా ఉంటే అది విషమవృత్తం.

**మూ. హ్రస్వాద్యమథ దీర్ఘాద్యం దీర్ఘం హ్రస్వమథాపి వా,**
**యుగ్మౌజవిషమైః పాదైర్వృత్తమర్ధసమం భవేత్. 158**

**తా.** ఒక పాదం లఘువుతో ప్రారంభమై మరొకపాదం గురువుతో ప్రారంభమైనా లేదా ఒక పాదం గురువుతో ప్రారంభమై మరొకటి లఘువుతో ప్రారంభ మైనా – ఈ

విధంగా సరి సంఖ్య పాదాలలోను, బేసి సంఖ్యపాదాలలోను వేరు వేరుగా ఉండే వృత్తం అర్ధసమం. అనగా అర్ధసమవృత్తంలో ఒకటి – మూడు పాదాలూ, రెండు – నాలుగు పాదాలూ సమంగా ఉంటాయి.

**మూ. పాదే సిద్ధే సమం సిద్ధం విషమం సార్వపాదికమ్,**
**ద్వయోరర్ధసమం విద్యాదేష భేదస్తు పాదశః. 159**

**తా.** ఒక పాదం సిద్ధమైతే సమవృత్తం సిద్ధ మౌతుంది. విషమవృత్తంలో ఏ పాదానికి ఆ పాదం వేరు వేరు రీతులలో సిద్ధం కావాలి. రెండు పాదాలలో సిద్ధమైతే అది అర్ధసమం. ఈ భేదం (అక్షరాల విభాగం) ఒక పాదానికి వర్తిస్తుంది.

**మూ. భేదాస్తు యే మయా ప్రోక్తా సమవృత్తవికల్పితాః,**
**త్రికైర్విషమవృత్తానాం సంప్రవక్ష్యామి లక్షణమ్. 160**

**తా.** సమవృత్తాలలో ఏర్పరచుకొన్న ఏ భేదాలు (గణాలు) నేను చెప్పి ఉన్నానో ఆ త్రికాలతోనే (గణాల రూపంలో ఉన్న భేదాలతోనే) విషమవృత్తాల లక్షణాలు చెపుతాను.

**మూ. (నైధనేఽన్యతరస్యాం వై ప్రథమే పాద ఇష్యతే,**
**ద్వితీయే చరణే చ స్యాదిత్యనుష్టుప్ సమాసతః). 161**

**తా.** ప్రథమతృతీయపాదాలు, ద్వితీయచతుర్థపాదాలు అనుష్టుప్‌లో ఉంటాయి అని అర్థం చెప్పవచ్చును. (శ్లోకార్థం స్పష్టంగా తెలియలేదు).

**మూ. సౌ గౌ తు ప్రథమే పాదే స్రౌ ల్గౌ చాపి ద్వితీయకే,**
**యుగ్మేఽ ర(థ)విషమే పాదే జ్ఞేయా పథ్యా తు సా త్రికైః. 162**

**తా. పథ్యావృత్తం :–** ప్రథమ పాదంలో రెండు సగణాలు, రెండు గురువులు. ద్వితీయపాదంలో స – రగణాలు, లఘు – గురువులు. ఈ విధంగా సరి – బేసి పాదాలలో గణా లుంటే అది **పథ్యావృత్తం** – అనుష్టుప్‌లో ఒక భేదం.

**మూ. ప్రియదైవతమిత్రాసి ప్రియసంబన్ధిబాన్ధవా,**
**ప్రియదానరతా పథ్యా దయితే! త్వం ప్రియాసి మే. 163**

**తా.** ఉదా. ఓ! ప్రియురాలా! నీకు దేవతలు మిత్రులు ఇష్టులు; సంబంధులు, బంధువులూ కూడ నీకు ఇష్టులు. ఇష్టమైన వస్తువులను దానం చేయడంలో ఆసక్తి ఉన్నదానవు. అందరికీ హితం కోరుదానవు. అందుచేత నాకు చాల ప్రియురాలవు.

**మూ. మ్రౌ గౌ తు ప్రథమే పాదే య్సౌ ల్గౌ చ ద్వితీయకే,**
**పాదే భౌ ల్గౌ తృతీయే చ చతుర్థే తు త సౌ లగౌ. 164**

**తా.** ప్రథమపాదంలో మ – ర గణాలు, రెండు గురువులు. రెండవ పాదంలో య – సగణాలు లఘు – గురువులు. మూడవ పాదంలో రెండు భగణాలు లఘు గురువులు. చతుర్థపాదంలో త – స గణాలు, లఘు – గురువులు. ఇది కూడ పథ్యా వృత్తమే. పాదాలు నాలుగు వేరు వేరుగా ఉన్నాయి.

**మూ. నైవాచారో న తే మిత్రం న సంబన్ధిగుణప్రియా,**
**సర్వథా సర్వవిషమా పథ్యా న భవసి ప్రియే. 165**

**తా.** ప్రియురాలా! ఆచారం లేదు, మిత్రు లెవరూ లేరు; సంబంధు లెవరికీ నువ్వు సద్గుణాలచేత ఇష్టురాలవు కావు. అన్ని విధాల విషమంగా ఉన్నావు; అందుచేత నీవు నాకు పథ్య కాదు.

**మూ. అయుజోర్లక్షణం హ్యేతద్విపరీతం తు యత్ర చ,**
**పథ్యా హి విపరీతా సా విజ్ఞేయా నామతో యథా. 166**

**తా.** ఈ లక్షణం బేసి పాదాలలో విపరీతంగా ఉంటే అది **విపరీతపథ్య**. ఎట్లనగా–

**మూ. కృతేన రమణస్య కిం సఖి! రోషేణ తేఽ_త్యర్థమ్,**
**విపరీతా న పథ్యాసి త్వం జడే! కేన మోహితా. 167**

**తా.** సఖీ! నువ్వు నీప్రియుని విషయంలో కోపించి ఏమి ప్రయోజనం? మూర్ఖురాలా! నువ్వు విపరీతంగా ప్రవర్తిస్తున్నావు. పథ్య కాదు. నిన్నెవ రిలా మోసగించారు?

**మూ. చతుర్థాదక్షరాద్యత్ర త్రిలఘు స్యాదయుక్తతః,**
**అనుష్టుప్ చపలా సా తు విజ్ఞేయా నామతో యథా. 168**

**తా.** మూడవ పాదంలో నాల్గవ అక్షరం తరవాత మూడు లఘువు లున్న అనుష్టుప్‌కు చపలా అని పేరు. ఎట్లనగా –

**మూ. న ఖల్వస్యాః ప్రియతమః శ్రోతవ్యం వ్యాహృతం సఖ్యా,**
**నారదస్య ప్రతికృతిః కథ్యతే చపలా హీయమ్. 169**

**తా.** ఆత డామెకు ప్రియతముడు కాడు. సఖురాలు చెప్పిన మాట వినాలి. చపల యైన ఈమె నారదుని ప్రతికృతి (నకలు) అని అంటారు.

**మూ. విపులా తు యుజి జ్ఞేయా లఘుత్వాత్సప్తమస్య తు,**
**సర్వత్ర సప్తమస్యైవ కేషాంచిద్విపులా; యథా. 170**

**తా.** సరిపాదాలలో ఏడవ అక్షరం లఘు వైతే అది విపులా అనుష్టుప్. నాలుగు పాదాలలోను ఏడవ అక్షరం లఘు వైతే విపుల అని కొంద రంటారు. ఎట్లనగా –

**మూ. సంక్షిప్తా వజ్రమధ్యే హి హేమకుమ్భనిభస్తనీ,**
**విపులాసి ప్రియే! శ్రోణ్యాం పూర్ణచన్ద్రనిభాననే! 171**

**తా.** పూర్ణచంద్రుని వంటి ముఖం కలదానా! బంగారు కుంభముల వంటి స్తనాలు గల నీవు శ్రోణీతలమునందు చాల విశాలంగా ఉన్నావు. వజ్రంవంటి నడుమునందు సన్నగా ఉన్నావు.

**మూ. గఙ్గేవ మేఘోపగమే ఆప్లావితవసున్ధరా,**
**కూలవృక్షానారుజన్తీ స్రవన్తీ విపులా బలాత్. 172**

**తా.** ఇది, వర్షకాలంలో భూమిని నీటితో ముంచెత్తుతూ, బలంచేత ఒడ్డుమీద నున్న వృక్షాలను పడగొడుతూ గంగ వలె విపులంగా ఉంది.

**వి.** సరిపాదాలలో ఏడవ అక్షరం లఘువైనదానికి పై శ్లోకము, అన్నిపాదాలలోను లఘువైనందుకు ఈ శ్లోకమూ ఉదాహరణలు.

**మూ. ఆగతా మేఘసమయే భీరు భీరుకులోద్గతే,**
**ఏకరాత్రౌ పరగృహం చోరీ బన్ధనమర్హసి. 173**

**తా.** భయస్వభావంగల కులంలో పుట్టిన ఓ! భయస్వభావం కలదానా! వర్షా సమయంలో పరగృహానికి వచ్చావు. చోరి యైన స్త్రీని ఒక రాత్రి బంధించి శిక్షించాలి.

**మూ. ఏవం వివిధయోగాస్తు పథ్యాపాదా భవన్తి హి,**
**యుగ్మౌజవిషమైః పాదైః శేషైరన్యైస్త్రికైరథ. 174**

**తా.** ఈ విధంగా పథ్యావృత్తంలోనే సరి – బేసి పాదాలలో, పైన చెప్పిన గణాలే కాక మిగిలినగణాలు కూడా ఉపయోగిస్తూ, విషమపాదాలను సృష్టిస్తూ కూర్చడంచేత దీనిలోనే అనేక భేదా లేర్పడతాయి.

**మూ. గుర్వన్తకః సర్వలఘుః త్రికో నిత్యం హి నేష్యతే,**
**ప్రథమాదక్షరాద్యత్ర చతుర్థాత్ ప్రాగ్ లఘుః స్మృతః. 175**

**తా.** ప్రథమాక్షరం తరవాత సగణం కాని నగణం కాని ఎన్నడూ ఉపయోగించ కూడదు. అట్లే చతుర్థాక్షరం తరవాత యగణం ప్రయోగించకూడదు.

వి. గుర్వన్తకః = సగణం. సర్వలఘుః = నగణం. ప్రాగ్లఘః = యగణం.

**మూ. పథ్యాపాదం సమాస్థాప్య త్రీణ్యన్తే తు గురూణ్యథ,**
**భవన్తి పాదే సతతం బుధైస్తద్వక్త్రమిష్యతే. 176**

**తా.** పథ్యావృత్తం పాదం ఏర్పరచి, ఆ నాలుగు పాదాలు చివర నాలుగు అక్షరాలు గురువులు ఉపయోగిస్తే అది **వక్త్రం** అవుతుంది.

**మూ. దన్తక్షతాధరం సుభ్రు! జాగరగ్లాననేత్రం చ,**
**రతిసంభోగఖిన్నం తే దర్శనీయతరం వక్త్రమ్. 177**

**తా.** అందమైన కనుబొమ్మలు కలదానా! దంతాలచేత క్షతములైన అధరోష్ఠమూ, నిద్ర లేమిచేత వాడిపోయిన నేత్రాలూ గల, రతిసంభోగంచేత వాడిపోయిన నీ ముఖం ఇంకా చూడాలని అనిపించేటట్లుంది.

**మూ. (ఇత్యేషా సర్వవిషమా నామతోఽనుష్టుబుచ్యతే,**
**తద్విదాం మతవైషమ్యం త్రికాదక్షరతస్తథా). 178**

**తా.** ఈ విధంగా అనుష్టుప్ అనే ఈ వృత్తం అన్ని విధాలా విషమ మైనది. దీనిలోని గణాల విషయంలోను, అక్షరాల విషయంలో పండితుల మతంలో వైషమ్యం ఉంది. అనగా కొందరు అక్షరసంఖ్యాదులు చూడా లనీ కొందరు గణాలను చూడా లనీ అంటారు.

**మూ. పాదే షోడశమాత్రాస్తు గాథాంశకవికల్పితాః,**
**చతుర్భిరంశకైర్జ్ఞేయా వృత్తజ్ఞైర్వానవాసికా. 179**

**తా. (1) వానవాసికాగాథ :-** పాదంలో పదహారు మాత్రలు గల గాథలు అంశకాలను పట్టి (మాత్రల సంఖ్యను పట్టి) కల్పింపబడతాయి. పాదంలో నాలుగు అంశకాలు ఉంటే **వానవాసికా** గాథ.

**మూ. అసంస్థితపదా సువిహ్వలాఙ్గీ మదస్ఖలితచేష్టితైర్మనోజ్ఞా,**
**క్వ యాస్యసి వరోరు! సురతకాలే విషమా కిం వానవాసికా త్వమ్. 180**

**తా.** ఓ! సుందరోరూ! నిలవని పాదాలు, వ్యాకులమైన అవయవాలు, మదంచేత తొట్రుపడుతూన్న చేష్టలూ – వీటితో మనోహరియైన నువ్వు ఎక్కడికి వెడతావు! సురత సమయంలో విషమంగా ప్రవర్తించే వనవాసికవా నువ్వు!

**మూ. (స్జౌ స్గౌ చ ప్రథమే పాదే తథా చైవ తృతీయకే,**
**కేతుమత్యాం గణాః ప్రోక్తా భ్రౌ న్గౌ గశ్చ సదా బుధైః. 181**

**తా. (2) కేతుమతి :-** ప్రథమతృతీయపాదాలలో స – జ – సగణాలు, ఒక గురువు, ద్వితీయచతుర్థపాదాలలో భ – ర – సగణాలు ఒక గురువు ఉంటే అది **కేతుమతీ** గాథ).

**మూ. స్ఫురితాధరం చకితనేత్రం రక్తకపోలమమ్బుజదలాక్షమ్,**
**కిమిదం రుషాపహృతశోభం కేతుమతీసమం వద ముఖం తే. 182**

**తా.** కదలుతూన్న అధరోష్ఠము, భయపడుతూన్న నేత్రాలు. ఎఱ్ఱని గండస్థలము.

పద్మపత్రాలవంటి నేత్రాలు గల నీ ముఖం, ఏమిది! కోపంచేత శోభావిహీనమై కేతుమతి వలె ఉన్నది?

**మూ. వక్త్రస్యాపరపూర్వస్య చాదౌ నౌ రో లగౌ త్రికాః,**
**నజౌ రజౌ ద్వితీయే చ శేషాగ్రం పునరేవ తు. 183**

**తా. అపరవక్త్రం :- అపరవక్త్రం** మొదటి పాదంలో న - న - రగణాలు, లఘు - గురువులు, రెండవ పాదంలో న - జ - ర - జ - గణాలు. మూడు నాలుగు పాదాలు ప్రథమద్వితీయాల వలెనే ఉంటాయి.

**మూ. సుతను జలపరీతలోచనం జలదనిరుద్ధమివేన్దుమణ్డలమ్,**
**కిమిదమపరవక్త్రమేవ తే శశివదనేఽద్య ముఖం పరాఙ్ముఖమ్. 184**

**తా.** ఓ! శశివదనా! సుతనూ! కన్నీళ్లతో నిండిన నేత్రములతో మేఘాలు కప్పిన చంద్రమండలం వలె ఉన్న నీ ముఖం, ఇప్పుడు పరాఙ్ముఖమై అపరవక్త్రం (మరొక ముఖం) వలె ఉంది. ఏమిటిది!

**మూ. నౌ యౌ తు ప్రథమే పాదే న్జౌ జ్రౌ గశ్చ తథాపరే,**
**యత్ర తత్ పుష్పితాగ్రా స్యాత్ యది శేషం తు పూర్వవత్. 186**

**తా. (4) పుష్పితాగ్రావృత్తం :-** మొదటి పాదంలో న - న - య - యగణాలు. రెండవ పాదంలో న - జ - జ - ర గణాలు, గురువు. ఇట్లే మూడు నాలుగు పాదాలలో ఉంటే పుష్పితాగ్రావృత్తం.

**మూ. పవనబలవిధూతచారుశాఖం ప్రముదితకోకిలకణ్ఠనాదరమ్యమ్,**
**మధుకరపరిగీయమానశబ్దం వరతను! పశ్య వనం సుపుష్పితాగ్రమ్. 187**

**తా.** సుందరీ! చక్కగా పుష్పించిన శాఖాగ్రాలు గల ఈ వనం చూడు. దీని అందమైన కొమ్మలను వాయువు కదలుస్తూన్నది. సంతోషంతో ఉన్న కోకిల కంఠ ధ్వనులతో రమ్యంగా ఉంది. తుమ్మెదలు గానం (ధ్వని) చేస్తూన్నాయి.

**మూ. స్జౌ స్లౌ చాదౌ, యథా న్సౌ జ్గౌ, భ్నౌ జ్లౌ గశ్చ తథా పునః,**
**స్జౌ స్జౌ గశ్చ త్రికా హ్యేతే ఉద్గాతాయాః ప్రకీర్తితాః. 188**

**తా. (5) ఉద్గాతావృత్తం :-** మొదటిపాదంలో స - జ - సగణాలు లఘువు, రెండవ పాదంలో న - స జ గణ గురువులు. మూడవ పాదంలో భ - న - జ గణ లఘువులు, నాల్గవ పాదంలో స - జ - స - జ గణ గురువులు - ఇది **ఉద్గాతావృత్తం.**

**మూ. తవ రోమరాజిరతిభాతి సుతను మదనస్య మఞ్జరీ,**
**నాభికమలవివరోత్పతితా భ్రమరావలీవ కుసుమాత్సముద్గతా. 189**

**తా.** ఓ! సుందరీ! నాభికమలవివరంనుండి బైలుదేరి, పుష్పంనుండి పైకి ఎగిరిన తుమ్మెదల పంక్తి వలె ఉన్న నీ రోమపంక్తి మదనుని మంజరి వలె చాల ప్రకాశిస్తూన్నది.

**మూ. స్జౌ స్లౌ చ, తతో న్సౌ జ్గౌ, నౌ సౌ చేతి తృతీయకే,**
**సౌ సౌ గశ్చ చతుర్థే తు లలితాయా గణాః స్మృతాః. 190**

**తా. (6) లలితావృత్తం :-** మొదటి పాదంలో స - జ - స గణాలు, ఒక గురువు. రెండవ పాదంలో న - స - జ - గణాలు ఒక గురువు, మూడవపాదంలో న - న - స - స గణాలు నాల్గవపాదంలో స - జ - స - జ - గణాలు గురువు - ఇది **లలితావృత్తం**.

**మూ. లలితాకులభ్రమితచారువసనకరచారుపల్లవా,**
**ప్రవికసితకమలకాన్తముఖీ ప్రవిభాసి దేవి! సురతశ్రమాతురా. 191**

**తా.** దేవీ! సురతశ్రమతో అలసిన నీవు, వ్యాకులమై నలిగిపోయిన అందమైన వస్త్రం హస్తపల్లవంతో అందంగా పట్టుకొని, వికసించిన పద్మం వలె మనోహరమైన ముఖంతో చాల అందంగా ఉన్నావు.

**మూ. ఏవమేతాని వృత్తాని సమాని విషమాణి చ,**
**నాటకాద్యేషు కావ్యేషు ప్రయోక్తవ్యాని సూరిభిః. 192**

**తా.** ఈ విధ మైన సమవృత్తాలను విషమవృత్తాలను కూడ కవులు నాటకాది కావ్యాలలో ఉపయోగించాలి.

**మూ. సన్త్యన్యాన్యపి వృత్తాని యాన్యుక్తానీహ పిణ్డశః,**
**న చ తాని ప్రయోజ్యాని న శోభాం జనయన్తి హి. 193**

**తా.** సామూహికరూపంలో ఇక్కడనే చెప్పిన ఇంకా ఎన్నో వృత్తా లున్నాయి. కాని వాటిని కావ్యాలలో ఉపయోగించకూడదు. వాటివల్ల కావ్యాలకు శోభ చేకూరదు.

**మూ. యాన్యతః ప్రతిషిద్ధాని గీతకే తాని యోజయేత్,**
**ధ్రువాయోగే తు వక్ష్యామి తేషాం చైవ వికల్పనమ్. 194**

**తా.** అందుచేత, ఏ వృత్తాలు నిషేధింపబడినవో వాటిని గీతకంలో (సంగీత ప్రయోగంలో) ఉపయోగించవచ్చును. వాటి ప్రయోగం ఎలా చెయ్యాలో ధ్రువాప్రయోగం గూర్చి చెప్పే సందర్భంలో చెపుతాను.

**వి.** మంచి వృత్తం మామూలుగా చదువుతూంటేనే శ్రవ్యంగా ఉంటుంది. అందుచేత ఏవి పాఠ్యములుగా కూడ శ్రవ్యంగా ఉంటాయో వాటినే కావ్యాలలో ప్రయోగించాలి.

సంగీతంతో జోడిస్తే విషయము, వృత్తమూ ఎలా ఉన్నా సంగీతవాద్యధోరణిలో కొట్టుకొని పోతుంది. (అభి.భా.) ఇది నేడు కూడ మనందరికీ అనుభవంలో ఉన్నదే!

**మూ. వృత్తలక్షణమేవం తు సమాసేన మయోదితమ్,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి హ్యార్యాణామపి లక్షణమ్. 195**

**తా.** ఈ విధంగా సంక్షిప్తంగా వృత్తాల లక్షణం చెప్పాను. ఇప్పుడు 'ఆర్యా'ల లక్షణం కూడ చెపుతాను.

**మూ. పథ్యా చ విపులా చైవ చపలా ముఖతోఽపరా,**
**జఘనే చపలా చైవ ఆర్యాః పఞ్చ ప్రకీర్తితాః. 196**

**తా.** పథ్యా, విపులా, చపలా, ముఖచపలా, జఘనచపలా అని ఆర్యలు ఐదు విధాలు.

**మూ. ఆసాం తు సంప్రవక్ష్యామి యతిమాత్రావికల్పనమ్,**
**లక్షణం నియమం చైవ వికల్పగుణసంశ్రయమ్. 197**

**తా.** ఈ ఐదు విధాల ఆర్యల యతి – మాత్రల కల్పనమును, లక్షణమును భేదాలను గుణాలను గూర్చి ఏర్పడే నియమమును చెపుతాను.

**మూ. యతిశ్ఛేదస్తు విజ్ఞేయః చతుర్మాత్రో గణః స్మృతః,**
**ద్వితీయాన్త్యే పాదావయుజౌ త్వపరౌ స్మృతౌ. 198**

**తా.** ఛేదం (ఒక పదం దగ్గర ఆపడం) **యతి**. నాలుగు మాత్రలు ఒక గణం. ద్వితీయచతుర్థపాదాలు యుక్కులు (సరిసంఖ్య గలవి). మిగిలిన ఒకటి మూడు పాదాలు అయుక్కులు (బేసివి).

**మూ. గురుమధ్యవిహీనస్తు చతుర్గణసమన్వితః,**
**అయుగ్గణో విధాతవ్యః యుగ్గణస్తు యథేప్సితః. 199**

**తా.** బేసి పాదాలలోని గణాలు నాలుగు ఉండాలి. ఈ పాదాలలో జగణం ఉపయోగించకూడదు. సరిపాదాలలో ఇష్టం వచ్చినట్లు చేసికొనవచ్చును.

**మూ. అర్ధాష్టమగణార్ధా చ సర్వైరార్యా ప్రకీర్తితా**
**షష్ఠో వై ద్వివికల్పస్తు నైధనో హ్యేకసంస్థితః,**
**పశ్చాదర్ధే తు షష్ఠః స్యాదేకమాత్రస్తు కేవలః. 200**

**తా.** అన్ని ఆర్యలలోనూ కూడ ఎనిమిదవ గణం అర్ధగణంగానే ఉండాలి. అనగా దీనిలో రెండు మాత్రలే ఉంటాయి. ఎనిమిదవగణం ఏకమాత్రకం అయినప్పుడు ఆరవగణం

అర్ధగణంగా గాని పూర్ణగణంగా గాని ఉండవచ్చు. రెండవ శ్లోకార్ధంలోని ఆరవగణంలో ఒక్క మాత్ర మాత్రమే ఉండాలి.

**మూ. ద్వివికల్పస్తు షష్ఠో యో గురుమధ్యో భవేత్తు సః,**
**తథా సర్వలఘుశ్చైవ యతిః సంజ్ఞాసమాశ్రితా. 201**

**తా.** ఆరవ గణంలో జగణం ఉండవచ్చు లేదా నాలుగు లఘువు లుండవచ్చు. యతి వాటిని పట్టి ఉంటుంది.

**మూ. (ద్వితీయాదిర్లఘుర్ జ్ఞేయః సప్తమే పఞ్చమే యతిః,**
**ప్రథమాదిరథాన్త్యే చ పఞ్చమే వా విధీయతే. 202**

**తా.** ఐదవ గణంలోని లఘువు పూర్తి అయిన తరువాత యతి రావచ్చు. లేదా ఆరవగణం మొదట అక్షరం మీద ఉండవచ్చు, లేదా ఐదవగణం పూర్తి అయిన తరువాత ఉండవచ్చు).

**మూ. గణేషు త్రిషు పాదస్య యస్యాః పథ్యా తు సా భవేత్,**
**అతశ్చ విపులాన్యా తు విజ్ఞేయా యతిలక్షణా. 203**

**తా.** పాదంలోని మూడు గణాలు పూర్తి యైనతరువాత యతి ఉంటే అది **పథ్యా ఆర్య;** ఆ నియమం లేకుండా పాదంలో ఎక్క డైనా యతి ఉంటే అది **విపులా ఆర్య.**

**మూ. అయుజః సర్వగురవో గురుమధ్యా గణా యుజః,**
**యస్యాః స్యుః పాదయోగే తు విజ్ఞేయా చపలా హి సా. 204**

**తా. (1) చపలాఆర్య :–** ఒకటి – మూడు పాదాలలో అన్నీ గురువులే ఉండాలి. రెండు నాలుగు పాదాలలో గణాల మధ్య గురువు లుండాలి. అది **చపలాఆర్య.**

**మూ. త్రింశదాద్యే తు విజ్ఞేయాః సప్తవింశతిః చాపరే,**
**ఉభయోరర్ధయోర్జ్ఞేయో మాత్రాపిణ్డో విభాగశః. 205**

**తా.** ఆర్యలోని పూర్వార్ధంలో ముప్పై మాత్రలు, ఉత్తరార్ధంలో ఇరవైయేడు మాత్రలూ ఉంటాయి. రెండు అర్ధాలలోని మొత్తం మాత్రల సంఖ్య పైరెండు సంఖ్యలు కలపగా లభిస్తుంది.

**మూ. ప్రథమతృతీయౌ పాదౌ ద్వాదశమాత్రౌ భవేత్తు సా పథ్యా,**
**విపులాన్యా ఖలు గదితా పూర్వోదితలక్షణోపేతా. 212**

**తా. (2,3) పథ్యా – విపులాఆర్యలు :–** ప్రథమ – తృతీయపాదాలలో పన్నెండేసి మాత్ర లున్నది **పథ్యా ఆర్య,** వెనుక చెప్పిన లక్షణం గల, యతినియమం లేనిది **విపులా ఆర్య.**

**మూ. పథ్యా యథా –**

**రక్తమృదుపద్మనేత్రాఽ_సితదీర్ఘబహులమృదుకేశీ,**
**కస్య న పృథుమృదుజఘనా తనుబాహ్వంసోదరీ పథ్యా. 213**

**తా.** పథ్యకు ఉదాహరణం ఎట్లనగా – ఎఱ్ఱని మృదువైన పద్మాల వంటి నేత్రాలు గలది, నల్లని దీర్ఘమైన, దట్టమైన మృదువైన కేశములు కలదీ, పెద్దదైన మృదువైన జఘనం కలది, సన్నని బాహువులు బుజాలు ఉదరమూ కలదీ అయిన వనిత ఎవరికి పథ్య కాదు?

**మూ. విపులా యథా –**

**విపులఘనజఘనస్తననయనైః తామ్రాధరోష్ఠకరచరణైః,**
**ఆయతనాసాగణ్డైర్లలాటకర్ణైః శుభా కన్యా. 214**

**తా.** విపులాఆర్యకు ఉదాహరణం ఎట్లనగా – విపులములు, ఘనములూ అయిన జఘన – స్తన – నయనాలతోను, ఎఱ్ఱని అధరోష్ఠ – హస్త – పాదాలతోను, పొడవైన నాసికా – గండ – లలాట – కర్ణములతోను ఉన్న కన్య శుభప్రదురాలు.

**మూ. ద్వితీయశ్చ చతుర్థశ్చ గురుమధ్యగతో భవేత్,**
**ఉభయోరర్ధయోర్యత్ర విజ్ఞేయా చపలా యథా. 215**

**తా. చపలా ఆర్యా :–** రెండు శ్లోకార్ధాలలోను ద్వితీయచతుర్థగణాలు జగణం అయితే అది **చపలాఆర్య.** ఎట్లనగా –

**మూ. ఉద్భటగామినీ పరుషభాషిణీ కామచిహ్నాకృతవేషా,**
**యా నాతిమాంసయుక్తా సురాప్రియా సర్వతశ్చపలా. 216**

**తా.** వికటంగా నడిచేదీ, పరుషంగా మాట్లాడేదీ, మన్మథచిహ్నాలతో కూడినవేషం గలది, బాగా సన్నంగా ఉన్నది, సురాప్రియ యైన స్త్రీ అన్ని విధాల చపల.

**మూ. పూర్వార్ధే లక్షణం హ్యేతదస్యాః స చ ముఖేన తు,**
**పశ్చిమార్ధే తు చపలా యస్యాః సా జఘనేన తు. 217**

**తా. (4,5) ముఖచపలా, జఘనచపలా :–** పైన చెప్పిన చపలాలక్షణం పూర్వార్ధంలో మాత్రమే పట్టే ఆర్య **ముఖచపల.** ఉత్తరార్ధంలో పట్టేది **జఘనచపల.**

**మూ. ఆర్యా ముఖే తు చపలా తథాపి చార్యా న మే యతః సా కిమ్,**
**దక్షా గృహకృత్యేషు తథా దుఃఖే భవతి దుఃఖార్తా. 218**

**తా.** ఈ ఆర్యురాలు కేవలం ముఖంలో చపల – ఏమేమో మాట్లాడుతుంది. అయితే మాత్రం ఈమె నాకు పూజ్యురాలు కాదా? ఎందుచేత ననగా – ఈమె ఇంటి వ్యవహారాలలో నేర్పు గలది. నాకేమైనా కష్టం కలిగితే ఈమె కూడా దుఃఖిస్తుంది.

**మూ. జఘనచపలా యథా –** (జఘనచపలకు ఉదాహరణం ఎట్లనగా) –

**వరమృగనయనే చపలాసి వరోరు! శశాఙ్కదర్పణనిభాస్యే,**
**కామస్య సారభూతేఽపూర్వమదచారుజఘనేన. 219**

**తా.** అందమైన మృగనయాలవంటి నయనాలు గలదానా, చంద్రునితోను, అద్దం తోను సమానమైన ముఖం గలదానా, అపూర్వమైన మదంచేత అందమైన జఘనంచేత కాముని సార మైనదానా; వరోరూ! చపలగా ఉన్నావు.

**మూ. ఉభయోరర్ధయోరేతల్లక్షణం దృశ్యతే యది,**
**వృత్తజ్ఞైః సాతు విజ్ఞేయా సర్వతశ్చపలా సఖి. 220**

**తా.** రెండు శ్లోకార్ధాలలోను ఈ చపలాలక్షణం ఉంటే అది **సర్వతశ్చపల** అని వృత్తజ్ఞులు అంటారు.

**మూ. (కార్యౌ ద్వాదశమాత్రౌ చ పాదావాద్యతృతీయకౌ,**
**అష్టాదశ ద్వితీయం చ తథా పఞ్చదశోత్తమా. 221**

**తా.** ఒకటి మూడు పాదాలలో పన్నెండేసి మాత్రలు, రెండవ పాదంలో పద్దెనిమిది మాత్రలు, నాల్గవదానిలో పదిహేను మాత్రలు – ఇదొక ఆర్యాభేదం).

**మూ. చతుఃపఞ్చప్రకారాణాం చతుష్కాణాం విశేషతః,**
**ప్రస్తారయోగమాసాద్య బాహుల్యం సంప్రవర్తయేత్. 222**

**తా.** నాలుగైదు విధాలైన చతుష్కాల (చతుఃపాదసముదాయాల) ప్రస్తారప్రయోగం చేసి ఇవి ఎలా అత్యధికమైన సంఖ్యలో ఉన్నాయో తెలుసుకొనవచ్చును.

**మూ. పఞ్చ పఞ్చాశదాద్యా తు త్రింశదాద్యా తథైవ చ,**
**ఆర్యా త్వక్షరపిణ్డేన విజ్ఞేయాత్ర ప్రయోక్తృభిః. 223**
**త్రింశతస్త్వథ వర్ణేభ్యో లఘువర్ణత్రయం భవేత్,**
**శేషాణి గురుసంఖ్యాని హ్యేవం సర్వత్ర నిర్దిశేత్. 224**
**(సర్వేషామేవ ఆర్యాణామక్షరాణాం యథాక్రమమ్)**
**సర్వేషాం జాతివృత్తానాం పూర్వముత్తరసంఖ్యయా. 225**
**వికల్పగణానాం కృత్వా సంఖ్యాపిణ్డేన నిర్దిశేత్.**

223 వ శ్లోకం మొదలు 226 వ శ్లోకంలోని పూర్వార్ధంవరకు ప్రస్తారవిధానం చెప్పబడింది. ఇది అతిక్లిష్ట మైన విషయం. కేవలం చిత్తవిభ్రాంతికరం. ప్రయోగానికి ఉపయోగించనిది. ఈ విధంగా ప్రస్తారం చేయగా మొత్తం ఆర్యాభేదాల సంఖ్య **ఎనిమిది**

**కోట్ల, పంతొమ్మిది లక్షల ఇరవైవేలు** (81920000) అని **అభినవభారతిలో** ఒక శ్లోకంలో చెప్పబడింది –

**"ఆర్యాః శతసహస్రాణి జ్ఞేయా హ్యేకాన్నవింశతిః,**
**అష్టౌ కోట్యః సహస్రాణి వింశతిశ్చ ప్రమాణతః". (అభి.భా.)**

**మూ. ఆర్యాగీతిరథార్యైవ కేవలం త్వష్టభిర్గణైః. 226**
**ఇతరార్ధే జః షష్ఠస్తు న లఘుగణ ఇష్యతే.**

**తా. ఆర్యాగీతి** కూడ ఎనిమిది గణాల ఆర్యయే. కేవలం భేద మేమనగా ఆర్యాగీతి ఉత్తరార్ధంలో కూడ ఆరవగణం విషయంలో రెండు వికల్పాలు ఉన్నాయి. ఆరవగణం జగణం కావచ్చు, లేదా నాలుగు లఘువులు కావచ్చు.

**మూ. వృత్తైరేవం తు వివిధైః నానాఛన్దఃసముద్భవైః,**
**కావ్యబన్ధాస్తు కర్తవ్యాః షట్త్రింశల్లక్షణాన్వితాః.**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే ఛన్దోవిచితిర్నామ పఞ్చదశోఽధ్యాయః.**

**తా.** ఈ విధంగా – అనేకఛందస్సులనుండి బయల్దేరిన అనేకవిధాలైన వృత్తాలను ఉపయోగించి ముప్పైయారు లక్షణాలతో కూడిన కావ్యబంధాలను నిర్మించాలి.

ఈ అధ్యాయం చివర అభినవభారతీవ్యాఖ్యానంలో శ్రీమదభినవగుప్తాచార్యపాదులు కవులము, పండితులము అనుకొనేవాళ్లందరూ ఎల్లప్పుడూ స్మృతిపథంలో ఉంచుకొన వలసిన ఒక గొప్ప ఉపదేశం చేశారు –

"కావ్యబన్ధాః ఇత్యనేన ఇదమాహ. యథా ప్రాసాదకుడ్యాదికే కర్తవ్యే ప్రథమం భూమిః, తద్వత్కావ్యే నిర్మాతవ్యే భూమికల్పః శబ్దచ్ఛన్దోవిధిః. క్షేత్రపరిగ్రహం వృత్త సమాశ్రయమ్ ఇత్యాది (?) విరచయన్ భిత్తిస్థానీయం లక్షణయోజనం, చిత్రకర్మప్రతిమమ్ అలఙ్కారగుణవివేశనం, గవాక్షవాతాయనాదిదేశీయః దశరూపకవిభాగః, ఉపయోగ నిరూపణప్రఖ్యా కాక్వాదిప్లుతిః, ఏవంభూతవాచికాభినయస్వరూపం చతుర్దశాదిభిః షడ్భిరధ్యాయైరుచ్యతే. తత్ర అధ్యాయద్వయం వృత్తలక్షణవిధానం తు భవిష్యతి.

యద్యపి రూపకవిరచనకాలే పరిపక్వప్రజ్ఞస్య న క్రమప్రతిభాసః తథాప్యపోద్ధా రధియా కల్ప్యత ఇత్యాహుః. ప్రబన్ధస్య యో యుక్తోఽభ్యాసః తన్నిష్పత్తిః, ప్రబన్ధా భ్యాసః, తత్సంపత్తిః, అభినేయార్థనిర్వర్తనమ్, తదభినయోపారోహణమ్ ఇతి స ఏవ క్రమ ఇత్యుపాధ్యాయః, యదాహుః –

**"మహాకవీనాం పదవీముపాత్తామారురుక్షతామ్,**
**నాసంస్మృత్య పదస్పర్శాన్ సంపత్సోపానపద్ధతిః"–** ఇత్యాది.

క్రమోల్లఙ్ఘనే హి సతి నాటకాది విరచయతాం మహాన్తః ప్రమాదాపభ్రంశాః భవన్తి. న హి సర్వో వాల్మీకిర్వ్యాసః కాలిదాసో భట్టేనుర్దాజో వా! తేషామపి ప్రాగ్జన్మార్జితక్రమాభ్యాస సముదితసంస్కారపాటవోత్పాదితః కులప్రతిభజ్ఞజ్ఞానాతిశయః **ఇతి శివమ్**.

**తా. "కావ్యబన్ధాస్తు కర్తవ్యాః"** ఇత్యాదివాక్యంచేత ఇక్కడ చెప్పదలచిన విషయం ఇది – పెద్ద భవనము, ప్రాకారమూ మొదలైనవి కట్టదలచినప్పుడు ముందు భూమి ఎట్లో అట్టిదే, కావ్యం నిర్మించాలనుకున్నప్పుడు శబ్దశాస్త్ర – ఛందఃశాస్త్రాదికం. ఇది భూమి వంటిది. వృత్తాలను స్వీకరించడం భూమిని సేకరించడం వంటిది. లక్షణాల కూర్పు గోడల వంటిది. అలంకారాల, గుణాల కూర్పు చిత్రకర్మ వంటిది. పది రూపకాల విభాగం గవాక్ష (చిన్నసందుల గాలిగూడు) వాతాయన (కిటికీ) స్థానీయం. వాటి ఉపయోగాన్ని తెలపడం వంటిది కాక్వాదిస్వరనిరూపణం. ఇలాంటి వాచికాభినయం పద్నాలగవ అధ్యాయం మొదలు ఆరు అధ్యాయాలలో చెప్పబడుతుంది. వాటిలో వృత్తాలను గూర్చి రెండు అధ్యాయాలలో చెప్పబడింది. లక్షణాల ప్రయోగం మున్ముందు చెప్ప బడుతుంది.

పరిపక్వమైన బుద్ధితో రూపకం రచించడానికి ఉద్యమించేవానికి ఈ క్రమం అంతా భాసించదు కదా అని అంటే – ఈ విధంగా ఒక మెట్టు తరవాత ఒక మెట్టు అను క్రమం స్ఫురించకపోవచ్చు. జరుగుతూన్న కార్యాన్ని పట్టి వెనక్కి వెనక్కి వెళ్లి పరిశీలిస్తే ఈ క్రమం తప్పక ఉండి తీరుతుంది అను విషయం తెలుస్తుంది అని పెద్దలంటారు. ప్రబంధనిర్మాణానికి అవసరమైన అభ్యాసం ప్రారంభించడం, అది పూర్తి అవడం, ప్రబంధాభ్యాసం, అది సార్థకం అవడం, రూపకనిర్మాణం, దానిని అభినయించడం – ఇదే క్రమం అని మా ఉపాధ్యాయు లంటారు. ఇలా అన్నారు – "మహాకవులు నడిచిన మార్గాన్ని ఎక్కాలనుకున్నవాళ్లకు వారి అడుగుజాడలను స్మరించకుండా ఆ సంపదను చేరే మెట్ల మార్గం లభించదు."

ఇలా క్రమం సరిగా పాటించకపోతే నాటకాదులు రచించేవారు పెద్ద పెద్ద పొరబాట్లు, అపభ్రంశలూ చేస్తూంటారు. ప్రతీవాడూ వాల్మీకి గాని, వ్యాసుడు గాని, కాళిదాసు గాని, భట్టేందురాజు గాని కాడు కదా! నిజానికి వాల్మీక్యాదులు కూడ పూర్వ జన్మలలో సంపాదించిన క్రమాభ్యాసంవల్ల ఏర్పడిన సంస్కారబలంచేతనే కులప్రతిభంగ (?) జ్ఞానాతిశయం సంపాదించకలిగారు. **ఇతి శివమ్**.

ఇదే ఘట్టంలో సర్వలఘుశ్లోకానికి ఉదాహరణగా రచించి శ్రీమదభినవ గుప్తాచార్యులు 223వ శ్లోకం క్రింద ఉదాహరచించిన శ్లోకంతో ఈ అధ్యాయం ముగిద్దాం.

**శిశిరతరకిరణపరికరసకలకల**
**విరచితకపిశకచనిచయ,**
**సమహృదయ తనువినిహిత**
**ధరణిధరవరసుత!**
**జయ జయ శివ!**

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో ఛందోవిచితి అను పదిహేనవ అధ్యాయం సమాప్తం**

---

ఈ అధ్యాయంలోని 206 నుండి 211 వరకు ఉన్న 6 శ్లోకాలలో ఆర్యాఛందోగత వర్ణసంఖ్యాదుల చర్చ ఉంది. అవి కొన్ని ప్రతులలో లేవు. ప్రకృతానికి అంతగా ఉపయోగించని అస్పష్టార్థాలైన వాటికి తాత్పర్యం వ్రాయలేదు. అవి నాకు సరిగా అర్థం కాకపోవడమే కారణం. ఆ శ్లోకాలు ఇవి –

**త్రింశత్తస్యాశ్చ యది స్యుః ఏతాని ద్విగుణాని తు**
**త్రీణ్యక్షరాణి చాన్యాని న్యస్య సంఖ్యావిభాగశః. 206**

**ఏతాని లఘుసంఖ్యాని నిర్దిష్టాని సమాసతః,**
**సర్వేషాం చైవమార్యాణామక్షరాణాం యథాక్రమమ్. 207**

**అర్ధాష్టమగణార్ధా చ సవవార్యా ప్రకీర్తితా,**
**షష్ఠశ్చ ద్వివికల్పస్తు నైధనే హ్యేకసంస్థితః. 208**

**పశ్చాద్వా యో గణః షష్ఠ ఏకమాత్రః స ఉచ్యతే,**
**ద్వివికల్పస్తు యః షష్ఠో గురుమధ్యే భవేత్తు సః. 209**

**యథా సర్వలఘుశ్చైవ యతిః సంఖ్యాసమా శ్రితా,**
**సా ద్వితీయా ద్విలఘుకా సప్తమే ప్రథమే యతిః. 210**

**గురుమధ్యవిహీనస్తు చతుర్గణసమన్వితః,**
**అయుగ్మగో విధాతవ్యః యుగ్మగస్తు స ఏవ చ. 211**

పుల్లెల శ్రీరామచంద్రుడు

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ షోడశోఽధ్యాయః

# కావ్యలక్షణము

"విచిత్రం రూపకభువాం లక్షణం భూషణం భువః,
భాస్యతే యేన తం వన్దే ప్రాచ్యధీసాధితం శివమ్."

– శ్రీమదభినవగుప్తాచార్యాః

**మూ. విభూషణం చాక్షరసంహతిశ్చ శోభాభిమానౌ గుణకీర్తనం చ,
ప్రోత్సాహనోదాహరణే నిరుక్తం గుణానువాదోఽతిశయశ్చ హేతుః. 1**

**సారూప్యమిథ్యాధ్యవసాయసిద్ధిపదోచ్చయాక్రన్దమనోరథాశ్చ,
ఆఖ్యానయాచ్ఞాప్రతిషేధపృచ్ఛాదృష్టాన్తనిర్భాసనసంశయాశ్చ. 2**

**ఆశీః ప్రియోక్తిః కపటః క్షమా చ ప్రాప్తిశ్చ పశ్చాత్తపనం తథైవ
అర్థానువృత్తిర్హ్యుపపత్తియుక్తీ కార్యోఽనునీతిః పరిదేవనం చ. 3**

**షట్త్రింశదేతాని హి లక్షణాని ప్రోక్తాని వై భూషణసంమితాని,
కావ్యేషు భావార్థగతాని తద్జ్ఞైః సమ్యక్ ప్రయోజ్యాని యథారసం తు. 4**

**తా.** విభూషణము, అక్షరసంహతి, శోభ, అభిమానము, గుణకీర్తనము, ప్రోత్సాహనము, ఉదాహరణము, నిరుక్తము, గుణానువాదము, అతిశయము, హేతువు, సారూప్యము, మిథ్యాధ్యవసాయము, సిద్ధి, పదోచ్చయము, ఆక్రందము, మనోరథము, ఆఖ్యానము, యాచనము, ప్రతిషేధము, పృచ్ఛ, దృష్టాంతము, నిర్భాసనము, సంశయము, ఆశీస్సు, ప్రియోక్తి, కపటము, క్షమ, ప్రాప్తి, పశ్చాత్తపనము, అర్థానువృత్తి, ఉపపత్తి, యుక్తి, కార్యము, అనునీతి, పరిదేవనము – ఈ ముప్పైఆరూ, భూషణాలతో సమానములైన లక్షణాలుగా చెప్పబడ్డాయి. వీటిని గూర్చి బాగా తెలిసిన పండితులు, భావాలతోను అర్థాలతోను సంబంధించిన ఈ లక్షణాలను రసానుగుణంగా కావ్యాలలో చక్కగా ప్రయోగించాలి.

**మూ. అలంకారైర్గుణైశ్చైవ బహుభిః సమలంకృతమ్,
భూషణైరివ విన్యస్తైః తద్ భూషణమితి స్మృతమ్. 5**

**తా. (1) భూషణం :–** దేహాన్ని ఆ యా అవయవాలమీద ఉంచిన (ధరించిన) భూషణాలచేత వలె, అనేకమైన అలంకారాలచేత, గుణాలచేత కావ్యాన్ని అలంకరించడం **భూషణం** అని చెప్పబడుతుంది.

**వి.** అలంకారం అనగా వేరుగా తీసి చూడడానికి వీలైన హార – కుండలాదికం. కావ్యాలలో ఉపమాదికం. అలంకారాన్నే భూషణం అని కూడ అనవచ్చు. ఐతే ఇక్కడ భూషణం అనగా అందంగా ఉండడానికి ఉపకరించే అన్నింటినీ ఒక చోట అమర్చడం. అలంకరించడం అన్నది కవిగతవ్యాపారం; పని. తద్ద్వారా కావ్యగత మైనది. అందుచేత 'అలంకారం' కాకుండా అలంకారాదులతో అలంకరించడం అనేది **భూషణం**. అదే **లక్షణం**.

**మూ. యత్రాల్పైరక్షరైః శ్లిష్టైః విచిత్రముపవర్ణ్యతే,**
**తమప్యక్షరసంఘాతం విద్యాల్లక్షణసంజ్ఞితమ్.** **6**

**తా. (2) అక్షరసంఘాతం :–** ఒకదానితో ఒకటి చక్కగా కలిసిన తక్కువ అక్షరాలతో విచిత్రంగా వర్ణించిన ట్లయితే, ఆ అక్షరాల కూర్పును కూడ, ఒక విచిత్రమైన వస్తువును కళ్లకు కట్టినట్లు చూపిన అక్షరవిన్యాసమును కూడ, **అక్షరసంఘాతం** అను లక్షణ మని తెలుసుకోవాలి.

**వి.** శ్రీమదభినవగుప్తాచార్యులు ఈ ఘట్టంలో లక్షణాల స్వరూపం చక్కగా విశదీకరిస్తూ, ఎన్నో విషయాల సమన్వయం చేస్తూ విస్తృతమైన వ్యాఖ్య సంతరించారు. అది చదివి అర్థం చేసికొని ఆనందించవలసినదే. అదంతా ఇక్కడ జొనిపితే కొన్ని వందల పత్రాలు వ్రాయవలసి ఉంటుంది. అది అస్మాదృశులకు అశక్యమైన పని. ఈ సందర్భంలో ఆయన ఉదాహరించి విస్తృతంగా విశదీకరించిన ఒక శ్లోకం మాత్రం సహృదయహృదయాహ్లాదం నిమిత్తం ఉద్ధరింపబడుతూన్నది. ఇది ఏ కావ్యంలోదో తెలియదు. అపార మైన సంస్కృతవాఙ్మయంలో నేడు లభిస్తూన్నది అత్యల్పం మాత్రమే. ఇదే అతివిస్తృతం అనుకుంటే దీనికి వంద రెట్లు, వెయ్యి రెట్లు వాఙ్మయం కాలగర్భంలో విలీనమైపోయింది. ఉన్నదాని సారాన్నైనా అందించేవారు అందుకొనేవారు నేడు కరవైనారు. ఆ శ్లోకం చదివి ఆ శ్రీరామచంద్రమూర్తి సాక్షాత్కారం పొందండి.

**విస్రమ్భాదుత్తమాఙ్గం ప్లవగబలపతేః పాదమక్షస్య హన్తుః**
**కృత్వోత్సఙ్గే సలీలం త్వచి కనకమృగస్యాఙ్గమాధాయ శేషమ్,**
**బాణం రక్షఃకులఘ్నం ప్రగుణితమనుజేనాదరాత్తీక్ష్ణమక్ష్ణోః**
**కోణేనోద్వీక్షమాణస్త్వదనుజవదనే దత్తకర్ణోఽయమాస్తే.**

విభీషణుడు వచ్చి తనను ఆశ్రయించిన తరువాత, సముద్రతీరంలో రాము డేమి చేస్తున్నాడు అని రావణుడు ప్రశ్నించగా వాని గూఢచారి రాముణ్ణి గూర్చి చెపుతూన్న మాటలై ఉంటాయి ఇవి –

"రాముడు తనకు అతివిశ్వాసపాత్రుడైన సుగ్రీవుని ఒడిలో శిరస్సు, అక్షసంహారి

యైన హనుమంతుని ఒడిలో పాదాలు పెట్టుకొని మిగిలిన శరీరభాగం కనకమృగచర్మం మీద ఉంచి పక్కనే కూర్చున్న తమ్ముడు రాక్షసకులవినాశకమైన బాణానికి పదును పెడుతూంటే నేత్రకోణంతో దాని వైపు చూస్తూ, నీ తమ్ముడు చెప్పే మాటలకు ఒక చెవి ఒగ్గి, శయనించి ఉన్నాడు."

ఈ శ్లోకంలోని ప్రతీ పదానికీ చక్కని భావం చెపుతూ అభినవగుప్తాచార్యులు – **'అయమ్'** (ఇతడు) అనడంలో **"గమ్భీరధీరాకృతిః ప్రసన్నశ్చ ఆస్తే"** రెండు మూడు రోజులలో మహాయుద్ధం చేయవలసి ఉన్నా కూడ ఏ చింతా లేకుండా "గంభీరధీరాకృతియై ప్రసన్నుడై ఉన్నాడు" అన్నాడు. 'సలీలమ్' అను పదం ఈ అర్థాన్ని దృఢీకరిస్తూన్నది అని కూడ వ్యాఖ్యానించారు.

**మూ. సిద్ధైరర్థైః సమం కృత్వా హ్యసిద్ధోఽర్థః ప్రసాధ్యతే,**
**యత్ర శ్లక్ష్ణవిచిత్రార్థా సా శోభేత్యభిధీయతే. 7**

**తా. (3) శోభ :–** ప్రసిద్ధమైన కొన్ని విషయాలతో పాటు అసిద్ధ మైన ఒక కొత్త విషయం జోడించి చెప్పి ఆ సిద్ధార్థాలచేత అసిద్ధార్థాన్ని సమర్థిస్తే అది మధురమూ విచిత్రమూ అయిన అర్థం గల **శోభ** అను లక్షణం.

**మూ. ధార్యమాణస్తు బహుభిర్వచనైః కార్యయుక్తిభిః,**
**న యః పర్యవతిష్ఠేత సోఽభిమానస్తు సంజ్ఞితః. 8**

**తా. (14) అభిమానం :–** ఒక విషయాన్ని ఎన్నో మాటలు చెపుతూ, యుక్తులు చూపిస్తూ నిర్ణయించడానికి ప్రయత్నించినా మనస్సులో ఆ విషయం నిలవదు. అది **అభిమానం** అనే లక్షణం.

**మూ. కీర్త్యమానైర్గుణైర్యత్ర వివిధార్థసముద్భవైః,**
**దోషా న పరికథ్యన్తే తద్ జ్ఞేయం గుణకీర్తనమ్.**

అభినవభారతిలో ఇచ్చిన మరొక పాఠం.

**లోకే గుణాతిరిక్తానాం బహూనాం యత్ర నామభిః,**
**ఏకోఽభిశబ్ద్యతే యస్తు విజ్ఞేయం గుణకీర్తనమ్. 9**

**తా. (5) గుణకీర్తనం :** అనేకవిషయాలకు సంబంధించిన గుణాలను చెప్పే సందర్భంలో వాటిలోనే ఉన్న దోషాలను మాత్రం చెప్పకపోవడం **గుణకీర్తనం** అను లక్షణం.

గుణాలతో పాటు కొన్ని దోషాలు కూడ ఉన్నా వాటిని చెప్పకుండా గుణం మాత్రమే చెప్పడం గుణకీర్తనం.

**మూ. ఉత్సాహజననైః స్పష్టైరర్థైరౌపమ్యసంశ్రయైః,**
**ప్రసిద్ధైరుపగూఢం చ జ్ఞేయం ప్రోత్సాహనం తు తత్. 10**

**తా. (6) ప్రోత్సాహనం :–** ఔపమ్యాన్ని ఆశ్రయించిన, అనగా ఎవరితోనో పోలికను చెప్పే, ఉత్సాహజనకా లైన స్పష్ట మైన విషయాలు చెపుతూ (ఒకనిలో ఉన్న విశిష్టగుణాలని చెపుతూ) ప్రకటంగాను, నిగూఢంగాను ప్రోత్సహించడం **ప్రోత్సాహనం** అను లక్షణం. ఇదే **ప్రియవచనం** అని కొన్ని పాఠాలలో ఉంది. (అభి.భా.)

**మూ. యత్రైకస్యాపి శబ్దస్య దర్శనాత్ సుబహూన్యపి,**
**యాన్తి సిద్ధిమనుక్తాని తదుదాహరణం స్మృతమ్. 11**

**తా. (7) ఉదాహరణం :–** ఒక విషయాన్ని చెప్పగానే దానికి సంబంధించిన ఎన్నో మరికొన్ని విషయాలు చెప్పకపోయినా స్ఫురించే టట్లు చేయడం **ఉదాహరణం** అను లక్షణం.

**మూ. నిరుక్తం ద్వివిధం ప్రోక్తం తథ్యం చాతథ్యమేవ వా,**
**సిద్ధాప్రసాధితం తథ్యమతథ్యం చాప్రసాధితమ్. 12**

**తా. (8) నిరుక్తం :–** తథ్యము, అతథ్యమూ అని **నిరుక్తం** రెండు విధాలు. లక్షణాన్ని పట్టి నిరూపించి సాధించినది తథ్యం; అలా చేయనిది అతథ్యం. రెండవ రకం నిరుక్తాన్ని సమర్థించడానికై మొదటిరకం నిరుక్తం ఉపయోగిస్తుంది.

**మూ. గుణానువాదో హీనానాముత్తమైరుపమాకృతః,**
**ఉత్తమార్థవిశేషో యః స చాప్యతిశయః స్మృతః. 13**

**తా. (9) గుణానువాదం :–** తక్కువదానిని ఉత్తమమైనవానితో పోల్చడంచేత **గుణానువాదం** ఏర్పడుతుంది.

**(10) అతిశయం :–** ఉత్తమమైన అర్థవిశేషాన్ని ప్రతిపాదించడం **అతిశయం**.

**మూ. బహూనాం భాషమాణానామేకస్యార్థవినిర్ణయాత్,**
**సిద్ధోపమానవచనం హేతురిత్యభిధీయతే. 14**

**తా. (11) హేతువు :–** చాలామంది మాటలాడుతూ వేరు వేరు అభిప్రాయాలు వెల్లడించుచున్నప్పుడు ప్రసిద్ధ మైన ఉపమానం ఏదో చెప్పి విషయనిర్ధారణం చేయడం **హేతువు** అను లక్షణం.

**మూ. అపదేశస్తు పరోక్షో యస్మాదుత్పద్యతేఽనుకరణేన,**
**లక్షణసమానకరణాత్ సారూప్యం తత్తు నిర్దేశ్యమ్. 15**

**తా. (12) సారూప్యం :–** చక్కగా అనుకరించి చెప్పడంచేత పరోక్షమైనవస్తువు కూడ ప్రత్యక్షంగా చూస్తూన్నట్లు మనస్సుకు గోచరించే టట్లు చేయడం **సారూప్యం** అను లక్షణం.

**మూ. అభూతపూర్వైర్యత్రార్థైస్తుల్యస్యార్థస్య నిర్ణయః,**
**స మిథ్యాధ్యవసాయస్తు ప్రోచ్యతే కావ్యలక్షణే. 16**

**తా. (13) మిథ్యాధ్యవసాయం:–** పూర్వం ఎన్నడూ జరగని విషయాలచేత వాటితో సామ్యాన్ని ప్రతిపాదిస్తూ తుల్యార్థాన్ని నిర్ణయించడం **మిథ్యాధ్యవసాయం** అను లక్షణం.

**మూ. బహూనాం తు ప్రధానానాం మధ్యే యన్నామ కీర్త్యతే,**
**ఏకార్థసాధనకృతం సా సిద్ధిరితి కీర్త్యతే. 17**

**తా. (14) సిద్ధి :–** ప్రసిద్ధమైన అనేకుల లేదా అనేకవస్తువుల మధ్య సాధారణమైన ఒక పనిని లేదా ఒక వస్తువును చేర్చి చెప్పడం, (దీనికి గొప్పతనం తీసికొనిరావడానికై) సిద్ధి అను లక్షణం.

**మూ. గుణైర్బహుభిరేకార్థైః పరైర్యః సంప్రశస్యతే,**
**పదోచ్చయం తు తం విద్యాన్నానార్థగ్రథనాత్మకమ్. 18**

**తా. (15) పదోచ్చయం :–** ఒక పురుషుణ్ణి లేదా వస్తువును స్తుతించడానికై వానికి లేదా దానికి సంబంధించిన విషయాలనే చెపుతూ సమానర్థక మైన పదాల ప్రయోగం **పదోచ్చయం.**

**మూ. ఆత్మభావముపన్యస్య పరసాదృశ్యయుక్తిభిః,**
**తీవ్రార్థభాషణం యత్ స్యాత్ ఆక్రన్దః స తు కీర్తితః. 19**

**తా. (16) ఆక్రందం :–** ఇతర వస్తువులతో సాదృశ్యం చూపడం వంటి యుక్తుల చేత తన మనస్సులో ఉన్న భావాన్ని ఆవిష్కరించి తీవ్రంగా విషయం చెప్పడం **ఆక్రందం** అను లక్షణం.

**మూ. హృదయస్థస్య భావస్య సుస్పష్టార్థప్రదర్శనమ్,**
**అన్యాపదేశకథనైర్మనోరథ ఇతి స్మృతః. 20**

**తా. (17) మనోరథం :–** మరొక విషయం ఏదో చెపుతూన్న వంకతో తన మనస్సులో ఉన్న భావం సుస్పష్టంగా చెప్పడం **మనోరథం.**

**మూ. అపృష్టైరథవా పృష్టైర్నిర్ణయః క్రియతే తు యః,**
**ఆఖ్యానమితి తద్ జ్ఞేయం లక్షణం నాటకాశ్రయమ్. 21**

**తా. (18) ఆఖ్యానం :–** ఎవరైనా ప్రశ్నించినప్పుడు గాని, ఎవరూ ప్రశ్నించకపోయినా గాని ఒక విషయం నిశ్చితంగా చెప్పబడినట్లయితే అది నాటకాలలో ప్రయోగించే **ఆఖ్యానం** అనే లక్షణం.

**మూ. ఆదౌ యత్ కోపజననమన్తే హర్షప్రవర్ధనమ్,**
**యత్తు ప్రియం పునర్వాక్యం సా యాచ్ఞా పరికీర్తితా. 22**

**తా. (19) యాచ్ఞ :–** మొదట క్రోధం కలిగించి చివరికి సంతోషం వృద్ధిపొందించే ప్రియవాక్యం **యాచ్ఞ** అను లక్షణం.

**మూ. కార్యేషు విపరీతేషు యది కశ్చిత్ ప్రవర్తతే,**
**నివార్యతే చ కార్యజ్ఞైః ప్రతిషేధః ప్రకీర్తితః. 23**

**తా. (20) ప్రతిషేధం :–** విపరీతమైన కార్యం చేయడానికి ప్రవర్తించినవానిని కార్యజ్ఞులు అలా చేయకుండా నివారిస్తే అది **ప్రతిషేధం** అను లక్షణం.

**మూ. యత్రాకారోద్భవైర్వాక్యైరాత్మానమథవాపరమ్,**
**పృచ్ఛన్నివాభిధత్తేఽర్థం సా పృచ్ఛేత్యభిసంజ్ఞితా. 24**

**తా. (21) పృచ్ఛ :–** (మాటలాడకపోయినా) ఆకారం (చేష్టాదులు) నుండి జనించిన మాటలను బట్టి తననే కాని, ఇతరుణ్ణి కాని ప్రశ్నిస్తూన్నట్లు మాట్లాడితే అది **పృచ్ఛ** అను లక్షణం.

**మూ. విద్వాన్ పూర్వోపలబ్ధౌ యత్సమత్వముపపాదయేత్,**
**నిదర్శనకృతస్తద్జ్ఞైః స దృష్టాన్త ఇతి స్మృతః. 25**

**తా. (22) దృష్టాంతం :–** బుద్ధిమంతుడు ప్రస్తుతమైన ఒక విషయాన్ని తాను పూర్వం తెలిసికొన్న మరొక విషయంతో పోలిక ఉన్నట్లు ప్రతిపాదిస్తే అది **దృష్టాంతం** అను లక్షణం.

**మూ. అనేకయుక్తిమద్వాక్యమనేకార్థప్రసాధకమ్,**
**అనేకవాక్యసంయుక్తం తన్నిర్భాసనముచ్యతే. 26**

**తా. (23) నిర్భాసనం :–** అనేకమైన యుక్తులతో, అనేకమైన వాక్యాలతో సంబంధిస్తూ అనేకమైన అర్థాలను సాధించే వాక్యం **నిర్భాసనం** అను లక్షణం.

**మూ. అపరిజ్ఞాతతత్త్వార్థం యత్ర వాక్యం సమాప్యతే,**
**సోఽనేకత్వాద్విచారాణాం సంశయః పరికీర్తితః. 27**

**తా. (24) సంశయం :–** అసలు విషయం ఏదో తేల్చకుండా వాక్యం పూర్తి చేయడంతో అది అనేక ఆలోచనలకు దారి తీసినప్పుడు అది **సంశయం** అను లక్షణం.

**మూ. యత్ర శాస్త్రార్థసంపన్నాం మనోరథసముద్భవామ్,**
**అప్రార్థనీయామన్యాం వా విదుస్తామాశిషం బుధాః. 28**

**తా. (25) ఆశీస్సు :–** శాస్త్రానుసారం చెప్పబడినది, మనోరథంనుంచి పుట్టినది, ప్రార్థింపదగనది లేదా ప్రార్థింప తగినది అయినది **ఆశీస్సు** అను లక్షణం.

**మూ. ఆదౌ యత్ క్రోధజననమన్తే హర్షప్రవర్ధనమ్,**
**తత్ ప్రియం వచనం జ్ఞేయమాశీర్వాదసమన్వితమ్. 29**

**తా. (26) ప్రియవచనం :–** మొదట కోపం కలిగించేదీ, చివరికి హర్షవర్ధకము, ఆశీస్సుతో కూడినదీ అయిన వచనం **ప్రియవచనం** అను లక్షణం.

**మూ. ఛలయుక్త్యా త్వన్యేషామభిసన్ధానాభిభావకం కపటమ్,**
**ద్విత్రిప్రయోగయుక్తౌ విజ్ఞేయః కపటసంఘాతః. 30**

**తా. (27)** మోసం చేయాలను ప్రవృత్తితో ఇతరులను తిరస్కరించడంకోసం చేసే యత్నం **కపటం**. ఈ కపటాన్నే రెండు మూడు సార్లు ప్రయోగిస్తే అది **కపటసంఘాతం**.

**మూ. దుర్జనోదాహృతై రూక్షైః సభామధ్యేఽతితాడితః,**
**అక్రోధః క్రోధజననైర్వాక్యైర్యః సా క్షమా భవేత్. 31**

**తా. (28)** క్రోధం కలిగించే కఠినవాక్కులతో దుర్జనులు సభామధ్యంలో కొట్టినా కూడ క్రోధం లేకుండా ఉండడం **క్షమ**.

**మూ. దృష్ట్వైవావయవం కంచిద్భావో యత్రానుమీయతే,**
**ప్రాప్తిం తామభిజానీయాల్లక్షణం నాటకాశ్రయమ్. 32**

**తా. (29) ప్రాప్తి :–** ఏదో ఒక అవయవం చూడగానే వాని భావాన్ని ఊహించి నట్లయితే, అది నాటకాలలో ప్రయోగించే **ప్రాప్తి** అను లక్షణం.

**మూ. అకార్యం సహసా కృత్వాఽకృత్వా కార్యమథాపి వా,**
**సంతాపో మనసో యస్తు పశ్చాత్తాపః ప్రకీర్తితః. 33**

**తా. (30) పశ్చాత్తాపం :–** సాహసంచేత చేయకూడని పని చేసి, లేదా చేయవలసిన పని చేయక మనస్సులో బాధపడడం **పశ్చాత్తాపం**.

**మూ. ప్రశ్రయేణార్థసంయుక్తం యత్పరస్యానువర్తనమ్,**
**స్నేహాద్దాక్షిణ్యయోగాద్వా సానువృత్తిస్తు సంజ్ఞితా. 34**

**తా. (31) అనువృత్తి :–** ఏదో ప్రయోజనాన్ని ఉద్దేశించి, స్నేహపూర్వకంగా గాని, మంచితనంచేత గాని ఇతరుని అనుసరించి ప్రవర్తిచడం **అనువృత్తి**.

**మూ. ప్రాప్తానాం యత్ర దోషాణాం క్రియతే శమనం పునః,**
**సా జ్ఞేయాహ్యుపపతిస్తు లక్షణం నాటకాశ్రయమ్. 35**

**తా. (32) ఉపపత్తి :–** ఏవైన దోషాలు జరిగి నప్పుడు వాటిని శాంతింపచేయడం నాటకాలలో ఉండే **ఉపపత్తి** అను లక్షణం.

**మూ. సాధ్యతే యోఽర్థసంబన్ధో మహద్భిః సమవాయతః,**
**పరస్పరానుకూల్యేన సా యుక్తిః పరికీర్తితా. 36**

**తా. (33) యుక్తి :–** పెద్ద లందరూ కలిసి పరస్పరము సహకరించుకొని ఏదైన ఒక కార్యం సాధిస్తే అది **యుక్తి** అను లక్షణం.

**మూ. యత్రాపసారయన్ దోషం గుణమర్థేన యోజయేత్,**
**గుణాభివాదం దోషాన్ వా కార్యం తల్లక్షణం విదుః. 37**

**తా. (34) కార్యం :–** దోషం తొలగించి గుణాన్ని ప్రయోజనసాధకంగా చేసినా, గుణాన్ని త్యజించి దోషం స్వీకరించినా అది **కార్యం** అను లక్షణం.

**మూ. అపూర్వక్రోధజనితమపరాధం ప్రమృజ్య యత్,**
**సేవార్థం మధురం వాక్యమనునీతిః ప్రకీర్తితా. 38**

**తా. (35)** అపరాధం చేయడంచేత కలిగిన క్రోధాన్ని తొలగించడానికై సేవిస్తూ మధురంగా పలికే వాక్యం **అనునీతి** అను లక్షణం.

**మూ. దోషైర్యదన్యనామోక్తైః ప్రసిద్ధార్థైః ప్రయోజయేత్,**
**అన్యత్రార్థేన సంబద్ధం జ్ఞేయం తత్ పరిదేవనమ్. 39**

**తా. (36) పరిదేవనం :–** ఒకని దోషాలను ఆ మాటలతో చెప్పకుండా ప్రసిద్ధమైన అర్థం గల మరొక విధమైన మాటలతో ఉటంకిస్తూ నిందించడం **పరిదేవనం**.

ఈ విధంగా ఇక్కడ చెప్పిన 36 లక్షణాలకు అభినవగుప్తాచార్యులు ప్రసిద్ధమైన నాటకాదులలోనుంచీ, తన రచనలనుంచీ గ్రహించి ఉదాహరణలు చూపారు. అయితే ఈ లక్షణాల పేర్లు గాని, వీటి లక్షణాలు గాని ఒక విధంగా లేవు. ఇంచుమించుగా ప్రతీలక్షణలక్షణానికీ అభినవగుప్తాచార్యులు పాఠాంతరం చూపించారు. వీటి స్వరూపం అంతగా స్పష్టంగా, వివిక్తంగా లేదు. అందుచేతనే తరువాతికాలంలో వచ్చిన అలంకార శాస్త్రగ్రంథాలలో వీటిని పూర్తిగా ఉపేక్షించడం జరిగింది. ఇలాంటి వీటికి కూడ అభినవ గుప్తుడు ఎంతో శ్రమపడి ఉదాహరణలు చూపుతూ వ్యాఖ్యానించడం ప్రశంసనీయం.

ముప్పై ఆరు లక్షణాలు చెప్పి ఇప్పుడు అలంకారాలు చెపుతున్నాడు –

**మూ. ఉపమా రూపకం చైవ దీపకం యమకం తథా,**
**అలఙ్కారాస్తు విజ్ఞేయాశ్చత్వారో నాటకాశ్రయాః. 40**

**తా.** నాటకాలలో (రూపకాలలో) ఉపమ, రూపకం, దీపకం (అర్థాలంకారాలు), యమకం (శబ్దాలంకారం) అని నాలుగు అలంకారాల ప్రయోగం ఉంటుంది.

**మూ. యత్కిఞ్చిత్ కావ్యబన్ధేషు సాదృశ్యేనోపమీయతే,**
**ఉపమా నామ సా జ్ఞేయా గుణాకృతిసమాశ్రయా. 41**

**తా.** కావ్యబంధాలలో ఏదైన వస్తువు సాదృశ్యాన్ని బట్టి పోల్చబడితే అది ఉపమాలంకారం. ఇది గుణాల సాదృశ్యాన్ని పట్టి ఆకారసాదృశ్యాన్ని పట్టి పోల్చబడవచ్చును.

**మూ. ఏకస్యైకేన సా కార్యా హ్యనేకేనాథవా పునః,**
**అనేకస్య తథైకేన బహూనాం బహుభిస్తథా. 42**

**తా.** ఒక వస్తువును ఒక వస్తువుతో పోల్చవచ్చు, ఒక వస్తువును అనేకవస్తువులతోను, అనేకవస్తువులను ఒక వస్తువుతోను, అనేకవస్తువులను అనేక వస్తువులతోను పోల్చ వచ్చును.

**మూ. తుల్యం తే శశినా వక్త్రమిత్యేకేనైకసంశ్రయా,**
**శశాఙ్కవత్ ప్రకాశన్తే జ్యోతీంషీతి భవేత్తు యా. 43**
**ఏకస్యానేకవిషయా సోపమా పరికీర్తితా.**

**తా.** 'నీ ముఖం చంద్రునితో సమంగా ఉంది' అన్నప్పుడు ఒక వస్తువు ఒక వస్తువుతో పోల్చబడింది. నక్షత్రాలు చంద్రునివలె ప్రకాశిస్తున్నాయి అని అంటే అనేక వస్తువులు ఒక వస్తువుతో పోల్చబడుతున్నాయి.

**మూ. శ్యేనబర్హిణభాసానాం తుల్యార్థ ఇతి యా భవేత్. 44**
**ఏకస్య బహుభిః సామ్యాదుపమా నాటకాశ్రయా,**
**బహూనాం బహుభిర్జ్ఞేయా ఘనా ఇవ గజా ఇతి. 45**

**తా.** "ఇది డేగలతోను, నెమళ్లతోను, భాసపక్షులతోను సమానము" అన్నట్లయితే ఒకటి అనేకవస్తువులతో సరిపోల్చబడింది. నాటకాలలో ఉండే ఉపమ ఈ విధంగా ఉంటుంది. "గజాలు మేఘాలవలె ఉన్నాయి" అంటే అది అనేకవస్తువులను అనేక వస్తువులతో పోల్చడం అవుతుంది.

**మూ. ప్రశంసా చైవ నిన్దా చ కల్పితా సదృశీ తథా,**
**యా కించిత్ సదృశీ జ్ఞేయా సోపమా పఞ్చధా బుధైః. 46**

**తా.** ప్రశంసోపమ, నిందోపమ, కల్పితోపమ, సాదృశ్యం బాగా ఉన్న ఉపమ, కొంచెం సాదృశ్యం ఉన్న ఉపమ అని ఉపమ ఐదు విధాలు.

**మూ. ప్రశంసా యథా –**

**దృష్ట్వా తు తాం విశాలాక్షీం తుతోష మనుజాధిపః,**
**మునిభిః సాధితాం కృచ్ఛ్రాత్ సిద్ధిం మూర్తిమతీమివ. 47**

**తా.** ప్రశంసోపమ ఎట్లనగా – మునులు చాల శ్రమపడి సాధించిన, మూర్తీభవించిన సిద్ధి వలె ఉన్న ఆ విశాలాక్షిని చూచి రాజు సంతోషించాడు.

**మూ. నిన్దా యథా –**

**సా తం సర్వగుణైర్హీనం సస్వజే కర్కశచ్ఛవిమ్,**
**వనే కణ్టకినం వల్లీ దావదగ్ధమివ ద్రుమమ్. 48**

**తా.** నిందోపమ ఎట్లనగా – అరణ్యంలో లత, దావాగ్నిచే కాలిపోయిన ముళ్ల చెట్టును వలె, ఆమె ఏ గుణాలూ లేని, కర్కశశరీరచ్ఛాయ గల వానిని కౌగిలించుకొన్నది.

**మూ. కల్పితా యథా –**

**క్షరన్తో దానసలిలం లీలామన్థరగామినః,**
**మతఙ్గజా విరాజన్తే జఙ్గమా ఇవ పర్వతాః. 49**

**తా.** కల్పితోపమ ఎట్లనగా – మదోదకం స్రవిస్తూ, విలాసతో మందంగా నడుస్తూన్న మదగజాలు (ఏనుగులు) నడుస్తూన్న పర్వతాల వలె ఉన్నాయి.

**వి.** పర్వతాలు నడవడం అనేది కల్పితం గాన ఇది కల్పితోపమ.

**మూ. సదృశీ యథా –**

**యత్త్వయాద్య కృతం కర్మ పరచిత్తానురోధినా,**
**సదృశం తత్త్వైవ స్యాదతిమానుషకర్మణః. 50**

**తా.** సదృశోపమ ఎట్లనగా – ఇతరుల చిత్తాన్ని అనుసరించిన నువ్వు ఇప్పుడు చేసిన పని, మనుష్యులు చేయజాలని పని చేయగల నీకే తగి ఉంది.

వి. ఇక్కడ ఉపమేయమే ఉపమానంగా చూపబడిందిగాన సదృశోపమ (అ.భా.)

**మూ. కించిత్సదృశీ యథా –**

**సంపూర్ణచన్ద్రవదనా నీలోత్పలదలేక్షణా,**
**మత్తమాతఙ్గగమనా సంప్రాప్తేయం సఖీ మమ. 51**

**తా.** కించిత్సదృశ్యోపమ ఎట్లనగా – పూర్ణచంద్రునివంటి ముఖం కలది, నల్ల కలువరేకుల వంటి నేత్రములు కలది, మదించిన ఏనుగు వంటి గమనం కలది అయిన, ఇదిగో! ఈ నా సఖురాలు వచ్చింది.

**వి.** దానిలో సాదృశ్యవాచకపదాలు సమాసంలో లోపించాయి గాన ఇది కించిత్స దృశియైన ఉపమ. (అ.భా.)

**మూ. ఉపమాయా బుధైరేతే భేదా జ్ఞేయాః సమాసతః,**
**శేషా యే లక్షణైర్నోక్తాస్తే గ్రాహ్యాః కావ్యలోకతః. 52**

**తా.** ఇవి సంక్షిప్తంగా ఉపమాభేదాలు. లక్షణాలు చెప్పని ఇతరమైన ఉపమాభేదాలను కావ్యాలనుండీ, లోకంనుండీ తెలుసుకోవాలి.

**మూ. నానాధికరణార్థానాం శబ్దానాం సంప్రదీపకమ్,**
**ఏకవాక్యేన సంయుక్తం యత్తద్దీపకముచ్యతే. 53**

**తా. దీపకాలంకారం :–** ఒకే వాక్యంలో ఉన్న ఒక పదం అనేకమైన ఆధారాలు గల అర్థాలను బోధించే శబ్దాలను ప్రకాశింపచేస్తూ వాటితో అన్వయిస్తే అది, అనగా ఒక శబ్దం బోధించే ఒక అర్థం వేరు వేరు పదాలు బోధించే అర్థాలతో సంబధిస్తే అది, దీపకాలంకారం.

**మూ. (ప్రసృతం మధురం చాపి గుణైః సర్వైరలంకృతమ్,**
**కావ్యే యన్నాటకే విప్రాస్తద్దీపకమితి స్మృతమ్. 54**

**తా.** విప్రులారా! సర్వగుణాలతో అలంకృతమైన మధురమైన ఏ అర్థం కావ్యంలోను నాటకంలోను వ్యాపించి ఉంటుందో అది దీపకం) (భావం అస్పష్టంగా ఉంది).

**మూ. యథా – సరాంసి హంసైః కుసుమైశ్చ వృక్షా మత్తైర్ద్విరేఫైశ్చ సరోరుహాణి,**
**గోష్ఠీభిరుద్యానవనాని చైవ తస్మిన్నశూన్యాని సదా క్రియన్తే. 55**

**తా.** ఎట్లనగా – సరస్సులు హంసలతోను, వృక్షాలు పుష్పాలతోను, పద్మాలు మదించిన తుమ్మెదలతోను, ఉద్యానవనాలు గోష్ఠులతోను ఎల్లప్పుడు కూడినవిగా చేయ బడుతున్నవి.

**వి.** 'అశూన్యాని క్రియన్తే' అనే వాక్యార్థం 'సరాంసి హంసైః' మొదలైన నాలుగు వాక్యాల అర్థాలతోను సంబంధిస్తూన్నది గాన దీపకాలంకారం.

**మూ. స్వవికల్పేన రచితం తుల్యావయవలక్షణమ్,**
**కించిత్సాదృశ్యసంపన్నం యద్రూపం రూపకం తు తత్. 56**

**తా.** ఒక వస్తువునకు – తుల్యమైన అవయవాలు, లక్షణాలు గల, కొంచెం పోలిక ఉన్న మరొక రూపం కల్పించబడినట్లయితే అది రూపకాలంకారం.

**మూ. (నానాద్రవ్యానురాగాద్యైర్యదౌపమ్యగుణాశ్రయమ్,**
**రూపనిర్వర్ణనాయుక్తం తద్రూపకమితి స్మృతమ్. 57**

**తా.** ఒక వస్తువునకు ఇతరమైన వివిధవస్తువుల అనురాగం (ప్రభావం)వల్ల దానిని ఇతరవస్తువుల రూపంలో చూడడం రూపకం. ఇలా చూడడానికి కారణం వాటి మధ్య పోలిక ఉండడం).

**మూ. యథా – పద్మాననాస్తాః కుముదప్రహాసాః వికాసినీలోత్పలచారునేత్రాః,**
**వాపీస్త్రియో హంసకులైః స్వనద్భిర్విరేజురన్యోన్యమివాహ్వయన్త్యః. 58**

**తా.** ఎట్లనగా – పద్మాలే ముఖాలుగా, తెల్ల కలవలే నవ్వులుగా, వికసిస్తూన్న నల్లకలువలే నేత్రాలుగా గల దిగుడుబావు లనే స్త్రీలు, ధ్వనిచేస్తూన్న హంససముదాయాలతో, ఒకరి నొకరు పిలుచుకొంటున్నట్లు ఉన్నారు.

**వి.** ఇక్కడ పద్మాదులను ముఖాదిరూపంలో చూడడం జరిగింది గాన రూపకం.

**మూ. శబ్దాభ్యాసస్తు యమకం పదాదిషు వికల్పితమ్,**
**విశేషదర్శనం చాస్య గదతో మే నిబోధత. 59**

**తా.** పదాలు మొదలైనవాటిలో కల్పించిన శబ్దాల ఆవృత్తి **యమకం**. దీనికి సంబంధించిన విశేషాలను చెపుతున్నాను. వినండి.

**మూ. పాదాన్తయమకం చైవ కాఞ్చీయమకమేవ చ,**
**సముద్గయమకం చైవ విక్రా(ఉత్క్రా)న్తయమకం తథా. 60**
**యమకం చక్రవాలం చ సందష్టయమకం తథా,**
**పదాదియమకం చైవ హ్యామ్రేడితమథా పి చ. 61**
**చతుర్వ్యవసితం చైవ మాలాయమకమేవ చ,**
**ఏతద్దశవిధం జ్ఞేయం యమకం నాటకాశ్రయమ్. 62**

**తా.** పాదాంతయమకం, కాంచీయమకం, సముద్గయమకం, విక్రాన్తయమకం, చక్రవాలయమకం, సందష్టయమకం, పదాదియమకం, ఆమ్రేడితయమకం, చతుర్వ్యవసిత యమకం, మాలాయమకం అని నాటకాలలో ఉపయోగించే యమకం పది విధాలు.

**మూ. చతుర్ణాం యత్ర పాదానామన్తే స్యాత్ సమమక్షరమ్,**
**తద్వై పాదాన్తయమకం విజ్ఞేయం నామతో యథా. 63**

**తా. (1) పాదాంతయమకం :–** నాలుగు పాదాల చివర సమానమైన అక్షరాలు ఉంటే అది పాదాంతయమకం. ఎట్లనగా –

**మూ. దినక్షయాత్సంహృతరశ్మిమణ్డలం దివీవ లగ్నం తపనీయమణ్డలమ్,**
**విభాతి తామ్రం దివి సూర్యమణ్డలం యథా తరుణ్యాః స్తనభారమణ్డలమ్. 64**

**తా.** సాయంకాలం అవడంచేత కిరణసముదాయాన్ని ఉపసంహరించుకొని సూర్య మండలం ఆకాశం మీద వ్రేలాడుతూన్న గుండ్రని బంగారుచక్రంవలె ఉన్నది. ఎట్టిగా ఉన్న ఆ సూర్యమండలమే (ఇంకా కొంత క్రిందికి దిగి) ఎట్టినై తరుణీస్తనమండలం వలె ఉన్నది.

**వి.** నాలుగు పాదాల చివరా కూడ 'మణ్డలమ్' అను అక్షరాల ఆవృత్తిచే ఇది పాదాంతమయకం.

**మూ. (లోకానాం ప్రభవిష్ణుర్దైత్యేన్ద్రగదానిపాతనసహిష్ణుః,**
**జయతి సురదైత్యజిష్ణుర్భగవానసురవరమథనకారీ విష్ణుః. 65**

**తా.** లోకాల ప్రభువు, దైత్యేంద్రుల గదాప్రహారములను సహించగలవాడు, సురుల కొరకై దైత్యులను జయించువాడు; అసురులను మథించువాడు అయిన విష్ణువు సర్వోత్కర్షగా ఉన్నాడు.

**వి.** దీనిలో 'ష్ణుః' నాలుగు పాదాల చివర్లలో ఆవృత్త మైనది.

**మూ. పాదస్యాన్తే తథా చాదౌ స్యాతాం తత్ర సమే పదే,**
**తత్కాఞ్చీయమకం చైవ విజ్ఞేయం సూరిభిర్యథా. 66**

**తా. (2) కాంచీయమకం :–** పాదాంతమునందు పాదప్రారంభంలోను సమానమైన పదాలు ప్రయోగిస్తే అది కాంచీయమకం. ఎట్లనగా –

**మూ. యామం యామం చన్ద్రవతీనాం ద్రవతీనాం**
**వ్యక్తావ్యక్తా సారజనీనాం రజనీనామ్,**
**ఫుల్లే ఫుల్లే సభ్రమరే వాభ్రమరే వా**
**రామా రామా విస్మయతే చ స్మయతే చ. 67**

**తా.** చంద్రునితో కూడిన రాత్రులు ప్రతీ జాము (జాముజాముకూ) పరుగెత్తు తుండగా, సారమైన యువతులు పరిచారికలుగా ఉన్న ప్రతీ స్త్రీ కూడ వికసించినదైనా, వికసించనిదైనా, తుమ్మెదలతో కూడినదైనా, తుమ్మెదలు లేనిదైనా పుష్పం విషయంలో ఆశ్చర్యపడుతూన్నది, నవ్వుతూన్నది.

**మూ. అర్థేనైకేన యద్వృత్తం సర్వమేవ సమాప్యతే,**
**సముద్గయమకం నామ తద్ జ్ఞేయం పణ్డితైర్యథా. 68**

**తా. (3) సముద్గయమకం :–** ఒకవృత్తం సగంతోనే సమాప్తి పొందుతే, అనగా శ్లోకంలోని పూర్వార్ధమే ఉత్తరార్ధం కూడ అయితే, అది **సముద్గయమకం**. ఎట్లనగా –

**మూ. కేతకీ కుసుమపాణ్డులదన్తః శోభతే ప్రవరకాననహస్తీ,**
**కేతకీకుసుమపాణ్డురదన్తః శోభతే ప్రవరకాననహస్తీ. 69**

**తా.** మొగలిపువ్వు వలె తెల్లని దంతాలు గల, శ్రేష్ఠమైన అడవిలోని ఏనుగు ప్రకాశిస్తూన్నది. కేతకీకుసుమములే తెల్లని దంతాలుగా గల శ్రేష్ఠమైన అరణ్యం అనే ఏనుగు ప్రకాశిస్తూన్నది.

**మూ. ఏకైకం పాదముత్క్రమ్య ద్వౌ పాదౌ సదృశౌ యది,**
**విక్రా(ఉత్క్రా)న్తయమకం నామ తద్విజ్ఞేయమిదం యథా. 70**

**తా. (4) ఉత్క్రాంతయమకం :–** పాదం విడిచి పాదం సమంగా ఉంటే అది ఉత్క్రాంతయమకం. ఎట్లనగా –

**మూ. స పూర్వం వారణో భూత్వా ద్విశృఙ్గ ఇవ పర్వతః,**
**అభవద్దన్తవైకల్యాద్విశృఙ్గ ఇవ పర్వతః. 71**

**తా.** ఆ ఏనుగు పూర్వం రెండు శిఖరాల పర్వతం వలె ఉండేది. ఇప్పుడు దంతాలు విరిగిపోవడంచేత శృంగాలు లేని పర్వతం వలె అయింది.

**మూ. పూర్వస్యాన్తేన పాదస్య పరస్యాదిర్యదా సమః,**
**చక్రవచ్చక్రవాలం తు విజ్ఞేయం నామతో యథా. 72**

**తా. (5) చక్రవాలయమకం :–** వెనక నున్న పాదం చివరి పదము, తరువాతి పాదం మొదట పదము సమంగా ఉంటే, పదాలు చక్రంలా తిరగడంచేత, అది చక్రవాలయమకం. ఎట్లనగా –

**మూ. (తుల్యాత్పాదద్వయాదన్త్యాదేకేనాదిర్యదా సమః,**
**సర్వత్ర చక్రవాలం తు తద్విజ్ఞేయం బుధైర్యథా. 73**

**తా.** రెండు పాదాల చివరి పదాలు వాటి తరువాతి పాదాల మొదటి పదాలు సమంగా ఉంటే అది చక్రవాలయమకం).

**మూ. శైలా యథా శత్రుభిరాహతా హతా**
**హతాశ్చ భూయస్త్వనుపుఙ్ఖగైః ఖగైః,**
**ఖగైశ్చ సర్వైర్యుధి సంచితాశ్చితా**
**శ్చితాధిరూఢా నిహతాస్తలైస్తలైః. 74**

**తా.** పర్వతాలవంటి ఆ యోధులు శత్రువులచేత, పొన్నుల వెనుకనే వచ్చు బాణాల చేత కొట్టి చంపబడినవారై పక్షులచేత ఒక చోటు పోగుచేయబడి, చివరికి చితుకులమీద ఉంచబడ్డారు.

**మూ. ఆదౌ ద్వౌ యత్ర పాదౌ తు భవేతామక్షరైః సమౌ,**
**సందష్టయమకం నామ విజ్ఞేయం తద్ బుధైర్యథా. 75**

**తా. (6) సందష్టయమకం :–** రెండు పాదాల మొదటి అక్షరాలు సమంగా ఉంటే అది సందష్టయమకం.

**మూ. పశ్య పశ్య రమణస్య మే గుణాన్,**
**యేన యేన వశగాం కరోతి మామ్,**
**యేన యేన హి సమేతి దర్శనం**
**తేన తేన వశగాం కరోతి మామ్. 76**

**తా.** నా ప్రియుని గుణాలను చూడు చూడు ఏ ఏ గుణంతో అతడు నన్ను వశం చేసికొనుచున్నాడో. ఏ ఏ గుణంతో నాకు కనబడతాడో ఆ గుణంలో నన్ను వశంచేసి కొంటున్నాడు.

**మూ. ఆదౌ పాదస్య యత్ర స్యాత్ సమావేశః సమాక్షరః,**
**పాదాదియమకం నామ తద్విజ్ఞేయం బుధైర్యథా. 77**

**తా. (7) పాదాదియమకం :–** పాదాల ప్రారంభంలో ఉన్న అక్షరాలు సమంగా ఉంటే అది పాదాదియమకం.

**మూ. విష్ణుః సృజతి భూతాని విష్ణుః సంహరతే ప్రజాః,**
**విష్ణుః ప్రసూతే త్రైలోక్యం విష్ణుర్లోకాధిదైవతమ్. 78**

**తా.** విష్ణువే ప్రాణులను సృజిస్తాడు. విష్ణువే వాటిని సంహరిస్తాడు. మూడు లోకాలను విష్ణువే సృజిస్తాడు. విష్ణువే లోకా లన్నింటికీ అధిదేవత.

**మూ. పాదస్యాన్తం పదం యత్ర దిర్ద్విరేకమిహోచ్యతే,**
**జ్ఞేయమామ్రేడితం నామ యమకం తత్ర సూరిభిః. 79**

**తా. (8) ఆమ్రేడితయమకం :–** పాదం చివర ఉన్న పదం రెండేసి సార్లు ఆవృత్తి చేస్తే అది **ఆమ్రేడితయమకం.**

**మూ. విజృమ్భితం నిఃశ్వసితం ముహుర్ముహుః**
**కథం విధేయం స్మరణం పదే పదే,**
**యథా చ తే ధ్యానమిదం పునః పునః**
**ధ్రువం గతా సా రజనీ వినా వినా. 80**

**తా.** మాటిమాటికి నిట్టూర్పు విజృంభించినది. అడుగడుగున నీ స్మరణం ఎలా చెయ్యాలి? మాటిమాటికి నీ ధ్యానం చేయగానే రాత్రి నీవు లేకుండా గడిచిపోయినది. (అర్థం నిఃసారం).

**మూ. సర్వే పాదాః సమా యత్ర భవన్తి నియతాక్షరాః,**
**చతుర్వ్యవసితం నామ తద్విజ్ఞేయం బుధైర్యథా. 81**

**తా. (9) చతుర్వ్యవసితం :-** అన్ని పాదాలూ ఒకే విధంగా ఉంటే చతుర్వ్యవసిత యమకం.

**మూ. వారణానామయమేవ కాలో వారణానామయమేవ కాలః,**
**వారణానామయమేవ కాలో వారణానామయమేవ కాలః. 82**

**తా.** ఇది వారణపుష్పాలకు కాలం. ఇది ఏనుగులకు మంచి కాలం. ఇది శత్రువులకు మరణకాలం. ఇది యుద్ధాలకు కాలం.

**మూ. నానారూపైః స్వరైర్యుక్తం యత్రైకవ్యఞ్జనం భవేత్,**
**తన్మాలాయమకం నామ విజ్ఞేయం పణ్డితైర్యథా. 83**

**తా. (10) మాలాయమకం :-** ఒకే వ్యంజనం వేరు వేరు అచ్చులతో కలిపి ప్రయోగించినది **మాలాయమకం.**

**మూ. లలీ బలీ హలీ మాలీ ఖేలీ మాలీ సలీ జలీ**
**ఖలో బలోఽబలో మాలీ ముసలీ త్వాభిరక్షతు. 84**

**తా.** వీలాసవంతుడు, బలవంతుడు, హలం ధరించినవాడు, మాల ధరించినవాడు ముసలం ధరించినవాడు అయిన బలరాముడు నిన్ను రక్షించుగాక.

**వి.** 'ల' అను వ్యంజనం అనేకపర్యాయాలు 'ఈ', 'ఓ' అను అచ్చులతో ప్రయోగింపబడింది గాన ఇది **మాలాయమకం.**

**మూ. అసౌ హి రామా రతివిగ్రహప్రియా,**
**రహః ప్రగల్భా రమణం మనోగతమ్,**
**రతేన రాత్రిం రమయేత్ పరేణ వా**
**న చేదుదేష్యత్యరుణః పురో రిపుః. 85**

**తా.** ఈ యువతికి రతియుద్ధం అంటే చాల ఇష్టం. ఈమె రహస్యప్రదేశంలో ప్రగల్భురాలు. మనోహరుడైన రమణుణ్ణి రాత్రంతా లేదా మరొక రాత్రి కూడ క్రీడింపచేయగల శక్తి గలది. ఐతే శత్రువైన అరుణుడు ఉదయించకుండా ఉండాలి!

**వి.** రేఫ అనేకపర్యాయాలు వేరువేరు అచ్చులతో కలిపి ఆవృత్తి చేయబడింది.

**మూ. స పుష్కరాక్షః క్షతజోక్షితాక్షః క్షరత్క్షతేభ్యః క్షతజం దురీక్షః,**
**క్షతైర్గవాక్షైరివ సంవృతాఙ్గః సాక్షాత్ సహస్రాక్ష ఇవావభాతి. 86**

**తా.** పద్మాల వంటి నేత్రాలు గల ఇతడు రక్తంచేత తడిసిన కళ్లుగలవాడై, గాయాల నుండి రక్తం కారుతూండడంచేత చూడడానికి శక్యంకానివాడై, శరీరం అంతా గాయాలతో గవాక్షములు ఏర్పడినట్లుండడంచేత, సాక్షాత్తు సహస్రాక్షుడు వలె ఉన్నాడు.

**మూ. ఏభిరర్థక్రియాపేక్షైః కార్యం కావ్యం తు లక్షణైః,**
**అతఃపరం ప్రవక్ష్యామి కావ్యే దోషాన్ గుణాంస్తథా. 87**

**తా.** అర్థక్రియకు, అనగా రసచర్వణకు, ఉపయోగించే ఈ లక్షణాలతో కావ్యం నిర్మించాలి. ఇటుపైన కావ్యంలో ఉండే దోషాలను, గుణాలను చెపుతాను.

**మూ. గూఢార్థమర్థాన్తరమర్థహీనం భిన్నార్థమేకార్థమభిప్లుతార్థమ్,**
**న్యాయాదపేతం విషమం విసన్ధి శబ్దచ్యుతం వై దశ కావ్యదోషాః. 88**

**తా. పది కావ్యాదోషాలు :–** గూఢార్థము, అర్థాంతరము, అర్థహీనము, భిన్నార్థము, ఏకార్థము, అభిప్లుతార్థము, న్యాయాపేతము, విషమము, విసంధి, శబ్దచ్యుతం అని కావ్యంలో ఉండడానికి అవకాశం ఉన్న పది దోషాలు.

**మూ. పర్యాయశబ్దాభిహితం గూఢార్థమభిసంజ్ఞితమ్,**
**అవర్ణ్యం వర్ణ్యతే యత్ర తదర్థాన్తరమిష్యతే. 89**
**అర్థహీనం త్వసంబద్ధం సావశేషార్థమేవ చ,**
**భిన్నార్థమభివిజ్ఞేయమసభ్యం గ్రామ్యమేవ చ. 90**
**వివక్షితోఽన్య ఏవార్థో యత్రాన్యార్థేన భిద్యతే,**
**భిన్నార్థం తదపి ప్రాహుః కావ్యం కావ్యవిచక్షణాః. 91**

**తా.** (1) ప్రసిద్ధమైన శబ్దంతో చెప్పడానికి బదులు పర్యాయశబ్దంతో చెప్పినది **గూఢార్థం**.

(2) చెప్పవలసినదానికి మరొకటి చెపితే అది **అర్థాంతరం**.

(3) అసంబద్ధంగా ఉన్నది **అర్థహీనం**.

(4) ఇంకా చెప్పవలసినది మిగిలిపోతే అది భిన్నార్థం. అసభ్య మైనది, గ్రామ్యమైనది, చెప్పదలచిన అర్థంతో మరొక అర్థం కలిసిపోయినదీ కూడ **భిన్నార్థమే**.

**మూ. అవిశేషాభిధానం యత్ తదేకార్థమితి స్మృతమ్,**
**అభిప్లుతార్థం విజ్ఞేయం యత్ పదేన సమస్యతే. 92**
**న్యాయాదపేతం విజ్ఞేయం ప్రమాణపరివర్జితమ్,**
**వృత్తభేదో భవేద్యత్ర విషమం నామ తద్ భవేత్. 93**

**అనుపశ్లిష్టశబ్దం యత్ తద్విసంధీతి కీర్తితమ్,**
**శబ్దచ్యుతం చ విజ్ఞేయమశబ్దస్వరయోజనాత్.** **94**

**తా.** (5) చెప్పిన విషయమే చెప్పడం **ఏకార్థం.**

(6) సంబంధం లేని వాక్యాలు, వాక్యార్థాలు గుచ్చెత్తి చెప్పినది **అభిప్లుతార్థం.**

(7) ప్రమాణవిరుద్ధంగా ఉన్నది **న్యాయాపేతం.**

(8) ఛందోభంగం ఉన్నది **విషమం.**

(9) వ్యాకరణం ప్రకారం సంధి చేయనిది **విసంధి.**

(10) కావలసిన శబ్దం, స్వరం కూర్చనిది **శబ్దచ్యుతం.**

**మూ. ఏతే దోషాస్తు విజ్ఞేయాః సూరిభిర్నాటకాశ్రయాః,**
**గుణా విపర్యయాదేషాం మాధుర్యౌదార్యలక్షణాః.**

**తా.** ఇవి నాటకాలలో ఉండడానికి అవకాశం ఉన్న దోషాలు అని పండితులు తెలుసుకోవాలి. దోషాలకు విపరీత మైనవి మాధుర్య – ఔదార్యములు గుర్తుగా గల గుణాలు అని తెలుసుకోవాలి.

**వి.** ఇక్కడ అ.గు. చెప్పిన ఒక విషయం గుర్తుంచుకొనదగినది – "వీటికి విపర్యయం (opposite) అవడంవల్ల గుణా లవుతాయి; ఈ దోషాలకు విఘాతమే, వీటిని తొలగించుకొనడమే గుణం అవుతుంది అని అర్థం. దోషం లేకపోవడం మాత్రం చేతనేనా? కాదంటున్నాడు – మాధుర్యౌదార్యములు చిహ్నం వేటికో అవి. ఇక్కడ ఈ విషయం చెప్పినట్లయింది – ఏ కావ్యమైనా ఈ దోషా లేవీ లేనిదై వినడానికి ఇంపుగాను, దీప్త రసంగాను (రసదీప్తి కలదిగాను) ఉంటే చాలు; అప్పుడు ఇతరగుణాలు, అలంకారాలూ లేకపోయినా ఆ కావ్యం కావ్యలక్షణానుసారం ఉన్నదే అని చెప్పబడింది."

**"ఏషాం విపర్యయాత్ గుణాః భవన్తి. ఏతద్దోషవిఘాత ఏవ గుణో భవతీత్యర్థః. కిమవిశేషేణ? నేత్యాహ – మాధుర్యౌదార్యలక్షణమ్ అఙ్కః యేషామ్. ఏతదుక్తం భవతి. ఏతద్దోషవిహీనం, శ్రుతిసుఖం, దీప్తరసం చ యది భవతి తావతా గుణాన్తరైః అలఙ్కారైశ్చ హీనమపి కావ్యం లక్షణయోగావ్యభిచారీత్యుక్తమ్". (అభి.భా. 16.95)**

**మూ. శ్లేషః ప్రసాదః సమతా సమాధిర్మాధుర్యమోజః పదసౌకుమార్యమ్,**
**అర్థస్య చ వ్యక్తిరుదారతా చ కాన్తిశ్చ కావ్యస్య గుణా దశైతే.** **96**

**తా.** శ్లేష, ప్రసాదము, సమత, సమాధి, మాధుర్యము, ఓజస్సు, పదసౌకుమార్యం, అర్థవ్యక్తి, ఉదారత, కాంతి – ఇవి పదీ కావ్యంలో ఉండవలసిన గుణాలు.

**మూ. (ఈప్సితేనార్థజాతేన సంబద్ధానాం పరస్పరమ్,**
**శ్లిష్టతా యా పదానాం హి శ్లేష ఇత్యభిధీయతే). 97**
**విచారగహనం యత్ స్యాత్ స్ఫుటం చైవ స్వభావతః,**
**స్వతః సుప్రతిబద్ధం చ శ్లిష్టం తత్పరికీర్త్యతే. 98**

**తా. (1) శ్లిష్టం (శ్లేష) :–** చెప్పదలచిన అర్థాలచేత పరస్పరము అన్వయిస్తూ శ్లోకాదులలో పదాలు కలిసి ఉండడం శ్లేష).

ఏది విచారించినకొలదీ లోతుగా ఉంటుందో, సహజంగా స్ఫుటంగా ఉంటుందో, చక్కగా లోహశకలాలు, దారంముక్కలు అతిగికొనినట్లు అతుక్కొంటుందో అది శ్లిష్టం (శ్లేష).

**మూ. అప్యనుక్తో బుద్ధైర్యత్ర శబ్దో౽ర్థో వా ప్రతీయతే,**
**సుఖశబ్దార్థసంయోగాత్ ప్రసాదః పరికీర్త్యతే. 99**

**తా. (2) ప్రసాదం :–** శబ్దార్థాలు సుఖంగా (అనగా తెచ్చిపెట్టుకొన్న అర్థాలూ భావాలూ లేకుండా) కలిసిపోవడంచేత ఇతరు లెవరూ చెప్పకపోయినా ఎక్కడ (ఏ కావ్యంలో అనగా శ్లోకంలో) శబ్దమూ అర్థమూ అనాయాసంగా బుద్ధికి గోచరిస్తాయో అది **ప్రసాదం**.

**మూ. నాతిచూర్ణపదైర్యుక్తా న చ వ్యర్థాభిధాయిభిః,**
**దుర్బోధనైశ్చ న కృతా సమత్వాత్ సమతా మతా. 100**

**తా. (3) సమత :–** బొత్తిగా పొడి పొడిగా ఉండే పదాలు కాని, సందర్భానికి ఉపయోగించని అర్థం బోధించే పదాలు కాని, అర్థం చేసికొనడానికి కష్టమైన పదాలు కాని వాడకుండా శ్లోకం సమంగా ఉండడం **సమత**.

**మూ. (అన్యోన్యసదృశా యత్ర తథా హ్యన్యోన్యభూషణాః,**
**అలఙ్కారా గుణాశ్చైవ సమాః స్యుః సమతా మతా. 101**

**తా.** గుణ – అలంకారాలు పరస్పరము తగినవై, పరస్పరము భూషణాలై సమంగా ఉన్నట్లయితే అది **సమత**).

**మూ. అభియుక్తైర్విశేషస్తు యో౽ర్థస్యేహోపలక్ష్యతే,**
**తేన చార్థేన సంపన్నః సమాధిః పరికీర్త్యతే. 102**

**తా. (4) సమాధి :–** ఏ అర్థంలో నిగూఢమైన విశేషాన్ని అభియుక్తులు, ప్రతిభా సంపన్నులైన సహృదయులు, గుర్తిస్తారో, అలాంటి అర్థంతో ఒప్పేది **సమాధి** అని చెప్పబడుతుంది.

**మూ. (ఉపమాస్విహ దృష్టానామర్థానాం యత్నతస్తథా,**

**ప్రాప్తానాం చాతిసంక్షేపాత్ సమాధిర్నిర్ణయో మతః). 103**

**తా.** (ప్రయత్నపూర్వకంగా గ్రహించిన ఉపమలలోని అర్థాలలో, అతిసంక్షిప్తంగా గుర్తించినవాటిలో ఏది యుక్తమో నిర్ణయించడం సమాధి).

**మూ. బహుశో యచ్ఛ్రుతం వాక్యముక్తం వాపి పునః పునః,**
**నోద్వేజయతి యస్మాద్ధి తన్మాధుర్యమితి స్మృతమ్. 104**

**తా. (5) మాధుర్యము :–** చాలమార్లు చెప్పినదే యైనా, చాలాసార్లూ విన్నదే అయినా, వాక్యం, ఏ గుణం ఉండడంచేత విసుగు కలిగించదో ఆ గుణం **మాధుర్యం**.

**మూ. (సమాసవద్భిర్వివిధైర్విచిత్రైశ్చ పదైర్యుతమ్,**
**సానుస్వారైరుదారైశ్చ తదోజః పరికీర్త్యతే). 105**
**(అవగీతోపి హీనోపి స్యాదుదాత్తావభాసకః,**
**యత్ర శబ్దార్థసంపత్తిస్తదోజః పరికీర్తితమ్). 106**

**తా. (6) ఓజస్సు :–** సమాసాల రూపంలో ఉన్న విచిత్రములైన, అనుస్వారలతో కూడిన, ఉదారమైన అనేకవిధాలైన పదాలతో కూడినది **ఓజస్సు**.

ఎక్కడ విషయం నింద్యమే అయినా, తక్కువ రకానికి చెందినదే అయినా, ఉదాత్తమైన అర్థాన్ని బోధిస్తుందో అక్కడ ఉన్న శబ్దార్థాల సంపత్తి **ఓజస్సు** అని చెప్ప బడుతుంది.

**మూ. సుఖప్రయోజ్యైర్యచ్ఛబ్దైర్యుక్తం సుశ్లిష్టసంధిభిః,**
**సుకుమారార్థసంయుక్తం సౌకుమార్యం తదుచ్యతే. 107**

**తా. (7) సౌకుమార్యం :–** సుఖంగా ఉచ్చరించడానికి శక్యమైన, చక్కగా ఏర్పడిన సంధు లున్న పదాలతో సుకుమారార్థమై ఉన్నది **సౌకుమార్యం** అని చెప్పబడును.

**మూ. సుప్రసిద్ధాభిధానా తు లోకకర్మవ్యవస్థితా,**
**యా క్రియా క్రియతే కావ్యే సార్థవ్యక్తిః ప్రకీర్త్యతే. 108**
**(యస్యార్థానుప్రవేశేన మనసా పరికల్ప్యతే,**
**అనన్తరం ప్రయోగస్తు సార్థవ్యక్తిరుదాహృతా). 109**

**తా. (8) అర్థవ్యక్తి :–** బాగా ప్రసిద్ధమైన అర్థాన్ని బోధించేదీ, లోకవ్యవహారంలో ఉన్నదీ అయిన ఏ క్రియ, (విషయప్రతిపాదనం అనే పని) కావ్యంలో కనబడుతుందో అది **అర్థవ్యక్తి**.

(చెప్పదలచిన అర్థాన్ని ముందుగా మనస్సులో భావనచేసి తరువాత దానిని పదాలలో ఆవిష్కరిస్తే అది **అర్థవ్యక్తి**).

**మూ. దివ్యభావపరీతం యత్ శృఙ్గారాద్భుతయోజితమ్,**
**అనేకభావసంయుక్తముదారత్వం ప్రకీర్తితమ్. 110**

**(అనేకార్థవిశేషైర్యత్ సూక్తైః సౌష్ఠవసంయుతైః,**
**ఉపేతమతిచిత్రార్థైః ఉదాత్తం తచ్చ కీర్త్యతే.) 111**

**తా. (9) ఉదాత్తం :-** దివ్యములైన భావాలతో (పద్ధతులతో) శృంగారాద్భుతాలను కూర్చినదీ, అనేకమైన భావాలతో నిండినదీ అయినది **ఉదారత్వం**. ఉదాత్తత్వమే ఉదారత.

(చాల చిత్రమైన అర్థవిశేషాలను, బోధించే, సౌష్ఠవంతో కూడిన సూక్తాలతో (మంచి అందమైన వాక్యాలతో) కూర్చినది కూడ **ఉదాత్తం**).

**మూ. యన్మనః శ్రోత్రవిషయమాహ్లాదయతి హీన్దువత్,**
**లీలాద్యర్థోపపన్నాం వా తాం కాన్తిం కవయో విదుః. 112**

**(యో మనఃశ్రోత్రవిషయః ప్రసాదజనకో భవేత్,**
**శబ్దబన్ధః ప్రయోగేణ స కాన్త ఇతి భణ్యతే.) 113**

**తా. (10) కాంతి :-** చెవిలో పడగానే ఏది చంద్రుడు వలె మనస్సుకు ఆహ్లాదం కలిగిస్తుందో, లీలావిలాసాదులను వర్ణించే అది **కాంతి** అని అంటారు.

(ఏ శబ్దబంధం - శబ్దాల కూర్పు. వినగానే మనస్సుకూ చెవులకు హాయి గొలుపుతుందో అది **కాంతి** అని పండితు లంటారు).

**మూ. ఏవమేతే హ్యలంకారాః గుణా దోషాశ్చ కీర్తితాః,**
**ప్రయోగమేషాం చ పునః వక్ష్యామి రససంశ్రయమ్. 114**

**తా.** ఈ విధంగా అలంకారాలు, గుణాలు, దోషాలు చెప్పాను. ఇప్పుడు, రసాను గుణంగా వాటిని ఎలా ప్రయోగించాలో చెపుతాను.

**మూ. లఘ్వక్షరప్రాయకృతముపమారూపకాశ్రయమ్,**
**కావ్యం కార్యం తు నాట్యజ్ఞైః వీరరౌద్రాద్భుతాశ్రయమ్. 115**

**తా.** నాట్యజ్ఞులు వీర - రౌద్ర - అద్భుతరసాలకు ఆశ్రయమైన కావ్యాన్ని ఎక్కువ లఘ్వక్షరాలతోను, ఉపమారూపకాల అధికప్రయోగంతోను నిర్మించాలి.

**మూ. గుర్వక్షరప్రాయకృతం బీభత్సే కరుణే తథా,**
**కదాచిద్రౌద్రవీరాభ్యాం యదా ఘర్షణజం భవేత్. 116**

**తా.** బీభత్సరసంలోను కరుణరసంలోను కావ్యం గుర్వక్షరాలు అధికంగా ఉండే టట్లు రచించాలి. ఒకరితో ఒకరు ఢీకొనడం ద్వారా వీరరౌద్రాల వర్ణనం ఉన్నప్పుడు అక్కడ కూడ గుర్వక్షరాల ప్రయోగం అధికంగా చెయ్యాలి.

**మూ. రూపదీపకసంయుక్తమార్యావృత్తసమాశ్రయమ్,**
**శృఙ్గారే చ రసే వీరే కావ్యం స్యాన్నాటకాశ్రయమ్. 117**

**తా.** శృంగారం గాని వీరం గాని ప్రధానంగా ఉన్న నాటకరూపమైన కావ్యంలో రూపక – దీపకాలంకారాలు అధికంగా ప్రయోగిస్తూ ఆర్యావృత్తం కూడ ఎక్కువగా వాడాలి.

**మూ. ఉత్తరోత్తరసంయుక్తం వీరే కావ్యం తు యద్ భవేత్,**
**జగత్యతిజగత్యాం వా సంకృత్యాం వాపి తద్భవేత్. 118**

**తా.** వీరరసకావ్యంలో (పరస్పరసంభాషణం పద్యాలలో నడిచినప్పుడు) ఒకనికి సమాధానంగా మరొకడు మాట్లాడేటప్పుడు, జగతీఛందస్సు కాని, అతిజగతీఛందస్సు కాని, సంకృతిఛందస్సు కాని ఉపయోగించాలి.

**మూ. తథైవ యుద్ధసంఫేటే ఉత్కృత్యాం సంప్రకీర్తితా,**
**కరుణే శక్వరీ జ్ఞేయా తథైవాతిధృతిర్భవేత్. 119**

**తా.** యుద్ధాల వర్ణనలలోను, సంఫేటాలలోను (పోట్లాడుకొనడంలోను) ఉత్కృతి ఛందస్సు ప్రయోగించాలి. కరుణరసంలో శక్వరీ – అతిధృతిచ్ఛందస్సులు ఉపయోగించాలి.

**మూ. యద్వీరే కీర్తితం ఛన్దః తద్రౌద్రేఽపి ప్రయోజయేత్,**
**శేషాణామర్థయోగేన ఛన్దః కార్యం ప్రయోక్తృభిః. 120**

**తా.** వీరరసం విషయంలో చెప్పిన ఛందస్సు రౌద్రంలో కూడ ప్రయోగించాలి. నాట్యప్రయోక్తలు మిగిలిన సందర్భాలలో అర్థౌచిత్యాన్ని పట్టి ఛందఃప్రయోగం చెయ్యాలి.

**మూ. (యచ్ఛన్దః పూర్వముద్దిష్టం విషమార్ధసమే సమమ్,**
**ఉదారమధురైః శబ్దైస్తత్కార్యం తు రసానుగమ్. 121**

**తా.** వెనుక చెప్పిన ఛందస్సులలో సమ – అర్ధసమ – విషమవృత్తాలలో ఏది రసానికి అనుగుణంగా ఉంటుందో దానిని ఉదారములు, మధురములు అయిన శబ్దాలతో ఉపయోగించాలి).

**మూ. శబ్దానుదారమధురాన్ ప్రమదాభిధేయాన్,**
**నాట్యాశ్రయేషు కృతిషు ప్రయతేత కర్తుమ్,**
**తైర్భూషితా బహు విభాన్తి హి కావ్యబన్ధాః**
**పద్మాకరా వికసితా ఇవ రాజహంసైః. 122**

**తా.** నాట్యానికి సంబంధించిన కృతులలో, ఆడవాళ్లు కూడ ఉచ్చరించడానికి అనువుగా ఉండే, ఉదారములు, మధురములూ అయిన శబ్దాలను ప్రయోగించడానికి ప్రయత్నించాలి. అలాంటి మధురశబ్దాలచేత భూషితములై కావ్యబంధాలు, వికసించిన పద్మసరస్సులు రాజహంసలతో ప్రకాశించినట్లు ప్రకాశిస్తాయి.

**మూ. త్రివిధం హ్యక్షరం కార్యం కవిభిర్నాటకాశ్రయమ్,**

**హ్రస్వం దీర్ఘం ప్లుతం చైవ రసభావవిభావకమ్. 123**

**తా.** కవులు నాటకాలలో హ్రస్వము, దీర్ఘము, ప్లుతమూ అని మూడు విధాలైన అక్షరాలు రస – భావాలను భావనచేయడానికి అనుగుణంగా ప్రయోగించాలి.

**మూ. ఏకమాత్రం భవేత్ హ్రస్వం ద్విమాత్రం దీర్ఘమిష్యతే,**
**ప్లుతం చైవ త్రిమాత్రం స్యాదక్షరం స్వరయోజనాత్. 124**

**తా.** స్వరాలతో (అచ్చులతో లేదా స్వరంతో) చేర్చడంవల్ల ఒక మాత్ర గలది హ్రస్వం, రెండు మాత్రలు గలది దీర్ఘం మూడు మాత్రలు గలది ప్లుతం.

**మూ. స్మృతే చాసూయితే చైవ తథా చ పరిదేవితే,**
**పఠతాం బ్రాహ్మణానాం చ ప్లుతమక్షరమిష్యతే. 125**

**తా.** ఏదైన ఒక విషయం స్మరించినప్పుడు, కోపంలోను లేదా అసూయా ప్రకటనం లోను, పరిదేవితంలోను (ఎవరినో నిందిస్తూ ఏడవడంలోను), బ్రాహ్మణుల మంత్రపాఠం లోను, ప్లుతాక్షరం ప్రయోగించాలి.

**మూ. అకారస్తు స్మృతే కార్య ఊకారశ్చాప్యసూయితే,**
**పరిదేవితే తు హాకారః ఓంకారోఽధ్యయనే తథా. 126**

**తా.** స్మరించినప్పుడు ప్లుతమైన అకారము, అసూయలో ఊకారము, ఏడ్పులో హాకారము, వేదాధ్యయనంలో ఓంకారము ప్రయోగించాలి.

**మూ. హ్రస్వదీర్ఘప్లుతానీహ యథాభావం యథారసమ్,**
**కావ్యయోగేషు సర్వేషు హ్యక్షరాణి ప్రయోజయేత్. 127**

**తా.** కావ్యప్రయోగా లన్నింటిలోనూ కూడ, భావానుగుణంగా, రసానుగుణంగా హ్రస్వ – దీర్ఘ – ప్లుతాక్షరాలు ఉపయోగింపచేయాలి.

**మూ. చేక్రీడితప్రభృతిభిర్వికృతైస్తు శబ్దై,**
**ర్యుక్తా న భాన్తి లలితా భరతప్రయోగాః,**
**యజ్ఞక్రియేవ శరవర్మధరైః, ఘృతాక్తైః**
**వేశ్యా ద్విజైరివ కమణ్డలుదణ్డహస్తైః. 128**

('**కృష్ణాజినాక్షరురుచర్మధరైర్ఘృతాక్తైః**' అని మూడవ పాదం కొన్ని పుస్తకాలలో)

**తా.** సుకుమార మైన నాట్యప్రయోగాలలో '**చేక్రీడిత**' మొదలైన వికృతమైన శబ్దాలు ప్రయోగిస్తే, బాణాలు కవచాలు ధరించినవాళ్లచేత యజ్ఞాలు, దండకమండలాలు ధరించి ఒళ్లంతా నెయ్యి పూసుకొన్న బ్రాహ్మణులచేత వేశ్యలూ ఏ విధంగా అందంగా ఉండవో (రో) అదే విధంగా ఆ నాట్యప్రయోగాలు శోభించవు.

('కృష్ణాజినాలు, రురుమృగాల చర్మలు ధరించి, ఒళ్లంతా నేతితో జిడ్డుజిడ్డుగా

ఉండి దండకమండలాలు చేతులలో ఉన్న బ్రాహ్మణులు దగ్గరికి వస్తే వేశ్యలు ఎలా శోభించరో అలా అని పాఠాంతరంలో అర్థం').

**వి.** వ్యాకరణానుసారం 'యఙ్' మొదలైనప్రత్యయాలు ధాతువులకు చేర్చగా తయారైన కొన్ని రూపాలు వ్యాకరణానుసారం సాధువులే అయినా వాటిని అన్ని సందర్భాలలోను వాడకూడదు. వినడానికి ఇంపుగా ఉండవు. అలాంటి పదాలలో ఒకటి 'చేక్రీడిత' అనే పదం. ఇలాంటి నియమాలు అన్ని భాషలలోను అనుసరించవలసినవి.

**మూ. (మృదులలితపదార్థం గూఢశబ్దార్థహీనం**
**బుధజనసుఖభోగ్యం యుక్తిమన్నృత్తయోగ్యమ్,**
**బహురసకృతమార్గం సన్ధిసన్ధానయుక్తం**
**భవతి జగతి యోగ్యం నాటకం ప్రేక్షకాణామ్.) 129**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే వాగభినయే కావ్యలక్షణో నామ షోడశోఽధ్యాయః.**

**తా.** ఏ నాటకమైనా ప్రేక్షకులు చూడడానికి అనుకూలంగా ఆనందకరంగా ఉండాలంటే దానిలోని పదాలు, అర్థాలూ, మృదువుగాను లలితంగాను ఉండాలి. క్లిష్టమైన శబ్దాలు గూఢమైన అర్థాలు దానిలో ఉండకూడదు. విద్యావంతు లెవరైనా శ్రమలేకుండా అర్థం చేసికొని ఆనందించేదిగా ఉండాలి. తగిన యుక్తులకు నిలిచేటట్లు కథావస్తువు ఉండాలి. నృత్తానికి యోగ్యంగా, ఉండాలి. అనేకరసాలు మార్గాలు దానిలో చూపాలి. సంధుల ప్రయోగం (అవి ముమ్మందు చెప్పనున్నాడు) చక్కగా ఉండాలి.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో వాగభినయంలో కావ్యలక్షణం అను పదహారవ అధ్యాయం సమాప్తం.**

పరిమలపబ్లికేషన్స్ (ఢిల్లీ) వారు ప్రచురించిన అభినవభారతీసహితనాట్యశాస్త్రం పదహారవ (16) అధ్యాయం చివర 'అనుబన్ధః' అను పేరుతో 42 శ్లోకాలు అధికంగా, అభినవభారతీసహితంగా ఉన్నాయి. వాటిలో కూడ 36 లక్షణాల లక్షణాలు అవే పేర్లతో, పదాలలో కొంచెం మార్పుతో చెప్పబడ్డాయి. వ్యాఖ్యానంలో అదే ఘట్టంలో పదహారవ అధ్యాయం ప్రారంభంలో ఇచ్చిన ఉదాహరణలకంటె అధికంగా కొన్ని ఉదాహరణలు ఇవ్వబడ్డాయి. కొన్ని ప్రతులలో ఈ శ్లోకాలే లేవు. విశేషం ఏదీ లేదు గాన వాటిని ఈ పుస్తకంలో చేర్చలేదు. జిజ్ఞాసువులు పైన చెప్పిన ప్రతి రెండవ సంపుటం 255-268 పేజీలలో ఈ అనుబంధం చూడవచ్చును.

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ సప్తదశోఽధ్యాయః

## కాకుస్వరవ్యఞ్జనః

**యదాన్తరరసాస్వాదకాకువిశ్రాన్తిసున్దరమ్,**
**రసజ్ఞపక్షగం వన్దే తద్వపుః పారమేశ్వరమ్. శ్రీమదభినవగుప్తాచార్యాః**

**మూ. ఏవం తు సంస్కృతం పాఠ్యం మయా ప్రోక్తం ద్విజోత్తమాః,**
**ప్రాకృతస్యాపి పాఠ్యస్య సంప్రవక్ష్యామి లక్షణమ్. 1**

**తా.** ద్విజోత్తములారా! ఈ విధంగా సంస్కృతభాషలోని పాఠ్యాన్ని గూర్చి చెప్పాను. ఇప్పుడు ప్రాకృతపాఠ్యలక్షణం కూడ మీకు చెపుతాను.

**మూ. ఏతదేవ విపర్యస్తం సంస్కారగుణవర్జితమ్,**
**విజ్ఞేయం ప్రాకృతం పాఠ్యం నానావస్థాన్తరాత్మకమ్. 2**

**తా.** సంస్కృతపాఠ్యమే సంస్కారగుణం లేకపోవడంచేత విపర్యస్తమై, వివిధ దేశాలలో ప్రాకృతపాఠ్యంగా రూపొందిం దని తెలుసుకోవాలి.

**వి.** 'పాఠ్యం' అనగా ఒక విశిష్టమైన రీతిలో ప్రయత్నపూర్వకంగా చదవదగినది, ఉచ్చరింపదగినది; లేదా – లోపల ఉన్న చిత్తవృత్తులను అనుసరించి తదనుగుణంగా పఠించదగినది లేదా ఆచార్యుని దగ్గర శిక్షణ పొంది పఠింపదగినది. (అ.భా.)

సంస్కృతమే, సంస్కారగుణం – అనగా ప్రయత్నపూర్వకంగా రక్షించడం, అనేది లేకపోవడంచేత ప్రాకృతం అయింది. సంస్కారరాహిత్యరూపమైన ప్రకృతివల్ల ఏర్పడినది.

**"సంస్కృతమేవ సంస్కారగుణేన, యత్నేన పరిరక్షణరూపేణ, వర్జితం ప్రాకృతం ప్రకృతేః అసంస్కారరూపాయాః ఆగతమ్" (అ.భా.)**

**నానావస్థాన్తరాత్మకమ్ – "నానాని యాని అవస్థాన్తరాణి దేశవిశేషాః తేష్వాత్మా నియత స్వభావః యస్యా ..... అవతిష్ఠన్తేఽస్మిన్నిత్యవస్థాః దేశాః" (అ.భా.)**

**మూ. త్రివిధం తచ్చ విజ్ఞేయం నాట్యయోగే సమాసతః,**
**సమానశబ్దః విభ్రష్టం దేశీగతమథాపి చ. 3**

**తా.** నాట్యప్రయోగంలో ప్రాకృతపాఠం – సంస్కృతసమానశబ్దము, విభ్రష్టము (మార్పు చెందిన సంస్కృతపదము) దేశీగతము (ఆ యా దేశాలకు సంబంధించినది) అని మూడు విధాలు అని తెలుసుకోవాలి.

**వి.** ఇది తెలుగు వ్యాకరణంలోని తత్సమం, తద్భవం దేశ్యం అను విభాగం వంటిది.

**మూ. కమలామలరేణుతరఙ్గలోలసలిలాదివాక్యసంపన్నమ్,**
**ప్రాకృతబన్ధేష్వేవం సంస్కృతమివ ప్రయోగముపయాతి. 4**

**తా.** ప్రాకృతరచనలలో కూడ "కమల, అమల, రేణు, తరఙ్గ, లోల, సలిల" మొదలైన సంస్కృతపదాలు సంస్కృతరచనలలోవలెనే యథాతథంగా కూర్చబడతాయి; అవి సమానశబ్దాలు.

**మూ. యే వర్ణాః సంయోగాత్ స్వరవర్ణాన్యత్వన్యూనతాం వాపి,**
**గచ్ఛన్తి పదన్యస్తాస్తే విభ్రష్టా ఇతి జ్ఞేయాః. 5**

**తా.** ప్రాకృతరచనలలో ఉపయోగించిన పదాలలోని కొన్ని పదాల మధ్య ఉన్న వర్ణాలు మార్పులు చెంది – ఒక అచ్చు మరొక అచ్చుగాను, ఒక వర్ణం మరొక వర్ణంగాను, ఒక వర్ణం పెరగడం, ఒక వర్ణం తరగడం – ఇలాంటివి జరుగుతూంటాయి. ఇవి విభ్రష్టాలు.

**మూ. ఏ ఓ ఆ ర పరాణి అ అంఆర పరం అ ఎ అ ఏ ణత్థి,**
**వసఆరమజిమాఇ అ కచవగ్గతవగ్గణిహణాఇ. 6**
**ఝ**

**తా.** ఏఐ ల తరవాత వచ్చే 'ఐ ఔ'లు, 'అనుస్వార, వ స ల' మధ్య ఉన్న వర్ణాలు, అనగా 'శ□ష'లు కవర్గ చవర్గ తవర్గలలోని పంచమాక్షరాలు అనగా ఙ ఞ న లు ప్రాకృతంలో ఉపయోగించబడవు.

**మూ. వచ్చంతి కగతదవయవా లోపం అత్థం చ సే వహంతి సరా,**
**ఖఘథధభా ఉణ హత్తమ్ ఉవేన్తి అత్థమముంచంతా. 7**

**తా.** క, గ, త, ద, న వ లు ప్రాకృతంలో లోపిస్తాయి. అవి లోపించగా మిగిలిన అచ్చులు వాటి అర్థాలు బోధిస్తాయి. అట్లే ఖ, ఘ, థ, ధ, భ, లు హ గా మారుతాయి. వాటి అర్థం మాత్రం అలాగే ఉంటుంది.

**మూ. ఉప్పరహుత్తరఆరో హేటాహుత్తొ అ పా అఏ ణత్థి,**
**మోత్తూణ భద్రవోద్రహ పద్రహ్రద చన్ద్ర జాఈస. 8**

**తా.** ప్రాకృతంలో భద్ర, వోద్ర, హ్రద, చన్ద్ర వంటి కొన్ని పదాలతో తప్ప రేఫకు ముందు గాని తరవాత గాని హల్లు ఉండదు.

**మూ. ఖఘథధభాణ హాఆర ముహమేహకహో వహు పహూఏసు,**
**కగతదయవాణ ణిచ్చం వీయమ్మి ఠిఓ సరో హోఇ. 9**

**తా.** ముఖ, మేఘ, కథా, వధూ, ప్రభూత మొదలైన – పదాలలోని ఖ, ఘ, థ, ధ, భలు తప్పక 'హ'గా మారతాయి. క, గ, త, ద, య, వలకు సంబంధించిన అచ్చులు ఆ అక్షరాల అర్థాన్ని తప్పక బోధిస్తాయి.

**మూ. ఛ ఇతి షకారో నిత్యం బోద్ధవ్యః షట్పదాదియోగేతు,**
**కిలశబ్దో రేఫాన్తో భవతి, యథా ఖ్షత్తి ఖలుశబ్దః. 10**

**తా.** 'షట్పద' మొదలైన పదాలలోని 'ష' ఎల్లప్పుడు 'ఛ'గా మారుతుంది. 'కిల'లోని 'ల', 'ర'గా మారుతుంది. 'ఖలు' అను పదం 'ఖు' అవుతుంది.

**మూ. డఇతి చ భవతి టకారో భటకటకుటీతటాద్యేషు,**
**సత్వం చ భవతి శషయోః సర్వత్ర తథాహి స ఆదేశః. 11**

**తా.** భట, కట, కుటీ, తట మొదలైన పదాలలోని 'ట' – 'డ' గా మారుతుంది. శ, ష – లకు నిత్యం 'స' అనేది ఆదేశంగా (వాటిస్థానంలో) వస్తుంది.

**మూ. అస్పష్టశ్చ దకారో భవతి అనాదౌ తకార ఇతరాద్యః,**
**వడవాతడాగతుల్యో భవతి డకారోఽపి లకారః. 12**

**తా.** 'ఇతర' వంటి పదాల మధ్యలో వచ్చిన 'త' అస్పష్టమైన 'ద'గా ఉచ్చరింపబడుతుంది. 'వడవా', తడాగ మొదలైన పదాలలోని 'డ' – 'ల'గా మారుతుంది.

**మూ. వధమధుశబ్దే చ తథా ధకారవర్ణో హకారతాం యాతి,**
**సర్వత్ర చ ప్రయోగే భవతి నకారోఽపి చ ణకారః. 13**

**తా.** 'వధ' మధు శబ్దాలలోని 'ధ' కారం 'హ'గా మారుతుంది. 'న' కారం ఎల్లప్పుడు 'ణ'గా ప్రయోగించబడుతుంది.

**మూ. ఆపాణం ఆవాణం భవతి పకారేణ వత్వయుక్తేన,**
**అయథాతథాదికేషు థకారవర్ణో వ్రజతి హత్వమ్. 14**

**తా.** పకారం నకారంగా మారి 'ఆపాణం' ఆవాణం అవుతుంది. 'యథా' 'తథా' వంటి కొన్నిపదాలలోనిది తప్ప 'థ', 'హ'గా మారుతుంది.

**మూ. పరుషం ఫరుసం విద్యాత్ పకారవర్ణోఽపి ఫత్వముపయాతి,**
**యస్తు మృగః సోఽపి మఓ యస్తు మృతః సోఽపి తథైవ. 15**

**తా.** పకారం ఫకారంగా మారి 'పరుషం' అనేది 'ఫరుసం' అవుతుంది. 'మృగ' 'మృత' అనేవి 'మఓ' అని మారతాయి.

**మూ. ఓకారత్వం గచ్ఛత్యౌకారశ్చౌషధాదిషు నియుక్తః,**
**ప్రచయాచిరాచలాదిషు చకారవర్ణోఽపి యకారః. 16**

**తా.** ఔషధాదిశబ్దాలలోని 'ఔ' – 'ఓ' గా మారుతుంది. 'ప్రచయ' 'అచిర' 'అచల' మొదలైనవాటిలోని 'చ' – 'య'గా మారుతుంది.

**మూ. అపరస్సరనిష్పన్నాహ్యేవం ప్రాకృతసమాశ్రయా వర్ణాః,**
**సంయుక్తానాం చ పునర్వ్యక్ష్యే పరివత్తిసంయోగమ్. 17**

**తా.** ప్రాకృతభాషలోని వర్ణాలు ఇతరవర్ణాలతో కలవనప్పుడు పైన చెప్పిన మార్పులు చెందుతాయి. ఇతరవర్ణాలతో సంయుక్తాలైనప్పుడు ఎలా మారుతాయో చెపుతాను.

**మూ. శ్చప్సత్సథ్యాః ఛ ఇతి ధ్యహ్యయోర్భవతి తు ఝకారః,**
**ష్టః ట్ఠః స్తః త్థః స్మోమ్హః ష్ణస్నక్ష్ణాం ణ్హః క్షః ఖకారరూపః. 18**

**తా.** శ్చ, ప్స, త్స, థ్య – ఇవి 'ఛ' గా మారతాయి. ధ్య – హ్య – ఇవి 'ఝ' గా మారతాయి. 'ష్ట' – 'ట్ఠ' గాను, 'స్త' – 'త్థ' గాను, 'స్మ' – 'మ్హ' గాను, 'క్ష్ణ' 'ష్ణ', 'క్ష' – 'ఖ' గాను మారుతాయి.

**మూ. ఆశ్చర్యం మాత్సర్యం చేత్యనయోర్యస్య రియం వై తథా,**
**ఉత్సాహశ్చోచ్ఛాహో పథ్యం పచ్ఛం చ విజ్ఞేయమ్. 19**

**తా.** 'ఆశ్చర్యం' 'మాత్సర్యమ్'లలోని 'ర్యం' 'రియం' గా మారి, 'ఆచ్చరియమ్' 'మాచ్చరియమ్' అని అవుతాయి. 'ఉత్సాహః' 'ఉచ్ఛాహో' అనీ, 'పథ్యం' 'పచ్ఛం' అనీ మారుతాయి.

**మూ. తుభ్యం తుర్ఝం మహ్యం మజ్ఝం విన్ధ్యశ్చ భవతి వింజ్ఝ ఇతి,**
**దష్టో దట్ఠో ఇతి తథా హస్తోఽపి తు హత్థ ఇత్యేవమ్. 20**

**తా.** 'తుభ్యం' – 'తుజం' గాను, 'మహ్యం' – 'మజ్ఝ' గాను, 'విన్ధ్య' – 'వింజ్ఝ' గాను 'దష్టో' – 'దట్ఠో' గాను, 'హస్త' – 'హత్థ' గాను అవుతాయి.

**మూ. ఆశ్చర్యం అచ్ఛరియం నిశ్చయమిచ్ఛన్తి ణిచ్ఛయం చ యథా,**
**వత్సం వచ్ఛం చ యథా అప్సరసం తద్వదచ్ఛర అం. 21**

**తా.** 'ఆశ్చర్యం' అనేది, 'అచ్ఛరియంగాను, 'నిశ్చయం' అనేది 'ణిచ్ఛయం'గాను, 'వత్స' అనేది 'వచ్ఛ'గాను, 'అప్సరసం' అనేది 'అచ్ఛరఅం'గాను అవుతాయి.

**మూ. గ్రీష్మో గిమ్హోతి తథా శ్లక్ష్ణం సహ్ణం సదా తు విజ్ఞేయమ్,**
**ఉష్ణం ఉహ్ణం యక్షో జక్ఖో పర్యఙ్కో భవతి పల్లంకు. 22**

**తా.** 'గ్రీష్మః' అనేది 'గిమ్హో' గాను, 'శ్లక్ష్ణం' అనేది 'సహ్ణం' గాను, 'ఉష్ణం' అనేది 'ఉహ్ణం' గాను, 'యక్ష' అనేది 'జక్ఖో' గాను, 'పర్యంకో' అనేది 'పల్లంకు' గాను అవుతాయి.

**మూ. విపరీతం హమయోగే బ్రహ్మాదౌ స్యాద్ బృహస్పతౌ ఫత్వమ్,**
**యజ్ఞో భవతి చ జన్నో భీష్మో భిమ్హోతి విజ్ఞేయః. 23**

**తా.** 'బ్రహ్మ' మొదలైనవాటిలో ఉన్న 'హమ' సంయోగం విపరీతం అవుతుంది. అనగా 'బ్రహ్మ' అనేది 'బ్రమ్హ' అవుతుంది. 'బృహస్పతి'లోని 'ప' 'ఫ' అవుతుంది. 'యజ్ఞ' అనేది 'జన్నో' అవుతుంది. 'భీష్మ' అనేది 'భిమ్మ' అవుతుంది.

**మూ. ఉపరిగతోఽధస్తాద్వా భవేత్కకారాదికస్తు యో వర్ణః,**
**స హి సంయోగవిహీనః శుద్ధః కార్యః ప్రయోగేఽస్మిన్. 24**
**ఏవమేవ తు విజ్ఞేయం సంస్కృతం ప్రాకృతం తథా.**

**తా.** సంయుక్తాక్షరాలలో పైన గాని క్రింద గాని ఉన్న కకారాద్యక్షరం సంయోగం లేకుండా శుద్ధంగా ప్రయోగింపబడుతుంది. సంస్కృతపదం ప్రాకృతపదంగా ఎలా అయిందో ఈ విధంగానే తెలుసుకోవాలి.

**మూ. అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి దేశభాషావికల్పనమ్,**
**భాషా చతుర్విధా ప్రోక్తా దశరూపే ప్రయోగతః. 25**

**తా.** ఇటుపైన దేశభాషల వినియోగాన్ని గూర్చి చెపుతాను. దశరూపకాలలో ప్రయోగించే భాష నాలుగు విధా లుంటుంది.

**మూ. సంస్కృతం ప్రాకృతం చైవ యత్ర పాఠ్యం ప్రయుజ్యతే,**
**అతిభాషార్యభాషా చ జాతిభాషా తథైవ చ. 26**
**తథా యోన్యన్తరీ చైవ భాషా నాట్యే ప్రకీర్తితా.**

**తా.** సంస్కృతభాషలోను, ప్రాకృతభాషలోను పాఠ్యం ఏ నాట్యంలో ప్రయోగించ బడుతుందో ఆ నాట్యంలో **'అతిభాషా', 'ఆర్యభాషా', 'జాతిభాషా', 'యోన్యన్తరీభాషా'** అని నాలుగు విధాల భాష చెప్పబడింది.

**మూ. అతిభాషా తు దేవానామార్యభాషా తు భూభుజామ్. 28**
**సంస్కారపాఠ్యసంయుక్తా సమ్యఙ్ న్యాయ్యప్రతిష్ఠితా,**
**వివిధా జాతిభాషా చ ప్రయోగే సముదాహృతా. 29**
**మ్లేచ్ఛశబ్దోపచారా చ భారతం వర్షమాస్థితా.**

**తా.** దేవతలకు అతిభాషను ప్రయోగించాలి. సంస్కారసహితమైన పాఠ్యంతో కూడినదీ, బాగా నియమాలతో నియమించబడినదీ అయిన ఆర్యభాష రాజులకు ప్రయోగించాలి. మ్లేచ్ఛశబ్దాలు, పద్ధతులూ గల, భారతవర్షంలోనే ఉన్న అనేకవిధాలైన జాతిభాష (అనేకవిధాల మనుష్యజాతులవాళ్లు మాట్లాడుకొనే భాష) నాట్య ప్రయోగంలో వినియోగించదగినది.

**మూ. అథ యోన్యన్తరీ భాషా గ్రామ్యారణ్యపశూద్భవా. 30**
**నానావిహఙ్గజా చైవ నాట్యధర్మీ ప్రతిష్ఠితా.**

**తా.** గ్రామ్యపశువులకు, ఆరణ్యపశువులకు, వివిధపక్షులకు సంబంధించిన భాష యోన్యన్తరీభాష. అది నాట్యధర్మిమీద ఆధారబడినది. అనగా – నాట్యంలో మాత్రమే ఉపయోగించేది.

**మూ. అతిభాషాశ్రయం పాఠ్యం ద్వివిధం సముదాహృతమ్,**
**ప్రాకృతం సంస్కృతం చైవ చాతుర్వర్ణ్యసమాశ్రయమ్. 32**

**తా.** అతిభాషతో సంబంధం ఉన్న పాఠ్యం – ప్రాకృత మనీ, సంస్కృత మనీ రెండు విధాలు. ఇది నాలుగు వర్ణాలవాళ్లూ ఉపయోగించేది.

**మూ. దీరోద్ధతే సలలితే ధీరోదాత్తే తథైవ చ,**
**ధీరప్రశాన్తే చ తథా పాఠ్యం యోజ్యం తు సంస్కృతమ్. 33**
**ఏషామేవ తు సర్వేషాం నాయకానాం ప్రయోగతః,**
**కారణవ్యపదేశేన ప్రాకృతం సంప్రయోజయేత్. 34**

**తా.** ధీరోద్ధత – ధీరలలిత – ధీరోదాత్త – ధీరశాంతనాయకులకు పాఠ్యం సంస్కృతంలో ప్రయోగించాలి. నాట్యప్రయోగంలో ఏర్పడిన అవసరాన్ని సూచించి ఈ నాయకులకే ప్రాకృతపాఠ్యాన్ని ఉపయోగించాలి.

**మూ. దారిద్ర్యాధ్యయనాభావయదృచ్ఛాదిభిరేవ చ,**
**ఐశ్వర్యేణ ప్రమత్తానాం దారిద్ర్యేణ చ్యుతాత్మనామ్,**
**అనధీతోత్తమానాం చ సంస్కృతం న ప్రయోజయేత్.**

**తా.** దారిద్ర్యము, అధ్యయనం లేకపోవడము, ఏవో ఆకస్మికమైన ఇతరకారణాలు – వీటిచేత నీచస్థితిలో ఉన్నవాళ్లకు, ఐశ్వర్యం కోల్పోయి దారిద్ర్యంచేత బాధపడుతూన్న మనస్సులు కలవాళ్లకు, ఉత్తమమైన సంస్కారాన్నిచ్చే గ్రంథాదులను చదవని వాళ్లకు, లేదా ఉత్తముల సంప్రదాయాలతో పరిచయం లేనివాళ్లకు సంస్కృతం ప్రయోగించ కూడదు.

**మూ. వ్యాజలిఙ్గప్రవిష్టానాం శమణానాం తపస్వినామ్,**
**భిక్షుచక్ర(కి)చరాణాం చ ప్రాకృతం సంప్రయోజయేత్. 36**

**తా.** ఏదో వంకపెట్టుకొని సంన్యాసివేషాదులు ధరించినవాళ్లకు, సాధారణ సంన్యాసులకు, తపస్సు చేసికొనేవాళ్లకు లేదా దీనులకు, భిక్షువులకు, బళ్లు నడిపేవాళ్లకు ప్రాకృతం ఉపయోగించాలి.

**మూ. భాగవతతాపసోన్మత్తబాలనీచగ్రహోపసృష్టేషు,**
**స్త్రీనీచజాతిషు తథా నపుంసకే ప్రాకృతం యోజ్యమ్. 37**

**తా.** భాగవతులు (దేవాలయాలలోని అర్చకులు), పిచ్చివాళ్లు, బాలులు, నీచ గ్రహాలు ఆవేశించినవాళ్లు, స్త్రీలు, నీచజాతులవాళ్లు, నపుంసకులు వీళ్లకు కూడ ప్రాకృతం ప్రయోగించాలి. **"భాగవతాః ఇహ దేవలాః"** (అభి.భా.)

**మూ. పరివ్రాణ్మునిశాక్యేషు చోక్షేషు శ్రోత్రియేషు చ,**
**శిష్టా యే చైవ లిఙ్గస్థాః సంస్కృతం తేషు యోజయేత్. 38**

**తా.** పరివ్రాట్టులు (ఉన్నతకోటికి చెందిన సంన్యాసులు), మునులు, బౌద్ధ సంన్యాసులు, విద్యావంతులైన శ్రోత్రియులు, సదాచారవంతులైన లింగస్థులు (ఆశ్రమ చిహ్నాలు ధరించేవారు) వీరికి సంస్కృతంలోనే పాఠ్యం ఉండాలి.

**మూ. రాజ్ఞ్యాశ్చ గణికాయాశ్చ శిల్పకార్యాస్తథైవ చ,**
**కలావస్థాన్తరకృతం యోజ్యం పాఠ్యం తు సంస్కృతమ్. 39**

**తా.** పట్టమహిషి, ప్రధానవేశ్య, శిల్పకారిణి, వీళ్లకు కూడ వాళ్లకు నైపుణ్యం ఉన్న కళలను పట్టి, వాళ్ల అవస్థలను పట్టి సంస్కృతపాఠ్యం ఉపయోగించాలి.

**మూ. సంధివిగ్రహసంబన్ధం తథా చ ప్రాప్తవాగ్గతిమ్,**
**నక్షత్రగ్రహచరితం ఖగానాం రుతమేవ చ. 40**
**సర్వమేతత్తు విజ్ఞేయం కావ్యబన్ధే శుభాశుభమ్. 41**

**తా.** పట్టపురాణికి సంస్కతృపాఠ్యం ఉండా లని చెప్పడంలో కారణం చెపుతున్నాడు– **"రాజ్ఞ్యాః సంస్కృతే నిమిత్తం దర్శయతి సంధివిగ్రహేతి"** (అ.భా.)

పట్టపురాణి సంధి, విగ్రహము మొదలైన రాజనీతులను, ఆ యా సమయాలలో వినవలసిన మాటల రీతులను, గ్రహ – నక్షత్రాల సంచారాదులను, పక్షుల ధ్వనులను, ఇతరమైన, కావ్యబంధంలో ఉండే శుభాశుభవిషయాలను తెలుసుకోవాలి. అందుచేత ఆమెకు సంస్కృతపాఠ్యం విధింపబడినది.

**మూ. క్రీడార్థం సర్వలోకస్య ప్రయోగే చ సుఖాశ్రయమ్,**
**కలాభ్యాసాశ్రయం చైవ పాఠ్యం వేశ్యాసు సంస్కృతమ్. 42**

**తా.** సకలజనులకు వినోదం కలిగించేది, ప్రయోగంలో సుఖకరము, వివిధకళల అభ్యాసానికి సంబంధించినదీ అయిన సంస్కృతపాఠ్యం వేశ్యలకు చెప్పబడింది.

**మూ. కలోపచారజ్ఞానార్థం క్రీడార్థం పార్థివస్య చ,**
**నిర్దిష్టం శిల్పకార్యాస్తు నాటకే సంస్కృతం వచః. 43**

**తా.** కళలు అభ్యసించడంకొరకు, వాటి ద్వారా లోకులకు ఉపచారం (ఆనందజననం ద్వారా) చేయడానికి, రాజుల క్రీడ (వినోదం) కొరకూ శిల్పనిపుణలైన స్త్రీలకు సంస్కృతపాఠ్యం చెప్పబడింది.

**మూ. ఆమ్నాయసిద్ధం సర్వాసాం శుభమప్సరసాం వచః,**
**సంసర్గాద్దేవతానాం చ తద్ధి లోకోఽనువర్తతే. 44**

**తా.** అప్సరఃస్త్రీల వాక్కు శుభమైన దని శాస్త్రాలలో ప్రసిద్ధి ఉంది. వాళ్లకు దేవతలతో సంబంధం కూడ ఉంది. లోకం శాస్త్రప్రసిద్ధినే అనువర్తిస్తుంది కదా. అందుచేత అప్సరస లకు కూడ సంస్కృతపాఠ్యమే.

**మూ. ఛన్దతః ప్రాకృతం పాఠ్యం స్మృతమప్సరసాం భువి,**
**మానుషాణాం చ కర్తవ్యం కారణార్థవ్యపేక్షయా. 45**

**తా.** అయితే – భూలోకానికి దిగి వచ్చిన అప్సరఃస్త్రీలకు మాత్రం, ఇచ్ఛానుసారం, ప్రాకృతపాఠ్యం ఉండవచ్చు. మనుష్యుల కైతే ఆ యా కారణాలను, పరిస్థితులను పట్టి ప్రాకృతపాఠ్యం ఉపయోగించాలి.

**మూ. (సర్వాస్వేవ హి శుద్ధాసు జాతిషు ద్విజసత్తమాః,**
**శౌరసేనీం సమాశ్రిత్య భాషాం కావ్యేషు యోజయేత్. 46**

**తా.** ద్విజోత్తములారా! శుద్ధమైన జాతులకు చెందినవారి కందరికీ, కావ్యాలలో, శౌరసేనీప్రాకృతాన్ని అనుసరించి భాషను (శౌరసేనీప్రాకృతాన్ని) ఉపయోగించాలి.

**మూ. అథవా ఛన్దతః కార్యా దేశభాషా ప్రయోక్తృభిః,**
**నానాదేశసముత్థం హి కార్యం భవతి నాటకే. 47**

**తా.** లేదా – నాట్యప్రయోక్తలు తమ ఇచ్ఛ ప్రకారం దేశభాషను ఉపయోగించ వచ్చును. ఎందుచేత ననగా, నాటకంలో వేరు వేరు దేశాలలో ప్రచారంలో ఉన్నదానిని స్వీకరించాలి.

**మూ. మాగధ్యవన్తిజా ప్రాచ్యా శౌరసేన్యర్ధమాగధీ,**
**బాహ్లీకా దాక్షిణాత్యా చ సప్త భాషాః ప్రకీర్తితాః. 48**

**తా.** మాగధి, ఆవన్తీ, ప్రాచ్యా, శౌరసేనీ, అర్ధమాగధీ, బాహ్లీకా, దాక్షిణాత్యా అని (ప్రాకృత) భాషలు ఏడు.

**మూ. శకారాభీరచణ్డాలశబరద్రమిలాన్ధ్రజాః,**
**హీనా వనేచరాణాం చ విభాషా నాటకే స్మృతాః. 49**

**తా.** శకారభాష, ఆభీర – చండాల – శబర – ద్రమిల – ఆంధ్రజాతులవాళ్ల

భాషలు, వనేచరుల (ఆటవికుల) భాషలు ఇవి హీన మైనవి, నీచ మైనవి. ఈ విభాషలు కూడ నాటకంలో ప్రయోగించబడాలి).

**"శబరాభీరచణ్డాలసచరద్రవిడోద్రజాః"** అని పాఠాంతరం.

**మూ. మాగధీ తు నరేన్ద్రాణామన్తఃపురసమాశ్రయా,**
**చేటానాం రాజపుత్రాణాం శ్రేష్ఠిణాం చార్ధమాగధీ. 50**

**తా.** రాజుల అంతఃపురాలలో మాగధీభాష ప్రయోగించబడుతుంది. చేటులు (నౌకర్లు), రాజపుత్రులు, పెద్ద వ్యాపారులు (వణిక్‌శ్రేష్ఠులు) – వీరికి అర్ధమాగధి చెప్పబడింది.

**మూ. ప్రాచ్యా విదూషకాదీనాం ధూర్తానామప్యవన్తిజా,**
**నాయికానాం సఖీనాం చ శూరసేన్యవిరోధినీ. 51**

**తా.** విదూషకుడు మొదలైనవాళ్లకు ప్రాచ్యభాష, ధూర్తులకు (మోసగాళ్లకు) అవంతిజ, నాయికలకు వాళ్ల సఖురాండ్రకు శౌరసేనీభాష యుక్తంగా ఉంటాయి.

**మూ. యోధనాగరకాదీనాం దాక్షిణాత్యాథ దీవ్యతామ్,**
**బాహ్లీకభాషోదీచ్యానాం ఖసానాం చ స్వదేశజా. 52**

**తా.** యోధులు, నగరరక్షకులు మొదలైనవారికి, జూదరులకు దాక్షిణాత్యభాష, ఉత్తరదేశీయులకు బాహ్లీకభాష. ఖసులకు వాళ్ల దేశభాష ఉపయోగించాలి.

**మూ. శకారఘోషకాదీనాం తత్స్వభావశ్చ యో గణః,**
**శకారభాషా యోక్తవ్యా చాణ్డాలీ పుల్కసాదిషు. 53**

**తా.** శకారులకు ఘోషకాదులకు (గొల్లపల్లెలవాళ్లు), అలాంటి స్వభావం గల ఇతరగణాలకు శకారభాష, పులస్కులు మొదలైనవారికి చాండాలిభాష ఉపయోగించాలి.

(**"శకారాణాం శకాదీనామ్"** అని పాఠాంతరం.)

**మూ. అఙ్గారకారకవ్యాధకాష్ఠయన్త్రోపజీవినామ్,**
**యోజ్యా శకారభాషా తు కించిద్వానౌకసీ తథా. 54**

**తా.** బొగ్గులు తయారు చేసేవాళ్లకు, మృగాలను వేటాడేవాళ్లకు, కట్టెలు అమ్ముకొనే వాళ్లకు, యంత్రాలతో జీవించేవాళ్లకు శకారభాష ఉపయోగించాలి. అప్పుడప్పుడు వనాలలో సంచరించే వాళ్ల భాష ఉపయోగించాలి.

**మూ. గజాశ్వాజావికోష్ట్రాదిఘోషస్థాననివాసినామ్,**
**ఆభీరోక్తిః శాబరీ వా ద్రామిడీ వనచారిషు. 55**

**తా.** ఏనుగులను, అశ్వాలను, మేకలను, గొఱ్ఱెలను, ఒంటెలు మొదలైనవాటిని సంరక్షించేవాళ్లకు, గొల్లపల్లెలలో ఉండేవాళ్లకు, ఆభీరి గాని, శాబరి గాని ఉపయోగించాలి. వనచారులకు ద్రామిడి ఉపయోగించాలి.

**మూ. సురఙ్గఖనకాదీనాం సంధికారాశ్వరక్షతామ్,**
**వ్యసనే నాయకానాం చాప్యాత్మరక్షాసు మాగధీ. 56**

**తా.** సురంగాలు తవ్వేవాళ్లు మొదలైనవాళ్లకు, కన్నాలు తవ్వేవాళ్లకు, అశ్వరక్షకులకు, వ్యసనాలలో ఉన్న నాయకాదులకు ఆత్మరక్షణసమయంలోను (ఇతరులు తమను గుర్తించకుండా ఉండడంకోసం) మాగధీభాష ప్రయోగించాలి.

**మూ. (న బర్బరకిరాతాన్ధ్రద్రమిలాద్యాసుజాతిషు,**
**నాట్యప్రయోగే కర్తవ్యం కావ్యం భాషాసమన్వితమ్.**

**తా.** బర్బర – కిరాత – ఆంధ్ర – ద్రమిళాదిజాతులవారి భాషలతో సహితమైన కావ్యం నాట్యప్రయోగంలో చేయకూడదు.

**వి.** (అర్థం అస్పష్టంగా ఉంది). వెనుక శ్లోకాలలో ద్రమిళభాష వాడవచ్చు నని చెప్పడంచేత ఈ నిషేధం పర్వతప్రాంతీయద్రవిడుల భాష విషయం అని గ్రహించాలి అని అ.భా.లో చెప్పబడింది – **"ద్రమిడకాదిపూర్వవిధానాది (హ) నిషేధో విశిష్టేష్వితి పర్యన్తవాసిషు ద్రమిడేషు ద్రష్టవ్యః; బర్బరాన్ధ్రాదిసాహచర్యాత్ జాఙ్గలదేశాదిగతేషు"** (అ.భా. 17.57)

**మూ. గఙ్గాసాగరమధ్యే తు యే దేశాః సంప్రకీర్తితాః,**
**ఏకారబహులాం తేషు భాషాం తద్జ్ఞః ప్రయోజయేత్. 58**

**తా.** గంగా – సాగరాల మధ్య నున్న దేశాలలో నివసించేవారికి 'ఏ'కారం అధికంగా ఉండే భాష ప్రయోగించాలి.

**వి.** గంగాసాగరమధ్యదేశం అనగా పూర్వదేశం (అ.భా.)

**మూ. విన్ధ్యసాగరమధ్యే తు యే దేశాః శ్రుతిమాగతాః,**
**నకారబహులాం తేషు భాషాం తద్జ్ఞః ప్రయోజయేత్. 59**

**తా.** వింధ్యపర్వతానికీ సాగరానికీ మధ్య నున్న దేశాలలో 'న'కారం అధికంగా ఉండే భాషను ప్రయోగించాలి.

**వి.** వింధ్యసాగరమధ్యదేశం అనగా దక్షిణసౌరాష్ట్రదేశం. (అ.భా.)

**మూ. సురాష్ట్రావన్తిదేశేషు వేత్రవత్యుత్తరేషు చ,**
**యే దేశాస్తేషు కుర్వీత చకారప్రాయసంశ్రయామ్. 60**

**తా.** సురాష్ట్రావన్తిదేశాలలోను వేత్రవతీనదికి ఉత్తరంగా ఉన్న దేశాలలోను 'చ' కారం అధికంగా ఉన్న భాషను ప్రయోగించాలి.

**వి.** సురాష్ట్రావన్తిదేశాలనగా పశ్చిమదేశం. 'వేత్రవత్యుత్తరేషు' అనగా ఉత్తరదేశం (అ.భా.)

**మూ. హిమవత్సిన్ధుసౌవీరాన్యే జనాః సముపాశ్రితాః,**
**ఉకారబహులాం తద్‌జ్ఞస్తేషు భాషాం ప్రయోజయేత్. 61**

**తా.** హిమవత్సింధుసౌవీరప్రాంతాలలో నివసించేవాళ్లకు 'ఉ'కారం అధికంగా ఉండే భాష ప్రయోగించాలి.

**మూ. చర్మణ్వతీనదీతీరే యే చార్బుదసమాశ్రితాః,**
**తకారబహులాం నిత్యం తేషు భాషాం ప్రయోజయేత్. 62**

**తా.** చర్మణ్వతీనదీతీరంలోని అర్బుదపర్వతప్రాంతాన్ని ఆశ్రయించికొని ఉన్నవాళ్లకు 'త'కారం అధికంగా ఉన్న భాషను ఉపయోగించాలి.

**మూ. ఏవం భాషావిధానం తు కర్తవ్యం నాటకాశ్రయమ్,**
**అత్ర నోక్తం మయా యత్తు లోకాద్గ్రాహ్యం బుధైస్తు తత్. 63**

**తా.** నాటకానికి సంబంధించిన భాషావిధానం ఇలా ఉండాలి. ఇక్కడ నేను చెప్పనిది ఏదైనా ఉంటే దానిని లోకంనుండి గ్రహించాలి.

**మూ. ఏవం భాషావిధానం తు మయా ప్రోక్తం ద్విజోత్తమాః,**
**పునర్వాక్యవిధానం తు లౌకికం ప్రతిబోధత. 64**

**తా.** ద్విజోత్తములారా! ఇంతవరకు భాషావిధానం చెప్పాను. ఇపుడు లౌకికమైన వాక్యవిధానాన్ని చెపుతాను. వినండి.

**మూ. ఉత్తమైర్మధ్యమైర్నీచైర్యే సంభాష్యా యథా నరాః,**
**సమానోత్కృష్టహీనాశ్చ నాటకే తాన్నిబోధత. 65**

**తా.** నాటకంలో ఉత్తములు, మధ్యములు, నీచులు - ఎవరితో ఏ విధంగా మాట్లాడాలో (ఎవరి నేవిధంగా పలకరించాలో) అట్లే సమాన - ఉత్కృష్ట - నీచులలో ఎవరు ఎవరిని ఎలా సంబోధించాలో తెలిసికొనండి.

**మూ. దేవానామపి వై దేవా మహాత్మానో మహర్షయః,**
**భగవన్నితి తే వాచ్యా యాస్తేషాం యోషితస్తథా. 66**

**తా.** మహాత్ములైన మహర్షులు దేవతలకు కూడ దేవతలు. వాళ్లను **'భగవన్'** అని సంబోధించాలి. వాళ్ల భార్యలను కూడ **'భగవతి'** అని సంబోధించాలి.

**మూ. దేవాశ్చ లిఙ్గినశ్చైవ నానా(శుతధరాశ్చ యే,**
**భగవన్నితి తే వాచ్యాః పురుషైః స్త్రీభిరేవ చ. 67**

**తా.** దేవతలను, వ్రతానికి లేదా దీక్షకు సంబంధించిన లింగం (చిహ్నం) ధరించిన వాళ్లను, వివిధశాస్త్రపండితులను – పురుషులు స్త్రీలూ కూడ **'భగవన్'** అని సంబోధించాలి.

**మూ. ఆర్యేతి బ్రాహ్మణం బ్రూయాత్ మహారాజేతి పార్థివమ్,**
**ఉపాధ్యాయేతి చాచార్యం వృద్ధం తాతేతి చైవ హి. 68**

**తా.** బ్రాహ్మణుని 'ఆర్యా' అనీ, రాజును 'మహారాజా' అనీ, ఆచార్యుని 'ఉపాధ్యాయా' అనీ, వృద్ధుణ్ణి 'తాతా' అని సంబోధించాలి.

**మూ. నామ్నా రాజేతి వా వాచ్యాః బ్రాహ్మణైస్తు నరాధిపాః,**
**తత్ క్షామ్యం హి మహీపాలైర్యస్మాత్పూజ్యా ద్విజాః స్మృతాః. 69**

**తా.** బ్రాహ్మణులు, రాజును పేరు పెట్టి కాని, రాజా అని కాని పిలవవచ్చు. రాజులు అందుకు సహించాలి; ఎందువల్ల ననగా ద్విజులు పూజ్యులు.

**మూ. బ్రాహ్మణైః సచివో వాచ్యో హ్యమాత్య సచివేతి వా,**
**శేషైరన్యైర్జనైర్వాచ్యో హీనైరార్యేతి నిత్యశః. 70**

**తా.** మంత్రిని బ్రాహ్మణులు 'అమాత్యా' అని కాని 'సచివా' అని కాని అనవచ్చు. మిగిలిన వాళ్లందరూ హీనులూ కూడ 'ఆర్యా' అనాలి.

**మూ. సమైః సంభాషణం కార్యం యేన నామ్నా స సంజ్ఞితః,**
**హీనైః సపరివారం తు నామ్నా సంభాష్య ఉత్తమః. 71**

**తా.** సములతో – వాని పేరుతో సంబోధించి సంభాషణం చెయ్యాలి. హీనులు ఉత్తముని పేరు, ఆతని పరివారం (వంశాదికం)పేరుతో కలిపి ఆతనిని సంబోధించాలి.

**మూ. నియోగాధికృతాశ్చైవ పురుషా యోషితస్తథా,**
**కారుకాః శిల్పినశ్చైవ సంభాష్యాస్తే తథైవ హి. 72**

**తా.** ఉద్యోగాలలో నియమితులైన పురుషులను, స్త్రీలను, ప్రతిమాదులు చేసే కారుకులను, చిత్రాదినిర్మాతలైన శిల్పులను, వాళ్ల వాళ్ల అధికారాదులను పట్టి, (అదికారాదు లను సూచించేపేర్లతో) సంబోధించాలి.

**మూ. మార్షో భావేతి వక్తవ్యః కించిదూనస్తు మార్షకః,**
**సమానోఽథ వయస్యేతి హంహో హణ్డేతి వాధమః. 74**

**తా.** మార్షుణ్ణి భావ అని సంబోధించాలి. మార్షునికంటె కొంచెం తక్కువవాడైన మార్షకుణ్ణి, సమానుణ్ణీ 'వయస్యా' అనీ, అధముణ్ణి 'హంహో' 'హండ' అనీ సంబోధించాలి.

**మూ. ఆయుష్మన్నితి వాచ్యస్తు రథీ సూతేన సర్వదా,**
**తపస్వీ చ ప్రశాన్తశ్చ సాధో ఇతి చ శబ్ద్యతే. 74**

**తా.** సారథి రథికుణ్ణి ఎల్లప్పుడు 'ఆయుష్మన్' అని సంబోధించాలి. ప్రశాంతుడైన వానిని, తపస్విని 'సాధో' అని సంబోధించాలి.

**మూ. స్వామీతి యువరాజస్తు కుమారో భర్తృదారకః,**
**సౌమ్య, భద్రముఖేత్యేవం హేపూర్వం చాధమం వదేత్. 75**

**తా.** యువరాజును 'స్వామీ' అని, రాజకుమారుణ్ణి, 'భర్తృదారక' అనీ, అధముణ్ణి "హే సౌమ్య, హే భద్రముఖ" అనీ సంబోధించాలి.

**మూ. యద్యస్య కర్మ శిల్పం వా విద్యా వా జాతిరేవ వా,**
**స తేన నామ్నా భాష్యో హి నాటకాదౌ ప్రయోక్తృభిః. 76**

**తా.** ఎవనిది ఏ పనియో, ఏ శిల్పమో, ఏ విద్యయో, ఏ జాతియో వానిని ఆ పేరుతోనే, నాటకాదులలో సంబోధించాలి.

**మూ. వత్స పుత్రక తాతేతి నామ్నా గోత్రేణ వా పునః,**
**వాచ్యః శిష్యః సుతో వాపి పిత్రా వా గురుణాపి వా. 77**

**తా.** తండ్రి పుత్రుణ్ణి, లేదా గురువు శిష్యుణ్ణి 'వత్సా' 'పుత్రకా', తాతా (నాయనా) అంటూ అసలు పేరుతో గాని, గోత్రం పేరుతో గాని పిలవాలి.

**మూ. సంభాష్యా శాక్యనిర్గ్రన్థా భదన్తేతి ప్రయోక్తృభిః,**
**ఆమన్త్రణైస్తు పాషణ్డాః శేషాః స్వసమయాశ్రితైః. 78**

**తా.** శాక్యులు (బౌద్ధసంన్యాసులను) నిర్గ్రంథులను (జైనసంన్యాసులను) 'భదన్త' అని సంబోధించాలి. మిగిలిన పాశుపతులు మొదలైన పాషండులను వాళ్ల వాళ్ల సిద్ధాంతాలకు సంబంధించిన 'భాపూషన్', 'భాసర్వజ్ఞ' ఇత్యాది పదాలతో సంబోధించాలి.

**మూ. దేవేతి నృపతిర్వాచ్యో భృత్యైః ప్రకృతిభిస్తథా,**
**భట్టేతి సార్వభౌమస్తు నిత్యం పరిజనేన హి. 79**

**తా.** రాజును వాని భృత్యులు, అమాత్యాది ప్రకృతులు 'దేవ' అని సంబోధించాలి. సార్వభౌముణ్ణి వాని పరిజనం, ఎల్లప్పుడు 'భట్ట' అని సంబోధించాలి.

**మూ. రాజన్నిత్యృషిభిర్వాచ్యో హ్యపత్యప్రత్యయేన వా,**
**వయస్య రాజన్నితి వా భవేద్వాచ్యో మహీపతిః. 80**
**విదూషకేణ, రాజ్ఞీ చ చేట్యా చ భవతీత్యపి.**

**తా.** ఋషులు, రాజును 'రాజన్' అని కాని, 'కౌరవ' ఇత్యాదివిధంగా అపత్య ప్రత్యయం చేర్చగా ఏర్పడిన పదాలతో కాని సంబోధించాలి. విదూషకును రాజును 'వయస్య' అని కాని, 'రాజన్' అని కాని సంబోధించాలి. రాణీని విదూషకుడు చేటీకూడ 'భవతి' అని సంబోధించాలి.

**మూ. నామ్నా వయస్యేత్యపి వా రాజ్ఞా వాచ్యో విదూషకః. 81**
**సర్వస్త్రీభిః పతిర్వాచ్య ఆర్యపుత్రేతి యౌవనే,**
**(అన్యదా పునరార్యేతి మహారాజేతి భూపతిః.) 82**

**తా.** రాజు విదూషకుణ్ణి వాని పేరుతో కాని 'వయస్య' అని కాని సంబోధించాలి. స్త్రీలందరు యౌవనంలో ఉన్న భర్తను ఆర్యపుత్ర అని సంబోధించాలి. (మరొకప్పుడైతే రాజును, 'ఆర్య' 'మహారాజ' అని సంబోధించాలి.)

**మూ. ఆర్యేతి పూర్వజో భ్రాతా వాచ్యః పుత్ర ఇవానుజః,**
**(యోషిద్భిరథ కామ్యేతి రాజపుత్రేతి యోధనైః). 83**

**తా.** తమ్ముడు అన్నగారిని 'ఆర్య' అని సంబోధించాలి. అన్న తమ్ముణ్ణి పుత్రుణ్ణి సంబోధించి నట్లు సంబోధించాలి. (స్త్రీలు రాజును 'కామ్య' అనీ, యోధులు రాజపుత్ర అనీ సంబోధించాలి.)

**మూ. పురుషాభాషణం హ్యేవం కార్యం నాట్యే ప్రయోక్తృభిః,**
**పునః స్త్రీణాం ప్రవక్ష్యామి యథాఽఽభాష్యాస్తు నాటకే. 84**

**తా.** నాట్యంలో, ప్రయోక్తలు, పురుషుల ఆభాషణం (పలకరింపు) ఎలా చెయ్యాలో చెప్పాను. ఇప్పుడు నాటకంలో, స్త్రీలను ఎలా పలకరించాలో చెపుతాను.

**మూ. తపస్విన్యో దేవతాశ్చ వాచ్యా భగవతీతి చ,**
**గురుభార్యా తు వక్తవ్యా స్థానీయా భవతీతి చ. 85**

**తా.** తాపసస్త్రీలను, దేవతాస్త్రీలను, 'భగవతీ' అని నిర్దేశించాలి. స్థానీయ అయిన, అనగా తనకంటె కొంచెం పెద్దదైన, గురుభార్యను (గురువు భార్యయైనా లేదా పూజ్యురాలైన మరొక స్త్రీయైనా) భవతీ అని సంబోధించాలి.

**మూ. గమ్యా భద్రేతి వాచ్యా వై వృద్ధామ్బేతి చ నాటకే,**
**రాజపత్న్యస్తు సంభాష్యాః సర్వాః పరిజనేన వై. 86**

**భట్టినీ స్వామినీ దేవీత్యేవం వై నాటకే బుధైః,**
**దేవీతి మహిషీ వాచ్యా రాజ్ఞా పరిజనేన వా. 87**

**తా.** గమ్యను (అనగా మాట్లాడడానికి తగిన స్త్రీని) 'భద్రే' అనీ, వృద్ధస్త్రీని 'అంబా' (అమ్మా) అనీ, సంబోధించాలి. రాజభార్యల నందరినీ పరిజనులు 'భట్టినీ' 'స్వామినీ', 'దేవీ' అని సంబోధించాలి లేదా నిర్దేశించాలి. పట్టమహిషిని రాజు, పరిజనమూ కూడ 'దేవి' అని సంబోధించాలి.

**మూ. భోగిన్యః పరిశిష్యాస్తు స్వామిన్య ఇతి వా పునః,**
**(కుమార్యశ్చైవ వక్తవ్యాః ప్రేష్యాభిః భర్తృదారికాః). 88**

**తా.** రాజుకు సంబంధించిన ఇతర భోగినీ స్త్రీలను, పరిచారకులు 'స్వామిని' అని సంబోధించాలి. (పరిచారికలు రాజకుమారీలను 'భర్తృదారికా' అనాలి.)

**మూ. స్వసేతి భగినీ వాచ్యా వత్సేతి చ యవీయసీ,**
**బ్రాహ్మణ్యార్యేతి వక్తవ్యా లిఙ్గస్థా వ్రతినీ తథా. 89**

**తా.** సోదరిని 'స్వసా' అనీ, చెల్లెలిని 'వత్సే' అనీ సంబోధించాలి. బ్రాహ్మణస్త్రీని, వ్రతదీక్షలో ఉన్న స్త్రీని, శైవ – శాక్తాదిలింగాలను (గుర్తులను) ధరించిన స్త్రీని 'ఆర్యా' అని సంబోధించాలి.

**మూ. పత్నీ చార్యేతి సంభాష్యా పితృనామ్నా సుతస్య సా,**
**సమానాభిస్తథా సఖ్యో హలేతి స్యాత్పరస్పరమ్. 90**

**తా.** భార్యను 'ఆర్యే' అని కాని, ఆమె తండ్రి పేరు చేర్చి (మాఠరపుత్రి! ఇత్యాది విధంగా) లేదా పుత్రుని పేరు చేర్చి 'సోమశర్మజనని!' ఇత్యాదివిధంగా గాని సంబోధించాలి. సమానమైన సఖురాళ్లు పరస్పరం 'హలా' అని సంబోధించుకోవాలి.

**మూ. ప్రేష్యా హఞ్జేతి వక్తవ్యా స్త్రియా యా తూత్తమా భవేత్,**
**అజ్జుకేతి చ వక్తవ్యా వేశ్యా పరిజనేన చ. 91**

**తా.** స్త్రీ, ఉత్తమమైన తన ప్రేష్యను (పరిచారికను) 'హఞ్జా' అని సంబోధించాలి. వేశ్యను ఆమె పరిజనం 'అజ్జుకా' అని నిర్దేశించాలి.

**మూ. అత్తేతి గణికామాతా వాచ్యా పరిజనేన హి,**
**ప్రియేతి భార్యా శృఙ్గారే వాచ్యా రాజ్ఞేతరేణ వా. 92**

**తా.** గణికామాతను, పరిజనం 'అత్తా' అని సంబోధించాలి. శృంగారంలో రాజూ, ఇతరులూ కూడ భార్యను 'ప్రియే' అని సంబోధించాలి.

**మూ. పురోధఃసార్థవాహానాం భార్యాస్త్వార్యేతి సర్వదా,**
**తల్లిఙ్గార్థాని నామాని కార్యాణి కవిభిః సదా. 93**

**తా.** పురోహితుల భార్యలను, సార్థవాహుల (వర్తకుల గుంపుల నాయకుల)

భార్యలను, ఎల్లప్పుడు (అన్ని వయస్సులలోను) 'ఆర్యా' అని సంబోధించాలి. కవులు ఆ యా స్త్రీపురుషులందరికీ వాళ్ల కుల – వృత్త్యాదులను సూచించే పేర్లు కల్పించాలి.

**మూ. ఔత్పత్తికాని యాని స్యుః న ప్రఖ్యాతాని నాటకే,**
**బ్రహ్మక్షత్రస్య నామాని గోత్రకర్మానురూపతః. 94**
**కావ్యే కార్యాణి కవిభిః శర్మవర్మకృతాని హి,**
**దత్తప్రాయాణి నామాని వణిజాం సంప్రయోజయేత్. 95**

**తా.** నాటకంలో – ప్రసిద్ధం కాని, పుట్టుకను పట్టి వచ్చే పేర్లు కల్పించాలి. ఉదాహరణకు – బ్రాహ్మణులకు, క్షత్రియులకు వాళ్ల గోత్రాలకు, పనులకు అనురూపమైన 'శర్మ' 'వర్మ' అను పదాలు జేర్చిన పేర్లూ, వర్తకులకు 'దత్త' అను పదం చేర్చిన పేర్లూ కల్పించాలి.

**మూ. (కాపాలికాస్తు ఘణ్టాన్తనామానః సముదాహృతాః)**
**శౌర్యోదాత్తాని నామాని తథా శూరేషు యోజయేత్. 96**

**తా.** (కాపాలికులకు, 'ఘంట' అను పదం చివర ఉన్న పేర్లు పెట్టాలి.) శూరులకు, శౌర్యాన్ని సూచించే, 'భీమపరాక్రమ' వంటి ఉదాత్తమైన పేర్లు పెట్టాలి.

**మూ. విజయార్థాని నామాని రాజస్త్రీణాం తు నిత్యశః,**
**దత్తా మిత్రా (చ) సేనేతి వేశ్యానామాని యోజయేత్. 97**

**తా.** రాజస్త్రీలకు శుభలక్షణాలను సూచించే 'విజయవతీ' వంటి పేర్లు పెట్టాలి. వేశ్యలకు 'దత్తా', 'మిత్రా' 'సేనా' మొదలైన పదాలు చేర్చిన 'దేవదత్తా' 'వసంతసేవా' 'విదగ్ధమిత్రా' మొదలైన పేర్లు పెట్టాలి.

**మూ. నానాకుసుమనామానః ప్రేష్యాః కార్యాస్తు నాటకే,**
**మఙ్గలార్థాని నామాని చేష్టానామపియోజయేత్. 98**

**తా.** నాటకంలో పరిచారికలకు అనేకవిధాలైన పుష్పాల పేర్లు – మాలతీ, మల్లికా, మంజరీ, చూతలతికా మొదలైనవి పెట్టాలి. ఇష్టులైనవాళ్లకు మంగళమైన అర్థాలు సూచించే 'సిద్ధార్థక' మొదలైన పేర్లు పెట్టాలి.

**మూ. గమ్భీరార్థాని నామాని హ్యుత్తమానాం ప్రయోజయేత్,**
**యస్మాన్నామానుసదృశం కర్మ తేషాం భవిష్యతి. 99**

**తా.** ఉత్తములకు గంభీరార్థకము లైన "అక్షోభ్య" ఇత్యాది నామధేయాలు పెట్టాలి. ఎందుచేత ననగా – వాళ్లు తమ జీవితంలో తమ పేర్లకు తగిన పనులే చేస్తారు.

**వి.** పేరు కున్న ప్రాధాన్యం వివరిస్తూ అ.గు. – **"నామ కిల ఈశ్వరేచ్ఛావశాత్స్వరూప క్రోడీకారేణైవ జాయతే. తథాహి నామాక్షరే గ్రహాభిచారయన్త్రకర్మాదిపీడితే, శాన్తికపౌష్టి కాద్యుపచారభాజి వా తథైవ పురుషస్య ఫలోదయ ఇత్యభిప్రాయః"** – ఒకనికి వాని స్వరూపస్వభావాదు లన్నింటినీ క్రోడీకరించిన పేరే, ఈశ్వరేచ్ఛచేత, పెట్టడం జరుగుతుంది. అందుచేతనే పేర్లో ఉన్న అక్షరాన్ని గ్రహంచేత గాని, అభిచారయంత్రంచేత గాని, ఇతర ప్రక్రియచేత పీడించినప్పుడూ, లేదా దానికి శాంతి – పౌష్టికాదికర్మలు చేసినప్పుడూ కూడ పురుషునికి తదనుగుణంగానే ఫలం కలగడం కనబడుతూన్నది" అన్నాడు.

**మూ. జాతిచేష్టానురూపాణి శేషాణామపి కారయేత్,**
**నామాని పురుషాణాం తు స్త్రీణాం చోక్తాని తత్త్వతః. 100**

**తా.** పురుషులకు స్త్రీలకూ కూడ వాళ్ల జాతులకు, చేష్టలకు అనురూపమైన పేర్లు పెట్టాలి అవన్నీ ఎలా ఉండాలో ఇంతవరకు చెప్పబడ్డాయి.

**మూ. ఏవం నామవిధానం తు కర్తవ్యం కవిభిః సదా,**
**ఏవం భాషావిధానం తు జ్ఞాత్వా కర్మాణ్యశేషతః. 101**

**తా.** పైన చెప్పిన విధంగా కవులు పేర్లు పెట్టాలి. అదే విధంగా, వెనుక చెప్పిన భాషల ప్రయోగవిధానం అనుసరిస్తూ అన్ని కర్తవ్యాలు నిర్వర్తించాలి.

**మూ. పాఠ్యగుణానిదీనాం వక్ష్యామః; తద్యథా – సప్త స్వరాః; త్రీణి స్థానాని, చత్వారో వర్ణాః, ద్వివిధా కాకుః, షడలఙ్కారాః, షడఙ్గానీతి.**

**ఏషామిదానీం లక్షణమభివ్యాఖ్యాస్యామః. తత్ర సప్త స్వరా నామ – షడ్జ – ఋషభ – గాన్ధార – మధ్యమ – పఞ్చమ – ధైవత. నిషాదాః. త ఏతే రసేషూ త్పాద్యాః . యథా –**

**తా.** ఇప్పుడు పాఠ్యగుణాలను (పాఠ్యానికి ఉపకరించే వాటిని గూర్చి) చెపుతాం. అది ఏవనగా – ఏడు స్వరాలు, మూడు స్థానాలు, నాలుగు వర్ణాలు, రెండు విధాలైన కాకువు, ఆరు అలంకారాలు, ఆరు అంగాలు ఇవి పాఠ్యగుణాలు).

ఇప్పుడు వీటి లక్షణాలు వ్యాఖ్యానిస్తాం. షడ్జము, ఋషభము, గాంధారము, మధ్యమమూ, పంచమము, ధైవతము, నిషాదము అనేవి ఏడు స్వరాలు. వీటిని ఆ యా రసాలలో వినియోగించాలి. ఎట్లనగా –

**మూ. తతః పాఠ్యం ప్రయుఞ్జీత షడలఙ్కారసంయుతమ్,**
**హాస్యశృఙ్గారయోః కార్యౌ స్వరౌ మధ్యమపఞ్చమౌ. 103**

**షడ్జర్షభౌ తథా చైవ వీరరౌద్రాద్భుతేష్వథ,**
**గాన్ధారశ్చ నిషాదశ్చ కర్తవ్యౌ కరుణే రసే.** **104**
**ధైవతశ్చైవ కర్తవ్యో బీభత్సే సభయానకే.**

**తా.** పిమ్మట ఆరు అలంకారాలతో కూడిన పాఠ్యం ప్రయోగించాలి. హాస్య – శృంగారరసాలలో మధ్యమ – పంచమస్వరాలు, వీర – రౌద్ర – అద్భుతరసాలలో షడ్జ – ఋషభస్వరాలు, కరుణరసంలో గాంధార – నిషాదస్వరాలు, బీభత్స – భయానక రసాలలో ధైవతము ఉపయోగించాలి.

**మూ. త్రీణి స్థానాని – ఉరః, కణ్ఠః, శిర ఇతి. భవత్యపి చ –**
**శారీర్యామథ వీణాయాం త్రిభ్యః స్థానేభ్య ఏవ తు,**
**ఉరసః శిరసః కణ్ఠాత్ స్వరః కాకుః ప్రవర్తతే.** **105**

**తా.** ఉరస్సు (వక్షఃస్థలం), కంఠము, శిరస్సు అని మూడు స్థానాలు. ఈ సందర్భంలో శ్లోకం ఉంది – శరీరవీణలోని ఉరస్సు, శిరస్సు, కంఠము అను మూడు స్థానాలనుండి కాకుస్వరం బయలుదేరుతుంది.

**మూ. ఆభాషణం చ దూరస్థే శిరసా సంప్రయోజయేత్,**
**నాతిదూరే చ కణ్ఠేన హ్యురసా చైవ పార్శ్వతః.** **106**

**తా.** దూరంగా ఉన్నవానితో మాటలాడేటప్పుడు ఆభాషణం శిరస్సుతో, తారనాదంతో చెయ్యాలి. తక్కువ దూరంలో ఉన్నవానితో కంఠంతో, మధ్యనాదంతో చెయ్యాలి. ప్రక్కనే ఉన్నవానితో ఉరస్సుతో మంద్రనాదంతో, చెయ్యాలి.

**మూ. ఉరసోదాహృతం వాక్యం శిరసా దీపయేద్బుధః,**
**కణ్ఠేన శమనం కుర్యాత్పాఠ్యయోగేషు సర్వదా.** **107**

**తా.** పాఠ్యాల విషయంలో, బుధుడు, వక్షఃస్థలం ద్వారా మీదికి తీసికొనివచ్చిన వాక్యాన్ని శిరస్సుచేత ప్రదీపింపచెయ్యాలి – తీవ్రం చెయ్యాలి. కంఠంచేత దానిని శమింప చెయ్యాలి.

**మూ. ఉదాత్తశ్చానుదాత్తశ్చ స్వరితః కమ్పితస్తథా,**
**వర్ణాశ్చత్వార ఏవ స్యుః పాఠ్యయోగే తపోధనాః.** **108**

**తా.** తపోధనులారా! పాఠ్యంలో ఉదాత్తము, అనుదాత్తము, స్వరితము, కంపితము అని నాలుగు విధాలైన వర్ణా లుంటాయి.

**మూ. తత్ర హాస్యశృఙ్గారయోః స్వరితోదాత్తైః వర్ణైః పాఠ్యముపపాద్యమ్. వీరరౌద్రాద్భుతేషూ దాత్తకమ్పితైః, కరుణబీభత్స భయానకేషు అనుదాత్తస్వరితకమ్పితైరితి. ద్వివిధా కాకుః సాకాఙ్క్షా, నిరాకాఙ్క్షా చేతి; వాక్యస్య సాకాఙ్క్షనిరాకాఙ్క్షత్వాత్.**

**తా.** హాస్యశృంగారరసాలలో, పాఠ్యం స్వరితోదాత్తవర్ణాలతో ఏర్పరచాలి. వీరరౌద్ర అద్భుతరసాలలో ఉదాత్త – కంపితవర్ణాలతోను, కరుణ– బీభత్స – భయానకాలలో అనుదాత్తస్వరితకంపితస్వరాలతోను ఏర్పరచాలి.

వాక్యం సాకాంక్షం గాను, నిరాకాంక్షం గాను ఉండడాన్ని పట్టి కాకువు కూడ సాకాంక్షం గాను, నిరాకాంక్షం గాను ఉంటుంది.

**మూ. అనియుక్తార్థకం వాక్యం సాకాఙ్క్షమితి సంజ్ఞితమ్,**
**నియుక్తార్థం తు యద్వాక్యం నిరాకాఙ్క్షం తదుచ్యతే. 110**

**తా.** ఇంకా చెప్పవలసినది ఏదో మిగిలిపోయి నట్లుండడంచేత, అర్థం నిశ్చితం కాని (పూర్తి కాని) వాక్యం **సాకాంక్షం**. నిశ్చితమైన అర్థం గలది **నిరాకాంక్షం**.

**మూ. తత్ర సాకాఙ్క్షం నామ తారాది మన్ద్రాన్తమ్, అనియుక్తార్థమ్ అనిర్యాతితవర్ణాలఙ్కారం, కణ్ఠోరః స్థానగతమ్. నిరాకాఙ్క్షం నామ నియుక్తార్థం, నిర్యాతితవర్ణాలఙ్కారం, శిరఃస్థానగతం మన్ద్రాదితారాన్తమితి.**

**తా.** తారనాదంతో మొదలై మంద్రనాదంతో సమాప్తి చెందేది, అనిశ్చితమైన అర్థం గలది. వర్ణాలంకారాలు పూర్తికానిది కంఠ – ఉరఃస్థానములం దున్నది అయిన కాకువు సాక్షాంక్షకాకువు. నిశ్చితార్థము, వర్ణాలంకారాలు పూర్తి యైనది, శిరఃస్థానం దగ్గర ఉన్నది, మంద్రంతో మొదలై తారనాదంతో అంత మైన కాకువు నిరాకాంక్షకాకువు.

**మూ. అథ షడలంకారా నామ –**
**ఉచ్చో దీప్తశ్చ మన్ద్రశ్చ నీచో ద్రుతవిలమ్బితౌ,**
**పాఠ్యస్యైతే హ్యలంకారా లక్షణం చ నిబోధత. 112**

**తా.** ఆరు ఆరలంకారా లేవి అనగా –

ఉచ్చము, దీప్తము, మంద్రము, నీచము, ద్రుతము, విలంబితము – ఇవి ఆరు పాఠ్యాలంకారాలు. వీటి లక్షణాలు తెలుసుకొనండి.

**మూ. ఉచ్చో నామ శిరఃస్థానగతః తారస్వరః. స చ దూరభాషణ – విస్మయ – ఉత్తరోత్తర జల్ప – దూరాహ్వాన – త్రాసన – ఆబాధాద్యేషు. దీప్తో నామ శిరఃస్థానగతః తార తరః . స చ ఆక్షేప – కలహ – వివాద – అమర్ష – క్రుష్ట – ఆఘర్షణ – క్రోధ – శౌర్య – దర్ప – తీక్షరూక్షాభిధాన – నిర్భర్త్సన – ఆక్రన్దితాదిషు. మన్ద్రో నామ ఉరఃస్థాన గతః . నిర్వేద – గ్లాని – చిన్తా – ఔత్సుక్య – దైన్య – వ్యాధి – క్రీడా – గాఢశస్త్రక్షత – మూర్ఛా – మద – గుహ్యార్థవచనాదిషు.**

**తా.** శిరఃస్థానంలో ఉన్న తారస్వరం ఉచ్చం. దూరలో ఉన్నవాళ్లతో మాటలాడడం,

ఆశ్చర్యం, ఒకరి తరువాత ఒకరు పోటీపడుతున్నట్లు మాటలాడడం, దూరంనుండి పిలవడం, భయపెట్టడం, నలిగిపోవడం మొదలైన సమయాలలో దాని ప్రయోగం చేయబడుతుంది. శిరఃస్థానమునందే ఉన్న తారతరమైన స్వరం దీప్తం. ఆక్షేపించడం (నిందించడం), కలహం, వివాదం, అమర్షం, తిట్టడం, తోపులాట, క్రోధము, శౌర్యము, దర్పము, తీక్ష్ణంగాను కటువుగాను మాటలాడడం, అరవడం మొదలైనవాటిలో దీని ప్రయోగం. ఉరఃస్థానంలో ఉన్న స్వరం మంద్రం. నిర్వేదం, శ్రమ, చింత, ఔత్సుక్యం, దైన్యం, వ్యాధి, క్రీడ, గాఢమైన శస్త్రప్రహారం, మూర్ఛ, మత్తు, రహస్యం చెప్పడం మొదలైన సమయాలలో దీని ప్రయోగం.

**మూ. నీచో నామ ఉరఃస్థానగతః మన్ద్రతరః. స చ స్వభావాభాషణ – వ్యాధి – శమ – శ్రమార్త – త్రస్త – పతిత – మూర్ఛితాదిషు. ద్రుతో నామ కణ్ఠగతః. స చ త్వరితః లల్లన – మన్మన – భయ – శీత – జ్వర – త్రాస – ఆయస్త – ఆత్యయికకార్యావేదనాదిషు. విలమ్బితో నామ కణ్ఠస్థానగతః, తనుమన్ద్రః. స చ శృఙ్గార – కరుణ – వితర్కిత – విచార – అమర్ష – అసూయిత – అవ్యక్తార్థప్రవాద – లజ్జా – చిన్తా – తర్జన – విస్మయ – దోషానుకీర్తన – దీర్ఘరోగనిపీడనాదిషు.**

**తా.** ఉరఃస్థానంలో ఉండే, ఎక్కువ మంద్రమైన స్వరం నీచం. స్వాభావికమైన భాషణము, వ్యాధి, శమము, పీడితుడు, భయపడినవాడు, పతితుడు, మూర్ఛితుడు – వీటి విషయంలో దీని ప్రయోగం. కంఠగతమై, శీఘ్రమైన స్వరం ద్రుతం. లల్లనం (సవిలాసమైనది), మన్మనం (అవ్యక్తము), భయము, చలి, జ్వరము, త్రాసము, ఆయాసము, ఆత్యయికమైన (హఠాత్తుగా వచ్చిన ఆపదకు సంబంధించిన) కార్యాన్ని గూర్చి తెలపడం మొదలైనవాటిలో దీని వినియోగం. కంఠస్థానంలో ఉన్న చాల మంద్రంగా ఉన్న స్వరం విలంబితం. శృంగార – కరుణరసాలు, ఇదా అదా అను ఆలోచన, విచారం, అమర్షం, అసూయ, అర్థం స్పష్టంగా తెలియకుండా మాటలాడడం, లజ్జ, చింత, భయపెట్టడం, ఆశ్చర్యం, దోషాలు చెప్పడం, దీర్ఘరోగబాధ మొదలైనవాటిలో దీని ప్రయోగం.

**మూ. అత్రానువంశ్యాః శ్లోకాః భవన్తి –**

**ఉత్తరోత్తరసంజల్పపరుషాక్షేపణేషు చ,**
**తీక్ష్ణరూక్షాభినయనే ఆవేగే క్రన్దితే తథా. 115**

**పరోక్షస్య సమాహ్వానే తర్జనే త్రాసనే తథా,**
**దూరస్థాభాషణే చైవ తథా నిర్భర్త్సనేషు చ. 116**

**భావేష్వేతేషు నిత్యం హి నానారసమాశ్రయా,**
**ఉచ్చా దీప్తా ద్రుతా చైవ కాకుః కార్యా ప్రయోక్తృభిః. 117**

**తా.** ఈ విషయంలో కొన్ని అనుంశ్యశ్లోకా లున్నాయి –

ఒకరికంటె ఒకరు బిగ్గరగా మాట్లాడడం, పరుషంగా నిందించడం, తీక్ష్ణంగాను తీవ్రంగాను చేసే అభినయం, ఆవేగం (మనస్సులో కంగారు), అరవడం, కనబడకుండా ఉన్నవానిని పిలవడం, జడిపించడం, భయపెట్టడం, దూరంగా ఉన్నవానితో మాట్లాడడం, ఏం చేస్తానో చూడు అంటూ నిర్భర్త్సనం – ఈ భావాలలో, వివిధరసాలకు సంబంధించిన ఉచ్చ– దీప్త – ద్రుతకాకువులు నాట్యప్రయోక్తలు ప్రయోగించాలి.

**మూ. వ్యాధితే చ జ్వరార్తే చ భయార్తే శీతవిప్లుతే,**
**నియమస్థే వితర్కే చ గాఢశస్త్రక్షతేషు చ. 118**
**గుహ్యార్థవచనే చైవ చిన్తాయాం తపసి స్థితే,**
**మన్ద్రా నీచా చ కర్తవ్యా కాకుః నాట్యప్రయోక్తృభిః. 119**

**తా.** వ్యాధితోను, జ్వరంతోను బాధపడుతున్నవాడు, భయపీడితుడు, చలితో బాధపడుతున్నవాడు, నియమంలో ఉన్నవాడు, ఇటా అటా అను ఆలోచన, గాఢమైన శస్త్రప్రహారం, రహస్యమైన విషయాలు చెప్పడం, చింత, తపస్సులో ఉన్నవాడు – ఈ సందర్భాలలో, నాట్యప్రయోక్తలు మంద్ర నీచకాకువులు ప్రయోగించాలి.

**మూ. లల్లే చ మన్మనే చైవ భయార్తే శీతవిప్లుతే**
**మన్ద్రా ద్రుతా చ కర్తవ్యా కాకు ర్నాట్యప్రయోక్తృభిః. 120**

**తా.** విలాసగా మాటలాడడం, అవ్యక్తంగా మాటలాడడం, భయార్తి, శీతబాధ – వీటిలో నాట్యప్రయోక్తలు మంద్ర – ద్రుతకాకువులు ప్రయోగించాలి.

**మూ. దృష్టనష్టానుసరణే ఇష్టానిష్టశ్రుతే తథా,**
**ఇష్టార్థఖ్యాపనే చైవ చిన్తాధ్యానే తథైవ చ. 121**
**ఉన్మాదేఽసూయితే చైవ ఉపాలమ్భే తథైవ హి,**
**అవ్యక్తార్థప్రవాదే చ కథాయోగే తథైవ చ. 122**
**ఉత్తరోత్తరసంజల్పే కార్యేఽతిశయసంయుతే,**
**వికృతౌ వ్యాధితే క్రోధే దుఃఖే శోకే తథైవ చ. 123**
**విస్మయామర్షయోశ్చైవ ప్రకర్షే పరిదేవితే,**
**విలమ్బితా చ దీప్తా చ కాకుర్మన్ద్రా చ వై భవేత్. 124**

**తా.** కనబడి వెంటనే కనబడకుండా పోయినదానిని వెదకడం, ఇష్టమైనది గాని అనిష్టమైనది గాని వినడం, ఇష్టమైన విషయం చెప్పడం, చింత, ధ్యానం, ఉన్మాదం, అసూయ, నింద, స్పష్టంగా అర్థం కాని సంభాషణ, కథ చెప్పడం, ఒకనికన్న ఒకరు

గట్టిగా మాట్లాడడం, ఏదో ఒక విశిష్టమైన పని చేయవలసిన అవసరం ఏర్పడడం, అంగవికారం, వ్యాధి, క్రోధం, దుఃఖం, శోకం, ఆశ్చర్యం, అమర్షం, అతిసంతోషం, ఏడ్పు – వీటిలో విలంబిత కాకువును, మంద్రకాకువును ప్రయోగించాలి.

**మూ. లఘ్వక్షరప్రాయకృతే గుర్వక్షరకృతే తథా,**
**ఉచ్చా దీప్తా చ కర్తవ్యా కాకుస్తత్ర ప్రయోక్తృభిః. 125**

**తా.** లఘువులు అధికంగా ఉన్న పాఠ్యంలోను, గురువు లున్న పాఠ్యంలోను నాట్యప్రయోక్తలు ఉచ్చకాకువు, దీప్తకాకువు ప్రయోగించాలి.

**మూ. యాని సౌమ్యార్థయుక్తాని సుఖభావకృతాని చ,**
**మన్ద్రా విలమ్బితా చైవ తత్ర కాకుర్విధీయతే. 126**

**తా.** ఆనందకరమైన అర్థం ఉన్న, సుఖకరమైన భావాలతో కూడిన పాఠ్యాలలో మంద్రకాకువు, విలంబితకాకువు ప్రయోగించాలి.

**మూ. యాని స్యుస్తీక్ష్ణరూక్షాణి దీప్తా చోచ్చా చ తేష్వపి,**
**ఏవం నానాశ్రయోపేతం పాఠ్యం యోజ్యం ప్రయోక్తృభిః. 127**

**తా.** తీక్ష్ణంగాను, కటువుగాను ఉన్న పాఠ్యాలకు దీప్తకాకువు, ఉచ్చకాకువు ఉపయోగించాలి. ఈ విధంగా నాట్యప్రయోక్తలు వేరు వేరు కాకువులతో పాఠ్యం ప్రయోగించాలి.

**మూ. హాస్యశృఙ్గారకరుణేష్విష్టా కాకుర్విలంబితా,**
**వీరరౌద్రాద్భుతేషూచ్చా దీప్తా వాపి ప్రశస్యతే. 128**

**తా.** హాస్య – శృంగార – కరుణరసాలలో విలంబితకాకువు, వీర – రౌద్ర – అద్భుతరసాలలో ఉచ్చకాకువుగాని, దీప్తకాకువు గాని ప్రశస్త మైనది.

**మూ. భయానకే సబీభత్సే ద్రుతా నీచా చ కీర్తితా,**
**ఏవం భావరసోపేతా కాకుః కార్యా ప్రయోక్తృభిః. 129**

**తా.** భయానక – బీభత్సరసాలలో ద్రుతకాకువు, నీచకాకువు ప్రయోగించాలి. ఈ విధంగా నాట్య ప్రయోక్తలు భావరసాలకు అనుగుణ మైన కాకువును ప్రయోగించాలి.

**మూ. అథ అఙ్గాని షట్ – విచ్ఛేదః, అర్పణమ్, విసర్గః, అనుబన్ధః, దీపనం, ప్రశమనమితి. తత్ర విచ్ఛేదో నామ విరామకృతః, అర్పణం నామ లీలాయమానమధురవల్గునా స్వరేణ పూరయతేవ రఙ్గం యత్పఠ్యతే తదర్పణమ్. విసర్గో నామ వాక్యన్యాసః. అనుబన్ధో నామ పదాన్తరేష్వవిచ్ఛేదః, అనుచ్ఛ్వసనం వా. దీపనం నామ త్రిస్థానశోభి వర్ధమానస్వరం**

**చేతి. ప్రశమనం నామ తారగతానాం స్వరాణాం ప్రశామ్యతామ్ అవైస్వర్యేణ అవ తారణమితి.**

**తా.** ఇపుడు ఆరు అంగాలు – విచ్ఛేదం, అర్పణం, విసర్గం, అనుబంధం, దీపనం, ప్రశమనం అని ఇవి ఆరు. **విచ్ఛేదం** అనేది విరామంచేత, చదువుతూ మధ్య ఆపడంచేత, ఏర్పడుతుంది. మధురమైన, సకుమారమైన స్వరంతో ఆడుకొంటూన్నట్లు, నాట్యరంగా న్నంతనీ ముంచెత్తుతూన్నట్లు పాఠ్యం గానం చేయడం, లేదా ఉచ్చరించడం **అర్పణం.** వాక్యాల చక్కని కూర్పు **విసర్గం.** పదాల అంతాలలో కూడ విచ్ఛేదం చేయకపోవడం, లేదా శ్వాస తీసికోకపోవడం **అనుబంధం.** మూడు స్థానాలలో (ఉరఃకంఠశిరస్సులలో) శోభిస్తూన్న స్వరం క్రమంగా పైకి లేపడం **దీపనం.** తారస్థాయికి చేరిన స్వరాన్ని శమింప చేస్తూ, అపస్వరాలు, వికృతస్వరాలు లేకుండా మెల్లగా క్రిందికి దింపడం **ప్రశమనం.**

**మూ. ఏషాం చ రసగతః ప్రయోగః – తత్ర హాస్యశృఙ్గారయోః అర్పణవిచ్ఛేదదీపన ప్రశమనయుక్తం పాఠ్యం కార్యమ్. దీపనప్రశమనయుక్తం కరుణే. విచ్ఛేదప్రశమనదీపన అనుబన్ధబహులం వీరరౌద్రాద్భుతేషు. విసర్గవిచ్ఛేదయుక్తం బీభత్సభయానకయోరితి. సర్వేషామప్యేషాం మన్ద్రమధ్యతారకృతః ప్రయోగః త్రిస్థానగతః. తత్ర దూరస్థాభాషణే తారం శిరసా, నాతిదూరం మధ్యం కణ్ఠేన. పార్శ్వతో మన్ద్రమురసా ప్రయోజయేత్ పాఠ్యమితి. మన్ద్రాత్తారం న గచ్ఛేత్ తారాద్వా మన్ద్రమితి.**

**తా.** ఆ యా రసాలలో వీటి ప్రయోగం ఇలా చెయ్యాలి – హాస్యశృంగారరసాలలోని పాఠ్యం అర్పణ – విచ్ఛేద – దీపన – ప్రశమనాలతో కలిసి ఉండాలి. కరుణరసంలో పాఠ్యం దీపన – ప్రశమనాలతో కలిసి ఉండాలి. వీర – రౌద్ర – అద్భుతరసాలలో విచ్ఛేద – ప్రశమన – దీపన – అనుబంధాలు ఉండాలి. బీభత్స – భయానకాలలో విసర్గ – విచ్ఛేదాలు ప్రయోగించాలి. వీటి అన్నింటినీ కూడ స్థానత్రయంతో సంబంధించిన మంద్ర – మధ్య – తారనాదాలతో ప్రయోగించాలి. దూరంలో ఉన్నవానితో మాట్లాడే టప్పుడు శిరః స్థానంచేత తారము, కొంచెం దూరంలో ఉన్నవానితో కంఠంచేత మధ్యమూ, ప్రక్కనే ఉన్నవానితో ఆభాషణంలో ఉరస్సుతో మంద్రమూ కూర్చాలి. మంద్రంనుంచి (మధ్యం స్పృశించకుండా) హటాత్తుగా తారానికి వెళ్లకూడదు, తారంనుంచి హటాత్తుగా మంద్రానికి దిగకూడదు.

**మూ. ఏషాం చ ద్రుత – మధ్య – విలమ్బితాస్త్రయో లయాః రసేషూపయోజ్యాః. తత్ర హాస్య – శృఙ్గారయోః మధ్యలయః, కరుణే విలమ్బితః, వీరరౌద్రాద్భుతబీభత్సభయానకేషు ద్రుత ఇతి.**

**తా.** వీటికి రసాలను పట్టి, ద్రుత - మధ్య - విలంబితలయలు మూడూ ఉపయోగించాలి. హాస్యశృంగారాలలో మధ్యలయ, కరుణలో విలంబితం, వీర - రౌద్ర - అద్భుత బీభత్స - భయానకాలలో ద్రుతలయ ఉపయోగించాలి.

**మూ. అథ విరామః అర్థసమాప్తౌ కార్యవశాత్, న ఛన్దోవశాత్, కస్మాత్? దృశ్యన్తే హ్యేక ద్విత్రిచతురక్షరాః విరామాః, యథా -**

**కిం? గచ్ఛ, మా విశ సుదుర్జన! వారితోఽసి**
**కార్యం త్వయా న మమ సర్వజనోపభుక్త,**
**సూచాసు చాఙ్కురగతే చ తథోపచారే**
**స్వల్పాక్షరాణి హి పదాని భవన్తి కావ్యే. 132**

**తా.** ఇపుడు విరామాన్ని గూర్చి - ఒక అర్థం పూర్తి అవగానే అవసరాన్ని పట్టి విరామం ఉపయోగించాలి. అంతే కాని ఛందస్సును పట్టి కాదు. అనగా ఛందస్సులోని ఒక పాదమో, శ్లోకార్థమో పూర్తి అయినప్పుడే విరామం అని అనుకొనగూడదు. ఎందువల్ల ననగా - ఒకటి - రెండు - మూడు - నాలుగు అక్షరాలలోనే విరామాలు కనబడు తున్నాయి. ఎట్లనగా - "ఏమిటి! చాలచెడ్డవాడా! వెళ్లు, లోపలికి రాకు. నిన్ను నిషేధిస్తున్నాను. అందరిచేతా అనుభవింపబడినవాడా! నీతో నాకేమీ పని లేదు" (కుపిత యైన నాయిక ఇంటికి వచ్చిన ప్రియునితో పలికిన మాటలు ఇవి).

"ఈ విధంగా 'సూచ'లలోను అంకురానికి సంబంధించినదానియందూ, ఉపచారం (ఉపచారంకోసం చెప్పే మాటలలోను) కావ్యంలో స్వల్పమైన అక్షరా లున్న పదాలు ఉంటాయి కదా." అక్కడ విరామాలు చేయవలసి ఉంటుంది కదా అనిభావం (సూచా అంకురం ఇవి అభినయవిశేషాలు, ముస్ముందు చెపుతాడు).

**మూ. ఏవం విరామే ప్రయత్నోఽనుష్ఠేయః, కస్మాత్? విరామో హ్యర్థానుదర్శకః. స్తః అత్ర శ్లోకా -**

**విరామేషు ప్రయత్నో హి నిత్యం కార్యః ప్రయోక్తృభిః,**
**కస్మాత్; అభినయో హ్యస్మిన్నర్థాపేక్షీ యతః స్మృతః. 133**
**యత్ర వ్యగ్రావుభౌ హస్తౌ తత్ర దృష్టిసమన్వితః,**
**వాచికాభినయః కార్యో విరామైరర్థదర్శకైః. 134**

**తా.** ఈ విధంగా విరామం విషయంలో ప్రయత్నం చెయ్యాలి. ఎందువల్ల? ఎందువల్లనంటే విరామం అర్థాన్ని స్పష్టంగా చూపుతుంది (బోధిస్తుంది). ఈ సందర్భంలో రెండు శ్లోకా లున్నాయి.

నాట్యప్రయోక్తలు ఎల్లప్పుడూ విరామాల విషయంలో ప్రయత్నం చెయ్యాలి. ఎందువల్ల? ఎందువల్లననగా, నాట్యంలో అభినయం అనేది అర్థంమీద ఆధారపడి ఉంటుంది.

రెండు చేతులు ఆంగికాభినయంలో వ్యాపృతములై ఉన్నప్పుడు (పనిలో ఉన్నప్పుడు) దృష్టులు కూడ కలిపి, అర్థాన్ని స్పష్టీకరించే విరామాలతో వాచికాభినయం చెయ్యాలి.

**మూ. ప్రాయో వీరే చ రౌద్రే చ కరౌ ప్రహరణాకులౌ,**
**బీభత్సే కుత్సితత్వాచ్చ భవతః కుఞ్చితౌ కరౌ. 135**
**హాస్యే చోద్దేశమాత్రేణ కరుణే చ ప్రలమ్బితౌ**
**అద్భుతే విస్మయాత్ స్తబ్ధౌ భయాచ్చైవ భయానకే. 136**
**ఏవమాదిషు చాన్యేషు ప్రవిచారేఽథ హస్తయోః,**
**అలంకారవిరామాభ్యాం సాధ్యతే హ్యర్థనిశ్చయః. 137**

**తా.** సాధారణంగా వీర – రౌద్రాలలో చేతులు ఆయుధాలతో వ్యాకులములై ఉంటాయి (వాటిపనిలో ఉంటాయి). బీభత్సంలో, అది కుత్సితం అవడంవల్ల కరాలు కుంచితములై ఉంటాయి.

హాస్యంలో అవి దేనికేసో చూపిస్తూంటాయి. కరుణరసంలో వ్రేలాడుతుంటాయి. అద్భుతంలో ఆశ్చర్యంవల్ల కదలకుండా ఉండిపోతాయి. భయానకంలో కూడ భయంచేత కదలకుండా ఉండిపోతాయి.

ఇలాంటివాటిలో అన్నింటిలోను హస్తాలు మరొకపనిలో ఉన్నప్పుడు అలంకారాల చేత, విరామంచేతా అర్థనిశ్చయం సాధించవలసి ఉంటుంది.

**మూ. యే విరామాః స్మృతా వృత్తే తేష్వలంకార ఇష్యతే,**
**సమాప్తేఽర్థే పదే వాపి తథా ప్రాణవశేన వా. 138**

**తా.** వృత్తంలో చెప్పిన విరామాల దగ్గర అలంకారం (ఉచ్చదీప్తాదికం) ఉండాలి. అర్థం సమాప్త మైనప్పుడు పదంమీద విరామం ఇవ్వవచ్చు. లేదా శ్వాసపీల్చుకొనే అవసరాన్ని పట్టి విరామం ఇవ్వవచ్చు.

**మూ. పదవర్ణసమాసే చ ద్రుతే బహ్వర్థసంకటే,**
**కార్యో విరామః పాదాన్తే తథా ప్రాణవశేన వా. 139**
**శేషమర్థవశేనైవ విరామం సంప్రయోయజేత్.**

**తా.** పదవర్ణాదులు కలిసిపోయిన చోట, ద్రుతవృత్తి అవలంబించినప్పుడు, అనేక

అర్థాలు కలిసి ఉన్నప్పుడు పాదాంతంలో విరామం చెయ్యాలి. లేదా శ్వాససౌకర్యాన్ని పట్టి చెయ్యాలి.

పైన చెప్పిన సందర్భాలలో తప్ప ఇతరసమయాలలో విరామం అర్థాన్ని పట్టి మాత్రమే చెయ్యాలి.

**మూ. అత్ర చ భావగతాని రసగతాని చ కృష్యాక్షరాణి బోద్ధవ్యాని, తద్యథా –**
**అకారైకారసంయుక్తమైకారౌకారసంయుతమ్,**
**వ్యఞ్జనం యద్భవేద్దీర్ఘం కృష్యం తత్తు విధీయతే. 140**

**తా.** ఈ సందర్భంలో భావాలకు రసాలకూ సంబంధించిన కృష్యాక్షరాలను గూర్చి తెలుసుకోవాలి. 'ఆ' కార 'ఏ' కారాలతోను, 'ఐ' కార 'ఔ' కారాలతోను కూడిన దీర్ఘ వ్యంజనం కృష్య మని చెప్పబడుతూన్నది.

**వి.** 'కృష్యం' అనగా సాగదీయవలసినది అని అర్థం. విలంబితలయానికి అనుకూల మైన, ఏ ఐ ఓ ఔ అను సంధ్యక్షరాలు, ఆ ఈ ఊ అను దీర్ఘాక్షరాలు (అ.భా.)

**మూ. విషాదే చ వితర్కే చ ప్రశ్నే వామర్ష ఏవ చ,**
**కలాకాలప్రమాణేన పాఠ్యం కార్యం ప్రయోక్తృభిః. 141**

**తా.** విషాదము, వితర్కము, ప్రశ్న, అమర్షము వీటియందు, నాట్యప్రయోక్తలు కలారూపమైన కాలం ప్రమాణంచేత (ఇన్ని కలలకాలం అను పద్ధతిని అవలంబించి) పాఠ్యం చెయ్యాలి.

**మూ. శేషాణామర్థయోగేన విరామే విరమేదిహ,**
**ఏకద్విత్రిచతుఃపఞ్చషట్కలం చ విలమ్బితమ్. 142**

**తా.** మిగిలిన ప్రదేశాలలో అర్థసంబంధాన్ని పట్టి విరామం చేయవలసిన చోట విరమించాలి. విలంబితం పాటించ వలసిన కృష్యాక్షరాలలో పాటించే విలంబితప్రమాణం, ఒకటి లేదా రెండు లేదా మూడు లేదా నాలుగు, లేదా ఐదు లేదా ఆరు కల లుండవచ్చును.

**మూ. విలమ్బితే విరామే హి యదా గుర్వక్షరం భవేత్,**
**షణ్ణాం కలానాం పరతో విలమ్బో న విధీయతే. 143**

**తా.** విలంబితమైన విరామంలో కృష్యమైన గుర్వక్షరం ఉన్నప్పుడు ఆరు కలలు మించి విలంబం చేయకూడదు.

**మూ. అథవా కారణోపేతం ప్రయోగం కార్యమేవ చ,**
**సమీక్ష్య వృత్తే కర్తవ్యో విరామో రసభావతః. 144**

**తా.** లేదా తగిన కారణం ఉన్నప్పుడు ఇతరస్థలాలలో కూడ విరామం చేయవచ్చును. రస – భావాలకు అనుగుణంగా ఉండే టట్లు చూచుకొంటూ వృత్తంలో విరామం చేస్తుండాలి.

**మూ. యే విరామాః స్మృతాః పాఠ్యే వృత్తపాదసముద్భవాః,**
**ఉత్క్రమ్యాపి క్రమం తద్జ్ఞైః కార్యాస్తేఽర్థవశానుగాః. 145**

**తా.** వృత్తాల పాదాలను పట్టి ఏర్పడిన ఏ విరామాలు పాఠ్యంలో చెప్పబడ్డాయో, వాటిని అతిక్రమించి కూడ, క్రమం పాటించకుండా కూడ అర్థానికి అనుగుణంగా వాటిని చేయవచ్చును.

**మూ. (నాపశబ్దం పఠేత్తద్జ్ఞో భిన్నవృత్తం తథైవ హి,**
**విశ్రమేన్నావిరామేషు దైన్యే కాకుం న దీపయేత్). 146**

**తా.** (పాఠ్యాన్ని గూర్చి బాగా తెలిసికొన్నవాడు అపశబ్దం ఉచ్చరించకూడదు. వృత్తం చెడిపోయినదానిని పఠించకూడదు. విరామాలు లేనిచోట విరామం ఇవ్వకూడదు. దైన్యం వర్ణించే సందర్భంలో కాకువును పెంచకూడదు).

**మూ. వర్జితం కావ్యదోషైస్తు లక్షణాఢ్యం గుణాన్వితమ్,**
**స్వరాలఙ్కారసంయుక్తం పఠేత్పాఠ్యం యథావిధి. 147**

**తా.** కావ్యదోషా లేవీ లేనిది, లక్షణా లున్నదీ, గుణములతో కూడినదీ, స్వరంతోను అలంకారాలతోను సంయుక్తమూ అయిన పాఠ్యాన్ని శాస్త్రోక్తరీతిలో పఠించాలి.

**మూ. అలంకారా విరామాశ్చ యే పాఠ్యే సంస్కృతే స్మృతాః,**
**త ఏవ సర్వే కర్తవ్యాః స్త్రీణాం పాఠ్యే త్వసంస్కృతే. 148**

**తా.** సంస్కృతపాఠ్యం విషయంలో చెప్పిన అలంకారాలను, విరామాలను స్త్రీలు ప్రాకృతపాఠ్యంలో కూడ అనుసరించాలి.

**మూ. ఏవమేతత్ స్వరకృతం కలాతాలలయాన్వితమ్,**
**దశరూపవిధానే తు పాఠ్యం యోజ్యం ప్రయోక్తృభిః. 149**

**తా.** ఇంతవరకు చెప్పిన ఈ స్వర – కలా – తాల – లయాలతో కూడిన పాఠ్యాన్ని దశరూపకాల ప్రయోగంలో, నాట్యప్రయోక్తలు అనుసరించాలి.

**మూ. ఉక్తం కాకువిధానం తు యథావదనుపూర్వశః,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి దశరూపవికల్పనమ్. 150**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే వాగభినయే కాకుస్వరవ్యఞ్జనో నామ**
**సప్తదశోఽధ్యాయః.**

**తా.** ఇంతవరకు, ఒక క్రమాన్ని పాటిస్తూ కాకువిధానం చెప్పాను. ఇటుపైన పది విధాలైన రూపకాల స్వరూపాన్ని, విభాగాన్ని చెపుతాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన 'బాలానందిని' అను నాట్యశాస్త్రాంధ్ర వ్యాఖ్యానమున కాకుస్వరవ్యంజన మను పదిహేడవ అధ్యాయం సమాప్తం.**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ అష్టాదశోఽధ్యాయః

# దశరూపవికల్పనము

**"రూపం యదేతద్బహుధా చకాస్తి తద్యేన భావీ భవితా న జాతు,**
**తచ్చక్షురర్కాత్మకమీశ్వరస్య వన్దే వపుస్తైజససారధామ్నః."**

**- శ్రీమదభినవగుప్తాచార్యాః**

**మూ. వర్తయిష్యామ్యహం విప్రాః! దశరూపవికల్పనమ్,**
**నామతః కర్మతశ్చైవ తథా చైవ ప్రయోగతః. 1**

**తా.** విప్రులారా! నేను ఇపుడు పేర్లతోను, లక్షణాలతోను, ప్రయోగవిధానాదులతోను కూడ పది రూపకాల విభాగాన్ని చేసి మీకు తెలుపుతాను.

**మూ. నాటకం సప్రకరణమఙ్కో వ్యాయోగ ఏవ చ,**
**భాణః సమవకారశ్చ వీథీ ప్రహసనం డిమః. 2**

**ఈహామృగశ్చ విజ్ఞేయా దశేమే నాట్యలక్షణే,**
**ఏతేషాం లక్షణమహం వ్యాఖ్యాస్యామ్యనుపూర్వశః. 3**

**తా.** నాటకం, ప్రకరణం, అంకం, వ్యాయోగం, భాణం, సమవకారం, వీథి, ప్రహసనం, డిమం, ఈహామృగం అని ఇవి నాట్యంలో పది విధాలున్నాయి. వీటి లక్షణం పైన పేర్కొన్న క్రమంలోనే విశదీకరిస్తాను.

**మూ. సర్వేషామేవ కావ్యానాం మాతృకా వృత్తయః స్మృతాః,**
**ఆభ్యో వినిఃసృతం హ్యేతద్దశరూపం ప్రయోగతః. 4**

**తా.** వృత్తులు కావ్యా లన్నింటికీ మాతృకలు. పది విధాలైన ఈ రూపకాలూ కూడ, ప్రయోగానుసారంగా ఆ వృత్తులనుండే ఆవిర్భవించాయి.

**మూ. జాతిభిః శ్రుతిభిశ్చైవ స్వరా గ్రామత్వమాగతాః,**
**యథా తథా వృత్తిభేదైః కావ్యబన్ధా భవన్తి హి. 5**

**తా.** జాతులతోను శ్రుతులతోను షడ్జాదిస్వరాలు గ్రామత్వాన్ని పొందినట్లు, (షడ్జగ్రామం మొదలైనవి ఏర్పడినట్లు) వృత్తిభేదాలచేత కావ్యబంధాలు ఏర్పడతాయి.

**మూ. గ్రామౌ పూర్ణస్వరౌ ద్వౌ తు యథా వై షడ్జమధ్యమౌ,**
**సర్వవృత్తివినిష్పన్నౌ కావ్యబన్ధౌ తథా త్విమౌ. 6**

**తా.** షడ్జమధ్యమస్వరాలు రెండూ ఎలా; పూర్ణస్వరములైన గ్రామాలో అదే విధంగా నాటక – ప్రకరణాలు రెండూ సర్వవృత్తులతో నిష్పన్నము లైనవి, తయా రైనవి.

**మూ. జ్ఞేయం ప్రకరణం చైవ తథా నాటకమేవ చ,**
**సర్వవృత్తివినిష్పన్నం నానాబన్ధసమాశ్రయమ్. 7**

**తా.** ప్రకరణమూ నాటకమూ కూడ అన్ని వృత్తుల కలయికచే నిష్పన్నమైనవి; అన్ని బంధాలకు (అంగాలకు) ఆశ్రయ మైనవి.

**మూ. వీథీ సమవకారశ్చ తథేహామృగ ఏవ చ,**
**ఉత్సృష్టికాఙ్కో వ్యాయోగో భాణః ప్రహసనం డిమః. 8**
**కైశికీవృత్తిహీనాని రూపాణ్యేతాని కారయేత్,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి కావ్యబన్ధవికల్పనమ్. 9**

**తా.** వీథి, నమవకారం, ఈహామృగం, ఉత్సృష్టికాంకం, వ్యాయోగం, భాణం, ప్రహసనం, డిమం – వీటిలో కైశికీవృత్తి ఉండకుండా ప్రయోగింపచేయాలి.

**మూ. ప్రఖ్యాతవస్తువిషయం ప్రఖ్యాతోదాత్తనాయకం చైవ,**
**రాజర్షివంశ్యచరితం తథైవ దివ్యాశ్రయోపేతమ్. 10**
**నానావిభూతిభిర్యుతమృద్ధివిలాసాదిభిర్గుణైశ్చైవ,**
**అఙ్కప్రవేశకాఢ్యం భవతి హి తన్నాటకం నామ. 11**

**తా.** నాటకంలో కథావస్తువు ప్రసిద్ధమై ఉండాలి. నాయకుడు కూడ ప్రఖ్యాతుడై ధీరోదాత్తుడై ఉండాలి. ఇది రాజర్షుల వంశానికి చెందినవారి చరిత్రను చెప్పాలి. దివ్యపురుషుల సంబంధం కూడ ఉండాలి.

అనేకవిధాలైన లోకాతీతశక్తులతోను, సమృద్ధి, విలాసము మొదలైన గుణాలతో కూడి ఉండాలి. దీనిలో అంకాలు, ప్రవేశకాలు అధికసంఖ్యలో ఉండాలి.

**మూ. నృపతీనాం యచ్చరితం నానారసభావచేష్టితం బహుధా,**
**సుఖదుఃఖోత్పత్తికృతం భవతి హి తన్నాటకం నామ. 12**

**తా.** సుఖదుఃఖాల ఉత్పత్తిచేత ఏర్పడిన, అనేకవిధాలైన రస – భావ – చేష్టలతో కూడిన రాజుల చరిత్రను వర్ణించేది నాటకం.

**మూ. అస్యావస్థోపేతం కార్యం ప్రసమీక్ష్య బిన్దువిస్తారాత్,**
**కర్తవ్యోఽఙ్కః సోఽపి తు గుణాన్వితం నాట్యతత్త్వజ్ఞైః. 13**

**తా.** బిందువును విస్తరింపచేయడం ద్వారా రాజుయొక్క వివిధావస్థలతో కూడిన దానినిగా, జాగర్తగా పరిశీలిస్తూ నాటకం రచించాలి. నాటకంలోని అంకం కూడా

రచించాలి. అది దాని చెప్పబోయే గుణాలతో కూడిఉండేటట్లు నాట్యతత్త్వజ్ఞులు చూచుకోవాలి.

**మూ. అఙ్క ఇతి రూఢిశబ్దో భావైశ్చ రసైశ్చ రోహయత్యర్థాన్,**
**నానావిధానయుక్తో యస్మాత్తస్మాద్భవేదఙ్కః. 14**

**తా.** 'అఙ్కః' అని రూఢిశబ్దం. ఇది భావాలచేత, రసాలచేత విషయాలను అంకురింపచేస్తుంది. అనేకమైన పద్ధతులతో నిండి ఉంటుంది. అందుచేతనే దీనిని 'అంకం' అంటారు.

**మూ. (అఙ్కసమాప్తిః కార్యా కావ్యచ్ఛేదే న బీజసంహారః,**
**వస్తువ్యాపీ బిన్దుః కావ్యసముత్థోఽత్ర నిత్యం స్యాత్.) 15**

**తా.** ఒక కావ్యభాగంలో అంకం పూర్తి చెయ్యాలి. బీజం మాత్రం తొలగిపోకూడదు. కావ్యానికి సంబంధించిన బిందువును అంకంలో కావ్యానుసారం, పైకి కనబడే టట్లు ఉంచాలి.

**వి.** 'బీజం', 'బిందు' మొదలైన పారిభాషికపదాల అర్థాలు మున్ముందు స్పష్టం అవుతాయి.

**మూ. యత్రార్థస్య సమాప్తిర్యత్ర న బీజస్య సంహారః,**
**కించిదవలగ్నబిన్దుః సోఽఙ్క ఇతి సదావగన్తవ్యః. 16**

**తా.** దేనితో ఒక అర్థం (విషయం, ఘట్టం) సమాప్తం అవుతుందో, బీజం మాత్రం నశించదో, బిందువు కొంచెం వెంబడిస్తూ ఉంటుందో అది అంకం.

**మూ. యే నాయకా నిగదితాస్తేషాం ప్రత్యక్షచరితసంయోగః,**
**నానావస్థోపేతః కార్యస్త్వఙ్కోఽవిప్రకృష్టస్తు. 17**

**తా.** నాయకుల చరిత్రను, ప్రత్యక్షంగా వివిధావస్థలతో అంకంలో చూపాలి. ఇది అతీదీర్ఘం కాకూడదు.

**మూ. నాయకదేవీగురుజనపురోహితామాత్యసార్థవాహానామ్,**
**నైకరసాన్తరవిహితో హ్యఙ్క ఇతి స వేదితవ్యస్తు. 18**

**తా.** నాయకుడు, దేవి, వాళ్ల తలిదండ్రులు మొదలైనవాళ్లు, పురోహితుడు, అమాత్యులు, సార్థవాహులు (పెద్ద వర్తకులు) – వీళ్ల, వివిధరసాలతో కూడిన వృత్తాంతాలను చూపేది అంకం.

**మూ. పఞ్చావరా దశపరా హ్యఙ్కాః స్యుర్నాటకే ప్రకరణే చ,**
**నిష్క్రామః సర్వేషాం యస్మిన్నఙ్కః స విజ్ఞేయః. 19**

**తా.** నాటకంలోను ప్రకరణంలోనూ కూడ అంకాలు ఐదుకు తక్కువ కాకుండా పదికి మించకుండా ఉండాలి. అంకం చివర పాత్ర లందరూ నిష్క్రమించాలి.

**మూ. క్రోధప్రసాదశోకాః శాపోత్సర్గోఽథ విద్రవోద్వాహౌ,**
**అద్భుతసంభవదర్శనమఙ్కే(ఽ)ప్రత్యక్షజాని స్యుః. 20**

**తా.** క్రోధం, అనుగ్రహం, శోకం, శాపం ఇవ్వడం, ఉపద్రవం, వివాహం, అద్భుత విషయాలు – వీటిని అంకంలో ప్రత్యక్షంగా చూపవచ్చు. (అభా.) కొందరు 'అప్రత్యక్షజాని' అని పదచ్ఛేధం చేసి వాటిని ప్రత్యక్షంగా చూపకూడదు అని వ్యాఖ్యానించారు (మన్ మోహన్‌ఘోష్).

**మూ. ఏకదివసప్రవృత్తః కార్యస్త్వఙ్కోఽర్థబీజమధికృత్య,**
**ఆవశ్యకకార్యాణామవిరోధేన ప్రయోగేషు. 21**

**తా.** అంకంలో అర్థబీజాన్ని కొనసాగిస్తూ ఒక రోజులో జరిగిన సంఘటనలను మాత్రమే ఆవశ్యకమైన కార్యాలకు తగు సమయం కేటాయించి వాటి కేమీ విరోధం లేకుండా చూపాలి.

**మూ. ఏకాఙ్కే న కదాచిద్బహూని కార్యాణి యోజయేద్ధీమాన్,**
**ఆవశ్యకావిరోధేన తత్ర కార్యాణి కార్యాణి. 22**

**తా.** ధీమంతుడు ఎన్నడు ఒక అంకంలో అనేకమైన కార్యాలను కూర్చకూడదు. ఆవశ్యకములైన అంశాలకు విరోధం లేకుండా దానిలో (అంకంలో) కార్యాలు నిర్వహించాలి.

**మూ. రఙ్గం తు యే ప్రవిష్టాః సర్వేషాం భవతి తత్ర నిష్క్రామః,**
**బీజార్థయుక్తియుక్తం కృత్వా కావ్యం యథార్థరసమ్. 23**

**తా.** రంగంలో ప్రవేశించినవా ళ్లందరూ అంకం చివర నిష్క్రమించాలి.

బీజార్థంతోను యుక్తులతోను, అర్థానికి రసానికి అనుగుణంగా కావ్యం రచించి.

**(న బహూనీహ కార్యాణి త్వేకాఙ్కే వినియోజయేత్,**
**ఆవశ్యకానాం కార్యాణాం విరోధో హి తథా భవేత్.) 24**

(**తా.** ఒక అంకంలో అనేక మైన కార్యాలు చూపకూడదు. అలా చేస్తే తప్పకుండా ప్రదర్శించవలసిన కార్యాలకు విఘాతం కలుగుతుంది.)

**జ్ఞాత్వా దివసావస్థాం క్షణయామముహూర్తలక్షణోపేతామ్,**
**విభజేత్సర్వమశేషం పృథక్ పృథక్ కావ్యమఙ్కేషు. 25**

క్షణాలు, యామాలు, ముహూర్తాలు మొదలైనలక్షణాలతో కూడిన దివసస్థితిని దృష్టిలో ఉంచుకొని, కావ్యాన్నంతనీ వేరు వేరు అంకాలలోనికి విభజించాలి.

**మూ. దివసావసానకార్యం యద్యఙ్కే నోపపద్యతే సర్వమ్,**
**అఙ్కచ్ఛేదం కృత్వా ప్రవేశకైస్తద్విధాతవ్యమ్. 26**

**తా.** ఒక దివసంలో జరిగే కార్యా న్నంతనీ అంకంలో చూపడం శక్యం కాకపోతే, అంకం విడగొట్టి ఆ కార్యాన్ని ప్రవేశకాలలో చూపాలి.

**మూ. విప్రకృష్టం తు యో దేశం గచ్ఛేత్కార్యవశానుగః,**
**అఙ్కచ్ఛేదేఽథ సంక్షేపాన్నిర్దిశేత్తం ప్రవేశకైః. 27**

**తా.** అంకంలోని ఒక పాత్ర పనిమీద దూరదేశానికి వెళ్లిన ట్లయితే ఆ విషయాన్ని అంకచ్ఛేదంలో ప్రవేశకాల ద్వారా, సంక్షిప్తంగా సూచించాలి.

**మూ. సంనిహితనాయకోఽఙ్కః కర్తవ్యో నాటకే ప్రకరణే వా,**
**పరిజనకథానుబన్ధః ప్రవేశకో నామ విజ్ఞేయః. 28**

**తా.** నాటకంలో నైనా, ప్రకరణంలో నైనా, ప్రతీ అంకంలోను, నాయకుడు సంనిహితుడై ఉన్నట్లు చూపాలి. పరిజనుల కథతో (సంభాషణాదులతో) సంబంధించినది ప్రవేశకం.

**మూ. (ప్రకరణనాటకవిషయే పఞ్చాద్యా దశపరా భవన్త్యఙ్కాః,**
**అఙ్కాన్తరసంధిషు చ ప్రవేశకాస్తేషు తావన్తః. 29**

**తా.** ప్రకరణంలోను, నాటకంలోను ఐదు మొదలు పది మించని అంకా లుండాలి. అంకాల మధ్యలలో వచ్చే సంధులలో అన్ని సంఖ్యలే గల ప్రవేశకా లుండవచ్చును.

**మూ. అనయోరన్తరవిహితః ప్రవేశకోఽర్థక్రియాం సమభివీక్ష్య,**
**సంక్షేపార్థః సన్ధిస్త్వర్థానాం సంవిధాతవ్యః). 30**

**తా.** అంకాల మధ్య సూచించవలసిన కథాంశాన్ని, పనులనూ దృష్టిలో పెట్టుకొని ప్రవేశకం ఉండాలి. విషయాలను సంక్షిప్తంగా సూచించడానికే, సంక్షిప్తంగా సంధి (అంకసంధి, ప్రవేశకం) ఏర్పరచాలి.

**మూ. అఙ్కచ్ఛేదం కృత్వా మాసకృతం వర్షసంచితం వాపి,**
**తత్సర్వం కర్తవ్యం వర్షాదూర్ధ్వం న తు కదాచిత్. 31**

**తా.** అంకచ్ఛేదం చేసి, ప్రవేశకం ద్వారా, మాసంలోనో కొన్ని మాసాలలోనో జరిగినది కాని, ఒక సంవత్సరంకాలంలో జరిగినది కాని సూచించవచ్చు. సంవత్సరానికి మించినది చూపకూడదు.

**మూ. యః కశ్చిత్కార్యవశాద్ గచ్ఛతి పురుషః ప్రకృష్టమధ్వానమ్,**
**తత్రాప్యఙ్కచ్ఛేదః కర్తవ్యః పూర్వవత్తద్జ్ఞైః. 32**

**తా.** ఎవరైనా పనిమీద దూరదేశం వెళ్లి నట్లు చెప్పవలసినప్పుడు వెనుకటివలెనే అంకచ్ఛేదం చెయ్యాలి.

**మూ. అఙ్కాన్తరానుసారీ సంక్షేపార్థమధికృత్య బిన్దూనామ్,**
**ప్రకరణనాటకవిషయే ప్రవేశకః సంవిధాతవ్యః. 33**

**తా.** ప్రకరణంలోను, నాటకంలోను ఏర్పరచిన ప్రవేశకం, బిందువులోని సంక్షేపార్థాన్ని ముందుకు సాగిస్తూ ఇతరమైన అంకాలను (ముందుకు వెనుక ఉన్న అంకాలను) అనుసరించి ఉండాలి.

**మూ. నోత్తమమధ్యమపురుషైరారచితో నాప్యుదాత్తవచనకృతః,**
**ప్రాకృతభాషాచారః ప్రయోగమాశ్రిత్య కర్తవ్యః. 34**

**తా.** నాట్యప్రయోగా న్ననుసరించి ఏర్పరచిన ప్రవేశకంలో ఉత్తమ – మధ్యమ – పురుషపాత్ర లుండకూడదు. ఉదాత్తములైన వచనాల (మాటల) ఉపయోగం ఉండ కూడదు. ప్రాకృతభాషలను, ప్రాకృతుల వ్యవహారాన్ని చూపాలి.

**మూ. కాలోత్థానగతిరసౌ వ్యాఖ్యాసంరమ్భకార్యవిషయాణామ్,**
**అర్థాభిధానయుక్తః ప్రవేశకః స్యాదనేకార్థః. 35**

**తా.** ప్రవేశకం కాలోత్థానాన్ని తెలుపుతుంది; వ్యాఖ్య, సంరంభం, కార్యం, విషయం అను విషయాలను తెలుపుతుంది. ఈ విధంగా ప్రవేశకం అనేకమైన ప్రయోజనాలను సాధిస్తుంది.

**వి.** ప్రవేశకం ఐదు విధాలుగా, ఐదు ప్రయోజనాలను సాధించేదిగా ఉంటుంది. (1) కాలాన్ని (ప్రాతఃకాలం, మధ్యాహ్నం, సాయంకాలం మొదలైనదానిని) సూచిస్తుంది. (2) వ్యాఖ్య = నిగూఢ మైన విషయాన్ని స్పష్టీకరిస్తుంది. (3) సంరంభం = ఏదో కార్యాన్ని సాధించడంకోసం ఉపాయాన్వేషణం మొదలైన హడావుడి, లేదా ఆలోచన – దీనిని సూచిస్తుంది. (4) కార్యం = రూపకం ప్రారంభంనుంచి చివరిదాకా నడిచే కార్యసాధ నోపాయాలు – **"కర్మణామారమ్భోపాయః"** (పనులు ప్రారంభించే ఉపాయం) **"పురుషద్రవ్య సంపత్"** = (కావలసిన మనుష్యులు, ధనం మొ॥) **"దేశకాలవిభాగః"** (సరియైన దేశాన్ని కాలాన్ని విభజించుకొనడం) **"వినిపాతప్రతీకారః"** (రావడానికి అవకాశం ఉన్న విఘ్నాలకు ముందుగాను, అవి ఏర్పడిన తరువాతా కూడ వాటి నివారణోపాయాలు) **'కార్యసిద్ధిః'** (చివరికి అనుకొన్న పని సిద్ధించడం) అని అర్థశాస్త్రంలో చెప్పిన పంచాంగాల అనుష్ఠానం. విషయం = రాబోయే అంకంలోని కథను సూచించడం. ప్రవేశకాలు ఈ ప్రయోజనాలు సాధిస్తాయి. (అభి.భా.)

**మూ. బహ్వాశ్రయమపి కార్యం ప్రవేశకైః సంక్షిపేచ్చ సంధిషు వా,**
**బహుచూర్ణపదైర్యుక్తం జనయతి ఖేదం ప్రయోగస్య. 36**

**తా.** చాలామందితో సంబంధించిన కార్యాన్ని కూడ ప్రవేశకాలలో కాని, అంక సంధులలో గాని సంక్షిప్తంగా తెలియపరచాలి. విడి విడి పదాలు, సమాసాలు, ఇతరపదాలు అధికంగా ఉపయోగిస్తే రూపకప్రయోగం విసుగు కలిగిస్తుంది.

**మూ. యత్రార్థస్య సమాప్తిర్న భవత్యఙ్కే ప్రయోగబాహుల్యాత్,**
**వృత్తాన్తస్స్వల్పకథైః ప్రవేశకైః సోఽభిధాతవ్యః. 37**

**తా.** ఏదైన ఒక అంకంలో ప్రయోగం అధికంగా ఉండడంచేత చెప్పవలసిన విషయా న్నంతనీ పూర్తిగా చెప్పడం కుదరనప్పుడు దానిని ప్రవేశకాల ద్వారా తెలపాలి.

**మూ. యుద్ధం రాజ్యభ్రంశో మరణం నగరోపరోధనం చైవ,**
**ప్రత్యక్షాణి తు నాఙ్కే ప్రవేశకైః సంవిధేయాని. 38**

**తా.** యుద్ధం కాని, రాజ్యభ్రంశం కాని, మరణం గాని, నగరాన్ని ముట్టడించడం గాని, అంకలో ప్రత్యక్షంగా చూపకూడదు. వాటిని ప్రవేశకాలద్వారా తెలపాలి.

**మూ. అఙ్కే ప్రవేశకే చ ప్రకరణమాశ్రిత్య నాటకే వాపి,**
**న వధః కర్తవ్యః స్యాద్యోఽభ్యుదయీ నాయకః ఖ్యాతః. 39**

**తా.** ప్రకరణ – నాటకాలలోని అంకంలో కాని, ప్రవేశకంలో కాని, ఉన్నతస్థితిలో ప్రసిద్ధుడైన నాయకుని వధ చూపకూడదు.

**మూ. అపసరణమేవ కార్యం గ్రహణం వా సంధిరేవ వా యోజ్యః,**
**కావ్యశ్లేషైర్బహుభిర్యథారసం నాట్యతత్త్వజ్ఞైః). 40**

**తా.** అనేకవిధాలైన కావ్యబంధాలు ఉపయోగించి, అలాంటి నాయకుణ్ణి దృశ్యం నుండి తొలగిపోయినట్లు గాని, ఆతనిని పట్టుకొన్నట్లు గాని, శత్రువులతో సంధిచేసుకొన్నట్లు గాని సూచించాలి.

**మూ. న మహాజనపరివారం కర్తవ్యం నాటకం ప్రకరణం వా,**
**యే తత్ర కార్యపురుషాశ్చత్వారః పఞ్చ వా తే స్యుః. 41**

**తా.** నాటకాన్ని గాని, ప్రకరణాన్ని గాని చాలమంది జనులతో నింపివేయకూడదు. అక్కడ చూపే కార్యానికి సంబంధించిన పురుషులు, నలుగురు లేదా ఐదుగురు మాత్రమే రంగస్థలంమీద ఉండాలి.

**మూ. కార్యం గోపుచ్ఛాగ్రం కర్తవ్యం కావ్యబన్ధమాసాద్య,**
**యే చోదాత్తా భావాస్తే సర్వే పృష్ఠతః కార్యాః. 42**

**తా.** కావ్యబంధంలో కార్యాన్ని గోపుచ్ఛాగ్రం (ఆవుతోకకుచ్చు) వలె ఉండే టట్లు చెయ్యాలి. ఉదాత్తమైన (సారభూతమైన) భావా లన్నీ (విషయాలన్నీ) చివర ఉండాలి.

**వి.** గోపుచ్ఛాగ్రం వలె ఉండా లనగా క్రమంగా అంగాలు తగ్గించాలి అనికొందరు అర్థం చెప్పగా కొందరు గోపుచ్ఛంలోనే వెండ్రుకలు కొన్ని పొడవుగాను కొన్ని పొట్టిగాను ఉన్నట్లు కొన్ని కార్యాలు ముఖసంధిలోనే పూర్తి అయిపోవాలి, కొన్ని ప్రతిముఖసంధి వరకు సాగవచ్చు; కొన్ని అవమర్శసంధితో ఆగిపోవాలి; కొన్ని నిర్వహణసంధివరకు కొనసాగుతాయి అని మరికొందరు అర్థం చెప్పారు. (అభి.భా.)

**మూ. సర్వేషాం కావ్యానాం నానారసభావయుక్తియుక్తానామ్,**
**నిర్వహణే కర్తవ్యో నిత్యం హి రసోఽద్భుతస్తద్‌జ్ఞైః. 43**

**తా.** అనేక రసాలతోను, భావాలతోను, యుక్తులతోను, కూడిన అన్ని కావ్యాలలోను కూడ నిర్వహణ సంధిలో అద్భుతరసం ఉండే టట్లు ప్రయోగనిపుణులు చూడాలి.

**మూ. నాటకలక్షణమేతన్మయా సమాసేన కీర్తితం విధివత్,**
**ప్రకరణమతః పరమహం లక్షణయుక్త్యా ప్రవక్ష్యామి. 44**

**తా.** నే నింతవరకు నాటకలక్షణం యథాశాస్త్రంగా చెప్పాను. ఇప్పుడు ప్రకరణం లక్షణం చెపుతాను.

**మూ. యత్ర కవిరాత్మశక్త్యా వస్తు శరీరం చ నాయకం చైవ,**
**ఔత్పత్తికం ప్రకురుతే ప్రకరణమితి దద్ బుధైర్‌జ్ఞేయమ్. 45**

**తా.** కవి తన ప్రతిభచేత వస్తువును (కథను) శరీరాన్ని లేదా వస్తుశరీరాన్ని, నాయకుణ్ణీ కొత్తగా కల్పించి రచించినది **ప్రకరణం.**

**మూ. యదనార్షమనాహార్యం కావ్యం ప్రకరోత్యభూతగుణయుక్తమ్,**
**ఉత్పన్నబీజవస్తు ప్రకరణమితి తదపి విజ్ఞేయమ్. 46**

**తా.** కవి తన ప్రతిభచేత క్రొత్తగా కల్పించి చేసిన ప్రకరణం అను రూపకంలోని కథావస్తువు అనార్షంగా (ఇతిహాసపురాణాదులలో ప్రసిద్ధమైనది కాకుండా) ఉంటుంది. అంతకు పూర్వం ఉన్న కథను (బృహత్కథాదులనుండి) గ్రహించినా, కవి దానిలో పూర్వం లేని కొన్ని గుణాలు కల్పిస్తాడు. అది ప్రకరణం.

**మూ. యన్నాటకే మయోక్తం వస్తు శరీరం చ వృత్తిభేదాశ్చ,**
**తత్ప్రకరణేఽపి చ యోజ్యం సలక్షణం సర్వసంధిషు తు. 47**

**తా.** నేను నాటకంలో ఉండా లని చెప్పిన వస్తుశరీరము, వేరు వేరు వృత్తులు, లక్షణాలు, సంధులు, ఇవన్నీ ప్రకరణంలో కూడ ఉండాలి.

**మూ. విప్రవణిక్సచివానాం పురోహితామాత్యసార్థవాహానామ్,**
**చరితం యన్నైకవిధం జ్ఞేయం తత్ ప్రకరణం నామ. 48**

**తా.** విప్రులు, వర్తకులు, సచివులు, పురోహితులు, అమాత్యులు, వర్తకుల గుంపుల నాయకులు – వీళ్ల అనేక విధాలైన చరిత్ర కథావస్తువుగా కలది ప్రకరణం.

**వి.** సచివః = మంత్రి, అమాత్యః = అధికారి (ఆఫీసరు).

**మూ. నోదాత్తనాయకకృతం న దివ్యచరితం న రాజసంభోగమ్,**
**బాహ్యాజనసంప్రయుక్తం తద్ జ్ఞేయం ప్రకరణం తద్జ్ఞైః. 49**

**తా.** ప్రకరణంలోని నాయకుడు ఉదాత్తుడు (ధీరోదాత్తుడు) కాకూడదు. దీనిలో దివ్యపురుషుల చరితంగాని, రాజుల చరిత్ర గాని ఉండదు. దీనిలో బాహ్యాజనులు (సాధారణజనులు) మాత్రమే ఉంటారు.

**మూ. దాసవిటశ్రేష్ఠియుతం వేశస్త్ర్యుపచారకారణోపేతమ్,**
**మన్దకులస్త్రీచరితం కావ్యం కార్యం ప్రకరణే తు. 50**

**తా.** ప్రకరణంలోని కావ్యంలో దాసులు, విటులు, శ్రేష్ఠులు (వర్తకులు) వేశలలోని (వేశ్యాస్త్రీల గృహా లున్న ప్రదేశాలలోని) స్త్రీల ఉపచారాలు, కారణాలూ (ఇవి ముున్ముందు చెప్పబడతాయి) ఉంటాయి. కులస్త్రీల చరితం తక్కువగా ఉంటుంది.

**మూ. సచివశ్రేష్ఠిబ్రాహ్మణపురోహితామాత్యసార్థవాహానామ్,**
**గృహవార్తా యత్ర భవేన్న తత్ర వేశ్యాఙ్గనా కార్యా. 51**

**తా.** సచివులు, శ్రేష్ఠిలు, బ్రాహ్మణులు, పురోహితులు, అమాత్యులు, సార్థవాహులు – వీళ్ల కుటుంబాలతో సంబంధించిన కథావస్తు వున్న ప్రకరణంలో వేశ్యాస్త్రీ ఉండకూడదు.

**మూ. యది వేశయువతియుక్తం న కులస్త్రీసంగమోఽపి (తత్ర) స్యాత్,**
**అథ కులజనప్రయుక్తం న వేశయువతిర్భవేత్తత్ర. 52**

**తా.** ప్రకరణంలో వేశ్యాయువతులున్న ట్లయితే ఆ ప్రకరణంలో కులస్త్రీలను చేర్చకూడదు. కులస్త్రీలున్న ప్రకరణంలో వేశ్యాస్త్రీలు ఉండకూడదు.

**మూ. యది వా కారణయుక్త్యా వేశకులస్త్రీకృతోపచారః స్యాత్,**
**అవికృతభాషాచారం తత్ర తు పాఠ్యం ప్రయోక్తవ్యమ్. 53**

**తా.** అవసరాన్ని పట్టి ఒక ప్రకరణంలో వేశ్యాస్త్రీలకు కులస్త్రీలకు ప్రవేశం కల్పించ వలసినప్పుడు దానిలోని పాఠ్యంలో భాషా – ఆచారాలలో వికారం లేకుండా ఉండేటట్లు చూచుకోవాలి.

**వి.** కులస్త్రీకి శౌరసేనీభాష ఉపయోగించి వేశ్యకు సంస్కృతం ఉపయోగిస్తే అది భాషావికారం. కులస్త్రీ ఆచారం (ప్రవర్తన) వినయప్రధానంగా ఉంటుంది; వేశ్యాస్త్రీ ఆచారం వినయరహితంగా ఉంటుంది. ఇందుకు విపరీతంగా వర్ణిస్తే అది ఆచారవైపరీత్యం (అభి.భా.)

**మూ. మధ్యమపురుషైర్నిత్యం యోజ్యో విష్కమ్భకోఽత్ర తత్త్వజ్ఞైః,**
**సంస్కృతవచనానుగతః సంక్షేపార్థః ప్రవేశకవత్. 54**

**తా.** ప్రకరణంలో నాటకంలోను కూడ, విష్కంభకం కూర్చాలి. దీనిలో పాత్ర లందరూ మధ్యమపురుషులై సంస్కృతంలో మాట్లాడాలి. ఇది ప్రవేశకం వలె సంక్షిప్తార్థమై, అనగా కథాగతిని తెలుసుకొనడానికి అవసరమైన విషయాలను సంక్షిప్తంగా అందించేదిగా ఉండాలి.

**మూ. శుద్ధః సంకీర్ణో వా ద్వివిధో విష్కమ్భకోఽపి కర్తవ్యః,**
**మధ్యమపాత్రః శుద్ధః సంకీర్ణో నీచమధ్యమకృతః. 55**

**తా.** శుద్ధవిష్కంభకం గాని మిశ్రవిష్కంభకం గాని ప్రయోగించవచ్చును. మధ్యమపాత్రలు మాత్రమే ఉన్నది శుద్ధవిష్కంభకము, నీచపాత్రలు మధ్యమపాత్రలూ కూడ ఉన్నది సంకీర్ణవిష్కంభకము.

**మూ. అఙ్కాన్తరాలవిహితః ప్రవేశకోఽర్థక్రియాం సమభివీక్ష్య,**
**సంక్షేపాత్సంధీనామర్థానాం చైవ కర్తవ్యః. 56**

**తా.** అర్థక్రియను దృష్టిలో ఉంచుకొని, అనగా సంధులను సంక్షిప్తగా చూపడం లేదా యుద్ధరాజ్యభ్రంశాదులను సంక్షిప్తంగా చూపడం అను అర్థక్రియను దృష్టిలో ఉంచుకొని, అంకం మధ్యలో గాని, అంకాల మధ్యలో కాని విష్కంభకం కూర్చాలి (అభి.భా.)

**వి.** మూలంలో 'ప్రవేశకః' అని ఉంది కాని అభిభా.లో విష్కంభకం అని చెప్పబడింది. పాఠాంతరం ఏదైనా ఉండి ఉండాలి.

**మూ. అనయోశ్చ బన్ధయోగాదన్యో భేదః ప్రయోక్తృభిః కార్యః,**
**ప్రఖ్యాతస్త్వితరో వా నాటకయోగే ప్రకరణే వా. 57**

**తా.** ఈ రెండింటియొక్క బంధంతో ఉండడంవల్ల, వీటి నిర్మాణాన్ని పోలిన నిర్మాణంవల్ల మరొక భేదం కూడ నాట్యప్రయోక్తలు ప్రయోగించవచ్చు. నాటకలక్షణా లున్నది ప్రఖ్యాతవస్తువు కలదై ఉంటుంది. ప్రకరణలక్షణా లున్నది కల్పితవృత్తం కలదై ఉంటుంది.

**మూ. (ప్రకరణనాటకభేదాదుత్పాద్యం వస్తు నాయకం నృపతిమ్,**
**అన్తఃపురసంగీతకవార్తామధికృత్యకర్తవ్యా). 58**
**స్త్రీప్రాయా చతురఙ్కా లలితాభినయాత్మికా సువిహితాఙ్గీ,**
**బహునృత్తగీతపాఠ్యా రతిసంభోగాత్మికా చైవ. 59**
**రాజోపచారయుక్తా ప్రసాదనక్రోధదమ్భసంయుక్తా**
**నాయకదేవీదూతీసపరిజనా - నాటికా జ్ఞేయా. 60**

**తా. నాటిక :-** ప్రకరణము నాటకము అను రెండు విధాలైన రూపకాలనుండి రాజు నాయకుడుగా గల కథావస్తువును కల్పించి రచించినది **నాటిక**. అంతఃపురంలో సంగీతగోష్ఠికి సంబంధించిన వృత్తాంతం తీసికొని రచించాలి. స్త్రీపాత్రలు ఎక్కువ సంఖ్యలో ఉంటారు. అంకాలు నాలుగు. లలితమైన అభినయం అధికంగా ఉంటుంది. అంగాలు చక్కగా కూర్చబడతాయి. నృత్త - గీత - పాఠ్యాలు అధికంగా ఉంటాయి. రతి సంభోగాలు, రాజోపచారాలు, బతిమాలడం, కోపం, దంభం మొదలైనవి ఉంటాయి. నాయకుడు, దేవి, వాళ్ల దూతికలు, పరిచారికలు ఇలాంటి పాత్ర లుంటారు.

**మూ. అన్తర్భాగవతా హ్యేషా భావయోరుభయోర్యతః,**
**అత ఏవ దశైతాని రూపాణీత్యుదితాని వై. 61**

**తా.** నాటికలో నాటకలక్షణాలూ, ప్రకరణలక్షణాలూ కలిసి ఉండడంచేత ఇది వాటిలో అంతర్గతమే. అందుచేతనే రూపకాలు పది అని చెప్పాం.

**మూ. ప్రకరణనాటకలక్షణముదితం విప్రా! మయా సమాసేన,**
**వక్ష్యామ్యతఃపరమహం లక్షణయుక్త్యా సమవకారమ్. 62**

**తా.** విప్రులారా! నేనింతవరకు ప్రకరణ - నాటకలక్షణాలు సవిస్తరంగా చెప్పాను. ఇటుపైన సమవకారమూ దాని లక్షణాలూ చెపుతాను.

**మూ. దేవాసురబీజకృతః ప్రఖ్యాతోదాత్తనాయకశ్చైవ,**
**త్ర్యఙ్కస్తథా త్రికపటః త్రివిద్రవః స్యాత్ త్రిశృఙ్గారః. 63**
**ద్వాదశనాయకబహులో హ్యష్టాదశనాడికాప్రమాణశ్చ.**

**తా. సమవకారం :-** దేవాసురుల బీజాలచేత, అనగా ఫలసంపాదనోపాయంచేత రచింపబడినది. దీనిలో ప్రసిద్ధులైన ఉదాత్తులైన నాయకు లుంటారు. మూడు అంకాలు, మూడు కపటాలు, మూడు విద్రవాలు, మూడు శృంగారాలు ఉంటాయి. పన్నెండుగురు నాయకు లుంటారు. దీని ప్రమాణం పద్దెనిమిది నాడికలు.

**మూ. వక్ష్యామ్యస్యాఙ్కవిధిం యావత్యో నాడికా యత్ర. 64**
**అఙ్కస్తు సప్రహసనః సవిద్రవః సకపటః సవీథీకః,**
**ద్వాదశనాడీవిహితః ప్రథమః కార్యః క్రియోపేతః. 65**

**తా.** దీని అంకాల ఏర్పాటు ఎలా ఉండాలో, దేనికి ఎన్ని నాడికలో చెపుతాను. మొదటి అంకంలో ప్రహసనం (హాస్యం కలిగించే కామశృంగారం), విద్రవమూ, కపటము, వీథి – ఇవి పన్నెండు నాడుల కాలంలో జరిగే టట్లు ఉండాలి. దీనిలో క్రియ (action) అధికంగా ఉండాలి.

**మూ. కార్యస్తథా ద్వితీయః సమాశ్రితో నాడికాశ్చతస్రస్తు,**
**వస్తుసమాపనవిహితో ద్వినాడికః స్యాత్తృతీయస్తు. 66**

**తా.** రెండవ అంకం నాలుగు నాడికల కాలంలో పూర్తి అయే టట్లు మొదటి అంకంవలెనే ఉండాలి. మూడవది రెండు నాడికలలో పూర్తి అయే విధంగా, కథావస్తువును పూర్తిచేసే దిశలో నడవాలి.

**మూ. నాడీసంజ్ఞా జ్ఞేయా మానం కాలస్య యన్ముహూర్తార్ధమ్,**
**తన్నాడికాప్రమాణం యథోక్తమఙ్కేషు సంయోజ్యమ్. 67**

**తా.** ముహూర్తకాలంలో సగం నాడిక. అంకాలలో పైన చెప్పిన విధంగా నాడికా ప్రమాణాన్ని పాటించాలి.

**వి.** ముహూర్తం = 48 నిమిషాలు. నాడీ లేదా నాడికా = 24 నిమిషాలు.

**మూ. యా నాడికేతి సంజ్ఞా కాలవిభాగే క్రియాభిసంపన్నా,**
**కార్యా చ సా ప్రయత్నాద్యథాక్రమేణైవ శాస్త్రోక్తా. 68**

**తా.** కాలాన్ని విభజించడంలో – క్రియచేత (గొట్టం చిల్లునుండి జలబిందువులు కారడం మొదలైన క్రియచేత) ఏర్పడిన 'నాడిక' అనే కాలవిభాగాన్ని, శాస్త్రోక్తరీతిలో ప్రయత్నపూర్వకంగా పాటించాలి.

**మూ. అఙ్కోఽఙ్కస్త్వన్యార్థః కర్తవ్యః కావ్యబన్ధమాసాద్య,**
**అర్థం హి సమవకారే హ్యప్రతిసంబన్ధమిచ్ఛన్తి. 69**

**తా.** ఈ కావ్యంబంధంలో ఒక అంకంలో ఉన్న అర్థానికి మరొక అంకంలో ఉన్న అర్థానికీ అంతగా సంబంధం లేకుండే టట్లు చూసుకోవాలి. ఎందువల్ల ననగా సమకారం లోని అంకాలలోని వస్తువు (ప్లాట్) లకు పరస్పరం సంబంధం ఉండకూడదు అని అంటారు.

**మూ. యుద్ధజలసంభవో వా వాయ్వగ్నిగజేన్ద్రసంభ్రమకృతో వా,
నగరోపరోధజో వా విజ్ఞేయో విద్రవస్త్రివిధః. 70**

**తా.** విద్రవానికి కారణం యుద్ధము, వరదలూ కాని, వాయువు, అగ్ని, ఏనుగులు గాని, శత్రువులు నగరాన్ని ముట్టడించడం కాని – ఈ మూడింటిలో ఏదైనా కావచ్చు.

**మూ. వస్తుగతక్రమవిహితో దైవవశాద్వా పరప్రయుక్తో వా,
సుఖదుఃఖోత్పత్తికృతః త్రివిధః కపటో౽త్ర విజ్ఞేయః. 71**

**తా.** ఇద్దరిలో ఒకని సుఖానికీ, రెండవవాని దుఃఖానికీ హేతువైన కపటం మూడు విధాలు. వస్తుగతక్రమవిహితము, దైవవశంవల్ల జరిగినది, పరుడు ప్రయోగించినది.

**వి.** వస్తుగతక్రమవిహితం అనగా – ఒక వస్తువును, ఫలాన్ని, సాధించడంకొరకు ప్రయత్నించేవాడు (గత) చేసిన కపటం. దీనిలో మోసపోయినవాడు నిర్దోషి. ఏదో మోసం చేసినవానిని మరొకడు మోసం చేయడం పరప్రయుక్తం. దీనిలో మోసపోయిన వాడు కూడ దోషియే. (అభి.భా.)

**మూ. త్రివిధశ్చాత్ర విధిజ్ఞైః పృథక్ పృథక్కార్యయోగవిహితార్థః,
శృఙ్గారః కర్తవ్యో ధర్మే చార్థే చ కామే చ. 72**

**తా.** వేరు వేరు కార్యాలచేత ప్రయోజనం సాధించగల, ధర్మనిమిత్తము, అర్థ నిమిత్తము, కామనిమిత్తము అయిన మూడు విధాలైన శృంగారాన్ని నాట్యప్రయోగజ్ఞులు ప్రయోగించాలి.

**మూ. యస్మిన్ ధర్మప్రాపకమాత్మహితం భవతి సాధనం బహుధా,
వ్రతనియమతపోయుక్తో జ్ఞేయో౽సౌ ధర్మశృఙ్గారః. 73**

**తా.** ఏ శృంగారం ధర్మాన్ని చేకూర్చి, తనకు అనేకవిధాల హితాన్ని కలిగించే సాధనంగా ఉంటుందో, వ్రత – నియమ – తపస్సులతో కూడిన ఆ శృంగారం **ధర్మ శృంగారం.**

**మూ. అర్థస్యేచ్ఛాయోగాద్ బహుధా చైవార్థతో౽ర్థశృఙ్గారః,
స్త్రీసంప్రయోగవిషయేష్వర్థార్థా వా రతిర్యత్ర. 74**

**తా.** ఏదో ఒక ప్రయోజనాన్ని సాధించడంకోసం చేసిన శృంగారం అర్థశృంగారం. లేదా ఏదో లాభాన్ని కోరి స్త్రీసంబంధమైన రతి ఏర్పడినది అర్థశృంగారం. (భావంలో పెద్దగా తేడాలేదు).

**మూ. కన్యావిలోభనకృతం ప్రాప్తౌ స్త్రీపుంసయోస్తు రమ్యం వా,
నిభృతం సావేగం వా యస్య భవేత్ కామశృంగారః. 75**

**తా.** కన్యను లోభపెట్టడం ద్వారా ఏర్పడినది, లేదా స్త్రీపురుషులు ఏకాంత ప్రదేశంలో చేరడంచేత, రహస్యంగాను, ఆవేగంతోను ఏర్పడిన శృంగారం **కామశృంగారం.**

**మూ. ఉష్ణిగ్గాయత్ర్యాదీన్యన్యాని చ యాని బన్ధకుటిలాని,**
**వృత్తాని సమవకారే కవిభిస్తాని ప్రయోజ్యాని. 76**

**తా.** సమవకారంలో కవులు ఉష్ణిక్, గ్రాయత్రి మొదలైన వృత్తాలు, బంధకుటిల వృత్తాలు, అనగా విషమ – అర్ధసమాదులు, ప్రయోగించాలి.

వి. ఉద్భటుడు 'నైవ ప్రయోజ్యాని' అను పాఠం అంగీకరించి – ఇలాంటి వృత్తాలు ప్రయోగించకూడదు; స్రగ్ధర మొదలైన దీర్ఘవృత్తాలే ప్రయోగించాలి అన్నాడు (అభి.గు.)

సమవకారంలో నాయకులు దేవతలు అవడంచేత – ఆ దేవతలకు సంబంధించిన యాత్రలు (జాతరలు) మొదలైన సందర్భాలలో, వీటిని ప్రయోగిస్తే శ్రద్ధాలువులైన దేవతా భక్తులు చాలా సంతోషిస్తారు. అలాంటి దేవతాభక్త్యాదులు లేని స్త్రీ – బాల – మూర్ఖాదులు దీనిలోని విద్రవాలు చూడగానే భయపడతారు! (అభి.భా.)

**మూ. ఏవం కార్యస్తద్జ్ఞైః నానారససంశ్రయః సమవకారః,**
**వక్ష్యామ్యతఃపరమహం లక్షణమీహామృగస్యాపి. 77**

**తా.** నాట్యజ్ఞులు, నానారసాలకు ఆశ్రయమైన సమవకారాన్ని ఈ విధంగా ప్రయోగించాలి. ఇప్పుడు ఈహామృగం లక్షణం చెపుతాను.

**మూ. దివ్యపురుషాశ్రయకృతో దివ్యస్త్రీకారణోపగతయుద్ధః,**
**సువిహితవస్తునిబద్ధో విప్రత్యయకారకశ్చైవ. 78**
**ఉద్ధతపురుషప్రాయః స్త్రీరోషప్రథితకావ్యబన్ధశ్చ,**
**సంక్షోభవిద్రవకృతః సంఫేటకృతస్తథా చైవ. 79**
**స్త్రీభేదనాపహరణావమర్దనప్రాప్తవస్తుశృఙ్గారః**
**ఈహామృగస్తు కార్యః సుసమాహితకావ్యబన్ధశ్చ. 80**

**తా. ఈహామృగం :– ఈహామృగం** అను రూపకంలో దివ్యపురుషులు ప్రధాన పాత్రలుగా ఉంటారు. దివ్యస్త్రీని నిమిత్తంగా చేసికొని యుద్ధం జరుగుతుంది. దీని కథావస్తువు చక్కగా కూర్చబడి ఉంటుంది. దీనిలోని ఘటన లన్నీ నమ్మడానికి శక్యంగా ఉంటాయి. ఉద్ధతులైన పురుషులు ఎక్కువగా ఉంటారు. స్త్రీనిమిత్తం కలిగిన రోషంతో కావ్యరచన అంతా సాగుతుంది. సంక్షోభం, విద్రవం (పారిపోవడం), సంఫేటం (పరుష సంభాషణలు) – ఇవన్నీ దానిలో చోటు చేసికొని ఉంటాయి. దీనిలోని కథావస్తువులో స్త్రీ

నిమిత్తమైన భేదనము (విడదీయడాలు), అపహరణము, మర్దనము (పెనుగులాట) వీటితో కూడిన శృంగారం ఉంటుంది. కావ్యరచన చాల బిగువుగా ఉంటుంది.

**మూ. యద్ వ్యాయోగే కార్యం యే పురుషా వృత్తయో రసాశ్చైవ,**
**ఈహామృగేఽపి తే స్యుః కేవలమమరస్త్రియా యోగః. 81**

**తా.** పురుషులు, వృత్తులూ, రసాలూ – ఇవన్నీ వ్యాయోగంలో ఎలా ఉంటాయో, ఈహామృగంలో కూడ అలాగే ఉంటాయి. దీనిలో స్త్రీలు దేవత లయి ఉండడమే ఈ రెండు రూపకాలకీ భేదం.

**మూ. యత్ర తు వధోద్యతానాం వధో హ్యుదగ్రో భవేద్ధి పురుషాణామ్,**
**కించిద్వ్యాజం కృత్వా తేషాం యుద్ధం శమయితవ్యమ్. 82**

**తా.** యుద్ధంలో వధించడానికి ఉద్యుక్తులై నప్పుడు, ఉదగ్రులైన (తీవ్రస్వభావంగల) పురుషుల వధ జరుగబోతూన్నప్పుడు, ఏదో వంకచేత ఆ యుద్ధం ఆగిపోయేటట్లు చెయ్యాలి.

**మూ. ఈహామృగస్య లక్షణముక్తం విప్రాః, సమాసయోగేన,**
**డిమలక్షణం తు భూయో లక్షణయుక్త్యా ప్రవక్ష్యామి. 83**

**తా.** విప్రులారా! ఈహామృగలక్షణం సవిస్తరంగా చెప్పాను. ఇప్పుడు డిమం లక్షణం చెపుతాను.

**మూ. ప్రఖ్యాతవస్తువిషయః ప్రఖ్యాతోదాత్తనాయకశ్చైవ,**
**షడ్రసలక్షణయుక్తః చతురఙ్కో వై డిమః కార్యః. 84**

**తా. డిమం :–** డిమంలోని కథావస్తువు, ఉదాత్తుడైన నాయకుడూ కూడ ప్రసిద్ధులై ఉండాలి. నాలుగు అంకాలతో ఆరు రసాలతో ఉండాలి.

**మూ. శృఙ్గారహాస్యవర్జం శేషైః సర్వై రసైః సమాయుక్తః,**
**దీప్తరసకావ్యయోనిర్నానాభావోపసంపన్నః. 85**

**నిర్ఘాతోల్కాపాతైరుపరాగేణేన్దుసూర్యయోర్యుక్తః,**
**యుద్ధనియుద్ధప్రహరణసంఫేటకృతశ్చ కర్తవ్యః. 86**

**తా.** డిమంలో శృంగారహాస్యాలు తప్ప మిగిలిన రసాలన్నీ ఉండవచ్చును. కావ్యం అంతా దీప్తములైన రసాలతో అనేకమైన భావాలతో నిండి ఉండాలి. దీనిలో పిడుగులు ఉల్కలు పడడం, చంద్రసూర్యగ్రహణాలు సూచించాలి. యుద్ధము, బాహుయుద్ధము, ఆయుధప్రయోగము, సంఫేటం (దొమ్మియుద్ధం) – వీటిని వర్ణించాలి.

**మూ. మాయేన్ద్రజాలబహులో బహుపుస్తోత్థానభేదయుక్తశ్చ,**
**దేవభుజగేన్ద్రరాక్షసయక్షపిశాచావకీర్ణశ్చ. 87**

**షోడశనాయకబహులః సాత్త్వత్యారభటీవృత్తిసంపన్నః,**
**కార్యో డిమః ప్రయత్నాన్నానాశ్రయభావసంపన్నః. 88**

**తా.** డిమంలో మాయా – ఇంద్రజాలప్రయోగం అధికంగా ఉండాలి. మాయచేత సృష్టించిన చాల పుస్తలు (నరాకృతిలో ఉన్న పెద్ద బొమ్మలు) లేస్తూండడం, వాటిని బ్రద్దలుకొట్టడం చూపాలి. దేవతలు, నాగులు, రాక్షసులు, యక్షులు, పిశాచాలు – వీళ్లతో వ్యాకులంగా ఉండాలి. పదహారుగురు నాయకు లుండాలి. సాత్త్వతీ, ఆరభిటీవృత్తులు ప్రయోగించాలి. ఈ విధంగా అనేకవిధాలైన రసాలతో, భావాలతో నిండి ఉండాలి.

**వి.** 'బహుపురుషోత్థానయోగయుక్తః' అని పాఠాంతరం. అది యుక్తమై ఉండవచ్చు.

**మూ. డిమలక్షణమిత్యుక్తం మయా సమాసేన లక్షణానుగతమ్,**
**వ్యాయోగస్య తు లక్షణమతః పరం సంప్రవక్ష్యామి. 89**

**తా.** ఈ విధంగా డిమానికి లక్షణం సవిస్తరంగా చెప్పాను. ఇప్పుడు వ్యాయోగం లక్షణం చెపుతాను.

**మూ. వ్యాయోగస్తు విదిజ్ఞైః కార్యః ప్రఖ్యాతనాయకశరీరః,**
**అల్పస్త్రీజనయుక్తస్త్వేకాహకృతస్తథా చైవ. 90**

**తా. వ్యాయోగం :–** వ్యాయోగంలో నాయకుడు ప్రసిద్ధుడై ఉండాలి. స్త్రీలు తక్కువగా ఉండే దీనిలోని కథ అంతా ఒక రోజున జరిగినది అయి ఉండాలి.

**మూ. బహవశ్చ తత్ర పురుషా వ్యాయచ్ఛన్తే యథా సమవకారే,**
**న చ దివ్యనాయకయుక్తః కార్యస్త్వేకాఙ్క ఏవాయమ్. 91**

**తా.** సమవకారంలో వలెనే దీనిలో కూడ చాలమంది పురుషులు ఉంటారు. దివ్యనాయకు డుండడు. దీనిలో ఒక్క అంకం మాత్రమే ఉండాలి.

**మూ. న చ దివ్యనాయకకృతః కార్యో రాజర్షినాయకనిబద్ధః,**
**యుద్ధనియుద్ధాఘర్షణసంఘర్షకృతశ్చ కర్తవ్యః. 92**

**తా.** దివ్యపురుషుడు దీనిలో నాయకుడుగా ఉండకూడదు. రాజర్షిని నాయకుడుగా చెయ్యాలి. యుద్ధం, బాహుయుద్ధం, ఢీకొనడం, గట్టిగా ఎదిరించడం – ఇవన్నీ దీనిలో ఉండాలి.

**మూ. ఏవంవిధస్తు కార్యో వ్యాయోగో దీప్తకావ్యరసయోనిః,**
**వక్ష్యామ్యతః పరమహం లక్షణముత్సృష్టికాఙ్కస్య. 93**

**తా.** దీప్తమైన రసాలకు స్థానంగా, వ్యాయోగం ఈ విధంగా రచించాలి. ఇటుపైన

నేను ఉత్సృష్టికాంకలక్షణం చెపుతాను.

**మూ. ప్రఖ్యాతవస్తువిషయస్త్వప్రఖ్యాతః కదాచిదేవ స్యాత్,**
**దివ్యపురుషైర్వియుక్తః శేషైర్యుక్తో భవేత్ పుమ్భిః. 94**
**కరుణరసప్రాయకృతో నివృత్తయుద్ధోద్ధతప్రహారశ్చ,**
**స్త్రీపరిదేవితబహులో నిర్వేదితభాషితశ్చైవ. 95**
**నానావ్యాకులచేష్టః సాత్త్వత్యారభటికైశికీహీనః,**
**కార్యః కార్యవిధిజ్ఞైః సతతం హ్యుత్సృష్టికాఙ్కస్తు. 96**

**తా.** ఉత్సృష్టికాంకంలో కథావస్తువు ప్రఖ్యాతమై ఉండాలి. ఒకప్పుడు అప్రఖ్యాతం కూడ కావచ్చును. దివ్యపురుషులు తప్ప ఇతరపురుష లుండవచ్చు. కరుణరసం ఎక్కువగా ఉంటుంది. యుద్ధము, ఉద్ధతుల కొట్లాటలు ఉండవు. స్త్రీల విలాపం అధికంగా ఉంటుంది. మాటలు నిర్వేదంతో నిండి ఉంటాయి. అనేకవిధాలైన వ్యాకులమైన చేష్టలతో నిండిన దీనిలో సాత్త్వతీ – ఆరభటీ, కైశికీవృత్తులకు స్థానం లేదు. కవులు ఉత్సృష్టికాంకాన్ని ఈ విధంగా ఉండే టట్లు రచించాలి.

**మూ. యద్దివ్యనాయకకృతం కావ్యం సంగ్రామబన్ధవధయుక్తమ్,**
**తద్ భారతే తు వర్షే కర్తవ్యం కావ్యబన్ధేషు. 97**

**తా.** దివ్యనాయకులతో రచించబడిన, యుద్ధాలు, బంధము, వధ – వీటితో కూడిన కావ్యాన్ని, దాని కథ భారతవర్షంలో జరిగినట్లుగా, కావ్యబంధాలలో చూపాలి.

**మూ. కస్మాద్ భారతమిష్టమ్; వర్షేష్వన్యేషు దేవవిహితేషు,**
**హృద్యా సర్వా భూమిః శుభగన్ధా కాఞ్చనీ యస్మాత్. 98**

**తా.** దివ్యనాయకుల సంగ్రామబంధనాదులు భారతవర్షంలో మాత్రమే జరిగి నట్లు ఎందుకు చూపాలి? ఇతరవర్షాలలో కూడ జరిగినట్లు ఎందుకు చెప్పకూడదు? (అని ప్రశ్న). (సమాధానం) ఎందుచేత ననగా – దేవతలకు చెప్పబడిన ఇతరవర్షాలలో సమస్తభూమీ కూడ మనోహర మైనది. శుభగంధం గలది. కాంచనమయమైనది.

**మూ. ఉపవనగమనక్రీడావిహారనారీరతిప్రమోదాః స్యుః,**
**తేషు హి వర్షేషు సదా న తత్ర దుఃఖం న వా క్లేశః. 99**
**యే తేషామధివాసాః పురాణవాదేషు పర్వతాః ప్రోక్తాః**
**సంభోగస్తేషు భవేత్; కర్మారమ్భో భవేదస్మిన్. 100**

**తా.** ఉపవనాలకి వెళ్లడం, అక్కడ క్రీడించడం, స్త్రీలతో రతి – సంతోషాలు,

ఇవన్నీ ఆ వర్షాలలో ఎల్లప్పుడు జరుగుతూనే ఉంటాయి. ఆ వర్షాలలో దుఃఖం కాని శోకం కాని ఉండదు. ఏ పర్వతాలు దేవతల నివాసస్థానా లని పురాణకథలలో చెప్పబడ్డాయో అక్కడ కూడ వీళ్లకు సంభోగమే. కార్యారంభం ఈ భావవర్షంలోనే జరుగుతుంది. అందుచేత దేవతలకు, వాళ్లు భారతవర్షంలో ఉన్నప్పుడు యుద్ధ వధబంధాదులు ఉండవచ్చునేమో కాని వాళ్ల వర్షాలలో వాళ్లు ఉన్నప్పుడు ఈ యుద్ధాదులు వాళ్ల కున్నట్లు చెప్పకూడదు అని అర్థం.

**మూ. అఙ్కస్య లక్షణమిదం వ్యాఖ్యాతమశేషయోగమాత్రగతమ్,**
**ప్రహసనమతఃపరమహం సలక్షణం సంప్రవక్ష్యామి. 101**
**ప్రహసనమపి విజ్ఞేయం ద్వివిధం శుద్ధం తథా చ సంకీర్ణమ్,**
**వక్ష్యామి తయోర్వ్యక్త్యా పృథక్ పృథగ్లక్షణవిశేషమ్. 102**

**తా. ప్రహసనం :–** ఇంతవరకు ఉత్సృష్టికాంకలక్షణం పూర్తిగా దానికి సంబంధించిన అన్ని అంశాలతో చెప్పాను. ఇపుడు ప్రహసనలక్షణం చెపుతాను. శుద్ధము, సంకీర్ణము అని ప్రహసనం రెండు విధాలు. ఈ రెండువిధాల ప్రహసనాల లక్షణాలను, వేరు వేరుగా చెపుతాను.

**మూ. భగవత్తాపసవిప్రైరన్యైరపి హాస్యవాదసంబద్ధమ్,**
**కాపురుషసంప్రయుక్తం పరిహాసాభాషణప్రాయమ్. 103**
**అవికృతభాషాచారం విశేషభావోపపన్నచరితపదమ్,**
**నియతగతివస్తువిషయం శుద్ధం జ్ఞేయం ప్రహసనం తు. 104**

**తా. శుద్ధప్రహసనం :–** హాస్యవాదాలతో కూర్చబడి ఉంటుంది. కొందరు కుత్సిత స్వభావులైన పురుషులు యతి – తాపస – బ్రాహ్మణాదులను, ఇంకా బౌద్ధశ్రమణ – జైనసంన్యాస్యాదులను పరిహసిస్తూ పలికేమాటలు దీనిలో అధికంగా ఉంటాయి. అయినా కూడ భాష – ఆచారాదులలో వికారం ఏమీ లేకుండా విశేషభావాలతో నిండిన పదాలు (కథాఖండాలు – అభి.భా.) దీనిలో ఉంటాయి. దీనిలో ఒక నిశ్చిత మైన రీతిలో నడిచే వస్తువు (కథావస్తువు) ఉంటుంది.

**మూ. వేశ్యాచేటనపుంసకవిటధూర్తా బన్ధకీ చ యత్ర స్యుః,**
**అనిభృతవేషపరిచ్ఛదచేష్టితకరణైస్తు సంకీర్ణమ్. 105**

**తా. సంకీర్ణప్రహసనం :–** దీనిలో ప్రధానపాత్రలుగా ఉన్న వేశ్యలు, చేటులు, నపుంసకులు, విటులు, ధూర్తులు (మోసగాళ్లు) కులటలు వినయరహితమైన వేషాలతో, పరివారంతో, చేష్టలతో పాత్రలుగా ఉంటారు.

**మూ. లోకోపచారయుక్తా యా వార్తా యశ్చ దమ్భసంయోగః,**
**స ప్రహసనే ప్రయోజ్యః ధూర్తప్రవివాదసంపన్నః. 106**

**తా.** లోకంలో ఉన్న వ్యవహారాన్ని అనుసరించి పరిహసింపదగిన నింద్యమైన వార్త, అనగా ప్రసిద్ధీ (ఉదాహరణకు – శాక్యులకు స్త్రీసంపర్కం ఉంటే అది ప్రహసించ దగినది అవుతుంది; అంతేకాని వాళ్లే చౌర్యం చేస్తే ప్రహసనీయం కాదు (అభి.భా.), డాంబికులతో సంబంధమూ ఇలాంటివి, ధూర్తుల విషయంలో లోకప్రవాదాన్ని పట్టి బైటకు పొక్కితే, వాటిని ప్రహసనంలో ప్రయోగించాలి.

**మూ. వీథ్యఙ్గైః సంయుక్తం కర్తవ్యం ప్రహసనం యథాయోగమ్,**
**భాణస్యాపి తు లక్షణమతః పరం సంప్రవక్ష్యామి. 107**

**తా.** ప్రహసనంలో, అవకాశాన్ని పట్టి వీథ్యంగాలను చేర్చాలి. ఇప్పుడు భాణం లక్షణం చెపుతాను.

**మూ. ఆత్మానుభూతశంసీ పరసంశ్రయవర్ణనావిశేషస్తు,**
**వివిధాశ్రయో హి భాణో విజ్ఞేయస్త్వేకహార్యశ్చ. 108**

**తా. భాణం :–** భాణం అనేకవిధాలైన విషయాలతో సంబంధించి ఉంటుంది. ఒక నటుడు ఇతరులకు సంబంధించిన కొన్ని విషయాలను వర్ణిస్తూ ఆ విషయా లన్నీ తాను సాక్షాత్తు చూచి నట్లు చెపుతాడు.

**మూ. పరవచనమాత్మసంస్థం ప్రతివచనైరుత్తరోత్తరగ్రథితైః,**
**ఆకాశపురుషకథితైః అఙ్గవికారైరభినయైశ్చైవ. 109**

**తా.** అతడు ఇతరులు పలికిన మాటలూ తానే అంటూ, ఆ మాటలు ఒకదాని తరవాత ఒకటిగా ప్రతివచనాల రూపంలో, తానే ముందుకు కొనసాగిస్తూ ఆకాశంలో ఉన్న ఎవరో పురుషుడు మాట్లాడుతున్నట్లు, తాను వాటిని విన్నట్లూ అభినయించి వాటికి సమాధానాలు చెపుతూ, అనేకవిధాల అంగవికారాలతోను, అభినయాలతోను వర్ణనలు చేస్తాడు.

**మూ. ధూర్తవిటసంప్రయోజ్యో నానావస్థాన్తరాత్మకశ్చైవ,**
**ఏకాఙ్కో బహుచేష్టః సతతం కార్యో బుధైర్భాణః. 110**

**తా.** భాణంలో అనేకవిధాలైన లోకవ్యవహారాల వర్ణనం ఉంటుంది. దీనిలో ధూర్తులు (వంచకులు, జూదరులు) విటులు పాత్రలుగా ఉంటారు. ఒకే అంకంలో ఉండే ఈ భాణం అనేకవిధాలైన చేష్టలతో నిండి ఉంటుంది.

**మూ. భాణస్యాపి హి నిఖిలం లక్షణముక్తం తథాగమానుగతమ్,**
**వీథ్యాః సమ్ప్రతి నిఖిలం కథయామి యథాక్రమం విప్రాః. 111**

**తా.** విప్రులారా! శాస్త్రానుసారంగా భాణాలకి ఉండవలసిన లక్షణా లన్నీ చెప్పాను. ఇప్పుడు **వీథీ**లక్షణా లన్నీ యథాక్రమంగా చెపుతాను.

**మూ. సర్వరసలక్షణాఢ్యా యుక్తా హ్యఙ్గైస్త్రయోదశభిః,**
**వీథీ స్యాదేకాఙ్కా తథైకహార్యా ద్విహార్యా వా. 112**

**తా.** ఒకే అంకం ఉండే **వీథి** అను రూపకాన్ని ఒకే నటునితో లేదా ఇద్దరితో నడిపించాలి. అన్ని రసాలు, లక్షణాలు, పదమూడు అంగాలు ఉంటాయి.

**మూ. అధమోత్తమమధ్యాభిర్యుక్తా స్యాత్ ప్రకృతిభిస్తిసృభిః,**
**ఉద్ఘాత్యకావలగితావస్పన్దితనాల్యసత్ప్రలాపాశ్చ. 113**
**వాక్కేల్యథ ప్రపఞ్చో మృదవాధిబలే ఛలం త్రిగతమ్,**
**వ్యాహారో గణ్డశ్చ త్రయోదశాఙ్గాన్యుదాహృతాన్యస్యాః. 114**

**తా.** దీనిలో అధమ – మధ్యమ – ఉత్తమప్రకృతులు మూడూ ఉండాలి. దీనిలో ఉండవలసిన పదమూడంగాలు – ఉద్ఘాత్యకము, అవలగితము, అవస్పందితము, నాలి, అసత్ప్రలాపము, వాక్కేలి, ప్రపంచము, మృదవము, అధిబలము, ఛలము, త్రిగతము, వ్యాహారము, గండము.

**మూ. (అథ వీథీ సంప్రోక్తా లక్షణమేషాం ప్రవక్ష్యామి),**
**పదాని త్వగతార్థాని యే నరాః పునరాదరాత్. 115**
**యోజన్తి పదైరన్యైః తదుద్ఘాత్యకముచ్యతే.**

**తా.** వీథిని చెప్పాను. ఇప్పుడు ఈ అంగాల లక్షణం చెపుతాను. (1) ముందు ఉపయోగించిన పదాలు చెప్పదలచిన అర్థాన్ని పూర్తిగా బోధించనప్పుడు, వాటికి మరి కొన్ని పదాలు జోడించడం **ఉద్ఘాత్యకం**.

**వి.** ఈ ఉద్ఘాత్యకస్వరూపం విశదీకరిస్తూ అభినవగుప్తాచార్యులు ఒక అతిమనోజ్ఞ మైన శ్లోకం కూడ ఉదాహరించారు – "నా ప్రశ్నకు ఇతడు నే ననుకొన్న సమాధానం ఇవ్వగలడా లేడా; నా మనస్సులో ఏది ఉన్నదో అది చెప్పగలడా లేడా – ఇలాంటి ఊహచేత ప్రశ్నించేవాడే, ఒక వైచిత్ర్యాన్ని మనస్సులో పెట్టుకొని ప్రశ్నిస్తాడు; ప్రతివక్త తగు సమాధానం చెపుతాడు. అతడు చెప్పిన ఆ సమాధానం ఉద్ఘాత్యకం. ఆదరపూర్వకంగా ప్రయోగించిన, ప్రశ్నరూపాలైన పదాల అర్థం పూర్తికానప్పుడు, బుద్ధిమంతులు, ఉత్తరరూపాలైన మరి కొన్ని పదాలు చేరుస్తారు. ఆ ఉత్తరపదసమూహమే ఉద్ఘాత్యకం.

**యథా పాణ్డవానన్దే -**

**కా భూషా బలినాం క్షమా, పరిభవః కోఽయం సకుల్యైః కృతః,**
**కిం దుఃఖం? పరసంశ్రయో, జగతి కః శ్లాఘ్యో?య ఆశ్రీయతే,**
**కో మృత్యుః? వ్యసనం, శుచం జహాతి కే? యైర్నిర్జితాః శత్రవః**
**కైర్విజ్ఞాతమిదం? విరాటనగరే చ్ఛన్నస్థితైః పాణ్డవైః.**

"బలవంతులకు అలంకారం ఏది? ఓరిమి. గొప్ప పరాభవం అంటే ఏది? సమాన కులంవాళ్లు చేసినది. దుఃఖం ఏమిటి? ఇతరులను ఆశ్రయించడం. జగత్తులో శ్లాఘింప తగినవా డెవరు? ఆశ్రయింపబడినవాడు. మరణం ఏది? దుర్వ్యసనం. తమ దుఃఖం ఎవరు విడిచిపెడతారు? శత్రువులను జయించినవాళ్లు. ఈ విషయా లన్నీ (స్వానుభవ పూర్వకంగా) తెలుసుకొన్నవా ళ్లెవరు? విరాటనగరంలో అజ్ఞాతంగా నివసిస్తున్న పాండవులు."

(ఈ **'పాండవానందం'** ఇప్పుడు లభిస్తూన్నదో లేదో తెలియదు. మా సహృదయ పఠితల ఆనందం కోసం ఈ పంక్తులు అధికంగా చేర్చడం జరిగింది).

**మూ. యత్రాన్యస్మిన్ సమావేశ్య కార్యమన్యత్ ప్రసాధ్యతే. 116**
**తచ్చావలగితం నామ విజ్ఞేయం నాట్యయోక్తృభిః.**

**తా. (2) అవలగితం :-** ఒకదానికోసం జరిగిన దానిని మరొకదానికి అన్వయించు కొని కార్యం సాధించుకొనడం **అవలగితం**.

**మూ. ఆక్షిప్తేఽర్థే తు కస్మింశ్చిచ్ఛుభాశుభసముత్థితే. 117**
**కౌశల్యాదుచ్యతేఽన్యోఽర్థస్తదవస్పన్దితం భవేత్.**

**తా. (3) అవస్పందితం :-** శుభానికి గాని అశుభానికి గాని సంబంధించిన ఒక అర్థాన్ని మార్చి, నేర్పుతో మరొక అర్థం చెప్పడం **అవస్పందితం**.

**మూ. హాస్యేనోపగతార్థప్రహేలికా నాలికేతి విజ్ఞేయా. 118**

**తా. (4) నాళిక :-** పరులను మోసిగించే, హాస్యజనకమైన ఉత్తరం (సమాధానం) నాళిక.

**మూ. మూర్ఖజనసంనికర్షే హితమపి యత్ర ప్రభాషతే విద్వాన్,**
**న చ గృహ్యతేఽస్య వచనం విజ్ఞేయోఽసత్ప్రలాపోఽసౌ. 119**

**తా. (5) అసత్ప్రలాపం :-** మూర్ఖజనుల ఎదుట విద్వాంసుడు పలికిన హితవచ నాలను అవతలివాళ్లు అంగీకరించకపోవడం **అసత్ప్రలాపం**.

**మూ. ఏకద్విప్రతివచనా వాక్కేలీ స్యాత్ప్రయోగేఽస్మిన్,**
**యదసద్భూతం వచనం సంస్తవయుక్తం ద్వయోః పరస్పరం యత్తు. 120**
**ఏకస్య చార్థహేతోః స హాస్యజననః ప్రపఞ్చః స్యాత్.**

**తా. (6) వాక్కేలి :–** రెండు ప్రశ్నలకు ఒకటే సమాధానం అయితే అది నాట్య ప్రయోగంలో **వాక్కేళి.**

**(7) ప్రపంచం :–** ఒక అసత్యవచనం ఇద్దరినీ స్తుతిస్తూన్నట్లుండి, ఒకనికి ప్రయోజనకారియై, హాస్యజనకం అయితే అది **ప్రపంచం.**

**మూ. యత్కారణాద్ గుణానాం దోషీకరణం భవేద్వివాదకృతమ్. 121**
**దోషగుణీకరణం వా తన్మృదవం నామ విజ్ఞేయమ్.**

**తా. (8) మృదవం :–** వివాదసమయాలలో గుణాలను దోషాలుగా గాని, దోషాలను గుణాలనుగా గాని చిత్రించడం మృదవం.

**మూ. పరవచనమాత్మనశ్చోతరోత్తరసముద్భవం ద్వయోర్యత్ర. 122**
**అన్యోన్యార్థవిశేషకమధిబలమితి తద్ బుద్ధైర్జ్ఞేయమ్.**

**తా. (9) అధిబలం :–** ఇద్దరిలో జరిగే సంభాషణలో ఒకరి మాట రెండవవాని మాటకు, రెండవ వాని మాట మొదటివాని మాటకు కారణ మైతే అది **అధిబలం.**

**మూ. అన్యార్థమేవ వాక్యం ఛలమభిసంధానహాస్యరోషకరమ్. 123**
**శ్రుతిసారూప్యాద్యస్మిన్ బహవోఽర్థా యుక్తిభిర్నియుజ్యన్తే,**
**యద్ధాస్యమహాస్యం వా తత్త్రిగతం నామ విజ్ఞేయమ్. 124**

**తా. (10) ఛలం :–** ఒక అభిప్రాయంతో పలికిన వాక్యం ఒకనికి హాస్యకర మైతే మరొకనికి రోషజనకం అవడం **ఛలం.**

**(11) త్రిగతం :–** వినబడే మాటలలోని సాదృశ్యంచేత ఒకే వాక్యానికి అనేక అర్థాలు యుక్తిపూర్వకంగా కల్పించడానికి వీలుంటే అది **త్రిగతం.** దీనిలో హాస్యం ఉండవచ్చు; లేకపోవచ్చు.

**మూ. ప్రత్యక్షవృత్తిరుక్తో వ్యాహారో హాస్యలేశార్థః,**
**సంరమ్భసంభ్రమయుతం వివాదయుక్తం తథాపవాదకృతమ్. 125**
**బహువచనాక్షేపకృతం గణ్డం ప్రవదన్తి తత్త్వజ్ఞాః.**

**తా. (12) వ్యాహారం :–** తొందరతోను ఆవేగంతోను మాట్లాడుతూ జరగబోయేది

ప్రత్యక్షంగా జరుగుతూన్నట్లు, హాస్యలేశం కోసం పలికిన, వివాదయుక్తమైన, అపవాద మూలకమైన మాట **వ్యాహారం.**

**(13) గండం :-** మాట పూర్తికాకుండానే దానిలోని, ఒక అభిప్రాయంతో పలికిన పదాలకు మరొక అర్థమూ అభిప్రాయమూ చెప్పడం **గండం.**

**మూ. ఇతి దశరూపవిధానం సర్వం ప్రోక్తం మయా హి లక్షణతః,**
**పునరస్య శరీరగతం సన్ధివిధౌ లక్షణం వక్ష్యే. 126**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే దశరూపనిరూపణం నామ అష్టాదశోఽధ్యాయః సమాప్తః.**

తా. ఈ విధంగా నేను దశరూపకప్రయోగవిధానాన్ని, వాటి లక్షణాలను, అన్నింటినీ చెప్పాను. దశరూపకాల శరీరానికి సంబంధించిన లక్షణాన్ని సంధివిధిప్రకరణంలో చెపుతాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో దశరూపనిరూపణం అను పద్దెనిమిదవ అధ్యాయం సమాప్తం.**

**ఇతి విమల శిశిరదీధితికలితశిరోమణ్డనాఙ్ఘ్రిదాస్యచణః,**
**అభినవగుప్తో గుప్తం దశరూపం సతత్త్వకం వ్యవృణోత్.**

**- శ్రీమదభినవగుప్తాచార్యాః**

**శ్రీః శ్రీః శ్రీః**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ ఏకోనవింశోఽధ్యాయః

## సంధినిరూపణము

"దేహే సన్ధ్యఙ్గగణే సమస్తే యత్స్థాపనం స్పర్శనవృత్తికారి,
తదిన్ద్రియం యస్య వపుర్నమామి తమాన్తరస్పర్శమయం మహేశమ్."

– శ్రీమదభినవగుప్తాచార్యాః

**మూ. ఇతివృత్తం తు నాట్యస్య శరీరం పరికీర్తితమ్,
పఞ్చభిః సన్ధిభిస్తస్య విభాగః సంప్రకల్పితః. 1**

**తా.** నాట్యానికి ఇతివృత్తం (కథావస్తువు) శరీర మని చెప్పబడుతుంది. ఐదు సంధులచేత దాని విభాగం కల్పింపబడింది.

**మూ. ఇతివృత్తం ద్విధా చైవ బుధస్తు పరికల్పయేత్,
ఆధికారికమేకం స్యాత్ ప్రాసఙ్గికమథాపరమ్. 2**

**తా.** నాట్యశాస్త్రపండితుడు ఇతివృత్తాన్ని రెండు విధాలుగా ఏర్పరచుకోవాలి. మొదటిది **ఆధికారికం**, రెండవది ప్రాసంగికం.

**మూ. యత్కార్యం హి ఫలప్రాప్త్యాః సామర్థ్యాత్పరికల్ప్యతే,
తదాధికారికం జ్ఞేయమన్యత్ ప్రాసంగికం విదుః. 3**

**తా.** ఏ కార్యము, అనగా ఆరంభము, ఫలం సాధించడానికి సామర్థ్యంవల్ల చేయబడుతుందో అది ఆధికారికం. మధ్యలో వచ్చే మిగిలిన వన్నీ ప్రాసంగికాలు.

**మూ. కారణాత్ ఫలయోగస్య వృత్తం స్యాదాధికారికమ్,
తస్యోపకరణార్థం తు కీర్త్యతే హ్యానుషఙ్గికమ్. 4**

**తా.** ఒక వృత్తాంతం (కథ) ఫలంతో సంబంధించడం అనే కారణంవల్ల, (అనగా ఏ కథకు ఫలంతో సంబంధం ఉంటుందో ఆ కథ) ప్రధానం. దానికి సాధనాలుగా ఉపయోగించే వృత్తం ఆనుషంగికం.

**మూ. కవేః ప్రయత్నాన్నేతౄణాం యుక్తానాం విధ్యపాశ్రయాత్,
కల్ప్యతే హి ఫలప్రాప్తిః సముత్కర్షాత్ ఫలస్య చ. 5**

**తా.** తగిన పద్ధతులను అనుసరించడంవల్ల, అర్హత గల నాయకులకు, కవి, ప్రయత్న పూర్వకంగా ఫలప్రాప్తి జరిగినట్లు కల్పిస్తాడు. ఫలం ఉత్తమమైన దవడంవల్ల

కూడ యుక్తులైన నాయకులకే ఆ ఫలం లభిస్తుంది. (అలా ఉత్తమఫలం అందుకొన్న నాయకుని కథ ఆధికారికం అని అర్థం).

**మూ. సంప్రాప్యే ఫలయోగే తు వ్యాపారః సాధకస్య యః,**
**తస్యానుపూర్వ్యా విజ్ఞేయాః పఞ్చావస్థాః ప్రయోక్తృభిః. 6**

**తా.** ఫలం సాధించే నాయకుడు ఫలం సాధించడానికి చేసే వ్యాపారానికి (పనికి; ప్రయత్నానికి) చెందిన అయిదు అవస్థలను (stages) వాటి క్రమం ప్రకారం నాట్యప్రయోక్తలు తెలుసుకోవాలి.

**మూ. ప్రారమ్భశ్చ ప్రయత్నశ్చ తథా ప్రాప్తేశ్చ సంభవః,**
**నియతా చ ఫలప్రాప్తిః ఫలయోగశ్చ పఞ్చమః. 7**

**తా.** ప్రారంభము, ప్రయత్నము, ప్రాప్తిసంభవము, ఫలప్రాప్త్యాశ, ఫలప్రాప్తి అని అవస్థలు అయిదు.

**మూ. ఔత్సుక్యమాత్రబన్ధస్తు యద్బీజస్య నిబధ్యతే,**
**మహతః ఫలయోగస్య స ఫలారమ్భ ఇష్యతే. 8**

**తా.** గొప్పదైన ఫలం లభించడానికి బీజమైన ఉపాయ సంపదను గూర్చి ఔత్సుక్యాన్ని మాత్రమే, ఉపాయమును స్మరించడాన్ని మాత్రమే (కావ్యంలో) చెప్పడం **ఫలారంభం**.

**మూ. అపశ్యతః ఫలప్రాప్తిం వ్యాపారో యః ఫలం ప్రతి,**
**పరం చౌత్సుక్యగమనం స ప్రయత్నః ప్రకీర్తితః. 9**

**తా.** ఇంకా ఫలప్రాప్తి కనబడక, ఫలాన్ని గూర్చి వ్యాపారం (పని) చేసే సాధకుని ఔత్సుక్యం మరి కొంత పెరగడం **ప్రయత్నం**.

**మూ. ఈషత్ప్రాప్తిర్యదా కాచిత్ఫలస్య పరికల్ప్యతే,**
**భావమాత్రేణ తం ప్రాహుః విధిజ్ఞాః ప్రాప్తిసంభవమ్. 10**

**తా.** 'ఫలం లభించేటట్లుంది' అను భావం సాధకునికి కలగడం **ప్రాప్తిసంభవము**.

**మూ. నియతాం తు ఫలప్రాప్తిం యదా భావేన పశ్యతి,**
**నియతాం తాం ఫలప్రాప్తిం సగుణాం పరిచక్షతే. 11**

**తా.** ఫలం తప్పక లభిస్తుంది అని మనస్సులో ఎప్పు డనుకొంటాడో అది **నియతఫల ప్రాప్తి**.

**మూ. అభిప్రేతం సమగ్రం చ ప్రతిరూపం క్రియాఫలమ్,**
**ఇతివృత్తే భవేద్యస్మిన్ ఫలయోగః ప్రకీర్తితః. 12**

**తా.** ఏ కథాభాగంలో, అభిలషింపబడిన సంపూర్ణమైన క్రియాఫలం అనుకొన్న విధంగా లభిస్తుందో అది **ఫలయోగం** అని చెప్పబడుతుంది.

**మూ. సర్వస్యైవ హి కార్యస్య ప్రారబ్ధస్య ఫలార్థిభిః,**
**ఏతాస్త్వనుక్రమేణైవ పఞ్చావస్థాః భవన్తి హి. 13**

**తా.** ఫలం కోరేవాళ్లు ప్రారంభించిన అన్ని కార్యాలకీ కూడ ఈ ఐదు అవస్థలు వరసగా ఉంటాయి.

**మూ. ఆసాం స్వభావభిన్నానాం పరస్పరసమాగమాత్,**
**విన్యాస ఏకభావేన ఫలహేతుః ప్రకీర్తితః. 14**

**తా.** స్వభావంచేత భిన్నములైన, అనగా వేరువేరు స్వభావాలు గల ఈ ఐదు అవస్థలు, పరస్పరమూ కలిసి ఒకటిగా ఏర్పడి ఫలానికి కారణం అవుతున్నాయి.

**మూ. ఇతివృత్తం సమాఖ్యాతం ప్రత్యగేవాధికారికమ్,**
**తదారమ్భాది కర్తవ్యం ఫలాన్తం చ యథా భవేత్. 15**

**తా.** ఆధికారికమైనదిగా వెనుక చెప్పబడిన ఇతివృత్తాన్ని ప్రారంభం మొదలు, ఫలం వరకు నడిపించాలి.

**మూ. పూర్ణసంధ్యపి కర్తవ్యం హీనసంధ్యపి వా పునః,**
**నియమాత్ పూర్ణసంధి స్యాత్ హీనసంధ్యథ కారణాత్. 16**

**తా.** ఇతివృత్తం నడపడంలో సంధు లన్నీ పాటించాలి. కొన్ని పాటించకపోయినా దోషం లేదు. పూర్ణంగా సంధులుండా లనేది నియమం. కొన్ని కారణాలచేత శక్యం కాని పక్షంలో సంధులు తక్కువ అయితే కావచ్చును.

**మూ. ఏకలోపే చతుర్థస్య ద్విలోపే త్రిచతుర్థయోః,**
**ద్వితీయత్రిచతుర్థానాం త్రిలోపే లోప ఇష్యతే. 17**

**తా.** ఒక సంధి తగ్గించాలనుకొన్నప్పుడు నాల్గవదానిని, రెండింటిని తగ్గించాలనుకొన్నప్పుడు మూడు నాలుగు సంధులను, మూడింటిని తగ్గించాలనుకొన్నప్పుడు రెండు మూడు నాలుగు సంధులను విడవవచ్చు.

**మూ. ప్రాసఙ్గికే పరార్థత్వాన్నహ్యేష నియమో భవేత్,**
**యద్వృత్తం సంభవేత్తత్ర తద్యోజ్యమవిరోధతః. 18**

**తా.** ప్రాసంగికవస్తువు ఆధికారికేతివృత్తంకోసం చేర్చినది కాబట్టి దాని విషయంలో సంధులను గూర్చిన ఈ నియమాలు లేవు. విరోధం లేకుండా కుదిరే దానినే ప్రాసంగికేతివృత్తంలో ఉపయోగించాలి.

**మూ. ఇతివృత్తే యథావస్థాః పఞ్చారమ్భాదికాః స్మృతాః,**
**అర్థప్రకృతయః పఞ్చ తథా బీజాదికా అపి. 19**

**తా.** ఇతివృత్తంలో ఆరంభం మొదలైన అయిదు అవస్థ లున్నట్లే బీజం మొదలైన అయిదు అర్థప్రకృతులు కూడ ఉన్నాయి.

**మూ. బీజం బిన్దుః పతాకా చ ప్రకరీ కార్యమేవ చ,**
**అర్థప్రకృతయః పఞ్చ జ్ఞాత్వా యోజ్యా యథావిధి. 20**

**తా.** బీజము, బిందువు, పతాక, ప్రకరి, కార్యము అను ఐదు అర్థప్రకృతులను నియమానుసారం ఉపయోగించాలి.

**మూ. స్వల్పమాత్రం సముత్సృష్టం బహుధా యద్విసర్పతి,**
**ఫలావసానం యచ్చైవ బీజం తత్పరికీర్తితమ్. 21**

**తా.** ప్రారంభంలో నాటిన అత్యల్పమైన ఏ వస్తువు ఫలంవరకు అనేకవిధాల విస్తరిస్తుందో అది **బీజం**.

**మూ. ప్రయోజనానాం విచ్ఛేదే యదవిచ్ఛేదకారణమ్,**
**యావత్సమాప్తిర్బన్ధస్య స బిన్దుః పరికీర్తితః. 22**

**తా.** ప్రధానేతివృత్తానికి సంబంధించిన ప్రయోజనాలు మధ్యలో ఎక్కడనైనా తెగిపోతే వాటిని మళ్లీ అతుకుతూ, కథ చివరివరకూ ఉండేది **బిందువు**.

**మూ. యద్వృత్తం తు పరార్థం స్యాత్ ప్రధానస్యోపకారకమ్,**
**ప్రధానవచ్చ కల్ప్యేత సా పతాకేతి కీర్తితా. 23**

**తా.** ప్రధానమైన ఇతివృత్తానికి ఉపకారకంగా ఉన్న పరార్థమైన ఏ వృత్తం ప్రధానం వలె కల్పించబడుతుందో, అనగా దాని కొక ఫలం ఉన్నట్లుగా నడపబడుతుందో, అది **పతాక**.

**మూ. ఫలం ప్రకల్ప్యతే యస్యాః పరార్థాయైవ కేవలమ్,**
**అనుబన్ధవిహీనత్వాత్ ప్రకరీతి వినిర్దిశేత్. 24**

**తా.** ప్రధానేతివృత్తంతో చాలదూరం సంబంధం లేని ఏ కథకు చెప్పిన ఫలం కూడ ప్రధానకథకే ఉపయోగిస్తుందో అది **ప్రకరి**. రామకథ ప్రధానకథ అయినప్పుడు ఆ కథతో కలిసి చాల దూరం నడిచే సుగ్రీవవృత్తాంతాదికం **పతాక**; తక్కువ దూరం నడిచే గుహ – శబరీవృత్తాంతాదికం **ప్రకరి**.

**మూ. యదాధికారికం వస్తు సమ్యక్ ప్రాజ్ఞైః ప్రయుజ్యతే,**
**తదర్థో యః సమారమ్భః తత్కార్యం పరికీర్తితమ్. 25**

**తా.** ఆధికారిక మైన ఏ వస్తువును ప్రాజ్ఞులు ప్రారంభిస్తారో దాని ప్రయోజనాన్ని ఉద్దేశించి చేసే ప్రయత్నం కార్యం.

"ప్రాజ్ఞులు, అనగా ప్రధాననాయక – పతాకనాయక – ప్రకరీనాయకులు, ఫలరూప మైన ఏ వస్తువును సంపాదింపవలసినదిగా సంకల్పించి ద్రవ్యగుణక్రియారూపసాధన సామాగ్రిని సమకూర్చుకొంటారో ఆ ఫలం కార్యం" అని **అభినవభారతి**. (ఇది కొంచెం క్లిష్టకల్పన వలె ఉన్నది).

**మూ. ఏతేషాం యస్య యేనార్థో యతశ్చ గుణ ఇష్యతే,**
**తత్ ప్రధానం తు కర్తవ్యం గుణభూతాన్యతః పరమ్. 26**

**తా.** వీటిలో, దేనికి ఉపకరించడానికై ఇతరమైనవి కూర్చబడతాయో, దేని దృష్ట్యా అవి అప్రధానములో అది ప్రధానం అని గ్రహించాలి; మిగిలిన వన్నీ దీనికి అంగాలు.

**వి.** అర్థప్రకృతులు ఐదూ కూడ ప్రతీ రూపకంలోను ఉండ నవసరంలేదు. బీజ – బిందు – కార్యాలు మాత్రం తప్పకుండా ఉండాలి. (అభి.భా.)

**మూ. ఏకోఽనేకోఽపి వా సన్ధిః పతాకాయాం తు యో భవేత్,**
**ప్రధానార్థానుయాయిత్వాదనుసన్ధిః ప్రకీర్త్యతే. 27**

**తా.** పతాక ప్రధానవృత్తానికి అంగంగా ప్రవేశపెట్టింది గాన, దానిలో (చెప్పబోవు ఐదు సంధులలో) ఒకటి రెండు సంధు లున్నా కూడ అవి అనుసంధులే. (ప్రధానేతి వృత్తానికి అంగంగా ఉన్న సంధులే).

**మూ. ఆగర్భాదావిమర్శాద్వా పతాకా వినివర్తతే,**
**కస్మాత్? యస్మాన్నిబన్ధోఽస్యాః పరార్థః పరికీర్త్యతే. 28**

**తా.** పతాక గర్భసంధి దగ్గరగాని, విమర్శసంధి దగ్గరగాని ఆగిపోతుంది. ఎందువల్ల? ఎందువల్ల ననగా పతాక ప్రధానకథావస్తువునకు అంగంగా కూర్చబడుతుంది.

**మూ. యత్రార్థే చిన్తితేఽన్యస్మింస్తల్లిఙ్గోఽన్యః ప్రయుజ్యతే,**
**ఆగన్తుకేన భావేన పతాకాస్థానకం తు తత్. 29**

**తా. పతాకాస్థానకం లక్షణం :–** ఏదో ఒక ప్రయోజనాన్ని గూర్చి ఆలోచించే టప్పుడు అకస్మాత్తుగా అలాంటిదే మరొక ప్రయోజనం, అనుకోకుండా ప్రాప్తిస్తే అది పతాకాస్థానకం. (ఇది పతాకాస్థానానికి సాధారణలక్షణం. దీనిలో నాలుగు భేదాలు రాబోయే శ్లోకాలలో చెపుతున్నాడు).

**మూ. సహసైవార్థసంపత్తిః గుణవత్యుపకారతః,**
**పతాకాస్థానకమిదం ప్రథమం పరికీర్తితమ్. 30**

**తా. (1) ప్రథమపతాకాస్థానకం :–** ఏదో ఒక ఉపకారకం అనుకోకుండా లభించి, ఎదురు చూచిన దానికంటె అధికమైన ప్రయోజనం లభిస్తే అది మొదటి పతాకాస్థానకం.

**మూ. వచః సాతిశయం శ్లిష్టం కావ్యబన్ధసమాశ్రయమ్,**
**పతాకాస్థానకమిదం ద్వితీయం పరికీర్తితమ్. 31**

**తా. (2) ద్వితీయపతాకాస్థానం :–** ఏదో ఒక ప్రకృతవిషయం వర్ణిస్తూ ప్రయోగించిన వాక్యంనుంచి మరొక మంచి అర్థం కూడ స్ఫురించడం **రెండవ పతాకా స్థానకం.**

**మూ. అర్థోపక్షేపణం యత్ర లీనం సవినయం భవేత్,**
**శ్లిష్టప్రత్యుత్తరోపేతం తృతీయమిదమిష్యతే. 32**

**తా. (3) తృతీయపతాకాస్థానకం :–** అస్పష్టంగా చెప్పబడుతూన్న విషయం, ప్రత్యుత్తరంలోని శ్లిష్టపదం (రెండర్థాలు గల పదం) ద్వారా ఎప్పుడు స్పష్టం అవుతుందో అది మూడవ **పతాకాస్థానకం.**

**మూ. ద్వ్యర్థో వచనవిన్యాసః సుశ్లిష్టః కావ్యయోజితః,**
**ఉపన్యాససుయుక్తశ్చ తచ్చతుర్థముదాహృతమ్. 34**

**తా. (4) చతుర్థపతాకాస్థానకం :–** కావ్యంలో ఉపయోగించిన సుశ్లిష్టమైన రెండర్థాలు బోధించగల వచనవిన్యాసం మరొక అర్థాన్ని కూడ స్పష్టీకరించడానికి సమర్థ మైతే అది నాల్గవ **పతాకాస్థానకం.**

**మూ. (యత్ర సాతిశయం వాక్యమర్థోపక్షేపణం భవేత్,**
**వినాశి దృష్టమన్తే చ పతాకార్థం తు తద్భవేత్). 35**

**తా.** (అతిశయపూర్వక మైన ఒక వాక్యం ఒక ప్రయోజనాన్ని సూచించినా, చివరికి ఆ ప్రయోజనం నశించినట్లయితే అది పతాకార్థం).

**మూ. చతుష్పతాకపరమం నాటకే కార్యమిష్యతే,**
**పఞ్చభిః సంధిభిర్యుక్తం, తాంశ్చ వక్ష్యామ్యతఃపరమ్. 36**

**తా.** నాటకంలో ఐదు సంధులతో కూడిన కార్యంలో నాలుగుపతాకాస్థానాల వరకు ఉండవచ్చు. (అంతకు మించి ఉండ కూడదు). ఇప్పుడు ఐదు సంధులను గూర్చి చెపుతాను.

**మూ. ముఖం ప్రతిముఖం చైవ గర్భో విమర్శ ఏవ చ,**
**తథా నిర్వహణం చేతి నాటకే పఞ్చ సంధయః. 37**

**తా.** నాటకంలో – ముఖము, ప్రతిముఖము, గర్భము, విమర్శము, నిర్వహణము అని సంధులు ఐదుంటాయి.

**మూ. పఞ్చభిః సన్ధిభిర్వ్యక్తం ప్రధానమనుకీర్త్యతే,**
**శేషాః ప్రధానసన్ధీనామనుగ్రాహ్యానుసన్ధయః. 38**

**తా.** ప్రధానకథావస్తువు ఈ ఐదుసంధులలో విభక్తమై ప్రయోగిపబడుతుంది. మిగిలిన అనుసంధులు ప్రధానసంధులకు ఉపకారకాలుగా ఉంటాయి.

**మూ. యత్ర బీజసముత్పత్తిర్నానార్థరససంభవా,**
**కావ్యే శరీరానుగతా తన్ముఖం పరికీర్తితమ్. 39**

**తా.** కావ్యంలో (రూపకంలో) శరీరాన్ని (ప్రారంభరూపమైన శరీరాన్ని) అనుసరిస్తూ, వివిధవిషయాలకు, రసాలకు ఉత్పత్తిస్థానమైన బీజముయొక్క ఆవిర్భావం దేనియందు జరుగుతుందో అది **ముఖసంధి**. (రూపకప్రారంభంలోనే ఇది ఉంటుంది గాన దీనికి **ముఖసంధి** అని పేరు).

**మూ. బీజస్యోద్ఘాటనం యత్ర దృష్టనష్టమివ క్వచిత్,**
**ముఖన్యస్తస్య సర్వత్ర తద్వై ప్రతిముఖం స్మృతమ్. 40**

**తా.** ముఖసంధిలో స్థాపితమై, ఒకప్పుడు కనబడుతూ మరొకప్పుడు కనబడకుండా ఉన్న బీజం దేనిలో ఉద్ఘాటిత మవుతుందో, కొంచెం ఉబుకుతుందో, అది ప్రతి **ముఖ సంధి**.

**మూ. ఉద్భేదస్తస్య బీజస్య ప్రాప్తిరప్రాప్తిరేవ చ,**
**పునశ్చాన్వేషణం యత్ర స గర్భ ఇతి సంజ్ఞితః. 41**

**తా.** వికసించిన బీజం ఏ సంధిలో ఉద్భిన్నం (ప్రకాశితం; వ్యక్తం) అవుతుందో, అదే ఒక మాటు దొరికినట్లు, దొరకనట్లు కనబడుతూండగా దానిని అన్వేషించడం (వెదకడం) ఉంటుందో అది **గర్భసంధి**.

**మూ. గర్భనిర్భిన్నబీజార్థో విలోభనకృతోఽపి వా,**
**క్రోధవ్యసనజో వాపి విమర్శః స ఇతి స్మృతః. 42**

**తా.** నాల్గవ సంధి **'విమర్శసంధి'** అని కొందరూ, **'అవమర్శసంధి'** అని కొందరూ అంటారు. (అభి.భా.). గర్భసంధిలో నిర్భిన్నమైనా కూడ బీజార్థం పూర్తిగా వికసించడం విషయంలో ఏదైన ప్రలోభనం చేతనైనా, క్రోధం చేతనైనా, వ్యసనంచేతనైనా సందేహం కాని, విఘ్నం కాని ఏర్పడగా దానికోసం బలవత్తరమైన ప్రయత్నం చేయడం **విమర్శసంధి**, లేదా **అవమర్శసంధి**.

**మూ. సమానయనమర్థానాం ముఖాద్యానాం సబీజానామ్,**
**నానాభావోత్తరాణాం యద్ భవేన్నిర్వహణం తు తత్. 43**

**తా.** ముఖాదులైన నాలుగు సంధుల ప్రారంభాద్యర్థాలను, బీజవికారా లైన ఉత్పత్తి – ఉద్ఘాటన – ఉద్భేద – గర్భనిర్భేదాలను సుఖదుఃఖాత్మకము లైన, తీవ్రస్థితికి చేరిన హాస – శోక – క్రోధాదిభావాలను ఒక చోట చేర్చడం **నిర్వహణసంధి**.

**వి.** నాటకాది రూపకాల కథావస్తువు ఒక నిర్ణీతమైన పద్ధతిప్రకారం ప్రారంభం నుంచి చివరివరకూ నడవడానికి ఉద్దేశించినవే ఈ పంచసంధులు. కొన్ని వేల సంవత్సరా లకు పూర్వమే భారతదేశంలోని నాటకరచయితల శిల్పచాతుర్యము ప్రయోగకౌశలము ఎంత ఉన్నతస్థితికి చెంది ఉన్నాయో తెలిపే ప్రత్యక్షోదాహరణం ఈ పంచసంధి ప్రక్రియా కల్పన.

ఆరంభము, యత్నము, ప్రాప్త్యాశ, నియతాప్తి, ఫలాగమము అను ఐదు అవస్థలను బీజము, బిందువు, పతాక, ప్రకరి, కార్యము అను అర్థప్రకృతులతో యథాక్రమంగా (మొదటిదానిని మొదటిదానితో – ఇత్యాదిక్రమంలో) సంధించడంవల్ల, కలపడంవల్ల, వరసగా ఈ ముఖము, ప్రతిముఖము, గర్భము, అవమర్శ, ఉపసంహృతి (దీనికే నిర్వహణం అని కూడ పేరు) అను సంధులు ఏర్పడతాయి. వీటిని అనుసరించడం వల్ల కథావస్తువులో శైథిల్యం లేకుండా ఒక విధమైన బిగి, ఐక్యమూ లభిస్తాయి. ప్రేక్షకులకు నిరంతరానందానుభూతి కలుగుతుంది.

మానవు డేదైన కార్యం సాధించా లనుకొన్నప్పుడు దానిలో ఆలోచనాపక్షం (psychological aspect) నిర్వహణపక్షం (practical aspect). అను రెండు పక్షాలు ఉంటాయి. ఉదాహరణకి – ఒకడు ఏదైన ఉద్యోగం సంపాదించుకోవా లనుకొన్నాడు. ఆ కోరిక పుట్టడమే **ఆరంభం**. అందుకు ప్రయత్నిస్తాడు. అది **యత్నం**. లభిస్తుందా లభించదా అను సంశయం కలుగుతూంటుంది. అది ప్రాప్త్యాశ. తప్పక లభిస్తుంది అను విశ్వాసం కలుగుతుంది. అది **నియతాప్తి**. ప్రయత్నం సఫలం అవడంతో ఆనందిస్తాడు. **అది ఫలాగమం**. ఈ ఐదూ మానసికపక్షాలు.

అతడు ముందుగా అభ్యర్థనాపత్రం పంపుతాడు. అది **బీజం**. కొంచెం ప్రయత్నించగా ఆ పత్రం చేరవలసిన అధికారి చేతికి చేరే టట్లు చేస్తాడు. అది **బిందువు**. మధ్యలో వచ్చే అంతరాయాలను ఎవరి సహాయంతోనో తొలగిస్తాడు. అది **పతాక**. కింది అధికారుల చేతులు తడిచేస్తాడు, అది **ప్రకరి**. చివరికి ఉద్యోగంలో చేరతాడు. ఇది **కార్యం**. ఈ విధంగా బీజారంభాల సంధి **ముఖసంధి**. బిందుయత్నాల సంధి **ప్రతిముఖ సంధి**. పతాకా – ప్రాప్త్యాశలసంధి **గర్భసంధి**. ప్రకరీనియతాప్తుల సంధి **అవమర్శసంధి**. కార్య – ఫలాగమాల సంధి **ఉపహృతిసంధి** లేదా **నిర్వహణసంధి**.

**అర్థప్రకృతయః పఞ్చ పఞ్చావస్థాసమన్వితాః,**
**యథాసంఖ్యేన జాయన్తే ముఖాద్యాః పఞ్చ సంధయః.** (దశరూపకం 1.22)

అన్ని రూపకాలలోనూ కూడ కథాస్వరూపాన్ని బట్టి ఐదు సంధులు కాని, అంతకు తక్కువ సంధులు కాని ఉండాలి.

ఈ సంధుల వినియోగం కేవలం రూపకాలలో నేకాదు, శ్రవ్యకావ్యాలలో కూడ ఉండాలని ఆలంకారికసంప్రదాయం.

**మూ. ఏతే తు సంధయో జ్ఞేయాః నాటకస్య ప్రయోక్తృభిః,**
**తథా ప్రకరణస్యాపి శేషాణాం చ నిబోధత. 44**

**తా.** నాటకంలోను, ప్రకరణంలోనూ కూడ ఈ సంధులుండా లను విషయం రచయితలు, నాట్యప్రయోక్తలూ కూడ తెలుసుకోవాలి. మిగిలిన రూపకాల విషయం చెపుతాను; తెలుసుకొండి.

**మూ. డిమః సమవకారశ్చ చతుఃసన్ధీ ప్రకీర్తితౌ,**
**న తయోరవమర్శస్తు కర్తవ్యః కవిభిః సదా. 45**

**తా.** డిమంలోను, సమవకారంలోను అవమర్శం తప్ప మిగిలిన నాలుగు సంధులే కవులు చెయ్యాలి.

**మూ. వ్యాయోగేహామృగౌ చాపి సదా కార్యౌ త్రిసంధికౌ,**
**గర్భావమర్శౌ న స్యాతాం తయోర్వృత్తిశ్చ కైశికీ. 46**

**తా.** వ్యాయోగ – ఈహామృగాలలో గర్భ – అవమర్శలు తప్ప మిగిలిన సంధులు మూడూ ఉండాలి. వీటిలో కైశికీవృత్తి అవలంబించాలి.

**మూ. ద్విసంధి తు ప్రహసనం వీథ్యఙ్కో భాణ ఏవ చ,**
**ముఖనిర్వహణే తత్ర కర్తవ్యే కవిభిః సదా. 47**

**తా.** ప్రహసన – వీథీ – అంక – భాణాలలో కవులు, ముఖసంధి, నిర్వహణ సంధీ – ఈ రెండు సంధులూ ఉపయోగించాలి.

**మూ. వీథీ చైవ హి భాణశ్చ తథా ప్రహసనం పునః,**
**కైశికీవృత్తిహీనాని కార్యాణి కవిభిః సదా. 48**

**తా.** కవులు, వీథీ – భాణ – ప్రహసనాలలో కైశికీవృత్తి ఉపయోగించకూడదు.

**మూ. ఏవం హి సన్ధయః కార్యా దశరూపే ప్రయోక్తృభిః,**
**పునరేషాం తు సన్ధీనామఙ్గకల్పం నిబోధత. 49**

**తా.** దశరూపకాలలో సంధులను, కవులు, ఈ విధంగా చెయ్యాలి. ఇప్పు డింక సంధుల అంగాల కల్పమును (ఏర్పాటును) తెలుసుకొనండి.

**మూ. సన్ధీనాం యాని వృత్తాని ప్రదేశేష్వనుపూర్వశః,**
**స్వసంపద్గుణయుక్తాని తాన్యఙ్గాన్యుపధారయేత్. 50**

**తా.** సంధుల ఆ యా ప్రదేశాలలో ఉన్న కథాంశాలలో, వాటి క్రమాన్ని అనుసరించి, తమ తమ సౌందర్యంతోను గుణాలతోను కూడిన అఙ్గాలను సంధ్యంగాలను, (ఉప సంధులను) చేర్చాలి.

**మూ. ఇష్టస్యార్థస్య రచనా, వృత్తాన్తస్యానుపక్షయః,**
**రాగప్రాప్తిః ప్రయోగస్య, గుహ్యానాం చైవ గూహనమ్. 51**
**ఆశ్చర్యవదభిఖ్యానం ప్రకాశ్యానాం ప్రకాశనమ్,**
**అఙ్గానాం షడ్విధం హ్యేతద్ దృష్టం శాస్త్రే ప్రయోజనమ్. 52**

**తా.** ఇష్టమైన (చెప్పదలచిన) విషయం కూర్చడం, ప్రధానకథ తెగిపోకుండా ఉండడం, ప్రయోగం రంజకంగా ఉండడం. రహస్యాలను సంరక్షించడం, ఆశ్చర్యకరమైన వాటిని చెప్పడం, ప్రకాశింపచేయదగినవాటిని (స్పష్టంగా పైకి చెప్పవలసినవాటిని) ప్రకాశింపచేయడం – ఈ ఆరూ అంగాల ప్రయోజనం అని శాస్త్రాలు చెపుతున్నాయి.

**మూ. అఙ్గహీనో నరో యద్వన్నైవారమ్భక్షమో భవేత్,**
**అఙ్గహీనం తథా కావ్యం న ప్రయోగక్షమం భవేత్. 53**

**తా.** అవయవలోపం ఉన్న మనిషి ఏ విధంగా ఏ పనీ ప్రారంభించడానికి అసమర్థుడో అదే విధంగా, అంగాలు లేని కావ్యం ప్రయోగానికి అనుగుణంగా ఉండదు.

**మూ. ఉదాత్తమపి యత్ కావ్యం స్యాదఙ్గైః పరివర్జితమ్,**
**హీనత్వాద్ధి ప్రయోగస్య న సతాం రఞ్జయేన్మనః. 54**

**తా.** అంగాలు లేని కావ్యం (నాటకం) ఎంత ఉదాత్త మైనా, దాని ప్రయోగం లోపభూయిష్ఠంగా ఉండడంచేత సత్పురుషుల మనస్సును రంజింపచేయజాలదు.

**మూ. కావ్యం యదపి హీనార్థం సమ్యగఙ్గైః సమన్వితమ్,**
**దీప్తత్వాత్తు ప్రయోగస్య శోభామేతి న సంశయః. 55**

**తా.** ఒక కావ్యంలోని అర్థం (కథావస్తువు) అంతగా బాగుండక పోయినా, అంగా లన్నీ చక్కగా కూరుస్తే దాని ప్రయోగం వెలిగిపోతూంటుంది గాన, అది శోభిస్తుంది. సంశయం లేదు.

**మూ. (తస్మాత్ సంధిప్రదేశేషు యథాయోగం యథారసమ్,**
**కవినాఙ్గాని కార్యాణి సమ్యక్తాని నిబోధత. 56**

**తా.** అందుచేత, కవి, సంధిప్రదేశాలలో, వీలును బట్టి, రసానుగుణంగా అంగాలు చక్కగా సమకూర్చాలి. వాటిని చెపుతాను, వినండి.

**మూ. ఉపక్షేపః పరికరః పరిన్యాసో విలోభనమ్,**
**యుక్తిః ప్రాప్తిః సమాధానం విధానం పరిధావనా. 57**
**ఉద్భేదః కరణం భేద ఏతాన్యఙ్గాని వై ముఖే.**

**తా.** ముఖసంధిలో – ఉపక్షేపము, పరికరము, పరిన్యాసము, విలోభనము, యుక్తి, ప్రాప్తి, సమాధానము, విధానము, పరిభావన, ఉద్భేదము, కరణము, భేదము అని (12) అంగా లుంటాయి.

**మూ. తథా ప్రతిముఖే చైవ శృణుతాఙ్గాని నామతః. 58**
**విలాసః పరిసర్పశ్చ విధూతం తాపనం తథా,**
**నర్మ నర్మద్యుతిశ్చైవ తథా ప్రగమనం పునః. 59**
**నిరోధశ్చైవ విజ్ఞేయః పర్యుపాసనమేవ చ,**
**పుష్పం వజ్రముపన్యాసో వర్ణసంహార ఏవ చ. 60**
**ఏతాని వై ప్రతిముఖే, గర్భేఉఙ్గాని నిబోధత.**

**తా.** ప్రతిముఖసంధిలో అంగాల పేర్లు వినండి – విలాసము, పరిసర్పము, విధూతము, తాపనము, నర్మ, నర్మద్యుతి, ప్రగమనము, నిరోధము, పర్యుపాసనము, పుష్పము, వజ్రము, ఉపన్యాసము, వర్ణసంహారము – ఇవి (14) ప్రతిముఖసంధ్యంగాలు. గర్భసంధి అంగాలను తెలిసికొనండి –

**మూ. అభూతాహరణం మార్గో రూపోదాహరణే క్రమః. 61**
**సంగ్రహశ్చానుమానం చ ప్రార్థనాక్షిప్తమేవ చ,**
**తోటకాధివనే చైవ హ్యుద్వేగో విద్రవస్తథా. 62**
**ఏతాన్యఙ్గాని వై గర్భే హ్యవమర్శే నిబోధత.**

**తా.** అభూతాహరణమూ, మార్గము, రూపము, ఉదాహరణము, క్రమము, సంగ్రహము, అనుమానము, ప్రార్థన, ఆక్షిప్తము, తోటకము, అధిబలము, ఉద్వేగము, విద్రవము – ఇవి (13) గర్భాంగాలు. ఇపుడు అవమర్శసంధి అంగాలు తెలుసుకొనండి.

**మూ. అపవాదశ్చ సంఫేటో విద్రవః శక్తిరేవ చ. 63**

**వ్యవసాయః ప్రసంగశ్చ ద్యుతిః ఖేదో నిషేధనమ్,**
**విరోధనమథాదానం ఛాదనం చ ప్రరోచనా. 64**

**వ్యవహారశ్చ యుక్తిశ్చ విమర్శాఙ్గాన్యమూని చ.**

**తా.** అపవాదము, సంఫేటము, విద్రవము, శక్తి, వ్యవసాయము, ప్రసంగము, ద్యుతి, ఖేదము, నిషేధనము, విరోధనము, ఆదానము, భావనము, ప్రరోచన, వ్యవహారము, యుక్తి – ఇవి (15) విమర్శసంధి అంగాలు.

**మూ. సన్ధిర్విరోధో గ్రథనం నిర్ణయః పరిభాషణమ్. 65**
**ద్యుతిః ప్రసార ఆనన్దః సమయో హ్యుపగూహనమ్,**
**భాషణం పూర్వవాక్యం చ కావ్యసంహార ఏవ చ. 66**

**ప్రశస్తిరితి సంహారే జ్ఞేయాన్యఙ్గాని నామతః,**
**చతుఃషష్టిర్ బుధైర్జ్ఞేయా న్యేతాన్యఙ్గాని సన్ధిషు. 67**

**తా.** సంధి, విరోధము, గ్రథనము, నిర్ణయము, పరిభాషణము, ద్యుతి, ప్రసాదము, ఆనందము, సమయము, ఉపగూహనము, భాషణము, పూర్వవాక్యము, కావ్యసంహారము, ప్రశస్తి – ఇవి (14) ఉపసంహారసంధి అంగాల పేర్లు. ఈ విధంగా ఐదు సంధులలో అరవైనాలుగు (64) అంగాలు అని బుధులు తెలుసుకోవాలి.

**మూ. (సంపాదనార్థం బీజస్య సమ్యక్ సిద్ధికరాణి చ,**
**కార్యాణ్యేతాని కవిభిర్విభజ్యార్థాని నాటకే). 68**

**తా.** కవులు నాటకంలోని అర్థాలను, కథాంశాలను విభజించుకొని, ఈ అంగాలను బీజాన్ని సంపాదించడం కొరకు, కార్యసిద్ధి కరము లయే టట్లు బాగా చూచుకొని ప్రయోగించాలి.

**మూ. పునరేషాం ప్రవక్ష్యామి లక్షణాని యథాక్రమమ్,**
**కావ్యార్థస్య సముత్పత్తిరుపక్షేపః ప్రకీర్తితః. 69**

**తా.** ఇపుడు వీటి లక్షణాలు క్రమానుసారంగా చెపుతాను. కావ్యార్థం పుట్టడం ఉపక్షేపం.

**మూ. యదుత్పన్నార్థబాహుల్యం జ్ఞేయః పరికరస్తు సః,**
**తన్నిష్పత్తిః పరిన్యాసో విజ్ఞేయః కవిభిః సదా. 70**

**గుణనిర్వర్ణనం చైవ విలోభనమితి స్మృతమ్,**
**సంప్రధారణమర్థానాం యుక్తిరిత్యభిధీయతే. 71**

**సుఖార్థస్యాభిగమనం ప్రాప్తిరిత్యభిసంజ్ఞితా,**

**బీజార్థస్యాపగమనం సమాధానమితి స్మృతమ్. 72**

**తా.** పుట్టిన అర్థం (కావ్యార్థం) విస్తరించడం **పరికరం**. ఆ అర్థం సిద్ధించడం **పరిన్యాసం**. గుణాలను వర్ణించడం **విలోభనం**. విషయాలను, చేయవలసిన పనులను, నిర్ధరించడం యుక్తి. సుఖం లభించడం ప్రాప్తి. బీజార్థం (బీజప్రయోజనం) పొందడం **సమాధానం**.

**మూ. సుఖదుఃఖకృతో యోఽర్థః తద్విధానమితి స్మృతమ్,**
**కుతూహలోత్తరావేగో విజ్ఞేయా పరిభావనా. 73**

**బీజార్థస్య ప్రరోహో యః స ఉద్భేద ఇతి స్మృతః,**
**ప్రకృతార్థసమారమ్భః కరణం నామ తద్భవేత్. 74**

**సంఘాతభేదనార్థో యః స భేద ఇతి కీర్తితః,**
**ఏతాని తు ముఖాఙ్గాని వక్ష్యే ప్రతిముఖే పునః. 75**

**తా.** సుఖదుఃఖాలతో సంబంధించిన, సుఖకరమైన లేదా దుఃఖకరమైన విషయాలకు సంబంధించిన కథను చెప్పడం **విధానం**, కుతుహూలంతో కూడిన ఆవేగం **పరిభావన**. బీజరూప మైన అర్థం అంకురించడం **ఉద్భేదం**. ప్రకృత మైన అర్థాన్ని (పనిని) ప్రారంభించడం **కరణం**. కలిసి ఉన్న (పాత్రల) సముదాయాన్ని విడదీయడం **భేదం**. ఇవన్నీ ముఖసంధ్యంగాలు. ఇపుడు ప్రతిముఖసంధ్యంగాలు చెపుతాను.

**మూ. సమీహా రతిభోగార్థా విలాస ఇతి సంజ్ఞితః,**
**దృష్టనష్టానుసరణం పరిసర్ప ఇతి స్మృతః. 76**

**కృతస్యానునయస్యాదౌ విధూతమపరిగ్రహః,**
**అపాయదర్శనం యత్తు తాపనం నామ తద్భవేత్. 77**

**క్రీడార్థం విహితం యత్తు హాస్యం నర్మేతి తత్ స్మృతమ్,**
**దోషప్రచ్ఛాదనార్థం తు హాస్యం నర్మద్యుతిః స్మృతా. 78**

**ఉత్తరోత్తరవాక్యం తు భవేత్ ప్రగయణం పునః,**
**యా తు వ్యసనసంప్రాప్తిః స నిరోధః ప్రకీర్తితః. 79**

**క్రుద్ధస్యానునయో యస్తు భవేత్తత్పర్యుపాసనమ్,**
**విశేషవచనం యత్తు తత్పుష్పమితి సంజ్ఞితమ్. 80**

**ప్రత్యక్షరూక్షం యద్వాక్యం వజ్రం తదభిధీయతే,**
**ఉపపత్తికృతో యోఽర్థః ఉపన్యాసశ్చ స స్మృతః. 81**

చాతుర్వర్ణ్యోపగమనం వర్ణసంహార ఇష్యతే,
కపటాపాశ్రయం వాక్యమభూతాహరణం విదుః. **82**

తత్త్వార్థకథనం చైవ మార్గ ఇత్యభిధీయతే,
చిత్రార్థసమవాయే తు వితర్కో రూపమిష్యతే. **83**

యత్సాతిశయవద్వాక్యం తదుదాహరణం స్మృతమ్,
భావతత్త్వోపలబ్ధిస్తు క్రమ ఇత్యభిధీయతే. **84**

సామదానాదిసంపన్నః సంగ్రహః పరికీర్తితః,
రూపానురూపగమనమనుమానమితి స్మృతమ్. **85**

రతిహర్షోత్సవానాం తు ప్రార్థనా ప్రార్థనా భవేత్,
గర్భస్యోద్భేదనం యత్ సాఽఽ క్షిప్తిరిత్యభిధీయతే. **86**

సంరమ్భవచనం చైవ తోటకం త్వితి సంజ్ఞితమ్,
కపటేనాతిసంధానం బ్రువతేఽధిబలం బుధాః. **87**

భయం నృపారిదస్యూత్థముద్వేగః పరికీర్తితః,
శఙ్కా భయత్రాసకృతో విద్రవః సముదాహృతః. **88**

దోషప్రఖ్యాపనం యత్తు సోఽపవాద ఇతి స్మృతః,
రోషగ్రథితవాక్యం తు సంఫేటః పరికీర్తితః. **89**

గురువ్యతిక్రమో యస్తు స ద్రవః పరికీర్తితః,
విరోధిప్రశమో యశ్చ సా శక్తిః పరికీర్తితా. **90**

వ్యవసాయశ్చ విజ్ఞేయః ప్రతిజ్ఞాహేతుసంభవః,
ప్రసఙ్గశ్చైవ విజ్ఞేయో గురుణా పరికీర్తనమ్. **91**

వాక్యమాధర్షసంయుక్తం ద్యుతిస్తద్‌జ్ఞైరుదాహృతా,
మనశ్చేష్టావినిష్పన్నః శ్రమః ఖేద ఉదాహృతః. **92**

ఈప్సితార్థప్రతీఘాతః ప్రతిషేధః ప్రకీర్తితః,
కార్యాత్యయోపగమనం నిరోధనమితి స్మృతమ్. **93**

బీజకార్యోపగమనమాదానమితి సంజ్ఞితమ్,
అపమానకృతం వాక్యం కార్యార్థే ఛాదనం భవేత్. **94**

ప్రరోచనా చ విజ్ఞేయా సంహారార్థప్రదర్శనీ,
(ప్రత్యక్షవచనం యత్తు స వ్యాహార ఇతి స్మృతః. **95**

**సవిచ్ఛేదం వచో యత్ర సా యుక్తిరితి సంజ్ఞితా,**
**జ్ఞేయా విచలనా తద్‌జ్ఞైరవమానార్థసంయుతా). 96**
**(ఏతాన్యవమృశేఽఙ్గాని సంహారే తు నిబోధత).**

**తా.** రతిభోగానికి ఉపకరించే వనితను గూర్చి లేదా యువకుని గూర్చిన కోరిక **విలాస**. కనబడి, కనబడకుండా పోయినదానిని అనుసరించడం (వెంబడించడం) **పరిసర్పం**. మొదట చేసిన అనునయాన్ని (బతిమాలడాన్ని) తిరస్కరించడం **విధూతం**. అపాయం రావచ్చునేమో అను ఆలోచన **తాపనం**. ఆటకోసం చేసిన హాస్యం **నర్మ**. దోషం కప్పిపుచ్చుడంకోసం చేసిన హాస్యం **నర్మద్యుతి**. మాటకు పైమాట చెప్పడం **ప్రగయణం (ప్రగమనం)**. కష్టాలు వచ్చి పడడం **నిరోధం**. కోపించినవానిని బతిమాలు కొనడం **పర్యుపాసనం**. విశేషాన్ని చెప్పడం **పుష్పం**. ప్రత్యక్షంగా పలికిన పరుషవాక్యం **వజ్రం**. ఉపపత్తిపూర్వకంగా పలికిన మాట **ఉపన్యాసం**. నాలుగు వర్ణాలవాళ్లను ఒక చోట చేర్చుడం **వర్ణసంహారం**. **ఇవి ప్రతిముఖాంగాలు**.

మోసం చేసే వాక్యం **అభూతాహరణం**. యథార్థం చెప్పడం **మార్గం**. విచిత్రమైన అర్థాల సముదాయం **రూపం**. లోకంలో ఉన్నదానికంటె ఉత్కర్షను చెప్పే వాక్యం **ఉదాహరణం**. భావనచేత తత్త్వాన్ని గ్రహించడం **క్రమం**. సామదానాదులతో కూడినది **సంగ్రహం**. చూస్తూన్నదానిని పట్టి చూడనిదానిని ఊహించడం **అనుమానం**. (అభి.భా.) రతిని, హర్షాన్ని, ఉత్సవాన్ని కోరుకొనడం **ప్రార్థన**. మనస్సులో లోలోన దాచుకొన్నది బైట పడడం **ఆక్షిప్తి**. ఆవేగంతో మాట్లాడడం **తోటకం**. కపటం చేసి మోసగించడం **అధిబలం**. రాజు, శత్రువులు, దొంగలు – వీళ్లవల్ల భయం **ఉద్వేగం**. భయంవల్లా, త్రాసంవల్లా కలిగిన శంక **విద్రవం**. **ఇవి గర్భసంధ్యంగాలు**.

దోషాలు చాటడం **అపవాదం**. రోషంతో పలికే మాటలు **సంఫేటం**. పెద్దవాళ్ల మాట దాటడం **ద్రవం**. కోపించినవానిని శాంతింపచేయడం **శక్తి**. ప్రతిజ్ఞను నిలబెట్టు కొనడంకోసం కార్యం **వ్యవసాయం**. పూజ్యుల పేరు చెప్పడం **ప్రసంగం**. తిరస్కారపూర్వక మైన వాక్యం **ద్యుతి**. మనస్సువల్లా, శరీరపరిశ్రమవల్ల కలిగిన శ్రమ **ఖేదం**. కోరిన ప్రయోజనానికి అడ్డుతగలడం **ప్రతిషేధం**. అనుకొన్న పనికి ఆకస్మికంగా విఘాతం ఏర్పడడం **విరోధనం**. బీజఫలం దగ్గరవడం **ఆదానం**. ఏదో పని సాధించడంకోసం అపమానజనకవాక్యాన్ని కప్పిపుచ్చడం **ఛాదనం**. ముగియనున్న కార్యం ఫలించబోతూన్నది అని సూచించడం **ప్రరోచన**. (ప్రత్యక్షంగా మాటలాడడం **వ్యాహారం**. మధ్యమధ్యనిలిచి పోతూన్న మాట **యుక్తి**. అవమానకరమైన వాక్యం **విచలన**. (ఇవి **అవమర్శసంధ్యంగాలు**). ఉపసంహృత్యంగాలు తెలుసుకొనండి).

**మూ. ముఖబీజోపగమనం సన్ధిరిత్యభిధీయతే.** **97**

**కార్యస్యాన్వేషణం యుక్త్యా నిరోధ ఇతి కీర్తితః.**

**తా.** ముఖంలో (నాటికముఖసంధిలో) ఉన్న బీజాన్ని పునః అనుసంధానం చేయడం **సంధి**. యుక్తిచేత కార్యాన్ని అన్వేషించడం **నిరోధం**.

**మూ. ఉపక్షేపస్తు కార్యాణాం గ్రథనం పరికీర్తితమ్.** **98**

**అనుభూతార్థకథనం నిర్ణయః సముదాహృతః.**

**తా.** కార్యాలను (ఫలాన్ని) సమీపించినట్లు చూపడం గ్రథనం. తాను వెనుక అనుభవించిన విషయాలను వర్ణించి చెప్పడం నిర్ణయం.

**మూ. పరివాదకృతం యత్స్యాత్తదాహుః పరిభాషణమ్.** **99**

**లబ్ధస్యార్థస్య శమనం ద్యుతిమాచక్షతే పునః.**

**తా.** పరివాద (అపరాధావిష్కరణ) పూర్వకంగా మాటలాడడం **పరిభాషణం**. లభించిన, అనగా (ఏదో కారణంచేత కలిగిన) కోపాదికాన్ని శాంతింపచేసికొనడం **ద్యుతి**.

**మూ. సమాగమస్తథార్థానామానన్దః పరికీర్తితః.** **100**

**దుఃఖస్యాపగమో యస్తు సమయః స నిగద్యతే,**

**శుశ్రూషాద్యుపసంపన్నః ప్రసాదః ప్రీతిరుచ్యతే.** **101**

**తా.** అనుకొన్న పనులన్నీ సమకూడడం (వల్ల కలిగేది) **ఆనందం**. దుఃఖం తొలగిపోవడం **సమయం**. శుశ్రూషాదులవల్ల కలిగిన ప్రీతి **ప్రసాదం**.

**మూ. అద్భుతస్య తు సంప్రాప్తిరుపగూహనమిష్యతే,**

**సామదానాదిసంపన్నం భాషణం సముదాహృతమ్.** **102**

**తా.** అద్భుతమైనది లభించడం ఉపగూహనం. సామదానాదులతో కూడిన వాక్యం **భాషణం**.

**మూ. పూర్వవాక్యం తు విజ్ఞేయం యథోక్తార్థప్రదర్శనమ్,**

**వరప్రదానసంప్రాప్తిః కావ్యసంహార ఇష్యతే.** **103**

**తా.** పూర్వం చెప్పిన విషయాలు మళ్లీ చెప్పడం **పూర్వవాక్యం**. వరప్రదానం లభించడం **కావ్యసంహారం**.

**మూ. నృపదేశప్రశాన్తిశ్చ ప్రశస్తిరభిధీయతే,**

**యథాసన్ధి తు కర్తవ్యాన్యేతాన్యఙ్గాని నాటకే.** **104**

**కవిభిః కావ్యకుశలైః రసభావమపేక్ష్య తు,**
**సంమిశ్రాణి కదాచిత్తు ద్విత్రియోగేన వా పునః. 105**

**తా.** రాజుకు, దేశానికి శాంతిని కోరడం **ప్రశస్తి**. కావ్యనిర్మాణ కుశలులైన కవులు నాటకాలలో, సంధులకు చెప్పిన ఈ అంగాలను, రస – భావాదులను దృష్టిలో పెట్టుకొని కూర్చాలి. ఒక్కొక్కప్పుడు ఈ అంగాలను రెండు మూడు కలిపి, మిశ్రితరూపాలలో కూడ ఉపయోగించవచ్చును. (ఈ అంగాలకు, సంధులకూ కూడ ప్రాచీనరూపకాలనుండి ఉదాహరణలు **అభినవభారతి**లో చూపబడ్డాయి. జిజ్ఞాసువులు అక్కడ చూడవచ్చు).

**మూ. జ్ఞాత్వా కార్యమవస్థాం చ కార్యాణ్యఙ్గాని సంధిషు,**
**ఏతేషామేవ చాఙ్గానాం సంబద్ధాన్యర్థయుక్తితః. 106**
**సన్ధ్యన్తరాణి సన్ధీనాం విశేషాస్త్వేకవింశతిః.**

**తా.** కార్యాన్నీ, అవస్థను గుర్తించి, తదనుగుణంగా, సంధులలో సంధ్యంగాలను ప్రయోగించాలి. ప్రయోజనాన్ని పట్టి ఈ సంధ్యంగాలతోనే సంబంధించి, సంధులకు, సంధ్యంతరాలు ఉంటాయి. వాటి భేదాలు ఇరవైఒకటి.

**వి.** ముఖాదిపంచసంధుల మధ్య (సంధికీ సంధికీ మధ్య) ఉన్నవి సంధ్యంతరాలు. లేదా ఉపసంధులు. అవి ప్రధాన – సంధులకు, వాటి అంగాలకు ఉపకారకాలుగా ఉంటాయి.

**మూ. సామ భేదస్తథా దణ్డః ప్రదానం వధ ఏవ చ. 107**
**ప్రత్యుత్పన్నమతిత్వం చ గోత్రస్ఖలితమేవ చ,**
**సాహసం చ భయం చైవ హ్రీర్మాయా క్రోధ ఏవ చ. 108**
**ఓజః సంవరణం భ్రాన్తిస్తథా హేత్వవధారణమ్,**
**దూతో లేఖస్తథా స్వప్నశ్చిత్రం మద ఇతి స్మృతమ్. 109**

**తా.** సామము, భేదము, దండము, దానము, వధ, ప్రత్యుత్పన్నమతిత్వము (సమయస్ఫూర్తి), గోత్రస్ఖలితము (ఒక పేరుకు బదులు మరొక పేరు పెట్టి పిలవడము), సాహసము, భయము, సిగ్గు, మాయ, క్రోధము, తేజస్సు (చురుకుతనం), సంవరణం (దాచిపెట్టడం), భ్రాంతి, హేతువును నిర్ణయించడము, దూత, లేఖ రాయడము, స్వప్నము, చిత్తరువు, మదము అని ఇరవైఒక్క సంధ్యంతరాలు.

**మూ. విష్కమ్భశ్చూలికాశ్చైవ తథా చైవ ప్రవేశకః,**
**అఙ్కావతారోఽఙ్కముఖమర్థోపక్షేపపఞ్చకమ్. 110**

**తా.** విష్కంభము, చూలికలు, ప్రవేశకము, అంకావతారము, అంకముఖము అని అర్థోపక్షేపకాలు ఐదు విధాలు.

**వి.** రూపకాలలో స్నాన - శయన - భోజన - చుంబనాదులు రంగస్థలంమీద ప్రత్యక్షంగా చూపకూడదు. దూరప్రయాణ యుద్ధాదులు చూపడానికి శక్యం కావు. అటువంటివి జరిగినట్లు తెలిస్తేనే కాని కథ ముందుకు నడవదు. వాటిని సూచించేవాటికి **అర్థోపక్షేపములు** అని పేరు.

**మూ. మధ్యమపురుషనియోజ్యో నాటకముఖసన్ధిమాత్రసంచారః,**
**విష్కమ్భకస్తు కార్యః పురోహితామాత్యకఞ్చుకిభిః. 111**

**తా.** విష్కంభకం పురోహిత - అమాత్య - కంచుక్యాది మధ్యమపాత్రలతో ప్రయోగించాలి. దీనిని నాటకం ముఖసంధిలో మాత్రమే ఉపయోగించాలి.

**మూ. శుద్ధః సంకీర్ణో ద్వివిధో విష్కమ్భకస్తు విజ్ఞేయః,**
**మధ్యమపాత్రైః శుద్ధః సంకీర్ణో నీచమధ్యమకృతః. 112**

**తా.** శుద్ధము, సంకీర్ణము అని విష్కంభకం రెండు విధాలు. అందరూ మధ్యమ పాత్రలే ఉన్నది శుద్ధవిష్కంభకం. మధ్యమపాత్రలూ నీచపాత్రలూ కూడ ఉన్నది **సంకీర్ణ విష్కంభకం**.

**మూ. అన్తర్యవనికాసంస్థైః సూతాదిభిరనేకధా,**
**అర్థోపక్షేపణం యత్తు క్రియతే సా హి చూలికా. 113**

**తా.** సూత - వంది - మాగధాదులు తెరవెనుకనే ఉండి అనేకవిధాల చేసే అర్థోపక్షేపణం **చూలిక**.

**మూ. అఙ్కాన్తరానుసారీ సంక్షేపార్థమధికృత్య బిన్దూనామ్,**
**ప్రకరణనాటకవిషయే ప్రవేశకో నామ విజ్ఞేయః. 114**

**తా.** ప్రవేశకం అనేది ప్రకరణంలోను, నాటకంలోను, రెండు అంకాల మధ్య ఉంటుంది. ఇది బిందువుల సంక్షిప్తమైన అర్థాన్ని సూచిస్తుంది.

**మూ. అఙ్కాన్త ఏవ చాఙ్కో నిపతతి యస్మిన్ ప్రయోగమాసాద్య,**
**బీజార్థయుక్తియుక్తో జ్ఞేయో హ్యఙ్కావతారోఽసౌ. 115**

**తా.** ఒక అంకం చివర, బీజానికి సంబంధించిన అర్థాన్నే (కథాభాగాన్నే) ముందుకు నడుపుతూ చేర్చిన మరొక చిన్న అంకం **అంకావతారం**.

**మూ. విశ్లిష్టముఖమఙ్కస్య స్త్రియా వా పురుషేణ వా,**
**యదుపక్షిప్యతే పూర్వం తదఙ్కముఖముచ్యతే. 116**

**తా.** ఒక అంకం ప్రారంభంలోనే స్త్రీ కాని, పురుషుడు కాని ప్రవేశించి రాబోయే అంకంలోని కథను ముందుగా సూచించిన ట్లయితే, ఆ భాగం **అంకముఖం**.

**మూ. అన్యాన్యపి లాస్యవిధావఙ్గాని తు నాటకోపయోగీని,**
**అస్మాద్వినిఃసృతాని తు భాణ ఇవైకప్రయోజ్యాని. 117**

**తా.** ఈ నాట్యరూపమైన నాటకంనుండే పుట్టిన, లాస్యవిధికి ఉపయోగించే ఇతరమైన అంగాలు కూడ ఉన్నాయి. అవికూడ నాటకానికి ఉపయోగించేవే. వాటిని, భాణం వలె, ఒకే పాత్ర (నటుడు) ఉపయోగించాలి.

**మూ. (భాణాకృవతిల్లాస్యం విజ్ఞేయం త్వేకపాత్రహార్యం వా,**
**ప్రకరణవదూహ్యం కార్యం సంస్తవయుక్తం వివిధభావమ్). 118**

**తా.** లాస్యం భాణం వలె ఏకపాత్రచేతనే నిర్వహింపబడుతుంది. ప్రకరణం వలె సంస్తవంతో కూడినదిగాను, వివిధభావాలతో నిండినదిగాను ఊహించి అలా చెయ్యాలి(?)

**మూ. గేయపదం స్థితపాఠ్యమాసీనం పుష్పగణ్డికా,**
**ప్రచ్ఛేదకం త్రిమూఢం చ సైన్ధవాఖ్యం ద్విమూఢకమ్. 119**
**ఉత్తమోత్తమకం చైవముక్తప్రత్యుక్తమేవ చ,**
**లాస్యం దశవిధం హ్యేతదఙ్గనిర్దేశలక్షణమ్. 120**

**తా.** గేయపదము, స్థితపాఠ్యము, ఆసీనము, పుష్పగండిక, ప్రచ్ఛేదకము, త్రిమూఢము, సైంధవము, ద్విమూఢకము, ఉత్తమోత్తమకము, ఉక్తప్రత్యుక్తము అని, అవయవాల కదలికయే లక్షణంగా గల, లాస్యం పది విధాలు.

**మూ. ఆసనేషూపవిష్టైర్యత్తన్త్రీభాణ్డోపబృంహితమ్,**
**గాయనైర్గీయతే శుష్కం తద్గేయపదముచ్యతే. 121**

**తా.** ఆసనాలమీద కూర్చున్న గాయకులు, గానం చేసే శుష్కమైన గానం **గేయపదం**. ఈ గానానికి వీణాదితంత్రీవాద్యాలు. మృదంగాదులు ఉపబృంహకములుగా (పోషకము లుగా) ఉంటాయి.

**వి.** ఈ గానం చేసేది గాయకులే, పాత్రలు కాదు. అందుచేత ఈ సమయంలో అభినయాదులు ఉండవు గాన ఇది 'శుష్కం' అన్నట్లు, అ.భా. వ్యాఖ్యానం. అభిప్రాయంగా కనబడుతూన్నది. "పక్కవాద్యా లేవీ ఉండని గానం" అనే కొందరి అనువాదం మూలాను గుణంగా లేదు.

**మూ. (యాఽనృత్యత్యాసనా నారీ గేయం ప్రియగుణాన్వితమ్,**
**సాఙ్గోపాఙ్గవిధానేన తద్ గేయపదముచ్యతే). 122**

**తా.** ఒక స్త్రీ, నృత్యం చేయకుండా కూర్చుండి, ప్రియుని గుణాలతో కూడిన గేయాన్ని, సాంగోపాంగవిధానంతో గానం చేస్తే ఆ గేయం **గేయపదం**.

**మూ. ప్రాకృతం యద్వియుక్తా తు పఠేదాత్తరసం స్థితా,**
**మదనానలతప్తాఙ్గీ స్థితపాఠ్యం తదుచ్యతే. 123**

**తా.** మన్మథాగ్ని చేత తపింపచేయబడిన శరీరం గల ఒక వియోగిని నిలబడి, ప్రాకృత భాషలో రచించిన గీతాన్ని రసవత్తరంగా పాడితే అది **స్థితపాఠ్యం.**

**మూ. (బహుచారీసమాయుక్తం పఞ్చపాణికలానుగమ్,**
**చఞ్చత్పుటేన వా యుక్తం స్థితపాఠ్యం విధీయతే). 124**

**తా.** స్థితపాఠ్యంలో అనేకచారీలు, పంచపాణితాల కలలు, లేదా చంచత్పుటతాలము ఉండాలి.

**మూ. ఆసీనమాస్యతే యత్ర సర్వాతోద్యవివర్జితమ్,**
**అప్రసారితగాత్రం చ చిన్తాశోకసమన్వితమ్. 125**

**వృత్తాని వివిధాని స్యుర్గేయం గానే చ సంశ్రితమ్,**
**చేష్టాభిశ్చాశ్రయః పుంసాం యత్ర సా పుష్పగణ్డికా. 126**

**తా.** అవయవాలు ముణుచుకొని కూర్చొని, ఏ విధమైన వాద్యాల ప్రయోగమూ లేకుండా, స్త్రీ పాడిన, చింతాశోకములతో నిండిన గీతం **ఆసీనం.**

అనేకవిధాలైన వృత్తాలతో పురుషచేష్టాభినయంతో గానంచేసే గేయం **పుష్పగండిక.**

**మూ. (యత్ర స్త్రీ నరవేషేణ లలితం సంస్కృతం పఠేత్,**
**సఖీనాం తు వినోదాయ సా జ్ఞేయా పుష్పగణ్డికా). 127**

**తా.** పురుషవేషం ధరించిన స్త్రీ సఖురాండ్ర వినోదంకొరకై లలితమైన సంస్కృత గీతాన్ని గానం చేస్తే అది **పుష్పగండిక.**

**మూ. (నృత్తం తు వివిధం యత్ర గీతం చాతోద్యసంయుతమ్,**
**స్త్రియః పుంవచ్చ చేష్టన్తే సా జ్ఞేయా పుష్పగడణ్డికా). 128**

**తా.** గీతవాద్యాలతో స్త్రీలు, పురుషుల వలె ప్రవర్తిస్తూ చేష్టలు చేస్తూ, చేసే నృత్తం **పుష్పగండిక.**

**మూ. ప్రచ్ఛేదకః స విజ్ఞేయో యత్ర చన్ద్రాతపాహతాః,**
**స్త్రియః ప్రియేషు సజ్జన్తే హ్యపి విప్రియకారిషు. 129**

**తా.** వెన్నెలచేత పీడింపబడి స్త్రీలు తమకు అప్రియం చేసి ఉన్నవారైనా కూడ ప్రియులతో ఎక్కడ కలుస్తారో అది **ప్రచ్ఛేదకం.**

**మూ. అనిష్ఠురశ్లక్ష్ణపదం సమవృత్తైరలంకృతమ్,**
**నాట్యం పురుషభావాఢ్యం త్రిమూఢకమితి స్మృతమ్. 130**

**తా.** నిష్ఠురములు కాని మృదువైన పదాలతో సమవృత్తాలతో అలంకరింపబడిన గేయం గానం చేస్తూ చేసే, అధికంగా పురుషులను గూర్చిన భావాలతో నిండిన నాట్యం **త్రిమూఢకం**.

**మూ. పాత్రం విభ్రష్టసంకేతం సువ్యక్తకరణాన్వితమ్,**
**ప్రాకృతైర్వచనైర్యుక్తం విదుః సైంధవకం బుధాః. 131**

**తా.** పాత్రలు, పాఠ్యంలో కాకువును పాటించకుండా, స్పష్టమైన వీణాదికరణాలతో (సాధనాలతో) ప్రాకృతభాషావచనాలతో ఏ నాట్యం చేస్తారో అది **సైంధవకం**.

**వి.** సైన్ధవకం అనేది గానానికి పేరైనా ఆగానంచేసే పాత్రలకు గానానికీ అభేదాన్ని కల్పించి పాత్రయే (పాత్రలే) సైంధవం అని చెప్పబడింది. (అభి.భా.)

**మూ. (రూపవాద్యాదిసంయుక్తం పాఠ్యేన చ వివర్జితమ్,**
**నాట్యం హి తత్తు విజ్ఞేయం సైన్ధవం నాట్యకోవిదైః). 132**

**తా.** రూప(?) వాద్యాదులు ఉండగా – పాఠ్యం మాత్రం ఉండని నాట్యం సైన్ధవ నాట్యం.

**మూ. ముఖప్రతిముఖోపేతం చతురశ్రపదక్రమమ్,**
**శ్లిష్టభావరసోపేతం వైచిత్ర్యార్థం ద్విమూఢకే. 133**

**తా. ద్విమూఢకం** అను నాట్యంలో ముఖప్రతిముఖసంధులూ, చతురశ్రం చేసిన పిమ్మట నాలుగు దిక్కుల వైపు పదక్రమణమూ ఉంటాయి. మనోహరమైన భావాల రసాల ఆవిష్కరణంచేత ఒక విధమైన వైచిత్ర్యం ఉంటుంది.

**మూ. ఉత్తమోత్తమకం విద్యాదనేకరససంశ్రయమ్,**
**వివిధైః శ్లోకబన్ధైశ్చ హేలాహావవిచిత్రితమ్. 134**

**తా. ఉత్తమోత్తమకం** అనేకరసాలకు ఆశ్రయమై, మనోహరమైన శ్లోకబంధాలతో హేలావిలాసాదులతో విచిత్రంగా ఉంటుంది.

**మూ. కోపప్రసాదజనితం సాధిక్షేపపదాశ్రయమ్,**
**ఉక్తప్రత్యుక్తమేవం స్యాచ్చిత్రగీతార్థయోజితమ్. 135**

**తా. ఉక్తప్రయుక్తంలో** – కోప – ప్రసాదాలలో ప్రయోగించే, విచిత్రమైన గీతార్థాలలో కూర్చిన ఉక్తప్రత్యుక్తాలు, (మాట – పైమాటా) ఉంటాయి. అధిక్షేపవచనాల ప్రయోగం కూడ అధికంగా ఉంటుంది.

**మూ. యత్ర ప్రియాకృతిం దృష్ట్వా వినోదయతి మానసమ్,**
**మదనానలతప్తాఙ్గీ తచ్చిత్రపదముచ్యతే. 136**

**తా.** మదనాగ్నితాపంతో బాధపడుతూన్న యువతి, ఏ నాట్యంలో, ప్రియుని చిత్తరువును చూస్తూ, మనస్సును వినోదింపచేసుకొంటుందో అది **చిత్రపదం.**

**మూ. దృష్ట్వా స్వప్నే ప్రియం యత్ర మదనానలతాపితా,**
**కరోతి వివిధాన్ భావాన్ తద్వై భావికముచ్యతే. 137**

**తా.** మదనానలతప్తయైన యువతి ఏ నాట్యంలో – స్వప్నంలో ప్రియుణ్ణి చూచి వివిధభావాలు ప్రకటిస్తుందో అది **భావికం.**

**మూ. ఏతేషాం నాట్యవిధౌ విజ్ఞేయం లక్షణం ప్రయోగజ్ఞైః,**
**తదిహైవ తు యన్నోక్తం ప్రసఙ్గవినివృత్తహేతోస్తు. 138**

**తా.** వీటి నాట్యవిధికి సంబంధించిన లక్షణాలను నాట్యప్రయోగం చేసేవారు తెలుసుకోవాలి. వాటిని గూర్చి చెప్పిన సందర్భంలో అవి చెప్పి ఉండడంచేత ఆ లక్షణాలు మళ్లీ ఇక్కడ చెప్పలేదు.

**మూ. పఞ్చసంధి చతుర్వృత్తి చతుఃషష్ట్యఙ్గసంయుతమ్,**
**షట్త్రింశలక్షణోపేతం గుణాలంకారభూషితమ్. 139**

**మహారసం మహాభోగముదాత్తవచనాన్వితమ్,**
**మహాపురుషసంచారం సాధ్వాచారం జనప్రియమ్. 140**

**సుశ్లిష్టసంధిసంయోగం సుప్రయోగం సుఖాశ్రయమ్,**
**మృదుశబ్దాభిధానం చ కవిః కుర్యాత్తు నాటకమ్. 141**

**తా.** నాటకం రచించే కవి దానిలో ఈ అంశా లన్నీ ఉండే టట్లు చూచుకోవాలి – ఐదు సంధులు, నాలుగు వృత్తులు, అరవైనాలుగు అంగాలు, ముప్పైఆరు లక్షణాలు, గుణాలు, అలంకారాలు, గొప్పరసాలు, గొప్ప భోగాలు, ఉదాత్తమైన మాటలు, మహాపురుషుల నడవడిక, ఉన్నతమైన ఆచారాలు నాటకంలో ఉండాలి. జనులకు ఆనందకరమై ఉండాలి. దీనిలోని సంధులు చక్కగా ఒకదానితో ఒకటి సంబంధించి ఉండాలి. దీని ప్రయోగం (ప్రదర్శనం) చేస్తే అది చక్కగా ఉండాలి; సుఖం కలిగించాలి. దీనిలో శబ్దాలు, పదాలు మృదువుగా, వినసొంపుగా ఉండాలి. (రూప కాలన్నింటిలోకీ శ్రేష్ఠమైన దవడంచేత నాటకం విషయంలో కవి చాల శ్రద్ధ చూపాలి అని భావం).

**మూ. అవస్థా యా తు లోకస్య సుఖదుఃఖసముద్భవా,**
**నానాపురుషసంచారా నాటకేఽసౌ విధీయతే. 142**

**తా.** సుఖదుఃఖాలవల్ల ఏర్పడిన, ప్రజల ఏ వేరువేరు పరిస్థితు లుంటాయో వాటినే

అన్ని విధాల పురుషులు (సామాజికులు) చూచి, గ్రహించే టట్లు, వారి హృదయాలలో వివిధరససంచారం కలిగే టట్లు నాటకం చేస్తుంది.

**మూ. న తద్ జ్ఞానం న తచ్ఛిల్పం న సా విద్యా న సా కలా,**
**న తత్ కర్మ న వా యోగో నాట్యేఽస్మిన్యన్న దృశ్యతే. 143**

**తా.** ఈ నాట్యంలో (నాటకంలో, రూపకంలో) చూడబడని (చూపబడని) జ్ఞానం లేదు; శిల్పం లేదు; విద్య లేదు; కళ లేదు, కర్మ (పని) లేదు; యోగం లేదు.

**మూ. యోఽయం స్వభావో లోకస్య నానావస్థాన్తరాత్మకః,**
**సోఽఙ్గాద్యభినయైర్యుక్తో నాట్యమిత్యభిధీయతే. 144**

**తా.** అనేకవిధాలైన అవస్థల స్వరూపంలో ఉన్న లోకస్వభావాన్నే ఆంగికాభి నయాదులు చేర్చి ప్రదర్శిస్తే అది నాట్యం అవుతుంది.

**మూ. దేవతానామృషీణాం చ రాజ్ఞాం చోత్కృష్టమేధసామ్,**
**పూర్వవృత్తానుచరితం నాటకం నామ తద్ భవేత్. 145**

**తా.** దేవతలు, ఋషులు, రాజులు, మహామేధావులు – వీళ్లు పూర్వం అనుసరించిన జీవనవిధానాన్ని అనుకరిస్తూ, నాట్యరంగంమీద ప్రదర్శిస్తే అది నాటకం అవుతుంది.

**మూ. యస్మాత్ స్వభావం సంత్యజ్య సాఙ్గోపాఙ్గగతిక్రమైః,**
**ప్రయుజ్యతే జ్ఞాయతే చ తస్మాద్వై నాటకం స్మృతమ్. 146**

**తా.** నటీ – నటులు తమ స్వభావాన్ని విడిచిపెట్టి అంగాలతో, ఉపాంగాలతో, గతులతో దీనిని ప్రయోగిస్తారు. ఎలా ప్రయోగించాలో బాగా తెలుసుకొని ఉంటారు, (ప్రయోగించిన రూపంలోనే సామాజికులు తెలుసుకొంటారు). అందుచేత నాటకం (నటులతో సంబంధం ఉన్నది) అని చెప్పబడుతుంది.

**మూ. సర్వభావైః సర్వరసైః సర్వకర్మప్రవృత్తిభిః,**
**నానావస్థాన్తరోపేతం నాటకం సంవిధీయతే. 147**

**తా.** అన్ని భావాలతోను, అన్ని రసాలతోను, అన్ని పనులతోను, అన్ని మానసిక స్వాభావిక ప్రవృత్తులతోను, (వీటినన్నింటినీ ప్రతిబింబింపచేస్తూ) అనేకవిధాలైన అవస్థా భేదాలతో (అవస్థాభేదాలను చిత్రించే) నాటకం రచింపబడుతుంది.

**మూ. అనేకశిల్పజాతాని, నైకకర్మక్రియాణి చ,**
**తాన్యశేషాణి రూపాణి కర్తవ్యాని ప్రయోక్తృభిః. 148**

**తా.** నాట్యప్రయోక్తలు, రూపకాల నన్నింటినీ అనేకశిల్పసముదాయాలు కలవాటిని

గాను, లేదా అనేక శిల్పాలనుండి పుట్టినట్లుగాను, అనేకమైన కర్మల అభినయాలతో కూడినవాటివిగాను చెయ్యాలి. (చూపాలి).

**మూ. లోకస్వభావం సంప్రేక్ష్య నరాణాం చ బలాబలమ్,**
**సంభోగం చైవ యుక్తిం చ తతః కార్యం తు నాటకమ్. 149**

**తా.** కవి, ప్రదర్శకుడూ కూడ ముందుగా జనుల స్వభావాలను అర్థం చేసికోవాలి. మనుషుల బలాన్నీ వాళ్ల దౌర్బల్యాన్నీ తెలుసుకోవాలి. వాళ్ల ఆనందాన్ని, ఆలోచనలను కూడ తెలుసుకోవాలి. తరువాత నాటకం రచించాలి; ప్రయోగించాలి.

**మూ. భవిష్యతి యుగే ప్రాయో భవిష్యన్త్యబుధా నరాః,**
**యే చాపి హి భవిష్యన్తి తేఽ త్యల్పశ్రుతబుద్ధయః. 150**

**తా.** రాబోయే యుగంలో చాలవరకు నరులు అల్పబుద్ధులై ఉంటారు. ఎవరైనా బుధులున్నా వాళ్ల శాస్త్రజ్ఞానం, బుద్ధివికాసమూ కూడ అంతంతమాత్రంగానే ఉంటుంది.

**మూ. కర్మ శిల్పాని శాస్త్రాణి విచక్షణబలాని చ,**
**సర్వాణ్యేతాని నశ్యన్తి యదా లోకః ప్రణశ్యతి. 151**

**తా.** కర్మలు, శిల్పాలు, శాస్త్రాలు, యుక్తాయుక్తవైచక్షణ్యాలు, బలాలు, ఇవన్నీ నశిస్తాయి. దానితో లోకం అంతా నశిస్తుంది.

**మూ. తదేవం లోకభాషాణాం ప్రసమీక్ష్య బలాబలమ్,**
**మృదుశబ్దం సుఖార్థం చ కవిః కుర్యాత్తు నాటకమ్. 152**

**తా.** అందుచేత, జనుల, భాషల బలాబలాలను దృష్టిలో ఉంచుకొని, కవి మృదువైన శబ్దాలు, సుఖగ్రాహ్య మైన అర్థము గల నాటకం రచించాలి. నాటకాన్ని సులభంగా అర్థమయే శబ్దాలలో రచించాలి.

**మూ. చేక్రీడితాద్యైః శబ్దైస్తు కావ్యబన్ధా భవన్తి యే,**
**వేశ్యా ఇవ న తే భాన్తి కమణ్డలుధరైర్ద్విజైః. 153**

**తా.** 'చేక్రీడ్యతే' వంటి శ్రవణకటువు లైన శబ్దాలు ప్రయోగిస్తే కావ్యబంధాలు (రచనలు) కమండలాలు చేతులలో పట్టుకొన్న ద్విజులు దగ్గరికి వస్తే వేశ్య లెలా వెలవెల బోతారో, భాసించరో అలా భాసించవు.

**మూ. దశరూపవిధానం చ మయా ప్రోక్తం ద్విజోత్తమాః,**
**అతఃపరం ప్రవక్ష్యామి వృత్తీనామిహ లక్షణమ్. 154**

**ఇతి భరతీయనాట్యశాస్త్రే సన్ధినిరూపణం నామ అధ్యాయః ఏకోనవింశః.**

**తా.** ద్విజోత్తములారా! దశరూపకాల విధానం చెప్పాను. ఇటుపైన రూపకాలు ప్రయోగించవలసిన వృత్తుల (కైశిక్యాదుల) లక్షణాలు చెపుతాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్ర వ్యాఖ్యానములో సంధినిరూపణం అను పందొమ్మిదవ అధ్యాయం సమాప్తం.**

**"ద్విజవరతోతనిరూపితసన్ధ్యధ్యాయార్థతత్త్వఘటనేయమ్,**
**అభినవగుప్తేన కృతా శివచణారమ్భోజమధుపేన."**

**- శ్రీమదభినవగుప్తాచార్యాః**

**శ్రీః శ్రీః శ్రీః**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ వింశోఽధ్యాయః

# వృత్తివికల్పనము

"నిఃశేషశబ్దవ్యవహారవృత్తిః
వైచిత్ర్యమభ్యేతి యతః ప్రతిష్ఠామ్,
శ్రోత్రాత్మకం తత్పరమేశ్వరస్య
వన్దేతమాం రూపమరూపధామ్నః."

– శ్రీమదభినవగుప్తాచార్యాః

**మూ. సముత్థానం తు వృత్తీనాం వ్యాఖ్యాస్యామ్యనుపూర్వశః,**
**యథావస్తూద్భవం చైవ కావ్యానాం చ వికల్పనమ్. 1**

**తా.** వృత్తులు ఏ విధంగా ఆవిర్భవించాయో క్రమానుసారం విశదీకరిస్తాను. కథావస్తూద్భవాన్ని (కావ్యవస్తు నిర్మాణాన్ని) పట్టి కావ్యాల భేదాల కల్పనను కూడ విశదీకరిస్తాను.

**వి.** విచిత్రములైన కాయ – వాక్ – మనస్సుల చేష్టలకు 'వృత్తి' అని పేరు. ఇవి సమస్తజీవలోకంలోను అనాదికాలంనుంచీ కూడ ఉన్నవే. విశిష్టమై ఒక రకమైన హృదయావేశంతో సంమిలిత మైనప్పుడు ఆ వృత్తులు నాట్యానికి ఉపకరిస్తాయి. లౌకికము, అలౌకికమూ అని హృదయావేశం రెండు విధాలు. ఇది అనేకవిధాలైన తారతమ్యాలతో, అనగా హెచ్చుతగ్గులతో ఉంటుంది. లోకంలో అనుభవించే సుఖదుఃఖాల తారతమ్యంచేత కలిగే హృదయావేశం వేరు; అది లౌకికం. కావ్యరసాస్వాదసమయంలో కలిగే హృదయావేశం వేరు; అది అలౌకికం. ఈ రెండవ విధమైన హృదయావేశంతో కూడిన కాయ – వాక్ మనశ్చేష్టావిశేషాలే నాట్యానికి సంబంధించిన వృత్తులు. (అభి.భా.)

**మూ. ఏకార్ణవం జగత్ కృత్వా భగవానచ్యుతో యదా,**
**శేతే స్మ నాగపర్యఙ్కే లోకాన్ సంక్షిప్య మాయయా. 2**

**అథ వీర్యబలోన్మత్తావసురౌ మధుకైటభౌ,**
**తర్జయామాసతుర్దేవం తరసా యుద్ధకాఙ్క్షయా. 3**

**తా.** భగవంతుడైన శ్రీమహావిష్ణువు, ప్రలయానంతరం, లోకాలన్నింటినీ మాయచేత తనలో లీనంచేసికొని ఆదిశేషపర్యంకంమీద శయనించి ఉండగా మధువు, కైటభుడు

అను అసురులు వీర్యంతోను బలంతోను మదించి యుద్ధం కోరుతూ ఆ దేవదేవుణ్ణి బలంతో, (తమ బలం ప్రదర్శిస్తూ) భయపెట్టారు.

**మూ. నిజబాహూ విమృద్నన్తౌ భూతభావనమక్షయమ్,**
**జానుభిర్ముష్టిభిశ్చైవ పోథయామాసతుః ప్రభుమ్. 4**

**తా.** తమ బాహువులు మర్దించుకొంటూ, (జబ్బలు చరచుతూ) వినాశరహితుడైన ఆ సకలభూత్రస్రష్టను మోకాళ్లతోను, పిడికిళ్లతోను కుమ్మివేశారు.

**మూ. బహుభిః పరుషైర్వాక్యైరన్యోన్యసమభిద్రవమ్,**
**నానాధిక్షేపవచనైః కమ్పయన్తావివోదధిమ్. 5**

**తా.** అనేకమైన పరుషవాక్యాలతోను, అనేకవిధాలైన అధిక్షేపవచనాలతోను సముద్రాన్ని కంపింపచేస్తున్నారా అన్నట్లు ఒకరి తరవాత ఒకరు ఉరికారు.

**మూ. తయోర్నానాప్రకారాణి వచాంసి వదతోస్తదా,**
**శ్రుత్వాత్వభిహతమనా ద్రుహిణో వాక్యమబ్రవీత్. 6**

**తా.** వాళ్లిద్దరూ ఇలా అనేకవిధాలైన మాటలు పలుకుతూండగా, విని, మనస్సులో బాధచెందిన బ్రహ్మదేవుడు ఇలా అన్నాడు.

**మూ. "కిమిదం భారతీవృత్తిర్వాగ్భిరేవ ప్రవర్తతే,**
**ఉత్తరోత్తరసంవృద్ధా, నన్విమౌ నిధనం నయ. 7**

**తా.** ఏమిది! మాటలతోనే భారతీవృత్తి నడస్తూన్నది. ఇది మాటలపై మాటల రీతిలో పెరుగుతూన్నది! వీళ్లిద్దరినీ సంహరించవచ్చును కదా!"

**మూ. పితామహవచః శ్రుత్వా ప్రోవాచ మధుసూదనః,**
**కార్యహేతోర్మయా బ్రహ్మన్! భారతీయం వినిర్మితా. 8**

**తా.** బ్రహ్మదేవుని మాటలు విని ముధుసూదను డిలా అన్నాడు – "బ్రహ్మా! ఈ భారతిని, కావాలనే నే నొక పనికోసం నిర్మించాను."

**మూ. వదతాం వాక్యభూయిష్ఠా భారతీయం భవిష్యతి,**
**అహమేతౌ నిహన్మ్యద్య ఇత్యుక్త్వా వచనం హరిః. 9**

**తా.** కొందరు మాటలాడుతున్నప్పుడు వాళ్ల మాటలే అధికంగా ఉండేది 'భారతి' అవుతుంది. ఇప్పుడు నేను వీళ్లిద్దరినీ సంహరిస్తాను." హరి ఇలా పలికి –

**మూ. శుద్ధైరవికృతైరఙ్గైః సాఙ్గహారైస్తథా భృశమ్,**
**యోధయామాస తౌ దైత్యౌ యుద్ధమార్గవిశారదౌ. 10**

**తా.** యుద్ధమార్గమునందు సమర్థులైన ఆ దైత్యులతో శుద్ధములు, వికారము లేనివీ అయిన ఆంగికచేష్టలతోను, అంగహారాలతోను యుద్ధం చేశాడు.

**మూ. భూమిసంస్థానసంయోగైః పదన్యాసైర్హరేస్తదా,**
**అతిభారోభవర్భూమేః భారతీ తత్ర నిర్మితా. 11**

**తా.** విష్ణువుయొక్క నేలమీద సంస్థానాలతో (నిలచిన విధానాలతో) సంయోగం చేత, పాదన్యాసాలచేత భూమికి చాల భారం కలిగింది. అక్కడ ఈ విధంగా **'భారతీ'** వృత్తి నిర్మింపబడినది.

**మూ. వల్గితైః శార్ఙ్గధనుషః తీవ్రైర్దీప్తతరైరథ,**
**సత్త్వాధికైరసంభ్రాన్తైః సాత్త్వతీ తత్ర నిర్మితా. 12**

**తా.** తరువాత శార్ఙ్గధనుర్ధారియొక్క తీవ్రములైన మిక్కిలి ప్రజ్వలించు, అధికమైన బలం గల, ఏమరపాటు లేని కదలికలచేత అక్కడ **సాత్త్వతి** ఆవిర్భవించింది.

**మూ. విచిత్రైరఙ్గహారైస్తు దేవో లీలాసమన్వితైః,**
**బబన్ధ యచ్ఛిఖాపాశం కైశికీ తత్ర నిర్మితా. 13**

**తా.** విష్ణువు లీలాసమన్వితాలైన విచిత్రమైన అంగహారాలతో కేశపాశం (జుట్టు) ముడి పెట్టుకొన్నాడు. ఆ విధంగా అప్పుడు **'కైశికి'** నిర్మింపబడింది.

**మూ. సంరమ్భవేగబహులైర్నానాచారీసముత్థితైః,**
**నియుద్ధకరణైశ్చిత్రైరుత్పన్నారభటీ తతః. 14**

**తా.** అనేకవిధాలైన చారీలతో ఏర్పడిన, తొందరతో, వేగంగా చేసిన, చిత్రములైన బాహుయుద్ధకరణాలచేత అక్కడ **ఆరభటి** పుట్టింది.

**మూ. యాం యాం దేవః సమాచష్టే క్రియాం వృత్తిషు సంస్థితామ్,**
**తాం తదర్థానుగైర్జప్యైర్ద్రుహిణః ప్రత్యపూజయత్. 15**

**తా.** విష్ణువు వృత్తులకు సంబంధించిన ఏ యే క్రియలను చేశాడో దానిని బ్రహ్మదేవుడు ఆ అర్థానికి సంబంధించిన జపించదగిన మంత్రాలతో పూజించాడు.

**మూ. యదా హతౌ తావసురౌ హరిణా మధుకైటభౌ,**
**తతోఽబ్రవీత్పద్మయోనిర్నారాయణమరిందమమ్. 16**

**తా.** నారాయణుడు ఆ రాక్షసులను సంహరించాడు. అప్పుడు బ్రహ్మదేవుడు శత్రువినాశకుడైన ఆయనతో ఇలా అన్నాడు –

**మూ. అహో! విచిత్రైర్విషమైః స్ఫుటైః సులలితైరపి,**
**అఙ్గహారైః కృతం దేవ త్వయా దానవనాశనమ్. 17**

**తా.** ఆహా! ఏమి ఆశ్చర్యము! దేవా! విచిత్రములు, విషమములు, స్ఫుటంగా ఉన్నవీ, లలితములు అయిన అంగహారాలతో నువ్వు దానవసంహారం చేశావు!

**మూ. తస్మాదయం హి లోకస్య నియుద్ధసమయక్రమః,**
**సర్వశస్త్రవిమోక్షేషు న్యాయసంజ్ఞో భవిష్యతి. 18**

**తా.** నీవు బాహుయుద్ధసమయంలో చేసిన ఈ పాదన్యాసం శస్త్రప్రయోగ సమయాలలో **'న్యాయ'** అను పేరుతో లోకంలో ప్రసిద్ధి పొందుతుంది.

**మూ. న్యాయాశ్రితైరఙ్గహారైర్న్యాయాచ్చైవ సముత్థితైః,**
**యస్మాద్యుద్ధాని వర్తన్తే తస్మాన్న్యాయాః ప్రకీర్తితాః. 19**

**తా.** న్యాయాన్ని ఆశ్రయించిన న్యాయాలనుండి పుట్టిన అంగహారాలతో యుద్ధాలు జరుగుతాయి గాన వీటికి **'న్యాయములు'** అను పేరు ప్రసిద్ధం కాగలదు.

**మూ. (చారీషు చ సముత్పన్నో నానాచారీసమాశ్రయః,**
**న్యాయసంజ్ఞః కృతో హ్యేష ద్రుహిణేన మహాత్మనా). 20**

**తా.** చారీలలో జనించి వివిధచారీలతో సంబంధించి ఉండడంచేత దీనికి (పాదన్యాసానికి) మహాత్ముడైన బ్రహ్మదేవుడు 'న్యాయం' అను పేరు పెట్టాడు.

**మూ. (తతో వేదేషు నిక్షిప్తా ద్రుహిణేన మహాత్మనా,**
**పునరిష్వస్త్రజాతే చ నానాచారీసమాకులే). 21**

**తా.** తరువాత దీనిని బ్రహ్మ వేదాలలోను, వివిధచారులతో వ్యాకులమైన (నిండిన) బాణ – అస్త్రప్రయోగంలోను ఉంచాడు (ఉపయోగించాడు).

**మూ. (పునర్నాట్యప్రయోగేషు నానాభావసమన్వితాః,**
**వృత్తిసంజ్ఞాః కృతా హ్యేతాః కావ్యబన్ధరసాశ్రయాః.) 22**

**తా.** పిమ్మట అనేకవిధాలలైన భావాలతో కూడిన, వృత్తు లను పేరు గల ఇవి కావ్యబంధాలను రసాలను ఆశ్రయించి ఉండే టట్లు నాట్యప్రయోగాలలో చేర్చబడినవి.

**మూ. చరితైర్యస్య దేవస్య జప్యం యద్యాదృశం కృతమ్,**
**ఋషిభిస్తాదృశీ వృత్తిః కృతా పాఠ్యాదిసంయుతా. 23**

**తా.** విష్ణువుయొక్క ఏ చరితములచేత (దానవులతో మల్లయుద్ధసమయంలో చేసిన చార్యాదులచేత) వాటికి అనుగుణంగా బ్రహ్మదేవుడు ఏ జప్యాన్ని (స్తోత్రాన్ని) రచించాడో అలాంటి వృత్తినే ఋషులు (బ్రహ్మపుత్రులు) పాఠ్యాదులతో కూడిన దానినిగా చేశారు.

**వి.** భారతీవృత్తిలో పాఠ్యానికి ప్రాధాన్యం. సాత్త్వతీవృత్తిలో అభినయానికీ, ఆరభటిలో

అనుభావాదుల ఆవేశరూప మైన రసానికీ, కైశికిలో గీతవాద్యాదిరంజకాలకు ప్రాధాన్యం. (అభి.భా.)

**మూ. నాట్యవేదసముత్పన్నా వాగఙ్గాభినయాత్మికా,**
**మయా కావ్యక్రియాహేతోః ప్రక్షిప్తా ద్రుహిణాజ్ఞయా. 24**

**తా.** నాట్యవేదంనుండి పుట్టిన వాచికాభినయాంగికాభినయరూపమైన ఈ వృత్తిని, నేను బ్రహ్మ ఆజ్ఞచేత కావ్యరచనకై కావ్యంలో ప్రవేశపెట్టాను.

**మూ. ఋగ్వేదాద్భారతీ క్షిప్తా యజుర్వేదాచ్చ సాత్త్వతీ,**
**కైశికీ సామవేదాచ్చ శేషా చాథర్వణాదపి. 25**

**తా.** ఋగ్వేదంనుండి భారతీవృత్తి, యజుర్వేదంనుండి సాత్త్వతీవృత్తి, సామవేదం నుండి కైశికీవృత్తి అథర్వణంనుండి ఆరభటీవృత్తి గ్రహింపబడినది.

**మూ. యా వాక్ప్రధానా పురుషప్రయోజ్యా స్త్రీవర్జితా సంస్కృతపాఠ్యయుక్తా,**
**స్వనామధేయైర్భరతైః ప్రయుక్తా సా భారతీ నామ భవేత్తు వృత్తిః. 26**

**తా.** వంశనామధేయంచేత, భరతపుత్రులు గాన భరతు లను పేరు గలవారు ప్రయోగించడంచేత 'భారతి' అను పేరు గల వృత్తిలో వాక్కు (పాఠ్యం) ప్రధానంగా ఉంటుంది. దీనిని పురుషులు ప్రయోగించాలి. స్త్రీలు ప్రయోగించకూడదు. పాఠ్యం సంస్కృతంలో ఉంటుంది.

**మూ. భేదాస్తస్యాస్తు విజ్ఞేయాశ్చత్వారోఽఙ్గత్వమాగతాః,**
**ప్రరోచనాఽఽముఖం చైవ వీథీ ప్రహసనం తథా. 27**

**తా.** భారతికి ప్రరోచన, ఆముఖం, వీథి, ప్రహసనం అని నాలు గంగాలు.

**మూ. జయాభ్యుదయినీ చైవ మఙ్గల్యా విజయావహా,**
**సర్వపాపప్రశమనీ పూర్వరఙ్గే ప్రరోచనా. 28**

**తా. (1) ప్రరోచన :–** పూర్వరంగంలో ఉండే ప్రరోచన జయాన్ని అభ్యుదయాన్నీ ఇస్తుంది. మంగళ ప్రద మైనది. విజయప్రదము. పాపాలన్నీ తొలగిస్తుంది.

**మూ. (ఉపక్షేపేణ కావ్యస్య హేతుయుక్తిసమాశ్రయా,**
**సిద్ధేనామన్త్రణా యా తు విజ్ఞేయా సా ప్రరోచనా). 29**

**తా.** చేయదలచిన ఒక కార్యాన్ని గూర్చి, హేతుసహితంగా, యుక్తిప్రదర్శన పూర్వకంగా చెప్పి, సిద్ధమైన ఆ కార్యంచేత, అనగా ఆ కార్యంలో ఉన్న వైశిష్ట్యాన్ని తెలపడంద్వారా, సామాజికులను దాని వైపు ఉన్ముఖులను చేయడం **ప్రరోచన**. ఒక వస్తువులోని గుణాలను వర్ణించి శ్రోతలకు దానిపై ఆసక్తి కలిగేటట్లు చేయడం ప్రరోచన.

**మూ. నటీ విదూషకో వాపి పారిపార్శ్వక ఏవ వా,**
**సూత్రధారేణ సహితాః సంలాపం యత్తు కుర్వతే. 30**

**చిత్రైర్వాక్యైః స్వకార్యోత్థైః వీథ్యఙ్గైరన్యథాపి వా,**
**ఆముఖం తత్తు విజ్ఞేయం బుధైః ప్రస్తావనాపి వా. 31**

**తా.** నటి గాని, విదూషకుడు గాని, పారిపార్శ్వికుడు (ప్రక్కనే ఉండే సహచరుడు) గాని సూత్రధారునితో కలిసి తాము చేయనున్న కార్యానికి సంబంధించిన విచిత్రములైన వాక్యములతో, వీథికి చెప్పిన అంగాలు ప్రయోగిస్తూ గాని, ఇతరవిధాలలో గాని చేసే సంభాషణ **ఆముఖం**. దీనికే **ప్రస్తావన** అని కూడ పేరు.

**మూ. (లక్షణం పూర్వముక్తం తు వీథ్యాః ప్రహసనస్య చ,**
**ఆముఖాఙ్గాన్యతో వక్ష్యే యథావదనుపూర్వశః.) 32**

**తా.** వీథీ – ప్రహసనాల అంగాలు వెనుక చెప్పబడ్డాయి. ఇపుడు క్రమంగా ఆముఖం అంగాలను గూర్చి చెపుతాను.

**మూ. ఉద్ఘాత్యకః కథోద్ఘాతః ప్రయోగాతిశయస్తథా,**
**ప్రవృత్తకావలగితే పఞ్చాఙ్గాన్యాముఖస్య తు. 33**

**తా.** ఉద్ఘాత్యకము, కథోద్ఘాతము, ప్రయోగాతిశయము, ప్రవృత్తకము, అవలగితము అని ఆముఖాంగాలు ఐదు.

**మూ. ఉద్ఘాత్యకావలగితలక్షణం కథితం మయా,**
**శేషాణాం లక్షణం విప్రా వ్యాఖ్యాస్యామ్యనుపూర్వశః. 34**

**తా.** ఉద్ఘాత్యక – అవలగితాల లక్షణాలు వెనుక (18–116) చెప్పిఉన్నాను. మిగిలినవాటి లక్షణాలను క్రమానుసారం చెపుతాను.

**మూ. సూత్రధారస్య వాక్యం వా యత్ర వాక్యార్థమేవ వా,**
**గృహీత్వా ప్రవిశేత్పాత్రం కథోద్ఘాతః స కీర్తితః. 35**

**తా.** సూత్రధారుడు పలికిన వాక్యాన్ని గాని, వాక్యం అర్థాన్ని గాని పట్టుకొని, ఏ ప్రస్తావనలో, రూపకానికి సంబంధించిన పాత్ర ప్రవేశిస్తాడో అది **కథోద్ఘాతం**.

**మూ. ప్రయోగే తు ప్రయోగం తు సూత్రధారః ప్రయోజయేత్,**
**తతశ్చ ప్రవిశేత్పాత్రం ప్రయోగాతిశయో మతః. 36**

**తా.** ప్రస్తావనాప్రయోగంలోనే సూత్రధారుడు మరొక ప్రయోగం చేయగా దానిని పట్టి పాత్రప్రవేశం జరిగితే అది ప్రయోగాతిశయం.

**మూ. కాలప్రవృత్తిమాశ్రిత్య వర్ణనా యా ప్రయుజ్యతే,**
**తదాశ్రయాచ్చ పాత్రస్య ప్రవేశస్తత్ ప్రవృత్తకమ్. 37**

**తా.** వసంతాదికాలాన్ని గూర్చి వర్ణన చేసి నపుడు దానిని పట్టుకొని పాత్ర ప్రవేశిస్తే అది ప్రవృత్తకం.

**మూ. ఏషామన్యతమం శ్లిష్టం యోజయిత్వార్థయుక్తిభిః,**
**(తస్మాదఙ్గద్వయస్యాపి సంభవో న నివార్యతే). 38**

**తా.** ఈ విధంగా ప్రయోజనాలతోను, యుక్తులతోను కూడిన ఏదో ఒక అంగాన్ని కూర్చాలి. (ఆవశ్యకతను పట్టి రెండు అంగాల ప్రయోగం కూడ చేయవచ్చును).

**మూ. పాత్రగ్రన్థైరసంబాధం ప్రకుర్యాదాముఖం తతః,**
**ఏవమేతద్బుధైర్జ్ఞేయమాముఖం వివిధాశ్రయమ్. 39**

**(లక్షణం పూర్వముక్తం తు వీథ్యాః ప్రహసనస్య చ.)**

**తా.** ఆముఖం పాత్రలతో కిక్కిరిసి ఉండకుండాను, గ్రంథంకూడ (సంభాషణ వర్ణనాదికం) అతిగా ఉండకుండా చూచుకోవాలి. ఈ విధంగా ఆముఖంలో అనేక విషయాలు, పద్ధతులూ ఉంటాయి. (వీథీ – ప్రహసనాల లక్షణం వెనుక చెప్పబడింది).

**మూ. (ఇత్యర్థాష్టవికల్పా వృత్తిరియం భారతీ మయాభిహితా,**
**సాత్త్వత్యాస్తు విధానం లక్షణయుక్త్యా ప్రవక్ష్యామి). 40**

**తా.** (ఇంతవరకు నేను భారతీవృత్తి, దానికి సంబంధించిన నాలుగు పద్ధతులను గూర్చి చెప్పాను. ఇప్పుడు సాత్త్వతీవృత్తి లక్షణ – విధానాలను గూర్చి చెపుతాను).

**మూ. యా సాత్త్వతేనేహ గుణేన యుక్తా న్యాయేన వృత్తేన సమన్వితా చ,**
**హర్షోత్కటా సంహృతశోకభావా సా సాత్త్వతీ నామ భవేత్తు వృత్తిః. 41**

**తా.** సత్త్వగుణం ప్రధానంగా ఉండే సాత్త్వతీరీతిలో న్యాయాలు, వివిధవృత్తాలు ఉంటాయి. అత్యధికహర్షం ఉంటుంది. శోకానికి దీనిలో స్థానం ఉండదు.

**మూ. వాగఙ్గాభినయవతీ సత్త్వోత్థానవచనప్రకరణేషు,**
**సత్త్వాధికారయుక్తా విజ్ఞేయా సాత్త్వతీ వృత్తిః. 42**

**తా.** సాత్త్వతీవృత్తిలో వాచికాభినయమూ, ఆంగికాభినయమూ ఉంటాయి. బలము (సత్త్వ), ఉత్థానము (కార్యవ్యాపృతుడై ఉండడము), మాటలు, చేతలు – వీటియందు సత్త్వగుణప్రభావం అత్యధికంగా కనబడుతుంది.

**మూ. వీరాద్భుతరౌద్రరసా నిరస్తశృఙ్గారకరుణనిర్వేదా,**
**ఉద్ధతపురుషప్రాయా పరస్పరాఘర్షణకృతా చ. 43**

**తా.** ఈ సాత్త్వతీవృత్తిలో వీర – అద్భుత – రౌద్రరసా లుంటాయి. శృంగార – కరుణ – నిర్వేదా లుండవు. దీనిలోని పురుషులు చాలమంది పరస్పరము ఘర్షణలతో ఉద్ధతులై ఉంటారు.

**మూ. ఉత్థాపకశ్చ పరివర్తకశ్చ సల్లాపకశ్చ సంఘాత్యః,**
**చత్వారోఽస్యా భేదా విజ్ఞేయా నాట్యతత్త్వజ్ఞైః. 44**

**తా.** సాత్త్వతీవృత్తిలో ఉత్థాపకము, పరివర్తకము, సల్లాపకము, సంఘాత్యము అను నాలుగు భేదాలుంటాయి.

**మూ. అహమప్యుత్థాస్యామి త్వం తావద్దర్శయాత్మనః శక్తిమ్,**
**ఇతి సంఘర్షసముత్థః తద్జ్ఞైరుత్థాపకో జ్ఞేయః. 45**

**తా. ఉత్థాపకము :–** "నేను లేస్తాను (నే నెవరో చూపిస్తాను). నువ్వు నీ శక్తి ఏమిటో చూపించు" అంటూ పరస్పరమూ ఘర్షణ పడడం **ఉత్థాపకం**.

**మూ. ఉత్థానసమారబ్ధానర్థానుత్సృజ్య యోఽర్థయోగవశాత్,**
**అన్యావర్థాన్ భజతే స చాపి పరివర్తకో జ్ఞేయః. 46**

**తా. పరివర్తకం :–** ఉత్థానంలో (సర్వసంనద్ధత్వంతో ఆక్రమాదికంచేయడంలో) ప్రారంభించిన పనులను, ఏదో కారణంచేత మధ్యలో విడిచివేసి, ఇతరకార్యాలు చేపట్టడం **పరివర్తకం**.

**మూ. (నిర్దిష్టవస్తువిషయః ప్రపఞ్చబద్ధస్త్రిహాస్యసంయుక్తః,**
**సంఘర్షవిశేషకృతస్త్రివిధః పరివర్తవో జ్ఞేయః). 47**

**తా.** (నిర్దిష్టమైన (ఫలానా అని నిశ్చయింపబడిన) వస్తువునకు సంబంధించినది, విస్తృతమైనది. మూడు విధాల హాస్యాలతో కూడినది అని సంఘర్షవిశేషకృతమైన పరివర్తకం మూడు విధాలు).

**మూ. సాఘర్షజో నిరాఘర్షజోఽపి వా వివిధవచనసంయుక్తః,**
**సాధిక్షేపాలాపో జ్ఞేయః సల్లాపకః సోఽపి. 48**

**తా.** పరస్పరదూషణాలతో కూడినది **సల్లాపకం**. దీనిలో ఘర్షణం ఉండి కాని, ఘర్షణం లేకుండా గాని అనేకవిధాలైన మాటల ప్రయోగం ఉంటుంది.

**మూ. (ధర్మాధర్మసముత్థం యత్ర భవేద్రాగదోషసంయుక్తమ్,**
**సాధిక్షేపం చ వచో జ్ఞేయః సంలాపకో నామ). 49**

**తా.** (ధర్మాధర్మాలతో సంబంధించినదై, రాగ – దోషాలతో కూడిన అధిక్షేపపూర్వకమైన వచనం **సంలాపకం**).

**మూ. మన్త్రార్థవాక్యశక్త్యా దైవవశాదాత్మదోషయోగాద్వా,**
**సంఘాతభేదజననః తద్జ్ఞైః సంఘాత్యకో జ్ఞేయః. 50**

**తా.** మంత్రం (ఆలోచన) చేతగాని, ఏదైన ప్రయోజనంచేత గాని, ఒక మాటచేత గాని, శక్తిచేతగాని, ప్రతికూలదైవవశంచేత గాని, తన దోషంచేత గాని ఒక సంఘంలో (జనసంఘంలో) భేదం కలగడం (కలిగించేది) **సంఘాత్యకం.**

**మూ. బహుకపటసంశ్రయాణాం పరోపఘాతాశయప్రయుక్తానామ్,**
**కూటానాం సంఘాతో విజ్ఞేయః కూటసంఘాత్యః. 51**

**తా.** అనేకకపటోపాయాలు అవలంబించేవాళ్ళు, పరులకు అపకారం చెయ్యా లనే ఆశయంతో ప్రవర్తించేవాళ్లు అయిన మోసగాళ్ల సముదాయం **కూటసంఘాత్యం.**

**మూ. ఇత్యష్టార్థవికల్పా వృత్తిరియం సాత్త్వతీ మయాభిహితా,**
**కైశిక్యాస్త్వథ లక్షణమతఃపరం సంప్రవక్ష్యామి. 52**

**తా.** ఇంతవరకు నాలుగు భేదాలు గల సాత్త్వతీవృత్తిని చెప్పాను. ఇటుపైన కైశికీవృత్తి స్వరూపం చెపుతాను.

**మూ. యా శ్లక్ష్ణనైపథ్యవిశేషచిత్రా స్త్రీసంయుతా యా బహునృత్తగీతా,**
**కామోపభోగప్రభవోపచారా తాం కైశికీం వృత్తిముదాహరన్తి. 53**

**తా.** కైశికీవృత్తిలో అందమైన విచిత్ర మైన విశిష్టవేషధారణ ఉంటుంది. స్త్రీపాత్రలతో అనేకవిధాలైన నృత్తగీతాల ప్రయోగమూ, కామభోగోపయుక్తములైన ఉపచారాలు ఉంటాయి.

**మూ. బహువాద్యనృత్తగీతా శృఙ్గారాభినయచిత్రనైపథ్యా,**
**మాల్యాలంకారయుతా ప్రశస్తవేషా చ కాన్తా చ. 54**

**చిత్రపదవాక్యబన్ధైరలంకృతా హసితరుదితరోషాద్యైః,**
**స్త్రీపురుషకామయుక్తా విజ్ఞేయా కైశికీ వృత్తిః. 55**

**తా. కైశికీవృత్తిలో** అనేకవిధాల వాద్యాల నృత్తాల గీతాల ప్రయోగం ఉంటుంది. నేపథ్యం (మేకప్) శృంగారాభినయానికి తగినట్లు చిత్రంగా ఉంటుంది. ఇది మాలలు, అలంకారాలు, ప్రశస్తమైన వేషాలు – వీటితో రమణీయంగా ఉంటుంది. విచిత్రమైన పదాల వాక్యాల కూర్పు, నవ్వులు, ఏడ్పులు, రోషాలు మొదలైనవాటితో ఇది స్త్రీపురుషుల కామంతో నిండి ఉంటుంది.

**మూ. నర్మ చ నర్మస్ఫుఞ్జో (స్ఫూర్జో) నర్మస్ఫోటోఽథ నర్మగర్భశ్చ,**
**కైశిక్యాశ్చత్వారో భేదా హ్యేతౌ సమాఖ్యాతాః. 56**

**తా.** కైశికీవృత్తికి – నర్మ, నర్మస్ఫుంజం (నర్మస్ఫూర్జం), నర్మస్ఫోటం, నర్మగర్భం అను భేదాలు (అంగాలు) ఉంటాయి.

**మూ. అస్థాపితశృఙ్గారం విశుద్ధకరణం నివృత్తవీరరసమ్,**
**హాస్యప్రవచనబహులం నర్మ త్రివిధం విజానీయాత్. 57**

**తా.** నర్మలో శృంగారరసస్థాపనం ఉంటుంది. విశుద్ధకరణాల ప్రయోగంతో కూడిన నర్మలో వీరరసానికి అవకాశం ఉండదు. హాస్యభరిత మైన వచనాల ప్రయోగం అధికంగా ఉంటుంది. ఇది మూడు విధాలు. 'నర్మస్ఫుంజం' మొదలైన మూడూ నర్మభేదాలే అని అర్థం.

**మూ. ఈర్ష్యాకోపప్రాయం సోపాలమ్భకరణానువిద్ధం చ,**
**ఆత్మోపక్షేపకృతం సవిప్రలమ్భం స్మృతం నర్మ. 58**

**తా.** నర్మలో ఈర్ష్య, కోపమూ అధికంగా ఉంటాయి. తనను తాను సమర్పించడం, వియోగం, నిందాపూర్వకమైన చేష్టలు – ఇలాంటి వన్నీ నర్మలో ఉంటాయి.

**మూ. నవసంగమసంభోగో రతిసముదయవేషవాక్యసంయుక్తః,**
**జ్ఞేయో నర్మస్ఫుఞ్జో హ్యవసానభయాత్మకశ్చైవ. 59**

**తా.** రతి స్ఫుటం అవడంతో దానికి అనుగుణమైన వేషాలతోను, మాటలతోను జరిగే నవసమాగమసంభోగం చివరికి భయంతో (భయానకంతో) ముగిస్తే అది నర్మస్ఫుంజం (స్ఫూర్జం).

**మూ. వివిధానాం భావానాం లవైర్లవైర్భూషితో బహువిశేషైః,**
**అసమగ్రాక్షిప్తరసో నర్మస్ఫోటస్తు విజ్ఞేయః. 60**

**తా.** అనేకవిధాలైన భావాల అనేకవిశేషాలు కొంచెం కొంచెం కనబడుతూంటాయి. రసం అసమగ్రంగానే నిలిచిపోతుంది. అది **నర్మస్ఫోటం.**

**మూ. విజ్ఞానరూపశోభాధనాదిభిర్నాయకో గుణైర్యత్ర,**
**ప్రచ్ఛన్నం వ్యవహరతే కార్యవశాన్నర్మగర్భోఽసౌ. 61**

**తా.** విజ్ఞానము, రూపము, శోభ, ధనము మొదలైన గుణా లన్నీ ఉన్నా కూడ, నాయకుడు కార్యవశంచేత (నవసమాగమసిద్ధికొరకు – అభి.భా.) ప్రచ్ఛన్నంగా (అవేమీ బైటపడకుండా) ఎక్కడ వ్యవహరిస్తాడో అది **నర్మగర్భం.**

**మూ. పూర్వస్థితో విపద్యేత నాయకో యత్ర చాపరస్తిష్ఠేత్,**
**తమపీహ నర్మగర్భం విద్యాత్ నాట్యప్రయోగేషు. 62**

**తా.** మొదట ఉన్న నాయకుడు పోయి వాని స్థానంలో మరొకడు వచ్చినట్లయితే అది కూడ **నర్మగర్భం** అని నాట్యప్రయోగాలలో గుర్తించాలి.

**మూ. ఇత్యష్టార్థవికల్పా వృత్తిరియం కైశికీ మయాభిహితా,**
**అత ఊర్ధ్వముద్ధతరసామారభటీం సంప్రవక్ష్యామి. 63**

**తా.** ఇంతవరకు నాలుగు భేదాలు గల కైశికీవృత్తిని చెప్పాను. ఇటుపైన ఉద్ధతమైన రసా లుండే **ఆరభటీవృత్తిని** గూర్చి చెపుతాను.

**మూ. ఆరభటప్రాయగుణా తథైవ బహుకపటవఞ్చనోపేతా,**
**దమ్భానృతవచనవతీ త్వారభటీ నామ విజ్ఞేయా. 64**

**తా. ఆరభటీవృత్తి** ఉద్ధతులైన పురుషుల గుణాలతో అధికంగా నిండి ఉంటుంది. అనేకవిధాలైన కపటాలు వంచనలు ఉంటాయి. డాంబికం అసత్యవచనాలు మొదలైన వాటితో నిండి ఉంటుంది.

**మూ. పుస్తావపాతం ప్లుతలఙ్ఘనాని భేద్యాని మాయాకృతమిన్ద్రజాలమ్,**
**చిత్రాణి యుద్ధాని చ యత్ర నిత్యం తాం తాదృశీమారభటీం వదన్తి. 65**

**తా.** ఏవో బొమ్మలు మొదలైనవి క్రిందపడడం, గంతులు, దాటడాలు, నరకడాలు, మాయతో చేసిన పనులు, ఇంద్రజాలము, చిత్రములైన యుద్ధాలు అధికంగా ఉండేది **ఆరభటీవృత్తి.**

**మూ. షాడ్గుణ్యసమారబ్ధా హతాతిసంధానవిద్రవోపేతా,**
**లాభాలాభార్థకృతా విజ్ఞేయా వృత్తిరారభటీ. 66**

**తా.** సంధి, విగ్రహం మొదలైనవాటితో ప్రారంభం అవుతుంది. బలాత్కారాలతో, మోసాలతో, పారిపోవడంతో నిండి ఉంటుంది. లాభాల వర్ణనలతోను, అలాభాల వర్ణనలతోను కూడి ఉంటుంది. అది **ఆరభటీవృత్తి.**

**మూ. సంక్షిప్తకావపాతౌ వస్తూత్థాపనమథాపి సంఫేటః,**
**ఏతే హ్యస్యా భేదా లక్షణమేషాం ప్రవక్ష్యామి. 67**

**తా.** సంక్షిప్తకము, అవపాతము, వస్తూత్థాపనము, సంఫేటము అని ఆరభటీవృత్తి భేదాలు (అంగాలు) నాలుగు. వీటి లక్షణాలు చెపుతాను.

**మూ. అన్వర్థశిల్పయుక్తో బహుపుస్తోత్థానచిత్రనేపథ్యః,**
**సంక్షిప్తవస్తువిషయో జ్ఞేయః సంక్షిప్తకో నామ. 68**

**తా.** ఏదో ప్రయోజనాన్ని ఉద్దేశించి ప్రదర్శించిన శిల్పాలు, అనేకవిధాలైన కట్ట

బొమ్మలు లేపడం, చిత్రమైన వేషధారణా మొదలైనవాటితో, కథావస్తువు సంక్షిప్తంగా ఉన్నది **సంక్షిప్తకం.**

**మూ. భయహర్షసముత్థానం విద్రవవినిపాతసంభ్రమాచరణమ్,**
**క్షిప్రప్రవేశనిర్గమమవపాతమిమం విజానీయాత్. 69**

**తా. అవపాతంలో** భయమూ, హర్షమూ కూడ అత్యధికంగా కలుగుతూంటాయి. విద్రవము (పరుషవాక్యాలతో భయపెట్టడం), ఆక్రమణము, కంగారుగా పనులు చేయడము, పాత్రలు తొందరగా ప్రవేశిస్తూండడము, నిర్గమిస్తూండడము ఉంటాయి.

**మూ. సర్వరససమాసకృతం సవిద్రవావిద్రవాశ్రయం వాపి,**
**నాట్యం విభావ్యతే యత్తద్వస్తూత్థాపనం జ్ఞేయమ్. 70**

**తా.** ఏ నాట్యంలో అన్ని రసాల మేళవింపు ఉంటుందో, ఒకప్పుడు విద్రవం ఉండడమూ ఉండకపోవడమూ కూడ జరుగుతుందో అది వస్తూత్థాపనం.

**మూ. సంరమ్భసంప్రయుక్తో బహుయుద్ధనియుద్ధకపటనిర్భేదః,**
**శస్త్రప్రహారబహులః సంఫేటో నామ విజ్ఞేయః. 71**

**తా. సంఫేటంలో** పను లన్నీ చాల తొందరగా చేస్తుంటారు. అనేక విధాలైన యుద్ధాలు, బాహుయుద్ధాలు, కపటాలు, నరకడాలు, బద్దలుకొట్టడాలు, ఆయుధ ప్రయోగాలు ఉంటాయి.

**మూ. ఏవమేతా బుధైర్జ్ఞేయా వృత్తయో నాట్యసంశ్రయాః,**
**రసప్రయోగమాసాం చ కీర్త్యమానం నిబోధత. 72**

**తా.** ఇవి నాట్యానికి సంబంధించిన నాలుగు వృత్తులు. ఈ వృత్తులలో ఏ ఏ రసాల ప్రయోగం ఉంటుందో చెపుతున్నాను; వినండి.

**మూ. హాస్యశృఙ్గారబహులా కైశికీ పరిచక్షితా,**
**సాత్త్వతీ చాపి విజ్ఞేయా వీరాద్భుతశమాశ్రయా. 73**
**రౌద్రే భయానకే చైవ విజ్ఞేయారభటీ బుధైః,**
**బీభత్సే కరుణే చైవ భారతీ సంప్రకీర్తితా. 74**

**తా.** కైశికీవృత్తి హాస్య – శృంగారాలతో అధికంగా సంబంధించి ఉంటుంది. సాత్త్వతీవృత్తి వీర – అద్భుతరసాలను ఆశ్రయించి ఉంటుంది. రౌద్ర – భయానకరసాలలో ఆరభటి అధికంగా ఉంటుంది. భారతీవృత్తి బీభత్సకరుణరసాలతో సంబంధించి ఉంటుంది.

**మూ. (న హ్యేకరసజం కావ్యం కించిదస్తి ప్రయోగతః,**

భావో వాపి రసో వాపి ప్రవృత్తిర్వృత్తిరేవ వా.) **75**

**తా.** (ప్రయోగించే కావ్యం ఏదీ ఒకే రసంతో ఉండదు. అట్లే ఒకే రసంతో సంబంధించిన భావం గాని, రసం గాని, ప్రవృత్తి గాని, వృత్తి గాని ఉండదు).

**మూ. సర్వేషాం సమవేతానాం యస్య రూపం భవేద్బహు,**
**స మన్తవ్యో రసః స్థాయీ శేషాః సంచారిణః స్మృతాః. 76**

**తా.** ఒక కావ్యంలో కలిసి ఉన్న అనేకస్థాయిభావాలలో ఏది విస్తృతంగా ఉంటుందో ఆ స్థాయి భావమే రసం అవుతుంది అని తెలుసుకోవాలి. మిగిలినవి (దానికి) సంచారిభావాలవుతాయి.

**మూ. వృత్త్యన్త ఏషోఽభినయో మయోక్తో వాగఙ్గసత్త్వప్రభవో యథావత్,**
**ఆహార్యమేవాభినయం ప్రయోగే వక్ష్యామి నేపథ్యకృతం తు భూయః. 77**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే వృత్తివికల్పనం నామాధ్యాయో వింశః.**

**తా.** ఇంతవరకు నేను వృత్తులవరకు, వాచిక – ఆంగిక – సాత్త్వికాభినయాన్ని గూర్చి చెప్పాను. ఇప్పుడు నాట్యప్రయోగంలో, నేపథ్యంచేత ఏర్పడే ఆహార్యాభినయాన్ని గూర్చి చెపుతాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో వృత్తివికల్పనం అను ఇరవైయవ అధ్యాయం సమాప్తం.**

**నృసింహగుప్తాయతినేత్థమత్ర వృత్తిస్వరూపం ప్రకటం వ్యధాయి,**
**యస్య త్రిణేత్రేణ హృదన్తరాత్మవృత్తిస్వరూపం ప్రకటం వ్యధాయి.**
**– శ్రీమదభినవగుప్తాచార్యపాదాః.**

**శ్రీః శ్రీః శ్రీః**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ ఏకవింశోऽధ్యాయః

# ఆహార్యాభినయము

**"యస్య సంకల్పమాత్రేణ విశ్వమాహార్యమద్భుతమ్,**
**తం మానసమహామూర్తిం వన్దే గిరిసుతామపి."**

**– శ్రీమదభినవగుప్తాచార్యాః**

**మూ. ఆహార్యాభినయం విప్రా వ్యాఖ్యాస్యామ్యనుపూర్వశః,**
**యస్మాత్ ప్రయోగః సర్వోऽయమాహార్యాభినయే స్థితః. 1**

**తా.** విప్రులారా! ఈ నాట్యప్రయోగం అంతా ఆహార్యాభినయంమీద ఆధారపడి ఉంది. అందుచేత ఆహార్యాభినయాన్ని క్రమానుసారంగా చెపుతాను.

**మూ. నానావస్థాః ప్రకృతయః పూర్వం నేపథ్యసాధితాః,**
**అఙ్గాదిభిరభివ్యక్తిముపగచ్ఛన్త్యయత్నతః. 2**

**తా.** ముందుగా నేపథ్యంచేత (వేషధారణంచేత) ప్రకాశితములైన వివిధము లైన రతి – శోకాద్యవస్థలూ, వాటికి ఆశ్రయభూతులైన ధీరోదాత్తాద్యుత్తమప్రకృతులూ అంగాదుల చేత (ఆంగికాభినయాదులచేత) ఎక్కువ ప్రయత్నంతో పని లేకుండా అభివ్యక్తము లవుతాయి.

**వి.** సమస్తమైన అభినయప్రయోగ మనే చిత్రానికి ఆహార్యం భిత్తి (గోడ) వంటిది. అందుచేత ఇతరాభినయా లన్నీ విరమించినా నేపథ్యవిశేషం చూడగానే ఒక విశేషం గుర్తింపబడుతుంది (అభి.భా.)

**మూ. ఆహార్యాభినయో నామ జ్ఞేయో నేపథ్యజో విధిః,**
**తత్ర కార్యః ప్రయత్నస్తు నాట్యస్య శుభమిచ్ఛతా. 3**

**తా.** ఆ యా పాత్రలు ధరించే వేషాలంకారాదుల విధానం ఆహార్యాభినయం, నాట్యప్రయోగం చక్కగా జరగా లనుకొనేవాడు నేపథ్యవిధివిషయంలో బాగా శ్రద్ధ వహించాలి.

**మూ. (తస్మిన్యత్నస్తు కర్తవ్యో నేపథ్యే సిద్ధిమిచ్ఛతా,**
**నాట్యస్యేహ త్వలఙ్కారో నైపథ్యం యత్రప్రకీర్తితమ్). 4**

**తా.** నాట్యప్రయోగం సఫలం కావాలని కోరుకొనేవాడు నేపథ్యం విషయంలో

మంచి ప్రయత్నం చెయ్యాలి. ఎందువల్లననగా – నైపథ్యం అనేది నాట్యానికి అలంకారం అంటారు పెద్దలు.

**మూ. చతుర్విధం తు నేపథ్యం పుస్తోఽలజ్కార ఏవ చ,**
**తథాఙ్గరచనాచైవ జ్ఞేయం సజ్జీవ ఏవ చ. 5**

**తా.** పుస్తము, అలంకారము, అంగరచన, సజ్జీవము (జీవించి ఉన్న ప్రాణులు) అని నేపథ్యం నాలుగు విధాలు.

**మూ. పుస్తస్తు త్రివిధో జ్ఞేయో నానారూపప్రమాణతః,**
**సన్ధిమో వ్యాజిమశ్చైవ వేష్టిమశ్చ ప్రకీర్తితః. 6**

**తా.** మట్టి, కఱ్ఱ, రాయి, తోలు మొదలైనవాటితో చేసిన బొమ్మలు మొదలైనవాటికి పుస్తములని పేరు. పుస్త – పుత్తలికాశబ్దాలు పర్యాయశబ్దాలు. అనేకవిధాలైన రూపాలను, ప్రమాణాలను పట్టి, పుస్తం – సంధిమము, వ్యాజిమము, వేష్టిమము అని మూడు విధాలు.

**మూ. కిలిఞ్జచర్మవస్త్రాద్యైర్యద్రూపం క్రియతే బుధైః,**
**సన్ధిమో నామ విజ్ఞేయః పుస్తో నాటకసంశ్రయః. 7**

**తా.** కిలింజము, వెదురు, చర్మ మొదలైనవాటితో నిర్మించిన, నాట్యోపయోగియైన పుస్తం **సంధిమం**.

**వి.** భూర్జవృక్షం బెరడు, వెదురుకఱ్ర బెరడు మొదలైనది కిలింజం.

**మూ. వ్యాజిమో నామ విజ్ఞేయః యన్త్రేణ క్రియతే తు యః,**
**చేష్టతే చైవ యద్రూపం చేష్టిమః స తు సంజ్ఞితః. 8**

**తా.** యంత్రంతో తయారుచేసినది **వ్యాజిమం**. (దీని అవయవాలు విడివిడిగా కదులుతాయి). దేని రూపం చేష్టలు చేస్తుందో గడ్డిమొదలైనవి చుట్టి, లక్క, కొవ్వు మొదలైనవి పైన పూసి తయారుచేసినది వేష్టిమం.

**మూ. శైలయానవిమానాని చర్మవర్మధ్వజా నగాః,**
**యే క్రియన్తే హి నాట్యే తు స పుస్త ఇతి సంజ్ఞితః. 9**

**తా.** నాట్యంలో ఉపయోగించడంకొరకై నిర్మింపబడే పర్వతాలు, వాహనాలు, విమానాలు, డాలు, కవచం, ధ్వజాలు, ఏనుగులు లేదా వృక్షాలు – వీటికి **పుస్తములు** అని పేరు.

**మూ. అలఙ్కారస్తు విజ్ఞేయో మాలాభరణవాససామ్,**
**నానావిధః సమాయోగోఽప్యఙ్గోపాఙ్గవిధిః స్మృతః. 10**

**తా.** పుష్పమాలలు, ఆభరణాలు, వస్త్రాలు ధరించడం ద్వారా అనేకవిధాల అంగ – ఉపాంగాలను అందంగా ఉండేటట్లు (కనబడేటట్లు) చేసే విధానం **అలంకారం.**

**మూ. వేష్టితం వితతం చైవ సంఘాత్యం గ్రన్థిమం తథా,**
**ప్రాలమ్బితం తథా చైవ మాల్యం పఞ్చవిధం స్మృతమ్. 11**

**తా.** వేష్టితము, వితతము, సంఘాత్యము, గ్రంథిమము, ప్రాలంబితము అని మాల్యం ఐదు విధాలు.

**వి.** వేష్టితమ్ = ఏదైన తృణంతో చుట్టబెట్టినది లేదా చాల పేటలు చుట్టినది. వితతమ్ = మాలాసమూహాత్మకమైనది. **సంఘాత్యమ్** = గుండ్రంగా కట్టినది; లేదా పుష్పాలు దారంతో గుచ్చికట్టినది. లేదా చాలపుష్పగుచ్ఛాలతో కట్టినది. ప్రాలమ్బితమ్ = మోకాళ్లవరకు వ్రేలాడేది. (అభి.భా.)

**మూ. చతుర్విధం తు విజ్ఞేయం నాట్యే హ్యాభరణం బుధైః,**
**ఆవేధ్యం బన్ధనీయం చ క్షేప్యమారోప్యమేవ చ. 12**

**తా.** ఆవేధ్యము, బంధనీయము, క్షేప్యము, ఆరోప్యము అని నాట్యంలో ఆభరణం నాలుగు విధాలు.

**మూ. ఆవేధ్యం కుణ్డలాదీహ యత్ స్యాచ్ఛ్రవణభూషణమ్,**
**ఆరోప్యం హేమసూత్రాది హారాశ్చ వివిధాశ్రయాః. 13**
**శ్రోణీసూత్రాఙ్గదే ముక్తా బన్ధనీయాని సర్వదా,**
**ప్రక్షేప్యం నూపురం విద్యాద్వస్త్రాభరణమేవ చ. 14**

**తా.** శ్రవణభూషణమైన కుండలాదికం **ఆవేధ్యం** (చెవి తమ్మికి రంధ్రం చేసి ధరించదగిన) ఆభరణం. బంగారు గొలుసు, ముత్యాలు మొదలైన అనేకవస్తువులతో ఏర్పరచిన హారాలు **ఆరోప్యాభరణం** (పైన వేసికొనదగినది). వడ్డాణములు, బాహుపురులు మొదలైనవి **ఆబంధనీయములు** (కట్టుకొనవలసినవి). వస్త్రాద్యాభరణము, నూపురము **ప్రక్షేప్యాభరణం.**

**మూ. భూషణానాం వికల్పం హి పురుషస్త్రీసమాశ్రయమ్,**
**నానావిధం ప్రవక్ష్యామి దేశజాతిసముద్భవమ్. 15**

**తా.** వేరు వేరు దేశాలకు, జాతులకు సంబంధించిన, పురుషులు స్త్రీలు ధరించే భూషణాలను గూర్చి చెపుతాను.

**మూ. చూడామణిః సమకుటః శిరసో భూషణం స్మృతమ్,**
**కుణ్డలం మోచకం కీలః కర్ణాభరణమిష్యతే. 16**

**తా.** చూడామణి (జుట్టు ముడిపైన ధరించే మణి) కిరీటము – ఇవి శిరస్సుకు ధరించే ఆభరణాలు, కుండలము (చెవి తమ్ముల క్రింది వేలాడేది), **మోచకం** (చెవిడిప్ప మధ్య రంధ్రంలో ధరించేది), కీలం (చెవి పైభాగం రంధ్రంలో ధరించేది) ఇవి కర్ణా భరణాలు.

**మూ. ముక్తావలీ హర్షకం చ సూత్రకం కణ్ఠభూషణమ్,**
**వేలికాఙ్గులిముద్రా చ స్యాదఙ్గులివిభూషణమ్. 17**

**తా.** ముత్యాలహారము, సర్పాకారంతో ఉన్న బరిణ, సువర్ణాదులతో చేసిన కొన్ని అల్లికలతో ఉన్న తాడు, ఇవి కంఠభూషణాలు. పక్షి – పద్మాద్యాకారాలున్న చిన్న గుండ్రని వేలికి ధరించేది (ఉంగరం) అంగులిభూషణం.

**మూ. హస్తలీ వలయం చైవ బాహునాలీవిభూషణమ్,**
**రుచకశ్చూలికా కార్యా మణిబన్ధవిభూషణమ్. 18**

**తా.** హస్తలి, వలయము, ఇవి బాహువుల భూషణం. రుచకము, చూలిక – ఇవి ముంజేతి అలంకారములు.

**మూ. కేయూరే అఙ్గదే చైవ కూర్పరోపరిభూషణమ్,**
**త్రిసరశ్చైవ హారశ్చ తథా వక్షోవిభూషణమ్. 19**

**తా.** కేయూరాలు, అంగదాలు మోచేతికి పైభాగంలో ధరించే ఆభరణాలు. మూడు పేట్ల గొలుసు, హారము వక్షఃస్థలభూషణం.

**మూ. వ్యాలమ్బమౌక్తికో హారో మాలా చైవాఙ్గభూషణమ్,**
**తలకం సూత్రకం చైవ భవేత్కటివిభూషణమ్. 20**

**తా.** వేలాడుతున్న ముత్యాలహారము, పుష్పమాల శరీరానికి భూషణం. తలకం, (పొత్తికడుపు దగ్గర కట్టేదీ), దానికి కూడ క్రింద కట్టే సూత్రకం–కటిప్రదేశానికి భూషణం.

**మూ. అయం పురుషనిర్యోగః కార్యస్త్వాభరణాశ్రయః,**
**దేవానాం పార్థివానాం చ పునర్వక్ష్యామి యోషితామ్. 21**

**తా.** ఇవన్నీ పురుషులకు (మానవులకు) సంబంధించిన ఆభరణాలు. దేవతల, రాజుల, స్త్రీల, ఆభరణాలు చెపుతాను.

**మూ. శిఖా పాశం శిఖావ్యాలః పిణ్డీపత్రం తథైవ చ,**
**చూడామణిర్మకరికా ముక్తాజాలగవాక్షిక్షమ్. 22**

**తా.** శిఖాపాశము, శిఖావ్యాలం (సర్పాకారంలో ఉన్న జడ), పిండీపత్రం, చూడామణి, మకరిక, గవాక్షాకారంలో, వల ఆకారంలో, తయారుచేసిన – ముత్యాల అల్లిక.

**మూ. శిరసో భూషణం చైవ విచిత్రం శీర్షజాలకమ్,**
**కణ్డకం శిఖిపత్రం చ వేణీపుచ్ఛః సదోరకః. 23**

**తా.** విచిత్రమైన వలవంటిది, కండకం, నెమలి ఈక. వేణీపుచ్ఛం (తోకవలె ఉన్న జడ), దోరకం, ఇవన్నీ శిరోలంకావిశేషాలు.

**మూ. లలాటతిలకం చైవ నానా శిల్పప్రయోజితమ్,**
**భ్రూగుచ్ఛోపరిగుచ్ఛశ్చ కుసుమానుకృతాస్తథా. 24**

**తా.** అనేకశిల్పాలతో రచించిన లలాటతిలకము, కనుబొమ్మల ముడి పైన పుష్పాకారమైన ఒకగుత్తి (ఇవి లలాటభూషణాలు).

**తా. కర్ణికా కర్ణవలయం తథా స్యాత్పత్రకర్ణికా,**
**కుణ్డలం కర్ణముద్రా చ కర్ణోత్కీలకమేవ చ. 25**

**నానారత్నవిచిత్రాణి దన్తపత్రాణి చైవ హి,**
**కర్ణయోర్భూషణం హ్యేతత్కర్ణపూరస్తథైవ చ. 26**

**తా.** అనేకవిధాలైన రత్నాలతో విచిత్రములైన దంతపత్రాలు (దువ్వెనలవంటివి), కర్ణిక, చక్రాకారమైన కర్ణాలంకారం, ఆకు ఆకారంలో ఉన్న అలంకారం, కుండలం, దుద్దు, కర్ణోత్కీలకము, కర్ణంలో ధరించే పుష్పము ఇవన్నీ కర్ణాభరణాలు.

**మూ. తిలకాః పత్రలేఖాశ్చ భవేత్ గణ్డవిభూషణమ్,**
**త్రివేణీ చైవ విజ్ఞేయం భవేద్వక్షోవిభూషణమ్. 27**

**తా.** చుక్కలు, ఆకులవంటి రంగులతో వేసిన చిత్రాలు గండస్థలాల భూషణం. త్రివేణి వక్షస్థలానికి భూషణం.

**మూ. నేత్రయోరఞ్జనం జ్ఞేయమధరస్య చ రఞ్జనమ్,**
**దన్తానాం వివిధో రాగశ్చతుర్ణాం శుక్లతాపి వా. 28**

**తా.** నేత్రాలకు కాటుక, అధరోష్ఠానికి రంగుపూయడం అలంకారం. నాలుగు క్రింది దంతాలకు, నాలుగు పైదంతాలకు ఏదైన రంగు పూయడం అలంకారం. వాటిని తెల్లగా నైనా ఉంచుకొనవచ్చును.

**మూ. రాగాన్తరవికల్పోఽథ శోభనేనాధికోజ్జ్వలః,**
**ముగ్ధానాం సున్దరీణాం చ ముక్తాభాసితశోభనాః. 29**

**సురక్తా వాపి దన్తాః స్యుః పద్మపల్లవరఞ్జనాః,**
**ఆశ్మరాగోద్ద్యోతితః స్యాత్ అధరః పల్లవప్రభః. 30**

**విలాసశ్చ భవేత్తాసాం సవిభ్రాన్తనిరీక్షితమ్.**

**తా.** ఆ దంతాలకు వేరు వేరు రంగులు పూయడం చాలా అందంగా, ప్రకాశ మానంగా ఉండేటట్లు చేస్తుంది. మూగ్ధానాయికల దంతాలు, సుందరస్త్రీల దంతాలు ముత్యాలవలె ప్రకాశిస్తున్నా, పద్మపల్లవాల రంగు వంటి రంగుతో బాగా ఎఱ్ఱగా ఉన్నా అవి చాల అందంగా కనబడతాయి. అధరానికి ఎఱ్ఱని రాయి రంగు పూస్తే అది చిగురు వలె ప్రకాశిస్తుంది. వాళ్ల విలాసలు, విలాసపూర్వకాలైన చూపులు మనోహరంగా ఉంటాయి.

**మూ. ముక్తావలీ వ్యాలపఙ్క్తిర్మఞ్జరీ రత్నమాలికా. 31**
**రత్నావలీ సూత్రకం చ జ్ఞేయం కణ్ఠవిభూషణమ్,**
**ద్విసరస్త్రిసరశ్చైవ చతుస్సరకమేవ చ. 32**
**తథాశృఙ్ఖలికా చైవ భవేత్ కణ్ఠవిభూషణమ్.**

**తా.** ముత్యాల హారం, వ్యాలపంక్తి, మంజరి, రత్నమాల, రత్నాలతో గుచ్చిన సూత్రం – ఇవి కంఠభూషణం. కంఠభూషణంలో రెండు లేదా మూడు లేదా నాలుగు పేట లుండవచ్చును. లేదా గొలుసు అల్లికలో ఉండవచ్చు.

**మూ. అఙ్గదం వలయం చైవ బాహుమూలవిభూషణమ్. 33**
**నానాశిల్పకృతాశ్చైవ హారా వక్షోవిభూషణమ్,**
**మణిజాలావనద్ధం చ భవేత్ స్తనవిభూషణమ్. 34**

**తా.** అంగదము, వలయము, జబ్బల భూషణం. అనేకవిధాలైన శిల్పాలతో (నగిషీలతో) చేసిన హారాలు. వక్షఃస్థలానికి భూషణం. స్తనభూషణం ఎన్నో రకాల మణులు పొదిగి చేయబడుతుంది.

**మూ. ఖర్జూరకం సోచ్ఛ్రితకం బాహునాలీవిభూషణమ్,**
**కటకం కలశాఖా చ హస్తపత్రం సపూరకమ్. 35**
**ముద్రాఙ్గులీయకం చైవ హ్యఙ్గులీనాం విభూషణమ్.**

**తా.** ఖర్జూరకము, ఉచ్ఛ్రితకము బాహువుల గొట్టంవంటి ప్రదేశంమీద ధరించే భూషణం. గుండ్రని ఆకారంలో ఉన్నది, కలశాఖ, హస్తపత్రము, పూరకము, ఎత్తైన ముద్ర ఉన్న ఉంగరము – ఇది వేళ్లకు ధరించే భూషణాలు.

**మూ. కాఞ్చీ మౌక్తికమాలాఢ్యా తలకం మేఖలం తథా. 36**
**రశనా చ కలాపశ్చ భవేచ్ఛ్రోణీవిభూషణం.**

**తా.** ముత్యాలమాలతో కూడిన కాంచి, తలకం, మేఖలం, రశన, కలాపం – ఇవి మొలపై ధరించే భూషణం.

**మూ. ఏకయష్టిర్భవేత్కాఞ్చీ మేఖలా త్వష్టయష్టికా. 37**

**ద్విరష్టయష్టీ రశనా కలాపః పఞ్చవింశకః,**

**ద్వాత్రింశచ్చ చతుఃషష్టిః శతమష్టోత్తరం తథా. 38**

**ముక్తాహారా భవన్త్యేతే దేవపార్థివయోషితామ్.**

**తా.** (పూర్వం బంగారు పూసలూ, గాజు పూసలూ, రత్నాలూ గుచ్చి అందంగా నిర్మించి దానిని వడ్డాణంగా ధరించేవా రన్నట్లు ప్రాచీనకావ్యాదులవల్ల తెలుస్తుంది). ఒక యష్టి (పేట) ఉన్నది **కాంచి**, ఎనిమిది యష్టు లున్నది **మేఖల**. పదహారు యష్టులున్నది **రశన**. ఇరవైయైదు యష్టు లున్నది **కలాపం**.

దేవతాస్త్రీలు, రాజభార్యలు ధరించే ముత్యాలహారాలకు – ముప్పైరెండు యష్టులు, అరవై నాలుగు యష్టులు, నూరు యష్టులు, నూటఎనిమిది యష్టులు ఉంటాయి.

**మూ. నూపురః కిఙ్కిణీకాశ్చ ఘణ్టికా రత్నజాలకమ్. 39**

**సఘోషే కటకే చైవ గుల్ఫోపరి విభూషణమ్.**

**తా.** నూపురము, మువ్వలు, చిరుగంటలు, రత్నాలు పొదిగిన వల (రంధ్రాలున్న అల్లిక), 'చప్పుడు' చేసే రెండు కటకాలు (అందెళ్లు) ఇవి కాలి మణవల పైభాగంలో ధరించే భూషణాలు.

**మూ. జఙ్ఘయోః పాదపత్రం స్యాదఙ్గులీష్వఙ్గులీయకమ్. 40**

**అఙ్గుష్ఠే తిలకం చైవ పాదయోశ్చ విభూషణమ్.**

**తా.** పిక్కలమీద పాదపత్రము, వేళ్లకు ఉంగరాలు, బొటనవేలికి తిలకము – ఇవి పాదాల భూషణం.

**మూ. తథాలక్తకరాగశ్చ నానాభక్తినివేశితః. 41**

**అశోకపల్లవచ్ఛాయః స్యాత్ స్వాభావిక ఏవ చ.**

**తా.** పాదాలకు – అశోకవృక్షం చిగుళ్లవంటి రంగు గల లత్తుకతో తయారు చేసిన రంగు అనేకవిధాలైన ఆకారాలలో పూయాలి. లేదా సహజమైన ఎఱ్ఱని రంగుతోనే ఉండవచ్చు.

**మూ. ఏతద్విభూషణం నార్యా ఆకేశాదానఖాదపి. 42**

**యథాభావరసావస్థం విజ్ఞేయం ద్విజసత్తమాః.**

**తా.** ద్విజసత్తములారా! నాట్యప్రయోగంలో ఉన్న భావాలను, రసాలను, అవస్థలను అనుసరించి స్త్రీలకు కేశాదిపాదనఖాంతం ఈ భూషణా లుండాలి.

**మూ. ఆగమశ్చ ప్రమాణం చ రూపనిర్వర్ణనం తథా. 43**

**విశ్వకర్మమతాత్ కార్యం స్వబుద్ధ్యాపి ప్రయోక్తృభిః.**

**తా.** శాస్త్రానుసారంగాను, పాత్రల శరీరప్రమాణాలను పట్టి, రూపాన్ని అనుసరించి, నాటప్రయోక్తలు, విశ్వకర్మ మతానుసారంగాను, తమ బుద్ధిని ఉపయోగించీ కూడ భూషణం ఏర్పాటు చెయ్యాలి.

**మూ. న హి శక్యం సువర్ణేన ముక్తాభిర్మణిభిస్తథా. 44**

**స్వాధీనమితి రుచ్యైవ కర్తుమఙ్గస్య భూషణమ్.**

**తా.** భూషణాలు ఒక నియమాన్ని పాటించి చెయ్యాలి కాని, బంగారంతోను, ముత్యాలతోను, మణులతోను, ఇవన్నీ మన చేతుల్లో ఉన్నాయి కదా అని, ఇష్టం వచ్చినట్లు శరీరాలంకరణం చేయకూడదు.

**మూ. విభాగతోఽభిప్రయుక్తమఙ్గశోభాకరం భవేత్. 45**

**యథాస్థానాన్తరగతం భూషణం రత్నసంయుత్తమ్.**

**తా.** వాటి వాటి స్థానాలలో, వేరు వేరుగా ఉంచబడిన, రత్నములతో కూడిన భూషణం శరీరానికి శోభను కలిగించేదిగా ఉంటుంది.

**మూ. న తు నాట్య ప్రయోగేషు కర్తవ్యం భూషణం గురు. 46**

**ఖేదం జనయతే తద్ధి సవ్యాయతవిచేష్టనాత్,**

**గురుభావావసన్నస్య స్వేదో మూర్ఛా చ జాయతే. 47**

**గుర్వాభరణసన్నో హి చేష్టాం న కురుతే పునః,**

**తస్మాత్తనుత్వచకృతం సౌవర్ణం భూషణం భవేత్. 48**

**రత్నవజ్జతుబద్ధం వా న ఖేదజననం భవేత్.**

**తా.** నాట్యప్రయోగాలలో బరువైన భూషణం వాడకూడదు. భూషణం బరువైతే ఆంగికచేష్టలు చేసే నటీనటులకు అలసట కలుగుతుంది. అలసిపోయినవాళ్లు చెమటపట్టి స్పృహతప్పి పడిపోతారు కూడ. బరువైన ఆభరణాలతో అలిసి పోయినవాడు అభినయం చేయజాలడు. అందుచేత బంగారుభూషణా లన్నీ పల్చని రేకులతో తయారుచేయించాలి. లేదా రత్నాదులు బంగారంమీద కాకుండా లక్కమీద పొదిగితే అవి అలసట కలిగించవు.

**మూ. స్వేచ్ఛయా భూషణవిధిః దివ్యానాముపదిశ్యతే. 49**

**యత్నభావవినిష్పన్నం మానుషాణాం విభూషణమ్.**

**తా.** దివ్యపురుషుల భూషణం నాట్యప్రయోక్త ఇష్టానుసారం చేయవచ్చును. మనుష్యుల విభూషణం మాత్రం ప్రయత్నపూర్వకంగా ఏర్పరచాలి.

**మూ. దివ్యానాం భూషణవిధిర్య ఏష పరికీర్తితః. 50**

**మానుషాణాం చ కర్తవ్యో నానాదేశసమాశ్రయః.**

**తా.** దివ్యపురుషుల విషయంలో పైన చెప్పిన భూషణవిధానం బాగానే ఉంటుంది. మనుష్యుల విషయంలో మాత్రం ఆయా దేశాలలో అలవాటులో ఉన్న భూషణవిధానం పాటించాలి.

**మూ. భూషణైశ్చాపి వేషైశ్చ నానావస్థాసమాశ్రయైః, 51**

**దివ్యాఙ్గనానాం కర్తవ్యా విభక్తిః స్వస్వభూమిజా.**

**తా.** వివిధమైన అవస్థలకు అనుగుణంగా దివ్యాంగనలకు ఉపయోగించే భూషణాలలో కూడ ఆ యా లోకాలలో ఉండే దివ్యాంగనలకు వేరు వేరు విధాల భూషణాలను విభజించి ఉపయోగించాలి.

**మూ. విద్యాధరీణాం యక్షీణామప్సరోనాగయోషితామ్. 52**

**ఋషిదైవతకన్యానాం వేషైర్నానాత్వమిష్యతే.**

**తా.** విద్యాధరస్త్రీలకు, యక్షస్త్రీలకు, అప్సరసలకు, నాగస్త్రీలకు, ఋషికన్యలకు, దేవతాకన్యలకు వేరు వేరు వేషాలు ఉపయోగించాలి (వెయ్యాలి).

**మూ. తథా చ సిద్ధగన్ధర్వరాక్షసాసురయోషితామ్. 53**

**దివ్యానాం నరనారీణాం మానుషీణాం తథైవ చ.**

**తా.** సిద్ధ - గంధర్వ - రాక్షస - అసురస్త్రీల వేషాలు, దివ్యనర - నారుల వేషాలు, మనుష్యస్త్రీల వేషాలు వేరు వేరుగా ఉండాలి.

**మూ. శిఖాపుటశిఖణ్డం తు ముక్తాభూయిష్ఠభూషణమ్. 54**

**విద్యాధరీణాం కర్తవ్యః శుద్ధో వేషపరిచ్ఛదః.**

**తా.** విద్యాధరస్త్రీలకు జుట్టు పుటల (దొప్పలవలె) చేసి తలమధ్య శిఖరం వలె ముడిపెట్టి దానికి ముత్యాల దండలు చుట్టబెట్టాలి. వాళ్ల భూషణాలు అధికంగా ముత్యాలతో నిండి ఉండాలి. వాళ్ల వేషము, వస్త్రాదులు తెల్లగా శుభ్రంగా ఉండాలి.

**మూ. యక్షిణ్యోఽప్సరసశ్చైవ కార్యా రత్నవిభూషణాః. 55**

**సమస్తాసాం భవేద్వేషో యక్షీణాం కేవలం శిఖా.**

**తా.** యక్షస్త్రీలు అప్సరసలు రత్నాల అలంకారాలు ధరించాలి. వాళ్ల వేషం ఒకే విధంగా ఉంటుంది. యక్షిణిలకు శిఖ ముత్యాలు మొదలైనవి లేకుండా ఉంటుంది.

**మూ. దివ్యానామివ కర్తవ్యం నాగస్త్రీణాం విభూషణమ్. 56**

**ముక్తామణిలతాప్రాయాః ఫణాస్తాసాం తు కేవలమ్.**

**తా.** నాగస్త్రీల వేషం కూడ దివ్యస్త్రీల వేషం వలె ఉంటుంది. వాళ్లకు ముత్యాలు, రత్నాలు, తీగలు వీటితో నిండిన పడగలు అధికం.

**మూ. కార్యం తు మునికన్యానామేకవేణీధరం శిరః. 57**

**న చాపి భూషణవిధిస్తాసాం వేషో వనోచితః.**

**తా.** మునికన్యలకు ఒకే జడ ఉండాలి. వాళ్ల వేషం వనానికి ఉచితంగా ఉంటుంది. అందుచేత భూషణా లేవీ ఉండవు.

**మూ. ముక్తామరకతప్రాయం మణ్డనం సిద్ధయోషితామ్. 58**

**తాసాం చైవ తు కర్తవ్యం పీతవస్త్రపరిచ్ఛదమ్.**

**తా.** సిద్ధస్త్రీల భూషణం అధికంగా ముత్యాలతోను, మరకతమణులతోను కూడి ఉంటుంది. వాళ్లు పీతవస్త్రాలు ధరిస్తారు.

**మూ. పద్మరాగమణిప్రాయం గన్ధర్వీణాం విభూషణమ్. 59**

**వీణాహస్తాశ్చ కర్తవ్యాః కౌసుమ్భవసనాస్తథా.**

**తా.** గంధర్వస్త్రీలు పద్మరాగమణులు అధికంగా ఉన్న భూషణాలు ధరిస్తారు. వాళ్లు కుసుంభవర్ణం వస్త్రాలు ధరించి హస్తాలలో వీణలు ఉన్నట్లు చూపాలి.

**మూ. ఇన్ద్రనీలైస్తు కర్తవ్యం రాక్షసీనాం విభూషణమ్. 60**

**సితదంష్ట్రా చ కర్తవ్యా కృష్ణవస్త్రపరిచ్ఛదమ్.**

**తా.** రాక్షసస్త్రీల భూషణాలు ఇంద్రనీలమణులతో ఉండాలి. తెల్లని కోరలతో వాళ్లు నల్లని వస్త్రాలు ధరించి ఉన్నట్లు చూపాలి.

**మూ. వైదూర్యముక్తాభరణాః కర్తవ్యాః సురయోషితః. 61**

**శుకపిచ్ఛనిభైర్వస్త్రైః కార్యస్తాసాం పరిచ్ఛదః.**

**తా.** దేవతాస్త్రీలు వైదూర్యమణులతోను ముత్యాలతోను నిండిన ఆభరణాలు, చిలుకల రెక్కల రంగు వంటి రంగు గల వస్త్రాలు ధరించినట్లు చూపాలి.

**మూ. పుష్పరాగైశ్చ మణిభిః క్వచిద్వైదూర్యభూషితైః. 62**

**దివ్యవానరనారీణాం కార్యో నీలపరిచ్ఛదః.**

**తా.** దివ్యస్త్రీలు, వానరస్త్రీలూ కూడ అక్కడక్కడ వైదూర్యములతో కూడిన పుష్పరాగ మణుల ఆభరణాలు, నీలవర్ణమైన వస్త్రాలు ధరించినట్లు చూపాలి.

**మూ. ఏవం శృఙ్గారిణః కార్యా వేషా దివ్యాఙ్గనాశ్రయాః. 63**

**అవస్థాన్తరమాసాద్య శుద్ధాః కార్యాః పునస్తథా.**

**తా.** దివ్యాంగనలకు శృంగారవేషాలు ఈ విధంగా చెయ్యాలి. ఇతరావస్థలలో మాత్రం వాళ్ల వేషాలు శుద్ధంగానే (శ్వేతవర్ణంలోనే) ఉండాలి.

**మూ. మానుషీణాం తు కర్తవ్యా నానాదేశసముద్భవాః. 64**

**వేషాభరణసంయోగాన్ గదతస్తాన్నిబోధత.**

**తా.** మానవస్త్రీలకు ఆ యా దేశాలకు సంబంధించిన వేషా లుండాలి. ఆ వేషాలు ఆభరణాలు ఎలా ఉండాలో చెపుతున్నాను; వినండి.

**మూ. ఆవన్త్యయువతీనాం తు శిరః సాలకకున్తలమ్. 65**

**గౌడీనామలకప్రాయం సశిఖాపాశవేణికమ్.**

**తా.** అవంతిదేశస్త్రీల శిరస్సు చిన్న ముంగురులతో ఉండాలి. గౌడస్త్రీల శిరస్సు ముంగురులు శిఖాపాశము, జడ – వీటితో ఉండాలి.

**మూ. ఆభీరయువతీనాం తు ద్వివేణిధర ఏవ తు. 66**

**శిరఃపరిగమః కార్యో నీలప్రాయమథామ్బరమ్.**

**తా.** ఆభీరస్త్రీలు రెండు జడలు వేసికొని, చాలవరకు నీలిరంగు బట్టలు కడతారు.

**మూ. తథా పూర్వోత్తరస్త్రీణాం సమున్నద్ధశిఖణ్డకమ్. 67**

**ఆకేశాచ్ఛాదనం తాసాం వేషకర్మణి కీర్తితమ్.**

**తా.** పూర్వోత్తర (ఈశాన్య) దేశాల స్త్రీలు జుట్టు బాగా పైకి తల మీదికి కట్టుకొని, కేశాలవరకు వస్త్రాలతో శరీరం కప్పుకొంటారు.

**మూ. తథైవ దక్షిణస్త్రీణాం కార్యముల్లేఖ్యసంశ్రయమ్. 68**

**కుమ్భీబన్ధకసంయుక్తం తథావర్తలలాటకమ్.**

**తా.** దక్షిణదేశస్త్రీలు శరీరాలమీద ఉల్లేఖ్యములు (బొమ్మలు – పచ్చబొట్లువంటివి), చిన్న పిడతల వంటి జుట్టుముడులు, నుదుటిమీద సుడివంటి గుండ్రని బొట్టు ఉండాలి.

**మూ. గణికానాం తు కర్తవ్యమిచ్ఛావిచ్ఛిత్తిమణ్డనమ్. 69**

**దేశజాతివిధానేన శేషాణామపి కారయేత్,**

**శేషం తథా చాభరణం క్షురకర్మ పరిచ్ఛదమ్. 70**

**తా.** గణికలకు ఇచ్ఛానుసారం శోభాకరములైన వేషం ఉండాలి. ఇతరపాత్రలకు

కూడ దేశాన్ని, జాతిని అనుసరించి, వేషము ఆభరణములు, క్షౌరము, వస్త్రధారణము ఉండాలి.

**మూ. అదేశయుక్తో వేషో హి న శోభాం జనయిష్యతి,**
**మేఖలోరసి బద్ధా తు హాస్యం సముపపాదయేత్. 71**

**తా.** ఆ దేశానికి తగని వేషం శోభాజనకంగా ఉండదు. వక్షఃస్థలానికి వడ్డాణం కడితే అది హాస్యం కలిగిస్తుంది.

**మూ. తథా ప్రోషితకాన్తాసు వ్యసనాభిహతాసు చ,**
**వేషో హి మలినః కార్య ఏకవేణీధరం శిరః. 72**

**తా.** ప్రియుడు ప్రవాసంలో ఉన్న లేదా ఆపదలలో ఉన్న స్త్రీల వేషం మలినంగా ఉండాలి. జుట్టు ఒకే జడతో ఉండాలి.

**మూ. విప్రలమ్భే తు నార్యాస్తు శుద్ధో వేషో భవేదిహ,**
**నాత్యాభరణసంయుక్తో న చాపి మృజయాన్వితః. 73**

**తా.** విప్రలంభశృంగారంలో, స్త్రీ, తెల్లని వేషంతో ఎక్కువగా ఆభరణాలు, శరీర సంస్కారము లేకుండా ఉండాలి.

**మూ. ఏవం స్త్రీణాం భవేద్వేషో దేశావస్థాసముద్భవః,**
**పురుషాణాం పునశ్చైవ వేషాన్ వక్ష్యామి తత్త్వతః. 74**

**తా.** దేశ – అవస్థానుసారం స్త్రీల వేషం ఈ విధంగా ఉండాలి. ఇప్పుడు పురుషుల వేషా లెలా ఉండాలో చెపుతాను.

**మూ. తత్రాఙ్గరచనాపూర్వం కర్తవ్యా నాట్యయోక్తృభిః,**
**తతః పరం ప్రయోక్తవ్యా వేషా దేశసముద్భవాః. 75**

**తా.** నాట్యప్రయోక్తలు నాట్యంలో పాల్గొనే నటులకు ముందుగా అంగరచన చేసి (శరీరాలకు తగిన రంగులు మొదలైనవి పూసి), పిమ్మట ఆ యా దేశాలకు తగిన వేషాలు వెయ్యాలి.

**మూ. సితో నీలశ్చ పీతశ్చ చతుర్థో రక్త ఏవ చ,**
**ఏతే స్వభావజా వర్ణాః యైః కార్యం త్వఙ్గవర్తనమ్. 76**

తా. తెలుపు, నీలం, పసుపు, ఎరుపు – ఇవి స్వాభావికమైన నాలుగు వర్ణాలు (రంగులు). వీటితో శరీరానికి తగిన రంగులు వెయ్యాలి.

**మూ. సంయోగజాః పునశ్చాన్యే ఉపవర్ణా భవన్తి హి,**
**తానహం సంప్రవక్ష్యామి యథా కార్యం ప్రయోక్తృభిః. 77**

**తా.** ఈ నాలుగు వర్ణాల సంయోగంవల్ల, ఏర్పడిన వర్ణాలు సంయోగజవర్ణాలు. ఇవి కాక కొన్ని ఉపవర్ణాలు కూడ ఉన్నాయి. వీటిని నాట్యప్రక్తలు ఎలా చెయ్యాలో చెపుతాను.

**మూ. సితపీతసమాయోగాత్ పాణ్డువర్ణః ప్రకీర్తితః,**
**సితనీలసమాయోగే కారణ్డవ ఇతి స్మృతః. 78**

**తా.** తెలుపు, పసుపు కలిస్తే తయారయే వర్ణం పాండువర్ణం. తెలుపు, నీలము కలవడంవల్ల ఏర్పడేది కారండవవర్ణం.

**మూ. సితరక్తసమాయోగే పద్మవర్ణః ప్రకీర్తితః,**
**పీతనీలసమయోగాద్ధరితో నామ జాయతే. 79**

**తా.** తెలుపు ఎరుపూ కలిస్తే తయా రయేది పద్మవర్ణం (గులాబీరంగు). పసుపు నీలమూ కలిస్తే హరితవర్ణం పుడుతుంది.

**మూ. నీలరక్తసమాయోగాత్ కషాయో నామ జాయతే,**
**రక్తపీతసమాయోగాత్ గౌరవర్ణ ఇతి స్మృతః. 80**

**తా.** నీలము, ఎరుపూ కలియగా కషాయవర్ణం పుడుతుంది. ఎరుపు పసుపూ కలిస్తే గౌరవర్ణం పుడుతుంది.

**మూ. ఏతే సంయోగజా వర్ణా హ్యుపవర్ణాస్తథా పరే,**
**త్రిచతుర్వర్ణసంయుక్తా బహవః సంప్రకీర్తితాః. 81**

**తా.** ఇంతవరకు చెప్పినవి సంయోగజవర్ణాలు – రెండు రంగులు కలపడంచేత పుట్టినవి. ఇవి కాక మూడు రంగుల కలయికవల్ల, నాలుగు రంగుల కలయికవల్ల పుట్టే ఎన్నో ఉపవర్ణాలు ఇంకా ఉన్నాయి.

**మూ. బలస్థో యో భవేద్వర్ణస్తస్య భాగో భవేత్తతః,**
**దుర్బలస్య చ ద్వౌ భాగౌ నీలం ముక్త్వా ప్రదాపయేత్. 82**
**నీలస్యైకో భవేద్భాగశ్చత్వారోఽన్యే తు వర్ణకే,**
**బలవాన్ సర్వవర్ణానాం నీల ఏవ ప్రకీర్తితః. 83**

**తా.** బలస్థమైన వర్ణం (ముదర రంగు) ఒక భాగానికి, నీలవర్ణం తప్ప మిగిలిన దుర్బలవర్ణాల రెండు భాగాలు (పాళ్లు) కలపాలి. నీలవర్ణం విషయంలో మాత్రం దాని ఒక భాగానికి మిగిలిన రంగులు నాలుగేసి భాగాలు కలపాలి. ఎందువల్ల ననగా అన్ని రంగులలోకీ నీలవర్ణం ఎక్కువ బలం గలది అని చెప్పబడింది.

**మూ. వర్తనాచ్ఛాదితం రూపం స్వవేషపరివర్జితమ్,**
**నాట్యధర్మప్రవృత్తం తు జ్ఞేయం తత్ ప్రకృతిస్థితమ్. 84**
**స్వవర్ణమాత్మనశ్ఛాద్యం వర్ణకైర్వేషసంశ్రయైః,**
**ఆకృతిస్తస్య కర్తవ్యా యస్య ప్రకృతిరాస్థితా. 85**

**తా.** రంగు పూయడంచేత కప్పబడిన, తన సహజవేషముతో శూన్యమైన నటుని రూపం, అతడు నాట్యధర్మంలో ప్రవర్తించినప్పుడు ప్రకృతిస్థిత మని చెప్పబడుతుంది.

**వి.** నాట్యప్రయోగంలో పాల్గొనే నటుని సహజమైన రూపాన్ని రంగు పూయడంచేత కప్పివేసి ఆతని సహజమైన వేషం కూడ లేకుండచేయడం జరుగుతుంది. ఆ విధంగా అతడు ఏ పాత్రగా అభినయించ నున్నాడో ఆ పాత్ర రూపంలో ఉన్నాడు. అభినయించబోయే పాత్ర ప్రకృతి. ఆ నటుని రూపం అప్పుడు ప్రకృతిరూపంలో ఉండడంచేత "ప్రకృతిస్థితం".

వేషానికి తగిన రంగులచేత నటుని సహజమైన వర్ణం కప్పబడి ఏ పాత్రయొక్క ప్రకృతి గ్రహింపబడిందో ఆ పాత్రయొక్క ఆకారం సంపాదించాలి.

**మూ. యథా జన్తుః స్వభావం స్వం పరిత్యజ్యాన్యదైహికమ్,**
**తత్స్వభావం హి భజతే దేహాన్తరముపాశ్రితః. 86**
**వేషేణ వర్ణకైశ్చైవ ఛాదితః పురుషస్తథా,**
**పరభావం ప్రకురుతే యస్య వేషః సమాశ్రితః. 87**

**తా.** ఒక దేహాన్ని విడచి మరొక దేహం పొందిన జీవుడు ఏ విధంగా తన స్వభావాన్ని విడచి ఆ (కొత్త) దేహంయొక్క స్వభావాన్ని పొందుతాడో అదే విధంగా పురుషుడు (నటుడు) వేషంచేత, రంగులచేత ఆచ్ఛాదితుడై, ఎవని వేషం ధరించాడో వాని చేష్టాదులు చేస్తాడు.

**మూ. దేవదానవగన్ధర్వయక్షరాక్షసపన్నగాః,**
**ప్రాణిసంజ్ఞాః స్మృతా హ్యేతే జీవబన్ధాశ్చ యోఽపరే. 88**

**తా.** దేవ - దానవ - గంధర్వ - యక్ష - రాక్షస - పన్నగులు, జీవునికి ఆశ్రయమైన ఇతరులు 'ప్రాణి' అని చెప్పబడుతున్నారు.

**మూ. (స్త్రీభావాః పర్వతా నద్యస్సముద్రా వాహనాని చ,**
**నానాశస్త్ర్యాణ్యపి తథా విజ్ఞేయాః ప్రాణిసంజ్ఞయా)**

**తా.** స్త్రీవేషంలో ఉండే నదులు, పర్వతాలు, సముద్రాలు, వాహనాలు, వివిధ శస్త్రాలు – ఇవి కూడ ప్రాణులుగా గ్రహింపదగినవి. (దీని భావం సరిగా కుదరడంలేదు). ఈ శ్లోకం కొన్ని ప్రతులలో లేదు).

**మూ. శైలప్రాసాదయన్త్రాణి చర్మవర్మధ్వజాస్తథా,**
**నానాప్రహరణాద్యాశ్చ తేఽప్రాణిన ఇతి స్మృతాః. 89**

**తా.** శైలములు, ప్రాసాదాలు, యంత్రాలు, డాళ్లు, కవచాలు, ధ్వజాలు, వివిధాయుధాలు మొదలైనవి అప్రాణులు.

**మూ. అథవా కారణోపేతా భవన్త్యేతే శరీరిణః,**
**వేషభాషాశ్రయోపేతా నాట్యధర్మమవేక్ష్య తు. 90**

**తా.** లేదా ఈ శైలప్రాసాదాదులు కూడ, కొన్ని కారణాలను పురస్కరించుకొని, నాట్యధర్మానుసారం వేషభాషాదులతో కూడి ప్రాణులుగా కూడ ఉంటాయి. ప్రవర్తిస్తాయి.

**మూ. వర్ణానాం తు విధిం జ్ఞాత్వా వయః ప్రకృతిమేవ చ,**
**కుర్యాదఙ్గస్య రచనాం దేశజాతివయఃశ్రితామ్. 91**

**తా.** వర్ణాల (రంగుల) విధానం తెలుసుకొని, పాత్రల వయస్సును, ప్రకృతిని, దృష్టిలో ఉంచుకొని, దేశ – కాల – వయస్సులకు తగిన అంగరచన చెయ్యాలి.

**మూ. దేవా గౌరాస్తు విజ్ఞేయా యక్షాశ్చాప్సరసస్తథా,**
**రుద్రార్కద్రుహిణస్కన్దాస్తపనీయప్రభాః స్మృతాః. 92**

**తా.** దేవతల, యక్షుల, అప్సరసల వర్ణం గౌరవర్ణం. రుద్ర – సూర్య – బ్రహ్మ – కుమారస్వాముల వర్ణం పుటం వేసిన బంగారువర్ణం వంటి వర్ణం.

**మూ. సోమో బృహస్పతిః శుక్రో వరుణస్తారకాగణాః,**
**సముద్రహిమవద్గఙ్గాః శ్వేతా హి స్యుర్బలస్తథా. 93**

**తా.** చంద్రుడు, బృహస్పతి, శుక్రుడు, వరుణుడు, నక్షత్రగణాలు, సముద్రుడు, హిమవంతుడు, గంగ, బలరాముడు – వీరి వర్ణం శ్వేతవర్ణం.

**మూ. రక్తమఙ్గారకం విద్యాత్ పీతౌ బుధహుతాశనౌ,**
**నారాయణో నరశ్చైవ శ్యామో నాగశ్చ వాసుకిః. 94**

**తా.** కుజునిది రక్తవర్ణం. బుధ – అగ్నుల వర్ణం పీతవర్ణం. నర – నారాయణ – వాసుకి నాగుల వర్ణం శ్యామవర్ణం (చామనచాయ).

**మూ. దైత్యాశ్చ దానవాశ్చైవ రాక్షసా గుహ్యకా నగాః,**
**పిశాచా జలమాకాశమసితాని తు వర్ణతః. 95**

**తా.** దైత్య – దానవ – రాక్షస – గుహ్యక – పర్వత – పిశాచ – జల – ఆకాశాల వర్ణం నలుపు.

**మూ. నానావర్ణాః స్మృతా యక్షా గన్ధర్వా భూతపన్నగాః,**
**విద్యాధరాః సపితరో వానరాశ్చ తథైవ హి. 96**

**తా.** యక్షులు, గంధర్వులు, భూతాలు, పన్నగులు, విద్యాధరులు, పితృదేవతలు, వానరులు – వీళ్లు అనేకమైన విధాల వర్ణాలతో ఉంటారు.

**మూ. భవన్తి షట్సు ద్వీపేషు పురుషాశ్చైవ వర్ణతః,**
**కర్తవ్యా నాట్యయోగేన నిష్టప్తకనకప్రభాః. 97**

**తా.** ఆరు ద్వీపాలలోని పురుషులను, నాట్యానికి సంబంధించి నంతవరకు, బంగారు చాయ కలవాళ్లనుగా చూపాలి.

**మూ. జమ్బుద్వీపస్య వర్షే తు నానావర్ణాశ్రయా నరాః,**
**ఉత్తరాంస్తు కురూంస్త్యక్త్వా తే చాపి కనకప్రభాః. 98**

**తా.** ఉత్తరకురుప్రాంతంలో తప్ప జంబూద్వీపలోని భరతవర్షంలోని నరులు అనేకవిధాలైన శరీరచ్ఛాయలతో ఉంటారు. ఉత్తరకురుప్రాంతవాసులు మాత్రం బంగారుచాయ కలవారు.

**మూ. భద్రాశ్వపురుషాః శ్వేతాః కర్తవ్యా వర్ణతస్తథా,**
**కేతుమాలే నరా నీలా గౌరాః శేషేషు కీర్తితాః. 99**

**తా.** భద్రాశ్వద్వీపవాసుల వర్ణం శ్వేతవర్ణం. కేతుమాలాద్వీపవాసుల వర్ణం నీలవర్ణం. ఇతరద్వీపవాసుల వర్ణం గౌరవర్ణం.

**మూ. నానావర్ణాః స్మృతా భూతాః వామనా వికృతాననాః,**
**వరాహమేషమహిషమృగవక్త్రాస్తథైవ చ. 100**

**తా.** భూతాలు అనేకవిధాలైన రంగులతో పొట్టిగా, వికృతములైన ముఖాలతో ఉంటారు. కొందరు వరాహ – మేష (గొఱ్ఱె) – మహిష – మృగ (లేడి) ముఖాలవంటి ముఖాలతో ఉంటారు.

**మూ. పునశ్చ భారతే వర్షే తాంస్తాన్ వర్ణాన్ నిబోధత,**
**రాజానః పద్మవర్ణాస్తు గౌరాః శ్యామాస్తథైవ చ. 101**
**యేచాపి సుఖినో మర్త్యా గౌరాః కార్యాస్తు వై బుధైః,**
**కుకర్మిణో గ్రహగ్రస్తాః వ్యాధితాస్తపసి స్థితాః. 102**
**ఆయస్తకర్మిణశ్చైవ హ్యసితాశ్చ కుజాతయః,**
**ఋషయశ్చైవ కర్తవ్యా నిత్యన్తు బదరప్రభాః. 103**
**తపఃస్థితాశ్చ ఋషయో నిత్యమేవాసితా బుధైః.**

**తా.** భరతవర్షంలో ఉన్న మనుషుల రంగులను గూర్చి మళ్లీ చెపుతాను. (నాట్య ప్రయోగంలో) రాజులలో పద్మవర్ణం కలవాళ్లు, గౌరవర్ణం ఉన్నవాళ్లు, శ్యామవర్ణం ఉన్నవాళ్లు కూడ ఉంటారు. సుఖవంతుల వర్ణం గౌరవర్ణంగా చూపాలి. పాపాత్ములు, భూతాలు ఆవహించినవాళ్లు, రోగులు, తపస్సులో ఉన్నవాళ్లు, శ్రమతో కూడిన పనులు చేసేవాళ్లు, నీచజాతులు – వీళ్ల వర్ణం నలుపు. ఋషుల వర్ణం రేగిపండు రంగు వలె ఉంటుంది. తపస్సులో ఉన్న ఋషుల వర్ణం నలుపు.

**మూ. కారణవ్యపదేశేన తథా చాత్మేచ్ఛయా పునః. 104**
**వర్ణస్తత్ర ప్రకర్తవ్యో దేశజాతివయోనుగః.**

**తా.** ఏవైన కారణా లుండడంచేత, లేదా నాట్యప్రయోజకుని ఇచ్ఛానుసారం, దేశ – జాతి – వయస్సులను దృష్టిలో ఉంచుకొని వర్ణం ఉపయోగించాలి.

**మూ. దేశం కర్మ చ జాతిశ్చ పృథివ్యుద్దేశసంశ్రయమ్. 105**
**విజ్ఞాయ వర్తనా కార్యా పురుషాణాం ప్రయోగతః.**

**తా.** దేశమును, చేసే పనిని, జాతిని, భూమిప్రదేశాన్ని, స్వభావాన్ని గుర్తుంచుకొని, నాట్యప్రయోగంలో, పురుషులకు వర్తన (ఆ యా రంగులతో శరీరం పూయడం) చెయ్యాలి.

**మూ. కిరాతబర్బరాన్ధ్రాశ్చ ద్రవిడాః కాశికోసలాః. 106**
**పులిన్దా దాక్షిణాత్యాశ్చ ప్రాయేణ త్వసితాః స్మృతాః.**

**తా.** కిరాతులు, బర్బరులు, ఆంధ్రులు, ద్రవిడులు, కాశీప్రాంతంవాళ్లు, కోసల దేశీయులు, పులిందులు, దాక్షిణాత్యులు – వీళ్లు సాధారణంగా నల్లగా ఉంటా రని అంటారు.

**మూ. శకాశ్చ యవనాశ్చైవ పహ్లవా వాహ్లికాశ్చ యే. 107**
**ప్రాయేణ గౌరాః కర్తవ్యా ఉత్తరాం యే శ్రితా దిశమ్.**

**తా.** ఉత్తరదిక్కునందు నివసించే శకులు, యవనులు, పహ్లవులు, వాహ్లికులు – వీళ్లను సాధారణంగా గౌరవర్ణంవాళ్లనుగా చూపాలి.

**మూ. పాఞ్చాలాః శౌరసేనాశ్చ మాహిషాశ్చౌఢ్రమాగధాః. 108**
**అఙ్గా వఙ్గాః కలిఙ్గాశ్చ శ్యామాః కార్యాస్తు వర్ణతః.**

**తా.** పాంచాల – శూరసేన – మహిష – ఓఢ్ర – మగధ – అంగ – వంగదేశ వాసులను శ్యామవర్ణం (చామనిచాయ) కలవాళ్లనుగా చూపాలి.

**మూ. బ్రాహ్మణాః క్షత్రియాశ్చైవ గౌరాః కార్యాస్తథైవ హి. 109**

**వైశ్యాః శూద్రాస్తథా చైవ శ్యామాః కార్యాస్తు వర్ణతః.**

**తా.** బ్రాహ్మణులకు, క్షత్రియులకు గౌరవర్ణము, వైశ్యులకు, శూద్రులకు, శ్యామ వర్ణము ఉపయోగించాలి.

**మూ. ఏవం కృత్వా యథాన్యాయం ముఖాఙ్గోపాఙ్గవర్తనామ్. 110**

**శ్మశ్రుకర్మ ప్రయుఞ్జీత దేశకాలవయోనుగమ్.**

**తా.** ఈ విధంగా యథావిధిగా ముఖాలకీ, ప్రధానావయవాలకీ, ఉపాంగాలకీ వర్తన (రంగుమొదలైనవాటితో సంస్కారం) చేసి, పిమ్మట దేశకాలవయస్సులకు అను గుణంగా ఉండేటట్లు శ్మశ్రుకర్మ (గడ్డాలు, మీసాలు ఏర్పరచడం మొదలైన పని) చేయించాలి.

**మూ. శుక్లం విచిత్రం శ్యామం చ తథా రోమశమేవ చ. 111**

**భవేచ్చతుర్విధం శ్మశ్రు నానావస్థాన్తరాత్మకమ్.**

**తా.** అనేకమైన అవస్థల మార్పులను దృష్టిలో ఉంచుకొని చేయవలసిన శ్మశ్రుకర్మ (మీసం ఉంచడం) శుక్లము, విచిత్రము, శ్యామము, రోమశము అని నాలుగువిధా లుంటుంది.

**మూ. శుక్లం తు లిఙ్గినాం కార్యం తథామాత్యపురోధసామ్. 112**

**మధ్యస్థా యే చ పురుషాః యే చ దీక్షాం సమాశ్రితాః,**

**దివ్యా యే పురుషాః కేచిత్ సిద్ధవిద్యాధరాదయః. 113**

**పార్థివాశ్చ కుమారాశ్చ యే చ రాజోపజీవినః,**

**శృఙ్గారిణశ్చ యే మర్త్యా యౌవనోన్మాదినశ్చ యే. 114**

**తేషాం విచిత్రం కర్తవ్యం శ్మశ్రునాట్యప్రయోక్తృభిః.**

**తా.** యతి – వానప్రస్థాదులు, అమాత్యులు, పురోహితులు, మధ్యస్థులు (అంతగా లౌకికసుఖాలయందు ఆసక్తిలేనివాళ్లు) వ్రతదీక్షలో ఉన్నవాళ్లు – వీళ్ల గడ్డాలు తెల్లగా ఉండేటట్లు చూడాలి. సిద్ధవిద్యాధరాది దివ్యపురుషులు, రాజులు, రాజకుమారులు, రాజసేవకులు (ఉద్యోగులు), శృంగారాసక్తి కలవాళ్లు, యౌవనమదంలో ఉన్నవాళ్లు – వీళ్ల మీసాలు చిత్ర – విచిత్రమైన ఆకారాలలో ఉండాలి.

**మూ. అనిస్తీర్ణప్రతిజ్ఞానాం దుఃఖితానాం తపస్వినామ్. 115**

**వ్యసనాభిహతానాం చ శ్యామం శ్మశ్రు ప్రయోజయేత్.**

**తా.** చేసిన ప్రతిజ్ఞను సాధించజాలనివాళ్లు, దుఃఖితులు, తపస్సులో ఉన్నవాళ్లు, కష్టాలలో ఉన్నవాళ్లు వీళ్ల గడ్డం మాసిపోయి ఉండాలి.

**మూ. ఋషీణాం తాపసానాం చ యే చ దీర్ఘవ్రతా నరాః. 116**

**తథా చ చీరబద్ధానాం రోమశం శ్మశ్రు కీర్తితమ్.**

**తా.** ఋషులు, తాపసులు, దీర్ఘకాలం పాటు వ్రతాచరణంలో ఉన్నవాళ్లు, అరణ్యాలలో నారచీరలు కట్టి తపస్సు చేసికొనేవాళ్లు వీళ్లకు వేలాడే గడ్డాలు ఉండాలి.

**మూ. ఏవం నానాప్రకారం తు శ్మశ్రుకార్యం ప్రయోక్తృభిః. 117**

**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి వేషాన్ నానాప్రయోగజాన్.**

**తా.** నాటకప్రయోక్తలు ఈ విధంగా అనేకరీతులలో శ్మశ్రుకర్మ చేయించాలి. ఇటుపైన, వివిధనాట్యప్రయోగాలకు సంబంధించిన వేషాలను చెపుతాను.

**మూ. శుద్ధో విచిత్రో మలినస్త్రివిధో వేష ఉచ్యతే. 118**

**తేషాం నియోగం వక్ష్యామి యథావదనుపూర్వశః.**

**తా.** శుద్ధము, విచిత్రము, మలినము అని వేషం మూడు విధాలు. క్రమంగా వాటి వినియోగాన్ని తెలుపుతాను.

**మూ. దేవాభిగమనే చైవ మఙ్గలే నియమస్థితే. 119**

**తిథినక్షత్రయోగే చ వివాహకరణే తథా,**

**ధర్మప్రవృత్తం యత్కర్మ స్త్రియో వా పురుషస్య వా. 120**

**వేషస్తేషాం భవేచ్ఛుద్ధో యే చ ప్రాయత్నికా నరాః.**

**తా.** దేవతాదర్శనానికి వెళ్లినప్పుడు, మంగలకార్యాలలో, నియమంలో ఉన్నప్పుడు, తిథి – నక్షత్రాల కలయికచే ఏర్పడిన పర్వదినాలలోను, వివాహం జరిగే టప్పుడు, ధార్మికమైన కర్మలలోను, స్త్రీలూ పురుషులూ కూడ పరిశుద్ధ మైన వేషం (వస్త్రాదులు) ధరించాలి. ప్రయత్నపూర్వకంగా వినయంతో ప్రవర్తించేవాళ్లు కూడ శుద్ధవేషం ధరించాలి.

**మూ. దేవదానవయక్షాణాం గన్ధర్వోరగరక్షసామ్. 121**

**నృపాణాం కర్కశానాం చ చిత్రో వేష ఉదాహృతః.**

**తా.** దేవ – దానవ – యక్ష – గంధర్వ – ఉరగ – రాక్షసులకు, రాజులకు నియమబద్ధజీవనవిధానం లేనివాళ్లకు చిత్రమైన వేషం ఏర్పరచాలి.

**మూ. వృద్ధానాం బ్రాహ్మణానాం శ్రేష్ఠ్యమాత్యపురోధసామ్. 122**

**వణిజాం కాఞ్చుకీయానాం తథా చైవ తపస్వినామ్,**
**విప్రక్షత్రియవైశాన్యాం స్థానీయా యే చ మానవాః.** **123**
**శుద్ధో వస్త్రవిధిస్తేషాం కర్తవ్యో నాటకాశ్రయః.**

**తా.** వయోవృద్ధులు, బ్రాహ్మణులు, శ్రేష్ఠులు (శెట్టిలు), అమాత్యులు, పురోహితులు, వర్తకులు, అంతఃపురాలలో ఉండే కంచుకులు, తాపసులు, విప్రులు, క్షత్రియులు, వైశ్యులు, రాజాధికారులు – వీళ్ల వస్త్రవిధానం, నాటకప్రయోగాలలో, పరిశుద్ధమై ఉండాలి.

**మూ. ఉన్మత్తానాం ప్రమత్తానామధ్వగానాం తథైవ చ.** **124**
**వ్యసనోపహతానాం చ మలినో వేష ఉచ్యతే.**

**తా.** ఉన్మత్తులు, మద్యం మత్తులో ఉన్నవాళ్లు, బాటసారులు, ఆపదలలో ఉన్నవాళ్లు – వీళ్లకు మలినవేషం వేయించాలి.

**మూ. శుద్ధరక్తవిచిత్రాణి వాసాంస్యూర్ధ్వామ్బరాణి చ.** **125**
**యోజయేన్నాట్యతత్త్వజ్ఞో వేషయోః శుద్ధచిత్రయోః,**
**కుర్యాద్వేషే తు మలినే మలినం తు విచక్షణః.** **126**

**తా.** నాట్యవేత్త శుద్ధచిత్రవేషాలలో శుద్ధవస్త్రాలను, రక్తవస్త్రాలను, విచిత్రమైన రంగుల వస్త్రాలను, పైనకప్పుకొనే, వెనుకనుండి వేలాడే వస్త్రాలనుగా ఏర్పాటు చెయ్యాలి. మలినవేషంలో మలినవస్త్రం ప్రావరణంగా ఏర్పరచాలి.

**మూ. మునినిర్గ్రన్థశాక్యేషు త్రిదణ్డిశ్రోత్రియేషు చ,**
**వ్రతానుగస్తు కర్తవ్యో వేషో లోకస్వభావతః.** **127**

**తా.** మునులు, జైనసాధువులు, బౌద్ధ భిక్షువులు, త్రిదండిసంన్యాసులు, శ్రోత్రియులు – వీళ్లందరికీ వాళ్ల వాళ్ల వ్రతాలను (నియమాలను) అనుసరించి లోకంలో అలవాటులో ఉన్న వేషాలు ఏర్పరచాలి.

**మూ. చీరవల్కలచర్మాణి తాపసానాం తు యోజయేత్,**
**పరివ్రాణ్మునిశాక్యానాం వాసః కాషాయమిష్యతే.** **128**
**నానాచిత్రాణి వాసాంసి కుర్యాత్పాశుపతేష్వథ**
**కులజాశ్చాపి యే ప్రోక్తాస్తేషాం చైవ యథోచితమ్.** **128**

**తా.** తాపసులకు నారతో నేసిన చీరలు, చెట్టు బెరళ్లు, మృగచర్మలు వస్త్రాలుగా కూర్చాలి. సంన్యాసులకు, మునులకు, బౌద్ధసంన్యాసులకు కాషాయవస్త్రం ఏర్పరచాలి. పాశుపతసంప్రదాయస్థులకు అనేకవిధాల విచిత్రములైన వస్త్రాలు, ఉన్నతకులాలలో పుట్టినవాళ్లకు వాళ్ల–వాళ్లకు తగిన వస్త్రాలు ఏర్పరచాలి.

**మూ. అన్తఃపురప్రవేశే చ వినియుక్తా హి యే నరాః,**
**కాషాయకఞ్చుకపటాః కార్యాస్తేఽపి యథావిధి. 129**
**అవస్థాన్తరమాసాద్య స్త్రీణాం వేషో భవేత్తథా.**

**తా.** అంతఃపురాల రక్షణకై నియుక్తులైన వాళ్లు, ఎఱ్ఱని చొక్కాలు ధరించాలి. స్త్రీలకు కూడ వాళ్ల వాళ్ల అవస్థలను పట్టి వేషా లుండాలి.

**మూ. వేషః సాంగ్రామికశ్చైవ శూరాణాం సంప్రకీర్తితః. 129**
**విచిత్రశస్త్రకవచో బద్ధతూణో ధనుర్ధరః.**

**తా.** శూరులకు, విచిత్రమైన ఆయుధాలు, కవచము, అంబులపొదులు, ధనస్సు వీటి అన్నింటితో కూడిన యుద్ధసంనద్ధమైనవారు ధరించే వేషం ఉండాలి.

**మూ. చిత్రో వేషస్తు కర్తవ్యో నృపాణాం నిత్యమేవ చ,**
**కేవలస్తు భవేచ్ఛుద్ధో నక్షత్రోత్పాతమఙ్గలే. 130**

**తా.** రాజుల కెల్లప్పుడు విచిత్రమైన వేషం ఉండాలి. నక్షత్రాలకు, ఉత్పాతాలకు (అశుభశకునాలకు) శాంతి చేసే సందర్భంవంటి సమయాలలో కేవలం తెల్లనివస్త్రాలతో వేషం ఉండాలి.

**మూ. ఏవమేష భవేద్వేషో దేశజాతివయోనుగః,**
**ఉత్తమాధమమధ్యానాం స్త్రీణాం నృణామథాపి చ. 131**
**ఏవం వస్త్రవిధిః కార్యః ప్రయోగే నాటకాశ్రయే,**
**నానావస్థాం సమాసాద్య శుభాశుభకృతస్తథా. 132**

**తా.** నాటకప్రయోగంలో, దేశ – కాల – వయోవస్థలకు అనుగుణంగా ఉత్తమ – మధ్యమ – అధమ – స్త్రీ పురుషుల వేషాలు తగిన వస్త్రాదులతో పైన చెప్పినవిధంగా ఏర్పరచాలి.

**మూ. తథా ప్రతిశిరశ్చాపి కర్తవ్యం నాటకాశ్రయమ్,**
**దివ్యానాం పురుషాణాం చ దేశజాతి వయఃశ్రితమ్. 133**

**తా.** నాటకప్రయోగాలలో, దేవతలకు, పురుషులకు కూడ దేశ – జాతి – వయోను సారంగా ప్రతిశీర్షం కూడ ఉపయోగించాలి.

**వి.** కొందరు దేవతల కొందరు ప్రధానపాత్రల ముఖాలకు అమర్చే లక్క మొదలైన వాటితో చేసిన, అందమైన, విశిష్టాకారాలు గల ముఖాలకు ప్రతిశీర్షకములు అని పేరు (అ.భా.). తలమీద ధరించే తలపాగా, టోపీ మొదలైనవి కూడ ప్రతి శీర్షకములు కావచ్చును. నా.శా. లోనే ఆ విధమైన సూచనలు చూ.శ్లో.138

**మూ. పార్శ్వగతా మస్తకినస్తథాచైవ కిరీటినః,**
**త్రివిధో ముకుటో జ్ఞేయో దివ్యపార్థివసంశ్రయః. 134**

**తా.** దివ్యపురుషులకు, రాజులకు ఉపయోగించే మకుటం – పార్శ్వగతం అని, మస్తకి అనీ, కిరీటి అనీ మూడు రకాలు.

**మూ. దేవగన్ధర్వయక్షాణాం పన్నగానాం సరక్షసామ్,**
**కర్తవ్యా నైకవిహితా ముకుటాః పార్శ్వమౌలయః. 135**

**తా.** దేవతలకు, గంధర్వులకు యక్షులకు, పన్నగులకు, రాక్షసులకు అనేకవిధాలుగా రచించిన పార్శ్వమౌలిముకుటం ఉండాలి.

**వి.** రెండు వైపులా విడి విడిగా ఉన్నట్లు కనబడే, పెద్ద బొణిపలవంటి నగిషీలున్న ముకుటం పార్శ్వమౌలిముకుటం అయిఉంటుంది. లేదా అది ఒక పక్కకు వంగి ఉండవచ్చు.

**మూ. ఉత్తమా యే చ దివ్యానాం తే చ కార్యాః కిరీటినః,**
**మధ్యమా మౌలినశ్చైవ కనిష్ఠాః పార్శ్వమౌలినః. 136**

**తా.** దేవతలలో ఉత్తములకు కిరీటిముకుటాలు, మధ్యములకు, మౌలిముకుటాలు, కనిష్ఠులకు పార్శ్వమౌలిముకుటాలు ఏర్పరచాలి.

**మూ. నరాధిపానాం కర్తవ్యాస్తథా మస్తకినో బుధైః,**
**విద్యాధరణాం సిద్ధానాం చారణానాం తథైవ చ. 137**
**గ్రన్థిమత్కేశమకుటాః కర్తవ్యాస్తు ప్రయోక్తృభిః.**

**తా.** రాజులకు మస్తకిముకుటాలు, విద్యాధరులకు, సిద్ధులకు, చారణులకు మధ్య మధ్య ఉండలుండలుగా కనబడే టట్లు ముడులు వేసిన జుట్టుతో ఏర్పరచిన ముకుటాలు ఉండాలి.

**మూ. అమాత్యానాం కఞ్చుకినాం తథా శ్రేష్ఠిపురోధసామ్. 138**
**వేష్టనాబద్ధపట్టాని ప్రతిశీర్షాణి కారయేత్.**

**తా.** అమాత్యులకు, కంచుకిలకు, శ్రేష్ఠిలకు, పురోహితులకు తలపాగాలు ఉండాలి.

**మూ. సేనాపతేః పునశ్చాపి యువరాజస్య చైవ హి. 139**
**మస్తకేష్వర్ధముకుటం ప్రయోగే సంప్రయోజయేత్,**
**శేషాణామర్ధయోగేన దేశజాతివయఃశ్రుతమ్. 140**
**శిరః ప్రయోక్తృభిః కార్యం ప్రయోగస్య వశానుగమ్.**

**తా.** నాటకప్రయోగంలో, సేనాపతికి, యువరాజుకు అర్ధముకుటం శిరోలంకా

రంగా ఉండాలి. మిగిలినవాళ్లకు, నాటకప్రయోగంలో కలిగే అవసరాన్ని పట్టి, దేశ - జాతి - వయో - విద్యాదులను అనుసరించి శిరోభూషణం ఏర్పాటుచెయ్యాలి.

**మూ. బాలానామపి కర్తవ్యం త్రిశిఖణ్డం విభూషితమ్. 141**

**జటాముకుటబద్ధం చ మునీనాం తు భవేచ్ఛిరః.**

**తా.** బాలుల శిరస్సులపై అలంకారంగా జుట్టు మూడు ముడులుగా వేసి తలమీదికి వచ్చే టట్లు కూర్చాలి. మునుల శిరస్సు జటాముకుటంతో ఉండాలి.

**మూ. రక్షోదానవదైత్యానాం పిఙ్గకేశేక్షణాని హి. 142**

**హరిచ్ఛ్రశ్మూణి చ తథా ముకుటాస్యాని కారయేత్.**

**తా.** రక్షో - దానవ - దైత్యుల కళ్లు జుట్టూ పచ్చగా ఉండేటట్లు, మీసాలు కొంచెం పసుపూ ఎరుపూ కలిసిన రంగులో ఉండే టట్లు, శిరస్సులమీద ముకుటాల ముఖాలు (Masks) ఏర్పాటు చెయ్యాలి.

**మూ. పిశాచోన్మత్తభూతానాం సాధకానాం తపస్వినామ్. 143**

**అనిస్తీర్ణప్రతిజ్ఞానాం లమ్బకేశం భవేచ్ఛిరః.**

**తా.** పిశాచాలు, ఉన్మత్తులు, భూతాలు, సాధకులైన మునులు, ప్రతిజ్ఞ చెల్లించు కొనలేనివాళ్లు - వీళ్ల జుట్టు ముడివేయకుండా వేలాడుతూ ఉండాలి.

**మూ. శాక్యశ్రోత్రియనిర్గ్రన్థపరివ్రాడ్దీక్షితేషు చ. 144**

**శిరోముణ్డం తు కర్తవ్యం యజ్ఞదీక్షాన్వితేషు చ.**

**తా.** బౌద్ధసంన్యాసులకు, శ్రోత్రియులకు, జైనమునులకు, సంన్యాసులకు, దీక్షలో ఉన్నవాళ్లకు, యజ్ఞదీక్షలో ఉన్నవాళ్లకు శిరోముండనం చేయించాలి.

**మూ. తథా వృత్తానుషఙ్గేణ శేషాణాం లిఙ్గినాం శిరః. 145**

**ముణ్డనం కుఞ్చితం వాపి లమ్బకేశమథాపి వా.**

**తా.** శైవపాశుపతాదిసంప్రదాయాలను అనుసరించే ఇతరు లందరికీ వాళ్ల వాళ్ల ఆచారాల ప్రకారం శిరోముండనం కాని, వేరు వేరు విధాల ముడివేసుకొనడం గాని, కేశాలు ముడివేయకుండా వ్రేలాడేటట్లు ఉంచడం కాని చెయ్యాలి.

**మూ. వధూనాఞ్చాపి కర్తవ్యం యే చ రాజోపజీవినః. 146**

**శృఙ్గారచిత్తాః పురుసాస్తేషాం కుఞ్చితమూర్ధజాః.**

**తా.** స్త్రీలు, రాజోద్యోగులు, శృంగారప్రియులు వీళ్ల జుట్లు వేరు వేరు ఆకారాలలో

ముళ్లు వేయించాలి.

**మూ. చేటానామపి కర్తవ్యం త్రిశిఖం ముణ్డమేవ చ. 147**

**విదూషకస్య ఖలతిః స్యాత్ కాకపదమేవ చ.**

**తా.** విదూషకుని శిరస్సు బట్టతలగా గాని, చెవుల దగ్గర కాకి ఈకల వంటి జుట్టు కొని (లేదా – మధ్య బట్టతల పక్కల కాకి ఈకలజుట్టు) ఉండాలి.

**మూ. శేషాణామర్థయోగేన దేశజాతిసమాశ్రయమ్. 148**

**శిరః ప్రయోక్తృభిః కార్యం నానావస్థాన్తరాశ్రయమ్.**

**తా.** మిగిలినవాళ్లందరి శిరస్సులూ అవసరాలను పట్టి, దేశ – జాతిభేదాను సారంగా, వాళ్ల వాళ్ల అవస్థలకు అనుగుణంగా ఉండే టట్లు నాట్యప్రయోక్తలు చెయ్యాలి.

**మూ. ఏవం నానాప్రకారేణ బుద్ధ్యా చైషాం విభజ్య చ. 149**

**భూషణైర్వర్ణకైర్వస్త్రై ర్మాల్యైశ్చైవ యథావిధి,**

**అవస్థానుకృతిః స్థాప్యా ప్రయోగరససంభవా. 150**

**తా.** ఈ విధంగా అనేకపద్ధతులలో, ఎవరికి ఏది యుక్తమో స్వబుద్ధిచేత కూడ నిర్ణయించుకొని, ఆ యా పాత్రలుగా అవస్థానుకరణం చేసే నటులకు, భూషణాలతోను, రంగులతోను, వస్త్రాలతోను మాలలతోను యథావిధిగా, ప్రయోగానికి, రసాలకు ఉపయక్త మైన వేషరచన చెయ్యాలి.

**మూ. స్త్రీణాం వా పురుషాణాం వాప్యవస్థాం ప్రాప్య తాదృశీమ్,**

**సర్వే భావాశ్చ దివ్యానాం కార్యా మానుషసంశ్రయాః. 151**

**తా.** నటీనటులు ఈ వేషాదులు ధరించి స్త్రీపాత్రల పురుషపాత్రల ఆ యా అవస్థలు పొంది (తామే ఆ అవస్థలలో ఉన్నట్లు భావిస్తూ) దేవతలకు సంబంధించిన విషయాలు, మనుష్యులకు (రాజాదులకు) సంబంధించిన విషయాలు ప్రదర్శించాలి.

**మూ. తేషాంచానిమిషత్వాది నైవ కార్యం ప్రయోక్తృభిః,**

**ఇహ భావా రసాశ్చైవ దృష్టిభిః సంప్రతిష్ఠితాః. 152**

**తా.** నాట్యప్రయోక్తలు దేవతల అనిమిషత్వాదులను (కళ్లకు రెప్పపాటు లేకపోవడం వంటివాటిని) గ్రహించకూడదు. ఎందుచేత ననగా – భావ – రసాదుల ఆవిష్కరణం, ప్రధానంగా, దృష్టులనే ఆశ్రయించి ఉంటుంది. రెప్పపాటు లేని నేత్రాలతో అది శక్యం కాదు కదా!

**మూ. దృష్ట్యైవ స్థాపితో హ్యర్థః పశ్చాదఙ్గైర్విభావ్యతే,**

**ఏవం జ్ఞేయాఙ్గరచనా నానాప్రకృతిసంభవా. 153**

**తా.** దృష్టిచేత (నేత్రాభినయంచేత) తెలుపబడిన విషయాన్నే తరవాత ఆంగికాభినయంచేత ప్రదర్శించడం జరుగుతుంది. (అందుచేత రెప్పపాటే లేకపోతే నేత్రాభినయం ఎలా కుదురుతుంది!)

అనేకప్రకృతులకు (నాటకకథావస్తువులోని పాత్రలకు సంబంధించిన) అంగరచన ఈ విధంగా (పైన చెప్పిన విధంగా) చెయ్యాలి.

**మూ. సంజీవ ఇతి యః ప్రోక్తః తస్య వక్ష్యామి లక్షణమ్,**
**యః ప్రాణినాం ప్రవేశో వై సజీవ ఇతి సంజ్ఞితః. 154**

**తా.** 'సజీవం' అని దేనిని అంటారో దాని లక్షణం చెపుతాను. నాట్యరంగంమీదికి, ఆవశ్యకతను పట్టి కొన్ని ప్రాణులను ప్రవేశపెడతారు. దానికే సంజీవం (సజీవం) అని పేరు.

**మూ. చతష్పదోఽథ ద్విపదస్తథా చైవాపదః స్మృతః,**
**ఉరగానపదాన్విద్యాద్ద్విపదాన్ ఖగమానుషాన్,**
**గ్రామ్యారణ్యాశ్చ పశవో విజ్ఞేయాః స్యుః చతుష్పదాః. 155**

**తా.** సజీవం చతుష్పద మనీ, ద్విపద మనీ, అపదం అనీ మూడు విధాలు. సర్పాలు అపదాలు (పాదాలులేనివి). పక్షులు మనుష్యులు ద్విపదాలు. గ్రామంలోను, అరణ్యంలోను నివసించే పశువులు చతుష్పదాలు.

**మూ. యే తే తు యుద్ధసంఫేటైరుపరోధైస్తథైవ చ,**
**నానాప్రహరణోపేతాః ప్రయోజ్యా నాటకే బుధైః. 156**

**తా.** నాటకంలో అనేకవిధాలైన ఆయుధాలు ధరించిన పాత్రలు ప్రయోగింపబడతారు. వాళ్లు యుద్ధాలలోను, సంఫేటాలలోను (పరుషభాషణపూర్వకయుద్ధాలలోను) ఆక్రమణలలోను, ముట్టడించడాలలోను పాల్గొంటారు.

**మూ. ఆయుధాని చ కార్యాణి పురుషాణాం ప్రమాణతః,**
**తాన్యహం వర్ణయిష్యామి యథాయుక్తి ప్రమాణతః. 157**

**తా.** ఆ యుద్ధాదులలో పాల్గొనే పురుషులకు, ప్రమాణానుసారం, ఆయుధాలు చేయించాలి. వాటిని గూర్చి నేను యుక్తిని (అవసరాన్ని) అనుసరించి వాటి ప్రమాణాలు ఎలా ఉండాలో చెపుతాను.

**మూ. భిణ్డిర్ద్వాదశతాలః స్యాద్దశ కున్తో భవేదథ,**

**అష్టౌ శతఘ్నీ శూలం చ తోమరః శక్తిరేవ చ. 158**

**తా.** భిండి పన్నెండు తాలాల పొడ వుండాలి. కుంతం పది తాలాలు, శతఘ్ని, శూలం, తోమరం, శక్తి ఎనిమిదేసి తాలాలు పొడ వుండాలి.

**మూ. అష్టౌ తాలా ధనుర్జ్ఞేయమాయామోఽస్య ద్విహస్తకః,**
**శరో గదా చ వజ్రం చ చతుస్తాలం విధీయతే. 159**

**తా.** ధనస్సు పొడవు ఎనిమిది తాలా లుండాలి. దీని వెడల్పు (నారి కట్టి లాగినప్పుడు ఏర్పడే దూరం) రెండు హస్తా లుండాలి. బాణం, గద, వజ్రం ఇవి నాలుగేసి తాలాలు పొడ వుండాలి.

**మూ. అఙ్గులాని త్వసిః కార్యశ్చత్వారింశత్ప్రమాణతః,**
**ద్వాదశాఙ్గులకం చక్రం తతోఽర్ధం ప్రాస ఇష్యతే. 160**

**తా.** ఖడ్గం నలభై అంగుళాల ప్రమాణంలో ఉండాలి. చక్రం పన్నెండు అంగుళాలు, ప్రాస ఆరు అంగుళాలు ఉండాలి.

**మూ. ప్రాసవత్ పట్టసం విద్యాత్ దణ్డశ్చైవ తు వింశతిః,**
**వింశతిః కణయశ్చైవ అఙ్గులాని ప్రమాణతః. 161**

**తా.** పట్టసం కూడ ఆరు అంగుళాలు, దండం ఇరవై అంగుళాలు, కణయం ఇరవై అంగుళాలు ఉండాలి.

**మూ. షోడశాఙ్గులివిస్తీర్ణం చర్మ కార్యం ద్విహస్తకమ్,**
**త్రింశదఙ్గులిమానేన కర్తవ్యం ఖేటకం బుధైః. 162**

**తా.** చర్మ పొడవు పదహారు అంగుళాలు, వెడల్పు రెండు హస్తాలు. ఖేటకం ముప్పై అంగుళాలు ఉండాలి. (ఈ రెండూ డాలులో భేదాలయి ఉంటాయి).

**మూ. జర్జరో దణ్డకాష్ఠశ్చ తథైవ ప్రతిశీర్షకమ్,**
**ఛత్రం చ చామరం చైవ ధ్వజో భృఙ్గార ఏవ చ. 163**
**యత్కించిన్మానుషే లోకే ద్రవ్యం పుంసాం ప్రయోగజమ్,**
**తత్సర్వం తూపకరణం నాట్యేఽస్మిన్ సంవిధీయతే. 164**

**తా.** జర్జరము, దండకాష్ఠము, ప్రతిశీర్షకము, ఛత్రము, చామరము, ధ్వజము, జలపాత్ర (కూజా) ఇవి కాక మనుష్యుల నిత్యావసరాలకు ఉపయోగపడే అన్ని వస్తువులూ కూడ నాట్యప్రయోగంలో ఏర్పరచుకోవాలి.

**మూ. యద్యస్య విషయప్రాప్తం తేనోహ్యం తస్య లక్షణమ్,**
**జర్జరే దణ్డకాష్ఠే చ సంప్రవక్ష్యామి లక్షణమ్. 164**

**తా.** నాట్యప్రదర్శనసమయంలో ఏ ఏ లోకప్రసిద్ధాలైన వస్తువులు అవసరం అవుతాయో వాటి స్వరూపస్వభావాలు స్వయంగా ఊహించి తెలుసుకోవాలి. నాట్య ప్రయోగంలో మాత్రమే ఉపయోగించే జర్జర - దండకాష్ఠాల లక్షణం చెపుతాను.

**మూ. శ్వేతభూమ్యాం తు యో జాతః పుష్యనక్షత్రజస్తథా,**
**సంగ్రాహ్యో వై భవేద్వేణుః జర్జరార్థం ప్రయత్నతః. 165**
**మాహేన్ద్రే తు ధ్వజే కార్యం లక్షణం విశ్వకర్మణా.**

**తా.** తెల్లని నేలమీద మొలిచిన, పుష్యనక్షత్రదివసాన పుట్టిన (లేదా ఛేదించిన) వెదురును జర్జరం కోసం ప్రయత్నపూర్వకంగా సంపాదించాలి. విశ్వకర్మ మహేంద్ర ధ్వజానికి ఏ లక్షణా లుండా లని చెప్పాడో ఆ లక్షణాలు దీనికి కూడ చెయ్యాలి (ఉండాలి).

**మూ. ఏషామన్యతమం కుర్యాత్ జర్జరం దారుకర్మకః. 166**
**అథవా వృక్షజాతస్య ప్రరోహో వాపి జర్జరః.**

**తా.** అందుచేత విశ్వకర్మ చెప్పిన వృక్షాలలో ఏ వృక్షమైనా, పుష్యనక్షత్ర రోజున ఏది పుట్టిందో దానినైనా గ్రహించి దానికి చెక్కడం మొదలైన పనులు చేయించి జర్జరం తయారు చేయవచ్చును.

**మూ. వేణురేవ భవేత్ శ్రేష్ఠస్తస్య వక్ష్యాపి లక్షణమ్. 167**
**ప్రమాణతో హ్యఙ్గులానాం శతమష్టోత్తరం భవేత్.**

**తా.** అయితే జర్జరనిర్మాణానికి వెదురే శ్రేష్ఠం. దాని లక్షణం చెపుతాను. దాని పొడవు నూట ఎనిమిది అంగుళా లుండాలి.

**మూ. పఞ్చపర్వా చతుర్గ్రన్థిస్తాలమాత్రస్తథైవ చ. 168**
**స్థూలగ్రన్థిర్న కర్తవ్యో న శాఖీ న చ కీటవాన్,**
**న కృమిక్షతపర్వా చ న హీనశ్చాన్యవేణుభిః. 169**

**తా.** ఆ వెదురుకట్టకు ఐదు కణుపులు, నాలుగు గ్రంథులు (కణుపుల మధ్యనున్న గట్టి సంధులు) ఉండాలి. ఆ గ్రంథులు పెద్దవిగా ఉండకుండా తాలప్రమాణంమాత్రమే ఉండాలి. లావైన గ్రంథులు కలది గాని, కొమ్మ లున్నది గాని, పురుగులున్నది గాని ఉపయోగించకూడదు. దీని పర్వలలో పుచ్చు లుండకూడదు. ప్రక్కన వేణువులు లేకుండా ఒక్కటే ఉన్నది కాకూడదు.

**మూ. మధుసర్పిఃసర్షపాక్తం మాల్యధూపపురస్కృతమ్,**
**ఉపాస్య విధివద్వేణుం గృహ్ణీయాజ్జర్జరం ప్రతి. 170**

**తా.** ఆ వెదురుకఱ్ఱకు తేనె, నెయ్యి, ఆవాలు పూసి, మాల్యాలు, ధూపము సమర్పించి యథావిధిగా పూజించి, దానిని జర్జరనిర్మాణంకొరకు గ్రహించాలి.

**మూ. యో విధిర్యః క్రమశ్చైవ మహేన్ద్రే తు ధ్వజే స్మృతః,**
**స జర్జరస్య కర్తవ్యః పుష్యవేణుసమాశ్రయః. 171**

**తా.** ఇంద్రధ్వజం విషయంలో ఏ విధి, ఏ క్రమం శాస్త్రంలో చెప్పబడిందో అవే విధి క్రమాలు జర్జరనిర్మాణంకోసం గ్రహించిన వేణువు విషయంలో కూడ పాటించాలి.

**మూ. భవేద్యో దీర్ఘపర్వా తు తనుపత్రస్తథైవ చ,**
**పర్వాగ్రమణ్డలశ్చైవ పుష్యవేణుః స కీర్తితః. 172**

**తా.** దేని కణుపులు దీర్ఘంగా ఉంటాయో, ఆకులు సన్నంగా ఉంటాయో, కణుపుల చివర్లలో ఉంగరాల వంటి మచ్చ లుంటాయో అది పుష్యవేణువు.

**మూ. విధిరేష మయా ప్రోక్తో జర్జరస్య ప్రమాణతః,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి దణ్డకాష్ఠస్య లక్షణమ్. 173**

**తా.** జర్జరాన్ని గూర్చిన ప్రమాణాన్ని విధానాన్ని చెప్పాను. ఇపుడు దండకాష్ఠం లక్షణం చెపుతాను.

**మూ. కపిత్థబిల్వవంశేభ్యో దణ్డకాష్ఠో భవేదథ,**
**వక్రం చైవ హి కర్తవ్యం త్రిభాగే లక్షణాన్వితమ్. 174**

**తా.** వెలగకొమ్మతో లేదా మారేడుకొమ్మతో లేదా వెదురుకఱ్ఱతో దండకాష్ఠం చేయించాలి. అది మూడు చోట్ల వంకరగా, మంచి లక్షణాలతో కూడినదై ఉండాలి.

**మూ. కీటైర్నోపహతం తచ్చ వ్యాధినా న చ పీడితమ్,**
**మన్దశాఖం భవేద్యచ్చ దణ్డకాష్ఠం తు తద్భవేత్. 175**

**తా.** పురుగులు దొలవనిది, వ్యాధి సోకనిది, తక్కువ కొమ్మ లున్నది అయిన కఱ్ఱనే దండకాష్ఠంకోసం తీసికోవాలి.

**మూ. యస్త్వేభిర్లక్షణైర్హీనం దణ్డకాష్ఠం సజర్జరమ్,**
**కారయేత్ స త్వపచయం మహాన్తం ప్రాప్నుయాద్ ధ్రువమ్. 176**

**తా.** ఇలాటి మంచి లక్షణాలు లేని దండకాష్ఠం కాని, జర్జరం కాని చేయించిన నాట్య ప్రయోక్త తప్పక కష్టాలలో చిక్కుకొంటాడు.

**మూ. అథ శీర్షవిధానార్థం పటీ కార్యా ప్రయత్నతః,**
**స్వప్రమాణవినిర్దిష్టా ద్వాత్రింశత్యఙ్గులాని వై. 177**

**తా.** ప్రతిశీర్షం తయారుచేయడంకోసం ప్రయత్నపూర్వకంగా 'పటి' (చిన్న బట్ట) చేసికోవాలి. దాని ప్రమాణం ముప్పైరెండు అంగులాలు ఉండాలి, లేదా ధరించేవానికి అవసరమైన ప్రమాణంలో ఉండాలి.

**మూ. బిల్వకల్కేన కర్తవ్యా పటీ చీరసమాశ్రయా,**
**స్విన్నేన బిల్వకల్కేన ద్రవేణ చ సమన్వితా. 178**

**తా.** మారేడు గుజ్జు బట్టమీద పట్టించి పటి తయారుచేసుకోవాలి. పల్చని మారేడు గుజ్జు, బిల్వద్రవము దానిమీద పూసి పటి తయారుచెయ్యాలి.

**మూ. భస్మనా తు తుషైర్వాపి కారయేత్ ప్రతిశీర్షకమ్,**
**సంఛాద్య తు తతోవస్త్రైర్బిల్వాదిగ్ధైర్ఘనాశ్రయైః. 179**
**బిల్వకల్కేన చీరం తు దిగ్ధ్వా సంయోజయేత్ పటీమ్,**
**న స్థూలం న తనుం చైవ న మృద్వీం చైవ కారయేత్. 180**

**తా.** బొగ్గుల బూడిదతో గాని, వరిధాన్యంపొల్లుతో గాని, వాటిని బిల్వంగుజ్జుతో కలిపి ప్రతిశీర్షకం తయారు చెయ్యాలి. తరవాత దానికి చిక్కని బిల్వం గుజ్జు పూసిన పటి చుట్టబెట్టాలి. పటి బాగా దళసరిగా ఉండకూడదు. బాగా పల్చగా ఉండకూడదు. ఎక్కువ మెత్తగా కూడ ఉండకూడదు.

**మూ. తస్యామాతపశుష్కాయాం సుశుష్కాయామథాపి వా,**
**ఛేద్యం బుధస్తు కుర్వీత విధిదృష్టేన కర్మణా. 181**
**సుతీక్ష్ణేన తు శస్త్రేణ అర్ధార్ధం ప్రతిభజ్య చ,**
**స్వప్రమాపాణవినిర్దిష్టం లలాటకృతకోణకమ్. 182**

**తా.** పటి నిప్పు వేడికి గాని ఎండకు గాని బాగా ఎండిన తరువాత దీనికి పదునైన శస్త్రంతో లక్షణానుసారంగా రంధ్రాలు చెయ్యాలి. సగం సగం భాగాలుగా దానిని విభజించుకొని, తన కొలతలకు సరిపడే టట్లు లలాటం ఆకారంలో ఆరు అంగుళాల పొడవు. నాలుగు అంగులాల వెడల్పు ఉన్న రంధ్రం చెయ్యాలి. దాని రెండు పక్కలా రెండు కోణా లుండాలి.

**మూ. అర్ధాఙ్గులం లలాటం తు కార్యం ఛేద్యం షడఙ్గులమ్,**
**అధ్యర్ధమఙ్గులం ఛేద్యం కటయోస్త్ర్యఙ్గులం భవేత్. 183**

**కటాన్తే కర్ణనాలస్య ఛేద్యం ద్వ్యధికమఙ్గులమ్,**
**త్ర్యఙ్గులం కర్ణవిస్తారం తథాస్యం ఛేద్యమేవ హి. 184**

**తతశ్చైవావటుః కార్యా సుషమా ద్వాదశాఙ్గులా,**
**పటీచ్ఛేద్యకృతం హ్యేతద్విధానం విహితం మయా. 185**

**తస్యోపరి తతః కార్యా ముకుటా వివిధాశ్రయాః,**
**నానారత్నప్రతిచ్ఛన్నా బహురూపోపశోభినః. 186**

**తా.** తరవాత, దవడలకోసం రెండు అంగుళాల పొడవు ఒకటిన్నర అంగుళాల వెడల్పు గల రెండు ఛిద్రాలు చెయ్యాలి. తరవాత, చెవులకోసం, దవడల చివరిభాగం దగ్గర, రెండు అంగులాలకంటె ఎక్కువ ప్రమాణంలో ఉన్న రెండు రంధ్రాలు చెయ్యాలి. కర్ణాలకోసం మూడు అంగులాలు చేసి నట్లే నోరుకోసం కూడ అంతే ప్రమాణం గల రంధ్రం చెయ్యాలి. తరవాత కంఠం కోసం సమంగా పన్నెండు అంగుళాల పొడవు రంధ్రం చెయ్యాలి.

పటికి చేయవలసిన రంధ్రాల విషయంలో పాటించవలసిన నియమాలు ఇవే. శీర్షాచ్ఛాదనం కోసం ఈ పటికి అనేకరత్నాలు పొదిగిన, వివిధాకారాలలో ఉన్న, అనేక విధాలైన శిల్పాలతో (నగిషీలతో) అందమైన కిరీటాలు అమర్చాలి.

**మూ. తథోపకరణానీహ నాట్యయోగకృతాని వై,**
**బహుప్రకారయుక్తాని కుర్వీత ప్రకృతిం ప్రతి. 187**

**తా.** నాట్యప్రదర్శనానికి అవసరమైన అనేకవిధాలైన ఉపకరణాలు కూడ, కథావస్తు స్వరూపానుసారం ఏర్పరచుకోవాలి.

**మూ. యత్కించిదస్మిన్ లోకే తు చరాచరసమన్వితే,**
**విహితం కర్మ శిల్పం వా తత్తూపకరణం స్మృతమ్. 188**

**తా.** చరాచరాత్మకమైన ఈ లోకంలో ఉండే అన్ని వస్తువులూ, శిల్పాలూ కూడ నాట్యప్రయోగోపయుక్తమైన ఉపకరణాలే.

**మూ. యద్యస్య విషయం ప్రాప్తం తత్తదేవాభిగచ్ఛతి,**
**నాస్త్యన్యః పురుషాణాం హి నాట్యోపకరణాశ్రయే. 189**

**తా.** నాట్యప్రయోగానికి అవసరమైన ఉపకరణం ఏ ప్రాంతంలో లభిస్తుందో అక్కడికి వెళ్లి సంపాదించవలసిందే. మానవులకు నాటకోపకరణాలను సేకరించడానికి మరొక మార్గం లేదు.

**మూ. యద్యేనోత్పాదితం కర్మ శిల్పయోగః క్రియాపి వా,**
**తస్య తేన కృతా సృష్టిః ప్రమాణం లక్షణం తథా. 190**

**తా.** ఏ శిల్పి ఏ వస్తువును, శిల్పాన్ని, నిర్మించడంలో నేర్పు కలవాడో అతడు ఆ వస్తువును, తగిన ప్రమాణాలతో, లక్షణాలను అనుసరించే సృష్టిస్తాడు.

**మూ. యా కార్ ష్ణాయసభూయిష్ఠా కృతా సృష్టిర్మహాత్మనా,**
**న సాస్మాకం నాట్యయోగే; కస్మాత్? ఖేదావహా హి సా. 191**

**తా.** ఎవరైనా మహాత్ముడు ఇనుము ఎక్కువగా ఉపయోగించి వస్తువులు తయారు చేస్తే అవి మనకు, నాట్యప్రయోగంలో ఉపయోగించవు. ఎందుచేత ననగా – అది బరువుతో, అలసట కలిగిస్తుంది.

**మూ. యద్ద్రవ్యం జీవలోకే తు నానాలక్షణలక్షితమ్,**
**తస్యానుకృతిసంస్థానం నాట్యోపకరణం భవేత్. 192**

**తా.** మానవలోకంలో వివిధలక్షణాలతో కూడిన ఏ యే ద్రవ్యా లుంటాయో వాటి ఆకారాలూ, అవయవవిన్యాసాలూ ఉన్న వస్తువులను (రెప్లికా) మాత్రమే నాట్యప్రయోగంలో ఉపయోగించాలి.

**మూ. ప్రాసాదగృహయానాని నానాప్రహరణాని చ,**
**న శక్యం తాని వై కర్తుం యథోక్తానీహ లక్షణైః. 193**

**తా.** ప్రాసాదాలు, గృహాలు, వాహనాలు, అనేకవిధాలైన ఆయుధాలు – ఇవన్నీ నాట్యప్రదర్శనంలో ఆవశ్యకములే అయినా, వాటిని యథార్థస్వరూపంలో రంగస్థలం మీద ఉపయోగించడం శక్యం కాదు.

**మూ. లోకధర్మీ భవేత్త్వన్యా నాట్యధర్మీ తథాపరా,**
**స్వభావో లోకధర్మీ తు విభావో నాట్యమేవ చ. 194**

**తా.** లోకధర్మి వేరు నాట్యధర్మి వేరు. లోకంలో కనబడేది లోకధర్మి, నాట్య ప్రయోగానుగుణంగా భావనచేత కల్పించినది, మార్పులు చేసి ఉపయోగించినది నాట్యధర్మి.

**మూ. ఆయసం తు న కర్తవ్యం న చ సారమయం తథా,**
**నాట్యోపకరణం తద్జ్ఞైః గురు ఖేదకరం భవేత్. 195**

**తా.** ఇనుముతో కాని, దృఢమైన కఠినమైన పదార్థంతో కాని చేసిన వస్తువును నాట్యోపకరణంగా ఉపయోగించకూడదు. బరువైనది ఖేదాన్ని కలిగిస్తుంది.

**మూ. కాష్ఠచర్మసు వస్త్రేషు జతువేణుదలేషు చ,**

**నాట్యోపకరణానీహ లఘుకర్మాణి కారయేత్. 196**

**తా.** నాట్యోపకరణాలన్నీ తేలికగా ఉండే టట్లు కఱ్ఱలతోను, తోళ్లతోను, బట్టలతోను, లక్కతోను, వెదురు బెరళ్లతోను చేయించాలి.

**మూ. చర్మవర్మధ్వజాః శైలాః ప్రాసాదా దేవతా గ్రహాః,**
**హయవారణయానాని విమానాని గృహాణి చ. 197**

**పూర్వం వేణుదలైః కృత్వా కృతీర్భావరసాశ్రయాః,**
**తతః సురంగైరాచ్ఛాద్య వస్త్రైః సారూప్యమానయేత్. 198**

**తా.** చర్మలు (డాలు), కవచాలు, ధ్వజాలు, శైలాలు, ప్రాసాదాలు, దేవతలు, గ్రహాలు, గుఱ్ఱాలు, ఏనుగులు, వాహనాలు, విమానాలు, గృహాలు – వీటనన్నింటినీ ముందుగా వెదురుబద్దలతో నిర్మించి, భావ – రసాలకు అనుగుణంగా ఉండే టట్లు మంచి రంగురంగుల వస్త్రాలు కప్పి, నిజమైన చర్మాదుల వలె కనబడేటట్లు చెయ్యాలి.

**మూ. అథవా యది వస్త్రాణామసాన్నిధ్యం భవేదిహ,**
**తాలీయైర్వా కిలిఞ్జైర్వా శ్లక్ష్ణైర్వస్త్రక్రియా భవేత్. 199**

**తా.** ఎక్కడనైనా వస్త్రాలు దొరకకపోతే వస్త్రాలకు బదులు తాటాకులు గాని, పల్చని చాపలు గాని ఉపయోగించాలి.

**మూ. తథా ప్రహరణాని స్యుః తృణవేణుదలాదిభిః,**
**జతుభాణ్డక్రియాభిశ్చ నానారూపాణి నాటకే. 200**

**తా.** ఆయుధాలు కూడ గడ్డితోను, వెదురుబద్దలతోను నిర్మించి, వాటికి లక్క మైనం మొదలైన వాటితో వివిధరూపాలు ఏర్పరచి నాటప్రయోగంలో ఉపయోగించాలి.

**మూ. ప్రతిపాదం ప్రతిశిరః ప్రతిహస్తం ప్రతిత్వచమ్,**
**తృణైః కిలిఞ్జైర్భాణ్డైర్వా సారూప్యాణి తు కారయేత్. 201**

**తా.** పాదాలు, శిరస్సులు, హస్తాలు, చర్మఖండాలు – వీటి ప్రతికృతులను తృణాలతోగాని, చాపలతో గాని, పాత్రలు మొదలైనవాటితో గాని, నిజమైన వాటితో సమానరూపాలుగా ఏర్పడేటట్లు చెయ్యాలి.

**మూ. యద్యస్య సదృశం రూపం సారూప్యగుణసంభవమ్,**
**మృణ్మయం తత్తు కృత్స్నం తు నానారూపం తు కారయేత్. 202**

**తా.** ఇంకా ఇతరమైన నాటకప్రయోగోపయోగివస్తువులను, నిజమైనవాటితో సమానమైన ఆకారాలు, గుణాలు మొదలైనవి ఉన్నట్లు కనబడే విధంగా మట్టితో చేయించాలి.

**మూ. భాణ్డవస్త్రమధూచ్ఛిష్టైర్లాక్షయాభ్రదలేన చ,**
**నగాస్తే వివిధాః కార్యా హ్యతసీశణబిల్వజైః. 203**

**తా.** భాండాలతోను (ఆనపకాయ బుఱ్ఱలు మొ.) వస్త్రాలతోను, మైనంతోను, లక్కతోను, అభ్రకంతోను, అవిసినారతోను, మారేడుగుజ్జు మొదలైనవాటితోను అనేక విధాలైన ఆకారాలు గల పర్వతాలు నిర్మించాలి.

**మూ. నానాకుసుమజాతీశ్చ ఫలాని వివిధాని చ,**
**వివిధాని చ భాణ్డాని లాక్షయా వాపి కారయేత్. 204**

**తా.** ఆ యా ప్రదేశాలలో లభించే అనేకవిధాలైన పుష్పాలు, ఫలాలు, పాత్రలు మొదలైనవాటిని లక్కతో కూడ నిర్మించవచ్చును.

**మూ. భాణ్డవస్త్రమధూచ్ఛిష్టైస్తామ్రపత్రైస్తథైవ చ,**
**సమ్యక్ చ నీలీరాగేణాప్యభ్రపత్రేణ చైవ హి. 205**
**రఞ్జితేనాభ్రపత్రేణ మణీశ్చైవ ప్రకారయేత్,**
**ఉపాశ్రయమథాప్యేషాం శుల్బవజ్గేన కారయేత్. 206**

**తా.** చిన్నగిన్నెలు, వస్త్రాలు, మైనము, పల్చని రాగిరేకులు. వీటితో అలంకారాల ఆకృతులను నిర్మించి వాటిపైన నీలిరంగు, అభ్రకమూ బాగా పుయ్యాలి. రంగులు వేసిన అభ్రకంతో మణులు చేయించాలి. వీటికి రాగి రేకులు ఆధారంగా ఏర్పరచాలి.

**మూ. వివిధా ముకుటా దివ్యాః పూర్వం యే గదితా మయా,**
**తేఽభ్రపత్రోజ్జ్వలాః కార్యాః మాణిక్యాలోకశోభితాః. 207**

**తా.** పూర్వం నేను చెప్పిన దివ్యమైన ముకుటాలకు పల్చని మైకా బిళ్లలు అతికి వెలుతుర్లో మాణిక్యాలతో సమంగా ప్రకాశించేటట్లు చెయ్యాలి.

**మూ. న శాస్త్రప్రభవం కర్మ తేషాం హి సముదాహృతమ్,**
**ఆచార్యబుద్ధ్యా కర్తవ్యమూహాపోహప్రయోజితమ్. 208**

**తా.** ఈ వస్తువులు ఈ విధంగా నిర్మించాలి, ఇలా సమకూర్చుకోవాలి అని శాస్త్రం ఏమీ చెప్పదు. అక్కడ అవసరాలను బట్టి నాట్యాచార్యుడు తన బుద్ధిని ఉపయోగించి, ఉహ – అపోహలతో (ఇది ఇక్కడ బాగుంటుంది, అనేది ఊహ; ఇది బాగుండదు; తీసివేయాలి అనేది అపోహ) చేసుకోవాలి.

**మూ. ఏష మర్త్యక్రియాయోగో భవిష్యత్కల్పితో మయా,**
**కస్మాదల్పబలత్వం హి మనుష్యేషు భవిష్యతి. 209**

**తా.** మర్త్యులు వేయవలసిన ఈ పను లన్నీ నేను, భవిష్యత్కాలాన్ని దృష్టిలో పెట్టుకొని చెప్పాను. ఎందుచేత ననగా – రాను రాను మనుష్యులు దుర్బలు లవుతారు.

**మూ. మర్త్యానామల్పశక్తిత్వాన్న చాతీవాఙ్గచేష్టితమ్,**
**నేష్టాః సువర్ణరత్నైస్తు ముకుటా భూషణాని వా. 210**

**తా.** మానవులకు శక్తి చాల తక్కువగా ఉంటుంది. అందుచేత ఆంగికమైన చేష్టలు ఎక్కువగా చేయకూడదు. కిరీటాలు, అలంకారాలు సువర్ణరత్నాలతో చేయించకూడదు.

**మూ. యుద్ధే నియుద్ధే నృత్తే వా దృష్టివ్యాపారకర్మణి,**
**గురుభావావసన్నస్య స్వేదో మూర్ఛా చ జాయతే. 211**

**స్వేదమూర్ఛాక్లమార్తస్య ప్రయోగస్తు వినశ్యతి,**
**ప్రాణాత్యయః కదాచిచ్చ భవేద్వ్యాయతచేష్టయా. 212**

**తస్మాత్తామ్రమయైః పత్రైః అభ్రకైరఙ్కితైరపి,**
**భాణ్డైరథ మధూచ్ఛిష్టైః కార్యాణ్యాభరణాని తు. 213**

**తా.** బరువుతో అలిసిపోయినవానికి యుద్ధంలోగాని, బాహుయుద్ధంలో గాని, దృష్టులతోను చేష్టలతోను చేసే అభినయాలలో గాని చెమట పడుతుంది. మూర్ఛ వస్తుంది. నటుడు చెమటతోను, మూర్ఛతోను, అలసటతోను పీడితుడైతే నాట్యప్రయోగానికి విఘాతం కలుగుతుంది. అతిగా ఆంగికాభినయం చేస్తే ఒకప్పుడు ప్రాణాలు పోవచ్చు కూడ.

అందుచేత అలంకారాలలో అధికంగా పల్చని రాగిరేకులు, రంగురంగుల అభ్రకం బిళ్లలు, చిన్న గిన్నెలు, మైనమూ – వీటిని మాత్రమే వాడాలి.

**మూ. ఏవం లోకోపచారేణ స్వబుద్ధివిభవేవన చ,**
**నాట్యోపకరణానీహ బుధః సమ్యక్ ప్రయోజయేత్. 214**

**తా.** నాట్యవిశారదుడు ఈ విధంగా లోకవ్యవహారం పరిశీలిస్తూ, తన బుద్ధిని కూడ వినియోగించి, నాట్యోపకరణాలను చక్కగా సమకూర్చుకోవాలి.

**మూ. మోక్తవ్యం నాయుధం రఙ్గే న ఛేద్యం న చ తాడనమ్,**
**ప్రాదేశమాత్రం గృహ్ణీయాత్ సంజ్ఞార్థం శస్త్రమేవ చ. 215**

**తా.** రంగస్థలంమీద ఆయుధం ప్రయోగించకూడదు. ఛేదించకూడదు; కొట్టకూడదు. కేవలం దూరంనుండి స్పృశిస్తున్నట్లు శస్త్రగ్రహణాన్ని ముద్రలద్వారా చూపాలి.

**మూ. అథ వా యోగశిక్షాభిర్విద్యామాయాకృతేన వా,**
**శస్త్రమోక్షః ప్రకర్తవ్యో రఙ్గమధ్యే ప్రయోక్తృభిః. 216**

**తా.** లేదా – నాట్యప్రయోక్తలు బాగా శస్త్రాభ్యాసం చేసి గాని, విద్యచేత గాని,

మాయాప్రయోగంచేత గాని రంగస్థలంమీద ఆయుధప్రయోగం చేయవచ్చు.

**వి.** విద్యా = సుధామకోక్తమైన హస్తలాఘనాదివిద్య. మాయా = చక్షుర్బంధాదిక మాయ. కనికట్టు. (అభి.భా.)

**మూ. ఏవం నానాప్రకారైస్తు ఆయుధాభరణాని చ,**
**నోక్తాని యాని చ మయా లోకాద్ గ్రాహ్యాణి తాన్యపి. 217**

**తా.** ఈ విధంగా అనేకవిధాలైన ఆయుధాలు, ఆభరణాలు నాటప్రయోగంలో ఏర్పరచుకోవాలి. నేను చెప్పని వేవైనా ఉంటే వాటిని లోకంనుండి గ్రహించాలి.

**మూ. ఆహార్యాభినయో హ్యేష మయా ప్రోక్తః సమాసతః,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి సామాన్యాభినయం ప్రతి. 218**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే ఆహార్యాభినయో నామ ఏకవింశోऽధ్యాయః.**

**తా.** నే నింతవరకు ఆహార్యాభినయాన్ని గూర్చి సవిస్తరంగా చెప్పాను. ఇప్పుడు సామాన్యాభినయాన్ని గూర్చి చెపుతాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో ఆహార్యాభినయం అను ఇరవైఒకటవ అధ్యాయం సమాప్తం.**

శ్రీః శ్రీః శ్రీః

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ ద్వావింశోఽధ్యాయః

# సామాన్యాభినయము

"భేదేనాత్మాభిముఖతాం నయన్తం భేదకారణమ్,
సామాన్యాభినయాకారగర్వమూర్తిం శివం నుమః."

– శ్రీమదభినవగుప్తాచార్యాః

**మూ. సామాన్యాభినయో నామ జ్ఞేయో వాగఙ్గసత్త్వజః,**
**తత్ర కార్యః ప్రయత్నస్తు నాట్యం సత్త్వే ప్రతిష్ఠితమ్. 1**

**తా.** వాక్కును, అవయవాలను, మనస్సును ఆశ్రయించి, ఆధారంగా చేసికొని జరిగే అభినయం **సామాన్యాభినయం**. దాని విషయంలో (సత్త్వం విషయంలో) ప్రయత్నం వహించాలి. ఎందువల్ల ననగా నాట్యం సత్త్వంమీద ఆధారపడి ఉన్నది.

**వి.** ఆంగిక – వాచిక – సాత్త్వికాభినయాలను పరస్పరసమన్వయంతో చేసే ప్రయోగం సామాన్యాభినయం. సామాన్యాభినయానికి సంబంధించిన, సామాన్యాభి నయంలో ఏర్పరచిన ఒక ప్రణాళికను అనుసరించి ఆంగికాద్యభినయాల ప్రయోగం ఉంటుంది.

ఒక సుగంధద్రవ్యనిర్మాత ఆపణానికి వెళ్లి వేరు వేరు వస్తువులను తీసికొనివచ్చి వాటిని తగు పాళ్లలో కలిపి తయారుచేసిన గంధద్రవ్యం ఏ విధంగా ఒక విశిష్టమైన సుగంధాన్ని ప్రసరింపచేస్తుందో, అదే విధంగా పై మూడు విధాలైన అభినయాల కలయికవల్ల ఏర్పడిన సామాన్యాభినయం అతిమనోహరంగా ఉంటుంది అని **అభినవభారతిలో** చెప్పబడింది.

**మూ. సత్త్వాతిరిక్తోఽభినయో జ్యేష్ఠ ఇత్యభిధీయతే,**
**సమసత్త్వో భవేన్మధ్యః సత్త్వహీనోఽధమః స్మృతః. 2**

**తా.** సత్త్వం అధికంగా ఉన్న అభినయం జ్యేష్ఠం (ఉత్తమం). సత్త్వం సమంగా ఉన్నది మధ్యమం. సత్త్వవిహీనమైన అభినయం అధమం.

**మూ. అవ్యక్తరూపం సత్త్వం హి విజ్ఞేయం భావసంశ్రయమ్,**
**యథాస్థానరసోపేతం రోమాఞ్చాస్రాదిభిర్గుణైః. 3**

**తా.** సత్త్వం పైకి కనబడదు; ఇది మనోభావరూప మైనది. ఆ యా తగిన ప్రదేశాలలో

రసాలతో కూడిన ఈ సత్త్వం రోమాంచం, కన్నీరు మొదలైన గుణాలచేత వ్యక్తం అవుతూంటుంది.

**మూ. అలఙ్కారాస్తు నాట్యజ్ఞైర్జ్ఞేయా భావరసాశ్రయాః,**
**యౌవనేఽభ్యధికాః స్త్రీణాం వికారా వక్త్రగాత్రజాః. 4**

**తా. స్త్రీలు ప్రయోగించదగిన సుకుమారమైన నాట్యాలంకారాలు :** – యువతుల సుకుమారభావాలకు పుష్టి కలిగించే, భావ – రసాశ్రితాలైన, నాట్యాలంకారాలను న్యాట్య ప్రయోక్తలు తెలుసుకోవాలి. ఇవి యౌవనంలో ఉన్న స్త్రీల ముఖ – శరీరాదులలో కలిగే వికారాల రూపంలో ఉంటాయి.

**మూ. ఆదౌ త్రయోఽఙ్గజాస్తేషాం దశ స్వాభావికాః పరే,**
**అయత్నజాః పునః సప్త రసభావోపబృంహితాః. 5**

**తా.** వాటిలో మొదటి మూడు ఆంగజమైనవి. శరీరంలోని పరివర్తనంవల్ల కలిగేవి. తరువాత పది స్వభావసిద్ధ మైనవి. ఏడు అప్రయత్నంగా సిద్ధించేవి. ఇవన్నీ కూడ రసభావపరిపుష్టములు, పరిపోషకాలూ కూడ.

**మూ. దేహాత్మకం భవేత్సత్త్వం సత్త్వాద్భావః సముత్థితః,**
**భావాత్సముత్థితో హావో హావాద్ధేలా సముత్థితా. 6**

**తా.** సత్త్వం దేహాత్మకమైనది. సత్త్వంనుండి భావం పుడుతుంది. భావంనుండి హావము, హావంనుండి హేల ఉత్పన్నము లౌతాయి.

**మూ. హేలా హావశ్చ భావశ్చ పరస్పరసముత్థితాః,**
**సత్త్వభేదే భవన్త్యేతే శరీరే ప్రకృతిస్థితాః. 7**

**తా.** హేల, హావము, భావము ఇవి ఒకదానినుండి ఒకటి పుడతాయి. ఇవన్నీ సత్త్వంయొక్క వేరు వేరు భేదాలే. ఇవి శరీరంయొక్క ప్రకృతితో, స్వాభావికస్థితితో, సంబంధించి ఉంటాయి.

**మూ. వాగఙ్గముఖరాగైశ్చ సత్త్వేనాభినయేన చ,**
**కవేరన్తర్గతం భావం భావయన్ భావ ఉచ్యతే. 8**

**తా.** వాక్కుచేత, అవయవాలచేత, ముఖరాగాలచేత సాత్త్వికవికారాలచేత, అభినయంచేత నాట్యరచయిత మనస్సులోని భావాన్ని (ఇతరులచేత) భావింపచేసేది భావం.

**మూ. భావస్యాతికృతం సత్త్వం వ్యతిరిక్తం స్వయోనిషు,**
**నైకావస్థాన్తరకృతం భావం తమిహ నిర్దిశేత్. 9**

**తా.** ఒక స్త్రీలో భావాతిశయంచేత కలిగిన వివిధావస్థలను చూచిన మరొక స్త్రీ మనస్సులో – లేదా ఒకపురుషునిలో భావాతిశయంచేత కలిగిన వివిధావస్థలను చూచిన మరొక పురుషుని మనస్సులో కలిగే భావమే ఇక్కడ చెప్పిన భావం.

**మూ. తత్రాక్షిభ్రూవికారాఢ్యః శృఙ్గారాకారసూచకః,**
**సగ్రీవారేచకో జ్ఞేయో హావః స్థితసముత్థితః. 10**

**తా.** నేత్రాల, కనుబొమ్మల వికారాలతో కూడినదై, కంఠరేచకం మొదలైన ఆంగిక చేష్టలచేత కూడ మనస్సులోని శృంగారభావాన్ని సూచించే, పైకి కనబడుతూ ఆగిపోతూ ఉండే స్థితి **హావం.**

**మూ. యో వై హావః స ఏవైషా శృంగారరససంభవా,**
**సమాఖ్యాతా బుధైర్హేలా లలితాభినయాత్మికా. 11**

**తా.** శృంగారభావంవల్ల కలిగిన హావమే లలితమైనశరీర చేష్టలకు హేతువై అభివ్యక్తమైతే అది **హేల.**

**మూ. లీలావిలాసో విచ్ఛిత్తిర్విభ్రమః కిలకిఞ్చితమ్,**
**మోట్టాయితం కుట్టమితం బిబ్బోకో లలితం తథా. 12**
**విహృతం చేతి విజ్ఞేయా దశ స్త్రీణాం స్వభావజాః,**
**అలంకారాస్తథైతేషాం లక్షణం శృణుత ద్విజాః. 13**

**తా.** లీల, విలాస, విచ్ఛిత్తి, విభ్రమం, కిల (లి) కించితం, మోట్టాయితం, కుట్టమితం, బిబ్బోకం, లలితం, విహృతం – ఈ పదీ స్త్రీల స్వభావసిద్ధమైన అలంకారాలు, వీటి లక్షణం వినండి.

**మూ. వాగఙ్గాలంకారైః శ్లిష్టైః ప్రీతిప్రయోజితైర్మధురైః,**
**ఇష్టజనస్యానుకృతిర్లీలా జ్ఞేయా ప్రయోగజ్ఞైః. 14**

**తా.** అందమైన, మనోహరమైన మాటలు, అవయవ విన్యాసాలు, అలంకారాలు, వీటి నన్నింటినీ ప్రేమపూర్వకంగా మధురంగా ప్రయోగిస్తూ ప్రియజనుణ్ణి (ప్రియుని వాగంగాలంకారాదులను) అనుకరించడం **లీల.**

**మూ. స్థానాసనగమనానాం హస్తభ్రూనేత్రకర్మణాం చైవ,**
**ఉత్పద్యతే విశేషః యః శ్లిష్టః స తు విలాసః స్యాత్. 15**

**తా.** నిలబడడం, కూర్చొనడం, నడక, హస్తాల చేష్టలలోను, కనుబొమ్మల విరుపులలోను, చూపులలోను, అందమైన ఒక విధమైన విశేషం, పరివర్తనం కలగడం **విలాసం.**

**మూ. మాల్యాచ్ఛాదనభూషణవిలేపనానామనాదరన్యాసః,**
**స్వల్పోఽపి పరాం శోభాం జనయతి యస్మాత్తు విచ్ఛిత్తిః. 16**

**తా.** పుష్పమాలలు, వస్త్రాలు, అలంకారాలు, మైపూతలు వీటి విషయంలో శ్రద్ధ వహించకుండా వీటిని స్వల్పంగా ఉపయోగించినా కూడ, దేని మూలాన శోభ అధికంగానే ఉంటుందో అది **విచ్ఛిత్తి.**

**మూ. వివిధానామర్థానాం వాగఙ్గాహార్యసత్త్వయోగానామ్,**
**మదరాగహర్షజనితో వ్యత్యాసో విభ్రమో జ్ఞేయః. 17**

**తా.** మదంతోను, రాగాతిశయంతోను, హర్షంతోను – అనేకవిధాలైన పనులు, వాక్కు, శరీరచేష్టలు, వస్త్రాలంకారాదిధారణం, భావప్రదర్శనం – వీటిని దేనిచేత తారుమారుగా చేయడం జరుగుతుందో అది **విభ్రమం.**

**మూ. స్మితరుదితహసితభయహర్షగర్వదుఃఖశ్రమాభిలాషాణామ్,**
**సంకరకరణం హర్షాదసకృత్ కిలకిఞ్చితం జ్ఞేయమ్. 18**

**తా.** హర్షాతిశయంవల్ల మాటిమాటికీ, చిరునవ్వు, ఏడ్పు, నవ్వు, భయం, ఆనందం, గర్వం, దుఃఖం, శ్రమ, అభిలాష – వీటి నంటినీ సంకీర్ణం చేయడం **కిలికించితం.**

**మూ. ఇష్టజనస్య కథాయాం లీలాహేలాదిదర్శనే వాపి,**
**తద్భావభావనాకృతముక్తం మోట్టయితం నామ. 19**

**తా.** ప్రియునికి సంబంధించిన మాటల సందర్భంలో కాని, లీలా – హేలాదులను చూపడంలో గాని ప్రియుని గూర్చిన భావనతో నిండినప్పుడు చేసే చేష్ట **మోట్టాయితం.**

**మూ. కేశస్తనాధరాదిగ్రహణాదతిహర్షసంభ్రమోత్పన్నమ్,**
**కుట్టమితం విజ్ఞేయం సుఖమపి దుఃఖోపచారేణ. 20**

**తా.** కేశ – కుచ – అధరాదిస్పర్శ చేసినప్పుడు ఆనందాతిశయంచేత, సుఖంగా ఉన్నా కూడ దుఃఖం కలుగుతున్నట్లు 'అబ్బా' అంటూ చేసే చేష్టలు **కుట్టమితం.**

**మూ. ఇష్టానాం భావానాం ప్రాప్తావభిమానగర్వసంభూతః,**
**స్త్రీణామనాదరకృతో బిబ్బోకో నామ విజ్ఞేయః. 21**

**తా.** ఎంత కాలంనుంచో కోరుకుంటున్న వస్తువులు లభించిన తరవాత, అభిమానం (అహంకారం) చేత, గర్వంచేత స్త్రీలు పైకి కనబరచే అనాదరభావం **బిబ్బోకం.**

**మూ. హస్తపాదాఙ్గవిన్యాసో భ్రూనేత్రోష్ఠప్రయోజితః,**
**సౌకుమార్యాద్భవేద్యస్తు లలితం తత్ ప్రకీర్తితమ్. 22**

**తా.** సౌకుమార్యంతో – కనుబొమ్మలు, నేత్రాలు, పెదవులు కదుపుతూ చేసే హస్త పాదాదుల మనోహరమైన విన్యాసం **లలితం**.

**మూ. కరచరణాఙ్గన్యాసః సభ్రూనేత్రోష్ఠసంప్రయుక్తస్తు,**
**సుకుమారవిధానేన స్త్రీభిరితీదం స్మృతం లలితమ్. 22**

**తా.** (పై లక్షణమే మాటలు మార్చి ఈశ్లోకంలో చెప్పబడింది).

**మూ. వాక్యానాం ప్రీతియుక్తానాం ప్రాప్తానాం యదభాషణమ్,**
**వ్యాజాత్ స్వభావతోఽ వాపి విహృతం నామ తద్ భవేత్. 23**

**తా.** ప్రీతి పూర్వక మైన మాటలు చెప్పవలసిన సమయంలో కూడ, ఏదో వంకచేత గాని, సహజంగానే గాని, అలా చేయకపోవడం **విహృతం**.

**మూ. శోభా కాన్తిశ్చ దీప్తిశ్చ తథా మాధుర్యమేవ చ,**
**ధైర్యం ప్రాగల్భ్య మౌదార్యమిత్యేతే స్యురయత్నజాః. 24**

**తా. అయత్నజాలంకారాలు :–** శోభ, కాంతి, దీప్తి, మాధుర్యం, ధైర్యం, ప్రాగల్భ్యం, ఔదార్యం – ఇవి స్త్రీలలో అయత్నంగా, సహజంగా ఉన్న అలంకారాలు.

**మూ. రూపయౌవనలావణ్యైరుపభోగోపబృంహితైః,**
**అలంకరణమఙ్గానాం శోభేతి పరికీర్తితా. 25**

**తా.** సుఖోపభోగంచేత పరిపుష్టములైన సౌందర్య – యౌవన – లావణ్యాలచేత అవయవాల అలంకరణం, (సౌందర్యాదులే అలంకారాలుగా ఉండడం) **శోభ**.

**మూ. విజ్ఞేయా చ తథా కాన్తిః శోభైవాపూర్ణమన్మథా,**
**కాన్తిరేవాతివిస్తీర్ణా దీప్తిరిత్యభిధీయతే. 26**

**తా.** శోభతో పాటు మన్మథావేశం కూడ తీవ్రంగా ఉంటే అది **కాంతి**. ఆ కాంతియే అతివిస్తృత మైతే అది **దీప్తి**.

**మూ. సర్వావస్థావిశేషేషు దీప్తేషు లలితేషు చ,**
**అనుల్బణత్వం చేష్టాయా మాధుర్యమితి సంజ్ఞితమ్. 27**

**తా.** అన్ని అవస్థావిశేషాలలోను, అది దీప్తావస్థలైనా, లలితావస్థలైనా, చేష్ట ఉల్బణంగా ఉండకపోవడం (మితిమీరి ఉండకపోవడం) **మాధుర్యం**.

**మూ. చాపలేనానుపహతా సర్వార్థేష్వవికత్థనా,**
**స్వాభావికీ చిత్తవృత్తిర్ధైర్యమిత్యభిధీయతే. 28**

**తా.** ఏ పనులలో ఉన్నా కూడ చాపల్యలేశం కూడ లేని, బడాయిమాటలు చెప్పుకొనని, స్వాభావికమైన (ఒడుదుడుకులు లేని) చిత్తవృత్తి **ధైర్యం**.

**మూ. ప్రయోగనిస్సాధ్వసతా ప్రాగల్భ్యం సముదాహృతమ్,**
**ఔదార్యం ప్రశ్రయః ప్రోక్తః సర్వావస్థానుగో బుధైః. 29**

**తా.** సంభాషణలలోను, ఇతరకార్యనిర్వహణలలోను సాధ్వసం (భయం, తడబాటు) లేకపోవడం **ప్రాగల్భ్యం**. అన్ని అవస్థలలోను ఒకే విధంగా వినయంతో ఉండడం **ఔదార్యం**.

**మూ. సుకుమారే భవన్త్యేతే ప్రయోగే లలితాత్మకే,**
**విలాసలలితౌ హిత్వా దీప్తేఽప్యేతే భవన్తి హి. 30**

**తా.** సుకుమారము, లలితము అయిన శృంగారానికి సంబంధించిన ప్రయోగంలో (నాటకప్రదర్శనలో) పైన చెప్పిన వన్నీ ఉంటాయి. దీప్తశృంగారప్రయోగంలో, అనగా ఈర్ష్యామర్షబహులశృంగారంలో, విలాస – లలితాలు తప్ప మిగిలినవి ఉంటాయి.

**మూ. శోభా విలాసో మాధుర్యం స్థైర్యం గామ్భీర్యమేవ చ,**
**లలితౌదార్యతేజాంసి సత్త్వభేదాస్తు పౌరుషాః. 31**

**తా. పురుషుల స్వాభావికశారీరగుణాలు :–** శోభ, విలాస, మాధుర్యము, స్థైర్యము, గాంభీర్యము, లలితము, ఔదార్యము, తేజస్సు – ఇవి పురుషులకు సహజంగా ఉండే గుణాలు (భావాలు).

**మూ. దాక్ష్యం శౌర్యమథోత్సాహో నీచార్థేషు జుగుప్సనమ్,**
**ఉత్తమైశ్చ గుణైః స్పర్ధా యతః శోభేతి సా స్మృతా. 32**

**తా.** నేర్పు, శౌర్యము, ఉత్సాహము, నీచమైన పనుల విషయంలో ఏవగింపు, ఉత్తమమైన గుణాల విషయంలో ఇతరులతో పోటీపడడము – ఇవన్నీ దేనివల్ల కలుగుతాయో అది **శోభ**.

**మూ. ధీరసంచారిణీ దృష్టిః గతిర్గోవృషభాఞ్చితా,**
**స్మితపూర్వమథాలాపో విలాస ఇతి కీర్తితః. 33**

**తా.** ధీరంగా ప్రసరించే చూపులు, ఉత్తమజాతికి చెందిన ఆబోతు నడకవంటి నడక, చిరునవ్వు నవ్వుతూ మాటలాడడము – ఇవి **విలాస**.

**మూ. అభ్యాసాత్ కరణానాం తు శ్లిష్టత్వం యత్ర జాయతే,**
**మహత్స్వపి వికారేషు తన్మాధుర్యమితి స్మృతమ్. 34**

**తా.** బలీయమైన వికారకారణాలు ఏర్పడినా కూడ, ప్రయత్నపూర్వకాభ్యాసంచేత ఇంద్రియాలలో ఎట్టి వికారమూ కలగకుండా ఉండడం **మాధుర్యం**.

**మూ. ధర్మార్థకామసంయుక్తాచ్ఛుభాశుభసముత్థితాత్,**
**వ్యవసాయాదచలనం స్థైర్యమిత్యభిసంజ్ఞితమ్. 35**

**తా.** ధర్మ – అర్థ – కామాలలో ఏదైన శుభం కాని అశుభం కాని కలిగినా, తాను చేసే ఉద్యమంనుండి చలించకుండా ఉండడం **స్థైర్యం.**

**మూ. యస్య ప్రభావాదాకారా హర్షశోకభయాదిషు,**
**భావేషు నోపలక్ష్యన్తే తద్ గామ్భీర్యమితి స్మృతమ్. 36**

**తా.** హర్షము, క్రోధము, భయము మొదలైన భావాలు కలిగినప్పుడు ముఖంమీద వాటి ప్రభావం దేనివల్ల కనబడదో అది **గాంభీర్యం**.

**మూ. అబుద్ధిపూర్వకం యత్తు నిర్వికారస్వభావజమ్,**
**శృఙ్గారాకారచేష్టత్వం లలితం తదుదాహృతమ్. 37**

**తా.** ఎట్టి వికారములూ లేని స్వభావంచేత, కావాలని ప్రయత్న మేమీ చేయకుండానే ఆకారము చేష్టలు శృంగారంగా (మనోహరంగా) ఉండడం **లలితం**.

**మూ. దానమభ్యుపపత్తిశ్చ తథా చ ప్రియభాషణమ్,**
**స్వజనే చ పరే వాపి తదౌదార్యం ప్రకీర్తితమ్. 38**

**తా.** ఒకవ్యక్తి తనవాడే అయినా పరు డయినా – ఆతనికి యథాశక్తి దానం చేయడం, చనువుతో ఉండడం (అభ్యుపపత్తి), ప్రియంగా మాట్లాడడం – ఇది **ఔదార్యం**.

**మూ. అధిక్షేపావమానాదేః ప్రయుక్తస్య పరేణ యత్,**
**ప్రాణాత్యయేఽప్యసహనం తత్తేజః సముదాహృతమ్. 39**

**తా.** ఇతరులు చేసిన అధిక్షేపాలను, అవమానాదులను, ప్రాణాలకు అపాయం కలుగుతుం దన్నప్పుడు, కూడ సహించకపోవడం **తేజస్సు**.

**మూ. సత్త్వజోఽభినయః పూర్వం మయా ప్రోక్తో ద్విజోత్తమాః,**
**శారీరం చాప్యభినయం వ్యాఖ్యాస్యామ్యనుపూర్వశః. 40**

**తా.** ద్విజోత్తములారా! సాత్త్వికాభినయాన్ని గూర్చి మీకు పూర్వమే చెప్పి ఉన్నాను. ఇప్పుడు శారీరాభినయాన్ని, క్రమానుసారం విశదీకరిస్తాను.

**మూ. షడాత్మకస్తు శారీరో వాక్యం సూచాఙ్కురస్తథా,**
**శాఖా నాట్యాయితం చైవ నివృత్త్యఙ్కుర ఏవ చ. 41**

**తా.** వాక్యము, సూచా, అంకురము, శాఖా, నాట్యాయితము, నివృత్త్యంకురము అని శారీరాభినయం ఆరు విధాలు.

**మూ. నానారసార్థయుక్తైర్వృత్తనిబన్ధైః కృతః సచూర్ణపదైః,**
**ప్రాకృతసంస్కృతపాఠో వాక్యాభినయో బుధైర్ జ్ఞేయః. 42**

**తా.** వివిధరసములను, అర్థాలను బోధించే వృత్తాలతోను గద్యలతోను ప్రాకృత భాషలో గాని, సంస్కృతభాషలో గాని ఉన్న పాఠ్యం **వాక్యాభినయం.**

**మూ. వాక్యార్థో వాక్యం వా సత్త్వాఙ్గైః సూచ్యతే యదా పూర్వమ్,**
**పశ్చాద్వాక్యాభినయః సూచేత్యభిసంజ్ఞితా సా తు. 43**

**తా.** స్వాత్త్వికాభినయ – ఆంగికాభినయాలచేత ముందుగా సూచించిన వాక్యాన్ని కాని, వాక్యార్థాన్ని కాని తరవాత వాక్యాభినయంచేత వ్యక్తీకరిస్తే అది **సూచాభినయం.**

**మూ. హృదయస్థో నిర్వచనైరఙ్గాభినయః కృతో నిపుణసాధ్యః,**
**సూచైవోత్పత్తికృతో విజ్ఞేయస్త్వఙ్కురాభినయః. 44**

**తా.** మంచి నైపుణ్యంతో హృదయంలో ఉన్న భావాన్ని, అంగాభినయం ద్వారా, ముందుగా వ్యంజింపచేసి, దానినే సూచాభినయం ద్వారా మళ్లీ ఆవిష్కరిస్తే అది **అంకురాభినయం.**

**మూ. యత్తు శిరోముఖజఙ్ఘోరుపాణిపాదైర్యథాక్రమం క్రియతే,**
**శాఖాదర్శితమార్గః శాఖాభినయః స విజ్ఞేయః. 45**

**తా.** శిరస్సు, ముఖము, కాళ్లు, ఊరువులు, హస్తాలు, పాదాలు – వీటిచేత (ఒకదాని తరవాత ఒకటి ఉపయోగిస్తూ) శాఖానుసారం చేసిన అభినయం **శాఖాభినయం.**

**వి.** విచిత్రమైన హస్తవర్తనకు శాఖా అని పేరు. 'శాఖాదర్శితమార్గః' అనగా వర్తనా క్రమాన్ని అనుసరించడంచేత సౌష్ఠవంతో కూడినది అని అర్థం.

**మూ. నాట్యాయితముపచారైర్యః క్రియతేఽభినయసూచయా నాట్యే,**
**కాలప్రకర్షహేతోః ప్రవేశకైః సంగమో యావత్. 46**

**తా.** నాటకప్రారంభంలో అనేకవిధాలైన సూచాభినయాల ప్రదర్శనం చేస్తూ ఆ సమయానికి ఒక విధమైన ఉత్కర్ష (మనోహరత్వం) కలిగించడంతో పాటు కొన్ని కర్తవ్య విధులు కూడ పూర్తిచేయడం కోసం చేసే అభినయం **నాట్యాయితాభినయం. ఇది పూర్తి అయిన వెంటనే పాత్రల ప్రవేశం జరుగుతుంది.**

**మూ. స్థానే ధ్రువాస్వభినయో యః క్రియతే హర్షశోకరోషాద్యైః,**
**భావరససంప్రయుక్తైర్ జ్ఞేయం నాట్యాయితం తదపి. 47**

**తా.** ధ్రువాలలోని తగు స్థానమునందు హర్షము, శోకము, రోషము మొదలైన భావ – రసాలను ఆవిష్కరించడానికై చేసే అభినయం కూడ నాట్యాయితాభినయమే అని తెలుసుకోవాలి.

**మూ. యత్రాన్యోక్తం వాక్యం సూచాభినయయేన యోజయేదన్యః,**
**తత్సమ్బద్ధార్థకథం భవేన్నివృత్త్యఙ్కురః సోఽథ. 48**

**తా.** ఒక పాత్ర పలికిన వాక్యానికి మరొక పాత్ర సూచాభినయంతో జోడిస్తూ దానితో సంబంధించిన అర్థం గల కథను అభినయం ద్వారా ప్రదర్శిస్తే అది **నివృత్త్యంకురం**.

**మూ. ఏతేషాం తు భవేన్మార్గో యథా భావరసాన్వితః,**
**కావ్యవస్తుషు నిర్దిష్టో ద్వాదశాభినయాత్మకః. 49**

**తా.** కథావస్తువుకు సంబంధించిన, భావ – రసాలతో కూడిన ఈ వాగభినయాలలో పన్నెండు మార్గాలు (రూపాలు) ఉంటాయి.

**మూ. ఆలాపశ్చ ప్రలాపశ్చ విలాపః స్యాత్తథైవ చ,**
**అనులాపోఽథ సంలాపస్త్వపలాపస్తథైవ చ. 50**
**సందేశ్చశ్చాతిదేశశ్చ నిర్దేశః స్యాత్తథాపరః,**
**ఉపదేశోఽపదేశశ్చ వ్యపదేశశ్చ కీర్తితః. 51**

**తా.** ఆలాపము, ప్రలాపము, విలాపము, అనులాపము, సంలాపము, అపలాపము, సందేశము, అతిదేశము, నిర్దేశము, ఉపదేశము, అపదేశము వ్యపదేశము – ఇవి పన్నెండు మార్గాలు.

**మూ. ఆభాషణం తు యద్వాక్యమాలాపో నామ స స్మృతః,**
**అనర్థకం వచో యత్తు ప్రలాపః స తు కీర్తితః. 52**

**తా.** సంభాషణరూప మైన వాక్యం **ఆలాపం**. అర్థరహితమైన వాక్యం **ప్రలాపం**.

**మూ. కరుణప్రభవో యస్తు విలాపః స తు కీర్తితః,**
**బహుశోఽభిహితం వాక్యమనులాప ఇతి స్మృతః. 53**
**ఉక్తిప్రత్యుక్తిసంయుక్తః సంలాప ఇతి కీర్తితః,**
**పూర్వోక్తస్యాన్యథావాదో హ్యపలాప ఇతి స్మృతః. 54**

**తా.** శోకంతో పలికే మాటలు **విలాపం**. చాల పర్యాయాలు చెప్పిన మాట **అనులాపం**. ఉక్తి – ప్రత్యుక్తులతో కూడినది **సంలాపం**. మొదట పలికినది మార్చి వేయడం **అపలాపం**.

**మూ. తదిదం వచనం బ్రూహీత్యేష సన్దేశ ఉచ్యతే,**
**యత్త్వయోక్తం మయోక్తం తత్ సోఽతిదేశ ఇతి స్మృతః. 55**
**స ఏషోఽహం బ్రవీమీతి నిర్దేశ ఇతి కీర్తితః,**
**వ్యాజాన్తరేణ కథనం వ్యపదేశ ఇహోచ్యతే. 56**

**ఇదం కురు గృహాణేతి హ్యుపదేశః ప్రకీర్తితః,**
**అన్యార్థకథనం యత్ స్యాత్ సోఽపదేశః ప్రకీర్తితః. 57**

**తా.** "నువ్వు ఈ మాట వానితో చెప్పు" అని చెప్పినది **సందేశం**. "నువ్వు చెప్పినదే నేను చెప్పాను", అని అంటే అది **అతిదేశం**. "ఇదిగో, ఈ నేను అంటున్నాను" అనడం **నిర్దేశం.** ఏదో వంకతో చెప్పడం **వ్యపదేశం**. 'ఇలా చెయ్యి", "ఇది తీసుకో" అనడం **ఉపదేశం**. ఇతరుల మాటగా చెప్పినది **అపదేశం.**

ఈ మార్గాలు అన్ని వాచికాభినయాల సృష్టికి కారణము. వీటికి మళ్లీ ఏడు విధాల లక్షణం చెపుతాను.

**మూ. ప్రత్యక్షశ్చ పరోక్షశ్చ తథాకాలకృతాస్త్రయః,**
**ఆత్మస్థశ్చ పరస్థశ్చ ప్రకాశః సప్త ఏవ తు. 58**

**తా.** ప్రత్యక్షము, పరోక్షము, భూతము, భవిష్యత్తు, వర్తమానము, ఆత్మస్థము, పరస్థము అని సంవాదస్వరూపంలో ఉన్న వాక్యంలో ఏడు ప్రకారాలు (మార్గాలు) ఉంటాయి.

**మూ. ఏష బ్రవీతి, నాహం భో వదామీతి చ యద్వచః,**
**ప్రత్యక్షశ్చ పరోక్షశ్చ వర్తమానశ్చ తద్ భవేత్. 59**

**తా.** "ఓయీ! ఇలా మాట్లాడుతూన్నది అతడు; నేను ఇలా అనడంలేదు" అని అంటే దీనిలో ప్రత్యక్షమూ, పరోక్షమూ, వర్తమానమూ కూడ కలిసి ఉన్నాయి.

**మూ. అహం కరోమి, గచ్ఛామి, వదామి వచనం తవ,**
**ఆత్మస్థో వర్తమానశ్చ ప్రత్యక్షశ్చైవ స స్మృతః. 60**

**తా.** "నేను చేస్తున్నాను; వెడుతున్నాను; నీ మాట చెపుతున్నాను" – ఈ వాక్యంలో ఆత్మస్థము, వర్తమానము, ప్రత్యక్షమూ కూడ ఉన్నాయి.

**మూ. కరిష్యామి గమిష్యామి వదిష్యామీతి యద్వచః,**
**ఆత్మస్థశ్చ పరోక్షశ్చ భవిష్యత్కాల ఏవ చ. 61**

**తా.** "నేను చేస్తాను; వెడతాను; చెపుతాను" అని అంటే దీనిలో ఆత్మస్థము, పరోక్షము, భవిష్యత్కాలమూ కూడ ఉన్నాయి.

**మూ. హతా జితాశ్చ భగ్నాశ్చ మయా సర్వే ద్విషద్గణాః,**
**ఆత్మస్థశ్చ పరోక్షశ్చ వృత్తకాలశ్చ స స్మృతః. 62**

**తా.** "నేను శత్రువుల నందరినీ సంహరించాను; ఓడించాను; భగ్నులను చేశాను" అను వాక్యంలో ఆత్మస్థము, పరోక్షము, భూతకాలమూ కూడ ఉన్నాయి.

**మూ. త్వయా హతా జితాశ్చేతి యో వదేన్నాట్యకర్మణి,**
**పరోక్షశ్చ పరస్థశ్చ వృత్తకాలస్తథైవ చ. 63**

**తా.** "నీవు శత్రువులను సంహరించావు; జయించావు" అని నాట్యాభినయంలో అంటే దానిలో పరోక్షము, పరస్థము, భూతకాలము ఉన్నాయి.

**మూ. ఏష బ్రవీతి కురుతే గచ్ఛతీత్యాది యద్వచః,**
**పరస్థో వర్తమానశ్చ ప్రత్యక్షశ్చ భవేత్తథా. 64**

**తా.** "ఇతడు అంటున్నాడు, చేస్తున్నాడు, వెడుతున్నాడు" – ఈ విధమైన వాక్యంలో పరస్థము, వర్తమానము, ప్రత్యక్షమూ ఉన్నాయి.

**మూ. స గచ్ఛతి కరోతీతి వచనం యదుదాహృతమ్,**
**పరస్థం వర్తమానం చ పరోక్షం చైవ తద్భవేత్. 65**

**తా.** "అతడు వెడుతున్నాడు; చేస్తున్నాడు" అను వాక్యంలో పరస్థము, వర్తమానము, పరోక్షమూ ఉన్నాయి.

**మూ. కరిష్యన్తి గమిష్యన్తి వదిష్యన్తీతి యద్వచః,**
**పరస్థమేష్యత్కాలం చ పరోక్షం చైవ తద్భవేత్. 66**

**తా.** "చేస్తారు, వెడతారు, చెపుతారు" అను వాక్యంలో పరస్థము, భవిష్యత్కాలము, పరోక్షము ఉన్నాయి.

**మూ. మయాద్యైవ చ సంపాద్యం తత్కార్యం భవతా సహ,**
**ఆత్మస్థశ్చ పరస్థశ్చ వర్తమానశ్చ స స్మృతః. 67**

**తా.** "నేను ఈ పని నీతో కలిసి నేడే చెయ్యాలి" అని అన్నప్పుడు ఆత్మస్థము, పరస్థము, వర్తమానము ఉన్నాయి.

**మూ. హస్తమన్తరితం కృత్వా యద్వదేన్నాట్యకర్మణి,**
**ఆత్మస్థం హృదయస్థం చ పరస్థం చైవ తన్మతమ్. 68**

**తా.** నాట్యప్రయోగసమయంలో పతాకాహస్తం అడ్డం పెట్టుకొని పక్కవానితో మాటలాడి నప్పుడు అది ఆత్మస్థము, హృదయస్థము, పరోక్షము. (తన మనస్సులో ఏదో అప్రత్యక్ష మైన విషయం పరునికే చెప్పబడుతూన్నది).

**మూ. పరేషామాత్మనశ్చైవ కాలస్య చ విశేషణాత్,**
**సప్త ప్రకారస్యాస్యైవ భేదా జ్ఞేయా హ్యనేకథా. 69**

**తా.** ఈ ఏడు విధాల భేదాలలోనే పరులను, తనను, కాలాన్నీ ఇటూ అటూ మారుస్తే అనేకమైన అవాంతరభేదాలు ఏర్పడతాయి.

**మూ. ఏతే ప్రయోగా విజ్ఞేయా మార్గాభినయయోజితాః,**
**ఏతేష్విహ వినిష్పన్నో వివిధోఽభినయో భవేత్. 70**

**తా.** ఇవన్నీ మార్గాభినయప్రయోగంలోని వివిధరీతులు. వీటి ద్వారా అనేకవిధాలైన అభినయం జరుగుతుంది.

**మూ. శిరోవదనపాదోరుజఙ్ఘోదరకటీకృతః,**
**సమః కర్మవిభాగో యః స సామాన్యాభినయస్తు సః. 71**

**తా.** శిరస్సు, ముఖము, పాదాలు, ఊరువులు, కాళ్లు, ఉదరము, కటిప్రదేశము – వీటి అన్నింటియందు అభినయప్రయోగాన్ని సమంగా పంచుతూ, వీటి అన్నింటితోనూ చేసిన అభినయం **సామాన్యాభినయం**.

**మూ. శిరోహస్తకటీవక్షోజఙ్ఘోదరకటీగతః,**
**సహకర్మవిభాగో యః సామాన్యాభినయస్తు సః. 72**

**తా.** శిరస్సు, హస్తాలు, కటిప్రదేశము, వక్షఃస్థలము, కాళ్లు, ఉదరము – వీటి యందు సమంగా విభక్తమైన అభినయకర్మ **సామాన్యభినయం**.

**మూ. లలితైర్హస్తసంచారైస్తథా మృద్వఙ్గచేష్టితైః,**
**అభినేయస్తు నాట్యజ్ఞై రసభావసమన్వితైః. 73**

**తా.** నాట్యమందు మంచి చాతుర్యం గల నటులు రసభావద్యోతకములైన లలితము లైన హస్తసంచారములచేత, మృదువైన ఆంగికచేష్టలచేత ఈ సామాన్యభినయం చెయ్యాలి.

**మూ. అనుద్ధతమసంభ్రాన్తమనావిద్ధాఙ్గచేష్టితమ్,**
**లయతాలకలాపాతప్రమాణనియతాత్మకమ్. 74**

**సువిభక్తపదాలాపమనిష్ఠురమకాహలమ్,**
**యదీదృశం భవేన్నాట్యం జ్ఞేయమాభ్యన్తరం తు తత్. 75**

**తా.** నాట్యంలో ఆభ్యంతరనాట్యము, బాహ్యనాట్యము అని రెండు విధాలున్నాయి. ఆభ్యంతరనాట్యప్రయోగంలో – చేష్టలు చాలా ఉద్ధతంగా ఉండకూడదు. చేష్టలు భ్రాంతిచేత చేయకూడదు (పొరబాటు చేయకూడదు). ఇతరభావాలతోను, క్రియలతోను ఆవిద్ధములు (మిశ్రితములు) కాకూడదు. తగిన లయ, తాలము, కలాప్రమాణాలు నిశ్చితరూపంలో పాటించాలి. సంభాషణలలోని పదాల ఉచ్చారణం స్ఫుటంగా, నిష్ఠురత్వం లేకుండా, మధ్య తడుముకోకుండా ఉండాలి.

**మూ. ఏతదేవ విపర్యస్తం స్వచ్ఛన్దగతిచేష్టితమ్,**
**అనిబద్ధగీతవాద్యం నాట్యం బాహ్యమితి స్మృతమ్. 76**

**తా.** దీనికి విరుద్ధంగా – స్వేచ్ఛగా చేసే గతులతో, చేష్టలతో, గీతవాద్యాల విషయాలలో నియమాలు పాటించకుండా ప్రదర్శించే నాట్యం **బాహ్యానాట్యం.**

**మూ. లక్షణాభ్యన్తరత్వాద్ధి తదాభ్యన్తరమిష్యతే,**
**శాస్త్రబాహ్యం భవేద్యత్తు తద్ బాహ్యమితి భణ్యతే. 77**

**తా.** శాస్త్రంలో చెప్పిన లక్షణాలకు లొంగి ఉన్నది **ఆభ్యంతరం.** శాస్త్ర విరుద్ధమైనది **బాహ్యం.**

**మూ. అనేన లక్ష్యతే యస్మాత్ ప్రయోగః కర్మ చైవ హి,**
**తస్మాల్లక్షణమేతద్ధి నాట్యేఽస్మిన్ సంప్రయోజితమ్. 78**

**తా.** దేనిచేత నాటప్రయోగము, నాట్యానికి సంబంధించిన అభినయాదికర్మ లక్షింపబడుతుందో (గుర్తింపబడుతుందో) అది లక్షణం. ఆ ప్రయోజనాన్నే ఉద్దేశించి దాట్యలక్షణం చెప్పబడింది.

**మూ. అనాచార్యోషితా యే చ యే చ శాస్త్రబహిష్కృతాః,**
**బాహ్యం ప్రయుఞ్జతే తే తు అజ్ఞాత్వాచార్యకీం క్రియామ్. 79**

**తా.** కొందరైతే గురుకులాలలో నాట్యాచార్యశుశ్రూష చేయక, శాస్త్రాలకి దూరులై, శాస్త్రబాహ్యమైన నాట్యం బైట చేసేవాళ్లని చూచి నేర్చుకొని, ఆచార్యులు చెప్పిన పద్ధతులేవీ తెలియకుండా నాట్యప్రయోగాలు చేస్తూంటారు (ఈ నాడు చాలమంది వీథినాటకాలు, సినేమాలు, టివీలు చూచి నృత్యసంగీతాదులు నేర్చుకున్నట్లు).

**మూ. శబ్దం స్పర్శం చ రూపం చ రసం గన్ధం తథైవ చ,**
**ఇన్ద్రియాణీన్ద్రియార్థాంశ్చ భావైరభినయేద్బుధః. 80**

**తా. ఇంద్రియాభినయం :–** శాస్త్రజ్ఞుడు, ఇంద్రియాలను, ఇంద్రియాలచేత గ్రహించే శబ్దము, స్పర్శ, రూపము, రసము, గంధము అనే ఇంద్రియార్థాలను, తగు విధంగా చేష్టలచేత అభినయించాలి.

**మూ. కృత్వా సాచీకృతాం దృష్టిం శిరః పార్శ్వగతం తథా,**
**తర్జనీం కర్ణదేశే చ బుధః శబ్దం వినిర్దిశేత్. 81**

**తా.** తెలివైన నటుడు, అడ్డంగా చూస్తూ శిరస్సు పక్కకు వంచి, తర్జని చెవిదగ్గర ఉంచుకొని శబ్దాన్ని (శబ్దశ్రవణాన్ని) అభినయించాలి.

**మూ. కించిదాకుంచితే నేత్రే కృత్వా భ్రూక్షేపమేవ చ,**
**తథాంసగణ్డయోః స్పర్శాత్ స్పర్శమేవం వినిర్దిశేత్. 82**

**తా.** కళ్లు కొంచెం మూసుకొంటూ, కనుబొమ్మలు పైకెత్తి, బుజాలు ఎత్తి చెక్కిళ్లకు తగలుస్తూ స్పర్శను అభినయించాలి.

**మూ. కృత్వా పతాకౌ మూర్ధస్థౌ కించిత్ ప్రచలితాననః,**
**నిర్వర్ణయన్త్యా దృష్ట్యా చ రూపం త్వభినయేద్బుధః. 83**

**తా.** పతాకహస్తాలు తలమీద ఉంచుతూ, ముఖం కొంచెం కదులుస్తూ, ఏదో పరికించి చూస్తూన్నట్లు దృష్టి పెట్టి రూపాన్ని (రూపదర్శనాన్ని) అభినయించాలి.

**మూ. కించిదాకుంచితే నేత్రే కృత్వోత్ఫుల్లాం చ నాసికామ్,**
**ఏకోచ్ఛ్వాసేన చేష్టౌ తు రసగన్ధౌ వినిర్దిశేత్. 84**

**తా.** కళ్లు కొంచెం మూసి, ముక్కు పుటలు పెద్దవి చేసి, ఒక్క ఊపిరి గట్టిగా పీల్చి తన కిష్టమైన రసమూ, గంధమూ అక్కడ నున్నట్లు అభినయించాలి.

**మూ. పఞ్చానామిన్ద్రియార్థానాం భావా హ్యేతేఽనుభావినః,**
**శ్రోత్రత్వఙ్నేత్రజిహ్వానాం ఘ్రాణస్య చ తథైవ హి. 85**

**తా.** ఈ క్రియల ద్వారా శ్రోత్ర – నేత్ర – జిహ్వా – ఘ్రాణా లనే ఐదు ఇంద్రియాల విషయాల అనుభవం జరుగుతుంది.

**మూ. ఇన్ద్రియార్థాః సమనసో భవన్తి హ్యనుభావినః,**
**న వేత్తి హ్యమనాః కించిద్విషయం పఞ్చధాగతమ్. 86**

**తా.** మనస్సు కలవానికే, మనస్సు సరిగా పనిచేస్తూన్నవానికే ఇంద్రియార్థాలు అనుభవగోచరం అవుతాయి. మనస్సు పనిచేయనివాడు ఐదు విధాలుగా ఉన్న విషయాన్ని (శబ్దాదివిషయాలను) అనుభవింపజాలడు కదా.

**మూ. మనసస్త్రివిధో భావో విజ్ఞేయోఽభినయే బుధైః,**
**ఇష్టస్తథాహ్యనిష్టశ్చ మధ్యస్థశ్చ తథైవ హి. 87**

**తా.** మనస్సుకు ఇష్టము, అనిష్టము, మధ్యస్థము అని మూడు విధాలైన భావా లుంటాయి.

**మూ. ప్రహ్లాదనేన గాత్రస్య తథా పులకితేన చ,**
**వదనస్య వికాసేన కుర్యాదిష్టనిదర్శనమ్. 88**

**తా.** ఆనందమయ మైన చేష్టలచేత, గగుర్పాటుచేత, ముఖం వికసించడంచేత ఇష్టభావాన్ని అభినయించాలి.

**మూ. ఇష్టే శబ్దే తథా రూపే స్పర్శే గన్ధే తథా రసే,**
**ఇన్ద్రియైర్మనసా ప్రాప్తైః సౌముఖ్యం సంప్రదర్శయేత్. 89**

**తా.** ఇష్టమైన శబ్ద – రస – రూప – స్పర్శ – గంధ – రసాల విషయంలో ఇష్టభావం చూపవలసి నప్పుడు మనస్సుతో కూడిన ఇంద్రియాలతో, ఆ శబ్దాదుల విషయంలో సుముఖత్వాన్ని ప్రదర్శించాలి.

**మూ. పరావృత్తేన శిరసా నేత్రనాసావికర్షణైః,**
**చక్షుషశ్చాప్రదానేన హ్యనిష్టమభినిర్దిశేత్. 90**

**తా.** శిరస్సు పక్కకు తిప్పడం, నేత్రాలు, నాసికా ముణుచుకొనడం, ఆ వస్తువుకేసి చూడకపోవడం – ఈ చేష్టలతో అనిష్టభావాన్ని అభినయించాలి.

**మూ. నాతిహృష్టేన మనసా న చాత్యర్థజుగుప్సయా,**
**మాధ్యస్థ్యేనైవ భావేన మధ్యస్థమభినిర్దిశేత్. 91**

**తా.** మనస్సులో ఎక్కువ సంతోషం లేకుండా, ఎక్కువ జుగుప్స కూడ లేకుండా, మాధ్యస్థ్యంతో మధ్యస్థభావాన్ని అభినయించాలి.

**మూ. తేనేదం తస్య వాపీదం స ఏవం ప్రకరోతి వా,**
**పరోక్షాభినయో యస్తు మధ్యస్థ ఇతి స స్మృతః. 92**

**తా.** 'ఈ పని అతడు చేశాడు'; 'ఇది వానిది', 'అతడు ఇలా చేస్తున్నాడు' అంటూ పరోక్షత్వాన్ని అభినయించడం మధ్యస్థభావం.

**మూ. ఆత్మానుభావీ యోర్థః స్యాదాత్మస్థ ఇతి స స్మృతః,**
**పరార్థవర్ణనా యత్ర పరస్థః స తు సంజ్ఞితః. 93**

**తా.** ఒక వ్యక్తి స్వయంగా తాను అనుభవించిన పదార్థం ఆత్మస్థం. పరులచేత అనుభవింపబడి నట్లు చెప్పినది **పరస్థం.**

**మూ. ప్రాయేణ సర్వభావానాం కామాన్నిష్పత్తిరిష్యతే,**
**స చేచ్ఛాగుణసంపన్నో బహుధా పరికల్పితః. 94**
**ధర్మకామోఽర్థకామశ్చ మోక్షకామస్తథైవ చ,**

**తా.** సాధారణంగా సమస్తభావాలూ కామంవల్ల పుడతాయి అని పెద్దలు చెపుతారు. ఇచ్ఛాగుణంతో కూడిన ఈ కామం – ధర్మకామ మనీ, అర్థకామ మనీ, మోక్షకామం అనీ అనేకవిధాలైనది.

**మూ. స్త్రీపుంసయోస్తు యోగో యః స తు కామ ఇతి స్మృతః. 95**
**సర్వస్యైవ హి లోకస్య సుఖదుఃఖనిబర్హణః,**
**భూయిష్ఠం దృశ్యతే కామః స సుఖం వ్యసనేష్వపి. 96**

**తా.** స్త్రీపురుషుల కలయిక కామ మని చెప్పబడుచున్నది. అది సకలలోకులకు సుఖదుఃఖా లిస్తుంది. అయితే కష్టాలలో కూడ ఈ కామమే చాల వరకు సుఖంగానే కనబడుతుంది.

**మూ. యః స్త్రీపురుషసంయోగో రతిసంభోగకారకః,**
**స శృఙ్గార ఇతి జ్ఞేయ ఉపచారకృతః శుభః. 97**

**తా.** ఏ స్త్రీపురుషసంయోగం కామోపచారాలతో కూడి రతి పూర్వకసంభోగాన్ని జరిగే టట్లు చేస్తుందో శుభమైన అది శృంగార మని చెప్పబడుచున్నది.

**మూ. భూయిష్ఠమేవ లోకోఽయం సుఖమిచ్ఛతి సర్వదా,**
**సుఖస్య హి స్త్రియో మూలం నానాశీలాశ్చ తాః పునః. 98**

**తా.** తరచుగా ఈలోకం ఎల్లప్పుడు సుఖమే కావా లని కోరుకొంటుంది. సుఖానికి మూలం స్త్రీలు. ఆ స్త్రీలు అనేకవిధాలైన స్వభావాలవాళ్లు ఉంటారు.

**మూ. దేవాసురగన్ధర్వరక్షోనాగపతత్రిణామ్,**
**పిశాచయక్షవ్యాలానాం నరవానరహస్తినామ్. 99**
**మృగమీనోష్ట్రమకరఖరసూకరవాజినామ్,**
**మహిషాజగవాదీనాం తుల్యశీలాః స్త్రియః స్మృతాః. 100**

**తా.** స్త్రీలు – దేవతలు, అసురులు, గంధర్వులు, రాక్షసులు, నాగులు, పక్షులు, పిశాచాలు – యక్షులు, వ్యాఘ్రాలు, నరులు, వానరులు, ఏనుగులు, మృగాలు, మీనాలు, ఉష్ట్రాలు, మొసళ్లు, గాడిదలు, సూకరాలు అశ్వాలు, మహిషాలు, గోవులు మొదలైన ప్రాణిజాతుల స్త్రీల శీలంతో సమానమైన శీలం కలవాళ్లుగా ఉంటారు.

**మూ. స్నిగ్ధైరఙ్గైరుపాఙ్గైశ్చ స్థితా మన్దనిమేషిణీ,**
**అరోగా దీప్త్యుపేతా చ దానసత్త్వార్జవాన్వితా. 101**
**అల్పస్వేదా సమరతా స్వల్పభుక్ సురతప్రియా,**
**గాన్ధర్వవాద్యాభిరతా దేవశీలాఙ్గనా స్మృతా. 102**

**తా. దేవతాస్త్రీశీలం గల నారి :–** అంగాలు, ఉపాంగాలు నున్నగా ఉంటాయి. స్థిరమైన స్వభావం; మెల్లగా కనురెప్పలు వాలుస్తూంటుంది. రోగా లేవీ లేకుండా దీప్తితో నిండి ఉంటుంది. దానము, సత్త్వము, ఋజుత్వము మొదలైన గుణాలున్నది. చెమట తక్కువ. అన్ని పరిస్థితులలోను సమమైన స్నేహభావం చూపుతుంది. ఆహారం తక్కువగా భుజిస్తుంది. సురతప్రియురాలు. గానం మీదా వాద్యాలమీదా ఆసక్తి కలది. అట్టి స్త్రీ **దేవశీలాంగన.**

**మూ. అధర్మశాఠ్యనిరతా స్థిరక్రోధాతినిష్ఠురా,**
**మద్యమాంసప్రియా నిత్యం కోపనా చాతిమానినీ. 103**

**చపలా చాతిలుబ్ధా చ పరుషా కలహప్రియా,**
**ఈర్ష్యాశీలా చలస్నేహా చాసురం శీలమాశ్రితా. 104**

**తా. అసురశీల :–** అధర్మాచరణంలో ఆసక్తురాలై శఠస్వభావంతో, స్థిరమైన క్రోధంతో నిష్ఠురంగా ప్రవర్తిస్తుంది. మద్యమాంసాలమీద ఎక్కువ ఆసక్తి కలిగి ఉంటుంది. గర్వమూ, చాపల్యము, లుబ్ధత్వము, అత్యధికంగా ఉండి ఎప్పుడు చూచినా కోపంతో ఉంటుంది. కలహప్రియురాలు. పరుషంగా మాటలాడుతుంది. ఈర్ష్యాస్వభావంతో అస్థిరమైన స్నేహభావంతో ప్రవర్తిస్తుంది. ఇట్టి స్త్రీ **అసురశీలాంగన.**

**మూ. క్రీడాపరా చారునేత్రా నఖదన్తైః సుపుష్పితైః,**
**స్వఙ్గీ చ స్థిరభాషీ చ మన్దాపత్యా రతిప్రియా. 105**
**గీతే వాద్యే చ నృత్తే చ రతా హృష్టా మృజావతీ,**
**గన్ధర్వసత్త్వా విజ్ఞేయా స్నిగ్ధత్వక్కేశలోచనా. 106**

**తా. గంధర్వశీల :–** ఆట లంటే ఇష్టం. అందమైన నేత్రాలు, చక్కగా పుష్పించి నట్లున్న గోళ్లు, దంతాలు, అందమైన శరీరావయవాలు – వీటితో మనోహరంగా ఉంటుంది. స్థిరంగా మాటలాడుతుంది. సంతానం తక్కువ. రతిప్రియ, గీత – వాద్య – నృత్తా లంటే చాల ఆసక్తి. శుభ్రత పాటిస్తూ ఎల్లప్పుడు సంతోషంగా ఉంటుంది. చర్మ, జుట్టు, కళ్లూ మెత్తగా మెరుస్తూంటాయి. అట్టి స్త్రీ **గంధర్వశీలాంగన.**

**మూ. బృహద్వ్యాయతసర్వాఙ్గీ రక్తవిస్తీర్ణలోచనా,**
**ఖరలోమా దివాస్వప్ననిరతాత్యుచ్చభాషిణీ. 107**

**నఖదన్తక్షతకరీ క్రోధేర్ష్యాకలహప్రియా,**
**నిశావిహారశీలా చ రాక్షసం శీలమాశ్రితా. 108**

**తా. రాక్షసశీల :–** అవయవా లన్నీ లావుగా పొడవుగా వ్రేలాడు తూంటాయి. పెద్ద పెద్ద ఎఱ్ఱని కళ్లు, చిరుసైన రోమాలు. పగటినిద్ర ఎక్కువ. చాల గట్టిగా (బిగ్గరగా) మాట్లాడుతుంది. నఖక్షతాలూ, దంతక్షతాలూ చేస్తూంటుంది. క్రోధము, ఈర్ష్య అత్యధికంగా ఉంటాయి. ఇతరులతో కలహించడం అన్నా రాత్రులందు తిరగడం అన్నా చాల ఇష్టం. అట్టి స్త్రీ **రాక్షసశీలాంగన.**

**మూ. తీక్ష్ణనాసాగ్రదశనా సుతనుస్తామ్రలోచనా,**
**నీలోత్పలసవర్ణా చ స్వప్నశీలాతికోపనా. 109**

**తిర్యగ్గతిశ్చలారమ్భా బహుశ్వాసాతిమానినీ,**
**గన్ధమాల్యాసవరతా నాగసత్త్వాఙ్గనా స్మృతా. 110**

**తా. నాగశీల :–** కొనదీరిన ముక్కు, సూది దంతాలు, సన్నని శరీరం, ఎఱ్ఱని కళ్లు – వీటితో శరీరచ్ఛాయ నల్లకలువ రంగులో ఉంటుంది. నిద్ర చాల ఎక్కువ. 'ఊఁ' అంటే కోపం. నడక అడ్డంగా నడుస్తున్నట్లుంటుంది. ఏ పనిలోను స్థిరత్వం ఉండదు. శ్వాసలు ఎక్కువగా పీలుస్తూంటుంది. అహంకారం ఎక్కువ. గంధాలన్నా, మాల్యాలన్నా, ఆసవాలన్నా (మద్యాలన్నా) చాల ఆసక్తి. ఇట్టి స్త్రీ **నాగశీలాంగన.**

**మూ. అత్యన్తవ్యావృతాస్యా చ తీక్ష్ణశీలా, సరిత్ప్రియా,**
**సురాసవక్షీరరతా బహ్వపత్యా ఫలప్రియా. 111**

**నిత్యం శ్వసనశీలా చ తథోద్యానవనప్రియా,**
**చపలా బహువాక్ఛీఘ్రా శాకునం సత్త్వమాశ్రితా. 112**

**తా. పక్షిశీల :–** నోరు పెద్దదిగా తెరుచుకుంటుంది. తీక్ష్ణమైన స్వభావం. జలక్రీడలన్నా, సుర (సారా), ఆసవం, పాలు, పళ్లు అంటే చాల ఇష్టం. అధికసంతానం. మాటిమాటికీ ఒగరుస్తూంటుంది. ఉద్యానవనాల్లో తిరగడం ఇష్టం – చపలత్వం ఎక్కువ. వాగుతూనే ఉంటుంది. తొందరపాటు ఎక్కువ. ఇలాంటి స్త్రీ **పక్షిశీలాంగన.**

**మూ. ఊనాధికాఙ్గులికరా రాత్రౌ నిష్కుటచారిణీ,**
**బాలోద్వేజనశీలా చ పిశునా క్లిష్ట (శ్లిష్ట) భాషిణీ. 113**

**సురతేష్వుజ్ఝితాచారా రోమశాఙ్గీ మహాస్వనా,**
**పిశాచసత్త్వా విజ్ఞేయా మద్యమాంసరతిప్రియా. 114**

**తా. పిశాచశీల :–** చేతివేళ్లు ఎక్కువగా గాని తక్కువగా గాని ఉంటాయి, రాత్రులందు ఇంటివెనక పెరళ్లలో తిరుగుతూంటుంది. పిల్లల్ని భయపెడుతుంది. చాడీలు చెపుతుంది. కటువుగా (రెండర్థాలు వచ్చేటట్లు) మాట్లాడుతుంది. సురతసమయాలలో మర్యాదలు పాటించదు. ఒళ్లంతా రోమాలు. బిగ్గరగా అరుస్తుంది. మద్యమాంసాలూ రతీ చాల ఇష్టం. ఇలాంటి స్త్రీ **పిశాచశీలాంగన.**

**మూ. స్వప్నప్రస్వేదనాఙ్గీ చ స్థిరశయ్యాసనప్రియా,**
**మేధావినీ చ మృద్వఙ్గీ మద్యగన్ధామిషప్రియా. 115**

**చిరదృష్టేషు హర్షం చ కృతజ్ఞత్వాదుపైతి సా,**
**అదీర్ఘశాయినీ చైవ యక్షశీలాఙ్గనా స్మృతా. 116**

**తా. యక్షశీల :–** నిద్రలో చెమట ఎక్కువగా కారుస్తుంది. స్థిరంగా ఉండే మంచా

లన్నా ఆసనాలన్నా ఎక్కువ ఇష్టపడుతుంది. బుద్ధిమంతురాలు. శరీరం మెత్తగా ఉంటుంది. మద్యము, సుగంధాలు, మాంసమూ ఇవి చాల ఇష్టం. చాలకాలానికి ఎవరైన కనబడితే కృతజ్ఞతాభావంతో ఎంతో మురిసిపోతుంది. చాలసేపు నిద్రించదు. ఇట్టి స్త్రీ **యక్ష శీలాంగన**.

**మూ. తుల్యమానావమానా యా పరుషత్వక్ ఖరస్వరా,**
**శఠానృతోద్ధతకథా వ్యాలసత్త్వా చ పిఙ్గదృక్. 117**

**తా. వ్యాలశీల :–** మానావమానాలు ఒకే విధంగా తీసికొంటుంది. చర్మ గురుకుగాను, స్వరం కరుకుగాను ఉంటాయి. చాటున అపకారం చేస్తుంది. అబద్ధాల కోరు. మాటలలో అణకువ ఉండదు. పిల్లి కళ్లు, ఇలాంటి స్త్రీ **వ్యాలశీలాంగన**.

**మూ. ఆర్జవాభిరతా నిత్యం దక్షా క్షాన్తిగుణాన్వితా,**
**విభక్తాఙ్గీ కృతజ్ఞా చ గురుదేవద్విజప్రియా. 118**
**ధర్మకామార్థనిరతా హ్యహఙ్కారవివర్జితా,**
**సుహృత్ప్రియా సుశీలా చ మానుషం సత్త్వమాశ్రితా. 119**

**తా. మనుష్యశీల :–** ఎల్లప్పుడు ఋజుత్వంతో ప్రవర్తిస్తుంది. నేర్పు, ఓర్పూ ఉన్నది. అవయవాలు తీర్చిదిద్దిన ట్లుంటాయి. కృతజ్ఞతాభావం కలది. గురు – దేవతా – ద్విజులపై భక్తి ఉన్నది. అహంకారశూన్యురాలై సఖీబంధుజనాదులతో స్నేహభావంతో, ఉత్తమమైన శీలంతో ధర్మ – కామ – అర్థాల విషయంలో శ్రద్ధ వహిస్తుంది. అట్టి స్త్రీ **మనుష్యశీలాంగన**.

**మూ. సంహతాల్పతనుర్ధృష్టా పిఙ్గరోమా ఛలప్రియా,**
**ప్రగల్భా చపలా తీక్ష్ణా వృక్షారామవనప్రియా. 120**
**స్వల్పమప్యుపకారంణ్ణు నిత్యం యా బహుమన్యతే,**
**ప్రసహ్యరతిశీలా చ వానరం సత్త్వమాశ్రితా. 121**

**తా. వానరశీల :–** శరీరం కుదించుకొన్నట్లుగా లావుగా ఉంటుంది. రోమాలు పింగళవర్ణంలో ఉంటాయి. మోసగించడం అంటే చాల ఇష్టం. జంకు లేకుండా తీక్షంగా ఉంటుంది. చపలస్వభావం – చెట్లూ, ఇంటికి ఆనుకొని ఉన్న తోటలు, వనాలు ణ్ణంటే ఇష్టం. ఎవరైనా స్వల్పమైన ఉపకారం చేసినా చాల గొప్పగా భావిస్తుంది. కాముకుణ్ణి బలాత్కరించి రతిని కోరుతుంది. అట్టి స్త్రీ **వానరశీలాంగన**.

**మూ. మహాహనులలాటా చ శరీరోపచయాన్వితా,**
**పిఙ్గాక్షీ రోమశాఙ్గీ చ గన్ధమాల్యాసవప్రియా. 122**
**కోపనా స్థిరచిత్తా చ జలోద్యానవనప్రియా,**

**మధురాభిరతా చైవ హస్తిసత్త్వా ప్రకీర్తితా.** **123**

**తా. హస్తిశీల :–** పెద్ద దౌడలతో, నుదురుతో, శరీరం బలిసి ఉంటుంది. పిల్లి కళ్లు, ఒళ్లంతా రోమాలు, గంధద్రవ్యాలు, మాలికలు, మద్యమూ చాల ఇష్టం. కోపస్వభావం. స్థిరమైన చిత్తం గలది. జలము, ఉద్యానములు, వనాలు వీటిని కోరుకుంటూంటుంది. మధురపదార్థాలను ఇష్టంగా తింటుంది. అట్టి స్త్రీ **హస్తిశీలాంగన.**

**మూ. స్వల్పోదరీ భగ్ననాసా తనుజఙ్ఘా వనప్రియా,**
**చలవిస్తీర్ణనయనా చపలా శీఘ్రగామినీ.** **124**

**దివాత్రాసపరా నిత్యం గీతవాద్యరతిప్రియా,**
**కోపనాస్థిరసత్త్వా చ మృగసత్త్వాఙ్గనా స్మృతా.** **125**

**తా. మృగశీల :–** సన్నని నడుము (పొట్ట), చప్పిడి ముక్కు, సన్నని పిక్కలు, చంచలమైన విశాలమైన నేత్రాలు గల ఈ స్త్రీ చపలస్వభావం గలది. శీఘ్రంగా నడుస్తుంది. పగలు కూడ భయపడే పిరికిది. ఈమెకు గీత – వాద్య – రతులయందు ఆసక్తి అధికం. చిరచిరలాడే స్వభావం. మనస్సుకు స్థైర్యం తక్కువ. ఇట్టి స్త్రీ **మృగశీలాంగన.**

**మూ. దీర్ఘపీనోన్నతోరస్కా చలా నాతినిమేషిణీ,**
**బహుభృత్యా బహుసుతా మత్స్యసత్త్వా జలప్రియా.** **126**

**తా. మత్స్యశీల :–** వక్షఃస్థలం పొడవుగా, ఎత్తుగా బలిసి ఉంటుంది. చంచల స్వభావం గలది. రెప్పపాట్లు తక్కువగా ఉంటాయి. చాలమంది భృత్యులు, పుత్రులు కలది. జలం అంటే చాల ఇష్టపడుతుంది. అలాంటి స్త్రీ **మత్స్యశీలాంగన.**

**మూ. లమ్బోష్ఠీ స్వేదబహులా కించిద్వికటగామినీ,**
**కృశోదరీ పుష్పఫలలవణామ్లకటుప్రియా.** **127**

**ఉద్బన్ధకటిపార్శ్వా చ ఖరనిష్ఠురభాషిణీ,**
**అత్యున్నతకటిగ్రీవా ఉష్ట్రసత్త్వాటవీప్రియా.** **128**

**తా. ఉష్ట్రశీల :–** పెదవులు వేలాడుతూంటాయి. చెమట ఎక్కువ. నడక కొంచెం వికటంగా (వక్రంగా) ఉంటుంది. ఉదరం సన్నంగా ఉండి కటిప్రదేశము, పక్కలు పై వైపునకు వంచి బిగించినట్లుంటాయి. కటువుగాను నిష్ఠురంగాను మాట్లాడుతుంది. కటిప్రదేశము, కంఠమూ, చాల ఎత్తుగా ఉంటాయి. పువ్వులు, పండ్లు, ఉప్పు, పులుపు, చేదు ఇష్టం. అడవులు ఇష్టం. ఇలాంటి స్త్రీ **ఉష్ట్రశీలాంగన.**

**మూ. స్థూలశీర్షాఞ్చితగ్రీవా దారితాస్యా మహాస్వనా,**
**జ్ఞేయా మకరసత్త్వా చ క్రూరా మత్స్యగుణైర్యుతా.** **129**

**తా. మకరశీల :–** శిరస్సు పెద్దదిగా ఉంటుంది. కుదించుకొని పోయిన కంఠం.

చీల్చిన ట్లున్న నోరు. గొప్ప ధ్వని. మీనశీల కుండే లక్షణాలు ఈమెలో కూడ ఉంటాయి. అలాంటి క్రూరమైన స్త్రీ **మకరశీలాంగన.**

**మూ. స్థూలజిహ్వోష్ఠదశనా రూక్షత్వక్కటుభాషిణీ,**
**రతియుద్ధకరీ ధృష్టా, నఖదన్తక్షతప్రియా. 130**

**సపత్నీద్వేషిణీ దక్షా చపలా శీఘ్రగామినీ,**
**సరోషా బహ్వపత్యా చ ఖరసత్త్వా ప్రకీర్తితా. 131**

**తా. ఖరశీల :–** నాలుక, పెదవులు, దంతాలు స్థూలంగా ఉంటాయి. చర్మ బిరుసు. మాట చాల కటువు. ధార్ష్ట్యంతో రతియుద్ధం చేస్తుంది. నఖక్షతా లన్నా దంతక్షతా లన్నా చాల ఇష్టం. సవతులను ద్వేషిస్తుంది. నేర్పు గలది. చపలస్వభావం గలది. శీఘ్రంగా నడుస్తుంది. కోపం ఎక్కువ. సంతానం ఎక్కువ. అలాంటి నారి **ఖరశీలాంగన.**

**మూ. దీర్ఘపృష్ఠోదరముఖీ రోమశాఙ్గీ బలాన్వితా,**
**సుసంక్షిప్తలలాటా చ కన్దమూలఫలప్రియా. 132**

**కృష్ణా దంష్ట్రోత్కటముఖీ హ్రస్వోదరశిరోరుహా,**
**హీనాచారా బహ్వపత్యా సౌకరం సత్త్వమాస్థితా. 133**

**తా. సూకరశీల :–** వీపు, ఉదరము, ముఖమూ పొడవుగా ఉంటాయి. శరీరం అంతా రోమాలతో నిండిఉంటుంది. మంచి బలం కలది. నుదురు చాల చిన్నది. దుంపలు పళ్లూ అంటే చాల ఇష్టం. కోరలతో ఉత్కటంగా ఉన్న ముఖంతో, పొట్టిగా ఉన్న ఉదరంతో, తలవెంట్రుకలతో నల్లగా ఉంటుంది. ప్రవర్తన అతినీచంగా ఉంటుంది. సంతానం ఎక్కువ. అలాంటి స్త్రీ **సూకరశీలాంగన.**

**మూ. స్థిరా విభక్తపార్శ్వోరుకటీపృష్ఠశిరోధరా,**
**సుభగా దానశీలా చ ఋజుస్థూలశిరోరుహా. 134**

**కృశా చఞ్చలచిత్తా చ స్నిగ్ధవాక్ శీఘ్రగామినీ,**
**కామక్రోధపరా చైవ హయసత్త్వాఙ్గనా స్మృతా. 135**

**తా. హయశీల :–** స్థిరస్వభావంగలది. శరీరంలోని పార్శ్వభాగాలు, ఊరువులు కటిప్రదేశము, వీపు, మెడ – ఈ అవయవాలన్నీ దేని కది తీర్చి దిద్దినట్లుంటాయి. సౌందర్యవతి – దానస్వభావం కలది. కేశాలు వంకర లేకుండా, ముతగగా ఉంటాయి. శరీరం సన్నంగా ఉంటుంది. చిత్తస్థైర్యం తక్కువ. మాట స్నేహభరితంగా ఉంటుంది. శీఘ్రంగా నడుస్తుంది. కామమూ, క్రోధమూ కూడ ఎక్కువ. ఇలాంటి నారి **హయ శీలాంగన.**

**మూ. స్థూలపృష్ఠాస్థిదశనా తనుపార్శ్వోదరా స్థిరా,**
**హరిరోమాఞ్చితా రౌద్రీ లోకద్విష్టా రతిప్రియా. 136**
**కించిదున్నతవక్త్రా చ జలక్రీడావనప్రియా,**
**బృహల్లలాటా సుశ్రోణీ మాహిషం సత్త్వమాస్థితా. 137**

**తా. మహిషశీల :-** వెన్నెముక దంతాలు స్థూలంగాను పక్కలూ, ఉదరమూ సన్నగాను ఉంటాయి. స్థిరంగా ఉంటుంది. రోమాలు బూడిదరంగు. భయంకరంగా ఉంటుంది. లోకులు ద్వేషిస్తారు. రతి ప్రియురాలు. ముఖం కొంచెం ఎత్తబడి ఉంటుంది. జలక్రీడ లన్నా వనాలన్నా ఇష్టం. నుదురు, పిరుదులు పెద్దవి. ఇలాంటి స్త్రీ **మహిష శీలాంగన**.

**మూ. కృశా తనుభుజోరస్కా నిష్టబ్ధస్థిరలోచనా,**
**సంక్షిప్తపార్ష్ణిపాదా చ సూక్ష్మరోమసమంచితా. 138**
**భయశీలా జలోద్విగ్నా బహ్యపత్యా వనప్రియా,**
**చఞ్చలా శీఘ్రగమనా హ్యజసత్త్వాఙ్గనా స్మృతా. 139**

**తా. అజశీల :-** సన్నని భుజాలతో, వక్షస్థలంతో శరీరం అంతా సన్నంగా ఉంటుంది. కళ్లు బిగిసికొని పోయి స్థిరంగా ఉంటాయి. పాదాల మణవలు కుదించుకొని పోయి ఉంటాయి. రోమాలు చిన్నవి. భయస్వభావం గలది. నీళ్లంటే భయం. సంతానం అధికం. వనంలో తిరగడం అంటే ఇష్టం. చంచల స్వభావం. శీఘ్రంగా నడుస్తుంది. అట్టి స్త్రీ **అజశీలాంగన**.

**మూ. ఉద్బన్ధగాత్రనయనా విజృమ్భణపరాయణా,**
**దీర్ఘాల్పవదనా స్వల్పపాణిపాదవిభూషితా. 140**
**ఉచ్చైఃస్వనా స్వల్పనిద్రా క్రోధనా సుకృతప్రియా,**
**హీనాచారా కృతజ్ఞా చ శ్వశీలా పరికీర్తితా. 141**

**తా. శ్వశీల :-** శరీరము నేత్రాలూ కూడ పైకి లాగి బిగించిన ట్లుంటాయి. ఎక్కువగా విజృంభిస్తుంది. (ఆవులింతలు చేస్తూంటుంది). పొడవైన చిన్న ముఖంతో చిన్న చేతులతో, కాళ్లతో ఉంటుంది. కంఠధ్వని పెద్దదిగా ఉంటుంది. నిద్ర తక్కువ; కోపం ఎక్కువ. మంచి పనులమీద ఆసక్తి కలది. కాని ప్రవర్తన నీచంగా ఉంటుంది. కృతజ్ఞత ఎక్కువ. అలాంటి స్త్రీ **శ్వ (శునక) శీలాంగన**.

**మూ. పృథుపీనోన్నతశ్రోణీ తనుజఙ్ఘా సుహృత్ప్రియా,**
**సంక్షిప్తపాణిపాదా చ దృఢారమ్భా ప్రజాహితా. 142**

**పితృదేవార్చనరతా సత్యశౌచగురుప్రియా,**
**స్థిరా పరిక్లేశసహా గవాం సత్త్వం సమాశ్రితా. 143**

**తా. గోశీల :–** బలిసిన పెద్ద శ్రోణి కలది. పిక్కలు సన్నం. మిత్రులకు ఇష్టురాలు. చేతులు కాళ్లూ చిన్నవి. ప్రారంభించిన పనిలో స్థిరంగా ఉంటుంది. సంతానం కోరుతూంటుంది. తలిదండ్రులను దేవతలను పూజిస్తుంది. సత్యమన్నా, శౌచమన్నా, గురువులన్నా చాల ఆసక్తి గలది. స్థిరమైన స్వభావం గలది. క్లేశాలను సహిస్తుంది. అలాంటి స్త్రీ **గోశీలాంగన.**

**మూ. నానాశీలాః స్త్రియో జ్ఞేయాః స్వం స్వం సత్త్వం సమాశ్రితాః,**
**విజ్ఞాయ చ యథాసత్త్వముపసేవేత తాః పునః. 144**
**ఉపచారో యథాసత్త్వం స్త్రీణామల్పోఽపి హర్షదః,**
**మహానప్యన్యథాయుక్తో నైవ తుష్టికరో భవేత్. 145**

**తా.** స్త్రీల ప్రవర్తనా శీలమూ కూడ సహజంగా వేరు వేరు విధాలలో ఉంటాయి. వాళ్ల స్వభావాన్ని సరిగా గుర్తించి వాళ్లను సేవించాలి; వాళ్లవల్ల లాభం పొందాలి. వాళ్ల స్వభావానికి అనుగుణంగా చేసిన ఉపచారం (తగు విధంగా చేసిన ఆదరణం) అల్పమైనా స్త్రీలకు సంతోషం కలిగిస్తుంది. వాళ్ల సహజమైన అభిరుచులకు విరుద్ధంగా ఎంత ఉపచారం చేసినా అది వాళ్లకు హర్షం కలిగించదు.

**మూ. యథా సంప్రార్థితావాప్త్యా రతిః సముపజాయతే,**
**స్త్రీపుంసయోశ్చ రత్యర్థముపచారో విధీయతే. 146**

**తా.** ఎవరికైనా – తమ కిష్టమైనది లభిస్తే రతి కలుగుతుంది. స్త్రీపురుషుల మధ్య రతి కలగడం కోసం ఉపయోగించే ఉపచారం (Courteous act; Etiquette) చెప్పబడు చున్నది.

**మూ. ధర్మార్థం హి తపశ్చర్యా సుఖార్థం ధర్మ ఇష్యతే,**
**సుఖస్య మూలం ప్రమదాస్తాసు సంభోగ ఇష్యతే. 147**

**తా.** ధర్మంకొరకై తపస్సు చేస్తారు. సుఖంకోసం ధర్మం కోరుతారు. సుఖానికి మూలం స్త్రీలు, వాళ్లతో సాంగత్యము.

**మూ. కామోపచారో ద్వివిధో నాట్యధర్మేభిధీయతే,**
**బాహ్యశ్చాభ్యన్తరశ్చైవ నారీపురుషసంశ్రయః. 148**
**అభ్యన్తరః పార్థివానాం స చ కార్యస్తు నాటకే,**
**బాహ్యే వేశ్యాగతశ్చైవ స చ ప్రకరణే భవేత్. 149**

**తా.** స్త్రీపురుషులకు సంబంధించిన నాట్యదర్మి యైన, కామోపచారం బాహ్యము, ఆభ్యంతరము అని రెండు విధాలు. నాటకంలో, పార్థివులకు సంబంధించిన కామోపచారం ఆభ్యంతరం మాత్రమే ప్రయోగించాలి. ప్రకరణంలో మాత్రం వేశ్యాసంబంధమైన బాహ్యకామోపచారం ప్రయోగించాలి.

**మూ. తత్ర రాజోపభోగం తు వ్యాఖ్యాస్యామ్యనుపూర్వశః,**
**ఉపచారంవిధిం సమ్యక్ కామతన్త్రసముద్భవమ్. 150**

**తా.** రాజు చేసే కామోపచారవిధానాన్ని కామశాస్త్రానుసారం స్పష్టంగా విశదీకరిస్తాను.

**మూ. త్రివిధా ప్రకృతిః స్త్రీణాం నానాసత్త్వసముద్భవా,**
**బాహ్యా చాభ్యన్తరా చైవ స్యాద్బాహ్యాభ్యన్తరాపరా. 151**
**కులీనాభ్యన్తరా జ్ఞేయా బాహ్యా వేశ్యాఙ్గనా స్మృతా,**
**కృతశౌచా తు యా నారీ సా బాహ్యాభ్యన్తరా స్మృతా. 152**
**అన్తఃపురోపచారే తు కులజా కన్యకాపి వా.**

**తా.** పైన వర్ణించిన వివిధమృగశీలాలు గల స్త్రీలలో బాహ్య, ఆభ్యంతర, బాహ్యాభ్యంతర అను మూడు విధాల ప్రకృతు లుంటాయి. సత్కులంలో పుట్టిన స్త్రీ ఆభ్యంతర ప్రకృతి. వేశ్యాస్త్రీ బాహ్యప్రకృతి. అంతఃపురోపచారంలో ఉన్న (అంతఃపురంలో పరిచారికగా ఉన్న) కులజ కాని, కన్యక కాని, శుద్ధమైన చరిత్ర కల దైతే, ఆమె బాహ్యాభ్యం తరప్రకృతి.

**మూ. న హి రాజోపచారే తు బాహ్యస్త్రీభోగ ఇష్యతే. 153**
**ఆభ్యన్తరో భవేద్రాజ్ఞో బాహ్యో బాహ్యజనస్య చ,**
**దివ్యవేశ్యాఙ్గనానాం హి రాజ్ఞా భవతి సంగమః. 154**

**తా.** రాజోపచారంలో బాహ్యస్త్రీసంబంధం అంగీకార్యం కాదు. రాజుకు ఆభ్యంతర ప్రకృతిసంబంధం ఉండాలి; బాహ్యజనులకు బాహ్యప్రకృతిసంబంధం ఉండాలి. అయితే రాజుకు అప్సరః స్త్రీలతో సంబంధం ఉండవచ్చు.

**మూ. కులజాకామితం యచ్చ తద్ జ్ఞేయం కన్యకాస్వపి,**
**యా చాపి వేశ్యా సా ప్యత్ర యథైవ కులజా తథా. 155**

**తా.** కులజవిషయంలో చెప్పబడిన ప్రణయవ్యవహారం కన్యకల విషయంలో కూడ వర్తిస్తుంది. ఈ నాట్యధర్మిలో వేశ్య కూడ కులజవలెనే (ప్రణయవ్యవహారంలో) ప్రవర్తించాలి.

**మూ. ఇహ కామసముత్పత్తిర్నానాభావసముద్భవా,**
**స్త్రీణాం వా పురుషాణాం వా ఉత్తమాధమమధ్యమా. 156**

**తా.** స్త్రీపురుషుల మధ్య ఉత్తమం, మధ్యమం, అధమం అను మూడు విధా లైన ప్రణయం అనేకకారణాలవల్ల జనిస్తుంది.

**మూ. శ్రవణాద్దర్శనాద్రూపాదఙ్గలీలావిచేష్టితైః,**
**మధురైశ్చ సమాలాపైః కామః సముపజాయతే. 157**

**తా.** గుణాలను గూర్చి వినడంచేత, చూడడంచేత, సౌందర్యంచేత, విలాసపూర్వక మైన శారీరచేష్టలచేత, మధురసంభాషణలచేత స్త్రీపురుషుల మధ్య కామం (ప్రేమ) ఏర్పడుతుంది.

**మూ. తతః కామయమానానాం నృణాం స్త్రీణామథాపి చ,**
**కామభావేఙ్గితానీహ తద్‌జ్ఞః సములక్షయేత్. 158**

**తా.** తెలివైనవాడు – స్త్రీపురుషులలో కనబడే, కామంవల్ల కలిగే చేష్టలను బట్టి వాళ్లు పరస్పరము ప్రేమతో ఉన్నారు అని గుర్తించకలుగుతాడు.

**మూ. రూపగుణాదిసమేతం కలాదివిజ్ఞానయౌవనోపేతమ్,**
**దృష్ట్వా పురుషవిశేషం నారీ మదనాతురా భవతి. 159**

**తా.** రూపము, సద్గుణాలు మొదలైనవి, కలాదుల విజ్ఞానము ఉన్న నవయువకుని చూడగానే నారిని మదనోద్రేకం ఆవహిస్తుంది.

**మూ. లలితా చలపక్ష్మా చ సాస్రా చ ముక్షులేక్షణా,**
**ప్రస్తోత్తరపుటా చైవ కామ్యా దృష్టిర్భవేదిహ. 160**

**తా.** అలాంటి అవస్థలో లలితమైన "కామ్యాదృష్టి"ని ప్రయోగించాలి. ఈ దృష్టిలో రెప్పలు చంచలము లవుతాయి. కన్నీరు కమ్ముతుంది. కళ్లు కొంచెం ముకుళీభవిస్తాయి. పై కనురెప్ప క్రింది వైపు జారుతుంది.

**మూ. వలితాన్తా సలాలిత్యసంమితైర్వ్యఙ్జితై స్తథా,**
**దృష్టిః సా లలితా నామ స్త్రీణామర్థావలోకనే. 161**

**తా.** నేత్రాంతాలు కదులుతూ, మనోహరమైన రీతిలో వివిధభావాలను వ్యంజింప చేస్తూ ప్రసరింపచేసే దృష్టి **లలితదృష్టి**. స్త్రీల క్రీకంటిచూపులలో ఈ లలితదృష్టిని ఉపయోగించాలి.

**మూ. ఈషత్సరక్తగణ్డస్తు సస్వేదలవచిత్రితః,**
**ప్రస్పన్దమానరోమాఞ్చో ముఖరాగో భవేదిహ. 162**

**తా.** ఈ అవస్థలో – చెక్కిళ్లు కొంచెం ఎఱ్ఱపడతాయి. చెమట చుక్కలు ఆ చెక్కిళ్ల మీద కనబడతాయి. రోమాంచం కనబడుతుంది. ఈ విధమైన ముఖరాగం అభి

నయించాలి.

**మూ. కామ్యేనాఙ్గవికారేణ సకటాక్షనిరీక్షితైః,**
**తథాభరణసంస్పర్శైః కర్ణకణ్డూయనైరపి. 163**
**అఙ్గుష్ఠాగ్రవిలిఖనైః స్తననాభిప్రదర్శనైః,**
**నఖనిస్తోదనాచ్చైవ కేశసంయమనాదపి. 164**
**వేశ్యామేవంవిధైర్భావైర్లక్షయేన్మదనాతురామ్.**

**తా. అనురాగావస్థలో వేశ్యచేష్టలు :–** కామంచేత శరీరంమీద కలిగిన వికారాలతో వేశ్య, క్రీకంటిచూపుతో చూస్తుంది; శరీరంమీద ఉన్న అలంకారం మాటి మాటికీ తడుముతూంటుంది. చెవి గోక్కుంటుంది. కాలి బొటనవేలుతో నేలమీద రాస్తుంది. ఏదో వంకతో నాభిప్రదేశమూ, స్తనాలూ ప్రదర్శిస్తుంది. గోళ్లు శుభ్రం చేసుకొంటూంటుంది. జుట్టు ముడివేసుకొంటూంటుంది. ఈ చేష్టలను బట్టి ఆమె మదనాతురయై ఉన్నట్లు గుర్తించాలి. (ఈ చేష్టల ద్వారా, వేశ్య కామాన్ని సూచిస్తూ అభినయించాలి).

**మూ. కులజాయాస్తథా చైవ ప్రవక్ష్యామీఙ్గితాని తు. 165**
**ప్రహసన్తీవ నేత్రాభ్యాం ప్ర (స) తతం చ నిరీక్షతే,**
**స్మయతే సా నిగూఢం చ వాచం చాధోముఖీ వదేత్. 166**
**స్మితోత్తరా మన్దవాక్యా స్వేదాకారనిగూహనీ,**
**ప్రస్పన్దితాధరా చైవ చకితా చ కులాఙ్గనా. 167**

**తా. అనురాగావస్థలో కులాంగన చేష్టలు :–** కులజనాయిక అనురాగచేష్టలు చెపుతున్నాను – కులజ, కళ్లతో నవ్వుతుందా అన్నట్లు మాటి మాటికి చూస్తుంది. చాటుగా నవ్వుతుంది. తల వంచి మాట్లాడుతుంది. చిరునవ్వు నవ్వుతూ మెల్లగా మాట్లాడుతుంది. చెమటను, ఆకారాన్నీ కప్పిపుచ్చుకొంటుంది. ఆమె అధరోష్ఠం అదురు తూంటుంది. బెదురుతూన్న ట్లుంటుంది.

**మూ. ఏవంవిధైః కామలిఙ్గైరప్రాప్తసురతోత్సవా,**
**దశస్థానగతం కామం నానాభావైః ప్రదర్శయేత్. 168**

**తా.** సురతోత్సవం పొందజాలని నాయిక పది అవస్థలలో సంబంధించిన తన కామాన్ని అనేకవిధాలైన ప్రేమసూచకాలైన ఈ రకాలైన చేష్టాదులచేత ప్రదర్శించాలి.

**మూ. ప్రథమే త్వభిలాషః స్యాద్ ద్వితీయే చిన్తనం భవేత్,**
**అనుస్మృతిస్తృతీయే తు చతుర్థే గుణకీర్తనమ్. 169**

**ఉద్వేగః పఞ్చమే ప్రోక్తో విలాపః షష్ఠ ఉచ్యతే,**
**ఉన్మాదః సప్తమే జ్ఞేయో భవేద్వ్యాధిస్తథాష్టమే. 170**

**నవమే జడతా చైవ దశమే మరణం భవేత్,**
**స్త్రీపుంసయోరేష విధిర్లక్షణం చ నిబోధత. 171**

**తా.** శృంగారావస్థలలో మొదటిది **అభిలాష;** రెండవది **చింతనం;** మూడవది **అనుస్మృతి;** నాల్గవది **గుణకీర్తనం;** ఐదవది **ఉద్వేగం;** ఆరవది **విలాపం;** ఏడవది **ఉన్మాదం;** ఎనిమిదవది **వ్యాధి;** తొమ్మిదవది **జడత;** పదవది **మరణం.** ఇవి స్త్రీపురుషు లిద్దరికీ కలిగేవి. వీటి లక్షణాలు వినండి.

**మూ. వ్యవసాయాత్సమారబ్ధః సంకల్పేచ్ఛాసముద్భవః,**
**సమాగమోపాయకృతః సోఽభిలాషః ప్రకీర్తితః. 172**

**తా. అభిలాష :–** సంకల్పంవల్లా ఇచ్ఛవల్లా పుట్టి సమాగమోపాయంకొరకై చేసే ప్రయత్నంతో ప్రారంభమైన తీవ్రమైన కోరిక **అభిలాష.**

**మూ. నిర్యాతి విశతి ముహుః, కరోతి చాకారమేవ మదనస్య,**
**తిష్ఠతి చ దర్శనపథే ప్రథమస్థానే స్థితా కామే. 173**

**తా.** కామప్రథమస్థానమైన అభిలాషలో ఉన్న యువతి మాటిమాటికి ఇంట్లోనుండి బైటకు వెడుతూంటుంది, లోపలికి వస్తూంటుంది. మన్మథాకారంతో (అనురాగసూచనతో) ప్రియునికి కనబడాలని ప్రయత్నిస్తూంటుంది.

**మూ. కేనోపాయేన సంప్రాప్తిః కథం వాసౌ భవేన్మమ,**
**దూతీనివేదితైర్భావైరితి చిన్తాం నిదర్శయేత్. 174**

**తా. చింత :–** "వానిని ఏ ఉపాయంచేత పొందగలను? అతడు నావా డెలా అవుతాడు" అంటూ తన భావాలను దూతికి తెలుపుతూ చింతను ప్రదర్శించాలి.

**మూ. ఆకేకరార్ధవిప్రేక్షితాని వలయరశనాపరామర్శః,**
**నీవీనాభ్యాః సంస్పర్శనం చ కార్యం ద్వితీయే తు. 175**

**తా.** ఈ రెండవ అవస్థలో అర్ధనిమీతలితనేత్రాలతో వంకరగా చూడడం, వలయాలను, వడ్డాణమును స్పృశిస్తూండడము, వస్త్రం ముడినీ నాభినీ స్పృశిస్తూం డడము – ఇలాంటి పను లన్నీ చెయ్యాలి.

**మూ. ముహుర్ముహుర్నిఃశ్వసితైర్మనోరథవిచిన్తనైః,**
**ప్రద్వేషాచ్చాన్యకార్యాణామనుస్మృతిరుదాహృతా. 176**

**తా. అనుస్మృతి :–** మాటి మాటికి నిట్టూర్పులు విడవడంచేత, మనోరథాన్ని నెవరు వేసుకొనడంచేత, ఇతరకార్యాలను ద్వేషించడంచేతా **అనుస్మృతి** అని తెలుసు కోవాలి. వీటి కన్నింటికీ అనుస్మృతి కారణం అని అర్థం.

**మూ. నైవాసనే న శయనే ధృతిముపలభతే స్వకర్మణి,**
**తచ్చిన్తోపగతత్వాత్ తృతీయమేవం ప్రయుఞ్జీత. 177**

**తా.** ప్రియుని గూర్చిన చింతతో ఉండడంచేత కూర్చున్నా, శయనించినా స్థైర్యాన్ని, ధైర్యాన్ని పొందజాలదు. తాను చేయవలసిన పని విషయంలో స్థిరత్వం చూపదు. మూడవదైన అనుస్మృతిని ఈ విధంగా ప్రదర్శించాలి.

**మూ. అఙ్గప్రత్యఙ్గలీలాభిర్వాక్చేష్టాహసితేక్షితైః,**
**నాస్త్యన్యః సదృశస్తేనేత్యేతత్ స్యాత్ గుణకీర్తనమ్. 178**

**తా. గుణకీర్తనం :–** "అంగప్రత్యంగాలలోగాని, మాటలలో గాని, చేష్టలలో గాని, నవ్వులో గాని, చూపులలో గాని వానితో సమానమైనవాడు మరొక డెవడూ లేడు" అనడం **గుణకీర్తనం.**

**మూ. గుణకీర్తనోల్లాసనైరశ్రుస్వేదాపమార్జనైశ్చాపి,**
**దూత్యవిరహవిస్రమ్భైరభినయయోగశ్చతుర్థే తు. 179**

**తా.** ఈ నాల్గవ అవస్థను ప్రియుని గుణాలను చెప్పడంలో ఆసక్తి చూపడంచేతా, కన్నీరు, చెమట తుడుకొంటూండడంచేత, ప్రియాసమాగమం తప్పక కలుగుతుంది అని దూతి ధైర్యం చెపుతూండడంచేత అభినయించాలి.

**మూ. ఆసనే శయనే చాసి న తుష్యతి న తిష్ఠతి,**
**నిత్యమేవోత్సుకా చ స్యాదుద్వేగస్థానమాస్థితా. 180**

**తా. ఉద్వేగం :–** మదనావస్థలో ఉద్వేగస్థానంలో ఉన్న నాయిక సుఖంగా కూర్చోలేక, శయనించలేక, ఒక చోట నిలబడలేక నిత్యమూ "ఎప్పుడా ప్రియసమాగమం!" అన్న ట్లుంటుంది.

**మూ. చిన్తా నిఃశ్వాసఖేదేన హృద్దాహాభినయేన చ,**
**కుర్యాత్తదేవమత్యన్తముద్వేగాభినయేన చ. 181**

**తా.** చింత, నిట్టూర్పులు, ఖేదము, హృదయంలో బాధ – వీటితో **ఉద్వేగాభినయం** చెయ్యాలి.

**మూ. ఇహ స్థిత ఇహాసీన ఇహ చోపగతో మయా,**

**ఇతి తైస్తైర్విలపితైర్విలాపం సంప్రయోజయేత్. 182**

**తా. విలాపం :-** "ఇక్కడ నిలబడ్డాడు; ఇక్కడ కూర్చున్నాడు; నేనిక్కడ ఆతనిని సమీపించాను" ఇలా ఏవేవో మాటలు పలుకుతూ **విలాపాన్ని** అభినయించాలి.

**మూ. ఉద్విగ్నాత్యర్థమౌత్సుక్యాదధృత్యా చ విలాసినీ,**
**తతస్తతశ్చ భ్రమతి విలాపస్థానమాశ్రితా. 183**

**తా.** ప్రణయావస్థలో, విలాపస్థానంలో ఉన్న నాయిక, ఉద్వేగంతో, ఔత్సుక్యంతో, ధైర్యం (స్థిరత్వం) లేక ఏమేమో మాటలాడుతూ, ఇటూ అటూ తిరుగుతుంది.

**మూ. తత్సంశ్రితాం కథాం యుఙ్క్తే సర్వావస్థాగతాపి వా,**
**పుంసః ప్రద్వేష్టి చాప్యన్యాన్యున్మాదః సంప్రకీర్తితః. 184**

**తా. ఉన్మాదం :-** మదనపరవశ యైనది, అన్ని అవస్థలలోనూ ఆ ప్రియునికి సంబంధించిన విషయాలే చెపుతూంటుంది. ఇతరపురుషులను ద్వేషిస్తుంది. ఇది **ఉన్మాదం**.

**మూ. తిష్ఠత్యనిమిషదృష్టిర్దీర్ఘం నిఃశ్వసితి గచ్ఛతి ధ్యానమ్,**
**రోదితి విహారకాలే నాట్యమిదం స్యాత్తథోన్మాదే. 185**

**తా.** రెప్పపాటు లేకుండా అదో రకంగా చూస్తూ నిలబడిపోతుంది. దీర్ఘంగా నిట్టూర్పులు విడుస్తుంది. ధ్యానంలోనికి వెళ్లిపోతూంటుంది. విహారసమయాలలో ఏడుస్తుంది. ఉన్మాదాన్ని ఈవిధంగా అభినయించాలి.

**మూ. సామదానార్థసంభోగైః కామ్యైః సంప్రేషణైరపి,**
**సర్వైర్నిరాకృతైః పశ్చాద్ వ్యాధిః సముపజాయతే. 186**

**తా. వ్యాధి :-** సామదానాలు, ఇష్టమైన వివిధపదార్థాలను పంపడము, ఇవన్నీ పనిచేయనప్పుడు వ్యాధి జనిస్తుంది.

**మూ. ముహ్యతి హృదయం క్వాపి ప్రయాతి శిరసశ్చ వేదనా తీవ్రా,**
**న ధృతిం చాప్యుపలభతే హ్యష్టమమేవం ప్రయుఞ్జీత. 187**

**తా.** మోహం చెందుతూంటుంది. మనసు ఎక్కడికో పోతుంది. తీవ్రమైన తలనొప్పి కలుగుతుంది. ధైర్యం కోల్పోతుంది. ఎనిమిదవదైన వ్యాధి అను స్థానాన్ని ఈ విధంగా అభినయించాలి.

**మూ. పృష్టా న కించిత్ ప్రబ్రూతే న శృణోతి న పశ్యతి,**
**హా కష్టవాక్యా తూష్ణీకా జడతాయాం గతస్మృతిః. 188**

**తా. జడత :-** జడతాదశలో ఉన్న నాయిక స్మృతి కోల్పోయి ఏదైనా అడిగినా

సమాధానం చెప్పదు. వినదు; చూడదు. హా! హా! అంటూ మౌనంగా ఉండిపోతుంది.

**మూ. అకాణ్డే దత్తహుంకారా తథా ప్రశిథిలాఙ్గికా,**
**శ్వాసగ్రస్తాననా చైవ జడతాభినయే భవేత్. 189**

**తా.** అకారణంగా, సమయం కాని సమయంలో హుంకారంచేస్తూ, అవయవాలన్నీ శిథిలమై పోయి, ధీర్ఘశ్వాసలచేత వాడిపోయిన ముఖంతో జడతను అభినయించాలి.

**మూ. సర్వైః కృతైః ప్రతీకారైర్యది నాస్తి సమాగమః,**
**కామాగ్నినా ప్రదీప్తాయా జాయతే మరణం తతః. 190**

**తా. మరణం :-** అన్ని ప్రతిక్రియలూ విఫలం అయిపోయి, ప్రియసమాగమం కలగకపోవడంతో కామాగ్నిదాహంచేత మరణదశ ఏర్పడుతుంది.

**మూ. ఏవం స్థానాని కార్యాణి కామతన్త్రం సమీక్ష్య తు,**
**అప్రాప్తౌ యాని కామ్యస్య వర్జయిత్వా తు నైధనమ్. 191**

**తా.** మనోరథం నెరవేరనప్పుడు కలిగే ఈ స్థానాలను, కామశాస్త్రానుసారం కల్పించి అభినయించాలి. మరణం (ప్రాణాలు పోవడం) మాత్రం ప్రదర్శించకూడదు.

**మూ. వివిధైః పురుషోఽ ప్యేవం విప్రలమ్భసముద్భవైః,**
**భావైరేతాని కామస్య నానారూపాణి యోజయేత్. 192**

**తా. పురుషుని ప్రణయావస్థలు :-** పురుషుడు కూడ వియోగంవల్ల కలిగే అనేకవిధాలైన స్థితులను, వేరు వేరు చేష్టలచేత, పైన చెప్పిన విధంగానే అభినయించాలి (ప్రదర్శించాలి).

**మూ. ఏవం కామయమానానాం నృణాం స్త్రీణామథాపి వా,**
**సామాన్యగుణయోగేన యుఞ్జీతాభినయం బుధః. 193**

**తా.** నాట్యప్రయోగనిపుణుడు, కామాతురులైన పురుషుల ప్రణయావస్థల నైనా స్త్రీల ప్రణయావస్థలనైనా, (ఈ క్రింది) సామాన్యగుణాలు కూడ చేర్చి అభినయింపచెయ్యాలి.

**మూ. చిన్తానిఃశ్వాసఖేదేన హృద్దాహాభినయేన చ,**
**తథానుగమనాచ్చాపి తథైవోర్ధ్వనిరీక్షణాత్. 194**
**ఆకాశవీక్షణాచ్చాపి తథా దీనప్రభాషణాత్,**
**స్పర్శనాన్మోటనాచ్చాపి, తథా సాపాశ్రయాశ్రయాత్. 195**
**ఏభిర్నానాశ్రయోత్పన్నై ర్విప్రలమ్భసముద్భవైః,**
**కామస్థానాని సర్వాణి భూయిష్ఠం సంప్రయోజయేత్. 196**

**తా.** చింత, నిట్టూర్పులు, అలసట, గుండెలో మండిపోతున్నట్లు అభినయం, ప్రియణ్ణి

అనుసరించి వాని వెనుకనే వెళ్లడం, పైకి చూస్తూండడం, ఆకాశం వైపు చూడడం, దీనంగా మాట్లాడడం, అలంకారాదులను స్పృశిస్తూండడం, ఏదో ఒక వస్తువును ఆధారంగా పట్టుకొంటూండడం, ఈ విధంగా వియోగంవల్ల కలిగిన, అనేక చేష్టలతో కామావస్థాదులను ప్రదర్శింపచెయ్యాలి.

**మూ. స్రజో భూషణగన్ధాంశ్చ గృహాణ్యుపవనాని చ,**
**కామాగ్నినా దహ్యమానః శీతలాని నిషేవతే. 197**

**తా.** కామాగ్నిలో మాడిపోతూన్నవాడు చల్లని పుష్పమాలలూ, భూషణాలు, సుగంధ ద్రవ్యాలూ, గృహాలు, ఉద్యానాలు సేవిస్తాడు.

**మూ. ప్రదహ్యమానః కామార్తో బహుస్థానసమర్దితః,**
**ప్రేషయేత్ కామతో దూతీం కామావస్థాప్రదర్శినీమ్. 198**

**సందేశం చైవ దూత్యాస్తు ప్రదద్యాన్మదనాశ్రయమ్,**
**తస్యేయం సమవస్థేతి కథయేద్వినయేన సా. 199**

**తా.** అనేకమైన మన్మథావస్థలలో నలిగిపోయి, దహింపబడుతూన్న కామార్తుడు తన అవస్థను గూర్చి వర్ణించి చెప్ప గల దూతిని పంపాలి. తన మన్మథబాధను గూర్చి తెలిపే సందేశాన్ని ఆ దూతికి ఇవ్వాలి. ఆ దూతి నాయికదగ్గరికి వెళ్లి వినయపూర్వకంగా ఆ సందేశాన్ని ఆమెకు చెప్పాలి.

**మూ. అథావేదితకామార్థో రత్యుపాయం విచిన్తయేత్,**
**అయం విధిర్విధానజ్ఞైః కార్యః ప్రచ్ఛన్నకామితే. 200**

**తా.** తన మన్మథబాధను ప్రియురాలికి తెలిపిన తరువాత రతికి ఉపాయం ఆలోచించాలి. ప్రచ్ఛన్నకామవృత్తాంతంలో, నాట్యవిధానం తెలిసినవాళ్లు ఈ పద్ధతి అవలంబించాలి.

**మూ. విధిం రాజోపచారస్య పునర్వక్ష్యామి తత్త్వతః,**
**అభ్యన్తరగతం సమ్యక్ కామతన్త్రసముద్భవమ్. 201**

**తా.** ఇప్పుడు అభ్యంతరస్త్రీల విషయంలో రాజులు అనుసరించవలసిన ప్రణయోప చారపద్ధతిని, కామశాస్త్రానుసారం విశదీకరిస్తాను.

**మూ. సుఖదుఃఖకృతాన్ భావాన్ నానాశీలసముత్థితాన్,**
**యాన్ యాన్ ప్రకురుతే రాజా తాంస్తాన్ లోకోఽనువర్తతే. 202**

**తా.** అనేకవిధాలైన శీలాలవల్ల కలిగిన, సుఖదుఃఖాలకు కారణభూతాలైన, ఏ ఏ

పద్ధతులను రాజు అనుసరిస్తాడో వాటినే సామాన్యజనులు కూడ అనుసరిస్తారు.

**మూ. న దుర్లభాః పార్థివానాం స్త్ర్యర్థమాజ్ఞాకృతా గుణాః,**
**దాక్షిణ్యాత్తు సముద్భూతః కామో రతికరో భవేత్. 203**

**తా.** రాజులు ఆజ్ఞామాత్రంచేతనే స్త్రీలవిషయంలో ఉత్తమమైన గుణాలను (కావలసిన ఫలాలను) పొందవచ్చును. కాని నేర్పుతో సాధించిన కామం రతికరం (ఆనందజనకం) గా ఉంటుంది.

**మూ. బహుమానేన దేవీనాం వల్లభానాం భయేన చ,**
**ప్రచ్ఛన్నం కామితం రాజ్ఞా కార్యం పరిజనం ప్రతి. 204**

**తా.** పట్టపురాణులమీద ఉన్న గౌరవంచేతా, ఇతరభార్యలకు భయపడుతూ రాజులు కూడ పరిజనం విషయంలో ప్రణయవ్యాపారం ప్రచ్ఛన్నంగా (రహస్యంగా) జరపాలి.

**మూ. యద్యప్యస్తి నరేన్ద్రాణాం కామతన్త్రమనేకధా,**
**ప్రచ్ఛన్నకామితం యత్తు తద్వై రతికరం భవేత్. 205**
**యద్వామాభినివేశిత్వం యతశ్చ వినివార్యతే,**
**దుర్లభత్వం చ యన్నార్యా సా కామస్య పరా రతిః. 206**

**తా.** రాజులు అనుసరించే కామతంత్రం అనేకవిధాలుగా ఉన్నట్లు చెప్పబడినా కూడ ప్రచ్ఛన్నకామవ్యవహారంలోనే అధికమైన ఆనందం ఉంది. చెడ్డ పని విషయంలో పట్టుదల ఉండడం, మధ్య మధ్య విఘ్నాలు ఏర్పడుతూండడం, ఏ స్త్రీ విషయంలో అభిలాష ఏర్పడినదో ఆమె లభించడంలో శ్రమపడవలసి ఉండడం. ఇవన్నీ ఉంటేనే కామవ్యవహారం అత్యానందకరం అవుతుంది.

**మూ. రాజ్ఞామన్తఃపురజనే దివాసంభోగ ఇష్యతే,**
**బాహ్యోపచారో యశ్చైషాం స రాత్రౌ పరికీర్తితః. 207**

**తా.** రాజులకు అంతఃపురజనంతో దివాసంభోగం నిషిద్ధం కాదు. వీళ్లకు బాహ్యస్త్రీల ఉపచారం మాత్రం రాత్రియందే జరగాలి.

**మూ. పరిపాట్యాం, పలార్థే వా నవే ప్రసవ ఏవ వా,**
**దుఃఖే చైవ ప్రమోదే చ షడేతే వాసకాః స్మృతాః. 208**

**తా.** వంతుప్రకారము గాని, సంతానం కోసం గాని, కొత్త పరిచయంలో కాని, ప్రసవానంతరం కాని, దుఃఖసమయంలో కాని, ఆనందసమయంలో కాని, ఈ ఆరు కారణాలను పురస్కరించుకొని రాజులు స్త్రీతో రాత్రి గడపవచ్చును.

**వి.** వాసకం అనగా ప్రియురాలితో గడిపే ఒక రాత్రి. (అభి.భా.)

**మూ. ఉచితే వాసకే స్త్రీణామృతుకాలేఽపి వా నృపైః,**
**ప్రేష్యాణామథవేష్టానాం కార్యం చైవోపసర్పణమ్. 209**

**తా.** రాజులు తగిన వాసకమునందు గాని, ఋతుకాలంలో అంతఃపురస్త్రీల దగ్గరకు, ప్రేష్యలైన స్త్రీల దగ్గరకు, ఇష్టలైన స్త్రీలదగ్గరకూ కూడ వెళ్లవచ్చును.

**మూ. తత్ర వాసకసజ్జా చ విరహోత్కణ్ఠితాపి వా,**
**స్వాధీనభర్తృకా చాపి కలహాన్తరితాపి వా. 210**

**ఖణ్డితా విప్రలబ్ధా వా తథా ప్రోషితభర్తృకా,**
**తథాభిసారికా చైవ జ్ఞేయాస్త్వష్టౌ తు నాయికాః. 211**

**తా. ఎనిమిది నాయికాభేదాలు :-** వాసకసజ్జ, విరహోత్కంఠిత, స్వాధీనభర్తృక, కలహాంతరిత, ఖండిత, విప్రలబ్ధ, ప్రోషితభర్తృక, అభిసారిక అని నాయికలు ఎనిమిది విధాలు.

**మూ. ఉచితే వాసకే యా తు రతిసంభోగలాలసా,**
**మణ్డనం కురుతే హృష్టా సా వై వాసకసజ్జికా. 212**

**తా. వాసకసజ్జిక :-** తగిన వాసకమునందు (వంతు ప్రకారం రాజు తన వద్దకు రావలసిన రాత్రియందు) రతిసంభోగమునందు అత్యధికమైన వాంఛతో, సంతోషంతో అలంకరించుకొనుచున్న నాయిక **వాసకసజ్జిక.**

**మూ. అనేకకార్యవ్యాసంగాద్యస్యా నాగచ్ఛతి ప్రియః,**
**తదనాగత(మ)దుఃఖార్తా విరహోత్కణ్ఠితా తు సా. 213**

**తా. విరహోత్కంఠిత :-** అనేకమైన ఇతరకార్యాల ఒత్తిడిచేత ప్రియుడు రాకపోవ డంతో దుఃఖార్త యైన నాయిక **విరహోత్కంఠిత.**

**మూ. సురతాతిరసైర్బద్ధో యస్యాః పార్శ్వే తు నాయకః,**
**సాన్ద్రామోదగుణప్రాప్తా భవేత్ స్వాధీనభర్తృకా. 214**

**తా. స్వాధీనభర్తృక :-** సురతాత్యాసక్తిచేత బుద్ధుడై నాయకు డెల్లప్పుడూ తన పక్కనే ఉండడంచేత అత్యధికంగా ఆనందభరితురాలైన నాయిక **స్వాధీనభర్తృక.**

**మూ. ఈర్ష్యాకలహనిష్క్రాన్తో యస్యా నాగచ్ఛతి ప్రియః,**
**సామర్షవశసంప్రాప్తా కలహాన్తరితా భవేత్. 215**

**తా. కలహాంతరిత :-** కలహించి కోపంతో ఇల్లు విడిచిపోయిన ప్రియుడు ఇంటికి రాకపోవడంచేత అమర్షంతో నిండిన మనస్సు గల నాయిక **కలహాంతరిత.**

**మూ. వ్యాసఙ్గాదుచితే యస్యా వాసకే నాగతః ప్రియః,**
**తదనాగమదుఃఖార్తా ఖణ్డితా సా ప్రకీర్తితా. 216**

**తా. ఖండిత :–** కార్యాంతరవ్యాసంగంచేత ప్రియుడు రావలసిన వాసకమునందు రాకపోవడంచేత దుఃఖపీడుతురా లైన నాయిక **ఖండిత**.

**మూ. యస్యా దూతీం ప్రియః ప్రేష్య దత్త్వా సంకేతమేవ వా,**
**నాగతః కారణేనేహ విప్రలబ్ధా తు సా భవేత్. 217**

**తా. విప్రలబ్ధ :–** ప్రియుడు దూతిచేత సందేశం పంపి, సంకేతస్థానం (కలియవలసిన ప్రదేశం) నిర్ణయించి చెప్పి కూడ ఎదో కారణంచేత రాకపోవడంతో దుఃఖితురా లైన నాయిక **విప్రలబ్ధ** (మోసగించబడినది).

**మూ. గురుకార్యాన్తరవశాద్ యస్యా వై ప్రోషితః ప్రియః,**
**ప్రరూఢాలకకేశాన్తా భవేత్ ప్రోషితభర్తృకా. 218**

**తా. ప్రోషితభర్తృక :–** ఏదో గొప్ప పనిమీద ప్రియుడు దేశాంతరంలో ఉండగా, తగు సంస్కారాదులు లేక వికృతంగా తయారైన ముంగురులు, జుట్టూ గల నాయిక **ప్రోషితభర్తృక**.

**మూ. హిత్వా లజ్జాం తు యాశ్లిష్టా మదేన మదనేన చ,**
**అభిసారయతే కాన్తం సా భవేదభిసారికా. 219**

**తా. అభిసారిక :–** అత్యధికమైన మదంచేత మన్మథావేశంచేతా సిగ్గు విడిచి కాంతుని కలవడం కొరకు వెళ్లే నాయిక **అభిసారిక**.

**మూ. ఆస్వవస్థాసు విజ్ఞేయా నాయికా నాటకాశ్రయాః,**
**ఏతాసాం చైవ వక్ష్యామి కామతన్త్రమనేకధా. 220**

**తా.** నాటకంలోని నాయికలు ఈ అవస్థలలో ఉన్నట్లు ప్రదర్శించాలి. వీళ్ల అనేకవిధాలైన కామోపభోగపద్ధతులను విశదీకరిస్తాను.

**మూ. చిన్తా నిఃశ్వాసఖేదేన హృద్దాహాభినయేన చ,**
**సఖీభిః సహ సంలాపైరాత్మావస్థావలోకనైః. 221**

**గ్లానిదైన్యాశ్రుపాతైశ్చ రోషస్యాగమనేన చ,**
**నిర్భూషణమృజాత్వేన దుఃఖేన రుదితేన చ. 222**

**ఖణ్డితా విప్రలబ్ధా వా కలహాన్తరితాపి వా,**
**తథా ప్రోషితకాన్తా చ భావానేతాన్ ప్రయోజయేత్. 223**

**తా.** ఖండిత, విప్రలబ్ధ, కలహాంతరిత, ప్రోషితకాంత – ఈ నాలుగు విధాల నాయికలు ఈ భావాల అభినయంలో – చింత, నిఃశ్వాసాలు, ఖేదము, హృదయదాహము, సఖురాళ్లతో సంలాపము, తన అవస్థను చూసుకొంటూండడము, గ్లాని, దైన్యం, కనీళ్లు కార్చడం, రోషం తెప్పించుకొనడం, భూషణాలు శరీరసంస్కారము లేకపోవడము, దుఃఖము, ఏడ్పు – వీటిని జోడించాలి.

**మూ. విచిత్రోజ్జ్వలవేషా తు ప్రమోదోద్ద్యోతితాననా,**
**ఉదీర్ణశోభా చ తథా కార్యా స్వాధీనభర్తృకా. 224**

**తా.** స్వాధీనభర్తృకనాయికను విచిత్రమైన మెరిసిపోతూన్న వేషంతో, ఆనందంతో వెలిగిపోతూన్న ముఖంతో, అత్యధికమైన శోభతో నిండి ఉన్నట్లు ప్రదర్శించాలి.

**మూ. వేశ్యాయాః కులజాయాశ్చ ప్రేష్యాయాశ్చ ప్రయోక్తృభిః,**
**ఏభిర్భావవిశేషైస్తు కర్తవ్యమభిసారణమ్. 225**

**తా.** వేశ్యలూ, కులస్త్రీలు, ప్రేష్యలూ అభిసారికలుగా ప్రియుల దగ్గరికి ఈ క్రింది విధంగా వెడుతూన్నట్లు నాట్యప్రయోక్తలు ప్రదర్శించాలి.

**మూ. సమదా మృదుచేష్టా చ తథా పరిజనావృతా,**
**నానాభరణచిత్రాఙ్గీ గచ్ఛేద్వేశ్యాఙ్గనా శనైః. 226**

**తా.** వేశ్యాంగన పరివారం తన వెంట వస్తూండగా, చక్కగా అలంకరించుకొని మదంతో, మృదువైన (సుకుమారమైన) చేష్టలతో మెల్లగా అభిసరణం చెయ్యాలి.

**మూ. సంలీనా స్వేషు గాత్రేషు త్రస్తా వినమితాననా,**
**అవగుణ్ఠనసంవీతా గచ్ఛేత్తు కులజాఙ్గనా. 227**

**తా.** కులజాంగన తన అవయవాలలో ముణుచుకొనిపోతూ, భయపడుతూ, తలవంచుకొని, మేలి ముసుగుతో శరీరం కప్పుకొని అభిసరణం చెయ్యాలి.

**మూ. మదస్ఖలితసంలాపా విభ్రమోత్ఫుల్లలోచనా,**
**ఆవిద్ధగతిసంచారా గచ్ఛేత్ ప్రేష్యా సముద్ధతమ్. 228**

**తా.** మదంచేత మాటలు తడబడుతూ, విలాసలచేత వికసించిన నేత్రాలతో, ప్రేష్య అడుగుల తొట్రుబాటుతో పొగరుగా నడుస్తూ అభిసరించాలి.

**మూ. గత్వా సా చేద్ యదా తత్ర పశ్యేత్ సుప్తం ప్రియం తదా,**
**అనేన తూపచారేణ తస్య కుర్యాత్ ప్రబోధనమ్. 229**

**తా.** ప్రియుని గృహం చేరేసరికి అతడు నిద్రపోతూంటే వానిని ఈ ఉపచారంచే మేల్కొలపాలి.

**మూ. అలఙ్కారేణ కులజా వేశ్యా గన్ధైస్తు శీతలైః,**
**ప్రేష్యా తు వస్త్రవ్యజనైః కుర్వీత ప్రతిబోధనమ్. 230**

**తా.** కులజస్త్రీ అలంకారాల ధ్వనులచేత, వేశ్య చల్లని సుగంధద్రవ్యాలచేత, ప్రేష్య వింజామరచేత మేల్కొల్పాలి.

**మూ. నిర్భర్త్సితపరం ప్రాయస్తథాశ్వాసనపేశలమ్,**
**నిష్ఠురం మధురం చైవ సఖీనామపి జల్పనమ్. 231**

**తా.** అలాంటి సమయాలలో సఖురాళ్ల సంభాషణలు భయపెట్టడంకోసం చేసేవి గాను, సాధారణంగా ధైర్యం చెప్పే ధోరణిలోను, ఒకప్పుడు నిష్ఠురంగాను, మధురంగాను ఉండాలి.

**మూ. కులాఙ్గనానామేవాయం నోక్తః కామాశ్రయో విధిః,**
**సర్వావస్థానుభావ్యం హి యస్మాద్ భవతి నాటకమ్. 232**

**తా.** ఇక్కడ కేవలం కులాంగనల ప్రణయవ్యవహారమే కాక వేశ్యాదులకు సంబంధించినది కూడ చెప్పబడింది. ఎందువల్ల ననగా నాటకంలో (నాట్యంలో) అన్ని విధాలైన అవస్థల ప్రదర్శనం చేయవలసి ఉంటుంది.

**మూ. నవకామప్రవృత్తాయాః క్రుద్ధాయా వా సమాగమే,**
**సాపదేశైరుపాయైస్తు వాసకం సంప్రయోజయేత్. 233**

**తా.** ప్రేమవ్యవహారాలతో కొత్తగా పరిచయం ఉన్న నాయికను లేదా సమాగమానికి అంగీకరించకుండా క్రోధంతో ఉన్న నాయికను ఏవో వంకలతో కూడిన ఉపాయాలతో సమాగమానికి అంగీకరింపచెయ్యాలి.

**మూ. నానాలఙ్కారవస్త్రాణి గన్ధమాల్యాని చైవ హి,**
**ప్రియాయోజితభుక్తాని నిషేవేత ముదాన్వితః. 234**

**తా.** ప్రియురాలు ధరించి అనుభవించిన అనేకవిధాలైన అలంకారాలను, వస్త్రాలను, గంధ – మాల్యాలను ఆనందపూర్వకంగా సేవించాలి (ధరించాలి).

**మూ. న తథా భవతి మనుష్యో మదనవశః కామినీమలభమానః,**
**ద్విగుణోపజాతహర్షో భవతి యథా సంగతః ప్రియయా. 235**

**తా.** ప్రియురాలిని పొందని, మదనవశుడైన పురుషుడు, ఆమెతో కలిసి నప్పుడు ఏ విధంగా రెండురెట్లు హర్షం కలవా డవుతాడో ఆ విధంగా (ఏ ఇతర ఉపాయంచేతా కూడ) హర్షావిష్టుడు కాజాలడు.

**మూ. విలాసభావేఙ్గితవాక్యలీలామాధుర్యవిస్తారగుణోపపన్నః,**
**పరస్పరప్రేమనిరీక్షితేన సమాగమః ప్రేమకృతస్తు కార్యః. 236**

**తా.** విలాసలు, భావము, చేష్టలు, మాటలు, లీల, మాధుర్యము మొదలైన అధికమైన గుణాల సూచనలచేతా, పరస్పరమూ ప్రేమపూర్వకంగా చూడడంచేతా, ప్రేమభావంతో జరిగిన నాయికానాయకుల సమాగమాన్ని నాట్యంలో ప్రదర్శించాలి.

**మూ. తతః ప్రవృత్తే మదనే ఉపచారసముద్భవే,**
**వాసోపచారః కర్తవ్యః నాయకాగమనం ప్రతి. 237**

**తా.** ఉపచారంవల్ల కలిగిన ప్రేమభావం ప్రవర్తించిన పిమ్మట నాయిక నాయకుని ఎదురుచూస్తూ సమాగమానికి తగిన నివాసాదికం సిద్ధం చేయడం మొదలైన సంనాహం చెయ్యాలి.

**మూ. గన్ధమాల్యే గృహీత్వా తు చూర్ణవాసస్తథైవ చ,**
**ఆదర్శే లీలయా గృహ్యాశ్ఛన్దతో వా పునః పునః. 238**

**తా.** నాయకునికొరకు ఎదురుచూస్తూన్న నాయిక సుగధద్రవ్యాలు, పుష్పమాలలు, సుగంధచూర్ణం చల్లిన వస్త్రము – ఇవన్నీ ధరించి విలాసపూర్వకంగా అద్దం పట్టుకోవాలి. (అద్దంలో చూచుకొంటూ అలంకరించుకోవాలి). అవసరాన్ని పట్టి మాటిమాటికీ కూడ అద్దం పట్టవచ్చును.

**మూ. వాసోపచారే నాత్యర్థం భూషణగ్రహణం భవేత్,**
**రశనానూపురప్రాయం స్వనవచ్చ ప్రశస్యతే. 239**

**తా.** సమాగమోపచారంలో భూషణాలు అధికంగా ధరించకూడదు. వడ్డాణము (పూసలు, మణులు గుచ్చిన మొలతాడు) నూపురము, ఇలాంటి చప్పుడు చేసే అలంకారాలు ధరించడం మంచిది.

**మూ. నామ్బరగ్రహణం రఙ్గే న స్నానం న విలేపనమ్,**
**నాఞ్జనం నాఙ్గరాగశ్చ కేశసంయమనం తథా. 240**

**తా.** (స్త్రీల వేరు వేరు అవస్థలు మొదలైనవాటిని అభినయించేటప్పుడు) స్త్రీలు వస్త్రం ధరించడం, స్నానం, శరీరానికి సుగంధద్రవ్యాలు పూసుకొనడం, కాటుక పెట్టుకొనడం, శరీరానికి రంగులు పూసుకొనడం, జుట్టు ముడిపెట్టుకొనడం – ఇదేమీ రంగస్థలంమీద ప్రదర్శించకూడదు.

**మూ. నాసావృతా నైకవస్త్రా న రాగమధరస్య తు,**
**ఉత్తమా మధ్యమా వాపి కుర్వీత ప్రమదా క్వచిత్. 241**

**తా.** ఉత్తమస్త్రీ కాని, మధ్యమస్త్రీ కాని ఏ సమయంలోనూ కూడ సరియైన వస్త్రధారణం లేకుండా గాని, ఏకవస్త్రంతో కాని రంగస్థలంమీదికి రాకూడదు. అధరోష్ఠానికి రంగు పూసికొనకూడదు.

**మూ. అధమానాం భవేదేష సర్వ ఏవ విధిః సదా,**
**తాసామపి హ్యసభ్యం యన్న తత్కార్యం ప్రయోక్తృభిః. 242**

**తా.** పైన నిషేధించినవి అధమస్త్రీలు చేయవచ్చు. అయితే వాళ్లు కూడ అసభ్యమైన పనులు చేస్తున్నట్లు, ప్రయోక్తలు ప్రదర్శించకూడదు.

**మూ. ప్రేష్యాదీనాం చ నారీణాం నరాణాం వాపి నాటకే,**
**భూషణగ్రహణం కార్యం పుష్పగ్రహణమేవ వా. 243**

**తా.** సేవకులైన స్త్రీలు, పురుషులు కూడ, నాటకంలో, రంగస్థలంమీద, భూషణాలు గాని, పుష్పాలు కాని ధరిస్తూన్నట్లు చూపవచ్చును.

**మూ. గృహీతమణ్డనా చాపి ప్రతీక్షేత ప్రియాగమమ్,**
**లీలయా మణ్డితం వేషం కుర్యాద్యన్న విరుధ్యతే. 244**

**తా.** బాగా అలంకరించుకొని నాయిక ప్రియుని రాకకోసం నిరీక్షించాలి. లీలాపూర్వకంగా, పెద్దప్రయత్నం ఏమీ లేకుండా తనను తాను అలంకరించుకోవాలి. ఆ సమయానికి ఏది విరుద్ధంగా ఉండదో ఆ వేషమే ధరించాలి.

**మూ. విధివద్వాసకం కుర్యాన్నాయికా నాయకాగమే,**
**ప్రతీక్షమాణా చ తతో నాలికాశబ్దమాదిశేత్. 245**

**తా.** నాయకుడు వచ్చే సమయానికి నాయిక యథావిధిగా ప్రణయవ్యవహారానికి తగిన ఏర్పాట్లన్నీ చేసుకొని, ఆతని రాకకై నిరీక్షిస్తూ నాళికల ధ్వని వినాలి.

**వి.** నేటి గంటల గడియారాలు వలె పూర్వకాలంలో గడియలను సూచించే యంత్రాలేవో గొట్టాల (నాళికల) రూపంలో ఉండేవి ఏర్పరచుకొని ఎన్ని గడియలో తెలుపు శబ్దం చేసేవారు.

**మూ. శ్రుత్వా తు నాళికాశబ్దం నాయకాగమవిక్లబా,**
**విషణ్ణా వేపమానా చ గచ్ఛేత్తోరణమేవ చ. 246**

**తా.** నాళికాశబ్దం విని, నాయకుని రాకను గూర్చి వ్యాకులచిత్తురాలై, దిగులు చెంది, వణుకుచు, సింహద్వారం దగ్గరికి (బైటనున్న ద్వారం దగ్గరికి) వెళ్లాలి.

**మూ. తోరణం వామహస్తేన కవాటం దక్షిణేన చ,**
**గృహీత్వా తోరణశ్లిష్టా సంప్రతీక్షేత నాయకమ్. 247**

**తా.** ప్రధానద్వారం నిలపకమ్మి ఎడమ చేతితోను, తలుపు కుడిచేతితోను పట్టుకొని, ద్వారం కమ్మికి ఆనుకొని నాయకునికోసం ఎదురుచూస్తూ నిలబడాలి.

**మూ. శఙ్కాం చిన్తాం భయం చైవ ప్రకుర్యాత్తోరణాశ్రితా,**
**అదృష్ట్వా రమణం నారీ విషణ్ణా చ క్షణం భవేత్. 248**

**తా.** రమణుడు వస్తూన్నట్లు కనబడకపోవడంతో, తోరణాన్ని ఆనుకొని నిలచి, శంక చింత భయము ప్రదర్శిస్తూ క్షణకాలం పాటు విషాదం చెందాలి.

**మూ. దీర్ఘం చైవ వినిఃశ్వస్య నయనామ్బు నిపాతయేత్,**
**సన్నం చ హృదయం కృత్వా విసృజేదఙ్గమాసనే. 249**

**తా.** దీర్ఘంగా నిట్టూర్చి, కన్నీళ్లు కారుస్తూ, హృదయం ఖేదంతో నిండగా తన శరీరాన్ని ఆసనంమీద పడవెయాలి.

**మూ. వ్యాక్షేపాద్విమృశేచ్చాపి నాయకాగమనం ప్రతి,**
**తైస్తైర్విచారణోపాయైః శుభాశుభసముత్థితైః. 250**

**తా.** నాయకుడు రావడంలో అలస్యం అవడంలో కారణం ఏమై ఉంటుందా అని, శుభమైన కారణాలు, అశుభమైన కారణాలూ రెండు విధాలూ కూడ ఆలోచించడం ప్రదర్శించాలి.

**మూ. గురుకార్యేణ మిత్రైర్వా మన్త్రిణా రాజ్యచిన్తయా,**
**అనుబద్ధః ప్రియః కిం ను ధృతో వల్లభయాపి వా. 251**

**తా.** ఏదో గురువైన పని రావడంచేతనో, మిత్రులు కాని, మంత్రి కాని రావడం చేతనో, రాజ్యానికి సంబంధించిన ఆలోచనలమూలానో ప్రియుడు రాలేదా, లేక ఎవరో ప్రియురాలు అడ్డుతగిలిందా అనుకొంటూ ఆలోచనలో మునిగిపోవాలి.

**మూ. ఉత్పాతాన్నిర్దిశేచ్చాపి శుభాశుభసముత్థితాన్,**
**నిమిత్తైరాత్మసంస్థైస్తు స్ఫురితైః స్పన్దితైరపి. 252**

**తా.** తన శరీరంమీద కనబడే – అవయవాలు కదలడం, అదరడం వంటి, శుభాశుభసూచకాలైన శకునాలను ప్రదర్శించాలి.

**మూ. శోభనేషు తు కార్యేషు నిమిత్తం వామతః స్త్రియాః,**
**అనిష్టేష్వథ సర్వేషు నిమిత్తం దక్షిణం భవేత్. 253**

**తా.** స్త్రీలకు శుభమైన ఫలం లభించ నున్నప్పుడు నిమిత్తం (శకునం) ఎడమ వైపునా, అశుభఫలం కలగబోయేటప్పుడు కుడివైపునా కనబడుతుంది.

**మూ. సవ్యం నేత్రం లలాటం చ భ్రూనాసోష్ఠం తథైవ చ,**
**ఊరుబాహుస్తనం చైవ స్ఫురేద్యది సమాగమః. 254**

**తా.** ప్రియసమాగమం కలుగుతుంది అంటే – ఎడమప్రక్క నున్న నేత్ర – లలాట – భ్రూ – నాసికా – ఓష్ఠ – ఊరు – బాహు – స్తనాలు అదురుతాయి.

**మూ. ఏతేషామన్యథాభావే దుర్నిమిత్తం వినిర్దిశేత్,**
**దర్శనే దుర్నిమిత్తస్య మోహం గచ్ఛేత్ క్షణం తతః. 255**

**తా.** ఇందుకు విపరీతంగా కుడివైపు అవయవాలలో జరిగితే అది అశుభసూచకం. అలాంటి దేదైనా కనబడితే క్షణకాలంపాటు స్పృహ కోల్పోయిన ట్లవాలి.

**మూ. అనాగమే నాయకస్య కార్యో గణ్డాశ్రయః కరః,**
**భూషణే చాప్యవజ్ఞానం రోదనం చ సమాచరేత్. 256**

**తా.** నాయకుడు రానప్పుడు అలంకారాల విషయంలో అనాదరభావం చూపుతూ, ఏడుస్తూ, చెక్కిలి అరచేతిలో ఆన్చి కూర్చోవాలి.

**మూ. అథ చేత్ శోభనం తత్ స్యాన్నిమిత్తం నాయకాగమే,**
**సూచ్యో నాయికయాసన్నో గన్ధాఘ్రాణేన నాయకః. 257**

**తా.** మంచి శకునం కనబడి నాయకుడు వస్తాడు అను సూచన జరిగినపుడు, నాయకుని సుగంధం ఆఘ్రాణిస్తున్నట్లు అభినయిస్తూ నాయకుడు దగ్గరనే ఉన్నట్లు సూచించాలి.

**మూ. దృష్ట్వా చోత్థాయ సంహృష్టా ప్రత్యుద్గచ్ఛేద్యథావిధి,**
**తతః కాన్తం నిరీక్షేత ప్రహర్షోత్ఫుల్లలోచనా. 258**

**తా.** ఆతనిని చూడగానే లేచి, సంతోషంతో యథావిధిగా ఎదురు వెళ్లి స్వాగతించాలి. అత్యంతానందంతో వికసించిన నేత్రాలతో ప్రియుణ్ణి చూడాలి.

**మూ. సఖీస్కన్ధార్పితకరా కృత్వా స్థానకమాయతమ్,**
**దర్శయేత తతః కాన్తం సచిహ్నం సరసవ్రణమ్. 259**

**తా.** సఖురాలి బుజంమీద చేయి ఆనుకొని 'ఆయతస్థానకం'లో నిలబడి, ఏవేవో గుర్తులు, ఇంకా ఆరని నఖక్షతాదులూ శరీరంమీద కనబడుతూన్న ప్రియుణ్ణి అపరాధినిగా గుర్తించాలి.

**మూ. యది స్యాదపరాద్ధస్తు తతస్తైస్తైరుపక్రమైః,**
**ఉపాలమ్భకృతైర్వాక్యైరుపాలభ్యస్తు నాయకః. 260**
**మానావమానసంమోహైరవహిత్థభయక్రమైః.**

**తా.** నాయకుడు అపరాధం చేసి నట్లు నిర్ధారణ అయితే అప్పు డాతనిని, నిందా వాక్యాలతోను, కోపం చూపడం, తనకు జరిగిన అవమానాన్ని గుర్తు చేయడం వంటి వాటితోను, సంమోహ – అవహిత్థ – భయాలతోను నిందించాలి.

**మూ. వచనస్య సముత్పత్తిః స్త్రీణామీర్ష్యాకృతా భవేత్. 261**
**విశ్రమ్భస్నేహరాగేషు సందేహే ప్రణయే తథా,**
**పరితోషే చ ఘర్షే చ దాక్షిణ్యాక్షేపవిభ్రమే. 262**
**ధర్మార్థకామయోగేషు ప్రచ్ఛన్నవచనేషు చ,**
**హాస్యే కుతూహలే చైవ సంభ్రమే వ్యసనే తథా. 263**
**స్త్రీపుంసయోః క్రోధకృతే పృథజ్ మిశ్రే తథాపి వా,**
**అనాభాష్యోఽపి సంభాష్యః ప్రియ ఏభిస్తు కారణైః. 264**

**తా.** ఈర్ష్య కలిగిన స్త్రీలు (ప్రియుడు మాట్లాడడానికి) ముందుగానే మాట్లాడ వచ్చును. అదే విధంగా – విశ్వాసము (నమ్మకం కుదరడం), స్నేహము, అనురాగము, సందేహము, ప్రణయము, సంతోషము, కలహము, దాక్షిణ్యము (మంచితనం), ఆక్షేపము, విలాస, ధర్మ – అర్థ – కామాలకు సంబంధించిన విషయాలు, రహస్యమైన విషయం చెప్పడం, హాస్యం, కుతూహలం, తొందర, వ్యసనము, స్త్రీపురుషుల మధ్య కోపం కలిగినప్పుడు, ఆ కోపం దూరంగా ఉన్నప్పుడు వచ్చినా, దగ్గరగా ఉన్నప్పుడు వచ్చినా – ఈ కారణాలచేత, మాట్లాడకూడనివాడైనా ప్రియునితో ముందు మాట్లాడవచ్చును.

**మూ. యత్ర స్నేహో భవేత్తత్ర ఈర్ష్యా మదనసంభవా,**
**చతస్రో యోనయస్తస్యాః కీర్త్యమానా నిబోధత. 265**

**తా.** స్నేహం ఉన్నవాని విషయంలో ప్రణయంచేత ఈర్ష్య (కోపం) కలుగు తూంటుంది. దానికి నాలుగు కారణా లుంటాయి; తెలుసుకొండి.

**మూ. వైమనస్యం వ్యలీకం చ విప్రియం మన్యురేవ చ,**
**ఏతేషాం సంప్రవక్ష్యామి లక్షణాని యథాక్రమమ్. 266**

**తా.** వైమనస్యము, వ్యలీకము, విప్రియము, మన్యువు – ఈ నాలుగూ ప్రణయ కోపకారణాలు. వీటి లక్షణం చెపుతాను; వినండి.

**మూ. నిద్రాఖేదాలసగతిం సచిహ్నాం సరసవ్రణమ్,**
**ఏవంవిధం ప్రియం దృష్ట్వా వైమరస్యం భవేత్ స్త్రియాః. 267**

**తా.** నిద్రచేత అలసటచేత మెల్లగా నడుస్తూ, సంభోగచిహ్నాలతో కొత్త నఖక్షతాదులతో ఉన్న ప్రియుణ్ణి చూడగానే స్త్రీలకు వైమనస్యం కలుగుతుంది. (మనస్సు విరిగిపోతుంది).

**మూ. తీవ్రాసూయితవచనాద్ బహుశః ప్రకమ్పమానోష్ఠీ,**
**సాధ్వితి సుష్ఠ్వితి వచనైః శోభతే ఇత్యేవమభినేయమ్. 268**

**తా.** తీవ్రమైన అసూయతో పలికే మాటలతోను, కోపంతోను పెదవులు బాగా వణికిపోతూ – 'సాధు' (మంచిది!), 'సుష్ఠు' (బాగుంది!), 'శోభతే' (అందంగా ఉంది!) అంటూ వైమనస్యాన్ని అభినయించాలి.

**మూ. బహుధా వార్యమాణోఽపి యస్తస్మిన్నేవ దృశ్యతే,**
**సంఘర్షమత్సరాత్తత్ర వ్యలీకం జాయతే తతః. 269**

**తా.** అలా చేయవద్దని ఎన్ని మార్లు చెప్పినా ఆ పనే చేస్తూన్న ప్రియునితో ఘర్షణపడి కోపంతో ఉన్న నాయికకు 'వ్యలీకం' (Mixed feeling) కలుగుతుంది.

**మూ. కృత్వోరసి వామకరం దక్షిణహస్తం తథా విధున్వన్త్యా,**
**చరణవినిష్టబ్ధేన చ కార్యోఽభినయో వ్యలీకే తు. 270**

**తా.** ఎడమచెయ్యి వక్షస్థలంమీద ఉంచి, కుడి చెయ్యి ఊపుతూ, పాదాలు నేలమీద కదలకుండా ఆన్చి 'వ్యలీకాన్ని' అభినయించాలి.

**మూ. జీవన్త్యాం త్వయి జీవామి దాసోఽహం త్వం చ మే ప్రియా,**
**ఉక్త్వైవం యోఽన్యథా కుర్యాద్విప్రియం తత్ర జాయతే. 271**

**తా.** "నీవు జీవిస్తేనే నేను జీవిస్తాను", "నేను నీ దాసుణ్ణి", "నువ్వే నా ప్రియురాలవు" అంటూనే మరొక విధంగా ప్రవర్తించేవాని విషయంలో స్త్రీకి 'విప్రియం' కలుగుతుంది.

**మూ. దూతీలేఖప్రతివచనభేదనైః క్రోధహసితరుదితైశ్చ,**
**విప్రియకరణేఽభినయః సశిరఃకమ్పైశ్చ కర్తవ్యః. 272**

**తా.** ప్రియుడు పంపిన దూతి మాటలకు, ఆతని లేఖలకు, ప్రశ్నలకు ప్రతివచనం ఇవ్వకుండా వాటిని తిరస్కరించడమూ, క్రోధము, నవ్వు, ఏడ్పు – వీటితో, ఈ పనులు చేసేటప్పుడు శిరస్సు కంపింపచేస్తూ 'విప్రియాన్ని' అభినయించాలి.

**మూ. ప్రతిపక్షసకాశాత్తు యః సౌభాగ్యవికత్థనః,**
**ఉపసర్పేత్ సచిహ్నస్తు మన్యుస్తత్రోపజాయతే. 273**

**తా.** తన సౌభాగ్యాన్ని (సౌందర్యాదులను) గూర్చి బడాయి చెప్పుకొనే ప్రియుడు సవతి ఇంటి నుంచి సంభోగచిహ్నాలతో వచ్చినప్పుడు వానిని చూడగానే 'మన్యువు' కలుగుతుంది.

**మూ. వలయపరివర్తనైరథ సుశిథిలముత్క్షేపణేన రశనాయాః,**
**మన్యుస్త్వభినేతవ్యః సశఙ్కితం బాష్పపూర్ణాక్ష్యా. 274**

**తా.** ఈ మన్యువు కలిగిన నాయిక కన్నీటితో నిండిన నేత్రాలతో చేతి వలయాలు తిప్పుతూ, వడ్డాణం శిథిలంగా చేసి పైకి ఎగదీస్తూ శంకాపూర్వకముగా మన్యువును అభినయించాలి.

**మూ. దృష్ట్వా స్థితం ప్రియతమం సశఙ్కితం సాపరాధమతిలజ్జమ్,**
**ఈర్ష్యావచసముత్థైః ఖేదయితవ్యో హ్యుపాలమ్భైః. 275**

**తా.** అపరాధం చేసి సిగ్గుపడుతూ శంకితుడై ఎదుట నిలబడిన ప్రియతముణ్ణి చూచి, నాయిక ఈర్ష్యతో నిండిన మాటలతోను, నిందావాక్యములతోను ఆతడు ఖిన్నుడయే టట్లు చెయ్యాలి.

**మూ. న చ నిష్ఠురభిభాష్యో న చాప్యతిక్రోధనస్తు పరిహాసః,**
**బాష్పోన్మిశ్రైర్వచనైరాత్మోపన్యాససంయుక్తైః. 276**

**తా.** అంతేనే కాని వానితో నిష్ఠురంగా మాట్లాడకూడదు. క్రోధంతో నిండిన, లేదా కోపం కలిగించే పరిహాసవచనాలు పలకకూడదు. తన భావాన్ని వ్యక్తీకరించే, కన్నీటితో కలిసిన మాటలు మాత్రమే పలకాలి.

**మూ. మధ్యాఙ్గుల్యోష్ఠాగ్రప్రవిచ్యవాత్ పాణినోరసి కృతేన,**
**ఉద్వర్తితనేత్రతయా ప్రతతైరభివీక్షణైశ్చాపి. 277**

**తా.** మధ్యవేలు అధరోష్ఠాగ్రంమీద ఉంచిన హస్తాన్ని వక్షస్థలంమీద ఉంచుకొని, పైకి తిప్పిన కళ్లతో మాటిమాటికీ చూపులు ప్రసరింపచేస్తూ తన మనోగతభావాన్ని ప్రకటించాలి.

**మూ. కటిహస్తనివిష్టతయా విచ్ఛిన్నతయా తథాఙ్గులేః కరణాత్,**
**మూర్ధభ్రమణనిహఞ్చితనిపాతసంశ్లేషణాచ్చాపి. 278**
**అవహిత్థవీక్షణాద్వా అఙ్గులిభఙ్గేన తర్జనైర్లలితైః,**
**ఏభిర్భావవిశేషైరస్యాభినయః ప్రయోక్తవ్యః. 279**

**తా.** 'కటిహస్త' కరణంచేత, లేదా ఆ కరణంలోని వేళ్లను విడిగా చేసి కటిశిరస్సు (పై భాగం) మీద ఉంచి ఒక్క మాటు అన్నింటినీ కిందికి జార్చడంచేత లేదా 'అవహిత్థ' వీక్షణంచేత, లేదా వేళ్లు విరుస్తూ లలితములైన తర్జనములచేత ఈ భావాన్ని అభినయించాలి.

**మూ. శోభసే సాధు; దృష్టోసి గచ్ఛ త్వమ్; కిం విలమ్బసే,**
**మా మాం స్ప్రాక్షీః; ప్రియాం యాహి తత్ర తే యా హృది స్థితా. 280**
**గచ్ఛేత్యుక్త్వా పరావృత్య వినివృత్తాన్తరేణ తు,**
**కేనచిద్వచనార్థేన ప్రహర్షం యోజయేత్ పునః. 281**

**తా.** "బాగా మెరిసిపోతున్నావు! చూచాను కదా! వెళ్లు; ఆలస్యం చేస్తావెందుకు? నన్ను ముట్టుకోకు; నీ హృదయంలో ఉన్న ప్రియురాలి దగ్గరికే వెళ్లు" అని పలికి, మళ్లీ వెనుకకు తిరిగి, ఏదో పనిమీద అన్నట్లు వెనుకకు వచ్చి, ఏవో కొన్ని మంచిమాటలతో మళ్లీ వానికి సంతోషం కలిగించాలి.

**మూ. రభసగ్రహణాచ్చాపి హస్తే వస్త్రే చ మూర్ధని,**
**కార్యం ప్రసాదనం నార్యా హ్యపరాధం సమీక్ష్య తు. 282**

**తా.** అపరాధం చేసిన నాయకుడు ఆమెను ప్రసాదింపచేసికొనడంకోసం హటాత్తుగా చెయ్యిగాని, వస్త్రంగాని, కేశపాశం కాని పట్టుకొన్న ట్లయితే, ఆమె వాని అపరాధాన్ని గూర్చి తెలిసినా కూడ ప్రసన్నురాలు కావాలి.

**మూ. హస్తే వస్త్రేఽథ కేశాన్తే నార్యాప్యథ గృహీతయా,**
**కాన్తమేవోపసర్పన్త్యా కర్తవ్యం మోక్షణం శనైః. 283**

**తా.** అతడు హస్తము, లేదా కేశపాశము పట్టుకొన్నా కూడ ఆమె ఆతనికి దగ్గరగా చేరుతూనే మెల్లగా విడిపించుకోవాలి.

**మూ. గృహీతయాథ కేశాన్తే హస్తే వస్త్రేఽథవా పునః,**
**యథా ప్రియో న పశ్యేద్ధి స్పర్శో గ్రాహ్యస్తథా స్త్రియా. 284**

**తా.** తన చెయ్యి గాని, వస్త్రం గాని, కేశపాశం గాని ప్రియుడు పట్టుకొన్నప్పుడు ఆమె, వానికి తెలియకుండా, వాని శరీరస్పర్శవల్ల కలిగిన సుఖాన్ని అనుభవించాలి. (అలా అభినయించాలి).

**మూ. పాదాగ్రస్థితయా కార్యా తథైవాకుఞ్చితాఙ్గయా,**
**అశ్వక్రాన్తేన కర్తవ్యం కేశానాం మోక్షణం శనైః. 285**

**తా.** నాయిక కొంచెం వంగిన శరీరంతో పాదాగ్రాలమీద నిలచి అశ్వక్రాంతచారిలో ఉంటూ, కేశాలు ప్రియుని పట్టునుండి మెల్లగా వదల్చుకోవాలి.

**మూ. అముచ్యమానే కేశాన్తే సంజాతస్వేదలేశయా,**
**హు హు ముఞ్చాపసర్పేతి వాచ్యః స్పర్శాలసాఙ్గయా. 286**

**తా.** ప్రియశరీరస్పర్శసుఖంచేత అలసమైన శరీరంతో శరీరం అంతా కొంచెం చెమటపట్టిన ఆ నాయిక కేశపాశం విడవని ఆ ప్రియునితో – "ఊ ఊ – విడు విడు; దూరంగా వెళ్లు" అనాలి.

**మూ. గచ్ఛేతి రోషవాక్యేన గత్వా ప్రతినివృత్య చ,**
**కేన చిద్వచనార్థేన చాలాపం యోజయేత్పుమాన్. 287**

**తా.** "వెళ్లు వెళ్లు" అని ఆమె కోపంతో పలకగా పురుషుడు దూరంగా వెళ్లి, ఏదో చెప్పాలన్నట్లు తిరిగి వచ్చి ఏవో మాటలు చెప్పడం ప్రారంభించాలి.

**మూ. విధూననేన హస్తస్య హుంకారం సంప్రయోజయేత్,**
**స చావధూననే కార్యః శపథైర్వ్యాజ ఏవ చ. 288**

**తా.** నాయిక చెయ్యి గట్టిగా ఊపుతూ 'హుం హుం' అనాలి. అలా చెయ్యి ఊపుతూ నాయిక నిందిస్తూన్నట్లు ఏమేమో అనాలి.

**మూ. అక్ష్ణోః సంవరణం కార్యం పృష్ఠతశ్చోపగూహనమ్,**
**నార్యాస్త్వపహృతే వస్త్రే నీవీచ్ఛాదనమేవ వా. 289**

**తా.** అపుడు పురుషుడు నాయిక వస్త్రాన్ని లాగివేయగా ఆమె వాని కళ్లు మూసివేయాలి లేదా వాని వెనుక దాగాలి లేదా వస్త్రం ముడి మాత్రం చేతితో కప్పుకోవాలి.

**మూ. తావత్ ఖేదయితవ్యస్తు యావత్ పాదగతో భవేత్,**
**తతశ్చరణయోర్యాతే కుర్యాద్దూతీనిరీక్షణమ్. 290**

**తా.** ప్రియుడు పాదాలమీద పడేవరకు వానిని ఈ విధంగా బాధపెట్టాలి. పాదాలమీద పడినతరువాత దూతి వైపు చూడాలి.

**మూ. ఉత్థాప్యాలిఙ్గయేచ్చైవ నాయికా నాయకం తతః,**
**రతిభోగగతా హృష్టా శయనాభిముఖీ వ్రజేత్. 291**
**ఏతద్ గీతవిధానేన సుకుమారేణ యోజయేత్.**

**తా.** అపుడు నాయిక నాయకుణ్ణి లేవదీసి, ఆలింగనం చేసి, రతిభోగాసక్తయై, సంతోషంతో శయనంవైపు వెళ్లాలి. **ఇదంతా సుకుమారమైన గీత విధానంతో మాత్రమే ప్రయోగించాలి.**

**మూ. యదా శృఙ్గారసంయుక్తం రతిసంభోగకారణమ్. 292**
**యదా చాకాశపురుషం పరస్థవచనాశ్రయమ్,**
**భవేత్కావ్యం తదా హ్యేష కర్తవ్యోఽభినయః స్త్రియా. 293**

**తా.** ప్రయోగించబడే కావ్యం శృంగారరససంయుక్తమై రతిసంభోగానికి కారణం అయినప్పుడూ, లేదా (భాణం వలె) ఆకాశపురుషునితో పరుడు పలికే మాటలను ఆశ్రయించి ఉన్నప్పుడు స్త్రీ ఈవిధంగా (పైన చెప్పినట్లు) అభినయించాలి.

**మూ. యదన్తఃపురసంబద్ధం కావ్యం భవతి నాటకే,**
**శృఙ్గారససంయుక్తం తత్రాప్యేష విధిర్భవేత్. 294**

**తా.** నాటకంలో (నాట్యప్రయోగంలో) ప్రదర్శిస్తూన్న కావ్యం అంతఃపురానికి సంబంధించినదై శృంగారరససంయుక్తమై ఉన్నప్పుడు కూడ అనుసరించవలసిన విధానం ఇదే.

**మూ. న కార్యం శయనం రఙ్గే నాట్యధర్మం విజానతా,**
**కేన చిద్వచనార్థేన అఙ్కచ్ఛేదో విధీయతే. 295**

**తా.** నాట్యధర్మం తెలిసిన నాట్యప్రయోజకుడు రంగస్థలం మీద శయనము ప్రదర్శించకూడదు. ఏదో విషయం కల్పించి ఆ ఘట్టంలో అంకం పూర్తిచేసివెయ్యాలి. ఆ విధంగా శయనాదులను సూచించాలి.

**మూ. యద్వా శయీతార్థవశాదేకాకీ సహితోఽపి వా,**
**చుమ్బనాలిఙ్గనం చైవ తథా గుహ్యాఙ్చ యద్భవేత్. 296**
**దన్తచ్ఛేద్యం నఖచ్ఛేద్యం నీవీస్రంసనమేవ చ,**
**స్తనాధరవిమర్దం చ రఙ్గమధ్యే న కారయేత్. 297**

**తా.** కథావస్తువును పట్టి ఒంటరిగా గాని, ఇతరులతో కాని శయనించి నట్లు చూపవలసివచ్చినా కూడ చుంబనము, ఆలింగనము, దంతక్షతాలు, నఖక్షతాలు, నీవిని (వస్త్రబంధాన్ని) విప్పడము, స్తన – అధరమర్దనము మొదలైన రహస్యక్రియలను రంగమధ్య యందు ప్రదర్శించకూడదు.

**మూ. భోజనం సలిలక్రీడా తథా లజ్జాకరం చ యత్,**
**ఏవంవిధం భవేద్యద్యత్తత్రఙ్గే న కారయేత్. 298**

**తా.** భోజనము, జలక్రీడ, లజ్జాకరమైన ఏ యే పను లుంటాయో అవేవీ కూడ రంగస్థలంమీద చేయించకూడదు.

**మూ. పితాపుత్రస్నుషాశ్వశ్రుదృశ్యం యస్మాత్తు నాటకమ్,**
**తస్మాదేతాని సర్వాణి వర్జనీయాని యత్నతః. 299**

**తా.** తండ్రీ, కొడుకూ – కోడలు, అత్తా – ఇలాంటివాళ్లందరూ కలిసి వెళ్లి నాటకం చూస్తారు. అందుచేత ఇలాంటి పను లేవీ రంగస్థలంమీద జరగకుండా జాగర్తగా చూచుకోవాలి.

**మూ. వాక్యైః సాతిశయైః శ్రవ్యైర్మధురైర్నాతినిష్ఠురైః,**
**హితోపదేశసంయుక్తైస్తద్‌జ్ఞః కుర్యాత్తు నాటకమ్. 300**

**తా.** నాటకప్రయోజకుడు నాటకంలో వాడే భాష విషయంలో కూడ చాల శ్రద్ధ

వహించాలి. దీనిలో ప్రయోగించే వాక్యాలు వినసొంపుగా, మధురంగా, నిష్ఠురత్వం లేకుండా, ఒక విధమైన ఉన్నతస్థాయిలో ఉండాలి. వాటిలో ఒక హితోపదేశం ఉండాలి.

**మూ. (ఏవమన్తఃపురకృతః కార్యస్త్వభినయో బుధైః)**

**తా.** (అంతఃపురానికి సంబంధించిన కార్యకలాపాలను ప్రదర్శించే నాటకం ఈ విధంగా ప్రయోగించాలి).

**మూ. సమాగమేఽథ నారీణాం వాచ్యాని మదనాశ్రయే,**
**ప్రియేషు వచనానీహ యాని తాని నిబోధత. 301**

**తా.** స్త్రీలతో జరిగే ప్రణయవ్యవహారాలలో నాయికలు ప్రియుల విషయంలో ఉపయోగించే వచనాలను (మాటలను) చెపుతాను; వినండి.

**మూ. ప్రియః కాన్తో వినీతశ్చ నాథః స్వామ్యథ జీవితమ్,**
**నన్దనశ్చేత్యభిప్రీతే వచనాని భవన్తి హి. 302**

**తా.** ప్రియ, కాన్త, వినీత, నాథ, స్వామిన్, జీవితమా, నందన – ఇవి ఆనంద సమయంలో ప్రియుని విషయంలో ప్రయోగించే పదాలు.

**మూ. దుఃశీలోఽథ దురాచారః శఠో వామో వికత్థనః,**
**నిర్లజ్జో నిష్ఠురశ్చైవ ప్రియః క్రోధేఽభిధీయతే. 303**

**తా.** దుఃశీల, దురాచార, శఠ, వామ, వికత్థన, నిర్లజ్జ, నిష్ఠుర – ఇవి క్రోధంతో ఉన్నప్పుడు ప్రియుని విషయంలో ప్రయోగించే పదాలు.

**మూ. యో విప్రియం న కురుతే న చాయుక్తం ప్రభాషతే,**
**తథార్జవసమాచారః స ప్రియస్త్వభిధీయతే. 304**

**తా.** విప్రియమైన పను లేవీ చేయకుండా, అయుక్తంగా మాటలాడకుండా ఋజువుగా ప్రవర్తించేవాడు **'పియుడు'**.

**మూ. అన్యనారీసముద్భూతం చిహ్నం యస్య న దృశ్యతే,**
**అధరే వా శరీరే వా స కాన్త ఇతి భాష్యతే. 305**

**తా.** అధరోష్ఠంమీద గాని, శరీరంమీద గాని అన్యస్త్రీసంగమచిహ్నా లేవీ కనబడని వాడు **'కాంతుడు'**.

**మూ. సంక్రుద్ధోఽపి హి యో నార్యా నోత్తరం ప్రతిపద్యతే,**
**పరుషం వా న వదతి వినీతః సోభిధీయతే. 306**

**తా.** నాయిక బాగా కోపించి దూషించినా జవాబు చెప్పనివాడు, చెప్పినా పరుషంగా మాట్లాడనివాడు **'వినీతుడు'**.

**మూ. హితైషీ రక్షణే శక్తో న మానీ న చ మత్సరీ,**
**సర్వకార్యేష్వసంమూఢః స నాథ ఇతి సంజ్ఞితః. 307**

**తా.** హితం కోరేవాడు, అహంకారం కాని, కోపం కాని లేనివాడు, అన్ని పనుల విషయంలోను ఏమరుపాటు లేనివాడు అయి రక్షణ ఇవ్వడంలో సమర్థుడైనవాడు **'నాథుడు'**.

**మూ. సామదానార్థసంభోగైస్తథాలాలనపాలనైః,**
**నారీం నిషేవతే యస్తు స స్వామీత్యభిధీయతే. 308**

**తా.** సామంచేత, దానంచేత, ధనంచేత, సంభోగంచేత, లాలన – పాలనలచేత స్త్రీని సేవించేవాడు, (ప్రేమతో చూచుకొనేవాడు) **'స్వామి'**.

**మూ. నారీప్సితైరభిప్రాయైర్నిపుణం శయనక్రియామ్,**
**కరోతి యస్తు సంభోగే స జీవితమితి స్మృతః. 309**

**తా.** సంభోగసమయంలో నాయికకు ఇష్టమైన విధంగా, ఆమె అభిప్రాయాలకు అనుగుణంగా శయనక్రియ చేసేవాడు **'జీవితం'**.

**మూ. కులీనో ధృతిమాన్ దక్షో దక్షిణో వాగ్విశారదః,**
**శ్లాఘనీయః సఖీమధ్యే నన్దనః సోఽభిధీయతే. 310**

**తా.** మంచి వంశంలో పుట్టినవాడు, ధైర్యవంతుడు, నేర్పరి, అందరి విషయంలో సాధుప్రవర్తన కలవాడు, మాటలలో చతురుడు, అయిన నాయకుడు సఖురాళ్ల మధ్య శ్లాఘిస్తూ చెప్పుకొనదగిన **నందనుడు**.

నాయికలు ఇలాంటి నాయకులను ఈ శబ్దాలతో సంబోధించాలి, లేదా నిర్దేశించాలి.

**మూ. ఏతే వచనవిన్యాసా రతిప్రీతికరాః స్మృతాః,**
**తథా చాప్రీతివాక్యాని గదతో మే నిబోధత. 311**

**తా.** ఇలాంటి వచనవిన్యాసాలు రతిని ప్రీతిని పెంపొందిస్తాయి. ఇప్పుడు అప్రీతి కరాలైన వాక్యాలను గూర్చి చెపుతున్నాను; వినండి.

**మూ. నిష్ఠురశ్చాసహిష్ణుశ్చ మానీ ధృష్టో వికత్థనః,**
**అనవస్థితచిత్తశ్చ దుఃశీల ఇతి స స్మృతః. 312**

**తా.** నిష్ఠురుడు, సహనం లేనివాడు, అహంకారవంతుడు, పొగరబోతు, బడాయిలు చెప్పుకొనేవాడు మనస్సు నిలకడలేనివాడు – ఇట్టివాడు **'దుఃశీలుడు'**.

**మూ. తాడనం బన్ధనం చాపి యోఽవిమృశ్య సమాచరేత్,**
**తథా పరుషవాక్యైశ్చ దురాచారః స ఉచ్యతే. 313**

**తా.** ఆలోచన లేకుండా స్త్రీని బంధించేవాడు, కొడుతూ పరుషంగా మాట్లాడేవాడు **దురాచారుడు**.

**మూ. వాచైవ మధురో యస్తు కర్మణా నోపపాదకః,**
**యోషితాం కించిదప్యర్థం స శఠః పరిభాష్యతే. 314**

**తా.** మాటలలో మాత్రమే మధురంగా ప్రవర్తిస్తూ పనిలో చూపక స్త్రీలకు ఏ విధంగానూ ఉపకరించనివాడు **శఠుడు**.

**మూ. వార్యతే యత్ర యత్రార్థే తత్తదేవ కరోతి యః,**
**విపరీతనివేశీ చ స వామ ఇతి సంజ్ఞితః. 315**

**తా.** ఏ పని చేయవద్దని నివారిస్తారో దానినే చేస్తూ, విపరీతకార్యాలమీద పట్టుదల కలవాడు **వాముడు**.

**మూ. సరసవ్రణచిహ్నో యః స్త్రీసౌభాగ్యవికత్థనః,**
**అతిమానీ తథా స్తబ్ధో వికత్థన ఇతి స్మృతః. 316**

**తా.** పరస్త్రీసంబంధంవల్ల ఏర్పడిన కొత్త చిహ్నాలతో స్త్రీసౌభాగ్యంచేత (స్త్రీలను వశం చేసికొనే నేర్పుచేత) బడాయి చెప్పుకొనే, గర్వి యైన మొండివాడు **వికత్థనుడు**.

**మూ. వార్యమాణో దృఢతరం యో నారీముపసర్పతి,**
**సచిహ్నః సాపరాధశ్చ స నిర్లజ్జ ఇతి స్మృతః. 317**

**తా.** అపరాధం చేసిన చిహ్నాలు స్పష్టంగా కనబడుతూండగా, నాయిక ఎంత నివారించినా ఆమె దగ్గరకు వెళ్లేవాడు **నిర్లజ్జుడు**.

**మూ. యోఽపరాద్ధస్తు సహసా నారీం సేవితుమిచ్ఛతి,**
**అప్రసాదనబుద్ధిశ్చ నిష్ఠురః సోభిధీయతే. 318**

**తా.** అపరాధం చేసికూడా, నాయికను ప్రసన్నురాలిని చేసికోవాలను ఆలోచన లేకుండా బలాత్కారంగా ఆమెను చేరడానికి ప్రయత్నించేవాడు **నిష్ఠురుడు**.

**మూ. ఏతే వచనవిన్యాసాః ప్రియాప్రియవిభావితాః,**
**తాం తామవస్థామాసాద్య విపరీతా భవన్తి హి. 319**

**తా.** ఈ వచనవిన్యాసాలు ప్రియుల విషయంలోను అప్రియుల విషయంలోను ఉపయోగించతగినవి. ఆ యా అవస్థలు మారుతే ఇవే విపరీతం అవుతాయి. ప్రియుడు అప్రియు డైతే అప్రియుడు ప్రియు డైతే అవి మారుతాయి.

**మూ. ఏష గీతవిధానే తు సుకుమారో విధిర్భవేత్,**
**శృఙ్గారరసవాచ్యం స్యాత్తత్రాప్యేష క్రమో భవేత్. 320**

**తా.** శృంగారరసంతో కూడిన కథావస్తువును శబ్దాలతో ప్రకటించేటప్పుడు, సకుమారమైన గీత విధానంలోను ఇదే విధానం అవలంబించాలి.

**మూ. ఏవమన్తఃపురగతః ప్రయోజ్యోఽభినయో భవేత్,**
**దివ్యాఙ్గనానాం తు విధిం వ్యాఖ్యాస్యామ్యనుపూర్వశః. 321**

**తా.** అంతఃపురం విషయంలో ప్రయోగించవలసిన అభినయవిధానం చెప్పబడింది. ఇప్పుడు దివ్యస్త్రీలకు సంబంధించిన అభినయవిధిని విశదీకరిస్తాను.

**మూ. నిత్యమేవోజ్జ్వలో వేషో నిత్యం ప్రముదితం మనః,**
**నిత్యమేవ సుఖః కాలో దేవీనాం లలితాశ్రయః. 322**

**తా.** దివ్యాంగనల వేషం ఎల్లప్పుడు ఉజ్జ్వలంగానే ఉంటుంది. మనస్సు నిత్యము ఆనందభరితమై ఉంటుంది. కాలం ఎల్లప్పుడు సుఖమయంగానే ఉంటుంది; లలితక్రీడలలో గడిచిపోతూంటుంది.

**మూ. న చేర్ష్యా నైవ చ క్రోధః నాసూయా న ప్రసాదనమ్,**
**దివ్యానాం దృశ్యతే పుంసాం శృఙ్గారే యోషితాం తథా. 323**

**తా.** దేవతాపురుషులకు దేవతా స్త్రీలకు మధ్య నడిచే శృంగారంలో ఈర్ష్య ఉండదు; క్రోధం ఉండదు; అసూయ ఉండదు. ప్రసన్నురాలిని చేసికొనడం ఉండదు. అభినయంలో ఇవేమీ ప్రదర్శించకూడదు.

**మూ. యదా మానుషసంయోగో దివ్యానాం యోషితాం భవేత్,**
**తదా సర్వే ప్రకర్తవ్యా యే భావాః మానుషాశ్రయాః. 324**

**తా.** దివ్యస్త్రీలకు మనుష్యులతో సంబంధం ఏర్పడినప్పుడు మాత్రం, మనుష్యులకు సంబంధించిన ఈభావా లన్నీ ఆ దేవతాస్త్రీలకు కూడ ప్రదర్శించాలి.

**మూ. శాపభ్రంశాత్తు దివ్యానాం తథా చాపత్యలిప్సయా,**
**కార్యో మానుషసంయోగః శృఙ్గారరససంశ్రయః. 325**

**తా.** శాపంచేత స్వర్గంనుండి భ్రంశవల్లగాని, సంతానం పొందా లను కోరిక చేత గాని ద్యివ్యస్త్రీలకు శృంగారానికి హేతువైన మనుష్యపురుషసంబంధం జరిగినట్లు వర్ణించాలి.

**మూ. పుష్పైర్భూషణజైః శబ్దైరదృశ్యాపి ప్రలోభయేత్,**
**పునః సందర్శనం దత్త్వా క్షణాదన్తరితా భవేత్. 326**

**తా.** దివ్యస్త్రీ కనబడకుండా ఉంటూ పుష్పాలచేత, భూషణధ్వనులచేత పురుషుణ్ణి లోభపెట్టాలి. ఒక్కసారి కనబడి మళ్లీ అంతర్ధానం చెందాలి.

**మూ. వస్త్రాభరణమాల్యాద్యైర్లేఖసంప్రేషణైరపి,**
**ఈదృశైరుపచారైస్తు సమున్మాద్యస్తు నాయకః. 327**

**తా.** వస్త్రాలు, ఆభరణాలు, మాలలు మొదలైనవాటితోను, లేఖలు పంపడాలతోను – ఇలాటి ఉపచారాలతో నాయకుణ్ణి రాగమత్తునిగా చెయ్యాలి.

**మూ. ఉన్మాదనాత్సముద్భూతః కామో రతికరో భవేత్,**
**స్వభావోపగతో యస్తు నాసావత్యర్థభావకః. 328**

**తా.** ఉన్మాదం కలిగించగా పుట్టిన కామమే రతికరం అవుతుంది. మామూలుగా కలిగినది అంతగా ఆనందకరం కాదు.

**మూ. యే భావా మానుషాణాం స్యుర్యద్గతం యచ్చ చేష్టితమ్,**
**తత్సర్వం మానుషం ప్రాప్య కార్యం దివ్యైరపి ద్విజాః. 329**

**తా.** ద్విజులారా! మనుష్యత్వం పొందిన (మనుష్యులుగా ఉన్న) దేవతలు మానవులలో ఏ భావాలు, ఏ చేష్టలు, ఎట్టి గమనం ఉంటాయో వాటిని అన్నింటిని ప్రదర్శించాలి.

**మూ. ఏవం రాజోపచారో హి కర్తవ్యోఽభ్యన్తరాశ్రయః,**
**బాహ్యమప్యుపచారం చ ప్రవక్ష్యామ్యథ వైశికే. 330**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే సామాన్యాభినయో నామ అధ్యాయో ద్వావింశః.**

**తా.** అభ్యంతరస్త్రీలతో సంబంధించిన రాజోపచారం ఈ విధంగా చెయ్యాలి. బాహ్యస్త్రీలతో సంబంధించిన ఉపచారాన్ని వైశికాధ్యాయంలో చెపుతాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన 'బాలానందిని' అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానము నందు సామాన్యాభినయం అను ఇరవైరెండవ అధ్యాయం సమాప్తం.**

**శ్రీః శ్రీః శ్రీః**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ త్రయోవింశోఽధ్యాయః

# వైశికాధ్యాయము

**"పుంసామశక్తాపి తదేకభావమాదర్శయన్తీ బహుభావపూర్ణా,**
**వేశ్యామతిర్నిర్వృతిధామ యత్స్థా తస్మై నమః స్తాత్ పరమేశ్వరాయ."**
**– శ్రీమదభినవగుప్తాచార్యాః**

**మూ. విశేషయేత్కలాః సర్వా యస్మాత్తస్మాత్తు వైశికః,**
**వేశోపచారే సాధుర్వా వైశికః పరికీర్తితః. 1**

**తా.** సమస్త మైన కళలోని విశేషాలను తెలిసినవాడు కాబట్టి **వైశికుడు**. లేదా వేశోపచారంలో (వేశ్యోపచారంలో) నిపుణు కాబట్టి **వైశికుడు** అని చెప్పబడుతున్నాడు.

**మూ. యో హి సర్వకలోపేతః సర్వశిల్పవిచక్షణః,**
**స్త్రీచిత్తగ్రహణాభిజ్ఞో వైశికః స భవేత్ పుమాన్. 2**

**తా.** అన్ని కళలయందు శిల్పాలలోను నేర్పు గలవాడు స్త్రీల చిత్తాన్ని ఎలా ఆకర్షించాలో తెలిసినవాడు **వైశికుడు**.

**మూ. గుణాస్తస్య తు విజ్ఞేయాః స్వశరీరసముత్థితాః,**
**ఆహార్యాః సహజాశ్చేతి త్రయస్త్రింశత్ సమాసతః. 3**

**తా.** వీనిలో మొత్తం ముప్పై మూడు గుణా లుంటాయి ఇవి – వాని శరీరం నుండి పుట్టినవి, ప్రయత్నపూర్వకంగా సంపాదించినవి, సహజమైనవి అని మూడు విధాలు.

**మూ. శాస్త్రవిచ్ఛిల్పసంపన్నో రూపవాన్ ప్రియదర్శనః,**
**విక్రాన్తో ధృతిమాంశ్చైవ వయోవేషకులాన్వితః. 4**

**సురభిర్మధురస్త్యాగీ సహిష్ణురవికత్థనః,**
**అశఙ్కితః ప్రియాభాషీ చతురః శుభదః శుచిః. 5**

**కామోపచారకుశలో దక్షిణో దేశకాలవిత్,**
**అదీనవాక్యః స్మితవాన్ వాగ్మీ దక్షః ప్రియంవదః. 6**

**స్త్రీలుబ్ధః సంవిభాగీ చ శ్రద్దధానో దృఢస్మృతిః,**
**గమ్యాసు చాప్యవిస్రమ్భీ మానీ చేతి హి వైశికః. 7**

**తా.** వైశికుడు శాస్త్రజ్ఞానసంపన్నుడై ఉంటాడు. అందమైనవాడు. చూచే వారికి

ఆనందం కలిగే రూపవంతుడు. శక్తిశాలి, ధైర్యవంతుడు. యౌవనంలో ఉన్నవాడు. మంచి కులంలో పుట్టినవాడు. మంచి వేషం ధరిస్తాడు. సుగంధం గలవాడు. మధురస్వభావుడు. త్యాగం చేసే స్వభావం కలవాడు. కష్టాలు సహిస్తాడు. ఆత్మశ్లాఘ చేసికొనడు. నిత్యశంకితుడై ఉండడు. ప్రియంగా మాటలాడతాడు. మంచి ప్రవర్తన కలవాడు. శుభప్రదుడు. పరిశుద్ధమైనవాడు. కామోపచారాలలో కుశలుడు. సమర్థుడు. దేశ కాలానుగుణంగా ప్రవర్తిస్తాడు. మాటలలో దైన్యం లేనివాడు. చిరునవ్వు వాని ముఖంమీద ప్రకాశిస్తూ ఉంటుంది. మాటలలో నేర్పరి. కార్యదక్షుడు. ప్రియమైన విషయాలు మాత్రమే చెపుతాడు. స్త్రీలయందు ఆసక్తి కలవాడు. మంచి ఏమున్నా పంచిపెట్టే స్వభావం కలవాడు (సంవిభాగీ). నమ్మకం కలవాడు. మంచి జ్ఞాపకశక్తి ఉన్నవాడు. గమ్యస్త్రీల (వేశ్యాదుల) విషయంలో కూడ పూర్తి విశ్వాసం లేనివాడు. ఆత్మాభిమానం ఉన్నవాడు.

**మూ. అనురక్తః శుచిర్దాన్తో దక్షిణః ప్రతిపత్తిమాన్,**
**భవేచ్చిత్రాభిధాయీ చ వయస్యస్తస్య తద్గుణః (షడ్గుణః) 8**

**తా.** వైశికునికి వాని కార్యకలాపాలలో సహాయ్యం చేసే వయస్యుడు (మిత్రుడు) కూడ వాని గుణాలవంటి గుణాలు కలవాడై ఉండాలి. అనురాగము (మిత్రునియందు పూర్తి స్నేహభావము) శుచిత్వము, (పరిశుద్ధత్వము) నియమబద్ధత్వము, అనుకూలంగా ప్రవర్తించడమూ, సమయస్ఫూర్తి, లేదా శీఘ్రంగా విషయాన్ని గ్రహించే శక్తి, అనేక విషయాలను గూర్చి మాట్లాడ నేర్పుకలవాడు, ఈ విధంగా ఆరు గుణాలు కలిగి ఉండాలి.

**మూ. విజ్ఞానగుణసంపన్నా కథినీ లిఙ్గినీ తథా,**
**ప్రాతివేశ్యా సఖీ దాసీ కుమారీ కారుశిల్పినీ. 9**
**ధాత్రీ పాషణ్డినీ చైవ తథా రఙ్గోపజీవినీ,**
**ప్రోత్సాహనేఽథ కుశలా మధురకథాదక్షిణాథ కాలజ్ఞా. 10**
**లడహా సంవృతమన్త్రా దూతీ త్వేభిర్గుణైః కార్యా.**

**తా.** అనేకమైన లౌకికవిషయాల జ్ఞానం కలది, అనేకమైన కథలు చెప్పకలిగినదీ, చిత్రలేఖసమర్థ (లింగినీ), తన ఇంటికి దగ్గరగానే నివసించేదీ, సఖురాలు, దాసి, కుమారి (అవివాహిత), చేతిపనులలోను శిల్పాలలోను నేర్పుకలది, పెంపుడుతల్లిగా పనిచేసేది, ఏదో వ్రతాన్ని అవలంబించినదీ (పాషండినీ), రజకస్త్రీ లేదా గ్రామాలలో సంచరించేదీ (రఙ్గోపజీవినీ), ప్రోత్సహించడంలో నేర్పుగలది, మధురంగా మాట్లాడేదీ, నేర్పు గలది, సమయాసమయాలు గుర్తించకలిగినది, ఆకర్షణశక్తి కలది (లడహా), ఆలోచనలను రహస్యంగా ఉంచగలిగినదీ – ఇలాంటి గుణాలున్నదానిని దూతిగా నియమించుకోవాలి.

**మూ. తయాప్యుత్సాహనం కార్యం నానాదర్శితకారణమ్. 11**
**యథోక్తకథనం చైవ తథా భావప్రకాశనమ్.**

**తా.** దూతి నాయికను గాని నాయకుణ్ణి గాని అనేకమైన కారణాలు చూపి ప్రోత్స కలిగించేదిగా ఉండాలి. చెప్పిన విషయాన్ని యథాతథంగా చెప్పాలి. భావాన్ని (నాయికా నాయకుల భావాన్ని) స్పష్టంగా ఆవిష్కరించకలిగి ఉండాలి.

**మూ. న జడం రూపసంపన్నం నార్థవన్తం న చాతురమ్. 12**
**దూతం వాప్యథవా దూతీం బుధః కుర్యాత్కదాచన.**

**తా.** జడుణ్ణి (మూఢుణ్ణి) గాని, సౌందర్యవంతునిగాని, ఏదో స్వప్రయోజనం కోసం ప్రయత్నించేవానిని గాని, రోగపీడితుణ్ణిగాని తెలివైనవాడు దూతనుగా చేసికొనకూడదు. ఇలాంటి స్త్రీని దూతిగా చేసికొనకూడదు.

**మూ. కులభోగధనాధిక్యైః కృత్వాధికవికత్థనమ్. 13**
**దూతీనివేదయేత్కామమర్థాంశ్చైవానువర్ణయేత్.**

**తా.** కులంచేత, భోగాలచేత, ధనంచేత నాయకుడు చాల గొప్పవాడని తెలుపుతూ, దూతి ఆతనిని చేరితే లభించే అనేకలాభాలను నాయికకు వర్ణించి చెప్పాలి.

**మూ. నవకామప్రవృత్తాయాః క్రుద్ధాయా వా సమాగమః,**
**నానోపాయైః ప్రకర్తవ్యో దూత్యా హి పురుషాశ్రయః. 14**

**తా.** క్రొత్తగా కామవ్యవహారంలో ప్రవర్తిస్తూన్న నాయికకు గాని, కోపించిన నాయికకు గాని నాయకునితో సమాగమం జరగడానికి దూతి అనేక ఉపాయాలు అవలంబించాలి.

**మూ. ఉత్సవే రతిసంచారే ఉద్యానే మిత్రవేశ్మని,**
**ధాత్రీగృహేషు సఖ్యా వా తథా చైవ నిమన్త్రణా. 16**
**వ్యాధితవ్యపదేశేన శూన్యాగారనివేశనే,**
**కార్యః సమాగమో నృణాం స్త్రీభిః ప్రథమసంగమే. 17**

**తా.** ఉత్సవసమయాలలో కాని, రాత్రియందు గాని, ఉద్యానంలో గాని, ధాత్రి (దాది) ఇంట్లో కాని, సఖురాలి ఇంట్లో కాని, ఏదైన ఆహ్వానాన్ని పురస్కరించుకొని వచ్చి నప్పుడు గాని, అస్వాస్థ్యం అనే మిషతో ఇతరు లెవరూ లేని శూన్యాగారంలోనికి తీసుకొని వెళ్లి గాని దూతి, పురుషులకు స్త్రీలతో ప్రథమసంగమం ఏర్పాటు చెయ్యాలి.

**మూ. ఏవం సమాగమం కృత్వా సోపాయం విధిపూర్వకమ్,**
**అనురక్తాం విరక్తాం వా చిహ్నైః సముపలక్షణయేత్. 18**

**తా.** ఈ విధంగా ఏదో ఒక ఉపాయం, పద్ధతి ప్రకారం ప్రయోగించి సమాగమం ఏర్పరచినతరువాత ఆమె వానివిషయంలో అనురాగంతో ఉందా విరాగంతో ఉందా అను విషయాన్ని చిహ్నాలను పట్టి తెలుసుకోవాలి.

**మూ. స్వభావభావాతిశయైః యా నారీ మదనార్దితా,**
**కరోతి నిభృతాం లీలాం జ్ఞేయా సా మదనాతురా. 19**

**తా.** ఏ యువతి స్వభావంచేతనే కాని, భావోద్రేకంచేత గాని ప్రియునివిషయంలో నిగూఢంగా శృంగారవిలాసలు చూపుతుందో ఆమె మదనాతుర అని తెలుసుకోవాలి.

**మూ. సఖీమధ్యే గుణాన్ బ్రూతే స్వధనం చ ప్రయచ్ఛతి,**
**పూజయత్యస్య మిత్రాణి ద్వేష్టి శత్రుజనం సదా. 20**

**సమాగమం ప్రార్థయతే హృష్టే హృష్యతి చాధికమ్,**
**తుష్యత్యస్య కథాభిస్తు సస్నేహం చ నిరీక్షతే. 21**

**సుప్తే చ పశ్చాత్ స్వపితి చుమ్బితా ప్రతిచుమ్బతి,**
**ఉత్తిష్ఠత్యపి పూర్వం చ తథా క్లేశసహాపి చ. 22**

**సమా దుఃఖే సుఖే చ స్యాన్న క్రోధముపయాతి చ,**
**ఏవంవిధైర్గుణైర్యుక్తా త్వనురక్తా తు సా స్మృతా. 23**

**తా.** అనురక్తురాలైన స్త్రీ సఖురాళ్ల మధ్య ప్రియుని గుణాలు వర్ణించి చెపుతూంటుంది. తన ధనం వాని కిస్తుంది. వాని మిత్రుల్ని గౌరవిస్తుంది. శత్రువుల్ని ద్వేషిస్తుంది. దగ్గిర ఉండా లని కోరుకుంటూంటుంది. అతడు సంతోషిస్తే ఎక్కువ సంతోషిస్తుంది. వానిని గూర్చిన మాటలు చెప్పుకొంటూన్నప్పుడు సంతోషిస్తుంది. స్నేహపూర్వకంగా చూస్తుంది. అతడు నిద్రించిన తరువాత తాను నిద్రిస్తుంది. అతడు చుంబనం చేస్తే తాను ప్రతిచుంబనం చేస్తుంది. వానికంటె ముందుగా మేల్కొంటుంది. ఎన్ని క్లేశాలైనా సహిస్తుంది. అతడు దుఃఖంలో ఉంటే తాను దుఃఖిస్తుంది. అతడు సుఖంగా ఉంటే తాను సుఖంగా ఉంటుంది. ఎన్నడూ వానిమీద కోపం చూపదు. ఇవి అనురక్తస్త్రీలో ఉండే గుణాలు.

**మూ. విరక్తాయాస్తు చిహ్నాని చుమ్బితాస్యం ప్రమార్జతి,**
**అనిష్టాం చ కథాం బ్రూతే ప్రియముక్తాపి కుప్యతి. 24**

**ప్రద్వేష్టి చాస్య మిత్రాణి భజతేఽరిజనం తథా,**
**శేతే పరాఙ్ముఖీ చాపి శయనే పూర్వశాయినీ. 25**

**సుమహత్యుపచారేఽపి న తోషముపయాతి చ,**
**న క్లేశం సహతే చాపి తథా కుప్యత్యకారణాత్. 26**

**న చ చక్షుర్దదాత్యస్య న చైనమభినన్దతి,**
**యస్యామేవం వికారాః స్యుర్విరక్తాం తాం వినిర్దిశేత్. 27**

**తా.** పురుషుని విషయంలో విరక్త యైన స్త్రీ చిహ్నాలు ఈ విధంగా ఉంటాయి – అతడు చుంబిస్తే ముఖం తుడుచుకొంటుంది. అనిష్టమైన విషయాలు మాట్లాడుతుంది.

ప్రియవాక్యం పలికినా కోపిస్తుంది. వాని మిత్రులను ద్వేషిస్తుంది; శత్రువులను సేవిస్తుంది. భర్తకంటె ముందే శయనించి ఎడముఖంతో పండుకొంటుంది. అత డెంత గొప్ప ఉపచారం చేసినా సంతోషించదు. క్లేశం సహించదు. నిష్కారణంగా కోపిస్తూంటుంది. వాని వైపు చూడదు; పలకరించదు. ఇలాంటి లక్షణా లున్నది వైరాగ్యవంతురా లని తెలుసుకోవాలి.

**మూ. హృదయగ్రహణోపాయమస్యాః వ్యాపారచేష్టితమ్,**
**అర్థప్రదర్శనం చైవ ఉపదానం పునర్భవేత్. 28**

**వ్యవధీనాం పరిత్యాగః భావోపక్షేప ఏవ చ,**
**అర్థోపన్యాస ఏవ స్యాదర్థదానం తథైవ చ. 29**

**తా.** విరక్తహృదయను తన వైపు మళ్లించుకొనడానికి పురుషుడు చేయ తగిన ఉపాయాలు ఇవి – తాను ఎంత ధనవంతుడో వర్ణించి చెప్పడం. నీకు ఇది ఇస్తాను అది ఇస్తాను అనడం. మధ్య ఉండే దూతలను దూతికలను తొలగించి స్వయంగా తన భావాన్ని ప్రకటించడం. అర్థాన్ని ప్రత్యక్షంగా చూపడం; కొంత ధనం ఇవ్వడం. ఇవన్నీ ఉపాయాలు. (ఈ శ్లోకాల అర్థాలు అస్పష్టంగా ఉన్నాయి).

**మూ. దారిద్ర్యాత్ వ్యాధితో దుఃఖాత్ పారుష్యాదశ్రుతాత్తథా,**
**ప్రవాసగమనాన్మానాదతిలోభాదతిక్రమాత్. 30**

**అతివేలాగమత్వాచ్చ తథా విప్రియసేవనాత్,**
**ఏభిః స్త్రీ పురుషో వాపి కారణైస్తు విరజ్యతే. 31**

**తా.** దారిద్ర్యంవల్ల, వ్యాధివల్ల, దుఃఖంవల్లా, పరుషత్వంవల్ల, విద్యాగంధం లేకపోవడంవల్లా, ప్రవాసానికి వెళ్లడంవల్ల, దురభిమానంవల్ల, దురాశవల్ల, పరసంబంధం వల్ల, మర్యాదను ఉల్లంఘించడంవల్ల, (ఆలస్యంగా వస్తూండడంవల్ల) అనిష్టమైన పనులు చేయడంవల్ల స్త్రీకి కాని పురుషునికి కాని విరక్తి కలుగుతుంది.

**మూ. భావగ్రాహీణి నారీణాం కార్యాణి మదనాశ్రయే,**
**తుష్టిమేతి యథా నారీ ప్రాప్యతే పురుషైరథ. 32**

**తా.** ప్రణయవ్యవహారంలో స్త్రీల భావాన్ని (హృదయాన్ని) ఆకర్షించే పనులు చెయ్యాలి. వాటితో స్త్రీ సంతోషించి పురుషునికి వశం అవుతుంది.

**మూ. లుబ్ధామర్థప్రదానేన కలాజ్ఞానేన పణ్డితామ్,**
**చతురాం లడహత్వేన హ్యనువృత్త్యా చ మానినీమ్. 33**

**(భూషణగ్రహణాచ్చాపి శృఙ్గారముఖరో భవేత్)**

**పురుషద్వేషిణీమిష్టైః కథాయోగైరుపక్రమైః. 34**

**ఉపక్రీడనకైర్బాలాం భీరుమాశ్వాసనేన చ,**

**గర్వితాం నీచసేవాభిః ఉదాత్తాం శిల్పదర్శనైః. 35**

**తా.** ధనాసక్తురాలికి ధనం ఇవ్వాలి. కలానిపుణురాలికి తన కున్న కలా నైపుణ్యం ప్రదర్శించాలి. చాతుర్యం కలదానితో ప్రాగల్భ్యంతో ప్రవర్తించాలి. ఆత్మాభిమానం కలదానితో అనుకూలంగా మసలుకోవాలి. శృంగారప్రధానురాలికి అలంకారాలు బహూకరించాలి. పురుషద్వేషిణికి ఆమె కిష్టమైన కథలు చెపుతూ దగ్గరికి జరుగుతుండాలి. చిన్న వయస్సులో ఉన్నదానికి ఆటవస్తువులు ఇవ్వాలి. భయస్వభావం కలదానికి ధైర్యం చెప్పాలి. గర్వితురాలికి కాళ్లు పట్టడంవంటి నీచసేవలు చెయ్యాలి. ఉదాత్తస్వభావం కలదానికి అందమైన శిల్పాలు చూపాలి. ఈ విధంగా స్త్రీల మనస్సును ఆకర్షించాలి.

**మూ. సర్వాసామేవ నారీణాం త్రివిధా ప్రకృతిః స్మృతా,**

**ఉత్తమా మధ్యమా నీచా వేశ్యానాం తు స్వభావజా. 36**

**తా.** స్త్రీలందరూ ఉత్తమప్రకృతి, మధ్యమప్రకృతి, నీచప్రకృతి అను మూడు ప్రకృతులను పట్టి మూడు విధాలుగా ఉంటారు. వేశ్యల ప్రకృతి యైతే వాళ్ల స్వభావాన్ని పట్టి ఉంటుంది.

**మూ. యా విప్రియేఽపి తిష్ఠన్తం ప్రియం వదతి నాప్రియమ్,**

**న దీర్ఘరోషా చ తథా కలాసు చ విచక్షణా. 37**

**కామ్యతే పురుషైర్యా తు శీలశోభాకులాధిక్యైః,**

**కుశలా కామతన్త్రేషు దక్షిణా రూపశాలినీ. 38**

**గృహ్ణాతి కారణాద్రోషం విగతేర్ష్యా బ్రవీతి చ,**

**కార్యకాలవిశేషజ్ఞా సురూపా సా స్మృతోత్తమా. 39**

**తా. ఉత్తమప్రకృతి** గల స్త్రీల లక్షణా లిలా ఉంటాయి – ప్రియునివల్ల ఏమైన విప్రియం జరిగినా ఈమె ప్రియుణ్ణి అప్రియమైన మాట అనదు. దీర్ఘకోపం కలది కాదు. కళలో నైపుణ్యం గలది, కామతంత్రాలలో కుశలురాలు, అనుకూలస్వభావం గలదీ, రూపవంతురాలు అయిన ఈమెలోని ఉత్తమమైన శీలమును, శోభను, కులీనత్వమును చూచి పురుషు లీమెను ఇష్టపడతారు. తగిన కారణం ఉన్నప్పుడే రోషం చూపుతుంది. ఈర్ష్యాభావం లేకుండా మాటలాడుతుంది. సౌందర్యవతి యైన ఈమె కార్యవిశేషాన్ని గుర్తించి వ్యవహరిస్తుంది.

**మూ. పురుషైః కామ్యతే యా తు తథా కామయతే చ తాన్,**

**కామోపచారకుశలా ప్రతిపక్షాభ్యసూయికా. 40**

**ఈర్ష్యాతురా త్వనిభృతా క్షణక్రోధాతిగర్వితా,**
**క్షణప్రసాదా యా చైవ సా నారీ మధ్యమా స్మృతా. 41**

**తా.** మధ్యమప్రకృతి గల స్త్రీని పురుషులు కోరుతారు, వాళ్లను ఈమె కోరుతుంది. కామోపచారాలలో కుశల యైన ఈమెకు శత్రువులపై అసూయ అధికం. ఈర్ష్యతో బాధ పడుతూంటుంది. ఆ ఈర్ష్యను దాచుకోలేదు. ఈమెకు కోపం వచ్చినా క్షణకాలమే ఉంటుంది. అనుగ్రహం కూడ అంతే. గర్వం కూడ అధికం.

**మూ. అస్థానకోపనా యా తు దుష్టశీలాతిమానినీ,**
**చపలా పరుషా చైవ దీర్ఘరోషాధమా స్మృతా. 42**

**తా.** అకారణంగా కోపిస్తుంది. చెడ్డశీలంతో మహాహంకారంతో చపలంగాను పరుషంగాను ఉంటుంది. కోపం అతిదీర్ఘం. అలాంటి స్త్రీ **అధమప్రకృతి.**

**మూ. సర్వాసాం నారీణాం యౌవనభేదాః స్మృతాస్తు చత్వారః,**
**నేపథ్యరూపచేష్టాగుణేన శృఙ్గారమాసాద్య. 43**

**తా.** ఈ త్రివిధప్రకృతులు గల స్త్రీ లందరికీ నాలుగు విధాలైన యౌవనా లుంటాయి. వాటిని పట్టి, శృంగారరసంలో – వాళ్ల వేషము, రూపము (peronality) చేష్టలూ ఉంటాయి.

**వి. "ప్రథమం యౌవనం యావద్వింశతి. ఏవం త్రింశచ్చత్వారింశత్పఞ్చాశదితి విభాగః. అన్యే తు – షోడశ – పఞ్చవింశతి. పఞ్చత్రింశత్. పఞ్చచత్వారింశదితి విభాగమాహుః"** (అభి.భా.)

"ఇరవై సంవత్సరాల వయస్సు వరకూ ప్రథమయౌవనం. ముప్పై వరకు ద్వితీయ యౌవనం. నలభై వరకు తృతీయయౌవనం. యాభై సంవత్సరాలవరకు చతుర్థయౌవనం. పదహారు, ఇరవైయైదు – ముప్పైయైదు – నలభైయైదు సంవత్సరాల వయస్సు అని కొంద రంటారు" (అభినవభారతి). అప్పటినుంచీ రంగులు మొదలైనవాటికోసం ఖర్చు లెక్కువవుతాయి.

**మూ. పీనోరుగణ్డజఘనాధరస్తనం కర్కశం రతిమనోజ్ఞమ్,**
**శృఙ్గారరసముత్సాహం ప్రథమం తద్యౌవనం జ్ఞేయమ్. 44**

**తా.** ఊరు – గండ – జఘన – అధర – స్తనాలు పీనములై కఠినంగా రతిమనోజ్ఞంగా ఉంటాయి. శృంగారోత్సాహం ఎక్కువగా ఉంటుంది. అది **ప్రథమ యౌవనం.**

**మూ. గాత్రం పూర్ణావయవం పీనౌ చ పయోధరౌ నతం మధ్యమ్,**
**కామస్య సారభూతం యౌవనమేతద్ ద్వితీయం తు. 45**

**తా.** శరీరావయవా లన్నీ పుష్టిగా ఉంటాయి. పయోధరాలు పీనములై ఉంటాయి. నడుము సన్నపడుతుంది. ఈ విధంగా **ద్వితీయయౌవనం** కామోపభోగసారభూత మైనది.

**మూ. సర్వశ్రీసంయుక్తం రతికరణోత్పాదనం రతిగుణాఢ్యమ్,**
**కామాప్యాయితశోభం యౌవనమేతత్ తృతీయం తు. 46**

**తా. తృతీయయౌవనం** సకలశోభలతోను తొణికిసలాడుతూంటుంది. రతిసాధనోత్పాదకమై రతిగుణంతో సమృద్ధమై ఉంటుంది. కామసంవర్ధితశోభమై, కామసంతర్పితశోభమై ఉంటుంది.

**మూ. నవయౌవనే వ్యతీతే తథా ద్వితీయే తృతీయకేఽపి,**
**శృఙ్గారశత్రుభూతం యౌవనమేతచ్చతుర్థం తు. 47**
**అ(అ)మ్లానగణ్డజఘనాధరస్తనం కించిదూనలావణ్యమ్,**
**కామం ప్రతి నోచ్ఛ్వాసం యౌవనమేతచ్చతుర్థం తు. 48**

**తా.** ప్రథమ – ద్వితీయ – తృతీయయౌవనాలు గడచి శృంగారానికి శత్రువైన **చతుర్థయౌవనం** ప్రవేశిస్తుంది. గండ – జఘన – అధర – స్తనాలు కొంచెం బిగి సడలి వాడిపోతాయి. శరీర లావణ్యం కొంచెం తగ్గుతుంది. రత్యుత్సాహం మందగిస్తుంది.

**మూ. నాత్యర్థం క్లేశసహా న కుప్యతి న హృష్యతి స్త్రీభ్యః,**
**సౌమ్యగుణేష్వసక్తా నారీ నవయౌవనా జ్ఞేయా. 49**

**తా.** నవయౌవనంలో ఉన్న స్త్రీ ఎక్కువ క్లేశం సహించజాలదు. ఇతరస్త్రీల విషయంలో ఆమెకు కోపమూ ఉండదు, హర్షమూ ఉండదు. మనుష్యులలోని మంచి గుణాలయందు ఆసక్తి చూపుతుంది.

**మూ. కించిత్కరోతి మానం కించిత్ క్రోధం చ మత్సరం చైవ,**
**క్రోధే చ భవతి తూష్ణీం యౌవనభేదే ద్వితీయే తు. 50**

**తా. ద్వితీయయౌవనావస్థలో** ఉన్న నాయిక కొంచెం మానం, కొంచెం క్రోధం, కొంచెం మాత్సర్యం చూపుతుంది. క్రోధం వచ్చినా మౌనంగా ఉండిపోతుంది.

**మూ. రతిసంభోగే దక్షా ప్రతిపక్షాసూయినీ రతిగుణాఢ్యా,**
**అనిభృతగర్వితచేష్టా నారీ జ్ఞేయా తృతీయే తు. 51**

**తా. తృతీయయౌవనావస్థలో** ఉన్న నాయిక రతిసంభోగంలో దక్షురాలై రతిగుణాఢ్య

రాలై శత్రువుల (సవతుల) విషయంలో అసూయతో ఉంటుంది. గర్వంతో కూడిన చేష్టలు బాహాటంగా చేస్తూంటుంది.

**మూ. చిత్తగ్రహణసమర్థా కామాభిజ్ఞా త్వమత్సరోపేతా,**
**అవిరహమిచ్ఛతి నిత్యం నారీ జ్ఞేయా చతుర్థే తు. 52**

**తా.** చతుర్థయౌవనావస్థలో ఉన్న నాయిక ప్రియుని చిత్తం గ్రహించడంలో సమర్థురాలై కామవిషయాలన్నీ బాగా తెలిసి ఉంటుంది. మత్సరం ఉండదు. ఎల్లప్పుడు ప్రియుని దగ్గరనే ఉండాలని కోరుకొంటుంది.

**మూ. యౌవనభేదాస్త్వేతే విజ్ఞేయా నాటకేషు చత్వారః,**
**పునరేవ తు పురుషాణాం కామితతన్త్రే ప్రవక్ష్యామి. 53**

**తా.** ఇవి నాటకాలలోని నాయికల నాలుగు విధాలైన యౌవనావస్థలు. ఇప్పుడు కామతంత్రానుసారం పురుషులలోని భేదాలను గూర్చి చెపుతాను.

**మూ. చతురోత్తమౌ తు మధ్యస్తథా చ నీచః ప్రవృద్ధకశ్చైవ (ప్రవృత్తకశ్చైవ),**
**స్త్రీసంప్రయోగవిషయే జ్ఞేయాః పురుషాస్త్వమీ పఞ్చ. 54**

**తా.** స్త్రీల ఉపచారం విషయంలో – చతురుడు, ఉత్తముడు, మధ్యముడు, నీచుడు, ప్రవృద్ధకుడు (ప్రవర్తకుడు) అని పురుషులలో ఐదు భేదా లుంటాయి.

**మూ. సమదుఃఖః క్లేశసహః ప్రణయక్రోధప్రసాదనే కుశలః,**
**రత్యుపచారే నిపుణః దక్షశ్చతురః స బోద్ధవ్యః. 55**

**తా.** ప్రియురాలితో సమానమైన దుఃఖం కలవాడు (దుఃఖం పంచుకొనే వాడు) క్లేశాలు తట్టుకొనగలగినవాడు, ప్రణయక్రోధం కలిగిన ప్రియురాలిని ప్రసన్నురాలిని చేసికొనడంలో కుశలుడు, రత్యుపచారంలో నేర్పు కలవాడు, కార్యసమర్థుడు అయిన నాయకుడు **చతురుడు**.

**మూ. యో విప్రియం న కురుతే నార్యాః కించిద్విరాగసంజాతమ్,**
**అజ్ఞాతేప్సితహృదయః స్మృతిమాన్ ధృతిమాన్ స తు జ్యేష్ఠః. 56**
**మధురస్త్యాగీ రాగం న యాతి మదనస్య చాపి వశమేతి,**
**అవమానితశ్చ నార్యా విరజ్యతే చోత్తమః స పుమాన్. 57**

**తా.** రాగం తగ్గడంవల్ల, గుర్తింపబడే విప్రియ మేమీ స్త్రీకి చేయనివాడు, వాని హృదయానికి అభీష్టమైన దేదో ఎవరికీ తెలియ శక్యం కానివాడు (గంభీరహృదయుడు) జ్ఞాపకశక్తి కలవాడు, ధైర్యవంతుడు అయిన పురుషుడు **ఉత్తముడు**. ఈ ఉత్తమపురుషుడు మధురస్వభావుడు; త్యాగశీలుడు. అత్యాసక్తి లేనివాడు. మదనునికి వశుడు అయిపోడు.

స్త్రీ అవమానించినట్లయితే ఆమెయందు వైముఖ్యం చెందుతాడు.

**మూ. సర్వార్థైర్మధ్యస్థో భావగ్రహణం కరోతి యో నార్యాః,**
**కించిద్దోషం దృష్ట్వా విరజ్యతే మధ్యమః స భవేత్. 58**
**కాలే దాతా హ్యవమానితోఽపి న క్రోధమతితరామేతి,**
**దృష్ట్వా వ్యలీకమాత్రం విరజ్యతే మధ్యమోఽయమితి. 59**

**తా. మధ్యమపురుషుడు** అన్ని విషయాలలోను మధ్యస్థభావం వహిస్తూ ప్రియురాలి భావాలకు అనుగుణంగా ప్రవర్తిస్తాడు. ఏ చిన్న దోషం కనబడినా వైరాగ్యం చెందుతాడు.

తగిన కాలంలో ధనాదు లిస్తూంటాడు. అవమానింపబడినా కూడ ఎక్కువగా కోపం చెందడు. చిన్న అపరాధం కనబడినా విరక్తు డౌతాడు.

**మూ. అవమానితోఽపి నార్యా నిర్లజ్జతయాభ్యుపైత్యవికృతాస్యః,**
**అన్యతరం సంక్రాన్తాం స్నేహపరావృత్తభావశ్చ. 60**
**అభినవకృతే వ్యలీకే ప్రత్యక్షం రజ్యతే దృఢతరం యః,**
**మిత్రైర్నివార్యమాణో విజ్ఞేయః సోఽధమః పురుషః. 61**

**తా. అధమపురుషుడు –** స్త్రీ తనను అవమానించినా కూడ సిగ్గు లేకుండా, ముఖంలో ఏ మాత్రము వికారం లేకుండా ఆమె దగ్గరికే వెడతాడు. మరొక పురుషునితో సంబంధం కలదైనా కూడ ఆమె విషయంలో ఉన్న స్నేహంచేత ఆమెవైపే తన భావాన్ని త్రిప్పుకొంటాడు. ఆమె కొత్తగా ఏదో చేయకూడని అపరాధంచేసినా కూడ, మిత్రులందరూ వారిస్తున్నా కూడ ఆమె విషయంలోనే ప్రేమను చాల దృఢంగా పెంచుకొంటాడు.

**మూ. అవిగణితభయామర్షో మూర్ఖప్రకృతిః ప్రసక్తహాసశ్చ,**
**ఏకాన్తదృఢగ్రాహీ నిర్లజ్జః కామతన్త్రేషు. 62**
**రతికలహసంప్రహారేష్వకర్కశః క్రీడనీయకః స్త్రీణామ్,**
**ఏవంవిధస్తు తద్జ్ఞై ర్విజ్ఞేయః సంప్రవృద్ధస్తు. 63**

**తా. సంప్రవృద్ధకుడు** (సంప్రవృత్తకుడు) స్త్రీల భయాన్నికాని అమర్షాన్ని కాని లెక్కచేయక మూర్ఖస్వభావుడై నవ్వుతూనే ఉంటాడు. ఏకాంతప్రదేశాలలో గట్టిగా పట్టుకొంటాడు. కామతంత్రాలలో సిగ్గు లేకుండా ప్రవర్తిస్తాడు. రతికలహాలలోను, అప్పుడు జరిగే దెబ్బ లాటలలోను కార్కశ్యం వహించజాలడు. ఆడవాళ్ల ఆటవస్తువులా ప్రవర్తిస్తాడు.

**మూ. నానాశీలాః జ్ఞేయాః గూఢార్థహృదయేప్సితాః,**
**విజ్ఞాయ తు యథాసత్త్వముపసర్పేత్తథైవ తాః. 64**

**తా.** చాల రకాలైన శీలం గల స్త్రీల హృదయాలలో ఏ భావా లున్నాయో, ఏ కోరిక లుంటాయో తెలుసుకొనడం చాల కష్టం. అందుచేత ముందుగా వాళ్ల అభిప్రాయా లను తెలుసుకొని తదనుగుణంగా వాళ్లను చేరాలి.

**మూ. భావాభావౌ విదిత్వాథ తత్ర తైస్తైరుపక్రమైః,**
**పుమానుపచరేన్నారీం కామతన్త్రం సమీక్ష్య తు. 65**

**తా.** స్త్రీలలో రాగం ఉందా లేదా అను విషయం ఆ యా చేష్టలచేత తెలుసుకొని, కామశాస్త్రానుసారం వాళ్ల ఉపచారం చెయ్యాలి. వాళ్లతో సంబంధం ఏర్పరచుకోవాలి.

**మూ. సామ చైవ ప్రదానం చ భేదో దణ్డస్తథైవ చ,**
**ఉపేక్షా చైవ కర్తవ్యా నారీణాం విషయం ప్రతి. 66**

**తా.** స్త్రీలను తనకు అనుకూలంగా చేసికొనడానికి సామ – దాన – భేద – దండోపాయాలు ప్రయోగించాలి. అవేమీ ఫలించకపోతే కొంతకాలం పాటు ఉపేక్షా భావంతో ఉండాలి.

**మూ. తవాస్మి, మమ చైవాసి, దాసోఽహం త్వం చ మే ప్రియా,**
**ఆత్మోపక్షేపణకృతం యత్తత్సామేతి కీర్తితమ్. 67**

**తా.** "నేను నీవాడను", నువ్వు నాదానవు; నేను నీ దాసుణ్ణి; నువ్వు నా ప్రియురాలవు" అంటూ తన మనో గతభావాన్ని నివేదించడం **సామ**.

**మూ. కాలే కాలే ప్రదాతవ్యం ధనం విభవమాత్రయా,**
**యన్నిమితాన్తరకృతం ప్రదానం నామ తత్ స్మృతమ్. 68**

**తా.** ఏదో నిమిత్తాన్ని పురస్కరించుకొని, అప్పుడప్పుడు తన సామర్థ్యాన్ని అనుసరించి ధనం ఇస్తూండడం **ప్రదానం**.

**మూ. భేదః స్యాత్తత్ప్రియస్యేహ సోపాయం దోషదర్శనమ్,**
**బన్ధనం తాడనం చాపి దణ్డ ఇత్యభిధీయతే. 69**

**తా.** ఆమెకు ప్రియుడైన ఇతరపురుషునిలో ఉన్న దోషాలను, ఏదో ఉపాయంతో ఆమెకు చూపడం **భేదం**. బంధించడం లేదా కొట్టడం **దండం**.

**మూ. మధ్యస్థాం మానయేత్ సామ్నా లుబ్ధాం చోపప్రదానతః,**
**అన్యావబద్ధభావాం చ భేదేన ప్రతిపాదయేత్. 70**

**తా.** మధ్యస్థురాలైన, స్త్రీని (పరపరుషసంబంధాదిదోషాలు పెద్దవి ఏవీ లేని స్త్రీని) సామంచేత, ధనంమీద ఎక్కువ వాంఛ ఉన్న స్త్రీని దానంచేత, పరపురునియందు

ప్రేమభావంతో ఉన్న స్త్రీని భేదంచేత వశం చేసుకోవాలి.

**మూ. దుష్టాచారే సమారబ్ధే త్వన్యభావసముత్థితే,**
**దణ్డః పాతయితవ్యస్తు మృదుతాడనబన్ధనైః. 71**

**తా.** పరపురుషునిపై ప్రేమచేత దుష్టమైన ప్రవృత్తి ప్రారంభం అయినప్పుడు మృదువుగా కొట్టడం, బంధించడం మొదలైన దండం ఉపయోగించాలి.

**మూ. సామాదీనాం ప్రయోగే తు పరిక్షీణే యథాక్రమమ్,**
**న స్యాద్యా చ సమాపన్నా తాముపేక్షేత బుద్ధిమాన్. 72**

**తా.** క్రమానుసారం ప్రయోగించిన సామాదులు పని చేయక, ఆ స్త్రీ దారికి రాకపోతే, అప్పుడు బుద్ధిమంతుడు ఆమెను ఉపేక్షించాలి.

**మూ. ముఖరాగేణ నేత్రాభ్యాం విజ్ఞేయో భావచేష్టితైః,**
**ద్వేష్యో వాపి ప్రియో వాపి మధ్యస్థో వాపి యోషితామ్. 73**

**తా.** స్త్రీల ముఖరాగంచేత, నేత్రాలచేత, భావంచేత ఏర్పడిన చేష్టలచేత అనగా ముఖరాగాదులను బట్టి, వాళ్లకు ఆ పురుషుడు ద్వేష్యుడా, ప్రియుడా, మధ్యస్థుడా అను విషయం గుర్తించవచ్చును.

**మూ. అర్థహేతోస్తు వేశ్యానాం ప్రియో వా యది వాప్రియః,**
**గమ్య ఏవ నరో నిత్యం ముక్త్వా దివ్యనృపస్త్రియః. 74**

**తా.** ఒక నరుడు ప్రియుడైనా అప్రియుడైనా వానిదగ్గరకు వేశ్యలు ధనంకోసం వెళ్లవలసి ఉంటుంది. అయితే దివ్యవేశ్యలకు, రాజాశ్రితలైన వేశ్యలకు ఇది వర్తించదు.

**మూ. ద్వేష్యం తు ప్రియమిత్యాహుః ప్రియం ప్రియతరం తథా,**
**సుశీలమితి దుఃశీలం గుణాఢ్యమితి నిర్గుణమ్. 75**

**తా.** ధనంకొరకై వేశ్యలు – ద్వేషింపదగినవానిని ప్రియు డంటారు. ప్రియుణ్ణి ప్రియతరు డంటారు. దుఃశీలుణ్ణి సుశీలు డంటారు. గుణరహితుణ్ణి గుణాఢ్యు డని పొగుడుతారు.

**మూ. ప్రహసన్తీ చ నేత్రాభ్యాం యం దృష్ట్వోత్ఫుల్లతారకా,**
**ప్రసన్నముఖరాగా చ లక్ష్యతే భావరూపణైః. 76**

**తా.** ఎవనిని చూడగానే వేశ్యాస్త్రీ వికసించిన నేత్రాలతో చూస్తూ నవ్వుతూ, ప్రేమ భావాభినయంచేత ప్రసన్నముఖరాగం కలది అవుతుందో వానిని పైన చెప్పినట్లు పొగడుతారు.

**మూ. భావాభావౌ విదిత్వైవం నరస్తైస్తైరుపక్రమైః,**
**యత్నాదుపచరేన్నారీం కామతన్త్రం ప్రతీక్ష్య తు. 77**

**తా.** ఈ విధంగా పురుషుడు, ఆ యా ఉపాయాలు ప్రయోగించి రాగంతో ఉందా విరాగంతో ఉందా అను విషయం తెలిసికొని, కామతంత్రానుసారం స్త్రీతో ప్రయత్న పూర్వకంగా వ్యవహరించాలి.

**మూ. ఉపచారబలత్వాచ్చ విప్రలమ్భాత్తథైవ చ,**
**తాసు నిష్పద్యతే కామః కాష్ఠాదగ్నిరివోత్థితః. 78**

**తా.** ఉపచారబలంవల్లా, విరహంవల్లా, స్త్రీలలో, కాష్ఠంనుండి బయలుదేరిన అగ్ని వలె, కామం ఆవిర్భవిస్తుంది.

**మూ. యోషితాముపచారోఽయం యథోక్తో వైశికాశ్రయః,**
**కార్యః ప్రకరణే సమ్యక్ యథాయోగం చ నాటకే. 79**

**తా.** ఇంతవరకు చెప్పిన, వైశికుడు స్త్రీలతో చేయవలసిన వ్యవహారం, ప్రకరణంలో చక్కగా ప్రదర్శించాలి. నాటకంలో అవసరాన్ని పట్టి ప్రదర్శించాలి.

**మూ. ఏవం వేశ్యోపచారోఽయం తద్‌జ్ఞైః కార్యో ద్విజోత్తమాః,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి ప్రకృతీనాం తు లక్షణమ్. 80**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే త్రయోవింశోఽధ్యాయః.**

**తా.** ద్విజోత్తములారా! ఇంతవరకు చెప్పినది వేశ్యోపచారం, దీనిని బాగా తెలిసినవాళ్లు ప్రయోగించాలి. ఇటుపైన ప్రకృతుల లక్షణాలు చెపుతాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన 'బాలానందిని' అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానము నందు వైశికాధ్యాయము అను ఇరవైమూడవ అధ్యాయం సమాప్తం.**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ చతుర్వింశోఽధ్యాయః

# పుంస్త్ర్యుపచారము

"త్రిధా వికల్పనం యస్యాం పుమాన్ యత్రోపచర్యతే,
తాం వన్దే ప్రకృతిం శమ్భోః శక్తిత్రయవిజృమ్భణాత్"

**– శ్రీమదభినవగుప్తాచార్యాః**

**మూ. సమాసతస్తు ప్రకృతిస్త్రివిధా పరికీర్తితా,
పురుషాణామథ స్త్రీణాముత్తమాధమమధ్యమా. 1**

**తా.** సంక్షిప్తంగా చెప్పా లంటే – ఉత్తమము, అధమము, మధ్యమము అని స్త్రీల ప్రకృతి, పురుషుల ప్రకృతీ కూడ మూడు విధాలు.

**మూ. జితేన్ద్రియా జ్ఞానవతీ నానాశిల్పవిచక్షణా,
దక్షిణాథ మహాలక్ష్యా భీతానాం పరిసాన్త్వనీ. 2**

**నానాశాస్త్రార్థసంపన్నా గామ్భీర్యౌదార్యశాలినీ,
స్థైర్యత్యాగగుణోపేతా జ్ఞేయా ప్రకృతిరుత్తమా. 3**

**తా.** ఇంద్రియాలను జయించినది, జ్ఞానం కలది, వివిధ శిల్పాలలో నేర్పుగలది, దాక్షిణ్యం కలది, గొప్ప లక్ష్యం గలది, భయపడినవాళ్ల భయం తొలగించేది, వివిధ శాస్త్రార్థాలతో సమృద్ధమూ, గాంభీర్యంతోను ఔదార్యంతోను ప్రకాశించుచున్నది. ధైర్యము, త్యాగము అను గుణాలతో కూడినది అయిన ప్రకృతి (సహజస్వభావం) **ఉత్తమప్రకృతి**.

**మూ. లోకోపచారచతురా శిల్పశాస్త్రవిశారదా,
విజ్ఞానమాధుర్యయుతా మధ్యమా ప్రకృతిః స్మృతా. 4**

**తా.** లోకోపచారంలో, అనగా లోకాన్ని మెప్పించడంలో, చాతుర్యం కలది. శిల్పశాస్త్రాలయందు మంచి ప్రవేశం ఉన్నది, విజ్ఞానంతో, మాధుర్యంతో కూడినది అయిన ప్రకృతి **మధ్యమప్రకృతి**.

**మూ. రూక్షవాచోఽథ దుఃశీలాః కుసత్త్వాః స్థూలబుద్ధయః,
క్రోధనా ఘాతకాశ్చైవ మిత్రఘ్నాశ్ఛిద్రమానినః (ఘాతినః). 5**

**పిశునాస్తూద్ధతైర్వాక్యైరకృతజ్ఞాస్తథాలసాః,
మాన్యామాన్యావిశేషజ్ఞాః స్త్రీలోలాః కలహప్రియాః. 6**

**సూచకాః పాపకర్మాణః పరద్రవ్యాపహారిణః,**
**ఏభిర్దోషైస్తు సంపన్నా భవన్తీహాధమా నరాః. 7**

**తా.** పరుషంగా మాట్లాడతారు. చెడ్డ శీలం కలవాళ్లు. చెడ్డ బుద్ధి కలవాళ్లు. వాళ్ల బుద్ధి స్థూలమైనది (సూక్ష్మవిషయాలు గ్రహించజాలదు). కోపం ఎక్కువ. ఘాతకులు, మిత్రద్రోహం చేస్తారు. ఇతరులు అజాగ్రత్తతో ఉన్నప్పుడు దెబ్బతీస్తారు. తీవ్రమైన మాటలతో చాడీలు చెపుతూంటారు. సోమరిపోతులైన వీళ్లకు కృతజ్ఞత్వం ఉండదు. ఎవరు మాన్యులో, ఎవరు అమాన్యులో వీళ్లకు తెలియదు. స్త్రీలోలులు, కలహప్రియులు! ఇతరుల రహస్యాలు బైట పెడుతుంటారు. పాపకర్మలు చేస్తూ పరుల ద్రవ్యం అపహరిస్తారు. ఇలాంటి ఎన్నో దోషాలతో నిండినవాళ్లు **అధమప్రకృతి** కలవాళ్లు.

**మూ. ఏవం తు శీలతో నృణాం ప్రకృతిస్త్రివిధా స్మృతా,**
**స్త్రీణాం పునశ్చ ప్రకృతిం వ్యాఖ్యాస్యామ్యనుపూర్వశః. 8**

**తా.** శీలాన్ని పట్టి పురుషుల మూడు విధాలైన ప్రకృతిని గూర్చి చెప్పాను. ఇప్పుడు క్రమానుసారం స్త్రీల ప్రకృతిని గూర్చి చెపుతాను.

**మూ. మృదుభావా చాచపలా స్మితభాషిణ్యనిష్ఠురా,**
**గురూణాం వచనే దక్షా సలజ్జా వినయాన్వితా. 9**

**రూపాభిజనమాధుర్యైర్గుణైః స్వాభావికైర్యుతా,**
**గామ్భీర్యధైర్యసంపన్నా విజ్ఞేయా ప్రమదోత్తమా. 10**

**తా. ఉత్తమప్రకృతిగల** స్త్రీ మృదువైన భావాలతో చాపల్యరహితురాలై చిరునవ్వు నవ్వుతూ మాట్లాడుతుంది. నిష్ఠురంగా మాట్లాడదు. పెద్దల మాటలు ప్రకారం నడవడంలో సమర్థురాలు. సిగ్గూ, వినయమూ కలది. రూపము, అభిజనము (ఉత్తమంశము) మాధుర్యము అనే గుణాలు ఈమెకు పుట్టుకతోనే లభించి ఉంటాయి. గాంభీర్య – ధైర్యాలతో ప్రవర్తిస్తుంది.

**మూ. నాత్యుత్కృష్టైరనిఖిలైరేభిరేవాన్వితా గుణైః,**
**అల్పదోషానువిద్ధా చ మధ్యమా ప్రకృతిః స్మృతా. 11**

**తా. మధ్యమప్రకృతిస్త్రీలో** – పైన చెప్పిన గుణాలలో కొన్ని మాత్రమే ఉంటాయి. ఎక్కువగా గుణా లేవీ ఉండవు. చిన్న చిన్న దోషా లేవైనా ఉండవచ్చును.

**మూ. అధమా ప్రకృతిర్యా తు పురుషాణాం ప్రకీర్తితా,**
**విజ్ఞేయా సైవ నారీణామాధమానాం సమాసతః. 12**

**తా. అధమప్రకృతి** గల స్త్రీలను గూర్చి సంక్షిప్తంగా చెప్పాలంటే – అధమప్రకృతి పురుషులలో ఉన్న లక్షణాలే వీళ్లలో ఉంటాయి.

**మూ. నపుంసకస్తు విజ్ఞేయః సంకీర్ణోఽధమ ఏవ చ,**
**ప్రేష్యాదేరపి విజ్ఞేయా సంకీర్ణా ప్రకృతిర్ద్విజాః. 13**

**తా.** నపుంసకుడైన ప్రకృతిలో నైతే మూడు ప్రకృతుల లక్షణాలు సంకీర్ణములై ఉంటాయి. కొందరి ప్రకృతి అధమప్రకృతియై ఉంటుంది. 'ప్రేష్య' మొదలైనవాళ్ల ప్రకృతి కూడ సంకీర్ణప్రకృతియే.

**మూ. శకారశ్చ విటశ్చైవ యేచా న్యేఽ ప్యేవమాదయః,**
**సంకీర్ణాస్తేఽ పి విజ్ఞేయా హ్యధమా నాటకే బుధైః. 14**

**తా.** నాటకాలలో (రూపకాలలో) కనబడే శకారుడు, విటుడు, ఈ తెగకి చెందిన వాళ్లందరూ కూడ సంకీర్ణులు గాను, వీరిలో కొందరు అధములుగాను ఉంటారు.

**మూ. ఏతా జ్ఞేయాః ప్రకృతయః పురుషస్త్రీనపుంసకైః,**
**ఆసాం తు సంప్రవక్ష్యామి విధానం శీలసంశ్రయమ్. 15**

**తా.** పురుషస్త్రీనపుంసకులకు సంబంధించిన ప్రకృతులు ఈ విధంగా (పైన చెప్పిన విధంగా) ఉంటాయి. ఇప్పుడు ఈ ప్రకృతులతో, ఉన్నవాళ్లు, తమ శీలానికి అనుగుణంగా ఏ విధంగా ప్రవర్తిస్తారో, (ఏ విధంగా వాళ్లు నాట్యంలో అభియించాలో) చెపుతాను.

**మూ. అత్ర చత్వార ఏవ స్యుర్నాయకాః పరికీర్తితాః,**
**మధ్యమోత్తమప్రకృతౌ నానాలక్షణలక్షితాః. 16**

**తా.** మధ్యమ – ఉత్తమప్రకృతులు గలవాళ్లలో నాలుగు విధాలైన వివిధలక్షణాలు గల నాయకు లుంటారు.

**మూ. ధీరోద్ధతా ధీరలలితా ధీరోదాత్తాస్తథైవ చ,**
**ధీరప్రశాన్తకాశ్చైవ నాయకాః పరికీర్తితాః. 17**

**తా.** ధీరోద్ధతులు, ధీరలలితులు, ధీరోదాత్తులు, ధీరశాంతులు అని నాయకులు నాలుగు విధాలు.

**మూ. దేవా ధీరోద్ధతా జ్ఞేయాః స్యుర్ధీరలలితా నృపాః,**
**సేనాపతిరమాత్యశ్చ ధీరోదాత్తౌ ప్రకీర్తితా. 18**

**ధీరప్రశాన్తా విజ్ఞేయా బ్రాహ్మణా వణిజస్తథా,**
**ఏతేషాం తు పునర్జ్ఞేయాశ్చత్వారస్తు విదూషకాః. 19**

**లిఙ్గీ ద్విజో రాజజీవీ శిష్యశ్చేతి యథాక్రమమ్,**
**దేవక్షితిభృతామాత్యబ్రాహ్మణానాం యథాక్రమమ్**
**విప్రలమ్భసుహృదోఽ మీసంకథాలాపపేశలాః. 20**

**తా.** దేవతలు ధీరోద్ధతులు. రాజులు ధీరలలితులు. సేనాపతి, అమాత్యులు ధీరోదాత్తులు. బ్రాహ్మణులు, వర్తకులు ధీరప్రశాంతులు. ఈ నాలుగు విధాల నాయకులకు నాలుగు విధాలైన విదూషకు లుంటారు. దేవతలకు లింగి (ముని), రాజులకు ద్విజుడు, సేనాపతి – అమాత్యులకు రాజజీవి (రాజోద్యోగి), బ్రాహ్మణులకు శిష్యుడు విదూషకులుగా ఉంటారు. విప్రలంభంలో వీళ్లు, మాటలు చెప్పడంలో మంచి నేర్పుతో, స్నేహితులై ఉంటారు.

**మూ. వ్యసనీ ప్రాప్య దుఃఖం వా యుజ్యతేఽభ్యుదయేన వా,**
**తథా పురుషబాహుల్యే ప్రధానో నాయకః స్మృతః. 21**

**తా.** కష్టాలలో చిక్కుకొని దుఃఖం అనుభవించి చివరికి అభ్యుదయం పొందినవాడు, చాలమందిలో ప్రధానుడు నాయకుడు.

**మూ. యత్రానేకస్య భవతో వ్యసనాభ్యుదయౌ పునః,**
**ప్రకృష్టౌ యత్ర తౌ స్యాతాం స భవేత్తత్ర నాయకః. 22**

**తా.** (ఒక కథావస్తువులో) చాలమందికి వ్యసనాభ్యుదయాలు కలిగినపుడు, అవి ఎక్కువగా కలిగినవాడు నాయకుడు.

**మూ. ఏతే తు నాయకా జ్ఞేయాః కావ్యబన్ధేషు సర్వదా,**
**నాయికాశ్చైవ వక్ష్యామి చత్రసః పునరేవ తు. 23**

**తా.** కావ్యబంధాలలో ధీరోద్ధతాదులు నాయకులుగా ఉంటారు. నాలుగు విధాలైన నాయికలను కూడ చెపుతున్నాను.

**మూ. దివ్యా చ నృపపత్నీ చ కులస్త్రీ గణికా తథా,**
**ఏతాస్తు నాయికా జ్ఞేయా నానాప్రకృతిలక్షణాః. 24**
**ధీరా చ లలితా చైవ ఉదాత్తా నిభృతా తథా,**
**దివ్యా రాజాఙ్గనాశ్చైవ గుణైర్యుక్తా భవన్తి హి. 25**
**ఉదాత్తా నిభృతా చైవ భవేత్తు కులజాఙ్గనా,**
**లలితా చాప్యుదాత్తా చ గణికా శిల్పకారికా. 26**

**తా.** దివ్య, రాజభార్య, కులస్త్రీ, గణిక – అని వేరు వేరు ప్రకృతులూ లక్షణాలూ గల నాలుగు విధాల నాయిక లుంటారు. దివ్యస్త్రీ. రాజభార్యలు కూడ ధీరురాళ్లై, లాలిత్యంతో ఉదాత్తమైన స్వభావంతో అణుకువతో ఉంటారు.

కులస్త్రీ ఉదాత్త స్వభావంతో అణకువతో ఉంటుంది. గణిక లలితత్వంతో ఉదాత్త స్వభావంతో, శిల్పనిపుణురాలై ఉంటుంది.

**మూ. ప్రకృతీనాం తు సర్వాసాముపచారో ద్విధా స్మృతః,**
**బాహ్యశ్చాభ్యన్తరశ్చైవ తయోర్వక్ష్యామి లక్షణమ్. 27**

**తా.** అన్ని ప్రకృతులకూ కూడ బాహ్యమూ, ఆభ్యంతరమూ అని రెండు విధాలైన ఉపచారం ఉంటుంది. వాటి లక్షణాలు చెపుతాను.

**మూ. తత్ర రాజోపచారో యః భవేదాభ్యన్తరస్తు సః,**
**తతో బాహ్యోపచారస్తు యః స బాహ్యక ఉచ్యతే. 28**

**తా.** రాజోపచారం ఆభ్యంతరం, బైటవాళ్లకు సంబంధించిన ఉపచారం (employment) బాహ్యం.

**మూ. తత్ర రాజోపచారేషు అన్తఃపురసమాశ్రయమ్,**
**స్త్రీవిభాగం ప్రవక్ష్యామి ఉపచారం తథైవ చ. 29**

**తా.** రాజోపచారాలలో అంతఃపురానికి సంబంధించిన స్త్రీ విభాగాన్నీ, వాళ్లు చేయవలసిన ఉపచారమునూ చెపుతాను.

**మూ. మహాదేవీ తథా దేవీ స్వామినీ స్థాయినీ తథా,**
**భోగినీ శిల్పకరిణీ నాటకీయాథ నర్తకీ. 30**

**అనుచారికా చ విజ్ఞేయా తథా చ పరిచారికాః,**
**తథా సంచారికాశ్చైవ తథా ప్రేషణచారికాః. 31**

**మహత్తరా ప్రతీహారీ కుమారీ స్థవిరా అపి,**
**ఆయుక్తికా చ నృపతేరయమాభ్యన్తరో జనః. 32**

**తా.** మహాదేవి, స్వామిని, స్థాయిని, భోగిని, శిల్పకారిణి, నాటకీయ, నర్తకి, అనుచారిక, పరిచారిక, సంచారిక, ప్రేషణచారిక, మహత్తర, ప్రతీహారి, కుమారి, వృద్ధ, ఆయుక్తిక – వీళ్లు రాజాంతఃపురంలో పరివారం (ఆభ్యంతరప్రకృతి).

**మూ. తత్ర మూర్ధాభిషిక్తా యా కులశీలసమన్వితా,**
**గుణైర్యుక్తా వయఃస్థా చ మధ్యస్థాఽక్రోధనా తథా. 33**

**ముక్తేర్ష్యా నృపశీలజ్ఞా సమదుఃఖసుఖా సదా,**
**శాన్తిస్వస్త్యయనే భర్తుః సతతం మఙ్గలైషిణీ. 34**

**శాన్తా ప్రీతియుతా ధీరా అన్తఃపురహితే రతా,**
**ఏభిర్గుణైస్తు సంపృక్తా మహాదేవీ త్యుదాహృతా. 35**

**తా.** వాళ్లలో – రాజుతో పాటు పట్టాభిషిక్తురాలు **మహాదేవి**. ఈమె మంచి కుల శీలాలు కలది. సద్గుణవతియైన ఈమె మధ్య వయస్సులో ఉంటుంది. కోపం లేనిది.

ఈర్ష్యాభావం కూడ లేనిది. రాజు శీలం బాగా తెలిసికొని ఆతని సుఖదుఃఖాలను పంచుకొంటుంది. ఎల్లప్పుడూ భర్త మంగళాన్నికోరుతూ శాంతి – స్వస్త్యయనాదులు చేయిస్తూంటుంది. శాంతయై, ధీరురాలై, ప్రేమభరితురాలై ఎల్లప్పుడు అంతఃపురహితం కోరుకొంటూంటుంది.

**మూ. ఏభిరేవ గుణైర్యుక్తాస్తత్సంస్కారవివర్జితాః,**
**గర్వితాస్త్వతిసౌభాగ్యాత్ ప్రీతిసంభోగతత్పరాః. 36**

**శుచినిత్యోజ్జ్వలాకారాః ప్రతిపక్షాభ్యసూయికాః,**
**యౌవనాతిగుణోన్మత్తాస్తా దేవ్యః సముదాహృతాః. 37**

**తా. 'దేవీ'**లలో కూడ మహాదేవిలో ఉన్న గుణా లుంటాయి కాని ఆమె కున్న సంస్కారం వీళ్లలో తక్కువగా ఉంటుంది. సౌందర్యభోగాదులు చూచుకొని గర్విస్తూ ఆనందం, సంభోగం – వీటిమీద ఎక్కువ ఆసక్తితో ఉంటారు. ఎల్లప్పుడు పరిశుభ్రమైన మెరిసిపోతూన్న ఆకారాలతో (personalities) ఉంటారు. సవతులపై వీళ్లకు అసూయ మెండు. యౌవనాదిగుణాలతో ఉన్మాదం చెంది ఉంటారు.

**వి. 'తత్సంస్కారవివర్జితాః'** అనగా రాజ్యాభిషేకం పొందడం అనే సంస్కారం లేనివాళ్లు అను అర్థంకూడ చెప్పవచ్చును.

**మూ. సేనాపతేరమాత్యానాం భృత్యానామథవా పునః,**
**భవేయుస్తనయాస్తాస్తు ప్రీతిసంమానవర్ధితాః. 38**

**శీలరూపగుణైర్యాస్తు సంపన్నా నృపవల్లభాః,**
**స్వగుణైర్లబ్ధమాహాత్మ్యాః స్వామిన్య ఇతి తాః స్మృతాః. 39**

**తా. 'స్వామినీ'** అని చెప్పబడేవాళ్లు సేనాపతి లేదా అమాత్యులు లేదా ఇతరభృత్యుల కుమార్తెలై ఉంటారు. వాళ్లు ప్రేమతోను సంమానంతోను పెంచబడి, శీలరూపగుణ సంపన్నలై రాజు ప్రేమను చూరకొంటారు. తమ సద్గుణాలచేతనే వాళ్లు గొప్ప స్థితిని పొందినవాళ్లు.

**మూ. రూపయౌవనశాలిన్యః కర్కశాః విభ్రమాన్వితాః,**
**రతిసంభోగకుశలాః ప్రతిపక్షాభ్యసూయికాః. 40**

**ఉత్థితాశ్చాప్రమత్తాశ్చ త్యక్తాలస్యా హ్యనిష్ఠురాః,**
**మాన్యామాన్యవిశేషజ్ఞాః స్థాయిన్యః సంప్రకీర్తితాః. 41**

**తా. స్థాయినీ :–** రూపయౌవనశాలినులైన స్థాయినీస్త్రీలు కర్కశస్వభావం కలవాళ్లై ఉంటారు. విలాసలతో రతిసంభోగంలో మంచి నైపుణ్యంతో ఉంటారు. వీళ్లకు ప్రతిపక్ష స్త్రీల విషయంలో చాల అసూయ ఉంటుంది. ఎల్లప్పుడు ఏదో పని చేస్తూ, ఏమరిపాటు

గాని, సోమరితనం కాని లేకుండా ఉంటారు. మృదువుగా మాట్లాడతారు. ఎవరు మాన్యులు ఎవరు అమాన్యులు అను భేదాలు తెలిసినవాళ్లు. వీళ్లు **స్థాయినీ** అను రాజసంబంధం ఉన్న స్త్రీలు. (రాజు ఉంచుకొన్న స్త్రీలై ఉంటారు).

**మూ. దక్షాః స్ఫుటా హ్యుదాత్తాశ్చ గన్ధమాల్యోజ్జ్వలాః సదా,**
**నృపతేశ్ఛన్దవర్తిన్యః సర్వత్రేర్ష్యావివర్జితాః. 42**
**సుశీలా లఘుసంమానా మృదుర్నా(నా)త్యుద్ధతాస్తథా,**
**మధ్యస్థా నిభృతా క్షాన్తా భోగిన్య ఇతి తాః స్మృతాః. 43**

**తా. భోగిని :–** నేర్పు కలవాళ్లు, స్పష్టమైన ప్రవర్తన కలవాళ్లు, ఉదాత్తమైన స్వభావం కలవాళ్లు, ఎల్లప్పుడు సుగంధద్రవ్యాలతోను, మాలలతోను ప్రకాశిస్తూంటారు. రాజు అభిప్రాయాన్ని అనుసరించి మసలుకొంటారు. వీళ్లకు ఎవరివిషయంలోను ఈర్ష్య ఉండదు. మంచి శీలం. వీళ్లకు అంతఃపురంలో సంమానం తక్కువగా ఉంటుంది. ఔద్ధత్యం లేకుండా మృదువుగా ఉంటారు. మధ్యస్థలై ఒకరి పక్షాన ఉండడం అనేది లేకుండా, తమను తాము అదుపులో ఉంచుకొని ఓరిమితో ఉంటారు. వీళ్లు **భోగినీలు.**

**మూ. నానాకలావిశేషజ్ఞా నానాశిల్పవిచక్షణాః,**
**గన్ధశిల్పవిభాగజ్ఞాః నానాలేఖ్యవిశారదాః. 44**
**శయనాసనయానజ్ఞాః మధురాశ్చతురాస్తథా,**
**దక్షాః సౌమ్యాః స్ఫుటాః శ్లక్ష్ణాః నిభృతాః శిల్పకారికాః. 45**

**తా. శిల్పకారికలు :–** ఈ స్త్రీలు అనేక కళావిశేషాలలోను శిల్పాలలోను మంచి ప్రావీణ్యం ఉన్నవాళ్లు. గంధద్రవ్యాలలోని వివిధ భేదాలను, శిల్పాలలోని భేదాలను చక్కగా గుర్తించేవాళ్లు. చిత్రకర్మలయందు విశారదలు, శయనాలను, ఆసనాలను, వాహనాలను చక్కగా అలంకరించే విధానాలను వాటి స్వరూపాలను ఎరిగినవాళ్లు. మధుర స్వభావం, చాతుర్యం, సామర్థ్యం ఉన్నవాళ్లు. సౌమ్యులు. స్పష్టంగా మాట్లాడేవాళ్లు. సౌకుమార్యం కలవాళ్లు, అణకువతో ఉంటారు.

**మూ. అథ – రూపగుణౌదార్యసౌభాగ్యధైర్యశీలసంపన్నా,**
**పేశలమధురస్నిగ్ధానునాదికలచిత్రకణ్ఠా చ. 46**
**హేలాభవవిశేషజ్ఞా సత్త్వేనాభినయేన చ,**
**మాధుర్యేణ చ సంపన్నా హ్యాతోద్యకుశలా తథా. 47**
**స్వరతాలయతిజ్ఞా చ తథాచార్యోపసేవికా,**
**చతురా నాట్యకుశలా చోహాపోహవిచక్షణా. 48**
**రూపయౌవనసంపన్నా నాటకీయా ప్రకీర్తితా.**

**తా. నాటకీయా :–** నాటకీయ రూప – గుణ – ఔదార్య – సౌభాగ్య (సౌందర్య) ధైర్య – శీలాలతో సంపన్నయై ఉంటుంది. ఈమె కంఠస్వరం మృదువుగా మధురంగా, స్నిగ్ధంగా (జీర లేకుండా) ప్రతిధ్వనించేదిగా, కలంగా (విన సొంపుగా) చిత్రంగా ఉంటుంది. హేలా – భావాలతో సాత్త్వికాభినయము, ఆంగికాభి నయము మొదలైనవాటిలో నైపుణ్యం కలది. మనిషిలోనే ఒకవిధమైన మాధుర్యం కనబడుతుంది. వాద్యాలలోను, స్వరాలలోను, తాలాలలోను, యతులలోను మంచి జ్ఞానం కలది. ఆచార్యశుశ్రూష చేసినది. చాతుర్యము, నాట్యంలో నేర్పు, ఊహ – అపోహలలో విచక్షణత్వము ఉన్నది. రూప – యౌవనసంపన్నురాలు. ఈ నాటకీయ నాటకాది పర్యవేక్షణం చేస్తుంది.

**మూ. అఙ్గప్రత్యఙ్గసంపన్నాశ్చతుష్షష్ఠికలాన్వితాః. 49**
**చతురాః ప్రశ్రయోపేతాః స్త్రీదోషైశ్చ వివర్జితాః,**
**సదా ప్రాగల్భ్యయుక్తాశ్చ త్యక్తాలస్యా జితశ్రమాః. 50**
**నానాశిల్పప్రయోగజ్ఞాః నృత్తగీతవిచక్షణాః,**
**సమాగతాసు నారీషు రూపయౌవనకాన్తిభిః. 51**
**న దృశ్యతే గుణై స్తుల్యా యస్యాః సా నర్తకీ స్మృతా.**

**తా. నర్తకీ :–** ఆమె హస్తచరణాద్యంగాలు, వాటి అవయవాలు చక్కగా ఉంటాయి. అరవైనాలుగు కళలలో నేర్పు గలది. చాతుర్యము, వినయసంపద కలది. స్త్రీరోగా లేవీ లేనిది. నిర్భయంగా ఎల్లప్పుడు ప్రవర్తించగలది. అలసత్వం గాని తొందరగా అలసిపోవడం గాని ఉండదు. అనేకవిధాలైన శిల్పాలు, వాటి నిర్మాణాదికము తెలిసినది. నృత్తంలోను గీతంలోను నేర్పుగలది. పదిమంది స్త్రీలు ఒక చోట కలిసినప్పుడు, రూప – యౌవన – కాంతులచేత ఎవతెతో సమానురాలు మరొక స్త్రీ ఉండదో అట్టి యువతి **నర్తకి.**

**మూ. సర్వావస్థోపచారేషు యా న ముఞ్చతి పార్థివమ్. 52**
**విజ్ఞేయా నామతః సా తు నృపతేరనుచారికా.**

**తా. అనుచారిక :–** అన్ని అవస్థలలోను అందించవలసిన సేవలలో ఎల్లప్పుడూ రాజుతో కూడా ఉండే స్త్రీ **అనుచారిక.**

**మూ. ఛత్రశయ్యాసనే యుక్తా తథా వ్యజనకర్మణి. 53**
**సంవాహనే చ గన్ధే చ తథా చైవ ప్రసాధనే,**
**తథాభరణసంయోగే మాలాసంగ్రహణేషు చ. 54**
**విజ్ఞేయా నామతః సా తు నృపతేః పరిచారికా.**

**తా. పరిచారిక :–** రాజుకు – ఛత్రం – శయ్య, ఆసనం, వింజామర, ఒళ్లు పట్టడం (సంవాహనము), సువాసనద్రవ్యాలు సమకూర్చడం, అలంకరణ, ఆభరణ ధారణ, మాల్యధారణ – ఈ పను లన్నీ చేయడానికి నియుక్తురా లైన స్త్రీ **పరిచారిక**.

**మూ. నానాకక్ష్యావిచారిణ్యస్తథోపవనసంచరాః. 55**
**దేవతాయతనక్రీడాప్రాసాదపరిసంచరాః,**
**యామకిన్యస్తథా చైవ యాశ్చైవంలక్షణాస్త్రియః. 56**
**సంచారికాస్తు విజ్ఞేయాః నాట్యజ్ఞైర్భోగవారితాః.**

**తా. సంచారిక :–** అన్ని ఇంటి వాకిళ్లలోను, ఉద్యానాలలోను, దేవాలయాలలోను, క్రీడాంగణాలలోను ప్రాసాదాలలోను, వాటి పర్యవేక్షణ చేస్తూ తిరిగే స్త్రీలు, జాములను (కాలాన్ని) ఘంటానాదాదుల ద్వారా తెలిపేవాళ్లూ – ఇలాంటి పనులు చేయడంకోసం నియమింపబడిన స్త్రీలు **సంచారికలు**. వీళ్లు ఎలాంటి ప్రణయవ్యవహారాలలోను పాల్గొన కూడదు.

**మూ. ప్రేషణే కామసంయుక్తే గుహ్యేగుహ్యసముత్థితే. 57**
**యా నియుక్తా బుద్ధైస్తాస్తు జ్ఞేయాః ప్రేషణచారికాః.**

**తా. ప్రేషణచారిక :–** ప్రేమకలాపాలలో, రహస్యవిషయాలలో, సందేశాలు అందించడం మొదలైన పనులలో, రాజుచేత గాని, రాణులచేతగాని నియమిత యైన స్త్రీ **ప్రేషణచారిక**.

**మూ. సర్వాన్తఃపురరక్షాయాం స్తుతిస్వస్త్యయనాదిభిః. 58**
**యా వృద్ధిమభినన్దన్తి మహత్తర్యస్తు తాః స్మృతాః.**

**తా. మహత్తరిక :–** దేవస్తోత్రాల పాఠాలు, స్వస్త్యయనం మొదలైన మంగళకార్యాలు నడిపిస్తూ సకలాంతపురరక్షయందు నియుక్తురాలై, అంతపురాభివృద్ధికోసం పాటు బడే స్త్రీ **మహత్తరిక**.

**మూ. సంధివిగ్రహసంబద్ధనానాకార్యసముత్థితమ్. 59**
**నివేదయన్తి కార్యం యాః ప్రతీహార్యస్తు తాః స్మృతాః.**

**తా. ప్రతీహారి :–** సంధి, విగ్రహంమొదలైన రాజ్యపాలనకు సంబంధించిన అన్ని విషయాలను అవసరమైనప్పుడల్లా రాజుకు నివేదించే స్త్రీ **ప్రతీహారి**. (Personal secretary in political affairs).

**మూ. అప్రాప్తరతిసంభోగా అసంభ్రాన్తా అనుద్ధటాః. 60**
**నిభృతా యాః సలజ్జాశ్చ తాః కుమార్య ఇతి స్మృతాః.**

**తా. కుమారీలు :–** రతిసంభోగం ఎరుగనివాళ్లు, ఏమరిపాటు లేనివాళ్లు, తీవ్రత్వం లేకుండా అణకువతో ఉండేవాళ్లు, సిగ్గు – సంకోచమూ ఉన్నవాళ్లు అయిన స్త్రీలు **కుమారీలు** (Spinisters).

**మూ. పూర్వరాజనయాభిజ్ఞాః పూర్వరాజాభిపూజితాః. 61**

**సర్వానుచరితజ్ఞాశ్చ తా వృద్ధా ఇతి సంజ్ఞితాః.**

**తా. వృద్ధ :–** వెనుకటి రాజు లవలంబించిన నీతి తెలిసినవాళ్లు, వెనుకటి రాజుల ఆదరం పొందినవాళ్లు అంతఃపురాలలో ఉన్న అందరి చరిత్ర (జాతకాలు) తెలిసినవాళ్లు **వృద్ధస్త్రీలు**.

**మూ. భాణ్డాగారేష్వధికృతా ఆయుధాధికృతాస్తథా. 62**

**ఫలమూలౌషధీనాం చ తథా చైవాన్నవీక్షికాః,**

**గన్ధాభరణమాల్యానాం వస్త్రాణాం చైవ చిన్తికాః. 63**

**బహ్వర్థేషు నియుక్తా యా ఆయుక్తా ఇతి చ స్మృతాః,**

**ఇత్యన్తః పురచారిణ్యః స్త్రియః ప్రోక్తాః సమాసతః. 64**

**తా. ఆయుక్త :–** రాజ్యభాండాగారాలమీద (ware houses) ఆయుధగారాలమీద అధికారం కలవాళ్లు, ఫలాలు, దుంపలు, ఓషధులు (ఇతరమైన ఆకుకూరలు కాయకూరలు మొ॥) ఖాద్యపదార్థాలు వీటి అన్నింటిని పరీక్షించే వాళ్లు, గంధ – ఆభరణ – మాల్య – వస్త్రాదుల ఏర్పాటులను గూర్చి పరిశీలించేవాళ్లు, ఇలాంటి అనేకమైన రాజాంతఃపుర కార్యాలలో నియమింపబడిన స్త్రీలు **ఆయుక్తలు**. ఈ విధంగా అంతఃపురంలో వివిధ కార్యాలలో నియుక్తలైన స్త్రీలను గూర్చి సంగ్రహంగా చెప్పాను.

**మూ. విశేషణం తు శేషాణాం తాసాం వక్ష్యామి వో ద్విజాః,**

**యా నియుక్తా నియోగేషు ప్రయోగేషు తథైవ హి. 65**

**తా.** ద్విజులారా! అంతఃపురాలలో ఆ యా పనులు చేయడానికీ, అప్పు డప్పుడు కొన్ని విశిష్టమైన కార్యాలు సాధించడానికీ నియోగింపబడిన మిగిలిన స్త్రీలకు ఉండ వలసిన ప్రధానమైన లక్షణాలను గూర్చి చెపుతాను.

**మూ. న చోద్ధటా న చోద్భ్రాన్తా న లుబ్ధా న చ నిష్ఠురాః,**

**శాన్తాః క్షాన్తాః ప్రసన్నాశ్చ జితక్రోధా జితేన్ద్రియాః. 66**

**అకామా నిభృతాశ్చైవ స్త్రీదోషైశ్చ వివర్జితాః,**

**అనురక్తాశ్చ భక్తాశ్చ నానాపార్శ్వసముత్థితాః. 67**

**తా నియోగేషు యోక్తవ్యా వనితా మదవర్జితాః.**

**తా.** అంతపురంలో నియుక్తలైన స్త్రీలు తీవ్రమైనవాళ్లు గాని, తొందరగా కంగారు పడేవాళ్లు గాని, ధనాశకలవాళ్లు కాని, నిష్ఠురంగా మాటలాడేవాళ్లు కాని కాకూడదు. వాళ్లు శాంత స్వభావలై, ఓరిమితో, ప్రసన్నమైన ముఖాలతో, క్రోధాన్ని ఇంద్రియాలను జయించి, రాజు, రాజభార్యలు మొదలైనవాళ్ల విషయంలో ప్రేమ, భక్తి కలవారై ఉండాలి. ఏమాత్రము మదం (పొగరుబోతుతనం) లేని అలాంటి స్త్రీలను రాజ్యంలోని లేదా దేశంలోని వివిధ ప్రాంతాలనుండి తీసికొనివచ్చి అంతఃపురాలలో ఆ యా కార్యాలలో నియోగించాలి.

**మూ. యత్ స్యాన్నపుంసకం నామ తృతీయా ప్రకృతిః స్మృతా. 68**
**సాప్యన్తఃపురసంచారే యోజ్యా పార్థివవేశ్మని,**
**కారుకాః కాఞ్చుకీయాశ్చ తథా వర్షధరాః పునః. 69**
**ఔపస్థాయికనిర్ముణ్డాః కక్ష్యాస్థానేషు యోజయేత్,**
**అపుమాంసస్తు పురుషా యే తు స్త్రీభోగవర్జితాః. 70**
**ఏతే త్వన్తః పురచరాః కార్యా నిత్యం హి నాటకే.**

**తా. అంతఃపురాలలోని ఇతరసేవకులు :–** నపుసంకం అని చెప్పే 'తృతీయప్రకృతి' కూడ ఉంది (పేడివాల్లు). అలాంటివాళ్లనుకూడ రాజాంతఃపురాలలో అంతటా సంచరించే వాళ్లనుగా నియమించాలి. ఆ యా కక్ష్యాస్థానాలలో (ప్రాసాదాలలోని వేరువేరు వాకిళ్లలో) శిల్పులను, కంచుకీయులను, వర్షధరులను, ఔపస్థాయికులను, నిర్ముండులను, నియమించాలి. నాటకంలో – నపుంసకులనూ, స్త్రీభోగాలకి దూరమైన (వయస్సు మళ్లిన) పురుషులను అంతఃపురచరులనుగా చూపాలి.

**మూ. ద్వాస్థం తు స్నాతకం కుర్యాదార్యమాచారసంయుతమ్. 71**
**బ్రాహ్మణాః కుశలా వృద్ధాః కామదోషవివర్జితాః,**
**ప్రయోజనేషు దేవీనాం నియోక్తవ్యా నృపైః సదా. 72**

**తా.** విద్యావంతుడు, ఆర్యుడు, సదాచారసంపన్నుడు అయినవానిని దాస్థుణ్ణిగా (ద్వార రక్షాధికారినిగా) నియమించాలి. మంచి నైపుణ్యం కలవారు, కామసంబంధమైన దోషాలేవీ లేనివాళ్లు అయిన బ్రాహ్మణులను, దేవీలకు సంబంధించిన విద్యాధ్యాపనాది ప్రయోజనాలలో రాజు నియోగించాలి.

**మూ. యే విద్యాసత్యసంపన్నాః కామదోషవివర్జితాః,**
**జ్ఞానవిజ్ఞానకుశలాః కుఞ్చుకీయాస్తు తే స్మృతాః. 73**
**ప్రేషణే చార్థసంయుక్తే కాఞ్చుకీయాన్నియోజయేత్,**
**తథా వర్షధరాంశ్చై కామచారేషు యోజయేత్. 74**

**ఔపస్థాయికనిర్ముణ్డాన్ స్త్రీణాం ప్రేషణకర్మణి,**
**రక్షణే చ కుమారీణాం బాలికానాం చ యోజయేత్.** **75**

**తా.** విద్యతోను, సత్యముతోను సంపన్నులు, కామదోషాలు లేనివాళ్లు లౌకిక విషయజ్ఞానమునందు, శిల్పశాస్త్రాది విజ్ఞానమునందు కుశలులు అయినవాళ్లను కంచుకీయులనుగా నియమించాలి. వీళ్లను ప్రధానమైన విషయాలకు సంబంధించిన పనులమీద పంపుతూండాలి. ప్రేమసందేశాలు పంపడంమొదలైన పనులపై వర్షధరులను పంపుతూండాలి. స్త్రీలకు సంబంధించిన పనులపై ఔపస్థాయికులను, నిర్ముండులను పంపుతూండాలి. వీళ్లను అంతఃపురంలోను కుమారీల బాలికల సంరక్షణకార్యంలో కూడ నియమించాలి.

**మూ. మానకార్యేషు నారీణాం నియుఞ్జీతానుచారికాః,**
**అన్తఃపురాధికారే హి రాజచర్యానువర్తినః.** **78**
**సర్వనృత్తాఙ్గయోగజ్ఞం నాట్యగారే నివేశయేత్.**

**తా.** అంతఃపురస్త్రీల గౌరవాన్ని సంరక్షించే కార్యంలో అనుచారికలను నియమించాలి. రాజచర్యలు (రాజు చేసే అన్ని కార్యక్రమాలు) తెలిసినవాళ్లను అంతఃపురాధికారంలో నియమించాలి. నృత్తానికి సంబంధించిన అన్ని అంగాలు, విషయాలు తెలిసిన వానిని నాట్యాగారాధిపతినిగా నియమించాలి.

**మూ. యే స్వల్పసత్త్వాః కుశలాః క్లీబాశ్చ స్త్రీస్వభావినః.** **79**
**జాత్యా న దోషిణశ్చైవ తే వై వర్షవ(ధ)రాః స్మృతాః.**

**తా.** స్వల్పమైన శారీరబలం కలవాళ్లు, కార్యచతురులు, నపుంసకులు, స్త్రీల స్వభావం వంటి స్వభావం కలవాళ్లు, పుట్టుకతో అంగవైకల్యం ఏమీ లేనివాళ్లు **వర్ష వ(ధ)రులు**.

**మూ. నపుంసకా యే పురుషాః స్త్రీస్వభావేన వర్జితాః.** **80**
**నిర్ముణ్డా నామతో జ్ఞేయాః కామవిజ్ఞానవర్జితాః,**
**ఏవమష్టాదశవిధం ప్రోక్తమన్తఃపురం మయా.** **81**

**తా.** స్త్రీస్వభావం లేని నపుంసకపురుషులకు **నిర్ముండుల**ని పేరు. వాళ్లకు కామ విజ్ఞానం ఏమీ ఉండదు.

ఈ విధంగా నేను పద్దెనిమిది విధాలైన అంతఃపురాన్ని గూర్చి (అంతఃపునివాసి అధికార్యాదులనుగూర్చి) చెప్పాను.

**మూ. అతఃపరం ప్రవక్ష్యామి బాహ్యం పురుషసంచరమ్,**
**రాజా సేనాపతిశ్చైవ పురోధా మన్త్రిణస్తథా.** **82**

**సచివాః ప్రాడ్వివాకాశ్చ కుమారాధికృతాస్తథా,**
**ఏతే చాన్యే చ బహవః సభాస్తారా నృపస్య తు.**
**విభాగమేషాం వక్ష్యామి లక్షణం చ పృథక్ పృథక్. 83**

**తా.** ఇటుపైన బాహ్య పురుషులను (Public Servants) గూర్చి చెపుతాను. రాజు, సేనాపతి, పురోహితుడు, మంత్రులు (Ministers), సచివులు (Secretaries) ప్రాడ్వివాకులు (న్యాయనిర్ణేతలు - Judges) రాజకుమారుల సంరక్షణంకోసం నియమించిన అధికారులు, ఇంకా ఎందరో రాజ్యపాలనతో సంబంధం ఉన్న సభాస్తారులు (సభ్యులు) వీళ్లందరూ బాహ్యసంచరులు (బైట తిరిగేవాళ్లు). వీళ్లలోని విభాగాలను, లక్షణాలను గూర్చి చెపుతాను.

**మూ. శీలవాన్ బుద్ధిసంపన్నః సత్యవాదీ జితేంద్రియః,**
**దక్షః ప్రగల్భః స్మృతిమాన్ విక్రాన్తో మతిమాన్ శుచిః. 84**

**దీర్ఘదర్శీ మహోత్సాహః కృతజ్ఞః ప్రియవాక్ పటుః,**
**లోకపాలవ్రతధరః కర్మమార్గవిశారదః. 85**

**ఉత్థితశ్చాప్రమత్తశ్చ వృద్ధసేవ్యర్థశాస్త్రవిత్,**
**నానానయప్రచారజ్ఞః ఊహాపోహవిచక్షణః. 86**

**పరభావేఙ్గితజ్ఞశ్చ శూరో ధీరః క్షమాన్వితః,**
**నానాశాస్త్రార్థతత్త్వజ్ఞో నానాశిల్పప్రవర్తకః. 87**

**నీతిశాస్త్రే చ కుశలస్తథా చైవానురాగవాన్**
**స్థానవృద్ధిక్షయజ్ఞశ్చ పరరన్ధ్రవిచక్షణః**
**కృతజ్ఞోఽవ్యసనీ చైవ గుణైరేభిర్భవేన్నృపః. 88**

**తా. నృపుడు :-** ఉత్తమమైన శీలమూ, గొప్ప బుద్ధీ కలవాడు, సత్యమునే పలుకువాడు, ఇంద్రియాలను అదుపులో ఉంచుకొన్నవాడు, సమర్థుడు, ప్రగల్భుడు (నిర్భయంగా స్పష్టంగా మాట్లాడేవాడు), మంచి జ్ఞాపకశక్తి కలవాడు, విక్రమవంతుడు, మతిమంతుడు, శుచియైనవాడు (Man of integrity) దూరదృష్టి కలవాడు గొప్ప ఉత్సాహం కలవాడు, ఇతరులు చేసిన మేలు మరవనివాడు, ప్రియంగా మాట్లాడేవాడు, మాటలలో నేర్పరి, లోకపాలుల నియమాలను పాటించేవాడు, కర్మమార్గంలో, పనులు నిర్వహించడంలో, విశారదుడు, ఎల్లప్పుడు కార్యోన్ముఖుడు (Active), ఏమరిపాటు లేనివాడు, పెద్దల సేవ చేసేవాడు (పెద్దవాళ్ల సలహాలు తీసికొనేవాడు), అర్థశాస్త్రం (రాజ్యపాలనావిధానం బోధించే శాస్త్రం) తెలిసినవాడు, అనేకవిధాలైన నీతిమార్గాల

ప్రచారాన్ని (ప్రయోగాన్ని) ఎరిగినవాడు, ఊహ – అపోహలయందు విచక్షణుడు, ఇతరుల మనోగతభావాలను, ఇంగితాలను (ముఖవికారాదులను) తెలుసుకొనగలిగినవాడు, శూరుడు, ధీరుడు, క్షమాగుణం కలవాడు, వివిధశాస్త్రాల తత్త్వం తెలిసినవాడు, అనేక విధాలైన శిల్పాలను ప్రవర్తింపచేసేవాడు (పోషించేవాడు), నీతిశాస్త్రంలో కుశలుడు, స్నేహస్వభావం కలవాడు, తగిన ప్రదేశమును లేదా ఒక స్థితిని, వృద్ధిని క్షయాన్ని (లాభ నష్టాలను) తెలిసికొనగలిగినవాడు, శత్రువుల రంధ్రాలను (weak points) తెలిసి కొనడంలో సమర్థుడు, కృతజ్ఞుడు, దుర్వ్యసనాలు లేనివాడు – ఇలాంటి గుణా లున్న వాడుగా రాజు ఉండాలి. రాజు పైన చెప్పిన విధంగా ఉండాలి.

**మూ. శీలవాన్ సత్యసంపన్నః త్యక్తాలస్యః ప్రియంవదః,**
**పరరన్ధ్రవిధిజ్ఞశ్చ యాత్రాకాలవిశేషవిత్. 89**

**అర్థశాస్త్రార్థతత్త్వజ్ఞో హ్యనురక్తః కులోద్భవః,**
**దేశవిత్ కాలమిశ్చైవ భవేత్ సేనాపతిర్గుణైః. 90**

**తా. సేనాపతి :–** మంచి శీలం కలవాడు, సత్యశీలుడు, అలసత్వం లేనివాడు, ప్రియంగా మాటలాడేవాడు, పరులలోని లోపాలను, వాళ్ల ప్రవర్తనలను తెలిసికొన గలవాడు, యుద్ధయాత్రకు తగిన కాలవిశేషం తెలిసినవాడు. అర్థశాస్త్రరహస్యాలు తెలిసినవాడు, స్నేహభావం కలవాడు, ఉత్తమకులంలో పుట్టినవాడు, దేశ – కాలాలు తెలిసినవాడు అయినవానిని సేనాపతిగా నియమించాలి.

**మూ. కులీనా బుద్ధిసంపన్నాః శ్రుతినీతివిశారదాః,**
**స్వదేశాశ్చానురక్తాశ్చ శుచయో ధార్మికాస్తథా. 91**

**పురోధోమంత్రిణశ్చైవ గుణైరేతైర్భవన్తి హి.**

**తా. మంత్రి – పురోహితులు :–** కులీనులు, బుద్ధిశాలులు, శాస్త్రాలలోను, నీతి యందు విశాదరులు, స్వదేశానికి చెందినవాళ్లు, రాజభక్తులు, పరిశుద్ధులు, ధార్మికులు అయినవాళ్లు పురోహితులు గాను మంత్రులుగాను నియమించుటకు అర్హులు.

**మూ. బుద్ధిమాన్ నీతిసంపన్నో విక్రాన్తః స్యాత్ ప్రియంవదః. 92**
**అర్థశాస్త్రే చ కుశలో హ్యనురక్తః ప్రజాసు చ,**
**యో ధార్మికస్తథామాత్యః కర్తవ్యో భూమిపైః. 93**

**తా. అమాత్యుడు :–** బుద్ధిమంతుడు, నీతిసంపన్నుడు, విక్రమవంతుడు, ప్రియంగా మాటలాడువాడు, అర్థశాస్త్రంలో కుశలుడు, ప్రజల విషయంలో స్నేహభావం కలవాడు, ధార్మికుడు అయినవానిని రాజు అమాత్యునిగా నియమించాలి.

**మూ. వ్యవహారార్థతత్త్వజ్ఞా బుద్ధిమన్తో బహుశ్రుతాః,**
**మధ్యస్థా ధార్మికా ధీరాః కార్యాకార్యవిచక్షణాః. 94**
**క్షాన్తా దాన్తా జితక్రోధాః నోద్ధతాః సమదర్శినః,**
**ఈదృశాః ప్రాడ్వివాకాశ్చ స్థాప్యా ధర్మాసనేష్వథ. 95**

**తా. ప్రాడ్వివాకులు (Judges) :–** వ్యవహారమును అర్థతత్త్వమును తెలిసికొన గలవారు, బుద్ధిమంతులు, విద్యావంతులు, మధ్యస్థులు (పక్షపాతబుద్ధి లేనివారు), ధార్మికులు, ధీరులు, ఏది చెయ్యాలో ఏది చేయకూడదో తెలిసినవారు, ఓర్పు గలవారు, అనుభవం కలవారు, క్రోధం జయించినవారు, అహంభావం లేనివాళ్లు, అందరినీ సమంగా చూచేవారు – ఇలాంటివాళ్లను, రాజు, ధర్మాసనాలమీద ప్రాడ్వివాకులనుగా స్థాపించాలి.

**మూ. ఉత్థితాశ్చాప్రమత్తాశ్చ త్యక్తాలస్యా జితశ్రమాః,**
**స్నిగ్ధాః క్షాన్తా వినీతాశ్చ మధ్యస్థా నిపుణాస్తథా. 92**
**నయజ్ఞా వినయజ్ఞాశ్చ ఊహాపోహవిచక్షణాః,**
**సర్వశాస్త్రార్థసంపన్నాః కామాద్యవికృతాస్తథా. 97**
**క్రమాయాతా హితాసక్తాః కుమారాధికృతాస్తథా.**

**తా.** ఎల్లప్పుడు కార్యోన్ముఖులు, ఏమరిపాటు లేనివారు, అలసత్వం లేనివారు. శ్రమ సహించగలవారు. స్నేహశీలుల, ఓర్పు గలవారు. వినయవంతులు, మధ్యస్థులు (మధ్యవయస్సులో ఉన్నవారు). నిపుణులు, నీతీ వినయమూ తెలిసినవారు, ఊహాపోహ లలో నేర్పు గలవారు, సకలశాస్త్రార్థజ్ఞానం కలవారు, కామాదులచేత వికారం చెందనివారు. తండ్రితాతలనుంచి వంశక్రమంలో వస్తూన్నవారు, రాజకుటుంబహితం కోరేవారు – ఇలాంటి వాళ్లను కుమారాధికృతులనుగా చెయ్యాలి (రాజకుమారసంరక్షణం చేసే అధికారులనుగా నియమించాలి).

**మూ. నానారూపైః సమాయుక్తా గుణైరేతే భవన్తి హి,**
**బృహస్పతిమతాదేషాం గుణాంశ్చాప్యభిలక్షయేత్,**
**విజ్ఞేయం చావధార్యం చ సభాస్తారవికల్పనమ్. 98**

**తా. సభాస్తారులు :–** మానవులు గుణాలతో అనేకవిధాలుగా ఉంటారు. రాజు, బృహస్పతి మతాన్ని అనుసరించి వీళ్ల గుణాలను గుర్తించాలి. స్వయంగా ఇతరుల ద్వారా వాళ్ల గుణాలను గూర్చి తెలిసికొని, నిర్ణయించుకొని, సభాస్తారులనుగా నియ మించాలి.

**మూ. ఇత్యేష వో మయా ప్రోక్తః ప్రాడ్వివాకాదినిర్ణయః,**

**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి చిత్రాభినయనం ప్రతి.** **99**

**ఇతిభరతీయే నాట్యశాస్త్రే పుంస్త్ర్యుపచారో నామాధ్యాయః చతుర్వింశః.**

**తా.** ఈ విధంగా నేను ప్రాడ్వివాకాది నియోగాన్ని గూర్చి చెప్పాను. ఇటుపైన చిత్రాభినయాన్ని గూర్చి చెపుతాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన 'బాలానందిని' అను**
**నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో పుంస్త్ర్యుపచారం అను**
**ఇరవైనాల్గవ అధ్యాయం సమాప్తం.**

గమనిక : అభినవభారతితో ముద్రించిన నాట్యశాస్త్రం పుస్తకంలో ఇది ఇరవైనాల్గవ అధ్యాయం. కాని కొన్ని ప్రతులలో ఇది ముప్పైనాల్గవ అధ్యాయంగా ముద్రించబడింది.

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ పఞ్చవింశోఽధ్యాయః

# చిత్రాభినయము

**"వాగఙ్గసత్త్వచేష్టాచిత్రాభినయప్రయోగరచనచణః,**
**సంసారనాట్యనాయకపురుషాకారః శివో జయతి"**

**- శ్రీమదభినవగుప్తాచార్యాః**

**మూ. అఙ్గాద్యభినయస్యైవ యో విశేషః క్వచిత్ క్వచిత్,**
**అనుక్త ఉచ్యతే చిత్రః స చిత్రాభినయః స్మృతః. 1**

**తా.** అక్కడక్కడ (కొన్ని సందర్భాలలో) అంగాద్యభినయమే ఏదో ఒక విశేషాన్ని సూచించడానికి చేయబడుతుంది. దానికే **చిత్రాభినయం** అని పేరు. వెనుక చెప్పని ఆ చిత్రాభినయాన్ని గూర్చి ఇక్కడ చెప్పబడుతూన్నది.

**మూ. ఉత్తానౌ తు కరౌ కృత్వా పతాకే స్వస్తికం తథా,**
**ఉద్వాహితేన శిరసా తథా చోర్ధ్వనిరీక్షణాత్. 2**

**ప్రభాతం గగనం రాత్రిం ప్రదోషం దివసం తథా,**
**ఋతూన్ ఘనాన్ వనాన్తాంశ్చ విస్తీర్ణాంశ్చ జలాశయాన్. 3**

**దిశో గ్రహాన్ సనక్షత్రాన్ కిఞ్చిత్ స్వఃస్థం చ యద్భవేత్,**
**తస్య త్వభినయః కార్యో నానాదృష్టిసమన్వితః. 4**

**తా. పగలు రాత్రి సాయంకాలం మొదలైనవాటి అభినయం :-** పతాకముద్రలో వెల్లగితలా ఉన్న హస్తాలను స్వస్తికముద్రలో ఉంచి, శిరస్సు ఉద్వాహితం చేసి తగిన వేరు వేరు దృష్టులతో - ప్రభాతం (తెల్లవారడం), ఆకాశం, రాత్రి, సాయంకాలం, పగలు, ఋతువులు, మేఘాలు, స్వర్గంలో (ఆకాశంలో) ఉన్న ఏదైన వస్తువు - ఇలాంటివాటిని ప్రదర్శించాలి.

**మూ. ఏభిరేవ కరైర్భూయః తేనైవ శిరసా పునః,**
**అధోనిరీక్షణేనాథ భూమిస్థాన్ సంప్రదర్శయేత్. 5**

**తా. భూమిపై ఉన్న పదార్థాల అభినయం :-** ఇవే హస్తముద్రలతో, అదే శిరస్సుతో, క్రిందికి చూడడం ద్వారా భూమిమీద ఉన్న వాటిని ప్రదర్శించాలి.

**మూ. స్పర్శస్య గ్రహణేనైవ తథోల్లుకసనేన చ,**
**చన్ద్రజ్యోత్స్నాం సుఖం వాయుం రసం గన్ధం చ నిర్దిశేత్. 6**

**తా. వెన్నెల, సుఖం, మందమారుతం మొదలైనవాటి అభినయం :–** చంద్రుణ్ణి, వెన్నెలను, లేదా చంద్రుని కాంతిని, సుఖమును, రుచిని, గంధాన్ని – 'స్పర్శ' ప్రదర్శనంచేత, రోమాంచం చేత (ఉలికిపడడంచేత) అభినయించాలి.

**మూ. వస్త్రావగుణ్ఠనాత్ సూర్యం రజో ధూమానిలాంస్తథా,**
**భూమితాపమథోష్ణం చ కుర్యాచ్ఛాయాభిలాషతః. 7**

**తా. సూర్యుడు, పరాగం మొదలైనవాటి అభినయం :–** వస్త్రంతో కప్పుకొనడం ద్వారా – సూర్యుణ్ణి, పరాగాన్ని, ధూమాన్ని, గాలిని అభినయించాలి. నీడకోసం వెదకడం ద్వారా నేలమీద తాపాన్ని, వేడినీ అభినయించాలి.

**మూ. ఊర్ధ్వకేకరదృష్టిస్తు మధ్యాహ్నే సూర్యమాదిశేత్,**
**ఉదయాస్తగతం చైవ విస్మయార్థైః ప్రదర్శయేత్. 8**

**తా. మధ్యాహ్నసూర్యుడు మొదలైనవాటి అభినయం :–** నడినెత్తిమీదికి వచ్చిన సూర్యుణ్ణి ఆకేకరదృష్టులతో (సగం సగం మూసికొనిపోతూన్న కళ్లతో) పైకి చూడడంచేత, ఉదయాస్తమయసమయాలలో సూర్యుణ్ణి ఆశ్చర్యద్యోతకాభినయాల ద్వారా ప్రదర్శించాలి.

**మూ. యాని సౌమ్యార్థయుక్తాని సుఖభావకృతాని చ,**
**గాత్రస్పర్శైః సరోమాఞ్చైస్తేషామభినయో భవేత్. 9**

**తా. సుఖం కలిగించే పదార్థాల అభినయం :–** సౌమ్యములు, సుఖప్రదములూ అయిన పదార్థాలను గాత్రస్పర్శలచేత రోమాంచాలచేత అభినయించాలి.

**మూ. యాని స్యుస్తీక్ష్ణరూపాణి తాని చాభినయేత్ సుధీః,**
**అసంస్పర్శైస్తథోద్వేగైస్తథా ముఖవికుణ్ఠనైః. 10**

**తా. తీక్ష్ణవస్తువుల అభినయం :–** తీక్ష్ణములైన దుఃఖహేతువులైన వస్తువులను గూర్చి, స్పృశించకుండా వాటికి దూరంగా ఉండడం, 'అబ్బో!' అన్నట్లు భయం, ముఖం ముణుచుకొనడంవంటివాటితో అభినయించాలి.

**మూ. గమ్భీరోదాత్తసంయుక్తానర్థానభినయేద్ బుధః,**
**సాటోపైశ్చ సగర్వైశ్చ గాత్రైః సౌష్ఠవసంయుతైః. 11**

**తా. గంభీరోదాత్తాది విషయాల అభినయం :–** గంభీరములు ఉదాత్తములు అయిన వస్తువులను, ఆటోపంతో, గర్వంతో, సౌష్ఠవంతో కూడిన అవయవాల విన్యాసాలచేత అభినయించాలి.

**మూ. యజ్ఞోపవీతదేశస్థమరాలం హస్తమాదిశేత్,**
**స్వస్తికౌ విచ్యుతౌ హారస్రగ్దామార్థాన్ సమాదిశేత్. 12**

**తా. హార - మాలాదుల అభినయం :-** ముత్యాలహారం, పుష్పమాలలు ధరించడాన్ని, యజ్ఞోపవీతం ధరించే భుజప్రదేశంమీద అరాలహస్తాలను ఉంచి స్వస్తిక ముద్రతో క్రిందికి జార్చి అభినయించాలి.

**మూ. భ్రమణేన ప్రదేశిన్యా దృష్టేః పరిగమేన చ,**
**అలపల్లవపీడాయాః సర్వార్థగ్రహణం భవేత్. 13**

**తా. 'సమస్తమూ' అను అర్థం అభినయించడం :-** తర్జని తిప్పి, దృష్టి నలుమూలలా ప్రసరింపచేసి అలపల్లవహస్తాన్ని నొక్కడం ద్వారా 'సమస్తము', 'అంతా కూడ' అను అర్థం అభినయించాలి.

**మూ. శ్రవ్యం శ్రవణయోగేన దృశ్యం దృష్టివిలోకనైః,**
**ఆత్మస్థం పరసంస్థం వా మధ్యస్థం వా వినిర్దిశేత్. 14**

**తా. శ్రవ్య - దృశ్యవిషయాల అభినయం :-** తనకు గాని ఎదుటివానికి గాని, ఇతరునికి గాని సంబంధించిన వినదగినదానిని లేదా చూడదగినదానిని, చెవి గాని చూపు కాని దాని వైపు తిప్పి (ప్రసరింపచేసి) అభినయించాలి.

**మూ. విద్యుదుల్కాఘనరవా విస్ఫులిఙ్గార్చిషస్తథా,**
**త్రస్తాఙ్గాక్షినిమేషైశ్చ తేఽభినేయాః ప్రయోక్తృభిః. 15**

**తా. మెరుపులు మొదలైనవాటి అభినయం :-** మెరుపు, ఉల్కాపాతం, ఉరుము, నిప్పునెరసులు, అగ్నిజ్వాలలు వీటిని భయపడిన శరీరంతో, కళ్లు మూసికొని అభినయించాలి.

**మూ. ఉద్వేష్టితపరావృత్తౌ కరౌ కృత్వా నతం శిరః,**
**అసంస్పర్శైస్తథానిష్టే జిహ్మదృష్టేన కారయేత్. 16**

**తా. అనిష్టవస్తువును అభినయించుట :-** శిరస్సు వంచి, చేతులు ఉద్వేష్టిత - పరివర్తితీకరణాలలో ఉంచి, ఆ వస్తువు స్పృశించకపోవడంచేతా, వంకర చూపుచేతా అనిష్టవస్తువును, (ఆ వస్తువు తనకు ఇష్టం కానిది అను భావాన్ని) అభినయించాలి.

**మూ. వాయుముష్ణం తమస్తేజో ముఖప్రచ్ఛాదనేన చ,**
**రేణుతోయపతఙ్గాంశ్చ భ్రమరాంశ్చ నివారయేత్. 17**

**తా. వేడిగాలి మొదలైనవాటి అభినయం :-** వేడిగాలిని, చీకటి, వెలుతురు - వీటిని ముఖం కప్పుకొనడంచేత అభినయించాలి. పరాగం, నీళ్లు, పక్షులు, తుమ్మెదలు - వీటిని నివారిస్తూన్నట్లు, తోలుతూన్నట్లు చేస్తూ అభినయించాలి.

**మూ. కృత్వా స్వస్తికసంస్థానౌ పద్మకోషావధోముఖౌ,**
**సింహర్క్షవానరవ్యాఘ్రశ్వాపదాంశ్చ నిరూపయేత్. 18**

**తా. సింహాదులైన క్రూరమృగాల సూచన :–** 'పద్మకోశ' ముద్రలో ఉన్న హస్తాలు రెండిటినీ స్వస్తికాకారంలో అధోముఖంగా (కింది వైపు అగ్రభాగా లుండేటట్లు) ఉంచి, సింహాలను, ఎలుగుబంట్లను, వానరాలను, వ్యాఘ్రాలను, ఇతర క్రూరమృగాలను సూచించాలి.

**మూ. స్వస్తికౌ త్రిపతాకౌ చ గురూణాం పాదవన్దనే,**
**ఖటకస్వస్తికౌ చాపి ప్రతోదగ్రహణే స్మృతౌ. 19**

**దా. గురువందనాదికం :–** గురుపాదవందనాన్ని సూచించడానికి 'త్రిపతాక' హస్తాలను స్వస్తికముద్రలో ఉంచాలి. ఖటకాముఖహస్తాలను స్వస్తికాకారంలో ఉంచి కొరడా పట్టుకొనడం సూచించాలి.

**మూ. ఏకం ద్విత్రీణి చత్వారి పఞ్చ షట్ సప్త చాష్టధా,**
**నవ వా దశవాపి స్యుర్గణనాఙ్గులిభిర్భవేత్. 20**

**దశాఖ్యాశ్చ శతాఖ్యాశ్చ సహస్రాఖ్యాస్తథైవ చ,**
**పతాకాభ్యాం తు హస్తాభ్యాం ప్రయోజ్యాస్తాః ప్రయోక్తృభిః. 21**

**తా. సంఖ్యల సూచన :–** ఒకటినుండి పదివరకు ఉన్న సంఖ్యలను అన్ని వేళ్లు చూపడం ద్వారా, లేదా అన్ని వెళ్లు లెక్కపెట్టడం ద్వారా సూచించాలి. పది, నూరు, వెయ్యి అను పదిరెట్ల సంఖ్యలను పతాకహస్తాల ద్వారా సూచించాలి.

**మూ. దశాఖ్యగణనాయాస్తు పరతో యా భవేదిహ,**
**వాక్యార్థేనైవ సాధ్యాసౌ పరోక్షాభినయేన వా. 22**

**తా.** పదికి మించిన వంద, వెయ్యి మొదలైన సంఖ్యలను మాటలతోనే చెప్పడం గాని పరోక్షాభినయం ద్వారా సూచించడం గాని చెయ్యాలి.

**మూ. ఛత్రధ్వజపతాకాశ్చ నిర్దేశ్యా దణ్డధారణాత్,**
**నానాప్రహరణం చైవ నిర్దేశ్యం ధారణాశ్రయమ్. 23**

**తా. ఛత్రధ్వజాదిసూచనం :–** ఛత్రాన్ని, ధ్వజాన్ని, పతాకాలను సూచించడానికి వాటి దండాలను పట్టుకొన్నట్లు గదాద్యాయుధాలను సూచించడానికి వాటిని ఎలా పట్టుకొంటారో అలా పట్టుకొన్నట్లు అభినయించడం ద్వారా సూచించాలి.

**మూ. ఏకచిత్తో హ్యధోదృష్టిః కించిన్నతశిరాస్తథా,**
**సవ్యహస్తశ్చ సందంశః స్మృతే ధ్యానే వితర్కితే. 24**

**తా. స్మరణాద్యభినయం :-** ఏకాగ్రచిత్తంతో, తల కొంచెం క్రిందికి వంచి, క్రిందికి చూస్తూ, ఎడమ చెయ్యి సందంశముద్రలో ఉంచడం ద్వారా స్మృతిని, ధ్యానాన్ని ఆలోచనను సూచించాలి.

**మూ. ఉద్వాహితం శిరః కృత్వా హంసపక్షౌ ప్రదక్షిణౌ,**
**అపత్యరూపణే కార్యముచ్ఛ్రయే చ ప్రయోక్తృభిః. 25**

**తా. అపత్యాదిసూచనం :-** శిరస్సు ఉద్వాహితం చేసి హంసపక్షహస్తాలను ప్రదక్షిణంగా త్రిప్పడంద్వారా, సంతానాన్ని, ఎత్తునూ సూచించాలి.

**మూ. అరాలం చ శిరఃస్థానే సముద్వాహ్య తు వామకమ్,**
**గతే నివృత్తే ధ్వస్తే చ శ్రాన్తవాక్యే చ యోజయేత్. 26**

**తా. గడిచిపోయినవి మొదలైనవాటి సూచన :-** వెళ్లిపోయినవాడు లేదా గడచి పోయిన కాలము, ఆగిపోయిన ధ్వని, నశించినవాడు లేదా ధ్వస్తమైన ప్రయత్నం, అలసిపోయినవాని మాటలు సూచించడానికి అరాలహస్తాన్ని శిరస్సు ఎడమ పక్కనుంచి కదల్చాలి.

**మూ. సర్వేన్ద్రియస్వస్థతయా దిక్ప్రసన్నతయా తథా,**
**విచిత్రభూతలాలోకైః శరదం తు వినిర్దిశేత్. 27**

**తా. శరదృతుసూచనం :-** అన్ని ఇంద్రియాలు స్వస్థంగా ఉన్నట్లు, దిక్కులు ప్రసన్నంగా ఉన్నట్లూ చూపడంచేత, విచిత్రమైన భూతలం వైపు చూపులు ప్రసరింప చేయడంచేతా శరదృతువును సూచించాలి.

**మూ. గాత్రసంకోచనాచ్చాపి సూర్యాగ్నిపటుసేవనాత్,**
**హేమన్తస్త్వభినేతవ్యః పురుషైర్మధ్యమోత్తమైః. 28**

**తా. హేమంతసూచన :-** మధ్యమపురుషులు, ఉత్తమపురుషులూ కూడ హేమంత ఋతువును సూచించడానికి శరీరం ముణుచుకొనడం, ఎక్కువగా ఎండను, అగ్నిని సేవించడం చెయ్యాలి.

**మూ. శిరోదన్తోష్ఠకమ్పేన గాత్రసంకోచనేన చ,**
**కూజితైశ్చ ససీత్కారైః అధమః శీతమాదిశేత్. 29**

**తా.** శిరస్సు, దంతాలు, పెదవులు వణికిపోతూండడంచేత, శరీరం ముణుచు కొనడంచేత 'స్స్' అంటూ కూయడంచేత అధముడు చలిని సూచించాలి.

**మూ. అవస్థాన్తరమాసాద్య కదాచిత్తూత్తమైరపి,**
**శీతాభినయనీం కుర్యాద్దైవాద్ వ్యసనసంభవమ్. 30**

**తా.** ఉత్తములు కూడ దైవవశంచేత వ్యసనంవల్ల కలిగిన అధమావస్థను పొంది శీతాభినయం అధముడు చేసినట్లు చెయ్యాలి.

**మూ. ఋతుజానాం చ పుష్పాణాం గన్ధాఘ్రాణైస్తథైవ చ,**
**రూక్షస్య వాయోః స్పర్శాచ్చ శిశిరం రూపయేద్బుధః. 31**

**తా. శిశరర్తు సూచనం :–** ఆ ఋతువులో పుట్టే పుష్పాల సుగంధాన్ని ఆఘ్రాణించ డంచేత, తీక్ష్ణమైన చలిగాలి స్పర్శచేత శిశిరర్తువును సూచించాలి.

**మూ. ప్రమోదజననారమ్భైరుపభోగైః పృథగ్విధైః,**
**వసన్తస్త్వభినేతవ్యో నానాపుష్పప్రదర్శనాత్. 32**

**తా. వసంతాభినయం :–** ఆనందకరములైన లేదా ఆనందంతో చేసే పనులచేతా, వివిధములైన ఉపభోగవస్తువులచేత, వివిధపుష్పాల ప్రదర్శనంచేతా వసంతర్తువును అభినయించాలి.

**మూ. స్వేదప్రమార్జనైశ్చైవ భూమితాపైః సవీజనైః,**
**ఉష్ణస్య వాయోః స్పర్శేన గ్రీష్మం త్వభినయేత్ బుధః. 33**

**తా. గ్రీష్మాభినయం :–** చెమట తుడుచుకొంటూండడం, నేలమీద పాదం మోపితే కాలిపోతూండడం, విసనకఱ్ఱలూ, వేడి గాలి తగులుతూండడం – వీటిచేత గ్రీష్మర్తువును అభినయించాలి.

**మూ. కదమ్బనీపకుటజైః శాద్వలైః సేన్ద్రగోపకైః,**
**మేఘవాతైః సుఖస్పర్శైః ప్రావృట్కాలం ప్రదర్శయేత్. 34**

**తా. వర్షాకాలాభినయం :–** కదంబ – నీప – కుటజపుష్పాలచేతా, ఇంద్రగోప కీటకాలు తిరుగుతూన్న పచ్చిక బీళ్లచేత, సుఖస్పర్శ గల మేఘవాయువులచేతా వర్షాకాలాన్ని సూచించాలి.

**మూ. మేఘౌఘనాదైర్గమ్భీరైర్ధారాప్రపతనైస్తథా,**
**విద్యున్నిర్ఘాతఘోషైశ్చ వర్షారాత్రం సమాదిశేత్. 35**

**తా. వర్షాకాలరాత్రుల ప్రదర్శనం :–** మేఘసముదాయాల ధ్వనులచేత, ధారావృష్టుల చేత, లేదా కొండలమీదనుంచి పడే ధారాప్రపాతాలచేత, మెరుపులచేత పిడుగుల ధ్వనుల చేత వర్షాకాలరాత్రిని ప్రదర్శించాలి.

**మూ. యద్యస్య చిహ్నం వేషో వా కర్మ వా రూపమేవ వా,**
**నిర్దేశ్యః స ఋతుస్తేన ఇష్టానిష్టార్థదర్శనాత్. 36**

**తా.** ఏ ఋతువునకు ఏది చిహ్నమో, ఏ వేషమో, ఏ రూపమో, ఆ చిహ్నాదులతో ఆ ఋతువును, దానివల్ల కలిగే ఇష్టానిష్టాలను చూపుతూ ప్రదర్శించాలి.

**మూ. ఏతానృతూనర్థవశాద్దర్శయేద్ధి రసానుగాన్,**
**సుఖినస్తు సుఖోపేతాన్ దుఃఖార్థాన్ దుఃఖసయుంతాన్. 37**

**తా.** ఆ యా ఋతువులను, ప్రయోగిస్తూన్న రూపకంలోని రసాలను పట్టి చూపుతూ ఆ నాట్యానికి సంబంధించిన పాత్రలలో సుఖవంతులను సుఖవంతులనుగాను, దుఃఖిస్తూన్నవాళ్లను దుఃఖవంతులగాను చూపాలి.

**మూ. యో యేన భావేనావిష్టః సుఖదేనేతరేణ వా,**
**స తదాహితసంస్కారః సర్వం పశ్యతి తన్మయమ్. 38**

**తా.** ఎవడు ఏ భావావేశంలో ఉంటాడో అది సుఖమైనా దుఃఖమైనా, ఆ భావంచేత వాని మనస్సులో చెరగని సంస్కారం ఏర్పడి ప్రపంచంలో అన్నింటినీ తన్మయంగానే, (సుఖమయంగానో దుఃఖమయంగానో) చూస్తాడు.

**మూ. భావాభినయనం కుర్యాద్విభావానాం నిదర్శనైః,**
**తథైవ చానుభావానాం భావసిద్ధిః ప్రవర్తితా. 39**

**తా.** విభావాలను చూపడం ద్వారా భావాలను అభినయించాలి. అదే విధంగా భావాల సిద్ధిని, భావాలు పుట్టాయి అను విషయాన్ని, అనుభావాలను చూపడం ద్వారా అభినయించాలి.

**మూ. విభావేనాహృతం కార్యమనుభావేన నీయతే,**
**ఆత్మానుభవనం భావో విభావైః పరదర్శనమ్. 40**

**తా.** విభావంచేత (విభావాలచేత) పుట్టింపబడిన భావాన్ని అనుభావం (అను భావాలు) సామాజికునికి తెలుపుతాయి. తాను స్వయంగా అనుభవించేటట్లు చేసేది (స్వయంగా అను భవించేది) భావం. దానినే పరులకు విభావాలచేత ప్రదర్శించడం జరుగుతుంది.

**మూ. గురుర్మిత్రం సఖా స్నిగ్ధః సంబన్ధీ బన్ధురేవ చ,**
**ఆవేద్యతే హి యః ప్రాప్తః స విభావ ఇతి స్మృతః. 41**

**తా.** రంగస్థలంమీద ప్రవేశించిన, లేదా ప్రవేశించినట్లు సూచింపబడిన గురువు, మిత్రుడు, స్నేహభావం గల సంబంధి, బంధువు, విభావ మని చెప్పబడుతున్నాడు.

**మూ. యత్త్వస్య సంభ్రమోత్థానైరర్ఘ్యపాద్యాసనాదిభిః,**
**పూజనం క్రియతే భక్త్యా సోఽనుభావః ప్రకీర్తితః. 42**

**తా.** గురువు మొదలైనవాళ్లలో ఎవరైనా ప్రవేశించిన వెంటనే – వారిని చూడగానే లేవడం ఎదురుగా వెళ్లడం, అర్ఘ్య – పాద్య – ఆసనాదులు సమర్పించడం మొదలైన పూజ భక్తిపూర్వకంగా చేయబడుతుంది. అది అనుభావం.

**వి.** ఒకనికి ఎవని విషయంలో భక్తి ఉంటుందో అతడు విభావం. అతని విషయంలో భక్తిభావంతో చేసే పూజాదులు అనుభావం. అట్లే అన్ని రస – భావాదుల విషయంలో చూచుకోవాలి అని చెప్పడంకోసం ఈ ఉదాహరణం ఇవ్వబడింది.

**మూ. ఏవమన్యేష్వపి జ్ఞేయో నానాకార్యప్రదర్శనాత్,**
**విభావో వాపి భావో వా విజ్ఞేయోఽర్థవశాద్ బుధైః. 43**

**తా.** ఇతరమైన రసభావాదిస్థలాలలో కూడ, ప్రయోజనాన్ని ఉద్దేశించి చూపబడిన వివిధకార్యాలను బట్టి ఏది భావమో ఏది విభావమో, ఏది అనుభావమో తెలుసుకోవాలి.

**మూ. యస్త్వపి ప్రతిసన్దేశో దూతస్యేహ ప్రతీయతే,**
**సోఽనుభావ ఇతి జ్ఞేయః ప్రతిసన్దేశదర్శితః. 44**

**తా.** (వీరరసప్రధాన మైన కథావస్తువు లున్న లేదా శృంగారాదిప్రధానవస్తువున్న నాట్యంలో దూతప్రేషణాదికం ఉంటుంది) దానిలో దూత తీసికొనివచ్చిన సందేశానికి జవాబుగా పంపిన ప్రతిసందేశం కూడ అనుభావమే. అనుభావమే ప్రతిసందేశంలో చూపబడుతూంటుంది.

**మూ. ఏవం భావో విభావో వాప్యనుభావశ్చ కీర్తితః,**
**పురుషైరభినేయః స్యాత్ ప్రమదాభిరథాపి వా. 45**

**తా.** ఈ లక్షణస్వరూపాలు గల భావ – విభావ – అనుభావాలను నాట్యంలో, పురుషులు స్త్రీలూ కూడ అభినయించాలి.

**మూ. స్వభావాభినయే స్థానం పుంసాం కార్యం తు వైష్ణవమ్,**
**ఆయతం వావహిత్థం వా స్త్రీణాం కార్యం స్వభావతః. 46**

**తా.** మామూలుగా నిలబడిన పురుషులు 'వైష్ణవస్థానకం'లోను, స్త్రీలు 'ఆయత' స్థానకంలో గాని, "అవహిత్థస్థానకం"లో గాని నిలబడాలి.

**మూ. ప్రయోజనవశాచ్చైవ శేషాణ్యపి భవన్తి హి,**
**నానాభావాభినయనైః ప్రయోగైశ్చ పృథగ్విధైః. 47**

**తా.** ప్రయోజనవశంచేత, (అవసరాన్ని బట్టి), అనగా వివిధభావాలను అభినయించే టప్పుడు, వేరు వేరు ఇతరవిషయాలను ప్రదర్శించే టప్పుడు, మిగిలిన స్థానకాలు (poses) అవలంబించాలి.

**మూ. ధైర్యలీలాఙ్గసంపన్నం పురుషాణాం విచేష్టితమ్,**
**మృదులీలాఙ్గహారైశ్చ స్త్రీణాం కార్యం తు చేష్టితమ్. 48**

**తా.** (అభినయాలలో) పురుషులు తమ చేష్టలను ధైర్యంతోను, లీలతోను కూడిన అంగహారాలతో చెయ్యాలి. స్త్రీలు, కోమలములు, సుకుమారములు అయిన అంగహారాలతో చేష్టలు చెయ్యాలి.

**మూ. కరపాదాఙ్గసంచారాః స్త్రీణాం తు లలితాః స్మృతాః,**
**సుధీరశ్చోద్ధతశ్చైవ పురుషాణాం ప్రయోక్తృభిః. 49**

**తా.** స్త్రీల హస్త – పాదాద్యంగాల సంచారములు (కదలికలు) లలితంగా ఉండాలి. పురుషుల హస్త – పాదాద్యంగాల కదలికలు చాల ధీరంగాను, ఉద్ధతంగాను ఉండాలి.

**మూ. యథారసం యథాబావం స్త్రీణాం భావప్రదర్శనమ్,**
**నరాణాం ప్రమదానాం చ భావాభినయనం (శబ్దార్థాభినయః) పృథక్**
**భావానుభావసంయుక్తం వ్యాఖ్యాస్యామ్యనుపూర్వశః. 50**

**తా.** స్త్రీలు రసానుగుణంగాను, భావానుగుణంగాను భావప్రదర్శనం చెయ్యాలి. స్త్రీలు చేసే భావాభినయము పురుషులు చేసే భావాభినయమూ వేరు వేరు విధాలలో ఉంటాయి. (వాళ్ల సంవాదాలు (dailogues) కూడ వేరు వేరు రీతులలో ఉంటాయి). స్త్రీ పురుషులకు ఏ విధమైన భావాభినయం యుక్తంగా ఉంటుందో క్రమం ప్రకారం విశదీకరిస్తాను.

**మూ. ఆలిఙ్గనేన గాత్రాణాం సస్మితేన చ చక్షుషా,**
**తథోల్లుకసనాచ్చాపి హర్షం సందర్శయేన్నరః. 51**

**తా.** దగ్గరనే ఉన్న మిత్రాదులను ఆలింగనం చేసికొనడం, చిరునవ్వుతో వికసించిన చూపులు, గగుర్పాటు – వీటితో పురుషుడు హర్షం అభినయించాలి.

**మూ. క్షిప్రసంజాతరోమాఞ్చా బాష్పేణాకులలోచనా,**
**కుర్వీత నర్తకీ హర్షం ప్రీత్యా వాక్యైశ్చ సస్మితైః. 52**

**తా.** వెంటనే రోమాంచము కలగడము, కన్నీరు కప్పిన నేత్రాలు, ప్రీతి పూర్వకమైన మాటలు, చిరునవ్వు – వీటితో నర్తకి హర్షం అభినయించాలి.

**మూ. ఉద్వృత్తరక్తనేత్రశ్చ సందష్టాధర ఏవ చ,**
**నిఃశ్వాసకమ్పితాఙ్గశ్చ క్రోధం చాభినయేన్నరః. 53**

**తా.** ఎఱ్ఱబడిన కళ్లు పెద్దవి చేస్తూ, క్రింది పెదవి కొరుకుతూ (గట్టిగా బిగిస్తూ) నిట్టూర్పులతో శరీరం వణికిపోతూ, పురుషుడు క్రోధం అభినయించాలి.

**మూ. నేత్రాభ్యాం బాష్పపూర్ణాభ్యాం చిబుకోష్ఠప్రకమ్పనాత్,**
**శిరసః కమ్పనాచ్చైవ భ్రుకుటీకరణేన చ. 54**

**మౌనేనాఙ్గులిభఙ్గేన మాల్యాభరణవర్జనాత్,**
**ఆయతస్థానకస్థాయా ఈర్ష్యాక్రోధో భవేత్ స్త్రియాః. 55**

**తా.** కళ్లు కన్నీటితో నిండి ఉంటాయి. బుగ్గలు, పెదవులు కదలుతాయి. శిరస్సు కంపిస్తూంటుంది. కనుబొమ్మలు ముణుచుకొని ఉంటాయి. ఈ విధంగా స్త్రీ (నర్తకి) ఏమీ మాట్లాడకుండా, పుష్పమాలలు, అలంకారాలు దూరంగా పడవేసి వేళ్లు విరుచుకొంటూ **'ఆయతస్థానకం'**లో నిలబడి ఈర్ష్యాజనితమైన క్రోధం అభినయించాలి.

**మూ. నిఃశ్వాసోచ్ఛ్వాసబహులైరధోముఖవిచిన్తనైః,**
**ఆకాశవీక్షణాచ్చాపి దుఃఖం పుంసాం తు యోజయేత్. 56**

**తా.** అధికమైన నిఃశ్వాసోచ్ఛ్వాసాలతో తల వంచి ఏదో ఆలోచిస్తూ, అప్పుడప్పుడు పైకి ఆకాశం వైపు చూస్తూ పురుషుడు దుఃఖాన్ని అభినయించాలి.

**మూ. రుదితైః శ్వసితైశ్చైవ శిరోభిహననేన చ,**
**భూమిపాతాభిఘాతైశ్చ దుఃఖం స్త్రీషు ప్రయోజయేత్. 57**

**తా.** ఏడ్పులూ నిట్టూర్పులూ తలమీద మొత్తుకొనడాలూ, నేలమీద పడడాలూ – వీటితో స్త్రీల దుఃఖాన్ని అభినయించాలి.

**మూ. ఆనన్దజం చార్తిజం చ ఈర్ష్యాసంభూతమేవ వా,**
**యత్ పూర్వముక్తం రుదితం తత్ స్త్రీనీచేషు యోజయేత్. 58**

**తా.** వెనుకచెప్పిన – ఆనందంచేత, ఆర్తిచేత, ఈర్ష్యచేత కలిగే రోదనాన్ని స్త్రీలలోను నీచులలోను ప్రదర్శించాలి.

**మూ. సంభ్రమావేగచేష్టాభిః శస్త్రసంపతనేన చ,**
**పురుషాణాం భయం కార్యం ధైర్యవేగబలాదిభిః. 59**

**తా.** తొందరచేత ఆవేగంచేత చేసే చేష్టలు, చేతిలోని శస్త్రం జారి క్రింద పడిపోవడం, ధైర్యము, వేగము, బలము (బలప్రదర్శనము) – వీటితో పురుషుల భయాన్ని ప్రదర్శించాలి.

**మూ. చలతారకనేత్రత్వాత్ గాత్రైః స్ఫురితకమ్పితైః,**
**సంత్రస్తహృదయత్వాచ్చ పార్శ్వాభ్యామవలోకనైః. 60**

**భర్తురన్వేషణాచ్చైవముచ్చైరాక్రన్దనాదపి,**
**ప్రియస్యాలిఙ్గనాచ్చైవ భయం కార్యం భవేత్ స్త్రియాః. 61**

**తా.** కంటిగుడ్లు తిరిగిపోతూ అవయవా లన్నీ వణుకుతూ ఉంటాయి. హృదయం (గుండె) కొట్టుకుంటూ ఉంటుంది. చూపులు ఈ పక్కకూ ఆ పక్కకూ తిప్పుతూ భర్తను వెదకుతూ బిగ్గరగా అరుస్తూంటుంది. భర్త దగ్గరనే ఉంటే వానిని కౌగలించుకొంటుంది. స్త్రీ భయాన్ని ఈ విధంగా అభినయించాలి.

**మూ. మదా యేఽభిహితాః పూర్వం తాన్ స్త్రీనీచేషు యోజయేత్,**
**సుకుమారైస్తు లలితైః పార్శ్వానతవిలమ్బితైః. 62**
**నేత్రావఘూర్ణనైశ్చైవ సాలస్యైః కథితైస్తథా,**
**గాత్రాణాం కమ్పనైశ్చైవ మదః కార్యో భవేత్ స్త్రియాః. 63**

**తా.** వెనుక చెప్పిన మద్యమదభేదాలను స్త్రీలయందు, నీచజనులయందు ప్రదర్శించాలి. సుకుమారంగాను అందంగాను పక్కలకు వంగడం, అవయవాలు వేలాడుతూన్నట్లు చేయడం, నేత్రాలు తిరిగిపోవడం, ముద్ద ముద్ద మాటలు, అవయవాలు వణకడం – వీటితో స్త్రీల మద్య మదాన్ని అభినయించాలి.

**మూ. అనేన విధినా కార్యః ప్రయోగః కరణాన్వితః,**
**పౌరుషః స్త్రీకృతో వాపి చావో హ్యభినయం ప్రతి. 64**

**తా.** స్త్రీలు గాని, పురుషులు గాని భావాన్ని అభినయించేటప్పుడు పైన చెప్పిన విధంగా యుక్తమైన కరణాలను జోడిస్తూ నాట్యప్రయోగం చెయ్యాలి.

**మూ. సర్వే సలలితా భావాః స్త్రీభిః కార్యాః ప్రయత్నతః,**
**ధైర్యమాధుర్యసంపన్నాః భావాః కార్యాస్తు పౌరుషాః. 65**

**తా.** స్త్రీలు భావాల అభినయం లాలిత్యంతోను, పురుషులు తాము చేయవలసిన భావాల అభినయాన్ని ధైర్యమాధుర్యసంపన్నరీతిలోను చెయ్యాలి.

**మూ. శుకాశ్చ శారికాశ్చాపి సూక్ష్మా యే చాపి పక్షిణః,**
**త్రిపతాకాఙ్గులిభ్యాం తు వలితాభ్యాం ప్రయోజయేత్. 66**

**తా.** చిలుకలను, గోరికంలను ఇతరమైన చిన్న పక్షులను త్రిపతాకముద్రలో ఉన్న హస్తం వేళ్లు వంచి ప్రదర్శించాలి.

**మూ. శిఖిసారసహంసాద్యాః స్థూలా యేఽపి స్వభావతః,**
**రేచకైరఙ్గహారైశ్చ తేషామభినయో భవేత్. 67**

**తా.** నెమళ్లు, సారసములు, హంసలు మొదలైన పెద్ద పక్షులను, వాటికి సంబంధించిన, రేచకాలతోను అంగహారాలతోను ప్రదర్శించాలి.

**మూ. ఖరోష్ట్రాశ్వతరాః సింహవ్యాఘ్రగోమహిషాదయః,**
**గతిప్రచారైరఙ్గైశ్చ తేఽభినేయాః ప్రయోక్తృభిః. 68**

**తా.** గాడిదలు, ఒంటెలు, కంచరగాడిదలు, సింహాలు, వ్యాఘ్రాలు, ఎద్దులు, దున్నపోతులు మొదలైన వాటిని వాటికి తగిన నడకలను, చేష్టలను ప్రదర్శిస్తూ అభినయించాలి.

**మూ. భూతాః పిశాచా యక్షాశ్చ దానవాః సహరాక్షసైః,**
**అఙ్గహారైర్వినిర్దేశ్యా నామసంకీర్తనాదపి. 69**

**తా.** భూతాలను, పిశాచాలను, యక్షులను, దానవులను, రాక్షసులను అంగహారాల చేత అభినయించాలి; లేదా వాటి పేర్లు చెప్పాలి.

**మూ. అఙ్గహారైర్వినిర్దేశ్యా అప్రత్యక్షా భవన్తి యే,**
**ప్రత్యక్షాస్త్వభినేతవ్యా భయోద్వేగైః సవిస్మయైః. 70**

**తా.** భూతపిశాచాదులు ప్రత్యక్షంగా కనబడనప్పుడు వాటిని అంగహారాలచేత సూచించాలి. అవి ప్రత్యక్ష మైతే వాటిని, భయంచేత, ఉద్వేగంచేత, ఆశ్చర్యంచేతా సూచించాలి.

**మూ. దేవాశ్చ చిహ్నైశ్చ ప్రణామకరణైః భావైశ్చ విచేష్టితైశ్చైవ,**
**అభినేయా హ్యర్థవశాదప్రత్యక్షాః ప్రయోగజ్ఞైః. 71**

**తా.** ప్రత్యక్షంగా కనబడని దేవతలను చిహ్నాలను చూపడంచేత, ప్రమాణాలచేత, భావాలచేత, చేష్టలచేత నిర్దేశించాలి.

**మూ. సవ్యోత్థితేన హస్తేన హ్యరాలేన శిరః స్పృశేత్,**
**నరోఽభివాదనే హ్యేతదప్రత్యక్షే విధీయతే. 72**

**తా.** అప్రత్యక్షమైన మానవునికి అభివాదనం, కుడి అరాలహస్తంతో శిరస్సు స్పృశించి చెయ్యాలి.

**మూ. ఖటకావర్ధమానేన కపోతాఖ్యేన వా పునః,**
**దైవతాని గురూంశ్చైవ ప్రమదాశ్చాభివాదయేత్. 73**

**తా.** దేవతలకు, గురువులకు, స్త్రీలకు ఖటకావర్ధమానహస్తంతో కాని, కపోత హస్తంతో కాని అభివాదనం చెయ్యాలి.

**మూ. దివౌకసశ్చ యే పూజ్యాః ప్రత్యక్షాశ్చ భవన్తి యే,**
**తాన్ ప్రమాణైః ప్రభావైశ్చ గమ్భీరార్థైశ్చ యోజయేత్. 74**

**తా.** పూజ్యులైన దేవతలు ప్రత్యక్ష మైనప్పుడు వాళ్ల గొప్ప ప్రమాణాలను, ప్రభావాన్నీ గాంభీర్యాదులను సూచించే విధంగా అభినయం చెయ్యాలి.

**మూ. మహాజనం సఖీవర్గం విటధూర్తజనం తథా,**
**పరిమణ్డలసంస్థేన హస్తేనాభినయేన్నరః. 75**

**తా.** జనసముదాయాన్ని, సఖీజనవర్గాన్నీ, విటధూర్తజనాన్నీ పరిమండలహస్తంచేత సూచించాలి.

**మూ. పర్వతాన్ ప్రాంశుయోగేన వృక్షాంశ్చైవ సముచ్ఛ్రితాన్,**
**ప్రసారితాభ్యాం బాహుభ్యాముత్క్షిప్తాభ్యాం ప్రయోజయేత్. 76**

**తా.** ఎత్తైన పర్వతాలను, వృక్షాలను, చాపిన చేతులు పైకి ఎత్తడం ద్వారా సూచించాలి.

**మూ. సమూహం సాగరం సేనాం బహువిస్తీర్ణమేవ చ,**
**పతాకాభ్యాం తు హస్తాభ్యాముత్క్షిప్తాభ్యాం ప్రదర్శయేత్. 77**
**శౌర్యం ధైర్యం చ గర్వం చ దర్పమౌదార్యముచ్ఛ్రయమ్,**
**లలాటదేశస్థానేన త్వరాలేనాభిదర్శయేత్. 78**

**తా.** సమూహాన్ని, సాగరాన్నీ, సేనను, చాల విస్తీర్ణమైన ప్రదేశాన్ని పతాకహస్తాలు రెండూ పైకి ఎత్తడం ద్వారా ప్రదర్శించాలి.

శౌర్యమును, ధైర్యమును, గర్వమును, దర్పమును, ఔదార్యమును, ఎత్తునూ, అరాల హస్తాన్ని లలాటప్రదేశం మీద ఉంచడం ద్వారా అభినయించాలి.

**మూ. వక్షోదేశాదపావిద్ధౌ కరౌ తు మృగశీర్షకౌ,**
**విస్తీర్ణప్రద్రుతోత్క్షేపౌ యోజ్యౌ యత్ స్యాదపావృతమ్. 79**

**తా.** మృగశీర్షహస్తాలను వక్షఃస్థలంనుండి తొలగించి శీఘ్రంగా చూపుతూ దూరంగా తీసికొని వెళ్లడం ద్వారా అపావృతాన్ని (తెరవడాన్ని) అభినయించాలి.

**మూ. అధోముఖోత్తానతలౌ హస్తౌ కించిత్ ప్రసారితౌ,**
**కృత్వాత్వభినయేద్ వేలాం బిలద్వారం గృహం గుహామ్. 80**

**తా.** అరచేతులు కొంచెం విస్తరింపచేసి, వాటి అగ్రభాగాలు క్రింది వైపు ఉండేటట్లు చేసి మళ్లీ వాటిని పైకి ఎత్తడం ద్వారా సమయాన్ని, బిలద్వారాన్నీ; గృహాన్నీ, గుహను అభినయించాలి.

**మూ. కామం శాపగ్రహగ్రస్తాన్ జ్వరోపహతచేతసః,**
**ఏతేషాం చేష్టితం కుర్యాదఙ్గాద్యైః సదృశైర్బుధః. 81**

**తా.** కామాన్ని, శాపగ్రస్తులను, గ్రహగ్రస్తులను, జ్వరంచేత మనస్సు సరిగా పని చేయనివాళ్లను, శరీరాలతో ఆ కాముకాదుల చేష్టలవంటి చేష్టలు చేస్తూ అభినయించాలి.

**మూ. దోలాభినయనం కుర్యాద్దోలాయాస్తు విల్లోలనైః,**
**సంక్షోభేణ చ గాత్రాణాం రజ్జుప్రగ్రహణేన చ. 82**

**యదాచాఙ్గవతీ డోలా ప్రత్యక్షా పుస్తజా భవేత్,**
**ఆసనేషూపవిష్టానాం కర్తవ్యం తత్ర డోలనమ్. 83**

**తా.** ఉయ్యాలను, అభినయిచడానికి ఉయ్యాల కదిలిపోతూన్నట్లు, అవయవాలు ఊగిపోతూన్నట్లు కూర్చున్నవాడు దాని తాళ్లు గట్టిగా పట్టుకొన్నట్లు ప్రదర్శించాలి. ఉయ్యాల దానికి ఉండవలసిన అన్ని అవయవాలతో పుస్తరూపంలో రంగంమీద ఏర్పరిస్తే దాని ఆసనంమీద పాత్రను కూర్చుండబెట్టి ఊపాలి.

**మూ. ఆకాశవచనానీహ వక్ష్యామ్యాత్మగతాని చ,**
**అపవారితకం చైవ జనాన్తికమథాపి చ. 84**

**తా.** నాట్యంలో అప్పుడప్పుడు ప్రయోగించవలసిన ఆకాశవచనాలు, ఆత్మగత వచనాలు – అపవారితకము – జనాంతికము – వాటిని గూర్చి చెపుతాను.

**మూ. ఆకాశభాషితం :–**
**దూరస్థభాషణం యత్ స్యాదశరీరనివేదనమ్,**
**పరోక్షాన్తరితం వాక్యమాకాశవచనం తు తత్. 85**

**తత్రోత్తరకృతైర్వాక్యైః సంలాపం సంప్రయోజయేత్,**
**నానాకారణసంయుక్తైః కావ్యభావసముత్థితైః. 86**

**తా.** దూరంగా ఉన్న పాత్రతో రంగస్థలంమీద ఉన్న పాత్ర మాట్లాడడం, లేదా శరీరం లేని మాట (శరీరం కనబడకుండా ఎవరో మాటలాడినట్లు) వినబడడం, లేదా కనబడకుండా ఉన్నవానితో మాటలాడుతూన్నట్లు మాటలాడడం – ఇది **ఆకాశవచనం (ఆకాశభాషితం)**. కావ్యంలో (నాటకంలో) ఉన్న వివిధకారణాలను పట్టి, కథ నడిచే పద్ధతిలోని కొన్ని అవసరాలను బట్టి, ఎవరో కనబడనివాడు ఏదో అడుగుతూన్నట్లు లేదా చెపుతూన్నట్లు ఆ మాటలను అనువదిస్తూ వాటికి (రంగస్థలంమీద ఉన్నవాడు) సమాధానాలు చెప్పడం ద్వారా ఆకాశభాషితం నిర్వహించాలి.

**మూ. అతిహర్షమదోన్మాదరాగద్వేషభయాదితః,**
**విస్మయక్రోధదుఃఖార్తివశాదేకోపి భాషతే. 87**

**హృదయస్థం వచో యత్తు తదాత్మగతమిష్యతే,**
**సవితర్కం చ తద్యోజ్యం ప్రాయశో నాటకాదిషు. 88**

**తా. ఆత్మగతం (స్వగతం) :–** ఆనందాతిశయము, మత్తు, పిచ్చి, రాగం, ద్వేషం మొదలైనవాటివల్ల, ఆశ్చర్యం, క్రోధం, దుఃఖం, శారీరకమైన బాధ, వీటివల్ల ఒక్కడే తనలో తాను మాట్లాడుకొంటాడు – ఇలాంటివాని హృదయంలో ఉన్న మాటకు **ఆత్మగతం** అని పేరు. ఏదో విషయాన్ని గూర్చి ఒకడు ఏదో వితర్కం చేసికొంటూన్నట్లు చూప వలసివచ్చి నప్పుడు, దీనిని నాటకాదులలో ప్రయోగించాలి.

**మూ. నిగూఢభావసంయుక్తమపవారితకం స్మృతమ్,**
**కార్యవశాదశ్రవణం పార్శ్వగతైర్యజ్జనాన్తికం తత్ స్యాత్. 89**

**తా. అపవారితకం, జనాంతికం :–** రహస్యంగా ఉంచవలసిన విషయాలను గూర్చి పక్క నున్నవానితో మాటలాడడం **అపవారితకం**. కార్యానికి సంబంధించిన అవసరాన్ని పట్టి, పక్కనే ఉన్నవాళ్లు (ఒకడు మరొకపాత్రతో అంటూన్న మాటలు) వినకపోవడం **జనాంతికం**.

**మూ. హృదయస్థం సవికల్పం భావవశాదాత్మగతమేవ,**
**యాని గూఢార్థయుక్తాని వచనానీహ నాటకే,**
**జనాన్తికాని కర్ణే తు తాని యోజ్యాని యోక్తృభిః. 90**

**తా.** 'ఇలా చెయ్యాలా అలా చెయ్యాలా' అనుకొంటూ వికల్పాలతో హృదయంలో ఉన్న విషయం కూడ **ఆత్మగతమే**. గూఢమైన (రహస్యమైన, అనగా పాత్రలలో కొందరికి మాత్రమే తెలియవలసిన) విషయాలకు సంబంధించిన మాట కూడ **ఆత్మగతమే**. గూఢార్థం గల వచనాలను 'జనాంతికం' ద్వారా చెవిలో చెపుతూన్నట్లు నాటకంలో ప్రదర్శించాలి.

**మూ. పూర్వవృత్తం తు యత్ కార్యం భూయః కథ్యం తు కారణాత్,**
**కర్ణప్రదేశే తద్వాచ్యం; మా గాత్తత్పునరుక్తతామ్. 91**

**తా.** ముందుగా చెప్పిన విషయాన్నే, అవసరాన్ని పట్టి మళ్లీ చెప్పవలసినప్పుడు, దానిని చెవిలోనే చెప్పాలి. అలా కాకపోతే (సామాజికులకు తెలిసిన విషయాన్నే) మళ్లీ చెప్పిన దోషం కలుగుతుంది.

**మూ. అవ్యభిచారేణ పఠేదాకాశజనాన్తికాత్మగతపాఠ్యాన్,**
**ప్రత్యక్షపరోక్షకృతానాత్మసముత్థాన్ పరకృతాంశ్చ. 92**

**తా.** ప్రత్యక్షంగా కనబడుతూన్నవాళ్లు, కనబడకుండా పరోక్షంగా ఉన్నవాళ్లు పాల్గొనే, ఆకాశభాషిత – జనాంతిక – ఆత్మగతభాషితాల పాఠ్యాలను కలగా పులగం కాకుండా, ఏ మాటలు ఎవరు అంటున్నవి అను విషయం సామాజికులకు స్పష్టంగా తెలిసే టట్లుగా చదవాలి – పలకాలి.

**మూ. హస్తమన్తరితం కృత్వా త్రిపతాకం ప్రయోక్తృభిః,**
**జనాన్తికం ప్రయోక్తవ్యమపవారితకం తథా. 93**

**తా.** నాట్యప్రయోక్తలు, మాటలాడుతున్నవానికి వింటున్నవానికి మధ్య త్రిపతాక హస్తం చూపుతూ జనాంతికాన్ని, అపవారితకాన్ని చెయ్యాలి. (అలా చేయడంవల్ల ఈ మాటలు ఎవరికి మాత్రమే వినిపించా లని చెపుతూన్నవో సామాజికులకు తెలుస్తుంది).

**మూ. సంభ్రమోత్పాతరోషేషు శోకావేగకృతేషు చ,**
**ఉచ్యన్తే యాని వాక్యాని పునరుక్తాని తేష్విహ. 94**
**బ్రూహ్యహో సాధు హా హేతి గచ్ఛ కిమ్ మా వద,**
**ఏతాని వచనానీహ ద్విత్రిసంఖ్యాని కారయేత్. 95**

**తా.** కంగారులో ఉన్నప్పుడు, ఉత్పాతాలు కనబడిన సమయాలలోను, రోషము శోకము ఆవేశమూ కలిగినప్పుడూ పలికే వాక్యాలలో – 'బ్రూహి' 'ఆహా' 'సాధు' 'హాహా' 'గచ్ఛ' 'కిమ్' 'మావద' వంటి పదాలను రెండు మూడు సార్లు ఉచ్చరించాలి.

**మూ. ప్రత్యఙ్గహీనం యద్వాక్యం వికృతం చ ప్రయుజ్యతే,**
**న లక్షణకృతస్తత్ర కార్యస్త్వభినయో బుధైః. 96**

**తా.** కొన్ని సందర్భాలలో అసంపూర్ణంగాను, వికృతంగాను వాక్యం పలికినప్పుడు దాని అర్థాన్ని సూచించడానికి అభినయం చేయకూడదు.

**మూ. భావో య ఉత్తమానాం తు న తం మధ్యేషు యోజయేత్,**
**యో భావశ్చైవ మధ్యానాం న తం నీచేషు యోజయేత్. 97**

**తా.** ఉత్తముల భావావిష్కరణరీతులను మధ్యములకు, మధ్యముల భావావిష్కరణ రీతులను నీచులకు ఉపయోగించకూడదు.

**మూ. పృథక్ పృథక్ భావరసైరాత్మచేష్టాసముత్థితైః,**
**జ్యేష్ఠమధ్యమనీచేషు నాట్యం రాగం హి గచ్ఛతి. 98**

**తా.** ఉత్తమ – మధ్యమ – నీచప్రకృతులకు సంబంధించిన భావ – రసాదులను వాళ్ల ప్రకృతికి అనుగుణమైన చేష్టల ద్వారా వేరు వేరు విధాలలో ప్రదర్శిస్తే నాట్యం రక్తి కడుతుంది.

**మూ. స్వప్నాయితవాక్యార్థస్త్వభినేయో న ఖలు హస్తసఞ్చారైః,**
**సుప్తాభిహితైరేవ తు వాక్యార్థైః సోఽభినేయః స్యాత్. 99**

**తా.** పలవరిస్తూ మాట్లాడిన మాటల అర్థాలను అంగ – హస్తాదిచేష్టల ద్వారా

అభినయించకూడదు. నిద్రపోతూన్నవాడు పలికిన మాటలే యథాతథంగా పలకాలి (ఆ విధంగా వాచికాభినయం మాత్రమే చెయ్యాలి).

**మూ. మన్దస్వరసఞ్చారైర్వ్యక్తావ్యక్తం పునరుక్తవచనార్థమ్,**
**పూర్వానుస్మరణకృతం కార్యం స్వప్నాయితే పాఠ్యమ్. 100**

**తా.** పలవరింతల పాఠ్యం మందమైన స్వరంతో తెలిసీ తెలియని రీతిలో, చెప్పిన విషయమే మళ్లీ చెపుతున్నట్లుగా, ఏదో పూర్వం జరిగిన విషయాన్ని స్మరిస్తూ మాట్లాడు తున్నట్లుగా ప్రయోగించాలి.

**మూ. వృద్ధానాం యోజయేత్పాఠ్యం గద్గదస్ఖలితాక్షరమ్,**
**అసమాప్తాక్షరం చైవ బాలానాం తు కలస్వనమ్. 101**

**తా.** వృద్ధులు తమ పాఠ్యాన్ని గర్గదస్వరంతో అక్షరాలు తడుముకొంటూ ఉచ్చరించాలి. చిన్న పిల్లలు మధురస్వరంతో, అక్షరాలు పూర్తిగా ఉచ్చరించకుండా మాట్లాడుతూన్నట్లు చూపాలి.

**మూ. ప్రశిథిలగురుకరణాక్షరఘణ్టానుస్వరితవాక్యగద్గదజైః,**
**హిక్కాశ్వాసోపేతాం కాకుం కుర్యాన్మరణకాలే. 102**

**తా.** మరణకాలం ఆసన్నమైన వాళ్ల మాటలలోని మహాప్రాణాక్షరాల ఉచ్చారణ శిథిలంగా ఉంటుంది. గద్గదస్వరంతో చిరుగంటల చప్పుడువలె (పిల్లికూతలవలె) ఉంటుంది. కంఠస్వరం ఎక్కిళ్లతోను, శ్వాసలతోను (ఒగర్పుతోను) ఆగుతూ ఆగుతూ ఉంటుంది.

**మూ. హిక్కాశ్వాసోపేతా మూర్ఛోపగమే మరణవత్ కథయేత్,**
**అతిమత్తేష్వపి కార్యం తద్వత్ స్వప్నాయితే యథా పాఠ్యమ్. 103**

**తా.** మూర్ఛ వచ్చే ముందు కూడ కంఠస్వరం, మరణసమయంలో వలెనే, ఎక్కిళ్లతోను, ఆయాసంతోను ఒగర్పుతోను, అడ్డుపడుతూంటుంది. మద్యమదం తీవ్రంగా ఉన్నవాళ్ళ పాఠ్యం కూడ పలవరించేవాని పాఠ్యలాగనే ఉంటుంది.

**మూ. నానాభావోపగతం మరణాభినయే బహూకీర్తితం తు,**
**విక్షిప్తహస్తపాదైః నిభృతైః సన్నైస్తథా కార్యమ్. 104**

**తా.** మరణాభినయంలో, హస్తాలు, పాదాలు, దుర్బలము లైపోయి కదలకుండా ఉండగా వాటిని జారవిడిచి, అనేకవిధాలుగా, వివిధచేష్టలతో మరణం ప్రదర్శించాలి.

**మూ. విషపీతేఽపి చ మరణం కార్యం విక్షిప్తగాత్రకరచరణమ్,**
**విషవేగసంప్రయుక్తం విస్ఫురితాఙ్గక్రియోపేతమ్. 105**

**తా.** విషం తాగడంవల్ల వచ్చిన మరణంలో శరీరం అంతా విషవేగం వ్యాపించి, కొన్ని అవయవాలు వణికి పోతూండగా, కాళ్లు చేతులూ చాచి నేలమీద పడవేసి అభినయించాలి.

**మూ. వ్యాధిప్లుతే చ మరణం నిషణ్ణగాత్రైస్తు సంప్రయోక్తవ్యమ్,**
**హిక్కశ్వాసోపేతం తథా పరాధీనగాత్రసంఞ్చారమ్. 106**

**తా.** అవయవాలు పట్టు తప్పి క్రిందికి పడిపోతూండగా, ఎక్కిళ్లు ఒగర్పు మొదలైన వాటితో బాధపడుతూన్నట్లుగా వ్యాధులవల్ల కలిగిన మరణం అభినయించాలి.

**మూ. ప్రథమే వేగే కార్యం త్వభినేయం వేపథుర్ద్వితీయే తు,**
**దాహస్తథా తృతీయే విలల్లికా స్యాచ్చతుర్థే తు. 107**
**ఫేనస్తు పఞ్చమస్థే గ్రీవా షష్ఠే తు భజ్యతే,**
**జడతా సప్తమే తు స్యాన్మరణం త్వష్టమే భవేత్. 108**

**తా.** మొదటి విషవేగంలో శరీరం చిక్కిపోతుంది. రెండవ వేగంలో వణుకు, మూడవ వేగంలో ఒళ్లు మంటలు, నాల్గవ వేగంలో ఎక్కిళ్లు ఐదవ వేగంలో నోటినుండి నురుగులు, ఆరవ వేగంలో మెడ వాలిపోవడం, ఏడవ వేగంలో జడత్వం, ఎనిమిదవ వేగంలో మరణము అభినయించాలి.

**మూ. తత్ర ప్రథమవేగే తు క్షామవక్రకపోలతా,**
**కృశత్వేఽభినయః కార్యో వాక్యానామల్పభాషణమ్. 109**

**తా.** ప్రథమవేగంలో కృశ్వత్వం కలిగినప్పుడు చెక్కిళ్లు దగ్గర పడిపోయి నట్లు, మాటలు మందంగా వస్తూన్నట్లు అభినయించాలి.

**మూ. (ప్రవిష్టతారకే నేత్రే కపోలాధరమేవ చ,**
**అంసోదరభుజానాం తు కృశతా కార్శ్యరూపణమ్).**

**తా.** గుడ్లు కళ్లలో కూరుకొనిపోతాయి. చెక్కిళ్లు క్రిందిపెదవి నొక్కుకొని పోతాయి. బుజాలు పొట్ట, భుజాలు కుదించుకొనిపోతాయి. కృశత్వాన్ని ఈ విధంగా అభినయించాలి.

**మూ. హస్తయోః పాదయోర్మూర్ధ్ని యుగపత్ పృథగేవ వా,**
**కమ్పనేన యథాయోగం వేపథుం సంప్రయోజయేత్. 110**

**తా.** చేతులు, కాళ్లు, తల ఇవన్నీ ఒకే సమయంలో కాని, వేరు వేరు సమయాలలో గాని కదల్చడం ద్వారా వీలును అనుసరించి వణుకును అభినయించాలి.

**మూ. సర్వాఙ్గవేపనోద్వేజనేన కణ్డూయనాత్తథాఙ్గానామ్,**
**విక్షిప్తహస్తగాత్రైర్దాహశ్చైవాభినేతవ్యః. 111**

**తా.** శరీరం అంతా వణకడం, ఏదో బాధ, అవయవాలను గోకికొనడం, చేతులూ, ఇతరమైన అవయవాలు విసిరివేస్తూండడం – వీటిచేత దాహం (శరీరంమంటలు) అభినయించాలి.

**మూ. ఉద్వృత్తనిమేషత్వాదుద్గారచ్ఛర్దనైస్తథాక్షేపైః,**
**అవ్యక్తాక్షరకథనైః విలల్లికామభినయేదేవమ్. 112**

**తా.** కళ్లు పైకి ఎత్తి రెప్పలు వాల్చడం, తేణుపులు, కక్కడం, తీవ్రమైన కంపం, అస్పష్టంగా మాట్లాడడం వీటితో ఎక్కిళ్లను అభినయించాలి.

**మూ. ఉద్గారవమనయోగైః శిరసశ్చ విలోలనైరనేకవిధైః,**
**ఫేనస్త్వభినేతవ్యో నిఃసంజ్ఞతయా నిమేషైశ్చ. 113**

**తా.** తేనుపులు, వాంతులు, అనేకవిధాల తల ఊగిపోవడం, స్పృహ కోల్పోవడం, కళ్లు మూతలు పడడం – వీటితో నోటినుండి నురుగు కారడాన్ని అభినయించాలి.

**మూ. అంసకపోలస్పర్శాచ్ఛిరసశ్చ వినామనాచ్ఛిరోభఙ్గః,**
**సర్వేన్ద్రియసంమోహాజ్జడతామేవం ప్రయుఞ్జీత. 114**

**తా.** చెక్కిళ్లూ, బుజాలు, తల – వీటిని మాటికి స్పృశించడం ద్వారా మెడ వాలి పోవడాన్ని అభినయించాలి. ఏ ఇంద్రియమూ పని చేయడం లేదు అని సూచిస్తూ జడత్వాన్ని అభినయించాలి.

**మూ. సంమీలితనేత్రత్వాద్వ్యాధివృద్ధ్యా భుజఙ్గదశనాద్వా,**
**ఏవం హి నాట్యధర్మే మరణాని బుధైః ప్రయోజ్యాని. 115**

**తా.** వ్యాధి పెరిగిపోవడంవల్ల గాని, సర్పం కరవడంవల్ల గాని మరణించడాన్ని కళ్లు మూసివేయడం ద్వారా నాట్యధర్మంలో అభినయించాలి.

**మూ. ఏతేఽభినయవిశేషాః కర్తవ్యాః సత్త్వభావసంయుక్తాః,**
**అన్యే తు లౌకికా యే తే సర్వే లోకవత్ కార్యాః. 116**

**తా.** ఇంతవరకు చెప్పిన అభినయవిశేషాలను, మానసికభావావిష్కరణంతో జోడించి చెయ్యాలి. ఇతరమైన లౌకికవిషయాభినయా లన్నీ లోకంలో ఎలా ప్రసిద్ధంగా కనబడు తున్నాయో ఆ విధంగా చెయ్యాలి.

**మూ. నానావిధైర్యథా పుష్పైర్మాలాం బధ్నాతి మాల్యకృత్,**
**అఙ్గోపాఙ్గై రసైర్భావైస్తథా నాట్యం ప్రయోజయేత్. 117**

**తా.** మాలాకారుడు అనేకవిధాలైన పుష్పాలతో మాల కట్టినట్లు, వివిధములైన ఆంగికాభినయాలతోను, రసాలతోను, భావాలతోను నాట్యప్రయోగం చెయ్యాలి.

**మూ. యా యస్య లీలా నియతా గతిశ్చ రఙ్గప్రవిష్టస్య విధానయుక్తః,**
**తామేవ కుర్యాదవిముక్తసత్త్వో యావన్న రఙ్గాత్ ప్రతినిఃసృతః స్యాత్. 118**

**తా.** నాట్యరంగస్థలంమీద ప్రవేశించిన నటుడు లేదా నటి తనకు ఏ లీల (role) ఇవ్వబడిందో, ఏ విధమైన గతి (అభినయాదికం) నిర్ణయింపబడిందో దానిని మాత్రమే శాస్త్రవిహితపద్ధతి ప్రకారం, మానసికమైన ఏకాగ్రతాదులను కోల్పోకుండా, రంగస్థలం విడిచి వెళ్లేవరకు జాగరూకతతో నిర్వహించాలి.

**మూ. ఏవమేతే మయా ప్రోక్తా నాట్యే చాభినయాః క్రమాత్,**
**అన్యే తు లౌకికా యే తే లోకాద్ గ్రాహ్యాః సదా బుధైః. 119**

**తా.** నే నీ విధంగా నాట్యంలో అనుసరించవలసిన అభినయపద్ధతులను విశదీకరించి చెప్పాను. లోకంలో ప్రసిద్ధంగా ఉన్న అభినయవిధానా లేవైనా ఉంటే వాటిని, పండితులు, లోకంనుండే నేర్చుకోవాలి.

**మూ. లోకో వేదస్తథాధ్యాత్మం ప్రమాణం త్రివిధం స్మృతమ్,**
**వేదాధ్యాత్మపదార్థేషు ప్రాయో నాట్యం ప్రతిష్ఠితమ్. 120**

**తా.** లోకము, వేదము, అధ్యాత్మము (తాను సంపాదించిన జ్ఞానము) అని ప్రమాణం మూడు విధాలు. వేదాల ద్వారా (ధనుర్వేద – గంధర్వవేద – నాట్యవేదాదుల ద్వారా), తన మేధాశక్తి ద్వారా తెలిసిన పదార్థాలమీదనే, సాధారణంగా నాట్యం ప్రతిష్ఠితమై ఉంది. వాటిని ఆశ్రయించుకొని ఉంది.

**మూ. వేదాధ్యాత్మోపపన్నం తు శబ్దచ్ఛన్దస్సమన్వితమ్,**
**లోకసిద్ధం భవేత్ సిద్ధం నాట్యం లోకాత్మకం తథా. 121**
**తస్మాన్నాట్యప్రయోగే తు ప్రమాణం లోక ఇష్యతే.**

**తా.** వేదం ప్రమాణంగా గలది, అధ్యాత్మసంమతము, శబ్దశాస్త్రఛందఃశాస్త్రాలను అనుసరించినదీ అయిన నాట్యం లోకప్రసిద్ధం (లోకాంగీకార్యం) అవుతేనే సిద్ధం అవుతుంది. ఈ విధంగా ఇది లోకాత్మకమైనది. అందుచేతనే నాట్యప్రయోగంలో లోకం ప్రమాణం అని చెప్పబడుతూన్నది.

**మూ. దేవతానామృషీణాం చ రాజ్ఞామథ కుటుమ్బినామ్,**
**పూర్వవృత్తానుచరితం నాట్యమిత్యభిధీయతే. 122**

**తా.** దేవతల, ఋషుల, రాజుల, కుటుంబుల పూర్వం జరిగిన చరిత్రలను వర్ణిస్తూ ప్రదర్శించేది నాట్య మని చెప్పబడుతుంది.

**మూ. లోకస్య చరితం యత్తు నానావస్థాన్తరాత్మకమ్,**
**తదఙ్గాభినయోపేతం నాట్యమిత్యభిసంజ్ఞితమ్. 123**

**తా.** (ప్రాచీనరాజమున్యాదుల చరితమే కాక) అనేకవిధాలైన అవస్థాభేదాల స్వరూపంలో ఉన్న లోక (సమాజ) చరితాన్నే ఆంగికాభినయాదులతో ప్రదర్శిస్తే అది (కూడ) 'నాట్యం' అవుతుంది.

**మూ. ఏవం లోకస్య యా వార్తా నానావస్థాన్తరాత్మికా,**
**సా నాట్యే సంవిధాతవ్యా నాట్యవేదవిచక్షణైః. 124**

**తా.** అనేకవిధాలైన అవస్థల (జీవనవిధానాదుల) భేదాలే స్వరూపంగా గల, లోకంలో ఉన్న జనుల చరిత్రనే, నాట్యవేదనిపుణులు, నాట్యంలో నిబంధించాలి. ఈ విధంగా నాటకాదులకు, రచనలకు, ప్రయోగాలకు మార్గదర్శకం లోకమే అని అర్థం.

**మూ. యాని శాస్త్రాణి యే ధర్మాః యాని శిల్పాని యాః క్రియాః,**
**లోకధర్మప్రవృత్తాని తన్నాట్యమితి సంజ్ఞితమ్. 125**

**తా.** ఏ శాస్త్రాలైనా, ఏ ధర్మాలైనా, ఏ శిల్పాలైనా, ఏ క్రియలు (activities) అయినా – ఇవన్నీ లోకధర్మాన్ని పట్టి (లోకవ్యవహారాన్ని పట్టి) ఏర్పడినవే. వాటినే రంగస్థలంమీద అభినయిస్తే అది నాట్యం అవుతుంది.

**మూ. న చ శక్యం హి లోకస్య స్థావరస్య చరస్య చ,**
**శాస్త్రేణ నిర్ణయం కర్తుం భావచేష్టావిధిం ప్రతి. 126**

**తా.** చరాచరాత్మకమైన ఈ లోకంలో ఉన్న స్థావరాల, జంగమాల భావాలు, చేష్టలు మొదలైనవి ఇలాగే ఉంటాయి, లేదా ఇలాగే ఉండాలి అని శాస్త్రంచేత నిర్ణయించడం శక్యం కాని పని కదా!

**మూ. నానాశీలాః ప్రకృతయః శీలే నాట్యం ప్రతిష్ఠితమ్,**
**తస్మాల్లోకప్రమాణం హి విజ్ఞేయం నాట్యయోక్తృభిః. 127**

**తా.** లోకంలో ఉన్న మానవుల శీలాలు అనేకవిధాలుగా, ఊహింప రాని భేదాలతో కూడిన రీతులలో, ఉంటాయి. నాట్యానికి మూలాధారం మానవశీలం. అందుచేత నాట్య ప్రయోక్తలు లోకం అను ప్రమాణాన్ని బాగా అర్థం చేసికోవాలి; దానిని అనుసరించాలి.

**మూ. ఏవం భావానుకరణే నానాప్రకృతిసంభవే,**
**భావాఙ్గసత్త్వసంయుక్తో యత్నః కార్యః ప్రయోక్తృభిః. 128**

**తా.** వివిధప్రకృతుల జనులకు చెందిన భావాలను అనుకరించడంలో, నాట్య

ప్రయోక్తలు భావాలు, అంగాలు (ఆంగికాభినయాలు) సత్త్వం (సాత్త్వికాభియాలు) వీటి విషయంలో మంచి ప్రయత్నం చెయ్యాలి.

**మూ. ఏతాన్ విధీన్యోఽభినయస్య సమ్యక్,**
**విజ్ఞాయ రఙ్గే మనుజః ప్రయుఙ్క్తే,**
**స నాట్యతత్త్వాభినయప్రయోక్తా**
**సంమానమగ్ర్యం లభతే హి లోకే. 129**

**తా.** అభినయానికి సంబంధించిన ఈ విధులను (పద్ధతులను) బాగా తెలిసికొని ఏ మనుజుడు (విద్వాంసుడు) నాట్యరంగంమీద ప్రయోగిస్తాడో యథార్థమైన నాట్య స్వరూపాన్ని చక్కగా ప్రయోగించిన అతడు లోకంలో అత్యుత్తమ మైన సంమానం పొందుతాడు.

**మూ. ఏవమేతే హ్యభినయా వాఙ్నేపథ్యాఙ్గసంభవాః,**
**ప్రయోగజ్ఞేన కర్తవ్యా నాటకే సిద్ధిమిచ్ఛతా. 130**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే చిత్రాభినయో నామ పఞ్చవింశోఽధ్యాయః.**

**తా.** నాటకంలో సిద్ధిని (success) కోరేవాడు వాక్కుకు, నేపథ్యానికి, ఆంగాలకీ సంబంధించిన అభినయాలను, అనగా వాచిక – ఆహార్య – ఆంగికాభినయాలను ఈ విధంగా ప్రయోగించాలి. ఈ విధంగా అభినయప్రయోగం చేసినవానికి నాటకప్రదర్శనలో సిద్ధి లభిస్తుంది.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో చిత్రాభినయం అను ఇరవైఐదవ అధ్యాయం సమాప్తం.**

**శ్రీః శ్రీః శ్రీః**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ షడ్వింశోऽధ్యాయః

## వికృతివికల్పము

**"యస్మిన్ సతి ప్రకృతిభూమివికల్ప ఏష,**
**స్త్రే (త్రే) ధాస్య యాతి హృదయాదరణీయభావః,**
**రాగః స యస్య మహిమా మహనీయధామ్ని**
**భూయాత్స నిత్యమపి తత్ర చ రాగవన్తః."**

**– శ్రీమదభినవగుప్తాచార్యాః**

**మూ. అనురూపా విరూపా చ తథా రూపానురూపిణీ,**
**త్రిప్రకారేహ పాత్రాణాం ప్రకృతిశ్చ విభావితా. 1**

**తా.** పాత్రల ప్రకృతి – అనురూప, విరూప, రూపానురూప అని మూడు విధాలు.

**మూ. నానావస్థాక్రియోపేతా భూమికా ప్రకృతిస్తథా,**
**భృశముద్యోతయేన్నాట్యం స్వభావకరణాశ్రయమ్. 2**

**తా.** అనేకవిధాలతో, క్రియలతో కూడిన భూమిక (role), ప్రకృతీ కూడ స్వభావాన్ని పాత్రల సహజస్వరూపాన్ని, కరణాలను అనుసరించి ప్రయోగించిన నాట్యానికి చాల శోభ చేకూరుస్తుంది.

**మూ. బహుబాహుబహుముఖాస్తథా చ వికృతాననాః,**
**పశుశ్వాపదవక్త్రాశ్చ ఖరోష్ట్రాశ్వగజాననాః. 3**

**ఏతే చాన్యే చ బహవో నానారూపా భవన్తి యే,**
**ఆచార్యేణ తు తే కార్యా మృత్కాష్ఠజతుచర్మభిః. 4**

**తా.** నాటకాలలో అనేక మైన బాహువులు, అనేకమైన ముఖాలు కలవాళ్లూ, వికృతమైన ముఖాలు కలవాళ్లు, పశువుల, క్రూరమృగాల ముఖాలవంటి ముఖాలు కలవాళ్లు గాడిదల – ఒంటెల, అశ్వాల, గజాల ముఖాలవంటి ముఖాలు గలవాళ్లు, ఇంకా ఎన్నో వేరు వేరు విధాలైన రూపాలు కలవాళ్లు అయిన పాత్ర లుంటారు. నాట్యాచార్యుడు అలాంటి వాళ్ల ఆకారాలను మట్టితోను, కఱ్ఱతోను, లక్కతోను, చర్మతోను చేయించాలి.

**మూ. స్వాభావికేన రూపేణ ప్రవిశేద్రఙ్గమణ్డలమ్,**
**ఆత్మరూపమవచ్ఛాద్య వర్ణకైర్భూషణైరపి. 5**

**తా.** ప్రతీ నటుడూ (నటీ) తాను అనుకరిస్తూన్న వ్యక్తికి తగిన రంగులచేత,

అలంకారాలచేత తన రూపాన్ని కప్పివేసికొని, ఆ వ్యక్తికి ఏది స్వాభావికమైన రూపం ఉంటుందో దానితో రంగమండపంమీద ప్రవేశించాలి.

**మూ. యాదృశం యస్య యద్రూపం ప్రకృత్యా తత్ర తాదృశమ్,**
**వయోవేషానురూపేణ ప్రయోజ్యం నాట్యకర్మణి. 6**

**తా.** ప్రకృతిని అనుసరించి వయస్సుకు వేషానికీ తగిన ఎలాంటి రూపం ఉంటుందో అలాంటి రూపాన్నే నాట్యప్రయోగంలో ప్రదర్శించాలి.

**మూ. యథా జీవత్స్వభావం హి పరిత్యజ్యాన్యదేహికమ్,**
**పరభావం ప్రకురుతే పరభావం సమాశ్రితః. 7**

**తా.** ఒక జీవుడు ఒక జన్మ విడిచి మరొక జన్మ ఎత్తినప్పుడు వెనుకటి దేహానికి సంబంధించిన స్వభావాన్నంతనీ పూర్తిగా విడిచివేసి మరొక దేహానికి సంబంధించిన స్వరూపస్వభావాదులనే ఎలా ప్రకటిస్తాడో అదే విధంగా నటుడు లేదా నటి తన స్వభావాదులను విడచి తాను అనుకరిస్తూన్న పాత్రల స్వభావాదులను ప్రదర్శించాలి.

**మూ. ఏవం బుధః పరం భావం సోస్మీతి మనసా స్మరన్,**
**తేషాం వాగఙ్గలీలాభిశ్చేష్టాభిస్తు సమాచరేత్. 8**

**తా.** సమర్థుడైన నటుడు తాను ఏ పాత్రగా నటిస్తున్నాడో ఆ పాత్ర తానే అని మనసా భావన చేస్తూ అవే విధమైన మాటలతో, అవయవవిన్యాసాలతో, లీలలతో, చేష్టలతో ప్రవర్తించాలి.

**మూ. సుకుమారప్రయోగో యో రాజ్ఞామామోదసంభవః,**
**శృఙ్గారరసమాసాద్య తన్నారీషు ప్రయోజయేత్. 9**

**తా.** రాజులకు ఆనందాన్ని కలిగించాలంటే శృంగారరసానికి సంబంధించిన సుకుమారమైన ప్రయోగాన్ని (అభినయాన్ని) స్త్రీలచేతనే చేయించాలి.

**మూ. యుద్ధోద్ధతావిద్ధకృతాఃసంరమ్భారభటాశ్చ యే,**
**న తే స్త్రీభిః ప్రయోక్తవ్యాః యోక్తవ్యాః పురుషేషు తే. 10**

**తా.** యుద్ధాలలో చేసే ఉద్ధతమైన ప్రవర్తనలతో, ఆడంబరాలతో, తీవ్రమైన చేష్టలతో చేసే ప్రయోగాలు స్త్రీలు చేయకూడదు. వాటిని పురుషులు మాత్రమే ప్రయోగించాలి.

**మూ. అనుద్ధటమసంభ్రాన్తమనావిద్ధాఙ్గచేష్టితమ్,**
**లయతాలకలాపాతప్రమాణనియతాక్షరమ్. 11**
**సువిభక్తపదాలాపమనిష్ఠురమకాహలమ్,**

**ఈదృశం యద్ భవేన్నాట్యం నారీభిశ్చ ప్రయోజయేత్.** **12**

**తా.** ఉద్ధటత్వం కాని, తొందర కాని ఉండకూడదు. చేతులూ, కాళ్లూ ఆవేశంలో తీవ్రంగా ఇటూ అటూ ఎగరవేస్తూ చేష్టలు చేయకూడదు. అవయవాల కదలిక లయకు, తాలానికి, కలలకు అనుగుణంగా ఉండాలి. పాఠ్యంలోని పదాల ఉచ్చారణం స్పష్టంగా, నియతమైన అక్షరాలతో, సుకుమారంగా ఉండాలి. అక్షరాలు ఉచ్చారణలో కలిసిపోయి అస్పష్టంగా ఉండకూడదు. ఇలాంటి సుమాకురనాట్యంలో స్త్రీలనే నియమించాలి.

**మూ. ఏవం కార్యం ప్రయోగజ్ఞైర్భూమికావినివేశనమ్,**
**స్త్రీయో హి స్త్రీగతో భావః పౌరుషః పురుషస్య చ.** **13**

**తా.** నాట్యప్రదర్శననిపుణులు స్త్రీల భావాలను అభినయించడానికి స్త్రీలను (నటిలను) పురుషభావాలను అభినయించడానికి పురుషులను (నటులను) నియమించి భూమికలను (Roles) ఏర్పాటుచెయ్యాలి.

**మూ. యథావయో యథావస్థమనురూపేతి సా స్మృతా,**
**పురుషః స్త్రీకృతం భావం రూపాత్ ప్రకురుతే తు యః.** **14**
**రూపానురూపా సా జ్ఞేయా ప్రయోగే ప్రకృతిర్బుధైః,**
**ఛన్దతః పౌరుషీం భూమిం స్త్రీ కుర్యాదనురూపతః.** **15**
**న పరస్పరచేష్టాసు కార్యౌ స్థవిరబాలిశౌ.**

**తా.** స్త్రీలు స్త్రీభావాలను, పురుషులు పురుషభావాలను వయస్సులకు, అవస్థలకు అనుగుణంగా అభినయిస్తే అది నాట్యప్రయోగంలో **అనురూపప్రకృతి**. పురుషుడు స్త్రీ వేషం ధరించి స్త్రీ భావాలను అభినయిస్తే అది నాట్యప్రయోగంలో **రూపానురూపప్రకృతి**. స్త్రీ (నటి) ఇచ్ఛానుసారంగా అనురూపప్రకృతిగా ఉండగలిగితే పురుషభూమికను (Roles) వహించవచ్చును. అట్లే వృద్ధులు యువకుల భూమికలు యువకులు భూమికలు, బాలిశలు (వికలాంగులు) మంచివాళ్ల భూమికలు, అవయవసౌష్ఠవం ఉన్నవాళ్లు వికలాంగుల భూమికలు ధరించకూడదు.

**మూ. పాఠ్యప్రయోగే పురుషాః ప్రయోక్తవ్యా హి సంస్కృతే.** **16**

**తా.** సంస్కృతంలో ఉన్న పాఠ్యాన్ని పురుషులు ఉపయోగించాలి.

**మూ. స్త్రీణాం స్వభావమధురాః కణ్ఠాః పుంసాం తు బలవన్తః,**
**యద్యపి పురుషో విద్యాద్ గీతవిధానం చ లక్షణోపేతమ్.** **17**
**మాధుర్యగుణవిహీనం శోభాం జనయేన్న తద్ గీతమ్.**

**తా.** స్త్రీల కంఠాలు (కంఠధ్వనులు) సహజంగానే మధురంగా ఉంటాయి. పురుషుల కంఠాలు బలంగా ఉంటాయి.

పురుషుడు గీతవిధానంలోను, దానికి సంబంధించిన శాస్త్రీయనియమాలలోను మంచి ప్రావీణ్యం కలవాడే అయినా అతడు పాడిన గీతం, మాధుర్యం లేకపోవడంచేత, శోభాజనకంగా ఉండదు.

**మూ. యత్ర స్త్రీణాం పాఠ్యాద్ గుణైర్నరాణాం చ కణ్ఠమాధుర్యమ్. 18**
**ప్రకృతివిపర్యయజనితౌ విజ్ఞేయౌ తావలంకారౌ.**

**తా.** అయితే కొందరు స్త్రీలు సంస్కృతాదిపాఠ్యాలను ఆ భాషలకు అనుగుణంగా, నిర్దుష్టంగా ఉచ్చరించగలరు. కొందరు పురుషులు గీతాన్ని మధురంగా పాడగలరు. ఇది ప్రకృతిలో (స్వభావంలో) జరిగిన మార్పుచేత ఏర్పడినవి. వీటిని వాళ్లకు అలంకా రాలుగానే భావించాలి.

**మూ. ప్రాయేణ దేవపార్థివసేనాపతిముఖ్యపురుషభవనేషు. 19**
**స్త్రీజనకృతాః ప్రయోగా భవన్తి పురుషస్వభావేన.**

**తా.** సాధారణంగా దేవతలు, రాజులు, సేనాపతులు మొదలైన పురుషుల భవనాలలో, పురుషులు నిర్వహించవలసిన భూమికలను స్త్రీలే నిర్వహించిన నాట్య ప్రయోగాలు జరుగుతుంటాయి.

**మూ. రమ్భోర్వశీప్రభృతిషు స్వర్గే నాట్యం ప్రతిష్ఠితమ్. 20**
**తథైవ మానుషే లోకే రాజ్ఞామన్తఃపురేష్విహ,**
**ఉపదేష్టవ్యమాచార్యైః ప్రయత్నేనాఙ్గనాజనే. 21**
**న స్వయం భూమికాభ్యాసా బుధైః కార్యాస్తు నాటకే,**
**స్త్రీషు యోజ్యః ప్రయత్నేన ప్రయోగః పురుషాశ్రయః. 22**

**తా.** స్వర్గలోకంలో నాట్యం రంభ, ఊర్వశి మొదలైన అప్సరఃస్త్రీలలో ప్రతిష్ఠితమై ఉన్నట్లు భూలోకంలో కూడ ఇది రాజాంతఃపురాలలో స్త్రీలయందే ప్రతిష్ఠితమై ఉంది. అన్ని పాత్రలూ స్త్రీలే ధరిస్తారు.

ఈ విధంగా స్త్రీలే కొన్ని పురుషభూమికలు వహించవలసి ఉండడంచేత నాట్యాచార్యులు ప్రయత్నపూర్వకంగా స్త్రీలకు (పురుషభూమికానిర్వహణం చేసే విధానాన్ని) నేర్పాలి. తెలివైన వాళ్లెవరూ, నాటకంలో ధరించ వలసిన భూమికలను స్వయంగా, (ఆచార్యోపదేశం లేకుండా) అభ్యసించకూడదు. పురుషభూమికలను ఎలా నిర్వహించాలో స్త్రీలకు ప్రయత్నపూర్వకంగా నేర్పాలి.

**మూ. యస్మాత్ స్వభావోపగతో విలాసః స్త్రీషు విద్యతే.**
**తస్మాత్స్వభావమధురమఙ్గం సులభసౌష్ఠవమ్,**
**లలితం సౌష్ఠవం యచ్చ సోఽలంకారః పరో మతః.**

**తా.** స్త్రీలలో స్వభావసిద్ధంగా విలాస ఉంటుంది. అందుచేత వాళ్ల శరీరం స్వభావం చేతనే మధురమైనదై సౌష్ఠవోపేతమై ఉంటుంది. ఈ విధంగా స్త్రీలలో సహజంగా ఉన్న ఈ లలితమూ, సౌష్ఠవమూ కూడ ఉత్తమమైన అలంకారం.

**మూ. ప్రయోగో ద్వివిధశ్చైవ విజ్ఞేయో నాటకాశ్రయః. 24**
**సుకుమారస్తథావిద్ధో నానాభావరసాశ్రయః.**

**తా.** అనేకవిధాల భావాలతోను, రసాలతోను కూడిన నాట్యప్రయోగం – సుకుమారము, ఆవిద్ధము అని రెండు విధాలు.

**మూ. నాటకం సప్రకరణం భాణో వీథ్యఙ్క ఏవ చ. 25**
**జ్ఞేయాని సుకుమారాణి మానుషైరాశ్రితాని తు.**

**తా.** మనుష్యులు అధికంగా ఉండే కథావస్తువులు గల నాటక – ప్రకరణ – భాణ – వీథీ – అంకాలు సుకుమారమైనవి. వీటి ప్రయోగం **సుకుమారప్రయోగం.**

**మూ. సుకుమారప్రయోగోఽయం రాజ్ఞామమోదకారకః. 26**
**శృఙ్గారరసమాసాద్య స్త్రీణాం తత్తు ప్రయోజయేత్,**
**యుద్ధోద్ధతావిద్ధకృతా సంరబ్ధారభటాశ్చ యే. 27**
**న తే స్త్రీణాం ప్రకర్తవ్యాః కర్తవ్యాః పురుషైర్హి తే.**

**తా.** ఈ అధ్యాంలోని 8, 9 శ్లోకాలే కొంచెం శబ్దాల మార్పుతో ఇక్కడ మళ్లీ చేర్చబడ్డాయి.

**మూ. యదావిద్ధాఙ్గహారం తు ఛేద్యభేద్యాహవాత్మకమ్. 28**
**మాయేన్ద్రజాలబహులం పుస్తనైపథ్యదీపితమ్,**
**పురుషప్రాయసంచారమల్పస్త్రీకమథోద్ధతమ్. 29**
**సాత్త్వత్యారభటీయుక్తం నాట్యమావిద్ధసంజ్ఞితమ్.**

**తా. ఆవిద్ధనాట్యంలో** అంగహారాలు తీవ్రంగా ఉంటాయి. బద్దలు కొట్టడాలు, నరికివేయడాలు, యుద్ధాలు – వీటితో నిండి ఉంటుంది. మాయా ఇంద్రజాల ప్రయోగాలు, పుస్తాలతో (కొయ్యలు మొదలైనవాటితో చేసిన బొమ్మలు తలలు (ప్రతిశీర్షకాదులు) మొదలైనవాటితో) వేసిన వేషాలు ఉద్ధతంగా ప్రయోగింపబడుతాయి. పురుషులు

అత్యధికంగాను, స్త్రీల సంఖ్య అతిస్వల్పంగాను ఉంటుంది. సాత్త్వతీ – ఆరభటీవృత్తుల ప్రయోగం అధికంగా ఉంటుంది.

**మూ. డిమః సమవకారశ్చ వ్యాయోగేహామృగౌ తథా. 30**

**ఏతాన్యావిద్ధసంజ్ఞాని విజ్ఞేయాని ప్రయోక్తృభిః.**

**తా.** డిమము, సమవకారము, వ్యాయోగము, ఈహామృగము – ఇవి **ఉద్ధతనాట్యాలు** (రూపకాలు).

**మూ. ఏషాం ప్రయోగః కర్తవ్యో దేవదానవరాక్షసైః. 31**

**ఉద్ధతా యే చ పురుషాః శౌర్యవీర్యసమన్వితాః.**

**తా.** ఈ ఉద్ధతనాట్యాలను దేవ – దానవ – రాక్షసపాత్రలతోను, శౌర్య – వీర్య సంపన్నులైన ఉద్ధతస్వభావం గల పురుషులతోను ప్రదర్శించాలి.

**మూ. యోగ్యాసు చ ప్రయత్నః కర్తవ్యః సతతమప్రమాదేన. 32**

**న హి యోగ్యయా వినా భవతి చ భావరససౌష్ఠవం కించిత్.**

**తా.** నిరంతరమూ ఏమరిపాటు లేకుండా యోగ్యల విషయంలో ప్రయత్నం చేస్తూనే ఉండాలి. యోగ్య చేయకుండా భావ – రసాదుల సౌష్ఠవం సంపాదించడం శక్యం కాదు కదా.

**వి.** యోగ్యా = నిరతరాభ్యాసం (Exercise, Rehearsal, Constant Practice).

**మూ. సంగీతపరిక్లేశో నిత్యం ప్రమదాజనస్య గుణ ఏవ. 33**

**యన్మధురకర్కశత్వం లభతే నాట్యప్రయోగేణ.**

**తా.** స్త్రీలు ఎల్లప్పుడు సంగీతసాధన చేస్తూండడం గుణమే అవుతుంది. ఎందుచేత ననగా అది నాట్యంలో ప్రయోగించినపుడు మధురత్వాన్నీ, స్థిరత్వాన్నీ (బలాన్నీ) పొందుతుంది.

**మూ. ప్రమదా నాట్యవిలాసైర్లభతే కుసుమైర్విచిత్రలావణ్యమ్,**

**కామోపచారకుశలా భవతి చ కామ్యా విశేషేణ. 34**

**తా.** నాట్యవిలాస లనే కుసుమాలచేత ప్రమద లావణ్యాన్ని పొందుతుంది. ఆ లావణ్యం పొంది ఆమె కామోపచారాలలో కుశలురాలై అధికంగా కామ్య (కోరదగినది) అవుతుంది.

**మూ. గీతం నృత్తం తథా వాద్యం ప్రస్తారగమనక్రియా,**

**శిష్యనిష్పాదనం చైవ షడాచార్యగుణాః స్మృతాః. 35**

**తా.** గీతము, నృత్తము, వాద్యము, ప్రస్తారము (తాలము), గమనక్రియ (అంకం ఎలా నడుస్తున్నది అను పరిశీలన) శిష్యులను తయారుచేయడము – ఈ ఆరూ ఆచార్యున కుండవలసిన గుణాలు.

**మూ. ఏతాని పఞ్చ యో వేత్తి స ఆచార్యః ప్రకీర్తితః,**
**ఊహాపోహౌ మతిశ్చైవ స్మృతిర్మేధా తథైవ చ. 36**

**తా.** ఊహ (చెప్పనిదానిని కల్పించడం), అపోహ (అనుపయుక్తమైనదానిని త్యజించడం) మతి, స్మృతి, మేధ – ఈ ఐదింటినీ తెలిసికొనగలిగినవాడే **ఆచార్యుడు**.

**మూ. మేధా స్మృతిర్గుణశ్లాఘా రాగః సంఘర్ష ఏవ చ,**
**ఉత్సాహశ్చ షడేవైతాన్ శిష్యస్యాపి గుణాన్ విదుః. 37**

**తా.** మేధ, స్మృతి, గుణాలను మెచ్చుకొనగలగడం, విషయంమీద మంచి ఆసక్తి, స్పర్ధ, ఉత్సాహము – ఈ ఆరూ శిష్యున కుండవలసిన గుణాలు.

**మూ. ఏవం కార్యం ప్రయోగజ్ఞైర్నానాభూమివికల్పనమ్,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి సిద్ధీనామపి లక్షణమ్. 38**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే వికృతివికల్పో నామ షడ్వింశోఽధ్యాయః.**

**తా.** నాట్యప్రయోగజ్ఞులు ఈ విధంగా అనేకవిధాలైన భూమికల వికల్పనం చెయ్యాలి. ఇటు పైన సిద్ధుల లక్షణాలు చెపుతాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన 'బాలానందిని' అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో వికృతివికల్పనం అను ఇరవైఆరవ అధ్యాయం సమాప్తం.**

**శ్రీః శ్రీః శ్రీః**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ సప్తవింశోఽధ్యాయః

# సిద్ధివ్యంజకాధ్యాయము

**"సత్త్వమిత్యమలరఙ్గమణ్డలే దైవమానుషవిభేదభేదితా,**
**సిద్ధిమానయతి యః స్వవిద్యయా తం నమామి గిరిజార్ధధారిణమ్."**
**– శ్రీమదభినవగుప్తాచార్యాః**

**మూ. సిద్ధీనాం చ ప్రవక్ష్యామి లక్షణం నాటకాశ్రయమ్,**
**యస్మాత్ ప్రయోగః సర్వోఽయం సిద్ధ్యర్థే సంప్రతిష్ఠితః. 1**

**తా.** నాట్యప్రయోగం అంతా సిద్ధిమీదనే (on the success of a performance) ప్రతిష్ఠితమై (ఆధారపడి) ఉంది. అందుచేత నాటకాల సిద్ధుల లక్షణాలు చెపుతాను.

**మూ. సిద్ధిస్తు ద్వివిధా జ్ఞేయా వాఙ్మనోఙ్గసముద్భవా,**
**దైవీ చ మానుషీ చైవ నానాభావసముత్థితా. 2**

**తా.** అనేకవిధాలైన భావాలకు సంబంధించిన వాచిక – సాత్త్విక – ఆంగికాభినయాల ద్వారా సంపాదింపదగిన సిద్ధి, **'దైవీ'** అని **'మానుషీ'** అనీ రెండు విధాలు.

**మూ. దశాఙ్గా మానుషీ సిద్ధిర్దైవీ తు ద్వివిధా స్మృతా,**
**నానాసత్త్వాశ్రయకృతా వాఙ్నైపథ్యశరీరజా. 3**

**తా.** 'మానుషీసిద్ధి' పది విధాలుగానూ, 'దైవీసిద్ధి' రెండు విధాలుగాను ఉంటుంది. సామాజికుల వివిధ సాత్త్వికవృత్తుల (భావాలు) ఆవిష్కరణం మాటలచేతా, వేషాలచేతా, శరీరాలచేతా జరుగుతుంది.

**మూ. స్మితార్ధహాసాతిహాసా సాధ్వహో కష్టమేవ చ,**
**ప్రవృద్ధనాదా చ తథా జ్ఞేయా సిద్ధిస్తు వాఙ్మయీ. 4**

**తా.** స్మితము, సగం హాసము, అతిహాసము, **"సాధు సాధు"** (బాగు బాగు) **'అహో'** (ఆహా), **'కష్టం కష్టం'** అను మాటలతోను, అత్యధికంగా పెరిగిపోయిన ధ్వనితోను సామాజికులు తమ భావాన్ని ప్రకటిస్తే అది **'వాఙ్మయీసిద్ధి'**.

**మూ. పులకైశ్చ సరోమాఞ్చైరభ్యుత్థానైస్తథైవ చ,**
**చేలదానాఙ్గులిక్షేపైః శారీరీ సిద్ధిరిష్యతే. 5**

**తా.** ప్రేక్షకులు పులకాలచేతా, రోమాంచంచేతా, లేచి నిలబడడంచేతా, వస్త్రాలు

ఇవ్వడంచేత, చేతినున్న ఉంగరాలు తీసి నటుల వైపు విసిరివేయడంచేత తమ అభి నందనలను ప్రకటిస్తే అది – **"శారీరీసిద్ధి"**. తమ సంతోషాన్ని ప్రకటిస్తూ ప్రేక్షకులు ఆ యా పాత్రధారులకు పారితోషికంగా తాము ధరించి ఉన్న వస్త్రాభరణాదులు అలా వాళ్ల పైకి విసిరివేసేవారట.

**మూ. కించిచ్ఛిష్టో రసో హాస్యో నృత్యద్భిర్యత్ర యుజ్యతే,**
**స్మితేన స ప్రతిగ్రాహ్యః ప్రేక్షకైర్నిత్యమేవ చ. 6**

**తా.** నటులు శిష్టమైన (గ్రామ్యం కాని) హాస్యరసాన్ని అభినయం ద్వారా వ్యంజింప చేసినప్పుడు ప్రేక్షకులు దానిని చిరునవ్వుతో అభినందిస్తారు.

**మూ. కించదస్పష్టహాస్యం యత్తథా వచనమేవ చ,**
**అర్ధహాసేన తద్ గ్రాహ్యం ప్రేక్షకైర్నిత్యమేవ హి. 7**

**తా.** నటులు కొంచెం అస్పష్టమైన హాస్యాన్ని ప్రయోగించినా, అస్పష్టార్థమైన హాస్యోక్తులు పలికినా, ప్రేక్షకులు దానిని అర్ధహాస్యంతోనే గ్రహిస్తారు.

**మూ. విదూషకోచ్ఛేదకృతం భవేచ్ఛిల్పకృతం చ యత్,**
**అతిహాస్యేన తద్ గ్రాహ్యం ప్రేక్షకైర్నిత్యమేవ తు. 8**

**తా.** విదూషకుడు చెప్పే బడాయిమాటలు, ఏవేవో కల్పనలు చేస్తూ చెప్పే మాటలు విన్నప్పుడు సామాజికులు దానిని అతిహాస్యంతో గ్రహిస్తారు.

**మూ. యద్ధర్మపదసంయుక్తం తథాతిశయసంభవమ్,**
**తత్ర సాధ్వితి సద్వాక్యం ప్రయోక్తవ్యం హి సాధకైః. 9**
**అహోకారస్తథా కార్యో నృణాం ప్రకృతిసంభవః,**
**విస్మయావిష్టభావేషు ప్రహర్షార్థేషు చైవ హి. 10**

**తా.** ధర్మానికి సంబంధించిన, ఉత్తమమైన అద్భుతవీరాదిప్రదర్శనం జరుగుతూ నప్పుడు **"సాధు సాధు"** అను మంచి మాటలు పలుకుతూ ప్రేక్షకులు దానిని అభినందిస్తారు. విస్మయజనకములైన విషయాలను, ఆనందజనకము లైన విషయాలను ప్రదర్శించినపుడు, సామాజికులు, మానవుల (పాత్రల) ప్రకృతిని పట్టి **"అహో"** అని అభినందిస్తారు.

**మూ. కరుణేఽపి ప్రయోక్తవ్యం సాస్రం కష్టేతి చైవ హి,**
**ప్రవృద్ధనాదా చ తథా విస్మయార్థేషు నిత్యశః. 11**

**తా.** కరుణప్రధానప్రదర్శనం జరుగుతూన్నప్పుడు సామాజికులు కన్నీళ్లు రాలుస్తూ, **'కష్టం కష్టం'** అని దానిని గ్రహిస్తారు. ఆశ్చర్యకరవిషయాల ప్రయోగంలో బిగ్గరగా కేకలతో

దానిని అభినందిస్తారు.

**మూ. సాధిక్షేపేషు వాక్యేషు ప్రస్పన్దితతనూరుహైః,**
**కుతూహలోత్తరావేగైర్బహుమానేన సాధయేత్. 12**

**తా.** అధిక్షేపపూర్వక మైన సంభాషణలు నాట్యరంగంమీద ప్రయోగిస్తూన్నపుడు సామాజికులు, రోమాంచంతోను, "ఇంకా ఏమి జరగబోతోందో!" అను కుతూహలంతో కూడిన అరపులతో, ఆదర పూర్వకంగా దానిని గ్రహిస్తారు.

**మూ. దీప్తప్రదేశం యత్ కార్యం ఛేద్యభేద్యాహవాత్మకమ్,**
**సవిద్రవభయోత్పాతం తథా యుద్ధనియుద్ధజమ్. 13**
**ప్రకమ్పితాంసశీర్షం చ సాస్రం సోత్థానమేవ చ,**
**తత్ ప్రేక్షకైస్తు కుశలైః సాధ్యమేవం విధానతః. 14**

**తా.** కథావస్తువు, అభినయమూ కూడ చాల తీవ్రరూపంలో, తలలు బద్దలు కొట్టడాలు, అవయవాలు ఛేదించడాలు, ఉత్పాతాలు, దేశోపద్రవాలు, యుద్ధాలు, బాహు యుద్ధాలు మొదలైనవాటితో నిండి ఉన్నపుడు, కుశలులైన ప్రేక్షకులు, దానిని కన్నీళ్లు కారుస్తూ, భుజాలు ఎగరేస్తూ తలలు కంపిస్తూ, మధ్య మధ్య ఆసనాలనుండి లేచిపోతూ గ్రహిస్తారు.

**మూ. ఏవం సాధయితవ్యైషా తద్‌జ్ఞైః సిద్ధిస్తు మానుషీ,**
**దైవికీం చ పునః సిద్ధిం సంప్రవక్ష్యామి తత్త్వతః. 15**

**తా.** నాట్యప్రయోగజ్ఞులు 'మానుషీసిద్ధిని' ఈ విధంగా సంపాదించాలి. ఇప్పుడు 'దైవీసిద్ధి' స్వరూపం చెపుతాను.

**మూ. యా భావాతిశయోపేతా సత్త్వయుక్తా తథైవ చ,**
**సా ప్రేక్షకైస్తు కర్తవ్యా దైవీ సిద్ధిః ప్రయోగతః. 16**

**తా.** ఏ నాట్యప్రయోగం భావాతిశయంతో, మానసికోద్వేగాతిశయప్రధానంగా ఉంటుందో ఆ ప్రయోగం **'దైవీసిద్ధి'**. ఇలాంటి ప్రయోగాన్ని ప్రదర్శించిన నటాదులు దైవీసిద్ధిని సాధించినట్లు భావించాలి.

**మూ. న శబ్దో యత్ర న క్షోభో న చోత్పాతనిదర్శనమ్,**
**సంపూర్ణతా చ రఙ్గస్య దైవీసిద్ధిస్తు సా స్మృతా. 17**

**తా.** దేనిని ప్రయోగించే సమయంలో శబ్దం ఏమీ ఉండదో, (ఏగొడవలు వినబడవో), క్షోభ ఉండదో, ఉత్పాత్పితా లేవీ కనబడవో, ప్రేక్షాగృహం జనంతో కిక్కిరిసి ఉంటుందో, ఆ ప్రయోగానికి **'దైవీసిద్ధి' (దైవకృపాకృతమైన సిద్ధి)** లభించిన దని అర్థం.

**మూ. దైవీ చ మానుషీ చైవ సిద్ధిరేషా మయోదితా,**

**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి ఘాతాన్ దైవసముత్థితాన్.** **18**

**దైవాత్మపరసముత్థా త్రివిధా ఘాతా బుధైస్తు విజ్ఞేయాః,**
**ఔత్పాతికశ్చతుర్థః కదాచిదథ సంభవత్యేషు.** **19**

**తా.** నే నింతవరకు **'దైవీసిద్ధిని', 'మానుషీసిద్ధిని'** చెప్పాను. ఇపుడు దైవంవల్ల కలిగే ఘాతాలను, అనగా 'దైవీసిద్ధి'కి ప్రతిబంధకాలను చెపుతాను. దైవంవల్ల కలిగినది, నటీనటాదుల వల్లకలిగినది, ఇతరులవల్ల కలిగినది అని ఘాతం (విఘాతం) మూడు విధాలు. అప్పు డప్పుడు ఉత్పాతాలవల్ల నాలుగవ విధమైన విఘాతం కూడ కలుగు తూంటుంది.

**మూ. వాతాగ్నివర్షకుఞ్జరభుజఙ్గసంక్షోభమణ్డపనిపాతాః,**
**కీటవ్యాలపిపీలికపశుప్రవేశాశ్చ దైవకృతాః.** **20**

**తా.** తుఫానుగాలి, అగ్నిభయం, అతివర్షం, ఏనుగు ఆక్రమించడం, సర్పం, ప్రజలలో ఏదో అలజడి, నాట్యమండపం కూలిపోవడం, పురుగులు సర్పాలు చీమలు పశువులు రంగమండపంలో ప్రవేశించడం – ఇవన్నీ దైవకృతము లైన నాట్యప్రయోగ విఘాతాలు.

**మూ. అతిహసితరుదితవిస్ఫోటితాని తాలికాపాతాః,**
**గోమయలోష్టపిపీలికవిక్షేపాశ్చారిసంభూతాః.** **21**

**తా.** ఎక్కువగా నవ్వడం, ఎక్కువగా ఏడవడం, చప్పుళ్లు, అరుపులు, చప్పట్లు కొట్టడం, రంగస్థలంమీదికి పేడ, మట్టిబెడ్డలు, చీమలు విసరడం ఇవి శత్రుకృతఘాతాలు.

**మూ. మాత్సర్యాద్ ద్వేషాద్వా తత్పక్షత్వాత్తథార్థభేదత్వాత్,**
**ఏతే తు పరసముత్థా జ్ఞేయా ఘాతా బుధైర్నిత్యమ్.** **22**

**తా.** మాత్సర్యంవల్ల గాని, ద్వేషంవల్ల గాని, మరొక పక్షానికి చెందినవా ళ్లవడంవల్ల గాని, కిట్టనివా ళ్లెవరో ధనం ఇచ్చి ప్రేరేపించడంవల్ల గాని పరులు ఇలాంటి విఘాతాలు కలిగిస్తుంటా రను విషయం బుధులు గుర్తించాలి.

**మూ. ఔత్పాత్తికాస్తథా స్యుః క్షితికమ్పోల్కాదివాతనిర్ఘాతాః,**
**(ఔత్పాతికాశ్చ ఘాతా మత్తోన్మత్తప్రవేశలిఙ్గకృతాః.)** **23**

**తా.** భూకంపము, ఉల్కలు పడడం, ఝంఝూవాతం, పిడుగులు మొదలైనవి ప్రకృతికోపంవల్ల కలిగే విఘాతాలు. అలాగే మద్యం త్రాగి మత్తులో ఉన్నవాళ్లు, పిచ్చివాళ్లు మొదలైన దుష్టులు ప్రేక్షాగృహంలోనికి చొచ్చుకొని రావడంవంటివి అనుకోకుండా కలిగే విఘాతాలు.

**మూ. పునరాత్మసముత్థా యే ఘాతాస్తాంస్తాన్ ప్రవక్ష్యామి,**

**వైలక్షణ్యమచేష్టితవిభూమికత్వం స్మృతిప్రమోషశ్చ. 24**

**అన్యవచనం చ కావ్యం తథార్తనాదో విహస్తత్వమ్,**
**అతిహసితరుదితవిస్వరపిపీలికాకీటపశువిరావాశ్చ. 25**

**ముకుటాభరణనిపాతాః పుష్కరజాః కావ్యదోషాశ్చ,**
**అతిహసితరుదితాని చ సిద్ధిం సర్వాత్మనా ఘ్నన్తి. 26**

**తా.** తమవల్లనే (నటీనటాదులవల్లనే) ఏర్పడే సిద్ధిఘాతాలను చెపుతున్నాను – అభినయం అస్వాభావికంగా ఉండడం, చేష్టలు సరిగా చేయకపోవడం, తనకు తగని పాత్రను ధరించడం, మాటలు మరచిపోవడం, కావ్యంలో లేని మాటలు పలకడం, ఏడుస్తూన్నట్లు గట్టిగా అరవడం, అవయవాల కదలిక సరిగా లేకపోవడం, నవ్వినా ఏడ్చినా అది అతిగా చేయడం, స్వరం వికృతంగా బయల్దేరవడం (కీచుగొంతువంటిది), అభినయసమయంలో చిన్న పురుగులు, పెద్దపురుగులు, పశువులు మొదలైనవాటి స్వరాలవంటి స్వరాలు వినబడడం, కిరీటాలు, ఆభరణాలు జారి కింద పడిపోవడం, మద్దెళ్లు మొదలైన వాద్యాలు సరిగా మోగకపోవడం, కావ్యం దోషభూయిష్ఠంగా ఉండడం, (సామాజికులు కావాలని చేసే) అతిగా నవ్వులు, అతిగా ఏడ్పులూ అన్ని విధాలా విఘాతం కలిగిస్తాయి.

**మూ. కీటపిపీలికపాతాః సిద్ధిం సర్వాత్మనా ఘ్నన్తి,**
**ముకుటాభరణనిపాతాః ప్రవృద్ధనాదశ్చ నాశనో భవన్తి. 27**

**తా.** కిరీటాలూ, ఆభరణాలూ జారి క్రింద పడిపోవడం, గట్టిగా అరుపులు సిద్ధివినాశకా లైతే కీటాలు (సర్పాదులు) చీమలు మొదలైనవి హటాత్తుగా రంగస్థలంమీద కనబడడం సిద్ధిని పూర్తిగా చెడగొడుతుంది.

**మూ. పశువిశసనమపి జ్ఞేయం బాధాజననం ప్రయోగస్య,**
**వాగ్భీతిభాణ్డదోషాః సిద్ధిం సర్వాత్మనా ఘ్నన్తి. 28**

**తా.** హటాత్తుగా వచ్చిన పశువులను గట్టిగా అదుముతూ బైటకు తోలడం మొదలైనవి నాట్యప్రయోగానికి బాధ కలిగిస్తాయి. మాటలలో దోషాలు, సభాకంపం, వాద్యాల దోషాలు – ఇవి ప్రయోగసిద్ధిని పూర్తిగా పాడుచేస్తాయి.

**మూ. జ్ఞేయౌ తు కావ్యయుక్తౌ ద్వౌ దోషావప్రతిక్రియౌ నిత్యమ్,**
**ప్రకృతివ్యసనసముత్థః శేషోదకనాలికత్వం చ. 29**

**తా.** నాటకాదికావ్యాలలో, ప్రతిక్రియ చేయడానికి (సరిచేసికొనడానికి) శక్యంకాని రెండు దోషాలుంటాయి. ఒకటి ప్రకృతివ్యసనంవల్ల – నాటకపాత్రలలో ఎవరిది ఏ

ప్రకృతో దానికి అనుగుణంగా అభినయించకుండా, తద్విరుద్ధంగా అభినయించడంవల్ల కలిగేది, రెండవది చేయవలసిన పనులు నిర్ణీతసమయానుసారం చేయకుండా ఉదక నాళికలలోని నీరు మిగిలిపోయేటట్లు చేయడం రెండవది.

**వి.** గడియారాలు లేని ఆరోజులలో, నాటకాదిప్రయోగాదివిశిష్టకార్యాలు నిర్వహించే టప్పుడు సమయం తెలియడానికై నిర్ణీతప్రమాణం గల గొట్టాలలో నీళ్లు పోసి, చిన్న రంధ్రంనుంచి నీరు చుక్క చుక్కలుగా కారిపోయే టట్లు చేసి, దానిని పట్టి కాలానికి సంబంధించిన అతి సూక్ష్మాంశాలను కూడ తెలుసుకొంటూ కార్యక్రమాలు (Minute ot Minute - నిమిష – నిమిషం లెక్కన) నడిపేవారు. ఒక గొట్టంలో ఉన్న నీరు పూర్తిగా కారిపోవడానికి (నేటి లెక్క ప్రకారం 24 నిమిషాలు పట్టేది.) అనుకొన్న సమయం ప్రకారం పనులు జరగకపోతే గొట్టంలో నీళ్లు మిగిలిపోవడమో, తరిగిపోవడమో జరుగుతుంది. ఆ అభిప్రాయంతో **'శేషోదకనాలికత్వం'** అను పదం ప్రయోగింపబడింది.

**మూ. పునరుక్తో హ్యసమాసో విభక్తిభేదో విసన్ధయోఽపార్థః,**
**త్రైలిఙ్గజశ్చ దోషః ప్రత్యక్షపరోక్షసంమోహః. 30**
**ఛన్దోవృత్తత్యాగో గురులాఘవసంకరో యతేర్భేదః,**
**ఏతాని యథాస్థూలం ఘాతస్థానాని కావ్యస్య. 31**

**తా.** కావ్యంలో (పాఠ్యంలో) స్థూలంగా కనబడే ఘాతస్థానాలు (దోషాలు) ఇవి. పునరుక్తి (చెప్పిన విషయమే మళ్లీ చెప్పడం), సమాసం చేయవలసిన చోట సమాసం చేయకపోవడం, ఒక విభక్తికి బదులు మరొక విభక్తి ప్రయోగించడం, సంధులు పాటించకపోవడం, చెడ్డ అర్థాలు తెలిపే పదాల ప్రయోగం, పుంలింగ స్త్రీలింగ నపుంసక లింగాలను తారు మారు చేసి ప్రయోగించడం, ప్రత్యక్ష మైన విషయాలను గూర్చి చెపుతున్నారా పరోక్షవిషయాలను గూర్చి చెపుతున్నారా అను మోహం (సందేహం) కలిగే విధంగా మాట్లాడడం, ఛందస్సును, వృత్తాన్ని త్యజించడం, గురువులను లఘువులను కలిపివేయడం (గురువును లఘువుగాను, లఘువును గురువుగాను ఉచ్చరించడం), వృత్తంలో యతిభంగం మొదలైనవి.

**మూ. విస్వరమజాతతాలం వర్ణస్వరసంపదా చ పరిహీణమ్,**
**అజ్ఞాతస్థానలయం స్వరగతమేవం విధం హన్యాత్. 32**

**తా.** నాటకప్రదర్శనసమయంలో స్వరాన్ని అనుచితమైన పద్ధతిలో ఆలాపన చేయడం, వర్ణసంపద స్వరసంపద లేకపోవడం, స్థానాల జ్ఞానం తాళజ్ఞానం లేకపోవడం. ఇవి సంగీతప్రయోగానికి విఘాతకా లవుతాయి.

**మూ. విషమం మార్గవిహీనం విమార్జనం చాకులప్రహారం చ,**
**అవిభక్తగ్రహమోక్షం పుష్కరగతమీదృశం హన్తి. 33**

**తా.** సమంగా ఉండకుండా విషమంగా ఉండడం, మార్గాల, మార్జనల జ్ఞానం లేకుండా, ఒక పద్ధతి పాటించకుండా ఇష్టం వచ్చి నట్లు బాదడం, ఎలా ప్రారంభించాలి ఎక్కడ విడిచిపెట్టాలి అనే జ్ఞానం లేకపోవడం – ఇవన్నీ మృదంగాదివాద్యాలలో జరిగే దోషాలు. ఇవి వాద్యవిధానానికి విఘాతకాలు. (సమ – మార్గ – మార్జనామొదలైన పారిభాషికపదాల అర్థాలు రాబోయే అధ్యాయాలలో స్పష్టం అవుతాయి).

**మూ. అప్రతిభానం స్ఖలనం విస్వరముచ్చారణం చ కావ్యస్య**
**అస్థానభూషణత్వం పతనం ముకుటస్య విభ్రంశః. 34**

**వాజిస్యన్దనకుఞ్జరఖరోష్ట్రశిబికావిమానయానానామ్,**
**ఆరోహణావతరణేష్వనభిజ్ఞత్వం విహస్తత్వమ్. 35**

**ప్రహరణకవచాదీనామప్యయథాగ్రహణం విధారణం చాపి,**
**అముకుటభూషణయోగశ్చిరప్రవేశోఽథవా రఙ్గే. 36**

**ఏభిః స్థానవిశేషైర్ఘాతా లక్ష్యాస్తు సూరిభిః కుశలైః,**
**యూపాగ్నిచయనదర్భస్రుగ్భాణ్డపరిగ్రహాన్ ముక్త్వా. 37**

**తా.** సంవాదాలలోని (dailogues) మాటలు గుర్తురాక తడముకొంటూండడం, తగిన స్వరం (accent) లేకుండా ఉచ్చరించడం, అలంకారాలు వాటి స్థానం కాని స్థానంలో ధరించడం, కిరీటం క్రింద పడిపోవడం లేదా పక్కకి ఒరిగిపోవడం, అశ్వ – రథ – రాసభ – ఉష్ట్ర – శిబికా (పల్లకీ), విమానాలను ఎలా ఎక్కాలో ఎలా దిగాలో తెలియకపోవడం, అభ్యాసం (practice) లేకపోవడం, ఆయుధాలను కవచాలను విపరీతంగా గ్రహించడం – తలక్రిందుగా ధరించడం, ముకుటాలు, భూషణాలు ధరించ వలసినవాళ్లు అవి ధరించక పోవడం, రంగస్థలంమీద ప్రవేశించడంలో ఆలస్యం చేయడం – ఇలాంటి వన్నీ పొరబాట్లు జరగడానికి అవకాశం ఉన్న స్థానాలు. ఇలాంటి ఘాతా లేవీ జరగకుండా నాట్యకుశలులైన పండితులు జాగర్తపడాలి. అయితే యజ్ఞాదులకు సంబంధించిన యూపస్తంభం, అగ్ని, చయనం (ఇటుకలు పరచడం) స్రుక్కులు, పాత్రలు మొదలైన సాధనాల విషయంలో అంతగా పట్టించుకొనవలసిన పనిలేదు. (పొరబాట్లు జరిగినా ప్రేక్షకులలో చాలమందికి తెలియదు కదా!)

**మూ. సిద్ధేర్మిశ్రో ఘాతః సర్వగతశ్చైకదేశజో వాపి,**
**నాట్యకుశలైః సలేఖ్యా సిద్ధిర్వా స్యాద్విఘాతో వా. 38**

**తా.** సిద్ధికి, మిశ్రఘాతము, సంపూర్ణఘాతము, ఏకదేశఘాతము అను మూడు విధాలైన ఘాతం ఉండవచ్చును. సిద్ధినీ, ఘాతాలనూ కూడ, నాట్యకుశలులు, పత్రంమీద (పుస్తకంలో) రాసి జాగర్తచేసికోవాలి.

**మూ. సిద్ధిర్వా ఘాతో వా సర్వగతో వ్యక్తలక్షణో బహుశః,**
**యస్త్వేకదేశజాతః స ప్రత్యవరోఽపి లేఖ్యః స్యాత్. 39**

**తా.** సంపూర్ణమైన సిద్ధి యైనా, ఘాతమైనా అనేకవిధాల స్పష్టంగా బైటకు కనబడుతూనే ఉంటుంది. (దానిని గూర్చి రాసుకొని ఉంచుకొనవలసిన పని లేదు) అయితే, ఏదో ఒక ఘట్టంలో జరిగిన ఘాత మైతే, అది చిన్నదే అయినా దానిని (మాత్రం తప్పక) రాసి ఉంచుకోవాలి.

**మూ. జర్జరమోక్షస్యాన్తే సిద్ధేర్మోక్షస్తు నాలికాయాస్తు,**
**కర్తవ్యస్త్విహ సతతం నాట్యేఽస్మిన్ ప్రాశ్నికైః సమ్యక్. 40**

**తా.** సూత్రధారుడు జర్జరం విడిచిన తరువాత, ప్రాశ్నికులు అనగా – ప్రయోగానికి సంబంధించిన కాలమును సిద్ధిని ఘాతమును పర్యవేక్షించేవాళ్లు (assessers), తమ పని ప్రారంభించి, నాలిక విప్పి సమయపాలనాన్ని, సిద్ధిని, ఘాతాలను పర్యవేక్షించి గుణ దోషాదులను రాయాలి.

**మూ. యోఽన్యస్య మహే మూర్ఖో నాన్దీశ్లోకం పఠేద్ధి దేవస్య,**
**స్వవశేన పూర్వరఙ్గే సిద్ధేర్ఘాతః ప్రయోగస్య. 41**

**తా.** ఒక దేవతకు సంబంధించిన ఉత్సవంలో ప్రయోగించిన నాటకం ప్రారంభంలో, ఎవడైనా మూర్ఖుడు తన అజ్ఞానాన్ని ప్రదర్శిస్తూ మరొక దేవతకు సంబంధించిన నాందీశ్లోకం చదివితే అది సిద్ధికి ఘాతం అవుతుంది. (పాశ్నికులు అది రాసుకోవాలి).

**మూ. యోఽన్యస్య కవేః కావ్యం కావ్యేన సంమిశ్రయేత్తథాన్యేన,**
**తస్యాపి బలాద్రఙ్గే తద్జ్ఞైర్ఘాతో విలేఖ్యస్తు. 42**

**తా.** ప్రస్తుతకావ్యానికి సంబంధించిన పాఠ్యంతో మరొక కవి రచించిన కావ్యంలోని పాఠ్యాన్ని ఎవడైనా కలిపి చదివితే వాని పేరు కూడా ఘాతకుల పేర్లలో (blacklist) చేర్చాలి.

**మూ. యోఽన్యస్య కవేర్నామ్నా కావ్యం కావ్యేన మిశ్రయేన్మోహాత్,**
**నిర్దిష్టదోషతోఽస్మిన్ సిద్ధ్యాలేఖ్యో బుధైః క్రమశః. 43**

**తా.** ఒక కవి రచించిన కావ్యం మరొకకవి రచించి నట్లు ఎవడైనా అజ్ఞానవశం చేత చెప్పినప్పుడు వాని పేరు కూడ ఘాతకుల పేర్లలో చేర్చాలి.

**మూ. యో దేశవేషభాషావ్యపేతమపి చ ప్రయోజయేత్ కావ్యమ్,**
**తస్యాప్యృభిలేఖ్యః స్యాత్ ఘాతోర్దేశః ప్రయోగజ్ఞైః. 44**

**తా.** ఒక దేశానికి సంబంధించిన కావ్యాన్ని ప్రయోగిస్తూ ఆ దేశంలోని వేష భాషాదులను అనుసరించనివాని పేరు కూడ నాటకసిద్ధివిఘాతకుల పేర్లలో చేర్చాలి.

**మూ. కః శక్తో నాట్యవిధౌ యథావదుపపాదనం ప్రయోగస్య,**
**కర్తుం వ్యగ్రమనా వా యథావదుక్తం పరిజ్ఞాతుమ్. 45**

**తా.** యథావిధిగా నాట్యప్రయోగం చేయగలిగినవాడు ఎవడున్నాడు? ఇతరులు చెప్పినా కూడ, సాధారణంగా వ్యగ్రమనస్సుతో ఉండేవా డెవడు, చెప్పినది చెప్పినట్లు తెలుసుకొనగలడు? అందుచేత ఒక ప్రయోగంలో కనబడిన పొరబా ట్లన్నీ కాగితం మీద రాసి జాగ్రత్తగా ఉంచుకోవాలి అని భావం.

**మూ. తస్మాద్గమ్భీరార్థాః శబ్దా యే లోకవేదసంసిద్ధాః,**
**సర్వజనేన గ్రాహ్యా స్తే యోజ్యా నాటకే విధివత్. 46**

**తా.** అందుచేత, అనగా శబ్దదోషాలు ఉచ్చారణదోషాలు రాకుండా ఉండడానికి, ఏ శబ్దాలు లోకంలోను వేదంలోను, ప్రసిద్ధములో, వేటిని అందరూ అర్థంచేసికొనగలరో వాటినే నాటకంలో ప్రయోగించాలి.

**మూ. న చ కించిద్గుణహీనం దోషైః పరివర్జితం న వా కించిత్,**
**తస్మాన్నాట్యప్రకృతౌ దోషా నాత్యర్థతో గ్రాహ్యాః. 47**

**తా.** అసలు గుణా లేవీ లేనిది కాని, అసలు దోషాలు ఏవీ లేనిది కాని ఏదీ లోకంలో ఉండదు, అందుచేత నాట్యప్రయోగంలో చిన్న చిన్న దోషా లేవైనా ఉన్న వాటిని అంతగా పట్టించుకోగూడదు.

**మూ. నానాదరస్తు కార్యో నటేన వాగఙ్గసత్త్వనేపథ్యే,**
**రసభావయోశ్చ గీతేష్వాతోద్యే లోకయుక్త్యాం చ. 48**

**తా.** అలాగని – నటుడు వాచికాంగికసాత్త్వికాభినయాల విషయంలోను, వేషం విషయంలోను, రసభావాల విషయంలోను, గీతాల విషయంలోను, వాద్యాల విషయం లోను, లోకవ్యవహారం విషయంలోను అనాదరం చూపకూడదు.

**మూ. ఏవమేతత్తు విజ్ఞేయం సిద్ధీనాం లక్షణం బుధైః,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి ప్రాశ్నికానాం తు లక్షణమ్. 49**

**తా.** సిద్ధుల లక్షణం ఈ విధంగా బుధులు తెలుసుకోవాలి. ఇప్పుడు ప్రాశ్నికుల

(నాట్యప్రయోగంలోని గుణదోషాలను నిర్ణయించే విశిష్టప్రేక్షకుల) లక్షణం ఎలా ఉండాలో చెపుతాను.

**మూ. చారిత్రాభిజనోపేతాః శాన్తవృత్తాః కృతశ్రమాః,**
**యశోధర్మపరాశ్చైవ మధ్యస్థవయసాన్వితాః. 50**

**షడఙ్గనాట్యకుశలాః ప్రబుద్ధాః శుచయః సమాః,**
**చతురాతోద్యకుశలాః వృత్తజ్ఞాస్తత్త్వదర్శినః. 51**

**దేశభాషావిధానజ్ఞాః కలాశిల్పప్రయోజకాః,**
**చతుర్ధాభినయోపేతాః రసభావవిల్పకాః. 52**

**శబ్దచ్ఛన్దోవిధానజ్ఞా నానాశాస్త్రవిచక్షణాః,**
**ఏవంవిధాస్తు కర్తవ్యాః ప్రాశ్నికా నాట్యదర్శనే. 53**

**తా.** సచ్చరిత్ర కలవారు, సత్కులప్రసూతులు, శాంతమైన ప్రవృత్తి గలవారు, వివిధ కళలలో పరిశ్రమ చేసినవాళ్లు, యశస్సునందు ధర్మమునందు ఆసక్తి గలవాళ్లు, మధ్యవయస్కులు, ఆరు అంగాలు గల నాట్యమునందు నేర్పు గలవారు, జీవనవిధానం తెలిసినవాళ్లు, తత్త్వం గ్రహించగలిగినవాళ్లు, దేశాలు ఆ దేశవాసుల భాషలు, ఆచారాలు తెలిసినవాళ్లు, కళలను, శిల్పాలను ప్రోత్సహించేవాళ్లు, చతుర్విధాభినయాలను గూర్చి తెలిసినవాళ్లు, రసాలను భావాలను గుర్తించగలవాళ్లు, శబ్దనియమాలను, ఛందఃశాస్త్ర నియమాలను ఎరిగినవారు, అనేకశాస్త్రాలలో సమర్థులు – ఇలాంటి వాళ్లను, నాట్యం చూడడంలో లేదా నాట్యప్రదర్శనాలలో, ప్రాశ్నికులనుగా, గుణదోషనిర్ణాయకులనుగా (Members of the sensor Board) నియమించాలి.

**మూ. అవ్యగ్రైరిన్ద్రియైః శుద్ధ ఊహాపోహవిశారదః,**
**త్యక్తదోషోఽనురాగీ చ స నాట్యే ప్రేక్షకః స్మృతః. 54**

**తా.** ఇంద్రియా లన్నీ చక్కగా పనిచేస్తున్నవాడు, ఊహాపోహాలలో సమర్థుడు, దోషాలు లేని వాడు, అనురాగ (స్నేహ) శీలుడు అయినవాడే సరియైన ప్రేక్షకుడు.

**మూ. యస్తుష్టౌ తుష్టిమాయాతి శోకే శోకముపైతి చ,**
**దైన్యే దీనత్వమభ్యేతి స నాట్యే ప్రేక్షకః స్మృతః. 55**

**తా.** నాట్యంలో సుఖవంతుడైనవానిని చూచి ఆనందించేవాడు, శోకంతో ఉన్నవానిని చూచి శోకించేవాడు, అతడు దైన్యంతో ఉంటే దైన్యం పొందేవాడు, ఇలాంటి వాడే నిజమైన ప్రేక్షకుడు.

**మూ. న చైవేతే గుణాః సమ్యగేకస్మిన్ ప్రేక్షకే స్మృతాః,**
**విజ్ఞేయస్యాప్రమేయత్వాదల్పత్వాదాయుషస్తథా. 56**

**తా.** అయితే ఈ గుణా లన్నీ ఒకే ప్రేక్షకునిలో ఉండడం అసంభావ్యం. ఎందువల్ల ననగా – తెలిసికొనదగినవిషయాలు అనంత మైనవి, ఆయుర్దాయం అల్ప మైనది.

**మూ. ఉత్తమాధమమధ్యానాం సంఙ్కీర్ణాయాం చ సంసది,**
**న శక్యమధమైర్జ్ఞాతుముత్తమానాం విచేష్టితమ్. 57**

**తా.** ఉత్తములు, అధములు, మధ్యములు కలిసి ఉన్న సభలో అధములు ఉత్తముల చేష్టలను తెలుసుకొనజాలరు కూడ.

**మూ. యద్యస్య శిల్పం నేపథ్యం కర్మ చేష్టితమేవ వా,**
**తస్య తేనైవ కార్యం తు స్వకర్మవిషయం ప్రతి. 58**

**తా.** ఎవనికి ఏ శిల్పము, వేషము, కర్మ, చేష్టలు ఉంటాయో వానికి అలాంటి శిల్పాదులు కలవాడే తగిన ప్రేక్షకుడు.

**మూ. నానాశీలాః ప్రకృతయః శీలే నాట్యం ప్రతిష్ఠితమ్,**
**ఉత్తమాధమమధ్యానాం వృద్ధబాలిశయోషితామ్. 59**

**తా.** నాట్యం వేరు వేరు విధాలైన శీలం గల వ్యక్తులమీద ఆధారపడి ఉంటుంది. ఉత్తమ – అధమ – మధ్యముల, వృద్ధ – ప్రాకృతజన – స్త్రీల శీలాలు, ప్రకృతులు అనేకవిధాలుగా ఉంటాయి.

**మూ. తుష్యన్తి తరుణాః కామే విదగ్ధాః సమయాశ్రితే,**
**అర్థేష్వర్థపరాశ్చైవ మోక్షే చాథ విరాగిణః. 60**

**తా.** యువకులు ప్రేమదృశ్యాలు చూచి ఆనందిస్తారు. విదగ్ధులు, ఏవైన శాస్త్రాదులలో నేర్పుగలవారు, నియమబద్ధంగా ఉన్న నాట్యప్రయోగం చూచి సంతోషిస్తారు. అర్థపరులు, అర్థప్రధానమైన దృశ్యాలు చూచి సంతోషిస్తారు. వైరాగ్యవంతులు మోక్ష ప్రధాన ఇతివృత్తాలు గల ప్రయోగాలు చూచి సంతోషిస్తారు.

**మూ. శూరా బీభత్సరౌద్రేషు నియుద్ధేష్వాహవేషు చ,**
**ధర్మాఖ్యానపురాణేషు వృద్ధాస్తుష్యన్తి నిత్యశః. 61**

**తా.** శూరులు బీభత్స – రౌద్రరసప్రధానప్రయోగాలను, యుద్ధాలను, మల్ల యుద్ధాలను చూచి ఆనందిస్తారు. వృద్ధులు ధర్మబోధకమైన కథలు పురాణకథలు మొదలైన వాటితో సంతోషిస్తారు.

**మూ. బాలా మూర్ఖాః స్త్రియశ్చైవ హాస్యనేపథ్యయోస్సదా,**
**ఏవం భావానుకరణే యో యస్మిన్ ప్రవిశేన్నరః**
**ప్రేక్షకస్తు స మన్తవ్యః గుణైరేతైరలఙ్కృతః. 62**

**తా.** బాలులు, మూర్ఖులు, స్త్రీలు హాస్యాన్ని, వేషాన్ని చూచి సంతోషిస్తారు. ఈ విధంగా ఏ భావాన్ని అనుకరించడం కోసం ఒక నటుడు ప్రవేశిస్తాడో ఆ భావంమీద ఆసక్తి గల, ఆ గుణాలు గలవాడే ప్రేక్షకుడు.(ప్రయోగంలోని ఆ ఘట్టాన్ని పరీక్షించగలవాడు)

**మూ. ఏవం హి ప్రేక్షకా జ్ఞేయాః ప్రయోగే నాట్యసంశ్రయే,**
**సంఘర్షే తు సముత్పన్నే ప్రాశ్నికాన్ సన్నిబోధత. 63**

**యజ్ఞవిన్నర్తకశ్చైవ ఛన్దోవిచ్ఛబ్దవిత్తథా,**
**అస్త్రవిచ్చిత్రకృద్వేశ్యా గాన్ధర్వో రాజసేవకః. 64**

**తా.** నాట్యప్రయోగంలో ప్రేక్షకులుగా ఉండవలసినవాళ్లు వీళ్లే. అయితే ఏదైన ఒక ప్రయోగానికి సంబంధించిన గుణదోషాల నిర్ణయంలో సంఘర్షం (అభిప్రాయభేదం) ఏర్పడితే, ఆ యా ప్రదర్శనలవిషయంలో అభిప్రాయం చెప్ప మని ప్రాశ్నికులను అడగాలి. యజ్ఞాలను గూర్చి తెలిసినవాడు, నర్తకుడు, చందఃశాస్త్రం తెలిసినవాడు, వ్యాకరణజ్ఞుడు, అస్త్రజ్ఞానం ఉన్నవాడు, చిత్రలేఖననిపుణుడు, వేశ్య, సంగీతపండితుడు, రాజసేవకుడు, (ఏదో ఒక రాజ్యపాలనాధికారంలో ఉన్నవాడు – గెజిటెడ్ ఆఫీసరు వంటివాడు) వీళ్లు ప్రేక్షకులు.

**మూ. యజ్ఞవిద్యజ్ఞయోగే చ నర్తకోఽభినయే స్మృతః,**
**ఛన్దోవిద్వృత్తబన్ధేషు శబ్దవిత్పాఠ్యవిస్తరే. 65**

**ఇష్వస్త్రవిత్సౌష్ఠవే తు నేపథ్యే చైవ చిత్రకృత్,**
**కామోపచారే వేశ్యా చ గాన్ధర్వః స్వరకర్మణి. 66**

**సేవకస్తూపచారే స్యాదేతే వై ప్రాశ్నికాః స్మృతాః,**
**ఏభిర్ధర్మమభిప్రేక్ష్య దోషా వాచ్యాస్తథా గుణాః. 67**

**తా.** యజ్ఞాలలో (దేవతాపూజాదివిషయాలలో) యజ్ఞవేత్త, అభినయాలలో నర్తకుడు, ఛందస్సుల విషయాలలో ఛందఃశాస్త్రజ్ఞుడు, పాఠ్యం విషయంలో వ్యాకరణజ్ఞుడు, శస్త్రగ్రహణా దులలో బాణ – అస్త్రాదినిపుణుడు, వేషం విషయంలో చిత్రకారుడు, కామోప చారాల విషయంలో వేశ్య, సంగీతస్వరవిషయంలో సంగీతశాస్త్రజ్ఞుడు, ఉపచారాదుల (ప్రొటోకాల్ మొదలైనవి) విషయంలో రాజసేవకుడు ప్రాశ్నికు లైన ప్రేక్షకులుగా ఉండి, ధర్మాను సారంగా, ఆ యా ప్రయోగాలలోని గుణదోషాలను చెప్పాలి.

**మూ. అశాస్త్రజ్ఞే (జ్ఞో) వివాదో హి యదా భవతి కర్మతః,**
**అథైతే ప్రాశ్నికా జ్ఞేయా గదితా యే మయాఽనఘాః. 68**

**తా.** ప్రయోక్త శాస్త్రజ్ఞానం లేనివాడైనపుడు, (శాస్త్రవిషయంలో కాక) ఆ యా అభినయాల ప్రయోగాల గుణదోషాల విషయంలో వివాదం ఏర్పడినపుడు, పైన నేను చెప్పినవారిని ప్రాశ్నికులుగా గ్రహించి నిర్ణయించాలి.

**మూ. శాస్త్రజ్ఞానాద్యదా (నాంయదా) తు స్యాత్ సంఘర్షః శాస్త్రసంశ్రయః,**
**శాస్త్రప్రమాణనిర్మాణైర్వ్యవహారో భవేత్తదా. 69**

**తా.** శాస్త్రజ్ఞానం విషయంలోనే (శాస్త్రజ్ఞుల మధ్యనే) వివాదం ఏర్పడినప్పుడు శాస్త్రగ్రంథాలనుండి ప్రమాణాలు చూపించి ఆ వివాదాన్ని పరిష్కరించాలి.

**మూ. భర్తృనియోగాదన్యోన్యవిగ్రహాత్ స్పర్ధయాపి భరతానామ్,**
**అర్థపతాకా హేతోః సంఘర్షో నామ సంభవతి. 70**

**తా.** తమ స్వామి (యజమాని) ఆజ్ఞచేత, (ఉసిగొల్పడంచేత) పరస్పరము విరోధం ఉండడంవల్లా, పోటీవల్ల, ధనంకోసమూ, పతాక (కీర్తి – ప్రశంసాపత్రాదికము), కోసమూ భరతుల (నటీ – నటుల) మధ్య సంఘర్షం (వివాదం, పోటీ) ఏర్పడుతూంటుంది.

**మూ. తేషాం కార్యం వ్యవహారదర్శనం పక్షపాతవిరహేణ,**
**కృత్వా పణం పతాకాః వ్యవహారః స భవితవ్యస్తు. 71**

**తా.** ఈ విధంగా వివాదం ఏర్పడిన భరతుల వ్యవహారాన్ని (Dispute) పక్షపాతం లేకుండా వాళ్ల ప్రయోగనైపుణ్యం చూచి నిర్ణయించాలి. పతాక (cirtificate) ఇవ్వడానికి ముందుగా ఒక పణం (షరతు) ఏర్పరచి తరువాత ప్రదర్శనం చూడడంవంటివాటి ద్వారా వాళ్ల మధ్య ఏర్పడిన వివాదాన్ని పరిష్కరించాలి.

**మూ. సర్వైరనన్యమతిభిః సుఖోపవిష్టైశ్చ శుద్ధభావైశ్చ,**
**లోకే గణకసహాయైః సిద్ధేర్ఘాతాః సమభిలేఖ్యాః. 72**

**తా.** సిద్ధి – ఘాతాలను నిర్ణయించే ప్రాశ్నికు లందరూ పరిశుద్ధ మైన భావంతో (నిష్పక్షపాతమైన పరిశుద్ధభావంతో) ఏకాగ్రచిత్తంతో సుఖంగా కూర్చుండి, గణకులను, లెక్కలలో ప్రవీణులను, సహాయులనుగా ప్రక్కన కూర్చుండబెట్టుకొని, సిద్ధి – ఘాతా లన్నీ వ్రాయించాలి.

**మూ. నాత్యాసన్నైర్న దూరసంస్థితైఃప్రేక్షకైస్తు భవితవ్యమ్,**
**తేషామాసనయోగో ద్వాదశహస్తస్థితః కార్యః. 73**

**తా.** ప్రాశ్నికులైన ప్రేక్షకులు ఒకరికొకరు చాల దగ్గరగా గాని చాల దూరంగా గాని కూర్చొనకూడదు. వాళ్ల ఆసనాల మధ్య దూరం పన్నెండు హస్తాలు ఉండాలి.

**మూ. యాని విహితాని పూర్వం సిద్ధిస్థానాని తాని లక్ష్యాణి,**
**ఘాతాశ్చ లక్షణీయాః ప్రయోగతో నాట్యయోగే తు. 74**

**తా.** నాట్యప్రయోగంలో ఏవి సిద్ధిస్థానా లని (points of success) ముందు గానే నిర్ణయింప బడ్డాయో, ఏవి ఘాతస్థానా లని (points of blemishes) నిర్ణయింప బడ్డాయో వాటిని ఒక టొకటే కాగితం మీద వ్రాసుకోవాలి.

**మూ. దైవోత్పాతసముత్థాః పరోత్థితా వా న వై బుధైర్లేఖ్యాః,**
**ఘాతా నాట్యసముత్థా హ్యాత్మసముత్థాస్తు లేఖ్యాః స్యుః. 75**

**తా.** నాట్యప్రయోగంలోని, దైవవశంవల్ల కలిగిన ఘాతాలను, ఉత్పాతాలవల్ల కలిగినవాటిని లిఖించకూడదు. ఆత్మసముత్థాలైన (నటీనటుల చేసిన పొరబాట్లవల్ల కలిగిన) ఘాతాలను మాత్రమే లిఖించాలి.

**మూ. ఘాతా యస్య స్వల్పాః సంఖ్యాతాః సిద్ధయశ్చ బహులాః స్యుః,**
**విదితం కృత్వా రాజ్ఞస్తస్మై దేయా పతాకా హి. 76**

**తా.** (ఏ నటునికి లేదా నటికి) లెక్కపెట్టిన ఘాతాలు చాల తక్కువగా ఉంటాయో, సిద్ధులు చాల అధికసంఖ్యలో ఉంటాయో, వానికి, ఆ విషయం రాజుకు తెలియపర్చిన పిమ్మట, పతాక (యోగ్యతాపత్రం – అవార్డు) ఇవ్వాలి.

**మూ. సిద్ధ్యతిశయాత్ పతాకా సమసిద్ధౌ పార్థివాజ్ఞయా దేయా,**
**అథ నరపతిః సమః స్యాదుభయోరపి సా తదా దేయా. 77**

**తా.** ఈ విధంగా సిద్ధుల సంఖ్య అధికంగా ఉన్నవానికి పతాక ఇవ్వాలి. రాజుకు తెలిపితే చాలు. పోటీపడేవా ళ్లిద్దరికీ సిద్ధులు సమంగానే ఉంటే రాజాజ్ఞప్రకారం ఇవ్వాలి. రాజు ఇద్దరి విషయంలోను సమత్వం ప్రదర్శిస్తే ఇద్దరికీ కూడ 'పతాక' ఇవ్వాలి.

**మూ. ఏవంవిధిజ్ఞైర్ద్రష్టవ్యో వ్యవహారః సమఞ్జసమ్,**
**స్వస్థచిత్తైః సుఖాసీనైః సువిశిష్టైర్గుణార్థిభిః. 78**

**తా.** ఉత్తమగుణాలను పోషించడంలో ఆసక్తి కలవాళ్లు, విశిష్టమైన ప్రవృత్తి గలవాళ్లు, నాట్యప్రయోగానికి సంబంధించిన విధివిధానాలు బాగా తెలిసినవాళ్లు అయిన ప్రేక్షకులు, సుఖాసీనులై, స్వస్థచిత్తులై వ్యవహారాన్ని సమంజసమైన పద్ధతిలో పరిష్కరించాలి.

**మూ. విమృశ్య ప్రేక్షకైర్గ్రాహ్యం సర్వరాగపరాఙ్ముఖైః,**
**సాధనం దూషణాభాసః ప్రయోగసమయాశ్రితైః. 79**

**తా.** ప్రేక్షకులు అన్ని విధాలైన రాగాలకు (పక్షపాతబుద్ధులకు) దూరులై, ప్రయోగానికి సంబంధించిన నియమాలను దృష్టిలో ఉంచుకొని, ప్రయోగాల సాధనాలను, దోషాభాసలను (దోషం వలె కనబడినా దోషం కాని విషయాలను) విమర్శించి నిర్ణయం తీసికోవాలి.

**మూ. సమత్వమఙ్గమాధుర్యం పాఠ్యం ప్రకృతయో రసాః,**
**గానం వాద్యం సనేపథ్యమేతద్జ్ఞేయం ప్రయత్నతః. 80**

**తా.** సమత్వము, అంగమాధుర్యము, పాఠ్యము, ప్రకృతులు, రసాలు, గానము, వాద్యము, వేషము – ఇవీ ప్రేక్షకులు ప్రయత్నపూర్వకంగా పరిశీలించవలసినవి.

**మూ. ధ్రువాణాం గానయోగేషు కలాన్తరకలాసు చ,**
**యదఙ్గం క్రియతే నాట్యం సమన్తాత్ సమముచ్యతే. 81**

**తా.** ధ్రువాగానసమయాలలో, కలలకు, అంతరకలలకు (విభిన్న కాలప్రమాణాలకు) అనుగుణంగా, నాట్యప్రదర్శనంలో అంతటా చేసే ఆంగికప్రదర్శనానికి **సమం** అని పేరు.

**మూ. అఙ్గోపాఙ్గసమాయుక్తం గీతతాలలయాన్వితమ్,**
**గానవాద్యసమత్వం చ తద్బుధైః సమముచ్యతే. 82**

**తా.** గీత – తాల – లయలకు, గానవాద్యాలకూ అనుగుణంగా (in hormony) అంగోపాంగాలతో చేసే నృత్యం 'సమం' అని బుధు లంటారు.

**మూ. అనిర్భుగ్నమురః కృత్వా చతురస్రకృతౌ కరౌ,**
**గ్రీవాఞ్చితా తథా కార్యా త్వఙ్గమాధుర్యమేవ చ. 83**

**తా.** వక్షస్థలం వంగకుండా నిలబెట్టి చేతులు చతురస్రముద్రలో ఉంచి, కంఠాన్ని అంచితం చేస్తే అది **అంగమాధుర్యం.**

**మూ. పూర్వోక్తానీహ శేషాణి యాని సాధ్యాని సాధకైః,**
**వాద్యప్రకృతయో గానం వక్ష్యమాణాని నిర్దిశేత్. 84**

**తా.** పూర్వం చెప్పినవే కాక మిగలిన ఏ విషయాలను ఇంకా నటుడు సాధించవలసి ఉందో వాటిని, వాద్యాలని, ప్రకృతులను, గానాన్ని, ఇంకా చెప్పబోవువాటిని కూడ పరిగణనలోకి తీసికొని నిర్ణయం చెయ్యాలి.

**మూ. యాని స్థానాని సిద్ధీనాం తైః సిద్ధిం తు ప్రకాశయేత్,**
**హర్షాదఙ్గసముద్భూతాం నానారససముత్థితామ్. 85**

**తా.** అనేకవిధాలైన రసాల అభినయసమయంలో హర్షంవల్ల (హర్షాదులవల్ల) ఏ సిద్ధి, ఏ స్థానాలలో, సిద్ధిగా గుర్తించబడుతుందో ఆ స్థానాలను పేర్కొంటూ ఆ సిద్ధిని

గూర్చి విశదీకరించాలి. "ఈ రసాన్ని అభినయిస్తూన్నప్పుడు ఈ విధమైన సిద్ధి నటుని ఈ అవయవంమీద స్పష్టంగా గోచరించింది" అని స్పష్టంగా చెప్పాలి అని అర్థం.

**మూ. వారకాలాస్తు విజ్ఞేయా నాట్యజ్ఞైర్వివిధాశ్రయాః,**
**దివసశ్చైవ రాత్రిశ్చ తయోర్వారాన్ నిబోధత. 86**

**తా.** నాట్యప్రయోగజ్ఞులు, వివిధకథావస్తువులతో కూడిన నాట్యాల ప్రయోగానికి తగిన సమయాలను తెలుసుకోవాలి. పగలు, రాత్రీ ప్రయోగించే నాట్యాలకు తగిన సమయాలను చెపుతున్నాను; వినండి."

**మూ. ప్రాదోషికోర్ధరాత్రిశ్చ తథా ప్రాభాతికోఽపరః,**
**నాట్యవారా భవన్త్యేతే రాత్రావిత్యను పూర్వశః. 87**

**తా.** రాత్రికాలంలో – సాయంకాలము, అర్ధరాత్రి, తెల్లవారే సమయం – ఇవి నాట్యానికి తగిన సమయాలు.

**మూ. పూర్వాహ్ణస్త్వథ మధ్యాహ్నస్త్వపరాహ్ణస్తథైవ చ,**
**దివాసముత్థా విజ్ఞేయా నాట్యవారాః ప్రయోగతః. 88**

**తా.** పూర్వాహ్ణము, మధ్యాహ్నము, అపరాహ్ణము – ఇవి పగలు నాట్యప్రయోగం చేయ దగిన సమయాలు.

**మూ. ఏతేషాం తు యథాయోగ్యం నాట్యం కార్యం రసాశ్రయమ్,**
**తదహం సంప్రవక్ష్యామి వారం కాలసముత్థితమ్. 89**

**తా.** ఈకాలంలో, ఈ సమయాలలో వేరు వేరు రసాలకు సంబంధించిన ఏ నాట్యం ప్రయోగించాలి, ఎందుకు ఆ కాలంలో చెయ్యాలి అను విషయాన్ని చెపుతాను.

**మూ. యచ్ఛ్రోత్రరమణీయం స్యాద్ధర్మాఖ్యానకృతం తథా,**
**పూర్వాహ్ణే తత్ ప్రయోక్తవ్యం శుద్ధం వా వికృతం తథా. 90**

**తా.** శ్రోత్రానందకరము, ధర్మసంబంధమైన ఆఖ్యానం గలది అయిన నాట్యం, అది శుద్ధ మైనా, మిశ్రమైనా, పూర్వాహ్ణసమయంలో ప్రయోగించాలి.

**మూ. సత్త్వోత్థానగుణైర్యుక్తం వాద్యభూయిష్ఠమేవ చ,**
**పుష్కలం సిద్ధియుక్తం తు అపరాహ్ణే ప్రయోజయేత్. 91**

**తా.** శక్తి – ప్రయత్నశీలత మొదలైన గుణాలతో కూడినది, వాద్యప్రయోగం అధికంగా ఉండేడి, నిశ్చితంగా సిద్ధిని ఇస్తుంది అను నమ్మకం ఉన్నది అయిన నాట్య ప్రయోగం అపరాహ్ణంలో చెయ్యాలి.

**మూ. కైశికీవృత్తిసంయుక్తం శృఙ్గారరససంశ్రయమ్,**
**నృత్యవాదిత్రగీతాఢ్యం ప్రదోషే నాట్యమిష్యతే. 92**

**తా.** శృంగారరసంతో సంబంధించినదై, కైశికీవృత్తితో కూడిన, వృత్తాలు, వాద్యాలు, గీతాలు అధికంగా ఉన్న నాట్యం ప్రదోషసమయంలో ప్రదర్శించాలి.

**మూ. యత్తు మాహాత్మ్యసంయుక్తం కరుణప్రాయమేవ చ,**
**ప్రభాతకాలే తత్ కార్యం నాట్యం నిద్రావినాశనమ్. 93**

**తా.** మాహాత్మ్యంతో కూడినది, కరుణరసప్రధానమూ అయిన నాట్యప్రయోగం ప్రభాతకాలంలో జరగాలి. ఇది వచ్చే నిద్రను ఆపివేస్తుంది.

**మూ. అర్ధరాత్రే న యుఞ్జీత న మధ్యాహ్నే తథైవ చ,**
**సన్ధ్యాభోజనకాలే చ నాట్యం న చ కదాచన. 94**

**తా.** అర్ధరాత్రసమయంలోను, మధ్యాహ్నసమయంలోను, సంధ్యాసమయంలోను, భోజనసమయంలోను నాట్యప్రయోగం ఎన్నడూ చేయకూడదు.

**మూ. ఏవం కాలం చ దేశం చ ప్రసమీక్ష్య ససంశ్రయమ్,**
**నాట్యవారం ప్రయుఞ్జీత యథాభావం యథారసమ్. 95**

**తా.** ఈ విధంగా కథావస్తుస్వరూపాన్నీ, రసాన్నీ, భావాలను అనుసరించి దేశ కాలాలను చూచుకొని నాట్యం ఆ యా సమయాలలో ప్రయోగించాలి.

**మూ. అథవా దేశకాలౌ చ న పరీక్ష్యౌ ప్రయోక్తృభిః,**
**యదైవాజ్ఞాపయేద్భర్తా తదా యోజ్యమసంశయమ్. 96**

**తా.** లేదా – ప్రభువు ఎప్పుడు ప్రయోగించ మని ఆజ్ఞాపిస్తాడో అప్పుడు, దేశ కాలాలను చూచుకొనకుండా ప్రయోక్తలు నాట్యప్రయోగం చెయ్యాలి.

**మూ. తథా సముదితాశ్చైవ విజ్ఞేయా నాటికాశ్రితాః,**
**పాత్రం ప్రయోగమృద్ధిశ్చ విజ్ఞేయాస్తు త్రయో గుణాః. 97**

**తా.** నాటకప్రదర్శనంలో పాత్ర, ప్రయోగము, సమృద్ధి అను ఈ మూడు గుణాలు కలిసి ఉండే టట్లు చూచుకోవాలి.

**మూ. బుద్ధిమత్త్వం సురూపత్వం లయతాలజ్ఞతా తథా,**
**రసభావజ్ఞతా చైవ వయఃస్థత్వం కుతూహలమ్. 98**

**గ్రహణం ధారణం చైవ గానం నాట్యకృతం తథా,**
**జితసాధ్వసతోత్సాహ ఇతి పాత్రగతో విధిః. 99**

**తా.** మంచి బుద్ధి, సౌందర్యము, లయ – తాలాల జ్ఞానము, రస – భావాల స్వరూపం తెలిసి ఉండడం, యౌవనం, నాట్యప్రయోగాదులందు వేడుక, విషయగ్రహణశక్తి, గ్రహించిన విషయాన్ని విస్మరించకుండా ఉండడం, నాట్యోపయోగియైన గానము, సభాకం పాదులు లేకపోవడం. ఉత్సాహం – ఇది అభినేతకు ఉండవలసిన గుణాలు.

**మూ. సువాద్యతా సుగానత్వం సుపాఠ్యత్వం తథైవ చ,**
**శాస్త్రకర్మసమాయోగః ప్రయోగ ఇతి సంజ్ఞితః. 100**

**తా.** వాద్యాల సౌష్ఠవం, గానం మధురంగా ఉండడం, పాఠ్యం మనోహరంగా ఉండడం, శాస్త్రజ్ఞాన – అభినయాదుల కలయిక, ఇవి ఉత్తమమైన ప్రయోగంలో ఉండే లక్షణాలు.

**మూ. శుచిభూషణతా యా తు మాల్యాభరణవాససామ్,**
**విచిత్రరచనాచైవ సమృద్ధిరితి సంజ్ఞితా. 101**

**తా.** భూషణాలలో శుచిత్వము, మాలా – ఆభరణ – వస్త్రాల విచిత్రమైన రచన – దీనికి సమృద్ధి అని పేరు.

**మూ. యదా సముదితాః సర్వే ఏకీభూతా భవన్తి హి,**
**అలఙ్కారః స తు తదా మన్తవ్యో నాట్యయోక్తృభిః. 102**

**తా.** ఈ మూడు గుణాలు కలిసి, ఒక్కటిగా ఏర్పడి, ఏ ప్రయోగంలో ఉంటాయో ఆ నాట్యప్రయోగం (తమకు) గొప్ప అలంకారము అని నాట్యప్రయోక్తలు భావించాలి.

**మూ. ఏతదుక్తం ద్విజశ్రేష్ఠాః సిద్ధీనాం లక్షణం మయా,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామ్యాతోద్యానాం వికల్పనమ్. 103**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే సిద్ధివ్యఞ్జకో నామ సప్తవింశోఽధ్యాయః.**

**తా.** ద్విజశ్రేష్ఠులారా నే నింతవరకు సిద్ధిలక్షణం చెప్పాను. ఇటుపైన ఆతోద్యాల (వాద్యాల) ఏర్పాటును గూర్చి చెపుతాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్ర వ్యాఖ్యానంలో సిద్ధివ్యంజక మను ఇరవైఏడవ అధ్యాయం సమాప్తం.**

**శ్రీః శ్రీః శ్రీః**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ అష్టావింశోఽధ్యాయః

## జాతివికల్పనము

**"మధ్యమస్వరముశన్తి యద్వశాన్నాదషట్కముదితం శ్రుతిక్రమాత్,**
**సోఽపి యద్విలసితం కలాత్మకం తం నమామి శిశిరాంశుమణ్డనమ్."**
**– శ్రీమదభినవగుప్తాచార్యాః**

**మూ. ఆతోద్యవిధిమిదానీం వ్యాఖ్యాస్యామః –**
**తతం చైవావనద్ధం చ ఘనం సుషిరమేవ చ,**
**చతుర్విధం తు విజ్ఞేయమాతోద్యం లక్షణాన్వితమ్. 1**

**తా.** ఇప్పుడు ఆతోద్యముల విధి వ్యాఖ్యానిస్తున్నాము – విశదీకరిస్తున్నాము.

తతము, అవనద్ధము, ఘనము, సుషిరము అని నాలుగు విధాలైన ఆతోద్యాలను వాటి లక్షణాలను తెలుసుకోవాలి.

**మూ. తతం తన్త్రీగతం జ్ఞేయమవనద్ధం తు పౌష్కరమ్,**
**ఘనం తాలస్తు విజ్ఞేయః సుషిరో వంశ ఉచ్యతే. 2**

**తా.** తంత్రు లున్నది (తీగలున్న వీణాదికం) **తతం**. చేతులతో, చిన్న కఱ్ఱలతో కొట్టబడే మృదంగాదికం **అవనద్ధం**. కంచుమొదలైన లోహాలతో తయారు చేసిన తాలవాద్యం **ఘనం**. ఊపిరిగాలి నింపి మ్రోగించబడే రంధ్రా లున్న పిల్లనగ్రోవి మొదలైనది **సుషిరం**.

**మూ. ప్రయోగస్త్రివిధో హ్యేషాం విజ్ఞేయో నాటకాశ్రయః,**
**తతం చైవావనద్ధం చ తథా నాట్యకృతశ్చ యః. 3**

**తా.** కొన్ని నాటకాల ప్రయోగాలలో తతవాద్యప్రయోగం అధికంగా ఉంటుంది; కొన్నింటిలో అవనద్ధవాద్యప్రయోగం అధికంగా ఉంటుంది. కొన్నింటిలో అన్ని విధాల వాద్యాల ఉపయోగము సాధారణరీతిలో ఉంటుంది. ఈ విధంగా వాద్యప్రయోగం మూడు రీతులలో ఉంటుంది.

**మూ. తతే కుతపవిన్యాసో గాయనః సపరిగ్రహః,**
**వైపఞ్చికో వైణికశ్చ వంశవాదక ఏవ చ. 4**

**తా.** తతప్రయోగసమయంలో కుతపవిన్యాసం ఈ విధంగా ఉండాలి – గాయనుడు

(ప్రధానగాయకుడు) ఆతని సహచరులు, విపంచీవాదకుడు, వైణికుడు, వంశవాదకుడు ఒక చోట కూర్చోవాలి.

**వి. 'కుతపం'** అనగా వాద్యవాదకులు తమ తమ వాద్యాలతో కూర్చొనవలసిన ఒక నిర్దిష్టమైన ప్రదేశం. వాద్యవాదకబృందం (Archestra of stringed instruments).

**'చిత్రా' 'విపఞ్చీ'** అని వీణలలో రెండు బేదా లుంటాయి. ఏడు తీగ లున్న వీణ 'చిత్ర' . దీనిని వేళ్లతో మోగిస్తారు. తొమ్మిది తీగ లున్నది 'విపఞ్చి'. వేళ్లకు చివర్లలో 'కోణం' అను లోహనిర్మితమైన ఒక చిన్న తొడుగు కట్టు కొని దీనిని మోగిస్తారు. ఇరవైయొక్క తీగల వీణ కూడ ఉండే దని అభినవగుప్తాచార్యులద్వారా తెలుస్తూన్నది.

**మూ. మార్దఙ్గికః పాణవికస్తథా దార్దురికో బుధైః,**
**అవనద్ధవిధావేష కుతపః సముదాహృతః. 5**

**తా.** అవనద్ధవాద్యాల ఉపయోగం ప్రధానంగా ఉన్న ప్రయోగంలో, మార్దంగికుడు (మృదంగం వాయించేవాడు) పాణవికుడు (పణవం అను వాద్యం చేయించేవాడు) దార్దురికుడు (దర్దురం అను వాద్యం వాయించేవాడు) ఒక చోట కూర్చుండి అవనద్ధ వాద్యకుతపంగా ఏర్పడతారు.

**మూ. ఉత్తమాధమమధ్యాభిస్తథా ప్రకృతిభిర్యుతః,**
**కుతపో నాట్యయోగే తు నానాదేశసమాశ్రయః. 6**

**తా.** ఉత్తమ – అధమ – మధ్యమప్రకృతులు గల వివిధపాత్రలు పాల్గొనే నాట్యం ప్రయోగంలో ఆ పాత్రల ప్రకృతులకు అనుగుణమైన వాద్యాల కుతపాలు నాట్యరంగం మీద ఆ యా ప్రదేశాలలో ఉండాలి.

**మూ. ఏవం గానం చ వాద్యం చ నాట్యం చ వివిధాశ్రయమ్,**
**అలాతచక్రప్రతిమం కర్తవ్యం నాట్యయోక్తృభిః. 7**

**తా.** ఈ విధంగా వేరు వేరు వస్తువులపై ఆధారపడి ఉన్న, అదే విధంగా చక్షుః – శ్రోత్రములు రెండింటిచేత ఒకే సమయంలో ఆస్వాదించదగిన గానము, వాద్యము, నాట్యము (అభినయము Action) అను ఈ త్రయమూ ఒక దానితో మరొకదానికి పూర్తి సమన్వయంతో అలాతచక్రం వలె ఒకే విధంగా ప్రకాశించే టట్లు నాట్యవేత్తలు ప్రయోగించాలి.

వి. **"యస్మాద్ద్వివిధాశ్రయం భిన్నేన్ద్రియగ్రాహ్యత్రివిధక్రియారూపం, తస్మాద్యత్నేన అస్య ఏకతా సంపాద్యా, యేనైకబుద్ధివిషయతాం సామాజికస్య గచ్ఛేత్. అలాతతేజఃకణో హి న వస్తుతః యుగపదనేకదేశసంబన్ధీ లాఘవయత్నేన తు తథా తథా సామ్యమా పాదితమ్".** (అ.భా.)

ఒక చివర ఎఱ్ఱని నిప్పు ఉన్న కఱ్ఱను గుండ్రంగా వేగంగా త్రిప్పినప్పుడు అది ఎదుట నిలబడి చూచేవాళ్లకు తేజశ్చక్రం వలె కనబడుతుంది. వాస్తవంలో, అత్యల్ప మైన ప్రదేశం మాత్రంలోనే ఉన్న అగ్ని హస్తలాఘవంచేత చక్రాకారంలో ఉన్నట్లు కనబడుతుంది. అదే విధంగా ప్రయోక్తల నేర్పుచేత గాన - వాద్య - నాట్యాలు - మూడూ వేరు వేరే అయినా సామాజికుని హృదయంలో ఒకే వస్తువు వలె, ఒకే విధమైన భావాన్ని కలిగించాలి అని భావం.

**మూ. యత్తు తన్త్రీకృతం ప్రోక్తం నానాతోద్యసమాశ్రయమ్,**
**గాన్ధర్వమితి తద్ జ్ఞేయం స్వరతాలపదాశ్రయమ్. 8**

**తా.** కంఠస్వర - తాల - పదాల సహకారంతో, అనేకవిధాలైన వాద్యాలను ఆశ్రయించిన, అనగా వాద్యాలతో కూడిన, తంత్రీకృత మైన ధ్వని **గాంధర్వ** మని చెప్పబడుతుంది. అనగా - వీణాదితంత్రీవాద్యములతోను, మృదంగాదివాద్యాలతోను కలిసిన గాత్రసంగీతానికి **గాంధర్వం** అని పేరు.

**మూ. అత్యర్థమిష్టం దేవానాం తథా ప్రీతికరం పునః,**
**గన్ధర్వాణామిదం యస్మాత్తస్మాద్గాన్ధర్వముచ్యతే. 9**

**తా.** ఇది దేవతలకు చాల ఇష్ట మైనది. గంధర్వులకు కూడ ప్రీతికర మైనది. అందుచేతనే దీనిని గాంధర్వం అంటారు.

**మూ. అస్య యోనిర్భవేద్గాత్రం వీణా వంశస్తథైవ చ,**
**ఏతేషాం చైవ వక్ష్యామి విధిం స్వరసముత్థితమ్. 10**

**తా.** గాంధర్వానికి గాత్రము (కంఠస్వరము), వీణ, వేణువు - ఈ మూడూ ఉత్పత్తి స్థానం. స్వరాలతో సంబంధించిన ఈ గాత్ర - వీణాదిప్రయోగ విధానాన్ని చెపుతాను.

**మూ. గాన్ధర్వం త్రివిధం విద్యాత్ స్వరతాలపదాత్మకమ్,**
**త్రివిధస్యాపి వక్ష్యామి లక్షణం కర్మ చైవ హి. 11**

**తా.** స్వరస్వరూపము, తాలస్వరూపము, పద స్వరూపము అని గాంధర్వం మూడు విధాలు. మూడు విధాలైన గాంధర్వంయొక్క అనగా స్వర - తాల - పదాలయొక్క లక్షణాలను వాటి కర్మలను చెపుతాను.

**మూ. ద్వ్యధిష్ఠానాః స్వరా జ్ఞేయా వైణాః శారీరకాస్తథా,**
**ఉభాభ్యామపి వక్ష్యామి విధిం స్వరసముత్థితమ్. 12**

**తా.** శరీరము, వీణ - ఈ రెండూ స్వరాల అధిష్ఠానం. ఈ రెండింటివల్ల ఏర్పడే స్వరాల విధిని మీకు చెపుతాను.

**మూ. స్వరా గ్రామౌ మూర్ఛనాశ్చ తానాః స్థానాని వృత్తయః,**
**స్వరసాధారణే వర్ణా హ్యలఙ్కారాః సధాతవః. 13**

**శ్రుతయో జాతయశ్చైవ విధిస్వరసమాశ్రయాః,**
**దారవ్యాం సమవాయోఽయం వీణాయాం సముదాహృతః. 14**

**తా.** స్వరములు, రెండు గ్రామములు, మూర్ఛనలు, తానములు, స్థానములు, వృత్తులు, స్వరసాధారణములు, వర్ణములు, అలంకారములు, ధాతువులు, శ్రుతులు, జాతులు – స్వరవిధిపై ఆధారపడిన వీటి అన్నింటి సమవాయము, సమదాయము దారవ్యవీణ యందు (దారునిర్మితమైన వీణయందు) ఉంటుంది.

**మూ. స్వరా గ్రామౌ హ్యలఙ్కారా వర్ణాః స్థానాని జాతయః,**
**సాధారణే చ శారీర్యాం వీణాయామేవ సంగ్రహః. 15**

**తా.** స్వరములు, గ్రామములు, అలంకారాలు, వర్ణాలు, స్థానాలు, జాతులు, సాధారణములు – ఇవి శారీరవీణయందు (గాయకుని కంఠమునందు) ఉండేవి.

**మూ. వ్యఞ్జనాని స్వరా వర్ణాః సన్ధయోఽథ విభక్తయః,**
**నామాఖ్యాతోపసర్గాశ్చ నిపాతాస్తద్ధితాస్తథా. 16**

**ఛన్దోవృత్తాని జాత్యశ్చ జ్ఞేయాః పదగతాత్మకాః.**

**తా.** వ్యంజనాలు (హల్లులు), స్వరాలు (అచ్చులు), వర్ణాలు, సంధులు, విభక్తులు, నామాలు, ఆఖ్యాతాలు, ఉపసర్గలు, నిపాతలు, తద్ధితలు, ఛందస్సులు, వృత్తాలు, జాతులు – ఇవి పదగతస్వరాలలో ఉండే తత్త్వాలు (అంశాలు).

**మూ. అనిబద్ధం నిబద్ధం చ ద్వివిధం తత్ పదం స్మృతమ్. 17**

**అతస్తాలగతస్యాపి సంప్రవక్ష్యామి వై ద్విజాః,**
**ఆవాపస్త్వథ నిష్క్రామో విక్షేపశ్చ ప్రవేశకః. 18**

**శమ్యా తాలః సంనిపాతః పరివర్తః సవస్తుకః,**
**మాత్రా విదార్యఙ్గులయా యతిః ప్రకరణం తథా. 19**

**గీతయోఽవయవా మార్గాః పాదభాగాః సపాణయః,**
**ఇత్యేకవింశకో జ్ఞేయో విధిస్తాలగతో బుధైః. 20**

**గాన్ధర్వసంగ్రహో హ్యేష విస్తరం చ నిబోధత.**

**తా.** అనిబద్ధము, నిబద్ధము అని పదం రెండు విధాలు. తాలంతో సంబంధించిన ఆ పదభేదాలను కూడ చెపుతున్నాను – ఆవాపము, నిష్క్రామము, విక్షేపము, ప్రవేశకము,

శమ్య, తాలము, సంనిపాతము, పరివర్తము, వస్తువు, మాత్ర, విదారీమాత్ర, అంగులి మాత్ర, యతి, ప్రకరణం, గీతులు, అవయవాలు, మార్గాలు, పాదభాగాలు, పాణులు – ఈ (21) ఇరవైయొకటి తాలసంబంధివిధులు. ఇంత వరకు చెప్పినది సంగ్రహం, ఇప్పుడు ఈ గాంధర్వం సవిస్తరంగా చెపుతాను; వినండి.

**మూ. షడ్జశ్చ ఋషభశ్చైవ గాన్ధారో మధ్యమస్తథా,**
**పఞ్చమో ధైవతశ్చైవ నిషాదః సప్త చ స్వరాః. 21**

**తా.** షడ్జం, ఋషభం, గాంధారం, మధ్యమం, పంచమం, ధైవతం, నిషాదం అని స్వరాలు ఏడు.

**మూ. చతుర్విధత్వమేతేషాం విజ్ఞేయం శ్రుతియోగతః,**
**వాదీ చైవాథ సంవాదీ హ్యనువాదీ వివాద్యపి. 22**

**తా.** శ్రుతుల భేదాన్ని పట్టి ఈ స్వరాలలో – వాదీ, సంవాదీ, అనువాదీ, వివాదీ అను నాలుగు భేదా లుంటాయి.

**వి.** శ్రుతుల తరువాత పుట్టే అనురణనం వంటి మధురము, మనోహరము అయిన ధ్వనికి **స్వరం** అని పేరు. కంచుగంట మోగించి నప్పుడు మొట్టమొదట ధ్వనిని అనుసరించి 'గుఞ్' మంటూ కొంత సేపు వినబడే ధ్వని అనురణనధ్వని.

**"శ్రుత్యనన్తరభావీ యః స్నిగ్ధో౽నురణనాత్మకః,**
**స్వతో రఞ్జయతి శ్రోతృచిత్తం స స్వర ఉచ్యతే."**

**(సంగీతరత్నాకరం** 1.24)

సంగీతసంప్రదాయజ్ఞుల ప్రకారం షడ్జాదిస్వరాలను వరుసగా నెమలి, చాతకపక్షి, మేక, క్రౌంచపక్షి, కోకిల, కప్ప, ఏనుగు ఉచ్చరిస్తాయి. వాటి ధ్వనులు ఈ స్వరాల వలె ఉంటాయి.

**మూ. తత్ర యో యత్రాంశః స తత్ర వాదీ. యయోశ్చ నవక – త్రయోదశశ్రుత్యన్తరే తావన్యోన్యం సంవాదినౌ, యథా షడ్జమధ్యమౌ, షడ్జపఞ్చమౌ, ఋషభధైవతౌ గాన్ధార నిషాదౌ ఇతి షడ్జగ్రామే. మధ్యమగ్రామే ప్యేవమేవ. షడ్జపఞ్చమవర్జం పఞ్చమర్షభ–యోశ్చాత్ర సంవాద ఇతి.**

**తా. 'వాదీ' – 'సంవాదీ' స్వరాలు :–** ఏది ఎక్కడ అంశంగా (అంగంగా) ఉంటుందో అది అక్కడ **'వాదీ'** అని చెప్పబడుతుంది. ఏ రెండు స్వరాలలో తొమ్మిది – పదమూడు శ్రుతుల అంతరం (interval) ఉంటుందో అవి పరస్పరము **'సంవాదిస్వరాలు'**. ఉదాహరణకి – షడ్జగ్రామంలో షడ్జ – మధ్యమాలు, షడ్జ – పంచమాలు, ఋషభ –

ధైవతాలు, గాంధార - నిషాదాలు పరస్పరం సంవాది స్వరాలు. మధ్యమ గ్రామంలో కూడ ఇట్లే; అయితే దీనిలో షడ్జ - పఞ్చమాలకు బదులు, పంచమ - ఋషభాలు సంవాది స్వరాలుగా ఉంటాయి. ఇదే భేదం.

**మూ. అత్ర శ్లోకః -**

**సంవాదో మధ్యమగ్రామే పఞ్చమస్యర్షభస్య చ,**
**షడ్జగ్రామే తు షడ్జస్య సంవాదః పఞ్చమస్య చ. 23**

**తా.** మధ్యమగ్రామంలో పంచమ - ఋషభస్వరాలకు పరస్పరము సంవాదం ఉంటుంది. షడ్జగ్రామంలోనైతే షడ్జానికీ పంచమానికీ సంవాదం.

**మూ. "వివాదినస్తు తే యేషాం స్యాద్వింశతికమన్తరమ్". తద్యథా - ఋషభగాన్ధారౌ, ధైవతనిషాదౌ. ఏవం వాది - సంవాది - వివాదిషు స్థాపితేషు శేషాః అనువాది సంజ్ఞకాః ; యథా - షడ్జస్య ఋషభ - గాన్ధార - ధైవత - నిషాదాః, ఋషభస్య మధ్యమ - పఞ్చమ - నిషాదాః, గాన్ధారస్యాపి - మధ్యమ - పఞ్చమ - ధైవతాః. మధ్యమస్య ధైవత - పఞ్చమ - నిషాదాః, పఞ్చమస్య ధైవత - నిషాదౌ, ధైవతస్య ఋషభ - పఞ్చమ - మధ్యమాః షడ్జగ్రామే.**

**మధ్యమగ్రామేఽపి మధ్యమస్య పఞ్చమ - ధైవత - నిషాదాః, పఞ్చమస్య ఋషభ - షడ్జ - గాన్ధారాః, ధైవతస్య షడ్జ - ఋషభ - గాన్ధారాః, నిషాదస్య షడ్జ - ఋషభ - గాన్ధారాః.**

**తత్ర వదనాద్ వాదీ. సంవదనాద్ సంవాదీ, వివదనాద్ వివాదీ, అనువదనాద్ అనువాదీ ఇతి.**

**ఏతేషాం చ స్వరాణాం న్యూనాధికత్వం తన్త్ర్యుపపాదనదణ్డేన్ద్రియవైగుణ్యాదుప-జాయతే. స్వరవిధానమేతచ్చతుర్విధమ్.**

**తా.** ఏ స్వరాలలో ఇరవై శ్రుతుల అంతరం ఉంటుందో అని పరస్పరం **వివాదిస్వరాలు**. అదెట్లనగా - ఋషభ - గాంధారాలు, ధైవతనిషాదాలు వివాదిస్వరాలు. వాది - సంవాది - వివాది స్వరాల లక్షణాలు ఈ విధంగా నిశ్చితమైన తరవాత ఇంక మిగలిన వన్నీ అనువాదిస్వరాలు. ఎట్లనగా - షడ్డగ్రామంలో షడ్జానికి ఋషభ - గాన్ధార - ధైవత - నిషాదాలు, ఋషభానికి మధ్యమ - పంచమ - నిషాదాలు, గాంధారానికి మధ్యమ - పంచమ - ధైవతాలు, మధ్యమానికి ధైవత - పంచమ - నిషాదాలు, పంచమానికి ధైవత - నిషాదాలు, ధైవతానికి ఋషభ - పంచమ - మధ్యమాలు అనువాదిస్వరాలు.

మధ్యమగ్రామంలో – మధ్యమానికి పంచమ – ధైవత – నిషాదాలు, పంచమానికి ఋషభ –షడ్జ – గాంధారాలు ధైవతానికి షడ్జ – ఋషభ – గాంధారాలు అనువాదిస్వరాలు.

దేని ధ్వని ప్రధానంగా (Prominently) వినబడుతుందో అది వాది (Sonant); మరొకదానితో కలిసి వినబడేది **సంవాది** (Consonant) ; మరొకదానితో పొత్తు కుదరినిది **వివాది** (Dissonant) ; మరొకదానిని అనుసరించి వినబడేది **అనువాది** (Assonant).

వీణాతంత్రులను సారించడంలో ఉన్న భేదాన్ని పట్టి, వీణాదండంలోని భేదాలను పట్టి, వీణావాదకుని ఇంద్రియాలలోని దోషాలను బట్టి స్వరాలలో హెచ్చుతగ్గులు ఏర్పడుతూంటాయి.

ఈ విధంగా నాలుగు విధాలైన స్వరవిధి చెప్పబడింది.

**మూ. అథ ద్వౌ గ్రామౌ – షడ్జో మధ్యమశ్చేతి. అత్రాశ్రితాః ద్వావింశతిః శ్రుతయః. యథా –**

**తిస్రో ద్వే చ చతస్రశ్చ చతస్రస్తిస్ర ఏవ చ,**
**ద్వే చతస్రశ్చ షడ్జాఖ్యే గ్రామే శ్రుతినిదర్శనమ్. 24**

**తా. రెండు గ్రామాలు :–** షడ్జగ్రామము, మధ్యమగ్రామము అని గ్రామాలు రెండు విధాలు. ఈ గ్రామాలనే ఇరవై రెండు శ్రుతులు ఆశ్రయించుకొని ఉంటాయి. అదెట్లనగా –

షడ్జగ్రామంలో శ్రుతులు ఈవిధంగా ఉంటాయి – ఋషభంలో మూడు, గాంధారంలో రెండు, మధ్యమంలో నాలుగు, పంచమంలో నాలుగు, ధైవతంలో మూడు, నిషాదంలో రెండు, షడ్జంలో నాలుగు.

**మూ. మధ్యమగ్రామే తు శ్రుత్యపకృష్టః పఞ్చమః కార్యః ; పఞ్చమస్య శ్రుత్యుత్కర్షాత్ అపకర్షాద్వా యదన్తరం మార్దవాత్ ఆయతత్వాద్వా తత్ ప్రమాణశ్రుతిః.**

**తా.** మధ్యమగ్రామంలో నైతే పంచమంలో ఒక శ్రుతి తగ్గించాలి. ఈ విధంగా పంచమస్వరంలో ఒక శ్రుతిని పెంచడంవల్ల గాని, తగ్గించడంవల్ల గాని ఏర్పడిన తంత్రుల మార్దవంవల్ల గాని, ఆయతత్వం వల్ల గాని ఏ అంతరం ఉంటుందో అది షడ్జమధ్యమాల అంతరంలో ప్రమాణమైన శ్రుతి.

**మూ. నిదర్శనం త్వాసామ్ అభివ్యాఖ్యాస్యామః – యథాహి – ద్వే వీణే తుల్యప్రమాణ తన్త్ర్యుపపాదనదణ్డమూర్ఛనే షడ్జగ్రామాశ్రితే కార్యే. తయోరన్యతరీం మధ్యమగ్రామికీం కుర్యాత్ పఞ్చమస్యాపకర్షేణ శ్రుతిమ్. తామేవ పఞ్చమస్యశ్రుత్యుత్కర్షవశాత్ షడ్జగ్రామికీం కుర్యాత్. ఏవమేకశ్రుతిరపకృష్టా భవతి. పునరపి తద్వదేవాపకర్షాత్ గాన్ధారనిషాదావపి**

**ఇతరస్యామ్ ఋషభధైవతౌ ప్రవిశతః, ద్విశ్రుత్యధికత్వాత్. పునస్తద్వదేవాకర్షాద్ ధైవతర్షభావి తరస్యాం పఞ్చమషడ్జౌ ప్రవిశతః; త్రిశ్రుత్యధికత్వాత్. తద్వత్ పునరపకృష్టాయాం తస్యాం పఞ్చమమధ్యమషడ్జా ఇతరస్యాం మధ్యమగాన్ధారనిషాదాన్తః ప్రవేక్ష్యన్తి; చతుః శ్రుత్యధి కత్వాత్. ఏవమనేన శ్రుతినిదర్శనేన ద్వైగ్రామిక్యో ద్వావింశతిశ్రుతయో విజ్ఞేయాః.**

**తా.** ఇపుడు ఈ శ్రుతులను గూర్చి నిదర్శన (Demonstration) పూర్వకంగా విశదీకరిస్తాం. ఒకే విధమైన దండములు, తీగలు, తీగల ఉపపాదనము (adjustment) ఉన్న రెండు వీణలు సిద్ధం చేసికోవాలి. పంచమస్వరంలో ఒక శ్రుతి తగ్గించడంద్వారా, ఆ రెండు వీణలలో ఒక వీణను మధ్యమగ్రామానికి సరి చేసికోవాలి. అదే వీణను, పంచమ స్వరంలో ఒక శ్రుతిని పెంచడంద్వారా షడ్జగ్రామానికి సరి చేసుకోవాలి. శ్రుతిని తగ్గించడం అంటే అర్థం ఇదే. అదే విధంగా రెండవ వీణలో కూడ శ్రుతిని తగ్గించగా గాంధార – నిషాదాలు, వరసగా ధైవత – ఋషభాలలో కలిసిపోతాయి. అప్పుడు వాటి రెండింటి మధ్య రెండు శ్రుతుల అంతరం ఉంటుంది. అదే విధంగా – మరొక వీణలో శ్రుతి తగ్గించగా ఋషభ – ధైవతాలు, వరుసగా, షడ్జపంచమాలతో కలిసిపోతాయి. అప్పుడు మూడు శ్రుతుల అంతరం ఏర్పడుతుంది. అదే విధంగా మళ్లీ ఒక శ్రుతిని తగ్గించగా పంచమ – మధ్యమ – షడ్జస్వరాలు, వరుసగా, మధ్యమ – గాంధార – నిషాదశ్రుతులతో కలిసిపోయి వాటి మధ్య నాలుగు శ్రుతుల అంతరం (వ్యవధానం) ఏర్పడుతుంది. ఈ విధమైన శ్రుతిప్రక్రియను అనుసరించి, రెండు గ్రామాలలోను ఇరవై రెండు చొప్పున స్వరా లుంటా యని తెలుసుకోవాలి.

**మూ. అత్ర శ్లోకాః –**

**షడ్జశ్చతుఃశ్రుతిర్ జ్ఞేయః ఋషభస్త్రిశ్రుతిః స్మృతః,**
**ద్విశ్రుతిశ్చాపి గాన్ధారో మధ్యమశ్చ చతుఃశ్రుతిః. 25**

**చతుఃశ్రుతిః పఞ్చమః స్యాత్ త్రిశ్రుతిర్ధైవతస్తథా,**
**ద్విశ్రుతిస్తు నిషాదః స్యాత్ షడ్జగ్రామే స్వరాన్తరే. 26**

**తా.** ఈ విషయంలో కొన్ని ప్రాచీనశ్లోకాలు – షడ్జగ్రామంలోని షణ్జస్వరంలో నాలుగు శ్రుతులు, ఋషభంలో మూడు శ్రుతులు, గాంధారంలో రెండు శ్రుతులు, మధ్యమంలో నాలుగు శ్రుతులు, పంచమంలో నాలుగు శ్రుతులు, ధైవతంలో మూడు శ్రుతులు, నిషాదంలో రెండు శ్రుతులు ఉంటాయి.

**మూ. చతుఃశ్రుతిస్తు విజ్ఞేయో మధ్యమః పఞ్చమః పునః,**
**త్రిశ్రుతిర్ధైవతస్తు స్యాచ్చతుఃశ్రుతిక ఏవ చ. 27**

**నిషాదషడ్జౌ విజ్ఞేయౌ ద్విచతుఃశ్రుతిసంభవౌ,**
**ఋషభస్త్రిశ్రుతిశ్చ స్యాద్ గాన్ధారో ద్విశ్రుతిస్తథా. 28**

**అన్తరనిదర్శనమపి వ్యాఖ్యాతమ్.**

**తా.** (మధ్యమగ్రామంలో) మధ్యమస్వరంలో నాలుగు శ్రుతులు, పంచమంలో మూడు శ్రుతులు, ధైవతంలో నాలుగు శ్రుతులు, నిషాదంలో రెండు శ్రుతులు, షడ్జంలో నాలుగు శ్రుతులు, ఋషభంలో మూడు శ్రుతులు, గాంధారంలో రెండు శ్రుతులూ ఉంటాయి. ఈ విధంగా పరస్పరాంతరాల విధానం విశదీకరింపబడింది.

**మూ. అథ మూర్ఛనాః ద్వైగ్రామిక్యః చతుర్దశ యథా –**
**ఆద్యా హ్యుత్తరమన్ద్రా స్యాద్రజనీ చోత్తరాయతా,**
**చతుర్థీ శుద్ధషడ్జా తు పఞ్చమీ మత్సరీకృతా. 29**
**అశ్వక్రాన్తా తు షష్ఠీ స్యాత్ సప్తమీ చాభిరుద్గతా,**
**షడ్జగ్రామాశ్రితా ఏతా విజ్ఞేయాః సప్త మూర్ఛనాః. 30**

**ఆసాం షడ్జనిషాదధైవతపఞ్చమమధ్యమగాన్ధారర్షభాః ఆద్యాః స్వరాః షడ్జగ్రామే.**

**తా.** ఇటుపై రెండు గ్రామాలకు సంబంధించిన పద్నాలుగు మూర్ఛనలు చెప్ప బడుతున్నాయి. ఎట్లనగా –

షడ్జగ్రామానికి సంబంధించిన మూర్ఛనలు ఏడు – మొదటిది ఉత్తరమంద్ర; రెండవది రజని, మూడవది ఉత్తరాయతా, నాల్గవది శుద్ధషడ్జా, ఐదవది మత్సరీకృతా, ఆరవది అశ్వక్రాంతా, ఏడవది అభిరుద్గతా.

ఈ ఏడు మూర్ఛనలలోని మొదటి స్వరాలు వరుసగా షడ్జము, నిషాదము, ధైవతము, పంచమము, మధ్యమము, గాన్ధారము ఋషభము అయి ఉంటాయి.

**వి.** ఒక రాగాన్ని సర్వత్ర వ్యాపింపచేయడం **మూర్ఛన**. ఏడు స్వరాల ఆరోహావ రోహణలు మూర్ఛన.

**మూ. అథ మధ్యమగ్రామే –**
**సౌవీరీ హరిణాశ్వా చ స్యాత్ కలోపనతా తథా,**
**చతుర్థీ శుద్ధమధ్యా తు మార్గవీ పౌరవీ తథా. 31**
**హృష్యకా చైవ విజ్ఞేయా సప్తమీ ద్విజసత్తమాః,**
**మధ్యమగ్రామజా హ్యేతా విజ్ఞేయాః సప్త మూర్ఛనాః. 32**

**ఆసాం మధ్యమ – గాన్ధార – ఋషభ – షడ్జ – నిషాద – ధైవత – పఞ్చమాః ఆనుపూర్వ్యా దాద్యాః స్వరాః.**

**తా.** మధ్యమగ్రామానికి సంబంధించిన మూర్ఛనలు –

మొదటిది సౌవీరీ, రెండవది హరిణాశ్వా, మూడవది కలోపనతా, నాల్గవది శుద్ధమధ్యా, ఐదవది మార్గవీ, ఆరవది పౌరవీ, ఏడవది హృష్యకా – ఇవి మధ్యమగ్రామానికి సంబంధించిన మూర్ఛనలు.

ఈ ఏడు మూర్ఛనల మొదటి స్వరాలు వరుసగా – మధ్యమ, గాంధార, ఋషభ, షడ్జ నిషాద, ధైవత, పంచమాలు.

**మూ. తత్ర షడ్జగ్రామే – షడ్జేనోత్తరమన్ద్రా, నిషాదేన రజనీ, ధైవతేన ఉత్తరాయతా, పఞ్చమేన శుద్ధషడ్జా, మధ్యమేన మత్సరీకృతా, గాన్ధారేణాశ్వక్రాన్తా, ఋషభేణ అభి రుద్గతా.**

**తా.** షడ్జగ్రామంలోని – ఉత్తరమంద్ర షడ్జస్వరంతోను, రజని నిషాదంతోను, ఉత్తరాయత ధైవతంతోను, శుద్ధషడ్జ పంచమంతోను, మత్సరీకృత మధ్యమంతోను అశ్వక్రాంత గాంధారంతోను, అభిరుద్గత ఋషభంతోను ప్రారంభం అవుతుంది.

**మూ. అథ మధ్యమగ్రామే – మధ్యమేన సౌవరీ, గాన్ధారేణ హరిణాశ్వా, ఋషభేణ కలోపనతా, షడ్జేన శుద్ధమధ్యమా, నిషాదేన మార్గీ, ధైవతేన పౌరవీ, పఞ్చమేన హృష్యకా ఇతి ఏవమేతాః క్రమయుతాః – పూర్ణాః, షాడవౌడవీకృతాః, సాధారణకృతాశ్చేతి చతుర్విధా శ్చతుర్విధమూర్ఛనాః.**

**తా.** మధ్యమగ్రామానికి చెందిన సౌవరీ మధ్యమంతోను హరిణాశ్వగాంధారం తోను, కలోపనత ఋషభంతోను, శుద్ధమధ్యమ షడ్జంతోను, మార్గి నిషాదంతోను, పౌరవి ధైవతంతోను, హృష్యక పంచమంతోను, ప్రారంభం అవుతాయి. ఈ విధంగా వేరు వేరు రీతులలో కలపబడిన స్వరాలచేత ఏర్పడిన మూర్ఛనలు పద్నాలుగూ కూడ – పూర్ణములు, షాడవీకృతములు, ఔడవీకృతములు, సాధారణకృతములు అని నాలుగేసి విధాలు.

**మూ. క్రమయుక్తాః స్వరాః సప్త మూర్ఛనాస్త్వభిసంజ్ఞితాః,**
**షట్పఞ్చకస్వరాస్తాసాం షాడవౌడవితాః స్మృతాః. 33**
**సాధారణకృతాశ్చైవ కాకలీసమలంకృతాః,**
**అన్తరస్వరసంయుక్తా మూర్ఛనా గ్రామయోర్ద్వయోః. 34**

**తా.** వేరు వేరు గ్రామాలలో ఉన్న ఏడు స్వరాలకు మూర్ఛన లని పేరు. ఆరు స్వరాలు గల తానాలకు షాడవా లనీ, అయిదు స్వరా లున్న తానాలకు ఔడవితా లనీ పేరు. ఈ రెండే కాక, షడ్జ – మధ్యమాలకు రెండింటికీ సంబంధించిన మరొక సాధారణ కృతమూర్ఛన, కాకలితో కలిసిన సాధారణస్వరాలతో ఏర్పడుతుంది.

**మూ. ద్వివిధైకమూర్ఛనాసిద్ధిః. తత్ర ద్విశ్రుతిప్రకర్షాద్ధైవతీకృతే గాన్ధారే మూర్ఛనా**

**గ్రామయోరన్యత్వం షడ్జగ్రామే. తద్వశాన్మధ్యమాదయో యథాసంఖ్యేన నిషాదాదిమత్త్వం ప్రతిపద్యన్తే. మధ్యమగ్రామేఽపి ధైవతమార్దవాత్ నిషాదోత్కర్షాత్ ద్వైవిధ్యం భవతి. తుల్యశ్రుత్యన్తరత్వాచ్చ సంజ్ఞాన్యత్వమ్. చతుఃశ్రుత్యన్తరం పఞ్చమధైవతయోః. తద్వత్ గాన్ధారోత్కర్షాత్ చతుఃశ్రుతికమన్తరం భవతి. శేషాశ్చాపి మధ్యమ - పఞ్చమ - ధైవత - నిషాద - ఋషభ - షడ్జాః మధ్యమాదిత్వం ప్రాప్నువన్తి, తుల్యశ్రుత్యన్తరత్వాత్; అన్తర నిదర్శనమపి శ్రుతినిదర్శనే ప్రోక్తమ్.**

**తా.** ఒకే మూర్ఛనను రెండు పద్ధతులలో సాధించవచ్చును. రెండు శ్రుతులను పెంచడం ద్వారా గాంధారం ధైవతంగా మారడంతో, షడ్జగ్రామంలో మూర్ఛనా - గ్రామాలు మారిపోతాయి. దానితో మధ్యమాదులు, వరుసగా నిషాదాదులుగా మారిపోతాయి. అదే విధంగా మధ్యమగ్రామంలో ధైవతంలోని స్వరాలు తగ్గించి నిషాద స్వరాలు పెంచడంచేత ఈ రెండు వేరువేరు అవుతాయి. శ్రుతుల అంతరం కూడ సమంగా ఉండడంచేత పేర్లు మారతాయి. పంచమ - ధైవతస్వరాల మధ్య నాలుగు శ్రుతుల అంతరం ఉంటుంది. గాంధారంలోని శ్రుతులు పెంచడంవల్ల వాటి మధ్య నాలుగు శ్రుతుల అంతరం ఉంటుంది. మిగిలిన మధ్యమ పంచమ - ధైవత - నిషాద - ఋషభ - షడ్జస్వరాలు వరుసగా మధ్యమాదిస్వరాలుగా మారుతాయి. ఇలా జరగడానికి కారణం సమానమైన శ్రుత్యంతరం ఉండడం. శ్రుత్యంతరం ఏ విధంగా ఏర్పడుతుందో వెనుక చెప్పబడింది.

**మూ. అథ మూర్ఛనాసంశ్రితాః తానాః చతురశీతిః - తత్ర ఏకోనపఞ్చాశత్ షట్స్వరాః పఞ్చత్రింశత్ పఞ్చస్వరాః. లక్షణం తు షట్స్వరాణాం సప్తవిధమ్; యథా - షడ్జ - ఋషభ - నిషాద - పఞ్చమహీనాః చత్వారః తానాః షడ్జగ్రామే. మధ్యమగ్రామే తు షడ్జ - ఋషభ - గాంధారహీనాస్త్రయః తానాః. ఏవమేతే సర్వాసు షాడవాసు మూర్ఛనాసు క్రియమాణాః భవన్త్యేకోనపఞ్చాశత్ తానాః.**

**తా.** ఇపుడు తానాలను గూర్చి చెపుతున్నాడు. (షాడవ - ఔడవ మూర్ఛనలే తానాలు అని కొందరి అభిప్రాయం. అయితే ఆరోహక్రమంలో ఉన్నది మూర్ఛన అని, అవరోహక్రమంలో ఉన్నది తానం అనీ కొందరి అభిప్రాయం).

మూర్ఛనలను ఆశ్రయించుకొని ఎనభైనాలుగు తానాలు ఉంటాయి. వీటిలో నలభై తొమ్మిది షట్‌స్వరములు, ముప్పైయైదు పంచస్వరములు. షట్స్వరతానాలు రెండు విధాలు షడ్జగ్రామంలో, షడ్జ - ఋషభ - నిషాద - పంచమస్వరాలు లేని నాలుగు తానా లుంటాయి. మధ్యమ గ్రామంలో, షడ్జ - గాంధారస్వరాలు లేని మూడు తానాలు ఉంటాయి. ఈ విధంగా రెండు గ్రామాలలోని మూర్ఛనలలో నలభైతొమ్మిది తానాలు ఉంటాయి.

**మూ. పఞ్చస్వరాణాం తు పఞ్చవిధమేవ లక్షణమ్. యథా - షడ్జపఞ్చమహీనాః,**

**ఋషభపఞ్చమహీనాః గాన్ధారనిషాదహీనా ఇతి త్రయస్తానాః షడ్జగ్రామే. మధ్యమగ్రామే తు ఋషభధైవతహీనాః, గాన్ధారనిషాదహీనా ఇతి ద్వౌ తానౌ. ఏవం పఞ్చ స్వరాః సర్వాసు మూర్ఛనాసు క్రియమాణాస్తానాః పఞ్చత్రింశత్ భవన్తి. షడ్జగ్రామే ఏకవింశతిః, మధ్యమగ్రామే చతుర్దశ. ఏవమేతే ఏకత్ర గమ్యమానాః చతురశీతిర్భవన్తి.**

**తా.** పంచస్వరాల లక్షణ మైతే పంచవిధమే. అదెట్లనగా – షడ్జగ్రామంలో షడ్జపంచమ హీనాలు, ఋషభ – పంచమహీనములు, గాంధార – నిషాదహీనములు అయిన మూడు తానాలు. మధ్యమగ్రామంలో ఋషభధైవతహీనాలూ, గాంధార – నిషాదహీనాలూ అయిన రెండు తానాలు. ఈ విధంగా చేయగా – రెండు గ్రామాలలోని ఐదు మూర్ఛనల నుండి ముప్పైఐదు తానాలు – షడ్జగ్రామంలో ఇరవైఒకటి, మధ్యమగ్రామంలో పద్నాలుగూ – ఏర్పడతాయి. అన్నీ కలుపుతే ఎనభైనాలు గవుతాయి.

**మూ. ద్వివిధా తానక్రియా తన్త్ర్యాం ప్రవేశో నిగ్రహశ్చ. తత్ర ప్రవేశో నామ అధరస్వర ప్రకర్షాత్, ఉత్తరస్వరమార్దవాద్వా; నిగ్రహస్తు అసంస్పర్శః. మధ్యమస్వరాసంస్పర్శః. మధ్యమస్వరేణ తు వైణేన మూర్ఛనానిర్దేశః భవతి అనాశిత్వాత్. మధ్యమస్వరస్య న నిగ్రహః ప్రవేశో వా. ఇత్థం ప్రయోక్తృశ్రోతృసుఖార్థం తానమూర్ఛనానానాత్వమ్. మూర్ఛనా తానప్రయోజనమపి స్థానప్రాప్తిః. స్థానం తు త్రివిధం పూర్వోక్తలక్షణం కాకువిధానే.**

**తా.** తంత్రీవాద్యంమీద తానప్రయోగం – ప్రవేశము, నిగ్రహము అని రెండు విధాలు. వెనుకటి స్వరాన్ని ప్రకృష్టం చేసి తరువాతి స్వరాన్ని మృదువును చేస్తే ప్రవేశం కలుగుతుంది. మధ్యమస్వరాన్ని స్పృశించకుండా ఉంటే అదే నిగ్రహం. వీణ యందలి మధ్యమస్వరం మూర్ఛనను సూచిస్తూంటుంది, ఎందువల్ల ననగా ఇది అనాశి, (నశించనిది). అందుచేతనే ఈ ప్రవేశ – నిగ్రహాలతో మధ్యమస్వరానికి సంబంధం ఉండదు. తానాలలోను మూర్ఛనలలోను ఉన్న ఈ ద్వైవిధ్యం ప్రయోక్తకు (వీణావాదకునకు) శ్రోతకూ కూడ ఆనందకరంగా ఉంటుంది. వీటి అభ్యాసం స్థానప్రాప్తికి కూడ ఉపకరిస్తుంది. స్థానాదులను గూర్చి వెనుక కాకుప్రకరణంలో వివరింపబడింది.

**మూ. సాధారణవిధిమిదానీం వక్ష్యామః. తత్ర సాధారణం నామ అన్తరస్వరతా. కస్మాత్? ద్వయోరన్తరస్థం యత్ సాధారణమ్. యథా ఋత్వన్తరే –**

**ఛాయాసు భవతి శీతం ప్రస్వేదో వా భవతి చాతపస్థస్య,**
**న చ నాగతో వసన్తః న చ నిఃశేషః శిశిరకాలః. 35**

**ఇతి కాలసాధారణమ్.**

**తా.** ఇప్పుడు సాధారణాన్ని గూర్చి చెపుతాం. ఒక స్వరం రెండు స్వరాల మధ్య ఆవిర్భవించడం లేదా ఉండడం. ఎందువల్ల? (లోకంలో) రెండింటి మధ్య ఉన్నదానిని

**'సాధారణం'** అంటాం. ఉదాహరణకి రెండు ఋతువుల మధ్యకాలం.

నీడలో ఉన్నపుడు చల్లగా ఉంటుంది; ఎండలో చెమట పడుతుంది. అందుచేత ఆ సంధి కాలంలో వసంతర్తువు రాకపోను లేదు, శిశిరర్తువు పూర్తిగా వెళ్లిపోనూ లేదు.

ఇది కాలసాధారణం.

**మూ. ద్వే సాధారణే – స్వరసాధారణం, జాతిసాధారణం చేతి. స్వరసాధారణం కాకల్య న్తరస్వరౌ. తత్ర ద్విశ్రుతిప్రకర్షాన్నిషాదవాన్ కాకలీసంజ్ఞకో నిషాదః, న షడ్జః, ద్వాభ్యామన్తర స్వరత్వాత్ సాధారణత్వం ప్రతిపద్యతే; ఏవం గాన్ధారోఽప్యాన్తరస్వరసంజ్ఞః. గాన్ధారో న మధ్యమః, తయోరన్తరస్వరత్వాత్. అత ఏవ స్వరసాధారణమ్.**

**తా.** స్వరసాధారణం, జాతిసాధారణం అని సాధారణం రెండు విధాలు. కాకలి, అంతఃస్వరమూ ఇవి స్వరసాధారణం. నిషాదానికి రెండు శ్రుతులు చేరిస్తే అది కాకలి అవుతుంది; అది నిషాదమూ కాదు షడ్జమూ కాదు; ఎందువల్ల ననగా ఇది నిషాద – షడ్జా లనే రెండు శుద్ధస్వరాల మధ్య వినబడుతూన్నది. అందుచేత ఇది 'సాధారణం' అయింది. అలాగే గాంధారానికి రెండు శ్రుతులు చేరిస్తే అది అంతరస్వరం అవుతుంది కాని మధ్యమం కాదు. ఎందువల్ల ననగా అది మధ్యమ – గాంధారా లనే రెండు స్వరాల మధ్య ఏర్పడిన అంతరస్వరం. అందుచేతనే ఇది స్వరసాధారణం.

**మూ. కస్మాన్నిషాదః కాకలీసంజ్ఞః? కలత్వాత్ కాకలీ, కృష్టత్వాద్వా అతిసౌక్ష్మ్యాత్, అథవా కాకాక్షివత్త్వాత్ ఉభయసంబన్ధాత్ కాకలీసంజ్ఞా. యథా షణ్ణాం రసానాం మధ్యే లవణః క్షారసంజ్ఞః ఏవం నిషాదః కాకలీసంజ్ఞః. సాధారణస్వరశ్చాన్తరసంజ్ఞో భవతి.**

**తా.** (పైన) నిషాదానికి 'కాకలి' అను పేరు ఎందుకు పెట్టారు? ఇది అస్పష్టంగా ఉంటుంది కాబట్టి కాకలి అంటారు. లేదా – ఇది మెల్లగా లాగబడుతుంది కాబట్టి, లేదా ఇది సూక్ష్మంగా ఉంటుంది కాబట్టి లేదా కాకి కన్ను వలె దాని ఇటూ అటూ ఉన్న రెండు స్వరాలతో సంబంధం గలది కాబట్టి, ఆరు రసాల మధ్యలో ఉన్న లవణాన్ని క్షారం (కోసివేసేది) అన్నట్లు నిషాదాన్ని కాకలి అంటారు. సాధారణస్వరాన్ని అంతరస్వరం అంటారు.

**మూ. జాతిసాధారణమ్ – ఏకగ్రామాంశినాం జాతీనాం జాత్యోర్వా అన్యస్మిన్ గ్రామే ప్రత్యఙ్గదర్శనం స్వరాణామవగమాత్. స్వరసాధారణం ద్వివిధద్వైగ్రామిక్యమ్. కస్మాత్? షడ్జగ్రామే షడ్జసాధారణమ్; మధ్యమగ్రామే మధ్యమసాధారణమ్. సాధారణమత్ర స్వరవిశేష ఇతి షడ్జసాధారణమ్. ఏవం మధ్యమగ్రామేఽపి సాధారణత్వమ్. అస్య తు ప్రయోగః సౌక్ష్మ్యాత్ కైశికం నామ నిష్పద్యతే. ఏవం స్వరసాధారణమ్. అస్య అల్పనిషాదగాన్ధారాసు**

**జాతిషు ప్రయోగః.**

**తా. జాతిసాధారణం :-** ఒక గ్రామంలోని అంశాలైన రెండు జాతులు లేదా అంతకంటె ఎక్కువజాతులు మరొక గ్రామంలో కనబడడం **జాతిసాధారణం.** స్వరాలు కనబడడాన్ని బట్టి జాతిసాధారణం స్పష్టంగా తెలుస్తూన్నది. షడ్జగ్రామసాధారణం, మధ్యమగ్రామసాధారణం అని స్వరసాధారణం రెండు విధాలు. షడ్జగ్రామంలో షడ్జ సాధారణం. మధ్యమగ్రామంలో మధ్యమసాధారణం. ఇది సూక్ష్మప్రయోగసాధ్యం అవడంచేత దీనికి 'కైశికం' అని పేరు. ఇది నిషాద – గాంధారాలు అల్పంగా (దుర్బలంగా) ఉన్న జాతులలో ఉపయోగించే సాధారణం.

**మూ. అత్ర శ్లోకౌ –**

**అన్తరస్వరసంయోగో నిత్యమారోహిసంశ్రయః,**
**కార్యస్త్వల్పో విశేషేణ నావరోహీ కదాచన**
**క్రియమాణోఽవరోహీ స్యాదల్పో వా యది వా బహు,**
**జాతిరాగం శ్రుతిశ్చైవ నయన్తే త్వన్తరస్వరాః. 37**

**తా.** ఈ సందర్భంలో రెండు శ్లోకా లున్నాయి –

అంతరస్వరం ఎల్లప్పుడు ఆరోహిలోనే ఉండాలి గాని అవరోహిలో ఉండకూడదు. అదే విధంగా ఇది అల్పస్వరూపంలోనే ఉండాలి.

దీనిని అల్పంగా నైనా బహువుగా (బరువుగా) నైనా అవరోహిలో చేసిన ట్లయితే అప్పు డాశ్రుతులను జాతిరాగాలలోనికి మార్చివేస్తుంది.

**మూ. జాతిమిదానీం వక్ష్యామః –**

**సర్వసాధారణగతాస్తిస్రో జ్ఞేయాస్తు జాతయః,**
**మధ్యమా పఞ్చమీ చైవ షడ్జమధ్యా తథైవ చ. 38**
**ఆసామఙ్గాని విజ్ఞేయాః షడ్జమధ్యమపఞ్చమాః,**
**యథాస్వం దుర్బలతరా వ్యక్తా సా పఞ్చమీ తథా. 39**
**షాడ్జ్యార్షభీ ధైవతీ చ నైషాదీ చ తథాపరా,**
**షడ్జోదీచ్యవతీ షడ్జకైశికీ షడ్జమధ్యమా. 40**
**షడ్జగ్రామాశ్రయా హ్యేతా విజ్ఞేయాః సప్త జాతయః.**

**తా.** ఇప్పుడు జాతులను గూర్చి చెపుతాం – స్వరసాధారణంలో, అనగా అంతర

గాంధార – కాకలీనిషాదాలలో – మధ్యమా, పంచమీ, షడ్జమధ్యమా అను మూడు జాతులుంటాయి. వీటికి షడ్జ – పంచమ – మధ్యమాలు అంగాలు. ఇవి అంగాలుగా ఉన్నప్పుడు దుర్బలంగా ఉంటాయి.

షడ్జగ్రామంలో – షాడ్జీ – ఆర్షభీ, ధైవతీ, నైషాదీ, షడ్జోదీచ్యవతీ, షడ్జకైశికీ, షడ్జ మధ్యమా అను ఏడు జాతు లుంటాయి.

**మూ. అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి మధ్యమగ్రామసంశ్రయాః. 41**

**గాన్ధారీ రక్తగాన్ధారీ గాన్ధారోదీచ్యవా తథా,**
**మధ్యమోదీచ్యవా చైవ మధ్యమా పఞ్చమీ తథా. 42**

**గాన్ధారపఞ్చమీ చాన్ధ్రీ నన్దయన్తీ తథాపరా,**
**కర్మారవీ కైశికీ చ జ్ఞేయా త్వేకాదశాపరా. 43**

**జాతయోఽష్టాదశేత్యేవ యాః పూర్వం గదితా మయా,**
**తాస్వహం సంప్రవక్ష్యామి న్యాసాపన్యాససంయుతాః. 44**

**తా.** ఇటుపైన మధ్యమగ్రామానికి సంబంధించిన జాతులను చెపుతున్నాను – గాంధారి, రక్తగాంధారి, గాంధారోదీచ్యవా, మధ్యమోదీచ్యవా, మధ్యమీ, పంచమి, గాంధారపంచమి, ఆంధ్రి, నందయంతి, కర్మారవి, కైశికి అను పదకొండు జాతులు మధ్యమగ్రామానికి చెందినవి. మొత్తం జాతులు పద్దెనిమిది అని నేను వెనుక చెప్పి ఉన్నాను. వాటి న్యాసము అపన్యాసము మొదలైన విషయాలు ఇప్పుడు చెపుతాను.

**మూ. ఏతాసామష్టాదశానాం సప్తస్వరాఖ్యాః. జాతయో ద్వివిధాః, శుద్ధాః, వికృతాశ్చ. తత్ర శుద్ధా షడ్జగ్రామే – షాడ్జీ, ఆర్షభీ, ధైవతీ, నిషాదవతీ చ. గాంధారీ, మధ్యమా, పఞ్చమీ చేతి, మధ్యమగ్రామే. శుద్ధాః అన్యూనస్వరాః స్వరాంశగ్రహన్యాసాః. ఏషామన్య తమేన ద్వాభ్యాం బహుభిర్వా లక్షణైర్విక్రియాముపగతా న్యాసవర్జం వికృతసంజ్ఞా భవన్తి; తేన తా ఏవ శుద్ధాః, తా ఏవ వికృతాః.**

**తా.** ఈ పద్దెనిమిది జాతుల పేర్లు సప్తస్వరాలపేర్లను పట్టి ఏర్పడ్డాయి. శుద్ధ జాతులు, వికృతజాతులు అని జాతులు రెండు విధాలు. షాడ్జీ, ఆర్షభీ, ధైవతీ, నిషాదవతీ అనేవి షడ్జగ్రామానికి సంబంధించిన శుద్ధజాతులు. గాంధారీ, మధ్యమా, పంచమీ అనేవి మధ్యగ్రామంలోని శుద్ధజాతులు. స్వరాలలో, అనగా – స్వర – అంశ – గ్రహ – న్యాసాలలో, ఏ ఒక్కటీ న్యూనం కాకుండా ఉన్నవి శుద్ధజాతులు. వీటిలో ఒకటి గాని, రెండు గాని ఇంకా ఎక్కువ గాని, లక్షణాలలో వికారం పొందినవి, వికృతసంజ్ఞ కలవి. న్యాసంలో విక్రియ ఉన్నా అది వికృతత్వానికి హేతువు కాదు. ఈ విధంగా ఏవి శుద్ధములో

అవే విక్రియ కలగడంచేత వికృతము లౌతాయి.

**మూ. న్యాసవిధావప్యాసాం మన్ద్రో నియమాద్ భవతి శుద్ధాసు, వికృతాస్వనియమాత్. తత్ర ఏకాదశ సంసర్గజా వికృతాః. పరస్పరం సంయోగాదేకాదశ నిర్వర్తయన్తి. యథా –**

**తా.** శుద్ధజాతులలో మంద్రస్వరం నియమపూర్వకంగా న్యాసస్వరం అయి ఉంటుంది. వికృత జాతులలో ఈ నియమం లేదు. పద్దెనిమిది జాతులలో పదకొండు జాతులు, రెండు లేదా అంతకంటె అధికమైన జాతుల కలయికచేత వికృతజాతు లవుతాయి; ఎందువల్ల ననగా ఈ జాతుల పరస్పరసంయోగంచేతనే ఈ పదకొండు జాతుల నిర్మాణం జరుగుతుంది. ఈ విషయమే ఇలా చెప్పబడింది –

**మూ. శుద్ధా వికృతాశ్చైవ హి సమవాయా జాతయస్తు జాయన్తే,**
**తా ఏవ సప్త శుద్ధా వికృతా భవన్తి చైకాదశాన్యాస్తు. 45**

**తా.** సమవాయాన్ని (పరస్పరసంసర్గాన్ని పట్టి), జాతులలో శుద్ధత్వము, వికృతత్వమూ ఏర్పడుతుంది. అది (సంసర్గం) లేని ఏడు జాతులు శుద్ధజాతులు; ఉన్నవి పదకొండు జాతులు.

**మూ. తాసాం యా నిర్వృత్తాస్వరేష్వథాంశేషు జాతిషు చ జాతిః,**
**తాన్ వక్ష్యామి యథావద్ సంక్షేపేణ క్రమేణేహ. 46**

**తా.** స్వరాల లేదా అంశల, లేదా జాతుల సంసర్గంచేత వికృతములుగా అయిన జాతులను గూర్చి క్రమంగా సంక్షిప్తంగా చెపుతాను.

**మూ. స్యాత్ షడ్జమధ్యమాభ్యాం నిర్వృత్తా షడ్జమధ్యమా జాతిః,**
**షాడ్జీగాన్ధారీభ్యాం సంభూతా షడ్జకైశికీ వాపి. 47**

**షాడ్జీగాన్ధారీభ్యాం ధైవత్యాశ్చాపి యా వినిష్పన్నా,**
**సంసర్గాద్విజ్ఞేయా సా షడ్జోదీచ్యవా జాతిః. 48**

**షాడ్జీగాన్ధారీభ్యాం ధైవత్యాశ్చాపి మధ్యమాయాశ్చ,**
**గాన్ధారోదీచ్యవా స్యాన్నిర్వృత్తా నామతో జాతిః. 49**

**గాన్ధారపఞ్చమీభ్యాం ధైవత్యాశ్చాపి మధ్యమాయా వా,**
**నిర్వృత్తా యా జాతిః సా మధ్యమోదీచ్యవా నామ్నా. 50**

**గాన్ధారపఞ్చమీభ్యాం నైషాదీమధ్యమాభ్యాం చ,**
**రక్తగాన్ధారీ నామ్నా జాతిః స్యాచ్చతసృభిస్తాభిః. 51**

**గాన్ధారీషడ్జాభ్యాం సంసర్గాజ్జాయతే చాన్ధ్రీ,**
**గాన్ధారీపఞ్చమీభ్యామార్షభీభ్యాం చైవ నన్దయన్తీ తు.** **52**

**గాన్ధారీపఞ్చమీభ్యాం జాతా గాన్ధారపఞ్చమీ జాతిః,**
**నైషద్యార్షభీభ్యాం పఞ్చమ్యాం చైవ సంసర్గాత్.** **53**

**కార్మారవీ నామ్నా జాతిః పూర్ణా హి భవతి సా జ్ఞేయమ్,**
**ధైవత్యార్షభహీనాః పఞ్చాద్యాః కైశికీం కుర్యుః.** **54**

**తా.** షాడ్జీ – మధ్యమా జాతుల సంయోగంవల్ల **షడ్జమధ్యమ** ఏర్పడుతుంది. గాంధారీ – షాడ్జీ – గాంధారీల సంయోగంవల్ల **షడ్జకైశికి**. షాడ్జీ – గాంధారీ – ధైవతీ – మధ్యమాల సంయోగంవల్ల **గాంధారోదీచ్యవం.** గాంధారీ – పంచమీ – మధ్యమా – ధైవతీ సంయోగంవల్ల **మధ్యమోదీచ్యవ.** గాంధారీ – పంచమీ – నైషాదీల సంయోగంవల్ల **రక్తగాంధారి**. గాంధారీ – షాడ్జీల సంసర్గంచేత **ఆంధ్రీ**. గాంధారీ – పంచమీ – ఆర్షభీ – నైషాదీల సంయోగంవల్ల **నందయన్తి**. గాంధారీ – పంచమీల సంయోగంవల్ల **గాంధార పంచమి**. నైషాదీ – ఆర్షభీ – పంచమీల సంయోగంవల్ల **కార్మారవి**. షాడ్జీ – మధ్యమా – పంచమీ – నైషాదీల సంయోగంవల్ల **కైశికి** ఏర్పడుతుంది.

**మూ. ఏవం పరస్పరోత్పన్నా జ్ఞేయా హ్యేతాస్తు జాతయః,**
**పృథగ్లక్షణసంయుక్తా ద్వైగ్రామిక్యః స్వరాశ్రయాః.** **55**

**తా.** ఈ విధంగా పరస్పరసంయోగంవల్ల పుట్టిన ఈ జాతుల లక్షణాలు వేరువేరుగా ఉంటాయి. ఇవి రెండు గ్రామాల స్వరాలను ఆశ్రయించి ఉంటాయి.

**మూ. అభ్యశ్చతస్రో నియమాద్ జ్ఞేయాః సప్తస్వరా బుధైః,**
**దశ పఞ్చస్వరా జ్ఞేయాశ్చతస్రశ్చైవ షట్స్వరాః.** **56**

**తా.** ఈ పద్దెనిమిది జాతులలోని నాలుగు జాతులలో ఏడు స్వరాలు ఉంటాయి; పదింటిలో ఐదు స్వరాలు, నాల్గింటిలో ఆరు స్వరాలు ఉంటాయి.

**మూ. మధ్యమోదీచ్యవా చైవ తథా వై షడ్జకైశికీ,**
**కర్మారవీ చ సంపూర్ణా తథా గాన్ధారపఞ్చమీ.** **57**

**తా.** మధ్యమోదీచ్యవా, షడ్జకైశికి, కర్మారవి, గాంధారపంచమీ – ఈ నాలుగు జాతులలో ఏడు స్వరాలూ ఉండడంచేత ఇవి సంపూర్ణజాతులు.

**మూ. గాన్ధారీ రక్తగాన్ధారీ మధ్యమా పఞ్చమీ తథా,**
**కైశికీ చేతి విజ్ఞేయాః పఞ్చైతా మధ్యమాశ్రయాః.** **58**

**తా.** గాంధారి, రక్తగాంధారి, మధ్యమ, పంచమ, కైశికి – ఈ ఐదూ మధ్యమ గ్రామానికి చెందినవి.

**మూ. నిషాదిన్యర్షభీ చైవ ధైవతీ షడ్జమధ్యమా,**
**షడ్జోదీచ్యవతీ చైవ షడ్జగ్రామసమాశ్రయాః. 59**

**తా.** నిషాదిని, ఆర్షభి, ధైవతి, షడ్జమధ్యమ, షడ్జోదీచ్యవతి – ఈ ఐదు జాతులు షడ్జగ్రామానికి చెందినవి.

**మూ. పఞ్చ స్వరా దశైతాశ్చ జాతయో నిత్యమేవ హి,**
**గాన్ధారోదీచ్యవా చైవ నన్దయన్తీ చ ఆన్ధ్రీ చ. 60**
**మధ్యమగ్రామసంభూతాః షట్స్వరాః తిస్ర ఏవ చ,**
**షడ్జగ్రామే తు విజ్ఞేయా షాడ్జ్యేకా షట్స్వరాశ్రయా. 61**
**యాస్తాః పఞ్చస్వరాః ప్రోక్తా యాశ్చైతాః షట్స్వరాః స్మృతాః,**
**కదాచిత్ షాడవీభూతాః కదాచిచ్చౌడవీకృతాః. 62**

**తా.** (పైన చెప్పిన) పది జాతులలోను అయిదు స్వరా లుంటాయి. మధ్యమ గ్రామానికి సంబంధించిన గాంధారోదీచ్యవా – నందయంతీ – ఆంధ్రీజాతులు మూడింటి లోను ఆరు స్వరా లుంటాయి. షడ్జగ్రామానికి చెందిన షాడ్జీజాతిలో ఆరు స్వరాలుంటాయి. ఐదు స్వరాలు గలవి, ఆరు స్వరాలు గలవి అని చెప్పిన ఈ జాతులు ఒకప్పుడు షాడవీ కృతము లవుతాయి; ఒకప్పుడు 'ఓడవీ' కృతాలౌతాయి.

**మూ. సంపూర్ణా మధ్యమగ్రామే జ్ఞేయా కర్మారవీ బుధైః,**
**మద్యమోదీచ్యవా చైవ తథా గాన్ధారపఞ్చమీ. 63**

**తా.** మధ్యమగ్రామానికి చెందిన కార్మారవీజాతి సంపూర్ణజాతి, మధ్యమోదీచ్యవా – గాంధారపంచమీజాతులు కూడ పూర్ణజాతులు.

**మూ. షడ్జగ్రామే తు సంపూర్ణా విజ్ఞేయా షడ్జకైశికీ,**
**పునశ్చ షట్స్వరా జ్ఞేయా గాన్ధారోదీచ్యవా బుధైః. 64**
**ఆన్ధ్రీ చ నన్దయన్తీ చ మధ్యమగ్రామసంశ్రయాః,**
**ఏవమేతా బుధైర్జ్ఞేయా ద్విగ్రామిక్యశ్చ జాతయః. 65**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి తాసామంశవికల్పనమ్.**

**తా.** షడ్జగ్రామంలోని షడ్జకైశికి సంపూర్ణజాతి. అట్లే గాంధారోదీచ్యవలో ఆరు స్వరా లుంటాయి. వీటిలోని ఆంధ్రీ – నందయన్తీజాతులు మధ్యమగ్రామాశ్రితాలు. రెండు

గ్రామాల జాతులు ఈ విధంగా ఉంటాయి. ఇప్పుడు వాటి అంశల నిరూపణం చేస్తాను.

**మూ. షట్స్వర్యే సప్తమాంశా తు నేష్యతే షడ్జమధ్యమా. 66**

**సంవాదిలోపాద్ గాన్ధారస్తత్రైవ న భవిష్యతి,**
**గాన్ధారీ రక్తగాన్ధారీ కైశికీనాం తు పఞ్చమః. 67**

**షడ్జాయాం చైవ గాన్ధారమనంశం విద్ధి షాడవే,**
**షాడవే ధైవతో నాస్తి షడ్జోదీచ్యవాయాం తథా. 68**

**సంవాదిలోపాత్సప్తైతే షాట్స్వర్యే తు వివర్జితాః,**
**గాన్ధారీరక్తగాన్ధార్యోః షడ్జమధ్యమపఞ్చమాః. 69**

**సనిషాదాశ్చ విజ్ఞేయా యేషు నౌడవితే ఇమే,**
**ద్వౌ షడ్జమధ్యమాంశే తు గాన్ధారోఽథ నిషాదవాన్. 70**

**ఋషభశ్చైవ పఞ్చమ్యాం కైశిక్యాం చైవ ధైవతః,**
**ఏవం చ ద్వాదశైవేతే వర్జ్యాః పఞ్చస్వరే సదా. 71**

**తాస్వనౌడవితా నిత్యం కర్తవ్యా జాతయో బుధైః.**

**తా. జాతుల అంశస్వరాలు :–** షాడ్జిలో నిషాదం లోపిస్తే అది **'షాడవం'** అవుతుంది. అయితే గాంధారంలో అంశస్వరం ఉన్నప్పుడు మాత్రం దాని సంవాది యైన నిషాదం లోపించదు (అది అంశహీనం అవుతుంది). షడ్జమధ్యమజాతిలో సప్తమస్వరంలో (నిషాదం) లోపిస్తే అది షాడవం అవుతుంది. అయితే – నిషాదమే దాని అంశస్వరం అయితే మాత్రం అది షాడవావస్థను పొందదు. షడ్జమధ్యమాజాతిలోని నిషాదగాంధారం లోపించడంచేత ఔడవావస్థ ఏర్పడుతుంది. నిషాదాంశస్వరావస్థలో షాడవం ఏర్పరచడం కొరకై నిషాదానికి సంవాదియైన గాంధారానికి లోపం జరగదు. ఇది షడ్జగ్రామవిధి.

షడ్జమధ్యమలో నిషాదస్వరము, గాంధారీ – రక్తగాంధారీ – కైశికీలలో పంచమ స్వరము, షాడ్జీలో గాంధారము, షడ్జోదీచ్యవతిలో ధైవతము అంశస్వరా లవుతాయి. సంవాదస్వరం లోపంవల్ల ఇవి షాడవద్వేషు లవుతాయి.

గాంధారిలో షడ్జ – మధ్యమ – పంచమ – నిషాదులకు, రక్తగాంధారిలో షడ్జ – మధ్యమ – పంచమ – నిషాదములకు, షడ్జమధ్యమలో గాంధార – నిషాదాలకు, పంచమిలో ఋషభానికీ, కైశికిలో ధైవతానికీ – ఈ విధంగా పదకొండు స్వరాలకు ఔడవావస్థలో లోపం చేయగూడదు. వీటిలో జాతులను అనౌడవితాలుగానే ఉంచాలి.

**మూ. సర్వస్వరాణాం విహితో వినాశస్త్వథ జాతిషు. 72**

**మధ్యమస్య వినాశస్తు కర్తవ్యో న కదాచన,**
**సర్వస్వరాణాం ప్రవరో హ్యవినాశీ చ మధ్యమః**
**గాన్ధర్వకల్పేఽభిహితః సామగైశ్చ మహర్షిభిః. 73**

**తా.** ఇతరస్వరాలకు వేటికైనా జాతులలో లోపం చేయవచ్చును కాని మధ్యమ స్వరానికి మాత్రం లోపం చేయకూడదు. ఎందువల్ల ననగా ఏడు స్వరాలలో మధ్యమస్వరం వినాశరహితమైన స్వరం. సామగానం చేసే మహర్షులు కూడ, "**గాంధర్వకల్పం**లో మధ్యమస్వరం అవినాశిస్వరం" అని చెప్పారు.

**మూ. గ్రహాంశౌ తారమన్ద్రౌ చ న్యాసోఽపన్యాస ఏవ చ,**
**అల్పత్వం చ బహుత్వం చ షాడవౌడవితే తథా. 74**

**తా. జాతిలోఉండే పది లక్షణాలు :–** గ్రహము, అంశము, తారము, మంద్రము, న్యాసము, అపన్యాసము, అల్పత్వము, బహుత్వము, షాడవము, ఔడవము – ఇవి పది లక్షణాలు.

**మూ. గ్రహాస్తు సర్వజాతీనామంశవత్ పరికీర్తితాః,**
**యత్రప్రవృత్తౌ భవేద్గానం సోఽంశో గ్రహవికల్పితః. 75**

**తా.** జాతు లన్నింటిలోనూ అంశస్వరాలే గ్రహసర్వాలు. గానసమయంలోను, వాద్యవాదనసమయంలోను ప్రారంభంలో ఉపయోగించే అంశస్వరాన్ని **గ్రహం** అని పేరు.

**మూ. తత్రాంశో నామ :–**
**యస్మిన్వసతి రాగస్తు యస్మాచ్చైవ ప్రవర్తతే**
**నేతా వై తారమన్ద్రాణాం యోఽత్యర్థముపలభ్యతే,**
**మన్ద్రతారవిషయా చ పఞ్చస్వరపరా గతిః**
**అనేకస్వరసంయోగో యోఽత్యర్థముపలభ్యతే. 77**

**అన్యచ్చ బలినో యస్య సంవాదీ చానువాద్యపి**
**గ్రహాపన్యాసవిన్యాససన్యాసన్యాసగోచరః**
**పరివార్య స్థితో యస్తు సోంఽశః స్యాద్దశలక్షణః. 78**

**తా.** అంశస్వరంలో పది లక్షణా లుంటాయి. ఇది రంజింపచేస్తుంది. దీనితో రాగం ప్రారంభింపబడుతుంది. తార – మంద్రస్వరాలను నియంత్రిస్తుంది. అనేకవిధాలైన స్వరసమూహాలలో దీని ప్రయోగం అధికంగా కనబడుతుంది. దీనికి సంబంధించిన గ్రహ – అపన్యాస – విన్యాస – సంన్యాస – న్యాసాల ద్వారా మాటి మాటికి అనువర్తనం జరుగుతుంది.

**మూ. పఞ్చస్వరపరా తారగతిః యథా –**

**అంశాత్తారగతిం విద్యాదాచతుర్థస్వరాదిహ,**
**ఆపఞ్చమాత్సప్తమాద్వా నాతః పరమిషేహ్యతే. 79**

**తా. ఐదవ స్వరాన్ని మించకూడని తారగతి :–** కంఠ్యమైన అంశస్వరంనుంచి ప్రారంభించిన తారస్వరం చతుర్థస్వరంవరకు లేదా పంచమస్వరం వరకు లేదా సప్తమ స్వరం వరకు లేపవచ్చును. అంతకు మించి లేపకూడదు.

**మూ. త్రివిధా మన్ద్రగతిః అంశపరా, న్యాసపరా, అపన్యాసపరా చేతి**
**మన్ద్రస్త్వంశపరో నాస్తి న్యాసే తు ద్వౌ వ్యవస్థితౌ,**
**గాన్ధారే న్యాసలిఙ్గే తు దృష్టమృషభసేవనమ్. 80**

**తా.** అంశపర, న్యాసపర, అపన్యాస పర అని మంద్రగతి మూడు విధాలు. అంశస్వరంకంటె తక్కువ మంద్రం ఉండదు. దీని అవధి న్యాసం వరకు, అపన్యాసం వరకు ఉండవచ్చును; గాంధారంలో మాత్రం న్యాసస్వరం తరవాత ఇంకా క్రిందికి దిగితే అది ఋషభప్రయోగం అవుతుంది గాన గాంధారమంద్రగతిలో అంశస్వరం, న్యాస స్వరం – ఈ రెండే ఉంటాయి.

**మూ. అథ న్యాసః ఏకవింశవిధో హ్యఙ్గసమాప్తౌ. తద్వదపన్యాసోఽప్యఙ్గమధ్యే షట్పఞ్చాశత్ సంఖ్యః. యథా –**

**న్యాసోహ్యఙ్గసమాప్తౌ స చైకవింశతివిధో విధాతవ్యః,**
**షట్పఞ్చాశత్సంఖ్యోఽఙ్గమధ్యేఽపన్యాస ఏవ స్యాత్. 81**

**తా.** ఏ స్వరంమీద అంగసమాప్తి జరుగుతుందో అది **న్యాసం**. న్యాసస్వరంలో ఇరవైయొక్క భేదాలుంటాయి. అపన్యాసస్వరంలో కూడ యాభైయారు భేదా లుంటాయి.

ఎట్లనగా – ఒక స్వరం దగ్గర అంగాల సమాప్తి అయినపుడు ఆ స్వరానికి (ఆ అవస్థకు) న్యాసస్వరం అని పేరు. దీనిలో ఇరవైయొక్క భేదా లుంటాయి. అంగమధ్యం ఏ స్వరం మీద అవుతుందో అది అపన్యాసస్వరం; దానికి యాభైయారు భేదా లుంటాయి.

**మూ. ద్వివిధమల్పత్వమ్ – లఙ్ఘనాదనభ్యాసాచ్చ. తత్ర షాడవౌడవితకరణత్వమంశానాం గీతగానామ్ ఆన్తరమార్గముపగతానాం స్వరాణాం లఙ్ఘనాదనభ్యాసాచ్చ సకృదుచ్చారణం యథా జాతిః; తద్వద్ బహుత్వమ్ అల్పత్వవిపర్యయాద్ ద్వివిధమేవాన్యేషామబలినాం సంచారః.**

**తా.** లంఘనంవల్ల (దాటివేయడంవల్ల) అనభ్యాసంవల్ల (ఆవృత్తి చేయకపోవడం వల్లా) స్వరాలకు అల్పత్వం ఏర్పడుతుంది.

ఏస్వరాల లోపంచేత జాతివిశేషంలో (ఒక జాతిలో) షాడవం, ఔడవం అనుభేదాలు

ఏర్పడతాయో ఆ స్వరాలకు, (ఆజాతిలో) లోప్యస్వరా లని పేరు. పరిపూర్ణజాతిలో కూడ లోప్యస్వరాల ప్రయోగం తక్కువగానే ఉంటుంది. ఏ అంశస్వరం ఏ జాతికి చెందినది కాదో అది ఆ జాతికి **అనంశస్వరం** అంటారు. లోప్యస్వరాలకు, అనంశస్వరాలకూ ఆవృత్తి (అభ్యాసం) ఉండదు.

ఒక స్వరాన్ని పూర్ణరూపంలో స్పృశిస్తూ మాటి మాటికీ దానిని ఆవృత్తి చేయడం ఒక విధమైన బహుత్వం. అదే విధంగా ఒక స్వరాన్ని విడవకపోవడం మరొక విధమైన బహుత్వం. ఇవి అల్పత్వభేదాలకు విపరీత మైనవి. అందుచేత ఇవి కూడ రెండు విధాలు. కొన్ని జాతుల బలీయమైన స్వరాల సంచారం కూడ జరుగుతూంటుంది.

**మూ. అల్పత్యం చ బహుత్వం చ తథా పూర్వవినిశ్చయాత్,**
**జాతిస్వరైశ్చ నిత్యం స్యాత్ జాత్యల్పత్వం ద్విధా చ తత్. 82**
**సంచారోంఽశబలస్థానామల్పత్వం దుర్బలేషు చ,**
**ద్వివిధోఽన్తరమార్గశ్చస్తు జాతీనాం వ్యక్తికారకః. 83**

**తా.** అల్పత్వము బహుత్వమూ కూడ ఈ జాతిలో ఇలా చెయ్యాలి అని ముందుగా నిర్ణయించుకొనడంవల్ల జరుగుతాయి. అల్పత్వం రెండు విధాలా జరుగుతుంది.

బలమైన అంశస్వరాలలో స్వరసంచారం అధికంగా జరుగుతుంది, దుర్బలమైన వాటిలో తక్కువగా ఉంటుంది. ఇది జాతిస్వరాల ప్రయోగానికి సంబంధించిన అంతర మార్గాల విషయంలో అనుసరించే పద్ధతి.

**మూ. షట్స్వరం షాడవితం చతుర్దశవిధం సప్తచత్వారింశత్ప్రకారం పూర్వోక్తవిధానం యథా జాత్యంశప్రకారైరితి.**

**తా.** షాడవితదశలో ఆరు స్వరాలు పద్నాలు గవుతాయి. వాటి భేదాలు నలభై ఏడవుతాయి. వీటి జాతికి, అంశాలకీ సంబంధించిన భేదాలు వెనుకచెప్పిన రీతిలో తెలుసుకోవాలి.

**మూ. పఞ్చస్వరమౌడవితం విజ్ఞేయం దశవిధం ప్రయోగజ్ఞైః,**
**త్రింశత్ప్రకారవిహితం పూర్వోక్తం లక్షణం చాస్య,**
**షట్స్వరస్య ప్రయోగోఽస్తి తథా పఞ్చస్వరస్య చ**
**చతుఃస్వరప్రయోగోఽస్తి హ్యవకృష్టధ్రువాస్వథ. 85**

**తా.** పంచస్వరాలు గల ఔడవితానికి పది భేదా లుంటాయి. వెనుక చెప్పిన పద్ధతిలో దానికి ముప్పై భేదాలు ఏర్పడతాయి. షట్స్వర – పంచస్వర – చతుఃస్వరాల ఔడవితం ప్రయోగం అవకృష్టధ్రువలో జరుగుతుంది.

**మూ. ద్వైగ్రామికీనాం జాతీనాం సర్వాసామపి నిత్యశః,**
**త్రిషష్టిరంశా విజ్ఞేయాస్తానాం చైవ తథా గ్రహాః. 86**

**తా.** ఈ విధంగా రెండు గ్రామాలకు చెందిన అన్ని జాతులకు మొత్తం అరవై మూడు అంశాలు, అరవై మూడు గ్రహాలూ ఉంటాయి.

**మూ. అంశగ్రహవిధిమిదానీం వక్ష్యామః - తత్ర,**
**మధ్యోదీచ్యవాయాస్తు నన్దయన్త్యాస్తథైవ చ**
**తథా గాన్ధారపఞ్చమ్యాః పఞ్చమోంఽశో గ్రహః స్మృతః. 87**

**తా.** ఇపుడు అంశగ్రహాల స్వరూపం విశదీకరిస్తాం.

మధ్యమోదీచ్యవా - నందయంతీ - గాంధారపంచమీల ఐదవ అంశస్వరానికి గ్రహం అని పేరు.

**మూ. ధైవత్యాశ్చ తథైవాంశౌ విజ్ఞేయౌ ధైవతర్షభౌ,**
**పఞ్చమ్యాస్తు గ్రహోవంశౌ భవతః పఞ్చమార్షభౌ. 88**

**తా.** ధైవత - ఋషభాలు ధైవతానికి అంశస్వరాలు. పంచమ - ఋషభాలు పంచమానికి అంశస్వరాలు.

**మూ. గాన్ధారోదీచ్యవాయాస్తు గ్రహోంశౌ షడ్జమధ్యమౌ,**
**ఆర్షభ్యాశ్చ తథైవాంశా నిషాదర్షభధైవతాః. 89**

**తా.** షడ్జ - మధ్యమాలు గాందారోదీచ్యవాకి అంశస్వరాలు. ఆర్షభికి నిషాద - ఋషభ - ధైవతాలు అంశాలు.

**మూ. నైషాదిన్యా నిషాదస్తు గాన్ధారశ్చార్షభస్తథా,**
**అంశాశ్చ షడ్జకైశిక్యాః షడ్జగాన్ధారపఞ్చమాః. 90**

**తా.** నైషాదికి, నిషాదము, గాంధారము, ఋషభము అంశాలు. కైశికికి షడ్జ - గాంధార - పంచమాలు అంశాలు.

**మూ. షడ్జపఞ్చమగాన్ధారైస్త్రిభిరేవ ప్రకీర్తితాః,**
**అంశైర్గ్రహైస్తథా చైవ విజ్ఞేయా షడ్జకైశికీ. 91**
**షడ్జశ్చ మధ్యమశ్చైవ నిషాదో ధైవతస్తథా,**
**అంశగ్రహాస్తు చత్వారః షడ్జోదీచ్యవతీం శ్రితాః. 92**

**తా.** షడ్జ - పంచమ - గాంధారాలు మూడూ షడ్జకైశికికి గ్రహాలు, అంశస్వరాలు, షడ్జోదీచ్యవతికి షడ్జ - మధ్యమ - నిషాద - ధైవతాలు అంశలు గ్రహాలూ కూడ.

**మూ. పఞ్చమశ్చార్షభశ్చైవ నిషాదో ధైవతస్తథా,**
**కర్మారవ్యాస్తథైవాంశాశ్చత్వారశ్చ ప్రకీర్తితాః. 93**

**తా.** పంచమ – ఋషభ – నిషాద – ధైవతాలు నాలుగూ కర్మారవీకి అంశాలు.

**మూ. గాన్ధారశ్చర్షభశ్చైవ నిషాదః పఞ్చమస్తథా,**
**చత్వారోంఽశా భవన్త్యాన్ధ్ర్యాః గ్రహాశ్చైతే తథైవ హి. 94**

**తా.** గాంధార – ఋషభ – పంచమాలు నాలుగు ఆంధ్రీకి గ్రహాలు, అంశాలు కూడ.

**మూ. ఋషభశ్చైవ షడ్జశ్చ మధ్యమః పఞ్చమస్తథా,**
**మధ్యమాయా గ్రహాస్త్వంశా ధైవతశ్చ ప్రకీర్తితః. 95**

**తా.** షడ్జ – పంచమ – మధ్యమ – ఋషభ – ధైవతస్వరాలు మధ్యమకు గ్రహాలు అంశాలూ కూడ.

**మూ. నిషాదషడ్జగాన్ధారమధ్యమాః పఞ్చమస్తథా,**
**గాన్ధారీరక్తగాన్ధార్యో గ్రహాంశాః పరికీర్తితాః. 96**

**తా.** గాంధారీ, రక్తగాంధారీలకు, నిషాద – షడ్జ – గాంధార – మధ్యమ – పంచమాలు గ్రహాలు, అంశాలూ కూడ.

**మూ. షాడ్జాయా షడ్జగాన్ధారౌ మధ్యమః పఞ్చమస్తథా,**
**ధైవతశ్చాపి విజ్ఞేయా గ్రహాశ్చాంశాః ప్రకీర్తితాః. 97**

**తా.** షడ్జ – గాంధార – మధ్యమ – పంచమ – ధైవతాలు షాడ్జీకి గ్రహాలు, అంశలూ కూడ.

**మూ. వర్జితర్షభయోగాస్తు కైశిక్యాంశాః షడేవ తు,**
**స్వరాః సర్వేఽపి విజ్ఞేయాః షడ్జమధ్యాంశజా గ్రహాః,**
**ఏవం త్రిషష్టిర్విజ్ఞేయా గ్రహాశ్చాంశాశ్చ జాతిషు. 98**

**తా.** ఋషభం తప్ప మిగిలిన ఆరు స్వరాలు కైశికికి అంశాలు గ్రహాలు కూడ. షడ్జమధ్యమకు అన్ని స్వరాలూ కూడ అంశలు, గ్రహాలూ కూడ. ఈ విధంగా జాతుల అరవైమూడు గ్రహాలు అంశాలు తెలియదగినవి.

**మూ. అంశవచ్చ గ్రహాస్తాసాం సర్వాసామేవ నిత్యశః,**
**సర్వాసామేవ జాతీనాం త్రిజాతిస్తు గణః స్మృతః. 99**

**సర్వథాచైవ విజ్ఞేయా వర్ధమానస్వరాస్తథా,**
**ఏకస్వరో ద్విస్వరశ్చ త్రిస్వరోఽథ చతుఃస్వరః,**
**పఞ్చస్వరో షట్స్వరశ్చ తథా సప్తస్వరోఽపి వా. 100**

**తా.** జాతు లన్నింటికీ అంశస్వరా లున్నట్లే గ్రహాలు కూడ ఉంటాయి. ఈ విధంగా అన్ని జాతులను మూడు గణాలుగా విభజించాలి. ఒక్కొక్క స్వరాన్ని పెంచుతూ పోతూంటే వాటికి వర్ధమానస్వరా లని పేరు. ఇలా ఒక స్వరం, రెండు స్వరాలు, మూడు, నాలుగు, ఐదు, ఆరు, ఏడు స్వరాలు పెంచగా అవి వర్ధమానస్వరా లవుతాయి.

**మూ. ఏవముక్తమిదం సమ్యగ్ జాతీనాం లక్షణం మయా,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి న్యాసాపన్యాసకల్పనమ్. 101**

**తా.** నే నింతవరకు జాతుల లక్షణం చెప్పాను. ఇటుపైన న్యాస – అపన్యాల విధానాన్ని గూర్చి చెపుతాను.

**వి.** గీతం ఏ స్వరంమీద ఆగుతుందో అది **న్యాసం**. గీతంలోని మధ్యఖండం (మధ్య భాగం) అవసితం అయినపుడు (పూర్తి యైనపుడు) ప్రయోగించేది **అపన్యాసం.**

**మూ. అంశాః స్యుః పఞ్చ షాడ్జాయా నిషాదర్షభవర్జితాః,**
**అపన్యాసో భవేదత్ర గాన్ధారః పఞ్చమస్తథా. 102**

**న్యాసశ్చాత్ర భవేత్ షడ్జో లోప్యః సప్తమ ఏవ తు,**
**షాడవం సప్తమోపేతమ్ అల్పౌ వై సప్తమర్షభౌ. 103**

**షడ్జగాన్ధారసంచారస్తథా ధైవతషడ్జయోః,**
**గాన్ధారస్య చ బాహుల్యన్త్వత్ర కార్యం ప్రయోక్తృభిః. 104**

**తా. షాడ్జి :–** నిషాద – ఋషభాలు తప్ప మిగిలిన ఐదు స్వరాలు 'షాడ్జీ'లో అంశస్వరాలు. వీటిలో గాంధార – పంచమాలు అపన్యాసాలు. షడ్జం న్యాసస్వరం, నిషాదం లోప్యస్వరం. అది లోపించడంచేతనే 'షాడ్జి' షాడవం అయింది. ఋషభ – నిషాదాల ప్రయోగం చాల అల్పంగా ఉంటుంది. షడ్జ – గాంధార – ధైవత – షడ్జాల సంచారం చేయబడుతుంది. గాయకులు ఈ జాతిస్వరంలో గాంధారం అధికంగా ప్రయోగించాలి.

**మూ. అంశజాతాస్తథార్షభ్యాం నిషాదర్షభధైవతాః,**
**ఏత ఏవ హ్యపన్యాసాః న్యాసశ్చ ఋషభః స్మృతః. 105**

**అల్పత్వం చ విశేషేణ భవేత్ షాడవకారిణః,**
**లఙ్ఘనం పఞ్చమస్యైవ స్యాదారోహణసంశ్రయాత్. 106**

షట్స్వరం సప్తమే హీనే పఞ్చస్వర్యే చ పఞ్చమమ్,
వివాదినాం స్వరాణాం చ సంచారోఽత్ర విధీయతే. **107**

**తా. ఆర్షభి :-** ఆర్షభికి నిషాద - ఋషభ - ధైవతాలు అంశస్వరాలు; ఇవే అపన్యాసాలు కూడ. ఋషభం న్యాసం. దీనిలో షడ్జము (షాడవకారి) అల్పంగా ఉంటుంది. ఆరోహంలో పంచమం లంఘింపబడుతుంది. షడ్జలోపంచేత షాడవత్వాన్నీ, పంచమ లోపంచేత ఔడవత్వాన్ని పొందుతుంది. దీనిలో, మిగిలిన స్వరాలతో పాటు నిషాద గాంధారాల సంచారం ఉంటుంది.

**మూ.** ధైవత్యాం ధైవతో న్యాసః స్యాదంశౌ ధైవతర్షభౌ,
అపన్యాసా భవన్త్యత్ర ధైవతర్షభమధ్యమాః. **108**

షడ్జపఞ్చమహీనం చ పఞ్చ స్వర్యం విధీయతే,
పఞ్చమేన వినా చైవ షాడవం పరికీర్తితమ్. **109**

ఆరోహిణౌ చ కర్తవ్యౌ లఙ్ఘనీయౌ తథైవ చ,
నిషాదశ్చర్షభశ్చైవ గాన్ధారో బలవాంస్తథా. **110**

**తా. ధైవతీ :-** ధైవతీజాతిలో ధైవతం న్యాసం; ఋషభ - ధైవతాలు అంశస్వరాలు. దీనిలో ధైవత - ఋషభ - మధ్యమస్వరాలు అపన్యాసా లవుతాయి. షడ్జ - పంచమములు తప్ప మిగిలిన ఐదు స్వరాలు ఉంటాయి. పంచమహీన మైన ఔడవము, షడ్జహీన మైన షాడబము దీనిలో ఉంటాయి. ఆరోహంలో పంచమ షడ్జాలను అంఘించడం జరుగుతుంది. దీనిలో నిషాద - ఋషభ - గాంధారాలు సబలంగా ఉంటాయి.

**మూ.** నిషాదిన్యాం నిషాదోంఽశో గాన్ధారస్త్వర్షభః స్మృతః,
ఏత ఏవ హ్యపన్యాసాః న్యాసశ్చైవాత్ర సప్తమః. **111**

ధైవత్యా ఇవ కర్తవ్యౌ షాడవౌడవితే తథా,
తద్వచ్చ లఙ్ఘనీయౌ తు బలవన్తౌ తథైవ చ. **112**

**తా. నిషాదిని :-** నిషాదినీ జాతిలో నిషాద - గాంధార - ఋషభాలు అంశస్వరాలు; అవే అపన్యాస స్వరాలు కూడ. నిషాదం న్యాసస్వరం. షాడవ - ఔడవ దశలను, లంఘనీయ స్వరాలను, సబల స్వరాలను ధైవతిలో వలెనే చూచుకోవాలి.

**మూ.** అంశాస్తు షడ్జకైశిక్యాం షడ్జగాన్ధారపఞ్చమాః,
అపన్యాసా భవన్త్యత్ర షడ్జసప్తమపఞ్చమాః. **113**

గాన్ధారశ్చ భవేన్న్యాసో హీనస్వర్యం న చాత్ర తు,
(హీనస్వరస్యాభావాత్తు సంపూర్ణా చేయమిష్యతే)
దౌర్బల్యం చాత్ర కర్తవ్యం ధైవతస్యర్షభస్య చ. **114**

**తా. షడ్జకైశికి :–** 'షడ్జకైశికీ' జాతిలో షడ్జ – గాంధార – పంచమస్వరాలు అంశస్వరాలు. షడ్జ – పంచమ – నిషాదాలు అపన్యాసాలు. గాంధారం న్యాస స్వరం. స్వరలోపం ఏదీ లేకపోవడం వల్ల ఇది సంపూర్ణ జాతి. ధైవత – ఋషభాలు దర్బలంగా ఉండేటట్లు చూచుకోవాలి.

**మూ. షడ్జశ్చ మధ్యమశ్చైవ నిషాదో ధైవతస్తథా,**
**స్యుః షడ్జోదీచ్యవత్యంశాః న్యాసశ్చైవ తు మధ్యమః. 115**

**అపన్యాసో భవత్యస్యా ధైవతః షడ్జ ఏవ చ,**
**పరస్పరమిహాంశానాం సంచారశ్చ విధీయతే. 116**

**పఞ్చమర్షభహీనం తు పఞ్చస్వర్యం విధీయతే,**
**ఋషభః షాడబే హీనో గాన్ధారశ్చ బలీ భవేత్. 117**

**తా. షడ్జోదీచ్యవా :–** దీనిలో షడ్జ – మధ్యమ – ధైవత – నిషాదస్వరాలు అంశస్వరాలు. మధ్యమం న్యాసం. ధైవత. షడ్జస్వరాలు అపన్యాసస్వరాలు. ఈ జాతిలో అంశస్వరాలలో పరస్పరసంచారం ఉంటుంది. షాడవావస్థలో ఋషభము, ఔడవావస్థలో ఋషభ – పంచమస్వరాలు లుప్తం అవుతాయి. దీనిలో గాంధారం బలంగా ఉంటుంది.

**మూ. సర్వేంఽశాః షడ్జమధ్యాయామ్ అపన్యాసాస్తథైవ చ,**
**షడ్జో వా మధ్యమో వాపి న్యాసః కార్యః ప్రయోక్తృభిః. 118**

**గాన్ధారసప్తమాపేతం పఞ్చస్వర్యం విధీయతే,**
**షాడవం సప్తమాపేతం చాత్ర కార్యం ప్రయోగతః. 119**

**సర్వస్వరాణాం సంచార ఇష్టస్తస్యాః ప్రయోక్తృభిః.**

**తా. షడ్జమధ్యమా :–** షడ్జమధ్యమలో అన్ని స్వరాలూ అంశస్వరాలే, అన్నీ అపన్యాసాలే. షడ్జం కాని మధ్యమం కాని న్యాసంగా ఉండాలి. గాంధార – నిషాదాలు తప్ప అన్ని స్వరాలూ ఉంటాయి. నిషాదం లేకపోవడంచేత షాడవం ప్రయోగించాలి. అన్ని స్వరాల సంచారమూ చెయ్యాలి.

**మూ. షడ్జగ్రామాశ్రితా హ్యేతా విజ్ఞేయాః సప్త జాతయః. 120**

**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి మధ్యమగ్రామసంశ్రితాః.**

**తా.** ఇవి షడ్జగ్రామానికి సంబంధించిన ఏడు జాతులు. ఇటుపైన మధ్యమ గ్రామాశ్రితాలైన జాతులను గూర్చి చెపుతాను.

**మూ. అంశాః స్యుః పఞ్చ గాన్ధార్యా ధైవతర్షభవర్జితాః. 121**

**అపన్యాసత్వమస్యాస్తు షడ్జపఞ్చమయోరపి,**
**గాన్ధారశ్చ భవేన్న్యాసః షాడవం చర్షభం వినా. 122**

**ఋషభధైవతాపేతం తథా చౌడవితం భవేత్,**
**లఙ్ఘనీయౌ చ తౌ నిత్యమృషభో ధైవతం వ్రజేత్. 123**

**షడ్జమధ్యమయోరత్ర బాహుల్యం సంవిధీయతే.**

**తా. గాంధారి :–** గాంధారీజాతిలో ధైవత – ఋషభాలు తప్ప మిగిలిన ఐదు స్వరాలూ అంశస్వరాలు. గాంధారం న్యాసస్వరం. ఋషభం లోపించడంచేత షాడబత్వమూ, ఋషభధైవతాల లోపంచేత ఔడవితత్వము కూడ దీనికి ఉంటాయి. ఋషభ – ధైవతాలు లఘింపబడతాయి. ఋషభం ధైవతంలోనికి కలిసిపోతుంది. షడ్జ – మధ్యమాల ప్రయోగం బహులంగా ఉంటుంది.

**మూ. గాన్ధారీ విహితం న్యాసం హీనస్వర్యం చ లక్షణమ్. 124**

**సర్వం చ రక్తపూర్వాయా గాన్ధార్యాశ్చ వినిర్దిశేత్,**
**బలవన్తౌ విధాతవ్యౌ ధైవతః సప్తమస్తథా. 125**

**గాన్ధారషడ్జయోరత్ర సంచారశ్చర్షభం వినా,**
**అపన్యాసస్తు కార్యః స్యాదేక ఏవాత్ర మధ్యమః. 126**

**తా. రక్తగాంధారి :–** 'రక్తగాంధారీ' జాతిలక్షణాలు. దీనిలోని 'షాడబ' 'ఔడబ' దశలు గాంధారిలో వలెనే ఉంటాయి. దీనిలో ధైవత – నిషాదాలు సబలంగా ఉంటాయి. గాంధార – షడ్జస్వరాలకు, ఋషభంతో తప్ప మిగిలిన స్వరాలతో సంగతి (సంచారం) ఉంటుంది. దీనిలో మధ్యమం ఒక్కటే అపన్యాసస్వరం.

**మూ. గాన్ధారోదీచ్యవాయాం తు తావంశౌ షడ్జమధ్యమౌ,**
**పఞ్చస్వర్యం భవేన్నాత్ర షాట్స్వర్యమృషభం వినా. 127**

**అన్యాస్త్వల్పబహుత్వస్య న్యాసాపన్యాసయోస్తథా,**
**యః షడ్జోదీచ్యవాయాస్తు స సర్వోఽత్ర విధిః స్మృతః. 128**

**తా. గాంధారోదీచ్యవా :–** దీనిలో షడ్జ – మధ్యమాలు అంశస్వరాలు. దీనిలో ఔడవీత్వం ఉండదు. ఋషభం లోపించడంవల్ల షాడబత్వం ఉంటుంది. దీనిలో కూడ అల్పత్వ – బహుత్వాలు, న్యాస – అపన్యాసాలు, షడ్జోదీచ్యవాలో ఉన్నట్లే ఉంటాయి.

**మూ. మధ్యమాయాం భవన్త్యంశాః సషడ్జర్షభమధ్యమాః,**
**పఞ్చమో ధైవతశ్చైవాపన్యాసస్తత్ర ఏవ తు. 129**

న్యాసో మధ్యమ ఏవాత్ర ద్విశ్రుత్యోర్హీనతా భవేత్,
గాన్ధారసప్తమాపేతం పాఞ్చస్వర్యం విధీయతే. **130**

గాన్ధారహీనం షట్స్వర్యం బాహుల్యం షడ్జమధ్యయోః,
గాన్ధారస్య చ దౌర్బల్యం మధ్యమాయా విధీయతే. **131**

**తా. మధ్యమ :–** 'మధ్యమా' జాతిలో గాంధార – నిషాద – షడ్జ – ఋషభ – మధ్యమస్వరాలు అంశస్వరాలు. ఇవే అపన్యాసస్వరాలు కూడ. మధ్యమస్వరం న్యాసస్వరం. గాంధార – నిషాదాల లోపంచేత ఔడవరూపము, గాంధారలోపంచేత షాడవరూపము ఉంటాయి. ఈ జాతి స్వరంలో షడ్జమధ్యమాలకు బహులప్రయోగమూ, గాంధారస్వర లంఘనమూ జరుగుతాయి.

**మూ.** మధ్యమోదీచ్యవాయాస్తు పఞ్చమోంఽశః ప్రకీర్తితః,
శేషో విధిస్తు కర్తవ్యో గాన్ధారోదీచ్యతాం గతః. **132**

**తా. మధ్యమోదీచ్యవా :–** దీనిలో పంచమస్వరం అంశస్వరం. మిగిలిన విషయాలన్నీ గాంధారోదీచ్యవాలలో ఉన్నట్లే ఉంటాయి.

**మూ.** ద్వావంశావపి పఞ్చమ్యా భవతః పఞ్చమర్షభౌ,
అపన్యాసో నిషాదశ్చ పఞ్చమర్షభసంయుతః. **133**

న్యాసః పంచమ ఏవ స్యాత్ మధ్యమర్షభహీనతా,
మధ్యమాయాం తు కర్తవ్యే షాడవౌడవితే యథా. **134**

దుర్బలాశ్చాత్ర కర్తవ్యాః షడ్జగాన్ధారమధ్యమాః,
కుర్యాచ్చాప్యత్ర సంచారం మధ్యమస్యర్షభస్య చ. **135**

గాన్ధారగమనం చాల్పం సప్తమ్యాం సంప్రయోజయేత్.

**తా. పంచమి :–** 'పఞ్చమీ' జాతిలో పంచమ – ఋషభాలు అంశస్వరాలు. నిషాద – పంచమ – ఋషభాలు అపన్యాసస్వరాలు. షాడబ – ఔడబాలు మధ్యమలో వలెనే ఉంటాయి. దీనిలో షడ్జ – గాంధార – పంచమాలు దుర్బలంగా ఉంటాయి. ఋషభ – పంచమాల సంచారం చేయబడుతుంది. దీనిలో గాంధారం నుంచి నిషాదం లోనికి వెళ్లాలి.

**మూ.** అథ గాన్ధారపఞ్చమ్యాః పఞ్చమోంశః ప్రకీర్తితః,
పఞ్చమశ్చర్షభశ్చైవ అపన్యాసౌ ప్రకీర్తితౌ. **136**

గాన్ధారోఽత్ర భవేన్న్యాసో హీనస్యర్వం చ నేష్యతే,
పఞ్చమ్యాస్త్వథ గాన్ధార్యాః సంచరశ్చ విధీయతే. **137**

**తా. గాంధారపంచమి :-** 'గాన్ధారపఞ్చమీ' జాతిలో పంచమం అంశస్వరం. పంచమ – ఋషభాలు అపన్యాసస్వరాలు. గాంధారం న్యాసస్వరం. దీనిలో షాడబత్వ – ఔడబత్వాలు ఉండవు. దీనిలో పంచమ – గాంధారాల సంచారం చెయ్యాలి.

**మూ. ఋషభః పఞ్చమశ్చైవ గాన్ధారోఽథ నిషాదవాన్,**
**చత్వారోంఽశా భవన్త్యాన్ధ్ర్యాః అపన్యాసస్త ఏవ చ. 138**

**గాన్ధారశ్చ భవేన్న్యాసో షడ్జాపేతం చ షాడబమ్,**
**గాన్ధారర్షభయోరత్ర సంచారః స్యాత్ పరస్పరమ్. 139**

**షష్ఠసప్తమయోశ్చాత్ర న్యాసో గత్యనుపూర్వశః,**
**షడ్జస్య లఙ్ఘనం చాత్ర నాస్తి చౌడవితం తథా. 140**

**తా. ఆంధ్రి :-** 'ఆన్ధ్రీ' జాతిలో ఋషభ – పంచమ – గాంధార – నిషాదాలు అంశస్వరాలు. అవే అపన్యాసస్వరాలు కూడ. గాంధారం న్యాసస్వరం. షడ్జం లోపించడం వల్ల షాడవావస్థ ఉంటుంది. గాంధార – ఋషభాలకూ, ధైవత – నిషాదాలకు పరస్పర సంచారం ఉంటుంది. షడ్జలంఘనం ఉంటుంది (అందుచేతనే షాడబావస్థ). ఔడవితం ఉండదు.

**మూ. నన్దయన్త్యాః భవత్యంశః పఞ్చమో నిత్యమేవ తు,**
**స్యాతామస్యామపన్యాసో మధ్యమః పఞ్చమస్తథా. 141**

**షాడబం షడ్జహీనం తు లఙ్ఘనీయః స ఏవ తు,**
**ఆన్ధ్రీవత్సఞ్చరో నిత్యమృషభస్య చ లఙ్ఘనమ్. 142**

**తత్ర మన్ద్రగతిః ప్రోక్తా నిత్యం గానప్రయోక్తృభిః,**
**తారగత్యాథ షడ్జస్తు కదాచిన్నాతివర్తతే. 143**

**గాన్ధారశ్చ గ్రహః కార్యస్తథా న్యాసశ్చ నిత్యశః.**

**తా. నందయంతి :-** 'నన్దయన్తీ' జాతిలో పంచమం అంశస్వరం. మధ్యమ – పంచమాలు అపన్యాసస్వరాలు. షడ్జలోపంవల్ల షాడవావస్థ ఏర్పడుతుంది. స్వరసంచారం ఆంధ్రీజాతిలో వలెనే ఉంటుంది. దీని ప్రయోగం ఋషభం వరకు మంద్రగతిలో ఉండాలి. షడ్జం ఎల్లప్పుడు తారస్థితిలోనే ఉండాలి; దానినుంచి దిగకూడదు. దీనిలో గాంధారం గ్రహంగాను, న్యాసంగానూ కూడ ఉంటుంది.

**మూ. కర్మారవ్యా భవన్త్యంశాః పఞ్చమర్షభధైవతాః. 146**

**నిషాదశ్చేతి చత్వారో గ్రహాశ్చ పరికీర్తితాః,**
**ఏత ఏవ హ్యపన్యాసా న్యాసః పఞ్చమ ఇష్యతే. 147**

**హీనస్స్వర్వం న చాత్ర స్యాదనంశా బలినస్తథా,**
**గాన్ధారస్య విశేషేణ సర్వతో గనమం భవేత్.** **148**

**తా. కార్మారవి :–** 'కార్మారవీజాతిలో – ఋషభ – పంచమ – ధైవత – నిషాద స్వరాలు అంశస్వరాలు; అవే అపన్యాసస్వరాలు కూడ. దీనిలో ఏ స్వరమూ లోపించదు. అందుచేత ఇది సంపూర్ణజాతిస్వరం. దీనిలో గాంధారం విశేషించి, అన్ని స్వరాలతోను సంచారం పొందుతుంది.

**మూ. కైశిక్యాస్తు భవన్త్యంశాః సర్వే చర్షభవర్జితాః**
**ఏత ఏవ హ్యపన్యాసా న్యాసౌ గాన్ధారసప్తమౌ.** **149**

**ధైవతేంఽశే నిషాదే చ న్యాసః పఞ్చమ ఇష్యతే,**
**దౌర్బల్యమృషభస్యాత్ర లఙ్ఘనం చ విశేషతః.** **150**

**అపన్యాసః కదాచిచ్చ ఋషభోఽపి భవేదిహ,**
**ఋషభః షాడవే హీనో ధైవతశ్చర్షభం వినా.** **151**

**తథా చౌడవితం కార్యం బలినౌ చాద్యపఞ్చమౌ,**
**షడ్జమధ్యావదత్రాపి సఞ్చారస్తు విధీయతే.** **152**

**తా. కైశికి :–** 'కైశికీ' జాతిలో ఋషభం తప్ప మిగిలిన ఆరు స్వరాలు అంశస్వరాలు. అవే అపన్యాసాలు కూడ. గాంధారనిషాదాలు న్యాసాలు. ధైవతము, నిషాదము దీనిలో అంశస్వరములుగా ఉన్నప్పుడు, అప్పు డప్పుడు పంచమస్వరం న్యాసస్వరంగాను, ఋషభం అపన్యాసం గాను ఉండవచ్చు. ఋషభం లోపించినప్పుడు షాడబదశ, ధైవత – ఋషభాలు లోపిస్తే ఔడవదశ ఉంటాయి. దీనిలో పంచమ – నిషాదస్వరాలు బలంతో ఉంటాయి, ఋషభస్వరం దుర్బలంగా ఉంటుంది. దీనిలో స్వరసంచారం షడ్జమధ్యమంలో వలె ఉంటుంది.

**మూ. ఏవమేతా బుధైర్జ్ఞేయా జాతయో దశలక్షణాః,**
**స్వైః స్వైశ్చ కరణ్యైర్యోజ్యా పదేష్వభినయైరపి.** **153**

**ఆసామిదానీం వక్ష్యామి రసభావవికల్పనమ్,**
**కార్యా యస్మిన్ రసే యాశ్చ తాశ్చ మే సన్నిబోధత.** **154**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే జాతివికల్పనం నామాధ్యాయోఽష్టావింశతిమః.**

**తా.** బుధు లీ విధంగా పది లక్షణాలు గల జాతులను తెలిసికొని వీటిని, ఔచిత్యాన్ని దృష్టిలో ఉంచుకొని పదాలలో (గీతాలలో) కూర్చి కరణాద్యభినయాలలో కూడ ఉపయోగించాలి.

ఇప్పుడు వీటికి రస – భావాదుల సంబంధం చెపుతాను. ఏ రసంలో ఏ జాతులను ఉపయోగించాలో తెలుసుకొనండి.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో జాతికల్పనం అను ఇరవైఎనిమిదవ అధ్యాయం సమాప్తం.**

**"శిశిరకలాశేఖరచరణామ్భోజాశ్రయాకలితతాపః,**
**అభినవగుప్తో గుప్తం జాత్యధ్యాయం విచారితవాన్."**

**– శ్రీమదభినవగుప్తాచార్యాః**

**శ్రీః శ్రీః శ్రీః**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ ఏకోనత్రింశోఽధ్యాయః

## తతాతోద్యవిధానము

**"జాతివినియోగకల్పం భూషణవైచిత్ర్యమపి వా జనయతి యా,**
**వన్దే తమభేదకరీం తాం నియతిం శాఙ్కరీం శక్తిమ్."**

**– శ్రీమదభినవగుప్తాచార్యాః**

**మూ. షడ్జోదీచ్యవతీ చైవ షడ్జమధ్యా తథైవ చ,**
**మధ్యపఞ్చమబాహుల్యాత్ కార్యా శృఙ్గారహాస్యయోః. 1**

**తా.** శృంగార – హాస్యరసాలలో షడ్జోదీచ్యవతీ – షడ్జమధ్యాజాతిస్వరాలను, వాటిలో మధ్యమపంచమాలు ఎక్కువగా ఉండేటట్లు చూచుకొంటూ ఉపయోగించాలి.

**మూ. షాడ్జీ త్వథార్షభీ చైవ షడ్జర్షభగ్రహస్వరాత్,**
**వీరరౌద్రార్భుతేష్వేతే ప్రయోజ్యే గానయోక్తృభిః. 2**

**తా.** గానప్రయోక్తలు (Music directors) వీర – రౌద్ర – అద్భుతరసాలలో, షడ్జ – ఋషభాల పాళ్లు అధికంగా ఉన్న షాడ్జీ – ఆర్షభీజాతిస్వరాలను ఉపయోగించాలి.

**మూ. నిషాదాంశే చ నైషాదీ గాన్ధారే షడ్జకైశికీ,**
**కరుణే చ రసే కార్యా జాతిర్గానవిశారదైః. 3**

**తా.** కరుణరసంలో నిషాదాంశస్వరం అధికంగా ఉన్న నైషాదిని, గాంధారాంశస్వరం అధికంగా ఉన్న షడ్జకైశికిని ప్రయోగించాలి.

**మూ. ధైవతీ ధైవతాంశే చ బీభత్సే సభయానకే,**
**ధైవతీ కరుణే యోజ్యా చోన్మాదే షడ్జమధ్యమా. 4**

**తా.** బీభత్సభయానకరరసాలలో ధైవతాంశస్వరం అధికంగా ఉన్న ధైవతిని, ఉన్మాదంలోను, కరుణరసంలోను ధైవతీజాతిస్వరాన్ని షడ్జ – మధ్యమాంశస్వరాలు బహులంగా ఉండేటట్లు చూచుకొంటూ ప్రయోగించాలి.

**మూ. ధ్రువావిధానే కర్తవ్యా జాతిర్గానప్రయోక్తృభిః,**
**రసం కార్యమవస్థాం చ జ్ఞాత్వా నాట్యే ప్రయత్నతః. 5**

**తా.** నాట్యప్రయోగంలోని ధ్రువావిధానంలో రసాన్నీ, కార్యాన్నీ, అవస్థనీ అనుసరించి వాటికి అనుగుణంగా, జాతిస్వరాల ప్రయోగం ప్రయత్నపూర్వకంగా చెయ్యాలి.

**మూ. షడ్జగ్రామాశ్రితా హ్యేతా విజ్ఞేయా జాతయో బుధైః,**
**అతఃపరం ప్రవక్ష్యామి మధ్యమగ్రామసంశ్రయాః. .6**

**తా.** ఇంతవరకు షడ్జగ్రామానికి చెందిన జాతుల ప్రయోగాన్నిగూర్చి చెప్పబడింది. ఇపుడు మధ్యమగ్రామసంబంధిజాతులను గూర్చి చెపుతాను.

**మూ. గాన్ధారీరక్తగాన్ధార్యోర్గాన్ధారాంశోపపత్తితః,**
**కరుణే తు రసే కార్యో నిషాదేంఽశే తథైవ చ. 7**

**మధ్యమా పఞ్చమీ చైవ నన్దయన్తీ తథైవ చ,**
**గాన్ధారపఞ్చమీ చైవ మధ్యమోదీచ్యయా తథా. 8**

**మధ్యపఞ్చమబాహుల్యాత్ కార్యా శృఙ్గారహాస్యయోః.**

**తా.** కరుణరసంలో, గాంధారీ – రక్తగాంధారీల గాంధారాంశ – నిషాదాంశాల కూర్పుచేత గానం చెయ్యాలి. శృంగార – హాస్యాలలో, మధ్యమ, పంచమీ, నందయన్తీ, గాంధారపంచమీ మధ్యమోదీచ్యవల ప్రయోగం, మధ్యమ – పంచమలను అధికంగా ఉపయోగిస్తూ చెయ్యాలి.

**మూ. కార్మారవీ తథా చాన్ధ్రీ గాన్ధారోదీచ్యవా తథా. 9**

**వీరే రౌద్రేఽద్భుతే కార్యాః షడ్జర్షభాంశయోజితాః.**

**తా.** రౌద్ర – అద్భుతరసాలలో, కార్మారవీ – ఆంధ్రీ – గాంధారోదీచ్యవాస్వరాల ప్రయోగం షడ్జఋషభాంశస్వరాలను అధికంగా ఉపయోగిస్తూ ప్రయోగించాలి.

**మూ. కైశికీ ధైవతాంశా స్యాద్ తథా గాన్ధారపఞ్చమీ. 10**

**ప్రయోక్తవ్యా బుధైః సమ్యక్ బీభత్సే సభయానకే.**

**తా.** కైశికీజాతిని ధైవతాంశస్వరబాహుల్యంతోను, గాంధారపంచమిని, బీభత్స – భయానకరసాలలో ప్రయోగించాలి.

**మూ. ఏకైవ షడ్జమధ్యా జ్ఞేయా సర్వరససంశ్రయా జాతిః,**
**తస్యా హ్యంశాః సర్వే స్వరాస్తు విహితాః ప్రయోగవిధౌ. 11**

**తా.** అన్ని రసాలలోను ప్రయోగించదగినది షడ్జమధ్యజాతిస్వరం. దీనిని ప్రయోగించేటప్పుడు అన్ని స్వరాలను అంశస్వరాలుగా ఉపయోగించవచ్చును.

**మూ. యో యదా బలవాన్ యస్మిన్ స్వరే జాతిసమాశ్రయాత్,**
**తత్ప్రయుక్తే రసే గానం కార్యం గేయే ప్రయోక్తృభిః. 12**

**తా.** ఏ రసానికి ఏ జాతి స్వరం విధింపబడిందో ఆ జాతిలోని బలీయమైన స్వరాన్ని, గాయకులు, అధికంగా, ఆ సమయంలో ఉపయోగించాలి.

**మూ. మధ్యపఞ్చమభూయిష్ఠం గానం శృఙ్గారహాస్యయోః,**
**షడ్జర్షభప్రాయకృతం వీరరౌద్రాద్భుతేషు చ. 13**

**గాన్ధారసప్తమగ్రామం కరుణే గానమిష్యతే,**
**తథా ధైవతభూయిష్ఠం బీభత్సే చ భయానకే. 14**

**తా.** శృంగారహాస్యాలలో గానం మధ్యపంచమభూయిష్ఠంగా, అనగా మధ్య - పంచమస్వరాల ప్రయోగం అధికంగా ఉన్నదిగా, జరగాలి. వీరరౌద్ర - అద్భుతాలలో గానం షడ్జ - ఋషభ భూయిష్ఠంగాను, కరుణరసంలో గాంధార - నిషాదభూయిష్ఠం గాను, బీభత్సభయానకాలలో ధైవతభూయిష్ఠంగాను ఉండాలి.

**మూ. సర్వేష్వంశేషు స్వరాః నియమోక్తవిధానేన సంప్రయోక్తవ్యాః,**
**కాకల్యన్తరవిహితా విశేషయుక్తాస్తు బలవన్తః. 15**

**తా.** అంశస్వరా లన్నింటిలోను స్వరప్రయోగం శాస్త్రోక్తనియమానుసారం కాకలీ స్వరాలను, అంతరస్వరాలను ఉపయోగిస్తూ జరగాలి. అవసరమైనప్పుడు స్వరాలను సబలంగా ఉపయోగించాలి.

**మూ. ఏవమేతా బుధైర్జ్ఞేయా జాతయో నాట్యసంశ్రయాః,**
**పాఠ్యప్రయోగవిహితాన్ స్వరాంశ్చైవ నిబోధత. 16**

**తా.** నాట్యప్రయోగంలో, జాతిస్వరాల ప్రయోగం ఇలా ఉండా లని బుధులు తెలుసుకోవాలి. ఇప్పుడు పాఠ్యప్రయోగంలో ఏ స్వరం ఉపయోగించాలో తెలిసికొనండి.

**మూ. హాస్యశృఙ్గారయోః కార్యౌ స్వరౌ మధ్యమపఞ్చమౌ,**
**షడ్జర్షభౌ చ కర్తవ్యౌ వీరరౌద్రాద్భుతేష్వథ. 17**

**గాన్ధారశ్చ నిషాదశ్చ కర్తవ్యౌ కరుణే రసే,**
**ధైవతశ్చ ప్రయోక్తవ్యో బీభత్సే సభయానకే. 18**

**తా.** హాస్యశృంగారాలలో మధ్యమపంచమస్వరాలు, వీర - రౌద్ర - అద్భుత రసాలలో షడ్జ - ఋషభాలూ, కరుణరసంలో గాంధారనిషాదాలు, బీభత్స - భయానక రసాలలో ధైవతము ప్రయోగించాలి.

**మూ. అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి వర్ణాలఙ్కారలక్షణమ్,**
**ఆరోహీ చావరోహీ చ స్థాయిసంచారిణీ తథా. 19**

**వర్ణాశ్చత్వార ఏవైతే అలఙ్కారాస్తదాశ్రయాః.**

**తా. వర్ణ - అలంకారాలు :-** ఇటుపైన వర్ణాల లక్షణాలు, అలంకారాల లక్షణాలు

చెపుతాను. ఆరోహి, అవరోహి, స్థాయి, సంచారి అని వర్ణాలు నాలుగు. అలంకారాలు వాటిని ఆశ్రయించుకొని ఉంటాయి.

**మూ. ఆరోహన్తి స్వరా యత్ర ఆరోహీతి స భణ్యతే. 20**
**యత్ర చైవావరోహన్తి సోఽవరోహీతి సంజ్ఞితః,**
**స్థిరాః స్వరాః సమా యత్ర స్థాయీ వర్ణః స ఉచ్యతే**
**సఞ్చరన్తి స్వరా యత్ర స సఞ్చారీతి సంజ్ఞితః. 21**

**తా.** స్వరాలు ఆరోహణం చేసే వర్ణం **ఆరోహి**; అవరోహణం చేసేది **అవరోహి**. స్వరాలు సమంగాను, స్థిరంగాను ఉన్న వర్ణం స్థాయి. స్వరాల సంచారం ఉన్న వర్ణం సంచారి.

**మూ. శారీరస్వరసంభూతాస్త్రిస్థానగుణగోచరాః,**
**చత్వారో లక్షణోపేతాః వర్ణా హ్యేతే ప్రకీర్తితాః. 22**

**తా.** పైన చెప్పిన లక్షణాలతో కూడిన ఈ నాలుగు వర్ణాలు శరీరంనుండి (కంఠం నుండి) బయల్వెడలే స్వరాలనుండి పుడతాయి. తమ తమ గుణాలతో హృదయము, కంఠము, శిరస్సు అను మూడు స్థానాలతో సంబంధించి, వాటినుండి ప్రకటమౌతాయి.

**మూ. పదం లక్షణసంయుక్తం యదా వర్ణోఽనుకర్షతి,**
**తదా వర్ణస్య నిష్పత్తిర్విజ్ఞేయా స్వరసంభవా. 23**

**తా.** లక్షణాలతో కూడిన పదాన్ని (గీతాన్ని) వర్ణం లాగినపుడు, వర్ణం స్వరంవల్ల పుడుతుంది అను విషయం తెలుసుకోవలి.

**మూ. ఏతే వర్ణాస్తు విజ్ఞేయాశ్చత్వారో గానయోగతః,**
**ఏతాన్ సమాశ్రితాన్ సమ్యగలంకారాన్ నిబోధత. 24**

**తా.** ఈ నాలుగు వర్ణాలను, గానంతో వీటి కున్న సంబంధాన్నీ గుర్తించాలి. ఈ వర్ణాలను ఆశ్రయించి ఉన్న అలంకారాలను గూర్చి తెలుసుకొనండి.

**మూ. ప్రసన్నాదిః ప్రసన్నాన్తః ప్రసన్నాద్యన్త ఏవ చ,**
**ప్రసన్నమధ్యశ్చ సమో బిన్దుర్వేణుస్తథైవ చ. 25**

**సన్నివృత్తః ప్రవృత్తశ్చ కమ్పితః కుహరస్తథా,**
**రేచితాఖ్యస్తథా చైవ ప్రేఙ్ఖోలితక ఏవ చ. 26**

**మన్ద్రతారప్రసన్నశ్చ తారమన్ద్రప్రసన్నకః,**
**ప్రస్వారశ్చ ప్రసాదశ్చ తథోద్వాహిత ఏవ చ. 27**

**అవలోకితః క్రమశ్చ స్యాన్నిష్కూజితక ఏవ చ,**
**ఉద్గీతో హ్రాదమానశ్చ రఞ్జితశ్చ తథా పరః. 28**

**ఆవర్తకాఖ్యో విజ్ఞేయః పరివర్తక ఏవ చ,**
**ఉద్ఘట్టితస్తథాక్షిప్తః సంప్రదానస్తథాపరః. 29**

**హసితాఖ్యోఽథ హుంకారః సన్ధిప్రచ్ఛాదనస్తథా**
**విధూనాఖ్యస్తథా జ్ఞేయో గాత్రవర్ణస్తథైవ చ**
**ప్రస్తారశ్చ ప్రసాదశ్చ స్థాయివర్ణసమాశ్రయాః. 30**

**తా. స్థాయివర్ణాశ్రిత అలంకారాలు :–** ప్రసన్నాది, ప్రసన్నాంతము, ప్రసన్నాద్యంతము, ప్రసన్నమధ్యము, కుహరము, రేచితము, ప్రేంఖోలితము, మంద్రతార ప్రసన్నము, తారమంద్రప్రసన్నము, ప్రస్తారము, ప్రసాదము, ఉద్వాహితము, అవలోకితము, క్రమము, నిష్కూజితకము, ఉద్గీతము, హ్రాదమానము, రంజితము, ఆవర్తకము, పరివర్తకము, ఉద్ఘట్టితము, ఆక్షిప్తము, సంప్రదానము, హ్రసితము, హుంకారము, సంధి ప్రచ్ఛాదనము, విధూనము, గాత్రవర్ణము, ప్రస్తారము, ప్రసాదము – ఇవి స్థాయివర్ణాన్ని ఆశ్రయించుకొని ఉండే అలంకారాలు.

**మూ. అథ సఞ్చారిజాన్ భూయః కీర్త్యమానాన్ నిబోధత,**
**మన్ద్రతారప్రసన్నాదిః బిన్దుః ప్రేఙ్ఖోలితస్తథా. 31**

**సంనివృత్తప్రవృత్తశ్చ రేచితః కమ్పితః సమః,**
**కుహరశ్చైవ వేణుశ్చ రఞ్జితో వ్యవలోకితః. 32**

**ఆవర్తకపరావృత్తౌ జ్ఞేయాః సఞ్చారిణస్తథా.**

**తా. సంచారివర్ణాశ్రితాలంకారాలు :–** ఇపుడు సంచారివర్ణజా లైన అలంకారాలను గూర్చి చెపుతున్నాను – మంద్రతారము, ప్రసన్నాది, బిందువు, ప్రేంఖోలితము, సన్నివృత్తము, ప్రవృత్తము, రేచితము, కంపితము, సమము, కుహరము, వేణువు, రంజితము, అవలోకితము, ఆవర్తకము, పరావృత్తము – ఇవి సంచారివర్ణాశ్రితాలంకారాలు.

**మూ. నిష్కర్షోఽత్యుచ్చయశ్చైవ హసితం బిన్దురేచితమ్,**
**ప్రేఙ్ఖోలితం తథాక్షిప్తం విధూనోద్ఘట్టితం తథా. 33**

**హ్రాదమానః సంప్రదానం సన్ధిప్రచ్ఛాదనం తథా,**
**ప్రసన్నాదిః ప్రసన్నాన్త ఇతి చారోహిణః స్మృతాః. 34**

**తా. ఆరోహివర్ణాలంకారాలు :–** నిష్కర్షము, అత్యుచ్చయము, హసితము, బిందువు, రేచితము, ప్రేంఖోలితము, ఆక్షిప్తము, విధూనము, ఉద్ఘట్టితము, హ్లాదమానము,

సంప్రదానము, సంధిప్రచ్ఛాదనము, ప్రసన్నాది, ప్రసన్నాంతము - ఇవి ఆరోహివర్ణా లంకారాలు.

**మూ. విధూనో గాత్రవర్ణశ్చ తథోద్వాహిత ఏవ చ,**
**ఉద్గీతశ్చ తథా వేణురిత్యేతే హ్యవరోహిణః. 35**

**తా. అవరోహివర్ణాలంకారాలు :-** విధూనము, గాత్రవర్ణము, ఉద్వాహితము, ఉద్గీతము, వేణువు - ఇవి అవరోహివర్ణాలంకారాలు.

**మూ. సప్తరూపగతా జ్ఞేయా అలఙ్కారాస్త్విమే బుధైః,**
**నేష్యన్తే హి ధ్రువాస్వేతే జాతివర్ణప్రకర్షణాత్. 36**

**తా.** ఈ అలంకారాలు సప్తరూపగీతాలకు సంబంధించినవి. వీటిలో జాతిస్వరాలను దీర్ఘంగా లాగడం ఉంటుంది గాన ఇవి ధ్రువగానంలో ఉపయోగించకూడదు. (సప్త గీతాలనుగూర్చి మున్ముందు తెలియగలదు).

**మూ. బిన్దుర్వాపి హి వేణుర్వా యే చాన్యేఽపి ప్రకీర్తితాః,**
**తే ధ్రువాణాం ప్రయోగేషు న కార్యాః స్వప్రమాణతః. 37**

**యస్మాదర్థానురూపా హి ధ్రువా కార్యార్థదర్శికా,**
**వర్ణానాం తు పునః కార్యం కృశత్వం పదసంశ్రయమ్. 38**

**తా.** ఇక్కడ చెప్పిన బిందువు, వేణువు మొదలైన వాటిని వాటికి చెప్పిన ప్రమాణాలతో ధ్రువాగానంలో ప్రయోగించకూడదు. ఎందువల్ల ననగా - ధ్రువాగీతి అర్థానికి అనుగుణంగా ఉంటూ జరుగుతూన్న, జరుగబోతూన్న అర్థాన్ని (విషయాన్ని) బోధించేదిగా రచింపబడుతుంది. వర్ణాలైతే పదాలను దుర్బలం చేస్తాయి. అందుచేత అర్థం స్పష్టంగా తెలియదు గాన వాటిని అర్థబోధప్రధానమైన ధ్రువలో ఉపయోగించకూడ దని భావం.

**మూ. యేఽత్ర ప్రయోగే గచ్ఛన్తి తాంశ్చ వర్ణాన్ నిబోధత,**
**ప్రసన్నాది ప్రసన్నాన్తః ప్రసన్నాద్యన్త ఏవ చ. 39**

**తథా ప్రసన్నమధ్యశ్చ బిన్దుః కమ్పితరేచితౌ,**
**తారశ్చ తారమన్ద్రశ్చ తథా తారతరః పునః. 40**

**ప్రేఙ్ఖోలితస్తథా మన్ద్రో మన్ద్రతారః సమస్తథా,**
**స్యాన్నివృత్తః ప్రవృత్తశ్చ ప్రసాదోఽపాఙ్గ ఏవ చ. 41**

**అవలోకస్తథా వేణురిత్యేతే సర్వవర్ణగాః,**
**స్థాయివర్ణాదృతే త్వన్యే సర్వవర్ణాః ప్రయోగినః**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి వర్ణాలఙ్కారలక్షణమ్.**

**తా.** ఎక్కువ ప్రయోగంలో ఉండే వర్ణా లేవో చెపుతాను; వినండి –

ప్రసన్నాది, ప్రసన్నాంతము, ప్రసన్నాద్యంతము, ప్రసన్నమధ్యము, బిందువు, కంపితము, రేచితము, తారము, తారమంద్రము, తారతరము, ప్రేంఖోలితము, మంద్రము, మంద్రతారము, సమము, నివృత్తము, ప్రవృత్తము, ప్రసాదము, అపాంగము, అవలోకము, వేణువు – ఇవి అన్ని వర్ణాలకు సంబంధించిన అలంకారాలు. స్థాయివర్ణాలు తప్ప మిగిలిన అన్ని వర్ణాలలోను ఈ అలంకారాల ప్రయోగం ఉంటుంది.

ఇటుపైన వర్ణాల లక్షణాలు అలంకారలక్షణాలు చెపుతాను.

**మూ. క్రమశో దీప్యతే యస్తు ప్రసన్నాదిః స కథ్యతే,**
**వ్యస్తోచ్చరిత ఏవైష ప్రసన్నాన్తోఽ భిధీయతే. 43**

**తా.** క్రమంగా, మెల్ల మెల్లగా ఉద్దీప్త మయేది, పెరిగేది **ప్రసన్నాది**. దీనికి విరుద్ధ మైనది, అనగా ప్రారంభంలోనే దీప్తమై క్రమంగా తగ్గేది **ప్రసన్నాంతకం**.

**మూ. ఆద్యన్తయోః ప్రసదనాత్ ప్రసన్నాద్యన్త ఇష్యతే,**
**ప్రసన్నమధ్యో మధ్యే తు ప్రసన్నత్వాదుదాహృతః. 44**

**తా.** ఆద్యంతాలలో ప్రసదనంవల్ల కింది స్థాయిలో (low pitch లో) ఉన్నది **ప్రసన్నాద్యంతం.** మధ్యలో ప్రసన్నంగా (low pitch) ఉన్నది **ప్రసన్నమధ్యం**.

**మూ. సర్వసామ్యాత్ సమో జ్ఞేయః స్థిరస్త్వేకస్వరోఽపి యః,**
**బిన్దురేకకలస్తారః స్పృష్ట్వా చ పునరాగతమ్. 45**

**స్యాన్నివృత్తః ప్రవృత్తశ్చ మన్ద్రం గత్వా సమాగతః,**
**ఆక్రీడితలయో యశ్చ స వేణుః పరికీర్తితః**
**కణ్ఠే నిరుద్ధపవనః కుహరో నామ జాయతే. 46**

**తా.** అన్నీ సమంగా ఉన్నప్పుడు అది **సమం**. ఒక వర్ణంలో ఉన్నది **స్థిరం**. ఒక్క కల ప్రమాణంలో ఉన్నది **బిందువు**. తారస్థానాన్ని చేరి క్రిందికి దిగినది **నివృత్తం.** మన్ద్రస్థాయి స్పృశించి తిరిగి వచ్చినది **ప్రవృత్తం**. లయతో క్రీడించేది **వేణువు**. గాలిని కంఠంలో నిరోధించేది **కుహరం**.

**మూ. త్రికలాకమ్పనాత్ తద్వద్రేచితాఖ్యః శిరోగతః,**
**ఉరోగతః కమ్పితః స్యాత్ కమ్పనాత్తు కలాత్రయమ్.**
**గతాగతప్రవృత్తో యః స ప్రేఙ్ఖోలిత ఉచ్యతే**
**యస్తు కణ్ఠే స్వరోఽథ స్యాత్ స తు తారః ప్రకీర్తితః. 48**

**ఉరోగతస్తథా మన్ద్రో మూర్ధ్ని తారతరః స్మృతః,**
**క్రమాగతస్తు యస్తారః షష్ఠః పఞ్చమ ఏవ వా.** **49**

**తారమన్ద్రః ప్రసన్నస్తు జ్ఞేయో మన్ద్రగతిశ్చ సః,**
**లఙ్ఘయిత్వా పరాన్ మన్ద్రాన్ క్రమాత్ తారగతిం గతః,**
**మన్ద్రతారప్రసన్నశ్చ విజ్ఞేయో హ్యవరోహణాత్.** **50**

**తా.** శిరస్సుదాకా వచ్చి మూడు కలల కాలం కంపితమైన స్వరం **రేచితం**. ఉరోభాగంలోనే మూడు కలల కాలం కంపింపబడినది **కంపితం**. పైకి వెడుతూ, క్రిందికి వస్తూ పైకీ క్రిందికీ ఊగేది **ప్రేంఖోలితం**. కంఠంలో నిలచిన స్వరం **తారం**. ఉరః స్థానంలో ఉన్నది **మంద్రం**. శిరస్సులో నిలచిన స్వరం **తారతరం**. ఒక కలాకాలంలో ఐదవ స్వరం లేదా ఆరవస్వరం మెల్లగా కిందికి దిగితే అది **తారమంద్రప్రసన్నం**. ఒక 'కలా'కాలంలో ఐదు లేదా ఆరు స్వరాలు మెల్లగా మంద్రస్థాయి నుంచి, ఇతర స్వరాలను దాటివేస్తూ తారస్థాయికి చేరి క్రిందికి దిగితే అది **మంద్రతారప్రసన్నం**.

**మూ. ఏకస్వరాధిరూఢః క్రమశః ప్రస్వారసంజ్ఞితో జ్ఞేయః,**
**ప్రస్వారస్తునివృత్తః శనైః ప్రసన్నః ప్రసాదః స్యాత్.** **51**

**తా.** ఒకే స్వరంతో మెల్ల మెల్లగా తారస్థాయికి చేరితే అది **ప్రస్వారం**. అక్కడినుండి మెల్లగా క్రింది దిగితే **ప్రసాదం**.

**మూ. అపాఙ్గికస్తు విజ్ఞేయః స్వరాణామథ సఞ్చరాత్,**
**సమనన్తరౌ స్వరౌ ద్వౌ విచరత్యుద్వాహితో ద్వికల ఏవ,**
**ఆరోహత్యేకకలాం పునరేకకలాం ప్రసాదయతి.** **52**

**తా.** స్వరాల సంచారం చేస్తే అది **అపాంగికం**. దగ్గరగా రెండు స్వరాలతో ఒక కలాకాలం ఆరోహణం చేసి మరొక కలాకాలం మంద్రంలోనికి దింపి ఉంచితే అది **ఉద్వాహితం**.

**మూ. ఉద్వాహిత ఏవ స్యాదవలోకితసంజ్ఞతో ద్విరభ్యస్తః,**
**ఏకం ద్వౌ త్రీన్ గచ్ఛన్ స్వరాన్ క్రమేణ క్రమో జ్ఞేయః.** **53**

**తా.** ఉద్వాహితాన్నే రెండు పర్యాయాలు ఆవృత్తిచేస్తే అది **అవలోకితం**. ఒకటి, రెండు లేదా మూడు స్వరాలు ఆరోహావరోహాలు క్రమంగా చేస్తే అది **క్రమం**.

**మూ. ఏకాన్తరమారుహ్య ప్రత్యేత్యేకాన్తరం స్వరో యస్తు,**
**నిష్కూజితసంజ్ఞోఽసౌ జ్ఞేయః సూరిభిరలఙ్కారః.** **54**

**తా.** ఒక స్వరం మరొకస్వరాన్ని లంఘించి ఆరోహణం చేసి తిరిగి అవరోహణం చేస్తే అది **నిష్కూజితం** అను అలంకారం.

**మూ. ఆదావారోహీ స్యాత్ ప్రస్వారోఽన్తేఽవరోహీ చ,**
**యత్ర క్రమాత్ కలాసు వదన్త్యలఙ్కారముద్గీతమ్. 55**

**తా.** 'ప్రస్వారం' అను అలంకారానికి సంబంధించిన ప్రక్రియలో, కొన్ని కలాకాలాలలో, ముందు ఆరోహిగా చేసిన స్వరాన్ని చివర అవరోహిగా చేస్తే అది **ఉద్గీతాలంకారం**.

**మూ. క్రమయోగేనానేన తు సఞ్చార్యేకాన్తరస్వరో ద్వికలమ్,**
**ద్వ్యవరః షట్పద ఏవ హ్యారోహీ హ్రాదమానః స్యాత్. 56**

**తా.** ఉద్గీతంలో చెప్పిన క్రమంలోనే రెండు కలలలో, కనీసం రెండు స్వరాలతో ప్రారంభించి ఆరుకు మించకుండా స్వరాల వరకు ఆరోహణం చేస్తే **హ్రాదమానం**.

**మూ. అథ రఞ్జితస్తు సమనన్తరస్వరే ద్వే కలే పునః స్థిత్వా,**
**అర్ధకలామారోహీ పునరేవ తథాఽవరోహీ స్యాత్. 57**

**తా.** సమీపంలో ఉన్న స్వరంమీద రెండు కలల కాలం నిలిచి, అర్ధకల పాటు ఆరోహణం చేసి, మళ్లీ అవరోహం చేస్తే అది **రంజితం**.

**మూ. ఆవర్తకశ్చతుర్షు స్వరేషు సమనన్తరేషు సంభవతి,**
**ఆరోహణావరోహణవిధినా చైకాన్తరేష్వపి చ. 58**

**జ్ఞేయో నిరన్తరకృతస్త్వష్టకలః సాన్తరస్తథా కార్యః,**
**తద్జ్ఞైః కలాశ్చతస్రస్త్వావృత్త్యావర్తకో భవతి. 59**

**తా.** నాలుగు సమీపస్థస్వరాలలో క్రమంగా, సాంతరస్వరంమీద ఆరోహణ అవరోహణాలు, నాలుగు కలాసమయాల అంతరంలో జరిగితే ఇది ఆవృత్తి ద్వారా ఏర్పడిన **'ఆవర్తనం'** అనే అలంకారం. ఇది అంతరం లేకుండాను అంతరంతోనూ కూడ చేయవచ్చు. నిరంతరంగా చేసేది అష్టకలాకాలంలోను, అంతరం ఉన్నదానిని చతుష్కలాకాలంలో సంచారంతోను చెయ్యాలి.

**మూ. అధిరుహ్య చ స్వరాం స్త్రీన్ స్వరాన్తరం లఙ్ఘయతి చ తదృత్తౌ,**
**పునరపి చ పరావృత్త్యా స స్యాత్ పరివర్తకోఽష్టకలః. 60**

**తా.** మూడు స్వరాల ఆరోహణం చేసి, స్వరాంతరం లంఘించి, పరివర్తనం చేసి వెనుకకు రావాలి. ఈ పరివర్తనం అష్టకలాకాలావధిలో జరగాలి. ఇది **పరివర్తకం**.

**మూ. యస్య స్వరావతీతౌ తథాపరం హ్యన్తరస్వరో భవతి,**
**ఏకకలం చైవ తథా స భవేదుద్ఘట్టితో నిత్యమ్. 61**

**తా.** రెండు స్వరాలు పూర్తి అయిన తరువాత ఎదర నున్న స్వరం అంతరస్వరం అయితే అది **ఉద్ఘట్టితం**. దీని ప్రమాణం ఏకకలకాలం.

**మూ. ఆక్షిప్తస్త్రిస్వరజః కర్తవ్యః షడ్విధః కలామాత్రః,**
**ఏకకలస్త్వధరః స్యాత్ విజ్ఞేయః షట్కలస్తు సః. 62**

**తా.** మూడు స్వరాలనుండి పుట్టి, షట్కలాకాలావధి గలది **ఆక్షిప్తం**. ప్రథమస్వరం ఏకకలామాత్రప్రమాణం గలదై మిగిలిన స్వరాలు షట్కలాకాలప్రమాణంలో ఉంటాయి.

**మూ. ఆక్షిప్తకశ్చతుర్భిః స్వరైస్తు కాలే కలాన్తరోపేతైః,**
**ఏకాన్తరస్వరక్రమ ఇహ గదితః సమ్ప్రదానస్తు. 63**

**తా.** ఆక్షిప్తంలో చెప్పిన నాలుగు స్వరాల సమూహం ఒక కలాకాలం అంతరంతో ప్రాప్తించగా ఒక స్వరం అంతరాన్ని విడిచి క్రమపూర్వకంగా స్థాపించి నట్లయితే అది **సంప్రదానం**.

**మూ. ద్విరపి ద్వికలం గదితం హసితమివోచ్చరితం తథా హసితమ్,**
**సమనన్తరస్వరకృతం చాక్షిప్తకమివ బుధైర్ జ్ఞేయమ్. 64**

**తా.** రెండేసి కలల రెండు స్వరాలను నవ్వుతున్నట్లు రెండు పర్యాయాలు ఉచ్చ రించడం **హసితం**. ఒక స్వరం అంతరంతో ఆక్షిప్తకంలోవలె స్వరప్రయోగం ఉంటుంది.

**మూ. సమనన్తరస్వరేషు చ హసితవద్ ద్వ్యవరశ్చతుష్పరో వాపి,**
**ఆరోహత్యేకకలాం హుంకారాఖ్యః స విజ్ఞేయః. 65**

**తా.** హసితంలో వలెనే దగ్గర నున్న స్వరంమీద, రెండు లేదా నాలుగు స్వరాల తరువాత, ఒక కలాకాలం అవధిలో ఆరోహం జరిగితే అది **హుంకారం**.

**మూ. స్థానాన్తరమారుహ్య ప్రత్యేతి తతశ్చతుష్కలం క్రమశః,**
**నోర్ధ్వపరిక్షేపః, స్యాత్ సన్ధిప్రచ్ఛాదనం నామ. 66**

**తా.** దగ్గర నున్న మరొక స్వరంమీద ఆరోహణ చేసి, అక్కడినుండి, నాలుగు కలల అవధిలో అవరోహం జరిగితే అది **సంధిప్రచ్ఛాదనం**. దీనిలో పైకి పరిక్షేపం ఉండదు.

**మూ. ఆదౌ పదముత్పాద్య తు యత్ర స్యాద్విస్వరే లఘుని వర్ణే,**
**సమనన్తరమారోహత్యేకకలం తద్ విధూననం తు. 67**

**తా.** ముందు పదం ప్రారంభించి, రెండు స్వరాలు గల లఘువైన వర్ణంమీద నిలిచి వెంటనే దాని తరువాత ఒక కలాకాలం ఆరోహం చేస్తే అది **విధూననం**.

**మూ. ఓంకారవదారోహేదనన్తరం తు స్వరం కలాన్తరయోః,**
**ద్వౌ ద్వౌ ప్రకమ్ప్యమానౌ స్వరౌ తతశ్చ ప్రసన్నౌ ద్వౌ. 68**

**ఏషోఽలఙ్కారవిధౌ విజ్ఞేయో గాత్రవర్ణ ఇత్యేవ,**
**ఏకారౌకారస్తథా దీర్ఘాక్షరమన్యదపి యోజ్యమ్. 69**

**తా.** అనంతరస్వరాల కలాంతరాలలో ఓంకారం వలె ఆరోహణావరోహణలు చేసి, రెండు ప్రకంపితస్వరాల తరువాత రెండు స్వరాలు మంద్రంగా చేసినట్లయితే ఇది గాత్రవర్ణం అవుతుంది. దీనికి ఓకారైకారాలు ఇతరదీర్ఘాక్షరాలూ చేర్చాలి.

**మూ. గీతాలఙ్కారాణాం కరణవిధిరయం యథావదుపదిష్టః,**
**ఏభిరలఙ్కర్తవ్యా గీతిర్వర్ణావిరోధేన. 70**

**తా.** గీతాలకు సంబంధించి అలంకారాల విధానం ఇంతవరకు చెప్పాను. వర్ణాలకు విరోధం కలగకుండా ఈ అలంకారాలతో గీతిని అలంకరించాలి.

**మూ. స్థానే చాలఙ్కారం కుర్యాన్న హ్యురసి కాఞ్చికాం బధ్యేత్,**
**అతిబహవోఽలఙ్కారా వర్ణవిహీనా న యోక్తవ్యాః. 71**

**తా.** అలంకారాన్ని తగిన స్థానంలోనే అమర్చాలి. వడ్డాణం వక్షఃస్థలానికి కట్టరు కదా! వర్ణాలు లేకుండా చాలా అలంకారాలు కూర్చకూడదు.

**మూ. ఏవమేతే హ్యలఙ్కారా విజ్ఞేయాః వర్ణసంశ్రయాః,**
**అథ గీతీః ప్రవక్ష్యామి ఛన్దోక్షరసమన్వితాః. 72**

**తా.** ఈ విధంగా వర్ణాలకు సంబంధించిన అలంకారాల లక్షణాలు తెలుసుకోవాలి. ఇప్పుడు ఛందస్సులతో, అక్షరాలతో కూడిన గీతులను చెపుతాను.

**మూ. శశినా రహితేవ నిశా విజలేవ నదీ లతా విపుష్పేవ,**
**అవిభూషితేవ చ స్త్రీ గీతిరలఙ్కారహీనా స్యాత్. 73**

**తా.** చంద్రుడు లేని రాత్రి వలె, నీళ్లు లేని నది వలె, పువ్వులు లేని లత వలె, అలంకరించుకొనని స్త్రీ వలె అలంకారాలులేని గీతి శోభించదు.

**మూ. అలఙ్కారాస్త్రయస్త్రింశదేవమేతే మయోదితాః,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి గీతానామపి లక్షణమ్. 74**

**తా.** నే నీవిధంగా ముప్పైమూడు అలంకారాలు చెప్పాను. ఇటుపైన గీతుల లక్షణం చెపుతాను.

**మూ. ప్రథమా మాగధీ జ్ఞేయా ద్వితీయా త్వర్ధమాగధీ,**
**సంభావితా తృతీయా చ చతుర్థీ పృథులా స్మృతా. 75**

**తా.** మాగధి, అర్ధమాగధి, సంభావిత, పృథుల అని గీతిలో నాలుగు భేదా లున్నాయి.

**మూ. భిన్నవృత్తిప్రగీతా యా సా గీతిర్మాగధీ స్మృతా,**

**అర్ధకాలనివృత్తా చ విజ్ఞేయా త్వర్ధమాగధీ.** **76**

**తా.** వేరువేరు వృత్తులతో (లయలతో) గానం చేసే గీతి **మాగధి**. మాగధికి పట్టే సమయంలో సగం సమయం పట్టేది **అర్ధమాగధి.**

**వి.** 'వృత్తి' శబ్దం పారిభాషికం. వీణాదివాదనానికీ, గానానికీ సంబంధించిన ఒక విశిష్టమైన శైలి. మున్ముందు మూలంలోనే స్పష్టం చేయబడుతుంది.

**మూ. సమ్భావితా చ విజ్ఞేయా గుర్వక్షరసమన్వితా,**
**లఘ్వక్షరకృతా యా తు పృథులా సంప్రకీర్తితా.** **77**

**తా.** గురువులైన అక్షరాలు అధికంగా ఉండేది **సంభావిత**. లఘువులు చాలా ఉన్నది **పృథుల.**

**మూ. ఏతాస్తు గీతయో జ్ఞేయా ధ్రువాయోగం వినైవ హి,**
**గాన్ధర్వ ఏవ యోజ్యాస్తు నిత్యం గానప్రయోక్తృభిః.** **78**

**తా.** ఈ గీతులను ధ్రువాగానంలో ప్రయోగించకూడదు. గానప్రయోక్తలు (నటీనటాదులు) ఈ గీతులను 'గాంధర్వం'లోనే ప్రయోగించాలి.

**మూ. గీతయో గదితాః సమ్యగ్ ధాతూంశ్చైవ నిబోధత,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి ధాతువాద్యస్య లక్షణమ్.** **79**

**తా.** గీతులను చెప్పాను. ఇపుడు ధాతువులను, తరువాత వాద్యధాతువులను గూర్చి చెపుతాను.

**వి.** వీణలోని కొన్ని తీగలను కొన్ని వేళ్లతో మీటడం చేత కలిగే ధ్వనివిశేషాలు **'ధాతువులు'** (అభినవభారతి).

**మూ. విస్తారః కరణం చైవ వ్యావిద్ధో వ్యఞ్జనస్తథా,**
**చత్వారో ధాతవో జ్ఞేయా వాదిత్రకరణాశ్రయాః.** **80**

**తా.** వాద్యవాదనాన్ని ఆశ్రయించిన ధాతువులు – విస్తారము, కరణము, ఆవిద్ధము, వ్యంజనము అని నాలుగు విధాలు.

**మూ. సంఘాతజశ్చ సమవాయజశ్చ విస్తారజోఽనుబన్ధకృతః,**
**జ్ఞేయశ్చతుఃప్రకారో ధాతుర్విస్తారసంజ్ఞస్తు.** **81**

**తా.** విస్తార మను పేరు గల ధాతువు – సంఘాతజము, సమవాయజము, విస్తారజము, అనుబంధజము అని నాలుగు విధాలు.

**మూ. విధిర్యస్తు స్మృతస్తస్య పూర్వం విస్తార ఏవ చ,**
**సంఘాతసమవాయౌ తు విజ్ఞేయౌ తౌ ద్వికత్రికౌ. 82**

**తా.** ముందుగా చెప్పిన విస్తారమే రెండు రెట్లు, మూడు రెట్లు చేసినట్లయితే అది వరుసగా సంఘాత - సమవాయా లవుతాయి. (విస్తార మనగా వీణాతంత్రిని ఒక్క మారు మోగించుట. **"ఏకప్రహారభవో విస్తారజః"** అను లక్షణాన్ని అనుసరించి విస్తార శబ్దార్థం ప్రసిద్ధ మన్నట్లు భావించి దానికి లక్షణం చెప్పలేదు.

**మూ. పూర్వశ్చతుర్విధస్తత్ర పశ్చిమోఽష్టవిధః స్మృతః,**
**కరణానాం విశేషేణ విజ్ఞేయా వై పృథక్ పృథక్. 83**

**తా.** వాటిలో మొదటిది (సంఘాతజం) నాలుగు విధాలు. రెండవది (సమవాయజం) ఎనిమిది విధాలు. ఈ విభేదాలు కరణాల విశేషాలను బట్టి ఏర్పడుతాయి. కరణం అనగా ఇక్కడ వాదనం (Production of sound).

**మూ. అధశ్చోర్ధ్వశ్చ విజ్ఞేయావధరోత్తరజౌ స్మృతౌ,**
**సంఘాతజవిధిస్త్వేష విజ్ఞేయో వాద్యయోక్తృభిః. 84**

**తా.** క్రింది స్వరములకు అధరజము లనీ, పై స్వరాలకు ఉత్తరజము లనీ పేర్లు. సంఘాతానికి సంబంధించిన ఈ విధానాన్ని వాద్యప్రయోక్తలు బాగా గుర్తించాలి.

**మూ. ద్వావుత్తరౌ ద్విరధర స్త్వధరాదిశ్చోత్తరావసానశ్చ,**
**జ్ఞేయస్తథోత్తరాదిః పునరప్యధరావసానశ్చ. 85**

**సమవాయజస్తథా స్యాత్త్రిరుత్తరస్త్రిరధరశ్చ విజ్ఞేయః,**
**ద్వ్యధరోత్తరావసానో ద్విరుత్తరస్త్వధరాన్తస్తు. 86**

**ప్రాగుత్తరో ద్విరధరో ద్విరుత్తరావసానశ్చ,**
**మధ్యోత్తరో ద్విరధరో ద్విరుత్తరోఽప్యధరమధ్యశ్చ. 87**

**అనుబన్ధస్తు జ్ఞేయో వ్యాససమాసాత్త్వనియత ఏవ సదా,**
**ఏవం చతుర్దశవిధో నిత్యం విస్తారధాతుః స్యాత్. 88**

**తా.** (ఉత్తరం అనగా ఉత్తరప్రహారం, వీణాతంత్రులను బలంగా మోగించడం (strong stroke). అధరం అనగా అధరప్రహారం. వీణాతంత్రులను మందంగా మోగించడం (mild stroke) (1) రెండు ఉత్తరప్రహారాలు (2) రెండు అధర ప్రహారాలు (3) ఉత్తరాధరప్రహారాలు (strong mild strokes) (4) అధర - ఉత్తరప్రహారాలు (mild strong strokes) - ఈ విధంగా సంఘాతజ విస్తారం నాలుగు విధాలు. సమవాయజ విస్తారంలోని భేదాలు - (1) మూడు ఉత్తర ప్రహారాలు; (2) మూడు

అధరప్రహారాలు ; (3) రెండు అధరప్రహారాలు – ఒక ఉత్తర ప్రహారం; (4) రెండు ఉత్తర ప్రహారాలు – ఒక అధరప్రహారం ; (5) ఒక ఉత్తరప్రహారం – రెండు అధర ప్రహారాలు; (6) ఒక అధర ప్రహారం – రెండు ఉత్తరప్రహారాలు; (7) ఒక అధరప్రహారం – ఒక ఉత్తరప్రహారం – ఒక అధరప్రహారం ; (8) ఒక ఉత్తర ప్రహారం – ఒక అధరప్రహారం – ఒక ఉత్తర ప్రహారం.

పైన చెప్పిన ప్రహారాలను వ్యస్తాలు చేయడంవల్లా కలపడంవల్లా అనిశ్చిత రూపంలో ఉండడం అనుబంధజం. ఈ విధంగా విస్తారధాతువు పద్నాలుగు విధాలు.

**మూ. రిభితోచ్ఛయనీరటితో హ్రాదస్తథానుబన్ధశ్చైవ క్రమాత్,**
**పఞ్చవిధో విజ్ఞేయో వీణావాద్యే కరణధాతుః. 89**
**త్రికపఞ్చక సప్తకనవకవధాతుయుతో యథాక్రమం విహితః,**
**సర్వైరనుబన్ధకృతైర్గుర్వన్తః స్యాత్ కరణధాతుః. 90**

**తా. కరణధాతువు :–** వీణావాద్యంలో, కరణధాతువు – రిభితము, ఉచ్ఛయము, నీరటితము, హ్రాదము, అనుబంధము అని ఐదు విధాలు. వీటిలో వరుసగా మూడు, ఐదు, ఏడు, తొమ్మిది ప్రహారాలు, వీటి అన్నింటి కలయికచేత ఏర్పడిన అనుబంధము, చివర గురువు ప్రయోగము ఉంటాయి.

**మూ. క్షేపప్లుతాతిపాతోఽతికీర్ణానుబన్ధసంజ్ఞితాశ్చేతి,**
**ఆవిద్ధో విజ్ఞేయో ధాతుర్వై పఞ్చవిధ ఏవ. 92**
**ద్విత్రిచతుష్కైర్నవకైః ప్రహారైః క్రమశః కృతైః,**
**ఆవిద్ధధాతుర్విజ్ఞేయస్త్వనుబన్ధవిభూషితః. 93**

**తా. ఆవిద్ధము :–** క్షేపము, ప్లుతము, అతిపాతము, అతికీర్ణము, అనుబంధము అని ఆవిద్ధధాతువు ఐదు విధాలు. మొదటి నాలిగింటిలో వరుసగా రెండు, మూడు, నాలుగు తొమ్మిది ప్రహారాలు, అనుబంధంలో ఈ వివిధప్రయోగాల సంయోగమూ ఉంటాయి.

**మూ. వ్యఞ్జనధాతుర్ జ్ఞేయః కలతలనిష్కోటితం తథోన్మృష్టమ్,**
**రేఫావమృష్టపుష్పానుస్వనితం బిన్దురనుబన్ధః. 93**

**తా. వ్యంజనధాతువు :–** కలము, తలము, నిష్కోటితము, ఉన్మృష్టము, రేఫము, అవమృష్టము, పుష్పము, అనుస్వనితము, బిన్దువు, అనుబంధము అను పది భేదాలు గల వ్యంజనదాతువు వీణావాదనంచేత వ్యంజితమవుతుంది.

**మూ. అఙ్గుష్ఠాభ్యాం సమం తన్త్ర్యోః స్పర్శనం యత్ కలం తు తత్,**
**వామేన పీడనం కృత్వా దక్షిణేనాహతిస్తలమ్. 94**

**తా.** వీణాతంత్రులను రెండు అంగుష్ఠాలతో స్పృశించడం **కలం**. ఎడమచేతి అంగుష్ఠంతో తంత్రిని అదిమి కుడిచేతి అంగుష్ఠంతో మోగించడం **తలం**.

**మూ. సవ్యాఙ్గుష్ఠప్రహారస్తు నిష్కోటితమిహోచ్యతే,**
**సవ్యప్రదేశినీఘాతమున్మృష్టమితి సంజ్ఞితమ్. 95**

**తా.** కుడిచేతి అంగుష్ఠంతో తీగ మోగించడం **నిష్కోటితం**. కుడి చూపుడువేలుతో (తర్జనితో) కొట్టడం **మృష్టం**.

**మూ. సర్వాఙ్గులిసమాక్షేపాద్ రేఫ ఇత్యభిధీయతే,**
**కనిష్ఠికాఙ్గుష్ఠకాభ్యాం దక్షిణాభ్యామధోగతమ్. 96**
**తన్త్రీషు త్రిప్రహారం చాప్యవమృష్టమితి స్మృతమ్.**

**తా.** అన్ని వేళ్లతోను తీగలను మీటడం **రేఫం**. కుడిచేతి కనిష్ఠికా – అంగుష్ఠాలతో క్రిందికి వంచి తీగలపై మూడు ప్రహారాలు చేయడం **అవమృష్టం**.

**మూ. కనిష్ఠాఙ్గుష్ఠసంయుక్తం పుష్పమిత్యభిధీయతే. 97**
**తలస్థానేఽధరన్యాసస్త్వనుస్వనితముచ్యతే,**
**గుర్వక్షరైరేకతన్త్ర్యాం బిన్దురిత్యభిసంజ్ఞితః. 98**

**తా.** కనిష్ఠిక – అంగుష్ఠము ఈ రెండూ కలిపి వాటితో తీగను కొట్టడం **పుష్పం**. తాలంలో చెప్పిన దానికంటె క్రింద తంత్రీ – అధఃస్థానంమీద మీటడం **అనుస్వనితం**. ఒకే తంత్రిమీద ఒకే గురువైన ఆఘాతం **బిందువు**.

**మూ. వాససమాసాదేషామనుబన్ధః సార్వధాతుకో జ్ఞేయః,**
**ఇతి దశవిధః ప్రయోజ్యః వీణాయాం వ్యఞ్జనో ధాతుః. 99**

**తా.** ఈ ధాతువులను సంక్షిప్తం చేయడం, విస్తరింపచేయడం లేదా వీటిని మిశ్రం చేయడం **అనుబంధం**. ఈ విధంగా పదివిధా లైన వ్యంజనధాతువును వీణపై వ్యంజింప చెయ్యాలి.

**మూ. ఇత్యేతే ధాతవః ప్రోక్తాశ్చత్వారో లక్షణాన్వితాః,**
**తిసౄణామపి వృత్తీనాం యాసు వాద్యం ప్రతిష్ఠితమ్. 100**

**తా.** ఈ విధంగా నాలుగు ధాతువులు, వాటిలక్షణాలు చెప్పాను. వీటిమీదనే మూడు వృత్తులు, వాటికి సంబంధించిన వాద్యము ప్రతిష్ఠితములై ఉన్నాయి.

**మూ. తిస్రో గీతవృత్తయః ప్రాధాన్యేన గ్రాహ్యాః – చిత్రా, వృత్తిః, దక్షిణా చేతి. తాసాం వాద్య – తాల – లయ – గీతి – యతి – మార్గ – ప్రాధాన్యాని యథాస్వం వ్యఞ్జకాని**

**భవన్తి. తత్ర చిత్రాయాం సంక్షిప్తవాహ్యం (మాగధీగీతిరేకకలః) తాలో ద్రుతో లయః, సమా యతిః. అనాగతగ్రహాణాం ప్రాధాన్యమ్. తథా వృత్తౌ (సంభావితా) రీతిః, వాదిత్రం, ద్వికలః, తాలో, మధ్యో లయః స్రోతోగతా (వహా) యతిః సమగ్రహమార్గాణాం ప్రాధాన్యమ్. దక్షిణాయాం (పృథులా) గీతిశ్చతుష్కస్తాలో, విలమ్బితో లయో, గోపుచ్ఛా యతిః, అతీతగ్రహమార్గాణాం ప్రాధాన్యమ్.**

**తా.** గీతంలో ప్రధానంగా – చిత్ర, వృత్తి (మార్గవృత్తి), దక్షిణ అను మూడు వృత్తులను గ్రహించాలి. వీటిలో – వాద్యము, లయము, తాలము, గీతి, యతి, మార్గము – ఇవి ప్రధానంగా, తమ స్వరూపాన్ని అనుసరించి వ్యంజకము లౌతాయి. వీటిలో, చిత్రవృత్తిలో, వాద్యాల సంక్షేపము, మాగధీగీతి, ఏకకల కాలము, ద్రుతలయము, సమగతి, అనాగతగ్రహము ఇవి ప్రధాన మైనవి. మార్గవృత్తియందు (వార్తికమార్గమునందు) 'సంభావితా' గీతి, వాదిత్రము, ద్వికలతాలము, మధ్యలయము 'స్రోతోవహా' యతి, సంగ్రహము – ఇవి ప్రధానమైనవి. దక్షిణమార్గంలో – చతుష్కలతాలము. విలంబిత లయము 'గోపుచ్ఛా' యతి ఉంటాయి. అతీత – అనాగతగ్రహాలకు ప్రాధాన్యం ఉంటుంది.

**మూ. తిస్రస్తు వృత్తయశ్చిత్రా దక్షిణావృత్తిసంజ్ఞితాః,**
**వాద్యగీతోభయగుణానిర్దిష్టాస్తా యథాక్రమమ్. 101**

**తా. 'చిత్రా' – 'దక్షిణా' – 'వృత్తి'** అను పేర్లు గల వృత్తులు మూడు. అవి వాద్యానికీ, గీతానికి రెండింటికీ కూడ గుణప్రకర్ష కలిగిస్తాయి. వాటి స్వరూపం యథాక్రమంగా చెప్పాను.

**మూ. సర్వాసామేవ వృత్తీనాం లలితాద్యాస్తు జాతయః,**
**ధాతుభిః సహ సంయుక్తా భవన్తి గుణవత్తరాః. 102**

**తా.** ఈ వృత్తుల లలితాదిజాతులతో, ధాతువులు సంయుక్తములై గుణవత్తరము లవుతాయి. అనేకమైన గుణాలను, వైశిష్ట్యాలను కలిగిస్తాయి.

**మూ. ఏతేషాం ధాతూనాం సమవాయాజ్జాతయస్తు జాయన్తే,**
**స్యాదుదాత్తలలితరిభితఘనసంజ్ఞా(శ్చతు) శ్చతస్రశ్చ. 103**

**తా.** ధాతువుల సమవాయం (కలయిక) వల్ల ఉదాత్తము, లలితము, రిభితము, ఘనము అను నాలుగు జాతు లుత్పన్నము లవుతాయి.

**మూ. తత్రోదాత్తా విస్తారధాతువిషయా బహువిషయత్వాద్వా,**
**లలితా వ్యఞ్జనహేతోర్లలితత్వాదేవ సంప్రోక్తా. 104**

**తా. ఉదాత్తజాతి** విస్తారధాతువులకు సంబంధించినది, లేదా అనేకమైన ఇతర విషయాలకు సంబంధించిది.

**లలితజాతి** వ్యంజనధాతువులకు సంబంధించినది. ఇది చాల మనోహరమైనది గాన దీనికి **లలిత** అని పేరు.

**మూ. ఆవిద్ధధాతువిషయా రిభితా ఘాతసంచయాన్నిర్దిష్టా,**
**కరణవిషయా ఘనసంజ్ఞా గురులఘుసంచయాత్తస్య.** **105**

**తా. రిభితజాతి** ఆవిద్ధధాతువులకు సంబంధించినది. దీనిలో ప్రహారవైవిధ్యం ఉండడంచేత దీనికాపేరు.

**ఘనజాతి** కరణధాతువులకు సంబంధించినది. ఇది గురు – లఘువుల సముదాయాలమీద ఆధారపడి ఉంటుంది.

**మూ. త్రివిధం వైణకవాద్యం కర్తవ్యం గీతసంశ్రయం తద్జ్ఞైః,**
**తత్త్వం తథానుగతమోఘశ్చానేకకరణసంయుక్తమ్.** **106**

**తా.** గీతనిష్ఠాతులు – తత్త్వము, అనుగతము, ఓఘము అను మూడు విధాలైన వీణావాద్యం ఉపయోగించాలి. వీటిలో అనేకమైన కరణాల కలయిక ఉంటుంది.

**మూ. లయతాలవర్ణపదయతిగీత్యక్షరభావకం భవేత్తత్త్వమ్,**
**గీతం చ యదనుగచ్ఛేదనుగతమిత్యుచ్యతే వాద్యమ్.** **107**

**తా.** లయ – తాల – పద – వర్ణ – యతి – గీతి – అక్షరాలు స్పష్టంగా తెలిసే విధంగా వాద్యవాదనం జరిగితే అది **'తత్త్వవాదనం'**.

గీతాన్ని అనుసరిస్తూ నడచిన వాద్యం అనుగతవాదనం.

**మూ. ఆవిద్ధకరణబహులం ఉపర్యుపరిపాణికం ద్రుతలయం చ,**
**అనపేక్షితగీతార్థం వాద్యం త్వోఘే విధాతవ్యమ్.** **108**

**తా.** ఆవిద్ధధాతువుల, కరణాల ప్రయోగం అధికంగా ఉంటుంది. గీతం అర్థానికి అంత ప్రాధాన్యం ఇవ్వకుండా ద్రుతలయంతో, ఉపర్యుపరిపాణికంతో జరిగే వాదనం **ఓఘవాచనం**.

**మూ. స్థితే తత్త్వం ప్రయోక్తవ్యం మధ్యే చానుగతం భవేత్,**
**ద్రుతే చౌఘం ప్రయుఞ్జీయాదేష వాద్యగతో విధిః.** **109**

**తా.** స్థితంలో (in the slow tempo) 'తత్త్వం' ప్రయోగించాలి. మధ్యంలో 'అనుగతం', ద్రుతంలో ఓఘం ప్రయోగించాలి. ఇది వాద్యంలో అనుసరించవలసిన విధానం.

**మూ. తత్త్వం తు ప్రథమే గానే ద్వితీయేఽనుగతం భవేత్,**
**ఓఘస్తృతీయే కర్తవ్యో లయతాలవిచక్షణైః. 110**

**తా.** లయతాలవిచక్షణులు, ప్రథమగానంలో తత్త్వం, రెండవగానంలో అనుగతం, మూడవగానంలో ఓఘం ప్రయోగించాలి.

**మూ. ఏవం తద్‌జ్ఞైర్ జ్ఞేయా వీణావాద్యే తు ధాతవః ప్రోక్తాః,**
**వక్ష్యేఽధునా విపఞ్చీవాద్యవిధానే తు కరణార్థమ్. 111**

**తా.** ఈ విధంగా నేను, వీణావాదనం చేసేవాళ్లు తెలుసుకొనవలసిన వీణావాద్యం లోని ధాతువుల స్వరూపం చెప్పాను. ఇపుడు 'విపంచి' మొదలైన వీణల వాదనలో అనుసరించవలసిన కరణాల విధానాన్ని గూర్చి చెపుతాను.

**మూ. రూపం కృతప్రతికృతం ప్రతిభేదో రూపశేషమోఘశ్చ,**
**షష్ఠీ చ ప్రతిశుష్కా హ్యేవం జ్ఞేయం కరణజాతమ్. 112**

**తా.** విపంచీవాదనంలో రూపము, కృతప్రతికృతము, ప్రతిభేదము, రూపశేషము, ఓఘము, ప్రతిశుష్కము అను ఆరు కరణా లుంటాయి.

**మూ. వీణావాద్యే ద్విగుణం గురులాఘవవాదనం భవేద్రూపమ్,**
**రూపం ప్రతిభేదకృతం ప్రతికృతమిత్యుచ్యతే వాద్యమ్. 113**

**తా.** వీణమీద రెండు గురువులు రెండు లఘువులు మోగిస్తే అది **రూపం**. రూపాన్నే ప్రతిభేదంలో మోగిస్తే అది **కృతప్రతికృతం**.

**మూ. యుగపత్కృతేఽన్యకరణం ప్రతిభేదో దీర్ఘలాఘవకృత్ స్యాత్,**
**వీణావాద్యవిరామేఽవిరతకరణం తు రూపశేషః స్యాత్. 114**

**తా.** వీణమీద రెండు వేరు వేరు కరణాలను పక్క పక్కనే మోగించి నప్పుడు గురు – లఘువులను ప్రయోగిస్తే అది **ప్రతిభేదం**. ప్రధానవీణ అపివేసిన తరువాత కూడ మరొక వీణమీద వాదనం కొనసాగిస్తే అది **రూపశేషం**.

**మూ. ఆవిద్ధకరణయుక్తో హ్యుపర్యుపరిపాణికస్త్వోఘః,**
**ప్రతిశుష్కా విజ్ఞేయా వాద్యే సా చైకతన్త్రికృతా. 115**

**తా.** ఉపర్యుపరిపాణికగ్రహమార్గంలో ఆవిద్ధకరణాల ప్రయోగం **ఓఘం**. ఒకే తీగమీద కరణాన్ని ప్రయోగించడం **పరిశుష్కం**.

**మూ. కార్యం ధ్రువాప్రయోగే ప్రాయేణ హి కోణవాదనం తద్‌జ్ఞైః,**
**ద్వాభ్యామపి వీణాభ్యాం గానే వా వాదనే వాపి. 116**

**తా.** సాధారణంగా, ధ్రువాప్రయోగంలో, ప్రయోగజ్ఞులు గీతానికి గాని, మరొక వాద్యానికి గాని సహకారిగా రెండు వీణలను ఉపయోగించినప్పుడు వాటిని కోణాలతో మోగించాలి. (వేళ్ల చివర తొడిగిన, లోహంతో చేసిన ఒక తొడుగు **కోణం**).

**మూ. స్థానం వా పాత్రం వా స్యాత్ తన్త్రిషు విభావయేత్ సమం గానమ్,**
**తచ్చోఘతుల్యకరణం వాద్యం కార్యం విపఞ్చ్యాస్తు. 117**

**తా.** అది ఏదో ఒక స్థానం (ప్రదేశం) అయినా, ఒక పాత్ర (character) అయినా, దానిని గానంతో కలిసి, వీణాతంత్రుల మీద కూడ సూచించాలి. విపంచిని ఉపయోగిస్తే దానిమీద ఓఘకరణం వంటిది ప్రయోగించాలి.

**మూ. సప్తతన్త్రీ భవేచ్చిత్రా విపఞ్చీ నవతన్త్రికా,**
**విపఞ్చీ కోణవాద్యా స్యాచ్చిత్రా చాఙ్గులివాదనా. 118**

**తా.** ఏడు తంత్రుల వీణ **'చిత్ర'** ; తొమ్మిది తంత్రుల వీణ **'విపంచి'**. విపంచిని వేళ్లకు కోణం తొడిగికొని వాయించాలి; చిత్రను వేళ్లతోనే వాయించాలి.

**మూ. ఏవం వేద్యా తద్జ్ఞైర్నానాకరణాశ్రయా విపఞ్చీ తు,**
**అత ఊర్ధ్వం వ్యాఖ్యాస్యే లక్షణయుక్తం బహిర్గీతమ్. 119**

**తా.** అనేకకరణాలకు ఆశ్రయ మైన విపంచిస్వరూపం ఇలా ఉంటుం దని తెలుసు కోవాలి. ఇటుపైన బహిర్గీతాన్ని దాని లక్షణాలను చెపుతాను.

**మూ. ఆశ్రావణా తథారమ్భో వక్త్రపాణిస్తథైవ చ,**
**సంఘోటనా తథా కార్యా పునశ్చ పరిఘట్టనా. 120**
**మార్గాసారితమన్యత్ స్యాత్ లీలాకృతమథాపి వా,**
**ఆసారితాని చ తథా త్రిప్రకారకృతాని తు. 121**
**ఏతాని హి బహిర్గీతాన్యాదౌ యోజ్యాని యోక్తృభిః,**
**సతాలాని హ్యతాలాని చిత్రవృత్తగతాని చ. 122**

**తా.** బహిర్గీతం ప్రారంభంలో – ఆశ్రావణ, ఆరంభం, వక్త్రపాణి, సంఘోటన, పరిఘట్టన, మార్గాసారితం, లీలాకృతము, మూడుపద్ధతుల ఆసారితాలు – వీటిని ప్రయోక్తలు ప్రయోగించాలి. వీటిని తాలం లేకుండా గాని, చిత్రమార్గంలో గాని, వృత్త (వార్తిక) మార్గంలో గాని చేయవచ్చును.

**వి.** నాట్యప్రయోగానికి ముందు, దీనిని పూర్వరంగవిధిలో చేయడంచేత దీనికి **'బహిర్గీతం'** అని పేరు.

**మూ. ప్రయోజనం హి పూర్వోక్తం పూర్వరఙ్గవిధౌ మయా,**
**తేషాం చైవ తు వక్ష్యామి లక్షణం సనిదర్శనమ్. 123**

**తా.** పూర్వరంగవిధిని గూర్చి చెప్పే సందర్భంలో బహిర్గీతిప్రయోజనాన్ని గూర్చి చెప్పాను. ఇప్పుడు దీని అంగాల లక్షణాలు, ఉదాహరణసహితంగా చెపుతాను.

**మూ. తత్రాశ్రావణా నామ :-**
**విస్తారధాతువిహితైః కరణైః ప్రవిభాగశో ద్విరభ్యస్తైః,**
**ద్విశ్చాపి సంనివృత్తైః కరణోపచయైః క్రమేణ స్యాత్. 124**

**తా.** వాటిలో - 'ఆశ్రావణ' అనగా - "ధాతువులు విస్తారం మొదలైన కరణ భేదాలలోని 'విస్తారం' అనే మొదటిదానిని (భేదాన్ని), ముందుగా రెండు పర్యాయాలు ప్రయోగించి, తరవాత **'సంనివృత్తం'** అనే ద్వితీయభేదాన్ని కూడ రెండు పర్యాయాలు ప్రయోగించాలి. క్రమంగా - తృతీయ చతుర్థకరణాలు రెండు పర్యాయాలు, పంచ - షష్ఠకరణాలు రెండు పర్యాయాలు, సప్తమ - అష్టమకరణాలు రెండుపర్యాయాలు ప్రయోగించాలి." ఇది ఆశ్రావణ.

**మూ. గురూణి త్వాద్యావేకాదశకచతుర్దశకసపఞ్చదశకమ్,**
**సచతుర్వింశకమేవం ద్విగుణీకృతమేతదేవ స్యాత్. 125**

**లఘుగురూణి చ తతః షట్ తథాష్టమం గురు భవేత్తథా చ పునః,**
**షట్చ లఘూని తథాన్త్యం గురు (స్త్రిః) స్యాదాశ్రావణాయాం తు. 126**

**తా.** ఆశ్రావణలోని మొదటి ఖండంలో, ఇరవైనాలుగు అక్షరా లుంటాయి. వాటిలో - ఒకటి, రెండు, పదకొండు, పద్నాలుగు, ఇరవైనాలుగు అక్షరాలు గురువులు. రెండవ ఖండంలో కూడ ఇదే విధంగా ఉంటాయి.

దీని తృతీయఖండంలో పదిహేను అక్షరా లుంటాయి. వాటిలో - మొదటిది లఘువు, తరవాత ఆరు గురువులు. ఎనిమిదవది గురువు, తరవాతి ఆరు అక్షరాలు లఘువులు, చివరి మూడు అక్షరాలు గురువులు. ఈ విధంగా ఆశ్రావణలో మూడు ఖండాలు ఉంటాయి. మొదటి రెండు ఖండాలలో ఇరవైనాలుగేసి అక్షరాలు, మూడవ ఖండంలో పదిహేను అక్షరాలు ఉంటాయి.

**మూ. త్రిః శమ్యోపరిపాణీ తాలోఽపి హ్యేష నిర్దిష్టః,**
**సమపాణౌ ద్వే శమ్యే తాలావప్యేవమేవ స్యాత్. 127**

**భూయః శమ్యా తాలావనుగుణాదుత్తరస్తథా ద్వికలశ్చ,**
**చఞ్చత్పుటస్తథా స్యాదేవం హ్యాశ్రావణాతాలః. 128**

**తా.** ఆశ్రావణలో తాలవిధానం ఈ క్రిందివిధంగా ఉంటుంది – మూడు శామ్యాలు, ఉపరిపాణితాళం, రెండు శమ్యాలు, రెండు తాళాలు, మళ్లీ ఒక 'శమ్యా'. సమపాణిలో రెండు తాళాలు. చివరగా రెండు కలాకాలాలలో అనుకూలమైన ఉత్తరతాళచంచత్పుట తాళాలు.

**మూ. అత్రోదాహరణమ్ –**

**(1) "కృం దుం జగతి యవలితక జమ్బుక ఝుం ర తితిసల కుచ సలవా దిద్రిం"**

**(2) "గణపతి పశుపతి కఙ్కక దిద్దే పరభుజ దిగి నిశి వా"**

**(3) "దిగి గిని చ పశుపతి నితి చ".**

**తా.** ఈ ఘట్టంలో ఉన్న ఉదాహరణ లన్నీ అస్పష్టార్థాలుగా ఉన్నాయి. కేవలం అక్షరాలకే ప్రాధాన్యం అయి ఉంటుంది.

**మూ. అథారమ్భః –**

**దీర్ఘాణ్యాదావష్టౌ ద్వాదశ చ లఘూని నైధనఞ్చైవ,**
**చత్వారి గురూణి తథా హ్రస్వాన్యష్టౌ చ దీర్ఘం చ. 129**

**లఘుసంజ్ఞాని చత్వారి ద్విగుణీకృతో దీర్ఘద్వయే తదన్తే,**
**అష్టౌ లఘూని నైధనమిత్యారమ్భేఽక్షరవిధానమ్. 130**

**తా. ఆరంభము :–** దీనిలో – ప్రారంభంలో (మొదటి భాగంలో) ఎనిమిది గురువులు, తరువాత పన్నెండు లఘువులు, చివర లఘువు ఉంటాయి. రెండవ భాగంలో – నాలుగు గురువులు. ఎనిమిది లఘువులు, ఒక గురువు, నాలుగు లఘువులు, నాలుగు గురువులు ఉంటాయి. మూడవ భాగంలో – ఎనిమిది లఘువులు, చివర గురువు ఉంటాయి.

**మూ. అస్య తు వాద్యమ్ :–**

**కార్యం త్రిపర్వవిహితైరుపవహనైరపృథఃసమవరోహైః,**
**తలరిభితప్రోదయుతైః కరణైర్విస్తారభూయిష్ఠైః. 131**

**అపచయయుక్తైర్ద్విస్త్రిస్తథా నివృత్తైస్తథా ద్విరభ్యస్తైః,**
**ఆరమ్భే వాద్యవిధిః, కార్యస్త్వేవం ప్రయోగజ్ఞైః. 132**

**తా.** ఆరంభంలో వాద్యవిధి ఇలా ఉంటుంది – వాద్యవిధానం మూడు పర్వాలలో, (విభాగాలలో) జరగాలి. విస్తారధాతువులు ప్రధానంగా ఉండే 'తాల' – 'రిభిత' – 'ప్రోద' కరణాల ప్రయోగం ముందు ఆరోహక్రమంలోను, తరువాత అవరోహక్రమంలోను

చెయ్యాలి. ఇందులో కరణాలను ముందుగా రెండు మూడు పర్యాయాలు అవరోహణ క్రమంలో ప్రయోగించి, తరవాత విపరీతక్రమంలో ప్రయోగించాలి. తరువాత వీటి నన్నింటినీ మళ్లీ ఆవృత్తి చెయ్యాలి.

**మూ. తాలశ్చాస్య –**

**తాలస్త్రికలస్స్యాదౌ శమ్యేకకలా కలాద్వయే తాలాః,**
**ద్వికలా చ పునః శమ్యా తాలో ద్వికలశ్చ కర్తవ్యః. 133**

**ద్వికలశ్చ సంనిపాతః పునః పితాపుత్రకశ్చ షట్పూర్వః,**
**చఞ్చత్పుటస్తథా స్యాదారమ్భే తాలయోగస్తు. 134**

**తా.** ఆరంభంలో తాలవిధానం ఇలా ఉండాలి – ప్రారంభంలో (ఆదిలో) మూడు 'కలా'ల తాళం, ఒక 'కల' కాలం శమ్య, మళ్లీ ఒక 'కల?' కాలం తాళం, మళ్లీ రెండు 'కల'ల రెండు శమ్యలు, రెండు 'కలల' తాళము, రెండు 'కల'ల సంనిపాతము; ద్వితీయ – తృతీయ ఖండాలో అక్షరానుసారం చంచత్పుటము, షట్‌పితాపుత్రకమూ ప్రయోగించాలి.

**మూ. అత్రోదాహరణమ్ –**

**"ఋ జం టుడు జగతి అవలినక దిగివా దింజేతి నికాల కుచ కుశ జమ్బుకం తిని వా". "ఆ గణపతి పశుపతి" "ఆ గణపతి పశుపతి వా"**

**తా.** అర్థం అస్పష్టం.

**మూ. అథ ఆవిద్ధవక్త్రపాణిః –**

**ఆవిద్ధకరణయుక్తో ద్వ్యఙ్గం స్యాదేకకః ప్రవృత్తో వా,**
**అర్ధవ్యఞ్జనధాతుర్వాద్యే పృథ వక్త్రపాణిస్తు. 135**

**తా. ఆవిద్ధవక్త్రపాణి :–** ఇది ఆవిద్ధధాతుకరణాలతో కూడి ఉంటుంది. దీనిలో ప్రవృత్తము ఏకకము అను వర్ణాంగాలు ఉంటాయి. వ్యంజనధాతువులోని సగం అక్షరాలు ఉంటాయి. విస్తారధాతుకరణాలు ఉండవు.

**మూ. గురూణి పఞ్చ హ్రస్వాణి షడ్ గురూణి చతుర్గుణః,**
**గురూణి ద్వే లఘు త్వేకం చత్వార్యథ గురూణి చ. 136**

**చత్వార్యథ లఘూని స్యుస్త్రీణి దీర్ఘాణి చైవ హి,**
**లఘూన్యష్టౌ చ దీర్ఘఞ్చ వక్త్రపాణౌ విధీయతే. 137**

**తా.** వక్త్రపాణిలో, వరుసగా – ఐదు గురువులు, ఆరు లఘువులు. నాలుగు రెట్లు గురువులు, రెండు గురువులు, ఒక లఘువు, నాలుగు గురువులు, నాలుగు లఘువులు, మూడు గురువులు, ఎనిమిది లఘువులు, ఒక గురువు ఉంటాయి.

**మూ. ద్వికలే మద్రకే(స్థకే) యత్తు శమ్యాతాలనిపాతనమ్,**
**తత్సర్వం వక్త్రపాణౌ తు ముఖే హ్యష్టకలాః స్మృతాః. 138**
**శమ్యాతాలౌ తాలశమ్యే తేషు కుర్యాత్ క్రమేణ చ,**
**తాలం శమ్యా చ తాలం చ సంనిపాతం తథైవ చ. 139**
**తస్యాధస్తాత్ పునః కార్యం పఞ్చపాణిచతుష్టయమ్,**
**వక్త్రపాణేరయం తాలో ముఖప్రతిముఖాశ్రయః. 140**

**తా.** రెండు 'కల'ల మద్రకగానంలో ఉపయోగించే 'శమ్యా' – 'తాలా'లు వక్త్రపాణిలో ప్రయోగించాలి. అయితే – దీని ప్రారంభం ఎనిమది 'కల'లలో ఉంటుంది. వక్త్రపాణికి సంబంధించిన ముఖ – ప్రతిముఖాలలో తాలవిధానం ఇలా ఉంటుంది – ఒక శమ్యా, ఒక తాళం, ఒక తాళం, ఒక శమ్యా, ఒక తాళం, ఒక శమ్యా, ఒక తాళం, ఒక సంనిపాతం, నాలుగు పంచపాణులు.

**మూ. అత్రోదాహరణమ్ – ద్విద్భిః కృం దూం జమ్బుక గజపతి యాః ఋతుద్దాదిద్ధేయే దుధిషి టున కితి ఇనా దుంఘటు వటూ కిటి మట దు.**

**అథ సంఘోటనా –**

**విస్తారకరణైస్త్రిభిశ్చ చిత్రైస్తథా హి వృత్తైశ్చ,**
**త్రిశ్చాభ్యస్తోపచయైర్వదన్తి సంఘోటనావాద్యమ్. 141**

**తా.** సంఘోటనలో – విస్తారధాతుకరణాలు మూడింటిని 'చిత్ర' 'వృత్త' భేదాలతో కలిపి వేరు వేరుగా రెండు లేదా మూడు పర్యాయాలు ప్రయోగించాలి. మళ్లీ వీటితో రెండు మూడు సార్లు కలుపుతూ, ఇతరకరణధాతువుల భేదాలతో పెంచుతూ వాదనం చెయ్యాలి.

**మూ. గురూణి లఘూన్యథాష్టౌ దీర్ఘం ద్వితయం తథా చ కర్తవ్యమ్,**
**లఘుదీర్ఘే లఘు చ పునశ్చతుర్గుణశ్చాపి కర్తవ్యమ్. 142**
**పునరష్టౌ హ్రస్వాః స్యుస్త్వథ గురు నిధనం తథా కార్యమ్,**
**సంఘోటనవస్తువిధౌ జ్ఞేయం గురులాఘవవిధానమ్. 143**

**తా.** సంఘోటనలోని గురులఘువిధానం ఈ విధంగా ఉంటుంది – రెండు గురువులు, ఎనిమిది లఘువులు, రెండు గురువులు, ఒక లఘువు, నాలుగు లఘువులు, ఎనిమిది లఘువులు, చివర గురువు.

**మూ. అస్యా వాద్యవిధిః :–**
**అధిదణ్డం హస్తాభ్యాముపగృహ్య దక్షిణాఙ్గుల్యా,**
**అఙ్గుష్ఠాభ్యాం చ సదా కార్యం సంఘోటనావాద్యమ్. 144**

**సంఘోటనే స్వరాణాం సంవాదివివాదినోశ్చాపి,**
**సంఘోటనా త్వభిహితా శేషానువాదిభిశ్చైవ. 145**

**అస్యాస్తాలః శీర్షకవత్పఞ్చపాణివిహితః.**

**తా.** దీని వాద్యవిధానం – సంఘోటనలో – వీణాదండాన్ని రెండు చేతులతోను పట్టుకొని, కుడిచేతి వేళ్లతోను, రెండు అంగుష్ఠాలతోను మోగించాలి. సంవాది – విసంవాది స్వరాలను, మిగిలిన అనువాది స్వరాలతో కలిపి వాయించడంచేత దీనికి **సంఘోటన** అను పేరు పెట్టబడింది. శీర్షకంలో వలెనే, దీనిలో పంచపాణితాళం ఉంటుంది.

**మూ. అత్రోదాహరణమ్ –**

**ఝండం జగతి యవలిత కదు టుడటుం మహాయోగీ క్షుక – కపాల యాసుపతి గణపతి క్త**

**అథ పరిఘట్టనా –**

**దీర్ఘాణ్యాదావష్టౌ లఘూని కుర్యాత్ పునర్ద్విగుణితాని. 146**
**హ్రస్వాన్యపి చత్వారి ద్విగుణితాని స్యుః సదీర్ఘాణి,**
**షోడశ లఘూని చ స్యుః సగురూణ్యన్యే తథైవ కార్యాణి. 147**

**ఏవం పరిఘట్టనాయాః గురులఘువస్తుక్రమః ప్రోక్తః.**

**తా. పరిఘట్టనా :–** మొదట ఎనిమిది గురువులు, పదహారు లఘువులు, మళ్లీ ఎనిమిది లఘువులు, ఒక గురువు, పదహారు లఘువులు, చివర ఒక గురువు – ఇది పరిఘట్టనలో గురులఘు క్రమము.

**మూ. వాద్యం చాస్య తద్‌జ్ఞైః సోపవహనం హస్తలాఘవాత్ కార్యమ్,**
**వ్యఞ్జనధాతుసముత్థం నానాకరణాశ్రయోపేతమ్. 149**

**తా.** దీని వాద్యసంగీతం వ్యంజనధాతువుకు సంబంధించిన చాలా కరణాల ప్రయోగంతో, ఉపోహనంతో నేర్పుగా నిర్వహించాలి.

**మూ. సంపర్కేష్టాకః స్యాత్తాలః కరణైస్తు ధాతుసంయుక్తైః,**
**గురులఘుయోగాదేవం విహితం కార్యం బుధైర్నిత్యమ్. 150**

**తా.** దీనిలో ధాతువులతో పాటు కరణాల ద్వారా సంపర్కేష్టాకతాలం ప్రయోగింపబడుతుంది. ఈ విధంగా దీని వాదనం గురులఘుయోగానుసారం జరుగుతుంది.

**మూ. అథ మార్గాసారితమ్ :–**

**చత్వారి గురూణి స్యుర్లఘూని చత్వార్యథ ద్విగుణితాని,**
**గురుణీ లఘునీ చాష్టావన్త్యం గురు చేతి కర్తవ్యమ్. 151**

**గురూణి చ లఘూని చ నవ స్యుర్మార్గాసారితే చ వస్తుని.**

**తా. మార్గాసారితం :–** దీనిలో నాలుగు గురువులు, ఎనిమిది లఘువులు, ఎనిమిది గురువులు. ఎనిమిది లఘువులు, చివర గురువు, లఘువు, గురువు, లఘువు ఉంటాయి.

**మూ. మార్గాసారితే వాద్యం విస్తారావిద్ధకరణసంయుతమ్,**
**తాలైః సకలైరథ గురులఘుసంచయైః స్యాదయమ్. 153**

**తా.** మార్గాసారితవాద్యంలో విస్తార – ఆవిద్ధధాతువుల కరణప్రయోగం ఉంటుంది. గురు లఘు విధానానుసారం 'కలా' ప్రమాణాలతో, తాళం ఉంటుంది.

**మూ. అత్రోదాహరణమ్ –**
**దిగ్లత్ సంటుం జగతి పచతి నకదిహే సంటుం.**

**తా.** ఇది మార్గానుసారితానికి ఉదాహరణం.

**మూ. అథవా –**
**చత్వారి చ గురూణి స్యుః హ్రస్వాన్యష్టౌ భవన్తి హి,**
**గురూణి తథా హ్రస్వాణి దీర్ఘమన్త్యమథాపి వా. 154**
**కనిష్ఠాసారితవిధౌ చాస్య తాలః ప్రకీర్తితః.**

**తా.** లేదా – మార్గాసారితంలో – నాలుగు గురువులు, ఎనిమిది లఘువులు, మూడు గురువులు, మూడు లఘువులు చివరిది గురువు ఉంటాయి.

దీని తాలం కనిష్ఠాసారితవిధిలో చెప్పబడినది.

**మూ. అత్రాప్యుదాహరణమ్ –**
**దికం తు జగతి యవతి యవలి ఝుం దుం తితి ఝుల కుల తితి వా.**

**తా.** దీనికి పైన చెప్పినది ఉదాహరణం.

**మూ. అథ లీలాకృతమ్ –**
**శ్రవణమధురాణి లీలాకృతాన్యభిసృతపరిసృతాన్తకృతాని**
**తాన్యప్యర్థవశాదిహ కర్తవ్యాని ప్రయోగవిధౌ. 155**

**తా. లీలాకృతం :–** కుశలు డైన ప్రయోక్త, సమయానుసారంగా, లీలాకృతాన్నీ, అభిసృతాన్నీ, పరిసృతాన్నీ కూడ ఆసారితానికి చెప్పిన నియమాలను అనుసరించి ప్రయోగించాలి, శ్రవణమనోహరమైన తాళం గ్రహించాలి.

**మూ. అథ ఆసారితాని జ్యేష్ఠమధ్యమకనిష్ఠాని. తాని చ తాలమానప్రమాణనిర్దిష్టాని తాలవిధానే యథాక్రమం వ్యాఖ్యాస్యే.**

**తా.** ఆసారితాలలో జ్యేష్ఠము, మధ్యమము, కనిష్ఠము అను భేదా లుంటాయి. వాటిలో తాల ప్రమాణాదులు కూడ ఉంటాయి. వాటిని తాలవిధానంలో, క్రమానుసారం వ్యాఖ్యానిస్తాను.

**మూ. ఏవమేతత్స్వరగతం జ్ఞేయం వీణాశరీరజమ్,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి సుషిరాతోద్యలక్షణమ్. 156**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే తతాతోద్యవిధానం నామ అధ్యాయ ఏకోనత్రింశత్తమః.**

**తా.** వీణ ద్వారా జనించే స్వరాలవిధానం ఈ విధంగా ఉంటుంది. ఇటుపైన సుషిరాతోద్యలక్షణాలు విశదీకరిస్తాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన 'బాలానందిని' అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో తతాతోద్యవిధానం అను ఇరవైతొమ్మిదవ అధ్యాయం సమాప్తం.**

**శ్రీః శ్రీః శ్రీః**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ త్రింశోఽధ్యాయః

## సుషిరాతోద్యలక్షణము

"రాగాత్మకం స్థాయిపదం నియచ్ఛన్నచ్ఛిన్నవంశస్వరలబ్ధసారః,
కాలాత్మకోఽసౌ పరమేశ్వరస్య స్యాద్విగ్రహోఽస్మద్భవబన్ధనాయ"

– శ్రీమదభినవగుప్తాచార్యాః

**మూ. ఆతోద్యం సుషిరం నామ జ్ఞేయం వంశగతం బుధైః,**
**వైణ ఏవ విధిస్తత్ర స్వరగ్రామసమాశ్రయః. 1**

**తా.** వంశంతో (వెదురుగొట్టంతో) నిర్మించిన, రంధ్రా లున్న ఆతోద్యాన్ని సుషిరవాద్య మని బుధులు తెలుసుకోవాలి. స్వరాలకు గ్రామాలకు సంబంధించిన ఏ విధి వీణకు చెప్పబడిందో అదే సుషిరవాద్యానికి కూడ వర్తిస్తుంది.

**మూ. ద్వికత్రికచతుష్కాస్తు జ్ఞేయా వంశగతాః స్వరాః,**
**కమ్పమానార్ధముక్తాశ్చ వ్యక్తముక్తాస్తథైవ చ. 2**

**తా.** వంశస్వరాలకు రెండు, మూడు, లేదా నాలుగు శ్రుతు లుంటాయి. అవి కంపితములు కాని, అర్ధముక్తములు గాని, వ్యక్తములు గాని అయి ఉంటాయి.

**మూ. తత్రోపరి యథా హ్యేకస్వరో వైణః స్వరాన్తరే,**
**ప్రాప్నోత్యన్యత్వమేవేహ తథా వంశగతోఽపి చ. 3**

**తా.** వీణాస్వరం తన ఆరోహిస్వరూపంలోను, లేదా తరువాతి స్వరం రూపంలోను ఏ విధంగా (అన్యత్వం) పరివర్తనం చెందుతుందో వంశస్వరం కూడ అదే విధంగా పరివర్తనం చెందుతుంది.

**మూ. ద్వికత్రికచతుష్కో వా స్వరః స్యాచ్ఛ్రుతిసంఖ్యయా,**
**అన్వీరణాత్తు శేషాణాం స్వరాణామపి సంభవః. 4**

**తా.** శ్రుతుల సంఖ్యను అనుసరించి వంశస్వరంలో ద్వికత్వము, త్రికత్వము, చతుష్కత్వము, ఏర్పడి నట్లు ఒకే స్థానంలో ఉండి బలంగా ఊదడంవల్ల ఇతరస్వరాలూ, కాకలీస్వరాలూ కూడ వంశస్వరంలో ఉద్భవించవచ్చును.

**మూ. స్వరాణాం చ శ్రుతికృతం చతుర్ద్విస్త్రిత్వలక్షణమ్,**
**అఙ్గులిపాతనకృతం తచ్చ మే సంనిబోధత. 5**

**తా.** శ్రుతిని పట్టి స్వరాలలో ద్వికత్వ – త్రికత్వ – చతుష్కత్వాలు ఏర్పడతాయి. అవి కూడ వేణురంధ్రాలమీద అంగుళీపాతనాన్ని పట్టి, వేణురంధ్రాలను వేళ్లతో మూసే విధానాన్ని పట్టి, ఏర్పడుతాయి. అది చెపుతాను; వినండి.

**మూ. వ్యక్తముక్తాఙ్గులిస్తత్ర స్వరో జ్ఞేయశ్చతుఃశ్రుతిః,**
**కమ్పమానాఙ్గులిశ్చైవ విశ్రుతిః పరికీర్త్యతే. 6**

**తా.** వ్యక్తముక్తాంగులి యైన స్వరం చతుఃశ్రుతి. కదలుతూన్న వేళ్లతో జనింపచేసినది విశ్రుతి.

**మూ. ద్వికోఽర్ధాఙ్గులిముక్తశ్చ ఏవం శ్రుత్యాశ్రితాః స్వరాః,**
**ఏతే స్యుర్మధ్యమగ్రామే భూయః షడ్జాశ్రితాః పునః. 7**

**వ్యక్తముక్తాఙ్గులికృతాః షడ్జమధ్యమపఞ్చమాః,**
**ధైవతశ్చర్షభశ్చైవ కమ్పమానాఙ్గులీకృతౌ. 8**

**స్వరసాధారణేచాపి కాకల్యన్తరసంజ్ఞకే,**
**అర్ధముక్తాఙ్గులిశ్చైవ గాన్ధారోఽథ నిషాదవాన్. 9**

**తా.** అర్ధాంగులీముక్తస్వరం (రంధ్రం సగం మూయగా ఏర్పడిన స్వరం)లో రెండు శ్రుతు లుంటాయి. ఇవి మధ్యమగ్రామంలోని శ్రుతులు ఆశ్రయించిన స్వరాలు. షడ్జగ్రామానికి చెందిన స్వరాలలో షడ్జ – మధ్యమ – పంచమస్వరాలు వ్యక్తముక్తాంగులీ స్వరాలు – వేళ్లు పూర్తిగా పైకి తీసి వేయగా ఏర్పడేస్వరాలు. ధైవత – ఋషభస్వరాలు కంపమానాంగులీకృతస్వరాలు – వేళ్లు కదిలిస్తూ పుట్టించిన స్వరాలు. కాకలీస్వరాలు, అంతరస్వరాలు, గాంధార – నిషాదస్వరాలు ఇవి అర్ధముక్తాంగులీస్వరాలు – వేళ్లతో రంధ్రాలు సగం సగం మూయగా జనించే స్వరాలు.

**మూ. నిషాదగాన్ధారయోశ్చ షడ్జమధ్యమయోరపి,**
**విపర్యయః సంనికర్షే శ్రుతిలక్షణసిద్ధిదః. 10**

**తా.** నిషాదగాంధారాలు వరుసగా షడ్జమధ్యమాలతో ఎదు రెదురుగా కలిసి నప్పుడు వాటి శ్రుతిలక్షణాలు విపర్యస్తములై స్వరసాధారణత్వంచేత కాకలీస్వరత్వాన్ని పొందుతాయి.

**మూ. వైణకణ్ఠప్రవేశేన సిద్ధా వంశాశ్రితాః స్వరాః,**
**యం యం గాతా స్వరం గచ్ఛేత్తం తం వంశేన వాదయేత్,**
**శారీరవైణవంశానామేకీభావః ప్రశస్యతే. 11**

**తా.** వీణా – కంఠస్వరాలతో చక్కగా మేళవించడంద్వారా వంశస్వరాన్ని సిద్ధం చెయ్యాలి. పరిపూర్ణంగా ఉండే టట్లు చెయ్యాలి. గాయకుడు గానం చేసే స్వరాలనే

వేణువుమీద, యథాతథంగా ఆవిష్కరించాలి. కంఠస్వర - వీణాస్వర - వంశనాదాల మధ్య పరిపూర్ణమైన సమన్వయం అత్యధికమైన శోభను సమకూర్చుతూ ప్రశంసనీయంగా ఉంటుంది.

**మూ. అవిచలితమవిచ్ఛిన్నం వర్ణాలంకారసంయుతం మన్ద్రమ్,**
**విధివల్లలితం మధురం వేణోరేవం స్మృతం వాద్యమ్. 12**

**తా.** వేణువాద్యంలో కుదుపులు గాని, మధ్య మధ్య తెగి పోవడంగాని ఉండకూడదు. అది మంద్రంగా వర్ణాలంకారాదులతో యథాశాస్త్రంగా ఉండాలి. లలితంగా, మధురంగా ఉండాలి.

**మూ. ఏవమేతత్స్వరగతం విజ్ఞేయం వంశయోక్తృభిః,**
**అతఃపరం ప్రవక్ష్యామి ఘనాతోద్యవికల్పనమ్. 13**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే సుషిరాతోద్యలక్షణం నామాధ్యాయస్త్రింశః.**

**తా.** పంశవాద్యవాదకులు వంశవాద్యానికి సంబంధించిన ఈ స్వరవిధానాన్ని గూర్చి తెలుసుకోవాలి. ఇటు పైన ఘనాతోద్యాలకు సంబంధించిన విధానాలను గూర్చి చెపుతాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్రవాఖ్యానంలో సుషిరాతోద్యలక్షణం అను ముప్పైయవ అధ్యాయం సమాప్తం.**

**శ్రీః శ్రీః శ్రీః**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ ఏకత్రింశోఽధ్యాయః

# తాలాధ్యాయము

**"యస్యాం కలా కాలలయప్రభావాత్ సామ్యం పరం యాతి జగత్క్రియాణామ్,**
**మాయాత్మికాం తాం తనుమష్టమూర్తేః వన్దే త్రిధాభోగపదం దధానామ్".**

**– శ్రీమదభినవగుప్తాచార్యాః**

**మూ. తాలో ఘన ఇతి ప్రోక్తః కలాపాతలయాన్వితః,**
**కలాస్తస్య ప్రమాణం వై విజ్ఞేయం తాలయోక్తృభిః. 1**

**తా.** 'తాలం' అనేది (కఠిన మైన కంచుమొదలైనవాటిచేత నిర్మించబడినది గాన) ఘనవాద్యాల జాతికి చెందినది. ఇది కలాపాతానికి ('కలా' అను కాలవిభాగానికి) లయకు (Tempo) కు సంబంధించినది. తాలానికి ప్రమాణం 'కల' అని తాళప్రయోగం చేసేవాళ్లు తెలుసుకోవాలి.

**మూ. యా లౌకికీ కలా కాష్ఠా నిమేషశ్చ స్మృతా బుధైః,**
**న సా తాలకలా జ్ఞేయా హ్యన్యైషా తాలజా కలా. 2**

**తా.** లోకంలో 'కలా' 'కాష్ఠ' 'నిమేష' అంటూ పండితులు చెప్పే ఏ'కలా' ఉందో అది ఈ శాస్త్రంలో తాలానికి సంబంధించిన 'కలా' కాదు. అది వేరు ఇది వేరు.

**వి.** 'కలా' అనేది కాలానికి ఒక పరిచ్ఛేదం. ఒక అల్ప మైన కాలఖండం. **"అష్టాదశ నిమేషాస్తు కాష్ఠా త్రింశత్తు తాః కలా"** అను అమరకోశోక్తి ప్రకారం పద్దెనిమిది నిమేషాల (రెప్పపాట్ల) కాలం ఒక 'కాష్ఠా'. ముప్పై కాష్ఠలు ఒక **'కలా'**. ఈ లెక్క ప్రకారం 'కలా' అనగా ఎనిమిది సెకండ్ల కాలం. కొందరు నలభై సెకండ్లు 'కలా' అనీ, మరికొందరు ఒక నిమిషం (మినిట్) అనీ అంటారు. (మ.ఘో.)

**మూ. నిమేషాః పఞ్చ మాత్రా స్యాన్మాత్రాయోగాత్కలాః స్మృతాః,**
**నిమేషాః పఞ్చ విజ్ఞేయా గీతకాలే కలాన్తరమ్**
**తతః కలాకాలకృతో లయ ఇత్యభిసంజ్ఞితః. 3**

**తా.** ఐదు నిమేషాలు ఒక **'మాత్ర'**. మాత్రల కలయికవల్ల (కొన్ని మాత్రలు కలిస్తే) **'కలా'** ఏర్పడుతుంది. గానసమయంలో రెండు 'కల'ల మధ్యకాలం (అంతరం – interval) ఐదు నిమేషాలు ఉంటుంది. పిదప మాత్రల విభాగంవల్ల ఏర్పడిన కలలను పట్టి లయ (Tempo) ఏర్పడుతుంది.

**వి.** ఒక లెక్క ప్రకారం ఐదు లఘువులను ఉచ్చరించడానికి పట్టే కాలం ఒక మాత్ర. **"పఞ్చలఘ్వక్షరోచ్చారమితా మాత్రా"** (మ.ఘో.)

**మూ. త్రయో లయాస్తు విజ్ఞేయా ద్రుతమధ్యవిలమ్బితాః,**
**యస్తత్ర తు లయో మధ్యస్తత్ప్రమాణా కలా స్మృతా. 4**

**తా.** ద్రుతము (quict) మధ్యము (medium) విలంబితము (slow) అని **లయ** మూడు విధాలు. మధ్యలయ 'కలా' కాలానికి ప్రమాణం; అనగా మధ్యలయకి ఎంత సమయం పడుతుందో అదే మామూలుగా 'కలా'కాలం.

**మూ. త్రివిధా సా చ విజ్ఞేయా త్రిమార్గనియతా బుధైః,**
**చిత్రే ద్విమాత్రా కర్తవ్యా వృత్తౌ సా ద్విగుణా స్మృతా. 5**
**చతుర్గుణా దక్షిణే స్యాదిత్యేవం త్రివిధా కలా,**
**కలాకాలప్రమాణేన తాల ఇత్యభిసంజ్ఞితః. 6**

**తా.** 'కల' మూడు మార్గాలచేత నియమితమై ఉంటుంది. చిత్రమార్గంలో మూడు మాత్రలు, వృత్తిలో ఆరు మాత్రలు, దక్షిణమార్గంలో ఇరవైనాలుగు మాత్రలు. ఇవి మూడు విధాలైన 'కల'లు. 'తాలం' గీతాల కాలాన్ని 'కలా' కాలాలలో కొలుస్తుంది కాబట్టి దీనికి ఆ (తాలం అని) పేరు.

**వి.** 'చిత్ర' వృత్తి, దక్షిణ అను మూడు విధాల మార్గాల స్వరూపం ముమ్ముందు చెప్పబోతున్నాడు.

**మూ. చతురస్రశ్చ త్ర్యస్రశ్చ తాలో ద్వివిధ ఏవ హి,**
**ద్వివిధాస్యాపి తాలస్య చైకా ప్రకృతిరిష్యతే. 7**

**తా. 'చతురస్రం'** అనీ, **'త్ర్యస్రం'** అనీ తాలం రెండు విధాలు. ఈ రెండు విధాల తాలానికీ ప్రకృతి (మూలకారణం) ఒక్కటే.

**మూ. తథా యోనిద్వయం చాస్య కీర్త్యమానం నిబోధత,**
**చఞ్చత్పుటస్తు విజ్ఞేయో తథా చాపపుటోఽపి చ. 8**

**తా.** ఇపుడు వీటి ఉత్పత్తిహేతువులను గూర్చి (యోనిద్వయం) వినండి – **'చంచత్పుటము' 'చాపపుటము'** అనేవి వీటి ఉత్పత్తిహేతువులు.

**మూ. చతుష్కలోఽథ ద్వికలస్తాలో యస్మాత్ప్రవర్తతే,**
**చతురస్రస్తు విజ్ఞేయస్తాలశ్చఞ్చత్పుటో బుధైః. 9**
**త్ర్యస్రశ్చాపపుటశ్చైవ గురులఘ్వక్షరాన్వితః,**
**ప్రథమం గురుణీ కృత్వా లఘు చాన్త్యం ప్లుతం తథా. 10**

**అక్షరాణాం నివేశేన స తు చఞ్చత్పుట స్తథా,**
**ఆదౌ గుర్వక్షరం యత్ర లఘునీ గురు చైవ హి. 11**
**త్ర్యస్రః స ఖలు విజ్ఞేయః తాలశ్చాపపుటో భవేత్.**

**తా.** వీటిలోని ఒక్కొక్కదానినుంచీ, నాలుగు లేదా రెండు 'కల'ల తాలాలు పుడతాయి (ప్రవర్తిస్తాయి). చఞ్చత్పుటతాలం చతురస్రం; చాపపుటతాలం త్ర్యస్రం వీటిలో 'గురువులు లఘువులూ కూడ ఉంటాయి.

**చతుష్పటంలో** – రెండు గురువులు, ఒక లఘువు, చివర ప్లుతము ఉంటాయి. త్ర్యస్రమైన **చాపపుటంలో** ఒక గురువు, రెండు లఘువులు, చివర గురువు ఉంటాయి.

**మూ. అనయోర్మిశ్రభావాచ్చ మిశ్రతాలః ప్రకీర్తితః. 12**
**షట్పితాపుత్రకశ్చైవ పఞ్చపాణిః స చేష్యతే,**
**యథోక్తైరభినిష్పన్నః స్వసంజ్ఞాగురులాఘవైః. 13**
**సమాసయోగాత్ తాలోఽయం త్రివిధః పరికీర్తితః.**

**తా.** చఞ్చత్పుట – చాపపుటాల మిశ్రణంచేత ఏర్పడే తాలం **'మిశ్రతాలం'**, **'షట్పితాపుత్రక'** తాలం, లేదా **'పంచపాణి'తాలం** కూడ ఈ మిశ్రతాలానికి చెందినదే. వీటి పేర్లలో ఉన్న గురులఘువులే ఈ తాలాలలో ఉంటాయి. ఈ విధంగా, సంక్షిప్తంగా, తాలంలో ఈ మూడు భేదా లుంటాయి.

**మూ. సంనిపాతస్తతః శమ్యా తాలః శమ్యా అథాపి వా. 14**
**శమ్యాతాలౌ ద్విరభ్యస్తౌ తాలశమ్యే తథైవ చ,**
**సంనిపాతాదికో జ్ఞేయః శమ్యాదిశ్చ తథాపరః. 15**
**తాలాదిశ్చ త్రిభిర్భేదైః పునశ్చఞ్చత్పుటో భవేత్,**
**సంనిపాతాదికో నాట్యే చతురస్రే భవేదయమ్. 16**
**శమ్యాదికస్తు విజ్ఞేయః తద్జ్ఞైరాసారితాదిషు,**
**తాలాదికస్తథా ప్రోక్తో విద్వద్భిః పాణికాదిషు. 17**
**చఞ్చత్పుటస్య యే భేదాః సన్నిపాతాదయస్త్రయః,**
**త ఏవ భేదా విజ్ఞేయా బుధైశ్చాపపుటే పృథక్. 18**

**తా.** (వాటి 'పాత' – 'కల'లు ఈ విధంగా ఉంటాయి) సన్నిపాత – శమ్యా – తాల – శమ్యాలు; లేదా శమ్యా – తాల – శమ్యా – తాలాలు, లేదా తాల – శమ్యా – తాల – శమ్యాలు – ఇవి ఏక'కలా'కాల చంచత్పుటలో. ఈ విధంగా **చంచత్పుట** –

సంనిపాతాది, శమ్యాది, తాలాది అని మూడు విధాలు. సంనిపాతాది చతురస్రం నాట్యంలోను, శమ్యాదిచతురస్రం ఆసారితాలలోను ప్రయోగింపబడుతుంది. తాలాది చతురస్రం పాణికాదిగీతాలలో ప్రయోగింపబడుతుంది.

చంచత్పుటంలో ఉన్న సంనిపాతాదిభేదాలే చాపపుటంలో కూడ ఉంటాయి.

**వి.** సశబ్దాలైన ధ్రువాదులకు 'పాతలు' అనీ నిఃశబ్దాలైనా ఆవాపాదులకు 'కలా' అని పేర్లు. (మ.ఘోష్).

**మూ. సన్నిపాతాదికస్త్వస్య బలవానితరేఽపి చ,**
**షట్కలోఽష్టకలశ్చైవ తాలో హ్యస్మాత్ ప్రవర్తతే. 19**

**తా.** ఈ చాపపుట తాలానికి సంబంధించిన సంనిపాతాదిభేదము, ఇతరమైన రెండు భేదాలూ కూడ బలంకలవై ఉంటాయి. అందుచేతనే సంనిపాతం ఆరు'కల'ల ప్రమాణంలోను ఎనిమిది కలల ప్రమాణంలోను ఉంటుంది.

**మూ. శమ్యాతాలప్రవేశేన త్ర్యస్రోఽన్యోఽపి విధీయతే,**
**షట్పితాపుత్రకకృతః పఞ్చపాణిరుదాహృతః. 20**

**తా.** 'శమ్యా' – 'తాల' ప్రవేశాలతో మరొక విధమైన త్ర్యస్రం కూడ ప్రయోగించ వచ్చును. ఇదే **షట్పితాపుత్రకం, 'పంచపాణి'** అనేది దీని మరొక పేరు.

**మూ. ఆద్యం ప్లుతం ద్వితీయం తు లఘు యత్రాక్షరం భవేత్,**
**తృతీయం చ చతుర్థం చ గురుణీ పఞ్చమం లఘు. 21**
**ప్లుతాన్తః షట్పితాపుత్రో గురులాఘవసంయుతః,**
**పఞ్చపాణిః స విజ్ఞేయః షట్పాతస్తు షడక్షరః. 22**

**తా.** మొదటి వర్ణం ప్లుతం, రెండవది లఘువు, మూడు నాలుగు వర్ణాలు గురువులు. ఐదవది లఘువు, చివరిది ప్లుతము. ఈ విధంగా గురులఘువు లున్నది **షట్పితాపుత్రకం**. ఆరు పాతాలు, ఆరు అక్షరాలు ఉన్న దీనినే **పంచపాణి** అని కూడ అంటారు.

**మూ. సన్నిపాతస్తతస్తాలః శమ్యా తాలస్తథైవ చ,**
**శమ్యా చైవ హి తాలశ్చ షట్పాతస్తస్య కీర్తితః. 23**

**తా.** సన్నిపాతము, తాలము, శమ్య, తాలము, శమ్య, తాలము – ఇవీ దీనిలోని ఆరు పాతాలు.

**మూ. తాలాదిస్త్ర్యస్రభేదోఽన్యః సమ్పక్వేష్టాకసంజ్ఞితః,**
**గురుపఞ్చాక్షరాద్యన్త్యప్లుతమాత్రాసమన్వితః,**
**సన్నిపాతస్తతః శమ్యా తాలం శమ్యైకతాలకః. 24**

**తా.** తాలాదిత్ర్యస్రంలో 'సమ్పర్క్వేష్టాకం' అను మరొక ప్రకారం కూడ ఉంది. దీనిలో మధ్య నున్న ఐదు అక్షరాలు గురువులు. ఆద్యక్షరము, అన్త్యాక్షరము ప్లుతాలు. దీనిలో పాతం – తాలము, శమ్య, తాలము, శమ్య, తాలము – ఈ క్రమంలో ఉంటుంది.

**మూ. త్ర్యస్రం సర్వగురుం కృత్వా నిష్క్రామం తత్ర యోజయేత్,**
**శమ్యాద్వయం తతస్త్వేష ఉద్ఘట్టః కథితో బుధైః.** **25**

**తా.** త్ర్యస్రంలో మూడు అక్షరాలూ గురువులై ఉండి, దాని 'కలా'లు – నిష్క్రామం, శమ్య, శమ్య ఈ ఈవిధంగా ఉంటే దానిని బుధులు **'ఉద్ఘట్టం'** అంటారు.

**మూ. ఏవమేకకలో జ్ఞేయః శుద్ధశ్చఞ్చత్పుటాదికః,**
**యథాక్షరోఽథ ద్వికలస్తథా చైవ చతుష్కలః.** **26**
**త్రయో భేదా హి తాలస్య ద్విగుణాః ద్విగుణాః స్మృతాః,**
**చతురస్రస్త్రిభిర్భేదైస్తాలస్తు పరికీర్తితః.** **27**
**చతుష్కలో హ్యష్టకలః కలా షోడశకః పునః.**

**తా.** శుద్ధ చఞ్చత్పుటాదులు ఏకకలలు, (ఒకే 'కల' ప్రమాణం గలవి). ఈ విధంగా**'యథాక్షరము', 'ద్వికలము', 'చతుష్కలము'** అని మూడు విధాల తాలాలుంటాయి. వీటిలో రెండవది మొదటిదానికంటె రెండు రెట్లు, మూడవది రెండవదానికంటె రెండు రెట్లు విస్తారం పొందుతుంది. చతురస్రతాలం మాత్రం – వరుసగా – నాలుగు, ఎనిమిది, పదహారు కలలలో మూడు విధాలుగా ఉంటుంది.

**మూ. త్ర్యస్రతాలస్తు షడ్భేదస్త్రికలః షట్కలస్తథా.** **28**
**కలాద్వాదశకోఽపి స్యాత్ చతుర్వింశతికస్తథా,**
**కలాష్టచత్వారింశత్కం కలా షణ్ణవతిస్తథా.** **29**

**తా.** త్ర్యస్రతాలంలో – (1) మూడు 'కలా'లు, (2) ఆరు 'కలా'లు (3) పన్నెండు 'కలా'లు, (4) ఇరవైనాలుగు 'కలా'లు (5) నలభై ఎనిమిది 'కలా'లు (6) తొంభై 'ఆరు' 'కలా'లు గల ఆరు విధాలుంటాయి.

**మూ. తాలో నవవిధశ్చాయమయుగ్మః సంప్రకీర్తితః,**
**ద్విప్రకారస్త్వయం తాలో నిఃశబ్దః శబ్దవాంస్తథా.** **30**
**ప్రయోగం ద్వివిధం చాస్య కీర్త్యమానం నిబోధత.**

**తా.** ఈ విధంగా – త్ర్యస్రతాలంలో మూడు సామాన్యభేదాలు. ఆరు విశేష భేదాలు – మొత్తం తొమ్మిది భేదా లుంటాయి. నిఃశబ్దము, సశబ్దము అని తాలం రెండు విధాలు. వీటి రెండు విధాల ప్రయోగాన్ని గూర్చి మీకు చెపుతాను.

**మూ. తత్రావాపో౽థ నిష్క్రామో విక్షేపశ్చ ప్రవేశకః. 31**

**చతుర్వికల్ప ఇత్యేవం నిఃశబ్దః పరికీర్తితః.**

**తా.** నిఃశబ్ద తాలంలో – ఆవాపము, నిష్క్రామము, విక్షేపము, ప్రవేశకము అను నాలుగు భేదా లున్నాయి.

**మూ. శమ్యాతాలో ధ్రువశ్చేతి సన్నిపాతస్తథాపరః. 32**

**ఇతి శబ్దేన సంయుక్తో విజ్ఞేయశ్చ చతుర్విధః.**

**తా.** శబ్దసంయుక్త (సశబ్ద) తాలంలో – శమ్య, తాలము, ధ్రువము, సంనిపాతము అని నాలుగు భేదాలున్నాయి.

**మూ. ఏతేషామథ వక్ష్యామి హస్తాఙ్గులివికల్పనమ్. 33**

**లక్షణం చ ప్రమాణం చ యథావదనుపూర్వశః.**

**తా.** వీటి లక్షణాలు, ప్రమాణాలు, వీటిని ప్రయోగించేటప్పుడు హస్త – అంగుల్యాది విన్యాసాలను క్రమానుసారం మీకు చెపుతాను.

**మూ. ఊర్ధ్వాఙ్గులిసమాక్షేప ఆవాప ఇతి సంజ్ఞితః. 34**

**నిష్క్రామో౽ధోగతస్య స్యాదఙ్గులీనాం ప్రసారణమ్,**

**తస్య దక్షిణతః క్షేపో విక్షేపః పరికీర్తితః. 35**

**నివర్తనం చ హస్తస్య ప్రవేశో౽ధోముఖస్య చ.**

**తా.** ఆకాశం వైపు తిప్పిన అరచేతి వేళ్లు పై వైపు వంచడం **ఆవాపం**. అరచెయ్యి క్రిందిపైపు తిప్పి దాని వేళ్లు చాపడం **నిష్క్రామం**. అధోముఖమైన ఆ హస్తం కుడి పక్కకు విసరివేయడం **విక్షేపం**. అధోముఖహస్తాన్ని వెనుకకు తీసికొనిరావడం **ప్రవేశం**.

**వి.** ఆవాపానికి సంకేతం 'ఆ'. నిష్క్రామానికి 'ని'. విక్షేపానికి 'వి' ప్రవేశానికి 'ప్ర.'

**మూ. కృత్వాఙ్గులీనామాక్షేపం నిష్క్రామం చ భవేదథ. 36**

**విక్షేపశ్చ పునః కార్యః పునశ్చైవ ప్రవేశనమ్,**

**యదా చతుష్కలో యోగస్తదా త్వేష విధిర్భవేత్. 37**

**నిష్క్రామశ్చ ప్రవేశశ్చ ద్వికలే పరికీర్తితౌ,**

**ఏషామన్తరపాతాస్తు పాతసంజ్ఞాః ప్రకీర్తితాః. 38**

**తా.** వేళ్ల ఆక్షేపం చేసిన పిమ్మట నిష్క్రామం చెయ్యాలి. తరువాత విక్షేపం చేసి ప్రవేశనం చెయ్యాలి. చతుష్కలతాలప్రయోగంలో వీటిని ఈ క్రమంలో చెయ్యాలి. ఎందువల్ల

ననగా – నిష్క్రామ – విక్షేపాలకు రెండు 'కలల' కాలం పట్టుతుంది. వీటి మధ్య నున్న సమయంలో జరిగే పాతాలకు (చేతుల కదలికలకు) పాతా లని పేరు.

**మూ. శమ్యా దక్షిణహస్తస్య తాలః పాతస్తు వామతః,**
**హస్తయోస్తు సమః పాతః సన్నిపాత ఇతి స్మృతః. 39**

**తా.** కుడిచేతి పాతం **శమ్య**. ఎడమచేతి పాతం **తాలం**. రెండుచేతుల సమమైన పాతం (రెండూ దగ్గరికి రావడం) **సంనిపాతం**.

**మూ. ధ్రువస్తు మాత్రికః పాతః రాగమార్గప్రయోజకః,**
**కలా యాస్త్రివిధాః ప్రోక్తాస్తాసాం పాతో ధ్రువః స్మృతః. 40**

**తా.** ఒక మాత్రకాలం పాటు విరామం కోసం చేసేపాతం ధ్రువం, ఇది రాగ మార్గజనకం. మూడు 'కలా'కాలాల పాతానికి కూడ **ధ్రువం** అని పేరు.

**మూ. యథాక్షరస్య తాలస్య స తు గుర్వక్షరో భవేత్,**
**యథాక్షరకృతైః పాతైః తాలో జ్ఞేయో యథాస్థితః. 41**
**గుర్వక్షరైశ్చ విశ్లిష్టైః స ఏవ ద్వికలో భవేత్,**
**ద్విర్భావో ద్వికలస్యైవ విజ్ఞేయస్తు చతుష్కలః. 42**

**తా.** యథాక్షరతాలంలోని ధ్రువంలో గురువు ఉంటుంది. యథాక్షరంలో తాలస్వ రూపం అక్షరానుసారం ఉంటుంది. గురువులు రెండు ఉంటే ఇది ద్వికలా కాలం కలది అవుతుంది. ఈ కలాకాలాన్ని రెట్టింపుచేసి నప్పుడు నాలుగు 'కల'లు కలది అవుతుంది.

**మూ. యథాక్షరకృతాః పాతాః సర్వైరేవ ప్రకీర్తితాః,**
**చఞ్చత్పుటస్య విజ్ఞేయాః తథా చాపపుటస్య చ. 43**
**పఞ్చపాణేశ్చ విహితాః భేదా హ్యేతే త్రయః స్మృతాః.**

**తా.** యథాక్షరతాలాంతర్గతాలైన అన్ని పాతలను గూర్చి ఇంతవరకు చెప్పాను. అందువల్ల చంచత్పుట – చాపపుట – పంచపాణులకు మూడు భేదాలుంటాయి.

**మూ. వృదస్య యగ్మమోజం యే పఞ్చతాలా భవన్తి హి. 44**
**మిశ్రా గీతాఙ్గసంయుక్తా జ్ఞేయా హ్యుద్ఘట్టకాదయః.**

**తా.** చతురస్ర – త్ర్యస్రతాలాలే కాక ఇంకా ఐదు విధాల తాలా లున్నాయి. మిశ్రతాల జాతికి చెందిన, 'ఉద్ఘటిత' మొదలైన పేర్లు గల ఈ తాలాలు గీతాల వివిధాంగా లకు సంబంధించినవి.

**మూ. కలాః పఞ్చ తథా సప్త పునర్నవ చ కీర్తితాః. 45**
**దశ చైకాదశైతే చ సంకీర్ణాః సముదాహృతాః.**

**తా.** ఈ తాలాలు ఐదు, ఏడు, తొమ్మిది, పది, పదకొండేసి 'కలా' కాలాలలో ఉండవచ్చును. అందుచేతనే వీటికి **'సంకీర్ణతాలాలు'** (Miscelaneous Talas) అని పేరు.

**మూ. న హ్యేషాముపయోగోఽస్తి సప్తరూపే ధ్రువాస్వపి. 46**
**ప్రవృత్తాదిషు కర్తవ్యా ఏతే గానప్రయోక్తృభిః.**

**తా.** వీటికి సప్తరూపగానాలలో కాని, ధ్రువలలో కాని ఉపయోగం ఉండదు. వీటిని గాయకులు ప్రవృత్తాదులలో మాత్రమే ఉపయోగిస్తారు.

**మూ. త్ర్యస్రశ్చ చతురస్రశ్చ షట్కలోఽష్టకలస్తథా. 47**
**ధ్రువాణాం తు భవేత్తాలం సంప్రవక్ష్యామి తత్త్వతః.**

**తా.** ఎనిమిది 'కల'ల చతురస్రతాలము, ఆరు 'కలల' త్ర్యస్రతాలము. ధ్రువలలో ఏ విధంగా ఉపయోగించబడతాయో మీ కిపుడు చెపుతున్నాను.

**మూ. కనిష్ఠాఙ్గులినిష్క్రామో శమ్యాచైవ తతో భవేత్. 48**
**కనిష్ఠికానామికాభ్యాం తు నిష్క్రామోఽతో విధీయతే,**
**తతస్తాలస్తు కర్తవ్యః శమ్యా చైవ తు పఞ్చమీ. 49**
**ప్రవేశో మధ్యమాఙ్గుష్ఠే, కర్తవ్యస్తర్జనీకృతః,**
**నిష్క్రామః సన్నిపాతోఽన్యే నిత్యమష్టకలో భవేత్. 50**
**ఏష యుగ్మే కలాపాతవికల్పోఽఙ్గులిభిః కృతః.**

**తా.** (ఎనిమిది 'కల'ల తాలం ఈ విధంగా ఉంటుంది). కనిష్ఠికచేత నిష్క్రామ – శమ్యాలు, కనిష్ఠికా – అనామికలతో నిష్క్రామ – తాల – శమ్యాలు, మధ్యమాంగులితో ప్రవేశము, అంగుష్ఠంతో నిష్క్రామ – సంనిపాతాలు ప్రదర్శించాలి. చతురస్రతాలంలో అగుల్యాదులతో 'కల'ల ప్రదర్శన విధానం ఇదే.

**మూ. కనిష్ఠాఙ్గులినిష్క్రామః ప్రథమే తు కలా భవేత్. 51**
**శమ్యాపాతో ద్వితీయా తు తృతీయా తాల ఏవ చ,**
**శమ్యా తత్ర చతుర్థీ తు పఞ్చమీ తర్జనీ క్రమాత్. 52**
**షష్ఠశ్చ సన్నిపాతః స్యాదేష వై షట్కలో విధిః,**
**ఏష త్ర్యస్రే కలాపాతవికల్పోఽఙ్గులిభిః కృతః. 53**

**తా.** షట్కలతాలం (యొక్క) ప్రథమకలాకాలంలో కనిష్ఠికలో నిష్క్రామము, రెండవ 'కల'లో శమ్యా, మూడవ 'కల'లో తాలము, నాల్గవ 'కల'లో శమ్య, ఐదవ దానిలో

తర్జనితో శమ్యాసంనిపాతాలు ప్రదర్శించాలి. త్ర్యస్రతాలంలో అంగుళులతో కలా ప్రదర్శన విధానం ఈ విధంగా ఉంటుంది.

**మూ. కనిష్ఠాఙ్గులినిష్క్రామః ప్రవేశశ్చ తథా భవేత్,**
**కనిష్ఠికానామికాస్థానే తతస్తాలస్తృతీయకః. 54**

**శమ్యాపాతశ్చతుర్థీ తు నిష్క్రామో మధ్యమాకృతః,**
**షష్ఠస్తాలస్తతో జ్ఞేయః నిష్క్రామస్తర్జనీకృతః. 55**

**శమ్యాష్టమీ తతస్తాలో నవమీ తు కలా స్మృతా,**
**కనిష్ఠికాప్రవేశస్తు దశమీ తు కలా భవేత్. 56**

**నిష్క్రామశ్చైవ తర్జన్యా తదనన్తరమిష్యతే,**
**సంనిపాతాస్తథాన్తే చ కలాద్వాదశకం భవేత్. 57**

**తా.** ద్వాదశకలాతాలంలో కనిష్ఠికతో నిష్క్రామ – ప్రవేశాలు, కనిష్ఠికా – అనామికలతో తాల – శమ్యాలు, తర్జనితో నిష్క్రామ – శమ్యా – తాలాలు, కనిష్ఠికతో ప్రవేశము, తర్జనితో నిష్క్రామమూ ప్రదర్శించాలి.

**మూ. ఏష త్వావాపవిక్షేపవ్యవధానేన పణ్డితైః,**
**విధిశ్చతుష్కలో జ్ఞేయః ప్రాగుక్తాఙ్గులిభిః కృతః. 58**

**తా.** చతుష్కలతాలంలోని ఆవాప – విక్షేపాల ప్రదర్శనం అంగులులతో (వేళ్లతో) ఎలా చెయ్యాలో వెనుక చెప్పబడినది.

**మూ. ద్వికలశ్చతుష్కలశ్చ పాదభాగః ప్రకీర్తితః,**
**చత్వారః పాదభాగాశ్చ మాత్రేతి పరిభాష్యతే. 59**

**తా.** పాదభాగంలో రెండు 'కల'లు, నాలుగు కలలు ఉంటా యని చెప్పాను కదా! నాలుగు పాదభాగాలకు **'మాత్ర'** అని పేరు.

**మూ. చఞ్చత్పుటస్య తాలస్య తథా చాపపుటస్య చ,**
**పఞ్చపాణేశ్చ విజ్ఞేయా భేదా హ్యేతే పృథక్ పృథక్. 60**

**తా.** చంచత్పుట – చాపపుట – పంచపాణితాలాలలో ఉన్న ఈ భేదాలను వేరువేరుగా గుర్తించాలి.

**మూ. ఏవమేష మయా తాలః సమాసాత్ పరికీర్తితః,**
**ఆసారితే వర్ధమానే గీతాఙ్గేషు చ యః స్మృతః. 61**

**తా.** ఈ విధంగా నేను, ఆసారితంలోను, వర్ధమానంలోను, ఇతరగీతాంగాలలోను ఉండే తాలాల సంక్షిప్తస్వరూపం మీకు చెప్పాను.

**మూ. అథాసారితకానాం తు సంప్రవక్ష్యామి లక్షణమ్,**
**భేదశ్చఞ్చత్పుటస్యాదౌ తథా గురులఘుప్లుతైః. 62**
**పఞ్చపాణిం తతః కుర్యాద్ ద్విరభ్యస్తం ప్రయోగవిత్.**

**తా.** ఇపుడు నేను ఆసారితాల లక్షణం చెపుతాను – నాట్యప్రయోగం చేసేవాడు ముందుగా గురు – లఘు – ప్లుతాక్షరాలతో కూడిన చంచత్పుటభేదాన్ని తీసికొని, తరువాత పంచపాణిని రెండు పర్యాయాలు ప్రయోగించాలి.

**మూ. యథాక్షరం తు పూర్వత్ర యథావద్వినివేశయేత్. 63**
**శమ్యాతాలః పునశ్చైవ శమ్యా తాలమథాపి వా.**

**తా.** చంచత్పుటతాలంలోని అక్షరాలకు అనుగుణంగా, చెప్పబడిన విధంగా తాల – సంనిపాతాలను – 'శమ్య, తాలం, శమ్య, తాలం, తాలం' అను క్రమంలో ఉంచాలి.

**మూ. ఆద్యేఽక్షరే సన్నిపాతం పఞ్చపాణేశ్చ యోజయేత్. 64**
**తాలం శమ్యాం చ తాలం చ శమ్యాతాలౌ తతః పరమ్,**
**ఏష ఏవ ద్వితీయేఽపి పఞ్చపాణౌ విధిః స్మృతః. 65**
**ప్లుతస్యాన్తేఽపి తస్యేష్టః సన్నిపాతః ప్రయోక్తృభిః,**
**ఏవం యథాక్షరం జ్ఞేయం కనిష్ఠాసారితం బుధైః. 66**

**తా.** పంచపాణి మొదటి అక్షరంమీద సంనిపాతం కూర్చి, తరువాతి వరుసగా తాల – శమ్యా – తాల – శమ్యా – తాలాలు కూర్చాలి. రెండవ పంచపాణి విధానం కూడ ఇట్లే. కొందరు ప్రయోక్తలు దీని ప్లుతం చివర కూడ సంనిపాతం ఉండా లంటారు. అక్షరానుసారం కనిష్ఠాసారితస్వరూపం ఇలా ఉంటుందని బుధులు తెలుసుకోవాలి.

**మూ. యథాక్షరస్యాక్షరైశ్చ తాలపాతాన్ నిబోధత,**
**చకారే తు భవేచ్ఛమ్యా ద్వితీయే తాల ఏవ చ. 67**
**పుకారే తు భవేచ్ఛమ్యా టకారే తాల ఏవ చ,**
**ఏవం చఞ్చత్పుటో జ్ఞేయః పఞ్చపాణిరతః పరమ్. 68**

**తా.** ఇపుడు నేను – **'చఞ్చత్పుట'** అను పేరులోని అక్షరాల విభాగాన్ని పట్టి తాల – పాతాలను చెపుతాను. 'చ' అనేది 'శమ్యా'కు సంకేతం. 'చత్' అనేది తాలానికి సంకేతం. 'పు' అనేది 'శమ్యా'కు సంకేతం 'ట' అనేది తాలానికి సంకేతం. ఇది 'చంచత్పుట' స్వరూపం. ఇటుపైన **'పంచపాణి'ని ('షట్పితాపుత్ర')** గూర్చి చెపుతాను.

**మూ. షట్కారే సంనిపాతః స్యాత్ పికారే తాల ఏవ చ,**
**తకారే తు భవేచ్ఛమ్యా పుకారే తాల ఏవ చ. 69**

**త్రకారే తు భవేచ్ఛమ్యా కకారే తాల ఏవ చ,**
**ద్వితీయేఽప్యేవ మేవ స్యాత్ సంనిపాతస్తతః పరమ్. 70**

**తా.** 'షట్' సంనిపాతానికీ, 'పి' తాలానికీ, 'తా' శమ్యాకీ, 'పు' తాలానికీ, 'త్ర్య' శమ్యాకీ; 'క' తాలానికీ సంకేతాలు. రెండవదానిలో కూడ ఇదే విధంగా తెలుసుకోవాలి. రెండవదాని చివర మాత్రం సంనిపాతం కూడ ఉంటుంది.

**మూ. గుర్వక్షరాణాం విశ్లేషాదేవమేవ తు మధ్యమమ్,**
**విశ్లేషితానామేషాం తు ద్విర్భావే యా కలా భవేత్. 71**

**తా.** దీనిలోనే (కనిష్ఠాసారితం)లోనే గురువుల మిశ్రణం చేస్తే అది మధ్యమాసారితం అవుతుంది.

**మూ. పాతాన్తే సా ప్రయోక్తవ్యా యథావదనుపూర్వశః,**
**ద్విర్భావో మధ్యమస్యైవ జ్యేష్ఠమిత్యభిధీయతే. 72**
**మధ్యమస్య విధానేన న్యసేచ్చ ద్విగుణాః కలాః,**
**సంనిపాతైర్నిపాతైశ్చ తేషాం వస్తు ప్రకీర్తితమ్. 73**

**తా.** దీనిలో, 'వెనుక చెప్పిన విధానం ప్రకారం గురువుల మిశ్రణం చేసి, 'కల'లను కూడ రెండురెట్లు చేస్తూ వాటి క్రమంలో ఉంచి చివర సంనిపాతం ఉంచాలి. ఇదే పద్ధతిలో మధ్యమాసారితాన్ని రెండు రెట్లు చేస్తే అది జ్యేష్ఠాసారితం అవుతుంది. 'కల' కాలాన్ని కూడ రెట్టింపు చేసి చివరి సంనిపాత – నిపాతాలతో వస్తువును (ప్రధానాంశాలతో కూడిన గీతాన్ని) ఉంచాలి.

**మూ. అతఃపరం ప్రవక్ష్యామి లయాన్తరితలక్షణమ్,**
**తాలో యస్య కనిష్ఠః స్యాత్ స లయాన్తరితః స్మృతః**
**కలాకాలాన్తరకృతా కేవలం తు కలాన్తరమ్. 74**

**తా.** ఇటు పైన 'లయాంతరితం' లక్షణాన్ని చెపుతాను. అత్యల్పమైన కాలం గల లయ **లయాన్తరితం**. 'కల'కు ఎంత సమయం నిర్ణయింపబడిందో దానికంటె భిన్నమైన సమయం పట్టే 'కల' 'విభిన్నకల' అని చెప్పబడుతుంది.

**మూ. అయమేవ తాలయోగో విశేషసిద్ధిస్తు పూర్వనిర్దిష్టా,**
**భవతి హి లయాన్తరితే శబ్దాద్ భేదో లయాచ్చైవ. 75**

**తా.** ఈ తాలాలప్రయోగం నాట్యానికి విశిష్టమైన సిద్ధిని, విజయాన్ని చేకూరుస్తుంది. లయాంతరితప్రయోగంవల్ల శబ్దంలోను, లయలోను కూడ ఒక విధమైన భేదం ఏర్పడుతుంది.

**మూ. ఆసారితానాం సంయోగో వర్ధమానక ఇష్యతే,**
**ఉత్పత్తిం లక్షణం చాస్య గదతో మే నిబోధత. 76**

తా. ఆసారితాల సంమేళనం వర్ధమానకం అని చెప్పబడుతుంది. వీటి ఉత్పత్తిని, లక్షణాలను గూర్చి చెపుతాను; వినండి.

**మూ. నిహత్య దానవం ఘోరం రుద్రేణామితతేజసా,**
**నృత్తముత్పాదితం పూర్వం చిత్రం తాణ్డవసంజ్ఞితమ్. 77**
**అథ భూతగణైః సర్వైస్తస్మిన్ కాలే మహాత్మభిః,**
**వర్ధమానమిదం సృష్టం పిణ్డీబన్ధైర్విభూషితమ్. 78**

**తా.** అపరిమితమైన తేజస్సు గల రుద్రుడు, పూర్వం భయంకరుడైన ఒక దానవుణ్ణి సంహరించి తాండవం అనే ఒక చిత్రమైన నృత్తం సృజించాడు. అప్పుడు మహాత్ములైన భూతగణాలన్నీ 'పిండీబంధాలతో' అలంకృత మైన ఈ వర్ధమానం సృజించారు.

**మూ. పరితుష్టశ్చ తం దృష్ట్వా సపత్నీకో వృషధ్వజః,**
**ప్రదదే చ వరం శ్రేష్ఠం సహ దేవ్యా మహేశ్వరః. 79**
**తల్లక్ష్యలక్షణయుతం మార్గయుక్తివిధిక్రమైః,**
**వర్ధమానం ప్రయోక్తారో యాస్యన్తి శివగోచరమ్. 80**

**తా.** పత్నీసహితుడైన వృషభధ్వజుడు ఆ వర్ధమానం చూచి చాల సంతోషించాడు. అపుడు మహేశ్వరుడు మహాదేవీ కూడ "లక్ష్య – లక్షణసహిత మైన ఈ వర్ధమానాన్ని సరి యైన మార్గాలను, యుక్తులను, విధానమును, క్రమాన్ని అనుసరించి ప్రయోగించు వాళ్లు శివలోకం పొందుతారు" అని శ్రేష్ఠమైన వరం ఇచ్చారు.

**మూ. ఏవమేతన్మయా దృష్టం పిణ్డీబన్ధనిమిత్తతః,**
**అధునా తు ప్రవక్ష్యామి లక్షణం శృణుత ద్విజాః. 81**

**తా.** ద్విజులారా! పిండీబంధాలకోసమై నేను దీని నంతనూ చూచి ఉన్నాను. ఇప్పుడు ఈ వర్ధమానం లక్షణం చెపుతాను; వినండి.

**మూ. వృత్తిదక్షిణచిత్రేషు మార్గేషు వినియోజితమ్,**
**ద్వివిధం వర్ధమానం స్యాత్ స్వప్రమాణవినిర్మితమ్. 82**

**తా.** వర్ధమానకం – వృత్తి, దక్షిణం, చిత్రం అను మూడు మార్గాలతో కూర్చబడి ఉంటుంది. దీని స్వరూపప్రమాణాదుల ననుసరించి నిర్మించిన ఈ వర్ధమానం రెండు విధాలు.

**మూ. అతాలం చ సతాలం చ తత్ప్రమాణం ద్విధా స్మృతమ్,**
**చతస్రః కణ్డికాశ్చైవ తావన్త్యాసారితాని చ. 83**

**తా.** తాలానుసారం ఉండేది, తాలం లేకుండా ఉండేది అని వర్ణమానం రెండు విధాలు. ఈ విధంగా దీనిలో నాలుగు ఆసారితాలు, నాలుగు కండికలూ ఉంటాయి.

**మూ. ధ్రువకేణ కలాభిస్తు కణ్డికా దేవకల్పితాః,**
**వర్ధమానశరీరే తు క్రియతే మార్గయోజనా. 84**

**తా.** ధ్రువలోని రెండు భాగాలూకూడ, దేవతలు 'కల'లతో నిర్మించారు. వర్ధమానంలో మార్గాలు చేర్చబడి ఉంటాయి.

**మూ. ఆద్యా నవకలా తు స్యాదష్టాభిస్తత్పరా స్మృతా,**
**దశీ షట్ చ తథా చైవ తృతీయా కణ్డికేష్యతే. 85**

**చతుర్థీ కణ్డికా చైవ ద్వాత్రింశత్కలికా స్మృతా,**
**కలాభిరేవ నిర్దిష్టా కణ్డికా వర్ధమానకే. 86**

**కేవలం మార్గసంభూతా స్వా(స్వ)లయోపాఙ్గవర్జితా.**

**తా.** మొదటి కండిక తొమ్మిది 'కల'ల, రెండవది ఎనిమిది 'కల'ల, మూడవది పదహారు 'కల'ల, నాల్గవది ముప్పైరెండు 'కల'ల కాలప్రమాణంలో ఉంటాయి. ఈ విధంగా వర్ధమానకంలోని కండికలు 'కల'లు నిశ్చితసంఖ్యలో ఉంటాయి. తగు మార్గాలతో కూడిన ఈ కండికలలో ఉపాంగమైన లయ ఉండదు.

**మూ. ఏకద్విత్రిచతుర్యోగాత్ తాభిరాసారితాని తు. 87**

**వర్ధమానే ప్రసూయన్తే మార్గతాలాఙ్గయోగతః.**

**తా.** కండికల ప్రమాణం వరుసగా – ఒకటి, రెండు, మూడు, నాలుగుకలలు; ఈ'కల'లు, తగిన మార్గతాలాలతో కూడిన ఆసారితాలను నిర్మిస్తాయి.

**మూ. ప్రథమం కణ్డికాం కృత్వా బాలతాలప్రయోజితామ్. 88**

**అన్తిమార్ధం కలాహీనం కుర్యాదేవం కనిష్ఠికమ్.**

**తా. కనిష్ఠాసారితం :–** బాల (చిన్న) తాలంతో కూడిన మొదటి కండికను పూర్తి చేసి, చివరి అర్ధంలో ఒక 'కల' తగ్గించి కనిష్ఠాసారితం చెయ్యాలి.

**మూ. ద్వితీయాం కణ్డికాం కృత్వా ప్రథమా సకలా యది. 89**

**యుజ్యతే పూర్వతాలేన తదా తత్ స్యాల్లయాన్తరమ్,**
**వర్ధమానం తదా చిత్రైర్నహి వృత్తేన యోజయేత్. 90**

**తా.** ఈ విధంగా ద్వితీయకండికనుకూడ పూర్తి చేసి దీనిలో ప్రథమకండికయొక్క పూర్వతాలంలోని ఆ 'కల'లను చేరిస్తే అదే **'లయాంతరితం'** అవుతుంది. ఈ వర్ధమానకం చిత్రమార్గంలో ప్రయోగించేటప్పుడు దీనిని అక్కడ వృత్తిమార్గంలో ప్రయోగించకూడదు.

**మూ. బహిర్వా వర్ధమానే వా కనిష్ఠం న హి దక్షిణే,**
**ద్విగుణాక్షరసంయోగాదన్యమార్గనియోజనాత్. 91**

**నృత్తకాలవిశేషాచ్చ బాలతాలాల్లయాన్తరమ్.**

**తా.** వర్ధమానకంలో నైనా, ఇతరగీతాలలో నైనా – దక్షిణమార్గంలో కనిష్ఠాసారితం చేయకూడదు. రెట్టింపు అక్షరాలను చేర్చడంచేతా, ఇతరమార్గాలను కూర్చడంచేతా, నృత్యమధ్యసమయాన్ని సరిచేసికొనడం చేతా, అల్పతాలప్రయోగంచేతా ఇది **'లయాంతరం'** అవుతుంది.

**మూ. కనిష్ఠాసారితే తాలో యో మయా పరికీర్తితః. 92**

**స ఏవ సర్వః కర్తవ్యః ప్రథమే కణ్డికాద్వయే,**
**తృతీయా సద్వితీయా చ ప్రథమా చైవ తత్కలా. 93**

**ద్వికలం యోగమాశ్రిత్య మధ్యమాసారితం తు తత్.**

**తా. మధ్యమాసారితం :–** కనిష్ఠాసారితంలో ఏ తాలాన్ని నేను చెప్పానో దానినే పూర్తిగా దీని (మధ్యమాసారితంలోని) మొదటి రెండు కండికలలోను ఉంచాలి. మొదలు చెప్పిన సంఖ్యలలోనే దీని తృతీయ – ద్వితీయ – ప్రథమ కండికలలో కూడ 'కల'లు ఉండాలి. అప్పు డది **మధ్యమాసారితం.**

**మూ. చతుర్థీమాదితః కృత్వా చతస్రః కణ్డికా యదా,**
**చతుష్కలేన యుజ్యన్తే జేష్ఠమాసారితం తు తత్. 93**

**తా. జ్యేష్ఠాసారితం :–** నాల్గవ కండికను అన్నింటికంటె ముందు ఉంచి, మిగిలిన కండికలను అదే క్రమంలో యథాతథంగా కలుపుతూ, నాలుగు కండికలలోను కూడ 'కలా' సంఖ్య నాలుగేసి చొప్పున పెంచాలి. అది **జ్యేష్ఠాసారితం.**

**మూ. ప్రయోగస్తు యదా త్వేషాం పిణ్డీబన్ధైర్వికల్ప్యతే,**
**ప్రత్యేకం త్వఙ్గవిన్యాసస్తదా తేషాం పృథక్ పృథక్. 95**

**తా.** వీటిని పిండీబంధాలతో కలిసి ప్రయోగించే టప్పుడు ఈ కండికలను వాటి వాటి అంగాలతో వేరు వేరుగా ఉంచాలి.

**మూ. ముఖం ప్రతిముఖం చైవ దేహః సంహరణం తథా,**
**అఙ్గాన్యేతాని చత్వారి సర్వేష్వాసారితేషు చ. 96**

**తా.** అన్ని ఆసారితాలలోనూ కూడ – ముఖం, ప్రతిముఖం, దేహం, సంహరణం అను నాలుగు అంగా లుంటాయి.

**మూ. ఉపోహనం ముఖం తేషాం యుగ్మం ప్రతిముఖం భవేత్,**
**ఓజః శరీరసంహారావేవమఙ్గవిధిక్రమః. 97**

**ఇత్యేవం చతురఙ్గాని జ్ఞేయాన్యాసారితస్య తు.**

**తా.** ఉపోహనం వాటి ముఖం; యుగ్మం ప్రతిముఖం; ఓజస్సు దేహ – సంహారాలు. ఇది అంగవిధానంలోని క్రమం. ఆసారితానికి ఈ విధంగా నాలు గంగా లుంటాయి.

**మూ. చతురాసారితైర్బద్ధం వర్ధమానకముచ్యతే,**
**వర్ణతాలలయగ్రన్థవాద్యాభినయవర్ధనాత్**
**పాత్రాణాం వృద్ధియోగాచ్చ వర్ధమానకముచ్యతే. 99**

**తా.** ఈ నాలుగు ఆసారితాలతో నిబద్ధమైన గీతం **వర్ధమానకం** అని చెప్పబడు తూన్నది. దీనిలో – అక్షరాలు, తాలాలు, లయలు, గ్రంథము (Text) వాద్యాలు, అభినయము – వీటిని క్రమంగా పెంచడంవల్ల దీని కా పేరు.

**మూ. వర్ధమానశరీరస్య భవేదాసారితస్య చ,**
**కార్యకారణభావేన పరస్పరవికల్పనమ్. 100**

**యథావృక్షాద్భవేద్బీజో బీజాద్ వృక్షస్య సంభవః,**
**అన్యోన్యహేతుసంయోగః ప్రసర్తవ్యస్తథైవ తు. 101**

**తా.** వర్ధమానశరీరమూ, ఆసారితమూ – ఈ రెండింటి మధ్యా పరస్పరమూ కార్యకారణభావం ఉంది. వృక్షంనుండి బీజం పుడుతుంది. బీజంనుండి వృక్షం పుడుతూన్నది. ఈ విధంగా వాటి మధ్యలో ఉన్న కార్యకారణభావంవంటిదే ఇది కూడ.

**మూ. యోగాదేకకలాత్ సూతే కనిష్ఠకలయాన్తరే,**
**ద్వికలాన్ మధ్యమం చైవ జ్యేష్ఠం చైవ చతుష్కలాత్. 102**

**తా. లయాంతరితం :–** లయాంతరంలో ఒక 'కల' చేర్చడంచేత కనిష్ఠాసారితం ఉత్పన్నం అవుతుంది. రెండు 'కల'లు చేర్చడంచేత మధ్యమాసారితం ఉత్పన్న మౌతుంది. నాలుగు 'కల'లు చేర్చడంచేత జ్యేష్ఠాసారితం ఉత్పన్నం అవుతుంది.

**మూ. చఞ్చత్పుటపరివర్తః శమ్యాది ద్వౌ చ పఞ్చపాణికృతౌ,**
**అన్తే చ సన్నిపాతః పాతవిధిరయం కనిష్ఠస్య. 103**

**తా. కనిష్ఠాసారితం :–** కనిష్ఠాసారితంలో సంనిపాత (పాత) నియమం ఈ విధంగా ఉంటుంది. చంచత్పుటం శమ్యాతో ప్రారంభించి నప్పుడు – శమ్యా – తాల – శమ్యా –

తాలాలు, శమ్యాతో ప్రారంభమయ్యే రెండు పంచాపాణుల ప్రయోగం ఉన్నప్పుడు – సన్నిపాత – తాల – శమ్యా – తాల – సంనిపాత – తాల – శమ్యా – తాల – శమ్యా – తాలాలు ప్రయోగించాలి.

**మూ. అయమేవ తాలయోగో విశేషసిద్ధిశ్చ పూర్వనిర్దిష్టా,**
**భవతీహ లయాన్తరితే శబ్దాద్ భేదో లయాచ్చైవ. 104**

**తా.** లయాంతరితతాలంలో అనుసరించ వలసిన ప్రక్రియ ఇదే. దీని లక్షణమూ, విశేషసిద్ధీ (సంవర్ధనమూ) వెనుక చెప్పబడింది. లయాంతరితంలో శబ్దాలను పట్టి లయను పట్టీ భేదం ఏర్పడుతుంది.

**మూ. ఉత్తరకాలాత్ కృత్వా త్వాదౌ తిస్రః కలాః పరిత్యజ్య,**
**ఏతత్ పాతవిధానం మధ్యమకాసారితే ప్రోక్తమ్. 105**

**జ్యేష్ఠస్య భవతి నియమాదాదావేకా చతుష్కలా మాత్రా,**
**మాత్రాద్వన్ద్వయుతాన్యత్ కృత్వా తౌ ద్వౌ చ పరివర్తౌ. 106**

**తా. మధ్యమ – జ్యేష్ఠాసారితాలు :–** మొదటి మూడు 'కల'లు విడచి, తరువాతి 'కల'లు ముందు ఉంచితే అది మధ్యమసారితానికి సంబంధించిన పాతవిధానం అవుతుంది.

జ్యేష్ఠాసారితం ప్రారంభంలో, తప్పకుండా చతుష్కలం మాత్రం ఉంచాలి. ఈ మాత్రను 'కృ దు' అను వర్ణాలతో చేసి, మరల రెండు పరివర్తాలు చెయ్యాలి.

**మూ. బాలం నవకలం యేషాం న తేషాం సాధుసంమతమ్,**
**సన్నిపాతాఙ్గవిన్యాసం కలానియమతః కృతమ్. 107**

**తా.** కనిష్ఠాసారితం నవకలానిర్మిత మను కొందరి అభిప్రాయాన్ని మరి కొందరు విద్వాంసులు అంగీకరించరు. వాళ్ల అభిప్రాయం ప్రకారం సంనిపాతవిన్యాసం 'కలా' నియమానుసారం చేయబడుతుంది.

**మూ. అథ తత్ర ముఖే తాలౌ ధ్రువపాతైరేవ నియమితౌ మానమ్,**
**తస్య కలామాత్రాక్షరగురులఘువర్ణస్థితం వక్ష్యే. 108**

**తా.** వారి మతం ప్రకారం – కనిష్ఠాసారితంలోని ముఖంలో రెండు తాలాలు ధ్రువపాతంచేత నియమితములై ఉంటాయి.

నే నిపుడు దీని ప్రమాణమునూ, గురు – లఘుక్రమాన్నీ విశదీకరిస్తాను.

**మూ. జ్యేష్ఠస్య కలా హ్యష్టౌ ముఖం భవేన్మధ్యమస్య సప్త కలాః,**
**షడ్భిర్లయాన్తరే స్యాత్ పఞ్చైవ కలాః కనిష్ఠస్య. 109**

**తా.** జ్యేష్ఠాసారితకముఖప్రమాణం ఎనిమిది 'కల'లు, మధ్యమాసారితకముఖ ప్రమాణం ఏడు 'కల'లు, లయాంతరితము ప్రమాణం ఆరు 'కలలు'. కనిష్ఠాసారితక ముఖ ప్రమాణం ఐదు కలలు ఉంటుంది.

**మూ. ఆదావన్తే గురుణీ మధ్యే చ లఘూని వాద్యతః ప్రభృతి,**
**అష్టౌ ద్వాదశ షోడశ వింశతిరపి చాక్షరాణి స్యుః. 110**
**ఆసారితోపవహనేష్వాదావాసారణాని యుక్తాని,**
**తాన్యక్షరాణి వాక్యే యాని పురా బ్రహ్మగీతాని. 111**

**తా.** అన్ని ఆసారితాల ఉపవహనాలలో చేసే ఆసారణవిధానంలో – కనిష్ఠాసారితంలోని ఎనిమిది అక్షరాలలో రెండు గురువులు, నాలుగు లఘువులు, మళ్లీ రెండు గురువులు అయి ఉండాలి. లయాంతరితంలోని పన్నెండు అక్షరాలలో – రెండు గురువులు, ఎనిమిది లఘువులు, రెండు గురువులు అయి ఉండాలి. మధ్యమాసారితంలో పదహారు అక్షరాలలో రెండు గురువులు, పన్నెండు లఘువులు, మళ్లీ రెండు లఘువులు అయి ఉండాలి. జ్యేష్ఠాసారితంలోని ఇరవై అక్షరాలలో – రెండు గురువులు, పదహారు లఘువులు, రెండు లఘువులు అయి ఉండాలి.

ప్రాచీనకాలంలో బ్రహ్మదేవుడు గానం చేసిన ఈ అక్షరాలను, నే నిపుడు చెపుతాను–

**మూ. యథా – కుహూ జగతి యది సిని గిజం హుం – ప్రథమే లయాన్తరేవాపి;**
**తితిజల కుచత్రలయ – మధ్యే; ఇతి కుచవలితల – జ్యేష్ఠే.**

**వి.** ఈ అక్షర నిర్మాణానికి **'బ్రహ్మప్రోక్తగీతం'** అని పేరు. భారతీయసంగీత సంప్రదాయంలో అతి ప్రాచీనకాలంనుంచీ గురుశిష్యపరంపరయా వస్తూన్న గీతాలు. ఇవి అనాదికాలంనుంచీ వస్తూన్నాయి అని కూడ కొందరి విశ్వాసం. ఇలాంటి ఉదాహరణ లన్నీ చూస్తుంటే భారతీయ నృత్యనాట్యసంప్రదాయానికి మూలపురుషుడు భగవంతుడైన శివుడే అని స్పష్టంగా తెలుస్తుంది. ఈ సంప్రదాయమూలాలు శివునికి మాత్రమే తెలిసి ఉండాలి. వీటి అర్థాలు అస్పష్టంగా ఉన్నా, వీటి ద్వారా శివుని ప్రాచీనస్వరూపసూచక మైన పదాలు వీటిలో కనబడతాయి.

**మూ. ఇత్యక్షరపతనకలాగురులఘువర్ణస్థితిప్రవిభక్తః,**
**ఆసారితముఖసంజ్ఞే ఉపవహనవిధిః సముద్దిష్టః. 112**

**తా.** అక్షరాల 'కల'ల ఏర్పాటు, గురు – లఘువులు క్రమమూ వీటిమీద ఆధారపడి ఉన్న ఈ అపోహనవిధానం ఆసారితాల ముఖాలలో పాటించవలసి ఉంది.

**మూ. ఏవమేతత్సవిస్తారం కథితం పరిమాణకమ్,**
**చత్వారస్తు గణా యుగ్మే ఓజే షట్ పరికీర్తితాః. 113**

**తా.** ఈ విధంగా ఉపవహనపరిమాణాన్ని గూర్చి సవిస్తరంగా చెప్పాను. చతురస్రంలో నాలుగు గణాలు, త్ర్యస్రంలో మూడు గణాలు ఉంటాయి.

**మూ. పఞ్చపాణౌ ద్వితీయే తు సార్ధాః షట్ పరికీర్తితాః,**
**కనీయ ఏవం కర్తవ్యమక్షరైస్తాలమానతః. 114**

**తా.** పంచపాణిలోను, చాపపుటంలోను ఆరున్నర గణా లుంటాయి. ఇలా ఉంచిన ట్లయితే అది తాలాల, ప్రమాణాల అనుసారం కనిష్ఠాసారం ఏర్పడుతుంది.

**మూ. యథా – దేవం దేవైః సంస్తుతమీశం దైత్యైర్యక్షైః ప్రణమితచరణమ్,**
**త్రైలోక్యా హితమీశం హరం రుద్రం శరణమహముపగతః 114.క**

**తా. "దేవం దేవైః"** ఇత్యాదిశ్లోకం కనిష్ఠాసారితానికి ఉదాహరణం. దేవతలచేత స్తుతింపబడినవాడు, సర్వశక్తుడు, దైత్యులచేత యక్షులచేత నమస్కరింపబడినపాదాలు కలవాడు, మూడు లోకాలకు హితకరుడైన ప్రభువు, పాపహరుడు, శత్రుభయంకరుడు అయిన దేవుని శరణుపొందుచున్నాను.

**మూ. అష్టావేవ గణాః కార్యాః పూర్వతాలే యథావిధి,**
**ద్వాదశైవ తు కర్తవ్యా షట్పితాపుత్రకే గణాః. 115**
**అర్ధత్రయోదశస్తథా తృతీయే వస్తుసంజ్ఞిని,**
**ఏవమక్షరవిన్యాసో మధ్యమాసారితే స్మృతః. 116**

**తా. మధ్యమాసారితం :–** పంచపుటతాలంలో ఎనిమిది గణాలు, షట్పితాపుత్రక తాలంలో పన్నెండు గణాలు. 'వస్తు' అను తృతీయభాగంలో పదమూడున్నర గణాలు ఉండాలి. మధ్యమాసారితంలో అక్షరవిన్యాసం ఈ విధంగా చెప్పబడింది.

**మూ. యథా – భూతాధిపతిం భగనేత్రహరణమీశం దేవైర్వన్ద్యం సురమఖమథనం రౌద్రం భయదం గజచర్మపటం శమ్భుం త్ర్యక్షం జ్వలననిభజటం భుజఙ్గపరికరమ్. త్రిదశ గణవృతం దైత్యైర్నిత్యం పరిపఠితచరితమ్ అమరపతినమితమ్ అభిమతసుఖదం రుద్రం పీతం పితృవననిలయం గఙ్గాప్లావితశోభనజటం తం శరణం గతోఽస్మి వరదం చ మహేశ్వరమ్. 116 క.**

**తా.** ఉదాహరణం – **"భూతాధిపతిం ... మహేశ్వరమ్"**. భూతాలఅధిపతి, భగుని నేత్రాలు హరించినవాడు, ఈశుడు, దేవతలచేత వంద్యుడు, దేవతల యజ్ఞం నశింపచేసినవాడు, రౌద్రుడు, భయంకరుడు గజచర్మవస్త్రదారి, సుఖనిలయుడు, మూడు నేత్రాలు కలవాడు, అగ్నిజ్వాలలవంటి జటలు కలవాడు, సర్పభూషణుడు, దేవతాగణ పరివృతుడు, ఎల్లప్పుడు దైత్యులచేత పఠింపబడిన చరిత్రకలవాడు, దేవేంద్రునిచేత

నమస్కరింపబడినవాడు, ఇష్టమైన సుఖాలు ఇచ్చేవాడు, రుద్రుడు, పచ్చని రంగుగలవాడు, శ్మశానవాసి, గంగచేత తడపబడిన అందమైన జటలుకలవాడు. వరదుడు అయిన ఆ పరమేశ్వరుణ్ణి శరణు వేడుచున్నాను.

**మూ. కార్యాః షోడశ యుగ్మాఖ్యే తాలే తు ప్రథమగే గణాః,**
**చతుర్వింశతిరోజాఖ్యే ద్వితీయే వస్తుసంజ్ఞితే. 117**
**చతుర్వింశతిరర్ధశ్చ తృతీయే వస్తుకే భవేత్,**
**జ్యేష్ఠే త్వాసారితే కార్య ఏవమక్షరసఙ్ఖ్యయః. 118**

**తా. జ్యేష్ఠాసారితమ్ :–** చంచత్పుటతాలంలో ముందుగా పదహారు గణా లుండాలి. రెండవ దైన చాపపుటతాలంలో ఇరవైనాలుగు గణాలు, మూడవదానిలో ఇరవైనాలుగున్నర గణాలు ఉండాలి. ఇదీ – జ్యేష్ఠాసారితంలో ఉండవలసిన అక్షరక్రమం.

**మూ. యథా – అమరప్రవరం మదనాఙ్గహరం భువనైకనాథమ్ అభయప్రదం త్రిపుర నాశకరం దేవం తమహం ప్రణతః. సురపితృమునిగణప్రణతచరణం పృథివీ – సలిలానల – పవన – యజ్ఞాధిపతి – సూర్య – చన్ద్ర – వ్యోమాఖ్యాః అష్టౌ మునిభిర్యస్య కార్యాః (యాః) ప్రోక్తాః త్రైలోక్యగురుం తమచిన్త్యమజం విద్యానిలయం భైరవరూపం ఖట్వాఙ్గధరం స్థిత్యుత్పత్తిప్రలయనిమిత్తం సూక్ష్మాక్షమచిన్త్యం చన్ద్రార్ధధరం తిలకార్ధధరం కుచార్ధధరం కాన్తార్ధధరమ్. బహలైర్వివిధైర్వికృతైర్వికటైర్ముణ్డైః విముఖైర్విషమైః ప్రమథైః పరివృతమీశం సతతం ప్రణతః.**

**తా.** దీని కుదాహరణం ఎట్లనగా – **"అమరప్రవరం ... ప్రణతః"**. అమరులలో శ్రేష్ఠుడు. మన్మథదేహనాశకుడు, సర్వలోకాలకు ఒకే ఒక నాథుడు. అభయప్రదుడు, త్రిపురనాశనం చేసినవాడు అయిన ఆ దేవునకు నమస్కరిస్తున్నాను. సురులచేత, పితృదేవతలచేత, మునిగణాలచేత నమస్కరింపబడిన పాదాలు కలవాడు, భూమి, ఉదకము, అగ్ని, వాయువు, యజమానుడు, సూర్యుడు, చంద్రుడు ఆకాశము – ఈ ఎనిమిదీ ఎవని కార్యములు (కాయములు) అని మును లంటారో అట్టి త్రిలోకగురువు (ముల్లోకాలకు గురువు), ఊహింప శక్యం కానివాడు, పుట్టుక లేని వాడూ, జ్ఞాన నిలయుడు, భయం కలిగించు రూపం గలవాడు, మంచంకోడు చేతిలో ఉన్నవాడు; స్థితి – సృష్టి – ప్రలయాలకు కారణము, సూక్ష్మములైన ఇంద్రియాలు కలవాడు, ఊహింప శక్యం కానివాడు. అర్ధచంద్రుణ్ణి శిరస్సుపై ధరించినవాడు; సగం బొట్టు, సగం కుచమండలం (ఒక కుచం) ధరించినవాడు, ప్రియురాలి శరీరార్ధము ధరించినవాడు, అనేకవిధాలవాళ్ళు, వికృతరూపులు. వికటంగా ఉన్నవాళ్ళు, బోడి తలలవాళ్ళు, వంకర ముఖాలవాళ్ళు; వక్రమైన అవయవా లున్న వాళ్ళ

అయిన ప్రమథులచే పరివృతుడు, అయిన ఈశ్వరుని ఎల్లప్పుడు నమస్కరించుచున్నాను.

**మూ. ఆసారితానాం సర్వేషాం త్రయో భేదాః ప్రకీర్తితాః,**
**యథాక్షరం ద్విసంఖ్యాతం త్రిసంఖ్యాతమథాపి వా. 119**

**తా.** యథాక్షర – ద్విసంఖ్యాత – త్రిసంఖ్యాతా లను మూడు విధాలైన ఆసారితాన్ని గూర్చి నేను మీకు చెప్పాను.

**మూ. తాలచ్ఛేదద్విగుణితైః సమవర్ణగణైః కృతమ్,**
**అనివృత్తాక్షరపదం యథాక్షరమితి స్మృతమ్. 120**

**తా. యథాక్షరం :–** దీనిలో సమానమైన వర్ణాల గణాలు ప్రయోగింపబడతాయి. ఈ గణాలు తాలంకోసం ద్విగుణితాలవుతాయి. దీనిలోని అక్షరాలు మాత్రం ఆవృత్తి చేయబడవు.

**మూ. నివృత్త్యా యత్సమాయుక్తం ద్విసంఖ్యాకం తదుచ్యతే,**
**నివృత్తిద్వయసంపన్నం త్రిసంఖ్యాతమితీష్యతే. 121**

**తా.** యథాక్షరాన్ని ఒక పర్యాయం ఆవృత్తి చేస్తే అది **ద్విసంఖ్యాతం**, దానిని (యథాక్షరాన్ని) రెండు మార్లు ఆవృత్తి చేస్తే అది **త్రిసంఖ్యాతం**.

**మూ. చతుష్కాదౌ చతుర్మాత్రా యథోక్తగురులాఘవాః,**
**యథాయోగం గణాః కార్యా గీతేష్వాసారితేషు చ. 122**

**తా.** ఆసారితంలోని గీతాల తాలం నాలుగు 'కల'లలో నాలుగు మాత్రల గణాలతో, వెనుక చెప్పిన గురులఘ్వక్షరాలతోను ఉండాలి.

**మూ. అక్షరైర్యా చతుర్మాత్రా ద్విమాత్రా వర్ణతస్తథా,**
**చిత్రే కలా భవేద్ యా తు వృత్తౌ సా ద్విగుణా మతా. 123**

**వృత్తౌ యా వర్ణమాత్రా తు చతుర్మాత్రా ప్రకీర్తితా,**
**ద్విగుణా దక్షిణే సా తు కలా జ్ఞేయాః ప్రయోక్తృభిః. 124**

**తా.** అక్షరాలలో నాలుగు మాత్ర లున్నదే వర్ణాలలో ద్విమాత్రం అవుతుంది. చిత్ర మార్గంలోని 'కల'లు వార్తికమార్గంలో రెట్టింపు అవుతాయి. అందుచేత వార్తికమార్గంలో నాలుగు మాత్రల ప్రమాణం గల 'కల'లు దక్షిణమార్గంలో రెట్టింపు చేయబడతాయి.

**మూ. న మార్గభేదోఽక్షరేషు కశ్చిదప్యుపపద్యతే,**
**వర్ణమాత్రాద్ద్విగుణితాద్వర్ణభేదః ప్రకీర్తితః. 125**

**తా.** అక్షరాలలో ('యథాక్షరాల'లో) మార్గం మార్చడం ఉండదు. వర్ణాలను

మాత్రలను రెట్టింపు చేయడంచేత అది వర్ణభేదం అని చెప్పబడుచున్నది.

**మూ. యథాక్షరేషు భూయిష్ఠం గీతేష్వాసారితేషు చ,**
**విధిరేష సముద్దిష్టో వర్ణతాలసమాశ్రయః. 126**

**తా.** "యథాక్షరా"లలోను, ఆసారితగీతాలలోను వర్ణ – తాలాలకు సంబంధించిన ముఖ్యమైన విధానం ఇదే అని చెప్పబడింది.

**మూ. ద్విసంఖ్యాతే నివృత్తిస్తు కార్యా స్యాదర్ధయోగతః,**
**ద్విసంఖ్యాతార్ధయోగేన త్రిసంఖ్యాతేఽపి చేష్యతే. 127**

**తా.** ద్విసంఖ్యాసారితంలోను, యథార్థచిత్రాసారితంలోను, అర్ధగణం చేర్చి ఆవృత్తి చేసి నట్లే త్రిసంఖ్యాతాసారితంలో, ద్విసంఖ్యాతాసారితంలోని సగం గణాలను చేర్చి పెంచవచ్చును.

**మూ. న చ చిత్రే ద్విసంఖ్యాతం కదాచిదపి యోజయేత్,**
**న చ వృత్తౌ త్రిసంఖ్యాతం గీతేష్వాసారితేషు చ. 128**

**తా.** చిత్రమార్గంలో ఎన్నడూ, ద్విసంఖ్యాతాసారితాన్ని కలపకూడదు. అట్లే – వార్తికమార్గంలో త్రిసంఖ్యాతాసారితగీతాలను చేర్చకూడదు.

**మూ. దక్షిణే స్యాత్త్రిసంఖ్యాతం ద్విసంఖ్యాతం చ వార్తికే,**
**చిత్రే యథాక్షరం ప్రోక్తమితి మార్గవినిశ్చయః. 129**

**తా.** దక్షిణమార్గంలో త్రిసంఖ్యాతమూ, వార్తికమార్గంలో ద్విసంఖ్యాతమూ, చిత్ర మార్గంలో యథాక్షరాసారితమూ చేర్చవచ్చును. మార్గాల విషయంలో అనుసరించవలసిన విధానం ఇదే.

**మూ. దక్షిణేనైవ గత్వాదౌ నివృత్తౌ వృత్తివద్ వ్రజేత్,**
**చిత్రవచ్చ యథాన్యాయం త్రిసంఖ్యాతే విధిః స్మృతః. 130**

**తా.** దక్షిణమార్గంలో ప్రారంభమై, వృత్తిమార్గంలో రెండు మార్లు ఆవృత్తమై చిత్ర మార్గంలో యథాక్షరం అవుతుంది. ఇదే త్రిసంఖ్యాతాసారితవిధానం.

**మూ. అనేనైవ విధానేన ద్విసంఖ్యాతమపీష్యతే,**
**వృత్తౌ వా దక్షిణే వాపి ప్రయోగోఽస్యైవ చేష్యతే. 131**
**వస్త్వాదౌ వస్తుమధ్యే చ వస్త్వన్తే వా నివృత్తయః,**
**ప్రయోక్తవ్యాః ప్రయోగజ్ఞైర్విచార్యాఙ్గబలాబలమ్. 132**

**తా.** ద్విసంఖ్యాతాసారితం కూడ ఇదే పద్ధతిలో చెయ్యాలి. దాని ప్రయోగం

దక్షిణమార్గంలో గాని వార్తిక మార్గంలో గాని జరగాలి. వస్తువులోని వేరు వేరు అంగాల బలాబలాలను అనుసరించి, నిపుణులైన సంగీతజ్ఞులు దీని ఆదియందు, మధ్యయందు, అంతమునందు ఆవృత్తులను చేస్తూండాలి.

**మూ. నివృత్తౌ తు కలా న్యూనా యదా వస్తువశాద్ భవేత్,**
**ఆకలాపతనాత్ తస్యా వర్ణః కార్యో నివృత్తిమాన్. 133**

**తా.** వస్తువును బట్టి, ఆవృత్తిలో ఒక 'కలా' కాలం న్యూనం అయితే, అప్పుడు గాయకుడు వర్ణాన్ని ఆవృత్తం చేసి, లేదా వర్ణాన్ని పొడవుగా లాగి ఆ కలాకాలాన్ని పూరించాలి.

**మూ. వర్ణాలఙ్కారసౌభాగ్యం విచ్ఛేదః కరణస్య చ,**
**తత్త్వాదీనాం ప్రయోగశ్చ నివృత్తీనాం ప్రయోజనమ్. 134**

**తా.** వర్ణాల, అలంకారాల సౌందర్యం వృద్ధిపొందడం, శరీరావయవాలకు కొంత విశ్రాంతి, తత్త్వాదుల ప్రయోగము – ఇవే ఆవృత్తుల ప్రయోజనం.

**మూ. వర్ణతాలాక్షరాణాం చ సంయోగోఽయం మయా స్మృతః,**
**ఆసారితేషు గీతేషు వర్ధమానేషు చైవ హి. 135**

**తా.** ఇంతవరకు నేను, ఆసారితాలలోను, వర్ధమానగీతాలలోను జరిగే, వర్ణ – తాల – అక్షరాల పరస్పరసంయోగాన్ని గూర్చి చెప్పాను.

**మూ. చతస్రః కణ్డికా జ్ఞేయా వర్ధమానే ప్రయోక్తృభిః,**
**విశాలా సంగతా చైవ సునన్దా సుముఖీ తథా. 136**

**తా.** వర్ధమానగీతాలలో – విశాల, సంగీత, సునంద, సుముఖి అను కండికలు (అవయవాలు) ఉంటా యను విషయం ప్రయోక్తలు గ్రహించాలి.

**మూ. తతః పూర్వా నవకలా ద్వితీయాష్టకలా స్మృతా,**
**తృతీయా షోడశకలా ద్వాత్రింశచ్చ తథోత్తరా. 137**

**తా.** వీటిలో, విశాల నవకల – తొమ్మిది కలాకాలాలలో ఏర్పడుతుంది. సంగత అష్టకల (8) ; సునంద షోడశ (16) కల; సుముఖి ద్వాత్రింశత్ (32) కల.

**మూ. ఉపోహనవిధిస్తాసామధునా చ మయోచ్యతే,**
**ఉపోహనం విశాలాయాః కలాపఞ్చకమేవ హి,**
**షట్కలాసంగతాయాశ్చ సునన్దాయాశ్చ సప్తకమ్. 138**
**సుముఖ్యాశ్చోపహనం నిత్యమష్టకలం భవేత్,**

**ఏతేషాం చైవ వక్ష్యామి గురులఘ్వక్షరక్రమమ్.** **139**

**తా.** నే నిపుడు వాటి ఉపోహనవిధానాన్ని చెపుతాను – 'విశాల' ఉపోహనకాలం ఐదు 'కల'లు, 'సంగత' ఉపోహనకాలం ఆరు 'కల'లు. 'సునంద' ఉపోహనకాలం ఏడు 'కల'లు. 'సుముఖి' ఉపోహనకాలం ఎనిమిది 'కల'లు.

**మూ. ఆదౌ గురుద్వయం కార్యం చతుర్దశ లఘూన్యపి,**
**ఉపోహనే విశాలాయాః పునరన్తే గురుః స్మృతః.** **140**

**తా.** 'విశాల' ఉపోహనంలో – మొదట రెండు గురువులు, పద్నాలుగు లఘువులు, చివర ఒక గురువు ఉండాలి.

**మూ. యథా – ఖుం దుం జగతి – అవలితక దిగినికుచకృతతితి వా.**

**తా. "ఖుందుం"** ఇత్యాదికం ఈ గురులఘుక్రమవిన్యాసానికి ఉదాహరణం.

**మూ. చతుర్భిరధికైర్హ్రస్వైర్గురుత్రయసమన్వితమ్,**
**సఙ్గతాయాం చ మునిభిరుపోహనమితి స్మృతమ్.** **141**

**యథా :– ఖుం దుం జగతి అవలితక దిగి నిగి తితి ఝల తితి చా.**

**తా. 'విశాలా'** ఉపోహనంలోని నాలుగు లఘువులు పెంచి, మూడు గురువులు ప్రయోగిస్తే అది 'సంగతా' ఉపోహనం అవుతుంది.

**"ఖుం దుం జగతి ... తితిచా"** – ఇది ఉదాహరణం.

**మూ. చతుర్భిరధికైరేవం లఘుభిర్గురుసంయుతైః,**
**సునన్దాయాశ్చ విజ్ఞేయో హ్యుపోహనవిధిర్బుధైః.** **142**

**యథా – ఖుం దుం జగతి అవలితక దిగతి ఖుల కుచలతితి వా.**

**తా. 'సంగతా'** ఉపోహనంలోని నాలుగు లఘువులు పెంచి, మూడు గురువులు చేరిస్తే అది **'సునన్ద' ఉపోహనవిధానం** అని బుధు లన్నారు.

**"ఖుం దుం జగతి ... తితి వా"** అనేది ఉదాహరణం.

**మూ. అష్టావింశల్లఘూని స్యుః సుముఖ్యాశ్చ గురూణి చ,**
**ఉపోహనవిధానే తు జ్ఞేయాని మునిసత్తమాః.** **143**

**యథా – ఖుం దుం జగతి అవలితక దిగి విగి తితి ఖుల ఖుచ కులతితి జగతితి వా.**

**తా. 'సుముఖి'** ఉపోహనంలో ఇరవైఎనిమిది లఘువులు, మూడు గురువులు ఉండాలి. మునిసత్తములారా! ఇదే 'సుముఖి' ఉపోహనవిధానం అని తెలుసుకోవాలి.

**"ఖుం దుం జగతి ... జగతితి వా"** ఇది ఉదాహరణం.

**మూ. ఉపోహ్యన్తే స్వరా యస్మాత్ యస్మాత్ గీతం ప్రవర్తతే,**
**తస్మాదుపోహనం జ్ఞేయం శుష్కాక్షర సమన్వితమ్. 144**

**తా. ఉపోహనలక్షణం :–** ఇది స్వరాలను ముందుకు నడిపిస్తుంది; గీతాన్ని ముందుకు సాగే టట్లు చేస్తుంది. ఆ కారణంవల్లనే దీనికి 'ఉపోహనం' అని పేరు. ఇది అర్థరహితమైన అక్షరాల (శుష్కాక్షరాల) సమూహం రూపంలో ఉంటుంది. (ఇది గాయకుడు చేసే ఉపోహనం).

**మూ. అథవోపోహ్యతే యస్మాత్ ప్రయోగః సూచనాదిభిః,**
**తస్మాదుపోహనం హ్యేతద్గానం భాణ్డసమాశ్రయమ్. 145**

**తా.** భాండంతో (సంగీతవాద్యాలతో) చేసే గానం కూడ ఉపోహనమే. ఎందువల్ల ననగా సూచనాదులచేత, ఇది నాట్యప్రయోగాన్ని ముందుకు నడుపుతుంది.

**మూ. శమ్యాతాలౌ ద్విరభ్యస్తౌ సన్నిపాతాన్త్య ఏవ చ,**
**ఉపోహనే విశాలాయాస్తాలోఽయం పరికీర్తితః. 146**

**తా. ఉపోహనాలలోని తాలవిధానం : 'విశాలా'** ఉపోహనంలో తాలక్రమం ఈ విధంగా ఉంటుంది – శమ్య, తాలం, తాలం, సన్నిపాతం.

**మూ. ద్వికలః సఙ్గతాయాస్తు తాలశ్చాపపుటః స్మృతః,**
**తస్యైవ సన్నిపాతోఽన్త్యే సునన్దాయాస్తథైవ చ. 147**

**తా. 'సంగత'** ఉపోహనంలో రెండు 'కల'ల చంచత్పుటతాలం ప్రయోగించ బడుతుంది. మూడు 'కల'ల తాలంతో ప్రారంభం అయే చంచత్పుటం **'సునంద'** అపోహనంలో ప్రయోగించబడుతుంది.

**మూ. చఞ్చత్పుటస్తు ద్వికలః సుముఖ్యాం స్యాదుపోహనే,**
**ఉపోహనే ద్విరభ్యస్తైస్తతః కార్యా తు కణ్డికా. 148**

**తా. 'సుముఖి'** ఉపోహనంలో రెండు 'కల'ల చంచత్పుటతాలం ప్రయోగించాలి. ఉపోహనాన్ని రెండు పర్యాయాలు ఆవృత్తి చేస్తే **'కండిక'** అవుతుంది.

**మూ. ఏతాన్యుపోహనానీహ చత్వారి కథితాని తు,**
**ఆనుపూర్వ్యాం ప్రయోగం చ కణ్డికానాం నిబోధత. 149**

**తా.** నే నీ విధంగా నాలుగు ఉపోహనాలు చెప్పాను. ఇపుడు కండికల ప్రయోగం క్రమంగా ఎలా చెయ్యాలో వినండి.

**మూ. శమ్యా తాలశ్చ శమ్యా చ పునస్తాలో యథాక్రమమ్,**

**త్రికలః సంనిపాతశ్చ విశాలాయాః ప్రకీర్తితః.** **150**

**తా.** 'విశాల'లో తాలక్రమం ఈ విధంగా ఉంటుంది. శమ్య, తాలం, శమ్య, తాలం, తరువాత త్రికలాసంనిపాతము.

**మూ. చఞ్చత్పుటస్తు ద్వికలః సఙ్గతాయా అపి స్మృతః,**
**చతుష్కలః సునన్దాయాం స ఏవ గదితో బుధైః.** **151**

**తా.** ద్వికలచంచత్పుటం ఉపయోగిస్తే అది 'సంగత' యొక్క తాలక్రమం అవుతుంది. దానినే చతుష్కలం చేసి ఉపయోగిస్తే అది 'సునందా'తాలక్రమం అవుతుంది.

**మూ. సన్నిపాతద్వయోపేతో ద్విచిత్రస్తు ప్రయోక్తృభిః,**
**కార్యశ్చతుష్కలో యుగ్మః సుముఖ్యాయా యథాక్రమమ్.** **152**

**తా.** రెండు చంచత్పుటాలను నాలుగు కలల ప్రమాణం కలదానినిగా చేసి, రెండు సంనిపాతాలతో కలిపి ప్రయోగిస్తే అది 'సుముఖీ' తాలక్రమం అవుతుంది.

**మూ. వర్ధమానస్య తాలోఽయం కణ్డికానాం పృథక్ పృథక్,**
**మయా ప్రోక్తః పునశ్చైవ సంహతానాం నిబోధత.** **153**

**తా.** ఇంతవరకు నేను వర్ధమానగీతం యొక్క స్వతంత్రఅంగరూపంలో తాలాలను వేరు వేరుగా చెప్పాను. ఇప్పుడు వీటిని అన్నింటిని కలిపితే ఏర్పడే స్వరూపాన్ని చెపుతాను.

**మూ. పూర్వం విశాలా కర్తవ్యా బాలతాలప్రయోజితా,**
**అన్తిమా త్రికలోపేతా బాలమాసారితం తు తత్.** **154**

**తా.** ముందుగా బాల (చిన్న) తాలంతో కూడిన **'విశాఖ'**ను చెయ్యాలి. దీనిలోని చివరి తాలం త్రికాలప్రమాణం గల తాలంతో పూర్తి యైతే అది కనిష్ఠాసారితం.

**మూ. సంగతాయా గ్రహం కృత్వా విశాలా సకలా యది,**
**యుజ్యతే పూర్వతాలే తు యదా స్యాత్తల్లయాన్తరమ్.** **155**

**తా.** **'సంగత'**ను గ్రహించి, **'విశాల'**ను పూర్తిగా పూర్వతాలంతో సంయుక్తం చేసినట్లయితే అది **లయాంతరం** అవుతుంది.

**మూ. సునన్దా చ యతః కార్యా సంగతా పునరేవ హి,**
**విశాలాం చ పునశ్చైవ సుముఖీం చ ప్రయోజయేత్.** **156**

**తా.** తరువాత 'సునంద'ను చేసి తరువాత 'సంగత'ను తరవాత విశాలను తరువాత 'సుముఖి'ని ప్రయోగించాలి.

**మూ. కనిష్ఠాసారితే తాలో యో మయా పరికీర్తితః,**
**స ఏవ సర్వః కర్తవ్యః ప్రథమే కణ్డికోద్భవే. 157**

**తా.** కనిష్ఠాసారితంలో ఏ తాలం ఉండా లని నేను వెనుక చెప్పానో ఆ క్రమం అంతా కండికాప్రారంభంలో చెయ్యాలి.

**మూ. సునన్దా సంగతా చైవ విశాలా చ యథోదితా,**
**సునన్దాయా గ్రహం కృత్వా తతశ్చైవ ప్రయోజయేత్. 158**

**తా.** తరువాత '**సునంద**'ను తీసికొని దానిని ప్రయోగించడానికి ఈ క్రమాన్నే పాటించాలి. తరువాత '**సునంద**'ను, '**సంగత**'ను, '**విశాల**'ను క్రమంగా ప్రయోగించాలి.

**మూ. మధ్యమాసారితే తాలో యో మయా పరికీర్తితః,**
**శమ్యాత్రయస్య కర్తవ్యః సునన్దాద్యస్య పణ్డితైః. 159**

**తా.** మధ్యమాసారితంలో ఏ తాలం నేను చెప్పానో దానినే సునంద ప్రారంభంలో ఉండే శమ్యాత్రయానికి ఉపయోగించాలి.

**మూ. సుముఖీ చ సునన్దా చ సంగతా పునరిష్యతే,**
**సుముఖ్యాదౌ గ్రహం కృత్వా యథోక్తం సంప్రయోజయేత్. 160**

**తా.** మళ్లీ సుముఖి, సునంద, సంగత ప్రయోగించాలి. మళ్లీ సుముఖితో ప్రారంభం చేసి పైన చెప్పిన క్రమంలో ప్రయోగించాలి.

**మూ. విశాలాయాః సమాప్తిస్తు జ్ఞేయా అథ నివృత్తయః,**
**జ్యేష్ఠే త్వాసారితే తాలో నిఃశబ్దః శబ్దవాంస్తథా. 161**

**తా.** దీనితరువాత '**విశాలా**' పూర్తి చేయడాన్ని గూర్చి, నివృత్తులను (ఆవృత్తులను) గూర్చి తెలుసుకోవాలి. జ్యేష్ఠాసారితంలో నిఃశబ్దతాలము, సశబ్దతాలమూ కూడ ప్రయోగించవచ్చును.

**మూ. స ఏవ సర్వః కర్తవ్యో బుద్ధైశ్చతసృణామపి,**
**సంయోగే కణ్డికానాం తు తాలోఽయం పరికీర్తితః.**
**ఏవమాసాం సమాయోగాద్వర్ధమానకమిష్యతే. 162**

**తా.** నాలుగు అంగాలలోను అనుసరించవలసిన తాలక్రమం ఇదే. కండికాల సంయోగంలో అనుసరించవలసిన తాలక్రమం ఇదే. కండికలను ఈ క్రమంలో కలపడంచేత '**వర్ధమానకం**' ఏర్పడుతుంది.

**మూ. బాలాం నవకలం జ్ఞేయం దశసప్తలయాన్వితమ్,**
**పఞ్చషష్టికలం జ్యేష్ఠం త్రయస్త్రింశత్తు మధ్యమమ్. 163**

**తా.** బాల (కనిష్ఠ) ఆసారితం తొమ్మిది 'కల'ల కాలం గలది. లయాంతరితం పదిహేడు 'కల'లు. మధ్యమాసారితం ముప్పైమూడు 'కల'లు. జ్యేష్ఠాసారితం అరవైయైదు 'కల'లు కలది.

**మూ. ఏతత్తాలవిధానం తు సర్వేష్వాసారితేషు చ,**
**కలానాం వృద్ధిమాసాద్య త్ర్యక్షరాణాం తు వర్ధనాత్.**
**లయస్య వర్ధనాచ్చాపి వర్ధమానకముచ్యతే. 164**

**తా.** అన్ని ఆసారితాలయందు అనుసరించవలసిన తాలవిధానం ఇది. 'కలా' వృద్ధిని పట్టి అక్షరాలను పెంచడంవల్లా లయను పెంచడంవల్లా 'వర్ధమానకం' అని పేరు.

**మూ. ఆసారితేషు గీతేషు వర్ధమానేషు చైవ హి,**
**ద్విగుణస్తాలయోగేన కార్యో హ్యక్షరజో విధిః. 165**

**తా.** ఆసారితగీతాలలోను, వర్ధమానగీతాలలోను కూడ అక్షరవిధానం తాలానికి రెట్టింపు ఉంటుంది.

**మూ. సమాప్తావన్తరహితః సన్నిపాతో యదా భవేత్,**
**అన్త్యా కలా ద్విమాత్రా తు తదా జ్ఞేయా ప్రయోక్తృభిః. 166**

**తా.** సమాప్తి లేకుండానే సంన్నిపాతం చేయవలసివచ్చి నప్పుడు చివర రెండు మాత్రల 'కల' ప్రయోగించాలి.

**మూ. ఏవమేతన్మయా ప్రోక్తం వర్ధమానస్య లక్షణమ్,**
**ఆసారితానాం వక్ష్యామి ప్రస్తారం లఘులక్షణమ్. 167**

**తా.** ఈ విధంగా నేను వర్ధమానం లక్షణం చెప్పాను. ఇప్పుడు ఆసారితాల ప్రస్తారాన్ని లఘులక్షణపూర్వకంగా చెపుతాను.

**మూ. అన్యూనాయాం కలాయాం తు ధ్రువం ప్రాజ్ఞో నివేశయేత్,**
**అథ తాలాక్షరవశాచ్ఛేషానన్తాంశ్చ యోజయేత్. 168**

**తా.** ఏ విధంగానూ రెండు 'కల'లకు తగ్గనప్పుడు ధ్రువను నివిష్టం చెయ్యాలి. మిగిలినవాటిని, అంతాలను తాలాలను పట్టీ, అక్షరాలను పట్టీ కూర్చాలి.

**మూ. ప్లుతే లఘ్వక్షరే చైవ ధ్రువే సామ్యం న విద్యతే,**
**న విద్యతే త్రిభిః పాతైః సమత్వముపదిశ్యతే. 169**

**తా.** ధ్రువతాలంలో ప్లుతమునందు, లఘ్వక్షరమునందు సామ్యం ఉండదు. ఇక్కడ

మూడు మూడు సంనిపాతములను మాత్రమే కారణంగా తీసికొని సమత్వం ఉపదేశింప బడి నట్లు భావించకూడదు.

**మూ. తాలైశ్చ సన్నిపాతైశ్చ శమ్యాభిశ్చ ధ్రువేణ చ,**
**కనిష్ఠాసారితం కార్యం మధ్యమం జ్యేష్ఠమేవ చ. 170**

**తా.** కనిష్ఠ – మధ్యమ – జ్యేష్ఠాసారితాలను తాలాలతోను, సంనిపాతాలతోను, శమ్యాలతోను, ధ్రువతోను ప్రయోగించాలి.

**మూ. ద్విగుణోత్తరయా వృద్ధ్యా హ్యస్యైవ తు మధ్యమం విధాతవ్యమ్,**
**ప్రస్తారే చైవ కలానాం శమ్యాతాలాన్తరోపేతమ్. 171**

**తా.** 'కల'ల సంఖ్యను రెట్టింపు చేయడం ద్వారా కనిష్ఠాసారితాన్ని మధ్యమా సారితం చెయ్యాలి. శమ్యాతాలాల మధ్య అంతరం ఇస్తూ ఇలా చెయ్యాలి.

**మూ. ఉత్తరతాలః ప్రథమే వస్తున్యాదౌ కలాత్రయం త్యక్త్వా,**
**కార్యౌ మధ్యే నిత్యం ద్వౌ పరివర్తౌ చ సంపూర్ణౌ. 172**

**తా.** మధ్యమాసారితం మొదటి వస్తువులో మూడు 'కల'లు విడిచి ఉత్తరతాలం (షట్పితాపుత్రం) ఉంటుంది. దానిని పూర్తిగా రెండు ఆవృత్తులు చెయ్యాలి.

**మూ. పూర్వం శమ్యా కార్యా ద్వికలస్తాలః కలాద్వయే శమ్యా,**
**పునరేకకలః తాలస్త్రికలః స్యాత్సంనిపాతశ్చ. 173**
**త్రికలోऽథ పునస్తాలః శమ్యేకకలాద్వయే తాలః,**
**ద్వికలా చ పునః శమ్యా తాలో ద్వికలశ్చ కర్తవ్యః. 174**
**త్రికలశ్చ సన్నిపాతో భూయో విధిరేష ఏవ కర్తవ్యః,**
**ద్వాదశకలస్తృతీయే తస్యాన్తే సన్నిపాతశ్చ. 175**

**తా.** మధ్యమాసారితానికి చెందిన పాతాల (సన్నిపాతాల) క్రమం ఇలా ఉంటుంది. ముందుగా శమ్య, రెండు 'కల'ల తాలము, రెండు 'కల'ల శమ్య, ఒక 'కల' తాలము, మూడు 'కల'ల తాలము, రెండు 'కల'ల శమ్య, రెండు 'కల'ల తాలం, మూడు 'కల'ల సంనిపాతము. మూడవ వస్తువులోను, చివరా పన్నెండు 'కల'ల సన్నిపాతము.

**మూ. ప్రథమస్త్వష్టకలః స్యాద్ ద్వాదశకలికౌ తథా పరౌ జ్ఞేయౌ,**
**అన్త్యశ్చ సన్నిపాతో మధ్యస్యాసారితస్యోక్తః. 176**

**తా.** మధ్యమాసారితకం ప్రథమభాగానికి కాలం ఎనిమది కలలు, రెండవదానికి పన్నెండు కలలు, మూడవ భాగానికి ఇరవైనాలుగు కలలు.

**మూ. యే పూర్వమఙ్గులికృతాః ప్రవేశవిక్షేపనిష్క్రమా గదితాః,**
**తే సర్వే కర్తవ్యా మధ్యే త్వాసారితే తద్జ్ఞైః. 177**

**తా.** అంగుళులతో చేయవలసిన ఏ ప్రవేశ – విక్షేప – నిష్క్రమాలు వెనుక చెప్పబడినవో వాటిని మధ్యమాసారితంలో కూడ ప్రయోగించాలి.

**మూ. అథ జ్యేష్ఠే తు కర్తవ్యం శమ్యాతాలలయాత్మకమ్,**
**శరీరం హి బుధైర్నిత్యం పఞ్చషష్టికలాన్వితమ్. 178**

**తా.** జ్యేష్ఠాసారితశరీరం శమ్యా – తాల – లయలతో చెయ్యాలి. దీని ప్రమాణం అరవైయైదు 'కల'లు.

**మూ. తస్యావాపోఽథ నిష్క్రామో విక్షేపోఽథ ప్రవేశనమ్,**
**అఙ్గులీనాం తు కర్తవ్యం కలామానం చతుష్కలమ్. 179**

**తా.** దీనిలో – ఆవాస – నిష్క్రామ – విక్షేప – ప్రవేశాలను నాలుగేసి 'కల'ల ప్రమాణంతో, అంగుళులతో చెయ్యాలి.

**మూ. జ్యేష్ఠం చతుష్కలం స్యాదావాపైః సంయుక్తం (తం) సవిక్షేపైః,**
**వస్త్వన్యత్ర స్యాత్ సప్తదశకలం తు శమ్యాది. 180**

**తా.** జ్యేష్ఠాసారితంలోని ఆవాప – విక్షేపాలు చతుష్కలప్రమాణంలో ఉంటాయి. దీని వస్తువు ప్రమాణం, మరొక స్థానంలో పదిహేడు కలల ప్రమాణంలో ఉంటుంది; ఇది శమ్యతో ప్రారంభ మవుతుంది.

**మూ. పూర్వం శమ్యా కార్యా చతుష్కలో వై భవేత్తతస్తాలః,**
**శమ్యా చతుష్కలా స్యాద్ ద్వికలస్తాలస్తతః కార్యః. 181**

**కార్యశ్చ సంనిపాతః పట్కలికః షట్కలశ్చ తాలః స్యాత్,**
**ద్వికలా చ పునః శమ్యా చతుష్కలః స్యాత్ పునస్తాలః. 182**

**శమ్యా చతుష్కలా స్యాత్ ద్వితాలో ద్వికలశ్చ కర్తవ్యః,**
**పునరేవ సంనిపాతశ్చ షట్కలః సంవిధాతవ్యః. 183**

**తా.** ఈ ఆసారితంలో చేసే పాతాల క్రమం ఇలా ఉండాలి – మొదట శమ్య, నాలుగు కలల తాలం, నాలుగు కలల శమ్య, రెండు కలల తాలం, ఆరు కలల సంనిపాతం, ఆరు కలల తాలం నాలుగు కలల శమ్య, రెండు కలల తాలం, ఆరు కలల సంనిపాతం.

**మూ. విధిరేష ఏవ కృత్స్నః పునస్తృతీయసన్నిపాతాన్తే తు,**
**పునరేషామఙ్గులివిక్షేపం సంప్రవక్ష్యామి. 184**

**తా.** తృతీయసంనిపాతసమయంలో ఈ విధానాన్నే అనుసరించాలి. దీని చివర

చేయవలసిన అంగులివిక్షేపానికి సంబంధించిన విధానం ఇప్పుడు చెపుతాను.

**మూ. ఆవాపః సహ శమ్యా నిష్క్రామశ్చ తతః పరమ్,**
**విక్షేపశ్చ తతస్తాలః కార్యః పునరావాప ఇష్యతే. 185**

**అనామికయా నిష్క్రామో విక్షేపోఽనన్తరం స్మృతః,**
**శమ్యయా సహ ఆవాపస్తాలో విక్షేపణం పునః. 186**

**కార్యశ్చ మధ్యమాఙ్గుల్యా ప్రవేశశ్చ తతఃపరమ్,**
**ఆవాపశ్చ తతః కార్యస్తర్జనీ నిష్క్రమస్తథా. 187**

**విక్షేపశ్చ పునః కార్యః సన్నిపాతస్తథైవ చ,**
**కలాః సప్తదశైవైతాః సన్నిపాతే తదన్తరమ్. 188**

**తా.** అనామికతో, ఆవాప – శమ్యా – నిష్క్రామ – విక్షేప – తాల – ఆవాప – నిష్క్రామాలను, మధ్యమాతో విక్షేప – శమ్యా – ఆవాప – నిష్క్రామాలను, తర్జనితో – నిక్షేప – సంనిపాతాలనూ చెయ్యాలి. ప్రథమసంనిపాతంలో ఈ పదిహేడు కలలు ఉంటాయి.

**మూ. ఆవాపశ్చ పునః కార్యః కనీయస్యాథ నిర్గమః,**
**విక్షేపశ్చ ప్రవేశశ్చ ఆవాపశ్చ తతః పునః. 189**

**అనామికాకనీయస్యోస్తతస్తాలో భవేత్పునః,**
**విక్షేపశ్చ పునస్తాభ్యాం తతః శమ్యా ప్రకీర్తితా. 190**

**ఆవాపశ్చ కనీయస్యాం తతస్తాలం నియోజయేత్,**
**ఆవాపశ్చ తతః కార్యస్తర్జనీనిష్క్రమస్తథా,**
**విక్షేపః పఞ్చదశకః శమ్యయా సహ కీర్తితః. 191**

**ఆవాపశ్చైవ కర్తవ్యః పునస్తాలః ప్రయోక్తృభిః,**
**విక్షేపశ్చ ప్రవేశశ్చ పునరావాప ఏవ చ. 192**

**ప్రదేశిన్యా చ నిష్క్రామో విక్షేపశ్చ పునః స్మృతః,**
**సన్నిపాతస్తథాన్యే చ చతుర్వింశతికో భవేత్. 193**

**తా.** కనిష్ఠికతో ఆవాప – నిష్క్రామాలు, అనామికా – కనిష్ఠికలతో విక్షేపము, ప్రవేశము, ఆవాపము, తాలము, మళ్లీ తాలము, విక్షేపము, తర్జనితో శమ్య, ఆవాపము, నిష్క్రామము చేసి విక్షేపము, శమ్య, అనామికా – విక్షేపము, ప్రవేశము, ఆవాపము, నిష్క్రామము – తర్జనితో చేసి, మళ్లీ నిష్క్రామ – ప్రవేశాలు చేస్తే ఇరవైనాలుగు కలల

రెండవ సన్నిపాతం అవుతుంది.

**మూ. తృతీయసన్నిపాతస్య ఏష ఏవ విధిః స్మృతః,**
**ఏవం జ్యేష్ఠస్య విజ్ఞేయస్తాలాఙ్గులివికల్పితః. 194**
**ప్రథమః షోడశకలః చతుర్వింశతికస్తథా,**
**ద్వితీయశ్చ తృతీయశ్చ సంనిపాతః కలాధికః. 195**
**ప్రత్యేకం పాతనం యేషు దశ సప్త భవన్తి హి,**
**శమ్యాతాలకృతానీహ సంనిపాతకృతాని చ. 196**

**తా.** తృతీయసన్నిపాతానికి కూడ ఇదే విధానం. ఇంతవరకు జ్యేష్ఠాసారితకంలో వేళ్లతో చేసే తాలవిధానం చెప్పబడింది. ప్రథమసన్నిపాతం పదహారు కలలలోను, ద్వితీయసన్నిపాతం ఇరవైనాలుగు కలలలోను, తృతీయసంనిపాతం ఒక కల పెంచీ చెయ్యాలి. ఈ విధంగా వీటిలో ఒక్కొక్కదానిలో శమ్యాపాతాల సంనిపాతాలను బట్టి పదిహేడు వర్గా లుంటాయి.

**మూ. వస్తున్యాద్యే హ్యజ్యేష్ఠేషు ద్వే చాన్యే పూర్వవద్ యోజ్యే,**
**షట్కశమ్యాష్టతాలం త్రిసన్నిపాతం త్రివస్తు చాప్యేవమ్. 197**
**సప్తదశపాతయుక్తం విద్యాదాసారితం సమ్యక్,**
**అష్టౌ తాలాస్తు షట్ శమ్యాః సన్నిపాతస్త్రయస్తథా. 198**

**తా.** కనిష్ఠ – మధ్యమాసారితాల ప్రథమవస్తువునందు వెనుకటి వలెనే మిగిలిన రెండూ చేర్చాలి. వాటి మూడు వస్తువులు కూడ – ఆరు శమ్యాలతో, ఎనిమిది తాలాలతో, మూడు సంనిపాతాలతో ఏర్పడతాయి. ఆసారితంలో పదిహేడు పాతాలు (కలలు) ఉంటా యను విషయం గుర్తుంచుకోవాలి.

**మూ. ఆసారితే విధౌ హ్యేష ఏకైకస్మిన్ ప్రకీర్తితః,**
**ఆసారితానుమిత్యేవం గదితం లక్షణం మయా. 199**
**గీతానాం వస్తుకానాం చ ప్రయోగః పరికల్ప్యతే,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి గీతకానాం తు లక్షణమ్. 200**

**తా.** నే నీ విధంగా ఆసారితవిధానం చెప్పాను. ఇప్పుడు గీతాల ప్రయోగము వస్తువుల ప్రయోగము ఎలా చెయ్యాలో, గీతలక్షణా లేవో చెపుతాను.

**మూ. సర్వాసామేవ గీతానాం వస్తుష్వవయవేషు చ,**
**వివధైకకవృత్తాని త్రీణ్యఙ్గాని భవన్తి హి. 201**

**తా.** గీతవస్తువులలోను, గీతావయవాలలోను – వివధము, ఏకకము, వృత్తము

అను మూడు అంగా లుంటాయి.

**మూ. ఏకకం తు విదార్యైకా ద్వేవాపి వివధః స్మృతః,**
**షట్పదం త్ర్యవరం వృత్తం విదార్యః పరికీర్తితాః. 202**

**తా.** ఒక విదారి ఉన్నది ఏకకం. రెండున్నది వివధం. ఆరు మించకుండా మూడుకు తగ్గకుండా విదారు లున్నది **వృత్తం**.

**మూ. పదవర్ణసమాప్తిస్తు విదారీత్యభిసంజ్ఞితా,**
**న్యాసాపన్యాసమంశాన్తం వస్తు తత్పరికీర్తితమ్. 203**

**తా.** పదాలు కాని వర్ణాలు కాని ఉన్నది **విదారి**. న్యాసంతోను అపన్యాసంతోను అంశతోను సమాప్త మయేది **వస్తువు**.

**మూ. విదారయతి యస్మాద్ధి పదమధ్యస్వరాన్ యదా,**
**తదా విదారీ విజ్ఞేయా గురువర్ణానుకారిణీ. 204**

**తా.** పదాలను, మధ్యలో ఉన్న స్వరాలను చీల్చివేస్తుంది కాబట్టి దీనికి ఆ (**విదారి** అని) పేరు. ఇది గురువర్ణాలను అనుసరించి ఉంటుంది.

**మూ. వివధైకకయోః ప్రాయః మద్రకేషు ప్రయోజనమ్,**
**ప్రకర్యాశ్చాపి వస్త్వర్ధే పాదే రోవిన్దకస్య చ. 205**
**రోవిన్దకోత్తరాభ్యాం తు వృత్తముల్లోప్యకే తథా,**
**పాణికాయాం బహిర్గీతే లాస్యే చైవ ప్రకీర్తితమ్. 206**

**తా.** సాధారణంగా వివధ – ఏకకాల ఉపయోగం మద్రకగీతాలలో ఉంటుంది. అట్లే ప్రకరిలోని ఒక్కొక్క వస్తువుయొక్క అర్ధభాగంలోను, రోవిందకం చతుర్థాంశంలోను కూడ వీటి ఉపయోగం ఉంటుంది. రోవిందక – ఉత్తర – ఉల్లోప్యపాణిక – బహిర్గీత – లాస్యాలలో వస్తువు ప్రయోగింపబడుతుంది.

**మూ. ప్రవృత్తమవగాఢం చ ద్వివిధం వృత్తముచ్యతే,**
**ఆరోహిత్వాదవగాఢం ప్రవృత్తమవరోహతః. 207**

**తా.** ప్రవృత్తము, అవగాఢము అని వృత్తం రెండు విధాలు. ఆరోహి అయి నప్పుడు **అవగాఢము**, అవరోహి అయి నప్పుడు **ప్రవృత్తము**.

**మూ. ఆరోహణం తు ద్వివిధం తథా చైవావరోహణమ్,**
**న్యాసాపన్యాసవిహితం మార్గాన్తరకృతం తథా. 208**

**తా.** ఆరోహణమూ, అవరోహణమూ కూడ రెండు విధములు – ఆరోహణం

స్వరాల న్యాస – అపన్యాసాల ద్వారా జరుగుతుంది. అవరోహణం అంతరమార్గవిధానం ద్వారా జరుగుతుంది.

**మూ. త్ర్యవరైకాదశపరా విదార్యః పరికీర్తితాః,**
**చతుర్వింశతిరేతాసాం ప్రమాణం పరమం స్మృతమ్. 209**

**తా.** గీతంలో విదారీలు కనీసం మూడు, అధికం పదకొండు మించకుండా ఉండాలి. అయితే కొన్ని విశిష్టసమయాలలో వీటి సంఖ్య ఇరవైనాలుగు వరకు పెంచ వచ్చును.

**మూ. అధ్యర్ధా చ తృతీయాచ్చ సంనిపాతాత్ ప్రమాణతః,**
**ఉల్లోప్యకే విదారీ తు స్మృతా వైహాయసే తథా. 210**
**వివధేన చ తాః కార్యా యుగ్మవృత్తేన చైవ హి,**
**న హ్యర్ధే సంనిపాతే తు భవేదఙ్గసమాపనమ్. 211**

**తా.** అయితే – ఉల్లోప్యకస్థితియందు, వైహాయస్థితియందూ కూడ విదారి తృతీయ సంనిపాతం ప్రమాణంకంటె సగం అధికప్రమాణంలో ఉండవచ్చును. వీటిని వివధతోను, అవృత్తిచేసిన వృత్తంతోనూ చెయ్యాలి. సంనిపాత సగంలో అంగసమాప్తి చేయకూడదు.

**మూ. వివధస్త్రివిధో జ్ఞేయః కీర్త్యమానాత్ విబోధత,**
**సాముద్గశ్చార్ధసాముద్గో వివృత్తశ్చేతి కీర్తితః. 212**

**తా.** సాముద్గము, అర్ధసాముద్గము, వివృత్తము అని వివధం మూడు విధాలు.

**మూ. న్యాసాన్తో వివధో జ్ఞేయో ముక్త్వా వై గేయకం సదా,**
**ఆ దౌ తు మద్రకే చైవ సాముద్గః పరికీర్తితః. 213**

**తా.** గేయకదశలో తప్ప ఇతరదశలలో వివిధం న్యాసస్వరంమీద సమాప్తం అవుతుంది. సముద్గకం మద్రకం ఆరంభంలో ఉంటుంది.

**మూ. లఘువర్ణసమం గేయం సముద్గే తు విధీయతే,**
**తత్త్వన్తే చ తృతీయే చ తద్వై గేయకసంజ్ఞితమ్. 214**

**తా.** సముద్గకంలోని గీతకంలో లఘువర్ణా లుండాలి. చివర ఉంచిన మూడవ విదారీకి **గేయకం** అని పేరు.

**మూ. విదార్యఙ్గసమోర్ధం స్యాత్ అర్ధం విసదృశం యథా,**
**యోగే తు అర్ధసాముద్గస్తథా జ్ఞేయః ప్రయోక్తృభిః. 215**

**తా.** ప్రయోగసమయంలో ఒక విదారియొక్క సగం భాగంతో రెండవ భాగం సమంగా ఉండి, దీని తరువాతి అర్ధభాగం అసమానంగా ఉంటే అది **అర్ధసముద్గకం**.

**మూ. విదారీ విషమా జ్ఞేయా న్యాసాపన్యాస ఏవ చ,**
**తత్సమ్ప్రయోగబాహుల్యం వివృత్తం పరికీర్తితమ్. 216**

**తా.** విదారికి చెందిన న్యాస – అపన్యాసాలలో అసమానత్వం ఉంటే, దాని ప్రయోగంలో కొంత అతిశయం కూడ ఉంటే అది **వివృత్తం** అని చెప్పబడుతున్నది.

**మూ. వివధం చైకకం చాపి వృత్తం చైవ యథాక్రమమ్,**
**న్యాసాపన్యాసమంశాన్తం సదా జ్ఞేయం ప్రయోక్తృభిః. 217**

**తా.** వివధ – ఏకక – వృత్తాలు క్రమంగా, న్యాస – అపన్యాస – అంశాలతో సమాప్తము లవాలి.

**మూ. సంన్యాసశ్చైవ విన్యాసో హ్యఙ్గమధ్యే యథాక్రమమ్,**
**విన్యాసః స తు విజ్ఞేయః విదారీమధ్యమాస్థితః. 218**

**తా.** సన్న్యాస – విన్యాసాలు వరుసగా అంగమధ్యంలో ఉంటాయి. విన్యాసం విదారి మధ్యంలో ఉంటుంది.

**మూ. విదారీ వజ్రవిన్యాసః పదాన్తే క్వచిదేవ హి,**
**న తద్బాహుల్యముద్దిష్టం ప్రయోగస్య ప్రయోక్తృభిః. 219**

**తా.** విదారి పదాంతంమీద విన్యాసం ఎప్పుడైనా జరగవచ్చును కాని అధికంగా దీని ప్రయోగం చేయకూడదు.

**మూ. గీతాని సప్త మద్రకోల్లోప్యకే చాపరాన్తకమ్,**
**ప్రకర్యో వేణకే చైవ రోవిన్దకమథోత్తరమ్. 220**

**తా.** మద్రకము, ఉల్లోప్యకము, అపరాంతకము, ప్రకరి, ఓవేణకము, రోవిన్దకము, ఉత్తరము అను ఏడు విధాలైన గీతాలు ప్రసిద్ధ మైనవి.

**మూ. ద్వివిధం మద్రకం తత్ర చతుర్వస్తు త్రివస్తు,**
**శీర్షకేణ సమాయుక్తం తత్తు జ్ఞేయం త్రివస్తుకమ్. 221**

**తా.** చతుర్వస్తు, త్రివస్తు అని ముద్రకం రెండు విధాలు. శీర్షకంతో కూడినది త్రివస్తుకం.

**మూ. పఞ్చ షట్ సప్త వాపి స్యుః శీర్షకాణ్యపరాన్తకే,**
**ప్రకర్యామథ చత్వారి స్యుస్త్రీణ్యర్ధాధికాని చ. 222**

**తా.** అపరాంతకంలో – ఐదు, ఆరు లేదా, ఏడు, శీర్షకా లుంటాయి. ప్రకరిలో నాలుగు గాని, మూడున్నర గాని శీర్షకా లుంటాయి.

**మూ. రోవిన్దకస్తు సప్తాఙ్గం షోడశాఙ్గం పరం స్మృతమ్,**
**ద్వౌ పాదౌ సమవర్ణౌ తు ఏకకే తత్ర కీర్తితౌ. 223**

**తా.** రోవిందకంలో కనీసం ఏడంగాలు, ఉంటాయి. పదహారంగాలు మించ కూడదు. ఏకకంలో సమవర్ణాలైన రెండు పాదా లుంటాయి.

**మూ. ప్రవృత్తం వివధం చాపి తస్య త్వాదౌ ప్రయోజయేత్,**
**తతో దేహం తతోఽఙ్గాని యథాయోగం నివేశయేత్. 224**

**తా.** దీని ప్రారంభంలో ప్రవృత్తకము, వివధమూ కూడ ప్రయోగించాలి. తరువాత శరీరాన్ని అవయవాలను సముచితరూపంలో ఉంచుతూ దీని ప్రయోగం చెయ్యాలి.

**మూ. ఆకారశ్చాస్య మధ్యే స్యాదాకారశ్చాన్తతః స్మృతః,**
**అవికల్పకమన్త్యేఽస్య శీర్షకం సంప్రయోజయేత్. 225**

**తా.** దీని మధ్యయందు అంతమునందూ కూడ 'ఆ'కారం ఉంటుంది. చివరి భాగంలో శీర్షకం స్పష్టంగా కూర్చబడుతుంది.

**మూ. సప్తాఙ్గం ద్వాదశాఙ్గం వా ప్రోక్తమోవేణకం బుధైః,**
**తత్ర ద్వ్యఙ్గం తు సప్తాఙ్గం త్ర్యఙ్గం ద్వాదశకం స్మృతమ్. 226**

**తా.** ఓవేణకంలో ఏడు అంగాలు గాని, పన్నెండు అంగాలు గాని ఉంటాయి. ఏడు అంగాలు ఉన్నదానికి ద్వ్యంగం అనీ ద్వాదశంగానికి త్ర్యంగం అనీ పేర్లు.

**మూ. పాదః సన్ధిర్మాషఘాతో వజ్రం సంపిష్టకం తథా,**
**శీర్షకం చతురస్రం చ తథా చైవోపవర్తనమ్. 227**

**ఉపపాతః ప్రవేణ్యౌ చ ద్వ్యఙ్గం సంహరణం తథా,**
**అఙ్గాని ద్వాదశాఙ్గస్య స్మృతాన్యోవేణకస్య తు. 228**

**తా.** పాదము, సంధి, మాషఘాతము, వజ్రము, సంపిష్టకము, శీర్షకము, చతురస్రము, ఉపవర్తనము, ఉపపాతము, రెండు ప్రవేణీలు, ద్వ్యంగము, సంహరణము – ఇవి ఓవేణకం యొక్క పన్నెండు అంగాలు.

**మూ. సంపిష్టకోపపాతాభ్యాం ప్రవేణీభ్యాం వివర్జితమ్,**
**ఉపవర్తనహీనం చ సప్తాఙ్గమపి కీర్తితమ్. 229**

**తా.** సంపిష్టకము, ఉపపాతము, ప్రవేణీద్వయము, ఉపవర్తనము తప్ప మిగిలిన అంగా లున్నది సప్తాంగవేణకము.

**మూ. వివర్తనం తు సప్తాఙ్గం తుల్యవర్ణపదం స్మృతమ్,**
**అనయోర్ద్వాదశాఙ్గే తు తథాన్యపదమిష్యతే. 230**

**తా.** రెండు ఓవేణకాలకు సాధారణమైన (common) అంగాలలో వర్ణాలు పదాలూ కూడ సమంగా ఉండడంచేత వాటికి **వివర్తనములు** అని పేరు. ద్వాదశాంగ – ఓవేణకం

లోని ఇతరాంగాలు పదాలు భిన్నభిన్నంగా ఉంటాయి.

**మూ. ఉల్లోప్యకేఽపి చాఙ్గానామేష ఏవ విధిః స్మృతః,**
**అవగాఢం ప్రవృత్తం చ మహాజనిక మేవ చ. 231**

**త్ర్యఙ్గస్తు స్యాత్తథా ద్వ్యఙ్గో మహాజనికవర్జితః,**
**స్థితప్రవృత్తసంయోగాదేకాఙ్గో వాపి కీర్త్యతే. 232**

**ఏకాఙ్గే సంవిధాతవ్యం మహాజనికమేవ చ,**
**ద్వ్యఙ్గం స్థితం ప్రవృత్తం వాప్యేకకాఙ్గం ప్రకీర్తితమ్. 233**

**ద్వ్యఙ్గే వ్యాససమాసాభ్యాం ధ్రువాధాతువిధిః స్మృతః.**

**తా.** ఉల్లోప్యకంలో కూడ అంగవిధానం ఓవేణకంలో వలెనే ఉంటుంది. దీనిలో అవగాఢము, ప్రవృత్తకము, మహాజనికము అను మూడు అంగా లుంటాయి. వీటిలోని 'మహాజనికం' తగ్గిస్తే అది ద్వ్యంగం అవుతుంది. దీనిని ప్రవృత్తకంతో కలిపి స్థితం చేరిస్తే ఉల్లోప్యకం అవుతుంది. ఇదే విధంగా కేవలం మహాజనికం ఉంచితే ఏకాంగ ఉల్లోప్యకం అవుతుంది. స్థిత – ప్రవృత్తకాలను కలిపితే ద్వ్యంగ ఉల్లోప్యకం అవుతుంది. వేరువేరుగా ఉంచుతే అది ఏకాంగం అవుతుంది. ద్వ్యంగ ఉల్లోప్యకంలో ధ్రువకు ధాతువులకు సంబంధించిన నియమవిధానం వ్యాససమాసపద్ధతిలో చేయబడుతుంది.

**మూ. స్థితం ప్రవృత్తం చ తథా మహాజనికమేవ చ. 234**

**త్ర్యఙ్గస్తు స్యాదథ ద్వ్యఙ్గో మహాజనికవర్జితః,**
**ఏకాఙ్గోఽపి విధాతవ్యో మహాజనికసంయుతః. 235**

**తా.** స్థితము, ప్రవృత్తము, మహాజనికము అను మూడు అంగాల ఉల్లోప్యానికి **త్ర్యంగఉల్లోప్యకం** అని పేరు. మహాజనికం తీసివేసి మిగిలిన రెండు అంగాలు ఉంటే **'ద్వ్యంగ ఉల్లోప్యకం'** అవుతుంది. మహాజనికం మాత్రమే ఉన్నది **ఏకాంగ ఉల్లోప్యకం.**

**మూ. ఏవం వ్యాససమాసాభ్యాం బహుధాఙ్గవిధిః స్మృతః,**
**చతురస్రస్తథా త్ర్యస్రో మిశ్రశ్చాన్తః ప్రకీర్తితః. 236**

**తా.** ఈ విధంగా ఉల్లోప్యంలో అంగాల వ్యాస – సమాసాలచేత, (వేరు చేయడం కలపడం వీటిచేత) దీనిలో చతురస్రము, త్ర్యస్రము, మిశ్రము అను మూడు భేదా లేర్పడతాయి.

**మూ. ఓవేణకస్య సంహారో ద్వ్యఙ్గ ఏకాఙ్గ ఏవ చ,**
**నాదౌ న మధ్యే సంహారో నిత్యం చైవ ప్రయోజ్యతే. 237**

**తా.** రెండు అంగాలతో గాని ఒక అంగంతో గాని ఓవేణకంయొక్క సంహరణం చేయవచ్చును. ఓవేణకం ఆరంభంలో గాని, మధ్యలో గాని ఈ సంహరణం చేయగూడదు.

**మూ. ఏకకో వివధో వాపి కార్యో హ్యన్తే బుద్ధైః సదా,**
**ఉల్లోప్యకం షడవరం వింశత్యఙ్గపరం స్మృతమ్. 238**

**తా.** చివర ఏకకం గాని, వివధం గాని తప్పక ప్రయోగించాలి. ఉల్లోప్యకంలో కనీసం ఆరు అంగాలు ఉండాలి. ఇరవైకి మించకూడదు.

**మూ. తత్ర సంహరణం జ్ఞేయం ముఖప్రతిముఖాన్వితమ్,**
**వైహాయసకసంయుక్తం తేనాపి చ వివర్జితమ్. 239**
**త్రిష్వఙ్గేష్వపరం జ్ఞేయం పరం స్యాద్ద్వాదశస్వపి,**
**ఏకాఙ్గం షట్పదం జ్ఞేయం వైహాయసకమేవ తు. 240**

**తా.** ఈ అంగాలలో – సంహరణంలోని 'ముఖ' ప్రతిముఖా లనే రెండు భాగా లుంచవచ్చును. ఇది వైహాయసకంతో కలిపికాని అది లేకుండా కాని చేయవచ్చును. దీనిలో అంగాల సంఖ్య మూడుకు తక్కువ కాకూడదు; పన్నెండుకు మించకూడదు. మూడు అంగా లున్నది అవరం; పన్నెండు అంగా లున్నది 'పరం'. వైహాయసంలో అంగాలు ఆరుకు మించకుండా, కనీసం ఒకటైనా ఉండాలి.

**మూ. అస్య చాఙ్గత్రయేऽతీతే ప్రయోగముపపాదయేత్,**
**ఉల్లోప్యకోత్తరాభ్యాం తు ముఖప్రతిముఖే స్మృతే. 241**
**తతోऽఙ్గానాం సమాసో వా విస్తరో వా విధీయతే.**

**తా.** దీని మూడు అంగాల గానం పూర్తి అయిన తరువాత ప్రయోగం ప్రారంభించాలి. ఉల్లోప్యకంలోను, ఉత్తరంలోను 'ముఖ' 'ప్రతిముఖ' అంగాలు విధింప బడినవి. తరువాత మిగిలిన అంగాలను ఆవశ్యకతానుసారం, సంక్షిప్తంగా గాని, విస్తృత రూపంలో కాని చేర్చవచ్చును.

**మూ. ముఖప్రతిముఖే చైవ జ్ఞేయే వివధసంజ్ఞితే. 242**
**వృత్తం ప్రతిముఖే చ స్యాదన్యయోస్తు సమాసతః,**
**ఉల్లోప్యకే తు శాఖాఖ్యం సోత్తరే చాపరాన్తకే. 243**
**ప్రతిశాఖా తథాచైషాం సమవర్ణపదా స్మృతా.**

**తా.** 'ముఖ' ప్రతిముఖాల'కు **వివధం** అని పేరు. ప్రతిముఖంలో **వృత్తం** ఉండాలి. ఇతరాంగాలలో కూడ దీనిని సంక్షిప్తరూపంలో చేర్చవచ్చును. ఉల్లోప్యకంలో 'శాఖా',

ఉత్తరంలో 'ప్రతిశాఖా' అనేవి (ఇవి ముఖ - ప్రతిముఖాలవంటివి) ఉంటాయి. ఇవి వర్ణ - పదాలతో కూడి ఉంటాయి.

**మూ. ఉత్తరం ద్వాదశపరం షడఙ్గావరమిష్యతే. 244**
**ఆకారపాదహీనేన సహ రోవిన్దకేన తు,**
**అన్తే చాథ విశేషేణ స్థాప్యమస్య హి శీర్షకమ్. 245**

**తా.** ఉత్తరంలో అంగాలు ఆరుకు తగ్గకుండా, పన్నెండుకు మించకుండా ఉండాలి. దీని చివర ఆకార - పాదాలు లేని రోవిందకంతో పాటు శీర్షకం ఉండాలి.

**మూ. ఏవమఙ్గవిధిః కార్యః సప్తరూపే ప్రయోక్తృభిః,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి గీతానాం వస్తుకల్పనమ్. 246**

**తా.** నాట్యప్రయోక్తలు అనుసరించవలసిన సప్తరూపగీతాంగవిధానం ఇలా ఉంటుంది. ఇటుపై ఈ గీతాల వస్తుప్రమాణాన్ని చెపుతాను.

**మూ. కలాః షోడశ విజ్ఞేయా మాత్రాః సర్వేషు వస్తుషు,**
**తస్యాశ్చైవ చతుర్భాగః పాదభాగః ప్రకీర్తితః. 247**

**తా.** ఇదే విధంగా, వస్తువులలో - పదహారు మాత్రలకు **'కలా'** అనీ, దానిలోని నాల్గవ వంతుకు **'పాదభాగం'** అనీ పేరు.

**మూ. ఆదౌ గుర్వష్టకం కృత్వా న్యసేల్లఘ్వష్టకం తథా,**
**తత్రోపవహనం కార్యం ప్రథమే తు గురుద్వయే. 248**
**గుర్వక్షరే తృతీయే తు తతః స్యాత్ ప్రత్యపోహనమ్,**
**గుర్వక్షరం చతుర్థే తు శమ్యా కార్యా తు పఞ్చమే. 249**
**షష్ఠసప్తమయోస్తాలః శమ్యా గుర్వక్షరేఽష్టమే,**
**తతోఽష్టకలికాన్ పాదాన్ కుర్యాల్లఘ్వక్షరేషు చ. 250**

**తా.** ప్రారంభంలో ఎనిమిది గురువులు, పిదప ఎనిమిది లఘువులు ఉంచి మొదటి రెండు గురువులలో ఉపవహనం చెయ్యాలి. మూడవ గురువు 'ప్రత్యపోహనం', నాలుగు, ఐదు గురువులు శమ్య ఆరు, ఏడు గురువులు తాలము, ఎనిమిదవ గురువు శమ్య. ఇది మొదటి ఎనిమిది గురువులకు చేయవలసినవి. దీని తరవాత ఎనిమిది 'కల'ల ప్రమాణం గల లఘువర్ణాలతో ఒక పాదం నిర్మించాలి.

**మూ. గుర్వక్షరే తాలగతే పాదాస్తు కలికాః స్మృతాః,**
**శమ్యాతాలౌ తాలశమ్యే కుర్యాద్ ద్వే వానుపూర్వశః. 251**

**తాలం శమ్యాం చ తాలం చ సన్నిపాతం తథైవ చ,**
**శీర్షకం చాస్య కర్తవ్యం బుధైశ్చాపపుటేన తు. 252**

**ఏవమేకకలో జ్ఞేయస్తాలయోగస్తు మద్రకే,**
**గురువిశ్లేషపాదేన ద్వికలం పరిచక్షతే. 253**

**తా.** గుర్వక్షరాల తాలాలు, పాదాల తాలాలు ఒక 'కలా' ప్రమాణంలో ఉంటాయి. వీటి పాతకలలు ఈ విధంగా ఉండాలి – శమ్య, తాలం, తాలం, శమ్య, శమ్య, తాలం, సన్నిపాతం. ఈ విధంగా చాపపుటతో దీని శీర్షకం చెయ్యాలి. మద్రకగీతంలో అనుసరించవలసిన ఏకకలాతాల పద్ధతి ఇదే. పాదంలోని గురువర్ణాల విశ్లేషణం చేస్తే రెండుకలల ప్రమాణం చూచుకొని దానిద్వారా చెయ్యాలి.

**మూ. విశ్లేషేణ కలాశ్చాత్ర యథాపూర్వం నివేశయేత్,**
**ద్వికలే మద్రకే చైవ త్రికలం స్యాదుపోహనమ్. 254**

**కలికా ద్వికలం వాపి భవేచ్చ ప్రత్యుపోహనమ్,**
**ద్వికలైర్గుర్వక్షరకృతైః పాదభాగైర్యథాక్రమమ్. 255**

**తా.** దీని విశ్లేషణం చేసిన తరువాత వెనుక చెప్పిన విధంగా 'కల'ల ఉపోహనము, రెండేసి కలల లేదా ఒక్కొక కలల ప్రత్యుపోహనము చెయ్యాలి. ఇది – ద్వికలగుర్వక్షరాలతో నిర్మించిన పాదభాగాలను అనుసరించి, క్రమానుసారంగా చెయ్యాలి.

**మూ. చతుర్భిస్తు భవేన్మాత్రా త్రిమాత్రం వస్తు సంజ్ఞితమ్,**
**త్రివస్తు ద్వికలం జ్ఞేయం పాతే పాదవిధిస్త్వయమ్. 256**

**తా.** నాలుగు కలలు ఒక మాత్ర. మూడు మాత్రలు ఒక వస్తువు. మూడు వస్తువులలోని ఒక్కొక్క వస్తువులో రెండేసి కల లుంటాయి. ఇదీ పాతంలోని పాదానికి సంబంధించిన నియమం.

**మూ. గుర్వక్షరేషు యే పాతాః శమ్యాతాలాదయః స్మృతాః,**
**తానేవ పాదభాగేషు ద్వికలేష్వత్ర యోజయేత్. 257**

**తా.** శమ్యా – తాలాదుల గురువర్ణాలలో ఏ పాతా లుంటా యని చెప్పబడిందో వాటినే ఈ ద్వికలపాదభాగాలలో ప్రయోగించాలి.

**మూ. అష్టమీ షోడశీ శమ్యా దశమీ చ యథాక్రమమ్,**
**చతుర్దశ్యాం కలాయాం తు తాలం వై ద్వాదశీయుతమ్. 258**

**లఘ్వష్టకే పాతవిధిర్యథాపూర్వం ప్రకీర్తితః.**

**తా.** ఎనిమిదవ పదవ పదహారవవాటి మీద శమ్య, పన్నెండవ – పద్నాల్గవ వాటి

మీద తాలము ఉంటాయి. ఎనిమిది లఘువులమీద జరిగే పాతవిధానం వెనుక చెప్పబడినది.

**మూ. వస్తుద్వయేఽపి ద్వికలే ఏవం పాతాన్ ప్రయోజయేత్,**
**శీర్షకం చైవ కర్తవ్యం షట్కలం పఞ్చపాణినా. 259**

**తా.** రెండు కలల మూడు వస్తువులలోనూ కూడ ఇదే పాతవిధానం అనుసరించాలి. ఐదు కలల శీర్షకాన్ని పంచపాణితాలంతో కూడ చెయ్యాలి.

**మూ. క్రండం క్రండం శైలేన్ద్రరాజసంస్థితమీశం శాన్తం శివం పన్నగేన్ద్రపరిబద్ధజటమ్. మునిగణనమితం ధ్యానాభిరతం జ్ఞానమయం మదనాఙ్గహరం విభుం ప్రభుం శరణాగతోఽహమ్.**

**తా. క్రండం, క్రండం** – శైలాధిరాజుపై నివసించువాడు, ఈశుడు, శాంతుడు, శివుడు, సర్పరాజుతో జటలు బంధించుకొన్నవాడు, మునిగణాలచే నమస్కరింపబడినవాడు, జ్ఞానస్వరూపుడు, మన్మథుని శరీరం నశింపచేసినవాడు, సర్వవ్యాపి, ప్రభువూ అయిన శివుణ్ణి నేను శరణుపొందుతున్నాను.

**మూ. దైత్యైర్నాగైః సంస్తుతమీశం త్వాం వేదమయం త్వాం కర్తారం భువనపతిం సర్వలోకనమస్కృతమ్, ఋగ్యజుః పరిపఠితం గఙ్గాధరం శూలధరం భుజగేన్ద్రధరం ప్రణతోఽస్మి శివం మృగరాజచర్మపరిబద్ధతనుమ్. విపులగతిం జ్వలనశిఖిసదృశకపిలజటం తమహం నమామి శివం శిరసా.**

**సమాప్తం ద్వికలం మద్రకమ్.**

**తా.** దైత్యులచేత, నాగులచేత స్తుతింపబడు చున్నవాడు, వేదస్వరూపుడు, సృష్టికర్త, లోకప్రభువు, సర్వలోకాలచేత నమస్కరింపబడినవాడు, ఋగ్యజుర్వేదాలలో చెప్పబడినవాడు, శూలధరుడు, భుజగేంద్రధరుడు, మృగరాజచర్మ చుట్టబెట్టిన శరీరం కలవాడు, విస్తృతమైన గమనం గలవాడు, ప్రజ్వలిస్తూన్న అగ్ని వలె కపిలవర్ణంతో ఉన్న జటలు కలవాడు అయిన ఆ శివుణ్ణి శిరస్సు వంచి నమస్కరిస్తున్నాను. (ఇది ఉదాహరణం).

**ద్వికలమద్రకం సమాప్తం.**

**మూ. దేవం విమలం ప్రణతార్తిహరం మాయాధారం మాయారూపం జటిలం నమామి శివం శిరసా.**

**శీర్షకం షట్కలం సమాప్తమ్. ద్వికలమద్రకమ్.**

**తా.** దేవుడు, స్వచ్ఛమైనవాడు, నమస్కరించువారి పీడలను తొలగించువాడు, మాయకు ఆధారభూతుడు, మాయారూపుడు, జటాధారి అయిన శివునిశిరస్సుతో నమస్క

రించుచున్నాను.

**షట్కల శీర్షకం సమాప్తం. ద్వికలమద్రకం సమాప్తం.**

**మూ. చతుష్కలం ప్రవక్ష్యామి యథావద్ ద్విజసత్తమాః,**
**చతుష్కలైః పాదభాగైర్యథాపూర్వముదాహృతైః. 260**

**తా.** ద్విజోత్తములారా! ఇప్పుడు నేను చతుష్కలమద్రకాన్ని గూర్చి చెపుతాను. దీనిలో పూర్వం చెప్పిన చతుష్కలపాదా లుంటాయి.

**మూ. చతుర్భిస్తు భవేన్మాత్రా త్రిమాత్రం వస్తుసంజ్ఞితమ్,**
**పాతాంశ్చైవ ప్రవక్ష్యామి పాదభాగే యథాక్రమమ్. 261**

**తా.** నాలుగు కలలు ఒక మాత్ర. మూడు మాత్రలు ఒక వస్తువు. దీని పాద భాగాలలో ఇవ్వవలసిన పాతాలను గూర్చి చెపుతున్నాను.

**మూ. చతుర్థే పఞ్చమేఽన్త్యే చ శమ్యా కార్యాష్టమే తథా,**
**దశమైకాదశే శమ్యాఽద్వితీయా నవమే స్మృతా. 262**

**షష్ఠే చ సప్తమే తాల అన్త్యే చ నవమేఽస్య హి,**
**దశమైకాదశే చైవ ద్వితీయః సముదాహృతః. 263**

**తా.** ప్రథమవస్తువులో – అంతమునందు, నాలుగు, ఐదు, ఎనిమిది, పది, పదకొండు కలలయందు, ఒకటి, తొమ్మిది కలలయందు శమ్య ఉంచాలి. ఆరు, ఏడు, నవమకలలయందు, చివరి కలయందు తాలం ఉంచాలి. పదవ కల ఆరంభంలోను, ఏడవ కల ఆరంభంలోను తాలం ఉంచాలి.

**మూ. ఆద్యన్తు ద్వాదశే ప్రోక్తం సన్నిపాతోవసానతః,**
**ఏవం పాతవిధానం స్యాత్సర్వం వస్తు ప్రయోజయేత్. 264**

**తా.** పన్నెండవ కల అంతమునందు, అన్నింటి ప్రారంభమునందు సంనిపాతం చెయ్యాలి. అన్ని వస్తువుల విషయంలో పాతనియమం ఇదే.

**మూ. ప్రథమే వస్తుకే హ్యాదౌ కలాష్టకముపోహనమ్,**
**ప్రత్యుపోహనమిత్యుక్తం ద్వితీయే ద్వికలం భవేత్. 265**

**తా.** ప్రథమవస్తుప్రారంభంలో ఎనిమిది కలల ఉపోహనము, ద్వితీయవస్తువులో రెండు కలల ప్రత్యుపోహనము చెయ్యాలి.

**మూ. తృతీయే త్రికలం జ్ఞేయం చతుర్థే తు చతుష్కలమ్,**
**అస్యాన్తే శీర్షకం కార్యం షట్పితాపుత్రకేణ తు. 266**

**తా.** తృతీయవస్తువులో మూడు కలల ప్రత్యుపోహనము, చతుర్థవస్తువులో చతుష్కల

ప్రత్యుపోహనము, దీని అంతమునందు షట్పితాపుత్రకంతో శీర్షకమూ చెయ్యాలి.

**మూ. ద్వికలే తు యథాపాతం పఞ్చపాణిచతుష్టయమ్,**
**ద్విగేయకం తృతీయే చ చతుర్థే చ యథాక్రమమ్. 267**

**తా.** ద్వికలవస్తువునందు నాలుగు యథాక్షరపంచపాణుల ప్రమాణం ఉండాలి. తృతీయ – చతుర్థవస్తువులలో క్రమంగా ద్విగేయకం ఉంచాలి.

**మూ. పరివర్తసమాప్తిస్తు చతుర్థే సంవిధీయతే,**
**మంద్రాంశోపోహనం వస్తు ప్రథమం చ ద్వితీయకమ్. 268**
**చతుర్థం తు త్రిప్రమాణం త్ర్యస్రతాలసముద్భవమ్.**

**తా.** చతుర్థవస్తువు చివర పరివర్తం ఉంటుంది. ప్రథమ – ద్వితీయవస్తువులు ఉపోహనంగాను, మద్రకాంగంగాను ఉంటాయి. వీటిలో మూడవ వస్తువులో మూడు వేరు వేరు ప్రమాణా లుంటాయి. అవి త్ర్యస్రప్రమాణంలో ఉంటాయి.

**మూ. ద్విర్భావాద్ద్వికలస్యైవం విజ్ఞేయం తు చతుష్కలమ్. 269**
**సప్తమే లఘుని త్వన్త్యే ద్విర్భావోఽస్మిన్విధీయతే,**
**చతుష్కలోఽత్ర విహితః కలాష్టకముపోహనమ్. 270**
**ఏకా ద్వే చ చతుష్కశ్చ తథా స్యాత్ ప్రత్యుపోహనమ్.**

**తా.** ద్వికలవస్తువును రెట్టింపు చేయగా అది చతుష్కలవస్తువు అవుతుంది. దీనిలో ఏడవ వర్ణాన్ని, చివరి వర్ణాన్ని లఘువు చేయడంకొరకు మళ్లీ దీనిలో ఆవృత్తి చెయ్యాలి. అందుచేతనే దీనిలో చతుష్కలం విధింపబడింది. దీనిలో ఉపోహనం ఎనిమిది కలలలోను, ప్రత్యుపోహనం ఒకటి లేదా రెండు లేదా నాలుగు కలలలోను చేయబడుతుంది.

**మూ. యథాక్షరస్తు కర్తవ్యం మద్రకస్య తు శీర్షకమ్. 271**
**చతుష్కలః పఞ్చపాణిః ద్వికలే ద్వికలః స్మృతః,**
**చతుష్కలస్తు కర్తవ్యో మద్రకే తు చతుష్కలే. 272**

**తా.** సాధారణంగా మద్రకంలో యథాక్షరం పంచపాణితాలం ప్రయోగింపబడుతుంది. ద్వికలమద్రకంలో రెండు కలల చతుష్పాణితాలము, చతుష్కలమద్రకంలో చతుష్కలపంచపాణి ఉపయోగించబడుతుంది.

**మూ. త్రివస్తు త్రిప్రమాణం తు త్ర్యస్రతాలసముద్భవమ్,**
**ఇత్యుక్తం మద్రకం పాతైస్త్రయోదశభిరన్వితమ్. 275**

**తా.** త్రిప్రమాణకమైన త్రివస్తుమద్రకంలో త్ర్యస్రతాలం ప్రయోగింపబడుతుంది. ఈ విధంగా పదమూడు పాతాలతో గూడిన మద్రకాన్ని గూర్చి చెప్పాను.

**మూ. గుర్వక్షరాణి చత్వారి చత్వారి స్యుర్లఘూని చ,**
**ద్వితీయే గురుకే శమ్యా తృతీయే తాల ఏవ చ. 274**

**తృతీయే చ చతుర్థే చ శమ్యాతాలే లఘూన్యపి,**
**తాలం శమ్యాం చ తాలే చ సన్నిపాతం చ యోజయేత్**
**లఘ్వక్షరైరష్టకలికాన్ పాతానేతాన్ ప్రయోజయేత్. 275**

**తా. అపరాన్తకం :–** దీనిలో నాలుగు గురువులు, నాలుగు లఘువులు ఉంటాయి. రెండవ గురువుమీద శమ్య, తృతీయగురువు మీద తాలం ఉంటాయి. మూడవ, నాల్గవ లఘువుల మీద శమ్య, తాలము ఉంటాయి. ఇక్కడ శమ్యా – తాల – సన్నిపాతములు – కలిపివేసి, లఘువర్ణాలమీద ఎనిమిది కలలతో నిర్మించిన పాతాలు ఉంచాలి.

**మూ. తాలః శమ్యా చ తాలశ్చ సంనిపాతోఽన్త్య ఏవ చ,**
**త్ర్యస్రతాలసముద్భూతం విజ్ఞేయమపరాన్తకమ్. 276**

**తా.** అపరాంతకం త్ర్యస్రతాలంతో పుట్టినది. క్రమంగా దీనిలో తాలం, శమ్య తాలం, చివర సంనిపాతము కూర్చాలి.

**మూ. గుర్వక్షరాణి విశ్లిష్య ద్వికలం సంప్రయోజయేత్,**
**పాదభాగైస్తథా షడ్భిః ద్వికలం చ చతుష్కలమ్. 277**

**శమ్యా తాలౌ తాలౌ శమ్యా తాలః పష్ఠో యథాక్రమమ్,**
**పూర్వవత్ పాతవిన్యాసః షష్ఠపఞ్చమయోః స్మృతః. 278**

**తా.** గురువర్ణాలను వేరు చేసిన తరువాత రెండు కలల తాలం ప్రయోగించాలి. ఈ ద్వికల – చతుష్కలతాలాల పాదభాగాలు ఈ విధంగా ఉంటాయి – శమ్య, తాలం, రెండు తాలాలు, శమ్య, తాలం, ఐదు ఆరు కలలలో పాతవిధానం వెనుకటి వలెనే ఉంటుంది.

**మూ. ఆవాపవిక్షేపయుతం పాతైరేభిశ్చతుష్కలమ్,**
**చతుష్కలైః పాదభాగైః షడ్భిస్తు సమలఙ్కృతమ్. 279**

**తా.** చతుష్కలకాలంలో ఆవాప – విక్షేపాలు కలిసి ఉంటాయి. దీనిలో నాలుగు కలల లేదా ఆరు కలల పాదభాగాలు ఏర్పరచాలి.

**మూ. వస్తు సంఖ్యాశ్చ షట్పఞ్చ సప్తకాన్ సంప్రయోజయేత్,**
**ద్వితీయే పఞ్చమేఽన్త్యే చ ద్వే శమ్యే సముదాహృతే. 280**

**తా.** దీనిలో ఐదు, ఆరు లేదా ఏడు సంఖ్యలలో వస్తువును ఉంచాలి. రెండవ, ఐదవ కలల చివర రెండు శమ్యలు ఉండాలి.

**మూ. తృతీయే తు భవేదన్యం ద్వితీయే పఞ్చమే స్మృతః,**
**ఆదౌ షష్ఠే తు తాలః స్యాత్ సన్నిపాతస్తతోఽన్తిమః. 281**

**తా.** మూడవ – రెండవ – ఐదవదాని అంతమునందు, ఆరవదాని ఆరంభము నందు తాలం ఉండాలి. అన్నింటి అంతమునందూ కూడ సంనిపాతం ఉండాలి.

**మూ. పూర్వవస్తుసముద్దిష్టాః పాతా హ్యేతాశ్చతుష్కలే,**
**ఏవం చతుష్కలే యోగే గదితస్త్వపరాన్తకే. 282**
**యథాక్షరపాతేష్వేతద్ విజ్ఞేయం చాపరాన్తకమ్.**

**తా.** చతుష్కలాపరాంతకానికి చెందిన పూర్వవస్తువులలో పాతాలు ఈ విధంగా ఉండాలి. చతుష్కలాపరాంతకంలో తాలాల విధానం ఈ విధంగా ఉంటుంది. ఇది యథాక్షరతాలాల పాతాలను అనుసరించి చేసే **అపరాంతకం**.

**మూ. ఆదౌ కలోపవహనం విశ్లేషాద్ ద్విగుణం భవేత్. 283**
**ద్వికలే కలికం జ్ఞేయం ద్వికలం చాప్యుపోహనమ్,**
**కలికే కలికం చేష్టం తథైవ చాప్యుపోహనమ్. 284**
**ఏతదేవ ద్విగుణితం విజ్ఞేయం తు చతుష్కలమ్,**
**లఘ్వక్షరే తృతీయే తు ద్విర్భావేఽన్యా కలా స్మృతా. 285**

**తా.** ఆరంభంలో ఒక కల ఉన్న ఉపవహనాన్ని వర్గీకరణదశలో రెట్టింపు చెయ్యాలి. ద్వికలాపరాంతకంలో ఒక కల లేదా రెండు కలలఉపోహనం చేసి నట్లే ఏకకలాపరాంతంలో కూడ ఒక కల ఉపోహనం చెయ్యాలి. ఈ ద్వికలాపరాంతకాన్ని రెట్టింపు చేస్తే అది చతుష్కలాపరాంతకం అవుతుంది. దీని మూడవ లఘ్వక్షరంలోని చివరి కల రెట్టింపు అవుతుంది.

**మూ. త్ర్యస్రతాలసముద్భూతం పాతైః షడ్భిర్విభూషితమ్,**
**వస్తు శాఖాఖ్యమిత్యేతద్ గదితం త్వపరాన్తకమ్. 286**

**తా.** ఈ అపరాంతకంలోనే త్ర్యస్రతాలోత్పన్న మైన వస్తువును షట్కలంతో ప్రయోగిస్తే దీనికి **'శాఖా'** అని పేరు.

**మూ. యథా శాఖా తథైవాస్య ప్రతిశాఖా విధీయతే,**
**పశ్చిమార్ధసమా సా తు తథైవాన్యపదా స్మృతా**
**శిరశ్చైకకలేనాస్య కర్తవ్యం పఞ్చపాణినా. 287**

**తా.** దీనికి శాఖవలెనే **ప్రతిశాఖ** కూడ ఉంటుంది. ఇది దీని చివరి అర్ధభాగంతో సమానంగా ఉంటుంది, ఇది వేరు శబ్దాలచేత నిర్మింపబడుతుంది. దీని శీర్షకం ఏకకల పంచపాణితాలంలో చేయబడుతుంది.

**మూ. వృత్తౌ నివృత్తయోగశ్చ గతే వస్తుచతుష్టయే,**
**శాఖాయాం ప్రతిశాఖాయాం విశేషః పశ్చిమే త్వయమ్. 288**

**తా.** నాలుగు వస్తువులను ప్రయోగించే టప్పుడు, వృత్తిమార్గంలో ఈ నివృత్తి విధానాన్ని అవలంబించాలి. ఈ నియమం విశేషించి శాఖా – ప్రతిశాఖల చివరి అర్ధభాగంలో పాటించాలి.

**మూ. షట్కలాపాతసంయుక్తే తాలికే తు తతః స్మృతే,**
**తథైకకలయుక్తేఽస్తి విధివత్ పఞ్చపాణినా. 289**
**యథాక్షరేణ తు భవేదనయోరుపవర్ణవమ్.**

**తా.** తరువాత ఆరు కలాపాతాలతో రెండు తాలిక లుండాలి. పిమ్మట యథాక్షరం లోని ఏకకాలపంచపాణితో ఈ రెండింటి ఉపవర్తనం చెయ్యాలి.

**మూ. ఉపోహనం తు వస్త్వర్ధం ద్వికలం ప్రత్యుపోహనమ్. 290**
**ద్వికలం దక్షిణే కార్యం వృత్తౌ చైవ చతుష్కలమ్,**
**న చాత్రోపోహనం కార్యం శేషాణాం తు కదాచన. 291**
**ఏవం చతుష్కలే యోగో మయా ప్రోక్తోఽపరాన్తకే.**

**తా.** చతుష్కలాపరాంతానికి చెందిన ఈ ఉపోహనం అర్ధవస్తువుతో నిర్మించ బడుతుంది. ప్రత్యుపోహనం కలాద్వయంలో జరుగుతుంది. ద్వికలాపరాంతకం దక్షిణ మార్గంలోను, చతుష్కలాపరాంతకం వార్తికమార్గంలోను చెయ్యాలి. ఉపోహనం ఎన్నడూ మిగిలిన మార్గాలలో చేయకూడదు. ఈ విధంగా నే నింతవరకు చతుష్కలాపరాతకం కాలప్రమాణం చెప్పాను.

**మూ. ఉల్లోప్యకం తు ద్విగురు ద్విలఘ్వన్తే గురు స్మృతమ్. 292**
**శమ్యాతాలౌ ద్విరభ్యస్తౌ సంనిపాతోఽన్త్య ఏవ చ,**
**ప్రత్యక్షరకృతైః పాతైః పఞ్చభిః సమలఙ్కృతమ్,**
**చతురస్రం సమం చేదం వస్తు జ్ఞేయం యథాక్షరమ్. 293**

**తా. ఉల్లోప్యకం :–** ఉల్లోప్యకం వస్తువులో రెండు గురువులు, రెండు లఘువులు, ఒక గురువు, ఉంటాయి. కలలు ఈ క్రమంలో ఉంటాయి – శమ్య, తాలం, శమ్య,

తాలం, సంనిపాతం. దీనిలో ప్రతీ ఒక్కొక అక్షరంమీద ఉండే ఐదు పాతాలు చతురస్ర యథాక్షరసమపాతాల వలె ఉంటాయి.

**మూ. పూర్వోక్తేన విధానేన ద్వి‌చతుష్కలమిష్యతే,**
**అస్య చాఙ్గత్రయే గీతే వైహాయసికమిష్యతే. 294**

**తా.** ఈ విధంగా ఉల్లోప్యకం రెండు లేదా నాలుగు కలలలో ఉంటుంది. దీని మూడు అంగాల గానం పూర్తి అయిన తరువాత వైహాయసికం ఉపయోగించాలి.

**మూ. తదేకాఙ్గావరం జ్ఞేయం ద్వాదశాఙ్గపరం తథా,**
**ప్రమాణం ద్వాదశకలం సప్తపాతమథాపి వా. 295**

**అస్య తు ద్వికలా శమ్యా తాలశ్చ ద్వికలస్తథా,**
**ద్వికలా చ పునః శమ్యా తాలశ్చైకకలః స్మృతః. 296**

**తతః శమ్యా తతస్తాలః సంనిపాతస్తతఃపరమ్,**
**శాఖేయం ప్రతిశాఖా తు నిత్యమన్యపదా స్మృతా. 297**

**తా.** దీనికి అంగాలు ఒకటినుండి పదహారు దాకా ఉంటాయి. ప్రమాణం పన్నెండు కలలు, లేదా ఏడు పాతాలు ఉంటాయి. రెండు కలల శమ్య, రెండు కలల తాలం, రెండు కలల శమ్య. ఒక కల తాలం, మళ్లీ శమ్య, తాలం, సన్నిపాత. ఇది 'శాఖ.' **ప్రతిశాఖ** యైతే విభిన్న పదాలతో నిర్మించబడినదై **'అన్యపద'** అనుపేరుతో ఉంటుంది.

**మూ. యదాత్వస్య భవేదన్తే తదన్తాహరణం బుధైః,**
**యథాక్షరేణ నియమాత్ సంహార్యం పఞ్చపాణినా. 298**

**స్వతాలేనాన్తహీనస్య సంహారః పరికీర్త్యతే,**
**ద్విప్రకారనివృత్తం చ త్ర్యంశోఽథ త్రివిధః స్మృతః. 299**

**తా.** ఇది చివరికి వచ్చినపుడు అంతాహరణం చెయ్యాలి. దీని సంహారం యథాక్షర పంచపాణితో చెయ్యాలి. అంతహీన మైన దీని సంహారం దీని తాలంమీదనె చెయ్యాలి. మూడు అంశాల రెండు విధాలైన నివృత్తం, మళ్లీ మూడు విధాలు.

**మూ. త్ర్యస్రశ్చ చతురస్రశ్చ మిశ్రశ్చ త్రివిధః స్మృతః,**
**స్థితప్రవృత్తే తస్యాఙ్గే మహాజనికమేవ చ. 300**

**స్యాత్ పఞ్చపాణితాలేన తదన్తాహరణం తథా,**
**తథాస్థితం భవేద్యుగ్మం తస్య పాతవిధిస్త్వయమ్. 301**

**శమ్యా తు ద్వికలా కార్యా తాలశ్చ ద్వికలః స్మృతః,**
**చతుష్కలః సన్నిపాతః ప్రవృత్తమత ఇష్యతే. 302**

**తస్యాపి ద్వికలా శమ్యా తాలశ్చైకకలః పునః,**
**చఞ్చత్పుటశ్చ తాలాదిః సన్నిపాతస్తతఃపరమ్. 303**

**తా.** త్ర్యస్రం, చతురస్రం, మిశ్రం అని నివృత్తం మూడు విధాలు. దీనికి స్థితం, ప్రవృత్తం, మహాజనికం అను మూడంగాలు ఉన్నాయి. పంచపాణితాలంయొక్క 'అన్తాహరణం' చేత, యుగ్మతాలంచేత ఇది 'స్థితం' అవుతుంది. దీని పాతవిధానం ఇలా ఉంటుంది – రెండు కలల శమ్య, రెండు కలల తాలం, నాలుగు కలల సంనిపాతము, దాని తరువాత ప్రవృత్తం చెయ్యాలి. ప్రవృత్తంలో రెండు కలల శమ్య, ఒక కల తాలం, తాలాదివర్గంయొక్క చంచత్పుటము, చివర సంనిపాతము.

**మూ. స్థితం తాలేన కర్తవ్యం మహాజనికమస్య తు,**
**నివృత్తతాలః కర్తవ్యో నివృత్తస్యాపి తత్త్వతః. 304**

**తా.** మహాజనికాన్ని స్థితతాలంతోను, నివృత్తకాన్ని నివృత్తతాలంతోను ప్రయోగించాలి.

**మూ. స్థితమహాజనికయోః ప్రాయః సముపవర్తనమ్,**
**ఆదావుద్ఘట్టకః కార్యః పరివర్తక ఏవ చ. 305**

**తా.** స్థిత – మహాజనికాలలో, సాధారణంగా ఉపవర్తనం అంతర్గతంగా ఉంటుంది. దీని ప్రారంభంలో ఉద్ఘట్టకమూ; పరివర్తకమూ చెయ్యాలి.

**మూ. యుగ్మే హి మిశ్రతాలత్వాత్ యుగ్మే హ్యన్తః ప్రయుజ్యతే,**
**వివధైకకసంయుక్తః సర్వశ్చాన్తవిధిః స్మృతః. 306**

**తా.** యుగ్మం మిశ్రతాలం అవడంచేత దానిని అంతమునందు ప్రయోగించాలి. 'వివధ – ఏకకాల' అంతతాలాల విషయంలో చెప్పిన నియమా లన్నీ ఇక్కడ కూడ వర్తిస్తాయి.

**మూ. యథావదన్తతాలోఽయం యుగ్మో మిశ్రశ్చ కీర్తితః,**
**అతఃపరం ప్రవక్ష్యామి త్ర్యస్రసాలవిధిం ప్రతి. 307**

**తా.** నే నింతవరకు అంతతాలవిధానానికి చెందిన యుగ్మ – మిశ్రతాలాలను గూర్చి చెప్పాను. ఇప్పుడు త్ర్యస్రతాలవిధానం చెపుతాను.

**మూ. శమ్యా తు ద్వికలా పూర్వం తతస్తాలో విధీయతే,**
**త్రికలః సన్నిపాతశ్చ ప్రవృత్తశ్చాప్యతఃపరమ్. 308**

**తా.** ముందుగా రెండు కలల శమ్య, తరవాత తాలం, మూడు కలల సంనిపాతము, తరువాత ప్రవృత్తం.

**మూ. ప్రవృత్తమత్ర కర్తవ్యం యథావత్ పరివర్తనమ్,**
**యథాక్షరప్రయుక్తేన సమాసాత్ పఞ్చపాణినా. 309**

**తా.** యథాక్షరానికి చెందిన పంచపాణితో ప్రవృత్తాన్ని పరివర్తనంగా చెయ్యాలి.

**మూ. అస్యాపి స్థితతాలేన మహాజనికమిష్యతే,**
**నివృత్తతాలః కర్తవ్యస్తథాస్యాన్తనివర్తితే. 310**

**తా.** దీని మహాజనికం స్థితతాలంతోను, అంతనివర్తనం నివృత్తతాలంతోను ప్రయోగించాలి.

**మూ. యుగ్మౌజమిశ్రతాలత్వాన్మిశ్రోఽప్యన్తః ప్రవర్తనమ్,**
**వివధైకకసంయుక్తః సర్వశ్చాన్తవిధః స్మృతః. 311**

**తా.** యుగ్మ – అయుగ్మతాలాల మిశ్రణం జరగడంవల్ల మిశ్రతాలంలో కూడ అంతఃప్రవర్తనం జరగాలి. ఏకకంతో పాటు వివధం రచించడం అంతస్తాలానికి సంబంధించిన ఒక నియమం.

**మూ. ద్వ్యఙ్గమేకాఙ్గమపి వా స్థితం కార్యం సమాసతః,**
**తత్ర యుగ్మం భవేత్ ద్వ్యఙ్గం త్ర్యస్రమేకాఙ్గమిష్యతే. 312**

**తా.** స్థితాన్ని ఒక అంగంతో గాని, రెండు అంగాలతో గాని సంక్షిప్తంగా చెయ్యాలి. యుగ్మతాలంతో రెండు అంగాలను సంక్షిప్తంచేసి త్ర్యస్రతాలంతో ఏకాంగస్థితం కూర్చాలి.

**మూ. ప్రవృత్తమపి విజ్ఞేయం ద్వ్యఙ్గమేకాఙ్గమేవ వా,**
**మహాజనికమేకాఙ్గం ద్వ్యఙ్గం సంహరణం స్మృతమ్. 313**

**తా.** ప్రవృత్తం కూడ ఒకటి. రెండు అంగాలతో చెయ్యాలి. మహాజనికాన్ని ఒక అంగంతోను, సంహరణాన్ని రెండు అంగాలతోను చెయ్యాలి.

**మూ. స్థితాదికః ప్రవృత్తాన్తః ఏవమన్తం విదుర్బుధాః,**
**ఉల్లోప్యకే సదా యోజ్యమూహాపోహవిశారదైః. 314**

**తా.** స్థితంతో ప్రారంభమై ప్రవృత్తకంతో సమాప్త మయే భాగానికి **అంతం** అని పేరు. దీనిని కలావిశారదులైన ప్రయోక్తలు ఉల్లోప్యకంలో, ఊహాపోహలతో చక్కగా కూర్చాలి.

**మూ. ప్రకరీవస్తు షణ్మాత్రా పాతాశ్చైకోనవింశతిః,**
**వస్తుప్రమాణం కర్తవ్యం తథైవ చ చతుష్కలే. 315**

**తా. ప్రకరి :–** ప్రకరిలోని వస్తువు ఆరు మాత్రలతో పందొమ్మిది పాతాలతో ఏర్పడుతుంది. దీని వస్తువు చతుష్కలాప్రమాణంలో ఉంటుంది.

**మూ. న యథాక్షరయోగోఽత్ర న చాత్ర ద్వికలో భవేత్,**
**ఆద్యమాత్రాత్రయస్యాన్తే శమ్యాతాలే ప్రకీర్తితౌ. 316**
**షణ్మాత్రం పాతసంయుక్తం వస్తు కార్యం యథాక్రమమ్,**
**ఉపోహనం తు వస్త్వర్ధే ప్రథమే చ ద్విజోత్తమాః. 317**

**తా.** దీనిలో యథాక్షరతాల – ద్వికలాతాలాల ప్రయోగం ఉండదు. దీని ప్రారంభంలో మూడు మాత్రల తరువాత శమ్య, తాలమూ ఉంటాయి. వీటి తరువాత ఆరు మాత్రల పాతాలతో కూడిన వస్తువు నిర్మింపబడుతుంది. వస్తు ప్రథమార్ధంలో ఉపోహనం ఉంటుంది.

**మూ. శమ్యా అస్య తు మాత్రా స్యాద్ ద్వితీయా తాలసంయుతా,**
**మాత్రాత్రయస్య చాన్త్యా స్యాత్ శమ్యైకా చ పునస్తథా. 318**
**చతుర్థ్యాం ద్వాదశస్తాలః పఞ్చమ్యాం చాష్టకః స్మృతః,**
**షష్ఠ్యాం తు ద్వికలా శమ్యా తాలశ్చ ద్వికలో భవేత్. 319**
**పునశ్చ ద్వికలస్తాలః శమ్యా చ ద్వికలా పునః,**
**శమ్యా తాలశ్చ తాలశ్చ శమ్యా తాలస్తథైవ చ. 320**
**శమ్యా తాలః సంనిపాత ఇతి వస్తు ప్రకీర్త్యతే.**

**తా.** దీని మొదటి మూడు మాత్రలలోని రెండవ మాత్ర తాలయుక్తశమ్య అయి ఉంటుంది. మళ్లీ చివర శమ్య ఉంటుంది. నాల్గవ మాత్రలో పన్నెండు తాలాలు, ఐదవ మాత్రలో ఎనిమిది తాలాలు, ఆరవ మాత్రలో రెండు కలల శమ్య, రెండు కలల తాలము, మళ్లీ ద్వికలతాలం, ద్వికలాశమ్య, మళ్లీ, శమ్య, తాలం, తాలం, శమ్య, తాలం, శమ్య, తాలం సన్నిపాతం ఉంటాయి.

**మూ. యదా త్వర్ధచతుర్థాని వస్తూని ప్రకరీ భవేత్. 321**
**పశ్చిమార్ధం పదస్యైతత్ తదర్ధం ప్రాక్ నివేశయేత్,**
**కనిష్ఠాసారితేనాస్య కార్యం సంహరణం తతః. 322**

**తా.** నాలుగున్నర మాత్రల వస్తువులో ప్రకరీనిర్మాణం చేసి నప్పుడు అది పదం యొక్క ఉత్తరార్ధభాగం అవుతుంది. దాని సగం భాగం ముందు ఉంచబడుతుంది. దీని సంహరణం కనిష్ఠాసారితంతో చేయబడుతుంది.

**మూ. పాదః పూర్వసమః కార్యస్త్వపరాన్తకశాఖయా,**
**ఓవేణకే ద్వితీయస్య తస్య చ ప్రతిశాఖయా. 323**
**స ఏవ పాతవిన్యాసో మాషఘాతమతః పరమ్,**

షట్పాతో ద్వాదశకలస్తస్య పాతవిధిస్త్వయమ్. **324**

కర్తవ్యా ద్వికలా శమ్యా తాలో ద్వికల ఏవ చ,
పునశ్చ ద్వికలస్తాలః శమ్యా చ ద్వికలా పునః. **325**

తతశ్చైకలస్తాలః సన్నిపాతః కలాత్రయే,
ప్రాయేణ మాషఘాతస్తు వివధాఙ్గః ప్రకీర్తితః. **326**

సన్ధిశ్చైవ హి తస్యాన్తే కదాచిదుపవర్తనమ్,
తస్యాః స్యాత్ కలికేనైవ తచ్ఛేషం పఞ్చపాణినా. **327**

సన్ధిర్యథాక్షరేణైవ కర్తవ్యః పఞ్చపాణినా,
ఏకకం వివధో వాపి తస్యాఙ్గం సముదాహృతమ్. **328**

**తా. ఓవేణకం :–** దీనిలోని ప్రథమపాదం అపరాంతకం శాఖతో సమంగా ఉంటుంది. దీని ద్వితీయపాదం అపరాంతకం ప్రతిశాఖతో సమంగా ఉంటుంది. దీనిలోని పాతకలల లోను, మాషఘాతంలోను వాటిలో అనుసరించిన క్రమమే అనుసరించాలి. దీని పాతనియమా న్ననుసరించి ఆరు కలల ఆరు పాతా లుండాలి. ఆ క్రమం ఇది – రెండు కలల శమ్య, రెండు కలల తాలం, మళ్లీ రెండు కలల తాలం, మళ్లీ రెండు కలల శమ్య, మళ్లీ ఒక ఏకకలాతాలం, త్రికలాసంనిపాతము. దీని మాషఘాతం సాధారణంగా, వివధకు అంగం అవుతుంది. దీని సంధి లేదా సమాప్తి అప్పుడప్పుడు ఉపవర్తనంమీద అవుతుంది. దీని ఓఘం ఒక కల ప్రమాణంలో ఉన్న పంచపాణితో నిర్మించబడుతుంది. సంధినిర్మాణం యథాక్షరం పంచపాణిద్వారా జరుగుతుంది. ఏకక – వివధలు దీని అంగాలు.

**మూ.** ఉపవర్తనవచ్చాస్య పృథగ్విధిరితి స్మృతః,
అన్త్యస్య చతురస్రస్య ప్రవృత్తే యో విధిః స్మృతః. **329**
వివధాఙ్గేన తేనైవ చతురస్రకమిష్యతే.

**తా.** దీని విధి ఉపవర్తనంవలెనే వేరుగా ఉంటుంది. అంత్యచతురస్రప్రారంభంలోని నియమాలే వివధాంగచతురస్రం విషయంలో కూడ వర్తిస్తాయి.

**మూ.** సన్ధివద్ వజ్రతాలశ్చ ద్విధా సమ్పిష్టకం స్మృతమ్. **330**

సప్తాఙ్గైర్ద్వాదశకలం ద్వాదశాఙ్గైర్దశైవ తు,
నిష్క్రామమాదితః కృత్వా శమ్యాస్త్రిస్రః ప్రయోజయేత్. **331**

తాలత్రయం తతశ్చైవ శమ్యాతాలౌ తతః పరమ్,

**శమ్యా తాలౌ తతః కార్యౌ సన్నిపాతోఽన్త్య ఏవ చ. 332**
**ఓవేణకే తు సప్తాఙ్గే సంపిష్టకమిదం స్మృతమ్.**

**తా.** సన్ధివత్, వజ్రతాలము అని సంపిష్టకం రెండు విధాలు. మొదటిదానిలో పన్నెండు కలల ఏడు అంగాలు, రెండవదానిలో పది కలల పన్నెండు అంగాలు ఉంటాయి. దీనిలో ముందు నిష్క్రామం చేసి తరువాత మూడు శమ్యలు, మూడు తాలాలు, ఒక శమ్య, ఒక తాలం, ఒక శమ్య, ఒక తాలం, పిమ్మట సంనిపాతం ప్రయోగించాలి. ఇది ఓవేణకంలోని ఏడంగాల **సంపిష్టకం.**

**మూ. ద్విశమ్యాతాలయోగేన ద్వాదశాఙ్గేఽపి చేష్యతే. 333**
**పాతా నవైకాదశ వా సంపిష్టకముదాహృతమ్,**
**వజ్రవత్ సంప్రయోక్తవ్యముపవర్తనమేవ చ. 334**

**తా.** దీనికే రెండు శమ్యాలు. ఒక తాలమూ చేరిస్తే అది ఓవేణకంలోని ద్వాదశాంగ సంపిష్టకం అవుతుంది. లేదా సంపిష్టకంలో తొమ్మిది లేదా పదకొండు పాతా లుండ వచ్చును. దీనిలో వజ్రతాలంలో వలెనే ఉపవర్తనం ప్రయోగించాలి.

**మూ. యుక్తా వివధవృత్తాభ్యాం ప్రవేణీ ద్వివిధా స్మృతా,**
**పఞ్చపాణిః ప్రకర్తవ్యః ప్రవేణ్యాం తు యథాక్షరః. 335**
**ద్వికలో వాపి మిశ్రో వా ప్రయోగోఽఙ్గవశానుగః,**
**అన్తే చాస్య ప్రకర్తవ్యం కదాచిదుపవర్తనమ్. 336**
**పఞ్చపాణివిధానేన యథోక్తేనైవ తద్భవేత్,**
**ద్వితీయతాలపాతేన హ్యపపాతశ్చ కీర్త్యతే. 337**
**వజ్రతాలేన కర్తవ్యం క్రమం సంహరణస్య తు,**
**రోవిన్దకే తు షణ్మాత్రాః పాతభాగైశ్చతుష్కలైః. 338**

**తా. ప్రవేణి :–** వివధంతోను, వృత్తంతోను కలిసి ఉండే **'ప్రవేణి'** రెండు విధాలు. ప్రవేణిలో యథాక్షరపంచపాణి ప్రయోగించాలి. ఇది అంగాలను అనుసరించి రెండు కలలతో కూడినదిగా, లేదా మిశ్రరూపంలో ప్రయోగించబడుతుంది. అప్పు డప్పుడు దీని అంతమునందు ఉపవర్తనం ఉంచబడుతుంది. ఈ ఉపవర్తనం యథాక్షరపంచపాణి విధానాన్ని అనుసరించి ఉంటుంది. దీని తరువాత వచ్చే ద్వితీయతాలంమీద జరిగే పాతానికి **'అపపాతం'** అని పేరు. దీని అంతాహరణం వజ్రతాలం ద్వారా చేయబడుతుంది.

**మూ. అర్ధేఽన్తే చైవ మాత్రాణాం పఞ్చానాం పాత ఇష్యతే,**
**తాలః శమ్యా చ తాలశ్చ శమ్యా తాలస్తథైవ చ. 339**
**అన్తే శమ్యా తథా చైవ సర్వాసామపి కీర్తితా,**

**పఞ్చానామపి మాత్రాణాం విధిరేష యథాక్రమమ్. 340**

**చతుర్దశస్తు పఞ్చమ్యాం మాత్రాయాం తాల ఇష్యతే,**
**చతుష్కలా తు తత్తుల్యా షష్ఠీ మద్రకమాత్రయా. 341**

**తా. రోవిందకం :–** రోవిందకంలో – నాలుగు కలల పదభాగాలతో ఆరు మాత్రలుండాలి. ఐదు మాత్రల అర్ధభాగం తరవాత పాత ఉండడం ఇష్టం. దీని పాతాల క్రమం ఇలా ఉంటుంది – తాలం, శమ్య, తాలం, శమ్య, తాలం. దీనిలోని ఐదు మాత్రల క్రమవిధానం ఇదే. ఐదవ మాత్రలో పధ్నాలుగు తాలాలు ఉండాలి. మద్రక గీతాలలో ఆరవ మాత్రలో నాలుగు కలలు ఉంటాయి.

**మూ. తథా చాష్టౌ కలాః కార్యాః ప్రథమాయాముపోహనమ్,**
**తతశ్చైవ ప్రయోక్తవ్యం ద్వికలం ప్రత్యుపోహనమ్. 342**

**పాతాః స్యుః సన్నిపాతాన్తాః వివధైకకయోజితాః,**
**వర్ణానుకరోష్టకలస్త్వన్తే ప్రస్తర ఇష్యతే. 343**

**తా.** ప్రారంభంలో ఎనిమిది కలల ఉపోహనం ఉంటుంది. తరవాత రెండు కలల ప్రత్యుపోహనం ఉంటుంది. సంనిపాత దగ్గరికి వచ్చి పాతాలు పూర్తి అవుతాయి. వివధ – ఏకకాలు దీనితో కలిసి ఉంటాయి. చివర వర్ణాల సంకలనం (అనుకర్షం) ఎనిమిది కలలలో చేయబడుతుంది. రోవిందకంలోని ప్రథమ పాదం పద్ధతి ఇది.

**మూ. తుల్యవర్ణోపవహనో ద్వితీయః పాద ఇష్యతే,**
**శరీరతాలః కర్తవ్యః ప్రస్తారోఽపి విశేషతః. 344**

**ద్వికలేనైవ కర్తవ్యో విశేషాత్ పఞ్చపాణినా,**
**కలా ద్వాదశ నిర్దిష్టం ప్రమాణఞ్చాస్య తత్త్వతః. 345**

**తా.** దీని ద్వితీయపాదం ఉపవహనంలో కూడ ఆ వర్ణాలే ఉండాలి. దీని ప్రస్తారంలో, విశేషించి, దీని స్వరూపంలో ఉన్న క్రమాన్ని అనుసరించి ఉండే తాలాలు ఉంచాలి. దీనిని ద్వికలపంచపాణిద్వారా ప్రయోగించాలి. దీని పూర్తి (కాల) ప్రమాణం పన్నెండు కలలు ఉండాలి.

**మూ. రోవిన్దకశరీరం తు షట్కలోపోహనం స్మృతమ్,**
**వివధం వా ప్రవృత్తం వా తస్యాదౌ పరికీర్త్యతే. 346**

**ఆకారవృత్తమన్యత్ స్యాచ్చతుష్కం త్రికమేవ వా,**
**తస్యోపరి యథేష్టం స్యాదథస్తాదఙ్గయోజనమ్. 347**

**అవిశేషనివృత్తం తు శీర్షకం తు ప్రయోజయేత్,**

యథాక్షరేణ తచ్చైవ కర్తవ్యం పఞ్చపాణినా. **348**

ఆదావేకైకమన్యస్య ప్రవృత్తో నియమో భవేత్,

ఇతి రోవిన్దకం ప్రోక్తం స్యాదుత్తరమతః పదమ్. **349**

**తా.** రోవిందకంలో ఆరు కలల ఉపోహనం చేయబడుతుంది. దీని ప్రారంభంలో వివధం కాని ప్రవృత్తకం కాని ప్రయోగింపబడుతుంది. ఇది నాలుగు లేదా మూడు కలల ఆవాపంతో ప్రారంభం అవుతుంది. దీని తరువాత అంగాల యోజనం (కూర్పు) జరుగుతుంది. దీని శీర్షకం యథాక్షరపంచపాణితో ప్రయోగించబడుతుంది. దీని ప్రారంభంలో ఏకకము, అంతంలో ప్రవృత్తకము ఉంచాలి. ఇదీ రోవిందకస్వరూపం. ఇపుడు నేను ఉత్తరం లక్షణాదులను చెపుతాను.

**మూ.** ఉత్తరం సంప్రవక్ష్యామి యథావిహితలక్షణమ్,

అస్యేదముత్తరస్యాథ ముఖం ప్రతిముఖం భవేత్. **350**

**తా.** ఇప్పుడు నేను ఉత్తరం స్వరూపము, దీని లక్షణాలు విశదీకరిస్తున్నాను – దీనిలో ముఖ – ప్రతిముఖాల ప్రయోగం ఉంటుంది.

**మూ.** ఉల్లోప్యకవదస్యాదౌ మాత్రా చైకా చతుష్కలా,

రోవిన్దకవదాకారం గణమాద్యం ప్రయోజయేత్. **351**

**తా.** ఉల్లోప్యకంలో వలెనే దీనిలో కూడ, ప్రారంభంలో నాలుగు కలల ఒక మాత్ర ఉంటుంది. రోవిందకం వలెనే దీని ప్రయోగం ఆవాపంయొక్క ఒక వర్గం ప్రారంభించే టప్పుడు చెయ్యాలి.

**మూ.** శాఖా షడఙ్గా త్వపరా ద్వాదశాఙ్గా పరా స్మృతా,

షట్పాతా ద్వాదశకలా శాఖా జ్ఞేయా ప్రమాణతః. **352**

తస్యాస్తు ద్వికలస్తాలః శమ్యా చైకకలా భవేత్,

తథా చ ద్వికలస్తాలః శమ్యా చ ద్వికలా తతః. **353**

పునశ్చైకకలస్తాలః సన్నిపాతః కలాత్రయే,

శాఖావత్ ప్రతిశాఖా చ భవేదన్యపదా తు సా. **354**

**తా.** దీనిలో ఆరు మొదలు పన్నెండు మించకుండా అంగా లుంటాయి. దీని శాఖ పన్నెండు కలలలో ఆరు పాతాలతో ఉంటుంది. దీనిలోని పాతాల క్రమం ఇది – రెండు కలల తాలం, ఒక కల శమ్య, రెండు కలల తాలం, రెండు కలల శమ్య, ఒక కల తాలం మూడు కలల సంనిపాతం. దీనిలో శాఖ వలె ప్రతిశాఖ కూడ ఉంటుంది. అది అన్యపదాలతో ఉంటుంది.

**మూ. అవిశేషాన్నివృత్తస్యాప్యస్యాన్తే నియమో భవేత్,**
**శీర్షకం చైవ కర్తవ్యమస్యాన్తే పఞ్చపాణినా. 355**

**తా.** సాధారణంగా – దీని అంతం విషయంలో ఒక విశిష్టనియమం ఉంది – దీని అంతంలో పంచపాణితో శీర్షకం చెయ్యాలి.

**మూ. పఞ్చపాణివిధానేన ప్రతిశాఖా తతః పరమ్,**
**ద్వికలః పఞ్చపాణిస్తు పూర్వపాతైర్యథాక్రమమ్. 356**

**తా.** దీని ప్రతిశాఖ కూడ ద్వికలపంచపాణితో, దీని చివర చెయ్యాలి. ప్రతిశాఖలో వెనుక చెప్పిన క్రమంలో పాతల సమావేశం ఉండాలి.

**మూ. తాలోఽయం దక్షిణే మార్గే సప్తరూపస్య కీర్తితః,**
**య ఏవ దక్షిణే కాలః స వృత్తావపి చేష్యతే. 357**

**తా.** సప్తరూపగీతాలలో ప్రయోగించే దక్షిణమార్గంలోని తాలక్రమం ఇంతవరకు నేను చెప్పాను. దక్షిణమార్గంలో కాలమే వృత్తంలో (వార్తికమార్గంలో) కూడ అంగీకరించ బడింది.

**మూ. చిత్రేణేవ హి సర్వత్ర విశేషో యత్ర నోచ్యతే,**
**అర్ధయోగాదేష ఏవ నృత్తే కాలవిధిర్భవేత్. 358**
**ఉల్లోప్యకోత్తరముఖే హిత్వా యుగ్మం తథైకకమ్,**
**అర్ధయోగస్తు తత్కాలే ద్వికలః సంప్రకీర్త్యతే. 359**

**తా.** చిత్రమార్గంలో కూడ, విశేషనియమం ఏదీ చెప్పని చోట్లలో, ఈ నియమాలే పాటించాలి. అర్ధయోగంవల్ల నృత్తంలోకూడ ఈ కాలవిధానమే వర్తిస్తుంది. అయితే ఉల్లోప్యక – ఉత్తరాల ముఖంలో మాత్రం వర్తించదు. రెండు కలల కాలం 'అర్ధయోగం' అని చెప్పబడింది.

**మూ. చతుష్కలః స్యాద్ ద్వికలో ద్వితీయశ్చ యథాక్షరః,**
**రోవిన్దకోల్లోప్యకయోర్మద్రకోత్తరయోస్తథా. 360**

**తా.** ఇదే విధంగా – రోవిందకంలోను, ఉల్లోప్యంలోను, రుద్రకంలోను, ఉత్తరలోనూ కూడ రెండవ అక్షరం నాలుగు లేదా రెండు కలల కాలంలో ఉండాలి.

**మూ. శరీరేషు విధిర్హ్యేష శేషేషు ప్రకృతిర్భవేత్,**
**ప్రకృతావపి తేషాం స్యాద్ ద్వికలేన చతుష్కలమ్. 361**
**కాలేనైవ భవేద్ వృత్తావర్ధయోగశ్చతుష్కలే,**
**వార్తిశ్చతుష్కలో యోగో దక్షిణే స్యాత్ కదాచన. 362**

**తా.** ఇదే గీతాల శరీరాల (స్వరూపాల) విధానం. మిగిలిన దశలలో ప్రకరీవిధానం అవలంబించాలి. ప్రకరిలో కూడ రెండు కలలతో పాటు నాలుగు కలలు కూడ ప్రయోగించ వచ్చును. వార్తికమార్గదశలో చతుష్కలప్రమాణం ఉంచవచ్చును. వృత్తిమార్గంలో చేసే చతుష్కలయోజనం అప్పుడప్పుడు దక్షిణమార్గంలో కూడ చేయవచ్చును.

**మూ. మద్రకోల్లోప్యకయోశ్చ ముఖోపవహనేషు చ,**
**యో దక్షిణే తాలవిధిర్వృత్తౌ స సముదాహృతః. 363**

**తా.** మద్రక - ఉల్లోప్యకాల ముఖ - ఉపవహనదశలలో దక్షిణమార్గంలో చెప్పిన తాలవిధానం వార్తికమార్గంలో కూడ వర్తిస్తుంది.

**మూ. చిత్రే వ్యస్తే సమస్తే వా తావుభౌ పరికీర్తితౌ,**
**శాఖానివృత్తాదన్యత్ర చిత్రం తూభయమార్గికమ్. 364**

**తా.** చిత్రమార్గంలో - అది స్వతంత్రంగా (ఒక్కటే) ప్రయోగింపబడినా, ఇతర మార్గాలతో కలిపి ప్రయోగింపబడినా, కలావిధానాలు రెండూ అంగీకార్యములే. చిత్ర మార్గంలో అంతాన్ని, ఈ రెండు మార్గాలలోని ఏదో ఒకదాని శాఖావిధానానుసారం ఏర్పరచి దానిని సమాప్తం చెయ్యాలి.

**మూ. ఇతి మార్గత్రయే హ్యేతత్ సప్తరూపం ప్రకీర్తితమ్,**
**ద్వివిధా ప్రకృతిశ్చాస్య కులకం ఛేద్యకం తథా. 365**
**ఏకార్థం కులకం తత్ర పృథక్ ఛేద్యకముచ్యతే.**

**తా.** మూడు మార్గాలలో గానం చేసే ఈ సప్తరూపగీతాలు, కులకము, ఛేద్యకము అను రెండు పద్ధతులలో ఉంటాయి. ఒక అర్థం గల లేదా ఏకవాక్యరూప మైన గీతం **కులకం**; విభిన్నవాక్యాల గీతం **ఛేద్యకం**.

**మూ. నిర్యుక్తం పదనిర్యుక్తమనిర్యుక్తం తథైవ చ,**
**త్రివిధం చైవ విజ్ఞేయం సప్తరూపం ప్రయోక్తృభిః. 366**
**బహిర్గీతాఙ్గశాఖాభిర్యుక్తం నిర్యుక్తమిష్యతే,**
**బహిర్గీతవిహీనం తు పదనిర్యుక్తమిష్యతే. 367**
**బహిర్గీతవిహీనం చాప్యనిర్యుక్తమితి స్మృతమ్. 368**

**తా.** నిర్యుక్తం పదనిర్యుక్తం, అనిర్యుక్తం అని సప్తరూపగీతం మూడు విధాలు. గీత శరీరానికి చెందని బాహ్యాశాఖతో కూడినది **నిర్యుక్తం**. బహిర్గీతతత్త్వంతో ఆంశికంగా సంబంధం ఉన్నది **పదనిర్యుక్తం**. ఏ మాత్రము బాహ్యాశాఖాసంబంధం లేనిది **అనిర్యుక్తం**.

**మూ. ఇత్యేతత్సప్తరూపస్య ప్రకృతేః ద్వివిధం స్మృతమ్,**
**బ్రహ్మోక్తం సప్తరూపం హి సామవేదాద్వినిఃసృతమ్. 369**

**తా.** ఈ విధంగా సప్తరూపగీతానికి చెందిన రెండు విధాల ప్రకృతిని చెప్పాను. ఈ సప్తరూపగీతాన్ని సామవేదం నుండి గ్రహించి బ్రహ్మదేవుడు ఉపదేశించాడు.

**మూ. దేవతారాధనం పుణ్యమనన్తం గీతవాదితమ్,**
**సర్వేషామేవ గీతానామన్తేషు ఛన్దకం స్మృతమ్. 370**

**తా.** గీతము, వాద్యసంగీతమూ కూడ దేవతల ఆరాధన చేయడానికి అత్యుత్తమ మైన సాధనం. అనంతపుణ్యస్వరూప మైనది. అన్ని విధాల గీతాల అంతమునందు ఛందకం (ఛేద్యకం) ప్రయోగించాలి.

**మూ. చతురఙ్గం తతస్త్ర్యఙ్గం నవాఙ్గం యుగ్మమేవ చ,**
**ఋగ్గాథాపాణికానాం చ ప్రమాణానాం తథైవ చ. 371**
**అనేనైవ విధానేన యుగ్మౌజత్వం విభావయేత్.**

**తా.** రెండు, నాలుగు, మూడు లేదా తొమ్మిది చతురస్రతాలాలతో నిర్మితములైన ఋక్కులు, గాథలు, పణికలు వీటి విషయంలో కూడ ఇదే విధానాన్ని అవలంబించాలి. ఈ నియమాన్నే అనుసరించి వాటి విషయంలో చతురస్రం కాని త్ర్యస్రం కాని ఉపయోగించాలి.

**మూ. యో గణః పూర్వముద్దిష్టస్తస్యాదౌ యా కలా భవేత్. 372**
**చతుర్మాత్రాకృతం చైవ కలాం సమవధారయేత్,**
**అష్టాఙ్గా వా షడఙ్గా వా యుగ్మౌజో వా ప్రమాణతః. 373**
**స్తుతియుక్తా తు కర్తవ్యా మాద్రికీ చైవ పాణికా,**
**చతుష్పదా తథైకాఙ్గా ద్వ్యఙ్గా త్ర్యఙ్గా విభావయేత్. 374**

**తా.** వెనుక చెప్పిన గణం ప్రారంభంలో ఒక కల ఉంటుంది. ఈ కల నాలుగు మాత్రల చేత నిర్మింపబడినది. (నాలుగు మాత్రలు ఒక కల). దేవతాస్తుతిలో ఉపయోగించే మాద్రికీ – పాణికీ – చతుష్పదా గీతాలను చతురస్రతాలంలో కాని త్ర్యస్రతాలంలో గాని, ఎనిమిది లేదా ఆరు అంగాలతో నిర్మించాలి. ఈ విధంగా ఒకటి లేదా రెండు మూడు లేదా అంగాలు గల గీతాలను నాలుగు పాదాలతో నిర్మించాలి.

**మూ. అఙ్గైర్వ్యస్తైః సమస్తైర్వా యుగ్మౌజౌ వా ప్రకీర్తితౌ,**
**సప్తరూపస్య తాలోఽయం మయా హి పరికీర్తితః. 375**

**తా.** ఈ అంగాలకు, చతురస్ర – త్ర్యస్రతాలాలను, వేరు వేరుగా గాని కలిపిగాని ఉపయోగించాలి. ఇవే సప్తరూపగీతాలవిషయంలో నేను విధించిన తాలాలు.

**మూ. చతురస్రా తథా త్ర్యస్రా ధ్రువా జ్ఞేయా ప్రయోక్తృభిః,**
**తాసాం తాలవిధానం తు షట్ప్రమాణం సమాసతః. 376**

**తా.** చతురస్ర – త్ర్యస్రలు 'ధ్రువ' అని ప్రయోగజ్ఞులు తెలుసుకోవాలి. వాటి తాలవిధానం, సంక్షేపంగా, ఆరు విధా లైనది.

**మూ. అడ్డితా చోత్థితా చైవ చతురస్రా ప్రమాణతః,**
**చతుర్భిః సన్నిపాతైశ్చ జ్ఞేయా చఞ్చత్పుటా స్మృతా. 377**

**తా.** వీటిలో 'అడ్డితా' 'ఉత్థితా' తాలాలు చతురస్రాలు. వీటి చంచత్పుటలో నాలుగు సంనిపాతా లుంటాయి.

**మూ. సుప్రతిష్ఠావసానానాం సన్నిపాతేఽన్త ఇష్యతే,**
**అపకృష్టా స్మృతా త్ర్యస్రా తథా చాపపుటాశ్రితా. 378**
**చతుర్భిః సంనిపాతైశ్చ యుక్తా పాదాన్తసంశ్రితైః,**
**తథాకాశగ్రహస్తాసాం తావచ్చఞ్చత్పుటః స్మృతః. 379**

**తా.** సుప్రతిష్ఠదగ్గర సమాప్త మయే ఈ ధ్రువల అంతమునందు సన్నిపాతం ఉంచాలి. అపకృష్టాధ్రువ త్ర్యస్ర – చాపపుటతాలాలచేత నిర్మింపబడుతుంది. దీని పాదం అన్తమునందు నాలుగు సంనిపాతా లుంటాయి. వీటి అన్నింటి ఆకాశగ్రహం చంచత్పుటం.

**మూ. విలమ్బితా చ త్ర్యస్రా చ సా ఏతద్ద్వితయాన్వితా,**
**నిష్క్రామాదిప్రయుక్తేన యోజ్యా చాపపుటేన తు. 380**

**తా.** విలమ్బితధ్రువ త్ర్యస్ర; ఈ రెండితో కూడి ఉంటుంది – ప్రారంభంలో నిష్క్రామంతో ప్రయోగించిన చాపపుటంతో దీనిని (ఈ విలంబితధ్రువను) కలపాలి.

**మూ. పాదాన్తే సన్నిపాతస్య ద్విపాదా యుగ్మసంజ్ఞితా,**
**చఞ్చత్పుటేన సంయోజ్యా ద్వికలేన యథావిధి,**
**శీర్షకాణి చ యోజ్యాని ద్వివిధం పఞ్చపాణినా. 381**

**తా.** పాదాంతంలో ఉన్న సనిపాత సరిపాదాలకు (రెండునాలుగు పాదాలకు) ద్వికలచంచత్పుటతాలం ఉపయోగించి శీర్షకాలను పంచపాణితాలంతో, రెండు వేరు వేరు పద్ధతులలో ఏర్పరచాలి.

**మూ. చతుర్భిః సంనిపాతైశ్చ సమ్యక్ పాదాన్తసంస్థితైః,**
**పాదాన్తస్యాన్తతాలస్య ద్విమాత్రాన్తం ప్రయోజయేత్. 382**

**తా.** పాదాంతంలో నాలుగు సన్నిపాతాలతో పాటు పాదాంతంలోని తాలానికి రెండు మాత్రలు చేర్చాలి.

**మూ. మాత్రాద్వయం తు కాలే తు ఝుఙ్కారైః సమతాం నయేత్,**
**కించిద్వినాతిరిక్తాయాం మాత్రాభిర్యత్ర చేత్కలా. 383**

**స్యాత్సమత్వం నయేత్తాం తు క్షయవృద్ధ్యా ప్రయోగవిత్,**
**వర్ణప్రకర్షేణ చ స్యాత్ తాలానామపి వర్ధనమ్. 384**

**స్యాజ్ఝఙ్కారో నియుక్తానామక్షరే చ కలాన్తరమ్,**
**కలాతాలప్రమాణేన యత్ స్యాచ్ఛుష్కకకుట్టనమ్. 385**

**తా.** ఈ రెండు మాత్రల సమయంతో ఝుంకారం సమంగా ఉండాలి. ధ్రువలో ఏదైన ఒక కల అధికత్వం ఏమీ లేకుండా ఉన్నట్లయితే, ప్రయోగనిపుణుడు మాత్రలను పెంచడంచేత గాని తగ్గించడంచేత గాని సమానమైన మాత్రలు కలదానిని చెయ్యాలి. వర్ణాలు పెంచడంతో పాటు తాలాలను కూడ పెంచుతూండాలి. నిర్యుక్తగీతాలలోని అక్షరాలలో చేర్చిన కొత్త కల, 'ఝుంకారం' కావాలి. ఇక్కడ కలా – తాలాల మధ్య సంబంధం ఉండడంచేత దీనికి **'శుష్కకుట్టనం'** అని పేరు.

**వి.** ఝుంకారం అంటే ఏమిటో నా.శా.లో. ఎక్కడా చెప్పలేదు (మన్‌మోహన్‌ఘోష్).

**మూ. తథా ధ్రువాణాం సర్వేషు కలాతాలౌ ప్రయోజయేత్,**
**భఙ్గతాలశ్చ కర్తవ్యో నత్కుటానాం యథావిధి. 386**

**కలాపాతేన సంయుక్తస్తాలశ్చఞ్చత్పుటో భవేత్,**
**ఏష ఏవ పునస్త్ర్యస్రః ఖఞ్జకే తాల ఇష్యతే. 387**

**తా.** ధ్రువ లన్నింటిలోనూ వాటికి తగిన కలలు తాలాలు ప్రయోగించాలి. నత్కుటక దశలో తప్పక భంగతాలం కూర్చాలి. దీనిలో కలా – పాతాలతో కూడ చంచత్పుటతాలం ప్రయోగింపబడుతుంది. ఖంజకధ్రువలో ఈ తాలం త్ర్యస్రతాలం అవుతుంది.

**మూ. పునఃప్రకృతయో హ్యేష భఙ్గస్త్వాక్రీడితో భవేత్,**
**యాన్యఙ్గాని ప్రయుక్తాని ధ్రువాస్వథ భహన్తి హి. 388**

**తాన్యష్టకలయోగేన యోజయేత్ షట్కలేన వా,**
**ఏవమేష మయా తాలో ధ్రువాణాం పరికీర్తితః. 389**

**తా.** దీని ఈ అంగానికి ఆక్రీడితం అని పేరు. ధ్రువలలోని అంగాలను ఎనిమిది లేదు ఆరు కలలలో ప్రయోగించాలి. ఈ విధంగా నేను మీకు ధ్రువల తాలాలను గూర్చి చెప్పాను.

**మూ. చతుష్పదావసానే తు సమ్ప్రవక్ష్యామి లక్షణమ్,**
**యద్దేవ్యా సుకుమారాఢ్యం శృఙ్గారరససంశ్రయమ్. 390**
**నృత్తం వికల్పితం తస్య తాలలక్షణముచ్యతే.**

**తా.** ధ్రువాతాలాలకి సంబంధించిన మిగిలిన లక్షణాలు చతుష్పదావివరణం తరవాత చెపుతాను. ఇప్పుడు – సుకుమారప్రయోగంతో నిండిన, శృంగారరసాశ్రయమైన, ఏ నృత్తం దేవి సృజించిందో దాని తాలం లక్షణం చెపుతాను.

**మూ. నారీప్రయోజ్యం తద్ జ్ఞేయమాశ్రితం తు చతుష్పదమ్. 391**
**త్ర్యస్రా వా చతురస్రా వా ద్వివిధా చ చతుష్పదా.**

**తా.** చతుష్పదాగీతం స్త్రీలు ప్రయోగించాలి. ఇది 'త్ర్యస్ర' 'చతురస్ర' అని రెండు విధాలు.

**మూ. ఏకస్యా వాబహూనాం వా ద్వయోర్వా వాక్యయోజనాత్. 392**
**తథా శృఙ్గారభూయిష్ఠా త్రివిధా స్యాచ్చతుష్పదా,**
**ప్రవృత్తసంజ్ఞా విజ్ఞేయా స్థితసంజ్ఞాశ్రయా తథా. 393**
**స్థితప్రవృత్తసంజ్ఞా చ త్రివిధా స్యాత్ పునశ్చ సా.**

**తా.** ఈ చతుష్పదలో ఒక పాత్రకు, రెండు పాత్రలకు లేదా అనేకపాత్రలకు సంబంధించిన వాక్యాల యోజనం ఉంటుంది. ఇట్టి మూడు విధాలు గల ఈ చతుష్పద శృంగారరసప్రధానంగా ఉంటుంది. దీనిలో పై భేదాలే కాక – స్థిత, ప్రవృత్త, స్థిత. ప్రవృత్త అను ఇంకా మూడు విధాలు కూడ ఉంటాయి.

**మూ. నిష్క్రామశ్చైవ శమ్యా చ తాలశమ్యా తథైవ చ. 394**
**తథోత్తమశ్చ నిష్క్రామః సన్నిపాతస్తథాఽన్తిమః,**
**అష్టావింశతివికల్పా బుధైర్జ్ఞేయా చతుష్పదా. 395**
**తస్యా వికల్పాన్ వక్ష్యామి యథావదనుపూర్వశః.**

**తా.** దీని తాలక్రమం ఇది – నిష్క్రామం, శమ్య, తాలం, శమ్య, నిష్క్రామం, సన్నిపాతం మీద సమాప్తి. చతుష్పదలో ఇరవైఎనిమిది భేదా లుంటాయి. క్రమంగా వాటి భేదాలు విశదీకరిస్తాను.

**మూ. ప్రవృత్తాఖ్యా ద్రుతలయా స్థితాఖ్యా చ విలమ్బితా. 396**
**స్థితప్రవృత్తసంజ్ఞా చ జ్ఞేయా మధ్యలయాశ్రితా,**
**జ్ఞేయశ్చఞ్చత్పుటస్తస్య తథా చాపపుటః పునః. 397**
**ద్వికలేన విధానేన తస్య పాతవిధిః స్మృతః.**

**తా.** 'ప్రవృత్త' చతుష్పద – ద్రుతలయలోను, 'స్థిత' చతుష్పద – విలంబిత లయలోను, 'స్థితప్రవృత్త' చతుష్పద మధ్యలయలోను ఉంటుంది. దీనిలో చంచత్పుట తాలం గాని, చాపపుటతాలం కాని ఉంటుంది. దీనిలోని పాతలు ద్వికలాలు లేదా రెట్టింపు కల లున్నవి.

**మూ. బహ్వక్షరా చ విపులా మాగధీ చార్ధమాగధీ. 398**
**సమాక్షరపదా చైవ తథా చ విషమాక్షరా,**
**ఆద్యన్త్యాపహరణా విజ్ఞేయా చాప్యనీకినీ. 399**
**అవసానాపహరణా అన్తాపహరణా తథా,**
**అభ్యన్తరాపహరణా తథా చైవార్ధనత్కుటా. 400**
**అర్ధఖఞ్జా చ మిశ్రా చ తథా చైవాథ శీర్షకా,**
**ఏకావసానా విజ్ఞేయా తథా చ నియతాక్షరా. 401**
**అర్ధప్రవృత్తా ఏతాసాం లక్షణం శ్రూయతామిదమ్.**

**తా. చతుష్పదలోని భేదాలు ఇవి :–** బహ్వక్షర, విపుల, మాగధి, అర్ధమాగధి, సమాక్షరపద, విషమాక్షర, ఆద్యంత్యాపహరణ, అనీకినీ, అవసానాపహరణ, అభ్యంతరాపహరణ, అర్ధనత్కుట, అర్ధఖంజ, మిశ్ర, శీర్షక, ఏకావసాన, నియతాక్షర, అర్ధప్రవృత్త, ఇపుడు వరుసగా వీటి లక్షణాలు చెపుతాను.

**మూ. వ్యక్తవాగ్యా లఘుప్రాయా లఘ్వక్షరసమన్వితా. 402**
**ద్రుతవాక్యా ద్రుతలయా జ్ఞేయా బహ్వక్షరేతి సా.**

**తా. 1. బహ్వక్షర :–** స్పష్టమైన అక్షరాలచేత అభివ్యక్తంచేయబడుతుంది; లఘువులు అధికంగా ఉంటాయి; లఘ్వక్షరాలతో కూర్చబడి ఉంటుంది. వాక్యోచ్చారణం ద్రుతంగా ఉంటుంది. లయ కూడ ద్రుతం. అట్టి గీతం **బహ్వక్షరచతుష్పద.**

**మూ. గురుప్లుతాక్షరప్రాయా స్వల్పవాక్యా యదా తథా. 403**
**త్రిలయా విపులాఖ్యా చ సుకుమారవిధౌ స్మృతా.**

**తా. 2. విపుల :–** గురువులు ప్లుతాలు అధికంగా ఉంటాయి. వాక్యాలు చిన్నవిగా, స్వల్పంగా ఉంటాయి. మూడు లఘువుల ప్రయోగమూ ఉంటుంది. అది **విపులాచతుష్పద.** దీని ప్రయోగం సుకుమారనృత్యాలలో ఉంటుంది.

**మూ. త్రిలయా త్రియతిశ్చైవ త్రిప్రకారాక్షరాన్వితా. 404**
**ఏకవింశతితాలా చ మాగధీ సంప్రకీర్తితా.**

**తా. 3. మాగధి :–** మూడు విధా లైన లఘు – గురు – ప్లుతాక్షరాలతో నిబద్ధమై

మూడు లయలూ, మూడు యతులూ కూడ ఉన్న, ఇరవైయొక్క తాలాలు గల చతుష్పద **మాగధీచతుష్పద**.

**మూ. గురులఘ్వక్షరకృతా ద్రుతమధ్యలయాన్వితా. 405**

**మాగధ్యేవార్ధతాలేన యుక్తా స్యాదర్ధమాగధీ.**

**తా. 4. అర్ధమాగధి :–** గురు – లఘ్వక్షరాలతో నిబద్ధమై, ద్రుతమధ్యలయాలతోను అర్ధతాలంతోను కూడిన మాగధియే అర్ధమాగధి అవుతుంది.

**మూ. గురులాఘవమాత్రాభిః పదవర్ణైస్తథైవ చ. 406**

**లయతాలైః సమైశ్చైవ సమాక్షరపదా స్మృతా.**

**తా. 5. సమాక్షరపద :–** దీని పాదాలలో గురు – లఘుమాత్రలు పదాలు వర్ణాలు, లయ, తాలము ఇవన్నీ సమంగా ఉంటాయి. ఇది **సమాక్షరపదచతుష్పద**.

**మూ. అక్షరైర్విషమాయాం తు మాత్రాపాదైస్తథైవ చ. 407**

**లయతాలైరనియతా సా జ్ఞేయా విషమాక్షరా.**

**తా. 6. విషమాక్షర :–** మాత్రాపాదాలలోని అక్షరాలు, లయలు, తాలాలు విషమంగా ఉన్న (వేరువేరుగా ఉన్న) గీతం **విషమాక్షరచతుష్పద**.

**మూ. యః స్యాత్త్వన్త్యః సంనిపాతః సానుస్వారోఽన్త్య ఇష్యతే. 408**

**ఆద్యాన్త్యాపహరణా చ సానుస్వారకృతా తథా.**

**తా. 7. ఆద్యన్త్యాపహరణ :–** (అర్థం అస్పష్టం) అంత్యసంనిపాతాన్ని అనుస్వారాన్ని చేర్చవలసి ఉన్న గీతం **ఆద్యంతాపహరణ చతుష్పద**. ఇది అనుస్వారచే చేయబడినది (మ.ఘోష్).

**మూ. మధ్యాద్యన్తైః సన్నిపాతైరనుస్వారకృతాక్షరైః. 409**

**శేషైరనియతా పాదైర్విజ్ఞేయా సా త్వనీకినీ.**

**తా. 8. అనీకిని :–** మధ్యయందు ఆదియందు అంతమునందు అనుస్వారతో కూడిన అక్షరాలుండి, ఇతరపాదాలలో అలాంటి నియమం ఏదీ లేని గీతం **అనీకినీ చతుష్పద**.

**మూ. అవసానాపరహణా నిత్యం జ్ఞేయామితాక్షరా. 410**

**అనుస్వారద్రుతా చైవమన్తాపహరణా స్మృతా.**

**తా. 9. అవసానాపహరణ : 10. అన్తాపహరణ :–** అక్షరసంఖ్య విషయంలో

నియమంలేనిది **అవసానాపహరణచతుష్పద**. అనుస్వారతో పాటు ద్రుతలయవిధానం కూడ ఉన్నది **అన్తాపహరణచతుష్పద.**

**మూ. ద్వితీయా సన్నిపాతేన మధ్యేక్షరసమన్వితా 411**
**అభ్యన్తరాపహరణా సానుస్వారేవ సా స్మృతా.**

**తా. 11. అభ్యన్తరాపహరణ :–** రెండవ కల సంనిపాతంలో ఉండగా మధ్యభాగంలో అక్షరనివేశం ఉన్న, అనుస్వారయుక్తమైన గీతం **అభ్యంతరాపహరణచతుష్పద.**

**మూ. అర్ధేన భిద్యతే యా తు విజ్ఞేయా సార్ధనత్కుటా. 412**
**త్ర్యస్రా హ్యనేన విధినా హ్యర్ధఖఞ్జైవ కీర్త్యతే.**

**తా. 12. అర్ధనత్కుట. 13. అర్ధఖంజ :–** సగంభాగంలో భిన్నం అయే గీతం **అర్ధనత్కుటచతుష్పద.** దానిని త్ర్యస్రతాలానుసారం ఉంచినప్పుడు అది **అర్ధఖంజచతుష్పద.**

**మూ. ఖఞ్జనత్కుటకాభ్యాం తు మిశ్రభావో యదా భవేత్. 413**
**త్ర్యస్రా వా చతురస్రా వా తదా మిశ్రేతి కీర్త్యతే.**

**తా. 14. మిశ్రా :–** ఖంజ – నత్కుటములు మిశ్రితములై ఉండగా త్ర్యస్ర – చతురస్రతాలాలలో గానం చేసే గీతం **మిశ్రచతుష్పద.**

**మూ. ఉపక్షేపేణ యస్యాస్తు స ఏవార్ధః సమాప్యతే. 414**
**శీర్షకం సా తు విజ్ఞేయా శీర్షకేణ విభూషితా.**

**తా. 15. శీర్షక :–** అర్ధభాగంలో అకస్మాత్తుగా పూర్తి అయిపోయే గీతం, దానికి శీర్షకం ఉన్నట్లయితే, అది **శీర్షకచతుష్పద.**

**మూ. ఏకపాదావసానస్తు యస్య స్యాదర్ధవర్ణతః. 415**
**ఏకావసానా నిపుణైః సా జ్ఞేయా తు చతుష్పదా,**
**పూర్వపాదేన తస్య స్యాత్ సర్వత్ర గురులాఘవమ్. 416**

**తా. 16. ఏకావసాన :–** ఒక పాదం అర్ధమాత్రావర్ణాలతో పూర్తి అయిపోయే గీతం **ఏకావసానచతుష్పద.** దీని పూర్వపాదంలో గురులఘ్వక్షరా లుంటాయి.

**మూ. పాదే పాదే తు విజ్ఞేయా శీర్షకేణ విభూషితా,**
**ఏకపాదావసానే చ సా జ్ఞేయా నియతాక్షరా. 416**

**తా. 17. నియతాక్షర :–** ఏకావసానగీతంలోని ప్రతీ పాదంలోను శీర్షకం. ఉంటే అది **నియతాక్షరచతుష్పద.**

**మూ. యస్యాః స్థితం ప్రవృత్తం వా భవత్యర్ధనివేశితమ్,**
**అర్ధప్రవృత్తా సా తు స్యాదుభాభ్యామపి వా కృతా. 417**
**నిష్క్రామశ్చైవ శమ్యా చ తాలః శమ్యా తథైవ చ,**
**ఆవాపః సన్నిపాతశ్చ షడస్య గ్రాహకాః స్మృతాః. 418**

**తా. 18. అర్ధప్రవృత్తా :–** అర్ధభాగంలో స్థితము, మరొక అర్ధభాగంలో ప్రవృత్తమూ ఉన్న గీతం **అర్ధప్రవృత్తచతుష్పద.** దీని తాలక్రమం – నిష్క్రామం, శమ్య, తాలం, శమ్య, ఆవాపం, సంనిపాతం. ఈ ఆరు దీని గ్రాహకాలు.

**మూ. ఉపోహనం తు త్రివిధం సుకుమారే ప్రకీర్తితమ్,**
**ద్వ్యవరం త్రిపరం తస్య కలాభిః ప్రత్యుపోహనమ్. 419**
**ద్వికలాభ్యాం చాన్తకలం సన్నిపాతపరం స్మృతమ్. 420**

**తా.** సుకుమారనృత్తంలో మూడు విధా లైన ఉపోహనం చేయబడుతుంది. ప్రత్యుపోహనంలో కూడ కనీసం రెండు కలలు, ఉంటుంది; మూడు కలలు మించదు. దీని చివర కల ద్వికల అవుతుంది. చివర సంనిపాతంలో ముగుస్తుంది.

**మూ. సన్నిపాతాపహరణా ఆదౌ మధ్యేఽన్తతోఽపి వా,**
**వాక్యద్వయాభినిష్పన్నా నానావాక్యాపి సా స్మృతా. 421**

**తా.** ఈ గీతం మొదట, మధ్య, లేదా చివరి భాగంలోను సంనిపాతప్రహరణం ఉంటుంది. ఇది రెండు లేదా అంతకంటె అధికమైన వాక్యాలతో పూర్తి అవుతుంది.

**మూ. ఏకపాదా ద్విపాదా వా త్రిపాదా చ ప్రకీర్త్యతే,**
**చతుష్పదాపి వా భూత్వా నాతః పదమిహేష్యతే. 422**

**తా.** ఇది ఒక పాదంతో, లేదా రెండు పాదాలతో లేదా మూడు పాదాలతో లేదా నాలుగు పాదాలతో నిర్మింపబడుతుంది. అంతకు మించి పాదా లుండకూడదు.

**మూ. కృత్వా తు పాదబహులం న శోభాం జనయిష్యతి,**
**వర్ణస్య ప్రకృతిం హ్యన్యదఙ్గవ్యక్తిం నిరస్యతి. 423**

**తా.** ఇంత కంటె అధికమైన పాదాలతో నిర్మిస్తే అది శోభను చెడగొడుతుంది. వర్ణాల స్పష్టత్వానికి అంగాల అభివ్యక్తికి విఘాతం కలుగుతుంది.

**మూ. తస్మాత్ స్థితా స్యాద్ ద్విపదా ఏకేనైవ పదా స్మృతా,**
**చతుష్పదా ప్రవృత్తా తు సమ్యక్ ప్రోక్తా ప్రయోక్తృభిః. 424**

**తా.** అందుచేత 'స్థిత'ను ఎల్లప్పుడు ఒక్క పాదంతోను రెండుపాదాలతోను నిర్మించాలి. 'ప్రవృత్త'యైతే నాలుగు పాదాలతో ఉండాలి.

**మూ. తత్రైకరూపైకపదా సా హి పాదపాతా స్మృతా,**
**ద్వాత్రింశత్పరమా సా హి సన్నిపాతపదా భవేత్. 425**

**తా.** దీనిలో పాదపాతాలు ఒకే విధంగా ఒకే పాదంతో ఉంటాయి. దీని కలలు ఇరవైరెండుకు మించి ఉండవు. దీని పాదంలో సన్నిపాతం ఉంటుంది.

**మూ. ఆభ్యాం మధ్యప్రమాణే తు త్రిపాదః పరికీర్త్యతే,**
**సన్నిపాతప్రమాణేన జ్ఞేయో మధ్యలయస్తథా. 426**

**తా.** దీని ప్రమాణంలో మూడు పాదా లుంటాయి. సంనిపాతప్రమాణాన్ని అనుసరించి ఇది మధ్యలయం అయి ఉంటుంది.

**మూ. లాస్యమిత్యేవ యత్పూర్వం మయా వః పరికీర్తితమ్,**
**లక్షణం తస్య వక్ష్యామి ప్రయోగం చ యథాక్రమమ్. 427**

**తా. లాస్యం :–** నేను వెనుక లాస్యం అని ఒకదాని పేరు చెప్పాను కదా! ఇపుడు దాని లక్షణాన్ని ప్రయోగవిధానాన్నీ యథాక్రమంగా చెపుతాను.

**మూ. లాసనాల్లాస్యమిత్యుక్తం స్త్రీపుమ్భావసమాశ్రయమ్,**
**భాణవచ్చైకహార్యం స్యాదూహ్యవస్తు చ తద్భవేత్. 428**

**తా.** శోభాయుక్తమై ఉత్తేజకంగా ఉండడంచేత ఇది లాస్యం (**"లసయతి లేదా లాసయతి ఇతి లాస్యమ్"** అని విగ్రహం) అని చెప్పబడుతున్నది. ఇది స్త్రీపురుషుల పరస్పరాకర్షణకు సంబంధించినది. ఇది, భాణం వలెనే, ఒక వ్యక్తిచేత అభినయించ బడుతుంది; ప్రదర్శించబడుతుంది. దీనిలోని వస్తువు ఊహ్యం, కల్పితం, అయి ఉంటుంది.

**మూ. ఏకార్థం పృథగర్థం వా తదఙ్గేషు ప్రకీర్తితమ్,**
**అఙ్గాని దశ చైవాస్య తేషాం వక్ష్యామి లక్షణమ్. 429**

**తా.** దీనిలోని వస్తువు ఒకే విషయానికి సంబంధించి గాని అనేకవిషయాలకు సంబంధించి గాని ఉండవచ్చు. ఇది వివిధ అంగాలలో విభక్తమై ఉంటుంది. దీని అంగాలు పది. వాటి లక్షణం చెపుతాను.

**మూ. గేయపదం స్థితపాఠ్యమాసీనం పుష్పగణ్డికా,**
**ప్రచ్ఛేదకస్త్రిమూఢం చ సైన్ధవాఖ్యం ద్విమూఢకమ్. 430**
**ఉత్తమోత్తమకం చైవ విచిత్రపదమేవ చ,**
**ఉక్తప్రత్యుక్తభావం చ లాస్యాఙ్గాని ప్రకీర్తితాః. 431**
**లాస్యే దశవిధం హ్యేతదఙ్గనిర్దేశలక్షణమ్.**

**తా. లాస్యాంగాలు :–** గేయపదం, స్థితపాఠ్యం, ఆసీనం, పుష్పగండిక, ప్రచ్ఛేదకం, త్రిమూఢకం, సైంధవకం, ద్విమూఢకం, ఉత్తమోత్తమకం, విచిత్రపదం, ఉక్తప్రత్యుక్తకం, భావితం (భావం) ఈ విధంగా లాస్యంలో పది అంగాలు చెప్పబడ్డాయి.

**మూ. ఆసీనపాఠ్యం యోజ్యం స్యాత్ ప్రయత్నాదాసనస్థయా. 432**
**స్థితపాఠ్యం పునశ్చైవ భౌమీచారీభిరన్వితమ్,**
**నృత్తకాలే చ వాద్యే చ గ్రహమోక్షే తథైవ చ. 433**
**గీతాఙ్గానాం విధిర్యః స్యాత్ స లాస్యే ప్రాయశః స్మృతః.**

**తా. ఆసీనపాఠ్యం** అను అంగాన్ని ఆసనంమీద కూర్చుండి ప్రయత్నపూర్వకంగా ప్రయోగించాలి. స్థితపాఠ్యా న్నైతే 'భౌమీచారీల'తో కూర్చి ప్రయోగించాలి. నృత్త సమయంలోను, వాద్యసమయంలోను, గీతి ప్రారంభంలోను, గీతసమాప్తియందు ఏ గీతాంగాలు విధింపబడ్డాయో అవి చాలవరకు లాస్యంలో ప్రయోగించవచ్చును.

**మూ. అఙ్గాన్యేతాని లాస్యే స్యుర్దశోక్తాని సమాసతః. 434**
**ఏతేషాం చైవ వక్ష్యామి ప్రయోగం లక్షణం తథా.**

**తా.** పది లాస్యాంగాలు సంక్షిప్తంగా (నామమాత్రనిర్దేశం ద్వారా) చెప్పబడ్డాయి. వీటి ప్రయోగం ఎలా చెయ్యాలో, అదీ, వీటి లక్షణాలూ చెపుతాను.

**మూ. (తత్ర గేయపదం తావత్ ప్రథమం పరికీర్త్యతే)**
**స్థాపితే భాణ్డవిన్యాసే పటేచైవాపకర్షితే. 435**
**బ్రహ్మణః పుష్పవర్షే తు చాసనే పరికల్పితే,**
**మార్జితేషు మృదఙ్గేషు ప్రయుక్తే చ త్రిసామ్ని తు. 436**
**ప్రాక్ శుష్కపారితం కార్యం తత్ త్రివేణుప్రయోజితమ్,**
**మార్గాసారితతాలేన తతశ్చాసారితం బుధైః. 437**

**తా. 1. గేయపదం :–** వాటిలో, గేయపదాన్ని గూర్చి ముందుగా చెప్పుచున్నాను–

వాద్యాలను వాటి వాటి స్థానాలలో ఉంచిన తరువాత తెర లేపాలి. రంగమధ్యంలో ఉన్న బ్రహ్మపీఠం మీద పుష్పోపహారం జరిపిన పిమ్మట, వాద్యవాదకులు తమ తమ నిశ్చితస్థానాలలో కూర్చోవాలి. మృదంగాల మార్జనం, త్రిసామగానం కూడ పూర్తి అయిన పిమ్మట మూడు వేణువులమీద శుష్కాసారితం జరిపించాలి. తరవాత మార్గాసారితంలో చేయవలసిన తాలంతో ఆసారితం చెయ్యాలి.

**మూ. పరివృత్తైస్త్రిభిర్యుక్తమతశ్చోపోహనం భవేత్,**
**త్ర్యస్రేణ ద్వికలేన స్యాత్తతశ్చ పరిధానకమ్. 438**

**ప్రయోక్తవ్యం ప్రయోగజ్ఞైః పరివర్తాత్మకం తథా,**
**పరివర్తే తథైవాస్య పుంవాక్యం ప్రాక్ సమాచరేత్. 439**

**త్రివాక్యః పురుషోఽత్ర స్యాత్ చతుర్వాక్యాఙ్గనా స్మృతా,**
**కార్యం తథా నిర్వహణం ప్రాప్త్యర్థం పరిధానకే. 440**

**ఇత్యేతత్ ప్రథమం త్వఙ్గం లాస్యే గేయపదం స్మృతమ్.**

**తా.** తరువాత త్ర్యస్రతాలంలో ద్వికలమైన ఉపోహనము, దాని తరవాత మూడు పరివర్తాలు చెయ్యాలి. ఇది పూర్వరంగాంగాలతో సంబంధించిన విధానం. తరువాత పరివృత్తితో కూడ పరిధానకం ప్రయోగించాలి. పరివర్తం జరిగే టప్పుడు ముందుగా పురుషవాక్యం పలకాలి. మూడు వాక్యాలసముదాయం 'పురుషుడు'; నాలుగు వాక్యాల సముదాయం 'అంగన'. ఇది నిర్వహణంలో పరిధానకం పొందడానికై చేయబడుతుంది. లాస్యంలోని ఈ ప్రథమాంగం **'గేయపదం'**.

**మూ. స్థితపాఠ్యస్య వక్ష్యామి విధానం చాప్యతః పరమ్. 441**
**వృత్తమేకమథ ద్వే వా యోజయేత్ పఞ్చపాణినా,**
**తతః పరం చ ద్వే భూయః ఖఞ్జకే సంప్రయోజయేత్. 442**

**చఞ్చత్పుటేన కర్తవ్యా ద్వికలేన తతః పరమ్,**
**యథాక్షరేణ చాయుక్తా సన్నిపాతైస్తథాష్టభిః. 443**

**అవసానే తు యోక్తవ్యం త్వరితం పఞ్చపాణినా,**
**ద్వికలేనేతికర్తవ్యం స్థితపాఠ్యం ప్రయోక్తృభిః. 444**

**తా. స్థితపాఠ్యం :–** ఇప్పుడు నేను స్థితపాఠ్యం చేయవలసిన విధానం చెపుతాను – దీనిలో – ఒకటి – రెండు వృత్తాలను పంచపాణితాలంలో గానం చెయ్యాలి. రెండు కలల చంచత్పుటతాలంలో రెండు ఖంజకాలు ప్రయోగించాలి. యథాక్షరవర్ణానికి చెందిన ఈ తాలంలో ఎనిమిది సంనిపాత లుంచాలి. దీని సమాప్తి ద్వికలచంచత్పుటతాలంలో, ద్రుతలయతో జరుగుతుంది.

**మూ. ఉపోహ్య తాలం త్ర్యస్రం చ బృహత్పాదపదైః సమైః,**
**ఆసీనపాఠ్యం యుఞ్జీత సర్వైర్భావైస్తు పౌరుషైః. 445**

**తా. ఆసీనపాఠ్యం : –** త్ర్యస్రతాలం గ్రహించి పెద్దపాదా లున్న వృత్తాన్ని గానం చేస్తూ పూర్తిగా పురుషభావాలు ప్రకటిస్తూ ఆసీనపాఠ్యం ప్రయోగించాలి.

**మూ. గేయం చతుర్భిః పాదైస్తు సమైరర్థవశానుగైః,**
**ఆసీనపాఠ్యం కర్తవ్యం విధివత్ పఞ్చపాణినా. 446**

**తా.** అర్థానుసారం నడిచే నాలుగు సమపాదాలతో నిర్మించిన గీతాన్ని పంచ పాణితాలంలో పాడుతూ, గీతంలోని భావాలు అభివ్యక్తం చేస్తూ ఆసీనపాఠ్యం ప్రయోగించాలి.

**మూ. ఆసీనపాఠ్యే కర్తవ్యః ప్రయోగః శీర్షకస్య తు,**
**అష్టభిః సంనిపాతైశ్చ యుక్తస్తాలాదినైవ తు. 447**

**తా.** ఆసీనపాఠ్యంలో ఎనిమిది సంనిపాతాలతో, తాలాలతో శీర్షకప్రయోగం చెయ్యాలి.

**మూ. యథాక్షరప్రవృత్తేన విధివత్ పఞ్చపాణినా,**
**ద్వితీయపరివర్తస్య సంనిపాతే తథాష్టమే. 448**
**అతీతే యుగ్మతాలేన శ్లోకః కార్యస్తతః పదమ్,**
**ఆసీనపాఠ్యే యద్వాద్యమవనద్ధకృతం భవేత్. 449**
**ఆసీనే గాత్రసంచారైస్తత్ర సామ్యం ప్రయోజయేత్.**

**తా.** దీనిని యథాక్షరపంచపాణితాలంతో నడిపించాలి. దీని రెండవ పరివర్తనంలో ఎనిమిదవ సన్నిపాతం పూర్తి అయిన తరువాత, చతురస్రతాలంలో ఒక శ్లోకం లేదా పదం గానం చెయ్యాలి. ఆసీనపాఠ్యంలో జరిగే వాద్యవాదనం దీనిలోని శరీరాంగాలు సంచారాలతో (చేష్టలతో) సామ్యం ఉండేటట్లు చెయ్యాలి.

**మూ. అష్టాదశ ద్వాదశ వా పదాని చ తతః పునః. 450**
**కుర్యాదుత్తరతాలేన తతో నిర్వహణం బుధైః,**
**ఏతదాసీనపాఠ్యస్య విధానం పరికీర్తితమ్. 451**

**తా.** అప్పుడు పద్దెనిమిది లేదా పన్నెండు పదాల గానం చెయ్యాలి. నిర్వహణం ఉత్తరతాలంలో ఉండాలి. ఇదే ఆసీనపాఠ్యానికి సంబంధించిన విధానం.

**మూ. విచిత్రవృత్తసంయుక్తం పుంస్త్రియోర్గతిచేష్టితైః,**
**అన్యోన్యాన్తరితే నిత్యం గీతవాద్యేన భూషితమ్. 452**
**పాదే పాదేఽఙ్గహారైశ్చ వాద్యేన చ సమన్వితమ్,**
**స్యాత్ పుష్పగణ్డికా నామ యదఙ్గం తన్నిబోధత. 453**

**తా. పుష్పగండిక :–** ఇది వేరు వేరు వృత్తాలలో నిర్మింపబడుతుంది. దీనిలో గీత – వాద్యాలు ఒక దాని తర వాత ఒకటి ఉంచవచ్చును. గీతంలోని ఒకొక్క పాదం గానం చేసే సమయంలో దానికి అనుకూలమైన అంగహారాల ప్రదర్శనము, వాద్య వాదనము చెయ్యాలి. ఇది **పుష్పగండిక** అను లాస్యాంగం.

**మూ. తత్రైకం పౌరుషం శ్లోకం సమవృత్తం ప్రయోజయేత్,**
**చతుర్భిః సన్నిపాతైశ్చ జ్ఞేయం చఞ్చత్పుటాశ్రయమ్. 454**
**పాదే పాదే తథేష్టం చ వాద్యం నృత్తం తథైవ చ.**

**తా.** అక్కడ సమవృత్తరూపమైన పురుషశ్లోకం, నాలుగు సన్నిపాతలతో చంచత్పుట తాలంతో గానం చెయ్యాలి. ప్రతీ పాదంలోను ఇష్టమైన వాద్యము నృత్యం, ఆవిద్ధచారీతో ఉద్ధతాంగహారాలతో చెయ్యాలి.

**మూ. తతశ్చాన్యే స్మృతే వృత్తే ఖఞ్జనత్కుటసంజ్ఞితే. 455**
**అన్తే నిర్వహణే చాస్య శీర్షకం పఞ్చపాణినా,**
**ఆవిద్ధచార్యఙ్గహారైరుద్ధతైస్తత్ ప్రయోజయేత్. 456**

**తా.** పిమ్మట ఖంజనత్కుట ఛందస్సులో ఉన్న రెండు గీతాల గానం చెయ్యాలి. వాటి నిర్వహణలో పంచపాణితాలంలో శీర్షకప్రయోగం చెయ్యాలి. దీనిలో నృత్యం ఆవిద్ధచారీతో, ఉద్ధతాంగహారాలతో చెయ్యాలి.

**మూ. త్ర్యఙ్గం ద్విధాతుప్రచ్ఛేదం విద్యాల్లాస్యప్రయోగవిత్,**
**జ్యోత్స్నాయాం మన్దిరే వాపి సలిలే దర్పణేఽథవా. 457**
**ఛాయాం సందృశ్య కాన్తస్య ప్రహర్షణవిభూషితమ్,**
**నృత్తప్రధానం క్రీడాఢ్యం హేలాదిభిరలంకృతమ్. 458**
**అఙ్గం ప్రచ్ఛేదకం తత్ర విద్యాల్లాస్యప్రయోగవిత్.**

**తా. ప్రచ్ఛేదకం :–** దీనిలో మూడు అంగాలు, రెండు ధాతువులు ఉంటాయి. ఒక నాయిక వెన్నెలలో గాని, ఏదైన మందిరంలో గాని, నీటిలో గాని, అద్దంలో గాని తన ప్రియుని చూసి ఆనందపారవశ్యం చెందడం దీనిలోని వృత్తం. దీనిలో నృత్తం ప్రధానంగా ఉంటుంది. క్రీడ అత్యధికంగా ఉంటుంది. హేలాదుల ప్రదర్శనంతో ఈ నృత్తం మనోహరంగా ఉంటుంది.

**మూ. చఞ్చత్పుటస్య తాలేన తస్యాం ప్రక్రీడితం భవేత్. 459**
**మాత్రావృత్తసమైః పాదైః సన్నిపాతైస్తథాష్టభిః,**
**బహ్వక్షరార్థసంయుక్తం తోటకం పఞ్చపాణినా. 460**
**ద్వికలేన ప్రకర్తవ్యం మిశ్రేణైకకలేన వా,**
**శీర్షకం చ ప్రకర్తవ్యం గురుప్రాయాక్షరాన్వితమ్. 461**
**యథాక్షరేణ త్ర్యస్రేణ సన్నిపాతైస్తథాష్టభిః,**
**వివధైకకసంయుక్తం కైశికీజాతిసంశ్రయమ్. 462**

**అఙ్గం ప్రచ్ఛేదకం విద్యాద్యుక్తం ప్రక్రీడితాదిభిః.**

**తా.** దీనిలోని క్రీడలో – సమపాదమాత్రాఛందస్సులో చంచత్పుటతాలంతో గానం చెయ్యాలి. ఈ గీతంలో ఎనిమిది పాతా లుండాలి; లేదా అనేకవర్ణాలు అర్థాలు గల తోటకఛందస్సులో ఉన్న గీతం, ద్వికలం లేదా ఏకకలం లేదా మిశ్రం అయిన పంచ పాణితాళంతో గానం చెయ్యాలి. దాని శీర్షకం ఎక్కువ గుర్వక్షరాలతో నిర్మితమై యథాక్షర త్ర్యస్రతాలంతో ఎనిమిది సంనిపాతాలతో ఉండాలి. ఈ ప్రచ్ఛేదకాన్ని వివధ – ఏకక మిశ్రితములైన కైశికీ సంబద్ధాలైన గీతాలతో ప్రయోగించాలి.

**మూ. అనిష్ఠురశ్లక్ష్ణపాదం గాన్ధారీజాతిమాశ్రితమ్.** **463**
**చఞ్చత్పుటేన యోక్తవ్యం త్రిమూఢం ద్వికలేన తు,**
**చతుఃషష్టిః సన్నిపాతాస్తస్మింశ్చైవ ప్రకీర్తితాః.** **464**
**యథామార్గకలోపేతా విదారీవివధాన్వితాః,**
**అఙ్గహారాన్ సవిష్కమ్భాన్ నైవ చాత్ర ప్రయోజయేత్.** **465**
**కేవలం పౌరుషైర్భావైః పాఠ్యం నాట్యయుతం నయేత్,**
**నత్కుటం ఖఞ్జకం చైవ విధానేన ప్రయోజయేత్.** **466**
**ఇతి త్రిమూఢముద్దిష్టం నానారససమాశ్రయమ్.**

**తా. త్రిమూఢం :–** దీనిలో కోమలములు స్నిగ్ధములూ అయిన అక్షరాలు గల పదాల ప్రయోగం ఉండాలి. ఇది గాంధారీజాతిని ఆశ్రయించి ఉంటుంది. ద్వికల చంచత్పుటతాలం ప్రయోగించాలి. అరవైనాలుగు సన్నిపాతాల ప్రయోగం మార్గానికి తగిన సంఖ్యలో ఉన్న కలలలో ఉండాలి. ఇవి విదారీ – వివధలను కలిపేవిగా ఉండాలి. దీనిలో అంగహారాల ప్రయోగంగాని, విష్కంభకప్రయోగం గాని ఉండకూడదు. చివర నత్కుటక – ఖంజకాల ప్రయోగం చెయ్యాలి. ఇదీ – అనేకరసాలతో కూడిన **త్రిమూఢకం** ప్రయోగించే విధానం.

**మూ. నాతిసృష్టాఙ్గహారం తు నాతిరేచకభూషితమ్.** **467**
**సైన్ధవీమాశ్రితం భాషాం జ్ఞేయం సైన్ధవకం బుధైః,**
**రూపం వాద్యాదిసంయుక్తం సైన్ధవం స్యాదథోద్ధతమ్.** **468**

**తా. సైంధవకం :–** సైంధవీభాషలో ఉండే దీనిలో అంగహారాల ప్రయోగం అతిస్పష్టంగా ఉండకూడదు. రేచకాల ప్రయోగం అధికంగా ఉండకూడదు. ఉద్ధత ఛందస్సులో ఉండే ఈ సైంధవకంలో వాద్యవాదనం ఉంటుంది.

**మూ. న పాఠ్యం స్వల్పమప్యత్ర ప్రకుర్వీత విచక్షణః,**
**వితస్తాలప్తిలేశాఢ్యం సైన్ధవే వాద్యమిష్యతే.** **469**

**మృద్వఙ్గహారబహులం గురుప్రాయాక్షరాన్వితమ్,**
**ఆక్రీడితస్య భాగేన యుగ్మతాలకృతేన హి. 470**

**వింశత్యా సంనిపాతానాం యుక్తం సైన్ధవకం భవేత్.**

**తా.** దీనిలో స్వల్పంగా కూడ పాఠ్యం ఉండకూడదు. దీనిలోని వాద్యం పూర్తిగా వితస్త – అలప్తిమార్గాలలో ఉంటుంది. గీతరచనలో గుర్వక్షరాలు అధికంగా ఉంటాయి. మృదువైన అంగహారాలు ప్రదర్శించవచ్చును. దీనిని చతురస్రతాలంతో, ఆక్రీడిత మార్గాలతో ప్రయోగించాలి. దీనిలో ఇరవై సన్నిపాతా లుంటాయి.

**మూ. ముఖప్రతిముఖోపేతం తథా చాపపుటాశ్రయమ్. 471**

**యథాక్షరైః సన్నిపాతైః తథా ద్వాదశభిర్యుతమ్,**
**నైకయుక్తివిచిత్రార్థం పౌరుషం భావమాశ్రితమ్. 472**

**ఏకాఙ్గం శీర్షకాఙ్గం వా ద్విమూఢం పరికీర్తితమ్.**

**తా. ద్విమూఢకం :–** దీనిలో ముఖ – ప్రతిముఖాలు యథాక్షరచాపపుటతాలంలో పన్నెండు సన్నిపాతాలతో ఉండాలి. దీనిలోని వస్తువు ఒకటికంటె ఎక్కువ ఘటనలతో కూడి ఉంటుంది. అనేకఅర్థాలతో కూడి ఉన్న ఈ వస్తువు పౌరుషభావంతో నిండి ఉంటుంది. దీనిలో ఒకే అంగం గాని లేదా శీర్షకం గాని ఉంటుంది.

**మూ. ఉత్తమోత్తమకే త్వాదౌ నత్కుటం సంప్రయోజయేత్. 473**

**తతః శ్లోకం విచిత్రార్థం తథా చైవోపపాదయేత్,**
**తతశ్చ వస్తుకం కార్యమపరాన్తకశాఖయా. 474**

**యథాక్షరేణ కార్యం తు శీర్షకం పఞ్చపాణినా,**
**ఉత్తమోత్తమకం ప్రోక్తం హేలాభావవిభూషితమ్. 475**

**తా. ఉత్తమోత్తమకం :–** దీని ప్రారంభం ఒక నత్కుటముతో చేసి తరువాత విచిత్రములైన అర్థాలతో పూర్ణమైన శ్లోకం గానం చెయ్యాలి. గీత వస్తువును అపరాంతక శాఖలో ఉంచి దాని శీర్షకాన్ని యథాక్షరపంచపాణితాలంలో హేల మొదలైన భావాలను అభివ్యక్తం చేస్తూ ప్రయోగించాలి.

**మూ. కోపప్రసాదబహులం సాధిక్షేపైరుపక్రమైః,**
**సల్లాపరుచిరైర్నిత్యముక్తప్రత్యుక్తమిష్యతే. 476**

**వస్త్వర్థేన ప్రకర్యాస్తు తస్య తాలవిధిః స్మృతః,**
**తతస్తు శీర్షకం కార్యం సంయుక్తం పఞ్చపాణినా. 477**

**వజ్రం సంపిష్టకం చైవ తాసాం త్ర్యస్రోఽత ఏవ చ.**
**ఉక్తప్రత్యుక్తమేవం హి ప్రసాదాన్తం ప్రయోజయేత్. 478**

**తా. ఉక్తప్రత్యుక్తం :–** దీనిలో క్రోధము, ప్రసాదనము, అధికంగా ఉంటాయి. ఒకరి నొకరు అధిక్షేపిస్తూ, మాటకు పైమాట చెపుతూ చేసే సంభాషణలతో ఈ క్రోధ – ప్రసాదనాలు (కోపాలు, వాటిని తీర్చడాలు) జరుగుతాయి. ప్రకరీవస్త్వర్ధభాగం దీనిలో తాలంగా ఉంచబడుతుంది. తరువాత పంచపాణి తాలంలో శీర్షకం ప్రయోగించాలి. దీని వస్తువును, సంపిష్టకాన్ని త్ర్యస్రతాలంలో ఉంచాలి. **'ఉక్తప్రత్యుక్తకం'** ప్రసాదంతో ముగింపచెయ్యాలి.

**మూ. దశాఙ్గం లాస్యమిత్యేతన్మయా వః పరికీర్తితమ్,**
**ప్రకరణే దశాఙ్గాని యత్రైకస్మిన్ భవన్తి హి. 479**

**తా.** లాస్యంలోని పది అంగాలుగా నే నిక్కడ చెప్పినవాటిని ఇదే పద్ధతిలో 'ప్రకరణం'లో ప్రయోగించవచ్చును.

**మూ. సఞ్చార ఇతి విజ్ఞేయో లాస్యచ్ఛేదే విపర్యయాత్,**
**ఏవమేతద్ బుద్ధైర్జ్ఞేయం గీతతాలవికల్పనమ్. 480**

**యతః కార్యః ప్రయత్నస్తు నాట్యం తాలే ప్రతిష్ఠితమ్,**
**సర్వస్యైవ హి నాట్యస్య ఆతోద్యానాం తథైవ చ. 481**

**తాలం కాలేన సంయుక్తం భవేన్నిత్యం ప్రమాణతః,**
**హీనం ప్రకృష్టవర్ణం వా గానం తాలేన ధార్యతే. 482**

**తస్మాదేతత్ప్రయత్నేన విజ్ఞాతవ్యం ప్రయోక్తృభిః.**

**తా. తాలప్రాధాన్యం :–** తాలవిపర్యయంవల్ల కలిగిన లాస్యచ్ఛేదం (break in the Lasya) సంచారం అని చెప్పబడుతుంది. (?) గీతతాలం కల్పనలను బుధులు ఈ విధంగా తెలుసుకోవాలి. ఎల్లప్పుడు తాలం విషయంలో చాల శ్రద్ధ చూపాలి. ఎందువల్ల ననగా నాట్యం తాలంమీదనే ఆధారపడి ఉంటుంది. తాలం కాల సమన్వయంతో జరపాలి. వర్ణాలలోని హెచ్చుతగ్గుల వల్ల గీతంలో కలిగే లోపాలను తాలంచేత సర్దుకొనవచ్చును. అందుచేత నాట్యప్రయోక్తలు ప్రయత్నపూర్వకంగా నిర్దుష్టమైన తాలజ్ఞానం సంపాదించు కోవాలి.

**మూ. ఋగ్గాథాపాణికాదానీం సప్తరూపం ప్రకీర్తితమ్. 483**
**చతుష్పదా వర్ధమానం తాలేనైవ విభావ్యతే,**
**తస్మాత్సర్వప్రయత్నేన కార్యం తాలావధారణమ్. 484**

**తా.** ఋక్, గాథ, పాణిక మొదలైన సప్తరూపగీతాలు, ప్రకీర్ణకాలు. చతుష్పద,

వర్ధమానకము మొదలైన అన్నింటి స్వరూపమూ కూడ తాలాన్నిపట్టే గుర్తించడానికి శక్యం అవుతుంది. అందుచేత నిశ్చితమైన తాలస్వరూపజ్ఞానం చాల ఆవశ్యక మైనది.

**మూ. యస్తు తాలం న జానాతి న స గాతా న వాదకః,**
**అఙ్గభూతా హి తాలస్య యతిపాణిలయాః స్మృతాః. 485**
**పూర్వోక్తం వై విధానం చ తచ్చ మే సన్నిబోధత.**

**తా.** సరియైన తాలజ్ఞానంలేనివాడు గాయకుడు కాడు, వాదకుడు కాడు. ఎందువల్ల ననగా గతులు, పాణులు, లయలు కూడ తాలానికి అంగాలే అని పెద్దలు అంటారు. నేను వెనుక చెప్పిన విషయమే మళ్లీ చెపుతున్నాను; వినండి.

**మూ. త్రయో లయాశ్చ విజ్ఞేయా ద్రుతమధ్యవిలమ్బితాః. 486**
**మార్గేషు వ్యక్తిమాయాన్తి గీతవాద్యోభయాత్మికాః,**
**తిస్రస్తు యతయశ్చాన్యా మార్గేషు లయసంశ్రయాః. 487**

**తా.** ద్రుతం, మధ్యం, విలంబితం అని లయ మూడు విధాలు. గీతాలకు సంబంధించిన వేరు వేరు మార్గాలలోను వాద్యవిధానాలలోను ఈ లయ అభివ్యక్తం అవుతుంది. ఇది (లయ) గీత – వాద్యాల ఆత్మ వంటిది. ఈ మార్గాలలో లయకు సంబంధించి మూడు యతులు కూడ ఉన్నాయి.

**మూ. ఛన్దోక్షరపదానాం హి సమత్వం యత్ ప్రకీర్తితమ్,**
**కలాకాలాన్తరకృతః స లయో మానసంజ్ఞితః. 488**

**తా.** ఛందస్సు, అక్షరాలు, పదాలు వీటిలో సమత్వాన్ని సంపాదిస్తూ, తదను సారంగా కలారూపమైన కాలంలో ఉండే అంతరం (వ్యవధానం) చూపిస్తూ, తాలప్రమాణం కొలిచేది 'లయ'.

**మూ. సమా స్రోతోగతా చైవ గోపుచ్ఛేతి యథాక్రమమ్,**
**పదవర్ణప్రకర్షాణామక్షరాణామథాపి చ. 489**
**నియమోఽథ యతిః సా తు గీతవాద్యసమాశ్రయా.**

**తా.** 'సమ', 'స్రోతోగత', 'గోపుచ్ఛ' అని మూడు విధాలైన యతి గీతాలతోను, వాద్యాలతోను సంబంధించి ఉంటుంది. ఇది పదాల సమయాన్నీ, అక్షరాల సమయాన్నీ నియమిస్తుంది.

**మూ. ఆద్యన్తే చైవ మధ్యే చ లయవర్ణపదైః సమా. 490**
**వాద్యప్రధానా భూయిష్ఠా చిత్రా జ్ఞేయా సమా యతిః.**

**తా.** ప్రారంభంలోను, మధ్యయందు, అంతమునందూ కూడ వర్ణాల, పదాల సమత్వాన్ని పరిరక్షించేది **'సమయతి'**. దీని ఉపయోగం చిత్రమార్గంలోను వాద్యవాదనం లోను కూడ అధికంగా ఉంటుంది.

**మూ. క్వచిచ్చైవావతిష్ఠతే, క్వచిచ్చైవ ప్రధావతి. 491**
**వాద్యశ్రుతపథా వృత్తౌ జ్ఞేయా స్రోతోగతా యతిః.**

**తా.** వాద్యశ్రుతమార్గంలో సంచరించే ఏ యతి కొన్ని చోట్ల నిలిచిపోయినట్లు, కొన్ని చోట్ల పరుగెత్తుచున్నట్లు ఉంటుందో అది **'స్రోతోగతయతి'**. దీని ప్రయోగం వృత్తి మార్గంలో జరుగుతుంది.

**మూ. గురుభిర్లఘుభిశ్చైవమవిభావితమక్షరమ్. 492**
**లమ్బితా గేయభూయిష్ఠా గోపుచ్ఛా దక్షిణే గతిః.**

**తా.** ఏ యతిలో గురులఘ్వక్షరవిభాగం స్పష్టంగా గుర్తింపబడదో, గీతప్రధానమై పొడిగించబడే ఆ యతి **గోపుచ్ఛయతి**. అది దక్షిణమార్గంలో ప్రయోగింపబడుతుంది.

**మూ. సమపాణ్యవపాణిశ్చ తథా ఉపరిపాణికమ్. 493**
**పాణిస్తు త్రివిధో జ్ఞేయో గీతవాద్యసమాశ్రయః.**

**తా.** గీత – వాద్యాలతో సంబంధించి ఉండే **'పాణి'** 'సమపాణి', 'అవపాణి', 'ఉపరిపాణి' అని మూడు విధాలు.

**మూ. లయేన యత్ సమం వాద్యం సమపాణిః స ఉచ్యతే. 494**
**లయాద్యదవకృష్టం తు సోఽవపాణిస్తు సంజ్ఞితః,**
**లయస్యోపరి వాద్యం స్యాత్తథా చోపరిపాణికమ్. 495**

**తా.** లయతో కూడా కూడా నడిచే వాద్యవాదనం **'సమపాణి'**. లయ ఆరంభించిన తరవాత దాని వెనుకనే నడిచే వాద్యవాదనం **'అవపాణి'**. లయను తన వెనుక తీసికొని వెళ్లే వాద్యవాదనం **'ఉపరిపాణి'**.

**మూ. యత్యుపాన్త్యాక్షరాణాం చ సమవాయో లయో భవేత్,**
**లయాత్ప్రభృతి ఏతేషాం ప్రమాణం పరివర్తతే. 496**

**తా.** యతికి వెనుక నున్న అక్షరానికి వెనుక నున్న అక్షరసముదాయం లయను నియమిస్తుంది. లయ మొదలవగానే వీటి ప్రమాణం మారిపోతూంటుంది.

**మూ. హానిః కలానాం కార్యా తు శేషేష్వన్యేషు పాణిషు,**
**తత్ర స్థితలయో యో వై సన్నిపాతే భవేదథ. 497**

**స తు మధ్యలయం ప్రాప్య సంనిపాతద్వయం భవేత్,**
**ద్రుతం చాపి లయం ప్రాప్య సన్నిపాతచతుష్టయమ్. 498**

**తా.** ఇతరపాణుల కలలు తగ్గించాలి. విలంబితలయలో ఒక సన్నిపాత, మధ్య లయలో రెండుసంనిపాతాలు, ద్రుతలయలో నాలుగు సంనిపాతాలు ఉండాలి.

**మూ. యో (యః) తత్ర చాన్తరకృతో దృతమధ్యలయో హి సః,**
**సోఽవపాణిస్తు విజ్ఞేయస్తద్జ్ఞైర్ద్రుతలయాశ్రయః. 499**

**తా.** ఈ అంతరంచేత సూచితమైనది **అవపాణి**. అది ద్రుతలయాశ్రితమై ఉంటుంది.

**మూ. మధ్యే చ యాన్తరకలా ద్రుతమేకకలా చ సా,**
**ఉపర్యుపరిపాణిశ్చ స జ్ఞేయో వాద్యసంశ్రయః. 500**

**తా.** ఏకకలాతాలాలు అంతరకాలాలై ద్రుతలయలో వాయించినపుడు దానికి ఉపర్యుపరిపాణి అని పేరు.

**మూ. అత ఊర్ధ్వం కలానాం తు ప్రమాణం న విధీయతే,**
**యతయః పాణశ్చైవ లయాశ్చైవ ప్రయోక్తృభిః. 501**
**యథాక్రమం హి కర్తవ్యం గీతయుక్తిమవేక్ష్య చ.**

**తా.** కలాప్రమాణం ఇంతకు మించి పెంచకూడదు. నాట్యప్రయోక్తలు గీతుల అవసరాలను దృష్టిలో పెట్టుకొని యతుల, పాణుల, లయల ప్రయోగం క్రమానుసారం చెయ్యాలి.

**మూ. ఏవం ధ్రువతాలవిధిః కర్తవ్యస్తాలయోగతః,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి ధ్రువాణామఙ్గకల్పనమ్. 502**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే తాలాధ్యాయః ఏకత్రింశః.**

**తా.** తాలాలను కూర్చడం ద్వారా ధ్రువతాలవిధానం ఇలా చెయ్యాలి. ఇటుపైన ధ్రువల అంగప్రకల్పనాన్ని గూర్చి చెపుతాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానంలో తాలాధ్యాయం అను ముప్పై ఒకటవ అధ్యాయం సమాప్తం.**

**శ్రీః శ్రీః శ్రీః**

1. **31వ అధ్యాయంలో అ.భా.వ్యా. సహితప్రతిలో 377 శ్లోకాలున్నాయి. వ్యాఖ్య కూడ అంతవరకే.**
2. **మన్‌మోహన్ ఘోష్ ప్రతిలో 502 శ్లోకాలున్నాయి.**
3. **Same in Hindi Edition.**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ ద్వాత్రింశోఽధ్యాయః

## ధ్రువావిధానము

"ప్రావేశిక్యపవర్గసన్తతిమహాభాగేషు యాక్షేపికా,
చిత్రాత్సంస్మృతిరఙ్గమణ్డలతలాదస్మాచ్చ నైష్క్రామికీ,
సంభోగాన్తరసంప్రసాదసుభగశ్రీశుద్ధవిద్యాత్మికా
ఛన్దఃసారమయీ ధ్రువా విజయతాం స్పర్ధాత్మికా సా తనుః".

– శ్రీమదభినవగుప్తాచార్యాః

**మూ. ధ్రువేతి సంజ్ఞితాని స్యుర్నారదప్రముఖైర్ద్విజైః,
యాన్యఙ్గానీహ ఉక్తాని తాని మే సన్నిబోధత. 1**

**తా.** నారదాదిద్విజప్రముఖులు ధ్రువలు అను పేరు పెట్టి ఏ అంగాలను చెప్పారో వాటిని గూర్చి చెపుతున్నాను; వినండి.

**మూ. యా ఋచః పాణికా గాథా సప్తరూపాఙ్గమేవ చ,
సప్తరూపప్రమాణం హి సా ధ్రువేత్యభిసంజ్ఞితా. 2**

**తా.** ఋక్కు, పాణిక, గాథ, వేరు వేరు ప్రమాణాలలో ఉన్న స్వరూపాలు గల సప్తరూపగీతాలు – వీటి కన్నింటికీ ధ్రువ లని పేరు.

**మూ. ఏభ్యస్త్వఙ్గేభ్య ఉద్ధృత్య నానాచ్ఛన్దఃకృతాని చ,
ధ్రువాత్వం యాని గచ్ఛన్తి తాని వక్ష్యామ్యహం ద్విజాః. 3**

**తా.** ద్విజులారా! ఈ అంగములనుంచే ఉద్ధరించి, ధ్రువాత్వం పొందకలిగిన, వివిధచ్ఛందోనిర్మితా లైనవాటిని మీకు చెపుతాను.

**మూ. ముఖం ప్రతిముఖం చైవ వైహాయసకమేవ చ,
నిత్యప్రవృత్తే వజ్రం చ సంధిః సంహరణం తథా. 4**

**ప్రస్తారశ్చోపవర్తశ్చ మాషఘాతస్తథైవ చ,
చతురస్రోపపాతే చ ప్రవేణీ శీర్షకం తథా. 5**

**సంపిష్టకాన్తాహరణే మహాజనికమేవ చ,
ధ్రువాణామఙ్గసంజ్ఞాని పఞ్చానామపి నిత్యశః. 6**

**తా.** ముఖం, ప్రతిముఖం, వైహాయసకం, స్థితం, ప్రవృత్తం, వజ్రం, సంధి, సంహరణం, ప్రస్తారం, ఉపవర్తం, మాషఘాతం, చతురస్రం, ఉపఘాతం, ప్రవేణి, శీర్షకం, సంపిష్టకం, అంతాహరణం, మహాజనికం – ఈ పద్దెనిమిదీ ఐదు ధ్రువాల అంగాలు.

**మూ. ఏకవస్తు ధ్రువా జ్ఞేయా ద్వివస్తు పరిగీతికా,**
**త్రివస్తు మద్రకం జ్ఞేయం చతుర్వస్తు చతుష్పదా. 7**

**తా.** ఒక వస్తువులో నిబద్ధ మైనది 'ధ్రువ'. రెండు వస్తువులలో నిబద్ధ మైనది 'పరిగీతిక'; మూడు వస్తువులలో నిబద్ధ మైనది 'మద్రకం'; నాలుగు వస్తువులలో నిబద్ధ మైనది "చతుష్పద".

**మూ. వాక్యవర్ణా హ్యలంకారా లయా యత్యథ పాణయః,**
**ధ్రువమన్యోన్యసంబద్ధా యస్మాత్తస్మాద్ ధ్రువాః స్మృతాః. 8**

**తా.** వీటి వాక్యాలలోని వర్ణాలు, అలంకారాలు, లయలు, యతులు, పాణులూ కూడ ధ్రువంగా (నిశ్చితరూపాలలో) పరస్పరం సంబంధించి ఉంటాయి గాన వీటికి ధ్రువ లని పేరు.

**మూ. ధ్రువాశ్చ పఞ్చ విజ్ఞేయా నానావస్థాసమాశ్రయాః,**
**ఏతాసాం చైవ వక్ష్యామి సప్తరూపాఙ్గకల్పనమ్. 9**

**తా.** వివిధఅవస్థలమీద ఆధారపడి ఉన్న ధ్రువలలో ఐదు భేదా లున్నాయి. ఇపుడు నేను వీటి ఏడు అంగాలను కూడ చెపుతాను.

**మూ. ఉపపాతః ప్రవృత్తశ్చ ప్రావేశిక్యాం ప్రకీర్త్యతే,**
**వజ్రం చ శీర్షకం చైవ ధ్రువాయాం శీర్షకం మతమ్. 10**

**తా.** ప్రావేశికీధ్రువలో ఉపపాతమూ (ఘాతము), ప్రవృత్తము, వజ్రము, శీర్షకము అంగాలుగా చెప్పబడ్డాయి.

**మూ. ప్రస్తారో మాషఘాతశ్చ మహాజనకమేవ చ,**
**ప్రవేణీ హ్యుపపాతశ్చ అడ్డితాయాః ప్రకీర్తితాః. 11**

**తా.** ప్రస్తారము, మాషఘాతము, మహాజనికము, ప్రవేణి, ఉపపాతము – ఇవి అడ్డితాధ్రువాంగాలు.

**మూ. ముఖప్రతిముఖోపేతా హ్యవక్రుష్టాభిధీయతే,**
**వైహాయసాన్తాహరణే స్థితాయాం సంప్రకీర్తితే. 12**

**తా.** ముఖ ప్రతిముఖాలు అవకృష్టాధ్రువాంగాలు. వైహాయస – అంతాహరణాలు స్థితాధ్రువాంగాలు.

**మూ. సంహారశ్చతురస్రం చ ఖఞ్జనత్కుటకే తథా,**
**సన్ధిః ప్రస్తారసంయుక్తస్త్వన్తరాయాం ప్రకీర్తితః. 13**

**తా.** ఖంజనత్కుటధ్రువకు సంహారము, చతురస్రము అంగాలు. అంతరా ధ్రువకు సంధి, ప్రస్తారము అంగాలు.

**మూ. యాన్యఙ్గాని కలాశ్చైవ గీతకాన్తర్గతాని చ,**
**తాని ఛన్దోగతైర్వృత్తైర్విభావ్యన్తే ధ్రువాస్వథ. 14**

**తా.** గీతాలలో ఏ అంగాలు కలలు చెప్పబడ్డాయో అవే ఛందోగతవృత్తాల రూపాలతో ధ్రువలలో ఉపయోగింపబడతాయి.

**మూ. త్ర్యస్రశ్చ చతురస్రశ్చ తాలః కార్యో ధ్రువాత్మకః,**
**షట్కలోఽ ష్టకలశ్చైవ యస్తు పూర్వం ప్రకీర్తితః. 15**

**తా.** ధ్రువలలో కూడ త్ర్యస్ర – చతురస్రతాలాల ప్రయోగం ఉంటుంది. అయితే అది వరుసగా – ఆరు కలలోను ఎనిమిది కలలలోను ప్రయోగించాలి.

**మూ. సర్వేషామేవ గీతానాం యాన్యఙ్గాని స్మృతాన్యథ,**
**తేషాం వృత్తం సవివధమేకకం చ భవిష్యతి. 16**

**తా.** వెనుక చెప్పిన వృత్తము, వివధము, ఏకకము – ఇవే అన్ని గీతాల అవయవాలు.

**మూ. పదవర్ణసమాప్తిస్తు విదారీత్యభిసంజ్ఞితా,**
**ఏతేషాం చైవ వక్ష్యామి విధిం ప్రకృతిసంభవమ్**
**జ్యేష్ఠానాం వృత్తసంయుక్తం కుర్యాదాదౌ తథైవ చ 17**
**వివధం చైవ మధ్యానాం నీచానామేకకం తథా.**

**తా.** ఒక పదాన్ని లేదా గీతాన్ని చివరి వరకు తీసికొనివెళ్లే గీతాంగం **'విదారి'**. నాట్యంలో వేరువేరు భూమికలలో ఉపయోగించవలసిన వీటి విధానం చెపుతాను. ఉత్తమపాత్రల గీతం ప్రారంభంలో 'వృత్తం' అను అంగాన్ని మధ్యమపాత్రల గీతంలో వివధాన్నీ నీచపాత్రల గీతంలో ఏకకం అను అంగాన్నీ ఉపయోగించాలి.

**మూ. త్ర్యస్రం వా చతురస్రం వా యోగం జ్ఞాత్వా ప్రయోగజమ్. 18**
**తేన ప్రయోగయోగేన ధ్రువా కార్యావసానికీ.**

**తా.** నాట్యప్రయోగంలో జరిగే త్ర్యస్ర – చతురస్రతాలాల సంమేళనాన్ని దృష్టిలో ఉంచుకొని, దాని ప్రమాణాన్ని అనుసరించి అవసానికీధ్రువాయోజనం చెయ్యాలి.

**మూ. గాయత్ర్యాశ్చాతిశక్వర్యా అన్తరే యా వ్యవస్థితాః. 19**

**తేషాం పాదప్రమాణేన ధ్రువా కార్యావసానికీ.**

**తా.** అవసానికీధ్రువలో, గాయత్రీ – అతిశక్వరీచందస్సుల మధ్య నుండే ఛందస్సు పాదాలను ఉపయోగించాలి.

**మూ. శక్వర్యాశ్చాతికృత్యా యే చాన్తరే త్వావసానికీ. 20**

**తేషామధ్యర్ధవిహితా ధ్రువా పాదమయీ స్మృతా.**

**తా.** శక్వరీ – అతికృతిఛందస్సుల మధ్య నుండే ఛందస్సు ఒకటిన్నర పాదాలతో అవాసానికీధ్రువ నిర్మించాలి.

**మూ. అతిచ్ఛన్దోవిధానేన గురులఘ్వక్షరాన్వితః, 21**

**కార్యో మాత్రా ప్రమాణేన ధ్రవాపాదోఽవసానికః.**

**తా.** యతినియమానుసారంగా, ఛందోమాత్రాదుల ప్రమాణాలను దృష్టిలో ఉంచుకొని, గురులఘువర్ణాలతో అవసానికీ ధ్రువాపాదనిర్మాణం చెయ్యాలి.

**మూ. మధ్యోత్తమానాం కర్తవ్యా చతురస్రావసానికీ. 22**

**అథాధమానాం కర్తవ్యా ధ్రువా త్ర్యస్రావసానికీ**

**అథ పూర్ణపదీ యా తు తస్యాం వృత్తం ప్రయోజయేత్,**

**తత్రేష్టవృత్తప్రామాణ్యాద్ ధ్రువా కార్యావసానికీ. 23**

**తా.** ఉత్తమమధ్యమపాత్రల అవసానికీ ధ్రువచతురస్రంలో ఉండాలి. అధమపాత్రల అవసానికీ ధ్రువ త్ర్యస్రంలో ఉండాలి. ధ్రువలోని అన్ని అవయవాలు పరిపూర్ణంగా ఉన్నప్పుడు దానిలో వృత్తం చేర్చాలి. వృత్తప్రమాణానుసారం అవసానికీ ధ్రువ ఉండాలి.

**మూ. ధ్రువాశ్చ పఞ్చ విజ్ఞేయా నానావృత్తసముద్భవాః,**

**యథాస్థానరసోపేతా ఉత్తమాధమమధ్యమాః. 24**

**తా.** వేరు వేరు ఛందస్సులతో సంబంధించి ఉన్న ధ్రువలు ఐదు విధాలు. అవి వాటి స్థానాలను, రసాలను పట్టి ఉత్తమ – మధ్యమ – అధమత్వాలను పొందు తూంటాయి.

**మూ. కనిష్ఠికాగ్రహా చైవ సన్నిపాతగ్రహా పరా,**

**తథా చాపగ్రహా చైవ త్రివిధా తు ధ్రువా స్మృతా. 25**

**తా.** 'కనిష్ఠికాగ్రహ', 'సంనిపాతగ్రహ', 'అపగ్రహ' అని ధ్రువలో మూడు విధా లుంటాయి.

**మూ. ప్రావేశికీ తు ప్రథమా ద్వితీయాక్షేపికీ స్మృతా,**
**ప్రాసాదికీ తృతీయా చ చతుర్థీ చాన్తరాధ్రువా. 26**

**నైష్క్రామికీ చ విజ్ఞేయా పఞ్చమీ చ ధ్రువా బుధైః,**
**ఏతాసాం చైవ వక్ష్యామి ఛన్దో వృత్తనిదర్శనమ్. 27**

**తా.** ఐదు విధానాలైన ధ్రువలలో **'ప్రాదేశికి'** మొదటిది; **'ఆక్షేపికి'** రెండవది. **'ప్రాసాదికి'** మూడవది, **'అన్తర'** నాల్గవది. **'నైష్క్రామికి'** ఐదవది. ఇపుడు నేను వీటి చందస్సులను చెపుతాను.

**మూ. గాన్ధర్వం యన్మయా ప్రోక్తం స్వరతాలపదాత్మకమ్,**
**పదం తస్య భవేద్యస్తు స్వరతాలానుభావకమ్. 28**

**తా.** స్వర – తాల – పదాలతో కూడిన గంధర్వానికి చెందిన ఏ వస్తువును నేను వెనుక చెప్పి ఉన్నానో దాని స్వరతాలాలు స్పష్టంగా ప్రకాశించిన ట్లయితే అపుడది **"పదం"** (పాట – song) అవుతుంది.

**మూ. యత్కిఞ్చిదక్షరకృతం తత్సర్వం పదసంజ్ఞితమ్,**
**నిబద్ధం చానిబద్ధం చ తత్పదం ద్వివిధం స్మృతమ్. 29**

**అతాలం చ సతాలం చ ద్విప్రకారం చ తద్భవేత్,**
**సతాలం చ ధ్రువార్థేషు నిబద్ధం తచ్చ వై స్మృతమ్. 30**

**యత్తు వా కరణోపేతం సర్వాతోద్యానురఞ్జకమ్,**
**అతాలమనిబద్ధం చ పదం తు జ్ఞేయమేవ తత్. 31**

**తా.** అక్షరాల కూర్పుతో ఏర్పడే వన్నీ **'పదాలే'**. పదంలో – నిబద్ధము, అనిబద్ధము అని రెండు భేదాలున్నాయి. అతాలము, సతాలము అని కూడ పదానికే మరి రెండు భేదా లున్నాయి. ధ్రువలలో ఉపయోగించే పదం సతాలమై, నిబద్ధమై (తాలానుగుణంగా బంధింపబడి) ఉండాలి. తాలనియమాలు లేకుండా ఉంటూ కరణాలతో సంబంధించి, అన్ని వాద్యాలకు మనోహరత్వాని చేకూర్చే పదం, అతాలము అనిబద్ధము అయిన పదం.

**మూ. నియతాక్షరసంబద్ధం ఛన్దోయతిసమన్వితమ్,**
**నిబద్ధం తు పదం జ్ఞేయం సతాలలయమాక్షరమ్. 32**

**తా.** నిశ్చితమైన అక్షరాలతో బద్ధమై, యతిసహితమైన ఛందస్సులో ఉన్నది **నిబద్ధపదం**. దీనిలోని అక్షరాలు తాలలయలకు అనుగుణంగా కూర్చబడతాయి.

**మూ. స్వచ్ఛన్దయతిపాదం తు తథా చానియతాక్షరమ్,**

**అనిబద్ధం పదం జ్ఞేయమతాలలయమాక్షరమ్. 33**

**తా.** ఇచ్ఛానుసారం యతులు, పాదనిర్మాణమూ ఉంటాయి. అక్షరనియమం ఉండదు. తాలం కాని, లయ కాని ఉండదు. అలాంటి అక్షరసమూహం (ఆక్షరమ్) అనిబద్ధపదం.

**మూ. అనిబద్ధాక్షరాణి స్యుర్యాన్యజాతికృతాని తు,**
**ఆతోద్యకరణైస్తేషాం విధానమపి నిర్దిశేత్. 34**

**తా.** సంఖ్యానియమాదులు లేని 'అక్షరాలు' జాతిగీతాల కోటికి కూడ చెందవు. అయితే వాటికి కూడ ఆతోద్యకరణవిధానం చెప్పవలసి ఉంటుంది.

**మూ. పదాని త్వనిబద్ధాని తాలేన రహితాని చ,**
**ఆతోద్యేషు నియుక్తాని తాని తాని తు రఞ్జయేత్. 35**

**తా.** తాలరహితా లైన అనిబద్ధపదాలు కూడ వాద్యాలతో నియమితము లైతే అవి వీటినీ, ఇవి వాటినీ రంజింపచేస్తాయి. వీటి కలయికవల్ల ఒక శోభ లభిస్తుంది అని భావం.

**మూ. యాని చైవ నిబద్ధాని ఛన్దోక్షరవిధానతః,**
**ధ్రువసంజ్ఞాని వర్ణాని తాని పక్ష్యామ్యతః పరమ్. 36**

**తా.** ఛందోవిధానాలచేత అక్షరసంఖ్యానియమాదులచేత నిబద్ధములైన వర్ణాలకు ధ్రువ లని పేరు. ఇటుపైన వాటిని గూర్చి చెపుతాను.

**మూ. అత్యుక్తం చ ప్రతిష్ఠా చ మధ్యా గాయత్రీ ఏవ చ,**
**ఏతాః స్థితాపకృష్టాసు త్ర్యస్రా జ్ఞేయాస్తు జాతయః. 37**

**తా.** అత్యుక్త, ప్రతిష్ఠ, మధ్య, గాయత్రి అను జాతిఛందస్సుల ప్రయోగం స్థితాపకృష్టా ధ్రువలలో చేయబడుతుంది. ఇవి త్ర్యస్రవర్గానికి చెందినవి.

**మూ. ఉష్ణిగనుష్టుభౌ బృహతీ పఙ్క్తిశ్చేతీహ జాతయః,**
**ఏతాః ప్రాసాదికీనాం తు యుగ్మా జ్ఞేయాశ్చ జాతయః. 38**

**తా.** ఉష్ణిక్, అనుష్టుబ్, బృహతి, పంక్తి అను యుగ్మవర్ణానికి చెందిన జాతులు ప్రాసాదికీధ్రువలో ఉపయోగించబడతాయి.

**మూ. అనుష్టుబ్ బృహతీ చైవ జగత్యథ విలమ్బితా,**
**ద్రుతా చ చపలా చైవ ఉద్గతా ధృతిరేవ చ. 39**

**ద్రుతానాం జాతయో హ్యేతాః ప్రయోగేషు ప్రకీర్తితాః.**

**తా.** అనుష్టుబ్, బృహతి, జగతి, విలంబిత, ద్రుతచపల, ఉద్గత, ధృతి అను ఛందోజాతులు ద్రుతాధ్రువలో ఉపయోగింపబడతాయి.

**మూ. ప్రావేశికీనాం జాతిస్తు హ్యుద్ధతానాం నిబోధత. 40**

**పఙ్క్తిశ్చ త్రిష్టుప్ జగతీ తథాతిజగతీ పునః,**
**శక్వరీ చేతి విజ్ఞేయా ఉద్ధతానాం తు జాతయః. 41**

**తా.** పంక్తి, త్రిష్టుప్, జగతి, అతిజగతి, శక్వరి – ఈ ఛందస్సులు ఉద్ధతపాత్రల విషయంలో ప్రయోగించే జాతులు, వీటి ప్రయోగం ఉద్ధతచరిత్రులకు సంబంధించిన ప్రావేశికీధ్రువలో ఉంటుంది.

**మూ. సర్వాసామేవ జాతీనాం త్రివిధం వృత్తమిష్యతే,**
**గురుప్రాయం లఘుప్రాయం గురులఘ్వక్షరం తథా. 42**

**తా.** జాతులలో సాధారణంగా – గురువులు అధికంగా ఉన్నవి, లఘువులు అధికసంఖ్యలో ఉన్నవి, గురులఘువులు రెండూ సమంగా ఉన్నవీ అని మూడు విధాల వృత్తా లుంటాయి.

**మూ. గురుప్రాయాపకృష్టా స్యాత్ లఘుప్రాయా ద్రుతా తథా,**
**గురులఘ్వక్షరప్రాయాః శేషాః కార్యా ధ్రువాస్తథా. 43**

**తా.** అపకృష్టాధ్రువలలో గురుప్రాయవృత్తాలు, ధ్రుతాధ్రువలలో లఘుప్రాయ వృత్తాలు, మిగిలిన ధ్రువాలలో గురులఘ్వక్షరవృత్తాలు ప్రయోగింపబడతాయి.

**మూ. వృత్తాన్యోజఃకృతాని స్యుర్ముఖే యాని భవన్తి హి,**
**తాని ద్రుతాసు యోజ్యాని లఘుయుగ్మకృతాని తు. 44**

**తా.** 'ముఖం'లో విషమవృత్తాలను, ద్రుతాధ్రువాలలో లఘుప్రాయసమవృత్తాలను ఉపయోగించాలి.

**మూ. యాని చాల్పాక్షరాణి స్యురల్పచ్ఛన్దః కృతాని తు,**
**తాని ద్రుతాపకృష్టాసు కార్యాణ్యాక్షేపకీషు చ. 45**

**తా.** అపకృష్టాధ్రువలలోను, ఆక్షేపికీ ధ్రువలలోను పాదాలలో తక్కువ అక్షరా లున్న చిన్న వృత్తాలను ఉపయోగించాలి.

**మూ. గుర్వాదిస్తు స్థితా కార్యా లఘ్వాదిస్తు ద్రుతా భవేత్,**
**యాన్యోజోయుగ్మచ్ఛన్దాంసి జ్ఞేయాన్యాక్షేపికీ తథా. 46**

**తా.** స్థితాధ్రువలో మొదటి అక్షరం గురువైన ఛందస్సు. ద్రుతాధ్రువలో లఘ్వక్షరం

ప్రారంభంలో ఉన్న ఛందస్సు, ఆక్షేపికీధ్రువలో సరి - బేసిపాదాలలోని అక్షరాలు వేరు వేరు సంఖ్యలో ఉన్న ఛందస్సు ప్రయోగించాలి.

**మూ. లఘుయుగ్మకృతా యా స్యాత్స్థితా సాక్షేపికీ భవేత్,**
**విషమాల్పాక్షరా వాపి యే చాప్యర్థవశానుగాః. 47**

**తా.** లఘ్వక్షరాలు సరిసంఖ్యలో ఉన్న ఛందస్సు లేదా బేసి సంఖ్యలో లఘ్వక్షరాలున్న ఛందస్సు ఆక్షేపికీధ్రువలో ఉపయోగించాలి. (మ.ఘోష్) (శ్లోకం అస్పష్టార్థం).

**మూ. వర్ణప్రకర్షే తేషాం తు శామ్యాతాలేన యోజయేత్,**
**జాతీనాం త్వథ సర్వాసాం చన్దోవృత్తనిదర్శనమ్**
**స్థానప్రమాణసంజ్ఞాభిర్గదతో మే నిబోధత. 48**

**తా.** వీటి అక్షరాలను పెంచే దశలో శమ్యాతాలం ఉపయోగించాలి.

ఇప్పుడు చందస్సుల జాతివృత్తాలకు ఉదాహరణలను, వాటి స్థాన - సంజ్ఞా - ప్రమాణాదులతో సహా చెపుతున్నాను; వినండి.

**మూ. గురుగాథాంశకో యస్యాః సర్వపాదేషు దృశ్యతే,**
**హ్రీరితి ఖ్యాతనామాసౌ ప్రథమా కీర్తితా ధ్రువా. 49**

**యథా - యో గఙ్గాశ్రిత్**

**తా.** దేని అన్ని పాదాలలోను గాథాంశం (అనగా పాదంలోని ఒక భాగం) సర్వగురువో (అన్నీ గురువులే ఉన్నదో) అది 'హ్రీః' అని ప్రసిద్ధమైన పేరు గల మొదటి ధ్రువ.

ఎట్లనగా - **యో గఙ్గాశ్రిత్** (గంగను ఆశ్రయించిన)

**మూ. తత్రాత్యుక్తా సర్వే దీర్ఘాః. 50**

**యథా - ఈశం దేవం శర్వం వన్దే.**

**తా.** అన్ని అక్షరాలు గురువులుగా ఉన్న ఛందస్సు **అత్యుక్త**. ఉదాహరణం - **ఈశం దేవం శర్వం వన్దే**. దీనిలో రెండక్షరాలు ఒక పాదం. అక్షరా లన్నీ గురువులు.

**మూ. యత్పదం మధ్యతః స్యాలఘుః సా తటీ. 51**

**యథా - శఙ్కరః శూలభృత్ పాతు మాం లోకభృత్.**

**తా.** మూడక్షరాల పాదంలో మధ్యవర్ణం లఘు వైతే అది **'తటీ'**.

ఉదాహరణం : **"శఙ్కరః ..."** లోకాలు సృజించినవాడు, శూలధారీ అయిన శంకరుడు నన్ను రక్షించుగాక.

**మూ. లఘుః స్యాత్ పదాదౌ త్రికే యా ధృతిః సా. 52**

**యథా – ఉమేశః సురేన్ద్రః తవాయుర్దదాతు.**

**తా.** పాదంలోని మొదటి అక్షరం లఘు వైతే అది ధృతిచందస్సు. ఉదా :– **ఉమేశ ఇతి.** ఇది పాదానికి మూడు అక్షరా లున్న పూర్తి శ్లోకం. "సకలదేవతాప్రభు వైన పార్వతీపతి నీకు దీర్ఘాయుర్దాయం ఇచ్చుగాక."

**మూ. లఘునీ గురుచేద్ రజనీ ఖలు సా. 53**

**యథా – అధిఅంవిరహే మదణోదహతి (అధికం విరహే మదనో దహతి)**

**తా.** పాదంలో రెండు లఘువులు ఒక గురువు ఉంటే **రజనీవృత్తం.** ఉదా : ఉదాహరణం ప్రాకృతంలో ఉంది. బ్రాకట్లలో సంస్కృతచ్ఛాయ. రాబోయే ఉదాహరణలు కొన్ని ఈ విధంగా ప్రాకృతంలో ఉన్నాయి). **అధిఅం** ఇతి :– విరహంలో మన్మథుడు అధికంగా కాల్చివేస్తున్నాడు. (మూడక్షరాల పాదం).

**మూ. మధ్యే త్యుక్తా చ సా జ్ఞేయా ఏతా వై వృత్తజాతయః,**
**ప్రతిష్ఠాసుప్రతిష్ఠానాం భూయో వక్ష్యామి లక్షణమ్. 54**

**తా.** 'రజనీ' వృత్తానికి 'మధ్యా' 'ఉక్తా' అని కూడ పేర్లు. ఈ ధ్రువలు వృత్తఛందస్సుల వర్గానికి చెందినవి. ఇప్పుడు ప్రతిష్ఠా – సుప్రతిష్ఠాజాతికి చెందిన ధ్రువాలు చెపుతాను.

**మూ. ద్వితీయం లఘు సర్వత్ర చతుర్ణాం యత్ర దృశ్యతే,**
**సా ప్రతిష్ఠా బుధైర్ జ్ఞేయా సుత్రపిష్ఠా ద్వయేన చ. 55**

**తా.** నాలుగు అక్షరాల పాదంలోని రెండవ అక్షరం లఘు వైతే అది **'ప్రతిష్ఠా'** వృత్తం. ఈ ఛందస్సులోనే మూడు, నాలుగువర్ణాలు లఘువు లైతే **'సుప్రతిష్ఠ'.**

**మూ. ప్రతిష్ఠా యథా :–**
**సోసఅంతో అంగఆఇం వాది వాదో పుప్ఫవాహో. 56**
**(శోషయన్నఙ్గకాని వాతి వాతః పుష్పవాహీ)**

**తా.** ప్రతిష్ఠకు ఉదాహరణం – **సోసఅంతో** ఇతి. పుష్పాలను ఎగురకొట్టుకొని వస్తూన్న ఈ గాలి అవయవాలను శోషింపచేస్తూ వీచుచున్నది.

**మూ. సుప్రతిష్ఠా యథా –**
**ఏదిసుఏ ఊసఇఆ ఆహిణ్డఇ హంసవహూ. 57**
**(ఈదృశక ఉత్సుకితా ఆహిణ్డతి హంసవధూః).**

**తా.** ఆడహంస ఈ విధంగా బెంగతో తిరుగుతూన్నది.

**మూ. లఘునీ ప్రాగ్ గురుణీ ద్వే యది పాదే భ్రమరీ సా.** **58**

**తా. భ్రమరి :** నాలుగు అక్షరాల పాదంలో మొదటి రెండు లఘువులు, తరువాతి రెండూ గురువులూ అయితే **భ్రమరీ** వృత్తం.

**మూ. యథా :- వణసండే అదిమత్తో వణదత్థీ పరిఖిణ్ణో.** **59**
**(వనషణ్డేఽతిమత్తః వనహస్తీ పరిఖిన్నః).**

**తా.** ఉదాహరణం – "చాలా మదించిన వనగజం చెట్లగుంపులో ఖిన్నమై ఉంది."

**మూ. లఘుగురు సదా పదే భవేత్తు యా జయా హి సా.** **60**

**యథా – హి హిమాహఏ వణంతరే, అఅం గఓ పవిణ్ణఓ.** **61**

**(హిమాహతే వనాన్తరే అయం గజః ప్రవిష్టః).**

**తా. జయా :–** నాలుగు అక్షరాల పాదంలో క్రమంగా లఘు – గురువులు రెండు మార్లు వస్తే అది **జయావృత్తం.**

ఉదా :– **హిమాహఏ** – మంచు కురిసిన వనమధ్యలోనికి ఈ ఏనుగు ప్రవేశించింది.

**మూ. చతుర్ణాం యత్ర పాదానాం తృతీయం చ భవేల్లఘు,**
**విజ్ఞేయా సుప్రయోగజ్ఞైర్విజయా నామ నామతః.** **62**

**యథా – మారుల్లఓ ణచ్చంతఓ మేహాగమే సంవద్ధ ఓ**
**(మయూరా నృత్యన్తో మేఘాగమే సమన్తతః).** **63**

**తా. విజయా :–** పైన చెప్పిన వృత్తంలోని నాలుగు పాదాలలోను మూడవ వర్ణం లఘు వైతే అది **విజయావృత్తం.**

ఉదా :– **మారుల్లఓ :–** వర్షాకాలం రాగానే నెమళ్లు అన్నిప్రదేశాలలోను నృత్యం చేస్తున్నాయి.

**మూ. దేయాః సర్వే దీర్ఘాః పాదా యస్యా**
**నామ్నా విద్యుద్భ్రాన్తా సా వృత్తే స్యాత్.** **64**

**యథా – ఏ ఏ గజ్జన్తా తోఅం ముంచంతా**
**లోఅం ఛాదన్తా మేహా సమ్పత్తా.** **65**

**(ఏతే గర్జన్తః తోయం ముఞ్చన్తః లోకం ఛాదయన్తః మేఘాః సంప్రాప్తాః).**

**తా. విద్యుద్భ్రాంత :–** పాదాలలో అన్నీ గురువులే ఉన్న వృత్తం **విద్యుద్భ్రాంతా వృత్తం.**

**ఉదా : ఏఏ :–** గర్జిస్తూ, నీళ్లు కురుస్తూ, లోకాన్ని కప్పివేసి, ఇవిగో, మేఘాలు వచ్చేశాయి.

**మూ. ఆదిపరే ద్వే యత్ర హి నిత్యం హ్రస్వవిధౌ సా భూతలతన్వీ. 66**

**యథా :- మేహణిరుద్ధం పేక్ఖిఅ వోమ్మం**
**పంథిఅదారా అంసుకివిణ్ణా.**

**(మేఘనిరుద్ధం ప్రేక్ష్య వ్యోమ పథికభార్యా అశ్రుక్లిన్నా). 67**

**తా. భూతలతన్వీ (భూతలమాన్యా) :-** ఐదక్షరాల పాదంలో - మొదటి అక్షరం తరవాతి రెండు మూడు అక్షరాలు హ్రస్వా లైతే అది **భూతలమాన్యా** లేదా **భూతలతన్వీ** వృత్తం. ఎట్లనగా - **మేహణిరుద్ధం :** (ప్రవాసం వెళ్లిన) బాటసారి భార్య మేఘాలు కమ్మి వేసిన ఆకాశం చూడగానే కన్నీళ్లతో తడిసిపోయింది.

**మూ. యది చ గురుః పదనిధనే భవతి హి సా కమలముఖీ. 68**

**యథా - పవణహఓ సలిలధరో భమఇ ణహే అహియసమో. 69**
**(పవనహతః సలిలధరో భ్రమతి నభసి అహిసదృశః)**

**తా. కమలముఖీ :-** ఐదక్షరాల పాదంలో చివరి అక్షరం గురు వైతే అది **కమలముఖీవృత్తం.**

ఉదాహరణం : **పవణహఓ :-** ఆకాశంమీద ఈ మేఘం గాలి దెబ్బకి సర్పంవలె మెలికలు తిరుగుతూన్నది.

**మూ. ప్రథమం చ తృతీయ చ త్వన్తం చైవ యదా గురు,**
**దృశ్యతే ప్రతిపాదం తు సా జ్ఞేయా వాగురా యథా. 70**

**యథా - మేహరుద్ధఓ ణట్టజోహ్ణ ణిచ్చణిప్పహో ఏసచందఓ. 71**

**(మేఘరుద్ధో నష్టజ్యోత్స్నో నిత్యనిష్ప్రభః ఏష చన్ద్రః)**

**తా. వాగుర :-** ఐదు అక్షరాల పాదంలోని ఒకటి, మూడు, చివరి అక్షరాలు గురువులైతే అది **వాగురావృత్తం.**

ఉదా :- **'మేహరుద్దఓ'** మేఘం అడ్డం వచ్చి వెన్నెల పోయిన ఈ చంద్రబింబం పూర్తిగా కాంతి లేనిది అయిపోయింది.

**మూ. ద్వితీయం నైధనం చైవ చతుర్థం చ గురుర్యదా,**
**సుప్రతిష్ఠా కృతే పాదే సా శిఖా కథితా యథా. 72**

**యథా - వలాహఏహిం సంగజ్జిదేహిం ణహం సమతా పరుణ్ణఅంవ్వ. 73**
**(వలాహకైః సంగర్జితైః నభః సమన్తాత్ పూర్ణమేవ)**

**తా. శిఖా :-** ఐదక్షరాల సుప్రతిష్ఠాఛందఃపాదంలోని రెండు, నాలుగు, ఐదు వర్ణాలు గురువు లైతే అది **శిఖావృత్తం.**

**ఉదా :- వలాహఏహిం :-** గర్జిస్తున్న మేఘాలు ఆకాశాన్ని పూర్తిగా కప్పివేశాయి.

**మూ. లఘునీ త్వాదౌ చరణౌ యస్యా గదితా నామ్నా ఘనపంక్తిః సా. 74**

**యథా – తడిసణ్ణద్ధం ఘణసంరుద్ధం జలధారేహిం రుదతీవబ్భం. 75**
**(తడిత్సన్నద్ధం ఘనసంరుద్ధం జలదారాభీ రుదతీవాభ్రమ్).**

**తా. ఘనపంక్తి :-** ఐదక్షరాల పాదంలోని మొదటి రెండక్షరాలు లఘువులైతే అది ఘనపంక్తివృత్తం.

**ఉదా : తడిసణ్ణద్ధం :-** మేఘాలు కప్పివేయగా మెరుపులతో కట్టివేసిన ఆకాశం జలధారలతో ఏడుస్తూన్నట్లుంది.

**మూ. ఏతాస్తు జాతయో జ్ఞేయా సుప్రతిష్ఠా ధ్రువాస్వథ,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి గాయత్రీపరికల్పనమ్. 76**

**తా.** ధ్రువలలో ప్రయోగించే సుప్రతిష్ఠాజాతులు ఇవి. ఇపుడు నేను, ధ్రువలలో ఉపయోగించే గాయత్రీ ఛందోజాతులను చెపుతాను.

**మూ. ఆద్యే పునరన్త్యే పాదౌ గురుణీ చేత్ జ్ఞేయా తనుమధ్యా గాయత్రసముత్థా. 77**

**యథా – వజ్జాహఅతుండో ధాఉజ్ఝరసోత్తో ఏసో గిరిరాఓ భూమిం విసదివ్వ. 78**
**(వజ్రాహతతుణ్డో ధాతుర్ఝురస్రోతా; ఏషో గిరిరాజో భూమిం విశతీవ)**

**తా. తనుమధ్య :-** ఆరు అక్షరాల పాదంలోని మొదట రెండు అక్షరాలు, చివరి అక్షరమూ గురువు లైతే అది **తనుమధ్యావృత్తం.**

**ఉదా : వజ్జాహఅ :-** పిడుగుదెబ్బ తిన్న శిఖరంతో ధాతువుల ప్రవాహాన్ని స్రవిస్తూన్న ఈ గిరిరాజు భూమిలోనికి దిగిపోతూ నట్లుంది.

**మూ. ఆద్యం చతుర్థమన్త్యం చ గురూణ్యేతాని యత్ర తు,**
**గాయత్రీప్రథమే పాదే జ్ఞేయా సా మాలినీ యథా. 79**

**యథా – దీసది పుణ్ణఓ పువ్వదిసాముహే**
**జుణ్హాసమాగమో పుణ్ణిమాచందమో. 80**

**(దృశ్యతే పూర్ణః పూర్వదిశాముఖే జ్యోత్స్నాసమాగతః పూర్ణిమాచన్ద్రః)**

**తా. మాలిని :-** ఆరక్షరాల పాదంలోని ఒకటి, నాలుగు, ఆరు అక్షరాలు గురువు లైతే అది మాలినీవృత్తం.

**ఉదా : దీసది –** జ్యోత్స్నాసమాగతుడైన పూర్ణచంద్రుడు తూర్పుదిక్కున కనబడు తున్నాడు.

**మూ. (ప్రక్షిప్తశ్లోకం)**

**వాహ వికీరిఏ వజ్జివిణివాదిఏ; ఏత్థ మహాణఏ కన్దది హత్థిణీ,**

**(వాతవికీర్ణకే వజ్రవినిపతితే; అస్మిన్ మహానగే క్రన్దతి హస్తినీ)**

**తా.** మాలినీవృత్తానికే మరొక ఉదాహరణం. ఈ మహాపర్వతం గాలితో వ్యాకులమైన పిడుగులతో కొట్టబడు తూండగా ఆడ ఏనుగు అరుస్తూన్నది.

**మూ. గురుయుగమన్తే యది పరమస్యా**

**ఇహ కథితా సా మకరకశీర్షా. 81**

**యథా – ఇహి సిసిరమ్మి మదజణణమ్మి, పమదవణమ్మి విచరది వాదో. 82**

**(ఇహ శిశిరే మదజననే ప్రమదవనే విచరతి వాతః).**

**తా. మకరకశీర్షా :–** ఆరక్షరాల పాదంలోని చివరి రెండక్షరాలు గురువు లైతే మకరకశీర్షావృత్తం.

**ఉదా : ఇహ –** మదం కలిగించే ఈ శిశిరఋతువులో వాయువు, ఉద్యానవనంలో వీచుతూన్నది.

**మూ. లఘునీ చతుర్థచరణే తు యస్యాః,**

**భవతీహ సా వై విమలా నామ్నా. 83**

**యథా – కమలాఅరేసుం భమరాలఏసుం**

**మదముబ్బహంతో పవిసే ఇ హత్థీ. 84**

**(కమలాకరేషు భ్రమరాలయేషు మదముద్వహన్ ప్రవిశతి హస్తీ)**

**తా. విమల :–** ఆరక్షరాల పాదంలోని చతుర్థవర్ణం లఘు వైతే అది **విమలావృత్తం.**

**ఉదా :– కమలా –** మదించిన ఈ ఏనుగు తుమ్మెదల నెలవైన పద్మసరస్సులలోనికి ప్రవేశిస్తూన్నది.

**మూ. యస్యాః స్యశ్చరణే త్రీణ్యాదౌ నిధనమ్,**

**దీర్ఘాణీహ తు సా వీథిర్నామ యథా. 85**

**యథా – గజ్జంతే జలదా ణచ్చంతే సిహిణో**

**గాయన్తే భమరా రమ్మే పాఉసఏ. 86**

**(గర్జన్తే జలదా నృత్యన్తి శిఖినో గాయన్తి భ్రమరా రమ్యే ప్రావృషి)**

**తా. వీథి :–** ఆరక్షరాల పాదంలో మొదటి అక్షరము, చివరి అక్షరము గురువు లైతే అది **వీథీవృత్తం.**

**ఉదా :- గజ్జంతే –** రమ్యమైన వర్షాకాలంలో మేఘాలు గర్జిస్తున్నాయి; నెమళ్లు నృత్యం చేస్తున్నాయి. తుమ్మెదలు గానం చేస్తున్నాయి.

**మూ. త్రిలఘురాదితో యది చ పఞ్చమమ్,**
**భవతి పాదతః ప్రకథితా గిరా. 87**

**యథా – జలదణాదఅం సుణియ కుంజరో**
**ణదది కాణణే పడిగయాఉలో. 88**

**(జలదనాదం శ్రుత్వా కుఞ్జరో నదతి కాననే ప్రతిగజాతురః)**

**తా. గిరా :–** ఆరక్షరాల పాదంలోని మొదటి మూడక్షరాలు, ఐదవ అక్షరమూ లఘువు లైతే అది **గిరావృత్తం.**

**ఉదా : జలద –** ఏనుగు మేఘధ్వని విని, శత్రుగజ మేమో అన్న భయంతో ఘీంకరిస్తున్నది.

**మూ. ఆద్యే చతుర్థకమన్తే తథా గురుః,**
**యస్యాస్తు పాదతః జ్ఞేయా హి సా జలా. 89**

**యథా – ఏసా హిమాహదం విక్ఖిత్తపత్తఅం**
**దట్ఠూణపాదవం హంసీ పరుణ్ణిఆ. 90**

**(ఏషా హిమాహతం విక్షిప్తపత్రకం దృష్ట్వా హంసీ ప్రరుదితా).**

**తా. జలా :–** ఆరక్షరాల పాదంలో మొదటి నాలుగు అక్షరాలు, చివరిది గురువు లైతే అది **జలావృత్తం.**

**ఉదా : ఏసా –** మంచుదెబ్బ తగిలి ఆకులు రాలిపోయిన వృక్షాన్ని చూచి ఈ హంసి బిగ్గరగా ఏడ్వడం ప్రారంభించింది.

**మూ. హ్రస్వశ్చేచ్చతుర్థో దీర్ఘాశ్చైవ వర్ణాః,**
**సర్వే యత్ర పాదౌ రమ్యా తు నామ్నా. 91**

**యథా – ఏదే గజ్జమాణా అబ్భం ఛాదఅన్తా,**
**భీమా కాలమేహా ఉవ్వేదం జణేంతి. 92**

**(ఏతే గర్జన్తోஉభ్రం ఛాదయన్తో భీమాః కాలమేఘాః ఉద్వేగం జనయన్తి)**

**తా. రమ్యా :–** ఆరు అక్షరాల పాదంలో నాల్గవ అక్షరం లఘువై మిగిలిన వన్నీ గురువు లైతే అది **రమ్యావృత్తం.**

**ఉదా :– ఏదే –** ఆకాశం కప్పివేసి ఉరుముతూన్న భయంకరమైన ఈ కారుమేఘాలు ఉద్వేగం కలిస్తున్నాయి.

**మూ. ఆద్యచతుర్థే చ అన్త్యముపాన్త్యం చ,**
**యత్ర గురూణి స్యుః సా ఖలు వై కాన్తా.** **93**

**యథా – సాహఅ సుసబ్భాహం కింసి పిఏ కుద్ధా,**
**మా చిరసమ్బద్ధం పెక్ఖసి సబ్భావం.** **94**

**(సాధయ సుసద్భావం కిమసి ప్రియే క్రుద్ధా; మాం చిరసంబద్ధం ప్రేక్షసే సద్భావమ్)**

**తా. కాంతా :–** ఆరక్షరాల పాదంలో ఒకటి, నాలుగు, ఐదు, ఆరు అక్షరాలు గురువు లైతే అది **కాంతావృత్తం.**

**ఉదా :– సాహ –** నీ సద్భావం పరిరక్షించుకో. ప్రియా! ఎందుకు కోపిస్తున్నావు? చిరకాలంనుంచి నీతో సంబంధం గల సద్భావవంతుడ నైన నన్ను చూడు.

**మూ. త్రీణ్యాదౌ తు యది అన్త్యశ్చాపి గురుః,**
**నామ్నా వై కథితా పఙ్క్తిః సా తు యథా.** **95**

**యథా – ఏసాహంసవహూ ఏత్థా కాణణదో**
**గన్తుం ఊసుఇఆ కాన్తం సంగహుఅ.** **96**

**(ఏషా హంసవధూః విద్ధా కాననతః గన్తుముత్సుకా కాన్తం సంగన్తుమ్).**

**తా. పంక్తి :–** ఆరక్షరాల పాదంలోని మొదటి మూడు అక్షరాలు, చివరిదీ గురువు లైతే అది పంక్తి (ఛందస్సు) వృత్తం.

**ఉదా :– ఏసా –** ఈ హంసవధువు ఈ కాననం విడిచివెళ్లి ఏదో విధంగా తన ప్రియుణ్ణి కలవాలని ఎంతో ఉత్కంఠతతో ఉంది.

**మూ. లఘునీ చ గురు చ ద్విగుణం యది చ,**
**చరణే చరణే కథితా నలినీ.** **97**

**యథా – పవణాహ్యదఆ తరుణా తరఓ**
**కుసుమోగ్గమఏ విహసంతి విఅ.** **98**

**(పవనాహతాస్తరుణాస్తరవో కుసుమోద్గమే విహసన్తీవ)**

**తా. నలినీ :–** ఆరక్షరాల పాదంలో రెండు లఘువులు ఒక గురువు రెండు పర్యాయాలు వస్తే అది **మాలినీవృత్తం.**

**ఉదా :– పవణా –** వసంతప్రారంభంలో మొక్క లన్నీ గాలికి కదులుతూ నవ్వుతూన్నట్లున్నాయి. లేదా – పువ్వులు పుడుతూన్న తరుణవృక్షాలు పవనస్పర్శ తగిలి నవ్వుతూన్నట్లున్నాయి.

**మూ. స్యాద్ద్వితీయం హ్రస్వం సర్వమన్యద్ దీర్ఘమ్,**
**యత్ర పాదౌ పాదౌ నీలతోయా సా స్యాత్.** **99**

**యథా – మేహవుందం వాదో వికరంతో వాది,**
**దూసహో ఆవాది పాదవాణం వాసీ.** **100**

**(మేఘవృన్దం వాతో వికిరన్ వాతి దుఃసహ ఆభాతి పాదపానాం లాసీ)**

**తా. నీలతోయా :–** ఆరక్షరాల పాదంలో రెండవ అక్షరం లఘువై మిగిలిన వన్నీ గురువు లైతే అది **నీలతోయావృత్తం.**

**ఉదా :– మేహవుందం –** తీవ్రమైన గాలి మేఘసముదాయాన్ని ఇటు అటూ విసిరేస్తూ చెట్లను ఊగిపోయే టట్లు చేస్తూ వీచుచున్నది.

**మూ. గాయత్ర్యా జాతయో హ్యేతా విజ్ఞేయాః సమవృత్తజాః,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి ఉష్ణిగ్‌జాతివికల్పనమ్.** **101**

**తా.** గాయత్రీఛందస్సుకు సంబంధించి సమవృత్తాలైన ధ్రువజాతులు ఇవే. ఇప్పుడు నేను ఉష్ణిగ్ ఛందస్సుకు సంబంధించిన వృత్తాలలో ధ్రువాజాతులు చెపుతాను.

**మూ. గురు నిధనగతం యది భవతి సదా,**
**భవతి తు చపలా ద్రుతగతిరథవా.** **102**

**యథా – సురుచిరణయణం వరమణిణియరం**
**మమ మదజణణం తవ వదణమిదం.** **103**

**(సురుచిరనయనం వరమణినికరం మమ మదజననం తవ వదనమిదమ్)**

**తా. చపలా లేదా ద్రుతగతి :–** ఏడక్షరాల పాదంలో చివరి అక్షరం గురు వైతే అది చపలావృత్తం లేదా **ద్రుతగతివృత్తం.**

**ఉదా :– సురుచిర –** అందమైన నేత్రములు గలది, శ్రేష్ఠమైన మణిసముదాయాలు కలది అయిన నీ ఈ వదనం నాలో మదనుణ్ణి పుట్టిస్తూన్నది.

**మూ. గురు చాన్త్యపఞ్చమం చరణే తృతీయతః,**
**గదితా తతస్తు సా విమలేతి నామతః.** **104**

**యథా – పిఓ వాఇ వాయఓ సువసంతకాలఏ**
**ఏస కాముఓ విఅ మదనం జణేంతఓ.** **105**

**(ప్రియో వాతి వాయుః సువసన్తకాలే; ఏష కాముక ఇవ మదనం జనయన్)**

**తా. విమలా :–** ఏడక్షరాల పాదంలో ఐదవ అక్షరము, చివరి అక్షరము గురువు లైతే అది **విమలావృత్తం.**

**ఉదా :- పియో -** వసంతకాలంలో ఈ వాయువు, ప్రియుడైన కాముకుడు వలె మన్మథుని (అభిలాషను) జనింపచేస్తూ వీచుతున్నాడు (చున్నది).

**మూ. గురుణా లఘునా చైవ సమానా యా హి వా ధ్రువా,**
**ఛన్దస్యుష్ణిక్కృతే పాదౌ సా జ్ఞేయా కామినీ యథా. 106**

**యథా - పేక్ఖిఊణ ఆఅదం సాహవం చ ఇట్ఠఓ**
**పాదవం వణోల్లఓ వాది వామవాదఓ. 107**

**(ప్రేక్ష్య ఆగతం మాధవం చ ఇష్టకః పాదపం వనోద్యతో వాతి వామవాతకః)**

**తా. కామినీ :-** ఏడక్షరాల పాదంలో లఘువులు గురువులతో సమానరూపంలో వరుసగా ఉంటే అది **కామినీవృత్తం.**

**ఉదా :-** వసంతుడు వస్తూన్నట్లు చూచి దక్షిణవాయువు వనంలో ఉద్యమించి వసంతుని గౌరవంకోసం (స్వాగతిస్తూ) వృక్షాలను కదుపుతూన్నది.

**మూ. ఆద్యే పునరథాన్త్యే పాదే చ గురుణీ ద్వే,**
**జ్ఞేయా భ్రమరమాలా నామ్నా ప్రకథితా సా. 108**

**యథా - హంసాగమణదీరం కాసం సుఅవిచిత్రమ్,**
**ఏదం సరదకాలే రమ్మం సరసి తోఅమ్. 109**

**(హంసాగమనధీరం కాశం సుఖవిచిత్రమ్. ఏతత్ శరది కాలే రమ్యం సరసితోయమ్)**

**తా. భ్రమరమాలా :-** ఏడక్షరాల పాదంలో మొదటి రెండక్షరాలు, చివరి రెండక్షరాలు గురువు లైతే అది **భ్రమరమాలావృత్తం.**

**ఉదా :- హంసాగమణ -** శరత్కాలంలో ఈ సరస్సు; హంసల రాకచేత ధీరంగా, మనోహరంగా, ఉంది. రెల్లుగడ్డి సుఖప్రదమై విచిత్రంగా ఉంది. ఉదకం నిర్మలంగా ఉంది.

**మూ. ఆద్యచతుర్థగతే అన్త్యతమం చ గురు,**
**యత్ర సదా చరణే సా ఖలు భోగవతీ. 110**

**యథా - చక్కసణామవహూ కంతసహాఇణిఆ**
**ణిమ్మలయమ్మి జలే హిణ్డది సంగదిఆ. 111**

**(చక్రసనామవధూః కాన్తసహాయం నీతా; నిర్మలేఽస్మిన్ జలే హిణ్డతి సంగతికా)**

**తా. భోగవతీ :-** ఏడు అక్షరాల పాదంలోని మొదటి నాల్గవ, చివరి వర్ణాలు గురువు లైతే అది **భోగవతీవృత్తం.**

**ఉదాహరణం :– చక్కసణామ –** ప్రియుణ్ణి చేరిన ఆడచక్రవాకపక్షి, కాంతునితో కలిసి నిర్మలమైన ఈ జలంలో సంచరిస్తూన్నది.

**మూ. ఆదౌ యది గురుణీ అన్త్యం నిధనగతమ్,**
**జ్ఞేయా మధుకరికా హ్యృష్టిగ్వినిగదితా. 112**

**యథా – ఏసా పిఅకలదా రమ్మాభరణజుదా,**
**కాలే మదజణణే జాదా కుసువవతీ. 113**

**(ఏషా ప్రియకలతా రమ్యాభరణయుతా, కాలే మదజననే జాతా కుసుమవతీ).**

**తా. మధుకరికా :–** ఏడు అక్షరాల పాదంలోని మొదటి రెండు అక్షరాలు; చివరిదీ గురువు లైతే అది **మధుకరికావృత్తం**.

**ఉదా :– ఏసా –** రమ్య మైన ఆభరణములతో కూడిన (నిండి ఉన్న) ఈ ప్రియంగులత మదజనక మైన కాలంలో కుసుమవతి అయినది.

**మూ. ద్వితీయం చ చతుర్థం చ అన్త్యోపాన్త్యే తథైవ చ,**
**పాదౌ యత్ర గురూణి స్యుః సుభద్రా నామతో యథా. 114**

**యథా – హిమాహదే వణమ్మి పణట్ఠపక్ఖితోయే,**
**కరేణుఆ విహీణో ఉవేది మత్థహత్థీ. 115**

**(హిమాహతే వనే ప్రణష్టపక్షితోయే; కరేణుకావిహీనః ఉపైతి మత్తహస్తీ).**

**తా. సుభద్రా :–** ఏడక్షరాల పాదంలో రెండవ, మూడవ, ఆరవ ఏడవ అక్షరాలు గురువులైతే అది **సుభద్రావృత్తం**.

**ఉదా :–** మంచు బాగా కురిసి, పక్షులూ, నీళ్లూ లేని వనంలోనికి ఈ మత్తగజం, ఆడ ఏనుగు లేకుండానే ప్రవేశిస్తూన్నది.

**మూ. యది చ భవత్యన్త్యే పది పది దీర్ఘాణి,**
**త్రిగురురిహప్రోక్తా కుసుమవతీ నామ్నా. 116**

**యథా – జలహరసమ్భత్తే క్షితిధరమూలే**
**సహయరిసంజుత్తో పవిచరిదో హత్థీ. 117**

**(జలధరసంభృతే క్షితిధరమూలే; సహచరీసంయుక్తః ప్రవిచరితః హస్తీ)**

**తా. కుసుమవతీ :–** ఏడక్షరాల పాదంలోని చివరి మూడు అక్షరాలు గురువు లైతే అది **కుసుమవతీవృత్తం**.

**ఉదా :– జలహర –** సహచరీ(రు)లతో కూడి ఈ గజం మేఘాలతో నిండిన పర్వతమూలంలో సంచరిస్తూన్నది.

**మూ. ద్వితీయం చ తృతీయం చ అథాన్తే గురుణీ చేత్,**
**సదా యత్ర తు పాదే భవేత్ సా ముదితా వై. 118**

**యథా – మహామేహవిదాణం బలాకాకులబద్ధమ్,**
**మహాభీమణిణాదం పదిణ్ణం గయణమ్మి. 119**

**(మహామేఘవితానం బలాకాకులబద్ధమ్; మహాభీమనినాదం ప్రదత్తం గగనే)**

**తా. ముదితా :–** ఏడక్షరాల పాదంలోని రెండు, మూడు, ఏడు అక్షరాలు గురువు లైతే అది **ముదితావృత్తం.**

**ఉదా :– మహామేహ –** ఆకాశంమీద చాల పెద్దదైన మేఘాల వితానం (చాదనీ) బలాకలతో (కొంగలతో) ఆకులంగా కట్టబడింది. భయంకరంగా ధ్వని చేస్తూన్నది.

**మూ. చతుర్థం నిధనం చైవ షష్ఠం చైవ గురూణ్యథ,**
**యత్ర తూష్ణీకృతే పాదౌ నామ్నా సాహి ప్రకాశితా. 120**

**యథా – కుసుమగన్ధవాహీ సలిలరేణుపుణ్ణో**
**రమణ వాది వాదో మణసిజం జణంతో. 121**

**(కుసుమగన్ధవాహీ సలిలరేణుపూర్ణః రమణి వాతి వాతః మనసిజం జనయన్).**

**తా. ప్రకాశితా :–** ఏడు అక్షరాల పాదంలోని నాలుగు, ఆరు, ఏడు అక్షరాలు గురువు లైతే అది **ప్రకాశితావృత్తం.**

**ఉదా :– కుసుమ –** రమణీ! పుష్పగంధం మోసికొనివస్తూ, నీటి తుంపరలతో నిండి ఉన్న ఈ మందమారుతం మన్మథుణ్ణి రేకెత్తిస్తూ వీస్తూన్నది.

**మూ. ప్రథమం యత్ర పాదే లఘునీ పఞ్చమం చ,**
**కథితా సా తు దీప్తా సతతం చేత్తథోష్ణిక్. 122**

**యథా – పవణో పుప్ఫవాహీ మదణం దీవయంతో,**
**సిసిరే వాది కాలే మమ సోఅం జణంతో. 123**

**(పవనః పుష్పవాహీ మదనం దీపయన్; శిశిరే వాతి కాలే మమ శోకం జనయన్)**

**తా. దీప్తా :–** ఏడక్షరాల పాదంలో ప్రథమ – పంచమాక్షరాలు లఘువు లైతే అది **దీప్తావృత్తం.**

**ఉదా :–** శిశిరఋతుపవనం సుగంధాన్ని అంతటా వ్యాపింపచేస్తూ మదనుణ్ణి ఉత్తేజింప చేస్తూన్నది. నా కైతే శోకం కలిగిస్తూన్నది.

**మూ. ద్వితీయం చ చతుర్థం చ అన్త్యోపాన్త్యే తథైవ చ,**
**తత్ర పాదే తు దీర్ఘాణి ఉష్ణిక్ సా తు విలమ్బితా. 124**

**యథా – గఇందతో అఖోఆ పటీపరిత్థహంసా,**
**భమంత చక్కవాఆ ణదీ గఆ సముహమ్. 125**

**(గజేన్ద్రతోయక్షోభా ప్రతీపరుద్ధహంసా; భ్రమచ్చక్రవాకా నదీ గతా సముద్రమ్)**

**తా. విలమ్బితా :–** ఏడక్షరాల పాదంలోని ద్వితీయ – చతుర్థ – సప్తమవర్ణాలు గురువు లైతే అది **విలంబితావృత్తం.**

**ఉదా :– గఇందతో –** గజేంద్రులు ఉదకాన్ని క్షోభింప చేస్తున్నా, హంసలు అడ్డం వచ్చి ఆపుతున్నా, చక్రవాకాలు చక్రభ్రమణం చేస్తున్నా లెక్క చేయకుండా నది తనప్రియుడైన సుముద్రుని చేరిపోయింది.

**మూ. ఆద్యమథ పఞ్చమం దీర్ఘమథ నైధనమ్,**
**యత్ర యది నామతః చఞ్చలగతిస్తు సా. 126**

**యథా – మేహమలముక్కఓ ణిమ్మలభణిగ్గఓ,**
**పుణ్ణససి సౌహది ఏస ణహఅంగణే. 127**

**(మేఘమలముక్తః నిర్మలభాణ్డగతః; పూర్ణః శశీ శోభతే ఏష నభోఙ్గణే)**

**తా. చంచలగతి :–** ఏడక్షరాల పాదంలో ప్రథమ – పంచమ – సప్తమాక్షరాలు గురువు లైతే అది **చంచలగతివృత్తం.**

**ఉదా :– మేహమల –** మేఘమాలిన్యానికి దూర మైన ఈపూర్ణచంద్రబింబం, ఆకాశప్రాంగణంలో, నిర్మలమైన భాణ్డంలో ఉన్నట్లు చాల మనోహరంగా ఉంది.

**మూ. ఏతాస్తు జాతయో జ్ఞేయాః స్థితాః ప్రసాదికీష్వథ,**
**అతఃపరం ప్రవక్ష్యామి త్వనుష్టుబ్లక్షణం పృథక్. 128**

**తా.** ఇవీ ప్రాసాదికీధ్రువలలో ఉపయోగించే జాతులు. ఇపుడు నేను అనుష్టుబ్ జాతి భేదాలను గూర్చి చెపుతాను.

**మూ. లఘునీ గురులఘునీ యది వా గురు చరమే,**
**చరణే ప్రతినియతా కథితా విమలజలా. 129**

**యథా – వికచామ్బుజహసిరే భమరావలిముహలే,**
**బహుణిమ్మలసలిలే విహగో పరిభమది. 130**

**(వికచామ్బుజహసితే భ్రమరావలిముఖరే, బహునిర్మలసలిలే విహగః పరిభ్రామ్యతి)**

**తా. విమలజలా :-** ఎనిమి దక్షరాల అనుష్టుప్ఛందః పాదంలో రెండు లఘు వుల తరువాత తృతీయవర్ణము, మూడు లఘువుల తరువాత అష్టవర్ణమూ గురువు లైతే అది **విమలాజలావృత్తం.**

**ఉదా :- వికచామ్బుజ -** వికసించిన పద్మాలతో హాసం చేస్తూన్న, భ్రమర పంక్తుల ధ్వనులతో నిండిన నిర్మలసలిలం గల పద్మసరస్సుపైన పక్షి పరిభ్రమిస్తూన్నది (తిరుగు తూన్నది).

**మూ. యది ఖలు పఞ్చమకః పునరపి చాన్త్యగతః,**
**భవతి చ పాదేఽపి చ గురుః లలితగతిః ఖలు సా. 131**

**యథా - కుసుమసుఅందిఅఏ మణసిజదీవణఏ,**
**ప్రమదవణంగణఏ విలసది హంసవహూ. 132**

**(కుసుమసుగన్ధితే మనసిజదీపనే, ప్రమదవనాఙ్గణే విలసతి హంసవధూః)**

**తా. లలితగతి :-** ఎనిమి దక్షరాల పాదంలోని పంచమఅష్టమాక్షరాలు గురువు లయితే అది **లలితగతివృత్తం.**

**ఉదా :- కుసుమ -** పుష్పాల సుగంధంతో నిండి మన్మథోత్తేజకమైన ఉద్యాన వనంలో హంసవధువు విహరిస్తూన్నది.

**మూ. షష్ఠం చైవాష్టమం చైవ యస్యాః స్యాదక్షరం గురు,**
**నిత్యమానుష్టుభే పాదే మహీ జ్ఞేయా తు సాయా యథా. 133**

**యథా - బహుకుసుమసోహిఏ కమలసండఏ,**
**సహఅరసహోఇణీ పరిసరది హంసిఆ 134**

**(బహుకుసుమశోభితే కమలవనఖణ్డే, సహచరసహాయినీ పరిసరతి హంసికా)**

**తా. మహీ :-** ఎనిమి దక్షరాల పాదంలోని ఆరు ఎనిమిది అక్షరాలు గురువు లైతే అది **మహీవృత్తం.**

**ఉదా :- బహుకుసుమ -** అనేక కుసుమాలతో శోభిస్తూన్న కమలసరస్సులో హంసిక సహచరునితో కలిసి సంచరిస్తూన్నది.

**మూ. లఘుగణ ఇహ షట్కో యది భవతి ముఖే తు,**
**చరణగతివిధౌ సా మధుకరసదృశాఖ్యా. 135**

**యథా - వివిధవణవిచారీ కమలవణసుగన్ధీ,**
**కుసుమవణవిబోధీ భవది సరది వాఓ. 136**

**(వివిధవనవిచారీ కమలవనసుగన్ధిః; కుసుమవనవిబోధీ భ్రమతి శరది వాతః)**

**తా. మధుకరసదృశా :–** ఎనిమి దక్షరాల పాదంలోని మొదటి ఆరు అక్షరాలు లఘువు లైతే అది **మధుకరసదృశావృత్తం.**

**ఉదా – వివిధ –** శరత్కాలంలో ఈ వాయువు కమలవనసుగంధాలతో నిండినదై, కుసుమవన్నాన్ని మేల్కొలుపుతూ వివిధవనాలలో సంచరిస్తూ వీస్తూన్నది.

**మూ. యది ఖలు పఞ్చమకం పునరపి చాన్త్యమకమ్,**
**గురు చరణే తు యదా భవతి సా నలినీ. 137**

**యథా – పులినతలంగణఏ కమలణిధివాసిణీ,**
**పజవం హి వాసగిహం పఅరది సారసి ఆ. 138**

**(పులినతలాఙ్గణే కమలనిధినివాసినీ, ప్రజవం హి వాసగృహం ప్రచరతి సారసికా)**

**తా. నలినీ :–** ఎనిమి దక్షరాల పాదంలోని ఐదు, ఎనిమిది అక్షరాలు గురువు లైతే అది **నలినీవృత్తం.**

**ఉదా :– పులినతలంగణఏ –** కమలసరోవనంలో నివసించే సారసిక నదీతీరం మీద ఇసుకతిన్నె మీద ఉన్న తన ప్రియతముని ఆవాసగృహం వైపు వెళ్ళడానికి బయలు దేరింది.

**మూ. ఆద్యమపి నిధనం చ దీర్ఘమథ భవతి చేత్,**
**యత్ర హి చరణవిధౌ సా ఖలు భవతి నదీ. 139**

**యథా – హంసకులసంముదితే సారసకులముహలే,**
**మత్తమధుఅరగణే హిణ్ణతి మహుఅరిఆ. 140**

**(హంసకులసంముదితే సారసకులముఖరే మత్తమధుకరకులే హిణ్డతి మధుకరికా)**

**తా. నదీ :–** ఎనిమిది అక్షరాల పాదంలోని ప్రథమ – అష్టమాక్షరాలు గురువు లైతే అది **నదీవృత్తం.**

**ఉదా :– హంసకుల –** ఈ మధుకరిక, హంసల గుంపులు ఆనందిస్తూన్న, సారసకులాల కోలాహలంతో నిండిన, మదించిన మధుకరకులాలు వ్యాపించి ఉన్న కమలవనంలోనికి ప్రవేశిస్తూన్నది.

**మూ. అనుష్టుప్ జాతయోహ్యేతాః ప్రావేశిక్యః ప్రకీర్తితాః,**
**స్త్రీణాముత్తమమధ్యానామపకృష్టాం నిబోధత. 141**

**తా.** ఇవి అనుష్టుప్ జాతికి చెందిన ప్రాదేశికీధ్రువలు. ఇపుడు నేను, మధ్యమ – ఉత్తమజాతిస్త్రీలు ప్రయోగించవలసిన 'అపకృష్టాధ్రువను' గూర్చి చెపుతాను.

**మూ. ఆద్యే చతుర్థమపి చాన్త్యే దీర్ఘాణి యత్ర చరణే తు,**
**ప్రావేశికీ తు బృహతీ సా నామ్నా తథైవ రుచిరాఖ్యా. 142**

**యథా – రాహూపరాఅహిఅసోహం చందం ణహే ణిసమిఊణ,**
**తారాగణో వి హతసోహో తేజస్సుఏహిం రుదదివ్వా. 143**

**(రాహూపరాగహృతశోభం చన్ద్రం నభసి నిరీక్ష్య,**
**తారాగణో౽పి హతశోభస్తేజోశ్రుభీ రుదతీవ).**

**తా. రుచిరా :–** తొమ్మి దక్షరాల పాదంలోని ప్రథమ – చతుర్థ – నవమవర్ణాలు గురువు లైతే అది **రూచిరావృత్తం.**

**ఉదా :– రాహూపరాగ –** చంద్రుడు రాహుగ్రస్తుడై ఆకాశంలో శోభావిహీనుడై ఉండడం చూచిన తార లన్నీ అత్యధికమైన శోకంతో తేజోరూప మైన కన్నీళ్లు కారుస్తున్న ట్లున్నాయి.

**మూ. యది పఞ్చమం హి సతృతీయం పాదాన్తరచితే వై,**
**ప్రమితేతి సా భవతి నామ్నా అవకృష్టా జాతిరిహ పఙ్క్తిః. 144**

**యథా – ఘణగచ్ఛగేద్దపరిఖిత్తో అరుణఘహోపిహిదసోహో,**
**గయణంగణే విహరమాణో ణ విభాది జుహ్వారహిదేన్దు. 145**

**(ఘనగర్భగేహే పరిక్షిప్తో అరుణప్రభాపిహితశోభః,**
**గగనాఙ్గణే విహరమాణో న విభాతి జోత్స్నారహిత ఇన్దుః).**

**తా. ప్రమితా :–** తొమ్మి దక్షరాల పాదంలో మూడవ అక్షరము, ఐదవ అక్షరము, చివరి మూడు అక్షరాలు గురువు లైతే అది **ప్రమితావృత్తం.**

**ఉదా :– ఘణగబ్భ –** మేఘగర్భగృహంలో పడవేయబడిన చంద్రుడు, అరుణుని కాంతి శోభను కప్పివేయగా జ్యోత్స్నారహితుడై ఆకాశాంగణంలో విహరిస్తున్నా శోభావిహీను డై ఉన్నాడు.

**మూ. యది ఖలు షష్ఠమథాన్త్యే భవతో గురుణీ చరణయోగే,**
**స్థితిలయకృతా తు జగతీ సా భువి గదితా గతశోకా. 146**

**యథా – జలహరణవిదాణపిహిదఙ్గో రవికిరణజాలహిదసోహో,**
**అహముఖవిణిగ్గవివణ్ణో అసు విసది అత్థగిరిమిందు. 147**

**(జలధరవితానపిహితాఙ్గః రవికిరణజాలహృతశోభః,**
**అహర్ముఖవినిర్గమవివర్ణః ఆశు విశతి అస్తగిరిమిన్దుః).**

**తా. గతశోకా :–** తొమ్మి దక్షరాల పాదంలోని షష్ఠ – నవమాక్షరాలు గురువు లైతే అది **గతశోకావృత్తం**.

**ఉదా :– జలహర –** మేఘాలు వ్యాపించడంచేత కప్పబడిన శరీరం కలవాడై సూర్యకిరణాలచేత కూడ శోభతగ్గిన, ప్రాతఃకాలప్రారంభంతో రంగు మారిపోయిన చంద్రుడు అస్తాద్రి చేరుతున్నాడు.

**మూ. ఆద్యే చతుర్థం దశమాష్టమాన్తగా యస్యా గురూణి చ భవన్తి పాదతః,**
**సా త్రైష్టుభే పాదవిధౌ విశ్లోకజాతిరవకృష్టగతా. 148**

**యథా – మేహత్థిఓ రవికరాభిహదో తారాగణే హి విధురే గమిదో,**
**అత్థం ఉవేది అరుణాభిహదో చందో ణహమ్మి రఅణీసహిదో. 149**

**(మేఘస్థితో రవికరాభిహతస్తారాగణైర్వైధుర్యం గమితః,**
**అస్తముపైత్యరుణాభిహతశ్చన్ద్రో నభసి రజనీసహితః).**

**తా. విశ్లోక :–** అతిజగతీఛందస్సుకు చెందిన పన్నెండక్షరాల పాదంలో మొదటి రెండు అక్షరాలు, నాలుగు, ఎనిమిది, పది, పన్నెందు అక్షరాలు గురువు లైతే అది **విశ్లోకవృత్తం**.

**ఉదా :– మేహత్థిఓ –** మేఘాలమధ్య ఉండిపోయిన చంద్రుడు రవికిరణాలచేత కొట్టబడి, తారాగణములు విడిచివేయగా, అరుణుని చేత తిరస్కృతుడై రాత్రితో కూడ అస్తమిస్తున్నాడు.

**మూ. ఆద్యే చతుర్థం దశమం నైధనం హ్యష్టమం తథా,**
**యత్ర దీర్ఘాణి పాదే స్యుః తత్ వృత్తం లలితం స్మృతమ్. 150**

**యథా – ఏసో పమత్తమయఘుమ్మిదాణణో**
**ఝీణో పఫుల్లవణవాదిచాలిదో,**
**పాసాభిబద్ధచరణో గఆణుగో**
**రమ్మం వణం గఅవరో పలాఅది. 151**

**(ఏష ప్రమత్తమదఘూర్ణితాననో క్షీణః ప్రఫుల్లవనవాతచాలితః**
**పాశాభిబద్ధచరణో గజానుగో రమ్యే వనే గజవరః పలాయతే).**

**తా. లలితా :–** పన్నెండు అక్షరాల పాదంలోని ఒకటి, నాలుగు, ఎనిమిది, పది, పన్నెండు అక్షరాలు గురువు లైతే అది **లలితావృత్తం**.

**ఉదా :– ఏసో –** అత్యధిక మైన మదంచేత తల తిరిగిపోతూన్న, చిక్కిపోయి అధికమైన వనవాయువుచేత కదిలిపోతూన్న, పాశాలచేత కట్టబడిన పాదాలు గల ఈ శ్రేష్ఠగజం, మరొక గజాన్ని అనుసరిస్తూ వనంలో పరుగెత్తుచున్నది.

**మూ. యది పఞ్చమం హి సతృతీయనైధనం**
**నవమం ద్వితీయమపి తస్య తాదృశమ్,**
**చరణే గురూణి యది సాతిపూర్వికా**
**జగతీ బుధైర్నిగదితా విలమ్బితా. 152**

**యథా – ఘణసంతదాయదవిదాణమంబరం**
**అవలంబఊణ రఅణీముహే ససీ,**
**గహగాహసంకుచితమందజోహఓ**
**ణ విరాజదే సవది కిం పధావిఓ. 153**

**(ఘనసన్తతాయతవితానమమ్బర**
**మవలమ్బితుం న రజనీముఖే శశీ,**
**గ్రహగ్రాహసంకుచితమన్దజ్యోత్స్నః**
**న విరాజతే సపది కిం ప్రధావితః).**

**తా. విలంబితా :–** పదమూడు అక్షరాల పాదంలోని మూడు, ఐదు, తొమ్మిది, పదకొండు, పదమూడు అక్షరాలు గురువు లైతే అది **విలంబితవృత్తం**.

**ఉదా :– ఘణ –** రాత్రిప్రారంభంలో చంద్రుడు ఆకాశం అంతా మేఘాలు కప్పివేయడంచేత, పైకి రాజాలక, రాహువు పట్టుకొన్నప్పుడు క్షీణించి నట్లు వెన్నెల క్షీణించగా ప్రకాశించడంలేదు. ఎక్కడి కైనా పారిపోయాడా!

(శ్లోకాలలో తప్పులు అధికంగా ఉండడంచేత ఉన్న పదాలను పట్టి అర్థాలు చెప్పడం జరుగుతూన్నది. అందుచేతనే నాట్యశాస్త్రగ్రంథపరిశోధనలో అత్యధికమైన పరిశ్రమచేసిన మన్‌మోహన్‌ఘోష్ కూడ అనేక స్థలాలలో దాదాపు అన్ని అధ్యాయాలలోనూ కూడ, "Text is corrupt" (పాఠం సరిగా లేదు). "Translation is tentative" "నే నిచ్చిన అనువాదం ఏదో ఇవ్వాలి కదా అని ఇచ్చినది) అని స్పష్టంగా వ్రాశారు.

**మూ. ఏతాః సుజాతయో జ్ఞేయాః స్థితానాం తు ప్రవేశజాః,**
**ఆక్షేపికాపకృష్టానాం సంప్రవక్ష్యామి లక్షణమ్. 154**

**తా.** ఇవి ప్రావేశికీస్థితాజాతికి చెందిన ధ్రువలు. ఇపుడు ఆక్షేపికాపకృష్టాజాతికి చెందిన ధ్రువలను చెపుతాను.

**మూ. సుప్రతిష్ఠాదికం ఛన్దస్త్వవకృష్టాసు యోజయేత్,**
**అత్యుక్తాదీని చ తథా దేవస్తుత్యాశ్రయాణి తు. 155**

**తా.** అపకృష్టాధ్రువలలో సుప్రతిష్ఠాజాతిఛందస్సులు ఉపయోగించాలి. అదే విధంగా దేవతాస్తుతిలో ప్రయోగించే వాటిలో అత్యుక్తాదిఛందస్సులను ఉపయోగించాలి.

**మూ. అక్షరాణాం నివేశేన యతయః పాణయస్తథా,**
**అవకృష్టాస్తు యస్యాః స్యుః అవకృష్టా తు సా భవేత్. 156**

**తా.** దేని యతులు, పాణులు, అక్షరాలు కలల మధ్య నున్న విభాగాదుల ద్వారా కూర్చబడతాయో అది అపకృష్టాధ్రువ (?)

**మూ. స్థాయివర్ణా స్థితలయా కలాన్తరకృతాక్షరా,**
**సమపాణియతిశ్చైవ హ్యాపకృష్టా విధీయతే. 157**

**తా.** అపకృష్టాధ్రువలో స్థాయివర్ణాలు, స్థితలయలు, వివిధకలలలో వర్ణసంఖ్యా నిర్ధారణము, సమపాణి, సమయతి ఉంటాయి.

**మూ. అల్పవస్తుపదా నిత్యమపకృష్టా విధీయతే,**
**ప్రావేశిక్యాస్తు సంక్షేపః కరణాఙ్గపరిగ్రహాత్. 159**

**తా.** అపకృష్టాధ్రువను అల్పవస్తువుతోను, అల్పపదాలతోను నిర్మించాలి. ప్రావేశికీ ధ్రువలో కరణాంగాలను ప్రవేశపెట్టడంద్వారా, దానిని సంక్షిప్తం చెయ్యాలి.

**మూ. ఏవం జ్ఞేయాపకృష్టానాం జాతీనాం వృత్తసంభవః,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి ధ్రుతానామిహ లక్షణమ్. 160**

**తా.** అపకృష్టాధ్రువలో ఉపయోగించే వృత్తాల విధానం ఈ విధంగా తెలియ దగినది. ఇప్పుడు ధ్రుతాధ్రువల లక్షణం చెపుతాను.

**మూ. ముఖే తు తోటకం కృత్వా శేషం హ్రస్వం తు యోజయేత్,**
**యుగ్మమోజస్తు మిశ్రం వా తథైవ లఘుసంచయః. 161**

**తా.** దీని ప్రారంభంలో తోటకం చేసి (ఉపయోగించి) మిగిలిన భాగంలో లఘువు లను ఉపయోగించాలి. లేదా – లఘువు, తరవాత గురువు ఈ విధంగా ఒకదాని తరవాత ఒకటి మారుస్తూ పూర్తి చెయ్యాలి.

**మూ. జగత్యాదిర్భవేత్ సా తు తథాతిధృతినైధనాః,**
**తథా ధ్రుతా చ ఛన్దోభిర్నానావృత్తసముద్భవాః. 162**

**తా.** జగతీఛందస్సు మొదలు అతిధ్రుతిఛందస్సువరకు ఉన్న వేరు వేరు ఛందస్సుల లోని వృత్తాలను ధ్రుతాధ్రువలో ఉపయోగించవచ్చును.

**మూ. అష్టావాదౌ యస్మిన్ సాన్త్యం స్యాన్నవమం**
**దీర్ఘాణి స్యుః శిష్టే ద్వే వై చేల్లఘునీ,**
**వృత్తం హ్యేషా విజ్ఞేయా గాన్ధర్వవిధౌ**
**యస్మిన్నేవం నిత్యం విక్రాన్తా జగతి. 163**

**యథా – ఏసో మేహో ణాదం ధత్తే ధూమణిహో**
**విజ్జుజ్జుత్తో దారేదీదం భూమి అలం**
**సించంతోతో యోఘం ఘోరో హత్థిణిహో**
**సంచాదన్తో లోఆలోఅం అదిద్దుదం. 164**

**(ఏష మేఘో నాదం ధత్తే ధూమనిభో**
**విద్యుద్యుక్తో దారయతీదం భూమితలమ్,**
**సిఞ్చన్ తోయౌఘం ఘోరో హస్తినిభో**
**సంఛాదయన్ లోకాలోకమతిద్రుతమ్).**

**తా. విక్రాన్తా :–** పన్నెండు అక్షరాల పాదంలోని మొదట తొమ్మిది అక్షరాలు, పన్నెండవ అక్షరమూ గురువు లైతే దీనిని **విక్రాన్తావృత్తం** అంటారు.

**ఉదా :– ఏసోమేహో –** పొగ వలె ఉన్న ఈ మేఘం ఉరుముతూన్నది. మెరుపులతో కూడి జలప్రవాహాలతో నింపుతూ నేలను చీల్చివేస్తూన్నది. భయంకర మైన ఏనుగు వలె ఉన్నది. అతిశీఘ్రంగా లోకంలో ఉన్న వెలుతురును కప్పివేస్తూన్నది.

**మూ. అష్టావాదౌ దీర్ఘాణి స్యుస్త్వతిజగతీ,**
**అన్త్యం దీర్ఘం సా విజ్ఞేయా మదనవతీ. 165**

**యథా – ఏసో మేహో ణాణద్దంతో అలకణిహో,**
**సద్దారంతో విద్యుజ్జోహో భమది దుదమ్. 166**

**(ఏష మేఘో నాదయన్నలకనిభః సందారయన్ విద్యుజ్జోత్స్నో భ్రమతి ద్రుతమ్)**

**తా. మదనవతీ :–** అతిజగతీఛందస్సులోని పాదంలోని పదమూడు అక్షరాలలో మొదటి ఎనిమిది అక్షరాలు, చివరిది గురువు లైతే సమపాదాల ఈ ధ్రువకు **మదనవతీ** అని పేరు.

**ఉదా :– ఏసో మేహో –** ముంగురులు వలె ఉన్న ఈ మేఘం, (హృదయం) చీల్చివేస్తూ, మెరుపు లను వెన్నెలతో శీఘ్రంగా తిరుగుతూంది.

**మూ. పఞ్చ త్వాదౌ యత్ర గురూ హ్యష్టమనవమే**
**అన్త్యం దీర్ఘం సా ఖలు నామ్నా విమలగతిః. 167**

**యథా – బాలో చన్దో మేహవిముక్కో విమలకరో**
**రోచీరంగో సోహది కంతో ఉవరిగదో**
**లీలాక్ఖిత్తో గంగధరేణేవ సురుచిరో**
**మూలారోహో ణాగణివాసో అధికవవు. 168**

**(బాలశ్చన్ద్రః మేఘవిముక్తః విమలకరః**
**రోచీరఙ్గః శోభతే కాన్తః ఉపరిగతః,**
**లీలాక్షిప్తః గఙ్గాధరేణేవ సురుచిరః**
**మూలారోహః నాగనివాసః అధికవపుః).**

**తా. విమలగతి :–** పద్నాలు గక్షరాల పాదంలోని మొదటి ఐదు అక్షరాలు, ఎనిమిది, తొమ్మిది అక్షరాలూ, చివరిది గురువు లైతే అది **విమలగతి**.

**ఉదా :– బాలో చన్దో –** మేఘాలనుండి బైటకు వచ్చిన బాలచంద్రుడు నిర్మలము లైన కిరణాలతో కాంతులకు నివాసమై మనోహరంగా ఉన్నాడు. అతిసుందరు డైన ఆ బాలచంద్రుడు శివునిచే, అలంకారంగా ధరించడానికై, విలాసపూర్వకంగా గ్రహింపబడిన వాడు వలె అధికమైన శరీరంతో ఆకాశంలో ప్రకాశిస్తున్నాడు. (అస్పష్టార్థం).

**మూ. (మరొక ఉదాహరణం)**

**తారమజ్ఝే మేహవిముక్కో విమలకరో**
**ఉజ్జాహింతో జాతి సమగ్గం రజదణిహో,**
**జోణ్హాసోహం విక్కిరమాణో గగణతలే**
**లీలాపత్తో గచ్ఛది ఏసో రజణికరో.**

**(తారామధ్యే మేఘవిముక్తో విమలకరః**
**ఉజ్జృమ్భయన్ యాతి సమగ్రం రజతనిభః**
**జ్యోత్స్నాశోభాం వికీర్ణయన్ గగనతలే**
**లీలాప్రాప్తః గచ్ఛత్యేష రజనికరః.)**

**తా.** నక్షత్రమధ్యలో నున్న చంద్రుడు మేఘా లన్నీ తొలగిపోగా నిర్మలమైన కిరణాలతో విజృంభిస్తూ పూర్తిగా వెండి వలె ప్రకాశిస్తున్నాడు. వెన్నెల శోభను అంతటా విస్తరింపచేస్తూ విలాసపూర్వకంగా ఆకాశతలంలో విహరిస్తున్నాడు.

**మూ. నవమం నైధనం చైవ ద్వాదశం సత్రయోదశమ్,**
**గురూణి యస్యాః పాదే స్యుః శక్వర్యా విభ్రమా యథా. 169**

**యథా – విగదఘణతిమిరే ణిమ్మలతారే ఖే**
**వికచకుముదవణబన్ధుసదారోచో**
**రజదగిరిసిహరసణ్ణిహిదో చందో**
**ఉదఅది వరతణు దే హిఅఆణందో. 170**

**(విగతఘనతిమిరే నిర్మలతారే ఖే**
**వికచకుముదవనబన్ధుః సదారోచః,**
**ఉదయగిరిశిఖరసన్నిహితశ్చన్ద్రః**
**ఉదయతి వరతను తే హృదయానన్దః).**

**తా. విభ్రమా :–** శక్వరీఛందస్సు పాదంలోని పద్నాలుగు అక్షరాలలో నవమ – ద్వాదశ – త్రయోదశ – అంతిమవర్ణాలు గురువు లైతే అది **'విభ్రమా' వృత్తం.**

**ఉదా :– విగద –** సుందరీ! దట్టమైన చీకట్లు తొలగిపోయిన, ప్రకాశిస్తూన్న నక్షత్రాలతో నిండిన ఆకాశంలో, వికసించిన కలవల గుంపులకు బంధువు, సర్వదా కాంతిమంతుడు, కైలాసగిరిశిఖనికి సంనిహితుడు అయిన, నీకు హృదయానందకరుడైన చంద్రుడు ఉదయిస్తున్నాడు.

**మూ. ఆద్యచతుర్థే పఞ్చమషష్ఠే నవదశమే**
**పాదవిభక్తా యత్ర తు దీర్ఘం నిధనగతమ్,**
**తత్ర తు బోధ్యా పఞ్చదశాఖ్యే భువి హి సదా**
**భూతలతన్వీ శక్వరిసంజ్ఞా హ్యతివిహితా.** **171**

**యథా – పాదవసిస్సం కంపఅమాణో పడుణిణదో**
**సేలతడేసుం పక్ఖలమాణో విసమగది,**
**రేణుసమూహం ఉద్ధుఅమాణో రుణకవిలో**
**వాఅది వాదో చండపవాహీ రుసిద ఇవ.** **172**

**(పాదపశీర్షం కమ్పయమానః పటునినదః**
**శైలతటేషు ప్రస్ఖలమానః విషమగతిః,**
**రేణుసమూహముద్ధరమాణః అరుణకపిలో**
**వాతి వాతః చణ్డప్రవాహీ రుష్టః ఇవ).**

**తా. భూతలతన్వీ :–** పదిహేను అక్షరాల పాదంలో ఒకటి, నాలుగు, ఐదు, ఆరు, తొమ్మిది, పది, పదిహేను అక్షరాలు గురువు లైతే అది **భూతలతన్వీవృత్తం.**

**ఉదా :– పాదవసిస్సం –** వృక్షశిఖరాలను కదల్చివేస్తూ, మహాధ్వనితో, పర్వతాల మీద, గమనం అడ్డుకొనడంచేత విషమంగా గమనం చేస్తూ, రేణుసముదాయాన్ని ఎగురగెడుతూ అరుణ – కపిలవర్ణాలలో ఈ ఝంఝామారుతం కోపంతో ఉన్నదా అన్నట్లు తీవ్రంగా వీస్తూన్నది.

**మూ. ఆద్యచతుర్థే సప్తమమన్త్యం దశమేఽపి,**
**యత్ర గురూణ్యథ సా సుకుమారేత్యభిగదితా.** **173**

**యథా – మేహసమూహాణిబద్ధవిదాణం జలభరితం**
**సోహఇ ఇందధనుజ్జలమజం గయణతలం. 174**
**ఝ**
**(మేఘసమూహహనిబద్ధవితానం జలభరితం**
**శోభతే ఇన్ద్రధనూజ్జ్వలమధ్యం గగనతలమ్).**

**తా. సుకుమారా :–** పదహా రక్షరాల పాదంలో ఒకటి, నాలుగు, ఏడు, పది, పదహారు అక్షరాలు గురువు లైతే అది **సుకుమారావృత్తం.**

**ఉదా :– సోహఇ –** మేఘసమూహంచేత కట్టబడిన వితానం కలది (అంతటా వ్యాపించిన మేఘంతో అందమైన వితానం (ఆచ్ఛాదనం) కట్టిన ట్లున్నది), నీటితో నిండినది, మధ్యలో ఇంద్రధనస్సుతో ప్రకాశిస్తూన్నది అయిన గగనతలం శోభిస్తూన్నది.

**మూ. తృతీయం చ చతుర్థం చ సప్తమం చాష్టమం తథా,**
**నవమం ద్వాదశం చైవ నైధనం సత్రయోదశమ్. 175**
**యత్ర దీర్ఘాణి పాదే తు ధృతిచ్ఛన్దఃసమాశ్రయే,**
**సా జ్ఞేయా గీతకవిధౌ ధ్రువా స్ఖలితవిక్రమా. 176**

**యథా – దివసం సూరసణాహం ఖే విఅ చందో కుముదవణే**
**ఉదితే దీసది ఏసో దప్పణబిమ్బాకిదీసదిసో,**
**గయణే మేహవిముక్ఖే సోమ్మసుహాఓ రతిసుహగో**
**వహలం విక్ఖిరమాణో సారదఓణ్హం పజతి దుదమ్. 177**
**(దివసం సూర్యసనాథం ఖే ఇవ చన్ద్రః కుముదవనే**
**ఉదితో దృశ్యత ఏష దర్పణబిమ్బాకృతిసదృశః**
**గగనే మేఘవిముక్తే సౌమ్యస్వభావో రతిసుభగః,**
**బహులం వికిరన్ శారదజ్యోత్స్నాం వ్రజతి ద్రుతమ్).**

**తా. స్ఖలితవిభ్రమా :–** పదహారు అక్షరాల ధృతిచ్ఛందఃపాదంలో మూడు, నాలుగు, ఏడు, ఎనిమిది, తొమ్మిది, పన్నెండు, పదమూడు, పదహారు అక్షరాలు గురువు లైతే అది **స్ఖలితవిక్రమాధ్రువాగీతి.**

**ఉదా :– దివసం :–** పగలు సూర్యు దుండగా ఆకాశంమీద ఉదయిస్తూన్న చంద్రుడు కుముదవనంలో ప్రతిబింబించినట్లు, అద్దంలో ప్రతిబింబించి నట్లు కనబడుతున్నాడు; మేఘాలు తొలగిపోయిన ఆకాశంలో సౌమ్యస్వభావవంతుడు, రతి వర్ధకుడు అయిన చంద్రుడు శరత్కాలపు వెన్నెలను అంతలా ప్రసరింపచేస్తూ శీఘ్రంగా వెడుతున్నారు.

**మూ. యది ఖలు పఞ్చమష్టమమన్త్యం దశమపరం**

**పునరపి తస్య పరం గురుకం చేచ్చరణవిధౌ,**
**ఇయమిహ సప్తదశాక్షరపాదే రుచిరముఖీ**
**వికసితపఙ్కజపత్రనిభాక్షీ మునిగదితా. 178**

**యథా – అసణిరవాహదపాదవకూడో ధరణిధరో**
**పగలిఅకన్దరనిజ్ఝరసానురవో ముహలో**
**వివిహవిహంగమసేవిఅకుంజో జహజలదో**
**పరడుహచంపకగీఅసణాహో హసది విఅ. 179**

**అశనిరవాకృతపాదపకూటో ధరణిధరః**
**ప్రగలితకన్దరనిర్ఝరసానూ రవముఖరః**
**వివిధవిహఙ్గమసేవితకుఞ్జో యతజలదః**
**పరభృతచమ్పక (పంచమ) గీతసనాథో హసతీవ.**

**తా. రుచిరముఖీ :–** పదిహే డక్షరాల పాదంలో పంచమ, అష్టమ, ఏకాదశ, ద్వాదశ, అంతిమవర్ణాలు గురువు లైతే అది **రుచిరముఖీ ధ్రువాజాతి.**

**ఉదా :– అసణి –** పిడుగుల ధ్వనిచేత కొట్టబడిన వృక్షసముదాయము గలది, గుహలనుండి స్రవిస్తూన్న ప్రవాహములతో నిండిన చరియలు గలది ధ్వనిస్తూన్నది, అనేకవిధాలైన పక్షులకు నివాసమైన పొదరిళ్లు కలది, మేఘాలను అడ్డుకొంటున్నదీ, కోకిలల పంచమధ్వనులతో కూడినదీ అయిన పర్వతం నవ్వుతూన్నట్లుంది.

**మూ. పఞ్చమం హ్యష్టమం యత్ర త్రయోదశమథాపి చ,**
**గురూణ్యష్టాదశం చైవ ద్రుతా వై చపలా తు సా. 180**

**యథా – పవనవిఘుణ్ణిదపఙ్కజకుసుమం సరసి జలం**
**కమలిణీవత్తపసాహితసుభఅం పలిహణిహం**
**చలిదతరంగవిదారితకుసుమం చలిదకద**
**క్ఖుభిదవిహంగవకంపిదసుహలం హసది విఅ. 181**

**(పవనవిఘూర్ణితపఙ్కజకుసుమం సరసి జలం**
**కమలినీపత్రప్రసాదితసుభగం స్ఫటికనిభం**
**చలితతరఙ్గవిధారితకుసుమం చలితగతం**
**క్షుభితవిహఙ్గమకమ్పితముకులం హసతీవ).**

**తా. ద్రుతచపలా :–** పద్దెనిమిది అక్షరాల పాదంలో ఐదు, ఎనిమిది, పదమూడు, పద్దెనిమిది అక్షరాలు గురువు లైతే అది **ద్రుతచపలాధ్రువ.**

**ఉదా :– పవన :–** ఈ సరోవరంలో జలంమీద నున్న పద్మాలు వాయువుచేత

ఇటూ అటూ తిరిగి పోతున్నాయి; ఊగుతున్నాయి. తామరాకులతో అందంగా ఉంది. స్ఫటికం వలె నిర్మలంగా ఉంది. తరంగాలు కదుల్తూండగా పైన ఉన్న పుష్పాల గుంపులు గుంపులుగా చీలిపోతున్నాయి. కదలుతూన్న గమనంతో క్షోభ చెందిన పక్షులచేత కమలముకులాలు కదిలిపోతూండగా నవ్వుతూన్నట్లుంది.

**మూ. యది ఖలు భవతి చరణవిధౌ ద్వాదశపరతః**
**గురుగురు పునరపి నిధనగతం వై గురుసహితమ్**
**ఇహ ఖలు ధృతిరతినిగదితనామా మునివిహితా**
**కవిగణమతిమత సముదితచిత్రా కనకలతా.**

**యథా – పముదిఅగహగణవిధిరహసోహో గఅణగఓ**
**విలులిఅజలహరసముదఅహీణో ణఅణ సుహణో**
**కిరణణివహదతిమిరో సోర జదణిహో**
**పసరది వరతణు హలధరలీలో సరది ససీ.**

**(ప్రముదితగ్రహగణవిధృతశోభో గగనగతో**
**విలులితజలధరసముదయహీనం పవనసుభగః,**
**కిరణనివహనిహతతిమర ఏష రజతనిభః**
**ప్రసరతి వరతను హలధరలీలః శరది శశీ).**

**తా. కనకలతా :–** పందొమ్మిది అక్షరాల అతిధృతిచందః పాదంలోని పదమూడు, పద్నాలుగు పందొమ్మిది అక్షరాలు గురువు లైతే అది **కనకలతాధ్రువ.**

**ఉదా :– పముదిఅ –** సుందరాంగీ! ఈ శారదచంద్రుడు ఆకాశంలో నేత్రానంద కరుడుగా సంచరిస్తున్నాడు. ఆనందిస్తూన్న గ్రహసముదాయాల శోభ ఈ చంద్రుని శోభను పెంచుతూన్నది. జలధరఖండా లేవీ వీనికి అడ్డుగా లేవు. కిరణసముదాయంతో చీకటి చీల్చి వేస్తున్నాడు. బలరాముని వలె ఉన్నాడు.

**మూ. పాదే పఞ్చమమన్త్యం చ దీర్ఘం ద్వాదశమేవ చ,**
**పదావృత్త్యా తదా జ్ఞేయా చపలా ముఖసంహితా. 184**

**యథా – పిఅసహి ఆఇఅ గఅణతలే చవలదరముహీ**
**పవిచరదౌ మదసురహిముహీ సురవరయువతిః. 185**

**(ప్రియసఖి ఆయతగగనతలే చపలతరముఖీ**
**ప్రవిచరతి మదసురభిముఖీ సురవరయువతిః)**

**తా. ముఖచపలా :–** పందొమ్మిది అక్షరాల పాదంలో ఐదు, పన్నెండు, పందొమ్మిది అక్షరాలు గురువు లైతే అది **ముఖచపలాధ్రువ**.

**ఉదా :– పిఅసహి –** ప్రియసఖి! అతిచపలమైన ముఖం గల ఈ సురవరయువతి (మెరుపు) మదంతో అందమైన ముఖంతో విశాలమైన ఆకాశంలో ఎలా సంచరిస్తూన్నదో చూడు.

**మూ. ఏతా హ్యష్టౌ తు విజ్ఞేయా ధ్రువాణాం మూలజాతయః,**
**ఆభ్యో వినిఃసృతాశ్చాన్యా యుగ్మౌజావిషమాక్షరాః. 186**

**తా.** ఈ ఎనిమిదీ ధ్రువల మూలజాతులు. వీటినుండి సరి పాదాలు, బేసి పాదాలు గలవి, విషమాక్షరములు అయిన మరి కొన్ని జాతులు బయలుదేరాయి.

**మూ. ఏతాస్తు జాతయో జ్ఞేయాః ద్రుతానాం వృత్తసంశ్రయాః,**
**దేవానాం పార్థివానాం చ హ్యౌపమ్యగుణసంభవాః. 187**

**తా.** ద్రుతధ్రువాలలో ఈ చందోవర్గాలు మాత్రమే ప్రయోగించాలి. దేవతల, రాజుల గుణవిశేషాలను వర్ణించడానికి, ఔపమ్యాన్ని బోధించడంలో ఈ ద్రుతధ్రువలు ఉపయోగించబడతాయి.

**మూ. సప్తదశ ద్వాదశైకాదశపఞ్చాష్టమతృతీయైః,**
**గురుభిర్యస్యాః పాదః సా జ్ఞేయాక్షిప్తికా నామ. 188**

**తా. క్షిప్తా :–** పదిహేడు అక్షరాల పాదంలోని తృతీయ – పంచమ – అష్టమ – ఏకాదశ – ద్వాదశ – సప్తదశాక్షరాలు గురువు లైతే అది 'క్షిప్తా' లేదా **'ఆక్షిప్తికా'** ధ్రువ.

**మూ. గుర్వాదిరథ లఘ్వాది యుగ్మౌజాప్యథవేతరా,**
**ఏతద్వృత్తగతా యా తు సా విజ్ఞేయా ద్రుతా ధ్రువా. 189**

**తా. ద్రుతా :–** మొదటిఅక్షరం గురువుగాని లఘువు గాని అయి ఉండి, సమవృత్తంలోగాని విషమవృత్తంలో గాని, మిశ్రవృత్తంలో కాని ఉంటే ఆ ధ్రువ 'ధ్రుతా' ధ్రువ.

**మూ. ఏతాస్తు జాతయస్త్ర్యస్రా ద్విపదాః పరికీర్తితాః,**
**ద్విపాదాశ్చతురస్రాశ్చ సంప్రవక్ష్యామ్యతః పరమ్. 190**

**తా.** ఇవి ద్విపదా – త్ర్యస్రా జాతిఛందస్సులు. ఇపుడు నేను ద్విపదా – చతురస్రా జాతి ఛందస్సులను చెపుతాను.

**మూ. యస్యాః పాదే ద్విరష్టప్రఖ్యా గణా గకారాఖ్యాః**
**సర్వే వర్ణా దీర్ఘాః యస్యా అష్టౌ సా భాషితా మాలా. 191**

**యథా – ఏఅం లోఅం సంఛాదంతా భీమా ణద్దంతి గంభీరా,**
**విజ్జుజ్జుత్తా తోఅం సంముంచంతా సముణ్ణదా మేహా. 192**
**(ఏతం లోకం సంఛాదన్తో భీమా నదన్తి గమ్భీరాః**
**విద్యున్యుక్తాః తోయం సంముఞ్చన్తః సమున్నతా మేఘాః).**

**తా. మాలా :–** పదహారక్షరాల పాదంలో అన్ని అక్షరాలు గురువు లైతే అది **మాలావృత్తం.**

**ఉదా :– ఏఅంలోఅం –** లోకా న్నంతనీ కప్పివేసిన ఎత్తైన ఈ మేఘాలు, భయంకరంగా భీకరంగా గర్జిస్తూ మెరుపులతో మెరుస్తూ వర్షధారలు కురిపిస్తున్నాయి.

**మూ. యస్యాః పాదే నిత్యం చతుర్థషష్ఠే జకారసంజ్ఞే తు,**
**శేషాన్యాని స్యుర్గురూణి సా తు ప్రభావతీ నామ్నా. 193**

**యథా – ఏదాణిం వాదసంఖోభిదాణి ఏదాణి పుప్ఫాణి ముత్తపత్తాణి,**
**దుదం ఇదం తపప్ఫది అద్ధాసిదాణి సోదంతి ధరణాణి. 194**

**(ఏతాని వాతసంక్షోభితాని ఏతాని పుష్పాణి తు ముక్తపత్రాణి**
**ద్రుతమిదం ... అర్ధాశ్రితాని సీదన్తి అనేన ...**

**తా. ప్రభావతీ :–** లక్షణంలోను లక్ష్యంలోను కూడ గ్రంథపాతాలు. (మ.ఘోష్)

**మూ. యది ఖలు చత్వార్యాదౌ లఘూని పాదే చతుర్థషష్ఠౌ లౌ,**
**అతిధృతిమానం చ స్యాద్ గురూణి శేషాణి సా చిత్రా నామ్నా. 195**

**యథా – జలహరణాదుద్ధతహఅదాణో వణం మద్దంతో,**
**సహఅరిసంవుద ఏసో గఇందో జాఉ రణ్ణమ్మి. 196**

**(జలధరనాదోద్ధహతదానో వనం మర్దయన్,**
**సహచరీసంవృత ఏషో గజేన్ద్రో యాతి అరణ్యే).**

**తా. చిత్రా :–** అతివృత్తిఛందోగతమైన పాదంలో మొదటి మూడక్షరాలు, నాలుగు, ఆరు అక్షరాలు లఘువులై, మిగిలినవి గురువు లైతే అది **చిత్రాధ్రువ.**

**ఉదా : జలహరణా :–** మేఘధ్వని వినగానే అధికమైన మదోదకం గల ఈ గజేంద్రుడు సహచరీసమేతుడై వనం మర్దిస్తూ అరణ్యంలోకి వెడుతున్నాడు.

**మూ. యది ఖలు భవతి యుగ్మజకారనామ్నా త్రికా కృతేః పాదే,**
**లఘుగణస్తదాదౌ వదన్తి నామ్నా చ మాలకితాం వై. 197**

**యథా – పరభుదణిదాదవాఉలిదాణి సుహసిసిరవాద**
**సంఖోహిదాణిణచ్ఛంది దాణిం రణ్ణాణి. 198**

**(పరభృతనినాదవ్యాకులితాని సుఖశిశిరవాత**
**సంక్షోభితాని నృత్యన్తీదానీమరణ్యాని.) 198**

**తా. మాలకితా :–** కృతిచ్ఛందఃపాదంలో రెండు జగణాలుండగా మొదట రెండక్షరాలు లఘువు లైతే అది **'మాలకితా'** ధ్రువ.

**ఉదా :– పరభుద –** కోకిలల ధ్వనులతో వ్యాకులములు, సుఖకరమైన శిశిర వాయువులచేత క్షోభింపచేయబడినవి అయిన ఈ అరణ్యాలిపుడు నృత్యం చేస్తున్న ట్లున్నాయి.

**మూ. ఆద్యచతుర్థే దశమాష్టమాద్యన్యాన్యథ చ యత్ర గురు చరణే,**
**ఏకాదశం జాగతే సా ప్రకృత్యాశ్రయా హి సురభిముఖీ. 199**

**యథా – లహు సకలే సీతలే ణహం అరవిందసురహి మదపత్తాలిణఅం,**
**సురభిమారుతేన ఏసా విభాది జలణసిహా. 200**

**(లఘు సకలే శీతలే నభః అరవిన్దసురభిమదపత్రాలినవమ్,**
**సురభిమారుతేనైషా విభాతి జ్వలనశిఖా).**

**తా. సురభిముఖీ :–** పదకొండు వర్ణాల జగతీఛందఃపాదంలోని, ఒకటి, నాలుగు, ఎనిమిది, పదకొండు అక్షరాల గురువు లైతే అది **సురభిముఖి.**

**ఉదా :– లహుసకలే –** లక్షణ – లక్ష్యాలు రెండూ అక్షరభ్రష్టాలు.

**మూ. విలమ్బితానామిత్యుక్తాశ్చతురస్రా హి జాతయః,**
**అతఃపరం ప్రవక్ష్యామి ద్రుతానాం జాతిలక్షణమ్. 201**

**తా.** ఇవి – చతురస్రాజాతిలో ఉన్న విలంబితాధ్రువాలు. ఇపుడు నేను ద్రుతాధ్రువా భేదాలు చెపుతున్నాను.

**మూ. సజసంశ్రితా యది భవతి చరణేషు చాకృతిసముత్థా,**
**గురుచాన్త్యమేవ చ యది తాం మనోగమనాం వదన్తి ఖలు నామ్నా. 202**

**యథా – కమలాకరమ్మి భరాఇఅమ్మి అధ గన్ధబహులమ్మి సరదే**
**ణాహాణిఅజలే ప్పిఆహిముహీ ఆరమేది కమలవణే హంసీ. 203**

**(కమలాకరే భరితే అథ గన్ధబహులే శరది**
**స్నాత్వా జలే ప్రియాభిముఖీ ఆరమతే కమలవనే హంసీ).**

**తా. మనోజ్ఞగమనా :–** ఆకృతిఛందఃపాదంలో సగణజగణాలు, చివర రెండు గురువులూ ఉంటే ఇది **మనోజ్ఞగమనాజాతి.**

**ఉదా :– కమలా –** శరత్కాలంలో సుగంధభరితమైన నీటితో నిండిన పద్మసరస్సులో స్నానం చేసి హంసి, ప్రియునికి అభిముఖురాలై కమలవనంలో విలాసచేష్టలు చేస్తూన్నది.

**మూ. యది పఞ్చ భవన్తి సకారగణా యది చాన్తతో భవతి గురుః,**
**యది షష్ఠగణశ్చ జకారకృతో వికృతగతిస్తతస్తు లలితగతిః. 204**

**యథా – సహఆరమణోహరగంధవహో సమవాఇ ఏస మదకలే హిం**
**మరణం జణేఇవ్వ వణే పవణో చసు అధిఇఆ సుసుఅపిఅవో. 205**

**సహకారమనోహరగంధవహః సంవాత్యేష మదకలైః,**
**మదనం జనయతీవ వనే పవనః ....**

**తా. లలితగతి :–** ఇరవైమూడు అక్షరాల రెండు పాదాలలో వరసగా ఐదు సగణాలు, ఒక జగణం, చివర గురువు, మిగిలినది లఘువు అయితే అది **లలితగతి**.

**ఉదా :– సాహఆర –** సహకారపుష్పాల గంధం మోసికొనివస్తూన్న ఈ పవనం, ఉపవనాలలో మత్తు కలిగిస్తూన్నట్లున్నది.

**మూ. యది దశమం షష్ఠమథ షోడశాన్తగతం**
**త్రయోదశమపి తథా గురుర్భవతి,**
**పాదవిహితం సతతం యది సంగతౌ**
**నామ్నా భవతి (హి) ధ్రువా ఖలు రతిః. 206**

**యథా – జలహరణిణఓ తిమిఅరంజపఅసమందఓ పర్వ్వరిసఏది జలణిహి,**
**అండమ్మిసుకరి సుభిదాభిదాభిదో వదావిదోక్ఖ అ గోముఖో. 207**

**తా. రతి :–** సంగతిచందఃపాదంలోని ఆరు, పది, పదమూడు, పదహారు, అక్షరాలు, చివరిదీ గురువులైతే అది **రతిజాతి**.

**ఉదా :– జలహరిణిణఓ –** ఉదాహరణ శ్లోకం అశుద్ధపాఠం; అస్పష్టం.

**మూ. యది గురు దశమం హి ససప్తమనిధనగతం సప్తదశమపి చ,**
**భవతి జగౌ షష్ఠయుతస్త్వతికృతిరథ సా తు భుజగముఖీ. 208**

**యథా – జలధరసమం ఆఅదఓసుహ**
**సురభికదో కుసుమవణాకులిదో,**
**మరణజణణో సుత్తిణాసకరో**
**సహి సమదాజణసహాఓ పవణో. 209**

**(జలధరైః సమమాగతో సుఖసురభికృత్ కుముదబాణాకులితో**
**మదనజననః సుప్తినాశకరః సఖి ప్రమదాజనసహాయః పవనః)**

**తా. భుజగముఖీ :–** అతికృతిఛందః పాదంలోని ఏడు, పది అక్షరాలు, పదిహేడవ అక్షరం, చివరి అక్షరం గురువు లైతే, ఆరవ అక్షరం కూడ గురువైతే అది **భుజగముఖీ** ధ్రువ.

**ఉదా :– జలధర –** సఖీ! సుఖకరమైన సుగంధం వ్యాపింపచేస్తూ కుసుమబాణాల చేత ఆకులితమై ఈ పవనం, మేఘాలతో కలిసి వస్తూన్నది. మదనజనక మైన ఈ పవనం నిద్రలేకుండా చేస్తూన్నది. ప్రమదాజనానికి సహాయుడుగా ఉంది.

**మూ. యది ఖలు సమేషు జశ్చ భవతి తథైవ గురు నిధనజం భవతి,**
**చరణే ఖలు భవతి శేషమథ సతతముత్కృతిరర్థవశాద్ ద్రుతపదగా. 210**

**యథా – మధుకరరుదేహి కథిద ఇవాసు**
**సువికసిదఓ సుమణముఖమలో**
**కమలిణిపియాహి పరిబుదఓ**
**తణుఅమపి విమాది విఅ పదుమసరో. 211**

**(మధుకరరుతైః కథిత ఇవాశు సువికసితః సుమనోముఖకమలః,**
**కమలినీప్రియాభిః పరివృతతనురపి విభాతి ఇవ పద్మసరః).**

**తా. ద్రుతపదగా :–** ఉత్కృతిచ్ఛందఃసమపాదాలలో జగణమూ, చివర గురువూ ఉన్న, అర్థానుసారి యైనది ద్రుతపదగాధ్రువ (అస్పష్టలక్షణం)

**ఉదా :– మధుకర –** సరోవర మనే నాయకుణ్ణి, వాని ప్రియ లైన కమలలతలు, చుట్టుముట్టి ఉన్నాయి అని భ్రమరధ్వనులు చెపుతున్నాయా అన్నట్టుంది.

**మూ. ఏతే ద్రుతాస్తు విజ్ఞేయాశ్చతురస్రాస్తు జాతయః,**
**అతః పరం ప్రవక్ష్యామి ఉద్ధతానాం వికల్పనమ్. 212**

**తా.** ఈ చతురస్రజాతులు ద్రుతాధ్రువలకు సంబంధించినవి. ఇప్పుడు ఉద్ధతా ధ్రువల ఛందస్సులను చెపుతాను.

**మూ. ఆద్యే హ్యథ నిధనే త్రీణి పాదే తు యది గురూణి స్యుః,**
**జ్ఞేయా ఖలు బృహతీ నిత్యం నామ్నా కనకలతాక్షిప్తా. 213**

**యథా – ఏసో గఅణదలే మేహో భీమో భయజననో దిఠో,**
**భూమిం ణవజలధారాహిం సించేదియ సహి గజ్జంతో. 214**

**(ఏష గగనతలే మేఘో భీమో భయజననో దృష్టః,**
**భూమిం నవజలధారాభిః సిఞ్చయిత్వా సఖి గర్జన్).**

**తా. కనకలతాక్షిప్తా :-** తొమ్మిదక్షరాల పాదంలో మొదటి రెండు అక్షరాలు, చివరి మూడక్షరాలూ గురువు లైతే అది **కనకలతాక్షిప్తా.**

**ఉదా :- ఏసో గఅణదలే :-** సఖీ! ఆకాశం మీద భయంకరమైన మేఘం కనబడింది. అది నూతన జలధారలచేత భూమిని తడిపివేస్తూ గర్జిస్తూన్నది.

**మూ. ఆదౌ ద్వే గురూ నిధనే త్రీణి యస్యాః పాదేష్వథ గురూణి స్యుః,**
**సంక్షిప్తా త్రిష్టుభ్భిః నియతా జ్ఞేయా పీనశ్రోణి సురుచిరచిత్రా. 215**

**యథా – ఏసో మేహో సిహరిణిహో ణీలో ధారాపాదేహిం అధిఅభఅదో భూమిమ్,**
**ఆపూరంతో పడుదరసణ్ణాదో తోయాపుణ్ణే గఅణదవే జాది. 216**
**(ఏష మేఘః శిఖరినిఖో నీలో ధారాపాతైరతిభయదో భూమిమ్**
**ఆపూరయన్ పటుతరసన్నాదో తోయాపూర్ణే గగనతలే యాతి).**

**తా. సురుచిరచిత్రా :-** పీనశ్రోణీ! పదకొండు అక్షరాల పాదంలో మొదటి రెండు అక్షరాలు, చివరి మూడు అక్షరాలు గురువు లైతే అది **సురుచిరచిత్రా** అవుతుంది.

**ఉదా : ఏసో మేహో :-** పర్వతం వంటి ఈ నీలమేఘం ధారాపాతాలచేత అతిభయంకరమై, భూమిని నింపివేస్తూ, బిగ్గరగా ధ్వనిచేస్తూ నీటితోనిండిన ఆకాశ మార్గంలో వెడుతూన్నది.

**మూ. యది ఖలు పఞ్చమమన్త్యే చరణవిధౌ యది గురూణి భవన్తి తు,**
**సా ఖలు శశిరేఖా భువి బృహతీ ప్రథితా. 217**

**యథా – గిరిచరవారణరూవం ఖుభిదమహణ్ణవణాదమ్,**
**పడుపవణేణ విధూదం భమది బలాహఅజూహమ్. 218**

**(గిరిచరవారణరూపం క్షుభితమహార్ణవనాదమ్,**
**పటుపవనేన విధూతం భ్రమతి బలాహకయూథమ్).**

**తా. శశిరేఖా :-** తొమ్మిదక్షరాల పాదంలో ఐదవ అక్షరం, చివరి అక్షరం గురువు లైతే అది **శశిరేఖాధ్రువ.**

**ఉదా :- గిరివర –** అడవిఏనుగుల గుంపు వలె ఉన్న మేఘాల గుంపు తీవ్రమైన గాలిచేత కొట్టబడి క్షోభిస్తూన్న సముద్రం వలె ధ్వనిచేస్తూ తిరుగుతూన్నది.

**మూ. యది ఖలు షష్ఠమన్త్యం గురూణి భవన్తి పాదయోగే,**
**ఇతి గదితా హి వృత్తే శలభవిచలితా సా. 219**

**యథా – ససికిరణలమ్భహారా ఉడుగణకిదావదంసా,**
**గహగణకిదంగసోహా జువది విఅ భాది రాఈ. 220**

**(శశికిరణలమ్బహారా ఉడుగణకృతావతంసా,**
**గ్రహగణకృతాఙ్గశోభా యువతిరివ భాతి రాత్రిః).**

**తా. శలభవిచలితా :–** తొమ్మిదక్షరాల పాదంలోని ఆరవ అక్షరము, చివరి రెండక్షరాలు గురువు లైతే అది **శలభవిచలితా** ధ్రువ.

**ఉదా :–** చంద్రకిరణములను వ్రేలాడుచున్న హారం కలదీ, నక్షత్రగణంకర్ణాలంకార పుష్పంగా లేదా శిరోభూషణంగా ధరించినదీ, గ్రహసముదాయమే ఇతరావయవాల అలంకారములుగా కలదీ అయిన ఈ రాత్రి సుందరయువతి వలె కనబడుచున్నది.

**మూ. యదిఖలు చరణవిధౌ లఘువసుగణకమిదమ్,**
**భవతి హి ఖలు బృహతీ మణిగణనికరకృతా. 221**

**యథా – ఉడుగుణకుసుమవదీ గహగణకి దతిలఅ,**
**రజణికరణిహముహ వజది విఅ ఆసు ణిసా. 222**

**(ఉడుగణకుసుమవతీ గ్రహగణకృతతిలకా,**
**రజనికరనిభముఖీ వ్రజతి ఇవాశు నిశా).**

**తా. మణిగణనికరకృతా :–** తొమ్మిది అక్షరాల బృహతీఛందఃపాదంలోని మొదటి ఎనిమిది అక్షరాలూ లఘువులైతే అది **మణిగణినికరకృతా** ధ్రువ.

**ఉదా :– ఉడుగణ –** నక్షత్రగణా లనే కుసుమాలు ధరించి, గ్రహగణం అనే తిలకం ధరించి, నిశానాయిక శీఘ్రంగా ప్రియు డైన రజనికరునివైపు (?) వెళ్లుచున్నది.

**మూ. చత్వార్యాదౌ చరణవిధౌ దీర్ఘాణి స్యుర్నిధనమపి**
**నామ్నా జ్ఞేయా జగతి హి సా సింహక్రాన్తా ఖలు బృహతీ. 223**

**యథా – ఆకంపన్తో ధరణితలం విక్ఖోభంతో గగణతలమ్,**
**విజ్జుజ్జోదా అవవిహవో ఏసో మేహో ప్పవిచలిదో. 224**

**(ఆకమ్పయన్ ధరణితలం విక్షోభయన్ గగనతలమ్,**
**విద్యుజ్జ్యోత్స్నాప్తవిభవః ఏష మేఘః ప్రవిచరితః).**

**తా. సింహక్రాన్తా :–** తొమ్మిదక్షరాల బృహతీఛందః పాదంలో మొదటి ఆరు అక్షరాలూ, చివరిదీ గురువు లైతే అది **సింహక్రాన్తాధ్రువ.**

**ఉదా :– ఆకంపన్తో –** మెరుపుల కాంతి అనే వైభవం లభించడంచేత ఈ మేఘం భూమిని అదిరిపోయే టట్లు చేస్తూ, ఆకాశాన్ని క్షోభింపచేస్తూ సంచరిస్తూన్నది.

**మూ. బృహత్యా జాతయో హ్యేతా విజ్ఞేయా వై ప్రవేశజాః,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి పఙ్క్తిజాతివికల్పనమ్. 225**

**తా.** ఈ బృహతీఛందస్సుకు సంబంధించిన జాతులు ప్రావేశికీధ్రువలో ఉపయో–గించబడతాయి. ఇపుడు పంక్తిఛందస్సుకు చెందిన జాతులను చెపుతాను.

**మూ. ఆద్యచతుర్థే హ్యథ నిధనం పఞ్చమకం చేత్ గురు చరణే,**
**గీతవిధానే భవతి హి సా పఙ్క్తికృతా వై సురదయితా. 226**

**యథా – పంకఅసండే విమలజలే సారసకేహిం సమణుగదో**
**కుందణికాసో ససిధవలో హంసజువాణో పరిచరిదో. 227**

**(పఙ్కజఖణ్డే విమలజలే సారసకైః సమనుగతః,**
**కున్దనికాశః శశిధవలో హంసయువా పరిచరితః).**

**తా. సురదయితా :–** పది అక్షరాల పాదంలోని ప్రథమ – చతుర్థ – పంచమ – దశమాక్షరాలు గురువులైతే అది **సురదయితాధ్రువ**.

**ఉదా :– పంకఅసండే –** మల్లిపువ్వువలె, చంద్రుడు వలె తెల్లగా ఉన్న హంస యువకుడు సారసాలు వెంట రాగా నిర్మలజలం గల పద్మసముదాయం మధ్య పచార్లు చేస్తున్నాడు.

**మూ. దీర్ఘాణి హ్యథ విధానగతం త్రీణి స్యుర్యది చరణవిధౌ,**
**సా జ్ఞేయా కుసుమసముదితా పఙ్క్తిశ్చేదపి చ కుముదినీ. 228**

**యథా – వాసంతో కుసుమసముదిదో పదోసో సుముహి సురభిణో**
**సోసంతో పిఅరహిదజణం సంపత్తో ఏసో సహి సరసో. 229**

**(వాసన్తః కుసుమసముదితః ప్రదోషః సుముఖి! సురభిః,**
**శోషయన్ ప్రియరహితజనం సంప్రాప్త ఏష సఖి! సరసః)**

**తా. కుసుమసముదితా :–** పది అక్షరాల పంక్తిఛందఃపాదంలోని మొదటి మూడక్షరాలు, చివరిదీ గురువు లైతే అది **'కుసుమసముదితా'** లేదా **'కుముదినీ'** అవుతుంది.

**ఉదా :– వాసంతో –** సఖీ! వసంతఋతువుయొక్క ఈ సరససంధ్యాకాలం వచ్చేసింది. ఇపుడు విరహిజనాలను శుష్కింపచేస్తూ పుష్పగంధం అంతటా వ్యాపిస్తున్నది.

**మూ. సప్తమాద్యచతుర్థయుతం యత్ర హి నైధనమేవ గురు,**
**పాదవిధౌ యది పఙ్క్తికృతా సా ఖలు వృత్తమితి ప్రథితా. 230**

**యథా – ఏస సముణ్ణఅ మంవరకే మేహరవం సుణిఊణ గఓ,**
**రోసరవేణ సముజ్జలిదో హిండేది కణణఏ కువిదో. 231**

**(ఏష సమున్నతమమ్బరే మేఘరవం శ్రుత్వా గజః,**

**రోషరవేణ సముజ్జ్వలితో హిణ్ణతి కాననే కుపితః).**

**తా. ప్రథితా :–** పంక్తిఛందఃపాదంలోని పది అక్షరాలలోని ఒకటి నాలుగు, ఆరు, ఏడు, పది అక్షరాలు గురువు లైతే అది **ప్రథితా.**

**ఉదా :–** ఆకాశం నుంచి వచ్చిన గంభీరమైన మేఘధ్వని విన్న గజం కోపించి ఘోరరవంతో విజృంభిస్తూ అరణ్యంలో తిరుగుతూన్నది.

**మూ. త్రీణ్యాదౌ తు భవన్తి గురూణి షష్ఠ్యన్తం నవమం చరణే తు,**
**యస్యా స ఖలు గీతవిధానే పఙ్క్తిః సా తు కృతోద్ధతనామ్నా. 232**

**యథా – అబ్భం అమ్బుధరేహిం పిణద్ధం విజ్జుజ్జోదఘణాంతపదీవమ్,**
**విదాఘుణ్ణిదకమ్పిదపత్తం ఉమ్మాదేది వ హత్థిసమూహమ్. 233**
**అభ్రమమ్బుధరైః పినద్ధం విద్యుజ్జ్యోతిఘనాన్తప్రదీపమ్,**
**వాతాఘూర్ణితకమ్పితపత్రమ్ ఉన్మాదయతీవ హస్తిసమూహమ్.**

**తా. కృతోద్ధతా :–** పది అక్షరాల పాదంలోని మూడు, ఆరు, తొమ్మిది, అక్షరాలు, చివరి అక్షరము గురువు లైతే అది **కృతోద్ధతా.**

**ఉదా :–** ఆకాశం మేఘాలచేత కప్పబడగా, మేఘాల చివర్లలో మెరుపులు దీపాల వలె ప్రకాశిస్తున్నాయి. చలిగాలికి వణికిపోతూన్న ఏనుగుల సముదాయం మత్తెక్కినట్లై పోతూన్నది.

**మూ. ఆద్యం చతుర్థే నైధనికే చ పఞ్చమషష్ఠే యత్ర చ దీర్ఘే,**
**పుష్పసమృద్ధా సంకథితా సా పఙ్క్తిరథైషా గీతవిధానే. 234**

**యథా – మేహసమూహం పీణవలాఅం విజ్జుపలిత్తం పేక్ఖియ ఏసో,**
**ఉట్ఠిదరోసో భూరిణిణాదో ధావది హత్థీ రుక్ఖవణమ్మి. 235**
**(మేఘసమూహం పీనబలాకం విద్యుదుపలిప్తం ప్రేక్ష్య ఏషః,**
**ఉత్థితరోషో భూరినినాదో ధావతి హస్తీ రూక్షవనే).**

**తా. పుష్పసమృద్ధా :–** పది అక్షరాల పంక్తిఛందఃపాదంలో మొదటి నాలుగు అక్షరాలు, ఐదు, ఆరు, పది అక్షరాలు గురువు లైతే అది **పుష్పసమృద్ధా.**

**ఉదా :– మేహసమూహం –** ఈ వనగజం, బలిసి కొంగలతో కూడిన, మెరుపులచేత పూయబడిన మేఘసమూహాన్ని చూచి కోపావేశంతో బిగ్గరగా ధ్వనిచేస్తూ వనంలో పరుగెత్తుచున్నది.

**మూ. యది ఖలు పఞ్చమమన్త్యం చరణవిధావపి దీర్ఘం స్యాత్,**
**భవతి నవం చాష్టమకం యస్యా విపులభుజా భువి సా జ్ఞేయా. 236**

**యథా – జలహరణాదసముప్విణ్ణో పగలితదాణసముక్కులో,**
**వణగహణం కువిదో హత్థీ సరభఅవ్విదకం జాతి. 237**
**(జలధరనాదసముద్విగ్నః ప్రగలితదానసమాకులః,**
**వనగహనం కుపితో హస్తీ సరభసగర్వితం యాతి).**

**తా. విపులభుజా :–** పది అక్షరాల పాదంలోని పంచమ, అష్టమ, నవమ, దశమ వర్ణములు గురువు లైతే అది **విపులభుజా** ధ్రువ.

**ఉదా :– జలహర :–** నిరంతరంగా కారుతూన్న మదోదకంచేత వ్యాకులమైన మత్తగజము మేఘధ్వని వినగానే చెదిరిపోతూ, కోపించి, తొందరగా, దర్పంతో దట్టమైన వనంలోనికి ప్రవేశిస్తూన్నది.

**మూ. ఏతాస్తు జాతయః ప్రోక్తా పఙ్క్త్య ఏవ సమాసతః,**
**అతః పరం ప్రవక్ష్యామి త్రిష్టుబ్జాతివికల్పనమ్. 238**

**తా.** ఇంతవరకు చెప్పిన జాతులు పంక్తిఛందస్సుకు సంబంధించినవి. ఇపుడు త్రిష్టుప్ఛందస్సుకు చెందిన ధ్రువాజాతుల భేదాలను చెపుతాను.

**మూ. ఆదావిహ ఖలు గురుణీ నిత్యం నిధనమపి చ పరతః,**
**వృత్తే కవిభిరితి నిగదితా త్రిష్టుబ్ జాతిరభిహితా చపలా. 239**

**యథా – ఏదే ఖిదిధరవరసదిసా భీమా పడుపడహసమరవా,**
**ణీలాసిదఖగకిదరసణా మేహా ణహదలమభిపడిదా. 240**
**(ఏతే క్షితిధరసదృశా భీమాః పటుపటహసమరవాః,**
**నీలాసితఖగకృతరశనా మేఘా నభస్తలమభిపతితాః).**

**తా. చపలా :–** పదకొండక్షరాల త్రిష్టుప్ఛందఃపాదంలోని మొదటి రెండక్షరాలు, చివరిదీ గురువు లైతే అది **చపలావృత్తం.**

**ఉదా :– ఏదే –** పర్వతాలవలె ఉన్నవీ, భయంకరములూ, పటహధ్వనివంటి కఠోరధ్వనులు చేయుచున్న మేఘాలు నీలవర్ణం గల, నల్లని పక్షుల వలె బారులు కట్టి ఆకాశంమీద అంతటా వచ్చి చేరుచున్నది.

**మూ. యది ఖలు మధ్యే త్వథ గురుణీ పునరపి చాన్త్యం గురు చరణే,**
**భవతి హి నిత్యం రుచిరముఖీ కమలదలాక్షీతి హి కథితా. 241**

**యథా – పరిధుణమాణో కిరణపడం అభిరుహమాణో ఉదయగిరిమ్**
**ఉడుగణబన్ధుకుముదసహో ఉదయతి చందో గగణతలే. 242**
**పరిధున్వానః కిరణపటమభిరోహమాణ ఉదయగిరిమ్,**
**ఉడుగణబన్ధుః కుముదసఖః ఉదయతి చన్ద్రో గగనతలే.**

**తా. కమలదలాక్షీ :–** పదకొండు అక్షరాల పాదంలోని ఐదు, ఆరు అక్షరాలు చివరిదీ గురువు లైతే అది **కమలదలాక్షి** జాతి.

**ఉదా :–** కిరణాల బట్ట దులుపుకొంటూ ఉదయాద్రి ఎక్కుతూ, నక్షత్రగణబంధువు, కుముదసఖుడూ అయిన చంద్రుడు ఆకాశంలో ఉదయిస్తున్నాడు (పైకి వస్తున్నాడు).

**మూ. యది ఖలు పఞ్చమకాష్టమే పునరపి చాన్త్యగతం తు గురు,**
**చరణవిధావిహ వృత్తగతే భవతి హి సా ద్రుతపదగతిః. 243**

**యథా – గయణతలంగణహిణ్ణణఓ కిరణహతస్సవిభూసిదఓ,**
**విహుణిఅమేహపడంసుఓ ఉదయతి చందణడో రణే. 244**
**(గగనతలాఙ్గణహిణ్డనకః కిరణసహస్రవిభూషితకః,**
**విధూనితమేఘపటాంశుకో ఉదయతి చన్ద్రనటో గగనే).**

**తా. ద్రుతపదగతి :–** పదకొండు అక్షరాల పాదంలో ఐదు, ఎనిమిది, పదకొండు అక్షరాలు గురువు లైతే అది **ద్రుతపదగతిధ్రువ**.

**ఉదా :–** గగనతలం అనే నాట్యరంగంమీద తిరిగేవాడూ, అనేకకిరణాలచే అలంక రించుకొన్నవాడు అయిన చంద్రు డనే నటుడు, మేఘపట మనే తెర తోసుకొంటూ ఆకాశంలో ప్రవేశిస్తున్నాడు.

**మూ. యది ఖలు మధ్యే గురుయుగలం నిధనగతం చాప్యథ గురుకమ్,**
**భవతి హి సైవం చరణవిధౌ కమలనిభాస్యే హ్యతిచపలా. 245**

**యథా – కుసుమసుగంధీ సుఅపవణో తరువరలాసో పమదవణే,**
**బహుకుసుమేస్సి ణవసరదే విచరతి రమ్మే ణలిణివణే. 246**
**(కుసుమసుగన్ధీ సుఖపవనః తరువరలాస్యే ప్రమదవనే,**
**బహుకుసుమేఽస్యాం నవశరది విచరతి రమ్యే నలినీవనే).**

**తా. అతిచపలా :–** పదకొం డక్షరాల పాదంలో ఐదు, ఆరు, పదకొండు అక్షరాలు గురువు లైతే **అతిచపలాధ్రువ**.

**ఉదా :–** పుష్పసుగంధి యై సుఖకర మైన పవనం, అనేకపుష్పాలతో వ్యాప్తమైన

శరత్కాలాలంలో – వృక్షవనం లాస్యం చేస్తూన్న ఉద్యానవనంలోను, రమ్యమైన పద్మవనము నందూ సంచరిస్తూన్నది.

**మూ. తృతీయాన్త్యం చతుర్థం చ పఞ్చమం షష్ఠమేవ చ,**
**గురూణి త్రైష్టుభే పాదే యత్ర సా విమలా యథా. 247**

**యథా – కుసుమాకిణ్ణే ణిమ్మలసలిలే ణలినీసణ్డే ఛప్పదముహలే,**
**సరసీమజ్ఝే సారసముదితే సమదో హత్థీ ఏస విచరిదో. 248**
**(కుసుమాకీర్ణే నిర్మలసలిలే నలినీఖణ్డే షట్పదముఖరే,**
**సరసీమధ్యే సారసముదితే సమదో హస్తీ ఏష విచరితః).**

**తా. విమలా :–** పదకొం డక్షరాల పాదంలోని తృతీయ – పంచమ – షష్ఠ – సప్తమ – ఏకాదశాక్షరాలు గురువు లైతే అది **విమలాధ్రువ.**

**ఉదా :–** మదించిన ఈ గజం, అంతటా పుష్పాలచే కప్పబడినది, నిర్మలోదకము, తుమ్మెదమోతతో నిండినది, సంతోషిస్తూన్న సారసపక్షులు గలదీ అయిన సరోమధ్యంలో ఉన్న పద్మసమూహం వైపు వెడుతూన్నది.

**మూ. చతుర్థం పఞ్చమం పూర్వమన్త్యోపాన్త్యే తథైవ చ,**
**గురూణి త్రైష్టుభే పాదే యత్ర సా రుచిరా యథా. 249**

**యథా – మేహవిదాణం అవధుణమాణో కంపఅమాణో కుమదవణాణి,**
**తోఅసమూహం అవకిరమాణో వాయది వాదో కువిద ఇవాసు. 250**
**(మేఘవితానమవధూనయమానః కమ్పయమానః కుముదవనాని,**
**తోయసమూహమవకిరమాణో వాతి వాతః కుపిత ఇవాశు).**

**తా. రుచిరా :–** పదకొండు అక్షరాల పాదంలో నాలుగు, ఐదు, పది, పదకొండు అక్షరాలు గురువు లైతే అది **రుచిరావృత్తము.**

**ఉదా :– మేహవిదాణం –** మేఘా లనే వితానమును కదుల్చుచు, కుముదవనాలను కదిల్చివేస్తూ ఈ వాయువు, కోపించినది వలె, నీళ్లు వెదజిమ్ముతూ శీఘ్రంగా వీచుచున్నది.

**మూ. యది ఖలు గణ ఇహ నియతో యది పది గురు చ హి నిధనగతమ్,**
**భవతి లఘుగతిరతిచపలా త్వరితగతిరధికమతిజగతీ. 251**

**యథా – విధుణియ జలధరమసిదపడం దిఅగణమునివరపరిపఠిదో,**
**ఉదయగిరిసిహరతటముకటో విచరది గగణతలమ్మిసురో. 252**
**(విధూయ జలధరమసితపటం ద్విజగణమునివరపఠితః,**
**ఉదయగిరిశిఖరతటముకుటః విచరతి గగనతలే సూర్యః).**

**తా. త్వరితగతి :–** పదమూడక్షరాల పాదంలోని చివరి అక్షరం మాత్రం గురువై మిగిలిన వన్నీ లఘువులుగా ఉన్నది **త్వరితగతి** లేదా (లఘుగతిరతిచపలా).

**ఉదా :– విధుణియ –** ఉదయగిశిఖరతటానికి కిరీటం వలె ఉన్న సూర్యుడు మేఘా లనే నల్లని వస్త్రం దూరంగా తొలగించి, ద్విజగణములు మునివరులు స్తుతి స్తూండగా, ఆకాశవీథిలో సంచరిస్తున్నాడు.

**మూ. యది ఖలు పఞ్చమనిధనగతే ద్వే చరణవిధౌ భవతి హి గురుణీ తు,**
**అతిజగతీ భువి కథితగుణా సా మదకలితేతి నిగదితనామా. 253**

**యథా – గగణతలంగణమహిరుహమాణో**
**రజతమహాగిరిసిహరసరూవో,**
**పడిహమహామణి ణిఅరణిఆసో**
**పరిచరిదో ణవసరది మియంకో. 254**

**(గగణతలాఙ్గణమధిరోహన్ రజతమహాగిరిశిఖరసరూపః,**
**స్ఫటికమహామణినికరనివాసో ప్రచరితః నవశరది మృగాఙ్కః).**

**తా. మదకలితా :–** పదమూడు అక్షరాల జగతీఛందఃపాదంలోని ఐదు, పదమూడు అక్షరాలు గురువు లైతే **మదకలితాజాతి.**

**ఉదా :– గగణతలం –** కైలాసపర్వతశిఖరం వలె ఉన్న, స్ఫటికమణుల సముదాయనివాసమా అన్నట్లున్న చంద్రుడు నవశరత్కాలంలో ఆకాశప్రాంగణం మీదికి ఎక్కడానికి కదిలి వస్తున్నాడు.

**మూ. త్రిష్టుభో జాతయో హ్యేతా జగత్యాస్తు నిబోధత**
**నవమం నైధనే ద్వే చ గురూణి చరణే యది,**
**వృత్తే తు జగతీ సా తు జ్ఞేయా కమలలోచనా. 255**

**యథా – దిఅగణముణిగణనందిదతేజో పవితదకిరణసహస్సపిణద్ధో**
**విధుణిఅ తిమిరపడం జగదీవో ఉదయది గగణదలే అసు సూరో. 256**

**(ద్విజగణమునిగణవన్దితతేజాః ప్రవితతకిరణసహస్రపినద్ధః,**
**విధూనితతిమిరపటం జగద్దీప ఉదయతి గగనతలే ఆశు సూర్యః).**

**తా.** ఇంతవరకు చెప్పినవి త్రిష్టుప్ఛందస్సుకు చెందిన ధ్రువాజాతులు. ఇపుడు జగతీఛందోజాతులను తెలుసుకొనండి –

**కమలలోచనా :** పదమూడు అక్షరాల పాదంలోని తొమ్మిది, పదమూడు అక్షరాలు గురువు లైతే, అది **కమలలోచనాజాతి.**

**ఉదా :- దిఅగణ –** ద్విజగణంచేత మునిగణంచేతా నమస్కరింపబడిన తేజస్సుతో ప్రకాశిస్తూ, వ్యాపించిన సహస్రకిరణాలతో జగత్తు కంతకూ దీపమైన సూర్యుడు, శీఘ్రంగా అంధకారమనే వస్త్రం తొలగించి ఆకాశతలంలో పైకి వస్తున్నాడు.

**మూ. యది ఖలు చరణే తు సప్తమం పునరపి నవమం సనైధనమ్,**
**గురు తదపవక్త్రముచ్యతే నియతమపి నిదర్శనం యథా. 257**

**యథా – గిరితడవిచరో విఘుణ్ణిదో అసణిఘణరవేణ కంపఅమ్,**
**అభిపదది దుదం మహీదలం పడుదరణిణదో మహోఘణో. 258**
**(గిరితటవిచరో విఘూర్ణితోऽ శనిఘనరవేణ కమ్పయన్,**
**అభిపతతి ద్రుతం మహీతలం పటుతరనినదో మహోఘనః).**

**తా. అపవక్త్రం :-** పదకొండు అక్షరాల పాదంలోని సప్తమ – నవమ – ఏకాదశాక్షరాలు గురువు లైతే అది **అపరవక్త్రం.**

**ఉదా : గిరితడ –** పర్వతప్రదేశంమీద సంచరిస్తూ, తిరిగిపోతూ, పిడుగులధ్వనుల చేత కంపింపచేస్తూ, తీవ్రమైన ధ్వనిచేస్తూన్న ఈ మహామేఘం భూతలంవైపు శీఘ్రంగా వస్తూన్నది.

**మూ. ఏతాస్తు జాతయో జ్ఞేయో ప్రావేశిక్యా ధ్రువాస్తథా,**
**సమవృత్తపదానాం తు వర్ధమానం నిబోధత. 259**

**తా.** ఇంతవరకూ చెప్పినవి ప్రావేశికీధ్రువాజాతులు. ఇప్పుడు వర్ధమానకాంతర్గతా లైన సమవృత్తఛందస్సులను చెప్పుచున్నాను.

**మూ. ఏతాసాం లక్షణం సర్వం పూర్వముక్తం విధానతః,**
**ప్రతిష్ఠాది యథా ఛన్దః సమ్యక్ పాదవిభాగతః. 260**

**తా.** ప్రతిష్ఠాచందస్సు మొదలైన వీటి అన్నింటి లక్షణాలు పాదానుసారంగా వెనుక చెప్పి ఉన్నాను. (ఇక్కడ ధ్రువల విషయంలో కేవలం వాటి ఉదాహరణలు చెప్పబడుచున్న వని అర్థం).

**మూ. ప్రతిష్ఠా యథా –**
**మేహరవం ణవసరదే, ణిసమియ కుద్ధో భవఇ గఅవరో. 261**
**(మేఘరవం నవశరది దిశమ్య క్రుద్ధో భవతి గజవరః).**

**తా. ప్రతిష్ఠా :-** శరత్కాలప్రారంభంలో మేఘగర్జన విన్న మదగజం క్రోధావిష్టం అవుతూన్నది.

**మూ. సుప్రతిష్ఠా యథా –**

**విజ్జుకసాహిం పహదం మరుద్ధిం; పరుదది గయణం పసమిఅగహతారమ్.**

**(విద్యుత్కశాభిః ప్రహతం మరుద్భిః ప్రరుదతి గగనం ప్రశమితగ్రహతారమ్).**

**తా. సుప్రతిష్ఠకు ఉదాహరణం :– విజ్జుకసాహిం –** మెరుపు లనే కొరడాలతోనూ, గాలిచేతా కొట్టబడిన ఆకాశం గ్రహాలు నక్షత్రాలూ కనబడక ఏడుస్తున్నట్లున్నది.

**మూ. గాయత్రీ యథా –**

**మేఘరవాఉలం రుద్ధగహకదంబమ్**

**పసమిదదివాకరం రుదది వియణహదలమ్.** **263**

**(మేఘరవాకులం రుద్ధగ్రహకదమ్బం ప్రశమితదివాకరం రుదతీవ నభస్తలమ్).**

**తా. గాయత్రికి ఉదాహరణం :– మేఘరవాఉలం :–** మేఘధ్వనిచేత ఆకులమై, మేఘాలచేత కప్పివేయబడిన గ్రహసముదాయం కల, ఆకాశతలం సూర్యుడు అస్తమించి రోదనం చేస్తూన్నట్లున్నది.

**మూ. ఉష్ణిగ్ యథా –**

**పుల్లిఅతరసండే సురభిపవణహదే,**

**విఅరది పదమవణే హంసో సహఅరిపరిబుదో.** **264**

**(పుల్లతరుఖండే సురభిపవనహతే; విచరతి పద్మవనే హంసః సః సహచరీవృతః).**

**తా. ఉష్ణింక్ఛదస్సుకు ఉదాహరణం :–** వికసించిన వృక్షసముదాయము గల, పరిమళి స్తూన్న పవనంతో వ్యాప్తమైన పద్మవనంలో హంస సహచరిలతో కూడి విహరిస్తూన్నది.

**మూ. వర్ధమానం మయైవం తు త్ర్యస్రాణాం పరికీర్తితమ్,**

**పునశ్చ చతురస్రాణామేవమేవ నిబోధత.** **265**

**తా.** నేనింతవరకు త్ర్యస్రంతో వర్ధమానకంలో ఏర్పడే భేదాలు చెప్పాను. చతురస్రంతో ఏర్పడే భేదాలు చెపుతాను.

**మూ. అనుష్టుప్ యథా –**

**తారాబంధు ఏస ణహే విక్కిరమాణో మేహపడమ్,**

**కిరణసహస్సభూసిదఓ ఉదయది సోమ్మో రజణికరో.** **266**

**(తారాబన్ధురేష నభసి వికిరన్ మేఘపటమ్,**

**కిరణసహస్రభూషిత ఉదయతి సౌమ్యః రజనికరః).**

**తా. అనుష్టుప్‌కు ఉదాహరణం :–** తారలతో కూడిన ఈ చంద్రుడు ఆకాశంమీద మేఘవస్త్రాన్ని దూరంగా గెంటివేస్తూ కిరణసహస్రభూషితుడై ఉదయిస్తున్నాడు.

**మూ. బృహతీ యథా –**

**ఏసో సుమేరువణఅమ్మి దేవఅసిద్ధఅపరిగీదే,**
**అదిసురహిగంధవణచారీ పలిచరది విహగజువాఓ. 267**

**(ఏష సుమేరువనే దేవసిద్ధపరిగీతే,**
**అతిసురభిగన్ధవనచారీ ప్రవిచరతి విహఙ్గమయుగలః).**

**తా. బృహతికి ఉదా :–** దేవతల సిద్ధుల సంగీతధ్వనులతో నిండి ఉన్న సుమేరు వనంలో పక్షుల జంట చాల పరిమళిస్తూన్న వనమునందు సంచరిస్తూ విహరిస్తూన్నది.

**మూ. పఙ్క్తిర్యథా – పంక్తికి ఉదాహరణం –**

**పాదవసీసం కంపఅమాణో సురహి గఅగండవాసిదఓ**
**ఉపవణతరుగణలాసణఓ విచరది వరతణు వణపవణో. 268**

**(పాదపశీర్షం కమ్పయమానః సురభిగజగణ్డవాసితః,**
**ఉపవనతరుగణలాసకః వరతను వనపవనః).**

**తా.** సుందరీ! ఈ వనపవనం ఉపవనంలోని తరువులను నృత్యం చేయిస్తూ, చెట్ల శిఖరాలను ఊపుతూ, సంచరిస్తూన్నది. గజగండస్థలాలనుండి స్రవిస్తూన్న మదోదకం చేత ఇది సుగంధం గలదై ఉంది.

**మూ. త్రిష్టుప్ యథా – త్రిష్టుప్‌కు ఉదాహరణం –**

**కుముదవణస్స విభూసణఓ విధుణిఅతిమిరపడం గగణే,**
**ఉదఅగిరిసిహరమహిరుహంతో రఅణికరో ఉదయది విమలకరో. 269**

**(కుముదవనస్య విభూషణో విధునితతిమిరపటం గగనే,**
**ఉదయగిరిశిఖరమధిరోహన్ రజనికర ఉదయతి విమలకరః).**

**తా.** ఈ చంద్రుడు కుముదవనానికి అలంకార మైనవాడు, ఆకాశంమీద కప్పి ఉన్న చీకటి అనే వస్త్రాన్ని దూరంగా తొలగించి ఉదయగిరిశిఖరాన్ని ఎక్కుతూ నిర్మలమైన కిరణాలతో ప్రకాశిస్తున్నాడు.

**మూ. జగతీ యథా – జగతికి ఉదాహరణం –**

**దిఅగణముణిగణసంథుదఓ తవిదకణఅబరసంణిభదేహో**
**దుదమిహ ణహదలమహిరుహమాణో విఅరది సపది దివసకరో. 270**

**(ద్విజగణమునిగణసంస్తుతః తప్తకనకవరసన్నిభదేహః,**
**ద్రుతమిహ నభస్తలమధిరోహన్ విచరతి సపది దివసకరః).**

**తా.** పుటంపెట్టిన శుద్ధమైన బంగారం వంటి దేహం కల సూర్యుడు ద్విజగుణాలచేత మునిగణాలచేత స్తుతింపబడుతూ శీఘ్రంగా ఆకాశంమీదికి ఎక్కుతూ సంచరిస్తున్నాడు.

**మూ. ఏతాస్తు జాతయో జ్ఞేయాశ్చతురస్రవివర్ధితాః,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి గణమాత్రావికల్పనమ్. 271**

**తా.** ఇవి చతురస్రాలచే వర్ధితము లైన జాతులు. ఇటుపైన గణ - మాత్రా ఛందస్సులను గూర్చి విశదీకరిస్తాను.

**మూ. సుప్రతిష్ఠావసానానాం పాదో ద్వ్యర్ధగణః స్మృతః,**
**చతుర్భిశ్చరణైస్తాసాం గణాః ప్రోక్తాః షడేవ హి. 272**

**తా.** సుప్రతిష్ఠాఛందస్సుల చివరి పాదాలలో రెండున్నర గణా లుంటాయి. వాటి నాలుగు పాదాలలో మొత్తం ఆరు గణాలు మాత్రమే ఉంటాయి.

**మూ. తథా చైవాపకృష్టానాం ద్వౌ గణావర్ధమేవ చ,**
**పదానాం చైవ విజ్ఞేయాః ప్రమాణేన గణా దశ. 273**

**తా.** అదే విధంగా అపకృష్టాధ్రువలోని చివరి పాదంలో రెండున్నర గణా లుంటాయి. దీని మొత్తం గీతంలో పది గణా లుంటాయి.

**మూ. పాదేఽడ్డితోత్థితానాం చ త్రయోర్ధం చైవ కీర్తితాః,**
**చతుర్దశ గణాశ్చైవ కీర్తితాస్తత్ప్రమాణతః. 274**

**తా.** అడ్డితధ్రువ పాదంలో మూడున్నర గణా లుంటాయి. మొత్తం ఈ ధ్రువాగీతంలో పద్నాలుగు గణా లుంటాయి.

**మూ. త్ర్యస్రాణాం తు ద్విపదానామర్ధషష్ఠాః గణాః స్మృతాః,**
**పాదతశ్చైవ విజ్ఞేయాస్త్వేకాదశ గణా బుధైః. 275**

**తా.** త్ర్యస్రజాతికి చెందిన ద్విపాదఛందస్సుల చివరి పాదాలలో ఆరున్నర గణా లుంటాయి. పూర్తి గీతంలో పదకొండు గణా లుంటాయి.

**మూ. పాదాశ్చ చతురస్రాణాం గణాః సార్ధాష్టమాః స్మృతాః,**
**పాదద్వయేఽపి తాశ్చ స్యుః గణాః పఞ్చదశైవ తు. 276**

**తా.** చతురస్రాజాతిద్విపాదఛందస్సుల చివరి పాదాలలో ఎనిమిదిన్నర గణా లుంటాయి. పూర్తి గీతంలో పదిహేను గణా లుంటాయి.

**మూ. ఆద్యాసు చతురస్రాసు ద్వ్యాదిర్నవావరస్తథా,**
**అక్షరాణాం భవేత్పిణ్డో గుర్వాది లఘునైధనమ్. 277**

**తా.** చతుర్రసాజాతిచ్ఛందస్సుల మొదటి పాదంలోని గణాలలో ఒక గురువు ఒక లఘువు ఉంటాయి. దీనిలోని గణాలు రెండుకు తగ్గవు, తొమ్మిదికి మించి ఉండవు.

**మూ. త్ర్యస్రే త్వక్షరపిణ్డే పఞ్చాదిర్నవావరశ్చ విజ్ఞేయః,**
**చతురస్రః సప్తాదిః యో దశావరశ్చ విజ్ఞేయః. 278**

**తా.** త్ర్యస్రంలో ఐదుకు తగ్గకుండా, తొమ్మిదికి మించకుండా గణా లుండాలి. చతురస్రంలోని గణాలు ఏడుకు తగ్గకుండా పదికిమించకుండా ఉండాలి.

**మూ. సర్వగురుః పఞ్చాదిః సర్వలఘుర్నవావరశ్చ విజ్ఞేయః,**
**సర్వగురుః సప్తాదిః త్రయోదశపరశ్చ సర్వలఘుః. 279**

**తా.** చతురస్రంలోని గణాలు సర్వగురువు లైతే అవి ఐదుకు తగ్గకుండా ఉండాలి. సర్వలఘువు లైతే తొమ్మిదికి మించి ఉండగూడదు. అన్నీ గురువు లైతే ఏడుకు తగ్గకుండా పదికి మించకుండా ఉండాలి.

**మూ. ఏష త్వక్షరపిణ్డో విజ్ఞేయో వై ధ్రువాసు సర్వాసు,**
**గణమాత్రాంశవికల్పం వ్యాఖ్యాస్యామి ద్విపదానామ్. 280**

**తా.** అన్ని ధ్రువలలోను వర్ణసంఖ్య ఇలాగే ఉండాలి. ఇపుడు ద్విపదల వివిధ అవయవాలను వాటిలో ఉండవలసిన గణాల సంఖ్యను చెపుతాను.

**మూ. ఏకాదశాద్యం త్ర్యస్రాణాం చైకవింశతి నైధనమ్,**
**పాదాక్షరకృతః పిణ్డో గుర్వాదిర్లఘునైధనమ్. 281**

**తా.** త్ర్యస్రధ్రువల ప్రథమపాదంలో పదకొండు గణాలు, చివరిపాదంలో ఇరవై యొక్క గణాలు ఉంటాయి. దీనిలోని గణాలలో గురువుకు తరవాత లఘు వుంటుంది.

**మూ. షోడశాద్యస్తథా పాదో భవేద్వింశతి నైధనమ్,**
**విజ్ఞేయశ్చతురస్రాణాం గుర్వాదిర్లఘునైధనమ్. 282**

**తా.** చతురస్రధ్రువ ప్రథమపాదంలో పదహారు గణాలు, చివరి పాదంలో ఇరవై గణాలు ఉండాలి. దానిలోని గణాలలో ఒక గురువు తరువాత ఒక లఘు వుండాలి.

**మూ. శీర్షకాణాం తు నియమో నైవ పాదవిధానతః,**
**గురుగుర్వాదిమధ్యాన్తస్తథా చైవ లఘుః స్మృతః. 283**

**తా.** శీర్షకాల విషయంలో ఈ నియమం పాదాలను పట్టి ఉండదు. శీర్షకం ప్రారంభంలో రెండు గురువుల తరువాత లఘువు ఉండాలి. దీని మధ్యలోను, చివరా కూడ ఇలాగే ఉండాలి.

**మూ. త్ర్యస్రాయాస్తు గణాః పఞ్చ సన్నిపాతే విధీయతే,**
**అష్టౌ చ చతురస్రాయాః సన్నిపాతో భవేత్తథా. 284**

**తా.** త్ర్యస్రధ్రువలలో ఐదు గణాల సంనిపాతం (ఆయామం లేదా ప్రమాణం), చతురస్రధ్రువలలో ఎనిమిది గణాల సంనిపాతము ఉంటుంది.

**మూ. ద్వౌ పాదౌ సన్నిపాతశ్చ ధ్రువాణాం సంప్రకీర్తితః,**
**ద్రుతం చ శీర్షకం చైవ హిత్వాన్యాని భవన్తి హి. 285**

**తా.** ధ్రువలలో రెండు పాదాల సంనిపాతం ఉంటుంది. ద్రుతము, శీర్షకము తప్ప మిగిలినవి ఉంటాయి.

**మూ. అక్షరపిణ్డస్త్ర్యస్రే పఞ్చాదిర్నవపరశ్చ విజ్ఞేయః,**
**అష్టావరశ్చతురస్రే త్రయోదశపరస్తు విజ్ఞేయః. 286**

**తా.** త్ర్యస్రంలోని గణాలు ఐదుకు తగ్గకుండా తొమ్మిదికి మించకుండా ఉండాలి. చతురస్రంలో ఎనిమిదికి తగ్గకుండా పదమూడుకు మించకుండా ఉండాలి.

**మూ. సర్వగురుః పఞ్చాదిః సర్వలఘుర్నవావరశ్చ విజ్ఞేయః,**
**సర్వగురురష్టాదిస్త్రయోదశావరతశ్చ సర్వత్ర లఘు. 287**

**తా.** చతురస్రధ్రువలో సర్వగురునిర్మితగణాలు ఐదుకు తగ్గకూడదు, తొమ్మిదికి మించకూడదు. సర్వలఘునిర్మితా లైతే ఎనిమిదికి తగ్గకూడదు పదమూడుకు మించ కూడదు.

**మూ. ఏష హ్యక్షరపిణ్డో విజ్ఞేయో వై ధ్రువావిధానజ్ఞైః,**
**గణమాత్రాంశవికల్పం వ్యాఖ్యాస్యామి ద్రుతాయాస్తు. 288**

**తా.** ధ్రువాప్రయోక్తలు తెలిసికొనవలసిన అక్షరపిండం ఇదే. ఇప్పుడు ద్రుతాధ్రువకు సంబంధించిన గణమాత్రావిభాగం చెపుతాను.

**మూ. అర్ధషష్ఠగణా జ్ఞేయాః సన్నిపాతాః ద్రుతాస్వథ,**
**మాత్రా ద్వావింశతిశ్చైవ గురులఘ్వక్షరాన్వితాః. 289**

**తా.** ద్రుతాధ్రువలలోని సన్నిపాతలలో ఆరున్నర గణా లుండాలి. గురులఘ్వక్షరాలు కలిసిన ఇరవైరెండు మాత్ర లుండాలి.

**మూ. శీర్షకాణామనియమో భవేత్పాదవిధానతః,**
**నానావృత్తవినిష్పన్నం కుర్యాద్వై శీర్షకం బుధః. 290**

**తా.** శీర్షకాలలో పాదవిధానాన్ని పట్టి నియమం ఉండదు. పండితుడు శీర్షకాన్ని నానావృత్తాలతో నిర్మించాలి.

**మూ. గుర్వాదిరథ లఘ్వాదిర్యుగ్మః సర్వలఘుస్తథా,**
**చతుర్మాత్రాగణా జ్ఞేయాః పూర్వచ్ఛన్దోవికల్పితాః. 291**

**తా.** వీటిలోని గణాలలో కొన్నిటికి ఆదియందు గురువు లుంటాయి. కొన్నింటికి లఘువు లుంటాయి. కొన్ని గురులఘుమిశ్రితములై ఉంటాయి. కొన్ని సర్వలఘువులు గాని, సర్వగురువులు గాని అయి చాతుర్మాత్రిక (నాలుగుమాత్రల) గణాలు ఏర్పడతాయి. వీటిద్వారా వెనుక ఛందస్సులలో అనేకప్రకారములైన వృత్తాలు ఏర్పడతాయి.

**మూ. అర్ధాష్టమగణాః పాదాః శీర్షకస్య భవన్తి హి,**
**త్రింశన్మాత్రాశ్చ విజ్ఞేయా యుగ్మౌజాక్షరికైః పదైః. 292**

**తా.** శీర్షకాలలోని పాదాలలో ఎనిమిదిన్నర గణాల చొప్పున ఉంటాయి. ఈ పాదాలలోని అక్షరాలు సరిసంఖ్యలో ఉండవచ్చు, బేసిసంఖ్యలో ఉండవచ్చు.

**మూ. శీర్షకస్యైకవింశత్యా షడ్వింశతిపరస్తథా,**
**అక్షరాణాం భవేత్పిణ్డః పాదే హ్యేకత్ర నిశ్చయాత్. 293**

**తా.** శీర్షకంలోని ఒక్కొక పాదంలో ఇరవైఒకటికి తగ్గకుండా, ఇరవైయారుకు మించకుండా అక్షరా లుంటాయి.

**మూ. యుగ్మా ఔజా మిశ్రా పాదే కార్యా గణాస్తు చత్వారః,**
**నియతం శీర్షవిధానే పశ్చాల్లఘుసంచయః కార్యః. 294**

**తా.** శీర్షకం నాలుగుపాదాలలోను కూడ సరిసంఖ్య అక్షరాలు, బేసి సంఖ్య అక్షరాలు మిశ్రితములై ఉంటాయి. శీర్షకంలో లఘువర్ణసంచయం తప్పకుండా ఉండాలి.

**మూ. త్రయ ఏవ గణాస్తు ముఖే లఘవస్త్రయ ఏవావసానే తు,**
**మధ్యే చేద్ గురుణీ ద్వే తచ్చపలం శీర్షకం నామ. 295**

**తా.** ప్రారంభంలో మూడు లఘుగణాలు, అట్లే చివర కూడ మూడు లఘుగణాలు, మధ్య రెండు గురుగణాలు లుంటే అది **'చపలా'** అను శీర్షకం.

**మూ. పూర్వార్ధేఽథ చతుర్హ్రస్వా మిశ్రా గణాస్తు చత్వారః,**
**పాతే భవన్తి నిత్యం పశ్చాల్లఘుసఙ్చయాః శేషాః. 296**

**తా.** మొదటి అర్ధంలో నాలుగు లఘువులు, నాలుగు మిశ్రగణాలు ఉండగా మిగిలిన భాగంలో లఘువర్ణసంచయం ఉండాలి.

**మూ. ఏకద్వికలాస్త్రికలాశ్చతుష్కలాః షట్కలాస్తథాష్టకలాః,**
**ధ్రువావిరామాః కార్యాః ప్రాసాదిక్యన్తరాక్షేపైః. 297**

**తా.** ప్రాసాదికీ – అంతరా – ఆక్షేపికీధ్రువల ద్వారా నిర్మించిన ధ్రువలలో విరామాలు (Pavses) ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఆరు, ఎనిమిది కలలు ఉండాలి.

**మూ. త్ర్యస్రే విరామస్త్రికలశ్చతురస్రే చతుష్కలః,**
**ప్రావేశిక్యా ధ్రువాయాస్తు నైష్క్రామిక్యాస్తథైవ చ. 298**

**తా.** త్ర్యస్రధ్రువలో మూడు కలల విరామం, చతురస్రధ్రువలో నాలుగు కలల విరామం ఉండాలి. ప్రావేశికీ – నైష్క్రామికీధ్రువల విషయంలో కూడ ఇదే నియమం పాటించాలి.

**మూ. విరామో ద్వికలో నిత్యమన్తరాయాస్తథైవ చ,**
**పాదాన్తే హి విరామస్తు ఆక్షిప్తాయాః ప్రకీర్తితః. 299**

**తా.** అంతరాధ్రువలో రెండు కలల విరామం ఉండాలి. ఆక్షిప్తాధ్రువలో పాదాంతంలో విరామం పాటించాలి.

**మూ. స్థితాయాస్తు తథా హ్యర్ధే ప్రాసాదిక్యాస్తథైవ చ,**
**కలాకలార్ధయోగేన గురులఘ్వక్షరాన్వితః. 300**

**తా.** స్థితా – ప్రాసాదికీధ్రువలలో పాదార్ధంలో విరామం చెయ్యాలి. వెనుక చెప్పినట్లు వీటిలో అర్ధకల చొప్పున కలను పెంచుతూ లఘు – గుర్వక్షరాలను చేరుస్తూ ఉంచాలి.

**మూ. త్రయో ధ్రువాణాం సంయోగా విజ్ఞేయా వృత్తసంశ్రయాః,**
**సర్వదీర్ఘః సర్వలఘుర్గురులఘ్వక్షరస్తథా. 301**

**తా.** వృత్తాలను పట్టి, ధ్రువల అంతాలలో సర్వదీర్ఘము, సర్వలఘువు, గురులఘు మిశ్రణము అను మూడు సంయోగాలు (పరిణామాలు) ఏర్పరచాలి.

**మూ. గురుప్రాయా స్థితా కార్యా లఘుప్రాయా ద్రుతా తథా,**
**గురులఘ్వక్షరప్రాయా ప్రాసాదిక్యన్తరా తథా. 302**

**తా.** స్థితాధ్రువలో అధికసంఖ్యలో గుర్వక్షరాల, ద్రుతాధ్రువలో లఘ్వక్షరాల, ప్రాసాదికీ – అన్తరాధ్రువలలో గురులఘుఅక్షరాల సమమిశ్రణము ఉండాలి.

**మూ. ఏవం ధ్రువాణాం కర్తవ్యా జాతయో వృత్తసంభవాః,**
**అత ఊర్ధ్వ ప్రవక్ష్యామి శీర్షకాణాం తు లక్షణమ్. 303**

**తా.** వృత్తాలతో ఏర్పడే ధ్రువల విధానం ఇది. ఇపుడు శీర్షకాల లక్షణం చెపుతాను.

**మూ. ఆద్యమన్త్యం తృతీయం చ పఞ్చమం సప్తమాష్టమే,**
**గురూణి యస్యాః పాదే తు సా శ్యేనీ తు కృతౌ యథా. 304**

**తా. (1) శ్యేనీ :–** ఇరవైఒక అక్షరా లున్న పాదంలో ఒకటి, మూడు, ఐదు, ఏడు, ఎనిమిది, ఇరవైఒకటి అక్షరాలు గురువు లైతే అది **'శ్యేనీ'** శీర్షకం.

**మూ. యథా –**

**సాగరం సముద్ధుణంతో రథ ఇవ లఘుగది అభిపదిదో**
**పవ్వదా సమాహణంతో తరుసు చ జణఅదో భయమతులమ్,**
**రేణుజాలముక్ఖిపంతో దివసకరకిరణమిదుకరణో**
**బోధఅం పజాసు కామం విచరది వరతణు సుహపవహణో. 305**

**(సాగరం సముద్ధున్వన్ రథ ఇవ లఘుగతిరభిపతితః**
**పర్వతాన్ సమాఘ్నన్ తరుషు జనయన్ భయమతులమ్,**
**రేణుజాలముత్క్షిపన్ దివసకరకిరణమృదుకరణః**
**బోధయన్ ప్రజాసు కామం విచరతి వరతను సుఖపవనః).**

**తా. ఉదాహరణం :– సాగరమ్ :–** సుందరీ! సుఖకర మైన ఈ వాయువు రథం వలె అతిశీఘ్రంగా వస్తూ, జనాలలో కామం ఉత్తేజపరుస్తూ సంచరిస్తూన్నది. ఇది సాగరాన్ని కదలుస్తూ పర్వతాలను డీకొంటూ వృక్షాలకు అధిక మైన భయం కలిగిస్తూన్నది. రేణువుల సముదాయాన్ని పైకి ఎగురుకొట్టి సూర్యుని కిరణాల తీవ్రతను తగ్గిస్తూన్నది.

**మూ. పఞ్చ త్వాదౌ యత్ర తు దీర్ఘం నవమమపి చ గురుసమయకృతం**
**దీర్ఘఞ్చాన్త్యం చాష్టమమన్యలఘు విరచితమపి చరణవిధౌ,**
**వృత్తే జ్ఞేయా జాతిరపీయం శ్రుతిసుఖయతిరచితవిభవా**
**క్రౌఞ్చా నామ్నా ఛన్దసి ప్రోక్తా ద్విజగణమునిగణపరిపఠితా. 306**

**యథా – ఏసో చందో ణిమ్మలదేహో విధుణిఅ ఘణతమమసిదపడం**
**లోకాణందో లోకపదీపో ఉడుగణగహగణసమణుగదో,**
**పాసాదాణం కారయమాణో సిదపవణిసణమివ విపులం**
**లోకాలోకం రంజఅమాణో విచరది వరతణు గయణతలే. 307**

**(ఏష చన్ద్రో నిర్మలదేహో విధూయ తమసమ్ అసితపటం**
**లోకానన్దో లోకప్రదీప ఉడుగణగ్రహగణసమనుగతః,**
**ప్రాసాదానాం కారయమాణః సితపటవసనమివ విపులం**
**లోకాలోకం రఞ్జయమాణో విచరతి వరతను గగనతలే).**

**తా. క్రౌంచా :–** ఇరవైరెండు అక్షరాల పాదంలో మొదటినుండి ఐదవ అక్షరం వరకు, అష్టమ, నవమ, అంతిమ అక్షరాలు గురువు లైతే, మిగిలిన అక్షరా లన్నీ లఘువు లైతే, సుఖప్రదమైన యతు లున్న, మునిగణం పఠించే ఈ జాతి 'క్రౌంచ' అను శీర్షకం.

**ఉదాహరణం :–** సుందరీ! నిర్మలస్వరూపు డైన ఈ చంద్రుడు దట్టమైన చీకటి అను నల్లని వస్త్రాన్ని దూరం చేస్తూ నక్షత్ర – గ్రహాదులు వెంట రాగా లోకం నేత్రాలను రంజింపచేస్తూ సంచరిస్తున్నాడు. లోకాని కంతకీ దీపమైన ఈ చంద్రుడు లోకానికి ఆనందం కలిగిస్తున్నాడు. ప్రాసాదాలపైన విశాలమైన తెల్లని వస్త్రం కప్పుతూన్న ట్లున్నాడు.

**మూ. ఆద్యచతుర్థే పఞ్చమషష్ఠే నవమదశమమథ నిధనగతం**
**యే చ తథాన్యే తే చ లఘుత్వం యది భవతి చరణగతివిధౌ,**
**సా వికృతిః స్యాత్ పుష్పసమృద్ధా ద్విజగణమునిగణపరిపఠితా**
**నామవికల్పాన్ వృత్తకృతా వైవిబుధబహుమతపదనియమా. 308**

**యథా – పుష్పవిదాణం ఉద్ధుణమాణో రథ ఇవ దుతగది అభిపదిదో**
**పక్కమమాణో సేలతడేసుం తరుసు అవకిరిఅ కమలదలమ్**
**మేహసమూహం ఉద్ధాణమాణో సరసిక్ఖుభిదసలిలకలకలో**
**భీమణిణాదో చండపవాహీ విచరది వరతణు వణపవణో. 309**

**(పుష్పవితానముద్ధూయమానః రథ ఇవ ద్రుతగతిరభిపతితః**
**ప్రక్రమమాణః శైలతటేషు తరుషు అవకీర్య కమలదలమ్,**
**మేఘసమూహముద్ధూనయమానః సరసి క్షుభితసలిలకలకలో**
**భీమనినాదశ్చణ్డప్రవాహీ విచరతి వరతను వనపవనః.**

**తా. పుష్పసమృద్ధా :–** ఇరవైమూడు అక్షరాల పాదంలోని ఒకటి, నాలుగు, ఐదు, ఆరు, తొమ్మిది, పది అక్షరాలు. చివరిది గురువు లైతే దీనికి **పుష్పసమృద్ధాశీర్షకం** అని పేరు.

**ఉదా :– పుష్పవిదాణం :–** సుందరీ! ఈ పవనం భయంకరంగా ధ్వని చేస్తూ తీవ్రంగా వీచుతూ సంచరిస్తూన్నది. పుష్పసముదాయాన్ని ఎగురుగొట్టి వేస్తూన్నది. పర్వత తటాలమీద సంచరిస్తూన్నది. వాటిపై నున్న చెట్ల మీద పుష్పదలాలను చిమ్మివేస్తూన్నది. మేఘసముదాయాన్ని ఎగురుకొడుతూ, కలిచివేయబడిన సరస్సులో నీళ్ల కలకలధ్వానాన్ని విస్తరింపచేస్తూ, రథం వలె అతిశీఘ్రంగా వచ్చి పడింది.

**మూ. అన్త్యం చ పఞ్చమం షష్ఠసప్తమం దశమం గురు,**
**వృత్తే సంకృతిసంజ్ఞే తు సంభ్రాన్తా నామ సా యథా. 310**

**కిరణసహస్సం విక్కిరమాణో ఫడిఅమణిరుచిరధవలణిహో**
**కుముదవణాఇ బోధయమాణో కుముదదలణిఅరసదిసవవు**
**గహగణబంధు లోకదీవో ఉడుగణగహగణసమణుగదో**
**ఉదయతి చందో రోహిణికంతో ణవసరది కుముదిగణ సుహృదో. 311**

**(కిరణసహస్రం వికిరన్ స్ఫటికమణిరుచిరధవలనిభః**
**కుముదవనాని బోధయమానః కుముదదలనికరసదృశవపుః,**
**గ్రహగణబన్ధుర్లోకప్రదీపః ఉడుగణగ్రహగణసమనుగతః**
**ఉదయతి చన్ద్రో రోహిణికాన్తో నవశరది కుముదిగణసుహృత్).**

**తా. సంభ్రాన్తా :–** ఇరవైనాలు గక్షరాల పాదంలోని పంచమ – షష్ఠ – సప్తమ – దశమ – అంత్యఅక్షరాలు గురువు లైతే అది **సంభ్రాంత.**

శరత్కాలప్రారంభంలో – రోహిణీకాంతుడు, కుముదినీసుహృత్ అయిన చంద్రుడు – నక్షత్రగణాలు, గ్రహాలు వెంటరాగా అనేకకిరణాలను వ్యాపింపచేస్తూ, కలువల గుంపులను మేల్కొలుపుతూ పైకి వస్తున్నాడు. ఈ చంద్రుని దేహం తెల్లని స్ఫటికమణి వలె అందంగా ప్రకాశిస్తూన్నది. తెల్ల కలువల రేకుల పోగువలె ఉంది.

**మూ. అష్టావాదౌ దీర్ఘాణి స్యుర్యది చ హి భవతి లఘుగణః,**
**భూయశ్చాన్తే దీర్ఘం త్వేకం యది భవతి పది పది పునరపి తదా,**
**మత్తాక్రీడా విద్యున్మాలేత్యపి చ కవిభిరపి బహుభిరుదితా**
**నామ్నా ఛన్దోవృత్తే వికృతిగతివిధిషు చ నియమసహితా. 312**

**యథా – ఏసో మేహో సేలాభోఓ అసణిమురజపడుపడహసమరఓ**
**ణాణావిజ్జుజ్జోఆలోఓ ఘణజలధరపడలసమణుగదో,**
**ణాణావణ్ణో తోడగ్గారీ పవిచరది రుచిరకుసుమజధురో**
**సంఛాదంతో లోయం ఏసో చలగిరిణివహా ఇవ సుతణులదే. 313**

**(ఏష మేఘః శైలాభోగేఽశనిమురజపటుపటహసమరవో**
**నానావిద్యుద్యోగాలోకో ఘనజలధరపటలసమనుగతః,**
**నానావర్ణస్తోయోద్గారీ ప్రవిచరతి రుచిరకుసుమజధుర్యః**
**సంఛాదయన్ లోకమేష చలగిరినివహా ఇవ సుతనులతే).**

**తా. మత్తాక్రీడ** లేదా **విద్యున్మాలా :–** ఇరవై మూడు అక్షరాల పాదంలోని మొదటి ఎనిమిది అక్షరాలు, చివరిదీ గురువులై యుండి, మిగిలిన వన్నీ లఘువు లైతే అది **మత్తాక్రీడా** లేదా **విద్యున్మాలా** అని చాలమంది కవులు ప్రశంసిస్తూంటారు. ఎట్లనగా –

ఓ! సుతనూ! శైలం వలె విశాలమైన శరీరం గల ఈ మేఘం, జంగమపర్వతం వలె ఆకాశాన్ని కప్పివేస్తూ సంచరిస్తూన్నది. దీని ఉరుములు మురజధ్వనుల వలె, పటహధ్వనుల వలె గంభీరంగా ఉన్నాయి. అనేకవిధాలైన మెరుపుల దీపాలతో ప్రకాశిస్తూన్న దీనిని దట్టమైన మరి కొన్ని మేఘసముదాయాలు అనుసరించి వస్తున్నాయి. అనేకవిధాలైన

వర్ణాలు గల ఈ మేఘం నీటిని వర్షిస్తూ అందమైన పుష్పాలు మోసికొని వస్తున్నట్లుంది.

**మూ. ఆద్యమన్త్యం చతుర్థం చ సప్తమం దశమం తథా,**
**గురూణ్యేకాదశం చైవ సంకృతౌ వృత్తసంచయే. 314**

**లఘూన్యన్యాని శేషాణి పాదే యస్మిన్ భవన్తి హి,**
**విజ్ఞేయం శీర్షకం తద్‌జ్ఞైః స్థలితం నామతో యథా. 315**

**యథా – వాదసముద్ధతవీచితరంగో ఫడిఅమణిణిఅరరుచిరజలో**
**వీచిపరంపరఘోరణిణాదో పడుపవణలులిదవిహగుకులో**
**మణికులాకులభీమతరంగో ఖుభిదఘణణివహసదిసరవో**
**తుంగమహీధరమాణణిరుద్ధో రుసిదో ఇవ పపది సలిలణిహి. 316**

**(వాతసముద్ధతవీచితరఙ్గో స్ఫటికమణినికరరుచిరజలః**
**వీచిపరమ్పరాఘోరనినాదః పటుపవనలులితవిహగకులః,**
**మణికులాకులభీమతరఙ్గో క్షుభితఘననివహసదృశరవః**
**తుఙ్గమహీధరమాననిరోధో రుషిత ఇవ సపది సలిలనిధిః).**

**తా. స్థలితా :–** ఇరవైనాలు గక్షరాల పాదంలోని ప్రథమ – చతుర్థ – సప్తమ – దశమ – ఏకాదశ – అంతిమాక్షరాలు గురువులగా ఉండి మిగిలినవి లఘువు లైతే అది **స్థలితాధ్రువ**. ఉదాహరణం – **వాదసముద్ధత :–**

ఎత్తైన పర్వతాల గర్వాన్ని అణిచే ఈ సముద్రం కోపావేశంలో ఉన్నట్లుంది. గాలికి పెద్ద పెద్ద తరంగాలు లేస్తున్నాయి. దీని జలం స్ఫటికమణుల సముదాయం వలె మెరుస్తూన్నది. భయంకర మైన తరంగాలు మణిగణాలతో వ్యాకులంగా ఉన్నాయి. విజృంభించిన దట్టమైన మేఘం వలె ధ్వని చేస్తూన్నది.

**మూ. ప్రకృత్యాం పశ్చిమాన్త్యే చ హ్యష్టమైకాదశే గురూ,**
**ద్వాదశశ్చేతి విజ్ఞేయం నామతశ్చపలా యథా. 317**

**మునిగణమండలివందిదతేజో విధుణిఅతిమిరదివ ఘణపడం**
**కమలవణాఇ విబోధఅమాణో జదిగణమునిగణపరిపఠిదో**
**భుజఅసహస్సవివద్ధితపాదో సుతవిదకణఅసదిసవపుఓ**
**కరణఅరేహి పసాదిఅలోఅం ఉదయది వరతణు దివసకరో. 318**

**(మునిగణమణ్డలవన్దితతేజాః విధూయ తిమిరదివఘనపటం**
**కమలవనాని విబోధయమానః యతిగణమునిగణపరిపఠితః,**
**భుజగసహస్రవివర్ధితపాదః సుతప్తకనకసదృశవపుః**

**కరనికరైః ప్రసాద్య లోకముదయతి వరతను దివసకరః).**

**తా. చపలా :-** ఇరవైయైదు అక్షరాల పాదంలోని పంచమ - అష్టమ - ఏకాదశ - ద్వాదశాక్షరాలు గురువు లైతే అది **చపలాధ్రువ**. ఉదాహరణం - **మునిగణ**.

సుందరాంగీ! దివసకరుడు తన కిరణాలతో లోకాన్ని నిర్మలంగా చేస్తూ ఉదయిస్తున్నాడు. వీని తేజస్సుకు మునిగణాలు అభివాదనం చేస్తున్నాయి. చీకటి అనే దట్ట మైన ఆచ్ఛాదనాన్ని తొలగించుకొని పైకి వస్తూన్న ఈ సూర్యుడు కమలవనాలను మేల్కొలుపుతున్నాడు. మునిగణాలు, యతిగణాలు స్తుతిస్తున్నాయి. తన సహస్రకిరణాల చేత ప్రాణుల పాదాలకు బలం చేకూరుస్తున్నాడు. వీని శరీరం పుటం పెట్టిన బంగారం వలె ఉంది.

**మూ. పఞ్చమం ద్వాదశం చైవ దీర్ఘమన్త్యం త్రయోదశమ్**
**ఉత్కృత్యాం తు భవేత్పాదే వృత్తం వేగవతీ యథా. 319**

**యథా - గగణతలంగణమభిరుహమాణో ఉడుగణగహగణసమణుగదో**
**హలధరఆణణసురుచిరరూవో సుహుదదఇదజణమదణకరో,**
**కిరణపడంసుఅమవకిరమాణో రజదగిరిసిహరసదిసవవూ**
**ఉదయతి సంపది అసు జగదీవో కుముదవణరుచిరవిమలకరో. 320**

**(గగనతలాఙ్గణమభిరోహన్ ఉడుగణగ్రహగణసమనుగతః**
**హలధరఆననరుచిరరూపః సుఖితదయితజనమదనకరః,**
**కిరణపటాంశుకమవకీర్యన్ రజతగిరిశిఖరసదృశవపుః**
**ఉదయతి సంప్రత్యాశు జగద్దీపః కుముదవనరుచిరవిమలకరః.**

**తా. వేగవతి :-** ఇరవైయా రక్షరాల ఉత్కృతిచ్ఛందః పాదంలోని పంచమ - ద్వాదశ - త్రయోదశ - అంతిమాక్షరాలు గురువు లైతే అది **వేగవతీవృత్తం**. ఉదా : **గగణతలంగణ -**

ఇపుడు చంద్రుడు శీఘ్రంగా ఆకాశంమీదికి వస్తున్నాడు. నక్షత్ర - గ్రహగణాలు వీని వెంటనే ఉన్నాయి. బలరాముని ముఖం వలె శోభిస్తున్నాడు. సుఖంగా ఉన్న ప్రియులకు మదనావేశం కలిగిస్తున్నాడు. కైలాసశిఖరం వలె నిర్మలమైన శరీరం గల ఈ చంద్రుడు నలుమూలలా కిరణా లనే వస్త్రాన్ని ప్రసరింపచేస్తున్నాడు. జగద్దీపమై వెలుగుతున్నాడు.

**మూ. ఏతా హ్యష్టౌ బుధైర్జ్ఞేయా శీర్షకాణాం తు జాతయః,**
**పునర్నత్కుటకానాం తు లక్షణం సన్నిబోధత. 321**

**తా.** ఇవి శీర్షకాలలో ఉపయోగించే ఎనిమిది జాతిచందస్సులు. ఇప్పుడు నత్కుట

లక్షణాలు తెలుసికొనండి.

**మూ. అష్టౌ నత్కుటకానాం తు విజ్ఞేయా మూలజాతయః,**
**దర్శనం లక్షణం త్వాసాం నామాని చ నిబోధత. 322**

**తా.** నత్కుటానికి ఎనిమిది మూలజాతిచ్ఛందస్సు లుంటాయి. వీటిని గుర్తించడానికి ఉపకరించే లక్షణాలు, పేర్లు తెలుసుకొనండి.

**మూ. రథోద్ధతా బుద్బుదకముద్గతా వంశపత్రకమ్,**
**ప్రమితాక్షరా కేతుమతీ హంసాస్యం తోటకం తథా. 323**

**తా.** రథోద్ధత, బుద్బుదకం, ఉద్గత, వంశపత్రం, ప్రమితాక్షర, కేతుమతి, హంసాస్యం తోటకం – అనేవి వీటి పేర్లు.

**మూ. పఞ్చమం చ తృతీయం చ సప్తమం నవమాన్త్యకే,**
**గురూణి త్రైష్టుభే పాదే నత్కుటం తద్రథోద్ధతమ్. 324**

**యథా – ఏసికా కమలగబ్భగేహకే రేణుపింజరిదచారుగత్తిఅ,**
**సారదే మదకలోవకూజిదా హిండతే సరవరమ్మి ఛప్పదీ. 325**

**(ఏషకా కమలగర్భగేహకే రేణుపిఞ్జరితచారుగతికా,**
**శారదే మదకలోపకూజితా హిణ్డతి సరోవరే షట్పదీ).**

**తా. రథోద్ధత :–** పదకొం డక్షరాల త్రైష్టుభఛందఃపాదంలోని ప్రథమ, తృతీయ, సప్తమ, నవమ, అంతిమ అక్షరాలు గురువు లైతే అది రథోద్ధత. ఉదా : **ఏసికా.**

పద్మగర్భగృహంలోని పుప్పొడిచేత పూయబడి అందంగా ఉన్న శరీరం గల ఈ తుమ్మెద మదంచేత మధురంగా కూజిస్తూ శరత్కాలసరోవరంలో తిరుగుతూన్నది.

**మూ. తృతీయం దశమం చాన్త్యం నవమైకాదశం గురు,**
**బుద్బుదం చాతిజగతీ విజ్ఞేయం నత్కుటం తు తత్. 326**

**యథా – తడిగుణబంధణిఅద్ధో సిదఖగపంతిసోహిదో,**
**ణహసి గజో సముగ్గఓ విచరతి ఏస మేహఓ. 327**

**(తటిద్గుణబన్ధనిబద్ధః సితఖగపఙ్క్తిసహితః,**
**నభసి గజః సముద్గతో విచరతి ఏష మేఘో).**

**తా. బుద్బుదం :–** పదమూడు అక్షరాల పాదంలో – తృతీయ – నవమ – దశమ – ఏకాదశ – అంతిమవర్ణాలు గురువు లైతే అది జగతీఛందస్సుకు చెందిన బుద్బుదనత్కుటం. ఉదా. **తడిగుణ –** మెరుపు లనే తాళ్లతో చుట్టబడినదై తెల్లని పక్షుల

పంక్తులతో కూడి, ఆకాశసంచారి గజం వలె ఉన్న, ఈ మేఘం సంచరిస్తూన్నది.

**మూ. అన్యే తు – (పాఠాన్తరం) –**

**సతృతీయపఞ్చనవమం త్రయోదశం షోడశం తథా దశమాత్ పరం చ నిధనం చతుర్థగమ్. యత్ర వై గురు భవతీహ శేషలఘుసంయుతం వృత్తౌ స్యాచ్చ సంశ్రితం ప్రవదన్తి బుద్బుదకమేవ నర్కుటం తద్ధి నామతః.**

**యథా – చిరకాలమభిసంభరన్తం పిఅం గాణత్త ముహిదం ణ రోద్ధుమ్**
**ముదిమాణఇంత్తడిదిదో కాణణే ఘణే**
**పరిఖేదిదే బహువిధే హ్యుణుగోవాసరాహరో.**
**(చిరకాలమభిసంభరన్తం ప్రియగానాన్ముదితం న రోద్ధుం**
**మొదమానాయాం తడితీత కాననే ఘనే**
**పరిఖేదితే బహువిధే హ్యనుగోవాసరహరః)**
**తరుసంధువజ్జహిఅఏ సంచలిఓ భీదభీదఓ**
**అసు కోదరం విసది పాసపాదవచ్చ దీణదీణఓ**
**(తరుసన్ధువనవజ్రహృదయ సంచలితో భీతభీతకః,**
**ఆశు కోటరం విశతి పార్శ్వపాదపస్థః దీనదీనకః)**

**తా.** ఈ పాఠం అస్పష్టార్థంగా ఉంది.

**మూ. తృతీయం పఞ్చమం చైవ నవమం చ తథైవ చ,**
**చతుర్దశం ద్వాదశం చ నైధనం చ భవన్తి వై. 228**
**అస్మిన్నష్టికృతే పాదే గురూణ్యేతాని నిత్యశః**
**ఛన్దోజ్ఞైర్జ్ఞేయమేతత్తు నత్కుటం హ్యుద్గతం యథా. 329**

**యథా – కమలాఅరం కుసుమిదం కలహంససంకులం**
**వరహత్థిజూథకలుసీఅసాగరోవమమ్,**
**ఏస మన్దమన్దం మధుఅరరవాణుకూలదం**
**కురరో ఉవేఇ తరిదం సరదాగమే సరం. 330**

**కమలాకరం కుసుమితం కలహంససంకులం**
**వరహస్తియూథకలుషితసాగరోపమమ్,**
**ఏష మన్దమన్దం మధుకరరవానుకూలదం**
**కురరీరుతైః త్వరితం శరదాగమే సరః.**

**తా. ఉద్గతా :–** పదహారక్షరాల పాదంలోని మూడు, ఐదు, తొమ్మిది, పది, పన్నెండు, పద్నాలుగు అక్షరాలు, చివరిదీ గురువు లైతే అది **ఉద్గతనత్కుటం**. ఉదా : **కమలాఅరం**.

శరత్కాలం రాగానే పుష్పించిన ఈ కమలసరోవరం కలహంసలతో నిండి ఏనుగుల గుంపులచేత కలుషితమైన సాగరం వలె ఉన్నది. తుమ్మెదల రొదలకు అనుకూలంగా ఉంటూ కురరాల ధ్వనులచేత తొందరపడుతూన్నట్లున్నది (?) (**అస్పష్టార్థం**).

**మూ. యత్ర చతుర్థషష్ఠదశమైః ప్రథమనిధనకైః**
**భూషితమక్షరైర్గురుకృతైః శ్రవణసుఖకరైః,**
**తత్ ఖలు వంశపత్రపతితం మునిగణగదితం**
**నత్కుటకం వదన్తి నియమాదుపవృత్తరచితమ్. 331**

**యథా – చూదవణం పఫుల్లతిలఅం కురవఅసహిదం**
**చారు అసోఅసాలకలిదం కుసుమసముదిదమ్,**
**మాధవకాణణం జువదిఆజణమదజణణం**
**హిండఇ కోఇలో ఫలరసాసనమహురరరవో. 322**

**(చూతవనం ప్రఫుల్లతిలకం కురవకసహితం**
**చార్వశోకసాలకలితం కుసుమసముదితమ్,**
**మాధవకాననం యువతిజనమదజననం**
**హిణ్ణతి కోకిలో ఫలరసాసవమధురరవః).**

**తా. వంశపత్రపతితం :–** పదిహేడక్షరాల పాదంలోని ఒకటి, నాలుగు, ఆరు, పది అక్షరాలు, చివరిది గురువు లైతే అది **వంశపత్రపతితనత్కుటం**. ఉదా : **చూదవణం**.

ఈ చూతవనంలోని తిలకవృక్షా లన్నీ పుష్పించి ఉన్నాయి. కురవక – అశోక – సాలవృక్షాలతో నిండిన ఈ వనం పుష్పాలతో వికసించి ఉంది. ఫలరసాసవంచేత మధురమైన కూజితం గల ఈ కోకిల యువతులకు మదం కలిగించే ఈ వసంతో ద్యానములో సంచరిస్తూన్నది.

**మూ. తృతీయం పఞ్చమం చైవ నవమం నైధనం తథా,**
**గురూణ్యేతాని పాదే తు జాగతే ప్రమితాక్షరమ్. 333**

**యథా – మధుకాణణే భమిఅ ఏస చిరం జువఇముహాసవసముబ్భహిదో,**
**కమలాకరే సురభిపంకజఏ అవహిండదే సరది హంసయువా. 334**

**(మధుకాననే భ్రాన్త్వైష చిరం యువతిముఖాసవసముత్థితహితః,**
**కమలాకరే సురభిపఙ్కజకే అవహిణ్డతి శరది హంసయువా).**

**తా. ప్రమితాక్షరా :–** పన్నెండు అక్షరాల జగతీఛందఃపాదంలో తృతీయ – పంచమ – నవమ – అంతిమ అక్షరాలు గురువు లైతే అది **ప్రమితాక్షరనర్కుటం.** ఉదా : **మధు కాణణే.**

ఈ యువహంస ఈ మధుకాననంలో తన యువతి (ప్రియురాలి) ముఖాసవాన్ని గ్రోలి చాల కాలం విహరించి పరిమళిస్తూన్న పద్మాలు గల కమలాకరంలో తిరుగుతూన్నది.

**మూ. యథా వా –** మరొక ఉదాహరణ

**కమలా అరేసు భయిఊణ చిరం భసలీముహాసవపివాసుఅఓ,**
**మధుభూసిదం సురభిచూదవణం పరిహిండదే సుతణు ఛప్పదఓ. 335**

**(కమలాకరేషు భ్రాన్త్వా చిరం భ్రమరీముఖాసవపిపాసుకః,**
**మధుభూషితం సురభిచూతవనం పరిహిణ్డతి సుతను షట్పదః)**

**తా.** ఓ సుందరాంగీ! ఈ తుమ్మెద చాల సేపు పద్మసరస్సులో తిరిగి, భ్రమరీ ముఖాసవాన్ని గ్రోలా లనే కోరికతో వసంతునిచే అలంకరించబడిన పరమళిస్తూన్న చూతవనంలో తిరుగుతూన్నది.

**మూ. ఆద్యే చతుర్దశ చ మాత్రా అన్యత్ర చ షోడశ భవన్తి తథా,**
**జ్ఞేయా హి సా విషమపాదే కేతుమతినత్కుటం జాతిః. 336**

**యథా – కుంజం విలోడిఅ గఅవరే సరే వికసిఅపంకఅమ్మి గదే,**
**పంకఅం విహాఅ భమరజుఆ భమణ భమరీగణం పరిగహియ. 337**

**(కుఞ్జం విలోడ్య గజవరే సరసి వికసితపఙ్కజే గతే,**
**పఙ్కజం విహాయ భ్రమరయువా భ్రమతి భ్రమరీగణం పరిగృహీత్వా).**

**తా. కేతుమతీ :–** ప్రథమపాదంలో పద్నాలుగు మాత్రలు, మిగిలిన మూడు పాదాలలో పదహారేసి మాత్రలు ఉన్నది **కేతుమతీనత్కుటజాతి.** ఉదా : **కుంజం.**

మదగజం లతాకుంజం పెకలించివేసి వికసించిన పద్మాలు గల సరస్సులోనికి వెళ్లగానే యువభ్రమరం, పద్మం విడచి భ్రమరీగణాన్ని వెంట తీసికొని బైట తిరుగుతూన్నది.

**మూ. తృతీయపఞ్చమాన్త్యాని ప్రథమం సచతుర్థకమ్,**
**షష్ఠం చ నైధనే చాథ గురూణి ధ్వజినీ యథా. 338**

**యథా – విలసంతిఆ కమలసండే సువసంతఏ కుసుమలుద్ధా,**
**తురిఅం ణిపీఅ మధుమత్తా ఛప్పది ఆకులం సముపజాది. 339**

**(విలసతి యా కమలఖణ్డే సువసన్తే కుసుమలుబ్ధా,**
**త్వరితం నిపీయ మధుమత్తా షట్పదికా కులం సముపయాతి).**

**తా. ధ్వజినీ :–** పదేసి అక్షరాల మొదటి మూడు పాదాలలోను ఐదవ అక్షరం, పదవ అక్షరం, అట్లే పది అక్షరాల నాల్గవ పాదంలో నాల్గవ అక్షరం ఆరవ అక్షరం గురువు లైతే అది **ధ్వజినీనత్కుటం.** ఉదా : **విలసంతిఆ –**

ఈ భ్రమరి (ఆడు తుమ్మెద) పుష్పాలచేత ఆకర్షింపబడి, కమలవనంలో విహరించి, దాని రసం తాగడంచేత మత్తెక్కి తిరిగి తన గుంపులోనికి వచ్చుచున్నది.

**మూ. తృతీయసప్తమాన్త్యా చతుర్థకం గురుయదాహి షష్ఠో దశమోఽపివా,**
**అథోదితో హి పాదేఽథ చ జాగతే భవేదిదం హంసాస్యమితి సంస్మృతమ్. 340**

**యథా. సుగంధవాదా వాంతి హి సమాణిణో**
**సరమ్మి రమ్మఏ పుల్లఅపంకజే,**
**తరంగసంకులే ఛప్పఅ ఆలిఅం**
**విలోభఅన్తఓ పక్ఖసణాహిఅ. 341**

**(సుగన్ధవాతా వాన్తి హి సమానినః సరసి రమ్యే ఫుల్లపఙ్కజే,**
**తరఙ్గసంకులే షట్పదాలికం విలోభయన్తః పక్షసనాభికమ్).**

**తా. హంసాస్యం :–** పన్నెండక్షరాల పాదంలోని ద్వితీయ – చతుర్థ – షష్ఠ – దశమ – అన్తిమాక్షరాలు గురువు లైతే అది **హంసాస్యం.** ఉదా : **సుగంధవాదా –**

వికసించిన పద్మాలు గల సరస్సులో సుగంధంతో కూడిన వాయువులు వీచుతూ తుమ్మెదలను పక్షులను ఆకర్షిస్తున్నాయి.

హంసాస్యానికే మరొక లక్షణం –

**మూ. తృతీయం చ చతుర్థం చ షష్ఠం సప్తమమేవ చ,**
**దశమం నైధనం చైవ గురూణి చ భవన్తి హి. 342**

**పాదే తు జాగతే యత్ర శేషాణి చ లఘూన్యథ,**
**హంసాస్యం నామ విజ్ఞేయం గదితం నత్కుటం యథా. 343**

**యథా – దిజహంసావతిణ్ణే సలిలాసఏ కుసుమామోదలుద్ధా కమలాకరే,**
**నలినీపుత్తమజ్ఝే పరిహిణ్డది భమణాఆసఖిణ్ణా భమరావలీ. 344**

**(ద్విజహంసావతీర్ణే సలిలాశయే కుసుమామోదలుబ్ధా కమలాకరే,**
**నలినీపత్రమధ్యే పంహిణ్డతి భ్రమణాయాసఖిన్నా భ్రమరావలీ).**

**తా.** హంసలూ ఇతరపక్షులూ దిగిన, పద్మాలతో నిండిన సరస్సులో పుష్పముల యందు ఆసక్తితో ఉన్న భ్రమరపంక్తి తిరిగీ తిరిగి అలసిపోయి నలినీపత్రాల మధ్య తిరుగుతూన్నది.

**మూ. యదిహాన్త్యతృతీయషష్ఠగతైర్నవమే నవమేన చ భూషితకమ్,**
**గురుభిః సహితం త్విహ తద్గదితం భువితోటకమేవ నత్కుటకమ్. 345**

**యథా – రజణీవిరమే అదిభీమరఓ భయసంజణణో ఖగకొసిగఓ,**
**అణువాయసఏహిం అవహత్థిదఓ పరిమగ్గదే కోటరకం తురిదమ్. 346**

**(రజనీవిరమేஉతిగభీరరవో భయసంజననః ఖగకౌశికకః,**
**అనువాయసైః అపహస్తితః పరిమార్గతే కోటరం త్వరితమ్).**

**తా. తోటకం :–** పన్నెండక్షరాల పాదంలోని తృతీయ – షష్ఠ – నవమ – అంతిమవర్ణాలు గురువులైతే అది **తోటనత్కుటకం**. ఉదా :– **రజణీ.**

తెల్లవారుజామున భయంకర మైన ధ్వని చేస్తూ భయం కలిగిస్తూన్న గుడ్లగూబ వెంటనే కాకులు వచ్చి గెంటివేయగా చెట్టు తొఱ్ఱ వెదకికొంటూన్నది.

**మూ. ఏతాస్తు జాతయః ప్రోక్తా నత్కుటానాం సమాసతః,**
**పునశ్చ ఖఞ్జనానాం తు సంప్రవక్ష్యామి లక్షణమ్. 347**

**ప్రమోదం ఖఞ్జకం పూర్వం భావినీ మత్తచేష్టితమ్,**
**ఏతాస్తిస్రః సమాఖ్యాతాః ఖఞ్జకానాం తు జాతయః. 348**

**తా.** ఈ విధంగా నత్కుటజాతులు సంక్షిప్తంగా చెప్పాను. ఇప్పుడు ఖంజకాల లక్షణం చెపుతాను.

ఖంజకంలో – ప్రమోదం, భావిని, మత్తచేష్టితం అను మూడు జాతు లుంటాయి.

**మూ. ఆద్యచతుర్థషష్ఠదశమం సషోడశమథాన్త్యమేవ చ,**
**యది ద్వాదశమేవ యత్ర చరణేషు సప్తదశకాత్ పరం చ విహితమ్,**
**ఛన్దసి చేత్తథా గురు చేదథాకృతిగతం భవేత్తు సతతమ్**
**మద్రకమేవ ఖఞ్జకమిదం పునశ్చ కథితం ప్రమోదకమిదమ్. 349**

**తా.** ఇరవైరెండక్షరాల ఆకృతిఛందఃపాదంలోని ఒకటి, నాలుగు, ఆరు, పది, పన్నెండు, పదహారు, పదిహేడు అక్షరాలు గురువులైతే ఇది **ప్రమోదఖంజకం.**

**మూ. మాహవమాససోహితసమగ్గకే ఉవవరణంమి**
**ణిచ్చప్పమత్తజుత్తబహుపక్ఖిసంఘపరిఘుట్టణాదముహవే**
**ఫలితచూతసండసఅరమంజరీ విలోలణాదపవణే**
**హిండది ఛప్పదాణుగదమగ్గఓ పరహుదో ణివిట్ఠవఅణో. 350**

**(మాధవమాసశోభితసమగ్రకే ఉపవనే పుల్లకుసుమే**
**నిత్యప్రమత్తజుష్టబహుపక్షిసంఘపరిఘుష్టనాదముఖరే,**

**ఫలితచూతఖణ్డసహకారమఞ్జరీవిలోలనాదపవనే**
**హిణ్డతి షట్పదానుగతమార్గకః పరభృత్ నివిష్టవదనః).**

**తా. ఉదా :– మాహవమాస –** వసంతర్తువునందు పూర్తిగా శోభితమై ఉద్యానవనం వికసించి ఉంది. అది మత్తెక్కిన అనేకపక్షుల నాదాలచేత ప్రతిధ్వనిస్తూన్నది. ఫలించిన చూతవృక్షాలలోను సహకారవృక్షాలగుత్తులలోను గాలి చప్పుడు చేస్తూన్నది. దానిలో ప్రవేశిస్తూన్న కోవెల వెనువెంట తుమ్మెదలు కూడ ప్రవేశిస్తున్నాయి.

**మూ. ఆద్యపఞ్చమమథాన్త్యసప్తమం స్యాత్ తృతీయమేవ దీర్ఘకమ్,**
**యస్య పాదయోగతో హి సా భావినీతి ఖఞ్జకం తథా. 351**

**యథా – జాదిపుప్ఫపాణమత్తఓ చూదరేణుగుంఠిదంగఓ,**
**ఫుల్లపఙ్కజోవ్వసోభిదో ఛప్పదో దుదం పధావిదో. 352**

**జాతిపుష్పపానమత్తః చూతరేణుగుణ్ఠితాఙ్గః,**
**ఫుల్లపఙ్కజోపశోభితః షట్పదః ద్రుతం ప్రధావితః.**

**తా. భావినీ :–** ఎనిమి దక్షరాల పాదంలోని ఒకటి, మూడు, ఐదు, ఏడు అక్షరాలు, చివరిదీ గురువులైతే అది **భావినీఖంజకం. ఉదా : జాదిపుప్ఫ :–**

జాజిపువ్వు మధువును త్రాగిమదించినది, చూతపుష్పరాగంచేత కప్పబడినది, వికసించిన పద్మంచేత శోభింపచేయబడినదీ(?) అయిన తుమ్మెద శీఘ్రంగా ఎగిరిపోయినది.

**మూ. యదా తృతీయసప్తమం తథాద్యపఞ్చమం లఘు,**
**తదా తు మత్తచేష్టితం వదన్తి ఖఞ్జకం బుధాః. 353**

**యథా – పఫుల్లపుప్ఫపాదవం విహంగమోవసోహిదమ్,**
**వణం పగీదఛప్పదం ఉవేఇ ఏసకోహలో. 354**

**(ప్రఫుల్లపుష్పపాదపం విహఙ్గమోపశోభితమ్,**
**వనం ప్రగీతషట్పదముపైత్యేష కోకిలః).**

**తా. మత్తచేష్టితం :–** ఎనిమి దక్షరాల పాదంలోని ప్రథమ – తృతీయ – పంచమ – సప్తమాక్షరాలు లఘువు లైతే అది **మత్తచేష్టితం**. ఉదా : **పఫుల్ల :–**

వికసించిన పుష్పాలతో నిండిన వృక్షాలతోను, పక్షులతోను శోభిస్తూన్న, భ్రమర గీతాలతో నిండిన వనంలోనికి కోకిల ప్రవేశిస్తూన్నది.

**మూ. సత్కుటానాం తు ఖఞ్జానామేతా వై మూలజాతయః,**
**ఆభ్యో వినిఃసృతాశ్చాన్యా యుగ్మౌజావిషమాక్షరాః. 355**

**తా.** ఇవి ఖంజకాల, నత్కుటాల మూలజాతులు. వీటినుండి సమ – విషమ – అర్ధసమజాతులు ఆవిర్భవించాయి.

**మూ. చతుఃషష్టిర్ధ్రువాణాం తు విజ్ఞేయా మూలజాతయః,**
**సమవృత్తాక్షరకృతా అతోఽన్యా విషమా మతాః. 356**

**తా.** ధ్రువామూలజాతులు అరవైనాలు గుంటాయి. వాటిలో కొన్ని సమాక్షరములతో ఏర్పడినవి. కొన్ని విషమాక్షరాలతో ఏర్పడినవి.

**మూ. సమవృత్తాస్తు జాయన్తే ధ్రువాస్త్రిస్రస్తు నిత్యశః,**
**యుగ్మౌజాశ్చాపి మిశ్రాశ్చ విషమార్ధసమాః సమాః. 357**

**తా.** ధ్రువలలో మూడు భేదాలు ఉంటాయి – కొన్నింటిలోని పాదాలు సమసంఖ్యలో ఉన్న అక్షరాలతో ఏర్పడతాయి, కొన్ని సమసంఖ్యలోను విషమసంఖ్యలోను ఉన్న అక్షరాలతో ఏర్పడతాయి. కొన్ని అర్ధ విషమ – అర్ధసమపాదాలతో ఏర్పడతాయి.

**మూ. సమవృత్తాస్తు తత్ర తు పఞ్చాశీతిః శతే స్మృతాః**
**తత్రార్ధవిషమాణాం తు షష్ట్యా చార్ధశతం స్మృతః,**
**ఏతదేవ పరీమాణం విషమాణాం ప్రకీర్తితమ్. 358**

**తా.** సమవృత్తధ్రువలు రెండువందల ఎనభై యైదు ఉంటాయి. అర్ధవిషమధ్రువలు ఒక వంద పది; విషమధ్రువల సంఖ్య కూడ ఇంతే.

**మూ. సామాన్యౌజాశ్చ జాయన్తే ధ్రువా విషమపాదికాః,**
**స్వేచ్ఛానామ్నా తు నామాని తాసాం కార్యాణి వృత్తతః. 359**

**తా.** సాధారణంగా పాదాల పొడవు విషమంగా ఉన్న ధ్రువలను, పాదాల సంఖ్య సమంగా లేని ధ్రువలను కూడ నిర్మించడం జరుగుతూంటుంది. వృత్తానుసారంగా వాటి పేర్లు ఎవరికి ఇష్టమైనట్లు వాళ్లు పెట్టుకొనవచ్చును.

**మూ. ఏతాస్తు జాతయః ప్రోక్తా నానావృత్తసముద్భవాః,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి వికల్పాన్ పఞ్చహేతుకాన్. 360**

**తా.** ఇవి వివిధవృత్తాలకు సంబంధించిన ధ్రువాజాతులు. ఇప్పుడు నేను ఐదు కారణాలవల్ల ఏర్పడిన వాటి వేరు వేరు ప్రకారాలను గూర్చి చెపుతాను.

**మూ. జాతిః స్థానం ప్రకారశ్చ ప్రమాణం నామ చైవ హి,**
**జ్ఞేయా ధ్రువాణాం నాట్యజ్ఞైర్వికల్పాః పఞ్చహేతుకాః. 361**

**తా.** జాతి, స్థానము, ప్రకారము, ప్రమాణము, పేరు – ఇది ఐదు ధ్రువల భిన్నత్వానికి కారణాలు.

**మూ. వృత్తాక్షరప్రమాణం హి జాతిరిత్యభిసంజ్ఞితా,**
**సమార్ధవిషమాభిశ్చ ప్రకారః పరికీర్తితః. 362**
**షట్కలాష్టకలే చైవ ప్రమాణే ద్వివిధే స్మృతే**
**యథా గోత్రకులాచారైర్నృణాం నామాభిధీయతే**
**ఏవం స్థానాశ్రయోపేతం ధ్రువాణామపి చేష్యతే. 363**

**తా.** ధ్రువలోని అక్షరాల సంఖ్యకు జాతి అని పేరు. వీటి సంఖ్య సమంగా గాని, విషమంగా గాని, అర్ధవిషమంగా గాని ఉండడాన్ని బట్టి ఒక భేదం ఏర్పడుతుంది. ఆరు లేదా ఎనిమిది కలల కాలం ధ్రువల ప్రమాణం. గోత్రం, కులం, ఆచారం వీటిని బట్టి, లోకంలో, మనుష్యులకు పేర్లు పెట్టి నట్లు ధ్రువలకు, ఆశ్రయాన్ని (స్థానాన్ని) పట్టి పేరు పెట్టబడుతుంది.

**మూ. ప్రవేశాక్షేపనిష్క్రామప్రాసాదికమథాన్తరమ్,**
**స్థానం పఞ్చవిధం విద్యాద్ ధ్రువాయోగవిధానతః. 364**

**తా. ధ్రువల పంచస్థానాలు :–** ప్రవేశము, ఆక్షేపము, నిష్క్రామము, ప్రసాదము, అంతరము – ఇవి ధ్రువల సంయోగం విధించడం వల్ల ఏర్పడే ఐదు స్థానాలు.

**మూ. నానారసార్థయుక్తా నృణాం యా గీయతే ప్రవేశేషు,**
**ప్రావేశికీ తు నామ్నా సా విజ్ఞేయా ధ్రువా తద్‌జ్ఞైః. 365**

**తా. ప్రావేశికీధ్రువా :–** పాత్రలు రంగమంచంమీద ప్రవేశించే సమయంలో ఆ యా విషయాలను సూచిస్తూ రసాలతో పూర్ణమైన ఏ గానం చేయబడుతుందో అది **ప్రావేశికీధ్రువ.**

**మూ. అఙ్కాన్తే నిష్క్రమణే పాత్రాణాం గీయతే ప్రయోగేషు,**
**నిష్క్రామోపగతగుణాం విద్యాన్నైష్క్రామికీం తాం తు. 366**

**తా. నైష్క్రామికీధ్రువా :–** నాట్యప్రయోగాలలో – అంకసమాప్తియందు గాని, పాత్రలు నిష్క్రమించే సమయంలో గాని, అనేకమైన ప్రయోజనాలను సూచిస్తూ చేసే గానం **నైష్క్రామికీధ్రువ.**

**మూ. క్రమముల్లఙ్ఘ్య విధిజ్ఞైః క్రియతే యా ద్రుతలయేన నాట్యవిధౌ,**
**సాక్షేపికీ ధ్రువాసౌ ద్రుతా స్థితా వాపి విజ్ఞేయా. 367**

**తా. ఆక్షేపికీధ్రువా :–** కొందరు ధ్రువాప్రయోగనిపుణులు, అవసరాన్ని పట్టి నియమాలను ఉల్లంఘించి ద్రుతలయలో గాని, విలంబితలయంలో గాని గానం చేసేది **ఆక్షేపికీధ్రువ.**

**మూ. యా చ రసాన్తరముపగతమాక్షేపవశాత్ కృతం ప్రసాదయతి,**
**రాగప్రసాదజననీ జ్ఞేయా ప్రాసాదికీ సా తు. 368**

**తా. ప్రాసాదికీధ్రువా :–** ఏదైన ఒక ఆకస్మికదుర్ఘటన జరిగిన ప్పుడు – అంతవరకు ఒక రసాన్ని ఆస్వాదిస్తూన్న సామాజికుల మనస్సులను ప్రసన్నం చేయడానికై గానం చేసేది ప్రాసాదికీధ్రువ.

**మూ. విషణ్ణే విస్మృతే క్రోధే సుప్తే మత్తేఽథ సజ్జతే,**
**గురుభారావసన్నే చ మూర్ఛితే పతితే తథా. 369**

**విషసంమూర్ఛితే భ్రాన్తే వస్త్రాభరణసంయమే,**
**దోషప్రచ్ఛాదనే యా చ గీయతే సాన్తరాధ్రువా. 370**

**తా. అన్తరాధ్రువా :–** నాట్యప్రయోగం జరుగుతూన్నప్పుడు, మధ్యలో, ప్రధాన పాత్రలు విషణ్ణు లైనా, మరుపులో ఉన్నా, కునికిపాట్లు పడుతున్నా, మత్తులో ఉన్నా, ఎవరినైనా కలుస్తున్నా, అధికభారంచేత శరీరం బరువెక్కి ఉన్నా, ఖేదం పొందినా, స్మృహతప్పినా, భూమిమీద పడిపోయినా, విషప్రయోగంచే మూర్ఛ చెందినా, భ్రాంతి చెందినా, వస్త్రాలంకారాదులు ధరిస్తూన్నా – ఇలాంటి దోషాలను కప్పిపుచ్చడానికై చేసే గానం **అంతరాధ్రువగానం**.

**మూ. ధ్రువాణాం చైవ సర్వాసాం రసభావసమన్వితమ్,**
**తథాస్థానం ప్రవక్ష్యామి యత్ర గేయం ప్రయత్నతః. 371**

**తా.** ఇపుడు ధ్రువలను ఏ స్థానాలలో (సమయాలలో) ఏరసభావాదులకు అనుగుణంగా, ప్రయత్నపూర్వకంగా గానం చెయ్యాలో చెపుతాను.

**మూ. ద్వివిధం తు స్మృతం స్థానం పరస్థం స్వాత్మసంస్థితమ్,**
**యత్త్వాక్షేపసమాయుక్తం తచ్చ మే సన్నిబోధత. 372**

**తా.** రసభావపూర్ణా లైన స్థానాలు (సమయాలు) పరులకు సంబంధించినవి (పరస్థ), తనకు సంబంధించినవి అని రెండు విధా లుండవచ్చును. ఇపుడు ఆక్షేపానికి (సామాజికుల మనస్సు మరల్చుడానికి) సంబంధించిన స్థానాన్ని గూర్చి చెపుతాను; వినండి.

**మూ. బద్ధే నిరుద్ధే పతితే వ్యాధితే మూర్ఛితే మృతే,**
**అవకృష్టా ధ్రువా కార్యా భావే చ కరుణాశ్రయే. 373**

**తా.** ఎవరైనా పాత్ర బంధింపబడినా, అడ్డుకొనబడినా, పడిపోయినా, అనారోగ్య వంతు డైనా, మూర్ఛచెందినా, మరణించినా కరుణరసాన్ని, తత్సంబద్ధభావాలనీ ఆవిష్కరించే అవకృష్టాధ్రువ ప్రయోగించాలి.

**మూ. ఔత్సుక్యే హ్యవహిత్థే చ చిన్తాయాం పరిదేవితే,**
**శ్రమే దైన్యే విషాదే చ స్థితా కార్యా ధ్రువా బుధైః. 374**

**తా.** ఔత్సుక్యము, అవహిత్థ, చింత, పరిదేవనము, శ్రమ, దైన్యం, విషాదం – ఈ అవస్థలలో, బుధులు స్థితాధ్రువ (విలంబితధ్రువ) ఉపయోగించాలి.

**మూ. ఏతేష్వేవ తు భావేషు కరుణావేదితేషు చ,**
**ధ్రువా ద్రుతా ప్రయోక్తవ్యా తథా వేగసమాశ్రయా. 375**

**తా.** పైన చెప్పిన ఈ భావాలలోను, కరుణరసదశ ఆవిష్కరించేటప్పుడు ఆవేగయుక్త చేష్టలతో ద్రుతాధ్రువ ప్రయోగించాలి.

**మూ. యత్ర ప్రత్యక్షజం దుఃఖం మృతాభిహతదర్శనాత్,**
**స్థితా తత్ర ప్రయోక్తవ్యా కరుణే తు రసే బుధైః. 376**

**తా.** మరణించినవానిని కాని, గాయాలు తగినవానిని కాని ప్రత్యక్షంగా చూచినప్పుడు కలిగిన దుఃఖదశలో, కరుణరసంలో స్థిత (విలంబిత) లయలో ధ్రువల గానం చెయ్యాలి.

**మూ. ఉత్పాతదర్శనే చైవ హ్యమర్షేఽద్భుతదర్శనే**
**వివాదే చ ప్రమాదే చ రోషే సత్త్వప్రదర్శనే. 377**
**రౌద్రవీరభయాదీషు ప్రత్యక్షావేదితేషు చ,**
**ధ్రువా ద్రుతలయా కార్యా హ్యావేగే సంభ్రమే తథా. 378**

**తా.** ఏదైన ఉత్పాతం చూచినప్పుడు, అమర్షంలోను, అద్భుతాన్ని చూచినప్పుడు, విషాదంలోను, ప్రమాదం (పొరబాటు) లోను, రోషంలోను, శక్తిప్రదర్శనలోను, రౌద్రవీర భయానకాదులను ప్రత్యక్షంగా వర్ణించి తెలిపేటప్పుడు, ఆవేగంలోను, సంభ్రమంలోను ద్రుతలయధ్రువ ప్రయోగించాలి.

**మూ. ప్రసాదనే యాచనే చ తథానుస్మరణేఽపి చ**
**తథాతిశయవాక్యేషు తథా చ నవసంగమే,**
**హర్షేఽథ ప్రార్థనే చైవ శృఙ్గారాద్భుతదర్శనే**
**ధ్రువా ప్రాసాదికీ కార్యా తద్జ్ఞైర్మధ్యలయాశ్రయా. 380**

**తా.** బతిమాలడంలోను, యాచనలోను, జ్ఞాపకం తెచ్చుకొంటూ మాటలాడడం లోను, అతిశయాన్ని వర్ణించి చెప్పేటప్పుడు లేదా దీర్ఘసంభాషణలలోను, ప్రియాప్రియుల నవసంగమంలోను, హర్షంలోను, ప్రార్థనంలోను, శృంగార – అద్భుతాల దర్శనంలోను **ప్రాసాదికీధ్రువ**ను **మధ్యలయ**లో గానం చెయ్యాలి.

**మూ. శరీరవ్యసనే శోషే పునఃసన్ధానకర్మణి,**
**సానుబన్ధా బుధైః కార్యా గీతజ్ఞైరన్తరాధ్రువా. 381**

**తా.** శరీరానికి దెబ్బతగిలినప్పుడు, రోషంలోను, ఎవనిపై నైనా శస్త్రసంధానం చేసేటప్పుడు, గీతజ్ఞులు అంతరాధ్రువాగానం, చాలాసేపు పొడిగిస్తూ ప్రయోగించాలి.

**మూ. అధ్రువాస్తు ప్రవేశాః స్యుర్గాయతో రుదతస్తథా,**
**సంభ్రమే ఘోషణే చైవ హ్యుత్పాతే విస్మయే తథా. 382**

**తా.** ఎవరైనా ఒక పాత్ర పాడుతూ గాని ఏడుస్తూ గాని ప్రవేశిస్తూన్నప్పుడు, పాత్రప్రవేశసమయంలో ఏదైన సంభ్రమంగాని, ఘోషణంగాని ఉత్పాతదర్శనం గాని, ఆశ్చర్యజనకమైన ఘటన గాని జరిగినప్పుడు ఆ పాత్రల ప్రవేశం ధ్రువాగానం లేకుండానే జరగాలి.

**మూ. ఏవమర్థవిధిం జ్ఞాత్వా దేశకాలమృతుం తథా,**
**ప్రకృతిం భావలిఙ్గం తు తతో యోజ్యా ధ్రువా బుధైః. 383**

**తా.** ఈ విధంగా – విషయం, స్థానం, సమయం, దేశం, కాలం, ఋతువు, పాత్రప్రకృతి, సూచించవలసిన భావాలు – వీటి నన్నింటినీ దృష్టిలో పెట్టుకొని బుధులు ధ్రువాప్రయోగం చెయ్యాలి.

**మూ. శీర్షకా చోద్ధతా చైవ హ్యనుబద్ధా విలమ్బితా,**
**అడ్డితా చాపకృష్టా చ షట్ ప్రకారా ధ్రువా స్మృతా. 384**

**తా. మరికొన్ని ధ్రువాభేదాలు :–** శీర్షక, ఉద్ధత, అనుబద్ధ, విలమ్బిత, అడ్డిత, అపకృష్ట అని ధ్రువలలో ఇంకా ఆరు భేదా లున్నాయి.

**మూ. శిరః స్థానీయమేతద్ధి యస్మాత్తస్మాత్తు శీర్షకా,**
**ఉద్ధతా తూద్ధతా యస్మాత్ తస్మాద్ జ్ఞేయా ధ్రువా బుధైః. 385**

**తా. శీర్షకధ్రువ :–** ధ్రువలలో దీనిని ప్రముఖస్థానంలో ఉంచడంచేత దీని కా పేరు.

**ఉద్ధతధ్రువ :–** ఉద్ధతరీతిలో గానం చేయడంచేత దీని కాపేరు.

**మూ. ఆక్రీడితప్రవృత్తో యః తదర్థో లయకారకః,**
**నాట్యోపచారజనితః సోఽనుబన్ధః ప్రకీర్తితః. 386**

**తా. అనుబద్ధధ్రువ :–** ఏ ధ్రువతో ఏదైనా ఒక నాట్యోపచారం (నాట్యప్రయోగం) ప్రారంభం అవుతుందో, దేనియందు దీనికోసమై ప్రత్యేకంగా నిర్ణయించిన లయ ఉపయోగించబడుతుందో ఆ ధ్రువ **అనుబద్ధధ్రువ.**

**మూ. నాతిత్వరితసంచారా నాట్యధర్మమనుస్మృతా,**
**సవిలమ్బితసంచారా భవేదథ విలమ్బితా. 387**

**తా. విలంబితధ్రువ :–** నాట్యదర్శిని అనుసరించి దేనియందు అతిత్వరిత మైన క్రియ ఏదీ జరగదో, దేనియందు గతి, క్రియలూ కూడ ఆలస్యంగా (విలంబంగా) జరుగుతాయో అది **విలంబితాధ్రువ**.

**మూ. అడ్డితా తూత్కటగుణా శృఙ్గారరససమ్భవా,**
**యస్మాత్తస్మాత్ప్రసన్నా చ తస్మాదేషాడ్డితా స్మృతా. 388**

**తా. అడ్డితధ్రువ :–** శృంగారరసంతో ప్రారంభమయేది ఉత్కటమైన గుణాలు కలది ప్రసన్నమూ అయిన ధ్రువ **అడ్డితధ్రువ**.

**మూ. అన్యభావేషు కృష్టా చ కృష్టా హేతుషు గీయతే,**
**యస్మాత్కారుణ్యసంయుక్తా హ్యపకృష్టా భవేత్తతః. 389**

**తా. అపకృష్టధ్రువ :–** ప్రారంభించిన భావంకంటె లేదా కారణంకంటె భిన్న మైన భావాలను తన వైపు లాగికొనే కారుణ్యసంబద్ధ మైన ధ్రువ **అపకృష్టధ్రువ**.

**మూ. యా తు ప్రావేశికీ దీప్తా సా కార్యా తూద్ధతా నృణామ్,**
**యా సమాసితసఞ్చారా భవేదథ విలమ్బితా. 390**

**తా.** పురుషపాత్రల విషయంలో ఉపయోగించే ప్రావేశికీధ్రువ ఉద్దీప్తమై, ఉద్ధతమై ఉండాలి. ఆంగికచేష్టాదికం సంక్షిప్తంగా ఉన్నప్పుడు విలమ్బితధ్రువను ఉపయోగించాలి.

**మూ. యా తు ప్రాసాదికీ నామ స్త్రీణాం కార్యాడ్డితా తు సా,**
**యా స్థితా సాపకృష్టా తు యా ద్రుతా సా విలమ్బితా. 391**

**తా.** స్త్రీల విషయంలో ఉపయోగించే ప్రాసాదికధ్రువ అడ్డిత చెయ్యాలి. అదే స్థిత (విలంబిత) లయలో ఉంటే అది 'అపకృష్ట' అవుతుంది. ద్రుతలయ లేకపోతే **విలంబిత** కూడ అవుతుంది.

**మూ. యతో లయవాద్యయతిపదవర్ణాస్తథాక్షరమ్,**
**అనుబధ్నాతి గీతేషు ప్రకారా షట్ ప్రవేశజా. 392**

**తా.** లయ, వాద్యసంగీతము, యతి, పదాలు, వర్ణాలు, అక్షరాలు – ఈ ఆరూ గీతాల వెంబడి ఉంటాయి. అందుచేత గీతాల ప్రవేశవిధానంలో ఆరు ప్రకారా లుంటాయి.

**మూ. శీర్షకా చోద్ధతా చైవ దేవపార్థివయోర్భవేత్,**
**దివ్యపార్థివవేశ్యానాం స్త్రీణాం యోజ్యా తథాడ్డితా. 393**

**తా.** రాజ – దేవతాపాత్రల ప్రవేశంలో శీర్షకధ్రువ, ఉద్ధతధ్రువ ఉపయోగించాలి. దివ్యస్త్రీ – రాజస్త్రీ – వేశ్యాస్త్రీల ప్రవేశంలో అడ్డితధ్రువ కూర్చాలి.

**మూ. మధ్యమానాం ప్రవేశే తు జ్ఞేయా ద్రుతవిలమ్బితా,**
**నీచానాఞ్చైవ కర్తవ్యే నృణాం వై ఖఞ్జనత్కుటే. 394**

**తా.** మధ్యమపాత్రప్రవేశంలో ధ్రుతవిలంబితధ్రువ ప్రయోగించాలి. నీచపాత్రల ప్రవేశంలో ఖంజనత్కుటకవర్గాలకు చెందిన ధ్రువలు ఉపయోగించాలి.

**మూ. ఖఞ్జకం నత్కుటం చైవ స్థానప్రాసాదికీ తథా,**
**కస్మాల్లలితభావత్వాద్ధాస్యశృఙ్గారయోర్యతః. 395**

**తా.** ఖంజక – నత్కుటాలు ఆ యా ప్రదేశాలలో (స్థానంలో) ఆనందం కలిగిస్తాయి. ఎందువల్ల? హాస్యశృంగారాలు లలితభావాలతో నిండి ఉంటాయి కనుక.

**మూ. కుర్యాన్నీచే మృతే చైవ అనుబన్ధం లయాశ్రయమ్,**
**స్త్రీణాం రాజన్యవైశ్యానామపకృష్టా తథైవ చ. 396**

**తా.** నీచపాత్రవిషయంలోను, మరణంలోను తగిన లయతో అనుబంధాధ్రువ నుపయోగించాలి. క్షత్రియ – వైశ్యస్త్రీల విషయంలో 'అపకృష్టా' ధ్రువ ఉపయోగించాలి.

**మూ. సన్నిపాతాస్తు చత్వారః ప్రావేశిక్యా భవన్తి హి,**
**శేషా ద్విసన్నిపాతాస్తు శీర్షకాః షట్పదాః స్మృతాః. 397**

**తా.** ప్రావేశికీధ్రువలో తాలం నాలుగు సన్నిపాతాలతో ఉంటుంది. మిగిలిన ధ్రువలలో తాలం రెండు సంనిపాతాలతో ఉంటుంది. శీర్షకాలలో ఆరు పాదా లుంటాయి.

**మూ. స్థితా వాప్యడ్డితా వాపి నీచానాం న హి కారయేత్,**
**సర్వభావాశ్రయగతౌ తేషాం కార్యం తు నత్కుటమ్. 398**

**తా.** నీచపాత్రల విషయంలో విలంబితలయ గాని, అడ్డితాధ్రువ గాని ప్రయోగించ కూడదు. వాళ్లకు సంబంధించిన అన్ని చేష్టాదులలోను నత్కుటగానం ప్రయోగించాలి.

**మూ. వస్తు ప్రయోగం ప్రకృతిం రసభావమృతుం వయః,**
**దేశం కాలమవస్థాం చ జ్ఞాత్వా యోజ్యా ధ్రువా బుధైః. 400**

**తా.** వస్తువును, ప్రయోగాన్నీ, ప్రకృతినీ, రసాన్నీ, భావాన్నీ, ఋతువును, వయస్సును, దేశాన్ని, కాలాన్నీ, అవస్థను దృష్టిలో ఉంచుకొని, గానవిశారదులు ధ్రువల ప్రయోగం చెయ్యాలి.

**మూ. వస్తు దేశసముత్థం చ నగరారణ్యసంభవమ్,**
**ప్రయోగశ్చైవ విజ్ఞేయో దివ్యమానుషసంశ్రయః. 401**

**తా.** నాటప్రయోగానికి చెందిన వస్తువు (కథ) ఏదైన దేశానికి, నగరానికి, అరణ్యానికీ సంబంధించి ఉంటుంది. ప్రయోగం దివ్య పాత్రలతోను, మానుషపాత్రల తోను సంబంధించి ఉంటుంది.

**మూ. ఉత్తమాధమమధ్యా తు త్రివిధా ప్రకృతిర్మతా,**
**రసభావౌ తు పూర్వోక్తావృతుః కాలకృతస్తథా. 402**

**తా.** పాత్రలలో ఉత్తమ – మధ్యమ – అధమ అను మూడు ప్రకృతు లుంటాయి. రసభావాలను గూర్చి వెనుకనే చెప్పాను. ఋతువు కాలం మార్పుచేత ఏర్పడుతుంది.

**మూ. శిశుయౌవనవృద్ధత్వం వయశ్చైవ ప్రకీర్తితమ్,**
**కక్ష్యాదిభేదజనితో దేశస్తు వివిధః స్మృతః. 403**

**తా.** శిశుత్వం, యౌవనం, వృద్ధత్వం అని వయస్సు మూడు విధాలు. సరిహద్దుల ఏర్పాట్లు మొదలైనవాటిని బట్టి దేశం అనేకభేదాలతో ఉంటుంది.

**మూ. కాలో రాత్రిందివకృతో మాసపక్షవినిర్మతః,**
**అవస్థా చైవ విజ్ఞేయా సుఖదుఃఖకృతా తథా. 404**

**తా.** రాత్రి, పగలు, మాసం, పక్షం మొదలైన విభేదా లున్నది కాలం. సుఖావస్థ, దుఃఖావస్థ అని **అవస్థ** రెండు విధాలు.

**మూ. స్థానాన్యేతాని తు బుధైర్నానావస్థాని నిత్యశః,**
**ప్రయోగే తు ప్రయోజ్యాని రసభావౌ సమీక్ష్య తు. 405**

**తా.** ఇవి వివిధఅవస్థలకు సంబంధించిన స్థానాలు (సమయాలు occasions). నాట్యప్రయోక్తలు నాట్యప్రయోగంలో వీటినీ, రసభావాలను జాగర్తగా గుర్తుంచుకోవాలి.

**మూ. యాని వాక్యైస్తు న బ్రూయాత్తాని గీతైరుదాహరేత్,**
**గీతైరేవ హి వాక్యార్థై రసపాకో బలాశ్రయః. 406**

**తా.** ఏ విషయాలను మాటలలో చెప్పడానికి శక్యం కాదో వాటిని గీతాల ద్వారా ఆవిష్కరించాలి. వాక్యార్థాలను గీతాల ద్వారా ఆవిష్కరిస్తే అప్పుడు రసపాకం బలీయంగా ఉంటుంది.

**మూ. ధ్రువాణామాశ్రయాః కార్యా ఔపమ్యగుణసంభవాః,**
**ఉత్తమాధమమధ్యానాం స్త్రీణాం నృణామథాపి చ. 407**

**తా.** ధ్రువలకు విషయ మైన స్త్రీ – పురుషపాత్రల ఉత్తమ – మధ్యమ – అధమ ప్రకృతులకు అనురూపంగా, వాళ్ల గుణాలతో ఉన్న సామ్యాన్ని (పోలికను) బట్టి ఉపమలను ఉపయోగిస్తూ ధ్రువానిర్మాణం చెయ్యాలి.

**మూ. చన్ద్రాగ్నిసూర్యపవనా దేవపార్థివయోః స్మృతాః,**
**దైత్యానాం రాక్షసానాం చ మేఘపర్వతసాగరాః. 408**

**తా.** దేవతలకు, రాజులకు చంద్ర – అగ్ని – సూర్య – పవనాలను ఉపమానంగా ఉపయోగించాలి. దైత్యులకు రాక్షసులకు ఉపమానాలుగా మేఘ – పర్వత – సాగరాలను ఉపయోగించాలి.

**మూ. సిద్ధగన్ధర్వయక్షాణాం గ్రహోడువృషభాః స్మృతాః,**
**తపఃస్థితానాం సర్వేషాం సూర్యాగ్నిపవనాః స్మృతాః. 409**

**తా.** సిద్ధ – గంధర్వ – యక్షులను గ్రహ – నక్షత్ర – వృషభాలతో పోల్చాలి. తపస్సులో ఉన్నవాళ్లనందరినీ సూర్య – అగ్ని – పవనాలతో పోల్చాలి.

**మూ. హవ్యవాహస్తు విప్రాణాం యే చాన్యే తపసి స్థితాః,**
**ఏతేషాం చైవ యా నార్యః తాసామౌపమ్యసంశ్రితాః. 410**

**తా.** బ్రాహ్మణులకు, తపస్సులో ఉన్న ఇతరులకూ అగ్నిని ఉపమానంగా చెప్పవచ్చు. వాళ్ల భార్యలకు కూడ అగ్నినే ఉపమానంగా చెప్పవచ్చును.

**మూ. విద్యుదుల్కార్కరశ్మిశ్చ దివ్యానామపి చ స్మృతాః,**
**దేవతాయాః ప్రయోజ్యాస్తు నృపాణామపి తే మతాః. 411**

**తా.** దివ్యులకు (దేవతలకు) మెరుపులు; అగ్నిపిండాలు, సూర్యకిరణాలు ఉపమానంగా చెప్పవచ్చును. దేవతలకు చెప్పినవాటిని రాజులకు కూడ ఉపయోగించవచ్చును.

**మూ. నాగసింహవృషా శ్చైవ నైతే దివ్యేషు కీర్తితాః,**
**వారణోరగసింహాశ్చ నృపాణామపి చేష్యతే. 412**

**తా.** దివ్యుల విషయంలో గజ – సింహ – వృషభాలను ఉపమానంగా చెప్పకూడదు. గజ – సర్ప – సింహాలను రాజులకు ఉపమానాలుగా ఉపయోగించవచ్చును.

**మూ. మహిషా రురుసింహాశ్చ క్రవ్యాదాః పశవశ్చ మే,**
**హింస్రసత్త్వేషు తే కార్యా యక్షరాక్షసజాతిషు. 413**

**తా.** హింసాస్వభావం గల యక్ష – రాక్షసజాతికి చెందినవారి విషయంలో, మహిష – రురుమృగ – సింహాలను, ఇతర మాంసభక్షకక్రూరమృగాలను ఉపమానంగా వాడవచ్చును.

**మూ. ఉత్తమానాం ప్రయోక్తవ్యా నానారససమాశ్రయాః,**
**మత్తమాతఙ్గసహితా రాజహంసాశ్చ యోక్తృభిః. 414**

**తా.** విభిన్నరసాల సందర్భాలలో, ఉత్తమప్రకృతులకు మత్తగజాలను, రాజహంస లను, ధ్రువాప్రయోక్తలు ఉపమానాలుగా ప్రయోగించవచ్చును.

**మూ. సారసాః శిఖినః క్రౌఞ్చాశ్చక్రాహ్వాః కుముదాకరాః,**
**మధ్యమానాం ప్రయోక్తవ్యా ఔపమ్యగుణసంశ్రయాః. 415**

**తా.** మధ్యములకు సారసపక్షులను, నెమళ్లను, క్రౌంచపక్షులను, చక్రవాకపక్షులను కలవల సరస్సులను ఉపమానాలుగా చూపవచ్చును.

**మూ. కోకిలః షట్పదో ధ్వాఙ్క్షః కురరః కౌశికో బకః,**
**పారావతః సకాదమ్బో హ్యధమేషు ప్రయోజితాః. 416**

**తా.** కోకిల, తుమ్మెద, కాకి, గోరింక, గుడ్లగూబ, కొంగ, పావురము, కాదంబపక్షి అధములకు ఉపమానంగా చూపవచ్చును.

**మూ. ఏవమేషాం యథోక్తానాం స్త్రియో యాస్తు భవన్తి హి,**
**ఉత్తమాధమమధ్యానాం తాసాం చైవ నిబోధత. 417**

**తా.** పైన చెప్పినవాళ్ల స్త్రీలకు, ఉత్తమాధమమధ్యమస్త్రీలకు ఉపయోగించదగిన ఉపమానాలను చెపుతాను; వినండి.

**మూ. శర్వరీ వసుధా జ్యోత్స్నా నలినీ కరిణీ నదీ,**
**నృపస్త్రీణాం భవన్త్యేతాః ఔపమ్యగుణసంశ్రయాః. 418**

**తా.** రాజభార్యలకు, రాత్రి, భూమి, వెన్నెల, పద్మలత, ఆడ ఏనుగు, నది – ఇవి పోలికలను బట్టి ఉపమానాలుగా చెప్పవచ్చును.

**మూ. దీర్ఘికా కురరీ వల్లీ సారసీ శిఖినీ మృగీ,**
**మధ్యమానాం భవన్త్యేతా వేశ్యాదీనాం తు నిత్యశః. 419**

**తా.** మధ్యమస్త్రీలకు, వేశ్యలకూ కూడ ఉపమానంగా దిగుడుబావి, ఆడగోరింక, లత, ఆడ సారసపక్షి, ఆడ నెమలి, ఆడలేడి ఉపయోగించవచ్చును.

**మూ. షట్పదీ కుక్కుటీ ధ్వాఙ్క్షీ పరపుష్టాథ కౌశికీ,**
**అధమానాం ధ్రువాస్వేతాః ప్రయోజ్యాస్తు ప్రయోక్తృభిః. 420**

**తా.** ధ్రువాప్రయోక్తలు, అధమస్త్రీలకు ఉపమానాలుగా ఆడతుమ్మెద, ఆడకోడి, ఆడకాకి, ఆడకోకిల, ఆడ గుడ్లగూబ – వీటిని ఉపయోగించవచ్చును.

**మూ. గత్యర్థోపమితా యాశ్చ చలానార్థా భవన్తి హి,**
**ప్రావేశిక్యాం బుధైరేవం నైష్క్రామిక్యాం తథైవ చ. 421**

**తా.** ఈ పోల్చడం నడకవిషయంలోను, ఇతరమైన కదలికల విషయంలోను, ప్రావేశికీ – నైష్క్రామికీధ్రువలలో చెయ్యాలి.

**మూ. ప్రావేశిక్యాశ్రయా యే చ పూర్వాహ్ణే చైవ తే స్మృతాః,**
**నక్తన్దివసముత్థాస్తు నైష్క్రామిక్యాం స్వకాలజాః. 422**

**తా.** పూర్వాహ్ణంలో జరిగే ఘటనల విషయంలో ప్రావేశికీధ్రువ ఉపయోగించాలి. రాత్రి గాని పగలు గాని ఎప్పుడు జరిగిన ఘటన విషయంలో నైనా నైష్క్రామికీధ్రువ ప్రయోగించాలి.

**మూ. సౌమ్యాః పూర్వాహ్ణకాలే తు మధ్యాహ్నే దీప్తిసంశ్రయాః,**
**అపరాహ్ణే తథా కాలే సన్ధ్యాయాం కరుణాశ్రయాః. 423**

**తా.** పూర్వాహ్ణాన్ని సూచించడానికి సౌమ్యమైన ధ్రువలు, మధ్యాహ్నం సూచించ డానికి దీప్తిగల (Excited) ధ్రువలు, అపరాహ్ణాన్నీ, సంధ్యాకాలాన్నీ సూచించడానికి కరుణప్రధానధ్రువలు గానం చెయ్యాలి.

**మూ. గమనార్థా హి యే ప్రోక్తాః ప్రావేశిక్యాం భవన్తి హి,**
**స్థావరా యే చ సంప్రాప్తా ఆక్షేపిక్యాశ్రయా హి తే. 424**

**తా.** గమనం అనే విషయాన్ని సూచించడానికి ప్రావేశికీధ్రువ, కదలకుండా ఉండడం అను విషయం సూచించడానికి ఆక్షేపికీధ్రువ ప్రయోగించాలి.

**మూ. ఆక్షేప్యాశ్రితాః సర్వే ద్రుతాః స్థితకృతాస్తథా,**
**ఆక్షేపా హ్యేవమేవ స్యుర్ద్రుతాః స్థితగతాశ్రయాః**
**రోషామర్షసముద్భూతాః శోకాద్భుతభయానకాః. 425**

**తా.** ఆక్షేపికీధ్రువల గానం ద్రుతలయతోను, విలంబితలయతోనూ కూడ చేయవచ్చు. ఇవి రోషాన్ని, అమర్షాన్ని, శోకాన్ని, అద్భుతాన్ని, భయానకాన్ని ఆశ్రయించి ఉత్పన్నము లైనప్పుడు ఈ విధంగానే ఉండాలి.

**మూ. యద్ద్రవ్యం వసుధాసంస్థం మృతదైవతమాశ్రితమ్,**
**తత్సర్వముపమేయం తు గానే యుక్తోపమాశ్రయే. 426**

**తా.** ధ్రువాగానంలో యుక్తమైన ఉపమానాలు ఎన్నుకొని, పృథివిమీద అన్ని వస్తువులనూ, మృతులను, దేవతాసంబద్ధవిషయాలను ఉపమేయాలుగా చేయవచ్చును.

**మూ. స్థావరే స్థావరం కుర్యాద్గతార్థేషు చలం తథా,**
**సుఖదుఃఖకృతాన్ భావానౌపమ్యగుణసంశ్రయాన్. 427**

**తా.** స్థావరానికి ఉపమానంగా స్థావరాన్నే ప్రయోగించాలి. అయితే ఇవి నడుస్తూన్న ట్లయితే (ఒక చోటనుండి మరొక చోటికి తరలింపబడుతూన్నప్పుడు) చలవస్తువును ఉపమానంగా చెప్పవచ్చును. సుఖదుఃఖాలకు సంబంధించిన విషయాలను (లేదా భావాలను) ఉపమానంగా చెప్పేదాని గుణాలతో వీటి గుణాల కున్న సామ్యాన్ని పట్టి పోల్చాలి.

**మూ. తత్ర రథవాజికుఞ్జరమృగపక్షిశిబికావిమానానామ్,**
**గతివిక్రమం హి దృష్ట్వా కర్తవ్యాథ ధ్రువా తద్‌జ్ఞైః. 428**

**తా.** రథం, అశ్వం, గజం, మృగం, పక్షులు, పల్లకీ, విమానము – వీటి గమనంలో ఉండే వేరు వేరు రీతులు బాగా ప్రత్యక్షంగా చూచి దానిని వర్ణిస్తూ ధ్రువారచన చెయ్యాలి.

**మూ. రథపత్రివాజివారణవిమానశిక్యస్థపక్షియానేషు,**
**ద్రుతపదవర్ణవిశేషా కర్తవ్యా వై ధ్రువా తద్‌జ్ఞైః. 429**

**తా.** రథాలు, పక్షులు, అశ్వాలు, గజాలు, విమానాలు, ఊయలలు (లేదా డోలీలు), పక్షివాహనాలు వీటి గమనాన్ని వర్ణించే ధ్రువల నిర్మాణం శీఘ్రంగా ఉచ్చరించడానికి వీలైన పద విశేషాలతో, వర్ణవిశేషాలతో చెయ్యాలి.

**మూ. ఓజఃకృతా హి వై గురువర్ణా వృషభగజేన్ద్రసింహేషు,**
**సారసవానరహంసే తథా మయూరే చ కర్తవ్యాః. 430**

**ద్రుతగమనే లఘువర్ణా విలమ్బితకృతే తు దీర్ఘవర్ణకృతాః,**
**ఏవం స్థితద్రుతానాం జ్ఞాత్వా భావం ధ్రువాః కార్యాః. 431**

**తా.** వృషభగజసింహాల గమనాన్ని వర్ణించే ధ్రువలు ఓజోగుణభరిత మైన గురు వర్ణాలచేత నిర్మించాలి. సారసపక్షులు, వానరాలు, కాకులు, మయూరము – వీటి గమనం వర్ణించే ధ్రువలలో ద్రుతగతిలో లఘువులు గాని, విలంబితగతిలో ఉన్న గురు వర్ణాలు కాని ఉండాలి. ఈ విధంగా విలంబిత – ద్రుతగతుల నియమాలను తెలిసికొని ధ్రువాయోజనం చెయ్యాలి.

**మూ. నాస్తి కించిదవృత్తం హి పదం గానకృతాశ్రయమ్,**
**తస్మాద్గానమభిప్రేక్ష్య తద్వృత్తం యోజయేర్బుధః. 432**

**తా.** వృత్తం (ఏదో ఒక చందస్సు) లేని గానయోగ్యమైన పదం ఉండదు. అందుచేత గానాన్ని పరిశీలించి దానికి తగిన వృత్తం ప్రయోగించాలి.

**మూ. తస్మాద్వాహనగత్యర్థా ధ్రువా కార్యాక్షరైస్తథా,**
**అఙ్గానాం సమతా యత్ర భాణ్డవాదే భవిష్యతి. 433**

**తా.** అందుచేత వాహనగమనాన్ని వర్ణించే ధ్రువను భాండవాద్యంతో (వాద్య వాదనంతో) సమంగా కుదిరే అంగాలు గల అక్షరాలతో నిర్మించాలి.

**మూ. యద్వృత్తం వాహనగతౌ ధ్రువాపాదే విధీయతే,**
**తద్వృత్తం తు భవేద్వాద్యమఙ్గపాతసమం తథా. 434**

**తా.** వాహనగతిని వర్ణించే ధ్రువలో ఉపయోగించే వృత్తానికి అనుకూలమైన వాద్యవాదనం ఏర్పాటు చేస్తే గీతాంగవాద్యాంగాల మధ్య సమత్వం ఉంటుంది.

**మూ. పూర్వం గానం తతో వాద్యం తతో నృత్తం ప్రయోజయేత్,**
**గీతవాద్యాఙ్గసంయోగః ప్రయోగ ఇతి కీర్తితః. 435**

**తా.** ముందు గానం తరవాత వాద్యం, తరువాత నృత్యం ప్రారంభించి ప్రయోగించాలి. ఎందువల్లననగా – గీత – వాద్య – శరీరావయవచాలనాల సమమైన కలయికయే, సమన్వయమే, **నాట్య ప్రయోగం** అనగా –

**మూ. హృదయస్థస్తు యో భావః సోఽఙ్గాభినయనైరథ,**
**నివృత్త్యఙ్కురసూచాసు కార్యస్త్వభినయాన్వితః. 436**

**తా.** హృదయంలో ఉన్న భావాన్ని అంగాభినయం ద్వారా నివృత్త్యంకురమార్గానికి చెందిన సూచలచేత అభినయించాలి. పైకి ఆవిష్కరించాలి.

**మూ. అథ ప్రాసాదికీ యోజ్యా ప్రహర్షార్థగుణోద్భవాః,**
**ఆకాశపురుషో యత్ర యత్ర చాకాశభాషణమ్. 437**

**తా.** ఆకాశంమీద నున్న పురుషుడు అక్కడినుండే సంభాషణం చేస్తూన్నప్పుడు మాత్రమే ప్రహర్షప్రద మైన ప్రాసాదికీధ్రువ ప్రయోగించాలి.

**మూ. అన్వర్థా తత్ర కర్తవ్యా ధ్రువాహ్యాభాషణాశ్రయా,**
**ప్రాసాదిక్యాశ్రయా చాపి ఈర్ష్యాక్రోధాశ్రయాపి వా. 438**

**శృఙ్గారరసమాసాద్య ధ్రువాన్వర్థా ప్రయుజ్యతే,**
**యాని ప్రాసాదికాని స్యుః స్థానాని రససంశ్రయాత్**
**అన్వర్థా తత్ర కర్తవ్యా ధ్రువా ప్రాసాదికీ త్వథ. 439**

**తా.** ఈ సందర్భంలో, సంభాషణతో సంబంధించిన ధ్రువల ప్రయోగం వాటి పేర్లను సార్థకం చేసే రీతిలో జరగాలి. శృంగారరసాశ్రయ మైన ధ్రువలు ఈర్ష్యా – క్రోధ – ప్రసాదనరూపభావాలను ఆశ్రయించి ఉపయోగించి నపుడు సార్థకములైన వాటినే ఉపయోగించాలి. ప్రసాదనం ఆవిష్కరించవలసి నప్పుడు విభిన్నరసాలకు సంబంధించిన

ధ్రువలను, ప్రాసాదికీరూపంలో ఉపయోగిస్తే వాటి అర్థాలకు తగిన విధంగా ఉపయోగించిన ట్లవుతుంది.

**మూ. భాషా తు శౌరసేనీ స్యాద్ ధ్రువాణాం సంప్రయోజనే,**
**కదాపి మాగధీ యత్ర కర్తవ్యం నత్కుటం బుధైః. 440**

**తా.** ధ్రువలలో శారసేనీభాషను ఉపయోగించాలి. నత్కుటధ్రువలను ప్రయోగించి నప్పుడు మాగధీభాష కూడ ఉపయోగించవచ్చును.

**మూ. దివ్యానాం సంస్కృతం గానం ప్రమాణైస్తు విధీయతే,**
**అర్ధసంస్కృతమేతత్తు మానుషాణాం ప్రయోజయేత్. 441**

**తా.** దివ్యపాత్రల విషయంలో వ్యాకరణాదులచేత పరిశుద్ధమైనదిగా నిర్ణయింప బడిన సంస్కృతభాషలో ధ్రువాగానం జరగాలి. మానవపాత్రలవిషయంలో అర్ధసంస్కృత మైన భాష గాని శౌరసేనీభాష గాని ఉపయోగించాలి.

**మూ. యే త్వౌపమ్యకృతా దివ్యా యది తేషాం ప్రయోగతః,**
**ప్రవేశో నాటకే తు స్యాచ్ఛృణు తేషాం సమాశ్రయమ్. 442**

**తా.** ఉపమానంగా చెప్పిన దివ్యపురుషు లెవరైనా, నాట్యప్రయోగసమయంలో, నాట్యరంగంమీద ప్రవేశించినప్పుడు పాటించవలసిన పద్ధతులు చెపుతాను; వినండి.

**మూ. యస్తేషాం సాత్త్వికో భావః కర్మసంకీర్తనం చ యత్,**
**తత్కార్యం గానయోగే తు ప్రమాణవిధిసంశ్రయమ్. 443**

**తా.** వాళ్లు ప్రదర్శించ వలసిన సాత్త్వికభావాలను వాళ్ల చెప్పదగిన కర్మలను, ప్రమాణసూచనపూర్వకంగా గీతాల ద్వారా ప్రకటించాలి.

**మూ. ఛన్దఃప్రమాణసంయుక్తం దివ్యానాం గానమిష్యతే,**
**స్తుత్యాశ్రయేణ తత్కార్యం కర్మసంకీర్తనాదపి,**
**ధ్రువాపాదవిధౌ కార్యం యచ్చౌపమ్యగుణాశ్రయమ్. 444**

**తా.** దివ్యపురుషులకు సంబంధించిన గానంలో ఛందస్సు గీతప్రమాణానుగుణంగా ఉండాలి. ఈ గీతాలలో ఆ దేవతల స్తుతి, వాళ్ల అద్భుతకర్మల వర్ణనము ఉండాలి. ధ్రువాపాదాలలో, ఈ విషయాలను స్పష్టీకరించే ఉపమానాల ప్రయోగం ఉండాలి.

**మూ. మాలా వక్త్రం పుటం వృత్తం విశ్లోకా చూలికా తథా,**
**ఉద్గతాఽ పరవక్త్రా చ కర్తవ్యా వై ప్రయోక్తృభిః. 445**

**తా.** ఈ సందర్భంలో గాయకులు మాలా – వక్త్ర – పుట – వృత్త – విశ్లోక – ఉద్గతా – అపరవక్త్ర ఛందస్సుల వంటి ఛందస్సులు ప్రయోగించాలి.

**మూ. విధానం ఛన్దసామేషాం మయా పూర్వముదాహృతమ్,**
**అథాశీర్వాదయుక్తాని కార్యాన్యేతాని దైవతే. 446**

**ఋగ్గాథాపాణికా హ్యేషాం బోద్ధవ్యాస్తు ప్రమాణతః,**
**సుశ్రవ్యాశ్చైవ యస్మాత్తు తస్మాద్గీతీషు యోజయేత్. 447**

**తా.** ఛందస్సుల లక్షణాలు నేను వెనుక చెప్పి ఉన్నాను. దేవతాసంబద్ధా లైన ధ్రువలలో ఆ దేవతల విజయాన్ని గాని, ఆశీస్సును గాని వ్యక్తీకరించాలి. ఋక్, గాథా, పాణికా మొదలైన వాటి ప్రమాణాలను, స్వరూపాలను బాగా తెలిసికొని, ధ్రువాగీతాలలో చేర్చాలి. ఎందువల్ల ననగా ఇవి వినడానికి చాల మధురంగా ఉంటాయి.

**మూ. గాన్ధారషడ్జమధ్యమపఞ్చమయుక్తాశ్చ జాతయో యాశ్చ,**
**ఏభిః ప్రమాణగానం కర్తవ్యం దైవతోపేతమ్. 448**

**తా.** ఈ గీతాల ప్రమాణాలకు అనుగుణంగా, గాంధార – షడ్జ – మధ్యమ – పంచమాలతో కూడిన జాతుల ప్రయోగం కూడ, దేవతలను సూచిస్తూ, ఈ గీతాలలో చేయవచ్చును.

**మూ. ప్రాసాదికం స్థితం చైవ నైష్క్రామం సంప్రవేశనమ్,**
**ప్రమాణమపి కర్తవ్యం చతుఃస్థానసమన్వితమ్. 449**

**తా.** ఈ గాంధారాదిజాతుల ప్రమాణం – ప్రాసాదికి – స్థిత – నైష్క్రామికి – ప్రావేశికి అను నాలుగు స్థానాలతో సంబంధించి ఉంటుంది.

**మూ. ప్రాయశః సంస్కృతం యోజ్యమనుష్టుప్ఛన్దసా కృతమ్,**
**నానాదైవతకార్యేషు హ్యన్తరాయం వినా తథా. 450**

**తా.** దేవతల అద్భుతకార్యాలను వర్ణిస్తూ సాధారణంగా, అనుష్టుప్ఛందస్సులో, సంస్కృతభాషలోనే అంతరాయం లేకుండా, (లేదా అంతరాధ్రువాప్రయోగం లేకుండా) గీతరచన జరగాలి.

**మూ. వక్త్రం చాపరవక్త్రం చ మాలాచేతి ప్రవేశజమ్,**
**పుటం చ చూలికా చైవ నైష్క్రామిక్యామథేష్యతే. 451**

**ప్రాసాదిక్యుద్గతా వృత్తం స్థితం చానుష్టుబిష్యతే,**
**స్థానాన్యేతాని యోజ్యాని ప్రమాణవిబుధైరథ. 452**

**తా.** ప్రావేశికీధ్రువలో మాలా, వక్త్ర, అపరవక్త్రాదిఛందస్సులు, నైష్క్రామికీధ్రువలో పుట – చూలికాదిఛందస్సులు, ప్రాసాదికీధ్రువలో ఉద్గతాఛందస్సు, స్థితాధ్రువలో

అనుష్టుప్ఛందస్సు ప్రయోగించాలి. ప్రమాణనిపుణు లైన శాస్త్రవేత్తలు నాట్యప్రయోగంలో ఈ స్థానాలను నియమానుసారం ప్రయోగించాలి.

**మూ. యదనుష్టుప్కృతం గానం స్థితస్థానపమాశ్రయమ్,**
**శాపభ్రంశాశ్రయకృతం చిన్తాదుఃఖసమన్వితమ్. 453**

**గురుప్రాయాక్షరకృతం కరుణస్వరజాతికమ్,**
**ప్రకృష్టవర్ణబహులం స్థితస్థానం తు తద్భవేత్. 454**

**తా.** అనుష్టుప్ఛందోబద్ధ మైన గీతం విలంబితవలయంలో నడవాలి. శాపము, స్థానభ్రంశము, చింత, దుఃఖము వంటి భావాలను ఆవిష్కరించే ఈ గీతంలో గుర్వక్షరాల ప్రయోగం అధికంగా ఉంటుంది. కరుణద్యోతకస్వరజాతులతో, దీర్ఘంగా లాగడానికి వీలైన అక్షరాలతో కూర్చిన ఈ గీతం 'స్థితస్థానం'లో గానం చేయబడుతుంది.

**మూ. ఉన్మాదనార్థం నృణాం తు తథా విహరణేష్వపి,**
**దివ్యాన్వయానాం కర్తవ్యం స్థానమానుష్టుభాశ్రయమ్. 455**

**తా.** మానవులలో ఆవేశం కలిగించడానికీ, వాళ్లు వివిధస్థానాలలో విహరించేటట్లు చేయడానికీ దివ్యపురుషులు అనుష్టుప్ఛందస్సులో ఉన్న గీతాలను ఉపయోగించాలి.

**మూ. మానుషేష్వవతీర్ణస్య దివ్యస్య స్మరణాశ్రయమ్,**
**ప్రమాణగానం కర్తవ్యం దివ్యభావసమన్వితమ్. 456**

**తా.** మనుష్యజన్మ ఎత్తిన దివ్యపురుషునకు వాని దివ్యభావస్మరణ కలిగిన దశలో ఆ దివ్యభావం ఆవిష్కరించడానికి తగిన గానం శాస్త్రానుసారం ప్రయోగించాలి.

**మూ. తస్యైవ దుఃఖవిషయం శోకచిన్తావినాశజమ్,**
**ప్రమాణగానం కర్తవ్యం శోకావస్థానసంశ్రయమ్. 457**

**తా.** పైన చెప్పిన పాత్రలే దుఃఖదశలో ఉన్నప్పుడు ఆ శోకాన్నీ, చింతనూ నశింప చేసే, శోకావస్థాసూచకమైన, ప్రామాణికమైన గానం ప్రయోగించాలి.

**మూ. ధ్రువాణాం హి విధానస్య హ్యాశ్రయస్య విశేషతః,**
**యథా ప్రయోగః కర్తవ్యస్తచ్చ మే సంనిబోధత. 458**

**తా.** ఇపుడు నేను, ధ్రువావిధానమును, వాటి ప్రయోగాన్నీ గూర్చి చెపుతాను; వినండి.

**మూ. స్థాపితే భాణ్డవిన్యాసే త్రిసామ్ని పరికీర్తితే,**
**ఆశ్రావణాద్యం కర్తవ్యం బహిర్గీతప్రయోజకమ్. 459**

**తా.** భాండవాద్యాలను వాటి వాటి స్థానాలలో ఉంచి, త్రిసామపఠనం పూర్తి అయిన తరువాత బహిర్గీతానికి సంబంధించిన ఆశ్రావణాదికం చెయ్యాలి.

**మూ. ప్రయుజ్య చ బహిర్గీతం పూర్వరఙ్గం ప్రయోజయేత్,**
**పూర్వరఙ్గే ప్రవృత్తే తు నాట్యద్వారం సమాశ్రయేత్. 460**

**తా.** బహిర్గీతప్రయోగం పూర్తి యైన తరువాత పూర్వరంగం ప్రయోగించాలి. తరువాత నాట్యద్వారం (రంగద్వారం) ప్రయోగించాలి.

**మూ. ధ్రువా తత్ర ప్రకర్తవ్యా ప్రకృతీనాం ప్రవేశజా,**
**గత్యాశ్రయేణ నాట్యజ్ఞైర్గానస్య పరివర్తనమ్. 461**

**తా.** పిమ్మట పాత్రప్రవేశం సూచించే ప్రావేశికీధ్రువ ప్రయోగించాలి. దానిలో పాత్రల గతి, పరివర్తనం కూడ సూచింపబడాలి.

**మూ. పరిక్రమేణ రఙ్గస్య గానేనార్థవశేన వా,**
**పరివర్తాః ప్రయోక్తవ్యాః షడేవ తు బుధైరథ. 462**

**తా.** రంగస్థలంమీద అడుగులు వేసే టప్పుడు గానవశంచేత గాని, మరేదైనా కారణం చేత గాని ధ్రువాగానం చేయవలసివస్తే బుధులు ఆరు పరివర్తాలు మాత్రమే ప్రయోగించాలి.

**మూ. ధ్రువాస్తత్ర ప్రకర్తవ్యా దేవతాభిర్యథా బుధైః,**
**తత్ర పాతాః ప్రయోక్తవ్యా ఏకవింశతిరేవ చ. 463**
**త్ర్యస్రా వా చతురస్రా వా ధ్రువా నాట్యే ప్రయోగతః,**
**త్రికాలం పాదపతనం త్ర్యస్రాయాం చ విధీయతే. 464**
**చతుష్కలం తు పతనం చతురస్రాగతం భవేత్.**

**తా.** ఈ సమయంలో చేసే ధ్రువల ప్రయోగం దేవతాపాత్రల విషయంలో చేసే ధ్రువల వలె ఉండాలి. వీటిలో ఇరవై పాతలు ప్రయోగించాలి. ప్రస్తుతనాట్య ప్రయోగానికి అనుగుణంగా త్ర్యస్రధ్రువ గాని చతురస్రధ్రువ గాని ప్రయోగించవచ్చును. త్ర్యస్రధ్రువలో పాదపతనం త్రికలాకాలంలోను, చతురస్రాధ్రువలో చతుష్కలాప్రమాణంగాను ఉండాలి.

**మూ. ఉత్తమే చతురస్రా తు త్ర్యస్రా చైవ తు మధ్యమే. 465**
**ఖఞ్జం నత్కుటకం చైవ హ్యధమే చ ప్రయోజయేత్,**
**విధిః స్వస్థగతో హ్యేష భవేచ్చరణపాతనే,**
**సంభ్రమోత్పాతరోషేషు కలార్ధకలమిష్యతే. 466**

**తా.** ఉత్తమపాత్రల విషయంలో చతురస్రధ్రువ, మాధ్యమపాత్రలకు త్ర్యస్రధ్రువ, అధమపాత్రలకు ఖంజక – నత్కుట ధ్రువలు ప్రయోగించాలి. చరణపాతవిధానం ఇదే. అయితే సంభ్రమము (తొందర), ఉత్పాతము, క్రోధము ఇలాంటి పరిస్థితులలో చరణపాత కాలం ఒక్క లేదా అర కల ఉండాలి.

**మూ. త్రికలద్వికలైకకలాశ్చతుష్కలా యత్ర పాదవిన్యాసాః,**
**తత్ర చ సామ్యం కార్యం భాణ్డేన సమం చ మానేన. 467**

**న హ్యేకకలా ద్వికలా ధ్రువావిరామా భవన్తి నాట్యవిధౌ,**
**తస్మాత్ సామ్యం కార్యం భాణ్డేన సమం చ గానేన. 468**

**తా.** పాదవిన్యాసాలు త్రికల – ద్వికల – ఏకకల చతుష్కలల కాలప్రమాణంలో ఉన్నప్పుడు దానికి వాద్యవాదనతోను, గానంతోను సామ్యం ఉండాలి. ధ్రువలలో ఏకకలా విరామాలు, ద్వికలావిరామాలు ఉండవు గాన నాట్యవిధిలో పాదపాతం (న్యాసం) గాన – వాద్యాలను అనుసరించి వాటితో సమంగా ఉండాలి.

**మూ. యే పూర్వోక్తా భావాః స్థితాశ్రయా వా ద్రుతాశ్రయా వాపి,**
**తేషు పాదనిపాతం జ్ఞాత్వా సామ్యం బుధైః కార్యమ్. 469**

**తా.** వెనుక చెప్పిన భావాల ప్రదర్శన జరిగే సమయంలో చేసే పాదవిన్యాసాలు విలంబితలయతో కాని, ద్రుతలయతో కాని ఉంటూ వాద్యవాదనాన్ని అనుసరించి ఉండాలి.

**మూ. అపటీక్షేపకృతాశ్చాత్యధికహర్షశోకరోషాద్యాః,**
**తత్ర పరిచ్ఛేదసమాః కార్యాస్తద్జ్ఞైః ప్రవేశే తు. 470**

**తా.** హర్షాతిశయం, రోషం, శోకం వంటి కారణాలచేత పాత్ర తొందరగా తెర లాగికొని ప్రవేశించినప్పుడు వాని పాదవిన్యాసం విభాగానుసారం ఉండాలి(?).

**మూ. ఏవమేతే బుధైర్జ్ఞేయాః ప్రయోగే పరివర్తకాః,**
**అతః పరం ప్రవక్ష్యామి భాణ్డగ్రహవికల్పనమ్. 471**

**తా.** నాట్యప్రయోగసమయంలో, పరివర్తకాలు ఈ విధంగా ఉండాలని బుధులు తెలుసుకోవాలి. ఇప్పుడు వాద్యాలకు సంబంధించిన గ్రహాల కల్పనను విశదీకరిస్తాను.

**మూ. అభాణ్డమేకం గానస్య పరివర్తం ప్రయోజయేత్,**
**చతుర్థే పరివర్తే తు తస్య భాణ్డగ్రహో భవేత్. 472**

**తా.** గీతప్రారంభంలో వాద్యవాదనం లేకుండా ఒక పరివర్తం చెయ్యాలి. దాని తరువాత చతుర్థపరివర్తంలో వాద్యగ్రహం చెయ్యాలి.

**మూ. సన్నిపాతగ్రహాః కాశ్చిత్ కాశ్చిద్వై తర్జనీగ్రహాః,**

**తథాకాశగ్రహాః కాశ్చిత్ ధ్రువాగానే భవన్తి హి.** **473**

**తా.** ధ్రువాగానాలలో ఒకప్పుడు సన్నిపాతగ్రహా లుండాలి. ఒకప్పుడు తర్జనీగ్రహా లుండాలి. ఒకప్పుడు ఆకాశగ్రహా లుండాలి.

**మూ. ధ్రువాయాస్తు గ్రహో యస్మాత్ కలాతాలలయాన్వితః,**
**స తు భాణ్డేన కర్తవ్యస్తద్‌జ్ఞైర్గతిపరిక్రమే.** **474**

**తా.** ధ్రువలలోని గ్రహాలు కలా – తాల – లయలచేత నియమితములై ఉంటాయి. అందుచేత ఇది చేష్టలలోను నడకలలోనూ కూడ వాద్యాల సహాయంతో జరగాలి.

**మూ. శీర్షకస్యోద్ధతాయాశ్చ ప్రదేశిన్యా గ్రహో భవేత్,**
**విలమ్బితాడ్డితాయాశ్చ సన్నిపాతే తృతీయకే.** **475**

**తా.** ఉద్ధతధ్రువశీర్షకంలో గ్రహం ప్రదేశిన్యంగుళితో చెయ్యాలి. విలంబితఅడ్డిత ధ్రువ సన్నిపాతంతోను, మూడవ అంగుళితోను చెయ్యాలి.

**మూ. నత్కుటస్యాడ్డితాయాశ్చ ప్రాసాదిక్యాస్తథైవ చ,**
**సన్నిపాతగ్రహః కార్యః ద్రుతాయాశ్చోర్ధ్వజో గ్రహః.** **476**
**నైష్క్రామిక్యనుబన్ధానాం గ్రహో భాణ్డసమో భవేత్,**
**న తేషాం పరివర్తస్తు కార్యో గానే ప్రయోక్తృభిః.** **477**

**తా.** నత్కుట – అడ్డిత – ప్రాసాదికీధ్రువలలోసంనిపాతగ్రహము, ద్రుతాధ్రువలలో ఆకాశగ్రహము, నైష్క్రామికీ – అనుబన్ధాధ్రువలలో వాద్యాలతో గ్రహము ప్రయోగించాలి. ప్రయోక్తలు దీనిలో పరివర్తం (ఆవృత్తిచేయడం) ఉంచకూడదు.

**మూ. నత్కుటస్య తు చత్వారో గ్రహాః కార్యాః ప్రయోక్తృభిః,**
**సన్నిపాతశ్చ శమ్యా చ తాలశ్చాకాశజస్తథా.** **478**

**తా.** నత్కుటధ్రువలో – సన్నిపాతము, శమ్య, తాలము, ఆకాశజగ్రహము అను నాలుగు గ్రహా లుంటాయి.

**మూ. సంభ్రమావేగహర్షేషు ప్రవేశా యే భవన్తి హి,**
**గ్రహో గానసమస్తత్ర సోద్ఘాత్యః సంప్రకీర్తితః.** **479**

**తా.** సంభ్రమ – ఆవేగ – హర్షాలతో పాత్రప్రవేశం జరిగి నప్పుడు గ్రహం గీతంతో కలిపి ప్రయోగించబడుతుంది. ఇలాంటి గ్రహానికి **'ఉద్ఘాత్యం'** అనిపేరు.

**మూ. భూషణవాసఃపతనే వైకల్యే విస్మృతే పరిశ్రాన్తే,**
**దోషాచ్ఛాదనహేతోరుద్ఘాత్యః సంప్రయోజ్యస్తు.** **480**

**తా.** పాత్ర అభినయిస్తూన్న సమయంలో భూషణమూ, వస్త్రమూ జారిపోయినప్పుడు,

పాత్ర వైకల్యం చెంది నప్పుడూ, పాఠ్యాదులు మరచి నప్పుడూ, అలసిపోయి నప్పుడూ, ఆ దోషాన్ని కప్పిపుచ్చడంకోసం ఉద్ఘాత్యం ప్రయోగించాలి.

**మూ. ఏవం ప్రయోక్తృభిః కార్యం ధ్రువాణాం సన్నివేశనమ్,**
**యథాస్థానాశ్రయోపేతం నృత్తనాట్యప్రయోగజమ్. 481**

**తా.** నాట్యప్రయోక్తలు ఈ నియమాలను పాలిస్తూ, నృత్తనాట్యాల ప్రయోగానికి సంబంధించిన ధ్రువాసంనివేశనం, తగు స్థానాలలో తగు ఆశ్రయాలతో ఈ విధంగా చెయ్యాలి.

**మూ. యథా వర్ణాదృతే చిత్రం శోభతే న నివేశనమ్,**
**ఏవమేవ వినా గానం నాట్యం రాగం న గచ్ఛతి. 482**

**తా.** రంగులు వేయకపోతే ఒక మంచి భవనం సుందరంగా (చిత్రంగా) ఎలా శోభించదో అట్లే గానం లేని నాట్యప్రదర్శనం రక్తికట్టదు, ఆనందం చేకూర్చదు.

**మూ. పూర్వరఙ్గవిధానే తు కర్తవ్యో గానజో విధిః,**
**దేవపూజాధికారశ్చ తత్ర సంపరికీర్తితః. 483**

**తా.** పూర్వరంగవిధానసమయంలో అనుసరించవలసిన గీతవిధి, వివిధదేవతా పూజావిధానమూ (వెనుక) చెప్పబడినది.

**మూ. తతశ్చ కావ్యబన్ధేషు నానాభావసమాశ్రయమ్,**
**గ్రామద్వయం చ కర్తవ్యం తథా సాధారణాశ్రయమ్. 484**

**తా.** అందుచేత కావ్యబంధాలలో సాధారణస్వరాల యోజనంతో, వివిధభావ రసాలకు అనుగుణ మైన గ్రామద్వయం ప్రయోగించాలి.

**మూ. ముఖే తు మధ్యమగ్రామః షడ్జః ప్రతిముఖే స్మృతః,**
**సాధారితం తథా గర్భే విమర్శే చైవ పఞ్చమమ్. 485**

**కైశికం చ తథా కార్యం గానం నిర్వహణే బుధైః,**
**సన్నివృత్తాశ్రయం చైవ రసభావసమన్వితమ్. 486**

**తా.** నాటకంలోని ముఖసంధిలో మధ్యమగ్రామగీతాలు, ప్రతిముఖసంధిలో షడ్జగ్రామగీతాలు, గర్భసంధిలో సాధారితము, విమర్శసంధిలో పంచమం, నిర్వహణ సంధిలో కైశికి, ప్రయోగించాలి. సంధులను, ఛందస్సులను ఆశ్రయించి ఉన్న ఈ గీతాలు రసాలకు, అవస్థలకు అనుగుణంగా ఉండాలి.

**మూ. యథారసకృతాః యాః స్యుః ధ్రువాః ప్రకరణాశ్రయాః,**

**నక్షత్రాణీవ గగనం నాట్యముద్ద్యోతయన్తి తాః. 487**

**తా.** ప్రకరణానుసారంగా, రసానుసారంగా ప్రయోగించిన ధ్రువలు, నక్షత్రాలు ఆకాశాన్ని ప్రకాశింపచేసి నట్లు నాట్యాన్ని ప్రకాశింపచేస్తాయి. నాట్యశోభను పెంచుతాయి.

**మూ. మాగధీ ప్రథమా గీతిస్తథా చైవార్ధమాగధీ,**
**సంభావితా తృతీయా స్యాత్ పృథులా చ తథా పరా. 488**

**తా.** మాగధి ప్రథమగీతి. అర్ధమాగధి ద్వితీయగీతి. సంభావిత తృతీయగీతి, పృథుల చతుర్థగీతి.

**మూ. వినివృత్త్యా పదానాం తు మాగధీ సముదాహృతా,**
**చిత్రేఽ ర్ధమాగధీ చైవ ద్విర్నివృత్తపదాశ్రయా. 489**

**తా.** వేరు వేరు లయలలో పదాల ఒక ఆవృత్తిని పట్టి మాగధి గుర్తించబడుతుంది. ఇది చిత్రమార్గంలో ప్రయోగింపబడుతుంది. పదాల ద్విరావృత్తి అర్ధమాగధి.

**మూ. వృత్తౌ సంభావితా ప్రాయో గుర్వక్షరసమన్వితా,**
**పృథులా దక్షిణే తు స్యాత్ లఘువాద్యాక్షరాన్వితా. 490**

**తా.** సాధారణంగా గుర్వక్షరాలు అధికంగా ఉండే 'సంభావిత' వార్తికమార్గంలో ప్రయోగింపబడుతుంది. వాద్యవిధానంలో లఘ్వక్షరాలతో కూడిన 'పృథుల' దక్షిణమార్గంలో ప్రయోగింపబడుతుంది.

**మూ. గానయోగే చతస్రస్తు యోజ్యాః సర్వత్ర గాయనే,**
**యథాక్షరకృతా హ్యేతాః ప్రయుజ్యన్తే ధ్రువాస్వపి. 491**

**తా.** గాయకులు ఈ నాలుగువిధాలైన గీతులను అన్ని గానాలలోను ఉపయోగించ వచ్చును. అక్షరప్రమాణానుసారం నిర్మించిన ఈ గీతులను ధ్రువలలో కూడ ఉపయోగించ వచ్చును.

**మూ. పూర్ణస్వరం వాద్యవిచిత్రవర్ణం త్రిస్థానశోభి త్రియతం త్రిమార్గమ్,**
**రక్తం సమం శ్లక్ష్ణమలఙ్కృతం చ సుఖప్రయుక్తం మధురం చ గానమ్. 492**

**తా. గానం** అనేది అన్ని స్వరాలతోను పూర్ణమై, వాద్యంతో విచిత్ర మైన వర్ణాలతో, మూడు యతులతో, మూడు మార్గాలతో, మూడు స్థానాలతో సంబద్ధమై ఉండాలి. సమంగా, మృదువుగా, అలంకారాలతో అలంకరింపబడి, మధురమై, అనాయాసంగా ప్రయోగింపబడి మనోరంజకంగా ఉండాలి. అలా ఉంటేనే అది **'గానం'**.

**మూ. గీతే ప్రయత్నః ప్రథమస్తు కార్యః శయ్యాం హి నాట్యస్య వదన్తి గీతమ్,**

**గీతేఽపి వాద్యేఽపి చ సుప్రయుక్తే నాట్యప్రయోగో న విపత్తిమేతి. 493**

**తా.** ముందుగా ప్రధానంగా, గీతం విషయంలో ప్రయత్నం చెయ్యాలి. ఎందుచేత ననగా గీతం నాట్యానికి శయ్య అని అంటారు. గీతప్రయోగము, వాద్యప్రయోగము బాగా ఉంటే నాట్యప్రయోగం ఏనాటికీ విపత్తు పొందదు; పాడవదు.

**మూ. ఏతదుక్తం మయా సమ్యక్ ధ్రువాణాం లక్షణం మహత్,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి గాతృవాదకయోర్గుణాన్. 494**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే ధ్రువావిధానం నామ ద్వాత్రింశోఽధ్యాయః.**

**తా.** ధ్రువల గొప్పదైన (పూజ్యమైన) ఈ విధంగా ఉన్న లక్షణం మీకు చెప్పాను. ఇటు పైన గానం చేసేవారి గుణాలు, వాద్యవాదకుని గుణాలు చెపుతాను.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన బాలానందిని అను నాట్యశాస్త్రాంధ్రవ్యాఖ్యానములో 'ధ్రువావిధానం' అను ముప్పైరెండవ అధ్యాయం సమాప్తం.**

**శ్రీః శ్రీః శ్రీః**

పరిమళపబ్లికేషన్స్‌వారి **అభినవభారతీ** సహిత **నాట్యశాస్త్రం**లో ధ్రువావిధానం అను 32 వ అధ్యాయం ఇక్కడ సమాప్తమైనది. దీనిలో 437 శ్లోకాలున్నాయి.

మన్మోహన్‌ఘోష్ సంపాదించిన ఆంగ్లానువాదసహిత**నాట్యశాస్త్రం** పుస్తకంలో ఇంత వరకు ఉన్న 494 శ్లోకాలు అయిన తరువాత కూడ ఈ ధ్రువాధ్యాయమే కొనసాగి 525వ శ్లోకంతో ముగిసినది. మొదటి పుస్తకంలో 494 నుండి 595 వరకు ఉన్న 31 శ్లోకాలను 33 వ అధ్యాయంగా చూపి దీనికి **'గుణదోషవిచారః'** పేరు పెట్టారు. అయితే దీనిలో 23 శ్లోకా లున్నాయి.

ఇక్కడ కూడ మేం **అభినవభారతీ**పద్ధతి స్వీకరించాము. శ్లోకసంఖ్య మాత్రం మార్చలేదు.

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ త్రయస్త్రింశోఽధ్యాయః

## గుణదోషవిచారము

**జ్ఞానక్రియాది ... వర్గవిధానహేతుర్దోషాపవర్జనపటుః కిల భక్తిభాజామ్,**
**ఆనన్దపూర్ణపరశఙ్కరసారసిన్ధుధారాస్థితిర్విజయతాం పరమేశ్వరోఽసౌ.**
**– శ్రీమదభినవగుప్తాచార్యాః**

**మూ. గుణాత్ప్రవర్తతే జ్ఞానం దోషాచ్చిత్తం నిరస్యతి,**
**తస్మాద్యత్నేన విజ్ఞేయౌ గుణదోషౌ సమాసతః 495**

**తా.** గుణాలవల్ల జ్ఞానం కలుగుతుంది. దోషం చిత్తాన్ని పాడుచేస్తుంది. అందుచేత గుణం అంటే ఏదో దోషం అంటే ఏదో ప్రయత్నపూర్వకంగా తెలుసుకోవాలి.

**మూ. గాతా ప్రత్యగ్రవయాః స్నిగ్ధో మధురస్వరోపచితకణ్ఠః,**
**లయతాలకలాపాతప్రమాణయోగేషు తత్త్వజ్ఞః. 496**

**తా. గాయకుని గుణాలు :–** గాయకుడు యువకుడై ఉండాలి. స్నేహశీలి అయి మధురమైన స్వరంతో పూర్ణ మైన (నిండు) కంఠం కలవాడై ఉండాలి. లయ – తాల – కలా – పాత ప్రమాణాలను సరిగా కూర్చడంలో వాటి యథార్థస్వరూపం తెలిసినవాడై ఉండాలి.

**మూ. రూపగుణకాన్తిసంస్థానసత్త్వమాధుర్యసమ్పన్నా,**
**పేశలమధురస్నిగ్ధానునాదసమరక్తశుభకణ్ఠా. 497**

**సువిహితగమకవిధాయిన్యక్షోభ్యా గీతతాలలయకుశలా,**
**ఆతోద్యార్పితకరణా విజ్ఞేయా గాయికా శ్యామా. 498**

**తా. గాయిక :–** అందము, సద్గుణాలు, కాంతి, చక్కని అవయవ నిర్మాణము, సత్త్వము (సత్తువ), మాధుర్యము – వీటితో సంపన్నురాలు, మృదువు, మధురము, స్నిగ్ధమైన (బొంగురు కాని) అనునాదం(ప్రతిధ్వని) కలది, (having a charming resonance), సమము (హెచ్చుతగ్గులు గరగర లేనిది) మనోహరము, రంజకము, శుభము అయిన కంఠస్వరము కలది, అక్షోభ్య (కంగారు సభాకంపమూ లేనిది never nervous), తాల – లయలలో నేర్పు గలది. వాద్య వాదనానికి అనుగుణంగా కరణాలను మలచుకొనే నేర్పు గలది అయిన శ్యామ (యౌవన మధ్యస్థురాలు) ఉత్తమగాయికగా చెప్పబడినది.

**మూ. సునివిష్టపాణిలయయతినియోగజ్ఞౌ చ సుమధురలఘుహస్తౌ,**

**గాతృగుణైశ్చోపేతౌ అవహితమనసౌ సుసఙ్గీతౌ. 499**

**స్ఫుటరచితచిత్రకరణౌ జితశ్రమౌ రక్తకణ్ఠౌ ప్రవీణౌ,**

**చిత్రాదివాద్యకుశలౌ వీణాయా వాదకౌ భవతః. 500**

**తా. వీణావాదకులు :–** వీణావాదకు లిద్దరూ ఉచితరీతిలో పాణి – లయ – యతుల శాస్త్రీయజ్ఞానము, ప్రయోగవిధానమూ తెలిసి, సుమధురమైన ధ్వనిని వీణపై ఆవిర్భవింపచేయగల హస్తలాఘవం కలవాళ్లై ఉండాలి. ఉత్తమగాయకుని కుండవలసిన గుణా లన్నీ వీళ్లకు కూడ ఉండాలి. సావధానచిత్తులై మంచి సంగీతజ్ఞానంతో వాద్యంమీద కరణాలను స్పష్టంగా రచించడంలో నేర్పుకలిగి తొందరగా అలసట చెందనివాళ్లై ఉండాలి. మధురమైన కంఠస్వరంతో ప్రవీణులై (ఉత్తమవీణావాదనంలో అనుభవంతో) ఇతర వాద్యాలలోను, చిత్రాదిమార్గాలలోను కుశలులై ఉండాలి. ఇలాంటివాళ్లే ఉత్తమ వీణావాదకులు.

**వి.** "సుసంగీతౌ" అనగా ఇతరవాద్యాలను అనుసరించి తన వాద్యాన్ని నడపగల నేర్పుగలవారు అని అర్థం.

**మూ. బలవానవహితబుద్ధిర్గీతలయజ్ఞస్తథా సుసఙ్గీతః,**

**శ్రావకమధురః స్నిగ్ధో దృఢానిలో వంశవాదీ స్యాత్. 501**

**తా. వంశవాదకుడు :–** బలవంతుడు, ఏకాగ్రచిత్తం కలవాడు, గీత – లయల సుస్పష్టజ్ఞానం కలవాడు, ఇతరవాద్యాలకు అనుగుణంగా తన వాద్యం నడిపింపగలవాడు (సుసంగీతః) అయిన వంశీవాదకుడు ఉత్తమవంశీవాదకుడు. ఆతని వంశీగానం ఒకే రీతిలో (ఎగుడు దిగుడులు లేకుండా) వినేవారికి మధురంగా ఉండాలి. అతడు మంచి ఊపిరిపట్టు కలవాడై (దృఢానిలః) ఉండాలి.

**మూ. అవిచలితమవిచ్ఛిన్నం వర్ణాలఙ్కారబోధకం మధురమ్,**

**స్నిగ్ధం దోషావరణం వేణోరేవం స్మృతం వాద్యమ్. 502**

**తా.** వేణువాద్యం వణుకు లేకుండా, తెగిపోతూండకుండా, వర్ణాలూ, అలంకారాలూ స్పష్టంగా వినబడే టట్లుగా ఉండాలి. వినడానికి ఇంపుగా, దోషాలను (ఇతరవాద్య దోషాలను) కప్పివేసేదిగా ఉండాలి.

**మూ. ప్రాయేణ తు స్వభావాత్ స్త్రీణాం గానం నృణాం చ పాఠ్యవిధిః,**

**స్త్రీణాం స్వభావమధురః కణ్ఠో నౄణాం బలిత్వం చ. 503**

**తా.** సాధారణంగా – స్వభావాన్ని పట్టి స్త్రీలకు గానము, పురుషులకు పాఠ్యవిధి ఉపయుక్తంగా ఉంటుంది. ఎందువల్ల ననగా – స్త్రీల కంఠం సహజంగానే మధురంగా

ఉంటుంది. పురుషుల కంఠం బలంగా ఉంటుంది.

**మూ. యః స్త్రీణాం పాఠ్యగుణో భవతి నృణాం చ గానమధురత్వమ్,**
**జ్ఞేయః సోఽలఙ్కారో న హి స్వభావో హ్యయం తేషామ్. 504**

**తా.** కొందరు స్త్రీల పాఠ్యం బాగుంటుం దంటే, అలాగే కొందరి పురుషుల గానం మధురంగా ఉంటుం దంటే అది వాళ్లకు అలంకారమే కాని అందరిదీ అలా ఉండదు. ఇది వాళ్లస్వభావం (సహజం) కాదు కదా.

**మూ. యద్యపి పురుషో నేతా గీతవిధానం చ లక్షణోపేతమ్,**
**మాధుర్యగుణవిహీనం శోభాజననం న తద్భవతి. 505**

**తా.** పురుషుడు గానంలో నేతగా (Team leader) ఉండి గీతవిధానం అంతా యథాశాస్త్రీయంగా సాగినా కూడ మాధుర్యగుణం లేని ఆ గానం నాట్యప్రయోగానికి శోభాకరంగా ఉండదు.

**మూ. ఏవం స్వభావసిద్ధం స్త్రీణాం గానం నృణాం చ పాఠ్యవిధిః,**
**అపరస్పరసంపన్నం కార్యమనాయాసనిష్పన్నమ్. 506**

**తా.** ఈ విధంగా గానం స్త్రీలకు స్వభావసిద్ధం;వాళ్లు చేస్తేనే బాగుంటుంది; పాఠ్యం పురుషులకు స్వభావసిద్ధం; వాళ్లకే నప్పుతుంది. అందుచేత నాట్యప్రయోగంలో ఒకరు చేయవలసినది మరొకరు చేయకుండా ఉంటే అది అనాయాసంగా విజయవంతంగా జరిగిపోతుంది.

**మూ. ప్రాయేణ దానవాసురయక్షరక్షోరగా వివిధచేష్టాః,**
**వాక్యాశ్రితాః ప్రయోగే భవన్తి పురుషాఙ్గనాబద్ధాః. 507**

**తా.** సాధారణంగా– దానవులు, అసురులు, యక్షులు, రాక్షసులు, ఉరగులు– వీళ్ల వివిధ చేష్టలను స్త్రీ–పురుషుల వాక్యాలద్వారా (పాఠ్యం ద్వారా) నాట్యప్రయోగంలో వర్ణింపబడుతూంటాయి. లేదా స్త్రీ పురుషులు దానవాదుల పాత్రలను ధరించి వాళ్ల చేష్టలను వాక్యాల ద్వారా చూపవచ్చును.

**మూ. స్త్రీభిః కార్యః ప్రయత్నేన ప్రయోగః పురుషాశ్రయః,**
**యస్మాత్ స్వభావోపహితో విలాసః స్త్రీకృతో భవేత్. 508**

**తా.** స్త్రీలు, పురుషులు చేయవలసిన ప్రయోగం చెయ్యా లంటే (పురుషపాత్ర ధరించాలంటే) చాల ప్రయత్నం చేయవలసిఉంటుంది. ఎందువల్ల ననగా స్త్రీలు చేసే విలాసభూయిష్ఠ మైన ప్రయోగమే వాళ్లకు స్వాభావికం. అదే వాళ్లు అనాయాసంగా చేయకలుగుతారు.

**మూ. నిత్యం వ్యాయామయోగైశ్చ నృణాం భవతి సౌష్ఠవమ్,**
**స్వభావతస్తు మధురం స్త్రీణామఙ్గవిచేష్టితమ్. 509**

**తా.** పురుషులకు స్త్రీపాత్రధరించడానికి శరీరసౌష్ఠవం రావాలంటే నిత్యము వ్యాయామం చెయ్యాలి. స్త్రీల శారీరచేష్టిత మైతే స్వభావసిద్ధంగానే మధురంగా ఉంటుంది.

**మూ. ఏవం స్త్రీణాం తు పురుషైరుపదేష్టవ్యమేవ చ,**
**గానం వాద్యం చ పాఠ్యం చ నానాప్రకృతిసంభవమ్. 510**

**తా.** ఈ తథ్యాన్ని దృష్టిలో ఉంచుకొని, పురుషులు స్త్రీలకు గానము, వాద్యము, వివిధరూపాలలో ఉండే పాఠ్యము (వాచికాభినయమూ) ఉపదేశించాలి.

**మూ. అవైస్వర్యం భవేత్ స్త్రీణాం గానవాద్యక్రియాస్వపి,**
**న హి తద్వర్ణమాధుర్యం పురుషేషు భవిష్యతి. 511**

**తా.** స్త్రీలకు గానవాద్యాదులలో వైస్వరం (అప్పుడప్పుడు స్వరం చెడిపోవడం) జరగదు. అయితే పురుషులకు అలాంటి వర్ణమాధుర్యం ఉండదు.

**మూ. స్మృతిర్మతిశ్చ మేధా చ ఊహాపోహస్తథైవ చ,**
**శిష్యనిష్పాదనం చైవ షడాచార్యగుణాః స్మృతాః. 512**

**తా. ఆచార్యగుణాలు :–** స్మృతి, మతి, మేధ, ఊహ, అపోహ, మంచి శిష్యులను తయారుచేసే ఆసక్తి – ఈ ఆరూ ఉత్తమ సంగీత – నృత్య – నాట్యాచార్యుల లక్షణాలు.

**మూ. (పాఠాన్తరం) జ్ఞాన – విజ్ఞాన – కరణ – వచన – ప్రయోగసిద్ధి – నిష్పాదనాని షడాచార్యగుణాః. తత్ర జ్ఞానం శాస్త్రావబోధః. య (త) థా చ క్రియాసంపాదనం విజ్ఞానమ్. కణ్ఠహస్తగౌణ్యం కరణమ్. జితగ్రన్థతా వచనమ్. దేశాదిసంపదారాధనం ప్రయోగసిద్ధిః. శిష్యస్వభావమవిశేష్యోపాత్తయ (?) ఉపదేశాచ్ఛిష్యనిష్పాదనమితి.**

**తా.** జ్ఞానము, విజ్ఞానము, కరణము, వచనము, ప్రయోగసిద్ధి, నిష్పాదనము – ఇవి ఆరూ ఆచార్యగుణాలు. వాటిలో – **జ్ఞానం** అనగా శాస్త్రావబోధ. శాస్త్రజ్ఞానాన్ని ప్రయోగంలో చూపడం **విజ్ఞానం**. కంఠ – హస్తాల నైపుణ్యం **కరణం**. ధారణాశక్తి (జితగ్రన్థతా) **వచనం**. దేశాదిసంపదను ఆరాధించుట (వివిధదేశాచారాదుల జ్ఞానం, తదనుకూలప్రవర్తనం) **ప్రయోగసిద్ధి**. శిష్యుల శక్తి సామర్థ్యాదులను గుర్తించి వారికి తగు శిక్షణ ఇవ్వడం **నిష్పాదనం**.

**మూ. మేధాస్మృతిర్గుణశ్లాఘా రాగః సంఘర్ష ఏవ చ,**
**ఉత్సాహశ్చ షడేవైతే శిష్యస్యాపి గుణాః స్మృతాః. 513**

**తా. శిష్యగుణాలు :–** మేధ, స్మృతి, తనలోని గుణాలను శ్లాఘించుకొనకపోవడం, విద్యార్జనం విషయంలో తోటివారితో పోటీపడడం, విద్యాసక్తి (రాగం), ఉత్సాహం – ఈ ఆరూ శిష్యుని కుండవలసిన గుణాలు.

**మూ. శ్రావకోఽథ ఘనః స్నిగ్ధో మధురస్త్వవధానవాన్,**
**త్రిస్థానశోభీత్యేవం చ షట్ కణ్ఠస్య గుణాః స్మృతాః. 514**

**తా.** బాగా వినబడేది, ఘనము, మృదువు, మధురము, అవధానంతో కూడినది, వర్ణోచ్చారణస్థానాలు మూడింటిలోను శోభించేది – అని కంఠగుణాలు ఆరు.

**మూ. దూరాత్తు శ్రూయతే యస్మాత్తస్మాచ్ఛ్రావక ఉచ్యతే,**
**శ్రావకః సుస్వరో యస్తు నవిక్షిప్తో ఘనః స్మృతః. 515**
**అరూక్షధ్వనిసంయుక్తః స్నిగ్ధః తద్‌జ్ఞైః ప్రకీర్తితః,**
**మహాస్థానేఽప్యవైస్వర్యం స వై మధుర ఉచ్యతే. 516**
**స్వరేఽధికే చ హీనే చ హ్యవిరక్తోఽవధానవాన్.**

**తా.** దూరానికి వినబడేది **శ్రావకం**. శ్రావకమై ఉండి మంచి స్వరంతో కూడినదై, విక్షిప్తం కానిది (మధ్యలో విరిగిపోకుండా ఉండేది) **ఘనం**. దూరంగా వినబడినా కూడ కర్ణకఠోరత్వం లేనిది **స్నిగ్ధం**. తారస్థాయికి వెళ్లినప్పుడు కూడ వైస్వర్యం పొందనిది, జీర వంటివి లేనిది, **మధురం**. స్వరం అధికమైనా, తగ్గినా క్రిందికి దిగిపోనిది **అవధానవత్తు**.

**మూ. శిరఃకణ్ఠేష్వభిహతం తత్ స్థానమధురస్వరైః. 517**
**త్రిస్థానేఽపి హి మాధుర్యం యస్య నిత్యం విధీయతే,**
**త్రిస్థానశోభీత్యేవం తు స హి తద్‌జ్ఞైః ప్రకీర్తితః. 518**

**తా.** శిరఃకంఠవక్షస్సు లను మూడు స్థానాలలో ఉద్భవించి, తార – మంద్ర – మధ్య స్థాయులతో సంబంధించి ప్రకాశించేది **త్రిస్థానశోభి**.

**మూ. కపిలోఽనవస్థితశ్చైవ తథా సన్దష్ట ఏవ చ,**
**కాకీ చ తుమ్బకీ చైవ పఞ్చ దోషా భవన్తి హి. 519**

**తా.** గాయకునిలో (స్వరగతాలైన) ఐదు దోషా లుంటాయి – కపిలము, అనవస్థితము, కాకి, తుంబి, సందష్టకం.

**మూ. వైస్వర్యం చ భవేద్యత్ర తథా స్యాత్ ఘర్ఘరాయితమ్,**
**కపిలః స తు విజ్ఞేయః శ్లేష్మకణ్ఠస్థథైవ చ. 520**

**తా.** (స్వర) స్వభావం చెడి వికృతంగా ఉన్నది, గరగరలాడేది, శ్లేష్మం కప్పిన కంఠంనుండి వెలవడేది అయిన స్వరం **కపిలం**.

**మూ. ఊనతాధికతా వాపి స్వరాణాం యత్ర దృశ్యతే,**
**కృశత్వదోషతశ్చైవ జ్ఞేయః స త్వనవస్థితః. 521**

**తా.** హటాత్తుగా తగ్గిపోయేదీ, హెచ్చుయేదీ అయిన స్వరం **అనవస్థితం**. కీచుకంఠం లేదా దుర్బలమైన స్వరం కూడ **అనవస్థితం.**

**మూ. దన్తప్రయోగాత్ సందష్టస్త్వాచార్యైః పరికీర్తితః,**
**యో న నిస్తరతి స్థానే స్వరముచ్చారణాగతమ్. 522**

**తథా రూక్షస్వరశ్చైవ స కాకీత్యభిసంజ్ఞితః,**
**నాసాగతస్వరో యస్తు తుమ్బకీ సోఽభిధీయతే. 523**

**తా.** దంతాలు బిగించి గానం చేసినది **సందష్టకం**. వర్ణోచ్చారణస్థానాలను స్పృశించ కుండా వెలువడి వినడానికి కఠోరంగా ఉండేది **కాకి**. ముక్కుతో శబ్దాలు ఉచ్చరిస్తూ గానం చేస్తే ఆ స్వరం **తుంబకి**.

**మూ. ఏతే గుణాశ్చ దోషాశ్చ తత్త్వతః కథితా మయా,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి హ్యవనద్ధవిధిం పునః. 524**

**తా.** ఈ విధంగా ఉండే గుణ – దోషాల తత్త్వం (స్వరూపం) నేను మీకు చెప్పాను. ఇటుపైన అవనద్ధవిధిని గూర్చి చెపుతాను.

**మూ. గాన్ధర్వమేతత్ కథితం మయా వః,**
**పూర్వం యదుక్తం ప్రపితామహేన,**
**కుర్యాద్య ఏవం తు నరః ప్రయోగే**
**సమ్మానమగ్ర్యం లభతే స లోకే. 525 ఇతి**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే గుణదోషవిచారో నామ త్రయస్త్రింశః (అధ్యాయః).**

**తా.** పూర్వం బ్రహ్మదేవుడు ఉపదేశించిన గాంధర్వశాస్త్రం నేను మీ కిపుడు చెప్పాను. దీనిని ఈ విధానాన్ని అనుసరించి ప్రయోగించిన నరుడు లోకంలో అత్యుత్తమమైన సంమానం పొందుతాడు.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన 'బాలానందిని' అను నాట్యశాస్త్రాంధ్ర వ్యాఖ్యానంలో 'గుణదోషవిచారః' అను ముప్పైమూడవ అధ్యాయం సమాప్తం.**

**శ్రీః శ్రీః శ్రీః**

వెనుక సూచించి నట్లు ఈ అధ్యాయానికి అ.భా. వ్యాఖ్యానుసారం **'గుణదోష విచారః'** అని పేరు. ఇది 33వ అధ్యాయం. శ్లోకాలు 23. ఇతరపుస్తకాలలో ఇది 32వ అధ్యాయమైన ధ్రువాధ్యాయంలో అంతర్గతం. దీని శ్లోకసంఖ్య ఈ (ఇతర) పుస్తకాలను అనుసరించి ఇవ్వబడినది.

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ చతుస్త్రింశోఽధ్యాయః

## పుష్కరవాదాధ్యాయము

'మార్జనానుగతమార్గసున్దరం పుష్కరత్రితయమాశ్రితం సదా,
చిత్రదానపదక్లప్తవిగ్రహం శ్రీసదాశివతనుం శివం నుమః."

– శ్రీమదభినవగుప్తాచార్యాః

**మూ. తతాతోద్యవిధిస్త్వేష మయా ప్రోక్తః సమాసతః,**
**అవనద్ధవిభాగేన లక్షణం కర్మ చైవ హి. 1**

**ఆతోద్యానాం ప్రవక్ష్యామి విధిం వాదనమేవ చ,**
**మృదఙ్గపణవానాం చ దర్దురస్య తథైవ హి. 2**

**తా.** నేను, తతవాద్యవిధానం సంక్షిప్తంగా చెప్పాను. ఇప్పుడు అవనద్ధవాద్యాల భేదాలను, లక్షణమును, వాటి పనులను, మృదఙ్గ – పణవ – దర్దురాల వాదనవిధానాన్ని చెపుతాను. (**'దర్దర' 'దద్దుర'** అని రెండు పేర్లు నా.శా. ప్రతులలో కనబడుతున్నాయి).

**మూ. గాన్ధర్వం చైవ వాద్యం చ స్వాతినా నారదేన చ,**
**విస్తారగుణసంపన్నముక్తం లక్షణకర్మతః. 3**

**తా.** గాంధర్వము, వాద్యము, వాటి విస్తృతగుణాలు, లక్షణాలు, వాటి కార్యమూ – ఈ విషయా లన్నీ స్వాతి – నారదులు తమ గ్రంథాలలో చెప్పి ఉన్నారు.

**మూ. అనువృత్త్యా తథా స్వాతేరాతోద్యానాం సమాసతః,**
**పౌష్కరాణాం ప్రవక్ష్యామి నిర్వృత్తిం సంభవం తథా. 4**

**తా.** నే నిపుడు స్వాతిముని గ్రంథాన్ని అనుసరించి పుష్కరములు (Drums) అను ఆతోద్యాల ఉత్పత్తినీ, వికాసాన్నీ గూర్చి చెపుతాను.

**మూ. అనాధ్యాయే కదాచిత్తు స్వాతిర్వై దుర్దినే మునిః,**
**జలాశయం జగామాథ సలిలానయనం ప్రతి. 5**

**తా.** ఒక నాడు మేఘాలు కప్పి రోజంతా సూర్యదర్శనం లేని దుర్దినమునందు, అనధ్యాయదివసమున స్వాతిమహాముని జలం తీసికొనిరావడానికై జలాశయానికి వెళ్లాడు.

**వి.** పూర్తిగా సూర్యుడు కనబడని దినం దుర్దిన మనీ, ఆ రోజు అనధ్యాయ మనీ (వేదాధ్యయనాదికం చేయకూడదనీ) శాస్త్రం.

**మూ. తస్మిన్ సరోనిషణ్ణే తు ప్రవృత్తః పాకశాసనః,**
**ధారాభిర్మహతీభిశ్చ కర్తుమేకార్ణవం జగత్. 6**

**తా.** ఆ ముని సరోవరంలో దిగిన సమయంలో వర్షాధిదేవత యైన దేవేంద్రుడు జగత్తు నంతా ఏకార్ణవం చేస్తూ జలధారావర్షం కురిపించాడు.

**మూ. పతన్తీభిశ్చ ధారాభిర్వాయువేగాజ్జలాశయే,**
**పుష్కరిణ్యాం పటుః శబ్దః పత్రాణామభవత్తదా. 7**

**తా.** అప్పుడు వాయువేగవశంచేత ఆ పద్మసరస్సులోని తామరాకులమీద జలధారలు పడుతూండగా మధురమైన శబ్దం ఉత్పన్నమయింది.

**మూ. తేషాం ధారోద్భవం శబ్దం నిశమ్య సహసా మునిః,**
**ఆశ్చర్యమితి మన్వానశ్చావధారితవాంశ్చ తమ్. 8**

**తా.** జలధారలు పడడంచేత పుట్టిన ఆ శబ్దాన్ని విన్న వెంటనే స్వాతిముని. 'ఏమి ఆశ్చర్యము!' అని మనస్సులో అనుకొంటూ ఆ శబ్దాన్ని పరీక్షగా విన్నాడు.

**మూ. జ్యేష్ఠమధ్యకనిష్ఠం తు పత్రాణామవధార్య చ,**
**గమ్భీరమధురం హృద్యమాజగామాశ్రమం తతః. 9**

**తా.** పత్రాలనుండి వెలువడుతూన్న జ్యేష్ఠ - మధ్యమ - కనిష్ఠ విధాలైన, గంభీరమధురశబ్దాన్ని జాగర్తగా పరిశీలించి తెలిసికొని తన ఆశ్రమానికి వెళ్లిపోయాడు.

**మూ. గత్వా సృష్టం మృదఙ్గాంశ్చ పుష్కరానసృజత్తతః,**
**పణవం దుర్దురాంశ్చైవ సహితో విశ్వకర్మణా. 10**

**తా.** ఆశ్రమానికి తిరిగి వెళ్లి ఆ ముని విశ్వకర్మసాహాయ్యంతో మృదంగాలు, పుష్కరాలు, పణవం, దుర్దురాలు సృష్టించాడు (నిర్మించాడు).

**వి.** 'పుష్కరం' అనేది అవనద్ధవాద్యా లన్నిటికీ సాధారణ (common) నామధేయం. వాద్యాల పేర్లు స్వరూపాలు దేశ - కాల బేదాలను పట్టి మారిపోతున్నట్లు కనబడుతుంది. వీటి స్వరూపస్వభావాలను గూర్చి సంప్రదాయజ్ఞులే చెప్పవలసి ఉంటుంది.

**మూ. దేవానాం దున్దుభిం దృష్ట్వా చకార మురజం తతః,**
**ఆలిఙ్గ్యమూర్ధ్వకం చైవ తథైవాఙ్కికమేవ చ. 11**

**తా.** దేవతల దుందుభిని చూచి దాని ప్రకారం మురజాన్ని నిర్మించాడు. అట్లే - ఆలింగ్యాన్ని (ఆలింగనం చేసుకొంటున్నట్లు వక్షస్థలంమీద ఆన్చి మోగించే వాద్యాన్ని) ఊర్ధ్వకమును (నేలమీద నిటారుగా నిలబెట్టి మోగించే వాద్యాన్ని - రుంజవంటి దాన్ని) ఆంకికాన్ని (ఒడిలో ఉంచుకొని మోగించ దగిన వాద్యాన్ని) నిర్మించాడు.

**మూ. చర్మణా చావనద్ధాంస్తాన్ మృదఙ్గాన్ దర్దురాంస్తథా,**
**తన్త్రీభిః పణవం చైవమూహాపోహవిశారదః. 12**

**తా.** ఊహాపోహలలో నేర్పు గల ఆ స్వాతిముని చర్మతో బిగింపబడిన, తీగలతో చుట్టబడిన మృదంగాలను, దర్దురాలను, పణవమును నిర్మించెను.

**మూ. భూయశ్చాన్యాన్యపి తథా కాష్ఠాయసకృతాన్యథ,**
**ఝల్లరీపటహాదీని చర్మనద్ధాని తాని తు. 13**

**తా.** కర్రలతోను, ఇనుముతోను మరి కొన్ని ఝల్లరీ – పటహాదివాద్యాలను నిర్మించాడు. అవి చర్మంతో బిగింపబడతాయి.

**మూ. ఆతోద్యసమవాయే తు యాని వాద్యాని వాదకైః,**
**అఙ్గప్రత్యఙ్గయోగేన గదతో మే నిబోధత. 14**

**తా.** వాద్యగణం కలిసి నప్పుడు (వాటి సామూహికవాదనంలో) ఏ వాద్యాలు ఉపయోగించాలో, వాటి కలయికవల్ల ఏ అంగ – ప్రత్యంగాలు ఏర్పడతాయో చెపుతాను; వినండి.

**మూ. విపఞ్చీ చైవ చిత్రా చ దారవీష్వఙ్గసంజ్ఞితే,**
**కచ్ఛపీఘోషకాదీని ప్రత్యఙ్గాని తథైవ చ. 15**

**తా.** దారవీవీణలలో (తతవాద్యాలలో) విపంచీ – చిత్రావీణలు అంగములు, కచ్ఛపీఘోషకాదివీణలు ప్రత్యంగములు.

**మూ. మృదఙ్గో దర్దురశ్చైవ పణవేష్వఙ్గసంజ్ఞితే,**
**ఝల్లరీపటహాదీని ప్రత్యఙ్గాని తథైవ చ. 16**

**తా.** అదే విధంగా ఆనద్ధవాద్యాలలో – మృదంగ – దర్దుర – పణవాలు అంగాలు; ఝల్లరిపటహాదులు ప్రత్యంగాలు.

**మూ. అఙ్గలక్షణసంయుక్తో విజ్ఞేయో వంశ ఏవ హి,**
**శఙ్ఖస్తు డక్కినీ చైవ ప్రత్యఙ్గే పరికీర్తితే. 17**

**తా.** సుషిరవాద్యాలలో లక్షణానుసారం వంశి ఉత్కృష్ట మైన అంగము. శంఖము డక్కినీ కూడ ప్రత్యంగాలు.

**మూ. నాస్తి కిఞ్చిదనాయోజ్యమాతోద్యం దశరూపకే,**
**రసభావప్రయోగం హి జ్ఞాత్వా యోజ్యం విధానతః. 18**

**తా.** దశరూపకాల ప్రయోగంలో ఉపయోగించ తగని ఆతోద్యం అంటూ ఏదీ

లేదు. అయితే – రస – భావాల ప్రయోగాల్ని బాగా గుర్తించి తదనుగుణంగా, శాస్త్రాను సారం తగిన ఆతోద్యాలు ఉపయోగించాలి.

**మూ. ఉత్సవే చైవ యానే చ నృపాణాం మఙ్గలేషు చ,**
**శుభకల్యాణయోగే చ వివాహకరణే తథా. 19**

**పుత్రాదికే సముత్పన్నే సంగ్రామే యోధసంకులే,**
**ఈదృశేషు హి కార్యేషు సర్వాతోద్యాని వాదయేత్. 20**

**తా.** ఉత్సవంలోను, రాజుల యాత్రలలోను, మంగలసమయాలలోను, శుభ – కల్యాణసమయాలలోను, వివాహసమయంలోను, పుత్రోత్పత్త్యాద్యుత్సవాలలోను, యోధులతో సంకులంగా ఉన్న యుద్ధంలోను – ఇలాంటి కార్యాలలో అన్ని ఆతోద్యాలు మోగించవచ్చును.

**మూ. స్వభావగృహవార్తాయామల్పభాణ్డం ప్రయోజయేత్,**
**ఉత్థానకార్యబన్ధేషు సర్వాతోద్యాని వాదయేత్. 21**

**తా.** సాధారణంగా అప్పు డప్పుడు గృహాలలో జరుపుకొనే చిన్ని చిన్ని ఉత్సవాలలో అల్పవాద్యాల ప్రయోగం చెయ్యాలి. ఉత్థానము నందు. (ఏదో పెద్ద కార్యం సాధించడం కోసం ఉద్యమం), రూపకప్రయోగాదులలోను అన్ని విధాల వాద్యాల ప్రయోగము చేయవచ్చును.

**మూ. అఙ్గానాం తు సమత్వార్థం ఛిద్రప్రచ్ఛాదనే తథా,**
**విశ్రామహేతోః శోభార్థం భాణ్డవాద్యం ప్రయోజయేత్. 22**

**తా.** ప్రయోగంలోని వివిధాంగాల సమన్వయంకోసము, లోపాలు కప్పడం కోసమూ, అలసట చెందినవాళ్లు విశ్రాంతి తీసికొనే సమయంలోను, శోభకొరకు భాండవాద్యం ఉపయోగించాలి.

**మూ. అథావనద్ధం వక్ష్యామి విధిస్వరసముత్థితమ్,**
**నానాకరణసంయుక్తం నానాజాతివిభూషితమ్. 23**

**తా.** ఇపుడు అవనద్ధవాద్యాలకు సంబంధించిన విధానమును, స్వరములను, కరణజాతులను గూర్చి చెపుతాను.

**మూ. యావన్తి చర్మనద్ధాని హ్యాతోద్యాని ద్విజోత్తమాః,**
**తాని త్రిపుష్కరాదీని హ్యవనద్ధమితి స్మృతమ్. 24**

**తా.** చర్మంతో కట్టి బిగించిన త్రిపుష్కరం మొదలైన ఆతోద్యా లన్నీ అవనద్ధాలు అని చెప్పబడింది.

**మూ. ఏతేషాం తు పునర్భేదాః శతసంఖ్యాః ప్రకీర్తితాః,**
**కింతు త్రిపుష్కరస్యాస్య లక్షణం ప్రోచ్యతే మయా. 25**

**తా.** ఈ అవనద్ధవాద్యాలలో వందలకొలది భేదా లుండవచ్చును. అయితే నేను త్రిపుష్కరావనద్ధవాద్యలక్షణాలు మాత్రమే చెపుతున్నాను.

**మూ. శేషాణాం కర్మబాహుల్యం యస్మాదస్మిన్న దృశ్యతే,**
**న స్వరా న ప్రహారాశ్చ నాక్షరాణి న మార్జనా. 26**

**తా.** ఎందువల్ల ననగా మిగిలినవాటికి దీనిలో (నాట్యప్రయోగంలో) ఎక్కువగా పని ఉండదు. అలాగే వాటిలో స్వరం కాని, ప్రహారవ్యవస్థ గాని, అక్షరాలు గాని, మార్జన గాని ఉండవు.

**మూ. భేరీపటహఝఙ్ఝాభిస్తథా దున్దుభిడిణ్డిమైః,**
**శైథిల్యాదాయతత్వాచ్చ స్వరే గామ్భీర్యమిష్యతే. 27**

**తా.** భేరీ – పటహ – ఝంఝా – దుందుభి – డిండిమాలు ఆకారంలో పెద్దవై, శిథిలంగా (డొల్లగా) ఉండడంచేత స్వరగాంభీర్యం మనం వాటినుండి అపేక్షిస్తాం.

**మూ. ప్రాయశస్తాని కార్యాణి కాలం కార్యం సమీక్ష్య తు,**
**కిం తు త్రిపుష్కరస్యాస్య శ్రూయతాం యో విధిః స్మృతః. 28**

**తా.** సాధారణంగా జరపవలసిన కార్యాలను, కాలాన్ని సమీక్షించి ఆ భేరీపటహాదులను ఉపయోగించాలి. (అందుచేత ప్రధానంగా తెలిసికొనవలసిన) ఈ పుష్కర వాద్యాలకు సంబంధించిన విధివిధానాలు మాత్రమే చెపుతాను; వినండి.

**మూ. వాయ్వాత్మకో భవేచ్ఛబ్దః స చాపి ద్వివిధో మతః,**
**స్వరవాంశ్చైవ విజ్ఞేయస్తథా చైవాభిధానవాన్. 29**

**తా.** శబ్దం వాయుస్వరూపం. అది రెండు విధాలు – ఒకటి, కేవలం స్వరాల రూపంలో (స్వరవాన్) ఉండేది; రెండు, అర్థవంతాలైన అక్షరాల రూపంలో (అభిధానవాన్) ఉండేది.

**మూ. తత్రాభిధానవాన్నామ నానాభాషాసమాశ్రయః,**
**స్వరవాంశ్చైవ విజ్ఞేయో నానావాద్యసమాశ్రయః. 30**

**తా.** 'అభిధానవత్' అయిన శబ్దం వివిధభాషల రూపంలో ఉంటుంది. 'స్వరవత్' శబ్దం వివిధవాద్యాలతో సంబంధం గలది.

**మూ. శారీర్యామథ వీణాయాం స్వరాః సప్త ప్రకీర్తితాః,**
**తేభ్యో వినిఃసృతాశ్చైవమాతోద్యేషు ద్విజోత్తమాః. 31**

**తా.** మానవశరీరం అనే వీణలో సప్తస్వరాలు ఆవిర్భవించాయి. అవే సంగీత వాద్యాలలో ప్రవేశింపచేయబడతాయి.

**మూ. పూర్వం శరీరాదుద్భూతాస్తతో గచ్ఛన్తి దారవీమ్,**
**తతః పుష్కరజం చైవమనుయాన్తి ఘనం పునః. 32**

**తా.** ముందుగా శారీరవీణలో పుట్టిన స్వరాలు, తరువాత దారవవీణలోనికి, తరువాత పుష్కరవాద్యాలలోనికి, తరువాత ఘనవాద్యాలలోనికి సంక్రమిస్తాయి.

**మూ. తేషాం బాష్కరణైర్జ్ఞేయాః ప్రహారా వచనాశ్రయాః,**
**యుద్ధాదిభిః సదా యోజ్యా వీణావాద్యేషు యోక్తృభిః. 33**

**తా.** ఆ వాద్యాలపై బాష్కరణాలచేత చేయబడిన ప్రహారాలు శబ్దాలకు (పదాదులకు) ఆశ్రయాలు. వాటిని నాట్యప్రయోక్తలు యుద్ధాదిసమయాలలో వీణల పైన ఇతరవాద్యాల మీద ప్రయోగించాలి.

**మూ. శారీర్యామథ వీణాయాం ఝుణ్టుం జగతికాది (కాదితి) చ,**
**భవేద్బాష్కరణం తత్ర నానాకరణసంయుతమ్. 34**

**తా.** శారీరవీణమీద 'ఝుణ్టుమ్' 'జగతి' 'కత' వంటి బాష్కరణాలను (Mnemonic Patterns) వివిధకరణాలను ప్రయోగించాలి.

**మూ. యం యం గాతా స్వరం గచ్ఛేత్ తమాతోద్యైః ప్రయోజయేత్,**
**యతిపాణిసమాయుక్తం గురులఘ్వక్షరాన్వితమ్. 35**

**తా.** గాయకుడు ఏ ఏ స్వరానికి వెడుతూంటాడో దానిని, యతి – పాణి – గురు – లఘ్వక్షరాలతో సహా ఆతోద్యాలమీద ప్రయోగించాలి.

**మూ. పౌష్కరస్య తు వాద్యస్య మృదఙ్గపణవాశ్రయమ్,**
**విధానం తు ప్రవక్ష్యామి దర్దురస్య తథైవ హి. 36**

**తా.** పౌష్కరవాద్యాలలో – మృదంగ – పణవ – దర్దురాలకు సంబంధించిన విధానం చెపుతాను.

**మూ. షోడశాక్షరసంపన్నం చతుర్మార్గం తథైవ చ,**
**విలేపనం షట్కరణం త్రియతి త్రిలయం తథా. 37**
**త్రిగతం త్రిప్రచారం చ త్రియోగం చ త్రిపాణికమ్,**
**దశార్ధపాణిప్రహతం త్రిప్రహారం త్రిమార్జనమ్. 38**
**వింశత్యలంకారయుతం తథాష్టాదశజాతికమ్,**
**ఏభిః ప్రకారైః సంపన్నం వాద్యం పుష్కరజం భవేత్. 39**

**తా.** పుష్కరవాద్యాలలో – పదహారు అక్షరాల ధ్వనులు, నాలుగు మార్గాలు, విలేపనము, ఆరు కరణాలు, మూడు యతులు, మూడు లయలు, మూడు గతాలు లేదా గతులు, మూడు ప్రచారాలు, మూడు యోగాలు, మూడు పాణులు, ఐదు పాణి ప్రహతాలు, మూడు ప్రహారాలు, మూడు మార్జనలు, పద్దెనిమిది జాతులు, ఇరవై అలంకారాలు – అను ప్రకారా లుంటాయి. ఈ ప్రకారాలతో (స్వరూపాలతో) పుష్కర వాద్యం సంపన్నం అవుతుంది.

**మూ. తత్ర షోడశాక్షరమితి యదుక్తం తదనువ్యాఖ్యాస్యామః –**
**కఖగఘటఠడఢతథదధమరలహ ఇతి షోడశాక్షరాణి స్యుః.**
**పుష్కరవాద్యే నియతం బాష్కరణే సంవిధేయాని. 40**

**తా.** ఇపుడు – పూర్వం చెప్పిన పదహారు అక్షరాల ధ్వనులను విశదీకరిస్తాను –

క – ఖ – గ – ఘ – ట – ఠ – డ – ఢ – త – థ – ద – ధ – మ – ర – ల – హ.

పుష్కరవాద్యబాష్కరణంలో వీటి ప్రయోగం, సర్వదా చేయబడుతుంది.

**మూ. తత్ర చతుర్మార్గం నామ – ఆలిప్తాడ్డితగోముఖవితస్తాశ్చత్వారో మార్గాః.**

**తా.** చతుర్మార్గం అనగా – ఆలిప్త – అడ్డిత – గోముఖ – వితస్తా అనేవి.

**మూ. విలేపనం నామ వామోర్ధ్వకప్రలేపాత్**

**తా.** వామక – ఊర్ధ్వకమృదంగాల పైన పిండి మొదలైనవాటితో లేపనం చేయడం **విలేపనం.**

**మూ. షట్కరణం నామ – రూపం, కృతిప్రతికృతం, ప్రతిభేదో, రూపశేషమ్, ఓఘః, ప్రతిశుష్కేతి.**

**తా.** రూప – కృతప్రతికృత – ప్రతిభేద – రూపశేష – ఓఘ – ప్రతిశుష్కాలు – **షట్కరణాలు.**

**మూ. త్రియతిర్నామ – సమా, స్రోతోగతా, గోపుచ్ఛా చేత్యన్వయాత్.**

**తా.** సమా – స్రోతోగతా గోపుచ్ఛా అనేవి త్రియతులు.

**మూ. త్రిలయం నామ ద్రుతమధ్యవిలమ్బితయోగాత్.**

**తా.** ద్రుత – మధ్య – విలంబితాలు **త్రిలయలు.**

**మూ. త్రిగతమితి – తత్త్వమనుగతమోఘశ్చేతి.**

**తా.** తత్త్వం, అనుగతం, ఓఘం అనేవి **త్రిగతం.**

**మూ. త్రిప్రచారం నామ – సమప్రచారః, విషమప్రచారః, సమవిషమప్రచారశ్చేతి.**

**తా.** సమప్రచార – విషమప్రచార –సమవిషమప్రచారాలు మూడు **ప్రచారాలు**.

**మూ. త్రిసంయోగం నామ – గురుసంయోగో, లఘుసంయోగో, గురులఘుసంయోగ శ్చేతి.**

**తా.** గురుసంయోగ – లఘుసంయోగ – గురులఘుసంయోగాలు **త్రిసంయోగం**.

**మూ. త్రిపాణికం నామ – సమపాణిరవరపాణిరుపరిపాణిశ్చేతి.**

**తా.** సమపాణి, అవరపాణి, ఉపరిపాణి అనేవి **త్రిపాణి**.

**మూ. పఞ్చపాణిప్రహతం నామ సమపాణిరర్ధపాణిః అర్ధార్ధపాణిః పార్శ్వపాణిః ప్రదేశినీ చేతి.**

**తా.** సమపాణి, అర్ధపాణి, అర్ధార్ధపాణి, పార్శ్వపాణి, ప్రదేశినీ అనేవి పంచపాణి ప్రహతాలు.

**మూ. త్రిప్రహారం నామ – నిగృహీతోఽర్ధనిగృహీతో ముక్తశ్చేతి.**

**తా.** నిగృహీత – అర్ధనిగృహీత – ముక్తా లనేవి **త్రిప్రహారాలు**.

**మూ. త్రిమార్జనం నామ – మాయూర్యర్ధమాయూరీకార్మారవీ చేతి.**

**తా.** మయూరీ – అర్ధమాయూరీ – కార్మారవీ – ఇది **త్రిమార్జనం**.

**మూ. అష్టాదశజాతికం నామ – శుద్ధా, ఏకరూపా, దేశానురూపా, దేశాదపేతరూపా, పర్యాయః, విష్కమ్భః, పర్యస్తా, సంరమ్భః, పార్ష్ణిసమస్తా, దుష్కరకరణా, ఊర్ధ్వగోష్ఠికా, ఉచ్ఛితికా, ఏవంవాద్యా, మృదఙ్గపణవా, అవకీర్ణా, అర్ధావకీర్ణా, సమలవా, విధూతం చేతి.**

**తా.** పైన చెప్పిన 'శుద్ధా' మొదలైన విధూతంవరకు ఉన్నవి **పద్దెనిమిది జాతులు**.

**మూ. వింశతిప్రకారం నామ – చిత్రః, సమః విభక్తః, ఛిన్నః, ఛిన్నవిద్ధః, విద్ధః, అనువిద్ధః స్వరూపానుగతః, అనుసృతః, విచ్యుతః, దుర్గః, అవకీర్ణః, అర్ధావకీర్ణః, ఏకరూపః, పరిక్షిప్తః, సత్త్వీకృతః, సమలేఖః, చిత్రలేఖః, సర్వసమవాయః, దృఢః ఇతి.**

**తా.** పైన చెప్పిన 'చిత్రః' మొదలు 'దృఢః' వరకు ఉన్నవి **ఇరవైప్రకారాలు**.

**మూ. ఏతావత్ సూత్రమ్. తత్ర షోడశాక్షరం నామ –**

**అభివ్యఞ్జితాని పూర్వం యాన్యేతాని షోడశాద్యాని**
**తాన్యక్షరాణి జానీతపుష్కరేషు యథాక్రమమ్,**
**పణవే దర్దురే చైవ మృదఙ్గేషు తథైవ చ. 41**

**తా.** ఇంతవరకు సూత్రం చెప్ప బడినది. ఇంతకు ముందు **'షోడశాక్షరం నామ'** అని ప్రారంభించి చెప్పిన సూత్రాలలో ఏ పదహారు అక్షరాలు అభివ్యంజితము లైనవో వాటిని పుష్కరాలలో – పణవంమీద, దర్దురంమీద, మృదంగంమీద యథాక్రమంగా ఎలా కూర్చాలో చెపుతున్నాను వినండి.

**మూ. కటరతఠదఘాస్తు దక్షిణముఖేఽత్ర గహధాశ్చ వామకే నియతాః,**
**థకారశ్చైవోర్ధ్వకే కరణధవలాశ్చ స్యురాలిఙ్గ్యే. 42**

**తా.** ఆనద్ధవాద్యాలలోని వామకం అనే మృదంగం పైన కుడిపక్క చేసే ప్రహారాల ద్వారా – క, ట, ర, త, ఠ, ద, ఘ – లను, ఎడమ పక్క చేసే ప్రహారాల ద్వారా గ, హ, ధ – లను మోగించాలి. ఊర్ధ్వక మృదంగం మీద 'థ', ను, ఆలింగ్యకమృదంగం మీద క, ర, ణ, ధ, వ, ల – లను మోగించాలి.

**మూ. ఏతేషామక్షరాణాం చ స్వరసంయోగం వ్యఞ్జనసంయోగం చ వ్యాఖ్యాస్యామః –**
**అత్ర – అఆఇఈఉఊఏఐఓఔఅంఅః ఇతి స్వరాః వ్యఞ్జనైః సంయోగం గచ్ఛన్తి.**

**తా.** ఈ అక్షరాలకు సంబంధించిన స్వరసంయోగాన్ని, వ్యంజనసంయోగాన్ని విశదీకరిస్తున్నాం. అ, ఆ, ఇ, ఈ, ఉ, ఊ, ఏ, ఐ, ఓ, ఔ, అం, అః – అను స్వరాలు (అచ్చులు) వ్యంజనాలతో (హల్లులతో) కలుస్తాయి.

**మూ. అకారేకారోకారైకారౌకారాంకారః ఇతి కకారే. యథా కకికుకేకోకమితి.**

**తా.** వీటిలో అ, ఇ, ఉ, ఏ, ఓ, అం లు 'క'తో కలవగా క, కి, కు, కే, కో, కం – లు అవుతాయి.

**మూ. ఇకారోకారౌకారాః ఖకారే. యథా – ఖి, ఖు, ఖో ఇతి.**

**తా.** 'ఖ్' కు, ఇ – ఉ – ఓ లు చేర్చగా ఖి, ఖు, ఖో – లు ఏర్పడతాయి.

**మూ. ఉకారైకారౌకారాః గకారే. యథా – గుగేగో ఇతి.**

**తా.** 'గ్'కు ఉ, ఏ, ఓ –లు చేర్చగా, గు, గే, గో – లు ఏర్పడతాయి.

**మూ. అకారైకారౌకారాః ఘకారే. యథా – ఘఘే, ఘో ఇతి.**

**తా.** ఘకారంతో అ, ఏ, ఓ లు చేర్చగా ఘ – ఘే, ఘోలు ఏర్పడతాయి.

**మూ. అకరైకారౌకారాంకారాః టకారే. యథా – ట, టి, టో, టమితి.**

**అకరైకారౌకాకారాః ఠ కారే యథా – ఠఠితో ఠౌ ఠం ఇతి.**

**తా.** టకారానికి అ – ఇ – ఓ – అం లు కలపగా టి – టి – టో – టం అని ఏర్పడతాయి.

రకారానికి అ – ఇ – ఓ అం లు చేర్చగా ర – రి – రో – రం లు ఏర్పడతాయి.

**మూ. అకారేకారౌ దకారే – యథా – ద, డో – ఇతి.**
**అకారేకారైకారాః ణకారే – యథా – ణ, ణి, ణే ఇతి.**
**అకారాకారేకారైకారాస్తకారథకారయోః. యథా – తతాతితే, థథాథిథే ఇతి.**

**తా.** డకారానికి అ, ఓ, లు చేర్చగా డ – డో లు ఏర్పడతాయి.

ణకారానికి అ, ఇ, ఏ –లు చేర్చగా ణ – ణి – ణే లు ఏర్పడతాయి.

తకార – థకారాలకు అ – ఆ – ఇ – ఏలు చేర్చగా త – తా – తి – తే – అనీ, థ, థా, థి, థే అనీ ఏర్పడతాయి.

**మూ. అకారోకారైకారౌకారాః దకారే యథా – దదుదేదో ఇతి.**
**అకారేకారౌకారాంకారాః ధకారే. యథా – ధధిధో ధం ఇతి.**

**తా.** దకారానికి అ – ఉ – ఏ – ఓలు చేర్చగా – ద – దు – దే – దోలు ఏర్పడతాయి.

ధకారానికి అ – ఇ – ఓ – అం లు చేర్చగా ధ – ధి – ధో – ధం లు ఏర్పడతాయి.

**మూ. అకారేకారైకారా రేఫే – యథా – రరారిరే ఇతి.**
**అకారాకారేకారైకారా లకారే. యథా – లలాలిలే – ఇతి. హకారమకారౌ శుద్ధౌ.**

**తా.** రకారానికి (రేఫకు) అఇఇఏలు చేర్చగా – రరారిరే – లు ఏర్పడతాయి.

లకారానికి అఆఇఏ లు చేర్చగా లలాలిలేలు ఏర్పడతాయి.

హకారమకారాలు అచ్చు లేవీ కలపకుండా శుద్ధంగా ఉంటాయి.

**మూ. తత్ర కకార – ఘకార – తకార – థకార – ధకారాణాం రేఫోఽనుబన్ధః. యథా – ధ్రుంధ్రత్రే. థ్రంధ్రం. కకారస్య లకారోఽప్యనుబన్ధః. యథా – క్లక్లేక్లం ఇతి. ఏవమేతే సంయోగైః ద్విహస్త సంయక్తాక్షరాణి భవన్తి. తత్ర ఆఙ్కికే మృదఙ్గే ద్విపుష్కరే సమహస్త నిపాతనాద్ ధకారః.**

**తా.** క ఘ త థ ద ధ ల కు అనుబంధంగా రేఫ (రకారం) చేర్చబడుతుంది. ఎట్లనగా – ధ్రుం, ధ్ర, త్రే, త్రం, థ్రం, ధ్రం.

కకారానికి లకారం అనుబంధంగా చేర్చబడుతుంది. ఎట్లనగా – క్ల, క్లే, క్లం, ఈ విధంగా వీటిని అన్నింటినీ రెండు చేతులతో వాదనం చేసే టప్పుడు వాద్యంమీద ఆవిష్కరించాలి. రెండు చేతులతో వాదనం ద్వారా అంకిక మృదంగం పైనా, రెండు పుష్కరాల వాద్యంపైనా 'ధం' ఆవిష్కరింపబడుతుంటుంది.

**మూ. తత్ర అఙ్గులిప్రచలనాత్ కుకారః. తత్రైవావష్టమ్భాత్ ధకారః. తత్రైవ అర్ధనిగృహీతః ధకారః. తత్రైవ దక్షిణముఖే పార్‌ష్ణిపీడితః క్లకారః. తత్రైవ అఙ్గులికుఞ్చనాత్ క్ష (ఖ) కారః. ఊర్ధ్వవామకయోః సమహస్తనిపాతాత్ ధంకారః. ప్రదేశిన్యా వాలిఙ్గ్యే క్లేంకారః.**

**తా.** వేలు మృదంగంపైన కదల్చి 'కు' కారము, అక్కడనే వేలు ఆపివేయడంచేత 'ధ' (య) పలికించాలి. దీనిని సగంలో ఆపివేస్తే 'థ' పలుకుతుంది. అరచేతి మొదటి భాగంలో కొడితే 'క్ల' పలుకుతుంది. వేళ్లు ముణిచి 'క్ష' లేదా 'ఖ' పలికించాలి. ఊర్ధ్వక – వామకాలను రెండింటినీ ఒకే సమయంలో రెండు చేతులతో వాయించి 'ధం' పలికించాలి. ఆలింగ్యంమీద ప్రదేశినితో 'క్లేం' పలికించాలి.

**మూ. కేచిదేకవక్త్రజం కేచిత్త్రివక్త్రజం కేచిద్ద్వివక్త్రజమితి. యథా రేఫః సర్వవక్త్రేషు. దకార దకారౌ ఆలిఙ్గ్యవామకే; ఆలిఙ్గ్యదక్షిణే మకారః; వామోర్ధ్వకే గకారః. క్వచిదాలిఙ్గ్యేఽపి లాఘవార్థం ధకారః కర్తవ్యః. ఏవం తత్ర ప్రతిషేధో న కార్యః. ఇతి ఉక్తః స్వరవఙ్జన సంయోగః.**

**తా.** వీటిలో కొన్ని ధ్వనులను వాద్యం ఒక ముఖం (ప్రక్క) నుంచి, కొన్నింటిని మూడు ముఖాలనుంచి (త్రిముఖవాద్యమైతే) కొన్నింటిని రెండు ముఖాలనుంచి, పలికించ వచ్చును. ఉదాహరణకి – 'ర' ఏ వాద్యం మీదనైనా ఒక ముఖంమీద, ఆలింగ్యమృదంగం ఎడమముఖం మీద 'ద', 'ధ'లు, 'ప' వామక – ఊర్ధ్వముఖాలమీద, 'గ' – ఒక్కొక్కపుడు ఆలింగ్యం మీద, పలికించవచ్చును. ఇదే విధంగా లాఘవం నిమిత్తం 'ఘ'ను ఆలింగ్యంమీద పలికించ వచ్చును. ఈ నియమాలకు ప్రతిషేధం లేదు; అనగా ఈ నియమాలు తప్పక పాటించాలి. ఈ విధంగా స్వరవ్యంజనసంయోగాన్ని గూర్చి చెప్పాను.

**మూ. పఞ్చపాణిరితి యదుక్తం – సమపాణిరర్ధపాణిరర్ధార్ధపాణిః పార్శ్వపాణిః ప్రదేశినీ చేతి. ఏతే పఞ్చ పాణిప్రహతా నిగృహీతార్ధనిగృహీతా ముక్తా యథాయోగం కార్యాః భవన్తి. తత్ర సమపాణిప్రహతః మకారః; స నిగృహీతః. గకారదకారధకారా అక్షరార్ధని గృహీతా అర్ధపాణిప్రహతాశ్చ. కకారఖకారటకారదకారాః పార్శ్వపాణిప్రహతాః నిగృహీతాశ్చ. తకారథకారహకారాః అర్ధార్ధపాణిప్రహతాః అర్ధనిగృహీతాశ్చ. మకారరకారణ కారహకారాః ద్విహస్తప్రహతా ఉక్తాః. ప్రదేశినీప్రహతో ముక్తః క్లంకారః. పార్శ్వపాణిర్ద్వి హస్తప్రహతా ముక్తా అపి ద్రాంధ్రం క్లోంకారాః. తత్ర చ క్లేంకారాః అర్ధపాణిప్రహతా నిగృహీతాశ్చ. పార్శ్వపాణిప్రహతో నిగృహీతశ్చ ధ్రంకారః. ఏవమేతేషు అక్షరేషు ప్రయోగవశేన కార్యాః ప్రహారాః.**

**తా.** సమపాణి, అర్ధపాణి, అర్ధార్ధపాణి, పార్శ్వపాణి, ప్రదేశినీ అని ఐదు పాణిప్రహతా లను చెప్పి ఉన్నాను. ఈ పాణి ప్రహతాలను, ఉపయోగాన్ని ఔచిత్యాన్నీ, దృష్టిలో ఉంచుకొని నిగృహీతం గాని, అర్ధనిగృహీతం గాని, ముక్తం గాని ఉంచాలి. ఉదాహరణకు – సమపాణి

ప్రహతంచేత పరికించిన మకారం నిగృహీతం చేయబడుతుంది. అర్ధపాణి ప్రహతంచేత పలికించిన గకారఘకారాలు అర్ధనిగృహీతాలు. పార్శ్వపాణిప్రహతంచేత పలికింపబడిన కఖటడలు నిగృహీతాలు. అర్ధపాణిప్రహతంచేత పలికించిన తథహలు అర్ధనిగృహీతాలు. ద్విహస్తప్రహతంచేత పలికించిన మఠరణలహలు ముక్తాలు. ప్రదేశినిచేత పలికించిన క్లం ముక్తం. ద్విహస్తప్రహతంచేత పలికించిన ద్రాం, ధ్రం, క్లేం – లు ముక్తాలు. వీటిలో 'క్లేం' అర్ధపాణిప్రహతంచేత పలికించినప్పుడు నిగృహీతం కూడ కావచ్చును. పార్శ్వపాణి ప్రహతంచేత పలికిచింని 'ధ్రం' నిగృహీతం. ఈ విధంగా అవసరాన్నిపట్టి అక్షరాలను వాటికి చెప్పిన ప్రహతాలచేత (ప్రహారాలచేత) వాద్యవాదనంలో పలికించాలి.

**మూ. షోడశైవ తు దృష్టాని వాద్యజాన్యక్షరాణి తు,**
**అనేనైవ తు యోగేన యోజ్యం బాష్కరణం బుధైః. 43**

**తా.** వాద్యాలమీద పలికించడానికి తగిన అక్షరాలు పదహారుమాత్రమే కనబడు తున్నాయి. అందుచేత బుధులు ఈ అక్షరాల ఈ విధ మైన మిశ్రణంచేత బాష్కరణం నిర్మించుకొంటూండాలి.

**మూ. చతుర్మార్గమితి యుదుక్తం తదనువ్యాఖ్యాస్యామః**
**అడ్డితాలిప్తమార్గౌ తు వితస్తో గోముఖస్తథా**
**మార్గాశ్చత్వార ఏవైతే ప్రహారకకరణాశ్రయాః. 44**

**తా.** 'చతుర్మార్గమ్' అని ఏది చెప్పామో దానిని వ్యాఖ్యానిస్తాం – అడ్డితము, ఆలిప్తము, వితస్త, గోముఖము అని ప్రహారకకరణాలకు సంబంధించిన మార్గాలు నాలుగు.

**మూ. తత్రాలిఙ్గ్యమృదఙ్గప్రహారయుక్తో౽డ్డితో మార్గః. వామోర్ధ్వకప్రహారయుక్తస్త్వాలిప్త మార్గః. ఊర్ధ్వాఙ్కికదక్షిణముఖో క్షిప్రహస్తప్రహతో వితస్తో మార్గః. ఆలిఙ్గ్యకరణబహులః సర్వపుష్కరహతః గోముఖమార్గ ఇతి.**

**తా.** ఆలింగ్యమృదంగప్రహారాలతో సంబంధించినది **అడ్డితమార్గం**. వామక – ఊర్ధ్వకప్రహారాలతో సంబంధించినది **ఆలిప్తమార్గం. వితస్తమార్గం** ఊర్ధ్వక – ఆంకికాల కుడి ముఖంమీద చేసే ప్రహారాలతో సంబంధించినది. **గోముఖమార్గం** అన్ని పుష్కర వాద్యాల ప్రహారాలతోను, విశేషించి ఆలింగ్యవాద్యాలతో సంబంధించి ఉంటుంది.

**మూ. తత్ర అడ్డితప్రహారజో యథా – ఘట్టం కత్థిత ఘట్టం ఘేటాం ఘట్టం గత్థిమం గత్థి ఘణ్టాం గత్థిత్థే – ఇత్యడ్డితో మార్గః.**

**తా. "ఘట్ట ... గత్థిత్థే"** – ఇది ఘట్టితమార్గప్రహారాలకు ఉదాహరణం.

**మూ. ఇదానీమాలిప్తమార్గః – దధ్నో మామాద్రో మాం ముదుర్ఘే గుదరనుటుం ఘేం ఘేస్త్రం ఘేన్ద్రామాజ్.**

**ఆలిప్తమార్గవాద్యం విజ్ఞేయం వాదకైరేవమ్.**

**తా.** ఆలిప్తమార్గప్రహారాలకి ఉదాహరణం – **"దధ్నో ... ఘేన్ద్రామాజ్"**.

**మూ. ఇదానీం వితస్తమార్గః – తకితాన్ తకితాన్ సేన్తాం కిన్తాం ఘిసం కేతాం ఇదు హుత కేతాం ఇతి వితస్తే స్యాత్.**

**తా.** వితస్తమార్గోదాహరణం – **"తకితాన్ ... కేతామ్"**.

**మూ. ఇదానీం గోముఖమార్గః – గుద్ధం క్లద్ధం మథికటా ఘంఘేన ఛిదుఖు ఖుణోగగ టత్థి పటం ఇతి గోముఖమార్గః. అఙ్గులిప్రచలనాద్ వర్తితో హకారో ముక్తశ్చ. స ఏవ స్వస్తికేనోర్ధ్వాఙ్కితయోరర్ధనిగృహీతః. తయోరేవ సమహస్తత్వదర్శనాత్.**

**తా. "గుద్ధం ... మటమ్"** ఇది గోముఖమార్గానికి ఉదాహరణం. హకారం వేళ్ల కదిలకవల్ల పుడుతుంది. అది ముక్తం. ఊర్ధ్వాంకితాలలో స్వస్తికంచేత ఉత్పన్నమైన హకారం అర్ధనిగృహీతం, ఎందువల్ల ననగా ఆ రెండింటిలోనే సమహస్తంచేత ప్రయోగం ఉంటుంది.

**మూ. అఙ్గులిప్రచలనాత్ హకారో ముక్త ఇతి. ధిత్థ తత్థ – కితా – ఖదేర్జ్ ఖదేర్జ్ గుఘుం టులేణ్ణ ఘత్తి ఘిత్థం ఘితాన్ హువఘే విధాతవ్యాః.**

**తా.** అంగులిచాలనంవల్ల హకారం ముక్తం గాన గోముఖమార్గంలో **"ధిత్థ ... హువఘే"** అని ప్రయోగించాలి.

**మూ. ఏవం వితస్తే మార్గే – గణే లమరవర్జితప్రహారాః స్యుః, ఊర్ధ్వమార్గేణ విశేషాః కార్యాస్తు గోముఖ్యా – ఖట్టమత్థి ఘట్ట ఘణ్టా ఘురఖేట్టం ఖత మాం వుదుణ కిత్తి కిత్తి కిటి మాం ఖు ఖు ణు ద్ధే ఘే ధోధో – విధాతవ్యా.**

**తా.** వితస్తమార్గంలో కూడ ప్రహారాలు ఇలాగే ఉంటాయి. అయితే – దీనిలో ల మ ర లుండవు. ఊర్ధ్వకంలో, గోముఖమార్గంలో – **'ఖటమత్థి ... ధోధో'** అని చెయ్యాలి.

**మూ. ఇదానీం గోముఖవాద్యం – ఠడణ ఘేణ్ట ణఖన్దు లంఘు ఖేజ్ ఘట మట్ట టాంణు ధ ఖు ఖు ణాం త్థి ఘటం ఘిటి మాం కక్కుటాంణు ధేజ్ కిటి మాజ్ ఘే ఘే కో కోమ – గోముఖ్యాం స్యాత్.**

**తా.** గోముఖీమార్గంలో – "ఠం డణ ... కోమ" అని ఉండాలి.

**మూ. యేత్వాలిప్తసముత్థా సర్వైర్మార్గైస్తు తే విధాతవ్యాః,**
**గ్రహణాక్షరసంఘాతైస్తు మృదఙ్గానాం గ్రహో భవతి. 45**

**తా.** ఆలిప్తప్రహారాల ప్రహారాలు అన్ని మార్గాలలోను జరగవచ్చును. మృదంగాల ఈ గ్రహం అక్షర సమూహాలచేత ఏర్పడుతుంది.

**మూ. ఏతేషాం తు ప్రవక్ష్యామి దర్శనాని యథాక్రమమ్,**
**చతుర్ణామపి మార్గాణామక్షరగ్రహణం యథా. 46**

**తా.** ఈ నాలుగు మార్గాలలో అక్షరగ్రహణం ఎలా చేయాలో అది ఉదాహరణ పూర్వకంగా విశదీకరిస్తాను.

**మూ. ఘృజ్ ఘృజ్ ఘట ఘేజ్ మత్థి మత్థి మటా మదాత్థ రిజ్ మన ఘేజ్ క్రజ్ కథి కటాజ్ – త్వడ్డితే.**

**తా.** అడ్డితంలో **"ఘృజ్ ... కటాజ్"** అని ఉంటుంది.

**మూ. ఝాఘ గేన్ద్రా తకి తాకు ఘృ ఘృజ్ ద్రో కిటి ఘేణ్టాజ్ గాన్ ఘి కిటి కేత్థా థ కుతా కితా కిరిదామ్ ఇతి సంయోగోఽపి వితస్తే తు.**

**తా.** "ఘా ... ఘ ... కిరిదామ్" అని కూడ వితస్తలో సంయోగం చేయవచ్చును.

**మూ. డో మాజ్ గుదు ఝేజ్ ఘో ఘణ్టాం ఘౌ ఘ ట దు ఇతి ఆలిప్తే సంయోగః కార్యోఽయం వాదనే తద్ జ్ఞైః.**

**తా.** ఆలిప్తమార్గంలో **"డో ... దు మా"** అని సంయోగం వాదనజ్ఞులు చెయ్యాలి.

**మూ. ఘే ఘేటాత్థి కటాం గుట్టా ఘుజ ఘేటా ఘణ్టాన్ ధి మధి త్థియం కే స టే ఘే గ ఘేణో ణో ణమ్ – ఇతి వైష గోముఖ్యే. ఇత్యుక్తా మార్గాః.**

**తా.** గోముఖమార్గంలో – **"ఘే ... ణమ్"** అని సంయోగం చెయ్యాలి. ఇంతవరకు మార్గాలను విశదీకరించాను.

**మూ. గోముఖ్యా ఉక్తో యో మార్గ ఏతేషాం పుష్కరాణాం చ,**
**త్రివిధః ప్రచారస్తత్ర సమో విషమః సమవిషమ ఇతి. 47**
**వామోర్ధ్వకయోర్వామసవ్యయోః అడ్డితమార్గేఽపి**
**కార్యః సమప్రచారః స్వాలిప్తే వాద్యకరణే తు. 48**

**తా.** గోముఖమార్గంలో – సమం, విషమం, సమ – విషమం అని మూడు విధాలైన పుష్కరప్రచారాలు చెప్పబడ్డాయి.

అడ్డితమార్గంలోను, ఆలిప్తమార్గంలోనూ కూడ, వామక – ఊర్ధ్వకాలను, వామక – సవ్యకాలను సమప్రచారంలో ఉంచాలి.

**మూ. వామోర్ధ్వకసవ్యానాం ప్రహతే వామః కరస్తు కర్తవ్యః,**
**సవ్యోర్ధ్వకసంయోగాత్ సవ్యో విషమప్రచారే తు. 49**

**తా.** వామక – ఊర్ధ్వక – సవ్యక ప్రహారంలో ఎడమచెయ్యి ఉపయోగించ బడుతుంది. సవ్యకఊర్ధ్వకప్రహారంలో విషమప్రచారం అవలంబించి కుడి చెయ్యి ఉపయోగించబడుతుంది.

**మూ. ఏవం స్వస్తికయోగాత్ ద్వాభ్యామపి యద్ భవేత్తు హస్తాభ్యామ్,**
**మార్గే వితస్తిసంజ్ఞే ప్రహతే విషమః ప్రచారః స్యాత్. 50**

**తా.** వితస్తమార్గంలో స్వస్తికీకృత (ఒకదానిపై ఒకటి అడ్డంగా ఉంచిన) రెండు హస్తాలతో ప్రహారం చేయబడుతుంది. విషమప్రచారంలో కూడ ఈ విధంగానే ప్రహార ప్రయోగం ఉంటుంది.

**మూ. స్వచ్ఛన్దతస్తు కరయోః ప్రహతం శేషేషు మార్గకరణేషు,**
**అడ్డితగోముఖయోగాత్ సమవిషమో హస్తసఞ్చారః. 51**

**తా.** ఇతరమార్గాలలో సౌకర్యాన్ని పట్టి హస్తప్రహారం స్వేచ్ఛ ప్రకారం చేయవచ్చును. అయితే అడ్డిత – గోముఖాల సంమిశ్రణం చేసినప్పుడు మాత్రం సమవిషమహస్తప్రచారం ఉపయోగించాలి.

**మూ. శృఙ్గారహాస్యసంయోగే వాద్యం యోజ్యం తథాడ్డితే మార్గే,**
**వీరాద్భుతరౌద్రాణాం వితస్తమార్గేణ వాద్యం స్యాత్. 52**

**తా.** శృంగారహాస్యాల సంయోగంలో వాద్యం అడ్డితమార్గంలో ఉండాలి. వీరాద్భుత రౌద్రాలలో వాద్యం వితస్తమార్గంలో ఉండాలి.

**మూ. కరుణరసే త్విహ వాద్యం యోజ్యం చాలిప్తకరణమార్గేణ,**
**బీభత్సభయానకయోస్తథైవ నిత్యం గోముఖ్యా. 53**

**తా.** కరుణరసంలో వాద్యం అలిప్తమార్గంలో ఉండాలి. బీభత్సభయానకాలలో వాద్యం గోముఖీమార్గంలో ఉండాలి.

**మూ. రసభావసత్త్వయోగం దృష్ట్వాభినయం గతిప్రచారం చ,**
**వాద్యం నిత్యం కార్యం తథా తథా స్థానసంయోగాత్. 54**

**తా.** రసభావాలను, పాత్రస్వభావాన్ని, అభినయమును, గతులను, ప్రచారములను, దృశ్యానికి సంబంధించిన దేశకాలాదులను దృష్టిలో ఉంచుకొని తదనుగుణంగా వాద్య ప్రయోగం జరగాలి.

**మూ. ఏవం ప్రహతవిధానం కార్యం మార్గాశ్రితైః రసైః సమ్యక్,**
**వక్ష్యామ్యతశ్చ భూయో దర్దురపణవాశ్రితం వాద్యమ్. 55**

**తా.** ఈ విధంగా మార్గాశ్రితమైన వాద్యవిధానం రసానుగుణంగా జరగాలి. ఇపుడు దర్దురపణవాలకు సంబంధించిన వాద్యవిధానం మళ్లీ చెపుతాను.

**మూ. అతివాదితమనువాద్యం సమవాదితముచ్యతే వాద్యమ్,**
**తత్రాతివదితం స్యాత్ పుష్కరాణామగ్రతో యత్తు. 56**

**యత్త్వనుగతం మృదఙ్గైరనువాదితముచ్యతే తు తద్వాద్యమ్,**
**సమవాదితం మృదఙ్గైర్ జ్ఞేయం సామ్యేన యద్వాద్యమ్. 57**

**తా.** అతివాదితం, అనువాదితం, సమవాదితం అని వాద్యాల వాదనం మూడు విధాలు. ప్రయోగసమయంలో, పుష్కరాదులను ఎదుట ఉంచి వాదనం చేయడం **అతివాదితం**. ఒక మృదంగవాదనం మరొక మృదంగవాదనాన్ని అనుసరించి జరిగితే అది **అనువాదితం**. రెండు మృదంగాలను కలిపి ఒకే సమయంలో వాదనం చేస్తే అది **సమవాదితం**.

**మూ. కఖగా పణధారవాజో ప్రహరణాద్ బహులాం భ్రాహులామ్,**
**ఏతే వర్ణా నిత్యం పణవాతోద్యవిధానే ప్రయోక్తవ్యాః. 58**

**తా.** పణవవాదనంలో, క, ఖ, గ, పణ (ఘ), ర, బ, అజ్, ప్ర, హ, ణ, బ్ర, హు, లాం, హు, లాం – ఈ వర్ణాల ప్రయోగం ఉండాలి.

**మూ. కిరి ఘిణ్టాం థో థో ణో ధోత్ర హులాం కిరి ఘిణ్టాం ణో ణో ణణ్టాం చో కిరి కణ్టాం మట మట త్థి తే టే టే దోణ్ణాం పణవవాద్యమ్.**

**తా.** పణవవాద్యవాదనంలో – **"కిరి ... దోణ్ణాం"** అను వర్ణా లుండాలి.

**మూ. తస్య ప్రహతం కార్యం కనిష్ఠికానామికాగ్రకేణైవ,**
**నానాకరణవిభాగం పణవే శిథిలాయతే తద్జ్ఞైః. 59**

**తా.** పణవవాదనిపుణులు, పణవాన్ని కనిష్ఠికాగ్రంచేత, అనామికాగ్రంచేత, శిథిలంగాను (మెల్లగాను) ఆయతంగాను (గట్టిగాను) ప్రహారాలు చేస్తూ, వివిధకరణాల విభాగాన్ని సుస్పష్టంగా చూపుతారు.

**మూ. వాద్యాః కనిష్ఠికానామికాభ్యాం తు కరణరాగవర్ణాః,**
**శేషాస్తు ప్రహారవిధౌ స్మృతాః ప్రహారాశ్చ వాద్యానామ్. 60**

**తా.** కరణాలను రాగయుక్తాలుగాను అలంకృతాలుగాను చేయడానికి వాద్యాలమీద కనిష్ఠికా – అనామికాప్రహారాల ద్వారా ధ్వనులు పలికించాలి. ఇతరసమయాలలో అన్నీ వెళ్లను ఉపయోగిస్తు పలికించవచ్చును.

**మూ. కోణానామికవాద్యం మధ్యాఙ్గుల్యా హి వాదనం కార్యమ్,**
**కోణానామికవాద్యం శుద్ధం ప్రహతం భవేదేతత్. 61**

**తా.** కోణంతోను అనామికతోను చేసే వాదనాన్ని మధ్యాంగులితో ప్రారంభించాలి. కోణానామికలతో చేసిన ప్రహతం శుద్ధప్రహతం అవుతుంది.

**మూ. భ్రాన్తకరణయోగాద్ త్రికులహమిత్యేతత్ భ్రాన్తవాదనాగ్రకృతమ్,**
**రిభితకరణానుబన్ధాస్తత్రాభ్యస్తోఽత్ర రకారస్తు. 62**

**తా.** రిభితకరణాన్ని ప్రయోగించేటప్పుడు, దాని ప్రారంభంలో **'త్రికులహమ్'** ఏర్పడుతుంది. అది రిభితకరణం గాను, అనుబంధంగాను కొనసాగుతుంది. దీనికి **'ర'**ను రెట్టింపు చేసి చేర్చాలి.

**మూ. మిశ్రకరణానుబన్ధే ద్రేకారస్తూర్ధ్వహస్తసంయోగాత్,**
**స తు వాదకేన వాద్యో ధుర్యేణ విశేషతః కార్యః. 63**

**తా.** మిశ్రకరణాల అనుబంధంలో ఊర్ధ్వహస్తంతో ప్రహారం చేసి ద్రేకారం పలికించాలి. మంచి వాద్యవాదకులు దీనిని విశేషించి చక్కగా ప్రయోగిస్తారు.

**మూ. స్వరచిత్రకరణరమ్యం కార్యం తథా కనిష్ఠికాగ్రేణ,**
**తత్రైవ కార్యా దోష్ణిమథాణిణి కఖుతప్రహారా వై. 64**

**తా.** స్వరాలలో చిత్రత్వాన్ని సంపాదించే వేరు వేరు కరణాలలోను కనిష్ఠికాగ్ర ప్రహారంతో ఆవిర్భవింపచెయ్యాలి. ఆ అంగులితోనే ప్రహారంచేసి **అ,ణి,ణి లు** పలికించాలి.

**మూ. కృత్వా తు శిథిలకక్ష్యాం కార్యాస్తు కనిష్ఠికాగ్రకోణేన,**
**తేనైవ చరేద్ధత్వోధ్వాణభాగే ఇత్యఞ్చితేనైవ. 65**

**తా. పణవవాదనం :–** దీని వాదనం శిథిలంగా కట్టిన పణవవాద్యంమీద కనిష్ఠికాగ్ర భాగంతో చేయబడుతుంది. బిగించి కట్టిన పణవంమీద, అంచితహస్తంతో **ధత్వోధ్వాణ** ధ్వని పలికించబడుతుంది.

**మూ. అఞ్చితశిథిలే పణవే కరణతణిణకృతాః ప్రహారాస్తు,**
**భ్రాన్తకరణాః నతథా స్వఞ్చితకక్ష్యే ప్రశిథిలే చ. 66**

**తా.** బిగించి కట్టిన పణవంమీద నైనా, వదులుగా కట్టిన పణవంపై నైనా ప్రహారాల ద్వారా **కరణతణి** – లను పలికించవచ్చును. అయితే – ఈ విధమైన భ్రాన్త (అనియమిత) కరణాలను, పణవం శిథిలంగా బంధించి ఉన్నప్పుడు పలికించకూడదు.

**మూ. అఞ్చితకక్ష్యే పణవే 'ఖఖరటణ' కృతాః ప్రహారాస్తు,**
**తథేన్తతః ప్రహారాః పణవే కార్యాః సదా శిథిలకక్ష్యే. 67**

**తా.** బిగించి కట్టిన పణవంమీద **ఖ,ఖ,ర,ట,ణ, ల** ప్రహారాలు చెయ్యాలి. శిథిలంగా కట్టిన పణవంమీద వాదనప్రహారాలచేత **తత, త్థేన్** వంటి వాటిని పలికించవచ్చును.

**మూ. కఖరటకృతాః ప్రహారాః సోచ్ఛ్వాసే పణవే విధాతవ్యాః,**
**శేషా భ్రాన్తకయోగాత్ సంయోగకృతాః సంవిధాతవ్యాః. 68**

**తా.** బిగించిన పణవంమీద ప్రహారాలచేత క, ఖ, ర, ట – లు పలికించాలి. ఈ ప్రహారాలు అనియతకరణాలతో కలిసి ఉండవచ్చును.

**మూ. టఙ్కారానుస్వననం పణవే కక్షాశ్చితే తు సంభవతి,**
**తేన చ ణకారయుక్తో హ్ణ ఇతి పణవే ప్రహారః స్యాత్. 69**

**తా.** బిగించిన పణవంమీద 'ట' యొక్క అనుస్వానం పలికించడం కుదురుతుంది. అదే విధంగా పణవంమీద 'హ్ణ' అని ణకారయుక్తప్రహారం చేయవచ్చును.

**మూ. తిర్యగ్గృహీతవాదనముఖవర్తిత ఇష్యతే ప్రహారోఽయమ్,**
**కహులాం క్రకులాం క్రమాదితి క్రకులా మిత్థం ప్రహారః స్యాత్. 70**

**తా.** పణవం ముఖంపైన అడ్డంగా ప్రహారం చేసి కహులాం, క్రకులాం, క్రకులాం, అను ధ్వనులు పలికించవచ్చును.

**మూ. ఏవం పణవే వాద్యం విధివత్సఙ్క్షేపతో మయాభిహితమ్,**
**వ్యాఖ్యాస్యతః పరమహం దర్దురవాక్యాక్షరాణ్యేవమ్. 71**

**తా. దర్దురవాదనం :–** పణవంమీద వాదనం చేసే విధానం సంక్షిప్తంగా చెప్పాను. ఇపుడు దర్దురంమీద పలికించ దగిన వాక్యాలను అక్షరాలను గూర్చి వివరిస్తాను.

**మూ. రేక్లతి త్రికలౌ క్లేచద్రో గోణో హథిణ్ణ సంయుక్తాః,**
**ఇతి దర్దురే ప్రహారాః కార్యా ముక్తా థణణ్ణాంశ్చ. 72**

**తా.** దర్దురంమీద ముక్తవాదనదశలో ప్రహారాలు చేసి – **రేక్లతి, త్రికల, క్లేచద్రో, గోణోం, హథిణ్ణ, థణణ్ణ** శబ్దాలు పలికించవచ్చును.

**మూ. కార్యాస్తత్రే ఏణక్షా రగ్రధ్రణ్ష్ణి ఇతి చ దక్షిణకరేణ,**
**వామేన గోమూరత్థాననఖస్పృష్టః ప్రకారోఽగ్రే. 73**

**తా.** కుడిచేతి ప్రహారాలతో **ఏణణ, క్షార, గ్రధ్రష్ణి** – పలికించవచ్చును. ఎడమచేతితో, నఖాగ్రాలు దర్దురానికి తగలకుండా, ప్రహారాలు చేసి **'గోమూరత్థా'** పలికించ వచ్చును.

**మూ. ముక్తౌతీత్రిత్రిణభవేన్నిపీడితేవై కరద్వయేనాపి,**
**విముక్తగ్రహణస్యాన్తే స్వనే నిపీడితే చైవ. 74**

**తా.** బిగించిన (నిపీడితేన) రెండు చేతులతో ప్రహారం చేసి **'ముక్తౌతీత్రి'** పలికించ వచ్చును. ముక్తగ్రహణం తరవాత ధ్వనులను నిపీడితములు చేయవచ్చును.

**మూ. స్యాత్ పీడితే చ థిత్థేనత్రనిత్యమథాపి వా,**
**శేషా భవన్తి ముక్తా గ్రస్త ఇతి చైవ నిగృహీతే. 75**

**తా.** చేతులు పీడితాలుగా ఉంచి **'థిత్థేనత్ర'** పలికించవచ్చును. ముక్తరూపంలో పలికించిన ఈ ధ్వనులు ఒక విశిష్టరూపంలో ఉంటాయి. నిగృహీతప్రహారం చేసి పలికించిన ధ్వనులు ముక్తరూపంలో కాని గ్రస్తరూపంలో కాని ఉంటాయి.

**మూ. శీఘ్రకరణానువిద్ధస్థితిరేవ హి వైస్వరస్ఖలితం స్యాత్,**
**ఇతి దర్దురప్రహారాః సమాసతస్త్ర విజ్ఞేయాః. 76**

**తా.** శీఘ్రంగా, వేగంగా వాదనం చేస్తే స్వరంలో స్ఖలనం రావడానికి అవకాశం ఉంటుంది. (ఆ విషయంలో జాగరూకులై ఉండాలి) ఈ విధంగా దర్దురప్రహారాల స్వరూపం సంక్షిప్తంగా చెప్పబడింది.

**మూ. ఏవం త్యసంకరకృతా ప్రహారవిశుద్ధిరిహ కీర్తితా తద్జ్ఞైః,**
**దర్దురపణవమృదఙ్గైర్మిశ్రితవాద్యం ప్రవక్ష్యామి. 77**

**తా.** ఈ విధంగా విశుద్ధమైన వాదనవిధానం దానియందు నైపుణ్యం కలవారు బోధించి ఉన్నారు. ఇప్పుడు దర్దుర – పణవ – మృదంగాలతో కలిపి చేసే మిశ్రితవాద్యం చెపుతాను.

**మూ. తత్ర వ్యక్తీభావం వాద్యే గచ్ఛన్తి మిశ్రితాః కేచిత్,**
**కేచిద్యుపగత్కరణాః కేచిత్పర్యాయకరణాస్తు. 78**

**తా.** వాద్యాల మిశ్రితరూపంలో కొన్ని కరణాలు ఒక విధమైన విశిష్టరూపంలో వ్యక్తం అవుతాయి. కొన్ని కరణాలు ఒకే సమయంలోను, కొన్ని ఒకదాని తరువాత ఒకటి వ్యక్తం అవుతాయి.

**మూ. ఏకైకసంప్రయుక్తా వర్ణా ణగరాస్తథైవ సంప్రోక్తవ్యాః,**
**ఘీం కా కత్థం త్రైఖో కహులం తకితా మృదఙ్గేషు. 79**
**అథ దర్దురే దజ్ స్యేజ్ ద్రౌజ్ కహులాం మటత్థి పణవే చ,**
**థం మటత్థిదాం కహులాం మటత్థి దేజ్ నేజ్వమిశ్రస్తు. 80**

**తా.** మిశ్రితవాదనంలో – స్వతంత్రప్రహారాలుగా – **ణ, గ, ర,** లు. మృదంగం మీద **ఘీంకా, కత్థం, త్రైఖో, కహులం, తకితాలు** పణవంమీదా దర్ధురంమీద – **దజ్, స్యేజ్, ద్రౌజ్, కహులాం, మటత్థి, దేజ్, నేజ్** – లు మిశ్రాలుగాను పలికించాలి.

**మూ. ఏభ్యో యేఽన్యే శేషాస్తే మిశ్రౌ ఏవ నిత్యశః కార్యాః,**
**పూర్వేఽపి చ మిశ్రత్వం వ్రజన్తి సర్వే యథాప్రయోగమ్. 81**

**తా.** మిగిలిన కరణా లన్నీ మిశ్రితరూపంలో ఉంచాలి. ఐతే – పైన చెప్పినవాటిని కూడ ప్రయోగానుసారం మిశ్రితాలుగా చేయవచ్చును.

**మూ. అథ యుగపత్కరణం కహులాం ణ్ణణాం ఖ ఖు ణ్ణే ఖే,**
**ద్రోమో ద్రోణం థోథో ర్థి ద్వం ఏవం యోజ్యం పణవే వాద్యమ్. 82**

**తా.** యుగపత్‌కరణంలో – పణవంమీద **కహులాం, ణ్ణణ్ణాం ఖ ఖు ణ్ణే ఖే ద్రోమో ద్రోణం థో థో థిం ర్థిద్వం** – ఇవి పలికించాలి.

**మూ. ధుర్యకృతం చ క్రమశః కరణం పరివాదకేన కర్తవ్యమ్,**
**టటటటే ఘోణణణ కిరిణి కిణికిణ్ణా కృతం చేతి. 83**

**తా.** ధుర్యుడు (వాదకగణనాయకుడు) చేసిన కరణాన్ని, పరివాదకుడు (వాదకుడు) ప్రయోగిస్తూ – టటటటే ఘోణణణ కిరిణి కిణికిణ్ణా అని పలికించాలి.

**మూ. పణవస్య చానుబన్ధే కార్యంణ్ణు ఖు ఖుణేతి వాద్యన్తు,**
**భూయః కృతప్రతికృతభేదో మార్దజ్గికదర్దురిభ్యాం చ. 84**

**తా.** పణవానికి అనుబంధంగా ణ్ణు, ఖు, ఖుణ, అని పలికించాలి. దానికి బదులుగా, మార్దంగికదర్దురిలు మళ్లీ కృత – ప్రతికృతం చెయ్యాలి.

**మూ. యద్యత్ కుర్యాన్మురజే ప్రహారజాతం గతిప్రచారేషు,**
**అనుగతమక్షరవృత్తం తదేవ వాద్యం తు పణవేఽపి. 85**

**తా.** (రూపకప్రదర్శనాలలో పాత్రల) గతిప్రచారాలలోను, ఇతర స్థితులలోను, మురజంమీద ఏ అక్షరాల (కరణాల) వాదనం చేయబడుతుందో వాటి నన్నింటినీ, ఆ సమయాలలో, పణవవాదనంలో కూడ ప్రయోగించాలి.

**మూ. న హి చిత్రం కర్తవ్యం గతిప్రచారేషు వాదనం తద్‌జ్ఞైః,**
**సమవిషమం తత్ర హి యన్న లక్ష్యం పాదసంచారే. 86**

**తా.** పాత్రల గతిప్రచారస్థితిలో చిత్రవాదనం చేయకూడదు. పాదగత్యాదులలో సరియైన ప్రమాణం లేకపోతే ఆ సమయంలో వాదనం సమవిషమం అయిపోయింది.

**మూ. ఉపరికరణే యథేష్టం కర్తవ్యం పణవే మృదజ్గే చ,**
**తత్ర ప్రహారకరణైః మృదజ్గవాద్యం విధాతవ్యమ్. 87**

**తా.** పణవ – మృదంగాల వాదనంలో ఉపరిపాణికరణాల ప్రయోగం యథేష్టంగా చేయవచ్చును. మృదంగవాదం సమానప్రహారాలతో జరగాలి.

**మూ. ప్రాయేణ సర్వాతోద్యేష్వాదౌ పణవగ్రహః ప్రయోక్తవ్యః,**
**వక్ష్యామ్యతః పరమహం దస్రుక్ పేన్తతితా తేతిత్సదేవేతి. 88**
**రేమితనృతామత్థి ఇతి దర్దురే ప్రహారః స్యాత్,**
**తథోర్ముక్తే నిషణ్ణే చ కార్యస్తత్ర ఙణ్ణారే. 89**

**తా.** అన్ని వాద్యాలు కలిపి వాదనం చేసే టప్పుడు పణవవాదనంతో ప్రారంభించాలి.

ఇప్పుడు నేను దర్దురప్రహారాలను గూర్చి చెపుతాను. **దస్రుక్, సేన్తతితా, తేతిత్స, దేవే, రమిత, నృత్థా, మత్థి** – ఇవి దర్దురప్రహారాలు. వీటిని ముక్తరూపంలో రెండు పర్యాయాలు పలికించిన తరువాత, ఆగి, 'ఙణ్ణార' వంటి ప్రహారాలు పలికించాలి.

**మూ. ఖ్రేద్రోకిథీతి దక్షిణకరేణ వామే తు గుదథిం క్లమ్,**
**తత్త్వవృష్టౌ కరాగ్రేణ ముక్తే తమితి చైవం నిగృహ్య. 90**
**శీఘ్రం కరణానుబన్ధస్థితిరేవ హి తకం స్యాత్,**
**ఇతి దర్దురే ప్రహారం వక్ష్యామ్యూర్ధ్వం కరణజాతమ్. 91**

**తా.** కుడిచేతితో **ఖ్రేద్రో కిథీ** – అని, ఎడమ చేతితో **గుదథిం వలం** అనీ పలికించాలి. తరువాత చేతుల అగ్రభాగాలతో **'తత్వవృష్ఠ'** పలికించి, రెండు చేతులూ **'తం'** మోగించిన పిమ్మట ఆపివెయ్యాలి. మిగిలిన కరణాల అనుబంధాలను **'తకం'**తో ఉచితరీతిలో కూర్చాలి.

ఇదే దర్ధురవాదన విధానం. ఇపుడు నేను కరణాలలోని ఆరు భేదాలు చెపుతాను.

**మూ. రూపం కృతప్రతికృతం ప్రతిభేదో రూపశేషమోఘశ్చ,**
**షష్ఠీ వై ప్రతిశుష్కేత్యేవం జ్ఞేయం కరణజాతమ్. 92**

**తా.** రూపం, కృతప్రతికృతం, ప్రతిభేదం, రూపశేషం, అతిశుష్కం, ఓఘం – అని కరణాలు ఆరు విధాలు.

**మూ. తత్ర రూపం నామ ద్విహస్తకరణవిభక్తమ్. యథా – ఘం ఖు ఖు ఙ ఖ ఘం క్రమం త్థిమం త్రైత్తరం ఘటాం ఘత్థి మేథి ఘేణ్టా కట గుద్ధ రణ కిటి ఘం ఘౌ కఘటం కఖం – ఇతి రూపమ్.**

**తా.** రెండు చేతులతో విభక్తరూపంలో కరణాలను పలికించడం **రూపం ; "ఘం ... కఖం"** ఇది ఉదాహరణం.

**మూ. కృతప్రతికృతం నామ యత్రైకం కరణం త్రికముద్భావయతి. యథా – థం – ఘు ఙ ఖథం క్రమత్థి వగ్గేం రఘటాం ఘటత్తి ఘం త్సాం ఇదుఘే కుహలాణ్ణం దోధోణ ఇతి కృతప్రతికృతాఖ్యమ్.**

**తా.** త్రిపుష్కరాలమీద ఒక కరణం పలికించడం **కృతప్రతికృతం.** ఉదా :- **"థం ... దోధోణ".**

**మూ. ప్రతిభేదో నామ యుగపత్కృతే కరణే మృదఙ్గానాం యదుపరికరణేన గచ్ఛతి. యథా - ధో ధో ణా ఖో లా ల ణా ణా థ్థి త్థఖి ఘణ్డాం ఏభిః కరణ విశేషః ప్రతిభేదో నామ విజ్ఞేయః.**

**తా.** మృదంగాలమీద రెండు కరణాలను కలిపి పలికించిన తరువాత, ఉపరిపాణిని (వాదనంకోసం) తీసికొంటే అది **ప్రతిభేదం.** ఉదా :- **"ధోధో ... ఘణ్డాం".**

**మూ. రూపశేషం నామ కరణా నామవిశేషః. యథా - ఖు ఖు ణో ణ్ణా మట ఘేం ఘౌణ్టా మటఘోటా మథి ఆల్మ్యాం ఘోం ఇతి వాద్యం రూపశేషః.**

**తా.** కరణాలలో భేదం లేకపోవడం **రూపశేషం.** ఉదా : **"ఖుఖు ... ఘోం".**

**మూ. ప్రతిశుష్కం నామ అనుస్వరో మార్దఙ్గికపాణవికదుర్దురికాణామ్. యథా - ఘటమటతి దుణథేర్జకటి కేఘేజ్ ఘోజ్ ఘోణ్డాఘోణ ఖో ఖో ఖ కుటకిట వకథ్థి ణణథ్థి ప్రతిశుష్కాఖ్యం సదా కరణమ్.**

**తా.** మృదంగ - పణవ - దర్దురాలు మూడూ కలిసి వాయిస్తున్నప్పుడు అన్నీ ఒకే స్వరంలో లేదా అనుస్వరంలో ఉండడం **ప్రతిశుష్కం.** ఉదా : **"ఘటమటథ్థి ... ణణథ్థి".**

**మూ. ఓఘో నామ చతుష్కాఖ్యే సర్వభాణ్డవిధేయే ద్రుతపాణిలయయోగేన నద్యోఘఘోష రవవత్ ఓఘః. యథా - థంకిటి మంథిహి కిటి ఘేజ్ ఘణ్టాణం ఘేణ్టా ఘోణ ఘోణ ఘటు ఘేజ్ ఘం ఘే విరిణి ణగేహంథైథోథో తథై ఘే చ.**

**తా.** వాద్యా లన్నింటినీ ద్రుతపాణిలయంలో వాదనం చేస్తూ, నిరంతరమైన ధ్వని, నదుల ప్రవాహాల ధ్వని వలె పుట్టించడం **ఓఘం.** ఉదా : **"థంకిటి ... ఘేచ".**

**మూ. కరణానాం సమాయోగః షడ్విధః పరికీర్తితః,**
**అనేనైవ విధానేన యోజ్యం బాష్కరణం బుధైః. 93**

**తా.** కరణాలను మిశ్రం చేసే విధానం ఇంతవరకు చెప్పబడినది. బుధులు ఈ పద్ధతినే అనుసరించి బాష్కరణం ఏర్పరచుకోవాలి.

**మూ. త్రియతిర్నామ - సమా, స్రోతోగతా, గోపుచ్ఛా చేతి. యతిర్లయపాణీనాం త్రివిధః సంయోగః. స చ త్రిప్రకారో భవతి. యథా - రాద్ధం, విద్ధం, శయ్యాగతమితి. త్రిలయం నామ - ద్రుతో, మధ్యో, విలమ్బితశ్చేతి. త్రిపాణికం నామ - సమపాణిః, అర్ధపాణిః, ఉపరిపాణిశ్చేతి. ఏవం త్రిప్రకారః సంయోగః కరణేషు.**

**తా.** సమ, స్రోతోగత, గోపుచ్ఛ అని మూడు యతుల పేర్లు; మూడు పద్ధతులలో జరిగే లయ – పాణుల మూడు విధాలైన సంయోగానికి **యతి** అని పేరు. అది రాద్ధం, విద్ధం, శయ్యాగతం అని మూడు విధాలు. ద్రుతం, మధ్యం, విలంబితం అని మూడు లయల పేర్లు. సమపాణి, అర్ధపాణి, ఉపరిపాణి అనేది **త్రిపాణి**కం. ఈ విధంగా కరణాలలో సంయోగం మూడు రీతులలో ఉంటుంది.

**మూ. సమా యతిర్ద్రుతశ్చాపి లయో యత్ర భవేదథ,**
**తథైవోపరిపాణిశ్చ రాద్ధస్యైష విధిర్భవేత్. 94**

**తా.** సమాయతి, ద్రుతలయ, ఉపరిపాణి ఉన్న వాద్యం **రాద్ధం**.

**మూ. తథా వాద్యప్రధానం చోపరిపాణిః సమా యతిః,**
**ద్రుతశ్చాపి లయో యత్ర రాద్ధం వాద్యన్తు తద్ భవేత్. 95**

**తా.** దేనియందు వాద్యం ప్రధానంగా ఉంటూ, ఉపరిపాణి, సమయతి, ద్రుతలయ ఉంటుందో ఆ వాద్యం **రాద్ధం** అను పేరు గలది.

**మూ. స్రోతోగతా యతిర్యత్ర లయో మధ్యస్తథైవ చ,**
**సమపాణిస్తథా చైవ విద్ధం వాద్యం తు తద్భవేత్. 96**

**తా.** స్రోత్రోవహాయతి, మధ్యలయ, సమపాణి ఉన్నది **విద్ధవాద్యం**.

**మూ. వార్త్తికో వృత్తిమార్గః స్యాత్ దక్షిణో గీతవాద్యయోః,**
**పాత్రేషూత్తమమధ్యేషు విద్ధం వాద్యముదాహృతమ్. 97**

**తా.** ఉత్తమ – మధ్యమపాత్ర లున్న దశలో వార్త్తికమార్గం గాని దక్షిణమార్గం గాని ప్రయోగించినప్పుడు సంగీతంలోని గీతాలలోను, వాద్యాలలోను చేసే వాద్యవాదనానికి కూడ **విద్ధం** అని పేరు.

**మూ. అర్ధపాణిస్తు యత్ర స్యాత్ తథా చైవ స్థితో లయః,**
**యతిశ్చైవ తు గోపుచ్ఛా వాద్యం శయ్యాగతం తు తత్. 98**

**తా.** అర్థపాణిప్రహారము, విలంబితలయ, గోపుచ్ఛయతి ఉన్నది **శయ్యాగతవాదనం**.

**మూ. యథా చ గీతిప్రాధాన్యం మార్గశ్చైవ హి దక్షిణః,**
**అత్యుక్తమేవాతోద్యేషు వాద్యం శయ్యాగతం భవేత్. 99**

**తా.** దేనిలో గీతానికి ప్రాధాన్యం ఉంటుందో, దక్షిణమార్గం ఉంటుందో, అత్యుక్త ప్రహారాలతో వాదనం చేయబడుతుందో ఆ వాద్యం కూడ **శయ్యాగతవాద్యం**.

**మూ. స్థితాల్లయాత్ ప్రభృత్యేషాం ప్రమాణం సంప్రవర్తతే,**
**కార్యా హానిః కలానాం చ శేషేష్వన్యేషు పాణిషు. 100**

**తా.** వీటి ప్రమాణం విలంబితలయాదులచేత నియమితం అవుతుంది. ఇతరపాణులలో కలలను తగ్గించాలి.

**మూ. యతయః పాణయశ్చైవ లయా వై వాద్యసంశ్రయాః,**
**యథా కామం హి కర్తవ్యా నాట్యయుక్తిమవేక్ష్య చ. 101**

**తా.** నాట్యప్రయోగం అవసరాలను పట్టి వాద్యాలకు సంబంధించిన యతులను, పాణులను లయలను ఇచ్ఛానుసారం ఉపయోగించవచ్చును.

**మూ. త్రిస్రో మార్జనా నామ –**
**మాయూరీ హ్యర్ధమాయూరీ తథా కార్మారవీతి చ,**
**తిస్రస్తు మార్జనా జ్ఞేయా పుష్కరేషు స్వరాశ్రయాః. 102**

**తా.** మూడు మార్జ నలనగా –

మాయూరి, అర్ధమాయూరి, కార్మారవి అను మూడు విధాలైన మార్జనలు వాద్యస్వరాలకు సంబంధించినవి.

**మూ. గాన్ధారో వామకే కార్యః షడ్జో దక్షిణపుష్కరే,**
**ఊర్ధ్వకే మధ్యమశ్చైవ మాయూర్యాం తు స్వరాః మతాః. 103**

**తా.** మాయూరీమార్జనలో – ఎడమ పుష్కరంమీద గాంధారస్వరము, కుడి పుష్కరం మీద షడ్జస్వరము, ఊర్ధ్వకం మీద మధ్యమస్వరము ఉంటాయి.

**మూ. వామకే పుష్కరే షడ్జః ఋషభో దక్షిణే తథా,**
**ఊర్ధ్వకే ధైవతశ్చైవమర్ధమాయూర్యుదాహృతా. 104**

**తా.** అర్ధమాయూరీ మార్జనలో – వామపుష్కరంమీద షడ్జస్వరము, దక్షిణపుష్కరం మీద ఋషభము, ఊర్ధ్వకం మీద ధైవతము ఉంటాయి.

**మూ. ఋషభః పుష్కరే వామే షడ్జో దక్షిణపుష్కరే,**
**పఞ్చమశ్చోర్ధ్వకే కార్యః కార్మారవ్యాః స్వరాస్త్వమీ. 105**

**తా.** వామపుష్కరంమీద ఋషభము, దక్షిణపుష్కరంమీద షడ్జము, ఊర్ధ్వకం మీద పంచమము ప్రయోగించాలి. ఇవి కార్మారవీమార్జనస్వరాలు.

**మూ. ఏతేషామనువాదీ తు జాతిరాగస్వరాన్వితః,**
**ఆలిఙ్గ్యే మార్జనం ప్రాప్య నిషాదః సంవిధీయతే. 106**

**తా.** ఆలింగ్యంలో మార్జనమునందు, రాగస్వరయుక్త మైన, అనువాదిస్వరమైన నిషాదాన్ని ప్రయోగించాలి.

**మూ. మాయూరీ మధ్యమే గ్రామే షడ్జే త్వర్ధా తథైవ చ,**
**కార్మారవీ తు గాన్ధారే సాధారణసమాశ్రయా. 107**

**తా.** మధ్యమగ్రామంలో మాయూరీమార్జన, షడ్జగ్రామంలో అర్ధమాయూరీమార్జన, గాంధార గ్రామంలో కార్మారవీమార్జన ఉంటుంది. ఇది సాధారణస్వరాలను ఆశ్రయించి ఉంటుంది.

**మూ. స్వరాః స్థానస్థితా యే తు శ్రుతిసాధారణాశ్రయాః,**
**త ఏవ మార్జనకృతాః శేషాః సఞ్చారిణః స్మృతాః. 108**

**తా.** శ్రుతిసాధారణసంబద్ధములైన స్వరాలు నిశ్చిత మైనవి. ఇవి మార్జనలతో సంబంధించి ఉంటాయి. మిగిలినవి సంచారులు (అనియతాలు)గా ఉంటాయి.

**మూ. వామకే చోర్ధ్వకే కార్యా ఆహార్యా లేపతః స్వరాః,**
**శైథిల్యాదాయతత్వాచ్చ తథా త్వాలిఙ్గ్యకాఙ్కికే. 109**

**తా.** వామక – ఊర్ధ్వకాలతో వాదనం చేయడానికి ముందు వాటికి లేపనం చెయ్యాలి. దానివల్ల వాటి ద్వారా అవసరమైన స్వరాలను పలికించడానికి శక్యం అవుతుంది. ఇదే పద్ధతి ఆలింగ్యక – ఆంకికాల విషయాలలో కూడ అవలంబించాలి.

**మూ. శైథిల్యాదాయతత్వాచ్చ చర్మస్ఫోటనయాపి చ,**
**ఏవం స్వరోద్భవః కార్యః మార్జనాసు ప్రయోక్తృభిః. 110**

**తా.** వాద్యవాదకులు (వాద్యాల) – చర్మను శిథిల మయేటట్లు చేసి, లేదా బిగించి, లేదా దానికి రంధ్రాలు చేసి కావాలను కొన్న స్వరాలను, మార్జనలలో పుట్టించాలి.

**మూ. మార్జనా మృత్కృతా కార్యా వామకోర్ధ్వకయోః సదా,**
**లక్షణం మృత్తికాయాస్తు గదతో మే నిబోధత. 111**

**తా.** మృత్తికతో లేపనం చేయడం ద్వారా వామక – ఊర్ధ్వకాల మార్జన చెయ్యాలి. (లేపనానికి ఉపయోగించే) మృత్తిక ఎలాంటి దుండాలో చెపుతాను; వినండి.

**మూ. నిఃశర్కరా నిఃసికతా, నిస్తృణా నితుషా తథా,**
**న విచ్ఛిన్నా న విశదా న క్షారా కటుకా న చ. 112**

**నావదాతా న కృష్ణా చ నామ్లా నైవ చ తిక్తికా,**
**మృత్తికా లేపనే శస్తా తయా కార్యా తు మార్జనా. 113**

**తా.** చిన్న రాళ్లు గాని, ఇసుకకాని, గడ్డి గాని, గింజల పొల్లు గాని లేనిది, విడిపోనిది, తెల్లగా గాని, ఉప్పగా గాని, కారంగా గాని, పచ్చగా గాని, నల్లగా గాని, పుల్లగా గాని,

చేదుగా గాని లేనిదీ అయిన మట్టి లేపనానికి ప్రశస్తమైనది. దానిని ఉపయోగించి మార్జనలు చెయ్యాలి.

**మూ. నదీకూలప్రదేశస్థా శ్యామా యా మృత్తికా భవేత్,**
**తోయాపసరణశ్లక్ష్ణా తయా కార్యా తు మార్జనా. 114**

**తా.** నదీతీరప్రదేశాలలో ఉండే శ్యామవర్ణమైన, నీళ్లు తొలగిపోయి చిక్కపడిన (ఒండ్రు) మట్టితో మార్జన (మార్జనకొరకు ఉపయోగించే లేపనం) చెయ్యాలి.

**మూ. బహువ్యాపృవదాతా చ కృష్ణా గుర్వీ న చ స్థిరా,**
**సతుషా న స్వనకరీ శ్యామా యత్ర న దృశ్యతే. 115**
**తత్ర గోధూమచూర్ణం వా యవచూర్ణం చ దాపయేత్,**
**యవగోధూమచూర్ణం తు కదాచిదుపయుజ్యతే. 116**

**తా.** ఎక్కువగా పాకిపోయేదీ, తెల్లనిది లేదా నల్లనిది, బరువెక్కువగా ఉండేదీ, స్థిరంగా నిలవనిది, పొల్లుతో నిండినది, ధ్వని పుట్టించనిది అయిన మట్టి లభ్యం కానప్పుడు గోధుమచూర్ణంగాని, యవల చూర్ణం గాని ఉపయోగించాలి. అప్పు డప్పుడు గోధుమయవ చూర్ణాలు కలిపి ఉపయోగించాలి.

**మూ. ఏకస్తస్య చ దోషః స్యాత్ ఏకస్వరకృతం భవేత్**
**ఏవం తు మార్జనాయోగాత్ శ్యామా స్వరకరీ భవేత్**
**త్రిసంయోగస్య వక్ష్యామి లక్షణం ద్విజసత్తమాః. 117**

**తా.** దీనిలో (గోధుమచూర్ణంలో) ఒకే దోషం ఉంటుంది; అది ఏమనగా – దానితో లేపనం చేస్తే ఒకే విధమైన స్వరం పుట్టిస్తుంది. అందుచేత మార్జనాలలో శ్యామ వర్ణం గల మృత్తికయే మంచిస్వరాలను పుట్టిస్తుంది.

ద్విజసత్తములారా! ఇపుడు త్రిసంయోగలక్షణం చెపుతాను.

**మూ. త్రిసంయోగో నామ – గురుసంచయో, లఘుసంచయో, గురులఘుసంచయశ్చేతి. తత్ర గురుసంచయో నామ గురుస్థిత లయౌఘప్రవృత్తౌ. యథా –**
**ఘేతో కేతాం చన్ద్రాం ఖేతాం ద్వం ద్వం తథైవ ఖేతాద్ధం,**
**ద్వం ద్వం ద్రాఘేతాం కత్తాం ఖేతామితి గురూణి స్యుః.**

**తా.** గురుసంచయము, లఘుసంచయము, గురులఘుసంచయము – వీటికి **త్రిసంయోగం** అని పేరు. గురువులు, స్థితలయ, ఓఘప్రవృత్తి – వీటి కలయిక **గురు సంచయం**. ఉదా :– **"ఘేతో ... ఖత్తాం"**.

**మూ. లఘుసఞ్చయో నామ లఘుకే ద్రుతలయప్రవృత్తౌ. యథా -**
**ఘట మట మట ఘట మత్థి ఘటు ఘటు గురుకృతే లఘుసంచయః**
**ఇతి సంయోగజాద్ జ్ఞేయం మృదఙ్గవాద్యం ప్రయోగజ్ఞైః.**

**తా. లఘుసంచయం :-** లఘుద్రుతలయాల సంయోగం **లఘుసంచయం.**

ఉదా : **"ఘట ... ఘటు".**

**మూ. గురులఘుసంచయో నామ - లఘుకైర్ద్రుతలయప్రవృత్తౌ. యథా - ఘట విమథి థే మథిథం కింతా ఘం ఘం ఘమోథికం తాద్ధం కటథిం కరథిం మఘవే - ఇతి సంచయే గురులఘు స్యాత్.**

**తా. గురులఘుసంచయం -** లఘువర్ణాలకు గురువర్ణాలతోకూడ సంయోగం ద్రుతలయ సంయోగం - **గురులఘుసంచయం.** ఉదా - **"ఘట ... మఘవే".**

**మూ. త్రిగతం నామ తత్త్వమనుగతమోఘశ్చేతి -**
**అక్షరసదృశం వాద్యం స్ఫుటపదవర్ణం తథైవ వృత్తసమమ్,**
**సువిభక్తకరణయుక్తం తత్త్వే వాద్యం విధాతవ్యమ్. 118**

**తా.** తత్త్వం, అనుగతం, ఓఘం - అనేవి **త్రిగతం.**

**తత్త్వ**వాద్యవాదనంలో ప్రహారాలు ఎంత సమంగా ఉండాలనగా - అక్షరాలు సుస్పష్టంగా విభక్తంగా (వేరు వేరుగా) అభివ్యక్తం కావాలి. గీతాల ఛందస్సుకు అనుగుణంగా ఉండాలి. కరణాలు చక్కగా విభక్తములై ఉండాలి.

**మూ. సమపాణ్యవరపాణియుతం స్ఫుటప్రహారకరణానుగతం చైవ,**
**గేయానుగతవాద్యస్య భవేద్ ఘాతం తదనుగతమ్. 119**

**తా.** వాద్యవాదనం సమపాణితో కాని అవరపాణితో కాని ప్రారంభం అవుతుంది. దానిలో వివిధప్రహారాలచేత వెలికి దీయబడిన కరణా లుంటాయి. అది గీతాన్ని అనుసరించి నడవాలి. అది **అనుగతవాద్యం.**

**మూ. నైకకరణాశ్రయయుతం హ్యుపరిపాణికం లయం చ,**
**ఆవిద్ధకరణబహులం యోజ్యం వాద్యం బుధైరోఘే. 120**

**తా. 'ఓఘవాద్య'** వాదనం ఉపరిపాణితో ప్రారంభం అవుతుంది. ఏదైన ఒకే కరణాన్ని ఆశ్రయించి ఉండదు. దీనిలో ద్రుతలయ, ఆవిద్ధకరణబాహుల్యమూ ఉంటాయి.

**మూ. సర్వస్యైవ హి వాద్యస్య హ్యష్టౌ సామ్యా భవన్తి హి,**
**తద్యథా -**

**అక్షరసమమఙ్గసమం తాలలయగతిసమం గ్రహసమం చ,**
**న్యాసాపన్యాససమం పాణిసమం చైవ విజ్ఞేయమ్. 121**

**తా.** అన్ని వాద్యాలలోను ఎనిమిది సామ్యా లుంటాయి – అక్షరసమం, అంగసమం, తాలసమం, లయసమం, యతిసమం, గ్రహసమం, న్యాసాపన్యాససమం, పాణిసమం, అని వీటి పేర్లు.

**మూ. యద్వృత్తం తు భవేద్గానం గురులఘ్వక్షరాన్వితమ్,**
**తద్వృత్తం తు భవేద్వాద్యం తదక్షరసమం స్మృతమ్. 122**

**తా.** గానం ఏ వృత్తంలో ఉంటుందో, ఆవృత్తంలోని గురులఘ్వక్షరాలను పలికిస్తూ చేసిన వాదనం **అక్షరసమం**.

**మూ. ధ్రువాణాం గ్రహమోక్షేషు కలాన్తరకలాసు చ,**
**యదఙ్గత్రిగతం వాద్యం తదఙ్గసమముచ్యతే. 123**

**తా.** ధ్రువాగీతాల మూడు అంగాలను అనుసరిస్తూ, ధ్రువల గ్రహము (ఆరంభము) మోక్షము (అంతము), కలలు, అంతరకలలు – వీటి అంగాల సమత్వాన్ని చూపుతూ నడిచిన వాదనం **అంగసమం**.

**మూ. యచ్ఛరీరం భవేద్గానం కలాకాలప్రమాణతః,**
**తత్ప్రమాణం తు యద్వాద్యం తద్వై తాలసమం స్మృతమ్. 124**

**తా.** కలా – కాలప్రమాణాల ద్వారా గీతస్వరూపాన్ని చూపే వాదనం **తాలసమం**.

**మూ. స్థితే మధ్యే ద్రుతే వాపి లయే గానం చ యద్భవేత్,**
**తథైవ యద్భవేద్వాద్యం తద్వై లయసమం భవేత్. 125**

**తా.** ప్రారంభంనుంచీ కూడ గానం ఏ స్థితలయలో, మధ్యలయలో లేదా ద్రుతలయలో నడుస్తూంటుందో ఆ లయనే అనుసరించే వాద్యం **లయసమం**.

**మూ. సమా స్రోతోగతా వాపి గోపుచ్ఛా చ గతిర్యథా,**
**తథా భవేత్తు యద్వాద్యం తద్వై యతిసమం భవేత్. 126**

**తా.** గీతంలోని సమా – స్రోతోవహా – గోపుచ్ఛాయతులను అనుసరించే వాద్యం **యతిసమం**.

**మూ. తతావనద్ధవంశానామేకశ్రుతికృతోఽపి చ,**
**గ్రహో గానేన సహితస్తద్వై గ్రహసమం భవేత్. 127**

**తా.** సమానశ్రుతుల ద్వారా, తత – అవనద్ధ – సుషిరవాద్యాలు గీతంతో సమంగా ఉంటే అది **గ్రహసమం**.

**మూ. న్యాసాపన్యాసయోగస్తు స్వరాణాం హి యథా భవేత్,**
**వంశవీణోద్భవం వాద్యం న్యాసాపన్యాసజం తు తత్. 128**

**తా.** వంశీ – వీణావాదనంలోని న్యాస – అపన్యాసస్వరాలు గీతంతో సమంగా ఉంటే అది **న్యాసాపన్యాససమం.**

**మూ. సమపాణ్యర్ధపాణిస్థం తథైవోపరిపాణికమ్,**
**గీతానుగం చ యద్వాద్యం స్మృతం పాణిసమం తు తత్. 129**

**తా.** సమపాణి – అర్ధపాణి – ఉపరిపాణివాదనాలు గీతాలను అనుసరించి ఉన్నట్లయితే అది **పాణిసమం.**

**మూ. అష్టాదశజాతికమితి యదుక్తం తదనువ్యాఖ్యాస్యామః – తద్యథా – శుద్ధా, ఏకరూపా, దేశానురూపా, దేశాదపేతరూపా, పర్యాయా, విష్కమ్భా, పర్యస్తా, సంరమ్భా, పార్ష్ణిసమస్తా, దుష్కరకరణా, ఊర్ధ్వగోష్ఠికా, ఉచ్ఛ్రితికా, ఏవంవాద్యా, మృదఙ్గపణవా, అవకీర్ణా, అర్ధావకీర్ణా, సంప్లవా, విధూతమితి. ఏతాసాం జాతీనాం లక్షణనిదర్శనాన్యభివ్యాఖ్యాస్యామః.**

**తా. 'అష్టాదశజాతికమ్'** అని (సూత్రరూపంలో) చెప్పినదానిని ఇపుడు వివరిస్తున్నాం – శుద్ధా, ఏకరూపా, దేశానురూపా, దేశాదపేతరూపా, పర్యాయా, విష్కంభా, పర్యస్తా, సంరమ్భా, పార్ష్ణిసమస్తా, దుష్కరకరణా, ఊర్ధ్వగోష్ఠికా, ఉచ్ఛ్రితికా, ఏవంవాద్యా, మృదఙ్గపణవా, అవకీర్ణా, అర్ధావకీర్ణా, సంప్లవా, విధూతమ్ (అని పద్దెనిమిది జాతులు). ఇప్పుడు ఈ జాతుల లక్షణోదాహరణలను వ్యాఖ్యానిస్తాం.

**మూ. ఏకాక్షరం ద్వ్యక్షరం వా యద్వాద్యం సర్వకార్మికమ్,**
**నిత్యం కరణయోగేన సా శుద్ధా నామతో యథా. 130**

**తా.** ఒకటి రెండు అక్షరాలతో అన్ని కార్యాలు జరిగిపోతాయి. దీనిని అన్ని విధాల క్రియలలోను ఉపయోగిస్తారు. అలాంటి అవనద్ధ వాద్యవాదనం **శుద్ధాజాతి.** ఉదాహరణం ఎట్లనగా –

**మూ. ఖోఖోఖంఖంఖంతామ్ ఏభిర్జాత్యక్షరైః సమాయుక్తా,**
**సా శుద్ధా విజ్ఞేయా మధ్యమోత్తమస్త్రీణాం భవేజ్జాతిః. 131**

**తా.** ఖోఖోఖంఖంఖం ఖంతాం – లతో నిర్మిత మైనది **శుద్ధాజాతి.** ఇది మధ్యమోత్తమ స్త్రీల అభినయంలో ఉపయోగించబడుతుంది.

**మూ. గోముఖీమద్దితాలిప్తౌ వితస్తం చాశ్రితా యదా,**
**వాదయన్తి తథైకైకమ్ ఏకరూపా హి సా యథా. 132**

**తా.** అడ్డిత, ఆలిప్త, వితస్తమార్గాలలో వేరు వేరుగా గోముఖీవాదనం చేస్తే అది **ఏకరూపాజాతి**. ఎట్లనగా –

**మూ. ద్రోజ్ ఘోజ్ దోజ్ ఘోజ్ దేధేజ్ అడ్డితమార్గాక్షరైః సమాయుక్తా,**
**సా త్వేకరూపా జాతిర్ నృణాం గీతవిధానతః కార్యాః. 133**

**తా.** అడ్డితమార్గానికి చెందిన **ద్రోజ్, ఘోజ్, దోజ్, ఘోజ్, దేదేజ్** అక్షరాలతో నిర్మితమైనది **ఏకరూపజాతి**. పురుషులు గానం చేసేటప్పుడు దానిని ప్రయోగించాలి.

**మూ. సర్వాస్వపి ప్రకృతిషు ప్రయోజ్యా సా స్థితా యా ద్రుతా వాపి,**
**దేశం కాలమవస్థాం చ జ్ఞాత్వా మధ్యేఽపి వినియోజ్యా. 134**

**తా.** ధ్రువాగీతగానం విలంబిత – ద్రుతలయలలో జరుగుతూన్నప్పుడు, అన్ని పాత్రల విషయంలోను ఈ జాతిని ఉపయోగించవచ్చును. దేశ – కాల – అవస్థాను సారం ఔచిత్యాన్ని దృష్టిలో ఉంచుకొని దీనిని మధ్యమలయలో కూడ ప్రయోగించవచ్చును.

**మూ. సర్వాతోద్యాని యత్రైకం కరణం భావయన్తి హి,**
**మృదఙ్గవాద్యానుగమాదేకరూపా తు సా స్మృతా. 135**

**తా.** మృదంగవాదనాన్ని అనుసరిస్తూ ఇతరవాద్యా లన్నీ ఒకే కరణం అవలంబిస్తే అది కూడ **ఏకరూపా**.

**మూ. అడ్డితమార్గవిభక్తా సంభోగకృతే భవతి హి శృఙ్గారే,**
**దేశానురూపా జాతిః స్థితలయయుక్తా చ కర్తవ్యా. 136**

**తా.** అడ్డితమార్గంలో వాదితమైన దేశానురూపజాతి విలంబితలయలో సంభోగ శృంగారసందర్భంలో ప్రయోగించబడుతుంది.

**మూ. మీమత్థిత్థమభూత్థికిమా ఏభిర్జాత్యక్షరైః సమాయుక్తా,**
**దేశానురూపా జాతిః శృఙ్గారే చోత్తమే స్త్రీణామ్. 137**

**తా. మీమత్థిత్థమభూత్థికిమా** అను అక్షరాలతో ఏర్పడు **'దేశానురూప'** జాతిని స్త్రీల ఉత్తమశృంగారంలో ప్రయోగించాలి.

**మూ. వామోర్ధ్వకప్రవృత్తబోధా క్షిప్రాపకృష్టలయయుక్తా,**
**దేశాదపేతరూపా కరుణరసే సా భవేజ్జాతిః. 138**

**తా. దేశాదపేతరూపజాతి** వామక – ఊర్ధ్వకాల మీద అపకృష్టాధ్రువాల ద్రుతలయలో వాయించబడుతుంది. దీనిని కరుణరసంలో ప్రయోగించాలి.

**మూ. ఘేద్రజ్ఘేద్రాజ్ ఘేఘేమేభిర్జాత్యక్షరైః సమాయుక్తా,**
**దేశాదపేతరూపా సా కార్యా వాద్యయోగేషు. 139**

**తా.** దేశాదపేతరూపజాతివాదనంలో - **ఘేద్రజ్ ఘేద్రాజ్ ఘే ఘేం** అక్షరా లుంటాయి.

**మూ. పర్యవగచ్ఛతి పూర్వం యస్మిన్ వై ప్రస్తుతం కరణజాతమ్,**
**త్రివిధేఽపి చ లయయోగే పర్యాయా నామ సా జాతిః. 140**

**తా.** ముందు ప్రారంభించిన కరణవర్గం మళ్లీ మూడు లయలలో ప్రయోగిస్తే అది **పర్యాయజాతి.**

**మూ. ధేదాజ్ ధేదేజ్ గుదుఘోజ్ ప్రాయా వామోర్ధ్వకవామహస్తసంచారా,**
**పర్యాయకృతా జాతిః వీరాద్భుతరౌద్రయోగేషు. 141**

**తా.** దీనిలో వామక ఊర్ధ్వకాలమీద ఎడమచేతితో వాదనం చేసి, **ధేదాజ్ ధేదేజ్ గుదుదోజ్** అక్షరాలు పలికించబడతాయి. దీనిని వీర - అద్భుత - రౌద్రరసాలలో ప్రయోగించాలి.

**మూ. గురుయుగ్మం లఘుయుగ్మం తథైవ లఘుగురూణి చైవ లఘు శ్చైవ,**
**ధిజ్ మాజ్ ఘటేఘేట్ గుదుఘేజ్ దఘేజ్మథిమేత్థమ్**
**విష్కమ్భాఖ్యా జాతిః శృఙ్గారే చోత్తమే స్త్రీణామ్. 142**

**తా.** రెండు గురువులు, రెండు లఘువులు, ఒక లఘువు, మూడు గురువులు, ఒక లఘువు - వీటితో **విష్కంభజాతి** నిర్మించబడుతుంది. ఉదా - ధిజ్ మాజ్ ఘట ఘేజ్ గు దు ఘేజ్ ఘేజ్ ధమ థ్థి మేత్థం. దీని యోజన ఉత్తమస్త్రీల శృంగారంలో ఉంటుంది.

**మూ. ఏకైకాక్షరయోగాద్యద్వాద్యం సర్వమార్గసంయుక్తమ్,**
**పర్యస్తా సా జాతిః సమహస్తవిచారసంయుక్తా. 143**
**ఆకాశే రథవిమానఋషివిద్యాధరభుజఙ్గమాదీనామ్,**
**త్వరితే గతివిన్యాసే ధారాయాం చైవ పర్యస్తా. 144**

**తా.** ఏకాక్షరకరణాల వాదనం అన్ని మార్గాలలోను సమప్రచారంతో చేస్తే అది **పర్యస్తాజాతి.**

విమాన - ఋషి - విద్యాధరుల ఆకాశగమనంలోను, ధారావృష్టిపాతసమయం లోను, సర్పాదుల శీఘ్ర గమనంలోను దీనిని ప్రయోగించాలి.

**మూ. స్థితిగతిలయవిన్యాసే శృఙ్గారే భవేత్తు యోత్తమప్రకృతౌ,**
**పర్యస్తా జాతిర్వై సాధమపురుషేషు కర్తవ్యా. 145**

**తా.** ఉత్తమపాత్రల ఆంగికవిన్యాసాలలోను, శృంగారరసావస్థలలోను, విలంబిత లయలో పాదన్యాసదశయందు ఈ జాతి ఉపయోగించబడుతుంది. అధమపాత్రల విషయంలో కూడ దీని యోజనం చేయవచ్చును.

**మూ. ఘేజ్ తాజ్ ఘేజ్ తాజ్ ఘోణ్వామేభిర్జాత్యక్షరైః సమాయుక్తా**
**అధమస్త్రీణాం యోజ్యా సంరమ్భా నామ వై జాతిః. 146**

**తా.** ఘేజ్ తాజ్ ఘోణ్వాం అక్షరాలతో కూడిన సంరంభాజాతి అధమస్త్రీపాత్రల విషయంలో యోజితమవుతుంది.

**మూ. అర్ధపాణికరణయుక్తం హ్యాదౌ మధ్యలయేన యత్తుల్యమ్,**
**సంరమ్భం తద్విద్యాదన్తే వాపి ద్రుతం యస్యాః. 147**
**యథా – మగరం కుయుథ కిం ...**

**తా. సంరభాజాతిలో** అర్ధపాణి, ప్రారంభంలో మధ్యలయ, అంతంలో ద్రుతలయ ఉంటాయి. ఉదా : **మగ రం కు యుథ కిం.**

**మూ. ఊర్ధ్వాఙ్కదక్షిణముఖే క్షిప్తా ప్రహతా వితస్తమార్గే తు,**
**పార్ష్ణిసమస్తా జాతిః కార్యా శృఙ్గారహాస్యగతౌ. 148**

**తా.** వితస్తమార్గంలో ఊర్ధ్వాంకికదక్షిణముఖంమీద తీవ్రప్రహారాలతో వాదనం చేస్తే అది **'పార్ష్ణిసమస్తా'** జాతి. శృంగార – హాస్యగతులలో దీని ప్రయోగం ఉంటుంది.

**మూ. తత్థిం కటం మంచ్ఛి కరణైః సపార్ష్ణినిష్పీడైః,**
**ధౌన్ద్రాజ్ గుధేజ్ గూధితాజ్ పార్ష్ణిసమస్తా పునర్జాతిః. 149**
**ధీరోత్తమపురుషాణామన్యేషాం దానవాదీనామ్.**

**తా. తత్థిం కటం మం ఛి** అను వాటిని **ధౌన్ద్రాజ్ గుధేజ్ గుధితాజ్** అను కరణాలతో పార్ష్ణినిష్పీడనంచేత పలికిస్తే అది **పార్ష్ణిసమాజాతి**. దీనిని ధీరప్రకృతి గల ఉత్తమపురుషుల విషయంలోను, ఇతరులైన దానవాదుల విషయంలోను ప్రయోగించాలి.

**మూ. స్వస్తికహస్తవిచారా సర్వమృదఙ్గప్రహారసంయుక్తా,**
**సా త్రిలయవాద్యయుక్తా దుష్కరకరణా భవేజ్జాతిః. 150**

**తా.** స్వస్తికాకారంలో ఉంచిన రెండు హస్తాలతో మృదంగంమీద అన్ని లయలతోను వాయించేది **దుష్కరకరణా**జాతి.

**మూ. దుణు దుణు దుణా కింక ధిమ ఘేజ్ ఘోటేజ్ మదత్థి దుఘికిటిఘేజ్**
**ఏభిర్జాత్యక్షరయోగైర్దుష్కరకరణా భవేజ్జాతిః. 151**

**తా. "దుణు ... ఘేజ్"** ఇవి దుష్కరకరణజాతిలోని అక్షరాలు.

**మూ. దైత్యేన్ద్రభుజగరాక్షసపిశాచగన్ధర్వగుహ్యకాదీనామ్,**
**గతివిన్యాసే యోజ్యా దుష్కరకరణా భవేజ్జాతిః. 152**

**తా.** దుష్కరకరణజాతి దైత్యరాజు, నాగులు, రాక్షసులు, పిశాచాలు, గంధర్వులు, గుహ్యకులు – వీళ్ల గతివిన్యాసంలో ప్రయోగింపబడుతుంది.

**మూ. ఊర్ధ్వాఙ్కదక్షిణముఖోత్క్షిప్తహస్తప్రహతా వితస్తమార్గా చ,**
**అఙ్కోర్ధ్వకప్రవృత్తా దక్షిణవామప్రహారా చ. 153**

**తా.** వితస్తమార్గంలో – ఊర్ధ్వక – ఆంకిక – దక్షిణమృదంగాల ముఖంమీద ఉత్క్షిప్తహస్త ప్రహారాలతో ప్రారంభించి, దక్షిణవామకాలతో, ఆంకిక – ఊర్ధ్వకాలమీద కూడ ఇదే విధంగా వాదనం చేస్తే అది **ఊర్ధ్వగోష్ఠికాజాతి.**

**మూ. ప్రాయేణోద్ధతవాద్యా వితస్తమార్గాశ్రయా తు దివ్యానామ్,**
**అధిధృజ్ ధృజ్ ప్రాయా జాతిరియమూర్ధ్వగోష్ఠికా స్యాత్. 154**

**తా.** వితస్తమార్గంలో, సాధారణంగా ఉద్ధతక్రమంలో **అధి ధృజ్ ధృజ్** అక్షరాల వాదనం చేస్తే ఊర్ధ్వగోష్ఠికాజాతి నిర్మిత మవుతుంది. దీనిని దివ్యపాత్రల గతి – చేష్టాదులలో ప్రయోగించాలి.

**మూ. సర్వమార్గైః సముద్ధృత్య యద్వాద్యకరణం భవేత్,**
**ఉచ్ఛితికాం విజానీయాద్ గూఢశృఙ్ఖలికాకృతామ్. 155**

**తా.** అన్ని మార్గాలను కలుపుతూ గూఢ శృంఖలాసంబద్ధ మైన వాదనం చేస్తే అది **ఉచ్ఛితికాజాతి.**

**మూ. కేంతా కేనాఙ్గదితామేభిర్జాత్యక్షరైః సమాయుక్తా,**
**రాజ్ఞాం స్వభావగమనే జాతిః కార్యోచ్ఛితికా తు. 156**

**తా.** కేంతాం కేన్నాం గదితాం అను అక్షరక్రమం గల ఈ జాతిని రాజుల స్వాభావిక గతియందు ప్రయోగించాలి.

**మూ. గోముఖ్యక్షరసహితా సర్వమృదఙ్గప్రహారసంయుక్తా,**
**కుహకాభినయే యోజ్యా వైదమ్బికదృష్టలిఙ్గేషు. 157**
**ఘేణ్టా టాదౌ తాథితా ఘేజ్ ఘేజ్ మటత్థి ఘట ఇంఘే,**
**ఏభిస్త్వక్షరయోగైః రేవంవాద్యా భవేజ్జాతిః. 158**

**తా. ఏవంవాద్యాజాతి** గోముఖికి చెందిన అక్షరాలలో వాయించబడుతుంది. దీనిలో మృదంగప్రహారా లన్నీ ఉంచవచ్చును. కపటవేషధారులు చేసే మూక – మాయా చేష్టల

సందర్భంలో దీని ప్రయోగం ఉంటుంది. దీనిలోని అక్షరక్రమం – **ఘేణ్టా టాదౌ తాథితా ఘేజ్ ఘేజ్ మటత్థి – ఘటఇంఘే.**

**మూ. వామనవిహ్వలఖఞ్జానాం వాజ్గే చాశన్యాహతపాదానామ్,**
**ఏవం వాద్యా జాతిస్త్వేషాం గమనే తు కర్తవ్యా. 159**

**తా.** పొట్టివాళ్లు, వ్యాకులత చెందినవాళ్లు, కుంటివాళ్లు, శరీరంమీద ఏదో నొప్పితో బాధపడుతున్నవాళ్లు, దెబ్బతగిలినవాళ్లు – ఇలాంటి వాళ్ల గమనంలో ఈ **ఏవంవాద్యా జాతి** ప్రయోగించాలి.

**మూ. పృథివీవాదితం యత్ర సర్వతోఽన్యేషు దృశ్యతే,**
**మృదఙ్గపణవా నామ సా జాతిః సార్వమఞ్చికీ. 160**

**తా.** కరణాల వేరు వేరు విభాగాలలో, నేలమీద కూడ ప్రహారం చేస్తూ వాదనం చేస్తే అది **మృదఙ్గపణవాజాతి**. దీని ప్రయోగం అన్ని మఞ్చస్థావస్థలలోను చేయవచ్చును.

**మూ. ధ్రోం ధ్రోం టేం టేమేభిర్జాత్యక్షరైః సమాయుక్తా,**
**మృదఙ్గపణవా ఏషా స్త్రీణాం భవేజ్జాతిః. 161**

**తా.** ధ్రోం ధ్రోం టేం టేం అను అక్షరాలు క్రమంగా ఉన్న ఈ జాతి స్త్రీల వివిధ చేష్టాసమయాలలో, మృదంగాలమీద, పణవాలమీద ప్రయోగించబడుతుంది.

**మూ. అవకీర్ణం తు యద్వాద్యం త్రిగుణైర్వాద్యకరణైర్మృదఙ్గానామ్,**
**దర్దురపణవోపగమాదవకీర్ణా నామ సా జాతిః. 162**

**తా.** మూడు రెట్ల కరణాలతో మృదంగవాదనం **అవకీర్ణాజాతి**. దీనిని దర్దురపణవ కాలతో చేర్చి చేస్తే అది **అర్ధావకీర్ణ.**

**మూ. కేన్తాం కేన్తాం కేన్తామేభిర్జాత్యక్షరైస్తు సంయుక్తా,**
**గోముఖమార్గే జాతిః సా చైవంగుణా విధాతవ్యా. 163**

**తా.** గోముఖమార్గంలో – కేంతాం కేంతాం కేంతాం అను అక్షరక్రమంలో ఉంటే ఇది **అర్ధావకీర్ణాజాతి.**

**మూ. అర్ధావకీర్ణవిధైః కరణైరిహ మార్గయోగలఘుయుక్తైః,**
**దర్దురపణవమృదఙ్గైరర్ధార్ధం వాదనే కార్యమ్. 164**
**థజ్ గదఘేణ్టాం సేన్ద్రామేభిర్జాత్యక్షరైస్తు సంయుక్తా,**
**సంప్లవమితి విజ్ఞేయా కర్తవ్యా వా నరైః (?) కరణైః. 165**

**తా.** అర్ధావకీర్ణాజాతికి సంబంధించిన అర్ధవిధానంతో పణవ – మృదంగాలను

ఉపయుక్తమార్గంలోఉన్న లఘ్వక్షరాలతో వాదనం చేస్తూ, థజ్, గద, ఘేంటా, సేన్ద్రా అక్షరాలను ఆక్రమంలో పలికిస్తే అది **సంప్లవాజాతి.**

**మూ. సర్వాఙ్గులిచలనకృతా సర్వమృదఙ్గప్రహారసంయుక్తా,**
**భీతగతినభోగత్యోః సంప్లవజాతిర్విధాతవ్యా. 166**

**తా.** ఈ సంప్లవాజాతిని అన్ని వేళ్లతోను, మృదంగంయొక్క అన్ని ప్రహారాలు చేస్తూ చేసి, భయపడిన వాని గతియందూ, ఆకాశగమనం చేసే పాత్రల గతియందు ప్రయోగించాలి.

**మూ. దివ్యైర్నానాకరణైశ్చిత్రైర్మృదఙ్గప్రహారసంయుక్తైః,**
**స్వాభావికోత్తమగతౌ వివృతాజాతిర్విధాతవ్యా. 167**

**తా.** మృదంగం మీద దివ్యములైన అసాధారణములైన కరణాలతో ప్రహారాలు చేస్తూ **వివృతాజాతి**ని నిర్మించాలి. దీని ప్రయోగం ఉత్తమపాత్రల గతిసమయాలలో ఉంటుంది.

**మూ. దరిగే గుదుఘేఙ్ తిత్థి క్లామ ఠత్థి కణం కుక్రామ,**
**ఏభిశ్చాక్షరయోగైర్విధూతజాతిర్విధాతవ్యా. 168**

**తా.** విధూతజాతి, దరిగే గుడుధేజ్ తిత్థి క్లామ టత్థి కణం కుక్రామ అను అక్షరాలతో నిర్మింపబడుతుంది.

**మూ. ఏతా గతిప్రచారేషు విజ్ఞేయా జాతయో బుధైః,**
**యాశ్చ నోక్తా మయా చాస్మిన్ తా గ్రాహ్యా లోకతోఽర్థతః. 169**

**తా.** పాత్రల గతిప్రచారసమయాలలో ప్రయోగించే ఈ జాతులను గూర్చి బుధులు సరిగా తెలుసుకోవాలి. ఇక్కడ నేను చెప్పని వేవైనా ఉంటే, అవసరాన్ని పట్టి వాటిని లోకంనుండి గ్రహించాలి.

**మూ. ఏవమేతేన విధినా కర్తవ్యం వాదనం బుధైః,**
**గతిప్రచారే గీతే చ దశరూపే విశేషతః. 170**

**తా.** బుధజనులు వాద్యాలను ఇపుడు చెప్పిన విధానం అనుసరిస్తూ, పాత్రల గతి ప్రచారాలలోను, గీతాలలోను, విశేషించి దశరూపకంలోను ప్రయోగించాలి.

**మూ. సప్తరూపవిధానే చ ఛన్దస్యాసారితే తథా,**
**తత్త్వం చానుగతం చైవ తథోఘోవాద్యమిష్యతే. 171**

**తా.** తత్త్వ – అనుగత – ఓఘవాదనాలను సప్తరూపగీతాలలోను, ఆసారితవిధి లోను ప్రయోగించాలి.

**మూ. వాద్యం గుర్వక్షరకృతం తథాల్పాక్షరమేవ చ,**
**గతిప్రచారే కర్తవ్యం గానే సామ్యమిహేచ్ఛతా. 172**

**తా.** రెండు వాద్యాలలోను సామ్యం ఉండాలనుకొన్నప్పుడు గురు – లఘు అక్షరాలతో నిర్మితమైన వాదనాన్ని పాత్రల గతులయందు, ఇతరచేష్టలయందు గీతంతో కలిపి చెయ్యాలి.

**మూ. తత్త్వం చానుగతం చైవ ఓఘశ్చాపి కదాచన,**
**రాజ్ఞాం లలితభావత్వాత్ యోజ్యం వాద్యం స్వభావజమ్. 173**

**తా.** రాజులు సాధారణంగా లలితస్వభావం కలవారై ఉంటారు గాన వాళ్లకు సంబంధించిన క్రియలలో తత్త్వ – అనుగతాలు అప్పుడప్పుడు ఓఘమూ కూడ వాటి స్వాభావికరూపంలో ప్రయోగించవచ్చును.

**మూ. తత్త్వం తు ప్రథమే గానే ద్వితీయేఽనుగతం భవేత్,**
**తృతీయే త్వోఘసంజ్ఞం తు వాద్యం గతిపరిక్రమే. 174**

**తా.** పాత్రల గతులయందు ఇతరక్రియలయందు (వాళ్లు అవి అభినయించే సమయంలో) మొదటి గీతంలో తత్త్వవాద్యము, రెండవదానిలో అనుగతము ప్రయో గించాలి.

**మూ. శేషాణాం ఛన్దతశ్చిత్రం ధ్రువాణాం సంప్రయోజయేత్,**
**అథ స్థితాపకృష్టాయాం వాద్యం చానుగతం భవేత్. 175**

**తా.** మిగిలిన ధ్రువాసమయాలలో ఇచ్ఛానుసారం యథాశాస్త్రంగా వాద్యవాదనం చేయవచ్చు. అయితే – స్థితాపకృష్టాధ్రువలో మాత్రం అనుగతవాద్యం ప్రయోగించాలి.

**మూ. ప్రావేశికీనాం కర్తవ్యం లయశ్చానుగతం తథా,**
**నైష్క్రామిక్యన్తరగతం కార్యం త్రిలయవాదితమ్. 176**

**తా.** ప్రావేశికీధ్రువలో వాద్యవాదనం అనుగతలయలో ఉండాలి. నైష్క్రామికీ ధ్రువలోను అన్తరాధ్రువలోను వాద్యవాదనం మూడు లయలలోను ఉండవచ్చును.

**మూ. ద్రుతం ప్రాసాదికీనాం చ ధ్రువా పఞ్చవిధా భవేత్,**
**ఏవం ధ్రువాణాం కర్తవ్యం వాద్యం ప్రకరణాశ్రయమ్. 177**

**తా.** ప్రాసాదికీధ్రువలో వాద్యవాదనం ద్రుతలయలో ఉండాలి. ఈ విధంగా – ఐదు విధాల ధ్రువలలో, పాత్రల అవస్థలను అనుసరించి వాద్యవాదనం జరగాలి.

**మూ. యో మాత్రాంశవికల్పస్తు ధ్రువాపాదే భవేదిహ,**
**స తు భాణ్డేన కర్తవ్యస్తద్జ్ఞైర్గతిపరిక్రమే. 178**

**తా.** పాత్రల చలనంలోను, ఇతరక్రియల అభినయసమయంలోను ధ్రువాపాదాలలో చెప్పిన మాత్రల విభాగాన్ని వాద్యవాదనం ద్వారా, వాద్యనిపుణులు సూచిస్తూండాలి.

**మూ. ఏవం గతిప్రచారేషు వాద్యం యోజ్యం ప్రయోక్తృభిః,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి గ్రహాన్ బాణ్డసమాశ్రయాన్. 179**

**తా.** పాత్రల గతిప్రచారాలలో వాద్యప్రయోక్తలు వాద్యాన్ని ఈ విధంగా ప్రయోగించాలి. ఇటుపైన వాద్యాలకు సంబంధించిన గ్రహాలను చెపుతాను.

**మూ. శమ్యాతాలగ్రహాః కేచిత్ తథా చ తర్జనీగ్రహాః,**
**తథాకాశగ్రహాః కేచిత్ ప్రదేశిన్యా గ్రహాః పరే. 180**

**తా.** కొందరు ఆచార్యులఅభిప్రాయం ప్రకారం – వాద్యగ్రహం (వాద్యారంభం) శమ్యా – తాలాలతో జరగాలి. కొందరి అభిప్రాయం ప్రకారం తర్జనితోను, కొందరి అభిప్రాయం ప్రకారం ఆకాశం (శూన్యస్థానం) తోను, కొందరిప్రకారం మధ్యమాంగులితోను చెయ్యాలి.

**మూ. తత్ర శమ్యాగ్రహో జ్ఞేయా నిత్యం దక్షిణపుష్కరే,**
**వామోర్ధ్వకే గ్రహాశ్చాపి జ్ఞేయాస్తాలగ్రహో బుధైః**
**తర్జనీగ్రాహకా నిత్యమాలిఙ్గ్యే పరికీర్తితాః. 181**

**తా.** దక్షిణపుష్కరంమీద శమ్య గ్రహంగా ఉంటుంది. వామ – ఊర్ధ్వకాల మీద తాలగ్రహం గ్రహంగా ఉంటుంది. ఆలింగ్యంమీద తర్జనితో గ్రహం చేయబడుతుంది.

**మూ. అథాకాశగ్రహః ప్రోక్తో నిష్క్రామే వా ప్రయోజితః,**
**ఆసారితా నిత్యశమ్యా ద్వితాలాస్తు ధ్రువాఙ్గజాః. 182**
**లయం చ న గ్రహం గానం తత్ర స్యాత్తర్జనీగ్రహః,**
**శీర్షకం చోద్ధతా చైవ ప్రదేశిన్యా గ్రహాః స్మృతాః. 183**

**తా.** నిష్క్రామంలో ఆకాశంనుంచి గ్రహం జరగవచ్చును. ఆసారితగీతాలలో ఎల్లప్పుడు శమ్యాగ్రహం ఉంటుంది. ధ్రువాంగాలనుండి రెండు తాలాలు ఉద్భూతములవుతాయి (?). లయగ్రహం కాని గీతగ్రహం కాని ఉండవు. అక్కడ తర్జనితో వాద్యారంభం చెయ్యాలి. శీర్షక – ఉద్ధతాధ్రువల గ్రహం ప్రదేశిని (మధ్యమాంగులి) ద్వారా జరుగుతుంది.

**మూ. నత్కుటస్యాడ్డితాయాశ్చ ప్రాసాదిక్యాస్తథైవ చ,**
**సన్నిపాతగ్రహో జ్ఞేయాస్తథైవైకకలా విధిః. 184**

**తా.** నత్కుట – అడ్డితాల గ్రహం, ప్రాసాదికీధ్రువాగ్రహం సంనిపాతతో జరుగుతుంది. దీని ప్రమాణం ఒకే కల మాత్రమే ఉండాలి.

**మూ. ఆకాశగ్రహకా జ్ఞేయాశ్చతుర్ద్వికలయోగజాః,**
**తథా చాఙ్గనిబద్ధాని గీతకాని యథాక్రమమ్. 185**

**తా.** ఆకాశగ్రహలో రెండేసి కలల నాలుగు భాగాలుంటాయి. దీని గీతాలు దీనికి అనుగుణంగా ఉండేటట్లు ఒక క్రమంలో కూర్చబడిన అంగాలతో ఉంటాయి.

**మూ. ఏవమేతే బుద్ధైర్జ్ఞేయా గ్రహా భాణ్డసమాశ్రయాః,**
**తాణ్డవే సుకుమారే చ వాద్యం వక్ష్యామ్యతః పరమ్. 186**

**తా.** భాండానికి సంబంధించిన గ్రహాలను గూర్చి పండితులు పైన చెప్పినట్లు తెలుసుకోవాలి. ఇపుడు తాణ్డవంలోను, లాస్యంలోను వాద్యం ఎలా ప్రయోగించాలో చెపుతాను.

**మూ. అభాణ్డమేకం గానస్య పరివర్తం ప్రయోజయేత్,**
**తస్యాన్తే సన్నిపాతస్తు కార్యో భాణ్డగ్రహే బుధైః. 187**

**తా.** వాద్యవాదనం ఏమీ లేకుండా గీతంయొక్క ఒక పరివర్తం చెయ్యాలి. అది పూర్తి యైనతరువాత వాద్యవాదనంలో సంనిపాతగ్రహం ప్రయోగించాలి.

**మూ. అథవా నృత్తశోభార్థమఙ్గాఙ్గపరివర్తనమ్,**
**గీతకస్య ప్రకర్తవ్యం లయస్య పరివర్తనమ్. 188**

**తా.** లేదా – నృత్తానికి శోభ కలగడంకోసం గీతగానవిధానంలో పరివర్తనం (మార్పు) చేయవచ్చును. గీతంలో లయకు పరివర్తనం చేయవచ్చును.

**మూ. యత్రాభినేయమఙ్గం తు న వాద్యం తత్ర యోజయేత్,**
**యత్రాఙ్గహారనృత్యం తు తత్ర వాద్యం ప్రయోజయేత్. 189**

**తా.** గీతాంగాన్ని దేనినైనా అభినయిస్తూన్నప్పుడు వాద్యం ప్రయోగించకూడదు. అయితే – ఆ అభినయం అంగహారనృత్యరూపంలో జరుగుతూన్నప్పుడు వాద్యం ప్రయోగించాలి.

**మూ. యదా గీతవశాదఙ్గం భూయో భూయో నివర్తతే,**
**తత్రాద్యమభినేయం తు శేషం నృత్తేన యోజయేత్. 190**

**తా.** గీతప్రయోగంలోని ఆవశ్యకతను పట్టి అంగం మాటిమాటికీ ఆవృత్తి చేయవలసి ఉంటే, అప్పుడు మొదటిదానిని అభినయించి, తరువాతి వాటిని నృత్తం ద్వారా ప్రదర్శించాలి.

**మూ. యద్వృత్తం తు పదం గానే తాదృశం గానమిష్యతే,**
**గీతవాద్యప్రమాణేన కుర్యాచ్చాఙ్గవిచేష్టితమ్. 191**

**తా.** గీతంలో ఉన్న ఛందస్సును అనుసరించి వాద్యవాదనం జరగాలి. గీతవాద్య వాదనాల ప్రమాణానికి అనురూపంగా అంగచేష్టలు ఉండాలి.

**మూ. వాద్యం గుర్వక్షరకృతం తథాల్పాక్షరయోజితమ్,**
**ముఖోపవహనే కార్యే ప్రకృష్టం వర్ణతస్తథా. 192**

**తా.** ముఖంలోను, ఉపోహనంలోను - గురు - లఘ్వక్షరాల భేదం వేరుగా, స్పష్టంగా తెలిసే విధంగా వాద్యవాదనం ఉండాలి. వర్ణాల నిర్మాణంలో వ్యవధానం ద్వారా వాద్యంలో ఈ భేదం చూపవచ్చును.

**మూ. స్థితే స్వల్పప్రహారం తు మధ్యేఽక్షరసమం తథా,**
**కార్యం తు గీతకే వాద్యం ద్రుతే చోపరిపాణికమ్. 193**

**తా.** గీతంతో చేసే వాద్యవాదనం విలంబితలయలో చిన్న ప్రహారాలతో (దెబ్బల) తోను మధ్యలయలో వర్ణాలను స్పష్టంగా వినిపించే విధంగాను, ద్రుతలయలో ఉపరిపాణి లోను జరగాలి.

**మూ. సమం రక్తం విభక్తం చ స్ఫుటం శుద్ధప్రహారజమ్,**
**నృత్తాఙ్గగ్రాహి కాలజ్ఞైర్వాద్యం యోజ్యం తు తాణ్డవే. 194**

**తా.** సమము, మనోహరము, స్పష్టంగా విభాగాలు తెలిసేది, శుద్ధప్రహారాలచేత పుట్టించినది, నృత్తాంగాలకు అనుగుణంగా ఉండేది అయిన వాద్యవాదనం, కాలప్రమాణ వేత్త లైన వాదకులు, తాండవసమయంలో ప్రయోగించాలి.

**మూ. సనృత్తేషు ప్రయోగేషు తత్త్వం హ్యనుగతం తథా,**
**అనృత్తేషు ప్రయోగేషు తత్త్వమోఘం క్రమేణ తు. 195**

**తా.** నృత్తం ఉన్న నాట్యప్రయోగాలలో 'తత్త్వ' – 'అనుగత' వాద్యవాదనాలు క్రమంగా ప్రయోగించాలి. నృత్తం లేని నాట్యప్రయోగాలలో క్రమంగా 'తత్త్వ' – 'ఓఘ' వాదనాలు ప్రయోగించాలి.

**మూ. స్థితే మధ్యే ద్రుతే వాపి యథా గానే తు వాదయేత్,**
**పదే నృత్తాఙ్గహారే తు తేనైవ ప్రక్రమేణ తు. 196**

**తా.** గీతాలలో విలంబిత – మధ్య – ద్రుతలయాలను అనుసరించి వాద్యవాదనం చేసినట్లే పదాభినయంలోను, నృత్తాంగహారాభినయంలోను కూడ చెయ్యాలి.

**మూ. యో విధిర్గానవాద్యానాం పదాక్షరలయాన్వితః,**
**స తు నృత్తాఙ్గహారేషు కర్తవ్యో నాట్యయోగతః. 197**

**తా.** గీతవాద్యాల విషయంలో పద – అక్షర – లయలతో ఏ వాదనవిధానం చెప్పబడిందో అదే నాట్యప్రయోగంలో కూడ నృత్తాంగహారాలలో ప్రయోగించాలి.

**మూ. ఏతాస్తు జాతయః ప్రోక్తా దశ చాష్టౌ చ భాణ్డజాః,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి ప్రకారాన్ వాద్యసంశ్రయాన్. 198**

**తా.** ఇంతవరకు వాద్యవాదనానికి సంబంధించిన పద్దెనిమిది జాతులను గూర్చి చెప్పాను. ఇటుపైన వీటికి సంబంధించిన భేదాలను చెపుతాను.

**మూ. అథ ప్రకారాః – చిత్రః, సమః, విభక్తః, ఛిన్నః, ఛిన్నవిద్ధః, విద్ధః, అనువిద్ధః, స్వరూపానుగతః, అనుసృతః, అనుసృతివిచ్యుతః, దుర్గః, అవకీర్ణః, అర్ధావకీర్ణః, ఏక రూపః, పరిక్షిప్తః, సాచీకృతః, సమరేఖః, చిత్రలేఖః, సర్వసమవాద్యః, దృఢః – ఇతి.**

**తా.** వాద్యవాదనంలోని ప్రకారాలు (విధాలు) – చిత్రము, సమము, విభక్తము, ఛిన్నము, ఛిన్నవిద్ధము, విద్ధము, అనువిద్ధము, స్వరూపానుగతము, అనుసృతము, అనుసృతివిచ్యుతము, దుర్గము, అవకీర్ణము, అర్ధావకీర్ణము, ఏకరూపము, పరిక్షిప్తము, సాచీకృతము, సమలేఖము, చిత్రలేఖము, సర్వసమవాద్యము, దృఢము.

**మూ. తత్ర – నిర్వర్తితాదిభిః ప్రయుక్తం చిత్రైః కరణైరనేకవిధహస్తైః,**
**త్రిలయం త్రిపాణియుక్తం చిత్రం వాద్యం బుధైర్జ్ఞేయమ్. 199**

**తా.** వాటిలో **(1) చిత్రవాదనం :–** నిర్వర్తితం మొదలైన చిత్రకరణాలతో, అనేక విధాలైన హస్తాలతో ప్రయుక్తమై మూడు లయలు, మూడు పాణులు ఉన్న వాద్యం **చిత్రవాద్యం.**

**మూ. దర్దురపణవమృదఙ్గైర్నానాకరణైస్తు యః సముపజాతః,**
**తాలాఙ్గవంశానుయుక్తః స తు విజ్ఞేయః సమో నామ. 200**

**తా. (2) సమవాదనం :–** వేరు వేరు కరణాలతో, దర్దుర – పణవ – మృదంగాల ఏ వాదనం, తాల – అంగ – వంశీలచేత అనుగతమౌతుందో, అనుసరించబడుతుందో, అది **సమవాదనం.**

**మూ. నాత్యాయతశ్చ యః స్యాత్ సంస్థానతః సమః విభక్తశ్చ,**
**అక్షరపాణిలయేషు చ విభక్తకరణే విభక్తస్తు. 201**

**తా. (3) విభక్తవాదనం :–** ఏ వాదనం తన శరీరాన్ని అధికంగా పెంచకుండా ఉంటుందో, దేని విభక్తము లైన కరణాలలోని అక్షరాలు, పాణులు సమానరూపంలో విభక్తములై తెలియబడతాయో, అది **విభక్తవాదనం.**

**మూ. వాద్యం ద్రుతలయం యత్ర సహసా చ నివర్తతే,**
**సర్వాతోద్యేషు భిన్నేషు ప్రకారశ్ఛిన్న ఏవ సః. 202**

**తా. (4) ఛిన్నవాదనం :-** ఒకే సమయంలో అన్ని వాద్యాలూ వేరు వేరుగా వాయించుచున్నప్పుడు, ద్రుతలయలో జరుగుతూన్న వాదనం, హటాత్తుగా నిలిపి వేస్తే అది **ఛిన్నవాదనం.**

**మూ. అవపాణిర్మృదఙ్గానాం పణవోపరిపాణి చ,**
**భవతి యత్ర వాద్యే తు ఛిన్నవిద్ధ ఇతి స్మృతః. 203**

**తా. (5) ఛిన్నవిద్ధవాదనం :-** మృదంగాలు అవపాణిలోను, పణవాలు ఉపరి పాణిలోను ఉంచిన వాదనం **ఛిన్నవిద్ధవాదనం.**

**మూ. మృదఙ్గకరణైర్వాద్యం పణవా వాదయన్తి చేత్,**
**సూచీవేధైర్విచిత్రైస్తు కరణై ర్విద్ధ ఏవ సః. 204**

**తా. (6) విద్ధవాదనం :-** మృదంగంమీద ప్రయోగించే కరణాలతో పణవాన్ని వాయిస్తే, ఆ కరణాలు విచిత్ర సూచీవేధ లైతే అది **విద్ధవాదనం.**

**మూ. విద్ధానువిద్ధం యద్వాద్యం సర్వాతోద్యేషు దృశ్యతే,**
**పరస్పరానువేధాచ్చ అనువిద్ధస్తు స స్మృతః. 205**

**తా. (7) అనువిద్ధవాదనం :-** అన్ని వాద్యాలకు సంబంధించిన విద్ధాలు పరస్పరం కలిసి నట్లు కనబడితే అది **అనువిద్ధవాదనం.**

**మూ. విశుద్ధవాద్యప్రకృతిః సమపాణికృతస్తథా,**
**స్వరూపానుగతశ్చైవ స్వరూప ఇతి స స్మృతః. 206**

**తా. (8) స్వరూపవాదనం :-** వాదనం దాని సామాన్యప్రకృతిని అనుసరించి సమపాణితో జరుగుతూ, దాని నిశ్చితస్వరూపానుసారం (అపరివర్తితంగా) ఉంటే అది **స్వరూపవాదనం.**

**మూ. మురజం పణవో వా పి పణవం దర్దురోఽపి వా,**
**యదానుయాయాదాతోద్యం స్వరూపానుగతస్తు సః. 207**

**తా. (9) స్వరూపానుగతవాదనం :-** మురజాన్ని పణవం అనుసరించినా, పణవాన్ని దర్దురం అనుసరించినా అది **స్వరూపానుగతవాదనం.**

**మూ. అనుగమ్య యదాతోద్యం గచ్ఛేద్ధి సలయం పునః,**
**శ్రుతవత్సమతావాద్యే తదానుసృత ఉచ్యతే. 208**

**తా. (10) అనుసృతవాదనం :–** ఒక వాదనం కొంతసేపు ఇతరవాద్యాల అనుసరణం చేసి, పిమ్మట ఆ లయనే తీసికొని ఆ వాద్యా లన్నింటితో కలిసి ఆలయను వినిపిస్తే అది **అనుసృతవాదనం.**

**మూ. ఏకైకానుగతం వాద్యం వాద్యజాతిసమన్వితమ్,**
**కృత్వాన్యజాతికం కుర్యాత్ తదానుసృతవిచ్యుతః. 209**

**తా. (11) అనుసృతవిచ్యుతవాదనం :–** ఒక అవనద్ధవాద్యం వాదనం తన జాతిలోనే ఉంటూ మరొక వాద్యాన్ని కొంత దూరం అనుసరించి, తరువాత మరొక జాతిలోనికి మారిపోతే అది **అనుసృతవిచ్యుతవాదనం.**

**మూ. యత్తు ప్రచారవిషమం సర్వమార్గప్రబోధకమ్,**
**అవిభక్తాక్షరకృతం తద్దుర్గః వాద్య ఉచ్యతే. 210**

**తా. (12) దుర్గవాదనం :–** ఒక వాదనం విషమగతిలో నడుస్తూ అన్ని మార్గాలను అనుసరిస్తూ, అక్షరవిభాజనం లేకుండా కొనసాగితే అది **దుర్గవాదనం.**

**మూ. సమావృత్తే మృదఙ్గాస్తు వాద్యన్తే పణవైర్యది,**
**నానావిచిత్రకరణైరవకీర్ణస్తథా స్మృతః. 211**

**తా. (13) అవకీర్ణవాదనం :–** పణవాలతో కలిసి మృదంగాల వాదనం విచిత్రములైన వివిధకరణాలలో జరిగినట్లయితే అది **అవకీర్ణవాదనం.**

**మూ. ద్రుతం లయం సమారుహ్య పణవో దర్దురోఽపి వా,**
**అవపాణౌ యదా స్యాతామర్ధకీర్ణా తు సా స్మృతా. 212**

**తా. (14) అర్ధకీర్ణవాదనం :–** పణవవాదనం గాని దర్దురవాదనం గాని అవపాణితో ద్రుతలయలో జరిగితే అది అర్ధకీర్ణవాదనం.

**మూ. సర్వాతోద్యాని యత్రైకం కరణం భావయన్తి చ,**
**సమవృత్తపదాన్యేవ ఏకరూప ఇతి స్మృతః. 213**

**తా. (15) ఏకరూపవాదనం :–** అన్ని వాద్యాల వాదనమూ కలిసి ఒకే కరణాన్ని అనుసరించి జరిగినట్లయితే అది **ఏకరూపవాదనం.**

**మూ. పణవైశ్ఛాదితం యత్ర వాద్యమల్పం మృదఙ్గజమ్,**
**అవిభక్తాక్షరపదం పరిక్షిప్తస్తు స స్మృతః. 214**

**తా. (16) పరిక్షిప్తవాదనం :–** అక్షరవిభాగం లేకుండా మెల్లగా జరుగుతూన్న మృదంగవాదనాన్ని పణవవాదనం కప్పివేస్తే అది **పరిక్షిప్తవాదనం.**

**మూ. చిత్రం హి కరణం యత్ర వాద్యైనైకేన వాద్యతే,**
**నృత్తాఙ్గహారానుగతం జ్ఞేయః సాచీకృతస్తు తత్. 215**

**తా. (17) సాచీకృతవాదనం :-** అంగహారాలతో కూడిన నృత్తాన్ని ఒకే వాద్యం వేరు వేరు కరణాలతో అనుసరిస్తే అది **సాచీకృతవాదనం**.

**మూ. కృత్వో పరిగతం వాద్యం పణవో దర్దురోఽపి హి,**
**యత్రోదీక్షేత మురజాన్ సముల్లేఖస్తు స స్మృతః. 216**

**తా. (18) సముల్లేఖవాదనం :-** ముందుగా పణవాన్ని గాని మురజాన్ని గాని వాయించిన తరువాత, మురజం ముఖం వైపు చూస్తే (మురజవాదనం చేస్తే) అది **సముల్లేఖ వాదనం**.

**మూ. చిత్రం బహువిధం వాద్యం మృదఙ్గపణవాదిభిః,**
**క్రియతే యత్ర సంబద్ధైః చిత్రలేఖః స ఉచ్యతే. 217**

**తా. (19) చిత్రలేఖవాదనం :-** మృదంగ - పణవాదులతో అనేకమైన ఇతర వాద్యాలు కలిసి చేసే వాదనం **చిత్రలేఖవాదనం**.

**మూ. సర్వమార్గగతో యస్తు సర్వపాణిలయాశ్రయః,**
**విచిత్రశ్చ విభక్తశ్చ స సర్వసమవాయకః. 218**

**తా. (20) సర్వసమవాయకవాదనం :-** ఏ వాదనంలో అన్ని మార్గాలు అనుసరింపబడతాయో అన్ని లయలు, పాణులు ఆశ్రయింపబడతాయో, దేని యందు వర్ణక్రమాదులు విభిన్నంగా, స్పష్టంగా గోచరిస్తాయో విచిత్ర మైన ఆ వాదనం **సర్వసమవాయకవాదనం**.

**మూ. యస్తు మధ్యలయోపేతః సమః సువిహితాక్షరః,**
**గతిప్రచారవిహితః ప్రకారో దృఢ ఏవ సః. 219**

**తా. (21) దృఢవాదనం :-** మధ్యలయలో సుస్పష్ట మైన అక్షరాలతో కూడిన, గతి - ప్రచారాలకు అనురూపంగా ప్రయోగింపబడే వాదనం **దృఢవాదనం**.

**మూ. ఏవమేతే ప్రకారాస్తు కర్తవ్యా వాద్యసంశ్రయాః,**
**గతిప్రచారే గేయే చ రసభావౌ సమీక్ష్య తు. 220**

**తా.** గతిప్రచారంలోను, గీతాలలోను ఈ వాద్యరీతులు, రసభావానుగుణంగా ప్రయోగించాలి.

**మూ. ప్రచారా జాతయశ్చైవ సర్వమార్గేషు సంస్థితాః,**
**యే వై గతిప్రచారేషు శుద్ధాస్తే కేవలాః స్మృతాః. 221**

**తా.** ఈ వాద్యప్రకారాలను, జాతులను అన్ని మార్గాలలోను ఉపయోగించవచ్చును. అయితే గతిప్రచారాలలో మాత్రం వీటిని శుద్ధరూపాలలోనే ప్రయోగించాలి.

**మూ. ఏతేషాం ప్రయోగమిదానీం వక్ష్యామి – తత్ర ఉపవిష్టః ప్రాఙ్ముఖో రఙ్గే కుతపనివేశః కర్తవ్యః, తత్ర పూర్వోక్తయోః నేపథ్యగృహద్వారయోర్మధ్యే కుతపవిన్యాసః కార్యః. తత్ర రఙ్గాభిముఖో మౌరజికః, తస్య దక్షిణతః పాణవికః, దార్దురికో వామతః. ఏష ప్రథమమవనద్ధకుతపవిన్యాస ఉక్తః.**

**తత్రోత్తరాభిముఖో గాయనః, గాయనస్య వామపార్శ్వే వైణికః; తస్య దక్షిణే వంశవాదకౌ, గాయకాభిముఖా గాయికా ఇతి కుతపవిన్యాసః.**

**తా.** ఇప్పుడు నే నీ వాద్యాల ప్రయోగాన్ని గూర్చి చెపుతాను – రంగమంచం మీద, వాద్యవాదక సమూహాన్ని, లేదా బృందవాదకులను (group singers) పూర్వాభిముఖంగా కూర్చుండబెట్టాలి. ఈ ఉపవేశనం – వెనుక చెప్పిన నేపథ్యం గృహం రెండు ద్వారాలమధ్య ఉండాలి. వీరిలో మృదంగవాదకుడు రంగమంచానికి అభిముఖంగా కూర్చోవాలి. వాని కుడి వైపున పాణవికుడు, ఎడమవైపున దర్దురవాదకుడు కూర్చోవాలి. ఇది ముందుగా చేయవలసిన అవనద్ధవాద్యాల విన్యాసం.

రంగమంచంమీద గాయకుడు ఉత్తరాభిముఖుడై కూర్చోవాలి. వాని ఎడమప్రక్క వైణికుడు, కుడిపక్క ఇద్దరు వేణువాదకులు గాయకునికి ఎదురుగా గాయిక కూర్చోవాలి. ఇది కుతపవిన్యాసం.

**మూ. మార్దఙ్గిక – పాణవిక – దార్దురికేషు, గాయక – గాయికా – వంశిక – వైణిక సహితేషు అశిథిలాయతతన్త్రీబద్ధాస్తనితేషు ఆతోద్యేషు యథాగ్రామరాగమూర్ఛనామార్జనానులిప్తేషు మృదఙ్గేషు, ఉద్ధారణ – నిపీడన – నిగృహీతముక్తప్రహారకృతేషు దర్దురవాదనముఖ్యవిన్యస్తహస్తైః వాదనకైః దేవతానామావాహనవిసర్జనార్థం ప్రథమమేవ త్రిసామ కర్తవ్యమ్.**

**స తు సర్వసచరాచరోత్పత్తిస్థితిప్రలయకర్తుః బ్రహ్మణో ముఖాభిసక్తేన ప్రథమేన సామ్నా వామపార్శ్వే చన్ద్రం సంప్రీణయతి, దక్షిణే పన్నగాన్, అథాన్తరేణ జలజం, ద్వితీయేన సామ్నా మునీన్, ఆయతేన తృతీయేన బృహత్సామ్నా దైవతాని చ.**

**తా.** మృదంగపణవ దర్దరవాదకులు, గాయక – గాయికలు, వీణావేణువాదకులు వారి వారి స్థానాలలో కూర్చున్న తరవాత, తంత్రీవాద్యాలను బిగించి వాటిమీద మోగించవలసిన గ్రామ – రాగ – మూర్ఛనలకు అనుగుణంగా ఉండే టట్లు, పరీక్షాపూర్వకంగా, వాటి ధ్వనులను సరిచేసుకోవాలి. మృదంగాలను మార్జనాదులతో పూసి సిద్ధం చేసికొని ఉద్ధారణ – నిపీడన – నిగృహీత – ముక్తప్రహారాలు చేసి పరీక్షించాలి. తరువాత వాదకులు

తమ హస్తాలు దర్ధరాదుల ముఖాలమీద ఉంచి ముందుగా దేవతల ఆవాహన – విసర్జనాల కొరకై 'త్రిసామ' అను ఉత్సవం జరపాలి.

సకలచరాచరజగదుత్పత్తిస్థితిప్రలయాలకు కారకు డైన బ్రహ్మదేవుని ముఖం నుండి బయల్వెడలిన మొదటి సామ ఎడమప్రక్కన ఉన్న చంద్రునికీ, కుడిపక్కన ఉన్న పన్నగులకు మధ్యలో ఉన్న జలచరాలకీ సంతోషం కలిగిస్తుంది. రెండవ సామచేత మునులను పెద్దదైన మూడవ సామచేత సకలదేవతాగణానికి సంతోషం కలుగుతుంది.

**మూ. ఏవం ప్రీణయతే యస్మాద్దైవతాని యథాక్రమమ్,**
**తస్మాత్త్రిసామ్ని విజ్ఞేయం త్రిసామత్వం బుధైరిహ. 222**

**తా.** త్రిసామ, క్రమానుసారం దేవతలకు సంతోషం కలిగిస్తుంది గాన దీనికి 'త్రిసామ' అను పేరు అని బుధులు తెలుసుకోవాలి.

**మూ. ఏవం చ శ్రయతే యస్మాద్ బ్రహ్మాణం కేశవం శివమ్,**
**తస్మాదేవత్ త్రిసామస్తు ఋషిభిః, పరికీర్తితమ్. 223**

**తా.** ఈ విధంగా – బ్రహ్మ, విష్ణువు, శివుడు ఆశ్రయించబడతారు గాన అందుచేత కూడ దీనికి త్రిసామ అని పేరు.

**మూ. చతుర్ణామపి వేదానామాదావోఙ్కార ఉచ్యతే,**
**తత్రాత్ర సర్వగీతానాం త్రిసామ పరిగీయతే. 224**

**తా.** నాలుగు వేదాల ప్రారంభంలోను ఓంకారం ఉచ్చరించబడుతుంది. అదే విధంగా అన్ని గీతాల ప్రారంభంలోను త్రిసామగానం చేయబడుతుంది.

**మూ. త్రిప్రకారం త్రిలయకం తథా చైవాడ్డితాశ్రయమ్,**
**షట్కలం త్రికలం చైవ త్రిసామ పరికీర్తితమ్. 225**

**తా.** ఈ త్రిసామ – మూడు ప్రకారాలతో, మూడు లయలతో అడ్డితమార్గంలో ఆరు లేదా మూడు కలల ప్రమాణం గల విభాగాలలో ఉన్న వాద్యవాదనం ద్వారా చేయబడుతుంది.

**మూ. త్రివిధం చైవాక్షరవిధౌ గురులఘ్వక్షరాన్వితమ్,**
**ఓకారశ్చ మకారశ్చ త్రికైస్త్రిగుణితం భవేత్. 226**

**తా.** గురు – లఘ్వక్షరాలతో కూడిన ఇది (త్రిసామ) అక్షరవిధానంలో మూడు విధాలైనది. ఓంకారము (అ+ఉ) మకారము (మ్) త్రికములచేత (మూడుమార్లు ఉచ్చరించ డంచేత) త్రిగుణితం అవుతుంది.

**మూ. తస్యైవ చాన్తే పూర్వరఙ్గవిధానమనుప్రాప్య ఛన్దఃసమేన చ అక్షరసమేన చ వాద్యేన బహిర్గీతవిధానం తు త్రిలయం వర్తనీయమ్. తత్ర ఆసారితప్రయోగే చ తత్త్వానుగతం వాద్యం ప్రాయః ప్రయోక్తవ్యమ్. యత్ర త్రిసప్తప్రత్యాహారాద్యవతీర్ణకోటిస్తత్ర వాద్యం ప్రవర్తతే. తత్రాదౌ తావత్ వామకోర్ధ్వకప్రహారయుక్తం, పశ్చాదాలిఙ్గ్యకమర్దనం గోపుచ్ఛాయతిమ్ ఆసాద్య విచిత్రీకరణయుతం చతుర్మార్గం సమార్దఙ్గికం సర్వభాణ్డికమపి వాద్యం పశ్చాత్ విపఞ్చీవాద్యం ప్రవర్తయితవ్యమ్. కస్మాత్? పూర్వం హి భాణ్డవాద్యేన సిద్ధిరుత్పాదయతి, పూర్వం భాణ్డేనాభివ్యఞ్జితో రఙ్గే ధ్రువావిధిః స్త్రీబాలమూర్ఖావకీర్ణే రఙ్గే కుతూహలజనన సమర్థం వాద్యం సముత్పన్నం భవతి.**

**తా.** త్రిసామ పూర్తి అయిన తరువాత పూర్వరంగవిధానం ప్రవర్తింపచేస్తూ, వాద్య వాదనం ఛందస్సులోని వర్ణాలను అనుసరిస్తూ మూడు లయలలోను జరిపిస్తూ బహిర్గీత ప్రయోగం చెయ్యాలి. ఆసారితగీతప్రయోగసమయంలో తత్త్వ – అనుగతవాద్యవాదనం ఉండాలి. త్రిసామ తరువాత, ప్రత్యాహారాద్యంగాలు కూడ పూర్తి చేసిన తరువాత మాత్రమే వాద్యవాదనం ప్రారంభించాలి. వాదనక్రమం ఇలా ఉండాలి – అన్నింటికంటె ముందు వామక – ఊర్ధ్వకవాదనం జరగాలి. తరువాత గోపుచ్ఛాయతితో ఆలింగ్యవాదనమూ, తరవాత విచిత్రకరణాలతో కూడిన నాలుగు మార్గాలలోను విపంచీవీణావాదనం చెయ్యాలి.

**ప్రశ్న :–** మృదంగంతో పాటు అన్ని వాద్యాల వాదనమూ అయిన తరువాత చివర ఇలా ముగించడం ఎందుకు? సమాధానం – ముందుగా అవనద్ధవాద్యాల వాదనం చేయడంవల్ల సిద్ధి కలుగుతుంది.

ముందుగా వాద్యం ద్వారా ధ్రువాప్రయోగం జరగబోతుంది అని సూచించాలి. సాధారణంగా నాట్యమండపంలో స్త్రీలు, బాలులు, సామాన్యప్రేక్షకులు అధికసంఖ్యలో ఉంటారు. వాద్యసంగీతం వాళ్లలో కుతూహలాన్ని అభిరుచిని పుట్టిస్తుంది.

**మూ. అపి చ –**

**ఆచార్యాః సమమిచ్ఛన్తి పదచ్ఛేదం తు పణ్డితాః,**
**స్త్రియో మధురమిచ్ఛన్తి విక్రుష్టమితరే జనాః. 227**

**తా.** మరొక విషయం ఏమనగా – సంగీత కలానిష్ణాతులైన ఆచార్యులు సమత్వాన్ని ఇష్టపడతారు. విద్వాంసులు పదచ్ఛేదాన్ని, స్పష్టత్వాన్ని ఇష్టపడతారు. ఆడవాళ్లు గాయకుల గానమాధుర్యాన్ని ఇష్టపడతారు. సామాన్యజనులు ఉచ్చైఃస్వరంతో రాగం సాగతీయడాన్ని ఇష్టపడతారు.

**మూ. తస్య చాన్తే తాణ్డవప్రయోగమధికృత్య నర్తక్యా అవతరణకాలే లఘువర్ణైః మార్దఙ్గికైః అఙ్గులిప్రచాలనప్రాయం వాద్యం యోజ్యమ్. నర్తక్యవతరణగీతాన్తే సన్నిపాతా జ్ఞేయాః.**

**లాస్యనృత్తానుగతం కరణాశ్రితం వాద్యం ప్రయోజ్యమ్. కరణధాతుసంయోగముచ్యతే "సమం రక్తమ్" (నా.శా. 33.194) ఇత్యాది. తత ఇదానీం వాసోర్ధ్వకప్రహార సంయుక్తమ్, ఆలిప్తమార్గదేశకరణసంశ్రయం సముత్థాపనకే వాద్యం యోజ్యమ్. యథా – ధేజ్ మతి ధజ్మథా ధేజ్ధితి టిత్ సంక్రంక్రం ఖోక ణే దేవ్యాం కేన్తాం కిటి ధేజ్ – ఇతి పూర్వరఙ్గలయ పాతనిర్దిష్టప్రయోగసముత్థాపనకే వాద్యం యోజ్యమితి.**

**తా.** వాద్యవాదనం తరవాత తాండవ ప్రయోగంకొరకు రంగమంచంమీదికి నర్తకి ప్రవేశిస్తూన్న సమయంలో మార్దంగికుడు అంగులిస్పర్శమాత్రమే చేస్తూ లఘువర్ణసము దాయంతో నిర్మించిన వాద్యవాదనం చెయ్యాలి. నర్తకీప్రవేశసమయంలో చేయవలసిన అవతరణగీతగానం తరువాత సంనిపాతం ప్రయోగించాలి. ఈ సమయంలో ప్రయోగించే సంగీతంలో తగురీతిలో కరణాల ప్రయోగం, లాస్యనృత్యానికి సంబంధించిన అంగహారాల ప్రయోగం ఉండాలి. కరణధాతుసంయోగం ఉండాలి. ఈ కరణధాతుసంయోగం ఉండడం చేతనే **'సమం రక్తమ్'** అని చెప్పబడింది.

**మూ. తయోః పరం యత్పరివర్తనం చాతుర్మార్గికశుద్ధజాత్యాశ్రయం యథా ప్రోక్తం ఖోఖోణాం ఖోఖోఖోణాం ఖఖోఖోణా ఏతద్ ద్రవ్యైర్యద్వాద్యం స్యాత్. పునస్త్రయో న్యాసా ఖోఖోదో ఖో ఖకేణాంఘత్ర యంత్రాంఘ నపుంసకపాదే. తథాకోన దుఖోజ్ మార్గం ఇతి చతుర్థప్రకారప్రవేశే చ వాద్యమఙ్గులిప్రచలనప్రాయమ్.**

**తా.** ఈ రెండు వాదన ప్రకారాల తరవాత నాలుగు మార్గాలలో విశుద్ధజాతులను ఆశ్రయించి ఉన్న పరివర్తనం ఉండాలి. ఇది **ఖోఖోణాంఖణోఖోణాంఖోఖోణాం** అను అక్షరాలతో నిర్మించబడుతుంది. తరువాత నపుంసకపాదసమయంలో **"ఖోఖో ... త్రాంఘం"** చేర్చాలి. తరువాత చతుర్థప్రకారప్రవేశసమయంలో వాద్యవాదనం **"కోనదుఖోజ్"** వంటి అక్షరాలతో జరగాలి. వాదకుడు వాద్యంమీద వేళ్లు తగిలీతగలనట్లుగా కదుపుతూ (అఙ్గులి ప్రచలనప్రాయం) మోగించాలి.

**మూ. వస్తూత్థాపనకే చాపకృష్టాయామర్ధమపి చార్యాం గ్రహో యథా – ఘేఘేన్తాం ఘేఘేజ్ ఘఖణాదోణాం ఘోఘఘౌఘఘే – ఇతి.**

**నాన్దీశుష్కాపకృష్టాయాం ప్రతిశుష్కం కరణం శ్రితం వాద్యం యోజ్యమితి. యథా – థోథోథో ఖేఖఘో ఘజ్ ణాదమ్యజ్ ఖోద్ఘో కుతాం ఖఖేఖేణకుసుగుకఘేజ్ ణోఖిఖేజ్ తాజ్ ఖేజ్ ణమ్ కిటి కిటి గఘేజ్ ఘేకటుక ఘదుకంలవలాఖో ఖోఖోఖో వాఘృతేటాం మాలింణంపాం కిటి వత్థి ఇతి.**

**తా.** వస్తూత్థాపన – అపకృష్టాచారీసమయాలలో చేసే వాద్యవాదనాదం వీటికీ చెయ్యాలి. **"ఘేఘూతా ... ఘేఘఘే"**.

నాందీశుష్కాపకృష్టాధ్రువలో ప్రతిశుష్కకరణంలో చేయవలసిన వాద్యవాదనం ఈ అక్షరక్రమంలో ఉంటుంది – **"థో ఘో ... వత్థి"**.

**మూ. రఙ్గద్వారప్రచరణే, జర్జరశ్లోకనిగదనే, చార్యాం చాడ్డితమార్గాశ్రితం సన్నిపాత గ్రహణం ప్రయోక్తవ్యమ్. మహాచార్యాం వితస్తమార్గాశ్రితం వాద్యం ప్రదేశిన్యా గ్రహం అపూర్వం తద్వత్ పూర్వరఙ్గే తాణ్డవవాద్యముక్తమ్. సన్నిపాతగ్రహో యథా వామకరేణ – ఖో ఖో ణాం దో దో దోకః మోక్షః దహేణ ణా థో థో ణో ఘోఘ టమటథిఘం ఘోఘోకర కరఝుంఖో ఖోఖిత కటకటాం ఘటకమత్థి ఘోఘో మిథి ణాం కిటి కినాం ఖకవలం ఇతి.**

**తా.** రంగద్వారప్రచారణం చేసి జర్జరశ్లోకపాఠం చేసే సమయంలో చారీప్రయోగం జరుగుతూన్నప్పుడు అడ్డితమార్గానికి చెందిన సన్నిపాతం గ్రహించాలి; మహాచారీ సమయంలో వాద్యవాదనం వితస్తామార్గంలో జరగాలి. ఇక్కడ గ్రహం ప్రదేశిన్యంగులితో చెయ్యాలి.

ఇదే విధంగా పూర్వరంగప్రయోగసమయంలో తాండవానికి ఉపయోగించే విశిష్టవాదనం తీసికొన్నప్పుడు సన్నిపాతగ్రహవాదనం ఎడమచేతితో చేయబడుతుంది. దీని అక్షరాలు – **"ఖో ఖో ... కవలం"**.

**మూ. ఆలిప్తమార్గాశ్రితం వాద్యమతఃపరముదాహార్యమ్. వితస్తమార్గస్థితికం వాద్యం ప్రదేశిన్యా గ్రహో యథా – ణణఖోణణో మఘుణాం ఖో ఖో మథి తకితాం కిన్తి కితాం కిటి కిన్తో ఖో ఖో మతితా మత్థిత్రమతి తికితి కేన్తాం ద్రౌన్తాం నత కేన్తాం టఘేతాన్ద్రాం కృన్తాం ద్రాం ద్రాన్తాం కిన్నాం కిన్నాం కేన్తాం ముద్రాం ఘ్రేం ఘ్రేం క్లేం ఘ్రుం ఘ్రుం ద్రాఘ్రూం ఘుద్రే ద్రాం ఘేన్ద్రాం ఘేన్ద్రాం ఘజ్ఞే క్లేజ్ ఇతి.**

**తా.** దీని తరువాత ఒక ఆలిప్తమార్గప్రయోగం చెయ్యాలి. వితస్తమార్గంలో ప్రదేశిని చేత గ్రహం అయిన పిమ్మట ఈ అక్షరక్రమంలో వాద్యవాదనం జరుగుతుంది – **"ణణ ... క్లేజ్"**.

**మూ. పటక్షేపణాత్ సిద్ధేరేతావచ్చతురస్రే పూర్వరఙ్గవిధానే భాణ్డవాద్యం ప్రయోజయేత్. త్ర్యస్రే తదేవ కాలావ్యవహితమ్. పునశ్చ నాటకాదిషు ధీరోదాత్త – ధీరోద్ధత – ధీరలలిత – ధీరప్రశాన్తానాం చతుర్ణాం నాయకానాం స్వస్వావస్థాసు నిర్గతం వాద్యముప దేక్ష్యామః. తత్ర ధ్రంధ్రం ధాన్ద్రం ప్రాయో దేవానాం గతే ప్రయోజ్యమ్. ఘేన్తాంప్రయోజ్యం రాజ్ఞామ్. ధ్రంక్లధట ధేజ్ ఘేట టత్థిదున క్రిటిద్రాం నాం నాం ధద్రాం ప్రాయో మధ్యమ పురుషేషు వాద్యమ్.**

**తా.** చతురస్రపూర్వరంగప్రయోగసిద్ధికొరకు – తెర తొలగించినది మొదలు అవనద్ధ వాద్యవాదనం జరగాలి. త్ర్యస్రపూర్వరంగంలో కూడ ఇదే విధంగా, మధ్యలో ఆపకుండా వాద్యవాదనం జరగాలి.

ఇప్పుడు నేను నాట్య ప్రయోగంలో నాటకాది విభిన్నరూపకాలలో ధీరోదాత్తధీరోద్ధత ధీరలలిత – ధీరశాంతనాయకుల గతిప్రచారంలోను, ఆ యా ఇతరావస్థలయందు చేయవలసిన వాద్యవిధానం చెపుతాను. దేవతాపురుషుల గతి సమయంలో సాధారణంగా, ఘ్రుం ధ్రం ధ్రం ధాస్త్రం ప్రయోగించాలి. రాజులగతులయందు **ధేన్తాం** ప్రయోగించాలి. మధ్యమపురుషుల విషయంలో **ధ్రం క్లం ధటు ధేజ్ ధేట్ టిత్థిధున్ క్రిటిద్రాం నాం నాం ధద్రాం వాద్యం** ప్రయోగించాలి.

**మూ. పునరేవం స్థితాయాం వాద్యవిధానం వక్ష్యామి.**

**త్రికలద్వికలైకకలాశ్చతుష్కలాశ్చైవ పాదవిన్యాసాః,**
**తత్ర తు సామ్యం కార్యం భాణ్డేన సమం చ గానే. 228**

**తా.** స్థితాధ్రువలో అనుసరించవలసిన వాద్యవిధానం మళ్లీ చెపుతాను –

పాదవిన్యాసాలు త్రికలలు, ద్వికలలు, ఏకకలలు, చతుష్కలలు ప్రమాణంలో ఉంటాయి. అప్పుడు భాండంతోను, గానంతోను పాదవిన్యాసాలకు సామ్యం ఉండేటట్లు చూడాలి.

**మూ. పునశ్చావస్థాకృతం వాద్యం వక్ష్యామి. త్వరితగమనే – వం వం ఘే ఘౌ టాం ఇత్యేవ వాద్యం ప్రయోక్తవ్యమ్. యథా విషమాదికమఙ్గులిప్రచలకృతం విహితమ్. తత్రైవ పూర్వం సమ్యగ్ లిఖితం త్వఙ్గులిప్రచారేషు. పునరన్యావస్థాసు వాద్యవిధానం వక్ష్యామి–**

**స్వస్థే గతిప్రచారే వాద్యం త్రికలం చతుష్కలం వాపి,**
**లయగతివిధానమఖిలం సమీక్ష్య తద్‌జ్ఞైః ప్రయోక్తవ్యమ్. 229**

**తా.** రూపకప్రయోగాలలో వివిధావస్థలలో చేయవలసిన వాద్యవిధానం చెపుతాను. పాత్రలు వేగంగా నడచేటప్పుడు – 'వం వం ఘే ఘౌ టాం' ఉపయోగించాలి. ఈ శబ్దాలు వేళ్లతో విషమంగా ప్రహారాలు చేయడం ద్వారా పలికించాలి. ఈ విషయం వ్రేళ్లతో వాదనం చేసే వాద్యగతిని గూర్చి చెప్పిన సందర్భంలో, వెనుక, వివరించి ఉన్నాం. ఇక్కడ నేను ఇతరదశలలో చేయవలసిన వాద్యవిధానాన్ని మళ్లీ చెపుతాను.

స్వస్థగతిప్రచారంలో – లయ – గతివిధానాన్ని అంతనీ పూర్తిగా దృష్టిలో ఉంచుకొని, వాద్యజ్ఞులు, త్రికలవాద్యం కాని, చతుష్కలవాద్యం కాని ప్రయోగించాలి.

**మూ. న హ్యేకకలా ద్వికలా వా ధ్రువావిరామా భవన్తి వాద్యేషు,**
**తస్మాద్భాణ్డేనైవ చ సామ్యం కార్యం న గానే. 230**

**తా.** ధ్రువల మధ్య చేసే వాద్యవాదనాలలో ఏకకలావిరామం గాని, ద్వికలావిరామం కాని ఉండదు. అందుచేత గతిప్రచారాన్ని వాద్యవాదనంతో కలిపి ఉంచాలి గాని గీతంతో కలిపి ఉంచకూడదు.

**మూ. సర్వత్ర త్వరితగమనేషు పాతాః పూర్వోక్తా యే గతిప్రచారేషు,**
**ధృజ్ ధృజ్ ఘేజ్ ఘేజ్ ప్రాయం తత్ర చ వాద్యం ప్రయోక్తవ్యమ్. 231**

**తా.** పాత్రల శీఘ్రగమనసమయంలో, గతిప్రచారప్రకరణంలో చెప్పిన తాలపాతాలనే ఉంచాలి. ఈ సమయంలో వాద్యవాదనంలో **ధ్రజ్ ధ్రజ్ ఘేజ్ ఘేజ్** అను ప్రహారాలు పలికించబడతాయి.

**మూ. దుఃఖార్తివ్యాధితేష్ట (జన) శాపక్లేశేష్టజనవియోగవిభవనాశవధబన్ధవ్రతనియమోపవాసాదియుక్తేషు పూర్వాలిప్తమార్గాశ్రితముత్థాపనవాద్యం విధాతవ్యమ్. దైత్యదానవయక్షరాక్షసగ్రహాదీనాం ధృజ్ ధృజ్ ఖద సంయుక్తం, ఘటు తు తం త తేతోన్ద్రాం ఇత్యేవమాది కరణైర్గతివాద్యం ప్రయోజయేత్. ఖఞ్జవికలవామనకుబ్జాదీనాం ప్రవృత్తగమనేషు ఘేతాం కటకాం ఇతి వాద్యం ప్రయోక్తవ్యమ్. విదూషకనిర్ముణ్డకోపస్థాయకవర్షవరాదీనాం ఘేఘేం స్తానోణ్ణో దోణ్ణణ్ణామితి వాద్యమ్. పునశ్చైవాథ వృద్ధశ్రోత్రియకఞ్చుకిస్థూలాదీనాం ధ్రాం ధ్రోం ధ్రాజ్ ద్రోజ్ ధిజ్ ద్రోణాం ఖో ఖో ణా ఇతి వాద్యం ప్రయోక్తవ్యమ్. గజవాజిఖరోష్ట్రరథవిమానయానేషు వంకిటిప్రాయమ్. సర్వత్రోత్తమమధ్యమాధమేషు పురుషేషు ఇత్థం రసాన్ భావాన్ భువి సమీక్ష్య వాద్యం ప్రయోక్తవ్యమ్. ఏవం తావత్ పురుషవాద్యమ్.**

**తా.** దుఃఖము, ఆర్తి, వ్యాధి, ఇష్టజనుల శాపము, క్లేశము, ఇష్టజనుల వియోగము, విభవనాశనము, ఇష్టజనుల వధ – బంధనాలు, నియమాలు తపస్సు మొదలైనవాటిలో ఉండడం మొదలైన కష్టాలలో ఉన్నవాళ్ల విషయంలో, ఉత్థాపనంలో చేసే అవనద్ధవాద్యాల వాదనం, వెనుక చెప్పిన ఆలిప్తమార్గంలో చెయ్యాలి. దైత్య – దానవ – యక్ష – రాక్షస గ్రహాలవంటి పాత్రల గతులలో చేసే వాద్యవాదనం **"ధృజ్ .. ద్ధాం"** అను అక్షరాలతో ఉండాలి. కుంటివాళ్లు, దుర్బలులు, గూనివాళ్లు – వీళ్ల కదలికలలో వాద్యవాదనం – **"ఘేతాం కటకాం"** వంటి కరణాలతో ఉండాలి. విదూషక – నిర్ముండక – ఉపస్థాపక – వర్షవరాదుల చలనాలలో **"ఘేఘేం ... ణ్ణాం"** వాద్యం ఉండాలి. గజ – అశ్వ – ఉష్ట్ర – రథ – విమానయానాల చలనాలలో వంకిటితో కూడిన వాద్యవాదనం జరగాలి. ఈ విధంగా, అంతటా కూడ, రస – భావాదులను దృష్టిలో ఉంచుకొని ఉత్తమ – మధ్యమ

– అధమపాత్రల విషయంలో వాద్యవాదనం ఉండాలి. ఇంతవరకు చెప్పినది పురుషవాద్యం.

**మూ. స్త్రీణాం పునరపి వ్యాఖ్యాస్యామః – తత్రోత్తమస్త్రీణాం దివ్యానాం – వం గతి కిపి ధమేటప్రథి ఘే ఇతిప్రాయమ్. చం కిత్తి కిథి ఘట మట థి ఘే ఇతి బ్రాహ్మణానామ్. అథ మధ్యమస్త్రీణాం వేశ్యాశిల్పకారికాణాం నాటకీయానాం – ఘ ఖ ఖ ఘికిటమత్థికిణ టోణాంథో ఇతి. మరథికులే కో ఖ కిణి ప్రాయం గీతమధమస్త్రీణామ్. ఏవం తావత్ సమాసాదభిహితం స్త్రీణామ్.**

**తా.** ఇపుడు స్త్రీపాత్రలవిషయంలో వాద్యవిధానం చెపుతాను. ఉత్తమ – దివ్యస్త్రీ పాత్రల విషయంలో సాధారణంగా – **"వంగతి ... ఘే"** ఉపయోగించాలి. మహారాణుల విషయంలో **"కిథి ... ఖు"** ల ప్రయోగం సాధారణంగా ఉంటుంది. బ్రాహ్మణస్త్రీల విషయంలో **"చం ... ఘే"** లు ప్రయోగించాలి. మధ్యమపాత్రల విషయంలోను, వేశ్యా – శిల్పకస్త్రీల విషయంలోను **"ఘ ... ఘో"** లతో కూడిన వాదనం ఉండాలి. అధమస్త్రీ పాత్రల విషయంలో అధికంగా – **"మరథి ... ఖి"** ల ప్రయోగం ఉంటుంది.

**మూ. అవస్థాన్తరితానాం తు త ఏవ పౌరుషవాద్యవిశేషా భవన్తి. తస్మాత్ సామాన్యతో హి భయక్లేశశోకక్రోధాదయో విభావాః సముత్పద్యన్తే. తత్ర ఆసామపి రసభావాపేక్షం మార్గాశ్రితం వాద్యం యోజ్యం భవతి.**

**తా.** స్త్రీలే అవస్థావిశేషాలలో ఉన్నప్పుడు పురుషవిషయంలో ఉపయోగించే వాద్య వాదనాలు ప్రయోగించాలి. ఎందువల్ల నగా భయ – క్లేశ – క్రోధాది విభావాలు స్త్రీ పురుషులందరికీ సమంగానే ఉంటాయి. స్త్రీల విషయంలో వాద్యప్రయోగం కూడ రసభావానుగుణంగా ఉచితమార్గాలలో ఉండాలి.

**మూ. అపిచ –**

**జాతిమార్గప్రకారైస్తు కరణైరక్షరైస్తథా,**
**వాదయేద్యస్తు సంకీర్ణం స శ్రేష్ఠో వాదకః స్మృతః. 233**

**తా.** జాతి – మార్గ – కరణ అక్షరాలను ఉచితరీతిలో ఉంచుతూ వాద్యవాదనం చేసే వాడే శ్రేష్ఠవాదకు డని చెప్పబడతాడు.

**మూ. అథాన్తరవాద్యాని చ – అనువిద్ధం, విప్రహారికం, సిద్ధిగ్రహణం, పరిచ్ఛిన్నమితి. తత్ర అనువిద్ధసంజ్ఞమన్తరవాద్యం యథా – ఖో ఖో ణే ణే ఘే ఇతి. వాద్యవిరామే విప్రహారితం యథా – ధ్రం ద్రాం ఖో ఖో ఇతి.**

**తా.** మధ్య మధ్య వాయించే అంతర వాద్యాలు – అనుబద్ధము, విప్రహారికము, సిద్ధిగ్రహణము, పరిచ్ఛిన్నము అనేవి.

**"ఖో ... ఘే"** అనేది అనువిద్ధమనే అంతరవాద్యానికి ఉదాహరణం. వాద్య విరామంలో విప్రహారితం ఎట్లనగా – **"ద్రం ... ఖో"**.

**మూ. సిద్ధిరపి చ**

**ఐశ్వర్యే విస్మృతే శ్రాన్తే వస్త్రాభరణసంయమే,**
**సిద్ధిర్వాదయితవ్యా తు నానాకరణసంశ్రయా. 234**

**తా.** సిద్ధిగ్రహణవాద్యం –

ఐశ్వర్యప్రాప్తి, విస్మరణము, అలసట, వస్త్రాభరణాదిధారణము – ఈ సమయాలలో వివిధకరణాలతో సిద్ధివాద్యవాదనం చెయ్యాలి.

**మూ. సా చ సిద్ధిర్యథా:–**

**మార్గాశ్రయా, కార్యా చిత్రకరణా పఞ్చషట్కలా భవతి. అపి చ –**
**పాత్ర్యవిరామే వాద్యా కర్మసాధనకృతే విరామే చ,**
**వస్త్రాభరణనిపాతే ముకుటస్య చ సంయమనకాలే. 235**

**తా.** సిద్ధిలో వాద్యం ఉచితమైన మార్గాలలో చిత్రకరణాలతో ఐదారు కలల ప్రమాణంలో ఉండాలి. దీని ప్రయోగం పాత్ర్యవిరామంలోను, ఏదైన ఒక పని ప్రారంభించి నపుడు మధ్యలో ఏదైన చిన్న విరామం ఏర్పడి నప్పుడు, వస్త్రాభరణధారణసమయంలోను, ముకుటధారణసమయంలోను ఉంటుంది.

**మూ. అథ పరిచ్ఛిన్నమ్ – సార్వభాణ్డికం ధ్రువాయా గ్రహోపశమే గమ్భీరధీరప్రహార ముద్ధతం యథా – పఞ్చషట్కలం చ, తథోత్తమానాం వితస్తమార్గాశ్రితం – ఘుం ఘుం టుం ల్క ఇతి. తథా ఉత్తమస్త్రీణామడ్డితవాద్యాశ్రితం యథా – ణణ్ణా ఖో ఖో ణణ్ణాం ఇతి. అథాధమానాం ఖఞ్జ – నత్కుట విషయం యథా – సం. సంకే తకి టకి ణ్ణాం ఇతి. అవస్థాన్తరేషు పునరేతదేవార్ధకృతం భవతి.**

**తా. పరిచ్ఛిన్నం :–** ధ్రువాప్రారంభం అయినపుడు వాదనం స్పష్టంగా ఉండాలి. అది అన్ని అవనద్ధవాద్యాల మీద, వితస్తమార్గంలో, **ఘుం, ఘుం ల్క** వంటి అక్షరాలతో, గంభీరధీరప్రహారాలో ఉద్ధతంగా ఉండాలి. ఉత్తమస్త్రీపాత్రల విషయంలో వాద్యవాదనం అడ్డితమార్గంలో, **ణ ణాం ఖో ఖో ణణ్ణాం** అక్షరాలతో ఉంటుంది. అధమస్త్రీపాత్రల విషయంలో ఖంజ – నత్కుట ధ్రువలలో ఉపయోగించే వాద్యవాదనం ఉపయోగించ బడుతుంది. ఇతరావస్థలు ఏర్పడి నపుడు దీని అర్ధభాగం మాత్రమే ఉపయోగించాలి.

**మూ. అథ ప్రాసాదికీ ప్రావేశిక్యాక్షేపిక్యవకృష్టాసు : తత్ర ప్రాసాదిక్యాం సమపాణౌ విభక్త కరణం వాద్యమ్. ద్రుతాయామ్ ఉపరిపాణికే చిత్రకరణమ్. స్థితాయామడ్డితాయామ్ అవకృష్టాయామ్ అర్ధసన్నిపాతకృతమితి.**

**తా.** ఇపుడు ప్రాసాదికీ – ప్రావేశికీ – ఆక్షేపికీ – అవకృష్టాధ్రువలలో ఉండే వాద్య వాదనాలను గూర్చి చెపుతున్నాం – ప్రాసాదికీ – ప్రావేశికీధ్రువలలో సమపాణితో కరణాలను విడి విడిగా ప్రయోగిస్తూ వాద్యవాదనం చెయ్యాలి. ద్రుతలయలో ఉన్న ద్రుతాధ్రువలో ఉపరిపాణితో కూడ చిత్రకరణంలో వాద్యవాదనం చెయ్యాలి. స్థితాధ్రువలో విలంబితలయలోను, అవకృష్టాధ్రువలో అర్ధసంనిపాతంలోను వాద్యవాదనం జరగాలి.

**మూ. ఏవమేతత్ ప్రయోక్తవ్యం వాద్యం గతిపరిక్రమే,**
**ప్రాసాదిక్యాం ధ్రువాయాం చ త్వన్తరాయాం తథైవ చ. 236**

**తా.** ప్రాసాదికీ – అంతరాధ్రువలలో గతిప్రచారాలలోను, ఇతర క్రియలలోను వాద్యవాదనం ఈ విధంగా జరగాలి.

**మూ. అభాణ్డమేకం గీతం తు పరివర్త్య ప్రయోజయేత్,**
**సన్నిపాతావసానేషు భాణ్డవాద్యగ్రహో భవేత్. 237**

**తా.** పరివర్తనరూపంలో, వాద్యవాదనం లేకుండా ఒక గీతం గానం చేయాలి. సన్నిపాతం ముగిసిన తరువాత వాద్యగ్రహణం (వాదనప్రారంభం) చెయ్యాలి.

**మూ. యథా ద్రుతవిలమ్బితాయాం చ 'తేలషోష' ఇతి. అడ్డితాయాశ్చ పాదే దే దే దేదే ఖో ఖో ఖ – ఇతి. అథ నత్కుటఖఞ్జయోః – షణ్ణా వువుణా ణా ఖో ఖో ణాణ్ణా దేదే దే దే ఖో ఖో ఖో ఖ ఇతి.**

**తా.** ద్రుత – విలంబితలయప్రహారాలు **"తేల షోష"** ఇలా ఉంటాయి. అడ్డితలో **"దే దే ... ఖ"**, ఖంజక – నత్కుటకాలలో **"ణ ... ఖ"** ఉంటాయి.

**మూ. అథోద్ఘాత్యమ్ –**
**సమ్భ్రమావేగహర్షేఽథ విస్మయావేగశోకజే,**
**గ్రహే దానస్య యద్వాద్యం తదుద్ఘాత్యం ప్రకీర్తితమ్. 238**

**తా.** తొందర, ఆకులత్వము, హర్షము, ఆశ్చర్యము, ఆవేగంవల్ల కలిగిన శోకము, దానగ్రహణము – ఈ సమయంలో చేసే వాద్యవాదనం ఉద్ఘాత్యం.

**మూ. మోక్షమిదానీముపదేక్ష్యామః. తద్యథా – సంహననం, సంసరణం చ. తత్రోద్ధతద్రుతానుబన్ధే – ధేత్తాం కికిటి దత్త కేత్తికిం గో దోఘఘే దో ఘ టేఘో ఘే యదో ఇతి. అథ ఖఞ్జనత్కుటకయోః – ఘే ద్రాం ఘుం ద్రాం తికితాం తకితాం గుదుఘే – ఇతి.**

**తా.** ఇపుడు వాద్యవాదనమోక్షం (వాదనం ఆపివేయడం) చేసే విధానం చెపుతాను. దీనిలో సంహననం, సంహరణం అను రెండు విధా లుంటాయి. ఉద్ధత – ద్రుత అనుబంధాల మోక్షంలో **"ఘేతాం ... యదో"** ఈ అక్షరా లుంటాయి. ఖంజ – నత్కుటక మోక్షంలో **"ఘేటారి ... గుదుఘే"** ఈ అక్షరాలుంటాయి.

**మూ. అథ స్థితాయామ్ – ధేధం ధేట్ మటధే ధే ఛిమటం కటభి మటభి కర్మాక దీ ఘటి – ఇతి. తత్రాడ్డితాయాం – కిన్త – కిన్తామ్ – ఇతి. అథ స్థితాయామ్ – ఘతతామ్ ఇతి. అవకృష్టాయామ్ – వవతామ్ – ఇతి.**

**తా.** విలంబితామోక్షంలో **"ధేధం ... ఘిటి"** ఈ అక్షరా లుంటాయి. అడ్డితాధ్రువా మోక్షంలో – **"కింత కింతాం"** ఉంటాయి. స్థితాధ్రువలో – **"ధత్ తాం"** ఉంటాయి. అవకృష్టాధ్రువామోక్షంలో **'వవతాం'** ఉంటాయి.

**మూ. ఏవమేతే గ్రహా మోక్షా ధ్రువాణాం గదితా మయా,**
**నిష్క్రామే చ ప్రవేశే చ ఆక్షేపిక్యాన్తరాసు చ. 239**
**ఏవం తాలకాలస్వరజ్ఞానేన మార్ధఙ్గికేన ప్రయతితవ్యమ్.**

**తా.** నే నింతవరకు – నైష్క్రామికీ – ప్రావేశికీ – ఆక్షేపికీ – అన్తరాధ్రువాల గ్రహాలను మోక్షాలను చెప్పాను.

మార్దంగికుడు ఇంతవరకు చెప్పిన ఈ తాల – కాల – స్వరజ్ఞానంతో ప్రయోగం చేయడం కోసం ప్రయత్నించాలి.

**మూ. భవతి చాత్ర శ్లోకః –**

**అతాలజ్ఞమకాలజ్ఞమశాస్త్రజ్ఞం చ వాదకమ్,**
**చర్మఘాతకమిత్యేవం ప్రవదన్తి మనీషిణః. 240**

**తా.** ఈ విషయంలో ఒక శ్లోకం ప్రసిద్ధంలో ఉంది –

తాలజ్ఞానం లేని కాలజ్ఞానం లేని, శాస్త్రజ్ఞానం లేని వాద్యవాదకుడు కేవలం చర్మ ఘాతకుడు (చర్మమీద బాదేవాడు) మాత్రమే అని పండితు లంటారు.

**మూ. ఏతేనైవ విధానేన వాద్యం యోజ్యం ప్రయోక్తృభిః,**
**అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి హ్యాతోద్యానాం తు లక్షణమ్. 241**

**తా.** వాద్యప్రయోక్తలు ఈ విధానాన్ని అనుసరించి వాద్యప్రయోగం చెయ్యాలి. ఇటుపైన నేను ఆతోద్యాల లక్షణం చెపుతాను.

**మూ. త్రిధా క్రియా మృదఙ్గానాం హరీతకీ యవాశ్రయా,**
**తథా గోపుచ్ఛరూపా చ భవత్యేషా స్వరూపతః. 242**

**తా.** మృదంగాలు మూడు ఆకారాలలో ఉంటాయి. కరక్కాయ ఆకారంలోను, యవగింజ ఆకారంలోను, గోపుచ్ఛం ఆకారంలోను (ఉంటాయి).

**మూ. హరీతక్యాకృతిస్త్వఙ్కో యవమధ్యస్తథోర్ధ్వకః,**
**ఆలిఙ్గ్యశ్చైవ గోపుచ్ఛాకృతిరేషాం ప్రకీర్తితః. 243**

**తా.** వీటిలో హారతకి (కరక్కాయ ఆకారంలో ఉన్నది) **అంకి**. యవమధ్యాకారం గలది **ఊర్ధ్వకం**. గోపుచ్ఛాకృతిలో ఉన్నది **ఆలింగ్యం**.

**మూ. తాలాస్త్రయోఽర్ధతాలశ్చ మృదఙ్గాఙ్కిక ఇష్యతే,**
**ముఖం తస్య చ కర్తవ్యం ద్వాదశాఙ్గులయోజితమ్. 244**

**తా.** ఆంకికమృదంగం పొడవు మూడున్నర తాలా లుండాలి. దాని ముఖం పన్నెండు అంగులాల వైశాల్యంతో ఉండాలి.

**మూ. తథోర్ధ్వకశ్చ కర్తవ్యశ్చతుస్తాలప్రమాణతః,**
**ముఖం తస్య ప్రకర్తవ్యమఙ్గులాని చతుర్దశ. 245**

**తా.** ఊర్ధ్వకమృదంగం ఎత్తు నాలుగు తాలాలు, ముఖం వైశాల్యం పద్నాలుగు అంగుళాలు ఉండాలి.

**మూ. ఆలిఙ్గ్యశ్చైవ కర్తవ్యస్తాలత్రయమథాపి చ,**
**ముఖం తస్యాఙ్గులాని స్యురష్టావేవ సమాసతః. 246**

**తా.** ఆలింగ్యమృదంగం పొడవు మూడుతాలా లుండాలి. దాని ముఖం, మూసికొన్నట్లు ఎనిమిది అంగుళాల వైశాల్యంతో ఉండాలి.

**మూ. పణవశ్చాపి కర్తవ్యో దీర్ఘత్వే షోడశాఙ్గులః,**
**కృశమధ్యోఽఙ్గులాన్యష్టౌ పఞ్చాఙ్గులముఖస్తథా. 247**

**తా.** పణవం పొడవు పదహారు అంగుళా లుండాలి. దాని ఎనిమి దంగుళాల మధ్యభాగం సన్నంగా ఉండాలి.ముఖం వైశాల్యం ఐదు అంగుళాలు.

**మూ. ఓష్ఠం తస్య చ కర్తవ్యం తద్‌జ్ఞైరధ్యర్ధమఙ్గులమ్,**
**మధ్యం తు సుషిరం తస్య చత్వార్యేవాఙ్గులాని తు. 248**

**తా.** దాని ఓష్ఠం (అంచు) అర్ధాంగుళం దళసరి ఉండాలి. దాని మధ్యభాగంలో నాలుగు, అంగులాల ఛిద్రం ఉండాలి.

**మూ. దర్దురశ్చ ఘటాకారో భవత్యష్ట్యఙ్గులిస్తథా,**
**ముఖం తస్య చ కర్తవ్యం ఘటస్య సదృశం బుధైః. 249**
**ద్వాదశాఙ్గులవిస్తీర్ణం పీనౌష్ఠం చ సమస్తతః.**

**తా.** దర్దురం ఘటాకారంలో పదహారంగుళాల పొడ వుండాలి. దీని ముఖం

ఘటముఖం వలె ఉంటుంది. ముఖం విస్తారం పన్నెండు అంగుళాలు. దీని చుట్టూ దళసరైన అంచు ఉండాలి.

**మూ. అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి చర్మలక్షణముత్తమమ్. 250**
**న జీర్ణోపహతం చర్మ న చ కాకముఖాహతమ్,**
**న మేదోపహతం కించిన్న చ ధూమాగ్నిదూషితమ్. 251**

**తా.** ఇటుపైన ఉత్తమచర్మలక్షణం చెపుతాను. చర్మ చిమికి, తూట్లు పడి ఉండకూడదు. కాకి ముట్టెతో పొడిచినది కాకూడదు. కొవ్వు ఉన్నది గాని, పొగా, నిప్పూ తగిలి దెబ్బతిన్నది గాని కాకూడదు.

**మూ. షడ్భిర్దోషైర్వినిర్ముక్తం చర్మ నిర్వర్తితం గవామ్,**
**ముఖం పల్లవసంకాశం హిమకున్దేన్దుసప్రభమ్. 252**
**స్నిగ్ధామిషవిహీనం తు క్లిన్నం చర్మ ప్రశస్యతే.**

**తా.** పైన చెప్పిన ఆరు దోషాలు లేని గోచర్మను (ఆవు లేదా ఎద్దు చర్మను) బాగా పరిశుద్ధం చెయ్యాలి. దాని ముఖం (పైభాగం) చిగురు వలె ఉండాలి. మంచు వలె మల్లిపువ్వు వలె, చంద్రబింబం వలె తెల్లగా, నున్నగా, మాంసం ఏమాత్రం లేకుండా తడిగా ఉండాలి. అలాంటి చర్మ మృదంగాదినిర్మాణానికి ప్రశస్త మైనది.

**మూ. విధినైవం ముఖోర్ణాని చర్మాణ్యాహృత్య బుద్ధిమాన్. 253**
**శీతోదకే నిశామేకాం స్థాపయిత్వా సముద్ధరేత్,**
**బద్ధైః సలిలతైర్ద్రానైర్గోమయైరతిమర్దితైః. 254**
**చన్ద్రకైస్తనుభిః పశ్చాత్ మృదఙ్గాన్ యోజయేద్బుధః.**

**తా.** పైన రోమా లున్న ఈ విధ మైన, చర్మలను తీసికొని వచ్చి ఒక రాత్రి చన్నీటిలో నానబెట్టి మర్నాడు పైకి తియ్యాలి. తరవాత దానిని శుభ్రమైన గోమయంతో రాసి రాసి శుభ్రం చెయ్యాలి. తరవాత ఆ చర్మం గుండ్రని చిన్న చిన్న ముక్కలుచేసి వాటిని మృదంగంమీద కొలతల ప్రకారం అంటించాలి.

**మూ. పుష్పావర్తిం తతః కుర్యాత్ త్రివర్తిం చన్ద్రికాశ్రయమ్. 255**
**కక్షాఖ్యం వై పరికరం గ్రీవాస్థం స్వస్తికం తథా,**
**శతాని త్రీణి కుర్వీత పుష్కరైర్హ్యక్షరాణి తు. 256**

**తా.** ఆ గుండ్రని చర్మఖండాలమీద మూడు పొరల పుష్పావర్తనం చెయ్యాలి. కక్షా అనే పరికరము, దీని మెడమీద స్వస్తికము చెయ్యాలి.

మృదంగంమీద మూడువందల అక్షరాలు పలికించవలసి ఉంటుంది.

**వి.** పారిభాషికపదాల అర్థాలు అస్పష్టంగా ఉన్నాయి.

**మూ. దశ తత్ర హి బ్రధ్నాస్తు ప్రక్షేప్యా వర్తిసంశ్రయా,**
**ని(ద్వే)హిత్వా తాక్షి(జ్గి)కే వధ్రే తృతీయే సంప్రవేశయత్. 257**

**తా.** దాని మీద వర్తితో చేసిన పది బ్రధ్నాలు (తాళ్లు) కట్టాలి. రెండు బ్రధ్నాలు విడిచి మూడవదానినుంచి నుంచి ప్రవేశింపచేయాలి(?)

"ఈ శ్లోకం అస్పష్టార్థం పాఠదోషభూయిష్టం" (మన్‌మోహన్‌ఘోష్).

**మూ. సర్వేష్వేవం ప్రయోగోఽయమాక్షి(జ్కి)కేషు విధీయతే,**
**నవే మృదఙ్గే దాతవ్యం రోహణం సతతం బుధైః. 258**
**గవ్యే ఘృతే చ తైలే చ తిలపిష్టం తథైవ చ.**

**తా.** అన్ని మృదంగాలవిషయంలోను ఇదే విధానం అవలంబించాలి. క్రొత్త మృదంగం మీద ఆవు నెయ్యి తైలమూ కలిపిచేసిన తెలకపిండి గుజ్జుతో పూతపూయాలి.

**మూ. బద్ధ్వా హ్యనేన విధినా ఆఙ్కికాలిఙ్గ్యకోర్ధ్వకాన్. 259**
**దేవతాభ్యర్చనం కృత్వా తతః స్థాప్యా మహీతలే.**

**తా.** అంకిక – ఆలింగ్యక – ఊర్ధ్వకాలను ఈ విధంగా (చర్మాదులచేత) బిగించి దేవతాపూజ చేసి, తరవాత, వాటిని నేలమీద ఉంచాలి.

**మూ. చిత్రాయామథవా హస్తే శుక్లే పక్షే శుభేఽహని,**
**ఉపాధ్యాయః శుచిర్భూత్వా కులీనో రాగవర్జితః, 260**
**ఘనజ్ఞో గీతతత్త్వజ్ఞో మధురో నియతేన్ద్రియః. 261**
**సోపవాసోఽల్పకేశశ్చ శుక్లవాసా దృఢవ్రతః,**
**మణ్డలత్రయమాలిఖ్య గోమయేన సుగన్ధినా. 262**
**బ్రహ్మాణం శఙ్కరం విష్ణుం త్రిషు తేషు ప్రకల్పయేత్,**
**ఆలిఙ్గ్యం స్థాపయేత్పూర్వం బ్రహ్మణః పూర్వమణ్డలే. 263**
**ఊర్ధ్వకన్తు ద్వితీయేఽస్మిన్ రుద్రనామ్ని నిధాపయేత్,**
**తిర్యగుత్సఙ్గికం సమ్యగ్ వైష్ణవే మండలే న్యసేత్.**

**తా.** ఈ దేవతాపూజ శుక్లపక్షశుభతిథియందు, చిత్రానక్షత్రమందు గాని, హస్త నక్షత్రమందు గాని చెయ్యాలి. ఈ పూజాదికం నిర్వర్తించే ఉత్తమకులంలో జనించిన ఉపాధ్యాయుడు రాగద్వేషాలు లేనివాడై, మధురస్వభావుడు, జితేంద్రియుడు అయి ఉండాలి.

నియమాలు పాటించడంలో దృఢచిత్తుడై ఘనవాద్యాలను, గీతాల తత్త్వాన్నీ చక్కగా తెలిసినవాడై ఉండాలి. అల్పమైన జుట్టు గల ఆ ఉపాధ్యాయుడు స్నానాదులచే శుచియై తెల్లని వస్త్రాలు ధరించి మంచి గంధము గల గోమయంతో మూడు మండలాలు నేలపై లిఖించి (నిర్మించి) ఆ మూడింటిమీదా బ్రహ్మదేవుని, శంకరుని, విష్ణువును ఆవాహనం చెయ్యాలి. ముందుగా బ్రహ్మకు సంబంధించిన తూర్పువైపు మండలంమీద ఆలింగ్యాన్ని ఉంచాలి. రుద్రునికి చెందిన రెండవ మండలంమీద ఊర్ధ్వకాన్ని, వైష్ణవమండలంమీద, అడ్డంగా ఉత్సంగికాన్ని ఉంచాలి.

**మూ. బలిపుష్పోపహారైశ్చ నానాపుష్పైర్విచిత్రితైః,**
**ఆలిఙ్గ్యే చ బలిం దద్యాన్మధుపాయసమిశ్రితమ్. 265**
**అపూపం లోచికామిశ్రమాఙ్కికే సంప్రదాపయేత్,**
**అనన్తరశ్చ దాతవ్యః సర్వ ఏవోర్ధ్వకే బలిః. 266**
**స్వస్తికే లోచికాపూపపిన్డకేణ్డరికైః సహ.**

**తా.** బలులతోను, విచిత్రము లైన వివిధపుష్పాలతోను మండలాల పూజ చెయ్యాలి. మధువు పాయసము కలిపి చేసిన మిశ్రాన్ని ఆలింగ్యానికి బలిగా ఇవ్వాలి. లోచికతో కలిపి అపూపాన్ని అంకికానికి బలిగా సమర్పించాలి. వెంటనే స్వస్తికాలను, లోచికలను అపూపపిండాలను, కేండరికాలను – వీటి నన్నింటినీ ఊర్ధ్వకానికి బలిగా ఇవ్వాలి.

**మూ. ఉన్మత్తకరవీరార్కపుష్పైరన్యైశ్చ భూషితైః. 267**
**బలిః కార్యః ప్రయత్నేన రక్తో రక్తామ్బరైః సహ.**

**తా.** ఉన్మత్త – కరవీర – అర్కపుష్పాలతోను, అందమైన పుష్పాలతోను, ఇతర పుష్పాలతోను, ఎఱ్ఱని వస్త్రాలలతోను, ప్రయత్నపూర్వకంగా బలిని సమర్పించాలి. పూజాద్రవ్యాలన్నీ ఎఱ్ఱనివై ఉండాలి.

**మూ. వైష్ణవే మణ్డలే స్థాప్య సర్వబీజగతేఽఙ్కికే. 268**
**స్రగ్వస్త్రాలేపనైః పీతైశ్చరుభిశ్చ సపాయసైః.**

**తా.** వైష్ణవమండపంమీద ఉంచిన, చుట్టూ బీజమంత్రాలు రాసిన ఆంకిక మృదంగాన్ని పచ్చని వస్త్రాలతోను పూవులతోను మాలలతోను, పూజించి అనేకవిధాలైన పాయసాలు, చరువులు (బియ్యంతో వండిన పదార్థం) బలిగా సమర్పించాలి.

**మూ. వాచయిత్వా ద్విజాన్ స్వస్తి దత్త్వా పూర్వం చ దక్షిణామ్,**
**పూజయిత్వా తు గన్ధర్వాన్ పశ్చాద్వాద్యం సమారభేత్. 269**

**తా.** బ్రాహ్మణులచేత స్వస్తివాచనం చేయించి, వాళ్లకు దక్షిణ సమర్పించి, గంధర్వులను పూజించి పిమ్మట వాద్యవాదనం ప్రారంభించాలి.

**మూ. తన్త్రీభిః పణవం నహ్యేత్ సుమృష్టాభిః సమన్తతః. 270**
**తతః పుష్కరికాశ్చైవ యోజయేత్తత్ర చర్మణా,**
**ఏవం మృదఙ్గపణవాః కర్తవ్యా దర్దురస్తథా. 271**

**తా.** పణవానికి అన్ని పక్కలా బాగా శుద్ధిచేసిన తాళ్లు కట్టి బిగించాలి. తరవాత దానిపైన చర్మతో పుష్కరికలు అంటించాలి. మృదంగ – పణవ – దర్దురాలను కూడ ఈ విధంగా నిర్మించాలి.

**మూ. దైవతాని చ వక్ష్యామి యాన్యేషాం చ భవన్తి హి,**
**వజ్రేక్షణః శఙ్కుకర్ణో గ్రామీణశ్చ తథా మహాన్. 272**
**ఏతాశ్చ దేవతా విప్రా మురజేషు ప్రకీర్తితాః.**

**తా.** ఈ వాద్యాలమీద ఉండే దేవతలను గూర్చి చెపుతాను. విప్రులారా! మురజాల మీద వజ్రేక్షణుడు, శంకుకర్ణుడు, గ్రామణి అను దేవతలు అధిదేవతలుగా ఉంటారు.

**మూ. మృణ్మయత్వాన్మృదఙ్గస్తు భాణ్డం భ్రమయతీతి చ. 273**
**మురజాస్తూర్ధ్వకరణాదాతోద్యం తోదనాదపి.**

**తా.** మట్టితో నిర్మించడంచేత **మృదంగ** మనీ, నాలుగు వైపులా తిరగడంచేత **భాండం** అనీ, నిలబెట్టడంచేత **మురజం** అనీ, తోయడంవల్ల (దెబ్బలు కొట్టడంవల్ల) **ఆతోద్యం** అనీ ఈ వాద్యానికి పేర్లు ఏర్పడ్డాయి.

**మూ. భాణ్డస్యాదౌ ప్రణీతోఽత్ర పణవశ్చ విధీయతే. 274**
**దారు యతో దారయతి తస్మాద్భవతి దర్ధురః.**

**తా.** భాండాలలో ముందు నిర్మించబడడంచేత అది **పణవం** అని చెప్పబడుచున్నది. కఱ్ఱను చీల్చి నిర్మించడంచేత దర్దురం అని చెప్పబడుతుంది.

**మూ. సృష్ట్వా మృదఙ్గాన్ పణవం దర్దురం చ మహాముని:. 275**
**మేఘైస్తు స్వరసంవాదాన్ మృదఙ్గానామథాసృజత్.**

**తా.** స్వాతిముని, ఈ విధంగా పణవ – దర్దుర – మృదంగాలను నిర్మించి, మృదంగాల స్వరాలను మేఘధ్వనులతో సంవాదం (సమానత్వం) ఉండే టట్లు ఏర్పరచాడు.

**మూ. విద్యుజ్జిహ్వో భవేద్వామే మేఘః స తు మహాస్వనః. 276**
**ఐరావణో మహామేఘః తథా చైవోర్ధ్వకే భవేత్,**
**ఆలిఙ్గ్యే తు తడిత్ఖ్యాతో నామ్నా మేఘో బలాహకః. 277**

**తా.** గొప్ప ధ్వని గల విద్యుజ్జిహ్వం అను మేఘం వామకానికి తన ధ్వని నిచ్చింది. మహా మేఘ మైన ఐరావణం ఊర్ధ్వకానికి తన ధ్వనిని ఇచ్చింది. బలాహక మను మేఘం ఆలింగ్యానికి తన ధ్వని ఇచ్చింది.

**మూ. దక్షిణే పుష్కరో మేఘః కోకిలో వామకః స్మృతః,**
**మృదఙ్గశ్చైవ నామ్నా తు ఊర్ధ్వకే నాన్యథోచ్యతే. 278**
**ఆఙ్కికః సిద్ధిరిత్యేవమాలిఙ్గ్యశ్చైవ పిఙ్గలః.**

**తా.** పుష్కరమేఘం దక్షిణంమీద, కోకిల వామకంమీద, నంది ఆలింగకంమీద, సిద్ధి ఆంకికంమీద, పింగలం ఆలింగ్యంమీద నివసిస్తాయి.

**మూ. భూతప్రియో బలిస్తేభ్యో దాతవ్యః సిద్ధిమిచ్ఛతా. 279**
**పూజయిత్వా తు తాన్ దేవాన్ ప్రేక్షాం రఙ్గే ప్రకల్పయేత్,**
**కరీషస్య చ సంఘాతే మృదఙ్గాన్ స్థాపయేద్బుధః. 280**
**సుసంఘాతానచలితాంస్తథా చావనతాన్ పునః,**
**ఆతోద్యపణవైశ్చైవ నర్తకోపనతైస్తథా. 281**
**శాన్తికర్మ ప్రయుఞ్జీత విధిదృష్టేన కర్మణా.**

**తా.** నాట్యప్రయోగం నిర్విఘ్నంగా జరగాలనుకొనేవాళ్లు వాద్యాలమీద ఉండే ఈ మేఘాలకు, భూతాల కిష్టమైన పూజలు బలులు సమర్పించి తరువాత రంగంమీద ప్రేక్ష ప్రారంభించాలి. మృదంగాలను పిడకల సెగమీద, చర్మ ముణుచుకొని పోకుండాను, తూట్లు పడకుండాను జాగర్తపడుతూ వెచ్చచేసి ఉంచాలి. తరువాత నర్తకులు వాటిని తీసికొని వచ్చిన పిమ్మట యథాశాస్త్రంగా శాంతికర్మ జరపాలి.

**మూ. చత్వారః పణవాః కార్యా దశరూపవిధౌ పునః. 282**
**నాటకేఽఙ్కే ప్రకరణే వీథ్యాం భాణే డిమే తథా. 283**
**మృదఙ్గం పణవం చైవ దర్దురం చైవ వాదయేత్,**
**ఏవమేతద్ బుధైర్జ్ఞేయం మృదఙ్గానాం తు లక్షణమ్. 284**

**తా.** దశరూపకాల ప్రయోగాలలో నాలుగు పణవాలను ఉపయోగించవచ్చును. నాటకంలోను, అంకంలోను, ప్రకరణంలోను, వీథిలోను, భాణంలోను, డిమంలోను మృదంగాన్ని పణవాన్ని, దర్దురాన్నీ ఉపయోగించవచ్చును – బుధులు మృదంగాల ఈ లక్షణాలను చక్కగా తెలుసుకొని ఉండాలి.

**మూ. అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి ఉపహస్తస్య లక్షణమ్,**
**కర్తరీ సమహస్తశ్చ హస్తపాణిత్రయం తథా. 285**

**తా. ఉపహస్తాలు :–** ఇపుడు నేను ఉపహస్తాల లక్షణం చెపుతాను. శిక్షణానికి సంబంధించి నంతవరకు – వీటిలో – కర్తరీ, సమహస్తము, హస్తపాణిత్రయము, వర్తనా, దండహస్తము అను ఐదు ప్రకారా లున్నాయి.

**మూ. తర్జన్యఙ్గుష్ఠయోగేన సదేశాద్రుతిభిస్తతః. 286**
**పర్యాయపతనైర్జ్ఞేయా కర్తరీ హస్తయోర్ద్వయోః.**

**తా. కర్తరీ :–** రెండు చేతుల తర్జనీ – అంగుష్ఠాలను ఒక దాని తరువాత ఒకటి వేగంగా పడేటట్లు చేయడం **కర్తరీ.**

**మూ. సమయోః సమతాలేన ద్వయోర్హస్తతలార్ధయోః. 287**
**పర్యాయతః ప్రపాతో యః సమహస్త ఇతి స్మృతః.**

**తా. సమహస్తం :–** రెండు సమహస్తాల అరచేతుల అర్ధభాగాలను, క్రమంగా, సమతాలంలో (వాద్యముఖం పైన) వంచడం (తాకే టట్లు చేయడం) **సమహస్తం.**

**మూ. విభావితస్య వామస్య పార్ష్ణిణాఙ్గులిభిస్తథా. 288**
**సకృద్దక్షిణహస్తస్య హస్తపాణిత్రయం భవేత్.**

**తా. హస్తపాణిత్రయం :–** ఎడమ అరచేతి మొదటిభాగంతోను, వేళ్లతోను (వాద్యముఖంమీద) కొట్టి, స్పష్టంగా మోగించి, తరువాత కుడి అరచేతి మూలభాగంలో కొట్టడం **హస్తపాణిత్రయం.**

**మూ. పూర్వం దక్షిణహస్తేన క్రమాద్వామేన పాతతః. 289**
**చత్వారో యత్ర వర్తన్తే వర్తనాత్ వర్తనాః స్మృతాః.**

**తా. వర్తనా :–** కుడిచేతితో ప్రారంభించి క్రమంగా ఎడమచేతితో నాలుగు మాట్లు పాతం చేయడం (దెబ్బకొట్టడం), **వర్తనా.** దీనిలో వర్తన, అనగా కొట్టడం, ఉంటుందిగాన దీని కాపేరు.

**మూ. ప్రథమం వామహస్తేన గృహీత్వా దక్షిణేన తు. 290**
**ప్రహారాః క్రమపాతేన దణ్డహస్తః సమస్తయోః.**

**తా. దండహస్తం :–** ప్రారంభంలో ఎడమచేతితో ప్రహారం చేస్తూ తరువాత కుడి చేతితో ప్రహారాలు చేసి వాదనం చేసిన తరువాత, రెండు చేతులతోను ప్రహారాలు చేసి మోగించడం **దండహస్తం.**

**మూ. సౌష్ఠవం లాఘవం చైవ బాహుల్యం దృఢతాపి చ. 291**
**సర్వేషాం చైవ హస్తానాం గుణాశ్చత్వార ఈరితాః,**
**ఏవమేతన్మయా ప్రోక్తం హస్తానామపి లక్షణమ్. 292**

**తా.** అన్ని హస్తాలలోను – సౌష్ఠవము, లాఘవము (శీఘ్రత్వము), బాహుల్యం (వైవిధ్యము), దృఢత్వం అను నాలుగు గుణా లుండాలి. ఈ విధంగా, నేను హస్తాల లక్షణాలు చెప్పాను.

**మూ. అత ఊర్ధ్వం ప్రవక్ష్యామి వాదకానాం తు లక్షణమ్,**
**గీతవాద్యకలాలయగ్రహమోక్షవిశారదోఽథ లఘుహస్తః**
**చిత్రపాణిర్విధిజ్ఞః సిద్ధిస్థానధ్రువాకుశలః. 293**
**కలాభిరతో మధురహస్తః సునివిష్టో రక్తమార్జనో బలవాన్,**
**సువిహితశరీరబుద్ధిః సంసిద్ధో వాదకః శ్రేష్ఠః. 294**

**తా. ఉత్తమవాదకలక్షణాలు :–** ఇటుపైన వాదకుల కుండవలసిన లక్షణాలు చెపుతాను – ఒకడు శ్రేష్ఠవాదకుడు కావా లంటే వానిలో ఈ గుణా లుండాలి. అతడు – గీత – వాద్య – కలా – లయ – గ్రహ – మోక్షాలలో విశారదుడై శీఘ్రహస్తుడై ఉండాలి. చిత్రపాణులకు సంబంధించిన పద్ధతులు తెలిసినవాడై సిద్ధిస్థానాలలోను, ధ్రువలలోను నేర్పు కలిగి వివిధకళలయందు ఆసక్తి, అభిరుచి ఉన్నవాడు కావాలి. ఏకాగ్రచిత్తుడై (సునివిష్టః) మధురహస్తచాలనంతో మనోరంజకమైన మార్జనలను సృష్టించగలవాడై ఉండాలి. బలవంతుడై, నిరంతరాభ్యాసంచేత శరీరాన్ని బుద్ధిని స్థిరంగా ఉంచుకొని తన విద్యలో సిద్ధిని పొందినవాడై ఉండాలి.

**మూ. ఆలేపనప్రమాణజ్ఞః చతుర్మార్గకృతశ్రమః,**
**ప్రతిగృహీతా సిద్ధీనామఙ్గదోషవివర్జితః. 295**
**స్వభ్యస్తకరణః సౌమ్యః గీతజ్ఞో గుణితగ్రహః,**
**సుసఙ్గీతప్రయోగజ్ఞో మృదఙ్గీ తు భవేద్గుణైః. 296**

**తా. ఉత్తమమృదంగవాదకుని లక్షణాలు :–** మార్దంగికుడు వాద్యాలకు ఎంత, ఎలాంటి ఆలేపనాలు చెయ్యాలో తెలిసినవాడై ఉండాలి. నాల్గు మార్గాలలో పరిశ్రమ చేసి, సిద్ధులలో శిక్షణ పొందినవాడై ఉండాలి. శారీరదోషాలేవీలేక సౌమ్యుడై, కరణాలను బాగా అభ్యసించి, గీతాల స్వరూపాన్ని, సంగీత ప్రయోగవిధానాన్నీ తెలిసినవాడై ఉండాలి. ఎప్పు డెప్పుడు ఏ యే గ్రహాలను ఏ విధంగా ఆవృత్తి చెయ్యాలో తెలిసినవాడు కావాలి. అతడే ఉత్తమమృదంగవాదకుడు.

**మూ. అభ్రాన్తో హస్తకాలజ్ఞశ్ఛిద్రావరణపణ్డితః,**
**అభ్యస్తకరణశ్చైవ భవేత్ పాణవికో గుణైః. 297**

**తా. ఉత్తమపాణవికుని లక్షణాలు :–** పణవానాదకుడు కరణాలను చక్కగా అభ్యసించినవాడై పొరపాటు చేయనివాడు, కాలనియమాలు తెలిసినవాడు, వాద్య ప్రయోగాలలోని లోపాలను కప్పివేయగలవాడు అయి ఉండాలి. అతడే ఉత్తమపాణవికుడు.

**మూ. నిశ్చలో నిపుణః శీఘ్రో లఘుహస్తో విధానవిత్,**
**వాదనాన్తరవేదీ చ దర్దురీ తు ప్రశస్యతే. 298**

**తా. ఉత్తమదార్దురికుని లక్షణాలు :–** స్థిరుడు, నైపుణ్యం ఉన్నవాడు, శీఘ్రంగా, తేలికగా (అనాయాసంగా) హస్తాలను కదల్చుకలవాడు, వాద్యవిధానం బాగా తెలిసినవాడు, ఇతరవాద్యాల విధానంలో కూడ ప్రవేశం ఉన్నవాడు అయిన దర్దురవాదకుడు ప్రశంసింప దగినవాడు.

**మూ. ఏతత్ సర్వం నాట్యయోగం సమీక్ష్య ప్రోక్తం వాద్యం సర్వలోకానుభావాత్,**
**నోక్తం యచ్చేదాగమాచ్ఛాస్త్రబుద్ధ్యా సద్భిః కార్యః మార్గజాతీః సమీక్ష్య. 299**

**తా.** నాట్యప్రయోగాన్ని దృష్టిలో పెట్టుకొని, లోకాభిరుచిని కూడ పరిగణనంలోకి తీసికొంటూ, ఈ వాద్యవిధానం అంతా చెప్పాను. ఇక్కడ చెప్పని దేదైనా ఉంటే దానిని, సంప్రదాయాన్ని (ఆగమాత్) పట్టి, తన కున్న శాస్త్రజ్ఞానంతో, మార్గజాతులను కూడ దృష్టిలో ఉంచుకొని సత్పురుషులు (ధీమంతులు) స్వయంగా కల్పించుకొనవచ్చును.

**మూ. స్ఫుటప్రహారం విశదం విభక్తం రక్తం విఘుష్టం కరలేపనం చ,**
**త్రిమార్జనం పూరితరాగయోగం మృదఙ్గవాద్యం గుణతో వదన్తి. 300**

**తా.** మృదంగవాదనంలో ప్రహారాలు (దెబ్బలు) స్ఫుటంగా ఉండాలి. వాదనంలోని విభాగాలు స్పష్టంగా తెలియాలి. దాని ధ్వని మనోరంజకంగా, గంభీరంగా ఉండాలి. దీనిమీద చేసే కరలేపనం – చేతితో రాయడం, మదురధ్వని జనకంగా ఉండాలి. మూడు విధాలైన మార్జనలతో గీతాల రాగాలకు పూరకంగా ఉండాలి. అలాంటి మృదంగవాద్యమే శేష్ఠమైనది అని పండితు లంటారు.

**మూ. వాద్యేషు యత్నః ప్రథమం తు కార్యః శయ్యా హి నాట్యస్య వదన్తి వాద్యమ్,**
**వాద్యే చ గీతే చ హి సుప్రయుక్తే నాట్యప్రయోగే న విపత్తిమేతి. 301**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే పుష్కరవాద్యో నామ అధ్యాయ శ్చతుస్త్రింశః.**

**తా.** ముందుగా వాద్యం విషయంలో ప్రయత్నం బాగా చెయ్యాలి; ఎందువల్ల ననగా నాట్యానికి వాద్యం శయ్య అంటారు. వాద్యము, గీతము బాగా ప్రయోగిస్తే, నాట్యప్రయోక్త నాట్యప్రయోగంలో విపత్తు చెందదు.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన 'బాలానందిని' అను నాట్యశాస్త్రాంధ్ర వ్యాఖ్యానంలో 'పుష్కరవాద్యం' అను ముప్పై నాల్గవ అధ్యాయం సమాప్తం.**

పరిమల పబ్లికేషన్‌వారి అభినవభారతీసహితనాట్యశాస్త్ర పుస్తకంలో ఈ అధ్యాయమే పాఠాంతరరూపంలో 246 శ్లోకాలతో మళ్లీ ఇచ్చారు (P.P. 451 - 474. IV Volume).

**శ్రీః శ్రీః శ్రీః**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ పఞ్చత్రింశోऽధ్యాయః

## భూమికావికల్పాధ్యాయః

**"యద్భూమికాలాభపరాః సదాశివపదస్థితాః,**
**తాం వన్దే పరమాం శక్తిం చన్ద్రమౌలేః పరాం తనుమ్."**

**– శ్రీమదభినవగుప్తాచార్యాః**

**మూ. విభాగం భూమికానాం తు సంప్రవక్ష్యామి నాటకే,**
**యాదృశైరేవ కర్తవ్యాః పురుషైర్భూమికాస్తథా. 1**

**తా.** ఇపుడు నాటకంలో చేయవలసిన భూమికల విభాగాన్ని (Distribution of roles) ఎలాంటి పురుషులు (స్త్రీలూ) ఏ భూమికను నిర్వహించాలో, చెపుతాను.

**మూ. గతివాగఙ్గచేష్టాభిః సత్త్వశీలైః సమాసతః,**
**పరీక్ష్య పాత్రం తద్జ్ఞస్తు యుఞ్జ్యాద్ భూమినివేశనే. 2**

**తా.** నాటకంలో భూమికను గ్రహించే వ్యక్తుల గతి, మాట తీరు, శారీరచేష్టలు – వీటితో పాటు వాని స్వభావము, సామర్థ్యము ఇవన్నీ పరిశీలించిన పిమ్మటనే నాట్య ప్రయోగజ్ఞుడైన ఆచార్యుడు ఆ వ్యక్తిని, ఆ భూమికను నిర్వహించడానికి నియమించాలి.

**మూ. తస్మాదన్విష్య హి గుణాన్ కార్యః పాత్రసమాశ్రయః,**
**న ఖేదజననం బుద్ధేరాచార్యస్య భవిష్యతి. 3**

**తా.** అందుచేత అభినయంచేసే నటుని గుణాలను పరీక్షించిన పిమ్మటనే వానిని ఎన్నుకోవాలి. ఇలా చేస్తే ఆచార్యుడు తరువాత చింతించవలసిన పని ఉండదు. ఆచార్యునికి తలనొప్పి ఉండదు.

**మూ. ఆచార్యః పాత్రజాంశ్చైవ గుణాన్ జ్ఞాత్వా స్వభావజాన్,**
**తతః కుర్యాద్యథాయోగం తేషాం భూమినివేశనమ్. 4**

**తా.** పాత్రల స్వాభావికమైన గుణాలను పరిశీలించిన పిమ్మట, ఆచార్యుడు వాటికి అనుగుణమైన భూమికలను నటులకు ఇవ్వాలి.

**మూ. అఙ్గప్రత్యఙ్గసంయుక్తమహీనాఙ్గం వయోన్వితమ్,**
**న స్థూలం న కృశం చైవ న దీర్ఘం న చ మన్థరమ్. 5**

**శ్లిష్టాఙ్గం ద్యుతిమన్తం చ సుస్వరం ప్రియదర్శనమ్,**
**ఏతైర్గుణైస్తు సంయుక్తం దేవభూమిషు యోజయేత్. 6**

**తా. దేవతాభూమిక :–** ప్రధానమైన అవయవాలు, చిన్న అవయవాలు సమంగా ఉండాలి. ఏ అంగలోపము ఉండకూడదు. యుక్తవయస్సులో ఉండాలి. ఎక్కువ లావుగా గాని, సన్నంగా గాని, పొట్టిగా గాని పొడవుగా గాని ఉండగూడదు. అవయవా లన్నీ ఒక దానికి ఒకటి తగిన విధంగా ఉండాలి. మంచి శరీరకాంతితో, మంచి కంఠస్వరంతో అందరికీ మళ్లీ మళ్లీ చూడాలనిపించేవాడుగా (ప్రియదర్శనమ్) ఉండాలి. ఇలాంటి గుణాలు గల వ్యక్తిని దేవతాపురుషభూమికలలో నియోగించాలి.

**మూ. స్థూలం ప్రాంశుం బృహద్దేహం మేఘగమ్భీరనిఃస్వనమ్,**
**రౌద్రస్వభావనేత్రం చ స్వభావభ్రుకుటీముఖమ్. 7**

**రక్షోదానవదైత్యానాం భూమికాసు ప్రయోజయేత్,**
**పురుషాణాం ప్రయోగస్తు తథాఙ్గక్రియయాన్వితః. 8**

**తా.** లావుగా, ఎత్తుగా, పెద్ద దేహంతో మేఘం వలె గంభీరమైన స్వరంతో భయంకరమైన చూపులతో ఉన్నవాడు, సహజంగా కనుబొమ్మలు విరిచి ఉండే ముఖం కలవాడు – ఇలాంటి వానిని రాక్షస – దానవ – దైత్యుల భూమికలలో నియమించాలి. పురుషుల అభినయం అధికంగా అంగక్రియలతో (శారీరచేష్టలతో) ఉంటుంది.

**మూ. సునేత్రాః సుభ్రువః స్వఙ్గాః సులలాటాః సునాసికాః,**
**స్వోష్ఠాః సుగణ్డాః సుముఖాః సుకణ్ఠాః సుశిరోధరాః. 9**
**స్వఙ్గప్రత్యఙ్గసంయుక్తాః దీర్ఘాశ్చ మదమన్థరాః**
**న స్థూలా న కృశాశ్చైవ స్వభావేన వ్యవస్థితాః,**
**సుశీలాః జ్ఞానవన్తశ్చ తథా చ ప్రియదర్శనాః**
**కుమారరాజభూమౌ తు సంయోజ్యా భరతోత్తమాః. 11**

**తా.** అందమైన కళ్లు, కనుబొమ్మలు, శరీరము, నుదురు, ముక్కు, పెదవులు, చెక్కిళ్లు, ముఖము, కంఠము, మెడ కలవాళ్లు, చేతులు, పాదాలు, వాటివేళ్లు మొదలైన అంగప్రత్యాంగాలూ కూడ చక్కగా ఉన్నవాళ్లు, మంచి ఎత్తు, మదమందగమనము కలవాళ్లు లావుగా కాకుండా, సన్నంగా కాకుండా, ఉండ వలసిన రీతిలో ఉన్నవాళ్లు, మంచి శీలం కలవాళ్లు, జ్ఞానసంపన్నులు, ప్రియదర్శనులు అయిన ఉత్తమనటులను రాజుల భూమిక లలోను, రాజకుమారాదుల భూమికలలోను నియమించాలి.

**మూ. అఙ్గైరవికలైర్వీరం స్ఫుటం వచనకర్మణి,**
**న దీర్ఘం నైవ చ స్థూలమూహాపోహ విచక్షణమ్. 12**
**అదీనం చ ప్రగల్భం చ ప్రత్యుత్పన్నవినిశ్చయమ్,**
**సేనాపతేరమాత్యానాం భూమికాసు ప్రయోజయేత్. 13**

**తా.** వీరుడు, అంగవైకల్యా లేవీ లేనివాడు, స్పష్టంగా మాటలాడువాడు, ఎక్కువ పొడవు గాని లావు గాని లేని వాడు, ఊహాపోహలలో నేర్పు గలవాడు, దైన్యం ఎరగని వాడు, ప్రగల్భుడు (bold) వెంటనే, సరియైన నిర్ణయం తీసికొనువాడు, అయిన నటుణ్ణి సేనాపతి – అమాత్యాదిభూమికలలో నియమించాలి.

**మూ. పిఙ్గాక్షం దీర్ఘనాసం చ హ్రస్వముచ్చమథాపి వా,**
**కఞ్చుకిశ్రోత్రియాదీనాం భూమికాసు నియోజయేత్. 14**

**తా.** పచ్చనికళ్లతో పొడవైన ముక్కుతో పొట్టిగా గాని, పొడవుగా గాని ఉన్నవానిని కంచుకి, శ్రోత్రియుడు మొదలైన భూమికలలో నియమించాలి.

**మూ. ఏవమన్యేష్వపి తథా నాట్యధర్మవిభాగతః,**
**దశావస్థానురూపేణ పాత్రం యుఞ్జ్యాత్ స్వభూమిషు. 15**

**తా.** ఈ విధంగా నాట్యధర్మాన్ని చూచుకొంటూ దశలకు, వయస్సుకు అనుగుణంగా ఇతరులను కూడ ఆ యా భూమికలలో నియమించాలి.

**మూ. మన్థరం వామనం కుబ్జం వికృతం వికృతాననమ్,**
**విష్టబ్ధనేత్రం కాణాక్షం స్థూలం చిపిటనాసికమ్. 16**
**దుర్వేషం దుఃస్వభావం చ వికృతాకారమేవ చ,**
**దాసభూమౌ నియుఞ్జీత బుధో దాసాఙ్కసంయుతమ్. 17**

**తా.** మందగొడిగా ఉండేవాడు, పొట్టివాడు, గూనువాడు, వికృతమైన ముఖంతో వికారంగా ఉన్నవాడు, కళ్లు లోపలికి దిగిపోయినవాడు, ఒంటికంటివాడు, లావుగా ఉన్నవాడు, తప్పడ ముక్కుడువాడు, చెడ్డ వేషస్వభావాలు కలవాడు, (శరీరంమీద) దాసుని ముద్ర ఉన్నవాడు అయిన పురుషుణ్ణి దాసభూమికలో నియమించాలి.

**మూ. ప్రకృత్యా తు కృశం క్షామం తత్ర శ్రాన్తేషు యోజయేత్,**
**తథా చ పురుషం స్థూలమరోగేషు ప్రయోజయేత్. 18**

**తా.** స్వభావంచేతనే ఎండి చిక్కిపోయినవానిని అలసటచెందినవాని భూమికలోను బలిసి ఉన్నవానిని రోగంలేనివాని భూమికలోను నియమించాలి.

**మూ. యది వా నేదృశాః సన్తి ప్రకృత్యా పురుషా ద్విజాః,**
**ఆచార్యబుద్ధ్యా యోజ్యాస్తు భావచేష్టాస్వభావతః. 19**

**తా.** ద్విజులారా! ఇలాంటి ప్రకృతిగల పురుషులు లభించ నప్పుడు, ఆచార్యుడు తన బుద్ధిని ఉపయోగించి లభించినవాళ్ల భావ – చేష్టాస్వభావాదులను పరిశీలించి వాళ్లను ఆ యా భూమికలలో నియమించాలి.

**మూ. యా యస్య సదృశీ చేష్టా స్వభావః కర్మ వా తథా,**
**సా తథాచార్యయోగేన నియమ్యా భావభావినీ. 20**

**తా.** ఈ పురుషుల చేష్టలు స్వభావము, చేసే పనీ – ఎలా ఉంటాయో పరిశీలించి ఆచార్యుడు వాళ్లను అలాంటి చేష్టాదు లున్న భూమికలలో నియమించాలి.

**మూ. అతః ఫరం ప్రవక్ష్యామి భరతానాం వికల్పనమ్,**
**భరతాశ్రయాశ్చ భరతాః విదూషకస్తౌరికస్తథా నాన్దీ,**
**నన్దీ ససూత్రధారో నాట్యకరో నాయకశ్చైవ. 21**
**ముకుటాభరణవికల్పైః జ్ఞేయా మాల్యైస్తు వివిధైశ్చ.**

**తా.** ఇటుపైన భరతుల (నాట్యప్రయోగంలో పాల్గొనే నటాదుల) కల్పనను (ఏర్పాటును) గూర్చి చెపుతాను.

భరతుడు, విదూషకుడు, తౌరికుడు (తూర్యం వాయించేవాడు) నాన్ది, నంది, సూత్రధారుడు, నాట్యకరుడు, నాయకుడు – వీళ్లందరినీ – వాళ్లు ధరించే కిరీటాలు, ఆ భరణవిశేషాలు, అనేకవిధాలైన మాలలు, ఇతరవస్తువులు – వీటిని పట్టి గుర్తించే టట్లుగా ఉండాలి.

**మూ. కారుకకుశీలవాద్యా విజ్ఞేయా నామతశ్చైవ. 22**

**తా.** శిల్పులు, గాయకులు, వాద్యవాదకులు వాళ్ల పేర్లను పట్టి గుర్తింపబడతారు.

**మూ. ధుర్యవదేకో యుస్మాదుద్ధారోऽనేకభూమికాయుక్తః,**
**నాట్య(గృ)గ్రహోపకరణైర్నాట్యం భరతో భవేత్తస్మాత్. 23**

**తా.** బండి కాడి బుజంమీద పెట్టుకొని భారం లాగే వృషభం వలె (ధుర్యవత్) నాటకప్రయోగంలో అనేక భూమికలను వహిస్తూ, ప్రయోగానికి సంబంధించిన కార్య భారాన్ని భరించేవాడు గాన అతడు **భరతుడు**.

**మూ. లోకహృదయాశ్రయకృతాం సర్వప్రకృతిప్రచారసంయుక్తామ్,**
**నానాశ్రయాం కురుతే తథా చ నారీ తు సర్వత్ర. 24**

**తా.** సకలజనుల హృదయాలకు సంబంధించిన, సకలప్రకృతుల ప్రయోగంలో పాల్గొంటూ అనేక విధాలైన కార్యాలు సాధించేదానిని **నారీ** అంటారు.

**మూ. ప్రత్యుత్పన్నప్రతిభో నర్మకృతో నర్మగర్భనిర్భేదః,**
**భేదవిదూషితవచనః విదూషకో నామ విజ్ఞేయః. 25**

**తా.** సమయస్ఫూర్తితో, పరిహాసశీలుడై, పరిహాసవాక్యాలలోని నిగూఢార్థాలను భేదిస్తూ అధిక్షేపణలచేత దూషితమైన మాటలు పలికేవాడు **విదూషకుడు**.

**మూ. తూర్యపతిర్యస్తు నరః సర్వాతోద్యప్రవాదనే కుశలః,**
**తూరపరిగ్రహయుక్తో విజ్ఞేయస్తౌరికో నామ. 26**

**తా.** తూర్యాలు వాయించేవాళ్ల నాయకుడై, అన్ని ఆతోద్యాల వాదనంలో ప్రవీణుడై 'తూరవాద్యం' పట్టి ఉండువాడు **తౌరికుడు**.

**మూ. నట నృత్తౌ భూత్వర్థోఽయం భూతం నాటయతి లోకవృత్తాన్తమ్,**
**రసభావసత్త్వయుక్తం యస్మాత్తస్మాన్నటో భవతి. 27**

**తా.** 'నట' శబ్దం "నట నృత్తౌ" అను నృత్తార్థకమైన 'నట' ధాతువునుండి భూతకాలమాచక 'త' ప్రత్యయం చేర్చగా ఏర్పడినది. పూర్వం ఏనాడో జరిగిపోయిన వృత్తాంతాన్ని రసభావాదియుక్తంగా ప్రత్యక్షంగా చూపుతాడు గాన వానికి **'నటుడు'** అని పేరు.

**మూ. స్తుత్యభివాదనకృతైర్మధురైర్వాక్యైః సుమఙ్గలాచారైః,**
**సర్వం స్తౌతి హి లోకం యస్మాత్తస్మాద్భవేద్వాదీ. 28**

**తా.** మధురవాక్యాలతో, మంగలాచారపూర్వకంగా స్తుతి, అభివాదనమూ చేస్తూ లోకంలో అందరినీ స్తుతిస్తాడు గాన వానిని **'వాదీ'** అంటారు.

**మూ. భావేభ్యో బహుధాస్మిన్ రసానసౌ వదతి నాట్యయోగేషు,**
**ప్రాకృతసంస్కృతపాఠ్యో నన్దీ నామేతి స జ్ఞేయః. 29**

**తా.** నాట్యప్రయోగాలలో, వివిధభావాలకు అనుగుణంగా రసాస్వాదజనకాలైన, ప్రాకృత – సంస్కృతభాషలలో రచించిన పాఠ్యాలను పలికేవాడు, పలికించేవారు **నంది**.

**మూ. గీతస్య చ వాద్యస్య చ పాఠ్యస్య చ నైకభావవిహితస్య,**
**శిష్టోపదేశయోగాత్ సూత్రజ్ఞః సూత్రధారస్తు. 30**

**తా.** విశిష్టమైన శాస్త్రోపదేశం ఉన్నవా డవడంచేత, వివిధభావాలకు సంబంధించిన గీత – వాద్య – పాఠ్యాల సూత్రం (విధానం) బాగా తెలిసినవాడు **సూత్రధారుడు**.

**మూ. యస్మాద్యథోపదిష్టాన్ రసాంశ్చ భావాంశ్చ సత్త్వసంయుక్తాన్,**
**భూమివికల్పైర్నయతి చ నాట్యకరః కీర్తితస్తస్మాత్. 31**

**తా.** శాస్త్రోక్తవిధానాన్ని అనుసరిస్తూ, రస – భావ – సత్త్వాలకు అనుగుణంగా భూమికలను ఏర్పరిచేవాడు **నాట్యకరుడు**.

**మూ. చతురాతోద్యవిధానం సర్వస్య తు శాస్త్రవేదవిహితస్య,**
**నాట్యస్యాన్తం గచ్ఛతి తస్మాద్వై నాయకోఽభిహితః. 32**

**తా.** నాట్యశాస్త్రగంధర్వవేదాదులలో చెప్పిన ప్రకారం, నాట్యానికి సంబంధించిన నాలుగు విధాలైన ఆతోద్యాల విధానాన్ని చివరివరకూ నడిపించేవాడు **నాయకుడు**.

**మూ. నానాప్రకృతిసముత్థం కరోతి యః శీర్షకం ముకుటయోగే,**
**వివిధైర్వేషవిశేషైః స చ ముకుటకారస్తు విజ్ఞేయః. 33**

**తా.** వివిధప్రకృతులకు అనుగుణంగా, అనేకవిధాలైన వేషాలకు సరిపడేటట్లుగా, ఆయా పాత్రలకు శీర్షాలంకారాదులను తయారుచేసేవాడు **ముకుటకారుడు**.

**మూ. భాణ్డకవాద్యజ్ఞా యా లయతాలజ్ఞా రసానువిద్ధా చ,**
**సర్వాఙ్గసున్దరీ వై కర్తవ్యా నాటకీయా తు. 34**

**తా.** వివిధవాద్యాలను గూర్చి, కళలను గూర్చి, వాద్యవిధానాదులను గూర్చీ నిర్దుష్టమైన జ్ఞానంతో, లయ – తాలాల విషయంలో అనుభవంతో, రసానుగుణంగా ప్రవర్తించకలిగిన, సర్వాంగసుందరి యైన నటిని **నాటకీయ** గా ఏర్పరచుకోవాలి.

**మూ. యస్త్వాభరణం కుర్యాద్బహువిధవిహితం స తదాభరణః,**
**యశ్చోపకరణయోగాత్ స తేన నామ్నాభిధాతవ్యః. 35**

**తా.** అనేకవిధాలైన ఆభరణాలను పాత్రానుగుణంగా తయారు చేసి ఇచ్చేవానికి ఆ ఆభరణం పేరు (ఆంగదికః ఇత్యాదివిధంగా) పెట్టాలి. అనేకవిధాలైన ఉపకరణాలు సమకూర్చేవానికి. ఆ ఉపకరణాల పేర్లు భృంగారకః ఇత్యావిధంగా పెట్టాలి.

**మూ. యో వై మాల్యం కురుతే పఞ్చవిధం మాల్యకృత్ స విజ్ఞేయః,**
**యశ్చాపి వేషయోగం కురుతే స చ వేషకారీ తు. 36**

**తా.** ఐదు విధాల మాలలు తయారుచేసేవాడు **మాల్యకృత్**. పాత్రలచే వేరు వేరు వేషాలు వేయించేవాడు **వేషకారి**.

**మూ. చిత్రజ్ఞశ్చిత్రకరో వస్త్రస్య చ రఞ్జనాత్తథా రజకః,**
**జత్వశ్మలోహకాష్ఠైర్ద్రవ్యకరః కారుకశ్చైవ. 37**

**తా.** బొమ్మలు గీసేవాడు **చిత్రకారుడు**. బట్టలకు కొత్త రంగులు వేసేవాడు **రజకుడు**. లక్క, రాయి, లోహం, కర్ర మొదలైనవాటితో వస్తువులు తయారుచేసేవాడు **కారుకుడు**.

**మూ. నానాతోద్యవిధానే ప్రయోగయుక్తః ప్రవాదనే కుశలః,**
**ఆతోద్యేఽప్యతికుశలో యస్మాత్ స కుశలవో జ్ఞేయః. 38**

**తా.** వివిధ ఆతోద్యాలకు సంబంధించిన విధానంలోను – వాటి ప్రయోగంలోను, స్వయంగా వాటి వాదనంలోను, కుశలుడు, ఆతోద్యంలో అతికుశలుడు అయినవాడు **కుశలవుడు**.

**మూ. యద్యత్ సమాశ్రయన్తే శిల్పం వా కర్మ వా ప్రయోగం వా,**
**తేనైనోపగతగుణా విజ్ఞేయా నామతః పురుషాః. 39**

**తా.** పురుషులు ఏ కర్మ, ఏ శిల్పం, ఏ ప్రయోగం వృత్తిగా ఆశ్రయించి దానిలో నేర్పు సంపాదిస్తారో దానితోనే వాళ్ల పేర్లుండాలి.

**మూ. ఏవం తు నాటకవిధౌ జాతిర్నటసంశ్రయా బుధైర్ జ్ఞేయా,**
**నాట్యోపకరణయుక్తా నానాశిల్పప్రసక్తా చ. 40**

**తా.** నాటకప్రయోగాలకు సంబంధించినంతవరకు వాళ్లవాళ్ల ఉపకరణాలను పట్టీ, శిల్పాలను పట్టీ నటులలో జాతు లేర్పడతాయి.

**మూ. (ఉక్తోఽత్ర భూమికాన్యాసః ప్రయోక్తారశ్చ యోగతః,**
**ఆదిష్టం నాట్యశాస్త్రం చ మునయః కిమిహోచ్యతామ్). 41**

**ఇతి భరతీయే నాట్యశాస్త్రే భూమికావికల్పాధ్యాయః పఞ్చత్రింశః.**

**తా.** మునులారా! ఇక్కడ (ఈ అధ్యాయంలో) భూమికాన్యాసమును గూర్చి ప్రయోక్తలను గూర్చి చెప్పాను. ఇంత వరకు నేను మీకు నాట్యశాస్త్రం అంతా బోధించాను. ఇకం ఏమి చెప్పాలో అడగండి.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచించిన 'బాలానందిని' అను నాట్యశాస్త్రాంధ్ర వ్యాఖ్యానంలో 'భూమికావికల్పాధ్యాయం' అను ముప్పైయైదవ అధ్యాయం సమాప్తం.**

**శ్రీః శ్రీః శ్రీః**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ షట్త్రింశోఽధ్యాయః

## నాట్యశాపము

"యస్మిన్నిగూఢపరమార్థమబుధ్యమానాః
సంసారనాట్యరసభావముపాశ్రయన్తే,
బుద్ధ్వా పునర్ముహురహో నిజమేవ యాన్తి
తత్ పూర్ణధామ శివతత్త్వమహం ప్రపద్యే."

– శ్రీమదభినవగుప్తాచార్యాః

మూ. అథాత్రేయో వసిష్ఠశ్చ పులస్త్యః పులహః క్రతుః,
అఙ్గిరా గౌతమోఽగస్త్యో మనురాయుస్తదాత్మవాన్. 1

విశ్వామిత్రః స్థూలశిరాః సంవర్తః ప్రతిమర్దనః,
ఉశనా బృహస్పతిర్వత్సః చ్యవనః కాశ్యపో ధ్రువః. 2

దుర్వాసా జమదగ్నిశ్చ మార్కణ్డేయోఽథ గాలవః,
భరద్వాజోఽథ రైభ్యశ్చ వాల్మీకిర్భగవాంస్తథా. 3

స్థూలాక్షః శఙ్కులాక్షశ్చ కణ్వో మేధాతిథిః కుశః,
నారదః పర్వతశ్చైవ సుశర్మా చైకధన్వినౌ. 4

నిష్ట్యాతిర్భవనో ధౌమ్యః శతానన్దః కృతవ్రణః,
జామదగ్న్యస్తథా రామో జమదగ్నిశ్చ వామనః. 5

ఏవం తే మునయః ప్రీతాః సర్వజ్ఞం భరతం తదా,
పునరూచురిదం వాక్యం కుతూహలపురోగమమ్. 6

**తా.** ఆత్రేయుడు, వసిష్ఠుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, అంగిరసుడు, గౌతముడు, అగస్త్యుడు, మనువు, ఆయువు, ఆత్మవంతుడు, విశ్వామిత్రుడు, స్థూలశిరస్సు, సంవర్తనుడు, ప్రతిమర్దనుడు, ఉశనసుడు, బృహస్పతి, వత్సుడు, చ్యవనుడు, కాశ్యపుడు, ధ్రువుడు, దుర్వాసుడు, జమదగ్ని, మార్కండేయుడు, గాలవుడు, భరద్వాజుడు, రైభ్యుడు, వాల్మీకి, స్థూలాక్షుడు, శంకులాక్షుడు, కణ్వుడు, మేధాతిథి, కుశుడు, నారదుడు, పర్వతుడు, సుశర్మ, ఏకధన్వులను ఇద్దరు ఋషులు, నిష్ట్యాతి, భవనుడు, ధౌమ్యుడు, శతానందుడు, కృతవ్రణుడు, పరశురాముడు, జమదగ్ని, వామనుడు – ఈ ఋషులందరు భరతుడు

చెప్పిన నాట్యశాస్త్రం విని సంతుష్టాంతరంగులై, సర్వజ్ఞు డైన ఆ భరతమునిని కుతూహల పూర్వకంగా ఇలా ప్రశ్నించారు.

**మూ. యస్త్వయా గదితో హ్యేష నాట్యవేదః పురాతనః,**
**ఏకచిత్తైః స చాస్మాభిః సమ్యక్ సముపధారితః. 7**

**తా.** అతిపురాతన మైన ఈ నాట్యవేదం మీరు బోధిస్తూండగా మేం సావధాన చిత్తంతో విని దానిని చక్కగా మా బుద్ధులలో ధారణ చేసికొని ఉన్నాం.

**మూ. భగవన్ సంశయోఽ_స్మాకం తన్నో వ్యాఖ్యాతుమర్హసి,**
**కో హ్యన్యో నాట్యవేదస్య నిశ్చయం వేత్తి తత్త్వతః. 8**

**తా.** పూజ్యుడా! మా మనస్సులో ఒక సంశయం ఉన్నది. దానిని నీవే తీర్చ కలవాడవు. నాట్యతత్త్వం తెలిసినవారు, మీరు తప్ప మరెవ రున్నారు!

**మూ. న వయం పరిభావేన న విరోధేన నేర్ష్యయా,**
**పృచ్ఛామో భగవన్నాట్యముపదేశార్థమేవ తు. 9**
**అస్మాభిశ్చ తదా నోక్తం వ్యవచ్ఛేదో భవేదితి,**
**ఇదానీం తూపశిక్షార్థం నాట్యగుహ్యం నిదర్శయ. 10**

**తా.** పూజ్యుడా! మేం అనాదరభావంతో కాని, విరోధంతో గాని, ఈర్ష్యతో గాని ప్రశ్నించడం లేదు; కేవలం నాట్యాన్ని గూర్చి ఇంకా మీరు ఉపదేశించగా తెలుసుకోవా లను అభిప్రాయంతో మాత్రమే అడుగుతున్నాం. ఈ సందేహం మాకు మీరు నాట్యోపదేశం చేస్తూన్నప్పుడే కలిగింది కాని, అప్పుడు అడిగితే ఉపదేశానికి విచ్ఛేదం కలుగుతం దని అడగలేదు. ఇప్పుడు ఇంతవరకు చెప్పిన నాట్యాన్ని గూర్చి ఇంకా కొన్ని విషయాలు బోధించే దృష్టితో (ఉపశిక్షయా) నాట్యానికి సంబంధించిన ఈ రహస్యం వివరించుము.

**మూ. లోకస్య చరితం నాట్యమిత్యవోచస్త్వమీదృశమ్,**
**తేషాం నో లోకగుహ్యానాం నిశ్చయం వక్తుమర్హసి. 11**

**తా.** ఈ నాట్యం లోకచరితరూపమైనది అని చెప్పావు కదా! ఈ నాట్యంలో ఇమిడి ఉన్న లోకతత్త్వరహస్య మేదో మాకు విశదీకరించుము.

**మూ. దేవస్య కస్య చరితం పూర్వరఙ్గే ద్విజర్షభ,**
**కిమర్థం యుజ్యతే ఘోషః ప్రయుక్తః కిం కరోతి చ. 12**
**ప్రీతం కిం దైవతం తత్ర ప్రీతం వా కిం కరోతి చ,**
**కస్మాదేవ పునః శౌచం సమ్యక్ చరతి సూత్రధృక్. 13**

**కథముర్వీతలే నాట్యం స్వర్గాన్నిపతితం విభో,**
**కథం తవాయం వంశశ్చ నటసంజ్ఞః ప్రతిష్ఠితః**
**సర్వమేతద్యథాతత్త్వం కథయస్వ మహామునే. 14**

**తా.** ఓ! బ్రాహ్మణశ్రేష్ఠా! పూర్వరంగంలో ఏ దేవత చరిత్ర ఉంటుంది? ఆ సమయంలో వాద్యఘోష ఎందుకు ఏర్పరుస్తారు; అది ఏమి చేస్తుంది. అక్కడ (పూజాదికం చేత) ఏ దేవతకు సంతోషం కలుగుతుంది; కలిగి అదేమి చేస్తుంది? సూత్రధారుడు అంత శౌచం (పవిత్రతాసంపాదనం) ఎందుకు చేసికొంటాడు? నాట్యం స్వర్గంనుండి భూతలంమీదికి ఎందుకు దిగివచ్చింది? నీ వంశంశానికి నటవంశం అని పేరు స్థిరంగా ఎలా ఏర్పడింది? మహామునీ! ఈ విషయాలలోని తత్త్వం మాకు చెప్పుము.

**మూ. తేషాం తు వచనం శ్రుత్వా మునీనాం భరతో మునిః,**
**ప్రత్యువాచ పునర్వాక్యం గుహ్యార్థాభినయం ప్రతి. 15**

**తా.** ఆ మునుల మాటలు విని, భరతముని నాట్యరహస్యాన్ని విశదీకరిస్తూ ఇలా అన్నాడు –

**మూ. భరత ఉవాచ –**
**బ్రవీమి వో హ్యయం విప్రాః యన్మాం పృచ్ఛత సువ్రతాః,**
**పూర్వరఙ్గవిధానస్య తచ్చ సమ్యక్ విబోధత. 16**

**తా.** భరతముని ఇలా అన్నాడు – ఉత్తమ నియమవంతులైన బ్రాహ్మణోత్తములారా! మీరు నన్ను దేనిని గూర్చి ప్రశ్నించారో అది చెపుతున్నాను; పూర్వరంగవిధానాన్ని గూర్చి అడిగారు కదా; అది బాగా అర్థం చేసికొండి.

**మూ. ప్రోక్తవానస్మి యత్పూర్వమహం విఘ్ననిబర్హణమ్,**
**తస్యానుబన్ధేన మయా పూర్వరఙ్గః ప్రకీర్తితః. 17**

**తా.** విఘ్నాలను తొలగించడాన్ని గూర్చి నేను మొదట చెప్పి దానికి సంబంధించిన విషయంగా (అనుబంధంగా) పూర్వరంగాన్ని గూర్చి కూడ చెప్పి ఉన్నాను. అనగా మీరిప్పుడడిగిన ప్రశ్నకు సమాధానం అప్పుడే చెప్పాను.

**మూ. శస్త్రాణాం పరిహారార్థం శరీరావరణం యథా,**
**తథా సర్వగతం పాపం హుతేనైవ ప్రశామ్యతి. 18**

**తా.** శస్త్రాల ప్రహారం తగలకుండా ఉండడంకోసం శరీరావరణం (కవచం) ధరిస్తారు కదా! అలాగే అన్ని విధాలైన పాపాలూ కూడ హోమంచేత శమిస్తాయి.

**మూ. ఏవం జప్యైశ్చ హోమైశ్చ దేవతాభ్యర్చనేన చ,**
**స్తుత్యాశీర్వచనైః శాన్తైః కర్మభావానుకీర్తనైః. 19**

**సర్వాతోద్యనినాదైశ్చ తథా గీతస్వనేన చ,**
**మయా పాపాపహరణైః కృతే విఘ్ననిబర్హణే. 20**

**స్తుతిగీతాదిసంహృష్టైః దేవైరభిహితోఽస్మ్యహమ్,**
**నితరాం పరితుష్టాః స్మ ప్రయోగేణామునా తవ. 21**

**దేవతాసురమానస్య యస్మాల్లోకశ్చ నన్దతి,**
**తస్మాదయం ప్రయోగస్తు నాన్దీనామా భవిష్యతి. 22**

**తా.** అదే విధంగా నేను పాపవినాశకా లైన జపాలచేత, హోమాలచేత, దేవతా పూజలచేత, స్తుతులచేత, ఆశీర్వచనాలచేత, శాంతులచేత, కర్మస్వభావవర్ణనలచేత, విఘ్నాలను పారదోలిన పిమ్మట స్తుతిగీతాదులకు సంతోషించిన దేవతలు నాతో ఇలా అన్నారు – "నీవు చేసిన ఈ ప్రయోగంచేత మేం చాలా సంతోషించాం. దేవతలను అసురులను ఆనందింపచేస్తే లోకం అంతా ఆనందిస్తుంది. అందుచేత నీవు చేసిన ఈ ప్రయోగానికి **'నాంది'** అను పేరు ప్రసిద్ధిలోనికి వస్తుంది.

**మూ. గతివాద్యానువాదీ చ యత్ర కాకుస్వరః శుభః,**
**తస్మిన్ దేశే తు పాపఘ్నో మాఙ్గల్యాశ్చ భవిష్యతి. 23**

**తా.** ఏ దేశంలో గతులను, వాద్యాలను అనుసరిస్తూ కాకుస్వరం వినబడుతుందో, ఆ దేశంలో శుభమైన ఆ కాకుస్వరం సర్వవిఘ్నాలను నశింపచేసి, మంగలప్రదం అవుతుంది.

**మూ. యావత్తం పూరయేద్దేశం ధ్వనిరాతోద్యసంశ్రయః,**
**న స్థాస్యన్తి హి రక్షాంసి న చ విఘ్నవినాయకాః. 24**

**తా.** ఆతోద్యధ్వని దేశంలోని ఎంత ప్రదేశాన్ని వ్యాపిస్తుందో అంత ప్రదేశంలోను రాక్షసులు గాని, విఘ్నవినాయకులు గాని నిలవజాలరు.

**మూ. ఆవాహే చ వివాహే చ యజ్ఞే నృపతిమఙ్గలే,**
**నాన్దీశబ్దానుపశ్రుత్య హింస్రా నశ్యన్తి సర్వదా. 25**

**తా.** దేవతాద్యావాహనమునందు, వివాహమునందు, యజ్ఞమునందు, నృపతి మంగలకరోత్సవమునందు నాందీశబ్దాలను వినగానే హింస చేసే క్రూరమృగరాక్షసాదులు నశిస్తారు. **'ఆవాహం'** అనగా వివాహానికై వరుడు బంధువులతో కలిసి, వధూగృహానికి వెళ్లడం అని కూడ అర్థం.

**మూ. పాఠ్యం నాట్యం తథా చైవ గేయం వాదిత్రమేవ చ,**
**వేదమన్త్రార్థవచనైః సమం హ్యేతద్భవిష్యతి. 26**

**తా.** పాఠ్యము, నాట్యము, గేయము, వాద్యమూ కూడ వేదమంత్రాలతో సమమైనవి అవుతాయి.

**మూ. శ్రుతం మయా దేవదేవాత్ తత్త్వతః శఙ్కరాద్ధితమ్,**
**స్నానజప్యసహస్రేభ్యః పవిత్రం గీతవాదనమ్. 27**

**తా.** గీతవాదనం స్నానాలకంటే, సహస్రమంత్రజపాలకంటె కూడ పవిత్ర మైన దనీ హితకరమైన దనీ సాక్షాత్తు దేవదేవుడైన శంకరుడు చెప్పగా విన్నాను.

**మూ. యస్మిన్నాతోద్యనాట్యస్య గీతవాద్యధ్వనిః శుభః,**
**భవిష్యత్యశుభం దేశే నైవ తస్మిన్ కదాచన. 28**

**తా.** నాట్యానికి సంబంధించిన ఆతోద్యముల, గీతముల, వాద్యముల ధ్వని ఏ దేశంలో వినబడుతూ ఉంటుందో ఆ దేశంలో ఎన్నడూ అశుభం జరగదు.

**మూ. ఏవం పూజాధికారార్థం పూర్వరఙ్గః కృతో మయా,**
**నానాస్తోత్రకృతైర్మన్త్రైర్దేవతాభ్యర్చనం ప్రతి. 29**

**తా.** అందుచేతనే నేను వివిధదేవతాస్తోత్రాల రూపా లైన మంత్రాలతో దేవతాభ్యర్చనం నిర్వహించడానికై పూజాప్రారంభం చేయడానికై పూర్వరంగం ఏర్పరచాను.

**మూ. యతోఽభివాదనం క్లిష్టశిష్టం తద్రఙ్గమణ్డలే,**
**సూత్రధారస్య తచ్ఛౌచం విహితం తు ద్విజోత్తమాః. 30**

**తా.** రంగమండలంలో శాస్త్రోక్తమైన అభివాదనం చేయడం కష్టం. అందుచేత సూత్రధారుడూ స్నానోప వాసాదులు చేసి శుచిగా ఉండాలి అను నియమం ఏర్పాటుచేశాను.

**మూ. శౌచం కృత్వా యతో మన్త్రైః పూజనం జర్జరస్య తు,**
**ఉచ్యతే పూర్వరఙ్గేఽస్మిన్ తస్మాచ్ఛౌచం ప్రకీర్తితమ్. 31**

**తా.** జర్జరపూజ శుచిగా ఉన్నవాడు మంత్రాలతో చెయ్యాలి అని శాస్త్రవిహితం గాన నేను పూర్వరంగంలో సూత్రధారుడు శుచిగా ఉండా లని నియమం ఏర్పరచాను.

**మూ. యథావతారితం చైవ నాట్యమేతన్మహీతలే,**
**వక్తవ్యం సర్వమేతద్ధి న శక్యం వినిగూహితమ్. 32**

**తా.** నాట్యం స్వర్గలోకంనుంచి భూలోకంలోనికి ఎలా దిగి వచ్చినవో ఆ విషయ మంతా చెపుతాను. మీ దగ్గర దీనిని దాచకూడదు కదా.

**మూ. మమైతే తనయాః సర్వే నాట్యవేదమదాన్వితాః,**
**సర్వలోకం ప్రహసనైర్బాధన్తే హాస్యసంశ్రయైః. 33**

**తా.** నా కుమారు లందరూ, నాట్యవేదజ్ఞానంచేత మదోన్మత్తులై హాస్యరసపూర్ణా లైన ప్రహసనాలతో అందరినీ బాధించడం ప్రారంభించారు.

**మూ. కస్య చిత్త్వథ కాలస్య శిల్పకర్మ సమభ్యసన్,**
**ఋషీణాం వ్యఙ్గకరణం కుర్వద్భిర్గణసంశ్రయమ్. 34**
**అగ్రాహ్యం సుదురాచారం గ్రామ్యధర్మప్రవర్తితమ్,**
**నిష్ఠురం చాప్రశస్తం చ కావ్యం సంసది యోజితమ్. 35**

**తా.** కొంత కాలం తరువాత వాళ్లు సామాజికుల సమూహంలో ఒక నాట్యప్రదర్శనం చేశారు. పరిహాసప్రధాన మైన ఆ ప్రదర్శనం ఋషులను పరిహసిస్తూ, దురాచారాలతో గ్రామ్యధర్మాలతో అనగా అశ్లీలదృశ్యాలతో, క్రూరంగా, అప్రశస్యంగా, ఎవ్వరూ మెచ్చుకొనని రీతిలో (అగ్రాహ్యం) జరిగింది.

**మూ. తచ్ఛ్రుత్వా మునయః సర్వే భీమరోషాః ప్రకమ్పితాః,**
**ఊచుస్తే భరతాన్ సర్వాన్ నిర్దహన్త ఇవాగ్నయః. 36**
**మా తావద్ భో ద్విజా యుక్తమిదమస్మద్విడమ్బనమ్,**
**కో నామాయం పరిభవః కిం చ నాస్మాసు సంమతమ్. 37**

**తా.** భయంకర మైన రోషం గల ఆ ముని లందరూ అది విని, కాల్చివేస్తూన్న అగ్నుల వలె ప్రకంపితులై ఆ భరతపుత్రులతో ఇలా అన్నారు – ఓ ద్విజులారా! మీరు ఈ విధంగా మమ్ములను వేళాకోళం పట్టించడం ఏమాత్రము బాగాలేదు. ఎందుకు ఇలా మమ్మల్ని అవమానిస్తున్నారు? మాలో మీకు నచ్చని ఏ దోషా లున్నా యని మీరు మమ్మల్ని ఇలా అవమానిస్తున్నారు!

**మూ. యస్మాద్ జ్ఞానమదోన్మత్తా భవన్తోఽ వినయాశ్రితాః,**
**తస్మాదేతద్ధి భవతాం కుజ్ఞానం నాశమేష్యతి. 38**

**తా.** జ్ఞానమదంతో ఉన్మత్తులై మీరు ఈ విధంగా పొగరుబోతుతనంతో ప్రవర్తి స్తున్నారు; అందుచేత మీలో ఉన్న ఈ కుజ్ఞానం నశించిపోతుంది.

**మూ. ఋషీణాం బ్రాహ్మణానాం చ సమవాయేఽథ సంగమే,**
**నిర్బ్రహ్మచరణా భూత్వా శూద్రాచారా భవిష్యథ. 39**

**తా.** ఋషుల, బ్రాహ్మణుల సభలలోను, వాళ్ళు ఒకచోట కలిసి ఉన్నప్పుడు, మీరు వారి దగ్గరకు వెళ్లినపుడు, బ్రాహ్మణాచారవిహీనులైన, శూద్రాచారులై వాళ్లను సమీపించడానికి అనర్హులవుతారు.

**మూ. శూద్రాస్తు కేవలం భూత్వా తత్కర్మ సమవాప్స్యథ,**
**యశ్చ వో భవితా వంశః స చాశౌచో భవిష్యతి. 40**

**తా.** మీరు కేవలశూద్రులై వాళ్ల ఆచారాలు అవలంబిస్తారు. ముందు ముందు మీ వంశంలో పుట్టినవాళ్లు కూడ శౌచరహితు లవుతారు.

**మూ. యే చ వో వంశజాస్తేఽపి భవిష్యన్త్యథ నర్తకాః,**
**పరోపస్థానవన్తశ్చ సస్త్రీబాలకుమారకాః. 41**

**తా.** మీవంశంలో పుట్టినవాళ్లందరూ నర్తకులవుతారు. స్త్రీ – బాల కుమారులతో సహా వాళ్లందరూ ఇతరులను ఆశ్రయించి జీవించేవా ళ్లవుతారు.

**మూ. శాపజన్మ తతో జ్ఞాత్వా సుతానాం మే సురాస్తదా,**
**సర్వే విమనసో భూత్వా తానృషీన్ సముపస్థితాః. 42**

**తా.** అప్పుడు దేవతలు నా కుమారులకు తగిలిన శాపాన్ని గూర్చి తెలిసి, కలత చెందిన మనస్సులతో ఆ ఋషుల దగ్గరికి వెళ్లారు.

**మూ. తావద్భిశ్చ తతః ప్రోక్తం దేవైః శక్రపురోగమైః,**
**ఇదానీం దుఃఖముత్పన్నం నాట్యమేతద్ వినఙ్క్ష్యతి. 43**

**తా.** ఇంద్రాదిదేవత లందరూ ఆ ఋషులతో – "ఎంతో శ్రమ చేయగా ఆవిర్భవించిన ఈ నాట్యం ఇప్పుడు నశించిపోతుంది కదా!" అన్నారు.

**మూ. ఋషిభిశ్చ తతః ప్రోక్తం న చైతద్ధి వినశ్యతి,**
**శేషమన్యత్తు యత్ ప్రోక్తం సర్వమేతద్భవిష్యతి. 44**

**తా.** అపుడు ఋషు లిలా అన్నారు – "నాట్యం నశించదు. మేం అన్న మిగిలిన దంతా అలాగే జరగుతుంది."

**మూ. ఏతచ్ఛ్రుత్వా తు వచనం మునీనాముగ్రతేజసామ్,**
**విషణ్ణాస్తే సుతాః సర్వే పునరాత్మవధైషిణః. 45**
**ప్రోక్తవన్తశ్చ మాం క్రుద్ధా బహుశో నాశితాస్త్వయా,**
**అనేన నాట్యదోషేణ శూద్రాచారా హి యత్కృతాః. 46**

**తా.** ఉగ్రమైన తేజస్సు గల ఆ మునుల మాటలు విని నా పుత్రులు అందరూ విషాదం చెంది ఆత్మహత్య చేసికోవా లని అనుకొంటూ, కోపావిష్టులై నాతో – "నువ్వే మమ్మల్ని అన్ని విధాలా నశింపచేసావు. ఈ నాట్యం అనే దోషంచేత శూద్రాచారులను చేశావు" అన్నారు.

**మూ. మయా తు సాన్త్వయిత్వోక్తా మా శోకం వ్రజతానఘాః,**
**కృతాన్తవిహితోఽస్మాకం మానవేషు విధిః సుతాః. 47**
**మునీనాం న మృషా వాక్యం భవిష్యతి కదాచన,**
**నిధనే చ మనో మా భూద్యుష్మాకమితి సాన్త్వితాః. 48**

**తా.** నేను వాళ్లను ఓదారుస్తూ – "పుత్రులారా! దుఃఖించకండి. ఇది మనకు దైవంవల్ల వచ్చిన విధి. మునులవాక్యం ఏ నాటికీ అసత్యం కాదు. మీరు మాత్రం మరణించా లను అభిప్రాయం మానుకొండి" అన్నాను.

**మూ. జానధ్వం తత్తథా నాట్యం బ్రహ్మణా సంప్రవర్తితమ్,**
**శిష్యేభ్యశ్చ తదన్యేభ్యః ప్రయచ్ఛధ్వం ప్రయోగతః. 49**

**తా.** ఈ నాట్యశాస్త్రం బ్రహ్మదేవునిచేత ప్రవర్తింపచేయబడినది. (సృజింపబడినది) అను విషయం గుర్తుంచుకొండి. దానిని శిష్యులకు ఇతరులకు ప్రయోగసహితంగా బోధించండి.

**మూ. మా వై ప్రణశ్యతామేతన్నాట్యం దుఃఖాత్ ప్రవర్తితమ్,**
**మహాశ్రయం మహాపుణ్యం వేదాఙ్గోపాఙ్గసంభవమ్. 50**

**తా.** ఎంతో శ్రమపడి ప్రచారంలోనికి తీసికొనివచ్చిన ఈ నాట్యం వేదవేదాంగాల నుండి ఆవిర్భవించినది. ఉత్తమమైన విషయాలతో సంబంధించినది. మహాపుణ్యప్రదం. అలాంటి ఈ నాట్యశాస్త్రం నశించిపోవడానికి వీలు లేదు.

**మూ. అప్సరోభ్య ఇదం చైవ యథోక్తం యన్మయా శ్రుతమ్,**
**నాట్యం దత్వా తతః సర్వే ప్రాయశ్చిత్తం కరిష్యథ. 51**

**ఇతి భరతీయనాట్యశాస్త్రే నాట్యశాపో నామాధ్యాయః షట్త్రింశః.**

**తా.** నేను వినినదానిని పట్టి – మీరు యథావిధిగా ఈ నాట్యశాస్త్రాన్ని అప్సరస్త్రీలకు ఇచ్చిన పిమ్మట మీరందరు (ఋషుల విషయంలో చేసిన పాపానికి) ప్రాయశ్చిత్తం చేసికొంటారు.

**పుల్లెల శ్రీరామచంద్రుడు రచంచిన 'బాలానందిని' అను నాట్యశాస్త్రాంధ్ర వ్యాఖ్యానంలో 'నాట్యశాపము' అను ముప్పైఆరవ అధ్యాయం సమాప్తం.**

**శ్రీః శ్రీః శ్రీః**

శ్రీః

ఓం స్వస్తి శ్రీగణేశాయ నమః

# అథ సప్తత్రింశోఽధ్యాయః

## గుహ్యతత్త్వకథనాధ్యాయము

"ఆకాఙ్క్షాణాం ప్రశమనవిధేః పూర్వభావావధీనాం
ధారాప్రాప్తస్తుతిగురుగిరాం గుహ్యతత్త్వప్రతిష్ఠా,
ఊర్ధ్వాధో యః పరభువి చ వా యత్ సమానం చకాస్తి,
ప్రోధానన్తం తదహమధునానుత్తరం ధామ వన్దే".

– శ్రీమదభినవగుప్తాచార్యాః

**మూ.** కస్య చిత్త్వథ కాలస్య నహుషో నామ పార్థివః,
ప్రాప్తవాన్ దేవరాజ్యం చ నయబుద్ధిపరాక్రమైః. 1

ప్రశశాస తదా రాజ్యం దైవీం వృష్టివాప్నువన్,
గాన్ధర్వం చైవ నాట్యం చ దృష్ట్వా చిన్తాముపాగమత్. 2

స చిన్తయిత్వా మనసా కథమేష గృహే మమ,
నాట్యప్రయోగో హి భవేదితి దేవగణైః కృతః. 3

కృతాఞ్జలిః ప్రయోగార్థం ప్రోక్తవాంస్తు సురాన్నృపః,
ఇదమప్సరసామిత్థం నాట్యం భవతు మే గృహే. 4

**తా.** కొంత కాలం తరవాత – నహుషు డను రాజు తన నీతిచేత, బుద్ధిచేత, పరాక్రమంచేత దేవరాజ్యాన్ని (దేవేంద్రపదవిని) పొంది, దేవతాసంపదను పొంది రాజ్యం పాలించాడు. అతడు ఒకనాడు గంధర్వులు ప్రయోగించిన నాట్యం చూచాడు. "దేవగణాలు ప్రయోగించిన ఈ నాట్యాన్ని భూలోకంలోని నా గృహంలో ఎందుకు ప్రయోగం చేయకూడదు" అను ఆలోచన ఆతని మనస్సులో కలిగింది. అతడు దేవతలకు నమస్కరిస్తూ – అప్సరసలు ఈ నాట్యాన్ని నా ఇంట్లో ప్రయోగిస్తే బాగుంటుంది అని అడిగాడు.

**మూ.** ప్రత్యుక్తః స తతో దేవైః బృహస్పతిపురోగమైః,
దివ్యాఙ్గనానాం నైవేహ మానుషైః సహ సంగతిః. 5

హితం పథ్యం చ వక్తవ్యం భవాన్ స్వర్గాధిపో హి యత్,
ఆచార్యాస్తత్ర గచ్ఛన్తు గత్వా కుర్వన్తు తే హితమ్. 6

**తా.** ఆ మాటలు విని బృహస్పతి మొదలైన దేవతలు రాజుతో దివ్యాంగనలు,

ఇక్కడ మనుష్యులతో కలవడం అనేది కుదరదు. నీవు స్వర్గరాజ్యాధిపతివి గాన, మేం నీకు ఏది హితమో, ఏది పథ్యమో అదే చెప్పాలి కదా? ఆచార్యులు అక్కడికి (భూలోకంలోని నీ ఇంటికి) వెళ్లి నీ కిష్టమైన ఈ పని చేస్తే మంచిది" అని చెప్పారు.

**మూ. ప్రోక్తవాంస్తు తతో మాం తు నృపతిః స కృతాఞ్జలిః,**
**ఇదమిచ్ఛామి భగవన్ నాట్యముర్వ్యాం ప్రతిష్ఠితమ్. 7**

**పూర్వమాచార్యకం చైవ భవతా హి ప్రతిశ్రుతమ్,**
**వ్యక్తభావాత్త్విదం లబ్ధం త్వత్సకాశాద్ద్విజోత్తమ! 8**

**తా.** అప్పుడా రాజు నాతో సవినయంగా ఇలా అన్నాడు – "పూజ్యుడా! ఈ నాట్యాన్ని నీవు భూలోకంలో ప్రతిష్ఠింపచెయ్యాలి అని నా కోరిక. నీవే పూర్వం ఇక్కడ నాట్యవిద్యాచార్యత్వం నిర్వహించావు అని నేను దేవతలు చెప్పగా విన్నాను. ద్విజోత్తమా! ఇపుడు నీతో పరిచయం ఏర్పడిన తరువాత నేనీ విషయం ప్రత్యక్షంగా చూచాను.

**మూ. పితామహగృహేఽస్మాకమేతదన్తఃపురే జనే,**
**పితామహక్రియాయుక్తముర్వశ్యా సంప్రవర్తితమ్. 9**

**తస్యాః ప్రణాశశోకేన ఉన్మాదోపరతే నృపే,**
**విపన్నేఽన్తఃపురజనే పునర్నాశముపాగతమ్. 10**

**తా.** పూర్వం ఉర్వశి, మా పితామహుడైన పురూరవుని గృహంలో, ఆతని పనులను (చరిత్రను) వస్తువుగా చేసికొని, ఈ నాట్యాన్ని, అక్కడి అంతఃపురజనంలో ప్రవర్తింపచేసింది. ఆమె అదృశ్యురాలైపోగానే శోకంతో రాజు మరణించాడు. అంతఃపురజనం కూడ కొంత కాలానికి నశించగా, ఈ నాట్యవిద్య కూడ మళ్లీ భూలోకంలో లేకుండా పోయింది.

**మూ. ప్రకాశమేతదిచ్ఛామో భూతలే సంప్రకీర్తితమ్,**
**తిథియజ్ఞక్రియాస్వేతద్ యథా స్యాన్మఙ్గలం శుభమ్. 11**

**తా.** ఏదైన ఒక శుభతిథియందు, పవిత్రమైన యజ్ఞం జరిగే సమయంలోను, శుభము, మంగలకరమూ అయిన ఈ నాట్యప్రయోగం, నా గృహంలో చేయగా చూడాలని నేను కోరుచున్నాను.

**మూ. తస్మాన్మమ గృహే బద్ధం నానాప్రకృతిసంభవమ్,**
**స్త్రీణాం లలితవిన్యాసైర్యశో వః ప్రథయిష్యతి. 12**

**తా.** అందుచేత వివిధపాత్రలతో, స్త్రీల లలితవిన్యాసాలతో, నా గృహంలో నాట్య ప్రయోగం చేయిస్తే మీ అందరి కీర్తీ అంతటా వ్యాపిస్తుంది.

**మూ. తథాస్త్వితి మయా ప్రోక్తో నహుషః పార్థివస్తదా,**
**సుతాశ్చాహూయ సంప్రోక్తాః సామపూర్వం సురైః సహ. 13**

**తా.** 'అలాగే చేస్తాను' అని నేను నహుషునికి మాట ఇచ్చి, నా పుత్రులను, దేవతలనూ పిలిచి, వాళ్లతో అనునయపూర్వకంగా ఇలా చెప్పాను –

**మూ. అయం హి నహుషో రాజా యాచతే నః కృతాఞ్జలిః,**
**గమ్యతాం సహితైర్భూమిం ప్రయోక్తుం నాట్యమేవ తు. 14**
**కరిష్యామశ్చ శాపాన్తమస్మిన్ సమ్యక్ ప్రయోజితే,**
**బ్రాహ్మణానాం నృపాణాం చ న భవిష్యథ కుత్సితాః. 15**
**తత్ర గత్వా ప్రయుజ్యధ్వం ప్రయోగం వసుధాతలే,**
**న శక్యం చాన్యథా కర్తుం వచనం పార్థివస్య హి. 16**

**తా.** "ఈ నహుషచక్రవర్తి వినయపూర్వకంగా మనల్ని కోరుతున్నాడు – అందుచేత మీరందరూ భూలోకానికి వెళ్లి నాట్యప్రయోగం చెయ్యండి. ఇది బాగా ప్రయోగిస్తే తరువాత, మీకు ఋషులిచ్చిన శాపాన్ని తొలగించుకుందాం. అప్పుడు బ్రాహ్మణులు, రాజులు మమ్మల్ని వెలివేసి నీచంగా చూడరు. రాజు మాట కాదనడానికి వీలులేదు కదా! అందుచేత భూలోకానికి వెళ్లి నాట్యప్రయోగం చెయ్యండి.

**మూ. అస్మాకం చైవ సర్వేషాం నహుషస్య మహాత్మనః,**
**ఆప్తోపదేశసిద్ధిశ్చ నాట్యే ప్రోక్తా స్వయంభువా. 17**

**తా.** నాట్యసిద్ధి (success of perfomance) ఆప్తుల ఉపదేశాన్ని అనుసరిస్తేనే లభిస్తుంది అని బ్రహ్మదేవుడు నాతోను, నహుషునితోను చెప్పి ఉన్నాడు."

**మూ. శేషముత్తరతన్త్రేణ కోహలః కథయిష్యతి,**
**ప్రయోగం కారికాం చైవ నిరుక్తాని తథైవ చ. 18**

**తా.** నాట్యశాస్త్రానికి సంబంధించిన ఇతరవిషయా లన్నీ (ఉత్తరతంత్రం) కోహలుడు చెపుతాడు. నాట్యప్రయోగవిధానము, కారిక, నిరుక్తాలు కూడ అతడు చెపుతాడు.

**మూ. అప్సరోభిరిదం శాస్త్రం క్రీడనీయకహేతుకమ్,**
**అధిష్ఠితం మయా స్వర్గే స్వాతినా నారదేన చ. 19**

**తా.** మనోవినోదహేతువైన ఈ నాట్యం (పూర్వం) నా పర్యవేక్షణలో అప్సరసలచేత, స్వాతినారదులచేత స్వర్గలోకంలో ప్రయోగింపబడినది.

**మూ. తతశ్చ వసుధాం గత్వా నహుషస్య గృహే ద్విజాః,**
**స్త్రీణాం ప్రయోగం బహుధా బద్ధవన్తో యథాక్రమమ్. 20**

